# పీఠిక

"వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ." —కాళిదాసు.

స్వభాషయందు సంపూర్ణజ్ఞానము ప్రతిమానవునకు నత్యావశ్యకము. ఆజ్ఞాన మాభాషలోనిగ్రంథపఠనమునఁగాని లభ్యపడదు. అట్లు చదివి శబ్దార్థపరిజ్ఞానము సంపాదించుటకు ముఖ్యసాధనములు నిఘంటువులే. తొలుదొలుత నాంధ్రభాష యందు వెలువడిననిఘంటువులు పద్యాత్మకములు. అట్టివానిలో ముఖ్యమైనవి ఆంధ్ర నామసంగ్రహ, ఆంధ్రభాషార్ణవాదులు. అవి సామాన్యముగ సుబోధకములు గావు; అవసరమున కుపకరింపవు. ఈలోపమును తొలఁగించుటకై అకారాదినిఘంటువులు బయలుదేఱినవి. వానిలో 184?-లో వెలువడిన ఆంధ్రదీపికయు తర్వాత విదేశీయుల కును ఆంగ్లభాషావిదులకు నుపయోగించుటకై మారిసు, విలియంబ్రౌను, కేంబెల్, సి. పి. బ్రౌనుప్రభృతుల ఆంధ్రాంగ్లనిఘంటువులును పేర్కొనఁదగినవి. ఇవి యేవియు సమగ్రములు కాకపోవుటచే శ్రీపరవస్తు చిన్నయసూరిగారు ఒకనిఘంటువు నారం భించిరి కాని యదియు నసంపూర్తిగనే నిలిచిపోయినది. పిమ్మట ప్రెసిడెన్సీకాలేజి తెనుఁగుపండితు లగు శ్రీచదలవాడ సీతారామశాస్త్రిగా రొక నిఘంటువును వ్రాసి పూర్తిచేసిరి కాని యది అచ్చగుటకు ముందే వారు మరణించిరి. ఆమీఁద ప్రెసి డెన్సీకాలేజీలో వీరిస్థానమున నియమితులైన శ్రీబహుజనపల్లి సీతారామాచార్యుల వారు శ్రీసీతారామశాస్త్రిగారి నిఘంటువునకు శబ్దరత్నాకర మను పేరుపెట్టి ముద్రింప యత్నించిరి. ఈపని వీరికి సాధ్యముకానందుచే మదరాసు సి. యస్. యం. కాలేజి తెనుఁగుపండితు లగు శ్రీమాన్ కొమాండూరు అనంతాచార్యులుగారి సహా యమున శ్రీసీతారామాచార్యులుగారు పై నిఘంటువును ప్రచురింపఁగలిగిరి. ఇదియే చాలకాలము ప్రమాణభూతమై యుండెను.

ఆమీఁద ఆంధ్రసాహిత్యపరిషత్తువారు శ్రీపీఠికాపురాధీశులద్రవ్యసహాయ మున "సూర్యారాయాంధ్రనిఘంటువు" ప్రారంభించిరి కాని చాలకాలమునకు పరి షత్తువారు నాలుగు సంపుటములనుమాత్రమె వెలువరింపఁగలిగిరి. ఇంకను రెండు సంపుటములు ముద్రించినఁగాని యీ నిఘంటువు సంపూర్ణము కాదు.

శబ్దరత్నాకరము నిపుడు లభింపదు. శబ్దరత్నాకరమున కాకరములైన గ్రంథజాలముకంటె నేఁటి కెన్నో వివిధవిషయములు, ప్రాచీనగ్రంథములు చీఁకటి నుండి బయలుపడినవి. వీనిమూలమున నిఘంటువునఁ జేర్పవలసినపదజాలము హెచ్చు పెరిఁగినది. అట్టిప్రమాణనిఘంటు వనేకసంపుటములలోఁగాక మూఁడుసంపుటముల

లోనే యందఱు కందుబాటులో నుండ సంకల్పించి 'వావిళ్లనిఘంటువు' అను పేర ఒకనిఘంటురచనమునకు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులవారిని నియమించితిని గాని వారు పని పూర్తిచేయకయే మరణించిరి. అనంతరము ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున పనిచేసిన శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారి సహాయమున వావిళ్ల నిఘంటువు ప్రథమసంపుటము ప్రకటింపఁబడెను. రెండవసంపుటమున చాలభాగము వీరే సిద్ధపఱచిరి. కాని, కాకినాడ పిఠాపురము రాజాగారి కాలేజి తెనుఁగుఅధ్యాపకులైన మీఁదట వీరుకూడ నీపనిమానిరి. రెండవసంపుటమున కొంతభాగమును శ్రీవేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారు సిద్ధపఱచినందున నీ రెండవసంపుటము ప్రచురింపఁగల్గితిని. పై సంవత్సరాదిలోగా మూఁడవసంపుటమునుగూడ ముద్రించి నిఘంటువును పూర్తిచేయ నిశ్చయించుకొంటిని గావున విద్వాంసులు భాషాభిమానులు నీ నిఘంటువును ఆదరించి యిట్టిపనులుకొనసాగింప నాకు ప్రోత్సాహము గల్గింతు రని ఆశించుచున్నాను.

చెన్నపురి
28-11-51

ఇట్లు,
వావిళ్ల వేంకటేశ్వరులు.

# వావిళ్ల నిఘంటువు సంజ్ఞావివరణ పట్టిక

| సంజ్ఞలు. | వివరణము. |
|---|---|
| అ | అకారాంతము. ఇక్కడ ఆ, ఇ, ఈ, ఉ, ఊ, న్ మున్నగునవి ఆయా అంతములుగా గ్రహింపనగును. |
| (అ. ఆ. అ) | పుంలింగ విశేషణమైనపుడు అకారాంతము, స్త్రీలింగ విశేషణమైనపుడు ఆకారాంతము, నపుంసక లింగవిశేషణమైనపుడు అకారాంతము. |
| (అ. ఆ, ఈ. అ) | స్త్రీలింగ విశేషణమైనపుడు ఆకారాంతము మఱియు ఈకారాంతమును. |
| (అ. ఈ. అ) | స్త్రీలింగ విశేషణమైనపుడు ఈకారాంతము. స్త్రీలింగములలో విశేషము లున్నపుడవి స్పష్టముగా సూచింపఁబడినవి. తుది అచ్చులనుబట్టి అవి ఆయా అంతము లని గ్రహింపనగును. ఉదా:—1. ఏకకుఁడు. సం. విణ. (అ. కికా. అ.) ఇట స్త్రీలింగ రూపము ఆకారాంతమగు 'ఏకికా' అని గ్రహింపనగును. 2. ఋణదాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు ఋణదాత్రీ యని గ్రహింపనగును. 3. ఋణి. సం. విణ. (న్. నీ. న్.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంత మగు ఋణినీ యని గ్రహింపనగును. 4. అపటువు. సం. విణ. (ఉ. ఉ, ట్వీ. ఉ.) ఇట స్త్రీలింగరూపములు ఉకారాంతమగు 'అపటువు' ఈకారాంతమగు 'అపట్వీ' యని గ్రహించునది. 5. ఉదర్చి. సం. విణ. (న్) ఇట మూఁడులింగములలో నొకటే రూప మని గ్రహింపనగును. |
| అ. క్రి. | అకర్మకక్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప. | అపపదము. (ఆగమము మొదలగునవి). |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆ. | ఆటవెలఁది. |
| ఆం. | ఆంగ్లము. |
| ఆమ్రే. | ఆమ్రేడితరూపము. |

| సంజ్ఞలు. | వివరణము. |
|---|---|
| ఉ. | ఉత్పలమాల; ఉర్దూభాష. |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | ఉపపదము. |
| ఉభ. | ఉభయము. (తెలుఁగును సంస్కృతమును) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క. | కన్నడము; కందపద్యము. |
| క్రి. | క్రియ. |
| క్రి. విణ. | క్రియావిశేషణము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| గీ. | గీతపద్యము. |
| చ. | చంపకమాల. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము. |
| దే. | దేశ్యము. |
| ద్వ. | ద్వయము. [వైకృతమును దేశ్యమును గలిసిన పదము.] |
| ద్రు. | ద్రుతాంతము. |
| ధా. | ధాతువు. |
| న. | నపుంసకలింగము. |
| పీఠి. | పీఠిక. |
| పుం. | పుంలింగము. |
| పుం. న. | పుం నపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుం స్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| ప్రే. | ప్రేరణరూపము. |
| బ. | బహువచనాంతము. |
| మ. | మళయాళము, మత్తేభవృత్తము. |
| మి. | మిశ్రము. [సంస్కృతపదము సంస్కృతేతర పదముతోఁగాని తెలుఁగు కృత్ప్రత్యయముతోఁగాని తద్ధిత ప్రత్యయముతోఁగాని కలిసిన పదము.] |

| సంజ్ఞలు. | వివరణము. | సంజ్ఞలు. | వివరణము. |
|---|---|---|---|
| మొ. | మొదలైనవి. | శా. | శార్దూలవృత్తము. |
| యు. | యుగళము. | శ్లో. | శ్లోకము. |
| | [కొన్ని యర్థములందు దేశ్యము కొన్నిట వైకృతమునైన పదము.] | సం. | సంస్కృతము. |
| | | స. | సర్వనామము. |
| రూ. | రూపాంతరము. | స. క్రి. | సకర్మకక్రియ. |
| వా. | వాడుక. | సా. | సామెత. |
| వి. | విశేష్యము. | సీ. | సీసపద్యము. |
| విశే. | విశేషణము. | స్త్రీ. | స్త్రీలింగము. |
| వై. | వైకృతము. | హిం. | హిందూస్థానీభాష |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. | = | సామ్యచిహ్నము. |
| వ్యవ. | వ్యవహారము. | ❦ | వ్యుత్పత్త్యాదిసూచకము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. | ... | వీని నడుమం గొన్ని యక్షరము లున్నవని తెలుపును. మిగిలినవి స్పష్టము. |
| శత్రం. | శత్రంతము. [దీనికి తెలుంగున వ్యస్త ప్రయోగము లేదు.] | | |

# గ్రంథసంకేత వివరణ పట్టిక

| సంఖ్య | సంజ్ఞ | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 1 | ఆ. | అచలాత్మజా పరిణయము | ఆ. ౩ | వేంకటాచార్యకవి | ౧౮ శ | మంజువాణీప్రెస్సు 1939-1906 సం॥ |
| 2 | అచ | అచ్చతెలుఁగు రామాయణము | కాం. ౬ | కూచిమంచి తిమ్మకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| | ,, బా. | బాలకాండము | | | | |
| | ,, యో. | అయోధ్యాకాండము | | | | |
| | ,, ర. | అరణ్యకాండము | | | | |
| | ,, కిష్కి. | కిష్కింధాకాండము | | | | |
| | ,, సుం. | సుందరకాండము | | | | |
| | ,, యు. | యుద్ధకాండము | | | | |
| 3 | అధ | అధ్యాత్మరామాయణము | కాం. ౭ | కోటమరాజు నాగయ్య | ౧౭ శ | వావిళ్లప్రెస్సు |
| | ,, ఉ. | ఉత్తరకాండము | | | | |
| 4 | అధ.సం. | అధ్యాత్మసంకీర్తనలు | ౪౧౩ సం. | తాళ్లపాక అన్నమాచార్యులు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు, చెన్నపురి 1936 |
| 5 | అని | అనిరుద్ధ చరిత్రము | ఆ. ౫ | కనుపర్తి అబ్బయ | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 6 | అప | అప్పకవీయము | ఆ. ౫ | కాకునూరిఅప్పకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 7 | అ. మ. క. | అష్టమహిషీ కల్యాణము (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు | ౧౫ శ | టి. టి. డి. ప్రెస్సు చెన్నపురి 1937 |
| 8 | అహ | అహల్యాసంక్రందనము | ఆ. ౩ | సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | ౧౮ శ | శృంగారగ్రంథమండలి 1938 |
| 9 | ఆం.చం. | ఆంధ్రచంద్రాలోకము | | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 10 | ఆం.పదా. | ఆంధ్రపదాకరము | | | ౨౦ శ | |
| 11 | ఆం.పారి. | ఆంధ్రపదపారిజాతము | | ఓగిరాల జగన్నాథకవి. గురుజాడ శ్రీరామమూర్తి | ౧౯ శ | శారదానిలయ ముద్రాక్షరశాల 1888 |
| 12 | ఆం.భా. | ఆంధ్రభాషార్ణవము | కాం. ౩ | నుదురుపాటి వేంకన | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| 13 | ఆం.శా. | ఆంధ్రశబ్దానుశాసనము | పరి ౬. | చిన్నయసూరి | ౧౯ శ | కాకినాడప్రెస్సు 1931 |
| 14 | ఆం.శే. | ఆంధ్రనామశేషము | | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 15 | ఆం.సం. | ఆంధ్రనామసంగ్రహము | వర్గలు ౫ | పైడిపాటి లక్ష్మణకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| | ,, దేవ. | దేవవర్గు | | | | |
| | ,, మాన. | మానవవర్గు | | | | |
| | ,, స్థా. | స్థావరవర్గు | | | | |
| | ,, తిర్య. | తిర్యగ్వర్గు | | | | |
| | ,, నా. | నానార్థవర్గు | | | | |

| సంజ్ఞలు. | వివరణము. | సంజ్ఞలు. | వివరణము. |
| --- | --- | --- | --- |
| మొ. | మొదలైనవి. | శా. | శార్దూలవృత్తము. |
| యు. | యుగళము. [కొన్ని యర్థములందు దేశ్యము కొన్నిట వైకృతము నైన పదము.] | శ్లో. | శ్లోకము. |
| | | సం. | సంస్కృతము. |
| | | స. | సర్వనామము. |
| రూ. | రూపాంతరము. | స. క్రి. | సకర్మకక్రియ. |
| వా. | వాడుక. | సా. | సామెత. |
| వి. | విశేష్యము. | సీ. | సీసపద్యము. |
| విణ. | విశేషణము. | స్త్రీ. | స్త్రీలింగము. |
| వై. | వైకృతము. | హిం. | హిందూస్థానీభాష |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. | = | సామ్యచిహ్నము. |
| వ్యవ. | వ్యవహారము. | ✤ | వ్యుత్పత్త్యాదిసూచకము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. | ... | వీని నడుమఁ గొన్ని యక్షరము లున్నవని తెలుపును. మిగిలినవి స్పష్టము. |
| శత్రు. | శత్రంతము. [దీనికి తెలుఁగున వ్యస్త ప్రయోగము లేదు.] | | |

# గ్రంథసంకేత వివరణ పట్టిక

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 1 | అచలా. | అచలాత్మజా పరిణయము | ఆ. ౩ | వేంకటాచార్యకవి | ౧౮ శ | మంజువాణీప్రెస్సు 1939-1906 సం॥ |
| 2 | అచ్చ. | అచ్చతెలుఁగు రామాయణము | కాం. ౬ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| | ,, బాల. | బాలకాండము | | | | |
| | ,, అయో. | అయోధ్యాకాండము | | | | |
| | ,, అర. | అరణ్యకాండము | | | | |
| | ,, కిష్కిం. | కిష్కింధాకాండము | | | | |
| | ,, సుం. | సుందరకాండము | | | | |
| | ,, యు. | యుద్ధకాండము | | | | |
| 3 | అధ్యా. | అధ్యాత్మరామాయణము | కాం. ౭ | కోటమరాజు నాగయ్య | ౧౭ శ | వావిళ్లప్రెస్సు |
| | ,, ఉ. | ఉత్తరకాండము | | | | |
| 4 | అధ్యా.సం. | అధ్యాత్మసంకీర్తనలు | ౪౧౩ సం. | తాళ్లపాక అన్నమాచార్యులు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు, చెన్నపురి 1936 |
| 5 | అని. | అనిరుద్ధ చరిత్రము | ఆ. ౫ | కనుపర్తి అబ్బయ | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 6 | అప్ప. | అప్పకవీయము | ఆ. ౫ | కాకునూరిఅప్పకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 7 | అ. మ. క. | అష్టమహిషీ కల్యాణము (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు | ౧౫ శ | టి. టి. డి. ప్రెస్సు చెన్నపురి 1937 |
| 8 | అహ. | అహల్యాసంక్రందనము | ఆ. ౩ | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు | ౧౮ శ | శృంగారగ్రంథమండలి 1938 |
| 9 | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము | | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 10 | ఆం. పదా. | ఆంధ్రపదాకరము | | | ౨౦ శ | |
| 11 | ఆం. పారి. | ఆంధ్రపదపారిజాతము | | ఓగిరాల జగన్నాథకవి. గురుజాడ శ్రీరామమూర్తి | ౧౯ శ | శారదానిలయ ముద్రాక్షరశాల 1888 |
| 12 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము | కాం. ౩ | నుదురుపాటి వేంకన | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| 13 | ఆం. శా. | ఆంధ్రశబ్దానుశాసనము | పరి ౬. | చిన్నయసూరి | ౧౯ శ | కాకినాడప్రెస్సు 1931 |
| 14 | ఆం. శే. | ఆంధ్రనామశేషము | | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 15 | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము | వర్గులు ౫ | పైడిపాటి లక్ష్మణకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| | ,, దేవ. | దేవవర్గు | | | | |
| | ,, మాన. | మానవవర్గు | | | | |
| | ,, స్థా. | స్థావరవర్గు | | | | |
| | ,, తిర్య. | తిర్యగ్వర్గు | | | | |
| | ,, నా. | నానార్థవర్గు | | | | |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 16 | ఆనంద. | ఆనందరంగరాట్ఛందము | ఆ. ౪ | కస్తూరిరంగయ్య | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 17 | ము. | ఆముక్తమాల్యద | ఆ. ౬ | కృష్ణదేవరాయలు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 18 | ఇందు. | ఇందుమతీపరిణయము | ఆ. ౬ | కుమారధూర్జటి | ౧౭ శ | చంద్రికాప్రెస్సు 1912 |
| 19 | ఉద్భ | ఉద్భటారాధ్యచరిత్రము | ఆ. ౩ | తెనాలిరామకృష్ణుడు | ౧౬ శ | భవానీప్రెస్సు బెజవాడ 1928 |
| 20 | ఉ. రా. | ఉత్తరరామాయణము | ఆ. ౮ | కంకంటి పాపరాజు | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 21 | ఉ. హరి. | ఉత్తరహరివంశము | ఆ. ౫ | నాచనసోమన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1919 |
| 22 | ఉ. హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | ఆ. ౪ | త్రెక్కెళ్లపాటి లింగన | ౧౭ శ | సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, నెల్లూరు 1891 |
| 23 | కకు. | కకుత్థ్సవిజయము | ఆ. ౫ | మల్లై అనంతభూపాలుడు | ౧౬ శ | బాలసరస్వతీ ముద్రాక్షరశాల, కాకినాడ 1904 |
| 24 | కలు. శ. | కలువాయిశతకము | | డబ్బీరు నరసకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 25 | కవిక. | కవికర్ణరసాయనము | ఆ. ౬ | సంకుసాల నృసింహకవి | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 26 | కవిచౌ. | కవిచౌడప్పశతకము | | కవిచౌడప్ప | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 27 | కవిజ. | కవిజనరంజనము | ఆ. ౩ | అడిదము సూరకవి | ౧౮ శ | పియర్లెస్ ప్రెస్సు, మద్రాసు 1932 |
| 28 | కవిజనా. | కవిజనాశ్రయము | అధి. ౪ | వేములవాడ భీమకవి | ౧౨ శ | సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ 1932 |
| | ,, సంజ్ఞా. | సంజ్ఞాధికారము | | | | |
| | ,, వృత్తా. | వృత్తాధికారము | | | | |
| | ,, జాతి. | జాత్యధికారము | | | | |
| | ,, దోషా. | దోషాధికారము | | | | |
| 29 | కవిరా. | కవిరాజమనోరంజనము | ఆ. ౫ | కనుపర్తి అబ్బయ | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 30 | కవి. సం. | కవిజనసంజీవని | తరం. ౪ | ముద్దరాజు రామభద్రకవి | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 31 | కవిసం. | కవిసంశయవిచ్ఛేదము | తరం. ౩ | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 32 | కళా. | కళాపూర్ణోదయము | ఆ. ౮ | పింగళి సూరన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 33 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి | ఉల్లా. ౯ | విన్నకోట పెద్దన | ౧౭ శ | కేసరిప్రెస్సు, చెన్నపురి 1929 |
| 34 | కాశీ. | కాశీఖండము | ఆ. ౭ | శ్రీనాథుడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1933 |
| 35 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము | ఆ. ౪ | ధూర్జటి | ౧౬ శ | బ్రిటిష్ మండల్ ప్రెస్సు, చెన్నపురి 1930 |
| 36 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము | | ధూర్జటి | ౧౬ శ | కళ్యాణిప్రెస్సు, తెనాలి 1949 |
| 37 | కాళిందీ. | కాళిందీకన్యాపరిణయము | ఆ. ౬ | అహోబలపతి | ౧౭ శ | కాకినాడప్రెస్సు 1929 |
| 38 | కుచేల. | కుచేలోపాఖ్యానము | ఆ. ౩ | గట్టుప్రభువు | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1924 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 39 | కువల. | కువలయాశ్వ చరిత్రము | ఆ. ౫ | సవరము చిననారాయణ | ౧౭ శ | బాలసరస్వతి ముద్రాక్షరశాల, కాకినాడ 1909 |
| 40 | కు. సం. | కుమారసంభవము | ఆ. ౧-౨ | నన్నెచోడుఁడు | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 41 | కృ. క. | కృష్ణకర్ణామృతము | ఆ. ౩ | వెలగపూడివెంగన | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1943 |
| 42 | శకుం. | శకుంతలాపరిణయము | ఆ. ౩ | కృష్ణకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 43 | కృష్ణ. | కృష్ణశతకము | | నృసింహకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 44 | కృష్ణా. | కృష్ణాభ్యుదయము | ఆ. ౫ | గొంతేటి సూరన | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 45 | కేయూర. | కేయూరబాహుచరిత్రము | ఆ. ౪ | మంచన | ౧౩ శ | సరస్వతీప్రెస్సు, కాకినాడ 1902 |
| 46 | క్రీడా. | క్రీడాభిరామము | ఆ. ౧ | వల్లభరాయఁడు | ౧౪ శ | పద్మాప్రెస్సు 1929 |
| 47 | గంధ. | గంధవహము | ఆ. ౧ | మంచెళ్ల వాసుదేవకవి | ౧౮ శ | సరస్వతీప్రెస్సు, కాకినాడ 1911 |
| 48 | గాథే. | శృంగారగాథేయోపాఖ్యానము | ఆ. ౧ | అనంతనార్యుఁడు | ? | కేసరీప్రెస్సు, చెన్నపురి 1929 |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము | ఆ. ౫ | తరిగొప్పుల మల్లన | ౧౬ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు చెన్నపురి 1922 |
| 50 | చంద్ర. వి. | చంద్రరేఖావిలాపము | ఆ. ౩ | కూచిమంచిజగ్గకవి | ౧౮ శ | 1931 |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము | ఆ. ౬ | పైడిమఱ్ఱి వేంకటపతి | ౧౭ శ | సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, నెల్లూరు 1897 |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము | ఆ. ౬ | సురభి మాధవరావు | ౧౬ శ | ఆనందముద్రాక్షరశాల 1908 |
| 53 | చం. రా. | చంపూరామాయణము | ఆ. ౮ | ఋగ్వేదకవి వేంకటాచలపతి | ౧౮ శ | కాకినాడప్రెస్సు, కాకినాడ |
| 54 | చక్ర. | చక్రవాళమంజరి | | తాళ్లపాక పెద తిరుమలయ్య | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు 1935 |
| 55 | చమ. | చమత్కారమంజరి | ఆ. ౩ | సింహాద్రి వేంకటాచార్యులు | ౧౬ శ | వేణుగోపాల ముద్రాక్షరశాల, విశాఖపట్టణము 1884 |
| 56 | చారు. | చారుచర్య | | అప్పన మంత్రి | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 57 | చిత్రభా. | చిత్రభారతము | ఆ. ౮ | చరిగొండ ధర్మన్న | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1934 |
| 58 | చెన్న. | చెన్నబసవపురాణము | ఆ. ౫ | ఆత్మకూరి పాపకవి | | వావిళ్లప్రెస్సు 1925 |
| 59 | ఛందో. | ఛందోదర్పణము | ఆ. ౪ | అనంతామాత్యుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1947 |
| 60 | జాహ్నవీ. | జాహ్నవీమాహాత్మ్యము | ఆ. ౪ | ఏనుఁగు లక్ష్మణకవి | ౧౮ శ | ఆంధ్రభాషావిలాసినీ ప్రెస్సు, చిత్రాడ 1923 |
| 61 | జై. | జైమినిభారతము | ఆ. ౮ | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1941 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 62 | తపతీ. | తపతీసంవరణో పాఖ్యానము | ఆ. ౫ | అద్దంకి గంగాధరకవి | ౧౬ శ | సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ 1896 |
| 63 | దశ. | దశకుమారచరిత్రము | ఆ ౧౨ | కేతన | ౧౩ శ | వావిళ్ల ప్రెస్సు 1925 |
| 64 | దశా. | దశావతారచరిత్రము | అవ. ౧౦ | ధరణిదేవుల రామయమంత్రి | ౧౮ శ | వావిళ్ల ప్రెస్సు 1926 |
| 65 | దా. శ. | దాశరథీశతకము | | కంచెర్ల గోపన్న | ౧౭ శ | వావిళ్ల ప్రెస్సు 1925 |
| 66 | దిలీప. | దిలీపచరిత్రము | ఆ. ౪ | కొటికలపూడి వెంకటకృష్ణకవి | ౧౯ శ | మాజువాణీప్రెస్సు ఏలూరు 1902 |
| 67 | ద్వా. | సింహాసనద్వాత్రింశిక | ఆ. ౧౨ | కొఱవి గోపరాజు | ౧౫ శ | కాకినాడ ప్రెస్సు 1936 |
| 68 | ద్వి. తి. సా. | ద్విపద సారంగధర చరిత్రము | ఆ. ౨ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | ఆంధ్రభాషావిలాసినీ ప్రెస్సు, చిత్రాడ 1921 |
| 69 | ద్వి. నల. | ద్విపద నలచరిత్రము | భాగ. ౫ | చక్రపురి రాఘవాచార్యులు | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 70 | ద్వి పరమ. | ద్విపద పరమయోగి విలాసము | ఆ. ౮ | తాళ్లపాక తిరు వేంగళనాథుడు | ౧౬ శ | కాకినాడప్రెస్సు, కాకినాడ 1928 |
| 71 | ద్వి. భాగ. | ద్విపద భాగవతము | స్కం.౧౨ | కోనేటినాథుడు | ౧౬ శ | కృష్ణా అండ్ కో ముద్రాక్షరశాల 1914 |
| 72 | ద్వి. భాగ. ద. | ద్విపద భాగవతము దశమస్కంధము | స్కం. ౧ | మడికి సింగన | ౧౪ శ | అముద్రితము |
| 73 | ద్వి. భార. | ద్విపద భారతము | పర్వ. ౧ | తిమ్మయ బాలసరస్వతి | ౧౬ శ | సరస్వతీ పవర్ ప్రెస్సు రాజమండ్రి 1943 |
| | ,, ఆది. | ఆదిపర్వము | ,, | | | |
| | ,, సభా. | సభాపర్వము | ,, | | | |
| 74 | ద్వి. శ. సా. | ద్విపద సారంగధర చరిత్రము | ఆ. 3 | బాణాల శంభుదాసుడు | ౧౮ శ | జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, చెన్నపురి 1914 |
| 75 | ద్వి. హరిశ్చం. | ద్విపద హరిశ్చంద్ర చరిత్రము | భాగ. ౨ | గౌరన | ౧౫ శ | జ్యోతిష్మతీప్రెస్సు చెన్నపురి 1912 |
| 76 | ధర్మ. | ధర్మఖండము | ఆ. ౯ | ఈదులపల్లి భవానీ శంకరుడు | ౧౭ శ | విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము |
| 77 | నరస. | నరసభూపాలీయము | ఆ. ౫ | మూర్తికవి | ౧౬ శ | ఓరియంటు ముద్రాక్షరశాల, సికింద్రాబాదు 1945 |
| 78 | నవ. | నవనాథచరిత్రము (ద్విపద) | భా. ౫ | గౌరన | ౧౫ శ | ఆనందప్రెస్సు, మద్రాసు 1937 |
| 79 | నా. పంచ. | పంచతంత్రము | ఆ. ౫ | నారాయణకవి | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1939 |
| 80 | నార. ఉ. | నారసింహపురాణము ఉత్తరభాగము | ఆ. ౫ | హరిభట్టు | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 81 | నిరం. | నిరంకుశోపాఖ్యానము | ఆ. ౪ | కందుకూరి రుద్రకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 82 | నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము | ఆ. ౧౦ | తిక్కన | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 83 | నీతి. | నీతిసీసపద్యశతకము | | తాళ్లపాక తిరుమలయ్య | ౧౫ శ | దేవస్థానము ప్రెస్సు చెన్నపురి 1935 |
| 84 | నృసిం. | నృసింహపురాణము | ఆ. ౫ | ఎఱ్ఱాప్రెగ్గడ | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 85 | నైష. | శృంగారనైషధము | ఆ. ౮ | శ్రీనాథుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| 86 | పండితా. | పండితారాధ్యచరిత్రము | ప్రక. ౫ | పాలకురికి సోమనాథుఁడు | ౧౩ శ | ఆంధ్రపత్రికప్రెస్సు 1939 |
| | ,, దీక్షా. | దీక్షాప్రకరణము | | | | |
| | ,, పురా. | పురాతనప్రకరణము | | | | |
| | ,, వాద. | వాదప్రకరణము | | | | |
| | ,, మహిమ. | మహిమప్రకరణము | | | | |
| | ,, పర్వ. | పర్వతప్రకరణము | | | | |
| 87 | పద్మ. | పద్మపురాణము ఉత్తరఖండము | ఆ. ౧౦ | మడికిసింగన | ౧౫ శ | వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాల, మదరాసు 1898 |
| 88 | పరత. | పరతత్త్వరసాయనము | ఆ. ౫ | ఈశ్వరఫణిభట్టు | | లా జర్నల్ ప్రెస్సు చెన్నపురి 1941 |
| 89 | పరమ. | పరమయోగివిలాసము | ఆ. ౫ | తిమ్మనృపాలుఁడు | | |
| 90 | పల్నా. | పల్నాటి వీరచరిత్రము (ద్విపద) | | శ్రీనాథుఁడు | ౧౩ శ | శ్రీరామప్రెస్సు 1934 |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము | ఆ. ౫ | కాకమాని మూర్తికవి | ౧౬ శ | మంజువాణిప్రెస్సు, ఏలూరు 1932 |
| 92 | పాండు. | పాండురంగ మాహాత్మ్యము | ఆ. ౫ | తెనాలి రామకృష్ణుఁడు | ౧౬ శ | ఆంధ్రపబ్లిషింగ్ హౌస్ చెన్నపురి 1945 |
| 93 | పారి. | పారిజాతాపహరణము | ఆ. ౫ | నందితిమ్మన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1933 |
| 94 | పార్వ. | పార్వతీపరిణయము | ఆ. ౬ | రఘునాథ భూపాలుఁడు | ౧౮ శ | సరస్వతీముద్రాక్షరశాల కాకినాడ 1908 |
| 95 | పిన. శకుం. | శకుంతలాపరిణయము | ఆ. ౪ | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1923 |
| 96 | పె. శకుం. | ,, | ఆ. ౩ | పెద్దాడనాగరాజు | ౧౮ శ | ఆనందప్రెస్సు 1900 |
| 97 | ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము | ఆ. ౧ | గణపవరపు వేంకటకవి | ౧౭ శ | నెల్లూరు 1892 |
| 98 | ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము | ఆ. ౫ | నందిమల్లయ ఘంట సింగయ | ౧౫ శ | చింతామణీముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము 1900 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసములు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 99 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము | ఆ. ౫ | పింగళి సూరన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1939 |
| 100 | ప్రభు. | ప్రభులింగలీల (ద్విపద) | ఆ. ౫ | పిడుపర్తి సోమన | ౧౬ శ | [illegible] ముద్రాక్షరశాల, విశాఖపట్టణము 1884 |
| 101 | బస. | బసవపురాణము | ఆ. ౭ | పాలకురికి సోమనాథుఁడు | ౧౩ శ | ఆంధ్రపత్రికప్రెస్సు 1926 |
| 102 | బహు. | బహుళాశ్వచరిత్రము | ఆ. ౫ | దామరల వెంగళ భూపాలుఁడు | ౧౬ శ | సరస్వతీప్రెస్సు కాకినాడ |
| 103 | బాలగో. | బాలగోపాలవిలాసము | ఆ. ౩ | ఒడ్డియకవి | ౧౭ శ | కాకినాడప్రెస్సు 1941 |
| 104 | బిల్హ. | బిల్హణీయము | ఆ. ౩ | పాడిపెద్ది కృష్ణస్వామి? చిత్రకవి సింగరార్యుఁడు? | ౧౯ శ | ఆనందప్రెస్సు చెన్నపురి 1910 |
| 105 | బ్రహ్మో. | బ్రహ్మోత్తరఖండము | ఆ. ౫ | శ్రీధరమల్లె వేంకటరామకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 106 | బ్రౌ. | బ్రౌణ్యనిఘంటువు | | సి. పి. బ్రౌను | ౧౯ శ | 1852 |
| 107 | భర్తృ. | భర్తృహరిశతకము | శ. ౩ | ఏనుఁగు లక్ష్మణకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| | ,, నీతి. | నీతిశతకము | | | | |
| | ,, శృం. | శృంగారశతకము | | | | |
| | ,, వై. | వైరాగ్యశతకము | | | | |
| 108 | భల్లా. | భల్లాణచరిత్రము | ఆ. ౫ | చిత్తారు గంగాధరకవి | — | సుదర్శనీప్రెస్సు చెన్నపురి 1928 |
| 109 | భాగ. | భాగవతము | స్కం. ౧౨ | పోతనాదులు | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 110 | భాను. | భానుమతీపరిణయము | ఆ. ౪ | రెంటూరి రంగరాజు | ౧౬ శ | మదరాసు 1872 |
| 111 | భార. | భారతము | పర్వ. ౧౮ | కవిత్రయము | | వావిళ్లప్రెస్సు 1949 |
| | ,, ఆది. | ఆదిపర్వము | ఆ. ౮ | నన్నయ | ౧౧ శ | |
| | ,, సభా. | సభాపర్వము | ,, ౨ | | | |
| | ,, అర. | అరణ్యపర్వము | ,, ౭ | నన్నయ, ఎఱ్ఱయ | ౧౪ శ | |
| | ,, విరా. | విరాటపర్వము | ,, ౩ | తిక్కన | ౧౩ శ | |
| | ,, ఉద్యో. | ఉద్యోగపర్వము | ,, ౪ | ,, | | |
| | ,, భీష్మ. | భీష్మపర్వము | ,, ౫ | ,, | | |
| | ,, ద్రోణ. | ద్రోణపర్వము | ,, ౫ | ,, | | |
| | ,, కర్ణ. | కర్ణపర్వము | ,, ౩ | ,, | | |
| | ,, శల్య. | శల్యపర్వము | ,, ౨ | ,, | | |
| | ,, సౌ. | సౌప్తికపర్వము | ,, ౨ | ,, | | |
| | ,, స్త్రీ. | స్త్రీపర్వము | ,, ౨ | ,, | | |
| | ,, శాం. | శాంతిపర్వము | ,, ౬ | ,, | | |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| | భార. అను. | అనుశాసనికపర్వము | ఆ. ౫ | తిక్కన | | వావిళ్లప్రెస్సు 1949 |
| | ,, అశ్వ. | అశ్వమేధపర్వము | ఆ. ౮ | ,, | | |
| | ,, ఆశ్ర. | ఆశ్రమవాసపర్వము | ఆ. ౨ | ,, | | |
| | ,, మౌ. | మౌసలపర్వము | ఆ. ౧ | ,, | | |
| | ,, మహా. | మహాప్రస్థానికపర్వము | ఆ. ౧ | ,, | | |
| 112 | భా. రా. | భాస్కరరామాయణము | కాం. ౬ | భాస్కరాదులు | ౧౧ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 113 | భా. శ. | భాస్కరశతకము | | మారద వెంకయ్య | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 114 | భీమ. | భీమఖండము | ఆ. ౬ | శ్రీనాథుఁడు | ౧౩ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు, చెన్నపురి 1929 |
| 115 | భో. | భోజరాజీయము | ఆ. ౭ | అనంతామాత్యుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1928 |
| 116 | భోజసు. | భోజసుతాపరిణయము | ఆ. ౫ | కోటేశ్వరుఁడు | | వైజయంతీప్రెస్సు 1908 |
| 117 | భోగి. | భోగినీదండకము | | పోతన | ౧౫ శ | జి. ఆర్. ప్రెస్సు చెన్నపురి 1916 |
| 118 | మల్ల. | మల్లభూపాలీయము | శత. ౩ | ఎలకూచి బాలసరస్వతి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 119 | మల్హాణ. | శృంగార మల్హాణ చరిత్రము | ఆ. ౩ | ఎడపాటి ఎఱ్ఱన | ౧౬ శ | ఆంధ్రపత్రికప్రెస్సు 1927 |
| 120 | మార్క. | మార్కండేయపురాణము | ఆ. ౮ | మారన | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1939 |
| 121 | ముకుం. | ముకుందవిలాసము | ఆ. ౩ | కాణాదము పెద్దన | ౧౮ శ | గద్వాల 1896 |
| 122 | మై. | మైరావణచరిత్రము | ఆ. ౩ | మాడయకవి | ౧౬ శ | విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము 1911 |
| 123 | మొ. రా. | మొల్లరామాయణము | కాం. ౬ | మొల్ల | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1928 |
| 124 | య. | యయాతిచరిత్రము | ఆ. ౫ | పొన్నిగంటి తెలగన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 125 | రంగా. | రంగారాయచరిత్రము | ఆ. ౩ | దిట్టకవి నారాయణకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1914 |
| 126 | రం. రా. | రంగనాథరామాయణము (ద్విపద) | కాం. ౬ | రంగనాథుఁడు | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1941 |
| 127 | రత్న. | రత్నపరీక్ష | | భైరవకవి | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 128 | రస. | రసమంజరి | గుచ్ఛము ౩ | సురతాని కోదండకవి | ౧౭ శ | విద్యానికేతనప్రెస్సు 1827 |
| 129 | రసిక. | రసికజనమనోభిరామము | ఆ. ౭ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1927 |
| 130 | రామ. క. | రామకర్ణామృతము | | సిద్ధకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 131 | రాఘవ. | రాఘవపాండవీయము | ఆ. ౮ | పింగళిసూరన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1929 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 132 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము | ఆ. ౩ | మాదయగారి మల్లన | ౧౬ శ | చింతామణి ప్రెస్సు 1908 |
| 133 | రాజ. వి. | రాజశేఖరవిలాసము | ఆ. ౩ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్ల ప్రెస్సు 1913 |
| 134 | రాధా. | రాధామాధవసంవాదము | ఆ. ౩ | వెలిదిండ్ల వెంకటపతి | ౧౮ శ | శ్రీపతి ప్రెస్సు కాకినాడ 1937 |
| 135 | రాధికా. | రాధికాసాంత్వనము | ఆ. ౪ | ముద్దుపళని | ౧౮ శ | రామా ఆర్టు ప్రెస్సు బందరు 1936 |
| 136 | రామ. | రామరాజీయము | ఆ. ౧ | వెంకయ్య | ౧౬ శ | వావిళ్ల ప్రెస్సు 1923 |
| 137 | రామ. లిం. | రామలింగేశ్వరశతకము | | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్ల ప్రెస్సు 1926 |
| 138 | రామా. | రామాభ్యుదయము | ఆ. ౮ | అయ్యలరాజు రామభద్రుఁడు | ౧౬ శ | వావిళ్ల ప్రెస్సు 1931 |
| 139 | రా. వి. | రాజవాహనవిజయము | ఆ. ౫ | కాకమాని మూర్తికవి | ౧౬ శ | మంజువాణీ ప్రెస్సు ఏలూరు 1937 |
| 140 | రుక్మ. | రుక్మవతీపరిణయము. | ఆ. ౫ | రేకపల్లి సోమప్ప | ౧౮ శ | కాకినాడ ప్రెస్సు 1940 |
| 141 | రుక్మాం. | రుక్మాంగదచరిత్రము | ఆ. ౫ | ప్రౌఢకవి మల్లన | ౧౫ శ | వావిళ్ల ప్రెస్సు 1938 |
| 142 | రుక్మి. | రుక్మిణీపరిణయము | ఆ. ౪ | సత్యవోలు భగవత్కవి | ౧౮ శ | సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ 1904 |
| 143 | రుక్మిణీ. | రుక్మిణీపరిణయము | ఆ. ౫ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్ల ప్రెస్సు 1922 |
| 144 | ల. సం. | లక్షణసారసంగ్రహము | ఆ. ౩ | చిత్రకవి పెద్దన | ౧౬ శ | కాకినాడ ప్రెస్సు కాకినాడ 1940 |
| 145 | వరాహ. | వరాహపురాణము | ఆ. ౧౨ | నందిమల్లయ ఘంటసింగయ | ౧౫ శ | కాకినాడ ప్రెస్సు కాకినాడ 1940 |
| 146 | వసి. | వసిష్ఠజనకసంవాదము | ఆ. ౩ | యామిజాల శేషయ | ౧౯ శ | వావిళ్ల ప్రెస్సు 1926 |
| 147 | వసు. | వసుచరిత్రము | ఆ. ౬ | రామరాజ భూషణుఁడు | ౧౬ శ | వావిళ్ల ప్రెస్సు 1926 |
| 148 | వా. రా. | వాసిష్ఠరామాయణము | ఆ. ౫ | మడికిసింగన | ౧౫ శ | చంద్రికా ప్రెస్సు 1935 |
| 149 | వాల్మీ | వాల్మీకిచరిత్రము | ఆ. ౩ | రఘునాథ భూపాలుఁడు | ౧౭ శ | శ్రీరామవిలాస ప్రెస్సు చిత్రాడ 1919 |
| 150 | విక్ర. | విక్రమార్కచరిత్రము | ఆ. ౮ | జక్కన | ౧౫ శ | వావిళ్ల ప్రెస్సు 1926 |
| 151 | విజ. | విజయవిలాసము | ఆ. ౩ | చేమకూర వేంకటకవి | ౧౭ శ | వావిళ్ల ప్రెస్సు 1924 |
| 152 | విజయ. | విజయనందనవిలాసము | ఆ. ౩ | మంగళగిరి ఆనందకవి | ౧౮ శ | శ్రీరామవిలాస ప్రెస్సు చిత్రాడ 1919 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 153 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | కాండ. 3 | కేతన | ౧3 శ | చింతామణీముద్రాక్షరశాల 1896 |
| 154 | విప్ర. | విప్రనారాయణ చరిత్రము | ఆ. ౫ | చెదలవాడ మల్లయ | ౧౬ శ | శ్రీపతిప్రెస్సు, కాకినాడ 1938 |
| 155 | వివే. | వివేకసింధువు | ఆ. ౫ | కొండనార్యుఁడు | ,, | వావిళ్లప్రెస్సు 1924 |
| 156 | విష్ణు. | విష్ణుపురాణము | ఆ. ౪ | కలిదిండి భావనారాయణ | ౧౬ శ | ఆనందప్రెస్సు 1931 |
| 157 | విష్ణు. నా. | విష్ణుమాయానాటకము | | చింతలపూఁడిఎల్లన | ౧౭ శ | ఆనందప్రెస్సు 1934 |
| 158 | వీథి. | వీథినాటకము | | శ్రీనాథుఁడు | ౧౫ శ | |
| 159 | వీర. | వీరభద్రవిజయము | ఆ. ౪ | పోతన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 160 | వేంక. | వేంకటేశాంధ్రము | వర్గులు. ౫ | గణపవరపు వేంకటకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1933 |
| 161 | వేంక. శ. | వేంకటేశ్వరశతకము | | తా. పెద తిరుమలయ్య | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 162 | వే. పంచ. | పంచతంత్రము | ఆ. ౫ | వేంకటనాథుఁడు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 163 | వేం. మా. | వేంకటాచల మాహాత్మ్యము | ఆ. ౬ | తరిగొండ వెంకమ్మ | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1937 |
| 164 | వేమన. | వేమనపద్యములు | | వేమన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 165 | వైజ. | వైజయంతీవిలాసము | ఆ. ౪ | సారంగుతమ్మయ | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 166 | శతకంఠ. | శతకంఠరామాయణము | ఆ. ౪ | మర్ధనకవి | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 167 | శ. ర. | శబ్దరత్నాకరము | | బ. సీతారామాచార్యులు | ౨౦ శ | డైసీసియన్‌ప్రెస్సు మదరాసు. 1912 |
| 168 | శశాం. | శశాంకవిజయము | ఆ. ౫ | శేషము వేంకటపతి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 169 | శశి. | శశిరేఖాపరిణయము | ఆ. ౫ | అప్పకవి | ? | వావిళ్లప్రెస్సు 1922 |
| 170 | శివరా. | శివరాత్రిమాహాత్మ్యము | ఆ. ౪ | శ్రీనాథుఁడు | ౧౫ శ | రాజమండ్రి 1930 |
| 171 | శివలీ. | శివలీలావిలాసము | ఆ. ౭ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 172 | శివ. సా. | శివతత్త్వసారము | ౪౦౬ పద్యములు | మల్లికార్జునపండితారాధ్యులు | ౧౨ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు చెన్నపురి 1922 |
| 173 | శుక. | శుకసప్తతి | ఆ. ౫ | కదిరీపతి నాయకుఁడు | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1935 |
| 174 | శృం. మం | శృంగారమంజరి (ద్విపద) | | తా. అన్నమయ్య | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు 1935 |
| 175 | శృం. సం. | శృంగారసంకీర్తనలు | ౬౪ సం. | తాళ్ళపాక అన్నమాచార్యుఁడు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు చెన్నపురి 1937 |
| 176 | శేష. | శేషధర్మము | ఆ. ౫ | తామరపల్లితిమ్మయ | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1927 |
| 177 | శ్రీరం. | శ్రీరంగమాహాత్మ్యము | ఆ. ౫ | భైరవకవి | ౧౫ శ | హిందూరత్నాకరం ప్రెస్సు, చెన్నపురి 1929 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసములు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 178 | శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము | ఆ. ౧౦ | కట్టావరద రాజేంద్రుడు | ౧౯ శ | హిందూరత్నాకర ప్రెస్సు, చెన్నపురి 1929 |
| 179 | శ్రీరాధా. | శ్రీరాధామాధవ సంవాదము | | చింతలపూడిఎల్లన | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1936 |
| 180 | శ్రీవేం. | శ్రీవేంకటేశోదాహరణము | పద్యము లు. ౨౯ | తాళ్లపాక పెదతిరుమలాచార్యుడు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు 1935 |
| 181 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము | ఆ. ౮ | మల్లారెడ్డి | ౧౬ శ | సుజనరంజనిప్రెస్సు కాకినాడ 1896 |
| 182 | సత్య. సా. | సత్యభామాసాంత్వనము | ఆ. ౪ | లింగనమూషి కామేశ్వరకవి | ౧౭ శ | శ్రీరామఆర్టుప్రెస్సు బందరు 1935 |
| 183 | షోడ. | షోడశకుమార చరిత్రము | ఆ. ౮ | వెన్నెలకంటి అన్నయ | ౧౪ శ | సిటీప్రెస్సు, కాకినాడ 1941 |
| 184 | స. శ. | సర్వేశ్వరశతకము | | యథావాక్కుల అన్నయ్య | ౧3 శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 185 | సప్త. | సప్తపదులు | | ముద్దుపళని | ౧౮ శ | రామఆర్టుప్రెస్సు బందరు 1936 |
| 186 | సర్వ. సం. | సర్వలక్షణసార సంగ్రహము | ఆ. 3 | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | మంజువాణీప్రెస్సు ఏలూరు 1927 |
| 187 | సమీర. | సమీరకుమార విజయము | ఆ. ౭ | పుష్పగిరి తిమ్మన | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 188 | సా | సారంగధరచరిత్రము | ఆ. 3 | చేమకూర వేంకటకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 189 | సాం. ని. | సాంబనిఘంటువు | వర్గములు౫ | కస్తూరిరంగకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 190 | సాంబో. | సాంబోపాఖ్యానము | ఆ. ౫ | రామరాజు రంగప్పరాజు | ౧౯ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1930 |
| 191 | సానందో. | సానందోపాఖ్యానము | ఆ. ౫ | శివరామకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 192 | సావి. | శృంగారసావిత్రి చరిత్రము | ఆ. ౨ | తంజాపూరి రఘునాథరాయలు | ౧౯ శ | ఇండియాప్రెస్సు చెన్నపురి 1928 |
| 193 | సిం. నార. | సింహాద్రినారసింహ శతకము | | గోగులపాటి కూర్మదాసుడు | | వావిళ్లప్రెస్సు |
| 194 | సీతారా. | సీతారామాంజనేయ సంవాదము | ఆ. 3 | పరశురామపంతుల గురులింగమూర్తి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1934 |
| 195 | సుగ్రీ. | సుగ్రీవవిజయము (యక్షగానము) | | కందుకూరి రుద్రకవి | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1940 |
| 196 | సుద. | సుదక్షిణాపరిణయము | ఆ. ౫ | తెనాలి అన్నయ్య | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1941 |
| 197 | సుభద్రా. | సుభద్రాపరిణయము | ఆ. ౬ | కూచిమంచిజగ్గకవి | ౧౮ శ | శ్రీపతిప్రెస్సు కాకినాడ 1935 |
| 198 | సురా. | సురాభాండేశ్వరము | ఆ. ౧ | గట్టుప్రభువు | | అమెరికన్ డైమండు ప్రెస్సు చెన్నపురి 1915 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 199 | సు. శ. | సుమతిశతకము | | బద్దెన? | | వావిళ్లప్రెస్సు 1928 |
| 200 | సూ. ని. | సూర్యరాయనిఘంటువు | సంపుటములు౪ | | ౨౦ శ | కాకినాడప్రెస్సు కాకినాడ |
| 201 | స్వా. | స్వారోచిషమనుచరిత్ర | ఆ. ౬ | అల్లసాని పెద్దన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1920 |
| 202 | హ. న. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము | ఆ. ౫ | రామరాజ భూషణుఁడు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 203 | హర. | హరవిలాసము | ఆ. ౭ | శ్రీనాథుఁడు | ౧3 శ | ఆనందప్రెస్సు 1939 |
| 204 | హరి. | హరివంశము | | ఎఱ్ఱయ | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| | ,, పూ. | పూర్వభాగము | ఆ. ౮ | ,, | ,, | |
| | ,, ఉ. | ఉత్తరభాగము | ఆ. ౧౦ | ,, | ,, | |
| 205 | హరిశ్చ. | హరిచంద్రోపాఖ్యానము | ఆ. ౫ | శంకరకవి | | వావిళ్లప్రెస్సు 1924 |

మిగిలినవి స్పష్టము.

## అ భి ప్రా య ము లు

## 6

### శ్రీదీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, వీ. ఆర్. కాలేజి, నెల్లూరు.

"వావిళ్ల నిఘంటువు" ప్రథమసంపుటమును అందందు పరిశీలించితిని. నిర్మాణపద్ధతి ప్రశంసార్హము. సంగ్రహమయ్యును సమృద్ధమనిపించుచున్నది. నిర్మాతలు కృతహస్తులు కావున, ఈపద్ధతిలోనే కోశము త్వరలో పూర్తియై వెలువడ గలదనియు, 'వెల స్వల్పము ఫల మధిక' మన్న నానుడికి తార్కాణమై ఆంధ్రలోకమున విపులప్రచారము కాంచగలదనియు నేను భావించుచున్నాను. సూర్యారాయ నిఘంటువులో దొరలిన ప్రమాదములు కొన్ని యిందు సంస్కరింపబడినవి. అది ముదావహమైన విషయము.

ఈ నిఘంటువు, భాషోద్ధరణ కంకణముధరించిన మీయొత్తికోలును పరిపూర్తి కావించి, వావిళ్ల వంశయశఃపతాకయై సారస్వత ప్రపంచమున శాశ్వతముగా విరాజిల్లగలదు.

## 7

### విద్యార్ణవ సాహిత్యసరస్వతి శ్రీ నూతలపాటి పేరరాజుగారు.

ఆంధ్రపండితులు, బోర్డు హైస్కూలు, ఉరవకొండ.

"వావిళ్ల నిఘంటువును శ్రద్ధతో పరిశీలించితిని. ఈ కోశము విద్యార్థులకేకాక పండితులకుకూడ సర్వవస్తు సంబోధనమును బ్రసాదించుననుటకు సందియములేదు. ఇది సంశయవిచ్ఛేదకంబులగు దృష్టాంతములతో నలరారుచున్నవి. ఇది త్వరలో పూర్తియగునని విని సంతసించితిని."

# ఇందుపయుక్తములైన సంస్కృతగ్రంథములపట్టిక

| సంఖ్య | గ్రంథనామము | గ్రంథకర్తనామము | గ్రంథమందలిసర్గాదులు |
|---|---|---|---|
| 1 | ఆప్టిని సంస్కృతాంధ్రనిఘంటువు | వామన శివరామాప్టుఁడు | |
| 2 | ఉత్తరరామచరితము | భవభూతి | ౭ అంకములు |
| 3 | కల్పద్రుమకోశము | సర్. రాజారాధాకాంతదేవు | |
| 4 | కాదంబరి | బాణుఁడు | ౨ భాగములు |
| 5 | త్రికాండశేషము | పురుషోత్తముఁడు | ౩ కాండములు |
| 6 | ధనంజయనిఘంటువు | ధనంజయకవి | ౨ పరిచ్ఛేదములు |
| 7 | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు | కేశవమిశ్రుఁడు | ౬ కాండములు |
| 8 | మనుస్మృతి | మనువు | ౧౨ అధ్యాయములు |
| 9 | మేదినినిఘంటువు | మేదినికరుఁడు | |
| 10 | రాజనిఘంటువు | నరహరిపండితుఁడు | ౨౧ వర్గములు |
| 11 | వాచస్పత్యనిఘంటువు | తారానాథతర్కవాచస్పతి | |
| 12 | విశ్వనిఘంటువు | మహేశ్వరసూరి | |
| 13 | వైజయంతీనిఘంటువు | యాదవప్రకాశుఁడు | ౮ కాండములు |
| 14 | సంస్కృతభాగవతము | వ్యాసుఁడు | |
| 15 | సంస్కృతభారతము | వ్యాసుఁడు | |
| 16 | సంస్కృతరామాయణము | వాల్మీకి | |
| 17 | సర్వశబ్దసంబోధిని | | |
| 18 | సాహిత్యదర్పణము | విశ్వనాథకవిరాజు | ౧౦ పరిచ్ఛేదములు |
| 19 | హలాయుధనిఘంటువు (అభిధానరత్నమాల) | హలాయుధుఁడు | ౫ కాండములు |
| 20 | హారావళి | పురుషోత్తమదేవుఁడు | |
| 21 | హితోపదేశము | నారాయణపండితుఁడు | ౪ భాగములు |
| 22 | హేమచంద్రనిఘంటువు (అనేకార్థసంగ్రహము) | హేమచంద్రుఁడు | ౭ కాండములు |

ఇంకను పెక్కు కావ్యనాటకాదులు.

# అభిప్రాయములు

## 1

మహోపాధ్యాయ కళాప్రపూర్ణ డాక్టరు: శ్రీ చిలుకూరి

నారాయణరావుగారు, ఎం. ఏ., పి. హెచ్. డి., ఎల్. టి.

"వావిళ్లనిఘంటువు" ప్రథమసంపుటమును సూక్ష్మముగ జూచినాను. అది సర్వవిధములను ఉత్తమనిఘంటువు కాబోతున్నదని చెప్పడానికి నాకెట్టి సందేహమును లేదు. శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారు నిఘంటు నిర్మాణమున ఆరితేరినవారు. వారిందు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువులో కుప్పలు తిప్పలుగా దొరలినదోషములను పరిహరించి శబ్దరత్నాకరములోని గుణములను నిలిపి సొంతపరిశీలనవల్ల ఏర్పడిన క్రొత్తవిషయములనుచేర్చి ఈగ్రంథమును సంతరించిరి. శ్రీవావిళ్లవారుకూడా ఈవిషయమున చాలాశ్రద్ధతో పనిచేసి గ్రంథసమగ్రతకును ప్రామాణ్యమునకును దోహదమిస్తున్నారు. ఈనిఘంటు విట్లే అచిరకాలములో సంపూర్ణముగ ప్రకటితమైన ఆంధ్రసాహిత్యజిజ్ఞాసువుల కమూల్యమైన సాహాయ్యమునివ్వగలదని నిశ్చయముగ చెప్పవచ్చును. వీరి యీ మహాప్రయత్నమును నిర్విఘ్నముగా కొనసాగింప పరమేశ్వరుడు వీరి కాయురారోగ్యములను ప్రసాదించునుగాక !

## 2

విద్వాన్ శ్రీగంటి సోమయాజిగారు, ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు.

భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారుచేసిన భాషాసేవామహాసముద్రమున నేడు ప్రచురింపబడిన వావిళ్ల నిఘంటువుయొక్క ప్రథమసంపుటప్రచురణ మొక నవ్యమహాతరంగము. సాహిత్యామృతసింధువును మథించి యందలి సారసంగ్రహణమునకై కీర్తిశేషులు శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులవారుచేసిన యారంభమును సమర్థులైన శ్రీబులుసు వేంకటేశ్వరులవారి సాహాయ్యమున భాషోద్ధారకులు ఫలవంతము చేయింపగలిగిరి. అనేకపదవిలసితమై, ప్రమాణానుబద్ధమై, నియమముల ననుసరించుచున్నదియైయున్న యీనిఘంటురాజము శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారి కీర్తి కుసుమమాలికలో నొకపువ్వు. ఖిలమగుచుపోవుచున్న యాంధ్రవాఙ్మయలక్ష్యజాతమును చాలవఱకు శ్రీశాస్త్రులవా రుద్ధరించిరి. శబ్దరత్నాకరము ప్రచారమున లేదు. సూర్యారాయనిఘంటువు పూర్తికానందున క్రొత్తనిఘంటువునకు స్థానము లేకపోలేదు.

ఈనిఘంటువున తెనుగునాటవ్యాప్తిలోనున్న యనేకపదములు సంగ్రహింపబడినవి. తెనుగు నందలి తత్సమపదములకును ప్రయోగములు చూపబడినవి. వ్యుత్పత్తులను చూపించుట మెచ్చదగినది. పాఠాంతరములను పేర్కొనుట ప్రశంసనీయము. ఈమహాకార్యమును తాముపూనుకొని సమర్థతతో నిర్వహించు శ్రీశాస్త్రిగారిని అభినందించుచున్నాను.

## 3

విద్వాన్ శ్రీ క. రామయ్యగారు, బీ. ఓ. యల్.,

ఆంధ్రోపన్యాసకుడు, శ్రీవేంకటేశ్వరప్రాచ్యకళాశాల, తిరుపతి.

ఇటీవల నొక కొంతపనిమీద నేను నామిత్రులగు శ్రీవేదాంతశిరోమణి కే. దక్షిణామూర్తి, బి. ఏ., బి. ఓ. యల్. గారితోను, శ్రీయన్. నాగయ్య, ఎం. ఏ. గారితోను గలిసి చెన్నపురి కేగినపుడు మాతండ్రిగారగు కీ. శే. కర్నూలు శ్రీ తాయన్నకవిగారి ప్రాణమిత్రులును నాశ్రేయోభిలాషులును నగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారినిజూచుభాగ్యము సమకూడినది. ఆసందర్భమున శ్రీశాస్త్రులవారు "వావిళ్ల నిఘంటువు" యొక్క ప్రెస్‌కాపీ నొకదాని నాకు జూపించిరి. ఈనిఘంటువునందు 'అ' కారము మొదలుకొని 'ఖ' కారము వఱకుగల పదము లున్నవి. దీనిని శ్రీశాస్త్రులవారు మొదటి సంపుటముక్రింద బ్రకటించియున్నారు. దీనికి సంపాదకులగు శ్రీశాస్త్రులవారు పీఠికలో దీనినిగుఱించి

"శబ్దరత్నాకరములు నాటను నేటను ననేకములు వెలసినను నవి సమగ్రములని చెప్పజాలము. నిఘంటువు లెప్పటికి నసంపూర్ణములే" అని చెప్పియున్నారు. కాని, నిజమున కిది యట్లుకాదు. ఏలయన 'అ' కారము మొదలు 'ఔ' కారము దాకనుండి సుమారు 580 పుటలతో మొదటి వాల్యూము క్రింద వెలువడిన యీ యాంధ్రనిఘంటువుయొక్క సంపూర్ణత నిదియే చెప్పుచున్నదనుటలో నతిశయోక్తి గానేరదు. ఇందితర నిఘంటువులలో లేనివియు నాటినుండి నేటిదాక మనయాంధ్రభాషలో నూత్నముగా బ్రయుక్తములగు ననేక సంస్కృత పదములును బెక్కు తెలుగు పదములును జేర్పబడియున్నవి. మఱియు ననుబంధముక్రింద నెన్నియో నూత్నములగుసంస్కృతశబ్దములకును, తెనుగు మాటలకును నర్థము నియ్యబడియున్నవి. ఈ నిఘంటుకర్తలు మన ఆంధ్రలోకమునకు జిరపరిచితులగు సుప్రసిద్ధ పండితోత్తములు. సంపాదకులు నాటినుండి నేటివఱకు నాంధ్రభాష కమూల్యమును, అపూర్వమును నగు సేవ నొనరించి యాసేతుహిమాచలము ఘనకీర్తిని సంపాదించిన వావిళ్లవారు. ఇది యాంధ్రరాష్ట్ర మవతరింపనున్న సుసమయము. ఇట్టిసమయమునకే సుప్రసిద్ధ "వావిళ్ల నిఘంటువు" నవతరింపజేసి మన యాంధ్రరాష్ట్రమునకంతటికిని నొసగిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చిరస్మరణీయులు. ఇట్టి నిఘంటువు ప్రతి యాంధ్రునియింటనుండదగినదియే !

## 4

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, ఎం. ఏ., (ఆనర్సు),
చేర్‌మెన్, బోర్డుఆఫ్ స్టడీస్ (తెలుగు) ఆంధ్రయూనివర్సిటీ, విశాఖపట్టణము.

వావిళ్ల నిఘంటువు ప్రథమసంపుటము చూచితిని. ఇతరనిఘంటువులుకూడ జెంతనుంచుకొని దానిని శ్రద్ధతో బరికించితిని. అది సర్వసమగ్రమును సర్వజనోపయోగియునై యలరారుచున్న దనిచెప్పుట కెంతయు సంతోషించుచున్నాను. శబ్దముల కీబడిన యర్థములు సవివరణములును సప్రయోగములునై సుగ్రాహములుగానున్నవి. అచ్చటచ్చట నితర ద్రావిడభాషలందలి పర్యాయపదముల నొసంగుటయు, తద్భవములకు సంస్కృతప్రాకృత ప్రకృతుల జూపుటయు, నావశ్యకములైన యెడల జన్యజనక భావమును వ్యుత్పత్త్యర్థములను సూచించుటయు, ముఖ్యములైన సమాసములనుగూడ జేర్చి వాని కర్థము లిచ్చుటయు, ద్రుతప్రకృతులైన శబ్దముల ద్రుతాంతతను ద్రువర్ణముచే సూచించుటయు నీ నిఘంటువుయొక్క విశిష్టతను జాటుచు గర్తల పరిశ్రమ బుద్ధిగౌరవములకు నిదర్శనముగానున్నది. ఇంగిలము మున్నగు పదములకడ నొసంగబడిన వివరణములు, సరసములు, సమంజసములునై మెచ్చు గొల్పుచున్నవి. చిరకాలమునుండి సంస్కృతాంధ్రగ్రంథముల నచ్చొత్తించుచు నాయుభయభాషలకు నపారమైనసేవ కావించుచున్న తామెప్పుడో పూనవలసిన నిఘంటు ప్రకటన క్రియకు గొంతయాలస్యముగనే ఒసంగినను దానిని సమగ్రముగను నిర్దుష్టముగను బ్రకటింపజాలుటచే నాలస్యమునుగూడ సర్థవంతమునే కావింప గలిగినారు. ఇతర సంపుటములనుగూడ నచిరకాలముననే ప్రచురించి భాషకు సేవను, గర్తలకు గీర్తిగౌరవములను, బండితులకు సంతోషమును, ఆత్మకు దృప్తిని గలిగింతు రని విశ్వసించుచున్నాను.

## 5

విద్వాన్: శ్రీ డి. వి. కృష్ణమూర్తిగారు, వి. ఆర్. కాలేజీ, నెల్లూరు.

"వావిళ్లనింఘటువు" ప్రథమ సంపుటమును పరిశీలించితిని. వంశపరంపరగా దాము సల్పుచున్న భాషాసేవకు ఈనిఘంటునిర్మాణ మెంతయు దగియున్నది. పిన్న పెద్దలందఱకు నియ్యది అత్యంతోపకారకము కాగలదు. మఱియు దమపేర వెలయుటచే నిది తమకు శాశ్వతయశస్సును జేకూర్పగలదు. మాలాది పదములతోడి ద్వితీయసంపుటము నైతము అచిరకాలములోనే వెలువడగలదని ఆశించుచున్నాను. పరమేశ్వరుడు తమకు దీర్ఘాయురారోగ్యము లనుగ్రహించుగాక !

# క

క. ఉభ. ఒకానొకయక్షరము. దే. ప్ర. 1. వ్యతిరేక క్త్వార్థకమున వచ్చునది:—కొట్టక; 2. కృత్ప్రత్యయము:—పోకముసుపు మొ. 3. 'కొని'కి ఆదేశముగా వచ్చురూపము. "మ. గరళం బెత్తుక త్రాఁగఁగా...భా. రా. అర. ౨, ఆ. ౧౦౨; 4. కొన్ని ధాతువులకు భావార్థమునందు వచ్చు ప్రత్యయము." ఉ...అటు గాక తక్కినన్." భా. రా. అయో. ౭౭౭; 5. ద్రు. అగు ధాతువు యొక్క నుబ్యంతరూపము:—తెస్సగ. చూడఁగ మొ. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. మన్మథుఁడు; 4. అగ్ని; 5. గాలి; 6. యముఁడు; 7. సూర్యుఁడు; 8. రాజు; 9. ఆత్మ; 10. దేహము. న. 1. సౌఖ్యము; 2. తల; 3. నీరు; 4. పేరు. (తెలుఁగున దీనికి వ్యస్తప్రయోగము లేదు.) ప్ర. 1. స్వార్థమును దెలుపును. "క...విచిత్రవీర్యకక్షేత్రమునన్." భార. ఆది. ర, ఆ. ౨౩౮; 2. అల్పార్థమును దెలుపును. ఉదా:—వృక్షకము = చిన్నచెట్టు. బాలకుఁడు = చిన్నబాలుఁడు.

కంకటము. సం. వి. అ. పుం. కవచము.

కంకటి. వై. వి. (సం. ఖట్వా) 1. మంచము. "ఉ...చొక్కటపుఁగంకటిపై..." శుక. ౧, ఆ. ౨౦౪, ఆం. భా. ద్వి. ౧౭౪; 2. ఆయుధవిశేషము. "చ. పరశులు గొంతములఁ గదలు భల్లము లమ్ములు విండ్లుఁ గంకటుల్...వ. అనుననేకాయుధవర్షంబు..." కు. సం. ౧౨. ఆ. ౫౭, ౬.

కంకణము. ఉభ. దే. వి. 1. ఒకానొకజలపక్షి. "చ...కంకణంపు మ్రోఁ, తలఁ బులు దేల పండుఁ బయిఁ దాల్చి నను ల్వడిఁ జొచ్చె వారిధిన్." ఆము. ౪, ఆ. ౧౦౧. (జలపక్షులు, వలయములు.) 2. రాపులుఁగు. ఆం. భా. ద్వి. ౯౧. సం. వి. అ. న. 1. చేతి కడియము; 2. చేతఁ గట్టకొను తోరము; 3. నగ, శిరోభూషణము. పుం. జలబిందువు. "ద్వి...నిజాపాంగహర్షాశ్రు, కంకణంబులు రాల..." పండితా. దీక్షా. 3.

కంకణముకట్టకొను. మి. అ. క్రి. (కంకణము + కట్టు + కొను) 1. చేతికిఁ దోరము గట్టుకొను; 2. దీక్షవూను. "ఉ...కంకణము గట్టుక యుండెడు నిప్పు డర్జునుం, డౌర రణంబు పెండ్లికొడుకంచు నుతించిరి వీరపుంగవుల్." విజ. 3, ఆ. ౧౫౪.

కంకణాయి. దే. వి. కంకణము, ఒకానొకజలపక్షి. (శ. ర.)

కంకణి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుగంట, గజ్జె. విణ. (న్. నీ. న్.) కంకణము గలవాఁడు.

కంకతము. సం. వి. అ. పుం; 1. బీఱువ్వ; 2. దుందుభము. పుం. న. దువ్వెన.

కంకతిక. సం. వి. ఆ. స్త్రీ. దువ్వెన.

కంకపత్త్రము. సం. వి. అ. పుం. 1. ఒకానొకబాణము; 2. బాణము. న. రాపులుఁగుటెక్క.

కంకము. సం. వి. అ. పుం. 1. రాపులుఁగు; 2. పెద్దరాచమామిడిచెట్టు.

కంకర. వై. వి. (సం. కర్కరమ్;) 1. గృహాదుల కుపయోగించు లేపద్రవ్యవిశేషము. "సీ. కంకర బెందడి గార సోద యనంగ లేపవిశేషము... ఆం. భా. ద్వి. ౧౭; 2. శిలావిశేషము. ఉదా:—కంకరతాయి. (వా.)

కంకరగాడిద = కంచరగాడిద. "మత్త. గాడిదల్ సెడఁ దన్నుకంకరగాడిదల్..." సానందో. ౨, ఆ. ౮.

కంకాళము. సం. వి. అ. పుం. అస్థిపంజరము.

కంకి. దే. వి. (క. కంకి.) జొన్న మొ. వానివెన్ను. ఆం. భా. ద్వి. ౨౩౬. విణ. వికృతము. "సీ. కంకి నోటను జొంగ యంకురింప". శ. హరిశ్చ. 3, ఆ. ౩౧. (బ్రౌ.)

కంకిపుత్తడి. దే. వి. ఒకానొకయోషధి. (బ్రౌ.)

కంకిపుత్రి. మి. వి. ఓషధివిశేషము. (బ్రౌ.)

కంకు. దే. స. క్రి. 1. గద్దించు. (శ. ర.) 2. తిట్టు. (శ. ర.) 3. ఎగురవేయు. (చూ. కంకుడు.) వి. 1. గద్దింపు. 2. తిట్టు. (బ్రౌ.)

కంకుఁడు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. క్షత్త్రియుఁడు; 3. కపట బ్రాహ్మణవేషధారి, ధర్మరాజు అజ్ఞాతమునఁ బెట్టుకొన్న పేరు; 4. రాపులుఁగులను జంపి తినెడుబోయ. సం. భాగ. ౨. ౪. ౧౮

కంకుడు. దే. వి. (కంకు. ధా.) ఎగురవేయుట. (చూ. కంకుడుకాయ.)

కంకుడుకాయ. దే. వి. (కంకుడు + కాయ.) బాలక్రీడార్థ మగు ఒకానొకకాయ. "చ. ఎలమిగఁ

జిన్నవాఁడె తను నెత్తుక మద్దొనరించు ప్రేతమూఁక, కలజిగి మోపిచన్నులును గంకుడుకాయలు లక్కదొండపం, డులుగ నొనర్చి యాడిన ఘనుండు..." చమ. ౩, ఆ. ౧౧౭.

కంకులుపెట్టు. దే. స. క్రి. (కంకులు + పెట్టు.) నిందించు, దూఱు. (బ్రౌ.)

కంకేళ్లి. సం. = కంకేళి.

కంకేళి. సం. వి. ఇ. పుం. అశోకము. (శోకనివారణార్థము జనులు దీనిక్రింద విహరింతురు.)

కంఖాణము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము. విజ. ౩, ఆ. ౧౩౭; 2. ఒకానొకజాతిగుఱ్ఱము. "సీ. కంఖాణతురగ..." వరాహ. ౫, ఆ. ౨౭.

కంఖాణి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగుఱ్ఱము. "క... సంజ్ఞా, కంఖాణిం జేర నరిగి కామాతురతన్." వరాహ. ౫, ఆ. ౯౬.

కంగటి = కంకటి. "ఉ...కంగటికాలు నమ్మఁ దగుకై దువు..." జై. ౫ ఆ. ౮౫. "ద్వి. కంగటికాళ్లసంకంపుఁఋూసలును, సంగడించిన యట్టిసభలును సభలె." పండితా. వాద. ౫౨౧. పు.

కంగరు. దే. వి. ఒకరకపునిచ్చెన. (బ్రౌ.)

కంగవ. దే. వి. స్థానము, చోటు. ఆం. భా. ద్వి. ౧౩. ఆం. పద. అచర. ౧౫.

కంగాణము. దే. వి. (త. కంగాణమ్.) కళ్లమునందలి కావలి. (శ. ర. బ్రౌ.)

కంగాబింగా. దే. క్రి. విశే. 1. నలఁగినలఁగనట్లుగా. వ్యవ:—ఆమిరియాలు కంగాబింగా నమలి మ్రింగుము; 2. తొందరగా: వ్యవ:—వాఁడు కంగాబింగా రెండుమెతుకులు తిని రైలునకు పోయినాఁడు. (వా.)

కంగారు. దే. వి. యుద్ధము. ఆం. భా. ద్వి. ౨౨౨; 2. కలవరపాటు. విశే. కలవరపడినది. "క. వెంగలివి త్తయి తిరుగుచుఁ, గంగారై చెడక..." భాగ. ౯. స్కం. ౫౮౩., మొ. రా. కిష్కిం. ౨౮.

కంగారుపడు. ద్వ. అ. క్రి. (కంగారు+పడు.) కలవరపడు, తొందరపడు. వా:—నీవంత కంగారుపడిన లాభము లేదు.

కంగాళీ. హిం. విశే. 1. నీచమైనది; 2. కలవరపడినది; 3. సంకరమైనది; 4. చెడిపోయినది.

కంగిస. దే. వి. యుద్ధము. ఆం. భా. ద్వి. ౨౨౨.

కంగు. దే. అ. క్రి. 1. తప్తమగు; కరఁగుటచే పొఱుఁ గెక్కు. "ఉ. కంగినపైఁడికుండల వరావకతైఁ చనఁజేయఁ జాలు చ, న్నుంగవ..." రాజ. చ. ౩, ఆ. ౭౯; 2. కదలు. (వా.) వి. 1. జరి మొదలగువానితో నుతకగా నేర్పఱచిన నున్న. "శా. కంగుల్ దీరినపైఁడిణీలుపెఁ..." విజ. ౨, ఆ. ౧౫౭. హరిశ్చ. ౧, ఆ. ౫౯; 2. కషము. వా:—ఉప్పునఁబట్టలో వాఁడు కంగు కాచినాఁడు; 3. మ్రోఁగుటయందగుధ్వని ననుకరణము. "ఉ. కంగున ఘుంటమైఁ గొడుపు గ్రుక్కనవై ముమఁగూర్యవాపముల్, నిరిగియుదిక్తటంబులును నిండఁగ..." భో. ౮, ఆ. ౯౩. (గీనిమాఱ్రేఁడితరూపము కంగుకంగు. స్కా. ౮, ఆ. ౧౦౩.)

కంగులము. స. వి. అ. పుం. హస్తము, చేయి.

కంగువు. సం. వి. ఉ. స్త్రీ. కొఱ్ఱధాన్యము.

కంగేళి. వై. వి. (సం. కంకేలిః.) అశోకము. "సీ. పొగడను గంగేళిఁ దగ విరుల్ గలిగించె..." య. ౮. ఆ. ౨౦.

కంగోరు. దే. వి. నిడుపుకాసె. (శ. ర.)

కంగోరుపావడ. దే. వి. (కంగోరు+పావడ.) నిడుపుకొన లుంచి కుట్టెడుగాగర. ఆం. భా. ద్వి. ౧౫౮.

కంచి. వై. వి. (సం. కాంచీ.) కాంచీపురము. "గీ. కాఁపుఁగోడలు కంచంతకాఁపురంబు...కీడ్పతిచె..." పాండు. ౩, ఆ. ౮౧. (కంచంత = కంచియంత; పెద్ద.) "శా...సంపదక్, గంచిం బోలినయట్టిపట్టణము సత్కారంబుగా నిచ్చి..." ద్వా. ౩, ఆ. ౭౨.

కంచిగరుడసేవ. మి. వి. 1. కంచిలో గరుడోత్సవము చూచుట. (ప్రతిఫలము లేనిపనిచేయుటకుపమానముగా దీనిని గ్రహింతురు. కంచి శ్రమపడి వెళ్లుటయేకాని యచటి గరుడోత్సవము కాని దేవతాదర్శనముకాని లభించుట కష్టమని భావము.) 2. జీతముబత్తెము లేని సేవ. (వా.)

కంచిమేఁక. ద్వ. వి. (కంచి+మేఁక.) కాంచీనగరమువైపుమేఁక; పెద్దపొదుఁగు గలయొకజాతి మేఁక. (శ. ర., బ్రౌ. వా.)

కంచియ = కంచె. (శ. ర.)

కంచుకము. సం. వి. అ. పుం. న. 1. అవిక; 2. ఒకవిధ మగుచొక్కా; 3. కవచము; 4. పాము కుబుసము; 5. పొట్టు; 6. వస్త్రము.

కంచుకి. సం. వి. న్. పుం. 1. అంతఃపురచారి. 2. పాము; 3. విటుఁడు; 4. అగరు.♆ విణ. (న్. నీ. న్.) కంచుకము కలవాఁడు.

కంచులి. (ళి.) సం. వి. ఈ. స్త్రీ = కంచూలము.

కంచులి. (ళి.) క. సం. వి. ఆ. స్త్రీ = కంచూలము.

కంచూలము. సం. వి. అ. న. అవిక.

కంచె. వై. వి. (సం. కక్షః.) వృతి, తుమ్మమొ. వానిచే నేర్పఱిచినఆవరణము. "కంచెయే చేను మేసినఁ గలదె దిక్కు". (చాటువు.) 2. బీడు, దున్ననిభూమి. ఆం. భా. ద్వి. ౬.

కంచెకోట. ద్వ. వి. (కంచె+కోట.) వెదురు పేము మున్నగువానిచే కోటచుట్టు నేర్పఱుపఁబడిన యావరణము. (శ. ర., బ్రౌ.)

కంచెగోడ. ద్వ. వి. (కంచె+గోడ.) కంప పాఁతిన గోడ. (శ. ర.)

కంచెల. వై. వి. (సం. కంచులీ.) 1. అవిక. "చ... తనువల్లి యుబ్బి కం, చెల తెగిపడ్డఁ గేతనము చీరచెఱంగున మూసెఁ జన్నులన్." స్వా. ౫, ఆ. ౬౩., నైష. ౬, ఆ. ౨౨. 2. బీడునేల. ఆం. భా. తృ. ౪౬.

కంచము. వై. వి. (సం. కంసమ్.) 1. కంచుపాత్ర; భోజనపాత్ర. "గీ. తమ్మిపూఁజూలి పునుకకంచము సాఁచి." హర. ౫, ఆ. ౧౬. "గీ... కంచముమొదటివాని, లేశ మంతయుఁ గృప లేక లేవ నెత్తె." పిన. శకుం. ౨, ఆ. ౧౬౫. చం. ౩, ఆ. ౨౩. 2. పళ్లెము. "చ. ఘన గతశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి..." ఆము. ౨, ఆ. ౧౬.

కంచేర. వై. వి. కంచుపని చేసి బ్రతికెడు ఒకానొకజాతి. (శ. ర. వా.)

కంచేరగాడిద. వై. వి. (కంచరము+గాడిద.) అశ్వతరము; నీచగార్దభము. (శ. ర. వా)

కంచేరము. వై. వి. 1. (సం. చంకురః.) గాడి, ఒక నీచజాతిరథము. (శ. ర.) 2. కంచరిపని. (వా.)

కంచేరి. వై. వి. (కంచు+అరి.) కంచుపని చేయు వాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౪.

కంచేల = కంచెల. "సీ...చన్నులు జిలుఁగుగంచ లల నఱుమ." భాగ. ౧౦, స్కం. ఉ. ౮౦౩.

కంచు. వై. వి. (సం. కంసమ్. క. కంచు.) ఒకానొక లోహము. "ఆ. కంచు మ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా" వేమన. "ద్వి. కలశముల్ మీఁదటఁ గంచుగుబ్బలును." పండితా. పర్వ. ౩౦౯. పు.

కంచుకంటు. ద్వ. వి. (కంచు+కంటు.) బాణలి, కందువు. ఆం. భా. ద్వి. ౨౪౩.

కంచుకాగడా. ద్వ. వి. (కంచు+కాగడా.) కంచుతో చేసిన కాగడా; మిక్కిలి కాంతి నిచ్చుకాగడా. వా:—కంచుకాగడా పెట్టి వెదకినా కనఁబడదు.

కంచుకొమ్ము. ద్వ. వి. (కంచు+కొమ్ము.) ఒకానొకవాద్యము. "గీ. ముందటను గంచుకొమ్ము మిన్నంది మొరయ." వైజ. ౪, ఆ. ౭౮.

కంచుపదను. ద్వ. విణ. (కంచు+పదను.) మృదువు, మెత్తనిది. "చ...ఎం, తని పచియింతుఁ గంచు పద నాచెలిసెమ్మన మొంచ నుద్ధవా." రాధా. ౨, ఆ. ౩౨.

కంచుమించు. దే. వి. ఒకానొకడేగ. ఆం. భా. ద్వి. ౯౦. విణ. (కంచు+మించు.) 1. అగోచరము, కనఁబడనిది. "గీ. కాఁకమించుల వినుమాని కంపు జోదు, మంచుగమిఁ గంచుమించు గావించు కరణి." రామా. ౫, ఆ. ౧౪౫. శుక. ౧, ఆ. ౨౨౨; 2. అధికము. "గీ. కంచుమించుగ ధరణి గ్రక్కదల..." సా. ౧, ఆ. ౮౩.

కంచురాయి. ద్వ. వి. (కంచు+రాయి.) కంచువలె మ్రోఁగు నొకరకపుఱాయి. (బ్రౌ.)

కంజము. సం. వి. అ. పుం. తలపైఁ బుట్టునది— వెండ్రుక. న. నీటఁ బుట్టునది— 1. అమృతము. 2. పద్మము.

కంజరము. సం. వి. అ. పుం. 1. కుంజరము, ఏనుఁగు; 2. కడుపు; 3. జిల్లేడు♆.

కంజరుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. బ్రహ్మ.

కంజాతము. సం. వి. అ. న. పద్మము, నీటిపుట్టుగు.

కంజారము. స. వి. అ. పుం. 1. కంజరము. 2. మణి; 2. మర్మావయవము. విణ. (అ. ఆ. అ.) అశుభప్రదము, అమంగళమైనది.

కంజూఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.

కంజాయింపు. దే. వి. ఏర్పాటు. (వా.) విణ. చేసి కది వేఱుగా చేర్పఁబడినది. వా.—వారిల్లు మంచికంజాయింపుగా నున్నది.

కంజె. వై. వి. (సం. కపింజలః.) కౌఁజు. (శ. ర.)

కంట. దే. వి. 1. కనుట. పొందుట. "క. ఇంటం దెవులునఁ జచ్చుట, కంటెరు బాపంబు లొందు గలవె నృపులకున్, బంటకలను పొలికల నిసి, గంట నిధానంబు గంట గాదే మనకున్." భార. భీష్మ. ౧, ఆ. ౯౯; 2. నాట్యబంధము. ఆం. భా. ప్ర. ౧౩౦; 3. నాట్యభేదము. (బ్రౌ.)

కంటఁబడు. ద్వి. అ. క్రి. (కంటన్+పడు.) కనఁబడు. "వ... మింటనుండి కంటఁబడి కంటువడఁ గనుఁగొన కిట్లనియె." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౩.

కంటక. స. వి. ఆ. స్త్రీ. ఒకరకపుకఱుఁదురీఁగ.

కంటకద్రుమము. సం. వి. అ. పుం. 1. ముండ్ల చెట్టు; 2. బూరుగు ♣.

కంటకఫలము. సం. వి. అ. పుం. ముండ్లు గలపండ్లు గలది. 1. పనస ♣; 2. పల్లేరు ♣.

కంటకము. ఉభ. దే. వి. 1. ద్వేషము. "ద్వి... నరులు కెఱతురు పన్నగభీతి ననుచు,... విసరిలెఁ గాని, కంటకంబున వేయఁ గఱకంతుసాక్షి." నవ. ౪, ఆ. 2. పరుషవాక్యము. "ర. అటెమి ననుఁ జీవ రునకు నగునె కంటక మాడ. స్వా; 3. ఆ. ౭౪. విణ. విరుద్ధము. "తరళ. కడఁగి బుద్ధిబలంబుఁ దద్దయుఁ గంటకంబుగఁ జేసి యేఁ, బుడమిరాజ్యము సర్వమున్ దగఁ బుచ్చియిచ్చిన..." భార. ఆర. ౬, ఆ. ౬౨. (శ.ర. పా.) సం. వి. అ. పుం. న.; 1. ముల్లు; 2. బాణాగ్రము; 3. సూదిమొన; 4. చేఁప ముస్నగువానియొముక; 5. రోమాంచము; 6. జ్యోతిశ్శాస్త్రమున కేంద్రస్థానము; 7. కార్యస్థానము. 8. వాదమున దోషభేదము. పుం. 1. వేదురు; 2. మొసలి.

కంటకారి. సం. వి. ఈ. స్త్రీ = కంటకారిక.

కంటకారిక. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు ♣.

కంటకి. ఉభ. దే. వి. బట్టలకు వేయు ఒకానొకరంగు. "రగడ. కంటకి గుజ్జరి మడుపులూ మొదలుగఁ గలిగిన పలుఁవెన్నెల పుట్టమ్ములు." కవిక. ౫, ఆ. ౧౯౫. స్వా; 3, ఆ. ౧౦౬. సం. వి. ఈ. స్త్రీ. 1. చేఁప; 2. వెదురు ♣, 3. రేగు ♣; 4. పల్లేరు ♣. ఈ. స్త్రీ. ... కంట కములు గలది.

కంటగించు. దే. అ. క్రి. అనిష్టము సూచు. "క... కాపరే యనఁడు తాపము సొంపెఁడు కంటగింపఁ డున్." భాగ. ౭. స్కం. ౧౯౪; 2. అసహ్య పడు. "శా... నా, పే రన్నను మని గంటగించె దరు పెంపే మీకు న న్నేమటన్." శుక. 3. ఆ, ౪౯౪. 3. నొచ్చు. "... తల కంటగించు చుండఁగ..." నిర్వ. ౧౦, ఆ. ౭౯.

కంటగింపు. దే. వి. (కంటగించు. ధా.) రోఁత, అసహ్యము. "మ... మాటపైఁ గంటగింపును ..." చంద్రా. ౫, ఆ. ౧౨.

కంటగిలు = కంటగించు. (నొచ్చు) "సీ. పసలస్రాం దొడిమ యొత్తినఁ గంటగిలును త్రకం బెట్టు కొర్పెనో కఱకుబడలు." పాండు. ౧, ఆ. 3.

కంటము. సం. వి. అ. పుం. న. ముల్లు, కంటకము.

కంటలము. ఉభ. వై. వి. (సం. కంతాలః. క. కంటలె.) 1. చిల్లరసరకు లుంచి యెద్దు మొ. వానిపై వేయుబుట్టలు మొ. వానిజత. "గీ... కంటలపుటెడ్లు, నాయుధము సేకరము..." హరి. పూ. ౬, ఆ. ౧౧. (శ. ర. పా. 'కందలము'. పాఠాం.) 2. తోమ్మిది మణుంగులబరువు. (కొంద పదిమణుంగు లని కొందఱు.) (వా.) 3. దూది మూట. (శ. ర.) సం. వి. అ. పుం. తుమ్మ ♣.

కంటసము. దే. వి. విప్రలాపము, విరోధపుమాట. ఆం. భా. ప్ర. ౧౧౬.

కంటసరము. వై. వి. (సం. కంఠసరః.) కంటసరి. "సీ. లాయంబుఁ గంచంబులై యుల్లసిల్లు నేపంట వేల్పునకును గంటసరము." చం. రా. 3, ఆ. ౨౩.

కంటసరి = కంటసరము. (గళభూషావిశేషము.) ఆం. భా. ద్వి. ౧౪౮. "సీ... సరి లేదు మెడ కంటసరికి నెందు." వాల్మీ. ౨, ఆ. ౫౦. 2. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౨౮.

కంటాణి. దే. వి. కాగితములు మొ. కుట్టుట నుప యోగించు సాధనవిశేషము. (బ్రౌ. వా.)

కంటాలము = కంట్లము. (బుట్టమొ.) (బ్రౌ.)

కంటెయ = కంటె. (శ. ర.)

కంటివాలు. ద్వ. వి. (కన్ను, ట్లు+వాలు.) చక్రాంగము. "సీ. ఇదిగదా పుక్కిట్లైనువ సంకు రవ తమ్మి కంటివాల్ గెలుబోక్కసను బ్యౌ భద్రా. ౧, ఆ. (శ. ర.)

కంటివిస్కురి. దే. వి. పాము. జంస. తిర్య. ౧౦౪.

కంటీలు. దే. వి. బ. చెవిపోగులు. "సీ. ఆత్తవారిచ్చిన యపరంజికంటీలు..." నిరం. ౨, ఆ. ౧౧౬. (బ్రౌ. పా.) 'ఘంటీలు' ముద్రి.

కంటు. దే. వి. 1. పగ. ఆం. భా. తృ. ౧౮౬. "ఉ. కంటన రాఘువేశుం డలుగన్..." రామా. ౭, ఆ. ౨౦౪. 2. శత్రువు. "ఉ. తుమ్మెదకంటు పూమొగడతోం దులదూగు లతాంగిముక్కు..." రాసూ. ౪, ఆ. ౬౬. ఆం. భా. ద్వి. ౧౮౭.

కంటుపడు. ద్వ. అ. క్రి. (కంటు + పడు.) పగగొను, విరోధించు. "వ...మింటనుండి కంటంబడి కంటుపడం గంసున కిట్లనియె. భాగ. ౧౦. స్కం. పూ. ౧౫౩.

కంటె. యు. దే. ప్ర. ద్రు. పంచమీవిభక్తి ప్రత్యయము. భార. ఆది. ౨, ఆ. ౩. వై. వి. (సం. కంఠికా;) 1. కంఠమున ధరించుగుండ్లనిగ. ఆం. భా. ద్వి. ౧౪ ౦. ఆము. ౬, ఆ. ౬; 2. మంగళసూత్రము. "సీ. ప్రామిన్కు రొవలు గన్పడం గంటె కట్టునప్పుడు గాని గళయుక్తిం బొందరాదు. కువల. ౪, ఆ. ౪౯.

కంటెబొట్టు. ద్వ. వి. (కంటె + బొట్టు.) కంఠాభరణవిశేషము, ఒకరకపుమెడనగ. (బ్రౌ.)

కంటెబొట్టుపేయు. ద్వ. అ. క్రి. (కంటెబొట్టు+ పేయు.) రహస్యముగం గాక మోసముచేం గాక విధ్యుక్తముగాం గాకపోయినను కంటెబొట్టు మెడలో వేసి) భర్తయగు. వా:—వాం డామెకు కంటెబొట్టువేసినాడు. (బ్రౌ.)

కంట్రాక్టు. ఆం. వి. కొంతపని చేసిన కొంతసొమ్ము పుచ్చుకొను నేర్పాటు.

కంట్రోలు. ఆం. వి. స్వేచ్ఛగాం గాక అధికారులు నిర్ణయించినవెలకే సరకులమ్మంబడునట్లు చేయుట.

కంట్లము = కంటలము. (శ. ర.)

కంఠగతప్రాణము. సం. వి. అ. పుం. కంఠమును బొందినప్రాణము; చావసిద్ధముగానున్న వాని ప్రాణము.

కంఠపాఠము. సం. వి. అ. పుం. కంఠస్థ మగునట్లు చదువుట.

కంఠము. సం. వి. అ. పుం. 1. కుత్తుక; 2. మెడ; 3. కంఠస్వరము; 4. దగ్గఱ; 5. మంగళి.

కంఠశోషము. సం. వి. అ. పుం. 1. గొంతుక ఎండుట; 2. వ్యర్థభాషణము.

కంఠస్థము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కంఠమందున్నది; 2. ఒప్పగించుటకు బాగుగా వచ్చియుండునది. (పాఠము, పద్యము మొ.)

కంఠస్నానము. సం. వి. ఆ. స్త్రీ. తల తడవకుండ కంఠమువఱకు చేయుస్నానము.

కంఠాలము. సం. వి. అ. పుం. 1. కందగడ్డ; 2. యుద్ధము; 3. కంటలము; 4. లొట్టె.

కంఠి. సం. వి. ఈ. స్త్రీ; 1. కంఠము; 2. గుఱ్ఱపు పలుపు. విణ. (న్. సీ. న్.) కంఠము కలది.

కంఠిక. సం. వి. ఆ. స్త్రీ; 1. కంటె. "ఉ. కంకణ కంఠికాకటుక కాంచిముఖాభరణ వ్రజంబులోం, గొంకక...నైష. ౭, ఆ. ౧౧; 2. మెఱుపు.

కంఠీరము. సం. వి. అ. పుం.—కంఠమున గొప్పధ్వని కలది—1. సింహము. 2. మదపుటేనుంగు; 3. పావురము.

కంఠేకాలుండు. సం. వి. అ. పుం.—కంఠమందు నలుపు గలవాండు—శివుడు.

కంఠోక్తి. సం. వి. ఇ. స్త్రీ. కంఠముతో చెప్పుట; గట్టిగా చెప్పుట.

కండ. వై. వి. (సం. ఖండః.) 1. మాంసము. ఆం. భా. ద్వి. ౧౩౧. మార్క. ౧, ఆ. ౭౪. 2. మాంసఖండము. "చ. గగనతలంబు నెత్తురులు గండలు నెమ్ములు...కురిసె..."భార. ద్రో. ౧, ఆ. ౧౩౨; 3. గుంజు. "వ. కండ గల తింత్రిణీశలాటు సంఘాతంబులు...స్వా. ౪, ఆ. ౬౦; 4. ముక్క. "సీ...కండలై పండం దఱిగిన ట్లుండు పదాతిచయము. భార. ద్రో. ౩, ఆ. ౧౫౯; 5. పటికబెల్లము. "సీ...నెఱ వైన కండమండెంగలు గాని." జై. ౮, ఆ. ౨౦౪. విణ. కండపెరిగినది, క్రొవ్వెక్కినది. "గీ. కండ కన్నులవాని నాంకలును బండ, లిట్ల బేతాళికల సారెం దిట్టువాని." ఆము. ౬, ఆ. ౨౦.

కండకావరము. వై. వి. (కండ+కావరము.) గర్వము. "ద్వి. కానిమ్ము నీకండకావర మ్మడఁతు. ద్వి. సా. ౧, ఆ. ౩౧. పు.

కండచీమ. ద్వ. వి. (కండ+చీమ.) ఒకజాతి పెద్ద చీమ. (వా.)

కండచెక్కెర. వై. వి. (సం. ఖండశర్కరా) పటిక బెల్లము. "సీ. కలికి నీకెమ్మోవి కండచక్కెర..." కృ. శతం. ౩, ఆ. ౪౮.

కండచెక్కెరదిండి. ద్వ. వి. (కండచక్కెర+తిండి.) చిలుక. ఆం. భా. ప్ర. ౪౩.

కండచెక్క. వై. వి. (కండ+చెక్క.) కాలఖండము, కడుపులోని నుండుమాంసవిశేషము. ఆం. భా. ద్వి. ౧౩౩.

కండతుండములు. ద్వ. వి. బ. (కండ+తుండము+లు.) ముక్కముక్కలు. "సీ...నఱకుండు కండతుండములు గాఁగ." జై. ౮, ఆ. ౬౪. రా. వి. ౩, ఆ. ౬౪.

కండనము. సం. వి. అ. న. 1. దంచుట; 2. చెఱుగుట; 3. తవుడు మొ.

కండని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఱోలు; 2. ఱోఁకలి.

కండపెట్టు. ద్వ. అ. క్రి. (కండ+పెట్టు.) మదించు, కొవ్వెక్కు. (బ్రౌ. వా.)

కండపొదుఁగు. ద్వ. వి. పాలులేని పొదుఁగు. (వా.)

కండవడము. వై. వి. (సం. కాండపటః. క. కండపట.) తెర, యవనిక. "చ. (గౌరి)...చను దొంచెఁ గండవడ మల్లన వెల్వడి..." కు. సం. ౯, ఆ. ౨౦. ౪, ఆ. ౪౧౩.

కండిక = ఖండ్రిక. (బ్రౌ. వా.)

కండియ = కండె. "సీ. చెంగావిజిలుగు కుచ్చెలకం డియబవంతి రాయంచ లడుగుల వ్రాలి మెరయ. పార్వ. ౩, ఆ. ౪౪.

కండుకము = కందుకము. "ఉ. కండుకకేళి సల్పెడి ప్రకారమునన్..." క్రీడా. ౮౨. వాల్మీ. ౧, ఆ. ౮౨.

కండురము. సం. వి. అ. పుం. 1. కందఁ; 2. కాఁకరఁ. విణ. (అ. ఆ. అ.) దురద కలది.

కండువా. హిం. వి. (హిం. ఖండ్వా.) 1. ఉత్తరీయము. 2. అడ్డదూలము. (బ్రౌ.)

కండువు. సం. వి. ఉ, ఊ. స్త్రీ. దురద.

కండూతి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కండువు; 2. గజ్జి; 3. గోకుట.

కండూయ. సం. వి. ఆ. స్త్రీ. కండూతి.

కండూర. సం. వి. ఆ. స్త్రీ. దూలగొండిఁ.

కండూరము. సం. వి. అం. పుం. కందఁ.

కండె. వై. వి. 1. ఊఁచకు చుట్టిననూలిచుట్ట. శుక. ౨, ఆ. ౪౨౩; 2. పేనిన నూలిచుట్ట. (శ. ర.) 3. జొన్న మొ. వానికండె. (శ. ర.) 4. కండెము. "సీ. కండె దిగిగి యంబుక్కఁగంబాలతో మాటు మలయు బాహువులయగ్గలికతోడ. పరమ. ౩, ఆ. ౪౮.

కండెకోక. ద్వ. వి. (కండె+కోక.) మేలునూలు చీర; పట్టుచీర. "సీ. పాలుటారులు విప్పి పనిహర్వ చెంగావి కండెకోఁకలఁ గట్టఁగా నొసగ్పి." పార్వ. ౬, ఆ. ౧౧౩.

కండెము. వై. వి. సాముచేయుటచే మిక్కిలి గట్టి పడిన భుజముఖము. "సీ. కండెముల్ తిగిగి బల్గొం డలు దాపించి నటువలె నెగుబుజా లతిశయిల్ల. సా. ౨, ఆ. ౪౨, విజ. ౧, ఆ. ౧౦౯.

కండెపట్టు. ద్వ. అ. క్రి. (కండెము+పట్టు.) నొప్పి కలుగు, లాగు. "క. కేలంగేలును బతిపతిఁ, గీలింపఁగ నేయం మకరకేతను బాహాః, నాళంబు కండెపట్టిన, నాలో రతి పువ్వుఁ దేనెయంటునఁ బిసుకున్." సాంబో. ౩, ఆ. ౧౨౮.

కండోలము సం. వి. పుం. 1. గంప; 2. ఒంటె.

కండోలవీణ. సం. వి. ఆ. స్త్రీ. చండాలవల్లకి, మాలలు వాయించునొకజాతివీణ.

కండోలి. సం. వి. ఈ. స్త్రీ. కండోలవీణ.

కండ్రిక. వై. వి. (సం. ఖండః.) ముక్క. "సీ. గడి యలోపల మూఁడుకండ్రికలై తాడు ధగఁ గూలఁ దిట్టె మేధావిభట్టు." అప్ప. ౨, ఆ. ౩౬౯.

కంత = క్రంత. (బ్రౌ.)

కంతి. వై. వి. (సం. గ్రంథిః.) 1. కణితి. ఆం. భా. ద్వి. ౭౪. 2. బొప్పి. "ద్వి. దుద్దున వీఁపు కంతులు గట్ట మోఁది. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౦౩.

కంతు. దే. వి. గడువు, వ్యవధి. (శ. ర.)

కంతుఁడు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు.

కంతువు. సం. వి. ఉ. పుం. 1. గాదె; ధాన్యపుగాదె. 2. హృదయము. విణ. (ఉ.) సుఖవంతుఁడు.

కంత్రి. దే. విశే. సంకరము, సంకీర్ణము. వ్యవ:— కంత్రిజాతి, కంత్రిమాట.

కంథ. స. వి. ఆ. స్త్రీ. 1. చిఱుగుబొంత; 2. మట్టిగోడ; 3. ఊరు.

కంథటిక. సం. వి. ఆ. స్త్రీ. కంథ, బొంత.

కంథావారము. సం. వి. అ. పుం. ప్రాకారము.

కంద. వై. వి. (సం. కందః) సూరణము ఔ. ఆం. భా. ద్వి. ౭౧. నీలా. ౨, ఆ. ౫౭. పే. కంద దుంప. ఆం. భా. ద్వి. ౪౧.

కందఁబాఱు. దే. అ. క్రి. (కందర్ + పాఱు) నల్లపడు. "సీ. లలితముక్తాహార గుళికాకలాపంబు ఘ్రాణానిలంబునఁ గందఁబాఱె." వై. ౨,ఆ.౧౧౯.

కందకము. దే. వి. అగడ్త, పరిఖ. (శ. ర.)

కందనకాయ. దే. వి. (కందనము+కాయ.) గుండె కాయ "మ. మనమున్ జెల్వును దూఱఁ దూఱ మఱి కెంపున్ పండియుం దూఱఁగం,దనకాయం గల నల్పు తోఁప..."ఆము. ౪,ఆ. ౪౩. పార్వ. ౦౪. ౬, ఆ.

కందనము. దే. వి. ఒకానొకమల్లబంధము. ఆం. భా. ద్వి. ౨౧౯. హంస. ౧, ఆ. ౨౦౬; 2. గుండె. (చూ. కందనకాయ.)

కందము. ఉభ. వై. వి. (సం. స్కంధః) 1. మూఁపురము. "ఉ. కందము లప్పళించి తురగంబుల నించుక నిల్పు...,భార. విరా. ౫, ఆ. ౬౯. "సీ. ముట్టి కందములను గత్తిపెట్టు పెట్టి... నడిఁదియూఁబోతుగమి బెట్టు గలఁచి యూడె." హరి. పూ. ౬, ఆ. ౧౬౫; 2. (సం. స్కంద కమ్.) కందపద్యము. "క...నీ, కందంబులు రస వన్తా, కందంబులు..." కవిచా. ౧౦. సం. వి. అ. పుం., న. 1. కందగడ్డ; 2. గడ్డ; 3. నీరుల్లి; 4. తామరదుంప; 5. కంతి. పు; 1. మేఘము; 2. ఒకానొక యోనిరోగము.

కందమూలము. సం. వి. అ. న. ముల్లంగి ఔ. "గీ. కందమూలముల నశనకాంక్ష దీర్చి. వ్రతము చరియించె నస్లేకవత్సరంబు. ద్వా. ౫, ఆ. ౨౫.

కందరము. సం. వి. అ. పుం., న. 1. గుహ; 2. కనుమ. పుం. అంకుశము., న. 1. అల్లము ఔ; 2. మొక్క.

కందరాలము. సం. వి. అ. పుం; 1. గంగరావి ఔ; 2. జువ్వి. ఔ; 3. కొండగోనుగు ఔ.

కందరికము. దే. వి. స్కంధాస్తరణము, గంతప అడుగున వేయు మెత్త. (బ్రౌ.)

కందర్పకూపము. సం. వి. అ. పుం. యోని, ఆడుగుఱి.

కందర్పభోగులు. సం. వి. అ. పుం. బ. ధాన్యభేదము. ప్రబంధ. ౧౧౨.

కందర్పముసలము. సం. వి. అ. పుం శిశ్నము,మగగుఱి.

కందర్పుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మదనుఁడు.

కందవము. ఉభ. దే. వి. ఎద్దుమీఁపుపై వేసెడుగంత. (శ. ర., బ్రౌ.) సం. వి. అ. పుం. న; 1. క్రొత్త మొలక; 2. అవ్యక్తమధురధ్వని; 3. సూర్యాది గ్రహణము; 4 కపాలము; 5. నింద; 6. ఒకజాతి అరఁటి ఔ. పుం; 1. బంగారము; 2. కందగడ్డ.

కందళి. సం. వి. ఈ. స్త్రీ; 1. టెక్కెము; 2 క్రొత్త మొలక; 3. సూర్యాదిగ్రహణము; 4. నింద; 5. కపాలము; 6. అరఁటి ఔ; 7. ఒకానొకలేఁడి; 8. అవ్యక్తమధురధ్వని.

కందళించు. సం. అ. క్రి; 1. అంకురించు, మొలకెత్తు. (శ. ర.) 2. ఉద్భవించు, కలుగు. "సీ... కొంత సందియంబు,మదిలోనఁ గందళింపఁగ..." ప్రభా. ౫, ఆ. ౬౯; 3. సంతసించు; వికసించు. "శా. ఎందే డెందము కందళించు రహిచే... స్వా. ౨, ఆ. ౬౨.

కందళికము = కందళము. "సీ...కందళికముఁ గోలె కదురుకోల." హంస. ౫, ఆ. ౯౦. (శ. ర. పా. 'కందళికెము' ముద్రి.)

కందా. దే. వి. రాజబంధువులకు భృత్యులకు వేఱుగా నేర్పఱచినబల్ల. (బ్రౌ.)

కందాడిక. దే. వి. కంబళి. (బ్రౌ.)

కందాయము. దే. వి; 1.జ్యేష్ఠాదిమాస చతుష్టయము. ఆం. భా. ప్ర. ౦౬; 2. పన్ను, కప్పము.(బ్రౌ.)

కందారి. దే. వి. ఒకానొకచెట్టు, తీక్ష్ణకంటక ఔ. (శ. ర. బ్రౌ.)

కంది. ఉభ. దే. వి. సస్యవిశేషము, తువరి ఔ. ఆం. భా. ద్వి. ౨౩౫. బ. ధాన్యవిశేషము. భీమ. 3, ఆ. ౫౭. సం. వి. న్. పుం. కందగడ్డ. ఈ. స్త్రీ. కంతి.

కందియన = కెందెన."సీ...కందియనలు పూసి గజ్జింబులు పూన్చి మీఁద. కు. సం. ౧౨, ఆ. 3.

కందు. దే. అ. క్రి.; 1. తప్తమగు; తాపమందు. "క. కందు గలపసిఁడి గాఁచినఁ, గంది వివర్ణమయినట్లు..." భార. సభా. ౨, ఆ. ౮౯; 2. వివర్ణమగు. "గీ. కంది యెంతయుఁ జెలు వేఁడెఁ జందురుండు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౭; 3. నలఁగు; వాడు. "ఆ...కందియును మహాసుగంధ కుసుమ, తతులు తొంటియట్ల తమకంపు విడుపక, యుండు..." భార. ఆర. ౨, ఆ. ౧౯౬. య. ౧, ఆ. ౮౧; 4. తగ్గు. "క...కం, దని పెంపున..." కాశీ. ౨, ఆ. ౧౯; 5. కృశించు, చిక్కు. "గీ.... పశులు, కందుచున్నవి మన కేల యిందు నుండ." వి. పు. ౭, ఆ. ౧౪౫; 6. చెడు. "గీ...పచ్చ గందనికూరలు..." నైష. ౬, ఆ ౧౨౨; 7. దుఃఖించు. "సీ. పగఁ గూడి కడుఁ గంది వందిన మైందీఁగకప్పున జెనలఁ జీకటులు గవియం." కు. సం. ౫, ఆ. ౬౫౧...8. భయపడు. "క... పడఁతుకల మొగములతోఁ, దడఁబడు నంచు శేలం, గడకడఁ జనుఁ జందురుండు కందుచు నచటన్. య. ౧, ఆ. ౭౬; 2. కోపపడు. "సీ...మనయెడఁ గందునో మగువ యనుచు. భాగ. ౮. స్కం. ౩౨౦. వి. 1. కళంకము, మచ్చ. సీ. ఇందు బింబము మీఁది కందుచందంబున...భార. విరా. ౨, ఆ. ౧౩౮; 2. మాలిన్యము, నలుపు. భార. సభా. ౨, ఆ. ౮౯; 3. దుఃఖము. "శా...మదికకందెల్లఁ జెగన్...నిర్వ. ౯, ఆ. ౭౮; 4. దోషము. "చ...తనువునఁ గందు చూపమి...పరమ. ౨, ఆ. ౧౭౩; 5. బిడ్డ; పిల్ల. ఆం. భా. ద్వి. ౯౯ స్వా. ౨, ఆ. ౪౧. విశే. నల్లనిది. "సీ. కందు దుప్పటి గప్పి యందియ డాకాలఁ గీలించి... వచ్చె నొకఁడు. ద్వా. ౧౦, ఆ. ౮౩.

కందుఁడు. వై. వి. (సం. స్కందః.) కుమారస్వామి, స్కందుఁడు. సాం. ని. దేవ. ౭.

కందుకము. సం. వి. అ. పుం. న. 1. బంతి; 2. తలగడ.

కందురీఁగ = కందురు. ఆం. భా. ద్వి. ౯౫.

కందురు. వై. వి. (సం. గంధోలీ.) కందురీఁగ. (శ. ర.)

కందువ. దే. వి. 1. జాడ, గుర్తు. "క...పురందరుఁ డేఁగిన, కందువ యే నిప్పు డెట్లు గాంతునొ...భార. ఉద్యో. ౧. ఆ. ౧౭౦; 2. ప్రదేశము, చోటు. "క. నలుగురు మంత్రులు ...పతిఁ దడవి కానక, పొలఁతులకందువకుఁ జేరఁ బోయిరి వెలుచన్. దశ. ౨, ఆ. ౩౯. వి. పు. ౨, ఆ. ౫౧; 3. సంకేతస్థలము. "ఉ. కందువ నెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడు వారు...భార. విరా. ౩, ఆ. ౧౨౭; 4. మూలు మూల. "క. అంగులఁ వెగిగృహాంబుల, సందుస లన్నియును వెదకఁగా...వైజ. ౪, ఆ. ౮౨; 5. రహస్యము. "ఉ...శ్రోతకు వక్తకున్ శుభా, నంతపరంపరావహము నైజగుణం బగు గాథికుండ మా, కందువ యె నెఱింగి సమస్టితిఁ గావ్య ముగా నొనర్పఁగన్. కాశీ. ౧, ఆ. ౮; 6. చమత్కారము. "ఉ. కాయజుచూపు లమ్ముదురు కందువమాటలఁ బుష్పలావికల్. విజ. ౧, ఆ. ౧౪; 7. పక్షము. "లయగ్రాహి. పొందుపడ సంధి యొకచందమునఁ జేసి దిరుకందువలవారు ...వి. పు. ౧, ఆ. ౧౭౩; 8. ఋతువు, సమయము. "సీ. వానకందువను...నిర్వ. ౩, ఆ. ౬౩, పిన. శకుం. ౨, ఆ. ౧౧౨; 9. ప్రతిజ్ఞ. "చ...ఋశ్యమూకమునఁ గందువసేయువెయగ్ని సాక్షిగా. భా. రా. కిష్కిం. ౪, ఆ. ౭౫; 10. నైపుణ్యము. "వ...నీకందువ సైరంధ్రి చెప్పిన" ...భార. విరా. ౪, ఆ. ౭౯. ("సైరంధ్రీ కౌశలం తవ" అని మూలము.) విశే. 1. చిత్రము. (బ్రౌ. కందువమాటలు.) 2. కపటము. (బ్రౌ. కందుపపద్యము.) 3. అసత్యము, లేనిది. (బ్రౌ. కందువరాజులు.)

కందువాఱు. దే. అ. క్రి. (కందు + వాఱు.) 1. వివర్ణమగు; 2. కళంకిత మగు. "చ. వెలవెలఁబాఱె మేఘు మరవిందవిరోధియుఁ గందు వాఱె...నరస. ౨ ఆ. ౭౦. (రెండర్థములకు నిది యుదాహరణమే.)

కందువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. 1. పెనము; 2. నూలుబంతి; 3. వంటయిల్లు.

కందెన. దే. వి. 1. బండికన్నులకుఁ బట్టించు చమురు. ఆం. భా. ద్వి. ౨౦౨; 2. చక్రముల యిరుసునకుఁ బూయఁ మసి. "సీ బండికందెనతోడఁ బ్రతి వచ్చు మైచాయ... శైవ. ౭, ఆ. ౯౩.

కండెఱ. ద్వ. వి. (కన్ను+తెఱ.) ఱెప్ప. "మ. మఱు నాఁ డంధకవృష్టి భోజయదుసామంతాగ్రణీసేన గం, దెఱగా..." ఉ. హరి. ౨, ఆ. ౮౪౮.

కంధర. సం. వి. ఆ. స్త్రీ. కంధరము, మెడ.

కంధరము. సం. వి. ఆ. స్త్రీ. కంధర, మెడ. అ. పుం. 1. మేఘము; 2. ముస్తె ౹.

కంధి. సం. వి. ఇ. పుం. సముద్రము. స్త్రీ. మెడ.

కంప. ఉభ. దే. వి. సుఘము, ముండ్లపుండ. ఆం. భా. ద్వి. ౩౮. స్వా. ౮, ఆ. ౩౭. సం. వి. ఆ. స్త్రీ. కంపము, వణఁకు.

కంపకోట. ద్వ. వి. (కంప + కోట.) వెదురుమున్న గు వానిచే కోటకు చుట్టు నేర్పఱిచినయావరణము, ప్రాచీనము. (శ. ర. బ్రౌ.)

కంపగట్టు. దే. అ. క్రి. (కంప + కట్టు.) కంచెవేయు. "క...చెట్టుచేమలు, కానంబడ నఱికి కంపగట్టిన పిదపన్." నిప్ర. ౨, ఆ. ౧౯.

కంపగోడ. ద్వ. వి. (కంప + గోడ.) 1. కంప పాఁతినగోడ. (శ. ర.); 2. చుట్టును గోడవలె కేర్పఱచినకంచె. (బ్రౌ.)

కంపజిట్ట. ద్వ. వి. (కంప+జిట్ట.)పక్షివిశేషము.(బ్రౌ.)

కంపతోడుగు. దే. వి. (కంప+తోడుగు.) చీఁపురు వలెఁ గట్టినకంప. (చల్లినగింజలు కప్పుపడుటకై కంపతోడుగు పై నీడ్తురు.) "సీ. కంపతోడు గీడ్చినట్లు..." స్వా. ౮, ఆ. ౫౮.

కంపనము. సం. వి. అ. పుం. 1. శిశిరఋతువు; 2. ఒకానొకయస్త్రము; 3. ఒకవిధ మగు సన్నిపాత జ్వరము. న. వడఁకు. విణ. (అ. ఆ. అ.) 1. వణఁకునది; 2. వణఁకించునది; 3. చలింపఁజేయు నది; 4. చలించునది.

కంపము. సం. వి. అ. పుం. కంప, వణఁకు.

కంపరము. యం. దే. వి. శవవాహనము. "ద్వి. కంప రం బవనిపై దింపించి..." బస. ౫, ఆ. ౧. పు. వై. వి. (సం. కంప్రము.) గగుర్పాటు. వ్యవ:— వారిదుఃఖము చూడఁగనే నాకు కంపరము కలిగినది.

కంపరమెత్తు. ద్వ. అ. క్రి. (కంపరము+ఎత్తు.) గగుర్పొడుచు. (వా.)

కంపవెట్టు. దే. స. క్రి. (కంప+పెట్టు.) పాడు చేయు. "సీ. పొంచి యెంతయుఁ దోడఁబుట్టిన దానిల్లు కంపవెట్టిన మహాఘనుఁడు వీఁడు." బిల్హ. ౨, ఆ. ౬౫.

కంపించు. సం. అ. క్రి. వణఁకు. మార్క. ౨, ఆ. ౬౬.

కంపితము. సం. వి. అ. న. 1. వణఁకు; 2. వణఁకించుట. విణ. (అ. ఆ. అ.) 1. వణఁకినది; 2. వణఁకింపఁబడినది; 3. చలించినది; 4. చలింపఁ బడినది.

కంపిరుగుడు. దే. వి. (కంపు+ఇరుగుడు.) కుళింశుపము, భస్మగర్భ౹. (బ్రౌ.) రూ. కంపుటిరుగుడు.

కంపిలు. సం. = కంపించు. "మ...సకలోర్వీభాగ ముం గంపిలన్." శతకంఠ. ౩, ఆ. ౧౧౬.

కంపిల్లకము. దే. వి. గోలికూర౹. (బ్రౌ.)

కంపు. దే. వి. 1. వాసన; సువాసన. "క...ప్రియ మగుకంపు...భార. అను. ౫, ఆ. ౨౬. "ఆ... కందియుండు మహాసుగంధకుసుమ, తతులు తొంటి యట్ల తమకంపు విడువక, యుండు..." భార. ఆర. ౨, ఆ. ౧౯౭; 2. దుర్వాసన. "ఆ. కప్పు రంపుఁగుడుటఁ గస్తూరియొరువుతో, నుల్లి నాఁటి చందనోదకములఁ, బెంప దాని తున్నకంపు వాయనిభంగి, నొంత దైన నిల్వ దింతిమనసు." ద్వా. ౧, ఆ. ౬౮. సా. తనకంపు తన కింపు.

కంపుఁదుమ్మ. దే. వి. (కంపు+తుమ్మ.) విట్ఖదిరము౹. (శ. ర.)

కంపుకొట్టు. దే. అ. క్రి. (కంపు+కొట్టు.) 1. సువాసన కల దగు. వా:—పరిమళ ద్రవ్యము లతో నామె కంపుకొట్టుచున్నది; 2. దుర్వాసన కల దగు. వా:—ఎలుక చచ్చి కంపుకొట్టు చున్నది.

కంపుటిరుగుడు. దే. వి. (కంపు+ఇరుగుడు.) భస్మ గర్భ౹. (శ. ర.)

కంపునాగు. ద్వ. వి. (కంపు+నాగు.) సర్పవిశేషము, ఒకజాతిపాము. (బ్రౌ.)

కంపె. దే. వి. (క. గంపె.) తాంబూలపాత్రము. ఆం. భా. ద్వి. ౧౬౬.

కంపెలుక. దే. వి. (కంపు+ఎలుక.) గంధమూషిక, చుంచు. (శ. ర., బ్రౌ.)

కంప్రము. ఉభ. వై. వి. కంపరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వణఁకునది; 2. చలించునది.

కంబకట్టు. ద్వ. వి. (కంబము+కట్టు.) వివాహ వేది కాదులయందు స్తంభముచుట్టుఁ గట్టెడుగుడ్డ. "సీ...దివ్యాంబరములు, గంబకట్టులు మేలు కట్టులు నయ్యె..." కు. సం. ౯. ఆ. 3. పండితా. పర్వ. ౪౨౦. పు.

కంబడి = కంబళి. "చ...కంబడిప్రాత..." ఆము. ౪, ఆ. ౩౫., సా. ౧, ఆ. ౧౧౬.

కంబమయ్య. వై. వి. (కంబము+అయ్య.) స్తంభోద్భవుఁడు, నృసింహావతారము. "సీ. కంబమయ్యరో మేలు కలిగిన నీ కొక్కగరుటాలమంతునిఁ గాను కిత్తు". య. ౨, ఆ. 3.

కంబము. వై. వి. (సం. స్కంభః. క. త. కంబ.) 1. స్తంభము. పారి. ౧, ఆ. ౪౯; 2. ఒకానొక మల్లపరికరము. ఆం. భా. ద్వి. ౨౦౭.

కంబమురాయఁడు = కంబమయ్య. య. ౧, ఆ. ౧౨౦.

కంబలము. సం. = కంబళము.

కంబలి. సం. = కంబళి.

కంబలిక. సం. = కంబళిక.

కంబవల్లి. వై. వి. 1. ఉపనయనాంతదినమునఁ జేయుం సంస్కారవిశేషము. (శ. ర.) 2. వడుగు కడపటి దినము. ఆం. భా. ద్వి. ౧౭౮; 3. నాగవల్లి మరుచటిదినమున చేయుం సంస్కారవిశేషము. రా. వి. ౫, ఆ. ౮౦.

కంబసూత్రము. మి. వి. బొమ్మల నాడించుటకై బొమ్మకట్టెకుఁ గట్టినదారము. "ద్వి. కడు నద్భుతంబుగఁ గంబసూత్రంబు, లడరంగ బొమ్మల నాడించువారు." పండితా. పర్వ. ౪౩౫. పు.

కంబళము. సం. వి. అ. పుం. 1. కంబళి; 2. సాలువ; 3. కంబళిపురుగు; 4. గంగడోలు; 5. ఏనుఁగుపై వేయు చిత్రకంబళము. న. నీరు.

కంబళి. ఉభ. వై. వి. (సం. కంబళః. క. కంబళి.) 1. గొంగళి. ఆం. భా. ద్వి. ౧౫౮; 2. పట్టుపురుగుచెట్టు. (చూ. కంబళిపండు.) విణ. దుష్టుఁడు. (బ్రౌ.) సం. వి. న్. పుం. ఎద్దు. విణ. (న్. సీ. న్.) కంబళము కలది.

కంబళిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నకంబళి, 2. ఒకానొకజాతి ఆఁడుజింక.

కంబళికట్టె. ద్వ. వి. (కంబళి+కట్టె.) ఒకరకపు వంటచెఱకు. (బ్రౌ.)

కంబళిపండు. ద్వ. వి. (కంబళి+పండు) పట్టుపురుగు చెట్టుపండు. (శ. ర., బ్రౌ.)

కంబళిపురుగు. వై. వి. (కంబళి+పురుగు.) గొంగళి పురుగు, కంబళివలె ముండ్లవంటినూఁగు గలయొక జాతిపురుగు. (శ. ర., బ్రౌ., వా.)

కంబాలకూర. దే. వి. కూరానువంటు ?. (బ్రౌ.)

కంబి. సం. వి. ఈ. స్త్రీ. 1. గరిటె; 2. త్రెడ్డు; 3. వెదురుకమ్మి. (శ. ర.)

కంబు. ఉభ. దే. వి. (క. కంబు.) సజ్జపైరు. (శ. ర.) బ. సజ్జలు, ఒకరకపుధాన్యము. (శ. ర.) సం. వి. ఉ. న. కంబువు, శంఖము.

కంబుకంఠ. సం. వి. ఆ. స్త్రీ. = కంబుకంఠి.

కంబుకంఠి. సం. వి. ఈ. స్త్రీ. శంఖమువంటికంఠము గల స్త్రీ; స్త్రీ.

కంబుగ్రీవ. సం. వి. ఆ. స్త్రీ. కంబుగ్రీవము, శంఖము వంటి కంఠముగలది.

కంబుగ్రీవము. సం. వి. అ. స్త్రీ. శంఖమునువలె మూఁడు రేఖలు గల కంఠము.

కంబువు. సం. వి. ఉ. పుం. చిత్రవర్ణము. పుం. న. 1. శంఖము; 2. కంఠము; 3. నత్తగుల్ల. ఉ. ఊ. స్త్రీ. 1. కంఠము; 2. గొట్టమువంటియెముక. విణ. (ఉ.) చిత్రవర్ణము గలది. (ఊ.) దొంగిలించువాఁడు.

కంబూకము. సం. వి. అ. పుం. కండనము, తవుడు.

కంభకట్టు = కంబకట్టు. మి. వి. (ప్రాకృతాంధ్రమిశ్రము.) "ద్వి. కంభకట్టను మేలికట్టను బొలుచు, గంభీర పుష్పకాగారంబునందు" బస. 3, ఆ. ౫౯. పు. కు. సం. ౯. ఆ. 3.

కంభము. వై. వి. కంబము. "శా. కంభంబీక్రియ..." ద్వా. ౨ భా. ౭, ఆ. ౧౩౬.

కంసము. సం. వి. అ. పుం న. 1. కంచు; 2. పాత్రవిశేషము; 3. మానవిశేషము. 4. వాంస.

కంసకారుఁడు. సం. వి. అ. పుం. కంచరి.

కంసారాతి. సం. = కంసారి.

కంసారి. సం. వి. ఇ. పుం. శ్రీకృష్ణుఁడు, అధోక్షజుఁడు.

కంసాల=కంసాలి. "ఆ...సం, సాలజాతివాఁడు చాలఁ గీడు." భో. ౫, ఆ. ౩౨౨.

కంసాలి. దే. వి. (క. కంసాళక.) 1. స్వర్ణకారజాతి. ఉదా. కంసాలివాఁడు; 2. స్వర్ణకారుఁడు. అం. భా. ద్వి. ౨౦౮.

కకందము. సం. వి. అ. పుం. బంగారము.

కకపాల. వై. వి. (సం. కక్షపాలా.) 1. బైరాగిచంక నుంచుకొనుసంచి. "సీ. కకపాలకేదార కటక ముద్రితపాణి..." స్వా. ౧, ఆ. ౫౯; 2. మంగలి పొది. అం. భా. ద్వి. ౩౦౧.

కకపిక. వై. విశే. (సం. కాకపికా.) చెల్లాచెదరు. "ద్వి. వికవిక లేలె నిన్నేల లకుముకులు, కకపిక లాయెఁ దక్కక పికపాణి." అ. మ. క. ౨, ఆ.

కకపికపడు. వై. అ. క్రి. (కకపిక+పడు.) గర్వించు, మిట్టిపడు. "క. ఒక పాటి కలిమిచేతను, గకపిక పడక..." హంస ౫, ఆ. ౧౫.

కకవిక = కకపిక. "క.కకవికలుగఁ బోట్లాడుచు, వికసిల్లెడు నాకడింది వీరులయందున్." కళా. ౭, ఆ. ౧౦౨.

కకవిక చేయు. ద్వ. స. క్రి. కలఁచు, క్షోభింపఁజేయు. "చ...సముద్రమణచ్ఛలంబునన్, గకవిక చేయఁగాఁ దలఁచి గంతులువేయఁ గలంగ కబ్ధి దాఁ, బకపక నవ్వినట్లు..." లక్ష్మీ. ౨, ఆ. ౭.

కకావిక = కకపిక. "చ. ఇరువదిచేతులన్ వివిధహేతి తతుల్ గొని యొక్కపెట్టఁ గిం, కరులపయిన్నిగిడ్చినఁ గకావికలైరి..." ఉ. రా. ౩, ఆ.౩౩౫.

కకావిక = కకవిక. 1. చెల్లాచెదరు. "ఉ...ఆత్మసైనికచయంబు కకావికలై కలంగి..." కళా. ౭, ఆ. ౫౭; 2. కలఁగినది; భయపడినది. "గీ. మెల్లనె కళావతీసతి మేలుకాంచి, ప్రక్క పేటొక్క మగఁడున్న బాగుఁ దెలిసి, యక్క యిది యేమి చోద్యమో యనుచు మిట్టి, పడి కకావికయై యొందుకడకుఁ జేరు." శుక. ౧, ఆ. ౩౧౭.

కకుంజలము. సం. వి. అ. పుం. చాతకపక్షి.

కకుత్తు. సం. వి. ద్. పుం. స్త్రీ. 1. ఎద్దుమూఁపురము; 2. శ్వేతచ్ఛత్రాదిరాజ చిహ్నము; 3. ప్రధానము; 4. పర్వతాగ్రభాగము.

కకుదము. సం. వి. అ. పుం. న. 1. కకుత్తు; 2. హస్తిమేఢ్రము.

కకుద్మంతము. సం. వి. త్. పుం. ఎద్దు. విశే. (అ. ఆ. అ.) పెద్దమూఁపురము గలది.

కకుద్మతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పిఱ్ఱ; 2. మొల.

కకుప్పు. సం. వి. భ్. స్త్రీ. 1. కాంతి; 2. దిశ; 3. చంపకమాల; 4. పర్వతాగ్రము; 5. శాస్త్రము; 6. రాగిణీభేదము; 7. ప్రాణము; 8. వాక్కు.

కకుభ. సం. వి. ఆ. స్త్రీ. కకుప్పు.

కకుభము. సం. వి. అ. పుం. 1. ఏఱుమద్దిచెట్టు; 2. వీణ కుఁగట్టిన సొఱకాయ.

కక్క. దే. వి. (క. కక్క.) 1. తండ్రితమ్ముఁడు, పినతండ్రి. (వా.); 2. అయ్య, నాన్న. (చిన్నపిల్లలు తండ్రిని బిలుచుమాట. బ్రా.)

కక్కపాల = కకపాల. "గీ. కక్కపాలయుఁ గక్షఁ భాగమునఁ బూని." విక్ర. ౨, ఆ. ౯౨.

కక్కరము. వై. విశే. (సం. కర్కరీ.) కఱకు, మోటైనది. "ద్వి...కక్కరం బగుతోలు..." ద్వి. భాగ. ౪, స్కం. (శ. ర.) వి. దారుహస్తము, కఱ్ఱచేయి. "సీ. సరసంబుగా దీనియందరముపైఁ జేర్పనికరము దాఁ గరమె కక్కరము గాక." మల్హ. ౧, ఆ. ౯౪.

కక్కరించు. వై. అ. క్రి. మొఱుఁగు; మోటుగా కేకలు వేయు. "చ. కనుఁగొని డాయ వచ్చి శునకంబువిధంబునఁ గక్కరించి యిట్టను..." చెన్న. ౨, ఆ. ౩౦.

కక్కసపడు. వై. అ. క్రి. (కక్కసము+పడు.) 1. బాధపడు. (శ. ర.); 2. అన్యులయెడఁ గఠినముగాఁ బ్రవర్తించు. (బ్రా.)

కక్కసపెట్టు. ద్వ. స. క్రి. (కక్కసము + పెట్టు.) బాధించు. "వ...ఇక్కరణి రక్కసులం గక్కసపెట్టి..." రామా. ౭, ఆ. ౧౯౨.

కక్కసము. వై. విశే. (సం. కర్కశ.) 1. వాఁడియైనది. "గీ. కక్కసపువఱకగోరులఁ ద్రొక్కి త్రొక్కి." పాండు. ౪, ఆ. ౨౩౯; 2. ఇఱుకైనది. "క..., రారమ్మని మిగుల నాదరంబునఁ జోటిం, పార నొసఁగెఁ గక్కస మని, గోరపడక..." పరమ. ౧, ఆ. ౭౪; 3. ఘోరము; అధర్మమైనది. "ఉ. అక్కట ధర్మమే గురుని యాత్మజఁ బట్టి రమింప...ఈ, కక్కసపుందనంబు కొఱగాదు..." ఉ. రా. ౭, ఆ. ౩౩౧.

వి. 1. దుష్కరత. ఆము. ౪, ఆ. ౨౧౪. (శ. ర. పా.); 2. కఠినత. "వ...కక్కసాన నిట్టు ద్రొక్కించి..."ఆము. ౪, ఆ. ౩౫. "సీ. చండ భానుఁడు కక్కసముఁ జేసి మున్ను దా మహి కిచ్చునప్పులు మరలఁ గొనియె." వైజ. ౧, ఆ. ౯౭. (పైరెండర్థములకు నుదాహరణమే); 3. కొరడా. "చ...థే యని కక్కసంబులన్, సద సద గాఁగ వ్రేసియు..." జై. ౪, ఆ. ౭౭.

కక్కసించు. వై. స. క్రి. హింసించు, బాధించు. "గీ. కదిసి కురువీరు లభిమన్యుఁ గక్కసింప." రా. వి. ౩, ఆ. ౬౬. రామా. ౬, ఆ. ౧౭౨.

కక్కసిల్లు. వై. అ. క్రి. వ్యాపించు; నిండు. "ద్వి ...పృథివి యాకసము, కక్కసిల్లఁగ నంతు కలిగె నచ్చోట." ద్వి. సా. ౧, భా. ౧౫. పు.

కక్కి. దే. వి. (క. కక్కి.) పినతల్లి. (వా )

కక్కించు. దే. స. క్రి. 1. కక్కఁజేయు; 2. పోఁ గొట్టు. "సీ...పరుసఁదనము, కక్కించి..." భార. భీష్మ. ౨, ఆ. ౩౯౭.

కక్కిత. దే. వి. మల్లవిద్యావిశేషము. ప్రబంధ. ౮౭.

కక్కిరి బిక్కిరి. దే. విశ. తాఱుమాఱు. (శ. ర.)

కక్కు. దే. స. క్రి. 1. కడుపులోనిది వెలిపుచ్చు, డోకు. "ఉ...సయించుచునె కక్కినకూడు క్రమ్మ ఱన్." వైజ. ౨, ఆ. ౧౦౦; 2. వెడలిపోవు. (చూ. కక్కించు.) వి. 1. డోకు. (బ్రౌ., వా.); 2. అంపము మొ. వానిపల్లు. "క. కక్కులకోడ వలిపోలెన్..."భో. ౪, ఆ. ౬౦.

కక్కుఁదెవులు. దే. వి. (కక్కు+తెవులు.) వాంతి రోగము, ఒకానొకవ్యాధి. (శ. ర.)

కక్కుడు. దే. వి. కక్కు, డోకు. (శ. ర., బ్రౌ.)

కక్కుర్తి = కక్కులితి. (చూ. కక్కుర్తిపడు.)

కక్కుర్తికాఁడు = కక్కులితికాఁడు. (చూ. కక్కులితికాఁడు.)

కక్కుర్తిపడు. ద్వ. అ. క్రి. లోభించు, ఆశపడు. "గీ. మొదలఁ గక్కుర్తిపడి కూడి పిదప వాయు." శివరా. ౩, ఆ. ౭౨.

కక్కుతాయి. దే. వి. కఱకుతాయి. "చ...కంపలు దుంపలు గక్కుతాళ్లు..."సానందో. ౨ ఆ. ౬.

కక్కులితి. దే. వి. (క. కక్కులితె.) 1. ఆశ. "చ... పట్టి క, క్కులితియ కాని దైవ మనుకూలము గాదు..." జై. ౬, ఆ. ౨౩౪. ప్రభా. ౧, ఆ. ౧౧౮; 2. అశ్రద్ధ. (శ. ర )

కక్కులితికాఁడు. దే. విశ. 1. లుబ్ధుఁడు; ఆశా పరుఁడు. "క. కక్కులితికాఁడు కార్యము, చక్కటి యెఱుఁగండు..."నా. పంచ. ౧, ఆ. ౩౨౦; 2. అశ్రద్ధగలవాఁడు (శ. ర.)

కక్కులకష్టము. దే. వి. (కక్కులు+కష్టము.) 1. అంపముననుండు కక్కులవంటి కక్కులుగల కష్టము. (దీనిని పెంకెగుఱ్ఱములకు వాడుదురు.); 2. ఎక్కువనిర్బంధముచేయుట. వ్యవః—కదల కుండ మెదలకుండ కక్కులకష్టము తగిలించినారు.

కక్కువాయి. ద్వ. వి. కాసరోగవిశేషము. (శ. ర. బ్రౌ.)

కక్కూర్తికాఁడు = కక్కులితికాఁడు. "ద్వి. కడగి పీనుఁగుమీఁదఁ గంపలు పెట్టి, కుడువఁగాఁ జూచు కక్కూర్తికాఁ డితఁడు." ద్వి. హరిశ్చ. ఉ. ౪౫౫౦.

కక్కూలితి = కక్కుర్తి. "క. వల దిటువలెఁ గక్కూలితి, పలుకులు..." సా. ౨, ఆ. ౧౦౯.

కక్కూలితికాఁడు = కక్కూర్తికాఁడు. "క. కక్కూలితికాఁ డటంచు గర్హింపకుమీ." సుద. ౨, ఆ. ౬౫.

కక్కూలితిపడు = కక్కుర్తిపడు. (చూ. కక్కుర్తిపడుచు.)

కక్కూర్తిపడుచు. ద్వ. స. క్రి. లోభపెట్టు, ఆశ గొలుపు. "సీ. కక్కూర్తిపడుచురే గాఢతపో రూఢుఁ డగుముండకర్ణు జానంతవాని." చంద్ర. ౨, ఆ. ౭౪.

కక్కెర. వై. వి. (సం. క్రకర.) 1. ఒకానొక పక్షి. "సీ. కొక్కెరల్ కక్కెరల్ గువ్వలు..." రసిక. ౧, ఆ. ౬౭. హరిశ్చ. ౨, ఆ. ౨౩; 2. పెద్దజాతిరొంగ. ఆం. భా. ద్వి. ౯౨.

కత్తి. దే. వి. ఒకానొకమల్లబంధము. ప్రబంధ. ౭౮.

కక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. కచ్చు; 2. సమత్వము; 3. పోటి; 4. మొలనూలు; 5. నడుము; 6. అంతఃపురము, లోపలిభాగము; 7. చంక; 8. గోడ; 9. గరివెందజీ. 10. నడికట్టు.

కక్షపాల. సం. వి. ఆ. స్త్రీ. కకపాల. "గీ. అక్షపాల సుకస్తులకక్షపాల." సా. ౩, ఆ. ౧౮౧.

కక్షము. సం. వి. అ. పుం. 1. కచ్చు; 2. తీఁగ; 3. గడ్డి; 4. చంక; 5. అంతఃపురము; 6. పార్శ్వము;

7. గోడ; 8. మొలనూలు; 9. పొద; 10. పాపము.

కక్ష్య. సం. వి. ఆ. స్త్రీ. 1. మేడయంతస్తు; 2. మొలనూలు; 3. ఇంటిలోపలిభాగము; 4. వ్రేలు; 5. ఉత్తరీయము; 6. ఏనుఁగునడుమున కట్టెడు మోకు.

కగ్గము. వై. వి. (సం. ఖడ్గః.) ఖడ్గము,కత్తి.(శ.ర.)

కగ్గించు. దే. స. క్రి. (కగ్గు. ధా. ప్రే.) జంకించు: కందఁజేయు. (బ్రౌ.)

కగ్గు. దే. అ. క్రి. 1. నల్లపడు. "చ...తనకగ్గిన కైదువు సూపి..." కళా. ౧,ఆ. ౨౧౦; 2. కందు. "ఉ. కగ్గినచెక్కులున్..." విప్ర. ౨, ఆ. ౫౩. విణ. వివర్ణమైనది. "ద్వి. కగ్గులై మ్రగ్గులై కకపిక లగుచు." అ. మ. క. 3, ఆ.

కచ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడేనుఁగు.

కచంగలము. సం. వి. అ. పుం. సముద్రము.

కచము. సం. వి. అ. పుం. 1. కేశము; 2. కట్టు; 3. మబ్బు; 4. కురువేరు.

కచాకచి. సం. అవ్య. కేశాకేశి, జుట్టు జుట్టు పట్టుకొని. "క. ఆహవము చేసిరి...,బాహాబాహిఁ గచాకచి..." కాశీ. ౫, ఆ. ౧౫౦.

కచిక. దే. వి. కాలి తెల్లనైన చల్లారినపిడుక; ఆపిడుక ముక్క. (చా.) రూ. కచ్చిక.

కచిక్కు. దే. వి. పొడుచుటయందగుధ్వని కనుకరణము. "ద్వి. చికటారిఁ గొంది కచిక్కునఁ బొడిచె." విష్ణు. ఉ. ౪, ఆ. (శ. ర.)

కచేరి. హిం. వి. 1. కొలువుకూటము, ఉద్యోగశాల. (శ. ర.); 2. వేశ్యాస్త్రీలుమొ. వారు జరుపు గానసభమొ. ఉదా:—పాటకచేరి, వీణకచేరి. (బ్రౌ. వా.)

కచోరము. సం. వి. అ. న. షడ్గ్రంధి.

కచేలము. సం. వి. అ. న. 1. జాబుమడుపు; 2. వ్రాత కాగితముల మడుపు.

కచ్చరము. సం. వి. అ. న. మజ్జిగ. విణ. (అ. ఆ. అ.) 1. మలినము. 2. కుత్సితము.

కచ్చా. హిం. విణ. 1. పచ్చిది; 2. అల్పము. (శ. ర.)

కచ్చి. దే. వి. 1. సాలెవాఁడు కొయ్యలను పడుగునందు చొప్పించెడుసందు. (శ. ర.); 2. కొచ్చిను దేశపుగుఱ్ఱము. ఆం. భా. ద్వి. ౧౯౬.

కచ్చించు. యు. దే. స. క్రి. 1. గవ్వలాట మున్నగునాటలలో కాయల నడపు. (శ. ర.); 2. సరిపెట్టు; ఇంటికి గోడ మొ. వానికొలతలు నిశ్చయించు.(వా.) వై. అ. క్రి. 1. కచ్చబిగించుకొను, సన్నద్ధమగు. "క. కచ్చించి మల్లు బిడ్డలు...,అచ్చటికేతెంచి నిలిచి రధిపతియెదురన్." హరి. పూ. ౯, ఆ. ౯౫. 2. గర్వించు. (చూ. కచ్చించుకొను.)

కచ్చించుకొను. దే. అ. క్రి. (కచ్చించు+కొను స్వార్థమున) గర్వించు. "ద్వి. నిబ్బరంబాడుచు నిక్కుచునంత, గబ్బెలయనుచును గచ్చించుకొనుచు." పండితా. పర్వ. ౪౦౪ పు.

కచ్చింపు. దే. వి. 1. సరిపెట్టుట, ఇల్లుమొ. కట్టునపుడు కొలతలు నిర్ణయించుట; 2. సరియగు నేర్పాటు, నిర్ణయము. (వా.)

కచ్చిక = కచిక. ఆం. భా. ద్వి. ౨౪౨.

కచ్చితము. వై. విణ. (సం. ఖచితః.) హెచ్చుతగ్గులు లేక సరిగా నుండునది. వ్యవ:—ఆవిషయమున వాఁడు కచ్చితముగా మాట్లాడినాఁడు.

కచ్చియ = కచ్చె. (శ. ర.)

కచ్చిలములు. వై. వి. బ. వస్త్రవిశేషము, "వ...కనకదండెలును గచ్చిలంబులును..." ద్వా. 3, ఆ. ౧౭౭.

కచ్చె. వై. వి. 1. (సం. కక్షా) కలహము. "చ...ఒం, డొరులకుఁ గచ్చె పుట్టుటకు నొక్కనిచేఁడియ నొక్కఁ డొంద నక్కఱ జనియింపఁ జేయ వలె..." పార్వ. ౨, ఆ. ౧౨౮; 2. విరోధోక్తి. ఆం. భా. ప్ర. ౧౧౬: 3. (సం. కచ్ఛః.) కచ్ఛభేదము. ఆం. భా. ద్వి. ౧౫౩.

కచ్చెపోతు. ద్వ. విణ. (కచ్చె+పోతు.) కలహశీలుఁడు. (శ. ర.)

కచ్చేరి = కచేరి. (శ. ర.)

కచే = కచ్చ. (చూ. కచరించు.)

కచేరించు. వై. అ. క్రి. కచ్చపోసిబట్టకట్టు. "క. కచరించి తోడిసకియల, సెచరించుచు నోలవిడుచు నెత్తిలి నగుచుం, గుచకుంభప్లవపతి యలి, కచయొక్కటె గడవ నీఁదెఁ గమలాకరమున్." సాంబో. ౫, ఆ. ౮.

కచ్చె. వై. వి. (సం. కచ్ఛః.) **1.** వెనుకకు దోఁపుకొనుదోవతికొంగు. "ద్వి. వెడ విడఁ దనకచ్చ వీడంగఁ బాఱి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౦౭; **2.** గోఁచి. "సీ. మొలఁ గచ్చకట్టుపై మలఁగిన పచ్చని నునుఁగొంగు దండుగా నులిచి చుట్టి." హరి. పూ. ౭, ఆ. ౧౩; **3.** కాసె. "ఆ. కచ్చ యమరఁ బట్టికాళ్లను జేతులు, వ్రేల... ఎత్తివైచె." భార. విరా. ౨, ఆ. ౧౭; **4.** ఉపస్థ. ఆం. భా. ద్వి. ౧౩౬.

కచ్చెకాఁడు. ద్వ. వి. (కచ్చ+కాఁడు.) గోఁచితాల్పరి, ముని. "గీ. అచ్చటికి వచ్చె వేలుపుఁగచ్చకాఁడు." కువల. ౫, ఆ. ౪౦. (వేలుపుఁగచ్చకాఁడు = దేవర్షి, నారదుఁడు.)

కచ్చెడము. వై. వి. (సం. కచ్ఛటికా.) **1.** గోఁచి. "గీ. జమిలిమొలత్రాట నినుపకచ్చడ మమర్చి." విక్ర. ౨, ఆ. ౯౨. స్వా. ౨, ఆ. ౭౩; **2.** చీర; వేశ్యలు ధరించుచీర. "ద్వి. భువి నిట్టిభక్తురాలవు కచ్చడంబు, ధవళాక్షి మఱి యేల తాల్ప వీవనిన..., కట్టితి సర్వాంగకచ్చడం బనుచుఁ, గట్టినసమకట్టు కాంత సూపుదును." బస. ౩, ఆ. ౬౦. పు. **3.** దూదిమొ. తెచ్చెడుబండి. (శ. ర., బ్రౌ.)

కచ్చెరము = కచ్చడము. (గోఁచి, చింపిపాఁత.) "క. బోయపలి యేడ విద్యు, చ్ఛాయా వలి యైన యిట్టిసతి యెడ సరే, వేయేల దివ్యరత్నం, బేయధముఁడో కచ్చరాన నిడి ముడివెట్టెన్." పార్వ. ౬, ఆ. ౯౭.

కచ్చు. యుఁ. దే. స. క్రి. చదరంగము మొ. వానిలో కాయ జరపు. (శ. ర.) వి. **1.** గర్వము, బింకము. "సీ. అరవిందములకచ్చు లడఁగించుజిగి..." స్వా. ౬, ఆ. ౧౦౨. కాశీ. ౧, ఆ. ౧౨౨; **2.** ఈసు. "ఉ...అల్లు ముద్రించినజాడఁ దెల్పె సుదతీమధుపంబు పరిచ్ఛదచ్ఛటా, కంచుకితోత్పలంబు తుదకచ్చునఁ జిక్కి యచంచలాకృతిన్." వసు. ౪, ఆ. ౧౩౩; **3.** సిగబంతి. "సీ. పారిజాతకతరుప్రసవగర్భిణి యైనకబరిపైఁ జెంగల్వకచ్చు నిలిపి." కాశీ. ౭, ఆ. ౫. వై. వి. (సం. కాంక్షా.) ఆశ. "సీ. క్షీరోదమధ్యస్థిరత్ననగగుహాగర్భనివాసంబుకచ్చు వదలి." పాండు. ౨, ఆ. ౧౧.

కచ్చుఁదనము. దే. వి. గర్వము. "గీ. చిలువమేపరి తలఁపులోపలనె వచ్చి, వినతుఁడై యిచ్చఁ గల కచ్చుఁదనము పోచ్చ". సమీర. ౬, ఆ. ౧౪౧.

కచ్చుకొను. దే. అ. క్రి. **1.** పట్టుపట్టు. ఆం. భా. తృ. ౧౭౯. చంద్రా. ౩, ఆ. ౨౭; **2.** డీకొను. "క...వేల్పుతేజిం, గచ్చుకొని హాసించు వీటఁ గల్గుహయంబుల్." చమ. ౧, ఆ. ౩౦.

కచ్చువాసము. దే. వి. **1.** ఇండ్లకు వేసెడుపెద్దవాసము. (శ. ర.) **2.** దూలములో చొనుపు చిన్నవాసము. (బ్రౌ.)

కచ్చువెట్టు. దే. అ. క్రి. డీకొను, ఎదిరించు. "చ. అగపడి కచ్చువెట్టి యితఁ డాడినమాటలకు..." భార. శల్య. ౨, ఆ. ౧౨౫.

కచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. **1.** గోఁచి; **2,** ఈలపురుగు; **3.** వారాహి, సప్తమాతృకలలో నొకతె.

కచ్ఛటిక. స. వి. ఆ. స్త్రీ. గోఁచి.

కచ్ఛపము. సం. వి. అ. పుం. **1.** తాఁబేలు; **2.** ఒకానొకనిధి; **3.** ఒకానొకమల్లబంధము.

కచ్ఛపస్థితి. సం. వి. ఇ. స్త్రీ. మందరీతి. "చ...రామసం, తతి భరియించి యున్నయది దానికి శోభనమందఁ గచ్ఛపస్థితి నయినం దలంపు దయసేయుఁడు మీ, రని యప్పగింపుమీ." నిర్వ. ౯, ఆ. ౨౫. (కొంచె మైనను అని భావము.)

కచ్ఛపి. సం. వి. ఈ. స్త్రీ. **1.** ఆఁడుతాఁబేలు; **2.** సరస్వతివీణ; **3.** మొటిమ.

కచ్ఛము. సం. వి. అ. పుం. న. అనూపము, కసెము. పుం. **1.** ఒడ్డు; **2.** నౌకాంగము; **3.** కచ్చ; **4.** తాఁబేటిచిప్ప. **5.** నందిచె⚘; **6.** గోఁచి; **7.** ప్రక్క; **8.** దేశభేదము.

కచ్ఛశుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. వ్యభిచరింపమి.

కచ్ఛుర. సం. వి. ఆ. స్త్రీ. **1.** గంట్లకచోరము⚘; **2.** దూలగొండి⚘; **3.** వాఁకుడు⚘; **4.** తీఁటకసింద⚘.

కచ్ఛురుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) **1.** తీఁటగలవాఁడు; **2.** జారుఁడు; **3.** గజ్జి కలవాఁడు.

కచ్ఛువు. సం. వి. ఉ, ఊ. స్త్రీ. గజ్జి.

కచ్ఛూరకము. సం. వి. అ. పుం. గందకచోరము⚘.

కచ్ఛోటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కచ్చ; 2. బట్ట యంచు.

కజము. సం. వి. అ. న. పద్మము.

కజ్జలధ్వజము. సం. వి. అ. పుం. దీపము.

కజ్జలము. సం. వి. అ. న. 1. కాటుక; 2. సిరా; 3. దీపపుమసి; 4. మేఘము; 5. కలువ.

కజ్జలి. సం. వి. ఈ. స్త్రీ. 1. సిరా; 2. దీపపుమసి; 3. మత్స్యవిశేషము.

కజ్జా. హిం. వి. పోరు, జగడము. (బ్రౌ. వా.)

కజ్జాకోరు. హిం. విణ. కలహశీలుఁడు, జగడమాడు స్వభావము కలవాఁడు. (వా.)

కజ్జెకాయ = కజ్జ. "మ...,వడలుం జక్కెర కజ్జె కాయలును..."రామా. ౨, ఆ. ౧౧౫.

కజ్జెము = కజ్జెకాయ. "ద్వి. కజ్జెముల్ కజ్జెముల్ కజ్జెంబు లనుచు, కజ్జెంబు లిచ్చుచు గమనించు వారు." పండితా. పర్వ. 3౫3. పు.

కజాయము = కజ్జము. (భక్ష్యవిశేషము) "శా... కజాయంబు లిం, డెన్నే నున్నవి..."పాండు. ౭౦, ఆ. ౨౭౯.

కజ్జీ = కజ్జము. (భక్ష్యవిశేషము.) "క...ఒక చకోరిక, కులుకుచు నొకకజ్జ మగనిఁ గుడువం జేసెన్." కకు. 3, ఆ. ౧౦౪.

కజ్జెము. వై. వి. 1. (సం. ఖాద్యమ్.) భక్ష్యము; భక్ష్య విశేషము. ఆం. భా. ద్వి. ౨౫౪. "సీ. కజ్జంబు లును బండ్లు..."భార. ఉద్యో. 3, ఆ. ౧౬౦. జై. ౬, ఆ. ౯౨; 2. (సం. కార్యమ్.) పని. "ద్వి. బిజ్జలునకు వినిపింపఁగ నతఁడు, కజ్జ మెంతే నియ్యఁ గలదు..."బస. ౬, ఆ. ౧౯3. పు.

కజ్జాయము = కజ్జ. ఆం. భా. ద్వి. ౨౫౪. రా. వి. ౨, ఆ. ౧౦౫.

కజ్జేరము = కజ్జూరము. ఆం. భా. ద్వి. ౭౯.

కజ్జూరము. వై. వి. (సం. ఖర్జూరః.) పేరీఁదు♣. య. ౫, ఆ. ౪౮.

కట. వై. అవ్య. (సం. కష్టమ్) అకట, సంతాపార్థకము. "ఉ...,కట చిత్తజుబారికి నోర్వవచ్చునే." విక్ర. 3, ఆ. ౪౬.

కటంకటము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. బంగారము; 3. చిత్రమూలము ♣.

కటంకటుఁడు. సం. వి. అ. పుం. 1. గణపతి; 2. శివుఁడు.

కటంబకుఁడు. సం. విణ. (అ. బిశా. అ.) కూరలు వండువాఁడు.

కటంబము. సం. వి. అ.పుం. 1.బాణము; 2. వాద్యము.

కటంభర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. కప్ప; 3. మణిసిల; 4. తీఁగబచ్చలి♣. 5. కటుకరోహిణి♣; 6. గలిజేరు♣.

కటకట. వై. అవ్య. అకట. కాళిందీ. ౨, ఆ. ౧౯౭. ...వి. 1. కష్టము. "చ...అధ్వగుల్, కటకటఁ జెంది..."ధర్మ. ౨, ఆ. ౧౨౦; 2. కోపము. (చూ. కటకటపడు.); 3. కొఱుకుటయందగు ధ్వని కనుకరణము. "ద్వి...కోఱ లొండొంటిఁ, గటకటఁ దాఁకిన గర్భంబు గలఁగి." నవ. 3. భా. (శ. ర.)

కటకటఁబడు. వై. అ. క్రి. (కటకటన్+పడు.) 1. బాధపడు. "క. ఇట యేను నిన్నుఁ బుత్త్రం, చుట యంత్తరకాల దివ్యసుఖసంగమసం, ఘట నకుఁ గాదే నీకట,కటఁబడుటకు దీనిఁ దెలుపఁగా రావలసెన్." భార. స్వ. ౪౦; 2. కోపించు. "క...అతఁడు గటకటఁబడియు,గ్రొ్కలువు వెడలి పోయెన్..."భార. ఉద్యో. ౪, ఆ. ౫౦. భార. ఉద్యో. ౧, ఆ. ౨౫౧, ౨౫౨; 3. కలఁతచెందు. "క. ఇటులు పరితాప మందుచు నటు నిటు వెతఁ గుందుచుండ నా ప్రాణసఖుల్, కటకటఁ బడి...త్రైలోక్యపచారములు సేయుచునెడన్."సావి. ౨, ఆ. ౫౪.

కటకటపడు = కటకటఁబడు. (దుఃఖించు) "క. మనమున మిక్కుటమై పెరిఁగెడు వెతలం, గట కటపడి..." రసిక. ౪, ఆ. ౯.

కటకటా = కట. ఆం. భా. తృ. ౬౭.

కటకటాలు. దే. వి. బ. ఇనుపయూచలు మొ. వానితో నేర్పఱచెడియడ్డు. (శ. ర. వా.)

కటకము. సం. వి. అ. పుం. పిడికిలి. పుం. న. 1. కడియము; 2. కొండనడుము; 3. సముద్రలవణము; 4. ఏనుఁగుకొమ్మునకు వేసెడుపొన్ను; 5. చాఁప; 6. రాజధాని; 7. సైన్యము; 8. ఒకానొకరాజధానీ నగరము; 9. దండు విడియుచోటు; 10. పక్షము. "క. సమరమునకు వచ్చినభూ,రమణు లుభయకట

కములను బ్రమదం బెసఁగన్,దమతమపురములకుం బో,వమహీజనులెట్టియుత్సవముఁ బొందుదురో." భార. ఉద్యో. ౩, ఆ. ౩౫౪. "క...రాఁ దొడఁగిరి భూ, విభులు...ఉభయకటకంబులకున్." భార. ఉద్యో. ౧, ఆ. ౫౧.

కటకరము. వై. వి. గంధర్వమృగము, కడంతి. ఆం. భా. ద్వి. ౮౫.

కటకసరులు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ...కస్తూరినిగరాలు కటకసరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

కటకాముఖము. సం. వి. అ. పుం. 1. అభినయహస్తవిశేషము; 2. వింటియందు బాణము కూర్చి లాఁగునపుడు పట్టెడు హస్తముద్రావిశేషము. "గీ. క్రమ్మఱఁ బలాశకటకాముఖమునఁ గీర, చలిత శాఖాస్ఫుటాశోకశరముఁ గూర్చె."ఆము. ౫, ఆ. ౧౪౧., అని. ౩, ఆ. ౫౯.

కటపయాదిసంఖ్య. సం. వి. అ. న. సంఖ్యలకు బదులు ప్రాచీనకాలమున వాడుకొనుభాష. (వర్గాక్షరములఁబట్టి దీని కీపేరు కలిగినది.)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | క. | ట | ప | య | స్త | న్య |
| 2. | ఖ. | ఠ | ఫ | ర | క్ర | |
| 3. | గ. | డ | బ | ల | క్ష | |
| 4. | ఘ. | ఢ | భ | వ | క్వ | |
| 5. | ఙ. | ణ | మ | | | |
| 6. | చ. | త | శ | | | |
| 7. | ఛ. | థ | ష | | | |
| 8. | జ. | ద | స | | | |
| 9. | ఝ. | ధ | హ | | | |
| 0. | ఞ. | న | ళ | | | |

పలికిన మొదటియక్షరము ఒకట్లస్థానము, రెండవది దశమస్థానము—ఇట్లే స్థానములు వృద్ధియగును. ఉదా:—1798 అనఁగా. జధషస్త. వద ఢఞ నతస్త . అనఁగా. 1600984. (బ్రౌ.)

కటపుట. దే. వి. విజృంభణము. "క. ఒకయే టొకపొటొకవే, టొకయా టొకముట్టిపాటు నొందకతండ,కక్కటపుటలు మానెౌ..."కకు. ౨, ఆ. ౧౦౪.

కటపెట. దే. వి. 1. వానకురియుంటయం దగుధ్వని కనుకరణము. "క. కటపెట తొటతొట రాలెడు, బొటబొటచినుకుల ధరిత్రి పొడ నట్టువడన్." వైజ. ౨, ఆ. ౧౪౬; 2. ఒరయుంటయం దగుధ్వని కనుకరణము. "ద్వి. కతినోరుదంష్ట్రలు కటపెట నొరయ."ద్వి. భాగ. ౭. స్కం.(శ. ర.)

కటభి. సం. వి. ఈ. స్త్రీ. 1. మానేరు♆; 2. సోమిదము♆.

కటమర. మి. వి. (కటము+మర.) హనువు, చెక్కిలి మీఁదిభాగము. ఆం. భా. ద్వి. ౧౪౩. "సీ... కనరానికటమురల్ పెచుపుఁ జెంచె." చంద్రా. ౧, ఆ. ౨౮. (ముద్రిపా. 'కటుమరల్' శ. ర.)

కటము. సం. వి. అ. పుం. న. 1. ఏనుఁగుచెక్కిలి; 2. చాప; 3. నలము♆; 4. కాలకూటము; 5. సమయము; 6. శ్మశానము; 7. మొల; 8. పిఱుఁదు; 9. ప్రతిజ్ఞ; 10. శవము; న. 1. సముద్రలవణము; 2. సొంటి.

కటా = కట. "మ...కీడునం దొడరెనే దైవంబు చెడ్డాఁ గటా." నిర్వ. ౫, ఆ. ౧౦౩.

కటాకటి. హిం. వి. జగడము. (బ్రౌ.) విణ. కొంచెమైనను మిగులనిది. వా:—వండినఅన్నము కటాకటిగా సరిపోయినది.

కటాక్షము. సం. వి. అ. పుం. కడగంటిచూపు; కృపావీక్షణము.

కటాక్షించు. సం. స. క్రి. 1. కడగంటఁ జూచు; "వ..,ఆరాజుం గటాక్షించుచు హృదయసంతాపంబు తనకుఁ దాన యుపశమించుకొని శకుంతల యారాజున కిట్లనియె."భార. ఆది. ౪, ఆ. ౭౮; 2. అనుగ్రహించు; 3. అనాదరించు. "వ. అని వాయోడక నెఱ నంటం బలికి పెక్కుదెఱంగుల నీశు దూషించుచుఁ దన్ను విశారదృష్టిం గనుంగొని సాభిలాషోక్తులు ప్రకటించుచున్నకృతకవిప్రు నగజ కటాక్షించి."కు. సం. ౭, ఆ. ౪౪.

కటాక్షించుకొను. మి. స. క్రి. (కటాక్షించు+కొను స్వార్థమున.) కడగంటఁ జూచు; అనుగ్రహించు. "సీ. కేవలభక్తితో తేవ వణిక్కులఁ గ్రేవల నటఁ గటాక్షించుకొనుచు." దశా. ౭, అ. ౧, ఆ. ౧౮౮.

కటాయించు. దే. స. క్రి. ఎగఁబెట్టు. "సీ. వైకమీఁ జాలక బాకీ కటాయించి..."రంగా. ౨,ఆ.౧౭౧.

కటారము = కటారి. (బ్రౌ.)

కటారి. వై. వి. (సం. కఠారః.) కత్తి; బాఁకు. "క. ..,పలరేని మేల్కటారీ నారీ."రసిక. ౩,ఆ. ౮౧.

కటారికత్తియ. వై. విణ. (కటారి+కత్తియ.) కటారి కలది; సౌందర్యముచేఁ బురుషులహృదయములఁ గలఁచునది. (స్త్రీ.) "చ... శౌర యొకొక్క తఱెం బువు బోండ్లు కటారికత్తియల్." కళా. ౧. ఆ. ౩౧.

కటారికత్తె = కటారికత్తియ. (శ. ర.)

కటారికాఁడు. వై. విణ. ఖడ్గధారి. కత్తి కలవాఁడు. "చ. బిరుదుకటారికాండ్రు..." కళా. ౯, ఆ. ౧౦౧.

కటారు = కటారి. "చ...నఱకెన్ గటారునన్." ఉ. రా. ౭, ఆ. ౪౧౯.

కటారుకత్తియ = కటారికత్తియ.

కటారుకత్తె = కటారికత్తె.

కటారుకాఁడు=కటారికాఁడు. "ఉ...చంప గవచ్చు కటారుకానిచందాన..."కాశీ. ౨, ఆ. ౧౪౦.

కటాహము. సం. వి. అ. పుం. 1. బాణలి; 2. పెనము; 3. చేట; 4. మట్టిదిబ్బ; 5. అప్పుడే కొమ్ములువచ్చుచున్న గేదెదూడ; 6. ఒకానొక దీవి; 7. ఒకానొకనరకము; 8. తలపుఱ్ఱె; 9. చెవులుగలగంగాళము; 10. తాఁబేటివెన్నుచిప్ప.

కటి. సం. వి. న్. పుం. ఏనుఁగు. ఇ, ఈ. స్త్రీ. 1. మొల; 2. పిఱుఁదు. ఈ. స్త్రీ. పిప్పలి✾. విణ (న్. సీ. న్.) కటము గలది.

కటిక. వై. వి. మాంస మమ్ముజాతి. "గీ. కటికవానిల్లు నాఁటికిఁ గన్నపెట్ట."భల్లా. ౧, ఆ. (శ. ర.) 2. వెండిబెత్తపు గోలము. "గీ. అనుచుఁ జెక్కాని కటికవాండ్రగ్గలంపు. రవళిగాఁ జూపి తెలుపఁగా ..." య. ౧. ఆ. ౧౦౦; 3. వేత్రహస్త ఆం. భా. ద్వి. ౧౮౪; 4. మల్లసాధనవిశేషము. ఆం. భా. ద్వి. ౨౦౭. విణ. 1. క్రూరము; 2. ధైర్యము. (చూ. కటికతనము.)

కటికతనము. ద్వ. వి. (కటిక+తనము.) 1. క్రూరత్వము. "క. ఈకటికతనంబు మానవే యని కరుణన్."వా. రా. ౨, ఆ. ౧౬౩; 2. ధీరత్వము."చ. కటికతనంబు మాన్పి చటుకాకుబిడంబము గూర్చి లజ్జనం, కటపడఁ జేసి..." నైష. ౩, ఆ. ౫౪.

కటికది. వై. వి. వేత్రహస్త. "సీ. పరిహాసకులు నటుల్ బయకాండ్రు మొగసాలఁ గాచినా రని తెల్పుకటికదాని." ఉ. రా. ౪, ఆ. ౨౨౩.

కటికన. దే. వి. ఒకానొకమల్లసాధనము. ఆం. భా. ద్వి. ౨౦౭.

కటికమెకము. వై. వి. (కటిక+మెకము.) ఖడ్గమృగము. (శ. ర.)

కటికి వై. విణ. (సం. కఠినమ్) 1. అధికము. (ఉదా. కటికినవ్వు.) 2. కఠినము. (ఉదా:— కటికినేల.) 3. తీక్ష్ణము. (ఉదా. కటికియెండ.) 4. సాంద్రము. "సీ. కటికిచీఁకటిదిండి కరములగిలిగింత సెవ్వాఁడు తొగకన్నె నవ్వఁ జేసెను." ఆము. పీఠి. ౧౯; 5. కేవలము. ఉదా:—వాఁడు కటికినీళ్లు త్రాగి ఉన్నాఁడు.

కటికినవ్వు. ద్వ. వి. (కటికి+నవ్వు.) విషపునవ్వు, తెచ్చిపెట్టుకొన్ననవ్వు. (చూ. కఠినహాసము.)

కటిల్లకము. సం. వి. అ. పుం. కాఁకర✾.

కటిసూత్రము. సం. వి. అ. న. 1. మొలత్రాడు; 2. ఒడ్డాణము; 3. కాసె.

కటీరము. సం. వి. అ. పుం. న. 1. గుహ; 2. జఘనము; 3. కటి; 4. పిఱుఁదు.

కటుంభర. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి✾.

కటుక. సం. వి. ఆ. స్త్రీ. 1. కటుకరోహిణి✾; 2. తాంబూలి✾; 3. కొత్తిమిరి✾.

కటుకము. సం. వి. అ. పుం. 1. పొట్ల✾; 2. కొండవత్తి✾; 3. జిల్లేడు✾; 4. కారము. న. కటుకత్రయము. (త్రికటుకము. సొంటి, పిప్పలి, మిరియము.) విణ. (అ. ఆ. అ.) 1. కారము గలది; 2. తీక్ష్ణమైనది; 3. ఇంపు కానిది; 4. భయము గొల్పునది; 5. పరుషమైనది; 6. చెడ్డది. (దధి కటుకము.)

కటుకరోహిణి. సం. వి. ఈ. స్త్రీ. కషాయాదులందుపయోగించు ప్రసిద్ధమగునోషధి.

కటుకు = కటుక్కు. యు. దే. వి. కొఱుకుటయందగుధ్వని కనుకరణము. "చ. కటుకునఁ బండ్లచేఁ గొఱుకఁగా..."ద్వా. ౧౨, ఆ. ౯. వై. విణ. క్రూరుఁడు. "క. కటుకున్ రక్కసిగొంగకు..." అచ్చతెలుఁగుభారతి.

కటుక్కు = కటుకు. (కొఱుకుటయందగుధ్వని కనుకరణము.) "వ...కుంటికడ్డపడఁ గటుక్కునం గొఱికి..."చంద్రా. ౨, ఆ. ౭౪.

కటుతుంబి. సం. వి. ఈ. స్త్రీ. చేఁదుసొఱ✾.

కటుదళ. సం. వి. ఆ. స్త్రీ. దోస. వృ.

కటురవము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. పరుష ధ్వని. విణ. (అ. ఆ. అ.) పరుషధ్వని కలది.

కటురోహిణి. సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణివృ.

కటువు. ఉభ. వై. వి. (సం. ఖాటిః) పాడె. (శ. ర.) సం. వి. ఉ. పుం. 1. కారము; 2. గుగ్గిలమువృ. 3. వెల్లుల్లివృ. స్త్రీ. 1. కటుకరోహిణివృ. 2. సల్లావవృ. న. 1. అకార్యము; 2. నింద. విణ. (ఉ. ఉ, ట్వీ. ఉ) 1. కారము గలది; 2. పరుష మైనది; 3. సువాసన గలది; 4. దుర్వాసన గలది; 5. మచ్చరము గలది; 6. వాఁడియైనది.

కటోలవీణ. సం. వి. ఆ. స్త్రీ. మాలలు వాయించువీణ.

కటోలి. సం. వి. ఈ. స్త్రీ. చండాలస్త్రీ.

కటోలుఁడు. సం. వి. అ. పుం. చండాలుఁడు.

కట్ట. దే. వి. (క. కట్టె.) 1. ఒకటిగాఁ జేర్చి కట్టిన వస్తువుల మొత్తము, మోపు. "సీ...దర్భ, కట్ట..." భార. అను. ౨, ఆ. ౪౪౬; 2. చెఱువు మొ. వానిగట్టు. "ఆ...కట్టఁ, దగినతరువు లిడిన సుగతి గలుగు." భార. అను. ౨, ఆ. 330; 3. ఆనకట్టు. "ఆ...ఎకిమీఁడు, దండుతోడఁ గడలిఁ దఱియ నరిగి. కట్టఁగట్టి..." అచ్చ. యుం. 23. అవ్య. కట. (శ. ర. బ్రౌ.)

కట్టకడ. దే. వి. (కడ+కడ.) మిక్కిలికడ, బిట్టచివర. "క...నిఖిలాశలకట్టకడలకు..." లక్ష్మీ. ౨. ఆ. ౭౯.

కట్టడ. దే. వి. 1. ధర్మము. "క...,ఇది కట్టడ తిరి కరులకు..." కాశీ. ౭, ఆ. ౫౨; 2. నియమము. ఆం. భా. ద్వి. ౧౭౪., కళా. ౮, ఆ. ౨౬౪; 3. అందము. "క...ఒడలికట్టడయును ముఖశ్రీరామ ణీయకంబు మహిరమణునియట్ల కాదె..." నిర్వ. ౧౦, ఆ. ౧౭౦; 4. గుణము, స్వభావము. "చ...వీణులు నిండి పాఱీనం, గతుకఁగఁ జూచుఁ గుక్క తనకట్టడ మీఱక యెందు భాస్కరా." భా. శ. ౫; 5. ప్రతిఫలము. "సీ. నిరుపమకమతపఃపరమపుణ్యంబులు కట్టడ యైన శృంగారవతులు." కళా. ౬, ఆ. ౪౫; 6. విష్ణ్వాలయమున భక్తులకు ఉపచారకులకు నియమముగా ఇచ్చెడుప్రసాదము. (వా.) 7. ఆజ్ఞ. (చూ. కట్టడచేయు.); 8. విధము. "ద్వి. ఈ చక్కఁదనమును నీనేర్పుపెంపు, రాచకట్టడ..." ద్వి. భాగ. 3. స్కం. (శ. ర.)

కట్టడచేయు. దే. స. క్రి. (కట్టడ+చేయు.) 1. నియమించు; ఆజ్ఞాపించు. "మ ..ననుం గట్టడచేసెఁ బట్టణము వారిం గొంచుఁ బొమ్మంచు..." జై. ౨, ఆ. ౧౦౭. "ఉ. కట్టినఁ గట్టఁ గాక హరి కట్టడచేసిన..." దశా. ౫, ఆ. ౧౮౯; 2. ప్రసాదించు, ఇచ్చు. "గీ...బహుధనాధీశ్వరత్వంబు ...,కట్టడచేయుమయ్య." ఉ. రా. ౧, ఆ. ౨౨౫.

కట్టడము. దే. వి. (క. కట్టడ. త. కట్టడమ్.) గృహాదికము. (బ్రౌ. వా.)

కట్టడి. దే. వి. 1. నియతి, భాగ్యము. ఆం. భా. ప్ర. ౯౯; 2. ఆజ్ఞ. "గీ...నాడు, మనవి గట్టడి గావింపు మనిన నతఁడు." దశా. ౨, ఆ. ౧౭3; 3. విష్ణ్వాలయమున నియతముగా ప్రసాదము మొ.ఇచ్చుట "చ...మూఁడు నిత్యలు పెరుమాళ్లకోవెలఁ బ్రసాదముకట్టడి సాఁగినచ్చు..." వైజ. ౨, ఆ. ౧౨౮; 4. కట్టుబాటు. "తే... దుర్మతుల్, కావునఁ గాని యెట్టియెడఁ గట్టడిఁ జెప్పఁగ నేరరు..." ద్వా. ౧, ఆ. ౧౬.

కట్టడికట్ట. దే. వి. (కట్టడి+కట్ట) వేల, చెలియలికట్ట. "చ. కడలిగముల్ కదుం దొనఁకి కట్టడి కట్టలు దాఁటి పాఱఁగా..." అచ్చ. యుం. ౧౬౨.

కట్టనము. దే. వి. (క. కట్టణ.) 1. కానుక. "సీ..., గాండీవికిని మేలుకట్టనంబు లమర్చి..." జై. ౭, ఆ. ౧౦౫; 2. బంధనము. "సీ...ఉక్కుటులుల, రాకట్టనపుటెడల్ నైర్కొని నఱకుట..." హరి. ఉ. ౨ ఆ. ౧౬; 3. వస్త్రము. ఆం. భా. ద్వి. ౧౫౫.

కట్టమర = కటమర. (బ్రౌ.)

కట్టరము. దే. వి. కంట, నాట్యబాధము. ఆం. భా. ప్ర. ౧3౦.

కట్టా = కట్ట, కటా. ఆం. భా. తృ. ౬౭. భాగ. ౧. స్కం. 3౧౧.

కట్టాణి. దే. వి. (కడు+ఆణి.) మిక్కిలి గుండ్రము ప్రశస్తము నైన ఒకానొకజాతిముత్యము. "సీ... కట్టాణిముత్యాలకంఠమాల." భీమ. ౧, ఆ. ౧౧౬. హంస. ౧, ఆ. ౨౧౬.

కట్టాయితపడు. ద్వి.అ. క్రి. (కట్టాయితము+పడు.) సిద్ధపడు. "క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక..." వేం. పంచ. 3, ఆ. ౧౫౯.

కట్టాయితము. దే. వి. (కడు+ఆయితము.) యుద్ధము నకు సిద్ధమైనసైన్యము. "సీ. అతమాస్త్రం దళములంబు నడకించుబొమ్మలు నాత్మసంభవుని కట్టాయితములు." భాగ. ౬. స్కం. ౪౪౫. విశే. సిద్ధమైనది. "వ. కట్టాయితంబై సురాసురులు బిట్టేచి..." హర. ౬, ఆ. ౫౯., ఉ.హరి. ౨, ఆ. ౨౫.

కట్టావి. దే. వి. (కడు+ఆవి) మిక్కిలి లేచుపొగ. "గీ. ఎసఁగుకట్టావిక్రియ నావి రెగయ..." ఆము. ౨, ఆ. ౬౦; ౪, ఆ. ౧౩౪.

కట్టించు. దే.స. క్రి. 1. నిర్మింపజేయు. "సీ. కట్టి పలేనైతిఁ గమలతాసారిబు..." కాశీ. ౨, ఆ. ౯౧. 2. బాధింపఁజేయు. "సీ. కావేరిఁ గట్టించె. గార్వాసరాసుల నుబ్బిచోడుఁడు మెచ్చ నొక్క తాత." హర. పీఠి. ౧౧.

కట్టిఁడి. దే. విశే. (కట్టు+ఇఁడి.) 1. దయలేనిది. "క. ఆ ట్టేల రాక తక్కుం,గట్టిఁడియె యూలతాంగి..." భార. విరా. ౨. ఆ. ౨౯౭. పాండు. ౫, ఆ. ౭౫; 2. ప్రౌఢుఁడు. "క...వివిధాగమ సం,పవిత్రఁ గట్టిఁడి యగు కవి, తాదక్షుని సుగాళిదాసు నుతింతున్." వాల్మీ. ౧, ఆ. ౯; 3. యుక్తము, తగనిది. "ఉ...,దిట్ట లనంగ విద్యయుు వినీతతయుఁన్ వెలయింప కమ్మెయున్, గట్టిఁడిపూన్కి నిల్లు దొరుఁగం జను నే సుతులాం యుత్తలీన్." హరి. పూ. ౨, ఆ. ౨౦౭; 4. చెనుగు. "క...,కట్టిఁడియై వీఁడు తల్లిగండము తలగాఁ,బుట్టె నవలక్షణుం డిఁకఁ,గట్టా యెవ్వారిఁ జెఱుపఁగా నున్నాఁడో." వేం. పంచ. ౫, ఆ. ౪౧.

కట్టిక. వై. వి. (సం. కాష్ఠికః.) 1. వేత్రహస్తుఁడు; వేత్రహస్త. వేంక. మాన. ౩.౨. ఆం. భా. ద్వి ౧౮౪; 2. వేత్రహస్తులజాతి. ఉదా:—కట్టికవాఁడు.

కట్టికవాఁడు. ద్వి. వి. (కట్టిక+వాఁడు.) వేత్రహస్తుఁడు; స్తుతిపాఠకుఁడు. "క. వడిఁ గట్టికవారలు పొంపడ ఖిడి హెచ్చరిక రాయపరగండ యనన్." కువల. ౨, ఆ. ౫౬. "చ. గడెలు పదాతి చెల్లె నరఁగా వాని కట్టికవారు మ్రోత గ,న్నడ నవధారు దేవ జనసా యన..." కువల. ౨, ఆ. ౪౭.

కట్టికుడుపు. దే. స. క్రి. (కట్టి+కుడుపు) అవశ్య మనుభవింపఁజేయు. "చ...అధర్మ మట్లుగాఁ, బఱచినపాటు కట్టికుడుపం జనునో చనదో విధాతకున్." కళా. ౧, ఆ. ౧౬౩; సానందో. ౨, ఆ. ౩౫.

కట్టిడి = కట్టడి. (నియతి, భాగ్యము.) ఆం. భా. ప్ర. ౯౯.

కట్టిపెట్టు. దే. స. క్రి. 1. చాలించు. "ఉ...నీ, మాటలు గట్టిపెట్టి చనుమా..." రసిక. ౩, ఆ. ౪౫. జై. ౧, ఆ. ౬౩; 2. దాచు. "గీ. ఇట్టి మీవారి నడతలు గట్టిపెట్టి, యమ్మ నేఁజెల్ల న్యాయంబు లాడె దౌం." శశాం. ౩, ఆ. ౯౧; 3. అణఁగఁగొట్టు. "సీ. భానుమత్కులవీర భద్రాన్న దేవేంద్ర గర్వసంరంభంబుఁ గట్టిపెట్టి." భీమ. ౧, ఆ. ౬౨; 4. నిర్మించు. "గీ. కలుమతం బొందె నిల్లొందెఁ గట్టిపెట్టి, బ్రహ్మయోగీశ్వరుని నుంచు భక్తి నెవ్వఁడతఁడు మాన్యుండు పూజ్యుండు నతులితముగ." భీమ. ౬, ఆ. ౫౫; 5. బంధించు. వ్యవ:—ఆవును రాటకుఁ గట్టి పెట్టుము; 6. అంటఁగట్టు; బలవంతముగాకట్టు. వ్యవ:—ఈచిన్నపిల్లను ముసలివానిఁ గట్టిపెట్టినారు.

కట్టియ = కట్టె. 1. పుడుక. "శా...పంటకట్టియలకై..." భార. విరా. ౧. ఆ. ౭౮; 2. కఱ్ఱ. "క. కట్టియఁ జేకొని దేగం, బట్టి..." స్వా. ౪, ఆ. ౨౪; 3. బాణము. "ఉ. కట్టియ వైచె నెన్నదురు గాఁడ..." భార. శల్య. ౧, ఆ. ౩౭౭.

కట్టివేయు. దే. అ. క్రి. నిలుపుచేయు. వ్యవ:—వానికి వాంతులు కట్టివేసినవి. స. క్రి. 1. బంధించు. వ్యవ:—ఆవును కట్టివేయుము; 2. నిర్మించు. వా:—వారు ఒక్కనెలలో ఇల్లు కట్టివేసినారు.

కట్టు. దే.అ. క్రి. 1.అగు,ఏర్పడు. "ఉ. అక్కడ నిక్కడఁ దా నిలిచి రక్తపు గుంపులు గట్టి వానరుల్."

భా. రా. యు. ౯౧౯. స్వా. ౪, ఆ. ౨౩; 2. నిబద్ధమగు. "గీ. కట్టు విచ్చుత్రములు పొంగుఁ గడుపు..." మార్క. ౨, ఆ. ౩౪; 3. అవు. మొ. గర్భము ధరించు. ఆం. భా. ద్వి. ౬౯౩. స. క్రి. 1. బంధించు. "సీ. శరభపుఖులైనను సరభపరాఖుగఁ గట్టి మూటకట్టుగఁ గట్టుమొక్కల ములు." విక్ర. ౧, ఆ. ౭౭, దశా. ౫, అ. ౧౧౯. 2. ధరించు. "సీ... నూత్నవల్కలము గట్టి." జై. ౬, ఆ. ౧౫; 3. ఆరోపించు. "క. కనికరము లేక వానిం, గని కరము నిరాపనింపఁ గట్టం దగునే." సా. 3, ఆ. ౫౧; 4. నిరోధించు, మానుకొను. "క. కట్టె నుపవాసములచే..." వరాహ. ౨, ఆ. ౧౭౬. "క...నేఁ గడుపు గట్టి...ఇటు వండిపెట్టిన..." శుక. 3, ఆ. ౨౭౯; 5. కూడఁబెట్టు. "క...ముఁన్, గట్టిన కర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ పేర్తురె మనుజుల్." భార. ఆది. ౫, ఆ. ౫౭; 6. కూర్చు. "క...మాలికలు గట్టి..." విప్ర. ౨, ఆ. ౩౦; 7. నిర్మించు; త్రవ్వించు. "మ...కట్టించదీ ర్ఘాగారమున్..." భా. రా. అర. ౧, ఆ ౧౧౪. "గీ. తాత కట్టినచెఱువు వంచుఁ దగునె మునుఁగ." కాశీ. ౬, ఆ. ౭౫౪; 8. మూయు. "ఉ...పౌండ్రవిభుకన్నులు గట్టి ప్రలంబవైరి కిన్, సేవ యొనర్చి..." ఉ. హరి. ౨, ఆ. ౯౮; 9. మాటగా నేర్పఱుచు. "సీ. భక్తిఁ ద్రోపదు సాధ్వి పరికరంబులు పెట్టి కట్టిన పొరిశీలంగాయగ ములు." ఆము. ౪, ఆ. ౩౫; 10. వహింపజేయు. "గీ...ఆచార్యుండు బ్రాహ్మణుండు...బలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని." భార. ద్రో. ౧, ఆ. ౬౨; 11. నిర్ణయించు. వా:—ఎకరమునకు నాలుగురూపాయలపన్ను కట్టినారు; 12. చెల్లించు. వా:—పరీక్షకు సొమ్ము కట్టవలయును; 13. ఆఁపుచేయు. "సీ. చేతులచేత రేవాతో యములఁ గట్టి..." దశా. ౬, అ. ౭౦. వి. 1. బంధనము. "ఉ...కన్నులమొక్కుఁ గాని యూ, కట్టున కంత యైనను వికారము నొందఁడు దైత్యుఁ డత్తఱిన్." దశా. ౫, అ. ౧౧౯; 2. బంధన సూత్రము; ధర్మసూత్రము. "సీ...ఇనుమునఁ గట్టుదాల్పు." కు. సం. ౮, ఆ. ౧౩౫. "సీ... సత్యంబను కట్టునఁ దగఁ గట్టువడి..." హరి. ఉ. ౭, ఆ. ౩౦; 3. సమయము; నిర్ణీత మగు వయస్సు. "క...ఇట్లీడేతి కట్టు దప్పిన, చేసియు కీర్తనైనఁ బెండ్లిసేయం దగనే." యు. 3 ఆ. ౧౦౦; 4. ఆకారము. "సీ కాళ్ళయొప్పిన నూరుకట్టునుజ్జ్వలను సేయంగ..." భార. విరా. ౧, ఆ. ౨౨౮; 5. కట్ట్య, —ము భాగము. (శ.ర.) 6. ప్రదేశము "గీ ..తమయింటి యెనుపుకట్లు." వి. పు. ౭, ఆ. ౧౩౭; 7. నిబంధనము. (శ. ర.) ఉదా:— కులముకట్టు; 8. ఉడికినకందిపప్పునీరు. వాని రసము. ఉదా: కందికట్టు; 9. కాలము. ఉదా:— సీతుకట్టు. (శీతకట్టు అని వాడుక.); 10. ఒకానొక జాతిపాము నంచున్నచార. వా:—కట్లపాము కఱచినచో కట్టు కట్టినను బాధ యెక్కువై చనిపోవును. క్రి. విశ. మిక్కిలి. (చూ. కట్టపకాసి.)

కట్టుఁగంబము. ద్వి. వి. (కట్టు+కంబము.) కట్టుఁగొయ్య. "సీ. కట్టుఁగంబము దుంతి గంధద్విపమునకు..." కాశీ. ౫, ఆ. ౧౩౫.

కట్టుఁగొంగు. దే. వి. (కట్టు+కొంగు.) కోకయొక్క కట్టుకొనుచెంగు. "క...గగుర్పొడిచెం జను, కట్టోకయినుమంత వీఁడెఁ గట్టుంగొంగున్." విజ. ౨, ఆ. ౧౭౮., దశా. 3, అ. ౮౯.

కట్టుఁగొమ్మ. దే. వి. (కట్టు+కొమ్మ.) ఆనకట్ట, సేతువు. (శ. ర.)

కట్టుఁగొయ్య. దే. వి. (కట్టు+కొయ్య.) సేధి; పశువులను కట్టుటకు పాఁతినగుంజ. "సీ. కట్టుఁగొయ్యకుఁ జేరి కామధేనువు తప్పె..." కాశీ. ౪, ఆ. ౧౧౧. ఆం. భా. ద్వి. ౨౩౪.

కట్టుఁగొట్టు. దే. వి. (కట్టు+కొట్టు.) కట్టుఁగొయ్య. (శ. ర.)

కట్టుఁగోక. దే. వి. (కట్టు+కోక.) మొలను ధరించెడి వస్త్రము. (శ. ర.)

కట్టుఁబోతు. దే. వి. (కట్టు+పోతు.) 1. దయ్యాలను పట్టించువాఁడు. (వా.) 2. పొగరుఁబోతు. 'గీ. జారచోరులఁ గన్నను సంతసిల్లుఁ, గట్టుఁబోతులఁ బొడగన్నఁ గొఁగిలించు." మల్హ. 3, ఆ. ౪; 3. మంత్రకాఁడు, చిల్లంగివాఁడు. (బ్రా. వా.)

కట్టుక. దే. వి. గర్భస్రావము. ఆం. భా. ద్వి. ౨౬౪.

కట్టుకట్టు. దే. అ. క్రి. (పని చేయుటకు పూనుకొను) నిర్ణయించు. వా:—పొలివారు నేఁడు కట్టుకట్టినారు.

కట్టుకథ. ద్వ. వి (కట్టు+కథ.) కల్పితగాథ. (వా.)

కట్టుకొను. దే. స. క్రి. (కట్టు+కొను.) 1. ధరించు. "చ...చూచి గ్రైవేయకలు గట్టుకొన్న మణి యోధ్యును బూఁడ్లును గట్టు..." స్వా. ౧. ఆ ౨౩; 2. పొందు. "ఆ. శైక దీన నేమి కట్టుకొనియె." భా. రా. అయో. ౬౦. భార. ద్రో ౩, ఆ. ౨౭౫; 3. తెచ్చుకొను. "గీ...ఊరి వారి, కొలయు నెడయుల కెల్లఁ దా నవ్వులికము గట్టికొని తుదనట్టులు గాదె వత్స." భార. శాం. ౬, ఆ. ౩౨౦; 4. బంధించుకొను. వ్యవ:—చేతులు కట్టుకొని నిలఁబడుము; 5. పెండ్లాడు. వా:—ఆతఁడామెను కట్టుకొన్నాఁడు.

కట్టుకొమ్మ. దే. వి. (కట్టు+కొమ్మ.) అగడ్తలో నడ్డముగాఁ గట్టినకట్టు. (బ్రౌ.)

కట్టుగడ. దే. విశే. కూడఁబెట్టినది (శ. ర.)

కట్టుగడచేయు. దే. స. క్రి. (కట్టుగడ+చేయు.) నిలువచేయు, కూడఁబెట్టు. (బ్రౌ.)

కట్టుగుంజె. దే. వి. (కట్టు+గుంజ) నిట్రాడు, పశువులను గట్టురాడు. (బ్రౌ. వా.)

కట్టుగుండు. దే. వి. (కట్టు+గుండు.) 1. ఱాళ్లను బ్రద్దలుకొట్టుగుండు. "సీ...కొండ గట్టెడు కట్టుగుండ్లరవము." పరమ. ౫, ఆ. ౪౦., చంద్రా. ౪, ఆ. ౨౧౪; 2. తూనికఱాయి. (వా.) ద్వి. పరమ. ౬, ఆ.

కట్టుగుఱ్ఱము, దే. వి. (కట్టు+గుఱ్ఱము.) దొడ్డిఁబెట్టిన గుఱ్ఱము. (బ్రౌ.)

కట్టుగొఱ్ఱె. దే. వి. (కట్టు+గొఱ్ఱె.) వధకై గుంజకుఁ గట్టినగొఱ్ఱె. (బ్రౌ.)

కట్టుచేయు. ద్వ. అ. క్రి. (కట్టు+చేయు.) (శాసనాదులచే) నివారించు. (బ్రౌ.)

కట్టుదొన. ద్వ. వి. (కట్టు+దొన. క. కట్టుదొణె) కోనేఱు, చెఱువు. "సీ. తనచరిత్రాంబునకును ముజ్జగముల జనులవీనులు కట్టుదొనలు గాఁగ." చంద్రా. ౫, ఆ. ౧౪౭.

కట్టుపకాసి. ద్వ. విశే. (కట్టు+పకాసి.) 1. మిక్కిలి ప్రకాశించువాఁడు—ధీరుఁడు; శూరుఁడు. "ఉ. కట్టుపకాసి దీర్ఘదృఢకాయుఁడు తత్ప్రతిహారపాలకుండు..." నిర్వ. ౪. ఆ. ౫౪. "క...హరియును నా,కట్టుపకాసికిని బలముఁ గడఁకయుఁ జూపెన్." హరి. పూ. ౮, ఆ. ౪౭; 2. సన్నద్ధుఁడు. "సీ. కట్టుపకాసులై గగనాంగణంబున మందేహు లింతకు మాఱుకొంద్రు." నైష. ౮, ఆ. ౧౩; 3. క్రుద్ధుఁడు. 'ఉ...రావుతుల్, గట్టుపకాసులై నరునిఁ గప్పిరి...' భార. శల్య. ౧, ఆ. ౭. ('క్రుద్ధేసు' అని మూలము.)

కట్టుపట్టు. దే. వి. (కట్టు+పట్టు.) ఆటపట్టు, నిధానము. "గీ. కాశి యణిమాదిసిద్ధుల కట్టుపట్టు." కాశీ. ౨, ఆ. ౫౦.

కట్టుపడు = కట్టువడు. (బద్ధుఁడగు.) "ఉ. వల్లభుఁడిట్లు కట్టుపడువార్త చెవింబడ"...దశా. ౫, ఆ. ౧౨౮. (తక్కువగు) "క...సంగ్రామమునన్...మృతిఁ బొందినశూరుఁడు, భూమీదాతకుఁ బ్రభావమునఁ గట్టుపడున్." భీమ. ౫, ఆ. ౬౬.

కట్టుపఱచు. ద్వ. స. క్రి. నిరోధించు. (చూ. కట్టువఱచు.)

కట్టుపాటు. ద్వ. వి. 1. కట్టుపడుట. (శ. ర.) 2. నిబంధనము. (శ. ర.)

కట్టుబండి. దే. వి. (కట్టు+బండి.) వస్తువులతోఁ గూడినబండి. "ఉ...నేఁడేపునఁ గట్టుబండి నిదె యందఱు చూడఁగ నింత చేసె..." వి. పు. ౭, ఆ. ౧౨౧., విక్ర. ౧, ఆ. ౭౬.

కట్టుబడి. దే. వి. బంటున కిచ్చెడుమాన్యము. "సీ. ఇరుగుకై జీతంపుటెక్కటీలకు గుజ్జువఱపుమామిడిఁ గట్టుబడిగఁ జేసి." చంద్రా. ౪, ఆ. ౮౪.

కట్టుమట్టు. దే. వి. 1. పసులసాల. "సీ. కట్టుమట్టున నుండి కదలించినఁ జెలంగు భీకరశుండాలబృంహితములు." విక్ర. ౪, ఆ. ౭౮; 2. ఉనికిపట్టు. "గీ...ఈమెట్టు మోక్షంబు కట్టుమట్టు." వరాహ. ౬, ఆ. ౮౭. 3. కట్టుపాటు, ఏర్పాటు. "వ...సుగ్రీవాజ్ఞ నడవం గట్టుమట్టు చేసి..." రామా. ౫, ఆ. ౩౨౫.

కట్టుమామిడి. దే. వి. (కట్టు+మామిడి.) 1. చిలుకలు మున్నగుపక్షులు కొఱుకకుండ పండ్లకు బుట్టలు కట్టినమామిడి. (శ. ర.) 2. అంటుమామిడి. (బ్రౌ.)

కట్టుమ్రాను. దే. వి. ఔ. తెప్ప, ప్లవము. (శ. ర. బ్రౌ.)

**కట్టువ.** దే. వి. 1. వెలుగు, వృత్తి, (కట్టవ అని వాడుక.) "సీ. ఆటవెప్పలు వ్రచ్చి పాటబం ధులు గూర్చి కట్టువ లన్నియు గాడుచేసి." అచ్చ. సుం. ౬౫; 2. ఒకవిధ మగుఉచ్చు. "గీ. జారకిరిపంక్తులకు మోటు సరసశశక, ములకుఁ గట్టువ..." హంస. ౨, ఆ. ౮౩.

**కట్టుపడు.** ద్వి. అ. క్రి. (కట్టు+పడు.) 1 బద్ధ మగు. "సీ...సత్యం బను కట్టునఁ దగఁ గట్టుపడ ..." హరి. ఉ. ౭, ఆ. ౩౦; 2. అడ్డుపెట్ట బడు. 'సీ...ఖచరులత్రోవలు గట్టుపడియె." ఉ. రా. ౧, ఆ. ౨౮౫., హర. ౫, ఆ. ౫; 3. తక్కువగు. (చూ. కట్టుపడు.)

**కట్టువర్గము.** మి వి. (కట్టు+వర్గము.) కట్నముగా నిచ్చువస్త్రముల మొత్తము. "ఉ....అవ్వనదేవ తాంగనల్, మచ్చికఁ గట్టువర్గము సమర్పణ చేసిరొ యంచుభూజనం, బచ్చెరువొదఁగా..." మల్హా. ౨, ఆ. ౨౪., చంద్రా. ౩, ఆ. ౫౦.

**కట్టువఱచు** = కట్టుపఱచు. "గీ. మీఁడిగాడ్పు శ్రీగాడ్పుతో మేళవించి, భానుకళిమార్గములు గట్టువఱచి..." పిన. శకుం. ౨, ఆ. ౧౧౩.

**కట్టువిడుపు.** దే. వి. (కట్టు+విడుపు.) మైలగుడ్డ, మాపు. సాం. ని. మాన. ౨౮.

**కట్టె** = కట్టియ. 1. పుడుక. "గీ. పూవు ముడిచిన పురవీథిభూమియందుఁ, గట్టె మోవంగ పలసిన కారణమున." భీమ. ౨, ఆ. ౧౦. 2. కఱ్ఱ; 3. బాణము. (చూ. కట్టియ.) విశే. కఠినము. ఉదా:—కట్టెబుద్ధి. (బ్రౌ.)

**కట్టెగుఱ్ఱము.** దే. వి. పిల్లలాడుకొను ఒకవిధ మగు ఆట. "సీ. కాలికంచంబును గట్టెగుఱ్ఱము..." హంస. ౩, ఆ. ౧౪౬.

**కట్టెడ.** దే. వి. కట్లపాము. (శ. ర.)

**కట్టెపండు.** దే. వి. (కట్టె+పండు.) గింజలు తీయని చింతపండు. (బ్రౌ.)

**కట్టెపాఁపర.** దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర. బ్రౌ.)

**కట్టెవిఱుపుమాట.** ద్వి. వి. (కట్టె+విఱుపు+మాట) పరుషవచనము, కఠినోక్తి. (శ. ర.)

**కట్నము.** దే. వి. 1. కట్టనము, కూర్పు. "సీ....జేజేల రాజాతికట్నంబు..." దశా. ౨, ఆ. ౨౮౧; 2. కుట్టిమము, నెలకట్టు. "సీ. పచ్చరాకట్నంబు పచ్చికపట్టని..." దశా. ౧.ఆ. ౨౭౨;3. కానుక. "ఆ. రాధ పెండ్లియాడ మాధవునకు దేవ, గట్నమిత్తు ననుచు గిరిశలక్ష్మి." శ్రీరాధా. ౪, ఆ. ౯౪; 4. నూతనవస్త్రము; వస్త్రము. "శా... కట్నంబులుల్ గానుకల్, మీసే ర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౨౦౮. "ద్వి....ఎట్టికట్నం బైన నిచ్చి మ్రొక్కుచును, నావస్త్రముల వార లనుగ వచ్చి నను, తేవన కంఠిచ్చులింగసంపదను." బస. ౪, ఆ. ౧౦౦. పు.

**కట్ఫలము.** సం. వి. అ. పుం. కేసరి.

**కట్వ.** వై. వి. (సం. ఖట్వా.) 1. ఖట్వ, ఒకానొక తీఁగ. (శ. ర.); 2. కట్లమంచము. ఆం. భా. ద్వి. ౨౦౧. (కట్లి అని శ. ర.)

**కట్లంక.** దే. వి. వగుసడ్డలపై నుంచెడు ఒంటిగుడ్డ. (శ. ర. బ్రౌ.)

**కట్లగుడియు.** ద్వి. వి. ఆ కఱ్ఱలపై సేషము. (శ. ర. బ్రౌ.)

**కట్లచెట్టు.** దే. వి. శింశుపవృక్షము. ఆం. భా. ద్వి. ౬౧.

**కట్లజెఱ్ఱి.** దే. వి. (కట్లు+జెఱ్ఱి.) కట్లుగలపెద్దజెఱ్ఱి. "గీ... పెద్దపలువన్నెకట్లజెఱ్ఱి, వైనడపెడుకాళ్లు గుం పనఁగ..." ఆము. ౪, ఆ. ౮౯.

**కట్లదండ.** దే. వి. (కట్టు+దండ) నడుమనడుమ బంగారుకట్లు గుచ్చిన నల్లపూసలదండ. "చ. గొనబగుముద్దుమోము సమగొన్న మెఱుంగుఁ గట్లదండయును." శుక. ౩, ఆ. ౧౦౫.

**కట్లపాము** = కట్టెడ. (బ్రౌ. వా.)

**కట్లపురుగు.** ద్వి. వి. (కట్ల+పురుగు) కట్లపాము. (శ. ర. బ్రౌ.)

**కట్లబల్ల.** ద్వి. వి. (కట్టు+బల్ల.) కత్తెరకాళ్లమడుపు బల్ల. (శ. ర. బ్రౌ)

**కట్లమంచము** = కట్వ. ఆం. భా. ద్వి. ౨౦౧.

**కట్లమారి.** దే. విశే. కట్లు గలది. "సీ. కిన్నెరకాయలు వన్నెవాసివియంచుఁ గట్లమారుల నుద్దిఁగట్టఁ దగు నె." చంద్రా. ౪,ఆ. ౧౨౭.

**కట్లసంచి.** దే. వి. (కట్టు+సంచి.) చుట్టు అఱ తేర్ప అఱచి కుట్టిననిడుపాటి గుండుసంచి. (శ. ర. బ్రౌ.)

**కట్లసరి** = కట్లదండ. "సీ...ఉద్దబుడగలు కట్లసరులు." హంస. ౪, ఆ. ౧౩౮.

**కట్లియ** = కట్లె. (శ. ర.)

కట్లె. దే. వి. (క. కట్లె.) బంగారు మొ. తూచుట కుపయోగించుగింజ మొ. ఆం. భా. ద్వి. ౩౦౦., కవిక. 3, ఆ. ౧౯౩.

కట్లెసంచి. దే. వి. కట్లెలసంచి. "చ. కమటము కట్లెసంచి యొరగల్లును..." హంస. ౨, ఆ.౧౦౭.

కట్వంగము. సం. వి. అ. పుం. దుండిగము, శ్యోనాకము.

కఠమర్దనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

కఠము. సం. వి. అ. పుం. 1. యజుర్వేదము దవి ఒకానొకభాగము; 2. ఒకానొక యుపనిషత్తు.

కఠారము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. బాఁకు. వీర. ౪. ఆ. ౫౬.

కఠింజరము. సం. వి. అ. పుం. 1. తులసి. 2. నల్లగగ్గెర.

కఠిన. సం. వి. ఆ. స్త్రీ. 1. వంటపాత్ర. 2. పటికబెల్లము.

కఠినము. సం. వి. అ. న. వంటపాత్ర. విశే. (అ. ఆ. అ.) 1. గట్టిది; 2. క్రూరము; 3. పరుషము; 4. బాధించునది; కొయ్యవాఱినది.

కఠినహాసము. సం. వి. అ. పుం. పటికినవ్వు. కాశీ. ౬, ఆ. ౨౯.

కఠిని. సం. వి. ఈ. స్త్రీ. బలపము మొ.

కఠిల్లకము. సం = కటిల్లకము.

కఠిల్లు = కఠీలు. "వ...కఠిల్లు పెల్లునునం బోరు కారుపోతుల..." స్వా. ౪, ఆ. ౩౭.

కఠీలు. దే. వి. కఠినపదార్థముల సంఘర్షణము లేక తుపాకిమొ. వాని ప్రేలుడుమొ వానిధ్వని కను కరణము. ప్రబంధ. ౭౦౭.

కఠేరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కష్టజీవి.

కఠోరము. సం. విశే (అ. ఆ. అ) 1. కఠినము; 2 క్రూరము; 3. తీక్ష్ణము; 4. పరిపక్వము; 5. పరిపూర్ణము.

కఠోలము. సం. = కఠోరము.

కడ. వై. వి. (సం. కాష్ఠా. క. కడె. త. కడై.) 1. దిశ. "గీ. దిక్కురాయఁడు తమిమీఱ రే వెలందిఁ బెండ్లి యగు నని కడ యను పేరటాలు." అచ్చ అయో. ౧౨; 2. గతి (చూ. కడచెను.); 3 అంతము. "సీ. పాండుతనూజులు...కడ లేని యొఱుకఁ దనరు, చున్న..." భార. ఆది. 3, ఆ. ౧౨; 4. చోటు. "ఆ...అరుగు మొందుక డకు." భార. ఆది. ౪, ఆ. ౨౭; 5. వైపు. "క...ఇరుగడలం, దల నిడి తూఁగఁగ..." భార. ఆది. 3, ఆ. ౧౪౯; 6. దూరము. "క. కడనుండి పెను, మాటలు, నుడువంగా వచ్చు..." సెలా. ౨, ఆ. ౧౧౧; 7. తీరము. "సీ... నావఁ గడఁ జేర్పు ప్రాపకుఁ గడపు జేయు." పారి. పీఠి. ౨౪; 8. దగ్గఱ. "క...వివేకకళాన్వులు, కడ నుండెఁ గంటె మిగులఁ గష్టము కలదే." ఆము 3, ఆ. (శ. ర.); 9. చావు. (చూ. కడకాలము.) 10. వేళ. "గీ. దివమునను సంజకడ యంచు దివ్వె లెత్తు." శుక. ౨, ఆ. ౫౬౧; 12. ఇది ద్రుతాంతముగ నుండి 'అంను, వలన' మున్నగునర్థముల నిచ్చును. "క. చెడు తెరు వాఁకౌరవ్యులకడ నిలుచునాగాక..." భార. ఉద్యో. 3, ఆ. ౯౧. "సీ...ఎవ్వనికడ నుదయించె జగము." హరి. ఉ. ౫, ఆ. ౧౦౭. విశే. 1. అంత్యము, చిట్టచివరది. "వ...ఎయ్యది కడగా నిమ్ములమ్ముగ సగుదు..." భార శాం. ౧, ఆ. ౨౦౧; 2. అన్యము, ఇతరము. ఆం. భా. త్ప. ౨౪.

కడంగము. సం. వి. అ. పుం. ఒకవిధ మగుకట్ల.

కడంగరీయము. సం. విశే. (అ. ఆ. అ.) మాష ముద్గాదికాష్ఠమును తినునది. (ఆపుమొ)

కడంబము. సం. వి. అ. పుం. 1. కూరకాఁడ. 2. కొన.

కడఁక. దే. వి. 1. యత్నము, పూనిక. "ఉ...వరాహము కడంక నదల్చిన మయ్యె నయ్యెడన్." నిర్వ. 3, ఆ. ౭౬., భార. ఆర. ౫, ఆ ౪౨౬; 2. ధైర్యము; స్థైర్యము. "క. కడిమిగలబహుశౌర్యా కల్పఁ గని యమ్మహారథు లనల్పక్రోధులయి తాఁకి రార్చి కడఁకన్." భార. ఆది. ౨, ౯౪; 3. పొగరు. "ఉ. సుక్కుక భూమిభృత్కులవిరోధికడంక నడంచి..." రాఘవ. ౨, ఆ. ౧౧౧; 4. శక్తి, పాటవము. "అ...ఇంద్రియములకడక దక్కె." భార. విరా. ౫, ఆ. ౧౧౩; 5. విధము, రీతి. "శా...వెన్నెల పిండి చల్లినకడంకన్..." య. ౫, ఆ. ౧౦౯; 6. తలఁపు. "క...ఉర్వీశుల మద్రువఁగ నుల్కు,

పాతం బనుకడఁకఁ దక్షభాసదు లఁలుకన్." కు. సం. ౨, ఆ. ౧౪౯; 7. ధైర్యము. "ఉ. కావఁగ దిక్కులేమిఁ గడఁకన్ మెఱవెట్టఁ దొడంగె వేద ముల్. దశా. ౧, అ. ౨౭౫; 8. ఉత్సాహము. "ఉ. శ్రీకలకంఠకంఠ గతుం ధరిత్రియు దక్షిణ వామభాగముల్, గైకొని కొల్వ వారిఁ గడఁ కన్ గడకన్నులకాంతిఁ జేర్చి..." విజ. పీఠి. ౨.

కడఁగించు. దే. స. క్రి. (కడఁగుధా. ప్రే.) ప్రోత్స హించు. "క...పాండవ, సమితిం గడఁగించువా రచట నెవ్వరొకో." భార. ఉద్యో. ౫ ఆ. ౨౪౨.

కడఁగు. దే. అ. క్రి. 1. యత్నించు. "క...ఎదురు సనఁ, గడఁగుచు..." భార. విరా. ౪. ఆ. ౧౧౪. 2. సాహసించు "క.. కురునాథుఁ డెట్లు కడ గెనో యనికిన్." భాగ. భీష్మ. ౨, ఆ. ౪౦౬. ద్రో. ౨. ఆ. ౧౪౨; 3. నిలుచు. "గీ. అగ్ర లించి నాయెదురఁ బొ హాస్యలించి. కడఁగఁ జాలె దుమల్లులఁ గాన నెందు." భార. విరా. ౪, ఆ. ౭; 4. కవియు. "క...మగధవిభుఁడు...కడ గె శార్ఙ్గధరుపై నొకఁడున్." హరి. ఉ. ౧, ఆ. ౧౧౨; 5. అతిశయిల్లు. (వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.) భార. ఆర. ౪.ఆ. ౨౮౮; 6. ఆరంభించు. "క...అమృతాబ్ధిన్ మథింపఁ గడఁగిరి..." భార. ఆర. ౪, ఆ. ౨౮౮.

కడఁజేము = కణజము. (గాదె.) "సీ. ఈగిచే యాగినఁ బ్రోగైనపంటచే జగము లన్నియుఁ గడఁజాలు గావె." కుశ. ౧, ఆ. ౧౨౯.

కడజే. దే. వి. గోకర్ణమృగము, ఒకజాతిదుప్పి. ఆం. భా. ద్వి. ౮౫.

కడఁత. దే. వి. కన్నులచివరి ప్రక్క, శిరస్సుయొక్క పార్శ్వము. ఆం. భా. ద్వి. ౧౪౪.

కడఁతి. దే. వి. గంధర్వమృగము. ఆం. భా. ద్వి. ౮౫. కాళ. 3. ఆ. ౪౮.

కడఁబడు. ద్వ. అ. క్రి. (కడము+పడు.) 1. తప్పి పగు. "క...వారలగౌరవము కడంబడియె నొకో." వేం. పంచ. ౧, ఆ. ౧౭౬. (శ. ర. పా.) 2. పడిపోవు. "క. పడగలఁ గలరత్నం బులు, గడఁబడ..." దశా. ౯, అ. ౧౮3.

కడకట్టు. ద్వ. స. క్రి. (కడ+కట్టు.) కడగట్టు. అ. క్రి. విలసిల్లు, ఒప్పు. "సీ. కాంచనకుంభసం గతశృంగములు గలమేడలు గడకట్టు మేరు వనఁగ." ద్వా. ౧, ఆ. ౬౭. వి. ఏర్పాటు. "వ...మునుముట్ట మాయవెట్టం గడకట్టు చేసి కొని..." విక్ర. ౮. ఆ. ౬౧.

కడకడ. వై. వి. (కడ+కడ.) ఈశాన్యదిశ. "క. కడకడయొడయని..." అచ్చ. బాల. ౯౭.

కడకడలి. ద్వ. వి. (కడ+కడలి.) పశ్చిమ సముద్రము. "క. కడకడలి నేఁడె వెలుఁగను, జడ దారి వడిన్ మునుంగ..." యయా. ౨, ఆ. ౬౯.

కడకన్ను. ద్వ. వి. ఔ. (కడ+కన్ను.) 1. కంటి చివర. "క...నరుకడకన్నరుణం బగుటయు... భార. భీష్మ. ౨, ఆ. 3౦౫; 2. కన్ను; కడ కంటిచూపు. "సీ. రతిదేవి నెవ్వగురారాపుఁ జన్నులు గడకన్నులకు నింపు గడలుకొలుప." నైష. ౭, ఆ. ౪౧.

కడకాలము. మి. వి. (కడ+కాలము.) తుదివేళ, మరణకాలము. "ఉ. త్యాగము భోగముల్ సలిపి దైవగతిం గడకాలమైన..." ద్వా. ౯, ఆ. ౯౮.

కడకాలు. ద్వ. వి. (కడ+కాలు.) పాదము; పాదము చివర. "ఉ...దేవకికన్నయారువ్వరన్... కడ కాళులు పట్టి వ్రేసి యాసురముగఁ జంపెఁ గంసుఁడు..." హరి. పూ. ౫, ఆ. ౧౦౬. "క. కడకా లొక త్రాచుపాము కడకం గఱచెన్." వేం. పంచ. ౧, ఆ. ౧౧౬.

కడకాల్ద్రోచు. ద్వ. స. క్రి. (కడకాల్తన్+త్రోచు.) తన్ను; నిరసించు. "ఉ...అయో మకనిం గడకాల్ద్రోచి నేఁ, డీవసుధేశునిం గలయ నెంచితి వెట్లు..." శుక. ౧, ఆ. ౧౫౪.

కడకుఁబోవు. ద్వ. అ. క్రి. (కడకున్+పోవు.) ముట్టగు. దశా. ౬, అ. ౫3. ఇట్లే: కడకేఁగు. సాం. ని. మాన. ౭౮.

కడకొంగు. ద్వ. వి. (కడ+కొంగు.) కొంగుచివర. "సీ. కట్టినపులితోలు కడకొంగు సోఁకి యాఁబో తుతత్తడి చిఱ్ఱుబుఱ్ఱుమనఁగ." హర. ౫, ఆ. ౧౬.

కడకొత్తు. ద్వ. స. క్రి. (కడకు+ఒత్తు.) చివరకు నెట్టు; నిరసించు. "చ...నెన్నడ కడకొత్తు హంసమిథునమ్ముల..." చంద్రా. ౪, ఆ. ౧౪3.

కడకొఱవి. ద్వ. వి. (కడ+కొఱవి.) 1. కాలఁగా మిగిలినకట్టె. "ద్వి...కాలి, కొంతచిక్కినకడ

గొఱవులు దెచ్చి." ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౫౬ పం; 2. కాలఁగా మిగిలి పొగయుకట్టై. "క. జ్ఞాతులు...నీలిం బాసినవిగతవి, భూతిం గడగొఱవు లట్లపొగయుదు రథిపా." భార. ఉద్యో. ౨, ఆ. ౨౭౫.

కడగగ్గమారి. గే. విశే. కష్టశీలుఁడు. (శ. ర. 'తొందరమనిషి' అని బ్రా.)

కడగండ్లు. దే. వి. బ. విపత్తు, ఇక్కట్టు. "క...వెత కష్టి మూఁగడ, కడగండ్లఁ జను విపత్తు..." ఆం. సం. మాన. ౫౯. "సీ. తలఁగనికడగండ్లఁ దగిలి..." అచ్చ. అయో. ౯౩.

కడగట్టు. = కడకట్టు. 1. నిర్ణయించు. "క. మును మున్న కాదె యాఖ్యలు...కడగట్టినవా రీతని యీదృశభావచేష్టితము లఖిలములున్." హరి. పూ. ౮, ఆ. ౧౩౮; 2. నియమించు. "చ... ఇట్టికోమలి లతాతరుసేవనమాచరింపఁగాఁ, గరుణ యొకింత లేక కడగట్టె మునీంద్రుఁడు..." పిన. శకుం. ౨. ఆ. ౬౨. వి. 1. కడకట్టు; 2. చక్రవాళపర్వతము. "గీ. తావిగుబ్బలికడగట్టు తావు లందు." ప్రబంధ. ౧౬౦.

కడగను. = కడముట్టు. (బ్రా. వా.)

కడగిట్టు. ద్వ. స. క్రి. (కడ+గిట్టు.) డాయు, దగ్గఱు. వేంక. మాన. ౭౩.

కడగొట్టు. ద్వ. అ. క్రి. (కడ+గొట్టు.) నశించు, చచ్చు. "మ...గిట్టెం బులుల్ సింగముల్, కడగొట్టెన్..." సా ౧, ఆ. ౧౦౭. విశే. 1. చిన్నది, చివరది. "చ...అంచఱను౯ గడగొట్టచెల్లెలై..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౬౮౫; 2. కడసారివాఁడు. "క. తల్లికిఁ గడగొట్టుకొడుకు దాఁ బ్రియ మగుటన్." ద్వా. ౧, ఆ. ౨౮.

కడగొట్టువాఁడు. దే. విశే. (కడగొట్టు+వాఁడు.) కనిష్ఠుఁడు; కనిష్ఠసోదరుఁడు. ఉ. రా. ౭, ఆ. ౩౨౧.

కడగోరు. ద్వ. వి. (కడ+గోరు.) కొనగోరు, నఖాగ్రము. "ద్వి. కాటుకకన్నీరు కడగోర దిద్ది." పప. ౫, ఆ.

కడచను. ద్వ.అ. క్రి. (కడ+చను.) 1. చచ్చు. "సీ ...సపల, సంశప్తసంఘ గడచనితె..." భార. శల్య. ౧, ఆ. ౯; 2. నశించు. "ఆ...శక్తి యొల్లను గడచన్న..." భార. అను. ౧, ఆ. ౯౯; 3. సాంతమగు. "క. కడఁగినహయమేధమఖము గడచనమికి..." భార. అర. 3, ఆ. ౬౮; 4. గతించు, కడచు. "వ...కడచినదానికి శోకం బేల..." భా. రా. యు. ౯౭౧. భార. శల్య. ౧, ఆ. ౧౦౯; 5. అపార మగు. "సీ. గోత్రాచలము లెత్తుకొని వచ్చి కడచన్నరత్నాకరముఁ గట్టె రాఘవుండు." కు. సం. ౧, ఆ. ౫౨; 6. ఫలించు. "క. పూనిక కడచన విష్వక్సేనప్రార్థనము చేసి..." విప్ర. ౨, ఆ. ౧౯. స. క్రి. దాటు. "క. వననిధి నవలీలం, గడచనువాని..." భా. రా. కిష్కిం, ౭౬౬.



కడచు. దే. అ. క్రి. 1. గతించు, జరగు. "ఉ... వత్సరంబునుక్, జేరువ చేరువం గడచె..." భార. విరా. 3, ఆ. ౧౦౬. 2. చచ్చు. "గీ. కడచినప్పుడు క్రిములొండెఁ గాను లొండెఁ, గుక్క లొండేనియును భుక్తి గొనెడుదేహ, మొకఁడు ప్రార్థించి యడిగిన నొసఁగ వలదె." కాశీ. ౬, ఆ. ౮౭; 3. నశించు. "గీ. కడచె ధైర్యంబు..."శివరా. 3,ఆ. 3; 4. మితిమీఱు. "క...కడచఁగ నెగ్గుల్, నొడివెడువివేకశూన్యుల, కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే." భార. ఆది. 3, ఆ. ౧౮౯; 5. కడముట్టు. "క. పడవం గడచినవాఁ, డీపడు చనుచున్..." విక్ర. ౧, ఆ. ౨౦; 6. కాలముపుచ్చు. "క...మానవతుల లోన మిగులమానవతివినై, యీనాఁటికిఁ గడచితి..." శుక. ౧, ఆ. ౧౩౧; 7. మించు. "క. వడి గల్గి హంసగతికిం, గడవఁ బఱచువారు..." భో. ౫, ఆ. ౨౮. స. క్రి. 1. దాఁటు "గీ. ఘనులు గంగాతరంగిణిఁ గడచి..." రామ. ౫, ఆ. ౨౮; 2. జవదాఁటు. "శా...కోదండ్రు మీవాక్యముల్, గడవంజాలక యుందురా..." భాగ. ౧, స్కం. ౨౬౭; 3. అతిక్రమించు. "గీ. కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి." పారి. ౧, ఆ. ౧౦౫; 4. తప్పించుకొను. "గీ... కర్మఫలంబు లవశ్యభుక్తి, కారణంబులుగా కెందుఁ గడవ వశమె." వి. పు. ౧, ఆ. ౨౧; 5. మించు. "చ. కొఱవులవేఁడిమిం గడచుఘోరపుఁ బల్కులు..." భా. రా. యు. ౭౨౭.

**కడచుక్క.** వై. వి. (కడ+చుక్క.) తుదినక్షత్రము; రేవతి. (శ. ర.)

**కడచెడు.** ద్వ. అ. క్రి. (కడ+చెడు.) దిక్కుమాలు. "క. విని కినిసి కపిలదేవుఁడు, ఘనహుంకృతి సేసె నంతఁ గడచెడి వారు మునికోపభస్మ సాత్కృత, తనులై పడిరి..." జాహ్నవీ. ౨, ఆ. ౧౨.

**కడచేయు.** ద్వ. స. క్రి. (కడ+చేయు.) విడిచిపెట్టు. "ద్వి. కావున నానలఁ గడచేసి మరల, దేవలోకమున కేతెంచితిమి..." ద్వి. నల. ౨, ఆ. ౬౨౯.

**కడచేరుచు.** ద్వ. స. క్రి. (కడ+చేరుచు.) ధ్వ్యంసిచేయు. "క...నుముఁ,గడచేరుపఁ దగు..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౫౫. రూ. కడచేర్చు.

**కడజాతి.** ద్వ. వి. (కడ+జాతి.) చండాలకులము. "ఉ. ఈకడజాతినాతి కిహిహీ మహిదేవుఁడు చిక్కె..." పాండు. 3, ఆ. ౯౪.

**కడతల.** వై. వి. (కడ+తల) తుదిచోటు. "వ... కరినగరంబుకడతల హాలాగ్రంబును జొనిపి..." భాగ. ౧౦. స్కం. ఉ. ౫౭౭.

**కడతెంచు.** దే. స. క్రి. (కడ+తెంచు.) కడచు, దాటు. "ద్వి...యమున మార్గంబు, విడిచినఁ గడతెంచి వేవేగ గొల్ల, విడిపట్టు పడు..." అ. మ. క. ౨౨. పు.

**కడతెగు.** ద్వ. అ. క్రి. (కడ+తెగు.) అంతు కలుగు. "క. ఉడుమండలంబుదాఁకను, వడి నేఁగితిఁ గోట దాఁటవచ్చునొ యంచుం, గడతెగక యంతకంతకుఁ, బొడవయ్యెను నాకు దాఁటి పోరా దయ్యెన్." మైరా. ౨, ఆ. ౧౧.

**కడతేర్చు.** ద్వ. స. క్రి. (కడతేఱు ధా. ప్రే.) 1. చంపు. "క...దానవు...కడతేర్చుటయిఁక న్..." శై. ౫, ఆ. ౧౪౬; 2. నశింపఁజేయు. "గీ. వారియఘములు గడతేర్చి..." ఉ. రా. ౪, ఆ. ౨౭. 3. కొనసాగించు. "సీ. తొడఁగిన పని చలం బెడపక యతిదుష్కరం బైనఁ గడతేర్చు ప్రభువులార." భార. విరా. 3, ఆ. ౨౧; 4. రక్షించు. "చ...నాయలఁత యార్చుము నన్ గడతేర్చు మెమ్మెయిన్." భార. ఉద్యో. 3, ఆ. ౨౧౧.

**కడతేఱు.** ద్వ. అ. క్రి. (కడ+తేఱు.) 1. చచ్చు. "సీ. శార్దూలముఖుఁ డీల్గె...దీర్ఘజిహ్వుఁడు కడతేఱి పోయె." అచ్చ. సుం. ౧౨3; 2. నశించు. "గీ...వారిదేహంబులు...తుదిఁ గడతేఱు..." కాశీ. ౬, ఆ. ౭౬; 3. పోవు. "ఉ... విరహజ్వరంబు కడతేఱునె యీ చలిమందులందు.." భో. 3, ఆ. ౨౯౯; 4. తుదముట్టు. "ఉ...కడతేఱు మదీయవాంఛ..." భార. విరా. 3,ఆ. ౬౨; 5. బాగుపడు. "చ. వలపున స్త్రీలబుద్ధి వినువారొకరేఁ గడతేఱిరెట్టివారలు గలరా..." శు. 3 ఆ. ౬౬; 6. బ్రతుకు, జీవించు. "ఉ...కడతేఱు...నె యింక వారలన్, మిక్కిలి శక్తిమీఱు ...మ్రింగెద..." దశా. ౨, అ 3౭౨; 7. కృతార్థమగు. ఆం. భా. త్రి. ౯౪; 8. మూడు. "సీ... పూర్ణచంద్రుండు మలినుఁడై కానవచ్చిన నాఁటిపు సంవత్సరమునఁ గడతేఱు..." భార. శాం. ౬, ఆ. ౧౨౬. (శ. ర. పా. 'కడచను' పాఠాం.)

**కడతేఱుచు** = కడతేర్చు. (చూ. కడతేర్చు.)

**కడదనరుచుక్క** =కడచుక్క. వేంక. దేవ. ౨౧.

**కడదెస.** వై. వి. (కడ+దెస.) తుదిదిక్కు, ఈశాన్యదిశ. (చూ. కడకడ.)

**కడదెసకాఁపరి.** ద్వ. వి. (కడదెస+కాఁపరి.) ఈశానుఁడు. వేంక. దేవ. ౧౭.

**కడనుంచు.** ద్వ. స. క్రి. (కడన్+ఉంచు.) గెంటివేయు. "సీ. పంకజాతాసనప్రతిపత్తి కడనుంచి మృగరాజపీఠిపై మెల్ల టించి." కళ. ౧, ఆ. ౧3.

**కడప.** యు. దే. వి. దేహళి. "గీ. కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁద." కాశీ. ౨, ఆ. ౭౫. "చ. పిడుగుల కల్కి లోఁ దొలిచి భీరులు కంచముఁ జల్లుదీధితుల్, కడపల వెల్లి రా..." ఆము. ౪ ఆ. ౧౭౦. వై. (సం. కదంబః.) కడిమిచె. ఆం. భా. ద్వి. ౪౬.

**కడపటికొండ.** ద్వ. వి. (కడపల+కొండ.) చక్రవాళపర్వతము. "చ. నడుఁగక బాల్యచాపలమునన్ దన పిమ్మటిప్రేలఁ జొక్కుపుల్, గడియపుటట్టటంచుఁ ద్రిజగజ్జను లచ్చెరుపంది చూడ నక్కడపటిసొంపు లెఱుఁగం దవిలించి నటించు శూలిపె,

న్గొడుకు..."వేం. పంచ. ౧, ఆ. ౨. ఇట్టే. కడపటిమల. ఆం. సం. స్థా. ౧.

కడపని. దే. వి. (కడను+పని.) వేఱొకపని. "సీ. దుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని కడపని గృహసూతకంబునందు." కాశీ. ౨, ఆ. ౧౪౦.

కడపల. వై. వి. ఔ. అంతము, చివర. "చ. కడపల లేనికేళితమకంబున..."నిర్వ. ౯, ఆ. ౨౩. భాగ. ౭. స్కం. ౧౦౯. "గీ...దెసలకడపల్లఁ బొడమి..."హరి. పూ. ౬, ఆ. ౧౬౩. విశే. చివరిది. "క. కడపటిభూములు..."హరి. ఉ. ౯. ఆ.౪౦.

కడపలచేరు. స్వ. అ. క్రి. (కడపల+చేరు.) అంతమందు, నశించు. "సీ. చాతకంబులపిపాసలు కడపలచేరెఁ గాంతారవహ్నులగర్వ మడఁగె." భాగ. ౧౦. స్కం. పూ. ౨౫౩.

కడపిపుచ్చు. దే. స. క్రి. (కడపి+పుచ్చు.) 1. ముందుకు పోఁ జేయు. "వ...సార్థవాహులం గడపిపుచ్చి..." కాశీ. ౪, ఆ. ౬౪; 2. ఉపేక్షించు. "గీ. శరణుచొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడపిపుచ్చిన నూర్ధ్వలోకములు దప్పు." భార.ఉద్యో. ౧, ఆ. ౧౬౧. కు. సం. ౭, ఆ. ౭౧౫; 3. కాలయాపన చేయు. "ఆ...సిద్ధసుతుని సిద్ధుని కీక యేఁ, గలయ నన్యు ననుచుఁ గడపిపుచ్చె." కళా. ౫, ఆ. ౧౭౧; 4. పంపిపుచ్చు. "వ. అంత నావాగ్దేవి యావిధంబున నొంపిదినకళామర్మభేదనసామ్రాజ్యసంపదనుభవావస్థ మానలాఘవశంక నప్రకాశముగాఁ గడపిపుచ్చుటకు నుపాయంబుఁ జింతించి." కళా ౫, ఆ. ౧౭.

కడపు. దే. స. క్రి. 1. చంపు. "సీ. ప్రక్క నిద్రితుఁ డైనరాకొమారునిఁ జేరి బిగియారఁ గుత్తుక పిసికి కడపు." హరిశ్చ. ౫, ఆ. ౧౧౭. (శ. ర. పా. 'కెడపి' ముద్రి.;) 2. పడఁగొట్టు. "ద్వి. మద్దులఁ గడపినమహితశౌర్యుండు." ద్వి. భాగ. ౩. స్కం. 3. పోఁగొట్టు. "గీ. కడిఁది యుత్పాత మది నీవు గడపవలయు." కాశీ. ౭. ఆ. ౬౯; 4. ఎక్కించు "చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహాశిలఁ గొండమీఁదికిం, గడపఁగ భార మచ్చటిది గ్రక్కున భూమికి డిగ్గఁద్రోవఁగాఁ, గడుసులభంబు..." సా. పంచ. ౧, ఆ. ౧౦౭. 5. జవదాఁటు. "ద్వి. గాధేయమునిమాట గడపక..." రం. రా. బాల. ౭౩. పు. 6. పొమ్మను. "క. అడిగినయప్పుడెఁ జెప్పెరఁ,గడపినఁ బోనవ్వ నేను..." భార. ఆర. ౫, ఆ. ౧౩; 7. దాఁటించు. "గీ. కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి." పారి. ౪, ఆ. ౪౯; 8. నడపు; త్రోలు. "క... అయ్యమున నోడఁ గడపుచు నుండెన్." భార. ఆది. ౩. ఆ. ౩౪. "క...సుభద్ర రథము గడపఁగ..." భార. ఆది. ౯, ఆ. ౭౧౭; 9. జరుగునట్లు చేయు. "గీ. కడపితే రాత్రి..." భార. శాం. ౭, ఆ. ౪; 10. (చంపక) విడుచు "చ...నీ, యనుజుల నల్వురం గడపు మర్జును నేఁతకు సమ్మతించితిన్." భార. ఉద్యో. ౪, ఆ. ౬౦.

కడపుఁజేయు. దే. వి. (కడపు+చేయు.) అతిక్రమము తెద్దు. "సీ. వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పులనావఁ గడఁజేర్చుప్రాఁకుడుఁగడపుఁజేయు." పారి. పీఠి. ౭౪. (ప్రాఁకుఁడుఁగడపుఁజేయి = చుక్కాను.)

కడబట్టు. దే. అ. క్రి. మూర్ఛిల్లు. వెంక. మాన. ౬౯. సాం. ని. మాన. ౪౭.

కడమ. దే. వి. 1. కొఱఁత, లోపము. "గీ. నీరరుహసూతిశేషాంగనిర్మితికిని, దగినయది లేక కనకపత్త్రమున నిచటఁ,గడమ కల దనువ్రాయంలేఖయుంను లిపియు, మధ్యమును నాఁటు నయ్యోసమ్మానవతికి." పిన. శకుం. ౭, ఆ. ౧౭౬; 2. శేషము; మిగులు. "క. మొదలనె నాకుం గలిగిన,యది శంఖసుదర్శనాంకనాదిసహితమై, పొదలెడి ప్రపత్తి యిఁక నడ,పెదఁ గడమయు..." పరమ. ౪, ఆ. ౧౪౦. "శా...నుయిదాఁటే వానికిన్ జింతయా, కంతైనం గడ మేనియుం గడమ కాదా..." పాండు. ౪, ఆ. ౧౭౫; 3. అంతము, కడపల. "గీ...నాపాపమునకుఁ, గడమ లేదంచుఁ జాఁగిలఁబడియెఁ గుంభి." భో. ౫, ఆ. ౩౧౯. విశే. 1. లోటు గలది, కొఱఁత పడినది. "మ. కడమల్ గావుగదా భవన్నిలయముల్ గళ్యాణయుక్తంబులే" భాగ. ౧. స్కం. ౭౬౭; 2. శేషించినది. "క. కడమకథ

సుడువు మనినన్." శుక. ౧, ఆ. ౬౧౮; 3. అన్యము, ఇతరము. ఆం. భా. తృ. ౫౪.

కడమపడు. ద్వ. అ. క్రి. (కడమ+పడు.) 1. లోపించు. "వ. ఒక్కొక్కట్రాడు పుట్టిన నది రెండంగు ళంబులు కడమపడియె..." భాగ. ౧౦. స్కం. పూ. ౩౭౪, 2. మిగులు. "గీ. కదిసి రక్ష్యముల్ వేయింటికి గడమపడక,యుండఁ జించి..." హరి. ఉ. ౭, ఆ. ౨౧౮; 3. పూర్తి కాకుండు. "వ. చెఱువు కడమపడియె..." ఆము. ౪, ఆ. ౫౩.

కడమపఱుచు. ద్వ. స. క్రి. (కడమపడు. ధా. ప్రే.) లోపింపఁజేయు. "క. ఏవెంటఁ గడమ పఱుపక, దేవా మము సంతరించితివి..." వేం. పంచ. ౧, ఆ. ౫౬.

కడమపెట్టు. దే. స. క్రి. (కడమ+పెట్టు.) కొంత కొంత దాఁచు; కప్పిపుచ్చు. "గీ...ఆపత్రికా ప్రకార మేమియుం నీవింకఁ గడమపెట్ట, కంత యును నాకు నెఱిఁగింపు..." ప్రభా. 3, ఆ. ౧౪౭. ప్రబోధ. ౫, ఆ. ౪.

కడమవడు = కడమపడు. 1. లోపించు. "గీ. కడ మపడఁ బల్కుపల్కు లాకస్మికముగ. కవిక. ౪, ఆ. ౧౬౩; 2. మిగులు. "గీ. అట్లు జైనుల వధి యించి యచటఁ గడమ, వడినవసతులు వడిఁ ద్రోచి...",కేయూర. ౨, ఆ. ౧౦౫.

కడమంత = కడవమంత. (శ. ర.)

కడముట్టఁబడు. ద్వ. అ. క్రి. కడముట్టు, దరిచేరు. "గీ. సమధికం బైనసంసారజలధియందు, మునుఁ గుచును దేలుచును గడముట్టఁబడని, జనుల కెల్లను..." భీమ. ౫, ఆ. ౧౭౦.

కడముట్టు. ద్వ. అ. క్రి. (కడ+ముట్టు.) 1. ముగియు. "సీ...కెంపులహజారము కడముట్టె నొక్కొ." కళా. 3. ఆ. ౧౩౦, 2. నిశ్శేష మగు. "గీ. శత్రువు బుఱంబుఁ జిచ్చునె చ్చురిక తోడ,గడమపెట్టక కడముట్ట నడఁపవలయు." ప్రబోధ. ౫, ఆ. ౪. 3. దరిచేరు. (చూ. కడ ముట్టఁబడు.) 4. శాంతి గను. ఆం. శే. ౪౦.

కడయిల్లు. దే. వి. (కడ+యిల్లు.) పరలోకము స్వర్గము. (ద్వి. భాగ. బ్రౌ.)

కడయేనుఁగు. వై. వి. (కడ+ఏనుఁగు.) దిగ్గజము. అచ్చ. బాల. ౩౮.

కడయేలిక. ద్వ. వి. (కడ+ఏలిక.) దిక్పాలకుఁడు. అచ్చ. అర. ౫౮.

కడయొత్తు. ద్వ. వి. (కడ+ఒత్తు) గృహావశేషము యొక్క చుట్టుగోడలయందలి స్తంభమూలమీఁది దూలము. (శ. ర.)

కడచెప్పు. ద్వ. వి. (కడ+చెప్పు.) చెప్పుతుద. "సీ. కడచెప్పు లొరయంగఁ గనుఁదమ్ము లరమోడ్చి ..." నైష. ౫, ఆ. ౯.

కడలి. దే. వి. (కడలు+ఇ. క. కడల్.) సముద్రము. "గీ. కపటమత్స్యాంబవై నీవు కడలినడుమ." నైష. ౮, ఆ. ౧౨౦; ఆం. సం. స్థా. ౧౯.

కడలికూఁతురు. దే. వి. (కడలి+కూఁతురు.) లక్ష్మి. ఆం. సం. దేవ. ౧౦.

కడలిమీఁగడముద్ద = కడలివెన్న. వేంక. దేవ. ౧౩.

కడలిరాయఁడు. ద్వ. వి. (కడలి+రాయఁడు.) 1. పాలసముద్రము. "సీ...కడలిరాయలలోఁతు గన్న గబ్బి." స్వా.౫, ఆ. ౪౭; 2. వరుణుఁడు. ఉ. రా. ౧, ఆ. ౩౧౬.

కడలిఱేఁడు. దే. వి. కడలిరాయఁడు. (వ్యా.)

కడలివెన్న. దే. వి. శశి, చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౫.

కడలివెలఁదుక. దే. వి. (కడలి+వెలఁదుక.) సము ద్రునిభార్య, గంగ. ఆం. సం. దేవ. ౩౩.

కడలు. దే. వి. (బ. కడళ్లు. కడళులు.) అల. "సీ. తూలెడుపయ్యెద దుఃఖాంబునిధిలోనఁ గడలు చందంబునఁ గడలుకొనఁగ." హరి. పూ. ౯, ఆ. ౧౪౪. నిర్వ. ౬, ఆ. ౧౩౪. హరి. పూ. ౭, ఆ. ౧౬౩.

కడలుకొను. దే. అ. క్రి. (కడలు+కొను.) 1. అతిశ యించు. "క...ప్రీతి కడలుకొనంగన్." భార. విరా. ౫, ఆ. ౩౮౮; 2. తొణఁకు; పొంగు. "ఆ...కథ వినంగ నాకుఁ గౌతుకంబు, మనము నిండి కడలుకొనుచున్నది..." భార. ఉద్యో. 3, ఆ. ౪౧౨; 3. కలుగు. "గీ...నిద్ర రేపు మాపు, మానియుండిన..., కన్నుఁగవయందు నరుణిమ గడలుకొనును." దశా. ౨, అ. ౧౩౮; 4. ప్రవహించు. "క...కనుఁగవఁ గడు నశ్రు

వెలి గడలుకొనంగన్." భాగ. విరా. ౪, ఆ. ౧౫౭.

కడలుకొలుపు. దే. స. క్రి. (కడలుకొను ధా. ప్రే.) కలిగించు. "సీ. రతిదేవి సెప్పంగు గారాపు జన్నులు గడకన్నులకు నిండు గడలుకొలుప." నైష. ౨, ఆ. ౪౧.

కడలుకొల్పు = కడలుకొలుపు. (వ్యాకరణసంజ్ఞా గ్రం.) భాగ. ౧. స్కం. ౭౧౯. (కలిగించు) శుక. ౨, ఆ. ౩౭.

కడలెత్తు. దే. అ. క్రి. (కడలు+ఎత్తు.) పొంగు. "చ. జొటజొట ధారగా వడిసెసుచుం గడలెత్తుసుధారసంబు గ్రుం,గుటగుట నప్పటప్పటికిఁ గ్రోలుచు..." పాండు. ౪, ఆ. ౪౧. కాశీ. ౫, ఆ. ౧౧౭.

కడలొత్తు. ద్వి. అ. క్రి. (కడలు+ఒత్తు.) 1. దిక్కులందేరు; వ్యాపించు. "సీ. కరమూలములకాంతి కడలొత్తి..." హరి. పూ. ౧. ఆ. ౧౬౮; 2. పొంగారు. "మ. సెలయేరుల్ గడలొత్తఁ జేయుచు..." హరి. ఉ. ౧, ఆ. ౫౭.

కడల్కొను = కడలుకొను. 1. అతిశయించు. "క. అని ప్రియము గడల్కొనఁ బల్కిన..." సా. ౨. ఆ. ౧౬; 2. వ్యాపించు. "మ...కేసరంబుల్ గడల్కొన..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౦.

కడవ. వై. వి. (సం. ఘటకి.) కుండ. "ఆ. తిండిపోత నీకు భండనం బేటికి,గడవఁ జేసి మనసు కాంతు దీఱ,నోపుకొలంది మ్రింగి యూరక నీ వింటి,కడవ యుండుము..." భార. ద్రో. ౪, ఆ. ౨౩౯.

కడవఁడు. దే. వి. (క. కడవ.) మగదుప్పి. "క... కడవఁడై. క...సంజ్ఞా, కంఖాణిం జేర నరిగి కామాతురతన్." వరాహ. ౫, ఆ. ౯౫, ౯౬.

కడవఁబడు. ద్వి. అ. క్రి. (కడవన్+పడు.) 1. శేషించు. "క...ఒకఁడుం,గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెన్." హరి. పూ. ౧, ఆ. ౩౭; 2. జరగు. "క. పదపడి దుస్తర మగునీ,పదుమూఁ డగు నేఁడు గడవఁబడుట యరిది..." భార. ఉద్యో. ౧. ఆ. ౯. "క. కడవంబడునొకొ పని యని,

కనుపెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరఁగన్." భార. శాం. ౫, ఆ. ౨౮౧. ఇట్లే: కడవఁగ. బడ...గి...పగలు గడవఁగఁబడుటయుఁ...' శుక. 3 ఆ. 3.

కడవఁబెట్టు. దే. స. క్రి. (కడవన్+పెట్టు.) (కష్టాదులనుండి) దాఁటించు. కడపఁజేయు. "క. ఆపదఁ గడవంబెట్టఁగ, నోపె..." భార. ఉద్యో. 3, ఆ. ౬. ౧, ఆ. ౧౦౬.

కడవడము = కళవళము. (చూ. కడవడించు.)

కడవడించు. దే. అ. క్రి. కళవళించు, కలఁతనందు. "ద్వి. ఎడనెడఁ గడవ లొఁబడఁ గడచుచును, గడవడించుచు భుజంగము విజృంభింప." బస. ౬, ఆ, ౪౩౦. పం. "ఆ. కటకటా విధాతఘటన యెవ్వరికైనఁ, గడవ వశమె యంచుఁ గడవడించు." సావి. ౨, ఆ. ౯౭. పు.

కడవటీటు. ద్వి. వి. వాద్యవిశేషము, టీటు. (శ. ర.)

కడవన్నె. వై. వి. (కడ+వన్నె.) పదియాఱువవన్నె; మేలిమిబంగారము. "సీ. కడవన్నెతుడుకుబంగరుకోట..." దశా. ౧, ఆ. ౨౬౭. "సీ. కడవన్నెగిం డ్లొకో గజనిమ్మపండ్లొకో సుదతీలలామవక్షోరుహములు." ఇందు. ౨, ఆ. ౧౯౮.

కడవన్నెగుబ్బలి. ద్వి. వి. కనకాద్రి, మేరుపర్వతము. "క. వెడలి కడవన్నెగుబ్బలి, గడచి దివికి మించి..." ఉ. రా. ౭, ఆ. ౧౧౦.

కడవముంత. దే. వి. (కడవ+ముంత.) చిన్నకడవ, కడముంత. హంస. ౫, ఆ. ౧౧.

కడవఱాయి. ద్వి. వి. (కడవ+ఱాయి.) కడవలు చేయుట కుపయోగించుఱాయి. హంస. ౫, ఆ. ౧౧.

కడవసము. దే. వి. కడాసము, తోలు. "క. మృదుప్రమథులు పులితోలుం, గడవసములు మడిచికొనుచుఁ గదురభసములన్." కాశీ. ౭, ఆ. ౩౩. భార. ఆది. ౭, ఆ. ౨౨౫.

కడవాఁడు. ద్వి. విశే. (కడ+వాఁడు.) 1. సేవకుఁడు; 2. కనిష్ఠుఁడు. "క...నాతొంటివిధం, బామనుజేశ్వరుఁ డడిగిన, నే మీకడవాఁడ నందు..." భార. ౧, ఆ. ౯౬. (ఇది పైరెండర్థములకు నుదాహరణమే.); 3. చండాలుఁడు. "సీ. గారాపుమీతల్లికడవాఁడఁ గాని నే గణ

తింపఁ గడవాఁడఁ గాఁ జుమయ్యా." స్వా. ౫. ఆ. ౪. (ఇది రెండు మూఁ డర్థములకు నుదాహరణమే.); 4. అన్యుఁడు. వెలివాఁడు. (శ. ర.)

కడపీను. ద్వ. వి. (కడ+పీను.) చెవిచివర. "మ. పది యార్వన్నెపసిండికట్ట మపనీపాళావతంసంబు నెన్నుదుటన్ గట్టె లతాంగి యొార్తు కడపీనుల్ సోఁక నేర్పొప్పఁగా." నైష. ౬, ఆ. ౫౩.

కడవెళ్లు. ద్వ. అ. క్రి. (కడ+వెళ్లు.) సమాప్తమగు. (శ. ర.) స. క్రి. దాఁటు. "గీ. విరహవారిధి నేఁ గడవెళ్లు టెపుడు." ప్ర భా. 3, ఆ. ౧౨౪.

కడవ్రేలు. ద్వ. వి. (కడ+వ్రేలు.) చిటికెనవ్రేలు, కనిష్ఠిక. (శివుఁడు.) "చ...శీతవసుధాధరకన్యక ముద్దుఁగేలు దా, మరకడవ్రేలు పట్టుకొని..." కళా. ౮, ఆ. ౧౦.

కడసంజె. వై. వి. (కడ+సంజ.) సాయంసంధ్య. కళా. ౮, ఆ. ౧౦.

కడసరము. దే. విశ. తుదిది, అంత్యము. (వా.)

కడసారము. దే. వి. తుద, చివర. వ్యవః—. కడసారపుఁ గోర్కి, కడసారపుబిడ్డ. మొ.

కడాని. దే. వి. 1. అపరంజి, మేలిమిబంగారము. ఆం. సం. స్థా. 3౫. ఆం. భా. ద్వి. ౨౭౯; 2. బంగారము. "ఉ. మేలికడానిడాల్ ..." నీలా. ౧, ఆ. ౧.

కడారము. సం. వి. అ. పుం. 1. పింగళవర్ణము; 2. దాక్షత్వము; 3. కూలము. న. జలము. విశ. (అ. ఆ. అ.); 1. పింగళవర్ణము కలది; 2. గర్వించినది; 3. నిస్సారము.

కడాసము = కడవసము. ఆం. భా. ద్వి. ౧౭౭.

కడి. దే. వి. 1. కబళము. "సీ. కమలజాండము నొక్కకడి చేసికొని మ్రింగ నరుదెంచుచున్న కాలాంతకుండొ." భా. రా. యు. ౧౪౬౭; 2. (పెద) ముద్ద. ఉదా:— పెదకడి; 3. తిండి. "క..., కడి దఱుఁగఁగ...మంచపుఁ, దొడుగ ఱతె రట్టె రుజలతో..." స్వా. 3, ఆ. ౧3౧; 4. సువాసన. ఆం. భా. తృ. ౬౧, ఆము. ౨, ఆ. ౧౯; 5. దుర్వాసన. (చూ. కడివోవు); 6. గాయము. ఆం. భా. తృ. ౬౧; 7. చోర సాధనవిశేషము. "క. కడియుంను గత్తియుం నాచే, వడి యుండినయేని పద్మభవునిట్లైనన్, వడిఁ జొచ్చి కన్నమున వెస, వెడలింపనె మిసుకకుండ వేదండంబున్." ఉద్భ. ౨, ఆ. ౨3౯.

కడిఁది. దే. వి. 1. శౌర్యము. ఆం. భా. ద్వి. ౨౨౧; 2. ఆపద. "క. వడిఁ బోయి మీర లిప్పటి, కడిఁదికి నేమాంసమైనఁ గ్రక్కునఁ గొని రం, డు..." నా. పంచ. ౧, ఆ. 3౭౬. విశ. 1. మహోన్నతము, మిక్కిలిగొప్పది. "చ...యోగిజనంబు లిట్టిదట్టి దని యెఱుంగ నోపనికడిందిపదంబును నొందనేర్చిదా." భాగ. 3 స్కం, ౯౭; 2. విశాలము, వెడఁదయైనది. "సీ...కడిఁదిటొమ్ము ..."రామా. ౬, ఆ. ౧౧౪; 3. గంభీరము, లోఁతైనది. "ద్వి. కడగానరానినీకడిఁది చిత్తంబుఁ, బడయుటకై నేనుఁ బడియున్నవాఁడ." రం. రా. యు. 3౦౭, పు. 4. కఠినము, దారుణము. "ఉ...విధియింపుఁ డిప్పుడ కడిందిగ దండము దప్ప కట్లెనేన్." నైష. ౪, ఆ. ౧౧3; 5. అసాధ్యము. "సీ...లోకంబు మెచ్చించుట కడిఁది గాదె." నిర్వ. ౧౦, ఆ. ౧౪౨; 6. దుర్భరము, సహింప శక్యము గానిది. "ఉ...ఏమి సేయుదుఁ గడిందివిచారము పుట్టె నె ట్టిశం, దప్పరి సంచరించునొకొ..." భార. విరా. ౧, ఆ. ౯౨; 7. దుర్జయుఁడు, జయింప శక్యము గానివాఁడు. "తరలము. వినత గోరె సుపుత్త్రులన్...కడిందివీరుల నిద్దఱన్." భార. ఆది. ౨, ఆ. 3.

కడిఁదిజడదారి. ద్వ. వి. (కడిఁది+జడదారి.) మహాజటాధారి, శివుఁడు. "గీ. కడిఁదిజడదారిసిగపూవు గళలప్రోవు." కృ. శకుం. ౧, ఆ. ౨౨.

కడికంచెము. ద్వ. వి. (కడి+కంచము.) భోజనపాత్రము. "చ. కలుపలరాజు పువ్వు కడికంచము బ్రహ్మకపాలము..." వీర. ౨, ఆ. ౭౫.

కడికండములు=కడికండలు. "సీ. పడఁద్రోచియుంను వాలఁ గడికండములుగ వ్రేసియుం గఠారంబులఁ జేరి చెఱిచి." భార. శల్య. ౧, ఆ. 3౪౦. భార. ద్రో. ౫, ఆ. ౧౧౪. కు. సం. ౧౧, ఆ. ౧౮౯.

కడికండలు. ద్వ. వి. బ. (కండలు+కండలు. క. కడి కండ.) ముక్కముక్కలు. "ఉ. మందుచు వచ్చుదానిఁ బదిమార్గణముల్ గొని వేగ మొప్ప

నా, ఖండలనందనుండు గడికండలు సేసిన..." భార. విరా. ౫, ఆ. ౧౫౧.

కడిగించు. వై. స. క్రి. (కడుగు. ధా. ప్రే.) కడుగఁజేయుట. (బ్రా.)

కడిగొను. దే. స. క్రి. (కడి+కొను.) ముద్దగాఁగొను; మ్రింగు. "క. చిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె చిచ్చుఱచూ పచ్చువడినశివునకుఁ దక్కన్." భాగ. ౪ స్కం. ౨౪౬.

కడితము. వై. వి. (సం. ఘట్టితమ్. క. కడిత.) 1. గుడ్డమీఁద జిగురుతోఁ గలిసినమసి పూసి యట్టలుగాఁ జేసి వానితోఁ జేర్పఁటిచినలెక్కలపుస్తకము. "ఉ... నేఁ, డక్కడితంబుఁ గట్టి యిడ నట్టల యున్నది కప్పునేఱుచున్." పాండు. ౪, ఆ. ౭౦. హంస. ౨, ఆ. ౨౨౬; 2. నల్లచీర. "క. గంగయుఁ గడితపువలువచె,ఱంగు ముసుంగిడి కడిందిఱాతనమున నా,శృంగారవనికె మెల్లనె,జంగమపుంగవుని వెదుకఁ జనియె నొకర్తె." శివలీ. ౨, ఆ. ౫౪.

కడితల. దే. వి. ఫలకము, కేడెము (చూ. కడితలవాఁడు.)

కడితలవాఁడు. దే. విణ. (కడితల+వాఁడు.) కేడెము పట్టువాఁడు. "చ. కడితలవారు వ్రేయఁ గడికండములై పడి..." సి. సం. ౧౧ ఆ. ౧౮౯.

కడితి. దే. వి. గోకర్ణమృగము. కడఁజు. "మ... కడుతుల్ చిక్కె గజాళి చొక్కె..." సా. ౧, ఆ. ౧౦౭, స్వా. ౪, ఆ. ౩౭.

కడిమము. దే. వి. మాంసము. "వ. అవ్వాడ చంపి తిత్తొలిచి గాలిగొన వైచిన తుక్కకడిమంబు గనుంగొని..." భార. శాం. ౩, ఆ. ౨౯౫. (ముద్రితపాఠము 'కలిమము' శ. ర. పా.)

కడిమి. యు. దే. వి. 1. చలము, పట్టుదల. "గీ. జామదగ్న్యుండు సాధింపఁ జాలకున్న,వాని భీష్ముఁ బాండవులకై పూని వచ్చి, కడిమి సాధించి తెర శిఖండి పోర." భార. భీష్మ. ౧, ఆ. ౫౫; 2. శౌర్యము, పరాక్రమము. "క. ఆరాజమణికుమారుఁడు, మారుఁడు సౌందర్యమునఁ గుమారుఁడు కడిమిన్." రసిక. ౧, ఆ. ౫౩; 3. సత్త్వము, బలము. "గీ...నాకడిమి వినుము." "ఉ. క్రచ్చఱ నొక్కరక్కసుఁడు కాఁడు సురాసురు లెల్ల నొక్కఁడై, వచ్చిన నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁ జేసి వారలన్, వ్రచ్చి వధింతు..." భార. ఆది. ౬, ఆ. ౧౮౯, ౨౦౦; 4. అతిశయము; ఆధిక్యము. "క ..బాలికడిమిన్, బాలికఁ దెచ్చిరి విహారభవనంబునకున్." వసు. ౩, ఆ. ౧౭౫; 5 దండోపాయము. "గీ. ఏఱు నిలుపఁ గే లొగ్గుట యిచ్చకంబు. మత్తకరిఁ గెరలించుట మాయ చేఁత, కొఁడ నెరిరించి తగరు డీకొనుట కడిమి, కాన గధిపునిగెడ మేలు దాన మండ్రు." కవిక. ౨ ఆ. ౩౭. విణ. పెద్ద. "రగడ. నలినాకు కడిమిగండడనకే వెఱచెదను." స్వా. ౩ ఆ. ౭౪. వై వి. (సం. కదంబకః.) కదంబము. "గీ. కడిమి చిగిరించె..." పాండు. ౪, ఆ. ౨౧.

కడిమిడి. దే. విణ. శాద్వలము, పచ్చిక గలది. "వ...పచ్చనికడిమిడిపట్టునం జటాయుపుం దలంచి దర్భపూతంబుగాఁ బిండంబు వెట్టి..." భా. రా. అర. ౨, ఆ. ౩౭౪. ('శకునాయ దదౌ రామో రమ్యేహరితశాద్వలే' అని మూలము.)

కడియపుటట్టు. ద్వ. వి. (కడియము+అట్టు.) ఒకానొకతినుబండము. "సీ...కడియంపుటట్లు వెన్నప్పాలు .." కళా. ౭, ఆ. ౭౧. వేం. పంచ. ౧, ఆ. ౭.

కడియము. వై. వి. (సం. కటకమ్. త. కడయమ్.) 1. వలయాకార మగుఒకానొకహస్తభూషణము. "సీ. కడియఁపుఁబాములు కకపాలలో నున్న భూతిమైఁ జిలికిన బుస్సు రనఁగ." హర. ౫, ఆ. ౧౬; 2. పాదమునకుఁ బైని ధరించు వెండి మొ. వాని యాభరణము. "సీ. గతి మ్రుచ్చిలఁగ వేచుఁ గాలిఁ ద్రావఁగఁ బాము నిడినకై వడిఁ గాలికడియ మమర." పారి. ౪, ఆ. ౭౭; 3. భక్ష్యవిశేషము. "వ...వడియంబులుఁ గడియంబులుఁ గాయంబులు గంధతోయంబులు..." కాశీ. ౭, ఆ. ౧౪౬.

కడియెత్తు. దే. అ. క్రి. (కడి+ఎత్తు) భుజించు. "క. అత్త దయామతిఁ దనకడ, నత్తమిలక నిద్రవోవ దహారహమందున్,బొత్తునఁ గుడువక తాఁ

గడ్డి,యొత్తదు తజ్జనని..." రాజ. చ. ౨, ఆ. ౩౪.

కడిలము. వై. వి. (సం. ఖట్వా.) ఒకానొకవృక్షము. (శ. ర.)

కడివోవు. దే. అ. క్రి. (కడి+పోవు) 1. వాడు. "క. కడివోయినపుష్పంబులు మఱి, ముడుచుచు నె రసికుఁ డగువాఁడు..." భో. ४, ఆ. ౨౨४. ఆము. ౯, ఆ. ౧౯; 2. చెడు. "చ...తాల్మి కడివోయిన నించుక లజ్జలాపునన్." ఉ. హరి. ౫, ఆ. ౨౦౨; 3. క్షీణించు. "గీ. సంతతము కడివోనివాసనలు గలుగు, పారిజాతమహీజపుష్ప ములు ముడిచి." వి. పు. ౮. ఆ. ౧౨౨; 4. శుభ్రమగు. "సీ. కడివోవ నొడళులు గడిగి..." కు. సం. ౧, ఆ. ౯౮.

కడిసె. దే. వి. వృక్షవిశేషము. (బ్రౌ.)

కడిసెలము. దే. వి. ఒకరకపుచేప. హంస. ४, ఆ. ౧౮౭.

కడు. దే. అవ్య. ద్రు. (దీనికి వృత్తియందచ్చుపరమై నపుడు 'కట్టు' అనురూపము వచ్చును. ఉదా:— కడు+అలుక = కట్టలుక మొ.) మిక్కిలి. "క. కడునధికుతోడఁ దొడరిన..." భార. సభా. ౧, ఆ. ౧౨౩. "సీ. ధరణీజగుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెఱ్ఱవన్నె యొసఁగి." భార. ఉద్యో. ౨. ఆ. ౧౧४.

కడుఁదురు. వై. వి. (సం. గండోలీ.) కందిరీగ. "క. వెరయాఁగలగతిఁ గవియుంచుఁ, బొరి బొరిఁ గడుఁదురులపగిదిఁ బొదువుచు..."భార. ద్రో. ౧, ఆ. ౨౫౮. "సీ. కడుఁదుర్ధనిడుతుట్టె గతిఁ జొఁగలోఁ బాండురత మించుకపిల కూర్చ్ఁబువాని." ఆము. ౬, ఆ. ౧౯.

కడుకొను. దే. అ. క్రి. 1. అతిశయించు. "క. వెల యాలివలపు కడుకో, వెఱకున్ వగ లేక..." శేష. ४. ఆ. (శ. ర); 2. ఓపిక పట్టు, శాంతము వహించు "క. పుడమియుఁ రాజ్యము బంధుల విడిచి మృగ:ఖ గసి విపినంబులలోఁ, గడు కొని మాయ ట్లిమసంబడినవరులు గలరె..." భార. ఆర. ౨. ఆ. ४. 3. కడఁగు. పూను. "క. భూనాథ నీకు భార్యం,గా నన్నుఁ బరిగ్ర హింపఁ గడుకొని యిష్టం,బేని సమయంబు సేయుము..." భార. ఆది. ४, ఆ. ౧४౯. సభా. ౧, ఆ. ౩౨. 4. ఉత్సహించు. "చ. కడు కొని కామినీజనులకౌఁగిట నే మని యుండువాఁడ ..."భో. ౧, ఆ. ౧౦४; 5. నిదానించు. "క. కడుకొనక తప్పఁ జూచినఁ, జెడు లోకము లను౦దిని ప్రసిద్ధము జగతిన్." కు. సం. ౯, ఆ. ४४.

కడుగు. దే. స. క్రి. 1. క్షాళనము చేయు. "గీ. గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు." శాశీ. ౩. ఆ. ౩౦. 2. తీసివేయు. "సీ. కడుగు నెవ్వని కీర్తి కార్తికీతిథినిశానాథబింబంబు నెన్నడిమి కందు." నైష. ౭, ఆ. ౧౦౫. వి. తండుల క్షాళనోదకము, బియ్యము కడిగిననీరు. ఆం. భా. ద్వి. ౨౫౦.

కడుగుడు. దే. వి. 1. కడుగుట; 2. గాలింపు. ఆం. భా. ద్వి. ౨౫౨.

కడుజు = కణజు. (శ. ర.)

కడుపు. వై. వి. (సం. గర్భః.) 1. ఉదరము, పొట్ట. "క...ఎచ్చోటఁ గడుపుఁ బ్రోతునో యను చున్..." భార. విరా. ౧, ఆ. ౨౬౮. ఆం. సం. మాన. ౨४; 2. చూలు. "ఉ...జారు శశిఁ బొంది కటా కడు పేల తెచ్చుకొంటి..." భాగ. ౯, స్కం. ౩౭౮. "క...లేడికడుపునఁ బులి పుట్టునె..." భార. ఆది. ౬. ఆ. ౮౫; 3. గర్భమున నున్నపిండము. "గీ. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు, దీప్తగర్భంబు మెల్లన తిగిచి యోగనిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ, గడుపు దిగె నంచుఁ బౌరులు కలఁగఁబడఁగ." భాగ. ౧౦, స్కం. పూ. ౬౨. 4. సంతతి. "గీ. సిరియు వాణియు మొదలైన సురపురంధ్రు, లట్టుఁ గడుపును చల్లఁగా నభిలషించి, నియమ మునఁ గొల్తు రెవ్వని నిత్యకలన, నట్టిభీమేశు నినుఁ గొల్తు మహారహంబు." భీమ. ४, ఆ. ౮౨; 5. బిడ్డ. "ద్వి. గారాముచేఁ గన్నకడుపు పోటనంటి." మృ. వి. ౩, ఆ. ౧౨౫. పు. సా:—1. కడుపు(గా) చల్లకవలకయుండు= శ్రమ పొందకుండు. రామా. ౨, ఆ. ౭. 2. కడుపునిండిన బేరము. (వా.)

3. కడుపులోఁ జెయిపెట్టి కలఁచినట్లు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౦౬.

4. కడుపుమీఁద కొట్టు = జీవనాధారము పడఁగొట్టు. (వా.)

5. కడుపు కండచిత్తగు = వంశాభివృద్ధియగు. ప్రభా. ౪, ఆ. ౪౧.

కడుపుకూడు. ద్వ. వి. (కడుపు+కూడు.) కడుపు నకు సరిపడ్డతిండి. "ఆ. ఏను గట్టవాలుదాన నా కెవ్వరు, కడుపుకూడు వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా, రలకుఁ బనులు సేసి..." భార. విరా. ౧, ఆ. ౭౯౮.

కడుపుచేయు. ద్వ. అ. క్రి. (కడుపు+చేయు.) గర్భిణిగా నొనర్చు, గర్భము నిలుపు. "క... అవ్వసిష్ఠుఁడు, మదయంతికిఁ గడుపుచేసె మదన క్రీడన్." భాగ. ౯. స్కం. ౭౧౦.

కడుపుచేలువ. ద్వ. వి. (కడుపు+చలువ.) సంతతి క్షేమముగా నుండుట. (వా.)

కడుపుచేల్లన. ద్వ. విశే. (కడుపు+చల్లన.) సంతతి గల; పుణ్యమైన. "గీ. ఒకకుమారుని దయ చేసి యంర్విలోనఁ, గడుపుచల్లనికాంతలఁ గలుపు నన్ను." ఉ. హరి. ౨, ఆ. ౭౫.

కడుపునకుఁబెట్టు. ద్వ. అ. క్రి. (కడుపునకున్+పెట్టు.) పాలిచ్చు; ఉగ్గుపోయు. "సీ. వేఁపాకు గోరంటవిత్తులు పొగవైచుఁ బోరు మాన్పుచుఁ గడుపునకుఁబెట్టు." ఇందు. ౨, ఆ. ౧౫.

కడుపుబ్బు. ద్వ. వి. (కడుపు+ఉబ్బు.) 1. ఆనాహము, మూత్రనిరోధక వ్యాధివిశేషము. (బ్రౌ.) "సీ. కడుపుబ్బునాఁగను నడరు నానాహాఖ్య." ఆం. భా. ద్వి. ౧౭౮. 2. అసూయ, ఓరువలేనితనము.

కడుపూఁద. ద్వ. వి. (కడుపు+ఊఁద.) 1. మల మూత్రబంధక మగుపశురోగము. "ఆ. నరిడి పుష్పు కప్పునాపురు కడుపూఁద." హరి. పూ. ౬. ఆ. ౪౫; 2. ఈర్ష్య, అసూయ. (శ. ర.)

కడుపేడు. దే. వి. (కడు+పేడు.) మేదరివాఁడు కట్టుకట్టెడు సన్ననివెదురుపేడు. (శ. ర.)

కడుపుమంట. ద్వ. వి. 1. క్షుద్బాధ. "ఉ... యెవ్వరో, మక్కువలేక నాకడుపుమంటయుఁ బుచ్చికొనంగఁ బూని..." శుక. 3, ఆ. 3౭౬. 2. ఈర్ష్య, ఓర్వలేనితనము. 3. కడుపుబ్బు.

కడువు=కడుగు. "గీ. ఆజ్యతైలాభ్యుపేతభాండావళు లను, నేళ్లనీళ్లలనొండె వేన్నిళ్ల నొండెఁ,గడువు టాతఁ దోమిన నొండెఁ గలుగు శుద్ధి." మార్క. 3, ఆ. ౭౫౪.

కడెము = కడియము. "ఉ. మేలిపసిండిగాజుల పమేలపుఁబచ్చలకీల్కడెంపుడా,కేలు..." విజ. ౧, ఆ. ౭౯.

కడ్గు = కడుగు. (క్షాళనము చేయు.) "చ. అడుగులు గడ్గి..." భార. అశ్వ. ౪, ఆ. ౨౨3.

కడ్డాయము. మి. వి. (కడు+ఆయము. త. కట్టాయం.) నరకులపై హెచ్చు వెలవేసి వానిని గొను మని నిర్బంధముచేయుట. (దే. వి. బలాత్కారము అని శ. ర., బ్రౌ, సూ. ని.)

కడ్డీ. వై. వి. (సం. ఖటికా. క. కడ్డి.) 1. బంగారుము. వానిని కరఁగి పుల్లవలె పోసెడుముక్క. ఆం. భా. ద్వి. ౨౭౫; 2. పలకపుల్ల. (శ. ర.)

కడ్డీవత్తి. వై. వి. అగరువత్తి. "క. ధూపంబు కడ్డి పత్తులు..." శుక. ౨, ఆ. 3౯.

కడ్పు = కడుపు. (కుక్షి.) హరి. పూ. ౫ ఆ. ౨౨౪.

కడ్మి = కడిమి. (బలము.) "మ...సురేశ్వరుని గడ్మిం గిట్టి తుస్సాద నో,సినపుత్త్రుం దగ నిత్తు నీకు..." భా. రా. బాల. ౪౭౬.

కఢాకు. దే. వి. కత్తివిసరులలో నొకవిధము. ప్రబంధ. ౭౮.

కణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయీఁగ; 2. తెల్లజీలకఱ్ఱ; 3. పిప్పలి.

కణఁక=కడఁక. 1. (పూనిక) "మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి... సర్వేలక్షణయుక్తంబును నైన మోక్షపదవిం గైకొందు రత్యున్నతిన్." భాగ. ౩, స్కం. ౮౪౦; 2. (వికాసము.) "సీ...కంజపుంజంబులు కణఁక నొంద." విక్ర. ౨ ఆ, ౧౦౭.

కణఁగు = కడఁగు. (అతిశయించు) "క. గణపాద హతులచేతను, వణఁకె గిరుల్ తరులతోడ వసుధం బడియెన్, గణఁగి వసుంధర గిరులును, ఫణపతిపైఁ బడియెఁ గమఠపతిపైఁ బడియెన్." వీర. ౪, ఆ. ౮౧.

కణఁజే = కడఁజము. వై. వి. (సం. గంజః. క. కణజ.) ధాన్యాదులకొట్టు; గాదె. "సీ. అఖిల వస్తువులధాన్యముల కణంజలు..." హంస. ౧, ఆ. ౧౩౭.

కణఁజేము = కడఁజము, కణఁజ. 1. గాదె. "సీ. కాయధాన్యంబులకణఁజముల్ బియ్యాంపుగరిసెలు దినుసులు గలకొటార్లు." హంస. ౧, ఆ. ౨౯౬; 2. పాఁతఱ. "చ...గరిసెనన్ గణఁజంబుల నెత్తరామిచే, నిలిచినకుప్పకావలికి నిల్వుమరు..." చంద్రా. ౧, ఆ. ౨౫; 3. కంగాళము. "సీ. ఆమనిదొరతేనియలకణఁజంబులు వనలక్ష్మి సౌభాగ్యమునకు నెడలు." ఉ. రా. ౬, ఆ. ౧౧.

కణఁజొ = కడఁజొ. ఆం. భా. ద్వి. ౮౫.

కణఁత = కడఁత. పండితా. దీక్షా. ౮౦, పు.

కణఁతి=కడఁతి. "చ...దుప్పులు కణఁతుల్ కిటుల్..." శాళ. 3, ఆ. ౪౮.

కణము. సం. వి. అ. పుం. 1. గింజ; 2. నూక; 3. లేశము. విణ. అ. పుం. సూక్ష్మమైనది.

కణయము. ఉభ. దే. వి. వాయుమార్గము, గాలి యుండుమేర. "ద్వి. విలసిల్లఁగా నందు వివిధ మేఘములు, గలుగు నారెండవకణయంబు గడచి." రం. రా. ఉ. ౬3, పు. సం. వి. అ. పుం. 1. ఆయుధవిశేషము. "వ. కణయకంపన ముసలముద్గర..."ఉ. హరి. ४, ఆ. ౨౧3; 2. క్రతువిశేషము.

కణసరము. దే. వి. ఒకజాతిదేఁగ. "సీ. కన్నెలేడుల మీఁద గాటంపుబీరంపు గణసరంబులఁ జొన్పి గండడంచి." రసిక. ౧, ఆ. ౧౧౫.

కణి. ఉభ. దే. వి. గాడీ, బండి. (బ్రౌ.) సం. వి. ఇ. పుం. ధ్వని. ఈ. స్త్రీ. అడవిలోఁ బైరగుజీల కత్తి.

కణిఁతి = కంతి. ఆం. భా. ద్వి. ౭४.

కణిక. ఉభ. వై. వి. (సం. కఠినికా.) 1. బలపము. ఉదా:—కణికపుల్ల; 2. నిడివియైనమొక్క. ఉదా:—సుద్దకణిక. సం. వి. ఆ. స్త్రీ; 1. లేశము; 2. సూది; 3. గోదుమరవ; 4. తూలిక; 5. జీలకఱ్ఱ; 6. పీణబిరడ; 7. సెల్లెళ్.

కణితి = కడితి. చంద్రా. ౨, ఆ. ౮४.

కణిశము. సం. వి. అ. పుం. న. సస్యమంజరి, ఎన్ను.

కణిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) సూక్ష్మతమము, కడుఁజిన్నది.

కణీయము. సం. విణ. (స్. యసీ. స్.) కణిష్ఠము.

కణుఁదురీఁగ = కందురీఁగ. "వ. కణుఁదురీఁగలు మూఁగినబాగున..." సౌ. ౨, ఆ. ౧3౧. పు.

కణుఁదురు=కడుఁదురు. "వ...కణుందురువలన లక్ష్మీగతజ్ఞానంబు విడువకుండుటయుఁ...ఎఱిఁగి..." భాగ. ౧౧, స్కం. ౯౯.

కణుజు=కడుజు. 1. (ఒకజాతిదేఁగ). "గీ. మృగయుం లంతటఁ దెచ్చిరి...కణుజు వేసడము బైరి... అనుదేఁగకొలము." పిన. శకుం. ౧, ఆ. ౧౧౦. ఆం. సం. లిర్వ్య. ౧౬; 2. (పగడములు తూఁచు మానవిశేషము.) ఆం. భా. ద్వి. ౨౭౭.

కణుదురు, దే. వి. ఒకానొకచెట్టు హంస. ४, ఆ. ౧౦.

కణ్వము. సం. వి. అ. న. 1. పాపము; 2. నగ.

కణ్వుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకమహర్షి. విణ. (అ. ఆ. అ.) 1. చెవిటివాఁడు; 2 గొప్పమేధ గలవాఁడు.

కత. వై. వి. (సం. కథా. క. కతె. త. కత్తై, క త్తం.) 1. వృత్తాంతము,సంగతి. "క. అప్పుడు మముఁబోంట్ల కతల్, చెప్పఁగ నేమిటికి..." కళా. ౨, ఆ. ౭౧; 2. కథ, చరిత్రము. "క. కతలుగ మాసాసాగ, స్థితులెల్లను జెప్పె..." స్వా. 3, ఆ. ౧౨౮; 3. దుశ్చేష్ట, చెడ్డపని. "చ...ఇఁకనీ, కతలను నూని యిప్పిభు నగణ్యకృపానిధి నాశ్రయింపు..." నృసిం. ౫, ఆ. ౮౬; 4. సామెత. "గీ. ఇను ముతోఁ గూడ నగ్నిహోత్రునకుఁ బెట్టు, తగులు నం చనుకతగాను..." రాధికా. 3, ఆ. ౭౦. ఉ. హరి. ४, ఆ. ౧౦౨.సా:—కతకుఁ గాల్లు ముంతకుఁ జెవులు. సా. 3, ఆ. ౧౮.

కతకము. సం. = కతము.

కతకారి = కతలకారి. "ద్వి. నెఱవైనపెద్దలు నేరని యట్టి, కఱపులు గఱచె నీకతకారిబిడ్డ." అ. మ. క. ౧. ఆ, 3౨ పు. ౧४ పం.

కతకారితనము. ద్వ. వి. (కతకారి+తనము.) కథా కథనమునఁ గలనైపుణ్యము. "ఉ. కంతుపతాణియుఁ గతలకారితనంబున మీఱి యిట్లనున్." శుక. ౨, ఆ. ౨3౬.

కతన. దే. వి. (క. కత.) కారణము. "క...నీ, కతనన్ సుఖవసతి మాకుఁ గలిగెఁ గుమారా." రామా. ౪, ఆ ౫౨.

కతపత్త్రము. మి. వి. (కత+పత్త్రము.) ప్రమాణపత్త్రము. "సీ. కతపత్త్ర మిడవచ్చుఁ గలగాంచు నపుడైనఁ, గోరికఁ బరకాంతఁ గోరఁ డనుచు." పాండు. ౧, ఆ. ౬౩.

కతమిచ్చు. దే. అ. క్రి. (కతము+ఇచ్చు.) సూచించు. "క. రతిపతి హళాహళించిన, యతిస్థైర్యధనంబు కొల్లలాడె నటంచున్, గతమిచ్చుకరణి ..." రామా. ౪, ఆ. ౧౬౯. వసు. ౪, ఆ. ౯.

కతము. ఉభ. దే. వి. 1. కారణము. "క...అతని కతమునను శాంత మగు బుధస్తుత నీకున్." భార. అర. ౪, ఆ. ౧౭౩; 2. గుఱుతు; సూచన. (చూ. కతమిచ్చు.) సం. వి. అ. పుం. చిల్ల. ఇందుగు. న. ఒల్లగింజ.

కతలకాఁచి. ద్వి. విశే. (కతలు+కాణాచి.) కథానిధి, పెక్కుకథలు చెప్పఁగలది. "క. నినుఁ గతలకాఁచి యని పేర్కొనునావచనంబు నిజ మగున్ మగువా..." వేం. పంచ. ౧, ఆ. ౫౫౪.

కతలకారి = కతకారి. "గీ. జనపతిని జేరఁ బోసిప దినము దినము, కతలు చెప్పఁగ సాగితో కతలకారి." హంస ౫, ఆ. ౩౩౭.

కతిపయము. సం. విశే. (త్రి. ఈ. ఊ.) కొంత; కొన్ని. (తెలుఁగున నిది సమాసపూర్వపదముగానే తెలుపు గానఁబడుచున్నది.) "వ...సత్యవతి... కతిపయకాలంబునకు గర్భిణియై." భార. ఆర. ౩, ఆ. ౧౩౭. "వ...కతిపయదినంబులు కొలంతగా..." భార. విరా. ౨, ఆ. ౨౨. (ఇది జాతివాచకముతో సమసించినపుడు తఱచు ఉత్తరపదముగా నుండును. ఉదా:—ఘృతకతిపయము = కొంత నెయ్యి. విప్రకతిపయము = కొందఱు విప్రులు.)

కతుకు. దే. స. క్రి. 1. కుక్క మొదలగునవి నాలుకతో కొంచెము కొంచెముగా త్రాగు. "చ... ఏఱులు నిండిపాఱినం, గతుకఁగఁ జూచుఁ గుక్క తనకట్టడ మీఱక యెందు భాస్కరా." భా. శ. ౫; 2. భుజించు. "క. కలికిన నతుకదు ..." పార్వ. ౫, ఆ. ౮౭.

కతుక్కు = కటుక్కు. "ఆ. ఒక్కనక్క వల గతుక్కనఁ గొఱికి తా,నవలఁ జనఁగ వెంటఁ దవిలె బలము." శుక. ౧, ఆ. ౭౬౬.

కత్తరము = కత్తళము. (బ్రౌ.)

కత్తరి. దే. విశే. 1. నానావర్ణములు గలది, శబలము. (శ. ర.) ఉదా:—కత్తరియావు మొ.; 2. వర్ణసాంకర్యము గలది, సంకరము. "క. ఉత్తమసతి శూద్రులతోఁ, జిత్తజసుఖకేళి వాంఛఁ జేసినఁ బ్రాయశ్చిత్తమున శుద్ధిఁ బొందును, గత్తరిపురుషునకుఁ బాయు గర్భం బైనన్." విజ్ఞా. ఆచా. ౧౧౨.

కత్తరించు. దే. స. క్రి. 1. కత్తిరించు, ఖండించు. "వ...బాహుదండంబులు గత్తరించియు బయల్లకు నొత్తరించియు..." ఉ. హరి. ౧, ఆ. ౧౪౮; 2. ఆడించు. "ద్వి. కన్నులార్చుచుఁ జెవుల్ గత్తరించుచును." పండితా. పర్వ. ౪౩౯ పు; ౫౭౦ పు. ౫ పం; 3. నశింపఁజేయు. "చ. మఱకువఁ గత్తరించి మదమానములం జుఱుపుచ్చి..." ఉ. హరి. ౪, ఆ. ౮౭.

కత్తరిగలయు. దే. అ. క్రి. (కత్తరి+కలయు.) 1. కలిసిపోవు. "వ...ప్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నసమయంబులు గత్తరిగలసి యుంటం జేసి నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు లుపసంహృతంబు లయ్యె..." కాశీ. ౨, ఆ. ౯౮; 2. సంకర మగు. "గీ. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ, కలిగాలంబునఁ గత్తరిగలసిపోవు." హరి. ఉ. ౯, ఆ. ౩౭.

కత్తరిల్లు. దే. అ. క్రి. చలించు, కదలు. "గీ. కటము లద్రువంగ మీసాలు గత్తరిల్ల." నైష. ౭, ఆ. ౪౬.

కత్తలాన. వై. వి. (సం. కర్తలాణిః.) 1. వర్మితవాజి, కవచము తొడిగినగుఱ్ఱము. ఆం. భా. ద్వి. ౧౯౬; 2. ఖట్లాన మనుదేశమందలిగుఱ్ఱము. (బ్రౌ.)

కత్తలానము. వై. వి. అశ్వాదివాహనము. "మ...తమ్మునికత్తలానము రయంబుల్ మీఱ రావించి ..." కువల. ౧, ఆ. ౭.

కత్తలాని. వై. వి. 1. వర్మితవాజి. ఆం. భా. ద్వి. ౧౯౬; 2. అశ్వాదివాహనము. "సీ. తెఱగంటి

కల్కి-ముద్దియ లూడిగపుఁజేలుల్ కడిఁదిబొబ్బ మెకంబు కత్తలాని." రసిక. ౧, ఆ. ౨; 3. గుఱ్ఱము. ఆం. సం. తిర్య. ౩.

కత్తపము. దే. వి. చిన్నముఱికికాలువ. (బ్రౌ.)

కత్తళఁడు = కత్తలాని. (శ. ర.)

కత్తళము. దే. వి. 1. యోధులు తొడిగికొనెడికవచము. "ఉ...పాంచాలుర నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూపాలక పుచ్చఁ గత్తళము..." భార. శల్య. ౨, ఆ. ౩౫. ("నాహత్వసర్వపాంచాలాన్ విమోక్ష్యే కవచం విభో" అని మూలము.) అచ్చ. అర. ౭; 2. ఆయుధవిశేషము. "క. పలకలు నొడ్డనములుఁ గత్తళములు..." కు. సం. ౧౧, ఆ. ౭౦.

కత్తళా. వై. వి. అశ్వాదివాహనము. "సీ. రమణీయమైనట్టిరాచిల్క-కత్తళా విలసిల్లుడగరకావిళము పడగ." గంధ. ౬.

కత్తళీఁడు. దే. విణ. (కత్తళము+ఈఁడు.) పర్మితుఁడు, కవచి. (శ. ర.)

కత్తి. వై. వి. (సం. కర్త్రీ. క. త. కత్తి.) 1. ఆయుధవిశేషము. "గీ. కత్తిఁ గుత్తుకను బిడానఁ గత్తిరించి." చంద్రా. ౨, ఆ. ౮౮; నిర్వ. ౫, ఆ. ౧౭; స్వా. ౪, ఆ. ౮; 2. ఆయుధము. "సీ...కత్తి యనఁగ, నాయుధ మొప్పు..." ఆం. భా. ద్వి. ౨౧౧; 3. మంగలికత్తి, క్షురిక. (శ. ర.); 4. మల్లబంధవిశేషము. ఆం. భా. ద్వి. ౨౧౯. (శ. ర.); 5. ఒకానొకపరిమితి గల పొలము. (నలుబదియెకరము లని ప్రభుత్వపు లెక్క. యుద్ధసమయమునఁ గత్తులతో వచ్చి సహాయముచేయ గెలిచినరాజు వారి కిచ్చు భూమి యగుట దీని కీపేరు వచ్చియుండును.బ్రౌ.)

కత్తికట్టు. ద్వ. అ. క్రి. (కత్తి+కట్టు.) జగడమునకు సిద్ధమగు. వ్యవ:—వాఁడు నామీఁదకు కత్తికట్టి వచ్చుచున్నాఁడు.

కత్తికాసు. వై. వి. పద్దవానిపనిముట్టు. (శ. ర. బ్రౌ.)

కత్తిగంటము. ద్వ. వి. (కత్తి+గంటము.) ఒకవైపునఁ గత్తిగాను ఒకవైపున గంటముగాను ఉపయోగించు వ్రాఁతపనిముట్టు. "గీ. ముదుకతలపాగ యును బాహుమూలమందుఁ, గవిలె చర్మపు లమర గ్రామకరణ మేతెంచి రెడ్డిచెంగట వసించె." శుక. ౩, ఆ. ౪౧౬.

కత్తిగొంటు. ద్వ. వి. (కత్తి+గొంటు) క్రూరురాలు. "ఆ. కత్తిగొంటు లైనయత్తగంతు." కు. సం. ౮, ఆ. ౧౩౫.

కత్తిపిట్ట. వై. వి. (కత్తి+పిట్ట.)—పిరహులకుఁ గత్తి వంటివి—పక్షివిశేషము, కోయిల. (బ్రౌ.)

కత్తిపిడిక. వై. వి. ఈఁడ్రవానికత్తులబుట్ట. (శ. ర.)

కత్తిపీఁట. వై. వి. (కత్తి+పీఁట.) పీఁటమీఁదఁ గూర్చుండి కూరలు మొ. తఱుగుట కనుకూలముగా నమర్చినకత్తి, ఈళిక. (శ. ర. బ్రౌ.)

కత్తిపేరిమెకము. వై. వి. (కత్తి+పేరు+మెకము.) ఖడ్గమృగము. "గీ. కత్తిపేరిమెకంబుల..." ఉ. రా. ౭, ఆ. ౩౯౦.

కత్తిమందు. ద్వ. వి. (కత్తి+మందు.) 1. కత్తి ఒఱపు పూయుమందు. (శ. ర. బ్రౌ.); 2. నుఱుపులమందు. (శ. ర. బ్రౌ.)

కత్తిమీఁదిసాము. ద్వ. వి. (కత్తి+మీఁద+సాము.) అపాయపుఁబని. "క...దొరతనపున్, సరవుల్ మఱి కత్తిమీదిసాములు సుమ్మీ." కువల. ౪, ఆ. ౮౨.

కత్తియ. వై. అప. స్వార్థమునను మత్వర్థమునను వచ్చునొకానొకస్త్రీప్రత్యయము. (ఉదా:—చెలికత్తియ = చెలి. అందకత్తియ = అందము గలది. దీనికి పుంలింగరూపము 'కాఁడు.')

కత్తియము. దే. వి. 1. అంకెలయడ్డబంతి. (శ. ర.); 2. వరుస. (చూ. కత్తెము.)

కత్తిరించు. వై. స. క్రి. కత్తెరతో ఛేదించు; ఖండించు. "చ...దశకంధరుం డడరి గ్రక్కున వేనలి పట్టికొన్న నంగన యొకవ్రేల వ్రేయ నది కత్తివిధంబునఁ దాఁకి కత్తిరించిన క్రియఁ ద్రెంచె వెండ్రుకలు చేశఁ దెమల్చిన యంత కివ్వలన్." నిర్వ. ౫, ఆ. ౧౭. "గీ. కత్తిఁ గుత్తుకను బిడానఁ గత్తిరించి." చంద్రా. ౨, ఆ. ౮౮.

కత్తిరిల్లు. ద్వ. అ. క్రి. ఖండితమగు. "గీ. భటుఁ డొకఁడు వింటఁ జాఱుకంటఁ బందిసేయ..., అతిభయద ఘుర్ఘురారావ మడర నతని, రెండుతొడలును వెసఁ గత్తిరిలఁగఁ జంపె." శుక. ౧, ఆ.

కత్తివాలితూపు. ద్వ. వి. అర్ధచంద్రబాణము. "క... అనిలసుతుఁడు కొండతునియ పైఁ జెంగ త్తివాలి తూపున..." భా. రా. యు. ౯౯౮.

కత్తివాలియమ్ము. = కత్తివాలితూపు. "ఆ. వాఁడి యైనకత్తివాలియమ్మును గొని, పగతుశిరము చెక్క లెగయ గోసె." భార. అర. ౬, ఆ. ౨౫౦. ('అర్ధచంద్రేణబాణేన' అని మూలము.)

కత్తులబోను. ద్వ. వి. (కత్తులు+బోను.) మృగాదులను పట్టుకొనుటకు చంపుటను కత్తు లమర్చిన బోను. "చ. గడలు గుడార్లు పగ్గములు కత్తుల బోనులు గడ్డపారలున్, వడిఁగొని పేటిదొమ్మరులు వచ్చిరి..." చెన్న. ౨, ఆ. ౨౦౯. విశ. కత్తులబోనువంటిది, ప్రమాదకరము. "ఉ... ఏమిట నెంచి చూచినన్, గత్తులబోనుకాఁపురము కామిని నీతలఁ పొప్ప గీయెనన్." చెన్న. ౪, ఆ. ౨౭౭.

కత్తువ. దే. వి. 1. మన్ను కెల్లగించెడుగసిక. (శ.ర.); 2. గనిము, చేనిగట్టు. ఆం. భా. ద్వి. ౮.

కత్త్రృణము. సం. వి. అ. న. 1. నిమ్మగడ్డి; 2. నాఁచు; 3. గడ్డియిల్లు.

కత్తె = కత్తియ. (శ. ర.)

కత్తెము = కత్తియము. (శ. ర. బ్రౌ.)

కత్తెర. వై. వి. (సం. కర్తరీ. ప్రా. కత్తరీ.) 1. కత్తిరించునొకానొకసాధనము; 2. (సం. కృత్తికా.) కృత్తికానక్షత్రము. "సీ. పూచినకొరవిపూఁబోద రింటిచందానఁ గత్తెర యొక్కచోఁ గదల కుండె." కాశీ. ౧, ఆ. ౧౩౮; 3. భరణీమూఁడు నాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమందును సూర్యుఁడుండు కాలము. (శ. ర. వా.)

కత్తెరకాఁడు. ద్వ. వి. (కత్తెర+కాఁడు.) కత్తెర దొంగ; మోసకాఁడు. "సీ. ఎడకానితనములు నడుపుకత్తెరకాండ్రకిచ్చకంబులు గాఁగ మెచ్చు లొసఁగి." ప్రబంధ. ౬౭౫.

కత్తెరకాలు. ద్వ. వి. (కత్తెర+కాలు.) 1. అందలపు కాళ్లకు అడుగున పోటిగా అమర్చెడుమార్పు కాలు. (శ. ర. బ్రౌ.); 2. మరకాలు. (వా.)

కత్తెరపోల = కత్తెర. (కత్తిరించుసాధనము.) (బ్రౌ.)

కత్తెరగడ్డము. ద్వ. వి. (కత్తెర+గడ్డము.) కత్తెర వేసినగడ్డము. శుక. ౨, ఆ. ౪౧౨.

కత్తెరగాయము. ద్వ. వి. (కత్తెర+గాయము.) కత్తెర విధముగ నుండునొకవిధమగు గవాక్షము. "మ. పురిచుట్టున్ నిశరుండు సారణుఁడునున్ భోజాంధనుల్ గూడి క,త్తెరగాయంబుల గండ్లమూంగడల సందిం గొమ్మకొమ్మన్ నిరం,తరమున్ సాదన దీవె లెత్తి..." ఉ. హరి. ౨, ఆ. ౯౪.

కత్తెరచీల. ద్వ. వి. (కత్తెర+చీల.) మీటయొక్కయు మునసయొక్కయు చీల వదలి రాకుండ దాని చివరరంధ్రమున అడ్డముగా వేసెడుచీల. (శ. ర.)

కత్తెరదొంగ. ద్వ. వి. (కత్తెర+దొంగ.) జేబులు మొ. కత్తిరించి దొంగిలించువాఁడు. వేంక. మాన. ౩౧, ఆం. సం. మాన. ౧౧.

కత్తెరబావిలీ. ద్వ. వి. (కత్తెర+బావిలీ) ఆఁడువారి యొకరకపు చెవినగ. (శ. ర. బ్రౌ.)

కత్తెరయెండ. ద్వ. వి. (కత్తెర+ఎండ.) తీవ్రాతపము, కత్తెరలో కాయునెండ. (బ్రౌ. వా.)

కత్తెరవంగ. వై. వి. (సం. కర్తారికా.) పెద్దవంగ*. ఆం. భా. ద్వి. ౫౯.

కత్తెరవాసము. ద్వ. వి. (కత్తెర+వాసము.) ఎదురెదురుగా కత్తెరవలె నుంచువాసము. (శ. ర.)

కత్థన. సం. వి. ఆ. స్త్రీ. = కత్థనము.

కత్థనము. సం. వి. అ. న. ఆత్మస్తుతి. విశ. (అ. ఆ. అ.) ఆత్మస్తుతి చేసికొనునది.

కత్రి. దే. వి. జక్కిణి యనునాట్యముయొక్క ఒకానొకయంగము. "సీ. లాఁగుమైసిరియుఁ బల్లటియుఁ గత్రియు బెళ్క విలసిల్లుజక్కిణివిధ మొకర్తు." ఉ. రా. ౬, ఆ. ౧౩౯.

కత్రించు = కత్తిరించు. "సీ. కేరాజుపోల్కిఁ గత్రించునంచపురేకుబొట్టును నొసలికిఁ బొందు పఱిచి." పార్వ. ౫, ఆ. ౧౮౮.

కథ. సం. వి. ఆ. స్త్రీ. 1. చరిత్ర; 2. వృత్తాంతము; 3. చెప్పుట; 4. ఇంచుక సత్యమైనకల్పితప్రబంధము. (కాదంబరి మొ.)

కథంభూతము. సం. విశ. (అ. ఆ. అ.) ఎటువంటిది.

కథకుఁడు. సం. వి. అ. పుం. పురాణకథకుఁ డగు సూతుఁడు. విశ. (అ. థికా. అ.) 1. చెప్పువాఁడు; 2. కథలు చెప్పువాఁడు.

కథనము. సం. వి. అ. న. చెప్పుట.

కథనీయము. సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁదగినది.

కథనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చెప్పువాఁడు.

కథయిత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) చెప్పువాఁడు. కథకుఁడు.

కథానకము. సం. వి. అ. న. పెక్కుచిన్నకథలు గల గ్రంథము.

కథానాయకుఁడు. సం. వి. అ. పుం. కథలోని ప్రధాన [పురుషుఁడు.

కథాపీఠము. సం. వి. అ. న. పీఠిక, ఉపోద్ఘాతము.

కథాముఖము. సం. = కథాపీఠము.

కథాశేషుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కీర్తిశేషుఁడు, మృతుఁడు.

కథించు. సం. స. క్రి. చెప్పు. "క. అనఁటయు వైశంపాయనుఁ,డనఘా ..కథింతు నీమకోరిక యలరన్." హరి. ఉ. ౫, ఆ. ౧౦౩.

కథితము. సం. వి. అ. న. కథనము, చెప్పుట. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినది.

కథ్యము. సం. = కథనీయము.

కద్. సం. కుత్సితార్థక మగు 'కు' అను అవ్యయమునకు వచ్చుఆదేశము. ఉదా:—కదన్నము, మొ.

కద. యం. దే. అవ్య. (కాదు+ఆ. దీనిరూపాంతరములు కాదా, కాదె, కదె, కా, క, మొ.) ఇది సందర్భానుసారముగా, నిశ్చయము, ప్రశ్నము, మున్నగువానిం దెల్పును. 1. నిశ్చయము. "గీ. అతివచిఱునవ్వు వీక్షించునప్పుడు కద, యీశరచ్చంద్రచంద్రిక యింపొనర్చు." ఉ. రా. ౪, ఆ. ౧౭౨; 2. ప్రశ్నము. "క. కనుఁగొని యిది గద మందర,మని యడిగిన..." దశా. ౨, ఆ. ౧౪౦. వై. వి. కత, వృత్తాంతము. "క. మొదల నొకవేగువానిం,గద లరయంగఁ బనిచి పిదపఁ గార్యము సేయం,బడిల మని పలికె శరభుఁడు..." భా. రా. యం. ౧౭౨.

కదంబకము. ఉభ. వై. విశే. మిశ్రము, కలిసినది. "చ...వినీలకేశముల్, ముడిపడకుండఁ దీర్చి విరులుం గురువేరుఁ గదంబకంబుగాఁ, బొడవుగఁ గొప్పువెట్టి..." నా. పంచ. ౩, ఆ. ౨౨౬. సం. = కదంబము. సం. వి. అ. న. గుంపు, సమూహము. "ఎత్తుగీలి...,లంకాపురాంగ, ణాంబరచరత్కాలంబకదంబకములు." ఆము. ౪, ఆ. ౨౭.

కదంబము. ఉభ. వై. విశే. (సం. కరంబః. క. కదంబ. త. కతంపమ్.) మిశ్రము. "సీ. పన్నీటితోఁ గదంబము చేసి పూసినమృగనాభిపస రాచనగరు వెలుప." ఆము. ౨, ఆ. ౭౫. వి. యక్షకర్దమము, కలపము. ఆం. భా. ద్వి. ౧౬౩. "ఉ. కమ్మకదంబ మేల చెలిఁ గొంకిటఁ గూర్చినజాలు..." రా. వి. ౪, ఆ. ౯౨. (వృత్తియందంత్యవర్ణలోపము వైకల్పికము. ఉదా:— కదంబకాపులు. ద్వా. ౩, ఆ. ౨౦౬.) సం. వి. అ. పుం. 1. కడిమిచెట్టు; 2. ఆవచెట్టు; 3. దేవదారుశమిచెట్టు. న. గుంపు.

కదంబించు. వై. అ. క్రి. 1. మిశ్రమగు. "సీ. సాంబ్రాణిధూపవాసనఁ గదంబించువీథుల మంగళద్రవ్యములు ఘటించి." జై. ౭, ఆ. ౪౯. విప్ర. ౨, ఆ. ౫౨; 2. తగులుకొను, అంటుకొను. "గీ...అవ్వనజగంధి, మేనిజవ్వాదిపస గదంబించునొడలు,కడిగికొని వార్చి ప్రవరుఁడు..." స్వా. ౨, ఆ. ౭౪. స. క్రి. మిశ్రముచేయు, కలుపు. "సీ. గంబూర మించుఁ గదంబించి కొండఱు కలికికన్నియలు బాగా లొసంగ." భాను. ౨, ఆ. ౪౯.

కదధ్వము. సం. వి. న్. పుం. కుత్సితమార్గము, చెడుత్రోవ.

కదనము. సం. వి. అ. న. 1. యుద్ధము; 2. హింస; 3. పాపము; 4. మర్దనము; 5. విహ్వలత.

కదన్న = కద. "శా. అన్నం గొల్తు గదన్న..." భా. రా. యు. ౫౮౪.

కదన్నము. సం. వి. అ. న. కుత్సితాన్నము, చెడ్డకూడు. "గీ. అతులమృష్టాన్న మైనఁ గదన్న మైన." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౧౨౭.

కదపా. దే. వి. ఈనాందారునకు రయితు భూమి సేద్యము చేసికొనునిబంధనలతో వ్రాసి యిచ్చు పత్త్రము. (ఈనాందారు రయితునకు వ్రాసి యిచ్చునది కౌలు.)

కదము. ఉభ వై. వి. (సం. స్కంధః. హిం. ఖదమ్.) ఆస్కందితము, అశ్వగతివిశేషము. (శ. ర.) సం. వి. అ. పుం. మేఘము. విశే. (అ. ఆ. అ.); 1. శిక్ష నిచ్చునది; 2. సుఖము నిచ్చునది.

కదమ్మ = కద. "ఉ. అందెలు గట్టి కాలితోడుసై చననీవుగదమ్మ ప్రోదిరా,యంచలు..." స్వా. ౫, ఆ. ౬౧.

కదయ్య=కద. "క...కారుణ్యము, నాదెస నుంపం గదయ్య..." దశా. ౧, అ. ౧౫౪.

కదరము. సం. వి. అ. పుం. 1. ఆంపము; 2. మేల్కట్టు; 3. వెలిచండ్రచెట్టు. న. పాలవిఱుగు.

కదరమ్మ = కద. "గీ...అవ్వేలఁదియొంత, వంత న డలెనొ గదరమ్మయింతులార." రసిక. ౪, ఆ. ౪౪.

కదరయ్య = కద. "గీ...మాపద్మగంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ,గూర్పఁ గదరయ్య..." సా. ౨,ఆ. ౧౭౦.

కదరె = కద. "గీ. ఎంత బడలెనొ కదరె..." రసిక. ౪, ఆ. ౧౭౭. [రుక్మి. ౨, ఆ. ౭౩.

కదరే = కదా. "శా...రుక్మి యుబ్బుఁ గదరే..."

కదర్యుఁడు. సం. విశ. (అ.ఆ. అ.) లోభి, పిసినిగొట్టు.

కదలాడు. దే. అ. క్రి. (కదలి+ఆడు. స్వార్థమున.) చలించు, కదలు. "చ...మద్దికాయలు కడుం గదలాడఁగ..." కవిరా. ౨, ఆ. ౪౭.

కదలారతి. ద్వ. వి. (కదలు+ఆరతి ?) వివాహాదిశుభ సమయములందు వధూవరాదులు ప్రవేశించు నపుడు హరిద్రాజలాదులతోఁ గూడినతట్టలతో నెత్తుహారతి. (చూ. కదలారతిపళ్లెరము.)

కదలారతిపళ్లెరము. ద్వ. వి. కదలార తిచ్చుటకు రకపుఁబళ్లెము. "వ...జాళువాకదలారతిపళ్లె రంబు సొంపున..." చంద్రికా. ౪, ఆ. ౬౯.

కదలించు = కదల్చు. "గీ. పట్టెఁ గదలించె...మందర నగంబు." హార. ౬, ఆ. ౪౪.

కదలిక. దే. వి. 1. చలనము. "గీ. కదలికల జాఱు జిలుఁగుఁబయ్యెదలతోడ." పరమ. ౪, ఆ. ౧౦౧; 2. యత్నము. "క. ఇది వేళ గాదు చొరఁబడి, వెదకఁగ నని యున్నయతనివెరవు త్రిలోకా, భ్యుదయాంకురార్పణం బీ,కదలిక యీడేర్తు నన్నగతి రవి గ్రుంకెన్." రామా. ౬, ఆ. ౧౦౬; 3. యాత్ర, చనుట. ఆం. భా. ద్వి. ౨౧౯.

కదలు. దే. అ. క్రి. (క. కదలు. త. కదల్.) 1. చలించు. "వ. ఒయ్యనొయ్యనం గదలుతూఁగు టుయ్యలలం గన్ను మొగిచియున్నవిలాసినీవిలా సులును..." పారి. ౨, ఆ. ౫౨; 2. ప్రయాణ మగు. "గీ. కాశికాక్షేత్రమున కేఁగఁ గదలి రపుడు." కాశీ. ౨,ఆ. ౩౨; 3. యత్నించు. "గీ... బాణమొక్కటి సంధించి యేయఁ,గదలఁ గన్గొని పల్కె నాకాశవాణి." జై. ౫, ఆ. ౧౨౨; 4. నడచు. "ఆ. కాలఁ జెప్పు లిడక కదలరాదు." వి. పు. ౨, ఆ. ౨౪౫; 5. వెడలు. "క...ఎందుఁ గదలెద వింకన్." సా. ౨, ఆ. ౯౭; 6. పాఱి పోవు. ఆం. భా. తృ. ౦౬; 7. నశించు. "సీ. పఱమొఱ ల్గప్పినఁ బాడఱి నుసుఁగాంతి గదలిన యమృతాంశుకళ యనంగ." భార. విరా. ౧, ఆ. ౨౯౪; 8. దండెత్తు. "గీ. గాటమై యెల్లి వానిపైఁ గదలవలయు." రాజ. చ. ౨, ఆ. ౫౯. వి. 1. కదలిక. "సీ. తలఁపులసందడి దండడించిన తాల్మి కదలు శిరఃకంపగతుల మెఱయ." భార. అర. ౭, ఆ. ౨౦; 2 ప్రయాణము. ఆం. భా. ద్వి. ౨౧౯.

కదలుచు. దే. స. క్రి. కదలించు, చలింపఁజేయు. "గీ. కరము లంఘ్రులు నల్లార్చి కదలుపుమరు, రామకృష్ణులు శైశవరతులఁ దగిలి." భాగ. ౧౦, స్కం. పూ. ౨౧౯. [౨౧౯.

కదలుడు. దే. వి. కదలిక, యాత్ర. ఆం. భా. ద్వి.

కదలుపరుపడి. దే. వి. మల్లబంధవిశేషము. హంస. ౧, ఆ. ౨౦౬. [ఆ. ౨౦౬.

కదలుమొన. దే. వి. మల్లబంధవిశేషము. హంస. ౧,

కదల్చు = కదలుచు. "ఉ...వీణియఁ గదల్చుచు నల్లన సారె మీటుచున్." జాహ్నవీ. ౪, ఆ. ౧౭.

కదళము. సం. వి. అ. పుం. 1. అరఁటిచెట్టు; 2. కోల పొన్నచెట్టు.

కదళి. సం. వి. ఈ. స్త్రీ. 1. అరఁటిచెట్టు; 2. వైజ యంతి, టెక్కెము; 3. ఒకజాతిలేడి.

కదళీదండము. సం. వి. అ. పుం. అరఁటిదూఁట.

కదవమ్మ = కద. "గీ...కాఁక, ముమ్మరం బయ్యెఁ గద వమ్మ ముద్దుగుమ్మ." ఇందు. ౩, ఆ. ౯.

కదవయ్య = కద. "గీ. కావఁ గదవయ్య..." నైష. ౧, ఆ. ౧౦౭. [..." ఉ. రా. ౧, ఆ. ౭౦.

కదవయ్యా = కదా. "మ...జయింపఁ గదవయ్యా

కదవె = కద. "సీ...చిఱునవ్వు నవ్వఁ గదవె." రసిక. ౫, ఆ. ౧౪౨.

కదవే = కదా. "శా...తెల్పఁ గదవే యేతత్పురా వృత్తమున్." దశా. ౧, అ. ౨౨౭.

కదా. సం. అవ్య. ఎప్పుడు. దే. అవ్య. 1. కిలార్థకము. 2. ప్రసిద్ధిని తెలుపును. "ఉ. హారిహాయుఁడేమియయ్యెనొకదా..." నైష. ౪, ఆ. ౬౫. (అయ్యెనొకో...ముద్రిత. పా.)

కదాచిత్. సం. అవ్య. ఎప్పుడో ఒకసారి.

కదించు. దే. స. క్రి. 1. దగ్గఱగా వేయు. "చ. తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూర్చుచునున్నవాఁ డిసీ,పలువ మజెంతనేర్చ రని భర్తఁ జూపి..." హంస. ౨, ఆ. ౨౧౪; 2. బిగించు. "ఉ...కడెన్ గదించి..." హంస. ౫, ఆ. ౭3; 3. అతుకు. "చ. కరఁగను బోఁతఁ బోయఁ గను గ్రాఁచి కదింపను గమ్మిదియఁగా...అతండు నేరిచెన్." హంస. ౨, ఆ. ౧౯౨; 4. ధరించు. "ఉ...కదించినమేల్మడిచీర..." హంస. ౨, ఆ. ౧౭౫; 5. కలుపు, కూడఁజేయు. "క. పెంచినదానవు దానిఁ గదించినదానవును నీవె..."రాధికా. ౪, ఆ. ౫౨; 6. చేరు. "చ... కదింపవు చేడెలకొప్పు లాతపో,ఖ్యముగ ఫలింతుమంచు మధు వానఁగఁ జేసెను దేంట్లఁ గ్రొవ్విరుల్." పార్వ. 3, ఆ. ౭.

కదియఁబడు. ద్వ. అ. క్రి. (కదియన్+పడు-స్వార్థమున.) 1. కలియఁబడు. "ఉ. అత్తటి మాళ్వుఁడు గదియంబడి..." దశ. ౧౨, ఆ. ౬౫. నిర్వ. 3, ఆ. ౨౭; 2. కలుగు. "చ...అడుగులఁ దొట్రుపాటు కదియంబడు...మరులెత్తినయాఁటదానికిన్." కువల. 3, ఆ. ౧౦౦.

కదియించు. దే. స. క్రి. 1. బిగించు. "గీ. తలుపు గదియించి రతికేళి సలుపుచుండె." హంస. ౨, ఆ. ౨౦౬; 2. రచించు. "క. మృదుమధురరచనఁ గావ్యము, గదియించినయట్లు..." వా. రా. ౧, ఆ. ౧౪; 3. ఖచించు, పొదుగు. "చ...తమ్మికెం,పులు గదియించినట్టిజిగిపుత్తడిముక్కలిపీఁట..."నీలా. ౧, ఆ. ౬౧; 4. చేర్చు. "వ... అంజలిపుటంబు నిటలంబునం గదియించి." కాశీ. ౫, ఆ. ౧౧౫; 5. మర్దించు. "సీ. కరమునఁ జాలిండ్లు గదియించి కదియించి యధరపల్లవరసం బాని యాని." అని. ౨, ఆ. ౯౧; 6. కట్టు. "చ...బిగియన్ గదియించి నిమంగయుగ్మమున్." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౯౨.

కదియిక. దే. వి. (కదియు ధా.) కదియుట, దగ్గఱగా వచ్చుట.

కదియు. దే. అ. క్రి. 1. సమీపించు. "మ. కదిసెన్ లగ్నము..." స్వా. ౫, ఆ. ౫౯; 2. కలియు. "సీ. కపట లాండొంటితోఁ గదియుచు..." భార. విరా. ౧, ఆ. ౧౬౨; 3. అంటు. "సీ. కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి..." నైష. ౫, ఆ. ౯; 4. సమాన మగు. "మధ్యాక్కర...వేవురకుఁ, గదియంగ నుత్తము నొక్కరుఁ బడయఁ గమలాక్షి వలతొ." భార. ఆర. ౨, ఆ. 3౫౧; 5. కలుగు. "గీ. అసుర వక్త్రంబులందు దైన్యంబు గదిసె." దశా. ౨, అ. 3౦౧. స. క్రి. 1 చేరు. "సీ...శీఘ్రముగ గవాక్షంబు గదిసె నొకతె." ఇందు. ౬, ఆ. ౫. జై. ౭, ఆ. ౮౦; 2. మార్కొను. "ఉ. ఆలములోన నను గదిసి..." ఉ. హరి. ౧, ఆ. ౬౧; 3. రమించు. "ద్వి. కామాంధుఁడై తల్లిఁ గదిసినయతఁడు." ద్వి. హరిశ్చ. ఉ. ౬౮ పం.

కదుకొను. దే. అ. క్రి. (కదుము+కొను.) అతిశయించు. "చ. కదుకొని వేఁడిబాష్పములు గ్రమ్మి పయింబయిఁ బర్వ భీతిమై,నదరుచు .."భా.రా. యు. ౨3౪౬.

కదుపు. వై. వి. (సం. కదంబమ్.) 1. సంఘము. అం. భా. ద్వి. ౨౦౦; 2. గోసమూహము. సాం. ని. తిర్య. ౭3; 3. కాల్బలము. మొ. "క. కదిసిన బలములు విచ్చిన,కదుపులఁ జెదరంగనీక..." భార. విరా. ౪, ఆ. ౨౧; 4. పశుపక్ష్యాది సంఘము. ఉదా:—ఎనుపకదుపు. అము. ౪, ఆ. ౧౨3. చిల్కకదుపు. ఉ. రా. ౬, ఆ. ౨౭. మొ.

కదుపుగట్టు. దే. అ. క్రి. (కదుపు+కట్టు.) గుమిగూడు, కలసిమెలసి యుండు. "గీ...,పులులతో నలు జింకపిల్లలు మృగేంద్ర,పోతకంబులు నాల క్రేపులును గదుపు, గట్టుకొని కూడి మాడ..." పిన. శకుం. ౨, ఆ. ౪౯. "ఆ. అందుల మెలఁగు కరులైరావతముఁ దామఁ, గదుపుగట్టి మేసి మదము గురియు." ద్వా. ౨, ఆ. ౭3. (ఇట్లే: కదుపులుగట్టు, కదుపులుకదుపులుగట్టు మొ.)

కదుము. దే. స. క్రి. (క. కదులు.) 1. ఆక్రమించు; పైఁబడు. "చ...తన్, గదిమినపంచసాయక

వికారము లించుక కట్టిపెట్టి..." వి. పు. ౬, ఆ. ౯౩. "క...బహువిధోగ్రాస్త్రములన్, జిదురు పలుక నొనరించిరి, కదిమి సురాభాదిదనుజగణ దేహంబుల్." ప్రభా. ౫, ఆ. ౨౧౬; 2. పీడించు, హింసించు. "క...,కదిమెం గుజ్జాపుఁ బొఁజు గగ్గులకాడై, చెదరంగ..." కాశీ. ౨, ఆ. ౮౧. వి. దెబ్బతగిలినచోట నెత్తురు గడ్డ కట్టి వాఁచువాఁపు, బొప్పి. ఆం. భా. ద్వి. ౧౩౦.

కదుముకట్టు. దే. అ. క్రి. (కదుము+కట్టు.) దెబ్బ తగులుటచే రక్తము గడ్డకట్టు; బొప్పికట్టు. (బ్రౌ. వా.)

కదురు. దే. అ. క్రి. 1. కలుగు. "క. గుదతలము నొవ్వఁ దోమినఁ,గదురును రోగంబు..." భార. అను. ౩, ఆ. ౨౭౮; 2. అతిశయించు. "చ. కినుక మనంబునం గదిరి క్రీడి..." భార. విరా. ౫, ఆ. ౧౭౬; 3. వ్యాపించు. "క...ముంద అను దృష్టి గదురఁగ వలయుఁన్." వి. పు. ౮, ఆ. ౨౮౬; 4. విజృంభించు. "చ. ప్రిదులని శౌర్యసంపదలఁ బెట్టినదండలు ద్రిప్పకే కడుం, గదురుచు హుంకరించుచును...పోరిరి వేరు వాఱుచున్." కళా. ౭, ఆ. ౧౦౦. (శ. ర. పా. 'కదుముచు' ముద్రి.) వి. 1. (క. కదురు. త. కదిర్.) తర్కువు, నూలు వడికెడుసాధనము. ఆం. భా. ద్వి. ౯౫౮; 2. తృణవిశేషము. "గీ. కదురు తుంగాను తుంగలు కలయ విడిచి." హంస. ౫, ఆ. ౮౭.

కదురుకొను. దే. (అ). క్రి. (కదురు+కొను. స్వార్థమున.) 1. కవియు, ఎదుర్కొను. "సీ. శాకినీ భూతపిశాచబేతాళముల్ కహకహకహమంచు కదుసుకొనఁగ." దశా. ౮, ఆ. ౨౧౩; 2. అతిశయించు, మిక్కుటమగు. "వ...సిదుర గదియమిఁ గెంజిగి గదురుకొనుకనుదుదలును..." చంద్రి. ౮, ఆ. ౧౦౭.

కదుష్ణము. సం. వి. అ. న. నులివెచ్చన. విశే. (అ. ఆ. అ.) నులివెచ్చనిది.

కదె = కద. "క...కొడుకులఁ,గనియెను గదె దేవ యాన..." య. ౫, ఆ. ౮౩.

కదే = కదా. "క...ప్రతుష్టి మేకొనఁడు గదే." పాండు. ౮, ఆ. ౧౭౦.

కద్ది. దే. వి. (క. కద్ది.) ప్రణయతాపము, వలపుబాధ. "ఉ. అద్దముఁ జూచి బిట్టులుకు నానతిఁ జేసిన సంచలించు న,మ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చట చేసినయంతనుండి యి,క్కద్ది నెఱింగి చందురుని గానఁగనీరు..." కావ్యా. ౧, ఆ. ౬౭.

కద్దు. దే. అ. క్రి. (కలదుయొక్క రూపాంతరము) కలదు, ఉన్నది. "క...,ముద్దులు గుల్కు మొగంబును, గద్దో లే దనెడునడుము గల దాచెలికిన్." సురా. ౩౧. "మ. అనినం గద్దొక వింత దెల్పెదను నీ వాలింపుమా..." సానందో. ౨, ఆ. ౧౬౧.

కద్రువ. సం. వి. ఊ. స్త్రీ. కశ్యపునియొకభార్య, పన్నగులతల్లి.

కద్రువు. సం. వి. ఉ. పుం. పింగళవర్ణము. విశే. (అ. ఆ. అ.) పింగళవర్ణము గలది.

కద్రూజము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

కద్వదుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తుచ్ఛపుమాట లాడువాఁడు.

కన. దే. అవ్య. ద్రు. 1. కనుక, కాఁబట్టి. "క. తన కొఱకుఁ గఱకురిపులం,గని యని మొదలించి పొలియుఁ గన నశ్రద్ధం, గనుఁగొనక మనుజపతికిం,దన మేనిం బోలెఁ బ్రోవఁ దగు భటపంక్తిన్." వేం. పంచ. ౧, ఆ. ౫౨౦; 2. వాక్యాలంకారము, ఊఁతపదముగాఁ బ్రయుక్తము. "క. ఈహాయరత్నము గన మన,సాహిణమున నున్ననీదుసామ్రాజ్యశ్రీ, కూహించి తెలియఁ బ్రథమో, దాహరణముగాదె యన ముదంబున నతఁడున్." జై. ౮, ఆ. ౫.

కనఁబడు. ద్వ. అ. క్రి. (కనన్+పడు.) అగపడు. "మధ్యా...అవ్వి యొంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద..." భార. అర. ౨, ఆ. ౧౬౯.

కనకతప్పెట. మి. వి. (కనకము+తప్పెట.) పటహము, వాద్యవిశేషము. (శ. ర.)

కనకదండెలు. మి. వి. బ. వస్త్రవిశేషము. (చూ. కచ్చిలములు )

కనకన = గనగన. "క. కనకన వెలుఁగుచు నిదిగోఁ, గననయ్యెం గనకశరణి గరుడధ్వజమున్." దశా. ౧, ఆ. ౧౭౨.

కనకనమను. దే. అ. క్రి. (కనకన+అను.) 1. మిక్కిలి ప్రకాశించు. "క...ఎక్కిరొగిక్, గన కనగోపమితములై, కనకనమను సౌధవీథికల కుక్ గడఁకన్." లక్ష్మీ. 3, ఆ. ౬౫; 2. మిక్కిలి మండు. "గీ. కనకనమను నిప్పుఁ దునుక లనఁగ." య. ౨, ఆ. ౭౬.

కనకనలాడు = కనకనమను. (శ. ర. వా.)

కనకము. సం. వి. అ. న. బంగారము; పుం. 1. సంపెఁగచెట్టు; 2. ఉమ్మెత్తచెట్టు; 3. కాంచనముచెట్టు; 4. నాగకేసరముచెట్టు; 5. మోదుగుచెట్టు; 6. కసిందచెట్టు; 7. కడిమిచెట్టు; 8. మహిషాక్షము.

కనకరంభ. సం.వి. ఆ. స్త్రీ. స్వర్ణకదళి, పచ్చఅరఁటిచెట్టు.

కనకాంగి. సం. వి. ఈ. స్త్రీ.—బంగారువంటిదేహము కలది—సౌందర్యము గలస్త్రీ; స్త్రీ. "చ... కన్నులకఱ వెల్లఁ దీఱఁగఁ గనుంగొనియెం గనకాంగి...గాధినందనున్." గాథే. ౫౯.

కనకాచలము. సం. వి. అ. పుం. మేరుపర్వతము. ఇట్టే: కనకగిరి, కనకశైలము మొ.

కనత్. సం. (శతృ.) ప్రకాశించుచున్న. "శా... హేమచంద్రకకనద్వర్మంబు..." భార. విరా. ౧, ఆ. ౨౩౫.

కనరు. దే. అ. క్రి. వెగటుచూపు, అసహ్యించు. "వ...పొనరుచుం దెరలుచు వనరుచుం గనరుచు నొగులుచుం బొగులుచు..." పిన. శకుం. 3, ఆ. ౧౯౧. వి. 1. వెగటు. "శా...ఉద్గారంపుంగన రార్చు భోగులకు...నారికేళాంబువుల్." ఆము. ౨, ఆ. ౬౮; 2. కోపము. ఆం. భా. ప్ర. ౧౩౫; 3. (కందమొ. వాని) నస, దురద. (శ. ర.) విణ. 1. అహితము. "ఉ...ఓ, రావణ నాదుబుద్ధి వినరా కనరా కనరా శుభస్థితుల్." సమీర. 3, ఆ. ౧౧౬; 2. వెగటైనది. (వా.)

కనరువోవు. దే. అ. క్రి. (కనరు+పోవు.) కాటువోవు, కాటువాసనవేయు. "సీ. కనరువోకుండఁ గాఁచినయానవాలతోఁ గడి సేయవచ్చు మీఁగడలతోడ." పిన. శకుం. ౧, ఆ. ౧౩౫.

కనరెక్కు. దే. అ. క్రి. (కనరు+ఎక్కు.) 1. కాటువోవు. (వా.) 2. వెగటుదోఁచు. సా:—తినఁగాఁ దినఁగా గారెలు కనరెక్కినట్లు.

కనలించు. దే. స. క్రి. (కనలు ధా. ప్రే.) కోపపడఁజేయు. "క. బరిగోలచేత మదసింధురముం గనలించినట్లు దూపుల నాభూవరుఁ గనలించుచు..." భా. రా. అర. ౧, ఆ. ౨౩౪.

కనలు. దే. అ. క్రి. (క. కనలు.) 1. మండు. "మ. ...అగ్నిజ్వాల లొక్కుమ్మడిం, గనలం గన్గొని ..." హరి. పూ. ౬, ఆ. ౧౪౭; 2. కోపించు. "గీ...పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ,గనలి కౌరితో..." భార. ఉద్యో. 3, ఆ. ౧౦౦. శుక. 3. ఆ. ౧౨౦; 3. తప్తమగు. "క. అని మది విరహానలమునఁ, గనలుచు..." సురా. ౭౭. వి. 1. కోపము. ఆం.భా. ప్ర. ౧౩౫. "చ. ...వే కనలు గైకొని దూఱె విభుండు కేతకిన్." నైష. ౧, ఆ. ౯౨. ('ఇతి క్రుధా కృశ్యత తేన కేతకమ్' అని మూలము;) 2. మంట. (శ. ర.) విణ. మండునది. "సీ...కనలు టగ్గిఁ, ద్రోయించి..." నృసిం. ౪, ఆ. ౧౭౮.

కనాతి. హిం. వి. (హిం. కనాత్.) బట్ట. (చూ. కనాతిగోడ.)

కనాతిగోడ. మి. వి. (కనాతి+గోడ.) బట్టతోఁ జేర్పఱచినగోడ, సరాతి. ఆం. భా. ద్వి. ౧౫౯.

కనారిలు. దే. అ. క్రి. 1. కోపించు. "చ...రావణుండు...కనారిని వేల్పులమీఁదఁ జూపువి, క్రమము..." ఉ. రా. 3, ఆ. ౩౧౪; 2. పరితపించు. "ఉ...నిజనందను లందఱు నన్యజాతు లన్నం దలవంపులై మదిఁ గనారిలె..." సమీర. ౧, ఆ. ౨౨౦.

కనికనములు. దే. వి. బ. చూచుట చూడకపోవుటలు. "క. గూఢాగూఢవ్యంగ్యము, రూఢిం గని కనము లమరురుచులు దనర్పన్." కాళిందీ. ౧, ఆ. ౧౮౨.

కనికరము. దే. వి. (త. కనికరం) 1. దయ. ఆం. భా. ప్ర. ౧౩౧. 2. శోకము. "సీ. వలరాచరాచవాఁ డలికాత్తుకను వెచ్చఁ గరఁగిన యల కనికరపుఁజోటు." స్వా. ౨, ఆ. ౯.

కనికరించు. దే. అ. క్రి. 1. కరుణించు, దయయుంచు. (శ. ర.); 2. శోకించు. (శ. ర.) స. క్రి. కరుణించు, వా:—అధికారులు వానిని గనికరించినారు.

కనిపట్టు. దే. స. క్రి. క్రొత్తఁగాఁ గనుఁగొను, వెదకి పట్టు. "చ. పరిమెయిఁ బాఱి వానిఁ గనిపట్టి పడిం బెడకేలు గట్టి తెచ్చిరి..." భార. శాం. 3, ఆ. ౫౦౫.

కనిపించు. దే. అ. క్రి. కనఁబడు. "సీ. వినుఁ గెంపుఁ బతకంబు గనిపింప సురదీర్ఘికా చేలయై మించె గగనలక్ష్మి." ఉ. రా. ౧, ఆ. ౧౩౬. స. క్రి. 1. చూపించు. "మ. అని సుగ్రీవునిఁ దోడితెచ్చి నయవిద్యాధాముని న్రామునిన్, గనిపించెన్..." రామా. ౫, ఆ. ౨౭౪; 2. కలుగఁజేయు, "మ. తనకర్మంబె శుభాశుభస్థితులు తత్తద్వేళలన్ బ్రాణికిన్, గనిపింపన్..." సమీర. ౧, ఆ. ౨౫౪; 3. పురుడుపోయు; ప్రసవింపఁజేయు. "సీ...మగువలఁ గనిపించు మంత్రసాని." చంద్రా. 3, ఆ. ౧౦౧.

కనిపెట్టుకొను. దే. అ. క్రి. 1. ఎదురుచూచు. "గీ...నీ వెప్పు డుదయ, మొంది తటమున్న యట్ల నీ కొసర నిత్తు, నేను గనిపెట్టుకొని వచ్చి..." కళా. ౫, ఆ. ౯౭; 2. వేచు, ఆఁగు. (వా.)

కనియు. దే. అ. క్రి. 1. పక్వమగు. "క...తపమున్, కనియంగఁ బండెఁ దమ కని..." హరి. ఉ. 3, ఆ. ౧౬౧. "చ...,కనియఁగఁ బండియుండు..." భార. అర. ౭, ఆ. ౪౪౬. (శ. ర. పా. తనియఁగఁబండియుండు. అని ముద్రిత. పా).; 2. మెత్తగిలు. (ఆం. పద.) స. క్రి. చూచు. (ఆం. పద.)

కనిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. చిటికెనవ్రేలు; 2. తమ్మునిభార్య; 3. చెల్లెలు; 4. ఒకానొకనాయిక.

కనిష్ఠిక. సం. వి. ఆ. స్త్రీ. చిటికెన.

కనిష్ఠుఁడు. సం. వి. అ. పుం. తమ్ముఁడు. విణ. (అ. ఆ. అ.) 1. అతిహీనుఁడు; 2. అతితరుణుఁడు.

కనిసెరము. దే. వి. శ్యేనము, డేగ. సాం. ని. తిర్య. ౭౯.

కనీని. సం. వి. ఈ. స్త్రీ. కనీనిక.

కనీనిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిటికెన; 2. కంటి నల్లగ్రుడ్డు.

కనీయుఁడు. సం. వి. స్. పుం. తమ్ముఁడు. విణ. (స్. యసీ, స్.) = కనిష్ఠుఁడు.

కనీసము. వై. విణ. (సం. కనీయస్.) అధమము. (శ. ర. వా.)

కను. దే. స. క్రి. (దీనికి కాంచన్, కానక, కానమి, కానని, కానేఁడు మొ. రూపములు వచ్చును.) 1. చూచు. "క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ, గన్నది కాదు..." భార. ద్రో. 3, ఆ. ౧౯౭. ఆర. 3, ఆ. ౯౪; 2. ప్రసవించు. "చ...ననుం గని కుంతి..." భార. ఉద్యో. ౪, ఆ. 33. దశ. ౯, ఆ. ౬౭; 3. గ్రహించు. "క...అప్పలుకునం, గనియెను దనపలుకుఁ దప్పుగా నతఁడు మఱిన్." భార. సౌ. ౨, ఆ. ౭౪. విక్ర. 3, ఆ. ౧౨౫; 4. పొందు. "గీ. తల్లి నీకులగోత్రసౌందర్యములకుఁ, దగినపతిఁ గంటి..." భార. ఆది. ౪, ఆ. ౬౧; 5. శరణుచొచ్చు. "ఉ...ప్రాంజలియై తనుఁ గన్నమీఁద నిట్టట్టనువాఁడు గాఁడు శరణాగతవత్సలుఁడు..." భా. రా. యు. ౭౭౮; 6. మార్కొను, ఎదిరించు. "మ. అట మిన్నందినయట్టివానిపొడవెం తన్నట్లు ఫాలాక్షునెక్కటికయ్యంబునఁ గన్నఫల్గును భుజాగర్వంబు లెక్కించుట..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౭౪. అ. క్రి. సంభవించు, కలుగు. "క. విను నిద్రాదోషంబునఁ, గనుకలలరజస్తమోవికారంబులచే..." భార. శాం. ౪, ఆ. ౩౧౮. వి. 1. నేత్రము. "క...,తెఱచినకను మూయక..." ఉ. రా. ౨, ఆ. ౧౬౪; 2. చెఱకు మున్నగువానిగనుపు. "సీ. కను గలవింటఁ జొక్కుపుంజపుల్ పుట్టించి..." వసు. 3, ఆ. ౫౩. విణ. అల్పము. (చూ. కనుచీఁకటి.)

1. కంటఁ బిసుకఁ బ్రాము = మోసగించు. దశ. ౬, ఆ. ౫౪.
2. కంటవత్తిడుకొను = జాగరూకత గలుగు. పాండు. 3, ఆ. ౫౬
3. కంటినొప్పి = పీడ. శుక. ౨, ఆ. ౨౮౩.
4. కంటిలోని నలుసు, కంటిలోని నెరసు = మిక్కిలిబాధించునది.
5. కంటివింటివజీరు = మన్మథుఁడు.
6. కనిపెంచువయసు-సానుడి-దశా. ౬, అ. ౪౫.

7. కను చూపుమేర = చూ. పానునంతదూరము. శుక. ౨, ఆ. ౯౬౬.

8. కనుచూఱ యొసఁగు = ఇష్టము వచ్చినట్లు చూడనిచ్చు. కవిక. 3, ఆ. ౧౯౧.

కనుంబొమ = కనుబొమ్మ. "ఉ. విండ్లకు మేల్తరంబు ఘనవేణిక నుంబొమదోయి బంగరుం, గిండ్లకు మేటి సాటి తులకించుచనుంగవ..." హంస. ౧, ఆ. ౬౧.

కనుఁగాపు. దే. వి. (కను+కాపు.) కనుసంజ్ఞచే ప్రభుచిత్తము గ్రహించి పనిచేయుంట కెదురు చూచు సేవకుఁడు. "ఉ. ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునున్ గనుగాపులట్ల మ్రొక్కెట్టియుఁ జేసి చేసియును వేసరి..." హర. 3, ఆ. ౧౧.

కనుఁగొను. దే. స. క్రి. (కను+కొను.) 1. చూచు. "మ...పౌత్రునిభూరిశ్రవసుం గనుంగొనుచు..." భార. భీష్మ. ౧, ఆ. ౯౪; 2. (మంచి చెడ్డలు.) విచారించు "వ. ఇట్లీరువ్వురుం బ్రవర్తించినవర్తనంబులు కనుంగొని విక్రమార్కుం డిట్లనియె." విక్ర. ౨, ఆ. ౯౨; 3. తెలిసికొను. "సీ. జనునవిశ్వాసంబు గనుఁగొని..." ఆము. ౪, ఆ. ౨౯౨; 4. గడించు. "చ...ఇప్పుడఁతులలోఁ గనుంగొను మహారమహోమహిమాను భావముల్." పారి. ౧, ఆ. ౬౧.

కనుఁజాటు. దే. వి. (కను+చాటు.) రహస్యము. "ద్వి. ఘనతపోమహిమచేఁ గన్నయాత్మజుని, గనుఁజాటుగా నుండఁగను జాటుసెట్టి" రం. రా. ఉ. ౯౨. పు. విణ. దాఁపురమైనది, రహస్యము. "క. కనుఁజాటులెండి నడిపిన,పనులం గండలును బెరిఁగి..." శుక. ౨, ఆ. ౨౦౭.

కనుఁబాటు. దే. వి. (కను+పాటు.) 1. చూపు. "గీ. శివునికనుఁబాటు దాఁకనిచిత్తభవుఁడో." విక్ర. ౮, ఆ. ౯౨. (శ. ర. పా. 'కనుఁజాటు' మ. ద్రి. పా;) 2. దృష్టిదోషము. "సీ. సుదతి నీమైఁ జక్కఁ జూచుట కోడెదఁ గనుఁబాటు వారయునో యని తలంచి." భార. విరా. ౨, ఆ. ౪౭. భార. భీష్మ. ౧, ఆ. ౧౮౯.

కనుఁబెంటి. దే. వి. (కను+పెంటి.) జీలుగుపిట్ట. (ఇది భవిష్యత్తు సూచించునదగుట నీపేరు వచ్చినది.) "సీ...కనుఁబెంటి నీరుకాకి." హంస. 3, ఆ. ౧౨. ఆము. ౬, ఆ. ౬౬.

కనుఁబ్రాము. దే. స. క్రి. (కను+ప్రాము.) మోసగించు. "క. అనుజన్మపథాగమనం, బొనరించిన ద్రోహి తగులనోర్వక నిన్నుం, గనుఁబ్రామి సాహరించిన, నను: జెందుసె దుష్కృతంబు నగచర తిలకా." రామా. ౯, ఆ. ౨౧౬.

కనుక. దే. అవ్య. ద్రు. 1. కావున. "గీ. తొలుత మాటలుపడి పుల్లసిలినవాఁడు, కనుక..." విప్ర. ౪, ఆ. ౮౭; 2. ఐనను. "ఉ. భూసుతకోసమే కనుక బొంకితి నేనియుం..." ఉ. రా. ౮, ఆ. ౮౬; 3. సుమా. "సీ. తడికట్లతోఁ ద్రొక్కొడవు చుమీ...ఇలు రమ్ము ముట్టెదు కనుక..." విప్ర. 3, ఆ. ౭౭; 4. అవధారణార్థకము. (చూ. కన్క.)

కనుకట్టు. దే. వి. (కను+కట్టు.) 1. గంత. "వ... కనుకట్టుతోడ మోములు మలంచుచు..." స్కా. ౪. ఆ. ౨౭; 2. కనుమాయ. "సీ...కనుకట్టొనర్చిన గాత లిడిన." ప్రబంధ. ౭౩౮.

కనుకని. దే. వి. 1. తత్తఱపాటు. "చ...వాని యుఁరంబుఁ బగిల్చి చంపినం, గనుకని బాఱె భీతిఁ యొసఁగంగఁ దదీయచమూసమూహముల్." భార. ఆర. ౬, ఆ. ౨౩౧; 2. భయము. "వ... సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనిం బఱవం దొడంగిన." భార. విరా. ౯, ఆ. ౧౯౬.

కనుకను. దే. వి. ఔ. (కను+కను.) ప్రతినేత్రము. "చ...ఈశ్వరుఁ గనుకంటఁ జూచిరఁట..." కు. సం. ౭, ఆ. ౬౨. అ. క్రి. జాగ్రత కలుగు. (బ్రౌ.)

కనుకలి. దే. వి. (కను+కలి) దృష్టి, చూపు. "సీ. ఇన్నాతిచెలువంబు గన్నశచీప్రియుండైనను గనుకలి నవయకున్నె." భార. విరా. ౨, ఆ. ౨౭. "సీ...కనుకలి వినుకలి గలిగినట్టి, పాపము దనకు నొప్పనిది..." భాగ. ౬. స్కం. ౪౬.

కనుకుట్టు. దే. విణ. (కను+కుట్టు.) 1. కంటిలోఁ కుట్టుచున్నట్లు చేయువాఁడు - బాధకుఁడు. "చ...విరాలిప్రోగులకనుకుట్టు..." రా. వి. 3, ఆ. ౮; 2. ఈర్ష్యాళువు. (చూ. కనుకుట్టుఁ

దనము.); 3. పగవాఁడు. "గీ. కలువకనుకుట్టు ప్రుందుతత్కాలమునను." సాంబో. ౨, ఆ. ౧౪౫.

కనుకుట్టుఁదనము. దే. వి. (కనుకుట్టు+తనము.) చూపోపమి, అసూయ. "వ...అవ్వదిశెలు దమ మఱఁదిప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁ దనంబున నతనిధర్మంబునకు విఘ్నంబు గావింపఁ దలఁచి..." భో. ౬. ఆ. ౧౨౫.

కనుకూర్కు. దే. అ. క్రి. (కను+కూర్కు.) కను మూయు, నిద్రించు. "చ. జరఠయొకర్తు కుంజ గృహాచంద్రశిలం గనుకూర్కుచుండ..." రామా. ౨, ఆ. ౯౭.

కనుకూలి. దే. వి. (కను+కూలి.) ధాన్యాదిరూప మైనకూలి. (శ. ర. బ్రౌ. వా.)

కనుగట్టు. దే. స. క్రి. (కను+కట్టు.) మాయ చేయు. "సీ. కనుగట్టి గాంగేయగర్భు డాఁగురు మూఁత లాడించె వస్త్రాపహరణవేళ." పాండు. 3, ఆ. ౧౭౮.

కనుగడ = కన్గడ.

కనుగిట్టు. దే. అ. క్రి. కన్నుగీటు, సైగచేయు. "క. కనుగిట్టి మాపువారును, గనుమఱి చెడి పట్టఁ జూడఁగడఁగెడువారున్." కు. సం. ౨. ఆ. ౮౦.

కనుగీటు=కన్గీటు. పరిహాసించు. "సీ. ననుఁ జూచి కను గీటు..." రాధికా. 3. ఆ, ౬౩. విప్ర. ౪, ఆ. ౧౭౫.

కనుగుఁజేఁప. దే. వి. ఒకజాతిచేఁప. (శ. ర. బ్రౌ.)

కనుగొలుపు. దే. అ. క్రి., స. క్రి. సైగచేయు. "క...తన మ్రోలం, గనుపట్టుననుంగుఁబట్టి కను గొలుపుటయున్." సీలా. ౧, ఆ. ౮౪.

కనుగ్రుడ్డు. దే. వి. (కను+గ్రుడ్డు.) నేత్రగోళము. "క...తనయిరుపది,కనుగ్రుడ్లన్ నిప్పులురలఁగా..." రామా. ౬, ఆ. ౧౬౮.

కనుచీఁకటి. దే. వి. (కను+చీఁకటి.) లేఁజీఁకటి, కొంచెముచీఁకటి. (శ. ర. బ్రౌ. వా.)

కనుచూపు. దే. అ. క్రి. (కను+చూపు) కనుపట్టు. "వ...అక్కాటికి చీఁకటిం గనుచూపి యిను మడించి..." రామా. ౮, ఆ. ౧౦.

కనునీరు = కన్నీరు. "సీ. కనునీట్లు పులిమికొంచును బానశాలలో మంచు గట్టించుచునేమర్త్యకులము." కుచేల. 3, ఆ. ౨౦. "శా. తోరం బౌకనునీరు చన్నుఁగవయందున్ జాఱి జాల్వాఱ..." ఇందు. ౨, ఆ. ౧౭౭.

కనుపట్టు. దే. అ. క్రి. (కను+పట్టు.) కనఁబడు, గోచరించు. "ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁ గను పట్టె..." భార. విరా. 3, ఆ. ౧౯౨.

కనుపండువు. దే. వి. (కను+పండువు.) కన్నుల పండువు; ఉత్సవానందము. "చ. పడఁతుక రోమరాజి కనుపండువు నిచ్చు జనంబుచూడ్కికిన్." చం. రా. 3, ఆ. ౮౬.

కనుపడు. దే. అ. క్రి. (కను+పడు.) కనఁబడు. "క...,మనసిజశిఖి యెనసినచోఁ, గనుపడు ధూమాంకురములగతి..." హంస ౧, ఆ. ౬౫.

కనుపఱచు. దే. స. క్రి. (కనుపడు. ధా. ప్రే.) చూపు. (బ్రౌ.)

కనుపాప. దే. వి. (కను+పాప.) కంటిలోనిపాప. "మ. కనుపాపల్ పయిఱెప్పలం గదియ..." స్వా. ౫, ఆ. ౮౪.

కనుపాలనిత్తులు. దే. వి. బ. కుళుత్థాంజనము. (శ. ర.)

కనుపు. దే. వి. గనుపు, పర్వము. ఆం. భా. ద్వి. ౭౪. దశా. ౧౦, అ. ౯౯.

కనుపుగొట్టు. దే. స. క్రి. (కనుపు+కొట్టు.) 1. ఖండించు; సంహరించు. "గీ. కర్ణనందనుఁ డి ట్లత్యుదీర్ణభంగిఁ, బాండురాజతనూజులబలము నెల్లఁ,గనుపుగొట్టంగఁ జొచ్చిన..." భార. ద్రో. ౧, ఆ. ౧౯౬; 2. పోఁగొట్టు, నశింపఁజేయు. "గీ. అమ్మహాభాగుఁ డద్రిజాప్రాణనాథ, కథల దురితంబు లన్నియుఁ గనుపుగొట్టె." ఉద్భ. ౧, ఆ. ౮; 3. చిందరవందరచేయు. (బ్రౌ.); 4. క్షోభపెట్టు. "వ. ఇవ్విధంబునం గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్నకవ్వడిం గనుఁగొని..." భార. ద్రో. 3, ఆ. ౧౫౯.

కనుపులగుండ్లు. దే. వి. బ. (కనుపులు+గుండ్లు.) మణిమయహస్తభూషావిశేషము. (శ. ర. బ్రౌ.)

కనుపులవిలుకాఁడు. దే. వి. (కనుపులు+విలుకాఁడు.) చెఱకువిల్కాఁడు, మన్మథుఁడు. "క. కను మూసినఁ గనువిచ్చినఁ,గనుపులవిలుకాని వ్రాయఁ గణఁగిన..." రా. వి. ౪, ఆ. ౨౨.

కనుపెట్టు. దే. అ. క్రి. (కను+పెట్టు) ఎదురుచూచు. "ఉ... బెట్టు కూ, పెట్టచు నిట్టు బోరఁ గను పెట్టుక యొక్కరుఁ డుండి..." ఆము. ౬, ఆ. ౧౦. (శ. ర. పా.) స. క్రి. (చూ. కన్పెట్టు.)

కనుపొట్టలు. దే. వి. బ. (కను+పొట్టలు) కంటి ఱెప్పలు. (శ. ర.)

కనుబడి. దే. వి. 1. ఉత్పత్తి. (శ ర. బ్రౌ.); 2. రాబడి. (బ్రౌ.); 3. అంచనా. (బ్రౌ.)

కనుబేటము. దే. వి. (కను+బేటము.) చూచుట వలనఁ గలుగుప్రేమము, వలపు. "చ. మగుఁ డలయింప నామనము మానము దూలిన నయ్యె వంతిసుం, దరికను బేట మేర్పడుట తాఁ దగు కారణ మయ్యెఁ గాక..." దశ. ౨, ఆ. ౧౪౬. కు. సం. ౧౦. ఆ. 33.

కనుబొమ్మ. దే. వి. (కను+బొమ్మ.) భ్రూవు. "ఉ. పూనిముకుందునాజ్ఞ గనుబొమ్మనె కాంచి..." ఆము. ౧, ఆ. ౪. స్వా. ౫, ఆ. ౯౪.

కనుమ. దే. వి. 1. రెండుకొండలనడిమిసందుత్రోవ "ఆ. వలన బెదర నృపతి కలఁగక ప్రజ వగ, లార్పఁ బనిచి కనుమలందు నిలువ, వేఱు వేఱ యేర్చి విలుమండ్రఁ బనిచి..." ఆము. 3, ఆ. ౨౭; 2. సందు, అవకాశము. "వ. ప్రవాహంబు... కనుమ కలిగినఁ బ్రవహించుచందం బున..." కవిక. ౪, ఆ. ౧౨౦. 3. రంధ్రము, కన్నము. "చ... ఆ, కనుమన తాను నేఁగి భుజగం బొకబొక్క వసించి..." కేయూర. ౪, ఆ. ౧౧౧. ఆం. భా. ప్ర. ౧౪౫.

కనుమబ్బు. దే. వి. (కను+మబ్బు.) కనుచీకటి. "ఉ... పల్లవా, లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగను మబ్బునఁ డక్కఁబెట్టి తు, చ్ఛాంగన రథ్య నేఁగె నెదురై పతికన్నులు గోరగింపఁగన్." వేం. పంచ. ౧, ఆ. ౨౪౬.

కనుమరి. దే. వి. కమ్మరి. ఆం. భా. ద్వి. ౨౦౪.

కనుమఱి. దే. వి. (కను+మఱుఁగు.) చాటు, రహస్యము. "క... కనుమఱి చెడి పట్టఁ జూపఁ గడఁ గెడువారున్." కు. సం. ౨, ఆ. ౧౦.

కనుమఱుఁగు. దే. వి. (కను+మఱుఁగు.) గంత. (చూ. కన్మఱుఁగు.)

కనుమఱుపడు. ద్వ. అ. క్రి. (కనుమఱుఁగు+పడు.) కంటికి మఱుఁ గగు, దాఁగుకొను. "క. కనుగిట్టి చూపువారును, గనుమఱి చెడి పట్టఁ జూపఁ గడఁ గెడువారున్, గని కడపిపుచ్చువారును, గనుమఱుపడువారుఁ బరులఁ గనుఁ గొనువారున్." కు. సం. ౭, ఆ. ౧౦.

కనుమాటు. దే. స. క్రి. (కను+మాటు.) కను మొఱఁగు, మోసగించు. "క. అని యొండొరు లిటులాడుచు, దినదినముకా గలసి యొరులు దెలియక యుండఁగా, గనుమాటితిరుగుచుందురు..." రాధా. ౧, ఆ. ౯౯.

కనుమాపు. దే. అ. క్రి. (కను+మాపు.) మాయము చేయు. "క. భామలకొప్పుల మైనపుఁ, బాముల నిడి వారు వెఱచి పరువిడఁ గృష్ణుం, డేమియుం లే దని వీన న, ప్పాములఁ గనుమాపి యభయపాణి యొసంగున్." సాంబో. ౧, ఆ. ౭౨. వి. కంటికి కనుపించునంతమాపు, కొంచెము మాపు. "ద్వి... చంద్రునికాంతి కనుమాపు మాన్పె." ద్వి. సారం. 3, ఆ. ౯౯. పు.

కనుమాయ. దే. మి. వి. (కను+మాయ.) కనుకట్టు, యక్షిణీవిద్య. "గీ. రంగమధ్యంబునందుండి రాజు దెసకు, నుఱుకు కృష్ణువేగస్ఫూర్తి యొక్కరుండు, గాన లే కున్కిఁ గనుమాయకరణి యయ్యె." హరి. పూ. ౯, ఆ. ౧౪౨.

కనుమారి. వి. (కనుమ+అరి.) పర్వతసానువు. "సీ. కల్లు ద్రావిన పాతకంబు..., కనుమారి నుఱుకంగ... పాయు," భార. శాం. ౧, ఆ. 30౭. (ప్రాఁత ప్రతిపా.) (కనుమూసి ముద్రి. పా.) "శ్లో. మరుప్రపాతం ప్రపతన్..." ముచ్యతే సర్వకిల్బిషైః." అని మూలము.) "గీ. పాయఁ దగుమిమ్ముఁ గనుమారిఁ బడఁ బొసంగు, విషము ద్రావుట యోగ్యంబు..." ఉ. హరి. ౪, ఆ. ౫౬.

కనుము. దే. వి. జా. 1. మకరసంక్రమణము, గ్రహణము, శవదహనము, గ్రామదహనము, శక్త్యుత్సవము మున్నగునవి జరిగినమఱుచటిదినము. (శ. ర. బ్రౌ. వా.) 2. శరము, తెల్లు. "గీ. కనుపపులు పెల్లుపఁబడవాలుఁ గన్నచోటు." స్వా. ౨, ఆ. ౯. "గీ. కనుపపులు గొనఁ గట్టుసంగరమొ..." పార్వ. ౪, ఆ. ౧౧౧.

కనుమూయు. దే. స. క్రి. (కను+మూయు.) కన్ను కనఁబడకుండఁ గప్పు, మోసగించు. "సీ. కపురంపుఁబలుకు కంచుఁ గనుమూసి కటకటా బూది గప్పిననిప్పుఁ బాదుకొల్పి." చంద్రా. ౪, ఆ. ౧౬౭. అ. క్రి. నిద్రపోవు. "సీ. కదనోత్సవత్వరఁ గనుమూయ నెఱుఁగక కోర్కి మై వేఁబోకఁ గోరువారు." కవిక. ౨, ఆ. ౧౩౨.

కనుమూసిగంత. దే. వి. (కను+మూసి+గంత.) దాఁగిలిమూఁత, బాలక్రీడావిశేషము. "మ... ఓ, మనగుంటల్ కనుమూసిగంత నలుకంబాలాట..." కళా. ౬, ఆ. ౨౦౨. ఆం. భా. ద్వి. ౩౦౭.

కనుమొఱఁగు = కన్మొఱఁగు. "క...మమున్, గను మొఱఁగి పాడి తప్పుచు, నని చేసిన నిన్ను శూరుఁ డంద్రే చెప్పుమా." భా.రా.యు. ౧౩౪౫.

కనుమోడుచే = కన్మోడ్చు.

కనుమోడ్చు = కన్ను మోడ్చు. నిద్రించు. "ద్వి. నడురాత్రి యరుదెంచె...కనుమోడ్తుగాక." రం. రా. బాల. ౩౪, పు.

కనుమోసము. దే. వి. (కను+మోసము.) చూచుచుండఁగనే మోసము జరగుట. "క. వాసవనందనుఁ డెంతయుఁ, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం, దా నైరణసేయ డు గను, మోసము లే కొక్కమొగిన ముసర.గ వల యున్." భార. విరా. ౪, ఆ. ౨౩౦.

కనుతెప్ప = తెప్ప. "సీ. కనుతెప్ప విడ నెఱుంగని చూడ్కి..." కవిక. ౧, ఆ. ౫౫.

కనువిందు. దే. వి. (కను+విందు.) నేత్రపర్వము, కన్నులపండువు. "క. దినముఁ గనువిందుచేయఁగ, మునిగృహముల వన్యభోజ్యములఁ దృప్తుండై." కకు. ౧, ఆ. ౧౬౦.

కనువినికి. దే. వి. (కను+వినికి.) చక్షుశ్శ్రవము, పాము. అచ్చ. సుం. ౧౮౧.

కనువినుకలి = కనువినికి. (చూ. కనువినుకలినెలవు.)

కనువినుకలినెలవు. దే. వి. (కనువినుకలి+నెలవు.) పుట్ట; పాములపుట్ట. (చూ. కనువినుకలినెలవు పుట్టు.)

కనువినుకలినెలవుపుట్టు. దే. వి. (కనువినుకలినెలవు+పుట్టు.) పుట్టఁబుట్టువు, వాల్మీకి. "వ. ఇది కనువినుకలినెలవుపుట్టుచే విరివిగాఁ జెప్పంబడి జగంబు లెఱిఁగిన దగుటం జేసి..." య. ౩, ఆ. ౩౯.

కనువెచ్చ. దే. వి. (కను+వెచ్చ.) కంటివేఁడిమి. "సీ. వలరాచరాచవాఁ డలికాకు కనువెచ్చఁ గరఁగినయలకనికరపుఁజోటు." స్వా. ౨, ఆ. ౯. విశ. నులివెచ్చనిది. (శ. ర.)

కనువెలుఁగు. దే. వి. (కను+వెలుఁగు.) నేత్రప్రకాశము; మార్గదర్శకుఁడు. "క. కను వెలుఁగు నీవు గానీ, వెనుక భవన్తతమ యూఁది వీరలు నేమం, జనుదెంచెదను..." భాగ. ద్రో. ౧, ఆ. ౬౬; ౧౦౦.

కనువేఁదుఱు. దే. వి. (కను+వేఁదుఱు.) కంటిపిచ్చి, చూచినంతనే కలుగువలపు. "ఉ. ఎన్నిభవంబులన్ గలుగు...కనువేఁదుఱునన్ బయిగాలి సోఁకినన్, వెన్నవలెం గరంగునలివేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్." స్వా. ౨, ఆ. ౫౭.

కనువేయు. దే. అ. క్రి. (కను+వేయు.) దృష్టించు; వలపుగలుగు. "గీ...అయ్యబలమీఁద, నలిననాభుండు గనువేసినాఁడు..." వరాహ. ౧౧, ఆ. ౫౨.

కనువైచు=కనువేయు. "చ...ఒక్కమగవానిపయిం గనువైచి తేమొ..." కువల. ఆ. ౩, ౧౦౭.

కనుసోగ. దే. వి. (కను+సోగ.) విశాలనేత్రము, (చూ. కన్సోగ.)

కనోజా. వై. వి. (సం. కాన్యకుబ్జ.) కన్యాకుబ్జ దేశమందలిభాష. (ఆం. పద.)

కన్క = కనుక. (అవధారణార్థకము.) "సీ. బింబోష్ఠినేఁ గన్కఁ బీతాంబరము నైన మెఱసియుండుదు గదా మేనినిండ." భాగ. ౧౦, స్కం. ఉ. ౨౧౨.

కన్కని = కనుకని. 1. భయహేతువు. "ఉ. సిగ్గునకుం బికాపికలు...శంకలకుఁ గన్కని...అగ్గజయానకుం బలికె నయ్యె యశేష్వరహాఃప్రసంగముల్." కవిక. 3, ఆ. ౨౯; 2. తత్తఱపాటు. "సీ. ఇంక నెందఱఁ జంప నెంచినాఁడో యని విడిచి కన్కని గుడి వెడలి పాఱె." ద్వా. ౪, ఆ. ౭౦.

కన్గంట. దే. అవ్య. ద్రు. (కంటన్+కంటన్.) కండ్ల ముందఱ, ప్రత్యక్షముగా. "మ...తాఁ జూచి

కన్గంట న, య్యుమప్రాణేశ్వరు సెట్టు మ్రింగుమనె..." భాగ. ౮, స్కం. ౨౩౯.

కన్గడ. దే. వి. (కను+కడ.) కడకన్ను, అపాంగము. "ఉ..., వీథులఁ దాఁకుకన్గడల వేమఱుఁ జూచుచుఁ బల్కు..." పాండు. ౪, ఆ. ౧౧౨.

కన్గను = కనుకను. (చూ. కన్గంట.)

కన్గలుగు = కనుగలుగు. "ఉ...సా, గ్రామములోనఁ గన్గలిగి కానక త్రొక్కిన..." భార. భీష్మ. ౧, ఆ. ౮౦.

కన్గవ = కనుఁగవ. (బ్రౌ.)

కన్గిఱుపు = కనుగిఱుపు. "సీ...దీవిఱేఁడు జోమలఁ గన్గిఱిపి యదల్చుటయు..." అచ్చ.యు ౧౨౫.

కన్గిలుపు = కనుగిలుపు. (కనుగీటు) ఆం. భా. తృ. ౨౯.

కన్గీటు = కనుగీటు. దే. అ. క్రి. కనుసైగ చేయు. వి. కనుగిలుపు. ఆం. భా. తృ. ౨౯.

కన్గొను = కనుఁగొను. 1. (చూచు.) "ఉ...సాకకాదు సం, క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలదె..." భార. విరా. ౨, ఆ. ౨౬; 2. (గ్రహించు) "గీ. తెల్లవాఱుటఁ గన్గొని..." నీలా. 3, ఆ. ౪౬.

కన్చెదరు. దే. అ. క్రి. (కను+చెదరు.) 1. కంటితో చూడలేనంత బాగుండు; 2. చెల్లాచెదరగు. "మ. చదిసెం దేరులు పాఱె వారణములు...క, న్చెదరెన్ సైన్యము వ్రాలె బాహుపులు..." కువల. ౨, ఆ. ౧౪౬.

కన్దెఱ. దే. వి. (కను+తెఱపి.) కనువిప్పు. (ఇది వా తెఱవంటిది.) 1. (రత్నార్థము.)ముందున్నది. "మ. మఱునాఁ డంధకభోజకృష్ణయమసామంతాగ్రణీసేన గం, దెఱగా..." ఉ. హరి. ౨, ఆ. ౦౪; 2. కండ్లు తెఱచువాఁడు. "గీ. అఖిలజగములకన్దెఱ యగుచు జనన, మాజకరపుటహృదయసరోజములకు, మకుళనంబును జృంభణంబును నొనర్చి, భానుబింబంబు పూర్వాద్రిపైవెలింగె." భార. విరా. ౨, ఆ. ౨౪౧.

కన్న. దే. ప్ర. ద్రు. (కు+అన్న.) కంటె, పంచమీ విభక్తి ప్రత్యయము. "ఉ...ఎలదేఁటిఘాటిక, న్నం గడుమేటి వేణి..." విజ. ౧, ఆ. ౧౫౦. హను. ౨, ఆ. ౫౬.

కన్నకొడుకు. దే. వి. (కనిన+కొడుకు.) ఔరసపుత్త్రుఁడు. ఆం. భా. ద్వి. ౧౧౧.

కన్నగాఁడు. దే. వి. (కన్నము+కాఁడు.) కన్నపుదొంగ. "గీ...దుర్వారచోర, గతులఁ బ్రతిగన్నవాఁ డొక్కకన్నగాఁడు." శుక. 3, ఆ. ౫౨౫. ఆం. సం. మాన. ౧౧.

కన్నడ. దే. వి. 1. ఉపేక్ష. "సీ. తనుఁ బిల్వఁ దమిహెచ్చియుండు జాగుసేసెఁ గ్రక్కునఁ బోకకన్నడఁ గట్టిపెట్టి." సా. 3, ఆ. ౧౪౯; 2. తిరస్కారము. "సీ. ఒకనిమాటున వైరి నుక్కడంగించిన నరుశౌర్య మెన్నఁ గన్నడ యొనర్చి." చంద్రా. ౧, ఆ. ౨౧; 3. ఒకానొకస్త్రీరాగము, హంస. ౫, ఆ. ౧౨౩.

కన్నడగౌళ. ద్వ. వి. (కన్నడ+గౌళ.) ఒకానొకరాగము. "ఉ...కన్నడగౌళ ముఖారి దేవగాం, ధారి..." చెన్న. ౨, ఆ. ౨౩౬.

కన్నడము. వై. వి. (సం. కర్ణాటకః. క. కన్నడవు. త. కన్నడం.) 1. భాషావిశేషము, కర్ణాటభాష. ఆం. భా. ప్ర. ౧౧౦; 2. కర్ణాటదేశము. "ఉ. కన్నడరాయ..." ఆము. ౧, ఆ. ౧౪.

కన్నడవు. దే. వి. ఉపేక్ష. "మ...నీవు కన్నడవు చేఁతం బట్టి ప్రార్థించినన్..." విప్ర. ౫, ఆ. ౨౧.

కన్నడసేయు. దే. స. క్రి. (కన్నడవు+చేయు.) ఉపేక్షించు; తిరస్కరించు. "చ. సదమలచిత్తులార తమసన్నిధి నే నొకవిన్నపంబుచేసెద దయచిత్తగించి దునిచి సేవకునింట శివార్చనంబు మే, ల్గదుర నొనర్పఁగావలయుఁ గన్నడసేయక మీరలన్న..." చెన్న. ౪, ఆ. ౩౩౩.

కన్నడి. దే. వి. (క. కన్నడిగ.) 1. కన్నడీఁడు. ఉపేక్ష చేయువాఁడు. (శ. ర.); 2. కర్ణాటదేశస్థుఁడు; 3. నిలువుటద్దము. (బ్రౌ.)

కన్నడించు. దే. స. క్రి. 1. ఉపేక్షించు. (శ. ర.); 2. కర్ణాటభాషాంతరీకరణము చేయు. (బ్రౌ.)

కన్నడీఁడు = కన్నడి. (ఆం. భా. ద్వి. ౧౦౩.) "సీ. ఆరెలు గన్నడీ లఱవలుఁ దెలుఁగులుఁ దనబిరుదంపియఁ దగిలి కొలువ." ద్వా. ౧, ఆ. ౪౨.

కన్నడుగు = కన్నడవు. "క. ఇన్నాళ్లు నన్ను మిక్కిలి,మన్నన గావించి చాల మంచిననీవే,

కన్నడుగు చేసి తే మని,విన్నప మొనరింతు నీకు విబుధాధిపతీ." వాల్మీ. 3, ఆ. 33.

కన్నది. దే. వి. (కన్న+అది.) తల్లి. వేంక. మాన. 3౭. ఆం. సం. మాన. 3.

కన్నపెట్టు. ద్వ. అ. క్రి. (కన్నము+పెట్టు.) కన్నమువేయు. "క. మాపీటిమ్రుచ్చు లేవురు, మాపీటం గన్నపెట్టి మణిభూషణముల్, గోవ తనంబునఁ దెచ్చిరి..." దశ. ౪, ఆ. ౨౪. స. క్రి. కన్నము వేసి దోఁచుకొను; అపహరించు. "సీ. కన్నగాండ్ర గడించి కలిగినవారిండ్లు గన్న పెట్టించుదుష్కర్మి వాఁడు." సానందో. ౨, ఆ. ౯౬. పరమ. ౪, ఆ. ౧౯౫.

కన్నపోవు. ద్వ. అ. క్రి. (కన్నము+పోవు.) కన్నము వేసి తీసికొనిపోఁబడు. "వ. నాగపట్టన ప్రసిద్ధబుద్ధాయతనంబు గన్నపోయె." పరమ. ౫, ఆ. ౧౫.

కన్నమిడు. ద్వ. స. క్రి. (కన్నము+ఇడు.) 1. కన్నపెట్టు, కన్నము వేసి దోఁచుకొను. "మ. ఒకనాఁ డేగురుదొంగలు...కన్నమిడు వాంఛన్ వచ్చి..." ద్వా. ౧౦. ఆ. ౧౧౫; 2. కన్నము చేయు. "క. మా మందిరకుడ్యం, బేమిటఁపురుఁ గూడి కన్నమిడి...మాటిలిమి..." దశ. ౬, ఆ. ౬౨.

కన్నము. వై. వి. (క. కన్న.) 1. రంధ్రము, బొక్క, "ద్వి. గడియకన్నంబును గడప కన్నంబు." బస. ౫, ఆ. 3౪౦. పు.; 2. దొంగలు త్రవ్వుసొరంగము. (మా. కన్నమిడు.)

కన్నముపెట్టు = కన్నపెట్టు. (బ్రౌ.) ఇట్టే: కన్నము వేయు. మొ.

కన్నయ్య. వై. వి. (కన్నఁడు+అయ్య. సం. కృష్ణః.) కృష్ణుఁడు. (శ. ర.) ద్వ. వి. (కన్న+అయ్య.) తండ్రి. సాం. ని. మాన. 3.

కన్నఱ. దే. వి. (త. కణ్ణరావి. కన్ను+అఱ)—కంటితోఁచూచుట కష్టమైనది—దుఃస్థితి; కష్టము. "ఉ...తలిదండ్రులు వా రెట నున్నవారొ యీ. కన్నఱ చూడఁ బాలయితి..." రామా. ౨, ఆ. ౪౧. (శ. ర. పా. 'కన్నడ', ముద్రి. పా.) వాల్మీ. ౧, ఆ. ౯౫.

కన్నఱి. దే. విశ. (కన్నఱ+ఇ.) దుఃఖితుఁడు; కష్టుఁడు. "వ...కిన్నరులు గన్నఱులుగా భూ తంబులు భీకరంబులుగా..." ఉ. హరి. ౬. ఆ. ౭౯.

కన్నవిటి. దే. విశ. (కన్ను+అవిటి.) గ్రుడ్డివాఁడు. "క. చెవిటికి శంఖధ్వని కన్నవిటికి దీపంబు... వృథయగున్." భల్లా. ౪, ఆ. (శ. ర.)

కన్నవెట్టు = కన్నపెట్టు. (కన్నమువేయు.) "అ... కమ్మకత్తి మనసుఁ గన్నవెట్టు, గండుదొంగ..." కళ. 3, ఆ. ౭౯. "గీ...ప్రజలయిండ్లఁ, గన్న పెట్టినదొక్కటే కాని కొదవ, కడమదుర్వృత్తు లన్నిగలుఁ గఱచె నతఁడు." నిరం. ౨. ఆ. ౨౬.

కన్నళవు = కన్నడుగు. "గీ. కన్నళవు సేయఁ గచ్ఛపాకారగరిమఁ, గరిమరాశిక యాన నీచరణ మహిమ." వసు. ౪, ఆ. ౧౬. రూ. కన్నడవు.

కన్నా. దే. విశ. అధికము. "క...నిన్,గన్నారం గంటి కంటిఁ గన్నాసుఖముల్." కాళిందీ. ౫, ఆ. ౪౯.

కన్నాఁగు. దే. అ. క్రి. (కన్ను+ఆఁగు.) కన్ను చూడక మూఁతపడు; నిద్రించు. "శా. అన్నా లక్ష్మణ...నేఁడు రణశయ్యం భూవిభుం డుండఁగాఁ, గన్నాఁగం దగునయ్య నీనిదురకుం గాలం బయోధ్యం గదా." భా. రా. యు. ౫, ౧౪.

కన్నాఁడు. దే. వి. (కన్న+వాఁడు.) తండ్రి. "దండ...నిన్నుఁగన్నాని రప్పింపక." ఉద్భ. 3. ఆ. ౭౯.

కన్నాకు. దే. వి. (కన్ను+ఆకు.) తమలపాకు కట్టయందు మొదట నుండెడియాకు; శ్రేష్ఠమైనయాకు. (శ. ర.) విశ. 1. శ్రేష్ఠము, ఉత్తమము. "సీ. కన్నాకు మేల్బంతి...అనఁ దనరు శ్రేష్ఠము..." ఆం. భా. తృ. ౧౫: 2. ముఖ్యుఁడు: ముఖ్యనాయకుఁడు. "క. కన్నాకు మనకు భీష్ముఁడు..." భార. భీష్మ. ౧, ఆ. ౭౬. "క. అనిలజభీష్ములు దమతమ, మొనలకుఁ గన్నాకులు..." భార. భీష్మ. ౨, ఆ. ౮౯౧; 3. రక్షకుఁడు. "సీ...గమికిఁ గన్నాకయి గాలి యరయు." స్వా. ౪, ఆ. ౪౨.

కన్నాత. దే. వి. మల్లబంధవిశేషము. ఆం. భా. ద్వి. ౭౧౯. బ. 1. ఒకానొక రతిబంధము. "సీ.

కన్నాత లాలించి కౌఁగిటఁ గదియించి సరిబిత్త
రుల నెత్తి చనుల నొత్తి." రాధికా. ౧, ఆ.
౧౪౬. "సీ. కన్నాత లాఁగించి కాంతుమోము
గదించి..." శశాం. 3, ఆ. ౯౫; 2. ఒకా
నొకమల్లవిద్య. ఆం. భా. ద్వి. ౨౦౭.

కన్నాస. ద్వ. విశ. (కన్ను+ఆస.) కంటి కాశను
గొల్పునది, కనుపండువైనది. "గీ. త్రుప్పు దుల్చిన
నొప్పారుతోయజాస్త్ర, చికిలినిద్దంపుగ్రౌదువు
చెలువు తోఁప, నూనెమెఱుఁగున నునుచాయ
మేను దనర,నది విటాళిలకన్నాసయై మెలంగు."
హంస. ౫, ఆ. ౨౧౫.

కన్నిచ్చు. దే. విశ. (కన్ను+ఇచ్చు.) కనుపండువు;
కంటి కింపైనది. (బ్రౌ.)

కన్నిడు. దే. అ. క్రి. (కన్ను+ఇడు.) కన్నువేయు,
మోహము కలుగు. "క. రుచిమీఁదం గన్నిడి
యా,శచీవిభుఁడు దిరుగు..." భార. అను. ౨,
ఆ. ౧౯౯; 2. దృష్టిపెట్టు. "చ...మోకమావి
పయిఁ గన్నిడి..." కవిక. 3, ఆ. ౧౦౫.

కన్నియ. వై. వి. (సం. కన్యా. క. కన్నె.) 1.
కన్య, వివాహముకానిబాలిక. "సీ. మునిదత్త
మగుమంత్రమున గొంతి కన్నియనాఁడు..."
భార. శాం. ౧, ఆ. ౧౬. ఆం. భా. ద్వి.
౧౦౬; 2. స్త్రీ; తరుణి "ఉ...రాత్రి యన్
కన్నియ..." నృసిం. ౨, ఆ. ౮౯. "ఉ. ఇన్ని
దినంబులుఁ గనవు లిందఱిలో నలసత్యభామ
క,న్నన్నలఁ ద్రిమ్మరుగ్ హరి పశంవదుఁడై
యన వించుఁ గాని యో,కన్నియ నీయెడం
గలుగుగౌరవ మెందునుఁ జూచి కాన..."
హరి. ౧. ఆ. ౬౫; 3. కుమారి, కూఁతురు.
"ఉ...ద్రుపదుకన్నియ నూచి..." భార.
విరా. ౨, ఆ. ౧3౯; 4. (సం. కర్ణీ.) పసుల
గట్టుత్రాడు. (బ్రౌ. వా.) విశ. 1. క్రొత్తది.
"సీ...కన్నియమెఱుంగు." పాండు. ౪, ఆ.
౨౧; 2. మొదటిది. (చూ. కన్నె.); 3. లేఁతది.
(చూ. కన్నె.)

కన్నియలేడి. ద్వ. వి. (కన్నియ+లేడి.) కారండ
వము, ఒకజాతిపక్షి. ఆం. భా. ద్వి. ౯౬. ద్వి.
హరిశ్చ. పూ. ౬3౧.

కన్నీరు. ద్వ. వి. (కన్ను+నీరు.) అశ్రువు, కంటి
నుండి కాఱునీరు. ఆం. భా. ద్వి. ౧౪౪. "క.
కన్నీ రొలుకఁగ నేడ్చిన, నన్నరపతు లెల్ల
నేడ్చి,రి..." భార. ద్రో. ౧, ఆ. ౫౯.

కన్ను. దే. వి. (క. కణ్ణు. త. కణ్.) (బహువ్రీహి
సుత్తరపదముగాఁ గలపుడు దీనియంత్యాక్షరము
నకు పూర్ణబిందుపూర్వకటివర్ణక మాదేశ మగును.
ఉదా:—కలువ+కన్ను=కలువకంటి. తమ్మికంటి
మొ.) 1. నేత్రము, కను; 2. రంధ్రము; వల
కన్ను; 3. చంద్రకము, నెమలిపురికన్ను. "సీ.
చంద్రకమ్ములును లోచనములు రంధ్రముల్
చెన్నొందుచుండును గన్ను లనఁగ." ఆం. భా.
తృ. ౬౧. (పైమూఁడర్థములకు నిది యుందా
హరణమే.); 4. జాడ, గుర్తు."ఆ...కరితురంగ,
రథపదాతిచయము రావించుచున్నయా, కన్నె
ఱింగి కోపకలితుఁ డగుచు." వి. పు. ౭. ఆ.
౪౧3. నైష. ౫, ఆ. ౯౫; 5. చూపు, దృష్టి.
"ఆ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం,
గనిపురంధ్రులు..." భార. అశ్వ. ౧, ఆ. ౧౪3;
6. చెఱకు మొదలైనగనుపు; పర్వము. ఆం. భా.
ద్వి. ౭౭; 7. చక్రము. "సీ. పంకరుహంబులు
బండికన్నులు చంపకంబులు నొగ లుత్పలంబు
లిరుసు." కు. సం. ౪, ఆ. ౮3; 8. వంతెన
ద్వారము. (శ. ర.); 9. కరణి, మృదంగాది
వాద్యములముఖభాగమున నేర్పఱుపఁ బడిన
వృత్తసీమండలము. (శ. ర.); 10. అదివేయు
ప్రక్క. (చూ. కన్నువేయు.); 11. కపటచేష్ట,
కీలు. ఆం. శే. ౫౫; 12. వ్రణాదిరంధ్రము.
(శ. ర.) ఈపదముపైఁ గల ప్రయోగవిశేషములు.

1. కన్నిచ్చునవచ్చు = కంటికింపగు. పాండు.
3, ఆ. ౮౯.

2. కన్నుండఁ గంటిపాపఁ గొనునట్లు=కన్నుల
యెదుటనే మోసము చేయు. "క. కన్నుండఁగంటి
పాపం,గొన్నట్లు..." ఉ. హరి. ౫, ఆ. ౨౮౮.

3. కన్నుగానక = (గర్వాదులచే) పొగ
రెక్కి. రామా. ౫, ఆ. ౭౦.

4. కన్నులఁగట్టినట్లు = ప్రత్యక్షముగా.

5. కన్నులఁ గప్పుకొను = కండ్ల కద్దుకొను;
గౌరవాదరములు కలుగు. విజ. 3, ఆ. ౧౭౨.

6. కన్నులఁబడు = కంటఁబడు, కనఁబడు. కువల. 3, ఆ. ౫౯.

7. కన్నులపండువు = కనుపండువు. భార. ఆశ్వ. ౨, ఆ. ౧౪౪.

8. కన్నులార్చు = కనుసంజ్ఞచేయు. చిత్ర. భా. ౪, ఆ. ౫౪.

9. కన్నులెఱ్ఱచేయు = కోపించు. రసిక. ౪, ఆ. ౧౭౦.

10. కన్నెఱచేయు, కన్నెఱ్ఱచేయు=కోపించు. కవిక. ౪, ఆ. ౭. ౫, ఆ. ౧౬౪.

కన్నుఁబ్రామ = కనుఁబ్రామ. "ఉ...కంస నధికారుల నందఱఁ గన్నుఁబ్రామి..." పద్మ. ౯, ఆ. ౯3.

కన్నుకట్టు. దే. వి. (కన్ను+కట్టు.) దాఁగిలిమూఁత, ఒకానొకబాలక్రీడ. "సీ. వెన్నెలతుప్పలు కన్నుకట్టు..." ప్రబంధ. ౬౧3. అ. క్రి. కనుమొఱఁగు, మోసగించు. ఇట్లే: కన్నులుకట్టు. "గీ...నన్ను నమ్మించి తెచ్చి, కాననంబులోఁ గన్నులుకట్టి కాదు, పఱచి నీ కట్టు పోఁ జన్నె భావజన్మ." కు. సం. ౫, ఆ. ౬౫.

కన్నునీరు = కన్నీరు. "చ...కన్నునీరు గ్రొబ్బున వెడలంగ..." భో. ౪, ఆ. ౧౬౭.

కన్నుపొడుచు. దే.అ. క్రి. (కన్ను+పొడుచు.) బుద్ధిచెప్పు; ప్రాయశ్చిత్తముచేయు. "సీ. నానాఁటఁ గృశించుచునునుఁ జూచి కనుగీటుపువ్వుఁబోఁడలఁ గన్నుపొడిచినట్లు." రాధికా. 3, ఆ. ౬3. "క. నే నిందుకొఱకె నవ్వ నహో నోడుడు పట్టినింప లందితి నయ్యో,యైన డికు నాయె నందుకె, పూనుద మందఱకుఁ గన్నుపొడిచినరీతిన్." రాధా. ౧, ఆ. ౪౬.

కన్నుబొమ = కనుబొమ్మ. "చ. చెలినునువంకకన్నుబొమ సింగిణి..." చంద్రా. ౪, ఆ. ౧౨౦.

కన్నుబొమ్మ = కనుబొమ్మ. "ఉ. మారునివిండ్లసౌరు పలుమాఱును మీఱెడి కన్నుబొమ్మలు..." ఇందు. ౨, ఆ. ౧౬౧.

కన్నుమిక్కిలివేలుపు. ద్వ. వి. (కన్ను+మిక్కిలి+వేలుపు.) త్రినేత్రుఁడు, శివుఁడు.

కన్నుమూయు. దే. అ. క్రి. 1. నిద్రపోవు: (చూ. కనుమూయు.); 2. మరణించు, దీర్ఘనిద్రపోవు. "గీ. అని ప్రలాపించి, కనుమూసె నాక్షణంబ." శుక. ౧, ఆ. 3౯౬. స. క్రి. మోసగించు. (చూ. కనుమూయు.)

కన్నుమొగుచు. దే. అ. క్రి. (కన్ను+మొగుచు.) 1. నిద్రపోవు. "గీ. ప్రహరిఁ దిరుగుట చాలించి భైరవుండు, గవనిమొగసాల యరుఁగుపైఁ గన్నుమొగిచె." కాశీ. 3, ఆ. ౨3౫; 2. ముకుళించు. "క. మసమసక నయ్యె దిక్కులు...కన్నుమొగిచెఁ గమలవనంబుల్." జై. ౨, ఆ. ౧౧౧.

కన్నుమొఱఁగు = కనుమొఱఁగు. "మ...అంతఃపురాంగనలన్ గన్నుమొఱంగి..." భీమ. ౧, ఆ, ౧౧౧.

కన్నుమోడ్చు = దే. అ. క్రి. (కన్ను+మోడ్చు.) నిద్రపోవు. "గీ....ఏ నింత కన్నుమోడ్చు, తఱిని గలలోన..." రా. వి. ౧, ఆ. ౧౫.

కన్నుమోడ్పు. దే. వి. నిద్ర. కనుమూఁత. "చ...ఇంచుకసేపు కన్నుమోడ్పు నెఱ..." హ. న. ౨, ఆ. ౫3.

కన్నులకచ్చి. దే. వి. (కన్నులు+కచ్చి.) బాలక్రీడావిశేషము, కన్నుకట్టు. "సీ...కన్నులకచ్చి గుడుగుడుగుంచాలు కుందెనగిఱి." హంస. 3, ఆ. ౧౪౬.

కన్నులకలికి. దే. వి. (కన్నుల+కలికి.) సునేత్ర; స్త్రీ. "క. అలరుంబ్రాయపుఁ గన్నుల, కలికిక..." వేం. పంచ. 3, ఆ. ౧౮౦. దశా. ౨, ఆ. 3౨౧.

కన్నులమండ = కన్నులమ్రాను. (బ్రా.)

కన్నులమ్రాను. దే. వి. (కన్నుల+మ్రాను.) ఇక్షువు, చెఱకు. ఆం. సం. స్థా. ౯.

కన్నులవింటిజోదు. ద్వ. వి. చెఱకువిల్కాఁడు, మన్మథుఁడు. దశా. ౨, ఆ. 3౨౧.

కన్నులవింటివాఁడు = కన్నులవింటిజోదు. నీలా. 3, ఆ. ౧౯.

కన్నులవినుకలి = కన్నువిన్కలి. నవ. ౪, ఆ.

కన్నులవిన్కలి = కనువినుకలి. ప్రబంధ. 3౪.

కన్నులవిలుకాఁడు = కన్నులవిలుతుఁడు. (శ. ర.)

కన్నులవిలుతుఁడు = కన్నులవింటిజోదు. ఆం. భా. ప్ర. ౪౫.

కన్నువేయు. దే. స. క్రి. దృష్టించు. "గీ. గుబ్బపాలిండ్లకే పఁ గ్రక్కున మరాళి, కన్ను

వేయంటఁ గని లజ్జ గదుర..." ఆము. ౬, ఆ. ౧౩౩.

కన్నువైచు. దే. అ. క్రి. దృష్టించు; వలపుగలుగు. "సీ. సితభానుఁ డాచార్యుచిగురాకుఁబోఁడిపై కన్నువైచిన కన్నెకలుపుమరులు." నైష. ౭, ఆ. ౧౫౧.

కన్నె = కన్నియ. 1. కన్య, వివాహముకానిబాలిక. "గీ. కన్నెవయసున గన్నెఱికంబుఁ దప్పి,పిదపఁ బతిభక్త యగునాతి త్రిదశవేశ్య." కాశీ. 3, ఆ. ౧౭౧; 2. కుమారి, కూఁతురు. "ద్వి. కన్నెల నూర్వురఁ గడుకూపవతులఁ,గనియె..." రం. రా. బాల. 33. పు. విశే. 1. మొదటిది. (చూ. కన్నెకయ్యము.); 2. లేఁతది. "గీ. పసిఁడి కుండల నిర్ఘరాంభస్సుఁ దెచ్చి, పోయు... కన్నెలతలకు మునికన్యకాకదంబము..." హర. ౫, ఆ. 30. విప్ర. 3, ఆ. ౧౯; 3. క్రొత్తది. "క...మాకన్నెపాట..." హ. న. ౨, ఆ. ౬౭; 4. చిన్నది. (కన్నెమావి. బ్రౌ.)

కన్నెక. వై. వి. 1. కన్య, బాలిక. "క. ఇలువరుసయు మానుషమును,గలరాజులయిండ్లఁ గన్నెకలు పుట్టునెడన్..." శుక. 3, ఆ. ౫౨౧; 2. స్త్రీ, ఆఁడుది. "గీ. ఎన్ని నైదేండ్లనైన నాఱేండ్లనైన, బిడ్డలను గంద్రు కన్నెకల్ గొడ్డువీఁగి,పదియు నొకయేఁటఁ బెద్దలుఁ బదియు నాఱు,నేండ్లు పరమాయు వగుఁ గలి హెచ్చుకతన" దశా. ౧౦, ఆ. ౨3.

కన్నెకయ్యము. ద్వ. వి. (కన్నె+కయ్యము.) యుద్ధారంభము, తొలిపోరు. ఆం. భా. ద్వి. ౨౨౨. భార. భీష్మ. ౧, ఆ. ౧౧౦.

కన్నెకలుపు. ద్వ. వి. (కన్నె+కలుపు.) ప్రథమసంగమము, తొలికూటమి. "సీ. సితభానుఁ డాచార్యుచిగురాకుఁబోఁడిపైఁ గన్నువైచిన కన్నెకలుపు మరులు." నైష. ౭, ఆ. ౧౫౧.

కన్నెకూర్మి. ద్వ. వి. (కన్నె+కూర్మి.) ప్రథమానురాగము, తొలివలపు. "గీ. మాననీయశశాంకకోమలము లైన, యామినీసమయములుఁ బర్యంకములును, సాత్త్వులుగ నొందు పలవంత జనవిభుండు, కన్నెకూర్మి ప్రకాశంబు గాకయుండ." నైష. ౧, ఆ. ౮౪.

కన్నెకొమర. ద్వ. వి. (కన్నె+కొమర.) ఒకానొక యోషధి. "సీ...గాడిదగడపర కన్నెకొమర ..." హంస. ౪, ఆ. ౧౦.

కన్నెకోమలి = కన్నెకొమర. (ఆం. పద.)

కన్నెగోరుకోఁత. ద్వ. వి. (కన్నె+గోరు+కోఁత.) కన్నెలకు గోళ్లతీయుసంస్కారము. (శ. ర. కన్నె వివాహయుక్తయై పెరుఁగుట నిది సూచించును. బ్రౌ.)

కన్నెతనము. ద్వ. వి. (కన్నె+తనము.) కన్యాత్వము, కన్నియధర్మము, "సీ. నీదుర్మదము కాదె నీరజాపునిధృతి గలఁచి మానివెఁ గుంతి కన్నెతనము." శ్రీరాధా. ౨. ఆ. ౧౮౪.

కన్నెది. ద్వ. వి. (కన్నె+అది.) కన్య. (బ్రౌ.)

కన్నెబావి. దే. వి. (కన్నె+బావి.) చిన్నబావి. (శ. ర.) నిర్జలకూపము. (బ్రౌ.)

కన్నెము. దే. వి. కోడిగుండెకాయ. (శ. ర. బ్రౌ.)

కన్నెరాసి. వై. వి. (కన్నె+రాసి.) కన్యారాశి. (ఆం. పద.)

కన్నెరికము. ద్వ. వి. (కన్నె+ఱికము.) 1. కన్యాత్వము; 2. వేశ్యకన్యప్రథమరతి. "ద్వి. గఱపిననాఁడహో కన్నెరిక మిడఁగ." పండితా. పురా. ౧౧౫. పు.

కన్నెఱ. దే. వి. (కన్ను+ఎఱ) రోషము. "రగడ. తలిరుబోఁడి నీతలఁపునఁ గన్నెఱ, వలదు..." రాజ. చ. ౨, ఆ. ౧౪౯.

కన్నెఱికము. ద్వ. వి. (కన్నె+ఱికము.) 1. కన్యాత్వము. "గీ. కన్నెవయసునఁ గన్నెఱికంబుఁ దప్పి, పిదపఁ బతిభక్త యగునామె త్రిదశవేశ్య." కాశీ. 3, ఆ. ౧౭౧; 2. వేశ్యకన్యాప్రథమరతి. "క...ధనగత్తుఁ దపుడు తనచెలికానికిఁ, బనిచెను పుష్పసుగంధికి, నొనరఁగఁ గన్నెఱికమునకు నొడఁబఱపింపన్." మల్హా. ౨, ఆ. 3. శాళి. ౫, ఆ. ౫౯.

కన్నెఱుఁగు. దే. స. క్రి. (కన్ను+ఎఱుఁగు.) చూచు; తెలిసికొను. (బ్రౌ.)

కన్నెలేడి. ద్వ. వి. (కన్నె+లేడి.) కన్నియలేడి. య. ౨, ఆ. ౨౪.

కన్నెసరులు. ద్వ. వి. (కన్నె+సరులు) కన్యలకు వలెఁ జూడ ముచ్చటగా నుండుధాన్యవిశేషము.

"సీ...గంబూరరాజనాల్కన్నెసరులు." హంస. ౪, ఆ. ౧౭౮.

కన్నోజె = కనోజె. (ఆం. పద.)

కన్నోటం. ద్వ. వి. (కన్ను+ఓటమి.) కోపము. (ఇది మొగమోటవంటిది.) కన్నోటు. "ఆ. మున్ను పలికినట్ల కన్నోట లేక వ్యుల్కటయు..." భార. శాం. ౪, ఆ. ౩౯౨.

కన్పట్టు = కనుపట్టు. "మ. ఉడుమార్గం బఖిలంబు... ప్రుల్కడుగంబడ్డనిశాతఖడ్గముక్రియన్ గన్పట్టె నప్పట్టునన్." హం. ౨, ఆ. ౨౫.

కన్పండువు = కనుపండువు. "గీ. మండలము తేజ రిల్లఁ గన్పండువగుచు...పద్మబాంధవుఁ డుద యాద్రిపై వెలింగె." శ్రీరాధా. ౪; ఆ. ౧౪౦.

కన్పడు = కనుపడు. "సీ...సవరంబుకుప్ప గన్పడ గొప్పకొప్పు వెట్టు." శుక. 3, ఆ. 3౫౪.

కన్పాప = కను పాప. (చూ. కనుపాప.)

కన్పు = కనుపు. "సీ. శిర సెత్తుమునివ్రేలివరుస కన్పులు గల్గుబలుకొమ్ము..." దశా. ౭, అ. ౧, ఆ. ౨౯.

కన్పుగొట్టు. దే. స. క్రి. (కన్పు+కొట్టు.) ఖండించు, నఱకు. (ఆం. పద.)

కన్పెట్టు = కనుపెట్టు. దే. స. క్రి. (కను+పెట్టు.) 1. ఆలోచించు. "గీ. పరుఁడ నగునాకు నక్షర పురుషునకును, భేద మేమియు లేదు కన్పెట్టి చూడ." సీతారా. ౨, ఆ. ౧౦౨; 2. కాచు, రక్షించు. "క...నీసొమ్ములు కన్పెట్టుకొని యున్నవారము..." పరమ. 3, ఆ. ౫3.

కన్బ్రాము=కనుఁబ్రాము. "శా...రక్షస్త్రీ కన్బ్రామి..." దశా. ౫, అ. 3.

కన్బెంటి = కనుఁబెంటి. "సీ...పాపురము కన్బెంటి మూఁగ." సుప. 3, ఆ. ౧౫౪.

కన్మూసిగంత = కనుమూసిగంత. (గంత.) "సీ... లాశిశాసలిశ కన్మూసిగంత." చము. 3, ఆ. ౪౦.

కన్మొఱగు = కనుమొఱగు. "మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి..." ఆము. ౧, ఆ. ౨.

కన్య. ఉభ. వై. వి. పెండ్లికానిపిల్ల. ఆం. భా. ద్వి. ౧౦౯. విశ. మొదటిది. "సీ. ధృతిఁ గుంతి మద్రభూపతుల నెయ్యపుఁగన్య కలనన వాలుఁ దూపుల జయించి." రాఘవ. ౧, ఆ. ౭. సం. వి. ఆ. స్త్రీ. 1. పెండ్లికానిపిల్ల; 2. పదేండ్లపిల్ల; 3. స్త్రీ; 4. కూఁతురు; 5. ఒకానొకనాయిక; 6. ఒకానొకరాశి; 7. దుర్గ; 8. కలబంద✻; 9. పెద్దయేలకి✻; 10. ప్రేంకణము✻.

కన్యక. సం. వి. ఆ. స్త్రీ. = కన్య.

కన్యస. సం. వి. ఆ. స్త్రీ. 1. చిటికెనవ్రేలు; 2. చిన్నచెల్లెలు.

కన్యసుఁడు. సం. వి. అ. పుం. చిన్నతమ్ముఁడు.

కన్యాకుబ్జము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము. న. ఒకానొకపట్టణము.

కన్యాకుమారి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గ.

కన్యాదానము. సం. వి. అ. న. కన్యను వరున కిచ్చి చేయుపెండ్లి.

కన్యాశుల్కము. సం. వి. అ. న. ఉంకువ, ఓలి.

కన్నెప్పు = కనుజెప్పు. (బ్రా.)

కన్వెలుఁగు = కనువెలుఁగు. (రక్షకుఁడు.) "క. అన్వ యసౌధస్తంభము, పెన్వగ యడఁగించుమందు పెద్దపయసునం, గన్వెలుఁగు సుతుఁడు..." సుప. ౧, ఆ. ౧౧౨.

కన్వేగు. దే. అ. క్రి. (కను+వేగు.) తెల్లవాఱు చుండు, తెలతెల్లవాఱు. "క. వినవచ్చి దొంగగా యని, యొనరఁగ నొకబొండ్లొయ్య నుంచిరి కన్వేఁగిన వెనుకఁ బిలిసికొని యచ్చని ననుఁ బొమ్మందురు... శుక. 3, ఆ. ౨౦౪.

కన్సోగ. దే. వి. (కను+సోగ) నేత్రవైశాల్యము. "సీ. తాటంకరోచులం దటిమిసకన్సోగ మెలఁ కువ లిరుదెస మెఱుఁగు లీన." ద్వా. 3, ఆ.౧3౯.

కపటము. సం. వి. అ. పుం న.—బ్రహ్మనుగూడ కప్పునది— మోసము, నటనము.

కపటి. సం. విశ. (న్. నీ న్.) కపటము గలవాఁడు.

కపటించు. సం. అ. క్రి. మోసముచేయు. "క... ఓమినమునికే, కపటింతురె..." వరాహ. ౧౦, ఆ. 3౬.

కపటికుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) కపటి.

కపర్దము. సం. వి. అ. పుం. 1. గవ్వ; 2. శివుని జటముడి.

కపర్ది. సం. వి. న్. పుం. శివుఁడు.

కపాటము. సం. = కవాటము.

కపాలపాణి. సం. వి. ఇ. పుం. శివుఁడు.

కపాలభృత్తు. సం. విశే. పుం. శివుఁడు.

కపాలమాలి. సం. వి. న్. పుం. శివుఁడు.

కపాలము. సం. వి. అ. పుం. న. 1. తలపుఱ్ఱె; 2. కుండపెంకు; 3. గుంపు; 4. బిచ్చపుకప్పెర.

కపాలి. సం. వి. న్. పుం. 1. శివుఁడు; 2. ఒకానొక సంకరజాతివాఁడు. విశే. (న్. సీ. న్.) కపాలము గలిగి యున్నవాఁడు.

కపాలు. దే. వి. మల్లవిద్యయందలి యొకానొక విసురు. హంస. ౧, ఆ. ౨౦౬.

కపి. సం. వి. ఇ. పుం. 1. కోఁతి; 2. పంది; 3. చల్లమడ్డి; 4. విష్ణువు; 5. సూర్యుఁడు; 6. ఉసిరికచెట్టు. 7. ఏనుఁగు; 8. కపిలవర్ణము. ఇ. ఈ. స్త్రీ. 1. ఆఁడుకోఁతి; 2. ఆఁడుపంది; 3. ఆఁడేనుఁగు.

కపింజలము. సం. వి. అ. పుం 1. చాతకపక్షి; 2. తెల్లతీతువుపిట్ట; 3. కముఁజు.

కపికచ్ఛువు. సం. వి. ఉ. స్త్రీ. దూలగొండిచెట్టు.

కపితాను. ఆం. వి. (Captain) సేనాపతి; అధికారి. "సీ. సీమమట్టు ఫిరాదు చేసి దస్త్రాల్ వ్రాసి యేతంత్రి కపితాను నెత్తఁగొట్టె." ఆనంద. పీఠి. ౫౯.

కపిత్థము. సం. వి. అ. పుం. 1. వెలఁగచెట్టు; 2. అభినయహస్తవిశేషము; 3. వెలఁగపండు.

కపిత్థాస్యము. సం. వి. అ. పుం. కొండ ముచ్చు, గోలాంగూలము.

కపిరథుఁడు. సం. వి. అ. పుం. 1. రాముఁడు 2. అర్జునుఁడు.

కపిల. సం. వి. ఆ. స్త్రీ. 1. కపిలగోవు; 2. ఆగ్నేయదిశయందలి యాఁడేనుఁగు; 3. ఇరుగుడుచెట్టు; 4. కలబందచెట్టు; 5. మెఱపు; 6. రేణుకచెట్టు.

కపిలము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. చిల్లమడ్డి; 3. కపిలవర్ణము; 4. కపిలవర్ణము గలయెద్దు. విశే. (అ. ఆ. అ.) కపిలవర్ణము గలది.

కపిలాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. శింశుపచెట్టు: 2. బుడమచెట్టు.

కపిలుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకముని; 2. కపిలాచార్యుఁడు; 3. సూర్యుఁడు; 4. అగ్నిహోత్రుఁడు.

కపిలె. దే. వి. (త. కపిలై.) 1. మోట. (శ. ర. వా.) 2. తూనికతాయి. "సీ. సరిగా జగత్ప్రపంచము తోడ నొకవంక తూనిక వచ్చినదొడ్డకపిలె." వరాహ. ౮. ఆ. ౮౯.

కపిలోహము. సం. వి. అ. న. ఇత్తడి.

కపివల్లి. సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలిచెట్టు.

కపిశ. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నయెఱ్ఱచీమ; 2. ఒకానొకదేవత; 3. ఒకానొకనది; 4. బండిగురువెందచెట్టు.

కపిశము. సం. వి. అ. పుం. 1. ఎఱుపు నలుపు కలసినరంగు; 2. నలుపు పసుపు కలసినరంగు; 3. చిల్లమడ్డి న. ద్రాక్షామద్యము. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱుపు నలుపు కలసినరంగు గలది; 2. పసుపు నలుపు కలసినరంగు గలది.

కపిశీర్షము. సం. వి. అ. న. 1. కోఁతితల; 2. కోటకొమ్ము; 3 మదురు.

కపీతనము. సం. వి. అ. పుం. 2. అంబాళముచెట్టు; 2. కలుజువ్విచెట్టు; 3. దిరిసెనముచెట్టు; 4. రావిచెట్టు; 5. బిల్వముచెట్టు; 6. పోఁకచెట్టు.

కపుఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు. విశే. (అ. ఆ. అ.) నీరు త్రాగువాఁడు.

కపురము. వై. వి. (సం. కర్పూరః.) కర్పూరము. ఆం. భా. ద్వి. ౧౬౨. వసు. ౨, ఆ. ౧౧౬.

కపురు. దే. వి. శోభ, సొగసు. "చ. అపుడు ప్రభావతీరమణి...లతాకృతిం, గపురు వహించి వచ్చిన..." శుక. ౨, ఆ. ౧౪౩; ౪౫౯.

కపోతపాలిక. సం. వి. ఆ. స్త్రీ. ఇంటిమీఁదుగాఁ జూరునం దేర్పఱచిన పావురపుగూఁడు.

కపోతము. సం. వి. అ. పుం. 1. గువ్వ; 2. పావురము; 3. పక్షి; 4. పావురపురంగు; 5. అభినయహస్తవిశేషము. "శ్లో. ప్రణామే వినయే తాలఘాతే శంభునిరూపణే కింకరోమీతి వదనేఽప్యానేచాఽంజలి రుచ్యతే. కపోత స్సకరోత్క్షేయ శ్లిష్టమూలాగ్రపార్శ్వకః." అభినయదర్పణమ్. శ్లో. ౪౩౨. ౪౩౩.

కపోదా. దే. వి. పెద్దవిల్లు, బలుపగువిల్లు. ఆం. భా. ద్వి. ౨౧౨.

కపోలము. సం. వి. అ. పుం. గండము, చెక్కిలి. స్వకపోలకల్పితము = తనబుద్ధివలన స్వయముగాఁ గల్పించినది.

కప్పు. దే. వి. (క. కప్పె.) మండూకము. (ఉరుగు కప్పు, చిఱుకప్పు, బోదురుకప్పు, తలకప్పు, రాచ కప్పు, మొ. ఇందలి భేదములు.) "ఆ...కప్పలఁ గాచి యెలుక పాముగలికిఁ బుచ్చె" ద్వా. ౪. ఆ. ౧౨౧. "చ...పాండవపక్షపాలి నీ, మన మటు గాన నెప్పుడును మాడెనఁ గప్పయెలుంగుఁ బాముపై, యునికి యెఱుంగ వచ్చె..." భార. ద్రో. 3, ఆ. ౧౦౭. (కప్పయెలుఁగుఁబాము. ఇది గోముఖవ్యాఘ్రమువంటిది.) సా: కప్పకాటు బాఁపనపోటు "గీ. బ్రహ్మ కప్పకాటు బాఁపనపో టును, లేకయుండఁ జేసె..." ద్వా. ౪, ఆ. ౧౩౦.

కప్పకుఱుపు. దే. వి. (కప్ప+కుఱుపు) కప్పపొక్కు, ఎండలో కాళ్లు కాలుటచే నేర్పడుబొబ్బ. (శ. ర. వా.)

కప్పచిప్ప. దే. వి. (క. కప్పెచిప్ప) ఆలిచిప్ప, శంబూక. ఆం. భా. ప్ర. ౧౬౧.

కప్పటము. దే. వి. (కప్పు. ధా.) కప్పు, మూఁత. (బ్రౌ.)

కప్పడము. వై. వి. (సం. కర్పటః. క. కప్పడం.) 1. వస్త్రము, బట్ట. ఆం. భా. ద్వి. ౧౧౧; 2. చినిఁగినబట్ట, జీర్ణవస్త్రము. "క. కడవసములుఁ గోలలుఁ గప్పడములు వీవలధనంబు..." భార. ఆది. ౭, ఆ. ౨౨౧. పారి. ౨. ఆ. 3౧; 3. పైబట్ట. "ద్వి. పట్టుఁగుప్పసమును బట్టుఁగప్ప డము." పండితా. మహిమ. ౧3౧. పు.

కప్పడికంబళి. దే. వి. ఒకరకపుఁగంబళి. "ద్వి. గద్దె కంబళ్లు గప్పడికంబళ్లు" పండితా. పర్వ. 3౪౬. పు.

కప్పడీఁడు. ద్వ. వి. (కప్పడము+ఈఁడు)—దాస చిహ్నముగఁ గట్టిన వస్త్రములుగల—భక్తుఁడు. "ద్వి. చెలఁగి నానాదేశముల కప్పడీలు, కలకలం బుగ గముల్ గట్టి యేతేర." పండితా. పర్వ. 3౯౧. పు.

కప్పతాళము. మి. వి. (కప్ప+తాళము.) ముద్ద బీగము. (శ. ర. బ్రౌ.)

కప్పనాగురు. దే. వి. (కప్ప+నాగురు.) చిఱుకప్ప కాటుచే పసులకుఁ గలిగెడురోగవిశేషము. (చూ. కప్పనావురు.)

కప్పనావురు=కప్పనాగురు. "ఆ. నరిడి పుప్పు కప్పనా వురు కడుపూఁద..." హరి. పూ. ౬, ఆ. ౪౧.

కప్పము. దే. వి. 1. పన్ను, ప్రజలు రాజునకు చెల్లించుసొమ్ము. "సీ...పరమండలంబుల ధరణి పతుల, నదిమి కప్పంబుల ముదముతోఁ గొను చును..." భార. ఆది. ౧, ఆ. ౭; 2. కానుక, సామంతులు ప్రభువుల కిచ్చుబహుమతి. "మ. గజతాఘోటకహాటక ప్రముఖముల్ గప్పంబు లొప్పింపుచున్, విజితారాతులు మ్రొక్క..." హరి. పూ. ౧, ఆ. ౧౬.

కప్పరపడు. ద్వ. అ. క్రి. (కప్పరము+పడు.) సంభ్రమమందు. "క. చెప్పిన నంతయు విని నే నప్పుడు తల యూఁచి యమ్మహాదేవి మొగం, బొప్పారఁ జూచి నవ్వినఁ, గప్పరపడి నన్నుఁ బలికె"...విష్ణు. నా. ౧, ఆ. ౨౦౬. జై. ౫, ఆ. ౧౯3.

కప్పరపాటు. ద్వ. వి. (కప్పరపడు. ధా.) సంభ్రమము, తొట్రుపాటు. "ఉ. కప్పరపాటుతో నతనిఁ గన్గొని..." రంగా. ౧, ఆ. ౭౦. భాగ. ౬, స్కం. 33౨., ౧౦, స్కం. పూ. ౨౪.

కప్పరము. దే. వి. సంభ్రమము, తొట్రుపాటు. (చూ. కప్పరపడు, కప్పరపాటు.)

కప్పలి. దే. వి. (త. కప్పల్.) ఓడ, నౌక. "సీ. విర హాంబురాశి దాఁటి రథాంగములు బోరగిలఁ నిడ్డ పసిఁడికప్పలి యనంగ." పరమ. 3, ఆ. ౨౮౦. "క. కప్పలితీరునను దేరు కదలక నిలిచెన్." శుక. ౨, ఆ. ౧౧

కప్పారు. దే. అ. క్రి. (కప్పు+ఆరు.) నల్లపడు. "సీ. కప్పారు రేణువు గమలాప్తబింబంబు రాహు మండలమునఁ రమణఁ గప్ప." భార. భీష్మ. ౧, ఆ ౨౪౨. "ఉ...కుచాగ్రతలంబులతోన యారు గ,ప్పారె..." కు. సం. 3, ఆ. ౨౪.

కప్పి. దే. వి. గిలక, యంత్రవిశేషము. (బ్రౌ.)

కప్పికోల. దే. వి. ఒకవిధముగుకోల, బాణవిశేషము. "గీ. కప్పికోలల నాతండు దుప్పిపదుపు, నొడల నరుణాంబు బిందువుల్ వొడమఁజేయ." సాంబో. 3, ఆ. ౧౭.

కప్పిడు. దే. స. క్రి. (కప్పు+ఇడు.) కప్పిపుచ్చు, దాఁచు. "క. కప్పిడఁగ నేల యొప్పమి, నిప్పుడ యెఱిఁగింపు కలిగెనేని మహాత్మా." శేష. ౪, ఆ. 3౮.

కప్పిపుచ్చు = కప్పిడు. "గీ. కల్లతనములు పలు మాఱుఁ గప్పిపుచ్చు." కాశీ. ౪, ఆ. ౯౦. నైష. ౧, ఆ. ౮౪.

కప్పిరి. దే. వి. (కప్పు+ఇరులు.) 1. కొంచెపాటి చీఁకటి. (శ. ర. బ్రౌ.); 2. నలుపు. "గీ. గురుకు చంబులు పైఁ బచ్చసరలు వాఱె, తుదలఁ గప్పిరి వొలుపారఁ గడిసి వలిసె." కు. సం. ౧౦, ఆ. ౩౮.

కప్పు. దే. అ. క్రి. క్రమ్ము, వ్యాపించు. "చ...విష ముద్భవిల్లి న,ల్గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్వెన..." భార. ఆది. ౨, ఆ. ౧౫. స. క్రి. 1. మూయు. "సీ. కరతలయుగళి వక్త్రములు గప్పక..." కాళ. ౨, ఆ. "క...వాణి యనం, గలవాకిలి యట్టిబుధుఁడు కప్పంజాలున్." భార. శాం. ౫, ఆ. ౩౨౨. ౪; 2. దాఁచు. "ఉ. చెప్పుము...ఏమియుం, గప్పక..." వరాహ. ౧, ఆ. ౯౦; 3. ఆచ్ఛాదింపఁజేయు. "సీ. పులి కళాసంబు గప్పుదురు పాఱఁగ మీఁద విద్యా ధరాంగనా విట గణంబు." హర. ౫, ఆ. ౧౦; 4. చుట్టునుండు. "క...సకియలు తన్, గప్పు కొని వెంట రాఁగా..." సా. ౩, ఆ. ౪౩. వి. 1. నలుపు. "సీ. ధవళాక్షితొంగలి తఱచు ఱెప్పల చెన్నుక ప్పుచీఁకటి గవియుదేర". భార. విరా. ౨, ఆ. ౩౭; 2. చీఁకటి. "చ. తనపయిరాజు రా వెసఁ బతంగుఁడు కాలవశాత్రి నేఁగుచోఁ, మునుకొని కప్పుమూఁకయును ముట్ట..." హ. న. ౪, ఆ. ౫; 3. దంతక్షతము. "చ...తా, మరకొమరాలు మాటె నళిమండలిపేరిటి కప్పు లన్నియున్." హ. న. ౪. ౮; 4. ఆచ్ఛాదనము. (శ. ర.); 5. ఇంటిపైకప్పు. (శ. ర.) విణ. నల్ల నిది. "గీ. ఉప్పరముపేర నొప్పెడుకప్పుట నటి, నుప్పతిలి..."ఉ. రా. ౪, ఆ. ౧౫౫.

కప్పుఁగుత్తుకపుల్గు. దే.వి. (కప్పు+కుత్తుక+పులుఁగు.) నీలకంఠము, నెమలి. "సీ. కప్పుగుత్తుకపుల్గుగ ములపెల్లు దొలంగె..." అచ్చ. కిష్కిం. ౬౯.

కప్పుఁగుత్తుకవాఁడు. దే. వి. (కప్పు+కుత్తుకవాఁడు.) నీలకంఠుఁడు, శివుఁడు. "సీ. కప్పుఁగుత్తుక వాఁడు..." అచ్చ. బాల. ౧౩, ఇట్టే: కప్పు మెడవలఁతి. అచ్చ. సుం. ౧౪.

కప్పుఁదెరువరి. దే. వి. (కప్పు+తెరువు+అరి.) కృష్ణ వర్త్మ, అగ్ని. (శ. ర.)

కప్పుఁదెరువుజోణ. ద్వి. వి. (కప్పు+తెరువు+జాణ.) కప్పుఁదెరువరి. "గీ. నిప్పుకలు వెట్టి రవులింపఁ గప్పుఁదెరువుజాణ మంటలు వెదచల్లఁ జాగె మిగుల." అచ్చ. సుం. ౧౬౬. ఆం. సా. దేవ. ౧౮.

కప్పుఁద్రోవదొర = కప్పుఁదెరువుజాణ. "ఉ...వేఁడి వేల్పునా, నొప్పెడుకప్పుఁద్రోవదొరయున్..." సమీర. ౨, ఆ ౧౦౫.

కప్పుఁద్రోవరి = కప్పుఁదెరువరి. సాం. ని. దేవ. ౧౨.

కప్పుకొను. దే. అ. క్రి., స. క్రి. (కప్పు+కొను స్వార్థమున) క్రమ్ము,వ్యాపించు. "క. ఒప్పనితమ కము చిత్తముఁ,గప్పుకొనుట నుత్తలంబు గదు రఁగ..." భార. విరా. ౨, ఆ. ౩౭. దశా. ౨, అ. ౬౦. స. క్రి. దాఁచు, మఱుఁగుచేయు. "సీ. కప్పుకోనేల బంగారమా పువుబంతు లవి సువర్ణలతోదయములు సుమ్ము." కవిరా. ౧, ఆ. ౮౧.

కప్పుటిల్లాలు. దే. వి. (కప్పు+ఇల్లాలు.) కాళి. వేంక. దేవ. ౭. ఇట్లే; కప్పుటైదువ.

కప్పుటెరవుదారి. ద్వ. వి. అగ్ని. (ఆం. పద.)

కప్పుటేటిగొంగ. దే. వి. (కప్పు+ఏటిగొంగ.) బల రాముఁడు. వేంక. దేవ. ౨౧.

కప్పుడు. దే. వి. కప్పు. ఆచ్ఛాదనము. (శ. ర.)

కప్పుదెంచు. దే. అ. క్రి. (కప్పు+తెంచు స్వార్థ మున.) క్రమ్ము. "ఉ. ఉఱుముచు నెత్తెడు బిమగు లుగ్రగతిం బడ ఘోరమూర్తియై, యఱి ముఱిఁ గప్పుదెంచు విలయాభ్రము చాడ్పున ..." భార. ద్రో. ౧, ఆ. ౮౯.

కప్పుబల్ల. దే. వి. (కప్పు+బల్ల.) ద్వారముమీఁది పలక. (శ. ర.)

కప్పుమల. దే. వి. (కప్పు+మల.) కాటుకకొండ, అంజనపర్వతము. (శ. ర.)

కప్పుమేనిగాము. ద్వ. వి. (కప్పు+మేని+గాము.) శనిగ్రహము. (శ. ర.)

కప్పుముత్తైదువ. ద్వ. వి. (కప్పు+ముత్తైదువ.) గౌరి, పార్వతి. సాం. ని. దేవ. ౬.

కప్పురగందము. వై. వి. 1. కర్పూరపువాసన; 2. కర్పూరమిళితచందనము. "సీ...కప్పురగంధ మొఱపు నెఱప." ఉ. రా. ౭, ఆ. ౨౫౪.

కప్పురగంధి. వై. వి. (కప్పురము+గంధి.) కర్పూరమువంటిపరిమళము గలస్త్రీ; స్త్రీ. "ఉ... నందుని ముద్దుఁజెల్లెలౌ,కప్పురగంధి రాధ యను కన్నియ..." రాధా. ౧, ఆ. ౧౨. చంద్రా. ౪, ఆ. ౧౬౬.

కప్పురపుటనఁటి. ద్వ. వి. (కప్పురము+అనఁటి.) కర్పూరకదళి. ఉ. రా. ౬, ఆ. ౨౪. దీని రూపాంతరములు: క ప్రపుటనఁటి. వసు. ౧, ఆ. ౧౩౯. క ప్రపనఁటి య. ౪, ఆ. ౨౦.

కప్పురపుబెండ. ద్వ. వి. (కప్పురము+బెండ.) గంధమూలము, ఒకరకపుబెండ. (శ. ర.)

కప్పురపువంగ. ద్వ. వి. (కప్పురము+వంగ.) కూటవార్తాకి, ఒకరకపువంగ. (శ. ర.)

కప్పురబోగి. వై. వి. (కప్పురము+బోగి.) సస్యవిశేషము. "ద్వి. పొలుపు గైకొనక కప్పురబోగి వేఁగె." విష్ణు. పూ. 3. ఆ. (శ. ర.) బ. ధాన్యవిశేషము. (వృత్తియందు దేకవచనాంతము.) "ఉ. కప్పురబోగి వంటకము...,ఒప్పులుగా భుజించిరి..." భీమ. ౨, ఆ. ౧౩౯.

కప్పురమద్ది. ద్వ. వి. (కప్పురము+మద్ది.) ఒకరకపుమద్ది. ఓన. శకుం. ౨, ఆ. ౧౪.

కప్పురము. వై. వి. (సం. కర్పూరః. క. కప్పుర.) కర్పూరము. (వృత్తియందు హల్లు పరమగుచో 'ము'వర్ణలోపము వికల్పము. ఉదా: కప్పురగందము, కప్పుర పీడెము మొ.)

కప్పుతాయి. దే. వి. (కప్పు+తాయి.) నీలమణి, నీలము. ఆం. భా. ద్వి. ౨౭౦. సాం. ని. స్థా ౬౧.

కప్పువేల్పు = కఱివేల్పు. సాంబో. ౧, ఆ. ౧౧౫.

కప్పెక్కు. దే. అ. క్రి. (కప్పు+ఎక్కు.) నల్లనగు. "క. కొప్పును రోమావళియును, గప్పెక్కెను... యావన మైనన్." వరాహ. ౯, ఆ. ౧౦౦.

కప్పెట. దే. వి. ఒకజాతిపక్షి. "సీ. పంగపంఱును గోరువంక కప్పెట..." సుద. 3, ఆ. ౧౯౪.

కప్పెర. వై. వి. (సం. కర్పరః. త. కప్పరై.) 1. కపాలము, పుఱ్ఱె. "చ. కఱచినపీనుఁగున్ వెడఁద కప్పెరయున్ మొలఁ బచ్చితోళులున్." ఉ. హరి. ౨, ఆ. ౧౨౬. ఆం. భా. ద్వి. ౧33; 2. భిక్షాపాత్రము, బిచ్చపుగిన్నె. "చ. కరమునఁ బట్టి భిక్షగొను కప్పెర గొప్పది గాదు మానెఁ డౌ,టరుదు..." చెన్న. ౫, ఆ. ౨౯. హర. ౫, ఆ. ౫౫; 3. వాసంతి, కుంపటి. "గీ. అనుచు నబ్బూసురుం డెంచునంతలోన, సురియ నిప్పులు రాలు కప్పెరయుం మొగము, మీఁద మసిబొట్టు మించ నప్పెలఁత రాఁగ." శుక. ౨, ఆ. ౧౯౨.

కప్రము = కప్పురము. "చ...కప్రపున్, వలపులు మీఱ..." ఆము. ౧, ఆ. ౭౧. ఆం. భా. ద్వి. ౧౬౨.

కప్రములక. ద్వ. వి. (కప్రము+ములక.) కప్పురపువంగ. (శ. ర.)

కఫము సం. వి. అ. పుం. శ్లేష్మము, తెమడ.

కఫారి. సం. వి. ఇ. పుం. 1. సొంటి; 2. మిరియాలు.

కఫి. సం. విణ. (న్. నీ. న్.) కఫరోగి.

కబంధము. సం. వి. అ. పుం. 1. కడుపు; 2. మబ్బు; 3. సముద్రము; 4. ధూమకేతువు. "గీ. అర్కునుదయాస్తమయములయందుఁ గృష్ణకాంతి ఘోరకబంధంబు గప్పఁజొచ్చె." భార. భీష్మ. ౧, ఆ. ౧౧. (ఉదయాస్తమయే సూర్యం కబంధైః పరివారితమ్. అని మూలము.) పుం. న. తలతెగి పోయినను తుళ్లెడుమొండెము, అట్ట. న. జలము.

కబంధుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు; 2. రాహువు.

కబరము. సం. వి. అ. పుం. న. 1. ఉప్పు; 2. పులుసు. విణ. (అ. ఆ. అ.) 1. మిశ్రము; 2. నానావర్ణములు కలది.

కబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొప్పు; 2. ఖరపుష్పి.

కబళనము. సం. వి. అ. న. కబళించుట, మ్రింగుట.

కబళము. సం. వి. అ. పుం. న. 1. అన్నము మున్నగువానిముద్ద; 2. మత్స్యవిశేషము.

కబళించు. సం. స. క్రి. 1. మ్రింగు, తిను; "క... తద్గాత్రంబున్. క...కుక్కపదుపు వెనుకకున్, జడిసెఁ గబళింప నొల్లక..." భార. శాం. 3, ఆ. ౫౦౦. (శ. ర.); 2. నశింపఁజేయు. "సీ. కైరవాకరములగర్వంబు కబళించి..." మార్క.

౨, ఆ. ౧౪౯; 3. కడుపునఁ బెట్టుకొను; జయించు. "ఉ...భీష్మనాఁజి గబళించి పాండ వుల జృంభితవిక్రమలీలఁ బొల్పుటన్." భార. ద్రో. ౧, ఆ. ౧౭; 4. పట్టుకొను. "సీ. అంగు ళంబుల నల్ల సలకలు గబళించి కెమ్మోవి యూని యెక్కింతుఁ గాయమ్ము." భార. విరా. ౨, ఆ. 3౧౦; 5. అంతర్గతముగాఁ జేయు; మించు. "క. ఘనతర గర్జాధ్వనులును, ఘనపథ మఖి లంబుఁ దూఁటుకట్టెడుతూర్య, స్వనములునుం గబళించుచు, ననిలతనయుంసింహనాద మడరెం బెలుచన్." భార. భీష్మ. ౧, ఆ. ౨౩౬.

కబాడము. దే. వి. అంకెమువలెఁ గట్టి యెద్దమీఁద వేసి తెచ్చెడుకసవు మున్నగువాని జంటమోపు. (శ. ర.)

కబాయి. దే. వి. (హిం. కబా. క. కబాయి. త. కషాయ్.) అంగీ. "సీ. నవపుష్పవనము నానా మణుల్ గ్రుచ్చినపచ్చపట్టుఁ గబాయిబాగు నెఱప." కళా. ౫, ఆ. ౧౭౯.

కబాయీ = కబాయి. "రగడ. చాదరలు పైఠిణులు చక్కనికబాయీలు." హంస. ౫, ఆ. 3౫౬. (శ. ర. పా.)

కబురు. దే. వి. (హిం. ఖబర్.) 1. వృత్తాంతము; సంగతి. ఆం. భా. తృ. ౫3; 2. దంభము, బడాయి. ఆం. భా. తృ. ౫3; 3. విశేషము, క్రొత్తసంగతి. "క. ఏగంధర్వపురంబున, కేఁగన్ మిముఁ గంటి కబురు లింతే సెలవా, వేగమునఁ బోయి వచ్చెద..." పార్వ. ౨, ఆ. ౧౭3.

కబోది. దే. వి. అంధుఁడు. (బ్రౌ.)

కబ్బపుఁగూరుపరి. ద్వ. వి. (కబ్బము+కూరుపరి.) కావ్యకర్త, కవి. "క. అని యెల్లవేల్పులను, బే ర్కొని కబ్బపుఁగూరుపరులగురునిఁ గడంకన్, గొనియాడి..." అచ్చ. బాల. పీఠి. ౧౨.

కబ్బపుఁగూర్పరి = కబ్బపుఁగూరుపరి. "గీ. బంట్లు కబ్బంపుఁగూర్పరుల్..." నీలా. ౨, ఆ. ౪౯.

కబ్బపుఁజేఁతరి = కబ్బపుఁగూర్పరి. సాం. ని. మాన. ౬.

కబ్బము. వై. వి. (సం. కావ్యమ్. ప్రా. కబ్బమ్. త. కాప్పియమ్.) కావ్యము; ప్రబంధము. "చ... జిహ్వికా, కిసలయతూలికం గొని లిఖింతురు కబ్బము..." భీమ ౧, ఆ. ౧౨. పరమ. ౨, ఆ. ౨3౪.

కబ్బముప్రోయాలు. ద్వ. వి. (కబ్బము+ప్రోయాలు.) సరస్వతి. "సీ. గిబ్బడాల్గొరగుండు కబ్బంబుప్రో యాలు..." అచ్చ. యు. ౫౬౨.

కబ్బాయి = కబాయి. "ద్వి... మేలు, తళ్లాయి కబ్బాయి గొమ్మంచు నొసఁగి." ద్వి. పరమ. ౬, ఆ. ౪౧౨. పు.

కబ్బి. దే. వి. మోసము. (బ్రౌ.)

కబ్బిలి. దే. వి. శౌండికుఁడు, కల్లు విక్రయించు వాఁడు. (శ. ర.)

కమండలము. వై. వి. (సం. కమండలు. క. కమండల) కమండలువు. "చ...సానికై, యొప్పుకమండ లంబు..." హంస. ౫, ఆ. ౧౨.

కమండలువు. సం. వి. ఉ. పుం. న. సన్న్యాసులు గాని బ్రహ్మచారులు గాని ఉపయోగించు ఒక విధపు జలపాత్రము. ఉ. పుం. 1. జువ్విచె; 2. నాలుగుపాదములు గల ఒకానొకజంతువు.

కమటము. దే. వి. అగసాలెవానికుంపటి. "చ. కమ టము కట్టెసంచి యొరగల్లును..." హంస. ౨, ఆ. ౧౪౧. "గీ. సమయునాఁడింధమాగ్రణి. సాంధ్య రాగ, విమలశిఖి మింటిపైఁగాకమటమునఁ గాఁచి." రా. వి. ౪, ఆ. ౪౨.

కమఠము. సం. వి. అ. పుం. 1. తాఁబేలు; 2. వెదురుచె; 3. అందుగుచె. 4. తాఁబేటిచిప్పయెముక. న. మునిభిక్షాపాత్రము. విణ. (అ. ఆ. ఆ.) పొట్టిది.

కమఠి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు, ధులి.

కమతకాఁడు. దే. వి. (కమతము+కాఁడు.) సేద్య గాఁడు. ఆం. భా. ద్వి. ౨౯.

కమతము = కమ్మతము. (చూ. కమతీఁడు.)

కమతీఁడు. దే.వి. (కమతము+ఈఁడు.) సేద్యగాఁడు. "సీ. వెదురుచేల్ కలుపు దీసి దినంబుఁ గాపాడు కమతీలు మా కేకలములు సుమ్ము." సా. ౧, ఆ. ౭3.

కమతుఁడు = కమతీఁడు. సేవకుఁడు. (రావణుఁడు.) "గీ. వాసవాదులఁ గమతులఁ జేసికొనియె." రామా. ౯, ఆ. ౯౫.

కమనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁదగినది; 2. మనోహరమైనది.

కమనుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్ఛ గలవాఁడు; 2. కాముకుఁడు; 3. అందగాఁడు.

కమరి. దే. వి. కమరు, ఒడ్డాణము. ఆం. భా. ద్వి. ౧౫౦.

కమరించు. దే. స. క్రి. (కమరు ధా. ప్రే.) అసూయమెు. కలిగించు. "క. మున్నింద్రప్రస్థంబున, నున్నతి మెయి ననుజతనుజ యుక్తంబుగ నీ, వున్న తెఱఁగు దుర్యోధను, కన్నులు గమరింప నతఁడు కడు వగ నొందెన్." భార. శాం. 3, ఆ. ౧౨౮.

కమరు. దే. అ. క్రి. (క. కమరు.) 1. కాలు, దగ్ధమగు. "క. కని దానిచుట్టు నుండెడు, ననలంబును జూచి తన్మహత్తరజిహ్వల్, దనికిన నెఱకలు గమరునొ, యనుతలఁపున..." భాగ. అను. ౧, ఆ. ౨౪౯; 2. ఎండు, శుష్కించు. (చూ. కమరులువోవు.); 3. కాఁగు, తప్తమగు. "సీ. ఎఱ్ఱగాఁ గాఁగిన యినుపకంబములతోఁ గట్టిన గమగమఁ గమరుచారి." దశ. 3, ఆ. ౧౬; 4. వాఁడిపోవు. "గీ. తీయవిలు చీమగమి దొల్చి తినియెనేని, బొదలు నావేఁడియూర్పులఁ బుష్పఁదేరు, కమరెనే బట్టబయ లగు గర్వరేఖ." పిన. శకుం 3, ఆ. ౧౯౦; 5. ఉడికిపోవు, కరఁగు. "చ. కమరె నశేషకోకనద కైరవపంక్తులు శైవలంబులున్." భార. ఆది. ౪, ఆ. ౨౬౬; 6. అఱఁగు, జీర్ణమగు. "క. బడబాగ్నివ్యలాగస్త్యులు, కుడిచినకుడు పఱుగఁ జేసి కుశలప్రదుల,య్యెడు మాకు ననుచు వలచే,గడుపు నిమిరి చదువ గట్టికండ్లుం జమరున్." విజ్ఞా. ఆచా. ౮౨; 7. అసూయమెు. కలుగు. (చూ. కమరించు.) వి. 1. కాలినకంపు. "సీ. కమరును నార్తనాదములును బెల్లుగ...గీ...పరగె, నద్భుతోద్భవం బైనమహానలంబు." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౫౧; 2. ఒడ్డాణము. "గీ. లజ్జ యెుఱఁగని కటిమండలంబుమీఁద, వలుఁద వజ్రాలకమరు గర్వంబు సూప." కాశీ. 3, ఆ. ౨౪౦. ౭, ఆ.౫.

కమరుచు = కమర్చు. (శ. ర.)

కమరులువోవు. దే. అ. క్రి. (కమరులు+పోవు.) ఎండు, శుష్కించు. "క. ధారాగృహమున నుండిన, నీ కెంతయుం నింకెఁ గొలని నీరులలోనం, భోరుహ కదళీసహ, కారంబులు గలయఁ గోఁడు గమరులువోయెన్." కు. సం. ౫, ఆ. ౧౬౯.

కమర్చు. దే. అ. క్రి. కందు, (కోపమున) కమలు. "గీ. భీముఁ డిపుడు గమర్చిన మోముతోడ, విదురవదనంబుఁ జూచుచుఁ బెనవు లదర." భార. ఆశ్ర. ౧. ఆ. ౧౮౯. స. క్రి. (కమరుధా. ప్రే.) కమరుచు, కమరఁజేయు. (శ. ర.)

కమల. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మీదేవి; 2. ఉత్తమస్త్రీ; 3. ఒకానొకఫలవృక్షము.

కమలచ్ఛదము. సం. వి. అ. పుం. 1. తామరరేకు; 2. రాపులుఁగు.

కమలజుఁడు. సం. వి. అ. పుం. కమలజన్ముఁడు, బ్రహ్మ.

కమలము. సం. వి. అ. పుం. న. సారసపక్షి. పుం. శివుని చేతియుత్తి; ఒకజాతిలేడి. న. 1. తామర; 2. ఎఱ్ఱతామర; 3. నీరు; 4. రాగి; 5. మందు; 6. కడుపులో నొకప్రక్కనుండు యెఱ్ఱనిమాంసము; 7. కత్తియెుఱ.

కమలవనము. సం=కమలషండము. నిర్వ. ౮, ఆ. ౪౪.

కమలషండము. సం. వి. అ. న. కమలసముదాయము గలది—తామరకొలను. "అ. ఇట్లు కమలషండమిక్కడక్కడవడ, నభిమతప్రకారహారిలీలఁ, గేలి సలిపి..." నిర్వ. ౮, ఆ. ౬౪.

కమలాకరము. సం. వి. అ. పుం. తామరకొలను. నిర్వ. ౮, ఆ, ౪౧.

కమలాక్షుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. విణ. (అ. ఈ. అ.) పద్మములవంటి కన్నులుగలవాఁడు.

కమలాప్తుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. సూర్యుఁడు.

కమలాలయ. సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

కమలాసనుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.

కమలించు. దే. అ. క్రి. దుఃఖించు, ఏడ్చు. "వ. అనిన నట్టిదివ్యవచనంబులు విని నమ్మి రతి మరణపరిచ్ఛేదంబు విచ్ఛేదంబు చేసి పతిం దలంచి కమలించి." కు. సం. ౫, ఆ. ౯౮. స. క్రి. (కమలుధా. ప్రే.) కమలఁజేయు, కందఁజేయు. "సీ. కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ

దల కెక్కఁ జాలెనేహాలవాలంబు." వసు. ౪, ఆ. ౭౯.

కమలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీఁగ; 2. తామరతంపర; 3. తామరకొలను. "క...పతియు సాతియుం, నిలిచి పొలిచి రపుడు కమలినీతట భూమిన్." నిర్వ. ౧, ఆ. ౬౫.

కమలు. దే. అ. క్రి. 1. కందు. ఆం. భా. తృ. ౯౯; 2. కాలు. "మ. ఇనచండాంశులఁ బత్రముల్ కమలి యే సెచ్చోటికిం బోవలే, కునికిన్..." భా. రా. కిష్కిం. ౭౧౦. వి. వైవర్ణ్యము, విన్నదనము. "సీ. కాళికావిభునిడా కాలితాటిం పులకమలు చేరని నాఁటి కుసుమదహితుఁడు." పిన. శకుం. ౧, ఆ. ౩౯.

కమలుచు. దే. స. క్రి. (కమలుధా. ప్రే.) కంప లించు, కాల్చు. ప్రబంధ. ౭౧౦.

కమల్చు = కమలుచు.

కమలోత్తరము. సం. వి. అ. న. కుసుంభము, కుసుమ పువ్వు.

కమసాలవాఁడు. వై. వి. లోహకారుఁడు. (శ. ర.)

కమసాలి = కమసాలవాఁడు. (వా.)

కమాను. దే. వి. (హిం. కమాన్.) 1. విల్లు. "ఉ... కసపక్షితిపాలుఁడు...ఎన్న సాటి యగు బంగరు గట్టుకమానుపాదుషా,నారికి..." చం. రా. ౧, ఆ. ౫౬; 2. ప్రయాణము. (శ. ర.); 3. పడవ నడపుసాధనము. ఉదా:...పడవకమాను. (వా.)

కమామీసు. హిం. వి. 1. వ్యవహారదక్షత, (బ్రౌ.) 2. కాలము. (బ్రౌ.); 3. విశేషము. (వా.)

కమి. దే. వి. 1. కబళనము. "సీ. కమి యనఁగా నొప్పుఁ గబళనంబు. ఆం. భా. ద్వి. ౭౬౦; 2= కమికిలి. "సీ. కాంతాజనంబులు కమియూర నిడుదు రేపురములో మత్కాలపుణ్యాభిక్ష. భీమ. ౩, ఆ. ౭; 3. తృప్తి. "ఉ...ముద్దుమోవు, ముం గమియూర ముద్దిడుట ముజ్జగ మేలుట గాక యుండునే." కవిక. ౧, ఆ. ౪౦.

కమికిలి. దే. వి. కట్టిలి. పాణివిశేషము. ఆం. భా. ద్వి. ౧౪౧. "చ. కమికేఁడు గుబ్బచన్నుఁ గవ..."రా. వి. ౩, ఆ, ౧౮. "ఆ...కమికెఁ డన్నమైన..."ద్వా. ౬, ఆ. ౧౦౧. ద్వా. ౭, ఆ. ౧౭౪.

కమిచీ. హిం. వి. కశము, కొరడా. (బ్రౌ. పా.)

కమిటీ. ఆం. వి. (Committee) సంఘము, ఏదే నొక పనిచేయ నేర్పడిన సంఘము.

కమిత. సం. విణ. (బు. త్రి. బు.) కాముకుఁడు.

కమియు. దే. అ. క్రి. 1. కవియు, పైఁబడు. "సీ. కమియుసుద్ధతవారణముఁ ద్రిప్పు నేసదాచార ధౌరేయుహుంకారరవము." భాను. ౧, ఆ, ౭; 2. నలఁగు, క్షతమగు. "క. కనలి నిశాచరికే లుక్కునఁ గమియఁగఁ బట్టి భీతిగొనఁ దిగిచి పడిన్."భా. రా. సుం. ౧౪; 3. మాఁగు, మిక్కిలి పండు. "చ...దోరపండులుం, గమిసినపండు లున్...."హరి. పూ. ౬, ఆ. ౧౨. (శ.ర. పా. 'కమిచిన' పాఠాంతరము.); 4. అతిశయించు, పూర్ణమగు. "గీ. కమియ నిచ్చిన గేదంగిగన్న పువ్వు."నైష. ౧, ఆ. ౯౦. 5. క్రమ్ము, సాంద్ర మగు. "చ...చెలువ గసుంగవం గమియఁ జెందినకాటుక కప్పుకై పడిన్."పారి. ౭, ఆ. ౪౬. స. క్రి. 1. కొఱకు "క. తలిరాకు మెఱుఁగువా తెఱ, కలకంఠ విటుండు గమియఁగా..." పారి. ౩, ఆ. ౫౬; 2. తిను; త్రాగు. "క...కండలు నెత్తురును వేఁగఁ గమియంగా..."మార్క. ౧. ఆ. ౭౪; 3. క్రమ్ము. "గీ. అతను దర్పాంధకార మంతంతఁ గమియ." రా. మా. ౫. ఆ. ౭౦.

కముఁజు. వై. వి. (సం. కపింజలః) కపింజలపక్షి, కొంజు. "ద్వి. కముఁజులఁ జిలుకలఁ గ్రౌంచ పక్షులను." ద్వి. నల. ౩. భా. ౩౭౩. పం.

కముచు. దే. స. క్రి. 1. కట్టుకొను. "క. చనుఁగవ ఘనమో జఘనము, ఘనమో యని నడిమిచక్కిఁ గమిచి విధి కరం,బునఁ దూఁచె దీనిఁ గా కిట్లనువు పడునె వళులపేర నంగుళిరేఖల్."నైష. ౫, ఆ. ౧౬; 2. ఊఁదఁబెఱుకు. "గీ. కపివరుఁడు పర్వతం బులు గమిచి తెచ్చి, కుప్ప లిడురీతి..."హంస. ౫, ఆ. ౧౦; 3. కొఱుకు. "సీ. తమి దొలంకఁగ సామఁగమిచిన చిగురాకుఁ జెలువున కిచ్చుకోయిల వెలంది." చంద్ర. ౩, ఆ. ౯౭; 4. మ్రింగు. "సీ...పక్షిస్వామిగతిఁ బుళిందశ్రేణిఁ గమిచి కమిచి." స్వా. ౪, ఆ. ౧౧౩. 5. చేర్చు, కూర్చు. "చు,..ఆ, ననపద్మంబు ముఖంబునం గమిచి మేనం జొప్పు గాకుండ మెత్తన కామాం

కము లావహించి రతితంత్రవ్యాప్తి మోపించి తిన్." దశ. ౭, ఆ. ౧౧౩. నైష. ౩, ఆ. ౩౯; 6. భక్షించు, తిను."క. కాలియుం గాలనిపీనుఁగు, నేలకు నొఱఁగంగఁ దిగిచి నెనడులు గమపం, గా..."దశ. ౧౦, ఆ. ౧౬౨; 7. ఆస్వాదించు, రుచిచూచు. "సీ...కదిసిన కెమ్మోవి గమిచి కమిచి." ఉ. హరి. ౫, ఆ. ౨౧౨; 8. ఆక్రమించు. "సీ. వరుస మీఁదటివ్రాలు వ్రాయ నేర్చిననాఁడె కమిచి దిక్కుల జయాంకములు వ్రాసె." పాండు. ౧, ఆ. ౪౧; 9. ఆకర్షించు, లాగివేయు. "మ...దుష్క్రియాపంకసం, కర దైత్యాసుపరంపరం గమచు రేఖన్..."ఆము. పీఠి. ౫; 10. నొక్కు, అదుము. "క. హారపరీక్షామిషమున, భూరమణుఁడు గమిచె నింతి పొంకపుఁజన్నుల్ ... చిగురుగోరులకొనలన్." నైష. ౭. ఆ, ౧౬౬.

కమ్మ. దే. వి. 1. శాకనాళము, కాడ. ఆం. భా. ద్వి. ౭౭; 2. పత్త్రవృంతము, మట్ట. ఉదా:—తాటికమ్మ; 3. తాటియాకు. ఆం.భా. ద్వి. ౭౭; 4. లేఖ; 5. కర్ణభూష. ఆం. భాం. తృ. ౫౨. (ఇది నాలుగైదర్థములకు నుదాహరణము.) హర. ౫. ఆ.౫౪; 6. ఒకానొకశూద్రజాతి. ఆం. భా. ద్వి. ౨౯౨. కృష్ణ. ౩, ఆ. ౨౬. భీమ. ౧,ఆ. ౩౧. విణ. ప్రియమైనది. (వృత్తియందు నిగాగమము వికల్పము. ఉదా.—కమ్మని.) 1. ఘ్రాణమునకుఁ బ్రియమైనది. ఉదా:—కమ్మనెత్తావి; 2. జిహ్వకుఁ బ్రియమైనది ఉదా.—కమ్మఁదేనె; 3. నేత్రమునకుఁ బ్రియమైనది. ఉదా:—కమ్మనిపసిఁడిటంకము. (ఇట్లే ఇతరము లూహించునది.)

కమ్మకట్టు. దే. వి. (కమ్మ+కట్టు.) ఓడినరాజు గెలిచిన రాజున కవసరమైనపుడు సంధియొడంబడిక ప్రకారము పంపుసైన్యము; కొంతధనము పుచ్చుకొని నిర్ణీత మగుకాలమువఱకే రాజుపక్షమున యుద్ధము చేయ వచ్చినసైన్యము. "చ. చెలువగుమైత్త్రిఁ గోయిలపజీరులఁ దుమ్మెదకమ్మకట్టు మూఁకల గొరువంకరాదొరల..."చంద్రి.౨,ఆ. ౭౭. "చ...విసువనికమ్మకట్టు...క్రక్కస మగు రక్కసుల్..."కవిరా. ౨, ఆ. ౯౨. "ఉ...కొల్వదు కమ్మకట్టు...సత్యము లేనిపట్టునన్." వేం. పంచ. ౧, ఆ. ౫౧౩.

కమ్మకత్తి. దే. వి. (కమ్మ+కత్తి.) కుసుమాయుధము, పుష్పాస్త్రము. "ఆ. కమ్మకత్తి మనసుఁ గన్నవెట్టు, గండుదొంగ..." కళా. ౩, ఆ. ౭౯.

కమ్మకసింద. దే. వి. (కమ్మ+కసింద.) ఒకజాతికసిందచెట్టు. "వ...కలివేఁపాకుపరిమళంబుతో సంబంధించు కమ్మకసిందగంధంబును గమ్మకసిందగంధంబుతోడం దార్కొను నేలకుల సౌరభంబులును ..." కాశీ. ౭, ఆ. ౧౯౫.

కమ్మగాడ్పు. దే. వి. (కమ్మ+గాడ్పు.) మలయమారుతము. "గీ. అఖిలభువనైకమోహనుం డైనమాధవునకు నీవనవాసిరంజన మయత్న, కార్యలేశంబు సమ్మంచుఁ గమ్మగాడ్పు, కడిమి వ్రోయించెఁ గలకంఠకంఠఘంట." హ. న. ౨, ఆ. ౯.

కమ్మచ్చు. వై. వి. (కమ్మి+అచ్చు.) అగసాలెవాఁడు బంగారము వెండి మున్నగువానితీఁగ తీసెడిపనిముట్టు. "ఉ...అలక్రౌంచనగంబుపేరి కమ్మచ్చున నీడ్చుశర్వగిరియందలి వెండిసలాకపిండునా..." ఆము. ౪, ఆ. ౧౪౯. "సీ. తెలివివెన్నెల వెండితీఁగలు నిగిడించుచదలు కమ్మచ్చుబెజ్జము లనంగ." పారి. ౨. ఆ, ౩౬.

కమ్మటము. దే. వి. కమటము, అగసాలెవానికుంపటి. "వ. ప్రతిసూర్యుం డనుకమ్మటంబు..." చంద్రా. ౪, ఆ. ౧౭.

కమ్మటాకు. దే. వి. (కమ్మ+ఆకు.) ఆభరణవిశేషము. "క...ఎడగాఁజులుఁ గమ్మటాకులును సొమ్ములుగాఁ దమక్రంతలందు మురిసిరి జంతల్." ద్వా. ౪, ఆ. ౧౪౦.

కమ్మటీఁడు. దే. వి. (కమ్మటము+ఈఁడు.) అగసాలెవాఁడు, స్వర్ణకారుఁడు. (శ. ర. బ్రౌ.)

కమ్మడి = కంబళి. (బ్రౌ.)

కమ్మతకాఁడు = కమతకాఁడు. ఆం. భా. ద్వి. ౨౨౬. శుక. ౩, ఆ. ౫౦.

కమ్మతము = కమతము. 1. సేద్యము. "సీ. బేహారమాడింపఁ బెరిఁగినధనమునఁ గమ్మతంబులు వెట్టి..." నా. పంచ. ౫, ఆ. ౧౩; 2. పొలము, సస్యము. "సీ. కమ్మతంబులలోన గనులు ద్రవ్వించి బేహార మాడించి..."పిన. శకుం. ౪, ఆ. ౧౭౫.

కమ్మతీఁడు = కమతీఁడు. ఆం. భా. ద్వి. ౨౯. "సీ... కల్పకంబులపంట కమ్మతీఁడు." స్వా. ౪, ఆ. ౪౭. రామా. ౧, ఆ. ౧౬౮.

కమ్మన. దే. వి. 1. కమ్మఁదనము. (శ. ర.); 2. మాధుర్యము. (శ. ర.); 3. సౌరభము. "ఉ....కడుఁ దియ్యని కమ్మనివండు లింపుసొం,పారఁగ నాని యాని..." భార. ఆర. ౭, ఆ. ౧౧. విణ. కమ్మని. "లయ. కమ్మ నగువిల్లు..." వీర. ౨, ఆ. ౨౯.

కమ్మనిమ్మ. దే. వి. (కమ్మ+నిమ్మ.) తియ్యనిమ్మ, శర్కరాంకము. (శ. ర.)

కమ్మనీరు. ద్వ. వి. (కమ్మ+నీరు.) 1. మకరందము, తేనె. "మ...మున్నీ రైనయక్కమ్మనీరు రహిన్ గూడిన నేర్పరించుగము లై రోలంబకాదంబముల్." ఆము. ౪, ఆ. ౧౨౧; 2. హిమాంబువు, పన్నీరు. "ఉ. భావము పల్లవింప నొకపంకజలోచన వ్రాసె నొక్కల జ్జావతి మించుగుబ్బవలి చన్నులపై మకరీకలాపముల్,వావిరిఁ గమ్మనీరు మృగనాభిరసంబున మేళవించి..." నైష. 3, ఆ. ౧౦౨.

కమ్మనూనియ. ద్వ. వి. (కమ్మ+నూనియ.) సంపెఁగమొ॰వాని తైలము, సుగంధతైలము. "శ్రీ. ఆతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి కమ్మనూనియ దెప్పించి మేను శిరము,నభ్యక్తములు సేయ..." భార. అను. ౨, ఆ. ౩౦౮.

కమ్మనూనె = కమ్మనూనియ. "ఉ...మసలమ్మకు నైతము కమ్మనూనె మైఁ,నంటి నలుంగుతో జలకమార్చి యొసంగిరి ధౌతవస్త్రముల్." పార. ౨, ఆ. ౭౯.

కమ్మపంజు. దే. వి. (కమ్మ+పంజు.) రత్నతాటంకము. "సీ. క్రొమ్మించు నిర్మించు కమ్మపంజులతళ్కులుదిరిచెక్కులతోడఁ జదురు లాడ." రా. వి. 3, ఆ. ౧౨౬. స్వా. 3, ఆ. ౨౮.

కమ్మపోఁజు = కమ్మపంజు. (కర్ణాభరణవిశేషము.) "వ...మిక్కిలి మెఱుంగులుఁ ద్రొక్కులాడు నవరత్నకీలితంబు లయినకమ్మపోఁజులు ధరియించి..." సురా. ౧౦౪.

కమ్మపిల్లి. ద్వ. వి. (కమ్మ+పిల్లి.) గంధమార్జాలము, పునుఁగుపిల్లి. ఆం. భా. ద్వి. ౭౪. "గీ. కమ్మపిల్లులపిల్లలు కారుకోళ్లు." పిన. శకుం. ౧, ఆ. ౯౭.

కమ్మపువ్వు = కమ్మపంజు. (రత్నతాటంకము.) "సీ... సరిపెణ లాలక్తకము పూఁత,తాటంక తిలకంబు కమ్మపువ్వు. గీ. లాదిగాఁ గలమేలిద్రవ్యముల నొప్పు, బసదనముఁ జేసి యుంచితరూపంబుఁ దాల్చి." దశ. 3, ఆ. ౭౭.

కమ్మపూఁత. ద్వ. వి. (కమ్మ+పూఁత.) మైపూఁత, అంగరాగము. "సీ. చిన్నారిమేన వాసించుఁ బో పొరుగింటికలికిచుట్టము లొమ్ముకమ్మపూఁత." వేం. పంచ. 3, ఆ. ౨౪౯.

కమ్మర. వై. వి. (సం. కర్మారః.) ఇనుపపని చేసి బ్రతికెడుజాతి: ఉదా: కమ్మరవాఁడు.

కమ్మరము. వై. వి. ఇనుపపని చేయువానివృత్తి. ఆం. భా. ద్వి. ౨౮౪.

కమ్మరి. వై. వి. (సం. కర్మారః. కమ్మర+ఇ. క. ప్ర. స్మగ.) కమ్మరపని చేయువాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౪. అచ్చ. అయో. ౧౬. య. ౨, ఆ. ౬౮.

కమ్మరీఁడు. వై. వి. (కమ్మరి+ఈఁడు.) కమ్మరి. "వ... తెయవరుల గెలుపం దరలుమరునకుం దఱి యను కమ్మరీఁడు వెఱపునం జేసి యునిచినకఱకుటమ్ములగుంపులసొంపునం బెంపారుకలువక్రొవ్విరులును ..." నీలా. 3, ఆ. ౧౦.

కమ్మరు. దే. వి. కమరు, మొలనూలు. (శ. ర.)

కమ్మరుబొందు. దే. వి. రెండు గాఁడికమ్ములనడిమి బిగిబద్ధ. (శ. ర.)

కమ్మరేఁగు. దే. వి. కమ్మరేగు, కశేరుకము. ఆం. భా. ద్వి. ౪౫. (బ్రౌ. పా.)

కమ్మరేను = కమ్మరేఁగు. (శ. ర.)

కమ్మవడ. ద్వ. వి. (కమ్మ+వడ.) తియ్యవడ, భక్ష్యవిశేషము. "సీ...కడఁ ద్రుంచి యుంచినకమ్మవడయు." పాంచా. ౪, ఆ. ౪౯.

కమ్మవలచు. దే.అ. క్రి. (కమ్మ+వలచు.) పరిమళించు. "గీ. కుందనము కమ్మవలచినచంద మగును." జై. ౧, ఆ. ౧౮.

కమ్మవిలుకాఁడు. దే. వి. (కమ్మ+విలు+కాఁడు.) ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు. "గీ. కమ్మవిలుకాఁడు మెఱయుఁ శృంగారవనము,లోని గురిపెంద

పొదక్రిందవాని నునిచి." విక్ర. ౮, ఆ. ౫౭.
(ఇట్లే. కమ్మనివింటిజోదు, కమ్మనివిల్తుఁడు. మొ.)

కమ్మవిల్తుఁడు = కమ్మవిలుకాఁడు. సాం. ని. దేవ. ౮.

కమ్మవిల్లు. దే. వి. (కమ్మ+విల్లు.) ఇక్షుధనుస్సు. "శా...కమ్మని ల్వంచి..." కవిరా. ౨. ఆ. ౧౫౪.

కమ్మాను. దే. వి. మాధుర్యము, తీపి. (చూ. కమ్మానుకొను.)

కమ్మానుకొను. దే. అ. క్రి. (కమ్మాను+కొను.) మధురత గైకొను, తియ్యనగు. "క. రమ్మా మరువపు రెమ్మా, గుమ్మా వెల లేనిసొమ్మ గొజ్జఁగితెమ్మా, కమ్మానుకొన్నసంపఁగి, కొమ్మా దయచేసి మనవి కొమ్మా కొమ్మా." రాధికా. ౪, ఆ. ౨౦.

కమ్మి. వై. వి. 1. వస్త్రపుటంచు. ఆం. భా. ద్వి. ౧౫౩. "సీ. పసిఁడికమ్ములపట్టుపచ్చడంబు." భీమ. ౧, ఆ. ౧౧౫; 2. బండిసేమి. ఆం. భా. ద్వి. ౨౦౨; 3. లోహశలాక; లోహపుఁదీఁగ. "క. సెమ్మిగదా నడ తుమ్మెద, దొమ్మిగదా బెడఁగుఁ గురులు తొలకరిమించుం, గమ్మికదా మెయి .." కువల. 3, ఆ. ౨౯. ఆం. భా. ద్వి. 3౦౦; 4. బేసరి, కుడిముక్కున స్త్రీలు ధరించునాభరణవిశేషము. "సీ. కుడిముక్కుఁగమ్మలు గురివెంద పేరులు..." నీలా. 3, ఆ. ౪౯; 5. పేము బొద్దు. (శ. ర.); 6. వెదురుమొ. వానికమ్మి. (శ. ర.)

కమ్మించు. ద్వ. అ. క్రి. కమ్మితీయు. (తీఁగతీయు.) "సీ. సరసభాషలఁ దేనె పెరలు శేఁపఁగ వచ్చు మేచాయఁ బసిఁడిఁ గమ్మింప వచ్చు." సాంబో. ౧, ఆ. ౧౪౭.

కమ్మిచీర. ద్వ. వి. (కమ్మి+చీర.) అంచులు కుట్టినచీర. (బ్రౌ.)

కమ్మితీయు. ద్వ. అ. క్రి. (కమ్మి+తీయు.) తీఁగఁదీయు; సన్నగిల్లిపోవు. "సీ. కమ్మితీసినలీలఁ గను పట్టునెమ్మేని మిసమిసల్ ..." సా. ౨, ఆ. ౪౨. "గీ. అంత మనసిజమంత్రితో యౌవనాఖ్య, రాజవర్యుఁ డురోజముల్ ప్రబలునట్టి, కార్యములు వల్క బాల్యంబు కమ్మితీసె, దుర్గములు లేక యెట్టొప్పు దొరతనంబు." పార్వ. ౨, ఆ. ౨౪.

కమ్మిదూపు. ద్వ. స. క్రి. (కమ్మి+దూపు) కమ్మచ్చునఁ బెట్టి తీయు. "సీ. కమ్మిదూకినదూత్నకలధౌత మునుబోలెఁ జక్కఁగ నిక్కి మైపొక్కమూనె." భీమ. ౪, ఆ. ౧3౦.

కమ్మిబండి. ద్వ. వి. (కమ్మి+బండి.) కమ్మి వేసినట్టిని చక్రపుబండి. (శ. ర. బ్రౌ.)

కమ్మియచ్చు = కమ్మచ్చు. "గీ. మార నాడింధముఁడు తాపభారవహ్నిఁ, గ్రాఁచి తనతూపుమొనవాఁడి కమ్మియచ్చు,చేత సంఘర్షణము చేయఁ జిక్కి చిక్కి, కనఁగ నగుఁ జెల్వ లలితాంగకనకలతిక." కాళిందీ. ౨, ఆ. ౪౨.

కమ్మిరించు. దే. స. క్రి. 1. మూఁతపెట్టు; దాఁచియుంచు. "క. ఇలు సొచ్చి సకలభాండం,బులు శోధింపంగ నొక్కమూల దెసను దొం,తులసంధిఁ గమ్మిరించిన, సలసల మసవేఁడిపాయసముఁ గనుఁగొనియెన్." భో. 3, ఆ. ౪౪. (శ. ర. పా. 'గ్రమ్మరించు' అని ముద్రి. పా.); 2. మూయు, కప్పివేయు. "సీ. నిగిడి పూరేకుబాగుగఁ గత్తిరించినగడ్డంబుకొన బొమ్ముఁ గమ్మిరింప." నైష. ౭, ఆ. ౯3.

కమ్ము. వై. స. క్రి. కమ్మిగా సాఁగఁ గొట్టు. "గీ. మేటిజమ్మేటియసటఁ గ్రొమ్మించుమించుఁ, బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటమువెట్టి, తమ్మిగద్దియ దాఁగటఁ గమ్మి యట్టికొమ్మఁ గావింపఁ బోలు నెత్తమ్మిమాలి." వసు. ౨, ఆ. 3౨. (శ.ర. పా. గ్రమ్మి" ముద్రి. పా.) వి. ఆచ్ఛాదనము, కప్పు. "సీ. నీకులుకుఁజెం డ్లవి పైకమ్ము దప్పించు..." బిల్హ. ౧, ఆ. ౪౧.

కమ్ముదల. దే. వి. మఱుఁగుపాటు. (బ్రౌ.)

కమ్మునీరు. ద్వ. వి. (కమ్ము+నీరు.) ఉపజలము, చలువ చేసెడుబట్టలు తడుపుట కుపయోగించు నీలిమందునీరు. (బ్రౌ.) ఆం. భా. ద్వి. 3౦౧.

కమ్మెరాకు. దే. వి. (కమ్మెర+ఆకు.) కారము గల నల్లనితమలపాకు. (శ. ర. బ్రౌ.)

కమ్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాముకము, మైథునేచ్ఛ గలది; 2. మనోహరము, ఇంపైనది.

కయి. యం. దే. వి. కై, చేయి. "మ...వానికయిం గ్రాలెడువిల్లు ద్రుంచి..." అచ్చ. యుం. ౪౯3. ప్ర. (కు+అయి.) 1. నిమిత్తము. "చ...కర్జున

కయి నీకు నేటికి మనోవ్యథ..." భార. శాం. ౧, ఆ. ౩౯; 2. షష్ఠ్యర్థకము. "చ...నీ వింకఁ బట్టినస్థలం,బునకయి పొమ్ము..." కువల. ౪, ఆ. ౯౩. (సాధారణముగా 'కై' యున్నచో టులనెల్ల నాయర్థముననే 'కయి'రూపము నుండుట గ్రహించునది.) వై. వి. (సం. కవిః.) కావ్యకర్త, కవి. సాం. ని. మాన. ౬.

కయిక. వై. వి. (సం. కైకేయీ) కేకయరాజపుత్త్రి, దశరథునిభార్యలలో మూఁడవది. (ఆం. పద.)

కయికానుక. దే.వి. (కయి+కానుక.) ఉపాయనము, కానుక. "లయగ్రాహి. లీలఁ జని క్రొవ్విరులు చాలఁ గయికానుకలు మేలిమిగ నిచ్చిరి యవేల తరభక్తిన్." రామా. ౧, ఆ. ౧౯౯. ఇట్లే: కయికాన్క. శుక. ౪, ఆ. ౭౦.

కయికూడు. దే. అ. క్రి. (కయి+కూడు.) కలుగు, సంభవించు. "ద్వి...పుత్త్రశోకంబు, కయికూడి ..." ద్వి. సారంగ. ౩, భా. ౧౦౧. పు.

కయికొను. దే. స. క్రి. (కయి+కొను.) 1. పొందు. "ఉ...దైతేయులు శౌరిచేత నతితీవ్రముగాఁ గయికొండ్రు ముక్తి..."ఉ. రా. ౫, ఆ. ౧౮౫. వసు. ౩, ఆ. ౧౬; 2. సరకుగొను. "ఉ. కొండ కిరాతుఁ డంచుఁ గయికొక..." హర. ౭, ఆ. ౧౦౦.

కయిచూఱ. దే. విశే. (కయి+చూఱ.)కొల్లు, సమృద్ధి. "ద్వి. హయగజరథములు నావు లెద్దులును,గయి చూఱఁగా మాకుఁ గలిగినకొలఁది...ఇచ్చుచు రాఁగ..." ద్వి. భల్లా. ౧, ఆ. ౧౯. పు.

కయిజారు = కైజారు. (బ్రౌ.)

కయిత = కైత. (కవిత్వము.) (బ్రౌ.)

కయితము = కయిత. (ఆం. పద.)

కయిదండ. దే. వి. (కయి+దండ.) చేయూఁత; అవలంబనము, ఊఁత. "చ...ఇంకన్ గయిదండ గొమ్ము..." ఉ. రా. ౬, ఆ. ౬౬. "చ... హస్తము కయిదండ గొంచు..." పారి. ౩, ఆ. ౪౦. "చ...తమకంబులకుం గయిదండలు..." కవిక. ౪, ఆ. ౧౨.

కయిదు. దే. వి. కైజు, ఒకజాతిపక్షి. "ఉ. దూరము గాఁగ నేఁగుకయిదుం గని..." చంద్రా. ౨, ఆ. ౧౦౩. (శ. ర. పా.)

కయిబార. దే. వి. (కయి+బార) చేతిబార; బార. "చ. బయలుచు గౌఁగిలింపఁ గయిబారలు సాఁచు వికావిక న్నగున్." కాళిందీ. ౨, ఆ. ౯౦.

కయిముట్టు. దే. స. క్రి. (కయి+ముట్టు) చేఁజిక్కించుకొను; చుట్టుముట్టు. "గీ. ఇట్టి దుర్మదుఁ గయి ముట్టి పట్టి తెచ్చి, జనులు వెఱఁగందఁ జెఱపట్టి." భాగ. ౧౦. స్కం. ఉ. ౫౬౦.

కయిలాగు. దే. వి. (కయి+లాగు) కైదండ, చేయూఁత, "చ...జెట్లు వెం, బడిఁ గయిలా గొసంగ..." కువల. ౨, ఆ. ౪౭.

కయివడి = కైవడి. (ఆం. పద.)

కయివారము. యౌ. దే. వి. 1. గనిమయంచు. (శ. ర.); 2. చుట్టుకొలత. (వా.) వై. వి. స్తోత్రము. "ఉ. వంది జనంబు గ్రమ్మి కయివారముఁ జేయఁగ..."ఉ.హరిశ్చ. ౪, ఆ. ౧౧౩.

కయివాలు. దే. అ.క్రి. (కయి+వాలు.) వంగు; దీనమగు. "ఉ. వాడినమోముతోడఁ గయివాలిన చూపులతోడ..."సుద. ౩, ఆ. ౪.

కయివ్రాలు. దే. అ. క్రి. (కయి+వ్రాలు.) జాఱు, పడు; ప్రవహించు. "చ...క్రిందికిఁ గయివ్రాలు తత్సలిలనిర్మలధార..."ఆము. ౪ఆ. ౨౧.

కయిసేఁత. దే. వి. (కయిసేయుంధా.) అలంకారము, ముస్తాబు. "క. ఎడ్డైతనపుఁ గయిసేఁతల, రడ్డులు నడచిరి పురస్సరద్భార్యముగా..."పాండు. ౩, ఆ. ౩౫.

కయిసేయు. దే. స. క్రి. (కయి+చేయు.) అలంకరించు, ముస్తాబుచేయు. "చ. చెలువలు చాల నిట్లు గయిసేయఁగ..." వసు. ౫, ఆ. ౧౨౩. అ. క్రి. అలంకారములు పెట్టు. "చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచి తగన్ గయిసేయ వేడుకన్..."పారి. ౨, ఆ. ౪౩.

కయీశ్వరుఁడు. వై. వి. (సం. కవీశ్వరః.) కవీశ్వరుఁడు. (బ్రౌ.)

కయ్య. దే. వి. 1. కేదారము, మడి. ఆం. భా. ద్వి. ౨౩౦; 2. కుల్య, కాలువ. ఆం. భా. ప్ర. ౧౬౪; 3. మంచె. (బ్రౌ.)

కయ్యపుఁగ్రచ్చు. ద్వ. వి. (కయ్యము+క్రచ్చు.) కలహశీలుఁడు; కలహశీల. "ద్వి. గొడవగొట్టులు మడివిడుపులు చాల, గడసరుల్ కయ్యం

పుఁ గ్రచ్చలు...వారవనితలు..." పండితా. పురా. ౧౧౬.పు. ఇట్లే కయ్యాలక్రచ్చ. పాండు. ౪, ఆ. ౨౧౦.

కయ్యపుఁదిండి. ద్వ. వి. (కయ్యము+తిండి) కలహాశనుఁడు, నారదుఁడు. "గీ...కయ్యంపుఁదిండి..." అచ్చ. సుం. ౨.

కయ్యమిచ్చు. ద్వ. అ. క్రి. (కయ్యము+ఇచ్చు.) యుద్ధమునకు వచ్చు. "చ...వే, వెలలుము కయ్య మి మ్మని సవేగసముద్ధత సింహనాదసం,కలితము గాఁగఁ బిల్చుటయు గ్రక్కున వెల్వడియెన్ మహేంద్రుఁడున్." హరి. ఉ. ౪, ఆ. ౧౬.

కయ్యము. వై. వి. (సం. కలహః. ప్రా. కయ్య.) 1. యుద్ధము. "ఉ...కయ్యము సేయుట కప్పుడిమ్మగున్." భార. విరా. ౪, ఆ. ౧౦౪; 2. జగడము. "ఆ. కయ్యమునకు నెపుడు గాలుద్రవ్వుదు కార్య,గతికిఁ జొరవు..." భార. విరా. ౪, ఆ. ౨౦౭.

కయ్యముపొడుచు. ద్వ. అ. క్రి. (కయ్యము+పొడుచు.) యుద్ధముచేయు, పోరు. "గీ. అధిపసుతనయుండు గయ్యంబు వొడుచు, తెంపు వదలక విభవంబు పెంపు మెఱసె." భార. భీష్మ. ౧, ఆ. ౧౪౨.

కయ్యర. దే. వి. తక్కువజాతిముత్యము. (శ.ర. బ్రౌ.)

కయ్యాటము. దే. వి. జగడము. (బ్రౌ. నవతుల కయ్యాటము. బ్రౌ.)

కయ్యాలమెకము. వై. వి. (కయ్యాలు+మెకము.) జంబుకము, నక్క. (ఆం. పద.)

కర. యు. దే. వి. 1. (క. కరె. త. కరై.) తీరము, ఒడ్డు. "క. హరిభక్తి తేపగా దు,స్తర సంసారాబ్ధిఁ గడచుసాధుజనులకుం, గరయై..." నృసిం. ౧, ఆ. ౪౨; 2. తరంగము, అల. ఆం. భా. ప్ర. ౧౫౬౪; 3. నేతవిశేషము, ఒకరంపుపంతెన. ఆం. భా. ద్వి. ర. వై. విశ. (సం. ఖరః.) తీక్ష్ణము. (చూ. కరసాన.)

కరంకము. సం. వి. అ. పుం. 1. కొబ్బెరబుఱ్ఱ; 2. కమండలువు; 3. కరండము; 4. తల; 5. ఒకజాతి చెఱకు*; 6. కంకాళము. "క. పురపురం బొక్కుచు బకపతి, కరంకముం దేరఁ బనిచి గారవమున నె,య్యారుఁ డాను, నన్ని యిచ్చిన..." భార. శాం. 3, ఆ. ౫౧౨.

కరంజము. సం. వి. అ. పుం. కానుగు*.

కరండము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. తేనెపెర; 3. వెదురు మున్నగువానితోఁ జేసినపూలసజ్జ; 4. కన్నెలేడి; 5. బరణి; 6. కారిజము.

కరంబము. సం. వి. అ. న. కలుపుట. పుం. కరంభము. విశ. (అ. ఆ. అ.) కలుపఁబడినది.

కరంభము. సం. వి. అ. పుం. 1. పెరుఁగుతోఁ గలిపిన పేలపిండి; 2. వేఁచినయవలు; 3. వివిధవస్తువుల కలయికవలనఁ గల్గుపరిమళము; 4. ప్రేంకణము*.

కరఁగించు. దే. స. క్రి. (కరఁగు ధా. ప్రే.) 1. ద్రవింపఁజేయుట. వా:—కాసు కరఁగించి ఉంగరము చేసినాఁడు; 2. మెత్తబఱచు; అంగీకరింపఁజేయు. "ఉ. చుట్టఱికంబుకన్ మనసు సొచ్చి పను గరఁగించి వేఁడితన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౫౫.

కరఁగు. దే. అ. క్రి. (క. కరఁగు.) 1. ద్రవమగు, నీరగు. "క. లోహమయదైత్యనగరీ, గేహంబులు హరశరాగ్నికీలాజ్వాలా,దాహమునఁ గరఁగి మూఁడుసమూహములై పెద్ద పెద్దముద్దలు నయ్యెన్." భీమ. ౪, ఆ. ౧౪౧; 2. పరవశమగు, సోలు. "చ. రమణభుజానిపీడనఁ గరంగినకాంతల విస్ఫురన్నితం,బముల..." నృసిం. 3, ఆ. ౭౧; 3. నీఱగు, భస్మమగు. "సీ. వలరాచరాచ వాఁడలి కాఱు కనువెచ్చఁ గరఁగిన యలకనికరపుఁ జోటు." స్వా. ౨, ఆ. ౯. స. క్రి. కరఁగించు, ద్రవమగునట్లుచేయు. "గీ. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువుగట్టి, పోసి చేసి..." భార. విరా. ౨, ఆ. ౭౭. "చ...పైఁడినగ ల్గరంగి పై, దొరగి మొలాముచేయు క్రియ..." పార్వ. ౫, ఆ. ౬. వి. కరఁగుట, ద్రవమగుట. (చూ. కరఁగుపడు.)

కరఁగుపడు. ద్వ. అ. క్రి. (కరఁగు+పడు.) క్షీణించు, నశించు. "వ...అంతరంగంబునం జెంగలించు కౌతుకాంకురంబు కరఁగుపడ వెఱఁగుపడి..." స్వా. ౬. ఆ. ౯.

కరఁచు. దే. స. క్రి. 1. కరఁగించు, ద్రవింపఁజేయు. "చ...స్వర్ణవిభూషముల్ కరంచి..." పార్వ.

౨, ఆ. ౪. "గీ. చెమట కింపురుషస్త్రీలచెక్కు-లంగుఁ, గ్రమ్మి మృగనాభిపత్త్రభంగములు గరఁచె." హర. 3, ఆ. ౫౯; 2. వశపఱచుకొను. "చ...కనకాద్రిఁ జాపముగ వంచిననీకు హిమాద్రిజాతయా, పడఁతిఁ గరంచు టెంత..." అప్ప. ౧, ఆ. ౨౦; 3. భస్మముచేయు. "చ...లలాట విలోచనకీలి నిన్ను నిక్కముగఁ గరంపకుండె..." కువల. ౪, ఆ. ౨౮; 4. వేధించు. "చ. విరహిజలం గరంపఁ గలవీరులు వీరు..." విజ. 3, ఆ. ౯.

కరక. ఉభ. దే. వి. హరీతకి, కరకచె. ఆం. భా. ద్వి. ౫౧. సం. వి. ఆ. స్త్రీ. వడగల్లు.

కరకంచు. దే. వి. కరకకాయనీటితో వ్రాసిన యంచు. ఆం. భా. ద్వి. ౧౫౪; 2. అట్టియంచు గలవస్త్రము. "వ...కదంబకావులును గరకంచు లును..." ద్వా. 3, ఆ. ౧౮౮.

కరకకాయ. దే. వి. హరీతకిచెట్టుకాయ. "గీ. ఆది వైద్యుఁ డతండు దుగ్ధాబ్ధిఁ బుట్టె, నమృతపూర్ణ కుంభం బొకహస్తమునను. నంబుచరమును గరక కాయయును నొకట, దాల్చి..." హర. ౬, ఆ. ౮౩.

కరకణి. దే. వి. వేఁటసాధనవిశేషము. "సీ...గొర కత్తళమ్ములు కరకణీలు." రుక్మాం. 3, ఆ. ౭౦.

కరకము. సం. వి. అ. పుం. న. 1. కమండలువు; 2. కొబ్బెరబుఱ్ఱ. పుం. 1 వడగల్లు; 2. దానిమ్మచె; 3. మోదుగుచె; 4. పొగడచె; 5. మామిడిచె.

కరకర = కఱకఱ. (క. త. కరకర.) "చ. కరకరఁ బండ్లు గీఁటుచు..." చెన్న. ౨, ఆ. ౨౦. "గీ. అందుల కసూయఁ గరకర మంచు..." సా. 3, ఆ. ౧౨౭. వై. క్రి. విణ. తీవ్రముగా. "సీ. బిరుదులు పచరించి కరకర సెగరించి..." హరి. వరా. ౨. ఆ.

కరకరపడు. ద్వ. అ. క్రి. (కరకర+పడు.) మండిపడు. "క. కరితురగస్యందనములఁ, బరివారముఁ జెగినవిదపఁ బటురోషమునన్, గరకరపడుచును సెరెరిన, ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరుని శిరంబున్." మొల్ల. అర. ౧౫.

కరకరి. దే. వి. 1. పట్టుదల. ఆం. భా. ప్ర. ౧౩౫. 2. పగ. "చ. గరిమఁ గళింగజంబు లగుగంధగజంబులకుంభరాజితోఁ, గరకరి పుట్టఁగాఁ గలడుకామిని నీవలిచన్నుదోయికిన్." నైష. ౫, ఆ. ౧౩౭; 3. అసూయ. "చ...అతం డవమానముచేసి యాక్షశో, దరి యెఱుఁగంగ నొండెడలఁ దత్పరుఁడై విహరించు దానికిం, గరకరిఁ బొందియుండి..." దశ. ౭, ఆ. ౪౭; 4. క్రూరత్వము. "చ. కరకరిఁ గూఁటఁ గఱ్ఱ యుఁడఁగా మొఱపెట్టెడులీల...విపంచిమీఁటుగతి మ్రోసి యళుల్ వెడలెన్ గొలంకులన్." సా. 3, ఆ. ౬౦.

కరకరించు. దే. అ. క్రి. పగఁబూను; వివాదపడు. "గీ. అటులవాఁ డడి హెచ్చని యాడుచుండ, మఱియొకఁడు వచ్చి వానిపైఁ గరకరించి, యిదియె దొడ్డని పల్కెనే యాగరాసు." పార్వ. ౬. ఆ. ౭౦.

కరకరిపడు = కరకరపడు. "క. హరిభక్తులై మహేశ్వరుఁ, బరుపడి శివభక్తులయ్యుఁ బంకరుహాక్షుం, గరకరిపడి దూషించిన, నరు లేగుదు రుగ్రమైననరకంబునకున్." పద్మ. ఉ. ౨, ఆ. ౨౮.

కరకస. వై. వి. 1. విరోధము, పగ. (బ్రా.); 2. అసూయ. (బ్రా.) విణ. (సం. కర్కశమ్.) కఱకు. ఉదా:—కరకసనేల. (బ్రా.)

కరకసా = కరకస. (శ. ర. బ్రా.)

కరక్కాయ = కరకకాయ. (శ. ర. బ్రా.)

కరగసము. వై. వి. (సం. క్రకచః. క. కరగస.) క్రకచము, రంపము. (శ. ర. బ్రా.)

కరగోడ. ద్వ. వి. గోరడి, కంచె నాటుటకై పొడివట్రితో నేర్పఱచినగోడ. (శ. ర.)

కరగ్రహణము. సం. = కరగ్రహము.

కరగ్రహము. సం. వి. అ. పుం. 1. పన్నుపుచ్చుకొనుట; 2. పెండ్లి.

కరజము. సం. వి. అ. పుం. 1. గోరు; 2. కానుగుచె. న. పులిగోరుచె.

కరట. సం. వి. ఆ. స్త్రీ. ప్రయాసముచేఁ బిదుకఁ దగినయావు.

కరటము. ఉభ. దే. వి. బరణి. "ద్వి...కైరగుళ్లియల, కరటాలు సున్నంబుకరటాలు నిడిన, యడపతిత్తులు మూఁపులందు ధరించి" పండితా. పర్వ. ౩౧౭ పు. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుచెక్కిలి; 2. కాకి; 3. ఒకానొకవాద్యము; 4.

మారేడుకాీ; 5. కుసుమపుష్పము; 6. ఏకాదశాహాఖ్య శ్రాద్ధము. న. కుంకుమపుష్పము.

కరటి. సం. వి. ఇ. పుం. ఏనుగు.

కరటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాస్తికుఁడు; నిందింపఁబడినచేష్టగలవాఁడు.

కరడము. దే. వి. అల. "సీ. కాంతానిసుఖము సైకతవేదికస్థలి కందర్పవిక్రమతులు కరడములుగ... సంసారజలధియందు." భీమ. ౫. ఆ. ౧౬౦.

కరడిగ. వై. వి. (సం. కరండకా.) బుట్ట. (ఆం. పద.)

కరడియ. దే. వి. పూలసజ్జ. "ఉ... అందినపుష్పములు గొన్ని కోయుచున్." "చ. కరడియ దాఁచి చాల వని సంవఁగికొమ్మను వాచి..." సావి. ౨. ఆ. ౧౦౦ పు.

కరడు. దే. వి. 1. అల. "సీ. గగనంబుతో రాయ కరడులు గలజలం బివ్వరఁ బొఱసమహార్ణవము కరణి." భార. ద్రో. ౨, ఆ. ౧౨౬. నిర్వ. ౮. ఆ. ౪౫; పక్షివిశేషము. ఆం. ద్వి. ౯౮.

కరడె = కరడియ.

కరణకమ్మలు. దే. వి. కరణకర్మలు, ఋగ్వేదమంత్రములతో కర్మ లాచరించు ఒకానొకజాతి బ్రాహ్మణులు. (శ. ర. వా.)

కరణము. ఉభ. వై. వి. (సం. కరణః. త. కర్ణమ్.) గణకుఁడు, లెక్కవ్రాయసు. "క... తనదాఁపునఁ గొల్చుచిత్రగుప్తుం, డనుకరణమునిక్కుఁ జూచి యంచకుఁ డనియెన్." సానందో. ౧, ఆ. ౧౪౬. ఆం. భా. ద్వి. ౧౮౭. సం. వి. అ. న. 1. చేయుంట, చేఁత. "క. దుర్వహాపటుతాపత్రయ, నిర్వాపణకరణబోధ నిర్మలజనహృత్పర్వాచరణ మహాసుర, గర్వాపహారత్వసంప్రకాశకరణా." భార. విరా. ౫, ఆ. ౪౦౬; 2. వర్తకము; 3. ఇంద్రియము; 4. దేహము; 5. సాధనము; 6. పరమాత్మ; 7. కారణము; 8. తాళభేదము; 9. నృత్యభేదము; 10. పూఁత; 11. పొలము; 12. రతిబంధము; 13. యోగాసనము; 14. జ్యోతిశ్శాస్త్రమునబవాది. (ఇవి 11. బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము.); 15. ఒకానొకదేశము. "ఉ... కరణదేశపుజాణగ నుండఁ బోలు నీ బాఁడు..." క్రీడా. ౧౫౯; 16. గణకుఁడు, లెక్కవ్రాఁడు. "గీ... గ్రామ, కరణమే తెంచి రెడ్డిచెంగట వసించె." శుక. ౨, ఆ. ౪౧౬.

కరణాధిపుఁడు. సం. వి. అ. పుం. 1. జీవుఁడు; 2. ఇంద్రియాధిష్ఠానదేవత.

కరణి. దే. వి. విధము, రీతి. "క. తరణి వొడిచి తమము సెఱచు, కరణిని..." భార. శాం. ౨, ఆ. ౧౬౦. "గీ... రెండవవెల్లువజేని, కరణిఁ గొలువున్నదొరఁ బొడగాంచి యపుడు." సీతా. ౨, ఆ. ౫౦.

కరణిక. వై. వి. కనినిక, కమ్రగద్దు. "ద్వి. పెంగుచుఁ గరణికల్ విస్తరించుచును, ... చుసెంతావ శిల్ నటించుచును." పండితా. పర్వ. ౪౩౮. పు.

కరణికము. వై. వి. కరణవృత్తి. (కరణీకము అని వాడుక.) ఆం. భా. ద్వి. ౧౧౭.

కరణికుఁడు = కరణము. "ద్వి... అత్తఱిఁ గరణికులు, చనుదెంచి..." ద్వి. పరమ. ౬, ఆ. ౪౧౮. పు.

కరణీయము. సం. వి. అ. న. చేయఁదగినపని. "క. త్వరితగతి సముచితకరణీయము లాచరించి..." భార. ఉద్యో. ౪. ఆ. ౧౩౭. విణ. (అ. ఆ. అ.) చేయఁదగినది.

కరణుఁడు. సం. వి. అ. పుం. శూద్రస్త్రీకిని వైశ్యునకును బుట్టినవాఁడు.

కరతలము. సం. వి. అ. న. అఱచేయి. "ఆ. అతనికరతలప్రయోగావమర్దితములై, కందియును మహాసుగంధకుసుమ, తతులు దొంటియట్ల కమకంపు విడువక, యుండు..." భార. అర. 3, ఆ. ౧౬౭.

కరతలామలకము. సం. వి. అ. న. అఱచేతిలోని యుసిరికకాయ. (తనంతనే స్పష్టమగుదానికిని అప్రయత్నముగ లభించుదానికి నిది యుపమానముగాఁ దఱచు వాడఁబడుచున్నది.)

కరతిత్తి. వై. వి. (సం. కరదృతిః) 1. వస్త్రపుసంచి, తములపాకులు మున్నగువాని నుంచుకొను చేతిసంచి. "ద్వి... ముష్టిఁ, బరసినకరతిత్తి పత్త్రాలసంచి." ద్వి. హరిశ్చ. ఉ. ౫౦౩. పం; 2. పాత్రవిశేషము. "ద్వి... కావళ్ళఁ, గరతిత్తులను, సుదకంబులుగొనుచు." పండితా. పర్వ. ౩౫౪. పు.

కరతోయ. సం. వి. ఆ. స్త్రీ. గౌరీవివాహకాలమందు ఈశ్వరునిహస్తమున హిమవంతుఁడు విడిచినదానోదకమువలన నేర్పడినది, నదీవిశేషము.

కరదివియ = కరదివ్వె. (శ. ర.)
కరదివ్వియ = కరదివ్వె.
కరదివ్వె. వై. వి. (సం. కరదీపికా.) దివటీ. "ద్వి. కర మునఁ బూనినఖడ్గప్రకాశ, మరుదుగాఁ గరదివ్వె యై త్రోవఁ జూప." ద్వి. మానిచ్చ. పూ. ౧౭౪౬. పం.
కరదీపిక. సం. వి. ఆ. స్త్రీ. దివటీ.
కరపక్కు. దే. వి. వన్నె తగ్గినకెంపు. ఆం. భా. ద్వి. ౨౭౭.
కరపత్త్రము. సం. వి. అ. న. 1. ఱంపము; 2. జల క్రీడ; 3. ప్రకటనపత్త్రము.
కరపీడనము. సం. వి. అ. న. పెండ్లి.
కరపుచ్చె. దే. వి. సోమకర్కటి. (శ. ర.)
కరపుటము. సం. వి. అ. పుం. అంజలి.
కరబూజా. హిం. వి. (హిం. ఖర్బూజా.) ఒకజాతి పండు. (శ. ర.)
కరభము. సం. వి. అ. పుం. 1. మణికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదటిదాఁకఁ గలచేతి వెలుపలి భాగము; 2. ఒంటెపిల్ల; 3. ఒంటె; 4. గాడిద; 5. నఖనామ గంధద్రవ్యము.
కరమర్దము. సం. వి. అ. పుం. కలివి.
కరము. ఉభ. దే. అవ్య. (క. కరం.) మిక్కిలి. (వృత్తియందు దీనికి మువర్ణలోపము వైకల్పికము. ఉదా:—కరము+వాఁడి = కరవాఁడి.) "క. కర మిష్టము సేసితి మా, కరిసూదన..." భార. ఆది. ౧, ఆ. ౧౮౯. "గీ...ఆప్రోలు కరము వెలయు." అచ్చ. బాల. ౩౨. సం. వి. అ. పుం. 1. చేయి; 2. కిరణము; 3. ఏనుఁగు తొండము; 4. పన్ను; 5. వడగల్లు; 6. హస్తా నక్షత్రము; 7. హింస; 8. తెల్లవరి; 9. ఇరు వదినాలుగంగుళములకొలత; 10. ముద్ర; 11. విక్షేపము. న. 1. ఇంద్రధనుస్సు; 2. అన్నము. సం. విశే. (అ. ఈ. అ.) చేయునది. (ఇది సమా సాంతములందే ఉపయుక్తము. ఉదా. శ్రేయ స్కరము. మొ.)
కరరుహము. సం. వి. అ. పుం. చేతిగోరు.
కరవటము. వై. వి. (సం. కరండః.) 1. బరణి, కరాటము. "గీ. మిక్కుటంబుగఁ గాటుక గుక్కి వట్టికరవటం బన జగదంధఖంధ మమరె." నృసిం. ౩, ఆ. ౮౦. "చ...పాణిపాటల మగు దంతపుంగరవటంబు..." ఆము. ద్వి. ౨౩; 2. శీర్ణకరండము. "సీ...శీర్ణకరండంబు చెలఁగుఁ గరాటంబు కరవటం బనఁగను..." ఆం. భా. ద్వి. ౧౬౬.
కరవట్టు. దే. వి. కరవటము. "ద్వి. తడియొత్తుకరవట్టు వడిసియున్నది యొ" పండి. తా. పురా. ౪౫౨. పు
కరవాఁక. దే. వి. సముద్రపుగట్టున కోర నుండెడు చెమ్మనేల. (శ. ర. బ్రౌ.)
కరవాఁడి. దే. విశే. (కరము+వాఁడి.) మిక్కిలివాఁడి గలది. "గీ ఘోర కరవాఁడిమూఁపులయగా ముశలంబు." పాండు. ౧, ఆ. ౧౦౭.
కరవాయి. దే. వి. (క. కరవాయి.) దోమకాటుఁడు సుత్తెతోఁ బాత్రము మున్నగువానిని జాఁగఁ గొట్టునపుడు ఒత్తుడుగా వానిలోపలఁ జొప్పించు చెడిమొగవంపు గండిమ్మె మొగపు ఇనుపకమ్మి. (శ. ర.)
కరవాలము. సం. వి. అ. పుం. కత్తి.
కరవాలు. వై. వి. (సం. కరవాలః.) కరవాలము, కత్తి. ఆం. భా. ద్వి. ౨౧౪. "చ...కాముక రవాలసమాయుధువర్పునూరలి, శ్వరజయలక్ష్మి నాఁ బొలిచి శైలజ నిల్చె మహోశుముందటన్." కు. సం. ౪, ఆ. ౨౮.
కరవాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కత్తిపీట; 2. చుర కత్తి.
కరవీరము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. శ్మశా నము; 3. గన్నేరు. న. గన్నేరుపువ్వు.
కరవీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. పుత్త్రులఁ గన్నస్త్రీ; 2. మంచి ఆవు; 3. అదితి.
కరవేదన. మి. వి. (కరము+వేదన.) మహాదుఃఖము. "చ...శ్రద్ధ యేనది దరిఁ బుణ్యతాపసవనంబు లలోపల డాఁగి యున్నదో, వెదకుద మంతదాఁకఁ గరవేదన మానుము..." ప్రబోధ. ౩, ఆ. ౮.
కరశాఖ. సం. వి. ఆ. స్త్రీ. అంగుళి, వ్రేలు.
కరసాన. వై. వి. (సం. ఖరశాణః. క. కరసాణె.) 1. రత్నాదికమును సానఁబట్టెడు చక్రాకారమైన సాన. "ఉ...మరుసాయకము ల్ గరసానఁ బట్టి కోకంబుల నేది లోకము పొగడ్తలు నీకొని చంద్రుఁడు తున్నడన్." నిర్వ. ౬, ఆ. ౪౩.

"గీ. ఎనిమిదవపాలు కరసానc దునియc బట్టె." వి. పు. ౪, ఆ. ౩౯; 2. గంధము మున్నగునవి తీయు చిన్నసాన. "సీ. కరసానc ...కలివె గంధపుబొట్టు..." క్రీడా. ౨౭౬.

కరహాటము. సం. వి. అ. పుం. 1. తామరదుంప; 2. మంగ...

కరా. వై. విణ. కర, తీక్ష్ణము. (చూ. కరాచురకత్తి)

కరాచేరకత్తి. వై. వి. (క. కరాచూరి.) కత్తి. "సీ. డాకెలంకున సిరాజీ కరాచురకత్తి..." స్వా. ౪, ఆ. ౨౦.

కరాచేరి = కరాచురకత్తి. స్వా. ౫, ఆ. ౭౧.

కరాచూరి = కరాచేరి. "క...తిమ్మవిభుని కరా చూరిం దెగి..." రామా. ౧, ఆ. ౬౧.

కరాటము = కరవటము. 1. బరణి. సాం. ని. స్థా. ౬౪; 2. శీర్ణకరండము. ఆం. భా. ద్వి. ౧౬౬.

కరాపువ్వు. వై. వి. కారము గలపుష్పు, లవంగము. (శ. ర.)

కరారు. హిం. వి. (హిం. ఖరార్.) నిర్ణయము, నిశ్చయము. (బ్రౌ. వా.)

కరారునామా. హిం. వి. నిర్ణయపత్రము, సెటిల్మెంటు దస్తావేజు. (బ్రౌ. వా.)

కరాళము. సం. వి. అ. పుం. 1. సర్జరసముతోc గలిసినసూనె; 2. కస్తూరీమృగము. న. కృష్ణతులసి. విణ. (అ. ఆ. అ.) 1. భయమును గొల్పునది; 2. ఎత్తైనది; 3. విశాలము. 4. మిట్టపండ్లు గలది.

కరాళి. ఉభ. వై. విణ. (సం. కరాళ.) 1. చెడ్డది. "గీ. ఇంట నెవ్వా రయిన భిక్ష మిడిన ముష్టి, వెట్టినc గరాళితేజియొప్పిదము దోcప, నెగిరిపడి యిందులకు మీర లెవ్వ రనుచుc, బెద్దపులివోలె రొప్పు నాబిసరుహాక్షి." శుక. ౩, ఆ. ౩౪౯; 2. భయంకరము. "గీ. కాళి యెక్కు కరాళి సింగంబునైన." వరాహ. ౪, ఆ. ౭౫. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిజిహ్వలలో నొకటి.

కరాళించు. దే. అ. క్రి. 1. సాటియగు. "క. ఆకాలనికెలన నాక్రియ, నాకలికిచకోరనేత్రి యంగజలీలా, శ్రీకిc గరాళించుచుc దన, లోకంబై పుష్పుcదోcటలో విహరింపన్." విష్ణు. నా. ౫, ఆ. ౧౭౧; 2. బొబ్బలుపెట్టు. "వ...ఎరగలి గొని కాలుకాలానలంబుకయిపడిం గదిసి కరాళించి..." వీర. ౪, ఆ. ౧౦౫; 3. సకిలించు. "ద్వి...కరాళించుగుఱ్ఱములు." రం. రా. యు. ౪౨౧ పు; 4. మొఱుగు. "వ ..కరాళించు సొగ మేయయంబులు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౯౬; 5. (కోపముచే) మండిపడు. "వ. అని విచి కరాళించి గద్దన శేచి గద్దియ డిగ్గి నుఱికి యొఱc బెట్టినఖడ్గంబు పెఱికి..." భాగ. ౭. స్కం. ౨౫౩. స. క్రి. నిందించు. "ద్వి... నన్ను, లెక్కసేయక కరాళించె నీరాజు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౭౪ పం.

కరాళితనము. ద్వ. వి. (కరాళి+తనము) దౌష్ట్యము, చెడ్డతనము. "ఉ. వాలి ప్రతాపకేళిc గడు వాలి కరాళితనాన నాన లో, మాలి విరాళి హేళిసుకు మారుని మోహాపుటాలి సైంద్రనీలాలి మదాలి వేణి జనరాలి గ్రహింప..." సమీర. ౩, ఆ. ౩.

కరి. ఉభ. దే. వి. 1. నిదర్శనము; సాక్ష్యము. "చ. అల మలయాద్రికుంభభవుc డన్కతకంబు... వారిదేవతల్, తొలcకులకేలc దాపనిడి తోమc గలం కడcగెన్ దదీయత, త్ఫలతకు హ్రస్వ మాటె కరి..." ఆము. ౪, ఆ. ౧౪౯; 2. మేర, అవధి. ఆం. భా. తృ. ౯౧; 3. లక్ష్యము, గుఱి. "క. పరు లెఱిcగిన నాఅడికిం,గరి యగు..." దశ. ౪, ఆ. ౬౯; 4. మర్యాద. వేంక. మాన. ౪౩. విణ. సాక్ష్యమైనది. "క...నకరపవ నాగ్నితుహినదీప్తులు కరిగాన్." భార. ఆది. ౨, ఆ. ౧౯౯. భా. రా. కిష్కిం. ౧౦౨. ఆం. భా. ద్వి. ౩౦౪. సం. వి. న్. పుం. 1. ఏనుcగు; 2. కోcతి; (శ. ర) 3. నాగకేసరము; 4. ఎనిమిదిసంఖ్య.

కరిక. సం. వి. ఆ. స్త్రీ. ఆcడేనుcగు.

కరికాలుcడు. సం. వి. అ. పుం. ఒకానొకచోడవంశపురాజు. "క. పర మాశించును భీమేశ్వరు ననుమతిc జేసి చోడవంశాభరణుc, దరి కాలుcడు కరికాలుcడు..." భీమ. ౧, ఆ. ౧౧౫.

కరికోcత. దే. వి. (కరి+కోcత.) మిక్కిలిబాధ, మహార్తి. "సీ. హరిమధ్య యెవ్వతె కరికోcతc బెట్టునో యదలించి మత్తేభయానలార..." రాధికా. ౩, ఆ. ౬౯.

కరికొను. దే. స. క్రి. (కరి+కొను.) సాక్ష్యము చేసి కొను. "క...దొరల కెఱిఁగించి వారలఁ, గరి గొని యెఱింగె నింటికడకుఁ గడంకన్." దశ. ౬, ఆ. ౫౬.

కరిజెకాయ. దే. వి. ఒకానొకభక్ష్యము. "వ... చంద్రకాంతలుఁ గరిజకాయలు...ఆదిగాఁ గల భక్ష్యంబులు..." హంస. ౧, ఆ. ౧౦౫. "గీ. గారె లతిరసాలు బొబ్బట్లు కరిజకాయలు..." చెన్న. ౪, ఆ. ౩౫౮.

కరిజె. దే. వి. భక్ష్యవిశేషము. "వ...చక్కెరమండ గలుఁ గరిజులు..." హంస. ౧, ఆ. ౧౦౫.

కరిణాలు. దే. వి. బ. ఒకజాతిసాలెవాండ్రు. (శ. ర.)

కరిణి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు.

కరిణిబత్తుఁడు. దే. వి. కరణజాతివాఁడు. (ఆం.పద.)

కరిదారకము. సం. వి. అ. పుం. సింహము, ఏనుఁగు గొంగ.

కరెడి. దే. వి. ఒకానొకచర్మవాద్యము. ఆం. భా. ప్ర. ౧౨౮.

కరిమాచలము. సం. వి. అ. పుం. సింహము.

కరిముఖుఁడు. సం. వి. అ. పుం. గజముఖుఁడు, గణపతి.

కరిరతము. సం. వి. అ. న. ఒకానొకరతిబంధము. "శ్లో. భూగత స్తనయుగాస్యమ స్తకా, మున్నత స్ఫిజ మధోముఖీం స్త్రియం,క్రామతి స్వకరకౢప్త మేహనే, వల్లభే కరిరతం తదుచ్యతే." రతిరహస్యము.

కరివియ=కరివె. (చూ. కరివె.)

కరివె. దే. వి. ఇత్తడి మున్నగువానితోఁ జేసి వీణాదండమును బొడివికొనియుండునట్లు సొరకాయపై సమర్చెడుతదంగము, కకుభము. ఆం. భా. ప్ర. ౧౨౬. "గీ. జీవరత్నంపు మేరువు చికిలి కెంపు,బిరడలును గరిడపచ్చలకరివె జేని,వ్రాఁత హొంబట్టుగవుసెన రాణఁ దనరు, వీణె యొక యింతి నిల్పెను వెలఁదియెసుట." వాల్మీ. ౩, ఆ. ౧౩౨.

కరివేద. దే. వి. నేల దున్ని విత్తుటకు వాన కెదురు చూచుట. (శ. ర.)

కరిసనము. వై. వి. (సం. కర్షణమ్. త. కరిసనం.) సేద్యము, వ్యవసాయము. "క...ధరణీసురులు గడఁగి వాణిజ్యముఁ,గరిసనమును జేయఁగలరు కలికాలమునన్." భార. ఆర. ౪, ఆ, ౭౯౩. హరి. పూ. ౭, ఆ. ౧౩౦.

కరిసించు. వై. స. క్రి. (సం. ఘృష్.) ఘర్షించు, ఢీకొను. "సీ. కంఠీరవము నైనఁ గరిసించుటయు కాని యెుకసీ పస్నినిభటోచ్చయంబు." బహు ౧, ఆ. ౧౦౨.

కరిసింపు. వై. వి. (కరిసించు ధా.) ఘర్షణము. "క. చిఱుమూల్గు లూఱడింపులు, గరిసింపులు గాయకములు గసరుటలుఁ గొసరుల్." సత్య. సాం. ౨, ఆ. ౬౭. పు.

కరిసె. వై. వి. (సం. కర్షూః. త. కరిసై.) కాలు పలము, పలములో నాల్గవపంతు. "సీ. కరిసె యనంగను కాలుపలం బొప్పు..." ఆం. భా. ద్వి. ౨౬౯.

కరీరము. సం. వి. అ. పుం. 1. కుండ; 2. వెదురు తురుపు. పుం. న. వెదురుమొలక పు.

కరీషము. సం. వి. అ. పుం. న. 1. ఏనుఁగుపిడుక; 2. పేఁడ; 3. పిడుక.

కరుగు. యు. దే. వి. (త. కరు.) పోఁత పోసెడి యచ్చు. "చ. కరుగునఁ బోయుమాడ్కి నొడికంబుగ తాత మలంచుకై వడిన్." చంద్రా. ౨, ఆ. ౧౨. వై. (సం. గర్భ.) గర్భము. (చూ. కరువు); 2. పరిపొట్టకట్టు. (శ. ర.)

కరుగుడు. దే. వి. సీసము, తగరము. సాం. ని. స్థా. ౬౫.

కరుడు. దే. వి. 1. గట్టిపడినముద్ద. "సీ. అదిచకోరములవిం దా కాదు దుగ్ధాబ్ధికడ జనించినవెన్న కరుడుగాని." వేం. పంచ. ౪, ఆ. ౨౩౮. సా. ౨, ఆ. ౨౦౫; 2. దినదినము వ్రాసెడిసంకీర్ణపు లెక్క. (శ. ర.)

కరుడుగట్టు. దే. అ. క్రి. (కరుడు+కట్టు.) ముద్దగట్టు; ముద్దగా చేర్పడు. "గీ. కలసి శుక్రశోణితములు గరుడుగట్టి, విను మమేధ్యమధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది." భార. స్త్రీ. ౧, ఆ. ౩౬. వరాహ. ౩, ఆ. ౧౧౯.

కరుణ. సం. వి. ఆ. స్త్రీ. దయ.

కరుణము. సం. వి. అ. పుం. 1. ఒకానొకరసము. (ఆలంకారికమతము.); 2. నిమ్మచెట్టు. న. 1.

దైన్యము; 2. శోకము. "క...పరితాపము పొందుచున్న పాంచాలిం గాం,చిరి...కరుణము మగుడంగఁ బొడమ..." భార. సౌ. ౨, ఆ. ౭౭. విశే. (అ. ఆ. అ.) 1. కరుణ గలది; 2. దీన మైనది.

కరుణించు. సం. స. క్రి. 1. కనికరించు. "చ... వీనిం గరుణించి..." భార. ఆని. ౨, ఆ. ౭౫; 2. అనుగ్రహించు, దయదలఁచి యిచ్చు. "ఉ. మున్ను విధాత మీకు వరముల్ కరుణించుటఁ జేసి..." ఉ. రా. ౨, ఆ. ౯౬. అ. క్రి. కనికరించు. "క. కరుణించి యిందు నాకుం, బురోహితుని గాఁగ మీసుపుత్త్రు..." భార. ఆది. ౧, ఆ. ౭౭. ౫, ఆ. ౨౫.

కరుబూజా. హిం. వి. వృక్షవిశేషము. ఉదా:—కరుబూజాపండు. (బ్రౌ. వా.)

కరుమపుసాకిరి. వై. వి. (కరుమము+సాకిరి.) కర్మసాక్షి, సూర్యుఁడు. ప్రబంధ. ౭౭౭.

కరుమము. వై. వి. (సం. కర్మ.) కర్మము, చేఁత. (చూ. కరుమపుసాకిరి.)

కరుమల = కమ్మర. (శ. ర.)

కరుమలి = కమ్మరి. "సీ. కమ్మరి కరుమలి..." ఆం. భా. ద్వి. ౨౭౪.

కరువ. వై. వి. (సం. గ్రావా.) కొండ, పర్వతము. "క...కరువ యనంగా, గుట్ట యనఁ దిప్ప యనఁ గ,న్పట్టును శైలాఖ్యలు..." ఆం. భా. ద్వి. ౨౭౪.

కరువటిల్లు. దే. అ. క్రి. తడఁబడు; వణఁకు. "చ. బెదరుచు సంతరంగమున భీతికిఁ గందవడంబు సుట్టి ప,ల్కైదు...మోవియంం గరువటిల్లెను నీమని ని,తతల్లడం, బొదవు డిదేమికారణము యిుగ్మలి నా కెఱిఁగింపు మేర్పడన్." కు. సం. ౪, ఆ. ౫౯.

కరువలి. దే. వి. (క. గరువలి.) వాయువు, గాలి. ఆం. భా. ప్ర. ౫౯. "సీ. కరువలిచేఁ దూలు కపిలజటాళియ కర మొప్పుశిఖలు గా..." భార. ఆది. 3, ఆ. ౧౭౨.

కరువలికుడుపరి. దే. వి. (కరువలి+కుడుపు+అరి.) గాలిదిండి, పాము. "సీ. తెలికడలిని గరువలికుడుపరిదోరపఱపుపయి నిదురఁ గొఱలునుతీయ." అచ్చ. అర. ౧౧౪.

కరువలికొడుకు. ద్వ. వి. (కరువలి+కొడుకు.) వాయుపుత్త్రుఁడు. 1. ఆంజనేయుఁడు. మొల్ల. సుం. ౬; 2. భీముఁడు. (ఇట్లే. కరువలికొమరుఁడు, కరువలిపట్టి మున్నగున వెఱుంగునది.)

కరువలిచుట్టము. దే. వి. (కరువలి+చుట్టము.) వాయుసఖుఁడు, అగ్నిహోత్రుఁడు. "వ...అక్కరువలిచుట్టంబు...రవులుకొని..." హరిశ్చ. 3, ఆ. ౧౨౦. (ఇట్లే కరువలిపిందు, కరువలిచెలికాఁడు మున్నగున వెఱుంగునది.)

కరువలిబలుతొలుజేజే ద్వ. వి. (కరువలి+బలు+తొలుజేజే.) గాలిరక్కసి, తృణావర్తుఁడు. "క... బేరజపుం,గరువలిబలుతొలుజేజే,నరుదుగ గుజతాల్పుపిటి కనిచె నడిమిన్." నీలా. ౧, ఆ. ౭౪.

కరువలియొర = కరువలికుడుపరి. "సీ. కరువలియొరసెజ్జ మురువుఁదామరబొజ్జ నెసఁగువాఁడు శుభంబు లొసఁగువాఁడు." ప్రబంధ. 330.

కరువలిరిక్క. ద్వ. వి. (కరువలి+రిక్క.) స్వాతీనక్షత్రము. (శ. ర. బ్రౌ.)

కరువాడు. దే. వి. 1. శుష్కమత్స్యము, ఎండిన చేఁప. ఆం. భా. ప్ర. ౧౬౦ (కఱువాడు. శ. ర.); 2. కృష్ణమీనము. (ఆ. పద.)

కరువు. యు. దే. వి. 1. పోఁత పోసెడియచ్చు. "చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధి తరంగఁ దెచ్చి గం,డసు వొనరించిరో..." భార. అను. ౧, ఆ. ౧౭3; 2. అచ్చునఁ బోసినబొమ్మ. "ఉ...చిత్తరువో కరువో యనంగ..." ఉ. హరి. ౧, ఆ. ౬౦; 3. కరఁగెడుమూస. "క. కరువునఁ బూరితమై ...రసములోఁ గాలునట్టు..." కు. సం. ౫, ఆ. ౯౯. వై. వి. 1. గర్భము. "క...అ ట్లిద్యురువురు నుపయోగింపఁగఁ,గరువులు క త్తత్ప్రకారకలితములయ్యెన్." భార. అను. ౧, ఆ. ౧౧౧. (అథగర్భా వనుప్రాప్తే, అని మూలము.); 2. పరిపొట్టకట్టె. (శ. ర.)

కరువుగట్టు. దే. అ. క్రి. (కరువు+కట్టు.) అచ్చునఁ బోయు. "గీ. ఇరువురును సౌఖ్యరసములఁ గరువు

గట్టి,పోసి చేసినరూపులపోల్కి నైరి." నిర్వ. ౪, ఆ. ౭౦.

కరుసు. యు. దే. వి. పచ్చిచర్మము. (ఆం. పద.) వై. వి. (సం. ఘర్షః.) పరుషోక్తి, కఱకు. ఆం. భా. ప్ర. ౧౧౭.

కరూశము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము. ఇట్లే; కరూషము.

కరేటువు. సం. వి. ఉ. పుం. పెద్దకొక్కెర.

కరేణువు. సం. వి. ఉ. పుం. 1. ఏనుఁగు; 2. కర్ణికారము ♣. స్త్రీ. ఆఁడేనుఁగు.

కరోటము. సం. వి. అ. న. 1. తలపుఱ్ఱె; 2. బట్టలపెట్టె.

కరోటి. సం. వి. ఇ. స్త్రీ. కరోటము, పుఱ్ఱె.

కర్కంధువు. సం. వి. ఊ. పుం. స్త్రీ. 1. రేఁగు♣. 2. వ్రణము. స్త్రీ; 1. యుద్ధము; 2. కాఁడి.

కర్కటకము. సం. వి. అ. పుం. 1. ఎండ్రకాయ; 2. ఒకానొకరాశి. 3. ఒకజాతిచెఱకు♣.

కర్కటకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుఎండ్రి; గొడ్డుకాఁకర♣.

కర్కటము. సం. వి. అ. పుం. 1. ఎండ్రి;2. కొక్కెర; 3. కర్కటకరాశి. 4. నూఁగుదోస♣; 5. అభినయహస్తవిశేషము; 6. తామరదుంప; 7. ముల్లు; 8. రతిబంధవిశేషము; 9. బూరుగుకాయ; 10. త్రాసుధండపుకొన.

కర్కటి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఆఁడుపీత.2 దోస♣; 3. బూరుగు♣; 4. స్వరము; 5. చేదుబీఱ♣.

కర్కము. సం. వి. అ. పుం. 1. ఎండ్రి; 2. అద్దము; 3. కుండ; 4. తెల్లగుఱ్ఱము ; 5. నిప్పు; 6. కర్కటరాశి; 7. నూఁగుదోస♣; 8. అందము. (శ. ర.)

కర్కరము. సం. వి. అ. పుం. 1. అద్దము; 2. ముద్గరము; 3. కంకరరాయి. విశే. (అ. ఆ. అ) 1. దృఢము; 2. కఠినము. భార. అర. ౬, ఆ. ౨౯౨.

కర్కరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గిండివంటిపాత్రము; 2. పెనమునుండి వేఁచినవానిని వెలికిఁ దీయునుపకరణము; 3. దోస♣. "గీ...దుర్వారకర్కరీఫలామోదధౌరంధరీ పరిష్ఠపవనములచేత..." శుక. 3, ఆ. 3౪౧. 4. కాంతార మనునొక జాతిచెఱకు♣. "సీ. ఘృతపిండనిభకర్కరీఖండములతోడ..." అను. ౨, ఆ. ౭3.

కర్కరేటువు. సం. = కరేటువు.

కర్కశము. సం. వి. అ. పుం. 1. కంపిల్లము♣. 2. కసింద♣. 3. చెఱకు♣. 4. కత్తి; 5. రత్నదోషములలోనొకటి. "వ...లశునపటలత్రాసచ్ఛిన్నజర్ఝరకర్కసనీలంబు లనియెడుదోషంబులు గలవు." రత్న. ౧౬. విశే. (అ. ఆ. అ) 1. కఱకైనది; 2. గట్టియైనది; 3. కనికరములేనిది; 4. తెగువగలది; 5. తెలియనిది; 6.అధికమైనది; 7. బాధించునది.

కర్కారువు. సం. వి. ఉ. పుం. గుమ్మడి♣.

కర్కోటకము. సం. = కర్కోటము.

కర్కోటము. సం. వి. అ. పుం. 1. అష్టనాగములలో నొకటి. (అనంతుఁడు), వాసుకి, పద్మునుఁడు, మహాపద్ముఁడు, తక్షకుఁడు, కర్కోటకుఁడు, కుళికుఁడు,శంఖుఁడు-వీరు అష్టనాగులు.) 2. మారేడు♣.

కర్చూరము. సం. వి. అ. పుం. గంట్లకచోరము♣. న. 1. బంగారము; 2. పారిదళము.

కర్చు. యు. దే. వి. కఱచు. "ద్వి...తల్లి, పిడుకలు గొని వచ్చునెడ మహోరగము, వెనువెంట వచ్చుపుత్త్రుని గర్చు..." పండితా. పురా. ౪౯౯. ప్ర. ౧౦. పం. హిం. వి. వ్యయము. "వ...సీమకు సూత్రంబులు పన్ని లక్షాంతరంబు కర్చు చేసి..." ఆనంద. పీఠి. ౫౮.

కర్జకాయ = కరజకాయ. (శ. ర. బ్రౌ.)

కర్జము. యు. వై. వి.,(సం. కార్యమ్. ప్రా. కర్జ). కార్యము, పని; చేయఁ దగినపని. "ఉ. కర్జము దప్పెనీయెదురఁగష్టపుమాటల కేలయోర్తురు..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౪౨. "క. పాపంబులు గర్జము లని,యేపునఁ జేయంగ..." భార. ఉద్యో. ౨, ఆ. ౬౯. విశే. చేయఁదగినది. "తరువోజ...ఎయ్యది గర్జము..." భార. ఆది. ౬, ఆ. ౨౪౭. "ఆ. ఇట్లు చేయువాఁడ నిదియ కర్జము..." భార.ఉద్యో. ౨, ఆ. ౯౬. దే. వి. భక్ష్యవిశేషము. "ఉ...మేలుకర్జములు పంతుల కిత్తుర నిండుఁగొఁగిటం, గ్రుత్తురు..." దశా. ౪, ఆ. 3౬౫.

కర్జూరము. వై. వి. (సం. ఖర్జూరః) ఖర్జూరవృక్షము. "మ. సురపొన్నల్ కనిగొట్టుం జెందుగలు కర్జూరంబు లబ్బెందలున్." య. ౫, ఆ. ౪౭.

కర్ణకీటి. సం. వి. ఈ. స్త్రీ. జెర్రి.

కర్ణజలూక. సం. వి. ఆ. స్త్రీ. జెర్రి.

కర్ణజలౌకము. సం. వి. స్. పుం. జెర్రి.

కర్ణధారుఁడు. సం. వి. అ. పుం. ఓడ నడుపువాఁడు, కర్ణగ్రాహుఁడు.

కర్ణపత్త్రము. సం. వి. అ. న. చెవికమ్మ.

కర్ణపూరము. సం. వి. అ. పుం. 1. పుష్పాదికృతకర్ణభూషణము; 2. కంగేలిచె; 3. శిరీషముచె; 4. తిలకముచె. న. నీలోత్పలము, నల్లకలువ.

కర్ణము. సం. వి. అ. పుం. 1. చెవి; 2. చుక్కాని; 3. కన్నము. (శ. ర.) విణ. (అ. ఆ. అ.) చెవులు లేనిది. (పశువు. కే. ని.)

కర్ణలతిక. సం. వి. ఆ. స్త్రీ. చెవికమ్మ.

కర్ణలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గొప్పశ్రవణశక్తిగలవాఁడు.

కర్ణవేష్టము. సం. వి. అ. పుం. కర్ణాభరణము.

కర్ణాకర్ణి. సం. అవ్య. శ్రవణపరంపర, ఒకరు విని మఱియొకరికిఁ జెప్పఁగా వారు విని మఱియొకరికిఁ జెప్పుటచే వ్యాప్తము. "శా... కర్ణాకర్ణిం గథలందు ముష్కు విననే..." ఉ. హరి. ౪, ఆ. ౭౯.

కర్ణాకర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. కర్ణాకర్ణిగా వినుట. "వ. ఈకృతిప్రారంభంబు కర్ణాకర్ణికావశంబున విని..." వరాహ. ౧, ఆ. ౧౦.

కర్ణాటము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

కర్ణాటి. సం. వి. ఈ. స్త్రీ. 1. కర్ణాటదేశపువనిత; 2. ఒకానొకస్త్రీరాగము.

కర్ణాతు. దే. వి. మల్లయుద్ధములోని విన్నాణము. (ఆం. పద.)

కర్ణి. సం. వి. ఈ. స్త్రీ. పశువులను గట్టురజ్జువు. వి. న్. పుం. కర్ణధారుఁడు. విణ. (న్. నీ. న్.) కర్ణము గలది.

కర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చెవికమ్మ; 2. చేతినడివ్రేలు; 3. ఏనుఁగుతొండముచివర; 4. తామరదుద్దు; 5. కుంటెనకత్తె. (హేమ. ని.); 6. బాణవిశేషము. (శ. ర.)

కర్ణికము. సం. వి. అ. న. కృష్ణాజినము. విణ. (అ. ఆ. అ.) 1. పెద్దచెవులు గలది; 2. చుక్కానుగలది.

కర్ణికాచలము. సం. వి. అ. పుం. మేరుపర్వతము.

కర్ణికారము. సం. వి. అ. పుం. 1. కొండగోఁగుచె; 2. ఱేలచె.

కర్ణీరథము. సం. వి. అ. పుం. 1. పల్లకి మున్నగు వాహనము; 2. బాలక్రీడాశకటము.

కర్ణేజపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కొండెకాఁడు.

కర్త. సం. వి. ఋ. పుం. 1. బ్రహ్మ; 2. పరమేశ్వరుఁడు. విణ. (ఋ. ర్త్రీ. ఋ.) 1. చేయువాఁడు; 2. అధిపతి, ప్రభువు. "మ...రాయల్ నన్ను సింహాసనంబునకుం గర్తను జేసె..." కృష్ణ. ౨, ఆ. ౩౭; 3. వ్యాకరణమున ధాతువు ఇచ్చుఅర్థముయొక్కవ్యాపారమును ఆశ్రయించునది.

కర్తనము. సం. వి. అ. న. 1. కత్తిరించుట; 2. తెగఁగొట్టుట; 3. నూలువడకుట; 4. సాలెవాని మగ్గము. విణ. (అ. ఆ. అ.) 1. కత్తిరించునది; 2. తెగఁగొట్టునది.

కర్తరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తెర; 2. యోగభేదము; భరణిమూఁడునాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణిమొదటిపాదమునందును సూర్యుఁ డుండుకాలము; 3. బాణము మొదటిభాగము.

కర్తరీముఖము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

కర్తలాణము. సం. వి. అ. పుం. తెల్లనిగోరిజలును తోఁకయం దెంద్రుకలును గలనల్లగుఱ్ఱము. "క. తెల్లనియొకకర్తలాణతేజోహయమున్." నైష. ౬, ఆ. ౯౬. (శ. ర. పా.)

కర్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) చేయఁదగినది.

కర్తారు. హిం. వి. (హిం. కర్తార్.) 1. తురుష్కుల దైవము; అల్లా; 2. సూర్యుఁడు. "గీ. అబ్జహితు పేరు లవి యెన్ని యైన నుండఁ బ్రాభకర్తారుశబ్దంబు రూఢికెక్కెఁ దిమ్మనృపఖడ్గధారావిదీర్ణమత్తఖానపుంగవసాంగత్యగరిమ దివిని." కువల. ౧, ఆ. ౪౦.

కర్తారుఁడు = కర్తారు. (అల్లా.) "శా. స్మర్తల్ తత్త్వ మటంచు సెంచఁగ మహాశైవుల్ మనో

జద్విష,న్మూర్తింగా నుతియింప వైష్ణవులు విష్ణుం డంచు నెంచఁగా దగం,గర్తాయం డనుచుం దుదు ష్కృలు మొదల్గాఁ గొల్వ..." విప్ర. 3, ఆ. ౧౦.

కర్తాలు=కర్తారు. "గీ. సారెసారెకుఁ గర్తాలు దూఱు వారు." కృష్ణ. 3, ఆ. ౪౬.

కర్తించు. సం. అ. క్రి. కర్తయగు, కార్యముచేయుం. (విరళప్రయోగము.) "ద్వి. కర్తయు జడుఁడు దత్కర్మవశుండు, గర్తింపఁ దానెట్లు కర్మంబు నెయిని." పండితా. వాద. ౧౩౮. పు. ౧౨. పం. (ప్రాఁతవ్రాఁతప్రతులపా.)

కర్త్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తెర; 2. చురకత్తి.

కర్దమము. సం. వి. అ. పుం. 1. బురద; 2. పాపము. న. మాంసము.

కర్పటము. సం. వి. అ. పుం. 1. వస్త్రము; 2. చేతి రుమాలు.

కర్పరము. సం. వి. అ. పుం. 1. కటాహము; 2. కుండపెంకు; 3. తలపుఱ్ఱె; 4. వెన్నెముక; 5. మేడిచెట్టు; 6. నిప్పు; 7. ఒకరకపుశస్త్రము.

కర్పరి. సం. వి. ఈ. స్త్రీ. 1. మ్రానిపసుపు వండిన యంజనవిశేషము; 2. కొప్పు.

కర్పూర. సం. వి. ఆ. స్త్రీ. పచంపచ,మ్రానిపసుపు.

కర్పూరగంధి. సం. విశే. (ఇ) కర్పూరమువంటిసుగంధము గలది. (స్త్రీ.) వి. బ. వస్త్రవిశేషము. ద్వా. 3, ఆ. ౧౮౮.

కర్పూరభోగి. సం. వి. న్. పుం. కప్పురబోగి.

కర్పూరము. సం. వి. అ. పుం. న. 1. ఘనసారము; 2. పచ్చకర్పూరము.

కర్బుర. సం. వి. ఆ. స్త్రీ. 1. వాయింటచెట్టు; 2. కలిగొట్టుచెట్టు.

కర్బురము. సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము; 2. పాపము; 3. గంట్లకచోరముచెట్టు. న. 1. నీరు; 2. బంగారము; 3. ఉమ్మెత్తచెట్టు. విశే. (అ. ఆ. అ.) చిత్రవర్ణము కలది.

కర్బురుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

కర్మ = కర్మము. (పని) "గీ. ఎఱుఁగునే నీడకన్నును నెండకన్నుఁ,జెలఁగి పూఁచునే కర్మ పండిన లతాంగి." శివరా. ౨, ఆ. ౩౯.

కర్మంది. సం. వి. న్. పుం. సన్న్యాసి.

కర్మకరుఁడు. సం. వి. అ. పుం.—కర్మప్రకారము హింసించువాఁడు—యముఁడు. విశే. (అ. ఆ. అ.) కూలివాఁడు.

కర్మకారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరి. విశే. (అ. ఆ. అ.) వెట్టికి పని చేయువాఁడు.

కర్మచండాలుఁడు. సం. వి. అ. పుం. కర్మచే చండాలునివంటివాఁడు, చండాలకర్మము చేయువాఁడు. (అసూయకుఁడు,పిశునుఁడు, కృతఘ్నుఁడు, దీర్ఘరోషుఁడు నని కర్మచండాలురు నలువురు. కర్మచండాలునికంటెజాతిచండాలుఁడు యోగ్యుఁడు.)

కర్మజము. సం. వి. అ. పుం. 1. కలియుగము; 2. మఱ్ఱిచెట్టు. విశే. (అ. ఆ. అ.) కర్మవలనఁ గలిగినది.

కర్మఠుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పూనినకర్మ కొనసాఁగువఱకు పని చేయువాఁడు. "మ. జననీ నీవమృతంబు నెమ్మనిన యాసత్శక్తి వాటించి యేఁ, జని నానావిధకర్మకర్మఠుఁడనై సాధించి వే తెచ్చితిన్." భార. అను. ౧, ఆ. ౨౬౩.

కర్మణ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. జీతము; 2. కూలి.

కర్మధారయము. సం. వి. అ. పుం. సమానాధికరణ తత్పురుషము, ఒకానొకసమాసము. (ఉదా:— తెల్లగుఱ్ఱము. మొ.)

కర్మము. సం. వి. న్. పుం. న. 1. పని; 2. నిత్యనైమిత్తికాది. (యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము ఇవి షట్కర్మములు: గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము ఇవి షోడశకర్మములు; 3. ద్వితీయాకారకము; 4. తర్కశాస్త్రమున పంచవిధకర్మములలో నొకటి. (ఉత్క్షేపణము, అవక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము. ఇవి పంచవిధకర్మములు.); 5. వైద్యశాస్త్రమునఁ గలపంచవిధకర్మములలో నొకటి. (వమనము, రేచనము, నస్యము, అనువాసనము, నిరూహము ననునవి యైదు.); 6. యజ్ఞము; 7. శిల్పము; 8. యాతన; 9. వడ్డి; 10. పుణ్యము; 11. పాపము; 12. జ్యోతి

శ్శాస్త్రమున జన్మనక్షత్రమునకు పదియవనక్షత్రము; లగ్నమునకు పదియవస్థానము.

కర్మయుగము. సం. వి. అ. న. కలియుగము.

కర్మసాక్షి. సం. వి. న్. పుం. సూర్యుఁడు. విణ. (న్. ణీ. న్.) పని చేయుచుండఁ గాంచువాఁడు.

కర్మారము. సం. వి. అ. పుం. 1. వెదురు; 2. కర్మరంగము.

కర్మారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరవాఁడు.

కర్మవు. సం. వి. న్. పుం. న.పని, కర్మము.

కర్మేంద్రియము. సం. వి. అ. న. వాక్పాణిపాదపాయూపస్థములలో నొకటి.

కర్వరము. సం. వి. అ. పుం. 1. వ్యాఘ్రము; 2. అంజలి; 3. పాపము. న. 1. జలము; 2. కర్మము.

కర్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. ఆఁడుపులి; 3. రాక్షసి; 4. భూమి.

కర్వరుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

కర్వలి = కరువలి. "సీ... ఎండ గాసెఁ గర్వలి దొలంగె." కాశీ. 3, ఆ. ౧౪౯.

కర్శకుఁడు. సం. విణ. (అ. ర్శికా. అ.) 1. కృశించువాఁడు; 2. కృశింపఁజేయువాఁడు.

కర్షకుఁడు. సం. వి. అ. పుం. కుజుఁడు. విణ. (అ. ర్షికా.) 1. ఆకర్షించువాఁడు; 2. నేల దున్నుకొని బ్రదుకువాఁడు.

కర్షణము. సం. వి. అ. న. 1. దున్నుట; 2. ఆకర్షణము; 3. ఒరయుట. విణ. (అ. ఈ. అ.) 1. దున్నునది; 2. ఆకర్షించునది; 3. లాగునది.

కర్షము. సం. వి. అ. పుం. 1. ఈడ్చుట; 2. ఒరయిక; 3. గీఁత; 4. దున్నుట; 5. తాండ్ర; 6. (వింటినారిని) లాగుట. "మ...క్రూరంపు టొప్పారునం, జలికం బైన మహాస్త్రముం దొడివి కర్షం బుబ్బునం జేయుచున్." భార. కర్ణ. 3, ఆ. 3౫౦. పుం. న. పదునాలుగుమాషములయెత్తు.

కర్షితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒరయిక గలది; 2. ఈడ్వఁబడినది; 3. దున్నఁబడినది. 4. పీడింపఁబడినది. "క. కర్షితరిపు లన్యోన్యా, కర్షణ సంకర్షణాపకర్షణముల సామర్షు లయి పెనఁగిరి ..." భార. సభా. ౧, ఆ. ౨౦౪.

కర్షువు. సం. వి. ఊ. స్త్రీ. 1. కాలువ; 2. యజ్ఞార్థము దున్నిననేల; 3. గొయ్యి; 4. నది. పుం. కరీషాగ్ని, పిడుకనిప్పు.

కర్సనము = కరిసనము. 1. (కృషి) "ఆ. కాఁపులావు వెరవు కలిగి కర్సనము సేయఁగ." భార. సా. ౧, ఆ. 3౧; 2. (దున్నుట) "సీ. గోవులు ...కర్సనంబునకు నొడవు." భార. అను. ౨, ఆ. 3౯౭.

కఱ. వై. వి. 1. నలుపు. "సీ. అతిమనోహరనవయౌవనారూఢుఁడై కఱలేని హిమరశ్మికాంతి దాల్చి." భార. ఆది. ౫, ఆ. ౧౫; 2. మచ్చ. "చ...దివ్యప్రభావంబునన్, గఱయుఁ న్మాగును లేకపుట్టిన శుభాంగం బద్భుతాపాదియై, నెఱయంగన్నులు విచ్చి చూచుతనయుఁన్ వీక్షించి మోదంబునన్." హరి. పూ. ౫, ఆ. ౧౨౦; 3. అకీర్తి. "చ...ఇం,కనికఱ మేదినీవిభుఁడు గాఁచెను..." సా. 3, ఆ. ౨౨౦. విణ. నల్లనిది. "ఉ. దట్టపువన్నెగుడ్డ కఱ దట్టిపొఁకన్ సవరించి..." రా. వి. ౨, ఆ. ౫౫. వి = కట్టి. (చార) "గీ...నల్ల, గఱలపండుగచీర..." శుక. ౨, ఆ. ౪౭౬. ౪, ఆ. ౭౭.

కఱక = కఱ. (నల్లనిది) "ద్వి. అందంబులగు కఱకంచు కావులును" పండితా. పర్వ. 3౦౭. పు. "ద్వి. కఱకత్రాళుల నెంద్రు కలును..." పండితా పర్వ. 3౪3, పు.

కఱకంఠుఁడు. మి. వి. (కఱ+కంఠుఁడు.) నీలకంఠుఁడు, శివుఁడు. "క...మదాత్మోపహారమిచ్చెద నీకుం, గఱకంఠ వరము నాకుఁబ, గఱఁ బరిమార్పంగ శక్తి గలుగుటయచుమీ." భార. సౌ. ౧, ఆ. ౧౨౧. "క. మఱి రామేశ్వరతీర్థము, కఱకంఠున కాటపట్టు..." భీమ. 3, ఆ. ౧౫౬.

కఱకంఠుతలమానికము. ద్వ. వి. (కఱకంఠుని+తల+మానికము) చంద్రుఁడు. సాం. ని. దేవ. ౧౦.

కఱకంఠుతలయేఱు. ద్వ. వి. (కఱకంఠుని+తల+ఏఱు) అమరతటిని, ఆకాశగంగ. సాం. ని. దేవ. ౧౬.

కఱకంఠురాణి. వై. వి. (కఱకంఠుని+రాణి) శివుని భార్య, గౌరి. సాం. ని. దేవ. ౬.

కఱకరి. వై. విశే. (కఱకు+అరి. సం. కర్కరః.) 1. కఠినము; కఠినుఁడు. "వ...అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల కులికి..." స్వా. ౨, ఆ. ౬౧; 2. నిపుణుఁడు, నేర్పరి. "చ...వివిధాయుధంబులన్, గఱకరియై రణస్థలుల గద్దఱియై..." స్వా. ౪, ఆ. ౭.

కఱకఱ. దే. వి. కొందుట ప్రొద్దు పొడుచుట ఒరయుట తఱుఁగుట మున్నగువానియం దగుధ్వని కనుకరణము. (శ. ర.)

కఱకఱి. దే. వి. 1. బాధ. "చ. కఱకఱి పెట్టి సొమ్మడుగు..." ఆము. ౯, ఆ. ౬౧; 2. ద్వేషము "క. తఱిఁ జెఱుపమిఁ గొంచెపుఁబగ, గఱకఱి నరిగట్టి పిదపఁ గడు నొప్పించున్." ప్రబోధ. ౨, ఆ. ౪౯. హంస. ౧, ఆ. ౧౨౭.

కఱకు. వై. వి. (సం. కర్కశః.) 1. కాఠిన్యము. "సీ. కోకంబులకుఁ బైఁడికుండలకఱకు మోపంతయు సరసత నబ్బెనేని." హరి. ఉ. ౭, ఆ. ౧౮3. (శ. ర. పా.) భీమ. ౨, ఆ. ౧౨౮; 2. శౌర్యము. ఆం. భా. ద్వి. ౨౨౧. బ. 1. పరుషవచనములు. "ద్వి. కఱకులాడెడుమాడ్కిఁ గాదు మోఁదటను." రం. రా. యు. ౨౮3 పు. 2. క్రూరకృత్యములు. "గీ. ఓరి పాపాత్మ... నీకఱకు లెల్లఁ, జక్కనగు నంతతో నని శాప మిచ్చె." భో. ౯, ఆ. ౧౦౯; 3. అంపములు మొవానికమ్ములు. "సీ...కఱకులకత్తిఁబు గాడ్దకేల." వేణు. శ. ౬౪. విశే. 1. కఠినము, పరుషము. "క...కఱకుమాటలతోడన్." వి. పు. ౮, ఆ. ౧౫౮. నైష. ౭, ఆ. ౯3; 2. గట్టిదైనది. "ఆ. కఱకుదర్భపూరిపఱపులు..." భార. ఆది. ౭, ఆ. ౨౨౪; 3. మోటువాఁడు. "ఆ. అగ్ని శిఖయుఁ బోలె నంటను డాయను, జూడ రాని యట్టిశుభచరిత్ర, నెఱుక లేనికఱకుటెఱుకు కప్పేక్షించె..." భార. అర. ౨, ఆ. ౯౧; 4. పదునైనది. "క. కఱకుంగోఱల విషములు, దొఱఁగఁగ ..." దశా. ౪, ఆ. ౧౮౨; 5. భయంకరమైనది. "గీ. కఱకుమిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కుదృష్టి." భాగ. ౧౦. స్కం. ఉ. ౯3౯; 6. దట్టము, సాంద్రము. "సీ...కఱకుఁజీఁకటి వెన్నుసఱచువాఁడు." కాశీ. 3, ఆ. ౨3౪.

కఱకుఁదనము. ద్వ. వి. (కఱకు+తనము.) 1. పారుష్యము. "గీ. సంతతంబును శ్రీహరిస్మరణ లేక, కఱకుఁదనమున దుర్భాష లఱచెనేని." జై. 3, ఆ. 3౪; 2. బిరుసుతనము. "ఆ. కఱకుఁదనముఁ జాలఁ దఱచుఁదనంబును, సెగలసిరులు గలిగి విరుల పేరి, కీర్తి బుగులుకొనఁగఁ గిసలయాధర గొప్ప, కొప్పు గప్పుమీఱి యొప్పు టొప్పు." పాండు. 3, ఆ. ౨౦౧.

కఱకుగిలు. వై. అ. క్రి. బిరుసగు. "వ...నిడుదలై యుండుకఱకుగిలు నాసాకేశంబులును." కవిక. ౯, ఆ. ౧౧౦. (శ. ర. పా. 'నిడుదలైయుడుగ, కరసగిలు' ముద్రి. పా.)

కఱకుట్లు = కఱ్ఱకుట్లు. "చ...తగునే కఱకుట్లను జంకఁ బొత్తముల్." ఉ. హరి. ౨, ఆ. ౧3౭. ఆం. భా. ద్వి. ౨౯౨.

కఱకుదుమ్ము. ద్వ. వి. (కఱకు+దుమ్ము.) గరగరలాడు దుమ్ము, ఇసుక. "సీ. గాలయానిలముచే దూసూరంబు రేఁగుసౌగంధికంబుదజంబు కఱకుదుమ్ము." స్వా. ౯, ఆ 3౮.

కఱకుసాన. ద్వ. వి. (కఱకు+సాన.) పదును పెట్టు సాన. "గీ. కఱకుసానలఁ గొప్పుగాఁకలఁగడాని, చికిలి యగురీతి మెఱసె బాలనుపమేను." దశా. ౪, ఆ. ౧౮౧.

కఱగొను. ద్వ. అ. క్రి. (కఱకు+కొను.) శాశ్వతముగా నిలుచు. "క. పెఱచోఁ జేసినపాపము, లఱుమక యయ్యెడ నడంగు నవి, ముక్తమునన్, గుఱుకొని చేసినయఘములు, కఱకొని దృఢవజ్రలేపకం బగుఁ దరుణీ." పద్మ. 3, ఆ. ౮౮.

కఱగొఱ. దే. వి. అగౌరవము, అపకీర్తి. "చ...వారి నెల్ల నేఁడైఱ నుఱుమాడఁ బంపుము కడింది గఁ జూడకు నీకు నేమిటికిం, గఱగొఱ కాదు పోమి కడ ( గష్టము నాకు సుదాత్తమానసా." భార. ద్రో. ౧, ఆ. ౨౨3. "చ...చాలమి దెచ్చికొన్న నా, కఱగొఱ దీర్తుఁగాక యొకకాలుఁడకా తలద్రుంప కేఁగెదే." కకు. ౯, ఆ. 3౪.

కఱచు. దే. స. క్రి. 1. కాటువేయు. "క. అఱచినఁ బఱచిన వ్రేళులు, గఱచిన నతఁ డించుకయును గరుణింపక యం, వఱ నుఱుము సేసె..."

భార. సౌ. ౨, ఆ. ౭. విరా. ౧ ఆ. ౨౭౯. "గీ. కన్నియలతోడ నాడుచు నుస్సు దాని, బావ మర్దినౌమై యొక్కపన్నగంబు, కఱచె. గన్నియ లందఱు వెఱచి పఱచి, యఱచుచూడ బ్రమ ద్వర యపనిఁ డ్రెళ్లె." భార. ఆది. ౧, ఆ. ౧౪౭; 2. ఖండించు. "క...ౘక్కఱచిన పెస లవవిసరము, తెఱఁగున వడగండ్లు ధవళదీథితి రాలెన్." ఆము. ౪, ఆ. ౧౨౧; 3. నాటు, గ్రుచ్చుకొను. "క. అఱిముఱివ్రేసిన బలకం, గఱచినసైంధవుని యలుఁగుఁ గని..." భార. ద్రో. ౧, ఆ. ౧౭౩; 4. పండ్లతో నొక్కిపట్టు. "చ. కఱచినపీనుఁగుక్ వెడఁదవెప్పర యున్..." ఉ. హరి. ౨, ఆ ౧౦౬. భార. ఆది. ౨, ఆ. ౭౩; 5. తిను. "ద్వి. ఖగపతి కసపెడి కఱచునే యరిలు,మృగపతి యూఁగోని మేయునే పొల్లు." పండి తా. మహిమా. ౨౬౦. పు. (ప్రాఁత ప్రతి.); 6. నేర్చు. "సీ. వేదంబులును ధను ర్వేదాదివిద్యలుఁ గఱచుచుఁ గడలేనిరాయుకఁ దనరు." భార. ఆది. 3, ఆ. ౧౨; 7 స్మరించు, తలపోయు. "క. ఎఱుక గలవారిచరితలు, గఱచుచు సజ్జనులగోష్ఠిఁ గదలక ధర్మం, బెఱుఁగుచు నెఱిఁగినదానిని, మఱప కనుష్ఠించునది సమంజసబుద్ధిన్." భార. ఆది. 3, ఆ. ౨౦౩.

కఱటి. దే. విశే. 1. మూర్ఖుఁడు. "క. మఱి యొఱిఁగి యెఱుఁగ నొల్లని, కఱటిం దెలుపంగఁ గమల గర్భునివశమే." భార. ఆది. ౪, ఆ. ౭౨; 2. దుష్టుఁడు. ఆం. భా. తృ. ౭; 3. మోసగించునది. "సీ. మానంబు వీటఁబో మసఁగి వ్రేఁకలఁ జిక్కువఱచినయదియె యీకఱటిచూపు." హరి. పూ. ౯, ఆ. ౨౨౪.

కఱటితనము. దే. వి. (కఱటి+తనము.) మౌర్ఖ్యము, మూర్ఖపుఁబట్టుదల. "క. తెఱవా నాచెప్పుటచ్చర, తెఱవలకున్ లేనిమేల్గడియ పచ్చునెడన్; జెఱచుకొనఁ గూడ దిపు డీ,కఱటితనం బుడిగి నెమ్మిఁ గైకొను నన్నున్." అచ్చ. సుం. ౪౦.

కఱతలాఁడు. వై. విశే. (కఱతలు+ఆఁడు.) 1. విజ్ఞుఁడు, జ్ఞానవంతుఁడు. "సీ. ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ కడదాఁక నెఱిఁగినకఱతలాని." కాశీ. ౨, ఆ. ౧౬౦; 2 దుశ్చేష్టుఁడు. "క. కదలిన మొత్తుగు నెక్కుడఁ, గదలెద పటు కఱతలాఁడ..." హరి. పూ. ౫, ఆ. ౨౪౨. (శ. రం. పా. 'గఱసులాడ' ముద్రి.)

కఱతలు. వై. వి. బ. (సం. కృతమ్.) 1. చేష్టలు (శ. ర.); 2. దుశ్చేష్టలు. "చ. కఱతలు పెద్ద వీనికి..." నృసిం. ౪, ఆ. ౧౩౫. "సీ. కఱతలు పోకిళ్లు..." అప్ప. ౨, ఆ. ౧౯౭.

కఱద. వై. వి. మాట. "గీ...కఱదనాఁ బలుకు..." ఆం. భా. ప్ర. ౧౧౦. బ. 1. మాయమాటలు మిథ్యావచనములు. "చ. ఎఱుఁగుదుఁ దక్షమింతయు మహీసురవర్య మతిప్రకాశతన్, గఱదలు మాని చెప్పుము ఖగత్వము నేమినిమిత్తమొంది తీవు..." పద్మ. ౪, ఆ. ౧౧౬; 2 బుద్ధులు, వంచనలు. "సీ...కఱదల బుద్ధులు..." అప్ప. ౨, ఆ. ౧౯౭. అచ్చ అరో. ౨౨; 3. కఱతలు. "క. బిఱబిఱ విభ కడి కరుగక, కొఱకొఱ లాడెద వదేమి గోరము మోస్త్రేల్, వెఱఁ గయ్యెడిఁ గద నీచెయు, కఱదల గనుఁగొన్న నెన్నఁ గన్నెలమిన్నా." రసిక. ౫ ఆ. ౧౬౩; 4. వింతలు. "క. కఱదలపులు గిడి..." ప్రభా. 3, ఆ. ౪౭.

కఱదతనములు. వై. వి. బ. చాతుర్యము. "క. విశిఖ పరిరంభణంబులుఁ, జతురవచోరుచులు నవుడు సస్మితములుగా, నితరేతరరతి వారికిఁ, గలిపయనములు నెఱసెఁ గఱదతనంబుల్." హరి. ఉ ౭, ఆ. ౨౦౫.

కఱదూపము. వై. వి. (కఱ+దూపము. సం. కాలధూమః.) 1. గృహధూమము, ధుంధుమారము "గీ. విరహపరితాపవేదన వేఁగుచున్న, చక్రవాకాంగనల కటాక్షములయగ్గి, నావహిల్లిన కఱదూప మనఁగ నొప్పె, సురగణాధీశబింబంబు నడిమి మచ్చ." భీమ. ౨, ఆ. ౪౫; 2. పొగచూరినదూగర. (ఆం. పద.)

కఱనూనె = కిట్టనూనె. (శ. ర.)

కఱపడు. ద్వ. అ. క్రి. (కఱవు+పడు.) లోపించు న్యూనతగను. "చ...యత్నమేమియుం, గఱపడకుండ..." వేం. పంచ. ౫, ఆ. ౫౯.

కఱపించు. దే. స. క్రి. 1. నేర్పించు; 2. కఱవ జేయు, పండ్లతోఁ గొఱుకఁజేయు. "ఆ. వెఱ

తల్లిం దోఁకఁ గఱపించుకొని దినిఁ, బఱచువానిఁ జూచి పార్థుఁ డలిగి." భార. ఆది. ౮, ఆ. ౭౩.

కఱపు. దే. స. క్రి. 1. నేర్పు, బోధించు. "క... కన్నియలకు నాట గఱపఁగా నోపుదు..." భార. విరా. ౧, ఆ. ౨౩౩; 2. చెప్పి పెట్టు, దుర్బోధచేయు. "ఆ. దుర్యోధనుండు శకునికర్ణదుశ్శాసనుల్, గఱపఁ బాండవులకు నలయఁజేయఁ, గడఁగె..." భార. ఆది. ౩, ఆ. ౧౨; 3. కలుగఁజేయు. "వ... రుధిరప్రవాహంబులకు జలప్రవాహంబులయొఱపు నెఱప..." జై. ౭, ఆ. ౧౭౫; 4. తెలియఁజేయు, చెప్పు. "ఆ. భూతలేశ నన్నుఁ బుత్తెంచి రిప్పుడు, తద్భయంబులెల్లఁ దలఁగునట్టి, మంత్రతంత్రవిధులచ్చి యేమఱకుండు,నది నిరంతరంబు ననియిఁ గఱపి." భార. ఆది. ౨, ఆ. ౧౯౧. వి. 1. బోధనము. "ద్వి. నెఱవైన పెద్దలు నేరనియట్టి, కఱపులు కఱచె నీకతకారిబిడ్డ." అ. మ. క. ౧. ఆ; 2. దుర్బోధ. "ఆ. శకునికఱపు విని యసన్మార్గవృత్తికిఁ, జొచ్చి యిట్టియెడరు దెచ్చుకొనిరి." భార. భీష్మ. ౧, ఆ. ౩౦. భార. ఆది. ౮, ఆ. ౪౧.

కఱప. దే. వి. ఒకానొకమూలిక. (శ. ర.)

కఱవు. దే. వి. 1. క్షామము. "క. కఱవుపయిఁ గఱవు వొరయుచు... అడఁచు దుష్కర్మములన్." భార. శాం. ౪, ఆ. ౨౩. భార. సభా. ౧, ఆ. ౨౭౧; 1. దారిద్ర్యము. "క. కఱవునఁ దో డావపంట గలిగిన కరణిన్." కువల. ౧, ఆ ౧౦౧; హరి. ఉ. ౭, ఆ. ౧౬; 2. పూరె యిండ్లకప్పునపు డేర్పఱచు కొనుమిటి. "సీ. కఱవు గేస్తులయిండ్లఁ గప్పు నేతలయంద..." అచ్చ. బాల. ౪౭. విణ. దుర్లభము. "క... మాదృశపీరుల్ జగతిం గఱవా..." రామా. ౫, ఆ. ౧౪౮. "చ... పురిలోన వింత కఱవా రథచోదకులు..." భార. విరా. ౪, ఆ. ౨౦.

కఱవుసేయు. దే. స. క్రి. (కఱవు+చేయు.) లోపింపఁజేయు. "గీ. వెలఁ గఱవుసేయు వెల చేలములు..." సా. ౨, ఆ. ౧౯౮. (వెలఁ గఱవుసేయు = అమూల్యములగు.)

కఱి. వై. వి. 1. పశుయోని. (శ. ర. బ్రౌ.); 2. నల్లఁదనము. ఆం. భా. ప్ర. ౧౦౮. విణ. (సం. త. కఱి.) నల్లనిది. "చ... పెద్దివ్వఁ, తలకఱి టెక్కెముల్..." య. ౧, ఆ. ౭౯. "సీ... కఱివన్నెకోడె యనఁగ." బసవ. ౨, ఆ. ౧౯.

కఱిగొను. దే. అ. క్రి. (కఱి+కొను.) -, నల్లనగు- అంటువడు. "గీ... ఈమట్టికుండల, నిచ్చ వండి పెట్ట మెచ్చు గాదు, వంటఁ జేసి మొదలివంట నే కఱిగొన్న, దానఁ దొలుత వండఁదగుట యెట్టు." ద్వా. ౨, ఆ. ౩౦.

కఱిజేజేయన్న. ద్వ. వి. (కఱి+జేజే+అన్న.) విష్ణునియన్న, ఇంద్రుఁడు. ఆం. భా. ప్ర. ౪౬.

కఱిపక్కెము. వై. వి. (కఱి+పక్కెము.) కృష్ణపక్షము, బహుళపక్షము. (శ. ర.)

కఱిపాము. ద్వ. వి. ఔ. (కఱి+పాము.) కృష్ణసర్పము, నల్లత్రాచు. "సీ. అఱజాఱునెఱివేణికఱి పాముపొమ్మకు వెడలు గుడ్డులనోలె నిరులు రాల." సాంబో. ౧, ఆ. ౧౧౯.

కఱిమానికము. వై. వి. (కఱి+మానికము.) ఇంద్రనీలమణి. "సీ. కఱిమానికంబులగముల లేటలను గూర్చినమేలిపట్టంచు రెంటెములును." య. ౪, ఆ. ౧౨౦.

కఱిమెడదొర. ద్వ. వి. (కఱి+మెడ+దొర.) శితికంఠుఁడు, శివుఁడు. అచ్చ. బాల. ౧౭౦.

కఱిమొలలు. దే. వి. బ. ఉద్దరుతగిలించునాగవాసములు. (ఆం. పద.)

కఱియ = కఱి. వి. (నల్లఁదనము) ఆం. భా. ప్ర. ౧౦౮. విణ. (నల్లనిది) "ఆ. కఱియజీలకఱ్ఱ గఱి వేము..." భార. అను. ౩, ఆ. ౧౯౫.

కఱిపలువప్రోడ. ద్వ. వి. (కఱి+పలువ+ప్రోడ.) నీలాంబరధారి, విష్ణుమూర్తి. సాం. ని. దేవ. ౧౫.

కఱివేము. ద్వ. వి. (కఱి+వేము.) కఱివేపాకు చెట్టు. భార. అను. ౩, ఆ. ౧౯౫.

కఱిరతనము = కఱిమానికము. "సీ. కఱిరతనంపుఁ జొక్కపుసరుల్ తళుకొత్త..." నీలా. ౨, ఆ. ౪౮.

కఱివేలుపు. ద్వ. వి. (కఱి+వేలుపు.) కృష్ణుఁడు. నీలా. ౧, ఆ. ౬౬. (రూ. కఱివేల్పు.)

కఱివేల్పుడాకన్ను. ద్వ. వి. (కఱివేల్పు+డాకన్ను). చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౫.

కఱివేల్పురిక్క. ద్వ.వి. (కఱివేల్పు+రిక్క.) శ్రవణ నక్షత్రము. (శ. ర.)

కఱివేల్పుహజ్జ. ద్వ. వి. (కఱివేల్పు+హజ్జ.) 1. విష్ణునిపాదము: 2. ఆకాశము. "సీ. విను ద్రిమ్మరులు కఱివేల్పుహజ్జను బూజ సలిపిన క్రొత్త చెంగలువ లనఁగ." అచ్చ. అయో. ౧౩.

కఱుకు. యం. దే. స. క్రి. రాచు. "గీ. కఱకుటం పు్రల నిఱికించి గజ్జెగదలఁ, గఱికి నెఱి నెఱిఁ గొలెమ్ముకయంను విఱుగ, విఱిచె వడిఁ గైజు నొకపెద్దవేపడంబు." స్వా. ౪, ఆ. ౫౯. వై. వి. (సం. క్షారః. క. కఱుకు.) 1. మందాకు మాడ్చి రాచినపొడి. (శ. ర.); 2. భస్మవిశేషము. ఆం. భా. ద్వి. ౨౪౩; 3. నఱుకుట మున్నగు వాని యం దగుధ్వని కనుకరణము. (దీనిఆమ్రేడిత రూపము కఱుకుకఱుకు.) "గీ. కఱుకు కఱుకునఁగు త్తుకఁ గఱచి విఱిచి." వేం. పంచ. ౪, ఆ. ౫౭౭.

కఱుకుట్లు = కఱకుట్లు. "క...లివ,వేలా కఱుకుట్లు పార్వతీశ్వర చెపుమా." కాళ. ౩, ఆ. ౯౯.

కఱుక్కు = కఱుకు. (నఱకుటమొ. వానియం దగు ధ్వని కనుకరణము. దీని యామ్రేడితరూపము కఱుకుకఱుక్కు.) "చ...సైంహికేయుని శిరంబు గఱుక్కునఁ ద్రుంచునంతలో..." దశా. ౨, ఆ. ౩౬౯. "చ. కఱుకుకఱుక్కున న్నఱికి..." రంగా. ౩, ఆ. ౧౨౩.

కఱుగోల. దే. వి. (కఱు+గోల) వాఁత వేసెడియినుప కమ్మి, చూడుఁగోడుపు. (శ. ర.)

కఱుదులాఁడు. వై.విశే. (కఱుదులు+ఆఁడు.) నేర్పరి. "సీ. కఱుదులాఁ డగుచక్రి కపటంపుటనువునఁ దను మోసపుచ్చిన..." హరి. ఉ. ౭, ఆ. ౩౦.

కఱుదులు. వై వి. బ. (క. కరుబు.) నేర్పులు. "క. కఱుదులమాటల మమ్ముం, గుఱుచపడుగ యేల యింత గోసెక్కింపన్." హరి.ఉ.౧౦,ఆ. ౨౪౧. "వ...దీనికఱుదు లెంతయరుదులు." ప్రభా. ౩, ఆ. ౫౨. (శ. ర. పా. కఱదు ముద్రి. పా.)

కఱె = కఱియ. ఉదా:—కఱెవాఁక = యమునానది.

కఱ్ఱ. యం. దే. వి. 1. కొయ్య. (ఉదా:—కఱ్ఱ సామాను.); 2. దండము; పుల్ల. ఉదా:—చేతి కఱ్ఱ; నూఁటికఱ్ఱ. ఆము. ౪, ఆ. ౧౧౯. 3. సస్యగుచ్ఛము. ఆం. భా. ద్వి. ౨౩౭; 4. చాఱ, (చూ. కఱ.) వై. వి. (సం. కాలః.) కళంకము; మఱక. (చూ. కఱ.) విశే. నల్లనిది. "గీ. కిఱ్ఱుఁ జెప్పులు దొడి నున్నగఱ్ఱతడుపు, లెలమిలోఁ గట్టి..." హరి. పూ. ౫; ఆ. ౨౫౨.

కఱ్ఱకుట్లు=కఱకుట్లు. "సీ. నీరు వెళ్ళఁగ నొత్తి సిప్పాల నందంద కమ్మఁగాఁ గాల్చినకఱ్ఱకుట్లు." రుక్మాం. ౩, ఆ. ౨౨౬. (ముద్రి. పా.)

కఱ్ఱజవ్వాది. ద్వ. వి. (కఱ్ఱ+జవ్వాది.) ప్రశస్తమైనసంకుమదము. వసు. ౨, ఆ. ౧౧.

కఱ్ఱపెత్తనము. దే. వి. (కఱ్ఱ+పెత్తనము) 1. యాజమాన్యము. (వా.); కఱ్ఱ చేతఁ బట్టుకొని పని జరుగునది లేనిది చూచుట.

కఱ్ఱమడ. దే. వి. పెల్లగించుట కుపయోగించుపనిముట్టు "గీ. గడ్డపాఱలఁ బాఱలఁ గఱ్ఱమడల, వెడఁద గుద్దండ్ల నాపుట్ట విరియఁ ద్రవ్వి." నా. పంచ. ౧, ఆ. ౨౪౦. (శ. ర. పా.)

కఱ్ఱి. వై. వి. అర్జునుఁడు. "ఆ. కఱ్ఱివిక్రమంబు గాల్పనే...రాజరాజుపీనుంగుఁ గన్నారఁ, గానఁ బడయమైలి మేని కృష్ణ." భార. ఉద్యో. ౩, ఆ. ౧౧౭. విశే. నల్లనిది. "సీ. కఱ్ఱి క్రీడాశూన్యకటి గోపురద్వార పరిరక్షకుఁడు కాలభైరవుండు." కాశీ. ౧,ఆ.౨. హరి.పూ.౯,ఆ.౨౫౫.

కఱ్ఱినెచ్చెలి = కఱ్ఱిసంగాతి. ఆం. సం. దేవ. ౭.

కఱ్ఱినేస్తి = కఱ్ఱినెచ్చెలి. ప్రబంధ. ౨౧౬.

కఱ్ఱియ = కఱియ. (చూ. కఱ్ఱె.)

కఱ్ఱిసంగాతి. వై. వి. (కఱ్ఱి+సంగాతి) అర్జునుని మిత్త్రుఁడు, కృష్ణుఁడు. వేంక. దేవ. ౪.

కఱ్ఱు. దే. వి. 1. నాఁగటికొంపయం దమర్చెడియినుప పాళము, కృషకము. (శ. ర.); 2. తలుపు తీయం ధ్వని కనుకరణము. "ద్వి. గడియ గ్రక్కునఁ బుచ్చి కఱ్ఱునఁ దలుపు, గడుఁ బాఱఁ దెఱచుడు ..." పండితా. దీక్షా. ౪౪, పు. (ప్రాఁతప్రతి పా.); 3. కాకధ్వనివిశేషము. "గీ. కాకి కఱ్ఱనె ..." శుక. ౨, ఆ. ౨౨౯; 4. దగ్గుటయం దగు ధ్వని కనుకరణము. "సీ...కఱ్ఱు కఱ్ఱునుదగ్గు లగ్గలము గాఁగ." శుక. ౩, ఆ. ౩౦.

కఱ్ఱుగుద్దలి. దే. వి. (కఱ్ఱు+గుద్దలి.) త్రోక్కిక. "సీ. త్రవ్వటంబులతఱిఁ ద్రవ్వటంబులు కెట్టుఁ దగినట్టి కఱ్ఱుగుద్దలి గడించి." కళా. ౪, ఆ. ౭౯.

కత్తె = కత్తెయు, కతె. "సీ...ఎత్తుమప్పటి నొప్పు కత్తెవాని." ఆము. ౬, ఆ. ౧౯.

కల. ఉభ. దే. వి. స్వప్నము. "చ. కమలదళాక్షిరో వినవుగా కల యొక్కటిగంటి వేకువన్." ప్ర. భా. ౧, ఆ. ౧౨౨; ౧౨౫; ౧౨౭. అవ. 1. భవిష్య దర్థకము. ఉదా:—కాఁగల, పోఁగల; 2 శక్త్యర్థకము. వలసిన యనునర్థ మిచ్చును. మఱియు నిది సమర్థత, ఉద్దేశము, అర్హాత మున్నగు దానిం దెల్పును. "గీ. చేయఁ గలకార్యములు సవిశేష కృతులు, సాత్మదృష్టిమైఁ గని..." హరి. పూ. ౧, ఆ. ౧౦౯. "మ...మాతాడ గాఁ గలదా..." శుక. ४, ఆ. ४౧. హరి. పూ. ౧, ఆ. ౧౯౧. విజ. ౨, ఆ. ౧౬४; 3. అస్త్యర్థకము. "గీ...మున్న కల రజ్జనాభునకును, మహిపు లెవ రం(డు)..." పారి. ౧, ఆ. 3౦. భార. ఉద్యో. 3, ఆ. ౯౭. (కలాదు, కలాను, కలా స్వదన్న గు రూపములును క్వాచిత్కముగఁ బ్రయోగములం గన్పట్టుచున్నవి. మఱియుం 'కలను'నకు కల్గు కద్దు అనురూపములును గానవచ్చు చున్నవి.) విశే. ఉన్న, కలిగిన. "చ ..ఉరోజకుంభముల్, గవిసి కలంత మేరయును గైకొని యున్నవి..." నైష. ౦, ఆ. ౬౭. పాండు. ౫, ఆ. ४४. భా. రా. యు. ౧४౭४. సం. వి. ఆ. స్త్రీ = కళ.

కలంకము. సం. = కళంకము.

కలంకారి. హిం. వి. (హిం. కలంకారీ.) వ్రాఁతపని వస్త్రము. (శ. ర. బ్రౌ.)

కలంజము. సం. వి. అ. పుం. 1. విషము పూసిన బాణము చేఁ జంపఁబడినమృగాదికము; 2 పొగాకు. (గంజాయి అని శ. ర.)

కలందాను. హిం. వి. (ఉర్దు. కలందాన్.) కలము లుంచుకొను పెట్టె. "సీ. నడికట్టులో మొల నిడిన కలందాను హస్తాగ్రమున వ్రేలుడ స్తరంబు." హంస. ౨, ఆ. ౨౯.

కలంబము. సం. వి. అ. పుం. 1. కూరనార; 2. బాణము; 3. సమూహము; 4. కడపచెట్టు.

కలంబి. సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలిచెట్టు.

కలంబుటము. సం. వి. అ. న. 1. సద్యోఘృతము;

కలఁక. దే. వి. (క. కలకు. త. కలక్కమ్.) 1. కలఁత, క్షోభము. "ఆ...నీనుపలుకులఁ గలఁక దేఱి బుద్ధి తెలివొందె." భార. ఉద్యో. ౨, ఆ. ౯౬. "గీ...నా సమానసంబు, కలఁక యంశయు బాసె నిష్కల్మషుండ, నైతి..." భాగ. ద్రో. ౨, ఆ. ౨౧౭; 2. కాలుష్యము, బురద. "సీ... నీళ్లకలఁక నిండుము రాని తెలుచుభంగి..." భా. రా. 3, ఆ. 3౨; 3. నింద. "సీ. కడుఁ గళానిధి చనో గ్రస్తుఁ జేసినదూఱు నునుల విఖ్యాతిఁ గఁ బ్రకలఁక." బిల్హ. ౧, ఆ. 3౭; 4. పాపము. "చ. త్రికరణశుద్ధిగా మగఁడె దేవుఁ డటంచు నిశ్చయించి యొండొకఁ డెటువంటి వాఁడయిన నొప్పదు కోరఁగ సాధ్వి యట్లయుం, గక మఱి ఎవ్వనేని కలఁకన్ నిరయంబు రయం బునన్ గనున్." శకుం. 3, ఆ. ౭౬; 5. జంకు, వెనుతీయుట. "సీ. బంధుల కగపడ్డఁ బాయుం గవ్వయ మను కలఁకమైఁ జెనుటలు గ్రమ్మెదేర." భార. విరా. ౨, ఆ. ౭౦. పారి. ౨, ఆ. ౫౧; 6. పలవు. "ఆ...వైకొనుకొన్కనవని... తెలచి యందు నొకింత, కలఁక లేమి చూచి నెలఁత గనలె." ఉత్తర. 3, ఆ. ౭3; 7. నేత్రరోగ విశేషము కండ్లకలఁక. (శ. ర. వా.)

కలఁకఁబాఱు. దే. అ. క్రి. (కలఁక+పాఱు.) 1. కలఁతపడు, క్షోభించు. "మ. కలకంబాఱి మఱందివెల్లఁగి మనగ్రోధుఁడై పట్టి..." భాగ. ౧౦ స్కం. పూ. ४४. (శ. ర. పా. 'కలఁగఁబాఱు' ముద్రి.); 2. కలుషితమగు; వెలవెలఁబోవు. "సీ. పౌండరీకసమృద్ధి బావఁగా శశికీర్తి మలఁగె నా వెన్నెలల్ కలఁకఁబాఱె." ఉ. రా. ४, ఆ. ౨४౨. (కలఁకపాఱు ముద్రి.)

కలఁకపడు. ద్వ. అ. క్రి. (కలఁక+పడు.) కలఁగు, క్షోభించు (చూ. కలఁకపాటు.)

కలఁకపాటు. ద్వ. వి. (కలఁకపడు. భా.) కలఁత, క్షోభము. "వ...ఇక్కలంకపాటు తక్కిన భయంబునకుం గాదు" కళా. ४, ఆ. ౧౭౭.

కలఁకు. దే. వి. 1. కాలుష్యము; 2. ప్రదేశము. "సీ. కలుషదేశమ్ములు చెలఁగుఁ గలం కన..." ఆం. భా. కృ. ౫౧.

కలఁకువ. దే. వి. కలఁత, క్షోభము. "ఉ...సర్వకర్మములంట జల్లుపము పెక్కు కలంకువల్ మదిం, గూరిన నైన..." వా. రా. ౫, ఆ. ౬౯. "గీ...,జలచరమ్ములకలఁకువల్ గలుగుదాని." భా. రా. అర. ౨, ఆ. ౪౨౨.

కలఁగఁబడు. ద్వ. అ. క్రి. (కలఁగన్+పడు.) 1. కలఁగు, సంక్షోభించు. "క...సాత్యకి కో, ల్తల తోర్వక నీబలము కలంగంబడియెన్." భార. ద్రో. ౪, ఆ. ౫. "క. ఆకతినపుగోల్తలకుం, గాక కలంగఁబడి నాల్గుకడలకు విచ్చెం, జీకాకు పడుచు నంగము, హీకాంతునిసేన లెల్ల నెంతయు భీతిన్." కళా. ౮, ఆ. ౬౦; 2. చెదరు, విచ్చిపోవు. "క. శరములవేగంబున గద,పరుసఁదనంబునను గలఁగఁబడి చేద్పడ నా,కరులం దోలెను భీముఁడు..." భార. భీష్మ. ౨. ఆ. ౨౧౫; 3. వ్యత్యస్త మగు; అపార్థము తీయఁబడు. "గీ. కాలములకీడుకతమునఁ గలఁగఁబడిన, వేదముల నీవు నాఁడును విమలబుద్ధి, నంచితవ్యాస మొందించి..." భార. శాం. ౬, ఆ. ౫౨౭.

కలఁగఁబాఱు. దే. అ. క్రి. (కలఁగన్+పాఱు.) 1. కలఁగు, క్షోభించు. "గీ. అదరుకొనకవిగ్రామసింహములు గవియఁ, బతులు నిజవచోదండ సంహతుల బెదరు, పఱుపఱుండిన ధారణీపాలసభలఁ, గలఁగఁ బాఱక సుకవులు మెలఁగు టెట్లు." చంద్రా. ౧, ఆ. ౧౬; 2. చెల్లాచెదరగు, విచ్చు. "మ. కలఁగంబాఱి తొలంగె వారుణబలౌఘుంబుల్..." హరి. ఉ. ౮, ఆ. ౨౭౨; 3. పంకిలమగు, కలుషమగు. "సీ. కమలాకరం బెల్లఁ గలఁగఁబాఱిన నొల్ల కరుచెంచు కొదమరాయంచ లనఁగ." దశా. ౨, ఆ. ౨౬౮; 4. (బుద్ధి) వికలత నందు. "చ...శాంతిసం,పద నొకయంతయుం గలఁగఁబాఱక యుండఁడె నిర్వికారుఁడై." భార. శాం. ౬, ఆ. ౨౦౨; 5. నశించు, క్షీణించు. "చ. కలఁగఁగఁబాఱె నాతనియఘంబులు...దపవహ్ని చిటచ్ఛిటధ్వనిన్, గలఁగఁగఁబాఱు పక్షుల ప్రకారమునన్..." శివరా. ౪, ఆ. ౪౨.

కలఁగించు. దే. స. క్రి. 1. కలఁచు, చలింపఁజేయు. "సీ. ఘనవలాహకశక్తిఁ గలఁగించె నెవ్వాఁడు రుతముంచే శేగమారుతముచేత." చంద్రి. ౧, ఆ. ౮; 2. పంకిలమొనర్చు; చెఱచు. "సీ. సింధునాయకుపొందు సేయఁ బోయెడితరంగిణి మదేభము గలఁగించినటుల." ఉ. రా. ౪, ఆ. ౨౨౦.

కలఁగు. దే. అ. క్రి. (క. కలంగు.) 1. క్షోభించు. "చ. ఎడఁద గలంగ..." ఉ. రా. ౬, ఆ. ౨౦౩; 2. పంకిల మగు; (భయముతో) క్షోభించు. "క. కలఁగిన పెద్దమడుపు..." భార. శాం. ౩, ఆ. ౩౪. "మ. కలఁగెం దోయధిస ప్తకంబు..." భార. విరా. ౪. ఆ. ౧౭౨; 3. చెల్లాచెదరగు; చలించు. "క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమ కుడై కలఁగినపవ్వ దేర్పఱుపఁగ నేఁ, గడునేర్తు..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౧౪; 4. భయపడు. "చ. జగపతి వచ్చెనా విని కలంగుదు రీతనిశత్రు లచ్చటన్." నైష. ౫, ఆ. ౧౩౩. పారి. ౨, ఆ. ౫౬; 5. కామవశుఁడగు. "చ...లేజవరాలు చెక్కు గీఁటిన వస వల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే." నైష. ౧, ఆ. ౧౭; 6. కనులు కలఁకనందు, నేత్రరోగము వచ్చు. ఉదా:—ఆమెకుఁ గనులు కలఁగినవి.

కలఁచియాడు. దే. స. క్రి. (కలఁచి+ఆడు.) కలఁచు, సంక్షోభింపఁజేయు. "గీ. ఇట్లు కౌరవానీకంబు నెల్లఁ గలఁచి, యాడి భీష్మునిదెసఁ బోవు క్రీడిఁ దాఁకె." భార. విరా. ౫, ఆ. ౧౫౮.

కలఁచు దే. స. క్రి. 1. కలఁచి యాడు, క్షోభపెట్టు. "క...ఎదిరిసైన్యముఁ గలఁతున్." భార. ఉద్యో. ౪, ఆ. ౪౧౯; 2. (మనోవైకల్యము) కలిగించు. "గీ...వేతొక్కండు మదిఁ గలంచు, చున్నయది..." భార. శాం. ౧, ఆ. ౬. 3. కామవశునిఁ జేయు. "సీ...యతినైన గుండె జల్లనఁ గలంప." ఆము. ౧, ఆ. ౫౯. "శా... కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్." స్వా. ౨, ఆ. ౬౮.

కలఁత = కలఁక. (చూ. కలఁతపడు.)

కలఁతపడు. ద్వ. అ. క్రి. (కలఁతే+పడు.) కలఁగు, సంక్షోభించు. (శ. ర.)

కలఁబడు. ద్వ. అ. క్రి. (కలయన్+పడు.) కలయఁబడు. (పరస్పరము) డీకొను. "క...ఇరువాగు జగడమునఁ గలఁబడియెన్." చంద్రా. ౬, ఆ.

౭౪. "క. చనుఁగవయును జఘనంబును, ఘనత నుసై పొరచుండఁగాఁ గలఁబడకుండ,డను మదనుఁడు నడుమను ద్రవ్వినపాత మనంగ నాభివివరము పొల్చెన్." చిత్ర.భా. 3, ఆ. ౫౫.

కలకంఠకంఠి. సం. వి. ఈ. స్త్రీ అవ్యక్తమధురధ్వని గలస్త్రీ; స్త్రీ; భార్య. "క. కులకాంతతోడ నెప్పుడుఁ గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ, కలకంఠకంఠి కన్నీ, రొలికిన సిరి యింట నుండ నొల్లదుసుమతీ." సు. శ. ౩౮. విణ. (న్. నీ. న్.) అవ్యక్తమధురధ్వని గలకంఠము గలది.

కలకంఠము. సం. వి. అ. పుం. 1. అవ్యక్తమధురధ్వని; 2. కోయిల; 3. పావురము; 4. హంస. విణ. (అ. ఈ, ఆ. అ.) మధుర మగుకంఠధ్వని కలది.

కలకండ = కలకండము. (బ్రౌ. వా.)

కలకండము = కల్కండము. (చూ. కల్కండము.)

కలకల. దే. వి. 1. నవ్వుటయం దగుధ్వని కనుకరణము. "క...శౌరి కలకల నవ్వెన్." భార. ఉద్యో. 3, ఆ. ౫౬; 2. పక్షికూఁతయం దగుధ్వని కనుకరణము. "క...పక్షుల్, కలకలను గూయఁజొచ్చెను..." హంస. ౧, అ. ౧౩౮. పద్మ. 3, ఆ. ౩౫. 3. పలుకుటయం దగుధ్వని కనుకరణము. "క...నిలునిలు మనుచు బొమ్మ కలకలఁ బలుకున్." ద్వా. ౨, ఆ. ౧౭. "సీ. కలకలఁ బల్కుచిల్కలకొల్కి..." ఉ. రా. ౬, ఆ. ౨౭; 4. బాధ కలుగుటయం దగునను కరణము. "చ...కాయజునమ్ముల గాయము ల్మదిం,గలకల నొంప..."అని. ౨, ఆ. ౭౯.

కలకము. సం. వి. అ. పుం. 1. గుంపునఁ బుట్టినపెద్ద మ్రోఁత, అలబలము. భారా. విరా. 3, ఆ. ౪; 2. వీణాదులధ్వని. "క...వీణా, కలకలములఁ గలకల నగు,పలుకుల..." పారి. ౨, ఆ. ౫; 3. సజ్జసరము, ఒకానొక ధూపద్రవ్యము.

కలకలాత్కారము. సం. వి. అ. పుం. కాంచి నున్న చిఱుగంటలధ్వని కనుకరణము. "మ...,కలకాంచీమణి కింకిణీకలకళాత్కారంబు తోరంబుగా." శివరా. ౨, ఆ. ౮౯.

కలకాలము. మి. వి. (కల+కాలము.) ఎల్లప్పుడు. "క...ఈవులందు నాదరణమునన్, గలకాలంబు పదాతుల, నలవున వశగతులఁ జేయ నగు నరపతికిన్." రుక్మా. 3, ఆ. ౬౪. రంగా. ౧, ఆ. ౧౬.

కలగంప. దే. వి. (కల+గంప.) కలగూరగంప, అనేక వస్తువులు గలగంప. విణ. అనేకము, పెక్కు. "సీ. కామితప్రదుఁ డైనకళ్యాపుకొంగిట మెచ్చుట దీర్తు రేముద్దరాండ్రు...గీ. వారికలగంప కడుపుల నేరుపఱుప, నరిదిబిడ్డలఁ బడసినబిరుదు సతుల, నామములు నన్వయంబులు నీమనంబు, పూనఁ జెప్పుదు వినవయ్య మానవేంద్ర." భాగ. ౬. స్కం. ౨౫౫.

కలగర. దే. వి. భృంగరాజము, గుంటకలగర. ఆం. భా. ద్వి. ౬౯.

కలగలపు. దే. వి. (కలపు+కలపు.) కలగలపు. (చూ. కలగలపుచేయు.)

కలగలపుచేయు. దే. స. క్రి. (కలగలపు+చేయు.) కూర్చు, కలుపు. "గీ. వారి వీరిని నన నేల వీరి వారి, గలగలపుచేయు న న్ననవలయుంగాక." రాధికా. 3, ఆ. ౪౫.

కలగలుపు = కలగల్పు. (చూ. కలగల్పు.)

కలగల్పు. దే. వి. (కలపు+కలుపు, కలుపు+కలుపు.) 1. కలుపుఁగోలుతనము. "సీ...కలగల్పు చూపుల రాకపోకల బయ ల్పాఱుకఁ జేయు." పాండు. 3, ఆ. ౬౨; 2. కొన్నికూరగాయలు కలిపి వండినకూర. "సీ. ఒకకొన్నికలగల్పు లొకకొన్ని బజ్జులు..." పాండు. ౪, ఆ. ౧౮౪; 3. కలయిక, కూటమి. (చూ. కలగలపు.) విణ. మిశ్రము, మంచిది చెడ్డది కలిసినది. ఉదా:— కలగల్పునూనె, కలగల్పునెయ్యి.

కలగుండు. దే. వి. కలఁగుడు, కలఁత. "మ. కలగుండై నెల వేది..."వసు. ౨, ఆ. ౧౪౨. భా. రా. సుం. ౧౧౫; 2. గండశిల. (వా.)

కలగుండుగొను. దే. అ. క్రి. (కలగుండు+కొను.) కలఁగు, క్షోభపడు. "ఆ. చేది మగధకేకయాది సేన, లెల్ల బెదరఁ దరలఁ దల్లడపడఁ గల, గుండుగొనఁగఁజేసెఁ గుంభజుండు." భార. ద్రో. ౧, ఆ. ౨౯౩. హరి. ఉ. ౯, ఆ. ౨౨౦.

కలగుండుచేయు. దే. స. క్రి. (కలగుండు+చేయు.) కలఁచు, క్షోభింపఁజేయు. "చ...భీకరవసికిటి యొక్కటి పక్కణంబులో, మదమునఁ జొచ్చి

యందుఁ గలనూనవులన్ గలగుండుచేయుచున్." చెన్న. ౨, ఆ. ౭౭.

కలగుండుపడు = కలగుండుపడు. (మా. కలగుఁడుపటుచు.)

కలగుండుపఱచు. దే. స. క్రి. (కలగుండుపడు. ధా. ప్రే.) కలఁచు, కలగుండుచేయు. "వ... గుటగుటార్భటుల భటులం గలగుండుపఱచి..." రా. వి. 3, ఆ. ౬౫.

కలగుండుపడు. ద్వ. అ. క్రి. (కలగుండు+పడు.) 1. కలఁతనందు, క్షోభించు. "ఉ...కలగుండుపడెన్ మది యింక నెట్లొకో." శ్రీరాధా. ౨,ఆ. ౨౧; 2. చెల్లాచెదరగు. "క. నిజసింహానాదమున నృగ్గజములు గుండియలు పగిలి కలగుండుపడన్." భార. భీష్మ. ౨, ఆ. ౨౦౭; 3. గండశిలలు గల దగు. "సీ. కలగుండువడి కుందెఁ గలమహీధరపంక్తు లాపలపా టొందె నఖిలతరులు." రామా. ౫, ఆ. 3౧౨. చంద్రి. 3, ఆ. ౧౫.

కలగుండువెట్టు. దే. స. క్రి. (కలగుండు+పెట్టు.) కలఁచు, కలఁతఁ గలుగఁజేయు. "సీ. సాత్యకియేచి ధృష్టద్యుమ్నుఁడును దాను గురుసైన్యములఁ గలగుండువెట్టు." భార. భీష్మ. 3,ఆ. ౬౪.

కలగూర. దే. వి. (కల+కూర.) 1. పెక్కుదినుసులు కలిసినకూరాకు. (శ. ర.); 2. కూరాకు. (తోఁటకూర, బచ్చలికూర మొ.) "ఉ. కూలికి నూనెలంటి కలకూరలకై పొలమెల్లఁ జుట్టి ప్రాల్మాలక ..." శుక. ౨, ఆ. 3౬3.

కలగూరగంప. దే. వి. (కలగూర+గంప.) 1. రకరకములకూరలు గలిసినగంప; 2. అనేకవిషయములు గల గ్రంథభాగము; 3. విషయవ్యత్యాసము; ఒకశాస్త్రమందలివిషయము మఱియొకశాస్త్రమందలి దని చెప్పుట; శాస్త్ర మొకటిచెప్పుచుండఁ దా నింకొకటి చెప్పుట. "గీ. శాస్త్రసాహిత్యములు మాకె చాల జితమటంచుఁ గలగూరగంప సేయకుము..." బహు. ౧, ఆ. ౧౧౦.

కలగొనఁబాఱు. దే. అ. క్రి. (కలగొనన్+పాఱు. స్వార్థమున.) కలఁతనందు, కలగొను. "చ. కలగొనఁబాఱుచున్ సతులు గన్నుల నశ్రుజలంబు లొల్క...తలలుఁ జేతులుఁ గొప్పు గ మోఁది శోంచు..." భార. శల్య. ౨, ఆ. ౧౯.

కలగొను. దే. అ. క్రి. 1. (కలఁక+కొను.) కలఁతనందు, వ్యాకులపడు. "గీ. అడవిఁ దరమిడి నఱుకంగ నందుఁ గలవి, హంగమంబులు గలగొననఱచు తెఱఁగు, దోఁచె నాతఁడు యోధులఁ దుఱుమఁ గలఁగి, యన్యజనము లాక్రందించు నప్పు డధిప." భార. సౌ. ౨, ఆ. ౬., భార. విరా. ౪, ఆ. ౧౬౭; 2. (కలపు+కొను.) వ్యాపించు. "చ...మహాప్రళయానలంబుపైఁ, గలగొని సప్తవారిధులు గప్పినభంగి..." కు. సం. ౧౦. ఆ. ౭. ఉ. హరి. ౫, ఆ. ౧౦౭; 3. సామీప్యమందు. "క...పుణ్యాఁ డురుతరజన్మంబులఁ బొందక హరిపదమునఁ, గలగొన బహుకల్పశతము గాఁపుర ముండున్." పద్మ. ౧౦, ఆ. ౫౦; 4. బయటకు వచ్చు, వెలువడు. "ఆ. కడుపులోన నుండి కలగొనఁ బాఱెడు, విబుధవైరి గురుఁడు వెడలకుండు, నట్లు..." భార. శాం. ౫, ఆ. ౪౭౨. స. క్రి. కలియు. "సీ. ఎలమావి లతలపైఁ గలగొనఁ దారుచుఁ జెలఁగుచిల్కలకల్కిపలుకులకును." మార్క. ౫, ఆ. ౭., నిరం. ౪, ఆ. 3౧.

కలఘోషము. సం. వి. అ. పుం. 1. కోయిల; 2. అవ్యక్తమధురధ్వని. విశే. (అ. ఆ. అ.) అవ్యక్తమధురధ్వని గలది.

కలజడముడి. ద్వ. వి. (కలపు+జడ+ముడి.) జటాజూటము. "గీ. కలజడముడికలాఁడు ముక్కంటి యనఁగ, శంకరునినామధేయము ల్ వేంకటేశ." వేంక. దేవ. ౫.

కలజొవ్వి = కలుజువ్వి. "సీ. పతిమేన మకరికల్ వ్రాయనిపేళ్లను వేళ్లటే కలజువ్విపేళ్లు గాక." అహ. 3, ఆ. ౨౯.

కలధౌతము. సం. వి. అ. న. 1. వెండి; 2. బంగారము; 3. అవ్యక్తమధురధ్వని.

కలధ్వని. సం. వి. ఇ. పుం. 1. నెమిలి; 2. పావురము; 3. కోయిల; 4. అవ్యక్తమధురధ్వని. విశే. (ఇ.) అవ్యక్తమధురధ్వని కలది.

కలన. సం. వి. ఆ. స్త్రీ. 1. గ్రహించుట; 2. స్వీకరించుట; 3. ధరించుట; 4. విప్పుట; 5. జ్ఞానము; 6. చేత.

కలనము. సం. వి. అ. పుం. ప్రబ్బలిశ్. న. 1. గుర్తు; 2. శోషము; 3. పట్టుకొనుట; 4. గ్రాసము; 5. జ్ఞానము.

కలనాదము. సం. వి. అ. పుం. 1. రాజహంస; 2. అవ్యక్తమధురధ్వని. విణ. (అ. ఆ. అ.) అవ్యక్త మధురధ్వని కలది.

కలనితబిసి. ద్వ. వి. (కలను+తబిసి.) కలహప్రియ ముని, నారదుడు. ఆం. భా. ప్ర. ౪౨.

కలనితబిసితల్లి. ద్వ. వి. (కలనితబిసి+తల్లి.) సరస్వతి. ఆం. భా. ప్ర. ౪౨.

కలనిసక్కు. ద్వ. వి. ఆశుభకాంక్షి. "గీ. కలని సక్కునయధికారి గలన్పపతికి, నేఁడు దీవులు గొన్న సమృద్ధిలేమ." ఆము. ౪, ఆ. ౨౩౭.

కలనిపని. ద్వ. వి. (కలను+పని) యుద్ధకార్యము, పోరాటము. "ఆ. కలనిపనికి నైనఁ గల్యాణమున నైన, సమత లేక యున్నఁ జక్కఁబడదు." పార్వ. ౨, ఆ. ౧౩౭.

కలను. వై. వి. ఔ. (సం. ఖలమ్; ఖలః. బ. కలఁకులు. దీని'ను'వర్ణమునకు ఏకవచనమందు వికల్పముగాను బహువచనమందు నిత్యముగను బిందుపూర్వక'కు'వర్ణము ఆదేశముగా వచ్చును.) 1. స్థానము, చోటు. "క...పంటకలను పొలి కల నిది,గంట నిధానంబు గంటకాదే..." భార. భీష్మ. ౧, ఆ. ౯౯. "క. దురమనకుఁ మధురయుం బుష్కరముః బ్రయాగంబుఁ దగిన కలఁకులు..." ఉ. హరి. ౪, ఆ. ౨౦౩; 2. కళ్లము. "సీ. కలనధాన్యములు గోవులపాడుగలఁ బాలు...,హరించు; నతిసూక్ష్మరూపిణియై స్వయంపాకిక..." మార్క. ౪, ఆ. ౧౧౨; విజ్ఞా. ప్రా. ౧౦౪; 3. పోరు. యుద్ధము. ఆం. భా. ద్వి. ౨౨౨., రామా. ౮, ఆ. ౫౪.

కలనుచెప్పు. ద్వ.అ. క్రి. (కలను+చెప్పు.) యుద్ధప్రకటనచేయు. "వ. కలనుచెప్పి మొనలఁ దీర్చి కదిసిన సమయంబున..." పళ. ౨, ఆ. ౧౦; ౧౨,ఆ.౫౩.

కలనుదిండితపసి. ద్వ. వి. (కలను+తెండి+తపసి.) కలహాశనముని, నారదుడు. "గీ...ముక్ కలను దిండి, తపసిఁ గని కల్గుకానుపుతపసి కలికె." అచ్చ. బాల. ౨౭.

కలప. దే. వి. 1. నాగలి. ఆం. భా. ద్వి. ౨౩౧; 2. ఇల్లు కట్టుకొనుట మొదలగు పనులకుపయోగించు దారుసామగ్రి. "సీ. కదిసి యే నే నని కడఁగి మోవఁగ యూగ నిలయంబుఁ గలపయుఁ గలశములును...గీ.... ఒక్కట నడపించె మనుజనాథ." భార. అశ్వ. ౩, ఆ. ౧౯౬.

కలపకట్టియ. వై. వి. (కలము+కట్టియ.) వ్రాసెడు కలము, కలముపుల్ల. (శ. ర.)

కలపతాలుపు. దే. వి. (కలప+తాలుపు.) 1. హలధరుడు, బలరాముడు; 2. వ్యవసాయి, కాఁపు. సాం. ని. మాన. ౩.

కలపదారి. దే. వి. (కలప+దారి.) హలాయుధుడు, బలరాముడు. సాం. ని. దేవ. ౧౫.

కలపన. వై. వి. (సం. కల్పనా) 1. లేనిది కల్పించుట. (చూ. కలపనగంప.); 2. ఉపాయము, యుక్తి; ఏర్పాటు. "క. కలసెడఁ బతి నగఁ డిన్నట, మెలఁగెట మాతండ్రి విన్న మేలగునే స్త్రీవుల కీన నురియఁ ద్రిప్పిన (ద్రిప్పఁడే?), కలపన పిండైనఁ జెలిమికై తెలు నగరే." ఉ. హరి. ౫, ఆ. ౧౬౩. [తాళపత్త్రప్రతిపా. 'కలపనఁబిండి' దే. వి. (కలపదము+పిండి.) శోభను అని శ. ర., సూ. ని. పా., కలపన = యుక్తి; ఏర్పాటు, పిండైన = కాయైన అనఁగా విఫలమైన అని భావము. 'కాయా? పండా?' అనుట వాడుక.]

కలపనగంప. ద్వ. వి. (కలపన+గంప.)—గంపల కొలఁది లేనిమాటలు కల్పించువాడు. (కలహశీలుఁ డని శ. ర., సూ. ని.) "చ. కలపనగంప యాతపసి కాలును నోరును బాదు గాన కైవ్వలనఁ బరిభ్రమించుచు నపాయపుఁ బ్రేలరిమాటలాడి ధీరులమదికైన నూరక విరోధ మొనర్చుచు నుండు..." హరి. పూ. ౫, ఆ. ౯౨.

కలపము. దే. వి. 1. యక్షకర్దమము, ఒకానొక లేపనద్రవ్యము. "సీ. కలపంబు లభినవగంధంబు లుగఁ గూర్చి తనువున నలఁదుడు ననువు గాఁగ." భార. విరా. ౧, ఆ. ౧౦౫. ఆం. భా. ద్వి. ౧౬౩; 2. మిశ్రము, కలుపుట. "సీ. సచ్చందనముకంటెఁ జందనంబునఁ గలపంబు చేసినకళ్లు

రంబుకంటె." పిన. శకుం. ౪, ఆ. ౧౭౬. య. ౪, ఆ. ౯౫.

కలపు. దే. స. క్రి. కలుపు, చేయు. "సీ...ఖండ శర్కరలతోఁ గలిపి కలపి." నైష. ౬, ఆ. ౧౨౦. "గీ...అహితులఁ గలపికొనుట, ధర్మ పని రిది నయవిరుద్ధంబు గాదె." భార. ఆది. ౭, ఆ, ౩౭. వి. కలయిక, కూటమి. "ఆ... ఇరువురమనముల, కలపు పూర్వసుకృతఫలము సుమ్ము." మార్క., ౯, ఆ. ౭౨.

కలబంద. దే. వి. ఘృతకుమారి, ఒకానొకమందు మొక్క. "సీ...కలబంద గుప్పగుత్తి." హంస. ౪, ఆ. ౧౦. ఆం. భా. ద్వి. ౬౯.

కలభము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుగున్న. (అమరము.); 2. ఉమ్మెత్త; 3. పోతము, శిశువు. కు. సం. ౯, ఆ. ౧౨౬.

కలమము. సం. వి. అ. పుం. 1. జ్యేష్ఠమున విత్తఁబడి మార్గశీర్షపుష్యమాసములఁ గోయఁబడు వరిపైరు; 2. వ్రాసెడుకలము; 3. అంకురము.

కలమరి. దే. విణ. (కలము+అరి.) ఓడ యెక్కి నది దాఁటువాఁడు. "గీ. రథికునకుఁ గలమరికి సారథియుఁ గర్ణ, ధారుఁడును బోలె నాత్మకుఁ దాను సుపథ, వర్తనైకవిధాయి గావలయుం యోగ, ధారణా నిశ్చయుం డగుధీరుఁ డధిప." భార. శాం. ౯. ఆ. ౯౭౭.

కలమరించు. దే. స. క్రి. ఆఱగించుకొన, లేకపోవు, జీర్ణము చేసికొన లేకపోవు. "గీ. గగనమాన వేగంబునఁ గలమరించి, కడుపు నిండఁగఁ గ్రోలిన కమలమనువుఁ, గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు, భానుబింబంబు రక్తాతపంబుఁగానె." శివరా. ౩, ఆ. ౯౨.

కలము. ఉభ. యం. దే. వి. 1. ఓడ. "సీ. కలముపైఁ గీలించి గాలి కెత్తినచాఁపవోలె..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౦౬. కాశీ. ౩, ఆ. ౧౨౩. ఆం. భా. ప్ర. ౧౪౭; 2. (త. కలమ్.) పండ్రెండుతూములపరిమాణము. "గీ...మూన్నూటయిరువదికలముల, హేమతండులములు..." పరమ. ౩, ఆ. ౧౯౬. వై. వి. (సం. కలమః. హిం. కలమ్.) వ్రాఁత కుపయోగించుసాధనము. ఆం. భా. ద్వి. ౫౭౯. సం. వి. అ. న. రేతస్సు. పుం. 1. రేఁగుచెట్టు; 2. మద్దిచెట్టు; విణ. (అ. ఆ. అ.) 1. అఱుగనిది; 2. అవ్యక్తమధుర మైనది. (ధ్వని మొ.)

కలముఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

కలయ. దే. అవ్య. ద్రు. 1. అంతటను. "వ... కొలువుఁ గలయం గనుంగొని..." భార. ఉద్యో. ౪. ఆ. ౨౩౬. భార. ద్రో. ౨. ఆ. ౨౨౬; 2. మిక్కిలి. "ద్వి. కనుమూసి తలవంచి కలయ లజ్జించి." బస. ౩, ఆ. ౧౧౪౭. పం. 3. అందఱును. "గీ. బాలుఁ డొక్కండు..., కలయ నూఁశార్చెఁ దనతొక్కుఁబలుకు లొప్పు." భార. ఆది. ౬. ఆ. ౨౭౦; 4. బాగుగా. "వ. నారదుఁ డమ్మహనీయద్విజులఁ గలయం గనుంగొని..." భార. శాం. ౧, ఆ. ౨; 5. మనస్ఫూర్తిగా. (చూ. కలయఁగ).

కలయంపి. దే. వి. 1. కలాఁపి, కస్తూరి మున్నగునవి కలిపి చల్లెడునీరు. "క. కలపడగ లెత్తి కస్తురి, కలయంపులు చల్లి..." య. ౪, ఆ. ౧౯౨. భీమ. ౩, ఆ. ౬౨; 2. పేడనీరు; స్థలశుద్ధికై గోమయాదులు కలిపి చల్లెడునీరు. "సీ. వరుస నేనుంగులు గురిసినదానధారావళి దగుకలయంపి గాఁగ." భార. విరా. ౩, ఆ. ౭౪; 3. గోముఖము, అలుకుట. "సీ. కలపడంబు కలాఁపి కలయంపి చానపి యనగోముఖాఖ్యలై యలరుచుండు." ఆం. భా. ద్వి. ౨౩.

కలయఁగ = కలయ. 1. (మనసు కలయునట్లు, మనస్ఫూర్తిగా.) "చ. కలయఁగఁ బల్కరించి రుపకారులు నై రని నమ్మియుండఁగా, పలవదు బుద్ధిమంతులు సవప్రియు లైనధరాధినాథులన్." భార. ఆది. ౪, ఆ. ౭౦; 2. బాగుగా. "చ... కంటిని గలయంగ నామనము..." హ. న. ౨, ఆ. ౯౪.

కలయఁబడు. ద్వ. అ. క్రి. (కలయన్+పడు-స్వార్థమున.) 1. కలయు, ఏకమగు. "గీ. మధురగాననినాదముల్ మయిలక్రోష్ఠు, వెలయఁ బూరించు నాదముల్ గలయఁబడఁగ." భా. రా. బాల. ౬౭౭; 2. ఒరసికొను, రాచుకొను. "గీ. కలయఁబడి మూఁపుమూఁపునఁ దలఁగఁ ద్రోయ, రాని సందడి నడచుశారవ్రజంబు." జై. ౩, ఆ.

ఉ౨; 3. (ప్రేమచే) మేనుమేను దాఁకించు. "క. కరమున మెల్లన నిమురుచుఁ, గర మనురాగమున మెఱసి కలయంబడుచున్, గరి హరికతమున బ్రదుకుచుఁ, గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్." భాగ. ల. స్క౦. ౧౨౦; 4. కలఁబడు, కవియు. "క. కలయఁబడి పోరఁదొడఁగిరి..." భా. రా. యు. ౭౪౭.

కలయిక. దే. వి. (కలయు ధా.) 1. కూడిక, సంబంధము. "క. అడవుల నవయు తపస్వికిఁ, గడుసౌఖ్యమె కోరుసతికిఁ గలయిక తగునే." పాండు. ౫, ఆ. ౧౮౩; 2. సంగమము, రతి. "గీ... అమ్మోహనాంగి, జాతివారాంబుజేక్షణల్ సైత మింత, సేర రనిపించెఁ గలయికయారజములు." శుక. ౪, ఆ. ౨౬.

కలయికము. దే. వి. రతిబంధము. "క. కలయికము లెఱిఁగి విటులన్, గలయుంచు ధనమాస మిగులఁ గలుగక ఘనులన్, ఖలులన్ సరిగాఁ జూడక, మెలఁగెడు వారాంగనలను మెచ్చఁగవలయున్." మల్హా. ౨, ఆ. ౧౭౦.

కలయు. దే. అ. క్రి. 1. ఏకమగు. "క. ఇత్తెఱఁగున నయ్యిరువుర, చిత్తము గతి నొడలు గలసి సిద్ధాంత పరాయత్తు లగుమునులయెఱుకకు, విత్తై చెలువారె జమిలివేల్పని తెలుపన్." ఉ. హరి. ౨, ఆ. ౧౭౮. భార. శాం. ౨, ఆ. ౨౪౩; 2. (రతియందు) ఏకమగు. "వ... కలికితనంబునన్ గలసి మెలసి రతాంతంబునం బరిశ్రాంతి యడంగ సంగణంబుల నిలిచి..." స్వా. 3, ఆ. ౨౮. (సాధారణముగా 'కలసిమెలసి' యని ప్రయోగములఁ గానవగును.) స. క్రి. 1. చేరు, కూడు. "సీ. తల్లిదండ్రులఁ జంపి ధన మెత్తుకొనిపోయి చెలఁగి తొత్తులపొత్తు గలయువారు." దశా. ౧౦, ఆ. ౧౦౫. ఉ. హరి. 3, ఆ. ౧౦౮; 2. రమించు, రతిచేయు. "గీ. వలపు గలిగిన నిండుజవ్వనిని వనిని, గలయుకంటెను సౌఖ్యంబు గలదె వెఱ." దశా. 3, ఆ. ౨౪.

కలరవము. సం. వి. అ. పుం. 1. కోయిల; 2. పావురము; 3. అవ్యక్తమధురధ్వని.

కలరూపు. ద్వి. వి. (కల+రూపు.) యాథార్థ్యము, సత్యము; భూతార్థమునఁ గలస్థితి. "చ...దానిది కలరూ పెఱుంగ నవనీపతి యిత్తనుఁ డయ్యె నాత్మలోన్." భార. ఆది. ౪, ఆ. ౩౦.

కలలము. సం. వి. అ. పుం. న. 1. గర్భపిండము; గర్భాధానము పిదప ఏకరాత్రకాలపాకము నొందిన గర్భభూతరేతోవికారము; 2. మావి, గర్భవేష్టనచర్మము; 3. రాగిచెంబు; 4. లోహకలశము. న. 1. ఎముక; 2. తోలుసంచి. (కే. ని.)

కలవ. దే. వి. 1. కలయుట. (శ. ర.); 2. కలసిన యిసుకయు సున్నమును. (శ. ర.). విణ. కలసినది. (శ. ర.)

కలవంటకము. దే. వి. (కలవు+వంటకము.) మిశ్రాన్నము, పెక్కువస్తువులు కలిపి చేసినయన్నము. (పులిహోరమొ.) ఆం. భా. ద్వి. ౨౫౭. "గీ. పైఁడిచూలాలివేవిళ్ల వాయఁ దోఁట, కలిమిచెలి పెట్టుకలవంటకంబు లనఁగ." య. ౪, ఆ. ౯.

కలవడము. దే. వి. కలయంపి, గోముఖము. ఆం. భా. ద్వి. ౨౩.

కలవడు. ద్వి. అ. క్రి. (కలవు+పడు.) కలయు, ఏకమగు. "క. కలవడిమాటలఁ బ్రియముల, నలయింపక యావులందు నాదరణమునన్." రుక్మా. 3, ఆ. ౬౪.

కలవరపడు. ద్వి. అ. క్రి. (కలవరము+పడు.) కలఁతపడు. "ద్వి. కలవరపడి పొర్లి కన్నులు దెఱచి." ద్వి. సా. ౨. భా. ౮౩, పు.

కలవరపాటు. దే. వి. (కలవరపడు ధా.) 1. కలఁత; 2. చలనము. "క. జలచరములు తలమూపక, కలవరపాటునఁ జెలంగఁ గన్నులసమతన్." విప్ర. ౨, ఆ. ౪౪.

కలవరపోవు. దే. అ. క్రి. (కలవరము+పోవు.) కలవరపడు. (శ. ర.)

కలవరము. దే. వి. (త. కలవరం.) 1. కలఁత. (శ. ర.) 2. చింత. (శ. ర.); 3. కలవరింత, స్వప్నభాషణము. ఆం. భా. ప్ర. ౧౪౨.

కలవరించు. దే. అ. క్రి. 1. కలఁతనందు, క్షోభపడు. "గీ. ఒదిఁగి యలమందసములోన నున్నరాజ, కన్యకామణి మేల్కాంచి కలవరించి, బహువిధంబుల విలపించె..." శుక. ౧, ఆ. ౪౭౩. వేం. పంచ. 3, ఆ. ౨౩౪. 2. (నిద్రామోహజ్వరాదులచే) మైమఱచి పలుకు. "చ...నిద్రలోఁ గలవరింప

..."నైష. ౫, ఆ. ౧౩౩. "గీ. కలవరించియుఁ గృష్ణాఖ్య తెలిసియున్న,యపుడుఁ గృష్ణాఖ్య..." హరి. పూ. ౮, ఆ. ౨౦. "సీ. చెలరేఁగి రాయంచ చేరువ మెలఁగుచోఁ గలికి నెన్నడలంచుఁ గల వరించు."అచ్చ. అర. ౯౫. (శ. ర. పా. 'కలువరించు' ముద్రి. పా.) స. క్రి. (నిద్రలో) పేర్కొను, పలుకరించు. "ఆ...రేయి నా ప్రక్కలోనుండి, కలవరింపలేదె చెలుల నెల్ల." శ్రీరాధా. ౧, ఆ. ౪౧.

కలవరింత. దే. వి. (కలవరించు. ధా.) 1. (నిద్రామోహాజ్వరాదులచే) మైమఱచి పలుకుట. "గీ. పలుకు నిద్దురలోఁ బెండ్లికలవరింత." శుక. ౨. ఆ. ౧౬౧. "గీ. తనరు పులకలు కలవరింతలును మాట, వీడుపాటులు చెలులకు వెఱఁ గొనర్ప." కళా. ౬, ఆ. ౨౧౪; 2. అట్లుపలికినపలుకు. ఆం. భా. ప్ర. ౧౪౨., కళా. ౫, ఆ. ౫౩.

కలవరింపు. దే. వి. (కలవరించు. ధా.) స్వప్నభాషణము. ఆం. భా. ప్ర. ౧౪౨.

కలవాఁడు. దే.విణ. (కల+వాఁడు.) 1. ఆప్తుఁడు."ఉ. శాంతనవుండు సర్వకురుసంతతికిన్ గలవాఁడు గాఁడె..."భార. ఉద్యో. ౨, ఆ. ౧౬౫; 2. ధనికుఁడు. "సీ. ఆరకూటకలాప మర్హామే కల వానికి..."నైష. ౪, ఆ. ౬౮; 3. కుబేరుఁడు. (సముద్రము) "సీ...కలవాని చెలికాని కలరుఁ దోఁట." చం. రా. ౨, ఆ. ౩; 4. శక్తుఁడు. "క. బలవంతులు దైతేయులు, బలభుస్మరముఖుల తోడ బద్ధద్వేషుల్, కలహములు కాక మానవు, కలవాఁడవు నీవు విబుధకార్యంబునకున్." కకు. ౨, ఆ. ౩౧. భార. ఉద్యో. ౩, ఆ. ౨౦౧.

కలవింకము. సం. వి. అ. పుం. 1. పిచ్చుక; 2. కళంకము; 3. కూఁకటిమూఁగ యనుపక్షి; 4. కళింగచె.

కలశ. సం. = కలశము.

కలశము. సం. వి. అ. పుం. న. ఘటము, కుండ; తరికుండ.

కలశాబ్ధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము. (ఇట్లే: కలశపాథోరాశి, కలశోదధి మొ.)

కలశి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కుండ; 2. పెరుఁగు చిలుకుకుండ; 3. కోలపొన్నచె.

కలస. సం. = కలశ.

కలసము. సం. = కలశము.

కలసాబ్ధి. సం. = కలశాబ్ధి.

కలసి. సం. = కలశి.

కలహంస. సం. = కలహంసము.

కలహంసము. సం. వి. అ. పుం. రాజహంస.

కలహంసుఁడు. సం. వి. అ. పుం. రాజశ్రేష్ఠుఁడు.

కలహము. సం. వి. అ. పుం. 1. జగడము; 2. యుద్ధము; 3. కత్తియొఱ.

కలహాంతరిత. సం. వి. ఆ. స్త్రీ. ముందు కోపముచే ప్రియుని విడనాడి వెనుక పరితాపము నందు నాయిక.

కలహారము. వై. వి. (సం. కహ్లార) సౌగంధికము. కు. సం. ౯, ఆ. ౭౨.

కలహాశనుఁడు. సం. వి. అ. పుం. కలసుడిండి, నారదుఁడు.

కలహించు. సం. అ. క్రి. జగడించు, జగడమాడు. "చ. ఎడపనికూర్మితోడ రమియించి వృథా కలహించి పాసిపో, యెడుతఱిఁ గామినీకరగృహీత పటాంచలుఁ డైనభర్తకై,వడి..."వరాహ. ౪. ఆ. ౧౩౯.

కలాఁపి. దే. వి. (కలఁత+ఆఁపు. సంధిని వర్ణలోప వర్ణవికారములు అని శ. ర.) కలయంపి. ఆం. భా. ద్వి. ౨౩.

కలాదుఁడు. సం. = కళాదుఁడు.

కలాపకము. సం. వి. అ. పుం. 1. = కలాపము; 2. ఏనుఁగుమెడత్రాడు. న. 1. సొంటి; 2. ఏక వాక్యముగా నున్న నాలుగుశ్లోకములు.

కలాపన. దే. వి. కలఁత. (శ. ర.)

కలాపము. ఉభ. దే. వి. కలఁత. (శ. ర.) సం. వి. అ. పుం. 1. నెమలిపురి; 2. గుంపు; 3. నగ; 4. అమ్ములపొది; 5. మొలనూలు, కాంచి; 6. వ్యాకరణభేదము.

కలాపి. సం. వి. న్. పుం. 1. నెమలి; 2. నెమలి పురి విచ్చుకాలము; 3. ఈశ్వరుఁడు;4. జువ్విచె. విణ. (న్. నీ. న్.) కలాపము గలది.

కలాపుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. విణ. (అ. ఆ. అ.) వైదగ్ధ్యము కలవాఁడు.

కలాయము. సం. వి. అ. పుం. గుండ్రనిసెనగలు, బటానీలు.

కలాయి. హిం. వి. చిలు మూర కుండఁగ పాత్రలకు తగరముతో పూసినపూఁత.

కలాలి. హిం. వి. (ఉ. కలాల్) కల్లుసారాయము లమ్మువాఁడు.

కలావంతుఁడు. సం. వి. త్. పుం. చంద్రుఁడు. విణ. (త్. వత్. త్.) 1. కళలు గలవాఁడు; 2. కళావేది; 3. శక్తుఁడు, సమర్థుఁడు. "క. నీవింత యలుగ నేటికి, నావంతయుఁ బౌరజనమనః ఖేదము నొక్కాక్రాంత ద్రిక్కు కుండఁ గలావంతులు మత్పతులు గలరు పగ దీర్పన్." భార. విరా. ౨, ఆ. ౧౬౧.

కలావతి. సం. = కళావతి.

కలాసి. హిం. వి. 1. ఓడమీఁద పనిచేయువాఁడు; 2. పడవలాగువాఁడు. (కళాసు అని వాడుక.)

కలి. ఉభ. దే. వి. ధాన్యామ్లము, పులియఁబెట్టిన కడుగు. ఆం. భా. ద్వి. ౨౫౦. "సీ. కలి వోసి నాన్చినగ్రచ్చకాయలభంగి..." కాశీ. 3, ఆ. ౧౩౮. సా:—కలి వోసిన వెనుక నుట్లు కనుఁ గొనుట = కడుగు పోసినను ఇంకను బెరుఁగు పోయుదు రని యుట్లవంకఁ జూచుట. (ఫలింపని కార్యముపై గంపెడాస పెట్టుకొనుట యని భావము.) రుక్మా. ४. ఆ. ౭౫. సా. ౨, ఆ. ౧౨౨. ప్ర. కొన్ని ధాతువులపై భావార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:—కనుకలి, వినుకలి

మొ. సం. వి. ఇ. పుం. 1. కలియుగము; 2. జగడము; 3. యుద్ధము; 4. విభీతకవృ; 5. కలిపురుషుఁడు; 6. శూరుఁడు. స్త్రీ. కళిక, మొగ్గ.

కలింగలు. దే. వి. (త. కలిఙ్గల్.) అలుఁగు, కాలువ చెఱువు మున్నగువానినుండి నీరుపోవుటకుఁ గట్టిన తూములు. (శ. ర.)

కలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మొగ్గ; 2. కళ; 3. వీణామూలము.

కలికము. దే. వి. శైత్యనివారణార్థము కంటికి వేయు మందు. (శ. ర.) విణ. స్వల్పము. "క. కలికపు మాటసి యని నీ,తలఁపున నిపు డల్ల నేలతాలుపు మిన్నన్, జులుకఁగఁ జూచెదవు..." అచ్చ. యు. ౨౧.

కలికి. దే. వి. 1. కోమలి; స్త్రీ. 2. కొంగతలయీఁక. "గీ...కలికి యనఁగ, గొంగతలయీఁక దంటయుఁ గోమలియును. ఆం. భా. తృ. ౬౨. విణ. 1. మనోజ్ఞము. "సీ...కరటిదానపునకుఁ గలికి మాపు." హర. ౬, ఆ. ౧౦3 "సీ. దనుజ శుద్ధాంతకాంతాకటాక్షములతోఁ గలికికాటుకలకుఁ గానివాని." ఉ. హరి. 3, ఆ. ౧४౨; 2. దంట, నేర్పరి. ఆం. భా. తృ. ౬౨.

కలికితనము. దే. వి. (కలికి+తనము.) 1. స్త్రీత్వము. "గీ. గంధవహునకు సిగ్గు జలంధరునకుఁ, గలికితనముఁ బావకునకుఁ గొను బలికి, దలఁపు నటియించుచును..." హర. ౬, ఆ. ౧౦3; 2. నేర్పు. "గీ...అమ్మెయికలికితనము, నట్టివెన్నును సైరంధ్రియంద కాక, కలవె యొరులకు..." భార. విరా, ౨, ఆ. ౬౭. శుక. ౧, ఆ. ४४౧; 3. సౌందర్యము. "గీ. కలికితన మేల యీకల్కిఁ గరఁపకున్న, దిట్టతన మేల యీదిట్టఁ దేల్పకున్న." శ్రీరాధా. ४, ఆ. ౧౯౭.

కలికితురాయి. దే. వి. (కలికి+తురాయి) కొంగతల యీఁకలతోఁ జేసినశిరోభూషావిశేషము. "సీ. కనకపువ్వుముల నొప్పినకుసుంబాపాగ రాణింపఁ గలికితురాయి మెఱయ." వేం. మా.౧, ఆ.౧3४.

కలికిపిట్ట. దే. వి. (కలికి+పిట్ట.) పక్షివిశేషము. (బ్రా.)

కలిగించు. దే. స. క్రి. 1. నిలుపు. "చ...శంతనుని యన్వయముం గలిగించి తీవ..." భార. అశ్వ. 3, ఆ. ౨౦౧. భార. ఉద్యో. ౧, ఆ. 3౭3. 2. ప్రకటించు "సీ...వేదములా నాలుగు గలిగించె నపుడు..." భార. శాం. ౬, ఆ. ४౭౯. 3. సృజించు. "ద్వి. వివిధభంగులవిందు వేడ్కఁ గావింప,సలమునఁ గాన నీవు వలయువస్తువులు, కలిగింపు మనవృషుఁ గామధేనువును." రం. రా. బాల. ౫3. పు.

కలిగొట్టు. దే. వి. పాటలవృ. ఆం. భా. ద్వి. ४౮. (నిదాఘము) "సీ. కలిగొట్టు చెట్టుగుంపుల కంటి చుట్టంబు..." చంద్రా. ౨, ఆ. ౧౬.

కలితనము. వై. వి. (సం. కలిత్వమ్. క. కలితన.) 1. శూరత్వము. "సీ. త్రైలోక్యకంటకు దశముఖు బంధుము యుక్తంబుగాఁ జంపిన కలితనమ్ము." భార. ద్రో. ౨, ఆ. ౨౦౧; 2. సామర్థ్యము. "ఆ. అరులగుణము లైన నగ్గింతు రెప్పుడుఁ, గలయఁ బెరసినపుడు కలితనంబు, మెఱయుదురు మహా

త్ములు..."భార. విరా. ౪, ఆ. ౨౨౩; 3. చాతుర్యము. (మేనక) "గీ. చెలులుఁ దాను విలాసవిచేష్టితముల, గాధిజుని మ్రోలఁ గ్రీడించెఁ గలితనమున." కృ. శకుం. ౨, ఆ. ౧౧౫.

కలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలియఁబడినది; 2 పొందఁబడినది; 3. కూడియున్నది; 4. స్వీకరింపఁబడినది; 5. లెక్కింపఁబడినది; 6. కట్టఁబడినది; 7. ఆలోచింపఁబడినది; 8. భేదింపఁబడినది

కలితీ. హిం. విణ. స్వచ్ఛము కానిది, మిశ్రితము. వా:—కలితీనెయ్యి.

కలిపొత్తి. దే. వి. (కలికి+పొత్తి) గాయములు మొ. కాఁచుటకు నేర్పుతో మడిచిన మెత్తనిగుడ్డపొత్తి. "వ...దర్పకశస్త్రంబుల గాఁడిపోటు నవఘాభావంపు బల్గాయమ్ముదుకఁ గాఁపంగఁ జెలుల్ ఘటించుకలిపొత్తుల్ వోలె..."చంద్రా. ౪. ఆ. ౧౭౬.

కలిమము. దే. వి. మాంసము. "వ...తిత్తొలిచి గాలి గొనవైచిన కుక్క కలిమంబుఁ గనుంగొని..." భార. శాం. 3, ఆ. ౨౦౫. (శ. ర. ప్రాఁత ప్రతి. 'కడిమము' ముద్రి. పా.)

కలిమారకము. సం. వి. అ. పుం. పూతికము, నెమలియడుగు.

కలిమి. దే. వి. (కలుగు. ధా.) కలుగుట. "క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీడంతకంటె నెగ్గు తదీయో, పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడిపొందుకలిమి ఘటునకున్."భార. విరా. ౧, ఆ. ౧౩౧. మార్క. 3, ఆ. 3౯౨; 2. సంపద. "క. కలిమియ చుట్టలఁ జేర్చుం, గలిమియ చెలులను ఘటించు..."భార. శాం. ౧, ఆ. ౫౧, నైష. 3, ఆ. ౧3.

కలిమికొండ. దే. వి. (కలిమి+కొండ.) సిరిగుబ్బలి, శ్రీశైలము. "గీ. కలిమికొండకు నేతెంచి నిలిచితనుచు, వింటి ముక్కంటి నినుఁ గనుఁగొంటి మంటి." ద్వా. ౧, ఆ. ౧౫౨.

కలిమిచెలి. దే. వి. (కలిమి+చెలి.) లక్ష్మి. య. ౪, ఆ. ౯. (ఇట్లే కలిమిగుబ్బలి, కలిమి తొయ్యలి మొ.)

కలిమిదండుగ. ద్వ. వి. (కలిమి+దండుగ) నేరము లేకున్నను ధనవంతునియొద్ద రాజు పుచ్చుకొనెడి ధనము. (Property tax), ఆస్తిపై పన్ను. "సీ. తెల్లబట్టలఁ గట్టి తిరుగులాడెడివారి బిగియించి కలిమిదండుగలు పెట్టి."పార్వ. ౨, ఆ. ౯౪.

కలిమివెలఁది = కలిమిచెలి. వేంక. దేవ. ౭.

కలిమివెలఁదికోడలు. దే. వి. (కలిమి+వెలఁది+కోడలు) సరస్వతి. వేంక. దేవ. ౭.

కలియఁబడు = కలఁబడు. (వా.)

కలియఁబెట్టు. దే. స. క్రి. (కలియన్+పెట్టు) కలియునట్లు కలుపు. వా:—అన్నము కలియఁబెట్టుము.

కలియు. దే. అ. క్రి. కలయు, చేరు; ఏకమగు. "సీ. ఈరాజబింబాస్యకారణంబుగ నద్రికులము దేవకులంబుఁ గలియుఁగాక."హర. ౪, ఆ. ౬౪. ఆము. ౪, ఆ. ౮. స. క్రి. రమించు, సంగమించు. "క. ఎక్కువకులం బకనికిని. నిక్కపుటాలైనదాని నీచకులుం డీ,సెక్కఁగఁ బలిమిం గలిసినఁ, దక్కని చంపుటయ రాజధర్మం బెందున్." విజ్ఞా. ప్రా. ౧౦౭.

కలియుగమహిమలు. సం. వి. న్. పుం. బ. 1. కలియుగచిత్రములు; 2. ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

కలిలము. సం. వి. అ. న. 1. కాలుష్యము; 2. గుంపు; 3. దేహము; 4. పాపము; 5. గాంభీర్యము; 6. జీవము గల శుక్రశోణితములముద్ద (కే. ని.) విణ. (అ. ఆ. అ.) 1. కలిసినది; 2. చొరరానిది; 3. ఎఱుఁగరానిది.

కలివడగ. దే.వి. (కలిమి+పడగ.) ఉత్సవసమయములయం దెత్తెడుజెండా; జెండా. "క. కలధౌత హర్మ్యములపైఁ, గలిపడగలు గలయ నెగసి క్రాలె..."కు. సం. ౮, ఆ. ౪3.

కలివి = కలివె. "వ...నేరేళ్లు మారేళ్లు గలువుల బలువుల..." పిన. శకుం. ౨, ఆ. ౧౪.

కలివిరి. దే. వి. ఒకానొకవృక్షము. "సీ. కలివిరి గుండ్రయు గచ్చ..."హంస. 3, ఆ. ౯.

కలివె. దే. వి. కరమర్దము, ఓంకి. "సీ...కలివె పండులు..."కాశీ. 3, ఆ. ౬౯. పండితా. పర్వ. 3౫౦. పు.

కలు. యు. దే. వి. 1. బండిచక్రము. "సీ. కల్పించి యాబాడికలు దొల్చె సత్యలోకంబుననుండి యాకమ్మలగర్భుఁడు..."కాశీ. ౧, ఆ, ౭౭; 2.

"సీ. ఇందుబింబముఁ జూచి చెందుప్పుగలుసావి యఱులెత్తి నాకంగ నాసపడిన." కాశీ. 3, ఆ. ౧౨. పరమ. ౫, ఆ. ౯౬. వై. వి. (సం. కల్యా. ప్రా. కల్లా. క. కళ్.) మద్యము, కల్లు. "క. పలువురకుఁ బుట్టి నిచ్చలు, గలు ద్రావుచుఁ బెరిఁగి యెట్లు గఱతురు శీలం,బులు..." భార. కర్ణ. ౨, ఆ. ౪౮. రామా. ౨, ఆ. ౯౭.

కలుఁగానుగు. దే. వి. (కలు+కానుగు.) త్రాయంతి ఘీ. (శ. ర.)

కలుఁగు. దే. వి. 1. రంధ్రము. "గీ...వల్మీకజంబు, నెలుకకలుఁగును గానిమ స్నెవకి పట్టి." కాశీ. ౫. ఆ. ౧౯3; 2. గుహ; సొరంగము. "క. కడువడి నక్కలుఁగుమొగం, బమస్కొక్కటి త్రోచి..." అచ్చ. కిష్కిం. ౨౭. (శ. ర. పా.)

కలుఁజు. దే. వి. 1. ఆకట్టు, శిలాబంధము, అలుఁగులు. ఆం. భా. ప్ర. ౧౬౨; 2. నూతిగోడ. "గీ. ఓరఁ గలుఁజులు వడి తావ లూడి ప్రాఁచి, బూరటిలి నీరు గననీక పూరి మొలచు, బావులును..." చంద్ర. 3. ఆ. ౪౮.

కలుజువ్వి. దే. వి. వృక్షవిశేషము. "ద్వి...కలుజువ్విపండ్లును..." పండితా. పర్వ. 3౫౮. పు.

కలుకోడి = కల్కోడి (చూ. కల్కోడి.)

కలుక్కు. దే. వి. మనసు నొచ్చుటయందగునను కరణము. "చ...ఇత్తెఱఁగు వినం గలుక్కు మనదే పగవారిమనంబు..." సా. 3, ఆ. ౫౦.

కలుత్రాంత. దే. వి. (కలు+త్రాంత.) కలుఁగానుగు, త్రాయంతీలత. (శ. ర.)

కలుగచ్చ. దే. వి. (కలు+గచ్చ.) ఒకరకపుగచ్చఘీ. (శ. ర.)

కలుగానుఁగ. దే. వి. (కలు+గానుఁగ) ఱాతిగానుఁగ. "క. చెఱకు కోటికి గలుఁగఁగా మరు, చెఱకున్ లోనైతి మనుచుఁ జెఱకులగమి నే,తఱఁ గలుగానుఁగలాడుదు, రెత్తఁగి ప్రజల్ సుగుణు లన్నరేంద్రునిపటన్." రామా. ౧, ఆ. ౧౨౭. ద్వా. 3, ఆ. ౬౦.

కలుగు. దే. అ. క్రి. (దీనికి 'కల' 'లే' అను రూపములును గానంబడుచున్నవి.) 1. సంభవించు. "వ...అమ్మగ్ధమం దనసన్నిధిఁ గామవికారంబు పుట్టుట గలుగ భావించుచు..." భార. విరా. ౨, ఆ. ౯౨; 2. ఉండు. "ఆ. ఏను గలుగ వెఱవ నేటికి..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౧3; 3. నిలుపు. (చూ. కలిగించు.); 4. చాలు, సమర్థమగు. "గీ...ఎవ్వరిఁ గొనియతండు, కౌరవుల మీఁద నెత్తి రాఁగలుగువాఁడు." భార. విరా. ౨, ఆ. ౧౬౮; 5. పుట్టు. "వ...గర్గునకు శిని జన్మించె. శినికి గార్గ్యుండు గలిగె..." భాగ. ౯. స్కం. ౧౪౯; 6. కలదగు. "ఆ...ప్రజకల్లఁ, గరుణ కలుగుమమ్మ కమలనేత్ర." భార. ఆది. ౮, ఆ. ౫. నైష. ౭, ఆ. ౯; 7. దొరకు. "ఆ. తలిరుఁబోఁడి మంచిదానవు గలిగి తిట్లరుగు నెంతురమ్మ..." ప్రభా. ౫, ఆ. ౧౯; 8. తగు. "క...కలకాలము, పాయక యత్తపసిగొడవః బడఁగాఁ గలదే." విప్ర. ౪, ఆ. ౧౭; 9. కడచు. "క...వనజాయతనేత్ర నీవు వచ్చి ముహూర్తం,బును లేను పోవఁ దమకిం,చిన నే మని నీకుఁ బ్రియము చెప్పుదు గరిసన్." వి. పు. ౨, ఆ. ౨౭౮; 10. రమించు. "మ. కకేకీ మాటలు పేయం నేటికి కిఁక నీకాయంబుతోఁ వానితోఁ, గలుగన్ భాగ్యము కల్గకున్న విభునింగాఁ జేయుమీ వీని రాఁ,గల జన్మంబున..." అని. ౨, ఆ. ౧౪౧. స. క్రి. 1. కలిగియుండు. "క. గురులకు భర్తుఁ డుదారుఁడు, గరుణ గలఁడు..." భార. ద్రో. ౨. ఆ. ౨3౭; 2. పొందు. "ఆ. తల్లి పనిచె నని యధర్మువు సేయంగ, నగునె యొఱక గలరె మగువ లెందు." భార. ఆది. ౨, ఆ. 3౪. భార. కర్ణ. ౨, ఆ. ౯౦. (ఈక్రిందిప్రయోగముల నీపదము సబింధకముగాఁ బ్రయుక్తము.) "లయగ్రాహి. సంగమును భంగముఁ గలుంగ..." సీతా రా. ౨, ఆ. ౧33. ౧, ఆ. ౬౭. "ఉ...భవత్సమానుఁ డే, లోకమునందు నెంచినఁ గలుంగఁగ నేర్చునె..." చెన్న. ౪, ఆ. ౨౪.

కలుచె. వై. వి. (సం. కలుషమ్. ప్రా. కలుస.) 1. క్షోభము, కలఁత. "చ...ధృతరాష్ట్రసూనులు కులక్షయ మయ్యెడుదాని కోర్చి పోరికిఁ జెగి వచ్చి రక్కలుచ రెండు నెఱిఁగెదునీవు నేను దీనికిఁ జోర నేల..." భార. భీష్మ. ౧, ఆ. ౧౯౬. 2. దోషము. "క. అలఘుపరవస్తువునకుం, గలదె యభావంబు మనసు గానని కలుచన్." భార.

శాం. ౪, ఆ. ౧౮౩; 3. కోపము. "మ. కలుచం గోశబిలంబు వెల్వడి..." నైష. ౫, ఆ. ౧౫౭; 4. కారణము. "మ...వింటి మన్నకలుచన్ దీసించునే తత్త్వసం, గతబోధంబు..." భార. శాం. ౧, ఆ. ౧౩౮. దశ. ౧౧, ఆ. ౧౩౫.

కలుచేపడు. ద్వ. అ. క్రి. (కలుచ+పడు.) కలఁతనందు, క్షోభపడు. "వ...తద్వధోపాయంబున నుపాయం బూహించి యెద్దియుం గానక కలుచపడి .." నృసిం. ౫, ఆ. ౪. "గీ. పొదిగె నేమఱి పాటులే కదనఁ బదనఁ, గలుచపడకుండ..." పేం. పంచ. ౧, ఆ. ౬౨౦.

కలుచు. దే. స. క్రి. వలచు, మోహించు. "గీ. కలిచెనా సలరు వలచె,ననుట..." ఆం. భా. తృ. ౯౬.

కలుజువ్వి. దే. వి. (కలు+జువ్వి.) కూటపర్కటి, కొండజువ్వి. ఆం. భా. ద్వి. ౪౪. "సీ. కలు జువ్వి వావిలి..." హంస. ౪, ఆ. ౧౧.

కలుపు. దే. స. క్రి. చేర్చు. "గీ...ఒకనుమాదుని గయ చేసి యుర్విలోనఁ, గడుపు చల్లనికాంతలఁ గలుపు నన్ను." ఉ. హరి. ౨, ఆ. ౭౫., విక్ర. ౫, ఆ. ౩. వి. 1. కలయిక, సంగమము. "సీ. సితభానుఁ డాచార్యుచిగురాకుఁబోఁడిపైఁ గన్ను వైచినకన్నె కలుపుమరులు." నైష. ౭, ఆ.౧౫౧. 2. పైరు మొ. వానితోఁ గలసి మొలచినగడ్డి మొ. ఆం. భా. తృ. ౫౧. "సీ. మొలపుతోఁ జెట్టుపాములఁగలుపుదియు." వైజ. ౨, ఆ. ౧౨౧; 3. పెరుఁగు; మిశ్రదధి. "చ...కలుపున్ వడియంబులు..." శశాం. ౩, ఆ. ౧౪. ఆం. భా. ద్వి. ౨౫౯; 4. మోహము. (చూ. కల్పు.)

కలుపుఁగోలు = కల్పుఁగోలు. (చూ. కల్పుఁగోలు)

కలుపుఁగోలుతనము. ద్వ. వి. (కలుపుఁగోలు+తనము) అభిన్నత్వము, ఐకమత్యము. "ఉ...అభయమిచ్చితి నేలితి రమ్మనుండు పొం, దచ్చపుదాయ యైన శరణార్థిఁబుమీ యని యొక్కమాట వా, క్రుచ్చినపిమ్మటం గలుపుఁగోలుతనంబునఁ గాతువాని..." రామా. ౭, ఆ. ౮౫.

కలుపొన్న. ద్వ. వి. (కలు+పొన్న) ఒకానొకజాతి పొన్న. (చూ. కల్పొన్న.)

కలుము. దే. వి. కలుషగంధము. "ఆ. కలుము నాఁగఁ గలుషగంధము..." ఆం. భా. ప్ర. ౧౦౬.

కలువ. వై. వి. (సం. కైరవమ్. క. కలుపె.) ఉత్పలము. "లయవిభాతి. చెలువ లౌనవెంచునులుచలు వలకుఁ బైనలముకలువలకు..." య. ౪, ఆ. ౧౦౪, ఆం. భా. ప్ర. ౧౬౪.

కలువకంటి. ద్వ. వి. (కలువ+కన్ను+ఇ.) కువలయాక్షి; స్త్రీ. "సీ. చెవిలోనఁ బాఱుఁగఁ జిమ్మె గొజ్జఁగనీటఁ గాల్పైరవు నొక్క-కలువకంటి." భీమ. ౫, ఆ. ౧౧౩.

కలువగొంగ. ద్వ. వి. (కలువ+గొంగ) కువలయారి, సూర్యుఁడు. "సీ. కలువగొంగను లేనిబలుపగంగను జేనివలువరింగులు పైవి గలుగువాని." ప్రబంధ. ౮౦౨.

కలువచెలి. ద్వ. వి. (కలువ+చెలి.) కుముదప్రియుఁడు, చంద్రుఁడు. "గీ. కలువచెలియును బూవుదండలును...,కాముకునకు వికారంబుఁ గలుగఁ జేయు." భర్తృ. ౨, శ. ౮౯.

కలువపడము. వై. వి. (కలువ+పడము. సం. కైరవపటః. త. కలువటమ్.) 1. ఉత్సవాదికాలములో ధ్వజస్తంభాదులకు వ్రేలఁగట్టెడు కలువపూదండ, ప్రాలంబమాలిక. "సీ. కలయఁగ గృహములఁ గలువపడములు గడు విలసిల్లె నంబరతలము గప్పి." భార. ఆది. ౬, ఆ. ౧౪౯. కళా. ౨, ఆ. ౯౧; 2. మేలుకట్టు. సాం. ని. మాన. ౧౯.

కలువనేస్తి. ద్వ. వి. (కలువ+నేస్తి.) చంద్రుఁడు. వేంక. దేవ. ౧౩.

కలువము. దే. వి. మందు మొ. నూఱుటకు వీలుగా పల్ల మేర్పఱచినఱాయి. (శ. ర. వా.)

కలువరాయఁడు = కలువఱేఁడు. "గీ. కలువరాయఁడు దనుజులఁ గౌఁగిలించి." శశాం. ౪, ఆ. ౨౦౧.

కలువఱేకు. ద్వ. వి. (కలువ+ఱేకు) కువలయదళము. "సీ. కలువఱేకులయేపు ఖంజనంబులరూపు నిరసించువాల్చూపుపునీటుదాని." ఉ. రా. ౨, ఆ. ౨౬౬. బ. పిఱుఁదులమీఁదినఖక్షతములు. వేంక. మాన. ౭౭.

కలువఱేఁడు = కలువలదొర. (బ్రౌ.)

కలువలదొర. ద్వ.వి. (కలువలు+దొర.) చంద్రుఁడు. రా. వి. ౪, ఆ. ౪౪. ఇట్లే కలువలరాయఁడు మొ.

కలువవిందు. ద్వ. వి. (కలువ+విందు.) చంద్రుఁడు. "గీ. కరము తోఁబుట్టు వగుటనో కలువవిందు, కందుఁ దనయందుఁ దాల్చె లక్ష్మణకుమార." రామా. ౬, ఆ ౩౦.

కలువవిలుతుఁడు. ద్వ. వి. (కలువ+విలుతుఁడు.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

కలువు=కలుగు. (పుట్టు.) "ఉ...నీవు కలుగక నియతోన్నతి గాంచెఁ దండ్రియున్." వసు. ౫, ఆ. ౧౫ (కలవాఁడగు) "శా. నామీఁదం గృపయొప్పఁ జాలఁ గలవన్నా..." హరి. పూ. ౭, ఆ. ౩౮.

కలుషము. సం. వి. అ. పుం. 1. దున్నపోతు; 2. నలుపు. న. 1. పాపము; 2. మురికి. విణ. (అ. ఆ. అ.) 1. కలఁగఁబాఱినది; 2. మురికియైనది; 3. నిందింపఁబడినది; 4. సామర్థ్యము లేనిది; 5. నల్లనిది.

కలుషించు. సం. అ. క్రి. 1. కోపించు. "వ. అనిన నమ్మాటలకుఁ గలుషించి కమలనాభుండు." హరి. ఉ. ౨, ఆ. ౨౯; 2. అసహ్యించుకొను. "చ. అని కలుషించి వేదవతి యచ్చటు వాసి చనం దలంచినన్." నిర్వ. ౫, ఆ. ౧౭; 3. కలఁగఁబాఱు. "వ...ఆబోట్టి కలుషించియు...ఉపశమించుకొని..." భార. విరా. ౨, ఆ. ౪౮; 4. విరోధించు. "క...కౌశికసుతుతోఁ, గలుషించి ఋశ్యమూక, స్థలి కాతఁడు వోవఁ దోన చనియె నితండున్." నిర్వ. ౭, ఆ. ౧౩౦.

కల్కండము = కలకండము. ద్వ. వి. (కల+కండము) ఒకవిధ మగుచక్కెర. "వ...చక్కెర కండ చక్కెర జీనిచక్కెర కల్కండంబు పుల్కండంబు..." ప్రబంధ. ౧౧౨. రూ. కలకండ.

కల్కఫలము. సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు.

కల్కము. సం. వి. అ. పుం. న. 1. కపటము; 2. పాపము; 3. పురీషము; 4. దేహమలము; మురికి; 5. మడ్డి; 6. ఒకానొకగంధద్రవ్యము; 7. పొడి; 8. తాండ్రచెట్టు. విణ. (అ. ఆ. అ.) 1. పాపము గలది; 2. చెడ్డది.

కల్కి. ఉభ. దే. వి. 1. స్త్రీ. "సీ. ప్రాఁబల్కుఁగల్కి పాపటను సిందూరమై యెవ్వానిపదకాంతి యెసక మెసఁగు." ఉ. రా. ౫, ఆ. ౬౯; 2. మనోజ్ఞత, అందము. "సీ. పృథుజటాబంధంబుఁ బెన్నెఱి వేణియోఁ గప్పలాంబరము గల్కిత్రిలుఁగన్ను." కు. సం. ౧౨, ఆ. ౨౧౦. విణ. 1. మనోజ్ఞము. "చ. చిలుకలకొల్కి కల్కి యొకచేడియ..." స్వా. ౫, ఆ. ౬౩; 2. సుందరుఁడు. "గీ. కలికితన మేల యీకల్కిఁ గరఁపకున్న." శ్రీరాధా. ౪, ఆ. ౧౯౭. సం. వి. ఇ. పుం. కల్క్యవతారము. విణ. (న్. నీ. న్.) కల్కము గలది.

కల్కితనము=కలికితనము. ఉభ. దే. వి. 1. స్త్రీత్వము; 2. దుష్టత్వము. సం. వి. న్. పుం. కల్క్యవతారము. "ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయఁటో, కల్కితనము సేయు ఘనత గలదె." భాగ. ౧౦. స్కం. పూ ౮౨౧. (పైయర్థముల కిది యుదాహరణము.)

కలోడి = కలుకోడి. దే. వి. ఒకజాతికోడి. (అశుభ సూచక మగుకూఁత కూయునది.) "ద్వి. నక్కరో కుట్టని కూసెఁ గలోడి, పుగి మహోత్పాతము ల్పుట్టె వెండియును." పండితా. మహిమ. ౧౯౭. పు.

కల్గించు = కలిగించు. (లభింపఁజేయు) "సీ. వలసినవస్తు లవ్వారిగా శిబిరంబునం దె కల్గించుమహావిభూతి." ఉ. రా. ౪, ఆ. ౧౮౬.

కల్గు = 1. కలుఁగు; (గుహ.) "క...పొలసు మేపగి కల్గుమొగక్ దాఁపిన పెఱుఁగాయి..." అచ్చ. యు. ౪౪౫; 2=కలుగు. దే. అ. క్రి. 1. ఉండు. "ఉ...వచియించెదఁ గల్గినమాట గట్టిగా." విజ. ౩, ఆ. ౧౫; 2. సమర్థ మగు. "సీ...భవబంధములఁ బెడఁబాపఁగల్గు." విక్ర. ౧. ఆ. ౧౯౭; 3. సంభవించు. "మ. బహుబాధల్ బడఁగల్గునంచుఁ దమలో..." హర. ౨, ఆ. ౧౯.

కల్చు = కలఁచు. (మోహించు.) "చ. కలువక కల్చినట్లు...తానొరుఁ గల్వమి నేర్పు వేశ్యకున్." కు. సం. ౮, ఆ. ౧౪౨.

కల్జు. దే. వి. (కలు ధా ?) కంసాలి; వడ్రంగి మొ. "సీ...కల్జువిత్తము రుంజకానిపాలు." రామలిం. ౨౩.

కల్జువ్వి = కలుజువ్వి. "ఉ...కల్జువ్వులనీడ..." కాశీ. ౩, ఆ. ౫౦.

కల్దు = కలదు. కద్దు. (ఉన్నది.) "చ. తనుతరరోమపల్లరికిఁ దా నిరువంకలఁ గల్దు తేఁడు నాన్..." ప్రభా. ౨, ఆ. ౮౨.

కల్పకము. సం. వి. అ. పుం. 1. = కల్పము; 2. కల్పవృక్షము; 3. కచోరము॥.

కల్పన. సం. వి. ఆ. స్త్రీ. 1. ఏర్పాటు; 2. చేత; 3. అలంకరణము; 4. రచన; 5. ఆరోపణము; 6. ఊహ; 7. యోధు లెక్కుటకై యేనుఁగును సన్నద్ధము చేయుట; 8. అర్థాపత్తి; 9. విధానము; 10. ప్రవసనము.

కల్పనము. ఉభ. దే. వి. కలాఁపి. "సీ. పూనీరు కలవ పుష్పాళ్లను దంపించి నునుపుమీఱంగఁ గల్పనముఁ జల్లి." ల. వి. ౫. ఆ. ౨౨. సం. వి. అ. పుం.= కల్పన.

కల్పము. సం. వి. అ. పుం. 1. న్యాయము; 2. పక్షాంతరము; 3. విధి; 4. వైదికవిధానములు తెలుపునొకానొకశాస్త్రము; 5. సంకల్పము; 6. ప్రళయము; 7. బ్రహ్మదినము; 8. తాంత్రి॥; 9. కల్పవృక్షము; 10. మద్యము. విణ. (అ. ఆ. అ.) 1. ఉచితము; 2. సమర్థము. ప్ర. (ఇది సమాసోత్తరపదముగానే తెనుఁగునఁ బ్రయుక్తము.) సమానము. "వ...అమృతకల్పంబులైన యీఫలమూలంబు లుపయోగించి క్రమ్మఱుము..." భార. ఆర. 3, ఆ. 3.౨౨.

కల్పలత. సం. వి. ఆ. స్త్రీ. కల్పవృక్షము.

కల్పవృక్షము. సం. వి. అ. పుం. కోరినవస్తువు లిచ్చెడి దేవవృక్షసామాన్యము, వేల్పుమ్రాను; 2. దేవవృక్షవిశేషము. (మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము అనియివి యైదు.)

కల్పాంతము. సం. వి. అ. పుం. ప్రళయము, ప్రపంచమంతయుం నశించుకాలము.

కల్పించు. సం. స. క్రి. 1. రచించు. "మ...అట్టిభువనక్షేమంకరం బైనభాగసమామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నే రొప్పఁగన్." భాగ. ౧. స్కం. ౧౩౬; 2. సృజించు. "గీ... అఖిలలోకములు గల్పించు..." మార్క. ౧, ఆ. ౧౧౫; 3. లేనిది కలిగించు, ఆరోపించు.

కల్పితము. సం. వి. అ. పుం. ఎక్కుటకు ఆయత్తము చేయఁబడినయేనుఁగు. విణ. (అ. ఆ. అ.) 1. రచింపఁబడినది; 2. ఆరోపింపఁబడినది; 3. స్ఫుటము చేయఁబడినది.

కల్పొన్న. ద్వ. వి. (కలు (కలి?)+పొన్న) ఒకజాతి పొన్న॥. "ద్వి. అక్కజంబుగఁ బూచె నంతఁ గల్పొన్న." పండితా. మహిమ. ౧౫౭. పు.

కల్మషము. సం. వి. అ. పుం. న. 1. పాపము; 2. మఱికి; 3. మడ్డి; 4. హస్తపుచ్ఛము. విణ. (అ. ఆ. అ.) 1. పాపము గలది; 2. మఱికి గలది.

కల్మాషము. సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము. (అమరము.) 2. నలుపు; 3. గంధశాలి; ఒకజాతివరి॥. విణ. (అ ఈ. అ.) 1. చిత్రవర్ణము గలది; 2. నల్లనిది.

కల్మి = కలిమి. 1. (ఉండుట.) "సీ. సతికల్మి లేములు సన నిశ్చయింపక..." భా. రా. కిష్కిం. ౭౮౪; 2. (పుట్టుక) "ఉ. పౌరులు మానవేంద్రునకుఁ బౌత్త్రుఁడు గల్మికి మిన్ను మోసి సొం, పారఁగఁ జేసి రుత్సవములు..." మార్క. ౮, ఆ. ౨౦౬; 3. (సంభవించుట.) "చ. విను విని వింతు మాపనియుం నీదుప్రసంగము మున్ను కల్మి యుంన్." ప్రభా. ౨, ఆ. ౫౦; 4. (అగుట.) "క...అతని యానతికల్మిక." కళా. ౨, ఆ. ౧౪.

కల్మిచ్చు. దే. వి. (కలు+ముచ్చు.) దుష్టుఁడు. "గీ... కల్ముచ్చు చెడుగు సాపెనలమారి." హంస. ౫. ఆ. ౧౧౩.

కల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. మద్యము; 2. కరక॥.

కల్యజగ్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రాతఃకాలభోజనము; 2. చలిది.

కల్యము. సం. వి. అ. న. 1. వేకువ; 2. నిన్న; 3. కల్లు, మద్యము; 4. లగ్నము. విణ. (అ. ఆ. అ.) 1. రోగము లేనిది; 2. సిద్ధమైనది; 3. నేర్పు గలది; 4. శుభప్రదము; 5. చెవిటిమూఁగ.

కల్యవర్తము. సం. వి. అ. పుం. ప్రాతరాశము, చలిది యన్నము.

కల్యాణము. సం. వి. అ. న. 1. పండుగు; 2. శుభము; 3. పెండ్లి; 4. బంగారము. విణ. (అ. ఈ. అ.) 1. నాశములేనిది; 2. శుభమైనది.

కల్యాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గోవు; 2. భూమి. 3. పార్వతి; 4. ఒకానొకరాగము; 5. మాషపర్ణి॥. విణ. (న్. సీ. న్.) కల్యాణము గలది.

కల్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సమర్థుఁడు; ఆసక్తుఁడు. "వ...ధర్మావసరణకల్యుం డగు శల్యుండును..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౮౬.

కల్ల. దే. వి. 1. అసత్యము. ఆం. భా. ప్ర. ౧౧౬. "శా...కల్లయుఁ నిజము వీడ్వా టొందఁగా..." కళా. 3, ఆ. ౨౭౮; 2. తప్పు. "గీ. కల్ల చేసితి రక్షింపుకాలకంత." భీమ. 3, ఆ. ౧౯౪; 3. మోసము. (శ. ర.); 4. పరుషవచనము. "సీ. తనతల్లి విసివి నిన్నను గొన్నికల్లలాడుటయుం నే వెళ్లిపోవుటయుఁ గలదు." పరమ. 3, ఆ. ౨౯౭; 5. హాని. "గీ...త్ర్యక్ష యనుచు, జపము సేయుందు రెవ్వ రావిపులపుణ్యా, ఘనులఁ గడిసినప్పుడ మీఱుఁ గల్ల వచ్చు." కాశీ. 3, ఆ. ౧౬౧; 6. తోఁట లోనగువానివెలుఁగు, కట్టువ. ఆం. భా. ద్వి. ౧౨. విణ. 1. అసత్యమైనది. "మ...భాషణమా కల్ల..." హంస. ౫, ఆ. ౧౧; 2. పరుషము. (శ. ర.); 3. మాయాకల్పితము. "ఆ. కల్లజింకఁ ద్రుంచె..." అచ్చ. యు. ౫౭; 4. మాయావి, దొంగ యైనవాఁడు. "ఆ...అచట నున్న కల్లతపసి, తెఱఁగు నతని తోడ నెఱిఁగించి..." అచ్చ. యు. ౪౧౯; 5. తెచ్చిపెట్టుకొన్నది, లేనిపోనిది. (చూ. కల్లగుట్టు.)

కల్లగుల్ల. దే. వి. (కల్ల+గుల్ల.) బొంకులప్రోఁగు, అసత్యము లాడువాఁడు. ఒంటి. శ. ౧౭.

కల్లగుట్టు. దే. వి. (కల్ల+గుట్టు.) తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యము. "గీ. తెఱవ లిటు నీరువోయం పందిరియ చేరి, యవలఁ గొఱకాక పిచ్చుకుంటై యనంగుఁ, దనువుఁగొనఁ జొచ్చెఁ గల్లగుట్టమరవారి, కధ్వగులు లాఁచియిడు విడియముల పేర." ఆము. ౨, ఆ. ౫౮.

కల్లచ్చులు. దే. వి. బ. (కల్ల+అచ్చులు.) తప్పు తూనికకట్లు. (వా.)

కల్లడి. దే. విణ. శోభగునది. "సీ. అనఘకాంతి సుధాంభోధికల్లడి డిండీరమో చంద్రమండలంబు." కు. సం. ౭, ఆ. ౭౧.

కల్లతనము. దే. వి. (కల్ల+తనము.) 1. పొరపాటు, తప్పు. "గీ. అధిప సంకల్పమై షమ్ము ఘగుటఁ జేసి; పూర్వకల్లతనంబున నుభిద కలిగె." భాగ. ౯, స్కం. ౧౪; 2. మోసము, కపటము. "ఉ. కల్లతనంబు గాక పొడఁట్టినపూర్వపురీతి..." భాగ. ౬. స్కం. ౫; 3. తప్పునడత. "గీ. కల్లతనములు పలుమాఱుఁ గప్పిపుచ్చు, నట్టినామీఁదఁ జాపంగ నలుగకున్నె." కాశీ. ౪, ఆ. ౯౦. వీర. ౧, ఆ. ౯౭; 4. అసత్యము. "ఉ. కల్లతనంబుగాక పొడకట్టినపూర్వపురీతి, నేఁడు న్యాయంల్లమునందు నుండుచు...భారతీ." భాగ. ౬, స్కం. ౫.

కల్లము. దే. వి. 1. మల్లబంధవిశేషము. ఆం. భా. ద్వి. ౨౦౯; 2. రతిబంధవిశేషము. "సీ. మల్లవల్లభులట్లు పరుసాధనలపట్టుఁ గల్లమ్ములకు నచ్చి కలసి కలసి." రాధికా. 3, ఆ ౧౩౭.

కల్లరి. దే. విణ. (కల్ల+అరి.) 1. అసత్యమాడునది; అసత్యమైనది. "సీ. తచ్చునగొండి పోతరకత్తె కల్లరి..." చిన్న. ౨, ఆ. ౨౪. "సీ...కల్లరివార్త నిజముగా నిర్వహింపని దేటినీటుకత్తె." శుక. ౧, ఆ. ౧౩౯; 2. వంచకుఁడు; మాయలాఁడు. "క. కల్లరితొలు వేలుపుఱేఁడల్లనఁ జెఱపట్టికొనుచునరుగుచు నున్నాఁడు..." అచ్చ. అర. ౬౬. "క... కల్లరికృష్ణుండు దానిఁ గని మఱి సొక్కెన్." దశా. ౮, ఆ. ౧౮౯; 3. దుష్టుఁడు, దుష్టురాలు. "ఆ...కల్లరులకు మేలుగానియట్టి, తనువు లెన్నియైనఁ దాల్చి..." భాగ. ౧౦. స్కం. పూ. ౯3. "క. అల్లదె తాటక యనియెడు, కల్లరిరాకాసి..." అచ్చ. బాల. ౧౧౨; 4. దోషి, అపరాధి. "చ...రాజుతోఁ, గపటము గాఁగఁ జెప్పి నినుఁ గల్లరిఁ జేయుఁ జుమీ నిజంబుగన్." సా. ౨, ఆ. ౧౫; ౨౭3; 5. మిక్కిలి నేర్పరి. "ఉ. మెల్లన వేఁటవేఁపులగమిం బడి సల్లులఁ జంప నేర్పితిం, గల్లరి యయ్యె నిప్పుడిది కానలఁ బందుల వేరువిత్తనన్." చంద్రా. ౨, ఆ. ౭౪.

కల్లరికత్తె. ద్వి. వి. (కల్లరి+కత్తె.) మోసకత్తె. (బ్రౌ.)

కల్లరితనము. దే. వి. (కల్లరి+తనము.) సాహసకృత్యము. "సీ. కుంజరేంద్రంబుపైఁ గుప్పించు సింగంబుఁ జెల్లరే చని పండ్లు డుల్లఁదన్ను." "గీ...వానికల్లరితనము లీశ్వరుఁ డెఱుంగు." రా. వి. 3, ఆ. ౪౫.

కల్లరీఁడు. దే. వి. (కల్లరి+ఈఁడు. స్వార్థమున.) దొంగ. పాం. ని. మాన. ౧౨.

కల్లరుజు. దే. వి. (కల్ల+అరుజు.) ఒకజాతిచేఁప. "సీ. మిసి కల్లరుజు తేలుమీను..." హంస. ౪, ఆ. ౧౮౭. (శ. ర. బ్రా. పా. 'కల్లురుజు' ముద్రి. పా.)

కల్లవాఁపు. దే. వి. (కల్ల+వాఁపు.) నొప్పి లేనివాఁపు, ఒకానొకరోగము. (వా.)

కల్లవాటు. దే. వి. (కల్ల+పాటు.) గమనవిశేషము, ఏకవాటు. "ద్వి. పెళ్లనుఱంతుల బెదరి యాపిట్ట, కల్లవాటడర నాకాశంబు ముట్టె." ద్వి. సా. ౧, భా. ౧౧, పు.

కల్లసేయు. దే. అ. క్రి. (కల్ల+చేయు.) మోసగించు. "ద్వి. మాఱుకాఁ డేతెంచిమనలను గల్ల, సేయుచున్నాఁ డెడసేయక వీనిఁ, దెగటార్పుము..." ద్వి. హరిశ్చ. పూ. ౧౯౫౩. పం.

కల్లు. యు. దే. వి. బొ. అనా. 1. ఱాయి (బ. కండ్లు, కండ్లులు) "సీ...కటికి. ఆ. నేలఁ గండ్లు లొత్త నిద్రపోయినది..." భార. ఆది. ౬, ఆ. ౧౭౮. ఆం.భా. ద్వి. ౭౯. నైష. ౮, ఆ. ౧౫౨. 2. బండిచక్రము. "క...డాపటికల్లు గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె..." భార. కర్ణ. ౩, ఆ. ౩౪౧. భాగ. ౧౦, స్కాం. పూ. ౨౫౧. వై. వి. (సం. కల్యమ్. క. కళ్లు.) మద్యము, ఒకరకపుమద్యము. "ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొల్లను బంపుము కల్లుదేర..." భార. విరా. ౨, ఆ. ౯౩., ఆం. భా. ద్వి. ౩౦౩. "ద్వి. సారాయి యొకయేఱు సరవిని బాఱెఁ, బాఱెఁ గల్లును నొక్కపావన తటిని." రం. రా. అయో. (శ. ర.)

కల్లుగాన్గు. దే. వి. (కల్లు+గాన్గు.) ఱాతిగానుఁగు. "సీ. కొండఱఁ గల్లుగాన్గులఁ బెట్టి రక్తముల్ పోరుకీ లెడలంగఁ బొంక మణఁచి." సానందో. ౩, ఆ. ౧౫౬.

కల్లుపాక. దే. వి. (కల్లు+పాక.) కల్లమ్మెడిచోటు. (వా.)

కల్లుపెంట = కల్లుపాక. (శ. ర.)

కల్లుప్పు. దే. వి. (కల్లు+ఉప్పు.) ఱాతియుప్పు, సైంధవలవణము. (వా.)

కల్లువడు; ద్వ. అ. క్రి. (కల్లు+పడు.) ఱాపడు, స్తంభించు. "వ...గుండె జల్లుమని కల్లువడి ముని తల్లజుపదపల్లవంబులు ద్రెళ్లి..." స్వా. ౫, ఆ. ౧౯.

కల్లువఱుచు. ద్వ. స. క్రి. (కల్లువడు ధా.) ఱాతిని జేయు. "సీ. నీవికారము గావె నిర్జరాధిపుఁ గోడిగాఁ జే సహల్యను గల్లువఱిచె." శ్రీరా ధా. ౨, ఆ. ౧౮౪.

కల్లెడ. దే. వి. (కల్లు+ఎడ) నురుఁగు. "వ. గండశైలంబు లొండొండ గుభులు గుభుల్లనం డొల్లి రభసంబున నభశ్చరులు త్ళ్లిడిల్ల నెల్లెడలం బెల్లెగయుకల్లెడలును..." శ్రీరం. ౧, ఆ. ౧౩౭.

కల్లెడు = కల్లేడు. "సీ. కైఁజు గువ్వ కల్లెడు..." సుద. ౩, ఆ. ౧౯౪.

కల్లెలుక = కల్లెల్క. (శ. ర.)

కల్లెల్క. దే. వి. (కల్ల+ఎల్క.) మూషికభేదము, ఒకజాతియెలుక. ఆం. భా. ద్వి. ౮౬. "గీ... వెల్ల, యెలుక కల్లెల్క..." స్వా. ౪, ఆ. ౨౫.

కల్లేడు. దే. వి. బొ. ఒకానొకపక్షి. "సీ...కల్లేడు పొన్నంగి కౌజు పికిలి." పార్వ. ౬, ఆ. ౭౭. "సీ...ప్రక్కలు నొక్క నుఱుకకల్లేటినో క్కోరణంబు." స్వా. ౪, ఆ. ౫౮.

కల్లేఱు. దే. వి. బొ. (కల్లు+ఏఱు.) వీరభద్రపర్వత పాదమూలమున పాఱెడియొకనది. "సీ. పాఱె నేశైలంబుపాదమూలంబునఁ గల్లేటితో వృద్ధ గంగవారి." కాశీ. ౩, ఆ. ౨౮.

కల్లోలము. సం. వి. అ. పుం. 1. పెద్దయల; 2. సంతోషము.

కల్లోలవతి. సం. వి. ఈ. స్త్రీ. నదీదేవి. "క. అల్లుఁడు నీ కాహ్నవి, నీ వల్లుఁడ వై తతనికిఁ దదంఘ్రి కుమారీ, వల్లభుఁడ వైతి చిత్రము, కల్లోలవతీ కళత్ర కల్మషదైత్యా." రామా. ౩, ఆ. ౪౧.

కల్లోలిని. సం. వి. ఈ. స్త్రీ. తరంగిణి, నది.

కల్లోలుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) శత్రువు.

కల్వ = కలువ. "సీ. సొగసువాలు మెఱుంగుఁజూపు లాశావీథికలఁ గల్వవిరి మేలుఁ కట్టులమర." ఉ.రా. ౨, ఆ. ౧౨౪.

కల్వకంటి = కలువకంటి. "క. చనుఁగవబంగరుపవఁటుల, మినుకులఁవలెఁ గషరుచులు మినుమిను కనఁగా, వనకుజలతికాజాలముఁ, గనకముగాఁ జేయుకల్వకంటులఁ గంటే." సుద. ౫, ఆ. ౭౯.

కల్వడము = కలువడము. "ద్వి. ఉప్పరవట్టంబు లాగిఁ గల్వడములు. పండితా." మహిమ. ౧౭౯, పు. (ప్రాఁతప్రతిపా. 'కప్పడములు' క్రొత్తప్రతిపా.)

కల్వము = కలువము. "ద్వి. కలిపి రసంబులఁ గల్వం బులందుఁ, గసబెసగా నూఱి..." నవ. ౫, ఆ.

కల్వఱేను = కలువఱేఁడు. (పిఱుఁదులమీఁదినత్త్రము) వేంక. మాన. ౭౭.

కవ. దే. వి. 1. జోడు, ద్వయము. "ఉ...కన్నుం గవ..." స్వా. ౨, ఆ. ౩౭; 2. జత, మిథునము. "క...వధూటిమెఱుఁగుఁబాలిండ్లు నిరాఘాట స్ఫురణప్రభ యను, నేటికి జక్కవలకవ యయి విరాజిల్లెన్." నైష. ౨, ఆ. ౧౭; 3. యమళము, ఒక తల్లి కించుమించుగా సమకాలమున పుట్టిన శిశుద్వయము. "సీ. నల్లలితాశోకపల్లవంబులఁ బాదపల్లవంబులఁ బాదపల్లవంబులు నొక్కతల్లి ప్రజలొ, బ్రణయాతిశయమునఁ బాయనిజక్కవకవయం నెవ్వలిసన్నుఁగవయుఁ గవయొ." కు. సం. ౮, ఆ. ౧౨. బ. 1. నకులసహదేవులు. ఆం. భా. ద్వి. ౧౮౨. భార. భీష్మ. ౧, ఆ. ౧౦౯; 2. కుశలవులు. "గీ. కవలు కవవీణె బూని ద్రాక్షాఫలోప, మానమానితవాల్మీకిమానిరచిత, చారు రామాయణశ్లోకసమితి గాన, లీలఁ బఠియింప..." ఉ. రా. ౭, ఆ. ౧౬౪. విశే. రెండు. "గీ. కవలు కవవీణె లూని..." ఉ. రా. ౭. ఆ. ౧౬౪.

కవకవ. దే. వి. 1. నవ్వుటయం దగుధ్వని కనుకర కరణము. "చ. కవకవ నవ్వి..." జై. ౬, ఆ. ౧౧౯; 2. పలుకుటయం దగుధ్వని కనుకరణము. "సీ. కవకవఁ బలికెడుకరణి..." ఉ. రా. ౭, ఆ. ౨౮౩.

కవకివ. దే. వి. పావురములధ్వని కనుకరణము. "సీ. బకదారికవకివ లొకదారి పైఁ జూపి..." హంస. ౨, ఆ, ౧౦౪.

కవకివకవ = కవకివ. "గీ. ఉవిదచెవిలోనఁ గవకివకవలు గొణఁగ, నటివ యిది మాకు నేర్పు మాటంచు వేఁడు." సావి. ౧, ఆ. ౮౯.

కవగూడు. దే. అ. క్రి. 1. రతికిఁ గూడు. (చూ. కవగూర్చు.); 2. ఎదుర్కొను; జతయై మార్కొను. "సీ. స్తనయుగచక్రముల్ జలజాతముకుళములో కవగూడి మొనచూపి కలహ మంద." ఇందు. ౩, ఆ. ౫౬.

కవగూర్చు. దే. స. క్రి. (కవగూడుధా. ప్రే.) రతికిఁ గూర్చు. "చ. అతిముతిఁ గేళిదీర్ఘికఁ బ్రియంబునఁ గోకము తమ్మితూఁడు వే, కఱచి నెమర్చి తద్రసము కామినివాతెఱఁ గుమ్మరించి త, త్తఱపడి కేళికిం గవయుతద్విధ మంతయుఁ బ్రేమఁ జూపి య, త్తెఱవ మనంబులోన విధిఁ దిట్టు నినుం గవగూర్పలేమికిన్." శ్రీరాధా. ౩, ఆ. ౧౪౭.

కవగొను. దే. స. క్రి. (కవ+కొను.) కూడు. "క. అది మొకలు వానిఁ గవగొని, మదపతి యారామమధ్యమందిరమున నిం, పొదవఁగ రమింపఁ దొడఁగెను..." హంస. ౫, ఆ. ౩౦౮.

కవచము. సం. వి. అ. పుం. న. 1. బొందలము, ఇనుపచొక్కా. 2. మంత్రసాధనాంగ మగు స్తోత్రవిశేషము. పుం. 1. తప్పెట; 2. కలజువ్వి చెట్టు; 3. నందిచెట్టు.

కవట. దే. వి. (త. కవట్టై.) 1. పెద్దకొమ్మ. "సీ. కవట లొండొంటితోఁ గదియుచు..." భార. విరా. ౧, ఆ. ౧౬౭; 2. లేఁతకొమ్మ. "ద్వి. కది సినకొండలు కవట లనంగ నశ్వమేధాద్రిముఖ్యాఖిల గిరులు, శాశ్వత శాఖోపశాఖ లనంగ." పండితా. పర్వ. ౨౩౬. పు; 3. పశురోగవిశేషము. "ద్వి...ముసుబంతి కవట... ఆదిగా నెన్నఁ, గలపసరాలరోగములకు..." నవ. ౧, ఆ. విశే. శేషాద్రి, ఉదా:—కవటాకు. (శ. ర. వా.)

కవటము. సం. వి. అ. న. 1. అన్నము. (కే. ని.); 2. ఎంగిలి.

కవడె. దే. వి. (త. కవుడి.) వాద్యభేదము. ఆం. భా. ప్ర. ౧౨౮.

కవణకాఁడు. దే. వి మల్లగమనవేది. ఆం. భా. ద్వి. ౨౦౮.

కవణము. వై. వి. (సం. కబళమ్.) 1. గుఱ్ఱమునోర వానికిఁ బెట్టు ఉలవలుమొ.దాణ. "ఆ...గడ్డి, కవణమును..." భార. ఉద్యో. ౧, ఆ. ౯౩. ఆం. భా. ద్వి. ౨౬౦; 2. ఆహారము. "క. గాలి

కవణంపుమేపుడు, చాలుపులం బోలి..." అచ్చ. యు. ౘా 3.

కవనము. సం. వి. అ. న. కవిత్వము. "గీ. గణన సేయఁడొ మరుసామకవనములకుఁ, దాను నాచేతఁ బడిన బెత్తంపుఁబెట్లు." రాధికా. 3, ఆ. ౭. "క. తోఁచ దసాధ్యంబు కవనధోరణి పట్టన్." ప్రబంధ. ౨౫.

కవను. దే. వి. (త. కవణై.) గడ్డి. ఆం.భా.ద్వి.౭౯.

కవపిట్ట. దే. వి. (కవ+పిట్ట.) జక్కవ, చక్రవాకము. (వా.)

కవపులుఁగు = కవపిట్ట. వేంక. దేవ. ౧3.

కవపుల్గుదాయ. దే. వి. శశి, చంద్రుఁడు. వేంక. దేవ. ౧3.

కవయు. దే. స. క్రి. రమించు, రతిచేయు. "క. దినమున సురతం బెయ్యెడఁ, జనదు చెడిపకన్యఁ గవయఁ జనదు..." భార. అను. ౪, ఆ. ౧౧౫. ఆం. భా. ద్వి. ౧౭౦.

కవరు. ఆం. వి. (Cover). 1. కాగితపుసంచి; 2. పైకప్పు.

కవఱులు. దే. వి. బ. పాచికలు. "గీ. కవఱు లురురత్న కంకణరవ మెసఁగఁ, బంతెములు గోరిపైచుచు పగడసాలఁ, దారతో నాడు హరిణాంకుఁ జేరి మ్రొక్కి..." శశాం. ౪, ఆ. ౧౬౯. ఆం. శే. ౫౫.

కవలవారు. దే. వి. బ. (కవలు+వారు.) 1. నకుల సహదేవులు. "గీ. కవలవారు సూర్యేందుప్రకాశ తేజులు..." భార. ఆది. ౫, ౧33; 2. కుశలవులు. (చూ. కవలు.); 3. యమళము, ఒక తల్లి కించుమించు సమానకాలమునఁ బుట్టినశిశుద్వయము. "సీ. కాశిరా జనువానిగాఁదిలికూఁతులఁ గవలవారల..." భార. సభా. ౧, ఆ. ౧3౫.

కవలు. దే. వి. (బ. కవళ్లు.) వేదాదిపఠనమందు కొంతసామ్యముచే ఒకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలియుట. "క. పదవర్ణ సౌష్ఠవోన్నతి, యొదవఁగ రువ్విచ్చి యిచ్చి యొక్కెడను గవ, ల్లొదయించకుండ..." పరమ. ౨, ఆ. ౧౦౯. కళా. ౪, ఆ. ౪౧.

కవలుకొను = కవలువోవు. "గీ. కమలజుని వేదపఠనంబు కవలుకొనియె." విక్ర. ౪, ఆ. ౫౧. (శ. ర. పా. 'కవలువోయె' ముద్రి. పా.)



కవలువోవు. దే. అ. క్రి. (కవలు+పోవు.) కవలగు. "గీ. పాఠ మొనరించుతఱిఁ దోడుపడు గురునకుఁ, గవలువోకుండఁ బుత్త్రుఁ డోకలువ కంటి." పాండు. ౨, ఆ. ౧౯.

కవవాయు. దే. అ. క్రి. (కవ+పాయు.) జత విడుచు, వియోగమందు. "సీ. కవవాసి యలఁదుకు కలహంసరుతము నా నాక్రందనారావ మతిశయిల్ల." కు. సం. ౨, ఆ. ౧౬.

కవాటము. సం. వి. అ. పుం. న. తలుపు.

కవాటి. సం. వి. ఈ. స్త్రీ. తలుపు.

కవాడము. దే. వి. (త. కవాడమ్.) ఎద్దులు మోయు బరువు. (గడ్డి మొ.) (శ. ర.)

కవి. ఉభ. దే. వి. (కవియు. ధా.) 1. మోగి, పెట్టు. "క. తారకుకింకరు లుగ్రాకారులు శతకోటు లొక్కకవిఁ గవిసిరి..." కు. సం. ౧౨, ఆ. ౧౦౨; ౧౦౪; 2. కవియుట, కూడుట. (చూ. కవిగొను, కవిచేయు.) సం. వి. ఇ. పుం. 1. శుక్రుఁడు; 2. వాల్మీకి; 3. పండితుఁడు; 4. జలపక్షి; 5. కావ్యకర్త; 6. బ్రహ్మ. ఇ, ఈ. స్త్రీ. 1. కళ్లెము; 2. అంగుళిత్రము. విశే. (ఇ, ఇ. ఈ. ఇ.) 1. కవిత్వము చెప్పువాఁడు; 2. పండితుఁడు.

కవించు = కవియించు. 1. పైకొలుపు. "చ. జట మొదలంటఁగాఁ బెఱికి...కవించె రాజుపైన్." భాగ. ౯. స్కం. ౧౦౨; 2 కల్గించు. "ఉ... మోముదమ్ములన్, వాలికపోటుగంట్లు చెలువంబు గవింపఁగఁ జేరురంబులన్, గ్రాలఁగ లీలమై దివిజకాంతలు పైచినపుష్పమాలికల్." నైష. 3, ఆ ౧౦.

కవిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కళ్లెము; 2. ఒకజాతి చేఁప.

కవిగొను. దే. అ. క్రి. (కవి+కొను.) కవియు, విస్తరించు. "చ. కవిగొని దానియూర్పులసెకన్ గసుఁగందె వనంబుపువ్వులున్." కవిక. ౪, ఆ. 3౦.

కవిచేయు. దే. అ. క్రి. (కవి+చేయు.) వెంటఁ బోవు, సహగమన మొనర్చు. "గీ. తోడఁ గవి చేయుదురు వానితో రమించు, కాంత లందఱు ..." జై. ౫, ఆ. ౧౦౯. (శ. ర. పా. 'గతి చేయు' ముద్రి. పా.)

కవిత. సం. వి. ఆ. స్త్రీ. కవిత్వము.

కవిత్వము. సం. వి. అ. న. కవిత.

కవిదల. దే. వి. (కవియు. ధా.) ఆక్రమణము, అఱుముట. "వ. ఇట్టితిభీషణశాసను జైనగణాధీశ్వరులకనిదల కప్పగింపక..." కు. సం. ౨, ఆ. ౬౭. ౧౧, ఆ. ౩౯.

కవియించు. దే. స. క్రి. (కవియుధా. ప్రే.) కవియఁజేయు, ప్రయోగించు. "క. కవిసినఁ గడంగియేసును, గవియించితి నంపవెల్లి..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౨; 2. పైకొల్పు. "చ. అలుక వహించి మస్తకరి నట్టె పయిం గవియించి..." ఉ. రా. ౫, ఆ. ౧౦౫; 3. పడవైచు. "సీ...మీతండ్రి పరికించి నన్ను, నవలీల నీలవణాంబుధిలోనఁ, గవియించి పక్షముల్ గాచి రక్షించె." రం. రా. కిష్కిం. ౨౩౭. పు.

కవియు. దే. అ. క్రి. 1. విస్తరించు. "క. తిమిరము కవిసిన..." భార. భీష్మ. 3, ఆ. ౧౬౪; 2. విజృంభించు. "క...ఈ, కడిసినవీరుల నెల్లం, గుదియించెద ననుచుఁ గవిసెఁ గురువితతిపయిన్." భార. భీష్మ. ౨. ఆ. ౩౬౧. 3. పైఁబడు, పైకొను. (చూ. కవియుదెంచు.); 4. కలుగు "సీ. పితృకార్యవిధి సమాపించినఁ గడపని కడపని మట్టంటు గలిసెనేని." కాశీ. ౭, ఆ. ౧౩౯. స. క్రి. 1. క్రమ్ము, ఆవరించు. ఆం. భా. తృ. ౧౧౭; 2. చేరు, దగ్గఱు. ఆం. భా. తృ. ౧౨౪; 3. ప్రతిఘటించు, ఎదిరించు. "చ...విచ్చలవిడి భూమిభుం గలిసె..." భార. భీష్మ. ౨, ఆ. ౨౫౦; 4. కప్పు, ఆచ్ఛాదించు. "క. చలిగాడ్పులమునురులమెయి, వలిగొని ధాత్రీపురంధ్రి వలిఁ బచ్చని కంబలిఁ గవిచికొన్నవిధమున..." కు. సం. ౬. ఆ. ౧౦౦.

కవియుదెంచు. దే. అ. క్రి. (కవియు+తెంచు-స్వార్థమున.) 1. విస్తరించు "గీ...చీకటి యెడనెడఁ గవియుదెంచె." భార. భీష్మ. ౧, ఆ. ౩౦౦; 2. విజృంభించు. (రక్కసుఁడు) "క...రఘుకులవీరుల, దిక్కునకుం గవియుదెంచె..." భార. అర. 3, ఆ. ౯౭; 3. అనుగమించు. "గీ. హస్తిపురిఁ జేరుగలమదహస్తి నెక్కి, క్రాలుకావలిరథములు కవియుదేర...వికర్ణుండు వచ్చి తాఁకె." భార. విరా. ౫, ఆ. ౧౯౩.

కవిరి. వై. వి. (సం. ఖాదిరః.) 1. తాంబూలముతోఁగూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచులోనగు వస్తువులు చేర్చి చేసినయుండ. (శ. ర.) 2. కాఁచు. (వా.)

కవిల. వై. విశే. (సం. కపిలమ్. క. కవిల.) కపిల వర్ణము గలది. "మధ్యా. అపసరజ్జుం దయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి, కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును..." భార. ఆది. ౪, ఆ. ౨౫౩.

కవిలసంచి. దే.వి. బంగారుపర్తకుఁడు మచ్చుముక్కలు ఒరపిడిరాయి గురివిందగింజలు మున్నగునవి వేసికొనుసంచి. "క ఆకరులమచ్చులగుదికగ్గిగాను వర్ణంబు మధుపనికషము గలత్మికవలసంచి దివసపై, శ్యకులాగ్రణి వాయి గట్టె సంధ్యావేళన్." వరాహ. ౪, ఆ. ౧౩౮.

కవిలియ=కవిలె. "చ. కవిలియ విప్పి చూచి యనఘాయితఁ డన్యాయధర్మకర్మముల్, నవిని యొనర్చె..." భో. 3. ఆ. ౫౫. పాండు. ౫, ఆ. ౮౦.

కవిలె. దే. వి. 1. మట్టించిన నీలపటుపువర్గు లెక్కపుస్తకము. "సీ. కవిలెలో నున్నప్రకారంబు ప్రజ పాపపుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప." ఉ. రా. 3, ఆ. ౩౧౬; 2. ఐదరఁటాకులబొత్తి. కవిరి యని వాడుక.

కవిలెపట్టు. దే. వి. (కవిలె+పట్టు-పద్దు?) కడితపుఁ బుస్తకము. "క. అని పల్కి చిత్రగుప్తుఁ, డనుపమముగఁ గవిలెపట్టుటాకులు గేలం, గొని..." పానందో. ౨, ఆ. ౫౯.

కవుఁగిలి = కౌఁగిలి. దే. వి. ప్రా. (కవుఁగిలు. ధా.) 1. ఆలింగనము. (చూ. కవుఁగిలించు.) పాం. ని. స్థా. ౫౧; 2. భుజాంతరము. "చ...ఎక్కుడు తమకంబుతోడఁ దల గ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తతిన్." కళా. ౪, ఆ. ౯౯.

కవుఁగిలించు = కౌఁగిలించు. "చ. తిగిచి కవుంగిలించి..." భార. విరా. ౧, ఆ. ౨౪౭.

కవుఁగిలింత = కౌఁగిలింత. (కవుఁగిలు. ధా.) "ఉ... వీడి పోనీని కవుంగిలింతలు..." కాశ.౧, ఆ.౪౨.

కవుఁగిలింపు = కౌఁగిలింపు. (చూ. కౌఁగిలింపు.)

కవుఁగిలు=కౌఁగిలు. "చ...నెటిఁ గవుంగిలం గొరవి ...భూచు..." పారి. ౪, ఆ. ౧౦.

కవుఁజు = కౌఁజు. (చూ. కౌఁజు.)
కవుచు = కౌచు. 1. మాఁగుడుమాంసపుకంపు. "సీ. ఏవీటిసతుల పాలిండ్లపై గంబూరనవహారముల చిప్ప కవుచు మాన్చు."ఆము. ౨,ఆ. 3; 2. మాంసము. ఆం. భా. ద్వి. ౧౩౧.
కవుడీలు = కౌడీలు. (చూ. కౌడీలు.)
కవుదు = కౌదు. 1. కపటము. ఆం. భా. ప్ర. ౧౩౮; 2. అపస్వరము, స్వరము తప్పుట. "చ. శ్రుతి గవు డొందినన్ గమలసూతికిసైనను దీర్చి చెప్ప నేరుతురు... అప్పురివిప్రసత్తముల్." పెన. శకుం. ౧, ఆ. ౭౬.
కవును = కౌను. (వృత్తియందు 'ను' వర్ణమునకు లోపము వికల్పము. ఉదా:—కవుఁదీఁగ. మొ. ఉత్తరపదమైనపుడు అంత్య 'ఉ' కారమునకు లోపము వికల్పము. ఉదా:—లేఁగుట్రనునుంగవున్. శ.ర.) 1. నడుము. "మ. బెళుకుంజూపులు సన్నపుంగవును శోభిల్లన్..." దశా. ౨, అ. ౫౮. నీలా. ౧, ఆ. ౫౬; 2. వింటినడుము. (చూ. కౌను.); 3. ఒకరకపుచెప్పు. ఆం.భా.ద్వి. ౬౫౮.
కవురు = కౌరు. 1. = కబురు. (వా.) 2. తుమ్మెదలగుంపు. (వర్ణాధిక్య మని శ. ర. ముదురు రంగు? అని సూ. ని.) "క. చిపురా వాతెఱ నల్లని, కవ్వరా నునుసోగవెండ్రుకలు పుత్తడిమేల్, సవురా దేహము ముద్దుల,దవురా యని జనులు పొగడ నాబిడ యడరున్." హంస. 3, ఆ. ౧౫౩. ప్రబంధ. ౭౮.
కవులు. హిం. వి. కౌలు; దే. వి. (వేదాముల లోనికవులు,పనసలు మున్నగువానిక్రమము. "గీ. తపసులు సకలవేదశాస్త్రములు చదువు,నప్పుడు గవుల్లుపోయినయట్టియెడలఁ, దీర్చిచదివించునట్టి సద్ద్విజకులంబు, కలిగి విలసిల్లు నప్పుణ్యకాననంబు." చిత్రభా. ౧. ఆ. ౪.
కవేరకన్య. సం. వి. ఆ. స్త్రీ. కవేరుఁడను రాజర్షి కూఁతురు, కావేరీనది.
కవేలము. సం. వి. అ. న. కలువ.
కవోష్ణము. సం. వి. అ. న. ఇంచుక వేఁడిమి. విణ. (అ. ఆ. అ.) ఇంచుకవేఁడిమి గలది.
కవ్యము. సం. వి. అ. న. పితృదేవతల కీఁదగిన యన్నము.

కవ్వడి. దే. వి. (కవ+వడి.) సవ్యసాచి, అర్జునుఁడు. "క. కడఁగి ద్రుపదానుజుఁడు సెవ్వడెఁ గవ్వడి నేసె...నరుఁ డస్త్రములన్." భార. ఆది. ౬, ఆ. ౮౨. విణ. రెండుచేతులందును వడి గలవాఁడు. "సీ. ఉత్తుంగను ఁవిశాలోరస్కుఁ డనియును గవ్వడియనియును..." భార. అర. ౮, ఆ. ౧౮౫.
కవ్వపుఁగొండ = కవ్వపుగట్టు. "చ. కమఠతనూవిలాసమునఁ గవ్వపుఁగొండ ధరించి దేవ నీ,యమృతముఁ దెచ్చి యాశ్రితజనావలి కిచ్చితి..." నృసిం. 3, ఆ. ౩౫.
కవ్వపుగట్టు. ద్వ. వి. (కవ్వము+గట్టు.) మందరపర్వతము. నీలా. ౨, ఆ. ౪౧.
కవ్వపుమల = కవ్వపుఁగొండ. (చూ. కవ్వపుమల తరిత్రాడు.)
కవ్వపుమలతరిత్రాడు. ద్వి. వి. (కవ్వము+మల+తరి+త్రాడు.) మందరనగమంథానసూత్రము; వేంక. తిర్య. ౧౦౪.
కవ్వము. దే. వి. మంథానము, పెరుఁగు చిలికెడు సాధనము.
కవ్వు. దే. స. క్రి. 1. కబళించు. (శ. ర.); 2. అపహరించు. (శ. ర.)
కవ్వుకొను. దే. స. క్రి. (కవ్వు+కొను.) 1. ఆదుకొను. (బ్రౌ.); 2. ఆక్రమించు. (బ్రౌ.)
కశ. సం. వి. ఆ. స్త్రీ. 1. కొరడా, గుఱ్ఱములు మొ. వానిని కొట్టుచబుకు; 2. మాంసరోహిణి.
కశిపువు. సం. వి. ఉ. పుం. న. 1. అన్నము; 2. వస్త్రము; 3. శయ్య. ద్వి. అన్నవస్త్రములు. (వై. ని.; మే. ని.)
కశేరుక. సం. వి. ఆ. స్త్రీ. వెన్నెముక.
కశేరుకము. సం. వి. అ. న. ఒకజాతిగడ్డిదుంప.
కశ్మలము. సం. వి. అ. న. 1. మోహము; 2. పాపము; 3. మూర్ఛ; 4. మాలిన్యము. విణ. (అ. ఆ. అ.) 1. మాలిన్యము గలది; 2. నిందింపఁబడినది.
కశ్యము. సం. వి. అ. న. 1. మద్యము; 2. గుఱ్ఱపు నడుము. విణ.(అ.ఆ. అ.) కశతోఁ గొట్టఁదగినది.
కషణము. సం. వి. అ. న. 1. ఒరయిక; 2. కండూయనము. విణ. (అ. ఆ. అ.) పక్వము గానిది.
కషము. సం. వి. అ. పుం. 1. ఒరయిక; 2 ఒరగల్లు. విణ. (అ. ఆ. అ.) ఒరయునది.

కషాయము. సం. వి. అ. పుం. న. 1. ఓషధులు వేసి కాఁచిననీరు; 2. ఒగరు; 3. ఎఱుపు; 4. విషయాభిలాష; 5. చందనాదులపూఁత; చందనము; 6. చెట్టుబంక. పుం. 1. పోఁక⚘; 2. దుండిగము⚘; 3. కలియుగము. విణ. (అ. ఆ. అ.) 1. ఒగరైనది; 2. సువాసన గలది; 3. ఎఱ్ఱనిది; 4. విషయాభిలాష గలది; 5. ఇంపగుధ్వని కలది; 6. ఎఱుపు పసుపు కలసినది. (రంగు.)

కష్టపడు. మి. అ. క్రి. (కష్టము+పడు.) 1. దుఃఖపడు. "క. నీవును ద్రోణుఁడుఁ గలుగన్, వైరులచే నేను గష్టపడితి..." భార. భీష్మ. 3, ఆ. ౧౩౭; 2. శ్రమపడు; 3. బాధపడు.

కష్టపఱుచు. మి. స. క్రి. (కష్టపడు. ధా. ప్రే.) బాధించు. "మ...నిర్జరకోటిఁ గష్టపఱుచున్ ధర్మంబు నష్టంబుగాన్." నిర్వ. ౨, ఆ. ౪౬.

కష్టపాటు. మి. వి. (కష్టపడు. ధా.) ధ్వంసపాటు, చెఱుపు. "గీ. నందనమ్మునకును వజ్రనాభదైత్యుఁ, డపుడు చేసినకష్టపా టబ్జనాభ, యిపుడు తలఁపునఁ బొఱిన హృదయమునకు, నధికతర మైన పరితాప మావహిల్లు." ప్రభా. ౧, ఆ. ౭౩.

కష్టపుఁజచ్చుట. మి. వి. (కష్టము+చచ్చుట.) దుర్మరణము, చెడుచావు. "ఉ. కౌరవవంశజాతుఁడవు గష్టపుఁజచ్చుట దెచ్చుకొంటి నీ, పేరును బెంపు మాలి యరిబృందము నవ్వఁగ నిట్లు సేయుందే." భార. శల్య. ౨, ఆ. ౯౯.

కష్టపుఁబాటు = కష్టపాటు. (కష్టపడుట, బాధపడుట.) "ఉ. కౌరవకోటిచేత మనకష్టపుఁబాటు దలంపు వచ్చినన్." భార. ఉద్యో. ౪. ఆ. ౫౦.

కష్టము. సం. వి. అ. న. 1. దుఃఖము; 2. పాపము; 3. శ్రమము; 4. కీడు. విణ. (అ. ఆ. అ.) 1. దుఃఖము కలది; 2. పీడించునది; 3. కష్టసాధ్యము; 4. దుష్టము. "ఉ. రావణునింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం, భావనసేఁత కష్ట మని పల్కిరి చూచితె లక్ష్మణా ..." నిర్వ. ౮, ఆ. ౧౧౬.

కష్టముపాటు = కష్టపాటు. "ఉ...ఎంతయుఁ గష్టముపాటు వచ్చినన్." భార. ఉద్యో. ౨, ఆ. ౧౨౫.

కష్టించు. సం. అ. క్రి. కష్టపడు.

కస. వై. వి. 1. (సం. కషాయమ్. క. కస.) 1. రంజకద్రవ్యాదిసారము. (వా.); 2. మురికి. (వా); 3. (సం. కశా.) కొరడా. "సీ...పద్యములు చతుస్స్వరము ప్రణవంబు గసగోల బ్రహ్మసూత్రము..." కు. సం. ౨, ఆ. ౨౯.

కసటు. వై. వి. (సం. కష్టమ్) 1. మాలిన్యము. "ఉ. లెక్కకు నెక్కువై కసటు లేనిమహోద్భుత తేజ మెల్లెడం, బిక్కటిలం జరింతు రతిభీమబలాఢ్యులు విష్ణుదూతలు..." భాగ. ౬, స్కం. ౧౭౪. స్వా. ౨, ఆ. ౯౯; 2. చిత్తమాలిన్యము, అజ్ఞానము. "క...,ఈవాక్యము లన్నిటం, భావం బలవఱిచి కసటు వాపును సత్తా." భార. శాం. ౯, ఆ. ౨౯౪; 3. దోషము. "ఆ. భరతనులము కసటు వాపి సంశుద్ధప్రతిష్ఠఁ గూర్చి యరుగుదెంచి తీశ." భార. మా. ౧౭; 4. పాపము. ఆం. భా. ప్ర. ౫౪; 5. దుఃఖము. "వ... మనసుకసటు వాసివివేకంబునను జేవ గలిగించి ..." భార. భీష్మ. ౧, ఆ. ౨౧౩. విణ. మలినమైనది. "సీ. కలువపుప్పొళ్ళచేఁ గసటైనవెన్నెల వలిపవెన్నెలలోన వడిచి తేర్చి." పారి. ౧, ఆ. ౪౮.

కసపిస. దే. వి. మిక్కిలి నమలుటయందగుధ్వని కనుకరణము. (ఆం. పద.)

కసబెస. దే.వి. నూఱుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. "ద్వి. కలిపి రసంబులఁ గల్వంబులందుఁ, గసబెసగా నూఱి..." నవ. ౯, ఆ.

కసమస. దే. వి. 1. తొందర. "చ ..నీప్రకట ప్రతాపము౧, గసమస దాఁటఁ బోయి యతిఖంజత నొందె సహస్రపాదుఁడున్." నైష. 3, ఆ. ౭౨; 2. తొట్రుపాటు. "క. అంతట నిద్దఱమనసులు, కంతునిపసఁ గలసె వింతకసమసలాలయన్." విక్ర. ౮, ఆ. ౮౭; 3. తినుటయం దగుధ్వని కనుకరణము. "ద్వి...మాంస మెల్ల, గద్దఱుత్తుకపడఁ గసమస మెసఁగి." నవ. ౧. ఆ.

కసరతు. హిం. వి. 1. శరీరవ్యాయామము. (వా.); 2. అభ్యాసము. (బ్రా. వా.)

కసరు. దే. అ. క్రి. 1. కోపపడు; విసుగుకొను. "క. పెసరుంబప్పేమిటి కని, కసరున్..." బహు.

౫, ఆ. ౧. పాండు. ౪, ఆ. ౨౧౦; 1. చలించు. "ద్వి. పసిఁడినలాక సుపాణిముత్తియము, కసరక నిలుచుక్రొక్కారు మెఱుంగు." ద్వి. భాగ. ౭. స్కం. (శ. ర.); 3. విజృంభించు. "గీ. కసరి యెవ్వానికంఠ హుంకారరవము, కొండ చిలువలకులములోఁ గూర్చె నహుషు." కాశీ. ౨, ఆ. ౪౦; 4. బొంకు, అసత్యమాడు. "క. పసుపును గుంకుమగంధము...వి, బిసరుహముఖి యంటించెనొ, కసరక నాతోడ నిపుడు గట్టిగఁ జెపుమా." శివలీ. ౨, ఆ. ౧౪౧. స. క్రి. తిట్టు (కోపించు అని శ. ర.) "క. అంపఁ దగువారి కసరుచు, నంపి...." స్వా. ౫, ఆ. ౨3. "శా. అమ్మా బిచ్చ మటన్న వేయ దొకయింతైనన్ సుహృద్బంధుజాలముల్ గొంపకు వచ్చినం గసరు..." సానందో. ౫, ఆ. ౨౧౧. వి. 1. కోపము. "గీ. తెగువ లోలోన నే నవ్వునగవు తెలుపఁ, గలఁక మామిఁడి పనిలేనికసరు తెలుప." ఆము. ౫, ఆ. ౬౦. శుక. ౨, ఆ. ౫౧౪; 2. పొగరు. "ద్వి. కస రెక్కి యంత ముష్కరము సేయంగ." ద్వి. సారంగ. 3. భా. ౧౦౫. పు; 3. గాలివాన. "గీ. బిట్టు కస రెత్తి మున్నీటినట్ట నడిమి, కరుగఁగా జీనువై చినతరణి యనఁగ." రా. వి. 3, ఆ. ౧౯. స్వా. 3, ఆ. ౯; 4. అతిశయము. "క. అసురుసు రని సొలయంగ్ రాజసురేంద్రుఁడు మలయపవనుచలికసరు నకున్." కవిరా. ౫, ఆ. ౨౬౫; 5. (రత్న) దోషము. "క. ఈరత్నమునకుఁ బుష్పియు, గారయుఁ గర్కశత యనఁగఁ గసరులు మూఁడే,పారు..." రత్న. ౨౮; 6. పింజె, లేఁత కాయ. "గీ. కాయ కస రేచికొని తించుఁ గాన లోన, ఘోరదుఃఖముల్ గుడువంగఁ గోర నేల." భా. రా. సు. ౧౭౮; 7. పెచ్చు, లాభము. (శ. ర.)

కసరుఁగాయ. దే. వి. (కసరు+కాయ.) కసరు, పింజె. "ద్వి. రసరసాన్నములను మెసవెడువాఁడు, కసరుఁ గాయలఁ బ్రొద్దు కడపుచున్నాఁడు." రం. రా. అయో. ౧3౭, పు.

కసరుఁదనము. దే. వి. (కసరు+తనము.) దోషము, తప్పు. "సీ. కులగోత్రముల కాదికొన్నచిన్నతనంబు విసముగో నుపయించు కసరుఁదనము." కృ. శకుం. పీఠి. ౫౬.

కసరుకొను. దే. అ. క్రి. (కసరు+కొను. స్వార్థమున.) 1. కోపపడు; 2. ఘోషించు. "సీ. జలదంబు గతి నిచ్చి వెలవెలఁ బాఱక కలశాంబునిధిరీతిఁ గసరుకొనక." నరస. ౫, ఆ. ౧౯. (రెండర్థములకు నిది యుదాహరణమే.)

కసవు. వై. వి. (సం. ఘాసః. క. కసవు.) 1. గడ్డి. "మ...శ్రీకాశీ ప్రదేశంబునన్, గసవై పుట్టెడుభాగ్య మైన మనకుం గల్పింపదా దైవము..."కాశీ. ౭, ఆ. ౨౦౬; పెంట. "సీ. గల్లు గల్లని రత్నకంకణంబులు మ్రోయ గంధవాహునియూలు కసవు నూడ్చు." భీమ. 3, ఆ. ౬౨.

కసవుఁగట్ట. ద్వ. వి. (కసవు+కట్ట.) గడ్డిపరక; తృణాగ్రము. "ఆ. వల్లభుండు రాక కెల్లప్పుడును దన, యిల్లు మెసురుచూచు చుండుకతన, గాలిఁ గసవుఁ గట్ట గదలినఁ గనువిచ్చి, దీనవీక్షణములఁ దేఱి చూచు." రామా. ౬, ఆ. ౧33.

కసవుఁగుప్ప. ద్వ. వి. (కసవు+కుప్ప.) 1. గడ్డిమేటి. (శ. ర.); 2. పెంటప్రోఁగు. (శ. ర.)

కసవుకోడి. వై. వి. (కసవు+కోడి.) ఒకజాతికోడి. (బ్రౌ.) ఉల్లంకిపిట్ట, ముక్కుపురుడుపిట్ట.

కసవుగఱుచు. ద్వ. అ. క్రి. (కసవు+కఱుచు.) పూరి మేయు, చెడిపోవు, తక్కువగు. "సీ. ప్రళయాంతకగభీరగళబిలావిర్భవత్కఠినహాసరవంబు కసవుగఱచె." రామా. ౭, ఆ. ౨౭౨.

కసవుగువ్వ. ద్వ. వి. (కసవు+గువ్వ.) ఒకజాతిగువ్వ. (బ్రౌ.)

కసవుపోఁచ = కసవుఁగట్ట. "సీ. కసవుపోఁచలు కసిగాట్టుగాఁ గొఱుకుచు..." హరిశ్చ. ౨, ఆ. ౪౯.

కసాయి. హిం. వి. (హిం. కసాయీ.) కటికవాఁడు. సౌనికుఁడు. (శ. ర. బ్రౌ.)

కసి. దే. వి. 1. కోపము. (శ. ర. వా.); 2. దురద. "క. చేతులకసి వోఁ గయ్యము, సేతవిలెడునట్టి విధము చింతింపు..." హరి. ఉ. ౭, ఆ. ౧౮. భార. కర్ణ. ౨, ఆ. 3౦౦; 3. కోరిక, తమి. "క. కన్నులకసివోఁ జూచితి, నెన్నఁడు సెచ్చోట్లఁ బోరులిట్టి వెఱఁగనో, యన్న..." హరి. ఉ, ౧. ఆ. 3౪; 4. చాపల్యము, చెడు

క్రోర్చ్యు. "ద్వి. సిసువ్రు దినంగ నాసించినజిహ్వ, కసి వోవ కున్నదే..." పండితా. మహిమ. ౨. ౧౭. పు. విణ. అల్పము. (చూ. కసికాటు.)

కసింద. దే. వి. (క. కసింద.) కాసమర్దముశ్రీ. (దీని భేదములు; తీటకసింద, కమ్మకసింద, కొండకసింద మొ.) "సీ...కసింద కోరిందపొదల." అమ. ౬, ఆ. ౧౩.

కసిఁడి. దే. విణ. (వృత్తియందు వికల్పముగా దీనికి అంత్యవర్ణలోపము. ఉదా:—కసికాటు, కసికోఁత, అల్పము. (చూ. కసిఁడికోఁత.)

కసిఁడికోఁత = కసికోఁత. (కసిఁడి+కోఁత;) నిత్యము కలిగించుబాధ. "గీ...అటువంటిమగసితోడఁ, గాఁపురము సేయుసతి దొడ్డగఱిత యగుచుఁ, గసిఁడికోఁతల నోర్చి..." పాండు. ౪, ఆ. ౧౫౭. "శా...కసిండికోఁత వలదా మీకున్ విచారింపఁగన్."వరాహ. ౫, ఆ. ౯౩.

కసికాటు = కసిగాటు. 1. కొంచెపుపంటికాటు. "గీ...అగ్గలం బయినచింత వలసి యొల్లమి నతండు, సొగటులను బోటు కసికాటులఁగ భుజించె." విజ. ౩, ఆ. ౪; 2. దంతక్షతము. "ఉ. కామిని నీదుమోవిఁ గసికాటుల చెక్కుల గోటి నొక్కులున్..." సురా. ౧౨౮. విణ. అల్పము. "గీ. మోసపోయితిఁ గసికాటుముచ్చట లనె." ప్రబంధ. ౭౫౦. పాండు. ౩, ఆ. ౭౨.

కసిగాటు. దే. వి. (కసి+గాటు.) కొంచెపుపంటి కాటు. "ఉ. మజ్జనభోజనక్రియలు మాని వలాని యరోచికంబునన్, ఖజ్జము గొంత కొంత కసి గాటులుగా భుజియించి..." పిన. శకుం. ౨, ౧౬౭. ప్రబంధ. ౫౯. విణ. అల్పము. (చూ. కసికాటు.)

కసిని = కసిఁడి. (చూ. కసినికోఁత.)

కసినికోఁత = కసిఁడికోఁత. "సీ. కసినికోఁతలు గోసి గారింతు రని బూతు తెలియఁగా వదిసెలఁ దిట్టు వారు."శుక. ౩; ఆ. ౧౨౧. "గీ. ఇంటివారల కసినికోఁ తెల్ల నుడివి." శుక. ౩, ఆ. ౨౯౭. (కసినికోలు ముద్రి.)

·కసిబిసి. దే. వి. 1. క్రోధము. (బ్రౌ.); 2. నమలుటయం దగుధ్వని కనుకరణము. "చ. కసిబిసి నమ్మ కంబునకుఁ గానివి చోట్లు నమల్ శౌలంతితో." పాంచాలీ. ౧, ఆ. ౭౮. విణ. 1. నలఁగినది. "వ...ముసలంబులమోఁదులం గసిబిసి యగువారును..."భా.రా. యు. ౧౪౩౨;2. పటుత్వము లేనిది. "చ. అసురులమాయ లన్నియును నబ్జజశౌత్రుఁడు వచ్చినంతటన్, గసిబిసియై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను..."భాగ.౮, స్కం.౩౪౩.

కసిమస. దే. వి. వేగముగా తినుటయం దగుధ్వని కనుకరణము. "క. కసిమస నాఁకట ఫలముల్, మెసవుచు..." వేం. పంచ. ౪, ఆ. ౮౫.

కసిమసఁగు. దే. అ. క్రి. (కసి+మసఁగు.) 1. విజృంభించు, చెలరేఁగు. "క. కసిమసఁగి యసురవిసరము, లసిలతికల సురల నెగవ నసువులు వెడలం, బస చెడిరి పడిరి కెడసిరి, యసమసమరవిలసనముల నని వెడలి నృపా." భాగ. ౮, స్కం. ౧౪౬. భార. కర్ణ. ౨, ఆ. ౨౯౪; 2. అధికమగు; వ్యాపించు. "లయవిభాతి...కఱవు కసిమసఁగె విశ్వమున..."వరాహ. ౧౦, ఆ. ౨౮; 3. గడితేఱు, నిపుణుఁ డగు. ఆం. శే. ౩౫. స. క్రి. 1. చంపు. "క. అసురుల మాయోపాయులఁ, గసిమసఁగఁగ నఁట ముఖంబుఁ గావఁగ నఁట తా, పసుఁ డోకఁడఁట సిసువులఁ గ్రొన్నిసువుల నడిగెనఁట..." రామా. ౪, ఆ. ౯; 2. పొఱఁద్రోలు; నొప్పించు. "క. వారల నంటఱ రౌద్రా, కారుండై కసిమసంగి గాంగేయుఁడు దుర్వారపటుబాణనిహతిని, వీరాహవరంగమునకు విముఖులఁ జేసెన్." భార. ఆది. ౪, ఆ. ౨౦౨; 3. నఱకు. "క...దశ, గ్రీవుఁ డసిఁ గసిమసంగిన, లావరి యగుపులుఁగు ఱేఁడు లా వఱి పడియెన్. రామా. ౫, ఆ.౨౦౩.

కసిమిరి. దే. వి. దురద. "శా. దేవా కయ్యములోఁడి వేడుక మదిం దిట్టాడుమర్త్యుండు నే, త్రోవం జేతులతీఁట వుత్తు నని కోరుం దానవుం డైననా, కీవే చేతులు చెసి తీకసిమిరిం కె ట్లోర్తు..." హరి. ౫, ఆ. ౨౧.

కసియము. వై. వి. 1. (సం. కషాయం.) కషాయము. (ఆం. పద.) 2. (సం. కచ్ఛ.) నీటియూటగల తావు. (ఆం. పద.)

కసివింద = కసింద. ఆం. భా. ద్వి. ౬౩.

కసివోవు. దే. అ. క్రి. (కసి+పోవు.) ఉపశమిల్లు, తగ్గు. "క...కాంతామణి తనమదిలో, సెంతయుఁ గసివోనివలపు హెచ్చినకతనన్." శుక. ౧, ఆ. ౩౦౧.

కసీదు. హిం. వి. (ఉర్దూ. కసీద్.) వస్త్రముమీఁద పుష్పలు మొ. కట్టుట, బుటాపని. "సీ. మును మును చెవిచాయ జాతినయోరసికను గసీదురుమాలు భాసిల్లఁ గట్టి." ప్రబంధ. ౧౭౯. ఇట్లే. కసీదా. (శ. ర.)

కసీసము. వై. వి. (సం. కాసీసమ్. ప్రా. కసీసం.) 1. అన్నభేది. (బ్రౌ.); 2. నల్లచాయ గలతెల్లబట్ట. "సీ...కలధౌతవస్త్రముల్ చెలఁగుచుండు. నవి నల్లచాయచే నలరుచున్నను గసీసం బనఁగాఁ దగు..." ఆం. భా. ద్వి. ౧౫౫. విణ. నల్లనిది. "క...కసీసపు, మాంజిష్ఠవోలె గగనమండప మమరెన్." స్వా. ౫, ఆ. ౪౫. ఆము. ౪, ఆ. ౧౦.

కసు. దే. విణ. (కసురుశబ్దమునకు వృత్తియం దంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము.) 1. లేఁతది. (ఉదా:—కసుఁగాయ, కసుఁగందు మొ. 2. అల్పము; సన్ననిది. "ఉ...వత్స మాతయుఁ, గామిడిచన్ను దోయి కసుఁగాను సమస్తము మన్ను ..." బిల్హ. ౧, ఆ. ౬౭.

కసుఁగందు. దే. వి. (కసురు+కందు.) 1. లేఁతబిడ్డ. "దండ...సీ వంతలోఁ గావుకావంచు నేడ్నుల్ దలిర్పం గసుంగందవై..." పారి. ౩, ఆ. ౩౫; 2. కొంచెమునలుపు; నలుపు. "ఉ...కసుఁగందొకయించుక లేక తిన్ననై, పున్నమచంద్రు, నొప్పిదముఁ బోలెడు మోమున నవ్వ దేఱఁగన్." మై. ౧; ఆ. ౧౩౪. (శ. ర. పా. 'కసుగందు' ముద్రి. పా.)

కసుగందు. దే. అ. క్రి. 1. (కందు+కందు.) వాడు; మిక్కిలివాడు. "మ. అసురాధీశసమర్పితంబు లగు నీలారామకల్పద్రుమ, ప్రసవంబుల్ కసుగంద వయ్యె..." భీమ. ౪, ఆ. ౧౪౬. "క...కసుగందినబాహులతతో..." ఉ. రా. ౪, ఆ. ౨౨౧, 2. మిక్కిలి బాధపడు. "క. కుసుమాయుధుబాణములం, గసుగంది..." నైష. ౪, ఆ. ౩౪; 3. (కసురు+కందు.) కొంచెమైనను శ్రమపడు. "చ. అతఁడు మదీయసఖ్యపరుఁ డక్కట యేఁ గసుగందకుండ నా, క్షితిపతి యిమ్మెయిం బరుల చేతఁ బరాభవ మొందె..." భార. సౌ. ౧, ఆ. ౭౦. వి. మిగుల వాడుట. (చూ. కసుగందులుగందు)

కసుగందులుగందు. దే. అ. క్రి. మిక్కిలి వాడుట. "క. కసుగందులు గందెనవవ, కుసుమలతికవోలె మిగుల గోమలి యొప్పెన్." కళా. ౪, ఆ. ౧౦౩.

కసుగు. దే. అ. క్రి. సణుగు, గొణఁగు "ద్వి. విసిగినఁ గసిగిన వెడనివ్వ నొంది, నుసలిన మసలిన ..." ద్వి. మారిచ. ఉ. ౧౫౪౧ పం. (శ. ర. పా. 'కసికిన' ముద్రి. పా.) స. క్రి. 1. నలఁచు (శ. ర.); 2. పులుఁము. (శ. ర.); 3. బాధించు; మిక్కిలి బాధించునట్లు త్రిప్పు. "ద్వి...నగ్గటా క్షించి రక్షింపు, మని వేఁడుకొను మాట మఱి బిట్టు చెవులఁ, గనలుంకూలము నాఁటి కసిగిన ట్టయిన." నవ. ౨, ఆ. ౧౦౭ పు. (క్రొ. త్తప్రతి.)

కసుబా. హిం. విణ. 1. అధికారు లుండుగొప్ప గ్రామము; 2. తాలుకాలోని ప్రధాననగరము. (ఆం. పద.)

కసుమాలము. వై. వి. (సం. కశ్మలమ్ త. కసుమాలమ్) మాలిన్యము. "క. దేవా యీకసుమాలము, దేవెడుకేల్లోయి నీదుదేహం బంటం,గా చెఱపయ్యెడు..." కాశీ. ౩. ఆ. ౯౭. విణ. 1. మలినము; పాపిష్ఠము. "మ...ఈ, కసుమాలం బగునాక మేల..." కాశీ. ౭, ఆ. ౨౦౬; 2. పాపాత్ముఁడు. "ఉ. మానవదానవుండు కసుమాలము వీఁడు..." సానందో. ౪, ఆ. ౧౦; 3. క్రూరము, దుష్టము. "క. పసిపాపఁ డనక నాసుతుఁ, గసుమాలపుఁ జెడుగుఁబురుగు కఱచెను..." నా. పంచ. ౩, ఆ. ౩౨౩.

కసురు = కసరు. దే. వి. కసరుఁగాయ, పిందె. "చ... కాయలుం, గసురులు పేట్ల వెల్లఁకులు..." నిర్వ. ౧౦, ఆ. ౧౨౧.

కసెచేరులు. దే. వి. బ. పళ్లాయిబొందులు. (ఆం. పద. లక్ష్మీ.)

కసెము. వై. వి. (సం. కచ్ఛుః.) 1. నీళ్లు చిదచిదయనెడు నేల. (శ. ర.); 2. ఊటగుంట. (బ్రౌ.)

కస్తి. వై. వి. (సం. కష్టం. క. కస్తి.) 1. కష్టము. "చ...డెందములోనికస్తి మాంతనమునఁ దెల్ప

..." నీలా. ౨, ఆ. ౧౧౭; 2. బాధ. "సీ. గాధిసూనుఁ డొనర్చుకస్తికి నోర్వఁడే సతియుఁ దాను హరిశ్చంద్రనృపతి." రంగా. ౨, ఆ. ౨౩౨; 3. దుఃఖము. ఆం. భా. ప్ర. ౧౩౫; 4. విపత్తు. ఆం. సం. మాన. ౫౯.

కస్తిపడు. వై. అ. క్రి. (కస్తి+పడు.) దుఃఖించు. "ఉ. మానసికవ్యథల్ రుజలు మాన్పఁగ నోపిన పుణ్యరాశి గం,గానదిఁ జేరి యుండియుఁను గస్తి పడం దగునయ్య..." ఉ. రా. ౬, ఆ. ౨౫౧.

కస్తిపఱుచు. వై. స. క్రి. (కస్తిపడు. ధా.) దుఃఖపెట్టు. "గీ. కామసమ్మోహిత క్రౌంచఘాతమునకు, వగచి నీచాటుకవి చెంచువానిఁ గినిసెఁ, గామమోహిత యగునింతిఁ గస్తిపఱుప, ననుజుఁ బురికొల్పి తిది నీకుఁ జనునె రామ." నైష. ౮, ఆ. ౧౩౦.

కస్తురి. వై. వి. (సం. కస్తూరీ. క. కస్తురి.) 1. మృగమదము, ఒకవిధ మగుపరిమళద్రవ్యము. "చ... క,స్తురికలయంపు లేల తమచొక్కపుఁజూపుల యింపు కల్గ..." కళా. ౮, ఆ. ౨౨౩. నైష. ౭, ఆ. ౧౧; 2. కస్తూరీమృగము. "గీ. కన్నుదెఱవని కస్తురి గమిశిశువులు." పిన. శకుం. ౧, ఆ. ౯౮; 3. వృక్షవిశేషము. "సీ...కస్తురియుఁ గన్నెరయుఁ బూచె." బహు. ౨, ఆ. ౨౧.

కస్తురిపట్టెయలు. వై. వి. బ. (కస్తురి+పట్టెయలు.) 1. ధాన్యవిశేషము; 2. పుష్పవిశేషము. "గీ. పచ్చగన్నెరు కస్తూరిపట్టెయలును, గుత్తిమల్లెలుఁ బ్రాథిగాఁ గూర్చి మఱియు, సకలజాతులఁ బోషింప శక్తి గలిగి, వాలికులు చైత్రుఁ డెగడుదు. రప్పురమున." భాను. ౧. ఆ. ౯. (ఇది రెండర్థములకు నుదాహరణమే.)

కస్తురిపట్టెలు = కస్తురిపట్టెయలు. (శ. ర.)

కస్తురిపసుపు. ద్వ. వి. (కస్తురి+పసుపు.) గంధహరిద్ర. (శ. ర.)

కస్తురిపిల్లి. వై. వి. (కస్తురి+పిల్లి.) గంధమృగము. (శ. ర.) గంధమార్జాలము.

కస్తురిపుల్లచీర. ద్వ. వి. (కస్తురి+పుల్ల+చీర.) స్త్రీ వస్త్రవిశేషము; (ఆం. పద లక్ష్మీ.)

కస్తురిమెకము. వై. వి. (కస్తురి+మెకము.) కస్తూరీమృగము. "మ. పులితూనల్ సవరాలుఁ గస్తురి మెకంబుల్ లేళ్లుఁ గుందేళ్లు..." య. ౧, ఆ. ౧౦౪.

కస్తురిపీణియ. వై. వి. (కస్తురి+పీణియ.) మృగనాభి, కస్తూరి ఉండెడుజింకబొడ్డు. "వ...కస్తూరి వీణి యలును బిల్లిగడ్డలును..." భల్లా. 3. ఆ. (శ. ర.)

కస్తురిపీణె = కస్తురిపీణియ. (చూ. కస్తూరిపీణె.)

కస్తూరి. సం. వి. ఈ. స్త్రీ. కస్తురి, మృగమదము.

కస్తూరినిగరాలు. మి. వి. బ. ధాన్యవిశేషము. "సీ. బంగారుతీఁగెలు గంగాజలమ్ములు గస్తూరినిగరాలు కటకసరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

కస్తూరిపట్టెలు = కస్తురిపట్టెలు. (ధాన్యవిశేషము.) "సీ...కస్తూరిపట్టెలు గంధసరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

కస్తూరిపసుపు. మి. వి. (కస్తూరి+పసుపు.) సువాసన గల యొకజాతిపసుపు. (బ్రౌ.)

కస్తూరిపీణె = కస్తురిపీణియ. "సీ. కస్తూరిపీణెలఁ గాను కగాఁ దెచ్చుకోయలజీతంబు గొప్పచేయు." పార్వ. ౧, ఆ. ౬౨. కవిజ. 3, ఆ. ౪౦.

కస్తూరీమృగము. సం. వి. ఉ. పుం. బొడ్డునందుఁ గస్తురిగలయొకజాతిలేడి, గంధమృగము.

కస్వరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పోవునది; 2. పీడించునది.

కస్సెము = 1. కసెము. (శ. ర.); 2. కసియము. (ఆం. పద. లక్ష్మీ.)

కహాకహా. ఉభ. వై. వి. (సం. కహాకహా.) పెద్దగా నవ్వునపుడు గర్జించునపుడు గలుగుధ్వని కనుకరణము. "చ. కహకహ నవ్వె..." కాశీ. ౭, ఆ. ౨౯. సం. వి. ఆ. స్త్రీ. గర్జించుధ్వని కనుకరణము. "మహోగ్రస్థర. గళరక్తక్రోడనిర్యత్కహాకహానినదోద్గాఢహాసంబు..." స్వా. ౪, ఆ. ౯౫.

కహ్లారము. సం. వి. అ. న. సౌగంధికము, కొంచె మెఱుపుఁ గొంచెము తెలుపు గలిగి మిక్కిలి పరిమళించుకలువ. "శ్లో...అహ్లాదికహ్లారసమీరణాహితే." శిశుపాలవధము. ౧౨. స. ౬౬. శ్లో.

కహ్వము. సం. వి. అ. పుం. బకము, పక్కికొంగ.

కళ. ఉభ. దే. వి. 1. మూర్ఛ. "గీ. ధరము నీమీఁద నిడి వార్ధిఁ దరుచునపుడు, హరుని మెడ గందె వారియుండం బండె కెంపు, సమరసంభుము కళ నొందె నహహ తెలిసె, ఘనజగత్కుక్షి వగుటఁగా

కమతవర్యా." చంద్రా. ౧, ఆ. ౭౪; 2. భ్రాంతి, భ్రమ. (చూ. కళవాఱు.); 3. రెమ్మ. "సీ. దక్షిణ హస్తపద్మంబులఁ దాల్చిన లలితంపుఁబువ్వారు కళలతోడ. పరమ. 3, ఆ. ౧3. (శ. ర. పా 'ఘళ' ముద్రి. పా.); 4. మర్మము; కడ, అంతము. "క. అలుగు వగ మాపువేళం, దలకల మను నింతసోఁకినఁ మగవానిం, గళ దాఁకఁ బెనఁగు నొకమొక్కలపు దొరకరాని సీటు కత్తియ యగుటన్." కువల. ౨, ఆ. ౧3౯.

సం. వి. ఆ. స్త్రీ. 1. భాగము, అంశము; 2. చంద్రునిలోఁ బదునాఱవభాగము; 3. ముప్పది కాష్ఠలకాలము; 4. స్త్రీరజస్సు; 5. శిల్పము; 6. మూలధనముపై వచ్చువడ్డీ; 7. ఓడ; 8. గీత వాద్యాదిచతుష్షష్టికళలలో నొకటి; 9. మణిసిల; 10. సప్తధాతువులలోనొకటి; 11. లెక్కించుట; 12. ద్రుతప్రకృతికము కానిపదము.

కళంకము. సం. వి. అ. పుం. 1. గుఱుతు; 2. మఱక; 3. మాఱు; 4. ఇనుపచిట్టెము.

కళంకి. సం. విశే. (న్. సీ. న్.) కళంకము గలవాఁడు. "సీ. అన్వయంబున కాది యగుచందురుఁడువోలె నకట కళంకి వై లయ్యో దీపు." నైష. 3. ఆ. ౬౫.

కళంకు. వై. వి. (సం. కళంకమ్.) మచ్చ. "మ...చంద్రుండుగాఁ, దతఁ డానల్పు కళంకు గాదు..." సా. వి. ౨. ఆ. ౫౦. పార్వ. ౫. ఆ. ౧౫.

కళగొను. అ. క్రి. (కళ+కొను.) కాంతివంత మగు, ప్రకాశించు. "చ. చెలివచనమ్ములం గెలువఁ జిల్కలు కూసెదు బాలమోముచేఁ, గళగొనఁ బూర్ణచంద్రుఁడును గాఁకలఁ జేసెదు..." పార్వ. ౫, ఆ. ౯.

కళత్రము. సం. వి. అ. న. 1. భార్య; 2. పిఱుఁదు; 3. కోట; 4. ఆఁడుగుఱ్ఱి; 5. జ్యోతిశ్శాస్త్రమున లగ్నమున నేడవస్థానము.

కళపట్టు. దే. అ. క్రి. (కళ+పట్టు.) మూర్ఛిల్లు. (చూ. కళవట్టు.)

కళపెళ. దే. వి. 1. కాఁగుట ఉడుకుట మున్నగు వానియందలిధ్వని కనుకరణము. "సీ. కళపెళ నుడుకు చక్కనిగూనియలు..." సీలా. 3, ఆ. ౧౬౧; 2. అర్చుటయం దగుధ్వని కనుకరణము. "ద్వి. కాలాభ్రభూతముల్ కళపెళ నార్చు, పోలిక..." అ. మ. క. ౨, ఆ. ౬౭. పు. ౭. పం.

కళవట్టు = కళపట్టు. "క. కళవట్టి పడినభీముఁడు, దెలిసెన్ హరికరుణ..." దశా. ౯, ఆ. ౧౬౦.

కళవరము. దే. వి. మల్లబంధవిశేషము. "గీ. కళవరానకుఁ జొచ్చి డొక్కరము హత్తి." ఉ. హరి. 3, ఆ. ౬౦.

కళవసము. దే. వి. తోలు, చర్మము. ఆం. భా. ద్వి. ౧౭౭. "గీ. కళవసం బూడ జలకమాడలుపు పీడ." కువల. ౨, ఆ. 3౫.

కళవళపడు. ద్వ. అ. క్రి. (కళవళము+పడు.) 1. తొందరపడు. "సీ. తెలియ శోధింపక కళవళపడరా దటంచు నవ్విటుని నేపారఁ బిలిచి." సానందో. ౫, ఆ. ౧౪; 2. కలఁతనందు. "క... రామ, త్త్వావల్లభుఁ డాత్మలోనఁ గళవళపడుచున్." జై. ౬, ఆ. ౧౫౧; 3. తొట్రుపడు. "క... హరిరాజము గని పఱచెడు, కరిబృందముఁ బోలెఁ జనిరి కళవళపడుచున్." భాగ. ౪ స్కం. 33౯.

కళవళపాటు. ద్వ. వి. (కళవళపడు. ధా.) 1. కలఁత, మనఃక్షోభము. "చ. కళవళపాటుతోఁ జెలిమికత్తెల దూఱుచు..." సీలా. 3 ఆ. ౧౪; 2. తొట్రుపాటు. "చ...పిచ్చుచుఁ బోయి రెంతయున్, గళవళపాటుతో..." ఉ. రా. ౫, ఆ. 3౦౧.

కళవళమగు. దే. అ. క్రి. (కళవళము+అగు.) కళవళపడు, క్షోభించు. "క...మునులమనంబులం, గళవళమయ్యెన్ దదీయగర్వోద్ధతికిన్." నృసిం. ౪, ఆ. ౧3౯.

కళవళము. దే. వి. (క. కళవళ.) 1. కలఁత, క్షోభము. "చ. నిలిచినభీతియున్ వడఁకు నివ్వెఱపాటును భూరిలజ్జయున్, గళవళమున్ జనింప..." హరిశ్చ. ౫, ఆ. ౭౨. విజ. 3, ఆ. ౨౪; 2. తొందరపాటు; తొట్రుపాటు. "క. పిలిచి ప్రతివచన మొడపమిఁ, గళవళమున నిల్లు సొచ్చి..." కాశీ. ౫, ఆ. ౬౬. స్వా. 3, ఆ. ౨౧; 3. (నిద్రామోహజ్వరాదులవలని) కలవరింత. ఆం. భా. ప్ర. ౧౪౨. "గీ. విరహవిభ్రాంతి నొక్కొక్కవేళయందుఁ గళవళపు వింతభాషలకతన..." నైష. 3, ఆ. ౯౬.

కళవళించు. దే. అ. క్రి. (కళవళము. ధా.) 1. కలఁతపడు. "క. చనుచున్న వాఁడ నని పులి నపలు కుల తలికి కళవళించుచు విసరుచు, దనుపమకో కార్ణవమున, ముని గిరుఱు నిజమోగసత్త్వమునఁ దరియించెన్." భాగ. 3, స్క. ౧౬౧. భార. విరా. ౨, ఆ. ౩౧; 2. విరహావస్థ నందు. "గీ. చెలులు శిశిరోపచారముల్ చేయుపొంటె, బ్రోవు లిడ్డమృణాళకర్పూరవితతిఁ, గాంచి నైద గ్ధి మదిలోనఁ గళవళించె, జాలకాయాత చంద్రికాజాల మనుచు." నైష. ౨, ఆ. ౧౧౬; 3. తొందరపడు. "ద్వి. కఱకంఠ యిది యేమి కళవళించెదవు, వఱల నాచేతఁ బోవచ్చునే యను చు." బస. ౨, ఆ. ౪౭ పు. ౭ ప: 4. చలించు, అల్లాడు. "గీ. ముద్దుమోము లల్లార్చుచో మూఁపులందుఁ, గర్ణభూషణజాలంబు కళవళింప." ఉ. హరి. ౫, ఆ. ౨౭౬; 5. కలవరపడి యఱచు. "సీ...వానికాలివ్రే లొకనియంగంబు దాఁకెఁ, దాఁకిన వాఁడు దక్షఱపాటుతో మేలుకని ముచ్చు ముచ్చంచుఁ గళవళించె." కాశీ. ౪. ఆ. ౧౨.

కళాంజి = కాళాంజి. "చ...వాలుదుం, బలుకకళాంజి కుంచె యడపంబును గొంపును పూని కొల్వఁగన్." ఉహ. ౧. ఆ, ౫౯.

కళాచిక = కళాంజి. ఆం. భా. ద్వి. ౧౬౮.

కళాధరుఁడు. సం. వి. అ. పుం. 1. కమసాలి; 2. చంద్రుఁడు. "శా...కళాధరుండు చేతోవీథిక సహజాధనాపహరణోద్యోగంబు సెగ్గించునే." వసు. ౪, ఆ. ౩౪. (పైరెండర్థములకు నిది యుదాహరణమే.)

కళానిధి. సం. వి. ఇ. పుం. కళాధరుఁడు, చంద్రుఁడు.

కళాయి. వై. వి. (సం. కటాహారి. క. కడాయి.) 1. సీలి మందుమో. కాఁచెడుగంగాళము. (శ. ర. వా.); 2. ఇత్తడిపాత్రలకు పూసెడుతగరపుఁ బూఁత. (శ. ర. వా.)

కళావరు. హిం. వి. ఆడెడుకాకితములలో నొకజాతి. (బ్రౌ. వా.)

కళాసము = కళవసము. "గీ. పులికళాసము కకపాల బూదిపూఁత." అచ్చ. అర. ౫౩. నైష. ౬, ఆ. ౧౧౫.

కళాసి. దే. వి. 1. నాట్యభేదము. శ్రీరంగ. ౪, ఆ. ౧౬౨; 2. = కలాసి. (కలాసు. వా.)

కళాసించు. దే. అ. క్రి. 1. (నృత్యము) ముగించు. "వ...మత్త వనమయూరమస్తకాళిని సకలమధురకంఠకేకాగీతికావసానంబునం గళాసించె..." కాశీ. 3, ఆ. ౨3; 2. డయ్యు. "గీ. రతిఁ గళాసించి వచ్చినరమణ మెఱయఁ, గొలని వెలుపడి నచ్చి రాజలజముఖులు." విక్ర. ౫, ఆ. ౬౧.

కళాసిక. దే. వి. 1. నాట్యాంతక్రియ. "వ... సురతతాండవంబునకుం గళాసిక యగుసారవశ్యంబున..." నైష. ౭, ఆ. ౧౮౭; 2. ముగింపు. "సీ. శిఖితాండవము కళాసికఁ జేసి సడలించెఁ గఱకుటీఁకల పేరిగాసెబిగువు." పాండు. ౪, ఆ. 3౭.

కళాసువాఁడు. హిం. వి. పడవపై నుండువాఁడు; పడవనడుపువాఁడు. (బ్రౌ.)

కళింగ. సం. వి. ఆ. స్త్రీ. స్త్రీ, ఆఁడుది.

కళింగము. సం. వి. అ. పుం. 1. దేశవిశేషము; 2. నెమిలియడుగుమ్రాను; 3. కూఁకటిమూఁగ యనెడి పక్షి; 4. కొండమల్లె. 5. శిరీషము; 6. పుచ్చతీగ. "క. అతఁడు కళింగోద్భవుఁ డగు, కతము ననో ప్రేలఁ జూపఁ గనుగొందక గోమాగ్యతమ స్వైరపడ నగు. నిరసింపఁ డై యుండె మునికులేశ్వర మింటే." పాండు. 3, ఆ. ౧౭. న. కుటజ ఫలము, కొడిసెకాయ. బ. ధాన్యవిశేషము. "వ...కళింగలు వంగపనులు జగన్నాధప్రియంబులు..." ప్రబంధ. ౧౨.

కళిందకన్య. సం. వి. ఆ స్త్రీ. యమునానది.

కళిందము. సం. వి. అ. పుం. 1. యమునానది పుట్టిన పర్వతము; 2. విభీతకము.

కళుకు. దే. వి. 1. కాంతి. "గీ... వెన్నెకళుకు లమర." య. ౫, ఆ. ౯౮, ౪, ఆ. ౮౬; 2. కిరణము. ఆం. భా. ప్ర. ౮౨; 3. పక్షిభేదము. ఆం. భా. ద్వి. ౯౮. విణ. తళుకు గలది. "సీ. పాలిండ్లు కెంగేలఁ బట్టనిచ్చిన పేటికళుకు బంగరుగిండ్లు కానుకిత్తు." రసిక. ౫, ఆ. ౧౭౨. "చ. కళుకుమెఱుంగుఁ గ్రొంబసిఁడికాంచిక..." వసు. ౫, ఆ. ౧౧౩. ఉ. రా. ౨, ఆ. ౩౩౧.

కళేబరము. సం. వి. అ. న. 1. దేహము; 2. శవము. (కే. ని.)

కళ్యము. వై. వి. (సం. ఖలీనం.) ఖలీనము, గుఱ్ఱము నోటఁ దగిలించు లోహసాధనవిశేషము. "సీ. కళ్యాలఁ బదిలంబు గానిగుఱ్ఱంబులఁ గ్రొత్త ముట్టున కీయఁగొలుపు వెరపు." భార. విరా. ౧, ఆ. ౯౪. శ్రీరాధా. ౫, ఆ. ౭౦. కాశీ. 3, ఆ. ౧౧.

కళ్ల = కల్లె. "గీ. కడఁగి వనలక్ష్మి యామిసినకళ్ల యనఁగ." నృసిం. ౨, ఆ. ౬౫.

కళ్లము. వై. వి. (సం. ఖలః.) ధాన్యము నూర్చు చోటు. ఆం. భా. ద్వి. ౨33. "గీ... కళ్లాన కూర్పవాత, ఘుట్టనలఁ బాఱుపెనుఁబొల్లకట్ట ..." ఆము. ౪, ఆ. ౧3. వరాహ. ౪, ఆ. ౧౪౮.

కళ్లాము = కళ్లము. (శ. ర.)

కళ్లాలు. దే. వి. స్త్రీ ప్రత్యయము. (ఇది సమాసాంత ములందే యుండును.) ఇది ఆలు వంటిది. "క. విడువాయఁగలపు ట్రిల్లగు, చెడుగుంగళ్లాలు..." వేం. పంచ. ౪, ఆ. ౪౧౨. (చెడుగుంగళ్లాలు = దుష్ట.)

కళ్లి. దే. వి. జెముడుచెట్టు. "ఉ. మామిడితోఁ బున్నాగ వనరుమల్లిని ఖిల్లుఁడు కళ్లిఁ జేర్చినట్లు..." చం. రా. ౭, ఆ. 33. ("శ్లో. మల్లీం చూతవనాదివ స్నుహీవనే." అని మూలము.)

కళ్లియ = కల్లె. (చూ. కల్లె.)

కళ్లియము = కల్లెము. (శ. ర.) రాజ. శ. ౨౦.

కల్లె. దే. వి. శైత్యముచే గట్టిపడినయమ్మి. ఆం. భా. ద్వి. ౧3౧. "సీ... తెలినున్న లుమియు కల్లెలు గాఁగ..." అచ్చ. కిష్కి. ౬౬.

కల్లెము. వై. వి. కళ్యము, ఖలీనము. "సీ. తనువు లొందినగాడ్పు లన నొప్పునుత్తమాశ్వముల ముత్యాల కల్లెములరుచులు." ఉ. రా. ౨, ఆ. 33౧. దశా. ౨, ఆ. ౬౬.

కా.

కా. దే. అవ్య. ద్రు. 1. కదా. "క... తాపసుఁ డొకఁ డట సిసువుల క్రొన్నిసువుల నడిగెనఁట మునులు సిర్గోహులు గా." రామా. ౪, ఆ. ౮; 2. అగుధాతువుయొక్క నుజ్యంతరూపము. ఇది అగునట్లు, అయి, అనుసరించి మున్నగునర్థముల నిచ్చును. "సీ. ధర్మాభివృద్ధిగాఁ దగువడువ్రనకు ..." భార. ఆది. ౬. ఆ. ౨౮౪. "సీ... నీకుఁగా నని సేయుట..." భార. భీష్మ. ౧, ఆ. ౧౫౭. "చ... వచనామృతంబు శ్రుతిసీమలఁగా దిగి బోధభూజ సేఁచన మొనరించుటన్..." పాండు. ౨, ఆ. ౧౭౧; 3. అని. "ఉ... ఎప్పటి యట్టకా వగచి..." భార. ఆది. ౭, ఆ. ౨౦౮. 3, ఆ. ౧౭౮; 4. ఐయుండునట్లు. "ఉ... ఎవ్వనికా... పురోహితుండుగాఁ, జేకొనువారము ..." భార. ఆది. ౭, ఆ. ౧౫౫. భార. శాం. ౬, ఆ. ౪౭౬. ప్ర. ఉదా:—ఆటకాఁడు, వెలికాఁడుమొ. (కొన్నియెడల దీనికి 'గా' నిత్యముగా నాదేశ మగును; ఉదా:—అందగాఁడు.)

కాంక్ష. సం. వి. ఆ. స్త్రీ. కోరిక.

కాంక్షకుఁడు. సం. విణ. (అ. క్షీ కా. అ.) కాంక్షించువాఁడు; కోరువాఁడు.

కాంక్షించు. సం. స. క్రి. కోరు. "మ. కలకాలంబును నన్ను దాన మొసఁగం గాంక్షించి..." వరాహ. ౧౦, ఆ. ౬౪. అ. క్రి. వాంఛసేయు. "మ. లలనా నీమధురాధరామృతము గ్రోలం గాంక్ష గావింప క్షీరకలశీతుచ్ఛతరామృతంబునకు నేఁ గాంక్షించినా నంచు నన్నలులకం జేయుచు ..." దశా. ౨, ఆ. 3౨౭.

కాంక్షిత. సం. విణ. (బు. త్రి. బు.) కాంక్షకుఁడు.

కాంక్షితము. సం. వి. అ. న. కోరిక. "చ... అధనంజయుని కాంక్షిత మెక్కడ నక్కడెల్లనెక్కుడుఁగుద మొప్పఁ దేరు రథిగోటులపైఁ బఱపెన్ ముకుందుఁడున్." భార. ద్రో. ౧, ఆ. ౨౪౮. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

కాంచనము. సం. వి. అ. న. 1. బంగారము; 2. కాంతి; 3. పద్మకేసరము; 4. ధనము; 5. హరిదళము; 6. బంధనము. పుం. 1. ఉమ్మెత్తచెట్టు; 2. సంపెంగచెట్టు; 3. మేఁడిచెట్టు; 4. పొన్నచెట్టు; 5. మద్దిచెట్టు; 6. కాంచనముచెట్టు. విణ. (అ. ఈ. అ.) సువర్ణమయమైనది.

కాంచని. సం. వి. ఈ. స్త్రీ. 1. పసుపు; 2. గోరోజనము.

కాంచనీయము. సం. విణ. (అ. ఆ. అ.) బంగారముతోఁ జేసినది.

కాంచి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. రశన, అందుదాని యొంటిపేట మొలనూలు. "ఉ. కంకణ కంఠికా కటకకాంచి ముఖాభరణ ప్రపంచముతో..."

నైష. ౭, ఆ. ౧౧; 2. మోక్షదాయకము లగు సప్తనగరములలో నొకటి. "శ్లో. అయోధ్యా మథురా మాయా కాశీ కాంచి రవంతికా,పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః."

**కాంచేనము.** వై. వి. (సం. వి. కాంచనః.) కోవిదారము⚜. (శ. ర.)

**కాంచు.** దే. స. క్రి. 1. చూచు. "ఉ. కాంచి యాతఁ డొక్కకాలిత్రోవయం దంతఁ, గాంచి ..." ఆము. ౬, ఆ. ౧౬; 2. బిడ్డను గను. "క...అంత ననుఁ గాంచి యది విపి,నాంతర మునఁ బాఅవైచి..." స్వా. ౬, ఆ. ౩౪; 3. "ఉ...జగన్నాటకసూత్రిచేతఁ గృతిబాధుఁడు గాంచుఁ జిరాయురున్నతుల్." నైష. ౧, ఆ. ౩; 4. భాగ్యము నందు,యోగ్యత గను. "చ... కృతకృత్యతం బొరయఁ గాంచు..." భార. శాం. ౬, ఆ. ౩౨౧. "క. వనజాయతాక్షి కతిపయ,దినములఁ జూడంగఁ గాంతుఁ దివిర నలుసి..." భార. ఆర. ౨, ఆ. ౧౦౧; 5. గ్రహించు. "ఉ. పూని ముకుందునాజ్ఞఁ గను బొమ్మనె కాంచి..." ఆము. ౧, ఆ. ౪; 6. స్మరించు. "గీ. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి." నైష. ౧, ఆ. ౭.

కాంచి. సం. వి. ఈ. స్త్రీ. 1. కలి; 2. పెద్దతుమ్మి⚜.

**కాండపటము.** సం. వి. అ. పుం. తిరస్కరిణి, తెర.

కాండపృష్ఠుఁడు. సం. వి. అ. పుం. 1. కొన్నకొడుకు; 2. పెంచుకొన్నకొడుకు; 3. శూద్రస్త్రీకిఁ బుట్టిన కొడుకు. విణ. (అ. ఆ. అ.) ఆయుధములచే బ్రదుకువాఁడు.

**కాండము.** సం. వి. అ. పుం. న. 1. గ్రంథపరిచ్ఛేదము; 2. ఊడుగు⚜; 3. గుంపు; 4. నీరు; 5. బాణము; 6. సమయము; 7. ఈనె; 8. కాడ; 9. వరిపోఁచ; 10. దుబ్బు; 11. కఱ్ఱ, 12. వృక్షస్కంధము; 13. గనుపు; 14. గుఱ్ఱము; 15. నిర్జనప్రదేశము; 16. ఱెల్లు⚜; 17. స్తుతి; 18. నిందను దెలుపును. (ఈయర్థమున నిది సమాసోత్తరపదముగానే యుండును. ఉదా:— ప్రజాకాండము = కుత్సితప్రజ.)

**కాండరుహా.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి⚜.

కాండీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బాణములు ధరించువాఁడు, విలుకాఁడు.

**కాండేక్షువు.** సం. వి. ఉ. పుం. 1. గొబ్బి⚜; 2. కాశ నునుఱెల్లు⚜.

కాండ్ర. దే. వి. తృణవిశేషము. "ఉ...కసవుఁ గాండ్రయుం..." కాశీ. ౬, ఆ. ౨౬౨.

కాండ్రించు. దే. అ. క్రి. క్రాయు. (బ్రా. వా.)

కాండ్రు. దే. వి. ఉమియునపుడు చేయుధ్వని కనుకరణము. (వా.)

కాంత. సం. వి. ఆ. స్త్రీ. 1. కోరఁదగినస్త్రీ; 2. స్త్రీ. 3. భార్య; 4. ప్రేంకణము⚜; 5. పెద్దయేలకి⚜: 6. ఛందోవృత్తభేదము.

కాంతపక్షి. సం. వి. న్. పుం. నెమిలి.

కాంతపుష్పము. సం. వి. అ. పుం. 1. వసంతఋతువు; 2. ఛాయా. (చంద్రకాంతము.); 3. ఎఱ్ఱగన్నేరు⚜. న. 1. కుంకుమము⚜; 2. సూదంటుఱాతియినుము. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది; 2. ఇంపైనది.

కాంతలకము. సం. వి. అ. పుం. నంది వృక్షము, తున్న⚜.

కాంతలోహము. సం. వి. అ. న. సూదంటుఱాయి. (రా. ని.)

కాంతారము. సం. వి. అ. పుం. న. 1. పెద్దయడవి; 2. దుర్గమ మగుదారి; 3. రంధ్రము. అ. పుం. 1. కోవిదారము⚜; 2. ఒకజాతిచెఱకు⚜; 3. వెదురు⚜.

కాంతాలపడు. ద్వ. అ. క్రి. (కాంతాలము+పడు.) అసూయపడు. "రగడ. తాల మెక్కెడె తాల కేమి కాంతాలపడు పంతాలదానవు." చంద్రా. ౪, ఆ. ౨౩౪.

కాంతాలము=కాంతాళము. (చూ. కాంతాలపడు.)

కాంతాళపడు. ద్వ. అ. క్రి. (కాంతాళము+పడు.) అధైర్యపడు. "సీ. తాళవృంతానిలోత్తాలవేదన కోడి తాళక మిగులఁ గాంతాళపడుచు." చంద్రా. ౪, ఆ. ౨౭౫.

కాంతాళము. దే. వి. 1. కోపము. అం. భా. ప్ర. ౧౩౫; 2. అధైర్యము. "క. అని యుంవ్విళ్లూరుచు మదిఁ,ననయముఁ దలపోయుం నుస్సురనుఁ గాంతాళం,బునఁ బొరలు నిట్టు విరహాం,బున

కోర్వక..." ప్ర. భా. 3, ఆ. ౪3;3. అసూయ. "రగడ. ఇంతి దివితో నొరసె నిడిగొ హింతాళంబు, లింతవిరవాదివిరికేలఁ గాంతాళంబు." ఉ. రా. ౬. ఆ ౬౧.

కాంతాళించు. దే. అ. క్రి. కోపించు, కినియు. "క. అంతటను వేగఁ దమ్ముల, వంకల నిడి సీట ముంచు వర్షర్తువుపై, గాంతాళించెనొ యన జల, దాంతము శరవృద్ధితోడ నరుదెంచుటయున్." పార్వ. ౪, ఆ. 3౭.

కాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. జిగి; 2. అందము; 3. కోరిక; 4. ఒకచంద్రకళ; 5. స్త్రీశృంగారసౌందర్యవిశేషము.

కాంతిలు. సం. అ. క్రి. ప్రకాశించు. "చ. కలువల జేనిమండలము కాంతిలుచున్నది తూర్పుకొండపై." బిల్హ. ౨, ఆ. ౫౨.

కాంతుఁడు. సం. వి. అ. పుం. 1. మగఁడు; 2. చంద్రుఁడు; 3. కుమారస్వామి; 4. ప్రియుఁడు

కాందవికుఁడు. సం. విణ. (అ. ఆ. అ) పిండివంట లమ్మువాఁడు.

కాందారి = కాఁదారి. (చూ. కాఁదారిప్రొద్దు.)

కాందారిమాందారిప్రొద్దు. ద్వ. వి. నిశీథసమయము, అర్ధరాత్రవేళ. ఆం. భా. ప్ర. ౯౪.

కాందారిమాందారివేళ = కాందారిమాందారిప్రొద్దు. "మ... శివశివా కాశీపతీ యంచు...కాందారిమాందారివేళను ధన్యు ల్విహరింతురో..." మల్ల. వై. ౧౫.

కాందిశీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఏదిక్కునకుఁ బోదు నని వెఱపుచేఁ బాఱెడువాఁడు. "ఆ. తెరలియిద్ద ఱొక్కతెరువునఁ బోవక, యూకులితను గాందిశీకు లయిరి." నిర్వ. ౪, ఆ. ౭౬; 2. అన్నిదిక్కులకుఁ బోయి వాడవాడల వెదకువాఁడు. "వ...గణాధీశ్వరు లెల్లకడలను శోధించి దక్షుం డున్నప ట్లెప్పట్లను గానక కాందిశీకులై కనుకనిం జని సకలభువనాధీశ్వరుపైఁ బరిగొని." కు. సం. ౨, ఆ. ౭౪.

కాంపిల్యము. సం. వి. అ. పుం. 1. దేశభేదము; 2. నగరవిశేషము; 3. కంపిల్లము♆.

కాంబవికుఁడు. సం. వి. అ. పుం. కంబు (శంఖ) సంబంధమైనవ్యాపారము చేయువాఁడు—1. శంఖములతో నగలు చేసి అమ్మువాఁడు; 2. శంఖ మూఁదువాఁడు.

కాంబోజము. సం. = కాంభోజము.

కాంబోజి. సం. = కాంభోజి.

కాంబోజుఁడు. సం. = కాంభోజుఁడు.

కాంబోది. దే. వి. సస్యవిశేషము. "ఏ. వెండియు నకాండప్రళయంబైనయయ్యనావృష్టిదోషంబున నం బ్రాపించిన మహాక్షామంబునం జేసి తద్దేశంబున రాజనంబు తేజంబు దొలంగె...కాంబోది బీదురాలె..." విష్ణు. నా. 3, ఆ. ౧౮౧.

కాంభోజము. సం. వి. అ. పుం. 1. కంభోజదేశపు గుఱ్ఱము; 2. పొన్న♆; 3. వెలిచంద్ర♆; 4. ఒకానొకదేశము. భో. ౧, ఆ. ౮౯.

కాంభోజి. ఉభ. దే. వి. వస్త్రవిశేషము. "ద్వి... కాంభోజి, పులిగోడపట్టును..." బస.3, ఆ. ౫౮.
పు. సం. వి. ఈ. స్త్రీ. 1. వెలిచంద్ర♆; 2. గురివెంద♆; 3. కారుగచ్చ♆; 4. ఒకానొకరాగము.
బ. ధాన్యవిశేషము. "సీ. చంద్రవంకలు జీని నరులు కాంభోజులు వంగాకుబొడమలు పొంగుఁ బ్రాలు." హంస. ౪, ఆ. ౧౨౮.

కాంభోజుఁడు. సం. వి. అ. పుం. 1. కంభోజదేశపు రాజు; 2. కంభోజదేశస్థుఁడు.

కాంస్యకారుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కంచరవాఁడు, కంచరి.

కాంస్యము. సం వి. అ. న. కంచు. పుం. న. కంచుపాత్రము. విణ. (అ. ఆ. అ.) కంచుది.

కాఁక. దే. వి. (కాఁగు. ధా.) 1. జ్వరము. (శ. ర.); 2. తాపము; విరహవ్యథ. ఆం. భా. ప్ర. ౪౯. "ఉ. ఆవనజాక్షి కాఁకఁ బొరలాడ నలంగిన సొమ్ము జీరలున్, వేవిన నూడ్చి..." ఆము. ౫, ఆ. ౧౫౫; 3. బాధ; "ఉ...ఇంక నన్, గాఁకలఁ బెట్టకే విను..." శశాం. 3, ఆ. ౬౧; 4. తపము. "ఉ. ఇంతిమృదూక్తిమాధురికి నిక్షురసం బెన వోలఁ జాల కా,ద్యంతము నోడి మధ్యమగుణాశ్రయమై నెఱకాఁక నెన్నిజ, స్వాంతరమున్ వహించియు..." వసు. ౨, ఆ. ౪౬; 5. కోపము. "ఉ. కాఁక నెవిర్చి సంగరముఖంబున హెచ్చిన రాజవంశమున్, గూఁకటివేళ్లతోఁ బెఱికి..." జై. ౧, ఆ. ౬౪. రుక్మా. ౪, ఆ. ౯౯; 6.

వేఁడిమి. "గీ. దరికొని వహించునకాఁకఁ దాళ లేక, తెరలి మృగములు మృగతృష్ణ కరిగి సొరుగు, మండు వేసవి..." ఉ. రా. ౨, ఆ. ౧౬౧. విణ. ఉష్ణము. (చూ. కాఁకవెలుఁగు.)

కాఁకదేఱు. దే. అ. క్రి. (కాఁక+తేఱు) 1. తప్తమగు. "సీ. నిగమఘోటలలాటనేత్రానలజ్వాలఁ గాఁకదేఱినకాముకాండములును." కవిరా. 3, ఆ. ౧౧౦; 2. గడిదేఱు, గడుసుమీఱు (వ:— వాఁడు అన్నిటఁ గాఁకదేఱినాఁడు.

కాఁకర. వై. వి. (సం. కారవేల్లిః.) కారవేల్లము. (దీనిభేదములు; అడవికాఁకర, ఆ కాఁకర, గొడ్డుకాఁకర, పొట్టికాఁకర మొ.) ఆం. భా. ద్వి. ౭౦. బహు. ౪, ఆ. ౧౪.

కాఁకరవత్తి = కాఁకరపువ్వువత్తి. (శ. ర.)

కాఁకరపువ్వువత్తి. వై. వి. (కాఁకర+పువ్వు+వత్తి) కాల్చునపుడు కాఁకరపువ్వువంటి యగ్నికణములు వెలిగ్రక్కు ఒకానొకబాణసంచు. (శ. ర. వా.)

కాఁకరా. ద్వ. వి. (కాఁక+రా.) వెలుఁగులరాజు, సూర్యుఁడు. "వ...కాఁకరా వెన్నెలగుత్తికం దోయిమన్నీఁడ..." ప్రబంధ. ౨౧౬.

కాఁకవడు. ద్వ. అ. క్రి. (కాఁక+పడు.) తప్తమగు, కాలు. "సీ. కర్బురేక్షణవహ్నికణవర్షములచేతఁ గరుబంతములు పెక్కు కాఁకవడఁగ." కంధ ౨౦.

కాఁకవెలుఁగు. దే. వి. (కాఁక+వెలుఁగు.) ఉష్ణరశ్మి, సూర్యుఁడు. "ఉ... దీప్తిచేఁ గాఁకవెలుంగురంగు నొకకానికిఁ గైకొనదు..." సుద. ౫, ఆ. ౧౫౫. రామా. 3, ఆ. ౫౨.

కాఁగ. = కాఁగా. ఆం. భా. తృ. ౭౦.

కాఁగడా. దే. వి. (కాఁగు+గడ.) కరదీపిక, చేతిదివ్వటీ. "మ. జగతీజ్యోతులు కాఁగడాలు... ఆరతులు నగ్నిజ్యోతులుగా వెల్గఁగన్." హంస. 3, ఆ. ౨౮.

కాఁగా. దే. అవ్య. ద్రు. (కాన్+కాన్) కనుక. "సీ. నీకుఁ గాఁగాఁ జేడె చేకూరినది కాక కొంచెగానికి సమకూడు టెట్టు." బహు. ౫. ఆ. ౧౦౮.

కాఁగాని. దే. విణ. (కాన్+కాని) కూడని; తప్పు గలది. "సీ. గారాబుకూఁతుపైఁ గాఁగానిపనిఁ బూనుపవనజసంభవుని నెమ్మనమువెలితి." నైష. ౭, ఆ. ౧౫౧.

కాఁగు. దే. అ. క్రి. 1. క్రాఁగు, తప్తమగు. "గీ. ఎఱ్ఱఁగా నగ్నిఁ గాఁగినయినుపయినుక." కాశీ. 3, ఆ. ౧౫౨. బహు. ౫, ఆ. ౫౬; 2. బాధపడు. "గీ... విరహాభరమ్మునఁ గాఁగి కుందు." ప్రబంధ. ౫౯; 3. కోపించు. "గీ. అనిన బులిఁ గోలవ్రేసిన యట్లు రేఁగి, కాఁగి హుమ్మని..." నృసిం. ౪, ఆ. ౧౩౦. వి. రాగిబిందె లేక డేగిసా. (పెద్ద బాన. అని. శ. ర.) "ఉ. ఆసల త్రుంపివెట్టి హృదయంబను కాఁగున యోగవాసనా, భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి..." ఉ. హరి. ౪, ఆ. ౧౬. పాండు. ౪, ఆ. ౨౧౧; 2. ఘటము, కుండ. "అ... కాఁగు కడప పనఁటిసాఁ, బరగు ఘటాఖ్యలు..." ఆం. శే. ౨౩.

కాఁగుడు. దే. వి. కాఁగుట, తపనము. (శ. ర.)

కాఁగుబిందె. దే. వి. (కాఁగు+బిందె) నీళ్లుకాఁచుట కుపయోగించురాగిబింద, డేగిసా. (వా.)

కాఁచేర. వై. వి. (సం. కాశావశీ.) కాసరము. ఆం. భా. ద్వి. ౭౦.

కాఁచి. వై. వి. (సం. కాకమాచీ.) కాకమాచి. ఆం. భా. ద్వి. ౭౦.

కాఁచు. దే. స. క్రి. (కాఁగు. ధా. ప్రే.) 1. తపింపఁజేయు, కాఁగఁజేయు. "సీ. గుజ్జుగాఁ గాఁచినగోక్షీరపూరంబు జమిలిమండెగలపై జల్లి చల్లి." నైష. ౬, ఆ. ౧౨౦; 2. చలికాఁచుకొను, చలిపోఁగొట్టుకొను. "గీ. సొరిది విహరించుకపులొకచోటఁ గూడి, కడిఁదిచలిచేత మేనులు గడ వడంక, రాత్రి మెఱుఁగారుఖద్యోతరాశిఁ జూచి, కణఁకుగాఁబోలు నని సీతు గాఁచుచుండ." నా. పంచ. ౧, ఆ. ౫౦౪; 3. కాల్చు, కాలఁజేయు. "గీ. పరకళత్రంబుకుచకుంభపాళియందు, నఖము దివిచినపాపాత్మునఖమునందు, నెఱ్ఱగా నగ్నిఁ గాఁచినయినుపసూదు, లుగ్రదృష్టిని జొన్పఁ డత్యాగ్రహమున." కాశీ. 3, ఆ. ౧౫౩; 4. (నొప్పిమొ. పోవుటకై) వెచ్చచేయు. "సీ. కాఁడినవిషకంటకములు మెల్లనఁ బుచ్చి తని వెచ్చఁ బాదపద్మములు గాఁచి." శై. ౬, ఆ. ౧౫. వి. ఖాదిరము, కవిరి. ఆం. భా. ద్వి. ౧౬౭.

కాఁచేవడియము. ద్వ. వి. (కాఁచు+వడియము.) కవిరియుండ. "గీ. కాఁచువడియంబు లవఁగను

గైరవ ళ్లఁ నంగ ఖాదిరఘుటికలు..." ఆం. శే. ౫౫.

కాఁజేయు. దే. స. క్రి. (కాన్+చేయు. అగు. ధా.) 1. కానించు, కలిగించు. "ద్వి. ఎక్కు తలంచిన నీరూప మైన, గ్రక్కున నప్పుడ కాఁజేయం గిరులు." బస. 3, ఆ. ౧౦౦౧ పం.; 2. పోఁగొట్టుకొను. (వా.); 3. దొంగిలించు. (వా.); 4. వ్యయించు. వ్యవ:—నాసొమ్మంతయుఁ గాఁజేసి నాఁడు; 5. ముగించుకొను. (వా.)

కాఁడ. దే. వి. 1. కూరాకు లోనగువానికాను. ఆం. భా. ద్వి. ౨౪౮; 2. తొడిమ. (శ. ర.) 3. బాణము. "ఆ. పొదను వచ్చుదాఁక నపరాధిపై దోప, నూఁగి చెఱుపవలయు పొదను వేచి, లక్ష్య సిద్ధిదాఁక లావునశర మూఁగి, కాఁడ విడుచు వింటివాఁడువోలె." ఆము. ౪, ఆ. ౨౪౩. (కాఁడన్ = నాఁటుకొనునట్లు అనియుఁ జెప్ప వచ్చును.)

కాఁడి. దే. వి. (త. కాడి.) ఎద్దుమెడ వానిమీఁద నుంచెడుబండి మొ వానియుగము. "చ. పవనజు చాపముల్ హరుల పగ్గములుం దునుమాడి కాఁడితో, నవి పెనఁగాడఁగా వెడఁదయమ్మునఁ గేతువుఁ గూల్చి..." భార. ద్రో. ౪, ఆ. ౨౩౩. "గీ. అట్టియరదంబు ముప్పదినూఱులక్షలందు నంటినకాఁడియు నన్ని రాజ, నముల విస్తారమై తురంగములకంధ, రములఁ దగులుచు వెలుఁగొందు..." భాగ. ౫ స్కం. ౨, ఆ. ౧౨. వి. కాఁపుడు గంజి. ఆం. భా. ద్వి. ౨౫౦.

కాఁడిగట్టు. ద్వ. వి. (కాఁడి+గట్టు.) ఒకపొలము నకు హద్దుగా నేర్పఱిచిన చిన్నగట్టు. (శ. ర. బ్రౌ.)

కాఁడిమాను. ద్వ. వి. (కాఁడి+మాను.) కూబరము, నొగ. వేంక. మాన. ౭౧.

కాఁడిమ్రాఁకు. ద్వ వి. కూబరము, నొగ. "సీ. నొగ కాఁడిమ్రాఁ కనఁ దగుఁ గూబరము..." సాం. ని. మాన. ౪౭.

కాఁడు. దే. అ. క్రి. 1. నాఁటుకొను, గ్రుచ్చుకొను. "సీ. కాఁడినవిషకంటకములు మెల్లునఁ బుచ్చి కనివెచ్చఁ బాదపద్మములు గాఁచి." జై. ౭, ఆ. ౧౫౯. ఉ. హరి. ౧, ఆ. ౧౫౪; 2. క్రమ్ము, సాంద్రమగు; దట్టమగు. "ఉ...భానుఁడు శీతభానుఁడున్, గాఁడిన మేఘకాళిమవికారము దూరముసేయుం .." పాండు. ౪, ఆ. ౪౩. స. క్రి. నాఁటు, గ్రుచ్చుకొను. "గీ. కంకటము దూఱి యంగంబు గాఁడి పోవఁ, గ్రూరనారాచ మేసిన స్రుక్కి నతఁడు." భార. ద్రో. ౨, ఆ. ౩౨. శ. సం. ౪, ఆ. ౭౩.

కాఁదారి = కాందారి. అర్ధరాత్రము. (చూ. కాఁదారిప్రొద్దు.)

కాఁదారిప్రొద్దు. ద్వ. వి. (కాఁదారి+ప్రొద్దు.) నిశీథసమయము, అర్ధరాత్రవేళ. "మ...,సంభోగేచ్ఛ నంతఃపురాం,గనలం గన్నుమొఱంగి యప్పురమునన్ గన్నెఱు కాఁదారిప్రొద్దున భీమేశుఁడు సానివాఁడ కరుగున్ ధూర్తప్రకారంబునన్." భీమ. ౧, ఆ. ౧౧౧.

కాఁదారిమాఁదారిప్రొద్దు = కాందారిమాందారిప్రొద్దు. "గీ. పడిపడిం జని పట్టి యీవాలుగంటి, నీవు పేరేమి యెవ్వఁడు నీమగఁడు, పూని కాఁదారిమాదారిప్రొద్దుకడను, నెందు వోయెదు తలిదండ్రు లెవ్వ రనిన." య. ౨, ఆ. ౭౯.

కాఁపడము. దే. వి. (కాఁచు. ధా.) నొప్పి గలచోట వేఁడిసీళ్లలో గుడ్డ ముంచి పిడిచి గాని వేడివస్తువుతోఁ గాని యొత్తుట, కాఁచుట. (శ. ర. వా.)

కాఁపత. దే. వి. (కాఁపు+అత్త.) కాఁపది, శూద్రస్త్రీ. (బ్రౌ. ఆం. పద.)

కాఁపది. దే. వి. (కాఁపు+అది.) శూద్రస్త్రీ. "క. కాఁపది యనఁ దగునా యది, కా పదియార్వన్నెనలరు కనకముఁ బుటముల్, కాఁప దిగిన డాల్పుతిమ..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౩౩.

కాఁపించు. దే. స. క్రి. (కాఁచు. ధా.) కాఁచఁ జేయు, పొంగునట్లు కాఁచు. "ద్వి. పిడికి కుండల పాలు బిందెలఁ బోసి, కాఁపించి నగరికిఁ గావళ్లఁ బంపి." నవ. ౧, ఆ. ౨౫. పు. ౧౪. పం. (క్రొత్తప్రతి.)

కాఁపు. దే. వి. (కాఁచు. ధా.) 1. శూద్రుఁడు. "క. ఓకాఁప యింద రమ్మని." భో. ౪, ఆ. ౫౯. ఆము. ౪; అ. ౧౩౩; 2. కర్షకుఁడు. ఆం. భా. ద్వి. ౨౫౯. "ఆ. కాఁపులావు పెఱవు గల్గి కర్షనము సేఁ యంగ..." భార. శా. ౧, ఆ.

౩౧; 3. కాఁపురము, నివాసము. "మ. అల పన్నిద్దఱుసూరులందున సముద్యల్లీలఁ గాపున్న వె, గ్గలపుందాపము..." ఆము ౧, ఆ. ౧౦. కళా. ౩, ఆ. ౨౬౦; 4. గృహస్థు, సంసారి. "సీ. కెలఁకుల నున్నతం గెడుజున్న గృహమేధి దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డి కాఁపు." స్వా. ౧, ఆ. ౬౬. దశ. ౬, ఆ. ౫౪. వి కాఁపడము. (వా.)

కాఁపుడు = కాఁపడము. (శ. ర.)

కాఁపుది = కాఁపది. (వా.)

కాఁపురము. దే. వి. 1. నివాసము. "సీ ..లాఁగల గ్రుస్సి యదవకాఁపురముండు నాఖుతతుల." ఆము. ౬, ఆ. ౧౩; 2. నివాసస్థానము, "క. పురమల్లదె...విభవములకుఁ గాఁపురమై శోభిలెడు ..." కళా. ౫, ఆ. ౧౦౦; 3. సంసారము. "ఉ...సుఖులై తలిదండ్రులు గూడి దేవియుఁ దాఁ, దేవరవోలె నుండి యిలు దీర్చఁగఁ గాఁపుర మొప్ప వానికిన్." స్వా. ౧, ఆ. ౫౩.

కాఁపురించు. దే. అ. క్రి. వసించు, కాఁపురము చేయు. "మ...ప్రియం, బెడుగక్ మర్త్యుఁడు కాఁపురింపఁ దగు లేదే యోగియై యొక్కచైలదరిం జేరికొనం దగున్..." మల్ల. వై. ౬౬.

కాఁపువచ్చు. దే.అ. క్రి. (కాఁపు+వచ్చు.) కాఁపురముండ వచ్చు, నివసింప వచ్చు. "గీ...నాకంబు వేడ్క, నయ్యోడకుఁ గాఁపువచ్చినయట్టు లుండె." భార. అను. ౨, ఆ. ౩౧౮. ఇట్లే: కాఁపులు వచ్చు. భార. విరా. ౨, ఆ. ౨౩౭.

కాఁపువాఁడు. దే. వి. (కాఁపు+వాఁడు.) శూద్రుఁడు (వా.)

కాఁపువోవు. దే. అ. క్రి. (కాఁపు+పోవు.) కాఁపురముగాఁ బోవు, వలసవెళ్లు. "వ...సముద్రంబు కాఁపువోవుచందం బయ్యె..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౩౦ ఇట్లే: కాఁపులువోవు. ఆము. ౧, ఆ. ౩౭.

కాఁబట్టి. దే. అవ్య. (కాన్+పట్టి.) కాఁగా, కనుక. "ఉ...సూతుఁడు తద్విధుండు కాఁబట్టి..." కాశీ. ౧, ఆ. ౭౬. ఆము. ౬, ఆ. ౬౬. ఆం. భా. తృ. ౭౦.

కాఁబడు. దే. అ. క్రి. (కాన్+పడు.) అగు. "చ...చెలిమి గాఁబడుఁగాక..." శై. ౨, ఆ. ౬౧.

కాఁబోలు. దే. అవ్య. ద్రు. (కాన్+పోలు.) ఔనేమో, ఊహను దెలుపును. "సీ. గంగాప్రవాహంబు గాఁబోలు నని వసిష్ఠాను లనుష్ఠానమాచరింప." విక్ర. ౭. ఆ. ౬౮. ఇట్లే: కాఁగఁబోలు. హరి. ఉ. ౭, ఆ. ౧౧౭.

కాక. ఉభ. దే. అవ్య—అగు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకరూపము—1. కాకుండుట. "చ. ఒకరుఁడ ధాత్రి యంతయుఁను నోర్చెఁ గృతాస్త్రుఁడు గాక యుండియుఁన్." భార. ఆర. ౫, ఆ. ౩౬౬; 2. పక్షాంతరమును దెలుపును. ఆం. భా. తృ. ౭౨; 3. కాని; అంతేకాని. "గీ. నీవు నలునకుఁ జేర్మితో దేవివైనఁ, గాక... నీ...భద్రలక్షణావళు లవి సఫలంబు లగునె." భార. ఆర. ౨, ఆ. ౨౦. "గీ. నిల్చి గెల్చిన సత్కీర్తి సెగడుఁగాక, దవ్వుదవ్వుల నిట్లైన నవ్వరెట్లు." భార. విరా. ౪, ఆ. ౬౨; 4. తక్క. "ఉ...నేనెకా, కెవ్వరు నీకుఁ బ్రాణపదము ..." విజ. ౩, ఆ. ౩౧; 5. ఆశీరర్థకము. "ఉ... అనాదిదంపతులు సత్కృప నిత్తురుగాక సౌఖ్యముల్." ప్రభా. పీఠి. ౨; 6 కానిమ్ము. "శా. అట్టే కా కని భూతి యందుకొని శైవాచారసంపన్నుఁడు..." హార. ౨, ఆ. ౮; 7. కదా. "ఆ. బ్రదుకవచ్చుఁగాక బహుబంధనములైన..." భాగ. ౮. స్క. ౧. ౫౯౮; 8. శాపమును దెల్పును. ఉదా:—వాఁడు భస్మీభూతుఁ డగుఁగాక; 9. ప్రతిజ్ఞానిశ్చయాదులను దెలుపును. "గీ...అతని సాధింతుఁగాక..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౮౪. "క...చాలింతముగా కింకఁ బోర లెస్సయున్నే." భార. భీష్మ. ౨, ఆ. ౩౪౦; 10. కామచారానుజ్ఞ దెలుపును. "ఆ...వచ్చుఁగాక లేమివచ్చుఁగాక, జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక, మాటఁ దిరుగలేరు మానధనులు." భాగ. ౮. స్కం. ౫౯౮. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకిదొండ♣; 2. కారుకొల్లి♣; 3. కాకమాచి♣; 4. కాకజంఘ♣; 5. గురివెంద♣.

కాకచించ. సం. వి. ఆ. స్త్రీ. గురివెంద♣.

కాకచించి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. కాకచించ♣.

కాకజంఘ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకిదొండ♣; 2. వెలమసంది♣.

కాకజంబుక. సం. వి. ఆ. స్త్రీ. కాకినేరేడుచె.

కాకతాళీయము. సం. వి. అ. న. దైవికముగా నేక కాలమున రెండుపనులు జరగుట. విణ. (అ. ఆ. అ.) కాకి వాలఁగాఁ దాటిపండు పడినవిధము వంటిది, ఆకస్మికసంభవము.

కాకతిందుకము. సం. వి. అ. పుం. నల్లతుమికిచె.

కాకతుండఫల. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండచె.

కాకతుండము. సం. వి. అ. పుం. 1. కాలాగరువు; 2. బాకా; 3. ఒకరకపుబాణము.

కాకనాసిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకిదొండచె; 2. ఎఱ్ఱతెగడచె.

కాకపక్షము. సం. వి. అ. పుం. 1. కాకిఱెక్క; 2. కూఁకటి, పిల్లజుట్టు.

కాకపదము. సం. వి. అ. పుం. ఒకానొకరతిబంధము. న. 1. కాకిపదముకొలఁది; 2. ఒకానొకగుఱుతు; 3. వజ్రదోషము. "ఆ. నడుమ నడ్డనిడుపు నల్లని రేఖలు, గలిగెనేని నదియుఁ గాకపదము, వలదు విలువ నిట్టివజ్రంబు దాల్చిన,జముఁడు దిట్టినట్లు చచ్చు నిజము." రత్న. ౨౮.

కాకపాణి. సం. వి. ఇ. న. రత్నదోషవిశేషము. "సీ...ఘననీలవర్ణంబు కాకపాణి..." రత్న. ౫౦.

కాకపీలుకము. సం. వి. అ. పుం. కాకితుమికిచె.

కాకపుష్టము. సం. వి. అ. పుం. పరపుష్టము, కోయిల.

కాకవల్లి. సం. వి. ఈ స్త్రీ. అడవిమల్లెచె.

కాకమాచి. సం. వి. ఈ. స్త్రీ. కాఁచిచె.

కాకమాత. సం. వి. ఋ. స్త్రీ. కాఁచిచె.

కాకము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. కాకివలె తలనుమాత్రము ముంచి చేయుఁస్నానము; 3. మానభేదము. 4. ఒకద్వీపము. న. కాకులగుంపు; 2. రతిబంధవిశేషము; 3. ఇంచుకజలము.

కాకముద్గ. సం. వి. ఆ. స్త్రీ. పిల్లపెసరచె.

కాకరి. దే. విణ. (కాకు+అరి.) వ్యర్థుఁడు. ఒంటి. శ. ౧౭.

కాకరుము. సం. వి. ఆ. స్త్రీ. వందాచె.

కాకరూకుఁడు. సం. వి. అ. పుం. స్త్రీజితుఁడు, భార్యకు వశుఁడైనమగవాఁడు. విణ. (అ. ఆ. అ.) 1. పిఱికివాఁడు; 2. దిగంబరుఁడు; 3. దరిద్రుఁడు.



కాకలము. సం. వి. అ. పుం. 1. కంఠమణి; 2. కాగితము; 2. (శ. ర.); 3. మాలకాకి.

కాకలి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. సూక్ష్మమగునవ్యక్త మధురధ్వని; 2. ఒకానొకవాద్యవిశేషము; 3. గురివెందచె. (వాచ.)

కాకాంగి. సం. వి. ఈ. స్త్రీ. కాకిదొండచె.

కాకాదని. సం. వి. ఈ. స్త్రీ. 1. గురివెందచె; 2. తెల్లగురివెందచె.

కాకి. ఉభ. వై. వి. (సం. కాకః. క. కాకె. త. కాక్కై.) వాయసము. (బొంతకాకి, నీరుకాకి, మాలకాకిమొ. దీనిభేదములు) ఆం. భా. ద్వి. ౯3. "గీ. కాకికడకంటిపైచూపు రాకమున్న." కాశీ. 3, ఆ. ౧౭౪. (ఇది వ్యర్థకసూచక మగు చూపు.) విణ. అల్పము, నీచము. ఉదా:—కాకి బంగారము. సం. వి. ఈ. స్త్రీ. 1. అఁడుకాకి. 2. వాయసీలత; 3. కాకుకొల్లిచె.

కాకికలువ. ద్వ.వి. (కాకి+కలువ.) అల్లిపువ్వు, కాకోత్పలము. (శ. ర. బ్రౌ.)

కాకిచిప్ప. ద్వ. వి. (కాకి+చిప్ప.) నీటిగుల్ల, శంబూక. ఆం. భా. ప్ర. ౧౬౧. య. 3, ఆ. ౨౯. య. 3, ఆ. ౨౯. హంస. ౪, ఆ. ౧౭౬.

కాకిచెఱకు. ద్వ. వి. (కాకి+చెఱకు.) చెఱకువంటి తృణవిశేషము. ఆం. భా. ద్వి. ౭౫.

కాకిచావు. ద్వ. వి. (కాకి+చావు.) 1. ఆకస్మికమరణము. (శ. ర. బ్రౌ.); 2. దిక్కుమాలిన చావు. వా:—వాఁడు తుదకు కాకిచావు చచ్చినాఁడు.

కాకిణి. సం = కాకణి.

కాకణిక. స. వి. ఆ. స్త్రీ. తూనికయందు స్వల్పపరిమాణము. "వ. ...కురుక్షేత్రంబునం గాకిణికామాత్రంబైనను గనకంబు దానఁబొనర్చినదాతలు..."కాశీ. ౨, ఆ. ౭౯.

కాకితము. వై. వి. (సం. కాగదమ్. త. కాకితం.) 1. వ్రాయుట కుపయోగించుపత్త్రవిశేషము. ఆం. భా. ద్వి. ౧౭౭. "ఉ...,కన్నులపండువై యమరుఁ గాకితమందలి వర్ణపద్ధతుల్."భీమ. ౧, ఆ. ౭3; 2. ఉత్తరము, జాబు. "గీ...కొప్పులోఁ జెక్కుకొన్న, కాకిత మొసంగ శిరమునఁ గదియఁ జేర్చి, యంతగోట లకోట యొక్కింత విచ్చి." సావి. ౧, ఆ. ౯3.

కాకితీపు. ద్వ. వి. (కాకి+తీపు.) మూర్ఛరోగవిశేషము, కాకిసొమ్మ. (శ. ర.)

కాకితుమ్మికి. ద్వ. వి. (కాకి+తుమ్మికి.) నల్లతిందుకము వృ. (శ. ర. బ్రౌ.)

కాకిదము = కాకితమము. (ఆం. పద.)

కాకిదొండ. వై. వి. (కాకి+దొండ) కాకతుండివృ. ఆం. భా. ద్వి. ౬౦.

కాకినేరేడు. ద్వ. వి. (కాకి+నేరేడు.) కాకజంబువృ. ఆం. భా. ద్వి. ౪౬.

కాకిపిట్ట. ద్వ. వి. (కాకి+పిట్ట.) కాకము, కాకి. "సీ. కాకిపిట్టకుఁ జాలకడిలేని బ్రదు కిడి..." సీలా. ౧, ఆ. ౧౧౧.

కాకిపెంపుడు. ద్వ. వి. (కాకి+పెంపుడు.) పరభృతము, కోయిల, కాకపుష్టము.

కాకిపెసర. ద్వ. వి. కాకముద్గవృ. ఆం. భా. ద్వి. ౫౮. బ. పిల్లిపెసలు. ఆం. భా. ద్వి. ౨౩౫.

కాకిబంగారు. ద్వ. వి. (కాకి+బంగారు.) పీతాభ్రకము, ఒకరకపుఅభ్రకపుతేకు. ఆం. భా. ద్వి. ౨౭౮.

కాకిబాతు. ద్వ. వి. ఒకవిధమైనఅడవిబాతు. (శ. ర. బ్రౌ.)

కాకిబేగడ. ద్వ. వి. (కాకి+బేగడ.) కాకిబంగారు. "ద్వి. కాకిబేగడబొట్టు..." ద్వి. పరమ. ౪, ఆ. ౩౨౩ పు.

కాకిమేడి. ద్వ. వి. (కాకి+మేడి.) కాకోదంబరివృ. ఆం. భా. ద్వి. ౪౨.

కాకిరెక్కలు. ద్వ. వి. బ. (కాకి+రెక్క) కాకపక్షము. బ. ధాన్యవిశేషము. "సీ... కాకిరెక్కలు పుష్పమంజరులు సీతాభోగసరులు..." హంస. ౪, ఆ. ౧౭౮.

కాకిరెల్లు. ద్వ. వి. (కాకి+రెల్లు.) తృణవిశేషము, (దీనిపుల్లలను చివర సన్నముగా చెక్కి కలములుగా నుపయోగింతురు.) (శ. ర.)

కాకివెదురు. ద్వ. వి. ఒకజాతితృణము. హంస. ౫, ఆ. ౪౪.

కాకిసొమ్మ = కాకితీపు. (శ. ర.)

కాకు. దే. వి. 1. గాసి, బాధ. "క. కాకులలోఁ గోకిలములు, కాకులఁ బడలేక గులముఁ గలయఁగ..." ద్వా. ౭, ఆ. ౯; 2. నింద, అవమానము. (చూ. కాకుచేయు.) విశ. 1. వ్యర్థము. (చూ. కాకుచేయు.); 2. కళావిహీనము. "ద్వి. వైకుంఠనగరంబు వనజారికరము, నోఁకనికుముదంబు జోకఁ గాకయ్యె." విష్ణు. పూ. ౨, ఆ. (శ. ర.) 3. చెల్లాచెదరు. "క. పాకారిదురాలోక, ప్రాకారాకారపురపరాభవపరిపా, కాకులుఁగా కాకుల వలె, గాకై చనఁజొచ్చి రెల్లకడలకు నసురుల్." రామా. ౬, ఆ. ౨౫౧; 4. వివాదపడినది. "శా... ఇద్దఱుసతుల్ వాక్యోపవాక్యంబులన్, గాకై మంచలపట్టుకుం దొడఁగి రా కల్యాణ వేదిస్థలిన్." పాంచా. ౪, ౨౪.

కాకుఁడు. సం. వి. అ. పుం. 1. కుంటివాఁడు; 2. అతిధృష్టుఁడు.

కాకుఁదనము. దే. వి. (కాకు+తనము.) దుశ్చేష్ట, చెడుపని. "ఉ. కాకుఁదనంబుచేసెఁ గొడుకా యిఁక నేమన నేర్తుఁ గోడలిన్." వేం. పంచ. ౪, ఆ. ౪౨౮.

కాకుచేయు. దే. స. క్రి. (కాకు+చేయు.) 1. అవమానించు. "గీ... అతఁడు జమునిలావు, చేవయుంను బొల్లుగాఁ గాకుచేసి విడిచె. పారి. పూ. ౪, ఆ. ౧౫౫; 2. అణఁగఁగొట్టు. "సీ. ఒకటిచ్చి తోన వేఱొకటిఁ గోరినయట్టికానీను గర్వంబుఁ గాకుచేసి." చంద్రా. ౧, ఆ. ౨౧; 3. ఆక్రమించు. "సీ... గాలి రజోవ్యాప్తిఁ గాకుచేసి..." పసు. ౪, ఆ. ౧౨, (ఇది రెండుమూఁడర్థములకుదాహరణము.) 4. గాసిపెట్టు, బాధించు. "ద్వి. కలికిపైఁ బడి తద్దఁ గరఁగించు నిన్నుఁ, గాకున్న నెపైన్నఁ గల్లలు గూర్చి, కాకుచేయఁను రాజుగారితోఁ జెప్పి." ద్వి. తి. సా. ౧ భా. ౬ పు; 5. వ్యర్థపుచ్చు, పొల్లుపోఁ జేయు. "మత్త... నిను వేఁడుకార్యముఁ గాకుచేయక చేయుమీ. హైరా. ౧, ఆ. ౭౨.

కాకుదము. సం. వి. అ. న. తాలువు, దౌడ.

కాకున్నె. దే. అవ్య. (కాక+ఉన్నె.) కదా, నిశ్చయార్థకము. "ఆ. అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగికా, కున్నె యిట్లు సేయ నువిద కడఁగ." భార. అర. ౨, ఆ. ౭౬౪.

కాకుపడు. ద్వ. అ. క్రి. (కాకు+పడు.) కలఁగు, క్షోభపడు. "క. చీకటికాటుకపెట్టెలు, కాకు పడన్ భాస్కరుండు కరజాలకముల్, పీక నిగిడింప..." శశాం. ౪, ఆ. ౧౭౭.

కాకుపఱుచు. ప్ర. స. క్రి. (కాకుపఱుచుధా. ప్రే.) వశపఱుచుకొను, అనుకూలపఱుచుకొను. "సీ. మెల్లనివగవుల నేనులు మఱపెంచి కడుజాణ మాటలఁ గాకుపఱిచి." భాగ. ౮ స్క. ౩౧౮.

కాకువు. సం. వి. ఉ. స్త్రీ. 1. శోకభయాదులచేఁ గలుగుధ్వనివికారము; 2. జిహ్వ; 3. ప్రశ్నము నను వ్యతిరేకభావము తెలుపుధ్వనిభేదము.

కాకుసేయు = కాకుచేయు. 1. (నిందించు.) "క. పరతత్త్వ మెఱుఁగ కూరక, పరమర్షులతోడ నేన పరముఁడ నంచుకా, సురులెల్లఁ గాకుసేయఁగ, దురహంకృతిఁ బలుకఁ దగునె తోయజగర్భా" కాశీ. ౫, ఆ. ౭౮; 2. తిరస్కరించు; జయించు. "సీ. బిగువుఁజన్నులయొప్పు పృథులాబ్జకోరకకరి కుంభములనైనఁ గాకుసేయు." పరమ. ౨, ఆ. ౩౭; 3. పోఁగొట్టు. "సీ. కావంబనికురంబకలిత మై ప్రవహించుకాళిందిగర్వంబు గాకుచేసి." స్కా. ౩, ఆ. ౧౯; 4. లోపింపఁజేయు, లేకుండఁజేయు. "సీ. శబ్దశర్కారార్థవైశారద్యమున శ్రుతికట్వాది దుష్టత కాకుసేసి." కాళిం. ౬, ఆ. ౧౭౧.

కాకేందువు. సం. వి. ఉ. పుం. కాకితుమ్మికపు.

కాకేమి. దే. అవ్య. (కాక+ఏమి) మఱియొకదాని లేమిని తెలుపును. "వ... అశుచిభావంబునం గాకేమి యప్పురుషుపతివ్రత మదీయదృష్టిగోచర గాకున్న దయ్యె..." భార. ఆది. ౧, ఆ. ౯౭.

కాకోదరము. సం. వి. అ. పుం. - ఉదరముతో కుటిలముగా నడచునది—పాము. "క. కాకోదర కుందవరపు కవిచౌడప్పా." కవిచౌడప్పశతకము.

కాకోడుంబరము. సం. వి. అ. పుం. బమ్మమేడిపు.

కాకోలము. సం. వి. అ. పుం. 1. మాలకాకి; 2. పాము; 3. అడవిపంది. పుం. న. విషభేదము. న. నరకభేదము.

కాకోలి. సం. వి. ఈ. స్త్రీ. కాయకొల్లిపు.

కాక్షము. సం. వి. అ. పుం. కడకంటిచూపు, న. (కోపాదులవలని) కుత్సితదృష్టి. విణ. (అ. ఈ. ఆ.)—కోపాదులవలని - కుత్సితదృష్టి గలది.

కాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. అడవితొగరిపు; 2. తొగరిపు; 3. తొగరిమన్ను, సౌరాష్ట్రమృత్తిక. (ఇదియే గోపీచందనము. సువాసితము.)

కాగడము. సం. వి. అ. న. కాగితము.

కాగము. సం. వి. అ. పుం. కాకి.

కాగితము = కాకితము. (క. కాగ౭. హిం. కాగజ్. సం. కాగదం.) వ్రాయుటకు. "గీ... కాగె, తంపు పరమాను...") దశా. ౩, ఆ. ౪౫.

కాగిదము = కాగితము. "సీ. దట్టముగఁ బెట్టియల లోనఁ బెట్టియున్న, తసకుబంగారుజిగి కాగిదము లలోన, సారముగ వ్రాసియున్న వస్తూరిఁ జూచి." కృష్ణ. ౩. ఆ. ౧౦౭. ఆంధ. పీఠి. ౧౦౭.

కాగిన. దే. వి. ఒకజాతిచేఁప. (శ. ర. బ్రౌ.)

కాచనకి. సం. వి. న్. పుం. వ్రాఁతప్రతి.

కాచమణి. సం. వి. ఇ. పుం. గాజుపూస.

కాచము. సం. వి. అ. పుం. 1. గాజుమన్ను; 2. గాజుపూస; 3. కావడిముట్టి; 4. నేత్రరోగ విశేషము; 5. అత్యల్ప మగువిలువ గలనాణెము, కానుదమ్మిడీ. "శ్లో. కాచాయ నీచం కమ నీయవాచా మోచాఫలస్వాదుముచా నయాచే, దయా కుచేలే ధనవత్కుచేలే స్థితే కుచేలే శ్రితమా కుచేలే." న. గాజుప్పు, కాచలవణము.

కాచస్థాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. గాజుపాత్ర; 2. కలిగొట్టుపు.

కాచికొను = కాచుకొను. (చూ. కాచికోలు.)

కాచికోలు=కాచుకోలు. "చ... మానినికిం దనుదాన కాచికోలాదవిన..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౦౫.

కాచిఘుఁడు. సం. వి. అ. పుం. తల్లిదండ్రులు లేని బిడ్డఁడు. (షే. ని.)

కాచితము. సం. విణ. (అ. ఆ. ఆ.) కావడియం దుంపఁబడినది. (కుండమొ.)

కాచు. దే. అ. క్రి. 1. ప్రతీక్షించు. "ఉ... ఆశచీ, కాంతుఁడు గాచినాఁడు కుతుకంబున నీదుకటాక్షవీక్షకున్." దశా. ౭, ఆ. ౭౬; 2. (వెన్నెల,ఎండ) కాయు, ప్రసరించు. "ఉ... కాఁడదవిఁ గాచినవెన్నెల..." ఉ. రా. ౩, ఆ. ౧౧౬. "క... పటుతర, విలయానలభాతి నెండ వేసవిఁ గాచెన్." కు. సం. ౬, ఆ. ౧౩౫; 3. పుట్టినకాయలు గలుగు. "మానిని. కాచి బెడంగుగఁ బండినయానసహాకారములం గదళీ తతులం, జూచుచు..." భార. ఆది. ౪, ఆ. ౨౦; 4. (కాయమొ.) కలుగు. వా:—పూ

మామిడిచెట్టు నూఱుకాయలు కాచినది. స. క్రి. 1. రక్షించు. "సీ...విప్రకులము సెల్లఁ, బ్రోచుచు శరణన్నఁ గాచుచు భిక్షుల..." భార. ఆది. ౧, ఆ. ౭; 2. క్షమించు. "ఉ. కాతురు తప్పు విశ్వనయకార్యధురంధరు లైనభూపతుల్." కాశీ. ౬, ఆ. ౨౨౩. "క...మరుల్, గావుము ప్రోవుము..." పారి. పూ. ౭, ఆ. ౨౩౮; 3. ఆఁపుకొను, నిగ్రహించుకొను. "ఉ...మనంబునఁ బొంగువిషాదరోషముల్, గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై." భార. ఉద్యో. 3, ఆ. ౧౧౪; 4. సమయము కనిపట్టు, (అవసరమునకు) ఎదురుచూచు. "ఉ. కీచకకోటి చేత నొకకీడును బొందక వచ్చితమ్మ...వే, కాచి విరోధులం దునుమఁగా నిటు మట్టుదురమ్మ నీపతుల్." భార. విరా. 3, ఆ. ౪౫; 5. (కాయము కాయమొ.) బయలుదేఱు; పుట్టు. "ఉ...పనులు సైకొని వారక చేయుచుండుటన్, మున్నటులున్నపాణితలముల్ బలుగాయలు గాచెఁ జూచితే." భార. విరా. ౨, ఆ. ౨౨౧; 6. ప్రసరింపజేయు, కాయఁజేయు. "గీ. వెలుఁగు లెల్లెడఁ గాచుచు నలరునిర్ధ,వేఁటకాఁ డప్పుడెంతయుఁ దేటమీఱె." అచ్చ. అయో. ౪౨. వి. మాంసము. (చూ. కాచుమేపరి.)

కాచుకొను. దే.అ. క్రి. (కాచు+కొను స్వార్థమున.) ప్రతీక్షించు. "వ. నలకూబరుశాపానుభవంబునకుం గాచుకొని యుండువానికి..." కళా. ౪, ఆ. ౧౭౭. స. క్రి. రక్షించు. "గీ. దోసమును నపకీర్తియుఁ దొలఁగఁ బెట్టి, నాఁడు గురుఁ గాచుకొంటివి..." విక్ర. 3, ఆ. ౧౨౯.

కాచుమేపరి. దే. విశే. (కాచు+మేపు+అరి) మాంసాశనుఁడు, రాక్షసుఁడు. (ఆం. పద.)

కాచూకము. సం. వి. అ. పుం. 1. కోడి; 2. జక్కవ.

కాజి. దే. వి. 1. ఒకానొకచెట్టు. "సీ. యువజనరాగపయోరాసు లుప్పొంగ వెలిబిమ్మి కాజిపువ్వులు ముడుంగ." పారి. ౨, ఆ. ౪౯. (శ. ర. పా. 'జాజి' ముద్రి.); 2. (హిం. క్వాజీ.) మహమ్మదీయన్యాయాధిపతి.

కాట. దే. వి. 1. కడుగు. "చ...ఇది దినంబును గంజియుఁ గాటఁ బోసి పెంచిన నిట నుంటు..." చెన్న. ౨. ఆ. ౨౬. (చూ. ౨౭.); 2. గంజి. (బ్రౌ.)

కాటకము. దే. వి. కఱవు, క్షామము. (శ. ర.)

కాటము. సం. వి. అ. పుం. కూపము, నూయి.

కాటా. హిం. వి. (హిం. ఖాటా.) ధాన్యాదులు తూచుసాధనము. (శ. ర. వా.)

కాటిక = కాటుక. (బ్రౌ. వా.)

కాటికాఁడు. ద్వి. వి. (కాడు+కాఁడు.) (శ్మశానమునఁ దిరుగునట్టి?) పక్షివిశేషము. ఆం. భా. ద్వి. ౯౭.

కాటికాపరి. ద్వి. విశే. (కాడు+కాపు+అరి.) శ్మశానపుఁగావలివాఁడు.

కాటికాపరితనము. ద్వి. వి. (కాటికాపరి+తనము.) శ్మశానపుఁగావలియుద్యోగము. "వ...నీకుఁ గాటికాపరితనం బిచ్చితి నందుఁ బుట్టినధనంబునందు ...నీవు రెండంశంబులు గొని బ్రతుకు మని..." మార్క. ౧, ఆ. ౨౩౪.

కాటిపాపఁడు. ద్వి. వి. (కాడు+పాపఁడు.) 1. గొల్లవాఁడు. "ద్వి. కాటిపాపఁడు పసిఁ గాచుచునుండ." బస. ౪, ఆ. ౩౧౮. పు; 2. కాటికాపరి. "ద్వి. పాటలగంధి నీపలు కియ్యకొనఁగఁ, గాటిపాపని కేల కరుణ నీమీఁద." ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౮౪. పం.

కాటిపాపలవాండ్రు. ద్వి. వి. బ. జాలవిద్య చేయునాటవికజనవిశేషము. (శ. ర. బ్రౌ.)

కాటిఱేఁడు. ద్వి. వి. (కాఁడు+ఱేఁడు.) శ్మశానాధిపతి, శివుఁడు. "గీ. కాటిఱేనికి మీఁదుగాఁ గట్టియున్న, గట్టివరహాని వరహాని గాఁగఁ జూడ..." శుక. 3, ఆ. ౫౦. "గీ...కాటిఱేనిఁ, గొలిచి." కాళ. 3, ఆ. ౪౯.

కాటు. దే. వి. 1. కఱచుట. "చ...మార్గ లందఱున్, గలఁగొనఁ బాఱిరో యిఁకయ కాటుల మ్రానుచున్ భయంబునన్." కు. సం. ౯, ఆ. ౧౧౭; 2. కఱచుటవలనఁ గలుగుగాయము. "చ...మా, కఱచినకాట్లకున్..." నృసిం. ౪, ఆ. ౪౩; 3. గాయము. (చూ. కాటుప.ఐ.); 4. మాఁడువాసన. "సీ. వెలికాటు గ్రమ్మఁ గూరలరుచుల్ గొన నేల పరు లెన్న నేల స్వభార్యగుణము." రామలిం. ౫౫. సా:—కప్పకాటు బాపనపోటు.

కాటుక. దే. వి. కజ్జలము, కంటికి నుపయోగించు నల్లని లేపనద్రవ్యము. "చ. ఘనగతశంపఁ గంచ మిడి గాటుకదీర్చి..." ఆము. ౨, ఆ. ౧౬. నైష. ౭, ఆ. ౧౯౩. "చ. చలువలజేనియప్పా డుపుఁజాయఁ దొలంగినకందు దోఁచె రే,చెలువ కనుంగవం గమియఁ జెందినకాటుకకప్పుకైవ డిన్." పారి. ౨, ఆ. ౮౭.

కాటుకకొండ. ద్వి. వి. (కాటుక+కొండ.) అంజనాద్రి. "ఉ. కాటుకకొండఁ బోలుమెయికాంతి ..." దశా. ౩, అ. ౧౪౫.

కాటుకపట్టు. దే. అ. క్రి. (కాటుక+పట్టు.) నల్లఁబాఱు, నల్లపడు. "క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండము చెమ్మయుటికి రూక్షార్క విభా, రహితతఁ గాటుకపట్టెను, రహి చెడి యన సంధ తమసరాసులు బెరసెన్." స్కా. ౩, ఆ. ౨౪.

కాటుకపిట్ట. ద్వి. వి. (కాటుక+పిట్ట.) కూఁకటి గువ్వ, ఖంజరీటము. ఆం. భా. ద్వి. ౯౦. (కాటుకపిట్టలు రతిచేయుస్థలమున ధన ముండునని వాడుక. చూ. వసు. ౩, ఆ. ౧౦౪.) సాం. ని. తిర్య. ౪౧.

కాటుకరేకులు. దే. వి. (కాటుక+రేకులు.) ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

కాటుకఱాయి. దే. వి. (కాటుక+ఱాయి.) సౌవీరాంజనము. (శ. ర. బ్రౌ.)

కాటుకజెకులపాము. దే. వి. కాటుకవలె నల్లని పొడలు గలపాము, పులిపెంజెర. (శ. ర.) ఇట్లే: కాటుకజెకులపొడ. (బ్రౌ.)

కాటువడు. ద్వి. అ. క్రి. (కాటు+పడు.) గాయము పడు, క్షతమగు. "సీ. తలలుఁ జీరలును గంపలు వట్టుకొని గాసిగా మ్రగ్గుటడవులఁ గాటువడియుం." నిర్వ. ౮, ఆ. ౭౬.

కాటుబంటు. దే. విశే. (కాటు+బంటు.) బాగుగా కాటువేయునది. (కుక్క మొ.)

కాటుబంటుఁదనము. దే. వి. (కాటుబంటు+తనము.) బాగుగాఁ గఱచుశక్తి. "గీ. అని యిటులు వేఱువేఱ నాయకునియెదుటఁ, గాటుబంటుఁ దనంబులు వేఁటకాండ్రు, మెచ్చి పొగడుచు మెకములమీఁద గొలుసులుబిపి జాగిలముల నుసికొలిపిరపుడు." సా. ౧, ఆ. ౯౨.

కాటులాడు. దే. అ. క్రి. (కాటులు+ఆడు.) కాట్లాడు, కలహించు. "సీ. అసుఖదం బైనరాజ్యామిషంబునకుఁ గుక్కలభంగిఁ దమలోనఁ గాటులాడి." భార. శాం. ౧, ఆ. ౮౫. "గీ. శిఖలు వీడఁగ ముఖములు జేగురింపఁ, గటము లదరంగ నొకవిడిఁ గాటులాడి, యొండొరులమీఁద శాపంబు లుగ్గడింప..." భీమ. ౮, ఆ. ౧౪౮.

కాటువోవు. దే. అ. క్రి. (కాటు+పోవు.) కాటువాసన గల దగు; మాఁడి యడుగంటినవాసన గొట్టు. "సీ...అపచన గాక క్లిష్టము గాక కాటువోక, గీ. దివ్యమై భవ్యమై సుధాదీప్ర మగుచు, స్వాదుతర మైనచొక్కపుటోదనమ్ము, ప్రియము నొదవించె..." సాంబో. ౫, ఆ. ౨౯౫.

కాట్రగడ. దే. వి. కంపకోట. (శ. ర.)

కాట్రేఁడు = కాటిజేఁడు "ఉ...కాట్రేఁడిలువేలుపౌచు నొనరించె మనోరథసిద్ధిసంపదల్." శివరా. ౩, ఆ. ౪౩. య. ౨, ఆ. ౩. పార్వ. ౬, ఆ. ౪౮.

కాట్లాడు = కాటులాడు. (చూ. కాటులాడు.)

కాఠిన్యము. సం. వి. అ. న. 1. కఠినత్వము; 2. నిర్దయ; 3. నిష్ఠురత్వము.

కాడు. వై. వి. బొ. (సం. కటః. క. త. కాడు.) 1. శ్మశానము, వల్లకాడు. ఆం. భా. ద్వి. ౨౨౫. 'సీ. దివ్యమందిరములఁ దిరిగెడునరుఁడైన నొకఁ గాడు కానక యుండలేఁడు." భల్లా. ౧, ఆ. (శ. ర.) భార. అను. ౩, ఆ. ౨౧౦. "క. ఎంత గడించినఁ గూటికి, నెంతటివాఁడైనఁ గాటి కిందునిభాస్యా." కుచేల. ౧, ఆ. ౭౪; 2. అడవి, కాననము. "సీ. నిరుపాధినిస్సీమనిర్నిబంధనవృత్తి గలమహాప్రతిభ యేకాటఁ గలిసె." శివరా. ౨, ఆ. ౧౦౯; 3. నాశము; కీడు; "ఉ...శివునిభార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిన్, గాడొనరింపఁ జూచెదవు..." భీమ. ౨, ఆ. ౧౧౨. సా:—కాటికిఁ గాళ్లుచాచుట = మరణమునకు సిద్ధముగా నుండుట. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౫౭. సం. అ. క్రి. వేఁడెక్కు. (కాఱు? అని సూ.ని.) "ఉ. వాడినవక్త్రపంకజము...,కాడినకన్నునీరు ..." కు. సం. ౧౧, ఆ. ౫౬.

కాడుచేయు. వై. స. క్రి. (కాడు+చేయు.) కాడ్పఱచు, క్షోభపెట్టు. (గోదావరి) "గీ. ఒక్కనది

పొంత గార్హ్యస్థ్యయుక్తమైన, పుణ్యాలప మాచరించుచుఁ బుణ్యజనులు, తాగు బంధులుఁ దామర తంప రగుచుఁ, గూడియుండఁగ నెంతసుఖంగాడుచేసి." భీమ. ౪, ఆ. ౧౮౦.

కాడుపడు. వై. అ. క్రి. (కాడు+పడు.) 1. మఱుఁగుపడు, కనఁబడకుండు. "చ. తనయుఁ డొకండు వాఁడు గుణధాముఁడు శ్రీడసవాంఛ సాంద్రకా, ననమున కేఁగి కాడుపడినం బడవం జనుదెంచి ..." భార. శాం. 3, ఆ. ౧౫౮. ('సుతం నష్ట మన్వేష్టుం వనమాగతం.' మూలము.) నిర్వ. ౪, ఆ. ౭౬; 2. నశించు, చెడు. "గీ. కటకటా మీవివేకంబు గాడుపడఁగ." భీమ. ౪, ఆ. ౫3; 3. కలఁతపడు, వ్యాకులమగు. "ఉ. ఎవ్వఁడ వీవు కాడుపడి యేకత మేటికి సంచరించెదు..." చెన్న. 3, ఆ. ౭౫. ఉ. రా. ౧, ఆ. ౧౨౬; 4. ధర్మక్షయ మగు, సర్వధర్మములు నశించు. "క. కూడమ్మికొంద్రు జనములు, బొడబు లాగ మను లమ్మి బ్రదుకుదు రెంసుం, జేడియ లమ్ముదు రచ్చోటు, గాడుపడినకలియుగమునఁ గౌరవముఖ్యా." హరి. ఉ. ౯, ఆ. ౪౨; 5. దారి తప్పు. "ఆ. నరులుందిఁగె మెట్టి యిరు లన్ననో యని, యెదుతమిస్రఁ గాడుపడి పొలంబు, లెల్లఁ దిరిగి..." ఆము. ౬, ఆ. ౧౨. (చూ. ౧౪.)

కాడుపఱుచు. వై. స. క్రి. (కాడుపడు. ధా. ప్రే.) 1. చిక్కులఁబెట్టు, శ్రమపఱుచు. "సీ. మమ్ముఁ బాపఁ గాలుండు మాయాకురంగమై పరుపాటవులఁ గాడుపఱిచె నకట." భా. రా. సుం. ౧౫౯; 2. విడిచిపుచ్చు; ఎడఁబాయు. "గీ. అబలఁ గడు నెడ యెఱుఁగనియాఁటదాన, మెలఁత నతిభీత నన్ను నమ్మించి తెచ్చి, కాననంబులోఁ గన్నులు కట్టి కాడు, వఱిచి నీ కిట్టు పోఁ జన్నె భావజన్మ." కు. సం. ౫, ఆ. ౬౫; 3. చంపు. "సీ.... ప్రియంవదకోడుకులఁ గాంతారభూమిలోఁ గాడుపఱిచి." దశ. ౭, ఆ. ౬౮; 4. అతిక్రమించు మీఱు. "వ... చేసినశపథంబు గాడుపఱచితి..." భో. ౭. ఆ. ౧౭౦; 5. అవమానించు. "ద్వి. వీఁడువో విష్ణుని విధిఁ గాడుపఱిచి, నాఁడు మురలింగమై నలి నున్నవాఁడు." పండితా. దీక్షా. ౫3 పు.

కాడుపాటు = కాడ్పాటు. (చూ. కాడ్పాటు.)

కాడ్పడు = కాడుపడు. 1. కలఁగు, క్షోభించు. "స్రగ్ధర. కారాగారంబులై రాక్షసులహృదయములే గాడ్పడఁగా రాముసాజ్ఞన్...కపులు గ్రాసి లంకాపురేగోపురప్రా, కారాదుల్ గూల్చి కారాగతసురవనితాగ్లాని మాయించి రంతన్." ఉ. రా. ౧; ఆ. ౭౫; 2. నశించు, భగ్నమగు. "చ. కరులు హరుల్ రథంబులును గాడ్పడెఁ జెడ్పడి రెల్లసైనికుల్." ఉ. రా. ౨, ఆ. ౪౬.

కాడ్పఱుచు = కాడుపఱుచు. (దోషభూయిష్ఠ మొనరించు, అపకీర్తి పాలుచేయు.) "గీ. కాఁపుకోడలు కంచంపకాఁపురంబుఁ, బాలవంటకములంబుఁ గాడ్పఱిచి యంఱికె, మగని నటువెట్టి రెండవమగని వింట." పాండు. 3, ఆ. ౮౧.

కాడ్పాటు వై. వి. (కాడుపడు. ధా.) కాడుపడుట, క్షోభము. "క. అనిసిఁ బసియుంను నొండొక్క... బడఁడు దృష్టిమార్గంబున నట్టేనును గాడ్పాటునఁ జనఁగా నొకచో నుపరిభరము కంపలఁ బగిలెన్." వేం. పంచ. ౧, ఆ. ౪౮౨.

కాణము. ఉభ. వై. వి. (సం. ఖాదనమ్.) దాణ, గుఱ్ఱము మున్నగువానికిఁ బెట్టు ఉలవలు మున్నగు నాహారము. "ఆ... పంటకట్టియలును గడ్డి, కాణములును బుల్లుగా నొడగూర్చి..." భార. ఉద్యో. ౧, ఆ. ౯3. (శ. ర. పా. 'కవణము' ముద్రి.) సం. వి. అ. పుం. రాకె. విణ. (అ. ఆ. అ.) 1. ఒంటికన్ను గలది; 2. చిల్లిది.

కాణయాచి. దే. వి. (ప్ర. కాణియాచ్చి.) చిరకాల వాసస్థానము; ఆటపట్టు. "గీ... అంగభవున, కాపురమ కాణయాచియై యమరు నేమొ, కాఁపురము సేయ వీరశృంగారములకు." కళా. ౧, ఆ. ౧౨3. "గీ. తండ్రి నుబ్బించునందంపుదాఁపురంబు, పొసఁగుతమ్ములబడలిక పుట్టినిల్లు, కళలు నాఱుపమింటికిఁ గాణయాచి, వెలఁగుఁ జుక్కల తెరువున సితమరీచి." కాళిందీ. 3, ఆ. 33. ఆనంద. పీఠి. 3. విణ. వంశపరంపరాగతము, కుల మర్యాదయైనది. "క. శ్రీకాళహస్తిపతిపద, శోకనదారాధనంబె కులధర్మము తల్లోకవ్యాపక చిహ్న,ద్యాకారస్మృతియె కాణయాచి మదంబా." కాళ. ౪, ఆ. ౩౭.

కాణాచి = కాణయాచి. (క. కణాచి.) వి. 1. చిర కాలవాసస్థానము, ఆటపట్టు. "శా. దేవబ్రాహ్మణ భక్తిప్రోవు ప్రియవక్తృత్వంబు కాణాచి..." విజ. ౧, ఆ. ౨౦; 2. వంశమర్యాద, కులధర్మము. "మ. వెలయాంధ్రేంద్రులు సన్నుతించిరి ననున్ వేనోళ్లఁ గాణాచికిన్, గలిగెన్ దిక్కని మీరు పుట్టినపుడే గారాము నాకింక నిష్ఫలమై పోఁ గలధర్మమున్ వనలఁగా భావ్యంబె యోయక్కలా,ర..." కాశీ. ౪, ఆ. ౨౫. విశే. 1. వంశ పారంపర్యముగా వచ్చునది. "గీ...రంగ, ధామ కోవెల మున్ను తాతలతరంబు, నాఁటనుండియు మాకుఁ గాణాచి గావె." విప్ర. ౫, ఆ. ౧౭; 2. చిరకాల మనుభవించినది. "క... తెకతేరఁక నీ. కౌఁగవిడిచి పోయెదనె ప్రావగ నాకాణాచి యైన వలపులపంటన్." కళా. 3, ఆ. ౧౯౧.

కాణాచికాఁడు. దే. విశే. (కాణాచి+కాఁడు.) 1. చిరకాలనివాసి. "వ...చౌవంచదుగకొండల కాణాచికాఁడా,..." ప్రబంధ. ౨౧౬; 2. చిర కాలానుభవము గలవాఁడు. "సీ. సచరాచర ప్రపంచమ్మును బాలించు రాచఱికమ్ము కాణాచి కాఁడు." వరాహా. ౧౧, ఆ. ౧౪.

కాణాదము. సం. వి. అ. పుం. కణాదుఁ డను ఋషిప్రోక్త మగుతర్కశాస్త్రము.

కాణి. వై. వి. (సం. కాకణీ.) కాకణి,కాని. ఆం. భా. ద్వి. ౨౭౨.

కాత = కావుత. 1. ఆశీరర్థకము. "మ...ఈశ్వరుఁ డిచ్చుఁ గాత జయలక్ష్మీ సుస్థిరైశ్వర్య శోభన ముల్..." నైష. పీఠి. ౨; 2. కాక, ఐననుసరే. "ఉ. జాలి తొలంగుఁ గాత గుణశక్తి రసాతల సీమకుం జనుం, గాత...బహుభంగుల విత్తమె మాకు మేలు..." భర్తృ. నీతి. ౩౭

కాతరము. సం. వి. అ. పుం. 1. ఒకజాతి చేఁప; 2. ఉడుపము. విశే. (అ. ఆ. అ); 1. పిఱికిది; 2. భయపడినది; 3. వ్యాకులపడినది; 4. చంచలము.

కాతరిల్లు. దే. అ. క్రి. (క. కాతరిసు.) సిద్ధపడు; ఉత్సహించు. "ఆ...కరిణులును దారు...,కామ కేళి సలుపఁ గాతరిల్లె." కు. సం. ౧, ఆ. ౯౮.

కాతర్యము. సం. వి. అ. న. 1. పిఱికితనము; 2. భయము; 3. వ్యాకులత; 4. చాంచల్యము.

కాతా. హిం. వి. (ఖాతా.) వ్యాపారములో సంబంధము, లెక్క. (శ. ర.)

కాతాళము. దే. వి. 1. కాంతాళము, కోపము. "క. మాతంగరథభటాశ్వపరీతుఁ డగుచుఁ ద్రోవ పుండరీకుఁడు చూచున్, గాతాళంబున నిలువక, పాతాళంబునకుఁ బోయి పోఁజులు చేయున్." జై. ౭, ఆ. ౯౪; 2. ఈసు; ఉద్ది "క... చక్కెరకున్, జేతికిఁ గలవాసి సుమీ, కాతాళము గాదు నీకు ఘనుఁడాతనికిన్." వే. పంచ. 3, ఆ. ౨౮౧.

కాతాళించు. దే. అ. క్రి. కోపించు. "సీ. తనుఁ దిట్టికొనక కాతాళించి గొణఁగక ముచ్చిలింపక పాపమునకుఁ జొరక." నీతి. ౩౨.

కాత్యాయని. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. యాజ్ఞవల్క్యునిభార్య; 3. సగమువయసు చెల్లి కాషాయవస్త్రములు ధరించువితంతువు.

కాథికుఁడు. సం. వి. అ. పుం. కథలు వ్రాయువాఁడు, కథారచయిత.

కాదంబము. సం. వి. అ. పుం. 1. కలహంస; 2. బాణము; 3. చెఱకువిల్లు; 4. కడిమి. విశే. (అ. ఈ. అ.) కదంబసంబంధమైనది.

కాదంబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. బాణకవికావ్యములలో నొకటి; 2. ఆఁడుకోయిల; 3. గోరువంక; 4. సరస్వతి; 5. మద్యము. "క. కాదంబరిఁ ద్రావింతును, జూదం బాడింతు..." నైష. ౭, ఆ. ౧౨౦; 6. ఏనుఁగు చెక్కిలిమదము.

కాదంబిని. సం. వి. ఈ. స్త్రీ. మేఘపంక్తి.

కాదను. దే. స. క్రి. (కాదు+అను.) మెచ్చకుండు. "శా...గురుం గాదంచు..." భార. శల్య. ౧, ౮౭.

కాదా = కద. "శా...చింతయూ, కంతైనం గడమేని సూఁం గడమ కాదా యంచు నూహించుచున్." పాండు. ౪, ఆ. ౧౭౫.

కాదాచిత్కము. సం. వి. (అ. ఈ. అ.) ఎపుడో యొకప్పుడు సంభవించునది. (తఱుచుగా సంభవింపనిది.)

కాదు. దే. 1. అగుధాతువుయొక్క వ్యతిరేకార్థక రూపము. (చూ. అగు.) దీనిపైఁ గలవిశేష ప్రయోగము లీక్రింద నీయఁబడినవి. "చ. కడుఁ

బసిబిడ్డ పీఁ డొకటి కా దవు నా సెఱుఁగండు ..." భార. విరా. ౨, ఆ. ౨౧౩. (ఇది కొంచెగా దనువంటిది, కాదవునను = మంచిచెడ్డలు చెప్ప అని భావము.) "క. కాదుం గూడ దటన్న ను ..." పరమ. ౫, ఆ. ౬౬. (అట్లు కాదన్న చో అని భావము.) "చ...ఒక్కరు డును గాదు గూడ దనఁ గల్గెనె..." భార. విరా. ౨, ఆ. ౨౫౭. (కాదుకూడదు = తప్పు, దోషము అని భావము.); 2. దీనియామ్రేడితరూపమునకు నిషేధార్థము." ఆం. భా. కృ. ౭౪.

కాదె = కద. "చ...వాఁడు గాదె చేసె..." భార. శాం. ౧, ఆ. ౭౯.

కాదే = కదా. "క...నీనియోగంబునఁ గా,దే నాఁడు జలధి నుండుట, మాని యిటకు వచ్చినాఁడ..." వి. పు. ౭, ఆ. ౧౦౪.

కాద్రవేయుఁడు. సం. వి. అ. పుం-కద్రువకొడుకు-పాపజాతివాఁడు. పడగయుం దోఁకయుఁ గలిగి నరాకారముతో నుండుసర్పభేదము. (అమరసుధ.) "గీ. కాద్రవేయులు భూమియుఁ హైకొనంగ, సురగలోకంబు వెడలి తత్పరిఖనీట, నెగసి తోడనే క్రుంకుచు న్నిలువలేక, తత్తటాబద్ధ గారుత్మతముల కులికె." ఆము. ౨, ఆ. ౭.

కాన. యు. దే. వి. అవ్య. ద్రు. కావున, కనుక. ఆం. భా. కృ. ౭౦. "మ...కానన్ మాని గాఁడారయన్. చంద్రా. ౩, ఆ. ౧౧౫. "క. కానఁ దటిచ్చల మగురా,జ్యానందము మరగి..."ఆము. ౨, ఆ. ౧౧. ఈక్రిందిభారతప్రయోగమున మాత్ర మిది కళగాఁ గాననగుచున్నది. "మ... కా,న తగం బొందుట కార్యము...."భార.ఉద్యో. ౧, ఆ. ౩౫౧; సంబోధనమున కనుప్రయుక్తమై ప్రేమక్రోధాదుల సూచించును." "గీ. ధర్మ మేమఱ కుండుమీ తల్లికాన." నైష. ౭, ఆ. ౯. "ఉ. ఓసి గయాళికాన..."శుక. ౨, ఆ. ౩౭౩; వై. వి. (సం. కాననమ్. త. కానం.) అడవి, కోన. ఆం. భా. ద్వి. ౩౪. భార. ఆర. ౨, ఆ. ౯౪.

కానఁబట్టు. దే. అ. క్రి. (కానన్+పట్టు.) కనఁబడు. "శా...భూ,నాకం బప్పర మేకొఱంత యును గానంబట్ట నెప్పట్టునన్." భా. రా. యు. ౧౫.

కానఁబడయు. దే. స. క్రి. (కానన్+పడయు.) కను, చూచు. "సీ. క డఁ గంటి నాజన్మ కల్మి కృతార్థతఁ గన్నులారఁగ మిమ్ముఁ గానఁబడసి. హార. ౪, ఆ. ౫౯.

కానఁబడు. ద్వ. అ. క్రి. (కానన్+పడు.) కనఁబడు, చూపట్టు. "క. స్వానుభవంబునఁ దథ్యము, కానంబడు..." కాళ. ౧, ఆ. ౮౦. నైష. ౬, ఆ. ౦౫. ఇట్లే: కానఁగఁబడు. హరి. ఉ. ౬, ఆ. ౬౩.

కానక. దే. అవ్య. కనుధాతువునకు వ్యతిరేకక్త్వార్థకరూపము. 1. కనకకనక. "సీ. కానక కన్న సంతాన మయ్యో." రామా. ౫, ఆ. ౧౨; 2. ఆలోచింపక. "ఉ...కానక నీవయిఁ గాని పోనియ్యా, వింత ఘటించినట్టి యలివేణులనోరికి శాస్తి సేసి..." శుక. ౪, ఆ. ౫౪; 3. చూడక, దృష్టించక. "ఆ...అవివేకియై,కోప మదర సారె గొని యతండు, వ్రేసె నెత్తు రపుడు వెడలఁ బోయినఁ జీరఁ,గప్పికొంటి నీవు గానకుండ."భార. విరా. ౫; ఆ. ౩౦౯.

కానగు. దే. అ. క్రి. (కాన్+అగు.) అగు. ఉ:— కానైన. (కానైతే అని వాడుక.)

కాననగు. దే. అ. క్రి. (కానన్+అగు.) కనఁబడు, చూపట్టు. "గీ. అభవ నీకంఠమూలంబునందుఁ దెలిసి, కాననయ్యెడు నిది యేమికప్ప సెప్పు." హార. ౬, ఆ. ౫.

కాననము. సం. వి. అ. న. 1. అడవి; 2. ఇల్లు. (మే. ని.); 3. బ్రహ్మముఖము.

కాననివాఁడు. దే. విశ. కండ్లు కనఁబడనివాఁడు, అంధుఁడు. "ఉ. కాననివాని నూఁతగొని కానని వాఁడు విశిష్టవస్తువుల్, కాననిభంగి..." భాగ. ౭. స్కం. ౧౮౨.

కానపుంజు. ద్వ. వి. (కాన+పుంజు) వనకుక్కుటము, అడవికోడి. సాం. ని. తిర్య. ౮౩.

కానమి. దే.వి. కనుధాతువుయొక్క వ్యతిరేకభావార్థకము. 1. చూడకపోవుట; కనఁబడకుండుట. "క. అనిరుద్ధునిఁ గానమికం,జెను నీ విభ్భంగిఁ జింత డిందుటఁ గని నీ,యనుఁగులు వగచెద

రిందగు, ననుపమకాంత్యాక్తిఁ దేర్చు మనఘు విచారా." హరి. ఉ. ౮, ఆ. ౧౨; 2. అజ్ఞానము. "ద్వి. దానవానీకంబుతలఁపులో నున్న, కానమి యెల్ల నొక్కట వెల్లివిరిసె, ననఁగఁ జీకటి కడు నగ్గలం బగుచు." రం. రా. యు. ౩౫౯. పు. (ప్రాఁత.) (౩౧౨ పు. క్రొత్త.)

కానరానికాళ్లయది. దే. వి. (కానరాని+కాళ్లు+అది.) సర్పము, పాము. ఆం. సం. తిర్య. ౧౮.

కానరానిచుక్క. ద్వ. వి. (కానవచ్చు. ధా.) అభిజిన్నక్షత్రము. (శ. ర.)

కానవచ్చు. దే. అ. క్రి. (కను. ధా.) కనఁబడు, చూపట్టు. విక్ర. ౨. ఆ. ౧౦౮. ఇట్లే: కానన్ వచ్చు. వి. పు. ౨, ఆ. ౧౦౬.

కాని. యు. దే. విశే. అగుధాతువుయొక్క వ్యతిరేకార్థకవిశేషణరూపము. చెడ్డ, తగని. (చూ. కానితనము.) "క. కానివ్యయం బెన్నఁడు నొక, కానిపనిఁ జేయఁగఁ దగదు .." రుక్మా. ౩, ఆ. ౪౫. అవ్య. 1. తక్క. "ఆ. నలుపకాని నలినదళనేత్ర పరిఖంపను..." భార. అర. ౨, ఆ. ౫౨; 2. ఊఁతపదము. "క...రమ్మా చూతముగాని నీగమన వేగంబున్." భార. విరా. ౨, ఆ. ౮౯; 2. పూర్వోత్తరవాక్యార్థ భేద సూచకము. "చ. ప్రియసుతుఁ బల్కని న్ననుసరింపఁగఁ బార్థుఁడు గాఁడుసుమ్ము దుర్జయభుజశక్తి నిర్మథితశత్రుఁడు భీముఁడు గాని..." భార. ద్రో. ౪. ఆ. ౧౪౮; 4. వికల్పార్థమును దెలుపును. ఉదా:— నేఁడుకాని రేపుకాని; 5. సరే, మంచిది. "గీ...నీవైనఁగాని, కరుణ చూడఁగరాదె యోమరునితూణి." రాధికా. ౪, ఆ. ౫౧. సాం. ని. మాన. ౪౩. వై. వి. (సం. కాకణీ.) కాణి, అణాలో నాల్గవవంతురాగి నాణెము. "క. కానివ్యయం బెన్నఁడు నొక, కానిపనిఁ జేయఁగఁ దగదు..." రుక్మా. ౩, ఆ. ౪౫.

కానిక = కానుక. "మ...వన్యకుసుమస్తోమంబునార్థిఁ గానికగా నిచ్చిన..." దశ. ౮, ఆ. ౨౬.

కానికిఁగొను. ద్వ. స. క్రి. (కానికిన్+కొను.) కాని విలువమైనను ఇచ్చు; లక్ష్యపెట్టు. "క...మముఁ గానికిఁ గొనవు..."భార. శాం. ౪, ఆ. ౩౮౭.

కానిచ్చు. దే. అ. క్రి. (అగు. ధా.) జరగనిచ్చు. "వ...అట్లే కానిమ్ము లె మ్మనిన..." ఆము. ౬, ఆ. ౬౬; 2. సెలవిచ్చు. (వా.)

కానితనము. దే. వి. (కాని+తనము) చెడ్డతనము; కూడనితనము. "గీ. మారుఁడదె కానితన మూని పోరెఁ బోని, నీదుపుణ్యానికేని నే నేరనేని." రాధికా. ౪, ఆ. ౫౧.

కానిది. దే. విశే. (కాని+అది) కూడనిది, నిషిద్ధము. "ఆ...కానివాని మానఁ జెప్పె." భార. అను. ౧, ఆ. ౨౭౮.

కానినేయుఁడు. సం. వి. అ. పుం. 1. వ్యాసుఁడు. "గీ. భిక్ష లేదని యింక కోపింతురయ్య, కాశికాపట్టణముమీఁదఁ గానినేయ." భీమ. ౨, ఆ. ౧౧౪; 2. కర్ణుఁడు. విశే. (అ. ఆ. అ.) కన్యకుఁ బుట్టినవాఁడు.

కానిపించు. దే. అ. క్రి. (కను. ధా.) ప్రత్యక్షమగు, కనఁబడు. "గీ...కృపవలిర్పంగఁ గాన్పించెఁ గేశవుండు. ఆ. కానిపించి యేమి గావలయును పర, మపుగు మనిన..."కళా. ౨, ఆ. ౯౮,౯౯. (శ. ర. పా.) కవిరా. ౪, ఆ. ౮౩. స. క్రి. చూపు. దర్శింపఁజేయు. "క. వానిం దోడ్కొని చని యా భూనాథుం గానిపించి..."భార. అర. ౭, ఆ. ౭. విక్ర. ౪, ఆ. ౧౯౨.

కానిపేరిది. దే. విశే. ఇష్టముకానిది, పనికిరానిది. "క. పలుమాఱుం దలవాకిట, మెలఁగుట యపతీజనైకమిత్రత కలహాంబుల కెలయుట నగుపలుకులఁ, బెలుచ నగుట నాకుఁ గాని పేరిది మగువా." భార. అర. ౫, ఆ. ౩౦౨.

కానిపోని. దే. విశే. (అగు. ధా.) లేనిపోనిది, అసత్యమైనది. "ఉ...కానిపోని యీ, వింత ఘటించి నట్టియలివేణుల నోరికి శాస్తిచేసి..."శుక. ౪, ఆ. ౫౪.

కానివాఁడు. దే. విశే. (అగు. ధా.) 1. అనర్హుఁడు, అర్హత లేనివాఁడు. "గీ. దీని నెఱిఁగించునపుడు భక్తియును శమము, దమము సంశ్రయమును వేదతత్పరతయుఁ, గలుగఁ జూచి యెఱిఁగింపు కానివాని, కీకు మీవిద్య పాత్రదానైకనిరత." భార. శాం. ౬, ఆ. ౬౫; 2. అసమర్థుఁడు, పనికిమాలినవాఁడు. "క. నరు నద్దెసఁ గలవారిని, గురు

బల ముబ్బునెడఁ బొగడి కొఱకొఱ గాఁగన్, గురుని గురుతనయుం మద్రే, శ్వరు నను నేమిటికిఁ గానివారిం జేయన్." భార. ద్రో. ౫, ఆ. ౧౦౫; 3. తటస్థుఁడు, సంబంధము లేనివాఁడు. "వ .. అవ్వీరుల నిట్లు నేసి, నీవు కానివాఁడవపోలెం దొలంగి యున్నవాఁడవు..." భార. అర. ౭, ఆ. ౪౧౬; 4. అనిష్టుఁడు, కిట్టనివాఁడు. (బ్రౌ.)

కానీ. దే. అవ్య. (అగు ధా. కాన్ + ఈ) 1. కానిమ్ము, అంగీకారసూచకము. "శా...స్నానంబుపాకోమం బులుం, గానీ భోజన మైనపిమ్మట నలంకారిం చుకో నిచ్చెదన్." సానందో. ౫, ఆ. ౧౮. విక్ర. 3, ఆ. ౬౧. ఆము. ౨, ఆ. ౨౬; 2. కాని, వికల్ప సూచకము. "మ...ననుఁగానీ శంభుఁగానీ రమే, శ్వరుఁగానీ..." కాశీ. ౨, ఆ. ౯. "మ...పావము లొాక్త రమ్మనుటగానీ యొంటియే పోకదా, నికట క్షోణికి నేఁగుదె మ్మనుటగానీ కొంత నెయ్యంపుఁ బూ, నికతోఁ గన్నులు విచ్చి చూచుటయగానీ లేద యొక్కింతయున్." కళా. ౪. ఆ. ౧౧౨. 3. క్రోధాదిసూచకము. "శా...కానీ వేగంబ హరించి తచ్ఛత్రులు భగ్నీభూతముల్ సేసె దన్." దశా. ౧, అ. ౨౪౩.

కానిమి. దే. వి. ఔ. కానిచ్చునను వ్యతిరేకభావార్థక రూపము, కానీయకపోవుట. (బ్రౌ. వా.)

కానీనుఁడు. సం. వి. అ. పుం. 1. కన్యకొడుకు; 2. వ్యాసుఁడు; 3. కర్ణుఁడు.

కానీరా = కానీ. (నిర్లక్ష్యసూచకము) "శా. కానీరా యిటువంటివనితము లనేకంబుల్ నినుం బోలి విన్నా చేసున్..." శశాం. 3, ఆ. ౬౯.

కాను. దే. వి. నీరు కలియని మజ్జిగ. ఆం. భా. ద్వి. ౨౫౯. "ఉ. వెన్నెలకాను జుఱ్ఱుకొని వీథుల యందుఁ జకోరదంపతుల్, మిన్నులు ముట్టి ..." కాళ. ౪, ఆ. ౯3.

కానుక. దే. వి. ఉపాయనము, దేవుఁడు బ్రాహ్మణుఁడు రాజు మున్నగువారి కిచ్చు పారితోషికము "క...కానుక లందుకొనక సుబోధ ముని నియమించెన్." భాగ. ౧౦. స్కం. ఉ. ౭౭౦. "వ...యజ్ఞోపవీతంబు గాను కిచ్చి కూర్చున్న ...అవ్విశ్వంభరాభర్త యిట్లనియె." ఆము. ౪. ఆ. ౫౯. సా. ౧, ఆ. ౬౫.

కానుగు. దే. వి. కరంజము. (దీనిభేదములు గంట్ల కానుగు తీఁగెకానుగు మొ.) "సీ. కలిగొట్టు మోదుగు కానుగు..." వేం. పంచ. ౪, ఆ. ౫౭౭. ఆం. భా. ద్వి. ౪౭.

కానుచు. దే. స. క్రి. 1. చూచు, కాంచు. "క... సాత్యవతేయుం, గానిచి యమ్మౌని..." వి. పు. ౮, ఆ. 3౦౯; 2. కనిపట్టు. (చూ. కాన్పు)

కానుపించు. దే. స. క్రి. చూపు, కనఁబడఁజేయు. "ఉ. శర్వునిఁ గానుపింతు నని జంగమవర్యుఁడు ..." చెన్న. 3, ఆ. ౬౭.

కానుపు. దే. వి. (కను. ధా.) 1. నేత్రము, దృష్టి. "క. ఏమును బెద్దలచే మును, వీను లలరఁ దర తరంబ విన్నవిధంబున్, మానసమున నున్న తెఱఁగు, గానుపునం గన్నక్రమముఁ గథన మొనర్తున్." నృసిం. ౧, ఆ. ౭౪; 2. ప్రాప్తి, పొందుట. "క...కానేరవు మోక్షపదము, కానుపు పృథనిశ్చపొందు గాను నేననిన్." భార. శాం. ౬, ఆ. ౭౯౦; 3. ప్రసవము, కనుట. "సీ. బహువారములయందు బహువస్తువులు గాంచి కలశపాథోరాశి కాను పుడిగె." హర. ౬, ఆ. ౧౭౯.

కానోపు = కాఁబోలు. "సీ ...వానయే పునఁ దెగియోఁ గానోపు నకట." భార. శాం. 3, ఆ. 3౧౦.

కాన్క = కానుక. "గీ ..ఫణిఫణాగ్రదళుంభి, కుంభ పరదంష్ట్రిదంష్ట్రికాకోటిగళిత, కలితముక్తాఫలం బులు కాన్క చేసి." శుక. ౧, ఆ. ౨౪౬. ఉ. రా. ౧, ఆ. ౨3౫.

కాన్కి. దే. వి. (కను ధా.) కానుపు, దృష్టి. "చ... మహాపురుషులకన్న కాన్కి యనవోహమ కావు డిదేమి చోద్యమో." కు. సం. ౬, ఆ. ౧౬౨.

కాన్గు = కానుగు. "గీ...కాన్గు సన్న, విరిగి..." హంస. ౪, ఆ. ౧౧. అచ్చ. యు. ౪3౮.

కాన్పు = కానుచు. 1. చూచు. (చూ. కానుచు.); 2. కనిపట్టు, తెలిసికొను. "ఉ...అమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేలపాటిల్లెడు వారిఁగాన్పు ట గడింది తదీయమహానుభావతన్." భార. విరా. 3, ఆ. ౯౫; 2. ఆశ్రయించు, శరణుచొచ్చు. "ఉ...భార్గవరాము నాశ్రిత, శ్రీకరుఁ గాన్పు మాపదలు నొందఁగనీఁ డతఁ డాశ్రయించినన్." భార. ఉద్యో. ౪, ఆ. ౨౯౯.

కాన్పించు = కానిపించు. (ప్రత్యక్షమగు) "గీ. కృప దల్పిరంగఁ గాన్పించెఁ గేశవుండు." కళా. ౨, ఆ. ౯౦.

కాన్పు = కానుపు. 1. వీక్షణము, చూపు. "ఉ... అత్తఱిఁ గ్రొత్తకా న్పగుట నడ్డము సొచ్చెనొ సిగ్గు పెంపున, న్నుత్తలమందఁ జేయుటకునో..." భార.విరా. ౨,ఆ. ౧౮౪;2. కనుట; భాగ్యమందుట. "శా...ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చ బగ సాధింపఁగఁ గా న్పల్పమే." భార. విరా. ౨, ఆ. ౨౭౫. భార. ఆది. ౬, ఆ. ౨౮౬; 3. భావించుట; తెలిసికొనుట; 4. జ్ఞానము, తెలివి. "గీ. కానఁ దనయట్ల యెదిరిని గాన్పుకాన్పు, జీవులకుఁ దారతమ్యంబుఁ జెప్పఁ దగదు." కాశీ. ౬, ఆ. ౭౦. (3, 4-అర్థముల కిది యుదాహరణమే.); 5. తలంపు, అభిప్రాయము. "క. ఇరువదిసా ల్గను వారలు, నరసి మనశ్శుద్ధి బుద్ధి యనుకాన్పున న, ప్పురుషునఁ బలికెదరు..."భార.అను.౪,ఆ.౨౭౫; 6. ప్రసవము, కనుట. "గీ. ఘనతఁ జొచ్చిన యింద్లను దనయ లుండి, కాన్పునకుఁ బుట్టిని ల్చేరుక్రమము గనమె." ఆము. ౪, ఆ. ౭౦. 7. సంతానము, బిడ్డ. "ఉ...చిన్న బోన మాసించినకాన్పు..."విప్ర. ౧, ఆ. ౨౩.

కాన్పుకెక్కు. దే. అ. క్రి. (కాన్పునకు+ఎక్కు.) కనఁబడు; ప్రకాశించు. "సీ. మరుమర్దుఁ దీఁగెలో మంజుసౌదామనీఖండంబులో యనఁ గాన్పుకెక్కి...గీ...ప్రీతి వచ్చిరి పురిఁ గల్గు పేరఁటాండ్రు." శ్రీరాధా. ౪, ఆ. ౧౫౧.

కాపంతము. దే. వి. కుక్కమెడకుఁ గట్టెడికట్టె. ఆం. భా. ద్వి. ౭౫౦.

కాపట్యము. సం. వి. అ. న. కపటము, మోసము.

కాపథము. సం. వి. అ. పుం. కుత్సితపుమార్గము, చెడుత్రోవ. "క...వలదు కాపథ మసినన్." శశాం. 3, ఆ. ౭౭.

కాపరి. దే. విశే. (కాపు+అరి.) రక్షకుఁడు, కాచువాఁడు. "ఉ. కాపరి లేనిగొఱ్ఱెయలకై వడి..." భాగ. ౧. స్కం. ౪౦౨. సిం. ౧, ఆ. 3౯.

కాపాడు. దే.స. క్రి. (కాచు ధా.) కాచు, రక్షించు. "క...ఇతఁ డేసతులం, గాపాడినవాఁడు..." ఆము. ౫, ఆ. ౪౦.

కాపించు. దే. స. క్రి. (కాచు ధా. ప్రే.) కావఁజేయు, కాపాడఁజేయు. "సీ. కట్టఁ గాపింప దక్షతలేమి నూరూర బందెలఁ బడిపోయెఁ బశుగణంబు." స్వా. 3, ఆ. ౧౨౯.

కాపిలము. సం. వి. అ. పుం. పింగళవర్ణము. న. 1. కపిలప్రోక్తము; 2. కపిలసంబంధి.

కాపిశాయనము. సం. వి. అ. న. మద్యము, కల్లు.

కాపిశాయిని. సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష.

కాపిశేయము. సం. వి. అ. పుం. పిశాచము. (కల్ప.)

కాపు. దే. వి. 1. రక్షణము. "ఆ... ప్రజలవలనఁ గరుణఁగలిగి వారిఁ గీడు గదురక యుండఁగఁ, గాపు పతి కహింసకత్వ మనఘ."భార. శాం. ౫, ఆ. ౨౯౯; 2. కాయలు కాచుట. (శ. ర. పా.) విశే. 1. రక్షకుఁడు, కావలివాఁడు. "రగడ. అలివ చురుశరములకు నళిధటావళికాపు, ప్రతిలేనివనసస్యపాళి కామనికాపు." ఉ. రా. ౬, ఆ. ౬౧; 2 వశుఁడు; లోలుఁడు. "గీ. ఉవిద నీ వెంత కొంచెకత్తెవె జయింతుఁ, గాపుఁ జేసిన గరితవు కావె నీవు." శుక. ౪, ఆ. ౧33.

కాపుకాఁడు. దే. విశే. (కాపు+కాఁడు.) రక్షకుఁడు. "గీ. కడిఁదిజడదారిజన్మంపుఁ గాపుకాఁడ."అచ్చ. యు. ౭౯.

కాపురుషుఁడు. సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు, నింద్యజనుఁడు. "క. కాపురుషులవలన నిట్టి కాఁతియ పుట్టెన్." భార. విరా. ౪, ఆ. ౧౪౦.

కాపెట్టు. దే. స. క్రి. (కాపు+పెట్టు.) కనుపెట్టుకొను, కాచుకొను. "క. చలి విడిచి జారశేఖరు, కలయికచవి మరఁగి తెరువు కాపెట్టుక ని,చ్చలు లేనిపనుల నెన్నే, నలవఱుచుకయుండు విరహ మగ్గలమైనన్." హంస. ౨, ఆ. ౧౧౦. "క... రతిసేనమందిరమును గాపెట్టుకొని యుండు మోహము కల్మిన్." హంస. ౫, ఆ. ౧33.

కాపేయము. సం. వి. అ. న. 1. కపిత్వము, కోఁతిగుణము; 2. కపిచేష్ట, కోఁతిపని; చెడ్డపని.

కాపోతము. సం. వి. అ. న. 1. కపోతసమూహము; 2. సౌవీరాంజనము. పుం. 1. బూడిదరంగు; 2. ఒకసంవత్సరగ్రాసము నిలువఁజేసికొను వానప్రస్థుఁడు. (వై. ని.) విశే. (అ. ఈ. అ.) 1. కపోతసంబంధి; 2. బూడిదరంగు గలది.

కాప్యకారము. సం. వి. అ. పుం. చేసిన పాపము ఒరులకుఁ జెప్పుట.

కాఫలము. సం. వి. అ. పుం. కట్ఫలము, కేసరు వీ.

కాఫీ. ఆం. వి. (Coffee) ఒకానొక చెట్టు. (దీని గింజలు వేఁచి పొడుముచేసి వేఁడినీళ్లతోఁ గలిపి వడపోసి వేఁడిపాలు చక్కెర గలిపి పానీయముగాఁ బుచ్చుకొందురు.

కామ. దే. వి. 1. ఛత్త్రధ్వజాదిదండము. "చ. గొడుగుగఁ జేసె గోవులను గోపకుమారులకున్ నగంబు...కడు బెడఁగొందె హస్తమున కామ తిరంబుగఁ దాల్చి పొల్చుటన్." హరి. పూ. ౭, ఆ. ౧౭౮. "ఆ. నిడుమ కామ సూది పడఁకెడు..." భార. కర్ణ. ౨, ఆ. ౧౧౧; 2. కలువ తామర మొ. వానికాఁడ. "గీ. కలువ టెండ తాఁకినతొగకామభంగి." హరి. పూ. ౭, ఆ. ౫౧. "గీ. కామఁ బాసినకమలంబుకరణిఁ బొలుచు, కర్ణతల..." భార. కర్ణ. 3, ఆ. 3౭౧; 3. శాకనాళము, కూరకాఁడ. ఆం. భా. ద్వి. ౨౮౮. "గీ...కుమారి, గోఁగుకామవిధంబునఁ గొంత యొదిగె." పాంచా. ౧, ఆ. ౫౮; 4. శిశ్నము, మగగుఱి. "సీ. సైంధవలవణంబు సరిగాఁగ మర్దించి కామఁ బూసిన వృద్ధి గలుగుచుండు." కళాశాస్త్రము. 3, ఆ. ౬౨; 5. చూచుకము, చనుమొన. "ఉ. మిమ్మట మైన వాఁడిఁ బటమిత్త్రములై వెలుఁగొందునీసఖా, గ్రమ్ములకున్ మృదుప్రకృతి గల్గుట గొత్త రమాకుచాద్రిపార్శ్వమ్ములయందు నందుఁ గల సారగతుల్ నఖరాభిపాతసాధ్యమ్ములు కామఁగా వలయు నట్లగుటన్ విటపుత్త్ర శాత్రవా." పాండు. ౫, ఆ. ౨౭౮. (శ. ర. పా. 'కామి' ముద్రి. పా.)

కామంచి. దే. వి. (క. కామఁచి.) నిమ్మగడ్డి, ఒకరకపుగడ్డి. ఆం. భా. ద్వి. ౭౯.

కామకూటము. సం. వి. అ. పుం. 1. వేశ్యాప్రణయము; 2. వేశ్యావిభ్రమము. (మే. ని.)

కామకూటుఁడు. సం. వి. అ. పుం. వేశ్యాప్రియుఁడు, విటుఁడు. (మే. ని.)

కామకృతము. సం. వి. అ. న. కామునియొక్కపని. విశే. (అ. ఆ. అ.) కోరికతోఁ జేసినది.

కామకేళి. సం. వి. ఇ. పుం. సురతము, మైథునము. విశే. (ఇ) కాముకుఁడు.

కామగుణము. సం. వి. అ. పుం. 1. రాగము, కోరిక; 2. ఇంద్రియార్థము; 3. పరిపూర్ణత. (మే. ని.)

కామచారి. సం. వి. న్. పుం. 1. గరుడుఁడు; 2. పిచ్చుక. విశే. (న్. ఈ. న్.) 1. విచ్చలవిడిఁ దిరుగువాఁడు; 2. యథేచ్ఛాసంచారి; 2. కాముకుఁడు.

కామదు. సం. వి. ఆ. స్త్రీ. కామధేనువు. (మే. ని.)

కామదార్ఘ్యు. మి. వి. బ. ధాన్యవిశేషము. "సీ... శ్రీరంగాలు కామదుర్ల." హంస. ౧, ఆ. ౧౭౨.

కామదుఘ. సం. వి. ఆ. స్త్రీ. కామధేనువు.

కామదోహము. సం. వి. ఈ. స్త్రీ. కామధేనువు.

కామధేనువు. సం. వి. ఉ. స్త్రీ. కోరినవస్తువు లిచ్చెడి యావు, వేల్పుటావు.

కామన. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

కామనియకము. సం. వి. అ. న. రమణీయత.

కామపాలుఁడు. సం. వి. అ. పుం. కోరికలు పాలించువాఁడు - బలరాముఁడు.

కామము. సం. వి. అ. పుం. న. 1. ఇచ్ఛ, కోరిక; 2. కోరఁబడినవస్తువు; 3. వలపు; 4. చతుర్విధపురుషార్థములలో నొకటి; 5. ఒకరకపుమామిడి వీ. న. రేతస్సు.

కామయితి. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) 1. కోరువాఁడు; 2. కాముకుఁడు.

కామరూపి. సం. వి. న్. పుం. 1. విద్యాధరుఁడు. (త్రి. ని.); 2. ఉడుముపంది. (వై. ని.) విశే. (న్. ఈ. న్.) 1. కోరినరూపము ధరించువాఁడు; 2. అందగాఁడు.

కామరేఖ. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. (వాచ.)

కామలత. సం. వి. ఆ. స్త్రీ. శిశ్నము, మగగుఱి.

కామలము. సం. వి. అ. పుం. 1. వసంతఋతువు; 2. మరుభూమి; 3. కామెర.

కామలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కాముకుఁడు.

కామవరములు. సం. వి. అ. న. బ. వస్త్రవిశేషము. "వ...కామవరంబులు సూరవరంబులు...అను పేళ్ల గలపుట్టంబులు గట్టుకొని..." ద్వా. 3, ఆ. ౧౧౯.

కామవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. వెన్నెల.

కామవల్లభము. సం. వి. అ. పుం. 1. వసంతఋతువు; 2. మామిడిచెట్టు.

కామశరము. సం. వి. అ. పుం. 1. మన్మథబాణము; 2. మామిడిచెట్టు.

కామశాస్త్రము. సం. వి. అ. న. రతిశాస్త్రము. "గీ. కామశాస్త్రంబు ముఖ్యంబుగా ఘటించు." పశా. ౧౦, అ. ౯.

కామసజ్జె. మిం. వి. (కామము+సజ్జ) శివయోగిపరికరవిశేషము. "ద్వి. ఖ్యాతిమైనొప్పెడుకామసజ్జలును." పండితా. పర్వ. ౩౧౬ పు.

కామసఖము. సం. వి. అ. పుం. 1. వసంతఋతువు; 2. చైత్రమాసము, 3. మామిడిచెట్టు.

కామసువు. సం. వి. ఊ. పుం. వాసుదేవుడు, కృష్ణుడు. స్త్రీ. రుక్మిణీదేవి. విణ. (ఊ.) కోరికల నీనునది.

కామాంకుశము. సం. వి. అ. పుం. 1. గోరు; 2. కామలత.

కామాంధము. సం. వి. అ. పుం. కోయిల. విణ. (అ. ఆ. అ.) కామముచే గ్రుడ్డి యైనది.

కామాక్షి. ఉభ. దే. వి. 1. వాద్యవిశేషము; "వ... కామాక్షులు ముఖవీణలు పిల్లంగ్రోవులు..." ప్రబంధ. ౬౦౯; 2. యోగులు ధరించునొక యాభరణము. "సీ. ఉపరంజిపసిండికామాక్షులు డామూంపుపై గొండ్లి గావించుయోగపట్టె." వేం. పంచ. ౪. ఆ. ౧౧౧. "సీ. కడునొప్పు సంకులు కామాక్షికవ గాంగ..." య. ౩, ఆ. ౯౬. సం. వి. ఆ. స్త్రీ. దేవీమూర్తిభేదము. కాంచీనగరప్రతిష్ఠిత యగుదుర్గాదేవి.

కామాటము. వై. వి. (సం. కర్మఠః. క. కామాట.) సంసారసామగ్రి, ఇంటిపరికరములు. వా:— పదిదినములకు కామాటము కూడం దీసికొనిపోనక్క అలేదు. "మ... భానుపుత్రాదులన్, వినుమీ చంపక పట్టి తెచ్చి దినముక్ నియింటికామాటపుం,బనిచెం జొచ్చెద నన్నదాక నిడ చెంపల్ వైతు మత్యుద్ధతిన్." రామా. ౮. ఆ. ౧౮౯. (మోటుపని, కూలిపని. అని శ. ర. సూ. ని.)

కామాటి. వై. విణ. (కామాటము+ఇ. త. కామాట్టి.) కామాటము గలవాడు. (మోటుపని చేయువాడు అని శ. ర. సూ. ని.)

కామాయుధము. సం. వి. అ. న. 1. మన్మథుని కైదువు; 2. మగసంటి. పుం. మామిడిచెట్టు.

కామారి. సం. వి. ఇ. పుం. 1. శివుడు; 2. విటమాక్షిక మను ధాతువు.

కామాల. వై. వి. (సం. కామలా. త. కామాలై.) కామెర. ఆం. భా. ద్వి. ౧౨౭.

కామి. ఉభ. దే. వి. అగుధాతువుయొక్క వ్యతిరేక భావార్థకయాపము. 1. కాకపోవుట. "క. ఘనతర గద్దపికని స్వనమున మటిమాటలాడ శక్యముగా మిన్." పారి. ౧, ఆ. ౧౩౨; 2. పనికిరాకుండుట. "క... విప్రజాతిఁ బనిత దాం, బనిసేయ నడపునది యప్పనులం బెఱసతులు గామి..." భార. అను. ౨, ఆ. ౨౪౦. సం. వి. ఈ. స్త్రీ. రతిదేవి. న్. పుం. 1. భార్యావశుండగుభర్త; 2. సారసపక్షి; 3. పిచ్చుక; 4. పావురము; 5. జక్కవ; 6. ఋషభ మను నోషధి. విణ. (న్. నీ. న్.) 1. కోరిక గలవాడు; 2. కాముకుడు.

కామించు. సం. అ. క్రి. అభిలషించు, కోరు. "ద్వి. సీమనస్తాపంబు నీవగ మాన్పం, గామించి వచ్చితిం గమలాయతాక్షి." బస. ౧, ఆ. ౧౬పు. ౧౯, పం. స. క్రి. 1. వలచు, మోహించు. "వ... పరాశరుండు దన్నుం గామించుటయు..." భార. ఆది. ౪,ఆ. ౨౩౯; 2 కోరు, వేడు. "సీ... దేవతానజనసేవనములం,గావించుపుత్రుని గామించి..." భార. అర. ౫,ఆ. ౫. భాగ. ౩ స్కం. ౩౬౬.

కామిని. సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీ; 2. ప్రియసంగమమున మిక్కిలి కోరిక గలస్త్రీ; 3. అందగత్తె; 4. పిఱికితనము గలస్త్రీ; 5. ఆడుజక్కవ; 6. ఆడుపావురము; 7. మద్యము; 8. మానిపసుపుచెట్టు; 9. బదనికచెట్టు; 10. స్త్రీసారసపక్షి.

కామినీభూతము. సం. వి. అ. పుం. తాను గోరినవానితో సంగమింపకాని విడువనియాడుదయ్యము; విడువనియాడుది. "క. కంటికిం బ్రియమగువానిం, గెంటనితమకమునం గామినీభూతమనక్, వెంటంబడి కౌఁగిలింపక,యింటికిం బోదవ్వ ధూటి కెంతటితమియో." శుక. ౨, ఆ. ౧౦౬.

కాముండు. సం. వి. అ. పుం. మన్మథుడు.

కాముక. సం. వి. ఆ. స్త్రీ. సంభోగముతక్క యితరమైనధనాదులయందు ఇచ్ఛ గలస్త్రీ.

కాముకుఁడు. సం. విణ. 1. (అ. ఆ. అ.) ధనాదుల యం దిచ్ఛగలవాఁడు; 2. (అ. ఈ. అ.) మైథు నేచ్ఛ గలవాఁడు.

కామెర. వై. వి. కామాల, కన్నులు పచ్చనగురోగ విశేషము.

కామేశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గాభేదము.

కామేశ్వరుఁడు. సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

కామ్యము. సం. వి. అ. న. 1. అగ్నిహోత్రాశ్వమేధాదికామ్యకర్మము. "శ్లో. ఇష్టాపూర్తస్య కామ్యానాం త్రివర్గస్య చ యో విధిః." సం. భాగ. ౨ స్కం.; 2. రూఢి. (వై. ని.) విణ. (అ. ఆ. అ.) 1. కోరఁదగినది; 2. కోరికతోఁ జేయఁబడునది; 3. కమనీయము, చక్కనిది. (కల్ప.)

కామ్లము. సం. వి. అ. న. ఇంచుకపులుపు. విణ. (అ. ఆ. అ) ఇంచుక పుల్లనిది.

కాయ. దే. వి. (కాయు. ధా. క. కాయ్.) 1. చెట్టు తీగ మొ. కాచెడుకాయ. "చ...మాఁకుఁ గాయలుం, గసురులు వేళ్లు వెల్లఁకులుఁ గాక సముజ్జ్వలభూషణంబులుం,బసిఁడియు నేల..." నిర్వ. ౧౦, ఆ. ౧౨౨. "శా...గుమ్మడికాయ యంతయగుముత్తెంబై..." ఆము. ౪, ఆ. ౨౧౩; 2. శలాటువు, పచ్చికాయ. ఆం. భా. ద్వి. ౩౯; 3. వీణ కమర్చినసొరకాయ. "సీ. శశికాంత మణిపీఠి జాజువాఱఁగఁ గాయ లుత్తుంగకుచపాళి నత్తమిల్ల." స్వా. ౫, ఆ. ౨౭; 4. కిణము, రాపిడివలన నఱచేయిమున్నగువానియం దేర్పడినపొక్కు. "ఉ...పాణితలమున్ బలుగాయలు గాచెఁ జూచితే." భార. విరా. ౨, ఆ. ౨౨౧; 5. శిశువు, బిడ్డ. (అలంకారికము) "ఉ...నాలుగేఁ, గాయలు గాయ వచ్చెలుపగర్భమునం దెటువంటిపాపమో." వేం. పంచ. ౧, ఆ. ౫౭౮; 6. కంటియందు కాచుకాయ. "ద్వి...కాయకన్నుల బిల్లిగడ్డంబును నల్లనిమేను." బస. 3, ఆ. ౧౧౧౬ పం.; 4. జూదము మొ. ఆడునపుడు ఉపయోగించుసాకె లోనగునది, చదరంగమందలిరాజాది ప్రతిమ. (శ. ర. వా.)

కాయకంటి. దే. వి. (కాయ+కన్ను+ఇ.) కుబేరుఁడు. (శ. ర.)

కాయకన్ను. దే. వి. (కాయ+కన్ను.) కాయ కాచినకన్ను. (శ. ర.)

కాయకన్నేటి. దే. వి. (కాయ+కన్ను+మేటి.) కాయకంటి, కుబేరుఁడు. సాం. ని. దేవ. ౧౪.

కాయకము. దే. వి. (క. కాయక. త. కాయకమ్.) జీవనోపాయము; వృత్తి "ఉ...,మానితి నిన్నిరో యనుచు మాకులకాయక మైనవేఁట..." కను. ౪, ఆ. ౫౭. చెన్న. 3, ఆ. ౨౦౮.

కాయకాఁడు. దే. విణ. (కాయ+కాఁడు.) వేఁటకాఁడు. "వ...కాయకాండ్రకు గాయమ్ము లారఁగటాక్షించి..." పార్వ. ౬, ఆ. ౮౪.

కాయక్లేశము. సం. వి. అ. పుం. 1. దేహబాధ; 2. దేహపరిశ్రమము.

కాయజలము. సం. వి. అ. న. మూత్రము.

కాయజుఁడు. సం. వి. అ. పుం. శరీరమునఁ బుట్టినవాఁడు, మన్మథుఁడు.

కాయధాన్యము. దే. వి. కాయనుండిపుట్టుధాన్యాదికము. (పెసలు మొ.) ఉ. రా. ౮, ఆ ౧౬., శుక. 3, ఆ. ౪౮౧.

కాయపెండలము. దే. వి. ఒకజాతిపెండలము. (శ. ర.)

కాయమానము. సం. వి. అ. న. 1. పందిరి; 2. ఆకుటిల్లు; 3. దేహపరిమాణము; 4. వేశ్యాగృహము; 5. కేళిగృహము. (వై. ని.)

కాయము. ఉభ. దే. వి. శరీరారోగ్యమునకై బాలింతల కిచ్చుటకు శొంఠి పిప్పలి మున్నగువానితోఁ జేసినయుండ. "చ. చెలఁకు బిడ్డకట్లు ఇల్లసిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ, బిలుపర మంత్రసానిఁ దలపెట్టరె కాయముఁ గూర్చ...అనుచు నేర్పరులై కడు సంభ్రమింపఁగన్." కాళ. 3, ఆ. ౨౬. సం. వి. అ. పుం. న. 1. శరీరము; 2. సమూహము; 3. మూలధనము; 4. ఇల్లు; 5. గుణము; 6. గుఱి; పుం. ప్రాజాపత్యము, ఒకానొకపద్ధతి పెండ్లి. విణ. (అ. ఆ. అ.) 1. ప్రజాపతిదేవతాకము; 2. ఋషిదేవతాకము.

కాయస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరికచెట్టు; 2. కరకచెట్టు; 3. ఏలకిచెట్టు; 4. తులసిచెట్టు; 5. కారుకొల్లిచెట్టు.

కాయస్థుఁడు. సం. వి. అ. పుం. 1. శరీరమం దుండువాఁడు-పరమాత్ముఁడు; 2. కరణము, లెక్కలువ్రాయువాఁడు. (పరశురామనిహతభీతులై

దాల్భ్యముని శరణు చొచ్చినక్షత్రియస్త్రీకిఁ బుట్టి చిత్రగుప్తునికడ లెక్కలు వ్రాయుచుఁ గాలముగడపినయాతనివంశస్థుఁడు.); 3. ఒకానొకక్షత్రియజాతివాఁడు.

కాయిక. సం. వి. ఆ. స్త్రీ. 1. రోజువారీవడ్డి, ప్రత్యహవృద్ధి. (శ. ని.)

కాయికము. సం. విణ. (అ. ఈ. అ.) శరీరమునకు సంబంధించినది. (పాపము మొ.)

కాయిదా. హిం. వి. ఏఁటేఁట సేలము వేయుభూమి మొ. (వా:—కాయిదాపాట.)

కాయిలా. హిం. విణ. రోగభూయిష్ఠము. (వా:—కాయిలామనిషి.

కాయు. వై. అ. క్రి. (సం. కాస్. క., త. కాయ్.) 1. ఎండ వెన్నెల మొ. ప్రసరించు. "సీ...ఒకదీవి పేరెండ యుబ్బికాయు." కాశీ. ౧, ఆ. ౧౭౯. "ఆ. పిండిఁ జల్లినట్లు పండువెన్నెలలు గాయఁగఁ దొడగె .." కళా. ౮, ఆ. ౧౬; 2. (కాయలు మొ.) ఉద్భవించు. "ఉ...నాలుగేళ్ళ, గాయలు కాయ వచ్చెలువగర్భమునం దెటువంటి పాపమో." వేం. పంచ. ౧, ఆ. ౫౮౮; స. క్రి. 1. ప్రసరింపఁజేయు. "క. ఇనుఁ డెండ గాయ శంకిలు..." భా. రా. బాల. ౧౨౬; కాశీ. 3, ఆ. ౨3; 2. కాపాడు. "మ...యజ్ఞము క్రతుహారిఁ గాయం బంచి..." వరాహ. ౧, ఆ. ౧౭౯. విజ. ౧, ఆ. ౪; 3. కాయలు కాచు. "శా. కాయం జొచ్చె రసాలముల్..." ద్వా. ౭, ఆ. ౧౨.

కాయువు. దే. వి. 1. కాంక్ష, కోరిక. ఆం. భా. ప్ర. ౧౩౭;2. శృంగారచేష్ట. "సీ. బెరసిన మేపడి సరులఁ గాయువు గని కన్నులచెన్నున నన్నుఁ గాంచి...గీ...అధిపతి లలితాంగిఁ గవసె నర్థి." నిర్వ. ౮, ఆ. ౭౨.

కాయ్వు = కాయువు. 1. కోరిక. "చ...ఏల నీ, కరమునఁ బుచ్చమాల మిటు కాయ్వునఁ బట్టెదు మేదినీశ్వరా." మార్క. ౫, ఆ. ౨౩౨; 2. అనురాగము. "సీ...కెమ్మోవి యాని యెక్కింతుఁ గాయ్వు." భార. విరా. ౨, ఆ. ౩౧౦; 3. శృంగారచేష్ట. "ఉ...ఒక్కచో నొకటి నొక్కటి గాంచి యెలర్చుకాయ్వులం, జిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౯. (ముద్రి. పా. 'చెయ్వులన్' శ. ర. పా.)

కార. ఉభ. దే. వి. కాసమర్ధము. ఆం. భా. ద్వి. ౬౩. సం. వి. ఆ స్త్రీ. 1. చెఱ; 2. చెఱసాల; 3. వీణకవి వె; 4. దూతిక; 5. బంగారము; 6. కారిక, శ్లోకరూప మగుసూత్రము; 7. పీడ. (త్రి. ని.)

కారండవము. సం. వి. అ. పుం. కన్నెలేడిపిట్ట.

కారంధమి. సం. వి. న్. పుం. 1. కంచుపనివాఁడు; 2. ధాతువాదరతుఁడు, రసవాది.

కారంభ. సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము.

కారకము. సం. వి. అ. న. 1. క్రియానిష్పాదక మగునాఱింటిసమూహము. (కర్తృ,కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అను నివియాఱు.); 2. కర్తమున్నగువానిని గుఱించి చెప్పువ్యాకరణభాగము. (ఉ:—కారకపరిచ్ఛేదము.); 3. కరకాజలము, వడగండ్లనీరు. విణ. (అ. రికా. అ) చేయునది. (ఇది సమాసాంతము లందే యొప్పును. ఉదా:-దుఃఖకారకము. మొ.)

కారగ్గి. ద్వ. వి. (కారు+అగ్గి.) కార్చిచ్చు, దావాగ్ని. "గీ. ఎగ్గతంబునఁ దాను గారగ్గిఁ గాలె, నటె..." భార ఆశ్ర. ౨, ఆ. ౧౬3. కాశీ. ౫. ఆ. ౧౫౯.

కారడుగు. ద్వ. వి. (కారు+అడుగు.) 1. రెండవ పంట. (శ. ర; బ్రౌ.); 2. అల్పధాన్యము.(శ.ర.)

కారణ. సం. వి. ఆ. స్త్రీ. 1. యాతన; 2. ప్రేరణ.

కారణకారణము. సం. వి. అ. న. 1. దూరకారణము; 2. పరమేశ్వరుఁడు; 3. పరమాణువు. సం. కిరా. ౧౮. ౩౫ శ్లో.

కారణజన్మము. సం. వి. అ. న. శాపాదులవలనఁ గలిగినజన్మము. "ఉ...,కారణజన్మమై తనువికారము వచ్చినఁ బెంపు తప్పునే." భార. విరా. ౪, ఆ. ౨౨.

కారణము. సం. వి. అ. న. 1. హేతువు; 2. పని పుట్టు; 3. వధము; 4. ఇంద్రియము. (కల్ప.)

కారణశరీరము. సం. వి. అ. న. 1. అజ్ఞానరూప మగుశరీరము; 2. స్థూలసూక్ష్మదేహములకు లోపల

నుండి మఱియొకదేహము నిచ్చుటకు హేతు వగుదేహము.

కారణికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) పరీక్షకుఁడు.

కారపుఁజెక్క. వై. వి. (కారము+చెక్క) ద్రాక్షత్వక్కు. (శ. ర.)

కారపుఁబదుగు. ద్వం. వి. (కారము+పదుగు) గట్టి నూలిపదుగు. "సీ. కారంపుఁబదుగులు కండెల కప్పెర..." హంస. ౨, ఆ. ౧౧.

కారపుఁబూస. ద్వం. వి. (కారము+పూస.) కారపుఁబొడి మెత్తనిసెనగపిండితోఁ గలిపి సన్నని రంధ్రములు గలచట్రముతో దూయుచు చమురున వేఁచినసన్నని తీఁగలవలె నుండుభక్ష్యవిశేషము. (వా.)

కారపుబూంది. ద్వ. వి. (కారము+బూంది.) కారము చల్లినబూంది. (కారపుబొంది. వా.)

కారపుమన్ను. వై. వి. ఊషరమృత్తిక. (ఆం. పద.)

కారము. ఉభ. వై. వి. (సం. క్షారః. ప్రా. కారం. క. కారపు. త. కారమ్.) 1. కటువు, షడ్రసములలో నొకటి. "క...;ఇతఁడు రసంపుఁబొనకములో, మిరియపుఁగారంబువోలె .." నైష. ౭, ఆ. ౧౮౦; 2. చౌడు. "చ...అంబరమునఁ బట్టినట్టిమలపంకము గారములోన నద్దఁగా, విరిసిన యట్లు..." భార. శాం. 3, ఆ. 3౬౪; 3. నూలు తడిపెడిద్రవ్యవిశేషము. (శ. ర.) 4. బిడ్డలకుఁ బెట్టునొకమందు. "సీ. పసిఁ దహతవహపెట్ట మునరెడుకార్చిచ్చుఁ గారంపుమందుగా నారగించి." చమ. ౧, ఆ. 3౨. విశే. కటువైనది, కారము గలది."చ. వలపులు గ్రమ్మఁగాఁ బొగచి వండిన కారపుఁగాయగూరలు..." ఉ. రా. ౫, ఆ. ౨౮౭. ప్ర. ఒకానొక తద్ధితప్రత్యయము. ఉదా:—నుడికారము. సం. వి. అ. పుం. 1. పని; 2. యత్నము; 3. బలము; 4. రతి; 5. వధము; 6. బలి; 7. హిమాచలము; 8. నిర్ణయము; 9. సుంకము; 10. ఒకధ్వనినిగాని వర్ణమునుగాని చెప్పునపుడు వచ్చుప్రత్యయము. (ఉదా: ఉకారము. ఘీంకారము. మొ.)

కారములుమిరియములునూఱు. ద్వం. అ. క్రి. (కారములు+మిరియములు+నూఱు.) పగపూను, కత్తి కట్టు. వ్యవ:—వాఁడు నామీఁద కారములు మిరియములు నూఱుచున్నాఁడు.

కారయితృ. సం. విశే. (ఋ. త్రి. ఋ.) చేయించువాఁడు.

కారయిల్లు. మి. వి. దే. (కార+ఇల్లు.) కారాగృహము, చెరసాల. "తరలము. ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె ..." భాగ. ౧౦. స్కం. పూ. ౧3౦.

కారవము. సం. వి. అ. పుం. కాకి. (త్రి. ని.)

కారవి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంగువచెట్టు; 2. సదాపచెట్టు; 3. గుగ్గుజటిచెట్టు; 4 పొట్టిగాయగ; 5. ఆఁడుకాకి.

కారవెట్టు. మి. స. క్రి. (కార+పెట్టు.) బంధించు; పట్టుకొను. "ఆ. వలలు దారు నింక వచ్చి జాలరి పేట, లాటు నేఱు గలఁచి కారపట్టి, మిడిసి పోపనీక మెదఁ బట్టుకొనియెద,రప్పు డొదుఁ జొత్తు ననఘచరిత." భాగ. ౮, స్కం. ౬౯౬.

కారవెల్లము. సం. వి. అ. పుం. కాకరచెట్టు.

కారాకు. దే. వి. (కారు+ఆకు.) జీర్ణపర్ణము, పండుటాకు. "క...కృపచాలక గారాకు మేపి చంపకు ప్రజలన్." ఆము. 3, ఆ. 3౨. భార. భీష్మ. ౧, ఆ. ౨౦౪. "...సరుపులఁ గారాకు ధరణిఁ దఱచై రాలెన్." ద్వా. ౩. ౧౨౯.

కారాకూరము. దే. విశే. 1. చలించినది. "క..., కారాకూర మయి మనసు కళవళపడఁగన్." సా. ౨, ఆ. 3; 2. క్షోభించినది. "స్రగ్ధర. కారాకూరంబులై రాక్షసులహృదయముల్ గాడ్పడన్..." ఉ. రా. ౧, ఆ. ౧౨౬. వి. 1. క్షోభము. "మ ..మాఱరదశక్ వేఁగెడుకాంత నింత పెనుఁగారాకూరముల్ సేసె..." పరమ. 3, ఆ. ౨౭౧; 2. నిర్బంధము. "శా...కారాకూరంబులు చేసినం గదలి నే రాను..." కాశీ. 3, ఆ. ౮౨.

కారాగారము. సం. వి. అ. న. కారాగృహము, చెఱసాల.

కారాట. దే. వి. (కారాడు. ధా.) వ్యాపనము, విస్తరణము. (శ. ర.)

కారాడు. దే. స. క్రి. నడపు; విజృంభింపఁజేయు. "గీ. హైమరథములఁ దోలి గంధాంధభద్ర, కరులఁ గారాడి దుముదారుగా హయాళిఁ,జేరు.

వను నూకి భటులకుఁ జేయి పీచి, యభ్యమిత్రీ యనైవసైన్యంబు గదిసి." దశా. ౨, ఆ. ३౮౯.

కారామణులు. మి. వి. బ. నల్లబొబ్బరలు. (బ్రౌ.)

కారామల్లె. మి. వి. బ. తెల్లయలచందలు. (ఆం.వద.)

కారావు. దే. వి. (కారు+ఆవు.) అడవియావు. (బ్రౌ.)

కారి. ఉభ. దే. ప్ర. ఒకానొకతద్ధితప్రత్యయము. ఉదా:—మాటకారి మొ. సం. వి. ఇ. స్త్రీ. క్రియ,పని. విణ. (న్. ణీ. న్.) చేయువాఁడు. (ఇది సమాసాంతములనే ప్రయుక్తము. ఉదా:—కార్యకారి మొ.)

కారించు. సం. స. క్రి. 1. బాధపెట్టు. "క. వైరము గొని వైత్యుఁడు...,కారింపఁ దొడంగె నమరుల..."నృసిం. ౨, ఆ. ౧౧३. భార. ఉద్యో. ౧, ఆ. ३౧౮; 2. పరాభవించు. "గీ. చని జనస్థానమున కేఁగి దనుజభామ, కర్ణనాలంబులై వాల ఖరునిమ్రోల, రాఘువులచేత నైనపరాభవంబు, దెలిపెఁ దెలిపినఁ గనలి వైరేయవరుఁడు. క. తరుణీ నినుఁ గారించిన, పౌరపొచ్చెపునరులఁ బోరఁ బొరిగొనకున్నన్, ఖరనామధేయ మొప్పునె, ఖరనామమె కాక నాకు గర్వావహమున్." రామా. ౫, ఆ. ౧౮౧; ౧౮౨; 3. చంపు. "క. తా రాజచంద్రుఁ డగుటకు, సారంగముఁ బట్టఁ గదియఁ శార్దూలంబున్, గారించి రాజశేఖరుఁ, డైరూఢి వహించెఁ గాన నవ్విభుఁ డచటన్." రామా. ౨, ఆ. ३౦.

కారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పని; 2. శిల్పము; 3. శ్లోకరూప మగుసూత్రము; 4. హింస; 5. నటుని భార్య; 6. వాకుడు.

కారికము. దే. విణ. (క. కారికె. త. కారిక్క్మ్.) అనాహతము, చలువ చేయనిది. ('వస్త్రము.' శ. ర. బ్రౌ.)

కారిజేము. వై. వి. (సం. కాలేయమ్.) కాలఖండము, కడుపులో నీరులిత్తిక్రింద నుండెడుమాంసఖండవిశేషము. "ఆ. వెల్చుముదుసు వంటపిండితాలింపులు, సన్నగూర కారిజంబు క్రొవ్వు, పొదలు మారిషములు పొసఁగుకజ్జంబులు, నంబుజాతగంధులసువుపఱచి." రుక్మా. 3, ఆ. ౨౨. (శ. ర. పా. 'గాలిజంబునొవ్వు' ముద్రి. పా.) స్వా. ౪, ఆ. ౬౦.

కారిత. సం. వి. ఆ. స్త్రీ. అప్పు పుచ్చుకొనువాఁడు తనయవసరమునుబట్టి తనంతటఁ దానే యిచ్చెదనని యొప్పుకొన్నయధిక మగువడ్డి.

కారితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెఱఁబెట్టఁబడినది; 2. బాధింపఁబడినది; 3. చేయింపఁబడినది. "వ...ఇట్టిదారుణంబు దుర్యోధనకారితంబుగా నెఱింగి చింతించి..."భార. ఆది. ౬, ఆ. ౧౬౮.

కారిశము. వై. వి. (సం. కార్శ్యమ్) కృశత్వము; బాధ "గీ. ఓతపస్విని...,కడు నార్త యగుదీనిఁ గనికరంబు, దొఱఁగి యే మివ్విధమున నత్యుగ్ర భంగి, గారిసంబులఁ బెట్టెడికారణంబు." శ్రీరం. ౪, ఆ. ౭౭౭. (కారిసంబులఁబెట్టు = కృశింపఁజేయు; బాధించు అని భావము.)

కారీషము. సం. వి. అ. న. కరీషసమూహము, పేడు పిడుకలప్రోగు.

కారు. యు. దే. వి. 1. అడవి. ఉదా:—కారుచిచ్చు, కారెనుపోతు; 2. (క. కాకు.) నలుపు. (చూ. కారుకొను.); 3. తాంబూలసేవనమునఁ బట్టెడుగార. "సీ. కోరమీసముమీసు నోర పీడెపుఁ గారు నోరచూపులసౌరు నొఱపు దనర." చెన్న. ౪, ఆ. ౨౪. వై. వి. (సం. కాలః. క. కారు.) 1. కాలము. "సీ. ఎచ్చోటఁ దీర్ఘంబు లేకారు జనులకిచ్ఛామాత్రభోగమోక్షప్రదములు." భీమ. 3, ఆ. ౬౫., ఆం. శే. ३౬; 2. వర్షాకాలము. ఆం.భా. ప్ర. ౧౬. "క. కా రనుపేరుఁడు మెఱుఁగను,దొరసిఁ బాంధులను రిపులఁ దునిమినఁ దద్దే, హారుణబిందులు దొరిఁగెనొ, ధారణి నవనింద్రగోపతతి విలసిల్లెన్." కు. సం. ౬, ఆ. ౧౦౧; 3. జ్యేష్ఠాదిమాసచతుష్టయము, కందాయము. ఆం. భా. ప్ర. ౧౬. "శా...ము, క్కారుం బండు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపుఁగే, దారంబుల్ తెగనమ్మఁగాఁ జనునె..." పాండు. 3, ఆ. ౪౦; 4. ఎండకాలమునఁ జల్లు వరిధాన్యము. ఉ:—కారువడ్లు. (శ. ర.); 5. గుంపు, సమూహము. (ఉదా:—కుఱ్ఱకారు.వా.) 6. ఆం. వి.(Car)యంత్రసాహాయ్యమున నడచు

శకటవిశేషము, మోటారు. దే. విణ. 1. దున్ననిది. (పొలము.) "సీ... శఱచువాన, కారుపొలంబునఁ గల్గెనేనియుఁ గొల్చి గావింప నేర్చునే యేవిధమున. వల నేర్పడఁగ దున్నఁబొలములో నైన వర్షంబు లేకున్న ధాన్యంబు లగునె." భార. సౌ. ౧, ఆ. ౩౧; 2. అధికము. ఉదా:—కారుపులుపు, కారునలఁపు (వా.); 3. పండినది. ఉదా:—కారాకు; 4. ఒగరైనది. ఉదా:—కారుగాయ; 5. ఉప్పునిది. ఉదా:—కారునీళ్లు. (వా.)

కారుఁడు. సం. వి. అ. పుం. 1. పతి; 2. యతి. (సాలగ్రామనిఘంటువు.) విణ. (అ. ఈ. అ.) చేయువాఁడు. (ఇది సమాసాంతములందే యుపయుక్తము ఉదా:—గ్రంథకారుఁడు, కుంభకారుఁడుమొ.)

కారుకంది. దే. వి. (కారు+కంది.) అడవికంది, వనతువరి. ఆం. భా. ద్వి. ౬౪.

కారుకొను. దే. అ. క్రి. (కారు+కొను.) 1. నల్లఁబడు; 2. వ్యాపించు. "గీ. గర్భగోళస్థితుం డైన కాలకంఠుకంఠహాలహలచ్ఛాయకాళిమంబు,నాభిబిలమున వెడలి కన్పట్టినట్లు, కమలపత్త్రేక్షణకు నారు గారుకొనియె." కాశీ. ౪, ఆ. ౪. "గీ. అలఁతిచీమలచాలుతోఁ దులయొనర్ప, వఱల నాళీకపత్త్రాక్షిమెఱుఁగుటారు, బాలనీలభుజంగంబుఁ బోలి యపుడు, గాటమై పూటపూటకుఁ గారుకొనియె." రసిక. ౬, ఆ. ౯౯. (పై రెండగ్రమ్ములకు నివి యుదాహరణములే.) "క. కారుకొనియె గాఢ మంధకారము దిశలన్." హర. ౭, ఆ. ౭౧; 3. కూడఁబడు, క్రమ్ముకొను. "క. కారుకొని మేసుమాలా, కారంబునఁ జాలనొప్పెఁ గౌరవసైన్యంబు..." భార. భీష్మ. ౨, ఆ. ౧౬౯; 4. అతిశయించు, విజృంభించు. "ఆ. కురునరేశ్వరుండు బుకిగొల్పెఁ బ్రాచ్యక, శింగదాక్షిణాత్యులంగబలము, మ్లేచ్ఛపతియుఁ బెరయ మెయికొని తాఁకిరి, గజఘటాసమృద్ధిఁ గారుకొనుచు." భార. ద్రో. ౩, ఆ. ౯౭. "మ. మదభృంగాలకకాంతి కారుకొను..." జాహ్నవీ. ౨, ఆ. ౧౧౯.

కారుకొమ్ముమేకము. ద్వి. వి. (కారు+కొమ్ము+మేకము.) దుప్పి. (శ. ర.)

కారుకొఱ్ఱి = కారుకొల్లి. (శ. ర.)

కారుకొల్లి. వై. వి. (సం. కాకోలీ.) 1. కలిగొట్టు. (శ. ర. బ్రా.): 2. వనకులత్థము, అడవియులవ. ఆం. భా. ద్వి. ౫౮.

కారుకోడి. ద్వి. వి. (కారు+కోడి.) అడవికోడి. "గీ... కారుకోళ్లు, కన్ను దెఱవనికస్తురిగమికిశువులు..." పిన. శకుం. ౧, ఆ. ౯౭. ఆం. భా. ద్వి. ౯౨.

కారుక్రమ్ము. దే. అ. క్రి. (కారు+క్రమ్ము.) సాంద్రమగు, దట్టముగా నేర్పడు. "సీ... కల్వకావిరి కాఱుక్రమ్ముచోట." సాందు. ౩, ఆ. ౧౫౯; 2. నల్లనగు. "సీ. గరళంపుఁగప్పునఁ గారుక్రమ్ముచు నున్న యమృతము త్రైపుఁగంటసరి యమర్చి." జాహ్నవీ. ౧, ఆ. ౧౩౧.

కారుఖానా. హిం.వి. కర్మాగారము, పనిచేయుస్థలము. (బ్రా. వా.)

కారుగచ్చ. దే. వి. (కారు+గచ్చ.) వాగుజి. ఆం. భా. ద్వి. ౫౫.

కారుగోఁగు. దే. వి. (కారు+గోఁగు.) కొండగోఁగు. "వ... నిమ్మపండ్లయచ్చపుఁబచ్చడాలు చాల స్త్రీ ఱచుం గారుగోఁగులపైఁ బర్వ..." య. ౪, ఆ. ౧౩.

కారుచిచ్చు. ద్వి. వి. (కారు+చిచ్చు.) దావానలము, కారగ్గి. "చ... కారుచిచ్చునను గాడ్పులుదోడగుచంద మొందఁగన్." ఉ. హరి. ౧, ఆ. ౨౨.

కారుచే. దే. స. క్రి. కాఁడఁజేయు, నాఁటునట్లు చేయు. (చూ. కార్చు.)

కారుజేనము. దే. వి. గలక, శణపుష్పిక. (శ. ర.)

కారుణికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కృపాళువు. భార. శాం. ౩, ఆ. ౩౬౫.

కారుణ్యము. సం. వి. అ. న. దయ, అక్కటికము.

కారుణ్యముసేయు. మి. స. క్రి. దయచేయు, ఇచ్చు, భార్యగా నొసఁగు. "మ... ఈనరేంద్రసుతుం డొండొకభార్య నొల్లక ఫణీంద్రా, యున్నవాఁ డమ్మదా, లసఁ గారుణ్యముసేయుం మీతనికి నుల్లాసంబు సంధిల్లఁగన్." మార్క. ౩, ఆ. ౭౦.

కారుదున్న. దే. వి. (కారు+దున్న.) వనమహిషము, అడవిదున్న. ఆం. భా. ద్వి. ౭౩.

కారునూవు. దే. వి. (కారు+నూవు.) అడవినూవు, జర్తిలము. (శ. ర.)

కారుపసరము. ద్వ. వి. (కారు+పసరము) అడవి జంతువు. (చూ. కార్పసరము.)

కారుపెసర. దే. వి. (కారు+పెసర. క. కారుహెసరు.) అడవిపెసర, ముద్గపర్ణి. ఆం. భా. ద్వి. ౨౩౫.

కారుపోఁక. ద్వ. వి. (కారు+పోఁక.) అడవిపోఁక, శైలపూగము. (శ. ర.)

కారుపోతు = కారుదున్న. (చూ. కార్పోతు.) నవ. ౧, ఆ. ౪౭ పు.

కారుబుడమ. దే. వి. అడవిబుడమ, తీవ్రగంధము. (శ. ర.)

కారుమినుము. దే. వి. (కారు+మినుము.) మాషపర్ణి. ఆం. భా. ద్వి. ౬౮.

కారుమునగ. దే. వి. (కారు+మునగ) అడవిమునగ, వనశిగ్రువు. ఆం. భా. ద్వి. ౪౪.

కారుమెఱుఁగు. ద్వ. వి. (కారు+మెఱుఁగు.) వర్షాకాలపుమెఱుపుతీఁగ. "క. కారుమెఱుం గన... దేవయాన కడుం జెలువొందెన్." య ౪, ఆ. ౯౧.

కారుమొగులు. ద్వ. వి. (కారు+మొగులు) వర్షాకాలమేఘము. "వ... కారుమొగుళులవలన దిగునగణితజలధారతీరున..." ఉ. రా. ౨, ఆ. ౬౧.

కారువు. సం. వి. ఉ. పుం. 1. విశ్వకర్మ; 2. ఇంద్రుఁడు. (కే. ని.); 3. శిల్పము. (హే. ని.)విశే. (పుం. ఉ, స్త్రీ. ఉ.) 1. శిల్పి; 2. చేయువాఁడు.

కారుసంపెఁగలు. ద్వ. వి. బ. (కారు+సంపెఁగలు) ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

కారూరు. దే. వి. (కారు+ఊరు. క. కారూరు.) అడవిపల్లె. "వ...వల్లియల వైచి కోడెలం బట్టిపెనఁచి కారూళ్ల జట్టికాఁఱులకు వశంబుసేయం బరవసం బెసంగఁ గ్రుమ్మరువారును..." హరి. పూ. ౫, ఆ. ౧౪౨.

కారె. వై. వి. (సం. క్షారతృణమ్.) క్షారతృణము, ఒకవిధమగుగడ్డి. ఆం. భా. ద్వి. ౭౬.

కారెనుపోతు = కారెనుము. ఆం. భా. ద్వి. ౮౩. భార. విరా. ౧, ఆ. ౮౩.

కారెనుము. దే. వి. జో. వనమహిషము, కారుదున్న. "వ...కారెనుపపెంట..." స్వా. ౪, ఆ. ౬౦.

కారెము. దే. వి. మళ్లకు నీళు తోఁడు తాటిదోనె. (చూ. కారెమెత్తు.)

కారెమెత్తు. దే. అ. క్రి. (కారెము+ఎత్తు.) కారెము తో నీళ్లు తోఁడు. "చ. బడలికవార లిందనుకఁ బాదులు త్రవ్వఁదగుం గారెమెత్తియుఁన్." విప్ర. ౩, ఆ. ౮౪.

కారేఁగి. దే. వి. (కారు+ఏఁగి) అడవిరేఁగు. "క...కారేఁగులు కంగేళ్లగ నకఁ డేఁగెన్..." ఉద్భ. ౨, ఆ. ౧౩౮.

కారేలకి. ద. ద్వ. (కారు+ఏలకి) అడవి ఏలకి, ఏలాపర్ణి. (శ. ర.)

కారోత్తమము. సం. వి. అ. పుం. కల్లుతేట. (కారోత్తర మని కొందఱు.)

కార్కరకము. సం. వి. అ. పుం. పాలునురుఁగు.

కార్కశ్యము. సం. వి. అ. న. 1. కర్కశత్వము; 2. క్రూరత్వము.

కార్కొను=కారుకొను. 1. ఒగ రెక్కు. "సీ. తమ్మికెంపులకు నెత్తావి గూర్పనితప్పు చివురులు గార్కొనం జేయురవ్వ." అచ్చ. అర. ౨౧; 2. విజృంభించు. "క. కరితురగసమితిఁ గార్కొని, కుపపీరుల మొనలు మొగులుకోమసుఁ గపియన్." భార. విరా. ౪. ఆ. ౨౭౦; 3. అతిశయించు. "శా... కార్కొన్నకోర్కుల్ మదికిన్, జేరల్ వెట్టఁగ..." య. ౫, ఆ. ౬౩. "గీ. కార్కొని దిగంతముల వానకాళ్లు నడచె." ఆము. ౪, ఆ. ౮౯.

కార్కొడి = కారుకోడి. "క. కుక్కలలో శబరులలోఁ, గక్కురచిమ్మటలలోనఁ గార్కొడులలో ..." శివరా. ౪, ఆ. ౪౬.

కార్చిచ్చు = కారుచిచ్చు. "క. కార్చిచ్చు గలిసి మృగతతి, నేర్చుకరణి..." భార. భీష్మ. 3. ఆ. ౨౭౮. భార. విరా. 3, ఆ. ౧౩౨.

కార్చు=కారుచు. దే. అ. క్రి. "చ. కవ వటు డించియే గునుకఁగా సురె గొంటులఁ గార్చి..." ఆము. ౬, ఆ. ౮౧. (శ. ర. పా. 'తార్చి' ముద్రి.) స. క్రి. కాఱఁజేయు, స్రవింపఁజేయు. "చ. అలికులవేణి యోర్తొకనివాస్తములన్ ముఖమజ్జనాంబువుల్, గలఁతియ యెత్తి పోయ నవి కార్చుచు నుండె విభుండు దోయిటన్." నైష. ౬, ఆ. ౧౧౨. గంధ. ౯౬.

కార్జము = కారిజము. (శ. ర.)

**కార్ణము.** సం. వి. అ. న. 1. గులిమి; 2. చెవిపోఁగు; విణ. (అ. ఈ. అ) చెవికి సంబంధించినది.

**కార్తస్వరము.** సం. వి. అ. న. 1. బంగారము; 2. ఉమ్మెత్తచెట్టు.

**కార్తాంతికుఁడు.** సం. వి. అ. పుం. జోస్యుఁడు.

**కార్తికము.** సం. వి. అ. న. కృత్తికానక్షత్రయుక్తమగుపౌర్ణమి గలమాసము. విణ. (అ. ఈ. అ.) 1. కృత్తికకు సంబంధించినది; 2. కార్తికమాస సంబంధి.

**కార్తికము.** సం. వి. అ. పుం. కార్తికమాసము.

**కార్తికేయుఁడు.** సం. వి. అ. పుం. కృత్తికల పుత్త్రుఁడు, కుమారస్వామి.

**కార్తె.** వై. వి. (సం. కృత్తికా.) 1. కృత్తిక యను నక్షత్రము. "సీ. కార్తె బాయస మబ్జగర్భుని తార మాషము..." భార. అను. ౨, ఆ. ౩౭౦; 2. (సం. క్రాంతికి.) సూర్యుఁ డుండునక్షత్రము; అందు సూర్యుఁ డుండుకాలము. ఉదా:— చిత్తకార్తె.

**కార్పటము.** సం. వి. అ. పుం. 1. చినిఁగినబట్ట; 2. లక్క.

**కార్పటికుఁడు.** సం. వి. అ. పుం. కోమటి. విణ. (అ. ఆ. అ.) 1. కాషాయవస్త్రమును ధరించి తీర్థయాత్రలు చేయువాఁడు; 2. కర్మఠుఁడు, పనియందు నేర్పు గలవాఁడు. (వాచ.); 3. గంగాదిజలము (గంగకావిడి) మోయుచుఁ దీర్థయాత్ర చేయువాఁడు; 4. పరులమర్మ మెఱిఁగినవాఁడు.

**కార్పణ్యము.** సం. వి. అ. న. 1. దారిద్ర్యము; 2. లోభిత్వము; 3. దైన్యము.

**కార్పసము** = కారుపసరము. ద్వి. వి. (కారు+పసరము) అడవిమృగము; అడవిగేదె. "చ...కా, ర్పసరపుఁబాలచే నివురఁబాఱిన నివ్వరియోగిరంబుతో." చంద్రా. ౨, ఆ. ౪౬.

**కార్పాసము.** సం. వి. అ. పుం. న. 1. ప్రత్తికాయ; 2. ప్రత్తి; 3. నూలు; 4. బట్ట; 5. కాగితము. విణ. (అ. ఈ. అ.) ప్రత్తికి సంబంధించినది.

**కార్పాసి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రత్తిచెట్టు.

**కార్బారి.** వై. విణ. (సం. కార్యకారి.) తీర్పరి, కార్యభారమును దీర్చువాఁడు. "సీ...తీర్పరి కార్బారి దిట్ట యనఁగఁ. గీ. గార్యకర్తనఁ జెలఁగు..." సాం. ని. మాన. ౧౧.

**కార్మణము.** సం. వి. అ. న. మూలికాదులచేఁ జేయఁబడునుచ్చాటనాదిక్రియ, చిల్లంగి. విణ. (అ. ఈ. అ.) 1. నెఱవేఱుదాఁకఁ బని చేయునది; 2. పనియందు నేర్పు గలది; 3. కర్మకు సంబంధించినది.

**కార్మారుఁడు.** సం. వి. అ. పుం. 1. శిల్పి; 2. కమ్మరి.

**కార్ముఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కర్మశీలుఁడు, పని చేయుస్వభావము గలవాఁడు.

**కార్ముకము.** సం. వి. అ. పుం. 1. వెదురుచెట్టు; 2. పెద్దవేముచెట్టు; 3. ఎఱ్ఱగన్నేరుచెట్టు. న. 1. విల్లు; 2. ధనూరాశి; 3. దూదియేకువిల్లు. విణ. (అ. ఆ. అ.) పనియందు నైపుణ్యము గలది.

**కార్మొయిఁగు** = కారుమొయిఁగు. "సీ. కార్మొయిఁగున కిట్టికళ గలదే..." ఉ. రా. ౪, ఆ. ౧౬౯.

**కార్మొగులు** = కారుమొగులు. వసు. ౨, ఆ. ౧౧.

**కార్యకాఁడు.** మి. వి. (కార్యము+కాఁడు.) కార్యము సిద్ధింపఁజేసికొనువాఁడు. "ఆ. ప్రతిన వలదు వైరిపట్టిన నృపతికి, దండు విడలఁ దీరకుండుఁ దీరుఁ, గాకయుండి యుండి కాలాంతరమున నాఁ,గార్యకాఁడో యంకకాఁడో నృపుఁడు." ఆము. ౪, ఆ. ౨౬౩.

**కార్యదర్శి.** సం. విణ. (న. నీ. న.) కార్యము నెఱవేర్చువాఁడు.

**కార్యము.** సం. వి. అ. న. 1. పని; 2. ప్రయోజనము; 3. అక్కఱ; 4. హేతువు; 5. జన్యము. (వ్యతి. కారణము.); 6. వ్యాజ్యెము; 7. జన్మలగ్నమునకు దశమస్థానము; 8. నాటకమునందలి కథాపర్యవసానము. విణ. (అ. ఆ. అ.) కర్తవ్యము, చేయఁదగినది. "క. ఫలములయెడ బ్రహ్మార్పణ, కలనపరుం డగుచుఁ గార్యకర్మము నడపన్, వలయును..." భార. శాం. ౧, ఆ. ౬౯. "క. ఇది కార్యమ యని పరిగ్రహింపుము నెమ్మిన్." భార. ఆది. ౬, ఆ. ౨౨౬.

**కార్యి.** సం. విణ. (న్. ఈ. న్.) 1. ఉద్యోగి; 2. కార్యార్థి; 3. వ్యాజ్యెమున నున్నవాఁడు.

**కార్వాకు.** దే. వి. తృణవిశేషము. హంస. ౫, ఆ. ౪౫.

కార్శ్యము. సం. వి. అ. న. 1. కృశత్వము, చిక్కుట; 2. తగ్గువల; 3. సన్నఁదనము. పుం. 1. మద్దిచెట్టు; 2. కచోరము; 3. లకుచము.

కార్షకుఁడు. సం.విణ. (అ. ర్షి కా. ఆ.) కృషీవలుఁడు, దున్నుకొని జీవించువాఁడు.

కార్షాపణము. సం. వి. అ. పుం. న. 1. పదియాఱు పణములయెత్తు; 2. కర్షమెత్తు వెండిటంకము. న. ధనము.

కార్షికము. సం.వి. అ. పుం. కర్షమెత్తువెండిటంకము. విణ. (అ. ఈ. అ.) 1. కర్షమెత్తుగలది; 2 ఒక కర్ష మిచ్చి కొనఁబడినది; 3. దున్నుటకుఁ దగినది.

కార్షికుఁడు. సం = కార్షకుఁడు.

కార్ష్ణి. సం. వి. ఇ. పుం. 1. మన్మథుఁడు; 2. శ్రీశుకుఁడు. ఈ. స్త్రీ. పిల్లపీచరపిట్ట.

కార్ష్ణ్యము. సం. వి. అ. న. కృష్ణత్వము, నలుపు. నైష. ౫, ఆ. ౩౯.

కాఱియ. వై. వి. (సం. కారికా. ప్రా. కారి ఆ.) 1. కష్టము, దుస్థితి. "క...ద్రౌపదికి నెయ్యేడలం, దేపాటులు వాటిల్లెనె, కాపురుషులవలన నిట్టి కాఱియ పుట్టెన్." భార. విరా. ౪, ఆ. ౧౩౦. "ఉ...ఈ, కాఱియ మచ్చలంబునకుఁ గాఁదగునే వివిధాస్త్రసంపదల్, మీఱిన నీవె చూడఁగ..." భార. కర్ణ. ౩, ఆ. ౧౦; 2. బాధ, యాతన. "క. వే ఱొకవిలు గొని విమతుఁడు, దూఱఁగ వారిమేన నాఁటెఁ దొమ్మదియమ్ముల్, మాఱెనుబదింటఁ బొదివెం,గాఱియగా మఱియుఁ బఱపె గమికొనఁ దూపుల్." హరి. ఉ. ౧, ఆ. ౧౫౭; 3. నలుపు. ఆం. భా. ప్ర. ౧౦౮.

కాఱియపడు. వై. అ. క్రి. (కాఱియ+పడు.) 1. బాధపడు, యాతన నందు. "క. మనుజు వరింపక మనుజాం,గన మనుజాశను వరించి కాఱియ పడునే." భా. రా. సుం. ౨౨౨; 2. ఇడుమలు గుడుచు, కష్టములపాలగు. "ఆ. జూదమాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను బణంబు, గాఁగ నొడ్డి యోడి కాఱియ పడఁడె..." భార. విరా. ౫, ఆ. ౨౪౫.

కాఱియపెట్టు. ద్వి. స. క్రి. (కాఱియ+పెట్టు.) 1. బాధపెట్టు. "ఉ... మేన్, గాఱియపెట్టియైన నొడికంబుగ వండుదు నెల్లకూరలున్." భార. విరా. ౧, ఆ. ౭౭. "క...మిముఁ, గాఱియ పెట్టితె..." భార. అను. ౫, ఆ. ౩౭౩; 2. దండించు, శిక్షించు. "క. నరకం బెట్టిది కల్మష, కరులకు జముఁ డెట్టిభంగిఁ గాఱియపెట్టున్." భార. అను. ౫, ఆ. ౧౬౯.

కాఱు. యు. వై. అ. క్రి. (సం. క్షర్.) 1. స్రవించు. "శా. మోముల్ వెల్వెలఁబాఱఁ గన్నుఁగవ నామోదాశ్రువుల్ గాఱ..." దశా. ౨, ఆ. ౨౯; 2. రాలు. "ఉ. కోఱలు దీటుచుం నయనకోణములం దహనస్ఫులింగముల్, కాఱఁగ..." హరి. పూ. ౪, ఆ. ౧౪౪. దే. వి. (త. కార్.) 1. అజ్ఞానము. "క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ, జాఱవిడిచినట్ల తనదు సుజ్ఞానము నన్,క్కాఱు విడిచి తనకంటెను, మీఱ నొకటి లేమి గాను మెయికొనవలయున్." భార. అను. ౪, ఆ. ౨౦౨; 2. సందంశకము, పట్టుకాఱు. "గీ. మీఱు సందంశకము పేరు కాఱనంగ." ఆం. భా. ద్వి. ౭౮. చంద్రా. ౪, ఆ. ౧౭; 3. కామవికారము. "వ... కాఱు పసులై తిరుగుచు..." హరి. పూ. ౬. ఆ. ౬౭. ('కారు' ము ద్రి.) బ. 1. పరుషోక్తులు. "ఉ... మాటలు చిత్తమునందు నిల్పకేఁ,గాఱులు ప్రేలెదన్..." భార. ఉద్యో. ౩, ఆ. ౧౦౭; 2. అసత్యోక్తులు. "ఆ. ఇవముసూడుకొలపు,టేలికల్ మున్నెందుఁ,గాఱులాడి రనినకత యెఱుంగ." అచ్చ. అయో. ౩౦; 3. గర్వోక్తులు. "ఆ. నీచులకు బలంబు నెట్టన పరుసని, కాఱు లఱచు చున్కి..." భార. కర్ణ. ౨, ఆ. ౯౦. విణ. 1. నీచము, నింద్యము. "గీ...వేదముల్ గాఱువేద,ములు మతంబులు సమ్మతంబులు ..." వరాహ. ౯, ఆ. ౫౦; 2. క్రూరము, కఠినము. "ఆ. కన్ను లెఱ్ఱచేసి యన్నులఁ గని కాఱు,కూఁత లఱచె దేమి కోకిలంబ." రసిక. ౪, ఆ. ౧౭౦; 3. వ్యర్థము, శుష్కము. "సీ. ఘుట మంచుఁ బట మంచుఁ గాఱుయుక్తులఁ బెంచు దుష్టతార్కికులకు దూర మగుచు." కళా. ౮, ఆ. ౨౨౦; 4. సాంద్రము, దట్టము.

"క. కాఱడవిఁ బఱచుమృగముల, నూఱడకయ తిగిచి..." భార. ఆది. ౮, ఆ. ౧౯.

కాఱుకొను = కారుకొను. (సందడించు.) "ఉ... ఘనప్రకరంబును బోలెఁ గాఱుకొం,చుం దఱ చైన దంతిభటసుందర కేతనరాజి గ్రాలఁగా." భార. విరా. ౫, ఆ. ౬౯.

కాఱుకొమ్ములమెకము. ద్వ. వి. (కాఱు+కొమ్ముల+ మెకము.) సాంద్రశృంగమృగము, దుష్టి. అం. సం. తిర్య. ౯.

కాఱుచేయు. దే. స. క్రి. కాఱుఁజేయు. (శ. ర.)

కాఱొడ్డెకాఁడు. దే. విణ. (కాఱొడ్డెము+కాఁడు.) పరుషభాషణము లాడువాఁడు; గర్వి. "క..., కాఱొడ్డెకాఁడు ఋణియును, బారము ముట్టంగ లేరు బహుదుఃఖములన్." శేష. 3, ఆ. ౫౯.

కాఱొడ్డెము. దే. వి. (కాఱు+ఒడ్డెము.) 1. పరుషోక్తి. ఆం. భా. ప్ర. ౧౧౭; 2. తిరుగుఁబాటు మాట. "శా... అది రా కాఱొడ్డెమా నేను జెప్ప న్నీ విప్పుని కొప్పుకోమి యిది..." చం. రా. ౫, ఆ. ౬౧.

కాల. సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టుచెట్టు; 2. నల్లజీలకఱ్ఱచెట్టు; 3. పెన్నేరుచెట్టు; 4. నల్లతెగడచెట్టు; 5. మంజిష్ఠిచెట్టు; 6. దుర్గ.

కాలకంఠము. సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. పిచ్చుక; 3. కాటుకపిట్ట; 4. వేఁగిసచెట్టు; 5. తూరుగుండె. విణ. (అ. ఆ, ఈ. అ.) 1. నల్లనికంఠము గలది; 2. కంఠమునందు నలుపు గలది.

కాలకంఠుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

కాలకము. సం. వి. అ. పుం. 1. పుట్టుమచ్చ; 2. లక్క; 3. నీటిపాము; 4. కంటిననల్లగ్రుడ్డు. న. 1. కారిజము; 2. కటివేముచెట్టు. విణ. (అ. లిం. అ.) నల్లనిది.

కాలకీలము. సం. వి. అ. పుం. కోలాహలము. (వాచ.)

కాలకుంఠుఁడు. సం. వి. అ. పుం. యముఁడు.

కాలకూటము. సం. వి. అ. పుం. న. హాలాహలవిషము.

కాలకృతుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

కాలక్షేపము. సం. వి. అ. పుం. 1. కాలముపుచ్చుట; 2. కాలయాపనము.

కాలఖంజనము. సం. వి. అ. న. కాలఖండము, కారిజము.

కాలఖండము. సం = కాలఖంజనము.

కాలగోచరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కాలమునకు వశమైనవాఁడు, కాలధర్మ మొందినవాఁడు, మృతుఁడు. "వ. ఈశ్వరుండు వానికి వైదగ్ధ్యం దఱువది వేవురుగొడుకులను శైబ్యయం దొక్కకొడుకుసుం గా వరం బిచ్చి యయ్యఱువది వేవురు నతిదర్పితులై యేకకాలంబునఁగాలగోచరు లగుదు రనియు నయ్యొక్కగొడుకు వంశకర్త యగు ననియుఁ జెప్పి యదృశ్యుం డైన." భార. అర. 3, ఆ. ౫౧.

కాలచక్రము. సం. వి. అ. న. చక్రాకారముగాఁ దిరుగుచుండుకాలము.

కాలజ్ఞపత్రి. సం. వి. న్. పుం. = కాలజ్ఞము. "మ... కాకున్నఁ గాలజ్ఞపత్త్రిరుతం బెట్లు చెలంగు మానకుపితస్త్రీ కర్ణదంభోళియై." ఆము. ౫, ఆ. ౧౦౫. (ఇటఁ గాలజ్ఞపత్రి యనఁ గోడి యనియుఁ గోయిల యనియుఁ గూడఁ జెప్ప వచ్చును.)

కాలజ్ఞము. సం. వి. అ. పుం; 1. కోడి; 2. కోయిల.

కాలజ్ఞుఁడు. సం. వి. అ. పుం. జోస్యుఁడు. విణ. (అ. ఆ. అ.) ఉచితసమయ మెఱిఁగినవాఁడు.

కాలటుక. దే. వి. (కాలు+అటుక.) కుండ లుంచుకొనుటకై రెండుమొనలు నిరుప్రక్కల గోడల యందుఁ బొదిగి యుయ్యాలగాఁ గాల్గొంచి యడ్డముగా నమర్చినమ్రాను. (శ. ర.)

కాలధర్మము. సం. వి. అ. పుం. 1. కాలముయొక్క ధర్మము; 2. మరణము.

కాలపక్వము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాలముచేతనే పరిపాక మందినది; 2. కాలముచే పరిపాకము చెందినది, మృతినొంద సిద్ధమైనది. "గీ. అని జనార్దనుఁ గనుఁగొని యకట కాల,పక్వ మయ్యె నీనరపతిప్రతతి యెల్ల,ననుడు..." భార. ఉద్యో. 3, ఆ. 3౭౭.

కాలపర్యయము. సం. వి. అ. పుం. కాలవ్యత్యాసము, కాలపుమార్పు. భార. మా. ౧౮౮.

కాలపాశము. సం. వి. అ. పుం. 1. యమపాశము; 2. ఉరిత్రాడు.

కాలపృష్ఠము. సం. వి. అ. పుం. 1. ఒకజాతిఇఱ్ఱి; 2. కాపులుఁగు. న. 1. విల్లు; 2. కర్ణునివిల్లు.

కాలప్రభాతము. సం. వి. అ. న. శరదృతువు. (త్రి. ని.)

కాలము. సం. వి. అ. పుం. **1.** నలుపు; **2.** వేళ; **3.** కోయిల; **4.** కంటికొల్లగ్రుడ్డు; **5.** మరణము; **6.** మూఁడుసంఖ్య. న. **1.** ఇనుము: **2.** కాలీయక మనుగంధద్రవ్యము; **3.** కక్కోలకము✿. విణ. **1.** (అ. ఈ. అ.) నల్లనిది; **2.** (అ. ఆ. అ.) క్రూరము, దుష్టము.

కాలముఖము. సం. వి. అ. పుం. కొండముచ్చు.

కాలముచేయు. మి. అ. క్రి. చచ్చు. "క...మాయ గోవు పడుచుం, గనుగ్రుడ్లం దిరుగవేసి కాలము చేసెన్." వరాహ. ౧౦, ఆ. ౪౦. ఆం. సం. మాన. ౫౩.

కాలమేషి. సం. వి. ఈ. స్త్రీ. **1.** కారుగచ్చు✿; **2.** నల్లతెగడ✿; **3.** మంజిష్ఠ.

కాలమేషిక. సం. వి. ఆ. స్త్రీ = కాలమేషి.

కాలయాపనము. సం. వి. అ. న. = కాలక్షేపము.

కాలయోగము. సం. వి. అ. పుం. **1.** విధి; **2.** కాలముయొక్కకూడిక.

కాలరాత్రి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. **1.** ప్రళయకాలము; **2.** చీఁకటిరాత్రి; **3.** దీపావళ్యమావాస్య; **4.** మానవజీవితములో డెబ్బదియేడవ వత్సరమున నేడవమాసమున నేడవనాఁటిరాత్రి; **5.** దుర్గాభేదము; **6.** నదీభేదము; **7.** యముని భగిని.

కాలరి. దే. వి. (కాలు+అరి.) **1.** పదాతి, కాలిబంటు. "సీ. చేగలమేకములఁ జెండుబెం డొనరించి కాలరిపోఁజుల నేలఁ జమరి." అచ్చ. సుం. ౧౦౮. ఆం. శే. ౩౧; **2.** దూత, చారుఁడు. "వ...మనము వెస గలకాలరుల వేగం బుచ్చి..." భార. ఉద్యో. ౧. ఆ. ౩౭. ('దూతా గచ్ఛంతు శీఘ్రగాః' అని మూలము.); **3.** పథికుఁ డిచ్చుపన్ను, అనుపు." ఆం. భా. ద్వి. ౧౯౨.

కాలరు. ఆం. వి. చొక్కాసెడపట్టి.

కాలవేయు. దే. స. క్రి. (కాలన్+వేయు.) కాలుటకై ప్రాయిమీఁదఁ బెట్టు. వా:—గిన్నె కాల వేసినది.

కాలశాకము. సం. వి. అ. పుం. కృష్ణనింబము, కఱివేము✿.

కాలశేయము. సం. వి. అ. న. మజ్జిగ.

కాలసర్పము. సం. వి. అ. పుం. నల్లత్రాఁచు, కృష్ణసర్పము.

కాలసూత్రము. సం. వి. అ. న. **1.** నరకభేదము; **2** మృత్యుహేతు వగుసూత్రము. (ఉరిత్రాడు మొ.); **3.** కాలమును నడపుసూత్రము.

కాలస్కంధము. సం. వి. అ. పుం. **1.** చీఁకటిమ్రాను✿; **2.** తుమికి✿; **3.** పొగడ✿. **4.** వేఁగిస✿; **5.** మేడి✿.

కాలస్థాలి. సం. వి. ఈ. స్త్రీ. పాటలి, కలిగొట్టు✿.

కాలహరణము. సం. వి. అ. న. ఆలస్యము, జాగు.

కాలహాని. సం. వి. ఇ. స్త్రీ = కాలహరణము.

కాలాఁగు. దే. అ. క్రి. (కాలు+ఆఁగు.) కాలూఁదు, కొంతకాల మాఁగు. "గీ. తిమురుమధ్యాహ్నమయ్యెను దేవ యిచట, నేఁడు కాలాఁగి మామందపాఁడి చూచి, గోరసముఁ బాయసంబాలు నారగించి, నిగ్రహం బైనమమ్ము మన్నింపవలయు." పిన. శకుం. ౧, ఆ. ౧౨౩.

కాలాతీతము. సం. వి. అ. న. కాలాతిక్రమణము, యుక్తకాలము దాఁటిపోవుట." శ్లో. కాలాతీతే వృథా సంధ్యా వంధ్యాస్త్రీమైథునం యథా." (వాచ.) విణ. (అ. ఆ. అ.) యుక్తకాలము దాఁటిపోయినది.

కాలానుసార్యము. సం. వి. అ. న. **1.** సిలాజిత్తు; **2.** ఇరుగుడు✿; **3.** నందివర్ధనము✿; **4.** సుగంధిద్రవ్యవిశేషము.

కాలాయసము. సం. వి. అ. న. ఇనుము.

కాలారి = కాలరి. **1.** (కాలిబంటు.) "ద్వి. కరులతో హరులతోఁ గాలారితోడ." ద్విపద అభిమన్యు చరిత్రము. ౧౪౪. పు. (బ్రౌ.); **2.** జనులమీఁద జమచేయుపన్ను. (ఆం. పద.)

కాలిక. సం. వి. ఆ. స్త్రీ. **1.** పార్వతి; **2.** ద్రౌపది; **3.** కుజ్జ; **4.** ఉడుత; **5.** బొగ్గు; **6.** నలుపు; **7.** రోమావళి; **8.** నల్లపిచ్చుక; **9.** మేఘావళి; **10.** మద్యము; **11.** నెలవారీవడ్డీ; **12.** జటామాంసి✿; **13.** కారుకొల్లి✿; **14.** నల్లసిరా; **15.** నల్లజీలకఱ్ఱ✿; **16.** తొగరిమన్ను; **17.** తేలుకొండి✿; **18.** కరక✿; **19.** అశ్వదంతరేఖ; **20.** వైవర్ణ్యము.

**కాలికంచెము.** దే. వి. (కాలు+కంచము.) ఇసుకలో కాలితోఁ గంచమువలెఁ జేయునాట, బాల క్రీడావిశేషము. "సీ. కాలికంచంబును గట్టె గుజ్జము..." హంస. ౩, ఆ. ౧౪౬.

**కాలికడ** = కాల్కడ. (చూ. కాల్కడ)

**కాలికడియము.** దే. వి. (కాలు+కడియము) అందె. (చూ. కాల్కడియము.)

**కాలికట్టు.** దే. వి. (కాలు+కట్టు.) పాదుక. (చూ. కాల్గట్టు.)

**కాలికము.** సం. వి. అ. పుం. 1. క్రౌంచపక్షి; 2. బొగ్గు. న. 1. పగ; 2. కృష్ణచందనము. విణ. (అ. ఈ. అ) 1. కాలమునకుఁ దగినది; 1. కాల జన్యము; 3. కాలకృతము.

**కాలిడు.** దే. అ. క్రి. (కాలు+ఇడు.) చొచ్చు; అడుగుపెట్టు. "ఉ...నృపాలుసొరెలకుఁ గాలిడ నెందును జోటు లేక..." భో. ౭, ఆ. ౧౩౦; 2. కాఁపురముండు. "చ...నీ,యనుజయు నేనుఁ గాలిడుదుము..." వేం. పంచ. ౧, ఆ. ౨౦౬.

**కాలితెరువు** = కాల్దెరువు. (చూ. కాల్దెరువు.)

**కాలిత్రోవ.** దే. వి. (కాలు+త్రోవ.) ఏకపది, నడక బాట. ఆం. భా. ద్వి. ౯. "ఆ. కాంచి యూలఁ డొక్కకాలిత్రోవయు నంతఁ, గాంచి..." ఆము. ౬, ఆ. ౧౬.

**కాలినడ.** దే. వి. (కాలు+నడ.) పాదచారము, కాలినడక. (శ. ర.)

**కాలిపారువ.** దే. వి. (కాలి+పారువ) మల్లయుద్ధములోని మెలకువలలోనొకటి. (ఆం. పద.)

**కాలిపుట్టువు.** దే. వి. (కాలు+పుట్టువు.) పాదజుఁడు, శూద్రుఁడు. (శ. ర.)

**కాలిబంటు.** ద్వ. వి. (కాలు+బంటు.) పదాతి, కాలరి; (శ. ర.)

**కాలిబోను.** దే. వి. (కాలు+బోను.) ఒకవిధ మగు బోను. స్వా. ౪, ఆ. ౩౭.

**కాలిమ.** సం. వి. న్. పుం. 1. నలుపు; 2. వైవర్ణ్యము.

**కాలిముల్లు.** దే. వి. (కాలు+ముల్లు.) కాలున గ్రుచ్చుకొన్నముల్లు. "ఆ. చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ, కంటిలోనినలుసు కాలిముల్లు, నింటిలోనిపోరు నింతంత గాదయా, విశ్వదాభిరామ వినురవేమ." (వేమన.) విణ. (కాలిలోని ముల్లువంటివాఁడు.) క్షణక్షణబాధకుఁడు. "గీ... గాలి, కాలిముల్లు కుభృత్స్వాలిపాలిపిడుగు, రావణుఁడు డించె భువనముల్ రక్షఁ జెందె." ఉ. రా. ౧, ఆ. ౧౪౯.

**కాలిమూఁక.** దే. వి. (కాలు+మూఁక) కాల్బలము. "సీ. నూటికొక్కఁడె చాలి మేటిమగంటిమిఁ గాలుద్రవ్వుచు నుండు కాలిమూఁక." రంగా. ౧, ఆ. ౧౩౭.

**కాలియ.** వై. వి. (సం. కాళికా.) పిశాచము. "ఉ. కాలియ పట్టినట్లు కడుఁ గంది కృశుం డయి ..." మార్క. ౧, ఆ. ౨౩౬.

**కాలీచి.** సం. వి. ఈ. స్త్రీ. యముని న్యాయవిచారణస్థలము.

**కాలు.** దే. అ. క్రి. 1. దగ్ధమగు. "చ...కాలిన యట్టి మ్రోడుకై, పడి..." స్వా. ౩, ఆ. ౪౬; 2. మండు. "గీ. సతి వియోగాగ్ని మనములో సంతతంబుఁ, దగిలికొని కాల..." కు. సం. ౩, ఆ. ౩౩౦. వి. టా. (క. కాలు. త. కాల్.) 1. పాదము. "ఆ...నేలఁ బెట్టి కాలఁ జమర." భార. శాం. ౩, ఆ. ౪౭౪; 2. నాలుగవవంతు. "గీ. మూలనక్షత్రమునయందు మొదటికాలఁ, గేంద్రమున నాంగిరసుఁ డుండ..." కాశీ. ౫, ఆ. ౩౨౬; 3. మంచము మొ. వానికోడు. "ఉ...,కంగటికాలు నమ్మఁదగునై దువు..." జై. ౫, ఆ. ౧౫; 4. పద్యపాదము. "సీ...ఈమూఁటి కక్షరంబులు సమం బన్నికాళ్ల..." అప్ప. ౪. ౧౦౧.

**కాలుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. యముఁడు; 3. శని; 4. ఒకానొకవిశ్వేదేవుఁడు.

**కాలుకంబము.** ద్వ. వి. (కాలు+కంబము.) ద్వారము యొక్క ప్రక్కచెక్క. (బ్రా.) "గీ. మరుఁడు శృంగారవీథు లేర్పఱచి తనదు, పేర నొకపేఁటఁ గట్టి సంప్రీతిఁ దోరణాల నుంచినకాలుకంబాలనంగఁ, గలికియూరులు చెలఁగుఁ బైఁ గాంచి మెఱయ." బిల్హ. ౨, ఆ. ౧౧౫.

**కాలుకొను.** దే. అ. క్రి. (కాలు+కొను) 1. కాలితో నడచు; నడచు. "సీ. కాలుకొన్నంతయుఁ గడు వేగమునఁ బాఱి..." నిర్వ. ౪, ఆ. ౭౬. ౬, ఆ. ౩౬. విక్ర. ౬, ఆ. ౧౦౦; 2. కాలు. (చూ.

కాలుకొల్పు.) 3. వ్యాపించు. "గీ. అంతకంతకు నెక్కుచు సంతమసముఁ, గాలుకొనసీక చంద్రుండు గ్రాలె నధిప." భార. ద్రో. ౫, ఆ. ౨౭౫; 4. కాలుమోపు; నిలుచు. (చూ. కాలూను.)

కాలుకొలుపు. దే. స. క్రి. (కాలుకొను. ధా. ప్రే.) కాలుకొనఁజేయు, మండించు. "గీ. కాలుకొలిపిన పావకజ్వాల లనఁగ." పారి. ౨, ఆ. ౭౫. (చూ. కాలుకొల్పు.) "వ...వాత్యానసానిల వేగంబునఁ గాలుకొల్పి..." శుక. 3, ఆ. ౪౪౯.

కాలుగొను. = కాలుకొను. (చూ. కాల్గొను.)

కాలుచు. దే. స. క్రి. (కాలుధా. ప్రే.) కాలఁజేయు, దహించు. (చూ. కాల్చు.)

కాలుచ్చు. దే. వి. (కాలు+ఉచ్చు.) వేటసాధనవిశేషము, కాళ్లు బంధించునొకవల. "క. మిడిబోనులఁ గాలుచ్చులఁ, బడఁదోలియుఁ బోఁగులోనుపటిబియుం లేళ్లన్, వడి గలజింకల నెల్లన్, బొడిచిరి కడుఁ జెంచులాఖుపులఁ జెవ లదరన్." యయా. ౨, ఆ. ౧౯.

కాలుదన్ను. దే. అ. క్రి. (కాలు+తన్ను.) కదలక నిలుచు. (చూ. కాల్దన్ను.)

కాలుదివియ. ద్వి. వి. (కాలు+దివియ.) కాఁగడా. (శ. ర.)

కాలుద్రవ్వు. దే. అ. క్రి. (కాలు+త్రవ్వు.) 1. కాలితో నేలను ద్రవ్వు. "సీ. అమ్మహోగ్రవ్యాఘ్రము..." "గీ. పక్షవిక్షేపపాతరసమ్ము గొలుపఁ, గాలుద్రవ్వుచు నుండెఁ దత్పాలమూలమున మొగంబున రౌద్రంబు మునుకొనంగ." విక్ర. 3, ఆ. ౧౦; 2. అకారణముగా సిద్ధపడు. (చూ. కాల్ద్రివ్వు.)

కాలుద్రొక్కు. దే. అ. క్రి. (కాలు+త్రొక్కు.) అభిముఖుఁడగు, ఎదురుపడు. 'గీ. పూసపాటి మహాస్థానభూమియందుఁ, గాలుద్రొక్కంగ నోడుఁ జుండాలుఁడైనఁ, గదలు మిటమాని దివిజగంగాభవాని. (సూక్తకవిచాటువు) "గీ...కాలుద్రొక్కఁ, గవిసెఁ గదిసె ననంగ నాఖ్యయయి యొప్పు, నభిముఖుండయ్యె ననుటకు..." ఆం. శ. ౧౭. స. క్రి. 1. వెంబడించు. "గీ. చెలువనిను రాజకీరంబు చెట్టపట్టెఁ, గలికి నినురాజహంసంబు కాలుద్రొక్కె, మంచికళకునంబు లిదిగో నామాట చూడు, కన్నె యాలోనఁ బెండ్లిగాఁ గలదు నీకు." విజ. ౨, ఆ. ౧౫౯; 2. పెండ్లాడు. (చూ. కాల్ద్రొక్కు.) వి. పెండ్లి. ఆం. భా. ద్వి. ౧౭౭.



కాలుపడు. ద్వి. అ. క్రి. (కాలు+పడు) చిక్కుకొను. (చూ. కాల్పడు.)

కాలుపలము. మి. వి. (కాలు+పలము.) పలములో నాల్గవవంతు. ఆం. భా. ద్వి. ౨౯.

కాలుపు. దే. వి. (కాలుచు. ధా.) కాల్చుట. (చూ. కాల్పు.)

కాలుబలము. మి. వి. (కాలు+బలము.) కాలినడకను జనుసేన. "ఆ. చదెనెఁ గాలుబలము..." భార. భీష్మ. ౨, ఆ. ౧౬౫.

కాలుమడి. దే. వి. (కాలు+మడి.) మూత్రము. (చూ. కాల్మడి.)

కాలుమడుచు. దే. అ. క్రి. (కాలు+మడుచు.) మూత్రము విడుచు. (శ. ర.)

కాలుమానిసి. ద్వి. వి. (కాలు+మానిసి.) కాలిబంటు, పదాతి. "సీ...మొగ్గ నేనుఁగుఁ బడుకాలుమానిసియును." భార. ద్రో. 3, ఆ. ౪౦.

కాలురి = కాలుచ్చు. "క. వెలివాఱును గాలురులును, వలలు..." ఉ. పారి. ౪, ఆ. ౨౨.

కాలువ. వై. వి. (సం. కుల్యా. క. కాలువె.) 1. కుల్య, నీరు పాఱుటకుఁ ద్రవ్వినమార్గము. "గీ. లోనితాతొట్టి నిండి కాలువగఁ జాఁగి." ఆము. ౬, ఆ. ౧., ఆం. శే. ౬3; 2. పరంపర. "సీ. అలిగి యర్జునుఁడు వాలంపకాలువ లోలి నడరించుటయు..." భార. భీష్మ. 3, ఆ. ౨3౪.

కాలువల = కాలుచ్చు. "వ...కాలువలన నురుల బోనుల..." పిన. శకుం. ౨, ఆ. ౧౪.

కాలుష్యము. సం. వి. అ. న. 1. మనోవైకల్యము; కలఁత; 2. మాలిన్యము; బురద.

కాలుసాఁచు. దే. అ. క్రి. (కాలు+చాఁచు.) 1. ప్రయత్నించు, దీక్షవహించు. "సీ. ఎవ్వండు నీచిత్త మెఱిఁగించుచున్నాఁడు కైవల్యపదవికై కాలుసాఁచి." హర. 3, ఆ. ౪3; 2. ప్రయాణమగు. (చూ. కాల్సాఁచు.)

కాలూఁదు. దే. అ. క్రి. (కాలు+ఊఁదు.) **1.** కాలు మోపు. "సీ. దీనికా నల్లాడఁగానె కా గర్వించి యంఘ్రిఁ జైత్రుసకుఁ గాలూఁదఁ గలిగె." ఆము. ౫, ఆ. ౧౦౫; నైష. ౫, ఆ. ౧౨౭; **2.** నిలుచు. "క...ఏ పట్టునఁ గాలూఁదక నిజపట్టణమున కరుగుదెంచి..." విక్ర. ౨, ఆ. ౨౬; **3** ప్రవేశించు. "క. బాలత్వ మెడలి తరుణిమ, కాలూఁదఁగ..." వా. రా. ౧, ఆ. ౧౧౪; **4.** కాలిమీఁదనిలుచు, పోవ సిద్ధమగు. "క. ఈలీలఁ గొంతకాలము, బాలామణి సంచరించు ప్రాయము నాఁడే, కాలూఁది యున్నయిందిర, తాలిమి చెడి నిలువ కచటు తలఁగినయంతన్." హంస. ౨, ఆ. ౧౪౯.

కాలేయకము. సం. వి. అ. పుం. మ్రానిపసుపు. న. పీతచందనము.

కాలేయము. సం. వి. అ. న. **1.** కారిజము; **2.** నల్ల అగలు; **3.** పీతచందనము. విణ. (అ. ఆ. అ.) కలియుగమునకు సంబంధించినది.

కాల్కడ. దే. వి. (కాలు+కడ.) మంచమునఁ గాళ్లు పెట్టుకొనువైపు, కాళ్లకడ. "గీ. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయంపి చెసనున్న తాసనమున, నుండెఁ బదపడి కాల్కడ యొద్ద కల్లఁ, జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి." భార. ఉద్యో. ౧, ఆ. ౬౫.

కాల్కడియము = కాలికడియము. "క. అని చీని చీనాంబర, ఘనమణిహారములు మేలుకాల్కడియంబుల్, గొనబుస్మెఱుఁగుంగరములు, చనవమరఁగ నిచ్చి పనుప సముచితరీతిన్." హంస. ౧, ఆ. ౭౯.

కాల్కొను = కాలుకొను. **1.** కాలుమోపు. "క. నేరక తొడరిలెఁ గాల్కొన, భూరుహములు లతలు గిరులుఁ బొవలేమియు లేవు..." భార. కర్ణ. ౨, ఆ. ౭౦; **2.** నిలుచు. "చ...రవి గ్రుంకె సంజ యెఱుపందె సుపర్ణుఁడు వచ్చి యందుఁ గాల్కొనియెనో మీఁద రాఘవులకుఁ ఫణిబంధము వాడ్వఁగా ననన్." రామా. ౯, ఆ. ౭.

కాల్గడ = కాల్కడ. "చ...కాల్గడ దలయంపిగా నిదుర నైకొన..." హరి. పూ. ౧, ఆ. ౯౭.

కాల్గట్టు = కాలికట్టు. "ద్వి. సరణార్తి సరణార్తి సరణార్తి యనుచు, గరమర్థి వారిచేఁ గాల్గట్టు గొనుచు." పండితా. దీక్షా. ౪౧. పు.

కాల్గొను = కాలుకొను. (నిలుచు.) "చ...ఎందుఁ గాల్గొనఁగఁ బట్టదు చిత్తము భీతి మీఱు..." భార. అర. ౪, ఆ. ౨౫౯.

కాల్చు = కాలుచు. దహించు. "చ...ఖాండవంబు... కాల్పఁ గోడంగె హుతాశనుఁడు..." భార. ఆది. ౮ ఆ. ౨౫౬ భీష్మ. ౫, ఆ. ౧౯౯.

కాల్దన్ను = కాలుదన్ను. "సీ. ...చటికి వేగంబ యరుగక యిచటఁ గాల్దన్ని యుండెడునట్టి ధైర్య మెందుఁ గలదు..." భార. మౌ. ౬౭.

కాల్ద్రివ్వ = కాలుద్రవ్వ. (అకారణముగా సిద్ధపడు.) "ఆ. కయ్యమునకు వలను కాల్ద్రివ్వ..." భార. శాం. ౨, ఆ. ౨౯౨.

కాల్దెరువు = కాలితెరువు. "ఉ...నడువఁ గాల్దెరువైనను లేక..." జై. ౨, ఆ. ౭.

కాల్ద్రొక్కు = కాలుద్రొక్కు. (వివాహమాడు) "సీ. దివిజవెలయాలికై తెగునన్నదమ్ములం దగ్రజుఁ గాల్ద్రొక్కనట్టిజంత." చం. రా. ౨, ఆ. ౭౪.

కాల్నడ = కాలినడ. "శా. ఆరాజేంద్రుఁడు కాల్నడన్ వెడలెఁ దో నాలుం దనూజుండు నే, తేరన్..." మార్క. ౧, ఆ. ౧౭౨. విణ. కాలితో నడచిపోవ ననువగునది. "చ...కాల్నడ లయి యేఱు లింకె..." జాహ్నవీ. ౨, ఆ. ౧౨౩.

కాల్పడు = కాలుపడు. "ఆ. కష్టగహనమందుఁ గాల్పడియున్నారు..." వేమన.

కాల్పనికము. సం. విణ. (అ. ఈ. అ.) **1.** కల్పితము; **2.** ఆరోపితము.

కాల్పము. సం. వి. అ. పుం. కచోరము, కర్చూరము.

కాల్పు = కాలుపు. (బాధ; కాల్పుట.) "క...ఈరోఁతల, కీకాల్పుల కీయవస్థ కే మోపుదు మే." సానందో. ౪, ఆ. ౧౯. "గీ. జనని జఠరాగ్ని కాల్పులఁ దనువు దూలి." సానందో. ౪, ఆ. ౫౨.

కాల్పువడు. ద్వ. అ. క్రి. (కాల్పు+పడు.) కాలు; కాల్పును బొందు. "చ...కాల్పువడ్డజము కంటెను బెద్దవె నీవు..." కు. సం. ౪, ఆ. ౬౬.

కాల్బలము = కాలుబలము. "సీ...కాల్బలములఁ గీటడఁచి..." మార్క. ౮, ఆ. ౧౦౪.

కాల్మడి = కాలుమడి. "గీ. కాళ్లచేతులు సెన్నఁడుఁ గడుగుకొనఁడు, విడుచుఁ గాల్మడి నిలుచుండి నడచి నడచి." మల్హా. 3, ఆ. ౬. హరి. పూ. ౬, ఆ. ౫.

కాల్మడుచు = కాలుమడుచు. (శ. ర.)

కాల్య. సం. వి. ఆ. స్త్రీ. ఎదవోయినయావు.

కాల్యకము. సం. = కాల్యము.

కాల్యము. సం. వి. అ. న. వేకువ. విణ (ఆ. ఆ. అ.) 1. ప్రాతఃకాలము; 2 కాలభవము.

కాల్వ = కాలువ. "ద్వి. వారిధిఁ బిల్లకాల్వయుఁ బోలె దాఁటి." రం. రా. సుం. ౨౪౦. పు.

కాల్వురు. దే. వి. బ. పదాతులు, కాలిబంట్లు. "సీ...కాల్వురును నేవు,రు..." భార. ఆది. ౧, ఆ. ౮౦. హరి. ఉ. ౬, ఆ. ౧౨౪.

కాల్సాఁచు = కాలుసాఁచు. 1. (అకారణముగా సిద్ధపడు.) "మ ..సాఁకమృగీనేత్రలమీఁదఁ గయ్యములకుఁ గాల్సాఁచుటా గొప్పెడున్." కళా. ౧, ఆ. ౧౪౯; 2. (దండెత్తు) (కైటభాసురుఁడు.) "మ వరుణున్ గుహ్యకనాథు గెల్చి తనకుఁ వారిచ్చుకైకానుకల్, కరుణం గైకొని బ్రహ్మపట్టణముపైఁ గాల్సాఁచి..." శేష. ౪, ఆ. ౯౦.

కావచికము. సం. వి. అ. న. కవచధారులసమూహము.

కావచ్చు. దే. అ. క్రి. (అగు. ధా.) 1. కాఁబోవు. అగుటకు సిద్ధమగు. "క. ఈవంశము విచ్ఛేదము, గావచ్చినఁ గులము నిలుపఁగా సత్యవతీ, దేవి వచనమున సంతతి, గావించెను వ్యాసుఁ డనుజగత్కర్త దయన్." భార. ఆది. ౫, ఆ. ౮; 2. ఊహను దెలుపును. ఉదా:—ఆముక్తమాల్యదాకర్త కృష్ణదేవరాయలే కావచ్చు.

కావడి. వై. వి. ఔ. (సం. కావటీ? (శ. ర.) క. త. కావడి.) నీళ్లమొ. మోయుటకై రెండుకొనలను ఉట్లమర్చినవెడల్పుగలగట్టివెదురుబద్ద, వీవధము. "వ...కావడుల నుంచియుం..." స్వా. ౪, ఆ. ౬౦. "ఉ...నన్నుఁ గావట...మోచు కేఁగుచో." ఆము. ౬, ఆ. ౮౪. భార. మా. ౨౯.

కావడించు. వై. స. క్రి. 1. కావడిగాఁ గట్టు. "ఆ. ప్రమథగణము దక్షుఁ బడఁగొట్టి కట్టుచు, గాలుచేయుఁ బడియుఁ గావడించి, మసుమృగంబు గట్టికొని వచ్చుబలుపేఁట, కాఁపువోలె వచ్చి కనిరి శంభు." ను. సం. ౨, ఆ. ౮౪. కుశల ౨, ఆ. ౧౩౬; 2. కావడిగాఁ బెట్టి తెచ్చుటకు వీలగు. "గీ. కట్టజవ్వాదిచుంకకుంభగళిపకాక్తి, కములు వింజామరంబులుఁ గావడించు, మెకములనుబిచ్చి కస్తూరినికరములును, నృపతియెదుటకుఁ దెచ్చిరి మృగయు లపుడు." సువ. 3, ఆ. ౧౯౫.

కావరము. దే. వి. 1. గర్వము, మదము. "గీ. కిన్నరస్త్రీలఁ జూచి లంఘింపఁబాఱుఁ, గావరంబెత్తి యుద్దామకామవిక్రృతి, వాయుజవములు రవితేరివారువములు." కాశీ. 3, ఆ. భా. ప్ర. ౧౩౩; 2. దుర్మదము, దుర్గర్వము. "ఆ. రక్తముఖులు కావరపువిజాతులు...మీర లగుట...కలఁచెదరు లతాంగిఁ జిలుకలార." కవిరా. 3. ఆ. ౧౪౫. విణ. దుర్మదము గలది; దుర్మదము గలవాఁడు. (ఇది అగ్గలము వంటిది. చూ. అగ్గలము.) "క. నీవు సుయోధనుపాలికిఁ, బోవఁగ వల దనియు నొక్కబుద్ధి వొడమెడుఁ, గోవింద యతఁడు మంత్రులుఁ, గావరములు చక్క వినరు కార్యవచనముల్." భార. ఉద్యో. 3, ఆ. ౨౮. (ముద్రి.పా. 'కావరముననను' ప్రాఁతప్రతిపాఠమున వి. దుర్మదము అని చెప్పవచ్చును.)

కావరి. దే. విణ. (కావరము+ఇ) దుర్మదము గలవాఁడు; ధూర్తుఁడు. ఆం. భా. త్రృ. ౭.

కావరించు. దే. అ. క్రి. గర్వించు, పొగరెక్కు. "గీ. అంత నక్కాంత నింతంత యనఁగరాని, తమకమున నవ్విభుఁ౦తు గాంధర్వసంజ్ఞ, మగు వివాహంబుచేత నింపావహిల్లఁ,గా వరించె మనోజుండు గావరించె." పరమ. ౨, ఆ. ౩౯. ఉ. రా. ౨, ఆ. ౬౧.

కావరుఁడు. దే. విణ. కావరి, దుర్మదుఁడు. "ఉ... ఈ కావరిఁ గష్టచిత్తు నధికంబుగ నమ్ముదు నీవు ..." భార. అర. ౬ ఆ, ౬౨. "గీ. లోకములఁ గలఁచెఁ, గావరుండు ప్రతాపలంకావరుండు." శతకంఠ. ౧, ఆ. ౬౨.

కావలచే. ద్వ. అ. క్రి. (కాన్+పలచు.) అగు, కావలయు. "స...క్షైటభారికనుంగు లగుడింగ రీలు దయాళువులు గావలఁదే..." ఆము. ౬, ఆ. ౬౬. (కావలవదే = కావంఁదా! కావలయు నని భావము.)

కావలము. దే. వి. 1. పాపము. "గీ. దేవపూజలఁ బొలివోనికావలంబు, బ్రాహ్మణోపాస్తిఁ జెడి పోనిపాపచయము, లచ్యుతానంత గోవింద హరి మురారి, యని తలంచినయప్పుడే యడఁగిపోవు." వి. పు. 3, ఆ ౧౩౫. 2. దురాచారము. "ఉ...మనవంశము నెవ్వన లేని యీ, కావల మేల ..." వి. పు. ౨, ఆ. ౨౦౬; 3. మదము. "క. దేవి యితఁడు హర్యక్షీ, భావము భజియించి యుండఁ బ్రకృతివిరోధం, బే వెంటఁ గలిగె నొక్కో, కావలమున నకట సింహికాసూనును కున్." నైష. ౦, ఆ. ౧౯౬. విణ. కావరము. (చూ. అగ్గలము.)

కావలయు. దే. అ. క్రి. (అగుధా. కాన్ + వలయు) 1. కోరు. "క. కావలసినవర మిచ్చెద ..." విప్ర. ౫, ఆ. ౭౨; 2. అవసరమగు. "గీ... కాపు కావలయునెడల." ఇందు. ౨, ఆ. ౫; 3. బాంధవ్యము కలుగు. "సీ. జనకుండు సుతుఁ డును జన్మంబు సేసిన వనిత వారేమి కావలయు నీకు." ఉ. రా. ౪, ఆ. ౨౧౬; 4. శాస్త్రియగు. "క. మాతాపితృవర్జితుఁ డగు, సీతని కే సెట్లు బిడ్డ నిచ్చితి నకటా, నాతప్పు గాక యిది దా, సీతనిత ప్పెట్లు నాకు నిటు కావలయున్." కాశీ. ౭, ఆ. ౪౯. అవ్య. ద్రు. ఊహను దెలుపును. "వ. కచుండు... నిహతుండయ్యెఁ గావలయును." భార. ఆది. 3, ఆ. ౧౧౫.

కావలి. దే. వి. 1. కాపు, రక్షణము. "క...కావలినే నుండంగఁ జొచ్చువారుం గలరే." ఉ. హరి. ౬, ఆ. ౧౫. హరి. ౨, ఆ. ౧౩౦; 2. నిర్బంధము, బంధనము. (చూ. కావలిపెట్టు.); 3. గుమ్మము. మొ. వానికడ నిలఁబడి యితరులు లోనికి రాకుండఁ జూచుట. (చూ. కావలికాఁడు.)

కావలికాఁడు. దే. విణ. (కావలి+కాఁడు.) 1. రక్షకుఁడు, కాపాడువాఁడు. (శ. ర.) 2. కావలి యుండువాకరు. "మ...కన్నగాండ్రు విని రాజ ద్వారమునఁ గాపు ప్పెట్టి కావలివాండ్రఁ గనుఁ బ్రామి ..." కాశీ. ౪, ఆ. ౫౭.

కావలికాచు. గే. అ. క్రి. (కావలి+కాచు) కావలి యుండు. (వా.)

కావలివాఁడు. దే. విణ. (కావలి+వాఁడు) కావలి కాపునాడు. "ఉ. కావలివారిఁ దోలి యొసకం బున గోవులఁ బట్టికొంటి..." భార. విరా. ౪, ఆ. ౧౯౨.

కావలుఁడు. దే. విణ. కావరి; కావలము గలవాఁడు, గర్వి. "ఉ. కావలుఁ డైనవీఁడు నగుణకార్యము పట్టునె వీని కెమ్మెయిం, గావ నిజంబు..." భార. విరా. ౨, ఆ. ౭౦. (ప్రా. తె. ప్రతిపా.) ను. సం. ౫ ఆ. ౭౯.

కావలె. దే. అ. క్రి. (కాన్+వలె.) కావలయు. 1. అవసరమగు. (అది నాకుఁ గావలె); 2. కోరు. (ఇట్లు కావలె ననియే చేసితిని.); 3. కావలసి యుండు, జరగకుండు. (ఆమెకు వివాహము కావలెను); 4. శాస్త్రి దగినగు. "ఉ...భవి ష్యదర్థముల్, కాని నామనంబునకుఁ గావలె నిట్టివిపాదవేదనల్." నరస. ౨, ఆ. ౪౭.

కావా. హిం. వి. (హిం. కావా.) అశ్వములమండ లాకారగతి, అశ్వగతివిశేషము. "క. ఆపనములఁ గిరావలి, యావలితగతిన్ భ్రమించునందా బల రేకా, గావా తిరిగెడుమారుని, మావులు నా నవుడు నికటమండలగతులన్." భద్రాపరిణ యము. ౪, ఆ. (శ. ర.)

కావారము. సం. వి. అ. న. శైవాలము, నాఁచు.

కావారి. సం. వి. ఈ. స్త్రీ. తృణాదినిర్మిత మగు ఛత్రము, గడ్డిగొడుగు.

కావి. దే. వి. (క. త. కావి.) 1. ఎఱుపు. ఆం. భా. ప్ర. ౧౦౦; 2. ఎఱ్ఱబట్ట. ఆం. భా. స్వ. ౧౫౪. పారి. ౧, ఆ. ౧౧౫. విణ. ఎఱ్ఱనిది. "గీ... పోటులఁ దొరఁగురక్తాంబుధార, లంగమెల్లను గప్పిన నప్పు డొప్పె, గావిసెలయేఱు లెల్లెడఁ గలయఁ బర్వఁ, బొలుచు కులపర్వతంబుచాడ్పున సతండు." భార. శల్య. ౨, ఆ. ౧౧౧, విక్ర. ౧, ఆ. ౧౩౬.

కావించు. దే. స. క్రి. (అగు. ధా.) 1. ఇచ్చు. "క...అది, కావించు ననూన ధర్మకామార్థం

బుల్." భార. అర. ౨, ఆ. ౨౯౩; 2. చేయు. "క. దురితము కావించి తొలంగుదునె పరమున కున్." ఆము. 3, ఆ. ౪౬; 3. వండు. "గీ. ఓగిరంబులు గావించు నొప్పు గాఁగ." కాశీ. 3, ఆ. ౨౧౨; 4. సృజించు. "సీ...లోకంబులు గావింపఁ దలఁప సహంకార మెసఁగె..." భార. శాం. ౬, ఆ. ౪౭౯; 5. కల్పించు. "గీ...నా యందు దోష,మొండు గావించి యాతండః మందువాఁడొ." భా. రా. కిష్కిం. ౪౯౩; 6. (తటాకాదులు) నిర్మించు; (కావ్యాదులు) రచించు. "సీ...చెఱువు గావింప నెంచినను గసరు." విప్ర. 3, ఆ. ౧౯. "క. నీ విప్పు డాంధ్రభావం, గావింపుచు నున్న చంపుకావ్యమ్ము ..." వి. పు. పీఠి. ౨౯.

కావిగొను. దే. అ. క్రి. (కావి+కొను.) ఎఱ్ఱనగు, ఎఱుపెక్కు. "క...వనరుహనేత్ర కన్నుఁగవ ధవళరుచుల్,గావిగొన నేడ్చి..." స్వా. ౨, ఆ. ౭౧.

కావిగోఁచిదారి. దే. వి. (కావి+గోఁచి+దారి.) కాషాయవస్త్రధారి, సన్న్యాసి. ఆం. భా. ద్వి. ౧౭౬. వేంక. మాన. ౩౪.

కావితాలుపు. దే. వి. (కావి+తాలుపు.) కాషాయధారి, సన్న్యాసి. (శ. ర.)

కావిపుట్టగోచులసామి. ద్వ. వి. సన్న్యాసి, యతి. ఆం. సం. మాన. ౨.

కావిరి. దే. వి. (ఆధిక్యముచే నలు పెక్కిన) ఎఱుపు రంగు, ముదురుకావిరంగు, "ఉ. నావుడు రోష వహ్నివలనం బొగ రేఁగినభంగి మోమునం, గావిరి పర్వ..." ఉ. హరి. ౯, ఆ. ౨౧౬. "సీ. తేరివాజులు మ్రొగ్గ జెసలఁ గావిరి గప్పె బహుచిత్రమేఘముల్ బయల నిండె." భా. రా. అర. ౧, ఆ. ౧౮౨. సమీర. ౨, ఆ. ౧౨౨. (తుదిరెండు ప్రయోగములందు నిది యుత్పాత సూచకము.) విశ. (ఉత్పాతసూచకముగా నలుపెక్కిన) ఎఱుపురంగు గలది. "ద్వి. కావిరి చీఁకటుల్ గవిసె లోకముల." విష్ణు. పూ. 3, ఆ. (శ. ర.)

కావిరిబొట్టు. ద్వ. వి. (కావిరి+బొట్టు.) కావు, దృష్టి దోషము కలుగనీనిలిలకవిశేషము. "సీ. ఫాల భాగంబుపైఁ బరగుకావిరిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగ." భాగ. ౧౦ స్కం. పూ. ౬౯౭.

కావిజా. దే. వి. (కావి+జాయి) పద్మరాగము, కెంపు.

కావిజాయి. దే. వి. 1. కెంపు; 2. ఎఱ్ఱనిమట్టిజాయి, జేగురుజాయి. (శ. ర.)

కావు. దే. వి. 1. చంటిశిల్లలయేడ్పుధ్వని కనుకరకరణము. "ఉ. ఎత్తిలి కావు కావు రని యేడ్చి తదీయపయోధరాగ్రముల్, కుత్తుక దాఁకఁ బీల్చి కొని..." హరి. పూ. ౯, ఆ. ౧౯౦. వేం. పంచ. ౪, ఆ. ౪౫౪; 2. బొట్టు. (చూ. కావుకరటము.); 3. వశీకరణాంజనము. "శా...చెలి నేత్రాంబులక్ వశ్యల, శ్రీమూలం బగుకావు నించె నన నుంచెం గజ్జలం బింతికిన్." వసు. ౯, ఆ. ౧౧౮; 4. కావిరిబొట్టు. "సీ...నుదుటిపై నును.గావు కుదురుకొల్పి." చంద్రా. ౨, ఆ. 3. 5. చోరసాధనవిశేషము. (చోరులు జడిపించుటకు అమ్మవారివలెఁ బెద్దబొట్టు వికారముగా నుదుటఁ బెట్టుకొందురు.) "సీ...కావుబొట్టు, జిలుగుఁగన్నపుఁగత్తి బలపంబు..." వేం. పంచ. ౩, ఆ. ౧౯౯., ప్రబంధ. ౭౯౯; 6. పాఁతరలో నగువానిపైకప్పు. "వ...లావుగాఁ గావుఁ గప్పి..." స్వా. ౪, ఆ. ౬౦. కళ. ౪, ఆ. ౭౨.

కావుట. దే. వి. (అగు. ధాతువుయొక్క భావార్థకరూపము.) అగుట, కావుడు. "క. జీవుఁడు మత్స్యము పేతుఁడు, గావు టెఱిఁగి..." భార. శాం. ౬, ఆ. ౩౮౯. భార. ఆది. ౧, ఆ. ౧౩౮.

కావుడు = కావుట. "చ...వారమృతాత్ములు గావు డొప్పదే." కు. సం. ౭, ఆ. ౬౨.

కావుత. దే. అవ్య. ద్రు. కాత, ఆశీరర్థకము: "చ...కరివక్త్రుఁడు...వరదుండు కావుతన్." వరాహ. ౧, ఆ. ౭.

కావుతము = కావుత. (కాత, ఆశీరర్థకము.) "ఆ. దానహోమజపవిధానముల్ మన కివి, గలవయేని ధరణివలయరాజ్య, మింద యుండి ధర్మనందనుఁ డొనరించు, చుండుఁ గావుత మ్మఖండితముగ." భార. ఆది. ౮, ఆ. ౬౩.

కావుదిగు. దే. అ. క్రి. (కావు+దిగు) 1. కడుపుబ్బు. (బ్రా.); 2. పశువును పశువుపొడుచుటవలనఁ గడుపువాచు. (బ్రా.)

కావున. దే. అవ్య. ద్రు. కాన, కాఁబట్టి. "మధ్యాక్కర... నాసుతునకు భార్య పగు మన్న నోడఁబడి యియ్యఁ,యనియోఁ గావునను దానిని దగ వివాహ మగుము సెయ్యమున." భార. ఆది. ౪, ఆ. ౧౪౨.

కావుపట్టు. దే. వి. (కావు+పట్టు.) మిక్కిలిబాధించు, యాతనఁబెట్టు. "ద్వి. కావరంబునఁ గన్నుఁ గానవు జముఁడు, కావుపట్టక నినుఁ గావఁడు సుమ్ము." నవ. ౧, ఆ. ౪౮. పు. ౨౯. పం.

కావువచ్చు. దే. అ. క్రి. (కావు+వచ్చు.) 1. కావు వేయుటచే పండు, మ్రుగ్గు. వ్యవ:—మొన్న కావు వేసినపం డ్లిప్పుడే కావువచ్చినవి; 2. పండున కుందురంగు కలుగు. వ్యవ:—ఆపండ్లకు కావు వచ్చినది.

కావువేయు. దే. స. క్రి. (కావు+వేయు.) ముదురు కాయలపై గడ్డిమొ. కప్పి పండవేయు. వ్యవ:— నిన్న వేయిమామిడికాయలు కావువేసినాము.

కావేరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. వేశ్య. 3. పసుపు🌿.

కావ్యము. సం. వి. అ. న. 1. కవికృతగ్రంథము; 2. సుఖము.

కావ్యుఁడు. సం. వి. అ. పుం. శుక్రాచార్యుఁడు.

కాశము. సం. వి. అ. న. తెల్లు పువ్వు.🌿. పుం. న. తెల్లు🌿. పుం. 1. ప్రథ; 2. తుమ్ము; 3. దగ్గు.

కాశి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. వారణాసి, కాశీపట్టణము. ఇ. పుం. 1. ప్రకాశము; 2. సూర్యుఁడు. విశే. (న్. సీ. న్.) ప్రకాశించువాఁడు.

కాశీప్రయాగలు. సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

కాశూల. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

కాశ్మరి. సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడు🌿.

కాశ్మర్యము. సం. వి. అ. పుం. గుమ్ముఁడు🌿.

కాశ్మీరజన్మము. సం. వి. న్. న. కుంకుమపువ్వు.

కాశ్మీరము. సం. వి. అ. పుం. భారతదేశమందలిపెద్ద సంస్థానములలో నొకటి. న. 1. కుంకుమపువ్వు; 2. టంకము. విశే. (అ. ఈ. అ.) కాశ్మీరదేశసంబంధి.

కాశ్యపి. సం. వి. ఈ. స్త్రీ. కశ్యపునిభార్య, భూదేవి. ఇ. పుం. 1. అనూరుఁడు; 2. గరుడుఁడు.

కాషాయము. సం. వి. అ. పుం. కావిబట్ట. విశే. (అ. ఈ. అ.) కావిరంగు గలది.

కాష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1 దిక్కు; 2. పదునెనిమిది రెప్పపాట్లకాలము. వి. పు. ౨, ఆ. ౬౬; 3. అవధి; 4. స్థితి; 5. అతిశయము; 6. మ్రాని పసుపు🌿.

కాష్ఠతక్షకుఁడు. సం. వి. అ. పుం. వడ్రంగి.

కాష్ఠద్రువు. సం. వి. ఉ. పుం. మోదుగు🌿.

కాష్ఠపాటల. సం. వి. ఆ. స్త్రీ. తెల్లకలిగొట్టు🌿.

కాష్ఠమఠి. సం. వి. ఈ. స్త్రీ. చితి.

కాష్ఠము. సం. వి. అ. న. కట్టె. "ఉ. కాష్ఠగతాగ్ని పోలె..." వి. పు. ౨, ఆ. ౬౬.

కాష్ఠీల. సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటి🌿.

కాష్ఠీలము. సం. వి. అ. పుం. రాజార్కము, రాచ జిల్లేడు🌿.

కాస. వై. వి. (సం. కచ్ఛా.) కాసె. "గీ. చల్లడంబులు దొడిగి కాసలు బిగించి." కవిరా. ౨, ఆ. ౭౧. "శా. చల్లాడంబులమీఁదటన్ బిగువుకాసల్ గట్టి..." అని. ౪, ఆ. ౩౪. (శ. ర. పా.)

కాసండీ. దే. వి. పాత్రవిశేషము. (వా.)

కాసమర్దము. సం. వి. అ. పుం. కసింద🌿.

కాసము. స. వి. అ. పుం. క్షవథువు, దగ్గు.

కాసర. దే. వి. కాశాదని, కాఁచర🌿. ఆం. భా. ద్వి. ౨౦. కాశీ. ౩, ఆ. ౨౩. బ. ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

కాసరము. సం. వి. అ. పుం. మహిషము, ఎనుపోతు.

కాసలనాడు. వై. వి. ఔ. (సం. కోసలం.) కోసల దేశము; ఆదేశమునుండి వచ్చిన యొకానొక బ్రాహ్మణజాతి. "ఉ... కాసలనాటివారి కన కాంగిని జూచితి నీళ్ల రేవునన్." వీథి. ౧౪.

కాసల్నాడు = కాసలనాడు. "క. కాసల్నాటను శ్రేష్ఠుఁడు, మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు..." క్రీడా. ౪౪.

కాసా. దే. వి. దాసీపుత్త్రుఁడు. (శ. ర.)

కాసారము. సం. వి. అ. పుం. కొలను, సరస్సు.

కాసావాఁడు. దే. వి. కాసా. (వా.)

కాసి. వై. వి. (సం. కాశీ.) కాశికాపట్టణము. (బ్రా.)

కాసించు. వై. స. క్రి. 1. కాసెగా ధరించు. "సీ. కరకంచువలిపెంబు గట్టిగాఁ గాసించి వెలిత్రాడు

కాసెపై బలియఁజుట్టి." ద్వా. ౭, ఆ. ౪౫; 2. బిగించు, కట్టు. "సీ. పులితోలు కచ్చడంబుగ మొలఁ గాసించి సర్వాంగములను భస్మంబుఁ బూసి." ద్వా. ౮, ఆ. ౧౦౪.

కాసియ = కాసె. (కాసెకోక, దట్టి.) "క...కట్టె బిగియం, దనకాసియ వారిరాశి దాఁటెడు తెగువన్." రామా. ౬, ఆ. ౮౩.

కాసీఁడు. దే. వి. (కాసె+ఈఁడు.) కాసెవాఁడు, కాలిపనివాఁడు. "గీ...ఒక్కనాఁడు కాసీల కిట్లను నయము మీఱ." పరమ. ౫, ఆ. ౪౮.

కాసీసము. సం. వి. అ. న. అన్నభేది, ఒకానొకఉపధాతువు.

కాసు. వై. వి. (సం. కాచః. క. త. కాసు.) 1. దమ్మిడిలో సైదవవంతు. (నాల్గవవం తని కొందఱు.) "గీ...తనకుఁ దా నబ్బినట్టికాసు పదివేలనిష్కముల్ గాఁ దలంచి." భాగ. ౧౦. స్కం. ఉ. ౯౬౫; 2. అల్పార్థసూచకము. "గీ...తావు గాసంతె చాలు." రావి. ౨, ఆ. ౭౦; 3. ధనము. "గీ. చల్లగాఁ జేతికాసెల్ల డుల్లి..." నిరం. ౨, ఆ. ౧౨౮. "గీ. కాంతలకు నియ్య మాచేతఁ గాసు లేదు." భల్లా. ౫, ఆ. (శ. ర.); 4. పండ్రెండ ణాలయెత్తు గలబంగారునాణెము. (వా. కాసుధర పెరిగినది.); 5. నాణెము. "సీ. అది సుధాకర బింబమా కాదు మఱికాసువన్నె వేలుపుటన్నువత్తి గాని." వేం. పంచ. ౪, ఆ. ౨౩౮.

కాసె. యు. దే. వి. 1. కాలిపనివాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౪; 2. కాయితొలిచెడుపని. (శ. ర.) వై. వి. (సం. కచ్ఛా.) 1. దట్టి, కాసెకోక. "మ. జిగిమై సొంపును దమ్మిమైమఱువుడాచేఁ గల్వచే కత్తియుఁన్,సిగఁ బూమొగ్గలతాయెతుల్ చిగురు కాసెం జెక్కినం జాలపొ,ల్పగును న్గేదఁగిఱేకువంకియును జాయల్ మీఱఁగా బూవుఁదీఁగెగుదెం దావలరాచయొంటరి కడుం గేరించుచుం జిమ్మినన్." య. ౫, ఆ. ౭౪. ద్వా. ౭, ఆ. ౪౬; 2. కుచ్చెల. ఆం. భా. ద్వి. ౧౫౩.

కాసెనిలుకడ. ద్వ. వి. మల్లబంధవిశేషము, ముప్పది రెండువిన్నాణములలో నొకటి." ప్రబంధ. ౭౮. హంస. ౧, ఆ. ౨౦౬.

కాసెనిల్కడ = కాసెనిలుకడ. ఆం. భా. ద్వి. ౨౦౯.

కాసెయులి. దే. వి. (కాసె+ఉలి.) టంకము, కాయి తొలుచుట కుపయోగించుసాధనము. ఆం. భా. ద్వి. ౩౦౦.

కాసెవాఁడు = కాసీఁడు. ఆం. భా. ద్వి. ౨౮౪. వేమన. ౩౨౪.

కాసెవోయు. దే. అ. క్రి. (కాసె+పోయు.)వస్త్రము గోఁచివలె వెనుకకుఁ దీసికట్టు. (శ. ర.)

కాహల. సం. = కాహళ.

కాహలము. సం. = కాహళము.

కాహలి. సం. = కాహళి.

కాహలిక. సం. = కాహళిక.

కాహలికుఁడు. సం = కాహళికుఁడు.

కాహళ. సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దఢక్క; 2. బాకా.

కాహళము. సం. వి. అ. పుం. 1. పిల్లి; 2. కోడి; 3. శబ్దము. న. 1. బాకా; 2. అవ్యక్తవాక్యము. విణ. (అ. ఆ. అ.) 1. అసభ్యము; 2. శుష్కము; 3. ఖలము; 4. అధికము.

కాహళి. సం. వి. ఇ. పుం. శివుఁడు. ఈ. స్త్రీ. 1. బాకా; 2. యువతి.

కాహళిక. సం. వి. అ. పుం. బాకా.

కాహళికుఁడు. సం. వి. అ. పుం. బాకా ఊఁదువాఁడు. పరమ. ౫, ఆ. ౯౧.

కాళ. వై. వి. కాళె,కాహళి. ఆం. భా. ప్ర. ౧౨౯.

కాళంజి. వై. వి. (సం. కలాచీ. క. కాళంజి.) తమ్మపడిగము. ఆం. భా. ద్వి. ౧౬౮. "సీ. వేడ్కతోఁ గాళంజిఁ దాల్చి..." ప్రభా. ౨, ఆ. ౧౫. రా. వి. ౨, ఆ. ౯౦.

కాళంజిక = కాళంజి. "వ...కనకకలశంబులుఁ కాళంజికలు..."ఉ. రా. ౮, ఆ. ౩౧౩.

కాళయుక్తి. సం. వి. ఇ. పుం. ఒకసంవత్సరము. (కాళయుక్త మని కొందఱు.)

కాళాంజి = కాళంజి. "క. కాళాంజిపూనెనొకసతి, నాళీక దళాక్షుమ్రోల..."సాంబో. ౧,ఆ. ౧౮౧.

కాళాగజ్జ. దే. వి. బాలక్రీడావిశేషము, పిల్లలుకాళ్లు చాఁపి యాడునాట. (బ్రౌ. వా.)

కాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. రాత్రి; 3. నల్లసిరా; 4. పాలపురుగు; 5. నల్లనిక్రొత్తమబ్బు; 6. నల్లని ఆఁడుది; 7. సత్యవతి; 8. అగ్ని యొక్కసప్తజిహ్వలలో నొకటి; 9. యముని

చెల్లెలు, కాళరాత్రి; 10. నింద; 11. బొగ్గు; 12; తేలుకొండి వృ; 13. దుంపబచ్చలి వృ; 14. నల్లజీలకఱ్ఱ వృ; 15. తొగరిచన్ను; 16. ఒకానొకశివశక్తి; 17. బొమముడి; 18. సప్తమాతృకలలో నొకతె; 19. పిప్పలివృ. న్. పుం. సూర్యుఁడు.

కాళింగము. సం. వి. అ. పుం. 1. నేలగుమ్ముడువృ; 2. ఏనుఁగు; 3. పాము; 4. కళింగదేశము. "ద్వి. శెలకొని కాళింగనిషధదేశములు." ద్వి. రం. రా. కిష్కిం. ౨౬౬. పు. (బ్రా.) న. కరబూజా వృ. విశ. (అ. ఈ. అ.) కళింగదేశమునకు సంబంధించినది.

కాళింగి. సం. వి. ఈ. స్త్రీ. రాజకర్కటి, పెద్దదోసవృ.

కాళిందీ. సం. వి. ఈ. స్త్రీ. 1. యమునానది; 2. కృష్ణునియష్టమహిషులలో నొకతె; 3. ఎఱ్ఱతెగడవృ.

కాళిందీభేదనుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

కాళిక. సం. వి. ఆ. స్త్రీ. కాళి, పార్వతి.

కాళిదాసుఁడు. సం. వి. అ. పుం. శాకుంతలాదిగ్రంథకర్త యగుమహాకవి.

కాళియ = కాళె. (చూ. కాళె.)

కాళె. వై. వి. (సం. కాహళికా. క. కహళే.) బూరగొమ్ము, ఒకానొకవాద్యము. "క. పొలఁతుకచిఱుతొడలన్ గా,ళెలు వోలమి..." య. ౪, ఆ. ౫౦.

కాళ్లజెఱ్ఱి. ద్వ. వి. (కాళ్లు+జెఱ్ఱి.) కర్ణజలూక. ఆం. భా. ద్వి. ౧౧.

## కి.

కి. దే. ప్ర. ద్రు. (షష్ఠీవిభక్తియందు 'ఇ, ఈ, ఐ' లకుఁ దరువాత 'నీకు మీకు' ఇత్యాదులందుఁ దక్క 'కి' యున్ను, మిగిలిన యచ్చులతరువాత 'కు' యున్ను వచ్చును. ఉదా:—గిరికి, కిటికీకి, ఇరవైకి మూఁడు తక్కువమొ.) 1. సంబంధసామాన్యమును, సంబంధవిశేషములను దెలుపును. "క...నీమఱఁదికి, నపరాధశతంబు సైఁపుమయ్య యుపేంద్రా." భార. సభా. ౨, ఆ. ౫౯; 2. ఇది ఇతరవిభక్త్యర్థముల నిచ్చును: (తృతీయకు) "మ. సిరికిం జెప్పఁడు..." భాగ; ౮. స్కం. ౯౬. (చతుర్థికి) "సీ... పాలికిఁ బెనంగ." ఆము. ౫, ఆ. ౧౪౩. (పంచమికి.) "సీ...ఎల్లవారి, కధికులు కారె ధరామరులు." భార. అను. ౫, ఆ. ౩౩౮. (సప్తమికి) "గీ. ఎఱుకు విలువిద్యకలిమికి హీనుఁ డయ్యెఁ, బార్థునకు..." భార. ఆది. ౫, ఆ. ౨౪౪.

కింక. దే. వి. (కినియు. ధా.) 1. పగ. "ఉ. పంకజనాభ మాపడిన పాటులు రాజ్యముఁ గోలుపోకయుఁన్,గింకకు మూలమై..." భార. ద్రో. 3 ఆ. ౧౩; 2. కోపము. "శా...నామీఁదనా,భూనాథాగ్రణి కింక దక్కి కరుణాపూర్ణాత్ముఁ డౌఁగాక..." భా. రా. కిష్కిం. ౫౧౭; 2. రోగము, తెగులు. (మారి మొ. అంటురోగము. (బ్రా.) 3. పసులను మేఁకలనుజంపెడు రోగవిశేషము (శ. ర.) "గీ... తెవులు, కింకనా రోగసంజ్ఞమై కెరలుచుండు." ఆం. భా. ద్వి. ౧౨౪.

కింకరుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. సేవకుఁడు, పరిచారకుఁడు, 2. అధీనుఁడు, వశుఁడు. "ప... ప్రేతవనవిహార నిరతుం డగుశంకరుండు కరుణాకింకరుం డగుట నప్పుడు." భార. శాం. 3, ఆ. ౩౭౮.

కింకిణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. చిఱుగంట; 2. గజ్జె; 3. గిలకవృ; 4. పుల్లద్రాక్ష.

కింకిణీకము. సం. వి. అ. పుం. చిఱుగంట. "శ్లో... కింకిణీకవిభూషితాస్." (హరివంశము.)

కింకిరము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. కోయిల; 3. తుమ్మెద; 4. ఎఱుపు. న. ఏనుఁగుకుంభస్థలము. విశ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది.

కింకిరాతము. సం. వి. అ. పుం. 1. చిలుక; 2. కోయిల, 3. అశోకమువృ.

కింకిరాతుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. ఇట్లే; కింకిరాటుఁడు.

కింకిరి. దే. వి. 1. కోపము. "మ...నేఁడు మిము దుర్వ్యాపారులం జూచి కొం,కక మీకింకిరికిం జెలంగినఁ దొలంగంబాటుఁ దద్ధర్మముల్." ఉ. హరి. ౪, ఆ. ౭౮; 2. రోత. "ఉ. పంకజముం దొఱంగి తదుపాంతచరన్మధుపప్రసక్తికిన్, గొంకి రుషాహిరూపములకున్ జననాథునివింతయక్కుపైఁ, గింకిరి గాఁగ లచ్చి తిలకించి యజస్రము నుండుఁగాత ని,శ్శంకతఁ జలక్యవిశ్వమనుజ

ప్రభుపుణ్యకటాక్షదృష్టులన్." కావ్యా. ౧,ఆ.౨.

కింకిరిచేయు. దే. అ. క్రి. (కింకిరి+చేయు.) విఘ్నించు, మలమలవిడుచు. "ద్వి. అప్పుడప్పుడనుఁ డా మోగివరుని, చీరవైఁ గింకిరిచేయ..." నవ. ౪, ఆ.

కింకిరిపడు. వ్య. అ. క్రి. (కింకిరి+పడు.) 1. కోపించు. "క. అతిథి నిటు గోరనేనియు, మఱిఁ గింకిరిపడక యోలమూనగొనక నీ,వతనికిఁ బ్రియంబు సల్పుము..." భార. అను. ౧, ఆ ౩౮. మార్క. ౨, ఆ. ౧౫౭; 2. రోఁతపడు. "ద్వి. అడరుదుర్గంధాన కణుమాత్రమైనఁ, గింకిరిపడక శంకింపక ధైర్య, మింకక చండాలునింటికి నేఁగి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౭౪. పం.; 3. అసూయపడు. "ద్వి. జగతి బోపల హరిశ్చంద్రభూవిభుఁడు...,బొంకకుండిననేమి బొంకిన నేమి, కింకిరిపడి పరికింప నాకేల." ద్వి. హరిశ్చ. ఉ. ౨౭౧౩ పం.

కింకిరిపాటు. వ్య. వి. (కింకిరిపడుధా.) కోపము. "సీ. నగుమొగంబులకాని నాతి నీదెస నెప్డుఁ బతులనుఁ గింకిరిపాటు లేమ." భార. అర. ౫, ఆ. ౨౯౧. ఉ. హరి. 3, ఆ. ౧౪.

కింకుర్వాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కింకరుఁడగుచున్న వాఁడు, సేవచేయుచున్న వాఁడు. "శా. కింకుర్వాణపురందరాదిక మహాగీర్వాణకోటీకిరీ, టాంకస్థాపిత నూత్నరత్నరుచిధారాశ్లేషకిమ్మీరస, త్పంకేజుండు హరుండు..." కాశీ. 3, ఆ. ౯౫.

కింగాణము. దే. వి. వ్యతిరేకము. "ద్వి...అభిమతఫల మడుగు మనినఁ, గింగాణమును జేయ దంగనఁ జూడు. బస. ౪, ఆ. ౧౨౧. పు. ౨౭ పం. (కింగాణి. బ్రా. పాతాం. కొఱగానిపని అని. బ్రా —కింగాణము = నైచ్యము. వ్యాఖ్య.)

కింగిరి. దే. విణ. అల్పము. (శ. ర.)

కించిజ్జ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కొంచెమే తెలిసినవాఁడు, అల్పజ్ఞుఁడు.

కించిత్తు. సం. అవ్య. ఇంచుక, కొంచెము. జై. 2, ఆ. ౨౦౬.

కించులుకము. సం. వి. అ. పుం. వానపాము.

కించే. దే. వి. విచారము, దుఃఖము. "ఉ...ఈతని కుత్తరంబు నే,నెవ్వగ నిత్తుఁ జిత్తమున కేమియుఁ దోఁపదు కించ పుట్టె..." సానందో. 3, ఆ. 3౭.

కించు. వై. విణ. (సం. కించిత్. ప్రా. కించి.) అల్పము, నీచము. (చూ. కించుఁదనము.)

కించుఁదనము. వై. వి. 1. క్రించుదనము, అల్పత్వము. "ఉ. కించుఁదనంబుతో నొకచక్కిటముఁ జెచ్చి ప్రతాపదీపితా,శాంచలుఁ డంచు...ప్రతిష్ఠించెదు నన్నిం బ్రతిఘటింపఁగ నేర్తురె దేవదానవుల్." రామా. 2, ఆ. ౨3౧; 2. శ్రమము, ఆయాసము. "ఉ. కించుఁదనంబు లేక వలకేల నొకించుక యప్పళింత గా,వించినఁ బుడ్డు పీడు ..రామా. 2, ఆ ౧౬౮.

కింజల్కము. సం. వి. అ. పుం. కేసరము, అకరువు. న. ఆకాశము. (వై. ని.)

కిందామీఁదా. దే. అవ్య. క్రిందనుమైని. వా:—వాఁడు కిందామీఁదాపడుచు సంసారము గడపుచున్నాఁడు. (కష్టముసుఖముపొందుచుఅని. భా.)

కిందు. దే. వి. బౌ. 1. క్రిందు, పాలనము. "ద్వి. చేకొని నామాటఁ జేసితి గాన, నీకిందరాజ్యంబు నిత్యమై యుండు." రం. రా. ఉ. ౧33. పు.2. వశము, స్వాధీనము. వా:—వానికింద పనిచేయలేను; 2. అడుగుభాగము. వా:—దానికిందిది. విణ. 1. అడుగుననున్నది. ఉదా:—కింది పుస్తకము;2.గతించినది. వా:—కిందటిశుక్రవారము.

కింపచానుఁడు. సం. = కింపచుఁడు.

కింపచుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కొంచెమే వండుకొనువాఁడు. (లోభి.)

కింపాకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మూఢుఁడు.

కింపురుషము. సం. వి. అ. పుం. భారతాదిదేశములలో నొకటి.

కింపురుషుఁడు. సం. వి. అ. పుం. 1. కిన్నరుఁడు. (శ్లో. పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి, ప్రియాముఖం కింపురుషశ్చుచుంబే. సం. కు. సం. 3. స. 3౮.); 2. దేవయోనివిశేషము. (చూ. కింపూరుషుఁడు.)

కింపూరుషుఁడు. సం. = కింపురుషుఁడు. (శ్లో. గంధర్వకింపూరుషకిన్నరాజగుః. సం. భాగ. దా. స్క. ౨౦. అ. ౨౦. శ్లో.)

కింవదంతి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. జనశ్రుతి, లోకప్రవాదము. (సత్యము కావచ్చు నసత్యము కావచ్చును.)

కింపరాటుఁడు. సం. వి. అ. పుం. అతివ్యయము చేయువాఁడు. (శ్లో. నృపతే కింక్షణో మూర్ఖో దరిద్రః కింపరాటకః. హితో. ౨, ఆ. ౯౧.)

కింశుక. సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్మతి, మాలెగుచెట్టు.

కింశుకము సం. వి. అ. పుం. 1. చిలుకముక్కువంటి పువ్వులు గలది— మోదుగుచెట్టు; 2. నందిచెట్టు.

కికకిక. దే. వి. నవ్వుటయందగు ధ్వని కనుకరణము. "చ...ఎవ్వరెవ్వరే, కికకిక నవ్వి రిప్పుడు..." భల్లా. ౨, ఆ. (శ. ర.)

కికాకిక = కికకిక. "చ...నగియె...కికాకికన్." కళా. ౮, ఆ. ౧౭౧. ౧, ఆ. ౪౦.

కికి. సం. వి. ఇ. పుం. కొబ్బరిచెట్టు. ఇ. న్. పుం; ఈ. స్త్రీ. పాలపిట్ట, చాషము.

కికిదివము. సం. = కికీదివము.

కికిదివి. సం. = కికీదివి.

కికీదివము. సం. వి. అ. పుం. కికీదివి.

కికీదివి. సం. = కికీదీవి.

కికీదీవి. సం. వి. ఇ. పుం. చాషము, పాలపిట్ట.

కికురించు. దే. అ. క్రి. మోసగించితిరుగు; తప్పించుకొనితిరుగు. "క. తీపు గలకజ్జ మన్యుఁడు, గోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం, బైపడి యది గొని యొక్కఁడు, క్రేపులలో నిట్టినట్టుఁ గికురించు నృపా." భాగ. ౧౦ స్కం. పూ. ౪౫౪. స. క్రి. 1. మోసగించు. "సీ. కికురించి రిచ్చి పుచ్చుకొనుచోటుల వారలాఁకకు లోనుఁగా కప్పు లీక." స్వా. 3, ఆ. ౧౨౯; 2. పోఁగొట్టు. "సీ. చెలువవేనలి చిమ్మచీఁకటిఁ గికురింపఁ జంద్రసూర్యులనుంచెఁ జామయోర్తు." వసు. ౫, ఆ. ౧౧౬; 3. ఓడించు, జయించు. "చ...అసంగుని మామ వెలుంగు సాసఁదీ, రినక ఆవాఁడితూపుఁ గికురించిన యోరమిటారి చూపునన్." సా. ౨, ఆ. ౧౧3.

కికురింత. దే. వి. (కికురించు ధా.) 1. మోసము. (శ. ర.); 2. మోసగించుట. 2. వంచనకరణము. ఆం. భా. ద్వి. ౨౯; 3. దాఁగుట. (చూ. కికురింతలాట.)

కికురింతలాట. దే. వి. (కికురింతలు+ఆట.) దాఁగుడుమూఁతలు. "సీ. స్వర్భాల లావెట్ల శాఖలచాటున సంత్మ...తురు కికురింతలాటలు..." చెన్న. ౫, ఆ. 3౭౮.

కికురింపు = కికురింత. ఆం. భా. ద్వి. ౨౯౨.

కికురు. దే. వి. వంచన, మోసము. ఆం. భా. ద్వి. ౨౯౨.

కికురుపొడుచు. దే. స. క్రి. [illegible] "స...ప్రస్ఫుటము కికురుపొడుచుచు..." భాగ. ౮ స్కం. ౧౦౮. ౧౦ స్కం. పూ. ౭౫౬.

కికురువెట్టు. దే. స. క్రి. (కికురు+పెట్టు.) 1. మోసగించు. "క. ఏ నొక బ్రాహ్మణకన్యక, నై నరపతిఁ గికురువెట్టి యంతఃపురకాం, తానిచయము లోనికిఁ జను, చే నొప్పుదు నాలుగేనుదివసంబులకున్." దశ. ౯, ఆ. ౬౨; 2. త్రోసిపుచ్చు. "ఆ. అతని చేత నున్న యమృతకుంభము చూచి, కేరలు వాడిచి సురలఁ గికురువెట్టి, పుచ్చుకొనిరి యసుర పుంగవు లెల్లను, మాఱు లేని బలిమి మానవేంద్ర." భాగ. ౮ స్కం. ౨౯౫.

కికురువొడుచు. దే. స. క్రి. (కికురు+పొడుచు.) మోసగించు. "క. [illegible] కికురువొడుచుచు ..., మొనసి చెన్నొంగ రాని మెలఁకువల నృపా." భాగ. ౧౦ స్కం. పూ. ౪3౧; 2. త్రోసివేయు. (చూ. కికురుపొడుచు.)

కిక్కస. దే. వి. సలము, తృణవిశేషము. ఆం. భా. ద్వి. ౭౫.

కిక్కుమిక్కురుమను = కిక్కురుమను (బ్రౌ.)

కిక్కురించు = కికురించు. (మోసగించు.) "ఆ... నానిఁ గిక్కురించిపోయి పక్కిఁ గాంచు." భా. రా. యు. ౨౬౭.

కిక్కురింత = కికురింత. (శ. ర.)

కిక్కురు. దే. వి. 1. మోసము. (చూ. కిక్కురువెట్టు.) 2. అల్ప మగు గంతధ్వని కనుకరణము. (చూ. కిక్కురుమను.)

కిక్కురుమను. దే. అ. క్రి. (కిక్కురు+అను.) నోరెత్తు, కొంచెమైనను మాటాడు. "క. కిక్కురుమన కమృతంబుం, గ్రుక్కలు వెట్టుగురు సురలు..." హర. ౬, ఆ. ౧౨౨.

కిక్కురువెట్టు. దే. స. క్రి. (కిక్కురు+పెట్టు.) మోసగించు. (మోహిని) "శా. శూలిన్ గిక్కురు వెట్టి

పోయె లతికాస్తోమాంతరాళంబులన్." నిష్కు. నా. ౪, ఆ. ౨౫౩, ౨౫౪. రసిక. ౩, ఆ. ౯౦.

కిక్కిస. దే. అవ్య. ద్రు. చచ్చునట్లు, ప్రాణముపోవునట్లు. (వి. మిక్కిలికదియిక అని. శ. ర. అవ్య. గట్టిగా అని. సూ. ని.) "దండకము..." భయభ్రాంతుఁడై పాఱ నుంకించునక్కి(ర)ంచు కంసుం డ్రిలోకీనృశంసున్ నియుద్ధక్రియాపద్ధతిం గిక్కిసం గొంతుఁ ద్రొక్కి నొక్కవే..." పారి. ౩, ఆ. ౩౮.

కిఖి. సం. వి. ఇ. పుం. కోఁతి. (త్రి. ని.) స్త్రీ. సృగాలిక, గొంకనక్క.

కిగ్గాడి. వై. విశ. (సం. కీకట:. క. కిగ్గ.) 1. హీనుఁడు, అల్పుఁడు. "సీ. తనవిడిందికి రంభ ననుపవై తని తిట్టుకిగ్గాడియసురకుఁ గేలు మొగిచి." ప్రభా. ౧, ఆ. ౭౮; 2. అప్రయోజకుఁడు, ఎందులకుఁ బనికి రానివాఁడు. ఆం. భా. తృ. ౨. ౭. "ఉ... పచ్చెఁ గిగ్గాడియుఁ బోలెఁ గామగపిగాఁడి గలయ్య నృపాలువీటికిన్." సుద. ౩, ఆ. ౪; 3. సామాన్యము; అతిసామాన్యము. "గీ. పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాత్మహయము దాఁటించి నట్టివాఁ గల్లయదిగో,నాఁటి కది యబ్బురము గాని నీటిలోని,నేఁటి కిగ్గాడిగుఱ్ఱాలు దాఁటుచుండు." కళా. ౮, ఆ. ౧౩౩.

కిగ్గాడికాఁడు. ద్వ. వి. (కిగ్గాడి+కాఁడు-స్వార్థమున.) అప్రయోజకుఁడు. "క. కిగ్గాడికాండ్రె యెప్పుడుం, దగ్గనిసంపదలఁ బొరల..." శుక. ౩, ఆ. ౨౭౭.

కిచ. దే. వి. (గినియామ్రేడితరూపము కిచకిచ.) 1. కోఁతులు మొ. వాని ధ్వనికనుకరణము. "ద్వి. అచలంబుపైకి గుండనక పెట్టనక, కిచకిచధ్వనులతోఁ గిచకొట్టుకొనుచు, నెగఁబ్రాకి యెక్కుచో..." రం. రా. కిష్కిం. ౧౮౯. పు; 2. చక్కిలిగింత. ఉదా:—కిచకిచలు; 3. చక్కిలిగింతవలనిజలదరము. (చూ. కిచకొట్టు.)

కిచకొట్టు. దే. అ. క్రి. (కిచ+కొట్టు.) 1. కోఁతులు ధ్వనిచేయు. "ద్వి. కిచకిచధ్వనులతోఁ గిచకొట్టుకొనుచు." రం. రా. కిష్కిం. ౧౮౮. పు; 2. చక్కిలిగింతకలుగు. "సీ. పూవుగుత్తులవంటిపూపచన్నులు గోళ్ల నదిమినఁ గిచకొట్టునట్టివేళ." శుక. ౧, ఆ. ౨౦౦; 3. పక్షులు కోఁతులు మొ. వానివలె ధ్వనిచేయు. "సీ. కిచకొట్టి బకదూతికపికపిల్ చెవిఁ గుల్కి కుదురుగుబ్బ లురంబుఁ గదియఁ జేర్చి." శుక. ౧, ఆ. ౩౦౩.

కిచుకు. దే. వి. పాము మొ. భక్షించుటయందుఁ జేయుధ్వని కనుకరణము. (దీనియామ్రేడితరూపము 'కిచుకుకిచుకు.' (పాము.) "వ... కిచుకు కిచుకు రనక... నిఖిలభేకంబులం భక్షించి..." వేం. పంచ. ౩, ఆ. ౩౬౦.

కిచ్చడి. దే. వి. (క. త. కిచ్చడి. హిం. కిచిడీ.) నానావస్తువులు చేర్చి వండినచిత్రాన్నము "సీ... పచ్చళ్లు కిచ్చళ్లు పాయసములు." ఉ. రా. ౬. ఆ. ౧౨౨. "వ... పచ్చడులుం గిచ్చడులును బజ్జులుం గిజ్జులును..." కాశీ. ౭, ఆ. ౧౮౫.

కిచ్చిలి. దే. వి. (క. కిచిలి. త. కిచ్చిలి.) 1. ఒకజాతి నారింజ. (బ్రౌ.); 2. ధాన్యవిశేషము. (వా.)

కిటకిట. దే. వి. (త. కిడుకిడు.) 1. పండ్లు కొఱుకుట మొ. వానియం దగుధ్వని కనుకరణము. "వ... కిటకిటం బండ్లు గొఱికి..." స్వా. ౫, ఆ. ౧౯. "చ. కిటకిటఁ బండ్లు గీటి పలికెం జటిధూర్జటి హుంకరించుచున్." దశా. ౨, అ. ౨౬; 2. బిరడఁ ద్రిప్పుట మేను వడఁకుట మొ. వానియం దగుధ్వని కనుకరణము. "సీ. శ్రుతులు విజ్జోడైనచోఁ దంత్రి బిగువుగాఁ బీడించి కిటకిట బిరడఁద్రిప్పు." వైజ. ౧, ఆ. ౧౧౮. "క. అటు నిటును జూచి గిగి మెల్లఁగఁ, గిటకిట యని మేను వడఁక..." పార్వ. ౪, ఆ. ౧౨౪.

కిటకిటమను. దే. అ. క్రి. (కిటకిట+అను.) కిటకిట మని ధ్వనిచేయు. "క. కిటకిట మన రదనపంక్తిఁ గీటుచుఁ బలికెన్." దశా. ౬, అ. ౮౨.

కిటకిటలాడు. దే. అ. క్రి. (కిటకిటలు+ఆడు.) సమ్మర్ద మగు, క్రిక్కిరియు. వ్యవ:—నేఁడు తీర్థములో జనులు కిటకిటలాడుచున్నారు.

కిటి. సం. వి. ఇ. పుం. 1. పంది; 2. వరాహావతారము.

కిటికి. దే. వి. (హిం. ఖిడ్కీ.) గవాక్షము, సోరణము. (శ. ర. వా.)

కిటుకు. దే. వి. 1. మోసము. ఆం. భా. ప్ర. ౧౩౮. 2. చెడ్డపని. "చ. కటకట మిమ్మువంటిగుణగణ్యులఁ బుణ్యులఁ జెప్పరాని సంకటములఁ బెట్టి యెట్టి కొఱగాములు చేసితిఁ దెక్కు నాకు నీ, కిటుకున

నేమిమేలు కలిగెన్..." వి. పు. ౭, ఆ. ౯౪; 3. రహస్యము. (వా. ఆసలుకిటు కది.) "గీ. ఆకిటుకు కూటిపఱచిగయ్యాళితపసి." చంద్ర. ౧, ఆ. ౧౩౪; 4. కష్టము, చిక్కు. "ద్వి. కపటనాటకుఁ డైన కౌశికుఁ డాత్మఁ, గృపమాలి నినుఁ బట్టి కిటుకులు పెట్టి." ద్వి. హరిశ్చ. పూ. ౧౭౭. పం.

కిట్టమి. దే. వి. (కిట్టు. ధా.) విరోధము. (ఆం. పద.)

కిట్టము. సం. వి. అ. న. 1. దేహమలము; 2. లోహాది ధాతుమలము, చిట్టెము; 3. నూనెమొ. వాని యడుగుమడ్డి; 4. పురీషము.

కిట్టింపు = గిట్టింపు. (ఆం. పద.)

కిట్టికోల. దే. వి. ఇఱికించుటకుఁగా నొకవైపు కొనలం జేర్చి కట్టి చిన్నకోలలతో నేర్పఱుపఁబడినసాధనము. (శ. ర.)

కిట్టిమము. సం. వి. అ. న. క్షారోదకము, ఉప్పునీరు.

కిట్టు. దే. అ. క్రి. స. క్రి. 1. పగఱు, తాఁకు. "ఉ...హరిం, గేవలమర్త్యుగాఁ దలఁచి కిట్టినఁ బట్టినఁ దారు మంటప్పవారిఁ గ్రమ్మునాశలభవర్గముచాడ్పున మ్రందిపోరె..." భార. ఉద్యో. 3, ఆ. 3౯౦; 3. దగ్గఱు, సమీపించు. "మ... భీమాగ్రజుం డాజిఁగిట్టినఁ బట్టం గడు నగ్గమైన యెడ..." భార. ద్రో. ౧, ఆ. 3౦౦; 3. = గిట్టు. (ఆం. పద.) స. క్రి. 1. చంపు, వధించు. "ఉ. కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములన్..." భార. కర్ణ. 3, ఆ. ౨౬౧; 2. డాయు, సమీపించు. ఆం. భా. త్రి. ౧౨౪. "చ...ఉగ్ర మృగనాథుఁసినైనను గిట్టిముట్టిబె, ట్టిదముఁగఁ గాలఁ గెలను గడిందిమగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు..." భార. విరా. ౧, ఆ. ౮3.

కిట్టుకొను. దే. అ. క్రి. (కిట్టు+కొను స్వార్థమున.) సమీపించు, చేరు. "క. చఱచియుఁ బొడిచియుఁ దాఁచియుఁ, గుఱుమూఁకలఁగూడఁ గిట్టుకొని తమకొనన్." దశ. ౬, ఆ. ౧౧౦.

కిణము. సం. వి. అ. పుం. 1. గట్టివస్తువులతోడి రాపిడివలనఁ జేతియందు కాచుకాయ; 2. ఎండిన పుండు; 3. కంతి.

కిణి. సం. వి. ఇ. స్త్రీ. ఉత్తరేను✱.

కిణిహి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉత్తరేను✱; 2. తెల్ల గినియు✱.

కిణ్వము. సం. వి. అ. పుం. న. సురాబీజము✱. న. 1. పాపము; 2. తెలికపిండి; 3. మద్యద్రవ్య సముదాయము.

కిత. దే. వి. 1. దేవతార్పణమునకై కళ్లమున నొక దెసను బోసెడిమూఁడుదోసిళ్ల ధాన్యరాశి. (శ. ర.); 2. ధాన్యరాశి. (బ్రౌ. వా.)

కితవము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త✱.

కితవుఁడు. సం. వి. అ. పుం. జూదగి. విణ. (౧.అ. అ.); 1. మోసకాఁడు; 2. దుష్టుఁడు; 3. పిచ్చివాఁడు.

కితాబు. హిం. వి. బిరుదు. "సీ. మెచ్చి పాచ్చా కితా బిచ్చుటచే వజారత విజయానందరంగ రాయ. గీ. లసఁగఁ బౌరుషనామధేయముల వెలసి." ఆనంద. పీఠి. ౭౭.

కిత్తనార. దే. వి. చాఁగనార. (శ. ర.)

కిత్తనారగుడ్డ. దే. వి. (కిత్తనార+గుడ్డ.) కిత్తనారతో నేసినగుడ్డ, మోటుగుడ్డ. (శ. ర.)

కిత్తలి. దే. వి. (క. కిత్తళె. త. కిత్తిలి.) నల్లపసి✱. (శ. ర. బ్రౌ.)

కిత్తి = కిత్తు. "సీ. ఎలికనేత్రమునకత్తి యూఁడజ్య పూనమై ఔప్పులసుదఁటుల నిష్టు లునిచె." పార. ౭, ఆ. ౭౯. పండితా. మహి. ౫౦పు. ౨ పం.

కిత్తికంటిపలఁగి. దే. వి. (కిత్తి+కన్ను+పలఁగి.) పెంకి. దేసి. ౫.

కిత్తు. దే. వి. (త. కిత్తు.) గిన్నె, పిన్న. ఆం. భా. ప్ర. ౪౯. సం. వి. గేస. ౧౩.

కిదుకు. దే. అ. క్రి. మాఁరాము పట్టు, బిడ్డలు చల పట్టు. "ద. నిదుకింటినశిశు ఎత్తికొని, చనుదుమఁ జను గారి గరిని..." భాగ. ౧౧ స్కం. పూ. ౨౫౦. "ద్వి. ఒత్తి నేనును నన్ను పసలకే లెగిచి, యెత్తుకొమ్మనుచు బెల్లినఁగు దైన్యమునఁ, గిదుకుచుఁ జిన్ని కెంగేలఁ బై కొంగుఁ, గదియించి బుడిబుడికన్నీరు దెచ్చి." ద్వి. హరిశ్చ. పూ. ౨౩౪౮ పం.

కినియు. దే. అ. క్రి. 1. కోపించు. (క. కినిసు.) "చ. అనిమిషనాథు నుండి బదరీశ్రమతాపసపఙ్క్తముంపటక, గినిసి ప్రతిజ్ఞ చేసి..." ఉ. హరి. ౧, ఆ. ౧౩౭. "సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప నది శార్ఙి తేజంబునందుడింపె." పారి. ౫, ఆ. 3౦, 2. ద్వేషించు. "గీ. అఖిల

విషయాసక్తి స్నేహముఁ డగుచు శుభము, నొంది మఱియక యశుభంబు నొంది కినియ, కుందు నెవ్వాఁడు..."సీతారా. 3, ఆ. ౧౪౨. స. క్రి. 1. కోపపడు. "గీ...రాధేయుఁడుఁ గినిసి..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౨౫. "ఉ...కుమారులం గినియ నోపఁడ..."భార. ఉద్యో. ౧, ఆ. 3౪౬; 2. సమీపించు. "గీ. కినిసి పాణిసాళి కంబు సోనపుటయును." హ. న. ౨, ఆ. ౪౭. (నలపక్షమున 'సమీపించు,' హరిశ్చంద్రపక్షమున 'కోపించు'.)

కినుక. దే. వి. 1. కోపము. ఆం. భా. ప్ర. ౧3౫. "వ...కినుకనూనినసవ్యరౌద్రరసంబలంకరింప." భాగ. ద్రో. 3, ఆ. ౨౨౫; 2. ఉసికె. "చ... అప్పొకచపంతజలాలోచనపాంథయిందురమ్మనుపుయం నిల్లు నేకొనెద పద్దిర మత్పతి వచ్చువేళ నీ,కినుకలు సాగ విచ్చుట జగేయున 'నాతఁడు భీతచిత్తుఁడై." శుక. 3, ఆ. ౧౯౬.

కినుకకాఁడు. దే. విశ. (కినుక+కాఁడు.) కోపము గలవాఁడు. (శ. ర.)

కినుకము = కినుక. (ఆం. పద.)

కినుపు. దే. వి. (కినియు ధా.) కోపము. "గీ. కినుపు కెలకించితము నాత్మఁ గీలుకొల్పఁగ, సవతి సీక్షించు ప్రౌఢయోషయును బోలె."కాశీ. ౪, ఆ. ౧౪౭. పెవిక. ౨, ఆ. ౧౪3.

కినుపడు. ఎవా. ఆ. క్రి. (కినుక+పడు.) కోపపడు. "క...అధిపతి నిన్నుఁగ్, జన్నియ విడిచె రణము గాత్త్రిమిన్నక కినుపగక పొమ్ము మీగృహమున కున్." భార. విరా. ౪, ఆ. ౨౧౭.

కిన్క = కినుక. "గీ...కిన్కఁ బూనినయలఁలినగపు, చెలువు మొగమున కొక్రొత్తపొలు పొనర్చ." భార. ఉద్యో. 3, ఆ. 3౬౪.

కిన్నర. సం. వి. ఆ. స్త్రీ. వీణావిశేషము, కిన్నరుల వీణెవంటివీణె. "ఉ... మేల్కిన్నరఁ జెంతఁ జేరి యొకకిన్నరకంఠి యొసంగ..." చంద్రిక. ౨, ఆ. ౯౫.

కిన్నరకంఠి. సం. వి. ఈ. స్త్రీ. కిన్నరధ్వనివంటి మధుర కంఠధ్వనిగల స్త్రీ; స్త్రీ.

కిన్నరము. సం. వి. అ. న. భారతాటదేశభేదము.

కిన్నరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కిన్నర. (కే. ని. వై. ని.); 2. కిన్నరస్త్రీ. "సీ. తతపాదక సమీరహతకిన్నరీరుతుల్ కిన్నరీరుతులు నేకీభవించె..." వసు. ౧, ఆ. ౧౪౯.

కిన్నరుఁడు. సం. వి. అ. పుం. 1. నరముఖమును నశ్వశరీరమును గలదేవయోనివిశేషము. "శ్లో. బింబోష్ఠం బహుమనుతే తురంగవక్త్రశ్చుంబంతం ముఖమిహ కిన్నరం ప్రియాయాః." శిశు. ౪, స. 3౮. శ్లో; 2. దేవయోనివిశేషము. "శ్లో. గంధర్వ కింపూరుషకిన్నరాజగుహ్యకాః." సం. భాగ. ౮. స్కం. ౨౦. అ. ౨౦. శ్లో.

కిన్నరేశుఁడు. సం. వి. అ. పుం. కిన్నరులరాజు. కుబేరుఁడు.

కిన్నెర. వై. వి. (సం. కిన్నరా.) కిన్నరులవీణవంటి వీణ. 'సీ. శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు పసిఁడికిన్నెరవీణ పలుకుఁదోడు."నైష. ౧, ఆ. ౫.

కిన్వడు = కినుపడు. "చ. జనకుని గన్నఁ గిన్వడుదు సఖ్యుల బంధులఁ గాంచినం,గనలుదు..." పాండు. పూ. ౯, ఆ. ౮౫.

కిమ్. సం. స. (మ్.) ప్రశ్నార్థకము. (ఇది తెలుఁగున సమాసపూర్వపదముగా నే యుండును. ఉదా:— కింకర్తవ్యము మొ. అవ్య. కుత్సితము. ఉదా:— కింప్రభువు మొ.

కిముఖాబు. దే. వి. (హిం. కింఖ్వాబ్.) బంగారు మొ. వానిపువ్వులతో గుట్టినవిలువ గలపీతాంబరాదికము. "సీ. పులితోలు సరిగపూవుల హెచ్చు కిముఖాబు గొప్పకమాసుగా నొప్పఁ జేసి." పార్వ. ౫, ఆ. ౧౪౯.

కిముడు. దే. విశ. కొంచెము, అల్పము. ఆం. భా. త్రు. ౧౬.

కిమ్మతు. హిం. వి. వెల.

కిమ్మత్తు = కిమ్మతు. (వా.)

కిమ్మను. వి. అ. క్రి. (కిమ్+అను.) నోరెత్తు, మాటాడు. "ఉ...ఇందుబింబముగ్, గిమ్మననీదు మోము..."స్వా. 3, ఆ. ౬., సా. 3, ఆ. ౧౦౭.

కిమ్మీరము. సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము; 2. నారింజ. విశ. (అ. ఆ. అ.) చిత్రవర్ణము గలది.

కిమ్ము. దే. వి. ఇమ్ము, ప్రీతి. "ఉ. కమ్మనిజున్ను మంచి నెయి గట్టిపి మీఁగడతోఁ బెరుంగు...ఇమ్మై యిం,గిమ్ములఁ దెచ్చి యిచ్చు రతికిం బలిమాలుచుఁ బిల్చు నిచ్చలున్." హంస. ౨. ఆ. ౧౧౧.

కియ్య. దే. వి. (కిందు+య.)హల్లు క్రిందియకారము. అం. భా. ద్వి. ౧౮౭. పాండు. ౧, ఆ. ౭౧.

కియ్యవడి. దే. వి. కియ్య, హల్లు క్రిందియకారము. (శ. ర.)

కిరకము. సం. వి. అ. పుం. పందిపిల్ల.

కిరడు. దే. వి. పాలకీ మోయువారు నడుచునడక లలో నొకనడక. ప్రబంధ. ౬౦౫.

కిరణమాలి. సం. వి. న్. పుం. సూర్యుఁడు.

కిరణము. సం. వి. అ. పుం. మయూఖము, వెలుఁగు.

కిరత్. సం. శత్రు. 1. కప్పుచున్న; 2. చిమ్ముచున్న; 3. పీడించుచున్న.

కిరము. సం. వి. అ. పుం. 1. పంది; 2. మఱుఁగు దొడ్డి. విణ. (అ. ఆ. అ.) చల్లునది.

కిరసనాల. ఆం. వి. (Kerosine oil) మట్టితైలము, దీపముల కుపయోగించునూనె. (ఇది ఖనిజము.)

కిరస్తాని. ఆం. వి. (Christian) క్రైస్తవజాతి. ఉదా:—కిరస్తానివాఁడు.

కిరాటుఁడు. సం. వి. అ. పుం. 1 వైశ్యుఁడు; 2. మ్లేచ్ఛుఁడు.

కిరాతకము సం. వి. అ. పుం. నేలవేము.

కిరాతతిక్తము. సం. = కిరాతకము.

కిరాతము. సం. వి. అ. పుం. 1. ఒకానొక దేశము; 2. మత్స్యవిశేషము; 3. నేలవేము.

కిరాతుఁడు. సం. వి. అ. పుం. 1. నెమిలిపించము ధరించి యడవిని దిరుగుబోయ; 2. మ్లేచ్ఛుఁడు. విణ. (అ. ఆ. అ.) పొట్టివాఁడు.

కిరానా. హిం. వి. చిల్లరదినుసులు. (వా:—కిరానావ్యాపారము.)

కిరానాకొట్టు. మి. వి. చిల్లరదినుసు లమ్ముదుకాణము. (వా.)

కిరాయి. హిం. వి. బాడుగ, బండియద్దె.

కిరి. సం. వి. ఇ. పుం. 1. నేలను ద్రవ్వునది—పంది. 2. నీళ్లను జిమ్మునది—మేఘము.

కిరాలి. సం. వి. ఇ. స్త్రీ. గంగ. ఈ. స్త్రీ. 1. కిరాతస్త్రీ; 2. కుంటెనకత్తె; 3. గంగ; 4. దుర్గ.

కిరీటము. సం. వి. అ. పుం. 1. రాజుల దొకవిధమైన తలపాగ. "క...కిరీటము పెట్టిన, తలనుక్ సుక్కు డుఁగఁ బోవఁ దగునే యొందున్." వాల్మీ. 3, ఆ. ౬౮; 2. ముకుటము, శేఖరము.

కిరీటి. సం. వి. న్. పుం. 1. అర్జునుఁడు; 2. ఏనుఁగు దంతపుమూలము. (వై. ని.) విణ. (న్. నీ. న్.) కిరీటధారి.

కిరీటిపచ్చ. మి. వి. (కిరీటి+పచ్చ.) 1. మరకతమాణిక్యము, గరుడపచ్చ, "వ...కిరీటపచ్చలఖాంగిళ్ల చెక్కిళ్లఁ జెలంగ..." సాంబో. ౧, ఆ. ౯3; 2. కిరీటియొక్కపచ్చలు. "క. చెలులు ప్రసంగవశమ్మున, నల రెం గడు విజయభవన మునిన న్నవలా, తెలియ వినుక్ గలయఁ గనుక్,బలుమరు బాగా కిరీటిపచ్చ లటన్నన్." విజ. 3, ఆ. ౨౬. (ఇది రెండిటికి నుదాహరణమే.)

కిరుదెస. వై. వి. (సం. గృధ్రసీ.) రొంటినుండి కాలివఱకు రోగవిశేషము. అం. భా. ద్వి. ౧౨౬.

కిరుసు. దే. వి. (శ. కరుచు.) ఇరుప్రక్కల నాదర గలిగి వాఁడి యైనకత్తి. "గీ. విరహి సెత్తుటఁ జొత్తిల్లుకిరుసు లనఁగ, నరుణతరుణప్రవాళంబు లపట నచటఁ, గ్రమ్మ..." కాశి. ౪, ఆ. ౧౮౬. కుచేల. ౪, ఆ. 3౧. విణ. ఇరుప్రక్కల నాదర గలిగి వాఁడి గలది. "మ...బల్కిరుసుకత్తిరోగఁ బోలె..." కళా. ౭, ఆ. ౧౨. చంద్రా. ౨, ఆ. ౭౫.

కిఱకిఱ. దే. వి. 1. రథనేమి ధ్వని కనుకరణము. (శ. ర.) 2. బండినట్టాధ్వని కనుకరణము. (వా.) 3. చెప్పులు మొ. వానిధ్వనికి ననుకరణము.

కిఱు = కిట్టు. (చూ. కిఱుఁజెప్పు.) విణ. సన్నము, అల్పము. (చూ. కిఱుకుంత.)

కిఱుఁజెప్పు. దే. వి. (కిఱు+చెప్పు.) కిట్టు గలచెప్పు. "మ...ఘోరాహినీయంఘ్రికిక్, గిఱుఁజెప్పైన విధంబు నామనములోఁ గీలించినట్లయ్యెడున్." నైష. ౮, ఆ. ౧౨౫. "క...దూ, డలఁ గాయఁగ...కిఱుఁజె,ప్పులు పిల్లనగ్రోవి యమరఁ బొలము దిరుగుచున్." చెన్న. 3, ఆ. 3౧.

కిఱుతు. దే. వి. 1. త్రిప్పట. "చ. కఱుకులఁ బెట్టి వీరి నడకించి తొలంగుడమన్న పట్టికకుఱుకితియ కాని దైవ మనుకూలము గాదు..." భై. ౩, ఆ.

౨3౪; 2. తలుపుతీయునపుడు కలుగుధ్వని కను కరణము. "క...చిత్తిని చనిపోః నుపుగిఱు కన కుండన్." శుక. ౨, ఆ. ౧౨౪.

కిఱుకు = కిఱ్ఱు. (చూ. కిఱుకుఁజెప్పులు).

కిఱుకుఁజెప్పు = కిఱుఁజెప్పు. "ద్వి. కిఱుకుఁజెప్పులు. ఆ. వా. క. ౧, ఆ.

కిఱుహూఁత. దే. వి. (కిఱు+హూఁత.) సన్నహూఁత, అల్ప ధ్వని. "సీ. నూగారు వొఱలుమేనులతోడ నెర నునై కిఱుహూఁత లిడ నాలుకింప లేక." వే. పంచ. ౧, ఆ. ౨౮౭.

కిఱుసు. దే. విణ. (క. కిఱుసు.) తక్కువ, న్యూనము. "గీ. అతిథిశిష్టాన్నభోక్త శతాశ్వమేధ, కర్త కెక్కుడు సరిగాని కాఁడు కిఱుసు." వరాహ. ౧౦, ఆ. ౧౦౯.

కిఱుసుకట్టు. దే. వి. బ. (కిఱుసు+కట్టు.) కుస్తీ కుండలపైఁ జేయునొకరకపుపరిశ్రమని. "గీ... కిఱుసుకట్టు, బొద్దుటీనలు నుచుపులు మొదలు గాఁగఁ, బనులు నిర్మించు గుండలపై నతండు." హంస. ౫, ఆ. ౧3.

కిఱ్ఱు. దే. వి. 1. చెప్పులు మొ. వానితో నడచునపుడు కలుగుధ్వని కనుకరణము. (దీనికి వృత్తియందు ద్విత్వలోపము వైకల్పికము. దీనియామ్రేడిత రూపము కిఱ్ఱుకిఱ్ఱు.) గీ. పాదములఁ గిఱ్ఱుకిఱ్ఱని పలుకుచుండు, కుచ్చుటుద్దాలు..."హంస. 3, ఆ. ౯౦. ద్వా. ౧౦, ఆ. ౯3; 2. తలుపుతీయు నపుడు కలుగుధ్వని కనుకరణము. "సీ. తలుపు కిఱ్ఱనకుండ." కాశీ. ౪, ఆ. ౧౦౧; 3. కావడి మోచునపుడు బద్దకు భుజములరాపిడిచేఁ కలుగు ధ్వని కనుకరణము. "గీ. గమనజవమున నుఱ్ఱాడు కావ దదరి,కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ గేళిసల్ప."హంస. ౧, ఆ. ౧౭౨.

కిఱ్ఱుఁజెప్పు = కిఱుఁజెప్పు. "ఉ...,పొం దవుకిఱ్ఱుఁ జెప్పులనుబొల్పెసఁగన్ ధనదత్తుఁ డెంతయున్." మల్హ. ౨, ఆ. ౯౦.

కిఱ్ఱుఁబాగాలు. దే. వి. బ. కిఱ్ఱుఁబావుకోళ్లు. వైజ. ౨, ఆ. ౪౫.

కిఱ్ఱుగానుఁగత్రిప్పట్లు. దే. వి. బ. (కిఱ్ఱు+గానుఁగ+త్రిప్పట్లు.) బాలక్రీడావిశేషము. "సీ. గచ్చ కాయలు కిఱ్ఱుగానుఁగత్రిప్పట్లు .." హంస. 3, ఆ. ౧౪౬.

కిల. వై. వి. నవ్వుట మొ. వానియందగుధ్వని. (చూ. కిలకొట్టు; కిలారుచు.)

కిలకించితము. సం. వి. అ. న. స్త్రీశృంగారచేష్టావిశేషము; అభీష్టతమసంగమము వలని యానందముచేఁ గలుగుస్మితాదులకూడిక. "శ్లో. స్మిత శుష్క రుదిత హసిత త్రాస క్రోధ శ్రమాదీనామ్, సాంకర్యం కిలకించిత మభీష్టతమసంగమాదిజాద్ధర్షాత్." సా. ద. 3, ౧౦౧. "గీ. కినుపు కిలకించితము నాత్మఁ గీలుకొనఁగ, సవతి నీక్షించు ప్రౌఢయోషయయు బోలె." కాశీ. ౪, ఆ. ౧౪౭.

కిలకిల. ఉభ. వై. వి. (సం. కిలకిలా. క. కిలకిలా.) నవ్వుట మున్నగువానియం దగుధ్వని కనుకరణము. "క...కిలకిల నవ్వె..." సా. ౨, ఆ. ౧౬౨. "చ...,సకినలకూఁకలన్ గిలకిల నృగు మోహనశయ్య నున్నెడన్." వసు. ౬, ఆ. ౭౪. "సీ...కిలకిలల్ గుల్కుచిల్కలకుఁ దోడు." య. ౫, ఆ. ౯౧. "చ. కిలకిల నార్చుచున్..." ఉ. రా. 3, ఆ. ౧3౦. సం. వి. ఆ. స్త్రీ. 1. హర్షధ్వని; 2. పీరుని సింహనాదము.

కిలకిలలాడు. ద్వి. అ. క్రి. (కిలకిలలు+ఆడు.) కిలకిల ధ్వని చేయు. "చ...సారెసారెకుం, గిలకిలలాడు చున్ మిగులఁ గేకలుకొట్టుదు రంతె కాని..." నీలా. ౨,ఆ. ౯౧.

కిలకొట్టు. ద్వి. అ. క్రి. (కిల+కొట్టు.) కిలకిలలాడు. "సీ. కిలకొట్టి యుట్టె చక్కిలిగిలి యని పెట్టి కిల కొట్టి నవ్వి నవ్వులయఁ జేసి." చంద్రా. ౨, ఆ. ౫.

కిలము. ఉభ. దే. వి. (క. కిలబు.) కిలుము, చిలుము. (బ్రా. వా.) సం. వి. అ. పుం. ఆట, క్రీడ.

కిలా. హిం. వి. కోట. (చూ. కిలాదారు.)

కిలాకిల = కిలకిల. "మ...కిలాకిల నవ్వన్..." కువల. ౧, ఆ. ౭. "చ...రంభ నగుచున్ గిలా కిలన్." ౧, ఆ. ౯౫.

కిలాతము. దే. వి. గుఱ్ఱము. "ఉ. విన్నన నేఁగు తామరలవిందు కిలాతపునీడలు..." య. ౨, ఆ. 3౯.

కిలాదారు. హిం. వి. కోటయధికారి. "గీ...కిలా దారులు సరదారులు..." ఆనంద. పీఠి. ౧౧౨.

కిలారము. దే. వి. గోకులము, పసులమంద. ఆం. భా. ద్వి. ౨౬౧.

కిలారి. దే. వి. (కిలారము+ఇ.) గోపాలకుఁడు, పసుల కాపరి. ఆం. భా. ద్వి. ౨౬౧.

కిలారించు. ద్వ. అ. క్రి. 1. సింహనాదము చేయు. "వ...పుడ్డు గొఱుకుచు నార్భటించుచుం గిలారించుచు...పోరుచుండ..." వేం. మా. 3, ఆ. ౪౨; 2 కిలకొట్టు. (శ. ర.)

కిలారుచు = కిలార్చు. ద్వ. అ. క్రి. (కిల+ఆరుచు) 1. కిలకిలధ్వని చేయు. (శ. ర.); 2. సింహనాదము చేయు.

కిలార్చు. ద్వ. అ. క్రి. (కిల+ఆర్చు.) సింహనాదము చేయు. "సీ దేవతల్ దయ్యంగ దిక్కులు వ్రయ్యంగ నప్పటప్పటికిఁ గిలార్చుకొనుచు" ఉ. రా. 2, ఆ. ౧౨౦. "ఉ...చం, ద్రాంగదు జీవముల్ గొని కిలార్చెద..." చంద్రా. ౬, ఆ. ౧౦౨.

కిలాసము. సం. వి. అ. న. సిధ్మరోగము. సోబె.

కిలాసి. సం. విణ. (న్. సీ. న్.) సిధ్మలుఁడు, సోబె రోగము గలవాఁడు.

కిలించు = కీలించు. (పట్టుకొను.) "చ... వీఁగుఁబండులం, బలిమిఁ గిలించి లెవ్వ మునిప ట్లోక టూడిన నవ్వి రందఱున్." సాంబో. ౫, ఆ. ౧౦౧.

కిలింజకము. సం. = కిలింజము.

కిలింజము. సం. వి. అ. పుం. 1. చాఁప; కటము; 2. తెల్లు మొ. వానితో చేసినత్రాడు.

కిలుము. దే. వి. (క. కిలుబు.) చిలుము. (బ్రౌ. వా.)

కిల్బిషము. సం. వి. అ. న. 1. పాపము; 2. అపరాధము; 3. రోగము.

కిల్బిషించు. సం. స. క్రి. చంపు. (బ్రౌ.)

కిల్లా = కిలా. "వ...చెంగలిపట్టుకిల్లా జాగీరును..." ఆనంద. శీఠి. ౧౦౭. రంగా. ౨, ఆ. ౫౪.

కిల్లాకు. ద్వ. వి. (కిల్లా+ఆకు.) 1. చీటి. ఆం. భా. ద్వి. ౧౮౮. శకాం. ౨, ఆ. ౭౬; 2. ఆజ్ఞాపత్త్రము. "గీ...కొండంతపనికిసైన...కిల్లాకు పనుపసాగె." కువల. ౨, ఆ. ౨౪. రామా. ౫, ఆ. ౧౭౭.

కిల్లాడి. దే. విణ. మోసకాఁడు. వ్యవ:—వాఁడు మంచికిల్లాడి.

కిల్లి. దే. వి. 1. మల్లబంధవిశేషము. ప్రబంధ. ౭౮. ఆం. భా. ద్వి. ౨౦౯; 2. తాంబూలపుఁజుట్ట. (వా. కిల్లీ యనియు వాడుక.)

కివకివ. దే. వి. కోయిల పావురము మొ. వానిధ్వని కనుకరణము "వ...కివకివఁ గూయుకోయిలల యారజంబునకు..." కువల. ౧, ఆ. ౧౭. "సీ. కిచ కొట్టుబకదారి కివకివల్ చెవిఁ గుల్కి..." శుక. ౧, ఆ. 3౦3. "సీ. చెవిగూంట నెలకొన్నకవపిట్ట కివకివల్ మొనసి నావబ్రహ్మ మినుముడింప. చంద్రా. 3, ఆ. (శ. ర. పా. 'కవకవ' ముద్రి.)

కివ్వు. దే. అ. క్రి: మడియు,చచ్చు. (శ. ర.బ్రౌ.)

కిశోరము. సం.వి.అ. పుం. 1. గుఱ్ఱపుఁబిల్ల; 2. శిశువు. ఉదా:—సింహకిశోరము మొ. భో. ౬, ఆ. 3౧3.

కిశోరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు. విణ. (అ. ఈ. అ.) పదునొకండేండ్లకుఁ బదునైదేండ్లకు నడుమ గలవయసువాఁడు. (వాచ.) అప్రాప్తవ్యవహారుఁ డగుబాలుఁ డని కొందఱు.

కిష్కువు. సం. వి. ఉ. పుం. 1. జేన; 2. ముంజేయి; 3. మూర: 4. నలుపదిరెండంగుళములకొలఁది.

కిసమస. దే. వి. వ్యథ, బాధ. "క. గుసగుసలువోయి పలుపుల, కిసమస లని తెలిసి రసికకిసలయపాణుల్, బిసకిసలకుసుమవిసరము, వెస మసలక తెచ్చి శిశిర విధిమానసలై. విజ. 3, ఆ. 3౭.

కిసరు. దే. వి. (క. కిసరు.) 1. దృష్టిదోషము. "చ. కిసలయపాణి లేఁతనునుఁగెంజిగురాకు మెఱుంగు మోవికిన్, గిసరు దొలంగిపో వలసి కేళి వనాంతరలక్ష్మిబోటియై, మసిఁ జిటిబొట్టు పెట్టె ననుమాడ్కి..." రాజ. చ. ౨, ఆ. ౧౪౪; 2. చూపోపమి, కనుకుట్టు. "క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం, గొసరి జనుల్ వార్ధి నీరు గ్రోలితివీసిర్, పసిసైౖ మాకిమ్మని కన్నిక్కస రుడుగం గావ నప్పగించెడు మాడ్కిన్." ఆము. ౪, ఆ. ౧౭౫.

కిసరుపడు. ద్వ. అ. క్రి. (కిసరు+పడు.) అసూయపడు. "వ...జోడు వీడక క్రొమ్మావులకమ్మని కొమ్మల నిమ్మల ముసరి పసిమి గలకిసలయమ్ములు వొసంగ మెసంగి కిసరుపడక కసరునెడి బిట్టురట్టడి తనంబు లలమి మించి కరాళించుకోయిలల మొత్తంబులును..." భాగ. ౮. స్కం. ౪౪౭.

కిసలము. సం. వి. అ. న. పల్లవము, చిగురు.

కిసలయము. సం. = కిసలము.
కిసాలము. సం. వి. అ. న. కిసలము. "సీ...రసాల కిసాలపటలి..." ఇందు. ౨, ఆ. ౪౨.
కిసాలు. దే. వి. నవ్వుటయం దగుధ్వని కనుకరణము. (బ్రౌ.) మృ. వి. ౧, ఆ. ౯.
కిసించు. దే. అ. క్రి. కృషిచేయు. (బ్రౌ.)
కిసిమిసి. దే. వి. (హిం. కిస్మిస్.) లఘుద్రాక్ష. (వా.) మృ. వి. ౨, ఆ. ౫౪.
కిసుక. వై. వి. (సం. కృషిః.) కృషి, సేద్యము. ఆం. భా. ద్వి. ౨౩౩.
కిస్తీ. హిం. వి. 1. వంతు చొప్పున చెల్లించు ద్రవ్యము; 2. పన్ను చెల్లింపవలసిన కాలము.
కిస్తీబందీ. హిం. వి. వాయిదాలయేర్పాటు.
కిస్మసుపండగ. ఆం. వి. (Christmas=Xmas) క్రీస్తుజన్మ దినోత్సవము.

కీ.

కీచరబాచర. దే. విణ. కలగినది, చెల్లాచెదరైనది. (బ్రౌ.)
కీచు. దే. వి. కోతులు పక్షులు మున్నగునవి చేయు ధ్వని కనుకరణము. "చ...వేదనక్,వనచరకాంత బెట్టులికి నాథునికౌగిలి వాసి కీచుకీచని కడు బమ్మగించుచు..." భో. ౫, ఆ. ౯౪. "కీచు కీచు మనుచు బక్షు లేచి లేచి కూయుచుండె. సప్త. ౭.
కీచుబిల్ల. దే. వి. (కీచు+బిల్ల.) అదిమినపుడు కీచుకీచనునట్లు లోపల విల్లు పెట్టి కట్టినబటువు తలగడ. (శ. ర.)
కీచుబుఱ్ఱ. దే. వి. (కీచు+బుఱ్ఱ.) 1. కీచుబిల్ల. "చ...,గిలకలమంచమున్ విరులు నించిన సెజ్జయు గీచుబుఱ్ఱయున్." రాధికా. ౧, ఆ. ౧౦౪; 2. బాలక్రీడావిశేషము. హంస. 3, ఆ. ౧౪౬. [వా.)
కీచుమను. దే. అ. క్రి. కీచుధ్వనిచేయు. (బ్రౌ.
కీచురాయి. దే. వి. (కీచు+రాయి.) ఝిల్లి, చిమ్మట. (బ్రౌ. వా.)
కీచులాడు. దే. అ. క్రి. (కీచులు+ఆడు.) వాదులాడు, కలహించు. (బ్రౌ. వా.)
కీకటము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. ఒకానొక దేశము.

కీకటుడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బీదవాడు; 2. లోభి, లుబ్ధుడు.
కీకసము. సం. వి. అ. న. ఎముక. పుం. సులిపురుగు. విణ. (అ. ఆ. అ.) కఠినము.
కీచకము. సం. వి. అ. పుం. రంధ్రముల ద్వారమున గాలి పోసికొని మ్రోగువెదురు.
కీటకము. సం. వి. అ. పుం. క్రిమి. విణ. (అ. ఆ. అ.) కఠినము.
కీటమణి. సం. వి. ఇ. పుం. ఖద్యోతము, మిడుగురు బురువు.
కీటము. సం. వి. అ. పుం. పురుగు. విణ. అ. పుం. నీచము. ఉదా:—నృపకీటము. కాశీ. ౪. ౪౪.
కీటు. దే. వి. గోడ పెట్టునపుడు ఒకతడవ పెట్టెడు మట్టిగోడపొడవు. "సీ. కీటు దిద్దెడుచోట గేవల మృగనాభి మనుముద్దసరిసుమ్ము మనుజనాథ." రా. వి. 3, ఆ. ౪౦.
కీడాడు. దే. స. క్రి. (కీడు+ఆడు.) నిందించు,తిట్టు. "మ...నను...నీ విట్టులు కీడాడంగ నర్హుం డవే." భార. కర్ణ. 3, ఆ. ౧౨. స్వా. ౪, ఆ. ౧౯.
కీడు. దే. వి. (క. కేట్. త. కేళ్.) 1. అపకారము. "క. శకుని వినుము సమరమున ప్రాంచుకుమారుల తోడ నెప్పుడుం బగగొని వారికి గీడ రోయు ..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౭; 2. నాశము. "క... ప్రళయంబున కీడునగ,జనకుండగ మీకు రక్ష సలిపితి గరుణన్." భార. ఆర. ౪, ఆ. ౨౩౧; 3. తప్పు. "గీ. కృష్ణకృష్ణ యనంత యే కీడు లేదు,వీరిదెస..." నృసిం. ౪, ఆ. ౧౧౮. 4. పాపము. "సీ. అధ్యాత్మవిధులనే నడగని దురితంబు దానముల్ చేసిన బోనికీడు." వి. పు. 3, ఆ. ౧౩౫. భార. అశ్వ. ౧. ఆ. ౧౫౩; 5. కసటు, మాలిన్యము. "గీ. తామ్రమాదిగ గల యట్టి ధాతుచయము, గొలిమి నిడి యూదు గీడెల్ల బోలియునట్లు."మార్క. 3,ఆ.3౧౫; 6. హాని. "తరువోజ...మీదు పరికింపకున్న గీడ్పాటిల్లకున్నె..." భార. స్త్రీ. ౨, ఆ. ౫౮. కేయూర.3,ఆ.౪౧; 7. చెడ్డపని, పాపకృత్యము. "గీ. అడవి గోవులకై గాల్చుటధ్వరమున, బశువుల జంపుటయును..,కీడులు గావు వత్స."

భార. శాం. ౧, ఆ. ౩౦౨; 8. అశుభము. "క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు కీడు నిచ్చు..." భాగ. ౧౦. స్కం. పూ. ౩౭; 9. అన్యాయ మగుమాట. "చ...ధర్మసుతుండు..., వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు గీడు వల్కునే." భార. ఉద్యో. ౨, ఆ. ౨౪; 10. నష్టము. సా:—కీ డెంచి మే లెంచుము. విశే. 1. తప్పైనది. "వ. కావునఁ గృతము దలంపమి గీడు..." భార. ఉద్యో. ౨. ఆ. ౭౮; 2. చెడ్డది. "ఉ. అక్కట ధర్మనందనుపయోన్యమునం దొక నాఁడుఁ గీడుపల్కొక్కఁడు లేదు..." భార. ఉద్యో. ౨, ఆ. ౬౩; 3. తక్కువది. "గీ... యేమిట నిమ్మహోద్యమంబుఁ గీ డంటే..." భార. ఆశ్వ. ౪, ఆ. ౨౧౮; 4. హానికరము. "ఉ... నీవలనివైరము గీడని చెప్పఁ జెప్పఁ నీ,కౌరవరాజు మానఁడు..." భార. భీష్మ. ౩, ఆ. ౫౩౩; 5. తగనిది. 'గీ. కాన సత్క్షత్త్రియుంనకు భైక్షంబు గీడు." ఆము. ౩, ఆ. ౬౩.

కీడుపడు. ద్వ. అ. క్రి. (కీడు+పడు.) 1. అణఁగు. (చూ. కీడుపఱచు.); 2. కష్టపడు. (చూ. కీడు పాటు.); 3. ఓడు. (చూ. కీడుపాటు.)

కీడుపఱచు. ద్వ. స. క్రి. (కీడుపడుధా. ప్రే.) కీడ్వఱచు. (చూ. కీడ్వఱచు.)

కీడుపాటు. ద్వ. వి. (కీడుపడు. ధా.) 1. కష్టము. "చ. ఇది గడు ముద్దరాలు...ఒకకీడుపాటునకు మోనఁజాలదు..." భార. విరా. 1, ఆ. ౧౦౩. "క...అనిమిషులతుఁ గీడుపాటు నగుచుండుట..." హరి. ఉ.౧౦, ఆ. ౧౪౬.

కీడువడు = కీడుపడు. (తక్కువపడు.) "క. తనను నెడరై నకటి మా,లనికంటెం గీడువడు నలజ్జత నది వ్రాసినయపుడ మఱచి కుజీవుఁడు,నుఁ బట్టపు రాజు నాగ దలఁచు మనమునన్." కేయూర. ౩, ఆ. ౭౮.

కీడుపెట్టు. దే. స. క్రి. (కీడు+పెట్టు.) కీడ్వఱచు, తక్కువచేయు. (చూ. కీడ్వెట్టు.)

కీడ్వడు = కీడుపడు. 1. ఓడిపోవు. "క. బలవంతుల బలములు నగ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్వడు నేతోలఁదులవారికి గర్వము, నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్." భార. ఉద్యో. ౩, ఆ. ౩౦౩. వరాహ. ౬, ఆ. ౪౬; 2. తక్కువ యగు. "క...భీమునకు నం,దొఱుఁ గీడ్వడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్." భార. ఆది. ౫, ఆ. ౧౬౫; 3. అజ్ఞాతముగ నుండు. "ఉ... మత్స్యభూమిభృ,ద్గేహమునందుఁ దేశి యనఁ గీడ్వడి యుండెనొ..." భార. విరా. ౪, ఆ. ౭౬; 4. అసూయ చెందు. "క...మిమ్ముం గొని యాడుట నాతఁడు మనసు గీడ్వడం జింతిల్లున్." భార. శాం. ౧, ఆ. ౧౭; 5. క్రుంగిపోవు. "చ. కినిసితి నేని యుద్ధరణిఁ గీడ్వడఁ ద్రొక్కుదు..." హరి. పూ. ౫, ఆ. ౯౦; 6. దైన్యపడు. "సీ. కృష్ణుఁ దోడుగఁ గొని కీడ్వడి వీరలు వచ్చినఁ జెప్పితి వధవిధంబు." భార. భీష్మ. ౩, ఆ. ౩౯౬.

కీడ్వరించు. దే. స. క్రి. (కీడుపడు. ధా. ప్రే.) కీడు పఱచు, మించు. "క. శరనిధినినాదనిభ మగు, పురఘోషముఁ గీడ్వరించి పొలుపగుఁ గరము,ప్పారి బ్రహ్మపురి మహీసుర, వరవేదాధ్యయనరవ మహార్యం బసఁగుచున్." భార. ఆది. ౮, ఆ. ౭౫.

కీడ్వఱచు = కీడుపఱచు. 1. వశపఱచు. "గీ. ప్రాణభయ మెట్టి వారిఁ గీడ్వఱుపకున్నె." భార. భీష్మ. ౩,ఆ.౫౮; 2.అణఁచుకొను. "క. వెఱపింపఁబోయి వెఱచిన, తెఱఁగునఁదా వేఁడికొనఁ బలికె వెను కొనియెం, నెఱవ వినయల్కు నడుఁ గీ,డ్వఱిచి విజృంభించు విరహపరితాపము చేన్." ప్రభా. ౫, ఆ. ౧౪౨; 3. చెఱచు "చ. చెఱగొని పోయి యాత్మపురిఁ జేర్చి దశాననుఁ డేసరేఁగి కీ,డ్వఱచి చినసీతఁ దెచ్చుకొని..."ఉ. రా. ౬, ఆ. ౨౧౦: 4. తీసివేయు. "సీ. పట్టెనామంబుఁ గీడ్వఱచి నూతనవిభూతిని ద్రిపుండ్రంబులు దీర్పవచ్చు." శుక. ౩, ఆ. ౯౯.

కీడ్పాటు = కీడుపాటు. 1. దైన్యము; "సీ. ఎలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్పు నిడు మని ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప." భార. విరా. ౪, ఆ. ౯౦; 2. హైన్యము. "క...కీడు మెయిఁగొని చేయన్, లోలత్వరహితచాయనుఁ, జాలం గీడ్పాటు వొలయుఁ చందము వచ్చున్." భార. శాం. ౫, ఆ. ౪౧౫; 3. అశుభము. ఆం. భా. ప్ర. ౯౯; 4. అవమానము. "శా...కీడ్పాటున కోర్చి పాఱె..."భార. శల్య. ౨, ఆ. ౨౧; 5.

హాని. "మ. క్రియ గోల్పోయి తపంబు పెద్దఱి కముక్ గీడ్పాటునం బొంది యస్వయమునం గంది...దేవేశు నుపాశ్రయించితిమి..." హరి. ఉ. ౪, ఆ ౭౦.

కీడ్వడు = కీడుపడు. 1. (వశమగు.) "మ...కాలంబుః గర్భి...నాతనికం గీడ్వడి యుండుఁ గావున నధిగత్యంబుక్ సదాకారమున్." హరి. ఉ. ౯. ఆ. ౯౧; 2. (చచ్చు, నశించు.) "శా...మహా, నిర్ఘాతోగ్రంథమూ త్తమాస్త్రనిహతిక్ నీ కేటికిక్ గీడ్వడక్, దీర్ఘక్రోధము మాని మానిని ధరిత్రీ పుత్త్రి నిమ్మా..." రామా. ౭, అ. ౨౦౩.

కీడ్వఱచు. దే. స. క్రి. (కీడ్వడు. ధా. ప్రే.) నశింపఁజేయు; మించు. "ద్వి...సూర్య, కిరణ విస్ఫురణంబుఁ గీడ్వఱచుచును." పండితా. మహిమ. ౯౭ పు. ౯ పం.

కీడ్వెట్టు = కీడుపెట్టు. "సీ. విక్రమక్రమమున విష్వ చ్ఛుతోఁ బ్రతి పెట్టినబలిమిఁ గీడ్వెట్టువాఁడు." దశ. ౧, ఆ. ౭౫.

కీత. దే. విశే. (క. కీతు.) 1. స్వల్పము, తక్కువ. (శ. ర.); 2. నికృష్టము, నీచము. (శ. ర.)

కీతు. దే. వి. కొబ్బరియాకులచాప. (బ్రౌ.)

కీదృక్కు. సం. విశే. (క్) ఎటువంటిది.

కీదృశము. సం. విశే. (అ. ఈ. అ.) ఎటువంటిది.

కీనము. సం. వి. అ. న. మాంసము. (వై. ని.)

కీనాశము. సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. అగ్ని.

కీనాశుఁడు. సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు; 2. యముఁడు. విశే. (అ. ఆ. అ.) 1. దున్నువాఁడు, కర్షకుఁడు; 2. లుబ్ధుఁడు, లోభి; 3. కూలివాఁడు, భృతకుఁడు; 4. రహస్యహంత, చాటుగాఁ జంపువాఁడు; 5. నీచుఁడు, క్షుద్రుఁడు; 6. మేలు మఱచువాఁడు, కృతఘ్నుఁడు.

కీరము. సం. వి. అ. పుం. చిలుక. బ. కాశ్మీరదేశము.

కీరించు. దే. స. క్రి. కీలించు, కట్టు. "సీ. రంగ వల్లులు కప్పురపుముగ్గు పెట్టిరి కీరించి రొగి మాల్య తోరణములు." శివరా. ౨, ఆ. ౫౩.

కీరితి. వై. వి. (సం. కీర్తి.) యశము. "సీ. ఎవని కీరితి కుభృద్ధవకుభృద్ధ...రబుధకరిసైంధవసమిద్ధ హారిణరుచిర, ము..." హంస. ౧, ఆ. ౧౫.

కీర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చిమ్మఁబడినది; 2. కప్పఁబడినది; 3. చెదరినది; 4. నొప్పింపఁబడినది.

కీర్తకుఁడు. సం. విశే. (అ. త్రికా. అ.) కీర్తించువాఁడు.

కీర్తన. సం. వి. ఆ. స్త్రీ. 1. యశము; 2. కథనము.

కీర్తనము. సం. వి. అ. న. 1. యశము; 2. కథనము. "ఆ. ...సురాసురా... కీర్తనము..." భార. అను. 3, ఆ. ౦౪.

కీర్తనీయము. సం. విశే. (అ. ఆ. అ.) స్తవనీయము, స్తుతింపఁదగినది. "సీ. ధన్యుఁడై క్షత్త్రియం దయఁ గాచి బుధలోకకీర్తనీయం బగుకీర్తి వడయుం." భార. ఆది. ౬, ఆ. ౨౯౬.

కీర్తము. సం. విశే. (అ. ఆ. అ.) కీర్తితము, ప్రసిద్ధము. "చ...సనత్కుమారుఁ డని యోగమ కోటియు నన్ను సంప్రకీర్తన మొనరించుఁ బుట్టువు మొదల్ దగ నిట్టి కుమారతాదశం, దన దుటఁ గీర్త మయ్యె నభిధానము నాకు జగత్త్రయంబునన్." హరి. పూ. ౨, ఆ. ౯౬.

కీర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. యశము; 2. అనుగ్రహము. 3. నైర్మల్యము; 4. పంకము; 5. విరివి; 6. దీప్తి; 7. ధ్వని; 8. కథనము.

కీర్తించు. సం. స. క్రి. స్తుతించు. "శా...సగాకర సుతుక్ సర్వజ్ఞుఁ గీర్తించెదన్." హరి. పూ. ౧, ఆ. ౬.

కీర్తితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధము. 2. కథితము; 3. కీర్తము.

కీర్తిశేషము. సం. వి. అ. పుం. మరణము, చావు. (కల్పి.) విశే. (అ. ఆ. అ.) కీర్తియే మిగిలినది— మరణించినది.

కీల. సం. వి. ఆ. స్త్రీ. ప్రభవాదిసంవత్సరములలో నొకటి.

కీలక. సం. వి. అ. పుం. కీల.

కీలకము. ఉభ. దే. వి. కీలు, మర్మము. (శ. ర. వా.) సం. వి. అ. పుం. 1. స్తంభము; 2. రాడు; 3. మంత్రాంగములలో నొకటి. (బీజము, శక్తి, కీలకము అని యివి మూఁడు.)

కీలనచేయు. మి. స. క్రి. (కీలనము+చేయు) కీలించు, ధరించు. "సీ. చిలుపపోఁగులను వ్రేళ్ళుపులఁ గీలన చేసి..." హర. ౫, ఆ. ౫౫. ఉద్భ. ౨, ఆ. ౧౯.

కీలనము. సం. వి. అ. న. కీలించుట, ధారణము.

కీలము. సం. వి. అ. పుం. 1. మంట; 2. మోఁచేయి; 3. మేకు. 4. స్తంభము; 5. చేయి; 6. లేశము.

కీలరము = కీలారము. (చూ. కీలరము సేయు.)

కీలరము సేయు. ద్వి. స. క్రి. (కీలరము+చేయు.) మందగట్టు. "సీ. అమరారితన పేరియచ్చులు వెట్టించి సురధేనుసమితిఁ గీలరము సేసె." కు. సం. ౪, ఆ. ౧౧.

కీలరి. వై. విణ. (కీలు+అరి.) కీలెఱిగినవాఁడు. (శ. ర.)

కీలరు = కీలారము. "ద్వి. కీలరుఁ బోడగాంచి కిని యుంచు దొడ్డి, పలుగాఁడి నిడి..." బస. ౭, ఆ. ౮౧౫ పం.

కీలరువాఁడు. ద్వి. వి. (కీలరు+వాఁడు) పసులకాపరి. "ద్వి. ఏలేశు కేశయ్య కీలరువాఁడో..." పండితా. పురా. ౧౫౬ పు. (ప్రాంతప్రతి.)

కీలారము. వై. వి. (సం. కీలాలకి.) పసులమంద. "గీ. వలఁతి సురభులఁ గీలారములకు నిచ్చె." భీమ. ౫, ఆ. ౮౭. భో. ౬, ఆ. ౩౧౩.

కీలారి. వై. వి. (కీలారము+ఇ) కీలరువాఁడు, పసుల కాపరి. ఆం. భా. ద్వి. ౨౬౧. "సీ. కీలార్లు పెరుఁగుసుం బాల మందలనుండి పడి రేపుమాపుఁ గాపడులఁ జేర." చంద్ర. ౨, ఆ. ౧౧౫.

కీలారితనము. వై. వి. (కీలారి+తనము.) పశుపాలకత్వము. "క. కీలారితనమునకు నేఁ, జాలుదు ..." భార. విరా. ౧, ఆ. ౧౦౦. ("గోసంఖ్యాతా భవిష్యామి విరాటస్యమహీపతేః." అని మూలము.)

కీలాలము. సం. వి. అ. పుం. పశువు. (కల్ప.) న. 1. అన్నము; 2. అమృతము; 3. నీరు; 4. నెత్తురు.

కీలి. సం. విణ. (న్. సి. న్.) 1. కీలించువాఁడు; 2. జ్వలించువాఁడు. (అగ్ని.)

కీలించు. ఉభ. వై. స. క్రి. 1. ఉంచు, పెట్టు. ఆం. భా. తృ. ౧౩౦; 2. కూర్చు; ధరింపఁజేయు. "సీ. ముత్యాల పేరులు మొగపుఁదీఁగెయు బన్న సరములు గీలించె జాణ యొత్తు." య. ౪, ఆ. ౯౦. సం. స. క్రి. 1. తగులు. (శ. ర.); 2. కట్టుకొను. "మ. కుర్కురతమారయుగళంబును... కేలఁ గీలించి..." పాండు. ౩, ఆ. ౯౯; 3. కదియించు. "మ...చరణద్వంద్వంబుఁ గీలించి..." భాగ. ౧౦ స్కం. పూ. ౬౩౭; 4. ప్రయోగించు; మీఁదఁబడవేయు. "శా. మాలిం జంపిన మాల్యవంతుఁడు... ఉన్నీలజ్వాలకరాళశక్తిఁ గొని మేమే తాఁకి పక్షస్థలిం, గీలించెకా జలదంబుపై మెఱుఁగుమాడ్కిన్ శోభిల్లె జెన్నుగాన్." నిర్వ. ౩, ఆ. ౭౮.

కీలితము. సం. వి. అ. న. బంధము. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; 2. మేకులు మొ. వానితో బిగింపఁబడినది; 3. కీలుతవేయఁబడినది; 4. నాఁటఁబడినది.

కీలు. దే. వి. (క. కీలు. త. కీల్.) 1. సంధి, అతుకు. "క. కీ లెడపినజంత్రముక్రియ, నేలపయిం బడియె మేదినీతనయ పెసన్." నిర్వ. ౯, ఆ. ౧౭; 2. మర్మస్థానము. "సీ. తేనె మావులఁ దెగటార్చి మఱి యంను నెఱి. గీలు నో నేయ..." అచ్చ. యు. ౩౧౭; 3. మర్మము. "క. ఈకీ లెఱుఁగంగపలచె హృదయములోనన్." నైష. ౩, ఆ. ౧౩౯; 4. కపటచేష్ట. ఆం. శ. ౫౫; 5. సీల. "క...కీలు జరగిన నచ్చోటన పడియె నొక్కయుండియు ..." పళ. ౧౦. ఆ. ౧౫౯; ౧౬౩; 6. మర, యంత్రము. "మ. ఒకమాణిక్యము బొమ్మ యొట్టి వగకీలున్ జాళువాజాలవల్లిక బాగాల్ కపురంపు టాకుమడుపుల్ ...అందియ నతండు...కైకొనియె..." విజ. ౧. ఆ. ౧౦౬; 7. ఉపాయము. "క...ఏకీలున నెవ్వరు నెఱుఁగం, జాలనియెడ దాఁచి..." కేయూర. ౩, ఆ. ౧౮౬; 8. విధము. "ఉ. కిన్నరకంఠి యొట్టిడినకీలున గాశిపురంబునందు భిక్షాన్నము లేదు..." కాశీ. ౭, ఆ. ౧౭౯; 9. ముడి. "గీ. ఒకత వలువకీ లెడలించి యొత్తుకడకుఁ, గొనుచుఁ బోయి..." హరి. పూ. ౮, ఆ. ౩౨; 10. తారు, మ్రానుమొ. వానిపైఁ గాయుద్రవ్యవిశేషము. (శ. ర.) విణ. కృత్రిమము, కపటము. "ఉ. కీలెలుఁగుల్ ఘటించి పరికింపక పందుకయుండి..." హంస. ౪, ఆ. ౨౩౪.

కీలుఁగొప్పు. దే. వి. (కీలు+కొప్పు.) జాఱుముడి గల కొప్పు. వదులుగా ముడివేసిన కొప్పు. "సీ. కీలుఁ

గొప్పునఁ బైఁడిగేదంగిరేకులు గొనలు గానం గ రాఁ గుదురుపఱిచి." నైష. ౮, ఆ. ౧౧౨.

కీలుకత్తి. ద్వ. వి. (కీలు+కత్తి.) మరకత్తి, మడకత్తి. (బ్రౌ.)

కీలుకాఁడు. దే. వి. (కీలు+కాఁడు.) యంత్రగాఁడు, మరత్రిప్పువాఁడు. "సీ. కీలుకాఁ డెడలింపఁ గెడ సినబొమ్మలకైవడి..." భాగ. ద్రో. 3, ఆ. ౬౨.

కీలుకొను. దే. అ. క్రి. (కీలు+కొను.) 1. అంటు కొను. "క...కర్మలేపముఁ దనతోఁ, గీలుకొననీక వెలుఁగుని, రాలంబనబోధఘనుఁడు..." భార. శాం. ౪, ఆ. 3౧౮. శివరా. ౧, ఆ. ౬౧; 2. నాఁటుకొను. "గీ. బాహ్యమునఁ గొంత కొంత యభ్యంతరమునఁ, గీలుకొనియున్న మదన బాణాళివోలె." నైష. ౬, ఆ. ౫; 3. ఉండు. "గీ. నృపతిచేతికి మీఁదుగా నెలఁతచేయి, గీలుకొనఁ జేసె నొక పేరఁటాలవడఁతి." నైష. ౬, ఆ. ౯౦.

కీలుకొలుపు. దే. స. క్రి. (కీలుకొను. ధా. ప్రే.) 1. నాఁటుకొనఁజేయు. "క. వాఁడికతూఁపులు పేనం, గీలుకొలిపి..." భార. కర్ణ. ౨, ఆ. ౨౮౮; 2. వహించు. "సీ...కేలముష్మైనవాలుఁ గీలుకొలిపి." నీలా. ౧, ఆ. ౧3; 3. బంధించు, "ఆ...కేలు దనదు కేలఁ, గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁడు..." భార. విరా. ౨, ఆ. ౪౫.

కీలుకొల్పు = కీలుకొలుపు. 1. లగ్నముచేయు. "శా...కౌతుకవరితాళకజాలంబులన్, బాలా రత్నము కీలుకొల్పె ముద మొప్పన్ విశ్వభూపాలుపై." కావ్యా. ౪. ఆ. ౫౭. "గీ...యౌవన లీలావికాసహాస, హేలనాదులఁ జిత్తంబుఁ గీలుకొల్పి. భాగ. ౫ స్కం. ౧, ఆ. ౧౭; 2. పెట్టుకొను, ధరించు. "చ...మేఖలా, వలయము గీలుకొల్ప నుఱవన్..." రామా. ౪, ఆ. ౧౪౮; 3. కూర్చు. "గీ...దాడిమబీజశంకను గరాగ్ర, కేళికాకీరముఖమునన్ గీలుగొల్పె." రామా. ౮, ఆ. ౧౪౯; 4. నిలుపు. "గీ. మ్రోల నుసురాజు ఋతురాజుఁ గీలుకొల్పి." వసు. 3, ఆ. ౧౬౯; 5. "వ...త్రిశూలంబు కేలం గీలుకొల్పి." భీమ. ౪, ఆ. ౮; 6. అమర్చు. "సీ. నీలికాసెలమీఁదఁ గీలుకొల్పినయట్టి నెలవంకకత్తులతళుకు లెసఁగ." చిత్రభా. 3, ఆ. ౧౨౭.

కీలుగంటు. దే. వి. (కీలు+గంటు.) జాఱుముడి "చ...కేశపాశము తడి యొత్తికొంచుఁ గటి సాధి నటింపఁగఁ గీలుగంటు లంబముగ నటింప ..." కాళ. ౪, ఆ. ౧౧౯. "సీ. కీలుగం టిడి యేల బోలఁగా నునుఁగొప్పుఁ గీల్కొల్పుకొమ్ము ..." శుక. ౨, ఆ. ౪౫౬.

కీలుచు. దే. స. క్రి. 1. కలించు, 2. ధరించు. (చూ. కీల్చు.)

కీలుజడ. ద్వ. వి. (కీలు+జడ.) వాలుజడ. "చ...కీలుజడఁ గొసి నివాళి యొనర్పును..." శుక. ౨, ఆ. ౨3౨.

కీలుబొమ్మ = కీల్బొమ్మ. దే. వి. (కీలు+బొమ్మ.) మరబొమ్మ. "చ. తెలిగలతాలికంబములఁ దీరిన బంగరుకీలుబొమ్మ..." ఉ. రా. ౧, ఆ. 3౧౭.

కీలుబొమ్మరము. దే. వి. (కీలు+బొమ్మరము.) మరబొంగరము. (చూ. కీల్బొమ్మరము.)

కీలుమలఁగు. దే. అ. క్రి. (కీలు+మలఁగు.) వెను దిరుగు. "వ...ఆమృగకల్లజంబు...అప్పురుష వతంసుహంసరథ చండచండం బగువాలంబుసం గీలుమలంగి కొట్టుటయు..." సాంబో. 3, ఆ. ౭౯.

కీలుముడి = కీలుగంటు. (చూ. కీల్ముడి.)

కీల్కొను = కీలుకొను. 1. అంటికొను. "చ...చంచువునఁ గీల్కొనుచిల్వ ఖలీనమై చగన్." దశా. ౨, ఆ. ౧౭౪; 2. అతుకుకొను. "ఆ. ధరణిఁ బడ్డ తునుక తనుదాసెఁ గీల్కొన్న విధము..." వరాహా. ౧౨, ఆ. ౨౯; 3. ముడివడు; ముడుచుకొను. "చ. జనితరతిత్వరం జెలఁలసన్నిధిఁ బయ్యెద యంటుఝర్ర్తవైఁ, గినిసి యదల్పుమై బొమలు గీల్కొనఁ జేసి..." శుక. ౪, ఆ. ౧౭౬.

కీల్కొలుపు. దే. స. క్రి. (కీల్కొను ధా. ప్రే.) నిలుపు, ఉంచుకొను. "చ. గురువుల నాత్మఁ గీల్కొలిపి..." వరాహా. ౭, ఆ. ౯౫.

కీల్కొల్పు. దే. స. క్రి. (కీల్కొను ధా. ప్రే.) 1. ఘటించు, కూర్చు. "సీ. కీలుగం టిడి యేల పోలఁగా నునుఁగొప్పుఁ గీల్కొల్పుకొ మ్మంచు గీజుపోరు." శుక. ౨, ఆ. ౪౫౬; 2. కలుగఁ జేయు, పొందించు. "శా. కీ డొక్కింతయుఁ

జెందనిక ప్రియమున్ గీల్కొల్పుచున్..." హరి. పూ. ౭, ఆ. ౨౪౦.

కీల్గంటు = కీలుగంటు. "సీ. వాల్గంటికీల్గంటు వైచి వచ్చినచెల్వ జడ యల్లుకొనునాఁటిసౌరుఁ జూరు." విజ. 3, ఆ ౧౩.

కీల్గొప్పు = కీలుగొప్పు. "గీ. శ్రవణకస్తూరముకుళంబు జాఱకుండ విరులకీల్గొప్పు వదలి పైపెక్కకుండ, నెత్తి శృంగారకందుకం బెత్తినట్లు, కైటభారాతి ముంగర ర్మొగరంబు." సారం. ౬, ఆ. ౪౬. నిఘ. ౨౫.

కీల్చు = కీలుచు. "సీ. చిఱుత కెంజెడలఁ గీల్చిన జాతి పటికంబు గళమున రుద్రాక్షకంఠమాల." వేం. పంచ. ౪, ఆ. ౧౧౧.

కీల్జడ = కీలుజడ. "సీ. శ్రీరుక్మిణికి మకరికలు చెక్కుల వ్రాసి సత్యకీల్జడకుఁ బూసరులు సుట్టి." ఉ. రా. షితి. ౪౪.

కీల్బొమ్మ = కీలుబొమ్మ. "సీ. హరినీలమణి మనోహర మంజిర స్తంభముల వినోదించుకీల్బొమ్మ వోలె." ఉ. హరి. ౨, ఆ. ౭3.

కీల్బొమ్మరము = కీలుబొమ్మరము. "సీ. కీల్బొమ్మరము జాతె గిఱ్ఱునఁ ద్రిమ్మరు తెఱఁగున..." ప్రబంధ. ౧౦౯.

కీల్మడి = కీలుమడి. సాం. ని. మాన. ౧౦.

కీవాడ. దే. వి. ఊరుచుట్టునుండుపాటిబొలము. (ఆం. పద.)

కీశపర్ణము. సం. వి. అ. పుం. ఉత్తరేను.

కీశపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేను.

కీశము. సం. వి. అ. పుం. కోఁతి. విణ. (అ. ఆ. అ.) నగ్నము, దిసమొలది.

కీశవల్లి. సం = కీశపర్ణి.

కీస. దే. విణ. (క. కీసు.) తక్కువ, అల్పము. (చూ. కీసవెలితి.) అవ్య. కొంచెము, కించిత్తు. "గీ...సంధ్య వార్చని బ్రాహ్మణుండు, కీస తక్కువశూద్రుండు కేవలంబు" కాశీ. ౫, ఆ. ౨౧౪.

కీసర. దే. వి. తిత్తిమొ. వానిలోపలిపొర. 'చ... మొలఁద్రాసును గీసరయుండులిత్తి...' వాంస. ౪, ఆ. ౧౫౬. విణ. అల్పము. (కీసరపాలు మొ. శ. ర.)

కీసవెలితి. దే. విణ. (కీస+వెలితి) 1. కొంచెము తక్కువది. "గీ. రత్నపుర మని గల దొకరాజధాని, కిన్నరాధీశునగరికిఁ గీసవెలితి." శివరా. ౨, ఆ. 3; 2. కొంచెము తక్కువవాఁడు. "గీ. ఇతనిపుణ్యాం బగణ్య మిం కితనితోడ, వాసవుఁడు గాఁడు ప్రతివాని గీసవెలితి, తమ్ముఁ డతనికి శార్ఙ్గి యాతనిస[illegible] [illegible]యు, దగుట నెగడ[illegible] దమ్ముఁడే [illegible] యుధుగులు." రామా. 3, ఆ. ౧3౮.

కీసవెల్తి=కీసవెలితి. (కొంచెము తక్కువది) "గీ. ఇపుడు ఘటికాద్వయం బయ్యె నినుఁడు పొడిచి, దప్ప జాల దివ్యోష్టికి వత్తువాటె, కేవలము మంచినడ కైనఁ గీసవెల్తి, రెండుజాములు నిట నూరకుండ నేల." భీమ. 3, ఆ. ౪౬.

## కు

కు. = కి. 1. సంబంధసామాన్యమును సంబంధవిశేషమును దెలుపును. "శా నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి..." భాగ. ౭, స్కం. 3౦. "ఉ. ధన్యుల కానుభద్రకు శతక్రతుపుత్త్రున కుద్భవించె న,మ్మాన్యయశుండు పుత్త్రుఁ డభిమన్యుఁడు..." భార. ఆది. ౮, ఆ. ౨౪౪; 2. ఇది ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, సప్తమ్యర్థముల నిచ్చును. "గ. చిరముగ బ్రహ్మాసం దపను సేసి..." భాగ. ఆది. ౨, ఆ. ౧౨౮. "క. శాంతనవుఁడు భీష్ముఁడు...,అంతకతనూజునకు... ఇట్లనియెన్." భార. సభా. ౨, ఆ. 3. "చ. పరువిభురాజసూజయమునకున్ ధన మిచ్చిరి రాజు లెల్ల..." భార. సభా. ౧, ఆ. ౧౬౨. "క. పితృపూజ సమగ్ర్యము దైవతపూజనమునకు..." భార. అను. 3, ఆ. ౧౫౭. "చ...కోమలి నీ కనురక్త..." భార. అర. ౨, ఆ. ౨౧౬; 3. మీఁద. "క...నాసుతునకు సుశ్లోకా యలుగం దగునే..." భార. శాం. ౫, ఆ. ౪౭౪; 4. మాఱు, బదులు. "చ...మది కిష్ట మైనయది గోరుము గోవునకు..." భార. అను. ౨, ఆ. ౪౨౮; 5. ఇది దేశకాలాదులయవధిని దెల్పును. "క...వి, డెనిమిది దివసములకు నిలు, సనుదెంచున్..." భార. శాం. ౬, ఆ, ౫౬౬. సం. అవ్య. 1. వృత్తియందును పాపనిందాల్పాద్యర్థముల

నిచ్చును. ఉదా:—కుజనుఁడు, కుతర్కము, కుగ్రామము మొ.; 2. ఒకానొకప్పుడు దీనికి కదాదేశము వచ్చును: ఉదా:—కదశ్వము, కదుష్ణము మొ.; 3. మఱియొక్కొక్కప్పుడు దీనికి కాకవాదేశము నగును: ఉదా.—కాపురుషుఁడు, కాపథము మొ. వి. ఈ. స్త్రీ. భూమి. (దీనికిఁ దెలుఁగున వ్యస్తప్రయోగము కానరాదు. ఉదా:—కుధరము, కుజము, కుతలము మొ.)

కుంక. దే. వి. 1. బాలవిధవ. (శ. ర.); 2. విధవ. సాం. ని. మాన. ౩౪; 3. అల్పార్థకము. ఉదా:—కుఱ్ఱకుంక. మొ.

కుంకటి = కూఁకటి. వి. 1. జుట్టు. (శ. ర.) 2. పిల్ల జుట్టు. (శ. ర.) విణ. ప్రధానము. (శ. ర.)

కుంకటివేరు=కూఁకటివేరు. (తల్లి వేరు.) (ఆం. పద.)

కుంకట్లు. దే. వి. బ. ముంగురులు. (ఆం. పద.)

కుంకముండ. దే. వి. (కుంక+ముండ.) బాలవితంతువు "ఉత్సాహ. కన్నవారివంకవారిఁ గానఁ బ్రాణనాథుఁడున్, మున్నె చచ్చె నేను కుంకముండ నెట్టు లేఁగుదున్." వేం. పంచ. ౪, ఆ. ౪౪.

కుంకుడు. దే. వి. ఫేనిలము. ఆం. భా. ద్వి. ౪౪.

కుంకుడుఁబురుగు. దే. వి. ఒకానొకయెఱ్ఱపురుగు. (శ. ర. బ్రా.)

కుంకుడుపండు. దే. వి. (కుంకుడు+పండు.) ముదిరి యెండినకుంకుడుకాయ. (వీనిపులుసుతోఁ దల రుద్దుకొందురు.) "గీ. గగనలక్ష్మినిజోరు నక్షత్రమాలి, కలు వియన్నదిజలములఁ గడుఁగఁ బిసుక, నెఱయుకుంకుడుపండులనుర వనంగఁ, బలపలని పాండురాంబుదపఙ్క్తు లమరె." ఆము. ౪, ఆ. ౧౫౭.

కుంకుమ. వై. వి. (సం. కుంకుమమ్. క. కుంకుమ. త. కుంకుమం.) 1. ఘుసృణము, ఒకానొకలేపన ద్రవ్యము. ఆం. భా. ద్వి. ౧౬౦. "ఉ. గుబ్బలి పట్టి గబ్బవలిగుబ్బల జొబ్బలుతావికుంకుమన్, గబ్బికొనంగఁ జాలునెద..." దశా. ౨, ఆ. ౬౯. నరస. ౨, ఆ. ౧౩; 2. ముఖమున బొట్టుపెట్టుకొనునొకానొకరాగద్రవ్యము. (చూ. కుంకుమ.)

కుంకుమపువ్వు. వై. వి. (కుంకుమ+పువ్వు.) కుంకుమము. "ఉ. కుంకుమపువ్వునుం బుఱుఁగు గొజ్జఁగనీరు..." నైష. ౭, ఆ. ౧౧.

కుంకుమపూవు = కుంకుమపువ్వు. ఆం. భా. ద్వి. ౧౬౧ దశా. ౧, ఆ. ౧౪.

కుంకుమము. సం. వి. అ. న. కుంకుమపువ్వు.

కుంకుమరేక. వై. వి. (కుంకుమ+రేక) ఆభరణవిశేషము. (ఆం. పద.)

కుంకుమి. సం. వి. ఈ. స్త్రీ. మహాజ్యోతిష్మతి. (దీనిరంగు కుంకుమరంగు.)

కుంకుము = కుంకుమ. (శ. ర. వా.) ముఖమున బొట్టు పెట్టుకొనుట కుపయోగించు నొకానొకరాగ ద్రవ్యము. "మ. పురసౌధోన్నతకేతుమట్టువల నంభోజారిపద్మాప్తులం, బిరవై కప్పు దలిర్పఁ బద్మవదనల్ హేలాగతిన్ మిత్రుఁడంచు రవిన్ గుంకుమ నింపఁగా..." చంద్రా. ౧, ఆ. ౧౭.

కుంగు = క్రుంగు. (చూ. కుంచు.)

కుంచనము. సం. వి. అ. న. 1. సంకోచము; 2. వంకర; 3. నేత్రరోగభేదము.

కుంచఫల. సం. వి. ఆ. స్త్రీ. గుమ్మడి.

కుంచిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కుంచెకోల; 2. గుంజ. 3. నల్లజీలకఱ్ఱ; 4. ఎఱ్ఱ; 5. వెదురుకొమ్మ; 6. మెంతి; 7. తూలిక. (కే. ని.)

కుంచితము. సం. వి. అ. న. నందివర్ధనపుష్పము. విణ. (అ. ఆ, అ.) 1. వంకరైనది; 2. ముడుఁతలు పడినది; 3. ముడిఁగియున్నది.

కుంచియ. వై. వి. 1. (సం. గుచ్ఛః.) కుచ్చు. (చూ. కుంచె.); 2. (సం. కుంచికా. ప్రా. కుంచిఅ) చామరము. "చ. అతులితభక్తిఁ బూర్వదిశయందు ననుగ్రహ యన్ వధూటి దాఁ, గుతుకము మీఱఁగాఁ బసిఁడికుంచియ వైచుచుఁ గొల్వు సేయఁ..." కళా. ౮, ఆ. ౨౩౦; 3. ఈఁగలు తోలుకొనుసాధనము. "ద్వి. పొలసుకై జుమ్మని పొలయుమక్షికలఁ, గుంచియతోఁ జోఁపుకొనుచు..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౬౯ పం. 4. గోడకు సున్నము కొట్టెడుకుట్ట. (శ. ర.)

కుంచె = కుంచియ. 1. (సం. గుచ్ఛః. క. కుంచ. త. కుంజం.) కుచ్చు. "గీ. పీలికుంచెతలాటంబు..." స్వా. ౪, ఆ. ౨౮. పారి. ౧, ఆ. ౨౪; 2.

(సం. కుంచికా.) సుత్తిగాఁ గట్టిన నెమలిపురికట్ట. "చ...కనకకుంచెయుఁ గృష్ణసృగాజినంబురుక్, బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్." భార. సభా. ౨, ఆ. ౩౧. ఆం. భా. ద్వి. ౨౯౬. హంస. ౧. ఆ. ౨౨౦; 3. సాలెవాఁడు పడుగు సరి చేసెడు సాధనము. "సీ. ఆసుపోసెడు దాని హ స్తంబురీతిని గుంచెవేసెడు దానికొమరు మిగుల." హంస. ౧, ఆ. ౨౨౦. 4. చిత్తరువు వ్రాయు తూలిక. (శ. ర.); 5. కుచ్చెట్ట పెట్టినవస్త్రము. "ద్వి. స్థిరచిదానందసపీఠిక బోలుకుంచె, కుతి యొకభుజమున మార్చలయఁగ. విష్ణు. ఉ. ౫, ఆ. (శ. ర.) 6. గోడకు సున్నము గొట్టునుట్ట. (శ. ర.); 7. చామరము. "సీ. జాలపాదము నంఘ్రిఁ గీలితం బనుసితాబ్జముభాతిఁ గుంచె హస్తమున వ్రేల." పాండు. ౨, ఆ. ౧౭౨.

కుంచెకోల. ద్వ. వి. (కుంచె+కోల.) 1. కుంచిక, తలుపుతోపలిగడియ తీయుటకు వేయుటకు నుపయోగించువంకర గలయినుపకోల. "ఆ. కౌడవ లసెను కుంచెకోలచే పక్షికి. పాట మిపుడు తెఱచి..." చెన్న. ౩. ఆ. ౪౩౬. "సీ. ఏదేవుకనుకోయి కాకుధామపుటింటి కుటికాక చాటంబుకుంచెకోల. గౌ. వి. ౧. ఆ. ౨౪; 2. ఒకరకపుబాణసంచు. "సీ. కోదసీ సరసీజాతపాదపద్మ, కుముదరూప ములై కుంచెకోలకములు, చెలఁగ...బహుచిత్ర బాణవైభవము గనుచు. ప్రబంధ. ౭౭.

కుంచెము. దే. వి. (త. కుంజం) నాలుగుమానికముల ప్రమాణము గలకొలతపాత్ర, ప్రస్థము. ఆం. భా. ద్వి. ౨౭౦. "క. విను మొకకుంచెడు ధాన్యము, దన కాయతి గల్గునతఁడు దాని నొసఁగినన్, ధనకోటి గల్గు..." భార. అను. ౫, ఆ. ౨౧౧.

కుంచు = కుంచు. దే. స. క్రి. (కుంగు. ధా.) 1. కుంగఁజేయు, వంచు. "ఉ. కొంచెముగా నిజాంగజము కుంచి ధరిత్రికి నంతయంత లం,ఘించి తేచుదంతిఁ బరికించుచు జనంబులు..." కవిక. ౨, ఆ. ౧౦౧; 2. తగ్గించు, కొంచెపఱచు. "సీ. కులగోత్రములవారిచెలువుఁ గుంచఁ డొకింత ప్రాజ్యసామ్రాజ్యభారము వహించి." పెద. శతం. ౧, ఆ. ౧౩. నిరం. ౪, ఆ. ౩౫. 3. అపహసించు మించు. "ఉ. లంచముఁ బట్టనం చలబలంగము చే నడలంగ బంగరుం, గొంచెముగాని మేనితళుకుల్ బెళుకుల్ బచరించుఁ జూపులున్, మించులఁ గుంచు మోమురజనీవిటు గుప్పునఁ దప్పు..." రా. వి. ౪, ఆ. ౯౦.

కుంజము. సం. వి. అ. పుం. న. 1. పొదరిల్లు; 2. ఏనుఁగుగండస్థలము; 3. ఏనుఁగుకొమ్ము.

కుంజరము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2, వెండ్రుక; 3. హస్తనక్షత్రము. విణ. అ. పుం. శ్రేష్ఠము. (ఈయర్థమున నీశబ్దము సమాసోత్తర పదముగానే యుండును. ఉదా:—నృపకుంజ రము మొ.)

కుంజరాశనము. సం. వి. అ. పుం. అశ్వత్థము, రావి చె.

కుంజరి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు.

కుంజలము. సం. వి. అ. న. కాంజకము, పులిసినకడుగు.

కుంట. వై. వి. (సం. కుండమ్. క. కుంటె. త. కుంటం.) 1. గుంట, అల్పతటాకము. ఆం. భా. ప్ర. ౧౬౨. "ఉ...ఎందు మం,దాకిని నిర్ఝరాకృతి వుదారగతిం జనునొందు బెల్ల ర,త్నాకరుఁ బొందఁ గాక యహహా చన నేర్చునె చొటి కుంటకున్." స. శతం. ౩, ఆ. ౭౪; 2. కొలను; చెఱువు. "ఆ. ఇంట నుండఁ గూడ దిప్పుడ కాని చని, గుంటనైనఁ బెద్దకుంటనైనఁ, బెంటనైన వైచి యింటికి నరుగుదెం, దనఁగ..." వేం. పంచ. ౫, ఆ. ౪౨; 3. భూపరిమాణవిశేషము. (శ. ర. బ్రౌ.)

కుంటగించు. దే. అ. క్రి. ఆఁగు, నిలుచు. (బ్రౌ.)

కుంటదూలము. దే. వి. కడదూలమునకును గోడకును నడ్డముగా నుంచుచిన్నదూలము. (శ. ర. దీనిని గుంటదూల మనియు నందు రని శ. ర.)

కుంటముక్కు. దే. వి. మత్స్యవిశేషము, ఒకరకపుఁ జేప. "సీ...గొరకమాపురమును గుంటముక్కు ...గీ...అది యగుమీలఁ బట్టు నతఁడు." హంస. ౪, ఆ. ౨౪౦.

కుంటి. వై. విణ. (సం. కుంఠ్. క. కుంటు. కుంటుధా.) 1. కుంటు, కాలు విఱిగినవాఁడు. ఆం. భా. ద్వి. ౧౨౨. "చ. అలుఁగుల మ్రంది యంపుల మృగావలియున్ విహగంబులున్ భయా, కులగతిఁ

బొంది మూఁగలును గుంటులుఁ జీకులు నైనయట్టు లై." భార. అర. ౧, ఆ. ౨౦౧; 2. కాలు లేని వాఁడు. "గీ...తానేల యకుగుదెంచుఁ, గుంటి సారథితో నల్లకుముదవై రి."నరస. ౫, ఆ. ౧౭౯; 3. విఱిగినది. "గీ. కుంటికా లొండుధర్మవృకుంటు మాన్ప." కవి. ౧, ఆ. ౬౦.

కుంటికుదుపు. ద్వ. విణ. (కుంటి+కుదుపు.) "గీ...అద్దివారోదాసునాజ్ఞ, గొందిసందిని నొకకుంటికుదుపుఁ జేవ, యనదబూతంబు నుండనీరై రి భటులు." కాశీ. ౫, ఆ. ౨౮౭. "గీ. కుంటికుదుపు లశక్తులు కుష్ఠరోగు.లు..."భీమ. ౫, ఆ. ౨౧. ("అశక్తాః ...పంగవోంధాశ్చ కుష్ఠినః" అని మూలము.)

కుంటిగడపరి. ద్వ. వి. (కుంటి+కడపరి) అనూరుఁడు. "గీ...జగజంత వేల్పు, కుంటిగడపరి యొకబండి కంటి తేరు, గడప రిక్కలతెరువున నడవఁ దొడఁగె." కాళిందీ. ౨, ఆ. ౧౪౬.

కుంటిగాము. వై. వి. (కుంటి+గాము.) శనిగ్రహము. (శ. ర.)

కుంటితనము. ద్వ. వి. (కుంటి+తనము.) పాదవైకల్యము. "చ. కులవసుధావరావలికిఁ గుంటితనం బొదవించె..."పారి. ౪, ఆ. ౩౩.

కుంటు. వై. వి. (సం. కుంఠీ. క. కుంటు.) 1. పాదవికలతచే పాద మూని యూనక నడచు. (వా.); 2. నశించు, పోవు. "చ...త్రప గెంటె నయంబు భయంబు గుంటె గా,సిలె బిగి..."చంద్రా. ౪, ఆ. ౧౮౦. వి. కుంటితనము. "గీ. కుంటికా లొండుధర్మవుకుంటు మాన్ప." కవి. ౧, ఆ. ౬౦. దశా. ౮, అ. ౭౦. విణ. కాలు విఱిగినవాఁడు. "క...కుటిలాలక న.కుక్కుంటునకు నిత్తురఁట..." భో. ౫, ఆ. ౨౩౧; 2. కాలు లేనివాఁడు. "గీ. కుంటు వినతామహాదేవిఁ గొడుకుఁగుఱ్ఱ." కాశీ. ౧, ఆ. ౧౨౧.

కుంటుగించు. వై. అ. క్రి. కుంటు. (శ. ర.)

కుంటుపడు. వై. అ. క్రి. (కుంటు+పడు.) 1. చెడు, భగ్నమగు. "మ...నిర్భాగ్యురా,ల పవిత్రం బగు పార్వణంబు నవలీలం బెంటపై వైచి కుం,టుపడం జేసితి శ్రాద్ధకర్మము..."జై. ౪, ఆ. ౧౦౧; 2. తగ్గు, కఠినమగు. "క. తొంటినడ గుంటువడినన్. బంటుతనము గుంటుపడక..."రామా.౮, ఆ.౧౫౫.

కుంటుపఱుచు. వై. స. క్రి. (కుంటుపడు-ధా. ప్రే.) చెఱచు, పాడుచేయు. "సీ...పెనుఁగొండ సాధించెఁ గోవెలనెల్లూరు గుంటువఱిచె."వరాహ. ౧, ఆ. ౩౦.

కుంటుపిచ్చుక. ద్వ. విణ. (కుంటు+పిచ్చుక.) పిచ్చుకుంటు, పంగువు. "సీ. తాపన నెద్దియాధారనూ దివిఁ బ్రాఁకుపితృవర్యులకుఁ గుంటుపిచ్చు కలకు." పాండు. ౫, ఆ. ౨౬౧.

కుంటువడు. వై. అ. క్రి. (కుంటు+పడు.) 1. కుంటియగు; చెడు. "క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁగినగోవృష్, దొరయుచు నందొకఁ డెడలిన,నరవర సద్ధర్మవర్తనము గుంటువడున్." భార. అను. ౪, ఆ. ౨౮౫; 2. మందగించు. "క. తొంటినడ గుంటువడినన్, బంటుతనము గుంటువడక పరుషధ్వనితో, మింటికి నిమ్ముగ నంగటి, గుంటవనుక నోరు దెఱచికొని యుంన్మఖుఁడై."రామా. ౮, ఆ. ౧౫౫; 3. ఆఁగు. "వ...ఉప్పరం బెగసి జగదండ కర్పరంబునఁ గుంటువడి మగుడువేగం బడరఁ బుడమికి డిగి నలుగడల వెల్లివిరిసి..."చం. రా. ౩, ఆ. ౨౫; 4. తెగిపడు. "గీ. ఘనభుజుండు సుమిత్రానందనుఁడు జిష్ణుఁ, దరిఁ గరము గుంటువడ నేయ..." రాఘవ. ౪, ఆ. ౧౬౯.

కుంటువాఱు. ద్వ. అ. క్రి. (కుంటు+పాఱు.) బలహీనమగు. "సీ. గుదియ చేకొనెఁ దద్ద గుంటువాఱి జముండు..." అచ్చ. బాల. ౬౮.

కుంటెన. వై. విణ. (సం. కుట్టనీ.) నాయికానాయకులను గూర్చువాఁడు; కూర్చునది. (చూ. కుంటెనకాఁడు, కుంటెనకత్తె.) వి. నాయికానాయకులఁ గూర్చుపని. "చ...అబ్ధికిం, గలయికకుంటెనల్ నడుపఁగాఁ బని పూనినయాకపాలకుం, డల శివుఁ డిచ్చుఁ గావుతఁ జిరాయువు..." కువల. ౧, ఆ. ౩. శుక. ౩, ఆ. ౪౦౯.

కుంటెనకత్తియ. వై. వి. (కుంటెన+కత్తియ.) తార్పునట్టిస్త్రీ. ఆం. భా. ద్వి. ౧౧౦.

కుంటెనకత్తె = కుంటెనకత్తియ. (శ. ర.)

కుంటెనకాఁడు. వై. విణ. (కుంటెన+కాఁడు.) తార్పువాఁడు. "సీ. సిగ్గింతయును లేక చెల్లెలికై తాను కుంటెనకాఁడైనకొంటెయొకఁడు." కలు.శ. ౮౩.

కుంటెనకానితనము = కుంటెనతనము. "క. మనసిజుఁ డిద్దఱకును గుంటెనకానితనంబు చేసెడిన్..." విక్ర. ౭, ఆ. ౫౪.

కుంటెనకుచ్చులు. వై. వి. (కుంటెన+కుచ్చులు.) కర్ణభూషావిశేషము. (శ. ర., కొనచెవినగలు. ఆం. పద.)

కుంటెనతనము. వై. వి. (కుంటెన+తనము.) తార్పు. "వ...ఏనయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నాఁడ నమ్మచ్చెకంటికిం గుంటెనతనం బెట్లు సేయనేర్తు..." నైష. 3, ఆ. ౬౬.

కుంటెననడచు. ద్వి. అ. క్రి. (కుంటెన+నడచు.) తార్పుపని జరుపు, దౌత్య మొనరించు. "సీ. గుఱు తంటిమా నీవు గుఱు తెక్కడిది భక్తి నంబికిఁ గుంటెననడచినావు." నిరం. 3, ఆ. ౨౯.

కుంటెనపంపు. ద్వి. అ. క్రి. (కుంటెన+పంపు.) తార్పుపనికి నియమించు, "ఉ...ఈవు మును భక్తుఁడు కుంటెనపంప బోతి..." కాళ. 3, ఆ. ౧౦౦.

కుంటెనపని. ద్వి. వి. (కుంటెన+పని.) తార్పుపని. "సీ. విల్లెక్కుడించక వేసినమదనుండు పలుమాఱు కుంటెనపనులు నడప." అని. 3, ఆ ౯౮.

కుంటెనపోవు. ద్వి. అ. క్రి. (కుంటెన+పోవు.) కుంటెననడచు. "మ. నిను నావాకిలి గావు మంటినో మనస్విలాలకభ్రాంతిఁ గుంటెనపొ మ్మంటినో ..." కాళ. శ. ౧౬. ఇట్లే: కుంటెనవోవు. పండితా. మహిమ. ౧౬౭ పు.

కుంటెనముడి. ద్వి. వి. (కుంటెన+ముడి.) తాటాకుల పుస్తకముదారమునడుమ నుండెడుముడి. (శ. ర.)

కుంటెనవుచ్చు. ద్వి. అ. క్రి. (కుంటెన+పుచ్చు) కుంటెనపంపు. "ద్వి. హరుఁడు గుంటెనవుచ్చనట వేయుమాడ, లరుదుగాఁ బడిగొనునటెయనుదిన నము." పండితామహిమ. ౧౬౪. 3 పం.

కుంటెనీఁడు. వై. వి. (కుంటెన+ఈఁడు.) కుంటెనకాఁడు. "వ..ఏము గుంటెనీలం బుచ్చిన నచ్చెలువయు..." దశ. ౫, ఆ. ౫౨; ౪౯. విక్ర. ౭, ఆ. ౧౨౪.

కుంటేల్లు = కుంటెనకుచ్చులు. "సీ. కడియాలు కుంటేల్లు..." చంద్ర. వి. ౨, ఆ. ౨౦.

కుంతన. సం. వి. ఆ. స్త్రీ. కుంతనము.

కుంతనము. సం. వి. అ. న. 1. మొక్కవోవుట, 2. మొక్కవోఁజేయుట.

కుంఠితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మొక్కవోయి నది; 2. మూర్ఖము.

కుంఠితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) బలహీనుఁడు; పౌరుషశూన్యుఁడు. "క. కీచకుఁడు ప్రేటువడి తన, నీచ జన యొరు లెఱుంగనేరక యుండన్, లేచి వెనుకఁ జని విస్మయగోచరుఁడై యసురకతనఁ గుంఠితుఁ డగుచున్." భార. విరా. ౨, ఆ. ౧౩౦.

కుంఠుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు; 2. సోమరి. ఇట్లే: కుంఠనుఁడు. విశే. (అ. ఆ. అ.) కుంఠ. విశే. (న్. నీ. న్.) కుంఠిన. విశే. (బు. త్రి. బు.)

కుండ. వై. వి. (సం. కుండమ్. క. త. కుండం.) 1. మట్టిమొ. వానితోఁ జేసినపాత్రము. "క...పూఁ, జెండులపసమించ్ బంగరు, కుండలమెఱుఁగున్ వెలందిగుబ్బల కడఁగున్." సింహా. ౧, ఆ. ౨౪. ఆం. భా. ద్వి. ౨౪౫; 2. పర్తులభాండము, గుంద్రనిపాత్రవిశేషము. ఆం. భా. ద్వి. ౨౪౬; 3. మేడమొ. వానిమీఁద నెత్తెడుకలశాకారము గలయలంకారవిశేషము. "సీ. కంబాలఁ జీనీసీనాంబరంబులు చుట్టి గోపురంబులఁ బైఁడికుండ లెత్తి." విక్ర. ౪, ఆ. ౧౩౬. "మ...మేడలతుదం దార్కొన్నబంగారుకుం. డట..." య. ౧, ఆ. ౭౮; 4. ఇరుసు తగిలించెడుబండిచక్రము నడిమిగుబ్బ. "వ...మున్ను కొండొకక్రుంగినచక్రంబు కుండ మునుంగం దిగఁబడిన..." భార. కర్ణ. 3, ఆ. 3౫౦. (శ. ర. పా. 'కుండు, గుండు' పాఠాంతరములు.) బ. ఏనుఁగుకుంభస్థలము. "సీ. కుండలు దాల్చి కన్గొనల నీ రొలుకఁ జేతులఁ జాఁపుకడ యేనుఁగులను రోసి." అచ్చ. బాల. ౪౬.

కుండంగము. సం. వి. అ. పుం = కుడుంగము.

కుండకడుపు. ద్వి. వి. (కుండ+కడుపు.) పెద్దబొజ్జ. "మ. నిడుమోముం గుఱుకేలుఁ గుండకడుపున్ ..." మార్క. ౧, ఆ. ౨౨౪.

కుండకీటుఁడు. సం. వి. అ. పుం. 1. చెడిపోయిన బ్రాహ్మణస్త్రీకొడుకు; 2. దాసిని కామించినవాఁడు; 3. నాస్తికుఁడు.

కుండకీలుఁడు. సం. వి. అ. పుం. నీచుఁడు.

**కుండగోఁకరి.** ద్వ. విశే. (కుండ+గోఁకరి.) వంటవాఁడు. "ద్వి. కుండగోఁకరిఁ జేసి కువలయేశు లకు, వండిపెట్టఁగఁ జేసి..." ద్వి. నల. ౨, ఆ. ౬౫౯ పం.

**కుండపొదుఁగు.** ద్వ. వి. (కుండ+పొదుఁగు.) కుండంత పొదుఁగు; పెద్దపొదుఁగు. "ఉ. దండమె దీని వాలధి సుధానిభవాఃకరకంబె దీని యీా, కుండ పొదుంగు..." పాండు. ౫, ఆ. ౨౪౪.

**కుండపోఁగులు.** ద్వ. వి. బ. (కుండ+పోఁగులు) కర్ణాభరణవిశేషము, ఒకరకపుచెవిపోఁగులు. "సీ. కుండ పోఁగులు చిప్పగొడ్డండ్లు..." సీలా. 3, ఆ. ౪౯. (శ. ర. పా. 'కుండప్రోఁగులు' ముద్రిపా.)

**కుండబంతి.** ద్వ. వి. (కుండ+బంతి.) క్రీడావిశేషము, పాకీ. (బ్రౌ.)

**కుండబిరుసు.** దే. వి. (కుండ+బిరుసు.) ఒకరకపుబాణ సంచు. "వ...కుండబిరుసులు సంపంగిపూలబిరుసులు..." హంస. 3, ఆ. ౨౮.

**కుండమార్చు.** ద్వ. అ. క్రి. (కుండ+మార్చు.) ఒక టిచ్చి మఱొకటి కైకొను. (శ. ర.)

**కుండమార్పు.** ద్వ. వి. (కుండ+మార్పు.) ఒక టిచ్చి మఱొకటి పుచ్చుకొనుట. "సీ. చండాంశుసుతు పొల్చిఁ గుండమార్పులు గాక వాసవమణిభాతిఁ ద్రాసమంద, గీ. కొసఁగ నేర్తువు యాచకవ్యూహ మునకు." నరస. ౫, ఆ. ౧౯.

**కుండమార్పుపెండ్లి.** ద్వ. వి. (కుండమార్పు+పెండ్లి.) ఒకపిల్ల నొకని కిచ్చి పెండ్లిచేసి యాతని సోదరునితో మఱియొకదగ్గఱిచుట్టమునతో తనయింకొకకన్యకనో సోదరినో యిచ్చి చేయుపెండ్లి. (వా.)

**కుండము.** సం. వి. అ. న. 1. కుండ; 2. నిప్పులకుండము. (హోమకుండము); 3. దేవఖాత మగు జలాశయము. (అగస్త్యకుండము మొ.); 4. ఒకానొకమానము.

**కుండలము.** సం. వి. అ. పుం. న. 1. కర్ణభూషణము (కుండనా లని వాడుక); 2. త్రాడు; 3. గుండ్రతనము. (పే. ని.)

**కుండలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తిప్పతీఁగ♥; 2. ఉప్పి♥; 3. కుండలినీశక్తి; 4. కుండలాకారనృత్యము, గొండ్లి "గీ. కుండలాకారవిభమును గుండలియగును." భార. విరా. ౧, ఆ. ౨౪౦. న్. పుం. 1. పాము; 2. నెమలి; 3. చాఱలుగల దుప్పి; 4. వరుణుఁడు; 5. కాంచనము♥. విశే. (న్. నీ. న్.) 1. కుండలములు గలవాఁడు; 2. గుండ్రనిది.

**కుండలించు.** సం. స. క్రి. 1. సున్నచుట్టు. "గీ...పతివేషమిషమున నబ్జసూర్య, మండలముల విధాత్రుండు గుండలించు." నైష. ౧, ఆ. ౫౬. "క. పుర కాంతలకొనులకుక్, సరిపడ దని బ్రహ్మ యాకసము నారసి వే, సరి దానిఁ గుండలించిన, సరణిన్ విని మ్రొట్టి యచటిసాలం బమరున్." చంద్రా. ౧, ఆ. 3; 2. వలయాకారముగ వంచు; వంచు. "గీ. కోపమునఁ జాపముం గొని కుండలించు." చం. రా. ౮, ఆ. ౧౨౪. "సీ. తనమేధ చక్రదాదంభసంభ్రమమున మెండొడ్డుకుండలిఁ గుండలించు." బహుళా. ౧, ఆ. ౬౦.

**కుండలీకరణము.** సం. వి. అ. న. సున్నచుట్టుట.

**కుండవీనులజోదు.** ద్వ. వి. (కుండ+వీనుల+జోదు) కుంభకర్ణయోధుఁడు, రావణునితమ్ముఁడు. "క. గుఱువెట్టుచుఁ గొండవలెక్, వెలఁగొప్పఁగ నున్నకుండవీనులజోదుక్." అచ్చ. యు. ౨౫౫.

**కుండానుగు.** ద్వ. వి. (కుండ+అనుగు.) గోరతుంబి♥. (శ. ర.)

**కుండి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కమండలువు, గిండి; 2. స్థాలి.

**కుండిక.** సం. వి. ఆ. స్త్రీ. = కుండి.

**కుండు.** దే. వి. 1. మొక్కలు వేయుట కుపయోగించుమట్టిపాత్రము. "మ. అలమాకందము కుండ్ల దింపఁ దగు నియ్యం ట్లొక్కచో వేయఁగా, వలె..." విప్ర. ౨, ఆ. ౬౯; 2. నీరు మొ. నిలువ చేయుపాత్రము. (కుడితికుండు, నీటికుండు మొ. వాడుక.)

**కుండుఁడు.** సం. వి. అ. పుం. మగఁడుండఁగా అన్యుమగనితోఁ బోయినస్త్రీకిఁ బుట్టినకొడుకు.

**కుంధ్రణాచి.** సం. వి. ఈ. స్త్రీ. తెల్లబల్లి.

**కుంతము.** సం. వి. అ. పుం. 1. బల్లెము; 2. ఈఁటె; 3. అడవిగోధుమ♥; 4. నల్లి.

**కుంతలము.** సం. వి. అ. పుం. 1. కేశము; 2. నాఁగలి; 3. పానపాత్రము; 4. యవలు; 5. కురువేరు♥; బ. ఒకానొకదేశము.

కుంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పాండురాజుభార్య; 2. రేణుక యనుగంధద్రవ్యము⚘; 3. గుగ్గిలము⚘; 4. అందుగు⚘. ఇ. పుం. 1. ఒకానొకదేశము; 2. ఒకానొకరాజు. (క్రథుఁడనురాజుకొడుకు)

కుంప. దే. వి. (క. కుంప.) స్తంభము. (శ. ర. బ్రౌ.)

కుందకము. ఉభ. దే. వి. (క. కుందక. త. కుందకమ్.) 1. అభ్యంతరము. (శ. ర. బ్రౌ.); 2. లోపము. (శ. ర. బ్రౌ.); 3. సేద్యము చేయక విడిచిన భూమి. (బ్రౌ.) సం. వి. అ. పుం. 1. మొల్ల⚘; 2. సంబరేను⚘.

కుందటేలు. దే. వి. ఒకజాతిపక్షి. "సీ. సాళ్వము డేగ...కుందటేల..." హంస. 3, ఆ. ౧౩.

కుందనము. దే. వి. (క. కుందణ. త. కుందనమ్.) అపరంజి, మేలిమిబంగారము. ఆం. భా. ద్వి. ౨౭౬. "గీ. కుందనమువంటి మేను మధ్యాంవినాత, పోమ్మహాతిఁ గందె..." స్వా. ౨, ఆ. ౪౭.

కుందము. సం. వి. అ. పుం. న. మొల్లపూవు. 1. కుబేరునినవనిధులలో నొకటి; 2. గన్నేరు⚘; 3. సానఁబెట్టుయంత్రము.

కుంది. దే. వి. (త. కుందాణి.) 1. దంచునప్పుడు ధాన్యము చెదరి పోకుండ గుంటచుట్టును నమర్చు జాతికుదురు. (శ. ర. బ్రౌ.); 2. కుందెన. ధాన్యము దంచుకొనుఱోలు. ఆం. భా. ౨౩౫; 3. దీపపాత్రవిశేషము. (ఉదా:—దీపపుకుంది. వా.)

కుందించు. దే. స. క్రి. (కుందు. ధా. ప్రే.) 1. తపింపజేయు; బాధించు. "శా. క్రోధంబు ప్రతీకారమై హృదయమును గుందింప..." భార. విరా. ౨, ఆ. ౨౭౯. "వ...కాళ్ళవియోగజనిత వేదనాభరంబు దుస్సహంబై యంతరంగంబుఁ గుందింప..." భీమ. ౨, ఆ. ౯౦; 2. లాఘవపఱచు. "శా...అడ్డము సెప్ప రెవ్వరును మానోద్రేకముం గర్వముం, గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం గుందించుటన్..." భార. ఉద్యో. 3, ఆ, ౪౯.

కుందిక. దే. వి. (కుందు+ఇక) కుందు, క్షోభము. "సీ. కలశపయోరాశి చిలుకుకవ్వపుఁగాము కుంది కబ్బనివాఁడు మందరంబు." పిన. శకుం. ౧, ఆ. ౩౫.

కుందికట్టు. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. పసిఁడి సోపనములపైఁ గుందికట్టుకై కడు నుద్దులైన జక్కవలకవలు." య. 3, ఆ. ౯౯.

కుందికాళ్లు. దే.వి. బ. బాలక్రీడావిశేషము. "సీ... ఆవలంబులు మఱి కుందికాళ్లు." వి.పు. ౭, ఆ. ౨౦౭.

కుందియన = కుందెన. దే. వి. తుంది, పసిబిడ్డలు కూర్చుండుటకై యేర్పఱిచినతొట్టె. "సీ. పసిఁడి కుందియనలోపలఁ బట్టుపొత్తులయొత్తున నొఱగి కూర్చుండ నోర్చె." వి. పు. ౭, ఆ. ౧౨౯.

కుందిల్లు. దే. అ. క్రి. (కుందు. ధా.) క్రుంగు, దీనమగు. "మ...ఆమునీంద్రాంగనా, కుల మత్యాకులవృత్తి నుండె వనటం గుందిల్లి చింతించుచున్." కు. సం. ౧౦, ఆ. ౪౨.

కుందు. దే. అ. క్రి. (క. కుందు.) 1. క్రుంగు. "చ...పయోనిధుల్ గలఁగె దిగ్గజముల్ మదమేది కుందె..." భార. అర. ౪, ఆ. ౫౪; 2. కాంతిహీనమగు. "సీ. కైరవకాననోత్కరములు కడుఁ గుంద..." విక్ర. ౨, ఆ. ౧౦౭; 3. కుంటు, కాలు నేల నానక పడుచు. (శ. ర.); 4. తగ్గు. "సీ. పెనుమంచుమీఁదఁ బర్వినవికాసము దప్పి చెలువు గుందినసరోజినివిధమున." భార. విరా. ౧, ఆ. ౨౫౪; 5. బాధపడు. "క...ముచ్చిల వేఁచువాఁడుఁ గాముఁ, కులవిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా." భార. ఉద్యో. ౨, ఆ. ౨౧; 6. దుఃఖించు. "ఆ...సౌఖ్యకారిణి యగు గతిఁ, బొందు నీసుతుండు గుందనేల." భార. ద్రో. ౨, ఆ. ౨౩౪. హరి. ౨, ఆ. ౧౧౯. 7. తపించు, పరితాపపడు. "గీ. ...పరసపెగముసఁ గుంది కుంది వగలఁ, బొంది పొంది..." భార. ద్రో. ౨, ఆ. ౩౧౫. నీలా. ౧, ఆ. ౧౦౫; 8. ముక్కలుచేయు. "సీ. పండఁగాఁ గుందినవడువున మావటీల్ పొడిపించి రిభముల విడిచి హాగుల." చంద్రా. ౬,ఆ. ౧౦౦. వి. 1. దుఃఖము. "గీ. గుండుఁ బుల్గులమదికుందు చెందుమందు, తోఁచె నెత్తమ్మివిరివిందు తూర్పునందు." రా. వి. 3, ఆ. ౭౫; 2. తక్కువ." "ఉ...హెచ్చుగుఁ గుం దగున్..." భార. విరా. ౪, ఆ. ౨౩౪. నైష. ౭, ఆ. ౧౧౭, 3. క్షీణదశ. "ఉ. పంచమును

గుందు లేనిశశికాంతి పహించినసెమ్మొగంబుతో." భో. ౧, ఆ. ౧౨౫. విణ. 1. న్యూనము, తక్కువది. ఆం. భా. తృ. ౨౪; 2. పొట్టిది; వంకరయైనది. "ఆ...కుదియఁబడ్డమెడయుఁ గుందు కాళ్లు, గుజ్జుపొడవు సైనరోమలి నొక్కతె, గంధపాత్రహస్తఁ గాంచె సెదుర." పద్మ. ౯, ఆ. ౨౯౦.

కుందుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు, విష్ణువు. (కల్ప.)

కుందుకొను. దే.అ. క్రి. (కుందు+కొను. స్వార్థమున.) కుందు, దుఃఖించు. "సీ. ఇంక నాల్గావంబు లిడసై తిఁగా యంచుఁ గుమ్మరి సెమ్మదిఁ గుందుకొనఁగ." శుక. ౨, ఆ. ౫౬౩.

కుందురు. దే. వి. తృణవిశేషము. హంస. ౫, ఆ. ౪౫. ప్రబంధ. ౨౦౧.

కుందురుకి. సం. వి. ఈ. స్త్రీ. అందుగు✿.

కుందురువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. కుందరము, ఒకానొకగంధద్రవ్యము✿.

కుందుతెల్లు. దే. వి. తెల్లులోనిభేదము, ఇక్ష్వాకిక✿. (శ. ర. బ్రౌ.)

కుందుపడు. ద్వ. అ. క్రి. (కుందు+పడు.) దైన్యపడు. "వ...కొందఱు దుష్టమతులు లేమిఁ గుందుపడినభర్తనధికకార్పణ్యంబు పచరించి సర్పిర్లవణతైలతండులాదులకై సిబ్బితిపఱుతురు..." కాశీ. ౨, ఆ. ౭౯; 2. మర్దింపఁబడు. "సీ. కలికిగుబ్బల పెంపుఁ గనఁ జాలఁ దమి గాంచి కోకముల్ రాజుచేఁ గుందుపడియె." చంద్రి. ౩, ఆ. ౧౫.

కుందెన. దే. వి. 1. ధాన్యము దంచుటోలు. ఆం. భా. ద్వి. ౨౩౯. "ఉ...కలమపాళికఁ గుందెన నించి...దంచి..." చంద్రి. ౬, ఆ. ౧౬; 2. కుందియన. (శ. ర.); 3. ఒకానొకచెట్టు (శ. ర.)

కుందెనగిలి. దే. వి. (కుందెన+గిలి.) బాలక్రీడావిశేషము. "సీ...గుడుగుడుగుంచాలు కుందెనగిలి." హంస. ౩, ఆ. ౧౪౬.

కుందెనగుడి. ద్వ. వి. (కుందెన+గుడి.) బాలక్రీడావిశేషము. "సీ...గుడుగుడుగుంచాలు కుందెన గుడి." కాళ. ౩, ఆ. ౩౩.

కుందెలు = కుందేలు. "ఉ...వంటయిల్, కుందెలు సొచ్చె..." భార. ఆది. ౬, ఆ. ౯౬౬. "ఆ. వేఁటకానియిల్లు వెఱవక కుందేలు, సొచ్చినట్టులు..." కు. సం. ౧౨, ఆ. ౮౭.

కుందెటికొమ్ము = కుందేటికొమ్ము. "మ. వసుధఁగ గుంపెటికొమ్ము తెచ్చుకొనఁగా వచ్చుం బ్రయత్నంబునన్." మల్ల. భూ. నీతి ౫.

కుందెవల = కుందేటివల. "క. ఎడపల కుందెవల..." హంస. ౪, ఆ. ౧౮౫.

కుందేటికొమ్ము. దే. వి. (కుందేలు+కొమ్ము.) శశశృంగము. ఆం. భా. ద్వి. ౬౬. విణ. చెవులపిల్లికొమ్ము వంటిది, శూన్యము. "గీ. తిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ, జేరి మూర్ఖులమనసు రంజింపరాదు." భర్తృ. నీతి. ౫.

కుందేటితాల్పు. దే. వి. (కుందేలు+తాల్పు.) శశధరుఁడు, చంద్రుఁడు. "గీ. వచ్చి యవ్వేఁడి వేలుపువంగడంపు, నేలమొలత్రాటి నిందుగుందేటితాల్పు, మ్రోల నిల్చి..." అచ్చ. యు. ౧౫౫

కుందేలు. దే. వి. డు. శశము, చెవులపిల్లి. "గీ. వంటయిలు సొచ్చెఁ గుందేలు వనజనయన." కాశీ. ౬, ఆ. ౨౨౧. ఆం. భా. ద్వి. ౮౫. స్వా. ౪, ఆ. ౫౧.

కుంపటి. దే. వి. (క. కుంపటి.) అగారధాని, నిప్పులుంచెడుపాత్రము. "క...కుంపటిలోఁ, దామరమొలచినక్రియ..." నృసిం. ౩, ఆ. ౧౨౭. ఆం. భా. ద్వి. ౨౪౧. అము. ౨, ఆ. ౬౯. రం. రా. ఆర. ౧౫౩ పు.

కుంపిని. ఆం. వి. (Company) కంపెనీ, వర్తకసంఘము. "సీ. అమరఁ గుంపినివర్తకావళి యొక్క చోట నొకచోటఁ గక్కుసుద్యోగిజనము." ఆనంద. పీఠి. ౧౪.

కుంపె. దే. వి. కంపె, తాంబూలపాత్రము. ఆం. భా. ద్వి. ౧౬౬.

కుంపెన. దే. వి. కర్ణభూషావిశేషము. ఆం. భా. ద్వి. ౧౪౮.

కుంపెరుఁగు. దే. వి. (కుండ+పెరుఁగు.) దధిభేదము. ఆం. భా. ద్వి. ౨౫౯.

కుంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞభూమిచుట్టుకంచె; 2. ముదుగుశాటిక.

కుంభకము. సం. వి. అ. పు. 1. ఊపిరి బిగపట్టుట. (ప్రాణాయామమున కుంభక రేచక పూరకము లను నంగములలో మొదటిది.); 2. స్థాళి, కుండ.

కుంభకారుఁడు. సం. వి. అ. పుం. కులాలుఁడు,కుమ్మరి.

కుంభఘోణము. సం. వి. అ. పుం. ఒకతంజాపురప్రాంత ప్రసిద్ధపట్టణము. "చ. అలరుచుఁ గాంచె ముందట నవామృతి నిర్మథన ప్రవీణముగ్...కుంభఘోణ మున్." కళా. ౨, ఆ. ౧౫౬.

కుంభము. సం. వి. అ. పుం. 1. కుండ; 2. ఏనుఁగు కుంభస్థలము; 3. కుంభరాశి; 4. ఇరువదిద్రోణ ములకొలత. న. గుగ్గిలము*.

కుంభయోని. సం. వి. ఇ. పుం. - కుంభసంభవుఁడు - 1. అగస్త్యుఁడు; 2. ద్రోణుఁడు; 3. వసిష్ఠుఁడు. ఇష్టే: కుంభసంభవుఁడు మొ.

కుంభాండము. సం. వి. అ. న. గుమ్మడి*.

కుంభాండి. సం. వి. ఈ. స్త్రీ. బూడిదగుమ్మడి*.

కుంభాభిషేకము. సం. వి. అ. పుం. క్రొత్తగా గుడి కట్టించి యందు ప్రతిష్ఠచేసినవిగ్రహమునకు మంత్రపూతమై కుంభమునఁ గలయుదకముచేఁ జేయించుస్నానము.

కుంభి. సం. వి. న్. పుం. 1. ఏనుఁగు; 2. మొసలి; 3. కుమ్మరవాఁడు; 4. గుగ్గిలము*. ఈ. స్త్రీ. 1. వంటకుండ; 2. కలిగొట్టు*; 3. నాఁచు; 4. పిన గుమ్ముడు*. విణ. (న్. నీ. న్.) కుంభము గలది.

కుంభించు. సం. స. క్రి. బిగఁబట్టు. "శా..., కుంభించెం బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్..." భాగ. ౧౦ స్కం. పూ. ౧౧౭౨.

కుంభిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁగపాచి, నాచు*; 2. వేశ్య; 3. కలిగొట్టు*.

కుంభిని. సం. వి. ఈ. స్త్రీ. 1. భూమి; 2. ఆఁడేనుఁగు. 3. భద్రదంతి*.

కుంభీనసము. సం. వి. అ. పుం. పాము.

కుంభీపాకము. సం. వి. అ. పుం. ఆవమండలి యిటు కలవలెఁ బాపులు కాల్పఁబడునరకభేదము.

కుంభీరము. సం. వి. అ. పుం. మొసలి.

కుంభీరుఁడు. సం. వి. అ. పుం. దొంగ.

కుంభీసంభవుఁడు. సం. వి. అ. పుం. అగస్త్యుఁడు. "శా. అంభోరాసినంతవానికిని శక్యంబే నుతిం పంగ నోకుంభీసంభవ... కాశికాక్షేత్రమున్." కాశీ. ౭, ఆ. ౨౫౯, ౨౮౩.

కుంభుఁడు. సం. వి. అ. పుం. 1. విటుఁడు; 2. కుంభ కర్ణుని కొడుకు.

కుకరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఈచవోయిన చేతులు గలవాఁడు.

కుకుందరము. సం. వి. అ. న. స్త్రీలపిఱుఁదిమీఁదిగుంట.

కుకురము. సం. వి. అ. పుం. కుక్క. బ. దశార్హ దేశము.

కుకూలము. సం. వి. అ. పుం. ఊముకనిప్పు. న. 1. గనిక నాఁటినగుంట; 2. కవచము.

కుక్క. వై. వి. (సం. కుక్కురః,కుకురః. ప్రా. కుక్కుర. త. కుక్కల్.) శునకము. "గీ. కడచినపుడు క్రిము లౌండెఁ గాక లౌండెఁ,గుక్క లౌండే నియును భుక్తిఁ గొనెదు దేహ,మొకఁడు ప్రార్థించి యడిగిన నొసఁగవల దె." కాశీ. ౬, ఆ. ౮౩. భార. శాం. ౩, ఆ. ౫౧౮. విణ. అల్పము, నీచము. (కుక్కగొడుగు, కుక్కపొగాకు మొ.) సా:—కుక్కకుఁ డెంకాయ దక్క దన్నట్లు. దశ. ౬, ఆ. ౮౬.

కుక్కగొడుగు. ద్వ. వి. (కుక్క+గొడుగు.) ఛత్రాకము, పుట్టగొడుగు. (శ. ర. వా.)

కుక్కగొట్టె. ద్వ. వి. (కుక్క+గొట్టె). కుక్కవలె నుండుగొట్టె, ఒకజాతిగొట్టె. (బ్రౌ.)

కుక్కచ్చు. ద్వ. వి. (కుక్క+అచ్చు.) కుక్కవంటి ముద్ర, శిక్షావిశేషము. "క. చంపినవానిని సరిగాఁ,జాపుట తగు విప్రుఁడైనఁ జంపక పలిత, త్సంపదఁ గొని తలగొఱిఁగి ప్ర,దంపడి కుక్కచ్చు వేసి సండింపఁదగున్." విజ్ఞా. ప్రా. ౬౫. ఇష్టే: కుక్కయచ్చు. విజ్ఞా. ప్రా. ౭౧.

కుక్కతొలసి. వై. వి. ఫణిర్జకము*. (శ. ర. బ్రౌ.)

కుక్కపాల. ద్వ. వి. (కుక్క+పాల) వటపత్త్రి*. ఆం. భా. ద్వి. ౬౬.

కుక్కబూరుగు. ద్వ. వి. (కుక్క+బూరుగు.) ఒక జాతి బూరుగు*. హంస. ౪, ఆ. ౧౧.

కుక్కముల్లు. ద్వ. వి. (కుక్క+ముల్లు.) రోగవిశేషము. (శ. ర. బ్రౌ.)

కుక్కమూతిపిందె. ద్వ. వి. (కుక్క+మూతి+పిందె.) ఆ ఫుడుగుకాలమున గాయలుదేఱు పనికిమాలిన పిందె. సా: చెడుకాలమునకుఁ గుక్కమూతిపిందె లన్నట్లు.

కుక్కమేడి. ద్వ. వి. (కుక్క+మేడి.) కాకోదుంబరి, కాకిమేడి*. (శ. ర.)

కుక్కలకట్టు. ద్వ. వి. (కుక్కలు+కట్టు.) కుక్కలు మొఱుఁగకుండఁ జేయుసాధనవిశేషము, చోర సాధనములలో నొకటి. "ఉ. కత్తియుం నీలిచీర యుంను...కుక్కలకట్టును బిండిబల్పమున్." చెన్న 3, ఆ. ౨౯౪.

కుక్కవాయింట. ద్వ.వి. (కుక్క+వాయింట.) శ్వాస బర్బరము॥. ఆం. భా. ద్వి. ౨౬౭.

కుక్కి. దే. వి. 1. త్రాళ్లు వదులై పల్లము పడినసులక మంచము. "ఉ...కొఅమాలినకుక్కిమీఁద నీ, యోజ ననాథుపాటు పడ నోగిత మైతె..." భో. ౫, ఆ. ౨౮౮. (శ. ర. పా. 'త్రుక్కి' ముద్రి. పా.) శివరా. ౪, ఆ. ౪౬; 2. అల్ప ఘట్వ, చిన్నమంచము. ఆం. భా. ద్వి. ౧౬౪. విణ. పాడువడినది. (లోఁతైన దని శ. ర. సూ. ని.) "ద్వి. ఆకుక్కినూతిలో నారీతి నున్న,యాకవి సుతఁ గాంచి యుద్ధృతం బుఁడి." ద్వి. భార. ౯. స్కం. (శ. ర.)

కుక్కిదము. దే. విణ. (కుక్క. ధా.) 1. తోలఁకి నది. "ఆ. ఉవిదమానసమున సుప్పొంగి పలరసం, బొక్కపెట్ట తతిమి కుక్కిదంబు,గాఁగ నిండి తాల్మి కట్టవిసెనో యన,వెడలె నశ్రువారి వెల్లి గొనుచు." కు. సం. ౫, ఆ. ౧౨౭; 2. సాంద్ర మైనది. "ఉ. తారకుఁడున్ భుజాబలమదంబున షణ్ముఖుమీఁద నేసె నా,నారుచిరాస్త్రసంహతి రణంబునఁ గ్రిక్కిని కుక్కిదంబు గాన్." కు. సం. ౧౨, ఆ. ౧౩౫; (త్రుక్కిదము ముద్రిత పా) 3. అందమైనది. "ద్వి. గండరించినయట్టి గతిఁగుక్కిదముగ." పండితా. దీక్షా. ౨౭౪. పు.

కుక్కిపడు. ద్వ. అ. క్రి. (కుక్కి+పడు.) కుక్కి యగు,త్రాళ్లు తెగి పల్లమగు. "ఆ. కుక్కిపడిన మిగులఁ గొంగోడువోయినఁ, గుఱుచయైన... నుల్కమంచ మొప్పు దండ్రు." వి. పు. ౪, ఆ. ౨౧౫.

కుక్కుటధ్వజుఁడు. సం. వి. అ. పుం. కోడిపడగదారి, కుమారస్వామి.

కుక్కుటము. సం. వి. అ. పుం. 1. కోడి; 2. అడవి కోడి.

కుక్కుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకోడి; 2. బూరుగుచె॥. ఇ, ఈ. స్త్రీ. కపటచర్య.

కుక్కుభము. సం. వి. అ. పుం. అడవికోడి.

కుక్కురము. సం. వి. అ. పుం. కుక్క. న. గ్రంథి పర్ణిచె॥.

కుక్కురి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకుక్క.

కుక్కురుకోయి = కొక్కురుకో. (బ్రౌ.)

కుక్కురోసట్టు = కుక్కురోకోయి. "ద్వి. కుక్కురో కుట్టనికూసెఁ గల్కోడి." పండితా. మహిమ. ౧౯౭. పు. ౧౧. పం.

కుక్షము. సం. వి. అ. పుం. కడుపు. (కౌముది.)

కుక్షి. సం. వి. ఇ. పుం. 1. కడుపు; 2. మధ్యభాగము; 3. కత్తియొఱ.

కుక్షింభరి. సం. విణ. (ఇ) లేనపొట్టమాత్రమే నింపు కొనువాఁడు.

కుక్షింభరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కుక్షియందు భరించువాఁడు, కడుపున నుంచుకొనువాఁడు. "శా...,రక్షార్థంబు భరింపరాదె యభవుక్ త్రైలోక్యకుక్షింభరున్." భీమ. ౪, ఆ. ౧౦౦.

కుగ్రామము. సం. వి. అ. పుం. పల్లెటూరు.

కుచండి. సం. వి. ఈ. స్త్రీ. చాఁగచె॥.

కుచందనము. సం. వి. అ. న. 1. రక్తచందనము; 2. కుంకుమపువ్వు.

కుచఫలము. సం. వి. అ. పుం. దానిమ్మచె॥.

కుచము. సం. వి. అ. పుం. స్తనము.

కుచరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరులదోషములు చెప్పువాఁడు.

కుచాగ్రము. సం. వి. అ. న. చనుమొన,చూచుకము.

కుచేలము. సం. వి. అ. న. 1. భూమికి వస్త్రము సముద్రము. "శ్లో...,దయా కుచేలే ధనదత్కుచేలే స్థితే౽కుచేలే శ్రితమాఞ్చుచేలే; 2. చినిఁగిన బట్ట.

కుచేలుఁడు. సం. వి. అ. పుం. కృష్ణునిసహపాఠియైన యొకానొకఋషి. విణ. (అ. ఆ. అ.) చినిఁగిన బట్ట కట్టువాఁడు.

కుచోద్యము. దే. వి. 1. మోసము,పన్నుగడ. "వ... కొన్నికుచోద్యంబులు సేసి నానాఁట మెచ్చుగా మచ్చరించిన..." ఆనంద. పీఠి. ౫౮; 2. పక్షపాతము; అసూయ. "ఉ. కంటికి వింద వైతి తెఱగంటికిఁ గుంటికి బాన యుచ్చు నీ,వింటికి నారివైన మన సిత్తువుగా యది గూడదేని నీ,వింటికి

నారికైనఁ గొద పీడజె మంచిగుణం బటంచుఁ జేకొంటి కుచోద్యమే కరముఁ గొప్పనఁ గూర్తుపుగా రఘూద్వహా." బహు. ౪, ఆ. ౭౩.

కుచ్చితము. వై. వి. (సం. కుత్సితః. క. కుచ్చిత. త. కచ్చితమ్.) కౌటిల్యము. "ఉ. గుచ్చిత మేమి గూడదు...నీ,యొచ్చపుఁజేఁత సౌఖ్యమున నుండుదు గా కని పల్కిపోయె న,వ్వెచ్చఁ జూమి విరోధ మొదవెం గరటాళి కులాకజాళికిన్." వెం. పంచ. ౩, ఆ. ౧౩౭. విశ. 1. కపటము,మోసగించునది. "క. చేసిన మే లెఱుఁగుదు రొరు,గాసింపరు కుచ్చితంపుఁగఱవ దెఱఁగ ర,త్యాసక్తసౌహృదులు స,త్యాసీరులు సుకలు వార లపకారకులే." ఉ. హరి. ౫, ఆ. ౩౦౦; 2. నీచము, నింద్యము. "ఆ. కుచ్చితంపుబ్రదుకుఁ గోరఁ దగునె." భార. విరా. ౧, ఆ. ౨౮౨. మార్క. ౭, ఆ. ౨౩౬.

కుచ్చితుఁడు. వై. విశ. దుష్టుఁడు. వేంక. మాన. ౩౦. ఆం. భా. తృ. ౭. ఉ. రా. ౫, ఆ. ౧౬౩.

కుచ్చిట్లు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "వ... పింపిళులు కుచ్చిట్ గీరనంగింజ లో,మనగుంటల్ ..." కళా. ౬, ఆ. ౨౦౨. (ప్రాంతప్రతిపా. 'కుచ్చెట్లు' శ. ర. పా.)

కుచ్చె. వై. వి. 1. కుచ్చెల. పింజె. ఆం. భా. ద్వి. ౧౫౩; 2. కెంపుపని. ఆం. భా. ద్వి. ౨౭౭.

కుచ్చెతీయు. ద్వ. స. క్రి. (కుచ్చె+తీయు.) రత్నములను సానఁబట్టు. (శ ర.)

కుచ్చెల. వై. వి. (సం. కచ్ఛః.) 1. కుచ్చె, పింజె. ఆం. భా. ద్వి. ౧౫౩. "చ...సరిగంచుచల్వకు,చ్చెలలు..."ఉ. రా. ౬, ఆ. ౧౬౧; 2. గాగర, పావడ. "సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద జరతాఱు పని మీఱుచెంగావిరంగారుచీరఁ గట్టి." హంస. ౧, ఆ. ౧౨౦; 3. పిడుకలు చొప్ప మొ. వాని ప్రోగు, రాశి. "గీ...రుబ్బు, ఱోలు పిడుకల కుచ్చెల దాలిగుంత, దనర నిరతంబు వెలయు నా తనిగృహంబు."శుక. ౨,ఆ. ౪౦౮. ఆం. భా.ద్వి. ౨౩౦; 4. ఎనిమిదిగొఱ్ఱులకొలఁది. (శ. ర. బ్రౌ.)

కుచ్చెలి = కుచ్చలి. ఆం. భా. ద్వి. ౭౪.

కుచ్చేల. వై. వి. (సం. కంచులీ) కంచెల, అవిక. "చ. కలువలు కొప్పునక్ నగుమొగంబునఁ గస్తురిబొట్టు పట్టుకు, చ్చలయును జంద్రకావిబురుసావనివల్వము పై రహింపఁగా." శుక. ౧, ఆ. ౧౬౯.

కుచ్చెలి. యు. దే. వి. రేఁగుచెట్టు. ఆం. భా. ద్వి. ౭౪. వై. విశ. కుచ్చలవంటిది. (చూ. కుచ్చలిగంత.)

కుచ్చెలిగంత. వై. వి. (కుచ్చలి+గంత.) యోగినులు యోగులు ధరించుబొంత. "సీ...గుబ్బ, చనుదోయి వన్నెకుచ్చలిగంత డాపలికరమునందు విభూతికక్షపాల." రాజ. చ. ౨, ఆ. ౯౪. పరమ ౧, ఆ. ౧౮౧.

కుచ్చెలిబొంత = కుచ్చలిగంత. "సీ. నలు వగుకలువ మొగ్గలు జడల్గా నాఁచు పొలుపైన కుచ్చలిబొంత గాఁగ." య. ౩, ఆ. ౫౬. "శా. నీ కీకుచ్చలి బొంత యింతిమిగులన్ వింతైననీమాత్రముల్, మాకుం గొత్తలు గావు సిద్ధపురుషా..."పరమ. ౧, ఆ. ౧౮౫.

కుచ్చు. వై. వి. (సం. గుచ్ఛః. ప్రా. కుచ్చ. క. త. కుచ్చు.) 1. పూవులు మొ. వానిగుత్తి. ఆం. భా. ద్వి. ౪౦; 2. పట్టుమొ. వానికుచ్చు. (శ.ర. వా.) బ. 1. స్త్రీలు జడయందుఁ జేర్చి యల్లుకొనెడి నల్లనిబలుపైన దారపునగ. "ఉదా:—జడకుచ్చులు. "సీ...జడబిళ్లలును గుచ్చు లడరి వెలుఁగ."వెం. మా. ౧. ఆ. ౧౩౦; 2. చెవికొన నుంచుకొను నొకవిధ మగునాభరణము. (శ. ర.)

కుచ్చుమీను. వై. వి. (కుచ్చు+మీను.) గండోలము, పెద్దతోఁక గలచేప. (శ. ర.)

కుచ్చులమెకము. వై. వి. (కుచ్చులు+మెకము.) చమరీమృగము. (శ. ర.)

కుచ్ఛము. సం. వి. అ. న. తెల్లగలువ. (వాచ.)

కుజము. సం. వి. అ. పుం. చెట్టు, భూజము.

కుజవారము. సం. వి. అ. పుం. మంగళవారము.

కుజుఁడు. సం. వి. అ. పుం.—భూజుఁడు—1. నరకుఁడు. 2. అంగారకగ్రహము.

కుటజము. సం. వి. అ. పుం. 1. కొండమల్లెచెట్టు; 2. అవిసెచెట్టు.

కుటజుఁడు. సం. వి. అ. పుం—కుంభసంభవుఁడు— 1. అగస్త్యుఁడు; 2. ద్రోణుఁడు; 3. వసిష్ఠుఁడు.

కుటపము. సం.వి. అ. పుం. 1. ఇంటితోఁట; 2. ఒకానొకధాన్యమానము. రూ. కుడవము. న. పద్మము.

**కుటము.** సం. వి. అ. పుం. న. కుండ. పుం. 1. ఇల్లు; 2. గుడిసె; 3. కొండ; 4. కోట; 5. చెట్టు.

కుటరము. సం. వి. అ. పుం. తరిగంబము, చల్లచేయు రాడు.

కుటాక. దే. వి. పక్షివిశేషము. ఆం. భా. ద్వి. ౯౫.

కుటి. సం. వి. ఇ. పుం. 1. శరీరము; 2. చెట్టు. ఇ, ఈ. స్త్రీ. 1. వాకర. 2. గుడిసె. ఈ. స్త్రీ. 1. నీళ్లు మోయుంపనికత్తె; 2. ముర యనుగంధ ద్రవ్యము శ; 3. ఇనుము.

కుటిల. సం. వి. ఆ. స్త్రీ. 1. నది. 2. స్పృక్క-శ.

కుటిలపడు. మి. అ. క్రి. (కుటిలము+పడు.) చెడు. (చూ. కుటిలపఱుచు.)

కుటిలపఱుచు. మి. స. క్రి. (కుటిలపడుధా. ప్రే.) చెఱుచు, నశింపఁజేయు. "వ...గుర్మదమద్వైరి లోకభీకరాలోకంబులను...కుటిలపఱుపుము...." భాగ. ౬ స్క. ౩౦౭.

కుటిలము. సం. వి. అ న. నందివర్ధనపుఁబూవు. విణ. (అ. ఆ. అ.) 1. వంకరయైనది; 2. కపటము గలది.

కుటీరము. సం. వి. అ. పుం. గుడిసె.

కుటుంబము. సం. వి. అ. పుం. న. 1. భార్య; భార్యా పుత్త్రాది. "ఉ. ఏనును నాకుటుంబ మగునీతర శాత్రియు..." హర. ౭, ఆ. ౧౧; 2. బంధువు; 3. జ్ఞాతి; 4. సంతతి; 5. పేరు. (వాచ.); 6. సమూహము.

కుటుంబి. సం. వి. న్. పుం. గృహస్థుఁడు. విణ. (న్. నీ. న్.) దున్నుకొని బ్రదుకువాఁడు.

కుటుంబిని. సం. వి. ఈ. స్త్రీ. 1. భర్త పిల్లలు గల యాఁడుది; 2. కుటుంబసమూహము.

కుటుఁడు. సం. వి. అ. పు. శిలాకుట్టకుఁడు, ఱాళ్లు మలుచువాఁడు.

కుట్టకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదించువాఁడు, పగులఁగొట్టువాఁడు.

కుట్టడము. దే. వి. (కుట్టు. ధా.) కుట్టుపని. "సీ. అవికకుట్టడపుఁదోరపునిగ్గుజంటీలు తనులతాద్యు తికిఁ గైదండ యొసఁగ." శుక. ౧, ఆ. ౫౮౯. (శ. ర. పా. కట్టడము ముద్రి. పా.)

కుట్టన. సం. వి. ఆ. స్త్రీ = కుట్టనము.



కుట్టనము. సం. వి. అ. న. 1. ఛేదనము; 2. నిందించుట; 3. వెచ్చచేయుట; 4. గుణించుట.

కుట్టని. సం. వి. ఈ. స్త్రీ. 1. కుంటెనకత్తె; 2. ఛేదన సాధనవిశేషము. "శ్లో. కుట్టనీ పేషణీ చుల్లీ ఉద కుంభీ చ మార్జనీ,పంచసూనా ఇతి ఖ్యాతా స్తాభి స్స్వర్గం న గచ్ఛతి."

కుట్టమితము. సం. వి. అ. న. దంతపీడనాదులచేఁ గోపభావ మభినయించినను లోపల మిక్కిలి యానందము బొందునట్టిస్త్రీలచేష్టావిశేషము. "శ్లో. కేశస్తనాధరాదీనాం గ్రహే హర్షేపి సంభ్రమాత్,ప్రాహుః కుట్టమితం నామ శిరఃకర విధూననమ్." సా. ద. ౩. ౧౧౧.

కుట్టాకము. సం. విణ. (అ. ఈ. అ.) ఛేదించునది, పగులఁగొట్టునది. "మ. కుటిలారాతివరూథినీధవ శిరః కుట్టాకధాటీ మహాః,పటహధ్వాన విపాట్య మానదశదిగ్భాగుఁడు..." నైష. ౧, ఆ. ౨౨.

కుట్టారము. సం. వి. అ. పుం. పర్వతము,కొండ. న. 1. రతి; 2. కంబళము.

కుట్టారిక = కట్టారుగ. (ధాన్యవిశేషము.) "సీ... కుట్టారి కారికె కొండబరిగె." హంస. ౪, ఆ. ౧౨౭.

కుట్టారుగ. దే. వి. (కుఱుచ+ఆరుగ.) క్షుద్రకోద్రవము శ. (శ. ర.) బ. ధాన్యవిశేషము. "మ... కట్టావికుట్టారుగో, గిరముల్ మెక్కి..." ఆము. ౪, ఆ. ౧౩౪.

కుట్టావలు. దే. వి. బ. (కుఱుచ+ఆవలు.) సర్షపవిశే షము, చిన్నావాలు. (శ. ర.)

కుట్టిమము. సం. వి. అ. పుం. న. 1. ఱాతికట్టడము గలనేల; 2. గుడిసె. పుం. దానిమ్మశ.

కుట్టియ = కుట్టె. (శ. ర.)

కుట్టీరము. సం. వి. అ. పుం. కొండ, పర్వతము. విణ. (అ. ఆ. అ.) పగులఁగొట్టునది.

కుట్టు. దే. స. క్రి. (త. కుత్తు.) 1. వస్త్రము పర్ణము మొ. వానిని దృఢముగా నానుసంధించు. "వ... కుట్టినడొల్లుటుల్లారులు..." ఆము.౪,ఆ.౩౫. "సీ. నునుఁ బోఁకపొత్తిఁ గుట్టినదొప్పగమిత్రోడ..." ఆము. ౧, ఆ. ౭౬; 2. తేనెటీఁగ మొ. కఱచు, కొండెము మొ. లోనికిఁ జొనిపి బాధించు. "గీ. మధువు గొన నుత్సహించినమనుజుఁ బట్టి, కుట్టి

నిర్జించుమధుకర కులమునట్లు." భార. ఆర. ౧, ఆ. ౨౫౧; 3. గ్రుచ్చు. "వ...పిశితఖండంబులు... గుములుగుట్టియు..." స్వా. ౪,ఆ. ౬౦; 4. చెవులకుఁగాని ముక్కునకుఁ గాని రంధ్రము పొడుచు. (వా.); 5. కొలుకు. "చ. గుమురులు గట్టి యీరికలు గుట్టి ప్రవాళము పట్టి కింకతో, నమలక మ్రింగి...కూయుఁ గోవెలల్." కు. సం. ౪, ఆ. ౧౦౭; 6. నోటితో గిల్లు. "ఉ...ఎదిరి కొక్కు యెఱుంగుట యెట్లు కుట్టినఁగూ, చూడఁగ దోసకాయలెవి శుద్ధయశోధన యన్యచిత్తముల్." హార. ౨, ఆ. ౬౩. వి. 1. కుట్టుట, సీవనము. 'సీ. జంటము త్తెపుఁగుట్టుజంటిజెకల నంటి బిగి గుబ్బచన్నులు పిక్కటిల్ల." ఉ. రా. ౬, ఆ. ౧౩౧. 2. కుట్టినదారము. "ఉ. గుత్తపుఁదాపితా జవిక కుట్టు పటుక్కున విచ్చె రంభకున్." కృ. శశం. పీఠి. ౭౦; 3. (కడుపులోని) బాధ. "క. తల నొప్పి కడుపుఁగుట్టుం, బుడుగుఱుపుం గాళ్లతీపు పాటించుచు..." శుక. ౨, ఆ. ౨౦౫; 4. ప్రొయ్యిలో క్రిక్కిఱిసి యుండుబూడిదము. (శ. ర.); 5. కుట్టినరంధ్రము. (ఉదా.—చెవి కుట్టు.); 6. పురిటినొప్పి, పురుడు వచ్చుటకు ముందు స్త్రీకిఁ గలుగునొప్పి. "ఆ...దండికుట్టుం బొడలక, నాతి యటు సుఖప్రసూతి యయ్యె." ద్వా. 3, ఆ. 3౯.

కుట్టుకాఁడ. ద్వి. వి. (కుట్టు+కాడ.) కుట్టుపోఁగు. (శ. ర.)

కుట్టుచేఁడు. దే. వి. (కుట్టు+చేఁడు.) దుర్మార్గుఁడు? "చ. గురుసతిఁ గూడురట్టునకుఁ గొంకని మోడు వియోగినీసము, తక్కరములకీడు చూచుటకు దర్పకు రేఁడెపెదుకుట్టుచేఁడు..." వరాహ. ౪, ఆ. ౨౪. (ప్రయోగాంతరము కానరాదు. "కొరడా?" అని సూ. ని.)

కుట్టుడాకు. దే. వి. (కుట్టుడు+ఆకు.) విడియాకులను భోజనము చేయుట కనుకూలముగా కుట్టఁగా నేర్పడినయాకు. (వా.)

కుట్టుడు. దే. వి. (కుట్టు. ధా.) కుట్టుట, సీవనము. (చూ. కుట్టుడాకు. శ. ర.)

కుట్టుతేలు. దే. వి. (కుట్టు+తేలు.) 1. కంటకము, ముల్లు; 2. క్షుద్రుఁడు, నీచు. "గీ. కుట్టుతేలనఁ గంటకక్షుద్రులగుదురు..." ఆం. భా. శ్రీ. ౪౬.

కుట్టుపోఁగులు. దే. వి. బ. కర్ణాభరణవిశేషము, ఉంగరమువంటి వట్టిపోఁగులు. (శ. ర.)

కుట్టుపోయు. దే. అ. క్రి. (కుట్టు+పోయు.) కుట్టు. (శ. ర. బ్రౌ.)

కుట్టుసురు. దే. వి. (కుఱు+ఉసురు.) కొంచెము మిగిలియున్న ప్రాణము. (శ. ర.)

కుట్టూరుపు. దే. వి. (కుఱు+ఊరుపు.) కొనయూపిరి. (వా.)

కుట్టె. దే. వి. గుదస్థానము. (శ. ర. బ్రౌ.)

కుట్మలము. సం. వి. అ. పుం. 1. మొగ్గ; 2. సగము విచ్చినమొగ్గ; 3. మొగ్గవంటిబాణపుములికి. న. నరకవిశేషము. (ఇందలివారు యంత్రరజ్జువులచేఁ గొట్టఁబడుదు రని వాచ.)

కుట్ర. దే. విణ. 1. అల్పము, సన్ననిది. "ఉ...లేఁ, గుట్రనుసుంగవుఁ గలుగుకోమలియై యఱి మ్రోల నిల్చినన్." విజ. ౨, ఆ. ౪౬; 2. ఉగ్రము, భయంకరమైనది. "శా. ఓసామీ యిటువంటి కొండదరిలో నొంటిం బులుల్ సింగముల్, గాసిం బెట్టెడుకుట్రనట్టడవిలోఁ గల్గువ్విక్రీ నీడనే, యూసం గట్టితి వేటిగడ్డ నిలు..." కాళ. 3, ఆ. ౬౫. వి. మాయ, పన్నుగడ. (బ్రౌ. వా.)

కుట్రపువాఁడు. దే. వి. కుట్టుపని చేయువాఁడు. (శ. ర. బ్రౌ.)

కుఠరము. సం. వి. అ. పుం 1. తరిగంబము; 2. తుంగము నై.

కుఠారము. సం. వి. అ. పుం. 1. గండగొడ్డలి; 2. గొడ్డలి; 3. చెట్టు. (కల్ప.)

కుఠారి. సం. వి. ఈ. స్త్రీ. గండగొడ్డలి. వి. న్. పుం. పరశురాముఁడు.

కుఠేరకము. సం. వి. అ. పుం. 1. నందివృ; 2. తెల్ల తులసివృ; 3. నల్లగగ్గెరవృ.

కుడంగము. సం. వి. అ. పుం. న. పొదరిల్లు.

కుడతా. హిం. వి. చొక్కా. (శ. ర.)

కుడి. ఉభ. దే. వి. (కుడుచు. ధా. క.త. కుడి.) 1. కుడుపు. (చూ. కుడుముట్టు.); 2. కుడిభాగము. "క. వేదండము తొండముసరి, కోదండముఁ దివియుం జెడమఁ గుడి నిబిడజ్యా, నాదము రోదసి

నిండఁగ..." స్వా. ౪, ఆ. ౯. నీలా. 3, ఆ. ౧౫. విణ. ఎడమకానిది, దక్షిణము. "మ. నిడు వాలుం గుడికన్ను పాదములపై నేమంబుతోఁ బెట్టి..." భీమ. ౬, ఆ. ౬౮. సం. వి. ఇ. పుం. దేహము, శరీరము.

కుడితి. దే. వి. తండులీణము, బియ్యము మొ. వాని కడుగునీరు. ఆం. భా. ద్వి. ౨౫౦.

కుడినీరు. ద్వ. వి. (కుడి+నీరు.) త్రాగఁ దగినజలము. "చ...అర్చనాగృహం,బులు గుడినీరు మేడలును భోజనశాలలు..." వసు. ౪, ఆ. ౭౨. "సీ. పడ మటిపన్నెటి కుడినీరు రాయంచగిండులు చెంగటఁ గీలుకొల్పి." దశా. ౭, అ. ౧, ఆ. ౨౭౬.

కుడిపి. వై. విణ. (సం. కురూపీ.) కురూపి. "క...సురు చిరహారం, బక్కుడిపియఋత వైచుచు..." భో. ౫, ఆ. 3౪౦.

కుడిపించు. దే. స. క్రి. (కుడుపు. ధా. ప్రే.) తిని పించు. "గీ. హరిణపత్సంబులకు మీరు కరుణ తోడఁ, బాయసాన్నంబు గుడిపింప భక్తిఁ జూచి." హర. ౧, ఆ. ౭.

కుడిమివాఁడు. దే. వి. పాములవాఁడు, విషవైద్యుఁడు. (శ. ర; బ్రా.)

కుడిముట్టు. దే. వి. (కుడి+ముట్టు.) భోజనపాత్రము. కంచము. "క. తోడవులు చివికినయెమ్ములు, గుడి ముట్టు కపాల మిల్లు గుడి మడియెద్దెక్కుడు గట్టుపలువు దోలగు, బడరునకై నవయ నేమి ప్రళయము వచ్చెన్." శు. సం. ౭, ఆ. 3౯.

కుడియడుగుపరుపడి. దే. వి. మల్లబంధవిశేషము. ప్రబంధ. ౭౮.

కుడియోరభ్రంగి.మి. వి. మల్లయుద్ధమందలి పంద్రెండు దండలలో నొకటి. ప్రబంధ. ౭౮.

కుడిశము. సం. వి. అ. పుం. ఒకరకపుఁ జేఁప.

కుడుంగము. సం. = కుడంగము. "క...ధాటీపటహ ధ్వానినాదా, టోపప్రక్షుభిత దిక్కుడుంగ క్రోడా." కాశీ. ౨, ఆ. ౧౬౬.

కుడుక. దే. వి. (త. కుడుక్కై.) 1. గిన్నె మున్నగు పాత్రము. "క. కుడిచేత మాంసఖండము, లెడ కేలను మద్యరసనహిత మగుకంచుం, గుడుకయుఁ ధరించి..." శివరా. ౪, ఆ. 3౭; 2. తక్కెడ సిబ్బి "గీ. గు[illegible] న్నట్టికుడుక యెక్కుడుగఁ దూఁగ, మాంసఖండంబు కుడుకలో మఱియు నించి, మఱియు నట్టైన నీక్షించి మదిఁ జెలంగి, త్రాసుపై నిల్చెఁ దాన యద్ధరణి విభుఁడు." శైవ. ౨, ఆ. ౭౬.

కుడుచు. దే. క్రి. (క. త. కుడి.) 1. భుజించు. ఆం. భా. తృ. ౧౧౮. "ఉ. వాసవనందనుండు గుడువం గుడువం బటుమారుతాహతిం, జేసి చలించి దీపశిఖ చెచ్చెరఁ బోవుడు భోజనక్రియా, భ్యాసవశంబునం గుడిచి పన్నుగ నిట్టుల విద్య లెల్ల నభ్యాసవశంబునం బడయ భారము లేదని నిశ్చితాత్ముఁడై." భార. ఆది. ౫, ఆ. ౨౨౮; 2. త్రాగు. "చ...పాలు తమ కిచ్చునె యెచ్చట నైన లేఁగలకుఁ, గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నును గాక భాస్కరా." భా. శ. ౪; 3. అనుభవించు. "క ఇడుమలు కుడువఁగఁ బుట్టిన, యొడలిది..." నిర్వ. ౯, ఆ. ౨3. భార. శల్య. ౧, ఆ. 33; 4. పొందు. "గీ. నగజ భయ మందఁ బ్రమథులు బెగడు గుడువ." హర. ౭, ఆ. ౭౯. "ఆ. కొడుక నిన్నుఁ గాంచుకొంటినోముల కాని, పెంచి గారవించి పేర్మి నీదు, ప్రోపుఁ గుడువఁ గాంచుపుణ్యంబు దుదిముట్టి, నేల చేయ నైతి నేమ గట్టి." భార. ఆర. ౭, ఆ. 3౪౮. (ప్రోపుఁగుడుచు = పోషణసుఖము నందు.) అ. క్రి. విందొనఁగు. (చూ. కుడువనిచ్చు. సా: కుడిచి కూర్చుండు = అనావశ్యకముగాఁ గలుగఁజేసి కొను. "గీ. కుడిచికూర్చుండి వెతఁ దెచ్చుకొంటి మొకటి." ప్రభా. ౪, ఆ. ౧౬. జై. ౧, ఆ. ౬౮.

కుడుచుకొను. దే. అ. క్రి., స. క్రి. (కుడుచు+కొను.) 1 (చన్ను గుడిచినట్లు) చప్పరించు. వా:—పిల్ల వాఁడు వేలు కుడుచుకొనుచున్నాఁడు; 2. (పాలు) త్రాగు. వా:—ఈవేళ దూడ కుడుచు కొని పోయినది కాన పాలు లేవు.

కుడుపరి. దే. విణ. (కుడుపు+అరి) కుడుచువాఁడు, తినువాఁడు. "సీ. తెలికడలిని గరువలికుడుపరిదొరప ఱుపుపయి నిదురఁ గొఱలునుఱియ." అచ్చ. అర. ౧౧౪. (కరువలికుడుపరిదొరపఱుపు= శేషశయ్య.)

కుడుపు. దే. స. క్రి. (కుడుచు. ధా.) అనుభవింపఁ జేయు. "క. క్రూరపుఁ బాపముఫలంబు గుడుపక దయుఁ న్నే." భార. ద్రో. ౫, ఆ. 3౦. "క. తోలు

జన్మంబునఁ జేసిన, కొలయును బుణ్యంబుఁ గట్టి కుడుపకయున్నే." సా. ౨, ఆ. ౩౩. (కట్టి కుడుపు = అవశ్య మనుభవింపఁజేయు. 'అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్.') ౨. 1. భోజనము. "గీ. సంధ్యయందు త్రిరాత్రంబు కుడుపు దక్కి, శౌచియై యఘమర్షణజపముఁ జేసి, యశ్వమేధఫలము నందు ననఘ నరుఁడు." భార. అను. ౨, ఆ. ౧౭. (కుడుపువక్కు = ఉపవసించు.); 2. విందు. "క. కడుపునఁ బుట్టిన కూఁతుమి, కొడుకుఁ సుకుమారమూర్తిఁ గులవర్ధనునిన్; మెడఁగోసి చంపి వంటాడు, కుడుపుల జోగులకుఁ బెట్టుక్రూరులు గలరే." హర. ౨, ఆ. ౭౯; 3. అనుభవము, భుక్తి. "గీ. కొంచె మైనను పగఁ బెంచి కుడుపు మేలు." భార. ఉద్యో. ౨, ఆ. ౪౭. ఆం. భా. ద్వి. ౨౬౦; 4. వృత్తి, జీవనోపాధి. "వ...పడపు కుడుపుగాఁ బరఁగుపడంతుల కిది మర్యాద..." శుకస. ౪, ౫౪.

**కుడుము.** దే. వి. (క. కుడుబు.) మోదకము, ఒకానొకభక్ష్యము. ఆం. భా. ద్వి. ౨౫౬. "క. ఎదిరిం దమయట్టులకా, మదిఁ దలఁచినఁ బోసఁగుఁ గాక మాకుం గుడు మిం, డిదె మీరు ప్రక్కఁ గొనుఁడని, చదు రడిచిన మనసుపొందు చక్కంబడునే." భార. ఉద్యో. ౧, ఆ. ౩౧౨.

**కుడుములతిండికాఁడు.** దే. వి. (కుడుములు+తిండి+కాఁడు.) విఘ్నేశ్వరుఁడు. ఆం. సం. దేవ. ౧౨.

**కుడువఁబెట్టు.** దే. అ. క్రి. (కుడువన్+పెట్టు.) 1. విందుచేయు. "వ...అవ్విప్రునకు మాంసముతోఁ గుడువఁబెట్టు మని పంచిన..." భార. ఆది. ౭, ఆ. ౧౧౫. 2. (స్తన్యము) కుడువనిచ్చు, ప్రాఁగిచ్చు. వా.—ఆమె పిల్లవానికిఁ గుడువఁబెట్టుచున్నది.

**కుడువనిచ్చు.** దే. అ. క్రి. (కుడువన్+ఇచ్చు.) విందీయ సమ్మతించు. "వ...తనబానసంబువానిం బిలిచి యే నొక్కబ్రాహ్మణునకుం గుడువనిచ్చి మఱచి యుండితిం జెచ్చెఱ నవ్విప్రునకు మాంసంబుతోఁ గుడువంబెట్టు మని పంచిన..." భార. ఆది. ౭, ఆ. ౧౧౫.

**కుడ్చు** = కుడుచు. 1. (భుజించు.) "సీ. పన్నిదంబులఁ గుడ్చుబ్రాహ్మణులు..." భార. అర. ౫, ఆ. ౩౦౬; 2. (త్రాగు.) "సీ. మును మహీధేనువు చను వత్సమై కుడ్చి..." కు. సం. ౭, ఆ. ౧౩౧.

**కుడ్పు** = కుడుపు. (చూ. కుడుపు)

**కుడ్యము.** సం. వి. అ. న. 1. గోడ; 2. పూఁత; 3. కౌతుకము. (మే. ని.)

**కుణకము.** సం. వి. అ. పుం. పిల్ల. (అప్పుడే పుట్టినపశుశిశువు అని ఆప్టే.) "వ...హరిణకుణకంబుం జూచుచు..." భార. ౫ స్కం. ౧, ఆ. ౧౦౯.

**కుణపము.** సం. వి. అ. పుం. 1. శవము; 2. పురుగు. న. చీము. విణ. (అ. ఆ. న.) 1. చెడ్డది; 2. దుర్గంధముగలది.

**కుణము.** సం. వి. ఇ. పుం. 1. నందివృక్షము; 2. ఈచవోయిన చేయి. విణ. (ఇ) ఈచవోయినచేతివాఁడు.

**కుతకుత.** దే. వి. ఉడుకుటమో. నానిఁగుం పెగుధ్వని కనుకరణము. (బ్రా. వా.)

**కుతకుతలాడు.** దే. అ. క్రి. (కుతకుతలు+ఆడు.) కుతకుత మని ధ్వనించు. వా:—అన్నము కుతకుతలాడుచున్నది. ఎండకు ఒడలు కుతకుతలాడుచున్నది.

**కుతగుఁడు.** వై. విణ. (సం. కృతఘ్నుఁడు.) 1. కృతఘ్నుఁడు, చేసిన మేలు మఱచువాఁడు; 2. దుర్మార్గుఁడు, దుష్టుఁడు. "ద్వి. వ్రతతత్పరతఁ బ్రతి వర్తింపుచుండఁ, గుతగులై జైనులు..." బస. ౬, ఆ. ౨౩౩ పం.

**కుతనువు.** సం. వి. ఉ. పుం. కుబేరుఁడు. విణ (ఇ) కురూపి.

**కుతపము.** సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. సువ్వులు. పుం. న. 1. కడప; 2. ఒకరగోఘుకంబళి; 3. ఒకరకపువాద్యము; 4. దర్భ; 5. పదునేనుభాగములు కల పగటిలో నెనిమిదవభాగము. "క...ఒకనాఁడు కుతపకాలమునందున్." స్వా. ౧, ఆ. ౫౮.

**కుతపుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. సూర్యుఁడు; 3. అగ్ని; 4. అతిథి; 5 తోడఁబుట్టినదానికొడుకు, మేనల్లుఁడు.

**కుతలము.** సం. వి. అ. పుం. న. 1. సప్తపాతాళములలో నొకటి. (అతల, వితల, సుతల, కుతల, తలాతల, రసాతల ధరాతలము లనునవి సప్తపాతాళములు.); 2. భూతలము, భూలోకము. "ఆ. శత్రువరుల నుగ్రసంగరంబునఁ జంపి, కుతలరాజ్య

మెల్లఁ గొందు ననుచు." భార. సభా. ౨, ఆ. ౨౬౯.

కుతి = కుతిల. "సీ...చుమ్మ కుతి జాలి చూపురు కస్తి నా శోక మొప్పు."ఆం. భా. ప్ర. ౧౩౫. (ప్రాంత ప్రాంత ప్రకృతుల. పా. 'కుడ' ముద్రి. పా.)

కుతిక = కుత్తిక. "ఉ...కుతికఁ గోసిన లోకమువారు తిట్టరే." వి. పు. ౭, ఆ. ౧౧. ౩, ఆ. ౧౧౨.

కుతికంటు = కుత్తికంటు. (స్త్రీపురుషులకంఠభూషా విశేషము.) "సీ...కుతికంటు సరిపెణ గుండ్ల పేరు." హంస. ౨, ఆ. ౧౯౦. ఆం. భా. ద్వి. ౧౪౮. "గీ. కూర్మి నీక నిట్లిళాదేవి గోరు లుంచు, నసెదువగ గోళ్ల కుతికంటు నునిచె నొకతె." రాధికా. ౧, ఆ. ౯౩.

కుతికిలఁబడు. ద్వ. అ. క్రి. (కుతికిలన్+పడు.) కూలఁ బడు. "వ...తూరుకుచు గుతికిలఁబడుసవియు ..." స్వా. ౪, ఆ. ౨౭.

కుతికిలు. దే. అ. క్రి. క్రుంగు, కూలు. (చూ. కుతికిలఁబడు.)

కుతినీ. హిం. వి. ఒకవిధమగుపట్టుబట్ట. "సీ...కుతినీత లాడ దంతపుఁబావజోడు..." రసిక. ౪, ఆ. ౪. ౩, ఆ. ౧౪౧, ౫, ఆ. ౧౫౮.

కుతిల = కుతిలము. (చూ. కుతిలపడుచు.)

కుతిలపడుచు. దే. అ. క్రి. (కుతిల+పడుచు.) 1. దుఃఖించు, బాధపడు. "సీ. విను నృపాలక యూళ్ల వెంబడి దేవరగుళ్ల పంచలఁ జేరి కుతిలపడిచి." హరిశ్చ. ౪. ఆ. ౧౯౧. "ఆ. అనుచు వెచ్చ నూర్పు నయ్యింతి లోఁ బుట్టు,కుతేము లుగ్గడించుఁ గుతిలపడుచు, మరలిపోవఁ జూచి విరహాగ్నిశిఖ లచేఁ, దిరుగు మరులుకొనుచు దివిజవిభుఁడు." పద్మ. ౩, ఆ. ౨౧.

కుతిలగొను. దే. అ. క్రి. (కుతిల+కొను.) కుతిల పడుచు. "ఆ...దైత్యరాజతనయ,దొడరి దేవ యానిఁ ద్రోపించె వలు వీక,క్రుంగి నూతిలోనఁ గుతిలగొనఁగ." భాగ. ౯. స్కం. ౫౨౩.

కుతిలపడు. ద్వ.అ. క్రి. (కుతిల+పడు.) 1.బాధపడు, దుఃఖించు. "క...అఁకటఁ, గుతిలపడు నతండు గువ్వకుత్తుకతోడన్." పాండు. ౩, ఆ. ౨౦. "సీ...కుష్ఠామయంబునఁ గుతిలపడఁగ." శివరా. ౪, ఆ. ౭౮; 2. కళాహీన మగు,కాంతి గోల్పోవు, "గీ...సముదరూపువతులలోఁ దమ తేజముల్ కుతిలపడిన." శ్రీరాధా. ౧, ఆ. ౭౪.

కుతిలపఱుచు. ద్వ. స. క్రి. (కుతిలపడు. ధా. ప్రే.) బాధపెట్టు. "గీ...కొంత తడసె నేని, గుతిలపఱు పరె నృపుబంట్లు గుసెలవారు." కాశీ ౫, ఆ. ౨౦౯. హరి. ఉ. ౯, ఆ. ౭౭.

కుతిలపాటు. ద్వ. వి. (కుతిలపడుధా.) కుతిలపడుట, బాధ. "సీ. ఎఱుఁగఁడు మత్తిల్లి పరఁటిపుట్టువు గ్రుక్కకొనినయప్పుడు గలకుతిలపాటు." య. ౧, ఆ. ౨౩.

కుతిలపెట్టు. దే. స. క్రి. (కుతిల+పెట్టు.) బాధపెట్టు. "ఆ...అరాజకత్వ, దోషజాత మైనదురితబాహు ళ్యంబు, కుతిలపెట్ట భూమి యతలమునకుఁ, బోవ ..." భార. శాం. ౨, ఆ. ౦౯. య. ౩, ఆ. ౯౩.

కుతుక = కుతిక. "సీ...నొసట మిక్కిలికన్ను విస పుఁగుతుక." రాజ. వి. ౩, ఆ. ౧౯౦.

కుతుకము. సం. వి. అ. న. 1. కౌతుకము; 2. సంతోషము.

కుతూహలము. సం. వి. అ. న. 1. కుతుకము; 2. నాయికకు మనోజ్ఞ మగువస్తువును చూచుట యందుఁ గలలోలత్వము. విశే. (అ. ఆ. అ.) 1. ప్రశస్తము; 2. ఆశ్చర్యకరము.

కుత్కీలము. సం. వి. అ. పుం. కొండ. "ఉ... ధాతుకుత్కీలము..." జై. ౬. ఆ. ౧౭౭.

కుత్తిక = కుతిక. "గీ...కత్తిఁ గుత్తికను బిరానఁ గత్తిరించి." చంద్రా. ౨, ఆ. ౦౮.

కుత్తిని=కుతినీ. "సీ...సూరత్తుకుత్తినిపట్టుచెండ్లు..." సానందో. ౧, ఆ. ౧౩౯.

కుత్తుక. దే. వి. కంఠము. "క...గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్." భార. భీష్మ. ౨, ఆ. ౩౬౪. స్త్రీ. ౧, ఆ. ౦.

కుత్తుకము = కుత్తుక. ఆం. భా. ద్వి. ౧౪౧.

కుత్తుకంటు = కుతికంటు. "సీ...కట్టాణిపూసలకుత్తు కం టనంగ." రా. వి. ౧, ఆ. ౬౨.

కుత్స. సం. వి. ఆ. స్త్రీ. నింద, దూఱు.

కుత్సనము. సం. వి. అ. న. 1. నింద; 2. నిందించుట.

కుత్సచేయు. మి. స. క్రి. (కుత్స+చేయు.) కుత్సించు. "సీ. జీవితేశ్వరుఁడు డించినయోగిరంబులు కుత్స సేయక భుక్తిగొనుట తగవు."కాశీ ౨, ఆ. ౭౫.

**కుత్సించు.** సం. అ. క్రి. అసహ్యించుకొను. "ప... అనిమిషనదీనందనుం డితం డింతయొప్పునిపల్కు వల్కునే యని మనంబునం గుత్సించుచు..." భార. భీష్మ. ౨, ఆ. ౪౨. కాశీ. ౪, ఆ. ౧౮. స. క్రి. నిందించు. "మ .. ఇక్ష్వాకుజన్ముం డొత్తిలి నవ్వె వేదవిదులం గుత్సించి..." నైష. ౭, ఆ. ౧౩౩. శుక. ౪, ఆ. ౧౨౨.

**కుత్సితము.** సం. వి. అ. న. 1. నింద; 2. చెంగల్వకోష్టు; 3. ఋణము. (కే. ని.) విణ. (అ. ఆ. అ.) 1. నిందింపఁబడినది; 2. నికృష్టమైనది.

**కుథము.** సం. వి. అ. పుం. దర్భ. పుం. న. ఏనుఁగుపైఁ బఱచుచిత్రకంబళము.

**కుదప.** దే. వి. రొంపిదుక్కి. (శ. ర.)

**కుదరము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము.

**కుదలు.** దే. అ. క్రి. కదలు, చలించు. "గీ. పుణ్యుఁ జమదగ్ని నందనుఁ బొదివి పట్టి కుదలకుండంగఁ దలఁ ద్రెంచికొనుచుఁ జనిరి." భాగ. ౯. స్కం. ౪౭౭.

**కుదించు** = కుదియించు. 1. బిగియఁబట్టు. "శా... కాంతుఁ డింపూనన్ వాగెఁ గుదించినన్ బురుషకప్రోన్నమ్రపూర్వాంగమై కానంగాఁ బడియెన్ మరుజ్జవన మాగంధర్వము..." ప్రభా. ౨, ఆ. ౩౭; 2. అణఁగఁగొట్టు. "సీ...జమదగ్నిసూను గర్వముఁ గుదించి." జై. ౬, ఆ. ౨౪౫.

**కుదికిలఁబడు.** ద్వి. అ. క్రి. (కుదికిలన్+పడు. ష్వార్థమున.) చదికిలఁబడు; కూలఁబడు. "ద్వి. కుదికిలఁబడి తన్నుకొన గుండె లవియ." రం. రా. యు. ౪౦౯. పు. ద్వి. హరిశ్చ. ఉ. ౯౦౧. పం.

**కుదికిలు.** దే. అ. క్రి. చదికిలఁబడు. "ద్వి. ఒక్కఁడు కుదికిల నుర్విపైఁ ద్రోచె." ద్వి. హరిశ్చ. ఉ. ౯౫౦. పం.

**కుదియఁబడు.** ద్వి. అ. క్రి. (కుదియన్+పడు.) 1. జంకు, వెనుదీయు. "సీ... చిందములకోలాహలములకుఁ గుదియఁబడక." భార. ౨. విరా. ౪, ఆ. ౬౨; 2. కృశించు. "సీ... దేహంబు... కుదియఁబడఁగ." దశా. ౨, అ. ౧౩౯.

**కుదియించు.** దే. స. క్రి. (కుదియు. ధా. ప్రే.) 1. అదుము. సీ. కుచము లురంబునఁ గుదియించి క్రమమున నిఱికినకొఁకిట నిం పొనర్చు." భార. విరా. ౨, ఆ. ౩౧౦; 2. తగ్గించు. "ఆ. మొదలఁ బెనిచి పిదపఁ గుదియింప..." ఆము. ౪, ఆ. ౨౦౮; 3. నిగ్రహించు. "సీ. కుదియించుననినెట్టుకొని యింద్రియవ్యాప్తి..." కాశీ. ౭, ఆ. ౧౧౯; 4. ఆఁపు. "క. నదిరయము వారకేంద్రుఁడు, గుదియించినయట్ల..." భార. శాం. ౪, ఆ. ౫౮౨; 5. బిగఁబట్టు. "ఉ. ఇంచుక కేల వాగె గుదియించిన..." య. ౧, ఆ. ౮౨; 6. తప్పించు. "సీ...ఇచ్చినశాపంబు కుదియింప నెమ్మెయిఁ గొలఁది కాదు." మార్క. ౭, ఆ. ౨౦౪; 7. అణఁగఁగొట్టు. "క...వారల, యూ, టోపముఁ గుదియించి..." భార. భీష్మ. ౩, ఆ. ౧౩౦; 8. బాధించు. "ద్వి. ఇడుమలఁ గుదియించి..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦౯. పం; 9. ముడుఁచు. "గీ...పిడికిలించి కరములు దాఁ గుదియించి..." దశా. ౮, అ. ౧౪.

**కుదియు.** దే. అ. క్రి. 1. క్రుంగు. "సీ. తనయున్న గిరి బెట్టు తాఁచి బిట్టెగసిన నది శేషుపడగలఁ గుదియ నదుమ." భా. రా. అర. ౨, ఆ. ౧౧౮. కవు. ౩, ఆ. ౧౧౯; 2. నిగ్రహము. "క... ఉద్ధురశిఖిబాణం బేసిన గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౫; 3. క్షీణించు. "ద్వి. కుదియనికడఁకతోఁ గోరి యాకాశనది నాడఁ బోయిన నాగకన్యకలు." రం. రా. కిష్కిం. ౨౧౯. పు.; 4. చెడు. "సీ... నెమ్మిపించెముదండకొనరేక యొక్కింత కుదియకుండ." హర. ౬, ఆ. ౪౫; 5. వెనుదీయు. (చూ. కుదియఁబడు.)

**కుదిరి.** వై. వి. (సం. కుదరః. క. కుదిరె.) గుఱ్ఱము. "సీ. వెలిపట్టునిద్దంపుఁదళుకులపుట్టంబు మెలపారు పులుఁగుభంజళులకుదిర." కవిస. ౧, ఆ. (శ. ర.)

**కుదిరిక.** దే. వి. (కుదురు. ధా.) 1. పొందిక. (శ. ర. వా.); 2. నిలుకడ. (శ. ర. వా.); 3. నెమ్మది. (శ. ర. వా.)

**కుదిల** = కుతిల. (చూ. కుదిలపడు.)

**కుదిలపడు** = కుతిలపడు. (చూ. కుదిలపఱుచు.)

**కుదిలపఱుచు.** ద్వి. స. క్రి. (కుదిలపడు. ధా. ప్రే.) 1. నొవ్వఁజేయు, నొప్పించు. "సీ. నృపతిపై మఱి యామినీచరకలి యొనుబడిచిల్కు విడరించి

కుదిలపఱిచె." రసిక. ౬, ఆ. ౩౪; 2. బాధించు, దుఃఖపెట్టు. "సీ...కూలికై నన్నిట్లు కుదిల పఱుచుచున్నారు..." పరమ. ౫. ఆ. ౪౦. "ఆ. అతనుచంద్రహాస మంగనఖార నాంహృదయ పంకజంబుఁ గుదిలపఱిచెఁ,బఱుప కేల యుండుఁ బాథోరుహాములకుఁ, జంద్రహాసములకు శాత్రవంబు." సాంబో. ౫, ఆ. ౫౧.

కుదిలించు. దే. స. క్రి. (కుదులు. ధా. ప్రే.) 1. పిసుర్చు. "వ...కెంగేలు కుదిలించి తివిచికొను..." కాశీ. ౬, ఆ. ౨౨౭; 2. నాటు. "క. కమిముంచకు మరు లెంచకు,కుమిలించకు పువ్వుటమ్ముఁ గుదిలించ కెదన్." రాధా. ౨, ఆ. ౬౦.

కుదిలిక. దే. వి. (కుదులు. ధా.) కుదులుట. (శ. ర.)

కుదుకనగోలు. దే. వి. వంచన. మోసము. "ద్వి... ఇాకనైనఁ, గుదుకనగోలు గైకొనక సాధనము, వదలుము..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦౬. పం. ౧౩౨౭. పం.

కుదుచు = కుదియించు. 1. నశింపఁజేయు. "సీ. నాకాధిపతి యైననహుషుని తేజంబు గుదిచి పాముగ భూమిఁ గూలవైచి." భా. రా. ౧, ఆ. ౭౬; 2. నొక్కు. "గీ. కదిసి నున్గోళ్లఁగొనలను గుదిచి పట్టి." య. ౨, ఆ. ౨౪; 3. బంధించు. "క. నాపాదంబులు గుదిచిన, పాపంబున..." దశ. 3, ఆ. ౧౧౨; 4. విలవిలఁగొట్టు. "ఆ... ఇలఁ, గూలి కాళ్లు గుదుచుకొనుచుఁ జచ్చె." పద్మ. ౯, ఆ. ౧౯౩.

కుదుప. దే. వి. 1. దుర్మాంసపిండము. (శ. ర. బ్రౌ. వా.); 2. పేరుకొన్నముద్ద. "క. అత్తఱి వెన్నెలచేఁ దళుకొత్తునజాండమున బుఱుయుంక్చంద్రుఁడు భాస్వత్తక్రకలశిఁ గుదుపల,మొత్తముతోఁ దేలువెన్నముద్దం బోలెన్." బహు. 3, ఆ. ౫౭; 3. వంచన. "చ. ఎఱుగనియట్ల యున్న నసురేశ్వరుఁ డప్పుడు గాలుఁజేయు లాఁవఱి రథసంబునం గుదుప నక్కడ నిక్కడ నూడఁజూచి ..." నిర్వ. ౭. ఆ. ౦౪.

కుదుపు. దే. స. క్రి. కుదుచు, కదల్చు. (బ్రౌ. వా.) వి. కదలిక, చలనము. (వా.)

కుదురు. దే. అ. క్రి. (క. కుదురు. త. కుదిర్.) 1. నిలచు, నెలకొను. "సీ. గుబ్బపాలిండ్లను గుదిరెఁ గ్రొంజెమటలు..." గంధ. ౨౧౨; 2. అనుకూలమగు. (శ. ర. వా.); 3. స్థిరమగు. (శ. ర. వా.); 4. స్వస్థమగు. (శ. ర. వా.); 5. మాను, తగ్గు. "సీ. అతని పేరురమున నంటి కుమ్మక గాని గుబ్బల పొగ రెట్లు గుదురునమ్మ." కలు. శ. ౧౯. వి. బొ. అనా. 1. పాదు. "క. వెదుగుమట నిడిన చూతం,బున నవమాలికయుఁ బోసె..." భార. విరా. ౫. ఆ. ౪౦౨. విక్ర. ౫, ఆ. ౪౦౨. విక్ర. ౫, ఆ. ౧౯; 2. మొదలు. "సీ. కుదురు నిండిన చిన్నిగుబ్బచన్నులమీఁద ముత్యాలత్రిసరంబు మురువుఁ జూప." భీమ. ౧, ఆ. ౧౧౪; 3. వంశము. (బ్రౌ.); 4. ఆధారము. "క...నాకు లక్ష్మి పెంపున కెల్లన్, సరసిరుహవదన నీవ కుదురుగా నొనరించెదం గుతూహల మెసఁగన్." భార. విరా. ౨, ఆ. ౧౨౨; 5. స్థానము. "గీ... ధర్మంబు సెడ నర్థకామములను, గోరుపురుషుండు నిందకుఁ గుదురు కాఁడె." భార. శల్య. ౨, ఆ. ౩౦౭. విక్ర. ౪, ఆ. ౧౪; 6. అగసాలెవాని కుంపటి. "గీ. బొమ్మ యను పేరియగసాలెపూఁట చెలిని,గోరి యలరించుటకుఁ జదల్కుదుటఁ గాంచి, నీట ముంచిన మేటివన్నియపసిండి,పూఁదె యనఁ గ్రుంకుకడలిలోఁబ్రొద్దు వ్రాలె." నీలా. 3, ఆ. 3; 7. చుట్టకుదురు. (బ్రౌ.); 8. కుదికిక. "మ...ఈ మేనిలోఁ,గుదురీకన్నుల బెళుకులు..." ఉ. రా. ౪, ఆ. ౧౯౦; 9. పంక్తి. "క. పరువంపుమొల్లమొగ్గల, దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్." విజ. ౨, ఆ. ౭౦; 10. భోజనముచేయుంట నుపయోగించుపాత్రము. (కంచముమొ.) "ఆ. ఆలుబిడ్డలు లేనియట్టిత్రిమ్మరి యగు, కొయ్యగాక కుదుటఁ గూడు పెట్టి,కుడుచువార లిట్టిక్రొవ్విదంబులు సేయఁ,జొచ్చు టిచ్చగించి చూతురయ్య." భార. ఉద్యో. ౨, ఆ. ౯. విణ. స్థిరము. "క. కుడితొడపై వామపదం,బిడి యితరముమీఁద నితర మిడి నిశ్చలతం,గడుఁ గుదురై కూర్చుండుట, పుడమిన్ వీరాసనాఖ్య..." కళా. ౫, ఆ. ౧౫౪

కుదురుకొను. దే. అ. క్రి. (కుదురు+కొను.) 1. ఉండు, వర్తిలు. "క...శివుఁడు చటులవిషాగ్నిం, గుదురుకొనఁ గంఠబిలమునఁ,బదిలంబుగ నిలిపె..."

భాగ. ౮. స్కం. ౨౪౫. కవిక. ౨, ఆ. ౬౧; 2. స్థిరపడు. "చ. కుదురుకొనెం గిరీంద్రములు ..." విక్ర. ౨, ఆ. ౭౦౩; 3. కలుగు. "గీ. ఆర్ధ్వగులు కోడిగములకై యాకులెల్ల, ద్రెంచి శాఖావితానము ద్రుంచిపైవ, మోడుపడియుండె నది నిల్వ నీడ పట్టుఁ, గొమ్మయును లేమి తన యందుఁ గుదురుకొనఁగ." శుక. 3, ఆ. ౪౩౯.

కుదురుకొలుపు. దే. స. క్రి. (కుదురుకొను. ధా. ప్రే.) నెలకొలుపు, స్థాపించు. "గీ. తురగమేధంబుఁ జేసి కౌతుకముతోడఁ, గురుకులంబున సత్కీర్తి గుదురు కొలుపు." జై. ౧; ఆ. ౬౧. ఇట్టే: కుదురుకొల్పు. చంద్రా. ౨. ఆ. 3.

కుదురుచే. దే. స. క్రి. (కుదురుధా. ప్రే) కుదురఁ జేయు, నెమ్మదింపఁజేయు. (శ. ర.)

కుదురుపడు. ద్వ. అ. క్రి. (కుదురు+పడు) 1. నెల కొను, స్థిరపడు. ఆం. భా. తృ. ౯౯. "సీ. మత్పాదభక్తి యాత్మను జనించినమాత్రఁ గొనసాగి జ్ఞానంబు గుదురుపడును." దశా. ౧, అ. ౨౨౨; 2. కట్టువడు. "గీ. పరమముని మానసాలానబంధ నమునఁ, గుదురుపడ కుండు యాదవకుంజరంబు." పాంచా. ౫, ఆ. ౮౧.

కుదురుపఱుచే. దే. స. క్రి. (కుదురుపడు. ధా. ప్రే.) 1. నిలుపు. "గీ...ఎదఁ దాల్మి గుదురుపఱుపఁ, జాల కసురులు పఱచిరి..." ఉ. రా. 3, ఆ. ౩౪౭; 2. తాల్చు. "సీ. కీలుఁగొప్పునఁ బైఁడి గేదంగిఱేకులు గొనలు గానంగరాఁ గుదురు పఱిచి." నైష. ౮, ఆ. ౧౧౨; 3. కలిగించు. "సీ. వసివాడు దేరియున్న సరోజరాజికిఁ గుముద సౌభాగ్యంబుఁ గుదురుపఱిచి." కవిరా. ౫, ఆ. ౨౧౮; 4. ఒప్పగించు. "గీ. కొడుకులకు నెల్ల రాజ్యంబుఁ గుదురుపఱిచి." భాగ. ౯. స్కం. ౨౧.

కుదురుపాటు. ద్వ. వి. (కుదురుపడు. ధా.) 1. నిలుకడ. "గీ. కొసర నెఱుఁగనికూరిమి కుదురుపాటె, ఱుఁగనిదిట్టంబు..." చంద్రా. ౬, ఆ. ౮౪౮; 2. ఏర్పాటు. "ఉ...వానితండ్రికెం, బట్టము గట్టి యాకుదురుపాటవునంతకు నిల్చి..." రాధా. 3, ఆ. ౯౨.

కుదురులెత్తు. దే. స. క్రి. (కుదురులు+ఎత్తు.) మోఁకెత్తు; బయలుదేఱు. "సీ...ఎదఁ జిన్నిచన్నులు కుదురులెత్తె." శివలీ. ౧, ఆ. ౪౫.

కుదురుసేయు. దే. స. క్రి. (కుదురు+చేయు) చక్కఁబఱచు, బాగుచేయు. "సీ. వ్రేలివంకరమాత్ర వీఁగ నొత్తఁగ లేఁడు కుదురుసేయఁ గలండె కూను నీపు." రామలిం. ౭౩.

కుదుర్కొను = కుదురుకొను. (ఉండు) "ఉ. వన్నియ మీఱ నన్నగరివాడలమేడలఁ గ్రీడలం గుదుర్కొన్న మెఱుంగుమిన్నలతకూనలకున్..." వేం. పంచ. ౧, ఆ. ౫౨.

కుదుర్చు = కుదురుచు. (శ. ర.)

కుదుర్పడు = కుదురుపడు. (తేఱు) "చ. వెలలి హజార మా నృపతి వేల్పులు దవ్వగుదాఁకఁ జూచి మూర్ఛిలి సచివోపచారములఁ జేసి కుదుర్పడి..." కకు. ౪, ఆ. ౧౬౧

కుదుర్పఱుచే = కుదురుపఱుచు. (ఉంచు, పెట్టు.) "క...కిరీటి కర్ణుసు, తునిమస్తము రథముపైఁ గుదుర్పఱిచి మదిం, గనలుచు..." జై. 3, ఆ. ౩౮.

కుదులు = కుదలు. 1. కదలు. "ద్వి. కుదులుచు నేమేలుకొని లేచి..." ద్వి. నల. ౪, ఆ. ౨౨౨; 2. అదరు. (శ. ర.)

కుదులుకొను. దే. అ. క్రి. (కుదులు+కొను. స్వార్థమున.) 1. వడఁకు. "క. అది...కుదులుకొను నేల బుసకొ, ట్టెద వను నే నెట్లు చేపడితి నను నడలున్." వేం. పంచ. ౪, ఆ. ౫౦౨; 2. భయపడు. "చ...చంపెఁ గుమారుఁడు వేగ రక్కసుం, గుదులుకొనంగ బాలకులు..." భాగ. ౧౦ స్కం. పూ. ౪౩౫.

కుదులుచే. దే. స. క్రి. (కుదులు. ధా. ప్రే.) కుదులఁజేయు, జాడించు. "చ. ముదిరినసాంద్ర చంద్రికలు ముత్తపుచంచుపుటంబులం దిడిన్, గుదిలిచి చించి చీఱి కదుఁ గ్రొవ్విన వెన్నెల గుజ్జు ముక్కునన్, ముదితల కందియిచ్చుచుఁ బ్రమోదము నొందెడు నాచకోరముల్..." మల్హ. 3, ఆ. ౯౯.

కుదువ. దే. వి. (త. కుదువై.) 1. తాకట్టు. ఆం. భా. ద్వి. ౨౫౯. శుక. ౨, ఆ. ౩౬౦; 2. దాఁచుకొన్నసొత్తు. ఆం. భా. ద్వి. ౨౬౭.

కుదువపెట్టు. దే. స. క్రి. (కుదువ+పెట్టు.) తాకట్టుంచు. "సీ. విత్తంబు చాలనివిభవంబు గొఱగాదు కుదువపెట్టఁగ రాదు కుందనంబు." రామలిం. ౪౬.

కుద్దారము. సం. = కుద్దాలము.

కుద్దాలము. సం. వి. అ. పుం. 1. గొడ్డలి; 2. కాంచనము॥.

కుధరణము. సం. వి. అ. పుం. భూధరము, కొండ.

కునటి. సం. వి. ఈ. స్త్రీ. 1. మణిసిల; 2 దనియాలు; 3. నైపుణ్యము లేనినటి (కల్ప.)

కునాశకము. సం. వి. అ. పుం. తీఁటకసింద॥.

కునికిపడు. ద్వ. అ. క్రి. (కునుకు+పడు.) నిద్రచేఁ దూలిపడు. (చూ. కునికిపాటు.)

కునికిపాటు. ద్వ. వి. (కునికిపడు. భా.) నిద్రచే తూఁగుట. (శ. ర. బ్రౌ. వా.)

కునికిలి. దే. వి. ఔ. శిరము. "ఆ. వాఁడినారసము సువర్ణుని కునికిట, నాఁటె నయ్యామర్త్యనాథ సుతుఁడు." భార. కర్ణ. ౧, ఆ. ౧౭౫.

కునిస్టి. దే. విశ. కుంటివాఁడు. ఆం. భా. ద్వి. ౧౨౨.

కునుకు. దే. అ. క్రి. 1. నిద్రచే తూఁగు. (శ. ర. వా.); 2. కాంతిహీన మగు. వా:—దీపము కునుకుచున్నది. వి. అల్పనిద్ర. "సీ. ధన మున్న నృపవహ్నితస్కర భయచింతఁ గునుకు కంటికి రాక కుందుచుండు." రామలిం. ౭.

కునుకుపట్టు. దే. అ. క్రి. (కునుకు+పట్టు.) నిద్రపోవు. "సీ...కునుకుపట్టినఁ జుట్టుకొనుదవాగ్ని." రామలిం. ౩౧.

కునుసు. దే. వి. ఔ. పట్టికాగ్రము, కుస. "క. చని వాని పట్టెమంచము, కునుసుం గూర్చుండి..." మల్హ. ౨, ఆ. ౧౦౧.

కున్కు = కునుకు. వి. (అల్పనిద్ర.) "ఆ...,ఈతఁడు ...,తూలిసేయుఁచుండి కున్కుఁ జెందె." చెన్న. ౩, ఆ. ౪౨౮.

కున్న. వై. వి. (సం. కుణకః. క. కున్ని.) బిడ్డ. "క. నిన్నింతవానిఁ జేసిన, యన్నాలుగు మోములతఁడు హరిపొక్కిటియం, దున్న వెలిదమ్మి యీనిన,కున్న యగుట తెలిసి విడువు కోపము తండ్రీ." నృసిం. ౫, ఆ. ౨౭. "ద్వి. పున్నెంబు చేసినపొలఁతులు నెలల, నెన్నఁ దొమ్మిది మోచి కున్నలఁ గంద్రు." బస. ౧, ఆ. ౩౫౮ పు.

కున్నఁడు. వై. వి. కున్న, బాలుఁడు. (శ. ర. బ్రౌ.) "ద్వి...చీరాలునంగ, కున్నఁడో కిన్నరుకొడుకో ...పండితా." పురా. ౪౫౫ పు.

కున్నె=కున్న. "ఉ. వెన్నెలవన్నెలాఁడి సెలవి న్నెల కొల్పెడు నవ్వుఁబువ్వచాల్, క్రొన్నెలకున్నె లాగునఁ దళుక్కను..." రా. వి. ౪, ఆ. ౯౧.

కుపకము. దే. వి. రాజస్త్రీ లెక్కు తెరలు గలబండి. "ద్వి. కొల్లారుబండ్లును గుపకపుబండ్లు. ద్వి. భాగ. ౨ స్కం. ౩౨ పు. "వ...,భరతభార్యల నందలంబులను గుపకంపుబండ్లను నిడుకొని..." భార. ఆశ్ర. ౨, ఆ. ౨౮.

కుపసము. వై. వి. (సం. కూర్పాసః.) 1. అంగిక; చొక్కాయ. "సీ. గురుపత్ని నాకొక్కకుపసంబుఁ గుట్టుము చలిగాలి యొడలిపైఁ బొలయకుండ, గురునందనుండు నాకు రచింపు పాదుకలడుసు పాదంబులం దంటకుండ. గీ...అనుచుఁ బ్రార్థించి రందటి కతఁడు మ్రొక్కు, యన్నియును దాను గల్పింప నియ్యకొనియె." కాశీ. ౭, ఆ. ౪౦; 2. పాముకూసము. "ద్వి. కుపసంబులూడ్చినక్రూరసర్పములు." రం.రా.యు.౩౭౪ పు.

కుపితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) కోపించినవాఁడు.

కుపూయము. సం. విశ (అ. ఆ. అ.) కుత్సితము, నిందితము.

కుప్ప. దే. వి. (క. కుప్ప. త. కుప్పల్.) 1. రాశి; ప్రోగు. ఆం. భా. ద్వి. ౧౦౧. భీమ. ౨, ఆ. ౧౩౯; 2. కమికిలి, పట్టిలి. ఆం. భా. ద్వి. ౧౪౧.

కుప్పఁగూర. క్రి. విశ. (కుప్ప+కూర.) 1. కుప్పకుప్పలుగా. "చ...మహాస్త్రశస్త్రముల్, గడువడిఁ గుప్పఁగూరగఁ జలంబునఁ బైఁ దొరఁగింప ..."భార. ద్రో. ౩, ఆ. ౧౫౨. "మ...శరజాలముల్ బిఱుఁదఁ గుప్పంగూర నాఁటించుచున్." నిర్వ. ౫, ఆ. ౦౭౮; 2. అధికముగా. "చ... హేయము మొనఁగొఁ గుప్పఁగూరలు..." భార. అశ్వ. ౧, ఆ. ౩౧.

కుప్పకొను. దే. అ. క్రి. (కుప్ప+కొను.) మెండుకొను, అతిశయించు. (చూ. కుప్పకోలు.)

కుప్పకోలు. దే. వి. (కుప్పకొను. ధా.) అతిశయము, ఆధిక్యము. (చూ. కుప్పకోలుగొను.)

కుప్పకోలుగొను. దే. అ. క్రి. (కుప్పకోలు+కొను.) మెండగు, అతిశయించు. "వ...ఆర్తరవంబులు కుప్పకోలుకొన..." హరిశ్చ. ౩, ఆ. ౬౧. (బ్రౌ.)

కుప్పగూలు. దే. అ. క్రి. (కుప్ప+కూలు.) కుప్పలుగా పడు, అధికముగా పడు. "ఉ. వాహనసూతయోధ రథవర్గము లొక్కటఁ గుప్పగూల..." భా. రా. యు. ౬౩౧. య. ౧, ఆ. ౪౪.

కుప్పగూలుచు=కుప్పగూల్చు. (కుప్పగూలు. ధా. ప్రే.)

కుప్పగూల్చు. దే. స. క్రి. (కుప్పగూలు. ధా. ప్రే.) కుప్పలుగాఁ గూల్చు. "గీ. నిరతిశయముగ నార్చులు నింగిముట్టఁ, గుప్పగూల్చె విశాచరకోటి నపుడు." భా. రా. యు. ౧౯౬౫.

కుప్పట. దే. వి. దాస్యమువలనిధనము. "క. ఆయింద్రుఁ గూలి కుప్పట, లాయముగా నిరవధీశరై మనునొక వృత్తియసి..." వేం. పంచ. ౫, ఆ. ౪౩.

కుప్పటగురిగింజె. దే. వి. ఓడిన వారు గెలిచినవారికి పణముగా గురిగింజ లిచ్చుకొనునాట. "సీ... కుప్పటగురిగింజ కొండకోఁతి." హంస. ౩, ఆ. ౪౬.

కుప్పతించు. దే. స. క్రి. కురియు, అధికముగా రాల్చు. "మ...కన్గొలుకుల్ నిప్పులఁ గుప్పతింప..." సమీర. ౭, ఆ. ౧౨౭.

కుప్పతిలఁబడు. ద్వి. అ. క్రి. (కుప్పతిలన్+పడు. స్వార్థమున.) రాశిగాఁ బడు, కుప్పతిలు. "ఉ... కుప్పతిలంబడు తేరులున్..." శై. ౫, ఆ. ౫౭.

కుప్పతిలు. దే. అ. క్రి. కుప్పలుగాఁ బడు, మెండుగా రాలు. "క. అప్పుడు కన్నుల నిప్పులు, కుప్పతిలఁగ..." వేం. పంచ. ౧, ఆ. ౬౦౭ కళా. ౧, ఆ. ౨౧౩.

కుప్పతిల్లు = కుప్పతిలు. (మెండగు, మిక్కుటమగు.) "దండ...సౌరభ్యముల్ గుప్పతిల్లన్..." విష్ణు. నా. ౫, ఆ. ౨౫౧.

కుప్పతెప్పలు = కుప్పఁగూరలు. "సీ. కప్పురపుగంది వనిలోనఁ గలయ మెలఁగుఁ, గప్పురపుటింటిబోదెల నుప్పతిల్లి. కుప్పతెప్పలుగా రాలుకప్పురంబుఁ, దన నగవుఁ గప్పురంబును దడఁబడంగ." మృ. వి. ౩, ఆ. ౧౫.

కుప్పనఁగూర = కుప్పఁగూర. (బహువచనము ప్రాయికము.) "క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పఁగ వజ్రోపమాన కాండములు వేసం, గుప్పనఁగూర వఱప..." భార. కర్ణ. ౨. ఆ ౨౯౮. "క. కుప్పనఁగూరలు గా మురుఁ, డప్పువ్వులకోల లేయ..." భో. ౨, అ. ౧౭౫. "ఉ...కుప్పనగూర నొండొరులఁ గూడఁగనీక కడంగి వేలుపుం, గప్పురగంధు లెక్కిరి ధగద్ధగితోన్నతహార్మ్యరేఖలన్." పారి. ౩, ఆ. ౧౧. (కుప్పనఁగూరి, కుప్పలఁగూరి పాఠాంతరములు. గుంపులుగా నని భావము.)

కుప్పము. దే. వి. (త. కుప్పమ్.) 1. ఊరు. వేంక. స్థా. ౮౦. ఆం. భా. ద్వి. ౨౩; 2. పల్లెవారి గూడెము. (శ. ర.)

కుప్పలుగట్టు. దే. అ. క్రి. (కుప్పలు+కట్టు) ప్రోగులు పడు. "ఉ...,కుండలచారుమస్తములు కుప్పలు గట్టెఁ బురంబువీధులన్." కేయూర. ౨, ఆ. ౧౧౬.

కుప్పలుగొను. దే. అ. క్రి. (కుప్పలు+కొను) కుప్పలగు, రాసులగు. "వ...కన్నులకొలుకుల నిప్పులు గుప్పలుగొన..." భాగ. ౯ స్కం. ౪౪౯. "సీ. కుప్పలుగొన జల్లుపుప్పొడి యెరువుగాఁ బొరిఁబొర విరహాగ్నిఁ బొగులఁ జొచ్చె." ద్వా. ౫, ఆ. ౧౩౦.

కుప్పలుఱుకు. దే. అ. క్రి. (కుప్పలు+ఉఱుకు.) మెండుకొను, మిక్కుటమగు. "సీ. నవ్యహార ప్రభాన్వైగనిగ్యంబులు కుచపర్వతంబులఁ గుప్పలుఱుక." చిత్రభా. ౨, ఆ. ౭౬.

కుప్పలువడు. ద్వి. అ. క్రి. (కుప్పలు+పడు.) గుమిగూడు. "క...ఏమిటికి నిఁక నిచటన్, గుప్పలు వడి నిలువఁగ..." వరాహ. ౧౦, ఆ. ౩౪.

కుప్పవడు. ద్వి. అ. క్రి. (కుప్ప+పడు.) 1. కుప్పయగు, ప్రోగగు. "క...,ధరఁ బ్రేగులం గుప్పవడఁగ..." చంద్రా. ౨, ఆ. ౯౪; 2. స్తంభించు, పడిపోవు. "సీ. కాళ్లు కుప్పవడఁగఁ గదలఁజాలక యట్టె నిడుముసుం గిడి శయనించు చెలువ." దశా. ౪, అ. ౪౫.

కుప్పసము = కుపసము. 1. (చొక్కా; అవిక.) "క. తొడిగినకుప్పస మూడ్చిన, వడువున..." భో. ౧, ఆ. ౧౩౭. చంద్రా. ౨, ఆ. ౩౮. "ఉ. కుప్పసముల్ వదల్చి వలిగుబ్బల నొత్తిరి..." ఆము. ౫, ఆ. ౧౦౪. రా. వి. ౫, ఆ.

౭౫; 2. (పాముకూసము.) "క... దుష్టభు, జంగము తన ప్రాఁతకుప్పసం బూడ్చుగదిన్." జై. ౬, ఆ. ౪౨. ఆం. భా. ప్ర. ౧౪౮.

కుప్పి. దే. వి. 1. అవాక్పుష్పివృ. హంస. ౪, ఆ. ౧౦; 2. గాజుతోఁ జేసినచషకము. ఆం. భా. ద్వి. ౨౮౦.

కుప్పించు. దే. అ. క్రి. (క. కుప్పిసు.) 1. ఎగురుటకుఁగాని దాఁటుటకుఁగాని పూర్వము కాళ్లు జోడించి నేల నదుము. "సీ. కుప్పించి యెగసిన కుండలంబులకాంతి గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ." భాగ. ౧ స్కం. ౨౨౨. భా. రా. సుం. ౫౧౮; 2. దాఁటు. "మ... పయికిం గుప్పించి లంఘించుచోన్." రామా. ౬, ఆ. ౯3. అచ్చ. యు. 3౮౫.

కుప్పిగంతు. దే. వి. (కుప్పించు. ధా.) దుముకు, చిన్నగంతు. "క. ఇది తగుఁ దగ దనక కళా, విదులకు నీసమ్ముఖమున విద్యల యెఱుకం, బొదవెట్టుట హనుమంతుని, యెదుర వెసం గుప్పిగంతు లెగయుటచుమ్మీ." ద్వా. ౨, ఆ. ౪౯. హరిశ్చ. ౧, ఆ. ౧౪౬. బ. బాలక్రీడావిశేషము. "సీ. కుప్పిగంతులు పెడిగ్రుద్దులాటలు..." వి. పు. ౭, ఆ. ౨౦౨.

కుప్పిగంతుగొను. దే. అ. క్రి. (కుప్పిగంతు+కొను) దుముకు, గంతిడు. "ఆ. వ్యోమకేశుజడలనుండి యవ్వాహిని, కుప్పిగంతుగొనినఁ గ్రుంగె ధరణి." భో. ౭, ఆ. 3౯.

కుప్పీలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. (శ. ర.)

కుప్పె. జై. వి. (సం. కూపీ. క. ఁ. కుప్పె.) 1. కాచాదిపాత్రవిశేషము. (దీనిమెడ నిడుపుగానుండును శ. ర.) "గీ. గాజు కుప్పెలఁ గస్తూరి కాజలంబు, కర్ణికారాంబపై నించెఁ గర్ణమోటి." భీమ. ౫, ఆ. ౧౧౫. పారి. ౨, ఆ. ౫౨; 2. గిండిమొ. వాని మీఁదిమూఁత; బిరడా. "క... కనకకుంభంబులపై, నీలపుఁగుప్పెల, నిలిపిన, పోలికఁ జనుమొనలఁ గప్పఁ బోలఁతికి నొప్పెన్." నృసిం. 3, ఆ. ౧3౨; 3. సవరమునకు మొదటనుండు గ్రంథి. "గీ. అదర బెడఁగైన నిడువాలుజడ సడల్చి, కుప్పె గనఁడ సవరంపుఁగొప్పుఁ బెట్టె." హంస. ౧, ఆ. ౨౧౬. శుక. ౨, ఆ. ౪౧౧; 4. గొడుగుమీఁదిగుబ్బ. "ద్వి. పెదపెద్దపసిఁడికుప్పెలు మీఁద నొప్పు... ధవళాతపత్రంబు దమజాలు పట్టె." రం. రా. యు. 3౪౯ పు. 5. కత్తియొఱ చివరితొడుగు. ఆం. భా. ద్వి. ౨౧౫; 6. ఔషధముయొక్కఉండ. (వా.); 7. ఇత్తడిమొ. వానితోఁ జేసి యెద్దుకొమ్ములఁ దగిల్చెడుగుబ్బ. (శ. ర.)

కుప్పెంట. దే. వి. హరితమంజరి, మూరుకొండవృ. (శ. ర.)

కుప్పెకోల. ద్వ. వి. (కుప్పె+కోల.) క్షుద్రకము, ఒకరకపుబాణము. (అలుఁగు లేనిబాణ మని బ్రౌ.) "సీ... ఆతనిపయిఁ గుప్పెకోల లిరువది నాఁటెంప..." భార. భీష్మ. ౨, ఆ. 3౯3. ద్రో. 3, ఆ. ౨౭౦.

కుప్పెన. దే. వి. ఒకజాతి అడవిచెట్టు. (బ్రౌ.)

కుప్యము. సం. వి. అ. న. వెండి బంగారు కాక తక్కిన లోహము.

కుబుసము = కుప్పసము. 1. వస్త్రము. "ఆ. పుణ్యపాపకర్మపుంజనిబద్ధమై, తొడగినకుబుసంబు పడువు దాల్చి, జీర్ణమగుచు నుండు చెనటిదేహంబున; యందు నీవు మమతఁ బొంద పలదు." మార్క. 3, ఆ. ౧౦౪; 2. నిలువుటంగీ. "గీ. కావి కుబుసంబు జలకుండికయును బూని." స్వా. ౧, ఆ. ౫౯; 3. పాముకూసము. ఆం. భా. ప్ర. ౧౪౮. "సీ. కుబుసంబు విడిచినకొదమనాగముతేప..." పరమ. ౨, ఆ. 3౧. 4. చర్మము, తోలు. "ఉ... ఈడ్చె న,బ్బాలికుఁ గాలభైరవుఁడు పై కుబుసం బొకపోరు వెత్తఁగన్." పాండు. ౪, ఆ. ౨౯౪. భీమ. ౪, ఆ. ౧3౦; 5. తలుపునకుఁ గ్రిందుమీఁదుల నుండెడికూచము. (శ. ర. బ్రౌ.)

కుబేరకము. సం. వి. అ. న. కురూపము. (వై. ని.) పుం. నందివృ.

కుబేరాక్షము. సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము, దాఁగుడుమూఁతలు. "సీ. క్రీడించు నొకవేళఁ దోడిబాలురఁ గూడి యక్షీణగతిఁ గుబేరాక్షకేళి." పాండు. ౪, ఆ. ౧3౪.

కుబేరాక్షి. సం. వి. ఈ. స్త్రీ. పాటల, కలిగొట్టువృ.

కుబేరాద్రి. సం. వి. ఇ. పుం. కైలాసము.

కుబేరుఁడు. సం. వి. అ. పుం. ధనదుఁడు, పైఁడిఱేఁడు. (విశ్రవోబ్రహ్మకు ఇలబిలయందుఁ బుట్టినవాఁడు. రావణునకు సవతితల్లికొడుకు. ఈతనిది మూఁడు కాళ్లును నెనిమిదిపండ్లును పెల్లకన్నును గల వికృత దేహ మని కల్ప.) విణ. (అ. ఆ. అ.) కురూపి.

కుబ్జకము. సం. వి. అ. పుం. 1. నెమ్మి; 2. గొజ్జఁగ, గులాబి.

కుబ్జము. సం. వి. అ. పుం. 1. గూను; 2. వంపుఁగత్తి; 3. ఉత్తరేను.

కుబ్జిక. సం. వి. ఆ. స్త్రీ. ఎనిమిదేండ్లవయసు గలకన్య.

కుబ్రము. సం. వి. అ. న. 1. బండి; 2. అడవి; 3. ఇల్లు.

కుభృత్తు. సం. వి. త్. పుం. 1. రాజు; 2. కొండ.

కుమారకము. సం. వి. అ. పుం. 1. చిలుక; 2. ఉలిమిరి; 3. సింధునదము; 4. ఒకానొకబాలగ్రహము. న. శుద్ధమైనబంగారము.

కుమారవ్రతము. సం. వి. అ. న. నిత్యబ్రహ్మచర్యము.

కుమారసువు. సం. వి. ఊ. స్త్రీ. కుమారస్వామిని గన్నది — 1. పార్వతి; 2. గంగ. పుం. అగ్ని.

కుమారాయితము. సం. విణ. (అ. ఆ. అ.) కుమారస్వామియంతటిది. (శక్తి,పరాక్రమము మొ.) "ఉ...గాం,గేయభుజాబలంబున నిక్కృత్తవిరోధి సమాజుఁడై కుమా,రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె..." భార. ఆది. ౫, ఆ. ౬.

కుమారి. సం. వి. ఈ. స్త్రీ. 1. కూఁతురు; 2. కన్య. 3. పార్వతి; 4. ఒకానొకనది; 5. విరజాజి; 6. కలబంద; 7. విష్ణుక్రాంత; 8. పెద్దయేలకి; 9. కొత్తిమిరి; 10. గోరంట; 11. జంబూద్వీపమందలి కుమారికాఖండము. ఉదా:—కన్యాకుమారి; 11. శ్యామాపక్షి. విణ. (న్. జీ. న్.) కుమారులు గలవాఁడు.

కుమారిలు. దే. అ. క్రి. 1. క్రుంగు, కుమిలిపోవు. "గీ. విరహవారిధి నేఁ గడవెట్ట వెపుడు, వలవని దురాశలను గుమారిలుటె కాక." ప్రభా. 3, ఆ. ౧౩౪. సా. 3, ఆ. ౧౨౬; 2 రగులు, రాఁజు. "ఆ. జ్ఞాతికులము నూర్చి నూతఁ బోయక నాదు, డెంద మించుకైన డిందుపడదు, కానరాదు గాని లోనఁ గుమారిలుచున్న దిపుడు రోషవహ్నివహంబు." ప్రబోధ. ౨, ఆ. ౬౯; 3. అసూయపడు, మచ్చరించు. "క. మానవతియిట్లు మానని, మానక్రోధములచేఁ గుమారిలి చింతా,ధీనమతి నుండ..." పారి. ౧, ఆ. ౧౧౪.

కుమారుఁడు. సం. వి. అ. పుం. 1. కొడుకు; 2. బాలుఁడు; 3. స్కందుఁడు; 4. (నాట్యోక్తియందు) యువరాజు; 5. ఐదేండ్లలోపుబాలుఁడు; 6. గుఱ్ఱపువాఁడు.

కుమి. దే. వి. కుమ్మి,కుసూలవిశేషము. ఆం. భా. ద్వి. ౨౪౦.

కుమిలించు. దే. స. క్రి. (కుములు. ధా. ప్రే.) 1. బాధపెట్టు. "క...మరు లెంచకు, కుమిలించకు పువ్వుటమ్ముఁ గుదిలించ కెదన్." రాధా. ౨, ఆ. ౬౮; 2. ఉడుకఁబెట్టు. "సీ. చెలిపాదములఁ బెట్టి చిగురులు గుమిలించి ఘనభీతిఁ గనెఁ బికకంఠి యొకతె." చంద్రా. ర, ఆ. ౧౬౫.

కుముఖము. సం. వి. అ. పుం. పంది. న. కుత్సితముఖము, కురూపము గలమొగము.

కుముటు. దే. అ. క్రి. వాంతికి ముందు కంఠమున వికారమెత్తు. (శ. ర.). వి. 1. కాసభేదము. ఆం. భా. ద్వి. ౧౨౬; 2. వాంతికి ముందు కంఠబిలమున నెత్తువికారము. (శ. ర.)

కుముద. సం. వి. ఆ. స్త్రీ. 1. గుమ్ముడు; 2. నాఁచు; 3. ముయ్యాకుపొన్న.

కుముదబాంధవుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

కుముదము. సం. వి. అ. న. 1. తెల్లకలువ; 2. ఎఱ్ఱతామర; 3. వెండి; 4. దమనకము. పుం. 1. నిర్ఋతిదిక్కునందలియేనుఁగు; 2. కర్పూరము; 3. శివునిశంఖము.

కుముది. సం. వి. ఈ. స్త్రీ. కట్ఫలము, పిసగుమ్ముడు.

కుముదిక. సం. = కుముది.

కుముదిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగలువతీఁగ; 2. తెల్లగలువ లుండెడిచోటు. (కొలను మొ.); 3. కుముద సమూహము.

కుముదుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు; 2. ఒకానొకవానరుఁడు; 3. ఒకానొకనాగుఁడు. (కుశునిభార్యయగు కుముద్వతియన్న.) విణ. (ద్) 1. సంతోషము లేనివాఁడు; 2. లోభిత్వము గలవాఁడు.

కుముద్వంతము. సం. విశే. (త్. ద్వతీ. త్.) కుముదములు మిక్కిలి గలది. (కొలను మొ.)

కుముద్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగలువతీఁగ; 2. తెల్లగలువల మొత్తము; 3. తెల్లగలువలుండెడుచోటు; 4. ఒకానొకనది; 5. శ్రీరాముని కోడలు. (కుశునిభార్య.)

కుములు. దే. అ. క్రి. 1. తపించు, ఉడుకు. "గీ. సవతి యాడినమాటలు సారెఁ దలఁచి, కొనుచుఁ బేర్చినదుఃఖాగ్నిఁ గుములుచుండె." భాగ. ౪, స్కం. ౨౬. చంద్రా. గీ., ఆ. ౭౨; 2. రగులు, రాఁజు. "సీ. పూరజం బని చాల బొంకించి యమ్మరో కుమిలి నిగ్గులు దేరు కుమ్ము గప్పె." చంద్రా. ౪, ఆ. ౧౬౭; 3. సడలు, జిగి వీడు. "సీ. యౌవన స్తంభహైన్యంబున దేహంబు కుమిలి గుడారునాఁ గుదియఁబడఁగ." దశా. ౨, అ. ౧౩౯.

కుమ్మకు. హిం. వి. 1. సాహాయ్యము. తోడు (వా.) 2. దురాలోచన. వ్యవ:—వారు నలుగురు కుమ్మకు చేసి వానియాస్తి దొంగిలించిరి.

కుమ్మర. వై. వి. కుండలు మొ. చేసి జీవించెడుజాతి. ఉదా:—కుమ్మరవాఁడు.-విశే. నల్లనిది. (చూ. కుమ్మరగువ్వ మొ.)

కుమ్మరగువ్వ. ద్వ. వి. (కుమ్మర+గువ్వ.) ఖంజరీటము ఒకజాతినల్లనిపక్షి. (శ. ర.)

కుమ్మరచెట్టు. ద్వ. వి. (కుమ్మర+చెట్టు.) ఒకానొక వృక్షము. (శ. ర. బ్రౌ.) [బ్రౌ.)

కుమ్మరత. ద్వ. వి. (కుమ్మర+త.) కుమ్మరస్త్రీ. (శ. ర.

కుమ్మరపురుగు = కుమ్మరపురువు. (శ. ర.)

కుమ్మరపురువు = కుమ్మరపుర్వు.

కుమ్మరపుర్వు. ద్వ. వి. (కుమ్మర+పురువు.) యమకీటము, మట్టిపురుగు. "ఉ. కట్టక యంన్న వృశ్చికముఁ గుమ్మరిపు ర్వని యందురే కదా." (బట్టుమూర్తిచాటువు.)

కుమ్మరపొనిక. ద్వ. వి. (కుమ్మర+పొనిక) కృష్ణముంజము, నల్లనిముంజగడ్డి. ఆం. భా. ద్వి. ౬౪.

కుమ్మరపోలికి = కుమ్మరచెట్టు. హంస. ౪, ఆ. ౧౧.

కుమ్మఱబూచి = కుమ్మరపురుగు. "ఆ. కట్టఁ దేలు కట్టకున్నఁ గుమ్మఱబూచి, తోఁకిరా జటంచుఁ జేసి..." రాధికా. 3, ఆ. ౧౨.

కుమ్మరసాన. వై. వి. (కుమ్మర+సాన.) కులాల చక్రము. "సీ. ఘనవర్తులావర్తగర్తభాగములు దిద్దిరను గుమ్మరసానరీతిఁ దిరుగు." దశా. ౧, అ. ౧౯౫.

కుమ్మరసారె = కుమ్మరసాన. (చూ. కుమ్మరిసారె.) బ. బాల క్రీడావిశేషము. "సీ. తుమ్మెదరేఁపుల్లు కుమ్మరసారెలు..." హంస. 3, ఆ. ౧౪౬.

కుమ్మరసారెచుక్క. ద్వ. వి. (కుమ్మర+సారె+చుక్క.) విశాఖానక్షత్రము. (శ. ర. బ్రౌ.)

కుమ్మరావము. వై. వి. (కుమ్మర+ఆవము.) ఆవాపము, కుమ్మరికుండలు మొ. కాల్చుట కేర్పఱచినకావు. "గీ...కుమ్మరావమున రాగి,మూఁత లేఱంగఁ గలవె నీ కింత యేల." ఉ. హరి. 3, ఆ. ౪౮. రా. వి. ౫, ఆ. ౯౯.

కుమ్మరి. వై. వి. (సం. కుంభకారః. క. కుంబర. కుమ్మర+ఇ.) కుమ్మరవాఁడు. "సీ. కుమ్మరియింట ..." ద్వా. ౧. ఆ. ౧౪౮. "సీ. పదను పసిఁడి గాఁగ భాండసంపద గల్గు గోత్రవర్తకులును గుమ్మరులును." ద్వా. ౧, ఆ. ౭౫. సా:—కుమ్మరి కొకయేఁడు గుదె కొక పెట్టు. (సత్కార్యము చేయుటకు చిరకాలము పట్టును. దానిని నశింపఁ జేయుటకు క్షణము చాలు నని భావము.) కాశీ. ౨, ఆ. ౯౯.

కుమ్మరించు. దే. స. క్రి. (కుమ్మరిలు ధా. ప్రే.) 1. కుమ్మరిలఁజేయు, (జలాదులను) మిక్కుటముగా వెలువఱచు. కవిక. ౪, ఆ. ౧౬౬; 2. మిక్కిలి వ్యాపింపఁజేయు. "సీ. చెమటచే జాఱిన చికిలి కస్తురిబొట్టు ఘుమఘుమతావులఁ గుమ్మరింప." శశాం. 3. ఆ. ౯.

కుమ్మరింత. దే. వి. (కుమ్మరించు ధా.) కుమ్మరించుట. "చ. పఱచి మురారిచేలనిజపక్షరుచిచ్ఛట లభ్రకోటికిఁ, మెఱపులు గుమ్మరింత లయి మిన్నొఱగంటికి మచ్చగీతలై...రహించఁగన్." బహు. 3, ఆ. ౮.

కుమ్మరింపు. దే వి. 1. కుమ్మరించుట. (వా.); 2. మల్లబంధవిశేషము. ఆం. భా. ద్వి. ౨౦౯.

కుమ్మరిలు = క్రుమ్మరిలు. (చూ. క్రుమ్మరిలు.)

కుమ్మరిసారె = కుమ్మరసాన. (కులాలచక్రము.) "గీ. ధాత్రి కుమ్మరిసారెవిధమునఁ దిరిగె" భారఉద్యో. ౪, ఆ. ౧౧౬. ప్రభా. ౨, ఆ. ౩౪..

కుమ్మరు = క్రుమ్మరు. (తిరుగు.) "ఉ...ఈ కొండకు వచ్చినప్డేసలఁ గుమ్మరిలేక్ నినుఁ గాంచువాంఛ చేన్." చెన్న. 3, ఆ. ౧౪౨.

కుమ్మి. దే. వి. నుమి, కుసూలవిశేషము, పౌణక. "సీ. మూసి ముల్లడిచి కుమ్ములకొల్చుపై మెత్తు లూడ్వఁడు పస్తైన నుండుఁగాని." పాండు. ౪, ఆ. ౧౪౯. చెన్న. ౪, ఆ. ౯౯.

కుమ్ము. దే. స. క్రి. (క. త. కుమ్ము.) 1. నలఁగఁగొట్టు. "సీ. గోడలు పూయంగఁ గుమ్మి గందంబున మేదించినట్టి జవ్వాదియడుసు." య. ౧, ఆ. ౪౭; 2. దంచు. "గీ...,ఇనుకఱోళ్లను బడవైచి యినుము గాఁగఁ, గుమ్ముచుందురు..." శేష. 3, ఆ. 3౭. "సీ. నీవారధాన్య మీగానెలఁత క్షమ్మ దటంచు..." పార్వ. ౨. ఆ. ౨౧; 3. పొడుచు "సీ. ఈవంకి నేవంక నేవంక పోకుండఁ గోటానఁ గోటులు కుమ్మినాను." ష. చ. ౨, ఆ. ౫౯. వి. 1. దెబ్బవ్రేటు. "గీ. ప్రతిబలము వ్రేయుతిరుగుడు తాళ్లకతనఁ, గుమ్ములాడిన బంగారుగోడలు ..."కువల. 3, ఆ. ౧౦; 2. పొట్టునిప్పు, కుకూలము. ఆం. భా. ద్వి. ౪౨. "సీ. పూరజం బని చాల బొంకించి యమ్మరో కుమిలి నిగ్గులు దేరు కుమ్ము గప్పి." చంద్రా. ౪, ఆ. ౧౬౭; 3. పిడకనిప్పు, పిడుకలతో వేసికొను చలిమంట. (చూ. కుమ్ముగాఁచు.) విణ. గూఢమైనది. (చూ. కుమ్ముసుద్ది.)

కుమ్ముగాఁచు. దే. అ. క్రి. (కుమ్ము+కాఁచు.) అప్పపేడపిడుకలతో వేసికొనుచలిమంటచే నొడలు వెచ్చచేసికొను. 'గీ. అత్తయును గోడలుఁను గుమ్ములాడుఁ గుమ్ముగాఁచుచోటికి మకరసంక్రాంతి వేళ." శివరా. ౪, ఆ. ౨౭.

కుమ్ముపురువు. ద్వ. వి. (కుమ్ము+పురువు.) ఒకరకపుఁ బురుగు. ప్రబంధ. ౧3౦.

కుమ్ములాడు. దే. అ. క్రి. (కుమ్ములు+ఆడు.) 1. జగడమాడు, పరుషములాడుకొను. శివరా. ౪, ఆ. ౭౨; 2. పోరు, కలయఁబడి క్రుమ్ముకొను. "సీ. కూలె నొక్కమ్మడిఁ గొమ్ముకత్తులకొద్దిఁ గుమ్ములాడి మదాంధకుంజరములు." చంద్రా. ౬,ఆ.౭౫.

కుమ్ముసుద్ది. ద్వ. వి. (కుమ్ము+సుద్ది.) సంకేతవృత్తాంతము, గూఢార్థము గలసంగతి. (శ. ర. బ్రా.)

కుమ్మెు. దే. వి. 1. పోటు, పొడుపు. "క. కుమ్మెలు దాఁకినబంగరు, బొమ్మరములయొప్పెఁ గడకుఁ బొమ్మనురేఖా, సమ్మిళితస్తనకుంభతటమ్ము..." సా. ౨, ఆ. ౨3౦; 2. క్షతము, నొక్కు. "సీ. క్రొవ్వాఁడికొనగోటికుమ్మెలు బిగియించు చెంప పెట్టు కపోలసీమ వెలుఁగ." చంద్రా. 3, ఆ. ౨౭.

కుమ్మెలువోవు. దే. అ. క్రి. (కుమ్మెలు+పోవు.) 1. గంట్లువడు, క్షతమగు. "చ. ఎఱుఁగడు లేఁత మోవిచిగు రెంతయుఁ గుమ్మెలువోవ నొక్కుటన్." శశాం. 3, ఆ. ౯౬. "ఉ. కుమ్మెలువోవ నొక్క చెలి క్రోలినతేనియ కావిమోవితో." శశాం. ౪, ఆ. ౧౬౯; 2. నొక్కులువడు, అదుము వోవు. 'సీ. బిగువుఁగాఁగిళ్లచేఁ బ్రియుబాహుపురులొత్తి కుమ్మెలువోయినకుచతటములు." ప్రభా. ౫, ఆ. ౬౨.

కుయి. దే. వి. కూయి, మొఱ. (చూ. కుయివోవు.) కుయివెట్టు.) విణ. రక్షకము. (చూ. కుయివోవు.)

కుయివెట్టు. దే. అ. క్రి. (కుయి+పెట్టు.) మొఱవెట్టు. "మ...కుయిపెట్టన్వెళ్లి కూర్పోరుకూ,పవితానం బన..." ఆము. ౨, ఆ. ౪౧.

కుయివోవు. దే. అ. క్రి. (కుయి+పోవు.) ఎడిసింపనేఁగు; రక్షింపఁబోవు. "వ...కురునాథుండు ...ఉత్తరంబునం బసులం బట్టిన నతండు బృహన్నల సారథిఁగాఁ గైకొని యెక్కరుండ కుయివోవుట విని..." భార. విరా. ౫, ఆ. ౨33. "సీ. పసులకై కుయివోయి పరులశస్త్రములచే నని లోన సమసినయట్టివాఁడు." రుక్మా. ౨,ఆ. ౧౧౧.

కుయో = కుయ్యో. "ద్వి. మొక్కలంబునఁ గుయో మట్టో యనంగ." ద్వి. సా. 3, ఆ. ౧౫౦. పం.

కుయ్యి. దే. వి. 1. మొఱ్ఱ. "ఆ. అనదనైతి నిచట నాలికుయ్యాలింపుఁ, డు..." భార. విరా. 3, ఆ. ౧౯; 2. కొంచెపుఁబలుకు. "క. ఇయ్యడవి వీని నేబలు, దయ్యంబలు వ్రేసె నొక్కొ తరలకయుండక్, దయ్యాఁ డొకింతయుం మనతోఁ, గుయ్యన నొల్లఁడు కన్నుఁగొన తెఱవంగన్." వాల్మీ. ౨, ఆ. ౧౨౦.

కుయ్యిడు. దే. అ. క్రి. (కుయ్యి+ఇడు.) అఱచు. "చ...,దివిజుల్ గుయ్యిడకుండ మిం దొసఁగి..." పశా. ౨, ఆ. 3౫౪; 2. మొఱపెట్టు "ఉ.

కుయ్యెడ శక్తి లే దుసరగోళములోపల నున్న వాఁడ ది,క్కెయ్యది..." భాగ. స్కం. ౧౮౦.
స. క్రి. అర్థించు, బిచ్చమడుగు. "క. ఆఁకట మలమలమాఁడుచుఁ, దేఁకువమెడి చేతులొగ్గి దీనత్వమునన్, గాకముగతి వాపోవుచు. గోకర్ణ క్షేత్రజనులఁ గుయ్యిడఁదొడఁగెన్." బ్రహ్మో. ౨, ఆ. ౬౪.

కుయ్యి. దే. అ. క్రి. 1. (పక్షి) పలుకు. "గీ. మనము మాటాడ వేళగా దనుచు నేమ, దియ్యమామిడి కొమ్మపైఁ గుయ్యికఁణఁగి, యుంటి..." రాధికా. ౨, ఆ. ౧౩౧; 2. మొఱపెట్టు "శా. ఓసూర్యాత్మజ జంతుసంఘములు కుయ్యో యంచుఁ గుయ్యంగ..." సానందో. 3, ఆ. ౧౭౦; 3. (భోజనాదులు) అర్థించు, బిచ్చమడుగు. "గీ. అతిథి వాకిట వచ్చి కుయ్యంగ నతని, నాదరింపక మూలగేహంబులోన, భోజనము సేసి తాఁ దృప్తి పొందినట్టి, కఠినచిత్తుఁడు పీఁడు భాస్కర తనూజ." సానందో. ౨, ఆ. ౮౧.

కుయ్యో. దే. వి. భయదుఃఖాదుల వలని యార్తధ్వని కనుకరణము. "శా. ఓసూర్యాత్మజ జంతుసంఘములు కుయ్యో యంచుఁ గుయ్యంగ..." సానందో. 3, ఆ. ౧౭౦. "మ...కుయ్యో మొఱ్ఱో, విను మాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపు మంచేన్..." భాగ. ౮ స్కం. ౨౧౯.

కురంగమము. సం. వి. అ. పుం. జింక.

కురంగము. సం. వి. అ. పుం. 1. జింక; 2. కోఁతి; న. 1. మెడి; 2. ఒకానొకతీర్థము.

కురంగి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుళేడి.

కురంజి. దే. వి. ఒకానొకస్త్రీరాగము. "స్త్రీ... కురంజి ధన్యాసి..." హంస. ౫, ఆ. ౧౨౩.

కురంటము. సం. వి. అ. పుం. పచ్చపువ్వులగోరంట✤.

కురండము. సం. వి. అ. పుం. 1. సాకరుండము✤; 2. బుడ్డ.

కురక. సం. వి. ఆ. స్త్రీ. సల్లకి, అందుగు✤.

కురము. దే. వి. పశువులకుఁ గలిగెడు శిశరోగవిశేషము. (శ. ర.)

కురరము. సం. వి. అ. పుం. లకుముకిపిట్ట.

కురరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడులకుముకిపిట్ట; 2. ఆఁడుగొఱ్ఱె.

కురవకము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగోరంట✤; 2. ఎఱ్ఱచేమంతి✤.

కురస. సం. వి. ఆ. స్త్రీ. గోజివ్వా, బెండ✤.

కురాడము. దే. వి. చప్పరము, మంచపుఁబందిరిగుడ్డ. "ఉ..ఇంద్రగోపపుం, బట్టుకురాడమున్..." పాంచా. ౫, ఆ. ౧౦. "ఉ... తెలిముత్తెపు కుచ్చులలోఁ గురాడమున్." బహు. ౪, ఆ. ౧౨౧. (బ్రౌ.)

కురాళము = కురాడము. "మ...గుజ్జరి నిద్రాత గటీ కురాళములలోఁ సంపెంగపూఁబాన్పున్." చంద్రా. ౪, ఆ. ౭౦. శుక. ౪, ఆ. ౨౨.

కురాసాని. దే. వి. ఒకానొకదేశము. "మ. అలుకన్ ఘోటకఘట్టికాఖురపుటీహల్యన్ గురాసానిపు, చ్చలు వో దున్ని..." ఆము. ౧, ఆ. ౧౩౯. కవు. ౧, ఆ. ౧౩౯.

కురాసానిమోము. దే. వి. యవానిక, కురాసాని దేశపుటోమము. ఆం. భా. ద్వి. ౫౭.

కురించు = కురియించు. "ఉ...సురల్...క్రొవ్విరులవాన గురించిరి భూమిమీఁద..." భో. ౫, ఆ. ౩౨౩. శతకంఠ. ౪, ఆ. ౧౫౦.

కురింజి. దే. వి. లతావిశేషము. (బ్రౌ.)

కురిచీ. దే. వి. (క. త. కుర్చి. హిం. కుర్సీ.) కూర్చుండునున్న తాసనము. "సీ...పట్టెవేల్పు సురఁటీలు మేల్మెఱుఁగు కురిచీలు..." రసిక. ౧, ఆ. ౬౧.

కురిచీపీఁట. దే. వి. (కురిచీ+పీఁట.) ఎత్తుకాళ్లపీఁట. మృ. వి. 3, ఆ. ౭౫.

కురిడి. దే. వి. లోపల నీ రింకినకొబ్బెర. (శ. ర. బ్రౌ.)

కురిడీ = కురిడి. (వా.)

కురిమింద. దే. వి. ఆలిచిప్ప, శంబూకవిశేషము. హంస. ౪, ఆ. ౧౮౬.

కురిమిడి. దే. వి. మడిచుట్టు వేసినకట్ట, గనిమ. (శ. ర. బ్రౌ.)

కురియించు. దే. స. క్రి. (కురియు. ధా. ప్రే.) వర్షింపఁజేయు; మిక్కుటముగాఁ బడఁజేయు. "చ... పుష్పవృష్టిఁ గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్." భార. కర్ణ. ౭, ఆ. ౩౭౫. భార. అర. 3, ఆ. ౨౦౬. "చ... వేలుపుం, గొమిరెలు కల్పభూజనవకోరకముల్ గురియించిరో యనన్." విక్ర. ౪, ఆ. ౨౦౭.

కురియు. దే. అ. క్రి. 1. వర్షించు. "సీ. వలసిన యప్పుడ వానలు కురియుట సస్యసమృద్ధి ప్రశస్త మయ్యె." భార. ఆది. ౫, ఆ. 3; 2. ఇచ్చు. "క. తురగియు నుష్ట్రియు ఖరియును, గురిసిన దుగ్ధములు నిండ్లకోటిగణితముల్." భార. శాం. ౧, ఆ. 3౨౧: 3. ప్రసరించు. "మ. చెలికిం గేలి వసంతకోత్సవదళశ్రీలై కపోలంబులన్, నవ కాలాగురుపత్త్రరేఖ లయి మేనం గమ్మకస్తూరి యై,భవశాంభోరుహనేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపుర్, నవనాజ్యాహుతిహోమ సంప్రభవ చంచద్వహ్నిధూమచ్ఛటల్." శివరా. ౨, ఆ. ౫౮; 4. (పైకప్పుమొ. చెడి) వర్ష జలము లోనఁ బడు. వ్యవ:—వారిల్లు కురియుచున్నది. స. క్రి. 1. కురియించు, కురియఁజేయు. "గీ. అసుర కామినీ నేత్రతోయములు కురిసి, యంబుదద్యుతిఁ త్రిదశసస్యంబుఁ బ్రోచు,నెవ్వఁ డవ్విష్ణుఁడు..." హరి. పూ. ౪, ఆ. ౧౫౧; 2. కలుగఁజేయు. "సీ... మొల్క లేనగవులు ముద్దు గురియ." భీమ. ౧, ఆ. ౯౪; 3. ఇచ్చు. "చ...కోరినకోర్కు లన్నియుం,గురియుదు వీవు..." హరి. ఉ. ౨, ఆ. ౧౫౬.

కురుఁజు. దే. వి. 1. దూలముమీఁదిగుజ్జు. "చ... మదనచేతులచాతురి నెయ్యపుంగురుం,జువిదలు దార్వ విష్ణుపద మొత్తుఁ బురిన్ గృహలక్ష్మి నూత్నతన్." ఆము. ౨, ఆ. ౧౭; 2. మంచె, స్థిర రథము. "చ... పెన్,గురుఁజులమీఁదఁ దార్కొ నిన క్రొత్తగుపుత్తడిబొమ్మ లెల్లెడన్..." య. ౪, ఆ. ౧౫3. విజ. ౨, ఆ. ౮౯. విణ. వామనుఁడు, పొట్టివాఁడు. (బ్రౌ.)

కురుకు = కూరుకు. (బ్రౌ.)

కురుక్షేత్రము. సం. వి. అ. న. కౌరవులు పాండవులు యుద్ధము చేసినక్షేత్రము. (సూర్యపుత్త్రి యగు తపతియందు సంవరణుఁడు గన్నకుమారుని పేరఁ బ్రసిద్ధ మగుక్షేత్రము. "క. అనఘుఁడు పౌరవ కులవర్ధనుఁ డద్దినసాథతనయఁ దపతి వివాహం, బొనరంగ నయ్యె నిరువురకును వంశకరుండుపుట్టెఁ గురుఁ డున్నతుఁడై. వ. వానిపేరం గురుక్షేత్రం బునాఁ బరగె,..." భార. ఆది. ౪, ఆ. ౧౧3, ౧౧౪. (కురుఁడు దున్నుటచేఁ గురుక్షేత్ర మను పేరు వచ్చెను. "వ...కురుం డనురాజు దున్నుటం జేసి దానికిఁ గురుక్షేత్రం బనునామంబు గలిగె ..." భార. శల్య. ౨, ఆ. ౨౧౪.)

కురుజి. దే. వి. చిన్నకంట్లము. (శ. ర.)

కురుజు. దే. వి. 1. ఒకజాతిడేగ. (శ. ర.) పిన శకుం. ౧, ఆ. ౧౧౦; 2. ఈఁకలు రాల్చినపక్షి. ఆం. భా. ద్వి ౯౭; 3. ఒకరకపుబాణసంచు. హంస. 3, ఆ. ౨౯.

కురుజుతేనె. దే. వి. పట్టుతేనె. "గీ. కురుజు తేనెయుఁ గాదిరి కుసుమరసము." శశాం. 3, ఆ. ౪3. "వ...పుట్టతేనె కఱ్ఱతేనె కురుజుతేనె..." ప్రబంధ. ౧౧౨.

కురుప. దే. వి. మేఁకలవాఁడు. ఆం. భా. ద్వి.౨౮౪.

కురుమ. దే. వి. 1. పశునేత్రరోగవిశేషము, పశువుల కన్నుల నీళ్లు కాఱురోగము. "ద్వి...కంటికురుమ కట్టూర్చు, కప్పునాపురు..." నవ. ౧, ఆ. 3౦ పు. ౨౦ పం. 2. (క. కురుంబ.) గొఱ్ఱెబొచ్చుతోఁ గంబళ్లు నేయుజాతి. (శ. ర.)

కురుమగొఱ్ఱె. దే. వి. (కురుమ+గొఱ్ఱె.) కంబళ్లు నేయుటకుఁ బనికివచ్చుఉన్ని నిచ్చుగొఱ్ఱె. (శ. ర. బ్రౌ.)

కురులు. వై. వి. (సం. కురులః. క. కురుళ్.) 1. అలకలు, ముంగురులు. "సీ. ప్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతోఁ నంటి యుగ్మలి నీకురు లొప్పుగం డె." భార. విరా. ౨, ఆ. ౧౫౬. "ఉ. కూకటి వేణితోఁ గురులు కూడకమున్న..." కళా. ౧, ఆ. ౨౬. ఆం. భా. ద్వి. ౧౪౫; 2. శిరోజములు, తలవెండ్రుకలు. "సీ. కొప్పు మెల్లన విచ్చి కురులు చిక్కొడలించి తలయంటె నేర్పుతోఁ బోలఁతి యొర్తు." య. ౪, ఆ. ౮౯. నీలా. ౧, ఆ. 33.

కురువడములు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ ...కురువడాల్ కంటసరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

కురువిందము. సం. వి. అ. పుం 1. నిడుముస్తె; 2. అద్దము; 3. ఇంగిలీకము; 4. వ్రీహివిశేషము; 5. పద్మరాగమణి. "సీ. సలలితమత్తకోకిల లోచనద్యుతి నలరారుఁ గురువింద మనెడికెంపు." రత్న. ౧౦.

కురువు. సం. వి. ఉ. పుం. 1. ఒకానొకక్షత్త్రియుఁడు. 2. ఒకానొకఋత్విక్కు; 3. ఒకానొకవర్షము; 4. అన్నము; 5. వాఁకుడుఖీ; 6. ఒకానొక దేశము.

కురుపేరు. ద్వ. వి. (కురులు+పేరు.) (క. కురు పేరు) హ్రీబేరము, కేశముఖీ. అం. భా. ద్వి. ౬౧. య. ౫, ఆ. ౯౪.

కుర్కుటము. సం. వి. అ. పుం. కోడి.

కుర్కురము. సం. వి. అ. పుం. కుక్క.

కుర్చ = కుఱుచ. "ద్వి. మిక్కిలిఁ బొడవైన మిగులఁ గుఱ్ఱైన." ద్వి. భల్లా. ౨, ఆ. ౩౭ పు.

కుర్చీ = కురుచీ. (వా.)

కుర్దనము. సం. = కూర్దనము.

కుర్పరము. సం. వి. అ. పుం. 1. మోఁచేయి 2. మోఁకాలు.

కుర్పించు = కురియించు. (కురియఁజేయు.) "ద్వి. అదిగాక వారుఁ డిరువదియొక్కదినము, వదిగొని కంచిలో వానఁ గుర్పింప." బస. ౪. ఆ. ౧౨౩.పు.

కుర్మట్టము = కుఱుమట్టము. "ఉ...కక్షపాల కుర్మట్టపుఁబావలుం గలుగుమానిశిఖామణిఁ జూచి..." సావి. ౨, ఆ. ౧౪.

కుర్య = కురియు. "చ. ఉడుగక యేడురాత్త్రులు మహోద్ధతి వానలు గుర్యఁ జూచి..." పద్మ. ౯, ఆ. ౨౩౧.

కుర్వాణుఁడు. సం. వి. అ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు. విశే. (అ. ఆ. అ.) సేవచేయుచున్నవాఁడు. (చూ. కింకుర్వాణుఁడు.)

కుఱఁగలి. దే. వి. ఔ. చేరువ,సమీపము. "వ... ఇచ్చోటికిఁ గుఱంగట..." భార. ఆది. ౭, ఆ. ౧౫౭. జై. ౧, ఆ. ౫౭. విశే. దగ్గఱ దైనది. చేరువను గలది."వ...ప్రభాసం బనుతీర్థంబునకుఁ జని యందులకు ద్వారావతిపురంబు కుఱంగలి యని విని..." భార. ఆది. ౮, ఆ. ౧౬౩."క. చాలఁ గుఱంగటిమనుఁగుల..." కువల. ౨, ఆ. ౧౦౯.

కుఱకుఱ. దే. విశే. అత్యల్పము. "క. కుఱకుఱ వేలుపుఁ బెఱవలఁ,జెఱపట్టినయటులె..." అచ్చ. సుం. ౫౦. "క. పఱతెంచి పనము వెఱకుట, కుఱకుఱ రక్కసుల నొక్కకొందఱఁ గేలన్,విఱుచుట...." రామా. ౬, ఆ. ౭౩౪.

కుఱు. దే. విశే. (క. త. కురు. వ్యుత్పత్తియందు 'కుఱుచ' శబ్దమున కంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీని కచ్చుపర మగునపుడు 'ఱ' వర్ణము నకు ద్విరుక్తటకార మాదేశ మగును. ఉదా:— కుఱు+ఉసురు=కుట్టుసురు మొ.) పొట్టి; చిన్న. "కుఱుగద్దె" ఆము. ౪, ఆ. ౫౮. "కుఱుగాఁడి." శుక. ౨, ఆ. ౪౦౮.

కుఱుకు. దే. వి. ప్రోఁగు. (చూ. కుఱుకులుగొను, కుఱుకులుగట్టు.)

కుఱుకులుగట్టు. దే. అ. క్రి. (కుఱుకులు+కట్టు.) ప్రోఁగగు,రాశిగా నేర్పడు. "మ. కుఱుకుల్ గట్టె భటాంగముల్..." భార. ద్రో. ౪, ఆ. ౮౩. ద్వి. హరిశ్చ. పూ. ౧౮౪౨. పం.

కుఱుకులుగొను. దే. అ. క్రి. (కుఱుకులు+కొను.) కుఱుకులుగట్టు, ప్రోఁగగు. "మణిగణనికరము. గొడుగులపఱియలు గుఱుకులుగొనుటన్." భార. స్త్రీ. ౨, ఆ. ౩.

కుఱుగడ. దే. వి. (కుఱు+గడ.) గడవంటియినుప సాధనము. "వ...విఱిగిపడిన కుఱుగడలును..." జై. ౫, ఆ. ౨౦. [మాల.)

కుఱుగొను. దే. అ. క్రి. త్వరపడు. (ఆంధ్రధాతు

కుఱుచ. దే. వి. (త. కుఱుచు.) 1. అచిరకాలము. "వ...ప్రాణభయంబు...నిడుపు గుఱుచల నెప్పుడుఁ దప్పదు..." ఆము. ౬, ఆ. ౩౦; 2. హ్రస్వమగుఅచ్చు. "క. కుఱుచలపై యరబిందులు,నెఱయఁగ నూఁదినను జెల్లు..." అం. భూ. ౫౭; 3. ఒకానొకయశ్వగతి. "చ. పతి యలతేజి నెక్కి...కుఱుచల్ వడి నూకి..." చంద్రా. ౨, ఆ. ౭౦; 4. లొచ్చు,కొద. సాం. ని. మాన. ౪౦. విశే. (దీనికి వ్యుత్పత్తియందుఁ గొన్ని యెడల నంత్యవర్ణలోపము.) 1. పొట్టి, చిన్న. "సీ. కుఱుచచేతులు..." భార. అర. ౧, ఆ. ౩౦౦. "ద్వి. కుఱుచమాటల..." ద్వి.హరిశ్చ. పూ. ౨౭౩౧. పం; 2. చులకన, లఘువు. "ద్వి. ననుఁ గుఱుచగఁ జేసె నరనాథుఁ డనిన." రం. రా. ఉ. ౧౩౨. పు. "శా...నన్గుఱుచ గావింపన్ దనున్ మెత్తురే." ఆము. ౬, ఆ. ౧౦౯.

కుఱుచేపడు. ద్వ. అ. క్రి. (కుఱుచ+పడు.) తగ్గు. (శ. ర.)

కుఱుచేపఱుచు. ద్వ. స. క్రి. (కుఱుచపడు. ధా. ప్రే.) 1. తగ్గించు, హ్రస్వముచేయు. "గీ...అవీర్వర వరుఁడు, మఱిపమోదమునగతిమేను గుఱుచ పఱిచి." భా. రా. సుం. ౪౮; 2. అసత్యపఱుచు, లాఘవముచేయు. "క. నెల యందురు తామర యని, పలుకుదు రీమోము బుధులు భవ్యామృత ము,జిలుకఁగరాజ మరందము, గులుకఁగ వలదే బుధో క్తిఁ గుఱుచపఱిచెదే." కాళిం. ౬, ఆ. ౯౩.

కుఱుచేలుద్రొక్కు. దే. అ. క్రి. (కుఱుచలు+త్రొక్కు.) నర్తించు, మిక్కిలి చలించు. "చ... హారముల్, గుఱుచలుద్రొక్క ముంగురులు క్రొంజె మటల్ బదనెక్క వేలుపుం,దెఱవ యొకర్తు..." వసు. ౫, ఆ. ౭౫.

కుఱుచేసేయు. దే. స. క్రి. (కుఱుచ+చేయు.) 1. త్రోసిపుచ్చు. "వ...నీవును నాపలుకులు గుఱుచ సేయక..." భార. విరా. ౪, ఆ. ౭౯; 2. వ్యర్థముచేయు. "ఉ...నా,చిత్తము పూనికం గుఱుచసేసినసోలముతోడి నట్ బియో,ద్వ్రత్త విశాలవక్షమునఁ దేజెమునట్లుగ వ్రాసి చూపి నా,యుక్తలపాటు మాన్పుము..." కవిక. ౩, ఆ. ౧౦౭.

కుఱునువ్వు. దే. వి. (కుఱు+నువ్వు.) నాసిరకపు నువ్వులు. హంస. ౪, ఆ. ౧౨౭.

కుఱుపంది. దే. వి. (కుఱు+పంది.) ఒకవిధమైనలేడి. (బ్రౌ.)

కుఱుపు. దే. వి. (క. కురు. త. కురుప్పు.) 1. అల్ప వ్రణము. ఆం. భా. ద్వి. ౧౭౯; 2. వ్రణము. (శ. ర. వా.)

కుఱుమట్టము. దే. విశే. (కుఱు+మట్టము.) పొట్టిగను బుష్టిగను నున్నది. (కుదిమట్టముఅనివాడుక.) "క..., కుఱుమట్టపు,బొట్టివడుగు గొంత నటిం చెన్." భాగ. ౮. స్కం. ౫౩౮. "మహాస్రగ్ధర. ...కుఱుమట్టం బైనతోఁకం గొని విసరు వెసం గూలఁగా సాలపం క్తుల్..." వరాహ. ౧౨, ఆ. ౩౨.

కుఱుమాడు. దే. వి. ఇంటిమూలకప్పు. (శ. ర. బ్రౌ.)

కుఱుమాపు. దే. విశే. (కుఱు+మాపు.) కొంచెము మాసినది. "సీ. కుఱుమాపు దడిపుంపుఁగోకలాఁ దొలఁకెడు కంపమాన నితంబకాంతిసొంపు." కళా. ౪, ఆ. ౧౦౮.

కుఱుమాపుడు = కుసుమాపు. "క...కురు మాపుడుఁ బుట్టం, బలవడఁ గట్టి..." భార. విరా. ౧, ఆ. ౫౯౧. నైష. ౭, ఆ. ౧౪౧.

కుఱువు. దే. వి. ఊరువు, తొడ. "వ. అక్కాలమలి యొక్కనాఁడు దనకుఱువు దలయంపిగాఁ గృష్ణు జినాస్తరణంబున నిజవాఘుండు నిద్రితుండై యున్నయవసరంబున..." భార. ఆది ౨, ఆ. ౧౫౮. 'గీ. పాణిపుటశీధుపాత్రంబుఁ బొఱవైచి, కుఱువుపై నున్న కిన్నర నుఱుకఁ ద్రోచి." పాండు. ౫, ఆ. ౧౩౬; 2. (క. కుఱువ. కొండమీఁది త్రోవ, కురువ. అని శ. ర.) గట్టు; గుట్ట. "ద్వి. గొల్లమల్ డిగ్గుచుఁ గుఱువు లెక్కుచును." పండితా. పర్వ. ౩౫౯ పు.

కుఱ్ఱ. దే. వి. 1. బాలుఁడు, చిన్నపిల్లవాఁడు. "ఆ. కోరు మెద్దియైనఁ గుఱ్ఱ నీవు." భాగ. ౭ స్కం. ౩౨౭. ఆం. భా. ద్వి. ౧౧౮; 2. కొడుకు, పుత్త్రుఁడు. "గీ. ఎన్నఁ గొమరులు కల్గక యున్న వారి, కింద నందును నెమ్మది బొంద దనుచుఁ, బుడమి వేలుపుఁబెద్దలు నుడువుచుందు, రట్లగుటఁ గుఱ్ఱ లేక నాకు నబ్బవలయు." అచ్చ. బాల. ౫౦. ర౦. రా. అయో. ౧౨౫ పు. విశే. చిన్నది, అల్పవయస్సు గలది. ఉదా:—కుఱ్ఱవాఁడు, కుఱ్ఱదిమొ. (కొన్నిచోట్ల నిది సమాసోత్తరపద ముగా నుపయుక్తము. ఉదా:—కొడుకుఁగుఱ్ఱ.)

కుఱ్ఱఁడు. దే. వి. కుఱ్ఱ, బాలుఁడు. "క...నందుని, కుఱ్ఱనిచరితామృతంబు..."భాగ. ౧౦ స్కం. పూ. ౬౩౩. ౯ స్కం. ౨౧౫. విశే. కుఱ్ఱ,చిన్న వయసువాఁడు. "సీ. కొడుకుఁగుఱ్ఱఁడు చన్ను గుడువ కట్టుంట విచారించి..." పరమ. ౧, ఆ. ౧౩౯.

కుఱ్ఱి. దే. వి. ఆవు, గోవు. "వ...ధర్మదేవుండు దన సమీపంబున లేఁగ లేనిలేఁగటి కుఱ్ఱిచందంబున హతప్రభయై...ఉన్నధాత్రి కిట్లనియె." భాగ. ౧, స్కం. ౩౯౫. భార. ఆది. ౭, ఆ. ౧౦౧; ౫, ఆ. ౨౧౮.

కుట్టు. దే. అ. క్రి. (త. కుట్టు.) కూయు. (శ. ర. బ్రౌ.) వి. కూఁత. "సీ. వెల్లుగాఁ బొలుచు పూరేళ్లకుట్టులసద్దు దొడ్డ యాబెళగువ్వ లొడ్డు రవళి." చంద్రా. ౨, ఆ. ౮౧.

కులకము. సం. వి. అ. న. 1. నాలుగింటికి పైఁగా నుండి యొకక్రియతో ముగియుపద్యావళి; 2. చేఁదుపొట్లచెట్టు; 3. సమూహము. పుం. 1. కాకితుముకిచెట్టు; 2. మరువముచెట్టు; 3. పుట్ట.

కులకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) కులశ్రేష్ఠుఁడు.

కులకుల. దే. వి. క్రిమికీటకాదులు గుంపులుగా నుండుచోఁ గలుగుధ్వని కనుకరణము. (చూ. కులకులలాడు.)

కులకులలాడు. దే. అ. క్రి. (కులకులలు+ఆడు.) కులకులమను. (వా:- పేలు కులకులలాడుచున్నవి. పురుగులు కులకులలాడుచున్నవి.)

కులట. సం. వి. ఆ. స్త్రీ. 1. అంకుటాలు; 2. పతివ్రత యగుభిక్షుకస్త్రీ.

కులటుఁడు. సం. వి. అ. పుం. దత్తపుత్త్రుఁడు.

కులపతి. సం. వి. ఇ. పుం. 1. వంశశ్రేష్ఠుఁడు; 2. పదివేలశిష్యుల నన్నదానాదులచేఁ బోషించి యధ్యయనము చేయించుబ్రహ్మర్షి. "శ్లో. మునీనాం దశసాహస్రం యోఽన్నదానాదిపోషణాత్, అధ్యాపయతి విప్రర్షి రసౌకులపతిః స్మృతః." (వాచ.)

కులపర్వతము. సం. వి. అ. పుం. ప్రధానపర్వతము. (మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము —ఇవి సప్తకులపర్వతములు.)

కులపాలి. సం. వి. ఈ. స్త్రీ. కులస్త్రీ, సద్వంశము సచ్ఛీలము గలయాఁడుది.

కులపాలిక. సం. వి. ఆ. స్త్రీ. కులపాలి.

కులము. సం. వి. అ. న. 1. వంశము; 2. జాతి. (ఉదా:—విప్రకులము.); 3. ఇల్లు. (ఉదా:—గురుకులవాసము.) 4. ఊరు; 5. దేహము. పుం. పిల్లి. (శే. ని.)

కులవంతుఁడు. సం. విశ. (తా. వతీ. తా.) కులీనుఁడు, సత్కులజుఁడు. ఇట్లే: కులసంభవుఁడు, కులీనుఁడుమొ.

కులస్త్రీ. సం = కులపాలి. ఇట్లే; కులాంగనమొ.

కులాయము. సం. వి. అ. పుం. 1. నీడము, పక్షిగూఁడు; 2. ఇల్లు; 3. ప్రదేశము.

కులాలము. సం. వి. అ. పుం. 1. కుక్కుభము, అడవికోడి; 2. కౌశికము, గ్రుడ్లగూబ.

కులాలుఁడు. సం. వి. అ. పుం. కుంభకారుఁడు, కుమ్మరి.

కులి. సం. వి. న్. పుం. కొండ. ఇ. పుం. చేయి. ఇ, ఈ. స్త్రీ. వాఁకుడుచెట్టు. ఈ. స్త్రీ. భార్యయొక్క అక్క, వదినె. (వై. ని.) విశ. (న్. నీ. న్.) కులవంతుఁడు.

కులికించు. దే. స. క్రి. (కులుకుధా. ప్రే.) కులుకఁ జేయు. (చూ. కుల్కించు.)

కులిరు. దే. వి. (క. కుళిర్.) శైత్యము, చల్లఁదనము. (చూ. కులిరుగొను.)

కులిరుగొను. దే. అ. క్రి. (కులిరు+కొను.) చల్లనగు. "క. కొలఁకులు నెలఁదూఁడులుఁ, దలిరులు నీహారవారిఁ దడిపి నయమునన్, గులిరుగొన మేననొత్తిరి, లలనలు పార్వతికి శీతలక్రియ వెలయన్." కు. సం. ౫, ఆ. ౧౪౯.

కులిశము. సం. వి. అ. పుం. వజ్రాయుధము. పుం. 1. ఒకజాతిచేఁప; 2. నల్లేరుచెట్టు.

కులీనుఁడు. సం. = కులవంతుఁడు.

కులుకరించు. దే. అ. క్రి. కులుకు, సోఁనలువాఱు. "గీ. పలుకుపలుకున నమృతంబు గులుకరింపఁ, దనుతటిత్కాంతి ధళధళధళ యనంగ, శంబరారాతి మోహనాస్త్రములరీతి, వనిత లేఁగిరి యుద్యానవనమునకును." సాంబో. ౪, ఆ. ౨౧౦.

కులుకు. దే. అ. క్రి. (కులుకు. త. కులుక్కు.) 1. విలాసముగా కదలు. "వ...చెదరినముంగురులు చక్కదువ్వుచు నల్లనల్లన గులుకుచు..." శశాం. 3, ఆ. ౨౧; 2. మిక్కిలి సంతోషించు. "క...కొండయనుఁగుఁగూఁతుఁ గలిసి కులికెడుదొరకున్." అచ్చ. బాల. ౨3; 3. శోభించు, ఒప్పు. "గీ...కంకణాకీర్ణకలిక, లారవమ్ములు గులుకనొయ్యార మొలుక." సా. ౨, ఆ. ౪౭. ఉ. రా. ౪, ఆ. ౧౬3. స. క్రి. 1. పూయు. "చ...అన్నులగుబ్బచన్నులన్, గులికినయేణనాభినవకుంకుమసంకుమదాకపంకసం, కలితవిలేపముల్..." హ. న. ౧, ఆ. ౧౧౧; 2. పోయు. "సీ.

గొజ్జంగిపూఁదేనె కులికి మేడించినకమ్మగస్తురి మేనఁ గలయ నలఁదు." కాశీ. 3, ఆ. ౧౧౮; 3. బాగుగాఁ గదుపు; (వేలితో) రంగరించు. "గీ ఎఱ్ఱగా నగ్నిఁ గాగినయినుపయినుకఁ, గులికి పోయుఁడు వీనిముక్కునను జెవుల." కాశీ. 3, ఆ. ౧౫౨. "గీ. పల్మఱును దేఁటిచిన్నిపాపలకుఁ గులికి, పువ్వుఁదేనియ నుగ్గులు పోసి పోసి." య. ౪, ఆ. ౨౫; 4. చుంబించు, ముద్దుపెట్టుకొను. "సీ...కెమ్మోవిఁ గులికి సీత్కృతులు సలిపి." చంద్రా. ౨, ఆ. ౫. 5. వ్యాపింపఁజేయు, పఱచు. "చ...చీకటుల్,గులికెడునీలిదట్టి..." కువల. ౪, ఆ. ౨౦౨; 6. చిలుకు, వెదచల్లు. "సీ. కొదలుమాటలు తేనెగులుకుచుఁ బలుకుచో ..." కళా. ౬, ఆ. ౧౯౬; 7. కలుగఁజేయు, పుట్టించు. "సీ.వలపులు గులుకుచెంగలువ క్రొవ్విరుల ఱేకులు గానరా నేసకొప్పు ముడిఁచి." వరాహ. 3, ఆ. ౧౧౧; 8. చేయిగలుపు, (బాహాబాహి) పోరు. "క. తలతలతోఁ దాఁకించినఁ,దలమీఱుం గాలుగాలఁ దాఁకించిన మిం,క్కిలికాలు గలుగుఁ జేతులఁ,గులికినఁ దనచేయి మీఁదగున్ ప్రేటున కున్." ఉ. హరి. ౬, ఆ. ౧౦౬. వి. 1. శృంగారపుఁగుదిలిక. "వ...మేలి మైనకులుకుల రసికజనంబులమనంబుల మరులుకొనం జాలి..." స్వా. ౫, ఆ. ౧౦౧; 2. విలాసము. ఆం. భా. ప్ర. ౧౩౯; 3. వలపు, ప్రేమము. "చ...,సరసమృదూక్తులుం గులుకుచల్లెడుచూపులు గల్గి యొప్పు న,త్తరుణిసచేతనాంగము నెదం గదియించిన సౌఖ్య మెట్టిదో." కవిరా. ౫, ఆ. ౩౧. విణ. 1. తుష్టినది, శృంగారపుఁగుదిలిక గలది. "సీ. గుత్తంపుఱవిక దా హత్తకుండఁగఁజేసి కలపంబు కులుకుగుబ్బలను బూయుం." హంస. ౧, ఆ. ౧౨౯; 2. మనోజ్ఞము, ఇంపైనది. "సీ. కులుకుఁబాయపురాచతలిరాకుఁబోఁడులు ..." నీలా. ౧, ఆ. ౨౭.

కులుకుఁదనము. దే. వి. (కులుకు+తనము.) శోభ, కాంతి. (చూ. కుల్కుఁదనము.)

కులుకులాఁడి. దే. వి. (కులుకులు+ఆఁడి.) విలాసిని; స్త్రీ. "గీ. వలపు గులికెడుసింగార మొలుక ముద్దుఁ, జిలుకకడ నిల్చెఁ గోమటికులుకులాఁడి." శుక. ౧, ఆ. ౨౩౭.

కులుప. దే. వి. శోఫ. (శ. ర.)

కుల్కించు = కులికించు. (విలాసముగాఁ ద్రుళ్ళించు.) "మ...గుబ్బచ, న్నులు గుల్కించు మెలంత లున్..."మల్ల. వై రా. ౫౬.

కుల్కు = కులుకు. దే. అ. క్రి. 1 శృంగారముగాఁ గుదులు. "చ. తెలియదు గాక నీకు సుదతీ రతినైపుణిఁ జూపవచ్చునో,..కుల్కవచ్చునో, చెలువుని చెంగటం బరుని చెంగటఁ బోలెఁ గురంగలోచనా." శుక. ౧, ఆ. ౫౨౯; 2. ఒప్పు "దరువు. ఉరమున వల్లకి గుల్క, నదియు హారినామమే వరుసఁ బల్క." మృ. వి. ౧, ఆ. ౧౩. స. ప్రకటించు, వెలిపుచ్చు. "ఉ...మూఢశఁ గుల్కెడు గ్రామ్యచేష్టితం, బావహిలంగ..."కళా. ౬, ఆ. ౧౫౮ వి. విలాసము. "చ...దై, న్యరసం బుప్పతిలన్ నెలంత వలవంతం గుల్కులన్ జెల్కపాం, దరగండచ్యుతబాష్పధార కొనగోటన్ మీటుచున్ బల్కఁగన్." సా. ౨, ఆ. ౧౨౮. విణ. 1. విలాసము గలది; 2. గద్గదికము. "సీ. పసివాళ్లు వాడెడుపదనాబ్జములతోడ వలపుఁ దెల్పెడు కుల్కుటెలుఁగుతోడ. పరమ." ౪, ఆ. ౧౦౧.

కుల్కుఁదనము = కులుకుఁదనము. "గీ. కుందనముఁ గేరు చెక్కుకుల్కుందనంబు, పల్లవము నవ్వుచరణసంపల్లవంబు." చంద్రా. ౫, ఆ. ౧౨౫.

కుల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. కాలువ; 2. తూముకాలువ; 3. నది; 4. తిప్పతీఁగ; 5. సాధ్వి.

కుల్యము. సం. వి. అ. న. 1. ఎముక; 2. మాంసము; 3. చేట; 4. ఎనిమిదిద్రోణములపరిమాణము. విణ. (అ. ఆ. అ.) 1. సత్కులమునఁ బుట్టినది; 2. కులహితమైనది; 3. గొప్పది.

కుల్లా = కుళ్లా. "శా. కుల్లా వెట్టితిఁ గోక సుట్టితి..." (శ్రీనాథునిచాటువు.)

కువ. దే. వి. (త. కువై.) 1. కువ్వ, కుప్ప. (చూ. కువలువడు.); 2. పాంతఱ.,(బ్రౌ.); 3. కోయిల ధ్వని కనుకరణము. (దీనియామ్రేడితరూపము కువకువ.) "చ...కువకువధ్వనిఁ బాఱువికాంగనన్..."స్వా. 3, ఆ. ౯౨.

కువము. సం. వి. అ. న. కువలము, కలువ.

కువరము. సం. వి. అ. పుం. ఒగరు. విణ. (అ. ఆ. అ.) ఒగరైనది.

కువలము. సం. వి. అ. న. 1. నల్లకలువ. "సీ. నద ములఁ గువలకాననవాటి యనుశంక నిందిందిర శ్రేణి యెదురుకొనఁగ. గీ...అంధకారంబు ప్రబలె." భీమ. ౨, ఆ. ౩౫; 2. రేఁగుపండు; 3. ముత్యము; 4. జలము; 5. కలువ.

కువలయము. సం. వి. అ. న. 1. కలువ; 2. నల్ల గలువ. పుం. న. భూమండలము.

కువలయిని. సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లగలువతీఁగ; 2. కలువలసమూహము.

కువలయేశుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. రాజు.

కువలువడు. ద్వ. అ. క్రి. (కువలు+పడు.) కుప్ప గూలు, త్రెళ్లిపడు. "క...వా,సవి వానిరథంబు రథ్యసారథులన్ మహి,గువలువడ నేసె..." భార. ఆది. ౬, ఆ. ౧౩.

కువలేశయుఁడు. సం. వి. అ. పుం. విష్ణుమూర్తి.

కువాడము. దే. వి. 1. కపటకృత్యము. "ద్వి. లోకం బులో లేనిలాటతాఁటకత్తె,నీకువాడమ్ములన్నియుం మాకుఁ దెలియు." ద్వి. పారిజ్ఞా. ఉ, ౧౮౦౪ పం.; 2. కాపట్యము, మోసము. "ఆ. నీకువాడ మెల్ల నిన్నరాతిరి గంటి, నమ్మచెల్ల నిన్ను నమ్మరాదు, నవ్వుగాదు రేయి నాప్రక్కలో నుండి, కలవరింప లేదె చెలుల నెల్ల." రాధా. ౧, ఆ. ౪౧.

కువాడి. దే. విణ. (కువాడము+ఇ) కపటి, మోస గాఁడు. "ద్వి. క్రచ్చఱ ద్వీపాంతరంబున నుండి, వచ్చినయట్టి కువాడివద్రంగి." ద్వి. పరమ. ౭, ఆ. ౫౨౩ పు.

కువాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పరులదోష ములను బ్రకటించువాఁడు; 2. దుష్టాలాపము లాడులాఁడు; 3. చెడ్డవాదము చేయువాఁడు.

కువాళము = కువాడము. 1. కపటపుఁబని. "చ... ఈకువాళముల్, తెలియక వెఱ్ఱిరాజ యిది లెస్స నిజం బని నమ్మినాఁడవే." సా. ౩, ఆ. ౨౦౭; 2. వాహనము మొ.వానిగవుసెన. ఆం. భా. ద్వి. ౧౫౯. విణ. మోసగాఁడు. "గీ...అక్కువాళంపు రక్కసుఁడు." అచ్చ. సుం. ౧౧౯.

కువాళి = కువాడి. "చ...మము౦, జేయుప నుపాయ మెంచి యిలు చేర్చెను దేవరసామ్ముఁ దెచ్చి యీ యఱవకువాళి యింత యఁరియా నని కానక మోసపోయితిన్." వైజ. ౪, ఆ. ౯౫.

కువాళించు. దే. స. క్రి. (మాయామోహాదులచే) వశీకరించుకొను. "మ...,ప్రకటస్నేహ మెలర్ప నాతనిపయిం బద్మావతీకాంత వా,లికక్రొవ్వాఁడి మెఱుంగుఁజూపులఁ నివాళించెన్ గువాళించు చున్." విక్ర. ౧, ఆ. ౨౪.

కువిందుఁడు. సం. వి. అ. పుం. తంతువాయుఁడు, సాలెవాఁడు.

కువిచిలు. దే. వి. ఒకరకపుమట్టిపాత్ర. "చ...చిల్లుల సిబ్బియుం దోనితొట్టియుం,గువిచిలు..." హంస. ౫, ఆ. ౧౨.

కువేణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. చేఁపలబుట్ట.

కువేలము. సం. వి. అ. న. కువలయము, కలువ.

కువ్వ. దే. వి. 1. రాశి. ఆం. భా. ద్వి. ౧౦౧; 2. పాఁతర. (బ్రౌ.)

కువ్వాడము = కువాడము. (శ. ర. బ్రౌ.)

కుశ. సం. వి. ఆ. స్త్రీ. 1. త్రాడు; 2. గుఱ్ఱపుకళ్లెము; 3. అరణి. అ. పుం. న. దర్భ.

కుశబృసి. సం. వి. ఈ. స్త్రీ. దర్భాసనము. "సీ. వన మునఁ గ్రమ్మరువారిఁ గాఁ గుశబృసీశయనాభి రతులఁగా..." భార. అర. ౧, ఆ. ౨౧౦.

కుశము. సం. వి. అ. పుం. 1. కుశద్వీపము; 2. పలుపు. న. జలము.

కుశలము. సం. వి. అ. న. 1. క్షేమము; 2. శుభము; 3. పుణ్యము; 4. పూర్ణత. విణ. (అ. ఆ. అ.) 1. క్షేమమైనది; 2. శుభమైనది; 3. పుణ్యము గలది; 5. నేర్పు గలది.

కుశస్థలి. సం. వి. ఈ. స్త్రీ. ద్వారక.

కుశాగ్రీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కుశా గ్రమువంటిది; 2. సూక్ష్మము. "మ. విలసద్ధర్మ విశుద్ధవృత్తులు వయోవృద్ధుల్ కుశాగ్రీయబుద్ధులు..." భార. ఆది. ౧, ఆ. ౩౫.

కుశి. సం. వి. ఈ. స్త్రీ. నాఁగటికఱ్ఱు.

కుశికము. సం. వి. అ. పుం. 1. నూనె మొ.వాని మడ్డి; 2. తాండ్రచెట్టు; 3. మద్దిచెట్టు.

కుశికుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకరాజు. విణ. (అ. ఆ. అ.) మెల్లకంటివాఁడు.

కుశీలవుఁడు. సం. వి. అ. పుం. 1. నటుఁడు; 2. వంది; 3. గాయకుఁడు; 4. యాచకుఁడు; 5. వాల్మీకి.

కుశుఁడు. సం. వి. అ. పుం. సీతారాములజ్యేష్ఠపుత్త్రుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. మదించినవాఁడు; 2. పాపము చేసినవాఁడు.

కుశేశయము. సం. వి. అ. న. నీటియం దుండునది. పద్మము. పుం. 1. సారసపక్షి; 2. కర్ణికారచెట్టు.

కుషాకువు. సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్నిదేవుఁడు; 3. కోఁతి.

కుషీ. హిం. వి. ఆనందము, సంతోషము.

కుష్ఠము. సం. వి. అ. పుం. న. 1. మహారోగము. 2. చెంగల్వకోష్టుచెట్టు. విణ. (అ. ఆ. అ.) భూమియం దుండునది.

కుష్ఠి. సం. విణ. (న్. నీ. న్.) కుష్ఠరోగము గలవాఁడు.

కుష్ఠు = కుస్తు. (వా.)

కుష్మలము. సం. వి. అ. న. 1. ఛేదనము; 2. ఛాదనము; 3. వికాసము.

కుష్మాండము. సం. వి. అ. పుం. 1. గుమ్మడిచెట్టు. 2. గర్భపిండము.

కుసి. దే. వి. (క. కుసి.) 1. సన్నముగాఁ జెక్కిన మంచముపట్టె మున్నగువానిచివర, పట్టికాగ్రము. ఆం. భా. ద్వి. ౧౬౪; 2. అవయవములసంధి. "సీ. పసిబాలుఁ డగునాఁడ బండిరూపముదైత్య వీరునిఁ గుసులకు విఱుగఁ దన్నె." చిత్ర. భా. ౫, ఆ. ౧౭౨; 3. మొదలు, మూలము. "క... కుసుమశరాసునివిల్లు కుసులకు విఱిగెన్." కకు. ౧, ఆ. ౧౭౯; 4. కార్శ్యము; 5. దుఃఖము. (ఆం. పద.)

కుసించు. దే. అ. క్రి. 1. కృశించు. (ఆం. పద.); 2. దుఃఖించు. (ఆం. పద.)

కుసిగుంపు. దే. వి. 1. బాధ. "క. రుసివంటిదాన నన్నీ, కుసిగుం పొనరించి యేమి గుడిచెదు..." వేం. పంచ. ౧, ఆ. ౨౫౭. ౧, ఆ. ౪౮౯; 2. విసుగు. "క. కొసరువగమాట లలుకలుఁ గుసిగుంపులు తెట్టు మోరికొట్టులు జారం, డసమసుఖం బుగఁ గైకొను, బసవెద్దగు మగఁడు మండిపడుఁ గుసుమూంగీ." శుక. ౧, ఆ. ౫౩౦. విణ. మందము. "ద్వి. కుసిగుంపు నడకల కోడెబాఁపతలు, అసమానగతి వచ్చి..." అ. మ. క. ౫, ఆ. ౨౩౨ పు: ౨ పం.

కుసిలించు. దే. అ. క్రి. కుసులు, అతృప్తిచే దుఃఖించు. (శ. ర. బ్రౌ.)

కుసిలింత. దే. వి. అతృప్తిచేఁ గలిగినదుఃఖము. (శ. ర. బ్రౌ.)

కుసీదము. సం. వి. అ. న. వడ్డివ్యాపారమువలన చేయు జీవనము.

కుసీదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కుసీదము కలవాఁడు.

కుసుంబా. వై. వి. (సం. కుసుంభః.) ఎఱుపు మించిన పసుపురంగు. "సీ. కనకపుష్పముల నొప్పినకుసుంబాపాగ..." వేం. మా. ౧, ఆ. ౧౩౪. మృ. వి. ౧, ఆ. ౩౨.

కుసుంభము. సం. వి. అ. పుం. 1. కుంకుమచెట్టు; 2. కమండలువు. న. 1. కుంకుమపువ్వు; 2. బంగారము.

కుసుంభరాగము. సం. వి. అ. పుం. నాయికానాయకుల పూర్వానురాగభేదము, బయటికి మాత్రము విశేషముగాఁ గానవై లోపల బొత్తిగా లేని యనురాగము. (నాయికానాయకుల పూర్వానురాగము మూఁడువిధములు. 1. నీలీరాగము. (పైకి శోభింపకున్నను హృదయమున గాఢముగా నుండి యెన్నఁటికిని జెడనియనురాగము; 2. మంజిష్ఠారాగము. (పైకి మిగుల శోభించునదియు నెన్నఁటికిని జెడనిదియు నగుననురాగము.); 3. కుసుంభరాగము.)

కుసుని. దే. వి. వామనుఁడు, పొట్టివాఁడు. ఆం. భా. ద్వి. ౧౨౩. (బ్రౌ. 'కుసులి'ముద్రి.)

కుసుమ. యం. దే. వి. (క. కుసుంబె. త. కుసుంబం.) 1. ఒకజాతిచెట్టు. (శ. ర.); 2. ఒకజాతిపూలమొక్క. (బ్రౌ.); 3. ఒకవిధ మగుసస్యము. బ. ధాన్యవిశేషము. "సీ. కుసుమ వెల్లగిసెయుం గోఁగు జనము." హంస. ౪, ఆ. ౧౨౭; 4. సుంకు. ఆం. భా. ద్వి. ౨౩౭. వై. వి. (పుం. కుసుంభః.) *1. ఎఱుపు మించినపసుపురంగు. "గీ.

కుముదకేదారమునసుండి క్రొత్తవిరియు, కమల షండంబులకు వేడ్కఁ గాపువచ్చు, కొదమతుమ్మెద కడతెక్కఁ గుసుమ పెట్టె, నభినవం బైన ప్రథమ సంధ్యాగమంబు." నైష. ౧, ఆ. ౫; 2. కుసుంభము. "సీ. పసిఁడికమ్ములతోడి కుసుమపూవన్నియ నిద్దంపుఁబుట్టంబు నెఱయఁ గట్టి." కాశీ. ౭, ఆ.౫.

కుసుమధన్వుఁడు. సం. వి. న్. పుం. మన్మథుఁడు.

కుసుమపూరాజనాలు. ద్వ. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౨౦.

కుసుమము. ఉభ. వై. వి. కుసుంభవర్ణము. "క. కుసుమం బబ్బినవిధమునఁ, బసుపున హత్తించినట్లు బంగారమునం, బస నిచ్చినగతి సంధ్యా, వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్." నైష. ౧, ఆ. ౨౫౭. బ. ధాన్యవిశేషము. ఆము. ౧, ఆ. ౬౬. సం. వి. అ. పుం. న. 1. పూవు; 2. స్త్రీరజస్సు; 3. పండు; 4. కంటిలోనిపువ్వు.

కుసుమాంజనము. సం. వి. అ. న. ఇత్తడిమలమునుండి తీయుకాటుక, పుష్పాంజనము.

కుసుమాకరము. సం. వి. అ. పుం. 1. తోఁట; 2. వసంతఋతువు; 3. పూగుత్తి.

కుసుమాగమము. సం. వి. అ. పుం. వసంతఋతువు.

కుసుమాధిపము. సం. వి. అ. పుం. చంపకము.

కుసుమాలుఁడు. సం. వి. అ. పుం. దొంగ, చోరుఁడు. (కల్ప.)

కుసుమాస్త్రుఁడు. సం. వి. అ. పుం. పుష్పబాణుఁడు, మన్మథుఁడు. ఇట్లే: కుసుమాయుధుఁడు, కుసుమబాణుఁడు, కుసుమశరుఁడు, కుసుమేషువు మొ.

కుసుమించు. సం. అ. క్రి. పుష్పించు, పూచు. (బ్రా.)

కుసులు = కుసిలించు. (శ. ర. బ్రా.) వి. 1. దండకడియము. (బ. కుసుళ్లు.) "సీ. సందిట నిరువంక నొందుపైఁడికుసుళ్లనందంబు నొందు రుద్రాక్షపూస." శుక. ౨, ఆ. ౩౨; 2. (సం. కుశలమ్.) సుఖము, సౌఖ్యము. (ఆం. పద.)

కుసూలము. సం. వి. అ. పుం. ధాన్యము పోయుం బాణక; గాదె.

కుసృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. చెడ్డనడవడి; 2. ఇంద్రజాలము. విణ. (ఇ) దుర్వృత్తి గలవాఁడు.

కుస్టు. వై. వి (సం. కుష్ఠమ్.) కుష్ఠరోగము. ఆం. భా. ద్వి. ౧౨౦.

కుస్తరించు. దే. స. క్రి. 1. బుజ్జగించు, లాలించు. "సీ. నిండుకౌఁగిటఁ జేర్చి నెమ్మిమైఁ దోఁడేలు గొదమచి...తుచు గుస్తరించు." కాశీ. ౨, ఆ. ౪౩; 2. (లాలింపు) తట్టు. "చ...అతఁడొదలఁ గుస్తరింపఁగన్." య. ౧, ఆ. ౭౭. (శ. ర. పా. 'ముస్తరింపఁగన్' ముద్రి.); 3. ఓదార్చు. "గీ. పొరలి యేడ్చుచు నుండనబ్బోటు లేల,కస్తి పడెదమ్మ యని యుత్తి కుస్తరింప." సా. 3, ఆ. ౪౨; 4. శాంతి పొందించు. "ఉ...,పంచశరవ్యథం దలఁకుభావము నేగతిఁ గుస్తరించెదన్." విక్ర. ౬, ఆ. ౩౧; 5. ఒప్పించు. "గీ. పద్మ దంబున వసుమంతుఁ దుమ్మలించి, కూర్మి బంధుల నందఱఁ గుస్తరించి, గోలయుఁ బతివ్రతాధర్మశీల యగుచుఁ, బ్రాణపద మైనయిల్లాలిపజ్జఁ జేరె." శుక. ౧, ఆ. ౧౦౭; 6. కొలుచు. "గీ. కుండలా ముఖతీర్థంబుఁ గుస్తరించి." భీమ. ౧, ఆ. ౨౧; 7. ధరించు. "సీ. సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి కురులపైఁ జిన్నిపూఁగుస్తరించి." కాశీ. ౭, ఆ. ౧౪౭; 8. కప్పు. "సీ. జాలినీలపుఁదాళి చాకచక్య ప్రభల్ కస్తూరినెఱిపూఁతఁ గుస్తరింప." సా. ౧, ఆ. ౭౯; 9. ఆఘ్రాణించు. "సీ. బిరుదుపస్తాదులఁ బేర్వేర నాడాడ మస్తాదుగా నిల్వఁ గుస్తరించి." రంగా. ౨, ఆ. ౧౯౧; 10. సంతోషింపఁజేయు. (చూ. కుస్తరింపు.)

కుస్తరింపు. దే. వి. (కుస్తరించు. ధా.) సంతోషహేతువు, ఉల్లాసకారణము. "ఉ...జారిణీ, జారులకుస్తరింపు జలజంబులకుం దలవంపు... చీకటిగుంపు..." ల. వి. ౪, ఆ. ౪౧.

కుస్తుంబరి. సం. వి. ఈ. స్త్రీ. ధాన్యాకము, కొత్తిమిరి.

కుస్తుంబురువు. సం. వి. ఉ. న. = కుస్తుంబరి.

కుస్తుభుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. సూర్యుఁడు.

కుహకము. సం. వి. అ. న. 1. ఇంద్రజాలము; 2. మోహము.

కుహన. సం. వి. ఆ. స్త్రీ. కపటచర్య.

కుహానము. సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పుట్ట. న. మాయ. విణ. (అ. ఆ. అ.) 1. ఈర్ష్య గలది; 2. మాయ గలది.

కుహరము. సం. వి. అ. న. 1. రంధ్రము; 2. గుహ; 3. తొఱ్ఱ; 4. చెవి.

కుహువు. సం. వి. ఊ. స్త్రీ. 1 చంద్రకళ కానరాని యమావాస్య; 2. కోకిలధ్వని.

కుహేళి. సం. వి. ఈ. స్త్రీ. దట్ట మగుమంచు, మూడ మంచు.

కుళము. దే. వి. (త. కుళమ్.) కొలను, చెఱువు "గీ... ఇవి మఠంబు,లివియ మణిమయపుందాతు లివి కుళంబు,లు...చెన్న." ౩, ఆ. ౪౫.

కుళాయ = కుళ్లాయ. "క...., శిరమున మిసిమికుళా యలు, ధరియించి చెలంగి రఖిలతరుచరము ఖ్యుల్." ఉ. రా. ౫ ఆ. ౨౭౦.

కుళాయి వై.వి.కుళ్లాయ. య. ౧,ఆ. ౭౫. ఆం.భా. ద్వి. ౧౫౫; 2. నగరములలో వివిధప్రదేశములకు నీటి నందించుగొట్టము. (వా.)

కుళీరము. సం. వి. అ. పుం. కర్కాటము; 2. కర్కాట కరాశి.

కుళుపు. దే. వి. ఉంగరమునకుఁ బొదిగెడివిశాల మగు మణివిశేషము. "చ...అ,చ్చెరు వగునీలపుంగు ళుపు చెక్కిన మేలిపసిండిముద్దుటుం,గరము..." చంద్రా. ౧, ఆ. ౮.

కుళ్లా = కుళ్లాయి. "లయగ్రాహి...బురుసాపని బెడం గుగలకుళ్లా..." రా. వి. ౨, ఆ. ౩౯.

కుళ్లాయ=కుళ్లాయి. "క. తల గలిగినకుళ్లాయలు..." సా. ౨, ఆ. ౧౬. (శ. ర. పా.)

కుళ్లాయి. వై. వి. (సం. ఖోలకః. క. కుళ్లాయి. త. కుల్లా.) 1. చిన్నటోపి. "సీ. పరిజనంబులు వీఁచు సురఁటి తెమ్మెరల బంగరువ్రాఁతకుళ్లాయి కళలు గదల." చంద్రా. ౨, ఆ. ౯౩; 2. సవరము? "క. పేరోజంబులకుళ్లా, యారాజకుమారుశిరసు నందుఁ దలిర్చెం,గారణ మానవనందకుమారక మస్తాగ్రపింఛమంజరి యనఁగన్." సాంబో. ౩, ఆ. ౭.

కుళ్లు. దే. అ. క్రి. 1. చెడు, పాడగు; 2. దుఃఖించు, విచారించు. "గీ. రాజముఖులార వరముఖాంభో జులార, చారుబిసబాహులార రంభోరులార, కందఁగా నేల ముడుఁగుచుఁ గుంద నేల,కుళ్లఁగా నేలతలవంపుగొ ళ్లవేల." చంద్రా. ౪, ఆ. ౨౫౮. (పైరెం డర్థములకు నుదాహరణము.) వి. 1. మనోవ్యథ. (వా.); 2. కాపట్యము. (వా.) 3. కుళ్లినపదార్థము. "గీ. కుళ్లుఁదిత్తికిఁ గవిసిన కుక్కవోలె." రామలిం. ౮౩.

కుళ్లుకుళ్లు. దే. వి. దగ్గుటయం దగుధ్వని కనుకరణము. "గీ...కుళ్లుకుళ్లున దగ్గుకొనుచు,నుండు మనుజుండు జర తన్ను నిండ ముంప." శివధ. ౫, ఆ. ౬౮.

కుళ్లుకొను. దే. అ. క్రి. (కుళ్లు+కొను. స్వార్థమున.) దుఃఖించు. "సీ. గొఱియమందల నించుకొన నైతిఁ గా యంచు గొల్లవాఁ డూరకే కుళ్లుకొనఁగ." శుక. ౨, ఆ. ౫౬౩.

కుళ్లుపోతు. దే. విణ. (కుళ్లు+పోతు.) దుఃఖశీలుఁడు. (శ. ర. బ్రా.)

కూ

కూ. దే. వి. 1. కూయు, మొఱ్ఱ. "ఆ. అకట యాఁడు కూయుం నాలకూయును లాఁతి, వారికైన నరయ వలయు..." భార. విరా. ౨, ఆ. ౧౭౭; 2. పిలుచునపుడు బదులుచెప్పునపుడు నెచ్చరించు కొనుపదను. (శ. ర.); 3. కోయిల కోడి మొ. కూయుటయం దగుధ్వని కనుకరణము. (వా.)

కూఁక. దే. వి. 1. కూఁత. "మ...మత్తిల్లుకో,వెల సీకారులకూఁకపాట లమరన్..." య. ౪, ఆ. ౧౨; 2. అఱపు. "గీ. తోఁక యల్లార్చి కేవుఁ గూఁకఁ బెట్టి." అచ్చ. సు. ౧౦౭; 3. మొఱ్ఱ. "సీ. ఒకమూల దాఁగి పేదకులకూఁకలు విని కలఁగి పర్యేద మేనిఁ గప్పువెలఁది." దశా. ౪, అ. ౪౫; 4. కేక. (చూ. కూఁతపెట్టు.) బ. చీవాట్లు. (చూ. కూఁకలువేయు.)

కూఁకటి. వై. వి. (సం. కూటకః) 1. కుంకటి, శిఖ; ముడి. "ఆ. వాఁడి యైనకత్తివాలియమ్మునఁ గొని, పగతుశిరము చెక్క తెగయ గోఱఁగి,నరుల కెల్లఁ జూడ నవ్వగుపట్టుగాఁ, గలయనైదుకూఁకటుల నొనర్చె." భార. ఆర. ౬, ఆ. ౨౫౦. "ఉ... కూఁకటి కందక ఫాలపట్టికన్, విద్దెము సేయు ముంగురులు..." అని. ౨, ఆ. ౨౧; పిల్లజుట్టు, కాకపక్షము. ఆం. భా. ద్వి. ౧౪౫. కాశీ. ౪, ఆ. ౬౯; 3. నెమిలిపింఛము. ఆం. భా. ద్వి.

ాజు; 4. శిరోజము. "సీ. జడలయల్లిక యూడ్చి సంపెంగనూనియఁ బిన్నకూఁకట్ల జొబ్బిలఁగ నంటి." హ.ర. ౨, ఆ. ౧౦౭; 5. తల్లివేరు. "ఉ...ఈ,గుత్తపుగుబ్బలాఁడిజడ కూఁకటి చీకటి మూలదుంపకు..."విజ. ౨, ఆ. ౧౦౫. విణ. 1. ప్రధానము. "ఉ. కూఁకటివేణితోఁ గురులు కూడకమున్న..." కళా. ౧,ఆ.౭౬; 2. ఁతిది. "క...ఆరఘుకులతిలకు లసుదిసాభ్యుదయతనూ, చారిమఁ గూఁకటిప్రాయము, వార్తై..."రామా. 3, ఆ. ౧౪౭.

కూఁకటిగుడ్లంగి. ద్వ. వి. దాత్యూహపక్షి, భరతపక్షి. (ఆం. పద.)

కూఁకటిగువ్వ. ద్వ. వి. (కూఁకటి+గువ్వ.) ఒకజాతి గువ్వ. ఆం. భా. ద్వి. ౯౮. సాం. ని. తిర్య. ౭౧.

కూఁకటిమువ్వ. ద్వ. వి. (కూఁకటి+మువ్వ.) ఒకజాతి పక్షి. ఆం. భా. ద్వి. ౯౧.

కూఁకటిమూఁగ. ద్వ. వి. (కూఁకటి+మూఁగ.) కూఁకటిమువ్వ. ఆం. భా. ద్వి. ౯౧. ఆం. సం. తిర్య. ౧౫.

కూఁకటివేరు. ద్వ. వి. (కూఁకటి+వేరు.) తల్లివేరు. "క...కూఁకటి, వేళ్లెండక్ మునిఁడికొనలు విఱుచుట గాదే." ప్రబోధ. ౪, ఆ. 3.

కూఁకపెట్టు. ద్వ. వి. (కూఁక+పెట్టు.) కేక కందు దూరము, క్రోశప్రమాణము. "గీ...దాని, చెట్టులకు నెల్ల నరగూఁకపెట్టుపొడువు." వరాహ. ౧౦, ఆ. ౧౨౬. అ. క్రి. = కూఁకవెట్టు.

కూఁకరించు. దే. అ. క్రి. చీవాట్లుపెట్టు, మందలించు. "సీ...రేచి వారిని గూఁకరించి పోవు." సత్యా. ౪, ఆ. ౫౮.

కూఁకలిడు. దే. అ. క్రి. (కూఁకలు+ఇడు.) 1. కూయు, కూఁతపెట్టు. "గీ. తలిరుఁబోఁడుల డెందముల్ తల్లడిల్లఁ, గూఁకలిడుకొంచు నంతయుఁ గొఱఁతలేక, యూఁగడంబునఁ బురి విచ్చి యాడె దేమి." నీలా. 3, ఆ. ౨౭; 2. కేకలువేయు; అల్లరిచేయు. "క. నాకొడుకును నాకోడలు, నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం,గోక లెఱుంగక పాటిఁనఁ,గూఁకలిడెక్ నీసుతుండు గుణమె గుణాఢ్యా." భాగ. ౧౦. సం॥. పూ. 3౨౫.

కూఁకలువెట్టు = కూఁకవెట్టు. (అఱచు.) "క. ఆఁకట మలమలమాడుచుఁ, గూఁకలువెట్టుచును బయటఁ గుపలయసురు ల,త్తాఁకల నుండఁగ నీ కీ,పీఁకక్ భుజియింపఁదగునె విప్రవరేణ్యా." శేష. ౧, ఆ. (శ. ర.)

కూఁకలువేయు. దే. అ. క్రి. (కూఁకలు+వేయు.) 1. కేకలిడు, కేకలువేయు. "సీ. తెరువడ్డు కట్టంగ మరునికింకరులకుఁ గూఁకలు వేయునో కోకిలంబు." పి. శకుం. 3, ఆ. 3౫; 2. చీవాట్లుపెట్టు, మందలించు. (వా.)

కూఁకవెట్టు. దే. అ. క్రి. (కూఁక+పెట్టు.) 1. కూయు. "క. సురగాలి యెదురుపీచెను, వఱడొక్కటఁ గూఁకవెట్టె వసుమతి వణఁకెన్..." మై. ౨, ఆ. 3; 2. కేకలువేయు. "ఉ...దిశల్ వడఁకఁగూఁకవెట్టుచున్." రామా. ౯, ఆ. ౧౦౯.

కూఁకవేటు. దే.వి. (కూఁక+వేటు.) కేకలు విని బెదరి మీఁదఁబడి కఱచుపాము. "సీ. కూఁక వేటులు చిల్లుగులియలు త్రాఁచులు..."ద్వా.౮, ఆ. ౯౮.

కూఁకు. దే. అ. క్రి. క్రుంకు, అస్తమించు. ఆం. భా. తృ. ౯౭. "ఆ. మూఁకఁ గూడి ప్రొద్దు కూఁకు దాఁక." మ. చ. 3, ఆ. ౧౨౫.

కూఁకుడు. దే.వి. (క. కూగటి) కుంకుడు. "సీ... చీకిరేను కూఁకుడు నెమ్మి ప్రేంకణమ్ము." హంస. ౪, ఆ. ౧౧.

కూఁత. దే. వి. (కూయు. ధా.) 1. అఱపు; ఆక్రోశము. "సీ...పరభృతమ్ముల రేఁచి కూఁతలు వేయించెఁ గొమ్మ యొకతె." చంద్రా. 3, ఆ. ౯౭. ఆం. భా. ప్ర. ౧౧౫; 2. ప్రలాపము. "చ...ఓసి యేమిటికితల్ దలపెట్టినదాన విచ్చటన్,బెలియము గాని నీవు పెనుఁద్రిమ్మరికూఁతల దానవే కదా." కళా. ౫, ఆ. ౫౦.

కూఁతకైదువు. దే. వి. (కూఁత+కైదువు.) శంఖము. వేంక. దేవ. ౨౦. సాం. ని. దేవ. ౧౪.

కూఁతనేల = కూఁకపెట్టు. ఆం. భా. ద్వి. ౯.

కూఁతపట్టునేల = కూఁతనేల. ఆం. భా. ద్వి. ౯.

కూఁతవేటుదూరము = కూఁతనేల. "సీ. విను మిచ్చటికిఁ గూఁతవేటుదూరంబునఁ గలదొక్కప్రాదము..." హరిశ్చ. 3, ఆ. ౬౫. ఇట్లే: కూఁతవేటు మేర. కకు. ౨, ఆ. ౮.

కూఁతు. దే. వి. 1. కూఁతురు, పుత్త్రిక. "సీ. పడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతుల..." భార. ఆది. ౩, ఆ. ౫౧. ఆం. భా. ద్వి. ౧౧౧; 2. ఆఁడుపిల్ల, స్త్రీశిశువు. "వ...శకుంతరక్షిత యైన కూఁతు...నెత్తికొని వచ్చి...శకుంతల యను నామం బిడి..." భార. ఆది. ౪, ఆ. ౪౭.

కూఁతురిబిడ్డ. దే. వి. (కూఁతురు+బిడ్డ.)—తనకూఁతురగులక్ష్మికిఁ గూఁతురు—గంగ. ఆం. సం. దేవ. ౩౩.

కూఁతురు = కూఁతు. దే. వి. ౕౌ. 1. పుత్త్రిక, కుమారి. "గీ...ల,తాంగి దుశ్శల యనుకూఁతు రమరఁ బుట్టె." భార. ఆది. ౫, ఆ ౧౦౮. ఆం. భా. ద్వి. ౧౧౧. "ఉ...నీకూఁతురి నీయఁ జూడఁ గలుగున్..." పార్వ. ౫, ఆ. ౭౨; 2. ఆఁడుపిల్ల. "ఆ ..,నలినవదన యెన్నినాళ్లైనఁ జిన్ని కూఁ,తురవు..." కళా. ౪, ఆ. ౬౭; 3. ఆఁడుది. "ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానిది, పట్టిపనికి నుచిత మైనసమయ, మెుదవెఁ దడయుటింక నొప్పను..." భార. ఉద్యో. ౩, ఆ. ౧౯౯.

కూఁతురుబుడమ. దే. వి. (కూఁతురు+బుడమ.) నూఁగుదోసకు. ఆం. భా. ద్వి. ౬౧.

కూకి. దే. వి. 1. పావురము. "చ. కొసరులొ చెక్కు నొక్కుటలొ కూకిరవల్ పలికించి పల్కుటో." అవ. ౩, ఆ. ౧౯; 2. ఒకజాతిపావురము. ఆం. భా. ద్వి. ౪౯.

కూకీ = కూకి. 1. పావురము. ఆం. సం. తిర్య. ౧౩; 2. ఒకజాతిపావురము. "క...బకదార్ఘను గూ, కీలు ననెడుపేరులం దగినపార్వములన్." సా. ౧, ఆ. ౧౨౭.

కూకీపలుకు. దే. వి. (కూకీ+పలుకు.) పావురాపలుకు; రతికూజితము. ఆం. భా. ద్వి. ౧౮౦.

కూకు. దే. వి. 1. ఆమిక్ష, పాలవిఱుగు. ఆం. భా. ద్వి. ౧౭౨; 2. తునియ, ముక్క. (చూ. కూకులు వత్తులు.)

కూకుదుఁడు. సం. వి. అ. పుం. సాలంకృతకన్యాదానము సత్కారపూర్వకముగాఁ జేయువాఁడు.

కూకురుగుండఁగి. దే. వి. పక్షివిశేషము, దాత్యూహము. (శ. ర. బ్రౌ.)

కూకురుగుండె = కూకురుగుండఁగి. ఆం. భా. ద్వి. ౯౩.

కూకులువత్తులు. దే. వి. బ. (కూకులు+వత్తులు.) తుత్తునియలు, ముక్కముక్కలు. "ఉ...రోమపుం,గుమ్మెలఁ బార్శ్వభూజములు కూకులువత్తులుగా...కుంజముల్, గొమ్ములఁ జిమ్ముదాని నొకఘోరవరాహముఁ గాంచి..." వేం. పంచ. ౨, ఆ. ౧౦౫. ౧, ఆ. ౪౯. విణ. కలఁగినది, క్షోభించినది. "క. చిలువదళవాయు లప్పుడు,...కూ,కులు వత్తులునై మొనతల, నిలువక శేషాహికడకు నెఱి చెడి పాఱెన్." జై. ౭, ఆ. ౧౦౨.

కూకువు. దే. వి. ఎనిమిదేండ్లకన్య. (బ్రౌ.)

కూగు. దే. వి. (క. కూగు.) కూఁతవేటుదూరము. "ద్వి. కూగెంట నొక్కొక్కకూటంబు గలదు." పండితా. పర్వ. ౪౮౦. పు. ౧౭. పం.

కూచము. సం. వి. అ. పుం. 1. కుచము. (కల్ప.); 3. ఏనుఁగు. (శే. ని.)

కూచి. ఉభ. దే. వి. (క. కూచి.) 1. (హిం. కూచ్.) దండయాత్ర. (చూ. కూచిసేయు.) 2. శౌర్యము. 'శా...,వానిం జూచిన నీకు నిన్నుఁ గనుఁగొన్నన్ వానికిన్ శోకసం,ధానం బొందఁగఁ జేసినప్పుడుగదా నాకూచి లేకున్నచో, నేనే రంభనె..." కువల. ౫, ఆ. ౪౮. విణ. 1. వాఁడియైనది. "ఉ...పరస్పరవీక్షణంబులన్, గూచి మెఱుంగుబల్చిలుకుఁగోలల పాలయి..." చంద్రా. ౨, ఆ. ౧౩౯; 2. వికసించినది. "గీ. నల్లప్రజపైసరగ దండు వెళ్లఁ దలఁచి, రాజు వేయించు వెలిగుడారం బనంగఁ, దోఁచెఁ బాండిమ ప్రాచిఁదోడ్తోనయందుఁ, గువలయదళము లప్పుడు గూచియయ్యె." సా. ౨, ఆ. ౧౬౧. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది; 2. ఆఁడేనుఁగు. (శే. ని.)

కూచిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కుంచె; 2. తాళపుఁజెవి.

కూచిమతము. వై. వి. సాతానిమతము. "సీ. తనది కూచిమతంబు తమ్ముఁడు బౌద్ధుండు సర్వేశ్వరమతంబు పడ్డకునిది." వేణు. ౬౯.

కూచిమారము. వై. వి. పోకిరితనము. (బ్రౌ.)

కూచిమారుఁడు. సం. వి. అ. పుం. 1. పురుషజాతులలో నొకజాతివాఁడు, కామించిన స్త్రీకి మందులు మాకులు పెట్టి బాధించువాఁడు. (భద్రుఁడు, పాంచాలుఁడు, దత్తకుఁడు, కూచిమారుఁడు,

మనోజ్ఞుఁడు నని యైదువిధముల పురుషజాతు లని కు. సం. ౮, ఆ. ౧౪౫. నాల్గుజాతు లే యని శ. ర. సూ. ని.) 2. కామశాస్త్రగ్రంథకర్త లలో నొకఁడు. "మ. స్మరవాత్స్యాయన కూచిమారకృత శాస్త్రగ్రంథసందర్భముల్ పరిశీలించిన వాఁడ..." నైష. ౨, ఆ. ౫౬.

కూచిసేయు. దే.అ. క్రి. (కూచి+చేయు.) దండెత్తు. "సీ. కూచిసేయింపఁగాఁ జూచెనందమొ యేల చైద్యుఁ డెఱుంగఁడే శార్ఙ్గలతిక." చంద్ర. ౫, ఆ. ౧౨౫. చంద్రా. 3, ఆ. ౫౨.

కూచీ = కూచి. (చూ. కూచీచేయు.)

కూచీచేయు = కూచిసేయు. "శా...ఆరాజు కూ,చీ చేయించి సమంచితతాత్మ బలవత్సేనాసమేతం బుగా." రంగా. ౨, ఆ. ౫౯.

కూచేము. దే. వి. (క. కూచ.) 1. స్తంభము. "సీ. గందంపుఁగూచముల్ పొంకెంచి కురువేళ్ల నల వఁగాఁ గట్టినయట్టిమహిమ." రా. వి. 3, ఆ. ౭౧; 2. కుసి. ఆం. భా. ద్వి. ౧౬౪.

కూజనము. సం. = కూజము.

కూజము. సం. = కూజితము.

కూజితము. సం. వి. అ. న. అవ్యక్తధ్వని.

కూజా. దే. వి. (హిం. కూజా.) నిడు పగుసన్ని మెడ గలపాత్రవిశేషము. (శ. ర. వా.)

కూటకము. సం. వి. అ. పుం. 1. కబరి, కొప్పు; 2. ఒకానొకగంధద్రవ్యము, మూర. న. 1. ఏఁడికోల లేనినాఁగలి; 2. ఫాలము. విణ. (అ. ఆ. అ.) 1. కపటమైనది; 2. కల్లయైనది.

కూటపాకలము. సం. వి. అ. పుం. ఏనుఁగులకు వచ్చెడి యొకవిధమగుజ్వరము. "శ్లో...,కలభం కఠోర ఇవ కూటపాకలః." మాలతీ.౧. ౪౨. "సీ. ఎవ్వాని క్రోధంబు హీనదుర్జనమదేభపరంపరకుఁ గూటపాకలంబు." వేదాంతరసాయనము. ౧, ఆ. ౧౬. (బ్రౌ.)

కూటమి. దే. వి. (కూడు. ధా.) 1. కూడిక. "సీ. ఎలమిఁ బొల్పగుయూథికలకు సంతలకూటముల కును మటి విచ్చుమొగ్గ లొందవె." ఆము. ౪, ఆ. ౧౨౩; 2. చెలిమి. "మ...అచ్యుం డైనసన్నార్గి ఘ్నున్నఁటికిన్ గూటమివంక వచ్చువికృతిన్ మగ్నుండు గానేర్చునే." స్వా. 3, ఆ. ౨౪; 3. సంభోగము. "చ. సరిపల పైఁకూటమికి సాటిఁక లేదుగదా తలంపఁగన్." సా. 3, ఆ. ౧౫౦. ఆం. భా. ద్వి. ౧౭౭.

కూటము. ఉభ. దే. వి. 1. కొలువుకూటము. "క. అలుకుడు మృగమదమున ముగ్గులువెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గోడలు పూయుఁడు మణిదామక, ములు గట్టుఁడు పెద్దకూటమున సొంపారన్." భార. ఉద్యో. 3, ఆ. ౧౫౬; 2. చావడి. "క...దానికన్నుసన్నం, గని కూటములో వసించెఁ గంకటిమీఁదన్." శుక. ౨, ఆ. ౫౨౪. 3. సంభోగము. "క. చని తల్పకేళీగేహం, బున నొకమగవాలి కూటమునకై కమకూర్కని యొక్కజాఁనుతో నిం, పునఁ బొదలుచు నుత్తరంపుమూల రమించెన్." శుక. 3, ఆ. ౬౧౨. సం. వి. అ. పుం. న. 1. కపటము; 2. అసత్యము; 3. గారడీ; 4. దంభము; 5. పాపము; 6. కొండకొమ్ము; 7. రాశి; 8. ఆకాశము; 9. ఒకవిధ మగు బోను; 10. ఫాలము. 11. సమ్మెట; 12. ఒకరకపుబాణము. న. సమూహము. పుం. ఇల్లు. విణ. (అ. ఆ. అ.) 1. కృత్రిమము; 2. అసత్యము; 3. కపటము; 4. నింజితము; 5. నిశ్చలము.

కూటశాల్మలి. సం. వి. ఇ, ఈ. స్త్రీ; ఇ. పుం. కృష్ణశాల్మలి, కొండబూరుగుచెట్టు.

కూటస్థము. సం. వి. అ. న. పులిగోరుచెట్టు. విణ. (అ. ఆ. అ.) ఎల్లకాలము పరిణామాదులు లేక యొక్కవిధముగా నుండునది. (ఆత్మ).

కూటస్థుఁడు. సం. వి. అ. పుం. 1. వంశమూలపురుషుఁడు; 2. పరమాత్మ.

కూటహర్మ్యము=కూటాగారము. "క. తిరుమలదేవీ చరణో, దరలాక్షాకల్పకల్పితస్థలకమల,స్ఫురదిందీవరబంధుర, హరిహయమణివలయ కూట హర్మ్యశ్రీవిహారి." స్వా. 3, ఆ. ౧౪౩.

కూటాగారము. సం. వి. అ. న. 1. మేడమీఁదియిల్లు, చంద్రశాల; 2. క్రీడాగృహము.

కూటాము = కూటము. (శ. ర. బ్రౌ.)

కూటికుప్పలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ... కూటికుప్పలు సారునం పెఁగ..." ప్రబంధ. ౧౧౭.

**కూటిసీల్లు.** దే. వి. (కూడు+సీల్లు.) ఆరనాళకము. (శ. ర. బ్రౌ.)

**కూటిపేద.** దే. విణ. (కూడు+పేద.) తిండిలేనిది; తిండిలేనివాఁడు. "సీ...కూటిపేద. గీ. యైన మృగనేత్ర...;రతి యొసర్పఁగఁ గొఱగాదు రసికులకును." వి. పు. ౪, ఆ. ౨౦. "క...అతఁడనంతవ్యథఁ గూటి పేదయై నెవ్వగలన్." శుక. 3, ఆ. 3౫౫.

**కూటు.** దే. వి. ఒకవిధమగుగాదె, పురి. ఆం. భా. ద్వి. ౨౪౦.

**కూటుకట్టు.** దే. అ. క్రి. (కూటు+కట్టు.) (ధాన్యాదులు) పురికట్టు, గాదెమొ. వానిలో జాగ్రత్త చేయు. (బ్రౌ.)

**కూటువ.** వై. వి. (సం. కూటః. కూడు.ధా.) 1. జనసమూహము. "ఉ...కోరికల్, గోరనివాఁడు గూటువలఁ గూడనివాఁడు..." భాగ. ౧ స్కం. ౫౧౭; 2. కూడిక. "వ...పెక్కింటికూటువ దేహము..." భాగ. ౭, స్కం. ౨3౭; 3. సంభోగము. "సీ. ఇహము పరం బని యెంచుచు గొన్నాళ్లు కూటువ మేలనుఁ గొన్నినాళ్లు." మల్హ. ౧, ౯౯; 4. "క. తోవలార కొదమ జక్కవ, కవలార కడిందిపోయగవుఁడుమ్మెదకూటువలార..." అచ్చ. ఆర. ౮3; 5. ప్రోగు. "క...ఆభరణంబుల్, గూటువలుగ నిడియెద నీక, జోటీ మాటాడి ముద్దు చూపంగదవే." రసిక. 3, ఆ. ౮౦.

**కూటువలుగొను.** దే. అ. క్రి. (కూటువలు+కొను.) గుమిగూడు. "క. పీటఁగలచేడె లెల్లను,...కూటువలుగొనుచుఁ జూచిరి...పద్మదళాక్షున్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౪౮. ఇట్లే. కూటువలుగూడు. రసిక. ౬, ఆ. ౧౯౮.

**కూటువమూఁక.** దే. వి. (కూటువ+మూఁక.) ప్రోగుచేసి తెచ్చినపిఱికిబలము. "చ. అడవులఁ గొండలం బడి మహాపద రూపఱి చన్న వారి నిప్పుడు గొని వచ్చి కృష్ణుఁ డొకప్రోపుగఁ గూటువమూఁకఁ గూర్చినం, బోడుతురె పాండునందనులు..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౦౮. దశ. ౪, ఆ. ౧౧౭.

**కూటువసరులు.** దే. వి. బ. (కూటువ+సరులు.) ఒకవిధమగుహారము, కృత్రిమహారము. "ద్వి. కాటుక చెదరి కన్నవ నీరు జాఱఁ, గూటువసరులఁ జిక్కువడహారములు." పద్మ. 3, ౨౧. (బ్రౌ.)

**కూటువు=కూటువ.** 1. (గుంపు.) "సీ. చవులతోఁ జెందొవపువులతో నసలుఁబుట్టువులతోఁ జిలుక కూటువులతోడ." అచ్చ. ఆర. ౨౬. 2 (సంభోగము) కళా. ౧, ఆ. ౯.

**కూడ.** దే. అవ్య. ద్రు. (క. కూడె. త. కూడు. ధా.) 1. సహార్థకము. "క...మిత్రగణంబుతో సుతులతోఁ గూడన్." భార. ద్రో. ౫, ఆ. ౨౧౦; 2. సముచ్చయార్థకము. "గీ. తారకాధీశ్వరుండు చింతామణియును, గూడ దుగ్ధాంబునిధిలోనఁ గూలుఁగాత." హర. ౬, ఆ. ౨౪; 3. సైతము. వా:—వాఁడు దేవునికూడ లెక్కచేయఁడు.

**కూడఁదీసికొను.** దే. స. క్రి. (కూడన్+తీసికొను.) 1. కూడఁదెచ్చుకొను. (వా.); 2. చేర్చుకొను. (వా.); 3. అనుకూలముగాఁ జేసికొను. (వా:వాఁడు వానిని గూడఁదీసికొని వచ్చినాఁడు.)

**కూడఁదెచ్చుకొను.** దే. స. క్రి. (కూడన్+తెచ్చుకొను.) కూడఁదీసికొను, కుదురుపఱచుకొను. "ఉ...వెండియుఁ, జిత్తము గూడఁదెచ్చుకొను చెప్పకపో దని నిర్ణయించి దగ్గుత్తికవెట్టి లక్ష్మణుఁడు కోమలిఁ జూచుచు నశ్రులొల్కఁగాన్." నిర్వ. ౭, ఆ. ౧౨.

**కూడఁబడు.** ద్వ. అ. క్రి. (కూడన్+పడు. స్వార్థమున.) 1. కూడు, కలియు. "వ...ఏకాంతస్థలంబునఁ దా రేవురును ద్రౌపదియును గూడఁబడునట్టితెఱంగు సంఘటించి..." భార. విరా. ౫, ఆ. 3౦౫. ఉ. హరి. ౫, ఆ. ౨౮౬; 2. కుదురుపడు. "వ...చెదరినచిత్తంబు కూడంబడ..." దశ. 3, ఆ. ౫౨; 3. ముడుఁగు. "గీ. కొన్ని దేశంబులవచేతఁ గూడఁబడియె." కాశీ. ౧. ఆ. ౧3౭.

**కూడఁబాఱు.** దే. అ. క్రి. (కూడన్+పాఱు.) స్వార్థమున.) కూడు, కలిసికొను. "క...అమరులెల్లఁ గలఁగి యన్యోన్యపీడన, భయముఁ బొంది కూడఁబాఱి..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౪౨.

**కూడఁబెట్టు.** దే. స. క్రి. (కూడన్+పెట్టు.) 1. ప్రోగుచేసిదాఁచు, నిలువచేయు. "క. కట్టక కుడువక యొరులకుఁ, బెట్టక తమతండ్రి కూడఁబెట్టినసిరి..." విక్ర. ౨, ఆ. ౧౬3; 2. సమావేశ

పఱుచు, కలిసికొనఁజేయు. "చ. అని తనవంగడం బగుధరాధిపమంత్రిపదాతివర్గముం, బనివడిఁ గూడఁబెట్టి..." ఉ. హరి. ౩, ఆ. ౫; 3. తార్చు; కలుపు. "వ...తగవు గోరియుంబోలెఁ గూడఁ బెట్టుచు..." కవిక. ౪, ఆ. ౧౧౩.

కూడముట్టు. దే. స. క్రి. (కూడన్+ముట్టు.) 1. వెన్నుదవులు. "గీ. గూఢచారుండు నన్నని కూడ ముట్టి." సుద. ౪, ఆ. ౧౨౨; 2. తఱుము; తఱిమి కలిసికొను. "ఆ...పవనుఁ డసుర, లెగిచి కూడముట్ట నెకిరింత యిఱినోరె,గఱిక దిగిచి నోరఁ గఱచుకొనియె." కవిక. ౨, ఆ. ౧౨౦.

కూడలి. దే. వి. (క. కూడల్. త. కూట్టల్.) 1. కాలువ నది మొ. కలిసినచోటు. ఆం. భా. ప్ర. ౧౬౪; 2. సరిహద్దు. (చూ. కూడలితాయి.)

కూడలిదారి. దే. వి. (కూడలి+దారి.) నాలుగు దారులు కలిసినచోటు. (బ్రౌ.)

కూడలిపట్టు. దే. వి. (కూడలి+పట్టు.) సమావేశ స్థలము, పలువురు కలిసికొనుస్థలము. (బ్రౌ.)

కూడలితాయి. దే. వి. (కూడలి+తాయి.) సరి హద్దుగా నేర్పఱిచినతాయి. (శ. ర.)

కూడలివాయి. ద్వ. వి. (కూడలి+వాయి.) రెండు పంచలు కలిసినమూలయం దేర్పఱచిన నీటిదారి. (శ. ర.)

కూడిక. దే. వి. (కూడు. ధా. త. కూడువై.) 1. పొందిక. "క...జక్కవలకూడిక...వెలఁది గుబ్బల కడఁగున్." నీలా. ౨, ఆ. ౨౪; 2. సంభోగము. ఆం. భా. ద్వి. ౧౭౯; 3. కలుపుట. ఉదా:—కూడిక, తీసివేఁత, గుణకారము.

కూడిమాడు. దే. అ. క్రి. (కూడు. ధా.) కలసిమెలసి యుండు, అన్యోన్యప్రేమమున జీవించు. "చ... మీర లోకగాత్రముకై వడిఁ గూడిమాడుచున్, జెలఁగుట యొప్పు..." నరస. ౩, ఆ. ౧౪౭. పిన. శకుం. ౨, ఆ. ౪౯. స. క్రి. రమించు. "సీ. కలధన మెల్లఁ బోకడఁ బెట్టి సన్న్యాసియై బిచ్చ మెత్తనియగ్రజుండు. గీ. లేఁడు ధరలోన రతిసేన, గూడిమాడి, యున్నవిటులందు..." హంస. ౫, ఆ. ౧౨౦.

కూడివచ్చు. దే. అ. క్రి. (కూడు+వచ్చు.) అను కూలమగు. వా:—వాఁ డేపనికి నాతోఁ గూడి రాఁడు, 2. లాభించు. వా:—ఆపనిలో వాని కైగువేలు కూడివచ్చినవి.

కూడు. దే. అ. క్రి. (క. త. కూడు.) 1. గుమి గూడు. "వ...అక్కాడిసపాషండషండంబు తల వంచుకొని పోయిన..." ఆము. ౪, ఆ. ౭౫; 2. దొరకు. "చ...వేగిరమె కావలె భోజన మెట్లు కూడు..." వరాహ. ౪, ఆ. ౧౦౩; 3. కలుగు. "ఉ...ఘోరజరాదిదోపములఁ గూడవు..." వి. పు. ౩, ఆ. ౩౦; 4. ఒప్పు. "వ...దివ్యాభరణంబులతోడం గూడి పార్వతి సర్వలోక నయనోత్సవకర యయ్యె..." హర. ౪, ఆ. ౯౩; 5. సాధ్యమగు. "మ...సహించువంగూడు నే యింద్రజిద్బలము..." క. రా. ౧, ఆ. ౧౫౭; 6. తగు. "ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలు గట్టఁగూడదు..." భార. విరా. ౧, ఆ. ౧౨౩. ఆది. ౬, ఆ. ౨౨౭; 7. సంబంధము కలదగు. వా:—ఇది పదిమందితోఁ గూడినపని. స. క్రి. 1. పొందు. "చ...నేఁడు నాకురుకుల మెల్లఁ బావనతఁ గూడె..." జై. ౯, ఆ. ౧౩౧. ఆం. భా. తృ ౧౯౯; 2. కలుపు. "సీ. లఘువుల క్రింది వెల్లను గూడి వెండియు నొక్కటి గలుపుక యంగ్గళింప. గీ. నైనసంఖ్య వృత్తము..." అప్ప. ౫, ఆ. ౧౪౯. అ. క్రి. స. క్రి. 1. చేరు, కలియు. "గీ. త్రుంకఁబాఱుసహస్రాంశుఁ గూడలేక, వెనుకఁ జిక్కినజరదంశువితతివోలె." నైష. ౨, ఆ. ౪౯; ౯౯; 2. సంభోగించు, రమించు. "క...మునీంద్రుఁడు మన్మథగోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగఁ దివిరెన్." భార. అర. ౨, ఆ. ౩౩౧. శుక. ౩, ఆ. ౧౩౧. వి. పొ. తిండి, అన్నము. "క...కూడుం,జీర నిడి సాకతంబు సేసినఁ జాలున్." భార. విరా. ౧, ఆ. ౨౧౯. "గీ...కూటిలోన..." భార. ఆది. ౭, ఆ. ౨౫౬.

కూడుకొను. దే. స. క్రి. (కూడు+కొను. స్వార్థమున.) 1. కలిసికొను. "వ...అనిలనందనుండు...ద్రుపదపుత్రుం గూడుకొనియె..." భార. భీష్మ. ౨, ఆ. ౩౭౩; 2. మిత్త్రునిగాఁ జేర్చుకొను. "గీ...విహీనులఁ గూడుకొంట...వలదు పలికి." ఆము. ౪, ఆ. ౨౫౨; 3. రమించు. (చూ. కూడొల్కును.)

కూడుగోకలు. దే. వి. బ. (కూడు+కోక+లు.) అన్నవస్త్రములు. "సీ. కఱవుకాలంబుల మఱువుసొచ్చినవారిక్రి కూడుగోక లొసంగిసాఁకెడువాఁడు." పాన. ౧, ఆ. ౧౫౭.

కూడుదల. దే. వి. (కూడు+తల. క. కూడుదలె. త. కూడుదల్.) లాభము, లబ్ధి. "క. వేడు కలర భూదేవికిఁ,గ్రోడాకారంబుఁ జూపి కులికెడుహరికిం,గ్రీడాచల మొప్పినచోఁ,గూడుదలయ కాదె యటకుఁ గొనిపో మ్రింకన్." వేం.మా. ౧,ఆ.౬౮.

కూడునీరు. దే. వి. (కూడు+నీరు.) గంజి. "ఉ. వేళమెకోడికూఁత యగువేళలఁ జల్ది భుజించి బండ్లు గం, గాళముఁ దే..." శుక. 3, ఆ. ౧౦3.

కూడుసీర. దే. వి. (కూడు+చీర.) అన్నవస్త్రాదికము. "క. వినుము గుణవంతుఁ డొకరుఁడు, ధనవంతుం డైనయొక్కధరణీనాథుం,దనకూడుసీరకై కాం, చన మడిగి తదీయబాలిశత్వము పేర్మిన్." భార. శాం. 3, ఆ. ౧౬౫.

కూడ్కొను = కూడుకొను. (రమించు.) "ఆ...ఁదివికి నేఁగినాఁడు,రమణుఁ డగుచు నచట రంభాది సతులఁగూ,డ్కొనకమున్న నన్నుఁగూడ ననుపు." ద్వా. ౧౧, ఆ. ౧౫౧.

కూణి. సం. విణ. (ఇ.) = కుణి.

కూన. వై. వి. (సం. కుణః.) 1. పశుపక్ష్యాదుల శిశువు. ఆం. భా. ద్వి. ౯౯. "ద్వి...పులులను వని,కూనలకును జన్నుఁ గుడిపెడు లేళ్లు." ద్వి. హరిశ్చ. పూ. ౭౪౭. పం; 2. కున్న, బిడ్డ. "క. కూనలఁ గానలకుఁ బంపుకొన నేరుతునే." అచ్చ. బాల. ౧౦౨. విణ. లేఁతది. ఉదా;—లతకూన." వసు. 3, ఆ. ౮౨.

కూనగుంత. వై. వి. (కూన+గుంత.) మీట మొదలు ఆనెడుపల్లము. "గీ. మ్రాను మీటుగ నెగయ గోమాయు వప్పు,డేక తాళప్రమాణ మట్లెగసి కూన,గుంతలోఁ బడి గ్రుడ్లు వెల్కుఱుక నాల్క, నడుముకఱచుక యఱచుచు బెడిసి మడిసె." హంస. ౧, ఆ. ౧౯3.

కూనరాగము. మి. వి. (కూన+రాగము. కూనిరాగమని వాడుక.) అల్పమగుపాట, అల్పముగా రాగము తీయుట. వా:—వాఁడు కూనరాగము తీయుచున్నాఁడు.

కూనరోగము. ద్వ. వి. (కూన+రోగము.) నేత్రవ్యాధివిశేషము. (బ్రా. Opthalmia.)

కూనలమ్మ. వై. వి. (కూనలు+అమ్మ.)—సేవించిన వారికిఁ బిల్లల నిచ్చు—గ్రామదేవత. (చూ. కూనలమ్మపటము.)

కూనలమ్మచీర. వై. వి (కూనలమ్మ+చీర.) ఒకవిధమగు చీర. "గీ...కుఱునూపుకూనలమ్మ,చీర కుడిపైఁట లోపలిసిస్తుఱవిక, యొసఁగఁ జరియించు నిట్టు లయ్యొమ్మెలాఁడి." శుక. ౨, ఆ. ౪౧౧.

కూనలమ్మపటము. మి. వి. (కూనలమ్మ+పటము.) కూనలమ్మ కిష్టమైనచీర, అమ్మవారు కట్టుకొనుచీరవంటి చీర. "సీ. క్రొత్తకమ్ములతోడి కూనలమ్మపటంబుఁ గటివిప్పుగా రెండుకట్లు కట్టి. గీ...అవ్వేశ్య మాత." వైజ. 3, ఆ. ౯౯.

కూని. హిం. వి. (హిం. ఖూనీ.) నరహత్య; దారుణహత్య. (శ. ర. వా.)

కూపకము. సం. వి. అ. పుం. 1. చెలమ; 2. గుంత; 3. చితి; 4. తెఱచాపకొయ్య; 5. నూనెసిద్ది.

కూపకూర్మము. సం. వి. అ. పుం. 1. నూతిలోని తాబేలు; 2.—నూతిలోని తాఁబేలువంటివాఁడు—అల్పవిషయాభిజ్ఞుఁడు. (వాచ.)

కూపమండూకము. సం. వి. అ. పుం. 1. నూతిలోని కప్ప; 2. నూతిలోనికప్పవంటివాఁడు, అల్పవిషయాభిజ్ఞుఁడు. ఇట్లే; కూపస్థమండూకము.

కూపము. సం. వి. అ. పుం. 1. నూయి; 2. గుంట; 3. ఓడతెరచాపకొయ్య; 4. పెండ్లికూఁతురు. (కే. ని. వై. ని.)

కూపారము. సం. వి. అ. పుం. అకూపారము, సముద్రము.

కూపి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుప్పె; 2. అల్పకూపము.

కూపెట్టు. దే. అ. క్రి. (కూ+పెట్టు.) 1. కుయ్యో యను, మొఱ్ఱో యను. "శా. కూపెట్టంగ మహీసుపర్వులమెడల్ గోసెన్..." వరాహ. ౨, ఆ. ౯౮. కాశీ. ౭, ఆ. ౯౦; 2. మొఱ్ఱవెట్టు, ఆర్తిఁ దెలుపుకొను. "క...విపన్నుల్, కూపెట్టిన విని తీర్పము..." ఆము. ౪, ఆ. ౨౦౪. స. క్రి. 1. (తలుపుమొ. కొట్టి.) పిలుచు. "క. తలుపు సడలింపు మనుచుం, గులభామను మాంత్రికుండు కూపెట్టినచో..." హంస. 3, ఆ. ౧౦౫; 2.

ఘోషింపఁజేయు. "ఉ...పద్మజుఁ గూర్చి యేఁగి కూ,పెట్టిరి హస్తములెత్తి మొగిచి పెద్దయెలుంగునఁ దద్గుణస్తుతుల్." హర. 3, ఆ. ౧౧.

కూబరము. సం. వి. అ. పుం. న. బండినొగ. విణ. (అ. ఆ. అ.) సుందరము, రమ్యము.

కూముడి. దే. వి. ద్రోణకాకము, మాలకాకి. (బ్రౌ.)

కూయి. దే. వి. 1. మొఱ్ఱ. "క. కూ యాలింపం గదయ్య గుణరత్ననిధీ." భాగ. ౧౦ స్కం. పూ. ౯౦౬; 2. వార్త; దుర్వార్త. "వ...నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన..." భార. విరా. ౪, ఆ. ౨౯. కాశీ. ౪, ఆ. ౬౬. విణ. రక్షకుఁడు. "చ. అసమున మీ దెఱుంగక మహోగ్రహావృత్తిఁ గడంగి చెచ్చెరం,బసులకుఁగూయిగాఁ జనియె బాపఁడు..." భార. విరా. ౫, ఆ. ౨౩౪.

కూయిడు. దే. అ. క్రి. (కూ+ఇడు; కూయి+ఇడు.) 1. కేకవేయు. "క. ఆయెడ సఖు లొకఁ డొక్కఁడు, కూయిడి జతగూడి కెడసి గునుకు పరువులం, బోయిరి చెంగటియూరుల, కు .." హంస. ౪, ఆ. ౨౨౨; 2. మొఱపెట్టు. "ఉ. కూయిడఁ జొచ్చె మన్మథునకుం గలకంఠమదాళి దంపతుల్, కో యని..." రామా. ౧, ఆ. ౧౯౭.

కూయు. దే. అ. క్రి. 1. అఱచు. "క. మానె నభోమణి నక్కలు, గూసెన్..." భార. విరా. ౪, ఆ. ౮౬. హర. ౭, ఆ. ౧౩౭; 2. మొఱ్ఱోయను. "గీ. తలలు దఱిగి పూజించిన దర్పలీల, నెసఁగు వీరుఁడు సీశైలమెత్తఁబోయి, బాహు లిఱుకంగఁ దాల్మి ని బాసి కూసె." హరి. ఉ. ౬.ఆ. ౯; 3. పలుకు. "గీ. నాయకాగ్రణి దబ్బరల్ గూయసాగె." నిరం. ౪, ఆ. ౬౭.

కూర. వై. వి. (సం. కూరమ్.) 1. ఆకు పువ్వు కాయ మొ. అపక్వశాకపదార్థము. ఆం. భా. ద్వి. ౬౯; 2. పక్వశాకము. "మ...కూరలు చల్ల నారవె మహాత్మా..." హర. ౨, ఆ. ౧౩౧. విక్ర. ౫, ఆ. ౨౧౯. "క. ఈరీతిఁ గడుపునొవ్విం, గూరాకై యుండికి..." వేం. పంచ. ౪, ఆ. ౨౬౦. (మిక్కిలి బాధపడు అని భావము.)

కూరటు. దే. వి. పొరలుట. (శ. ర. బ్రౌ.)

కూరపసుపు. దే. వి. (కూర+పసుపు.) కూరలలోఁ జేర్చెడుపసుపు.

కూరము. సం. వి. అ. పుం. న. అన్నము, వంటకము.

కూరముక్కు దే. వి. (కూర+ముక్కు.) ఒకజాతి చేఁప. "గీ. మోర పక్కెర దొందును గూర ముక్కు...ఆది యగుమీలఁ బట్టు నతఁడు." హంస. ౪, ఆ. ౧౮౭.

కూరాకుచేయు. ద్వి. స. క్రి.—కూరాకుఁ ద్రుంచు నట్లు త్రుంచివేయు—సులువుగాఁ జంపు. "గీ. పులులఁ జట్టలు చీరి దుప్పులను లేళ్ల, నేకలమ్ములఁ గ్రుమ్మి కూరాకుచేసి." సా. ౧, ఆ. ౯౦.

కూరాకుపురుగు. ద్వి. వి. (కూరాకు+పురుగు.) ఆకుఁ గూరలకుఁ బట్టు నొకానొకపురుగు. (బ్రౌ.)

కూరాడు. దే.వి. ధాన్యామ్లము, పులియఁబెట్టినకడుగు నీరు. ఆం. భా. ద్వి. ౨౫౦.

కూరిచి. దే. అవ్య. కూరుచుధాతువునకు క్త్వార్థక రూపము, గుఱించి. "క. అమ్మునివ చనలఁ గూరిచి, యమ్మా..." శుక. 3, ఆ. ౫౯౩. అప. ద్వితీయావిభక్తియం దుద్దేశార్థమున వచ్చు ప్రత్యయము.

కూరిమి. దే. వి. (కూరుచు. ధా.) 1. ప్రేమ. ఆం. భా. ప్ర. ౧౩౬; 2. వాత్సల్యము. (చూ. కూర్మి.) 3. స్నేహము. "క. కూరిమి గలదినములలో, నేరము లెన్నఁడును గలుగ నేరవు..." సు. శ. ౩౮; 4. వలపు. "క. వారిజలోచన నీపైఁ, గూరిమి గల మగని వెదకికొనుము..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౫౦; 5. వలపుతమి; తీవ్రానురాగము. "చ. వనజదళాక్షి నీవు మదవస్థ తెఱంగెఱిఁగింప నాదరించునొ యటుగాక కూరుములు చూపుచు నంగడి వాయ కింపులన్, దనిపెదుపువ్వుఁబోండ్లకు ముదం బొదవన్ బరిహాసకంబు సేయునో..." శ్రీరాధా. 3, ఆ. ౧౫౩. విణ. ప్రియము. "ఉ...నంయమి కులాగ్రణికూరిమిపెద్ద..." రాజ. చ. ౨, ఆ. ౯౫.

కూరిమికత్తియ. దే. విణ. (కూరిమి+కత్తియ.) కూరిమి గలది, ప్రియురాలు. (చూ. కూర్మికత్తియ.)

కూరిమికత్తె = కూరిమికత్తియ. (చూ. కూర్మికత్తె.)

కూరిమికాఁడు. దే. విణ. (కూరిమి+కాఁడు.) ప్రియుఁడు. (చూ. కూర్మికాఁడు.)

కూరు. దే. అ. క్రి. 1. కలుగు. "క...శోకము, గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్."

భార. భీష్మ. ౨, ఆ. ౩౬౪. నిర్వ. ౩, ఆ. ౧౦౪; 2. పడు. "ఉ...నరకార్ణవంబులోఁ, గూరిన నన్ను నేఁడు నెడకుండ నొనర్చినపుణ్యమూర్తు లన్." భాగ. ౬ స్కం. ౧౪ అ; 3. బాధపడు. "క...ఏటికి...,తీఱని చింతాభరమునఁ, గూరె దవు..." ప్రబంధ. ౭౩౩; 4. దుస్సిపోవు. "ఉ...కడు నొవ్వెడు మేనులు వాఁడికై దువుల్, గూరఁగ నాఁటినం బుడమిఁ గూలుట కక్కుట యోగ్య మచ్చునే." భార. ఉద్యో. 3, ఆ. ౨౬౮; 5. నిద్రించు. "లయగ్రాహి...కా.క్షీరకృతసేతువుల దారిఁ జనుచో నచటఁ గూరుకలహాంస లగడై రొదసేయన్." వసు. ౨, ఆ. ౨౨. భార. స్త్రీ. ౨, ఆ. ౨౦. స. క్రి. 1. పొందు. "గీ. పండితులు వగఁ గూరదు పౌరవేంద్ర." భార. స్త్రీ. ౧, ఆ. ౨౭. "చ...బోయలు...భార్గవుఁ జేరి మమ్ముఁ గన్గొనినది యాదిగాఁ గరుణఁ గూరెద వొక్కటి విన్నవింతుమే." భార. అను. ౨, ఆ. ౨౭౮; 2. చొప్పించు, క్రుక్కు. వా:—రాళ్లు కూరు, అన్నము నోటఁగూరు, కారము కూరుమెు.

కూరుకిడు. దే. అ. క్రి. (కూరుకు+ఇడు) నిద్రపట్టు. (చూ. కూర్కిడు.)

కూరుకు. దే. అ. క్రి. 1. కూరు, నిద్రించు "మ. అదె నాబిడ్డనుబట్టి దొంగలు మహాహంకారులై కొంచు నున్మదులై పోయెదరు..., కదలం డీమగపంద కూరుకుగలిం గన్మూసి గుర్వెట్టుచున్." భాగ. ౯, స్కం. ౪౦౫; 2. కునుకు, తగ్గు. "ఉ...ఘృతం బతిమాత్ర వోసినం, గూరికి గూర్కి యాక్షణమ గొబ్బునమండినదీపమో యనన్." నైష; 3, ఆ. ౧౧౬. వి. నిద్ర. "ఉ...కూరుకు రాదు రేయి నా, కెన్నఁడు..." భాగ. ౧౦స్కం. పూ. ౧౭౧౪.

కూరుకుపాటు. దే. వి. (కూరు. ధా.) కునికిపాటు, తంద్ర. (చూ. కూర్కుపాటు.)

కూరుకువాఁడు. దే. విణ. (కూరుకు+వాఁడు.) నిద్రపోతు. (చూ. కూర్కువాఁడు.)

కూరుకొను. దే. అ క్రి. (కూరు+కొను స్వార్థమున. త. కూఱుకొళ్.) కలఁగు. (చూ. కూర్కొను.); 2. చొచ్చు. (శ. ర.); 3. దిగఁబడు. వా:—కాలు ఊబిలో కూరుకొనిపోయినది. స. క్రి. క్రుక్కు. (చూ. కూర్కొను.)

కూరుచు. దే. అ. క్రి. ప్రియపడు. "క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీవొక్కరూప యసదృశ ధర్మాచారుండవు రాజునకుం, గూరుతు కత మేమి యిట్లగుటకుం జెపుమా." భార. ఉద్యో. 3, ఆ. ౨౧౭; 2. సంఘటించు. (చూ. కూర్చు.) స. క్రి. 1. పుట్టించు, కలిగించు. "క. అఱకాలను విఱిగిన ములు, కుఱు చైనను బిదపఁ జీము గూరిచెడుగలిన్." ప్రబోధ. ౨, ఆ. ౪౯; 2. = కూర్చు. (చూ. కూర్చు.)

కూరుచుండఁబడు. ద్వ. అ. క్రి. (కూరుచుండన్+పడు. స్వార్థమున.) కూలఁబడు, చదికిలఁబడు. (చూ. కూర్చుండఁబడు.)

కూరుచుండఁబెట్టు. దే. స. క్రి. (కూరుచుండన్+పెట్టు.)ఆసీనుఁ జేయు. (చూ. కూర్చుండఁబెట్టు.)

కూరుచుండు. దే. అ. క్రి. ఆసీనుఁ డగు. "చ. నడచుచుఁ గూరుచుండుచును..."కాశీ. ౫,ఆ. ౪౦.

కూరుచుకొను. దే. అ. క్రి. (కూరుచు+కొను.) ఆదరించు. "క. నేరిచిన నేరకున్నను, గూరుచుకొని రాక మీరె కోపించిన నెవ్వారిఁక మాకు శరణ్యులు..."దశా. ౨, అ. ౩౭.

కూరుచుకోలు. దే. వి. (కూరుచుకొను. ధా.) కూర్చుకొనుట. (చూ. కూర్చుకోలు.)

కూరుపరి. దే. విణ. (కూరుపు+అరి.) కూర్చువాఁడు, రచయిత. "క. అని యెల్లవేల్పులం జేర్కొని కబ్బముకూరుపరుల గురునిఁ గడంకం, గొని యాడి..."అచ్చ. పీఠి. ౧౨. వి. నారియందు బాణమును గూర్చుచోటు. ఆం. భా. ద్వి. ౨౧౧.

కూరుపు. దే. వి.(కూరుచు.ధా.) కట్టు. "వ...తొడిగినట్టి సరిగకంగుల కూరుపుఁబని కపురుపరకాళా యొంటిపొరబిగువు నిడుపుఁగాసెల..." ప్రబంధ. ౭౮.

కూర్కిడు=కూరుకిడు. "చ...కూర్కిడినంతలోపలన్. "చ. ఒకకలఁ గంటి..."బిల్హ. ౨, ఆ.౩౬, ౩౭.

కూర్కు = కూరుకు. (నిద్రించు.) "చ...కుడుచుచుఁ బవ్వళించుచును గూర్కుచు...శ్రీగగనగంగఁ దలంచి త్యజించుఁ బాపముల్." కాశీ. ౫. ఆ. ౪౦. వి. నిద్ర. "సీ. నగధుర్య కందమాయనము సౌఖ్యమునఁ గూర్కుపట్టుకూర్మము గుఱుపెట్టె ననఁగ." వరాహ. ౭, ఆ. ౬౧.

కూర్కుపాటు = కూరుకుపాటు. "సీ...కూర్కుపాటులఁ దూఁగి కూఱువారు." వరాహ. ౧౧, ఆ. ౧౭౬.

కూర్కువాఁడు = కూరుకువాఁడు. ఆం. భా. తృ. ౧౧.

కూర్కొను = కూరుకొను. (అ. క్రి. కలుగు.) "మ...కూర్కొనెం గంట..." రామా. 3, ఆ ౯3. (స. క్రి. త్రుక్కు.) "సీ. ఏపురార్గురుచల్ల లెలమిఁ బన్నిదమాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁడు..." భాగ. ౧౦, స్కం. పూ. ౪౯౬.

కూర్చము. సం. వి. అ. పుం. న. 1. పిడికెడుదర్భలు; 2. నెమిలిపింఛెము; 3. తల; 4. మీస; 5. డంబము 6. పొగడికొనుట; 7. భ్రూమధ్యము; 8. వ్రేఁగివగడ్డమును మీసమును. విణ. (అ. ఆ. అ.) కఠినమైనది.

కూర్చశీర్షము. సం. వి. అ. పుం. 1. కొబ్బెరచెట్టు; 2. జీవక మనుగంధద్రవ్యముచెట్టు.

కూర్చశేఖరము. సం. వి. అ. పుం. కొబ్బెరచెట్టు.

కూర్చి = కూరిచి. "గీ. నిన్నుకూర్చి యేతెంతు నీసన్న కడకు." భార. శాం. 3, ఆ. 33౨. భాగ. ౧౦. స్కం. ఉ. ౧3౨౦.

కూర్చిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మొగ్గ; 2. కుంచెకోల; 3. తూలిక; 4. సూది.

కూర్చియిచ్చుమిటారి. దే. వి. (కూర్చు. ధా.) కుంటెన కత్తె, దూతి. సాం. ని. మాన. ౧3.

కూర్చు = కూరుచు. దే. స. క్రి. 1. చేర్చు. "చ... కవుంగిటఁ గూర్చె..." కళా. ౪, ఆ. ౯౯; 2. కలుపు. "సీ...మలయజంబు కురంగమదముఁ గూర్చి." భీమ. ౧, ఆ. ౧౧౫; 3. సంధానము చేయు. "ఆ. కొమ్మ నలవరించి కూర్చు టరుదె." భార. విరా. ౨, ఆ. ౭౦; 4. ఏకముచేయు. "సీ. చందురుసునుఁగాంతి కందేర్చి కూర్చి..." భార. విరా. ౨, ఆ. ౫౭; 5. అంటించు. "గీ. వస్త్రములు తైలమున ముంచి వహ్నిఁ గూర్చి." హర. ౨, ఆ. 3౦; 6. (వింట) సంధించు. "ఉ. భావజుఁ డప్డు దున్మదనబాణము లియ్యనివింటఁ గూర్చుచో" నైష. ౧. ఆ. ౭౯; 7. స్మరించు. "ఉ...మడశరమంత్రము జిహ్వఁ గూర్చి..." భీమ. ౬, ఆ. ౨౬; 8. అలంకరించు. "ఉ... కల్పకుసుమంబులఁ గూర్పఁ గడంగి రయ్యెడన్." వసు. ౫, ఆ. ౭3; 9. కూడఁబెట్టు. "గీ. కొంద అర్థము వారిక కూర్చి, యిచ్చిరి..." భార. ఆది. ౭, ఆ. ౧3౨; 10. పొందించు. "గీ. దండ్యు దండింపకుండు టదండ్యు దండనంబు గూర్చుట..." భార.అను.౫,ఆ. ౬౬; 11. సిద్ధమొనరించు. "క...అతఁడు సేనలు గూర్చెన్." దశా. ౪, ఆ. 3౬; 12. చేయు. "సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి..." భార. విరా. ౧, ఆ. ౧౦౭; 13. రచించు. "సీ. శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు." ఆము. ౧, ఆ. ౧3; 14. కలిగించు. "సీ. కువలయానందంబుఁ గూర్చుచల్లనిరాజు..." వసు. ౧, ఆ. ౨౧; 15. కుట్టు. "ద్వి. ఇంతవానికి నీకు నిట సూదిఁ బూని,గంతబొంతయుఁ గూర్పఁ గారణం బేమి." ద్వి. పరమ. ౨, ఆ. ౭౪. పు. అ. క్రి. 1. ప్రియమగు, ఇష్టమగు. "మ. హరి మేనల్లుఁడు గొంతికూర్చుమనుమండు ..." భార. ద్రో. ౨, ఆ. ౨3౬; 2. సంఘటించు. "ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్." భార. విరా. ౧, ఆ. ౨౭.

కూర్చుండఁబడు = కూరుచుండఁబడు. "గీ...రథంబు, మీఁదఁ గూర్చుండఁబడియెఁ జేయూఁదికొనుచు." భార. భీష్మ. ౧, ఆ. ౧౭౭.

కూర్చుండఁబెట్టు = కూరుచుండఁబెట్టు. "గీ. అప్పుడొకబోటి నృపుని పాదాంతికమున,రెండు సందిళ్లఁ బట్టి కూర్చుండఁబెట్టె." కళా. ౭, ఆ. ౧౪౫.

కూర్చుండు = కూరుచుండు. "గీ. నిదుర మేల్కాంచి కూర్చుండె నుదధిశయుఁడు, విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు." కాశీ. 3, ఆ. ౨౨.

కూర్చుకొను = కూరుచుకొను. 1. సంపాదించు. "సీ...ఈతెల్లవిగురువెందపే రెండుఁ గూర్చుకొంటి." జై.. 3, ఆ. ౭౪; 2. సన్నద్ధముచేయు. "వ. అచ్యుతుండు సురాసురులం గూర్చుకొని ..." హర. ౬, ఆ. ౪౦; 3. కూడుకొను. "క... బలిని గూర్చుక కలశి, జలధి మథియింపుఁడు..." దశా. ౨, ఆ. ౭౭. హర. ౬, ఆ. 3౨.

కూర్పుకోలు=కూరుచుకోలు. "చ...మమః గూర్పు కోలు దుస్తరము..." భార. శల్య. ౧, ఆ. ౧౭.

కూర్నిసాతు. హిం. వి. (హిం. కూర్ణిశాత్.) సలాము. "గీ. నజరుగుజరానుపటిచె పొన్నా కడాని, జాలె మాతఁడు కూర్నిసాతు చేసి." రంగా. ౨, ఆ. ౮౯.

కూర్పన. దే. వి. (కూరు+పన) ప్రోగగుట; గుమిగూడుట (చూ. కూర్పనపడు.)

కూర్పనపడు. ద్వి. అ. క్రి. (కూర్పన+పడు) ప్రోగగు; గుమిగూడు. "వ...కూర్పనపడి వలదాటి వెలిఁ జెంది గుమ్మపడునవియును బరువెత్తి వింటినెలకట్టి యలఁ గొట్టఁబడునవియును నై..." పార్వ. ౬, ఆ. ౮౪.

కూర్పకము. సం. వి. అ. పుం. 1. మోఁచేయి. ఆము. ౨, ఆ. ౬౧; 2. మోఁకాలు.

కూర్పరి = కూరుపరి. (శ. ర.)

కూర్పాసము. సం. వి. అ. పుం. 1. అవిక; 2. పొట్టి చొక్కా; 3. కవచము.

కూర్పించు. దే. స. క్రి. (కూర్చు. ధా. ప్రే.) మలామాచేయించు. "సీ...కూర్పించె నట్టిండ్లు కుందనములు." భీమ. ౯, ఆ. ౮౭.

కూర్పు = కూరుపు. వి. 1. కూర్చుట. (వా.); 2. ముద్రణము. ఉదా: రెండవకూర్పు.

కూర్మము. సం. వి. అ. పుం. 1. తాఁబేలు; 2. కూర్మావతారము; 3. అభినయహస్తవిశేషము; 4. ఒకానొకయుపవాయువు.

కూర్మి. ఉభ. దే. వి. (క. కూర్మె.) 1. వాత్సల్యము. "ఆ. బుజ్జగించి కూర్మి పొంపిరివోవంగ, హితమితోఁ జిత్రకిట్టు లనియె." హర. ౪, ఆ. ౯; 2. ప్రేమము. (చూ. కూరిమి.) విణ. ప్రియము. "గీ. కూర్మియనుజన్మహృదయంబుకోర్కి యొఱఁగి." కాశీ. ౧, ఆ. ౧౨. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడు తాఁబేలు.

కూర్మికత్తియ = కూరిమికత్తియ. "క. అటువంటి కూర్మికత్తియ..." కువల. ౪, ఆ. ౧౬౯.

కూర్మికత్తె = కూరిమికత్తె.

కూర్మికాఁడు=కూరిమికాఁడు. "చ...అప్పడఁతులఁ గూర్మికానివలె...,తడవుచు..." కృ. శకుం. ౨, ఆ. ౧౬౮.

కూలంకష. సం. వి. ఆ. స్త్రీ.—ఒడ్డును ఒరయునది—నది.

కూలంకషము. సం. వి. అ. పుం. సముద్రము. విణ. (అ. ఆ. అ.) 1. ఒడ్డును ఒరయునది. (నద్యాది.) 2. లక్షణచే—పూర్ణము.(కూలంకషప్రజ్ఞ మొ.)

కూలఁబడు. ద్వి.అ. క్రి. (కూలన్+పడు.స్వార్థమున.) 1. కూలు, చచ్చు. "చ...ఖరుఁడు గాఁ డటు గూలఁబడంగ..." రామా. ౬, ఆ. ౧౩౯; 2. చదికిలఁబడు. "మ. అలరెం దత్తనువుల్ ధరం బడుట భూతాజ్ఞప్తి చేపెట్టి మోపులు నేలం బడవైచి కూలఁబడుకాఁపులో్వాలె నప్పట్టునన్." కువల. ౨, ఆ. ౧౪౧; 3. కూలు, పడు. "సీ... కులభూధరంబులు గూలఁబడఁగ." దశా. ౪, అ. ౨౦౨. "ఉ. కూఁలబడెఁ దిశల్..." రామా. ౮, ఆ. ౬౧.

కూలము. సం. వి. అ. న. 1. ఒడ్డు; 2. దగ్గఱ; 3. చెఱువు; 4. సేనవెనుక; 5. స్తూపము.

కూలముద్రుజము. సం. విణ. (అ. ఆ. అ.) కూలమును గూల్చునది. (నది, గజము మొ.) "క. సామర్ష దళితపరభట, సామజహాయ కూలముద్రుజక్షత జధునీ, కాముకితాఖిలజలధికి..." పారి. పీఠి. ౨౮. ('కూటమూర్ధజ' పాఠాం.)

కూలమ్ము. దే. వి. (కూలు+అమ్ము.) (ప్రయోగింపఁగనే యెదిరివానిఁ గూల్చు) ఒకవిధమగుబాణము. "క. కూలమ్మున నొకఁడు సరి,త్కూలమ్మున ఖడ్గి నేసి కో యని యార్చెన్." చంద్ర. ౨, ఆ. ౪౧.

కూలవతి. సం. వి. ఈ. స్త్రీ. నది.

కూలారుచు. దే. స. క్రి. (కూలుధా.) కూల్చు.

కూలార్చు = కూల్చు. "ద్వి. కుటిలుగ జాసురుఁ గూలార్చి..." పండితా. వాద. ౨౨౯. పు.

కూలి. ఉభ. దే. వి. (క. త. కూలి.) 1. పనిచేసినందల కిచ్చెడుధనము, జీతము. ఆం. భా. ద్వి. 303. "ఉ. కూలికి నూనె లంటి..." శుక. ౨, ఆ. 3౬3; 2. పన్ను. "గీ. నీవు మాధర్మములలోన నృపవరేణ్య, కూలి యాఱవభాగంబు గొనుచు మమ్ముఁ, గావఁ బూనినకతమునఁ గాదె యొందు, చింత యెఱుఁగక రేలు నిద్రింతు మేము." మార్క. ౯, ఆ. ౧3౮. సం. విణ. (న్. నీ. న్.) కూలము గలది. (నద్యాది.)

కూలించు. దే. స. క్రి. (కూలు ధా. ప్రే.) కూల్చు, రాలుచు. "సీ...పవనాభిహతిఁ దూలుబంధుజీవ, కుంజంబుపుష్పాలఁగూలించువిధమున..." పాండు. ౫, ఆ. ౧౭.

కూలికాఁడు. దే.వి. (కూలి+కాఁడు. క. కూలికాఱ.) కూలివాఁడు. "చ...ఘాసము లూడ్చు కూలి కాం.డ్రకు .." వేం. పంచ. ౧, ఆ. ౬౮౧.

కూలిపడు. ద్వ. అ. క్రి. (కూలి+పడు.) కూలిపని చేయు. (చూ. కూలిపాటు.)

కూలిపాటు. ద్వ. వి. (కూలిపడు. ధా.) కూలిపని చేయుట. "ఉ...ఈయమరుల కెట్లు జీవనము లందలివారల నాశ్రయించి నిత్యముగను గూలి పాటుఁ బడి తారు చరించెద రేమి చెప్పుదున్." పార్వ. ౨, ఆ. ౯౩.

కూలియాలు. దే. వి. స్త్రీ. (కూలి+ఆలు.) వెలయాలు, వేశ్య. "చ...రొక్కమీఁ గలుగువాఁడె మనోజుఁడు కూలికూలికిన్." కు. సం. ౮, ఆ. ౧౮౮.

కూలు. దే. అ. క్రి. 1. పడు. "మ...తత్సూతు న్నుద్ధతి నేసెం దల నేలఁ గూల..." ఉ. హరి. ౧, ఆ. ౧౬౭; 2. చచ్చు. "ఉ. కూలెదువారె పాండవులు ఘోరపుఁబోర..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౭౧; 3. పొడగు. "గీ. పెడలిపోయితి నివ్వీథి వెంట నరుగు, పెండ్లివారలఁ జూడ నాపిన్న తనము.గూల..." శుక. ౨, ఆ. ౧౩౧; 4. విఱుగు. "ఉ...లెట్టినం,దన్నితిఁ దన్నినం దన పదంబులు గూల శపించె..." వి. పు. ౪, ఆ. ౩౨. వి. లవిత్రము. ఆం. భా. ద్వి. ౨౩౧.

కూలుచు. దే. స. క్రి. (కూలు. ధా. ప్రే.) 1. పడఁ గొట్టు. "క...అతని కేతనము ధరం, గూలిచి..." భార. ద్రో. ౧, ఆ. ౧౯౪; 2 = కూల్చు. (చూ. కూల్చు.)

కూల్చు. = కూలుచు. 1. పడఁగొట్టు. "ఆ...దుర్యోధను, శిరముఁ దన్నువాఁడ ధరణిఁ గూల్చె." భార. సభా. ౨, ఆ. ౨౭౬. "సీ...పక్వఫలాగతతులఁ గూల్చు." ఉ. రా. ౨, ఆ. ౧౪౮; 2. పడవేయు. "సీ...పరిపాటికొంపలోఁ గూల్పక..." శుక. ౩, ఆ. ౫౨౮; 3. భగ్నమొనర్చు. "గీ. నంద కము గూల్చు దూదవనందకంబు." ఉ. హరి. ౩, ఆ. ౭; 4. చెఱచు. "గీ...ఎన్ని,కాఁపురంబులు గూల్చితో కద..." శుక. ౩, ఆ. ౨౦౧; 5. శాంతిపఱచు. "గీ...తాపంబుఁ గూల్పఁ జాల." బిల్హ. ౨, ఆ. ౧౨౫; 6. చంపు. "ఆ...బొంకు మాటలాడి గురునిఁ,గూల్ప నేర్చినట్టిక్రూరాత్ముఁడు ..."భార.శాం. ౧,ఆ. ౧౯౯. హర. ౭, ఆ.౫౩.

కూవరము. సం. = కూబరము.

కూశ్మాండము. సం. వి. అ. పుం. గుమ్మడికాయ. ఇట్లే: కూష్మాండము.

కూసము. వై. వి. (సం. కూర్పాసః.) పాముతోలు. "ఉ...పాము కూసముల్."రఘు. ౯, ఆ. ౧౧; 2. చొక్కా.

కూసు. దే. విశే. అల్పము, నీచము. ఉదా:—కూసు మతము. సా:-అభ్యాసము కూసువిద్య. (బ్రౌ.)

కూళ. వై. విశే. (సం. క్రూరః. క. కూళ. త. కూళై.) 1. క్రూరుఁడు. "చ...పూ,విలుతుఁడు కూళ వాఁ డిడెడు వేదన కోరువఁ జాల..." రసిక. ౩, ఆ. ౮౯; 2. దుష్టుఁడు, కుజనుఁడు. "ఆ. కూళ కూళ మెచ్చు గుణవంతు విడనాడి." వేమన. (బ్రౌ.) ఆం. భా. తృ. ౭; 3. అవివేకి. "గీ. పాణియా పోరకబళంబుఁ బాఱవైచి,కూర్పరము నాకు పెను పెంజీకూళవోలె."కాశీ. ౨, ఆ. ౧౧౦; 4. దీనుఁడు. (చూ. కూళతనము.); 5. నీచుఁడు, అల్పుఁడు. "ఆ. తలకు నెరులు వచ్చి తను వెంత వడలిన, కూళవిటుఁడు యువతిఁ గూడు టెల్ల, పండ్లుపడ్డ కుక్క పసరము చీకదా." వేమన. (బ్రౌ.)

కూళఁడు = కూళ. 1. అవివేకి. "ఉ...ఆ,కూళఁడు కామరాజ్యమునకుఁ వెలిగాఁడె తలంచి చూడఁ గన్." షోడ. ౨, ఆ. ౫౧; 2. లుబ్ధుఁడు. "క. పండుగ పబ్బం బైనను, గొండిని యొకకాసు నీనికూళని..." భల్లా. ౫, ఆ. (శ. ర.)

కూళతనము. వై. వి. (కూళ+తనము.) దైన్యము. "ఉ...ప్రాఁతబట్టకై, కూళతనంబునం బ్రభుల కుం దనుమర్దన మాచరించియుఁన్." శుక. ౨, ఆ. ౩౬౩.

కూళమారి = కూళ. (క్రూరుఁడు, దుష్టుఁడు.) "గీ. కూళమారి విధాత చేకూర్చె నిటుల." ప్రబంధ. ౬౫౫.

## కృ

కృంతత్రము. సం. వి. అ. న. నాఁగలి.

కృకణము. సం. వి. అ. పుం. 1. కక్కెరపక్షి. 2. క్రిమి.
కృకము. సం. వి. అ. పుం. కుత్తుక.
కృకరము. సం. వి. అ. పుం. 1. కక్కెరపక్షి. 2. ఒకానొక ఉపవాయువు; 3. గన్నేరుచెట్టు.
కృకలాశము. స. వి. అ. పుం. తొండ, ఊసరవెల్లి: ఇట్లే: కృకలాసము.
కృకవాకువు. సం వి. ఉ. పుం. 1. కోడి 2. నెమిలి; 3. తొండ; ఊసరవెల్లి.
కృకలాసము. సం. = కృకలాశము.
కృచ్ఛ్రము. సం. వి. అ. పుం. న. 1. సాంతపనాది వ్రతము. 2. దుఃఖము; బాధ. పుం. మూత్రకృచ్ఛ్రరోగము. న. పాపము. విణ. (అ. ఆ. అ.) 1. కష్టమైనది, శ్రమావహము. 2. పాపము గలది, అఘయుక్తము.
కృతకము. సం. విణ. (అ. ఆ. అ) 1. కృత్రిమము, కల్పితము. 2. కపటము, సత్యదూరము.
కృతకాద్రి. సం. వి. ఇ. పుం.—క్రీడించుట కేర్పఱుపఁబడినకొండ—చేతగట్టు.
కృతకృత్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) కృతార్థుఁడు. ఇట్లే: కృతకార్యుఁడు, కృతక్రియుఁడు మొ.
కృతఘ్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చేసినమేలు మఱచువాఁడు.
కృతఘ్నము. సం. వి. అ. పుం—చేసినమేలు మఱవనిది—కుక్క.
కృతజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ) చేసినమేలు మఱవనివాఁడు.
కృతపడు. మి. అ. క్రి. (కృతము+పడు.) 1. కడచు, గతించు. "వ...కృతపడినకార్యంబు గ్రమ్మఱం బొడమునే..." భార. కర్ణ. ౧, ఆ. ౨౬; 2. మరణించు, చచ్చు. "క. పనిచి కృతపడినగాంగే, యునిదెస యమ్మలిక నాతఁ దుల్లము నానా, ఘనతరచింతాభర మొంది, దినఁ గుందుచు నుండఁ గొన్నిదివసంబులకున్." భార. ద్రో. ౧, ఆ. ౬; 3. విడఁబడు, వేఱగు. "సీ. సురకరి యీయద్రిఁ జరియించు నేనికకొదమలఁ గృతపడ్డకొదమ యొక్కొ..." మార్క. ౧, ఆ. ౯౭.
కృతపఱుచు. మి. స. క్రి. (కృతపడు. ధా. ప్రే.) కడపు. "వ...దినంబులు కడంద్రోచి...ఋతువులు కృతపఱిచి..." సాంబో ౧, ఆ. ౧౭౩.
కృతపుంఖుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విలువిద్యయందు నేర్పు గలవాఁడు; 2. గుఱితప్పక యేయువాఁడు.
కృతబుద్ధి. సం. వి. ఈ. స్త్రీ. 1. సునిశితమైనబుద్ధి; 2. స్థిరచిత్తము. విణ. (ఇ) 1. సునిశితమైనబుద్ధి గలవాఁడు; 2. స్థిరమైన చిత్తము గలవాఁడు. ఇట్లే: కృతమతి.
కృతమాలము సం. వి. అ. పుం. రేలచెట్టు.
కృతము. సం. వి. అ. న. 1. చేష్ట. "గీ...రోమపాదుఁ డనఁగ, ధరణిఁ బరఁగినవీరుండు దనపురోహి, తాపరాధకృతమున బ్రాహ్మణులచేత, విడువఁబడినఁ దన్మహి కనావృష్టి యయ్యె." భార. అర. 3, ఆ. ౯౦; 2. కారణము. "చ...నీకృతమునఁ గౌరవాన్వయ మకల్మషకీర్తిఁ బ్రకాశితం బగున్." భార. అర. ౧, ఆ. ౫౧; 3. చేసినమేలు. "క. కృత మెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతురు..." భార. విరా. 3, ఆ. ౬౪. పుం. న. కృతయుగము. విణ. (అ. ఆ. అ.) 1. చేయఁబడినది; 2. సంపాదింపఁబడినది; 3. అలవాటుచేయఁబడినది. "క. అకృతాస్త్రుఁడ బాలుఁడ..." భార. విరా. ౪, ఆ. ౫౩; 4. సిద్ధము చేయఁబడినది; 5. నొప్పింపఁబడినది; 6. చాలినది; 7. నియమితము, ఏర్పాటయినది.
కృతముఖుఁడు. సం. విణ (అ. ఈ, ఆ. అ.) 1. పండితుఁడు; 2. నేర్పరి.
కృతలక్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గుణములచే బ్రసిద్ధి చెందినవాఁడు; 2. కృతయుగలక్షణములు గలవాఁడు. "ఉ...ఇటులే కృతలక్షణుండై చెలంగఁగా, ద్వాపరలక్షణుం డనఁగవచ్చునొకో యల ధర్మనందనున్." విజ. ౧, ఆ. ౨౩.
కృతవేది. సం. విణ. (న్. నీ. న్.) కృతజ్ఞుఁడు.
కృతసాపత్నిక. సం. వి. ఆ. స్త్రీ. అధివిన్న, తాను బ్రదికియుండఁగా మరలఁ బెండ్లాడినభర్తగలస్త్రీ.
కృతహస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నేర్పరి; 2. గుఱితప్పక యేయువాఁడు. "క. మనసిజరాగంబునఁ బెనఁగినయిఱ్ఱిని లేడిఁ జూచి కృతహస్తుఁడు పెల్చన యేనమ్ములనారెంటినిఁ ద్రెళ్ళఁగ నేసెఁ గడుఁ గఠినహృదయుం డై." భార. ఆది. ౫, ఆ. ౭౫.

కృతాంజలి. సం. వి. ఇ. పుం. 1. జోడించినదోసిలి; 2. లజ్జాళువు, పోఁకుడుముడుఁగుచెట్టు. విణ. (ఇ) చేమోడ్చినవాఁడు, నమస్కరించినవాఁడు.

కృతాంతము. సం. వి. అ. పుం. 1. దైవము: 2. సిద్ధాంతము; 3. పాపము; 4 శనివారము; 5. భరణీనక్షత్రము. విణ. (అ. ఆ. అ.) 1. ముగింపఁబడినది; 2. నశింపఁజేయఁబడినది.

కృతాంతుఁడు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. శని.

కృతార్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కృతకృత్యుఁడు.

కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. చేయుట; పని; 2. ప్రబంధము; గ్రంథము; 3. యత్నము; 4. హింస; 5. ఇరువది; 6. ఒకానొకఛందస్సు. విణ. (న్. నీ. న్.) 1. నేర్పరి; 2. ధన్యుఁడు; 3. ప్రాజ్ఞుఁడు, పండితుఁడు.

కృతిపతి. సం. వి. ఇ. పుం. కృతిని స్వీకరించినవాఁడు, అంకితము గైకొన్నవాఁడు. భార. విరా. ౧, ఆ. ౧౮.

కృతుఁడు. సం. వి. అ. పుం. కూటికిఁ బనిచేయు భృత్యుఁడు.

కృత్తము సం. విణ. (అ. ఆ. అ) ఛేదింపఁబడినది.

కృత్తి. సం. వి. ఈ. స్త్రీ. 1. చర్మము; 2. బెరడు; 3. కృత్తికానక్షత్రము; 4. కత్తిరింపు; 5. బుజపత్త్రిచెట్టు.

కృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. కృత్తికానక్షత్రము.

కృత్తివాససుఁడు. సం. వి. స్. పుం.=కృత్తివాసుఁడు.

కృత్తివాసుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

కృత్తు. సం. వి. త్. పుం. విశేష్యవిశేషణరూపము లేర్పడుటకై క్రియలపై వచ్చుప్రత్యయము. ఉదా:—మొలక, వాలిక, గమనము మొ. విణ. (త్) చేయువాఁడు. (సమాసాంతములందే ఈయర్థమున నుండును. ఉదా: పుణ్యకృత్తు.)

కృత్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. పని, చేష్ట; 2. అభిచారక్రియవలనఁ బుట్టినదేవతామూర్తిభేదము.

కృత్యము. సం. వి. అ. న. 1. కార్యము; 2. ప్రయోజనము. విణ. (అ. ఆ. అ.) 1. చేయఁదగినది; 2. కోపగించినది; 3. లోభించినది; 4. భయపడినది. 5. ఛేదింపఁబడినది; 6. అవమానింపఁబడినది.

కృత్రిమధూపకము. సం. వి. అ. పుం. అనేక పరిమళవస్తువులు కూర్చి చేసినధూపద్రవ్యము.

కృత్రిమము. సం. వి. అ. పుం. చిల్లకుడ్డి. న. 1. బిడలవణము; 2. కాచలవణము; 3. రసాంజనము. విణ. (అ. ఆ. అ.) అస్వాభావికము, కల్పితము.

కృత్స్నము. సం. వి. అ. న. 1. నీరు; 2. కడుపు. విణ. (అ. ఆ. అ.) అంతయు.

కృదంతము. సం. వి. అ. పుం. క్రియాజన్యవిశేష్యవిశేషణరూపములలో నొకటి, కృత్ప్రత్యయము కడపటఁ గలపదము.

కృప. సం. వి. ఆ. స్త్రీ. కనికరము, దయ.

కృపణము. సం. వి. అ. పుం. క్రిమి. న. దైన్యము. (వాచ.)

కృపణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బీదవాఁడు; 2. లోభివాఁడు; 3. చెడ్డవాఁడు; 4. మందుఁడు.

కృపవాఁడు. మి. విణ. కృప గలిగినవాఁడు, దయకు నర్హమైనవాఁడు. "ఉ...,ఎవ్వఁడు తేజరిల్లు నతఁ డెప్పుడు నీకృపవాఁడు భార్గవీ." వి. పు. ౧, ఆ. ౨౦౩.

కృపసేయు. మి. స. క్రి. 1. కృపతో నిచ్చు. "చ...,అమ్ముకుందుండె తనయఁగ నాకు నీశిశువుఁ దాఁ గృపసేసె నటంచు హృష్టుఁడై." ఆము. ౫, ఆ. ౫. విక్ర. ౧, ఆ. ౨; 2. కృపతో నుపదేశించు. "సీ...నా కైహిముష్మికాసౌఖ్యప్రదాయిమంత్రము కృపసేయవలయు." వరాహ. ౧౨, ఆ. ౪౬.

కృపాణము. సం. వి. అ. న—కృప లేకుండఁ జేయునది—ఖడ్గము, కత్తి.

కృపాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తెర; 2. చురకత్తి.

కృపాళుఁడు. సం. విణ. (ఉ) కృప గలవాఁడు. ఇట్లే: కృపాళువు.

కృపీటము. సం. వి. అ. న. 1. కడుపు; 2. నీళ్లు; 3. సమిధ.

కృపీటయోని. సం. వి. ఇ. పుం. అగ్ని.

కృపుఁడు. సం. వి. అ. పుం. కృపాచార్యుఁడు, ద్రోణునిబావమఱఁది.(చిరంజీవులలో నొకఁడు.)

కృమి. సం. వి. ఇ. పుం. 1. పురుగు; 2. గాడిద. 3. లక్క.

కృమిణము. సం. విణ. (అ. ఆ. అ.) క్రిములు గలది.

కృశము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చిక్కినది; 2. సన్ననిది; 3. చిన్నది; 4. క్షీణావస్థలో నున్నది. "క. లెమ్ము కురునాథ కడఁగుము, మమ్ముం గొని పాండుపుత్త్రమథనమునకు సైన్యమ్మదియును నీచేతఁ గృశమయ్యెడుఁజుమ్ము వలదు శంకింపం గన్." భార. శల్య. ౧, ఆ. ౩౧.

కృశాంగి. సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము వృ.

కృశానురేతసుఁడు. సం. వి. స్. పుం—అగ్నిలో రేతస్సు వైచినవాఁడు—శివుఁడు.

కృశానురేతుఁడు. సం. = కృశానురేతసుఁడు.

కృశానువు. సం. వి. ఉ. పుం. 1. అగ్ని; 2. చిత్రమూలము వృ.

కృశాశ్వి. సం. వి. న్. పుం. కృశాశ్వనిసూత్రము లధ్యయనము చేసినవాఁడు, నటుఁడు.

కృశాశ్వుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకనాట్యశాస్త్రకారుఁడు.

కృశించు = కృశియించు. సం. అ. క్రి. 1. సన్నగిల్లు. "మ...కృశించె మేను..." ఉ. రా. ౧, ఆ. ౧౫౧; 2. బాధపడు. "ఉ. వే నరనాథ...అం, భోనిధిమేఖలాకలితభూమి యధార్మికరాజచోరపీడానిరతిం గృశింప నకటా తగునయ్య యుపేక్షసేయ..." భాగ. ౪, స్కం. ౫౪౩.

కృశియించు. సం. స. క్రి. కృశింపఁజేయు. "క..., దురితాత్ములఁ లేదు దప్పితోఁ గృశియింపన్." రుక్మా. ౧, ఆ. ౨౬. అ. క్రి. సన్నగిల్లు. "గీ. తనువు గృశియింప..." ఉ. రా. ౫, ఆ. ౧౫౩.

కృషకము. సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. నాఁగటి కఱ్ఱు.

కృషకుఁడు. సం. విణ. (అ. షికా. అ.) కర్షకుఁడు, సేద్యగాఁడు.

కృషాణుఁడు. సం. వి. అ. పుం. కర్షకుఁడు, సేద్యకాఁడు.

కృషి. సం. వి. ఇ. స్త్రీ. సేద్యము.

కృషికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కర్షకుఁడు, సేద్యకాఁడు.

కృషీవలుఁడు. సం. = కృషికుఁడు.

కృష్టపచ్యము. సం. వి. అ. పుం. దున్నిననేలయందుఁ బైరగుధాన్యము. (అకృష్టపచ్యము = నీవారాది.) "గీ. వర్ణములు నాశ్రమంబులు వరుసఁ దప్పె, వేదములు నాగమంబులు విన్నఁబోయె, సౌరభంబులు కృష్టపచ్యములుఁ జెడియె, వృద్ధిఁబొందె నధర్మంబు విశ్వమునను." కాశీ. ౬, ఆ. ౮, ౬. విణ. (అ. ఆ. అ.) దున్నినపొలమునఁ బండింపఁబడునది. (ధాన్యాది.)

కృష్టము. సం. వి. అ. న. 1. దున్నుట; 2. లాగుట. విణ. (అ. ఆ. అ.) 1. ఆకర్షింపఁబడినది; 2. దున్నఁబడినది. [కృష్టము.

కృష్టి. సం. వి. ఇ. పుం. చదువరి, పండితుఁడు. ఈ. స్త్రీ. =

కృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. కృష్ణానది; 2. ద్రౌపది; 3. యమునానది; 4. దుర్గ; 5. ఒకానొకయగ్నిజిహ్వ; 6. ద్రాక్ష వృ; 7. పిప్పలి వృ; 8. నల్లజీలకఱ్ఱ వృ; 9. గుమ్మడి వృ; 10. కృష్ణతులసి వృ; 11. కారుగచ్చ వృ; 12. కటుకరోహిణి వృ.

కృష్ణకందము. సం. వి. అ. న—నల్లనిదుంప గలది—ఎఱ్ఱగలువ వృ.

కృష్ణకర్ముఁడు. సం. విణ. (ఇ.) పాపకర్ముఁడు, దురాచారుఁడు.

కృష్ణకాయము. సం. వి. అ. పుం. దున్న. విణ. (అ. ఆ. అ.) నల్లనిదేహము గలది.

కృష్ణగతి. సం. వి. ఇ. పుం. అగ్ని. విణ. (ఇ) = కృష్ణకర్ముఁడు.

కృష్ణతారము. సం. వి. అ. పుం. ఇఱ్ఱి. విణ. (అ. ఆ. అ.) నల్లనికనుగ్రుడ్డు గలది.

కృష్ణదేహము. సం. వి. అ. పుం. తుమ్మెద. విణ. (అ. ఆ. అ.) నల్లనిదేహము గలది.

కృష్ణద్వైపాయనుఁడు. సం. వి. అ. పుం—యమునాసైకతమునఁ బుట్టినవాఁడు—వ్యాసుఁడు.

కృష్ణనీలములు. సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౩౮.

కృష్ణపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. నల్లతులసి వృ.

కృష్ణపాకము. సం. వి. అ. పుం. తలివెలి వృ.

కృష్ణఫల. సం. వి. ఆ. స్త్రీ. కారుగచ్చ వృ.

కృష్ణభేద. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి వృ.

కృష్ణము. సం. వి. అ. పుం. 1. నలుపు; 2. కాకి; 3. కోయిల; 4. అగ్ని; 5. కృష్ణపక్షము; 6.

మేఘము; 7. కలియుగము; 8. నల్లత్రాచు; 9. నల్లయిఱ్ఱి; 10. కలివెలి. న. 1. మిరియము; 2. ఇనుము; 3. సీసము; 4. పాపము. విణ. (అ. ఆ. అ.) 1. నల్లనిది; 2. భయపడినది; 3. అశుభమైనది.

కృష్ణల సం. వి. ఆ. స్త్రీ. గురివెందలి.

కృష్ణలోహము. సం. వి. అ. న. అయస్కాంతము. సూదంటుఱాయి.

కృష్ణలోహితము. సం. వి. అ. పుం. ఖూడిదరంగు, నలుపు నెఱుపును గలసినరంగు.

కృష్ణవర్త్మ. సం. వి. న్. పుం—నల్లనిమార్గము గలవాఁడు—1. అగ్ని; 2. రాహువు. విణ. (న్. న్, ఆ. న్.) దుష్ప్రవర్తనము గలవాఁడు, దురాచారుఁడు.

కృష్ణవేణ. సం. వి. ఆ. స్త్రీ = కృష్ణవేణి.

కృష్ణవేణ్ణ. సం = కృష్ణవేణ. "సీ. విలసితంబగు కృష్ణవేణ్ణ మలాపహారిణి..." భో. ౧, ఆ. ౪౦.

కృష్ణవేణి. సం. వి. ఈ. స్త్రీ. కృష్ణానది.

కృష్ణశారము. సం. వి. అ. పుం. నల్లయిఱ్ఱి. ఇట్లే: కృష్ణసారము.

కృష్ణాజినము. సం. వి. అ. న. నల్లయిఱ్ఱితోలు.

కృష్ణావాసము. సం. వి. అ. పుం. రావిలి.

కృష్ణాష్టమి. సం. వి. ఈ. స్త్రీ. శ్రావణకృష్ణాష్టమి, గోకులాష్టమి.

కృష్ణిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లావలి.

కృష్ణిమ. సం. వి. అ. పుం. నల్లఁదనము. ఇట్లే: కృష్ణిమము.

కృష్ణుఁడు. సం. వి. అ. పుం. 1. దేవకీవసుదేవులకుఁ బుట్టినవిష్ణుమూర్తి; 2. వేదవ్యాసుఁడు; 3. అర్జునుఁడు; 4. పరమాత్మ.

కృష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దున్నఁబడునది; 2. లాగఁబడినది.

క్ల

క్లప్తకీల. సం. వి. ఆ. స్త్రీ. నియమపత్త్రము. (దస్తావేజుమొ.)

క్లప్తధూపము. సం. వి. అ. పుం. చిల్లమడ్డి.

క్లప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రచింపఁబడినది, నిర్మింపఁబడినది; 2. సమర్థము, చాలినది; 3. భిన్నము, ఖండింపఁబడినది; 4. నిశ్చయింపఁబడినది.

"మ. అలఘుస్యందన మెక్కి దైత్యగురుక్లప్తామోఘలగ్నంబునన్." శశా. ౫, ఆ. ౧౫.

క్లప్తి. సం. వి. ఈ. స్త్రీ. 1. రచించుట. 2. ఏర్పాటు; 3. నిశ్చయము.

క్లప్తికము. సం. విణ. (అ. ఆ. అ) కొనఁబడునది, ప్రక్రయము.

కె

కె. దే. విణ. వృత్తియందు 'కెంపు' శబ్దముయొక్క లుప్తశేషరూపము. (చూ. కెంపు)

కెంగటు. దే.వి. తాళబీజము, తాటిటెంక. "సీ. కెంగటం చనఁగఁ జెలంగును దాళ బీజాభిధ..." ఆం. భా. ద్వి ౭౮.

కెంచేము. దే. విణ. నేర్పుగలవాఁడు, నైపుణ్యముగలవాఁడు. "క. కాంచిన ననసానాగడ, కెంచపుమాస్టీడు బెట్టు గెరలుచుఁ జెలిఁ బ్రేకొంచు నెదఁదటాయించన్, గొంచకయే మొగలితేకుగుమ్మితిఁజిమ్మెన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౨౪. ప్రబంధ. ౭౮.

కెంజేయి. దే. వి. (కెంపు+చేయి.) హస్తపద్మము, పద్మమువంటిచేయి. "సీ. మాసంగవచ్చునే మహ్యావ్హాకాలంబు శ్రీవిశాలాక్షి కెంజేలిభిక్ష." కాశీ. ౨, ఆ. ౧౧౨.

కెంటలము. దే. వి. గర్భవతికి అష్టమమాసమునఁ బెట్టు నూతనాలంకారవిశేషము. "క. ఆసలి కాన్పునఁ దష్టమమాసంబునఁ గెంటలం బమరఁబెట్టి మహోల్లాసంబున నుండఁగ నవ, మాసంబులు నిండె గర్భమహిమయు నలరన్." ద్వా. 3, ఆ. 3౬.

కెందమ్మి = కెందామర. పారి. 3, ఆ. ౨౪.

కెందామర. ద్వ. వి. (కెంపు+తామర.) ఎఱ్ఱతామర. ఆం. భా. ప్ర. ౧౬౭.

కెందొగ. ద్వ. వి. (కెంపు+తొగ.) ఎఱ్ఱకలువ. ఉ. రా. ౬, ఆ. ౬౧.

కెంపు. దే. వి. 1. పద్మరాగమణి. ఆం. భా. ద్వి. ౨౭౭; 2. ఎఱుపు. "క. ఇనుఁడు తనకడకు నేతెంచిన రాగముఁ బొందు టది యుచితమనఁగాఁ గెంపున మెఱసి పశ్చిమాశాంగన జనసంభావనముల గౌరవమందెన్." భార. విరా. ౨, ఆ. 3౧౮; 3. దంతక్షతము. "చ...విడికెంపుమిఱుమెఱుఁగు మోవిపైఁ జుఱుచుఱు క్కను

"కెంపులకుం దలంకఁగన్." దశా. 2, ఆ. ౧౫౬. ఆం. భా. కృ. ౫౪. (ఇవి మూఁ డర్థములకు నుదాహరణములు) "సీ...చిన్ని కెంపులతోడి చిగురుమోవి." కాశీ. ౧, ఆ. ౪, ౪౭. విశే. (క. త. కెమ్పు.) దీనికి వైకల్పికముగా వృత్తియం దంత్యవర్ణము లోపించును. మిగిలిన దానికిఁ గొన్నియెడల నుగాగమము, కొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వము నగును. ఉదా:—కెంజిగురు, కెమ్మోవి, మొ:—) ఎఱ్ఱనిది; ఎఱుపెక్కినది. "సీ...కెంపువాతెఱసొంపె..." దశా. ౧, ఆ. ౧౬౪. "చ....కనుదోయి కెంపుగ నకుంఠిత విక్రమ మొప్ప..." భార. కర్ణ. 3, ఆ. ౧౬3.

కెంపుకంటి. దే. వి. (కెంపు+కన్ను.) కోయిల. (శ. ర. బ్రౌ.)

కెంపుకన్నులపులుఁగు. దే. వి. కోయిల. వేంక. తిర్య. ౧౦౭.

కెంపుగాము. ద్వ. వి. (కెంపు+గాము.) కుజుఁడు, అంగారకుఁడు. (శ. ర. బ్రౌ.)

కెంపునవతు. ద్వ. వి. (కెంపు+నవతు.) స్వాతీనక్షత్రము. (శ. ర.)

కెంబట్టు. ద్వ. వి. (కెంపు+పట్టు.) ఎఱ్ఱపట్టు. (బ్రౌ.)

కెంబసుపు. ద్వ. వి. (కెంపు+పసుపు.) కుంకుమము. "సీ. నునుపుగా దువ్వి తీర్చిన కెంపుబాలేందు పస మీఱునొసటి కెంబసుపుబొట్టు." శుక. ౨, ఆ. ౪౨౫.

కెంబెదవి. ద్వ. వి. (కెంపు+పెదవి.) రక్తవర్ణము గలవాతెఱ. (బ్రౌ.)

కెకరించు. దే. అ. క్రి. 1. కోరు. "ద్వి...చావఁ, గెకరించెదవు విధి గెలువ నీవశమె." నవ. ౧, ఆ. ౪౯. పు. ౧. పం; 2. కెక్కరించు. (చూ. కెక్కరించు.)

కెక్కరించు. దే. అ. క్రి. (కోడిమొ. పురుగులుమొ. తినుటకు ముక్కుతో)మట్టిని చిమ్ము. వ్యవ:— వాఁడు కోడి కెక్కరించినట్లు కెక్కరించి రెండు మెతుకులు తిన్నాఁడు.

కెడ = కడ. దే. వి. 1. పార్శ్వము, ప్రక్క. ఆం. భా. ద్వి. ౧3౭. "గీ. కృపుఁడు వృషసేనుఁడును వారి కెడనఁ గూడి." భార. ద్రో. ౪, ఆ. 303. (శ. ర. పా.); 2. దిశ, దిక్కు. "సీ. ఇటు వల్లెత్రాటిమిక్కుటపుఁ దెక్కరికీఱు కెడ గొప్పతిప్ప వీక్షించినాఁడ." ప్రబంధ. ౧౪౯.

కెడకూడు. దే. అ. క్రి. 1. కూడనుండు, అనుసరించు. "సీ. నెఱి లేక నీతోడినీడయై గెడగూడి పరఁగిననన్నింత యెరవుసేసి." కు. సం. ౫, ఆ. ౧౨3. "ద్వి...పురజనులు, గెడగూడి తన్నిరు గెలఁకులఁ గొలువ." బస. ౪, ఆ. 2౦౯; 2. సుమిగూడు. "గీ...కొండ ఉన్నారు గగనవీథి, నొరిమెఁ గెడగూడుకొని యెవ్వరొక్కొ వీరు." కాశీ. 3, ఆ. ౧3౭. స. క్రి. రమించు, భోగించు. "క. మగనికి వెఱపక యింటికిఁ, దగఁ దాసే కర్తయగుచుఁ దత్పరవృత్తిన్, పగ గలదై వెలిఁ దిరిగెడు, మగువం గెడగూడువాఁడు మదనుఁడు గాఁడే." మల్హ. ౨, ఆ. ౧2౩.

కెడపు. దే. స. క్రి. (కెడయు. ధా. ప్రే.) 1. పడఁగొట్టు; త్రోయు. "సీ. కెరలి చీఁకటిత్రాను గెడపంగ నిక్కినసముయగజంబుదంతము లనంగ." పారి. ౨, ఆ. 3౬. జై. 3, ఆ. ౧౦౯. "క... రఘువీరుఁడు...సురాంతకుఁ బడఁ గెడపి..." రామా. ౪, ఆ. ౫౦; 2. చంపు; వశింపఁజేయు. "క. ఈహరిణనయనఁ గెడపిన, స్త్రీహత్యయుఁ గెడపకున్నఁ జెచ్చెర స్వామి, ద్రోహంబును..." హరిశ్చ. ౫, ఆ. ౧౪3. "గీ. అచ్యుత యనంత గోవింద యనెడునామ, కీర్తనం బౌషధం బౌచుఁ గెడపఁ రోగ, జాలములనెల్ల..." శేష. ౧, ఆ. ౫౧. కాశీ. ౬, ఆ. ౧2౬.

కెడమాలు. దే. అ. క్రి. ఏర్పడు?; మార్పుచెందు? "ఆ. పగలు చేయుం జేయుఁ బగలును గెడమాల, కునికిఁ గేలిగతులు నొదవె నేని, కన్నె చన్నుఁ గవకుఁ గన్నుంగవకు నీడు, కోకయుగము నవచకోరయుగము." శ్రీరాధా. ౧, ఆ. ౧౬౫.

కెడయాడు. దే. అ. క్రి. (కెడ+ఆడు.) నడయాడు, తిరుగు. "సీ. ఈహంసయానంబు నింతయొప్పయి యున్నె యలివ యిక్కడఁ గెడయాడెనేని." షోడ. ౮, ఆ. 3౯.

కెడయిక. దే. వి. (కెడయు. ధా.) 1. పతనము. (శ. ర.); 2. చావు. (శ. ర.)

కెడయు. దే. అ. క్రి. 1. విఱుగు, వికలమగు. "మ. కరిబృందంబులు త్రెళ్ళఁ ద్రెల్లుఁగఁ దురంగ

స్తోమముల్ పెక్కు గూల్తె రథానీకము లగ్గలంబు గెడసెన్..." భార. కర్ణ. ౨, ఆ. ౨౦౦. భీష్మ 3, ఆ. 3౫3; 2. పడు, కూలు. "సీ. కీలుకాఁ డెడలింపఁ గెడసినబొమ్మలకై వడి..." భార. ద్రో. 3, ఆ. ౬౨; 3. ఖండితమగు; చచ్చు. "సీ. వరములు వడయంగ శిరములు గెడయంగఁ బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె." ఉ. హరి. ౨, ఆ. ౧౯౧. "క. కసిమసఁగి యసురవిసరము, లసిలతి కలసురల సెగవ నసువులు వెడలం, బసచెడిరి పసిరి కెడసిరి, యసమసమరవిలసనముల నని వెడలి నృపా." భాగ. ౯, స్కం. ౧౪౬. సా. ౧. ఆ. ౧౦౮; 4 ఎడమగు, పాయు. ఆం.భా.తృ. ౯౫.

కెడవు. దే. వి. (కెడయు. ధా.) పతనము, కెడయిక. (శ. ర. బ్రౌ.) విణ. ఒఱగినది, వ్రాలినది. "క. విడు విషఁ డనిఫణి పలుకఁగఁ, గడుభరమున మొదలఁ గుదురు గలఁగమిఁ గెడవై, బుడబుడరవమున నఖిలము, వడవడవడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్." భాగ. ౯, స్కం. ౧౯౯.

కెడ్బెరసు. దే. విణ. (కెడ+బెరసినది.) ఏకమైనది, మొత్తమైనది. "గీ. సొంపు మిగులంగ జోదుల యంపపొదల, దీప్తులును లేఁతనవ్వులదీధితులును, హారిరశ్ములఁ గెడ్బెర నగుచు వెలుఁగఁ, దేరు లరిగె నుద్దామతఁ గౌరవేంద్ర." భార. శల్య. ౧, ఆ. ౧౦౪. ('కీడ్బెర నగుచు' ముద్రి.) "క... కెడ్బెరసై పీనుఁగులు పడువుఁ బ్రేకయుఁ బడియెన్." కు. సం. ౧౧, ఆ. ౧౨౪; ౧౯౦.

కెయ్య = కయ్య. (బ్రౌ.)

కెర. దే. వి. కిలకిలధ్వని. (చూ. కెరగొట్టు.)

కెరగొట్టు. దే.అ. క్రి. కిలకిల మను. ఆం.భా. తృ.౯౮.

కెరటము. దే. వి. కరడము, అల. (ఈపద మత్యాధునికులరచనలయందు వాడుకయందుఁ గాననగుచున్నది.)

కెరలించు. దే. స. క్రి. (కెరలు. ధా. ప్రే.) 1. అతిశయింపఁజేయు, వృద్ధిపొందించు. "గీ. సోయగము గాంచి తిలకించి సొబగు మించి, మరులు గెరలించి కెరలించి మదిఁ గరంచి, యఱమరలు దీఱ లాలించి యూమతించి, కలికితొలికూటమి విభుండు తులకరించె." కృ. శకుం. 3, ఆ. ౫౦. శశాం. ౪, ఆ. ౫౯; 2. ఏసిగించు, చిరాకు గొలుపు. "ఉ. ఇం కిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం, బొంకము కాని నీవలని బొంకులు మాచవి గావు..." పారి. ౧, ఆ ౧౨౬. 3. బాధించు, కారించు. "క. రాచిలుకా..., మాచెలిఁ గెరలించి తేని మాటలు వచ్చున్." విజ. 3, ఆ. ౫౯.

కెరలిపడు. అ. క్రి. (కెరలి+పడు.) 1. బాధపడు. 2. తొందరపడు. "క. కెరలిపడి జనని దూఱుట, ధరణీపతి ననుట వెఱ్ఱితన మిఁక నేలా, పరితాప మొంద నాకుం, గఱకంఠుఁడె దిక్కు గాక కలరే యితరుల్." సా. 3, ఆ. 3౭.

కెరలియాడు. దే.అ. క్రి. (కెరలి+ఆడు.) ఉప్పొంగు, మిక్కిలి సంతోషించు. "గీ... బాణాసురుండు, దనుజసుందరీసహితుఁడై మన...లోనఁ, గెరలియాడుచు మధుపానకేళిఁ దేలి." ఉ. హరి. ౫,ఆ.౪౮.

కెరలు. దే. అ. క్రి. (క. కెరలు) 1. అతిశయించు, విజృంభించు "గీ... పెల్లాయాసపడు విమాథుఁ, డతని బాధించు దోషత్రయంబు గెరలి." భార. అశ్వ. ౧, ఆ. ౧౧౬. "సీ. ఒండొరుల సరోష హుంకృతిఁ గెరలుచుఁ గెరలి తూపులవాన గురిసి కురిసి." రాఘవ ౪, ఆ. ౨౨౫. 2. వ్యాపించు; (రుచి) కలుగు. "గీ. కృష్ణపథుని, కీల లెంతైన మీఁదుగాఁ గెరలుగాచె." భర్తృ. ౧, ఆ. ౮౮. "క...వినో, ద మ్మగుకథ వినియెద యని, కమ్మని చక్కెరలు కెరలఁగా నిట్లనియెన్." శుక. ౪, ఆ. ౧౦౮; 3. కోపపడు; ఏసుగుకొను. "గీ...ఎవ్వ రేమన నొకింత,కెరలనిసుశీలసంపన్న గేస్తురాలు." సా. 3, ఆ. ౪౬. స్వా. ౬, ఆ. ౪౮; 4. తత్తఱపడు. "చ. కెరలక క్రమ్మఱింప నడుగెంటనె నిల్చినొకింత నూకినన్...తత్పురీహరుల్." పాండు. ౧, ఆ. ౧౧౪; 5. భ్రమణము చేయు, తిరుగు. "చ...భ్రమరజాల గుణాంచితపాంసు చక్రముల్, గెరల..." వసు. 3, ఆ. ౧3౫; 6. ఎగురు. "వ...అదల్చినం గెరలి చెరలుకొట్టుచు మిన్నులపైఁ బౌఱుచిలుకవారువంబుల..." శ్రీరం. ౨, ఆ. ౨౯౫.

కెరలుకొను. దే. అ. క్రి. (కెరలు+కొను.) 1. పెంపొందు, వృద్ధిపొందు. "క. వాడక వ్రాలక తెవుళులఁ, గూడక తగ నల్ల గెరలుకొని నవకములై,

చూడఁగ భద్రము లగుచుఁగ్, పీడెన్ సస్యంబు లిడుమ పీడెం బ్రజకున్." భాగ. ౧౦, స్కం. పూ. ౨౯౨; 2. ఉప్పొంగు, సంతోషించు. (చూ. కెర్లుకొను.)

కెరలుచు. దే. స. క్రి. (కెరలు. ధా. ప్రే.) కెరలించు. కెరలఁజేయు. (చూ. కెరల్చు.)

కెరలువాఱుచు. దే. అ. క్రి. (కెరలు+పాఱుచు.) 1. విజృంభించు. అతిశయించు. "ఆ. అతనిచేత నున్నయమృతకుంభము సూచి, కెరలువాఱిచి సురలఁ గినుకపెట్టి, పుచ్చుకొనిరి యసురపుంగవు లెల్లను, మాఱులేనిబలిమి మానవేంద్ర." భాగ. ౮, స్కం. ౨౯౫; 2. పెంపొందు వృద్ధినందు. "గీ. గరిమ నీగతిమెల్లనఁ గెరలువాఱిచి, చెలఁగి మూఁడంగ..." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౧౦౭.

కెరలెత్తు = కెరలువాఱుచు. (కెరలు+ఎత్తు.) విజృంభించు, మదమెక్కు. "సీ. ఘుమఘుమ నళులు ఘోషింపఁ గెరలెత్తి మూర్ఛిత మిన్నులు మోవ నెగయు." సాంబో. ౨, ఆ. ౧౯3.

కెరల్చు = కెరలుచు. 1. రగుల్చు, మండించు. "సీ. విరహచింతాగ్ని నివ్విధి గెరల్పెదు నన్నపగిది ..." వరాహ. 3, ఆ. ౭౫; 2. వ్యాపింపఁజేయు. "ఉ. తమ్ములదాయరూపు సెఱతావిఁ గెరల్చు వసంతుసేపు..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౧౫; 3. పురికొలుపు, ప్రేరేచు. "చ...సాళువంబులన్, దడవి కెరల్చుచున్..." స్వా. ౪, ఆ. 3౦. కళా. ౬, ఆ. ౧౨౮; 4. కోపింపఁజేయు; బాధించు. "చ...చిక్కుర మునిము చ్చటంచు గమకింపులచేఁ గపిలుం గెరల్చి తద్గురుతరకోప దీపమునకుఁగ్ శలభాకృతిఁ జెంది రందఱున్." చం. రా. 3, ఆ. ౧౪.

కెర్లు=కెరలు. 1. అతిశయించు. "గీ. మొనసి వలితెమ్మరలు కెర్లి పెనఁగులాఁడు." కువల. 3, ఆ. ౯౫; 2. విసుగు. "పంచచామరము....సారె సారె నన్నుఁ గెర్లఁ జేయరాక పొమ్మికన్." విప్ర. ౪, ఆ. ౫౯.

కెర్లుకొను = కెరలుకొను. (ఉప్పొంగు, సంతోషించు.) "గీ. పఱల దిక్కుల నెంచి దుర్వాదమైన, కీడు మేలును దెల్పుచుఁ గేక లిడుచుఁ, గెర్లుకొనుచును దనపేరు కేరికొనుచు, వచ్చె నచటికి డుబుడక్కవాఁ డొకండు." హంస. ౨, ఆ. ౨౭.

కెల. దే. వి. సాట్యము? "సీ. కెల చూపురంభనెచ్చెలి యయ్యె మూఁపున మంజిటికుంచియ మాటి యోర్తె." సాంబో. ౨, ఆ. 3౪.

కెలఁకరించు = కెక్కరించు. (బ్రౌ.)

కెలఁకు. దే. స. క్రి. 1. కెరలించు, రేఁపు. "వ... ఇంకులఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిం గెలంకిన బుద్ధిక్షోభంబుగా నింతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో..." ఆము. ౬, ఆ. 3౬. (శ. ర. పా. 'వీనిఁ గెలఁకిన' ముద్రి.); 2. ఊడఁబెఱుకు, లాగివేయు. "వ...భగునికన్నులు కెలఁకి పూషుపండ్లు వెఱికి..." కాశీ. ౭, ఆ. ౯౫. (శ. ర. పా. 'కెలికి' ముద్రి.)

కెలను. దే. వి. బౌ. (బౌ. రూ. కెలఁకు, కెలంకు.) 1. పార్శ్వము, ప్రక్క. "సీ. కెలఁకులనున్న తంగెటిజున్ను గృహమేధి యజమానుఁ డంక స్థితార్థపేటి." స్వా. ౧, ఆ. ౬౬. "క. బలగము గలభూపాలుఁడు, గెలనిమహేశ్వరుల బుద్ధికెని వ్రేఁ గగుచున్." భార. శాం. ౨, ఆ. 3౫౮; 2. దగ్గఱ, దాపు. "గీ...కెలన నున్న, చిన్నిముద్దుల సిరి యాళసెట్టి కనియె." హర. ౨, ఆ. ౭3. ఆం. భా. తృ. ౨౧; 3. దిక్కు, దిశ. "చ. కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషములెల్ల కెలంకులఁగ్ భయంకరములుగా..." భార. ఆర. 3, ఆ. ౨౯౭. విశే. 1. ప్రక్కనున్నవాఁడు, పొరుగువాఁడు. "చ...అన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యులట్లుగా, కెరవయి నిల్చినం గెలని కెల్లిదమై పటిపోదు రెంతయున్." భార. ఉద్యో. ౨, ఆ. ౮౮; 2. ఎదుటివాఁడు. "ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములుగాఁగఁ, జలుప వలయు నృపతి గొలువున్నయెడల బాహ్యహారము లైనఁ గెలని కెగ్గు లగుట." భార. విరా. ౧, ఆ. ౧3౭; 3. పగవాఁడు, శత్రువు. "గీ. కెలని నోడించువిధముఁ దా గెలుచువిధముఁ, దలఁచుకొనుచును రాజ్యతంత్రంబు చాగు, రీతిఁ గోల్పడి..." పిన. శకుం. ౪, ఆ. ౧౬౪.

కెలయు. దే. అ. క్రి. 1. ఉత్సహించు. "గీ. కెలసి నెలపుల్గుగములు గ్రుక్కిళ్లు మ్రింగఁ, గ్రమ్ముకొని వచ్చు వెన్నెలచెమ్మ యనఁగ." చంద్రా. ౫, ఆ. ౫3; 2. గర్వించు. "ద్వి. కెలయుచు నిను నీవె

కీర్తించుకొనెదు, కులజుండు తనుఁదానె కొనియాడుకొనునె." రం. రా. అర. ౧౬౬. పు. ౧౫. పం. కువల. ౨, ఆ. ౨౪; 3. వికటించు, వికటముగాఁ బలుకు. "సీ...కట్టుకొంగు. గీ. తొలఁగి ఒఘనంబు కనిపింపఁ గెలసి నవ్వ." దశా. ౧, ఆ. ౧౯౦. "సీ. స్త్రీలగా నందఱ సృష్టింపరైతి రంచును నుపధాతలఁ జూచి కెలయు." దశా. ౪, ఆ. ౧౧౯.

కెలవు. దే. వి. వలపు, వాంఛ. "గీ. సగము మొగిచిన కనుఁగవ సగము నగవు, సగముసగ నుగుపలుకులు సగము మఱపు,కెలవు సగమును దగ రతిఁ గలిసి యలసి, లోలలోచన నాయెద వ్రాలు టెపుడొ." రాధికా. ౨, ఆ. ౧౨3. విప్ర. 3, ఆ. ౭3.

కెలసము. దే. వి. (క. కెలస.) 1. పని. "గీ. ఏన నగుఁగాక విడుతుమే పూనినట్టి, కెలసము..." రామా. ౨, ఆ. ౧౧౪; 2. కావలసినపని. "ఉ... నీకెలసంబుదీర్చెదం,జట్టన నన్నుఁ బంపుము భృశంబుగ నెయ్యది కార్యమి త్తఱిన్." భార. అర. ౫, ఆ. ౨౨౭; 3. సేవ. (దివిజగణములు) గీ... తమతఁ బార,వచ్చి కెలసంబు సేసినవారె కారె." కు. సం. ౨, ఆ. ౨౫. [రేచు. (శ. ర.)

కెల్లగించు. దే. స. క్రి. 1. పెల్లగించు. (శ. ర.); 2. కెల్లు = కెరలు. (చూ. కెల్లుమలఁగు.)

కెల్లుమలఁగు. దే. అ. క్రి. (కెల్లు+మలఁగు.) మరలు; పరాఙ్ముఖమగు. (శైలసుత) "గీ. కేకరాలోకనంబులఁ గెల్లుమలఁగె." హర. 3, ఆ. ౧౧.

కెవ్వు. దే. వి. అర్చుట సింహనాదముచేయుట కేక వేయుట మొ. వానియందలిధ్వని కనుకరణము. "గీ. శంకరుఁడు నందిపై నెక్కి హుంకరించి, యతిశయార్భటిఁ గెవ్వున నార్చి పేర్చి." అని. ౪, ఆ. ౪౬. ఉదా:—కెవ్వునఁ గేకవేయు. కెవ్వున నేడ్చుమొ. (వా.)

కెళకుళి. దే. వి. క్రీడాసరస్సు. "సీ. ఈకెళకుళిలోన కెలనాగ ప్రోదిరాయంచలకవల నిందించి యాడె." షోడ. ౧, ఆ. 3౦. (శ. ర. పా.)

కెళవు. దే. వి. 1. పార్శ్వము, కెలను. "గీ. ఊరు పాడైనఁ గెళవులయూళ్లు కుటికి, మెసవదొరఁ కొంటిఁ బ్రజ మారిమసఁగినట్లు." స్వా. ౫, ఆ. ౭౬. జై. ౮, ఆ. ౧౨3. 2. దూరము, దవ్వు. "క...మనము కెళవు దొలఁగి యుండుద మనుచున్." జై. ౫, ఆ. ౫3. "సీ. వినుతికి విడిపట్టు వినయమ్ములకు గట్టు కలఁక కిరవు కీర్తులకుఁ గెళవు." సత్యా. సా. 3, ఆ. ౧3౪.

కెళాకుళి = కెళకుళి. "సీ. ఈకెళాకుళిచెంత రాకేందుబింబాస్య తివిరి యంచకు నడల్ దిద్దుచుండె." రసిక. 3, ఆ. ౧౦౭.

కెళాకూళి=కెళకూళి. "గీ. తావితమ్మికెళాకూళి దండ నొప్పు, గొప్పపన్నిటికాల్వకు..." రా. వి. 3, ఆ. ౧౧. [కొను.)

కెళ్లు. దే. అ. క్రి. (క. కెళ్లు.) తిను. (చూ. కెళ్లుకొను.)

కెళ్లుకొను. దే. అ. క్రి. (కెళ్లు+కొను. స్వార్థమున.) తిను; కోటపైచుకొను. "వ...పనికి మొదళ్లు కెళ్లుకొనియు నమలి చవిగొన లేక మరల వెడలఁ గ్రక్కు డాకినీగణంబులును..." కవిక. ౨, ఆ. ౧౯౭.

కెళ్లురుకు=క్రెళ్లురుకు. (బ్రా.)

కెళ్లువాఱు=క్రెళ్లువాఱు. (బ్రా.)

## కే.

కే. దే. వి. ఉత్సాహముతో వేయుంకేక మొ. వాని ధ్వని కనుకరణము. "క. నాయింటం బదికడవల, నేయి పెరుఁగు పాలుఁ ద్రావి నీప్రియతనయుం, డోయమ్మ కడవ లన్నియుఁ, గే యని బోరగిలఁ ద్రోచి కేసుచు వచ్చెన్." హరి. పూ. ౫, ఆ. ౨౧౭. పార్వ. ౪, ఆ. ౯౪.

కేంద్రము. సం. వి. అ. న. 1. వృత్తక్షేత్రముయొక్క మధ్యస్థానము; 2. లగ్నమును దానికి జతుర్థసప్తమ స్థానములును; 3. మధ్యము.

కేఁగేలు = కెంగేలు. "గీ. చెలువ చెలువయ్యె బల్ పల్కు చిలుక చిలుక, వెలఁది వెలఁది నీకేఁగేల నలరునలరు." సావి. ౨, ఆ. ౭.

కేఁగో. దే. వి. నెమిలిమొ. కూయుఁకూఁతయం దగు ధ్వని కనుకరణము. "క. కేఁగోదమ నెమిలి పల్కెడుఁ,గేఁగో యని వైశ్య మనకు గెలుపగుఁ జుమ్మీ." క్రీడా. ౬౨.

కేక. ఉభ. వై. వి. (సం. కేకా. క. కెకె.) 1. నెమిలి కూఁత. ఆం. భా. ద్వి. ౯౨; 2. అఱపు. "క... తోడిజనవాధిసుతుల్,సాటెకుఁ గేకలు వేయఁగ ..."పా. ౨,ఆ. 3.సం.వి.ఆ. స్త్రీ. నెమిలికూఁత.

కేకటగెమ్మటలు. దే. వి. బ. కే కే యనుచుఁ జేయు పరిహాసవాచకము. "ద్వి. కర మరుర క్తియ కారణం బుగను, గిరిజేశుఁ గేకటగెమ్మట లాడి,యును సర సముచేసియును గేలిచేసి,యును..." పండితా. మహిమా. ౨౭౩. పు.

కేకయము. సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

కేకయి. సం. వి. ఈ. స్త్రీ. కైక, కైకేయి.

కేకరము. సం. వి. అ. న. 1. మెల్లకన్ను. (వాచ.); 2. కడకన్ను.

కేకరాక్షి. సం. వి. ఇ. న. = కేకరము. ఆము. ౨, ఆ. ౨౬.

కేకరించు. ఉభ. వై. అ. క్రి. కేకలువేయు; గొంతుక సరిచేసికొనునట్లు ధ్వనిచేయు. "ద్వి. క్రీడించి మలయుచుఁ గేకరించుచును." నవ. 3, భా. (శ. ర.) "ఆ. కేకరించి కొన్ని పోకలఁ బోయి య,చ్చేడెచూపు దన్నుఁ జేరకునికి."శుక. ౧, ఆ. ౯౧౬. న. క్రి. మించు; తక్కువపఱుచు. "సీ. ఇంచునీటిని గేకరించుచల్లనిమాట జాబిల్లితోఁ బొందుఁ జలువు మోము." గంధ. ౧౯౯. సం. అ. క్రి. కడగన్నిడు, క్రీగంటఁ జూచు. "గీ... ఇంద్రుడిక్కుఁ, గేకరించియుఁ జూడక కృష్ణుఁ డంచి, తానును డయి యుండె ననాదరమున." హరి. పూ. ౭, ఆ. ౧౯౬.

కేకరింత. దే. వి. (కేకరించు. ధా.) కేక, గొంతు సరిచేసికొనునట్లు కేకవంటిధ్వని చేయు. "సీ. ఒడ వెడుగాఢద్య మదిరిపాటునఁ బల్కరింపఁ బుట్టెడు కేకరింత దెలుప." ఆము. ౯, ఆ. ౬౦.

కేకరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మెల్లకంటివాఁడు.

కేకసలాడు. దే. అ. క్రి. (కేకసలు+ఆడు.) (పరి హాసాదిసమయములలో) చప్పట్లుగొట్టు. "ఉ. శాక మదీయవాక్యములు గైకొన నొల్లక మోర త్రోపునం, గేకసలాడుచుం జనిన..."మత్స్యపు రాణము. (సూ. ని.)

కేకసలు. దే. వి. బ. (పరిహాసాదికముల నవ్వుచుఁ గొట్టు) చప్పట్లు. "మ త్త... వారి వారికి వారిలోఁ, గేలిఁ దేలుచుఁ జాలఁ బ్రేలుచుఁ గేకసల్ వడిఁ గొట్టుచున్." రా. చ. ౨, ఆ. ౧౬౦. ఆం. భా. త్రి. ౯౭.

కేకి. సం. వి. న్. పుం. నెమిలి.

కేకిసలాడు = కేకసలాడు. "గీ.. కేకిసలాడుచుఁ బొందుపడని, పలుకు లెసఁగంగ..." భార. మా. ౧౪.

కేకిసలు = కేకసలు. "చ. వనిత యొకర్తు...హరిఁ జూచెఁ గేకిసలు గొట్టుచు బోటులు దాని నవ్వఁ గన్."పారి. 3, ఆ. ౧౨. (ఈక్రిందిప్రయోగ మునమాత్ర మీయర్థమున నేకవచనప్రయోగము కాననగుచున్నది.) "ఉ. కేకిస గొట్టి యొర్తు గిలి గించిన...చంద్రి. ౪, ఆ. ౧౭. (నమస్కార ములు) "రగడ. శ్వేతాద్రిస్థలి సింహాలోచనున కెలమిని గేకిస లిచ్చుచు భక్తిని." హంస. ౪, ఆ. ౨౧౩. "గీ. కిసలముల కేల యింత కేకిసల మసల." బహు. ౨, ఆ. ౪౧.

కేగరించు. దే. అ. క్రి. సమీపించు, దగ్గఱు. "ద్వి క్రేట్లువాఱుచు నీడఁ గేగరింపుచును." పండితా. పురా. ౨౯౯ పు. ౫ పం.

కేటత్రాడు. దే. వి. ఔ. (కేడు+త్రాడు.) యమ పాశము, కాలపాశము. "క. పితరదొర కేట త్రాటన్, జతనంబునఁ దివియు మిగుల జడుపున నెదలో, వెతకుడుచు తపసిబిడ్డని, బ్రతికించి యసుంబు గన్నబల్లిమున కొగిన్." నీలా. ౧, ఆ. ౨౨.

కేటాయించు. దే. స. క్రి. వేఱుపఱుచు. (శ. ర. వా.)

కేటాయింపు. దే. వి. (కేటాయించు. ధా.) వేఱు పాటు. వా:—దేని కది కేటాయింపు మంచిది.

కేడ. దే. విణ; (త. కేడన్.) ధూర్తుఁడు, ములుచ. ఆం. భా. త్రి. ౭.

కేడించు. దే. అ. క్రి. తొలఁగు, తప్పుకొను. "సీ. కేడించి కుంభినిక్రిందికిఁ బోరాదు మనుజసిం హుఁడ నని మఱయరాదు." భాగ. ౧౦ స్కం. పూ. ౧౩౪౦. "సీ... ద్రోణసుతుండును శల్యుం డుఁ గేడించి చనిరె యపుడు." భార. భీష్మ. ౧, ఆ.౯౮. (ప్రే.) స. క్రి. తొలఁగించు; నిర సించు. "గీ...వాకిటఁ బెట్టినట్టి, తడకఁ గేడించి పోవరునఁ దార్చి..."విప్ర. 3, ఆ. ౬౮. "శా...సముద్భూతప్రబోధాత్ము లెల్లం గేడిం పక యాదరింపుఁడు..."కావ్యా. 3, ఆ. ౨.

కేడించుకొను. దే. అ. క్రి. (కేడించు+కొను. స్వార్థ మున.) తప్పుకొను. "సీ. ఖోడించి చినసివంగి

కేడించుకొను నిట్టీ వెనుకగాఁ గట్టూన్ప విడిచి త్రెళ్ల." కథు. ౪, ఆ. ౮౬.

కేడు. దే. అ. క్రి. (క. త. కేడు.) చచ్చు. (చూ. కేడువాఱు.) వి. చావు. (చూ. కేటత్రాడు.)

కేడువాఱు. దే. అ. క్రి. (కేడు+పాఱు. స్వార్థమున.) చచ్చు. "గీ. సారథులు వ్రాలఁ గొమ్ములు చదిసి కూలఁ, బక్కెరలు వ్రీలఁ గరవాలపటలి తూలఁ, గేడువాఱంగ నవి పోరు ఖేచరాళి, హర్షమునఁ జూడఁగా బొమ్మలాడినట్లు." కువల. ౨, ఆ. ౧౪౫.

కేడెము. వై. వి. (సం. ఖేటకమ్. త. కేటయం.) డాలు, పలక. ఆం. భా. ద్వి. ౨౧౬.

కేతకి. సం. వి. ఈ. స్త్రీ. 1. పచ్చపూమొగలి, గేదఁగి, (చెట్టు, పువ్వు మొ.); 2. జాజీ; 3. సువర్ణముఖీ నది. "శా...కేతక్యాపగం గ్రుంకుచున్..." కాళ. ౪, ఆ. ౧౭౩.

కేతనము. సం. వి. అ. న. 1. ఇల్లు; 2. స్థానము; 3. టెక్కెము; 4. గుఱుతు; 5. కృత్యము; 6. నిమంత్రణము.

కేతుమాలము. సం. వి. అ. న. నవవర్షములలో నొకటి.

కేతువు. సం. వి. ఉ. పుం. 1. నవగ్రహములలో నొకటి; 2. టెక్కెము; 3. గుఱుతు; 4. కాంతి; 5 ధూమకేతువు; 6. అగ్ని; 7. కిరణము; 8. శత్రువు. విణ. ఉ. పుం. శ్రేష్ఠుఁడు. ("మను వంశకేతుం." సం. రఘు. ౨, ఆ. ౩౩.)

కేదారకంకణము. సం. వి. అ. న. హస్తాభరణవిశేషము. "సీ. అడుగునెత్తమ్ముల నపరంజిపావాలు కరమునఁ గేదారకంకణంబు." కాళ. ౧, ఆ. ౩౦.

కేదారగౌళ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనపుంసక రాగము. "సీ. కాంభోజి కేదారగౌళ శోకవరాళి పున్నాగగుమ్మ కాంభోజి..." హంస. ౫, ఆ. ౧౨౪.

కేదారము. సం. వి. అ. పుం. న. వరిమడి; పుం. 1. ఆలవాలము, పాదు; 2. ఒకానొకపుణ్యక్షేత్రము. పాండు. ౨, ఆ. ౨౧౨. 3. శివలింగభేదము; 4. పర్వతభేదము. 5. వరిపండు పొలము; "శా... కేదారమ్ముల్ తెగ నమ్మఁగాఁ దగునె..." పాండు. ౩, ఆ. ౪౧.

కేదారి = కేదారిగౌళ. (బ్రా.)

కేదారుఁడు. సం. వి. అ. పుం. గంగాధరుఁడు, శివుఁడు.

కేదారేశుఁడు. సం = కేదారుఁడు. "శా. కేదారేశు భజించితెన్..." స్వా. ౧, ఆ. ౭౧.

కేనము. దే. వి. టక్కు, మోసము. "వ అని...నిజ సంపదల బుజ్జగించి వెంబూనికేనంబు లలవడ నోజఁగొల్పుచు." కు. సం. ౮, ఆ. ౧౪౧. విణ. సాటి,సమానము. "ఉ...గాం,గేయుఁడుఁ దారకాసురుఁడుఁ గేనలు లే కనిసేసి రీసునన్." కు. సం. ౧౨, ఆ. ౧౪౫.

కేనిపాతకము. సం. వి. అ. పుం—నీటిలోఁ బడవై చుటచేఁ బడవ నడప సాధనమైనది-ఓడత్రెడ్డు.

కేయూరము. సం. వి. అ. న.-బాహుశిరమున నుండునది-అంగదము. పుం. ఒకానొకరతిబంధము.

కేరజేము. దే. వి. ఒకానొకపక్షి. "సీ. మూలసంముల నుండి మూల్గుడాబలక్రందు గుంపుకేరజపుకయ్యం పురొదలు." చంద్రా. ౨, ఆ. ౮౧. చిత్ర భా. ౩, ఆ. ౧౨౨. (కేర్జము అని ఆం. భా. తృ. ౯౮.)

కేరడము. దే. వి. (కేరు. ధా.) 1. వక్రోక్తి. "గీ. కేరడము లాడుసతి మధ్యధీర..."నరస. ౨, ఆ. ౭౯. ("ప్రియం సోత్ప్రాసవక్రోక్త్యా మధ్యాధీరాదహేద్రుషా" అని సాహిత్యదర్పణము); 2. వేళాకోళము. ఆం. భా. ప్ర. ౧౩౯. చంద్రా. ౨, ఆ. ౧౪౫; 3. చతురోక్తి. "గీ. వలపులకుఁ జిక్కి కేరడములకు జొక్కి." హంస. ౨, ఆ. ౧౧౨; 4. తిరస్కారోక్తి; తిరస్కారము. "గీ...కేరడములాడుచుండి రేనిఁ, గవియుపాండవబాణాగ్నిఁ గాముసువ్వె, తమ్ముఁ దమలోభమునుచిచ్చు దరికొనంగఁ, దెగినవారలు పోదురింతియ తలంప." భార. ఉద్యో. ౧. ఆ. ౩౫౩. "గీ. మువ్వురను గేరడము చేయ నవ్విధంబు, సైఁప లేక..."హరి. పూ. ౧, ఆ. ౧౭౭.

కేరడించు. దే. స. క్రి. పరిహసించు; వక్రార్థము గలిగించు. "సీ. కడుమొఱలుంపకే కటకంబు లన మ్రోయుఁ గటకముల్ శుభయత్నగరిమ ననుచుఁ. గీ. జెలిపలుకుఁ గేరడించుచు..."వసు. ౫, ఆ. ౭౬. "ఆ. నగినఁ గేరడించినక్ మీసలంటినఁ, బట్టి తివియ నాకుఁ బాడిగాదె."ద్వా.౭, ఆ.౫౧.

కేరళము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

కేరించు. దే. అ. క్రి. నవ్వు,హసించు. (చూ. కేరింత.)

కేరింత. దే. వి. (కేరించు. ధా.) హాసము, నవ్వు. ఆం. భా. ప్ర. ౧౩౧.

కేరిజేమ = కేరజము. (బ్రౌ.) 'సీ. కేరిజంబులఁ గోరి కేరులు వీరించి పూరేండ్లఁబుడకలఁ బూడ్డెఁ గలిపి. ద్వా. ౧, ఆ. ౨౩౯.

కేరిజెవ్వ. దే. వి. శ్యేనవిశేషము. (బ్రౌ.)

కేరియ. దే. వి. (కేరుధా.) కేరింత. (చూ. కేరియలువాఱు.)

కేరియలువాఱు. దే. అ. క్రి. (కేరియలు+పాఱు.) కేరింతలుకొట్టు. "ఉ. జీఱికె కల్లుద్రావి మదసింధురగామిను లన్ని కేఱియల్, వాఱుచు గౌడుగీతములు వాడుచు..." శు. సం. ౬. ఆ. ౪౫.

కేరియవాఱు. దే. అ. క్రి. (కేరియ+పాఱు.) కేరింతలుకొట్టు. (చూ. కేరియలువాఱు.)

కేరు. దే. అ. క్రి. 1. ఉత్సహించు, ఉత్సాహపడు. "మంజులగతిరగడ. స్వర్ణమందిరసువర్ణస్వామికేఁ గేరుచు జరిపెద గిడిగి ళ్లనుచును." హంస. ౪, ఆ. ౨౧౩. స్వా. 3, ఆ. ౨౩; 2. ఉత్సాహముతోఁ బలుకు; కూయు. "చ...కుచంబులోరగా, వెలుపడఁ బైఁటవేయు నెఱవింతగఁ గేరు మరుల్కొనంగ..." హంస. ౧, ఆ. ౨౧౭. "గీ. కీరకలకంఠములు క్రొవ్వి కేరుచోట." స్వా. 3, ఆ. ౧౧౧; 3. కుతూహలపడు."చ...ఉగ్మలి మరియోర్తు వేనలిని గంధము మెత్తి మిటారిగుబ్బలన్,గలయఁ బ్రసూనమాలికలు గట్టి హరిం గనఁ జేరెఁ గేరుచున్." రుక్మి. ౫, ఆ. ౨౬.4. అతిశయించు, మిక్కుటమగు. "చ...కువలయాధిపుపాటలు పాడినం గరం, బలరుచుఁ గేరికేరి నగు..."కళా. ౬, ఆ. ౧౯౫; 5. ఒప్పు. "ఉ. కేరును గేతకిన్ మొగలి గేదఁగియం చను పేరు లొప్పు ఖర్జూరము గజ్జూరంబనఁగ ...ఆం. భా. ద్వి. ౭౯. స. క్రి. 1. పరిహసించు. "గీ. బెళికి తప్పించుకొనుచు బిట్టులికి పఱచు, కలికి నవ్వుచు రావె యావలికి నీవు,వలికి వెఱచిన నని కేరి పలికికొనుచు, వెలఁదిమిన్నలు నీరాడి వెడలునపుడు." దశా. ౯, అ. ౭౮. ఉ. రా. ౧, ఆ. ౪. 2. తిరస్కరించు. "గీ. చిన్న చీమలనునుఖారు చెలువయారు, కదళికాకాండములమీఱు కాంతయూరు, లందములఁ జెందు రతిఁ గేరు నతివసౌరు, దాని కెనయైననారు లిద్ధరణి లేరు." హంస. ౨, ఆ. ౧౮.

కేరుకొను. దే అ. క్రి. (కేరు+కొను. స్వార్థమున.) ఉత్సాహపడు. "వ...ఒడ్డోరులఁ గడవం గేరుకొను బేతాళ బాలికాజనంబులవలనను..." పారి. ౫, ఆ. ౧౩. స. క్రి. గొప్పగాఁ జెప్పుకొను. "గీ...తన పేరు కేరికొనుచు,వచ్చె నచటికి దుబుడక్కవాఁ డొకండు." హంస. ౨, ఆ. ౨౭.

కేలు. వై. వి. ఔ. అనా. (సం. కులిః.) 1. చేయి. "ఆ. కట్టినాఁడఁ గేలఁ గంకణంబు." పాండు. ౪, ఆ. ౧౦౫; 2. తొండము. "చ. తొలఁగక యమ్మహాబలుఁడు దోర్బల మొప్పఁ గృపాణపాతభంగులఁ గరినాథు కేలు నిరుగొమ్ములతో దెరయంగఁ ద్రుంప..." భార. అర. ౬, ఆ. ౨౭౯.

కేలుదండ. వై. వి. (కేలు+దండ.) కైదండ, చేయూఁత. "చ...రఘూద్వహుం డతిరయంబున లక్ష్మణుకేలుదండతో." దశా. ౭, అ. ౨౮.

కేలుదోయి. వై. వి. (కేలు+దోయి.) హస్తద్వయము. (చూ. కేల్దోయి.)

కేలుమెకము. వై. వి. (కేలు+మెకము.) కరి, ఏనుఁగు. రా. వి. ౫, ఆ. ౪౫.

కేలుమొగుచు. ద్వ. అ. క్రి. నమస్కరించు. "గీ. కృష్ణపక్షను భక్తిమైఁ గేలుమొగిచి..."హరిశ్చ. 3, ఆ. ౧౩౦. (శ. ర. బ్రౌ.)

కేలుమొగ్గ. వై. వి. అంజలిబంధము, చేమోడ్పు.

కేలుమోడ్చు. ద్వ. అ. క్రి. (కేలు+మోడుచు.) నమస్కరించు. (చూ. కేల్మోడ్చు.)

కేలుమోడ్పు. ద్వ. వి. (కేలు+మోడ్పు.) నతి, మ్రొక్కు. "సీ...కేలుమోడ్పెఱఁగుదు,నాఁగఁ జెన్నొందును నతి..." ఆం. భా. ద్వి. ౧౭౫.

కేలువిడుచు. ద్వ. అ. క్రి. (కేలు+విడుచు.) చేయివీచు, ఆజ్ఞాపించు. "ఆ. పన్ని వేగిరించుపరనిజధ్వజినులఁ,జూచి కోప మేచి త్రోచి యపుడు, పోర నొండొకంటెఁ బోడుచుట కవనీశ,విబుధరిపులు కేలువిడుచుటయును."కవిక. ౨, ఆ. ౧౫౧.

కేలుసాఁచు. ద్వ.అ. క్రి. (కేలు+చాఁచు.) అడుగుకొను, బిచ్చమెత్తు. "సీ. శ్రీకాంత దానయ్యుఁ

ప్రియము నిరోధింపదు క్రింజై విరోధికిఁ గేలు సాఁప." వసు. ౧, ఆ. ౬౫.

కేలొసఁగు. ద్వ. అ. క్రి. (కేలు+ఒసఁగు.) నమస్కరించు. "మంజులగతిరగడ. వ్యాఘ్రపురస్థలియందు మహాబ్రహ్మస్వామికిఁ గేలొసఁగెద హితముగ." హంస. ౪, ఆ. ౨౧౩.

కేల్దోయి = కేలుదోయి. (దీనిబహువచనరూపములు కేల్దోయిలు, కేల్దోలు.) "క. బాలామణులొక్కొకయెడ, నాలోలై లాలతాగతాళులు నలినేచ్ఛాలీలల వ్రాలఁగఁ గేల్దోలు చలాచలక దాఁపుమరు పయ్యెదలన్." శ్రీ రాధా. ౨, ఆ. ౧౪౩.

కేల్మోడ్చు = కేలుమోడ్చు. "గీ. పలికి గట్టని కేల్మోడ్చి ప్రభునిఁగూర్చి." రసిక. ౧, ఆ. ౬౪.

కేవడము. వై. వి. 1. (సం. ఖేటకమ్.) ఒకరకపు డాలు. ఆం. భా. ద్వి. ౨౧౯. స్వా. ౪, ఆ. ౨౮; 2. నాశనము (చూ. కేవడించు.)

కేవడించు. దే. స. క్రి. నశింపఁజేయు. (ద్యోతకము.) "సీ. ధర్మశీలంబుల మర్మంబు భేదించుఁ గీర్తిధనంబులఁ గేవడించు." విష్ణు. నా. ౨, ఆ. ౧౭.

కేవరి. దే. వి. (కేవు+అరి.) కేవు పుచ్చుకొనువాఁడు. (శ. ర. బ్రౌ.)

కేవలము. సం. వి. అ. న. నిర్ణయము, అవధారణము. విణ. (అ. ఆ. అ.) 1. అంత, సమస్తము; 2. అచ్చము, ఒక్కటి; 3. ప్రధానము. "క... అర్జునుడు విరాటసుతున కిట్లనుఁ గేవలవీరరసమయాత్మకుఁ డగుచున్." భార విరా. ౫, ఆ. ౩; 4. సామాన్యము. "క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచినపద్మహితుఁడొ శచీగృహమేధియొ కాక యితఁడు కేవలనరుఁడే." భార. విరా. ౧, ఆ. ౨౧౫.

కేవలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సామాన్యుఁడు. "ఉ...,కీటడఁగించు నర్జునుఁడు కేవలుఁడే యని భీతచిత్తులై ... పాఱినన్." నిర్వ. ౭, ఆ. ౫౨.

కేవు. దే. వి. 1. కెవ్వు, అర్చుటయం దగుధ్వని కను కరణము. "సీ. అని పల్కి కేవున నార్చి..." అచ్చ. యు. ౭౮౯. "ఉ...ఉగ్రమూర్తియై, కేవున నార్చి..." కవిరా. ౪, ఆ. ౧౨౬; 2 (హిం. కేవ్.) ఓడకూలి. (శ. ర. బ్రౌ వా.)

కేశకారము. సం. వి. అ. పుం. 1. గోఱపము; గుత్తములవెండ్రుకలు కత్తిరించుకత్తెర; 2. ఒకజాతిచెఱకు.

కేశగర్భము సం. వి. అ. పుం. కొప్పు.

కేశఘ్నము. సం. వి. అ. న. ఇంద్రకము, బట్టతల.

కేశచ్ఛిదుఁడు. సం. వి. అ. పుం. మంగలి.

కేశపాశి. సం. వి ఈ. స్త్రీ. సిగ.

కేశమార్జకము. సం. వి. అ. న = కేశమార్జనము.

కేశమార్జనము. సం. వి. అ. పుం. దువ్వెన.

కేశము. సం. వి. అ. పుం. 1. తలవెండ్రుక; 2. గుఱ్ఱపుమెడవెండ్రుక; 3. కిరణము; 4. యోని. పుం. న. కురువేరు.

కేశముష్టి. సం. వి. ఇ. పుం. మహానింబము, పెద్దవేము.

కేశరంజనము. సం. వి. అ. పుం. భృంగరాజము గుంటగలగర.

కేశరాజము. సం. = కేశరంజనము.

కేశవము. సం. వి. అ. పుం. సురపొన్న.

కేశవుఁడు. సం. వి. అ. పుం—కేశి యనురాక్షసుని జంపినవాఁడు—విష్ణుమూర్తి. విణ. (అ. ఆ. అ.) చక్కనితలవెండ్రుకలు గలవాఁడు.

కేశవేశము. సం. = కేశగర్భము.

కేశాంతికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తలవెండ్రుకలవఱకు నుండునది; 2. తలయెత్తుపొడువు కలది.

కేశి. సం. వి. న్. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు. (చూ. కేశవుఁడు.); 2. సింహము. ఈ. స్త్రీ. సిగ. విణ. (న్. నీ. న్.) మంచివెండ్రుకలు గలవాఁడు.

కేశికుఁడు. సం. విణ. = కేశవుఁడు.

కేశిని. సం. వి. ఈ. స్త్రీ. 1. కురులసౌభాగ్యము గలస్త్రీ; 2 ఒకరాక్షసి; 3. దుర్గ.

కేశుఁడు. సం. వి. అ. పుం. 1. వరుణుఁడు; 2. విష్ణువు.

కేసరము. సం. వి. అ. పుం. న. 1. సింహాదులమెడజూలు; 2. కింజల్కము. పుం. 1. నాగకేసరము; 2. పొన్న, 3. పొగడ. న. 1. ఇంగువ. 2. బంగారము, 3. అన్నభేది.

కేసరి. ఉభ. వై. వి. 1. (సం. ఖేచరః.) ఒకానొక మృగము. ఆం. భా. ద్వి. ౧౫౫; 2. ఒకవిధ మగు పరిపైరు. "వ...కేసరులు చంద్రవంకలు..." ప్రబంధ. ౧౧౨. హంస. ౪, ఆ. ౧౨౮. సం. వి. న్. పుం. 1. ఒకానొకవానరుఁడు, హనుమం

కునితండ్రి; 2. సింహము; 3. గుఱ్ఱము; 4. పొన్నచెట్టు; 5. నాగకేసరముచెట్టు. విణ. న్. పుం. శ్రేష్ఠుఁడు. "మ. అని కీర్తించి తపస్వికేసరి యఖండానందదుగ్ధార్ణవం, బునఁ గ్రీడించుచు..." కాళ. ౧, ఆ. ౧౪౭.

కేసి. దే. వి. వైపు, ప్రక్క. ఉదా:—వానికేసి, దానికేసి. (బ్రా.)

కేళకుళి = కేళాకూళి. "గీ. అంబుధులు కేళకుళులు కులాచలములు." కవిక. ౨, ఆ. ౫౭. రసిక. ౪, ఆ. ౪౪.

కేళకూళి. శేంక. స్థా. ౯౦. భీమ. 3, ఆ. ౧౧౯. "గీ. కాలువలు దీర్చిన పసిండి కేళకూళి." విక్ర. ౫, ఆ. ౧౯.

కేళాకుళి = కేళాకూళి. ఆం. భా. ప్ర. ౧౬౩.

కేళాకూళి. వై. వి. (సం. క్రీడాఖాతమ్.) క్రీడా సరస్సు. "సీ. లలిత మైనట్టికేళాకూళిఁ జుట్టి పెల్లల్లిన ద్రాక్షపందిళ్లచెంత." శశాం. ౪, ఆ. ౧౬౫. "క. లోకాలోకమహీధర, మేకోట కులాచలములు కృతకాద్రులు కేళాకూళులు జలరాసులు, శ్రీకరధృతిసాంద్రుఁ డౌ హరిశ్చంద్రునకున్." కవిజ. ౧, ఆ. ౨౬.

కేళి. సం. వి. ఇ. పుం. ఈ. స్త్రీ. 1. క్రీడ, ఆట; 2. స్త్రీపురుషుల విహారక్రీడ. (వనకేళి. జలకేళి మొ.) 3. పరిహాసము, వేళాకోళము. ఇ. స్త్రీ. భూమి (వాచ.)

కేళిక. ఉభ. వై. వి. (సం. కేళికా.) 1. నృత్యము, నాట్యము. "చ...జక్కిణిరవండి మేళములఁ గేళిక సల్పిరి..." రామా; 2. నాట్యవిశేషము. "ద్వి. కేళికఁ జొక్కయు లీల నటింప." బస. ౭, ఆ. ౧౫౪ పు. సం. వి. ఆ. స్త్రీ = కేళి.

కేళికిల. సం. వి. ఆ. స్త్రీ. రతీదేవి.

కేళికిలుఁడు. సం. వి. అ. పుం. విదూషకుఁడు. విణ. (అ. ఆ. అ.) పరిహాసము చేయువాఁడు. ఇట్లే: కేళికిలుఁడు, కేళికీలుఁడు మొ.

కేళిసచివుఁడు. సం. వి. అ. పుం. నర్మసఖుఁడు. (విదూషకాది.)

కేల్లి = క్రేల్లి. (బ్రా.)

కేల్లిదాఁటు = క్రేల్లిదాఁటు. (బ్రా.)

కేల్లియుకు = క్రేల్లియుకు. (బ్రా.)

## కై.

కై. దే. వి. (క. త. కై.) 1. చేయి. "మ...చిలుకం గై నుంచకే చిల్కపల్కులో నీపల్కులో కాంచ లేము..." ఉ. రా. ౬, ఆ. ౫౬; 2. తొండము. (శ. ర.); 3. కవి. (బ్రా.); 4. కుక్క మొఱఁగుటయందు దగుధ్వని కనుకరణము. "మ... (కుక్క)...కైకైశబ్దముల్ సేయుచున్." బ్రహ్మో. ౨ ఆ. ౧౩౦. ప్ర. (కు+ఐ.) చతుర్థీ విభక్తిప్రత్యయము, కొఱకు. "గీ...దీనికై వెఱప నేల." జై. ౧, ఆ. ౭౩. భార. సభా. ౨, ఆ. ౧౭౪.

కైంకర్యము. సం. వి. అ. న. సేవ, ఊడిగము.

కైక. వై. వి. (సం. కైకేయీ.) దశరథునిభార్యలలో నొకతె. భరతునితల్లి. ఆం. భా. ద్వి. ౧౦౫. అచ్చ. అయో. ౯౪.

కైకట్టు. ద్వ. వి. (కై+కట్టు.) సందర్భము. ఆం. భా. [ప్ర. ౧౧౨.

కైకయి. సం = కైకేయి.

కైకర్ణిక. మి. వి. (కై+కర్ణిక.) వశీకరణౌషధము. "క. పానమందురసముఁ బసరును, ఘనమణిమంత్రౌషధములఁ గైకర్ణికకాపును....తవిలిచి తెత్తున్." హంస. ౨, ఆ. ౩౯.

కైకలవాఁడు. దే. వి. తంతువాయభేదము, ఒకజాతి సాలెవాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౩.

కైకానుక. దే. వి. (కై+కానుక.) ఉపాయనము. "మ...జవాదిపిల్లులు మొదల్గాఁ గానలో వాని గుంపులుఁ గైకానుక చేసి..." య. ౧, ఆ. ౧౦౪. ఇట్లే. కైకాన్క. హంస. ౨, ఆ. ౩౭. శుక. ౨, ఆ. ౨౮౯.

కైకానము. మి. దే. వి. (కై+కానము?) వేదన, బాధ. "క. చేసెడువలరాయనికై, కానములకు ..." వేం. పంచ. ౪, ఆ. ౪౧౧.

కైకూలి. దే. వి. (కై+కూలి.) ఏనాఁటిపని కానాఁ డిచ్చెడుకూలి, కైజీతము. "ద్వి. కొడవలి గడియించుకొనుచుఁ గైకూలి,వడిరాజనములకు నొడఁ బాటు చేసి." బస ౪, ఆ. ౧౩౫ పు.

కైకేయి. సం.వి. ఈ.స్త్రీ. కేకయరాజుకూఁతురు;కైక.

కైకొను. దే. అ. క్రి. 1. పనియగు; వ్రతమగు. "క. మాకుం బుణ్యము సాలమి, గాకేమి జగత్త్రయంబుఁ గావం బ్రోవం, గైకొన్న నీవు సకలవి,

వేకిని మాదుఃఖ మెఱుఁగవే మధుమథనా." ఉ. హరి. ౪, ఆ. ౯౬; 2. సంభవించు, తటస్థమగు. "క. వికరి తనకు నపాయము, గైకొనఁగాఁ దనదుమూర్ధకంపము సేయక, లోకమున కపుడు సకలము, హీకంపము పుట్టునట్టిసుభరాజంబున్." భా. రా. బా. ౪౨౦. స. క్రి. గ్రహించు. "గీ. కైకొనుము దీని నని యిచ్చె నాకవనిత." సైష. 3, ఆ. ౧౨౦; 2. వివాహమాడు. "మ. జయలక్ష్మీసతితో సనంగవతి నిచ్చం గైకొనం గోరి యుజ్జయినీనాథుఁడు..." విక్ర. ౪, ఆ. ౫౪; 3. లక్ష్యపెట్టు. "మ. మనసేనం గలఁగంగఁ జేయుచు మదిక మందాకినీనందనుం,డు నను గైకొనకున్న వాఁ డితనియాటోపం బడంగించెదన్." భార. భీష్మ. ౨, ఆ. 3౧; 4. వశపఱచుకొను. "గీ... అయ్యింతి ననుఁ గనుఁగొనియె నాత్మఁ, గైకొనియె రాగరసమఁన్రఁ గడఁకొనియె, మదనవికృతి బయల్పడ నుడిలగొనియె." భార. విరా. ౨, ఆ. ౮3; 5. పొందు; అనుభవించు. "మ...కాశీశ్వర నీలకంఠ యనుచుఁ బ్రాఁ గన్నువాటిల్లఁ దత్కాలశినూనుఁడు మూర్ఛ గైకొనుఁ గ్రమక్షామూక్షరోల్లాసియై." కాశీ. ౨, ఆ. ౧౫౪. "గీ...అఖిలరాజ్యవైభవంబులు గైకొంచు..." కవిక. ౬, ఆ. 3౯; 6. అనుసరించు. "మ. చరమాశాంతరవీథిఁ గైకొని సరోజాతప్రియుం డేఁగఁగా..." విక్ర. ౨,ఆ ౧౧౫. హర. ౨, ఆ. ౫3; 7. సమ్మతించు. "గీ...గెల్పు గెల్పుగ మదీయ, బుద్ధి గైకొనదు..." భార. శాం. ౧, ఆ. ౬. భార. ఉద్యో. ౧, ఆ. 3౧౫; 8. ధరించు. "శా...నాఁ డేను గైకొన్న కాంతాకారంబు..." భాగ. ౮, స్కం. 3౯౧.

కైకొలుపు. దే. స. క్రి. (కైకొను. ధా. ప్రే.) 1. అంగీకరింపఁజేయు; 2. ధైర్యముచెప్పు. 'క... మది బెదరం, గా వల దని చెప్పి దొరలు గైకొలుపఁ బుటయున్." భో. ౪, ఆ. ౭౪. (రెండిటికి నిదె యుదాహరణము.)

కైకొల్పు = కైకొలుపు. (పుఁకొలుపు, ప్రేరేఁచు.) "వ...కుటిలస్వభావు లయి భూవరులు రుక్మిం గైకొల్పిన నతండు..." భాగ. ౧౦ స్కం. ఉ. 3౦౦.

కైకోల. దే. వి. గుడ్డలు నేసి బ్రతికెడునొకానొక జాతి. (శ. ర.)

కైకోలు. దే. వి. (కైకొనుధా.) 1. సమ్మతి. "క. నీకును మంత్రులకును నీ,లోకమువారలకు సాక్షి లో నిశ్చితమై, కైకోలు కలిగెనే..." దశ. ౭, ఆ. ౧౭౪; 2 స్వీకారము. "క. లాభంబు ధర్మమఁఖ్యము,గా భరవడి మార్గశుద్ధి గనుఁగొని కైకోల్గా భూవరునకు నిహపర, శోభనములు సేఁత చెప్ప శ్రుతివాక్యంబుల్." భార. శాం. ౨, ఆ. ౪౧౦. 3. శపథము. "క. నేలయుం నుదకముఁ దేజము, గాలియు నాకసము నెఱుఁగఁ గాచితి నాకై, కోలిడ..." ద్వా. ౫, ఆ. ౧౯౮.

కైచెఱ. ద్వ. వి. (కై+చెఱ) చేఁజిక్కుట, వశమగుట. (చూ. కైచెఱయిచ్చు)

కైచెఱయిచ్చు. ద్వ. అ. క్రి. (కైచెఱ+ఇచ్చు.) తనంతఁ దాను వశమగు, చేతులార లొంగు. "క. ఏచినతననితువాలువి, లోచనములచెలువమునకు లొంగి జలజముల్,కైచెఱయిచ్చె ననం గేలీచాలితనలిన మాకలికి ధరియించున్." వరాహ. ౧౧. ఆ. ౫౦.

కైచేఁపు. దే. వి. (కై+చేఁపు.) అంజలి, నమస్కారము. "మంజులగతిరగడ...నిబిడస్థలిలో నిబిడాకార,స్వామికి మతిఁ గైచాఁపు లొసంగుచు." హంస. ౪, ఆ. ౨౧3.

కైజీతగాఁడు. ద్వ. విణ. (కైజీతము+కాఁడు.) జీతము పుచ్చుకొని యుద్ధముచేయుయోధుఁడు. "సీ. మూలబలంబును మొత్తాలవారును మిత్రబలంబును శత్రుబలముఁ, ఆ. గానసంబుబలముఁ గైజీతగాండ్రును, సైనయట్టిబలము లాఱు నరసి." భార. ఆశ్ర. ౧, ఆ. ౭3.

కైజీతము. ద్వ. వి. (కై+జీతము.) ఏనాఁటి దానాఁ డిచ్చుజీతము. "గీ. అగుచుఁ గైజీతములవారలనికి నిగిడి." కువల. ౨. ఆ. ౧౪3. రా. వి. ౫, ఆ. ౧3. విణ. శపథాపొంధనిషేవి, వెనుకకు మరల నని యొట్టుపెట్టుకొని యుద్ధముచేయువాఁడు. ఆం. భా. ద్వి. ౧౮౫. ప్రబంధ. ౭౯౭.

కైజో. దే. వి. వాఁగెను వెనుక కీడ్చి కట్టుట; కళ్లెపుఁ బగ్గపుకట్టు. "సీ. కైజో యమర్చి నక్రంబుపై వరుణుండు..." శ్రీరం. మా. ర, ఆ. ౧౯౧.

కైజోచేయము. దే. అ. క్రి. (కైజో+చేయము.) గుఱ్ఱపు నోటికళ్లెముకటు: దగిలించుపగ్గము బిగించు. (దీని వలన గుఱ్ఱ మాఁగిపోవును.) "క...విభుండు హాయము డిగి హుసా,రై కైజాచేసి మహా నోక హాతలమున నిలిచి..." చంద్రా. ౨. ఆ. ౧౧౧. "శా. కైజాచేసినబొంమమక్షీ విరిబల్లు ఁడాజగా జోడులే,జీశాడన్..." కువల. ౪, ఆ. ౯౯.

కైజోమోర. దే. వి. (కైజో+మోర.) 1. హాయ శీర్షకంపనము, గుఱ్ఱము తలయాడించుట. ఆం. భా. ద్వి. ౨౦౦; 2. కళ్లెపుఁబగ్గము బిగించినహయా దులమూతి. "శా...పురిం బొల్చు నా,జానే యంబులు ఫేనహాస మిడి కైజామోర లల్లార్చు చున్." ఆము. ౨, ఆ. ౨౬. వసు. ౧, ఆ. ౧౫.

కైజో. దే. వి. కపింజలము, కౌఁజుపక్షి. ఆం. భా. ద్వి. ౯౪. స్వా. ౫, ఆ. ౫౮.

కైటభారి. సం. వి. ఇ. పుం. విష్ణువు. ఇట్లే: కైటభవైరి. కాశీ. ౬, ఆ. ౯3; కైటభారాతి. హర. ౬, ఆ. ౪౫.

కైటభుఁడు. సం. వి. అ. పుం. విష్ణునికర్ణములనుండి పుట్టి బ్రహ్మను జంపఁబోఁగా విష్ణునిచే నిహతుఁడైనయొకానొక రాక్షసుఁడు. (ఇతనితోఁబుట్టిన మఱియొకఁడు మధుఁడు.)

కైత. వై. వి. (సం. కవితా.) కవిత, కవిత్వము. "ఉ. పూఁతమెఱుఁగులుం బసరుఁబూఁతబెడంగులు చూపునట్టివా.కైతలు..." పెద్దనచాటువు.

కైతప్పు. దే. వి. (కై+తప్పు.) పొరపాటు, ప్రమాదవశము. "ఉ...దేవ నిన్ను కై,తప్పునఁ జేరె నీ హాయము..." జై. ౫. ఆ. ౧౬౮. విణ. చేతి నుండి తప్పినది, చేజాఱినది. "సీ. కంగుకంగున నేలఁ గైతప్పుగాఁ బడు వేఁటమ్ము లేఱక దాఁటి దాఁటి." స్వా. ౪, ఆ. ౧౦3.

కైతవము. సం. వి. అ. పుం. ఉన్మత్తవృ. న. 1. మోసము; 2. జూదము; 3. పందెము; 4. వైడూర్యమణి.

కైతవుఁడు. సం. వి. అ. పుం. 1. జూదరి; 2. మోసకాఁడు.

కైదండ. దే. వి. (కై+దండ.) 1. చేయూఁత. "సీ. కైదండ లిచ్చి రాకలువరాయనిఁ దెచ్చి..." య. ౪, ఆ. ౯3; 2. ప్రోద్బలము. "సీ. గంధేభ ఘంటికాఘుణఘుణల్ ఘనబృంహితధ్వానము లకుఁ గైదండ గొసంగ." దశా. ౨, ఆ. 3౭౭.

కైదారకము. సం. = కైదార్యము.

కైదారికము. సం. = కైదారకము.

కైదార్యము. సం. వి. అ. న. కేదారసమూహము, వరిమళ్లగుంపు.

కైదు. దే. వి. కైజు. (శ. ర.)

కైదువ=కైదువు. 1. (ఆయుధము.) ఆం. భా. ద్వి. ౨౧౧. "చ. కరమున శైలభేది యగుకైదువ యున్నశచీకళత్రుఁడో .." హరిశ్చ. ౪, ఆ. ౭౧. 2. (అంచు.)"చ...ఐదుకైదువుల్,గలయపరంజి బిళ్ల తుదిగన్ బులిగోరును..." రా. వి. ౨, ఆ. ౨౧. 3.(కైజు)"సీ. ఈమించుకైదు వల్లెన్నిగల్గిన నైనఁ దిత్తి దీనిమాడ్కిఁ ద్రెంచి పట్టు." చంద్రా. ౨, ఆ. ౭౭.

కైదువు. దే. వి. ఆయుధము. "క...,పోరి మిడుఁగుఱు లెగసి కైదువులపొడి రాలెన్."భార. ద్రో. ౫, ఆ. ౫౧. స్వా. ౪, ఆ. ౧౯.

కైపడు. ద్వ. అ. క్రి. (కై+పడు.) కైవ్రాలు. (చూ. కైవడు.)

కైపదము. ద్వ. వి. (కై+పదము.) సమస్య. "ఉ. కైపద మిచ్చువారలను గ్రక్కునఁ బద్యము చెప్పువారలున్." భో. ౨, ఆ. ౫౦.

కైపాల. వై. వి. కక్షపాల. (బ్రా.)

కైపు. దే. వి. 1. సారాయి. వేఁక. మాన. ౭౨. ఆం. భా. ద్వి. 3౦3; 2. మత్తు. (చూ. కైపు మిఁడులు.); 3. మదము, పొగరు. (చూ. కైపెక్కు.) 4. కపటము. ఆం. భా. ప్ర. ౧3౮; 5. అతిశయము, ఉద్రేకము. "క...వేసవి, కైపు సడలఁ దోఁచెఁ గాయకాలము దళమై." పాండు. ౪, ఆ. ౧౯; 6. విధము, రీతి. 'సీ. తలతలయం చని వెలుఁగు మెఱుఁగులు దీపికాస్తోమంబుకైపుఁ జెంద." పార్వ. 3, ఆ. ౯౫. చంద్రా. ౬, ఆ. ౧౦౦; 7. సౌందర్యము. "ఉ. కారుమెఱుఁగులం దెగడుకైపున నొప్పునెలంతలు..." య. ౪, ఆ. ౧౦3; 8. విలాసము. "సీ. పేరోలగం బున్నఁ జేర్పు కైపులతోడ నచ్చరపూఁబోఁడు లరుగుదేర." య. ౫, ఆ. ౧౫౫. విణ. సుందరము, మనోజ్ఞము. "ఉ. ఎల్లరు నంత మేలుకొని

యిందుముఖుల్ ముఖమజ్జనాదికం, బల్లనఁ దీర్చి కైపుగఁ దుకూలాంబరముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబులుం బరిమళంబులుఁ దాలిచి..." రామా. ౬. ఆ. ౧౦౭.

కైపుమిగులు. దే. అ. క్రి. (కైపు+మిగులు.) కైపెక్కు, మత్తిల్లు. "గీ. విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్న, గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపుమిగిలి, పెనఁగునెడ నెట్ట విరిసెనా వనిత మేనఁ,గలయ నవనఖదంతవిక్షతము లడరె." కు. సం. ౧. ఆ. ౧౭౧.

కైపెక్కు. దే. అ. క్రి. (కైపు+ఎక్కు.) 1. తీవ్రమగు. "మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీనేర్చునే, సుతుఁడుం గష్టుఁడు సంధియేల యగు సంచుక్ నను నన్ కైపెక్కినట్టి లలం పచ్యుత నీకుఁ గల్గినది..." భార. ఉద్యో. 3, ఆ. ౭౨; 2. మదించు, పొగరెక్కు (వా.) 3. ఆలసమగు, సోమరియగు. "గీ. జనులు పనన్న కైపెక్కి యశక్య మని మనంబులోపల స్రుక్కి కార్యంబుసంతుఁ, బూని యుద్యోగ మొనరింప లేని యెట్లు, దాని సఫలతాఫలతలు దారు గందు." మార్క. 3, ఆ. ౪౭; 4. ప్రీలు, వదులగు. "సీ. కబరికాభారంబు గైపెక్కి విరులతో నవటుభాగంబుపై నత్తమిల్ల." కాశీ. పీఠి. 3. 5. చెవరు, ఇఱునటు తొలఁగు. "గీ. శ్రవణ కహ్లారముసుళంబు జాఱకుండ, విరులకీల్గొప్ప వదలి కైపెక్క కుండ, నెత్తె శృంగారకేందుకం బెత్తినట్లు, కైటభారాతి మందరక్ష్మాధరంబు." పార. ౭, ఆ. ౪౫.

కైఫీయతు. హిం. వి. (హిం. కైఫియత్.) సమాచారము; వివరణము.

కైముడి. ద్వ. వి. (కై+ముడి.) వాద్యవిశేషము, తాళము. ఆం. భా. ప్ర. ౧౨౮.

కైమోడుపు. ద్వ. వి. (కై+మోడుపు.) నతి, మ్రొక్కు. "మంజులగతిరగడ. మాహారమందసమానత విడిసినకాలమేఘునకుఁ గైమోడుపు లని." హంస. ౪, ఆ. ౨౧౩.

కైరండు. దే. వి. ఒకజాతిగుఱ్ఱము. "మ... తజ్జలదంబు కైరఁ డెగయుక్ ధారావిహారంబులన్." వరాహ. ౧౦, ఆ. ౯3. ప్రబంధ. ౧౮౪.

కైరవడి. వై. వి. (సం. ఖాదిరవటీ.) ఖాదిరఘుటిక, కాఁచువడియము. ఆం. భా. ద్వి. ౧౬౭, ఆం. శే. ౫౫.

కైరవము. సం. వి. అ. న. తెల్లగలువ.

కైరవి. సం. వి. న్. పుం. చంద్రుఁడు. ఈ. స్త్రీ. వెన్నెల.

కైరవిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగలువతీఁగ; 2. తెల్లగలువలమొత్తము; 3. తెల్లగలువ లుండు కొలను.

కైరవుఁడు. సం. వి. అ. పుం. 1. జూదరి; 2. పగవాఁడు.

కైరి = కైరఁడు. (బ్రా.)

కైలాగు. దే. వి. (కై+లాగు. త. కైదండ.) 1. చేయూఁత. "క...పరిజనములు కైలా గొసంగ స్నానోన్ముఖుండై." విజ. ౧. ఆ. ౫౫; 2. అవలంబము, ఊఁత. "మ...జనపాణికల్లకము కైలా గిచ్చి..." విప్ర. ౪, ఆ. ౧౬.

కైలాట. దే. వి. మాయ. "వ...అది కల్ల గాదు కైలాట గాదు..." వేం. మా. ౫, ఆ. ౩౧.

కైలాటకము = కైలాట. "సీ. పనిలేనిపనికైనఁ బాటి కైలాటకంబులు నేయుమునిఁ గన్నప్రోడ వేల్పు." చిత్రభా. ౪, ఆ. ౧౧౩.

కైలాటకాఁడు. దే. విశే. 1. (కైలాట+కాఁడు.) మాయావి. వేంక. మాన. ౩౦; 2. (కైలాటము+కాఁడు.) దుష్టుఁడు. ఆం. సం. మాన. ౧౧.

కైలాటము. దే. వి. 1. నతి, మ్రొక్కు. "మంజులగతిరగడ. ఉత్తలతిలమున నుత్తమహారికిని ఘనతరభక్తిని గైలాటము లని." హంస. ౪, ఆ. ౨౧౩; 2. మాయోపాయము. "ఉ...కైలాటమునక్ ఘటిల్లె సకలార్థము..." కాశీ. ౬, ఆ. ౧౪౧.

కైలాసకి. దే. వి. నాట్యవిశేషము. "ఉ...కైలాసకి...నాట్యకలనక్ బ్రకటించెను హావభావముల్." శ్రీరం. మా. ౪, ఆ. ౧౬౨; 3. మోసము. "గీ. ఏమిపుట్టునో కైలాట మింకమీఁద, మగువ దయలేక విడనాడఁ దగునె నీకు." విజ. ౨, ఆ. ౧౯౧.

కైలాసము. సం. వి. అ. పుం. వెండికొండ.

కైలు. హిం. వి. (హిం. కైల్.) పండినధాన్యము కొలత. (శ. ర.)

కైవడి. దే. వి. (కై+వడి.) 1. కరజవము, చేతివేగము. ఆం. భా. తృ. ౫౨; 2. విధము, రీతి. "క. శ్రీకాళహస్తినాయకుఁ, డీకైవడి జగములెల్ల నేలుచు..." కాళ. ౧, ఆ. ౨౦. భార. భీష్మ. ౯౩; 3. సాదృశ్యము, పోలిక. "ఆ. అతనిమేను కుంతియట్టుల కైవడి, యరయ..." భార. శాం. ౧, ఆ. ౧౨.

కైవడిముస్తె. వై. వి. (సం. కైవర్తముస్తా.) తుంగముస్తె. (శ. ర.)

కైవడు = కైపడు. "వ...ఒకయించిమచ్చికంటికి... వేణికాభరంబు కైవడ,...చేరం బిలిచిన..." భీమ. ౨, ఆ. ౧౧౦.

కైవర్తము. సం. వి. అ. న. తుంగముస్తె.

కైవర్తి. సం. వి. ఈ. స్త్రీ. = కైవర్తము.

కైవర్తుఁడు. సం. వి. అ. పుం. నీటియందు వర్తించువాఁడు, జాలరి.

కైవల్యము. సం. వి. అ. న. 1. ఏకాకిత; 2. ఐక్యత; 3. మోక్షము.

కైవళి. దే. వి. ఉపమ, పోలిక. ఆం. భా. ద్వి. ౩౦౨.

కైవసము. ద్వ. వి. (కై+వసము.) స్వాధీనము. "క...కావేరినదిన్, సేవించినవారలకున్, గైవసమగుఁ గ్రతుఫలంబుఁ గైవల్యంబున్." శేష. ౪, ౧౧౭. నరస. ౨, ఆ. ౪౦.

కైవారపుఁజెయ్యి. దే. వి. (కైవారము+చెయ్యి.) కైమోడుపు, నమస్కారము. "మంజులగతిరగడ. తనరుశరణ్యస్థలము శరణ్యస్వామికి నిదె కైవారపుఁజె య్యని." హంస. ౪, ఆ. ౨౧౪. పార్వ. ౫, ఆ. ౪౦.

కైవారము. దే. వి. (త. కైవారమ్.) 1. స్తుతి, వినుతి. (ఇది దేశ్యముగనే యచ్చతెలుఁగుగ్రంథములందలి ప్రయోగములఁబట్టి విదితము. కాని, కర్ణాటకసంప్రదాయముల ననుసరించి హేరాళాది పదములకువలెనే శ్రీనాథుఁడు దీనినిగూడ సంస్కృతసమాసఘటితము గావించినాఁడు.) "సీ. కైవార మనఁగ...వినుతి." ఆం. భా. ప్ర. ౧౧౪. "గీ. అనుచుఁ గైవార మొనరించు నవ్వ లంతి..." నీలా. ౨, ఆ. ౪౨. "సీ. భారతీదేవి కైవారవాక్యంబులు పఠియించుచున్నది ప్రస్ఫుటముగ." కాశీ. ౭, ఆ. ౪౭. నైష. ౭, ఆ. ౯౯. భార. ఉద్యో. ౨, ఆ. ౨౭; 2. పరిధి. (శ. ర. బ్రా.)

కైవారి. దే. వి. (కైవారము+ఇ.) వంది, స్తుతిపాఠకుఁడు. "మ. కమలాక్షస్మరఘస్మరాబ్జభవులుం గైవారులు..." హరి. పూ. ౧, ఆ. ౪; ౧౧౯.

కైవాలు. దే. అ. క్రి. కైవడు, వంగు. "గీ. ప్రొద్దు కైవాలుదాఁక నప్పాలఁతులుండి." శుక. ౩, ఆ. ౯౩. [జేయు, పంచు.

కైవాలుచే. దే. స. క్రి. (కైవాలు ధా. ప్రే.) ఒఱగఁ

కైవీఁగు. దే. అ. క్రి. (కై+వీఁగు.)- చేతులు లాగు-అలయు, డయ్యు. "వ. అంత నుభయబలంబులుం గైవీఁగి శిబిరంబుల కరుగునవసరంబున..." కు. సం. ౧౧, ఆ. ౨౦౩.

కైవు. దే. వి. కైపు, మత్తు. (చూ. కైవెక్కు.)

కైవెక్కు. దే. అ. క్రి. (కైవు+ఎక్కు.) కైపెక్కు, మత్తిల్లు. "క. నావుఁడు మురారి నవ్వుచు, నా వేఁదురు నూఱడించి యనుచితము మహీ,దేవునిఁ జంపుట యనుచుం,గైవెక్కినవాని మేను కరమున నిమిరెన్." ఉ. హరి. ౨, ఆ. ౧౫౦.

కైవ్రాలు. దే. అ. క్రి. 1. వంగు. "ఉ...పండి కై, వ్రాలినరాజనంబులకు..." విక్ర. ౪, ఆ. ౩౯; 2. వ్రాలు. "సీ...నుదులు గైవ్రాలెనా స్ఫటికాక్షమాలికదగ." ఉ. రా. ౩, ఆ. ౧౦౩; 3. పడు. "శా. కంతేకాలపదారవిందములపైఁ గైవ్రాలి..." చంద్ర. ౩, ఆ. ౭౨; 4. గతించు. "గీ. ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండ." కాశీ. ౧, ఆ. ౭; 5. వాడు. "క. వ్రాలినచెప్పలు వెతఁ గై, వ్రాలినహృదయాంబుజంబు..." సా. ౨, ఆ. ౨౫౭.

కైవ్రాలుచే = కైవాలుచు. (శ. ర.)

కైశికము. సం. వి. అ. న. కేశసమూహము.

కైశికి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకకావ్యవృత్తి; 2. దుర్గ.

కైశోరము. సం. వి. అ. న. వయోవిశేషము. "వ. బాల్యకౌమారకైశోరవయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచు..." భాగ. ౭, స్కం. స్కం. ౨౧౩. విణ. (అ. ఈ. అ.) కిశోరసంబంధమైనది.

కైశ్యము. సం. వి. అ. న. కేశసమూహము, కైశికము.

కైసడలు. దే. అ. క్రి. (కై+సడలు.) కైప్రాలు, కైవడు. "ఉ. వేనలిపాట పాట నరవేంద్రుకతోఁ దిలతండులాన్వయ,శ్రీ నటియింపఁ గైసడలి ప్రేఁకనిచన్నులు పాలవంకలై, కొ నసియాప్ప ..." కాశీ. ౭, ఆ. ౧౪౯.

కైసరుఁడు. వై. వి. (సం. కపీశ్వరః.) కైతగాఁడు, కవీశ్వరుఁడు. సాం. ని. మాన. ౬.

కైసాటిచుక్క. ద్వ. వి. (కై+సాటి+చుక్క.) హస్తనక్షత్రము. (శ. ర.)

కైసేఁత. ద్వ. వి. (కైసేయు. ధా.) అలంకృతి. ఆం. భా. ద్వి. ౧౪౬. "క...,పరిణయపుంగైసేఁతల, నరపతి యొఱ పతిశయిల్లునటనఁ జెలంగున్." విజ. ౨, ఆ. ౧౩.

కైసేయు. ద్వ. స. క్రి. (కై+చేయు.) 1. అలంకరించు. "క. ఆసమయమునఁ గుమారిం గైసేసి ..." విక్ర. ౪, ఆ. ౧౯౨; 2. గౌరవించు? 'గీ. ఎలమి నభిమన్యుపెండిలి యిష్టవిధమునఁ,జేసి యుల్లాసలక్ష్మి గైసేసి మత్స్య, మనుజపతియన్వయంబు పావనము చేసి." భార. ఉద్యో. ౧, ఆ. ౩; 3. పూజించు. "మ...నే,మును పూజించితిఁ బిమ్మటన్ హరియుం నంభోజాత గర్భుండునున్,గని కైసేసిరి..." భీమ. ౪, ఆ. ౨౦౩.

కైళము. సం. వి. అ. న. 1. వినోదము; 2. కేళీసమూహము.

కొ.

కొంకణము. సం = కోంకణము. (బ్రౌ. వా.)

కొంకనక్క. ద్వ. వి. (కొంకు+నక్క.) క్షుద్రజంబుకము, నీచజాతినక్క. "ఉ. చీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలున్." భార. అశ్వ. ౨. ఆ. ౧౧౭. ఆం. భా. ద్వి. ౮౩.

కొంకర. దే. వి. వంకర, వంపు. (శ. ర.); ముడుఁగుట, ముడుచుకొనిపోవుట. (చూ. కొంకరవంకరలుపోవు.) విశే. 1. వక్రము, వంకరలు గలది. "క. ఎక్కడిమొగ మెక్కడిపొడు, వెక్కడిరూపేద గమన మెక్కడికంఠఁ,బెక్కడ వినము కనుంగొన, మిక్కొంకరమెకము ననుచు నే త్తెఱ దానిన్." వేం. పంచ. ౧, ఆ. ౪౭౬; 2 దూష్యము, నిందితము. "వ...ఈ బ్రహ్మచారి శంకరునిగుఱించి యింకను వంకరకొంకరమాట లాడ నుంకించుచున్నవాఁడ..." హర. ౪, ఆ. ౩౩.

కొంకరలుపోవు. దే. అ. క్రి. (కొంకరలు+పోవు.) శైత్యాదులచే దేహాదులు ముడుచుకొనిపోవు; వంకరలుపోవు. "చ. నినుఁ దనచంక వైచుకొని నీరనిధానచతుష్టయంబునన్, జని చని సాంధ్యకృత్యములు సల్పెడునంతకుఁ ద్రిప్పి తెచ్చి పెం, పున నటవైచి కొంకరలుపోయినపేమెయి చక్కనొక్కి పోనిచినవాలినందనుఁడ నంగదుఁడన్ దశకంఠ వింటివే." రామా. ౭, ఆ. ౨౪౮. ఇట్లే: కొంకరవంకరలుపోవు; వంకరకొంకరలుపోవు.

కొంకి. దే. వి. (క. కొంకి.) 1. వెదురుమొ. వాని చివర గట్టుపుల్లమొ. "క...కొంకి గలవెదురు వెదురునం జేఁద పుచ్చి..." దశ. ౧౧, ఆ. ౭౯; 2. దోఁటి. (శ. ర.); 3. వంపుచీల. (శ. ర.); 4. చోరసాధనములలో నొకటి. "ఉ. కత్తియు నీలి చీరయును...కొంకియు నషత లొల్కుబూదియున్." చెన్న. 3, ఆ. ౨౯౪; 5. ఆయుధవిశేషము. "వ...కొంకి త్రుమ్మెను దగరు మొదలుగాఁ గలసాధనంబులచేఁ జీకాకుపఱచియు ..." ఉ. హరి. 3, ఆ. ౩౬; 6. కాలిమడమ పైభాగము. ఆం. భా. ద్వి. ౧౩౬. ఆము. ౬, ఆ. ౮౧. శుక. ౧, ఆ, ౨౬౩. విశే. వంకరది, కొంకివంటిది. (ఉదా:—కొంకివ్రేళ్లు. కొంకిసిగమొ.) బ. 1. ముచ్చిలిగుంటప్రక్క నుండెడి యెముకలు. (శ. ర. బ్రౌ.); 2. మోకాలిచిప్ప లోతట్టున నుండు నెముకలు. (శ. ర.)

కొంకికొను. దే. అ. క్రి. (కొంకు+కొను. స్వార్థమున.) కొంకు, జంకు. "ఉ...అనుమానముతో నొకకొంత కొంకికొం,చు..." హంస. ౧, ఆ. ౮౯.

కొంకిరిబింకిరి దే. విశే. వక్రము, వంకర గలది. (వా: కొంకిరిబింకిరివ్రాఁత.)

కొంకు. దే. అ. క్రి. 1. సంశయించు. "క. తనయగపాటొరు లెఱుఁగుదు,రని సూతుఁడు సమయభంగ మగుటకు భీముం,డును గొంకుచు..." భార. విరా. ౨, ఆ. ౧౪౪; 2. జంకు, భయపడు. "క...కాననాంతమున ముచ్చులకుం,గొంకి యస హాయతను నే,వంకకు నరిగితివొ..." విక్ర. ౭, ఆ. ౧౨౭; 3. వెనుదీయు. "ఉ. ఇట్టిది క్రూరకర్మ

మని యించుక కొంకక లక్ష్యయింటఁ జి,చ్చొట్టితి ...” భార్య. శల్య. ౨, ఆ. ౧౩౪; 4. సిగ్గు పడుట. (బ్రా.) వి. 1. భయము. “ఆ. తలకు పుట్టెఁ గొంకు కొలఁదికి మీఱె...” భార. విరా. ౨, ఆ. ౧౦౬; 2. సంశయము. “క. తెలివ యొడబాటుమాటం, బలిపోయినకొంకుతోడ బ్రాహ్మణుఁ గొని కన్యకుఁ గగునెడకు సరిగె...” భార. అను. ౧, ఆ. ౭౪; 3. కొంకర. (చూ. కొంకువోవు.); 4. సిగ్గు. (బ్రా.)

కొంకునక్క = కొంకనక్క. (బ్రా.)

కొంకుపడు. ద్వ. అ. క్రి. (కొంకు+పడు.) 1. జంకు, భయపడు. (బ్రా.); 2. వెనుదీయు. (బ్రా.)

కొంకుపాటు. ద్వ. వి. (కొంకుపడు. ధా.) 1. భయము. “సీ. పరులు తిట్టినచోటఁ బ్రత్యుత్తరము లేక ప్రాణహానికిఁ గొంకుపాటు లేక.” కవిక. ౪, ఆ. ౧౦౭; 2. సందేహము. “చ...శకుం గని కోమలి కొంకుపాటుతోఁ, గొతుకుచుఁ బల్కె...” హంస. 3, ఆ. ౨౨౦.

కొంకువోవు. దే. అ. క్రి. (కొంకు+పోవు.) కొంకర వోవు. “గీ. కొన్నిదేశంబు లివముచేఁ గొంకు వోయె.” కాశీ. ౧, ఆ. ౧౩౭. “చ....ఆపదం, బొరయక యుండఁ జేయుము ప్రభూతపుసీతునఁ గొంకువోయెడున్.” భార. శాం. 3, ఆ. 3౧3.

కొంగ. వై. వి. (సం. క్రుఞ్.) 1. క్రౌంచము. ఆం. భా. ద్వి. ౯3; 2. బకము. సాం. ని. తిర్య. ౭౯.

కొంగకాళ్లవాఁడు. ద్వ. విశ. (కొంగ+కాళ్లు+వాఁడు.) ఊర్ధ్వజ్ఞువు, ఎత్తుకాళ్లవాఁడు. (శ. ర.)

కొంగగుద్దలి. ద్వ. వి. (కొంగ+గుద్దలి.) ఉప్పరవాఁడుపయోగించు నొకానొక త్రవ్వెడుసాధనము. (బ్రా.) [చేఁప. (బ్రా.)

కొంగముక్కు. ద్వ. వి. (కొంగ+ముక్కు.) ఒకజాతి

కొంగవాలు. వై. వి. (కొంగ+వాలు.) 1. మాదిగవానికత్తి. ఆం. భా. ద్వి. ౨౮౯; 2. ఒకరకమైనకత్తి. “సీ...కొంగవాలున గట్టిగొంగ గెలిచి.” అచ్చ. యు. ౪౭౪. య. ౨, ఆ. ౧౦. “సీ. కొంగవాల్నఱకు లంగుళులఁ బట్టుక జబ్బలంటఁ గుట్టిడ పెజ్జు సరయువారు.” ఆము. ౬, ఆ. ౧౫.

కొంగు. దే వి. (స్త్రీపురుషుల) చేలాంచలము, చెఱఁగు. “చ...తనయుత్తరీయ వస్త్రపుఁగొనకొంగునఁ దుడిచెఁ దన్వికపోలపుఘర్మబిందువుల్.” కళా. ౪. ఆ. ౯౫. భాగ. 3. స్కం. ౪౭౦. అ. క్రి. 1. కొంగుపఱచు, సంభోగమిచ్చు. (బ్రా.); 2. ఒఱగు. (చూ. కొంగోడు.)

కొంగుపఱచు. ద్వ. అ. క్రి. (కొంగు+పఱచు.) 1. సిద్ధమగు. “గీ. కొంగుపఱచిరి నృపతి లాకూటి కొఱకు.” రామలిం. ౨3; 2. సంభోగ మిచ్చు. “గీ...పలుగాకులకుఁ గొంగుపఱచుచెలఁల,నంటి ...” శుక. ౨, ఆ. ౧౨౦.

కొంగుపసిఁడి. ద్వ. వి. (కొంగు+పసిఁడి.) కొంగు బంగారము. విశ. సులభసాధ్యము; వశమైనది. “క. తను గన్నతండ్రి సెప్పిన,పని సేసిన సుగతి కొంగుపసిఁడియకాదే.” భాగ. ౯. స్కం. ౫౫౭. ఇట్లే: కొంగుబంగారము మొ.

కొంగుబత్తెము. ద్వ. వి. (కొంగు+బత్తెము.) కొంగునఁ బోసికొనుబత్తెము, ధాన్యాదికమైనకూలి. “చ... నిలిచినకుప్పకావలికి నిల్పుదు రప్పుడెఁ గొంగు బత్తెపుం,గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబు పొసంగు వేలుపున్.” చంద్రా. ౧, ఆ. ౨౫.

కొంగుమాయు. దే. అ. క్రి. (కొంగు+మాయు.) చెఱఁగుమాయు, ముట్టగు. (శ. ర. బ్రా.)

కొంగుముడి. దే. వి. (కొంగు+ముడి.) 1. (భార్యాభర్తలు.) కొంగులు కలిపివేసికొనుముడి. “చ... కొంగుముళ్లతో, వరములు దంపతు ల్వడయ ...” హంస. ౨, ఆ. ౧౫; 2. కొంగుచివర వేసినముడి. విశ. 1. వశము, స్వాధీనము. “ఉ. అంగన నాకుఁ గొంగుముడి యై తగునీ విపుడిచ్చునీవి...” రామా. ౪, ఆ. ౧౬౨; 2. ప్రీతికరము, ఇష్టమైనది. “చ...కొంగుముడి కాదె భవద్వచనంబు నావుడున్.” వసు. 3, ఆ. ౪3.

కొంగుముడివేయు. దే. అ. క్రి. (కొంగు+ముడి+వేయు.) నిశ్చయించు, స్థిరపఱచు. “క. మది తహతహ విడిచి యిఁకఁ,ముదమున సతులార కొంగు ముడివేసికొనుం,డిదె నేఁటిమాపటికిఁ గూ,ర్చెద వాలాయముగ నేలు ప్రియులను మిమ్మున్.” ప్రభా. ౫, ఆ. ౧౫.

కొంగొంగు. దే. వి. కొంగలధ్వని కనుకరణము. "సీ... కొంగలుచెలఁగి కొంగొంగు రనఁగ." హర. ౫, ఆ. ౧౬.

కొంగొడ్డు. దే. అ. క్రి. (కొంగు+ఒడ్డు.) కొంగు పఱచు, సంభోగమిచ్చు. "గీ ..కాసుపీసములకై యబ్బినట్టి,పురుషులకు నెల్లఁ గొంగొడ్డి పొట్టపోసి, కొనెడివెలయాలిబ్రదు కిట్టి దనఁగ నేల." పరమ. 3, ఆ. ౨౦౭.

కొంగోడు. దే. వి. (కొంగు+కోడు.)—ఒఱగినకోడు- ఒఱగుట, వ్రాలుట. (చూ. కొంగోడువడు, కొంగోడుపోవు.)

కొంగోడువడు. ద్వ. అ. క్రి. (కొంగోడు+పడు.) ఒఱగు, ఒడ్డగిల్లు. "సీ...కులపర్వతములు కొంగోడువడియె." మై. ౨, ఆ. 3౭.

కొంగోడుపోవు. దే. అ. క్రి. (కొంగోడు+పోవు.) ఒఱగినకోడు గలదగు. "ఆ. కుక్కిఁవడిన మిగులఁ గొంగోడువోయిన...,చుల్కమంచ మొప్ప దంద్రు." వి. పు. 3, ఆ. ౨౧౫.

కొంచించు. దే. అ. క్రి. (కొంచు+ఇంచు. స్వార్థమున.) 1. తగ్గు. "గీ. వేఁడివేలుపుకృష్ణుని వేఁడఁ బోవ,గురుత కొంచించుకాంక్షయే కొఱఁతపడిన, గౌరవము వోవు నని చెప్పఁగాఁ బనేమి." కాళిందీ. ౨, ఆ. ౨౪; 2. సంశయించు. "మ... పుత్రుండటంచును గొంచింపక వీని నొంచుఁ డిపుడు..." దశా. ౪, ఆ. ౧౭౧.

కొంచియము = కొంచెము. (తక్కువది,అల్పము.) "గీ. గోష్పదముకంటె మున్నీరు కొంచియంబు." చం. రా. ౬, ఆ. ౯౨. "ఆ. చంద్రశేఖరునిఁ బ్రసంగవశంబునఁ, గొలిచినారు భక్తి కొంచియంబు." కాశీ. 3, ఆ. ౧౪౦.

కొంచియముచేయు = కొంచెముచేయు. (న్యూనపఱచు.) "సీ. శ్యామోదయము కొంచియము చేయనేతెంచి. శ్యామోదయమును హెచ్చఁగఁ దనర్చె." చంద్రి. ౪, ఆ. ౪౫.

కొంచెకత్తె. వై. విణ. (కొంచెము+కత్తె.) 1. అల్పురాలు. (శ. ర.); 2. సామాన్యురాలు. (శ. ర.); 3. అమాయకురాలు. "గీ. ఉవిద నీవెంతకొంచెకత్తెవె జయంతుఁ,గాపు జేసినగరితవుకావె నీవు." కువల. ౪, ఆ. ౧౭3. (వ్యతిరేకలక్షణచే 'జాణ' అని భావము.)

కొంచెకాఁడు. ద్వ. విణ. (కొంచెము+కాఁడు.) 1. సామాన్యుఁడు. "క...కొంచెకాఁడవె,యన్నన్న నఖాగ్రనిర్జితారివి గాదే." శుక. 3, ఆ. ౨౯౫. బహు.౫, ఆ. ౧౦౪; 2. అల్పుఁడు,నీచు. (శ. ర.)

కొంచెతనము. వై. వి. (కొంచెము+తనము.) 1. అల్పత్వము, నీచత్వము; 2. సన్నఁదనము, సూక్ష్మత్వము. "ఆ...గొనబుఁగొను, కొంచెతనము..." అచ్చ. అర. ౨3.

కొంచెపడు. వై. అ. క్రి. (కొంచెము+పడు.) 1. న్యూనమగు. "వ...తంత్రీ నీప్రసాదంబున నన్నియు సమకూరెడుంగాక కొంచెపడియెడు నే..." భో. ౬, ఆ. ౯౯౧; 2. సన్నగిల్లు. "సీ. కడుదొడ్డకటికటి కడుఁ గొంచెపడియుండె..." చంద్రా. ౧, ఆ. ౯౭; 3. చులకనగు. "క. ఒరునొద్ద కేఁగి హైన్యము, పరికింపఁగ వేఁడి కొంచెపడియెడుకన్నఁ,మరణం బుత్కృష్టము..." శివధ. ౫, ఆ. ౯౪; 4. నశించు. 'గీ. క్రూరసంతతి వెలయునే కొంచెపడక." సిత. ౫౯. "గీ. తరుణి నీచేత మదనతంత్రంబు లెఱుఁగఁ,గోరియున్నాఁడ నాయాస కొంచెపడక, యుండ సురతసుఖాంబుధి నోలలార్చి, యింపు సొంపార నన్ను మన్నింపవలయు." వి. పు. ౨, ఆ. ౨౧౭.

కొంచెపఱచు. ద్వ. స. క్రి. (కొంచెపడు. ధా. ప్రే.) 1. తక్కువపఱచు. "క. అప్పుడు చతురంగంబుల, కుప్పలు కులగోత్రగరిమఁ గొంచెపఱుపఁగా నుప్పొంగి..." జై. ౫, ఆ. ౯3; 2. చెఱచు. "గీ. వాసి గనుమమ్మ కులశీలవర్తనములు, కొంచెపఱుపక..." పరాహ. ౨, ఆ. ౧౨౪.

కొంచెపుఁదనము. వై. వి. (కొంచెము+తనము.) న్యూనత. "వ...పగతుకొంచెపుఁదనంబు వినుట..." దశ. ౧౨, ఆ. ౧౨౪.

కొంచెపువాఁడు. ద్వ. విణ. (కొంచెము+వాఁడు.) అల్పుఁడు, నీచు. "క...పరిమార్తుఁ గొంచెపు,వారై యున్నెడన..."భార. ఉద్యో.౧, ఆ.౧౪.

కొంచెము. వై. వి. (సం. కించిత్. క. కొంచ. త. కొచ్చె.) న్యూనత, కొఱఁత. "ఉ...నీకు నీ, కొంచెము వచ్చు టెల్ల హరిఁ గోరి నుతింపమి

...నార్యపూజితా." భాగ. ౧,స్కం. ౧౯౫; 2. అచిర కాలము. "ఉ...కొంచెములోననె కాయసిద్ధికిం, గారణ మ్మది..." సా. 3, ఆ. ౨౫౧; 3. సంక్షేపము. "క. అని మన్వాదులు విస్తర,మునఁ జెప్పినవర్ణధర్మములు గొంచెమునన్, వినిపించిన ..." వరాహ. ౯, ఆ. ౧3౧. విశ. 1. అల్పము, చిన్నది. "వ...కొంచెంబు పెద్ద యన లేదు సమరంబున జయంబు దైవాధీనంబు..."భార. భీష్మ. ౧, ఆ. ౧౪. హరి. ఉ. ౨, ఆ. ౧౯; 2. తగు మాత్రము, మితము. "సీ. కొంచెపుటశనంబు గొనుచు సంగంబులఁ బాసి యింద్రియములపజ్జఁ జనమి." భార. శాం. ౬, ఆ. 3౮; 3. సులభసాధ్యము. "క...అమ్మానినితోఁ బొందు కొంచెమా యొనగూడన్." శుక. ౪, ఆ. ౧౬; 4. నీచము, తక్కువది. (చూ. కొంచెపువాఁడు.)

కొంచె. వై. వి. (సం. క్రౌంచః. క. కొంచ.) 1. క్రౌంచము. ఆం. భా. ద్వి. ౯3. భార. భీష్మ. ౨, ఆ. 3౦; 2. ఒకానొకపర్వతము. (చూ. కొంచగట్టు.)

కొంచెగట్టు. వై. వి. (కొంచ+గట్టు.) క్రౌంచాద్రి. అచ్చ. యు. ౨౦౯.

కొంచెదీవి. వై. వి. (కొంచ+దీవి.) క్రౌంచద్వీపము. (శ. ర.) [(బ్రౌ.)

కొంచెపాఱు. ద్వ. అ. క్రి. సంశయించు; వెనుదీయు.

కొంచెమల = కొంచగట్టు. (శ. ర.)

కొంచెమొగ్గరము. వై. వి. (కొంచ+మొగ్గరము.) క్రౌంచవ్యూహము. (శ. ర.)

కొంచెసొరము. వై. వి. (కొంచ+సొరము.) సప్తస్వరములలో నాల్గవది, మధ్యమస్వరము. (శ.ర.)

కొంచె. యు. వై. అ. క్రి. (సం. కుంచ్.) 1. సంకోచించు; భయపడు. "క...ఎట్టివారిఁ జంపుదుఁ గొంచన్." ప్రబోధ. ౨, ఆ. ౬౬. "ఉ. కొంచక యంబుధిం బడినకొండలపక్ష్రము లూడ్చదయ్యో న్నా,ఱుచులకత్తి..." వసు. 3, ఆ. ౧౦2; 2. మందగించు, తగ్గు. "మ...ముఖపాండుశ్రీ మిటారించెఁ గుల్కు,నడల్ గొంచె..." ఉ. రా. ౧, ఆ. ౧౮౧. వి. 1. సంకోచము. "ఆ. ఓరి దోసకారి...కినుకరించి రాఁగఁజనునె కొంచు లేక." అచ్చ. కిష్కిం. ౨౯; 2. న్యూనత. "గీ. ఎంచుచుండు నతం డెందుఁ గొంచులేక." నీలా. ౧, ఆ. ౪౮; 3. మదము. "మ...నీటదళత్వం కజనేత్ర యోర్తు తననీడన్ జూచి యాఱార గొం,చు దలిర్పన్ జెలియొవ్వతో పగలు పంజుల్ మించ నేతెంచె నే,నిదిగో దాని జయింతు నంచు దుమికెన్ హేలావతుల్ నవ్వఁగన్." చంద్రా. ౪, ఆ. ౨౪౫. విశ. అల్పము, తక్కువది. "ఆ...కొంచు గాని,కినుకతోడ..."అచ్చ. యు. ౧౦౦. దే. వి. ముణికిచెమట. "సీ...కొం చనఁగను ముణికిచెమట." ఆం. భా. ప్ర. ౧౪౦.

కొంచుఁడు. వై. విశ. సామాన్యుఁడు. "శా...ఆ, భల్లూకేంద్రుఁడు జాంబవంతుఁడు తలంపం గొంచుఁడే..." శతకం. ౧, ఆ. ౧౦౫.

కొంజు = కొంచు. దే. అ. క్రి. (దీనికి వ్యతిరేకార్థమునసే ప్రయోగములు కానవగుచున్నవి.) 1. సంకోచించు. "చ...కొం,జక మఖసాధనాశ్వము జంభవిరోధి హరించునుద్ధతిన్." భాగ. ౪, స్కం. ౪౬౪. భాగ. ౧౦. స్కం. పూ. ౧3౧2; 2. లోభించు. "క. రంజిలి తాము ను మున్నుగ,నంజలిపడ కిచ్చె నేని నయముగ వారున్, గొంజక నిత్తురు క్రమ్మఱ, ముంజేయియుం నాడె నేని మోఁచే యాఁడున్." కుచేల. ౧, ఆ. ౧౦౮; 3. విసువు. "క. కంజదళాక్షుఁడు వెనకెను, గొంజక లేఁగల నపారగురుతృణవనికా, పుంజంబుల..." భాగ. ౧౦. స్కం. పూ. ౫౦౫. దాశ. శ. ౨3.

కొంట. దే. వి. కొనుట. (అనుప్రయుక్త మైనకొను ధాతువునకును రూప మిట్లేయుండునని. ఉదా:— చేకొంట, కైకొంటమొ.) "ఉ...గొగ్గులైన మఱి యందులమాధురిఁ జూచి కాచె ఖర్జూరఫలంబులం బ్రియము చొప్పడ లోకులు గొంట భాస్కరా." భా. శ. ౬౮. "సీ. పొరుగు బేడిసపిండు పుటము గొంటయుఁబోలె జవనహాయంబులు చౌకళింప." సాంబో. 3, ఆ. ౧౬౮.

కొంటె. దే. విశ. త. (కొండి.) అల్లరిపనులు చేయువాఁడు. "క. కొంటెవి మాహృదయంబులు, గొంటెవి మానంబు లజ్జఁ గొంటెవి వలువల్,గొంటివికెంచెటులు సేసెదో,కొంటెపుగడ నిన్ను నెఱిఁగి కొంటెవి కృష్ణా."భాగ. ౧౦. స్కం. పూ.౮౨౨.

కొంటెతనము. దే. వి. (కొంటె+తనము.) 1. అల్లరితనము; 2. అకార్యము. "క. వింటికదా నీతన యుని, కొంటెతనము..." భో. ౫, ఆ. ౩౩౧; 3. క్రూరత్వము. "ఉ...లోకముల్, కొంటెతనం బునం గెలిచికొలిచి యచ్చోరియుంబు మన్మథా." కృ. శకు. ౨, ఆ. ౧౭౯.

కొంటెపాడికట్టు. దే. విణ. (కొంటె+పాడి+కట్టు.) ధూర్తుఁడు; దుష్టుఁడు. (బ్రౌ.)

కొండ. దే. వి. (క. కొండ.) 1. మల, పర్వతము. "సీ. ఈకొండ మణికాంచనాకారరుచి కాంచె..." విక్ర. ౨, ఆ. ౧౫; 2. ఆకాశము. "కొండ మీఁదివెండిగిన్నె కొక్కిరాజుకాలు విఱిగె." (వా.); 3. ఘనకార్యము. "క. కొండ ధరించుట నాకొక, కొండా .." మారి. పూ. ౭, ఆ. ౧౭౯. విణ. ఘనమైనది. "గీ. తా నెఱింగియుం నీజాతి గానిదాని, మాట లెల్లను గొండగా మదిఁ దలంచి." విప్ర. ౪, ఆ. ౭౭. సా:—1. కొండఁ ద్రవ్వి యెలుకను బట్టు. పరమ. ౧, ఆ. ౧౦౭; 2. గోరంతలు కొండంతలు సేయు. ఆము. ౫, ఆ. ౭౭; 3. కొండ విఱిగి మీఁదఁ బడ్డట్టు. (వా.)

కొండంగి. దే. వి. (కొండ+అంగి.) గోలాంగూలము, కొండముచ్చు. ఆం.భా. ద్వి. ౭౩. ('గొండొంగి' అని బ్రౌ. 'కొండెంగ' అని శ. ర.)

కొండకంది. దే. వి. (కొండ+కంది.) ఒకజాతిపెద్ద కంది. (శ. ర. బ్రౌ.)

కొండకాకి. ద్వ. వి. (కొండ+కాకి.) అద్రికాకము, మాలకాకి. (శ. ర. బ్రౌ.)

కొండకాలువ. ద్వ.వి. (కొండ+కాలువ.) సెలయేరు. (శ. ర. బ్రౌ.)

కొండకోఁతి. దే. వి. (కొండ+కోఁతి.) 1. కొండముచ్చు; 2. బాలక్రీడావిశేషము. "సీ. దాఁగిలి మూఁతలు...గురిగింజ కొండకోఁతి. హంస. ౩, ఆ. ౧౪౬.

కొండగుమ్ముడు. దే. వి. (కొండ+గుమ్ముడు.) ఒకజాతి పెద్దగుమ్ముడు. హంస. ౪, ఆ. ౧౧.

కొండగుఱుతు. దే. వి. (కొండ+గుఱుతు.) సామాన్య లక్షణము. (శ. ర. వా.)

కొండగోనుగు. దే. వి. (కొండ+గోనుగు.) అక్షోటము. (శ. ర.)

కొండగోజ్జ. ద్వ. వి. (కొండ+గోజ్జ.) రోహిషము, పాట్లేలు." గీ. కోఁతితో మైత్రి వాటించుఁ గొండ గోజియు, యకార్యశేయుంపిపుణ్యాశ్రమాంతర మున." కాశీ. ౨, ఆ. ౪౩. ఆం. భా. ద్వి. ౭౫. ఇట్లే: కొండగోజియు, కొండగోజ్జీయు మొ. (దీనిబహువచనరూపము 'గొర్జు' అని య. ౨.ఆ. ౩౨. సమాత్ర మున్నది.)

కొండగోఁగు. దే. వి. (కొండ+గోఁగు.) 1. కర్ణికారవృక్షము. "సీ. గోసరి వావిలిఁ గొండగోఁగును వనిపించె మూర్కొని మాటాడి ముదిత యొర్తు." య. ౪, ఆ. ౧౯; 2. కందరాళము. ఆం. భా. ద్వి. ౪౩.

కొండచిలువ. దే. వి. (కొండ+చిలువ.) గోనసము, కొండలుం దుందుపాము. ఆం. భా. ప్ర. ౧౪౭.

కొండచీమ. దే. వి. (కొండ+చీమ.) ఒకజాతి(నల్లని పెద్ద)చీమ. (శ. ర.)

కొండచేయు. దే. స. క్రి. (కొండ+చేయు.) అధిపతిగా నెంచుకొను. "సీ. ఈకొండమణి కాంచనాకారరుచిఁ గాంచెఁ గొండ లెల్లను దను గొండ చేయ." విక్ర. ౨, ఆ. ౧౫. '(కొండఁజేయు.' ముద్రి.)

కొండచూలి. దే. వి. (కొండ+చూలి.) పార్వతి, గిరిజ. భాగ. ౯. స్కం. ౫౧౪. ఇట్లే: కొండ రాచూలి, కొండపట్టి మొ.

కొండజువ్వి. దే. వి. (కొండ+జువ్వి.) కలుజువ్వి. ద్వి. పరమ. ౨, ఆ.

కొండజొన్న. దే. వి. (కొండ+జొన్న.) ఒకజాతి జొన్న. (శ. ర.)

కొండతంగేడు. దే. వి. (కొండ+తంగేడు.) ఒకజాతి తంగేడు. (శ. ర.)

కొండత్రిమ్మరి = కొండముచ్చు. (శ. ర.) (ఇట్లే: మలత్రిమ్మరి, తిప్పతిమ్మరి మొ. శ. ర.)

కొండదాసరి. దే. విణ. (కొండ+దాసరి.) చెట్టుకాని గుట్టకాని యెక్కి పలుకుచు బిచ్చ మెత్తుకొని జీవించువాఁడు, నీచజాతిభిక్షుకుఁడు. (వా. చూ. కొండదాసరితనము.)

కొండదాసరితనము. దే.వి. (కొండ+దాసరి+తనము.) కొండగాని చెట్టుగాని యెక్కి బిచ్చ మెత్తుకొను వృత్తి, బిచ్చమెత్తి బ్రదుకుట. "గీ. తనదుచెల్లెలి

డొడ్డభూధవున కిచ్చియ్యకనివలనను సిరిగాంచు నంతకంటె, సారమై తోఁచుఁ గొండదాసరి తనంబు." రామలిం. ౭౮.

కొండనాలుక. దే. వి. (కొండ+నాలుక.) చిఱు నాలుక, గళశుండిక. (శ. ర. బ్రా.) ఇట్లే: కొండ నాల్క. "సీ. ఎచ్చోట ముచ్చిచ్చు నేఁడేసి నాల్కలు కొండనాల్కలదాఁకఁ గోఁతవడియె." భీమ. ౩. ఆ. ౩౭.

కొండపగతుఁడు. దే. వి. (కొండ+పగతుఁడు.) పర్వ తారి, ఇంద్రుఁడు. "సీ. కొండపగతుపట్టికోడలి నింతువేఁకటిఁ గాచినట్టిచేకత్తివాఁడు." రా. వి. ౧, ఆ. ౭౧.

కొండపలుకు. దే. వి. (కొండ+పలుకు.) పర్వతగుహ యందలి ప్రతిధ్వని. "గీ. కొమరుఁ బిల్వని యల పల్కు కొండపలుకు." చంద్రా. ౧, ఆ. ౯౩.

కొండపిండి. ద్వ. వి. (కొండ+పిండి.) నగభేది. "సీ. కొండపిండి యనంగఁ బిండికొండ యనంగ నగ భేది సంజ్ఞగా నలరుచుండు."ఆం. భా. ద్వి. ౬౯.

కొండపిచ్చుక. దే. వి. (కొండ+పిచ్చుక.) కొండలఁ దిరుగుపిచ్చుక. "సీ...కొండపిచ్చుక వానకోయిల యును." హంస. ౩, ఆ. ౧౨.

కొండప్రత్తి. ద్వ. వి. (కొండ+ప్రత్తి.) ఒకజాతి ప్రత్తిచెట్టు. (శ. ర.)

కొండబరిగె. దే. వి. (కొండ+బరిగె.) ఒకజాతి సస్యము. హంస. ౪, ఆ. ౧౨౭.

కొండబూరుగు. దే. వి. (కొండ+బూరుగు.) కూట శాల్మలిచెట్టు. ఆం. భా. ద్వి. ౪౭.

కొండబెండ. దే. వి. (కొండ+బెండ.) కచ్ఛూర కముచెట్టు. (శ. ర.)

కొండమల్లయ్య. ద్వ. వి. (కొండ+మల్లయ్య.) శ్రీశైల మల్లికార్జునుఁడు, శివుఁడు. "సీ. కొండమల్లయ్యచే నుండు నందురు గాని జికను గాన మేపంక నైన." య. ౧, ఆ. ౧౦౯. [(శ. ర.)

కొండమల్లె. ద్వ. వి. (కొండ+మల్లె.) గిరిమల్లికచెట్టు.

కొండమామిడి. దే. వి. (కొండ+మామిడి.) కోశా మ్రముచెట్టు. (శ. ర.) [గర్భముచెట్టు. (శ. ర.)

కొండమారేడు. దే. వి. (కొండ+మారేడు.) గంధ

కొండము. వై. వి. (సం. కుండమ్.) గుండము. (శ. ర. బ్రా.) ఆం. భా. ద్వి. ౨౪౧.

కొండముక్కిడి. దే. వి. (కొండ+ముక్కిడి.) ఒకజాతి ముక్కిడిచెట్టు. హంస. ౪. ఆ. ౧౧.

కొండముచ్చు. దే. వి. (కొండ+ముచ్చు.) గోలాం గూలము. నల్లనిముఖము గలపెద్దకోఁతి. (శ. ర. బ్రా.)

కొండముసువ = కొండముచ్చు. (శ. ర.)

కొండయల్లుఁడు. దే. వి. (కొండ+అల్లుఁడు.) శివుఁడు. "సీ. కొండయల్లుని మేన గొమరారుసిరి మించి ..." చిత్రభా. ౯, ఆ. ౧౦.

కొండయెక్కు. దే. అ. క్రి. (కొండ+ఎక్కు.) 1. (ధనాదులచే) మిన్నందు, ఘనతఁగను; విఱ్ఱవీఁగు; గర్వించు. "ద్వి. హరికృపఁ గల్గుసర్వైశ్వర్య ములును, గొఱఁత లేదిప్పుడే కొండయెక్కుదవు." మ్ము. వి. ౨, ఆ. ౬౭. "గీ. కొండయెక్కుదు బతిమాలుకొనిఁ కొలఁది." సిం. నార. ౧౭; 2. వ్యతిరేకలక్షణచే ఆఱిపోవు. వా:—దీపము కొండయెక్కుచున్నది. ఇట్లే: కొండెక్కు. సా:— కోడిపెయ్యిబంగారమంటే కొండెక్కి యేఱిగినట్లు.

కొండరా = కొండఱేఁడు. (బ్రా.)

కొండరావి. దే. వి. (కొండ+రావి.) ఒకజాతిరావిచెట్టు. హంస. ౪, ఆ. ౧౦.

కొండరాయఁడు = కొండఱేఁడు. వీర. ౩, ఆ. ౧౦౮.

కొండరి. దే. వి. (కొండ+అరి.) కిరాతుఁడు, బోయ వాఁడు. "వ...బంకితలలకఱకుకొండరులు సను దెంచిన..." హ్వా. ౧౧, ఆ. ౨౬. ౧౧, ఆ. ౧౯.

కొండఱేఁడు. దే. వి. (కొండ+ఱేఁడు.) పర్వతరాజు, హిమవంతుఁడు. "ఆ. కొండఱేనికూఁతు కుసుమాప చయకేళి..." భో. ౯, ఆ. ౧౯౧.

కొండరాయఁడు. ద్వ. వి. (కొండ+రాయఁడు.) 1. పర్వతరాజు, హిమవంతుఁడు; 2. సప్తపర్వత రాజు, ఏడుకొండల కధిపతి, తిరుపతివేంకటేశ్వ రుఁడు. "సీ. కొండలరాయనిఁ గొలుచుకవులకు బంగారంబుముడుపు మోత్రాళ్లమడుపు." ప్రబంధ. ౨౪. [పుష్పికచెట్టు. (శ. ర.)

కొండల్లము. ద్వ. వి. (కొండ+అల్లము.) తృణ

కొండవాఁడు = కొండరి. (శ. ర.)

కొండవీడు. దే. వి. ప్రా. (కొండ+వీడు.) 1. కైలా సము. "గీ. కొండవీ డేలువేలుపుఁ గూడి... కడిమిపూఁదోఁటలో నాడుగరితఁ దలఁతు." అచ్చ. పీఠి. ౨; 2. ఆంధ్రదేశమందలి యొకా

నొకనగరము. "సీ. మటికొండవీ డెక్కి మార్కొని నలిమైన యలకసవాపాత్రు నంటి రాజె." ఆము. ౧, ఆ. ౩౬. సా: కొండవీటి చేంతాడు. (కొండవీటిలో నూతులు చాలలోతైనియు నందులకు వలయుచేదాడు చాలపొడుగైన దనియుఁ బ్రసిద్ధము.)

కొండసంపెఁగ. ద్వ. వి. (కొండ+సంపెఁగ.) ఒకరకపు సంపెంగచెట్టు. హంస. ౪, ఆ. ౧౧. [-౫౫.

కొండసూడు = కొండపగతుఁడు. అచ్చ. కిష్కి. ౧.

కొండాట. దే. వి. (కొండాడు. ధా.) 1. స్తుతి. "శా... ఉన్నపురములన్ కొండాట కర్హంబులే." కాశి. ౧, ఆ. ౧౮; 2. —వ్యసంగము. "గీ. హరునితోడిద కొండాటయై లతాంగి,యుగ్రతాపంబు నైరింపకున్నఁ జూచి." వీర. ౧, ఆ. ౧౮౪. (ముద్రి. పా. 'కొండాటమై' శ. ర. పా.)

కొండాటము. దే. వి. (కొండాడు ధా.) 1. స్తుతి. "సీ. కుచ్చితకాంద్రన్నఁ గొండాటములు సేయు..." మల్హ. ౩, ఆ. ౪; 2. వ్యాసంగము. (చూ. కొండాట.); 3. కలహము. "క. అని కెలసి పులుకుపులుకునఁ,దనుఁ జూడం జూడఁబట్టి తన్నెం గొట్టెన్, దనివిసనఁ దిట్టె ననలుం,గొనలుగ రొద మగనిఁ జెగనికొండాటముననన్." వేం. పంచ. ౪, ఆ. ౪౬౮. విశే. కలహశీలము గలది. "శా... చూడు నేఁ,డీకొండాటపుటెక్క యుంక్కెఱుఁగ కిట్టేపార భక్షించెదున్." వేం. పంచ. ౨,ఆ. ౯౦.

కొండాడు. దే. స. క్రి. (త. కొండాడు.) స్తుతించు. ఆం. భా. తృ. ౧౨౪. "ఉ. చేడియ యానృపాల కులశేఖరు... కొం,డాడగ వేయినోళ్ల వలె..." రాజ. చ. ౩, ఆ. ౧౩౨.

కొండి. దే.వి. 1. తేలుతోఁక. ఆం.భా. ద్వి.౮౮;2. తేలుతోఁకచివరిముల్లు. (బ్రౌ. వా.); 3. ఎక్కతలుపునంచులయందుఁ గొట్టెడు తేలుతోఁక వంటి యినుపగొళ్లెము. (శ. ర.); 4. పీతడెక్క. "క. అక్కర్కటము ముందఁగ నల, కొక్కెర దత్తరస మెలిచికొని తినునదియై, ముక్కెత్తి చూచు నాలో,నొక్కుఁకునఁ గొండ్ల నిఱికి యొత్తెన్ గళమున్." వేం. పంచ. ౧, ఆ.౩౭౬.

కొండిక. వై. వి. (సం. కుణకః.) 1. చిన్నవాఁడు. "క. అని పలికి హరి గిరీటిం,గనుఁగొని కొండికవు నీవు గావున నీకుఁ గామును గోరఁ బాడి యన వుడు, విని కృష్ణునిఁ గోరుకొనియె విజయుం డెల మిన్." భార. ఉద్యో. ౧. ఆ. ౭౬. (శ. ర. బ్రౌ. పా. 'కొండొకవు' ముద్రి.); 2. బాలుఁడు, శిష్యుఁడు. "సీ... కొండిక ప్రాయఁడే గురుఁడు ప్రాయ." రామలిం. ౩౫; 3. బాలిక, చిన్నపిల్ల. "క... కూఁతుం గొండిక యన కఁపవలయుఁ గూరిమి ననుజున్." య. ౪, ఆ. ౧౨౬. విశే. 1. చిన్నది. "క...నీయఁదుగున భూమండల మతిసూక్ష్మాకృతిఁ, గొండికమచ్చయుఁనుబోలెఁ గొమరొందు హరీ." పాండు. ౨, ఆ. ౭౦. పరాహ. ౪, ఆ. ౧౩౫.; 2. అల్పము, నీచము. "క. కొండికలము మన కెంకటి,దండి గలుగు నధిక పస్తుతలి హరి కొసఁగన్." కుచేల. ౧, ఆ.౧౧౦.

కొండికవాఁడు. ద్వ. వి. (కొండిక+వాఁడు.) బాలుఁడు. "ఉ...ఇవ్వ డీ,కొండికవాని నమ్మ పగగోలిపి కార్యమె మీకు కార్యమే." కు. సం. ౧౦, ఆ. ౧౬౩.

కొండియ = కొండె. 'సీ. చందురులో నున్నకందుఁదా మణఁగించుతేవఁ జెందలల కొండియలు చెలఁగ." విప్ర. ౧, ఆ. ౭౮.

కొండియము = కొండెము. "గీ. ఆదరింతురు కొండియం బవనిపతులు."హరి. ఉ. ౯, ఆ. ౫౬. భార. అను. ౨, ఆ. ౭౧.

కొండియఁడు. దే. విశే. కొండెకాఁడు. "ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడుఁ గొండియఁడున్ ...చేరువ నున్కి భూపతికిఁ జెట్టు..." భార. శాం. ౩, ఆ. ౪౬౩. ఆం. భా. తృ. ౧౩.

కొండీ = కొండి. (బ్రౌ. వా.)

కొండీఁడు. దే. విశే. (కొండెము+ఈఁడు.) కొండెకాఁడు. "సీ. కొండీనినాలుక రెండుగాఁ జీరెదు నలఖగంబులఁ జూడు మవనినాథ." మార్క. ౨, ఆ ౯౫. శేష. ౩, ఆ. ౩౩.

కొండుక. దే. విశే. 1. చిన్న. "వ...వానికిం గొండుకవాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుం జేసి..." భార. ఆది. ౪, ఆ. ౧౧౩; 2. చిన్నవాఁడు. "ఆ...పరశురాముఁడు... దండితాహితుండు గొండుక యయ్యును దద్ద, గుణములందుఁ బెద్ద యయ్యె." భార. ఆది. ౩, ఆ. ౭౦; 3. వివేక

హీనుఁడు. "సీ. కొండఱు బ్రాహ్మణుల్ గొందఱుకలాత్మకులోచితాచారంబు లుడిగి కాన,లసఁ జన్న..." భార. శాం. ౧. ఆ. ౭౧.

కొండె. దే. వి. (స్త్రీపురుషుల) కలయుంపుసిగ. ఆం. భా. ద్వి. ౧౪౫. "గీ. కురులు సవరించి విరులతోఁ గొండెఁ గట్టి." వేం. మా. ౪, ఆ. ౨౪౫.

కొండెఁడు = కొండీఁడు. "క. ధరఁ గాఁపు కొండెఁడైనను,గరణాలకు బ్రతుకు లేదుగదరా సుమతీ." సు. శ. ౮౫.

కొండెకత్తె. దే. విఁ. కొండెములు చెప్పునది. (స్త్రీ.)

కొండెకాఁడు. దే. విఁ. కొండెములు చెప్పువాఁడు. (చూ. కొండెకానితనము.)

కొండెకానితనము. దే. వి. (కొండెకాఁడు+తనము.) పిశునత్వము, కొండెములు చెప్పుట. (రంభ.) "గీ... చేరరాదయ్యె నమరమాని, కొండెకాని తనానకు గురువు కాన." నిరం. ౪, ఆ. ౨౩.

కొండెక్కు = కొండయెక్కు. (వా.)

కొండెపుఁదపసి. దే. వి. (కొండెము+తపసి) నారదుఁడు. "సీ...కొండెపుందపసిఁ గైకొనక చెలఁగి." చిత్రభా. ౫, ఆ. ౧౦.

కొండెము. దే. వి. పైశున్యము,లేనినేరము చెప్పుట. "సీ. కొట్టు బేహారులగొనబుటంగడులంద తఱచుగాఁ గొండెముల్ తలఁపులంద." అచ్చ. బాల. ౨౦. సా. ౨, ఆ. ౨౪౭. [(శ. ర.)

కొండెపల. దే. వి. చేఁపలఁబట్టుటకు వేసెడువల.

కొండేలమారి. దే. విఁ. (కొండెములు+మారి.) చాడీలమారి, చాడిగొట్టు. "సీ...మఱఁదలు కొండేలమారి బసివి."తహ. ౩, ఆ. ౪౩. ఇట్లే: కొండెపుఁగొఱవి. పండితా. పురా. ౧౧౬. పు.

కొండొక. వై. విఁ. (సం. కుణకః.) 1. కొంచెము. "వ. అని చెప్పి యుత్తమద్విజలోహితపాతంబెట్టునుం గీడు గావున నీకు నొకహాని పుట్టుటకుం జాలక యిబ్బంగిం జేసితి నని వెండియుఁ గొండొకకీలాలంబు దొరఁగం దుడుచుచుండె..." భార. విరా. ౫, ఆ. ౨౬౨. భార. విరా. ౧, ఆ. ౨౦౭; 2. చిన్నది. "సీ...అబ్జసరుహాక్షి, కొండొకసవలియు..." రాఘ. ౪, ఆ. ౭౪; 3. చిన్నవాఁడు. "వ...నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండొకనై యుండ..."భాగ. ౬. స్కం. ౧౫. భార. ౨, ఆ. ౮౪; 4. పొట్టి. "గీ. బాలుఁడొక్కఁడు కొండొకకోల సేతఁ,బట్టుకొని..." భార. ఆది. ౬, ఆ. ౨౬౦; 5. ఒక. (ఉదా:- కొండొకనాఁడు.) క్రి. విఁ. 1. కొంచెముగా. "క. ద్యూతక్రీడకుఁ గొండొక,సేతున్..."భార. విరా. ౧, ఆ. ౧౯౬; 2. కొంచెము సేపు. "వ... ఒండొకయుపాయంబు మదిం దోఁచమికిం గొండొక చింతించి..." విక్ర. ౨, ఆ. ౧౮౮; 3. కొంతదూరము. "వ. ఏనును భక్తిమయం బగు సాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దొలంగి..." భార. విరా. ౧, ఆ. ౧౩.

కొండొకనవ్వు. ద్వ. వి. (కొండొక+నవ్వు.) చిఱునవ్వు, మందహాసము. "గీ. అనినఁ గొండొకనవ్వులయంగఁ జూచి."భార. విరా. ౫, ఆ. ౧౧౪.

కొండ్ర. దే. వి. 1. ఒకసారి చాలు చుట్టినకొలఁది గలపొలము. "క. ధరఁ గొండ్ర వేలు పండును, బరఁగుం బురుషాయుష్యంబు ప్రజలకు నెల్లన్." కాశీ. ౪, ఆ. ౨౯౯; 2. పొలము. "గీ. కొండ్రలం బండు నారంభకోటు లెల్ల." భీమ. ౩, ఆ. ౧౪౨; 3. చాలు. "సీ. ఓర్చు నాఁగలిఁ గూర్చి యొకకొండ్రయెత్తిన ఫణిరాజు తలగుట్ట బయలుపడదె."కవి. ౧. ఆ. ౧౨౯. (ఒకకొండ్రయెత్తు = ఒకచాలు దున్ను.)

కొండ్రకైదువు. దే.వి. (కొండ్ర+కైదువు.) నాఁగలి. "గీ. కొండ్రకైదువుబల్లిదుమూర్తితోడు." రా. వి. ౧, ఆ. ౭౧. (కొండ్రకైదువుబల్లిదుఁడు = హలధరుఁడు, బలరాముఁడు.) (శ. ర. పా. 'కొండకూటువపగవాని మూర్తితోడు' ముద్రి. పా.)

కొండ్రచేయు. దే. అ. క్రి. (కొండ్ర+చేయు.) కృషిచేయు, వ్యవసాయముచేయు. (బ్రౌ.)

కొండ్రపోతు. దే. వి. (కొండ్ర+పోతు.) ఎలుఁగుబంటి. (బ్రౌ.)

కొంత. వై. స. (సం. కించిత్. కొంచెము+అంత.) ఇంచుకకొలఁది, ఇంచుకంత. "క...ఒక, కొంత యొసఁగిరేని నట్టికూడేమిటికిన్." భార. శల్య. ౨, ఆ. ౧౩.

కొంతము. వై. వి. (సం. కుంతః. క. కొంత.) 1. ఈఁటె, బల్లెము. "క. వ్రేలిరి గడగొంతంబులఁ, గూలిరి గడిదలలు దాఁకి కుంభినిమీఁదన్." కు.

సం. ౧౧, ఆ. ౧౨౬. "క. గొంతాన నొకఁడు బెబ్బులిఁ,గొంతానం జిదిమి..." శుక. ౧, ఆ. ...; 2. ఆయుధము, అస్త్రము. "క...విరి, కొంతపువే ల్పనఁగ రాజు కొలువున్న యెడన్." య. ౫, ఆ. ౪౫. (విరికొంతపువేల్పు = పుష్పాయుధుఁడు.) "క. ఎంతజితేంద్రియు లైనను. నెంతసదాచారు లైన నేకాంతమునం, గాంతల సంగతి నుండినఁ, గంతునికొంతాలపాలు గాకుం డుదురే." విక్ర. 3,ఆ. ౬౦. విశే. కుంతాకారము గలది. "సీ. పొలుపొందఁగా జెల్లు పూచినవిధమున మునుకొని కొంతంబు మొగ్గరంబు." కు. సం. ౧౧, ఆ. ౯౦.

కొందఱు. వై. స. బ. (కొంత+వారు.) కొంతశబ్దము యొక్క మహన్మహత్త్వర్థకరూపము, కొంతసంఖ్య గలవారు. "మ...మిమ్ముం గొందఱన్..." భార. ద్రో. ౨, ఆ. ౨౯౪.

కొందలపడు. ద్వ. అ. క్రి. (కొందలము+పడు.) 1. కలఁతనందు, క్షోభించు. "క...మనంబు గొందల పడఁగా..." భార. ద్రో. ౨, ఆ. ౨౯౨; 2. దుఃఖించు, ఏడ్చు. "క...అతిదీనతతోఁ గొందల పడ...విజ. ౨, ఆ. ౫౭.

కొందలపఱుచు. ద్వ. స. క్రి. (కొందలపడుధా. ప్రే.) కలచు, "క...ఇట్లను పగలు మిగిలి కొందలపఱు పన్." భార. విరా. ౧, ఆ. ౯౭.

కొందలపాటు. ద్వ. వి. (కొందలపడు. ధా.) కలఁత, క్షోభము. "ఉ. కొందలపాటునన్ మనము గుందినఁ గంటికి నిద్ర రాక..." నిర్వ. ౬, ఆ. ౮౦. భార. విరా. ౨, ఆ. ౩౧౫.

కొందలపెట్టు. దే. స. క్రి. (కొందలము+పెట్టు) 1. కలఁచు. కలవరపఱుచు. "సీ. డెందంబు నెవ్వగఁ గొందలపెట్టెడు..." మార్క. ౬, ఆ. ౨౨; 2. బాధించు, దుఃఖింపఁజేయు. "చ...దైత్యుఁడు మమ్ము నింక నేఁ,కొలఁదుల నైఁచు నే కరము కొందలపెట్టక..." హరి. పూ. ౪, ఆ. ౨౨.

కొందలము. దే. వి. (త. కొందళమ్.) 1. కలఁత, క్షోభము. "మ...,కొందలమందెన్ త్రిదశేంద్రపట్టణము..." భార. విరా. ౪, ఆ. ౧౭౨; 2. వ్యథ, బాధ. ఆం. భా. ప్ర. ౧౫౦; భార. ద్రో. ౨, ఆ. ౨౪౭; 3. విచారము, దుఃఖము. "చ. కలఁగుచు నేయఁ పాయమును గానక నిప్పును సీతనూజుఁ గొం,దలమున విక్రయించు వసుధాధవుఁ డెవ్వఁడైనఁ జెప్పెరన్." హరిశ్చ. 3, ఆ. ౨౫౮; 4. జంకు, సంకోచించు. "చ. అరికిఁటి మాగధధరాధిపుబాహులు త్రెంచి గ్రక్కునం,దలయుచు ద్రుంచి యేనుఁగు నుదగ్రతఁ బిఁడుగుఁజేసి నప్డు గొం,దల మొకయింత లేకతని తమ్ముఁడు దండఁడు దాఁకి..." భార. కర్ణ. ౨, ఆ. ౩౧౫; 5. సంశయము. "క. కొందఱు గలఁ డందురు నినుఁ,గొందఱు లేఁడందు రతఁడు గుణిగాఁ డనుచున్,గొందఱు గలఁ డని లేఁ డని, కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహాత్మా." భాగ. ౮. స్కం. ౨౨౫; 6. దైన్యము. "ఉ... కట్టి వెసఁ గొట్టుచు భంగము లెల్లఁ జేయఁగాఁ, గొంజల మంది యేడ్చుచును గూఁతలువెట్టెద రాలకింపుఁడా." వి. పు. ౨, ఆ. ౧౩౦.

కొందలించు. దే. అ. క్రి. కలఁగు. క్షోభపడు. "వ. అప్పుడు పండికముపులవెను వెంటం దవిలి కొందలింపం జిందఱవందఱగాఁ జేసి .." ఉ. హరి. ౪,ఆ. ౨౫.

కొందాఁక. ద్వ. అవ్య. ద్రు. (కొంత+దాఁక.) కొంతవఱకు. "మ. కులకాంతాకరసంగమంబు మఱియుం గొందాఁక నాకాంక్షసేఁ,యుఁలఁటాటాక్షుని ..." వరాహ. ౬, ఆ. ౨౭.

కొందు. దే. స. క్రి. (త. కొందు.) 1. నాఁటనేయు. "గీ. మోదమున నైదుతూపులపాదుసాహి, తమ్మిదోదుమ్మిఁ గొంది డెందమ్ము గ్రుమ్మి,క్రమ్ముకొని దొమ్మి సేసిన సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డిట్లను నెమ్మనమున." ఉ. రా. ౭, ఆ. ౪౬౬; 2. ముక్కలుచేయు,నజ్జుగా నఱకు. (శ. ర. బ్రా.)

కొంప. దే. వి. 1. అల్పగృహము. "సీ. అరిభయంకరలంక యందేదకొంపయో కాపించుకొని పోయి కొలువిఁ జూడ." రామా. ౭, ఆ. ౭. ఆం. భా. ద్వి. ౧౪; 2. గృహము. "శా. అమ్మా బిచ్చమటన్న వేయ దొకయింతైనన్ సుహృద్బంధుజాలమ్ముల్ కొంపకు వచ్చినం గసరు..." సానందో. ౫, ఆ. ౨౧౧. పార్వ. ౪, ఆ. ౫౦.

కొంపచెఱుపు. దే. విశే. (కొంప+చెఱుపు.) దుష్టుఁడు. "గీ. కొంటె కసుమాలమును దూబ కొంపచెఱుపు." హంస. ౫, ఆ. ౧౧౩.

కొంపదీయు. దే. అ. క్రి. (కొంప+తీయు.) కొంప మునుఁగు. స. క్రి. నశింపఁజేయు. (బ్రౌ. వా.)

కొంపమునుఁగు. దే. అ. క్రి. (కొంప+మునుఁగు.) గొప్పప్రమాదము వచ్చు. (వా. వాఁడు కొంప మునిఁగినట్లు పరుగెత్తుకొని వచ్చినాఁడు.)

కొంపోవు = కొనిపోవు. "క. చంపినను జంపునన్నటు, కొంపోకుండినను జాలు..." ప్రభా. ౩, ఆ. ౧౪౩.

కొంసేలు. ఆం. వి. (Council.) సభ. "సీ. జాతి కొంసేలు మేజాపల్కపైఁ గొట్టి లీల నేఘనుఁడు చెల్లించుకొనిరొ." ఆనంద. పీఠి. ౫౯.

కొకబెక = కొకిబికి. (బ్రౌ.)

కోఁబిక = కొకిబికి. (బ్రౌ.)

కొకిబికి. దే. విణ. 1. వికృతము. "క. ఎక దిగఁ బొఱిసచన్నులు, చికిబికి వెంట్రుకలకొప్పు చిఱుత పిఱుందుల్, వికటపుమోముం గలిగిన, కొకి బికియంగమున నొక్కగోతై నిలిచిన్." శ్రీరాధా. ౫, ఆ. ౧౦౮. స్వా. ౪, ఆ. ౭౩; 2. తప్పు గలది, అపసవ్యము. "క. తకిట తకతక యటం చని, యొకజతి యెడతఱరాల నున్నదియది యూ, దికి సరిపడ నటియింపుము, గొకిబికికాలైన బిరుదు గొనుమా వెనుకన్." పార్వ. ౫, ఆ. ౧౮౯. (కొకిబికికాలు = తప్పునాట్య మని భావము.)

కొక్కరాయ. దే. వి. ఒకానొకతీఁగె. (బ్రౌ.)

కొక్కరాయి = కొక్కెర. (శ. ర. బ్రౌ.) ఆం. భా. ద్వి. ౯౪.

కొక్కరించు. దే. స. క్రి. (క. కొక్కరిసు.) పండ్లికిలించు, వెక్కిరించు. "ద్వి. కొనచెవుల్ ఱిక్కించి కొక్కరించుచును." రం. రా. సుం. ౨౭౪. పుట. "చ...యుగాంతయమకాసనుకై పడి మించు పేల్పులన్, గనుఁగొని కొక్కరించు దశకంఠు..." దశా. ౭, అ. ౧౫౧.

కొక్కరింత. దే. వి. కొక్కరించుట. (శ. ర.)

కొక్కి. దే. వి. 1. కొక్కెము. (బ్రౌ.); 2. గుప్పిలి. "చ...దిక్కులు పగిలించి బ్రహ్మ నొకకొక్కికిఁ దెచ్చెద మీక్షణంబునన్." మై. ౩, ఆ. ౩౬. (ఒకకొక్కికిఁదెచ్చు = హస్తగతము చేసికొను.); 3. కొక్కెర. (చూ. కొక్కిరాజు.) విణ. గొగ్గి, వికృతము. "సీ. కాంతరో నీతావికావిమో విటులానికొక్కిదంతంబుల నొక్కఁదగునె." హంస. ౧, ఆ ౯౧.

కొక్కిరాజు. మి. వి. (కొక్కి+రాజు.) కొక్కెర రాజు. "కొండమీఁది వెండిగిన్నె కొక్కిరాజు కాలువిఱిగె." (ప్రాఁతపాట.)

కొక్కిరిబిక్కిరి = కొంకిరిబింకిరి. (వా.)

కొక్కిస. దే. వి. 1. మల్లబంధవిశేషము. ఆం. భా. ద్వి. ౨౦౯; 2. వృక్షవిశేషము. (బ్రౌ.)

కొక్కు. దే. వి. 1. పందికొక్కు. ఆం. భా. ద్వి. ౮౬; 2. ఒకానొకయాట. (వా.)

కొక్కురోకో. దే. వి. కోఁడికూఁత కనుకరణము. "గీ. అప్సరఃస్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కురోకో యటంచును గోళ్లు కూసె." హర. ౭, ఆ. ౧౩౭.

కొక్కురౌతు. ద్వ. వి. (కొక్కు+రౌతు.) వినాయకుఁడు. ఆం. భా. ప్ర. ౪౩.

కొక్కె = కొక్కెము. (బ్రౌ.)

కొక్కెము. దే. వి. కొలికి. (బ్రౌ. వా.)

కొక్కెర. దే. వి. బకము, కొంగ. ఆం. భా. ద్వి. ౯౪. భార. శాం. ౩, ఆ. ౪౭౮.

కొక్కెస = కొక్కిస. (బ్రౌ.)

కొక్కొక్కొ = కొక్కొరోకో. "క. కొక్కొక్కొ యనుచుఁ గోడి కూయఁ దొడంగెన్." పరాహ. ౪, ఆ. ౧౬౪.

కొక్కొరొకో = కొక్కు రోకో. "సీ. కొక్కొరొకో యని కుక్కుటంబులు గూసె...". కాశీ. ౩, ఆ. ౨౩౫.

కొక్కొరోకో = కొక్కురోకో. "ఉ...కొక్కొరో, కో యని కూయఁడే యతఁడు..." నైష. ౮, ఆ. ౭౯.

కొక్కోకము. సం. వి. అ. న. రతిశాస్త్రవిశేషము.

కొక్కోకో = కొక్కురోకో. "శా. కొక్కోకో యని కుక్కుటచ్ఛటలెలుంగుల్ రెచ్చె నల్దిక్కులన్." బహు. ౩, ఆ. ౯౪.

కొజ్జా. దే. వి. (హిం. ఖోజ్జా.) 1. రాణివాసపుఁ గావలివాఁడు; 2. షండుఁడు. "సీ. వీథులఁ దిరుగంగ వెసఁ దలారులు పట్టి కొజ్జాను జేసిరో..." భో. ౪, ఆ. ౩౧౯.

కొటారము. వై. వి. ధాన్యాదిరాసు లుంచుచోటు. "క...సొబగులుపంట కొటారంబు కళలపంటర

మనఘా." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౭. వసు. ౨, ఆ. ౧౪౯.

కొటారి. వై. వి. (కొటారము+ఇ.) ఉగ్రాణపువాఁడు, కోష్ఠాధికారి. "ద్వి. బోయీఁడు బాచయ్య భూరి కొటారి" బస. ౨, ఆ. ౪౬. పు.

కొటారు. వై. వి. (సం. కోష్ఠాగారమ్. క. కొట్టార.) 1. కోష్ఠగృహము, కొట్టు. ఆం. భా. ద్వి. ౧౫. హంస. ౨, ఆ. ౨౨౬; 2. ధాన్యాదిరాసు లుంచు కళ్లము. "గీ. తేరులా కొమ్ముటేఁగు బారులా ప్రసారులా చొక్కటపురాచదారులా కొటారులా తీరులా గొనబారు నార ప్రోలియొయ్యార మేరికిఁ బొగడ నరిది." అచ్చ. బాల. ౮; 3. స్థలము, చోటు. "సీ...జావరి యెబ్బ రాసి గాతలకొటారు..." చెన్న. ౨, ఆ. ౨౪.

కొటి = కోటి. (చూ. కొటికాఁడు.)

కొటిక. వై. వి. (సం. కుటీ.) 1. చిన్నగ్రామము. ఆం. భా. స్థా. ౪, శివలీ. ౨, ఆ. ౪౩. జై. ౧, ఆ. ౮౬; 2. నగరము "సీ...ముక్కొటికసోఁకు దులదిగులు." అచ్చ. బాల. ౮. (ముక్కొటిక = త్రిపురములు.) విణ. వామనుఁడు, పొట్టివాఁడు. ఆం. భా. ద్వి. ౧౨౩.

కొటికాఁడు. దే. వి. (కొటిక+వాఁడు.) గ్రామపు సౌకరు, తలారి; గ్రామమున శిక్షింపఁబడినవానిని నఱకువాఁడు. "ఉ...కుమారుఁడు శౌరి నెమ్మదిన్, గట్టిగ నిల్వనప్డు కొటికాండ్రు కృపన్ వల కాలిపిల్ల వ్రేల్, ముట్టఁగఁ గోసి..." జై. ౮, ఆ. ౪౧.

కొట్టకొన. దే. వి. (కొన+కొన.) చిట్టచివర, అన్నిటికిఁగొన. (శ. ర. బ్రౌ. వా.)

కొట్టడి. వై. వి. (సం. కోష్ఠకి. త. కొట్టడి.) కొట్టు, సరకు లుంచుగది. "చ. పరఁగెడురత్నకొట్టడులు ..." హంస. ౧, ఆ. ౧౧౯. ఇట్లే: కొట్టడీ. హంస. ౧, ఆ. ౮౧.

కొట్టము. వై. వి. (సం. గోష్ఠమ్.) 1. పసుసాల. "ఉ...ఎద్దీనె నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టుమటన్నచందమే, కానఁగ నయ్యె..." సా. ౨, ఆ. ౨౭౬. భార. ఉద్యో. ౧, ఆ. ౯౩; 2. చావడి, శాల. ఆం. భా. ద్వి. ౧౩; 3. (సం. కోష్ఠాగారమ్.) కొట్టు, కోష్ఠగృహము. ఆం. భా. ద్వి. ౧౫.

కొట్టరువు = కొటారు. (ధాన్యాదిక ముంచుకొట్టు.) "ద్వి. కొట్టరువునఁ బట్టి కొలిపించుచుండ." బస. ౬, ఆ. ౬౪౭. పు.

కొట్టాడు. దే. అ. క్రి. (కొట్టు+ఆడు.) 1. జగడమాడు. (శ. ర.); 2. దుఃఖించు, బాధపడు. "క. కట్టా త్రికరణ మెఱుఁగక, పుట్టినదురితముల నప్పుడు పొలియింపనియట్టి కట్టిఁడిదేహం బుడిగినఁ, గొట్టాడుచు బిట్టు నరకకూపంబులలోన్." భాగ. ౬. స్కం. ౪౩.

కొట్టాము = కొట్టము (పసుసాల.) (శ. ర.)

కొట్టాయి. దే. వి. తృణపర్ణాదిశాల. (బ్రౌ.)

కొట్టి = కోటి. (చూ. కొట్టికాఁడు.)

కొట్టించు. దే. స. క్రి. 1. పడఁగొట్టఁజేయు. "సీ. నట్టింట దేవళ్లు పెట్టెఁ బెట్టిఁకతిన్నెఁ గొట్టించి వెసఁ బందికూడు చేసె." శుక. 3, ఆ. ౫౦; 2. మ్రోయించు. స్వా. ౪, ఆ. ౩౭.

కొట్టిక = కొటిక. (గ్రామము) ఆం. సం. స్థా. ౪.

కొట్టికత్తె. వై. వి. పరిచారిక. "వ...గుత్తులయొడచి గుళ్లు...కొట్టికత్తెలు పిడికిన..." కేయూర. ౪, ఆ. ౫౦.

కొట్టికాఁడు. వై. వి. పరిచారకుఁడు; చారుఁడు. "క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెల వగునడవిన్ జారఁ గొట్టికాండ్రు డెక్కెముఁ బన్నికించి యెఱిఁగి కలయఁబడి కూఁత లిడన్." ఆము. 3, ఆ. ౨౬.

కొట్టిగడ్డ. దే. వి. కాకాంచి. (బ్రౌ.)

కొట్టిడి = కొట్టడి. (బ్రౌ.)

కొట్టిడియెద్దులు. ద్వి. వి. బ. (కొట్టిడి+ఎద్దులు.) సరకులబండ్లకుఁ గట్టునెద్దులు. (బ్రౌ.) (వా.)

కొట్టివేఁత. దే. వి. (కొట్టివేయు. ధా.) కొట్టివేయుట.

కొట్టివేయు. దే. స. క్రి. 1. తీసివేయు, తొలఁగించు. (బ్రౌ.); 2. కూల్చు, పడఁగొట్టు. "క. దళవాయి తోడఁ గోటకు, వెలుపటిముల్లిల్లు గొట్టివేయించి పిరంగులు లగ్గంబులమీఁదన్, నిలిపింపఁగఁ బనిచి నిగుడునెవ్వగతోడన్." కువల. 3, ఆ. 3.

కొట్టు. యు. దే. అ. క్రి. 1. తాఁకు, సోఁకు. "తరల. అరిగి తక్కటపుధేనువు నల్లనల్లన మళ్లలోఁ, దిరుగుచున్ వడి గాలి గొట్టినఁ దెళ్లుచున్ మఱి లేచుచున్." వరాహ. ౧౦. ఆ. ౩౮; 2. అగు;

కలుగు. "సీ. ఆఁకలి గొట్టి నే నడిగినయన్నంబుఁ బెట్టింపుము..." దశా. ౬, ఆ. ౭౧; 2. దంచు. "ఉ. కోమలి నాతు నెట్టియెడఁ గొట్టినపిండి సమస్తలోకముల్." కళా. ౬. ఆ. 3౬. (కొట్టిన పిండి = మిక్కిలితెలిసిన దని భావము.) స. క్రి. 1. ప్రహరించు, తాడించు. "క. తనచేతినాగ బెత్తముఁగొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నద యుఁడై." స్వా. ౪, ఆ. ౪౫; 2. వాయించు, మ్రోయించు. "చ...మ్రాఁకులతుద లెక్కి చప్పటలు గొట్టి యదల్పఁగ..." ఆము. 3, ఆ. ౨౨; 3. కూల్చు, చంపు. "గీ...తురకలపట్టణములు, గొట్టి సాధింపవలయు..." కృష్ణ. ౨, ఆ. ౯౬, "ఉ...దైత్యుల నూచముట్టుగాఁ గొట్టిన శౌర్య ధుర్యునకు..." జై. ౬, ఆ. ౫౫; 4. పోఁగొట్టు. "గీ. నిద్దురను గొట్టి వైరాగ్యనియతిఁ బట్టి." పార్వ. ౪, ఆ. ౪౨; 5. బ్రద్దలుకొట్టు. "సీ... నారికేళములు గొట్టి." శుక. 3, ఆ. ౪౪౨; 6. కొఱికివేయు. "చ...అవ్వని సేమఱి నిద్రవోవఁగా, నెలుకలు గొట్టెనేమొ సిగలు..." కకు. ౫, ఆ. ౧౭; 7. కొల్లగొట్టు. "మ...అర్థపుం, దెరువాటుల్ తెగి కొట్టి తజ్జపరిషద్విజ్ఞాత చౌర్యక్రియా,విరసుండై కొఱఁతంబడున్ సుకవి ..." స్వా. ౧, ఆ. ౯; 8. ప్రేరణార్థమునఁ దుమున్నంతముల కనుప్రయుక్తమగును. ఉదా:— చెడఁగొట్టు, విడఁగొట్టు మొ; 9. అనుకరణశబ్దముల కనుప్రయుక్త మగును. ఉదా:—కిచకొట్టు, బుసకొట్టు మొ; 10. నాఁటువేయు. "చెట్టుఁ గొట్టఁగాఁ బాలు గాఱఁగా చెన్నాపట్టం జువ్వఁచ్చి" (ప్రాఁతపాట.) వి. 1. దెబ్బ. "గీ. ఇట్టు కొట్టినకొట్టున నెఱ్ఱివాఱె, పుష్పకోమలధవళ కపోలతలము, కరుణ పుట్టించె..." వరాహా. ౨, ఆ. ౧3౫; 2. దండోపాయము. ఆం. భా. ద్వి. ౧౯౦; 3. వృక్షవిశేషము. "వ.కలుగొట్లఁ గొట్ల ..." పిన. శకుం. ౩, ఆ. ౧౪. వై. వి. (సం. కోష్ఠః.) కోష్ఠము, సామగ్రు లుంచెడుగది. "సీ. కొట్లు బేహారులగొనబుటంగడులంద తఱచుగా గొండెముల్ కలుపులంద." అచ్చ. బాల. ౪౭. వ్యవహారమునందలి ప్రయోగవిశేషములు: కంపుకొట్టు, దిష్టికొట్టు, దారికొట్టు, ఈఁతకొట్టు, ఊకొట్టు, గంటకొట్టు, ఎండకొట్టు, అచ్చుకొట్టు, కొట్టుకొట్టు, సున్నముకొట్టు, చెంపకొట్టు, తలకొట్టు. మొ.

కొట్టుకాడు. దే. అ. క్రి. (కొట్టు. ధా.) కొట్టాడు, బాధపడు. "గీ. బయలు వెడలంగఁ జాలదు భయముచేత, నిముడుకొని యుండఁజాలదు భ్రమముచేతఁ,గలికి యపు డోదమునఁ బడ్డకరిణికరణిఁ,దొట్రుపడి కొట్టుకాడును ద్రొక్కులాడు." రాధా. ౨, ఆ. ౪౬.

కొట్టుకొను. దే. అ. క్రి. (కొట్టు+కొను.) 1. బాధపడు. వ్యవ:—ఆదెబ్బతో దానిప్రాణములు గిలగిలకొట్టుకొన్నవి; 2. అల్లలాడు. వ్యవ:—గాలికి ఆకులు కొట్టుకొనుచున్నవి; 3. జగడమాడు; పోరు. వ్యవ:—పిల్లలు కొట్టుకొనుచున్నారు. (ఇట్లే యితరము లూహించునది.) [(బ్రౌ.)

కొట్టుడుబిళ్ల. దే. వి. (కొట్టుడు+బిళ్ల.) గోళీకాయ.

కొట్టుప(వ)డు. ద్వి. అ. క్రి. (కొట్టు+పడు.) 1. దెబ్బతిన్నట్లు—లేచు. "సీ. పొడవంటుకొనఁ గొట్టువడి గొంతవడి వారుల్ శరదభ్రజాతసంజాతబుద్ధి. గీ. చూప..."రామా. ౬, ఆ. ౯౯; 2. దైన్యమందు. "ఉ. కూలినచోటఁ గొట్టువడి కుందినచోట...కానరు దుఃఖభారముల్." భాగ. ౬. స్కం. ౧౨3; 3. వ్యయమగు. (శ. ర.); 4. దెబ్బలుతిను. "క. కొట్టువడి యటకు మునుపే, తిట్టుంబడి..." స్వా. ౪, ఆ. ౭౬; 5. నికృష్టమగు, నీచతనందు. "క...తృష్ణం, గొట్టువడకుండఁగాఁ దన,పట్టపుటిల్లాలిఁ గష్టపడి పోషించెన్." హంస. ౨, ఆ. ౧౫౭.

కొట్టుమిట్టాడు. దే. అ. క్రి. (కొట్టు. ధా.) 1. స్వేచ్ఛగాఁ దిరుగు. "క. రక్కసులు వేదబంబుల, మిక్కిలి నాముకొని కొట్టుమిట్టాడంగా, నక్కటయొకమెకమునకై, యిక్కానల నొంటి. దిరుగుటిది తగవగునే." య. ౨, ఆ. ౫౭; 2. అతిశయించు, మిక్కుటమగు. "సీ. ఆఁకలి కొట్టుమిట్టాడంగ..."భాగ. ౯. స్కం. ౧౦౧; 3. మిక్కిలి ప్రయాసపడు. వ్యవ:—దానికోస మంత కొట్టుమిట్టాడుదు వేల?

కొట్టుమిట్టిపడు. ద్వి. అ. క్రి. (కొట్టు ధా.) త్రుళ్లిపడు; ఎగిరిపోవు. "ఉ. దిగ్గన లేచి నిబ్బరము దీటు

కుచంబుల నాఁచ లేక తాఁ,బగ్గెడుఁ గొట్టుమిట్టి పడు వైఁటచెఱం గఱనేల జాఱఁగన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౨౬.

కొట్టులాట = కొట్లాట. (శ. ర.)

కొట్టులాడు = కొట్లాడు. (ఒకరినొకరు) కొట్టుకొను. "రగడ. అపుడు కొంద ఱనుణనందనాబ్జబృంద ములను ద్రుంచి, నిపుణచాటుఘటితి నీటు నిగుడ ప్రేటులాడ నెంచి, జలజనాళముల విశాలసరసలీలఁ గొట్టులాడి." రా. వి. ౩, ఆ. ౧౨౨.

కొట్టె. దే. వి. (త. కొట్టై.) 1. కుసూలవిశేషము, ఒక రకపుగాదె. ఆం. భా. ద్వి. ౨౪౦; 2. పండు లోనిగింజ. (బ్రౌ.)

కొట్నము. దే. వి. (కొట్టు. ధా. క. కొట్న.) 1. ధాన్యము. "ద్వి...మాఁకక కొట్నంబు దినముఁ, బుట్టెడు దంపంగఁ బోలక..." బస. ౪, ఆ. ౧౧౨. పుట. "మ...మాధవకాననేఁడి రలపెండ్లిం దీవపూఁబోఁడు లుత్కళికన్ గొట్నము తేఁటి పాట లెసఁగం గా వంచురీతిన్..." చంద్రా. ౪, ఆ. ౨౧౫; 2. దంపు. "ద్వి. పెట్టిఁ గొట్నము నీళ్లు వెలయంగఁ గసవుఁ,గట్టెలు నివి యాదిగాఁ గలపనులు, పగ లెల్లఁ జేసి..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౬౧. పం; 3. వివాహతంత్రవిశేషము. (శ. ర.); 4. ఊడిగము, సేవ. "శా. ఇట్టట్టెం మను బోవరాక వగతో నెల్లప్పుడున్ వేలుపుల్,పెట్టిం గొట్నముఁ జేయ..." య. ౨, ఆ. ౬౩.

కొట్ర. దే. విణ. వామనుఁడు, పొట్టివాఁడు. ఆం. భా. ద్వి. ౧౨౫. వి. పిండిమొ. ఉడుకఁబెట్టుటకుఁ బెట్టినయెసరు. "వ...కీచకతండులంబులం బిండి కొట్టి కొట్రం బోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించికపుడుములబానలు..." కాశీ. ౩, ఆ. ౩౬.

కొట్లమారి. దే. విణ. (కొట్లు+మారి.) కొట్లు పడు స్వభావము గలవాఁడు. "సీ. తాళమఁల్ చూడఁ గీర్తనపాత్రము లటంచుఁ గొట్లమారులజోడుఁ గూర్పఁ దగునె గీ...గబ్బిచట్టుబ్బగవము." చంద్రా. ౪, ఆ. ౧౨౩.

కొట్లాట. దే. వి. (కొట్లు+ఆట.) పోట్లాట. "గీ. పికిలిపిట్టలఁ గొట్లాట పెట్టి చూచు." కువల. ౫, ఆ. ౯. అహ. ౧, ఆ. ౧౦౫.



కొట్లాడు. దే. అ. క్రి. (కొట్లు+ఆడు.) పోట్లాడు. "గీ. చుట్టములతోడ నొప్పమి పుట్టినప్పు,డడ్డపడి వారితోడఁ గొట్లాడితైన,దాని నడుమఁగఁ జొర కున్నవానిఁ గ్రూర,కర్ముఁ డని చెప్పుదురు కర్మ కాండవిదులు." భార. ఉద్యో. ౩, ఆ. ౨౪౨. రా. వి ౨, ఆ. ౧౫.

కొడక. దే. వి. చిన్నగిన్నె. (బ్రౌ.)

కొడతము. దే. వి. కుక్కమెడ. వానిమెడకుఁ గట్టి పట్టుకొనుకట్టె. "క. కొడతములు విచ్చి కుక్కల, వినుచుచు..." పద్మ. ౧, ఆ. ౧౧౩.

కొడమ. దే.వి ముఖభాగమునందుఁ గట్టు లేకనడుమ వలవలె నల్లిక గలచూఁకవంటి చేఁపలఁబట్టు నొకానొక సాధనము. "గీ. కొడమ తెల్లడికొడమ ..." హంస. ౪, ఆ. ౧౮౬. ప్రబంధ. ౧౯౪.

కొడము. దే. వి. 1. కుంభహారతి. (బ్రౌ.); 2. కొడమ. (బ్రౌ.); 3. సెటికుండ. (బ్రౌ.)

కొడవలి. దే. వి. పా. అనా. లవిత్రము, ఒకానొక కోఁతసాధనము. (దీని బహువచనరూపములు. కొడవలులు, కొడవళ్లు, కొడవసులు, కొడవండులు, కొడవండ్లు మొ.) "క. కక్కలకొడవలివోలెం, జక్కఁగఁ జెగి యున్న క్రూరసర్పమువదనం, బొక్కటి యుండఁగఁ గనుఁగొని, యక్కజముగఁ బతికిఁ జూపె యతఁ డిట్లనియెన్." భో. ౪, ఆ. ౬౦. "క...,కొడవంటఁ గోయుసురవడి..." వరాహ. ౧౨, ఆ. ౨౪. "గీ. పలయుం వైరాగ్య మనుకొడవలినతాని." భార. శాం. ౪, ఆ. ౧౯౨.

కొడస. వై. వి. (సం. కుటజకి.) కుటజము, కొండ మల్లెకీ. ఆం. భా. ద్వి. ౫౦.

కొడి. వై. వి. (సం. కోటిక. క. కుడి.) 1. దీపశిఖ. "సీ. కొడిఁ బుట్టుకాళిమాంకురపు మేఘములకు మెఱుఁగులై చూపు గ్రమ్మించు లలర." పాండు. ౨, ఆ. ౧౨౭; 2. దీపశిఖనుండి వెడలుపొగ. "క. శ్రీకమలగృహము మోముచి, లోకింపఁగ దీప కళికలు కనుంగవయా,నాకొడి వాటినసన్నపు, రేఁలు నా బొమలు సుందరికిఁ జెలువొందున్." పిన. శకుం. ౨, ఆ. ౧౮౯; 3. (వత్తి,చుట్ట మొ. వాని) కాలినతుదిభాగము. ఉదా:—దీపపుకొడి మొ. (బ్రౌ.); 4. జెండా,ధ్వజము. ఉదా:—కొడిచేయు = జెండయెత్తె. కొడిస్తంభము =

ధ్వజస్తంభము. (బ్రౌ.); 5. స్వభావము. ఉదా:- చవిటికొడినేల. (బ్రౌ.)

కొడిద = కొడిసిలి. ఆం. భా. ద్వి. ౧౪౦.

కొడిసిపూస. దే. వి. మొలత్రాటిని గ్రుచ్చి ధరించు వెండిసొము. వానిబిళ్ల. "సీ. కొడిసిపూసల నంటు కొలిపిన మొలత్రాడు తలదుద్దు చీరణంబులపొవి యును." వేం. పంచ. ౧, ఆ. ౫౯౮.

కొడిసిలి. దే. వి. బొ. 1. వంచినచేర; పుడిసిలి. "చ. అడఁకువ మీకు నేమి యిడ నక్షయమా ననుటక్ నిజంబుగాఁ, గొడిసెడుదానలోఁయ మనుగుం డగ దమ్ముల మజ్జగంబులన్, దడలు కొలంకులై పుగఁటుపక్రముహంసపరాగయుక్తిచేఁ, గడలు కొనంగఁ జేయునలకైతవవామను నిన్ను నెన్నె దన్." చంద్రా. ౧, ఆ. ౭౯. ఆం. భా. ద్వి. ౧౪౦; 2. పెద్దయఱచేయి. "చ. కొడిసెఁడు నెమ్మొగంబు తళుకుం దెలికన్నులు చేరఁడేసిగా, పిడికెఁడుగా నునుంగవను బెన్నెరులుం దెగ బారెఁడేసిగా." బహు. ౪, ఆ. ౧౦౫.

కొడిమె. దే. వి. 1. లేనినింద. "క. విడువక మీగానము సొగసిడుటయు మఱి పాడుఁ డనుట యొగ్గే పానెం,బడిగినవారే పేదలె, కొడిమెలు గట్టుకుఁడి యతనిఁ గొని పనియేలా." ఆము. ౫, ఆ. ౫౪. కళా. ౫, ఆ. ౫౬; 2. లేనినేరము. "చ. జడమడి జాహ్నవీతటనిశాకరపోతముఁ జూచి యెవ్వరీ,కొడిమెలు గట్టి పెండ్లికొడుకుం గడియారము మోవఁ జేసి రం,చడుగ వివాహవేదిపయి నంబికనెచ్చెలిఁ జూచి నవ్వునా,మృడుఁడు..." జై. పీఠి. ౨; 3. అసత్యము. ఆం. భా. ప్ర. ౧౧౮; 4. పాపము. (చూ. కొడిమెలాఁడు.); 5. కువేశి,చేఁపలబుట్ట." ఆం. భా. ప్ర. ౧౫౯; 6. నావ, పడవ. (బ్రౌ.)

కొడిమెలాఁడు. దే. విశే. (కొడిమెలు+ఆఁడు.) పాపాత్ముఁడు. (శ. ర.)

కొడివడు. ద్వ. అ. క్రి. (కొడి+పడు.) చలించు, వణఁకు. "ఆ...పన్ని నిలిచెఁ గాయ్యోతో దానవ, కులబలంబు నేల కొడివడంగ." కు. సం. ౧౧, ఆ. ౭౯.

కొడిస. దే. వి. మత్స్యవిశేషము. "సీ...కొడిసలఁ బరివాసకులకు నిచ్చె." ద్వా. ౧, ఆ. ౨౪౧.

కొడిసె = కొడస. ఆం. భా. ద్వి. ౫౦. హరి. పూ. ౯, ఆ. ౬౮. [భా. ద్వి. ౫౯.

కొడిసెపాల. దే. వి. కొడిసెవిత్తు. (శ. ర. బ్రౌ.) ఆం.

కొడుఁగురు. దే. వి. 1. దీపముయొక్కచిట్టెము. (శ. ర.); 2. కొంకర. (చూ. కొడుఁగురువోవు.)

కొడుఁగురువోవు. దే. అ. క్రి. (కొడుఁగురు+పోవు.) కొంకరవోవు. "చ...సీతుసం,గొడుఁగురువోయి యున్నసఖుఁ గ్రోఁతిఁ గనుంగొని..." కేయూర. ౩, ఆ. ౨౭౦.

కొడుకఁడు. దే. వి. కొడుకు, బిడ్డఁడు. "క. కొడుకఁడు నాపొదిగిటిలోఁ, జెడిపోయిననాఁటనుండి చెలియా తెలియం,బడ దేవార్తయు..." భాగ. ౧౦. స్కం. ఉ. ౩౨.

కొడుకు. దే. వి. 1. పుత్త్రుఁడు. "క...నీ,కొడుకని యాతని నెంతయు,నెడమడుగుగఁ జూప దెత్తె యిందఱు నగఁగాన్." భార. ఆది. ౪, ఆ. ౧౦౦; 2. మగబిడ్డ. "ఆ. ఘనభుజుండు రాధ యను దానిపతి యొక్క,సూతుఁ డరుగుదెంచి చూచి రత్న,పుంజభరిత మయినమంజసలోనున్న,కొడుకు దానితోన కొనుచు వచ్చె." భార. ఆది. ౫, ఆ. ౩౧; 3. పురుషుఁడు. "క...జడిసెఁ గాఁపుంగొడుకొ,లో..." వేం. పంచ. ౪, ఆ. ౪౮౮.

కొడుకుఁగుఱ్ఱ. దే. వి. (కొడుకు+కుఱ్ఱ) 1. పుత్త్రుఁడు. "గీ...నీ కేల రాధ, కొడుకితం డనుతక్కువ కొడుకుఁగుఱ్ఱ." భార. ఉద్యో. ౪, ఆ. ౫౯. 2. గారపుబిడ్డఁడు. "సీ...వడఁకు గుబ్బలికూఁతు కొడుకుఁగుఱ్ఱనుఁ జనుబాలిడి..." వేం. పంచ. ౪, ఆ. ౪౦౧.

కొడుపు. దే. వి. 1. (ప్రత్తి)కాడ. "సీ. శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు గుంటిమీఁదటి ప్రత్తికొడుపు వోలె." కాశీ. ౧, ఆ. ౦౩౮; 2. గంటమున్నగునవి వాయించుకోల. "ఉ...;క్రంగన గంటపైఁ గొడుపు వ్రాలుట యెన్నఁడొ..." నైష. ౩, ఆ. ౨౫. రామా. ౬, ఆ. ౭; 3. కడ్డీ. "ఉ...ఎండపె,న్పొటికె వెంటఁ దోఁచుతొఁగ వేరు బడిన్ గొడుపై చెలంగఁగా..." ఆము. ౨, ఆ. ౫౪; 4. తంతి మీటుటకు బంగారులోనగు వానితోఁ జేసి వ్రేలికి వేసికొనెడిగోరు. (శ. ర. బ్రౌ.); 5. వెదురుకనుపులనడిమిభాగము. (శ. ర.)

కోడుము. దే. వి. బిందెవంటికుండ. "క. కోడు మెత్తు కోలకు గుడికిన్, నడచున్ వెలపడుచు..." శుక. 3, ఆ. ౧౭.

కోడ్కు=కోడుకు. "గీ. పరమకళ్యాణనిధుల దంపతులఁ గోడ్కుఁ, గోడలిని దోడుకొని యదుకుంజరంబు, మరలె ద్వారకకు..." సాంబో. ౫, ఆ. 3౦౬.

కోడ్డిపూస = కోడిపిపూస. "సీ... ఈకోడ్డిపూస నీ కెవ్వఁ డిచ్చె." జై. 3, ఆ. ౭౪.

కోణజేషం. = కోణజా. (బ్రౌ.)

కోణజా. దే. వి. వాకిటికావలియిల్లు, ద్వారమాత్ర సంరక్షక మగుపంచ. (శ. ర. బ్రౌ.)

కోణత = కోణతము. 1. కుక్కను గట్టెడుకొయ్య. (శ. ర.); 2. మల్లపరికరవిశేషము. ఆం. భా. ద్వి. ౨౯౭.

కోణతము. దే. వి. 1. కుక్కను గట్టెడుకొయ్య. "సీ... కోణతంబు విప్పినంతనె కుక్క వెదకుఁ జెప్పు." వేణు. 3౬; 2. మల్లసరికరవిశేషము. "మ. అమ రం గ్రొవ్విరితేనెజాలుకోణతా లందంద లాగించి ..." శశాం. ౨, ఆ. ౧౧౭.

కోణిఁగె. దే.వి. దిబ్బ, కుప్ప. (శ.ర. సూ. ని.) "వ... క్రీడాపులినంపుఁగోణింగెలఁ జెలంగురంగుల..." కృష్ణ. పీఠి. ౨౦. (ప్రయోగాంతరము లేదు.)

కోణిగ = కోణిగె. "సీ... పవడాలకంబముల్ రత నాలకోణిగలు..." ఆనంద. పీఠి. ౯౭.

కోణిగచూరు. దే. వి. (కోణిగ+చూరు.) కోణిగ. ఆం. భా. ద్వి. ౨౧.

కోణిగె. దే. వి. 1. ముంజూరు, వలీకము. "చ. చెదరి కపోతముల్ గోణిగె చేరక..." వసు. ౪, ఆ. ౬3; 2. నతి, కై మోడ్పు. "రగడ. గోవర్ధనమునఁ గోలువై కన్పడు, గోపవేషునకుఁ గోణిగె లొన ర్చుచు..." హంస. ౪, ఆ. ౨౧3.

కోణిప. దే. వి. 1. కొడిపిలి. (బ్రౌ.); 2. ఒకానొక మనుష్యజాతి. (శ. ర. బ్రౌ.)

కోణిదిలి = కొడిదిలి. "గీ... కోణిదెఁడుజల మైన నొండుపుష్పమైన..." సానందో. ౫, ఆ. ౧౭౭. ('కోణితెఁడు'. అపముద్రి.)

కోణుఁగురు = కోడుఁగురు. (శ. ర.)

కోణుఁజు. దే. వి. పిడుఁజు, పశువులదేహమునఁ జేరి రక్తములు బీల్చుకృమివిశేషము. (శ. ర. బ్రౌ.)

కోణుజెక్కు. దే. అ. క్రి. (కోణుజు+ఎక్కు.) కోణు జులు పట్టినవగు. "సీ. ఎనుపు తిప్పలుగొని యెల్ల మందలు గోణుజెక్కె..." హరి. పూ. ౬, ఆ. ౫. (ముద్రి. పా. 'కోణుజెక్కు' శ. ర. సూ. ని.)

కోతిమిరి. వై. వి. (సం. కుస్తుంబరి. క. కోతుమురి.) దనియపుమొక్క. ఆం. భా. ద్వి. ౨౪౯.

కోతిమిరిపురుగు. వై. వి. (కోతిమిరి+పురుగు.) శల భమువంటికీటకవిశేషము. (ఇది కోతిమిరివాసనఁ గొట్టును.) (బ్రౌ.)

కోతుక. దే. అ. క్రి. 1. జంకు, వెనుదీయు. "సీ... కోతుకక మద్యంబుఁ గ్రోలువారు." సానం. ౪, ఆ. 3౮. రసిక. ౪, ఆ. ౧౭౦; 2. వర్ణలోప ముగా మాటాడు. (శ. ర.). 3. తక్కువగు. "క. కోతుకక మణితంబు సలిపెఁ గోమలి యంతన్." సత్య. సాం. ౨, ఆ. ౯౫. ప్ర. వి. జంకు, సంకో చము. (శ. ర.) విణ. గ్రస్తము, వర్ణలోపము గలది. (మాటపదము మొ.) ఆం. భా. ప్ర. ౧౧౮.

కోతుకపడు. ద్వ. అ. క్రి. (కోతుక+పడు.) 1. తక్కువయగు. "క. అతసికి మంజుల యనఁగా, సతి యొక్కతె గలదు దానిసరి యెన్నుటకుం, గోతుకపడు రతియుఁ జతురత, నితరుల నెన్నంగ నేల..." హంస. ౨, ఆ. ౮౯. ("రతికిఁ జతు రత, యితరుల." ముద్రి. సూ. ని. పా.); 2. (మాట)లుప్తవర్ణ మగు. (శ. ర.)

కొత్తడము. దే. వి. కోటబురుజు. "ద్వి. కలు వైన యట్టికొత్తడములతోడ, నిల వైనముందలియిట్టిక గోడ." రం. రా. యు. 3౦3. పు. ౧౮. పం.

కొత్తడి. దే. వి. బృందము, సంఘము. "ద్వి. అతని పరమసాధ్వి యతివ మాదాంబ..., కొత్తడి నెల్లను గొండొక్కపెద్ద, యుత్తమురాలు..." బస. ౧, ఆ. ౧3. పు, ౧౮. పం.

కొత్తము=కొత్తళము. "సీ. తివిరి కొత్తము లొద్దఁ దీర్ఘ వాసులనిల్పి పరిహాసములు చేసి...". మల్హ. 3, ఆ. ౭.

కొత్తళము = కొత్తడము. ఆం. భా. ద్వి. ౧౨. "చ. తలఁకునఁ గోటలన్ గడలఁ దల్పులు వేల్పులు మాసి డాసి కొత్తళములపై నలంగములఁ దా ర్కొని..." ఉ. రా. ౪, ఆ. ౨౭౭.

కొత్తెము. దే. వి. తాటిపేళము. (శ. ర.)

కొత్తెమ్మ. దే. వి. యోగిని. (బ్రౌ.)

కొత్తెమ్మసాని = కొత్తెమ్మ. "వ...ప్రత్యక్షీకృత మోక్ష లక్ష్మీవిశేషంబులం బోనియనశన వ్రతశుష్కభూతంబు లగుమేనులుం గలకొత్తెమ్మసానులు..." విప్ర. ౨, ఆ. ౧౪.

కొత్వాలు. దే. వి. (హిం. కోత్వాల్.) పోలీసుతణిఖీదారి. "గీ...ముష్కరతురుష్కులవలం బొమ్మని కొత్వాలు కప్పగింతురు..." కృష్ణ. ౨, ఆ. ౧౨౩.

కొద. దే. వి. 1. కొఱఁత, లోపము. "క. తుదఁ జిక్కు లేల మీమది, కొద దీఱినఁ జాలు నమ్మ కొనవలసిన వచ్చెద నమ్ముకొనుఁడు..." కళా. ౪, ఆ. ౧౨౪. "గి. నీవు వచ్చితి మేలయ్యె నిదియ చాలు;నతఁడు రాకున్నఁ గొద లేశ మైన లేదు." 3, ఆ. 20, నిర్వ. ౬, ఆ. ౬3; 2. అక్కఱ, అవసరము. "క. ఇది గాంధర్వవివాహము,సుదతి మన కిపుడు సాక్షి సూర్యుఁడె యన నో,ముదికఁడ నీకొద దీఱిన,వదలెద నే నొల్ల ననుఁ బ్రవాళాధరయున్." భో. 2, ఆ. ౧౧౪; 3. లెమి, ఆశ. "వ...జాఱినపయ్యెదలు దారిన పేరెదలు కొలఁది గడచినసద్దులు కొద దీఱనిసుద్దులు..." సమీర. 3, ఆ. ౧2౮; 4. సంకోచము, జంకు. "చ. ఎదఁ గొద లేక ముచ్చులని యెట్టు వచించితిరి..." పరమ. 3, ఆ. ౬౧; 5. శేషము, ఒరువాయి. "గీ...కొదయుఁ దీర్పంగ మగిడి..." ఆము. ౬, ఆ. ౮3.

కొదమ. దే. వి. 1. పశుపక్ష్యాదులపిల్ల. ఆం. భా. ద్వి. ౯౯. భార. విరా. ౧, ఆ. ౯౪; 2. ఆఁడు మేఁకపిల్ల. (శ. ర.); 3. గిఱ్ఱము. "క. తురగపరీక్షావిదు లగు,పురుషులఁ బిలిపించి యశ్వపుంగవులఁ గని తెం,దరయుఁడు మరకొదమలలో, నిరుపమలక్షణముఁ గీర్తనీయంబును గాన్." భార. అశ్వ. 3, ఆ. ౨౧2. విశ. 1. తరుణము, పడుచుది. "సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి..." భార. విరా. ౧, ఆ. ౯౫; 2. దృఢము, బలమైనది. "సీ. కొదమగుబ్బలదాని..." దశా. ౨, ఆ. ౧౦; 3. లేఁతది; చిన్న. "గీ...కొదమయెండ, ప్రాచి కభినవమాణిక్యపదక మయ్యె." కాశీ. ౧, ఆ. ౧౨3. "ఉ. నోరణగండ్ల రాఁ గొదమ చుక్కలు..." ఆము. ౨, ఆ. ౧3.

కొదమతనము. దే. విశ. (కొదమ+తనము.) బాల్యము, లేఁబ్రాయము. "గీ. కొదమతనమున నొప్పారి పిదప గఁడు మెఱసి ఘాటలెఁగుమృగనాథు లెఱుఁగ దోఁప." హరి. పూ. ౬, ఆ. ౧2౮.

కొదమరి. దే. వి. (కొదమ+అరి.) పిల్లలు గలది. "ది...మదగజేంద్రంబు, కొదమరిపందిచ నుడుచునే దేవ." పండితా. మహిమ. ౨౬౦. ప్ర.

కొదరు. దే. అ. క్రి. అతిశయించు. "సీ. కోర్కుల తమకింయు కొదరియుఁ దాలిమిపొంపున నందంద క్రిందువడఁగ." హరి. ఉ. 2, ఆ. ౧23. (శ. ర. పా. 'కొరియు' ముద్రి. పా.); 2. చెదరు, చిందు. (శ. ర. బ్రౌ.); 3. రేఁగు. (శ. ర.)

కొదలించు. దే. స. క్రి. కొదలఁజేయు, (స్థాయి) తగ్గించు. "సీ. పెదతొక్కుఁబలుకుల విసిపించుఁ గొదలించుఁ గలయవల్లభుపల్కు పలుకుపొంత." కు. సం. ౯, ఆ. ౧౪౬.

కొదలు. దే. అ. క్రి. తగ్గు, సంకుచితమగు. (చూ. కొదలించు,కొదలుపడు.) విశ. 1.అవ్యక్తము. "సీ. కొదలఁ మాటలు తేనె గిలుకుచుఁ జిలుకుచో మోహనం బగునింతముద్దుఁ బెలుపు." కళా. ౬,ఆ.౧౯౬. విప్ర. ౧, ఆ. ౧౨; 2. అలసము. "గీ...,సారెఁ జెల్లుబ్బ యుపజనశ్రమజలాబ్ధినిమఁడ కొన దక్షిణము వాసి యేఁగుదెంచెఁ,గొదలునడతోఁడఁ బవమానకుంభజుండు." చంద్ర. 3, ఆ. ౧౦2.

కొదలుపడు. ద్వి. అ. క్రి. కొదలు+పడు.) కొఱఁత పడు. (చూ. కొదల్పడు.)

కొదల్పడు = కొదలుపడు. "ఉ...నాప్రమ్మునిముద్దు మాటలు గొదల్పడఁబల్కెడుచిల్కబోఁప..." నిర్వ. ౫, ఆ. ౧౧౫.

కొదవ = కొద. 1. కొఱఁత,లోపము. "గీ. ఇది యెఱుఁగక యున్న నా కేమి కొదవ." శుక. 3, ఆ. ౨23; 2. అవమానము. "గీ...,ఇట్టికొదవ మా కొదవ నేల." రాము. 3, ఆ. ౬౫; 3. సందేహము. "గీ...అపుడుగదా మదికొదవ దీఱు." కళా. ౨, ఆ. ౧౫2; 4. నేరము. "చ...అది నాకు నేర మగునే కద యీకొదవల్ సహించి నన్నుఁ బ్రోవుము..." కుమా. ౨, ఆ. ౮౧. విశ. న్యూనము. ఆం. భా. త్రి. ౨౪.

కొదవచేయు. దే. స. క్రి. (కొదవ+చేయు) చిన్నఁ బుచ్చు, సిగ్గుపఱచు. "క... వంపఁ దగ దంపి పచో,మఱి నిన్నుఁ గొదవ చేసిన, తెఱఁగగు..." విప్ర. ౪, ఆ. ౨౩.

కొదవపడు. ద్వ. అ. క్రి. (కొదవ+పడు.) 1. లోపము కల దగు, విఘ్నము నందు. "క. యాగము కొదవ పడ కుండఁగ, సాగింపుఁడు..." పద. శకుం. 3, ఆ. ౧౦౬; 2. విచ్ఛిన్న మగు, తెగిపోవు. "సీ. కొదవడ్డకౌరవక్షోణిపాలవతంసమంశంబు నిలిచె నెవ్వానివలన." వరాహ. ౧, ఆ. ౯; 3. క్షీణించు, తగ్గు. "క... జవసత్త్వ మింకఁ గొదవడఁ జూపుఁ..." శుక. ౨, ఆ. ౧౩౬.

కొదవపడు = కొదవడు. 1. విఘ్నమునందు. "సీ... పను లన్నియుఁ గొదవపడక సాగు." పరమ. ౫, ఆ. ౧౫; 2. పాడగు. "క. కొదవపడియెఁ బసి యనుచున్..." వేం. పంచ. ౧, ఆ. ౯౬.

కొదవపఱచు. ద్వ. స. క్రి. నశింపఁజేయు. "గీ. ఎవ్వనియశంబు జగ మెల్ల నెనసి చుట్టుకొండ యవ్వలితమ మెల్లఁ గొదవపఱుప." కాళిం. ౧, ఆ. ౩౫. [తృ. ౨౪.

కొదుక. దే. విశే. న్యూనము, తక్కువ. ఆం. భా.

కొదుగు. దే. అ. క్రి. 1. భయపడు. "గీ. కొదుకునే మిట నేరూపొకో యటంచు." సావి. ౨, ఆ. ౭౭. పు; 2. సంకోచించు. "క... ఎంతయు వెతచేఁ, గొదుకుచు నిట్లని పలికెన్..." దశా. ౫, ఆ. ౫.

కొదుకుకొను. దే. అ. క్రి. (కొదుకు+కొను. స్వార్థమున) భయపడు. "గీ. గోలయును బోలె నొదుగుచుఁ గొదికికొనుచు." విప్ర. 3, ఆ. 3.

కొదుపు. దే. అ. క్రి 1. ఏకేసి నోట వేసికొని మ్రింగక ఊరక నములు. (శ. ర.); 2. ఊరించు. (బ్రౌ.)

కొద్ది = కొలఁది. దే. వి. 1. పరిమితి. "ద్వి. కలకొద్ది దానముల్ గావించువారు." రం. రా. అయో. ౭౭. పు. ౧౯. పం; 2. శక్తి. 'సీ. కూలె నొక్కమ్మడిఁ గొమ్ముకత్తులకొద్దిఁ గుమ్ములాడి మదాంధ కుంజరములు." చంద్రా. ౬, ఆ. ౭౫. విశే. 1. అల్పము. "ద్వి. కొద్దిగా ముత్తెంపుగొనబువజ్రాల, మద్దికాయలడాలు మలయఁ జెక్కిళ్ల." రం. రా. బాల. ౨౦. పు. ౩౦. పం; 2. పాటిని, ప్రమాణము కలది. వా:—పిండికొద్దిరొట్టె.

కొద్దికాఁడు. దే. విశే. (కొద్ది+కాఁడు.) క్షుద్రుఁడు, నీచుఁడు. ఆం. భా. తృ. ౧౩. [పఱుచు.)

కొద్దిపడు. ద్వ. అ. క్రి. న్యూనతనందు. (చూ. కొద్ది

కొద్దిపఱచు. ద్వ. స. క్రి. (కొద్దిపడు. ధా. ప్రే.) న్యూనత నందించు. "ఆ. తిట్టె నేని గొట్టఁ గొట్టినఁ గొట్టును,గొట్టెనేని యముఁడు కొద్దిపఱుచు." వేమన. ౧౧౩౧.

కొన. దే.వి. (వై. అని. శ. ర.) (క. కొనె. త. కొనై) 1. చివర. "ఆ... వేఁగుఁబోక తెమ్మర లెలదీఁగ, కొనలవంక లొత్తు ననలఁ బ్రోచు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౨. వేం. పంచ. ౪, ఆ. ౫౬౫; 2. చెట్టుచివరికొమ్మ. "చ... ఆకులుం,గొనలును జొంపములు..." భార. శాం. 3, ఆ. ౩౯౪; 3. సజ్జపు జూలు. ఆం. భా. ద్వి. ౧౯౨.

కొనకొనఁగోడి. దే. వి. (కొనకొన+కోడి.) జలకుక్కుటము, నీటికోడి. "గీ. కొనకొనంగోడి యేత్రింత కొంకనక్క, నమలి యీలాంగి టిటవర్ణనంబు లెస్స." క్రీడా. ౫౨. ఆము. ౪, ఆ. ౧౭౩.

కొనకొను. దే. అ. క్రి. (చూ. గొనకొను.)

కొనటి. వై. విశే. (సం. కునష్టిః.) కురూపి, వికృత రూపము కలవాఁడు. "గీ... రూపవిహీనులు దారురూపు,గలిగి తోలుమేనఁ గొనటులఁ బలికినారు." భార. ఆర. ౫, ఆ. ౯౩. మార్క. 3, ఆ. ౨౩౬.

కొనమునిఁగించు. దే. స. క్రి. (కొనమునుఁగు. ధా. ప్రే.) పూర్తిగా ముంచు; మిక్కిలి బాధించు. "చ... కనిసి పల్కిలి వారిఁ బిశాచులార! పొం,డని యిటు లన్నమాత్రనె మహోగ్రనిపాతమువోలె వారలం,గొనమునిఁగించె నాపలుకు కుత్సితరూపులు గాఁగఁ జేయుచున్." ఉష. ౧, ఆ. ౧౭౭.

కొనమునుఁగు. దే. అ. క్రి. (కొన+మునుఁగు.) పూర్తిగా మునుఁగు;మిక్కిలి బాధపడు. (చూ. కొనమునిఁగించు.)

కొనరిక్క. ద్వ. వి. (కొన+రిక్క.) రేవతీనక్షత్రము. "క. కొనరిక్క పేరిపొలఁతుక, పెనిమిటివై నాఁగ లియుఁను బెనుతాటిసిడం,బును బూని..." అచ్చ. బాల. ౧౩౨.

కొనలిడు. దే. అ. క్రి. (కొనలు+ఇడు.) వర్ధిల్లు, వృద్ధిపొందు. "క. త్రయ్య దొకయించు కైనన్,

డయ్యెదు కొనలిడియెఁ దృష్ణ..." భాగ. ౯, స్కం. ౫౭౭.

కొనలునిగుడు = కొనలిడు. "ఆ. కుశలమడిగి ప్రియము కొనలునిగుడ." భార. ఆర. ౫, ఆ. ౯౯. హరి. ఉ. ౮, ఆ. ౨౨౧.

కొనలువాఱు = కొనలునిగుడు. "వ...కొనలువాఱి యుద్దీపించు ప్రద్యుమ్న ప్రతాప వైభవంబును బోలె..." ప్రభా. ౨. ఆ. ౧౦౫.

కొనలుసాగు = కొనలువాఱు. "గీ. గోపకాంతల యాసలు కొనలుసాగు, చందము..." వి. పు. ౭, ఆ. ౮౭. కాశీ. ౭. ౨౩౮.

కొనలొత్తు. ద్వ. అ. క్రి. (కొనలు+ఒత్తు.) వర్ధిల్లు. "ద్వి...వేడ్కలు కొనలొత్త నపుడు."రం రా. బాల. కాం. ౨౫. పు. ౨౦. పం.

కొనసాగు. ద్వ.అ. క్రి. (కొన+సాగు.) 1. ప్రసరించు. వ్యాపించు. "గీ. నవమయూఖాళి గొనసాగి మిపుల నొప్పె." కళా. ౬. ౧౫. జాహ్నవీ. ౧. ౧౮౬; 2. ప్రవహించు. "సీ. ముజ్జగమ్ముఁ బవిత్రముగఁ జేయఁ దీర్థమ్ముఁ గొనసాగఁ జేసినయనఘ మూర్తి." ౧, ఆ. ౧౨౭; 3. వర్ధిల్లు, పెరుఁగు, "ఆ. కొడుకుఁ గన్నవేడ్క గొనసాగ." భాగ. ౧౦. స్కం.పూ.౯౭. దశా. ౧,అ. ౨౨౨; 4. నెఱవేఱు."గీ...ఆశక్తులైన,వారిచేఁతలు కొనసాగి వచ్చు నట్లు." పరాహ. ౧౧. ౨౮.

కొని = కొన్ని. "గీ...మఱచి యున్నయెడను గొని దినములకున్." నిర్వ. ౭, ఆ. ౬౩. వల్లు పరమగుచో నికారలోపము. "ఉ. కొన్ని గొణంగి కొన్ని లిసి..." పాండు. ౮, ఆ. ౧౮౭.

కొనితెచ్చు. దే. స. క్రి. (కొని+తెచ్చు.) తీసికొని వచ్చు. "చ...సుశీఘ్రతఁ గొనితెమ్ము..." ప్రభా. ౧, ఆ. ౧౩౬.

కొనిపించు. దే. స. క్రి. (కొనుధా. ప్రే.) కొనఁ జేయు, మూల్యమునకుఁ బుచ్చుకొనఁ జేయు. ఉదా. ఆతనిచేఁ గొనిపించుట కిష్టము.

కొనిపోవు. దే. స. క్రి. (కొని+పోవు) అపహరించు. "క. నాచిన్నిముద్దుఁగూతురు, నాచక్కనితల్లి వీథి నడయాడఁగ నన్నిచు కొనిపోయె..." రాజ. వ. ౨, ఆ. ౩౧. (ఇట్లే: కొనిచను, కొంచుఁజను, కొంచేఁగు, కొంచుఁబోవు. మొ.)

కొనియాట. దే. వి. (కొనియాడుధా.) పొగడ్త. "ఉ...ఆ,త్మాదరవృత్తి మీరు విజయాశ ననుం గొనియాటఁ జేసి..."భార. ద్రో. ౧. ఆ. ౭౩. భార. శాం. ౧, ఆ. ౧౭; 2. ఆచరణము. "సీ... ధర్మమ యెప్డుఁ గొనియాట నాస్తికగోష్ఠిఁ జనమి..." భార. ఆర. ౧, ఆ. ౫. ౮౮; 3. సేవనము. "క...సే,యడుగులఁ గొనియాటకుఁ బను,పడి నారము..." హరి. ఉ. ౯. ఆ. ౫౨.

కొనియాడు. దే. స. క్రి. (కొని+ఆడు.) 1. పొగడు. "క. తనపలుకు లోకమెల్లను, గొనియాడం దగిన లోకగురుఁడు..." భార. ఆది ౭, ఆ. ౨౮౬; 2. గౌరవించు. "సీ. కుంతీమహాదేవి కోడం డ్రలోపల నగ్గలంబుగఁ గొనియాడఁ బరఁగి." భార. విరా. ౨, ఆ. ౨౧౬. భార. కర్ణ. ౨, ఆ. ౫౮; 3. కొలుచు. "సీ. స్వర్గకాములు పితృవర్గంబుఁ గొనియాడి యిహలోకసుఖలీల లెల్లఁ గాంచి." హరి.పూ. ౨, ఆ.౧౩౦; 4. కాపాడు "గీ...అతని పుత్త్రకులు దాని, సొంగిళులు పెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి." భార. కర్ణ. ౨, ఆ. ౫౮; 5. అవలంబించు. "చ...మా,మొదలిటివారొనర్చువిధముం గొనియాడితి మేము నియ్యెడన్." భార. విరా. ౧, ఆ. ౧౭౯. భార. శాం. ౬, ఆ. ౫౦౮; 6. తలఁచు. "క. విధివశమున వచ్చినకీ,డథములు గొనియాడి వ్రేఁగులై విపుల భవాం,బుధి మునుఁగుదురు..."భార.అను.౧,ఆ.౯.

కొనివచ్చు. దే. స. క్రి. (కొని+వచ్చు.) తెచ్చు. "సీ. తనసంతతికి మేఁత గొనివచ్చురీతి దిక్కరిశరీరంబులగరుల నాను." దశా. ౧, ఆ. ౨౯౯.

కొను. దే. అ. క్రి. (త. కొళ్.) 1. చెల్లు. "ఆ. కుటిలబుద్ధులిచటఁ గొనవు సెట్టన ఘన,దోర్బలంబు మెఱసి తొడరవలయు." భార. విరా. ౮, ఆ. ౯౯౭; 2. ఉండు. "చ. మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి..." కవిక. పీఠి. ౬; 3. అతిశయించు. "చ. గనగన నెల్లప్రొద్దుఁ గొని క్రాలెడు వేఁడిమిఁ బేర్చుభర్తమే,నెనయను దగ్గఱన్ సయిఁప కెంతయు భీతి నొదుంగుచున్..."హరి. పూ. ౧, ఆ. ౧౬౭; 4. ఏర్పడు. "ద్వి. గుంపులు గుంపులు గొని తన్ను దాఱి,సొంపేది రాముని సుద్ది చెప్పుచును." రం. రా. అయో. ౧౨౧. పు.

౨౦. పం; 5. (ఇది సకర్మకక్రియల కార్థ్యనే పదార్థమందును అకర్మక్రియలకు స్వార్థమందును అనుప్రయుక్త మగును. ఉదా: చంపుకొను. మొ. (కొన్, కోఁగన్, కొన్న, కోక, కోని, కొందురు, కొంద్రు, కొఁడురు, కొంద్రు, కొమ్ము, కొక్కొమ్ము, కోవయ్యి మొదలగువిశేషరూపములు వ్యాకరణము లనుబట్టియుం ప్రయోగములనుబట్టియు గ్రహింప వలయును.) దే. స. క్రి. 1. గ్రహించు. "సీ. గంధర్వకామినీ కాముకవ్రాతంబు లాతాలఁ గొని మోఁది లజ్జఁ గొంద్రు." పార. ఆ. ౧౦; 2. తీసి కొనిపోవు. "ఆ...అలివపిండుఁ,గవులఁ దురగ ములను వరదంబులను గొని,యరుగుదెంచె..." భార. మా. ౧౧౫; 3. స్వీకరించు. "గీ. కపిల యిచ్చినవానిన కాదు నిజము కొన్నవానిని బుణ్యా త్మకునిఁగఁ జేయు." భార. అను. 3, ఆ. ౧౦౩; 4. లోఁగొను. "గీ...సముద్రంబులోన బుట్టి, వైవఁ గొన్నంత గొనుఁ గాక..." భార. భీష్మ. ౨, ఆ. ౨౭౨; 5. అపహరించు. "వ. పొత్తిచీరఁ గొని పసిఁడిపురువగు." మార్క. ౨, ఆ. ౧౧౮. "క. ఆమిష మని దానిం గొనఁ,గా మది సమకట్టి యొక్క ఖగ మాఖగమున్, వ్యోమమునఁ దాఁక ..." భార. ఆది. 3, ఆ. ౭౯; 6. ఆహారముగాఁ జేసికొను. "గీ. ఎవ్వరిఁ గొని యఃతండు,కౌరవుల మీఁద నెత్తిరాఁ గలుగువాఁడు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౬౯; 7. పొందు. (ఇది తలఁచు విశేష్యములకనుప్రయుక్తమై ఈయర్థముతో శబ్ద పల్లవక్రియగా ఏర్పడును. ఉదా: తెవులుగొను. మరులుకొను. మొ.) "గీ. కుసుమధనువున నెవ్వండు గొను విజయము." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦, "ఉ...సురేశ్వరాదులుఁ, బన్నములాడి నీ మగనిపక్షము పల్కెఁడుగాక బేలనీ, కొన్నమరుల్ జగజ్జనులు గొందురె ప్రాత్యులఁ బూజ్యులుం దురే." కు. సం. ౨, ఆ. 3౪; 8. గతి చేయుం. "ద్వి. పసిఁడిపింజల నొప్పుబాణము ల్గాడిగి,గోముఖుం డనువానిఁ గొని కాడ నేసె." రం. రా. ౭౫. పు. ౧. పం; 9. లక్ష్యపెట్టు. "క. కొనరు బుధులమాట నాస్తికులు వినయసిద్ధీ." భార. శాం. ౬, ఆ. ౨౨౫. భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౪: 10. పళపళచుకొను. "గీ. ఇందు రమ్మన్నచోట నిల్చెల్లఁ గొనుట." కువల. ౨, ఆ. ౨3; 11. ధరించు. "క. నలుపదితొమ్మిదిరూపం, బులు గొనియుండు..." పాండు. ౧, ఆ. ౧౮౫. కువల. ౨, ఆ. ౧౨౭; 12. పూను. "ఆ...ప్రాణ మిత్త్రు ననుచుఁ బ్రతినఁ గొంటి." జై. ౮, ఆ. ౯౦; 13. కవియు. "సీ. కమలకాననమధ్యకలహంస విభుభాతిఁ గూర్మి నెచ్చెలిఁ బిండు గొని చెలఁ గుచు." పాండు. ౨, ఆ. 3౧. కేయూర. ౪, ఆ. ౧౬౫; 14. కలఁచు. "క. అది రవి గ్రుం కుట గాఁ గొని..." భార. ద్రో. ౪, ఆ. 3౧౬; 15. నెఱవేర్చు. "క. రాజింపఁ బల్కి తనపని, జాజై కొను..." ఆము. ౪, ఆ. ౨౬౯; 16. తెచ్చుకొను. "చ...లేనివగలుం గొని మాటికిఁ గులుకు..." హంస. ౧, ఆ. ౨౧౭; 17. చేర నిచ్చు. "వ...క్రేపులం గొననియావుల..." హరి. పూ. ౫, ఆ. ౧౫౨; 18. భుజించు. "క. తను యాత్రకుఁగా నశనముఁ,గొను..." భార. శాం. ౫, ఆ. 3౨౧; 19. త్రాగు. "క...శ్రీపాదోద కముఁ గొనియె..." హర. ౨, ఆ. ౧౨౪; 20. విలుచు. "క. ఏ మమ్మెద మనిన...కొనుట యొప్పె దు తెరువు..." భార. అశ్వ. ౪, ఆ. ౯౬౫; 21. ఖండించు. "చ...ఎక్కుడు పెన రాహువు మస్తకము గొన్న సుదర్శనదేవుఁ గొల్చెదన్." ఆము. ౧, ఆ. ౯; 22. కొట్టు. ఆం. భా. తృ. ౧3౨. భార. భీష్మ. 3, ఆ. 3౧౯; 23. గ్రుచ్చుకొను. "చ. ఒకబలుతూపు పురంబు గొని యుచ్చి చనన్..." భార. ద్రో. ౫, ఆ. ౧౭3.

కొనుకొను. దే. స. క్రి. (కొను+కొను. స్వార్థమున.) విలుచు, వెలకుఁ గైకొను. "గీ...బ్రదుకు గలిగె, నేని యర్థంబు లేరాని విచ్చియైనఁ,బొందు గొను కొందు నెట్లరవిందనయన." ఉద్భ. ౨, ఆ. ౧౬౮; ౨౭౧.

కొనుగోలు. దే. వి. 1. (కొనుధా.) క్రయము. (శ. ర.); 2. (నాట్య) శబ్దోచ్చారణము ప్రబంధ.౯౪.

కొనుబడి. దే.వి. (కొను ధా.) క్రయము. (శ.ర. బ్రౌ.)

కొనుమొదలు. దే. వి. (కొనుధా.) కొనుట కిచ్చిన సొమ్ము. (శ. ర. బ్రౌ.)

కొన్నాళ్లు. ద్వ. వి. (కొన్ని+నాళ్లు.) కొన్ని దినములు; కొంతకాలము. వసు.౧,ఆ.౧౨3.నీలా.3, ఆ.౨౫.

కొన్ని. ద్వి. స. బొ. (కొంతశబ్దముయొక్క-అమహద్గ్ఘకబహువచనరూపము.) "సీ...కొన్ని వెడల నుమిసి..." స్వా. ౩, ఆ. ౬౬. "శా. కొన్నిటి పార్శ్వములన్ నలియ..." భార. భీష్మ. ౨, ఆ. ౨౧౧. (ఈక్రిందిచోట నిది మహన్మహత్సగ్ఘకముగాఁ గూడఁ బ్రయుక్తము.) "ది...మఱికొన్ని వేల్పులు..." బస. ౪, ఆ. ౧౧౩. పు.

కొపురు. వై. వి. (సం. గోపురమ్.) 1. శిఖరము. "క. దాఁటుటయుఁ గొండకొపురులు.బీటులు వాఱెన్..." అచ్చ. కిష్కిం. ౧౦౨; 2. ఉన్నతి. "ఆ...పిఱుఁదుఁగొపురును..."అచ్చ. అర. ౨౩. (శ. ర. పా. 'కొపరి'ముద్రి.)

కొపెర. దే. వి. కొప్పెర, పెద్దమూతిగలచిన్నపాత్ర. "సీ. సారాయికొపెర గంజాపొడుల్..."కువల. ౧, ఆ. ౪౧.

కొప్పరము. వై. వి. 1. శిఖరము. (శ. ర.). 2. మూఁపు. ఆం. భా. ద్వి. ౧౩౭. వరాహ. ౧, ఆ. ౧౪౬. విణ. విజృంభితము. "ఉ...రోగముల్, కొప్పర మైనచో..." దా. శ. ౧౫.

కొప్పరించు. వై. అ. క్రి. 1. అతిశయించు. "వ...కప్పురంపుఁగుప్పలఁ గొప్పరించినసరసమధురసంబులు నించి..." పారి. ౨, ఆ. ౯౩; 2. విజృంభించు. ఉ. హరి. ౪, ఆ. ౨౯౬; 3. రోమాంచముకలదగు. "గీ. గునియుఁ గుప్పించు లంఘించు గొప్పరించు...,పంది మెల్లన రణపరిపంథియగుచు." భాగ. ౩. స్కం. ౬౩౭. ఉ. రా. ౭, ఆ. ౩౬౩; 4. పండ్లిగిలించు, వెక్కిరించు. "ద్వి. కొప్పరించుచుఁ బండుకోఁతిరైయుండె." అభిమన్యుచరిత్రము. (బ్రా.) ౧౭౪. స. క్రి. నింపు. "సీ...మందాకినీతోయముల్ కొప్పరించినగాజుకుప్పె లనఁగ." విప్ర. ౩, ఆ. ౨౮.

కొప్పరింత. వై. వి. 1. అతిశయము. (శ. ర.); 2. విజృంభణము. (శ. ర.)

కొప్పు. దే. వి. (త. కొప్పు.) 1. మగవానిసిగ. "ఆ...వానిఁ గొప్పు పట్టి యీడ్చుకొని వచ్చె..."భార. ఆది. ౭, ఆ. ౯౯; 2. వేనలి. "చ...కొప్పుతీరు..." నీలా. ౨, ఆ. ౧౫; 3. వింటికొన. ఆం. భార. తృ. ౬౧; 4. ఇంటినడికొప్పు.మొగుడు. (శ. ర.); 5. ఉన్నతస్థానము. "క. లలిఁ గొప్పెక్కించితి మధుపుల శుకుల నడుగుపఱచితి..." చంద్రా. ౯. ఆ. ౫౧; 6. నాట్యవిశేషము. "గీ. కొప్పువగ జక్కిణీగొప్పు ద్రొక్కి నొక్కుచక్కని మిటారి..." దశా. ౭౩. ౧, ఆ. ౨౭౭.

కొప్పువల. దే.వి. (కొప్పు+వల.)వాలపాశ్యావిశేషము; తలవెండ్రుకలను బంధించుముత్యాలసరము (బ్రా.) ఆం. భా. ద్వి. ౧౪౭. కళా. ౭. ఆ. ౬౬. య. ౪, ఆ. ౮౫.

కొప్పెర. వై. వి. (సం. కర్పరః.) 1. కటాహము, కాఁగు. "గీ...చమురుఁగొప్పెరలలోన." జై. ౪, ఆ. ౧౧౦; 2. పాత్రవిశేషము,కమండలువు. "గీ. పసిఁడికొప్పెర లాతంబు పచ్చకోల,...తాల్చి నెఱిమిండడంగ మగుచు." హర. ౯, ఆ. ౪౦; 3. తలపుఱ్ఱె. "క...నడునెత్తి పగులఁగొట్టఁగ, వెడలెంగొప్పెరసెత్తురు..."దశా. ౮, అ. ౧౯౭.

కొప్రము = కొప్పరము. (శిఖరము.) "ఉ. క్రొన్నెల జాలమేలిపనికొప్రపుమేడల..."నీలా.౧, ఆ ౨౮.

కొబ్బరి = కొబ్బెర. (వా.)

కొబ్బెర. దే. వి. 1. నారికేళము. "సీ. కోఁతిఁ కొబ్బెరకాయ కొనకెక్కి పడఁద్రోయు దాని జలంబులు ద్రావఁగలదె." రామలిం. ౧౭; 2. కాయలోనిపేశము. ఆం. భా. ద్వి. ౭౫.

కొబ్బెరపండు. (కొబ్బెర+పండు.) కొబ్బెరపేశము. "ఉ...చక్కెర కొబ్బెరపండు లంద్రముల్..." నీలా. ౧, ఆ. ౭.

కొబ్బెరపూవు. దే. వి. (కొబ్బెర+పూవు.) కొబ్బెరకాయలో నేర్పడుతెల్లనికురిడీ. (వా.)

కొబ్బెరయుండ. దే. వి. (కొబ్బెర+ఉండ.) భక్ష్యవిశేషము, నూండము. (శ. ర.)

కొమ. దే. వి. 1. శాఖ. (శ. ర.); 2. కొమ్మ,స్త్రీ. (శ. ర.); 3. భార్య. "చ...నీ కొమ పరిశుద్ధిగాంచెఁ గయికొ మ్మనఁ గొమ్మ గురుండు చేకొనెన్."శశాం. ౯, ఆ. ౧౭౨; 4. చెలి. "సీ. కొమలార మీ రేల భ్రమరాళిఁ దఱుమఁగా..." సావి. ౨, ఆ. ౩౫.

కొమరసామి. వై. వి. (సం. కుమారస్వామి.) కుమారస్వామి. "సీ. కొక్కరోకో యని కొమరసామి రథంబు కంఠంబు సాఁచి క్రేంకార మిచ్చె."భీమ. ౨, ఆ. ౭౮. కాశీ. ౪, ఆ. ౩౦౨. క్రీడా. ౧౪౫.

కొమరాలు. ద్వ. వి. ఔ. (కొమరు+ఆలు.) 1. స్త్రీ. "గీ. తమ్మికొమరాలు పత్త్రనేత్రములు మోడె." వేం. పంచ. ౪, ఆ. ౨౬౪; 2. యువతి. "సీ. కొమరాలిసిబ్బెంపుగుబ్బ పొందమ్మిమొగ్గలు..." పె. శకుం. ౨, ఆ. ౮౭; 3. సుందరి. "గీ. అట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దానవచ్చి కామింప నొల్లనివాఁడు గలఁడె." భాగ. 3. స్కం. ౭౮౭. ౯. స్కం. ౭౨.

కొమరిత. వై. వి. (సం. కుమారీ.) కూఁతురు, దుహిత. "గీ...రాచకొమరిత..." పాంచా. ౨, ఆ ౩౧.

కొమరు. వై. వి. (సం. కూబరః.) 1. మనోజ్ఞత. "సీ. వదనంబుకొమరు భావనఁ జేసి..." భార. విరా. ౧, ఆ. ౨౨౮. ఆం. భా. త్వ. ౪౧; 2. విధము, రీతి. "క. కురువీరుల మొనలు మొగులుకొమరునఁ గలియఁగన్." భార. విరా. ౪, ఆ. ౨౭౦; 3. అందము, సౌందర్యము. ఉదా:—కొమరుమిగులు, కొమరారుమొ. 4. (సం. కుమారః.) కుమారస్వామి. సాం. ని. దేవ. ౭. విశే. 1. మనోజ్ఞము. "గీ. కొమరుమే నొప్ప..." కళా. ౪, ఆ. ౯౯; 2. విలాసయుక్తము. "క...హాయరత్నము..., కొమరుగ నేకతమ యిచ్చెఁ గ్రుష్మరుచున్నన్." భాగ. ఆది. ౨, ఆ. ౨౬; 3. (సం. కుమారః.) యౌవనుఁడు. "గీ. కొమరుజంగమునకు నిచ్చెఁ గోర్కి తీఱ." హర. ౧, ఆ. ౨౩.

కొమరుంపనము. వై. వి. (కొమరు+పనము) యౌవనము. "లయగ్రాహి. శేనికొమరుందనము లేచిచెలువంబును..." కళా. ౪, ఆ. ౪౯.

కొమరుఁడు. వై. వి. (సం. కుమారః.) (దీనికి బహువచనమున "కొమలు" అనురూపము ఆము. ౪, ఆ. ౧౩౪. నఁ గానవచ్చుచున్నది.) 1. పుత్త్రుఁడు. ఆం. భా. ద్వి. ౧౧౧. 2. మగవాఁడు. "ఉ... రాకొమరుండు..." విక్ర. 3, ఆ. ౭౮; 3. కౌమారవయస్కుఁడు. ఆం. భా. ద్వి. ౧౬౮; 4. కుమారస్వామి. "చ. కొమరుఁడు సామి కొంచ మలఁ గొట్టినజాణ..." ఆం. భా. ప్ర. ౪౪.

కొమరుఁబ్రాయము. వై. వి. (కొమరు+ప్రాయము.) యౌవనము. "క...సీ, కొమరుంబ్రాయము మిక్కిలి, గొమరొందెడు..." కళా. ౪, ఆ. ౪౬. (శ. ర. పా.)

కొమరునాఁడు. ద్వ. వి. (కొమరు+నాఁడు.) యౌవనము. "మ...కొమరునాఁడే చెల్గె మాపై ఖరుల్." కకు. ౪, ఆ. ౨౬.

కొమరులు. దే. వి. బ. మేలుదూలముమీఁదిగుజ్జులు. (శ. ర. బ్రా.)

కొమరేఱు. ద్వ. వి. ఔ. (కొమరు+ఏఱు.) కుమారవాహిని, స్వామిపుష్కరిణి. "సీ. కొమరేటికల్యాణకమలషండంబుల..." భీమ. ౨, ఆ. ౬౨; ౬౩.

కొమారి. వై. వి. కుమారి, కూఁతురు. "గీ...రాకొమారి." చంద్రా. ౪, ఆ. ౧౯౧.

కొమారిత = కొమారి. "క. మడిచ్చఁ గైకొంటి నీ కొమారితఁ బొందున్." ప్రభా. ౫, ఆ. ౨౦౬. పాంచా. ౨, ఆ. ౧౦.

కొమారుఁడు. వై. వి. 1. పుత్త్రుఁడు. ఆం. భా. ద్వి. ౧౧౧. (బ. కొమాప్లు. సా. ౨, ఆ. ౮౫.); 2. పురుషుఁడు. "గీ...రాచకొమారులందు." భోజ సుతా. ౨, ఆ. ౫౨.

కొమార్త=కొమరిత. (కూఁతురు.) "సీ...తొలివేల్పురాయనికొమార్త." య. ౪, ఆ. ౫౭. కువల. ౨, ఆ. ౨౮.

కొమార్తె = కొమరిత. (కూఁతురు) "ఉ...కృష్ణరాయభూకాంతునకుం గొమార్తె నొసఁగన్..." కృష్ణ. ౪, ఆ. ౭౪.

కొమిరె. వై. వి. (సం. కుమారీ.) 1. కౌమారవయసునఁ గలస్త్రీ. ఆం. భా. ద్వి. ౧౦౬; 2. యువతి. "క...వేలుపుఁగొమిరెలతో..." విక్ర. ౨, ఆ. ౨౪౫. ఉ. రా. ౪, ఆ. ౨౧౦; 3. కూఁతురు. "చ. కొమిరె మనోవ్యథం బొగుల గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి తల్లి..." వసు. 3, ఆ. ౧౦౫; 4. ఆఁడుది. "గీ...రాచ కొమిరె నిదురించుతఱి..." శుక. ౧, ఆ. ౪౬౪. విశే. యౌవనము గలది. "వ...కొమిరెహరిణలోచనల..." ఆము. ౪, ఆ. ౩౫.

కొమ్మ. దే. వి. (త. కొంబు.) 1. శాఖ. "సీ...మఱ్ఱికొమ్మను గట్టినవ్రేలెడునుట్టి..." విక్ర. ౨, ఆ. ౪౪; 2. స్త్రీ. "క...రెంకవకొమ్మ..." ౬, ఆ. ౧౮; 3. భార్య. "గీ. సోమకార్ధేందుధరుకొమ్మ గోకులమ్మ." భీమ. ౧, ఆ. ౯౮; 4. (కోటమొ.) శిఖరము. "లయగ్రాహి...కోటకుదలన్ నెగడు

కొమ్మల్." స్వా. ౫, ఆ. ౩౦. "సీ...కూలుఁ గొమ్మలతోఁడిగోపురకములు." చంద్ర. 3, ఆ. ౪౮.

కొమ్మత్రిమ్మరి. దే. వి. (కొమ్మ+త్రిమ్మరి.) కోఁతి. "గీ. కొమ్మత్రిమ్మరినా డొవఁగూడఁ జేతు." అచ్చ. యు. ౧౨౩. (శ. ర. పా. 'కొండద్రిమ్మరినాడు' ముద్రి.)

కొమ్మదాఁటుమెకము. ద్వ. వి. (కొమ్మ+దాఁటు+మెకము) కోఁతి. వేంక. త్ర్య. ౯౫.

కొమ్మదాసరి. దే. వి. (కొమ్మ+దాసరి.) చెట్టెక్కి బిచ్చమడుగునొకదాసరిజాతివాఁడు. (వా.)

కొమ్మనఁటి. దే. వి. (కొమ్ము+అనఁటి.) కదళీవిశేషము, ఒకజాతియరఁటిచెట్టు. "గీ. పనసపం డ్లేడపండ్లు కొమ్మనఁటిపండ్లు." రసిక. ౧, ఆ. ౬౪. ఇట్లే: కొమ్మనరఁటి. నైష. ౬, ఆ. ౧౩౯.

కొమ్మనగొట్టెపిండిచెట్టు. దే. వి. పూతికవృక్షము. (శ. ర.)

కొమ్మనగొలిమిడి. దే. వి. మూఁఘపువృక్షము. (శ. ర.)

కొమ్మనగోర. దే. వి. 1. ఒకానొకవృక్షము. (శ. ర.); 2. కొండపిండివృక్షము. (బ్రౌ.)

కొమ్మమెకము = కొమ్మదాఁటుమెకము. "క. వినుకొమ్మమెకపుబలియుండ .." అచ్చ. కిష్కిం. ౮.

కొమ్మలువోవు. దే. అ. క్రి. (కొమ్మలు+పోవు.) వృద్ధిపొందు. "చ...రతికోర్కులు కొమ్మలువోవ...." నిర్వ. ౮, ఆ. ౭౩.

కొమ్మి. దే. వి. 1. ఒకానొకచెట్టు. "గీ. కొమ్మిపండ్లుఁ దపండ్లును..." కళా. 3, ఆ. ౬౯. హంస. ౪, ఆ. ౧౨౫; 2. ఒకజాతిచేఁప. (బ్రౌ.)

కొమ్ము. దే. వి. (క. త. కొంబు.) 1. పశుశృంగము. "ఉ. కొమ్ములఁ గ్రుమ్ముఖాడుమదఘోరవృషంబుల మాడ్కి..." ఉ. రా. 3, ఆ ౨౫౦; 2. ఏనుఁగుదంతము. "సీ. తొండమ్ముకొమ్ములు తునియవ్రేటులుపడి కొదవద్దయేచుఁగుకొదవు వోలె." దశ. 3, ఆ. ౪; 3. పందికోఱ. "సీ. నీటిలోఁ మునిఁగిన నేలఁజేసియుఁ గొమ్ముకొన నుబ్బనెత్తినఘోణి వీవ." పారి. ౧, ఆ. ౯౯; 4. చోఱచేఁపయొక్క అంపమువలె నుండుఁనవయవము. "సీ...కొమ్మున శేషాహి గ్రుచ్చి యెత్తు." దశా. ౧, అ. ౨౨౫; 5. చంద్రునిపక్షప్రారంభరేఖయందలికొన. "సీ...కుముదాప్తదారణకొమ్ము దఱిఁగె." (దారణకొమ్ము=వెల హెచ్చుతగ్గులను సూచించుకొన.) కాళ. 3, ఆ. ౧౪౯; 6. (విల్లు మొ. వాని)కొన. "సీ. ధనువుక్రిందటికొమ్ము ధరణిపై మోపి మీఁదటికొమ్ము వామహస్తమునఁ బట్టి." భో. ౫, ఆ. ౨౭; 7. (పసుపు మొ. వాని) నిడుపైనదుంప. ఉదా:— సొంటికొమ్ము, పసుపుకొమ్ము మొ 8. చిమ్మనగ్రోవి. "గీ. కొమ్ము దగఁ బూని...జలకేళి సల్పి రపుడు." చంద్రా. ౪, ఆ. ౨౪౭; 9. కొండకొన. "క. గుబ్బలికొమ్మెక్కుటినిబ్బరమునఁ బెఱికి..." అచ్చ. యు. ౨౪౧; 10. కోటకొమ్మ. ఆం. భా. ద్వి. ౧౨; 11. వృక్షశాఖ. "ఉ...మూఁకందము కొమ్మునకె బిగియఁ గాళులు రెండుఁ దగిల్చి వ్రేలుచున్..." నిర్వ. ౧౦, ఆ. ౭౦; 12. (చెఱుపు) కొన. "గీ. చెఱుపుకొమ్మునఁ గయ్యంబు సేయుచుండె." వేం. పంచ. ౧, ఆ. ౨౩౨; 13. (పల్లకి మొ.) దండె. ఆం. భా. ద్వి. ౨౦౧. దశా. ౨, ఆ.౨౭౪; 14. ఊఁదువాద్యములలో నొకటి. "క. కొమ్ములనినదమ్ములు శంఖమ్ములశబ్దములు..." రా. వి. ౫,ఆ ౬౦. ఆం.భా. తృ. ౫౨; 15. బలము, సేన. "క. కొమ్మా దానవనాథుని,కొమ్మాహవమునకుఁ దోలఁగె..." భాగ. ౧౦.స్కం. ఉ.౧౮౭; 16. ఉత్సాహము. "ఆ...దైత్యభటుల, కొమ్ము వీడ సురలకొమ్ము వర్ధిల వాని,కొమ్ము వెఱికి..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౧౪౪; 17. హల్లునకుఁ జేర్చు 'ఉ'కారచిహ్నము. అప్ప. ౪, ఆ. ౪౯; 18. మాదిగవాఁడు క్రోవ్వుంచుకొనెడిపాత్రము. (శ. ర.); 19. గవుండ్లవాఁడు బందము తగిలించెడు కత్తిపిడిగానివంకరకొయ్య. (శ. ర.)

కొమ్ముకాఁడు. దే. వి. (కొమ్ము+కాఁడు.) 1. కమసాలివాఁడు; 2. పంది. "సీ. నరకహేతుహిరణ్యహారణవృత్తిఁ జరించుకొమ్ముకానిభజించుకొదవ తెల్లి." వసు. ౧, ఆ. ౬౨. (రెండర్థములకు నిది యుదాహరణమే.); 3. కొమ్ముఁబువాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౯.

కొమ్ముకాఁకర. ద్వ. వి. (కొమ్ము+కాఁకర.) ఒకానొకజాతికాఁకరవృక్షము. (శ. ర.)

కొమ్ముచేఁప. దే. వి. (కొమ్ము+చేఁప.) ఒకజాతియాఁడుచేఁప, శృంగి. (శ. ర.)

కొమ్ముచోఱ. దే. వి. (కొమ్ము+చోఱ.) అంపము వంటియవయవము గలచోఱచేఁప. "క...,సుర

ఆం. భా. ప్ర. ౭౨. వై. 1. గ్రుడ్లగూబ (శ. ర.); 2. ఒకజాతిపక్షి. "సీ...గిజిగాడు కొరడు." సుద. 3, ఆ. ౧౯౪.

కొరద. దే. వి. ఒకజాతిచేప. "సీ. కొరదయుఁ గడిసె..." వేం. పంచ. ౧, ఆ. ౨౯౪. "సీ. కొరద దాసరి కొయ్య..." హంస. ౪, ఆ. ౧౮౭. (శ. ర. పా. 'కొరదు' ముద్రి.)

కొరవంజి. దే. వి. (క. కొఱవంజి.) 1. ఎఱుకువాఁడు. "క...ఇక్కడిబోయలలో మఱి యెక్కుడు చాయలమలల మెలఁగుకొరవంజులలోన్." చంద్రా. ౨, ఆ. ౮౭. (శ. ర. పా. 'కోమలలోనన్' ముద్రి. పా.) కాల; 2. ఎఱుకుజాతిస్త్రీ. "శా. ఏయేభూములు చూచినావె కొరవంజీ..." శుక. ౧, ఆ. ౧౦౧; 3. ఎఱుకులు చేయునాట్యభంగిమములలో నొకటి. "క. ఎఱుకో యెఱుక యటంచుం, గొరవంజి నటించె నొక్కగురుకుచ..." దశా. ౭, అ. ౧, ఆ. ౨౮౮; 4. నాట్యవిశేషము. "సీ. చలుపుచున్నది ప్రోడజాడలఁ గొరవంజి యల తిలోత్తమనృత్యనిలయసీమ." కవిరా. 3, ఆ. ౮౮.

కొరవి. వై. వి. (సం. కురవకః.) ఎఱ్ఱగోరంటపూ. ఆం. భా. ద్వి. ౫౩. కాశీ. ౧, ఆ. ౧౩౮.

కొరసానిగండు. ద్వ. వి. కొర్నవగండు. (శ.ర.బ్రా.)

కొర్కు=కొఱకు. "ద్వి...కండలు కొర్కికొనుచు." పండితా. పర్వ. ౫౧౧, పు. ౧౨. పం.

కొ_ర = కొఱఁత. (కొఱ్ఱు, శూలము) "చ...వీతిహోత్రుఁ డచ్చెడుగులఁ గొల్చుఁ గొ_రపయిఁ జెక్కినరీతి సభాంగణంబునన్." పార్వ. ౨, ఆ. ౯౯.

కొర్నవగండు. ద్వ. వి. కొర్ణగండు, దుమ్ములగొండి. "చ...చెవులపోతులు కొర్నవగండ్లు..." కాళ. 3, ఆ. ౪౮.

కొర్వికోల = కొఱవికోల. "చ. చెలఁగి చెలంగి మానసము చిల్లులువోవఁగ నేసె బాలికన్, వలపుల రాచజోదు ప్రసవంబులపేరిటి కొర్వికోలలన్." పిన. శకుం. 3, ఆ. ౧౬౯.

కొఱ. దే. వి. (త. కుఱై.) 1. కొఱఁత, లోపము. ఆం. భా. త్రి. ౪౬; 2. శేషము, మిగులు. "క. కొఱ గలకల నగు నడుపు..." ఉ. హరి. ౪, ఆ. ౨౭౨; 3. మంచి, మేలు. "క...ఆఁడుది యనుకొమన్నఁ గొఱగాదు సుమీ." సా. ౨, ఆ. ౧౨౩; 4. ప్రయోజనము. "ద్వి. తజి చనుదేర నాతనిదుత్తివలనఁ గొఱ గలయొక మంచికోడును జనించె." ద్వి. భాగ. ౮, స్కం. (శ. ర.); 5. శిల్పము. "సీ. కొఱ మించుపగడంపుగుంద్రగంబంబులు..." అచ్చ. అయో. ౪, ఆ. ౪; 6. వికారము. "ద్వి. కంతునికొఱ రోసి కన్నులు మూసి, చింత లొక్కటి చేసి శివుఁ దలపోసి." ద్వి. హరిశ్చ. ఉ. ౬౩, పం; 7. ఆఁదము. ఆం. భా. త్రి. ౪౬. అచ్చ. అయో. ౧౧౯; 8. ఒకజాతిచేప. ఆం. భా. ప్ర. ౧౬౦; 9. అపరాధము. "సీ...నిరపరాధులమీఁదఁ గొఱ తలంచి...గీ...పరఁగినట్టి, పరమపాతకుఁ డఘూమిపాలకుండు." సాంనందో. ౨, ఆ. ౮౬; 10. (కొహమలాదు) డొర్వులఁ గలుగుధ్వని. (మా. కొఱకొఱ, కొఱకొఱలాడు.) విశే. 1. అల్పము, తక్కువది. "గీ. జగతిఁ గొఱనోము నోఁచినజలజముఖుల, కూరిమి గణించి యతఁ డేల గారవించు." వసు. ౪, ఆ. ౧౧౧; 2. ప్రయోజనకారి. "గీ...అంతకంటె, నేముఁ గొఱగాము మాచేత నింత పుట్టె." భార. అశ్వ. ౪, ఆ. ౭౭; 3. మనోహరము. "క...మాయట్టివారిమాటలు కొఱయె." భార. సభా. ౨, ఆ. ౯౦; 4. మేలైనది. "వ...తత్పత్నీహరణప్రయత్నంబు కొఱ గాదు..." వరాహ. ౧౧, ఆ. ౫౭; 5. తగినది. "క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాహంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయం, తలవారితోన తగు నధికుల హీనులతోడ నైనఁ గొఱగా దధిపా." భార. ఉద్యో. ౨, ఆ. ౪౬; 6. శక్తుఁడు, సమర్థుఁడు. "చ...సమరంబునకుం గొఱ యైన వాఁడ..." భార. విరా. 3, ఆ. ౧౫౦.

కొఱఁకు. దే. వి. బెడు, విలీతము. ఆం. భా. ద్వి. ౬.

కొఱఁత. దే. వి. 1. చేయవలసినపని. "క. నాకొఱఁతఁ దీర్చి వచ్చితి, నీకొఱఁతయె యింక సూతునిం దెగఁ జూడన్." భార. విరా. ౨, ఆ. ౨౭౧; 2. లోపము. "ఆ...నీకు, గురువ యింక నొక్క కొఱఁతయు లేదు..." భార. విరా. ౧, ఆ. ౨౫౩; 3. అవమానము. "సీ. పౌరయుఁ గట్టెనె

పాండుపుత్త్రులసతి దుస్ససేనుండు సభను జేసిన కొఱంత." విప్ర. ౪, ఆ. ౪౯; 4. దోషము. "గీ...నీమీఁదికొఱంత, నీకుఁ గానంగ వచ్చునె ..."భార. ఉద్యో. ౪, ఆ. ౧౭౬; 5. మిగులు. "వ. నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు కొఱంత గలదు..."భార విరా. ౧, ఆ. ౩౧౩; 6. కొట్టు, శూలము."ఆం. భా. తృ. ౪౬, సాం. ని. నాసా. ౭౬. విశ. 1. అల్పము. "గీ. శౌరి మేము కులస్థానపౌరుషముల, నేమిట కొఱంత తెల్పుమా..."దశా. ౭, ఆ. ౧౯౦; 2. తక్కువ. "గీ...పార్థు నొకటి, కొఱంతగా నూఱుశరముల నుఱక నొంచె." భార. కర్ణ. ౫, ఆ, ౩౭౧; 3. మిగిలినది. "క. కావింపు కొఱంత కార్యము..." దశ. ౬, ఆ. ౧౨౭.

కొఱంతపడు = కొఱంతపడు. (చూ. కొఱంతపఱచు.)

కొఱంతపఱచు. ద్వి. స. క్రి. (కొఱంతపడు. ధా.) తక్కువచేయు, జయించు. "సీ. కమలాక్షినిడు వాలుఁగన్నులు కుసుమాస్త్రక్రొవ్వాఁడితూపులఁ గొఱంతపఱప." వి. పు. ౨, ఆ. ౧౯౬.

కొఱంతపడు. ద్వి. అ. క్రి. (కొఱంత+పడు.) 1. లోపమువచ్చు. "సీ. తల్లిదండ్రులు నన్నదమ్ములుఁ జెలికాండ్రు గురువులు శిక్షింపఁ గొఱంతపడునె, పిదప మేలగుఁగాక..." భాగ. ౭, స్కం. ౬౪౭; 2. మఱుఁగుపడు. "సీ...తద్వృత్త మొకటి కొఱంత, పడుచుండఁ బ్రత్యక్షపరిచితం బైనది కాదె నీబుద్ధికి..."హరి. పూ.౧,ఆ.౪౭.

కొఱంతపెట్టు. దే. స. క్రి. (కొఱంత+పెట్టు.) మిగుల్చు;దాఁచు, మఱుఁగుపఱచు. "క. కంకుఁడు ధర్మసుతుఁడు వలలుఁడు భీముండు గవలు హయశిక్షకగో,కింకరులు సెప్పఁదొడఁగిరి,నింకఁ గొఱంతపెట్ట నేల యే నర్జునుఁడన్." భార. విరా. ౪, ఆ. ౧౩౪.

కొఱంతవోవు. దే. అ. క్రి. (కొఱంత+పోవు.) తక్కువగు. "ఉ...అందునే,వెంటఁ గొఱంతవోనిపృథివీసురుఁ డొక్కఁడు సోమశర్మ పేరింట నెసంగు ..." శుక. ౨, ఆ. ౧౪౪.

కొఱకంచు. దే. వి. (బ్రా. వా.) ('కొఱకచ్చు'. శ. ర., సూ. ని.) కొఱవి, అలానము. "చ...వె, న్నెలకొఱకంచులో యనఁగ నిండినచీఁకటిమీఁద నిరి. జుక్కలు కనుపట్టె..." రామా. ౨, ఆ. ౯౪. (ముద్రి. పా.) "గీ. పసుపుజేసకుకొఱ కంచుమిసిమి జేఱు,మిట్టకనుగ్రుడ్లు..." వెం. పంచ. 3, ఆ. ౧౩౪. (ప్రాఁతప్రతి. పా.)

కొఱకు. దే. అవ. ద్రు. (కొఱ+కు. చతుర్థీవిభక్తి ప్రత్యయము.) 1. కై, కోసము. "సీ...ఖాదఱఁ గృతార్థులఁ జేయుకొఱకొ..." కళా. ౨, ఆ. ౬; 2. సంప్రదానార్థకము. "క. వేదోక్తవిధిని మేమా,యాజిజులకొఱకె యిత్తు మధ్వభాగం,బు ..." దశా. ౧, ఆ. ౨౭౪.

కొఱకొఱ. దే. వి. 1. కోపము. "క. పెటికితనంబును జలమును,గొఱకొఱ యాలేనిగుణము..." నీలా. ౧, ఆ. ౪౪. శివలీ. ౭, ఆ. ౧౨౫; 2. పగ. "వ...అనుహారమోగిని విష్ణుభక్తియది సదా మా తోఁడకొఱకొఱ మానదు..." ప్రబోధ. ౨. ఆ. ౪౭; 3. (కోపాదులందు) ఊర్పులు విడుచుట యందు వచుధ్వని కనుకరణము. "క. తెఱపలకడుపులలో నే,ట్టెఱఁ బెరిగెడుప్రోడ రేయి త్రిమ్మరి దొరపైఁ,గొఱకొఱ నూర్పులు నిగుడుచు, తెఱఁగు నగాటంపుటూర్పుఁజెమ్మెర ఁడరెన్."అచ్చ.బాల. ౭౨. విశ. కోపి; పగగలవాఁడు. "గీ...అతఁడు ...కొఱకొఱ గాకున్నె,యోట సైచునే మహోన్నతుండు." హరి. ఉ. ౭, ఆ. ౧౯.

కొఱకొఱలాడు. దే. అ. క్రి. (కొఱకొఱలు+ఆడు.) కోపాదులచే విసుగుకొను. "క. బిఱబిఱవిభుకడ కరుగక,కొఱకొఱలాడెద వదేమి..." రసిక. ౫, ఆ. ౧౬౩.

కొఱగానివాఁడు. దే. విశ. (కొఱ+కానివాఁడు.) ప్రయోజనకారి కానివాఁడు, అప్రయోజకుఁడు. ఆం. భా. ద్వి. ౨౭.

కొఱగామి. దే. వి. (కొఱ+కామి.) 1. పనికిమాలినతనము. "క. కొఱగానికొడుకు పుట్టినఁ,గొఱగామియె కాదు తండ్రిగుణములఁ జెఱచున్..." సు. శ. ౪౧; 2. చెడ్డపని. "క. వెఱవక కలలోఁ జేసిన,కొఱగామికి వగచుచోట గుణరత్నము చే, కుఱె..."ఉ. హరి. ౫, ఆ. ౧౪౩; 3. దౌష్ట్యము. "క. ఎఱుఁగుదు నేను సుయోధను,కొఱగామియు ..." భార. ఉద్యో. 3, ఆ. ౨౩౭; 4. దోషము. "క. ఇక్కొఱగాములలోపల, నొక్కటి నీచిత్త

వృత్తి నొందెనొ..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౧; 5. హాని. "వ...చంద్రపతీగుణనతుల కేమి కొఱగామి సంఘటిల్లునో యని తలంకెద..." ప్రభా. ౪, ఆ. ౨౨; ౬. దుర్నిమిత్తము. "ఉ. ఏకొఱగాము లైన మము నింత యెఱుంగక మించి వచ్చునే." రామా. ౭, ఆ ౬౯.

కొఱడు. దే. వి. ఔ. (త. కుఱడు.) 1. స్థాణువు. "వ...నిరుద్ధంబు లగుమనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి యన్నాహారంబులు వర్జించి కొఱడు చందంబున." భాగ. ౧, స్కం. ౩౨౪; 2. ఆయుధవిశేషము, కొఱడుకోల. "ఉ. భూరిధృతిం బసిండిజలపోఁతకటార్లుఁ గొఱడ్లుఁ బూని..." కళా. ౮, ఆ. ౯౯; 3. స్తంభము. "సీ. ఒకచోఁ దగుల్పడె నుపకార్యకొఱటికిఁ బరమైనరోహిణీ తారకంబు." కాశీ. ౧, ఆ. ౧౩౮. విణ. మూర్ఖుఁడు. "క...హంసడిభకులు, కొఱవిం దల బఱికి కొన్నకొఱడులు గారే." ఉ. హరి. ౪, ఆ. ౧౦౬.

కొఱడుకోల. దే. వి. (కొఱడు+కోల.) ఆయుధవిశేషము. "చ. కొనలు మొనల్పడం గొఱడుకోలవిధంబున..." చంద్రా. ౨, ఆ. ౯౫. (శ. ప. పా. 'కొరడుకోలు' ముద్రి.)

కొఱడుపాఱు. దే. అ. క్రి. (కొఱడు+పాఱు.) కొయ్యపాఱు, తిమురుపట్టు. (శ. ర. బ్రా.)

కొఱడువడు. ద్వి. అ. క్రి. (కొఱడు+పడు.) మ్రానుపడు. "సీ...కొఱడువడుట..." అప్పు. ౨, ఆ. ౧౯౬.

కొఱనవ్వు. దే. వి. (కొఱ+నవ్వు.) మందహాసము, చిఱునవ్వు. "సీ. కొఱనవ్వు కపురంపుఁగ్రోవియౌనన నేల గొనబువెన్నెలరాశి యనఁగరాదె." బహు. ౫, ఆ. ౫౨.

కొఱను. దే. వి. ఔ. 1. బీను, విపీతము. ఆం. భా. ద్వి. ౬; 2. వనము, అడవి. "క. సరసీరుహసంభవుచే,నరకుం దేవరము వడసి సమ్మినవాఁడో,పురములు గైకొని కొఱఁకుల,తెరువులఁ బట్టించె నన్ను దిక్పాలకులన్." ఉ. హరి. ౧, ఆ. ౧౬౯.

కొఱపము. వై. వి. (సం. క్షురప్రః.) గుఱ్ఱమును తోమెడునొకానొకసాధనము. ఆం. భా. ద్వి. ౧౯౯; హంస. ౫, ఆ. ౪౧.

కొఱప్రాణము. మి. వి. (కొఱ+ప్రాణము.) కొన యూపిరి,కుట్టుసుఱ. "క. జుఱజుఱుకని నెత్తురు వెలి,కుఱుకుచు రొదసేయ నఱితియొడపిన యూప్పల్,పఱవ మిడిగ్రుడ్ల వడఁకుచుఁ,గొఱ ప్రాణముతోడఁ దన్నికొనునమ్మొదవున్." ఆము. 3, ఆ. ౩౩.

కొఱమాలు. దే. అ. క్రి. (కొఱ+మాలు.) 1. పనికిమాలు. "క...,కొఱమాలినయెఱుక లెఱిఁగి కొందఱు నీపే,రెఱిఁగియుఁ దలఁపఁగ నొల్లరు..." భాగ. ౧౦. స్కం. పూ. ౯౪; 2. దయమాలు, క్రూరమగు. "సీ. కొఱమాలి విస మిడ్డకఱకు రక్కసిఁ జెండి..." సిలా. ౧, ఆ. 3; 3. సౌందర్యహీనమగు, వికృతమగు. "సీ...కొఱమాలినట్టి దృగ్గోళకములుం." కాశీ. 3, ఆ. ౧౩౮.

కొఱముట్టు. దే. వి. (కొఱ+ముట్టు.) ఉపకరణము, పనిముట్టు. (శ. ర. వా.)

కొఱలు. దే. అ. క్రి. 1. ఉండు. "గీ...ఒకపర్ణశాల గావించి యచటఁ, గొఱలె నారాచసింగంపుఁగొదమవోయి." రామా. ౫, ఆ. ౬౫; 2. వెలుఁగు. "సీ. క్రుంకుగుబ్బలిఁ బుట్టి కొఱలుచుఁ గడలవెంబడిఁ బ్రాకు సెరగలిమంట లనఁగ." అచ్చ. అయో. ౧౩; 3. అతిశయించు. "సీ...కొఱలంరజస్తమోగుణములందు, వర్తించునీపాప వర్తికి..." భాగ. ౬, స్కం. ౪౪౦; 4. ఒప్పు. ఆం. భా. తృ. ౮౨; 5. నిండు. "సీ...కొఱలుట నిండుట..." అప్పు. ౨, ఆ. ౧౯౭; 6. పగగొను. "క. పిఱుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతిబలం,బుఱని తెగువ ముందటఁ బెన్గొఱలుట చిత్తమునఁ బెట్టుకొని విహరించెన్." భార. స్త్రీ. ౨, ఆ. ౮౭. స. క్రి. 1. కామించు, వలచు. "గీ...అప్సరస్త్రీని యొకర్తు, గోపకామినీరూపయై కొఱలి యతని,వలన గర్భంబుఁ దాల్చె నీశ్వరునియాజ్ఞ." హరి. ఉ. ౨, ఆ. ౧౧౬; 2. అభిలషించు,కోరు. "చ...సనా,తన మగు మోక్షముం గొఱలి తా విడుచున్ గృహధర్మవర్గమున్." భార. శాం. ౫, ఆ. ౩౧౦; 3. పొందు, పడయు. "క...కొఱఁత పడక యుండి నడపి కొఱలుము శుభమున్." హరి. పూ. ౧, ఆ. ౧౭౧.

కొఱలుకొను. దే. అ. క్రి. (కొఱలు+కొను. స్వార్థమున.) శోభించు, ఒప్పు. "సీ. కలయుంగఁ గుముదినీకుల మెల్ల నభినవకోశసంపత్తిచేఁ గొఱలుకొనఁగ." కవిక. ౪, ఆ. ౧౯౭.

కొఱప. దే. వి. ఒకానొకకొండజాతి. (శ. ర. బ్రా.)

కొఱపత. దే. వి. (కొఱప+త.) కొఱపజాతిస్త్రీ. (శ. ర.)

కొఱవి. దే. వి. 1. కొఱకంచు. "క...హంసవిభకులు, కొఱవిం దల బఱికికొన్న కొఱకులు గాక." ఉ. హరి. ౪, ఆ. ౧౦౬. భార. అర. ౬, ఆ. ౨౨౬; 2. నిప్పు. "సీ. అరిభయంకరలంక యంబేదకొంపయే శోధించుకొని పోయి కొఱవిఁ జూడఁడ." రామా. ౭, ఆ. ౭. పా:—కొఱవితోఁ దలగోఁకుకొను = ఎఱిఁగియే కీడు తెచ్చుకొను. భార. అర. ౫, ఆ. ౨౦.

కొఱవికోల. దే. వి. (కొఱవి+కోల) ఆగ్నేయాస్త్రము. (చూ. కొఱ్వికోల.) [(శ. ర.)

కొఱవిచీమ. దే. వి. (కొఱవి+చీమ) పెద్దయెఱ్ఱచీమ.

కొఱవిదయ్యము. ద్వ. వి. (కొఱవి+దయ్యము.) 1. పిశాచభేదము. "గీ. గగన మచురుద్రభూమి నేక తమ తినుగు, నదరు లఁమి సెడుకొఱవిదయ్యంబు వీఁడె" నైష. ౭, ఆ. ౧౨౭; 2. కొఱవిరూపమునఁ గాన నగుదయ్యము. "ఆ. మఱచి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి, యగ్నిఁ గోరి వెంట నరుగుమాడ్కి." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౧౬౭.

కొఱవిదాలుపు = కొఱవిదయ్యము. వేంక. దేవ. ౨౪.

కొఱవోవు. దే. అ. క్రి. (కొఱ+పోవు) తెల్లవోవు, నిశ్చేష్టతనందు. "వ... బ్రహ్మమాటలకుం గొఱవోయినవాణి యేమిటం దేఱె .." భార. అశ్వ. ౨, ఆ. ౨౨.

కొఱసంది. ద్వ. వి. (కొఱ+సంది) ఆయము, జీవస్థానము. "క. పఱతెంచి కరి మదము నే, ర్తెఱఁ దొండం బెత్తి వ్రేయ దెప్పఱికమునకో, గొఱసంది డాఁకి నేలకు, నొఱగిన సింగంపుఁగొదమ యొ ప్పమరంగన్." నిర్వ. ౧౦, ఆ. ౭౯. భార. విరా. ౨, ఆ. ౩౫౧.

కొఱికికొను. దే. స. క్రి. (కొఱుకు+కొను. స్వార్థమున.) 1. (ఊడిపడునట్లు) కఱచు. "ఆ... అతనిచెవులు గూబ లంటఁ బెఱికి, ముక్కు గొఱికికొని దుముక్కునఁ దనసేన, సరసి కుఱికి రామచంద్రుఁ గాంచె..." రామా. ౯, ఆ. ౧౪౯; 2. (కోపాదులచే) పండ్లు పటపటలాడించు. "సీ...కోకిలాక్షుఁడు పండ్లు గొఱికికొనియె, అగ్నిజిహ్వుండు ఘోరాట్టహాసము సేసె..." కాశీ. ౭, ఆ. ౩౧.

కొఱుకు. దే. స. క్రి. (క. కొఱుకు.) 1. కఱచు. "గీ. పటపటఁ గపాలపంక్తులఁ బగులఁ గొఱికి." స్వా. ౪, ఆ. ౧౧౩. కుచేల. 3, ఆ. ౫౨; 2. పండ్లు పటపటలాడించు. (చూ. కొఱికికొను.); 3. అపహరించు. "క. విటతాటకి యచలం జేయం, సటలం బడి సొక్కి సొక్కి సవమవమై తా, నటు నిటుఁ బోవను జాలక, చిటిముడిచేఁ గాసు లెల్లఁ జెల్లఁగఁ గొఱికెన్." మల్హ. ౩, ఆ. ౧౨. వి. 1. ఆహారము, ఎర. "సీ...కొక్కుగుంపుల కిడ్డకొఱుకు లనఁగ." చంద్రా. ౫, ఆ. ౫౨; 2. తినుట. "గీ. కొఱుకునకు లేక మూషకకోటి చేర, కునికి..." శుక. ౩, ఆ. ౨౪౫; 3. మేహరోగవిశేషము. (శ. ర.)

కొఱుతనుఱుకు. దే. అ. క్రి. (కొఱుతన్+ఉఱుకు.) 1. తలకు మించినపని చేయు, అతిసాహసమొనర్చు. "ఆ. కొఱుతకుఱుకుఁ గాని కొడుకు కెన్నఁడును గార్యతంత్రమునకుఁ జొరఁడు..." భార. స్త్రీ. ౧. ఆ. ౧౭. హరి. పూ. ౭, ఆ. ౨౯; 2. కొఱ్ఱున దిగఁబడు. (వ్యు.) విశే. 1. క్రూరుఁడు. "ఆ. చెలువ మగని దిక్కు చేసన్నఁ జూచి యా, కొఱుతనుఱుకు ముక్కు గోసె ననియె." విక్ర. ౭, ఆ. ౧౬౦; 2. దుష్టబుద్ధి. "వ...నీచెప్పెడి ధర్మంబులు కౌరవులకుం జెప్పవలవదా వారలు గదా మీఁ దెఱుంగక కొఱుతనుఱుకులై చెడు తెరువునం బోయెడువారు..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౩; 3. సాహసికుఁడు. "గీ. చుఱుకు చూపునఁ గాలిన కొఱుకనుఱుకు." కాళ. ౩, ఆ. ౭౧.

కొఱ్ఱ. దే. వి. 1. ప్రియంగువు, ఒకానొకసస్యము. ఆం. భా. ద్వి. ౭౩౪. "ఆ. కొఱ్ఱగింజ నోరఁ గొఱికియు నొక ప్రొద్దు, చెఱచు నన్నవిధము..." కుచేల. ౧, ఆ. ౫౨. ౨. ధాన్యవిశేషము. "సీ... కొఱ్ఱలు చామలు..." హంస. ౪, ఆ. ౧౨౭ 2. మత్స్యవిశేషము. ఆం. భా. ప్ర. ౧౬౦. హంస. ౪, ఆ. ౧౮౭.

కొఱ్ఱు. దే. వి. ఔ. (దీనిబహువచనరూపములు: కొఱ్ఱులు, కొఱులు, కొఱ్డు. రూపాంతరములు:— కొఱితిన్, కొఱ్తిన్, కొఱుతన్, కొఱ్తన్. మొ.) **1.** ముల్లు. "క. సొలయక తూనిఁగలం గొఱ్ఱులఁ బెట్టితి నీవు..." భార. ఆది. ౪, ఆ. ౨౭౦; **2.** ఇనుపముల్లు. "సీ. లికుచావళికి వృత్తలీల చెన్నగుఁ గాక బొంగరంబులఁ గొఱ్ఱఁ బూన్పవలదె... గీ...తెఱపపాలిండ్లతోడ వాదించెనేని." పె. శకుం. ౨, ఆ. ౭౫; **3.** మేకు. "చ...ముల్లు వుచ్చి కొఱ్ఱడిచినచంద మయ్యె..." స్వా. ౩ ఆ. ౩౪; **4.** శూలము. "సీ...యదువృష్ణిభోజాంధకవీరవరులఁ, గొఱ్ఱుల నిడుఁడు..." వి. పు. ౭, ఆ. ౪౧౩. విజ్ఞా. ప్ర. ౧౦౪.

కొల. దే. వి. (క. కొలె. త. కొలై.) **1.** వధ, హింస. "చ. మనసిజ దోస మాఁడుకొల మానఁ గదయ్య తలంచి మ్రొక్కెదన్." చంద్ర. ౪. ఆ. ౯౪; **2.** పాపము. "క. తొలుజన్మంబునఁ జేసిన,కొలయును బాపంబుఁ గట్టి కుడుపక యున్నే." పా. ౨, ఆ. ౩౩; ౧౦౨; **3.** పగ. "ద్వి...దశరథాత్మజుని, గొలిచితి బంటనై కొల యాఁగనైతి, చలమున నీతండ్రిఁ జంపినాఁ డతఁడు." రం. రా. యు. ౩౪౭. పు; **4.** బాధ, ఆర్తి. "క. నిలుకొల నిలువనీయక, కలుషాత్ముఁడు బాధపెట్టఁగా విధి నాత్మన్, బలుమాఱు దూఱుఁ గోమటి,కొల యెక్కడఁ గలిగె నఁచుఁ గుందుచు నాత్మన్." మల్హ. ౩, ఆ. ౭౯; **5.** (కొలుచు. ధా.) కొలత. (వా. చూ. కొలకోలు.)

కొలఁకు. దే. వి. చెఱువు. "మ...ఆకాశంబునన్ రెండుగా,కులు..., కలహంసం బాడి కొలంకులోనఁబడి లోకం బెల్ల వీక్షింపఁగాఁ, గలహంసత్వమునొందె..." కాశీ. ౬,ఆ. ౧౮౭. ఆం. భా. ప్ర. ౧౬౩.

కొలఁకువు = కొలఁకు. "శా...కొలంకువు గలంకం బొందఁగాఁ జొచ్చి..." భాగ. ౯ స్కం. ౧౧౧, కృ. శకుం. ౨, ఆ. ౧౬౬.

కొలఁది. దే. వి. **1.** పరిమితి. "ఆ. కొలఁదిమీఱు కుడుపుఁ గుడువమియును." భార. అను. ౫, ఆ. ౨౬౩. శాం. ౬, ఆ. ౨౭౧; **2.** అవధి. "క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁదిఁ గడచి వచ్చితిమి..." భార. విరా. ౪, ఆ. ౯౩; **3.** బలము. "ఆ...తనచేతి; కొలఁది సూపి క్రీడి సెలఁగి..." భార. విరా. ౫. ఆ. ౬౬; **4.** గొప్పతనము. "క...ఈలతాంతము, కొలఁదులు సెప్పంగ నిచ్చ క్రొత్తలు సుమ్మీ." పారి. ౧, ఆ. ౬౩; **5.** స్థితి. "వ...వగచుకొలంది కడ చనియె ధీరుఁడవై వార్తల నవధరింపుము." భార. శల్య. ౧, ఆ. ౧౦౯; **6.** విధము. "సీ. వెడత్రోవ మును చెప్పి వడి నవ్వఁ దిరుగునవ్వగు కొలందినె యపత్రపయు మరల." ఆము. ౪, ఆ. ౧౬౩. విశే. **1.** పరిమాణము గలది. "క...చెప్పెడుకొలఁదియె వాని కరుణపెంపు కుమారా." భార. విరా. ౫, ఆ. ౨౧౬; **2.** సమానమైనది. "గీ...లెక్కనకొలఁది సచివుఁ,డింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు." దశ. ౧, ఆ. ౯౩; **3.** అల్పము. "క. కొలఁదియె గంగాతిశయము గుణరత్ననిధీ." జాహ్నవీ. ౩, ఆ. ౭౨; **4.** సాధ్యము. "చ... దానితెఱం గెఱుఁగంగ బ్రహ్మకుం,గొలఁదియె...." భార. సభా. ౧, ఆ. ౭౯.

కొలఁదియిడు. దే.స. క్రి. (కొలఁది+ఇడు.) లెక్కించు. "క. కొలఁదియిడరానిశరతతిఁ,బొలివోవక దేవ శిల్పిఁ బొదివిన..." హరి. ఉ. ౧౦, ఆ. ౬౬.

కొలఁదివెట్టు. దే. స. క్రి. (కొలఁది+పెట్టు.) **1.** గణించు. "క...శ్రీ,హరిమాయాగుణవిభూతు లగుఁ బలనిధులుం,బరగినదీవులు వర్షము,లరయంగాఁ గొలఁదివెట్ట నలవియె జగతిన్." భాగ. ౫, స్కం. ౨, ఆ ౧౬. భో. ౪, ఆ. ౨౪౦; **2.** తక్కువ చేయు. "సీ. పాండవుల నడిసన్న యొడళులలెక్క యమ్ములపెంపు గగనంబుఁ గొలఁదివెట్టె." భార. విరా. ౩, ఆ. ౧౬౭.

కొలఁదివేరు. దే. వి. (కొలఁది+వేరు.) వట్టివేరు; అల్పతృణము. "సీ...అరఁటి,మోసుల వీజనంబులు సేయుఁ గొలఁదివేళ్లిరవుగాఁ గూర్చి చామరలు సేయు." కు. సం. ౫, ఆ. ౧౩౯.

కొలకనఁగోడి = కొనకొనఁగోడి. దే. వి. కుక్కుటవిశేషము. "చ. పొలఁతుక క్రిందుమీఁ దగుచు భూషణతూర్యనినాద మొప్పఁగాఁ,గొలకనఁగోడ్లు లావుకలుఁ గోకిలముల్ కలహంసముల్ శిఖావళములుఁ బారువాలు నలువంకఁ బ్రతిధ్వను

లీయ లీయమై, గౌరవముల్ ఘటించె రతికాంతర కాంతరశంఖఘంక్కృతిన్." దశా. ౮, ఆ. ౨౩౬.

కోలకోల. వై. వి. (సం. కలహః.) 1. కిటకిట. "చ. కోలకోలమంచు నుండుసితకోకనదప్రభవప్రసూత నా, కోలునిచి తొంటినాఁ డపితికోటుసంపడి..." వైష. 3, ఆ. ౧3. (కోలకోలమను = కిటకిటలాడు.); 2. పక్షులమొ. వాని ధ్వని కనుకరణము. "చ...కోలకోలఁ గూయు...కోక దంపతుల్." స్వా. 3. ఆ. ౬౨.

కోలకోల. దే. వి. (కోల+కోల.) కోలకఱ్ఱ, మానవం డము. "సీ. ఈవార్ధివిస్తార మింతయా నని నల్వ కొల్చి తివ్వనికోలకోల యనఁగ...గీ..., నేతుఁ బొనరించితివి నాఁడు భూతలేంద్ర." సుద. ౧. ఆ. ౧౧౨.

కోలగాఁడు. దే.వి. (కోలత+కాఁడు.) (ధాన్యాదులు) కొలుచువాఁడు. (శ. ర.)

కోలగారము. దే. వి. 1. ధాన్యముకొలత కిచ్చెడుకూలి. (శ. ర. బ్రా.); 2. కొలత. (బ్రా.)

కోలత. దే. వి. (కొలుచు. ధా.) 1. పరిమాణము. (శ. ర. వా.); 2. (ధాన్యాదులు) కొలుచుట. (శ. ర. వా.)

కోలనాడు. ద్వ. అ. క్రి. (కోలను+ఆడు.) 1. స్నానము చేయు. "గీ. మేనిలేనియ నించినమెట్టతమ్మిఁ, జేరి కోలనాడి ప్రస్ఫాడిపేరికత్న, బొనఁగ నవ్వలి క్రొవ్విగిపురిటియిల్లు, వింతనాఁ డెందుఁ దేఁటిబాలెంత కంటె." కువల. 3, ఆ. ౧౨౫; 2. తీర్థయాత్ర కేఁగు. "సీ పిత్రృవనంబున హాకఁ బలివిమానము వెంటఁ గై నేసి కోలనాడఁ గదలుఛంగి." కాశీ. ౨, ఆ. ౮౬.

కోలను. వై. వి. బొ. (సం. కూలమ్. త. కుళమ్.) 1. చెఱువు. "సీ. మరకతశైవలోత్కరముల విలసిల్లఁ గొల నని సన్మణిస్థలము చూచి." భార. సభా. ౧, ఆ. ౧౨. "గీ. కొలనఁ గరిదంపతులు పద్మకళిక లొకటి, కొకటి యొసెత్తి మకరంద మొలుక..." ఆము. ౪, ఆ. ౧౭3; 2. చిన్నగుంట. "గీ. కాయ మొనరింప జలకంబుఁ గాచఁ గెలనఁ, గొలను ద్రవ్వింప..." ఇాము. ౨, ఆ. ౫.

కోలపగ. ద్వ. వి. (కొలము+పగ.) కులశత్రుత్వము, జాతివైరము. "క. తీరనికొలపగయుంబలె, నీరమణి మణికి నాపు నెపయము..." వేం. పంచ. 3 ఆ. ౧౯౫. శుక. ౨ ఆ. ౨౮౪.

కోలపగతుఁడు. ద్వ. వి. (కొలము+పగతుఁడు.) జాతి వైరి; గర్భశత్రువు. "క... కొలపగతురగాశె యూపకులు లాభులకున్." పం.పంచ.౩,ఆ.౧౪౧.

కోలపెట్టు. దే. స. క్రి. (కొలత+పెట్టు.) కొలుచు. "వ...నీరిమొదలినలము కొలపెట్టరాదు..." వరాహ. ౧౨, ఆ. ౪౩.

కోలము. వై. వి. (సం. కులమ్.) 1. వంశము. "గీ. మానికం బవు గద కూచిముంచికొలము.నం దరయ..." నీలా. ౧, ఆ. ౧౫; 2. సజాతీయప్రాణి సముదాయము. "సీ. కలకలఁ బలుక్కచిల్కల కొలంబులఁ జాల నలసపోన్నల మూఁగి యలరు లాఁగి." య. ౪, ఆ ౧౫.

కోలవేరు = కొలఁదిపేరు. "క. కొలవేసలు నెలమూఁదులు..." కు. సం. ౫, ఆ. ౧౪౯.

కోలసామి. వై. వి. (కొలము+సామి.) కొలముసామి, జాతిపెద్ద. "క. ఆది యొకనాఁ దంబరముననబని వేలు బకాదివారికఘులు సనఁగా, నచె నాకొల సాములు వో, యెంద ఒని యడ్డముగఁ బాజి..." కేయూర. 3, ఆ. ౧౫౦.

కోలారకము. దే. వి. కొలత. పేంక. మాన. ౭౦. (శ. ర. పా. 'కొలారికము' ముద్రి.)

కోలారము. దే. వి. కొల్లారము. (శ. ర.)

కోలారికము. దే. వి. ఒంటిపోరుమల్లులకుఁ గైదువు లేర్పఱుచుట. ఆం ధా. స్వి. ౨౦౬. "సీ. ఈ లేమఁ నిండిమే నెప యూఁర గల్గినహారికిఁ గొలారిక మంపరాదె." సాని. ౧, ఆ. ౭౫. (కొలారిక మంపు = పోరునకు రమ్మని కటారి నంపు.)

కోలారు = కొలారము. (శ. ర.)

కోలారుబండి = కొల్లారుబండి. "సీ. కండోపకండమై గండోపలము లుండుపథములందుఁ గొలారుబండ్ల నాఁకి." శుక. ౧. ఆ. ౨౭౦.

కోలికి. దే. వి. 1. కంటికొన. "ద్వి. కొలుకులు రెండు నంగళములు నదుకఁ, గలయఁగఁ గన్నెఱ్ఱఁ గొలుకులై కాటె, నక్కను గొలుకులు నఱచేత మూయఁ, బక్కిల్లఁ బిండుచు పాటుంగఁ దొడఁగె." బస. 3, ఆ. ౭౭౮. పు; 2. ముక్కు నంటిన కంటిమూల. (చూ. కొల్కి.); 3. కొక్కెము.

"సీ. ఘనకిరీటంబులు గట్టిగా సవరించి కలితమండలముల కొలుకు లదిమి." దశా. ౨, ఆ. ౧౮౩; 4. బంధము. "క. పలుకుల నగవుల నడపుల, సలుకల సిపఠాకనముల నాగ్నీసవధూ,సులముల మనములతాలిమి,కొలుకులు వదలించుఘనునిఁ గొలిచెద మనికొఁన్." భాగ. ౧, స్కం. ౨౨౪; 5. కంఠము. ఆం. భా. ద్వి. ౧౪౧; 6. పరిపాకము. "వ...ఇప్డఱసు నీడయి యున్నది. కార్యంబును గొలికికి వచ్చినది..." పీఠ. 3, ఆ. ౯౪; 7. వశము.లొంగుబాటు. "ద్వి. నిను నే దుఃఖమున నెత్తుక ప్రామి,కొని గుల్లపఱుపక కొలికికి రావు." ద్వి. హరిశ్చ. ఊ. ౧౬౮. పం.

కొలికిచెప్పు. దే. వి. (కొలికి+చెప్పు.) కొలికి గలచెప్పు, పాదరక్షావిశేషము. "సీ...కొలికిచెప్పులు జమ్మిగూడలు..." శుక. ౨, ఆ. ౯౪౯.

కొలికిపూస. దే. వి. (కొలికి+పూస.) కొలికికిఁ దగిలించెడుపూస. (చూ. కొల్కిపూస.)

కొలికిముడి. దే. వి. (కొలికి+ముడి.) జాఱుముడి. (శ. ర. బ్రౌ.)

కొలిపించు. దే. స. క్రి. (కొలుచు. ధా. ప్రే.) 1. ధాన్యాదులు కొలువఁజేయు. (శ. ర. వా.); 2. సేవింపఁజేయు. "వ...కులగురుం డగుసమ్మందాకినీనందనుండు వారి నభినందించి కొలిపించుకొని యుండె..." భార. భీష్మ. 3, ఆ. ౪౨౦. అ. క్రి. నట్టువుఁడు కొనుగోలు చేయు. (శ. ర.)

కొలిమి. దే. వి. (క. కొలిమె.) కమ్మరిమొ. లోహాదులు కాల్చెడునిప్పుగుంట. "సీ. కోపంబు గదిరిన కొలుముల కెన యైనకన్నుల నిప్పులు గడలు కొనఁగ." భా. రా. యు. ౧౩౨౯. మార్క. 3, ఆ. ౩౧౯.

కొలిమితిత్తి. దే. వి. (కొలిమి+తిత్తి.) కొలిమి యూఁదెడితిత్తి, భస్త్రి. ఆం. భా. ద్వి. ౨౯౯.

కొలివెపిట్ట. దే. వి. ఒకరకపు తెల్లమచ్చలుగల పక్షివిశేషము. (బ్రౌ.)

కొలుచు. దే. స. క్రి. 1. కొలతవేయు. "ఉ...అప్ధూటిక్రాల్గన్నులు చేరలం గొలుచుకైవడి..." నైష. ౮, ఆ. ౩౯. హర. ౧, ఆ. ౨౩; 2. సేవించు. "క. ధరణీశ్వరుఁ డమ్మునివీరు...భక్తి వదలక కొలిచెన్." భార. సభా. ౧, ఆ. ౧౩౯. భాగ. ఆది. 3, ఆ. ౧౧౦; 3. ధ్యానించు. (చూ. కొల్చు.); 4. నమస్కరించు. ఆం. నం. మాన. ౩౧. వి. 1. ధాన్యము. "క. కొలు చపహరించు నన్నరుఁ డెలుకయుఁ బందియును నైనయాదుర్జననం,బులఁ బొందు..." భార. అను. ౪, ఆ. ౨౬౧. ఆం. భా. ద్వి. ౨౩౬; 2. పరి. "క. కొలుచు యపలు నెసగలు..." మార్క. ౨, ఆ. ౧౧౪.

కొలుపు. దే. అ. క్రి. 1. ఇష్టపడు. "క. కావున నిపుఁ జెడ బాయఁగ,నో విహగవరేణ్య కొలుప దుర్లంబు..." కళా. ౨, ఆ. ౧౭౯; 2. ఇష్టమగు. "క. ఈ పేదమాట లెల్లను,గోపవివశుఁ డైన నాకుఁ గొలుపవు..." భార. అను. ౧, ఆ. ౧౧; 3. చెల్లు. "ద్వి. తక్కువ నీవట్టితానకంబులును, గొలుపవు మాయెడఁ గుటిలవిచార." ద్వి. హరిశ్చ. పూ. ౧౧౮౭. పం; 4. నట్టువుఁడు కొలిపించు. (శ. ర.) స. క్రి. (కొను. ధా. ప్రే.) 1. పురికొలుపు. "క. అలిగి దశార్ణాధీశుఁడు,కొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము..." భార. భీష్మ. 3, ఆ. ౧౯౧. రాఘవ. ౪, ఆ. ౧౨౧; 2. పుట్టించు. "సీ. తపనమండలము శస్త్రపరంపరలఁ గప్పి కదన మంతయును జీకట్టు గొలుప." జై. ౨, ఆ. ౭౦; 3. కనుగీటు. (చూ. కనుగొల్పు.); 4. వ్యాపింపఁజేయు. (చూ. కొల్పు.) వి. 1. సేవ. "గీ. హరి యొకండ జగత్కర్త యఖిలభర్త, విశ్వసంహర్త భోక్త వివేకయోక్త, తలఁపుబలుపును గొలుపును దెలుపు నతని,దెసన కావింప నగు నొండుదిక్కు వోక." నృసిం. ౪, ఆ. ౧౦౩; 2. వందనము. సాం. ని. మాన. ౨౯; 3. జాతర. ఆం. భా. ప్ర. ౧౪౩.

కొలువడి. దే. వి. (కొలుచు. ధా.) కొలత. వేంక. మాన. ౭౦. [(శ. ర.)

కొలువాసము. దే. వి. మత్స్యవిశేషము, రాజీవము.

కొలువు. దే. వి. 1. సేవ. "చ...ఏ,వపుఁ గొలు వైన నాకు నిలువక మది గొల్పదు..." భార. విరా. ౧, ఆ. ౧౯౭. ఆం. భా. ద్వి. ౨౨౮; 2. ఆస్థానము. "క...అతఁడు కటకటఁబడి య,క్కొలువు వెడలిపోయెన్..." భార. ఉద్యో. ౪, ఆ. ౮౦. ఆం. భా. ద్వి. ౧౭౧. 3. చోటు. "క. ఫాలఁతి

సుపుత్త్రయుం నిడుమకుఁ,గొలువుగ నట్టడవిలోనఁ గొడుకుం గాంచెన్." దశ. ౨, ఆ. ౯౦.

కొలువుకాఁడు. దే. వి. (కొలువు+కాఁడు.) సేవకుఁడు. (శ. ర.)

కొలువుకూటము. దే. వి. సభామంటపము. భార. ఉద్యో. ౪, ఆ. ౧౩౭. ఇట్లే: కొలువుసాలము.

కొలువుగొను. దే. స. క్రి. (కొలువు+కొను.) 1. సేవింప నిచ్చు,సేవ చేయ ననుమతించు. "వ... మునీంద్రా! నన్నుం గొలువుగొని మీరిందు నిలుచుట మా కెల్లపురుషార్థంబులు..." దశ. ౧౧, ఆ. ౫౮. భార. విరా. ౧, ఆ. ౨౨౪; 2. సభదీర్చు. "క...ప్రజ గొలువుగొనన్, గించిదవశిష్టముగ నే,తెంచెఁ దరణి గగనమధ్యదేశంబునకున్." సాంబో. ౨, ఆ. ౩౭.

కొలువుడుకాఁడు = కొల్వుడుకాఁడు. (శ. ర.)

కొలువుసేయు. దే. అ. క్రి. (కొలువు+చేయు.) 1. సభచేయు; నివసించు. "గీ. భోగిసభ మైన గేదంగి పూవునకును, వగచుమదిఁ గొన్ని బంధుజీవకలతాంత, గుచ్ఛములలోన నొకకొన్ని కొలువు సేయుఁ,జేటు లఖిలర్తుమయవనీ వాటిఁ గమిచి." పాండు. ౧, ఆ. ౧౮౧; 2. సేవ సంపాదించు. "క. కని కొలువు సేసికొని మా,లిని నాఁ జని సాధ్వి యిది మలీమసవృత్తం,బున పొంతఁబోవ దెన్నఁడు, నను వ్రేకఁదనంబు దోఁచునట్లు చరింతున్." భార. విరా. ౧, ఆ. ౧౦౬.

కొలె. దే. అవ్య. ద్రు. 1. మొదలుకొని. "శా... భూపాలుఁ డా,రామక్షోణికిఁ జన్ననాఁటఁగొలె నిద్రాసౌఖ్యము ల్మానినాఁ,డేమో యంచు..." వసు. ౪, ఆ. ౭౬; 2. ఉండి. "చ. నృపవర పెక్కునాళ్ళ గొలె నిన్నుఁ గనుంగొన నున్నయట్టి మా,తపములు పండె..." ("...గొలెనిన్ గనకుండినయట్టి నేఁడు, మా..." వావిళ్లవారి పా.) భాగ. ౯. స్కం. ౩౧౮.

కొల్కి = కొలికి. (ముక్కు నంటినకంటిమూల.) "ఉ. కోఱలు చప్పరించి కనుఁగొల్కుల నిప్పుక లొల్క..." శుక. ౧. ఆ. ౨౬౮.

కొల్కిపూస = కొలికిపూస. "మ. పాలుపారన్ శరదంగనాతిలక మంభోజాకరంపుంబొకా, కొలికిన్ దామరకొల్కిపూస యనఁ జెన్నొందెన్..." చంద్రా. ౪, ఆ. ౩౨.

కొల్చు = కొలుచు. దే. స. క్రి. 1. కొలతవేయు. "మ...పదాంబుజం బొకటిచే క్ష్మాచక్రమెల్లం గొల్చి..." దశా. ౫, ఆ. ౧౧౪. శుక. ౨, ఆ. ౫౦౬; 2. ధ్యానించు. "ఉ...దివ్యపరాశరాత్మజాం, భోరుహమిత్త్రుఁ గొల్చి..." భార. ఆది. ౧, ఆ. ౨౨. ౪, ఆ. ౭౪. వి. 1. ధాన్యము. "గీ. నెట్టుకొని కొల్చు పోఁకకుఁ బుట్టెఁ దమ్మె." ఉ. రా. ౮, ఆ. ౧౪౧; 2. ధాన్యప్రమాణ. "క. విను మఱియలరుఁ జేసియుఁ, గొనుగతి సత్యంతసుఖముఁ గొన నగుఁ గామం,బున నధికసుఖము లొందవని, జనుసిరి దాఁ గొల్చు లేనిసస్యము కాదే." భార. శాం. ౩. ఆ. ౪౬౦; 3. పరిధాన్యము. భార. సౌ. ౧, ఆ. ౩.

కొల్త = కొలత. (వా.)

కొల్ది = కొలఁది. 1. (విధము.) "స్రగ్ధ...ఓపుత్త్రసివార్తదంభోళిరై,కాలఁగా వ్రయ్యకొల్ది నన్నెటికిన్,జాలి నొందించె..." భాగ. ౬, స్కం. ౪౫౩; 2. (పరిమితి) "మ...నెవ్వడిఁ జేకొల్దిగఁ దీసి..." నీలా. ౩, ఆ. ౧౩; 3. (బలము.) "మ... చేకొల్దులన్ మోఁది..." శ్రీరం. మా. ౩, ఆ. ౯౮.

కొల్ను = కొలను. "చ. ధర యనుకొల్నిలో మెలచు తామరపూ వన..." పాండు. ౧, ఆ. ౧౦౬. నా. పంచ. ౩, ఆ. ౧౧౨.

కొల్పించు = కొలిపించు. (సేవింపఁజేయు.) "వ... ఇవ్విధంబున సుఖం జేసి నన్నుం గొల్పించుకొని..." భార. అను. ౧, ఆ. ౩౬౯.

కొల్పు = కొలుపు. అ. క్రి. 1. (వష్టకము.) "క. ఈయనతో రణ మిమ్మహిం,జేయఁగ మది కొల్పదు..." భార. భీష్మ. ౨, ఆ. ౨౫౨; 2. (చెల్లు.) "ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయప్రభంగులె మందు గాక ని,ర్మాయత నల్లసిల్లెదుపరాక్రమలీలలు గొల్పునెట్టు..." భార. శల్య. ౨, ఆ. ౫౨. వి. (నమస్కారము) సాం. ని.-మాన. ౨౫.

కొల్పుడుచేతులు. దే. వి. బ. (కొల్పుడు+చేతులు.) నమస్కారములు. "రగడ. చైత్రకూటమున సరసతఁ గొల్వగు,గోవిందునకును గొల్పుడుచేతులు." కూంస. ౪, ఆ. ౨౧౩.

కొల్మి = కొలిమి. "సీ. వనమహీస్థలి కొల్మి ఘనకింశుకప్రసూనంబు లంగారవారంబులు..." ప్రబంధ. ౪౪.

కొల్ల. దే. వి. (క. కొల్లె. త. కొళ్లై.) దోఁపుడు. ఆం. భా. ద్వి. ౨౨౩. ౯తి. ౩౦. విశే. అత్యధికము. "ఉ...ఫలియించెను గోటిక లెల్లఁ గొల్లగా." దశా. ౨. ఆ. ౧౫౯. కవిక. పీఠి. ౨౦.

కొల్లఁబోవు. దే. అ. క్రి. (కొల్ల+పోవు.) 1. విఘ్నమగు, చెడు. "మ...నాని వృథాజన్మము గాదె నాతపము భక్తిం జూడు గాకున్న యెట్ల విచారింపఁగ నెల్లియుక్ ప్రపమ కొల్లంబోయెనక్ జూచెదన్." కాశీ. ౨, ఆ. ౧౧౪; 2. దోఁపుడుపడు. "సీ. పాదరసంబులు గొన్నవార లేఁగిరి తోఁట లెల్లను బయలుచేఁ గొల్లఁబోయె." శుక. ౨, ఆ. ౩౬౦. [(ఆఁడుది. శ. ర.)

కొల్లకత్తె. ద్వ. విశే. (కొల్ల+కత్తె.) కొల్లపెట్టునది.

కొల్లకాఁడు. దే. విశే. (కొల్ల+కాఁడు.) కొల్లపెట్టువాఁడు. "చ. పడుచులతోడ నాడఁ బసిబాలుఁడ వావలదన్న మాన వాఁగడములు కొన్ని సేస్తివి... కొల్లకాఁడవై దుడుకులు సేయ నోరితివి..." రాధా. ౧, ఆ. ౨౭.

కొల్లకొట్టు. దే. స. క్రి. (కొల్ల+కొట్టు.) 1. కొల్లపెట్టు. (శ. ర.); 2. అధికముగా సంపాదించు. (శ. ర. బ్రౌ.)

కొల్లగొను. దే. స. క్రి. (కొల్ల+కొను.) 1. కొల్లపెట్టు. "మ. అవనిన్ త్రిదశేంద్రుచాపుబరం కన్యాగండపాళిద్వయీనవలావణ్యరసంబుఁ గొల్లగొని..." స్వా. ౫, ఆ. ౮౨; 2. అధికముగా సంపాదించు. "గీ. ఎల్లవారును మోక్షంబుఁ గొల్లగొనఁగఁ, జూడఁ జాల..." వరాహ. ౧౦, ఆ. ౧౩.

కొల్లపడు. ద్వ. అ. క్రి. (కొల్ల+పడు.) కొల్లవోవు, దోఁపుడువోవు. (చూ. కొల్లపఱుచు.)

కొల్లపఱచు. ద్వ. స. క్రి. (కొల్లపడు. ఛా.) దోఁచుకొను. "గీ. ఉప్పు పరాజక మైనత వాపసఫముఁ, గొల్లపఱచిరి కొల్లలన్ గొల్లగాను." రంగా. ౩, ఆ. ౨౬౫.

కొల్లపుచ్చు. దే. స. క్రి. (కొల్లపోవు. ఛా.) 1. దోఁచుకొను. "గీ. విపులకాంచనరత్నాదివివిధవస్తుకోటి నెల్లను నంపఁప కొల్లపుచ్చి." భాగ. ౧౦, స్కం. ఉ. ౬౨౪; 2. చెఱచు. "గీ. స్త్రీలు దుర్జనగోష్ఠి వర్జించి కులమును శీలమును గొల్లపుచ్చక..." జాహ్నవీ. ౩, ఆ. ౭౯.

కొల్లపెట్టు. దే. స. క్రి. (కొల్ల+పెట్టు.) దొంగిలించు. "మ...ఏరా కృష్ణ వ్రేపల్లెలోనను బాల్యావస్థలు కొల్లపెట్టితి..." దశా. ౯, ఆ. ౧౯౬.

కొల్లపోవు = కొల్లఁబోవు. (బ్రౌ.)

కొల్లము. దే. వి. కొండప్రభాగము. "ద్వి. కొల్లముల్ డిగ్గుచుఁ గురువు లెక్కుచును, గోవాలముల్ సొచ్చుచు నుద్ధతిఁ జనుచు, శైలముల్ ప్రాకుచు ..." పండితా. పర్వ. ౩, ౪౮. పు. ౧౮. పం.

కొల్లరి. దే. విశే. (కొల్ల+అరి.) దోఁపుడుకాఁడు. "గీ. కొల్లపఱచిరి కొల్లరు లొక్కలక్ష గాను." రంగా. ౩, ఆ. ౨౬౫.

కొల్లలాడు = కొల్లాడు. 1. (దోఁచుకొను.) "సీ. నల్లగల్వలచెల్వ కొల్లలాడుచు రూఢి కెక్కు చొక్కపుమేనిచక్కఁదనము." పరమ. ౩, ఆ. ౪౦; 2. (చక్కఁగా ననుభవించు.) "సీ. కుంతలాంచదరాశికుంత లాగరుగంధికుంత లామోదముల్ కొల్లలాడి." శశాం. ౨, ఆ. ౭౪.

కొల్లలిడు = కొల్లపెట్టు. (బ్రౌ.)

కొల్లలు గొమ్ములువోవు. దే. అ. క్రి. (కొల్లలు+కొమ్ములు+పోవు.) అత్యధికమగు, వృద్ధినొందు. "ఉ...విహితభూరిసుఖంబు గొల్లలుం గొమ్ములువోవ..." పశ. ౧౦, ఆ. ౧౧౧.

కొల్లవట్టు. దే. స. క్రి. (కొల్ల+పట్టు.) దోఁచు. "మ... ఈశ్వరభూభర్త బెడంగుకోట యువనాశ్వవ్రాతముక్ భీమసంగరరంగంబునఁ గొల్లపట్టుకొని..." వరాహ. ౧, ఆ. ౩౧.

కొల్లవిడుచు. దే. స. క్రి. (కొల్ల+విడుచు.) 1. చూఱవిడుచు, స్వేచ్ఛగా ననుభవింప నిచ్చు. "గీ... ఉన్నధనముఁ గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁ దనిసి, విడిచి రర్థంబు..." జై. ౧, ఆ. ౭౩; 2. వశపఱచు, స్వాధీనముచేయు. "గీ. కుంభ తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు." ప్రభా. ౨, ఆ. ౧౧౧.

కొల్లవెట్టు. దే. స. క్రి. (కొల్ల+పెట్టు.) 1. దోఁచుకొను. "మత్తకోకిల. ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసముం గొల్లవెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా." భాగ. ౭, స్కం. ౨౨౫; 2. అధికముగా సంపాదించు. "గీ. అఖిల

తీర్థంబులను నాడి యవనినుసుడుం,గొక్కిమైం బుణ్యలక్ష్ములం గొల్లవెట్టె." కాశీ. 3, ఆ. ౯౧.
కొల్లాటిపక్షి. మి. వి. పికిలిపిట్ట. (బ్రౌ.)
కొల్లాడు = కొల్లలాడు. 1. (దోచుకొను.) "సీ... అగ్రహారములు కొల్లాడి కాల్చి." ఉ. హరివం. ౪, ఆ. ౮౪; 2. (అపహరించు.) "మ...గొల్ల గుబ్బెతలమానం బెల్లం గొల్లాడఁడో." దశా. ౧౦, ఆ. ౮౦; 3. (అధికముగాఁ బొందు.) "క... కొల్లాడిరి కైవల్యలక్ష్మి సమయబు మునులున్" కాశీ. ౨, ఆ. 3౭; 4. (కనివితీఱ ననుభవించు) "గీ...ఇతవి, యలరుఁ బ్రాయంబు కొల్లాడు మనుచుఁ బలికె."శుక. ౪, ఆ. ౨3. [(బ్రౌ)]
కొల్లాపురి. దే. వి. కొల్హాపురము, ఒకానొకనగరము.
కొల్లాబండి = కొల్లారుబండి. (శ. ర.)
కొల్లాయ. దే. వి. చిన్నయంగవస్త్రము. (వా.) ఇట్లే: కొల్లాయగుడ్డ. కొల్లాయపంచె. మొ.
కొల్లాయి = కొల్లాయ. (బ్రౌ.)
కొల్లారము = కొల్లారు. (శ. ర. బ్రౌ.)
కొల్లారు. దే.వి. చతుశ్శాలసదుమ బయలును నాలుగు ప్రక్కల కట్టడమును గలయిల్లు. (శ. ర. వా.)
కొల్లారుబండి. దే. వి. (కొల్లారు+బండి.) కంబళివాహ్యకము, కంబళిముచేఁ గప్పఁబడినబండి. "గీ. పావలటు మీటి కొల్లారుబండి యెక్కి,దురదురన రంభ యింటికి నరిగి..." శుక. ౪, ఆ. ౨౧3.
కొల్లార్బండి = కొల్లారుబండి. ఆం. భా. ద్వి. ౨౦౧.
కొల్లి. దే. వి. వృక్షవిశేషము. (శ. ర. బ్రౌ.)
కొల్లు. దే. స. క్రి. చంపు. (బ్రౌ.) వి.=కొల్లుకట్ట. (బ్రౌ.)
కొల్లుకట్ట = కొల్లుగుంట. (బ్రౌ.)
కొల్లుగుంట. దే. వి. నీళ్లగుంట. (బ్రౌ.)
కొల్లేరు. దే. వి. ఒకానొకచిన్ననది; 2. ఒకానొక పెద్దచెఱువు. ఉదా:—కొల్లేటికొంగలు. (బ్రౌ.)
కొల్వు = కొలువు. (ఆస్థానము.) "చ...కొల్వున కేఁగుదెంచి మున్ననం బ్రజ విన్నపంబులు వినం గదవయ్య..." విక్ర. 3, ఆ. ౪౪.
కొల్వుడుకాఁడు = కొలువుకాఁడు. ఆం. భా. ద్వి. ౧౮౪.
కొవ్వ = క్రొవ్వ. (బ్రౌ. వా.)
కొవ్వెర = కొబ్బెర. (కొబ్బరికాయలోనిముక్క.) ఆం. భా. ద్వి. ౭౮.

కొస. దే. వి. 1. కొన. "సీ. మునుమును మనఁ జుట్టి కొసవెండ్రుకలు పట్టి హమ్మని యుంచియ లుపియఁ దాఁచి." కళా. ౪. ఆ. ౧౬౬. రెం. పంచ. ౨, ఆ. ౧౫౪; 2 కొంగు. "గీ. కొస డిగఁగ నీల పుట్టంబు ముడుఁగుపెట్టి" హర. ౭, ఆ. ౧౧౯. విణ. కొనచి, చివరిది. "గీ...ఇం కొక్క కొసమాట యూఁకింపు." మొ. రా. యు. ౧, ఆ. ౨3.
కొసరు. దే. అ. క్రి. 1. కూయు. "సీ. కోకిలము పంచమశ్రుతిఁ గొసరినట్లు." క్రీడా. ౧౦౧; 2. చెలరేఁగి కూయు. "సీ. పారిజాతకలతాపల్లవంబులు మేసి కొసరెను ద్యానపుంస్కోకిలములు." హర. ౭, ఆ. ౧3౫; 3. వెనుదీయు. "గీ. కొసర కగ్నిం బ్రవేశించెఁ గుసుమనాభ." కాశీ. ౫, ఆ. ౧౭౦; 4. తప్పు. "క. కోరినవర మేమి యైనఁ గొసరక యిత్తున్." భాగ. ౧౦, స్కం. ఉ. ౮3౪. స. క్రి. (క. కొసరు.) 1. కోరు. "క... పండుగను గోయకూరే, కొసరున్..." బసవ. ౫, ఆ. ౮; 2. వేఁడు. "సీ. ధవుఁ గూర్చిం గొసరు చున్నవిహాలె ముఖరాళివనరుహాస్యములఁ బద్మినులు తెలిపె." స్వా. ౫, ఆ. ౪౦; 3. కొసరడుగు. "ఉ...పుష్పముల్ కొసర కూరక యొన్నికి నల్ల నవ్వుచున్." విక్ర. ౧, ఆ. ౮3; 4. అనుభవించు. "గీ...సతిమోహముతావిఁ గొసర ..." వసు. 3, ఆ. ౮౫. వి. 1. అనులాపము, మాటిమాటికి పలుకుట. ఆం. భా. ప్ర. ౧౧౫; 2. కోరిక. "చ...ఆ,కొసరు తెలిసి గెలింగి పుచుసుంభములం బలిఁ దాల్చి..." ఉ. హరి. ౫, ఆ. ౧౨౫; 2. ప్రార్థనము, వేఁడికోలు. "గీ...అల్క పెటులు,కొసరుఁబల్కులతో గ్రుచ్చి గ్రుచ్చి యడుగ." శుక. ౫, ఆ. ౧౦. శశాం. 3, ఆ. ౯౭; 4. సరకులు కొనువానికి విక్రేత యిచ్చు పెచ్చు. (శ. ర. వా.); 5. వెనుదీయుట. "ఆ. కొడుకు సీఁగదయ్య కొసరు లేక." భాగ. ౯, స్కం. ౧౯౪; 6. విజృంభణము. "సీ...ఒంటి కన్నునం గొస రుడిపి యుండిపి."దశ. ౯, ఆ. 3౭. 7. లోపము. "మ...పొసఁగెఁ నేఁ గృతిఁ జెప్పఁగాఁ బరిమళంబుల్ చాల కొక్కొక్కచోఁ, గొస రొక్కించుక కల్గనేనియును..."పిన. శకుం. ౧, ఆ. ౭; 8. సంశయము. "ద్వి. బసవనసుజ్ఞాన

భ_క్తిమార్గముఁ,కొసరులు దీర్ప మాకును పశ మగునె.” ప్రభులిం. ౪, ఆ. ౧౦౯. పు. ౧౮. పం.

కొాస్సె. వై. వి. (సం. కుశకః) కుశ,దర్భ. ఆం. భా. ద్వి. ౭౫.

కొాల్లు. దే. వి. 1. దగ్గుటయం దగుధ్వని కనుకరణము. “సీ...కొాల్లుకొాల్లున దగ్గుచో...” విప్ర. ౪, ఆ. ౧౯; 2. బ. (సం. కుళుత్థః.) ఉలవలు. “సీ... కొాల్లగంజి...”హంస. ౨, ఆ. ౧౫౯; వేం. పంచ. ౪, ఆ. ౪౫౫.

## కో.

కో. దే. వి. 1. ఉత్సాహసూచక మగుకేక కనుకరణము. “క. కో యని తలపడ్డఁ బోరు ఘోరం బయ్యెన్.” భార. భీష్మ. 3, ఆ. ౪౦౯; 2. ఏడుపు నందలిధ్వని కనుకరణము. “చ...కో యను సేడ్పులు నుప్పతిల్లెడున్.” జై. ౧, ఆ. ౫౭; 3. కోడికోయిలలకూఁతయందలిధ్వని కనుకరణము. “గీ. కొక్కరో కోయటంచును గోల్లు కూసె.” హర. ౭, ఆ. ౧౩౭. పార్వ. ౫, ఆ. ౨౬౭. “క. కోయిల లంతయుఁ గనుఁగొని,కో యని కూయంగ ...” చిత్రభా. 3, ఆ. 3౭; 4. భయంకరధ్వని కనుకరణము. “క...కో యనుకూఁతల్,విని చేరన వికృతాకృతిఁ, గని...”శుక. ౨, ఆ. ౫3౭; 5. చాటువాఁడు వేయుకేక కనుకరణము. “ఉ... దిసాంతయోధుఁ డీచాయఁ దదీయపత్నిఁ బెలుచం బడ నీడిచికొంచుఁ బోయెడుం, గో యను మాడ్కి...”పాని. ౨, ఆ. 3౦; 6. (కొనుధా.) కొన్నియెడల‘కొనుధాతువున కాదేశముగా వచ్చునది. ఉదా:—కోవయ్య, కోకొమ్ము, కోను, కోము, కోరు, కోక, కోన్ మొ.

కోంకణ. సం. వి. ఆ. స్త్రీ. రేణుక, జమదగ్నిభార్య.

కోంకణము. సం. వి. అ. పుం. సహ్యాద్రికిని సముద్రమునకును నడుమఁ గలయొకానొక దేశము.

కోంకృతి. సం. వి. ఇ. స్త్రీ. కోం అనుధ్వని. “క... కుక్కుటములు పక్కణమునఁ గోంకృతి సలిపెన్.” రామా. ౨, ఆ. ౧౦3.

కోఁగు. దే. స. క్రి. గొఱుగు, ముండనముచేయు. ఆం. భా. ద్వి. ౧౭౭.

కోఁచే. దే. వి. పిఱికితనము. “గీ. కోఁచ యొక్కింత లేక యూరాచపట్టి.” రంగా. ౧, ఆ. ౧౬౮. విణ. పిఱికి. “ఆ. ఓరి కోఁచబంట యొక్కించుకేనియు, మగతనంబు లేక పగతుఁ జేరి.” అచ్చ. యు. ౧౬౦. ఆం. భా. ద్వి. ౨౨౧.

కోఁచేతనము. దే. వి. (కోఁచ+తనము.) 1. భీరుత్వము, పిఱికితనము. “క. అని తమదొర దూఱెడుధన, దుని మారీచప్రహస్తధూమ్రాక్షశుకాద్యనిమిషరిపుమంత్రులు మార్కొని నిలువఁగ లేక చనిరి కోఁచతనమునన్.” ఉ. రా. 3, ఆ. ౪౯; 2. అల్పత్వము, తక్కువతనము. ఆనంద. పీఠి. ౪౦.

కోఁచేవాఱు. దే. అ. క్రి. (కోఁచ+పాఱు.) భయపడు. “గీ...వేల్పురాచవారలు నాకత్తిఁ గోఁచవాఱ,నితఁ డనఁగ నెంత...” చంద్రా. 3, ఆ. 33. ప్రభా. ౨, ఆ. ౫౮.

కోఁడు. దే. స. క్రి. బియ్యము మొ. చేటలోఁ బోసి ప్రక్కవాటుగా నిటునటు త్రిప్పు. “చ...,గుసుకులు గోఁడుచుఁ వరుణుగుండియఁ దేఁడుచు ...” కళ. ౫, ఆ. ౧౨3.

కోఁత. దే. వి. (కోయు. ధా.) 1. కోయుట, లవనము. (శ. ర.); 2. హింసనము, బాధ. “ద్వి. కమలాక్షి తుచ్ఛభోగముల కాసించి, యమునిచేఁ గోఁతల కమ్మ నేనొర్వ.” ద్వి. సా. ౧. భా. ౨౮. పం.; 3. ఖండనము. “క. పెడగోఁతల నెత్తు రొలుక ...” భార. శాం. 3, ఆ. ౧౦౮.

కోఁతపట్టు. దే. అ. క్రి. కోఁత కోయ నారంభించు. (శ. ర. వా.)

కోఁతపడు. ద్వ. అ. క్రి. (కోఁత+పడు.) 1. ఖండితమగు, కోయఁబడు. “గీ. మొనసి హితమాచరించిన మిండముక్కు,కోఁతపడె ననుమాటయె గోఁచరించె.” కాశీ. ౬, ఆ. ౨౩౫; 2. హింసనందు, బాధింపఁబడు. “గీ. కాలుచేఁ గోఁతపడ లేక కడకుఁ దొలఁగఁ,గాలుచేఁ గోఁతపడఁ జేసె నాలతాంగి.” సా. 3, ఆ. ౧౨౦. (ఇది మొదటియర్థమునకు నుదాహరణమే.)

కోఁతవడు = కోఁతపడు. (నఱుకఁబడు.) “సీ.ఎచ్చోట ముచ్చిచ్చు నేడేసినాల్కలు కొండనాల్కల దాఁకఁ గోఁతవడియె.” భీమ. 3, ఆ. 3౭.

కోఁతి. దే. వి. (క. కోతి. త. కోంది.) వానరము. “ఉ...అకట కోఁతికి మానిక మేల...” దశా. ౧, ఆ. ౨౯౫. రామలిం. ౧౭. విణ. కోఁతివంటి

చేష్టలు గలవాఁడు, దుండగీఁడు. వ్యవః—వాఁడు పట్టికోఁతి.

సా:—1. నిప్పుద్రొక్కుకోఁతికి సివ మెత్తినట్లు. రంగా ౨, ఆ. ౨౭.

2. తాఁ జెడ్డకోఁతి వన మెల్లఁ జెఱచినట్లు.

3. కోఁతిపుండు బ్రహ్మరాక్షసి.

4. కోఁతికిఁ గొబ్బెరకాయ దొరకినట్లు.

5. కులమింటికోఁతి యైనను మేలు.

కోఁతికొమ్మంచి. దే. వి. (కోఁతి+కొమ్మంచి.) బాలక్రీడావిశేషము. (బ్రా. వా.)

కోఁతిగుమ్మకట్టె = కోఁతికొమ్మంచి. (బ్రా.)

కోఁతిపుల్లలు. దే. వి. బ. (కోఁతి+పుల్లలు.) మగ్గపుఁబలకదారములను మీఁదికి దగిల్చెడిపుల్లలు. (శ. ర. బ్రా.)

కోఁతిమామిడి. దే. వి. అంబాళము, కపీతము. (దీని పండ్లు కోఁతుల కిష్టము.) (శ. ర.)

కోఁదాడు. దే. వి. ఔ. తాళవృక్షవిశేషము. "సీ. ముక్కుదాడిమ బీఱ మొగలింగ కోఁదాడు..." హంస. ౪, ఆ. ౧౧.

కోక. దే. వి. 1. (పురుషుని)వస్త్రము. "గీ. అపుడు గురుభామ చిత్రాంగి యలమి బలిమి,నొడిసిపట్టినఁ బైకోక విడిచి చనియె." సా. ౨, ఆ. ౧౩౨. పరమ.౧, ఆ, ౩౬; 2. స్త్రీలుకట్టుబట్ట. "సీ. కులటలఁ గూడదు తొలఁగనీయకు పైఁట మీఁగాళ్లపైఁ గోక మెలఁగనీదు."దశా.౧౦,ఆ.౧౦౯.

కోకనదము. సం. వి. అ. న. 1. ఎఱ్ఱకలువపూవు; 2. ఎఱ్ఱతామరపూవు.

కోకటించు. దే. అ. క్రి. కో యను. "ద్వి. కూఁకటి గిఱుపుచుఁ గోకటించుచును." పండితా. పర్వ. ౪౩౯. పు. ౬. పం.

కోకము. సం. వి. అ. పుం. 1. జక్కువ; 2. కప్ప; 3. తోఁడేలు; 4. ఈఁత.

కోకిలము. సం. వి. అ. పుం. 1. కోయిల; 2. కొఱవి; 3. ఛందోవిశేషము.

కోకిలాక్షము. సం. వి. అ. పుం. ముల్లుగోరిమిడి.

కోగెల. వై.వి. (సం. కోకిలః.) పికము, కోవెల.(శ.ర.)

కోచము. సం. వి. అ. పుం. సంకోచము, ముడుఁగుట. విశే. (అ. ఆ. అ.) 1. ముడుఁగునది; 2. ముడుఁగఁ జేయునది.

కోట. వై. వి. (సం. కోటః. క. కోటె.) 1. రాజధానిచుట్టు నుండు ప్రహరి. ఆం. భా. ద్వి. ౧౨. నైష. ౨, ఆ. ౪౭; 2. చుట్టును ప్రాకారము గలిగి రాజవాసస్థాన మగుప్రదేశము. "సీ. కోట యేకుఱ కెప్పుఁ బాటించి..." భార. శాం. ౨, ఆ. ౨౮౪. విశే. కోటకంటిరి, మిక్కిలిరక్షకము. "ఉ. పెట్టనికోట నీకు హరి..." భాగ. ఉద్యో. ౧, ఆ. ౨౯౭. స్త్రీ. ౨, ఆ. ౧౭౪.

కోటఁడు. దే. వి. (త. కోట్టాన్.) గ్రద్దగూబ. ఆం. భా. ద్వి. ౯౧. క్రీడా. ౫౧.

కోటకొమ్మ. దే. వి. (కోట+కొమ్మ.) దుర్గప్రాకారశిఖరము. "గీ...పొల్చుఁ జూడఁ బట్టణముకోట కొమ్మలపంక్తి గగనమండలశ్రీకి సరపుఁ గిరువుండ వోలె." ఆము. ౨, ఆ. ౫. నీలా. ౧, ఆ ౩౧.

కోటము. సం. వి. అ. పుం. 1. కోట; 2. కుటిలత.

కోటరము. ఉభ. దే. వి. కోడలితనము,స్నుషాత్వము. "చ. అరయమిఁ జేసె నమ్మహా పురుషుని పాలికిఁ బతులు వోవఁగ పేరలతోన యేను జెచ్చెరఁ జని కోటరంబు వగఁ జేయుదునో..." భార. ఉద్యో. ౩, ఆ. ౧౧౭. సం. వి. అ. పుం. న. చెట్టుతొఱ్ఱ.

కోటరించు. దే. అ. క్రి. కోరాడు. "సీ. చిఱుతరై గురుతరస్థితి రొప్పి కుప్పించుఁ గోలమై లీలమైఁ గోటరించు." ల. వి. ౨, ఆ. ౧౦౨.

కోటవి. సం. వి. ఈ. స్త్రీ. 1. నగ్నిక; 2. దుర్గాభేదము.

కోటానఁగోటులు. మి. వి. బ. (కోటులు+కోటులు.)- పెక్కుకోటులు-అనేకము, అనేకులు. "క. హాటకములు దక్షిణగాఁ,గోటానంగోటు లొసఁగి..." విక్ర. ౫, ఆ. ౧౩౦. భా. రా. యు. ౨౬౩. "క. కోటానఁగోట్లు వచ్చిరి.పీటం గలరసికు లెల్ల వేడుకఁ జూడన్." మల్హ. ౨, ఆ. ౫౭.

కోటి. యు. వై. వి. (సం. కోటిః.) నూఱులక్షల సంఖ్య. "క...కోటికి నెత్తిన,పడగలచేఁ గోమటి-డ్లు బంగరుమళిగల్."య. ౧, ఆ. ౮౮. "క. అన సిట్టిపలువయఱపుల,కును గోటిఁ బడగ యెత్తు గుఱి యగుపెద్దన్,నిపునమ్మరాదుగా కట్టొనరిచితే చిట్టిలంచ మొసఁగనె నీకున్."కళా. ౭, ఆ. ౨౭. (కోటికిఁ బడగయెత్తు = కోటీశ్వరుఁడైనట్లు జెండాయెత్తు,ఘనుఁ డగు అని భావము.) దే. వి.

వేగు, చారుఁడు. "క. చెడ విఱిగి యడవిఁ బడి యొడ, నెడ గట్టులతుదలఁ గోటి యిడి లోఁగడ కున్, దమకు వోడిపించి యాఁకుల, గుడిసెల వసి యించె మంత్రిగురుభటయుతుఁడై." ఆము. ౩. ఆ. ౧౭. (శ. ర. పా.) (కోటి యిడు = చారుల నేర్పఱుచు.) సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. అంచు; 2. చివర; 3. వింటికొప్పు; 4. పెంపు; 5. నూఱు లక్షలు; 6. సముదాయము; 7. (గణిత) త్రిభుజ క్షేత్రమున భుజకర్ణములకు భిన్నమగు అవయవ రేఖ.

కోటికాఁడు. దే. వి. (కోటి+కాఁడు. స్వార్థమున.) చారుఁడు. "క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెల వగునడవిన్, జొరఁ గోటికాండ్రు టెక్కెము, పరికించి యెఱింగి కలయఁబడి కూఁత లిడన్." ఆము. ౮, ఆ. ౨౬. (శ. ర. పా.) (కొట్టికాండ్రు. పాఠాం.)

కోటికొండలు = కోటానఁగోటులు. విశే. అత్యధికము. "గీ. నృపులపదముల రేఖల కెల్ల మాఘు, జాగ్రమాలరేఖలే మూల మనుచుఁ గోటి, కొండలుగ ధాన్యరాసులు పండ పేట, సుజనభజనైకవిఖ్యాతి శూద్రజాతి." ఆము. ౨, ఆ. ౩౬. "తరలము...సస్యము కోటికొండలు పండ..." నిర్వ. ౧౦, ఆ. ౧౬౦.

కోటివర్ష. సం. వి. ఆ. స్త్రీ. స్పృక్క యనుగంధద్రవ్యము.

కోటీరము. సం. వి. అ. పుం. 1. కిరీటము; 2. జటాజూటము. సం. నైష. ౧౧. స. ౧౮. శ్లో.

కోటేరు. దే. వి. దుక్కికిఁ బోవునపుడుగాని దుక్కియై మరలి వచ్చునపుడుగాని దుంపమీఁదుగా కాడికి తగిలించిననాఁగలి, విపర్యయబద్ధలాంగలము. ఆం. భా. ద్వి. ౨౩౨. "సీ. మీ టేరుపడి మంచికోటేరు వెట్టిన ముకువు చూపట్టెడుముక్కు టెక్కు." వాల్మీ. ౩, ఆ. ౧౧౭.

కోట్టము. సం. వి. అ. పుం. దుర్గపురము.

కోట్టారము. సం. వి. అ. న. 1. కోట్టము; 2. కొలని మెట్టు; 3 నూయి.

కోట్రము. దే. వి. కోడలికము. "సీ. వైవాహిక క్రియావ్యసనంబు గొన్నేండ్లు గొన్నేండ్లు కోడండ్రకోట్రములును." పా. ఫ్రు. ౫, ఆ. ౧౮౭. ౬, ఆ. ౭౩. నిరం. ౨, ఆ. ౫౮.

కోతరము. సం. వి. అ. పుం. అంకోలము, ఊడుగు.

కోద. దే. వి. 1. ఒకవిధమగునాఱు. ఆం. భా. ద్వి. ౩౫. (బ్రా. పా.); 2. ఒకవిధమగుపొద, కంప. "సీ. కోరింద నలతుమ్మ గొటిరె కోద...గీ...మొదలుగా జగలిగల్గు, కంపలన్నియును..." హంస. ౪, ఆ. ౯.

కోదంగి = కోణంగి. "ద్వి. కోదంగిగతి బాలుఁ డాడు మనంగ, వేడుక మతిఁ దోలఁకాడంగ నాడు." పండితా. పురా ౧౬౬. పు.

కోదంట్రము = కోడలికము. "క...ఓ, రమణీమణి నీకోడంట్రము నెఱుఁగరు..." కళా. ౭, ఆ. ౮౯. ఆం. భా. ద్వి. ౧౧౧.

కోదంట్రికము = కోడలికము. "క...సకి నాతనుజునకు నీవు సతివై కోడం, ట్రిక మెపుడు చేసితివి నీ, మొకమే నే నెఱుఁగ..." ఉ. రా. ౪, ఆ. ౨౦౬.

కోడబడి. దే. వి. భక్ష్యవిశేషము. (బ్రా. కోడిబడి. శ. ర.) హంస. ౧, ఆ. ౧౦౫.

కోడఱికము. దే. వి. (కోడలు+ఱికము.) కోడలితనము. "చ. పలుకువెలంది యేయువిదపజ్జలఁ గోడఱికంబు సేయు..." రామా. పీఠి. ౨. (ముద్రి. పా. కోటఱికము. శ. ర. పా.) ఆం. భా. ద్వి. ౧౧౧.

కోడలితనము. దే. వి. (కోడలు+తనము.) స్నుషాత్వము. "సీ. అత్తగారని బత్తి నడుగు లొత్తుచు శచీపనజాక్షి కోడలితనము నెఱప." దశా. ౩, అ. ౫౦.

కోడలు. దే. వి. బ. (కొడుకు+ఆలు.) కొడుకుభార్య, స్నుష. 'క. లలితాంగిఁ బడసెఁ దనకోడలిరూపముకంటెఁ గడు బెడం గగురూపో, జ్జ్వలకాంతి గలుగుదానిన్..." భార. అర. ౩, ఆ. ౨౬౬. పాండు. ౩, ఆ. ౬౦.

కోడాడు. దే. స. క్రి. 1. కొరాడు, కుమ్ము. "వ... ఇవ్విధంబున సవ్యేదండంబు లొండొండ చండక్రీడఁ గోడాడుచుండ." నృసిం. ౪, ఆ. ౪౭; 2. (ప్రాణము) తీయు. "మ...ఆమ్మానిశూలంబు చేకొని నారాయణుప్రాణముల్ రణముఁగోఁ గోడాడఁ జూడన్..." ఉ. హరి. ౬, ఆ ౪౫.

కోడి. వై. వి. (సం. కుక్కుటః. క. కోటి.) కుక్కుటము, అజ్జవాలు. ఆం. భా. ద్వి. ౯౨. బ. కోళ్లు. కోళ్లును. "గీ. కొక్కురో కో యుటంచును గోళ్లు

కూసె." హార. ౭, ఆ. ౧౩౭. "ఉ. పాములుఁ జేష్టనుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోష్ఠలున్." భార. అశ్వ. ౨, ఆ. ౧౧౭.

కోడిగ. దే. వి. (త. కోడి.) 1. హారము. "సీ. కోయ చేడెకు: గెంపుకోడిగల నొసంగి గురిగింజలకు దీసి సరము గూర్చు." పార్వ. ౨, ఆ. ౨౩; 2. రత్నములయిరువదింటిసంజ్ఞ. (శ. ర.)

కోడిగము. దే. వి. 1. మోసము. "క. పీడక యిట్టుల నార్తి దేఁడులు విహరింప గర్భ మిరవుగ నిలిచెన్, వ్రీడావతికిని సాహారి,కోడిగ మే మనుచుఁ జెల్వ గుణరత్ననిధీ." ఉ. హరిశ్చ. ౨, ఆ. ౧౯; 2. శృంగారచేష్ట. "ఉ...ఈ,కోఁతివిటుండు చేయు వెడకోడిగముల్ గని మాటి పత్తురే." భల్లా. ౫, ఆ. (శ. ర.) అని. ౧, ఆ. ౧౧౯; 3. పరియాచకము. "సీ. అతులితవేదవేదాంతచర్చల బ్రహ్మ నైనఁ గోడిగ మాడుహంసతతులు." చెన్న. ౧, ఆ. ౨; 4. కొంటెతనము. "గీ. అధ్వగులు కోడిగములకై యాకుఁ జెల్లఁ,ద్రెంచి శాఖావితానముల్ ద్రుంచి వైవ,మోడుపడియుండె..." శుక. ౩, ఆ. ౪౩౯; విణ. 1. చెడ్డది. "గీ. కోడిగపుఁగంతుయాకన కోడి వజ్రి, కోడియై కూసెఁ గొక్కొరోకో యటంచు." ఆహ. ౩, ఆ. ౭౧. విప్ర. ౩, ఆ. ౪౦; 2. వ్యర్థము, పనికిమాలినది. "చ. పని మఱి లేనికోడిగపుఁబాఁటని నీ వొక ప్రోది సేసి..." ప్ర. ౬, ఆ. ౦౩.

కోడిగించు. దే. అ. క్రి. కూడు. రమించు. "సీ. గొల్ల యిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి పరకామినీ సహోదరతఁ జూప." పారి. పీఠి. ౧౭. స. క్రి. పరిహసించు. "సీ. మంచువేసవినాఁటిమార్తాండ బింబంబుఁ గోడిగించుకసిండిగుబ్బతోడ." కాశీ. ౪, ఆ. ౨౯౪.

కోడిగీఁడు. దే. విణ. (కోడిగము+ఈఁడు.) 1. విలాసవంతుఁడు. "సీ. కుంటెనీలకు నిచ్చి కోడిగీలకు నిచ్చి మిన్నక పారకామినుల కిచ్చి." విక్ర. ౭. ఆ. ౧౨౪; 2. కొంటెవాఁడు. "సీ. తనపెద్దంబు నకుమాధవసత్యభామల గట్టాలఁజేసినకోడిగీఁడు." పరావ. ౨, ఆ. ౧౦౦. చిత్రభా. ౫, ఆ. ౪౩.

కోడిపీఁట. వై. వి. (కోడి+పీఁట.) అనుకర్షము, నొగ చివర క్రింద నెత్తుగా నుంచెడుమోపుడుకొయ్య. "సీ. పంకరుహాంబులు బండికన్నులు ..ఆకోక ముల్ కోడిపీఁట." కు. సం. ౪, ఆ ౦౩.

కోడిపోరు. ద్వ. వి. (కోడి+పోరు.) కోడిపందెము, ద్యూతవిశేషము. ఆం. భా. ద్వి. ౩౦౬.

కోడియ. దే. వి. కోడెదూడ, గిత్త. "గీ...ఆకోడె యలకు బట్టి." సీతా. ౨, ఆ. ౬౨. వెం. పంచ. ౧, ఆ. ౫౦౬.

కోడిచెప్పు. ద్వ. వి. (కోడి+చెప్పు.) నేత్రరోగవిశేషము. "ద్వి.చెప్పఁ జిత్రము కోడిచెప్ప పెగ్గెదో." బస. ౩, ఆ. ౭౦౭. పం.

కోడీ = కోడిగ. (శ. ర.)

కోడు. దే. వి. బొ. 1. (మంచము మొ. వాని) కాలు. ఆం. భా. ద్వి. ౧౬౪. దశా. ౧. ఆ. ౧౪; 2. ఊరిదరి నీటిపల్లము. "గీ. నీపకదఁ గోష్ఠఁ గూడి మున్నిటిఁ గవయు,మొగులుబడి వాహినుల కెట్లు మొరయ వచ్చు, వార్థ లేనింటికి పలప్రవనిత యైన,మంగళోత్సంగ గాకమాగంగ యొపర." భీమ. ౩, ఆ. ౨౨. ద్వా. ౬, ఆ. ౭౦; 3. రేఖ, గీత. ఆం. భా. తృ. ౫౩. [(శ. ర. బ్రా.)

కోడుతాఱు. దే.అ. క్రి. పండినపైరు మిక్కిలి యెండు.

కోడె. దే. వి. 1. కాఁడి మరపఁ దగినదూడ, గిత్త. (శ. ర.); 2. గోవు మొ. దాసిమగదూడ. ఆం. భా. ద్వి. ౨౬౨; 3. ఎద్దు. "ఉ...శూలపాణికిం,గాలొకటేమొ కుంటిపలెఁ గన్పడుచున్నది లేక కోడె నే,కేళల నెక్కుచుం దిరుగ కట్టెమొ..." పాక్ష్వ. ౪, ఆ. ౯౨; 4. గోవత్సము, ఆవుదూడ. "ఆ. భక్తుఁ డొందుఁ జనిన బలితెంతు వెనువెంట,గోవు వెంటఁ దగులుకోడెభంగి." భాగ. ౯, స్కం. ౧౧౯; 5. విటుఁడు. "గీ. అడిగినంతయు రో యిచ్చినట్టి క్రొత్త,కోడెఁ జేకొని..." కవిక. ౪, ఆ. ౯౯. విణ. 1. పడుచుది, పడుచువాఁడు. "శా. కామాంధల్ వెలనాటికోడెవిధవల్ ..." క్రీడా. ౨౦౯. దశా. ౯, ఆ. ౧౩౦. "క. మదమొదవుకోడెఁటులకు..." హంస. ౧, ఆ. ౭౨; 3. మగది. "గీ...ఎవని,నెదికొమ్ములఁ గ్రుమ్మచుఁ గదిసి కోడె,తలపులఁ బొడ్చుచు..." సిలా. ౨, ఆ. ౪౩.

కోడెకాఁడు. దే. వి. (కోడె+కాఁడు. స్వార్థమున.) 1. తరుణుఁడు. "గీ...మించుబోండ్లఁగూడి జల

శెళ్లిఁ గావించుకోడెకానిఁ,దలిరువిల్కాని నగు చక్కఁదనమువాని." వశా. ౬, అ. ౭౪. ఆం. సం. మాన. ౮; 2. కుమారుఁడు, జవ్వనమునకుఁ బూర్వదశయం దున్నవాఁడు. ఆం. భా. ద్వి. ౧౧౮; 3. విటుఁడు. "చ. ఘను లగుకోడెకాండ్రకుసు దంగెడిజున్నులు...'రామా. ౧, ఆ. ౧౪౧. విప్ర. ౨, ఆ. ౨౮.

కోడెకొండ. దే. వి. (కోడె+కొండ.) హిమవత్పర్వతము. (భూమిని ధేనువుగా హిమవంతుని దూడగను జేసి పృథుచక్రవర్తి యోషధులు పిదుకుట పురాణప్రసిద్ధము.) "ఉ...ధాత్రి కెం,బన్నిన కోడెకొండ యొడఁబాటునఁ దాల్చెఁ దదంక మిప్పుడున్." కళా. ౧, ఆ. ౧౫౪.

కోడెగాడ్పు. దే. వి. (కోడె+గాడ్పు.) మందమారుతము. "సీ. నుఱుపకే లున్నవి సెఱయ వైర్యం బున గందపుపులకోడెగాడ్పునములు." ప్రభా. ౫, ఆ. ౭౪.

కోడెతనము. దే. వి. (కోడె+తనము.) 1. పడుచుఁదనము.(వ్యా.); 2. ప్రౌఢత్వము. "సీ...జవ్వాజి కస్తూరి కులుకుగుబ్బలఁ బాయుంకోడెతనము." ఉ. రా. ౬, ఆ. ౧౬౭; 3. విటత్వము. "ఉ. వచ్చి పురంబువాకిట రువారపుఁగోడెతనంబుతోడఁ గన్నిచ్చకు వచ్చుచేడియల నెచ్చరికించుచు..." విక్ర. ౮, ఆ. ౮.

కోడెత్రాచు. దే. వి. (కోడె+త్రాచు.) పడుచుత్రాచుపాము. "సీ...కోడెత్రాచును ముగ్గులాడినట్లు." వేణు.౫౦.ఇట్లే: కోడెనాగు.మొ.వాల్మీ.3,ఆ.౪3.

కోడెరాతు. ద్వ. వి. (కోడె+రాతు.) వృషభవాహనుఁడు, శివుఁడు. "సీ. ఇటు కోడెరాతు మై నిద్దసొమ్ములమేఁతసొంపు లీనెడుకొండఁ జూచి నాఁడ." నరస. ౫, ఆ. ౨౨. ఇట్లే: కోడెవయాళి వజీరుఁడు. శుక. ౨, ఆ. ౨౪౪.

కోణంగి. దే. వి. (త. కోణంగి.) అంగములను వికారముగాఁ జూపి జనులను నవ్వించుచు బిచ్చ మెత్తు దాసరి. "సీ. ఆళించు నెపుడు సత్యాసక్తి నమ్మహా నటుఁడు నేనగరిఁ గోణంగి యగుట." వైజ. ౧, ఆ. ౪౨. హంస. 3, ఆ. ౭౯.

కోణంగితనము. దే. వి. (కోణంగి+తనము.) కోణంగి చేష్ట, వెక్కిరింత. (బ్రౌ.)

కోణపుఁడు. సం. వి. అ. పుం. నైరృతుఁడు, మూలఱేఁడు.

కోణము. సం. వి. అ. పుం. 1. ఇల్లుమొ. వానిమూల; 2. మూల; 3. అంచు. 4. కుజగ్రహము; 5. దుడ్డుకఱ్ఱ; 6. శనిగ్రహము; 7. (గణిత.) రెండురేఖలు కలియుచోటు (మూల).

కోణాలగొంది. మి. వి. (కోణాలు+గొంది.) మిక్కిలి యిఱుకైన చీఁకటిమూల. "మత్తకోకిల...కోణాల గొందిఁ గసంబు నుబ్బుజనంబు..." పాండు. ౫, ఆ ౭౯. ('కోనాలగొంది.' ముద్రి.)

కోణే. దే. వి. (క. కోణే.) అంతఃపురము. "శా. కోణే వాకిట వారి నిల్పి...నృపాలుఁ డంతిపురముం జేరెం బ్రమోదంబునన్." కువల. ౨, ఆ. ౪౮.

కోదండము. ఉభ. దే. వి. (క. కోదండ. త.కోదండం.) దండనసాధనవిశేషము, నేరము చేసినఁ బట్టించి వ్రేలాడఁజేయుటకై మీఁదఁ గట్టినత్రాడు. "గీ. తొడలు వడిపెట్టి కోదండ మదరఁ గట్టి,రెట్ట లెగఁ బెట్టః బట్టించు రేపు మాపు."హంస. 3,ఆ. ౧౪౧. సం. వి. అ. న. 1. విల్లు; 2. ధనూరాశి. పుం. 1. కనుబొమ్మ; 2. దేశభేదము.

కోదండరామములు. సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౭౮.

కోదండి. సం. విశే. (న్. నీ. న్.) విటకాఁడు.

కోద్రంగము. సం. వి. అ. పుం. మంచె. "శ్లో. కోద్రంగస్తు తమంగస్స్యాత్." అమరపదపారిజాతము.

కోద్రవము. సం. వి. అ. పుం. కోరదూషము, అర్క.

కోన. వై. వి. (సం. కాననమ్) 1. అడవి. "ఆ. గోల యట్టికాఱుఁగోనలో నిన్నొంటి, డించి చనఁగఁ జనునె..."అచ్చ. అర. ౪౯; 2. తోఁట. "చ... మల్లియలు పూచినకోనలు..." వసు. ౨, ఆ. ౨౦; 3. దేశభేదము. "సీ. కోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలె." స్వా. ౧, ఆ. 3౭; 4. గోసమూహము. ఆం. శే. 3౨; 5. (సం. కోణః. క. కోణె. త. కోణమ్.) మూల. "సీ. క్రొంజీఁకటులు క్రమ్ముకోవల కోనల..."సా. 3, ఆ. ౨3౨. దశ. ౫, ఆ. ౭౧; 6. లోయ. "సీ.మందరశైలంబునందు నొకానొకకోనలో..." దశా. ౪, అ. ౭౮; 7. కొన. "మ ..కన్గోనలన్ దంద్ర యొక్కఁడు

దోఁచెన్..." హరి. ఉ. ౩, ఆ. ౧౭౮. పాండు. ౧, ఆ. ౧౬౧.

కోనతెంకి. ద్వ. వి. (కోన+తెంకి.) కోఁతి. "క... అకోన్కోనతెంకిబంట్లు..." అచ్చ. యు. ౨౪౪.

కోనత్రిమ్మరి = కోనతెంకి. అచ్చ. కిష్కిం. ౯.

కోనమనికిపట్టు = కోనతెంకి. అచ్చ. కిష్కిం. ౧౧.

కోనమెకము. వై. వి. (కోన+మెకము.) కోఁతి. అచ్చ. యు. ౩౧౧.

కోనఱేఁడు. ద్వ. వి. (కోన+ఱేఁడు.) నైరృతుఁడు, మూలఱేఁడు. (శ. ర.) [మాన. ౭౩.

కోనవంక. ద్వ. వి. (కోన+వంక.) సెలయేఱు. వేంక.

కోనెఱు = కోనేఱు. "క...కోనెఱు బుగ్గ వాఁగు ..." హంస. ౪, ఆ. ౨౧౦.

కోనేఱు. ద్వ. వి. టౌ. (కోన+ఏఱు)(క. త. కోనేరి.) పుష్కరిణి, చుట్టును మెట్లు గలిగి చదరముగ నున్న చెఱువు. ఆం. భా. ప్ర. ౧౬౨.

కోపకత్తె. మి. విణ. (కోపము+కత్తె.) కోపము గలది. "సీ. సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁ జేయం కొడుకుఁ గాంచినయట్టికోపకత్తె." క్రీడా. ౧౨౯.

కోపకాఁడు = కోపగాఁడు. (శ. ర.)

కోపకుఁడు. సం. విణ. (అ. పికా. ఆ.) కోపించువాఁడు.

కోపగాఁడు. మి. విణ. (కోపము+కాఁడు.) కోపము గలవాఁడు. "గీ. అన్న మీతండ్రి కోపగాఁడౌనో కాదో." కాశీ. ౪, ఆ. ౯౦. సా. ౨, ఆ. ౧౧౫.

కోపగించు. వై. అ. క్రి. (సం. కోపః.) 1. కోపపడు. "గీ. ఆపడంతుక దెల్పినఁ గోపగించి." సా. ౨, ఆ. ౨౭౦; 2. పగగొను. "గీ. ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గడిసి, గెలువఁగా లేక చని కోపగించి ..." పాండు. ౫, ఆ. ౯౮.

కోపగిలు. వై. అ. క్రి. (సం. కోపః.) కోపపడు. "సీ. వేగ మూహింపుమీ విధుబింబముఖి కోపగిలిన భావము..." చంద్రా. ౩, ఆ. ౮౭.

కోపదారి. మి. విణ. (కోపము+దారి.) కోపము గలవాఁడు. చెన్న. ౪, ఆ. ౨౭౭.

కోపన. సం. వి. ఆ. స్త్రీ. కోపము గలఆఁడుది. [వాఁడు.

కోపనకుఁడు. సం. విణ. (అ. నికా. అ) కోపము గల

కోపనము. సం. వి. అ. న. కోపగించుట. విణ. (అ. ఆ. అ.) 1. కోపపడునది; 2. కోపము కలిగించునది; 3. ప్రకోపింపఁజేయునది.

కోపము. సం. వి. అ. పుం. 1. కినుక; 2. ప్రకోపము.

కోపయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కోపింపఁజేయువాఁడు.

కోపి. సం. వి. న్. పుం. నీటిపావురము. (కల్ప.) విణ. (న్. నీ. న్.) 1. కోపము గలవాఁడు; 2. కోపము గలిగించువాఁడు; 3. ప్రకోపము గలిగించునది.

కోపించు. సం. అ. క్రి. కోపగించు. "ఆ. కొడుకు పాటు చూచి కోపించి కాళింగపతి..." భార. భీష్మ. ౨, ఆ. ౬౫. స. క్రి. కోపపడు. "మ. గురుశాస్త్రార్థగరిష్ఠు లైనబుధులన్ గోపింపఁగా రాదు..." మల్లభూ. నీతి. ౧౩. ద్వా. ౭, ఆ. ౧౩.

కోపించుకొను. మి. అ. క్రి. (కోపించు+కొను. స్వార్థము.) కోపపడు. "సీ. అతిభయంకరలంక యందు దేవ కాంపవయే కోపించుకొని పోయి కొఱవిఁ జూడ." రామా. ౭, ఆ. ౭.

కోపితుఁడు. సం. విణ. (౹ా. ఆ. అ) కోపింపఁజేయఁబడినవాఁడు. భార. భీష్మ. ౨, ఆ. ౭౩.

కోపు. దే. వి. (క. కోపు. త. కొప్పు.) 1. నాట్యగతివిశేషము. ఆం. భా. ప్ర. ౧౩౦. వైజ. ౧, ఆ. ౧౨౯; 2. అందము. "క. వాలారుఁజూపుఁగోపుల, వేలుపుఁబూఁబోండ్లు నీకు వెసబలముగ..." చంద్రా. ౩, ఆ. ౩౧; 3. బలము. "దండకము...సుందరాగంబుఁ బెన్ గోపునన్ మూఁపునం దాల్పవా...." కృ. శతం. ౩, ఆ. ౧౪౭; 4. కారణము. "చ... వేఁటకోపున సవరించినన్ జెరలు బోనులు గైకొన కొక్కయిఱ్ఱి వచ్చినఁ జదుదించినాఁడ ..." య. ౨, ఆ. ౫౫; 5. కడ. "సీ. కరకంకణంబులు గల్లనఁ జెలు లిరుకోపులఁ జేరి వీచోపు లిడఁగ." శశాం. ౪, ఆ. ౧౪౬; 6. విధము. "ఉ. క్రోధము మూర్తి గైకొనినకోపున..." ఉ. రా. ౩, ఆ. ౨౪౧; 7. బలపము. (శ. ర.); 8. వింటికొన. ఆం. భా. తృ. ౬౨; 9. మద్యము. సాం. ని. మాన. ౪౭; 10. సమయము. (శ. ర. బ్రౌ.); 11. చేపలు గ్రుచ్చెడుసూది. (శ. ర. బ్రౌ.); 12. దుకాణము. (చూ. కోపుదారుఁడు.); 13. నిడివి. "సీ. అష్టదిక్సుఖములం దష్టాంగములు మించఁ గోపు గాంచినవజ్రకూబరములు." దశా. ౫, ఆ. ౧౫. బ. వందనము. "వ...పినాకి నీకు నమస్కారంబు కైలాసనిలయా నీకుఁ గోపులు

...." భీమ. ౩,ఆ. ౨౧౧. విశ. చక్కని. "ద్వి...
బృందావనమందు, గో పైనచెంగల్వకొలనిలోప
లను." ద్వి. శ. సా. ౯. భా. ౭౬. పు.

కోపుదాయఁడు. దే. వి. (కోపు+దాయఁడు.) సరకులను
పైటనుండి తెచ్చి యిమ్మువాఁడు. (శ. ర.)

కోపుపరుపడి. దే. వి. (కోపు+పరుపడి.) 1. పండ్రెండు
పరుపములలో నొకటి. ప్రబంధ. ౭౯; 2. పదు
నాల్గువిసరులలో నొకటి. హంస. ౧, ఆ. ౨౦౬.

కోపులెత్తు. దే. అ. క్రి. (కోపులు+ఎత్తు.) దండెత్తు.
"సీ. భటకోపశిఖి శిఖప్రభల మ్రింగి బలారికులిశ
ధారలమీఁదఁ గోపులెత్త." సాంబో. ౫,ఆ. ౨౦౩.

కోపువాఱు. దే. అ. క్రి. (కోపు+పాఱు.) అందగించు.
(శ. ర.)

కోమ. దే. వి. 1. వల్మీకాగ్రము, పుట్టచివర. ఆం.
భా. ద్వి. ౯; 2. కొమ్మ, ఆఁడుది. "ఉ...చిల్కల్,
మాయను...గద్దరి కారుజింకకో, మాయను..."
అచ్చ. ఆర. ౯౬. (శ ర. పా. 'కూమా' ముద్రి.)

కోమటి. వై. వి. (సం. కార్పటికః. క. కోమటి. త.
కోమట్టి.) వైశ్యుఁడు. "చ...అంగడులఁ గోమటు
లప్పురి సిద్ధరత్నముల్." భార. ఆది. ౯, ఆ. ౭౩.
ఆం. సం. మాన. ౨.

కోమటీఁడు = కోమటి. (కోమటి+ఈఁడు. స్వార్థ
మున.) "సీ. వంచిమూల్యము నిచ్చి వడి కొర్చి
త్రైవర్ణికులఁ గంటఁ దిరుగనికోమటీఁడు." హంస.
౫, ఆ. ౧౨౦.

కోమలకము. సం. వి. అ. న. తామరతూఁడు.

కోమలము. సం. వి. అ. న. 1. సీరు; 2. పగడము
నందలిదోషవిశేషము. రత్న. ౭౫: 3. ఈదోషము
గలరత్నము. రత్న. ౭౬. విశ. (అ. ఆ. అ.) 1.
మృదువైనది; 2. అందమైనది; 3. ఇంపైనది.

కోమలి. వై. వి. (సం. కోమలా. క. కోమలె.) 1.
స్త్రీ. ఆం. భా. ద్వి. ౧౦౪. "క. అల్లునిమంచితనం
బును, గొల్లనిసాహిత్యవిద్య కోమటినిజమున్,
బొల్లున దంచిన బియ్యముఁ, దెల్లనికాకులును లేవు
తెలియుర సుమతీ." సు. శ. ౯; 2. సుందరి
యైనస్త్రీ. "ఉ. ఆమదిరాక్షిఁ జూచి పరిహాసము
మీఱ బలీంద్రుఁ డిప్పు డో, కోమలి నీవు చేనమృత
కుంభము పూనినఁ జూచి గోపబాలామణి వంచుఁ
బాల్గొనఁ దలంచెద మన్నను నవ్వుచుక్ మృగా,

త్రీమణి బావ నీవు దధిఁ జిల్కఁగ గోపిక నైన
దోసమే." దశా. ౨, ఆ. ౩౬౨.

కోమలికము. వై. వి. చక్కఁదనము. "సీ...మేని
కోమలికంబుఁ గను దిట్టగుణము గుల్కెడు
మొగంబు." కళా. ౪, ఆ. ౯౪. భా. రా. ఆర.
౧, ఆ. ౧౪౯.

కోయ. దే. వి. ఒకజాతిబోయ. "సీ. కస్తూరివీశెలఁ
గానుకగాఁ దెచ్చుకోయకు జీతంబుగొప్ప చేయు."
పార్వ ౧, ఆ. ౬౨; ౫౦. చంద్రా. ౪. ఆ. ౨౩౫.

కోయత. దే. వి. (కోయ+త.) బోయజాతిస్త్రీ. "గీ.
కోయతల్ చెప్పుకొనఁగ." ప్రబంధ. ౧౭౪.

కోయష్టికము. సం. వి. అ. పుం. గ్రుడ్డికొంగ.

కోయిల. యు. దే. వి. (త. కోయిల్.) 1. గుడి.
'ఉ...కోయిల్లతొత్తులమారి..." ప్రబోధ. ౩,ఆ.
౨౯. (కోయిలతొత్తు = దేవదాసి, వేశ్య.); 2.
ఒకానొకదివ్యస్థలము. "క. కోయిలఁ దిరుమలఁ
బెరుమాళ్కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదిక
పుణ్యాయతనంబుల మాయంపై యెక్కడఁ
బోయెనొకో మురాంతకుప్రతిమల్." కాశీ. ౫,
ఆ. ౨౯౮. వై. వి. (సం. కోకిలః. క. కుకిల్. త.
కుయిల్.) పికము. "చ...కోయిలలయెలుంగు
లోలిఁ గొని..." హరి. పూ. ౯, ఆ. ౩౫. పారి.
౩, ఆ. ౪౯. [కూరాకు. (బ్రా.)

కోయిలకూర. ద్వ. వి. (కోయిల+కూర.) ఒకజాతి

కోయు. దే. స. క్రి. (క. త. కొయ్.) 1. నఱకు,
ఖండించు. "గీ. అపుడు మెడఁ గోయ మునిరోఁజు
టాలకించి." స్వా. ౬, ఆ. ౫౧. సా. ౩, ఆ.
౩౬; 2. పోఁగొట్టు, నశింపఁజేయు. "గీ. ఆస
లన్నియు మొదలంటఁ గోసియున్న, గోఁచికట్టున
కటువంటిగొడవ గడవ, రాక మెడఁ జుట్టుకొనియె
..." పాండు. ౫, ఆ. ౨౩౯; 3. (పుష్పాదులను)
త్రుంచు. "చ. అలరులఁ గోయుచుక్ మధుకరా
వళిఁ జోపుచు..." నిర్వ. ౭, ఆ. ౨౯; ౩౪;
౩౬. ఆము. ౩, ఆ. ౩౩; 4. తెగునట్లు చేయు.
వా:—కత్తిపీఁటతో చేయి కోసికొనకుము.

కోర. దే. వి. 1. గిన్నె, పాత్రము. "ఆ. అనుచుఁ
గోరలోనిఘనసారగంధంబు, వలసినట్ల యొసఁగె
వారలకును." వి. పు. ౭, ఆ. ౩౯౬. వేంక.
మాన. ౩౭; 2. మద్యపాత్రము, కల్లుగిన్నె.

"చ...ఇం,పౌవరినయానవంబులు సముత్సుకతం గనకంపుగోరలం,గొని హారసన్నిధానమునఁ గ్రోలిరి ..." భార. మా. ౩౦. నృసిం. ౩, ఆ. ౯౪; 3. పన్లెము. "గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు...,కట్నములఁ బైఁడికోరబాగాలు నంప." వైజ. ౧, ఆ. ౧౭౯. స్వా. ౫, ఆ. ౯౬. 4. కొలగిన్నె, కొలతపాత్ర. 'ద్వి. మంచిగంగుల పాలు మరగంగఁ జూచి,కుంచెడుగోరతోఁ గొలిచి చేపట్టి."బస. ౩, ఆ. ౭౦. పు. "ద్వి. కోర బెడం గనో కుంచెడు లేవా." బస. ౩, ఆ. ౭౦. పు. విణ. పెద్దది. (ఉదా:—కోరమీసము మొ.)

కోరంగి. ఉభ. దే. వి. 1. ఉసిరికచెట్టు. (బ్రా.); 2. ఒకానొక చిన్నరేవుపట్టణము. (బ్రా.) సం. వి. ఈ. స్త్రీ. 1. చిట్టేలకిచెట్టు; 2. పిప్పలిచెట్టు.

కోరకము. సం. వి. అ. పుం. న. 1. మొగ్గ; 2. తామర తూడు; 3. తక్కోలముచెట్టు; 4. చోరముచెట్టు.

కోరకించు. సం. అ. క్రి. మొగ్గతొడుగు. "వ... కోరకించిననీపభూరుహంబునుం బోలె..."ఉద్భ. ౨, ఆ. ౨౬.

కోరకితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మొగ్గ తొడిగినది. (లతాది); 2. ముడుఁగు. "గీ. కోరకించిన కడకంటికొలికిఁ జూచి." నైష. ౭, ఆ. ౧౪౦. (వావిళ్ల ప్రతి. పా.)

కోరకొండె = కోరసిగ. (శ. ర.)

కోరకొమ్ము. దే. వి. (కోర+కొమ్ము.) వాఁడి యైన కొమ్ము. "సీ. వహోమకుండలముపై కుఱికి కొంకర కోరకొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు." వరాహ. ౧౧, ఆ. ౭౬.

కోరగించు. వై. అ. క్రి. (సం. కోరకః.) 1. మొగ్గ దొడుగు. "సీ. జలదానిలంబునఁ బులకించెనో యనఁ గుటజభూజంబులు కోరగించె." విక్ర. ౪, ఆ. ౩౧; 2. ఎఱ్ఱపడు. "ఉ. నా విని కోరగింప నయనంబులు..." వేం. పంచ. ౪, ఆ. ౪౬; 3. ఉదయించు. "శా. నాళీకాప్తుఁడు కోరగించు నట ముక్ ప్రత్యూషకాలంబునన్." తపతీ. ౩, ఆ. ౬; 4. చెదరు. "సీ. మించుకన్నులు కోరగించురాజాన్నంబు..."విక్ర. ౪, ఆ. ౧౮౮; 5. మారముచేయు. (బిడ్డలు) "గీ. కొంటెతన ముకఁ దెమ్మంచుఁ గోరగింపఁ,దల్లి యేమియు నన లేక తల్లడించె." కుచేల. ౧, ఆ. ౩౯.

కోరగొను. దే. అ. క్రి. (కోర+కొను.) కోరవోవు, కొంకరలగు. "ఉ...కాళ్లు నేలపైఁ ద్రొక్కఁగ రాక కోరగొని తొట్రుపడంగ..." పద్మ. ౩, ఆ. ౭౯.

కోరచూపు. దే. వి. (కోర+చూపు) వికృతపుఁజూపు. "సీ. కోరచూపులమొఱ్ఱచేపుగ్రుడ్డులవాఁడు..." వరాహ. ౨, ఆ. ౪౫.

కోరడి. దే. వి. ఆవరణముగా వేసినపొడిమట్టిగోడ, కరగోడ. (శ. ర. బ్రా.)

కోరదూషము. సం. వి. అ. పుం. కోద్రవము, అరికెచెట్టు.

కోరదౌడ. దే. వి. (కోర+దౌడ.) చప్పిదౌడ. "సీ. ఆరేయి గలనెల్లవారును గోరదౌడలును నల్లని మేను గలనెలంత,యొక్కత యుయు 'సొచ్చి యఁవిదల నీడిచికొనిపోవ... కనిరి." భార. మా. ౨౫. [పాగ. (వా.)

కోరపాగ. దే. వి. (కోర+పాగ.) ప్రక్కకుఁ జుట్టిన

కోరమీస = కోరమీసము. "గీ. కోరమీస మిడిగ్రుడ్లు ..." నైష. ౭, ఆ. ౯౩.

కోరమీసము. దే. వి. (కోర+మీసము.) బొద్దుగాఁ బెరిఁగి తుదను వంగినమీసము. "ఆ. మనుజరక్త సిక్తతనువును గోరమీసములు..." భార. అశ్వ. ౩, ఆ. ౮౭.

కోరము. ఉభ. దే. వి. 1. కోరుసాధనవిశేషము. (వా.); 2. ఒకానొకవిషకుసుమము. (బ్రా.) సం. వి. అ. పుం. 1. మొగ్గ; 2. చిన్నమొలక.

కోరవాయి. ద్వ. వి. (కోర+వాయి.) వాతరోగవిశేషము. ఆం. భా. ద్వి. ౯౨౫.

కోరవాఱు. దే. అ. క్రి. (కోర+పాఱు.) వికృతమగు; భయంకరమగు. "స్రగ్ధర...నేత్రాంతముల్ కోర వాఱన్,మీసంబుల్ దీటి పల్కన్..."వరాహ. ౩, ఆ. ౨౦.

కోరవోవు. దే. అ. క్రి. (కోర+పోవు.) 1. కొంకర వోవు. "వ. అట్టిసమయంబున నిరంతరధారాపాతంబునం దడిసి నలుదెసలం బఱచి ప్రేయువాయువునఁ గోరవోయి యొండొంటిచాటున కొదింగి ..." హరి. పూ. ౭. ఆ. ౧౭౧. విక్ర. ౧, ఆ. ౨౦౦; 2. (పక్షవాతము మొ. వానిచే) పడిపోవు.

"గీ...ప్రత్యుద్గమాభివందనము లెలమి, నడపకుం డిన మానినీ నన్నుఁ గన్న,నోరిమాటకుఁ దనకేమి కొరవోయె." భాగ. ౪. స్కం. ౪౨.

కోరసిగ. ద్వ. వి. (కోర+సిగ.) ఓరముడి, ముఖమునకుఁ బ్రక్కను వేసెడుజడముడి. "గీ. కోరసిగ వేయు చోటనే కొమ్ము వ్రట్టి." రామా. ౨, ఆ. ౧౧౦. వైజ. ౪, ఆ. ౬౭.

కోరా. దే. విశ. అవాహతము, తెలుపు చేయనిది. "మ. తలఁ గోరాముడిగుడ్డయున్..." చెన్న. ౫, ఆ. ౨౫౨.

కోరాడు. దే. స. క్రి. (కోరు+ఆడు.) 1. (గజాదులు) కుమ్ము. "క. జేగురుఁ గోరాడినమున,నాగఁబులరీతి..." జై. ౭, ఆ. ౧౬౭. వరాహ. ౧౧, ఆ. ౭౬; 2. (పందిమొ. నేల) కెల్లగించు. "(వరాహము) సీ. అవనీతలము మోర నలవోక గోరాడు..." విక్ర. ౨, ఆ. ౧౩౫; 3. దుమ్ము రేఁగఁగొట్టు. "గీ. గ్రొచ్చి కోరాడి తన్వారి కుతల మెల్ల." భాగ. ౯, స్కం. ౨౦౫. రామా. ౧, ఆ. ౨౦౬; 4. ధ్వంసముచేయు. "సీ. సరిదుపవన సరోవరములఁ గోరాడి మందలఁ గొందలమందఁ జేయు." భాగ. ౧౦, స్కం. ఉ. ౫౪౧.

కోరాబంగారు. దే. వి. (కోరా+బంగారు.) మట్టపు బంగారు, ఇతరలోహములతోఁ గలసి వన్నె తగ్గిన బంగారము. (శ. ర. బ్రౌ.)

కోరింద. దే. వి. జతూక, లక్క కలుగునొకతీఁగె. (శ. ర.) "సీ...కసింద కోరిందపొదల." ఆము. ౬, ఆ. ౧౩. య. ౧, ఆ. ౩౦.

కోరిక. దే. వి. (కోరు ధా. క. కోరికె.) 1. వాంఛ. "క. కోరికయుం నొల్లమియు లేక..." భార. శాం. ౬, ఆ. ౨౩౪. పారి. ౧, ఆ. ౫౧; 2. కోరికయొక్క ఫలము. "ఉ...ఇచ్చెదఁ గోరికవారి కోరికల్." దశా. ౧, ఆ. ౨౫౫; 3. వరము. "గీ. నలువ కోరిక లొసఁగెడినాడు..." అచ్చ. యు. ౮.

కోరికి = కోరిక. వాంఛ. "క. నీకోరికి యప్రతిహత,ము..." భార. ద్రో. ౨, ఆ. ౧౬౧.

కోరికిపడు. ద్వ. అ. క్రి. (కోరికి+పడు.) అపేక్షపడు, కోరు. "మ. విని వీక్షించినదాఁక ముచ్చట పడుక్ వీక్షించి గాఢోపగూ,హనలాభం బగు దాఁకఁ గోరికిపడున్..." మల్లభూ. శృం. ౨౨.

కోరికె = కోరిక. (వా. భ.) "క...మామకమానస, కేదారములందుఁ గోరికెలు ఫలియించెన్." తపతీ. ౧, ఆ. ౭.

కోరితము. సం. = కోరకితము.

కోరు. యు. దే. స. క్రి. (క. త. కోరు.) 1. వాంఛించు. "క. కోరినవంటకములు నా,సేరిమిఁ దగనిడిపి..." భార. విరా. ౧, ఆ. ౨౮౯. స్వా. ౨, ఆ. ౭౬; 2. వరించు. "ఉ...మృగాయతలోచన నన్నుఁ గోరునో,కోరదో..." దశా. ౧, ఆ. ౧౭౫; 3. ఎదురుచూచు. "గీ...ఉంటిఁ దన్నిదర్శనముఁ గోరి." దశా. ౧. ఆ. ౧౭౫; 4. చీరు. "సీ. తోరంపుఁ గొమ్ములఁ గోరి చెండాడుచో..." నృసిం. ౪, ఆ. ౧౨౧; 5. (కొబ్బరిమొ.) గుంజుతీయు. వ్యవ:—కొబ్బరికాయ కోరుము. వి. 1. (గీసిన) కొబ్బరిపదార్థము. ఉదా:—కొబ్బరికోరు; 2. పాలు,భాగము. "ఉ. వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ, గోరరి గొంచు సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి,స్తారము..." భార. భీష్మ. 3, ఆ. 3౦౯. ఆం. శే. ౪౫.

కోరురాజనాలు. దే. వి. బ. (కోరు+రాజనాలు.) ధాన్యవిశేషము, ఒకజాతిధాన్యము. "సీ...కోరు రాజనాల్ బుడమకోల్ రాజనాలు..." హంస. ౪, ఆ. ౧౨౮.

కోరుపెట్టు. దే. స. క్రి. (కోరు+పెట్టు.) బలియిచ్చు. "చ. అసులకుఁ గోరుపెట్టితికదా నినుఁ దమ్ముఁడ వైరిఁ జంపి యొ,వ్వరివలమూఁపుమీఁద విలువైతు నయోధ్యకు కొట్టు పోవుదున్." రామా. ౮,ఆ. ౩౮.

కోర్కి = కోరికి. "చ...ఇత్తెఱంగు కోర్కికిఁ గత మేమి..." భార. ద్రో. ౧, ఆ. ౧౦౯.

కోర్ణగండు = కోర్నపగండు. "మ...కోర్ణగండ్లు గురు పోతుల్ కొండగొఱ్ఱెల్..." ఇందు. ౨, ఆ. ౫౧.

కోఱ. వై. వి. (సం. ఖురుశి.) దంష్ట్ర. "ఉ. కోఱలు దీటుచున్ నయనకోణములున్ దహనస్ఫులింగముల్, కాఱఁగ..." హరి. పూ. ౪, ఆ. ౧౪౩. భార. విరా. ౪, ఆ. ౨౧౩.

కోఱకైదువ. వై. వి. (కోఱ+కైదువ.) దంష్ట్రాయుధము, పాము. "గీ...కోఱకైదువదునెదారి

గుఱుతుగట్టు,సామి సంతోసమున నున్నసమయ మునను." ప్రబంధ. ౨౧౦.

కోఱకొమ్ము. ద్వ. వి. (కోఱ+కొమ్ము.) వాఁడిమొన గలకొమ్ము. "సీ. మిాటిన క్రొవ్వాఁడి కోఱకొమ్ములఁ బుట్టలామకాడకను కోరాడి యాడి."వి. పు. ౭, ఆ. ౩౦౪.

కోఱడమాడు. దే. అ. క్రి. (కోఱడము+ఆడు.) పరిహసించు, వేళాకోళము చేయు. "ఉ. జీతికి కల్లు ద్రావి మదసింధురగామిను లన్నిశేరియాల్, వాఱుచు గొఁడుగీతములు పాడుచుఁ బొల్పుగఁ గ్రాలియాడుచున్,గోఱడమాడుచున్ బతులకున్ వశవర్తులుగాక మేరకున్,మిాఱుచు వన్యకాంతలు రమింతురు తద్విపినాంతరంబులన్." కు. సం. ౬, ఆ. ౪౫. (వన్నెకాండ్లు. ముద్రి. పా.) ఇట్లే: కోఱడము లాడు. నిర్వ. ౩. ఆ. ౯౯.

కోఱడము. దే. వి. 1. అపహాస్యము, వేళాకోళము (చూ. కోఱడమాడు.); 2. క్రోధము, కోపము. "చ...,తొడిఁబడ ప్రేసెఁ దీవ్రతరవోరసినిం దను నీడఁ బోక కోఁ,ఱడమున..." నిర్వ. ౫, ఆ. ౭౭; 3. క్రూరత్వము. "గీ.బాలకునిఁ జంపఁ దలఁచుట పాప మనక,కోఱడంబున నొండొరు మిాఱఁ బొఱ, వేఱువేఱయుంపాయముల్ వెదకి వెదకి..." దశ. ౨, ఆ. ౭౧; 4. దౌష్ట్యము. "గీ. అతనివెనుకన కర్ణుండు ననుజగణము, శకునియును వారిపొంతైన జనపతులును, బోయి రమ్మెయిఁ జని యొక్క ప్రోవుగట్టి,వేఱ యంతంత నుండిరి గోఱడ మున." భార. ఉద్యో. ౩, ఆ. ౭౭౪.

కోఱపల్లు. ద్వ.వి.ఔ. (కోఱ+పల్లు.) కోఱ,దంష్ట్ర. "సీ. దేవేంద్రమదభేది తెలిచాయ గలకోఱపంటి మొనల్ సానపట్టకొమ్ము." కుచేల. ౨, ఆ. ౧౦౨.

కోల. ఉభ. దే. వి. 1. దండము,కఱ్ఱ. "గీ...గొయ్యి, కోలఁ ద్రవ్వినమాత్రఁ బాతాళమూని,మేల సిద్ధింప నేర్చు..." భార. అశ్వ. ౩, ఆ. ౧౦౫; 2. బెత్తము. "గీ...పొగ్గడికత్తె లరిది,పైఁడి కోలలు పూని పే సదఁ డటంచుఁ,బల్లకీముందఱను బరాబరులు సేయ." య. ౪, ఆ. ౧౫౯; 3. గడ. (చూ. చెఱకుఁగోల.); 4. కామ. "చ గొడుగుల గాలిఁ గూల్చి మఱి కోలల తోడన పాఱ నార్చెఁ జేఁ,ద్వడ జడి మేఘుఁడు..." ఆము. ౪, ఆ. ౧౯౯; 5. పునుక. "క. చాలఁగ పరసిదపుంఖములు, కోలలఁ గెలఁకుట..."పిన.శకుం. ౩,ఆ.౧౭౦; 6. బాణము."క. వింటిని సారథి నొకకోలం దునిమిన ..."భార. భీష్మ. ౩,ఆ. ౩౩. హరి. ఉ. ౪,ఆ. ౧౫౫;7. ఇనుపసలాక. "సీ...దాపలి చేతియందు, బెడిదంపు గోలలు బెడఁగొంద..." భార. విరా. ౧. ఆ. ౨౧౧; 8. మరకుటి. 'గీ. గుదమునఁ జేపమానులు: గోల నొక్క,యూఱు...,చమిరి శౌచంబు సేయుట చమరుఁదనము."విజ్ఞా. ఆచా. ౩౯. విణ. దీర్ఘవృత్తము. (వ్యతి. గుండ్రము.) "సీ. బూరకాభులు నీచపోయిన పేతులఁ గోల మూఁపులు గుదిగొన్న తోదలు." ఉ. హరి. ౨, ఆ. ౧౧౨. సం. వి. ఆ. స్త్రీ. 1. పిప్పలి*; 2. చవ్య మనుగంధద్రవ్యము*.

కోలంకి. దే. వి. పక్షివిశేషము. (బ్రౌ.)

కోలంబకము. సం. వి. అ. పుం. వీణాశరీరము.

కోలకము. సం. వి. అ. న. 1. తక్కోలము*; 2. మిరి యము*; 3. ఒకానొకగంధద్రవ్యము. పుం. 1. ఊడుగు*; 2. ఐరిక*.

కోలకాఁడు. దే. వి. (కోల+కాఁడు.) 1. వేత్ర ధరుఁడు. "సీ. ఆజ్ఞలజీవ్రల నేర్పుయమాఁడు నాయుపడఱఁ, గోలకాఁడై యుండు వేళ యెఱిఁగి."శతకంఠ. ౪, ఆ. ౧౧౧; 2. కామాతు రుఁడు. "ద్వి. ఆలజేఁదునుబోలె నటయుటఁ జనుమఁ,గోలకాఁడును బోలెఁ గూర్మె నగొనుచు." పండితా. పర్వ. ౩౭౨. పు.

కోలక్రోఁతులు. దే. వి. బ. (కోల+క్రోఁతులు.) కోఁతి కొమ్మంచి, బాలక్రీడావిశేషము. "సీ. కోల క్రోఁతులు బిల్లగోడ్లు..." వి. పు. ౭, ఆ. ౨౦౨.

కోలగ్గెర. దే. వి. (కోల+గ్గెర) ఎద్దులను కాఁడి గట్టి క్రిందపడ వేయుట. ఆం. భా. తృ. ౩౨.

కోలగ్గెరద్రోయు. దే. స. క్రి. (కోలగ్గెర+ త్రోయు.) మాటకట్టుగాఁ బడఁ ద్రోయు; చాప చుట్టుగాఁ ద్రోయు. "గీ. ఆసియుఁ బాత్రయుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ, గోలగ్గెరద్రోయఁ దత్కుజముతోడ, నొరగి రక్కసుతో దైన్యవిర హితముగ, ధర్మ మెఱిఁగించుచూ త్తి నాకనిక ననియె." ఆము. ౬, ఆ. ౨౭.

కోలచారి. దే. వి. (కోల+చారి.) నాట్యవిశేషము. "ఉ. దేశివిధంబు రట్టణము దివ్యకలాసియుఁ గోల చారియున్." శ్రీరం. మా. ౪, ఆ. ౧౬౨.

కోలజొన్న. దే. వి. (కోల+జొన్న) ఒకరకపుజొన్న, పౌద్దాలకము. (శ. ర.)

కోలజెముడు. దే. వి. (కోల+జెముడు.) ఒకరకపు జెముడు. "గీ. నేలతీఁట కసిందయుఁ గోల జెముడు." హంస. ౪, ఆ. ౧౦. [(శ. ర.)

కోలదబ్బ. దే. వి. (కోల+దబ్బ.) ఒకజాతిదబ్బ.

కోలదలము. సం. వి. అ. న. నఖ మనుగంధద్రవ్యము.

కోలదివియ. ద్వ. వి. (కోల+దివియ) కాగడా, కరదీపిక. "ఆ. వారు సంభ్రమించి వడిఁ గోలదివియలు, గొనుచు నులివుమిగులఁ గూడఁబాఱి, నృత్తశాలఁ జొచ్చి..." భార. విరా. 3, ఆ. ౪, దశ. ౫, ఆ. ౯౦.

కోలదివ్వె=కోలదివియ. ద్వి. హరిశ్చ. ఉ. ౨3౧౯, పం.

కోలనిమ్మ. ద్వ. వి. (కోల+నిమ్మ). ఒకజాతినిమ్మ. (శ. ర.)

కోలపాల. దే. వి. (కోల+పాల) అర్కపుష్పిక. (శ. ర.)

కోలపొన్న. ద్వ. వి. (కోల+పొన్న.) అంఘ్రిపర్ణిక. ఆం. భా. ద్వి. ౫౫.

కోలమారి. దే. విశే. దుష్టుఁడు, పీడించువాఁడు. (బ్రౌ.)

కోలమారితనము. దే. వి. దౌష్ట్యము, పీడించుట. (బ్రౌ.)

కోలము. ఉభ. దే. వి. (త. కోలమ్.) నాట్యవిశేషము. "గీ. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి,మమునఁ గాళిక నిల్చి కోలము నటింప." ఆము. ౪, ఆ. ౯౦. (ముద్రి. పా. 'నీలికోలము' శ. ర. పా.) సం. వి. అ. పుం. 1. పంది; 2. తెప్ప; 3. శనిగ్రహము; 4. ఒడి; 5. కౌఁగిలి; 6. ఎలుక. న. 1. రేఁగుఁబండు; 2. పోఁటి; 3. త్రికటుకము. విశే. (పు. ఆ. అ.) కుంటిది.

కోలమెఱుఁగు. దే. వి. (కోల+మెఱుఁగు.) నిలువుమెఱపు, ఐరావతి. "ఉ. నీలపయోధరావలి విని ర్భరదీధితు లాడకాడకుం, గోలమెఱుంగుతండములఁ గొల్చి గ్రహించెదుమాడ్కి..." విష్ణు. నా. ౧, ఆ. 3౯. "సీ. శివుదిక్కునందు జేకువఁ గోలమెఱుఁగులు మెఱసె..." హరి. పూ. ౭, ఆ. ౧౬౦.

కోలలవారు. దే. వి. బ. (కోలలు+వారు) వేత్రధరులు. "వ...కోలలవారియొలుంగులును..." ఉ. హరి. 3, ఆ. ౨౭.

కోలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి.

కోలవస. ద్వ. వి. (కోల+వస.) జటిల. (శ. ర.)

కోలాకుపొన్న. ద్వ. వి. (కోల+ఆకు+పొన్న.) అంఘ్రిపర్ణిక. "సీ...చిత్రమూలము నల్లతీఁగె కోలాకుపొన్న..." హంస. ౪, ఆ. ౧౦.

కోలాట = కోలాటము. "వ... మోహనాంగులు... కోలాటలాడ..." ల. వి. ౫, ఆ. ౭౪.

కోలాటపుఁగమ్మ. దే. వి. (కోలాటము+కమ్మ.) కర్ణాభరణవిశేషము. "సీ. కడియాలుఁ జెక్కుజోకల యుంగరములు ముంగరయుఁ గోలాటంపుఁగమ్మ జోడు." కళా. ౭, ఆ. ౬౬.

కోలాటము. దే. వి. (కోల+ఆటము. త. కోలాట్టమ్.) 1. హల్లీసకము. ఆం. భా. ప్ర. ౧3౦; 2. బాలక్రీడావిశేషము. "సీ. కోలాటములు పిల్లఁగ్రోవులు..." హంస. 3, ఆ. ౧౪౬.

కోలారికమంపు = కొలారికమంపు. "క. సూరెలను నింద్రజుఁడు కొలారికమంపిన..." కువల. ౫, ఆ. ౫౫.

కోలారికము = కొలారికము. (చూ. కోలారికమంపు.)

కోలాస. దే. వి. (కోలు+ఆస.) 1. పేరాస. "సీ... దర్శనములు కోలాసఁ గొనక..." పిన. శకుం. ౪, ఆ. ౧౭౫; 2. దురూహ, చెడ్డయాలోచనము. (బ్రౌ.)

కోలాసకత్తియ. ద్వ. వి. (కోలాస+కత్తియ.) పేరాస గలస్త్రీ. "ద్వి. పుట్టినప్పుడే నేర్చుబుద్ధులపోక, కోలాసకత్తియ..." పండితా. పురా. ౧౨౨, పు.

కోలాహలము. సం. వి. అ. పుం. కలకలము, పెద్దగోద.

కోలి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. రేఁగు; 2. గంగరేఁగు.

కోలు. దే. వి. (కొను. ధా.) 1. అనుప్రయుక్తమైన కొనుధాతువునకు భావార్థకరూపము. "సీ... తెచ్చికోలు మార్గ్యమున డాఁచి." స్వా. 3, ఆ. ౯౭; 2. కొల్ల; బలి. "క. మున్నును నేఁ గారణముగ, నన్నియుదుమ లనుభవించి రనుజులు వీరిం, గన్నారఁ జూడుఁగాని జగన్నుత భీష్ముఁడుఁ గోలుగా నిడఁజాలన్." భార. భీష్మ. 3, ఆ. ౨౮౦. క్రి. విశే. మిక్కిలి. (చూ. కోలుమసఁగు.) విశే.

పెద్ద. (చూ. కోలుపులి.) అవ్య. మొదలుకొని, ఉండి. "గీ. ఇప్పు డేడాదిగోల్ సామి యేఁగు డేమి, నేల యీవిక తెలుఁగున నోలి నెపుడుఁ, గడిమి నెడయాక తిరుగుమెకంబు లడవి." య. ౧, ఆ. ౧౦౬.

కోలుకాఁడు. దే. విణ. (కోలు+కాఁడు.) 1. కావలివాఁడు. "క. కనుఁగొనినమాత్ర నొండొరు,మనములు నొడఁబడిన వారి మఱి యెక్కడనుం, జనకుండ సడ్డుపెట్టఁగ, మనసిజుఁ డనుకోలుకాఁడు మాటికిఁ దఱిమెన్." విక్ర. ౪, ఆ. ౨౫; 2. సుంకరి క్రిందిబంటు. "సీ. వెనుఁగోలుకాండ్రకు జనసమూహంబులగణుతి చూపెడునాయక ప్రభుండు." హంస. ౨, ఆ. ౪౯; 3. నియమించు నధికారము గలవాఁడు. "క. పులి కోలుకాఁడు గావున, నలయక పరు నెఱిఁగి వాని ననుపఁగ ..." నా. పంచ. ౧, ఆ. ౨౪౬; 4. ముద్రలు వేయునధికారి. (బ్రౌ.)

కోలుకొను. దే. అ. క్రి. (కోలు+కొను.) 1. ఉత్సహించు. (చూ. కోల్కొను.); 2. వర్ధిల్లు. (చూ. కోల్కొను.); 3. తేఱుకొను. "గీ. కొంతమాత్ర పుటేవి గా కింతలేపి, తలముతప్పినయీవృషు తగునె యియ్య, నిచ్చి మఱి కోలుకొన లేక యేపుఁ దఱిఁగి,పోవఁ దెగడరె జనులు దుర్బుద్ధి యనుచు." హరిశ్చ. ౪, ఆ. ౭౩.

కోలుకొలుపు. దే. స. క్రి. (కోలుకొను. ధా.) ప్రోత్సహించు. "సీ. రవిఁ దెత్తుమే నీకు రమణుండుగా నల కూబరుఁ దెత్తుమే కోలుకొలిపి." కు.సం.౬,ఆ.౧౭.

కోలుకోలన్నలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. గుజ్జెనగూడులు కోలుకోలన్నలు గీరనగింజలు ..." హంస. ౫, ఆ. ౧౫౫.

కోలుతల. దే. వి. (కోలు+తల. త. కోలుదల్.) 1. ముఖాముఖిఁ జేయుయుద్ధము. "క. భూరిబల ఘోర మగునా,భూరతుఁ ఱునికోలుతలకుఁ బోవక భీష్మ,స్ఫారఫలము ద్రోణునిదో,స్సారంబును నచ్చి నీదుసైన్యము పెనఁగెన్." భార. భీష్మ. ౨, ఆ. ౧౦౯; 2. యుద్ధసన్నాహము. (చూ. కోలుతల సేయు.)

కోలుతలసేయు. దే. అ. క్రి. (కోలుతల+చేయు.) యుద్ధమునకుఁ బ్రోత్సహించు. "గీ. ఉన్నచోటన కదలక యున్న ద్రోణ,భీష్మునకు గోలుతల సేయఁ జెడికి సేన. చంద్రుఁ డుదయించఁ బెరిఁగినశరధియట్లు, తోడుతోడుతఁ బొంగారి చూడ నొప్పె." భార. భీష్మ. ౨, ఆ. ౧౧౭.

కోలుపడు. ద్వ. అ. క్రి. (కోలు+పడు.) పరపృత మగు, దొంగిలింపఁబడు. "క. హరిభార్యలు బోయలచేఁ, బరిభవమును బొంది కోలుపడిరి..." వి. పు. ౭, ఆ. ౨౭౩. స. క్రి. పోఁగొట్టుకొను. "చ. తమపగపాలు గోలుపడి దాసిన యిప్పుడు గోరువీరికిన్, సముచితవృత్తి నిచ్చి..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౯. భా. రా. యు. ౫౯౪.

కోలుపాటు. ద్వ. వి. (కోలుపడు. ధా.) కోలుపడుట. (చూ. కోల్పాటు.)

కోలుపుచ్చు. దే. స. క్రి. (కోలుపోవు. ధా. ప్రే.) 1. పోఁగొట్టు, నశింపఁజేయు. "చ. ...ధృతిఁ గోలుపుచ్చెఁ గుసుమాయుధుఁడు..." భార. విరా. ౨. ఆ. ౨౬౩; 2. చంపు. "ఉ. ఏమఱి రక్ష సాలనిమృగేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు..." భార. భీష్మ. ౧, ఆ. ౭౦.

కోలుపులి. దే. వి. (కోలు+పులి.) వ్యాఘ్రము, పెద్ద పులి. భార. విరా. ౧, ఆ. ౭౩.

కోలుపోక. దే. వి. (కోలుపోవు. ధా.) పోఁగొట్టుకొనుట. "ఉ. పంకజనాభ మాపడినపాటులు రాజ్యముకోలుపోకయున్." భార. ద్రో. ౩, ఆ. ౧౩. దశ. ౪, ఆ. ౧౦.

కోలుపోవు. దే. అ. క్రి. 1. చెడు. "ఆ. ఇట్టు లగుట యెఱిఁగి యొల్లభంగుల రహస్యంబు కోలుపోని యట్లు గాఁగ, నడరునీదుకోర్కి కనుమాప మెట్టిది, యట్టిభోగభంగి ననుభవింపు." భార. విరా. ౭, ఆ. ౨౬౨; 2. మోసపోవు. ఆం. భా. తృ. ౯౭.

కోలుమసఁగు. దే. అ. క్రి. (కోలు+మసఁగు.) 1. మిక్కిలి విజృంభించు. "చ. కుపితయుగాంత రుద్రుగతిఁ గోలుమసంగినవాఁడు భీష్ముఁడు..." భార. భీష్మ. ౧, ఆ. ౧౩౭; 2. మిక్కిలియగు. "సీ. కోలుమసంగెడు కోర్కులవెనువెంట..." భార. విరా. ౨,ఆ. ౩౧౫. స. క్రి. చంపు. "సీ. తండ్రి యధ్వరవిఘాతకు బారిసమరిసఁ గొడుకు శంఖనఖాఖ్యుఁ గోలుమసఁగి." కకు. ౨, ఆ. ౧౧౭.

కోలుముందు. దే. వి. (కోలు+ముందు.) అతిశీఘ్రత, అన్నిటికంటె ముందు. "గీ...నయ్యెబలమీద. నలిననాభుండు కనుచేసినాఁడు వానిఁ,గోలుముం దుగ నీవ చేకొనఁగవలయు."వరాహ.౧౧,ఆ.౫౨.

కోలుమొసడి = కోలుమొసలి. (చూ. కోల్మొసడి.)

కోలుమొసలి = కోల్మొసడి. (చూ. కోల్మొసలి.)

కోలె. దే. వి. కొయ్యకాలు. పెన్నుకోసినకాఁడ. (క. ర. ప్రా.) అవ్య. ద్రు. 1. మొదలుకొని, ఉండి. "సీ...నిన్నటఁగోలె..." భార. ఆది. ౭, ఆ. ౧౧౭. భార. విరా. ౧, ఆ. ౭౪; 2. వఱకు, దాఁక. "వ...దానిశరీరసౌగంధ్యంబు యోజనంబునంగోలె జనులకు నేర్పడుచుట్టుగాఁ బ్రసాదించిన నది గంధవతి యనియు యోజన గంధి యనియుఁ బరఁగి..." భార. ఆది. ౩,ఆ.౪౧.

కోలెముక = కోలెమ్ము. "ఉ. కొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు..." భార. సౌ. ౧, ఆ. ౧౭.

కోలెమ్ము = కోలెమ్ముక. "ఆ. నేలఁ బెట్టి వానికోలెమ్ము బల్లన, విఱిచి..." భార. ఆది. ౬, ఆ. ౨౧౫.

కోలెమ్ముక. దే. వి. (కోల+ఎమ్ముక.) వెన్నెముక. "గీ... కోలెమ్ముకయును విఱుగ..." స్వా. ౪, ఆ. ౫౭.

కోల్కొను = కోలుకొను. 1. (ఇష్టపడు.) "ఉ... బంధువర్గమున్, ఘోరముగా వధించుటకుఁ గోల్కొనపన్నది బుద్ధి..." భార. ఉద్యో. ౪, ఆ. ౯౦; 3. (అతిశయించు.) "క. దీప మణఁగఁ జీఁకటియును, గోప మడఁగ శాంతిగుణముఁ గోల్కొను క్రియ..." పాండు. ౪, ఆ. ౧౭; 3. (లేచుకొను.) "క. నరసూను నపుడు కర్ణుఁడు, డిరుమూఁడుశిలీముఖంబు లెద నించిన నొచ్చి రయంబునఁ గోల్కొని..." జై. ౭, ఆ. ౧౯.

కోల్తల = కోలుకల. 1. (ముఖాముఖిఁ జేయు యుద్ధము.) "క. ఆకలనప్పుడుగోల్తలకుం,గాక కలంగఁబడి వాల్గుగడలకు విచ్చెఁ జీకాకుపడుచు నంగము, హీ కాంతునిసేన లెల్ల నెంతయు భీతిన్." కళా. ౬, ఆ. ౭౦; 2. (తీవ్ర మగుదెబ్బ.) "చ. కురుఁ దనుతీవ్రమారుతముకోల్తల కోర్వక..." భార. ద్రో. ౧, ఆ. ౨౬౭.

కోల్తలసేయు = కోలుకలసేయు. 1. (యుద్ధసన్నాహము చేయు.) ఆం. శే. ౧౩; 2. (యుద్ధము సేయు.) "ఆ. అతఁడు వడిన వెండి యాసేన గోల్తల,సేయు..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౧౭; 3. (యుద్ధమునకుఁ బ్రోత్సహించు.) "క. బరవస మునఁ గోల్తలసేసిరి పురికొని కడఁగి దైత్యసేనలు మగుడన్." నిర్వ. ౩, ఆ. ౧౪; 4. (సైన్యము నడపు.) "క. సమరధుఁడు బిరుదు లక్ష్మణ,కుమార కుం దేచి మొనలఁ గోల్తలసేయున్." భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౪.

కోల్పడిపోవు = కోలుపోవు. (పోఁగొట్టుకొను.) "ఉ...నిన్ను నమ్మి నా,గుట్టును తేజముల్ మిగులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్." పారి. ౧, ఆ. ౧౨౭.

కోల్పడు = కోలుపడు. అ. క్రి. 1. (క్షీణించు.) "క. అలకాఁపువగలచిలుకల, కొలికికిఁ దమి యింత యైనఁ గోల్పడక..." హంస. ౪, ఆ. ౧౫౫; 2. (చంపఁబడు.) "చ. అడవిం గోల్పడుప్రాణి యెయ్యదియు లేక..."హరి. పూ. ౭, ఆ.౧౦౪. స క్రి. 1. (పోఁగొట్టుకొను.) "చ...కోల్పడి తీవును నీదుశీలమున్." భార. శాం. ౩, ఆ. ౧౪౫; 2. (ఓడిపోవు.) "చ...నిన్నునుం,బుడమిని దమ్ముఁ గోల్పడిరి పొల్తి భవత్పతు లైనపాండవుల్." భార. సభా. ౨, ఆ. ౧౪.

కోల్పాటు = కోలుపాటు. 1. (పోఁగొట్టుకొనుట.) "గీ. ధరణిరాజ్యముగోల్పాటుఁ దండ్రిచావు..." భార. అర. ౧, ఆ. ౨౧; 2. (చావు.) "శా. కుంతీసూనునిచేతఁ గర్ణున కనిం గోల్పాటు వాటిల్లునే." భార. కర్ణ. ౩, ఆ. ౨౭౫.

కోల్పుచ్చు = కోలుపుచ్చు. (చెఱచు, నశింపఁజేయు.) "గీ. మిగిలి యప్పాండవాగ్రజుమగఁటిమియును, జలముఁ గోల్పుచ్చి తూలఁబోఁ బలికి..."భార. కర్ణ. ౧, ఆ. ౧౪౨.

కోల్పులి = కోలుపులి. (పెద్దపులి.) "క. గొఱియల పిండునకుఁ గవియుకోల్పులిక్రియ..." భార. భీష్మ. ౧, ఆ. ౨౯౬.

కోల్పోవు = కోలుపోవు. (స. క్రి. పోఁగొట్టుకొను.) "గీ. కాంతిసంపదఁ గోల్పోయి కలియుగంబు, సాధ్వసాలిరేకంబున జలదరించె."వైష.౭,ఆ.౯౬.

కోల్మసఁగు = కోలుమసఁగు. (అ. క్రి. విజృంభించు.) "చ......ఆదిసూ, కరములపోలెఁ గోల్మసఁగి

వైపునఁ గొన్ని మహాంపగంధపిం డురములు..."
కు. సం. ౧౧, ఆ. ౧౪౩.

కోల్మొసడి = కోలు మొసడి. భార. ఆది. ౮,ఆ. ౧౪౮.

కోల్మొసలి = కోలుమొసలి. కళా. ౪, ఆ. ౧౪౬.

కోవ. దే. వి. 1. హారము. "ఉ...సురాంతకుభాగ్య రత్నపుం,గోవ యనం దనర్చినత్రికూటము సుమ్మిది లక్ష్మణాగ్రజా." రామా. ౭, ఆ. ౧౪౦; 2. హారములోనిపేట. "ఉ. క్రొత్తమెఱుంగుముత్తియపుఁగోవయొ వాలుమెఱుంగుఁదీవయో." సుప. ౪, ఆ. ౬౨; 3. ముత్యము. (చూ. కోవలుపడు.); 4. బిడ్డలగొంతురోగము. "ద్వి. అటిమియో కోవయో యంగిటిమల్లో." బస. ౩, ఆ. ౩౬౫. పం; 5. కోరు,గోపురాకారముగా నుండుపుట్టచివర. (శ. ర.); 6. వంశానుక్రమము. (బ్రౌ.)

కోవరము. దే. విశే. గాఢము,అధికము. "క. కోవరపుంబ్రేమఁ గాఁపుకొడుకు కవ్వేళన్." వేం. పంచ. ౪, ఆ. ౪౯౭.

కోవలుపడు. ద్వి. అ. క్రి. (కోవలు+పడు.) ముత్యములకోవవలె నుండు, ముత్యములు రాలినట్లుండు. "క. ఆవృషలీపతి యూవ,జ్జీవంబుగ నంతనంతఁ జేసినవానాం,హోవిసరంబులు పటమునఁ,గోవలుపడ వ్రాసి చిత్రగుప్తుఁడు దాఁచెన్." పాండు. ౫, ఆ. ౭౪. (స్పష్టముగా, విపరముగా నని భావము.)

కోవి. దే. వి. జాడు,క్షీణసస్యము. ఆం.భా.ద్వి. ౬౩౭.

కోవిదారము. సం. వి. అ. పుం. ఎఱ్ఱకాంచనముచె.

కోవిదుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పండితుఁడు; విద్వాంసుఁడు.

కోవు. దే. వి. ఆర్పుటయం దగుధ్వని కనుకరణము. "ఉ...కంతుఁ డుగ్రుఁడై.కో వని యార్చి..." పిన. శకుం. ౩, ఆ. ౩౪. కళా. ౬, ఆ. ౯౧.

కోవురము. దే. వి. 1. చెట్లపైఁగాని గుట్టలపైఁగాని యెక్కి వైరులను బొంచి చూచుట. ఆం. భా. తృ. ౬౯. "గీ. ఉదయగిరిమీఁద గోవురం బుండి నిగుడు, నహితరవిరశ్మిచే బద్ధుఁ డగుచుఁ దోడి, బలగ మైనట్టిచుక్కలవలనత్రోవఁ,జూపు నేతెంచె నన వేగుఁజుక్క వొడిచె." స్వా. ౩, ఆ. ౫౪.

కోవెల. యు. దే. వి. 1. గుడి. "ఉ. కోవెలవారుపత్తెమునకుం బనిఁ,బూనియుం..." ఉ. రా. ౭, ఆ. ౬౯. బహు. ౫, ఆ. ౬౦. ఆం. సం. ౭౯; 2. వర్తులదీర్ఘ దేవాలయము. ఆం. బా. ద్వి. ౧౯.

వై. వి. (సం. కోకిలః.) కోయిల, పికము. "సీ. తులకించుమూఁడవ తొలిపల్కు రవళికో వెలకూఁతలకు నొక్కవింత నెఱప." యు. ౭, ఆ. ౫౦. దశా. ౩, ఆ. ౧౭.

కోశకారము. సం. వి. అ. పుం. 1. పట్టుపురుగు; 2. ఒకరకపుచెఱకుచె.

కోశపల. సం. వి. ఆ. స్త్రీ. మహాకోశాతకి, పెద్దబీఱచె.

కోశము. సం. వి. అ. పుం. న. 1. పాత్రము; 2. పెట్టె; 3. కత్తియొఱ; 4. కప్పు; 5. రాశి; 6. బొక్కసము; 7. వెండిబంగారములు; 8. నిఘంటువు; 9. గ్రంథము; 10. మొగ్గ; 11. జాజికాయ; 12. పట్టుకాయ; 13. ఆఁడుగుఱి; 14. వృషణము; 15. గుడ్డు; 16. పంచకోశములలో నొకటి. (అన్నమయ,ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశము లని యివి యైదు.); 17. ఇల్లు; 18. తత్తి; 19. జాజికాయ బెరడు; 20. ఒకానొకదివ్యము.

కోశలికము. సం. వి. అ. న. లంచము.

కోశాగారము. సం. వి. అ. పుం. బొక్కసము.

కోశాతకి. సం. వి. ఆ. స్త్రీ. 1. బీఱచె; 2. పొట్లచె; 3. ఆవడచె.

కోశాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. 1. బొక్కసముపై నధికారి; 2. కుబేరుఁడు.

కోశామ్రము. సం. వి. అ. పుం. కొండమామిడిచె.

కోషము. సం = కోశము.

కోష్ఠము. సం. వి. అ. పుం. 1. సామగ్రు లుంచెడు గది; 2. గాదె. (పాణక మొ.); 3. కడుపులోని భాగము; 4. ఇంటిలోపలిభాగము.

కోష్ణము. సం. వి. అ. న. ఇంచుక వేఁడి. విశే. (అ. ఆ. అ.) ఇంచుకవేఁడి కలది.

కోసము. దే. అవ్య. 1. కొఱకు, నిమిత్తము. "ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితినేనియుం..." ఉ. రా. ౮, ఆ. ౮౯; ౧, ఆ. ౧౬౯; 2. కారణమున. "క. పోది నప్పయిం సేనను బన్నిద మాడినకోస మీతనిం దెచ్చితి..." వై. జ. ౩, ఆ. ౯౯.

కోసరము = కోసము. (క. కోసర.) (కొఱకు.) "సీ. ముక్తికోసరము..." నరసింహశతకము. ౭;౫౭.

కోసలు. సం. వి. అ. స్త్రీ. అయోధ్యాప్రదేశము.
కోసలము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.
కోసు. వై. వి. (సం. క్రోశః) క్రోశము. "గీ...పదు కోసులు..." భీమ. ౧. ఆ. ౭౭. విశే. దీర్ఘము.
ఉదా:—కోసుముక్కము. (బ్రౌ.)
కోస్టు. వై. వి. (సం. కుష్ఠమ్) చెంగల్వకోస్టు, పాటి ఛావ్యము. (శ. ర., సూ. ని.)
కోస్తా. ఆం. వి. (Coast) సముద్రతీరము.
కోహళము. సం. వి. అ. పుం. 1. కాహళము; 2. ఒకరకపుమద్యము.
కోహళి. దే. వి. ఆలవట్టము, ఉల్లడ. "సీ. పార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్నయలపుగెందమ్మి కోహళియనంగ...గీ...భానుబింబంబు గన్నుల పండువయ్యె." ఉ. హరి. 3, ఆ. ౭౬. "శా. మాళిగ్ గోహళి సంఘటించినక్రియన్ మధ్యాహ్నవేళన్ మహాకాళం బైననభోవిభాగమున పెక్కం గాసె బీఱెండ..." హర. ౭, ఆ. ౧౦౯.
కోహళుఁడు. సం. వి. అ. పుం. నాట్యశాస్త్రప్రవర్తకుఁ డైనయొక ముని.
కోహో. దే. వి. పరిహాసము చేయుటయం దగుధ్వని కనుకరణము. "వ...కేలుచఱచి కోహో యని గేలిసేయుఁగణికాకదంబంబుల చప్పటులు..." ఆము. ౪, ఆ. ౩౫.
కోళ. దే. వి (క. కోళ.) బొండ, ద్రుపదము. "ద్వి. మాలినఁకేలఁ జాఱ నూఁకి బంగారు, కోళంబులోఁ గాలు గ్రుచ్చినట్లయ్యె." ప్రభులిం. 3, ఆ. ౭3. పు.
కోళిగి. దే. వి. సతి. "వ...మధుసూదనునకుఁ గోళిగి ..." ప్రబంధ. ౭౭౦.
కోరె. దే. విశే. విస్మితుఁడు, వెఱఁగుపడినవాఁడు. ఆం. భా. శృం. ౯.

## కౌ.

కౌ. దే. వి. 1. వృత్తియందు కౌనుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా:—కౌఁదీఁగె. హా. కౌను.); 2. కాకధ్వని కనుకరణము. (దీనియామ్రేడితరూపము కౌకౌ.) "శా. ప్రాతఃకాలము వాయసంబు పఠనాపత్యోక్త శాస్త్రంబులోఁ, దాత్పర్యంబులు చెప్పఁడెవ్వి యను చందం బొప్పఁ గౌ కౌ యనన్, జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిలవ్రాతం బిచ్చెఁ దుహీ తుహీ యని గృహారామప్రదేశంబులన్." నైష. ౮, ఆ. ౧౭.
కౌంకణము. సం. = కోంకణము.
కౌంతి. సం. వి. ఈ. స్త్రీ. రేణుక యనుగంధ ద్రవ్యము.
కౌంతేయుఁడు. సం. వి. అ. పుం. కుంతికొడుకు.
కౌఁగిలి. దే. వి. హా. 1. భుజాంతరము, క్రోడము. "మ. పొలతుక్ గౌఁగిట గ్రుచ్చి యెత్తి తల్పంబ్రాల్చోయించునవ్వేళ..." పారి. పీఠి. ౪; 2. ఆలింగనము, కౌఁగిలింత. "క. నలకూబరుబిగికౌఁగిట, నలరుచు సుఖయించు రంభయఁట..." ఉ. రా. ౪, ఆ. ౨౩౧. ఇందు. ౬, ఆ. ౧౩౫.
కౌఁగిలించు. దే. స. క్రి. 1. ఆలింగనముచేయు. "చ...పైఁబడి కౌఁగిలించినన్." శశాం. 3, ఆ. ౭౯; 2. ఆక్రమించు. "సీ. తరళతాటంకరత్నప్రభాసంఛ్లోభి గండస్థలంబులఁ గౌఁగిలింప." కాశీ. ౧. ఆ. 3; 3. పట్టుకొను. "గీ. కర్ణశష్కులికలశంబుఁ గౌఁగిలించి,యూఁదఁజేయుచు..." నైష. ౨, ఆ. ౭.
కౌఁగిలింత. దే. వి. (కౌఁగిలించు. ధా.) ఆలింగనము. "చ. హృదయము లెప్పుడున్ గదియకే తఱచౌ వెడకౌఁగిలింతలన్." ఆము. ౨, ఆ. ౬౨.
కౌఁగిలింపు=కౌఁగిలింత. "సీ. తరితీపు పెఱుంగనితలిరు లేవడిచూపు కరఁగింప నెఱుఁగనికౌఁగిలింపు." చంద్రా. ౬, ఆ. ౧౪౮.
కౌఁజు. వై. వి. (సం. కపింజలః.) కపింజలపక్షి. "సీ. కౌఁజుపోఁజులఁ బోవఁగానీక..." రసిక. ౧, ఆ. ౧౧౫.
కౌకృత్యము. సం. వి. అ. న. 1. అకార్యము చేయుట; 2. పశ్చాత్తాపపడుట.
కౌక్కుటికుఁడు. సం. వి. అ. పుం. 1. కపటి, వంచకుఁడు; 2. కుక్కుటముపలెఁ గ్రిందికిఁ జూచుచు నడచు యతి.
కౌక్షింభర్యము. సం. వి. అ. న. పొట్టపోసికొనుట. "స్రగ్ధర. కౌక్షింభర్యంబు దీర్పం గడుపున కిడుదుం గాలసంప్రాప్తభిక్షన్." భీమ. 3, ఆ. ౨౦౦.
కౌక్షేయకము. సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.
కౌచే. దే. వి. 1. చేపమీఁదిపొలుసు. "మ. దివిజద్వేషి సుదారవారిచరమూర్తిం ద్రుంచి చాతుర్యమొప్ప వడిం జొకపుఁజెల్లకౌచుగమి దంభిం

బొందమైఁ దాల్చి...." ఆము. ౪, ఆ. ౧౭; 2. చర్మముపైఁ గలపొట్టు. "సీ. క్రొవ్వినపందులఁ గొన్నిటిఁ గమలిచి కత్తిఁగాలచు జిహ్వ కౌచు గడిగి." ప్రబంధ. ౫౧౦; 3. మాంసము. "మ...కౌచుదో౽బ్బగుడుల్ చన్నులు హేమకుంభములె..." మల్లభూ. వై. ౧౬. ('స్తనౌ మాంసగ్రంథీ కనక కలశావిత్యుపమితా' అని మూలము.); 4. మర్గంధము. "సీ. పవిటినతులపాలిండ్లపై గంబూర నవహారములఁ జిప్పకౌచు మాన్చు." ఆము. ౨, ఆ. ౨. (బ్రౌ. పా.) నరస. ౧, ఆ. ౩౫.

కౌచేముచ్చు. దే. వి. (కౌచు+ముచ్చు.) మాంసాహారి, రాక్షసుఁడు. (బ్రౌ.)

కౌచేమేపరి = కౌచుముచ్చు. ఆం. భా. కృ. ౬.

కౌటికుఁడు. సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులను జంపి విక్రయించుకసాయివాఁడు. విణ. (అ. ఈ. అ.) 1. వలతోఁ బిరుకువాఁడు; 2. కుటిలుఁడు.

కౌటిల్యము. సం. వి. అ. న. 1. వంకర; 2. కుటిలత్వము; 3. కౌటిల్యునియర్థశాస్త్రము.

కౌటిల్యుఁడు. సం. వి. అ. పుం. చాణక్యుఁడు, అర్థశాస్త్రగ్రంథరచయిత.

కౌటుంబము. సం. విణ. (అ. ఈ. అ.) 1. కుటుంబమునకు వలయునది; 2. కుటుంబసంబంధి.

కౌటుంబికుఁడు. సం. విణ (అ. ఈ. అ.) 1. కుటుంబము పోషించువాఁడు; 2. కుటుంబములోనివాఁడు.

కౌడు. వై. వి. (సం. కపటకః.) కపటము. ఆం. భా. ప్ర. ౧౩౮.

కౌడువు. దే. వి. కైవడి, వలె. ఆం. భా. ద్వి. ౩౦౨.

కౌడుపెట్టు. దే. స. క్రి. (కౌడు+పెట్టు.) మోసగించు, కపటముచేయు. "క. అనుటయుఁ నతిమత్సరతన్, బెనఁగెడువారలను గౌడుపెట్టి పటువిక్రైఁ, గొనియెద నీవస్తువు లని..." షోడ. ౨, ఆ. ౪౦. (శ.ర. పా. 'కాడుపెట్టి' ముద్రి. పా. కౌడుఁబెట్టి. శ. ర.) [మూలరేఁడు.

కౌణపుఁడు. సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు; 2.

కౌతుకము. సం. వి. అ. పుం. 1. తహతహ, అనుభవింపవలెనను కోరికయందాశ; 2. పెండ్లియందు చేతికి గట్టుకొనెడితోరము; 3. ఉత్సవము; 4. వేడుక; 5. సంతోషము; 6. కోరిక; 7. కల్యాణపరంపర; 8. పరిహాసము.

కౌతుకి. సం. విణ. (క్రి. సి. క్రి.) కౌతుకము గలవాఁడు.

కౌతుకితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) = కౌతుకి.

కౌతూహలము. సం. = కుతూహలము. "ఉ. అహార్ణాక్షి ముద్దియల కౌతుకపుష్పలవంత ఛాకకౌతూహలిగా స్పృశించుచునెడ..." శైవ. ౬, ఆ. ౧౮.

కౌద్దాలికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) గుద్దలితోఁ ద్రవ్వి జీవించువాఁడు. "ఉ. ..చక్రవర్తి పాళికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూలకౌద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై." భాగ. పీఠి.

కౌద్రపీణము. సం. వి. అ. న. ఆర్ద్ర పంకభూమి.

కౌను. దే. వి. 1. నడుము. "సీ. అచ్చుపడకౌఁదీఁగ యందంబు..." భార. శాం. 3, ఆ. ౨౮. విరా. ౪, ఆ. ౨౫. స్వా. 3, ఆ. ౬; 2. కొంటెనడుము. "చ. పిడికెఁడు కౌనుఁ గొప్పఁ గని ప్రేమఁ ద్రివక్రసమాంగిఁ జేసితేఁ. బిడికెఁడుకౌనుఁ గొప్పఁ బయిపెచ్చు గుణంబుకు గంటి నంచు..." ఆము. ౧, ఆ. ౮; 3. పావరకావిశేషము. (చూ. కవును.)

కౌపము. సం. వి. అ. న. నూతినీరు. విణ. (అ. ఈ. అ.) నూతిసంబంధమైనది.

కౌపీనము. సం. వి. అ. న. 1. అకార్యము; 2. గోఁచి; 3. గుహ్యావయవము.

కౌబేరము. సం. వి. అ. న. 1. చెంగల్వకోష్టు; 2. ఒకరకపుచిండివాఁట. విణ. (అ. ఈ. అ.) కుబేర సంబంధమైనది.

కౌమారము. సం. వి. అ. న. బాల్యమునకుఁ దరువాతియవస్థ. విణ. (అ. ఈ. అ.) 1. కుమారునకు సంబంధించినది; 2. కుమారస్వామికి సంబంధించినది.

కౌమారి. సం. వి. ఈ. స్త్రీ. 1. సప్తమాతృకలలో నొకతె; 2. బ్రహ్మచారిని పెండ్లాడిన స్త్రీ.

కౌమారికేయుఁడు. సం. వి. అ. పుం. కన్యను పెండ్లాడినపురుషుఁడు.

కౌముదము. సం. వి. అ. పుం. కార్తికమాసము.

కౌముది. సం. వి. ఈ. స్త్రీ. 1. వెన్నెల; 2. కార్తికపూర్ణిమ; 3. ఆశ్వయుజపూర్ణిమ; 4. ఉత్సవము.

కౌమోదకి. సం. వి. ఈ. స్త్రీ. 1. విష్ణుగద; 2. ఒకానొకతీర్థము. పాండు. ౨, ఆ. ౧౫౦.

కౌరవుఁడు. సం. వి. అ. పుం. కురువంశపువాఁడు.

కౌరు. దే. వి. కవురు. (శ. ర.)

కౌలటినేయుఁడు. సం. వి. అ. పుం. భిక్షుకియం బతి ప్రకయు నైనవాని కొడుకు.

కౌలటేయుఁడు. సం. 1. కౌలటినేయుఁడు; 2. కులట కొడుకు.

కౌలటేరుఁడు. సం. వి. అ. పుం. కులటకొడుకు.

కౌలవ. సం. వి. అ. పుం. బవాదికరణములలో నొకటి. (చూ. కరణము.)

కౌలీనము. సం. వి. అ. న. నింద. 1. అకార్యము; 2. అకార్యకరణము; 3. పశుపక్ష్యాదులపోరడము; 4. జగడము; 5. కులీనత; 6. గుహ్యావయవము. విశే. (అ. ఆ. అ.) వంశపరంపరగా వచ్చినది. (ఆచారము మొ.)

కౌలు. దే. వి. (హిం. ఖౌల్. క. కౌలు.) 1. రాజాదులు ప్రజల కిచ్చునభయపత్త్రము. ఆం. భా. ద్వి. ౧౪౪. 'సీ. జగిజాలు దగుకలు చిగురాకు నకుఁ బ్రాకు కలికికోయిలలకుఁ గౌలు పనుప." కుచేల. ౪, ఆ. ౧౩౪; 2. ఈనాందారు రైతునకు వ్రాసి యిచ్చుపత్త్రము. (చూ. కదపా.) 3. (వేదాదులలోని) క్రమము. (చూ. కవులు.)

కౌలేయకము. సం. వి. అ. పుం. కుక్క. విశే. (అ. ఆ. అ.) మంచికులమునఁ బుట్టినది.

కౌశలము. సం. వి. అ. న. 1. క్షేమము; 2. నేర్పరితనము. భార. ఆది. ౭, ఆ. ౧౭౦. [కానుక.

కౌశలి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుశలప్రశ్నము; 2.

కౌశల్యము. సం = కౌశలము.

కౌశికము. సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ; 2. ముంగిస; 3. గుగ్గిలముచె. విశే. (అ. ఈ. అ.) 1. పట్టులో పెట్టఁబడినది; 2. గుడ్లగూబను సంబంధించినది; 3. కుశికవంశమంది.

కౌశికి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది; 2 దుర్గ; 3. ఒకానొకవృత్తి.

కౌశికుఁడు. సం. వి. అ. పుం. 1. విశ్వామిత్త్రుఁడు; 2. పాములవాఁడు; 3. ఇంద్రుఁడు; 4. కోశాధ్యక్షుఁడు; 5. నిఘంటువు తెలిసినవాఁడు; 6. నిఘంటురచయిత.

కౌశేయము. సం. వి. అ. న. 1. పట్టు; 2. పట్టుబట్ట.

కౌసీద్యము. సం. వి. అ. న. 1. వడ్డివలన జీవించుట; 2. అలస్యము; 3. కునికిపాటు.

కౌసుంభము. సం. విశే. (అ. ఈ. అ.) 1. కుసుమపూవుతో చేయఁబడినది; 2. కుసుమపూవురంగు వేయఁబడినది.

కౌసుమము. సం. వి. అ. న. 1. మకరందము; 2. పుష్పాడి; 3. పుష్పాంజనము. విశే. (అ. ఈ. అ.) కుసుమసంబంధమైనది. [కుఁడు.

కౌసృతికుఁడు. సం. వి. అ. పుం. మోసకాఁడు, వంచ

కౌస్తుభము. సం. వి. అ. పుం. కుస్తుభ-సముద్రమందుఁ బుట్టినది—విష్ణువక్షస్స్థలమందలిమణి.

కౌక్షత్త్రీనము. సం. వి. అ. న. ఉలవలుపండుభూమి.

## క్రం.

క్రంగు. దే. వి. (క. కఱంగు.) మ్రోగుటయం దగు ధ్వని కనుకరణము. "ఉ. క్రంగన గంటపైఁ గొడుపు వ్రాలుట యెన్నఁడొ..." నైష. 3, ఆ. ౨౫. విక్ర. ౫, ఆ. ౧౨౪.

క్రంచేఁజ. దే. క్రి. విశే. ద్రు. (క్రంచు+అజన్.) 1. వెంటనే. "క...ఉమేశాస్త్రమునన్, గ్రంచఱ సంతకుపుర కేఁగించితి..." భార. ఆర. ౪, ఆ. ౧౬; 2. విడువకుండఁగా. "సీ. క్రంచఱ నీరిలో ముంచుచు నెత్తుచుఁ గారించి తీరంబు సేరఁ బెట్టు." భార. ఆది. ౫, ఆ. ౧౬౬.

క్రంచేఱు. దే. అ. క్రి. (క్రంచు+అఱు.) మఱుఁగు లేకుండు. "గీ. పగఱఁ గని సైతురేనియు మృగకులంబుఁగని సహింపరు రాజులు మొనసి వానిఁ, గ్రంచఱఁగఁ జంపుదురు నమ్మించి చంపఁ,జనదు మాయ బలంబునఁ జనదు చంప." భార. ఆది. ౫, ఆ. ౫౬.

క్రంచు. దే. వి. 1. మాంద్యము, అలస్యము. (చూ. క్రంచఱ.); 2. మఱుఁగు, చాటు. (చూ. క్రంచఱు.)

క్రంత. యు. దే. వి. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁ దీసికొనివచ్చుప్రధానద్రవ్యము. ('కంత' అని వాడుక.) "వ...యోగ్యవస్తువులవిస్తరిల్లిన క్రంత నడవ..." భార. విరా. ౫, ఆ. ౩౮౯. రామా. ౪, ఆ. ౧౧౪. వై. వి. (సం. గర్తః.) 1. రాజవీథి. "సీ...క్రంతలఁ బన్నిరు గలయఁ జల్లి." నీలా. 3, ఆ. ౪౭; 2. త్రోవ. "చ. చోరనిబిలంబులుఁ బెడలఁ జూడని క్రంతలు..." ఉ. హరి. ౧, ఆ. ౧౩౧; 3. సందు. "సీ. రచ్చలు క్రంతలు

రాజమార్గంబులు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౧౭; 4. వీథి. "మ. ప్రజ లెల్లం బురిఁ గ్రంత క్రంతల మహాపాపంబుగాఁ బల్కెడున్." హర. ౨, ఆ. ౭౯: 5 రాజసభ. "ద్వి. తనజాడ తెలిసి క్రంతకు నేడ్చిరేని...కట్టుకొట్టును బడి..." ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౩. పం; 6. రంధ్రము. "ఉ...నృపాలదేహమున్, గ్రంతలు చేసి చొచ్చె విశిఖంబులు..." జై. ౨, ఆ. ౬౮.

క్రందకుఁడు. సం. విణ. (అ. దికా. అ.) 1. ఏడ్చు వాఁడు; 2. ఏడిపించువాఁడు.

క్రందనము. సం. వి. అ. న. 1. (యోధుల) అర్పు; 2. ఏడ్పు; 3. పిలుపు; 4. ధ్వని. పుం. పిల్లి.(వాచ.)

క్రందయిత. సం.విణ.(ఋ.త్రీ.ఋ.)ఏడ్పించువాఁడు.

క్రందిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఏడ్చువాఁడు.

క్రందితము. సం. వి. అ. న. = క్రందనము.

క్రందిల్లు. వై. అ. క్రి. (సం. క్రంద్.) 1. మ్రోఁగు. "క. ఆదముక వీరకాహళ, దుందుభినిస్సాణ శంఖతూర్యంబు లొగిన్, గ్రందిల్లె..." వీర. ౪, ఆ. ౧౬౧; 2. సింహనాదము చేయు. "క. స్కందగణేశులు తోడై క్రందిలి యిఱుదెసలఁ దఱుము గణనాథబలం,బందంబు చెలఁగి యార్పుల, సందడి మిన్నందె కృష్ణసైన్యముఁ దాఁకెన్." పద్మ. ౧౦, ఆ. ౧౬౩.

క్రందు. వై. అ. క్రి. (సం. క్రంద్) 1. మ్రోఁగు. (చూ. క్రందిల్లు.); 2. విలపించు. "సీ...కృతఘ్నును గ్రకంటకసముదయముమీఁదఁ, గ్రందన దిమియు మఱియు దుఃఖములఁ బెట్ట,తెఱఁగు లెన్ని యన్నింటను బఱతురధిప." భార. ఆర. ౪, ఆ. ౨౬౩. వి. 1. మ్రోఁత, ధ్వని. "సీ. సిరిఁ బాసియును నొక్కచింతయుం లేక వీచులక్రం దడంగినజలధిపోలె." భార. శాం. ౪. ఆ. ౪౧౨; 2. రోదనము, ఏడ్పు. ఆం. భా. ద్వి. ౨౨౩; 3. అతిదారుణధ్వని. ఆం. భా. ప్ర. ౧౨౧; 4. సందడి. "ఉ. కామవిలోభకస్పృహలగర్వపరంపర క్రందు వాసి..." హరి. పూ. ౧, ఆ. ౧౦; 5. ఉపద్రవము. "గీ. ఇత్తెఱంగునఁ గలుగుక్రం దెల్ల నోర్చి, నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక." భార. విరా. ౪, ఆ. ౩౨; 6. అతిశయము, పెంపు. "చ...కోర్కుల క్రందు చేష్టితం,బులఁ దడఁబెట్ట..." హరి. ఉ. ౩, ఆ. ౮; 7. విరోధము. "క. పాం డైన లెస్స విరసపుఁ గ్రం దయ్యెడుచంద మైన రాజుల నెల్లన్, ముందర రావించి క్రమం,బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ డొయ్యన పిదపన్." భార. ఉద్యో. ౧, ఆ. ౪౫. దశ. ౫. ఆ. ౪౫; 8. భేదము. "ఆ. సూతపుత్త్ర యితఁడు నాకలఁ జెద్దమో,పెత్తి నమ్మి యున్న యిట్టిచోటఁ,గ్రందు సేయ నాకుఁ గాదని సైరించి,యున్న బ్రదికి తింక నూరకుండు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౫౦. ('మిథో భేదో న మే కార్య స్త్వేక జీవసి సూతజ' మూలము.) విణ. 1. అధికము. "వ...అందందు గ్రందుగా మంచుచేదివియలు చెందొవలుగా ..." స్వా. ౫, ఆ. ౭౧; 2. సంకులము, దొమ్మియైనది. "సీ. విందానువిందులు గ్రందున వెసఁ గుంతిభోజుని నాతనిపుత్త్రుఁ దాఁకి,రి..." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౬.

క్రందుకయ్యము. ద్వ. వి. (క్రందు+కయ్యము.) దొమ్మియుద్ధము. నిర్వ. ౫, ఆ. ౨౨౪. భార. భీష్మ. ౨, ఆ. ౩౮౦.

క్రందుకొను. ద్వ. అ. క్రి. (క్రందు+కొను.) 1. అతిశయించు. (చూ. క్రందుకొలుపు.); 2. ప్రకటితమగు. "చ. కని వినయంబు క్రందుకొనఁగాఁ బ్రణమిల్లి..." జై. ౭, ఆ. ౭౪; 3. బహుళమగు. "గీ. సంతతపరంసపరమహంసప్రమోద, కారణమహోపకస్వరకమలచక్ర, పూర్ణసదముల సరసు లేపురమునందుఁ, గ్రందుకొనుచుండు నాఁటి దానందనగరి." ప్రబోధ. ౧, ఆ. ౩౯; 4. పూర్ణమగు. "సీ. ఆలంబికంఠహారావళి ప్రభలతోఁ గౌస్తుభరోచులు గ్రందుకొనఁగ." భాగ. ౩, స్కం. ౫౩౮; 5. మూఁగు. "ఉ...పితృరాజుకింకరుల్, గ్రందుకొనంగ నేపడర గాసిగఁ జేసెఁ దవాజ్ఞ నెంతయున్." నిర్వ. ౫, ఆ. ౫౦.

క్రందుకొలుపు. దే. స. క్రి. (క్రందుకొనుధా. ప్రే.) అతిశయింపఁజేయు. "సీ. భీషణోత్తమహాయహేషావిఘోషంబు గరిబృంహితిస్ఫూర్తిఁ గ్రందుకొలుప." భాగ. ౬, స్కం. ౩౬౯.

క్రందుపడు. ద్వ. అ. క్రి. (క్రందు+పడు.) 1. గుమిగూడు. "క. ఇలఁ గోలఁ దట్టుచున్ సం,బళి

సంబళి యనుచుఁ గ్రందుకొనుజనములకున్, దొలఁగుచు..." హరి. ౧, ఆ. ౬౭౫; 2. కుప్పలగు. "సీ. గ్రహతారకౌఘంబు మహిఁ గ్రందుకొనఁ దాల్ప నవి క్రందుపడ నిల్ప నకఁడె చాలు." శా. హా. ఆర. ౧. ఆ. ౨౭౮; 3. మఱుఁగుపడు. (చూ. క్రందుపఱచు.)

క్రందుపఱచు. దే. స. క్రి. (క్రందుపడుధా. ప్రే.) మఱుఁగుపఱచు. "సీ. తులసీపలాశమంజులదామకంబులఁ గౌస్తుభపదకంబుఁ గ్రందుపఱుప." కాశీ. ౫, ఆ. ౧౧౭.

క్రందుపాటు. ద్వ. వి. (క్రందుపడుధా.) (సమరము) సంకులమగుట. "గీ. ఇవ్విధంబునఁ గ్రందుపాటెంతయైన...చిక్కుపడక,పోరె..." భార. భీష్మ. ౨, ఆ. ౧౧౨.

క్రంప = కంప. భార. అను. 3. ఆ. ౨3౫.

క్రకచపత్త్రము. సం. వి. అ. పుం. 1. టేకుచెట్టు; 2. మొఁగలిచెట్టు. [తురుచెట్టు.

క్రకచము. సం. వి. అ. పుం. 1. ఱంపము; 2. వెఱ

క్రకరము. సం. =క్రకచము విణ. (అ.అ.అ.)దీనము.

క్రక్కస. వై. విణ. (సం. కర్కశా.) కర్కశము, కఠినము. "ఉ...తామరచూలిదేవి యా క్రక్కసజవ్వనిం గరము గాఁకన మొప్పఁగఁ జూచి..." నైష. ౫, ఆ. ౧౧౬.

క్రక్కసపడు. వై. అ. క్రి. (క్రక్కస+పడు.) క్రూరమగు. "క. నిక్కుచుఁ జని గంధర్వులఁ గ్రక్కసపడి కొట్టి రమిత గదలఁ దలలన్." వేం. మా. 3, ఆ. ౧౧.

క్రక్కించు. దే. స. క్రి. (క్రక్కు. ధా ప్రే.) 1. క్రక్కఁజేయు, వెలిగ్రక్కు. "ఉ...మనుష్యమాంసములు దించును గ్రొవ్వి వాని నెల్లఁ గ్రక్కించెను..." భార. ఆది. ౬, ఆ. ౨౯౪; 2. తిరిగియిచ్చు. "ద్వి. దక్కించి పోయినధన మెల్ల మగుడఁ గ్రక్కింపనున్న నే కలహకంతి కనె." ద్వి. పారిజా. ఉ. '౧౦౭౦. పం.

క్రక్కు. దే. స. క్రి. 1. కడుపున వికార మెత్తి తిన్నది వెలిపుచ్చు. "క. నలుఁ దొల్లి యాక్రమించిన,కలి కర్కోటకవిషంబు గ్రక్కుచు..." భార. ఆర. ౨, ఆ. ౨౭౮; 2. వెడలఁజేయు. "మ. గద లన్యోన్యసమాహతిన్ మిడుఁగుఱుల్ గ్రక్కంగ సారించుచున్." భార. ద్రో. ౧, ఆ. ౧౮౫

క్రక్కుపడు. ద్వ. అ. క్రి. (క్రక్కు+పడు.) (బలవంతముగా) బయటపడు. "సీ. ఆక్రోశపరిదేవనాక్షరవ్రాతంబు కంఠగద్గదికచేఁ గ్రక్కుపడఁగ." హర. 3, ఆ. ౯౨.

క్రక్కెర = కక్కెర. (శ. ర.)

క్రచ్చఱ. దే. క్రి. విణ. ద్రు. (క్రచ్చు+అఱన్.) 1. వెంటనే. "చ...క్రచ్చఱ మునివర్గవాహనుఁడవై చనుదెమ్ము .." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭౬. భార. ఆర. ౭, ఆ. 3౬౯; 2. పరిపాటిగా. "ఉ. క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా,వచ్చితిమి..." భార. ఆది. ౪, ఆ. ౨౭. భార. ఆది. ౭, ఆ. 3౬౬; 3. సమభాగముగా. "చ...ఇంకఁ గ్రచ్చఱ నిలఁ బంచి చక్క సగ మక్కడ నెవ్వరికేని మవ్వలం, బెఱుఁగక యీఁదలంచినను నే నది యేటికి సమ్మతించెదన్." భార. ఉద్యో. 3, ఆ. 3౬౧; 4. ఏకకంఠముగా. "చ...అని క్రచ్చఱఁ బల్కెఁ బురాణసంహితల్." భీమ. 3, ఆ. ౧౬౦.

క్రచ్చఱించు. దే. స. క్రి. (క్రచ్చఱుధా. ప్రే.) మిగులఁజేయు, మించు. "సీ. చంద్రిక పరివచ్చు సరసమందస్మితకళ మౌక్తికాంశులఁ గ్రచ్చఱింప." శ్రీరా. భా. ౧, ఆ. ౧౦3.

క్రచ్చఱు. దే. అ. క్రి. (క్రచ్చు+అఱు) మిగులు. (చూ. క్రచ్చఱించు.)

క్రచ్చు. దే. స. క్రి. చుట్టుకొను. "వ...మచ్చరంబిచ్చం బెచ్చుపెరుఁగం జెచ్చెరం జొచ్చి క్రచ్చి ...ఫులుఁగు కలఁగుండువఱచి చఱచినం గనలి ..." రామా. ౫, ఆ. ౧౯౯. వి. 1. పేసినత్రాడు లోనగునానియం దుపయుక్తము కాని తృణాదులయంశము. (శ. ర.); 2. పొల్లు. "గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు గొజ్జఁ,గొలుచులమ్ముచోఁ గ్రచ్చులు గలిపి...పూర్వభవమున లాభంబుఁ బొందినారు." భార. అను. ౫, ఆ. ౧౦౪; 3. కోపము. "క... చూడ్కిన్, గ్రచ్చెగయఁ బోవుచున్నాఁ,డచ్చెరు విది..." వేం. పంచ. ౧, ఆ. ౬౦౨; 4. కోరిక. "సీ. కఱివేల్పు

చూడ్కిఁజక్కఁర లుబ్బిపొఱక బలుగ్రచ్చుఁ బైరులు పండఁ గలవె.” నీలా. ౧, ఆ. ౧౦౩.

క్రచ్చుకొను. దే. స. క్రి. (క్రచ్చు+కొను. స్వార్థమున.) 1. చుట్టుకొను. “క...చెలుల్, గ్రచ్చుకొని యడుగ నిట్లను, నచ్చెఁడియ...” వసు. ౪, ఆ. ౫౭; 2. సమీపించు. “వ...పచ్చికలమచ్చికల విచ్చలవిడిఁ గ్రచ్చుకొని మెసవ నుంకించు నంకంపురాజింక...” వసు. ౨, ఆ. ౧౦.

క్రతుధ్వంసి. సం. వి. న్. పుం. జన్నపువొంగ,శివుఁడు.

క్రతువు. సం. వి. ఉ. పుం. 1. యజ్ఞము; 2. విష్ణువు; 3. ప్రజాపతి.

క్రథనము. సం. వి. అ. న. 1. హింస, వధము; 2. ఛేదనము, నఱకుట.

క్రథితవ్యము. సం. విశే. (అ.ఆ.అ.) హింసింపఁదగినది.

క్రథ్యము. సం = క్రథితవ్యము.

క్రన్న. దే. క్రి. విశే. ద్రు. 1. వెమ్మట. “గీ... మున్ను తన్నోటు, వడియెనో నన్ను మున్నోటు వడి విభుండు, గ్రన్నఁ దన్నోటువడియెనో యన్న...” భార. సభా. ౨, ఆ. ౨౦౯; 2. మరల. “ఆ. ఇన్నరేంద్రుచేత మున్న గృహీతమైయున్న నాకరంబు గ్రన్న నింక, నొరుల కర్హమగునె...” భార. ఆది. ౭, ఆ. ౧౮౧; 3. శీఘ్రముగా. “తరల. తరుణి ద్రౌపది యిట్లు పాండవవార్తరాష్ట్రుల కైనభీ, కరపరస్పరకోపవేగము గ్రన్నఁబాపి విపత్తిపా,గరనిమగ్నుల నుద్ధరించెను...” భార. సభా. ౨, ఆ. ౨౮౯.

క్రన్నన=క్రన్న. 1 (వెమ్మట) “మానిని...ఉగ్రతఁ దాఁకిన నిద్దఱకున్, గ్రన్నన శక్రసుపర్ణుల కయ్యముకైవడి ఘోరరణం బొదవున్.” మార్క. ౧, ఆ. ౩౭; 2. (శీఘ్రముగా) ఆం.భా. తృ. ౭౧.

క్రమణము. సం. విశే. (అ. మిశా. అ.) 1. క్రమము కలది; 2. బోధనది.

క్రమణము. సం. వి. అ. పుం. గణ్యము. న. 1. పాదన్యాసము, అడుగిడుట; 2. అడుగు.పాదము.

క్రమము. సం. వి. అ. పుం. 1. వెనుకముందులుగా నుండుట. వరుస; 2. ఆక్రమించుట; 3. సామర్థ్యము, 4. అడుగిడుట; 5. పదము; 6. వేదమున పదము సంహితానుసారముగాను దానికి విలోమముగాను పఠించుట; 7. జరుగుట. (ఉదా:- కాలక్రమమున); 8. ఆచరణము; 9. విధి; 10. విధము.

క్రమించు. సం. స. క్రి. 1. (అతిక్రమించు.) “శా. మందాక్షాంచలముల్ క్రమించి మదభర్మప్రౌఢతల్ దాఁటి...” ఆని. ౩, ఆ. ౩౪; 2. (ఆక్రమించి) చంపు. “సీ...ఆచక్రధరుని జనయు రాక్షసి వెరవునఁ బట్టి క్రమించు...” భార. మా. ౧౦; 3. (కడపు.) “చ...కొన్ని ప్రొద్దులు క్రమింపఁగ సంకట సంకటప్రొద్దులనెల యైన...” సావి. ౧, ఆ. ౧౧౫.

క్రమికము. సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రమముగా వచ్చినది; 2. వంశపరంపరగా వచ్చినది.

క్రమియించు = క్రమించు. 1. (అతిక్రమించు.) “ఉ....అవ్వీడుఁదు ద్వారపట్కము మతివేగమునన్ గ్రమియించి సప్తమద్వారము సేరఁగా...” ఉ. రా. ౪, ఆ. ౯; 2. (కడపు.) “చ...అవ్విభావరిఁ గ్రమియించె...” భా. రా. యు. ౭౩౦.

క్రముకము. సం. వి. అ. పుం. 1. పోఁకచెట్టు; 2. ప్రత్తిచెట్టు; 3. గంగరావిచెట్టు; 4. నాగముస్తెచెట్టు; 5. ఎఱ్ఱలొద్దుగుచెట్టు. న. పోఁకకాయ. [కము.

క్రమేలము. సం. వి. అ. పుం. ఒంటె రూ. క్రమేల

క్రమ్మన. దే. క్రి. విశే. ద్రు. శీఘ్రముగా, వెంటనే. “చ. క్రమమున నైన శాత్రవులఁ గ్రమ్మన నైనను జావఁజేత ధర్మము...” భార. శాం. ౧, ఆ. ౧౭౮. జై. ౩, ఆ. ౪.

క్రమ్మఱ. దే. అవ్య. ద్రు. (క్రమ్మఱు. ధా.) మరల. “క...వచ్చి క్రమ్మఱఁ, బుట్టినచందమున...” నైష. ౨, ఆ. ౪. హరి. ౧, ఆ. ౭౪.

క్రమ్మఱంగ = క్రమ్మఱ. “క. నారాయణుండు కృత్రిమ,నారీరూపమునఁ దన్మనంబుల కతిమో,హారంభకారుఁడై యసు,రాధులచేఁ గ్రమ్మఱంగ నమృతము గొనియెన్.” భార. ఆది. ౨, ఆ. ౧౭.

క్రమ్మఱి = క్రమ్మఱ. ఆం. భా. తృ. ౮౯.

క్రమ్మఱించు. దే. స. క్రి. (క్రమ్మఱు. ధా.) మరల్చు, వెనుద్రిప్పు. “చ. అనిలజుఁడుంబలంబు నమ్మనాగ మెదిర్చి క్రమ్మఱించె,నిరుపరిక్రాంతిసాంగురుసింహమహాధము నిట్లు గ్రమ్మఱించు,మనె...” భార. ఆది. ౪, ఆ. ౨౦౮. విరా. ౩, ఆ. ౧౮౭.

క్రమ్మఱిల్లు. దే. అ. క్రి. (క్రమ్మఱుధా.) మరలు. "చ. పఱచిన దేవకీసుతుఁడు పన్నగ సన్నిభుఁ గ్రమ్మఱిల్లి..." పాండు. ౪, ఆ. ౮౦.

క్రమ్మఱు. దే. అ. క్రి. (మరలు) "మ... క్రమ్మఱి చూచుకొ౯ వెవి దాక్షి నిల్చి...మాయామృగం బిమ్ములకా." భార. అర. ౬, ఆ. ౩౧౭. రాఘవ. ౩, ఆ. ౧౨౯.

క్రమ్మఱుమే = క్రమ్మఱించు. "చ...పొల్తిపై, వెక్కొనుచూడ్కి క్రమ్మఱుప నేరక..." భార. విరా. ౨, ఆ. ౨౩. అర. ౩, ఆ. ౧౭౦.

క్రమ్మఱుదెంచు. దే. అ. క్రి. (క్రమ్మఱు+తెంచు. స్వార్థమున.) మరలు, మరలివచ్చు. "ఉ...పే రెలుఁగునం, గ్రమ్మఱుదెంచు కౌరవనికాయము గర్వ మడంపుఁ డన్న..." భార. కర్ణ. ౨, ఆ. ౧౯౮.

క్రమ్మించు. దే. స. క్రి. (క్రమ్ముధా. ప్రే.) వ్యాపింపఁ జేయు. "సీ. కొదమగుబ్బలదానిఁ గ్రమ్మించుఁ గ్రమ్మించు నెమ్మేనిబిగనిగన్నిగలదాని." దశా. ౨, ఆ. ౧౦. ౧౯.

క్రమ్ము. దే. అ. క్రి. 1. వ్యాపించు. "చ. కరము ననన్న శరాలముఁ గ్రమ్ము మెఱుంగులు..." భార. భీష్మ. ౩, ఆ. ౧౦౮; 2. స్రవించు. "గీ. రమణి పొరిఁబొరిఁ గన్నీరు గ్రమ్మ..." భార. స్త్రీ. ౨, ఆ. ౬౪; 3. ప్రవహించు. "క. క్రమ్మిన నెత్తురు టేఱులు, గ్రమ్మ..." జై. ౭, ఆ. ౧౬౧; 4. కవియు. "క...పొంగుజలధి యన గ్రమ్మిన యుద్ధతబలము..." భార. భీష్మ. ౨, ఆ. ౨౧౭; 5. కలుగు. "క...క్రమ్మినతమకంబున విల్లు విడిచి..." పారి. ౪, ఆ. ౭౧. స. క్రి. 1. కలియు, రమించు. "మ...మాబోంట్ల నుద్ధతిచేఁ గ్రమ్మఁగ నేల నీకుఁ గఱవే తారుణ్యలావణ్య జృంభితరంభాదినిలింపభామలు..." వసు. ౨, ఆ. ౧౩౬; 2. చుట్టుకొను. ఆం. భా. తృ. ౧౧౭. వసు. ౧, ఆ. ౧౪౪.

క్రమ్ముకొను. దే. అ. క్రి. (క్రమ్ము+కొను. స్వార్థమున.) ఆవరించు, మూఁగు. "సీ. దర్పక నెఱరాతుఁ దనము పేర్మిఁ గ్రమ్ముకొను నతేజః కీర్తిఘనము లనఁగ." ప్రభా. ౨, ఆ. ౪౧.

క్రమ్ముడల. దే. వి. 1. క్రమ్ముట. (శ. ర.); 2. కప్పుట. (బ్రౌ.)

క్రమ్ముదెంచు. దే. అ. క్రి. (క్రమ్ము+తెంచు. స్వార్థమున.) 1. (వ్యాపించు) "సీ...ఖరనఖరోచులు క్రమ్ముదేర." భాగ. ౭, స్కం. ౨౯౧; 2. (ప్రవహించు.) "గీ...సౌఖ్యరసము పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్ముదేర, సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు." భార. విరా. ౫, ఆ. ౪౦౨; 3. (బయలువెడలు.) "చ...నోర మాటలుం, బొగలును గ్రమ్ముదేర..." భా. రా. యు. ౧౪౮౨.

క్రమ్ములించు = క్రమ్మించు. (వ్యాపింపఁజేయు.) "సీ. కేసరంబులు దళత్కేసరంబులు కొన్ని కడివోని ఘుమఘుమల్ గ్రమ్ములింప." సాంబో. ౧, ఆ. ౧౬౦.

క్రమ్ముపడు. ద్వి. అ. క్రి. (క్రమ్ము+పడు.) పూడు, మూఁతపడు. "గీ. ఘనుఁడు గృహమేధి పెరటిలోఁ గ్రంతఁ జూచి, క్రమ్ముపడ మంచి దొకరేఁగుకొమ్మ వేయు, మనుచు భృత్యునిఁ బలుకంగ నంబుజాక్షి, వానిగొడ్డలి నడబావిలోన వైచె." గంధ. ౬౬.

క్రమ్మెక్కు. దే. అ. క్రి. (క్రమ్ము+ఎక్కు. స్వార్థమున.) పాఱు, ప్రవహించు. "మ. ఉదకం బింకిన లావు దూలివడిఁ దా నుష్ణింపఁగా రొంపిలోఁ, గదలంజాలనిమీను వాన గురియం గ్రమ్మెక్కు పెన్నీటిలోఁ, బొదలం గన్నవిధంబు..." స. శ. ౯౪.

క్రయపెట్టు. మి. స. క్రి. (క్రయము+పెట్టు.) అమ్ముటకుఁ బ్రకటించు. "సీ. పౌరుషూళ్లఁ గల మాన్యభూములధాన్యంబుఁ గ్రయపెట్టి..." నిరం. ౨, ఆ. ౨౬.

క్రయము. సం. వి. అ. పుం. 1. వెల; 2. కొనుట.

క్రయవిక్రయికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) క్రయవిక్రయములచే జీవించువాఁడు.

క్రయించు. సం. స. క్రి. వెల యిచ్చికొను. (శ. ర.)

క్రయికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సరకును వెల యిచ్చి కొనువాఁడు.

క్రయ్య. దే. వి. కయ్య, కాలువ. "ఉ. క్రయ్యలు గట్టి యున్న రుధిరస్థలులున్..." భా. రా. యు. ౯౯౮. భార. సౌ. ౨, ఆ. ౧౭.

క్రయ్యఁబడు. ద్వి. అ. క్రి. (క్రయ్యన్+పడు.) 1. కలియు. "క. వెయ్యేండ్లయ్యెను సీతోఁ గ్రయ్యం బడి యున్నవాఁడఁ గామసుఖములన్." భాగ.

౯, స్కం. ౧౭౭; 2. బలాత్కరించు. "క... కన్యకఁ, గ్రయ్యంబడి చేసికొనిన రాక్షస మయ్యెన్." విజ్ఞా. ఆచా. ౧౦౦; 3. చొచ్చు. "క... క్రయ్యఁబడకు నుడడి యగుచోన్." భో. ౬, ఆ. ౩౨.

క్రయ్యఁబాఱు. దే. అ. క్రి. (క్రయ్యన్+పాఱు.) కలయఁబాఱు, ఏకముఖముగాఁ బ్రవహించు. "(గంగ.) వ...మఱుగద యన బయలుపడక ప్రమద యనఁ గ్రయ్యంబాఱుచు...ప్రవహించి ..." భాగ. ౯, స్కం. ౨౩౦.

క్రయ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కొనువారలకు అంగడియందు పఱవఁబడినది. (సరకు.)

క్రయ్య. దే. అ. క్రి. కలియు. "వ...ముద్దుఁజం దురుతోడ నెయ్యంబునఁ గ్రయ్య నడరి చొప్పు దప్పక సాగి..." భాగ. ౯, స్కం. ౨౩౦.

క్రల్లు. దే. వి. భస్మము. (చూ. క్రల్లువడు.)

క్రల్లువడు. ద్వ. అ. క్రి. (క్రల్లు+పడు.) దగ్ధమగు, బూడిద యగు. "క. తరులెల్లఁ గ్రల్లువడఁగా, విరళ ములై పీఁచు లున్నవిధ మొప్పె నహస్కరరుచుల తోడఁ దలపడి, యరుదుగఁ బోరాడి తుమురులై పడినక్రియన్." హరి. పూ. ౬, ఆ. ౩౭.

క్రవ్యము. సం. వి. అ. న. మాంసము.

క్రవ్యాత్తు. సం. వి. ద్. పుం. 1. రాక్షసుఁడు; 2. మాంసాహారి. విణ. (ద్) మాంసము తినువాఁడు.

క్రవ్యాదుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు. విణ. (అ. ఆ. అ.) మాంసము తినువాఁడు.

క్రవ్యాశి. సం. విణ. (న్. సీ. న్.) మాంసము తిను వాఁడు. వి. న్. పుం. = క్రవ్యాత్తు. [బడినది.

క్రశితము. సం. విణ. (అ. ఆ. అ.) కృశింపఁజేయఁ

క్రశిమ. సం. = క్రశిమము. "క. పశువులఁ బోలెగొని ముఖములు, విశదములుగఁ జేయుబుధుని వీక్షించి తమున్, విశసనము సేయుదునో యని, క్రశిమఁ జెగ డొందు భూతగణము నరేంద్రా." భాగ. ౭, స్కం. ౪౧౬.

క్రశిమము. సం. వి. న్. పుం. కృశత్వము.

క్రష్ట. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) 1. కృశించు వాఁడు; 2. దున్నువాఁడు; 3. లాగువాఁడు.

క్రష్టవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దున్నఁదగినది; 2. లాఁగఁదగినది.

## క్రా.

క్రాంతదర్శి. సం. విణ. (న్. సీ. న్.) ఇంద్రియా తీతవిషయజ్ఞుఁడు.

క్రాంతము. సం. వి. అ. పుం. గుఱ్ఱము. న. 1. పోవుట; 2. పాదము. విణ. (అ. ఆ. అ.) 1. పోయినది, వెళ్లినది; 2. ఆక్రాంతము, ఆక్రమింపఁబడినది; 3. వ్యాప్తము, వ్యాపింపఁబడినది. "ఉ. శాంతన వుం డనేకబలసంకలి సద్భటశౌర్యపాకదుర్దాంత పరాక్రమస్ఫురణఁ దాఁకి సముజ్జ్వలశాతసాయక, క్రాంతపరీత నిర్మథిత కంపిత పాలితమూర్తిఁ జేసి ..." భార. భీష్మ. ౩, ఆ. ౨౪౬.

క్రాంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పోవుట; 2. అడు గిడుట; 3. మీఱుట; 4. సూర్యమార్గము.

క్రాఁక. దే. వి. (క్రాఁగు ధా.) కాఁక. (శ. ర.)

క్రాఁగు. దే. అ. క్రి. 1. తపించు, కాఁగి సలసలకాఁగు. "క. ఈగంగాదికతీర్థము, లీఁగంగాసిత్వ తమసమి ద్ధాంబుస్థలం, దోఁగెడు వారల గసగసఁ, గ్రాఁగెడు నంగారసింధుకల్లోలములన్." పాండు. ౧, ఆ. ౧౭౦; 2. కాలు, దగ్ధమగు. "ఉ. కౌరవకోటి... దుర్వారభవత్ప్రతాపశిఖిఁ గ్రాఁగె మఱిన్ వగ పేల దీనికిన్." భార. శాం. ౧, ఆ. ౯౩; 3. దుఃఖించు, బాధపడు. "సీ...గతి లేక యాఁకటఁ గ్రాఁగువారు." వి. పు. ౪, ఆ. ౧౭౪; 4. నశించు. "క. బలవక్షగేంద్ర కోపా, నలశిఖిస్ఫుటధూతుఁడై క్షణంబున వాఁడున్, బల మఱి గ్రాఁగె నుదగ్ర, జ్వలన జ్వాలావలీశలభమపోలెన్." భార. ఆది. ౨, ఆ. ౯౦. ఆర. ౨, ఆ. ౨౬౩. వి. కాఁగు, పెద్దబాన. "గీ. క్రాఁగుపై మొగ్గ తెలిసిగ్గ గ్రాఁగి పొంగ." రా. వి. ౩. ఆ. ౧౩. ఆం. భా. ద్వి. ౨౭౪.

క్రాఁగుడు. దే. వి. (క్రాఁగు ధా.) కాఁగుడు. (శ. ర.)

క్రాఁచు. దే. స. క్రి. (క్రాఁగు. ధా. ప్రే.) 1. తపింపఁ జేయు, సలసలఁ గ్రాఁగఁజేయు. "సీ. కనకగిరి స్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె..." స్వా. ౧, ఆ. ౩౭; 2. కాల్చు, దగ్ధముచేయు. (మహా నలంబు) "సీ...మృగములఁ బొదలను గ్రాఁచి కొనుచు...గీ...పరఁగె..." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౬౧; 3. పీడించు, బాధించు. "చ...నిశా చరులన్ బడల్పడన్, ఘనభుజదండచండమహిఁ గ్రాఁచిన..." భార. ఆర. ౩, ఆ. ౩౬౭; 4.

చంపు, వధింపఁజేయు. "గీ...విక్రమక్రమము ప్రచ్చుచు వెలువడి క్రాఁచె శస్త్ర." భార. అర. ౨, ఆ. ౩౨౩. "చ...కౌరవకులకుఖ్యాతి యొప్ప లీకఁ గ్రాఁచితె చిత్తము ప్రీతిఁ బొందనే." భార. శాం. ౧, ఆ. ౪.

క్రాథము. సం. వి. అ. పుం. హింస, వధము.

క్రాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ.) కొను వాఁడు, క్రేత.

క్రాఁగు. దే. అ. క్రి. కాండ్రించు. "సీ. ధవళలాంగూలపల్లవచాలనంబులు గాముదీర్చ్యాయలఁ గ్రాఁగి యుమియు." కాశీ. ౪, ఆ. ౨౯. శుక. ౩, ఆ. ౪౯. స. క్రి. 1. కక్కు. "క. కొలఁది మెఱుంగక తిని కోకిలకామిని వెడలఁ గ్రాఁగెఁ గిసలయఖండంబులు..." వరాహ. ౩, ఆ. ౧౧; 2. ఉమియు. "గీ. కదలిపీ రభ్రకలభముల్ గ్రాఁగె..." ఆము. ౪, ఆ. ౧౧. ఉ. హరి. ౨, ఆ. ౧౨౪; 3. దంచు; చేటతోఁ జెరఁగు. "సీ. ఒడికంబుగా గ్రాఁచి యొక్కింత నేలపై నిరుసవడ్లను బోసి యొంద వెఱపి, యొయ్యనొయ్యన గ్రాఁగియుముక నవ్వులకెంచి కొని నేఁప్పమైఁ గలకూర విలిచి." దశ. ౧౦, ఆ. ౧౦౫. రా. వి. ౩, ఆ. ౧౧౪.

క్రార. దే. వి. (క్రయ్యి+ర.) జడ్డయై యొకయక్షరముతోఁ గలియు రేఫము. ఆం. భా. ద్వి. ౧౮౭. అప్ప. ౪, ఆ. ౪౯. [(శ. ర. బ్రా.)

క్రారవడి. దే. వి. (క్రార+వడి. స్వార్థమున.) క్రార

క్రాలించు. దే. స. క్రి. (క్రాలుధా. ప్రే.) క్రాలఁ జేయు, ప్రవర్తిల్లఁజేయు. "క. కాలరసపాది మొగులం,గాలాకృతిఁ బొదలుచదలు గవిఁ బవి శిఖివా,తూలధమసీముఖంబునఁ, గ్రాలించి మెఱుంగుఁబసిఁడిఁ గనె రససిద్ధిన్." రామా. ౬, ఆ. ౧౧.

క్రాలు. దే. అ. క్రి. 1. అల్లలాడు. "ఉ...మంద సమీరణాంబుజంబులఁ, గ్రాలుప్రవాళమంజరులు..." నైష. ౨, ఆ. ౪౮. భా. రా. అయో. ౧౦; 2. తిరుగు. "క. సేలకు నబ్దైదు పొడవునఁ గ్రాలుచు ..." భార. ద్రో. ౫, ఆ. ౩౧౭; 3. ప్రవర్తిల్లు. "క. కైలాసనగమునందును, గ్రాలెడుప్రావృట్పయోధరముచందమునన్." వి. పు. ౭, ఆ. ౩౩౯; 4. చెదరు. "ఉ...విస్ఫులింగముల్,క్రాలఁగ..." భాగ. ౬, స్కం. ౪౨౫; 5. సంచరించు. "ద్వి. ఏలె సభాస్థలి యొన్ని చందములఁ, గ్రాలుచున్నాఁడను గటకటా ఁ బసవ." రం. రా. అర. ౧౮౭. క్రు. 6. విజృంభించు. "క...బలువిలు గొని,క్రాలుచు నాభీమముఖ్యరథికుల నొంచెన్." భార. ద్రో. ౪, ఆ. ౨౯; 7. ఒప్పు. ఆం. భా. కృ. ౧౩; 8. ఆవరించు, మైఁబడు. "గీ...అకాల నిద్రగనుఁగవలఁ గ్రాల..." హరి. ౪ ఆ. ౬౭; 9. ప్రకాశించు. 'ఆ. కర్ణకేలనంబు క్రాలెడు నల్లడె..." భార. విరా. ౫, ఆ. ౭౦; 10. ప్రవర్తిల్లు, బ్రదుకు. "చ...నిర్గుణతయె పట్టి క్రాలు తమకుం దగువారలు చెప్పసౌమ్యభాషణము నిరర్థకంబు..." నిర్వ. ౬, ఆ. ౬.

క్రాలుఁగంటి. దే. వి. తరళేక్షణ. (చూ. క్రాల్గంటి.)

క్రాలుఁగన్ను. దే. వి. బౌ. (క్రాలు+కన్ను.) 1. చంచలేక్షణము,విలాసపుఁజూపు. "శా...పయ్యారపుం,గ్రాలుంగన్నులఁ గ్రొమ్మెఱుంగులు దొలంకఁగ..." వరాహ. ౪, ఆ. ౧. స్వా. ౧, ఆ. ౧౨; 2. కాకిచూపు గలకన్ను. "ద్వి. క్రాలుఁగన్నును నీరు కారెడికన్ను." పండితా. మహిమ. ౨౭౩. పు.

క్రాలుకొను. దే అ. క్రి. (క్రాలు+కొను.) ప్రకాశించు. "వ...జలజలని తెలినీటిజాలునం గ్రాలుకొనుచు .." వసు. ౪, ఆ. ౨౩.

క్రాల్గంటి. దే. వి. బౌ. (క్రాలు+కన్ను+ఇ.) చలించు నట్టికన్నులు గలయాఁడుది; ఆఁడుది. "క...చను,కట్టుబుఁ గడు బలిసె నపుడు క్రాల్గంటులకున్." అచ్చ. బాల. ౭౯. నీలా. ౩, ఆ. ౩౬.

## క్రి

క్రి. దే. విణ. వృత్తియందు 'క్రింద' శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి కొన్నిపట్ల నుగాగమమును గొన్నిపట్ల మీఁది వర్ణమునకు ద్విత్వమును, కొన్నిపట్ల లుప్తశేషమునకు దీర్ఘమును వచ్చును. ఉదా:—క్రిందల క్రియ్యాట, క్రీనీడ.

క్రించు. వై. విణ. (సం. కించిత్.) 1. అల్పము, నీచము. "గీ. పాడిమానుసులంద్రు నిన్నాలు నొకనిఁ,బొదిపి రిస్సిరొ పెక్కండ్రు ప్రోదలిదియు,మగఁటిమియొ క్రించుపని కిట్టు తెగిన యప్పు, డుల్లములు వారలకు నెట్టు లుండు

నోక్కు." భార. స్త్రీ. ౨, ఆ. ౨౬; 2. అల్పుఁడు, నీచుఁడు. "ఉ... ఈక్రించుల యాదవాన్వయులఁ గెలియఁబోలె ధనుర్విముక్తనిర్వాంచిత సాయకాగ్ని కనవద్యహావిస్ఫులింగా నొనర్చెదన్." హరి. ఉ. ౧, ఆ. ౧౦౮. సాంబో. ౧, ఆ. ౧౨౩; 3. దుష్టుఁడు, దుర్మార్గుఁడు. "దండకము... అక్కిరించుఁ గంసుం ద్రిలోకీనృశంసున్..." పారి. 3, ఆ. ౩౮; 4. అసూయాపరుఁడు,మచ్చరుఁడు. "క. క్రించు లగురాజతనయులు, వంచింపక యాజుదు రపవాదోక్తుల నొండొంచు నృపాలుని ద్రోలను, బంచమహాశబ్దములును బహుళములయ్యెన్." నైష. ౬, ఆ. ౩౪.

క్రించేఁడు. దే. విణ. క్రించు, నీచుఁడు. "మ. జననిందం బడలేక నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గాననంబునఁ ద్రోయించినతప్పు చాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రించునిచందంబున రచ్చపెట్టితి నటంచుం డాఁగి పోనేల సొంపున నేఁ డింకొకసారి నీనగుమొగంబుం జూపవే జానకీ." ఉ. రా. ౮, ఆ. ౯౬.

క్రించేఁదనము. దే. వి. (క్రించు+తనము.) 1. నీచత్వము. "క... నిజభామ నొల్లక,ధామమున నటించెఁ గ్రించుఁదనమున జడుఁడై." భాగ. ౬, స్కం. ౧౦౬; 2. దౌష్ట్యము. "దండకము... దక్షుండు మాత్సర్యదక్షాత్ముఁడై క్రొవ్వి పీఠాప్రపాతైకమాత్రావఘాతాంకను న్నిన్నుఁ గన్నాని రప్పింప కుప్పొంగి దర్పించి క్రించుందనం బొందుచున్ మందభాగ్యోదయత్వంబునన్ బన్ని జన్నంబు సేయంగ..." ఉద్భ. 3, ఆ. ౨౮.

క్రిందంటు. దే. అ. క్రి. (క్రిందు+అంటు.) నేలపాలగు, నశించు. "ఉ... మత్కుమారిమేనంటియుం నింటి కేఁగి చద లంటినదుర్మతి సేనతోడఁ గ్రిందంటఁగ మంటివాన గురియుం గలదేడుదినంబులు..." ఉ. రా. ౭, ఆ. ౩౩౭.

క్రిందల. దే. వి. (క్రిందు+తల.) తలక్రిందు, అధోముఖము. "సీ. మోముఁదమ్మికిఁ జేటి మొత్తమై పొగ పర్వ ప్రేలుఁ గ్రిందలగాఁగ వృక్షశాఖ." పాండు. ౨, ఆ. ౨౯.

క్రిందు. దే. వి. భా. 1. అధోభాగము. "గీ. వృష్టి తఱి నిద్దజనఁ ద్రావఁ గ్రిందనుండి." ఆము. ౪, ఆ. ౧౭౭. "గీ. నాభికంధంబు క్రిందట..." కాశీ. ౨, ఆ. ౧౨౫; 2. గతకాలము. "వ... అతనితోడఁ గ్రిందటఁ బరికరంబులవారును మందటఁ బరికరంబులవారును బొందుదురు." భాగ. ౧౦, స్కం. ఉ. ౪౮౧; 3. అధికారము, ఆజ్ఞ. "సీ. తాను రుక్మిణి యయ్యెఁ దగ నన దాత్మనాయకుఁ డొకనరు క్రింద కాపులఁ బట్టె." వసు. ౧. ఆ. ౬౫. విణ. 1. అధోభాగమున నున్నది. "సీ. చరమాంగ పీఠికాగ్రాపరశేషుండు కిటవకచ్ఛపరాజు క్రింది మట్టు." హర. ౬, ఆ. ౪౦. బస. 3, ఆ. ౭౮౫; 2. తక్కువది. "సీ. శ్రీకాంత దా నయ్యెఁ బ్రియము విరోధించున క్రిందై విరోధిఁ గేలు సాఁచు." వసు. ౧, ఆ. ౬౫; 3. కడచినది. ఉదా:– క్రిందటిఏఁడు.

క్రిందుపడు. స్వ. అ. క్రి. (క్రిందు+పడు.) 1. క్షీణించు, తగ్గు. "సీ. బ్రతుకుభాగ్యము క్రిందుపడఁగ బాపనయిండ్లు కరిగి యాఁకటికిఁ గూడడిగెననుచు." శుక. ౨, ఆ. ౫౪౭; 2. వశమగు. "మ. పగవాఁ డైనను వచ్చి క్రిందుపడి తాఁ బ్రార్థించినన్ వానికిం, దగుసంభావన లిచ్చి పుచ్చుటయపో ధర్మంబు..." వి. పు. ౬, ఆ. ౧౬౧; 3. ఓడు. "క... ఇంద్రాదిక,బృందారకవరులతోడఁ బెనఁకువ నొందుం గ్రిందుపడకుండఁ దపమున,నందిరి వర మఖిలభువనపావనోత్సుకతన్." హర. ౭, ఆ. ౧౭౯; 4. అడుగున పడి నలఁగు. "క... శంఖుఁ డాసనము డిగ్గకమున్, దన వామపదాంగుష్ఠంబున నదిమె దశాస్యుహస్తములు క్రిందుపడన్." ఉ. రా. 3, ఆ. ౮౩.

క్రిందుపఱుచు. ప్ర. అ. క్రి. (క్రిందుపడు. ధా. ప్రే.) 1. సమీపింపఁజేయు, దగ్గఱకుఁ దెచ్చు. "మ... లంఘనచాతుర్యము నింగిఁ గ్రిందుపఱుపగా..." భా. రా. యు. ౧౪౨౭; 2. చులకన చేయు. "సీ... గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱిచె." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౨౮; 3. ఓడించు. "సీ... కుండలీశ్వరు క్రిందుపఱచిన శాబ్దికుండు." వరాహ. ౯, ఆ. ౩౪.

క్రిందుసేయు. దే. స. క్రి. (క్రిందు+చేయు.) 1. క్రిందిముఖముగా సేయు. "గీ. క్రిందు సేయంగఁ బడినట్టికృష్ణపృథునిశీల తెండైన మీఁదుగాఁ

7రలుఁ గాక." భక్తవ. ౧, క. ౭౭; 2. తక్కువచేయు. "చ...సమస్తముఁ గ్రింపసేసి మించికబలశేల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుండెనేని నిరుపమాదృతిం జెప్పి నీవు మముం గరుణింపఁగాఁ దగున్." పాండు. ౧, ఆ. ౧౪౨.

క్రిక్కు. దే. వి. 1. సందు, బట్టు. ఆం. భా. ద్వి. ౧౦౬. కావ్య. ౭, ఆ. ౬3; 2. యతిభూషణ విశేషము. "చ. జడలను బూచి బొక్కుణము జన్నిదముం బులితోలు చీరయుం గొడుగును గ్రిక్కియుఁ గెమరుఁగోలయుఁ గృష్ణమృగాజినంబుఁ బొల్పడరఁగఁ దాల్చి...వికతాపసోత్తముఁడు..." దశ. ౬, ఆ. ౫.

క్రిక్కటిల్లు. దే. అ. క్రి. కంపించు. వణఁకు. "శా. క్షోణీచక్రము గ్రిక్కటిల్లఁగ దిశల్ ఘూర్ణిల్ల..." పద్మ. ౯, ఆ. 3౨౧.

క్రిక్కిర్సు = క్రిక్కిఱియు. (నిండు.) "ద్వి... క్రిక్కిర్సి సెక్కొని పిక్కటిల్లి..." పండితా. మహిమా. 3౫౯. పుట.

క్రిక్కిఱి. దే. విశే. (క్రిక్కిఱియు. ధా. వృత్తియందు పాక్షిక'యు'లోపము) ఇఱుకైనది, రారాపు. "ఉ. క్రిక్కిఱిచన్నుదోయి యురుగ్రేవలకొంతియుఁ బంచబాణుఁ గ్రొవ్వెక్కఁగఁ జేయ..." నైష. ౭, ఆ. ౧౯౪.

క్రిక్కిఱించు. దే. స. క్రి. (క్రిక్కిఱియు. ధా.) 1. నిండించు, క్రిక్కిఱిసి యుండఁజేయు. "క... పార్థుసేనాకలకలములు నిజపురోపకంఠసరణి దిక్కులఁ గ్రిక్కిఱింప..." జై. ౧, ఆ. ౧౨౭. (శ. ర. పా. 'వక్కలింపఁగా' ముద్రి. పా.); 2. ముడుఁగఁజేయు. "వ...నడికెక్కుఁ గ్రిక్కిఱించుచు..." పాండు. ౪, ఆ. ౨3౭; 3. కిఱించు, మోసపుచ్చు. "ద్వి. కిన్నరబ్రహ్మయ్యఁ గ్రిక్కిఱించితివో, కన్నదబ్రహ్మయ్యఁ గనుమఱంగితివో." పండితా. మహిమా. 3౦౬. పు.

క్రిక్కిఱియు. దే. అ. క్రి. (క్రిక్కు+ఇఱియు.) 1. ఇఱుకగు, ఎడము లేక వ్యాపించు. "ఉ... ఎల్లచోటులుం, గ్రిక్కిఱియంగఁ గ్రందుకొని కేశజలంబులు..." భా. రా. కిష్కిం. ౫౧3. "క. క్రిక్కిఱిసినచన్నుఁగవలఁ గ్రిస్సినవడు

ముస్." భాగ. ౧, స్కం. ౨౬౫; 2. నాఁటు కొను. "చ...నిశాతసాయకము లొక్కమొగిం బడి మేనియందుఁ గ్రిక్కిఱియఁగఁ జేసి..." భార. విరా. 3, ఆ. ౨౧౫; 3. కూడు, చేరు. "ఉ. లెక్కకు నెక్కువై కపటు లేనిమహోద్భతతేజ మెల్లెడం, బిక్కటిలం జరింతు రతిభీమబలాఢ్యులు విష్ణుదూత లాచక్కని ధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్, గ్రిక్కిఱియుగ్ జగంబునను గేశవసేవకరక్షణార్థమై." భాగ. ౬, స్కం. ౧౭౪. ఆం. భా. కృ. ౧౧౯.

క్రిక్కు = కిఱుకు. (శ. ర.)

క్రిక్కొను. దే. అ. క్రి. (క్రిక్కు+కొను.) నిండు. "క. మృదుబలము లుర్విఁ గ్రిక్కొన, విడిసిన..." కు. సం. ౧, ఆ. ౧౭.

క్రిగ్గాలి. దే. వి. (క్రిక్కు+గాలి.) తూర్పుగాలి. (బ్రౌ.) "ద్వి...ఛిద్రపుష్పములు, క్రిగ్గాలిఁ దూల..." బస. ౪, ఆ. ౧౨౫. పం.

క్రితము. దే. వి. (ఇంతకు) మునుపు, పూర్వము. "మ. ప్రతికూలాచరితంబు నీవలన నల్పంబైన నేఁ గంటినే, క్రితము..." హర. 3, ఆ. ౧౬. ప్రబోధ. 3, ఆ. ౫౬.

క్రిమి. సం. వి. ఇ. పుం = కృమి.

క్రిమిఘ్న. సం. వి. ఆ. స్త్రీ. పొగాకు.

క్రిమిఘ్నము. సం. వి. అ. పుం. వాయువిళంగము.

క్రిమిజ. సం. వి. ఆ. స్త్రీ. లక్క.

క్రిమిజాతము. సం. వి. అ. న. లక్క.

క్రిమిశైలము. సం. వి. అ. పుం. వల్మీకము, పుట్ట.

క్రియ. సం. వి. ఆ. స్త్రీ. 1. ధాత్వర్థము; 2. చేయుట; 3. చేష్ట; 4. విద్యాభ్యాసము; 5. పూజ; 6. ప్రాయశ్చిత్తము; 7. చికిత్స; 8. వ్యవహారమందు సాక్షిపత్త్రాది; 9. ఉపాయము; 10. ఉపకరణము; 11. ఆరంభము; 12. విధము. "క... పుష్పితజంగమలతక్రియ నున్నతకుచ సనుదెంచెఁ బవననందను డాయన్." భార. ఆది. ౬, ఆ. ౧౯౦. నైష. ౫, ఆ. ౭౬. (కడపటియర్థము తెనుఁగున నే కలదు.)

క్రియగొను. మి. అ. క్రి. (క్రియ+కొను.) 1. ఏర్పడు. "క. ఉడుగక మే మహితముఁ బలి, కెడివారము నీవు హితవు క్రియగొనఁగాఁ బల్కెడువాఁడవు

క్రీయూట = క్రియ్యూట. (క్రీ+ఊట.) "వ... తోరంపుసజ్జకంప్రపూర్ణనీటి యేటిక్రీయూటల చలువఁ జెలువంబు లగుఁపయపంపుమరువంపుఁ బొదల..." సాంబో. ౧, ఆ. ౯౩. [(శ. ర.)

క్రీవాడ. ద్వి. వి. (క్రింద+వాడ.) పాటిపొలము.

క్రు.

క్రుంకించు. దే. స. క్రి. (క్రుంకుదా. ప్రే.) క్రుంకఁ జేయు, అస్తమింపఁ జేయు. "గీ. అనుచుఁ గ్రుంకింప రాని ప్రౌఢసి యగసి." భార. విరా. ఆ. ౨౧౪.

క్రుంకిడు. దే. అ. క్రి. (క్రుంకు+ఇడు.) స్నానము చేయు. "శా. ఏమేతీర్థములందుఁ గ్రుంకిడితిరి ..." స్వా. ౧, ఆ. ౬౮.

క్రుంకు. దే. అ. క్రి. 1. అస్తమించు. "క. మాయ రవి యేల క్రుంకఁడొకో యను..." భార. విరా. ౨, ఆ. ౩౧౨; 2. చచ్చు. "శా. శంకాకీర్ణమనస్కదానవరిపుల్ చక్రాయుధుం డింతలోఁ, గ్రుంకెంబో యని భీతులైరి..." ఉ. హరి. ౬, ఆ. ౧౫౦; 3. మునుఁగు, స్నానముచేయు. "చ... క్రుంకితి నీళ్లను జావు దప్పనే." భార. శల్య. ౨, ఆ. ౫౪. "గీ. కణఁకఁ గాంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి." కాశీ. ౩, ఆ. ౧౬; 4. నాఁటుకొను. "ఉ. కోలలసంధి నెంపములు గ్రుంకిన వంత దినక్రమంబునన్, మీఱిన నొవ్వి భుక్తిఁ గొన జేరక..." కేయూర. ౩, ఆ. ౧౧౫; 5. అడుగునకుఁ బోవు. "శా...రవిదీప్తిం గ్రుంకి పాతాళగహ్వరముం దూఱినదాని..." ఆము. ౨, ఆ. ౬౬; 6. దాఁటు, అతిక్రమించు. "ఆ. నిలువ వలయుం నీకుఁ గలవారి నెల్లను, గూర్చి మోహరించుకొని కడంగి, నడవు సమరమునకు వెడ జంకఁ బో డింకఁ, దప్పఁ గ్రుంక లేదు తఱికిఁ జోరుము." భార. ఉద్యో. ౪, ఆ. ౧౯౧. హరి. ఉ. ౬, ఆ. ౨౦౨. వి. 1. స్నానము. (చూ. క్రుంకువెట్టు); 2. మాఁగుట; 3. అస్తమయము. పీఠ. శకుం. ౪, ఆ. ౧౬౪.

క్రుంకుఁగడలి. దే. వి. (క్రుంకు+కడలి) పశ్చిమసముద్రము. "గీ... క్రుంకుఁగడలిలోఁ బొద్దు వ్రాలె." సింహా. ౩, ఆ. ౩.

క్రుంకుగట్టు. ద్వి. వి. (క్రుంకు+గట్టు.) అస్తాద్రి, పడమటికొండ. "క...రేరాజు క్రుంకుగట్టున కరిగెన్." వైజ. ౧, ఆ. ౧౧౦. య. ౫, ఆ. ౩౦. (ఇట్టివే: క్రుంకుగుబ్బలి, క్రుంకుమల, క్రుంకుమెట్ట, క్రుంకుమెట్టు, క్రుంకుకొండ మొ.)

క్రుంకుడు. దే. వి. (క్రుంకు. ధా.) అస్తమయము. (చూ. క్రుంకుడుగట్టు.)

క్రుంకుడుగట్టు = క్రుంకుగట్టు. య. ౩, ఆ. ౩౪.

క్రుంకులిడు = క్రుంకిడు. "సీ. తెల్లవాఱె నటంచుఁ దివిరి యజ్ఞన్నిగట్టేటిపొంతకుఁ గ్రుంకులిడఁగఁ జన్న." అచ్చ. బాల. ౧౪౬.

క్రుంకులువెట్టు = క్రుంకువెట్టు. 1. (స్నానము చేయు.) "సీ. యజ్ఞతటాకంబునందు గ్రుంకులువెట్టి..." భీమ. ౩, ఆ. ౧౧౨; 2. (వంగు.) "గీ. ఎట్లు గ్రుంకులువెట్టుచు నేచి పట్టనీక..." భా. రా. అర. ౨, ఆ. ౩౨.

క్రుంకువెట్టు. దే. అ. క్రి. (క్రుంకు+పెట్టు.) 1. మునుఁగు. "మ. అపరాధంబులు పెక్కు చేసితి మహాహంకారకామక్రియా, విపులాంభోనిధిఁ గ్రుంకువెట్టి..." నిరం. ౩, ఆ. ౪౯; 2. స్నానము చేయు. "సీ. గంగలో మణికర్ణికాతీర్థమునయందు సంకల్పపూర్వంబు గ్రుంకువెట్టి." కాశీ. ౩, ఆ. ౮౯.

క్రుంగఁబడు. ద్వి. అ. క్రి. (క్రుంగన్+పడు. స్వార్థము.) క్రుంగు, దిగఁబడు. "ఆ. ధరణి క్రుంగఁ బడఁగ..." భా. రా. కిష్కిం. ౪౩౧.

క్రుంగిలఁబడు. ద్వి. అ. క్రి. (క్రుంగిలన్+పడు.) ముడుచుకొను. "గీ. పాన్పుమీఁదటఁ గ్రుంగిలఁ బడఁగఁ దిగిచి ప్రథమసురతంబుఁ గావించు ప్రౌఢ వార." రాజగో. ౫౬.

క్రుంగిలు. దే. అ. క్రి. (క్రుంగు. ధా.) ముడుఁగు, క్రుంగు. "ఉ...రెమ్మిపోకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం, బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు..." విజ. ౨, ఆ. ౩౦.

క్రుంగు. దే. అ. క్రి. 1. (క్రిందికి) అణఁగు. "సీ. క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్యవికృతిఁ గ్రుంగనినాఁటిమిథ్యాశిఖరి." నైష. ౧, ఆ. ౩౫; 2. దిగఁబడు. "సీ. ఆకాశవాహినీసైకతంబుల ఖురాంచలటంకములు గ్రుంగ జడనుపడిన." కాశీ. ౩, ఆ. ౧౨; 3. తగ్గు. ఆం. భా. తృ. ౮౮; 4. నశించు. "శా. కాశీదేవనదీజలంబులను గ్రుంకం గ్రుంగు సర్వాఘముల్." సురా. ౨౦; 5. చచ్చు. ఆం.

భా. ద్వి. ౨౨౫; 6. వంగు. "సీ...వాఁడు... అవనిఁ గ్రుంగి నిలుచు." భార. విరా. ౨, ఆ. ౧౫: 7. హ్రస్వమగు. "మ...క్రుంగి క్రుంగి కనక స్తంభంబు చిత్రంబుగా, సరసీరుహాసన స్థితం బగుటయును..." విక్ర. ౨, ఆ. ౧౧౫; 8. నీరసించు. వా:—వాఁడు కష్టములకుఁ గ్రుంగి పోయినాఁడు.

క్రుంచము. సం. వి. చ్. పుం. 1. క్రౌంచపక్షి, ఒక జాతికొంగ; 2. హంస. అ. పుం. 1. క్రౌంచపర్వతము. 2. క్రౌంచపక్షి.

క్రుక్కించు. దే. స. క్రి. (క్రుక్కు-ధా. ప్రే.) కూరించు. "వ...కేదారపంకంబులోన... జేరంబుఁ గ్రుక్కించి..." పరమ. ౫, ఆ. ౨౯.

క్రుక్కిదము. దే. విణ. 1. అవిరళము, దట్టమగునది. "ఉ. అక్కజమై మహార్థనివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్. గ్రుక్కిదమైనసత్కృతి..." కు. సం. ౧, ఆ. ౩౯; 2. కప్పువడినది, క్రుక్కఁబడినది. "ద్వి. గ్రక్కున భస్మంబు గాఁజురంధ్రంబు, గ్రుక్కిదంబై కట్టుకొని కీలుకొనుడు." పండితా. పురా. ౧౩౪. పు.

క్రుక్కు. దే. స. క్రి. 1. పేను మొ. గోటితో నొక్కు. "గీ. ఎలయుసీత్కారములతోడ నీల్గ గ్రుక్కు." పాండు. ౩, ఆ. ౩౦. ప్రభా. ౧, ఆ. ౧౦౯; 2. అడఁచు. "సీ. శౌడకు రసావేశమున వచ్చు నర్మోక్తు లాదవి నాలుకకు రాకుండఁ గ్రుక్కు." స్వా. ౩, ఆ. ౯౭; 3. తూరుచు. "ఉ. అక్కమలాయతాక్షుఁడు భయంకరబాహువు దైత్యుకుక్షిలోఁ, గ్రుక్కిన..." వి. పు. ౭, ఆ. ౩౨౯. వి. మోసము, వంచనము. ఆం. భా. ద్వి. ౮౯౨.

క్రుక్కుడు. దే. వి. (క్రుక్కు-ధా.) 1. క్రుక్కుట. (శ. ర.); 2. పీడనము. ఆం. భా. ప్ర. ౧౫౦.

క్రుచ్చు = కూర్చు. (చూ. వాక్రుచ్చు.)

క్రుత్తు. సం. వి. ధ్. స్త్రీ. కోపము.

క్రుధ. సం. వి. ఆ. స్త్రీ. కోపము.

క్రుద్ధము. సం. వి. అ. న. కోపము. విణ. (అ. ఆ. అ.) కోపము నందినది.

క్రుమ్మరించు. దే. స. క్రి. (క్రుమ్మరుధా. ప్రే.) 1. (కడవ మొ. వానితో) ఒక్కసారిగాఁ బోయు. "గీ. కడవలను గ్రుమ్మరించినవడువు తోఁపఁ, గురియుచుండఁగ..." ద్వా. ౧౦, ఆ. ౪౪; 2. ప్రజ్వలింపఁజేయు. "సీ. క్రోధపావకః దుందుకుండంబు లన నేత్రగోళముల్ మంటలు గ్రుమ్మరింప." ఉ. రా. ౩, ఆ. ౩౪౫; 3. ప్రసరింపఁజేయు. "గీ. కమ్మని పిసాళివలపులు గ్రుమ్మరించు, కమ్మజవ్వాది..." వసు. ౫, ఆ. ౧౦౯.

క్రుమ్మరిల్లు. దే. అ. క్రి. (క్రుమ్మరించు. ధా.) 1. (కడవ మొ. వానినుండి జలాదులు) ఒక్కసారిగాఁ బడు. "క...శృంగారరసంబు గ్రుమ్మరిలు పొదరింటన్." కవిరా. ౨, ఆ. ౧౬౧; 2. గుట్టలుగాఁ బడు. "వ...క్రుమ్మరిల్లినబొమ్మిడికమ్ములును గుంపులుగొనుపడగలును..." పద్మ. ౧౦, ఆ. ౨౬.

క్రుమ్మరు. దే. అ. క్రి. 1. విహరించు, తిరుగు. "క. అమృతముతో నుద్భవమై, యమరేశ్వరయోగ్యమైనహయరత్నము తద్విమలోదధితీరంబునఁ, గొమరుగ నేకతమ యిచ్చఁ గ్రుమ్మరుచున్నన్." భార. ఆది. ౨, ఆ. ౨౬; 2. వర్తించు, మెలఁగు. "క. ఉరులింగము బోధించిన,కరణిఁ గ్రుమ్మరుచు..." చెన్న. ౫, ఆ. ౨౨౪; 3. (జలాదులు ఘటాదులనుండి) ఒక్కసారిగాఁ బడు. (చూ. క్రుమ్మరించు.)

క్రుమ్ము. దే. స. క్రి. 1. పొడుచు. "గీ. ఈఁటియలఁ గ్రుమ్మి నొంచిరి లేఁటిగముల." య. ౨, ఆ. ౧౭. ఉ. హరి. ౧, ఆ. ౧౪౨; 2. మర్దించు. "సీ. కంసారి బిగియారఁ గౌఁగిటఁ జేర్చిన గుబ్బలఁ గసిదీఱఁ గ్రుమ్మెఁ గొమ్మ." రాధికా. ౨, ఆ. ౧౩౬. వి. 1. పోటు, పొడుపు. "సీ. కులుకుగుబ్బల యొమ్ము గ్రుమ్ము లేర్పడి గ్రుచ్చి తనివారఁ గౌఁగిట ననఁగి పెనఁగి." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౩౨; 2. ఉద్ధతి. "సీ. దయ పితలిందికి వైచి నయము క్రుమ్మడఁగించి..." దశ. ౩, ఆ. ౯.

క్రుమ్ముడి. దే. వి. (కురులు+ముడి.) కురులముడి, కొప్పు. (చూ. క్రొమ్ముడి.) "ద్వి. కడఁకతోఁ గూఁతు క్రుమ్ముడిఁ గోసి మాకు, జడఁ గట్టె మానక జారుండు..." బస. ౪, ఆ. ౧౨౩. పు. ౭. పం.

క్రుమ్ముడు. దే. వి. (క్రుమ్ము ధా.) పోటు, పొడుపు. (శ. ర.)

క్రుమ్ముడువడు. ద్వ. అ. క్రి. (క్రుమ్ముడు+పడు.) పోటుపడు. (శ. ర.)

**క్రుమ్ములాడు.** దే. అ. క్రి. (క్రుమ్ము+ఆడు.) 1. కొమ్ములతోఁ గ్రుమ్ముకొను. "గీ. కొసరకాఁబోతు నాఁబోతుఁ గ్రుమ్ములాడ." కాశీ. ౨, ఆ. ౧౨౪; 2. పోరు. "ఉ.. మన్మథవికారము ధైర్యముఁ గ్రుమ్ములాడఁగన్." కళా. 3, ఆ. ౧౯; 3. వాగ్వాదముచేయు. "గీ. ఓపిఁ బడవైచె నాతఁడా పేరుఁ దవుచుఁగా వదుచుఁ గ్రుమ్ములాడునక్రొంచ రాశి." కవల. ౨, ఆ. ౧౫౧.

**క్రుమ్మెన** = క్రుమ్ము. (పోటు, పొడుపు.) (చూ. క్రుమ్మెనలాడు.)

**క్రుమ్మెనలాడు.** దే. అ. క్రి. (క్రుమ్మెనలు+ఆడు.) పోట్లాడు, యుద్ధముచేయు. "మ...రాచబిడ్డలు నకౌ వెల్మవారల్ దురమ్మునకు నొడ్డారించి క్రొవ్వాఁడిబాఁకులతోఁ గ్రుమ్మెనలాడసాగి రలుకన్..." రంగా. 3, ఆ. ౨౧౬.

**క్రుయి.** దే. వి. కొప్పులో దోఁపిన వెండ్రుకలముడి "శ్రీ. క్రుయి వెళ్లి జాఱిన క్రొమ్ముడిలో పలివిరులు తుమ్మెదలకు విందువెట్టె." కాశీ. ౫, ఆ. ౧౧౯.

**క్రుయ్యఁబాఱు.** ద్వ. అ. క్రి. (క్రుయ్యన్+పాఱు. స్వార్థమున.) క్రుయ్యు, కృశించు, "సీ. పలికి యొంపయుఁ గ్రుయ్యఁబాఱినచుఁజెక్కు లందంద తడిపెడు నశ్రువారి." హరి. ఉ 3, ఆ. ౪౭.

**క్రుయ్యు.** దే. అ. క్రి. (సం. కృశ్.) 1. కృశించు. "చ...వంతయును గ్రుస్సి ఖురంబు ప్రస్సి పుర్వు లుగ్గడుపుగఁ బాఱఁ దద్దయును గాఱియఁ బొంజె ప్రజంబుల్ బసుల్." హరి. పూ. ౬, ఆ. ౪3; 2. క్షీణించు. "క. క్రుయ్యా దొకయించుకైనన్, దయ్యము కొవలిపేయఁ దృష్ణ..." భాగ. ౯, స్కం. ౪౭౭, 3. వెనుదీయు. "ఉ. ఎయ్యెడఁ గయ్యముల్ గలవొ యెవ్వడు చివ్వల కుత్సహింతుఁడో, క్రుయ్యక..." హరి. పూ. ౮, ఆ. ౧౧౬; 4. వసుకఁబడు. "వ...తరుణతరుణి జనంబులు...వినోదంబుల నడటుమీఱి కడచి చనం బంధ్యాంధజరఠ ప్రముఖులు క్రుస్సి యొలాకు పడ నెడనెడం గావలియై తగువారు నడపింప..." హరి. పూ. ౬, ఆ. ౨౨; 5. శ్రమమందు. "క...దుర్భిక్షప్రాణంబుల్ నయ్యాఁ దొమ్మిది యమ్ములఁ గ్రుయ్యక దయ్యక యతండు గొనియె నరేంద్రా." భార. ద్రో. ౪, ఆ. ౧౯౭.

**క్రుష్టము.** సం. వి. అ. న. 1. ఏడుపు; 2. కూఁత; 3. ధ్వని. విణ. (అ. ఆ. అ.) 1. అఱచినది; 2. తిట్టఁబడినది; 3. యుద్ధాదులకుఁ బిలువఁబడినది.

**క్రుళ్లగించు.** దే. అ. క్రి. (మనసులో) దుఃఖించు. (శ. ర.)

**క్రుళ్లగింత.** దే. వి. (క్రుళ్లగించు. ధా.) మనసులోని దుఃఖము. (శ. ర.)

**క్రుళ్లు.** దే. అ. క్రి. 1. క్రుళ్లగించు. "సీ. కోపశోకాదులఁ గ్రుళ్లుచు..." భాగ. ౬, స్కం. ౫౦౯; 2. అవియు, పగులు. "సీ. గుండియలు గ్రుళ్లఁ దన్నిన..." శుక. 3, ఆ. ౯33. భో. ౬, ఆ. ౧౫౦; 3. (కాలాతిక్రమమున ఫలాదులు) చెడు. (శ. ర.)

**క్రుళ్లుపోతు.** దే. విణ. (క్రుళ్లు+పోతు.) క్రుళ్లగించుస్వభావము గలవాఁడు. (శ. ర.)

### క్రూ.

**క్రూర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎఱ్ఱగలిజేరు♆; 2. రేఁగు♆, 3. వాఁకుడు♆.

**క్రూరకోష్ఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మలబద్ధరోగము కలవాఁడు.

**క్రూరగంధము.** సం. వి. అ. పుం. గంధకము.

**క్రూరదృక్కు.** సం. వి. అ. పుం. 1. శని; 2. అంగారకుఁడు; 3. పిశునుఁడు. స్త్రీ. క్రూరదృష్టి. విణ. (శ్) క్రూరదృష్టి గలవాఁడు.

**క్రూరము.** సం. వి. అ. పుం. 1. డేగ; 2. రాపులుఁగు. న. ఉస్థి. విణ. (అ. ఆ. అ.) భయంకరమైనది; 2. దయ లేనిది; 3. హింసించునది; 4. కఱకైనది; 5. ధనము లేనిది; 6. ఉష్ణము కలది.

**క్రూరరావి.** సం. వి. న్. పుం. మాలకాకి.

### క్రే.

**క్రే.** దే. విణ. (వృత్తియందు 'క్రేవ' శబ్దమునకు తుది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. ఉదా:- క్రేఁగన్ను, క్రేఁగయిమొ.) ప్రక్కది. (చూ. క్రేఁగన్ను.)

**క్రేంకారము.** సం. వి.అ. పుం. 1. మయూరాదిధ్వని. "సీ. కొక్కరోకో యని కొమరుసామి రథంబు కంఠంబు సాచి క్రేంకార మిచ్చె." భీమ. ౨, ఆ. ౨౭; 2. శస్త్రభూషణాదు లొకదాని కొకటి తాఁకినఁ గలుగుధ్వని. "సీ. శస్త్రభూషణసము

చ్ఛయములు నుఱుపంగఁ గడలొత్తువలుఁదక్రేంకారములును." హరి. ఉ. ౭, ఆ. ౨౩౧.

క్రేంకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. శారికమరాళాదిధ్వని. "ఉ...కలారవక్రేంకృతి..." రామా. ౨ ఆ. ౧౦౪. ఆము. ౪, ఆ. ౧౮౦; 2. నూపురాది ధ్వని. "చ...అందియలక్రేంకృతి..." కాశీ. ౪, ఆ. ౧౫౪; 3. క్రేం అనుధ్వని. (చూ. క్రేంకృతికారి.)

క్రేంకృతికారి. సం. విణ. (న్. ఈ. న్.) క్రేం అను ధ్వని చేయునది. "ఉ...తటవిద్రుమద్రుమక్రేంకృతికారి..." పాండు. ౨, ఆ. ౧౯౨.

క్రేంక్రియ. సం. వి. ఆ. స్త్రీ. పక్షిధ్వని. "స్రగ్ధర. కేలీలోలద్విజాలీకృతమధురికల క్రేంక్రియా సంకులంబుల్." నైష. ౫, ఆ. ౧౫౯.

క్రేఁగన్ను. దే. వి. ఔ. (క్రేవ+కన్ను.) అపాంగము. కడకన్ను. ఆం. భా. ద్వి. ౧౪౪. "గీ. అనుచుఁ గ్రేఁగంట నీరసం బంకురింప." కాశీ. ౪, ఆ. ౧౪౮.

క్రేఁగయి. ద్వ. వి. (క్రేవ+కయి.) హస్తాగ్రము. "ఉ. మంచపుఁగోడు తాలుపరిమన్కిబిడాకపు మెట్టుఁ గ్రేఁగయిం,గొంచక యొత్తినట్టి నిను..." అచ్చ. యు. ౧౩.

క్రేఁటు. దే. అ. క్రి. 1. గొంతు సవరించుటకై శబ్దించు. "వ...ఆబోట్లటి క్రేఁటుచు నిట్లనియె." స్కా. ౬, ఆ. ౯; 2. తొట్రుపడు. "ఉ...అమాసచీకటిం గ్రేఁటుచు నేఁగుదెంచె నడురేయిని జారుఁడు కన్నపెట్టఁగన్." భల్లా. ౧, ఆ. (శ. ర.) వి. గద్గదకంఠమును సరిచేసికొనుటకై చేయు ధ్వని. ఆం. భా. ప్ర. ౧౨౨.

క్రేఁటుకొను. దే. అ. క్రి. (క్రేఁటు+కొను. స్వార్థమున.) గొంతు సవరించుకొనుటకు ధ్వనిచేయు. "క...అతనిఁ జూచుచుఁ, గోపమునం జూచి గ్రేఁటుకొనుచుం బలికెన్." స్కా. ౨, ఆ. ౬౯.

క్రేఁదొట్టు. దే. అ. క్రి. (క్రేవ+తొట్టు.) కట్టొరయు. "వ...క్రేఁదొట్టుకరళ్లకై వడి..." ఉ. హరి. 3, ఆ. ౬౪. (సూ. ని. పా. 'క్రేతొట్టు' శ. ర. పా. 'కైతొట్టు' మద్రి. పా.)

క్రేగాలి. దే. వి. (క్రేవ+గాలి.) మందమారుతము. "ద్వి. సంపఁగెక్రేగాలిఁ జలియించు తేఁటి, గుంపుల గతి..." అ. మ. క. ౨, ఆ. ౬౭. పు.

క్రేంగో. దే. వి. హంసహూఁతయందలి ధ్వని కనుకరణము. "ద్వి. ఏగతియును లేమి నే రాజహంస, క్రేంగో యనుచు మమ్ము గేలిసేసెదవు." పండితా. ప్రరా. ౧౪౫. పు.

క్రేడి. దే. వి. 1. సంబావృతోఁ గలసిన కాకు లోనగు ఎఱ్ఱపట్టు. (శ. ర.); 2. పరిహాసము. (చూ. క్రేడిసేయు.)

క్రేడించు. దే. అ. క్రి. 1. తొలఁగు. "క...విష్వచ్చుఁడు క్రేడించి యొందువలనికి నడచెన్." భార. భీష్మ. ౨, ఆ. ౩౦౭. ద్రో. ౧, ఆ. ౩౭౪; 2. ఉపేక్షించు. "చ. కని ద్రోణాత్మజుఁ డేచి సాత్యకి భుజాగర్వంబు మాన్పింతుఁ బొమ్మని పోఁబో నడుమన్ ఘటోత్కచుఁడు ఘోరాకారప్రస్ఫురజంఘుఁడు దానుం బటుసింగిఁ దాఁకుటయుం నిపుత్త్రుండుఁ గర్జుండుఁ దక్కినవారల్ వెఱ లోని తోడియనికిం గ్రేడించి పక్షీశ్వరా." భార. ద్రో. ౫, ఆ. ౬౮. ౧, అ. ౩౯౯.

క్రేడిసేయు. దే. అ. క్రి. (క్రేడి+చేయు.) పరిహసించు. "వ...విలయమార్తాండమండలంబు వేఁడిమిం గ్రేడిసేయుమాఁడవబాణంబు తూణంబునం దిగుచునప్పుడు..." జై. ౫. ఆ. ౪౨. (శ. ర. పా. 'క్రేణిసేయుఁ' మద్రి.)

క్రేణి. దే. వి. 1. పరిహాసము. "ఉ. నారి యొకర్తు చొక్కపునవల్ గలచక్కని చిన్నపొన్నకుం, జెరి ప్రసూనగుచ్ఛము లశేషముఁ గోసియుఁ గ్రేణి నోర్తు నీ,భూరుహ మెక్కు మన్న నగి పూచెఁగఁ జేయుదు నాకిదెంతయున్, మేరువు గాదు నా నది నమేరు వనం బగి పూచెఁ గ్రమ్మఱన్." చమ. ౧, ఆ. ౬౮. (శ. ర. పా.); 2. అధికారము. "క. మించి ధనమాసఁ బ్రజ నెక్కించుచు మరొత్తులకుఁ గ్రేణియిచ్చుట పతి కూహించిన నిండిన చెఱు వవిఁయించి శకులకులము సంగ్రహించుట కాదే." కవిక. ౨, ఆ. ౧౯.

క్రేణించు. దే. స. క్రి. ఉపేక్షించు, తిరస్కరించు. "సీ. కమల మొక్కటి నేను గాన్కగా నిచ్చినఁ గనుసన్నఁ గ్రేణింపఁ జనునె సకియ." రామా. ౧, ఆ. ౧౮౮.

క్రేణిపట్టు. దే. స. క్రి. (క్రేణి+పట్టు.) సంపాదించు. (బ్రాహ్మణుండు.) "గీ. పరమకల్యాణి యాపగాఁభ

శ్రీవేణి, రాజరేఖావతంసగారాపురాణి, సమధిక శ్రీతి దేవి యాసత్యవాణి, కేవలత్వకుభశ్రేణి గ్రేణివట్టె." కాశీ. 3, ఆ. ౯౦.

**క్రేణిసేయు.** దే. స. క్రి. (క్రేణి+చేయు.) 1. పరిహసించు. "క...ద్రోణుం,డుదిత్కారుని గ్రేణిసేయుచుజ్జ్వలరథ మెల్లదిశలు వెలిఁగింపఁగ బెట్టిదముగ ముందు గవిసె మొన గడిమితోఁ గవియన్." భార. ద్రో. ౧, ఆ. ౧౩౭. భార. విరా. ౧, ఆ. ౨౩౪; 2. జోలు. "ఉ. ఆందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱు వ్రాలెందఱో యెన్నుమా యిచట నీగురుభీష్ములఁ గ్రేణిసేయువా,రెందఱో..." భార. ఉద్యో. 3, ఆ. ౨౬౪. [కొనువాఁడు.

**క్రేత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) వెల యిచ్చి

**క్రేపు.** దే. వి. 1. దూడ. ఆం. భా. ద్వి. ౨౬౨. భార. శాం. ౨, ఆ. ౩౮౯; 2. పాఁడిపశువు. (ఆవు,గేదె) 'సీ. క్రేపులు కమయంత క్షీరముల్ గురిసెను..." శశాం. ౫, ఆ. ౧౬౪; 3. (పర్వత) శిఖరము. "ఉ...ఇందుబింబముగా, గిమ్మననీదు మోము గిరిక్రేపులు మూఁపులు కొను గానరాదు..." స్వా. 3, ఆ. ౬.

**క్రేయము.** సం. విణ. (అ. ఆ. అ.) కొనఁదగినది.

**క్రేయో.** దే. వి. వెడలఁగొట్టుటయం దగుధ్వని కనుకరణము. "శా...ఈ,యోషిద్వ్రాడఖులన్ ధనంబుఁ గొని క్రేయో యంచు మర్త్యాళి దుర్భావల్ వల్కుఁ బురంబులో వెడలఁ బంపం బాడి..." భల్లా. 3, ఆ. (శ. ర.)

**క్రేవ.** దే. వి. 1. పార్శ్వము. "శా. తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువకేదారంబుతీరంబునన్." స్వా. ౨,ఆ. ౨౨; 2. దగ్గఱ. ఆం. భా. తృ. ౨౧; 3. ప్రదేశము. "ఉ...చలువక్రేవల కేఁగుచు నీరు ద్రావుచున్." చెన్న. ౫, ఆ. ౧౩.

**క్రేళ్లు.** దే. వి. బ. 1. అతిశయము, పెంపు. "సీ... క్రీడాచలంబులక్రేళ్లు గలిగి." భా. రా. యు. ౨౨౭౧; 2. గంతులు, దుముకులు. (చూ. క్రేళ్లుదాఁటు మొ.)

**క్రేళ్లుచూచు.** దే. స. క్రి. (క్రేళ్లు+చూచు.) చంచలముగాఁ జూచు. "ఉ...నేర రబ్బసం,వచ్చటులంబులై మెఱయు బచ్చెనచూపులఁ గ్రేళ్లుచూడఁగన్." పిన. శకుం. ౨, ఆ. ౧౬౦.

**క్రేళ్లుచూపు.** దే. వి. (క్రేళ్లు+చూపు.) చంచలదృష్టి. "సీ. క్రేళ్లుచూపులకలికితనంబుపస నేర్చె..." కళా. ౬, ఆ. ౨౦౦.

**క్రేళ్లుత్రుళ్లు.** దే. అ. క్రి. (క్రేళ్లు+త్రుళ్లు.) ఎగిరిపడు. "సీ. తలవాంచి బెళుకుఁజూపులు క్రేళ్లుత్రుళ్లఁగఁ దెఱమఱుఁగున నిల్చి నొఱపుఁ జూచి." కుచల. ౪, ఆ. ౮౧.

**క్రేళ్లుదాఁటు.** దే. అ. క్రి. (క్రేళ్లు+దాఁటు.) 1. ఎగిరిపడు. "స్ర...మీలు, క్రేళ్లుదాఁటుచు..." విష్ణు. పూ. ౨, ఆ. (శ. ర); 2. గంతులిడు. "సీ...మనుఁబిల్ల డొంకలనుండి క్రేళ్లుదాఁట." స్వా. ౨, ఆ. ౭.

**క్రేళ్లుదోలు.** దే. స. క్రి. (క్రేళ్లు+తోలు.) పరుగులెత్తించు. "వ...తేరు క్రేళ్లుదోలి పాంచాల బలంబులపై నడరె." భార. భీష్మ. 3, ఆ. ౩౬౮.

**క్రేళ్లుద్రిప్పు** = క్రేళ్లుదోలు. "మ...శోర్యులు క్రేళ్లుద్రిప్పు..." స్వా. ౨, ఆ. ౩౦.

**క్రేళ్లుబ్బు.** దే. అ. క్రి. (క్రేళ్లు+ఉబ్బు.) అతిశయించు. "సీ. ఆలజలంబులు ధాత్రి నవఘళింపక మున్న క్రేళ్లుబ్బువారియకీర్తిపంక్తము..." నరస. ౫, ఆ. ౧౦౨.

**క్రేళ్లుమలఁగు.** దే. అ. క్రి. (క్రేళ్లు+మలఁగు.) వెనుదీయు, నిరాకరించు. "సీ. ఉరుకుచాద్రుల నంట నూహించు నూహించి క్రేళ్లుమలంగిన డిల్లపోవు." సాంబో. ౧, ఆ. ౭౦. 3, ఆ. ౧౪౩.

**క్రేళ్లుమసలు.** దే. అ. క్రి. (క్రేళ్లు+మసలు.) సంచలించు. "గీ. యమున కొకయింత యోరఁగా నడుగు లూఁది,సాలమూలంబు నాఁగటం జాల గ్రొచ్చి, యీవతుదఁ గేలఁ దివిసిన నీమదార్తిఁ, గ్రేళ్లుమసలుచు వెస నొడ్డగిల్లెఁ బురము." సాంబో. ౫, ఆ. ౨౩౧.

**క్రేళ్లురుకు.** దే. అ. క్రి. (క్రేళ్లు+ఉరుకు.) 1. ఎగిరిపడు. "సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడు వాలుగుసోగల నేలు దెంచి." (..."వాలుగ సోగల మేలుఁడించి." శ. ర. పా.) భార. విరా. ౨, ఆ. ౮౩; 2. గంతులిడు. "క. క్రేళ్లుఱికి మసలె లేఁగలు,మల్లడిగొని అంకె లిడియె మదవృష

భంబుల్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౭; 3. చూచుటు."క...క్రేళ్ణటికెం దొలఁగం బగతుని,య అకటనుండి భువిమీఁది కబ్బలియుండున్." హరి. పూ. ౭, ఆ. ౧౨౫. భార. శల్య. ౨, ఆ. ౨౭౫.

క్రేళ్ణవాఱు. దే. అ. క్రి. (క్రేళ్ణ+పాఱు.) 1. గంతులిడు. "ఉ...లోచన ప్రభా,జాలము క్రేళ్ణవాఱఁగఁ గుచద్వితయంబు చలింప..." కృ. శకుం. ౨, ఆ. ౪౮; 2. విజృంభించు. "గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తోలఁగ నుఱికి, కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్ణవాఱు, నావృకోదరుపైఁ గవియంగఁ జేయి,వీచె సేనకుఁ గాళింగవిభుఁడు గడఁగి." భార. భీష్మ. ౨, ఆ. ౭౦; 3. చెదఱిపోవు. "ఉ...వేఁ, గప్పె శరాళి సూతుఁడు తెగటార్చు లోటఱి గ్రేళ్ణవాఱఁగన్." భార. ద్రో. ౪, ఆ. ౧౨౫.

క్రేళ్ణసను. దే. అ. క్రి. (క్రేళ్ణ+చను ) ఎగిరిపడు. "సీ. హస్తులగదఁరుచ కడచి నిల్వక క్రేళ్ణసను హయంబులమణిస్యందనములు." భా. రా. యు. ౫౧౮.

క్రేళ్ణెగయు. దే. అ. క్రి. (క్రేళ్ణ+ఎగయు.) పైకెగురు. "క...,కే లొగిఁ దెగి యులుఁగుతోన క్రేళ్ణెగసి పడెం, దూలె..."కు.సం.౧౧,ఆ.౧౫౫.

## క్రై.

క్రై. ఒకానొకఅక్షరము. (ఈయక్షరముక్రింద 'క్రైలు' 'క్రైలుదారి' యనుపదములు శ. ర. సూ. ని. మొ. నిఘంటువులు గ్రహించినవి. అందుల కాధారముగాఁ జూపిన. ఉ. హరి. ౪, ఆ. ౨౯౯. లో శ. ర. పా. ఎచటను గానరాని కారణమునను ముద్రితప్రతులలో మఱియొక చక్కనిపాఠ ముండుటచేతను నవి యిట త్యక్తములు.)

## క్రొ.

క్రొ. దే. విణ. వృత్తియందు 'క్రొత్త'శబ్దము యొక్కలుప్తవిశేషరూపము. (చూ. క్రొత్త.)

క్రొంకి. దే. వి. కొంకి, యుద్ధాదిసాధనవిశేషము. "గీ...క్రొంకులు బద్ధపరులుఁ,గత్తి గొంతంబు లాదిసెల్లెఁ గత్తళములు." ఉ. హరి. ౨, ఆ. ౯౨. "చ...ఉరి,క్రొంకి నారసము..." దశ. ౫, ఆ. ౭౭. (ఇట నిది యొకచోరసాధనము.)

క్రొంచె. వై. వి. (సం. క్రౌంచః. ప్రా. కొంచ.) క్రౌంచము. "ఉ. ఱెక్కలు సించి కంఠమున ఱెకలు వాపి శిరంబు వ్రచ్చి పేఁరుకుక్కఁ గ్రొంచచంచ మఱునొద్దు గలంగఁగఁ జేసి..." భార. భీష్మ. ౨, ఆ. ౩౦. సాంబో. ౨, ఆ. ౫.

క్రొంజమురు. దే. వి. (క్రొత్త+చమురు.) క్రొత్తనూనె. "చ...మే, చిదిమినమాత్రఁ గ్రొంజమురు చిల్లున మీఁదికి గుప్పలింపఁగా." సాంబో. ౨, ఆ. ౧౮౬.

క్రొంజిగురు. దే. వి. (క్రొత్త+చిగురు.) క్రొత్తచిగురు, లేఁతచిగురు. "సీ...క్రొంజిగు రొత్తిన గుజ్జుమావి." దశా. ౨, ఆ. ౨౮౨.

క్రొంజిగురులవిల్కాఁడు. దే. వి. (క్రొత్త+చిగురు+విలుకాఁడు.)మన్మథుఁడు.ఆం.భా.ప్ర.౪౪.

క్రొంజిలుఁగుఁజల్వ. దే.వి.(క్రొత్త+చిలుగు+చల్వ.) అతిసున్నిత మైనవస్త్రము. "చ. జలకములాడి క్రొంజిలుఁగుఁజల్వలు దాలిచి..."ఉ. రా. ౫, ఆ. ౨౪౭.

క్రొంజీకటి. దే. వి. (క్రొత్త+చీకటి) మునిచీకటి, మసకచీకటి."మ....కన్పట్టెఁ గ్రొంజీకటుల్."వసు. ౪, ఆ. ౧౦. [కాంతి. ఇందు. ౫,ఆ.౧౭౩.

క్రొంజాయ. ద్వి. వి. (క్రొత్త+చాయ.) చక్కని

క్రొందమ్మి = క్రొత్తమ్మి (శ. ర.)

క్రొందావి. దే. వి. (క్రొత్త+తావి.) చక్కనిపరిమళము. హంస. ౫. ఆ. ౩౬౬.

క్రొంబట్టు. దే. వి. (క్రొత్త+పట్టు.) క్రొత్తపట్టు, చక్కనిపట్టు. దశా. ౭. ఆ. ౭౨.

క్రొంబని. దే. వి. (క్రొత్త+పని.) చక్కనిశిల్పము. ఇందు. ౬, ఆ. ౧౩౧.

క్రొంబూవిలుకాఁడు. దే. వి. (క్రొత్త+పూ+విలుకాఁడు.) నవమన్మథుఁడు. కృ. శకుం. ౧, ఆ.౭౦.

క్రొంబెరుఁగు. దే. వి. (క్రొత్త+పెరుఁగు.) సద్యోదధి, అప్పుడే చక్కఁగాఁ దోడుకొన్న పెరుఁగు. పిన. శకుం. ౧, ఆ. ౧౩౫.

క్రొంబొగ. దే. వి. (క్రొత్త+పొగ.) క్రొత్తపొగ, బాగుగా వ్యాపించినపొగ. భా. రా. యు.౨౧౯.

క్రొక్కారము. దే. వి. కోడికూఁత. "సీ. కారోక్కడి గముల క్రొక్కారంపుసందడి..." చంద్రా. ౨, ఆ. ౮౧. (శ. ర. పా. 'కోకారము' ముద్రి.)

క్రొక్కారు. దే.వి. (క్రొత్త+కారు.) వర్షాకాలము. నైష. 3, ఆ. ౮౮.

క్రొగ్గంటి. దే. వి. (క్రొత్త+గంటి.) క్రొత్త గాయము, అపుడే పడినగాయము. కు. సం. ౧౧. ఆ. ౧౩౨. (వావిళ్ల ప్రతిలో యూనివర్సిటీ ప్రతిలో ముద్రితపా. 'క్రొంగంటుల.')

క్రొత్త. దే. వి. 1. నవీనత, నూతనత. "ఉ. ఆజి రసంబులం జవులయందుఁ గ్రొత్తలువుట్ట నిచ్చులుకా, వేడ్కకనంగిఁ బాకములు విన్నను వొప్పుగఁ జేసి చేసి..." భార. విరా. ౧, ఆ. ౭౭; 2. అపూర్వత. (చూ. క్రొత్తచేయు.) విణ. (వృత్తియందు మీఁదివర్ణము వికల్పముగా లోపించినపుడు కొన్నియెడల నుగాగమమును గొన్నియెడలఁ బరమగువాల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా:— క్రొంబసిఁడి, క్రొక్కారుమొ.) 1. నూతనము, నవీనము. "సీ. క్రొత్తముత్యములతో ..." కాశీ. ౬, ఆ. ౩౯, భాగ. ౧౦, స్కం. పూ. ౧౬౮౨; 2. అపూర్వము. పూర్వ మెఱుఁగనిది. "క...తద్ధారుణశరవృష్టి మిగులఁ గ్రొత్త యగుచు వీక్షణముల కత్యద్భుతకారణమై..." కళా, ౬. ఆ. ౯. క్రి. విణ. క్రొత్తగా. "సీ. క్రొత్త దోమినదంతకోరకంబునయందుఁ దాంబూలరాగంబుతళుకు గూర్చి." క్రీడా. ౧౩౪.

క్రొత్తచేయు. దే. అ. క్రి. (క్రొత్త+చేయు.) 1. (అలవాటులేమి) వికృతి గలిగించు. "క...మధురసపానం బీ,చపలునికిం గ్రొత్తచేసి సంకటపఱిచెన్." ప్రబోధ. 3, ఆ. ౬౦; 2. క్రొత్తగా సంపాదించు. 'వ...శూలపాణికిం బరమసాధనం బైనపాశుపతంబు నీకుం బ్రస్ఫుటపరిజ్ఞానం బయిన నీవు జయద్రథవధం బవశ్యంబును జేయుదు వమ్మహాస్త్రంబుకలిమి సమంత్రకముష్టికస్థానక విజ్ఞానంబుగాఁ గ్రొత్తచేసికొనుట మేలు తదర్థంబుగా నద్దేవుఁ జిత్తంబున నిలిపి సభక్తికధ్యానంబు సేయుము..." భార. ద్రో. ౨, ఆ. ౩౬౧.

క్రొత్తడము. దే. వి. కోటఁబురుజు. "సీ. క్రొత్త డంబులకొంపు క్రొత్తడంబులరంగు నింగికిఁ దోఁపు పన్నియలు నింప." య. ౧, ఆ. 3.

క్రొత్తడి. దే. వి. 1. పతివ్రత. ఆం. భా. ద్వి. ౧౧౬; 2. పుణ్యస్త్రీ, పతిపత్ని. "క. అత్తలకు మ్రొక్కి తక్కటి, క్రొత్తడు లందఱకుఁ బ్రియము కొనలు నిగుడఁగా." హరి. ఉ. ౪, ఆ. ౨౩౪. "చ... అది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొత్తడి సకలంబుఁ జూడ సఖ హైన్యముఁ బొందటఁ జూచి పొక్కితిన్." భార. ఉద్యో. 3, ఆ. ౧౮౭.

క్రొత్తపడు. ద్వ. అ. క్రి. (క్రొత్త+పడు.) క్రొత్త యగు. (చూ. క్రొత్తవఱుచు.)

క్రొత్తమగఁడు. దే. వి. (క్రొత్త+మగఁడు.) అంతుమగఁడు, జారుఁడు. "ఆ. కోట్ల మూయ దుద్దు గొంగడి పఱిచిన,మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచుఁ, గులఁకునడల నరిగి కూర్చుండె దాని క్రింది,దింటిమగఁడు దాఁగు టెఱుఁగ లేక." వేం. పంచ. 3, ఆ. ౨౪౭.

క్రొత్తముట్టు. దే. వి. (క్రొత్త+ముట్టు.) 1. నూలిపోఁగు; 2. సమర్త. "గీ. క్రొత్తము ట్టన నూలిపోఁగును సమర్త." ఆం. భా. తృ. ౪౭.

క్రొత్తమ్మి. దే. వి. (క్రొత్త+తమ్మి.) పుల్లపద్మము. పిన. శకుం. ౧, ఆ. ౧౭౫.

క్రొత్తవఱుచు. ద్వ. స. క్రి. (క్రొత్తపడుధా.) ప్రకాశింపఁజేయు, నూతనశోభ నిచ్చు. "మ. ప్రమదం బాననకాంతిఁ గ్రొత్తవఱుపన్..." భార. భీష్మ. ౧. ఆ. ౧౦౫.

క్రొత్తళము = క్రొత్తడము. (శ. ర.)

క్రొత్తావి = క్రొందావి. పిన. శకుం. ౨, ఆ. ౬౧.

క్రొన్నన. దే. వి. (క్రొత్త+నన.) క్రొత్తమొగ్గ. ఆము. ౫, ఆ. ౧౧౫. శశాం. ౨, ఆ. ౯౭.

క్రొన్ననఁబోఁడి. దే. వి. (క్రొత్త+నన+పోఁడి.) స్త్రీ; నూత్నకుసుమాంగి. నీలా. ౧, ఆ. ౧౧౬.

క్రొన్ననలొత్తు. దే. అ. క్రి. (క్రొన్ననలు+ఒత్తు.) అతిశయించు. "ఉ...క్రొన్ననలొత్తునిజావలోకనో,త్కంఠ నతిప్రయత్నమునఁ దత్కృతి నిట్లు పఠింప..." పరమ. ౫, ఆ. ౧౧౪.

క్రొన్ననవింటివాఁడు. దే. వి. (క్రొత్త+నన+విల్లు+వాఁడు.) మన్మథుఁడు. విక్ర. ౧, ఆ. ౧౦౭.

క్రొన్నిలుటద్దము. దే. వి. (క్రొత్త+నిలువు+అద్దము.) క్రొత్తనిలువుటద్దము. కాళిందీ. ౨, ఆ. ౧౦౪.

క్రొన్నురుఁగు. దే. వి. (క్రొత్త+నురుఁగు.) నూత్నఫేనము. పరమ. ౧, ఆ. ౬౩.

క్రొన్నెత్తురు. ద్వా. వి. బొ. (క్రొత్త+నెత్తురు.) కవిక. ౫, ఆ. ౧౯౨.

క్రొన్నెల. దే. వి. (క్రొత్త+నెల.) బాలచంద్రుఁడు. దశా. ౩, ఆ. ౪౬. బ. చెక్కిళ్లయందును దొడలయందు మీఁజేతులందును గావించునఖక్షతములు. వేంక. మాన. ౨౨.

క్రొన్నెలతాలుపు. ద్వా.వి. (క్రొత్త+నెల+తాలుపు.) చంద్రశేఖరుఁడు, శివుఁడు. రాజ. చ. ౧, ఆ. ౫.

క్రొమ్మావి. దే. వి. (క్రొత్త+మావి.) క్రొత్తగాఁ బూఁచినమామిడిచెట్టు. ఉ. రా. ౩, ఆ. ౬౬.

క్రొమ్మి. దే. వి. ఎఱ్ఱగోరంటచెట్టు. ఆం. భా. ద్వి. ౫౩.

క్రొమ్మించు. దే. వి. (క్రొత్త+మించు.) 1. క్రొత్తమెఱుపు. నీలా. ౫, ఆ. ౫౨; 2. నూత్నకాంతి. హర. ౫, ఆ. ౪౪.

క్రొమ్మించుదారి. ద్వా. వి. (క్రొత్త+మించు+దారి.) మేఘము. వేంక. దేవ. ౫౩.

క్రొమ్ముడి = క్రుమ్ముడి. (క్రొత్త+ముడి.) భార. ఉద్యో. ౩, ఆ. ౧౧౩. ఆం. భా. ద్వి. ౧౪౫.

క్రొమ్మెఱుఁగు. దే. వి. (క్రొత్త+మెఱుఁగు.) 1. తొలకరిమెఱుపు. "క. ఉఱు ముఱిమి మూలగాడ్పులు,చఱచి విసరఁజొచ్చె మదనసంహారు దెసఁ గ్రొమ్మెఱుఁ గుద్భవించె..." హర. ౫, ఆ. ౧౨; 2. నూత్నకాంతి. దశా. ౪, ఆ. ౫౯.

క్రొమ్మేఘము. ద్వా. వి. (క్రొత్త+మేఘము.) నూత్నమేఘము. భీమ. ౩, ఆ. ౭౨.

క్రొవ్వాఁడి. దే. వి. (క్రొత్త+వాఁడి.) తీక్ష్ణత. "ద్వి. క్రొవ్వాఁడి చూపక క్రూరత లేక." పండితా. దీక్షా. ౬౧. పు. విణ. మిక్కిలి వాఁడి గలది. "శా...నఱకెనో క్రొవ్వాఁడిఱంపంబుచే..." హర. ౨, ఆ. ౬౯.

క్రొవ్వారు. దే. అ. క్రి. (క్రొవ్వు+ఆరు.) 1. బలియు. "శా. క్రొవ్వారుంజనుదోయి వ్రేఁగునకు నాఁగోరంతకా నంతయుంగ్, జవ్వాడంగ ..." భాను. ౪, ఆ. ౪౪; 2. అందమగు. "గీ. విరిసెఁ గ్రొవ్వారి నాగకేసరపుఁబువ్వు." భీమ. ౫, ఆ. ౯౬.

క్రొవ్విదము. దే. వి. (క్రొవ్వు+ఇదము.) 1. మదించి చేయుంపని, దుష్కార్యము. "ఆ...ఇట్టి క్రొవ్విదంబులు సేయఁ,జొచ్చు టిచ్చగించి చూతురయ్య." భార. ఉద్యో. ౫, ఆ. ౯; 2. బలుపు. "ఉ. చన్నులక్రొవ్విదంబుఁ గటిచక్రపుఁబెంపును ..." పద్మ. ౩, ఆ. ౭. విణ. పరువైనది. "సీ. విరియ నూకించు క్రొవ్విదపుమల్లియమొగ్గ తెలతాఁకఁ జొక్కించుచిక్కులందు." నృసిం. ౩, ఆ. ౨౫.

క్రొవ్విరి. దే. వి. (క్రొత్త+విరి.) నూతనప్రసవము, అపుడే వికసించినపువ్వు. నైష. ౭. ఆ. ౧౬౧.

క్రొవ్వు. దే. అ. క్రి. 1. మదించు. "సీ...దంభోద్భవుం డనురాజు...క్రొవ్వి..." భార. ఉద్యో. ౩, ఆ. ౫౭౨; 2. వాఁడియగు. "ఉ...కదీయమస్తముం,గ్రొవ్వినమచ్ఛరంబునన నూర్చెద..." ఉ. హరి. ౩, ఆ. ౪౩; 3. బలియు. "ఉ. క్రొవ్వినగట్టిబిబ్బరపు గుబ్బచనుంగవలున్..." హరిశ్చ. ౧, ఆ. ౧౦౫; 4. మిక్కుటమగు. "చ...క్రొవ్వినమంగళ ధూప ధూమముల్." కాశీ. ౧, ఆ. ౪౯. వి. 1. వస.శరీరధాతువులలో నొకటి. ఆం. భా. ద్వి. ౧౩౫; 2. మదము. "క. ఇవ్విధమున శిని వీరుని, క్రొవ్వు చెఱచి..." భార. శల్య. ౧, ఆ. ౫౫౬; 3. సారము. "సీ. వనజాక్షిచూపులు వలరాజుతూపులు క్రొత్తవెన్నెలలోని క్రొవ్వు నవ్వు." విక్ర. ౧, ఆ. ౧౧౯; 4 బలుపు. "ఉ. కోమలతామ్రమాళికల క్రొవ్వెఱ సంజకుఁ బ్రోదివెట్ట..." నైష. ౭, ఆ. ౧౫౩. బ. గర్వోక్తులు. "చ. తగుమునుఘోషయాత్రను బదంపడి గోగ్రహణంబునందుఁ జేరుగొనినసీకు ని ట్లనుట క్రొవ్వులు దక్కుము సాలు నిన్నియున్." భార. ద్రో. ౫, ఆ. ౯౯.

క్రొవ్వుగొను. దే. అ. క్రి. (క్రొవ్వు+కొను.) క్రొవ్వెక్కు, మదించు. "సీ. పరువంపుఁజినుకుల పసఁ గ్రొవ్వుగొని తేలగిలఁబడువానకోయిలల యొప్పు." హరి. పూ. ౯, ఆ. ౨౫.

క్రొవ్వెక్కు = క్రొవ్వుగొను. "ఉ. క్రిక్కిఱిచన్నదోయి యిరుక్రేవలకాంతియుఁ బంచబాణుఁ గ్రొవ్వెక్కఁగఁ జేయు..." నైష. ౨, ఆ. ౧౯౪.

క్రొవ్వెద. దే. వి. (క్రొవ్వు+వెద.) కేశధమ్మిల్లము, కొప్పు. "క...చెంగలువలు క్రొవ్వెదకు వేఱొకర్తు ఘటించెన్." ఆము. ౬, ఆ. ౧౫౯. ఆం. భా. ద్వి. ౧౪౫.

క్రొవ్వేఁడి. దే.వి. (క్రొత్త+వేఁడి.) మిక్కిలివేఁడిమి. విణ. బాధకము, సహింపరానిది. "గీ. విబుధముని మాట చెవికిఁ గ్రొవ్వేఁడి యగు ద,వమ్మునగర్వోద యంబు దైనవిధ్వస్తశిఖికి,చాల నుద్వేగ మంది..." కాశీ. ౧, ఆ. ౧౦౬.

క్రొష్టు. దే. వి. దగ్గుటయం దగుధ్వని కనుకరణము. "చ. కదలుకరాళితో శర యుగడ్డముతో బిగి తప్పి కట్టుసున్,వదలిన మేనికోఁ గనుల పైఁ బడి కప్పెడు భ్రూయుగంబుతోఁ గుదియను గేల నూనుకొని క్రొష్టున దగ్గుచు..." పార్వ. ౪, ఆ. ౭౮.

క్రో.

క్రోంచము. సం. వి. అ. పుం. క్రౌంచాద్రి. (వాచ.)

క్రోఁతి. దే. వి. (క. కోతి. త. కోడి.) కోఁతి. "ద్వి. ఆక్రూరకపుఁ గాక యగచరుల్ పఱవ,నో క్రోఁతు లార మీకులుక నేమిటికి."రం. రా. యు. ౩౭౬. పు. ఉ. రా. 3, ఆ. ౨౭౬.

క్రోడ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఱొమ్ము; 2. ఒడి.

క్రోడము. సం. వి. అ. పుం. 1. పంది; 2. కోటరము. న. 1. ఱొమ్ము; 2. ఒడి; 3. లోపలిభాగము. "మ...నాభిపం,కరుహక్రోడ మిళిందబృందము ..." ఆము. ౧, ఆ. ౫; 4. మధ్యము. "క. ఆశుక్షోజహుకహారితశ, మీ శాఖాశకలనిసద మేదురవిశదా, భీశుజ్వాలాజాలహు, తాశక్రోడ మున వేల్చి రాహుతు లెలమిన్."స్వా.౫,ఆ ౯౯.

క్రోడాడు. దే. స. క్రి. 1. కోరాడు, (వృషభము మొ. కొమ్ములతో) పొడుచు. "క. ఏడాకుపొన్న కొమ్మలు. గ్రోడాడెడునదవి గౌరుకొదమలు మోద,క్రీడఁ దనరుచాడ్పున..." హరి. పూ. ౭, ఆ. ౧౧౭; 2. (పందిమొ.) నేల కెల్లగించు. "వ. మహాదేహంబు లగువరాహంబులు చొచ్చి ఘోషంబుల నెల్లచోట్లుం గ్రోడాడం దొడంగె." హరి. పూ. ౬, ఆ. ౧౦.

క్రోడించు. దే. స. క్రి. తరచు, మథించు. "గీ. నవమతిస్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల,కావ్య లక్షణలక్ష్యసాగరము సెరయ." మై. ౧, ఆ. ౧౧.

క్రోడీకరణము. సం. వి. అ. న. 1. క్రోడీకరించుట; 2. ఆలింగనము. (హలా. ని.)

క్రోడీకరించు. సం. స. క్రి. 1. ఒకటిగాఁ జేర్చు. (శ. ర.); 2. తెలిసికొను. "వ...శాస్త్రంబులు క్రోడీకరించి పురాణంబులు హృద్గతంబులు గావించి..." సా. ౧, ఆ. ౫౩.

క్రోడుఁడు. సం. వి. అ. పుం. శనిగ్రహము.

క్రోధన. సం. వి. ఆ. పుం. ఒకానొకసంవత్సరము. ఆ. స్త్రీ. కోపము గలస్త్రీ.

క్రోధనము. సం. వి. అ. న. 1.కోపము;2. కోపించుట.

క్రోధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కోపి.

క్రోధము. సం. వి. అ. పుం. 1. కోపము; 2. రౌద్ర రసస్థాయిభావము.

క్రోధి. సం. వి. న్. పుం. 1. ఒకానొకసంవత్సరము; 2. దున్నపోతు; 3. కుక్క. విణ. (న్. నీ. న్.) క్రోధము గలవాఁడు.

క్రోధించు. సం. అ. క్రి. కోపగిల్లు. "క...వారాణ సిపైఁ,గ్రోధించినవిశ్వేశ భర్త కోపింపఁడొకో." కాశీ. ౭, ఆ. ౧౯౪.

క్రోధిల్లు = క్రోధించు. "ద్వి. (శిలాకారగజము) సాధకుఁ డెవ్వఁడే సాధించి యెక్కఁ,గ్రోధిల్లు ..." పండితా. పర్వ. ౩౮౪. పు.

క్రోద్ధ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కోపించువాఁడు.

క్రోయు. దే. స. క్రి. (పాము, మంటమొ.) నాలుకలు చాఁచు. "ఉ...నాలుకలు గ్రోయుమహో రగరాజయుగ్మముం,జేసి..." భార. ఆర. ౬, ఆ. ౧౭౮. "క. నాలుకలు గ్రోయుసర్పములు..." నృసిం. ౨, ఆ. ౧౩.

క్రోలగచ్చు. దే. వి. సర్పాక్షివృ. (బ్రా.)

క్రోలించు. దే. స. క్రి. (క్రోలుధా. ప్రే.) త్రాగించు. "సీ. హరులపగ్గము లూడ్చి యంబువుల్ గ్రోలించి ..." చం. రా. ౪, ఆ. ౬౭.

క్రోలు. దే. స. క్రి. 1. త్రాగు "చ...తియ్యనినీరు గ్రోలి..." హర. 3, ఆ. ౩౨; 2. తిను. "క. తలిరాకుగుత్తిఁ దమిఁ గోయిల చందునఁ జించి క్రోలె..." పారి. 3, ఆ. ౪౯; 3. మ్రింగు. "సీ. ఉగ్రసత్త్వాహార ముపశమించుటకు నా బడబాన లముఁ గ్రోలి పాఱవిడుచు." దశా. ౧, ఆ. ౨౧౯; 4. అనుభవించు. "గీ...ప్రియుండుఁ, బ్రియయుఁ గ్రోలిరి నూతనప్రేమరసము." హరి. ఉ. ౭, ఆ. ౨౦౪; 5. ఆఘ్రాణించు. "గీ. మావి కడ నిల్చు విరులనెత్తావిఁ గ్రోలు." స్వా. 3, ఆ. ౩౧. వి. 1. క్రోవి,గొట్టము. "చ...గొంతుక్రోల్,

గఱచి..." ఆము. 3, ఆ. ౨౦; 2. చిమ్మనగ్రోవి. "సీ. కనకంపుఁ గ్రోవుల్లు గొని ముంచి కాశ్మీర జలము లొండొరులపైఁ జల్లువారు." కు. సం. ౯, ఆ. ౧౧౦; 3. జాడు, క్షీణసస్యము. ఆం. భా. ద్వి. ౨౩౭. విణ. క్రోలు, పెద్దది. "గీ. క్రోలు పులి లేఁగదూడను గొంచుఁ బోవ;" పార్వ. 3, ఆ. ౧౧౭. [విశేషము. (శ. ర.)

క్రోలుకసవు. ద్వ. వి. (క్రోలు+కసవు.) సదము, తృణ

క్రోలుచు = క్రోల్చు.

క్రోల్చు. దే. అ. క్రి. కూయు. "చ. కొసరి వసంత కాలమునఁ గోయిల క్రోల్చినభంగి..." కాశీ. ౫, ఆ. ౧౬౭. స. క్రి. (క్రోలు ధా. ప్రే.) 1. త్రాగించు. "ఉ. వీనులలేనెలై పరియ వింతగఁ గావ్యరసంబుఁ గ్రోల్చి యమ్మానవకోటికిం బశు సమానత మానఁగఁ జేసి..." నృసిం. పీఠి. ౭. (శ. ర. పా. 'క్రోలి'ముద్రి.); 2. అభ్యసించు. "శా... ఆమ్నాయముల్ క్రోల్చుచో." పాండు. ౫, ఆ. ౧౭౧. శివరా. ౨, ఆ. ౮౨. 3. ఆలాపించు. "ఉ. కోయిలపంచమస్వరము క్రోల్చిన భంగిని..." క్రీడా. ౧౭౦.

క్రోవ. దే. వి. 1. సరము. "సీ... ఆణిముత్తెపుఁగ్రోవ ..." నీలా. ౨, ఆ. ౨౭; 2. రోగవిశేషము. ఆం. భా. ద్వి. ౧౨౮.

క్రోవి. యం. దే. వి. 1. గొట్టము. "గీ. తియ్యపూదేనియలక్రోవి దీని మోవి." నైష. 3, ఆ. ౧౭౦; 2. ఆసుపోఁతుగొట్టము. "సీ... దుండె నాడె క్రోవి." హంస. ౨, ఆ. ౧౧; 3. తుపాకి. 'సీ. చేతిక్రోవులు వైచి బీకుచెయ్యులఁ బాఱె బగ్గము పాడై తుపాకిమూఁక." రా. వి. ౫, ఆ. ౧౫; 4. బుడ్డి. "సీ... పన్నీటిక్రోవి." నీలా. 3, ఆ. ౯౦; 5. బరణి. "సీ. తనిరు లేమావిక్రొత్తజవాజిబలుఁ గ్రోవి..." అచ్చ. బాల. ౧౩౯; 6. మూస. "ఉ. కాలకళాదుఁ డెండ యనుకాంచనరేణువు ప్రత్యగాశనాఁ గ్రాలెడుక్రోవిఁ గూర్చి కరఁగంగ ..." కళా. ౮, ఆ. ౯; 7. కంఠనాళము. "గీ. కొంద ఱినతనూజాదులక్రోవిలోనఁ బ్రాణములు గల్గఁ దెలియుండి బ్రతికెద మన." రాఘవ. ౪, ఆ. ౧౫౫; 8. రంధ్రము. "సీ... పుట్టక్రోవులలోనఁ బుట్టెఁ జెట్లు." వాల్మీ. 3, ఆ. ౧౪౦; 9. భూమి లోపల నీళ్లు వచ్చుట కేర్పఱచినమార్గము. "చ. కొలఁకుల వాఁగులన్ సదులఁ గ్రోవుల బావుల నిర్ఝరంబులన్." భార. అర. ౪, ఆ. ౩౩౨; 10. కానుగచెట్టు. (క్రౌ.) వై. (సం. కరవకః.) ఎఱ్ఱగోరంటచెట్టు. ఆం. భా. ద్వి. ౫౩.

క్రోశనము. సం. వి. అ. న. 1. కూఁత; 2. అఱపు. విణ. (అ. ఆ. అ.) 1. అఱచునది; 2. కూయునది.

క్రోశము. సం. వి. అ. పుం. 1. ఏడుపు; 2. పిలుపు; 3. కోసు.

క్రోష్టుపుచ్ఛిక. సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్నచెట్టు.

క్రోష్టువు. సం. వి. ఉ. పుం. నక్క.

క్రోష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడునక్క; 2. నేలగుమ్మడిచెట్టు; 3. లాంగలిచెట్టు.

క్రోసు. వై. వి. (సం. క్రోశః.) కోసు. "గీ. అప్పుడు వారాణసీక్షేత్ర మైనక్రోసులంత మేర యుపద్రవం బందకుండు." కాశీ. ౨, ఆ. ౫౧.

## క్రౌ

క్రౌంచదారణుఁడు. సం. వి. అ. పుం. 1. గుహుఁడు; 2. పరశురాముఁడు.

క్రౌంచము. సం. వి. అ. పుం. 1. ఒకజాతికొంగ; 2. ఒకానొకపర్వతము; 3. ఒకానొకద్వీపము.

క్రౌంచాదనము. సం. వి. అ. న. తామరతూఁడు.

క్రౌర్యము. సం. వి. అ. న. క్రూరస్వభావము.

క్రౌశశతికుఁడు. సం. వి. అ. పుం. 1. నూఱుక్రోసులు నడచువాఁడు; 2. నూఱు క్రోశములదూరమున నుండఁగా వచ్చి కలిసికొనఁ దగినవాఁడు.

## క్ల

క్లమకము. సం. విణ. (అ. మికా. అ.) 1. బడలునది; 2. బడలఁజేయునది.

క్లమథము. సం. = క్లమము.

క్లమము. సం. వి. అ. పుం. శ్రమము.

క్లమి. సం. విణ. (న్.నీ.న్.) బడలినది, శ్రమముండినది.

క్లమిక. సం. విణ. (బు స్త్రీ. బు.) శ్రమమందువాఁడు, బడలువాఁడు.

## క్లా

క్లాంతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బడలినది; 2. వాడినది.

క్లాంతి. సం. వి. ఇ. స్త్రీ. బడలిక, శ్రమము.

క్లామ్యత్. సం. క్రి. బడలికపొందుచున్న. "గీ. గాఢపరిరంభసంభ్రమక్లామ్యదచల, గురుపయోధరవరహారకుసుమమణులు...,అమరఁగోమకాండ్రు పొలిచి సహస్రబముగ." వేం. పంచ. ౪,ఆ. ౩౧౩.

క్లి

క్లిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) తడిసినది.
క్లిశితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్లేశము చెందినది; 2. క్షీణించినది; 3. చెదరినది; 4. చెడినది; 5. స్వల్పమైనది.
క్లిష్టము. సం. వి. అ. న. 1. పూర్వోత్తరవిరుద్ధమైన వాక్యము; 2. దూరార్థము గలవాక్యము. "క. దూరార్థము క్లిష్టం బగు..." నరస. ౪, ఆ. ౧౭. విణ. = క్లిశితము.
క్లిష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. బాధ; 2. సేవ.

క్లీ

క్లీతకము. సం. వి. అ. న. అతిమధురము.
క్లీబము. సం. వి. అ. న. నపుంసకలింగము.
క్లీబుఁడు. సం. వి. అ. పుం. నపుంసకుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. పుంస్త్వహీనుఁడు; 2. పిఱికివాఁడు.

క్లే

క్లేదకము. సం. వి. అ. పుం. కఫము. విణ. (అ. దికా. అ.) తడుపునది.
క్లేదనము. సం. వి. అ. పుం. కఫము. న. తడుపుట. విణ. 1. (అ. ఆ. అ.) తడుపునది; 2. (అ.ఈ.అ.) తడుపుటకు సాధనమైనది.
క్లేదము. సం. వి. అ. పుం. 1. తడి; 2. బాధ; 3. పుండుచీము.
క్లేశకుఁడు. సం. విణ. (అ.శికా.అ.) బాధించువాఁడు.
క్లేశపడు. మి. అ. క్రి. (క్లేశము+పడు.) దుఃఖపడు, బాధపడు. "క. అత్యుద్ధతకుచజఘన, ప్రత్యుక్తం బగుచుఁ క్లేశపడుచవలగ్నం,బత్యంతదుర్బలం బై, యత్యున్నతుల నోపదఁ జేవ కబ్బునె సుఖముల్." కాళిందీ. ౨, ఆ. ౧౪౩.
క్లేశము. సం. వి. అ. పుం. 1. దుఃఖము; 2. కోపము; 3. ప్రయత్నము; 4. సేవ; 5. పంచక్లేశములలో నొకటి. (అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, మరణభయము ననునవి పంచక్లేశములు.)
క్లేశిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) క్లేశకుఁడు.
క్లేశితము. సం. విణ. (అ. ఆ. అ.) బాధింపఁబడినది.

క్లై

క్లైబ్యము. సం. వి. అ. న. 1. నపుంసకత్వము; 2. పిఱికితనము.

క్లో

క్లోమము. సం. వి. అ, న్. న. నీరులిత్తి.

క్వ

క్వణనము. సం. వి. అ. న. = క్వాణము.
క్వణము. సం. వి. అ. పుం. = క్వాణము.
క్వణిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ధ్వని చేయునది.
క్వణితము. సం. వి. అ. న. = క్వాణము.
క్వథనము. సం. వి. అ. న. కాఁచుట.
క్వథిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) క్వాథకుఁడు.

క్వా

క్వాచిత్కము. సం. విణ. (అ. ఈ. అ.) 1. అక్కడక్కడ సంభవించునది; 2. అప్పుడప్పుడు సంభవించునది.
క్వాణకము. సం. విణ. (అ. ణికా. అ.) 1. మ్రోఁగునది; 2. మ్రోఁగించునది.
క్వాణము. సం. వి. అ. పుం. వీణాదుల మ్రోఁత.
క్వాథకుఁడు. సం. విణ. (అ.థికా.అ.) కాఁచువాఁడు.
క్వాథము. సం.వి. అ. పుం. 1. కషాయము; 2. బాధ.
క్వాథోద్భవము. సం. వి. అ. న. దార్వికషాయాంజనము.

క్ష.

క్షంత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఓర్చువాఁడు, సహించువాఁడు.
క్షంతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఓర్వఁదగినది; 2. మన్నింపఁదగినది.
క్షణద. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు.
క్షణదము. సం. వి. అ. న. నీరు. (వాచ.)
క్షణదుఁడు. సం. వి. అ. పుం. జోస్యుఁడు.
క్షణద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. = క్షణప్రభ.
క్షణనము. సం. వి. అ. న. 1. చంపుట; 2. గాయపఱచుట.
క్షణప్రకాశ. సం. = క్షణప్రభ.
క్షణప్రభ. సం. వి. ఆ. స్త్రీ. తటిత్తు, మెఱుపు.
క్షణభంగురము. సం. విణ. (అ. ఆ. అ.) క్షణమాత్రములో నశించునది.

క్షణము. సం. వి. అ. పుం. 1. అత్యల్పకాలము; 2. ముహూర్తము; 3. గడియలో నాలవభాగము; 4. తీఱిక; 5. ఉత్సవము; 6. సమయము; 7. అస్వతంత్రత;. 8. ఇతరవ్యాపారము లుడుగుట. "సీ.కర్మకాండవిముండు గాబియున్నాఁడు బ్రహ్మత్వమునకు క్షణం బంది భృగుఁడు." కాశీ. ౭. ఆ. ౧౭. [2. క్షణమాత్ర ముండునది.

క్షణి. సం. విణ. (న్. నీ. న్.) 1. అవకాశము గలది;

క్షణించు = క్షణియించు. (శ. ర.)

క్షణిక. సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు.

క్షణికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షణకాలముండునది; 2. నశించునది.

క్షణియించు. సం. స. క్రి. విందున కాహ్వానించు. "వ. అయ్యా నీవలిథిని మాయింటఁ గృతభోజనుండవై పొమ్మని క్షణియించిన." భార. ఆది. ౧, ఆ. ౧౦౦.

క్షతజము. సం. వి. అ. న. 1. నెత్తురు; 2. చీము.

క్షతము. సం. వి. అ. న. 1. గాయము; 2. అపాయము; 3. దుఃఖము; 4. దెబ్బ; 5. చీల్చుట. విణ. (అ. ఆ. అ.) 1. గాయపడినది; 2. నశించినది; 3. చీల్పఁబడినది; 4. కొట్టఁబడినది; 5. పీడింపఁబడినది.

క్షతయోని. సం. వి. ఇ. స్త్రీ. కన్యాత్వము చెడినస్త్రీ.

క్షతి. సం. వి. ఇ. స్త్రీ. 1. గాయము; 2. నాశము; 3. ఛేదనము; 4. క్షీణత్వము.

క్షత్త. సం. వి. ఋ. పుం. 1. ద్వారపాలుఁడు; 2. సారథి; 3. శూద్రస్త్రీయందు క్షత్త్రియునకుఁ బుట్టినవాఁడు; 4. దాసీపుత్త్రుఁడు; 5. బ్రహ్మ; 6. చేప; 7. రాయబారి; 8. రోఁకలి; 9. శివుఁడు. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. చనిపోయినవాఁడు; 2. నీతి విడిచినవాఁడు.

క్షత్త్రము. సం. వి. అ. న. 1. క్షత్త్రియకులము; 2. శరీరము; 3. ధనము; 4. నీరు.

క్షత్త్రియ. సం. వి. ఆ. స్త్రీ. క్షత్త్రియస్త్రీ. (ఇట్లే: క్షత్త్రియక, క్షత్త్రియిక, క్షత్త్రియాణి మొ.)

క్షత్త్రియుఁడు సం. వి. అ. పుం. క్షత్త్రియకులమునఁ బుట్టినవాఁడు.

క్షత్త్రుఁడు. సం. = క్షత్త్రియుఁడు.

క్షప. సం. = క్షణద.

క్షపణకుఁడు. సం. వి. అ. పుం. 1. బౌద్ధసన్న్యాసి. "గీ. జటిపరివ్రాడ్కాపాలికక్షపణకాక. ధూర్తకాపాలికాద్యనేకులక..." స్కా. ౧, ఆ. ౬౬; 2. విక్రమాదిత్యునియాస్థానమందు నున్న నవరత్నములలో నొకఁడు. "శ్లో. ధన్వంతరి క్షపణ కామరసింహ శంకు-వేతాళ భట్ట ఘట కర్పర కాళిదాసాః ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం, రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య." (కల్ప.)

క్షపణము. సం. వి. అ. న. ఉపవాసము. మనుస్మృతి. ౪. ౨౨౨.

క్షపాకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

క్షపానాథుఁడు. సం. = క్షపాకరుఁడు.

క్షపితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాశము నొందినవాఁడు, చెడినవాఁడు. "క. జనపియమున్యాఖ్యాయప్రపంచములు విడువఁగలరు బ్రాహ్మణులు జనాధిప శూద్రులు విపులకుకక్షపితులు గాఁగలరు వినవె కలికాలమునన్." భార. అర. ౪, ఆ. ౨౭౬.

క్షమ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఓర్పు, సహనము; 2. భూమి, నేల; 3. మన్నింపు తప్పునైఁచుట. "ఆ. క్షమయ తాల్చియుండఁ జన కెల్లప్రొద్దుఁ దేజంబ తాల్చి యుండఁ జనదు పలికి, సంతతక్షముండు సంతతతేజుండు, నగుట దోషమందు రనఘమతులు." భార. ఆర. ౧, ఆ. ౨౧౭.

క్షమకుఁడు. సం. విణ. (అ. మి కా. అ.) క్షమించువాఁడు.

క్షమాపణ. సం. వి. ఆ. స్త్రీ. క్షమాపము.

క్షమాపణము. సం. వి. అ. న. క్షమింప వేఁడుకొనుట. "శ్లో. బ్రహ్మన్ త్వం గచ్ఛ భద్రం తే నాభాగతనయం నృపమ్ క్షమాపయ మహాభాగ తతశ్శాంతిర్భవిష్యతి." సం. భాగ. ౯, స్కం. ౪, స. ౭౪. శ్లో.

క్షమి. సం. విణ. (న్. నీ. న్.) 1. ఓర్పువాఁడు; 2. మన్నించువాఁడు; 3. సమర్థుఁడు.

క్షమించు = క్షమియించు. ఉ. రా. ౨, ఆ. ౨౧.

క్షమిత. సం. = క్షాంత.

క్షమితవ్యము. సం. = క్షంతవ్యము.

క్షమియించు. సం. స. క్రి. 1. సహించు, ఓర్చు. "క. క్షమియించువారిఁ గని చాఁలమిపెట్టుదురు ...." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦; 2. తప్పునైఁచు, మన్నించు. "ఆ. అది నపరాధ మొక్కటి యైన

నవియు. నల్పమైనను క్షమియించు నదియుఁ గాక, చెనసి యపరాధములు పెక్కు సేయుచున్న. పాపకౌరవ్యులకు సహింపఁగ నేల." భార. అర. ౧, ఆ. ౨౧౯. ౧, ఆ. ౩౭౭; 3. ఉపశమిల్లఁజేయు. "క...అలుకను క్షమియించి శాంతుఁ డగుపురుషుండు..." భార. ఆది. ౭, ఆ.౧౪౩; 4. సరిపెట్టు. "సీ. తనకుఁ బ్రత్యుత్థాన మొనరింప కుండిన క్షమియించుకొన బృహస్పతిని గాను." దశా. ౨, ఆ. ౪౧.

క్షముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. సహించువాఁడు; 2. సమర్థుఁడు; 3. హితుఁడు; 4. తప్పుసైఁచు వాఁడు. "ఆ. సంతతక్షముండు సంతతతేజుండు. నగుట దోష మందు రనఘమతులు." భార. అర. ౧; ఆ. ౨౧౭.

క్షయ. సం. వి. ఆ. పుం. ఒకానొకసంవత్సరము.

క్షయణము. సం. వి. అ. న. వాసస్థానము. విశే. 1. (అ. ఆ. అ.) క్షీణింపఁజేయునది. 2. (అ.ఈ.అ.) క్షయింపఁజేయ సాధనమైనది.

క్షయము. సం. వి. అ. పుం. 1. తగ్గుదల; 2. ప్రళయము; 3. క్షయరోగము; 4. ఇల్లు; 5. హింస

క్షయి. సం. వి. న్. పుం. చంద్రుఁడు. విశే. (న్.ణీ.న్.) 1. నశించునది; 2. తగ్గునది; 3. క్షయరోగము గలది.

క్షయించు. సం. అ. క్రి. 1. క్షీణించు, తగ్గు; 2. నశించు, చెడిపోవు. "వ. ఆతనితపంబు భిన్నభాండగతం బైనక్షీరంబు చందంబున క్షయించు." భాగ. ౪, స్కం. ౪౪౨. [సాధ్యమైనది.

క్షయ్యము. సం. విశే. (అ. ఆ. అ.) క్షయింపఁజేయ

క్షరము. సం. వి. అ. పుం. మేఘము. న. నీరు. విశే. (అ. ఆ. అ.) 1. స్రవించునది; 2. నశించునది.

క్షరి. సం. వి. న్. పుం. వర్షాకాలము.

క్షరించు = క్షరియించు.

క్షరితము. సం. వి. అ. న. 1. స్రవించుట; 2. నశించుట. విశే. (అ. ఆ. అ.) 1. స్రవించినది. భార. ఆది. ౮, ఆ. ౨౨౧; 2. నశించినది.

క్షరియించు. సం. అ. క్రి. 1. నశించు; 2. స్రవించు; 3. ఉపయించు. "క. క్షర మంద్రు దానివలనను, క్షరియించినతత్త్వములను..." భార. శాం. ౬, ఆ. ౬.

క్షవథువు. సం. వి. ఉ. పుం. 1. తుమ్ము; 2. దగ్గు.

క్షవము. సం. వి. అ. పుం. 1. తుమ్ము; 2. దగ్గు; 3. నల్లావఱి.

క్షా

క్షాంతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మన్నింపఁబడినది; 2. సహనస్వభావము గలది.

క్షాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఓర్పు; 2. మన్నించుట.

క్షాత్త్రము. సం. వి. అ. న. 1. క్షత్త్రియధర్మము; 2. క్షత్త్రియసమూహము. విశే. (అ. ఈ. అ) క్షత్త్రియునకు సంబంధించినది.

క్షామము. సం. వి. అ. న. 1. కఱవు; 2. నాశము. విశే. (అ. ఆ. అ.) 1. కృశము; 2. అల్పము.

క్షామ్యము. సం. = క్షంతవ్యము.

క్షారకము. సం. వి. అ. పుం. 1. పసరుమొగ్గ. (కసుగాయ యని కొందఱు.); 2. (పక్షులను మత్స్యములను పేయు) బుట్ట.

క్షారకుఁడు. సం. వి. అ. వి. పుం. చాఁకలవాఁడు.

క్షారము. సం. వి. అ. పుం. 1. ఉప్పు; 2. కారము; 3. గాజు; 4. బూడిద; 5. ఉప్పుత్తఱి; 6. బెల్లము; 7. కాలుట; 4. వెలిగారము. విశే. (అ. ఆ. అ.) 1. స్రవించునది; 2. తిక్తలవణరసమిశ్రణముచేఁ గలిగినది.

క్షారిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి.

క్షారితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. స్రవింపఁబడినది; 2. నశింపఁజేయఁబడినది; 3. ఉప్పునుండి యావిరిరూపమునఁ దీయఁబడినది; 4. మోపఁబడిననింద గలది.

క్షారోదకము. సం. వి. అ. పుం. ఉప్పుసముద్రము.

క్షాళకుఁడు. సం. విశే. (అ. ళికా. అ.) 1. కడుగువాఁడు; 2. శుద్ధి చేయువాఁడు. [చేయుట.

క్షాళన. సం. వి. ఆ. స్త్రీ. 1. కడుగుట; 2. శుద్ధి

క్షాళనము. సం. వి. అ. న. కడుగుట. విశే. 1. (అ. ఆ. అ.) కడుగునది; 2. (అ. ఈ. అ.) కడుగ సాధనమైనది.

క్షాళము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కడుగునది; 2. శుద్ధిచేయునది.

క్షాళయిత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) = క్షాళకుఁడు.

క్షాళితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కడుగఁబడినది; 2. శుద్ధిచేయఁబడినది.

క్షి.

క్షితము. సం. వి. అ. న. 1. నాశము; 2. హింస. విణ. (అ.ఆ.అ.) నశించినది; 2. హింసింపఁబడినది

క్షితి. సం. వి. ఇ. స్త్రీ. 1. భూమి; 2. ఇల్లు; 3. నాశము; 4. ప్రళయము; 5. తగ్గుదల.

క్షితిధరము. సం. వి. అ. పుం. పర్వతము.

క్షితిపతి. సం. వి. ఇ. పుం. రాజు.

క్షిప. సం. వి. ఆ. స్త్రీ. క్షేపణము, చిమ్ముట.

క్షిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోయఁబడినది, 3. ఉపేక్షింపఁబడినది; 4. కలఁగినది.

క్షిప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోసివేయుట; 2. తిరస్కరించుట.

క్షిప్రము. సం. వి. అ. న. 1. ముహూర్తమునఁ బదునైదవభాగము; 2. బొటనవ్రేలికిని జూపుడువ్రేలికిని నడిమిభాగము. విణ. (అ. ఆ. అ.) వేగము గలది. క్రి. విణ. (అ. న.) శీఘ్రము, వేగముగా.

క్షిప్రశ్యేనము. సం. వి. ఆ. స్త్రీ. చిట్రింత, భారద్వాజపక్షి.

క్షియ. సం. వి. ఆ. స్త్రీ. 1. క్షయము, తగ్గుదల; 2. ధర్మవ్యతిక్రమము, అధర్మవర్తనము.

క్షీ.

క్షీణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నశించినది; 2. అల్పమైనది; 3. కృశించినది.

క్షీణించు. సం. అ. క్రి. 1. నశించు; 2. కృశించు; 3. సన్నగిల్లు; 4. తఱుఁగు.

క్షీబుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మత్తిల్లినవాఁడు.

క్షీరగ్రాహి. సం. వి. న్. పుం. ఒకజాతియింద్రనీలమణి. "క. సారం బగునీలము గోక్షీరములం దిడఁగ నదియుఁ గృష్ణము నైనన్, క్షీరగ్రాహి యనంబడు, నారతోత్తమముఁ దాల్ప నమరుల కమరున్." రత్న. ౬౭.

క్షీరనీరన్యాయము. సం. = క్షీరోదకన్యాయము.

క్షీరనీరము. సం. వి. అ. న. 1. నీరు పాలు గలసిన మిశ్రము; 2. బిగికౌఁగిలి.

క్షీరము. సం. వి. అ. పుం. న. 1. పాలు; 2. నీరు.

క్షీరమోరట. సం. వి. ఆ. స్త్రీ. చేకొణపచెట్టు.

క్షీరవిదారి. సం. వి. ఈ. స్త్రీ. నల్లనేలగుమ్ముడుచెట్టు.

క్షీరశుక్ల. సం. వి. ఆ. స్త్రీ నల్లనేలగుమ్ముడుచెట్టు.

క్షీరాబ్ధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము.

క్షీరావి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుపాలచెట్టు.

క్షీరాశము. సం. వి. అ. పుం. హంస. విణ. (అ.ఆ.అ.) పాలు త్రాగునది.

క్షీరి. సం. విణ. (న్. ణీ. న్.) పాలు గలది.

క్షీరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పాలచెట్టు; 2. పరమాన్నము.

క్షీరోదకన్యాయము. సం. వి. అ. పుం. నీళ్లును పాలును గలిసి యుండునట్లొక్కటిగాఁ గలిసి యుండుధర్మము. "గీ. కలుపరాయఁడు దనుజులఁ గౌఁగిలించి, వావివరుసలు మెఱయంగ వారుఁ దాను, సెనసి క్షీరోదకన్యాయమున వసించె." శశాం. ౪, ఆ. ౨౦౧.

క్షీరోదము. సం. వి. అ. పుం. పాలసముద్రము.

క్షు.

క్షుందానము. సం. విణ. (అ. ఆ. అ.) పొడి చేయునది.

క్షుణ్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడి చేయఁబడినది; 2. నలఁగినది. (మార్గము.); 3. బాగుగా నభ్యసింపఁబడినది (పాఠము.)

క్షుణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వ్యుత్పన్నుఁడు, (శాస్త్రములందు) నిరూఢ మగుప్రజ్ఞ కలవాఁడు.

క్షుతము. సం. వి. అ. న. తుమ్ము.

క్షుతి. సం. వి. ఇ. స్త్రీ. క్షుతము.

క్షుత్తు. సం. వి. ద్. స్త్రీ. పొడిచేయుట. ద్. స్త్రీ. ఆఁకలి. త్. స్త్రీ. తుమ్ము.

క్షుద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఈఁగ; 2. తేనెటీఁగ; 3. అంగహీన యగునాఁడుది; 4. వేశ్య; 5. గచ్చాకు; 6. పులిచింతచెట్టు; 7. వాకుడుచెట్టు; 8. ఆడవిగోదుమచెట్టు. [కోల. (శ. ర.)

క్షుద్రకము. సం. వి. అ. పుం. బాణవిశేషము, కప్పె

క్షుద్రఘంటిక. సం. వి. ఆ. స్త్రీ. చిఱుగంట.

క్షుద్రశంఖము. సం. వి. అ. పుం. నత్తగుల్ల.

క్షుద్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నీచుఁడు; 2. క్రూరుఁడు; 3. పేదవాఁడు; 4. లోభి.

క్షుధ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి.

క్షుధితము. సం. విణ. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నది.

క్షుబ్ధము. సం. వి. అ. పుం. కవ్వము. విణ. (అ.ఆ.అ.) క్షుభితము.

క్షుభితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కలఁగినది; 2. భయపడినది.

క్షుభ్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) క్షోభపెట్టఁబడుచున్నది. "క్షీ...నగియెడునదివోలె నాగనక్రమకరకులక్షుభ్యమాణమై..." భార. అర. 3, ఆ. 32. వేం. పంచ. పీఠి. ౯.

క్షుమ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలి⚘; 2. అగిసె⚘; 3. జనము⚘.

క్షురకము. సం. వి. అ. పు. 1. పల్లేరు⚘; 2. గొలిమిడి⚘; 3. బొట్టుగు⚘.

క్షురప్రము. సం. వి. అ. పుం. కొడవలి.

క్షురమర్ది. సం. వి. న్. పుం. మంగలి.

క్షురము. సం. వి. అ. పుం. 1. మంగలకత్తి; 2. డెక్క; 3. బాణము; 4. పల్లేరు⚘; 5. గొలిమిడి⚘.

క్షురి. సం. వి. న్. పుం. మంగలి. ఈ. స్త్రీ. 1. కత్తి; 2. మంగలకత్తి.

క్షురిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కత్తి; 2. మంగలకత్తి.

క్షురిణి. సం. వి. ఈ. స్త్రీ. మంగలది.

క్షుల్లకము. సం. వి. అ. పుం. నత్తగుల్ల. విణ. (అ. ఆ. అ.) 1. అల్పము; 2. నీచము; 3. పేద; 4. కనిష్ఠము; 5. మూఢము.

క్షే.

క్షేత్రకరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పొలమువలన జీవించువాఁడు.

క్షేత్రకృత్తు. సం. విణ. (త్.) = క్షేత్రకరుఁడు.

క్షేత్రజుఁడు. సం. వి. అ. పుం. భర్తయనుజ్ఞచేత భార్యకు మఱియొకనివలనఁ గలిగినకొడుకు.

క్షేత్రజ్ఞుఁడు. సం. వి. అ. పుం. 1. జీవుఁడు; 2. పరమాత్మ; 3. క్షేత్ర మెఱిఁగినవాఁడు. విణ. (అ. ఆ. అ.) నేర్పరి.

క్షేత్రము. సం. వి. అ. న. 1. వరిమడి; 2. పొలము; 3. స్థానము; 4. పుణ్యస్థలము; 5. భార్య; 6. యోని; 7. శరీరము; 8. ఆకాశము; 9. గృహము; 10. బృందము.

క్షేత్రాజీవి. సం. విణ. (న్. నీ. న్.) = క్షేత్రాజీవుఁడు.

క్షేత్రాజీవుఁడు. సం. వి. అ. పుం. పొలమువలన బ్రదుకువాఁడు, సేద్యకాఁడు.

క్షేత్రియము. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షేత్రమునకు సంబంధించినది; 2. మఱియొందుఁ బుట్టినది. (తృణాది); 3. కుదుర్పరానిది. (రోగాది.)

క్షేత్రియుఁడు. సం. వి. అ. పుం. 1. పరదారరతుఁడు; 2. క్షేత్రాధిపతి.

క్షేపణము. సం. వి. అ. న. 1. త్రోయుట; 2. విసరుట; 3. జరపుట; 4. నివసించుట; 5. దూఱుట; 6. పోఁగొట్టుట. "మ...రిపుస్థైర్యక్షేపణాటోపతన్." భార. ద్రో. 3, ఆ. ౧౫. విణ. 1. (అ. ఆ. అ.) చిమ్మునది; 2. కదల్చునది; 3. నిరసించునది; 4. (అ ఈ. అ.) క్షేపణసాధన మైనది.

క్షేపణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. తెడ్డు; 2. చేఁపవల; 3. ఒడిసెల.

క్షేపము. సం. వి. అ. పుం. 1. చిమ్ముట; 2. త్రోయుట; 3. గర్వించుట; 4. ఉల్లంఘించుట; 5. ఆక్షేపణము; 6. ఆలస్యము; 7. పూఁత; 8. అనాదరము.

క్షేమ. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ, పార్వతి.

క్షేమకారి. సం. వి. న్. పుం. గరుత్మంతుఁడు. "ఆ. క్షేమకారి దీర్చెఁ జెలరేఁగి యనుకూలమారుతంబు వీచె..." అని. ౪, ఆ. ౩౬. విణ. (న్. ణీ. న్.) క్షేమంకరుఁడు.

క్షేమతండులములు. సం. వి. అ. పుం. బ. ప్రయాణమున వట్టిచేతులతోఁ బోక యింటినుండి పట్టుకొనిపోయెడు కొలఁదిబియ్యము. "సీ...శాలిక్షేమతండులములు." ఆము. ౨, ఆ. ౯౭.

క్షేమము. సం. వి. అ. పుం. న. 1. కుశలము; 2. లబ్ధరక్షణము. (అలబ్ధప్రాప్తియోగము.); 3. మోక్షము; 4. చోరమను గ్రంథద్రవ్యము⚘. విణ. (అ.ఆ.అ.) 1. క్షేమము గలుగఁ జేయునది; 2. క్షేమము గలది.

క్షేమ్యము. సం. విణ. (అ.ఆ.అ.) క్షేమమునకుఁ దగినది.

క్షై.

క్షైణ్యము. సం. వి. అ. న. క్షీణత.

క్షైత్రజ్ఞము. సం. వి. అ. న. ఆత్మస్వరూపజ్ఞానము. విణ. (అ. ఈ. అ.) క్షేత్రజ్ఞసంబంధమైనది.

క్షైత్రము. సం. వి. అ. న. 1. క్షేత్రసమూహము. విణ. (అ. ఈ. అ.) క్షేత్రసంబంధి.

క్షో.

క్షోడము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగును గట్టుకంబము. (కల్ప.); 2. అవడ⚘. (వైజ.)

క్షోణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. భూమి; 2. ముంజతృణముతో నల్లిన బ్రహ్మచారిమొలత్రాడు.

క్షోణీసురుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు. భార. విరా. ౫, ఆ. ౨౪౨.

క్షోదము. సం. వి. అ. పుం. 1. నూఱుట; 2. పొడి చేయుట.

క్షోదితము. సం. వి. అ. న. పొడి, పిండి. విణ. (అ. ఆ. అ.) పొడి (పిండి) చేయఁబడినది.

క్షోదిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అత్యల్పము; 2. అతినీచము.

క్షోదీయము. సం. విణ. (స్. యసీ. స్.) క్షుద్రతరము

క్షోభపడు. మి. అ. క్రి. (క్షోభము+పడు.) కలవరమందు.

క్షోభపెట్టు. మి. స. క్రి. (క్షోభము+పెట్టు.) కలఁత నందించు. [3. వికారము.

క్షోభము. సం. వి. అ. పుం. 1. కలఁక; 2. చలనము;

క్షోభించు. సం. అ. క్రి. కలఁతపడు. (శ. ర.)

క్షోభిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) క్షోభించువాఁడు.

క్షోభితము. సం. విణ. (అ. ఆ. అ.) క్షోభపెట్టఁబడినది.

## క్షౌ.

క్షౌద్రము. సం. వి. అ. పుం. చంపకము, సంపెంగచెట్టు. న. 1. తేనె; 2. నీరు; 3. ధూళి; 4. నైచ్యము. 5. అల్పత్వము. విణ. (అ. ఈ. అ.) 1. క్షుద్రునకు సంబంధించినది; 2. తేనెటీఁగలకు సంబంధించినది.

క్షౌమము. సం. వి. అ. పుం. న. 1. పట్టుబట్ట; 2. మేడమీఁదిగది. న. నారచీర. విణ. (అ. ఈ. అ.) అగిసెసంబంధి. (బట్ట.)

క్షౌరము. సం. వి. అ. న. ముండనము.

క్షౌరి. సం. వి. ఈ. స్త్రీ. మంగలకత్తి.

క్షౌరికుఁడు. సం. వి. అ. పుం. మంగలి.

## క్ష్ణ.

క్ష్ణవిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) వాఁడిచేయువాఁడు.

## క్ష్ణు.

క్ష్ణుతము. సం. విణ. (అ. ఆ. అ.) వాఁడి చేయఁబడినది.

## క్ష్మా.

క్ష్మా. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. ఒకటి యనుసంఖ్య.

క్ష్మాజము. సం. వి. అ. పుం. చెట్టు.

క్ష్మాజాని. సం. వి. ఇ. పుం. - భూమి జాయగాఁ గలవాఁడు - రాజు.

క్ష్మాజుఁడు. సం. వి. అ. పుం. భూపుత్రుఁడు. 1. నరకాసురుఁడు; 2. అంగారకుఁడు.

క్ష్మాతము. సం. విణ. (అ. ఆ. అ.) కంపించినది.

క్ష్మాదారుఁడు. సం. వి. అ. పుం. = క్ష్మాజాని.

క్ష్మాపతి. సం. వి. ఇ. పుం. రాజు. [బడినది.

క్ష్మాపితము. సం. విణ. (అ. ఆ. అ.) కంపింపఁజేయఁ

క్ష్మాపుఁడు. సం. వి. అ. పుం. రాజు.

క్ష్మాభృత్తు. సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు.

క్ష్మాయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కంపించువాఁడు.

## క్ష్వి.

క్ష్వింకము. సం. వి. అ. పుం. ఎఱ్ఱని మొగము గల యాఁడుకోఁతి. (వై. ని.) [విడువఁబడినది.

క్ష్విణ్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జిడ్డుగలది; 2.

## క్ష్వే.

క్ష్వేడ. సం. వి. ఆ. స్త్రీ. 1. సింహనాదము; 2. వెదురుసలాక. [క్ష్వేడితము, క్ష్వేళితము.

క్ష్వేడనము. సం. వి. అ. న. సింహనాదము. ఇట్లే:

క్ష్వేడము. సం. వి. అ. న. చేదుబీఱపువ్వు. పుం. 1. విషము; 2. ధ్వని; 3. కర్ణరోగవిశేషము. విణ. (అ. ఆ. అ.) 1. వంకరైనది; 2. పొందరానిది.

క్ష్వేళి. సం. వి. ఆ. స్త్రీ. 1. క్రీడ. (కల్ప.); 2. సింహనాదము. ఇట్లే, క్ష్వేళిక.

## ఖ.

ఖ. సం. ఒకానొకయక్షరము. వి. అ. పుం. సూర్యుఁడు. న. 1. ఆకాశము. (ఈయర్థమునసే తెనుఁగునఁ బ్రయోగము గలదు.) "ఉ. ఖంబుగదే కవ్రక్షత్రులిసుఖంబుగదే నుడి..." రుక్మి. ౫, ఆ. ౬౦; 2. స్వర్గము; 3. ఇంద్రియము; 4. నక్షత్రము; 5. పొలము; 6. సుఖము; 7. జ్ఞానము; 8. బ్రహ్మము; 9. ఇల్లు; 10. పట్టణము; 11. (గణిత.) శూన్యము.

ఖంగు. దే. వి. 1. గంట మ్రోగుటమొ. వానియందగుధ్వని కనుకరణము. "గీ. గంట ఖం గని మ్రోయ..." హంస. ౨, ఆ. ౪౮. కళా. ౧, ఆ. ౬౬; 2. ఘనపదార్థములరాయిడివలనఁ గలుగు ధ్వని కనుకరణము. "ఉ. కచ్ఛపరాజువెన్నెముక ఖంగునఁ దాఁకనిగట్టు లేదు..." రామా. ౭, ఆ. ౧౩౨; 3. గట్టిగా మాటలాడుటయం దగు ననుకరణము. "సీ...ఖంగుఖం గనుచుపక్కటులుల మహోస్వనంబు." పరమ. ౫, ఆ. ౪౦.

ఖంగుఖంగు. దే. వి. ఘనపదార్థములరాయిడివలనఁ గలుగుధ్వని కనుకరణము. "ఉత్సా...,దెబ్బ

దుబ్బుఖంగుఖంగు తంగుకింగుమద్ధ్వనుల్." కళా. ర, ఆ. ౧౦౯.

ఖాంగురింగు. దే. వి. చిన్నకింకిణులధ్వని కనుకరణము. "వ...జబురుజంగులఖాంగురింగులు... ప్రబంధ. ౭౭ర.

ఖాజ. సం. వి. ఆ. స్త్రీ. ఛందోవిశేషము.

ఖాజనము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట.

ఖాజపాదము. సం. వి. అ. పుం. గంజనగాలు, కుంటుచుదాడెడు నొకవిధమగుబాలక్రీడ.

ఖాజరి. సం. వి. ఈ. స్త్రీ. వాద్యవిశేషము. "సీ. కాహళదుందుభిఖాజరీమర్దళఝల్లరీరవంబులు బోరు కలుగ." భాను. ౪, ఆ. ౬౪.

ఖాజరీటకము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట.

ఖంజరీటము. సం. = ఖాజరీటకము.

ఖాండ. సం. వి. అ. పుం. ఖండము, (మువర్ణలోపము. ఇది దర్భాదులలోనిది. ఆ. స్త్రీ. అని శ.ర.) స్మార్తకర్మప్రతిపాదక మగుమంత్రాదిభాగము. (గర్భాధానఖాండ) "ఉ...క్రొత్తలఁ దప్పవట్టుదుక్, ఖండల ముష్టి విప్పఁ గని నవ్వుచు వెండి ప్రయోక్తలన్..." ఆము. ౭, ఆ. ౩. [దూతాది.)

ఖాండకావ్యము. సం. వి.అ. న. చిన్నకావ్యము. (మేఘసం

ఖండనము. సం. వి. అ. న. 1. ఛేదించుట; 2. విఱుచుట; 3. కఱచుట; 4. యుక్తులచే నిరాకరించుట; 5. విచ్ఛిత్తి.

ఖాండపరశువు. సం. వి. ఉ. పుం. 1. దంతములు ఖండింపఁబడినయేనుఁగు; 2. రాహువు; 3. పరశురాముఁడు; 4. శివుఁడు; 5. గండ్రగొడ్డలి.

ఖాండము. సం. వి. అ. పుం. న. 1. సగము; 2. భాగము; 3. ముక్క. పుం. 1. పులకండము; 2. రత్నదోషము. న. 1. ఒకజాతిఉప్పు; 2. ఒకజాతిచెఱకు. విశే. (అ. ఆ. అ.) 1. ఖండించునది; 2. ఖండింపఁబడినది; 3. కొఱవడినది.

ఖాండశర్కర. సం. వి. ఆ. స్త్రీ. పులకండము, కండచక్కెర.

ఖాండా. వై. వి. (సం. కరండః.) ఖడ్గము, కత్తి. "క. తుండములతోడ మదవేదండములం గాండకతుల ధరణింబడఁగా,ఖాండాఁ జెండెద నని యా, ఖాండలపాత్రుండు బలికెఁ గడువేడుకతోన్." కృష్ణ. ౩, ఆ. ౯౨. "సీ. చికిలిసేయించిన చిగురు ఖాండాజోడుకన్నె గేదంగిచేకత్తు లనఁగ." దశా. ర, అ. ౨, ఆ. ౧౬౭. కసు. ౪, ఆ. ౪౭.

ఖాండించు. సం. స. క్రి. 1. ఖాండములుచేయు. "మ...ఈభూజము వంటకట్టియలకై ఖాండింపఁగా నేటికిన్." భార. విరా. ౨, ఆ. ౧౩౬; 2. (వాదము) నిరాకరించు. "సీ. మందుమంత్రంబులు మాయలు పచరించి ఖాండించి కూచిమారుండు తిరుగు." మల్హా. ౨, ఆ. ౧౩ర.

ఖాండిక = ఖాండ్రిక. దే. వి. 1. చిన్నపల్లె. (శ. ర.) ('గ్రామఖాండిక' యని భీమ. ౫, ఆ. ౨౦. నఁగలదు.); 2. పన్నులేకుండ గుత్త కిచ్చినభూఖాండము. [చంక.

ఖాండికము. సం. వి. అ. పుం. 1. బటానిగింజ; 2.

ఖాండిత. సం. వి. ఆ. స్త్రీ. నాయికాభేదము. విశే. (ఋ. త్రి. ఋ.) ఖండించువాఁడు.

ఖండికము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నఱకఁబడినది; 2. నశింపఁజేయఁబడినది; 3. నిరాకరింపఁబడినది.

ఖండియరాయ. మి. వి. ఒకానొకబిరుదము. "క. ఖాండియరాయనిచే..." నిర్వ. ౪, ఆ. ౧౦౦. నైష. ౧ ఆ. ౩౨.

ఖండీ. దే. వి. (హిం. ఖాండీ.) పుట్టి. (శ. ర.) [సలు.

ఖండీరము. సం. వి. అ. పుం. పీతముద్గము, పచ్చపెఖాంఢ్రిక = ఖాండిక. (పన్నులేకుండ గుత్తకిచ్చినభూఖాండము.) "క. ఏనాఁటియగ్రహారమొ, మానాఁటికి మాన్యమాయె మాపని దీరెన్, మీనాఁటఖాండ్రి కాయెను, నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టూ. (చాటువు.)

ఖగము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. గాలి; 3. బాణము; 4. సూర్యాదిగ్రహము. విశే. (అ. ఆ. అ.) ఆకాశమునఁ బోవునది.

ఖగుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. దేవత.

ఖగోళము. సం. వి. అ. పుం. ఆకాశగోళము. (ఖగోళశాస్త్రము = Astronomy.)

ఖచరము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. మేఘము; 3. గాలి; 4. సూర్యాదిగ్రహము,

ఖచరుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. గంధర్వాది; 3. రాక్షసుఁడు. [౪. ఆ. ౨౧౩.

ఖచించు. సం. స. క్రి. చెక్కు, పొదుగు. ఉ. హరి.

ఖచిక్కు. దే. వి. 1. శుకాదులు పండ్లు గింజలు మెు. కొఱుకుటయందగు ధ్వని కనుకరణము. "చ. జిలిబిలిచెక్కు లార్చుచు ఖచిక్కున ముక్కునఁ బక్వదాడిమీ, ఫలయుంగళంబు నొక్కునొక బాల శుకంబు..." కృ. శకుం. ౨, ఆ. 33; 2. మర్దించుటయందగు ధ్వని కనుకరణము. "ఉ...గుబ్బలు ఖచిక్కునఁ గ్రమ్మఁగరాదు..." హంస. ౧, ఆ. ౯౪; 3. (బాణాదులు) ఏయుటయందగు ధ్వని కనుకరణము.

ఖచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెక్కఁబడినది; 2. కూడినది; 3. వ్యాప్తమైనది.

ఖచియించు = ఖచించు. "క. ఖచియించినవజ్రంబుల, రుచులను..." భార. ఉద్యో. ४,ఆ. ౧౨3

ఖజ. సం. వి. ఆ. స్త్రీ. 1. కవ్వము; 2. త్రెడ్డు; 3. యుద్ధము; 4. మథనము.

ఖజకము. సం. వి. అ. పుం. కవ్వము.

ఖజపము. సం. వి. అ. న. నెయ్యి. [మథనము.

ఖజము. సం. వి. అ. పుం. 1. కవ్వము; 2. త్రెడ్డు; 3.

ఖజాక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నగరిటె; 2. కవ్వము; 3. అంకుటాలు.

ఖజానా. దే. వి. (హిం. ఖజానా.) ధనాగారము. "మ...దస్తు సేయఁడు ఖజానా నింపుఁ డింపొందఁగన్." రంగా. ౧, ఆ. ౧४౦.

ఖజ్జము. దే. వి. భక్ష్యవిశేషము. "ఉ. మజ్జనభోజనక్రియలు మాని వలానియరోచికంబునన్, ఖజ్జము కొంతకొంత కసిగాటులుగా భుజయించి..." పిన. శకుం. ౨, ఆ. ౧౬౭.

ఖటకము. సం. వి. అ. పుం. పిడికిలి. [ము.

ఖటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బలపము; 2. కర్ణరంధ్ర

ఖటికము. సం = ఖటకము.

ఖట్టి. సం. వి. ఇ. పుం. స్త్రీ. పాడె, శవవాహనము.

ఖట్టిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నమంచము; 2. గద్దె; 3. పాడె. [లను వేటాడువాఁడు.

ఖట్టికుఁడు. సం.వి. అ. పుం. 1. వేటకాఁడు; 2. పక్షు

ఖట్వా. సం. వి. ఆ. స్త్రీ. 1. మంచము; 2. కోలశింబి.

ఖట్వాంగి. సం. వి. న్. పుం. శివుఁడు. ఇట్లే: ఖట్వాంగధరుఁడు.

ఖడ్గము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. ఖడ్గమృగము; దానికొమ్ము. న. ఇనుము.

ఖడ్గి. సం. వి. న్. పుం. ఖడ్గమృగము. విణ. (న్. నీ. న్.) కత్తిగలవాఁడు.

ఖణి దే. వి. మ్రోగుటయందగు ధ్వని కనుకరణము. "ద్వి. వడిఁ మీటఖణిఖణి వాఁగుచు గిరుల, బెడఁగుఁ గైకొనుజిగిబిగిచన్నుఁగవల." అ. మ.క. ४,ఆ.

ఖణిల్లు. దే. వి. 1. ఖడ్గాదులు విఱుగుటయందగు ధ్వని కనుకరణము. "సీ. అడిదంబు జళిపించి మెడమీఁద వైచిన నది ఖణిల్లనుచు రెండయ్యె నపుడు." దశా. ४, ఆ. ౧౭౭. "గీ. ఖణిఖణిల్లని మెట్టియల్ కడు రహింప." హంస. ४, ఆ. 3౭౦; 2. ఎద్దు మెు. అంకెవేయుటయందగు ధ్వని కనుకరణము. "వ...సందిపోతు పోతరించి ఖణిల్లున అంకెవైచె..." కాశీ. 3, ఆ. ౨3. "సీ. వెస ఖణిల్లని అంకెవేసి..." సానందో. ౧, ఆ. ౧౦౯. భాగ. ౧౦, స్కం. ఉ. ४౦3.

ఖణీలుఖణీలు. దే. వి. ఎద్దు అంకెవేయుటయందగు ధ్వని కనుకరణము. "చ...వృషభాధిపుల్ ఖణీల్, ఖణిలున అంకెవేయ కెఱఁగన్ సమకూడదు..." కాళ. ४, ఆ. ౧४3.

ఖతమాలము. సం. వి. అ. పుం. 1. పొగ; 2. మబ్బు.

ఖదిర. సం. వి. ఆ. స్త్రీ. 1. అత్తపత్తిచెట్టు; 2. మిడుఁగుఁదామరచెట్టు.

ఖదిరము. సం. వి. అ. పుం. గాయత్రి, చండ్రచెట్టు.

ఖదిరసారము. సం. వి. అ. పుం. కవిరి. [డు.

ఖదిరుఁడు.సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు; 2. చంద్రుఁ

ఖద్ది. దే. వి. ఉత్సాహము. (బలము, శక్తి అని శ.ర. సూ. ని.) "స్రగ్ధర. ఖద్దిన్ జెండాడు ప్రాపుల్..." స్వా. ४, ఆ. ౮.

ఖద్దించు. దే. అ. క్రి. ఉత్సహించు, ఉత్సాహపడు. "సీ. ముద్దుఁజెక్కులు నొక్కి ఖద్దించు ఖద్దించి తారసింపమిఁ దహతహఁ జలించు." సాంబో. ౧, ఆ. ౭౦. స. క్రి. తక్కువచేయు. "క. ఉద్దండవృత్తి నపుడా, మద్దుల నడఁగించినట్టిమతకరి ప్రావృట్ప్రోద్దామవిద్యుదాళిన్, ఖద్దించు గృహంబుచొచ్చి కహకహ నగుచున్." సాంబో. 3, ఆ. ४౯.

ఖద్యోతకీటము. సం. = ఖద్యోతము. (సిరులు) "మ...ఖద్యోతకీటప్రభల్." కాళ. ४.

ఖద్యోతము. సం. వి. అ. పుం. మిడుఁగుఱుబురుగు.

ఖద్యోతుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఖనకము. సం. వి. అ. పుం. ఎలుక.

ఖనకుఁడు. సం. వి. అ. పుం. కన్నపుదొంగ. విణ. (అ. ఆ. అ.) త్రవ్వెడువాఁడు.

ఖననము. సం.వి.అ. న. 1. త్రవ్వుట; 2. పాఁతిపెట్టుట.

ఖని. సం.వి. ఇ, ఈ. స్త్రీ. గని, రత్నములు పుట్టుచోటు.

ఖనిత్రకము. సం. = ఖనిత్రము.

ఖనిత్రము. సం. వి. అ. న. 1. గడ్డపార; 2. గుద్దలి.

ఖపరాగము. సం. వి. అ. పుం. చీకటి.

ఖపుటుఁడు. సం. వి. అ. పుం. అన్నము చేతిలోనే భుజించువ్రతము గలవాఁడు.

ఖపురము. సం. వి. అ. పుం. 1. పోఁకచెట్టు; 2. మ్రాని బొంక; 3. నాగముస్తె; 4. గంధర్వనగరము. విణ. (అ. ఆ. అ.) సోమరిది. [డాపరడఁగిచెట్టు.

ఖర. సం. వి. అ. పుం. ఒకానొకసంవత్సరము. ఆ. స్త్రీ.

ఖరకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఖరకుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. గాడిదలసాల; 2. మంగలిసాల.

ఖరఖరాత్కారము. సం. వి. అ. పుం. ఎముకలు చిదుకుటయం దగుధ్వని కనుకరణము. "సీ. తోరంపుటెమ్ములతోడ నుగ్గగు వగుదంవడిఖర ఖరాత్కారములును." హరి. ఉ. ౭. ఆ. ౨౩౧.

ఖరపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. వాయింటిచెట్టు.

ఖరపుష్పము. సం. వి. అ. పుం. మరువముచెట్టు.

ఖరమంజరి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేణిచెట్టు.

ఖరము. సం. వి. అ. పుం. 1. గాడిద; 2. కంచర గాడిద; 3. కాకి; 4. రాబందు; 5. కురరపక్షి. న 1. వేఁడిమి; 2. వాఁడిమి. విణ. (అ. ఆ. అ.) 1. వాఁడియైనది; 2. వేఁడెక్కినది; 3. గట్టిది; 4. క్రూరమైనది.

ఖరా. హిం. విణ. 1. సరియైనది. (ఖరాగాఁ జెప్పుము); 2. స్థిరమైనది. (వాఁడు ఖరాగా నుండెఁడు.)

ఖరాబు. హిం. విణ. చెడ్డవాఁడు, తుంటరి. "సీ... ఖరాబు కూళ..." హంస. ౪, ఆ. ౧౧౩.

ఖరాబుచేయు. మి. స. క్రి. పాడుచేయు. (కాగితము ఖరాబు చేయకుము.)

ఖరీదు. దే. వి. (హిం. ఖరీద్.) వెల. (శ. ర. వా.)

ఖరీదుచేయు. దే. స. క్రి. (ఖరీదు+చేయు.) వెల యిచ్చికొను. (వా.)

ఖరుచు. దే. వి. (హిం. ఖర్చ్.) వ్యయము.

ఖరుచుచేయు. మి. స. క్రి. (ఖరుచు+చేయు.) 1. వ్యయముచేయు. (వాఁడు ఒక్కకాని ఖరుచు చేయఁడు); 2. ఓడించు. "ఉ. క్షీరపయోనిధిక్ ఖరుచు చేయుచు నెంతయుఁ దేజరిల్లెనీ, వీరయ నారసింహవిభు విశ్రుతకీర్తులు ముజ్జగంబునన్." సత్య. సాం. ౧, ఆ. 30. పు.

ఖరువు. సం. వి. ఉ. స్త్రీ. భర్తను వరించుకన్య. పుం. 1. మన్మథుఁడు; 2. ఈశ్వరుఁడు; 3. పురుషుఁడు. 4. స్త్రీ; 5. తెలుపు; 6. దంతము; 7. గుఱ్ఱము; 8. దర్పము. విణ. (ఉ) 1. క్రూరము; 2. తీక్ష్ణము; 3. తెల్లనిది; 4. దురాచారుఁడు.

ఖర్చు = ఖరుచు. (శ. ర.)

ఖర్జూ. సం. వి. ఊ. స్త్రీ. 1 తీఁట; 2. చిట్టీఁదుచెట్టు.

ఖర్జూరము. సం. వి. అ. పుం. 1. ఖర్జూరపుచెట్టు; 2. తేలు. న. వెండి. ఇ. ధాన్యవిశేషము. "మ. సారిదిం జేర్చినతీఁగెమల్లియలు ఖర్జూరంబులున్ ..." ఆము. ౧, ఆ. ౬౬.

ఖర్జూరి. సం. వి. ఈ. స్త్రీ. ఈఁతచెట్టు.

ఖర్పరము. సం. వి. అ. పుం. 1 బిచ్చమెత్తెడువిప్ప; 2 తలపుఱ్ఱె; 3. కుండపెంకు; 4. తుత్థాంజనము.

ఖర్పరి. సం. వి. ఈ. స్త్రీ. తుత్థాంజనము, పాలతుత్తము.

ఖర్పరుఁడు. సం.వి.అ. పుం. 1. దొంగ; 2. మోసకాఁడు.

ఖర్వటము. సం. వి. అ. పుం. న. గ్రామవిశేషము.

ఖర్వము. సం. వి. అ. పుం. న. సంఖ్యావిశేషము. (౧౦,౦౦౦,౦౦౦,౦౦౦) పుం. కుబేరునినిధులలో నొకటి. విణ. (అ. ఆ. అ.) 1. పొట్టిది; 2. అధమము.

ఖలతి. సం. విణ. (ఇ. ఇ, ఈ. ఇ.) బట్టతలవాఁడు.

ఖలపువు. సం విణ. (ఉ.ఊ.ఉ.) కళ్లమూడ్చువాఁడు.

ఖలము. సం. వి. అ. న. 1. నేల; 2. చోటు; 3. కల్కము. పుం. 1. కొమ్మెత్తిచెట్టు; 2. వెమురుచెట్టు; న. కళ్లము.

ఖలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. కళ్లములసమూహము; 2. ఖలులసమూహము.

ఖలీనము. సం. వి. అ. పుం. న. గుఱ్ఱపుకళ్లెము.

ఖలుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. క్రూరుఁడు; 2. నీచుఁడు; 3. అధముఁడు; 4. దుష్టుఁడు.

ఖల్లము. సం. వి. అ. పుం. 1. ఔషధికల్వము; 2. గొయ్యి; 3. తోలు; 4. వానకోయిల; 5. కాలువ; 6. వస్త్రవిశేషము.

ఖల్వాటుఁడు. సం. విణ. (అ.ఆ.అ.)బట్టతలగలవాఁడు.

ఖసూచి. సం. విణ (ఇ) అడిగినది చెప్పలేక ఆకాశము చూచువాఁడు, ప్రతిభాహీనుఁడు.

ఖస్థసము. సం. వి. అ. పుం. గసగసచెట్టు. న. గసగసలు.

ఖళిఫెళి. దే. వి. వీరణము. మొ. వాయించుటయం దగుధ్వని కనుకరణము "సీ. ఫెళఫెళ వీరణాల్ ఖళిఫెళి వాయించి..." హంస. ౨, ఆ. ౮౯.

ఖళీఫెళి. దే. వి. కోడిపుంజులు తన్నుకొనునపు డగు ధ్వని కనుకరణము. "చ...ఖళీఫెళిఁ బుంజులు తన్నులాడఁగన్." హంస. 3, ఆ. ౨౧౬.

ఖళూరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గరిడీ. "చ... మంటికై,పోరల రథీశుఁ డీకమలబుద్ధి ఖళూరికఁ దక్క..." ఆము. ౨, ఆ. ౩౮; 2. గరిడీపాల. "సీ. ఒకయాత్రి గగనగంగకు ఖళూరిక నొక్క యడుగు వేదములకు విడిడిఁ జూప." ప్రబంధ. ౫౫౭.

ఖా

ఖాండవప్రస్థము. సం. వి. అ. పుం. హస్తినాపురము నుండి వెడలినతరువాతఁ బాండవులు వసించిన స్థానము. "క. కమ్మఁ గని ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముఁ జేసి..." భార. ఆది. ౮, ఆ. ౬౭.

ఖాండవము. సం. వి. అ. పుం. 1. పులకండము; 2. తినుబండము. న. ఇంద్రునియొక్క వనములలో నొకటి. [చేయువాఁడు.

ఖాండవికుఁడు. సం. వి. అ. పుం. పిండివంటలు

ఖాండికుఁడు. సం. = ఖాండవికుఁడు.

ఖాకీ. హిం.వి. వస్త్రవిశేషము.(ఉదా: ఖాకీచొక్కా. ఖాకీగుడ్డ. వా.)

ఖాట. సం. వి. ఆ. స్త్రీ. పాడె. శవవాహనము.

ఖాటము. సం. వి. అ. పుం. పాడె, శవవాహనము.

ఖాటి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాడె; 2. పెంకెపట్టు.

ఖాటిక. సం. = ఖాట.

ఖాణము. వై. వి.* (సం. ఖాదనం. హిం. ఖానా) దాణా, అశ్వాదులకుఁ బెట్టుతిండి. "క. మను దివ్యాస్త్రబలంబున, జనియించిననీరితోన సంభూతంబై, యొనరినఖాణము మేమెం, దనివుసనం దురగములకు దర్ప మెలర్పన్." భార. ద్రో. 3, ఆ. ౧౬౫. విజ. ౧, ఆ. ౬౬.

ఖాణా = ఖాణము. "మ... లేఁగజువ్వాన్వులు పుస్తాగములై వనికి జిగురుఖాణా మేటికిన్ మెచ్చు గాన్." శకుం. ౨, ఆ. ౧౧౮.

ఖాతకము. సం. వి. అ. న. అగడ్త. [పడేసవాఁడు.

ఖాతకుఁడు. సం. వి. అ. పుం. అధమర్ణుఁడు, అప్పు

ఖాతము. సం. వి. అ. న. 1. అగడ్త; 2. గొయ్యి; 3. కోనేరు; 4. గుహ; 5. త్రవ్వుట. విణ. (అ. ఆ. అ.) త్రవ్వఁబడినది.

ఖాతరు=ఖాతీరు. (వా:—నా.మాట వానికి ఖాతరు కాదు. ఖాతరుచేయుం = లక్ష్యపెట్టు.)

ఖాతీరు. హిం. వి.(ఖాతర్.)లెక్క, లక్ష్యము."శా... వెల్లబిడ్డ మమలం ఖాతీరుసం జేఁడొకో." రంగా. ౨, ఆ. ౮౯. (ఖాతీరుకుఁదెచ్చు = లెక్క సేయు, లక్ష్యపెట్టు.) [అడవి; 4. కోనేఱు.

ఖాత్రము. సం.వి. అ. న. 1. గుద్దలి; 2. దారము; 3.

ఖాదకుఁడు. సం. వి. అ. పుం. అప్పుపుచ్చుకొను వాఁడు. విణ. (అ. దికా. అ.) 1. తినువాఁడు; 2. తినిపించువాఁడు. [తినుట; 2. తిండి.

ఖాదకము. సం. వి. అ. పుం. పల్లు, దంతము. న. 1.

ఖాదనము. సం.వి. అ. పుం.పల్లు. న. 1. తినుట; 2. తిండి.

ఖాదము. సం. = ఖాదనము. విణ. (అ.ఆ.అ.) తినునది.

ఖాదయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) తినిపించు వాఁడు.

ఖాదిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) తినువాఁడు.

ఖాదితము సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

ఖాదిరము. సం. వి. అ. పుం. కవిరి, కాఁచు, రంగి వము. విణ. (అ. ఈ. అ.) ఖదిరసంబంధమైనది.

ఖాద్యము. సం. వి. అ. న. మిఠాయిమొ. తినుబండము. విణ. (అ. ఆ. అ.) తినఁదగినది.

ఖాన = ఖాను. 1. (తురుష్కప్రభువు.) వసు. ౨,ఆ. ౨౦; 2. (తురుష్కనామధేయాంతవాచకము.) "గీ. అమీనుఖాన, యొదయుడు...."య.౧,ఆ.౬.

ఖానకము. సం. = ఖనకము.

ఖానకుఁడు. సం. = ఖనకుఁడు.

ఖానము. సం. వి. అ. న. తినుట.

ఖాని. సం. = ఖని.

ఖాను = ఖానుఁడు. 1. (తురుష్క ప్రభువు.) "సీ. ఉమగనిబిభ్రాంతిఁ దళగాల్గుపడ నిల్చుఖానులు డాఁగఁ జీఁకటులుఁజేసె." వసు. ౧, ఆ. ౪౬; 2 (తురుష్కనామాంతవాచకము.) "క...అమీను ఖానుసింగంబునకున్." య. ౧, ఆ. ౪౪.

ఖానుఁడు. హిం. వి. (ఖాన్.) 1. తురుష్క ప్రభువు. "శా. ఆమాటల్ విని ఖానుఁడు..." రంగా. ౨ ఆ. ౪౮; 2. తురుష్కనామాంతవాచకము. (ఇది శర్మ శాస్త్రి వంటిది.)

ఖామందు = ఖావందు. (శ. ర.)

ఖాయము. హిం. విశే. (ఖాయమ్.) స్థిరము, శాశ్వతము. (శ. ర. వా.)

ఖారము. సం. వి. అ. పుం. పుట్టి, పరిమాణవిశేషము.

ఖారి. సం, వి. ఇ, ఈ. స్త్రీ. ఖారము, పుట్టి.

ఖారీకము. సం. విశే. (అ. ఆ. అ.) పుట్టెడువిత్తులు విత్తఁదగినది. (పొలము.)

ఖారీవాపము. సం. = ఖారీకము.

ఖార్కారము. సం. వి. అ. పుం. ఓంద్ర, గాడిద చేయుధ్వని.

ఖాలీ. హిం. విశే. (ఖాలీ) ఉత్తది. "గీ. కోట ఖాలీ యొనర్చుట కేటిసబబు." రంగా. ౨, ఆ. ౧౪౮. ౨, ఆ. ౧౭౪.

ఖావందు. హిం. వి. (ఖావంద్.) ప్రభువు, అధికారి. "శా... మేల్గడీ, ఖాలీచేసి యథేచ్ఛ మేఁగు మని మీఖావందునకున్ వ్రాయుమీ." రంగా. ౨, ఆ. ౧౪౮. ౨, ఆ. ౧౭౪.

ఖాసా. హిం. విశే. (ఖాస్.) సొంతమైనది. (శ. ర.)

ఖాళీ = ఖాలీ.

ఖి

ఖిందానము. సం. విశే. (అ. ఆ. అ.) ఖేదపడుచున్నది, దుఃఖించుచున్నది.

ఖిఖి. సం. వి. ఇ. పుం. కిఖి, కొంకనక్క.

ఖిదిరుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. తపస్వి; 3. దరిద్రుఁడు.

ఖిద్రుఁడు. సం. వి. అ. పుం. దరిద్రుఁడు.

ఖిన్నము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఖేదమందినది; 2. దైన్యపడినది.

ఖిలము. సం. వి. అ. న. శేషము, మిగిలినది. "శ్లో. అలం దగ్ధై ర్ద్రుమైర్దీనైః ఖిలానాం శివమస్తు వః." సం. భాగ. ౬, స్కం. ౪, అ. ౧౬ శ్లో. విశే. (అ. ఆ. అ.) 1. దున్ననిది. (నేల); 2. చెడినది; 3. శిథిలము; 4. సంక్షిప్తము; 5. గ్రంథాంతమునఁ జేర్పఁబడినది.

ఖిలీభవించు. సం. అ. క్రి. ఖిలమగు, నశించు. "వ... సప్తాంగపరిక్షయంబునఁ ద్రివర్గంబు నశించు. త్రివర్గనాశంబున నుభయలోకమార్గంబును ఖిలీభవించుం గావున." కాశీ. ౫, ఆ. ౨౯౦.

ఖు

ఖుదా. హిం. వి. (ఖుదా) అల్లా, దేవుఁడు. "గీ... రాయలతోఁ బోరి గెలువ మనకు, వశమె యైన ఖుదా యున్నవాఁ డటంచు." కృష్ణ. 3, ఆ. ౭౬. రంగా. ౨, ఆ. ౨౫౨.

ఖురము. సం. వి. అ. పుం. 1. గొరిజ; 2. నఖ మను గంధద్రవ్యము, 3. మంగలికత్తి; 4. మంచపుకోడు.

ఖురళి. సం. వి. ఈ. స్త్రీ. 1. సాము; 2. శస్త్రాభ్యాసము; 3. శస్త్రాభ్యాసముచేయుచోటు. రూ. ఖురళిక.

ఖురాకము. సం. వి. అ. పుం. పశువు.

ఖురాలకము. సం. వి. అ. పుం. ఇనుపబాణము.

ఖుర్దనము. సం. వి. అ. న. క్రీడ, ఆట.

ఖులాసా. హిం. వి. (ఖులాసా) క్షేమము; సుఖము.

ఖుల్లము. సం. విశే. (అ. ఆ. అ) 1. క్షుద్రము; 2. దరిద్రము; 3. దుష్టము.

ఖుల్లసు. హిం. వి. వివరము.

ఖుసి. హిం. వి. (ఖుసీ.) సంతోషము. "మ. ఖుసి మీఱన్ సురథాణ నిండుకొలువై కూర్చున్నచో ..." హర. పీఠి. ౨౨.

ఖూ

ఖూని = కూని.

ఖూబు. హిం. అవ్య. (ఖూబ్) సెబాసు, ఒళీ "మ. అవురా వాతెఱతేఁటఖూబు పిఱుఁదొయ్యారంబు మజ్ఝారె చన్గవతళ్కుల్..." ప్రబంధ. ౪౦౪.

ఖే

ఖేచరము. సం. = ఖచరము.

ఖేచరి. సం. = ఖచరి.

ఖేచరుఁడు. సం. = ఖచరుఁడు.

ఖేటము. సం. వి. అ. పుం. 1. కర్షకగ్రామము; 2. సూర్యాదిగ్రహము; 3. కఫము; 4. సునందకము, బల

రామునిగద. పుం. న. 1. వేట; 2. చర్మము. న. 1. గడ్డి; 2. డాలు. విణ. (అ. ఆ. అ.) 1. అధమము; 2. వడ్డిచే బ్రదుకునది.

ఖేటాయించు = కేటాయించు. (హిం. ఖేటా.)

ఖేటి. సం. విణ. (న్. నీ. న్.) 1. పారుడు; 2. కాముకుడు.

ఖేటించు. మి. స. క్రి. (హిం. ఖేటా.) విడిచిపెట్టు, ఖాళీచేయు. "మ...మీ రాజోట ఖేటింపుడన్, పథముల్ దప్పినపల్కు వల్కు దగునే...." రంగా. ౨, ఆ. ౧౭౪.

ఖేదకుడు. సం. విణ. (అ. దికా. అ.) 1. ఖేదపడు వాడు; 2. ఖేదపెట్టువాడు.

ఖేదనము. సం. వి. అ. న. 1. దైన్యము; 2. బాధ; 3. దారిద్ర్యము; 4. బడలిక; 5. రోగము; 6. క్షయము.

ఖేదపడు. మి. అ. క్రి. బాధపడు, దుఃఖించు. "ఉ. అక్కట వేగిరింపడుచు నందిటి సమ్మదసంపసెజ్జలో, నెక్కొనుకోరి ఖేదపడు నేరమి వచ్చె నటంచు లేచుచున్." కాళిందీ. ౨, ఆ. ౧౬౯.

ఖేదము. సం. వి. అ. పుం. = ఖేదనము.

ఖేదించు. సం. అ. క్రి. ఖేదపడు. "స...హనుమంతుండు ఖేదింప లక్ష్మణుండు వగలంబొగుల..." భా. రా. యు. ౨౩౭౪.

ఖేయము. సం. వి. అ. న. పరిఖ, అగడ్త. పుం. నీళ్లు పాఱుట కనువుగాఁ గట్టిన ఆనకట్ట. విణ. (అ. ఆ. అ.) ఖనీయము, త్రవ్వఁదగినది.

ఖేల. సం. వి. ఆ. స్త్రీ. క్రీడ, ఆట.

ఖేలత్. సం. శత్రు. 1. క్రీడించుచున్న; 2. అల్లలాడుచున్న. "శా. ఖేలన్మార్గము లైనతాళకరుచుల్ కృష్ణుండు వీక్షించుచున్." హరి. పూ. ౭, ఆ. ౭౫.

ఖేలనము. సం. వి. అ. న. 1. అల్లలాడుట; 2. క్రీడ; 3. క్రీడాసాధనము.

ఖేవిహారుడు. సం. వి. అ. పుం. ఖేచరుడు, దేవత. "ఉత్సాహము. యక్షసిద్ధసాధ్యఖేవిహారగరుడకిన్నరాధ్యక్షమణి కిరీటకోటితరుణికిరణమంజరీ, ప్రేమణీయచరణకమలు భీమనాథదేవునిన్, దక్షవాటికాపురైకధాము నాశ్రయించెదన్." భీమ. ౩, ఆ. ౨౦౨.

## ఖై

ఖైదీ. హిం. వి. (ఖైదీ) చెఱలో నుంచఁబడినవాఁడు.

ఖైదు. హిం. వి. (ఖైద్) చెఱ, కారాగృహము.

ఖైలికము. సం. విణ. (అ. ఈ. అ.) ఖిలమునకుఁజెందినది, అనుబంధమున నున్నది.

## ఖో

ఖోటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. జాణ; 2. మాయావిని.

ఖోడుఁడు. సం. వి. అ. పుం. శని. విణ. (అ.ఆ.అ.) కుంటివాఁడు.

ఖోలకము. సం. వి. అ. పుం. 1. శిరస్త్రాణము; 2. పోఁకచిప్ప; 3. పుట్ట; 4. పాకము.

ఖోల్ముకము. సం. వి. అ. పుం. అంగారకుఁడు.

## ఖ్యా

ఖ్యాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) చెప్పువాఁడు.

ఖ్యాతము. సం. వి. అ. న. 1. ప్రకటనము; 2. చెప్పుట. విణ. (అ.ఆ.అ.) 1. చెప్పఁబడినది; 2. ప్రసిద్ధము; 3. చాటఁబడినది.

ఖ్యాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) చెప్పఁబడినది.

ఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రసిద్ధి; 2. ప్రశంస; 3. చెప్పుట; 4. జ్ఞానము.

ఖ్యానము. సం. వి. అ. న. చెప్పుట.

ఖ్యాపకము. సం. విణ. (అ. పికా. అ.) 1. చెప్పునది; 1. బయలుపఱచునది.

ఖ్యాపనము. సం. వి అ. న. 1. చెప్పుట, ప్రకటించుట; 2. ప్రసిద్ధముచేయుట.

## ఖ్యే

ఖ్యేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఖ్యాతవ్యము, చెప్పఁదగినది.

## గ

గ. ఉభ. దే. ఒకానొకయక్షరము. సం. వి. అ. పుం. 1. గంధర్వుఁడు; 2. విఘ్నేశ్వరుఁడు. న. గానము, సంగీతము. ఆ. స్త్రీ. గాథ.

గంగ. ఉభ. దే. విణ. పెద్దది. (ఉదా:—గంగడోలు మొ.) సం. వి. ఆ. స్త్రీ. 1. భాగీరథి. (భాగీరథి, గౌతమి, కృష్ణవేణి, కావేరి, తుంగభద్ర—పంచగంగలు. ఆకాశగంగ మందాకిని, పాతాళగంగ భోగవతి.); 2. నది. "గీ. మిన్నయేఱు గౌతమీగంగవన్నె కెక్కు." రసిక. ౬, ఆ. ౧౭౩; 3.

నీరు. (ఈయర్థము తెలుఁగునందే కలదు.) వా:— గోదావరిగంగ తియ్యఁగ నుండును.

గంగక. సం. వి. ఆ. స్త్రీ. = గంగ. (బ్రౌ.)

గంగచిప్ప. దే. వి. (గంగ+చిప్ప.) పెద్దజాతి ఆలిచిప్ప.

గంగడోలు. దే. వి. (క. గంగదొవల్.) 1. గళకంబళము, ఆవులకు మెడకును గళముక్రింద వ్రేలాడు పెద్దతోలు. "గీ. రాజతాహార్య గౌరాజరాజమునకుఁ, జంద్రశేఖరవరకకుచ్చాదువృషకు, నినుఁహాసింధు వృషకంఠసీమ నిగిడి, డాలు దీపించె నిది గంగడోలుఁబోలె." పాండు. ౨, ఆ. ౧౭౭; 2. పెద్దడోలు. ఆం. భా. తృ. ౪౭.

గంగనమ్మ. మి. వి. ఒకానొక గ్రామదేవత. (గంగానమ్మ యని వాడుక.) "గీ. గొప్పచింతలో తుకములుఁ గూర్చి నీకు,గావుపెట్టింతుఁ జుమ్మి యోగంగనమ్మ." నీలా. ౧, ఆ. ౧౧౩.

గంగనురుఁగు. మి. వి. భక్ష్యవిశేషము. "ద్వి. పరుగు లప్పడములు వడియములు గంగ,నురుఁగులు..." ప్రభులిం. ౪, ఆ. ౧౫౦. పు.

గంగమయిలు. దే. వి. నలుపు. (బ్రౌ.) విణ. 1. నల్లనిది. (బ్రౌ.); 2. నలుపుపసుపువర్ణములు గలది. ఉదా:- గంగమయిలావు. (శ. ర.)

గంగమ్మ. మి. వి. 1. గంగనమ్మ. ఉదా:—గంగమ్మ జాతర; 2. గంగానది. "గీ. ...జపంబు, వడుపు నొప్పంగ గంగమ్మ వమువృమమ్మ." భీమ. ౪, ఆ. ౧౭౫.

గంగరావి. దే. వి. బ్రహ్మదారువృక్ష. ఆం. భా. ద్వి. ౪౨. భాను. ౨, ఆ. ౫౮.

గంగరేఁగు = గంగరేను. ఆం. భా. ద్వి. ౪౫.

గంగరేను. దే. వి. పెద్దరేఁగు, లికుచవృక్ష. "సీ... గంగరేనుపండ్లు." కాశి. 3, ఆ. ౬౯.

గంగవాడిచెల్లు. దే. వి. గుజ్జము నడుమను గట్టు అభరణవిశేషము. (బ్రౌ.)

గంగసిందూరము. మి. వి. కుంకుమతోఁ గలిపి బొట్టు పెట్టుకొను నొకజాతిసిందూరము. (వా.)

గంగాక. సం. = గంగ.

గంగాజలములు. సం. వి. అ. న. బ. 1. గంగలోని నీళ్లు; 2. ధాన్యవిశేషము. "సీ. బంగారుతీఁగెలు గంగాజలమ్ములు కస్తూరినిగరాలు కటకసరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

గంగాద్వారము. సం. వి. అ. న. హరిద్వారము, మాయాపురి. "వ...కురుక్షేత్రంబు గంగాద్వారంబు..." కాశి. 3, ఆ. ౬౮.

గంగాధరుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. సముద్రుఁడు.

గంగాపుత్రుఁడు. సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి. 3. గంగాతీరమున యాత్రికులచే స్నానము చేయించుబ్రాహ్మణుఁడు; 4. ఒకానొక సంకీర్ణజాతివాఁడు.

గంగాళచిప్ప = గంగచిప్ప.

గంగాళము. దే. వి. (క. గంగాళ. త. కంగాళ.) 1. నీరు మొ. పోసికొనుటకై మూతి వెడల్పు గల పెద్దపాత్రము. ఆం. భా. ద్వి. ౨౪౬. శుక. 3,ఆ. ౧౦3; 2. భోజనపాత్రము. "గీ. మగనిఁ గూర్చుండ మనుచువమ్మాయులాఁడి, పెడఁదగంగాళమునఁ గూడు గుడిచి లేచి." వేం పంచ. ౪.ఆ ౪౫౬.

గంగి. దే. వి. 1. సాధువగుయావు. "ద్వి. మంచిగంగుల పాలు మఱుఁగంగఁ గాఁచి." బస. 3, ఆ. ౪౧3. పం.; 2. గంగమ్మ. (వా.) విణ. సాధువైనది. "ఉత్సాహ...గంగిగోవువంటి సాధుబాఁపనికిఁ నినున్,జనునె పలువయనఁగ..." కళా. ౭,ఆ.3౦.

గంగికట్టి. దే. వి. (గంగి+కట్టి.) సాధువైనయావు. విణ. సాధువైనయావువంటిది, పరమసాధువైన వాఁడు. "శా...నాహ్యన్నాథుఁ ద్విజు గంగికట్టి నకటా హింసింప నేలయ్య .." భాగ. ౯, స్కం. ౨౪౬.

గంగిరెద్దు=గంగెద్దు. "సీ. గంగిరెద్దుకు-లేవె ఘనతూర్యరావముల్ ..." రామలిం. ౧౦.

గంగెద్దు. దే. వి. (గంగి+ఎద్దు.) దాసరులు శృంగారించి యాడించెడియెద్దు, దేవవృషభము. ఆం. భా. ద్వి. ౨౬౧.

గంగెద్దులాట. దే. వి. (గంగెద్దులు+ఆట.) బాలక్రీడావిశేషము. "సీ. బండ్లికలును బొప్పబొడ్ల మంచంబులు గంగెద్దులాటలు..." హంస. 3, ఆ. ౧౪౬.

గంజ. సం. వి. ఆ. స్త్రీ. 1. గుడిసె; 2. కల్లుపాక; 3. కల్లుకుండ; 4. గంజాయి. "క. శీలముఁ బట్టియు గంజా,హాల లుపాంశున భుజించునధములబైటం, జాలుఁడు వైవన్..." ఆము. ౪, ఆ. ౪౭. (గంజా

శబ్దము హాలాశబ్దము గూడ దేశ్యములే యైనను నిట సంస్కృతపదములుగా వాడఁబడినవి. హాలాశబ్దమును బ్రాచీనులుగూడ సంస్కృతమున వాడిరి. గంజా భిన్నపదముగాఁ గైకొనఁ దగు నని పేదం. పేం. వ్యాఖ్య. కాని, 'హాలలు' అని బహువచనాంత మండుటచే నట్లెంచుట యాలోచనీయము.)

గంజము. సం. వి. అ. పుం. 1. గని; 2. అంగడి; 3. బొక్కసము; 4. గోష్ఠము; 5. తిరస్కారము.

గంజి. వై. వి. (సం. కాంజికమ్. క. గంజి. త. కంజి.) అన్నము వార్చినరసము. "ఉ...పొట్ట కొక చేరెఁడుగంజియు లేక యాఁకటం,జచ్చియుఁ జావము..." ద్వా. ౧,ఆ.౭౫.ఆం.భా. ద్వి.౨౬౦

గంజిగుల్ల. వై. వి. (గంజి+గుల్ల.) నీటిముగ్గవలె లేచెడి బొబ్బ. (శ. ర. బ్రా.)

గంజితొరక. ద్వ. వి. (గంజి+తొరక.) గంజిమీఁది మీఁగడ. (శ. ర.) [బ్రా.)

గంజె. దే. వి. కృషికి యోగ్య మైనభూమి. (శ. ర.

గంజెనగాలు. ద్వ. వి. బాలక్రీడావిశేషము, ఖంజపాదక్రీడ. ఆం. భా. ద్వి. ౨౦౭.

గంజా. వై. వి. (సం. గంజా. క. కంజా. హిం. ఘంజా.) మత్తు కలిగించెడియొకానొకవస్తువు. "సీ. సారాయిసొంపెర గంజాపొడుల్..." కువల. ౧, ఆ. ౪౧.

గంజాయి = గంజా. 1. గంజామొక్క. ఆం. భా. ద్వి. ౭౩; 2. దానియాకు. ఆం. భా. ద్వి. ౪౧; 3. గంజాయాకుతోఁ జేయుమత్తుపదార్థము, కలంజము. "ద్వి. గంజాయి దినె నేమి కలుద్రావె నేమి." ద్వి. హరిశ్చ. ౨. భా. ౧౪౫౧. పం. ఆం. భా. ద్వి. ౩౦౪. [(శ. ర.)

గంజో. దే. వి. కూరలుమొ. అమ్మువీథి, కూరలబజారు.

గంట. యు. దే. వి. గడ్డిదుబ్బు. "గీ. తెల్లుగంటల నాఁబోతు లుల్లసిల్లె." ఆము. ౪, ఆ. ౧౫౬; ౪, ఆ. ౧౨౪. వై. వి. (సం. ఘంటా. క. గంటె) 1. ఘంట, వాద్యవిశేషము. "సీ...కమనీయ మగు పైఁడిగంట..." కు. సం. ౭, ఆ. ౨౨. రామా. ౭, ఆ. ౨౫; 2. కింకిణి, చిఱుగంట. "సీ. గంటల మొలనూలు కడిఁదియొడ్డాణంబు..." య. ౪, ఆ. ౭౯; 3. రెండున్నరగడియలకాలము, అఱువది నిముసములకాలము. (వా. శ. ర.); 4. ఒకగడియ. ఆం. భా. తృ. ౫౩.

గంటకట్టు. దే. అ. క్రి. (గంట+కట్టు) దుబ్బేర్పడినదగు. (శ. ర. బ్రా)

గంటకజ్జ. దే. వి. (గంట+కజ్జ.) సస్యనాశము. ఆం. భా. ద్వి. ౨౩౭.

గంటము. దే. వి. (త. గంటం.) తాటాకుమీఁద వ్రాయుటకు సన్నని మొన గలిగి యుక్కుతోఁ జేయఁబడిన సాధనవిశేషము. ఆం. భా. ద్వి. ౧౭౯. భీమ. ౧, ఆ. ౭౬.

గంటలమ్మ. వై. వి. (గంటలు+అమ్మ.) ఒకానొకగ్రామదేవత. (శ. ర. బ్రా.)

గంటవేఁట. ద్వ. వి. (గంట+వేఁట.) జీవములు చిఱుగంటలు నుపయోగించుచు వాడెడియొకానొక రకపువేఁట. "గీ. గంటవేఁటయు మొదలుగాఁ గలుగు వేఁటలు..." రామా. ౨, ఆ. ౨౯. కాశీ.

గంటి. వై. వి. (సం. గ్రంథిః.) 1. గాయము. "ఉ. పంటికొలందిఁ జక్కెరలపానక మూరెడుకావి మోవిఁ బెన్గంటి యొనర్చి..." రసిక. ౪, ఆ. ౧౪. భార. శల్య. ౨, ఆ. ౧౬౯; 2. రంధ్రము. "సీ. క్రౌంచాచలముపోటుగంటిఁ దూఱినరాజహంసముల్..." విజ. 3, ఆ. ౨౪. ద్వా. ౧౦. ఆ. ౧౨౨.

గంటిపడు. వై. అ. క్రి. (గంటి+పడు.) 1. క్షతమగు. "సీ. తమికొద్ది నధరబింబము గంటిపడనీక మొనపంట నొక్కింత మోపు మనుచు." అని. 3, ఆ. ౧౬; 2. రంధ్రమేర్పడు. (చూ. గంటిపఱుచు.) ఇట్లే: గంటిపడు. భా.రా.యు.౧౪౩౦.

గంటిపఱుచు. వై. స. క్రి. (గంటిపడుధా. ప్రే.) 1. గాయపఱచు, దంతక్షతము చేయు; 2. రంధ్రము పడఁజేయు, చిల్లుపఱుచు. "గీ. ఫలసమత్కారములు గంటిపఱుచు ననుచు." చంద్రా. ౪,ఆ.౧౯౩.

గంటివెట్టు = గంటిపఱుచు.(గాయపడఁజేయు.) "క. నేఁటి కిది గంటివెట్టఁగ, నేటికి నీబోయవింట నిడ్డ సరము లీ,పూఁటఁ గడపఁ జాలవె..." కేయూర. 3, ఆ. ౧౪౩.

గంటిసేయు. సం. స. క్రి. గాయపఱచు, క్షతము గలుగఁజేయు. "సీ...నాథుఁనియధరబింబము గంటిసేయంగ నెంచు." దశా. 3, ఆ. ౧౭.

గంటీలు. ద్వ. వి. బ. ఒకరకపుచెవిప్రోగులు. "గీ. గిలుకుమట్టెలు గంటీలు..." హంస. ౪,ఆ. ౧౩౯. ఆం. భా. ద్వి. ౧౪౯.

గంటు. వై. స. క్రి. 1. గాయపఱచు. 'ఉ. వేఁదుఱు గొన్నమానవుని వేమఱు గంటిచియు బిట్టు కాల్చియుం, మోఁదియు నీటఁ ద్రొక్కియుఁను మున్కొని తీర్పఁ గడంగువెజ్జువట్లు...' నృసిం. ౫, ఆ. ౧౨. వి. (సం. గ్రంథిః. క. గంటు.) 1. గాయము. "సీ. చికిలిచంచురుకొని చిగురాకు నుముమోవి నంటిన మొనపంటిగంటుఁ జూచి." శుక. ౧, ఆ. ౩౧౫; 2. హృదయగ్రంథి. "సీ. గంటెలాఱుఁ బగుల్పఁ గడు హెచ్చువహ్నిచే మోఁదికుండలికన్య మేలుకొలిపి." వరాహ. ౧౦, ఆ. ౫౪; 3. వెండ్రుకలముడి. "గీ...కురులు ముప్పిగంటుగా వైచి..." పార్వ. ౫, ఆ. ౧౭౯; 4. (సంచి) కట్టుముడి. "మ..., వెలుచంగంటు ఫుటుక్కునం దునిసి వే వృద్ధ్యం బడెం జాలె..." ఆము. ౪,ఆ. ౩; 5. గసుపు.ఆం.భా.ద్వి.౭౪.

గంటుబారంగి. ద్వ. వి. (క. గంటుబారంగి.) భార్గి, ఒకానొకయోషధి. ఆం. భా. ద్వి. ౫౪.

గంటువెట్టు. దే. స. క్రి. (గంటు+పెట్టు.) (కోపావసర్యాదులచే మొగము) ముడుచుకొను, ముడి పడఁజేయు. "శా. అన్నన్ మోములు గంటువెట్టుకొని రోషాయత్తులై యత్తఱిన్." విక్ర. ౩, ఆ. ౧౦౭. "వ. ఏ నిట్టిదాని వినఁ జాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన లేచి పోయె." భార. ఉద్యో. ౩, ఆ. ౭౩.

గంటె. దే. వి. 1. గరిఁటె. ఆం. భా. ద్వి. ౨౪౩; 2. సజ్జపైరు. "వ. గంటె కొఱ్ఱ తఱచును..." భీమ. ౩, ఆ. ౫౩. మి. సజ్జలు, ధాన్యవిశేషము. (శ. ర.)

గంటెకామ. దే.వి. ఒకానొకచెట్టు. "సీ....ముయ్యాకుపొన్నయుం హంసపాది గంటె,కామ..." హంస. ౪, ఆ. ౧౦.

గంట్లకచోరము. ద్వ. వి. షడ్గ్రంథికవీ. (శ. ర.)

గంట్లకామసు. దే. వి. షడ్గ్రంథమువీ. (శ. ర.)

గంట్లము. దే. వి. గర్భిణులకోరిక, దోహదము. "సీ. పూలలేవిరియలఁదుఁ జాలాలిగొరువంకపిండు గంట్లంబులఁ బెట్టి పెట్టి." య. ౪, ఆ. ౧౫.

గండ. యు. దే. వి. మ్రొక్కుబడి. (చూ. గండదలము) వై.వి. (సం. గండకః. క. గండ.) శూరుఁడు. "గీ... మేనగట్టురాకన్నియయయును, గలుగు జగముల గండరగండ వేల్పు." అచ్చ. యు. ౫౯౯. నరస. ౫, ఆ. ౭౦.

గండఁడు. వై. వి. శూరుఁడు. "క. గండఁడు శంభుద్రోహర, గండఁడు..." వీర. ౬, ఆ. ౭౯.

గండకత్తెర. వై. వి. (గండ+కత్తెర.) 1. మెడఁ గత్తిరించుపెద్దకత్తెర. "క. శిలము దొరగినవిమ్మట,నేగాకాయంబు దివి సెడసేయుంటయే, మేలని హృదయమార్జంబునఁ, గాలాంతకు నిల్పి గండకత్తెర గొనఁగాన్." చెన్న. ౪, ఆ. ౨౧౭. కళా. ౩, ఆ. ౧౦; 2. సంకటము. (బ్రా.) విషమస్థితి. వా:— నే నిపుడు గండకత్తెరలో నున్నాను. [(బ్రా.)

గండకట్టెలు. దే. వి. బ. వంటచెఱకు, వంటకట్టెలు.

గండకము. సం. వి. అ. పుం. 1. పులిగోరుపదకము; 2. ఖడ్గమృగము; 3. అంతరాయము; 4. చేఁపపిల్ల. "ఆ. గండకముల కిట్టిగండముల్ గల విఁకే, మనఁగ వచ్చు నెట్లు మనఁగ వచ్చు." దశా. ౧, ఆ. ౧౩౭.

గండకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. ఆఁడు ఖడ్గమృగము.

గండగొడ్డలి. వై. వి. ఔ. (గండ+గొడ్డలి.) (క. కండకొడలి.) పరశువు. "సీ. పులులమొత్తంబుల బోనులఁ జొరఁ దోలి గండగొడ్డంద్లచేఁ జెండి చెండి." రసిక. ౧, ఆ. ౧౧౦.

గండగొడ్డలితాలుపు. ద్వ. వి. (గండగొడ్డలి+తాలుపు.) పరశురాముఁడు. అచ్చ. యు. ౨౨.

గండడఁగించు. ద్వ. స. క్రి. (గండడఁగు. ధా. ప్రే.) గండడఁచు, నశింపఁజేయు. "చ...క్రోధకాముల గండడఁగించి..." ఉ. హరి. ౪, ఆ. ౯౭. వసు. ౪, ఆ. ౩౨.

గండడఁగు. ద్వ. అ. క్రి. (గండు+అడఁగు.) సత్త్వహీనుం డగు. "చ...పగతుండు గండడఁగి కాతరభావము నెమ్మనంబునన్, దనికిన..." హరి. ఉ. ౨, ఆ. ౬౭.

గండడఁచు = గండడఁగించు. "సీ. ఎదిరించుకరి నైన బెదరించుహరి నైన గండడంపఁగఁ జాలు గుండె దిటము." ఇందు. ౧, ఆ. ౧౫౭.

గండదల. దే. వి. (గండ+తల.) మ్రొక్కుబడికి బలిగా నిచ్చుతల. "సీ. మునుబావమఱఁదు లిమ్ముల నంబి కకు గండదల లియ్య..." భో. ౫, ఆ. ౨౪౯.

గండదీపము. మి వి. (గండ+దీపము.) మ్రొక్కుబడి నిమిత్తము పెట్టుదీపము. "సీ. విరహిజనంబుల వేఁగింప మారుండు తెలివిఁ బెట్టినగండదీప మనఁగ." కాళింది. 3, ఆ. 3౦. శుక. ౨, ఆ. ౪౯౫ (జబ్బుపడినప్పుడు కాని కష్టసమయములో నున్నప్పుడు కాని దేవునకు మ్రొక్కి దానివలన శుభము కలిగినవెనుక నది చెల్లించుట కొక పెద్ద పాత్రలో నేయి పోసి పిండివత్తులతో వెలిగించి నెత్తిని బెట్టుకొని గుడిచుట్టు త్రిప్పుదీపము. బ్రౌ.)

గండపెండరము. ద్వా. వి. (గండ+పెండరము.) 1. శూరులు కవులుఁ మొ. వారు కాలిని బిరుదముగా ధరించు నందె. "సీ...డాకాల గండపెండర మమర్చి." ఆచ్చ. యు. ౨౦3; 2. ఆభరణవిశేషము. "గీ. పెద్దపీతాంబరము గండపెండరంపుఁ గటకకటి సూత్రకేయూరకంకణాది,దివ్యభూషణ జాలంబుఁ దేజరిల్ల. రాముఁ డభినవశృంగారధాముఁ డయ్యె." దశా. 2, అ. ౧, ఆ. ౨౪౭.

గండపెండారము = గండపెండరము. 1. (శూరులు మొ.వారు బిరుదముగా ధరించుకాలియందె) "సీ. డాకాలిగండపెండారంపుదాపున బొమ్మకై వైరి భూభుజులు వ్రేల." కాశీ. ౧, ఆ. ౪౫. రామా. ౪, ఆ. ౧౦౯; 2. (ఆభరణవిశేషము.) "సీ. శ్రీ పాదములఁ బైఁడిచిఱుగజ్జె యందెలతోడ రవణిల్లు గండపెండార మమర...,గీ...,దివ్యబాలకుఁ డొక్కఁడు తేజరిల్లె." కాశీ. 3, ఆ. ౨౪౧.

గండపెండెము = గండపెండరము. (శూరాదిబిరుద చిహ్న మగుకాలియందె) "సీ. తోలువేల్పురా ప్రతిమలచెక్కడపుగండపెండెంబు డాకాల దండిఁ జూప. గీ. శాత్రవజిగీష నరుదెంచెఁ జక్ర ధరుఁడు." ఉ. రా. ౨. ఆ. ౪౨.

గండపెండేరము = గండపెండరము. (శూరాదిబిరుద చిహ్న మగుకాలియందె.) "సీ. దండిగా మగ రాలు దాపినబలితంపుగండపెండేరము డాకాలఁ గ్రాల." రసిక. ౧, ఆ. ౪౭.

గండపెండేరము = గండపెండరము.(కవిబిరుదచిహ్న మగుకాలియందె.) "సీ. బిరుదైనకవిగండపెండేరమున కీవె తగు దని తానె పాదమునఁ దొడిగె." (పెద్దనచాటువు.)

గండభేరుండము. వై. వి. (గండ+భేరుండము.) 1. రెండుతలలు మూఁడుకన్నులు గలపక్షివిశేషము. "గీ. శరభ సాళువ మళవంబు సారమెగము, గండభేరుండ మని మఱి కలుగుజీవ్రు, లని యెఱుఁగ కేము తడవింట నమ్మిరిండఁ, దొడిగి యడవుల వేఁటాడఁ దొడఁగినపుడు." సాంబో. ౨. ఆ. ౧౭౯; 2. మృగవిశేషము. "వ...సింహాబుభ శార్దూలగండభేరుండ భల్లూకవరాహాదిమృగంబుల..." రుక్మా. 3, ఆ. ౧౦౦. ('గండభేరుండ' మని తత్సమముగా నిట గ్రామ్యము.)

గండమాల. సం.వి. ఆ. స్త్రీ =గండమాలము. "క. కని దీని నెత్తఁ దొడ్డ్రను, మన జూసి దలఁపంగఁ బసుల మారియెపచ్చెన్, మను గండమాలమీఁదను మొన కుఱుపుం బుట్టె నన్ను మోసం బాయెన్." ద్వా. ౧౦, ఆ. ౫౪.

గండమాలము. సం. వి. అ. పుం. మెడచుట్టును గడ్డలు లేచెడివ్రణవ్యాధివిశేషము.

గండము. సం. వి. అ. పుం. 1. కపోలము, చెక్కిలి; 2. ఏనుఁగుచెక్కిలి; 3. నీటిలోనిబుడగ; 4. కుఱుపు; 5. కిణము; 6. గుర్తు; 7. ఖడ్గమృగము; 8. అశ్విన్యాదినక్షత్రములమొదటిఘడియలు; 9. దుష్టనక్షత్రఘడియలయందుఁ గలిగినజననము వలనిహాని; 10. గుంట్రాయి; 11. అశ్వకంఠ భూషణము; 12. కవచము. విణ. ప్రశస్తము, శ్రేష్ఠము. (సమాసమందే అని విల్సన్.)

గండరించు. దే. అ. క్రి. 1. అతిశయించు, సంపూర్ణముగాఁ బ్రకాశించు. (పట్టు అని. సూ. ని.) "సీ. నిండుఁ బున్నమనాఁడు గండరించినచంద్రమండలశ్రీలతో మాఱుమలయ." భాగ. ౬,స్కం. ౨౬౦; 2. ఆవిర్భవించు. పుట్టు. (బ్రౌ.) స. క్రి. ఊయిమొ. తొలిచి రూప మేర్పఱుచు. "గీ... ప్రళయకాలానలమున, గండరించినరూపంబు కరణి భీముఁడతిభయంకరాకారత నతిశయిల్లె." భార. విరా. ౪, ఆ. ౧3౪. మార్క. 3,ఆ.౯౨.

గండరులు. వై. వి. బ. (సం. ఖండకః) తునుకలు. (శ. ర. బ్రౌ.) (చూ. గండ్రలు.)

గండరువ్వ. దే. వి. 1. ఱాయిమొ. తొలిచి చేసిన యాకారము, గండరించినరూపు. "చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధికరంగఁ దెచ్చి గం,డరు వొనరించిరో..." భార. అను. ౧ ఆ. ౧౮౩; 3. ఆట్టిరూ పేర్పఱుచునచ్చు. "క. కరువున గండరువునఁ జి,త్తరువున నిచంద్రరుచులఁ దాఁకల రుచులన్, హరిహరధాత్రాదుల కీ,హరిణము చరిరూపు వడయ నలవియె యొరుల్." భా. రా. అర. ౨, ఆ. ౩౩. నిర్వ. ౬, ఆ. ౫౩.

గండశైలము. సం. వి. అ. పుం. (భూకంపాదుల వలన) కొండనుండి జారి పడిన పెద్దఱాయి.

గండాడు. దే. అ. క్రి. (గండు+ఆడు.) మైథునము చేయు. రమించు. "క. చండాలితోఁ ద్విజుండొ గి, గండాడిన వక్షమున భగము వ్రాసి తగన్, దండువఁ గొని జేకంబున,నుండక యుండంగ నడచు టుచితము పలికెన్." విజ్ఞా. ప్రా. ౧౨౬.

గండారము = గండరువ్వ. (గండరించినరూపు.) "ఉ...ఆ,చ్చెరువకంపము గదిసి చిత్తరువో కరువో యనంగ గం,డారపుబొమ్మవోలె నచటం గద లించుక లేక యుండఁగన్." ఉ. హరి. ౧, ఆ. ౬౦. ప్రబంధ. ౭౮౮.

గండారు. దే. వి. చెఱసాల. "శా. ప్రేలుంగొమ్ములు నేల దొరపిలినక్ వెళ్లంగ రాకుండఁగా, లోలోఁ బ్రిమ్మరునాలిగాడ్పులు పరోక్షక్ రేలుఁ బూఁదావులన్, జాలక్ ముచ్చిలిపోవఁ బట్టుకొని పజ్జక్ బచ్చగండార్గలో, సోలక్ గావలిపెట్టె నామని యనక్ జూపట్టె లేఁదోఁటలన్." య. ౪,ఆ.౮.

గండాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగఱిక♣; 2. సర్పాక్షి.

గండి. ఉభ. దే. వి. (న. గండి.) 1. రంధ్రము. "ఉ. సన్నపుగండి యొక్కొటి రసాంతరమార్గము పోలె నిమ్నమై." భో. ౫, ఆ. ౭౫. ఆం. భా. ప్ర. ౧౪౫; 2. (తొడిమ మొదలి) చిన్నగుంట. "సీ. ఆకురాలుపుగండ్ల నానెడునాన నిం తడుగూఁది బొకంటి యంగ లాద్చి." ఆము. ౫, ఆ. ౧౧౭. స్వా. ౬, ఆ. ౨౭; 3. సందు. "ఉ...గండి గాంచి సరుతేరిపథంబునఁ బోవ వారికిన్." భార. ద్రో. 3, ఆ. ౮3. సం. వి. ఇ. పుం. స్కంధము.

గండిక = గండి. (శ.ర.) సం. వి. ఆ. స్త్రీ. గులకఱాయి.

గండిచేయు. దే. స. క్రి. (గండి+చేయు.) బొఱ్ఱ పొడుచు. "గీ. బండికల్లుగ నీమేను గండిచేసె." స్వా. 3, ఆ. ౪౦.

గండిదొంగ. దే. వి. (గండి+దొంగ.) కన్నపుదొంగ, గజదొంగ. "చ. బలపము లేఁతనవ్వు నునుబయ్యెద సన్నపుఁగావిచీర మిం,చులుగొను జల్లజంపు నుసుఁ జూడ్కియె కన్నపుగత్తి మోవితీ,పలపడఁ జొక్కుచుక్ దగ విటావలిడెందముఁ గన్న వెట్టి యి,ప్పులథన మెల్లఁ దీసికొనిపోవలెఁ గామిని గండి దొంగయై." మ్హా. ౨ ఆ ౧౮. ఆం. భా. ద్వి. ౨౯౧.

గండిపసు. వై. వి. (సం. గ్రంథిపర్ణమ్.) గ్రంథిపర్ణము♣. ఆం. భా. ద్వి. ౬౨.

గండీరము. సం. వి. అ. పుం. 1. ఏఱువంగ♣; 2. తురుజకూర♣. న. చిత్రికూర♣.

గండీరి. సం. వి. ఈ. స్త్రీ. జెముడు♣.

గండు. వై. వి. (సం. గండః. క. గండు.) 1. పౌరుషము. "క. గండున రాధాతనయుం డు, రెండు దినంబులు పెనఁగి..." భార. అశ్వ. 3. ఆ. ౧౨౪; 2. శక్తి. "క...నిన్నున్, ఖండనమునఁ బడవైవఁగ, గండు గలుగు టద్భుతంబు..." భార. స్త్రీ. ౨, ఆ. ౭౭; 3. మగజంతువు. ఆం. భా. ద్వి. ౧౦౦; 4. మగతుక్క. "చ...వేఁట దీర్పఁగాఁ,బులితలగుండు గండఁ డనఁ బొల్చినగండివి..." చంద్రా. ౨, ఆ. ౭౫; 5. గర్వము. "ఉ...దుర్దమదోర్బలు లమ్మహాత్మకుల్, గండున బెట్టు పైఁబడుట కార్యము గాదు..." భార. సౌ. ౧, ఆ. ౨౨; 6. కోపము. "గీ. అని గయాళించుకొనుచు...మొగమునఁ బూనుగండు,తోడ బొమముడి నిగుడ నత్తోయజాక్షి." శుక. ౪, ఆ. ౪౩. విశే. మగది. "సీ...గండుఁగోయిలల సొంపు." భార. అను. ౧, ఆ. ౧౯౧.

గండుఁడు. సం. వి. అ. పుం. శూరుఁడు.

గండుతాయి. ద్వ్య. వి. (గండు+తాయి.) మగతాయి, వజ్రము. "సీ. గండుతానిగ్గుచొక్కాటంపు మొగ మొట్టు తొగరిఁకలపరాణి దుమికియాడ." ఉ. హరిశ్చ. 3, ఆ. ౧౩౧.

గండువాపిలి. ద్వ్య. వి. (గండు+వావిలి) పోతువావిలి, వృక్షవిశేషము. "సీ. కలుజువ్వి వావిలి గండు

వావిలి యేఱుమద్ది మద్దియంను..." హంస. ౪, ఆ. ౧౧.

గండూపదము. సం. వి. అ. పుం. వానపాము.

గండూపది. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడువానపాము.

గండూష. సం. వి. ఆ. స్త్రీ. = గండూషము. (కే. ని.)

గండూషము. సం. వి. అ. పుం. న. 1. పుక్కిలింత; 2. పుడిసిలి; 3. ఏనుఁగుతొండముచివర; 4. పుక్కిటఁ బట్టిననీరు.

గండూషించు. సం. స. క్రి. 1. పుక్కిలించు; చక్కఁగాఁ జదువు. "వ...కాదంబరి గండూషించి..." స్వా. 3, ఆ. ౨౧; 2. పొట్టఁబెట్టుకొను. "వ...ఆర్యావర్తదేశమత్తకాశినీ జంఘాకాండ పాండిత్యంబు గండూషించు చిగురుబొట్టలఁ గను పట్టునవియు...ఐనప్రాసంగుం జేలును..." కాశీ. ౭, ఆ. ౨౬.

గండూషీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) పుక్కిలించినది; క్షుణ్ణముగా గ్రహింపఁబడినది. "శా. గండూషీకృతవేదశాస్త్రనిఖిలగ్రంథార్థసారుండు ...మా, ర్కండేయుండు..." హరిశ్చ. ౧, ఆ. ౭౪.

గండె. వై. వి. (సం. గడః. త. కెండై.) 1. చేఁప. "గీ. తాను సురమానినృపతనుల్ దాల్చి యకట! కామినీతతి నుడికించుకంటె నట్టె, గండయును నల్లదాసరిగాఁడు గిరియు, హరియునై పోవుటయుం మంచి దనుయుంగంబు." ఆము. ౫, ఆ. ౪౧; 2. ఒకజాతిచేఁప. "ఉ. అల్లైయు గండె రొయ్య పర కాదిగఁ జేఁపలఁ బట్టి..." ప్రబంధ. ౧౯౫.

గండెక్కు. ద్వి. అ. క్రి. (గండు+ఎక్కు.) మదించు. "ద్వి. గండెక్కి యున్నావు కళలు దైవార, మిండజంగము కింత మెత్తన యేల." ద్వి. భల్లా. 3, ఆ. ౬౬. పు.

గండోలము. సం. వి. అ. పుం. 1. బెల్లము; 2. బెల్లముతో వండినయొకానొకయౌషధము; 3. నోరు పట్టుముద్ర; 4. గుండ్రముగాఁ జేసినరాయి, గోలీ.

గండోలి. ఉభ. దే. వి. = గండోలిగాఁడు. సం. వి. ఈ. స్త్రీ. కణుఁదురిఁగ. (వై. ని.)

గండోలిగాఁడు. దే. వి. (గండోలి+కాఁడు.) వికృతవేషమునఁ గడుపుబ్బ నవ్వించువాఁడు. (వా.)

గండ్ర. యం. దే. విణ. 1. ధృష్టుఁడు. (శ. ర.); 2. పెద్దని. (చూ. గండ్రచీమ.) బ. కఠినవాక్కులు. "శా...,గండ్రల్ గాఁటు లాడి దిక్కృతులఁ బోకాల్మంటివి..." స్వా. ౫, ఆ. ౧౭. వై. వి. బ. (సం. ఖండః.) తునుకలు. "ఉ. ఆత్తతి నమ్ము కుండుఁడు తదక్తసహస్రశరాసనంబులన్, కత్తి మొగంబుటమ్ములును గండ్రలు సేయుచు..." అని. ౪, ఆ. ౮౫. అం. భా. ద్వి. ౭౫.

గండ్రచీమ. దే. వి. (గండ్ర+చీమ.) ఉలంకలము, పెద్దనల్లచీమ. (శ. ర.)

గండ్రపురి. దే. వి. (గండ్ర+పురి.) పెద్దపురి. "సీ. పతయాళు వడుబొంది పడకుండుటకు గండ్రపురులిచ్చుగతిఁ జాలఁ బొత్తు లనిచి." పాండు. 3, ఆ. ౫౬.

గండ్రించు. వై. స. క్రి. ఖండించు. "క...వానికల యిలఁ గూలంగండ్రించువేల్పుపగతుం, డీండ్రల మారయ్య నితని సెన్నఁగఁ దరమే." చెన్న. ౫. ఆ. ౨౧౦.

గండ్రిక. వై. వి. (సం. ఖండకః.) 1. ఖండము; తునుక. "స్రగ్ధర...గండ్రికల్ చేసి నేలన్, నిండించెఁ దుష్టులన్..." య. ౨, ఆ. 3౨. అం. భా. ద్వి. ౭౫, 2. ఒకవిధ మగుపిండివంట. "సీ. గడితంపువెన్నెల గండ్రికల్ సిగరిగాఁ దియ్య వెన్నెలలోనఁ దెచ్చి పెట్టి." య. ౨, ఆ. ౮3.

గంత. ఉభ. వై. వి. (సం. కంథా. క. కంతె.) 1. బొంత. అం. భా. ద్వి. ౧౫౮; 2. ఎద్దులు మొ. వానిమీఁద వేయుగోనె, మెత్త. (శ. ర.); 3. గానుఁగెద్దులు మొ. వానికిఁ గనబడకుండఁ గట్టుకట్టు తోలుముక్క. (వా.) సా:—గంతకుఁ దగిన బొంత. "క. భోగేచ్ఛ నాకుఁ గల్గిన, నీగతిఁ జరియింపనేటి కింటనె యుండన్నన్, సాగదె మున్నిటిపట సం,భోగము గంతలకుఁ దగినబొంతలు లేవే." వైజ. ౨, ఆ. ౧౧౧. సం. విణ. (బు. త్రీ.బు.) 1. పోవువాఁడు; 2. పొందువాఁడు.

గంతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁదగినది.

గంతు. దే. వి. 1. దుముకు, ప్లుతగతిభేదము. "ఉ... ఓరి నీగంతు లడంగిపోవ..." వాల్మీ. 3, ఆ. ౧౫౪. బ. తుళ్లు, మిడిసిపాటు. "మానిని. అంత మదింపకువే యని పల్కిన నంత మదింపకువే

యనుచుఁ, గంతు లడంచెద లెమ్మ పిపల్కిన గంతులడంచెద లెమ్మనుచున్." కళా. ౩, ఆ. ౧౯౫. వసు. ౪, ఆ. ౨౭.

గంతుగొను. దే. అ. క్రి. (గంతు+కొను.) 1. దుముకు. "వ...ఒక శాఖను గంతుగొని..." భా. రా. సుం. ౧౭౬. భాగ. ౬, స్కం. ౩౭౮; 2. చచ్చు. "మ...గిట్టెఁ మనుఁబిల్ల గంతుగొనె..." పా. ౧, ఆ. ౧౦౭. ఆం. భా. తృ. ౮౭.

గంతువు. సం. వి. ఉ. పుం. పోవువాఁడు, వెళ్లువాఁడు.

గండపట్టియ. వై. వి. (సం. స్కంధపట్టికా. క. గండపట్టిగె.) 1. స్కంధపట్టిక, తలుపుమీఁద నమర్చెడు నడ్డుకొయ్య. "క. బలిసద్మ ద్వారేంద్రో, పలఘంకకవాట మనఁగఁ బరఁగె నరసి యూర్ధ్వ లుగండపట్టియలుగాఁ, జెలఁగు..." చంద్ర. ౪, ఆ. ౨౬; 2. (సం. గంధమ్,) గండపురేఖ.

గండపట్టె = గండపట్టియ. 1. (స్కంధపట్టిక.) "మ...ఆధాత్రీశుపక్షకవాటముపై నెడ్డాకొ గండపట్టెగతి నుండఁ నాదుకే ల్సెప్పుటల్." కళా. ౭, ఆ. ౧౧౦. ఆం. భా. ద్వి. ౨౧; 2. (గండపురేఖ.) "గీ. ఉదటుగుబ్బలు గలకల్వ టురము సూచి, గండపట్టెలు చూచి బంగారు సూచి." ఆము. ౨, ఆ. ౧౦. ఆం. భా. తృ. ౫౪.

గండపుఁగొండ. వై. వి. (గండము+కొండ.) మలయాచలము. "చ...ఆయ్యళికచ నీదఁ జేర్చె నవు డండపు గండపుఁగొండపయ్యెరల్." రా. వి. ౩, ఆ. ౮౦. "సీ. కరులు కొమ్ముల వ్రేయ విరియు గండపుఁ గొండతరురాజిపువ్వులతావి కొంత." సాంబో. ౫, ఆ. ౧౮. ఇట్టే: గండపుమల మొ.

గండపుఁగొండటాణెవారు. ద్వి. వి. పవనుఁడు, వాయుదేవుఁడు. వేంక. దేవ. ౧౫.

గండపుమ్రాను. ద్వి. వి. (గండము+మ్రాను.) చందనవృక్షము. "చ. ననిచినగుజ్జుమావికెలనం దగు గండపుమ్రానికొమ్మలన్." విప్ర. ౩, ఆ. ౫.

గండపొడి. ద్వి. వి. (గండము+పొడి.) గంధచూర్ణము, బుక్కా. "సీ. బలుకప్పురంపుఁ దిప్పలు వితర్దులు గాఁగఁ బుప్పొడుల్ వలిగందపొడులు గాఁగ." రసిక. ౨, ఆ. ౧౪. ఆం. భా. ద్వి. ౧౬౨.

గండము. వై. వి. (సం. గంధః.) 1. చందనవృక్షము. "ద్వి. గండంపుఁగొమ్మలఁ గాలాహి చుట్టు, చందంబునను..." ద్వి. పరమ. ౪, ఆ. ౩౨౯. పుం. 2. చందనపుఁజెక్క మొ. అఱుగఁదీయఁగా వచ్చిన లేపనద్రవ్యము. "గీ. గంద మందంద డెందంబునందు నలఁది." విక్ర. ౪, ఆ. ౧౫౯; 3. సువాసన." ఉ...క్రొత్తకప్రపుం, గందముచందముం జెగడుఁ గస్నియ నెమ్మెయితావి..." నీలా. ౧, ఆ. ౫౮;4.సువాసన. ఆం. భా. ప్ర. ౧౦౬.

గండరగోళము = గండ్రగోళము. (బ్రా.)

గండవొడి = గండపొడి. "క. గండవొడిబరణి యొక్కతె,...వహించెన్." సాంబో. ౧, ఆ. ౧౮౩.

గందొడివాఁడు = గండోలిగాఁడు. "సీ. పూలగట్టు పాతానిబోడి కుంగర మిచ్చు గందొడివానికి విందు సేయు." హంస. ౫, ఆ. ౧౩౪.

గండ్రగోళము. దే. వి. అల్లరి, గొడవ. (బ్రా. వా.)

గంధకము. సం. వి. అ. పుం. ఒకానొకయుపధాతువు.

గంధకారి. సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుఁదామర♣. విణ. (న్. జీ. న్.) బుక్కావాఁడు. "వ... ఆంధ్రదేశీయు లగుగంధకారులు...ఆమ వారిపైఁ జల్లఁగా..." ఆము. ౪, ఆ. ౩౫.

గంధకారిక. సం. వి. ఆ. స్త్రీ. సైరంధ్రి, సువాసన ద్రవ్యముల నాయత్తపఱుచుస్త్రీ.

గంధకుటి. సం. వి. ఈ. స్త్రీ. మురయనుగంధ ద్రవ్యము♣.

గంధగజము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

గంధఘూళి. సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి.

గంధనము. సం. వి. అ. న. 1. ఉత్సాహపెట్టుట; 2. ప్రకటించుట; 3. వెలిఁగించుట; 5. నొప్పించుట; 6. నలుఁగుపెట్టుట; 7. సూచించుట.

గంధనాకులి. సం. వి. ఈ. స్త్రీ. సన్నాత్తి♣.

గంధపుష్పము. సం. వి. అ. పుం. 1. మొగలి♣; 2. ప్రబ్బ♣; 3. బిరిగి♣; 4. అంకోలము♣.

గంధఫలి సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రేంకణము♣; 2. సంపంగిమొగ్గ. "శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మేలా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపం బూని..." వసు. ౨, ఆ. ౪౭.

గంధమాదనము. సం. వి. అ. పుం. 1. పెద్దనల్లతుమ్మెద; 2. గంధకము. పుం. న. పర్వతవిశేషము. న. గంధ

మాదనపర్వతమందలియడవి. విశే. (అ. ఈ. అ.) సుగంధముచేఁ బరవశమైనది.

గంధము. సం. వి. అ. పుం. 1. సువాసన; 2. వాసన; 3. లేశము; 4. గంధకము; 5. చందనాదిలేపన ద్రవ్యము; 6. సంబంధము; 7. గర్వము.

గంధమూలము. సం. వి. అ. పుం. కులంజనము॰.

గంధమూలి. సం. వి. ఈ. స్త్రీ. గంట్లకచోరము॰.

గంధమూషి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు.

గంధమూషికము. సం. వి. అ. పుం. చుంచు.

గంధమృగము. సం. వి. అ. పుం. 1. పునుఁగుపిల్లి; 2. కస్తూరీమృగము. [విశేషము.

గంధరసము. సం. వి. ఈ. స్త్రీ. గోపము, ఉపధాతు

గంధరాజము. సం. వి. అ. పుం. 1. జవాది యను గంధద్రవ్యము॰. "సీ. ఘుమఘుమవత్సుమ గంధ రాజాంగమర్దనపైఁ జిరోష్ణమజ్జనము లాడి." ఆము. ౪, ఆ. ౧౩౬; 2. చందనపుమ్రాను.

గంధర్వనగరము. సం. వి. అ. పుం. 1. (దుఃఖాదులు లేక పరమసుఖద మైన) గంధర్వులపట్టణము. "ఆ. మఱియు నీగృహస్థమార్గంబునం జెల్ల,విషయముల ను బొంది విశ్వమెల్లఁ,గడఁకతోడ నిట్లు గంధర్వ నగరంబు,గాఁ దలంచి మిగుల మోద మందు." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౧౬౬; 2. భూమియం దెండమావులవలె నాకాశమునఁ దోఁచుమిథ్యానగ రము. "వ...గంధర్వనగరంబునుం బోలె స్వప్న లబ్ధమనోరథంబునుం బోనియర్థంబుఁ బాసి కానం బడుచు..." భాగ. ౬, స్కం. ౪౬౦.

గంధర్వము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. మగ కోయిల; 3. ఒకానొకమృగము; 4. మరణించిన తరువాతఁ దిరిగి జన్మించులోపున యాతనా శరీరము ధరించినప్రాణి.

గంధర్వహస్తము. సం. వి. అ. పు. ఆముదము॰.

గంధర్వుఁడు. సం. వి. అ. పుం. 1. దేవయోనివిశే షము; 2. గాయకుఁడు.

గంధవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. భూమి; 2. సత్యవతి. (వ్యాసునితల్లి.): 3. మద్యము; 4. అడవిమల్లె॰; 5. మురయనుగంధద్రవ్యము॰; 6. వాయుదేవుని నగరము.

గంధవహ. సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు. ఇట్టే: గంధవాహ.

గంధవహోయనము. సం. వి. అ. న. వాతాయనము, కిటికీ. (పురాంగనలు) "ఉ...గృహాంత చితగంధ వహోయనంబులకా, విష్ణుగ హత్తి యుఁన్..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౨౨.

గంధవహుఁడు. సం. వి. అ. పుం. వాయువు, గాలి. ఇట్టే: గంధవాహుఁడు.

గంధసరులు. మి. వి. బ. ధాన్యవిశేషము. "సీ. కస్తూరి పట్టెలు గంధసరులు." హంస, ౪, ఆ. ౧౨౮.

గంధసారము. సం. వి. అ. పుం. చందనము॰.

గంధాహువు. సం. వి. ఉ. పుం. చుంచు.

గంధాశ్మము. సం. వి. న్. పుం. గంధకము.

గంధించు. సం. అ. క్రి. పరిమళించు. "సీ. స్వాదించు మోదించు నీకునాలుకయందు గంధించి సొగయుం నీఘ్రాణమందు." చెన్న. సీ. ౨౮.

గంధికము. సం. వి. అ. పుం. గంధకము. విశే. (అ. ఆ. అ.) గంధముగలది.

గంధిని. సం. వి. ఈ. స్త్రీ. మురయను గంధద్రవ్యము॰.

గంధిలము. సం. వి. అ. పుం. వృద్ధజంబుకము, వరదు నక్క. (చూ. బ్రౌ.) విశే. (అ. ఆ. అ.) 1. పరిమళించునది. "సీ. దవగంధవహాబంధు దహ్య మానానేకకాళికాగురుధూపగంధిలంబు." రామా. ౨, ఆ. ౨౫; 2. విస్తరించునది. "ఉ. గంధిల పౌరుషప్రకటగౌరవ రాఘవ..." రామా. ౭, ఆ. ౮౯.

గంధోత్తమ. సం. వి. ఆ. స్త్రీ. 1. కణుఁదురీఁగ; 2. కచోరము॰.

గంప. దే. వి. (క. గంపె.) కండోలము, వెదురు మొ. వానితో నల్లినబుట్ట. ఆం. భా. ద్వి. ౨౪౦. ఆము. ౧, ఆ. ౭౫.

గంపపులుఁగు. దే. వి. (గంప+పులుఁగు.) కుక్కుభము, అడవికోడి. ఆం. భా. ద్వి. ౯౭.

గంబుర. వై. వి. (సం. కర్పూరః.) కప్పురము. "ఉ... తెలిగంబుర వెన్నెలలోనితేట..." శుక. ౧, ఆ. ౧౮౩. ఆం. భా. ద్వి. ౧౬౨.

గంబురము = గంబుర. ఆం. భా. ద్వి. ౧౬౨.

గంబురా = గంబుర. "సీ. గంబురా మించఁ గదం బించి కొందఱు కలికికన్నియలు బాగాలొసంగ." భాను. ౨, ఆ. (శ. ర.) శశాం. ౧, ఆ. ౧. ఆం. భా. ద్వి. ౧౬౨.

గంబూర = గంబుర. "క. గంబూర కులికి యనురా, గం బూర..." సా. ౨, ఆ. ౫౪. ఆము. ౨,ఆ. 3.

గంబూరము = గంబుర. "సీ. తావిగంబూరంపుదీవి నీమొగము..." వసు. ౬, ఆ. ౧౪.

గంబూరరాజనాలు. ద్వ. వి. బ. ధాన్యవిశేషము. "సీ...గంబూరరాజనాల్ కన్నెసరులు." హంస. ౪, ఆ. ౧౨౧.

గంభారి. సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడుచెట్టు.

గంభీరము. సం. వి. అ. పుం. 1. తామరచెట్టు; 2. నిమ్మచెట్టు. విణ. (అ. ఆ. అ.) 1. లోతుగలది; 2. గుట్టు గలది; 3. మంద్రము; 4. దురవగాహము.

గంభీరవేది. సం. వి. న్. పుం. తోలూడునట్లును నెత్తురు కాఱునట్లును గండ యూడునట్లును బరిగోలతో నంకుశముతో నెంత బాధించినను నొడలెఱుఁగనిమదగజము. (చిరకాలపరిచితం బగు శిక్షను దీర్ఘకాలమునకుఁ గాని తెలిసికొన లేని యేనుఁగని కొందఱు.)

గంభీరిమ. సం. వి. న్. పుం. గాంభీర్యము.

గంభీరిమము. సం. = గంభీరిమ.

గగనకుసుమము. సం. వి. అ. పుం. న. ఆకాశపుష్పము. (శూన్యార్థమునఁ బ్రయుక్తము.)

గగనము. సం. వి. అ. న. 1. ఆకాశము; 2. శూన్యము, సున్న. విణ. (అ. ఆ. అ.) దుర్లభము. (ఈయర్థమున వైకృత మని శ. ర. సూ. ని. కాని, వన పర్యాయ మగుగహనశబ్దము దుర్గమపర్యాయ మనుట యుక్తము. ఇది తెలుఁగుననే యీయర్థమునఁ బ్రయుక్తము.) "సీ. గగనఘంటాపథక్రమణశీలున కెంత గగన మయ్యె లతాంగికొనుఁ జదలు." వసు. 3, ఆ. ౯౯.

గగురు. దే. వి. భయసంతోషాదులచే మేనిపెండ్రుకలు నిక్కఁబొడుచుట, రోమాంచము. ఆం. భా. ద్వి. ప్ర. ౧౪౧.

గగురుపడు. ద్వ. అ. క్రి. (గగురు+పడు.) రోమాంచమగు. (చూ. గగురుపాటు.)

గగురుపాటు. ద్వ. వి. (గగురుపడు. ధా.) రోమాంచము. "గీ. గగురుపాటును వణఁకును గానిపింప." ఉ. రా. ౧, ఆ. ౨౨౧. ఇట్లే: గగుర్పాటు. ఉ. రా. ౧, ఆ. ౧3౬.

గగురుపాఱు. దే. అ. క్రి. (గగురు+పాఱు.) రోమాంచము కలదగు. ఇట్లే; గగుర్పాఱు. "మ. కమలాకామినిపాణిపంకజము సోఁకక మే గగుర్పాఱు..." ఉ. రా. ౮, ఆ. 3౧౧.

గగురుపు. దే. వి. రోమాంచము. ఇట్లే: గగుర్పు. "ఉ. గుప్పున కప్పు దప్పడఁతిగుబ్బలు మించెఁ గగుర్పు కూర్పునన్." చంద్రా. ౬, ఆ. ౧౪౨.

గగురుపొడమించు. దే. స. క్రి. (గగురుపొడము ధా. ప్రే.) రోమాంచము గలిగించు. ఇట్లే: గగుర్పొడమించు. "చ...,కుటిలతదాల్చుబోఁగిని గగుర్పొడమించుచు..." పాండు. ౪, ఆ. ౪౧.

గగురుపొడము. దే. అ. క్రి. (గగురు+పొడము.) రోమాంచితమగు. (చూ. గగురుపొడమించు.)

గగురుపొడుచు. దే. అ. క్రి. (గగురు+పొడుచు.) రోమాంచితమగు. "గీ. క్రైదువలు విడిచి యొడళ్లు గగురుపొడువ." ఉ. హరి. ౧, ఆ. ౪౧. ఇట్లే: గగుర్పొడుచు. "ఉ. గుబ్బమెఱుంగుజక్కవ గగుర్పొడువన్..." స్వా. ౨, ఆ. ౨౧.

గగురుపొడుపు. దే. వి. (గగురుపొడుచు. ధా.) రోమాంచము. ఇట్లే: గగుర్పొడుపు. "సీ...పూరి మోసులు గగుర్పొడుపు గాఁగ." అచ్చ. కిష్కిం. ౬౬.

గగ్గతిల్లు. దే. అ. క్రి. కంపించు. "గీ...నేల, గగ్గతిల్లంగ నిజపాదఘట్టనమున." సుద. ౫, ఆ. ౫౧.

గగ్గు. దే. అ. క్రి. సంకోచించు. (శ. ర.) వి. గద్గదిక, డగ్గుత్తిక. ఆం. భా. ప్ర. ౧౭౭.

గగ్గుఱు = గగురు. ఆం. భా. ప్ర. ౧౪౧.

గగ్గులకాడు. దే. వి. ఔ. (గగ్గులు+కాడు.) 1. ధాన్యము రాల్చినకంకులరాశి. (శ. ర.); 2. ధ్వంసము. "గీ. కలఁచి తెరలించి గగ్గులకాడు సేసి, సకలబలముల దెసలకు సరగఁ దెచ్చె." శ్రీరాధా. ౫, ఆ. ౭౦; 3. వల్లకాడు, శ్మశానము. "ఉ. దగ్గఱి యెవ్వఁడో కటకటా శివలింగము మీఁదిరత్నముల్, గగ్గులకాటఁ గల్పి మలుకంపలు తీపలు పెట్టె నేఁడు..." కాళ. ౨, ఆ. ౧౧౦; 4. పథము. ఆం. భా. తృ. ౧౨3. విణ. 1. చెల్లాచెదరైనది. "సీ...గగ్గులకాడైరి ఖచరవరులు." పారి. ౫, ఆ. 3౭; 2. కలఁగినది, క్షోభపడినది. "క. చదిపెం గాలుబలంబులఁ,గదిమెక్ గుఱ్ఱంబు

ప్రాఁజు గగ్గులకాడ్రై, చెదరంగ..." కాశి. ౨, ఆ. ౪౧; 3. చెదరఁగొట్టునది. "ఉ. సిగ్గునకుం బికావికలు చిత్తసమున్నతి పేరివార్తకున్, గగ్గులకాడ్డ... యథేష్టరహః ప్రసంగముల్." కవిక. 3, ఆ. ౨౯.

గగ్గులు. దే. వి. బ. గింజలురాల్చిన కంకులు. (శ. ర. బ్రా. చూ. గగ్గులకాడు. ౧ అర్థము.)

గగ్గెర. దే. వి. 1. వృక్షవిశేషము. (శ. ర.); 2. (సువాసన గలిగి పూజాద్రవ్య మగు) ఒకరకపు మొక్క. "గీ. దవనమును గగ్గెరయు బిల్వదళము లాది,యైనపూజార్హవస్తువు లపుడు దెచ్చి." ఉ. రా. 3, ఆ. ౨౦౧.

గగ్గోడు = గగ్గోలు. (చూ. గగ్గోడుపడు.)

గగ్గోడుపడు. ద్వి. అ. క్రి. (గగ్గోడు+పడు.) కలఁగు, క్షోభించు. "గీ. ఏడుతాళములును గగ్గోడు పడియెఁ, బెల్లగించి మహీధ్రంబు పెఱికినప్పుడు..." హర. ౬, ఆ. ౪౭.

గగ్గోలు. దే. వి. 1. క్షోభము. "గీ గొల్లవాడల నెల్ల గగ్గోలుపుట్టె." సీతా. 3, ఆ. ౫౫; 2. పెద్దగోడవ. "గీ. అపుడు కొందఱు మృగయు లయ్యడవిఁ దూఱి, ఘోరముగ నెల్లకడలఁ గగ్గోలు గాఁగఁ, గూఁత లిడి..." రసిక. ౧, ఆ. ౧౦౮. విశ. 1. అధికము. "ఉ...గ,గ్గోలుగ నుప్పతిల్లె బిగిగుబ్బలపైఁ బులకాంకురావళుల్." గంధ. ౭3; 2. ప్రియము. "క...గగ్గోలుగ న,న్నారిపుఁ బడుదు నని ఘనం బగుప్రేమన్." శుక. ౨, ఆ. ౨౧౫.

గగ్గోలుపడు. ద్వి. అ. క్రి. (గగ్గోలు+పడు.) 1. ప్రతిధ్వనించు. "గీ...చటులపటహ, ఘూర్ణిత ధ్వని దిశలు గగ్గోలుపడఁగ." కవిరా. 3, ఆ. ౧౪; 2. కలఁగు. "ద్వి. నే నొక్కరుండ నన్నిటఁ దో డొకరిఁ,గానక బెగడి నల్గడలు చూచుచును, బడలుచు గగ్గోలుపడి మొరటిలుచు." విష్ణు. పూ. 3, ఆ. (శ. ర.); 3. అధికమగు. "వ...నీలంపు నిగ్గులు గగ్గోలుపడుకొనపాదిరిం గౌఁగిలించిన పొగడగుంపులనట్టనడుమ..." కువల. ౪, ఆ. ౯౨.

గచ్చ. దే. వి. గ్రచ్చ, యను తీ♆. ఆం. భా. ద్వి. ౪౯.

గచ్చకాయలు. దే. వి. బ. గచ్చకాయలతో నాడు నాట, బాలక్రీడావిశేషము. "సీ. గచ్చకాయలు కెట్టు గానుఁగ త్రిప్పుట్ల..." హంస. 3, ఆ. ౧౪౬.

గచ్చు. దే. వి. 1. పూఁత. "సీ. పసిఁడిగచ్చుమరసోపానముల్..." ఆము. ౪, ఆ. ౫౮. చంద్రా. 3. ఆ. ౮3; 2. కాంతి. "ఉ. క్రాలెడుపచ్చ పట్టుతునుగచ్చుల క్రొమ్మెఱుఁ గైచలింప..." హరి. పూ. ౬. ఆ ౧౧౬; 3. ఇసుక సున్నము దంచి తయారుచేసినపదార్థము. గార. "సీ. గచ్చు చదురితదారుచక్రంపుబిళ్ల." స్వా. ౫, ఆ. ౫౦. విశ. 1. కపటము. "క...గచ్చుగ నిట్టనియె గోపకన్యక పలితోన్." హంస. ౨, ఆ ౧౨౪; 2. గ్రస్తము; కొత్తుమైనది. "ఆ. గచ్చు కొతుకు నా గ గ్రస్తాఖ్య ...సిల్లు." ఆ. భా. ప్ర. ౧౧౮. (బ్రా. శ. ర. పా.) బ. బీరములు. "సీ. గెలుపసిగాజుకు బుఱగచ్చులుతు మొంపు నెలమి వంక్యాళు మైత్ర నేచ్చ మొంపు." వేణు. ౧౭.

గచ్చుకొను దే. అ. క్రి. (గచ్చు+కొను.) పట్టుకొను, అంటియుండు. (శ. ర. బ్రా.)

గచ్చుతనము. దే. వి. (గచ్చు+తనము.) కాపట్యము, మోసము. (బ్రా.)

గచ్చులాఁడి. దే. విశ. (గచ్చులు+ఆఁడి) 1. మాయలాడి; దాంభికురాలు. (శ. ర. బ్రా.); 2. విలాసిని యగుస్త్రీ. "ఉ...ఇటు వచ్చిన యచ్చరగచ్చులాండ్రలో, నేరుచిరాంగి చక్కనిది..." అహ. ౧, ఆ. ౭౨.

గచ్చువిచ్చగు. దే. అ. క్రి. (గచ్చు+విచ్చు+అగు.) వికలమగు, చెడిపోవు. "గీ. గచ్చువిచ్చయ్యెఁ బారశీకవ్రజంబు." కృష్ణ 3, ఆ. 3౯. ఆం. శే. ౯.

గజత. సం. వి. ఆ. స్త్రీ. 1. గజసమూహము, ఏనుఁగులగుంపు; 2. గజత్వము, గజధర్మము.

గజపతిలాగీలు. మి. వి. బ. ధాన్యవిశేషము. "వ... కందర్పభోగులు గజపతిలాగీలు..." ప్రబంధ. ౧౧౨. [పిప్పలితీ♆.

గజపిప్పలి. సం. వి. స్త్రీ. ఈ. ఏనుఁగుపిప్పలి, పెద్ద

గజపుష్పము. సం. వి. అ. న. నాగకేసరపుపువ్వు. "వ. అని లక్ష్మణుని చేత నఱుతం గుఱుతుగా నొక గజపుష్పమాలికఁ గీలుకొలుపం గావించి..." రామా. ౫, ఆ. 3౧౧.

గజభక్ష్య. సం. వి. ఆ. స్త్రీ. సల్లకి, అందుగు♆.

గజము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2. ఎనిమిది సంఖ్య; 3. ముప్పదియాఱంగుళములు.

గజయాన. సం. వి. ఆ. స్త్రీ. 1. కరిగమన; 2. స్త్రీ.

గజాజీవుఁడు. సం. వి. అ. పుం. మావటీఁడు.

గజాననుఁడు. సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు.

గజాహ్వయము. సం. వి. అ. న. హస్తినాపురము.

గజి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు.

గజిబిజి. దే. వి. 1. కలవరము. "చ. గజిబిజి లేక యుబ్బక..." భార. భీష్మ. ౨, ఆ. ౩౩: 2. నిడుపు. "క...నిత్యమును హరిఁ, గజిబిజి లేక తలంచిన, సుజనులకును నతనియందుఁ జొరఁగా వచ్చున్." భాగ. ౧౨, స్కం. ౭; 3. తమకము. "వ...పరదేశం బాపోశనంబు గొనం దమకించుతనబలంబు గజిబిజి యుఁడిపికొని..." భార. విరా. ౩, ఆ. ౧౩౧; 4. గొడవ. "క... వి,గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్." భాగ. ౧, స్కం. ౪౩౭. శశాం. ౫, ఆ. ౧౨౭; 5. బాధ. "చ...,బే,రజపుల తాంకి బాణుఁడు కరిస్థికవల్లవఖడ్గధారచే, గజిబిజి చేసె నేవి మఱి కార్యము తప్పు నటంచు గొబ్బునన్." రాజ. చ. ౩, ఆ. ౮౩, 6. దైన్యము. "క. భుజగర్వ మడఁగఁ జుట్టిన, భుజగాస్త్రము ట్టు నట్టుఁ బొరలంబడినన్, గజిగజి లేదు మొగంబున, మఱ బాపురె వీనిఁ బోల మగలుం గలరే." ఉ. హరి. ౫, ఆ. ౨౭౦. విశే. 1. కలవరపడినవాఁడు. "క. గజిబిజియై సభాస్థలిఁ బ్రజ లెల్లను బొట్టివడుగు బాఁపనిరాకన్." భాగ. ౮, స్కం. ౫౩౪; 2. గాయపడ్డది. "సీ. ఈగుబ్బ లిఁకమీఁద నాగోటి కొనధాటి గదిసిన గజిబిజి గాక యున్నె." కువల. ౩, ఆ. ౫౪; 3. వ్యయమైనది. "క. పొలఁతుక నిజదయితునకై,కలమానధనంబు చాల గజిబిజిగాఁ దా,నిలుపడియును గులగలియును, దలఁపమియత్రపావినాశదశ యనఁ బరఁగున్." కావ్యా. ౨, ఆ. ౭౬.

గజిబిజించు. దే. అ. క్రి. 1. కలఁతపడు. "వ. అట్టియెడఁ దదీయసైన్యంబు గజిబిజించెఁ." ఉ. హరి. ౩, ఆ. ౭౮; 2. గడిబిడిచేయు. "ద్వి. భుజములు విచ్చుచుఁ బొంగుచుఁ దాను, గజిబిజింపుచుఁ జిట్టకంబులాడుచును." పండితా. పురా. ౩౩౯. పు. ద్వి. భాగ. ౩. ప్ర. ౫౧; 3. కోలాహలము చేయు. "ద్వి. క్రందును గ్రంమను గజిబిజింపంగ." పండితా. పర్వ. ౩౯౫. పు.

గజిబిజిపడు. ద్వ. అ. క్రి. (గజిబిజి+పడు.) కలఁతపడు. "క. గుజగుజలువోవువారును, గజిబిజిపడువారు..." భాగ. ౮. స్కం. ౫౩౪.

గజ్జి. వై. వి. (సం. కచ్ఛూః.) 1. తీఁటకుఱుపు. ఆం. భా. ద్వి. ౧౨౯; 2. చిన్నకుఱుపుల మొత్తము.

గజ్జిపట్టు. ద్వ. అ. క్రి. (గజ్జి+పట్టు.) చిన్న చిన్న తీఁట కుఱుపులుకలుగు. (బ్రౌ. వా.)

గజ్జియ. దే. వి. ఒకవిధమగుచిఱుగంట. "సీ. శ్రీ పాదములఁ బైఁడిచిఱుగజ్జియలతోడ తవణిల్లుగండపెండార మమర." కాశీ. ౩, ఆ. ౨౪౧.

గజ్జె = గజ్జియ. "ఉ. చక్రినితంబ్రి పాదజలజంబుల గజ్జెలు మ్రోయ..." ఉ. రా. ౧, ఆ. ౧౮౪. ఆం. భా. ద్వి. ౧౫౧.

గజ్జెగొలుసు. ద్వ. వి. (గజ్జె+గొలుసు.) స్త్రీపాదాభరణవిశేషము, పాఁజేబులు. (శ. ర. బ్రౌ.)

గజే. వై. విశే. (సం. గజః.) పెద్ద. (ఇది సమాసపూర్వపదముగనే యుండును.) ఉదా:— గజదొంగ, గజదొండ, గజనిమ్మ, గజయీఁత. మొ.

గజేగజే. దే. వి. వడఁకుటయం దగుధ్వని కనుకరణము. "ద్వి. కడు భయంబున వాఁడు గజగజ మేను వడఁక..." నవనాథ. ౩, ఆ. ౨౨౬. పు.౧౭ ప.

గజేదండ. ద్వ. వి. మల్లవిద్యావిశేషము. "వ...ఆవీరుఁడు గజదండ కుక్కుటపుదండ మొదలుగాఁ గలుపదిరెండుదండల యఖండపాండిత్యంబు..." హంస. ౧, ఆ. ౨౦౬.

గజేదొంగ. ద్వ. వి. (గజ+దొంగ.) పెద్దదొంగ, గొప్పదొంగ. (బ్రౌ. వా.)

గజేదొండ. ద్వ. వి. (గజే+దొండ.) పెద్దదొండచె. (వా.)

గజేనిమ్మ. ద్వ. వి. (గజే+నిమ్మ.) పెద్దనిమ్మచె. "రగడ. నెలకొనుచుఁ బ్రజలు గజనిమ్మలను నిమ్మలను." భాను. ౨, ఆ. ౬౮. ఆం. భా. ద్వి. ౪౨.

గజేబొంకు. ద్వ. వి. (గజ+బొంకు.) గొప్పయసత్యము, పచ్చియబద్ధము. "ఉ. చేరిక వీరబాహుని భజించుటచే గజబొంకు బొంకుటన్, సారము దూలె మున్నని..." సాంబో. ౧, ఆ. ౧౯.

గజేము. వై. వి. (సం. గజః. హిం. గజ్) ఇనుప యూఁచ, తుపాకిలో మందు దట్టించునినుప సలాక. (శ. ర. వా.)

గజేయీఁత. ద్వ. వి. (గజ+ఈఁత.) గొప్పయీఁత. (వా.) వాఁడు గజయీఁతగాఁడు.

గజ్జ. దే. వి. తొడసందు. "క. జలనిధులు జాను దఘ్నం,బులు గాఁ గులగిరులు గజ్జపొడువులు గా ..." భా. రా. సుం. ౩౦౮. పార్వ. ౫, ఆ. ౧౮౮.

గజ్జదుముకు. దే. వి. (గజ్జ+దుముకు.) మల్లవిద్యా విశేషము. "వ...లోవెలి గజ్జదుముకు చూరణ నఱుకు మొదలైన..." ప్రబంధ. ౭౮.

గజ్జా. వై. వి. (సం. కచ్ఛూః.) వి. 1. మదము. (చూ. గజ్జాపట్టు); 2. ఆధిక్యము. (చూ. గజ్జారేఁగు.)

గజ్జాగెలయు. ద్వ. అ. క్రి. (గజ్జా+కెలయు.) మదించు, పొగరెక్కు. "గీ. చిలుకజవరాలుగవి గజ్జాగెలసి మరుని, మర్మ ముద్ఘాటనము సేసి మలయుచోట." సాంబో. ౧, ఆ. ౧౭౭.

గజ్జాపట్టు. ద్వ. అ. క్రి. (గజ్జా+పట్టు.) "ద్వి. కర్మ జాడ్యము మాని గావింతురేని, మర్మంబుఁ జెప్పెద మఖ మొనర్చుటకు, గజ్జాకట్టిన యహంకారంబు పశువు, రజ్జావు వాయుపూరకమె యూపంబు, మనసు జ్ఞానమె యగ్ని..." ప్రభులిం. ౪, ఆ. ౧౩౫. పు. ౧౦ పం.

గజ్జూరము. వై. వి. (సం. ఖర్జూరః.) ఖర్జూరము. (శ. ర. బ్రా.)

గజ్జారేఁగు. ద్వ. అ. క్రి. (గజ్జా+రేఁగు.) మదించు. "గీ. జెల్లు శోభిల్లె మంకెన లుల్లసిల్లె, కాలకంధర వాహంబు గజ్జారేఁగె." పాండు ౪, ఆ. ౩౭.

గజ్జులాఁడు. ద్వ. వి. (గజ్జులు+ఆఁడు.) మదించిన వాఁడు, గర్వి. "వ. అని యర్జునుండు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున మొగ మడ్డంబు గదల్చి..." హర. ౭, ఆ. ౬౧.

గటక. దే. వి. 1. పిండితోఁ జేసినజావ. (శ. ర.) 2. లేపనార్థము నూఱి యుడికించినపిండి. (బ్రా.)

గట్ట. వై. వి. (సం. ఘట్టనా.) సీసనోటికి వేసి గట్టించెడ బిరడ. (శ. ర.)

గట్టన. వై. వి. (సం. ఘట్టనా.) గట్టించుట. (శ. ర.)

గట్టము. దే. విశ. గట్టిది. "చ. పరువులిడంగ నాత్మ ఖురపాతములం గనకాద్రి చెంగటన్, గర మప రంజిరా మొరసుగట్టపునేలలు చూర్ణితంబులై..." కవిక. ౨, ఆ. ౧౦౦.

గట్టి. దే. వి. 1. పొల్లు కానిగింజ. "గీ. మాగధాధమ బహుధాన్యమర్దనమున, కేను రోఁకలి నైకొంటి నిది నిజంబె, యింక మీలోన గట్టిపొల్లేర్పఱచి, చెరుగఁ జక్రంబె చాలదె శ్రీహరికిని." దశా. ౯, ఆ. ౫౦; 2. శౌర్యము. "ఉ. మందర రాజుఁ బుచ్చి బలముల్ గలయంబడి గోవ్రజంబులన్, దవపడిపెట్టకుండఁ బిఱుఁదన్ నడి పింపఁగఁ బంచి గట్టిమై, నందఱు నింతకున్ వెను కయై మొన లేర్చి..." భార. విరా. ౪, ఆ. ౧౮౪. ఆం. భా. ద్వి. ౨౨౧; 3. ధైర్యము. ఆం. సం. మాన. ౫౩; 4. బాలురు వ్రాసికొనుట్రాని పలకమీఁద బొగ్గుపొడి పసరు కలిపి పూయు పూఁత. "ఉ. దేవి తమోమషీరసము తేటఁ బొసంగఁగ గట్టి వెట్టి యం,శాపళి వ్రాయఁగాఁ దొడఁగె..." నైష. ౮, ఆ. ౧౭౦; 4. ఉండ. "సీ. హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కటి గాఁగఁ గరఁగినగట్టి యనఁగ...భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె." భార. విరా. ౨, ఆ. ౨౪౧. విశ. 1. దృఢము. "గీ. బద్ధ నీగట్టిహృదయసంపుటముఁ దాఁకి, కుంఠితము లయ్యె మరునంపకోల లెల్ల." నైష. ౮, ఆ. ౧౩౯. ఆం. భా. తృ. ౨౩; 2 అధికము. "గీ. అట్టిశ్రీపర్వతముఁ జూచి నట్టివారు, గట్టిపుణ్యంబుఁ జేసినయట్టివారు." విక్ర. ౧, ఆ. ౧౯౭; 3. నిశ్చితము, తప్పనిది. "ఆ. ఇకనికడుపు వ్రచ్చి యిం డిప్డు రత్నంబుఁ,గాంచిరేని తనదు కడుపు వ్రత్తు,రుఱక చంపి పోదు రూరక విడు వరు, కడుపు వ్రచ్చు టెట్లు గట్టి తనకు." కేయూర. ౩, ఆ. ౩౩౧; 4. దిట్ట. "సీ. వేద శాస్త్రంబులు వెదకి గానఁగ లేనిగట్టి వ్రేతలతోలఁ గట్టుపడియె." భాగ. ౧౦, స్కం. ఉ. ౬౯౦; 5. సాంద్రమైనది, గుల్లకానిది. "గీ...గట్టిపరహా..." శుక. ౩, ఆ. ౫౧.

గట్టిగా. క్రి. విశ. ద్రు. (ఇది వ్రాస్యాంతముగఁ గూడ నుండును.) కఠినముగా. "ఉ. గట్టిగ నుండుకొండ లును..." సీలా. ౨, ఆ. ౬౩; 2. బిగువుగా. "క. అని పొగడుచు నొయ్యారపు, టనువున

జడ లల్లి జిలుఁగు లగుపయ్యెదలు,జముకట్టు గట్టి గట్టిగ..." ప్రా. ౩, ఆ. ౪౩; 3. శ్రద్ధతో, సావధానముగా. "క..., చెప్పినను నొక్కటిగా నొసరించి గట్టిగా వినుమదిపా." పాండు. ౫. ఆ. ౫౦; 4. ప్రాకటముగా. "క. ఇట్టివిధంబులు ముట్టిపడి, చెట్టన కదమ్మునఁ గొక్కెరల యట్టె నెలక్, గట్టిగఁ బాఱెం దెలుపను..." వి. పు. ౧. ఆ. ౫౨; 5. స్పష్టముగా. "ఉ...వంశ మెల్లఁ బ్రాక్తన్వుసీమచర్య నని చాతపడం తియె యూరలిచ్చి స్వాస్థ్యమున వచ్చి తావక గుణంబులు చూచినయట్ల గట్టిగన్." కళా. ౪, ఆ. ౧౭౭; 6. బాగుగా అనుకట్టు. "సీ. హీర కుట్టిమభూము లిసుకనేల లటంచు గట్టిగా నడుగులు పెట్ట వెఱచు." దశా. ౧, ఆ. ౨౬౨; 7. నిశ్చలముగా. "క. తగ మేహాసంబుపై స్వ్యగ్ఘ మిడి దాశిపైఁ దనుర్యాం బిడి గట్టిగఁ గూర్చుండుట యోగభద్రగణా మోక్షసహాఖ్యమై పెంపొందున్." కళా. ౫, ఆ. ౧౬౫; 8. రూక్షముగా. ఉదా:—వస్త్రము గట్టిగా వచ్చినది; 9. బిగ్గరగా. ఉదా:—గట్టిగా మాటాడనిచో నాకు వినఁబడదు.

గట్టించు. వై. స. క్రి. (సం. ఘట్టనమ్.) గట్టన చేయు. "సీ. గంధపుఁబొడి పైచి గట్టించి యందుపై నెలకొలఁ గట్టిననెలవులందు." య. ౫, ఆ. ౯౮.

గట్టిచేయు. ద్వ. స. క్రి. (గట్టి+చేయు.) 1. దృఢపఱచు. వా:—నీ పన్నమాట గట్టిచేయుము. (వ్రా.); 2. గట్టితనము గలిగించు. (వా.)

గట్టితనము. దే. వి. (గట్టి+తనము.) 1. బిగువు, జిగి. "ఉ. శ్రీలలితాంబు సాధునయశీలగుణాంబును జారుపావనే, బాలపసంబుఁ జన్నుఁగవగట్టితనంబు వితంబతోఁపయున్..." వల్హా. ౧, ఆ. ౧, దశా ౫, అ. ౬. ౭, 2. దృఢత్వము. వ్యవ:—ఇనుమునకుఁ గలగట్టితన మిత్తడి కుండదు.

గట్టితబోడి. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. చిడుగుడుప్వలపోటి చెండు గట్టితబోడి యల్లి యుప్పనఁ బట్టెవుష్పళాలు." శశ. ౩.ఆ. ౩౩. ప్రబంధ.౬౧౩.

గట్టిపాఱు. దే. అ. క్రి. (గట్టి+పాఱు.) బలపడు, బెదరుతీఱు. "గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి, కాకలను దేఱి గడిమీఱి గట్టిపాఱి, రాలుగాయతనాన చేరజపుదారి..." హంస. ౫, ఆ. ౧౧౦.

గట్టిల్లు. వై. అ. క్రి. (సం. ఘట్) సంభవించు, కలుగు. "ద్వి. సెట్టికి. గర్భంబు లిట్టు దేవరకు, గట్టిల్లె నింతియ..." బస. ౪, ఆ. ౬౪౩.

గట్టివ. ద్వ. విశే. (గట్టి+వా.) ధూర్తుఁడు. "ఉ. గట్టివ చేతఃగుం బసలుఁ గల్లతనంబులు..." పారి. ౧, ఆ. ౧౨౭.

గట్టివా. ద్వ. వి. ధూర్తస్త్రీ. ఆం. భా. ద్వి. ౧౧౭. విశే. 1. మాటకారి. "గీ. గట్టివా యొక్కతె సహస్రకరునిమీఁదఁ, దఱచు గాల్కొనుపైపా తమము నించి, దలఁప నిది యొక్కటియు యయుక్తం బటంచు, విభుఁడు చిఱునవ్వు నవ్వ నవ్వించె సఖుల." ఉ. రా. ౩, ఆ. ౨౧౫; 2. ధూర్తురాలు. "మ...లోఁ దాల్మి యూఁదనిఁ బాడం బులకాంకురంబు లొనగూడం గట్టివా యింతి పైచని యువ్వాకిటి కడ్డమై నిలిచి కౌఁతుం బట్టఁగాఁ బోయినన్." సా. ౨, ఆ. ౯౩. అచ్చ. అయో. ౭౨; 3. పరుషవాక్కు గలది. "గీ. తవిలి పలుమఱుఁ జెవులు చీఁదఱగొనంగ. బిట్టు మొరసెడు వస త్రాగినట్టు లిట్టి, గట్టివాజాడ లెట్టుగాఁ బట్టువడియె". నీలా. ౩, ఆ. ౨౯; 4. దుష్టుఁడు. "దండకము...బిట్టు దట్టింపుచుం జెట్టలం బెట్టు బల్గట్టివారక్కస స్వక్కసంబైన పేరుక్కుతో నుక్కుగంబంబునం బట్టి గట్టింపవా..." అచ్చ. యు. ౧౬౧; 5 దిట్టఁడు. "సీ పెనుఁబాఁపపేరు వేసినగట్టివాసుంభిదైత్యావరోధ వైధవ్యదాయి." వరాహ. ౬, ఆ. ౪౯.

గట్టివాఁడు. ద్వ. వి. దిట్ట. ఉదా:—వాఁడు వేదవేదాంగములఁ జాల గట్టివాఁడు.

గట్టివాతనము. ద్వ. వి. (గట్టివా+తనము.) గయ్యాళితనము. "వ. వెంటనంట వచ్చునిజచ్ఛాయలం గని తమ్ము నంతనంతఁ జూపెట్టుక వచ్చునొంటని తమ్మికంటు లని యప్పట్టున గట్టివాతనంబులు గను పట్టఁ దమనేరమి వారిపై నారోపించి..." చంద్రా. ౫, ఆ. ౬౩.

గట్టివాయి = గట్టివా. వి. (ధూర్తురాలు.) "క. వంచాడించక తాలిమి, డించక బిగు వెడలి దల్ల

డించక మదిలోఁ, నించుక యైనను దాఁ జలి, యించక యాగట్టివాయి యిట్టని పలికెన్." సా. ౩, ఆ. ౨౦౬. ఆం. సం. మాన. ౪. సాం. ని. మ న. ౫౯.

గట్టివాయితనము. ద్వ. వి. (గట్టివాయి+తనము.) ధార్ష్ట్యము. "తే. సగము ముడిచిన వేణికా స్తబక మొక్క,-చేత ధరియించి చనుదెంచెఁ జెలువ యొర్తు, ఫణిఫణాగ్రాహి కేకిడింభంబుఁ గదిసి, గట్టి వాయితనంబునఁ బట్టె ననఁగ." సుద. ౫,ఆ.౧౩౩.

గట్టివాలు. దే. వి. 1. సైరంధ్రి, పరులయింటియం దుండి గంధపుష్పాదులచే నలంకరించుచు స్వతంత్రముగా నుండుస్త్రీ. "సీ. గట్టివాలై లక్ష్మి కై సేయుచున్నది చేరి యంతఃపురస్త్రీజనములు." కాశీ. ౭. ఆ. ౫౭; 2. గంధపుష్పాదుల నమ్ము స్త్రీ. "గీ. ఏకజాతిసుమంబు లనేకజాతి, కలికసుమనః కదంబమ్ము గా నొనర్చి, వలచి తరిలేపు పుట్టించి విలుతు రక్తి. గట్టివాలుపడంతు లప్పట్టణమున." తపతీ. ౧, ఆ. ౬౧. ఆము. ౨, ఆ. ౨౩.

గట్టివైసు. ద్వ. వి. ప్రౌఢతనము. (చూ. గట్టివైసుది.)

గట్టివైసుది. ద్వ. విశే. (గట్టివైసు+అది.) ప్రౌఢ. సాం. ని. మాన. ౧౩.

గట్టు. వై. వి. (సం. ఘట్టః.) 1. పర్వతము,కొండ. "ఆ. గాడ్పువేల్పుపట్టి గట్టెక్కి యుక్కునఁ, జూచె నూటి నేటిజోటిమగని,భావిసేతు వచ్చుపడ..." రామా. ౬. ఆ. ౯౨. ఆం. భా. తృ. ౫౩; 2. తీరము, ఒడ్డు. ఆం. భా. తృ. ౫౩.

గట్టుఁద్రిమ్మరి. ద్వ. వి. (గట్టు+త్రిమ్మరి.) వానరము, కోఁతి. "క...చీర మ్మొదవఁగ నర్గంటుం ద్రిమ్మరి మొనగానిఁ బట్టి తెచ్చెద నెలమిన్." అచ్చ. సుం. ౧౨౮.

గట్టుతాలుపు. ద్వ. వి. (గట్టు+తాలుపు.) నగధరుఁడు, విష్ణువు. "సీ. మశకపంక్తులయట్టు మార్తురుద్ధతిఁ జూపగట్టుతాలుపుచెట్టు బెట్టుఁ జెండె,మకరమై ఖరి వైరినికరంబు చెలరేఁగ వనజనాభుఁడు వార్ధిపహిపహించె." ఉ. రా. ౨, ఆ. ౫౦.

గట్టుదాయ. ద్వ. వి. (గట్టు+దాయ.) నగవైరి, ఇంద్రుఁడు. "గీ. బమ్మయ మ్మెచ్చి యజ్ఞగబంటు మీఁద, వైవనది సంపఁ జాలక వానిఁ గదియఁ, గట్టి వైచిన మే నల్లఁ బట్టి వైచి, తండ్రికడ నిల్పె నగ్గట్టుదాయపహాఁడు." అచ్చ. సుం. ౧౩౭. (గట్టుదాయపహాఁడు = ఇంద్రజిత్తు.)

గట్టుపట్టి. ద్వ. వి. (గట్టు+పట్టి.) 1. మైనాకుఁడు. "సీ. గట్టుపట్టిని బెట్టుపట్టి పట్టుచ తేరి కట్టికెట్టిని గ్రోలు కిట్టతపము" అచలా. ౩. ఆ. ౪౧; 2. పార్వతి. "సీ. కలశపారావార కన్యకామణి వాఁగఁ గమ్మిమ్మి వసించుగట్టుపట్టి." వరాహ. ౯, ఆ. ౫౯.

గట్టురాచమూలి. ద్వ. వి. (గట్టు+రాచ+మూలి.) 1. పార్వతి. "పండఁము...శశిశిల్లాలపై యున్న యాగట్టురాచమూలివి స్నిపకానే..." రాజ. చ. ౨, ఆ. ౭౯; 2 మైనాకుఁడు. (బ్రా.) ఇత్తి: గట్టురాపట్టివెం.

గట్టురాజేల్లుఁడు. ద్వ. వి. (గట్టు+రాజు+అల్లుఁడు.) శివుఁడు. "ఉ...గట్టు రాజల్లుఁడు వింటిసేన్పున సమంచితయానము నందుచుండమా,పల్లుఁడు..." రామా. ౧, ఆ. ౪౩.

గట్టురాజు. ద్వ. వి. (గట్టు+రాజు.) హిమవంతుఁడు. (చూ. గట్టురాజల్లుఁడు.)

గట్టులయేకిమీఁడు. ద్వ. వి. (గట్టులు+ఏకిమీఁడు.) హిమవంతుఁడు. రామ. ౨౧౩.

గట్టులరాముఁడు = గట్టులయేకిమీఁడు. సాం.ని. స్థా. ౫౫.

గట్టులతేఁడు = గట్టులయేకిమీఁడు. (శ. ర. బ్రా.)

గట్టువాలు. దే. వి. సైరంధ్రి. (పర్వతములపై చరించునది. అనఁగా పరపురుషసాంగత్యముఁ గోరునది.) "మ. రా జెలమికై దెచ్చినగట్టువా లిది యనన్..." హరి. పూ. ౯, ఆ. ౨౯. "ఆ. ఏను గట్టి వాలుదాన." భార. విరా. ౧, ఆ. ౨౯౭.

గట్టువిలుకాఁడు. ద్వ. వి. (గట్టు+విలు+కాఁడు.) శివుఁడు. అచ్చ. సుం. ౧౫౭.

గట్టువిలుతుఁడు = గట్టువిలుకాఁడు. ఆం. సం. దేవ.౬.

గట్రాచూలి = గట్టురాచూలి. "శా...చుట్రా నిల్తురు గాక నన్ను సమరక్షోణిఁ విజృంభించి యాగట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారంబు వారించెదన్." జై. ౬, ఆ. ౯౭.

గట్లగొంగ. దే. వి. దేవేంద్రుఁడు. "సీ...కొంగ వాలున గట్లగొంగ గెలిచి." అచ్చ. యు. ౪౭౪

గట్లజేనిబిడ్డ = గట్టురాచూలి. ఆం. భా. ద్వి. ౪౧.

గట్లుహూడు. దే. వి. దేవేంద్రుడు. (చూ. గట్లుగొంగ.)

గడ. యు. దే. ప్ర. చేర్చికలకంటె వచ్చునొకా నొక కృత్యక్రియము. (చూ. అత్తుగడ, చేరుగడ; మొ.) వై. వి. (సం. కాండః. క. గడె.) 1. చెఱకుగడ మొదలగు నిడుపాటికోల. "సీ. కమలపుష్పాళంబు గాలాప్రుద్రాముగాఁ గాండగ్ర దండంబు గడయుఁ గాఁగ." ఉ. సం. ౧౦, ఆ. ౫౩౫. ఆం. భా. ద్వి. ౭౫; 2. ఓడకంబము. "క. గడకట్టి యోడఁ బఱిచి..." శివయోగసారము ౨, ఆ. (శ. ర.) 3. యుద్ధసాధనవిశేషము. "సీ. వెనుపపాదల్ పేర్చువిధముగఁ గనిపించుగడల పోజులు సమగ్రముగఁ గూడి." విజ. 3, ఆ. ౧౫౨. సా. ౨, ఆ. ౧౯౦; 4. కంబమువంటిచెట్టు యొక్క అడుగుభాగము. "సీ. పరిభూతబిసపద్మ భాతులు చేతులు కదళికాయుగళంబు గడలు తొడలు." భా. రా. సుం. ౧౫౩; 5. (సం. ఘటా ప్రా. ఘడా.) సమూహము. "సీ. మక్కువఁ దేఁకువ దక్కి లోదవిలి యాడెదుచక్రవాకపు గడలతోడ." నిర్వ. ౭, ఆ. ౫౩.

గడగట్టు. దే. అ. క్రి. (గడ+కట్టు) ప్రతిష్ఠించు; నిర్ధారణచేయు. "ఉ...రామమూర్తికిన్, రెండవ సాటిదైవ మిఁక లేఁ డనుచున్ గడగట్టి... చాటెదను..." దాశ. శ. ౩౮.

గడగడ. దే. వి. (త. కడకడప్పు.) వణఁకుట, వెడలుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. "క. గడగడ వడఁకెడుమేన, న్నిడుమెండ్రుక పెట్టి..." ఉ. హరి. ౬, ఆ. ౯౬. "ద్వి. కూటమి నొకజోడుకోడెలై యున్న, నాఁటిసఖ్యము మది నాటి ప్రేరేఁప, గడగడ వసుదేవుకడ కేఁగె నతఁడు." అ. మ. క. ౧, ఆ. ౨౬ పు. (వడిగా వెడలు అని భావము.)

గడగడపడు. ద్వ. అ. క్రి. (గడగడ+పడు) వణఁకు. (చూ. గడగడపఱచు.)

గడగడపఱచు. ద్వ. స. క్రి. (గడగడపడు ధా. ప్రే.) వణఁకించు, భియపెట్టు. "ద్వి. కనకరేఖాకాంతి గడగడపఱచు, తనువల్లికయు వీణఁ దలపించు వెలుఁగు." రం. రా. ఉ ౭౦, పు. ౭ పం. (ఇట ఓడించు నను నర్థముతో నౌపమ్యముఁ దెలుపును.)

గడగడలాడు. దే. అ. క్రి. (గడగడలు+ఆడు) వడఁకు, భయపడు, వ్యవ— వాఁడు నన్నుఁ జూచి గడగడలాడును.

గడచీల. ద్వ. వి. పితపుబానయందమర్చి యుండెడు దండెపుఁబీఁటలు దగుల్చుటకు గడతల నుండెడు చీల. (శ. ర.)

గడన. వై. వి (సం ఘటనా) 1. సంపాదనము. "క. గడనగలమగని జూచిన నడుగులకును మడుఁగు లిడుదు రతివలు..." సు. శ. ౪౩. వైజ. ౨, ఆ. ౩౦; 2. ఎన్నిక (సం. గణనా.) "సీ. లక్షించి మలయశైలమ్ముఁ దేఁ డని కాని గంధసారమునకు గడన లేదు. వై. ౫, ఆ. ౧౬౭; 3. స్తోత్రము. "ఆ....ఎనయఁ జేతిసాకెఁ గొని ప్రేసెఁ బతి పేడి, గడన యుడుగు మన్న నుడుగ వసుచు." భార. విరా. ౫, ఆ. ౨౫౯; 4. దొంగవేపు. ఆం. భా. తృ. ౩౫.

గడనకత్తె. వై. వి. (గడన+కత్తె.) వేశ్య. (శ. ర.)

గడనచేడియ. వై. వి. (గడన+చేడియ) వేశ్య. "గీ...గడనచేడియ లాడికెల్ గాణ లొజ్జ, బాఁపనయ్యలు దీర్పరుల్ బలసి కొలువ." నీలా. ౨, ఆ. ౪౯.

గడనపడఁతి. ద్వ. వి. భోగముది, వేశ్య.

గడనపడఁతుక = గడనపడఁతి. వేంక. మాన. ౩౬.

గడనము. వై. వి. (సం. ఘటా) సమూహము. "క. పిడుఁగు లయి తాఁకు నలుగడ, జడనిధులై ముంచు గోత్రశైలములై పై, పడుఁ జదియఁగారుమొగుళుల, గడనములై చుట్టుఁ బన్నగములై కప్పున్." కు. సం. ౧౨, ఆ. ౧౮౪.

గడప. దే. వి. దేహళి. ద్వారముయొక్క క్రిందికమ్మి. ఆం. భా. ద్వి. ౧౫.

గడబడ. దే. వి. (హిం. గడ్‌బిడ్.) 1. అల్లరి. (శ. ర.); 2. తొందర; బాధ. (బ్రౌ.)

గడబిడ = గడబడ. (వా.)

గడమంచె = గడవంచె. (వా.)

గడము. ఉభ. దే. వి. కుండలోనగువానిమూఁత. ఆం. భా. ప్ర. ౭౬. సం. వి. అ. పుం. 1. గండెచేఁప; 2. విఘ్నము; 3. తెర; 4. కంచె; 5. అగడ్త; 6. ఒకానొకదేశము.

గడలవణము. సం. వి. అ. న. గడదేశమందు పుట్టిన జాతియుప్పు.

గడవంచె. దే. వి. (హిం. ఘరోంచి.) మూటలు మున్నగునవి పెట్టుటకై కొంచె మెత్తగా నుండు నట్లు కో ల్లమర్చినబల్ల. (వా.)

గడసాధన. వై. వి. సాము, వ్యాయామము. (శ. ర.)

గడసియ = గడసె. (శ. ర.)

గడసిల్లు. దే. అ. క్రి. సమమగు. "సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింతు లింకించె గంభీరహుంకార గర్జనమున, గడసిల్లుధర యొద్దగెడవైన నెవ్వాఁడు త్రాసుమైఁ గట్టచందమున వంచె." భీమ. ౨, ఆ. ౯౯.

గడసె. దే. వి. ఆటుక. (శ. ర.)

గడి. ఉభ. దే. వి. 1. ఎల్ల, పొలిమేర. "క. పరఁగును నచ్చుట వాహిని, విరజ యనఁగ మిగుల నొకటి విమలామృతని, ర్భరపూర్ణ యగుచు నది గడి, పరమపదమునకు భవప్రపంచంబునకున్." పరమ. ౧, ఆ. ౨౪. ఆం. భా. ద్వి. ౨౪; 2. అంతు, మేర. "చ. ఎదిరిన యోబళౌరినరసేంద్రునికీర్తి నిజాంశుపంక్తికిన్, మదనవిరోధి భీతుఁడయి మార్కొన కేఁగినఁ దద్రథాంబుఁ, దత్సదనము నాక్రమించి రభసంబున నావృషభాధిపధ్వజున్, వెదకఁజుమీ యజాండముల పే వెదలెన్ గడి లేని యీసునన్." నరస. ౪, ఆ. ౬౯; 3. చదరంగపుబల్ల మున్నగువానిమీఁద గీచినయిల్లు. ఉదా:— చదరంగపుగడి; 4. సమీపము. "క. తరుగుల్మాదుల మఱువునఁ, దరతరమ చలించి గడికిఁ దారుచుఁ బురసంహారు నెయిదఁ జొచ్చెఁ గాముఁడు..." కు. సం. ౯, ఆ. ౧౪; 5. కుంపటి మున్నగు వానిమూఁత. ఆం. భా. ప్ర. ౯౬; 6. మర్యాద. "గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి పఱలఁ బెరిఁగి, కాకలనుదేఱి గడి మీఱి గట్టుపాఱి, రాలుగాయతనాన బేరజపుదారి. నారితేఱియుం బలుగుంటమారి యయ్యె." హంస. ౯, ఆ. ౧౧౦. వేంక. మాన. ౪౩; 7. రెండు రెండుపశువుల కొక్కొక్కకాలు చేర్చి వేయు బంధము. (చూ. గడిత్రాడు.); 8. కోట. "క. ఆబొబ్బిలిగడిపై తెఱఁగా బురుజులపై నెసంగు నాగ్నేయకళా, తీబదయోమయ మైనయు, రాబాసోంపన్న నెన్నరా దెవ్వరికిన్." రంగా. ౨. ఆ. ౨౭. పం. వి. ఇ. పుం. గిత్త, కోడెమాడ.

గడించు. వై. స. క్రి. 1. సంపాదించు. "చ. పుడమి సమస్తవర్ణములపొల్తులు నీలువు దప్పి లంజెలై, పడిచి గడింతు రర్థములు..." వరాహ. ౮, ఆ. ౧౨౬. ద్వి. హరిశ్చ. ఉ. ౮౮౮. పం; 2. కల్పించు. "మ...దో,సముసు మ్మొందు నిరాపనిందలు గడించన్..." సా. ౩, ఆ. ౧౨. కళా. ౯. ఆ. ౩౮; 3. నాటించు, లక్ష్యమొనర్చు. "క. వెడదెరువు లిచటఁ జెల్లవు, పుడమి నహాదొంగ లానపాడిచినఁ గోకల్, విడుతురె గడింతునే యొక్కఁడి గతిమాలిన పిశాచికవో నీ మాటల్." కళా. ౩, ఆ. ౧౮౩. ఇట్లే; గడియించు.

గడికట్టు. దే. అ. క్రి. ఆఱితేఱు. వ్యవ.—ఆపిల్ల వాఁడు అప్పుడే గడికట్టినాఁడు.

గడికాల్లువేయు. దే. స. క్రి. రెండురెండుపశువుల నొక్కొక్కకాలు చేర్చి బంధము వేయు. ఉదా. ఆవులను షాలములో గడికాల్లువేసిరా? (శ. ర.)

గడితపడు. వై. అ. క్రి. (గడితము+పడు) గట్టిపడు. "గీ...వలరాచ మేపుడుకఁటివేల్పు, జడలలోనుండి వడియుచు గడితపడిన, లేటవేలుపుటేటి పెన్నిటిబొట్టులనఁగఁ జుక్కలు కనుపట్టె..." య. ౨, ఆ. ౭౧.

గడితము. వై. వి. (సం. ఘటితమ్.) 1. తఱచు, బాహుళ్యము. "క. మిడుతల గడితము తోలు కరి, పిడుగుల బెడిదంబు చిలుఁవపిండులవడియున్." అచ్చ. యు. ౩౨౯; 2. మోటుఁదనము. (శ. ర.); 3. చిక్కన. "క. పడఁతుక యొక్కతె పోఁగుల, గడితము గలచల్వవల్వఁ గైకొని..." పార్వ. ౯, ఆ. ౧౨౮. విశే. 1. "సీ. పచ్చియేనికతోలు పచ్చడంబుఁ ద్యజించి గడితంపుఁబట్టుపచ్చడము గట్టు." హర. ౯, ఆ. ౯. హరి. ఉ. ౭, ఆ. ౨౧౩; 2. సాంద్రము, చిక్కనిది. "సీ. కుందబొజ్జలక్రింద ద్రిండుగా బిగియించి గడితంపుమడుఁగులు గట్టినారు." శైవ. ౭, ఆ. ౬౩. రసిక. ౯, ఆ. ౧౩౩; 3 అధికము. "క...గడితపు, వలవంతం జెంది కుందవలదు నృపాలా." రసిక. ౩, ఆ. ౧౯౧. రసిక. ౧, ఆ. ౨.

గడిత్రాడు. దే. వి. జా. (గడి+త్రాడు.) రెండు రెండుపశువుల నొక్కొకకాలు చేర్చి బంధము వేయుపలుపు. (శ. ర.)

గడిదల. దే. వి. ఆయుధవిశేషము. "క... శూలిరి గడిదలలు దాఁకి కుంభినిమీఁదన్." కు. సం. ౧౧, ఆ. ౧౨౬. ప్రబంధ. ౭౭౮.

గడిచేయు. దే. అ. క్రి. (గడి+చేయు.) ఆరితేఱు నిపుణుఁడగు. "చ...మిక్కిలిన్, దెగువరికంతు కేళి గడిచేసినజాణ..." నిరం. ౨, ఆ. ౩౫. ఆం. శే. ౩౫.

గడిదొంగ. దే. వి. నిపుణత గలదొంగ. (బ్రౌ.)

గడిపోతు. ద్వ. వి. (గడి+పోతు.) ఆఁబోతు. "ద్వి... గడిపోతువలె మేనికండలు పెంచి." ద్వి. హరిశ్చ. ఉ. ౫౫౮. పం.

గడియ. యం. దే. వి. తలుపునకు నడ్డుగా వైచుకఱ్ఱ. "గీ....తలుపు, మూసి గడియ బిగించెద మోస పోక." శుక. ౨, ఆ. ౧౨౨. ఆం. భా. ద్వి. ౨౨. వై. వి. (సం. ఘటికా.) 1. ఇరువది నాలుగు నిమిషములకాలము, ఘటిక. ఆం. భా. ప్ర. ౯౫; 2. అల్పకాలము, ముహూర్తము. "ఆ. నీవు నిష్ఠ నిట్లు గావించితివి గాన, గడియ లోన మెచ్చు గలిగె నీకు." ద్వా. ౨, ఆ. ౯౮. దశా. ౩, ఆ. ౩౭.

గడియకుడుక. ద్వ. వి. (గడియ+కుడుక.) గడియలను దెలుపుపాత్రవిశేషము. (ఇది యడుగునఁ జిల్లులు కలిగి యుండును. దీనిని నీటిలో వేయఁగా నాచిల్లులనుండి నీరు లోనికి ప్రవహించి యది మునుఁగును. దీనినిబట్టి పూర్వము కాల మానము నెఱుంగువారు. సూ. ని.) "గీ...గడియ కుడుక మ్మునుంగుట గని గురుండు, తెల్లవాఱెడు నని పఱతెంచి పలుక." శుపల. ౨, ఆ. ౧౨౫. ద్వా. ౪, ఆ. ౨౩౯.

గడియారము. (క. గడియార. త. గడికారం. తు. గడియాళ్.) 1. గడియలు మొదలగుకాలమును దెలుపుయంత్రవిశేషము. (బ్రౌ.) 2; ఘంటలు నిముసములు తెలుపుయంత్రము. "ఉ. ఆనలినాయ తాక్షుగడియారమునం దభిసారికాజిఘాం, సానిరత ప్రసూనశరచాపగుణధ్వనులో యనంగ ఘంటానినదంబు లయ్యెడ వినంబడియెన్..." ..."పారి. ౨, ఆ. ౫౦. క్రీడా. ౧౫౫.

గడిసిలఁబడు. దే. అ. క్రి. (గడిసిలన్+పడు. స్వార్థమున.) పాడగు. "సీ. ఇగురు మేఁతల నొగ రెక్కుఁ గోకిలకును వడి బొమ్మ గడిసిలఁబడియె నేని..." పిన. శకుం. ౩, ఆ. ౯౧.

గడిసిలు. దే. అ. క్రి. చెడు, పాడగు. (చూ. గడిసిలఁబడు.)

గడీ. దే. వి. కోట. "గీ. రావువారిగడీమీఁద రాచవారి, పనుపునఁ బఠానువారు కోపంబుచేసి." రంగా. ౨, ఆ. ౧౨౨.

గడు = గడ్డు. (చూ. గడుగాయ.)

గడుకము. సం. వి. అ. పుం. 1. గిండి; 2. బంగారుగిండి.

గడుఁగాయ. దే. విశ. (గడు+కాయ.) తుంటరి. (వా.)

గడుమన్నెము. దే. విశ. (గడు+మన్నెము.) గడ్డు మన్నెము. (వా.)

గడురుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మఱుగుజ్జువాఁడు, కుబ్జుఁడు. (శ. ర.)

గడులుఁడు. సం. = గడురుఁడు.

గడువు. ఉభ. దే వి. కాలము యొక్కయవధి. "ద్వి... కొన్ని, దినములు గడు విడి..." ద్వి. పరమ. ౭, ఆ. ౫౪౯. పు. ఆం. భా. ద్వి. ౮౯౧. సం. వి. ఉ. పుం. 1. గిండి; 2. బల్లెము; 3. వానపాము. 4. మెడమీఁదికంతి; 5. నిరర్థకవస్తువు. విశ. (ఉ) కుబ్జుఁడు.

గడుసరి. దే. విశ. (గడుసు+అరి.) 1. కఠినుఁడు; కఠినము. ఆం. భా. తృ. ౧౨. "ద్వి. నమ్మిక పుట్టించి నయములు చేసి, గడుసరిమనములు గరఁగించి పుచ్చి." ద్వి. హరిశ్చ. ఉ. ౬౧౯. పం; 2. మాయలమారి. "క. అడుగులు తొట్రుపడంగా, నడలొందిన యదియపోలె నయ్యెయెడలన్, బుడమిఁ బడి మ్రొగ్గి లేచుచు, గడుసరి యగు శశక మొయ్యఁ గదియం బోవన్." నా. పంచ. ౧, ఆ. ౨౫౪. వైజ. ౪, ఆ. ౯౪; 3. అసాధ్యుఁడు (శ. ర.); 4. దుష్టుఁడు. "క. ఒడయఁడ నే నొకజన్నము, గడువేడుకతో నొనర్పఁ గడఁగిన నెపుడున్, గడుసరిరక్కసు లిరువురు, దొడరి వడిన్ జెఱుపుచుందురు చల మొదవన్." అచ్చ. బాల. ౯౫. పండితా. పురా.

౧౧౫. పు; 5. ధైర్యవంతుఁడు. వేంక. మాన. ౨౯; 6. తెలివైనవాఁడు. వా:—వాఁడు మంచిగడుసరి.

గడుసరితనము. ద్వ. వి. (గడుసరి+తనము.) గడుసుఁదనము. (బ్రా. వా.)

గడుసు. దే. వి. 1. కాఠిన్యము. (శ. ర.); 2. ధార్ష్ట్యము. (చూ. గడుసుపడు.); 3. మోటుఁదనము. (చూ. గడుసురాలు.) విశే. 1. కఠినము, గట్టిది. "కవిరాజ...గడుసుఁజనుంగవ..." కవిరా. ౫, ఆ. ౨౪౫. శుక. ౨; ఆ. ౪౧౨; 2. దుష్టుఁడు. "ఆ...ఆతతాయి గడుసు నన్యదేశ్యు నధర్మ..." ఆము. ౪, ఆ. ౨౦౯. ఆం. సం. మాన. ౧౧; 3. అధికము. "క...గడు సగుశోకము నెమ్మది, నడఁగక..." పార్వ. 3, ఆ. ౭౪; 4. అసాధ్యము. (శ. ర.)

గడుసుఁదనము. దే. వి. (గడుసు+తనము.) 1. కాఠిన్యము. "గీ. గడుసుఁదన మొందునుపలసానుములయందు." చం. రా. ౪, ఆ. ౨౯; 2. ధార్ష్ట్యము. "వ...మీర లీమ్రుచ్చుల నెచ్చరికం గనిపెట్టుకొని యుండుఁ డనుటయు నుదిరి పడుచు నప్పడుచులు గడుసుఁదనంబునఁ నతని నధిక్షేపించి." ప్రభా. ౧, ఆ. ౧౦౭; 3. మోటుఁదనము. "సీ. రాఁగూడ దని పల్కు రమణిఁ బెంబడి నేఁగి కానలో విహరించు గడుసుఁదనము, మాయా మృగము వెంట మగఁడు పోవఁగ దాటమఱఁది నంపిన వాఁటి మంకుఁదనము." కృ. శకుం. పీఠి. ౫౦.

గడుసుపడు. ద్వ. అ. క్రి. (గడుసు+పడు.) మొండితనము దాల్చు. "గీ. పలికి బొంకక గుణముల వెలితి రాక, నడక నడలక యడిగిన గడుసుపడక, యన్వయాచార మెడలక యాదిశైవ, లక్షణంబుల నారాధ్యుఁ డమరు." ఉద్భ. ౧, ఆ. ౧౬౬. ఇట్లే; గడుసువడు. పాండు. 3. ఆ. ౧౪.

గడుసుబుఱ్ఱ. దే. వి. (గడుసు+బుఱ్ఱ.) మంచిమేధ. వ్యవ.—వానిది మంచిగడుసుబుఱ్ఱ. విశే. మంచి మేధగలవాఁడు. వ్యవ:—వాఁడు గడుసుబుఱ్ఱ.

గడుసురాలు. దే. వి. (గడుసు+ఆలు.) గడుసుఁదనము గలస్త్రీ. "ద్వి. కండక్రొవ్వినదైన గడుసురాలైన." ద్వి. భల్లా. ౨, ఆ. ౩౯. పు.

గడె. వై. వి. గడియ. 1. కువల. ౨, ఆ. ౪౬. పాండు 3, ఆ. ౭౪; 2. బల్లెము. (చూ. గడెకారి.); 3 ఘటికి, గంట. (బ్రా.)

గడెకారి. దే. వి. (గడె+కారి.) 1. బల్లెము గలవాఁడు. (శ. ర); 2. పోకిరి. (గడేకారియని వాడుక.)

గడేరము. ఉభ. దే. వి. గడియారము. (బ్రా.) సం. వి. అ. పుం. మేఘము.

గడోరము. సం. వి. అ. పుం. 1. బెల్లము; 2. కబళము.

గడ్డ. వై. వి. (సం. గండః. క. గడ్డె.) 1. వ్రణము. ఉదా:—నెత్తురుగడ్డ; 2. దుంప. (శ. ర.); 3. మంటిపెల్ల. "క. ఘనతరమగు ప్రాగ్గౌరవమున మునిఁగినఁ బాప మఖిలమును రూపునెడుం, బెనుపున యగ్గలికఁ బొగడు, గనినపయోరాశిఁ బడ్డగడ్డయుఁ బోలెన్." భార. అను. ౨, ఆ. ౮౦. ఆం. భా. ద్వి. ౨౩౦; 4. ఒడ్డు, తీరము. "ద్వి... కావేరి, ఘనవేగమున రెండుగడ్డలు జవురుఁగొని పాఱ..." ద్వి. పరమ ౫౪౧ పు. 3 పం. కాశి. 3 ఆ. ౬౫.

గడ్డతీరువ. ద్వ. వి. (గడ్డ+తీరువ.) భూమిని కొలుచుట; కొలిచినభూమి. (బ్రా.)

గడ్డపలుగు. ద్వ. వి. (గడ్డ+పలుగు.) గునపము. (బ్రా.)

గడ్డపాఱ. ద్వ. వి. (గడ్డ+పాఱ.) గునపము. "చ... గడలు గుదార్లు పగ్గములు కత్తులుబోనులు గడ్డపాఱలున్, వడిఁ గొని మేటిదొమ్మరులు వచ్చిరి..." చెన్న ౨, ఆ. ౨౨౯. కళా. ౬, ఆ. ౨౭. ఆం. భా. ద్వి. ౨౩౦.

గడ్డపొయ్యి. ద్వ. వి. (గడ్డ+పొయ్యి.) గడ్డలతోనేర్పఱచిన పొయ్యి. (శ. ర.)

గడ్డము. దే. వి. 1. చిబుకము. "మ...తా నొక్క చేఁ, దన కంఠంబును గౌఁగిలించి యొక చేతన్ గడ్డము న్బట్టి..." కళా. ౫, ఆ ౬౧. ఆం. భా. ద్వి. ౧౪౨; 2. శ్మశ్రువు, గడ్డముమీఁదిపొడుగుపాటి వెండ్రుకలమొత్తము. "వ...అర్ధనారి గావునం బురుషుండు గాఁడు గడ్డంబు కలిగినకతంబున యోషగాదు..." కాశీ. ౭. ఆ. ౪౭. ఆం. భా. ద్వి. ౧౪౬.

గడ్డి. దే. వి. కసవు, తృణము. ఆం. భా. ద్వి. ౭౬.

గడ్డిపరక. దే. వి. (గడ్డి+పరక.) అల్పతృణము. (వా.) విశే. గడ్డిపరకవంటివాఁడు. వ్యవ:—వాఁడు నా కొకగడ్డిపరక.

గడ్డిపాము. దే. వి. (గడ్డి+పాము.) ఒకజాతిపాము. (శ. ర.)

గడ్డిపిట్ట. ద్వ. వి. (గడ్డి+పిట్ట.) పక్షివిశేషము. "సీ. పికిలిపిట్టలుగడ్డిపిట్టలుఁగోరలుబంగరుపిచ్చికలు..." రసిక. ౧, ఆ. ౬౭. (శ. ర. పా.)

గడ్డిబొద్దు. దే. వి. (గడ్డి+బొద్దు) 1. చుట్టకుదురు. (శ. ర.); 2. బండిమీఁద లేసికొనిపోఁ దగుపెద్ద మోపు. "గీ. గడ్డిబొద్దువలెను మేను గానిపింప." చంద్ర. వి. ౧, ఆ. ౬౯.

గడ్డు. దే. వి. ఆధిక్యము. (చూ. గడ్డుకొను.) విణ. 1. అసాధ్యము. ఉదా:—గడ్డురోగము; 2. అధికుఁడు. "సీ. అలుచైనవానియి ట్లాక్రమింపఁగఁ జూచుఁ దనకు గడ్డైనఁ బాదములు వట్టు." రామలిం. ౨౩. ౨౬; 3. కష్టమైనది: వా:—ఇవి చాల గడ్డుదినములు. క్రి. విణ. అధికముగా. (చూ. గడ్డుఱుకు.)

గడ్డుకొను. దే. అ. క్రి. (గడ్డు+కొను.) అతిశయించు. "వ. యాదఃపతి మేదో మృతంబు జెడ్డున గడ్డుకొనిన పూషాదిత్య పలుపరుసయంతంబున నుప్పతిల్లు త్రుళ్లమెఱుఁగులు..." భీమ. ౫, ఆ. ౯.

గడ్డుఱుకు. దే. అ. క్రి. (గడ్డు+ఉఱుకు.) మీఁద బడు. "వ...గడ్డుఱుకనీకయడ్డంబుగా నొడ్డుకొనియెడు నెదురుపిడికిలి వాయం దట్టి..." కళా. 3, ఆ. ౨౬౬. రాఘవ. ౪, ఆ. ౧౫౨; 2. పాఱిపోవు. "వ...అడ్డగించి నించినయొండువలలకు నడ్డించి వెడ్డునం బడక గడ్డుఱికియు మృగంబులు ..." ఉ. హరి. ౪. ఆ. ౨౯.

గడ్డెనబొడ్డి. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. గడ్డెన బొడ్డీ యొక్కసికొక్కు..." హంస. 3, ఆ. ౧౪౬. (బ్రౌ. పా. గడ్డెనబోడిముద్రి.)

గడ్యారము = గడియారము. (బ్రౌ.)

గణకుఁడు. సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు; 2. గ్రామపులెక్కలు వ్రాయువాఁడు, కరణము.

గణగణ. దే. వి. (క. త. కణకణ.) ఘంటాధ్వని యనుకరణము. "సీ...గణగణ మొరయుచాలిగంట లురియు." ప్రబంధ ౧౮.

గణన. సం. వి. ఆ. స్త్రీ. 1. ఎన్నిక; 2. తలంచుట.

గణనము. సం. వి. అ. న. 1. లెక్కపెట్టుట; 2. తలఁచుట.

గణనీయము. సం. విణ. (అ. ఆ. అ.) గణింపఁదగినది.

గణపతి. సం. వి. ఇ. పుం. వినాయకుఁడు.

గణము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. ప్రమథులసమూహము; 3. సేనావిశేషము. (ఇరువదేడురథములు నన్నియేనుంగులు నెనుబదియొక్క గుఱ్ఱములు నూటముప్పదియేవురుకాల్వురును గల సేన); 4. ఛందోనియమవిశేషము. (మ గణము. మొ.)

గణయత్. సం. శత్ర. గణించుచున్న.

గణరాత్రము. సం. వి. అ. న. పెక్కురాత్రుల సమూహము.

గణరూపము. సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు.

గణహాసము. సం. వి. అ. పుం. చోర మనుగంధద్రవ్యముచెట్టు. విణ. (అ. ఆ. అ.) పెక్కురను పరిహసించునది.

గణాచారి. సం. వి. న్. పుం. ఒడలెఱుఁగక గంతులు వేయువాఁడు. (ఇది యాంధ్రమునమాత్రమే.) శుక. 3, ఆ. ౧౮.

గణాధిపుఁడు. సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు; 2. శివుఁడు; 3. ఒకగణమునకు నాయకుఁడైన వాఁడు.

గణి. సం. వి. ఇ స్త్రీ. 1. వెక్కిరించుట; 2. (పదక్రమాదులు వెక్కిరించుచు) సాంగవేదాధ్యయన మొనర్చినవాఁడు.

గణించు. సం. స. క్రి. (రూ. గణియించు. 1. లెక్కించు.) "సీ...పరమాణుగణము. గీ. నైన గణియింపఁగా వచ్చుఁ గాని విభుఁడ, తత్కృతయుగంబులోపలిదైత్యమథన, కృతచరిత్రంబు లన్నియు నెన్నరాదు..." వరాహ. ౫, ఆ. ౪౬; 2. ఆలోచించు. "శా. దారస్వీకృతియుం దయాభిరతియున్...దీన దా, సీరాజీసుతబాంధవాతురజనశ్రేణీసమృద్ధాన్నస, త్కారోదారతయు న్గణింప గృహికిన్ ధర్మంబు లుద్యన్మతిన్." మార్క. 3 ఆ, ౧౪౫; 3. లక్ష్యపెట్టు. "చ. వరద నిరీహయోగిజనవర్గసుపూజిత నీపదాబ్జములన్, నిరతము నంతరంగమున నిల్పి భవత్సదనుగ్రహేచ్ఛ, స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢులవిద్యులు మున్న మంగళా, వరణుఁ డటంచుఁ బల్కనభవ తి నే గణియింప నచుంతా." భాగ.

౪, స్కం. ౧౭౫; 4. చూచు. "ఉ. ఎక్కడఁ జూచినన్ జనమదేభతురంగమనోజ్ఞరావ మే, చక్కఁగణించినన్ వివిధచామరభూషణకేతనద్యుతుల్..." ఇందు. ౫, ఆ. ౬౯; 5. చెప్పు. "చ...మూనిని యతిధర్మముల్ శ్రుతి గణించిన భంగిన యేనుఁ జెప్పితిన్." భార. అను. ౫, ఆ. ౧౬. ఉ. రా. ౬, ఆ. ౧౯౯; 6. పొగడు. "మంజులగతిరగడ...హరిక్షేత్రంబున నెలకొను సాలగ్రామస్వామి గణింపుచు." హంస.౪,ఆ.౨౦౩.

గణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వేశ్య; 2. ఆఁడేనుఁగు; 3. అడవిమొల్లచెట్టు; 4. నల్లిచెట్టు.

గణికారిక. సం. వి. ఆ. స్త్రీ. నెల్లిచెట్టు.

గణితము. సం. వి. అ. న. 1. లెక్క; 2. గణిత శాస్త్రము; 3. గణించుట. విశే. (అ. ఆ. అ.) లెక్కింపఁబడినది.

గణితి. సం. విశే. (న్. నీ. న్.) 1. గణితశాస్త్రజ్ఞుఁడు; 2. గణించినవాఁడు.

గణుతి. వై. వి. (సం. గణితమ్.) 1. ఎన్నిక. "సీ. పెనుఁగోలుకాండ్రకు జనసమూహంబులగణుతి చూపెడునాయక ప్రభుండు." హంస. ౨, ఆ. ౪౯; 2. పొగడ్త. (చూ. గణుతించు.); 3. లక్ష్యము. "సీ. కనపుమోపరిగాలి గణుతియే మా కంచు నగినట్లు వదనఫేనముల రాల్చు." శశాం. ౨, ఆ. ౨౫.

గణుతించు. వై. స. క్రి. 1. తలఁచు. "ఉ...మీ, తెచ్చినవస్తుకోటి గణుతింపఁ గృతార్థతఁ బొంది..." నిర్వ. ౭, ఆ. ౧౪౬. భార. శాం. ౫, ఆ. ౨౪౨; 2. పొగడు. "సీ. గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధపటలోషితస్థాణు భట్టబాణు." భీమ. ౧, ఆ. ౭. భాగ. ౭, స్కం. ౧౨౦; 3. లక్ష్యపెట్టు. "ఉ. దిగ్గన లేచి పోయె గణుతింపక వాఁడు విరోధలబ్ధికై, యగ్గలికంబుగన్..." నిర్వ. 3, ఆ. ౧౦౯. [(శ. ర.)

గణెము. దే. వి. వేషధారులు ధరించెడిలక్కసొమ్ము

గణేయము. సం. విశే. (అ. ఆ. అ.) గణనీయము.

గణేరుక. సం. వి. ఆ. స్త్రీ. 1. కుంటెనకత్తె; 2. పనికత్తె, దాసి.

గణేరువు. సం. వి. ఉ. పుం. కర్ణికారముచెట్టు. స్త్రీ. 1. వేశ్య; 2. ఆఁడేనుఁగు.

గణ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. లెక్కింపఁదగినది; 2. లక్ష్యము సేయఁదగినది; 3. గణములోఁ జేరినది.

గతపడు. మి. అ. క్రి. (గతము+పడు.) 1. కడచు. (శ. ర.). 2. చచ్చు. "ద్వి. హతశేషు లగురాక్షసావలి చెప్ప, గతపడ్డయమ్మహాకాయునిఁ దలఁచి..." రం. రా. యు. ౩౭౯.

గతము. సం. వి. అ. న. 1. పోక; 2. నడక; 3. విధము. విశే. (అ. ఆ. అ.) 1. పోయినది; 2. కడచినది; 3. పొందఁబడినది; 4. తెలియఁబడినది; 5. చచ్చినది.

గతముసేయు. మి. అ. స. క్రి. (గతము+చేయు.) చంపు. "ద్వి. ఖండింతు మలయింతుగతము సేయుదును,గాక సైరింతునే..." పండితా. పర్వ. ౫౨౧. పు.

గతాగతము. సం. వి. అ. న. రాకపోకలు.

గతానుగతికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఒకరు ప్రవర్తించినటులు ప్రవర్తించువాఁడు.

గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పోక; 2. నడక; 3. మార్గము; 4. ఉపాయము; 5. ఎఱుక; జ్ఞానము; 6. ప్రమాణము; 7. నారిపుంటికంటితోవ. (శ. ర.); 8. స్థానము; 9. దిక్కు. "గీ...అంద ఱకు నీవ గతి గాక యన్యుఁ డొకఁడు, నీకు గతి యొకరె సకలలోకైకసాక్షి." దశా. ౧, ఆ. ౧౬౨. విధము. "గీ...వీర,మేమిగతిఁ బల్కెనను నది యెల్ల మనము, నైకొనవలయు..." భార. విరా. ౫, అ. ౨౯౫. ద్వి. హరిశ్చ. ఛూ. ౧౫౧. పం.

గతించు. సం. అ. క్రి. 1. కడచు. "చ...గొబ్బున సమయంబు కాకులకుఁ బోలె గతించెఁ బరాన్నభుక్తులన్." భర్తృ. వైరా. ౪౭; 2. చచ్చు. (శ. ర.)

గతిగొను. మి. అ. క్రి. (గతి+కొను.) ఏకమగు. "క. కలికివరుమదనకదనపుఁ, బలుకులకలకలము బెడఁగుపడుమేఖలము, వ్వలరవళిఁ దగిలి గతిగొనఁ, గలకంఠిరతంబు సలుపుగమకము గనియెన్." భాగ. ౬. సం. ౯౯.

గతిపడు. మి. అ. క్రి. (గతి+పడు.) ప్రాప్తించు. "క...వానితలఁ ద్రెంచి సముత్కటముగ నవల

ములో నొక్కట వైపుము సిద్ధు లెల్ల గలిపడు నీకన్." ద్వా. ౧౨, ఆ. ౬౫.

గతిసేయు. మి. అ. క్రి. (గతి+చేయు.) గతియగు, కాపాడు. "క. ఆతనికృప నిట్టు బ్రతికితి, క్షితి రాజులుగులకు నెల్ల సేవ్యుండవై వింతలతివర్షంబులు వెలిగిలి,గతి సేసిన యశకునికు గనుఁగొన వలసెన్." ద్వా. ౫, ఆ. ౭౬.

గతిల. సం. వి. ఆ. స్త్రీ. 1. వరుస; 2. ఏఱు; 3. పేముపో.

గతుకు = కతుకు. దే. స. క్రి. 1. (శునకాదులు) కొలఁదికొలఁదిగా నాస్వాదించుట. "క. ప్రతి గృహము నెపుడుఁ దిరుగుచు,నతిశయమున భుక్త శేష మాతురమతినై, గతుకుచు వీథుల నుండుచుఁ, గతిపయసంవత్సరములు గడపితి నచటన్." బ్రహ్మో. ౨, ఆ. ౧౨౮; 2. (నీచముగా) తినుట. (బ్రౌ.) (వి. 1. ఎంగిలి తినుట. (శ. ర.); 2. చిన్న గొయ్యి. వ్య:—గతుకులలోఁ బడుటచేఁ గాలు కొంచెము నొప్పిచేసినది. సా:— గతుకుటకుఁ బోయిన బ్రతుకులు పోయినవి. (బ్రౌ.)

గ_త్త. దే. వి. ఎరువు. (రూ. గ_త్తము. శ. ర.)

గ_త్తర. దే. వి. 1. ఉపద్రవము. (శ. ర.); 2. క్రమము లేక కలిసిపోయి యుండుట. (బ్రౌ. వా.)

గ_త్తరపడు. ద్వి. అ. క్రి. (గ_త్తర+పడు.) క్రమ భంగమగు, చెదరిపోవు. (బ్రౌ.)

గత్తు. దే. వి. మాత్రగంధము. (శ. ర.)

గత్వరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పోవునది; 2. నశించునది; 3. కదచునది.

గద. సం. వి. ఆ. స్త్రీ. గుదియ.

గదమాయించు. దే. స. క్రి. గద్దించు. (శ. ర.)

గదము. సం. వి. అ. పుం. 1. రోగము; 2. ఉఱుము; 3. ఒకరకమువిషము.

గదాధరుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. ఒక తర్క గ్రంథ రచయిత.

గది. ఉభ. దే. వి. ఇంటిలోపలియఱ. (శ. ర.) సం. విణ. (న్. నీ. న్.) 1. గద గలవాఁడు; 2. రోగము గలవాఁడు.

గదుకు. దే. స. క్రి. = కతుకు. (శునకాదులు) కొలఁదికొలఁదిగా నాస్వాదించు. "చ. కలిసిన నోరు వోయి యొరుకబ్బఫుదోంతుల సత్పదార్థముల్, గదుకుచు సెట్టివారిఁ బొడగన్నను గుట్టిని స్నేహసౌఖ్యముల్, మదికి ససహ్యమై శునక మార్గమునం జరియించుచున్నదు,ప్పుడకవు లెల్ల మత్క_వితఃబట్టక తప్పులు విండ్రు గావుతన్." వాసిష్ఠ. ౧, ఆ. ౭. వి. ఎంగిలి తినుట. (శ. ర.)

గదుము. దే. స. క్రి. గద్దించు. "క్రీ. హా... దిని యాము గవిచిమన్యోగులు హాయిపోతు... గదుముఁ జూచు." సా. ౧, ఆ. ౬౫. ఆం. భాత్ర్య. ౧౨౮.

గదుముకొను. దే. స. క్రి. (గదుము+కొను.) గదు... "క. సురుఁ డార్చి పోక పో కన ... గదుముకొనుచు వెన్దరుముంగా"య. ౫,౩ ౧౧౯.

గదురు. దే. వి. దుర్వాసన. "చ. మందమున నోవు కాసురుఁడు మ్రుచ్చిలి యచ్చలమారఁ గొన్నప్రాఁ, జదువులు తెచ్చి తజ్జఠరసాంద్రతరాంత్రము లంట నంటు నిల్,గదురు దొలంగఁ గీర్తి యను గంగ దొలంచి..." పాండు. ౨, ఆ. ౫౬. విణ. 1. విస్రము, పచ్చివాసన గలది. ఆం. భా. ప్ర. ౧౦౨; 2. చెడ్డని. "సీ. పులితోళ్ళమై నాఱఁ బోసిన రక్తార్ద్రకరిశిరోముక్తాళి గదురుకంపు." చంద్ర. ౫, ఆ. ౧౨౧. సీ. గదురుకంపునఁ బ్రేవు లదరఁ జేసెడుదాని..." భాగ. ౭, స్కం. ౪౩౫. [(కంఠ,పర్వము.)

గద్గదము. సం. విణ. (అ. ఆ. అ.) డగ్గుత్తికపడినది

గద్గదస్వరము. సం. వి. అ. పుం. 1. డగ్గుత్తికపడిన కంఠధ్వని; 2. ఎనుఁబోతు.

గద్గదిక. సం. వి. ఆ. స్త్రీ. డగ్గుత్తిక.

గద్ద. వై. వి. (సం. గృధ్రః.) పక్షివిశేషము, గృధ్రము.

గద్దగోరు. వై. వి. బొ. (గద్ద+గోరు.) 1. గద్దయొక్క గోరు; 2. ఒకానొకచెట్టు. (దీనియాకులు గద్ద గోరువలె నుండును) "వ...ఇప్ప కప్పురమద్ది గద్దగోరు..మొదలుగఁ బెక్కు తెఱంగుల మ్రానులు ..." పిన. శకుం. ౨, ఆ. ౧౪; 3. చోరసాధన విశేషము. (ఇది గద్దగోరువలె వంపుగా నుండి యెదుటిదానికిఁ దగిలించినచోఁ బట్టుపట్టును.) "గీ. కావు ములుబంతి సికముల్ల గద్దగోరు... తోలునిచ్చెన మొదలు ముందుగ ధరించి." ప్రబంధ. ౭౬౯. వేం. పంచ. 3, ఆ. ౧౯౫; 4. ఒకవిధమైన గొండ్లెము. (వా.)

గద్దన. దే. వి. గద్దించుట. ఆం. భా. తృ. ౩౦.

గద్దరి. దే. విశే. 1. నిపుణుఁడు. "ఉ. గద్దరియోగి హృత్కమల కంధరసామభవంబుఁ జెందుచె. న్నిద్దపుగండుఁడేఁటి......" దాశరథి. శ. ౪౩. "చ. కరితురగాద్రిరోహముల గద్దరులై విలువిద్యలందు నేర్పరులయి..." చం. రా. ౨, ఆ. ౧౭; 2 పొగరు గల ; "క. ఎద్దులు మఱుఁగులుగాఁ జని, గద్దరులై చేరువెస్సెకంబుల వాలో, నుద్దవిడి నొంచిరి" య. ౨, ఆ. ౧౮. పరమాగ్ని, ఆ. ౩౬౩. 3. దుష్టము "ఉ...తద్గ్రహానీమ వసింపనీయ దీ, గద్దరిగ్రద్ద చేరి కలకాలము పోరెడి..." ఉ. రా. ౨, ఆ. ౨౩౦. నీలా. ౨, ఆ. ౧౦౫. 4. దట్టమైనది, "చ...ఆ. యత మగుచక్రవాళగిరియంచలి గద్దరియంధకారమున్"...సెమం ౧, ఆ. ౧౬౦.

గద్దరించు. దే. అ. క్రి. గర్జించు, గట్టిగా నఱచు. "సీ. కఠినవాలము జెట్టు గాలించి యొకచోటఁ గడిమిమై బొవ్వచు గద్దరించు." హ. వరాహ. ౪ ఆ. ౮.

గద్దరికాఁడు. దే. విశే. (గద్దరి+కాఁడు - స్వార్థమున) గద్దరితనముగలవాఁడు, దిట్ట. "ఉ... ఇట్టిబల, ల్గద్దరికాఁడు వాఁడిని జగంబుల గెల్చుట యేమి వింత..." అచ్చ. పం. ౧౨.

గద్దరితనము. దే. వి. 1. ధైర్యము "క. పెద్దపులి వెడలి చనె నని గద్దరితనమునను నక్కకదుపులు పొదలో, నుద్దవిడిఁ జొచ్చి చిఱుతల, యొద్దం బడినట్టు లయ్యె నోయమరేంద్రా." దశా. ౪ ఆ. ౪౦ 2. పొగరు. "వ...పదములు ఖండించియు మరలి గద్దరితనంబున గద్దించిన నుద్దవిడిం గదిసి పందిపోట్లం బొడిచియు." వరాహ. ౪ ఆ. ౭౦.

గద్దించు. దే. అ. క్రి. అదలించు. "సీ. గవి నున్న పులిఁ గన్నఁ గదిసి గద్దించి గొబ్బున నీడ్చి లేనోపుప్రోడ నేను." ఉ. రా. ౨, ఆ. ౪౦౪." రామా. ౧. ఆ. ౧౭౪.

గద్దింపు. దే. వి. (గద్దించు. ధా.) అదలింపు. "గీ. ఆతనిగద్దింపులకు భయ మొందువారు." కుచల. ౨, ఆ. ౯౯. ఆం. భా. తృ. ౩౦.

గద్దిగ. దే. వి. (గద్దియమీఁదఁ బఱచు) కంబళి. "సీ. బటువుగద్దియలపైఁ బట్టుగద్దిగలేలి జఘన దేశముల హిజారు లమర." కుచల. ౧, ఆ. ౧౩. కుచల. ౨, ఆ. ౮.

గద్దియ. వై. వి. (సం. ఖట్వికా) 1. సింహాసనము. "గీ. క్షత్రియులఁ దెచ్చి తొంటితొంటిగద్దియ నిడి, పట్టబద్ధుఁ గావించుచు..." హరి. పూ. ౧, ఆ. ౧౦౩. హర. 3, ఆ ౪౦.2 పీఁట. ఆం. భా. ద్వి. ౧౭౫. 3. పువ్వులలో పుంకేసరము. "గీ. తమ్మి గద్దియ దాకట గ్రమ్మి యట్టి కొమ్మఁగావింపఁ బోలు నెత్తమ్మిమూలి." వసు. ౨, ఆ. ౩౭. 4. (సం. గద్యాణమ్) వరహా. చూ. గద్దె.)

గద్దువ. దే. వి. గడ్డము. "సీ. వెడలి గద్దువ మోవ వీడియంబులు చేసి కాంతఁ జెంపలు మోవఁ గంద మలఁది." కవిక. ౪, ఆ ౯౪. పార్వ. ౨, ఆ. ౧౬౩.

గద్దె. వై. వి. (సం. ఖట్వికా) 1. సింహాసనము. "సీ. ఉచితంబు లనుషోడశోపచారంబుల నాగద్దె కలితభక్తి నాచరించి." విక్ర. ౨, ఆ. ౯౫. హర 3, ఆ. ౪౦. 2. పీఁట. ఆం. భా. ద్వి. ౧౬౫ 3. సోడె. (శ. ర.) 4. (సం. గద్యాణమ్)వరహా బంగరునాణెము. "సీ. పదివేలమొదవులు పదివేల గద్దెల పసిఁడియుం బిమ్మహోత్సవుల కిమ్ము." భార అర. ౨, ఆ. ౩౪౪. (శ. ర. పా.) 5 గద్యము. (వ్యతి. పద్దెము. బ్రౌ.)

గద్దెపొంకము. ద్వ. వి. (గద్దె+పొంకము.) పరువు నకుఁ దగినగౌరవపుమాట. "సీ. కలవి లేవివి కొన్ని కొలువునఁ గూర్చుండి గద్దెపొంకము చెప్పఁగలదుగాక." చంద్రా. ౨, ఆ. ౭౯ (శ. ర. పా.)

గద్యము. సం వి. అ. న. వచనము. విశే.(అ. ఆ. అ.) చెప్పఁదగినది.

గద్యాణము. సం. వి. అ. పుం. 1. వరహా. 2. నలువది యొన్మిది గురివెందగింజలయెత్తు.

గనగన. దే. వి. 1. కాలుట (మేలు) యందలియను కరణము. "సీ. వేసవి గనగన వేఁగుచ ట్రాతిపై నగ్గి నల్గడ మండ నడ్గుఁ జూచి." నిర్వ. ౩, ఆ. ౬౩. 2. కోపముచే మండిపడుటయందలి యనుకరణము. "క. అనుటయుఁ హనుమఁడు

గనగనఁ, గనలి..." ఉ. హరి. ౪, ఆ. ౧౯౬. విణ. గనగన యనుకాంతి గలది. "వ. మహ్వాంపు దివ్వెలవలె నివ్వటిలుఁగనగనని మణులకై......" ఉ. రా. ౩, ఆ. ౧౦౧. స్వా. ౪, ఆ. ౬౦.

గనగనలాడు. దే. అ. క్రి. (గనగనలు+ఆడు.) గనగన మండు. సానందో. ౨, ఆ. ౬.

గనప. దే. విణ. పెద్దది. "సీ. కావిసెలరేఁబు లురి వెను గనపకొండ, కరణి నొంచె భానుఁడు బాహుకర్తనమున." హరి. ఉ. ౯, ఆ. ౨౧౭. భార. శాం. ౫, ఆ. ౪౦. (దీనికి సమాసమందే ప్రయోగము కన్పట్టుచున్నది.

గనపర. దే. వి. గన్నేరు. (చూ. గనిమెర.)

గనపరాకులు. దే. వి. బ. (గనపర+ఆకులు) గన్నే రాకులవంటియమ్ములయలుగులు. "గీ....గనపరా కులు నిగిడ్చి, చెప్పటట్టులు శోధించి సికలు విప్పి." ఆము. ౬, ఆ. ౭౯.

గనము. వై. విణ. (సం. ఘనమ్) అధికము. సా. ని. మాన. ౪౯.

గనయము. 1. పోఁకముడి. "సీ. అనయంబుఁ దిన్నని యనువున గనయంబు ప్రిదులంగ మెలఁగి చొక్కొదవఁ జేయు. ఆ. నిక్కరంబు..." భార. స్త్రీ. ౨, ఆ. ౧౩౩. కావ్యా. ౬. ఆ. ౯౧: 2. వింటి కొప్పు. "క. గొనయంబు నెక్కఁ ద్రోచిన, గన యంబున కెక్కకున్నఁ గ్రమ్మినతమకం, బున విల్లు విడిచి వే ఱొక యనిమిషభటుఁ డనికివెడలె నడిదముఁ గొనుచున్." హరి. ౪. ఆ. ౨౨.

గని. వై. వి. (సం. ఖనిః) 1. ఆకరము; బంగారు మొద లగునవి పుట్టుచోటు. "గీ...అధికశుభంబులకు భ, వత్పాదంబు గని కాదె వాసుదేవ." భార. శల్య. ౨. ఆ. ౩౩౯. హంస. ౫, ఆ. ౩౯౨; 2. బిలము. "చ. అనవుడు నిష్వరోత్తమమునందు మహాబిల మొప్పుచుండు దా, నను గుహ యొక్క టెప్పుడును నవ్యముగాఁ గనుపట్టు నందులో, నచుపమ మైనగుండు గల దందును నేడు బిలంబు లుండు న,గ్గములఁ జరించుఃదుష్మె దలకై మడి సెప్పుడు వానిప్రాణముల్." వైజ. ౩, ఆ. ౧౨౧; 3. (సం. ఘనమ్) గడ్డ. (చూ. గనికట్టు.)

గనికట్టు. ద్వ. అ. క్రి. (గని+కట్టు.) గడ్డకట్టు. "వ... హిమసలిలములు కస్తూరిమెకంబులమదభరంబులం దొరఁగుచాభీరక్తంబు లిరిసి గనికట్టిన నిగరములు గరఁచికొని..." వసు. ౨, ఆ. ౧౧.

గనికెకుండ. దే. వి. బాల్యక్రీడావిశేషము. "సీ. బండ్లకలుఁగు జొప బెండ్లసుంచసలు గంగెద్దు లాటలు గనికెకుండ..." హంస. ౩, అ. ౧౪౬.

గనిమ. దే. వి. చిన్నగట్టు. "మ. గనిమల్ దీటిచి కాల్వ తేర్పఱచి..." బహు. ౨, ఆ. ౨౦. వసు. ౧, ఆ. ౧౩౯.

గనిమెర. దే వి. గన్నేరుచె. "ద్వి. గనిమెరపూఁ జాయ గలుగుసీర్కాడి, గనుపట్టు శాటిమీఁ గాళ్లతో నొరయ." ద్వి. పరమ. ౪, ఆ. ౨౬౯. పు. "సీ. గనిమెరల పరువమును గనకమయకదళి తరుకుసుమముల..." సాంబో. ౫, ఆ. ౨౩.

గనియ. వై. వి. (సం. కణికా.) ఖండము, ముక్క. "సీ. కాళ్లను జేతులు గనియలుగాఁ బట్టి చిది మింపఁ దగు నని పవరువారు." ద్వా. ౩, ఆ. ౬౦. ఆం. భా. ద్వి. ౭౫.

గనిపోటు. ద్వ. వి. ఆనవాలుకై జాళ్లమీఁద వేయు పోటు. "సీ. చెడివంపుటడ్డీలు బిగియించి గని వోటు కొండఁ గొట్టెదుకట్టుగుండ్లరనము." పర. మ. ౫, ఆ. ౪౦. ద్వి. పరమ. ౭, ఆ. ౫౧౫. పు.

గనీబు. దే. వి. ఒఱ. "చ. కలకల నవ్వుసుక్ నృప శిఖామణి హొన్ను గనీబులోని యిట్టులపు మెఱుంగుఁజాయల బెడంగుఁగటారి జరీన దూసి ..." ఉ. రా. ౭, ఆ. ౨౧౧.

గనుపు. దే. వి. వెదురు చెఱకు మున్నగునానియం దెడదెడ నేర్పడి యుండుముడి, పర్వము. ఆం. భా. ద్వి. ౭౪. [తోడ. ౨, ఆ. ౭౩.

గనె = గనియ. "సీ...తనుపారురసదాడి గనెల

గన్నెర. దే. వి. కరవీరముచె. "రగడ...వలదు తేనె లకు వంపను గన్నెర." రాజ. చ. ౨, ఆ. ౧౪౯. బహు. ౨, అ. ౨౧.

గన్నెరాకమ్ము. దే. వి. (గన్నెరు+ఆకు+అమ్ము) గన్నే రాకువంటియలుఁగు గలబాణము. "వ. అట్లు తాఁకుటయుం నతండు గన్నెరాకమ్ములఁ జీకాకు పఱిచె..." భార. భీష్మ, ౩, ఆ. ౨౧౯. నైష. ౬, ఆ. ౩౯.

గన్నెరు = గన్నేరు. ఆం. భా. ద్వి. ౫౩. బ. ధాన్య విశేషము. వేంక. మాన. ౨౯.

గన్నేరు. దే. వి. కరవీరము ⚘ "సీ. గన్నేరుఁబూఁ జాయఁ గనుపట్టుజిలుఁగైన సలిలకాషాయ వస్త్రంబుఁ గట్టి." నైష. ౮, ఆ. ౧౦౩. ఆం. భా. ద్వి. ౫౩. బ. ధాన్యవిశేషము. సాం. ని. మాన. ౫౨.

గప్పళించు. దే. స. క్రి; పీల్చు. గ్రహించు. "సీ. పొత్తి సొరసినమృగనాభిమృగినెత్తురులు గప్పళించినవెలవు లయ్యె." రా. వి. 3, ఆ. ౫౯.

గప్పాలు. దే. వి. (హిం. గప్) అతిశయపుమాటలు. (శ. ర.)

గప్పు. దే. వి. వాసనకొట్టుటయందలియనుకరణము. "రగడ. కప్పురంపుటనంటు లివిగో గప్పుగప్పునఁ దావిఁ జిల్కెడు." కిరా. 3, ఆ. ౨౦.

గప్పున. క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా. "సీ. పట చిత్రితాకారపతిరేఖకనురాయ విప్పు జెప్పులచేత నప్పళించె, నప్పళింపఁగనీక గప్పునఁ గనుదోయి నలమి పైఁబడ లజ్జ యడ్డకట్టె." చంద్రా. ౫, ఆ. ౭౭; 2. ఆకస్మికముగా. "ఉ. గప్పున వ్రాలఁగా దివురుకై వడి నుబ్బున నిబ్బరింపుచున్." చంద్రా. ౬. ఆ. ౧౫౭.

గబగబ. దే. వి. పరుగెత్తుట మున్నగువానియందగు ననుకరణము. (వ్యవ.) వాఁడు గబగబ పరుగెత్తి వచ్చినాఁడు.

గబీలు. దే. వి. మండుట మున్నగువానియం దగు ననుకరణము. (శ. ర.)

గబీలుమను. దే. అ. క్రి. (గబీలు+అను) మండినట్లగు, పరితపించు. "క....అతనిఁ గనినంతనె నా, డెందము గబీలు మనియెన్..." అహ. 3, ఆ. ౮. (ప్రాఁతప్రతి. పా. 'భగీలుమనియెన్' క్రొత్త ప్రతి. పా.)

గబుక్కున. దే. వి. ఉబుకుట మొదలగువానియందలి యనుకరణము. వ్యవ. వాఁడు గబుక్కున నేటిలోఁ నుఱికినాఁడు.

గబుసు. దే. వి. కపటము. ఆం. భా. ప్ర. ౧౩౮.

గబ్బరించు. దే. అ. క్రి. గబగబధ్వనిచేయు. "ద్వి. బొబ్బలు వొడుచుచుఁ బొంగుచుమాఱు, గబ్బరించుచు..." పండితా. పర్వ. ౪౮౪. పు. ౨౮ పం.

గబ్బాటు. దే. వి. కలత. (శ. ర.) విశే. వెల తక్కువైనది. (పసుపు కంద చేమ గెణుసు పెండలము మున్నగువస్తువు అని శ. ర.)

గబ్బి. వై. వి. కపటము. ఆం. భా. ప్ర. ౧౩౮. విశే. 1. గర్వి. "క గబ్బియగుచు డోఁజ పెఱుఁగక, గొబ్బునఁ జైఁబడుచు..." విజ. ౨, ఆ. ౧౯౧; 2. నిక్కినది. "సీ. కొన లుబ్బి గబ్బియై యుప రంజికుండయై కొండయై దండ నిండి." నరస. ౫, ప్ర. ౧౧౩. హర. 3, ఆ. ౨౩; 3. గొప్పవాఁడు. "గీ. కడలిఁ గోలకుఁ దెచ్చిన గబ్బివీవ." పారి. ౧, ఆ. ౪౯. "క. అబ్బురముగ నీచే నొక, కబ్బము గావించి దాఁపఁ గైకొని కీర్తుల్ జొబ్బిల నంగజిలో నట్టదబ్బిగఁజాల మొనర్తుఁ గడుమున మొనవన్." ఆనంద. పీఠి. ౧౮; 4. ధీరుఁడు. చూ. గబ్బితనము.)

గబ్బిడా. దే. వి. తలక్రిందుగా వ్రేలాడునొకానొక పక్షి, గబ్బిలము. సాం. ని. తిర్య ౭౧.

గబ్బిడాయి. =గబ్బిడా. గబ్బిలము. ఆం. భా. ద్వి. ౯౪.

గబ్బితనము. ద్వ. వి. (గబ్బి+తనము.) 1. గర్వము. "సీ...రాచ, బిడ్డయై యుండి గబ్బితనం బెఱుఁగఁడు..." ఉ. హరి. ౫, ఆ. ౨౭౮. పరమ. ౨, ఆ. ౪౬; 2. ధైర్యము. "గీ. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కఁడుండు, శారయవనునికడ కేఁగి గబ్బితనము, వెలయఁ దనపేరు చెప్పి గర్వించి తన్నుఁ దఱిమి పట్టంగ నోపినఁ దగిలి రమ్ము. చ. అనుటయు..." వి. పు. ౭, ఆ. ౧౭, ౧౯.

గబ్బిలము = గబ్బిడా. "గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ బైలపాయిక చెన్నొందు దశశిష." ఆం. భా. ద్వి. ౯౪.

గబ్బిశాయి = గబ్బిడా. "సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిశాయి చీకురా యనంగను బైలపాయి కాభ్యలు చెల్లు..." ఆం. సం. తిర్య. ౭౧.

గబ్బిలి. దే. వి. ఔ. పిడికిలి. ఉదా: గబ్బెఁడుకూరతే. (శ. ర.)

గబ్బివాఁడు. ద్వ. విశే. (గబ్బి+వాఁడు.) గబ్బితనము గలవాఁడు. "ద్వి...పడుచు, చనుగుబ్బ గొర్తి చనుగబ్బివాఁడు." అ. మ. క. ౧, ఆ. ౩౪. పు.

గబ్బిస. దే. వి. ఒకానొకమూలిక ⚘. (శ. ర.)

గబ్బు. యం. దే. వి. 1. గంధము, వాసన. "సీ... పొలగబ్బు..." చంద్రా. ౨, ఆ. ౧౮. ఆం. భా. ప్ర. ౧౦౬; 2. దుర్గంధము. "సీ. ఎడ లేక తఱచు ప్రేలెడుజిబ్బిటీలకే గబ్బులు వెదచల్లు గర్భగృహము." చంద్ర. 3, ఆ. ౪౮. వై. వి. (సం. గర్వః. క. గబ్బు.) 1. గర్వము. "క. నిబ్బరపు బాలహంతయు, గొబ్బునఁ జేజంబు మణియుఁ గోల్పడి సతుఁడై, ప్రబ్బినవగకే విప్రుఁడు, సిబ్బితితో నొడలిగబ్బు సెడి వడఁ జనియెన్." భాగ. ౧, స్కం. ౧౭౩. బస. ౬, ఆ. ౯౯. పం; 2. (జంతువుల) మదము (చూ. గబ్బుచెంకమెకము.) విణ. గాఢము, దట్టము, (చూ. గబ్బుచీకటి )

గబ్బుకొను. ద్వ. అ. క్రి. (గబ్బు+కొను.) గబ్బుకలదగు, పరిమళించు. "ఉ. గుబ్బలివట్టి గబ్బవలి గుబ్బల జొబ్బిలుతావికుంకుమన్, గబ్బుకొనంగఁ జాలు నెదఁ గప్పిన బెబ్బులివన్నెపచ్చడా, బబ్బురమై తనర్ప...వచ్చె మహేశుఁ డత్తఱిన్." దశా. ౨, ఆ. ౬౯. [కారము. (శ. ర.)

గబ్బుచీకటి. ద్వ. వి. (గబ్బు+చీకటి.) గాఢాంధ

గబ్బుచెంకమెకము. ద్వ.వి. (గబ్బు+చెంక+మెకము.) మదము చెంపలయందుఁ గలజంతువు, ఏనుఁగు. "సీ. గబ్బుచెంకమెకంబు గట్టి కళేవరంబు కుబుసంబుగాఁ జేసికొన్నదంట." ఆం. భా. ప్ర. ౩౭.

గబ్బుదేఱు. ద్వ. అ. క్రి. (గబ్బు+తేఱు.) అతిశయించు. "సీ. మెఱపులై మిట్టలై మిక్కిలి బటువులై క్రాలుఁగన్నులచెన్ను గబ్బుదేఱ..." పాండు. ౨, ఆ. ౯౧.

గబ్బుమీఱు. ద్వ. క్రి. (గబ్బు+మీఱు.) గట్టిదగు. "సీ. పచ్చబంగారు కుప్పలు సేయఁగా రాదె గబ్బుమీఱికవీరిగుబ్బలందు." పాండు. ౧, ఆ. ౧౧౭.

గబ్బులుఁగు. దే. వి. ఒకానొకశకునపుపక్షి, భాసంతము." ఉ. మానక యుఁబ్బి గబ్బులుగు మాటికి మాటికిఁ గ్రోల్చెఁ గొమ్మపై..." వార. ౨, ఆ. ౧౮. ఆం. భా. ద్వి. ౯౭. ఆము. ౬, ఆ. ౬౬.

గబ్బెక్కు. ద్వ. అ. క్రి. (గబ్బు+ఎక్కు.) దట్టమగు. "ఉ...గ,బ్బెక్కిన మబ్బు శైలగుహ వీఁగె దిశల్ వెలుగొంతె..." వేం. పంచ. 3, ఆ. ౧౦౭.

గభస్తి. సం. వి. ఇ. స్త్రీ. అగ్నిభార్య. పుం. 1. సూర్యుఁడు; 2. కిరణము.

గభస్తిమంతుఁడు. సం. వి. త్. పుం. సూర్యుఁడు.

గభీరము. సం. విణ. = గంభీరము. విణ.

గభీరిమ. సం. వి. న్, పుం. గాంభీర్యము.

గమకము. ఉభ. దే. వి. 1. యత్నము. "క. గమకమున నెదురుపగతురఁ, గొమరుం బాయముల వేల్పుఁగొమ్మలఁ గడుఁ జుట్టములఁగఁ గూర్చెదు నేరుపు..." య. ౧, ఆ. ౭౨. సా. ౧, ఆ. ౧౦౦; 2. ఉత్సాహము. "మ. గమకంబుల్ సెడి కైదువుల్ విడిచి..." ఉ. రా. ౨. ఆ. ౯౧; 3. నైపుణ్యము. "క. కలికి వరుమదనకదనపుఁ, బలుకులకలకలము బెడఁగు వడుమేఖలము,వ్వలరవళిఁ దగిలి గతిగొనఁ,గలకంఠి రతంబు సలుపు గమకము గనియెన్." భాగ. ౬, స్కం. ౯౯; 4. బలము. "సీ...తాటిదండములు త్రోయంగ రెట్టలగమకము." ప్రబంధ. ౧౨. విణ. 1. అధికము. "వ...అతని మీఁది తమకంబు గమకంబై పర్వ నతనిమదియుఁ దనపయిం దగులుటం దెలిసి ..." య. ౫, ఆ. ౬౫. చంద్రా. ౧, ఆ. ౭; 2. మనోజ్ఞము. "ద్వి. అంచల బంగరుహరువుచిత్తరువు, లందంబు గాఁ దీర్చి హరినీలకరుల, గమిగమిచినపటికంపుసింగముల, గమక మాసోపానగతుల నేర్పఱచి." రం. రా. బాల. ౭౩. పు. ౧౦. పం. రా. వి. 3, ఆ. ౧౮; 3. స్థూలము. ఆం. భా. తృ. ౨౦. సం. వి. అ. పుం. స్వరవిన్యాసభేదము. విణ. (అ. మికా. అ.) 1. తోఁపఁజేయునది; 2. నిరూపణచేయునది; 3. వెళ్లునది.

గమకముగొను. దే. అ. క్రి. (గమకము+కొను.) యత్నించు. "క. పలికెద నని గమకముగొనుఁ, బలికినఁ గడు నలుగు విభుఁడు ప్రతివచనములన్, బలుకఁ, దని నిలుచు..." భాగ. ౭, స్కం. ౩౩౩.

గమకించు. దే. అ. క్రి. 1. యత్నించు. "మ. గగనారణ్యచరాంధకారగజముం గాలాహ్వయవ్యాఘ్రుఁ డ,చ్చొగఁ బట్టన్ గమకించి..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౨౪౨. శకుం. ౪, ఆ. ౫౪. 2. ఒప్పు. "ద్వి...చిత్రాంగిఁ గనుఁగొని మ్రొక్కి, వినుతింప వారాశివిధమునఁ బొంగి,

గమకించుముత్యాలగద్దెపై నుండి..." ద్వి. సా. ౧, ఆ. ౨౨. పు. వైజ. ౪, ఆ. ౩౦; 3. తలంచు. "మ...ప్రతిష్ఠల్ సూచినం దీరునా, తమి యంచున్ గమకించు భీతి మదిలోఁ దగ్గించుః గాంచున్ వెతన్." శశాం ౧, ఆ. ౨౧. హంస. ౧, ఆ. ౧౪౦.

గమకింపు. దే. వి. బెదరించుట. "చ...చిక్కురమునిము చ్చుటంచు గమకింపులచేఁ గపిలుం గెరల్చి త, ద్గురుతరకోపదీపమునకుక్ శలభాకృతిఁ జెంది రందఱున్." చం. రా. ౩, ఆ. ౧౪.

గమగమ. దే. వి. (క. గమగమ) 1. పరిమళించుట యం దగునను కరణము. "సీ. గమగమ వలచు చొక్కపుఁగమ్మఁగస్తురి వలఁ గిడె నొకమదనాగ యాన." రసిక. ౧, ఆ. ౨౧. హంస. ౫, ఆ. ౩౨౦; 2. కోపించుటయం దగునను కరణము. "క. అనుటయుం హంసుఁడు గమగమఁ, గనలి..." ఉ. హరి. ౪, ఆ. ౧౯౬; 3. కమరుటయం దగు ననుకరణము." "సీ. ఎట్టఁగాఁ గాగినయినుప కంబములతోఁ గట్టినఁ గమగమఁ గమరువారి..." దశ. ౩, ఆ. ౧౬; 4. సువాసన. "క. వలను పవనవాసనలం, గలవిపణులమృగమదాదికము గమగమలన్...కను." ౧, ఆ. ౧౪౪.

గమగమించు. దే. అ. క్రి. గమగమ యని వాసన గొట్టు. "గీ. కప్పురపువీడియపుఁదావి గమగ మింప." శేష. ౪, ఆ. (శ. ర.)

గమథము. సం. వి. అ. పుం. త్రోవ.

గమథుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పోవు వాఁడు, మార్గస్థుఁడు; 2. యాత్రికుఁడు.

గమనము. సం. వి. అ. న. 1. పోక, వెళ్లుట; 2. ప్రయాణము; 3. పొందుట; 4. రమించుట.

గమనించు. సం. అ. క్రి. పోవు, వెళ్లు. "సీ. నడిచె నిం ద్రుఁడు కిన్నరకాహళులు మ్రోయ గమనించె శిఖి డిండిమములు మ్రోయ." వరాహ. ౨, ఆ. ౧౦. జై. ౨, ఆ. ౧౦౬; 2. సంచరించు. "ద్వి. వసు ధేశునొద్దనె వదలక నీవు, వసియింపఁ దగు నన్ను వచ్చితి నేను, దలఁచినప్పుడు వచ్చి ధరియింతు రూపు, గలిగియుం బోడ లేక గమనింప నేర్తు." రం. రా. ఉ. ౧౧౫. పు. ౧౮. పం; 3. వెలువడు. "ద్వి. అమృతాంశురుచిలోన నడఁగక వెలికి, గమనించె నన దేహకళ వెల్లఁబాఱె." రం. రా. బాల. ౧౯. పు. ౨౪, పం; 4. వేడుకపడు. "ఉ. నింతవు నామనోవృత్తి గమనించుచు కేళి కహ్నికంబు." శశాం. ౪, ఆ, ౯౦. (ఇట 'తలఁచు' అని శ. ర. స. క్రి. 1. గ్రహించు (వా.); 2. దాటి పో. (వా.); 3. నడచు; 'క...దెదకుఁడు గమనించినపుడె రక్ష మస గుచు..." వేమన. (ప్రా.)

గమనిక. ఉస. దే. వి. జ్ఞాపకము. "వ...మృత్యుదేవత యెత్తుసం గాటపు శికర శమనుని గమనిక..." భాగ. ౧౦. స్కం. ౧౩౭౮. సం. వి. ఆ. స్త్రీ. మార్గము; పద్ధతి. "క్రీ. యాత్ర ప్రవర్తనము దండ్ర, గమనికయును ... శైవదానవిధులు బహుళ త్యాగములును లోక, ప్రస్తుతము లయ్యె..." భార. అశ్వ ౪, ఆ. ౨౧౯.

గమనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలియఁ దగినది; 2. పొందఁదగినది.

గమము. సం. వి. అ. పుం. 1. పోక; 2. ప్రయాణము; 3. త్రోవ; 4. దండయాత్ర; 5. ద్యూతభేదము; 6. పొందుట; 7. రతి, పొందు.

గమయత్. సం. శత్రు. 1. నడపుచున్న; 2. పొందించుచున్న.

గమయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. నడిపించువాఁడు; 2. పొందించువాఁడు.

గమయు. దే. అ. క్రి. ఘుమఘుమ వాసనకొట్టు. "గీ. గమయుకలపంటకములతోఁ గాంక్షపీఱ, హితమితాన్నంబుః గబళించి కెల్లవారు." సాంబో. ౫, ఆ. ౨౯౬.

గమాయించు. దే. అ. క్రి. గమగమించు, పరిమళించు, "మ. పరమాన్నంబులుఁ బిండివంటలును సూపంబుల్ గమాయించు పండ్లరసంబుల్..." అని. ౧, ఆ. ౧౦౫.

గమి. ఉభ. దే. వి. సమూహము. "ఆ. కవలవారుఁ గొడుకు గమియుఁ బాంచాలవర్గంబు..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౯. భీష్మ. ౨, ఆ. ౨౯. విణ. సాంద్రము. "క. నెఱి దగఁ దేజితమై గమి, మెఱుఁగు లడరుదారసమున మిక్కిలి పదనే, ల్తెఱ మెఱయ నురము నొంచిన..." భార. కర్ణ. ౩, ఆ. ౫. సం. విణ. (న్. న్. న్.) పోవువాఁడు.

గమించు. సం. అ. క్రి. వెళ్లు, ప్రయాణముచేయు. "ఉ. చయ్యన నేఁగి దయ్యనొకచక్కి రవిచ్ఛవిఁ జొక్కి వేసవిం,బయ్యెదకొంగు చాటుగొను భర్తకరం బవలంబయష్టిగా,నొయ్యనఁ జేరి యూఁత గొని యూఁటుఁ గాంచు గమించు నిర్ధ్వధిన్." రామా. ౫, ఆ. ౧౦౫ ప్రై. ౭, ఆ. ౨౦౨. స. క్రి. 1. చేరు. "వ. నీకుఁ దక్క నన్యులకు నాతాటక యున్న దేశంబు గమింప నశక్యంబు..." భా. రా. బాల. ౨౩౭; 2 రమించు. (చూ. గమియించు.)

గమికత్తె. ద్వ. వి. (గమి+కత్తె.) అంతఃపురపరిచారికలలో ముఖ్యురాలు. "క. గమికత్తెలతో నపుడా, క్రమ మెఱిఁగింపఁగ వారు గ్రక్కునఁ జేత్క, ప్రమదప్రదమై యొప్పెడు, ప్రమదవనముఁ జేరి యపుడు ప్రమదం బెసఁగన్." శశాం. ౪, ఆ. ౧౬౪.

గమికాఁడు. దే. వి. (గమి+కాఁడు.) 1. అధిపతి. "సీ. కయ్యాన జక్కులగమికాని ముక్కంటికిఁ గులిలవెట్టటలు నీకతనఁ గాదె" య. 3, ఆ. ౬౪. భాగ. ౧, స్కం. ౨౧౫; 2. సేనాధిపతి; అల్పసేనాధిపతి. "క. అక్కరణ బోరుటక్కరి, రక్కసిగమికాండ్ర ముఖ్వర స్మానిసిఁజేఁ, డొక్కొక్క కఱకుటమ్మునఁ, జిక్కంగానీక దలలు చిదిమెం గినుకన్." అచ్చ. అర. ౧౪. ఆం. భా. ద్వి. ౨౮౪; 3. ముఖ్యజనుఁడు. "గీ. అనుడు నందులో గమికాండ్రు రతనిఁ జూచి, దేవరకు నిట్టియక్కఱఁ దీర్పఁగాక, యెన్నటికి మేము నీ సొమ్ముఁ దిన్నవార, మిందఱము నని తమమూఁకలెల్లఁ జూపి." పరమ. ౫, ఆ. ౧౧.

గమిగూడు. దే. అ. క్రి. (గమి+కూడు.) గుంపుగూడు. "సీ. రవి గ్రుంక ముకుళించురాజీవములఁ బాసి గడిగూడు తుమ్మెదకదుపనంగ." కువల. ౪, ఆ. ౧౨.

గమిగొను. దే. అ. క్రి. (గమి+కొను.) ప్రోగవడు. "క. వేలోకవిలు గొని విమతుఁడు, తూఱఁగ మారిమేన నాటె: దొమ్మిది యమ్ముల్, నూటెనుఁ బదింటఁ బొదివెం, గాఁడియగా మఱియుఁ బఱపె గమిగొనఁ దూపుల్." మారి. ఉ. ౧, ఆ. ౧౬౩. కావ్యా. ౨. ప్ర. ౬౯.

గమియించు = గమించు. వరాహ. ౯, ఆ. ౧౨౭. సేతు. 3, ఆ. ౧౬.

గమియు. దే. అ. క్రి. దగ్గఱఁగఱగాఁ బెరుఁగు; తలచగు. "సీ. గురివెందపూఁదీఁగకొవమ లల్లిన చోటఁ గపురంపుటనఁటులు గమియుచోట." సాంబో. ౧, ఆ. ౧౭౭. స. క్రి. 1. అణఁచు, పోఁగొట్టు. "ఆ. నడక చూపునెడల నాళీకపత్రాక్షి, గమియు హంసశిఖులగర్వరేఖ." సాంబో. 3, ఆ. ౧౧౦; 2. అందిచ్చు. "క. ఏల విచారము జయమున, భూలోకసుఖంబు లెల్లఁ బొందఁగ వచ్చున్, వాలికశరవిధి సీల్గినఁ,గేలు గమియు రంభ నృపతికిం గుళలమతీ." సాంబో. ౫, ఆ. ౭౪.

గము. సం. విణ. (అ. ఆ. అ. ఇది యుత్తరపదమై వృత్తియందుమాత్రమే యుండును.) 1. పోవునది. (ఉదా: మార్గగము); 2. పొందునది. (ఉదా: దేహగము.)

గములుగొను. దే. అ. క్రి. (గములు+కొను.) గుంపుగూడు. "వ. వఱదలును వఱదలవలన మెదలి పాఱెడియేఱులును నేఱులవెంట గఱులు త్రిప్పుచు గములుగొని క్రొన్నెటి కెదురునడచుమీనంబులును..." భాగ. ౧౦. స్కం. పూ. ౭౫౬.

గమ్మత్తు. దే. వి. (హిం. గమ్మత్.) 1. చమత్కారము. "క. గమ్మత్తు చిమ్మనొకకథఁ, గ్రమ్మఱఁ దెల్పెదను..." హంస. ౨, ఆ. ౬; 2. వేడుక. (శ. ర.)

గమ్మను. దే. అ. క్రి. (గమ్ము+అను.) పరిమళించు. "ఉ...కైతలు...... కమ్మనగమ్మనన్వలెన్." పెద్దనచాటువు.

గమ్మము. వై. వి. (సం. ఘర్మః.) చెమట. "వ. తను పునఁ జెమటలు గ్రిక్కిఱిసిన మదనసూనమావిలసనంబునం బొడమిన ప్రోడతనంబున నెంతగమ్మంబు గ్రమ్మె నని వతులకుఁ దెలియకుండం బలుకుచు..." చంద్రి. ౪, ఆ. ౧౦౨.

గమ్ము. దే. వి. వాసనకొట్టుట మున్నగువానియందగుననుకరణము. "చ. కలపపుఁదావి నల్గడల గమ్మనఁగన్..." ఉ. రా. ౬, ఆ. ౧౬౧. "ఉ. గమ్మనఁ గన్నునీ రొలుకఁగా నపు డిట్లను..." భో. ౫, ౪౨.

గమ్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁబడుచున్నది; 2. తెలియఁబడుచున్నది.

గమ్యము. సం. = గమనీయము.

గయ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకపుణ్యక్షేత్రము. (ఇందు శ్రాద్ధము పెట్టినచోఁ బితృదేవతలు తరింతురు.)

గయము. సం. వి. అ. పుం. 1. ధనము; 2. గృహము; 3. పశువిశేషము; 4. అపత్యము.

గయాళము. = గయ్యాళము. (శ. ర.)

గయాళి = గయ్యాళి. (శ. ర.) దే. వి. ధూర్తురాలు. "సీ. గట్టివా జంత ఱాఁగ గయాళి యనఁగను ధూర్తయోషాభిధ దోఁచుచుండు." ఆం. భా. ద్వి. ౧౧౨. సాం. ని. మాన. ౫. విశే. 1. క్రూరము. "గీ. సడలుపడనికడిందిదానఁగు గయాళి, బోరప్రాఁకుడుకొలములపులుఁగుఱేఁడ." అచ్చ. బాల. ౬ 3; 2. వదరుఁబోతు. "క. బాలా వేలాగుల బలి, మాలిన విన కిగ్గయాళిమ దఁతులవెంటన్, జేలవయి చనెదు..." రసిక. 3, ఆ. ౯౧. కళా. ౪. ఆ. ౬౨.

గయాళించు = గయ్యాళించు. (శ. ర.) 1. ఉద్ధతిచూపు. "మ. అనుచుం గంకణనిస్వనంబులు బెడంగై మ్రోయఁ గాంచీకల, స్వనముల్ వీనుల విందుసేయ నుసుటుంజన్నుల్ గయాళింప లోఁ, చనదీప్తుల్ చెలఁగంగఁ బైకొను..." విప్ర. 3, ఆ. ౮౯; 2. అఱచు. "గీ....అమ్మచెల్ల. వింత నావంటిదానికా యింతమాట." "గీ. అని గయాళించుకొనుచు హస్తాంబుజముల, నలరు పాపని దురమర నరిది తొట్ట, లోనఁ బడవైచి మొగమునఁ బూను గండు, తోడ బొమముడి నిగుడ నత్తోయజాక్షి." శుక. ౪, ఆ. ౪౨; ౪3.

గయాళు. దే. వి. సేద్యము చేయుటకుఁ దగనిపొలము. (శ. ర. వా.)

గయుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు; 2. షోడశమహారాజులలో నొకఁడు.

గయ్యాళము = గయాళము. దే. వి. ధిక్కారపుమాట. (శ. ర.)

గయ్యాళి = గయాళి. దే. వి. ధూర్తురాలు. "సీ. గట్టివాయి యనంగ గయ్యాళి యన ఱాఁగ యన ధూర్తసతికి నామ్నాయము లమరు." ఆం. సం. మాన. ౪. విశే. 1. ధూర్తుఁడు; ధూర్తురాలు. "గీ. ఉద్ధతులు గొంట్లు పలుగాకు లుదురుమిడుకు, లాకతాయిలు శఠులు గయ్యాళు లగుచు." హార. ౬. ఆ. ౧౦; 2. జగడగొండి. "సీ. కలహాంతె కూడుగా మెలఁగెడుగయ్యాళి నిష్ఠురత్వముఁ జూపునెఱకరాళి." శుక. 3, ఆ. ౧౮.

గయ్యాళించు = గయాళించు. దే. అ. క్రి. ధిక్కరించు. "ద్వి. అనఁటికంబముల గయ్యాళించు తొడలు." ద్వి. పారిజా. ఉ. 3౫౫. పం.

గర. ఉభ. దే. వి. 1. గడ్డ, ముద్ద. (చూ. గరవడు.) 2. రేఖావిశేషము. "గీ. రేఁక యనఁగను రేఖయై రీతి గాంచు, గర యనఁగఁ దద్విశేషమై పరఁగుచుండు. ఆ. భా. ద్వి. 3౪. సం. వి. ఆ. స్త్రీ. దేవతాళము ౕ.

గరకట్టు. దే. అ. క్రి. (గర+కట్టు.) గడ్డకట్టు. "ఉ. క్రమ్మెడుశోణితంబు గరకట్టుట..." జై. ౬, ఆ. ౧౯౬.

గరకొను. దే. అ. క్రి. (గర+కొను.) గడ్డకట్టు. (శ. ర.)

గరగ. వై. వి. (సం. కరకః.) 1. నీళ్లు త్రాగుటమున్నగువాని కుపయోగించెడు చిన్నపాత్రము. "గీ. గరగ లొసఁగిన వరుఁడు భూసురు లొనర్చు, నాచమనముఖ కర్మంబులందు షష్ఠ, భాగఫల మొందు..." భార. అను. ౨, ఆ. 3౭౮; 2. కుండ. "ద్వి. వరుణుండు తనబల్మి వర్జించి వచ్చి, గరగకావడి మోఱఁగాఁ గాచియుండు." రం. రా. సుం. (శ. ర.) "సీ...గరగతో వికులోదకములు డించి." హార. ౨, ఆ. ౧౨3; 3. గ్రామదేవతాఘటము. (వ్యవ.) ఆచాకివాఁ డమ్మవారి యుత్సవములో గరగను ధరించినాఁడు.

గరగడ. దే. వి. (గరగ+గడ.) నూనె మొదలగునవి చిన్ననోరు గలపాత్రములలోఁ బోయుటకు అడుగున నాఁదోఁకవలె క్రోవి యమర్చి చేసిన విశాలముఖపాత్రవిశేషము, గళాయి. (శ. ర.)

గరగర. దే. వి. కాంతి. "ద్వి. గాజుటోవరిలోన గరగర మీఱ,రాజిల్లు నవపుష్యరాగరత్నములు." నవ. ౧, ఆ. ౬౨ పు. ౧౮. పం. విశే. (దీనికిఁ గర్త్ధారయమున నిగాగమము వచ్చును.) 1. మేదురము, చక్కనైన నునుపైనది. (చూ. గరగరని

వాఁడు.); 2. చక్కనిది. "వ...గరగరనిజెఱి కురులు గుఱిగడవఁ బెరిఁగినవగుటం జేసి..." స్వా. ౩, ఆ. ౯; 3. పరిశుభ్రమైనది. "క. మెడమచ్చు సలఁచి యలకలు, ముడిగొని నిజపాణిపద్మములు గరగరగా, గడుగుకొని..." పాండు. ౩, ఆ. ౩౧; 4. రుచ్యమైనది. "గీ. ఏను వంటలవాఁడనై యానరేంద్రుఁ గొలిచి గరగరగాఁ గూడుగూర చిత్రములకు వచ్చినచందంబునన యొనర్చి..." భార. విరా. ౧,ఆ. ౨౬. క్రి. విశే. 1. చక్కఁగా. "ద్వి. సన్నబియ్యం బేర్చి జడికట్టకుండఁ, గన్నుల కింపుగా గరగరఁ గాఁచి..." ప్రభులిం. ౪, ఆ. ౧౫౦ పు. ౭ పం; 2. పూర్తిగా. "క. తరితీపు లేనిమోహము, గరగరగా విడువవలయు..." సు. శ. (బ్రౌ.)

గరగరన. దే. విశే. 1. సన్నమైనది. "ద్వి...నీరు వెడలి, గరగరనైన చొక్కపురాతిమీఁదఁ, బరువడి నందంద పంక్తులు సాగి." ద్వి. సిం. భాగ. ౬, ఆ. ౧౯ పు; 2. రుచ్యమైనది. "క. బిరుసింత గాక నడిమికి, మురియక సనుఁబ్రాయిపడి చిముడఁ బాఱక యే,బెరికియును లేక మిక్కిలి, గరగర నగునేఱుఁబ్రాలకళమాన్నంబుల్." జై. ౯, ఆ. ౧౯౯; 3. అందమైనది. "క. ఆగురువు చిగురుఁబోఁడి స,దా గరగరనై మనోజుతరవారి గతిన్, సోగమెఱుంగు తెఱంగునఁ, దా గేహము లోన మెలఁగుఁ దారుణ్యమునన్." వరాహ. ౨, ఆ. ౧౯. హంస. ౪, ఆ. ౯౦; 4. పూర్తియైనది. "చ...సర్వకార్యముల్, గరగరనయ్యె రమ్ము...." కాశీ. ౬, ఆ. ౯౦.

గరగరనివాఁడు. దే. విశే. (గరగర+వాఁడు) మేదురుఁడు, చక్కనై సన్ననైనవాఁడు. "గీ. మేదుర సమాఖ్య మా మినమిననివాఁడు, గరగరనివాఁడు నాఁగను గాలకంఠ." ఆం. భా. తృ. ౧౦. "గీ. గరగరనివాఁడు నవ్వమొగంబువాఁడు..." విజ. ౭, ఆ. ౧౬౪.

గరగరిక. దే. వి. 1. నైర్మల్యము. "సీ. రతిరయచ్ఛిన్న సూత్రమునఁ జిక్కక ముత్తెములు రాల గరగరికలు వహింప. గీ...వలఁతు లప్పద్మముఖులు." ఆము. ౭, ఆ. ౬౧; 2. అందము. "గీ. చెలువమెడ తుంటవిల్తునిచింద మరయ, నందు నిరుగడ వైచిన కుందనంపుసరులు పూఁబోఁడిచేతులు చాల నరయఁ,గాకయుండిన నీగరగరిక గలదె." యు. ౪, ఆ. ౪౭., కళా. ౧,ఆ. ౧౯; 3. శృంగారరసము. "సీ. గరగరిక యన సింగార మనంగను శృంగార నామంబు చెలఁగుచుండు." ఆం. భా. ప్ర. ౧౩౧; 4. అలంకారము. "ఆ. పతిప్రవాసవేళఁ బాటించుకొనవు నెమ్మేన గరగరికలు మెఱుఁగుఁబోఁడి." కళా. ౪, ఆ. ౧౭౯. ఆం. భా. ప్ర. ౧౩౧; 5. విధము. "క. పరదేశం బెఱుఁగక తగు, గరగరికల్ విడువ ముడువఁ గలిగి నడుమఁ జే,దఱికము పాటిలి తెరియన్, విఱిగిననుబోఁటి కమరునే యింతైనన్." వేం. పంచ. ౭, ఆ. ౧౩౧. విశే. 1. అందమైనది. "చ. గరగరికైనదై నెనరు గల్గినదై..." శశాం. ౪, ఆ. ౨౦; 2. పరిశుభ్రమైనది. (చూ. గరగరికతనము.)

గరగరికతనము. దే. వి. (గరగరిక+తనము.) పరిశుభ్రత. "క. దొరకైనఁ బేదకైనన్, వెరవరి యిల్లాలికైన వేశ్యకునైనన్, గరగరికతనము బాగు." కవిచౌ. శ. ౬౧.

గరగు. దే. వి. వృక్షవిశేషము. "సీ. గరగుకాయయును ముల్కకాయ యందుగుకాయ లుసిరికకాయలు ..." హంస. ౪, ఆ. ౭౩౫.

గరణము. సం. వి. అ. న. 1. మ్రింగుట; 2. చల్లుట; 3. విషము.

గరదము. సం. వి. అ. న. విషము.

గరము. సం. వి. అ. పుం. 1. వ్యాధి; 2. తడుపుట; 3. మ్రింగుట; 4. విషము; 5. కృత్రిమవిషము; 6. కంతము. న. ఒకానొకకరణము. (చూ. కరణము); 7. జలము.

గరళము. సం. వి. అ. పుం. న. 1. విషము; 2. సర్పవిషము. న. గడ్డిమోపు. [గరుడపచ్చ.

గరళారి. సం. వి. ఇ. పుం. (విషమునకు శత్రువు)

గరవడము. దే. వి. మల్లబంధవిశేషము. "వ...అబ్బలానుజుం డుబ్బి గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగంబుననుండి జానువుల నెత్తుచు నురవడిం గరవడంబున నున్న..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౪౫.

గరవడు. ద్వ్య. అ. క్రి. (గర+పడు.) గడ్డకట్టు. "సీ. కరఁగు టెన్నఁడు లేక గరవడ్డలేమంచుఁ దెచ్చి

యున్నతముగాఁ దీర్చిరొక్కొ." భో. ౭, ఆ. ౨౧౫.

గరవళము. దే. వి. మల్లబంధవిశేషము. "చ...చేబయున్, గరవళముఁ నృసింహమును గైకొని జెట్టను గాంచి వెంబడిన్." ప్రబంధ. ౮౧.

గరవ్రతము. సం. వి. అ. పుం. మయూరము.

గరాగరి. సం. వి. ఈ. స్త్రీ. దేవతాళము.

గరాగరిక. దే. విశే. అందమైనది. "చ...మదనోజ్జ్వితయై గరాగరికయై మాణిక్యపుఁ బొమ్మ యా,మని రాత్రిఁ సృజియించు నే నొకతె మస్మాహాత్మ్యవిమం జూడుమా." అహ. ౨, ఆ. ౯.

గరాధిక. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్క; 2. లక్కపురుగు.

గరాసు. వై. విశే. దుష్టుఁడు; దుష్టురాలు. "గీ. గ్రామమున కెల్ల మాలిమికాఁడ వగుట, బ్రతికిపోతివి పోర బాఁపన గరాస." శుక. ౨, ఆ. ౪౭౪. "ఉ. బిడ్డయొ పాపమో చిదిమిపెట్టినకైవడి నున్న నిన్నుఁ దా,సడ్డ యొనర్ప కవ్వలఁ బిశాచమువంటి గరాసుఁ గూడె..." శుక. ౧, ఆ. ౫౨౭. ఆం. భా. తృ. ౭.

గరి. దే. వి. అతిశయము. (చూ. గరిగొను.)

గరిఁటె. దే. వి. ఇనుము ఇత్తడిమున్నగువానితోఁ జేసిన తెడ్డు, కంబి. "ద్వి. నేయి గరింటెడుఁ బోయక యున్న." పండితా. వాద. ౨౦౩. పు. ఆం. భా. ద్వి. ౨౪౩.

గరిగ. దే. వి. కుండ, పాత్రము. "క. ఊరుయుగంబును పేరన్, బొఱెడుబంగారునీటివాఁకను రతియున్, మారఁడును జిన్నిగంగలు, సొరుగ మించి రనఁ జెలికి జానువు లమరున్." ఆం. భా. ద్వి. ౨౪౭.

గరిగొను. దే. అ. క్రి. (గరి+కొను.) 1. అతిశయించు. "ద్వి...గరిగొన్న పెనుమేఁక కంఠరక్తమున." రం. రా. యు. ౩౬౯. పు. ౫. పం; 2. అల్లుకొను. "ద్వి. లతగరిగొన్న మూలస్తంభ మనఁగ." పండితా. దీక్షా. ౮. పు.

గరిడి. వై. వి. (సం. ఖురళీ. క. గరడి.) 1. సాము "సీ. గరిడిసాధనలవేడ్కలఁ గొంతతడవు..." కళా. ౭, ఆ. ౩౪. కళా. 3, ఆ. ౧౩౦; 2. సాముసేర్చుకొనుచోటు. ఆం. భా. తృ. ౪౬; 3. అభ్యాసస్థానము. "గీ. సర్వవేదపురాణశాస్త్రముల గరిడి...సర్వమోక్షములకును సాస్పదము కాశి." కాశీ. ౭, ఆ. ౨౦౮; 4. సమీపము. "సీ. ఆసవన క్షోణియందును సరసులగరిడి నిష్టపురాణపరిచితిఁ బ్రియ,మంచెడుసమయంబున..." రాఘవ. ౨, ఆ. ౧౯. సీ. నికటఖళూరికల్ నెగడును గరిడి నా..." ఆం. భా. తృ. ౪౬. విశే. ఆరితేఱినవాఁడు. (చూ. గరిడిముచ్చు.)

గరిడికెక్కు. ద్వ. అ. క్రి. (గరిడికి+ఎక్కు.) ఆరితేఱు. "ద్వి. హరునిభక్తులయాజ్ఞ శిరమునఁ దాల్చి, గరిడికెక్కిన యంకకాఁడును బోలె." పండితా. వాద. ౧౭౬. పు.

గరిడిముచ్చు. 1. ద్వ. వి. (గరిడి+ముచ్చు.) దొంగ. వేంక. మాన. ౩౧; 2. ఆరితేఱినదొంగ. కళా. ౧, ఆ. ౪౫.

గరిడియ. వై. వి. (సం. కరండకః.) బుట్ట. "క. ఫలభారము దుర్భర మని,వెలఁది యచట నొక్కవృక్షవిటపంబున ని, మ్ముల గరిడియఁ దగిలిచి యు,జ్జ్వలపరశువుఁ గొనుచు మృదులసంభ్రమలీలన్." భార. ఆర. ౭, ఆ. ౨౬౬.

గరిడీ = గరిడి. వి. "చ...కెంపుటొడుబిళ్లలగరిడీలు శీతలశిలాతలముల్..." వసు. ౪, ఆ. ౭౨. స్వా. ౨. ఆ. ౪౩.

గరిత. వై. వి. (సం. గృహస్థా.) 1. భార్య, గృహస్థురాలు. "సీ. మూఁడు త్రోవలఁ బాఱె మున్నిటిగంతగాఁ బరఁగునేదేవునిపాదతటిని." ఉ. హరి. ౨, ఆ. ౨౪౪. ఆం. భా. ద్వి. ౧౦౫; 2. పతివ్రత. "సీ...అతనిదేవేరి సీతమ గడింది, గరితయయని జగంబుల కిది మేలుపనియేని యిమ్ముల్కి పలిచి చెనఁటి. గీ. పొలసుమేపరిగమి కానిఁ బొలియఁజేయుఁ,గాత..." అచ్చ. రా. యు. ౩౫౬; 3. స్త్రీ. "ద్వి. కదలి నే రోఁకలి గైకొన్న నవలఁ,గదలుదు రీవాడగరిత లిందఱును." ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౯౬. పం. ఆం. సం. మాన. ౯.

గరితతనము. వై. వి. (గరిత+తనము.) పాతివ్రత్యము. "క. ఈగతి మెలంగునంగన, నా గాబలదేవుఁ డెఱిఁగి లలనా రావే, బాగాయెం గద చిన్నెలు, నీగరితతనంబు గంటి నే నిష్వేశన్." శుక. ౨, ఆ. ౩౭౨.

గరితము. సం. విణ. (అ. ఆ. అ.) విషము గలది.

గరిపడు. ద్వ. అ. క్రి. (గరి+పడు.) కలియఁబడు. "గీ...నిజచ్ఛాయలప్రతి, కరులని గరిపడుట గల్గు గంధకరులు." ప్రబంధ. ౫3; ౭ర.

గరిమ. ఉభ. దే. వి. విధము. "సీ. భరతునిలాగునఁ బరశురామునిభాతి రంతిదేవునిభంగి రాముగరిమ." విక్ర. ౨, ఆ. ౬౫. సం. వి. న్. పుం. 1. బరువు; 2. గౌరవము. "ఉ. దైన్యము దక్కి దూతయుచితంబుగఁ బొందునృపాలుపాలు రా,జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా,మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొందము..." భార. ఉద్యో. ౧, ఆ. 3౨; 3 శ్రేష్ఠత్వము; 4. అణిమాద్యైశ్వర్యములలో నొకటి.

గరిమము. సం. = గరిమ.

గరిమిడి. దే. వి. 1. పందికొక్కు. "సీ. చౌరఁబడ్డ ముంగిస యఁరిఁబడ్డ గరిమిడి మునుపుగా గొల్లున మునిసిపోవ." కకు. ర, ఆ. ౯౭; 2. గఱిక, దూర్వ. "సీ...గరిమిడి గఱిక నాఁగఁ జను దూర్వ."ఆం. భా. ద్వి. ౭ర.

గరిమిడికొక్కు. దే. వి. (గరిమిడి+కొక్కు.) పందికొక్కు. "సీ...కొక్కన గరిమిడికొక్కనంగను బందికొక్కనంగను మూషికాభిద లగు..." ఆం. భా. ద్వి. ౧౬.

గరివడియము = గరివడెము.

గరివడెము. వై. వి. (సం. ఖరవటకః.) ఒకవిధమైన వడియము. "సీ. పొల్చుమాషాపూపము వడయనంగను వడియ మనంగను వడక మెసఁగు, గరివడె మనఁగను ఖరవటకం బొప్పు..." ఆం. భా. ద్వి. ౨౫౫.

గరివించు. వై. అ. క్రి. గర్వపడు. "గీ. చేర్చి గరివింప నేర్చె..."కవిక. 3, ఆ. ౨౬౬. (శ.ర.పా.)

గరిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలిబరువైనది; 2. మిక్కిలిశ్రేష్ఠమైనది.

గరిసె. వై. వి. (సం. గంజః.) ధాన్య ముంచెడుకొట్టు. గాదె. "సీ. భాండసంభారంబు పగిలించి గోడలి గోరాడి గరిసెలు కూలఁ దాఁకి." హరి. పూ. ౬, ఆ. ౧3౭. "సీ...కుసూలాభిధ గాదె యనంగను గరిసె యనఁగ." ఆం. భా. ద్వి. ౨ర౦; 2. మానవిశేషము, ఆఱువందలకుంచముల పరిమాణము. (శ. ర. వా.)

గరిసెన. దే. వి. భక్ష్యవిశేషము. "సీ ..లడ్డువాల్ గట్టెలు గరిసెన ప్రోగులు నతిరసె మెట్టు లప్పడాల కొటారులు..." శ్రీరం. మా. ౬, ఆ. ౧౧౦.

గరిసెబావి. వై. వి. (గరిసె+బావి.) గరిసెవలె చువ్వలు మొదలగువానితో నల్గి భూమిలోపలికి దింపి ఏర్పఱచు నొకవిధమైననూయి. (శ. ర. బ్రౌ.)

గరీబు. దే. వి. (హిం. గరీబ్. త. గరీబు. క. గరీబ.) 1. మహమ్మదీయులలో నొక తెగ. "గీ...ధక్కను మొగ లగరీబు పఠాణు లాది పౌఁజులఁ బలాయన మొనర్చుపటిమ గల్గు,తురకదొరలము మాకు హిందువులు భరమె."రంగా. ౨, ఆ. 3౯. రా. వి. ౫, ఆ; 2. బీదవాఁడు. (శ. ర.)

గరీయము. సం. విణ. (న్. సీ. న్ ) గురుతరము.

గరు. దే. వి. గగురుపాటు, రోమాంచము. "గీ. మేను గరు దాల్చెఁ జలి పచ్చె మెడలు నొచ్చె." కాశీ. 3, ఆ. ౧౨౧. (శ. ర. పా.' గఱుదాల్చె'ముద్రి.) శివ. రా. ౧, ఆ. ౬౧.

గరుటామంతుఁడు. వై. వి. (సం. గరుత్మాన్.) "క. గరుటాలమంతుఁ డనఁగను, గరుడుని పే ళ్లొప్పు..." ఆం. భా. ప్ర. ౫3. వేంక. దేవ. ౨౦.

గరుటాలమంతుఁడు = గరుటామంతుఁడు. "సీ. కంబ మయ్యరొ మేలు గలిగింపు నీకొక్క గరుటాలమంతుని గాను కిత్తు." య. ౨, అ. 3. ఆం. భా. ప్ర. ౫3.

గరుడకంబము. మి. వి. (గరుడ+కంబము.) 1. గరుడస్తంభము; 2. నేరమొనర్చినవానిని బంధించుటకై కొత్వాలుచావడియెదుట నుండు స్తంభము. "సీ. గరుడులను గరుడకంబాలఁ గట్టి గంధర్వుల గంధర్వతతుల నడఁచి." ఉ. రా. ౨, ఆ. ౪౯౭.

గరుడధ్వజుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

గరుడపచ్చ. మి. వి. (గరుడ+పచ్చ.) 1. మరకతము, ఆకుపచ్చవన్నెగలరత్నము. "సీ. గరుడపచ్చలచాయ గలపచ్చ గందనికూరలు శైవలాంకురము లయ్యె." నైష. ౬, ఆ. ౧౨ర. య. ర, అ. ౧౬; 2. గరుడపచ్చవన్నె గలవస్త్రవిశేషము. "గీ...,గరుడపచ్చలు నేత్రముల్ తురగ

వల్లి...మొదలుగా వల్వాలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. ౨౭౨.

గరుడము. సం. వి. అ. పుం. 1. గరుడాకారముగాఁ గట్టినయిల్లు; 2. వ్యూహభేదము.

గరుడసరులు. మి. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౨౭.

గరుడస్తంభము. సం. వి. అ. పుం. విష్ణ్వాలయము నెదుట నుండెడుధ్వజస్తంభము.

గరుడాశ్మము. సం. వి. న్. పుం. గరుడపచ్చ.

గరుడి. వై. వి. (సం. గరుడః.) గరుత్మంతుఁడు. "క... గరుడివిచిత్రాంగముపై, హరి యెక్కి వెలింగె మేన హరినీలరుచుల్." కు. సం. ౯, ఆ. ౨౯. "గీ. గరుడి యొసరించు మాకు నుక్కటశుభంబు." సాంబో. ౧, ఆ. ౪.

గరుడిరవుతు = గరుడిరౌతు.

గరుడిరౌతు. వై. వి గరుడవాహనుఁడు, విష్ణువు. "సీ. పంటవలఁతిసంటు పాపపానుపుసంటు శరిగట్టు మోపరి గరుడిరౌతు...గీ...వెన్నుఁ డన నీవు పేర్మి..." వేంక. దేవ. ౪.

గరుడుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

గరుత్తు. సం. వి. త్. పుం. పక్షము, ఱెక్క.

గరుత్మంతుఁడు. సం. వి. త్. పుం. 1. గరుడుఁడు; 2. అగ్ని.

గరుదాల్పు. దే. వి. (గరు+తాల్పు.) గగురుపాటు. "సీ...గరుదాల్పనంగను బరఁగు రోమాంచంబు..." ఆం. భా. ప్ర. ౧౪౧.

గరుపాటు. ద్వి. వి. రోమాంచము. "చ. అన విని గుండె జల్లనఁగ నచ్చెరుపాటును ఱిచ్చపాటు నెక్కొన గరుపాటునుం గమురఁ గొండొకసేపటు లూరకుండి..." శశాం. 3, ఆ. ౬౪.

గరుపాటుమొన. ద్వి. వి. (గరుపాటు+మొన.) పంది మూతి (శ. ర.) "సీ. గరుపాటుమొనఁ ద్రవ్వి కడుపుఁ బోసికొనెడుపందితోఁ బొందు నిర్బంధ మనియుం." వేం. పంచ. ౧, ఆ. ౭౩.

గరుపాఱు. దే. అ. క్రి. (గరు+పాఱు.) రోమాంచ మగు, గగుర్పొడుచు. "క. కని యుత్తరుండు గరుపాఱిన మేనును దలఁకుమనమ ఱిచ్చపడిన చూపును సై తొట్రుపడుచు, ని ట్లనియె..." భార. విరా. ౪, ఆ. ౫౧. "సీ...గరుపాఱె మైజు పర్వె నసఁగఁ,వగుచు రోమాంచసామ ముల్..." సాం. ని. మాన. ౨౪.

గరుము. దే. విశ. గులకఱాలచేత గట్టియైనది. ఉదా:— గరుపనేల. (శ. ర.) (గరపనేల = ఎఱ్ఱరాయిగుక నేల. గొడ్డునేల. బ్రౌ. వా.)

గరువము. వై. వి. 1. (సం. గర్వః.) గర్వము. "ఆ. కల్లఁ జింకఁ జిక్కె గండగొడ్డలితాల్పు, గరువ మడఁచె నతనికడిమి యసఱె." అచ్చ. యు. ౧౧౬. పారి. ౧, ఆ. ౯౦. ఆం. శే. 3౦; 2. (సం. గౌరవమ్) గొప్పతనము. "చ...నిను మది నాదరించు టిది నీదగుభాగ్యము గాదె యింత యున్, వనిత యెఱుఁగవైతి గరువంపువిచారము లేమ నీయెడన్." భార. అర. ౬, ఆ. ౪౦౫; 3. మర్యాద. "క. దూతీముఖమున గరువము, ప్రీతియుఁ బొదలంగఁ గదియుఁ బ్రియము లరయఁ గా,ర్యాతురతఁ దార పైకొను,టే తెరువునఁ గాదు చూడు మిది సెబుద్ధిన్." హరి. ఆ. ౭, ఆ. ౧౪౬; 4. విరివి, విస్తృతి. "మ. గరువం బారఁగ నీకు నిన్నియును వక్కాణింపఁగా నేటికిన్..." వి. పు. ౧ ఆ. ౧౨౯. (గరువంబారఁగ = విస్తారముగా) విశ. 1. అధికమైనది. "ఉ... ఈ.కాంతకు వంశశీలగుణగౌరవయౌవనరూప సత్కళా,వంతుఁడు కాంతుఁ డైన గరువంపుఁ దపంబు ఫలంబు నొందుఁబో." విక్ర. ౬, ఆ. ౫౧. కాశీ.౪, ఆ. ౬౯; 2. పెద్దది. "ఉ. చూతమె దాని పక్వతరశుక్తిపుటాంతర దృశ్యమౌక్తిక, వ్రాతములై వెలుంగు గరువంపుఁగొటారుల మెప్పు..." స్వా. 3, ఆ. ౯౯; 3. వివరము, స్పష్టము. "చ. వసఁటఁ దొలంగఁబెట్టి గరువంబుగఁ జెప్పుము దీనిమూలమున్." భార. ఉద్యో. ౪, ఆ. ౨౯౯.

గరువు. దే. వి. 1. చెంప. "చ. గరువున కొత్తఁ జెంగలువకచ్చు ఘటించినమాళిఁ జాట్టెఁ జెం,దిరిక చెఱంగునన్ బసిఁడితీఁగలు నించినజిల్గుఁజాగ..." స్వా. ౫,ఆ. ౫౯; 2. గట్టినేల. "ఆ. గరువు గరుసు నాఁగ ఖరభూమి విలసిల్లు." ఆం. భా. ద్వి. ౪. "వ...అచ్చటన్ గ్రొచ్చి గరువునేలల గుంట లొనరించి..." స్వా. ౪, ఆ. ౬౧.

గరుసు. యం. దే. వి. 1. మేర, హద్దు. "సీ. గరుసులు గడవంగ గదలి...గీ...పయోనిధు లొక్కటఁ, బెల్లురేఁగి జగము లెల్ల వాడిచె." భార. ఆర. ౪, ఆ. ౨౨౫. భా. రా. యం. ౨౩౦; 2. మర్యాద, గౌరవము. "క. దురమునఁ జుట్టఱికం బను,గరు సిడికొను టేల కలుగుఁ గౌరవ నాథా." భార. ద్రో. ౫, ఆ. ౧౨౩; 3. తోలు, చర్మము."సీ. దొనదొనమనుసీఁగతుట్టెలరూ పేఱు పడక క్రంపలను వ్రేలెడుగరుసులు." ఆము. ౪, ఆ. ౧౭. వై. విణ. (సం. కర్కశః. క. గరుసు.) 1. గులకతాయి. "క. జల మిక్షుఫలరసంబులు, గలువంబురుహోత్పలములు గరుసులు ముత్యం, బులు మీలు మణులు సంకుల,నవి సస్యము చెఱకు రాజనపుఁబొల మెల్లన్." కు. సం. ౭, ఆ. ౯౨౫; 2. గట్టినేల, ఖరభూమి. "అ. గరువు గరుసు నాఁగ ఖరభూమి విలసిల్లు." అం. భా. ద్వి. ౪.

గరుసెక్కు. దే. అ. క్రి. (గరుసు+ఎక్కు) మేర మీఱు, పొంగు. "క. కని మనమునఁ గోరిక ని,క్కనితాంతానందవార్ధి గరుసెక్కఁగఁ జక్కనసతి నాశిఖరికి మ్రొక్క నియోగించుచును మ్రొక్కి కౌతూహలియై." వరాహ. ౧౦, ఆ. ౪౭.

గర్గము. సం. వి. అ. పుం. 1. వృషభము; 2. వానపాము.

గర్గరి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెరుఁగు చిలికెడుకుండ; 2. కుండ. [నాదము.

గర్జ. సం. వి. ఆ. స్త్రీ. 1. మేఘధ్వని; 2. సింహ

గర్జత్. సం. శత్రు. గర్జించుచున్న.

గర్జన. సం. = గర్జ.

గర్జనము. సం. వి. అ. న. 1. మేఘధ్వని; 2. ధ్వని; 3. కోపము.

గర్జము. సం. వి. అ. పుం. 1. మేఘధ్వని; 2. ధ్వని; 3. ఏనుఁగు.

గర్జరము. సం. వి. అ. పుం. ముల్లంగి‡.

గర్జించు. సం. అ. క్రి. అఱచు. "గీ. గోండ్రు గోండ్రని గర్జించుఁ గొంతతడవు, కోరచూపుల వీక్షించుఁ గొంతతడవు." వరాహ. ౧౧, ఆ. ౭౬. వై జ. ౨, ఆ. ౭౪.

గర్జితము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు. న. మేఘధ్వని.

గర్జిలు. సం. అ. క్రి.=గర్జిల్లు. (అఱచు.) "లయగ్రాహి. నిర్జరవరప్రముఖదుర్జయుఁ డనం బరఁగు దుర్జయుఁడు...కనలి గర్జిలుచు వీఁకన్." వరాహ. ౫, ఆ. ౭౬.

గర్జిల్లు. సం. అ. క్రి. 1. అఱచు. (చూ. గర్జిలు.); 2. మ్రోఁగు. "క...బోరన దివి దేవదుందుభులు గర్జిల్లెన్." నిర్వ. ౧౧, ఆ. ౧౪౬. జై. ౬, ఆ. ౧౭౬; 3. ఉఱుము. "క...కదలె విలయకాల మేఘు మొదరి గర్జిల్లె నన..." జై. ౬, ఆ. ౧౩౫.

గర్త=గరిత. (భార్య.) "చ. విను మొకబ్రాహ్మణుండు కులవృత్తము పెంపు దొఱంగి బోయదా,సి నొకత గర్తఁ జేసికొని..." భార. శాం. 3, ఆ. ౪౭౨.

గర్తము. సం. వి. అ. పుం. 1 గొయ్యి; 2. పిఱుఁదుల మీఁదిగుంత; 3. త్రిగర్తదేశము.

గర్తాటము.సం. వి. అ. పుం. 1. పందికొక్కు; 2. ఎలుక.

గర్తిక. సం. వి. ఆ. స్త్రీ. సాలెవాఁడు నేత నేయుం చోటు.

గర్దభము. సం. వి. అ. పుం. 1. గాడిద; 2. గంధద్రవ్యవిశేషము. న. తెల్లగలువ.

గర్దభాండము. సం. వి. అ. పుం. 1. కలుజువ్వి‡; 2. పిప్పలి‡.

గర్దభి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుగాడిద; 2. పేఁడపురుగు; 3. తెల్లవ్రాఁకుడుచెట్టు.

గర్ధన. సం. వి. ఆ. స్త్రీ. = గర్ధనము.

గర్ధనము. సం. వి. అ. న. తృష్ణ, పేరాస.

గర్ధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గృధ్నువు, పేరాసగలవాఁడు.

గర్ధము. సం. వి. అ. పుం; 1. తృష్ణ; 2. యాచన; 3. గర్దభాండము‡.

గర్ధి. సం. విణ. (న్. నీ. న్.) పేరాస గలది.

గర్ధించు. సం. అ. క్రి. పేరాసపడు. "సీ...లోభంబ యది...ధర్మంబు గలఁచి నరుని,బ్రుయిమారి యేమిటికయినను గర్ధించువానిఁగా సమకట్టు..." భార. శాం. 3, ఆ. ౩౯౯.

గర్భకము. సం. వి. అ. పుం. తలవెండ్రుకలలో ముడుచు కొన్నపూలదండ. న. ఒకరాత్రి మునిగియుండుటకుఁ గలకాలము, రజనీద్వయము. (విల్యమ్సు.)

గర్భచ్యుతి. సం. వి. ఇ. స్త్రీ. గర్భస్రావము.

గర్భపాకి. సం. వి. న్. పుం. అఱువదిదినములలో పండువరి.

గర్భము. సం. వి. అ. పుం. 1. కుక్షి,కడుపు; 2. కడుపులోనిపిండము. చూలు; 3. శిశువు; 4. గర్భారంభకాలము; 5. అగ్ని; 6. నాటకసంధులలో నొకటి; 7. కడుపులోనిశిశువు; 8. పనసముల్లు; 9. అపవరకము,లోపలిగది; 10. సంతానము; 11. లోపలిభాగము; 12. శుక్రము; 13. సమూహము; 14. సారము; 15. కచాదులయందు గట్టుకొనినపూలదండ.

గర్భవతి. సం. వి. ఈ. స్త్రీ. చూలాలు.

గర్భాగారము. సం. వి. అ. న. 1. గర్భాశయము; 2. లోపలిగది; 3. పురుటిల్లు; 4. దేవాలయమున దేవతావిగ్రహ ముండుచోటు.

గర్భాధానము. సం. వి. అ. న. 1. గర్భము కలిగించుట; 2. గర్భోత్పత్తికై కావించుసంస్కారవిశేషము.

గర్భాశయము. సం. వి. అ. పుం. స్త్రీశరీరమున భ్రూణ ముండుచోటు; 1. గర్భమును బుట్టుకొనియుండుసంచి, మావి.

గర్భిణి. సం. వి. ఈ. స్త్రీ. చూలాలు.

గర్భీకరించు. సం. స. క్రి. 1. కను. "సీ. శక్తి గర్భీకరించకయుండెనే నరుంధతి నొక్కగతి నీ డనంగవచ్చు, జనులు నిందింప మందులఁ గాంచకుండెనే ఛాయఁ గొంతసమంబు సేయవచ్చు." ఉ. రా. ౧, ఆ. ౩౯; 2. ఆదరించు. "ద్వి. శరణన్నపశువుల సత్కృపఁ గాచు, బిరుదు దలంచి గర్భీకరించుకొని, శరణార్థి యనుటయే చాలు నా కనుచుఁ, బరిపాలనము సేయ భారంబు మీది." ప్రభులిం. ౩, ఆ. ౧౦౧. పు. ౧౮. పం.

గర్ముత్తు. సం. వి. త్. స్త్రీ. 1. గంటె, తృణసస్యవిశేషము; 2. బంగారు; 3. తీఁగ.

గర్వము. సం. వి. అ. పుం. 1. అహంకారము; 2. ఒకానొకవ్యభిచారిభావము. (అలం.); 3. గర్వపుమాట. "మ...వారికి దగం బాలీక గర్వంబులాడిన..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౬౬.

గర్వాడు. అ. క్రి. మేయు. "సీ...గర్వాడె నాఁగ మేపుమేసె ననుట దనర్చును..." ఆం. భా. కృ. ౯౭.

గర్వి. సం. విశే. (సీ. న్. సీ.) గర్వము గలవాఁడు.

గర్వించు. సం. అ. క్రి. గర్వపడు. "స్రగ్ధర...దైత్యులు ద్రిక్తులై సంవిద్ధోరంధర్వవృత్తిన్ వెసం గవిసిరి గర్వించి రీవేల్పు లంచున్." వరాహ. ౧౧,ఆ.౬౨.

గర్వితుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) గర్వించినవాఁడు.

గర్సు = గరుసు. (మేర, హద్దు.) మార్క. ౨, ఆ. ౧౨.

గర్హ. సం. వి. ఆ. స్త్రీ. నింద.

గర్హణ. సం. వి. ఆ. స్త్రీ. నింద.

గర్హణము. సం. వి. అ. న. నింద.

గర్హించు. సం. స. క్రి. నిందించు. "వ...వారలు కొనియాడుమంత్రంబులు గర్హించితి..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౦౧. మార్క. ౫, ఆ. ౭౬.

గర్హితము. సం. విశే. (అ. ఆ. అ.) నిందింపఁబడినది.

గర్హ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిందింపఁదగినది.

గఱగఱ. దే. వి. భక్ష్యవిశేషములు నమలుటయందగు ధ్వని కనుకరణము. (వ్యవ.—వాఁడు వడుగులు గఱగఱ నమలుచున్నాఁడు. శ. ర.)

గఱగొఱ. దే. వి. తక్కువ. "చ. తఱిమి సుశర్మ తమ్ములును దాను వచ్చి నాజికి నన్నుఁ బిల్వ నే, నెఱుఁగనియట్టు లుండుట టిది యేపురుషార్థము వారి నెల్ల నే, డ్తెఱ నుఱుమాడఁ బంపుము కడిందిగఁ జూడకు నీకు నేమియుం, గఱగొఱ గాదు పోమి గడుఁ గష్టము నాకు నుదాత్తమానసా." భార. ద్రో. ౧, ఆ. ౨౨౩. విశే. తక్కువయైనవాఁడు. "క. గరగరిక నిన్ను నైనం, గఱగొఱగాఁ జేయు నేమి గణుతింపఁ జెలిన్." సావి. ౨, ఆ. ౭౨.

గఱి. యుం. దే. వి. గఱుకుఁదనము. వా:—పిల్లివాలు కకు గఱి యెక్కువ. విశే. గఱుకు. (చూ. గఱిగమ్మ.) వై. వి. (సం. గరుత్.) 1. పక్షము, ఱెక్క. "సీ. పర్జన్యుశరణంబు ప్రాపించి గఱులతోఁ జదలఁ గ్రుమ్మరుశిలోచ్చయ చయంబో." కృ. శకుం. ౧, ఆ. ౩౭. ఉ. రా. ౬, ఆ. ౧౬౦; 2. బాణము మొదలగువానిఱెక్క. "మ...విచక్రుండు నత్తఱి నేసెం దెగ నిండ నారసములన్ దైత్యారివక్షంబునం,గఱి దోఁపన్ హరియుం భుగుల్ భుగులుగాఁ గ్రక్కెన్ వెసన్ నెత్తురుల్." ఉ. హరి. ౪, ఆ. ౨౩౧. వరాహ. ౪, ఆ. ౯౩.

గఱిక. దే. వి. దూర్వ, తృణవిశేషము. "వ... మెత్తనిగఱిక మేసి పోసరించి..." ఆము. ౪, ఆ. ౩౫. సాం. ని. స్థా. ౬౧.

గఱికచెక్కు. దే. వి. (గఱిక+చెక్కు.) పచ్చికతోడి మట్టిపెల్ల. (శ. ర.)

గఱికమోడిచెక్కు = గఱికచెక్కు. (బ్రౌ. శ. ర.)

గఱికసూదులు. దే. వి. బ. (గఱిక+సూదులు) శాలిధాన్యవిశేషము. (శ. ర.)

గఱిగమ్మ. దే. వి. (గఱి+కమ్మ.) అంపమువలె గఱుకైనయంచులు గలతాటికమ్మ. (బ్రౌ. వా.)

గఱిచిప్ప. దే. వి. (గఱి+చిప్ప.) ముత్యపుఁజిప్ప. (శ. ర.)

గఱిచిలుకు. దే. వి. (గఱి+చిలుకు.) ఱెక్కలు గట్టిన బాణము. "క...గఱిచిలుకులు విడ్డు లోనుగాఁ గొంచు వెసన్." య. ౧, ఆ. ౪౨.

గఱుకు. దే. వి. కొడవలిలోనగువానికక్కు. "గఱుకుల కత్తిలంబు గాద్దకేల." (శ. ర.) విశే. గఱగఱగలది. గఱుకుకాకితము. (వా.)

గఱుగు. దే. వి. వృక్షవిశేషము. (శ. ర. బ్రౌ.)

గఱువ. వై. విశే. (సం. గురుః. క. గరువ.) 1. మర్యాద గలది. (చూ. గఱువతనము); 2. గంభీరము. (చూ. గఱువతనము.); 3. గొప్పవాఁడు. "చ...గఱువల్ చవిగానికథ ల్వచింతురే." ప్రభా. ౩, ఆ. ౫; 4. పెద్ద. "వ...మిక్కిలి నక్కఱపడి వేఁడక ప్రోడ లగుగఱువ లిరువురేకాంతమాడుచోటికి కేటికిఁ బోయెదరు..." ప్రభా. ౩, ఆ. ౫౨; 5. ప్రౌఢము. (చూ. గఱువతనము.)

గఱువతనము. ద్వి. వి. (గఱువ+తనము.) మర్యాద. "వ...జాదరియాలికి గఱువతనం బెక్కుడియది ..." భార. విరా. ౨, ఆ. ౧౫౩. నిరం. ౩, ఆ. ౩౧; 2. గాంభీర్యము. "గీ. ధీరయై యిట్టు సమ్మదపూరమునకు, గఱువతన మను బలితంపుఁ గట్ట పెట్టి, వెలఁది యెఱుఁగనియదివోలె వికృతి లేక,యల్ల నెప్పటియట్టుల యరుగుటయును." భార. విరా. ౩, ఆ. ౫౫; 3. శౌర్యము. "తే. చూచి వారలతేజంబు సొంపువెంపు, గరువతనమును దను భీతుఁ గా నొనర్ప." ఉ. రా. ౫, ఆ. ౫౩; 4. ప్రోడతనము. "వ...రాగవల్లరి యాగఱువతనంబులాగు వేగరితలందు చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాదమేదురనిరీక్షణంబుల నీక్షించి..." ప్రభా. ౩, ఆ. ౫౨.

గఱ్ఱు. దే. వి. త్రేఁచుటయందగుధ్వని కనుకరణము. "ఆ...అమ్మునీశ్వరుండు, గడుపుఁ దడవికొనుచుఁ గఱ్ఱునఁ ద్రేఁచిన,నసుర జీర్ణమయ్యె నాక్షణంబ." భార. అర. ౨, ఆ. ౩౪౫. కాశీ. ౪, ఆ. ౨౩౭. (దీనియామ్రేడితరూపము గఱ్ఱుగఱ్ఱు.) చంద్రా. ౬, ఆ. ౧౦౦.

గఱ్ఱి. దే. వి. మత్స్యములఁబట్టెడు సాధనవిశేషము. (దీనియాకారము తిఱ్ఱివంటిదికాని యిది మిక్కిలి పెద్దది. శ. ర.)

గలఁతియ. వై. వి. (సం. గళంతికా) చెంబు,పాత్రము. "చ. అలికులవేణియో రోకసిహస్తములన్ ముఖమజ్జనాంబువుల్, గలఁతియ యెత్తి పోయ నవి గార్చుచుండె నతండు దోయిటన్." సైవ. ౬, ఆ. ౧౧౨. ఆం. భా. ద్వి. ౨౪౭. "చ...దీని చన్గలఁతియఁ జంద్రరేఖ లిడఁగా..." సాంబో. ౫, ఆ. ౩౦౨.

గలఁతె = గలఁతియ. "సీ...తగు గళంతిగ గలంతె గరిగ యన." ఆం. భా. ద్వి. ౨౪౭.

గలగల. దే. వి. భూషణములు మొదలగునవి కదలుటయందగుధ్వని కనుకరణము. "చ. గలగల మ్రోయుచునందెలును గజ్జెలు మువ్వలు పైఁడియుంగరంబులు..." కళా. ౬, ఆ. ౧౯౯; 2. వృక్షాదులు కదలుటయందగుధ్వని కనుకరణము. "ఆ. గగనభాగ మెంతగల దంతట నగంబు, లాడఁజొచ్చెఁ దెచ్చునపుడు కపులు, వరుస కెగుర నెగుర వైవఁగా గలగలఁ, గలుకసాననములు గ్రక్కదలఁగ." రామా. ౭, ఆ. ౧౨౭. ప్రబంధ. ౧౯౬.

గలతరించు. దే. అ. క్రి. (మేను) జల్లుమను. (ఉదా: నా కొడలంతయు గలతరించుచున్నది. శ. ర.)

గలబ. దే. వి. (హిం. గలబా.) 1. జగడము. "వ... ఈమహోత్సవంబులలో నిట్టిగలబలు సేయుదురే బలుబంట్లకు సందిక్రంత జగడంబులు వల దని ..." ద్వా. ౭, ఆ. ౩౦; 2. దుండగము. "ద్వి. క్రతుకర్మములకు విఘ్నములు గావించి, క్షితిమీఁద గలబలు చేయుఁ డెల్లెడల." దీ. భాగ. ౭, స్కం.

(శ. ర.); 3. అల్లరి. "సీ. గలబ గాకుండ వేల్పుల నొక్కనొకనిగా ధనరాజువెలినుండి యనుపు వాఁడు." కువల. ౧. ఆ. ౬౦. ద్వా. ౭, ఆ. ౬౪.

గలబరించు. దే. అ. క్రి. కలఁగు. (ఉదా. నాకు బుద్ధి గలబరించుచున్నది. శ. ర.) [నీయకుము.)

గలబా = గలబ. (ఉదా:—బాలురను గలబా పడ

గలబెల. దే. వి. రొదచేయుటయం దగుధ్వని కను కరణము. దశ. ౫, ఆ. ౧౫౯.

గలి. సం. వి. ఇ. స్త్రీ. 1. లత; 2. శక్తి కలిగియుం బరువు మోయనియెద్దు.

గలిజేరు. దే. వి. మూలికావిశేషము, పునర్నవశీ. ఆం. భా. ద్వి. ౬౯.

గలిజేరు = గలిజెరు. "సీ. గలిజె రనంగను గలిజే రనంగఁ బునర్నవసంజ్ఞగా నమరియుండు." ఆం. భా. ద్వి. ౬౯.

గల్జేరు = గలిజేరు. "సీ...గలిజేరు గుంటగల్జేరును దంతి బందారు నేల,తంగెడు..." హంస. ౪, ఆ. ౧౦.

గలిబిలి. దే. వి. 1. సందడి. "క...మానులు దమలో, గలిబిలి చాలించి కన్నుఁగవలు దీఱన్, గొలు వను మ్రొక్కను బొగడన్, దలఁపులు పురికొలుపఁ జూచుతఱి..." శ్రీరం. మా. ౬, ఆ. ౨౭; 2. కలఁత. (చూ. గలిబిలిసేయు.)

గలిబిలిసేయు: దే. అ. క్రి. (గలిబిలి+చేయు.) కలఁచు,"క. ఎలమి గలలక్ష్మి యొకనికిఁ,గలిగిన నది యంచి కుడువఁగాఁ గూడి యనేకులు వెక్కు ళంగులం గలి,బిలిచేయుదు రతనిమనసు భేదించి తగన్." దశ. ౧౧, ఆ. ౧౯.

గలీబు. దే. వి. (హిం. గలాఫ్.) 1. తలగడ పఱుపు మొదలగువానికి తొడుగుగానెన. (శ. ర. వా.) 2. కత్తియొఱ. "ఉ. అజనకేంద్రుకన్యరుచిరాంగ విలాసముఁ జూచినంతలో, లేఁజిగురాకునిద్దపు గలీబున నుంచినతమ్మిఱేకుఖం,డా జళిపించి మారుఁడు తటాలునఁ బేరెదఁ జూచి వైవఁగా, రాజనృపాలశేఖరుఁడు రామనృపాలుఁడు సొక్కి సెమ్మసిన్." దశా. ౭, అ. ౨౧౧; 3. కత్తియొఱకు తొడుగుగానెన. "సీ. కోశసమాచ్ఛాది కొఱలు గలీబన..."ఆం. భా.ద్వి.౨౧౫.

గల్భము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దిట్టమైనది; 2. గర్వము గలది.

గల్ల. దే. వి. 1. ఖొల్ల; 2. మాదిగవాఁడు తోలు నానవేసెడుచట్టి. (శ. ర.)

గల్లకము. సం. వి. అ. పుం. 1. మద్యపానపాత్రము; 2. ఇంద్రనీలమణి.

గల్లము. సం. వి. అ. పుం. గండస్థలము, చెక్కిలి.

గల్లు. దే. వి. భూషణాదులు మ్రోయుటయం దగు ధ్వని కనుకరణము. "సీ. కరకంకణంబులు గల్లనఁ జెలు విరుకోపులఁ జేతి పిచోపు లిడఁగ." శశాం. ౪, ఆ. ౧౪౨. (దీనియామ్రేడితరూపము గలు గల్లు, గల్లుగల్లు.) కృ. శకుం. ౩, ఆ. ౩౫. హర. ౫, ఆ. ౫౧.

గల్లుర = గల్లు. [౫, ఆ. ౫౧.

గల్లురుమను. దే. అ. క్రి. గల్లుమని ధ్వనిచేయు. "సీ. ఇక్షెల్ల బెదరంగ గల్లురుమను." సావి. ౧, ఆ. ౫౯.

గల్వర్కము. సం. వి. అ. పుం. 1. స్ఫటికము; 2. ఇంద్రనీలమణి; 3. మద్యపానపాత్రము.

గవఁకు =గవను. (గోపురము.) "సీ. అవనీశ్వరోత్తమ యప్పురంబున నాల్గువంకల నున్నగవఁకులు వినుము...అతోమ్మిదిగవఁకులనుపడిదిక్కున నేడుఁ గ్రిందిదిక్కునను రెండు నయి యుండు..." భాగ. ౪, స్కం. ౭౬౭. "సీ...గవఁకు గవను నాఁగఁ గలవు గోపురసంజ్ఞలు..." ఆం. భా. ద్వి. ౨౧.

గవగవ = గబగబ. వి. కవియుట మొదలగువానియం దగునుకరణము. "క. గవయుం గవ యాద్వైతమిఁ, గవయం గవయంబు మీఁద గవగవఁ గవయం,గవి యుంచినజాగిలములఁ, గవియంగానీఁడు భర్త కరుణాన్వితుఁడై." కృ. శకుం. ౧, ఆ. ౬౬.

గవతము. దే. వి. కసవు. "సీ...గడ్డి గాదము గవతము కసపు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ..." ఆం. భా. ద్వి. ౭౬.

గవను. దే. వి. ఔ. పురద్వారము, గోపురము. "సీ. కేశవస్వామిలోఁగిలి పరామర్శించి - కాలభైరవ దేవుగవను జూచి." కాశీ. ౨, ఆ. ౪౧. రామా. ౯, ఆ. ౬౯.

గవనికాపరి. (గవను+కాపరి.) దే. వి. పురద్వారపాల కుఁడు. "గీ. అరిగి మెల్లన గవనికాపరులచేత,

నేలికఱుఁ దమరాకడ యెఱుఁగఁ జెప్పి..." సీతా. ౨, ఆ. ౪౭.

గవయము. సం. వి. అ. పుం. సురుపోతు. "మ. రతిరాజుద్ధతిమీఱ నొక్కపరిఁ గోరాజాశ్వని న్నొత్తఁ బోనకని స్నీవును వేగ నొత్త గవయం బాంబోతును దాకి యుగ్రక్షఁ బోరాడఁగ నున్నయన్నడిమి లేఁగలొత్వెలె క్రోశానల, స్థితిపాత్రై మెఱపెట్టినక్ మనుపవే శ్రీకాళహస్తీశ్వరా." కాళ. శ. ౭౦.

గవయి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగవయము.

గవర. వై. వి. (సం. గారక.) కొలఁదియెఱుపు. విణ. కొంచెమెఱ్ఱనిది. "ద్వి. రవరవ తాంబూలరాగంబుతోడ, గవరలై యున్న చక్కనివంతములును." ద్వి. పరమ. 3, ఆ. ౧౭౭. పు.

గవరవ. వై. వి. (సం. గౌరక.) కొలఁదియెఱుపు. విణ. కొంచెమెఱ్ఱనిది. "సీ. కడుపు మండించునాఁకటి చిచ్చుసెగదాఁకి గవరనై యున్న కన్నవలవారు." శైవ. ౭, ఆ. ౫3. "ద్వి. గవరనిపనపులఁగ్రాల్పులి గోష్ఠ." పండితా. పర్వ. 3౧౭. పు. ౧౨. పం.

గవలము. సం. వి. అ. పుం. దున్నపోతు. న. దున్నపోతుకొమ్ము.

గవలి. సం. వి. ఈ. స్త్రీ. గేదె.

గవాంపతి. సం. వి. ఇ. పుం. 1. ఎద్దు; 2. సూర్యుఁడు; 3. అగ్ని; 4. పసులకాపరి.

గవాక్షము. సం. వి. అ. పుం. కిటికీ.

గవాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. పిన్నపాఁపరబీ; 2. బుడమబీ.

గవాగ్రము. సం. వి. అ. న. గోసమూహము.

గవాదని. సం. వి. ఈ. స్త్రీ. 1. పసులకసవుతొట్టి; 2. పెద్దపాఁపరబీ.

గవామృతము. సం. వి. అ. న. ఆవుపాలు.

గవి. దే. వి. (క. గవి. త. కెవి. హిం. గవ్వ.) 1. గుహ. "మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్డు మెఱపంగాఁ గాంచి రా జేసె..." స్వా. ౪. ఆ. ౪౬. రామా. ౭, ఆ. 3౪; 2. గుంట, ఖాతము. "గీ. ఊఁతయలజల్లఁ జెఱువుల నుండరాక, కాల్గొనల్లసెగల్లను గవులు విడిచి, తరలి చెంతలనూతిగుంతల వసించె." వేం. పంచ. ౧, ఆ. ౨౫౪. ఆం. భా. ప్ర. ౧౪౬.

గవిలెము. దే. వి. గంధములో రాచి కలిపెడువిత్తు. (శ. ర. సోపువంటి పరిమళపదార్థము. బ్రౌ.)

గవుండ్లవాఁడు = గాండ్లవాఁడు. వి. సారాయమ్ము వాఁడు. (కల్లుగీచువాఁడు అని కొందఱు. శ. ర.)

గవుఁడు = గౌఁడు. (చూ. గౌఁడు.)

గవుకున. దే. అవ్య. ద్రు. తొందరతో, అనాలోచితముగా. (గబుక్కున అని వాడుక.) "గీ. అట్టి నన్నును జేరి భయంబు లేని,పోలుపుతో నున్న దీపువుఁబోణి చెంత, ననుచు గవుకునఁ బట్టరాదరయవలయు, యోజన యొనర్చి చేయుట రాజనీతి." శుక. ౨, ఆ. ౨౪౯.

గవుడపేరు = గౌడపేరు. వి. కంఠభూషావిశేషము. "సీ. తరుణమైహయరాజసంతాన్ఠిపటలంబు గవుడపేరుగఁ జేసి కట్టె నఱుత." క్రీడా. ౧౨౭.

గవుడసరము = గౌడసరము. "ద్వి. ముత్తైపుఁ జేరులు ముంగామురములు, నొత్తులు రాజులు నొడ్డైనపసులు గవుడసరాలు బంగారుకడెములును, సవరని రత్నాల సందిదండలును." ప్రభులిం. ౪, ఆ. ౧౪3. పు.

గవుద = గౌద. (చిబుకము.) "సీ...ముక్కు, నువుఁబువ్వ చెవులు శ్రీల్ నునుఁబండ్లు మొల్ల లధర మిగు ల్చక్కు లద్దములు గవుద,తాటిగింజ..." ప్రబంధ. 3౯౭.

గవుదకట్టు = గౌదకట్టు. (చూ. గౌదకట్టు.)

గవుర = గౌర. (చూ. గౌర.)

గవురు = గౌరు. (చూ. గౌరు.)

గవులు=గౌలు. 1. (గంధము, వాసన.) "ఆ. కంపు గబ్బు గవులు గందంబు వల పస,గంధ మొప్పు..." ఆం. భా. ప్ర. ౧౦౬; 2. (దుర్గంధము, చెడువాసన.) "చ. పొలసుగవుల్ కడుం గదురఁ బొట్టఱుఁ గల్గె నటంచు నార్చుచున్, సొలయక వచ్చుతాటకఁ గనుంగొని..." య. 3, ఆ. ౭.

గవుసెన = గౌసెన. (వీణ విల్లు ఉఱుపు మొదలగువానికిఁ దొడుగుగలీబు.) "గీ. ఘనకచములను గిన్నెరకాయలకును, బట్టుపయ్యెద గవుసెనబాగు సూప, సకలసౌభాగ్యలక్షణచారుమహిమ, నల్ల సిల్లెడుకన్యక నోర్తుఁ దెచ్చి." వి. పు. ౨, ఆ. ౧౯౬. హరి. ఉ. 3, ఆ. ౧౫౯.

గవుళి = గౌళి. (చూ. గౌళి.)

గవేధువు. సం. వి. ఉ. స్త్రీ. అడవిగోధుమలు.
గవేషకుఁడు. సం. విశే. (అ. షికా. అ.) వెదకువాఁడు.
గవేషణ. సం. వి. ఆ. స్త్రీ. వెదకుట.
గవేషణము. సం. వి. అ. న. = గవేషణ. [వెదకునది.
గవేషము. సం. వి. అ. పుం. వెదకుట. విశే. (అ.ఆ.అ)
గవేషించు. సం. స. క్రి. వెదకు. "దండకము. శ్రీనాథనాథా...నీపాదయుగ్మంబు యుష్మన్ముఖాంభోజనీడోద్గతంబైనవేదాండజశ్రేణిచేతన్ గవేషించి సంప్రాప్తులై యుందురు..." భాగ. 3, స్కం. ౨౦౩.
గవేషితము. సం. విశే. (అ. ఆ. అ.) వెదకఁబడినది.
గవ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవులమంద; 2. గోరోజనము; 3. రెండుక్రోసులదూరము.
గవ్యము. సం. వి. అ. న. 1. పసులు మేయుపొలము; 2. అల్లెత్రాడు; 3. రాగద్రవ్యభేదము. విశే. (అ. ఆ. అ.) 1. ఆవునకు హితమైనది; 2. గోవు సంబంధమైనది. (పంచగవ్యములు. పాలు, పెరుఁగు, నెయ్యి, పంచితము, పేఁడ.)
గవ్యూతము. సం. వి. అ. న = గవ్యూతి.
గవ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. రెండుక్రోసులదూరము.
గవ్వ. దే. వి. 1. వరాటిక. "సీ. ఎడమలోచనము గ్రుడ్డైగసి గవ్వయుఁబోలె నట్టూఁకలూఁగుచు నుండఁగాక." కాశీ. ౪, ఆ. ౧౯౭. ఆము. ౪ ఆ. ౩౯; 2. ఒకానొకనాణెము. "మ. చరమాశానికషోపలాంచలమునన్ సంధ్యాప్రకాశోదయం, బౌరఁ గావించి విరించిచేఁ గొనినసూర్యాండస్వదార్వన్నెబంగరపుంబూదియకై వియద్విపణి పేర్కన్ గాలమన్మబ్బు చెచ్చెరఁ జెల్లించినగవ్వ చౌక మన మించెం దారకాచక్రముల్." నైష. ౮, ఆ. ౧౯౯.
గళికము. సం.వి.అ. పుం. 1. నూనెమొదలగువానిమడ్డి, 2. ఒకవిధమగుమేకు.
గవ్వసరులు. దే. వి. బ. (గవ్వ+సరులు.) ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౭౮.
గస. వై. వి. (సం. కాసః. త. కశం.)ఉబ్బసము.(శ.ర.)
గసగస. వై. వి. (సం. గసకః. క. గసగసె. త. కసకసా. హిం. కష్ఖాష్.) సస్యభేదముళ్. బ. 1. గసగసవిత్తులు. "గీ. జాజికాయలు జాపత్రి చాఱపప్పు,సెనగ లనుములు గసగసల్ మునగపువ్వు, మనసవిత్తులు కొత్తిమిర మందసాల, సూజితెత్రానిన మదముబ్బుఁ జేరువేళ." హంస. ౫, ఆ. ౧౩౧. 2. భక్ష్యవిశేషము. "వ...గసగసలుఁ జెసరపప్పులగములుఁ జెఱకుగుడములు..." కాశీ. ౭, ఆ. ౧౮౬. ఆం. భా. ద్వి. ౧౬౧.
గసగసాలు=గసగసలు. (గసగసవిత్తులు.) "సీ. వెదుపఁ బ్రాలును జాతిపదనికల్ గసగసాల్ జల్లిమెకప్పఁ బాలుఁ జాఱపప్పు." య. ౧, ఆ. ౧౦౩.
గసాబు. దే. వి. తుపాకీవంటియుద్ధసాధనవిశేషము. "ద్వి. క్రోవులు జబురుజంగులు ఫిరంగులును, ఖనక్రోవులును గసాబులు తుపాకులును, వసుధ లీలఁగ నొక్కవడిఁ గాల్చి..." అ. మ. క. 3, ఆ. ౧౭౧. పు.
గసి. వై. వి. (సం. గశికః.) 1. ఒకవిధమగుమేకు. "సీ. పసి గసి మే కన వసుధ శంకు. గీ. భేదనామంబు లగు..." ఆం. భా. ద్వి. ౨౧౮. రం. రా. యు. ౩౬౫. పు. ౧౨. పం; 2. ఒకానొక వేఁటసాధనము. "ఆ...పసులు గసులు...అవి గాఁగ దెచ్చి రాటవికులు." పిన. శకుం. ౧, ఆ. ౧౧౬. హరిశ్చ. ౨, ఆ. ౬; 3. నూనె కాఁచిన నెయ్యి మొదలగువానిమడ్డి. "సీ...గసినాఘృతాదికల్కంబు దనరు."ఆం. భా. ద్వి. ౨౯౯.
గసిక. వై. వి. (సం. గశికమ్.) 1. త్రవ్వుట కనువుగా కొన చెక్కినకొయ్య. (శ. ర. వా.); 2. శూలము. "ద్వి...మానవమాంస, ఖండంబు లొండొండ గసికల గ్రుచ్చి,కమ్మఁగాఁ గాల్చి చంకను బెట్టి మెసఁగి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౬. ౨౪; 3. మొన గలుగునట్లు చెక్కినకొయ్య బాణము. "గీ. గసికకోలలు గొని భిల్లబిసరువాతు, లడవిఁ దిరుగుదు రాత్మనాయకులఁ గూడి." కాళ. 3, ఆ. ౧౫; 4. ఒకవిధమైన మేకు. "గీ. కన్నుఁగవ సూదిగోరుల గసికఁగొట్టి మలముమూత్రంబుఁ ద్రావించి మాటిమాటి, కన్నిఁ బడవైచి వేఁతురాయముసిభటులు, మద్యపానంబు చేసినమానవులను." శేష. 3, ఆ. ౯.
గసిబిసి = గజిబిజి. దే. విశే. 1. మిక్కిలి చెదరినది. "చ...అసురులమాయ లన్నియును నట్టవశాత్తుఁడు వచ్చినంతనే, గసిబిసియై నిరర్థ మయి గ్రక్కునఁ బోయెను నిద్ర నొంది సంతసమున

మేలుకొన్నగతిఁ దాల్చి కెలంగిరి వేల్పు లంద ఱున్." భాగ. ౧, స్కం. 3౪3: 2. వ్యత్యస్తము. క. లసితాలంకృతి సంధులు, గసిబిసియై చెదర కుండఁ గల్పించినఁ బొం,డెసఁగెడుసంయోగం బది,రసికులు నరసింహసంకరం బనఁ బరఁగున్." కావ్యా. 3. ప్ర. ౯. బస. ౭, ఆ. ౯౧౫. పం; 3. కలఁగినది. "సీ. ముసలపాతంబుల గసిబిసిగా మొత్తి సునిశితోద్యతపరశువుల నఱకి." రం. రా. యు. ౧౨3౯. పం.

గసిబిసిచేయు. దే. స. క్రి. (గసిబిసి+చేయు.) కలఁచు. "గీ...అయ్యవనివిభుని, వ్రతము లన్నియుఁ గొనిపోయి పఱదఁ గలిపి, చిత్త మంతయు గసిబిసిచేసి విడిచె." భో. ౨,ఆ.౧౦౦.

గస్తాలు. దే. వి. బ. మల్లవిద్యావిశేషము. "సీ. మసును జెట్టి యనంగ మల్లాభిధానంబు తద్విద్య సామనఁ దనరుచుండుఁ,గస్సాతలు పుటముల్ గస్తాలు మండిలు...రాజిల్లుఁ దద్భేదనామంబులు." ఆం. భా. ద్వి. ౨౦౭.

గస్తీలు. దే. వి. బ. (గస్తు+ఈలు.) కావలివారు. ఉదా. పైగస్తీలు వచ్చినారు. (శ. ర.)

గస్తు. దే. వి. (హిం. గస్తు. క. గస్తు.) రాత్రివేళ దొంగతనము లోనగునవి జరుగకుండుటకై కావలి ఊరు తిరిగి కాచుకావలి. "గీ. కుశలగతి మజ్జనము లాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్థ రాత్రివేళ, ఖడ్గఖేటకపాణులై గస్తు దిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు." వేం. పంచ. 3, ఆ. ౧౯౭. రంగా. ౨, ఆ. ౧౯౦.

గహనము. సం. వి. అ. న. 1. అడవి; 2. గుహ; 3. దుఃఖము; 4. జలము. విణ. (అ. ఆ. అ.) 1. దట్టమైనది; 2. చొరరానిది; 3. ఎఱుఁగరానిది.

గహ్వము. సం. వి. అ. న. 1. గాంభీర్యము; 2. పోవుటకు శక్యము గానిచోటు.

గహ్వరము. సం. వి. అ. పుం. పొదరిల్లు. న. 1. అడవి; 2. గుహ; 3. ఏడ్పు; 4. జలము; 5. దంభము; 6. గాంభీర్యము. కుచేల. ౨, ఆ. ౧3.

గహ్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గుహ; 2. నేల.

గళంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఝారీ; 2. చెంబు; 3. లింగముపై నభిషేకార్థము వ్రేలాడఁగట్టు ధారాపాత్రము.

గళంతిక. సం. వి. ఆ. స్త్రీ. = గళంతి.

గళకంబళము. సం. వి. అ. పుం. గంగడోలు.

గళకత్తెర. మి. వి. (గళము+కత్తెర.) మల్లబాధవిశేషము. "వ...పాదగళార్తియు నృసింహంబు నాదియగుముప్పదిరెండువిన్నాణంబుల నాణెంబు పరీక్షించి..." హంస. ౧, ఆ. ౨౦౬. ఆం. భా. ద్వి. ౨౧౯.

గళకము. సం. వి. అ. పుం. 1. కంఠము; 2. మత్స్యవిశేషము.

గళగళ. దే. వి. 1. గొలుసులధ్వని కనుకరణము. "సీ. గళగళధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి సుడివడఁ గుక్కల నడవిఁ గలిపి." స్వా. ౪, ఆ. ౧౦3; 2. ఉదకముపోయుటయం దగుధ్వని కనుకరణము. "సీ. సలిలంబు గళగళఁ దలలమీఁదటఁ బోసి బుఱ్ఱకాయల నెత్తి పొడిచి పొడిచి..." వాల్మీ. ౨, ఆ. ౯౬; 3. పుక్కిలించుటయం దగుధ్వని కనుకరణము. "ద్వి. చెలువార వాసిల్లుశీతలోదకము, లలరఁగ గ్రుక్కగ్రుక్కనఁగఁ ద్రావుచును, బూరించి గళగళఁ బుక్కిలించుచును." పండితా. దీక్షా. 3౨. పు.

గళనము. సం. వి. అ. న. 1. జాఱుట; 2. కాఱుట. విణ. (అ. ఆ. అ.) 1. జాఱునది; 2. కాఱునది.

గళము. సం. వి. అ. పుం. 1. కుత్తుక; 2. సాలవృక్షనిర్యాసము, సజ్జరసము; 3. మత్స్యవిశేషము; 4. తెల్లుగడ్డి.

గళశుండిక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

గళస్తని. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుమేఁక.

గళాయి. దే. వి. గడగడ. (వా.) నూనెమొ. సీసాలోఁ బోయుసాధనము. (గళ్లాయి, గళ్లా, అని వా.)

గళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జాఱినది; 2. కాఱినది; 3. తఱఁగినది; 4. తినఁబడినది.

గళ్య. సం. వి. ఆ. స్త్రీ. గళములసమూహము.

గళ్ల = కళ్ల. (శ. ర.)

గళ్లై = కళ్లై. (బ్రౌ.)

గళ్లైము. దే.వి. పాలమీఁగడవంటి లేఁతకొబ్బెర.(శ.ర.)

## గా

గా. ఇది మహాద్వాచముల కనుప్రయుక్తమై నీచత్వమిత్రత్వములఁ దెలుపును. (ఇది పరమగునపుడు పూర్వాచ్చున కాదేశముగా 'ఇ' వచ్చును. దీనిని

కొందఱు 'ఇగా' అని గ్రహించిరి. సంబుద్ధియందు 'గ' అనురూపము నుండును.) "క. జగములు వొగడఁగ నెగడిన, జగబంటరికొమరుఁ డయ్యు జతనమునఁ గటా, పగదీఱుప దోసవు నీ,మగతన మేమిటికిఁ దులువమార్గ ద్రిమ్మరిగా." అచ్చ. యుం. ౧.౭౨. "క...గోపాలిక ర మ్మటంచుఁ గొడుకుం బిలిచెన్." అహోబలపండితీయము. ౩౫౬. పు.

గాంగము. సం. విణ. (అ. ఈ. అ.) గంగకు సంబంధించినది.

గాంగుఁడు. సం. వి. అ. పుం. 1. గంగాపుత్త్రుఁడు; 2. కుమారస్వామి.

గాంగేయము. సం. వి. అ. పుం. మత్స్యవిశేషము. న. 1. బంగారు; 2. ఉమ్మెత్త.

గాంగేయుఁడు. సం. = గాంగుఁడు.

గాంగేరుకి. సం. వి. ఈ. స్త్రీ. బీఱ.

గాండివము. సం. = గాండీవము.

గాండివి. సం. = గాండీవి.

గాండీవము. సం. వి. అ. పుం. న. 1. విల్లు; 2. అర్జునునివిల్లు.

గాండీవి. సం. వి. న్. పుం. అర్జునుఁడు.

గాంఢ్రించు. దే. అ. క్రి. (ముఖము.) ఉబ్బు. (శ.ర.)

గాండ్రు. దే. వి. పులి యఱచుటయందు దగుధ్వని కను కరణము. "వ...పాఱమ్ములు ఆమ్ముకెలంకులం గాఁడ గాండ్రు గాండ్రు మన రొప్పి నొప్పి కుప్ప రంబుగా వియ త్తలంబునకు విల్లెత్తుపాడు వెగసి ..." స్వా. ౪, ఆ. ౩౭.

గాండ్రుపెట్టు. దే. అ. క్రి. (గాండ్రు+పెట్టు.) గాండ్రుమని ధ్వనిచేయు. "ద్వి. మండ్రాటముగ నిట్టిమాంసంబు మెసవి, గాండ్రుపెట్టెడు పెద్ద గండుమెకాలు." ద్వి. సా.౭,ఆ. ౭౦.పు.౧౭౫౦.

గాండ్ల. దే. వి. నూనె అమ్మి జీవించుజాతి. (చూ. గాండ్లవాఁడు.)

గాండ్లది. దే. విణ. (గాండ్ల+అది.) గాండ్లజాతిస్త్రీ.

గాండ్లవాఁడు. దే. విణ. గాండ్లజాతివాఁడు. "వ... కటిక బట్టు లెట్టి దేండ్ర తొగట గాండ్లవారును ..." హంస. ౩, ఆ. ౭౯.

గాంధర్వము. సం. వి. అ. పుం. 1. వధూవరులు పరస్పరేచ్ఛచేఁ జేసికొనువివాహము; 2. గుఱ్ఱము; 3. దినముయొక్క పదునేనుభాగములలో నేడవది. న. గానము, పాట.

గాంధర్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. భాష, వాక్కు; 2. దుర్గ.

గాంధర్వుఁడు = గంధర్వుఁడు.

గాంధారము. సం. వి. అ. పుం. 1. సంగీతస్వరవిశేషము; 2. సిందూరము; 3. ఒకానొకదేశము.

గాంధారి. సం. వి. ఈ. స్త్రీ. 1. గంజాయి; 2. ధృతరాష్ట్రునిభార్య; 3. తీఁటకసింద. ఇ. పుం. శకుని.

గాంధికము. సం. వి. అ. పుం. గంధద్రవ్యము.

గాంధికుఁడు. సం. వి. అ. పుం. గంధద్రవ్యములు అమ్మపురుషుఁడు.

గాంభీర్యము. సం. వి. అ. న. 1. లోఁతు; 2. (క్రోధ శోకాదులచే) వికారము నొందకుండుట.

గాఁజెర. యుం. దే. వి. ఒకానొకదుంప. "ఆ... పెండలి, మల్ల మల్లి పసుపు ముల్లంగి వెల్లుల్లి,గాఁ జరయును మొదలు గాఁగఁ గలవు..." హంస. ౪. ఆ. ౧౬౧. వై. వి. (సం. కలంజః.) శాకము. "సీ. గంజాయి యనఁగను గాంధారి చెన్నొందు గాఁజర యంచనఁగాఁ గళంజ, మగు..." ఆం. భా. ద్వి. ౭౩.

గాఁడి. దే. వి. 1. తొలిచి కాని త్రవ్వి కాని నిడుపుగా నేర్పఱిచినపల్లము. (చూ. గాఁడిప్రొయ్యి); 2. నిపానము, పసులు నీరుత్రావుటకు గాఁడియేర్పడ ఱాతితోఁ గట్టినతొట్టి. "గీ. ప్రతిదినముఁ గ్రోల నిది గాఁడి బావి గాదె, కృతకశక్తికి నందగోబృందమునకు..." వేం. పంచ. ౩, ఆ. ౧౭౧. ఆం. భా. ప్ర. ౧౬౩; 3. పసులఁ గట్టు చోటఁ గసవు వేయుటకుఁ బలకలు లోనగు వానితో గాఁడిగా నేర్పఱిచినస్థానము. "గీ. కామ గవి గట్టు గదిని దా గాఁడిపట్టు." ఉ. రా. ౪, ఆ. ౨౪౯. పిన. శకుం. ౪, ఆ. ౪.

గాఁడిప్రొయ్యి. దే. వి. (గాఁడి+ప్రొయ్యి.) గాఁడి త్రవ్వి యేర్పఱిచినప్రొయ్యి. (వా.)

గాఁడు. దే. వి. 1. దురద. "గీ...దూల జిల నవ నవ గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి..." ఆం. భా. ద్వి. ౧౭౯; 2. కామమదము. (శ. ర.)

గాగర. దే. వి. స్త్రీలు కట్టుకొనుపావడ. (శ. ర.)

గాజరము. సం. వి. అ. న. పచ్చముల్లంగి.

గాజియ = గాడియ. వై. వి. (సం. గజః.) ధాన్యము మొదలగునవి పోసికొనుట కేర్పడినచిన్నబొట్టె.

గాజె = గాజియ.

గాజోపరుఁజు. ద్వ. వి. ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము. "గీ. జరవరుంజునవంగను బరఁగు నదియొ,చనును నెమ్మలిపరుఁజు గాజాపరుఁ జన." ఆం. భా. ద్వి. ౧౧౫. (శ. ర. పా.)

గాజు. వై. వి. (సం. కాచః. క. గాజు.) 1. ఇసుక కరఁగించి చేసినయొకపదార్థము. "గీ. వలచుఁ గస్తూరినిగరాలతలుపు దెఱవ, గాజుటోవరిలోఁ ధూపగంధలహరి." నైష. 2. ౧౫౪. ఆం. భా. ద్వి. ౨౭౦; 2. గాజుతోఁ జేసినహస్తవలయము. "గీ. గాజు లెగఁద్రోసి చప్పుడు గాకయుండ, వచ్చె నూర్వశి యర్జునావాసమునకు." హర. 2, ఆ. ౧౧౯. ఉ. హరి. ౪, ఆ. ౧౫3; 3. హస్త వలయము. "సీ. సడలి ముంజేవ్రాలు జాఱువా పైఁడిగాజులు పైకి నెగఁద్రోయఁచో విలాస,ము ..." దశా. ౨, ఆ. 3౬౦. పండితా. పర్వ. 3౧౪. పు. ౧౨. పం.

గాజుఁగడియము. ద్వ. వి. (గాజు+కడియము) గాజుతోఁ జేయఁబడినకడియము. "క. రాజా రాజులు బ్రాఁతే,రాజులం ధనపాలసుఁడు రాఁ గుందు...వె,రాజు మగఁ డైన నేలా,గాజుంగడి యంబు కడను గలదే యెందున్." మల్హ. ౨, ఆ. 2. బ. ధాన్యవిశేషము. "వ... ఈదుఘుటికలు గాజుఁగడియములు జాజికుసుమలు...అనునూట నాలుగువగలపైరులు." ప్రబంధ. ౧౧౨.

గాజుఁబూస. ద్వ. వి. (గాజు+పూస.) గాజుతోఁ జేసినపూస. "శా. గాజుంబూస సురేంద్రనీల మణిగాఁ గన్పించుచుందంబునన్..." ఒంటి. శ. ౧౧. "శా. మేక్,గాజుంబూసను నందు లేక కడియం గాయంబులం జేసినన్." అచ్చ. యు. ౫౦3.

గాజుకప్పెరలు. ద్వ. వి. బ. (గాజు+కప్పెరలు.) ధాన్యవిశేషము. "సీ...గాజుకప్పెరల్ కురువ డాల్ కంటసరులు...గీ...అవి యగుపేరు గల్గువ త్తతనియింట; నుండు..." హంస. ౪, ఆ. ౧౨౭.

గాజుకుప్పె. ద్వ. వి. (గాజు+కుప్పె.) కాచపాత్ర విశేషము. "సీ. చేదివ్వెప్రతిమ చొసీలిలబంధముల మేల్కట్టు గొజ్జఁగినీటిగాజుకుప్పె. గీ. కలరతా గారమునను..." వైజ. 3, ఆ. ౭౪.

గాజుకొప్పెర. ద్వ. వి. (గాజు+కొప్పెర.) గాజుతోఁ జేసినయొకరకపుపాత్రము. "గీ. గాజుకొప్పెర యనఁగను కర్పర మగు." ఆం. భా. ద్వి. ౨౪౫.

గాజుపడు = గాజువాఱు. (గాజు+పడు.) ఛిన్నా భిన్నమగు. "ఉ. ఆజగదేకవీరుఁ డగునర్జునుఁడు... పదునార్వుర నొక్కపెట్టునం, గాజుపడంగఁ గూల్చె..."చిత్రభా. 3, ఆ. ౧౨౧.

గాజుప్పు. ద్వ. వి. (గాజు+ఉప్పు.) ఒకానొకఉప్పు, కాచలవణము. (శ. ర.)

గాజులవాఁడు. ద్వ. వి. (గాజులు+వాఁడు) గాజు లమ్మువలిజె. (శ. ర. వా.)

గాజువాఱు.ద్వ.అ.క్రి. (గాజు+పాఱు.) చిట్లు;కాంతి హీనమగు. "గీ. నెఱయ నర్మిలి నెనయుఁనీనెమ్మొ గంబు, ఘనభుజంగవిషవ్యాప్తి గాజువాఱి, రాహు కబళితరోహిణీరమణుమాడ్కి, నుండఁ గనుఁగొని యే నెట్టు లుండుఁ గుఱ్ఱ." మార్క. ౧, ఆ. ౨౫౪. హరిశ్చ. ౪, ఆ. 3౯.

గాటము. వై. విశే. (సం. గాటమ్. క. గాట.) 1.అధికము."ఉ...గాటముగాఁ దనర్చుకుతుకంబులఁ... కడుఁ్ సుఖించు..." కళా. ౧, ఆ. ౨౦; 2. సాంద్రము, దట్టము. "ద్వి. పాటలాలింత్రిణీ ప్రముఖవృక్షముల, గాట మానడవుల..." ద్వి. హరిశ్చ. పూ. ౫౧౬. దశా. ౧, అ. ౨౧౧.

గాటు. వై. వి. (సం. కటుః.) 1. కారము. "గీ... గాటు,కార మొ జ్ఞొట్టన యనంగఁ గటువు వెలయు." ఆం. భా. ప్ర. ౧౦౪; 2. తీవ్ర మగు వాసన. "సీ. బొట్టుకస్తురి నీటుపట్టుబల్విలెవాటు దొట్టుగంధపుగాటుఁ దొంగలింప." చెన్న. ౪, ఆ. ౨౬౪. విశే. 1. కారము గలది. ఉదా:- మిరెప కాయలు గా టైనవి; 2. తీవ్ర మగువాసన గలది. ఉదా:- ద్రావకము గాటుగా నున్నది.

గాడి. వై. విశే. (సం. గాఢమ్.) గాఢము. "రగడ. గాడిగ వెన్నెల గాయఁగఁ దరువుల, నీడలఁ బొడ వెన్నెలలు..." బిల్హ. ౨, ఆ. ౭౯.

గాడిద. వై. వి. (సం. గార్దభః.) ఖరము. "చ. గాడిదరూపు దాల్చి యయుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసంబొడెదు శక్ర..." భార. శాం. ౪, ఆ. ౩౯౬. ఆం. భా. ద్వి. ౨౬౬.

గాడిదకాళ్లవాఁడు. ద్వ. విశ. ఒకటితో నొకటి తగులు మోకాళ్లవాఁడు, సంఙ్ఞువు. (శ. ర.)

గాడిదగడపర. ద్వ, వి. ఓషధీవిశేషము, పిండీతకముళ్. "గీ. పొదలుఁ బిండీతకమ్ము గాడిదగడపర,చాగ రాడి వెలికి యటం చన." ఆం. భా. ద్వి. ౬౫. హంస. ౪, ఆ. ౧౦. [(శ. ర.)

గాడిదపులి. ద్వ. వి. దుమ్ములగొండి, కొర్నవగండు.

గాడీ. దే. వి. (హిం. గాడీ.) 1. బండి. (వా.); 2. మనుష్యులచే లాగఁబడునొకరకపుబండి. (వా.)

గాడు. దే. వి. గుదము. "సీ...గుదసమాహ్వయముశా గుద్ద గాడు పిఱ్ఱి పిఱుఁ దన..." వేంక.మాన.౪౨.

గాడుపు. దే. వి. వాయువు, గాలి. "సీ. ఏచి యీచెవి గాడు పాచెవిఁ బోవంగ..." పాండు. ౨,ఆ.౨౯.

గాడుపుకొడుకు. దే. వి. (గాడుపు+కొడుకు.) 1. హనుమంతుఁడు; 2. భీముఁడు.

గాడుపుచూలు. దే. వి. (గాడుపు+చూలు.) వాయుపుత్త్రుఁడు, హనుమంతుఁడు. "క...తులువతోలు వేలుపులం,గాడుపడఁ దఱిమి యార్చుచు,గాడుపు చూల్వీడు సొచ్చె గాటపుఁగినుకన్." అచ్చ. సుం. ౧౭౧.

గాడుపుతండ్రి. దే. వి. (గాడుపు+తండ్రి.) ఆకాశము. "క. అపు డగ్గివన్నె తొలువేలుపు తనసెమ్మేని మంటలు గడిందిగ గాడుపుతండ్రిఁ బొదువఁ గోఁతిపదుప్పునై నరదంబు నెమ్మితోఁ బఱపుట యుంన్." అచ్చ. యు. ౪౯౦.

గాడుపుసంగడీఁడు. దే. వి. (గాడుపు+సంగడీఁడు) వాయుసఖుఁడు, అగ్ని. "గీ...ఇంద్రజితుండు దీవి, కరిగి గాడుపుసంగడీఁ డలర నొక్క,దండ వేలిమి యొనరింప..." అచ్చ. యు. ౧౩౯.

గాద్దె. = గాడిద. "సీ. జాతైనబొరాహజారతేజికిఁ గాక కఱకులకళ్లెంబు గాద్దె కేల" వేణు. శ. ౬౪.

గాడ్పు = గాడుపు. "సీ...చల్లనిగాడ్పు..." భార. ఆది. ౪, ఆ. ౨౩. ఆం. భా. ప్ర. ౫౯.

గాడ్పుకొడుకు = గాడుపుకొడుకు. (ఆంజనేయుఁడు; భీముఁడు.) "సీ...గర్వ మడంచి విడిచె గాడ్పు కొడు కొగిన్." రాఘవ. ౪, ఆ. ౩౩. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

గాడ్పుచుట్టము. దే. వి. (గాడ్పు+చుట్టము.) అగ్ని. అచ్చ. సుం. ౧౫౧.

గాడ్పుచూలి = గాడుపుచూలు. (హనుమంతుఁడు.) "ఓ...గాడ్పుచూలి యిట్టివముసూచు, గ్రుంకు నంతకు నొదిఁగి యశ్వొండమున్న." అచ్చ.సుం.౨.

గాడ్పుతూపు. దే. వి. (గాడ్పు+తూపు.) వాయవ్యాస్త్రము. "చ...గాడ్పుతూపునెవ్వడిఁ దొఱగించి చేయి దెగ వైచెఁ గడిందిగ రాముఁ డత్తఱిన్." అచ్చ. యు. ౨౫౭.

గాడ్పుదిండి. దే. వి. (గాడ్పు+తిండి.) పవనాశనము, పాము. "సీ. ఏపంట యొసఁగుచున్యాదిదోసపు దుల్వ గాడ్పుదిండులకు వాకట్టుచుండు." అచ్చ. బాల. ౧౧.

గాడ్పుదిండిములికి. దే. వి. (గాడ్పుదిండి+ములికి.) నాగాస్త్రము. "ఆ. సోలి యపుడె తెలిసి సోఁకుఁజో డెంతయుం, ములికి గాడ్పుదిండిములికి వైవ." అచ్చ. యు. ౩౫౩.

గాడ్పునెచ్చెలి. దే. వి. (గాడ్పు+నెచ్చెలి.) అగ్ని. "సీ. నీటినిసువు గాడ్పునెచ్చెలి...అంటఁగూడని వేలు పనఁ దగు శిఖి." వేంక. దేవ. ౧౬.

గాఢము. సం. విశ. (అ. ఆ. అ.) 1. బిగువైనది. (ఆలింగనాది); 2. గట్టిమైనది; 3. అధికము; 4. అవగాహనము చేయఁబడినది. (నద్యాది); 5. అవగాహనము చేసినది.

గాణ. వై. వి. (సం. గాయనః. క. గాణ.) 1. పాటకాఁడు. "సీ. గాణయం చనఁగను గాయకాభిధ చెల్లు..." ఆం. భా. ద్వి. ౨౯౭. వేంక. మాన. ౩౨; 2. పాటకత్తె. "వ...కలమధురకిన్నరీనిక్వాణంబులరాణం ద్రాణఁజెఱుచు విన్నాణంపుఁ గొల్పుటెలుంగులను వేల్పుగాణలు పాడులక్ష్మీనారాయణుల కల్యాణంపుఁబాటలం దీటుకొను తిన్ననిరవంబులునుం గలిసి..." స్వా. ౫,ఆ.౭౧,

గాణతనము. ద్వ. వి. (గాణ+తనము.) గాయకత్వము. "ఉ. వీణియ మట్టి పంచశరవిక్రమముల్ పచరించుగీతముల్, గాణతనంబు మీఱఁ బలుకం గలభాగ్యము నాకుఁ గల్గునే." చంద్ర. ౪,౹ఆ. ౧౧౨.

గాణపతము. సం. విణ. (అ. ఆ. అ.) గణపతికి సంబంధించినది.

గాణిక్యము. సం. వి. అ. న. గణికలసమూహము.

గాణి. వై. వి. (సం. గాయనీ.) పాటకత్తె. "క. ఐదువగాణీలశుభా,పాదన గేయములపేర భారతి సతిపై,మోదమున ధవళవర్ణ, ప్రాదుర్భావంబు సెఱపెఁ బలుమఱు నిచటన్." వసు. ౫, ఆ. ౧౨౬. వసు. ౨, ఆ. ౧౧.

గాణు. దే. వి. హాని. "క. రాణించిన నీకొఁగిటఁ, బ్రాణేశ్వర నాకు మగుడఁ బ్రాయము వచ్చెన్, జాణ లగువారికూర్మికి, గాణు గలుగనేర దెంత కాలంబునకున్." ప్రబోధ. ౨, ఆ. ౨౫.

గాణుఁడు. వై. వి. (సం. గాయనః.) పాటకాఁడు "శా. పక్షంబుల్ లలిఁ దాల్చుకీరనిభదీవ్యద్వాణు లుగ్ గాణులున్." హరి. ఉ. ౭, ఆ. ౧౨౦. (శ. ర. పా.)

గాత. ఉభ. వై. వి. (సం. ఘాతః.) 1. దెబ్బ. "స్రగ్ధర...ఖడ్గిం జెండాడు ప్రాఁకుల్ కవుఁగిటి కొలఁదుల్ కత్తి నొక్కొక్క గాతన్." స్వా. ౪, ఆ. ౮. (శ. ర. పా.) "పంచచామరము. కటారికాని గాతచేత..."రా. వి. ౪, ఆ. ౪౭; 2. ద్రోహము. "సీ...ఎబ్బెరాసి గాతలకోటారు. ఆ. మగనికంటెనెరసు వగలాఁడి..." చెన్న. ౨, ఆ. ౨౪; 3. విణ. (సం. గాథా.) కథ, గొడవ, సంగతి. "ఉ...నీవు నీ,గాతలె పల్కి మాయలఁ బ్రగల్భతఁ జూపిన..."విష్ణు నా. ౪, ఆ. ౧౬౫. సం.విణ.(బు. త్రి. బు.) గానము చేయువాఁడు.

గాతము. వై. వి. (సం. ఖాతమ్. క. గాతాము.) గోయి. "ఉ. అతఁడు సంబడించుకొని యూకరి చొప్పున నేఁగి యేఁగి తా,నాతతగుల్మమధ్యమున నారసి కన్గొని దానిఁ జుట్టి రా,గాతము ద్రవ్వి యాకలముగప్పినఁ గానక కూలె వారణం, బాతతపక్షముల్ తునుమ నంబుధిఁ గూలినకొండ కైవడిన్." వాసి. ౫, ఆ. ౧౬౦. (శ. ర. పా.) ఆం. భా. ప్ర. ౧౪౬.

గాతి. యుం. దే. వి. గ్రాసము. లిండి. "గీ. చెఱకులను బెల్లమును జూపి చిన్నవాండ్రఁ,జంపి తోడవులు గొనివచ్చుసాహసమునఁ, బాపముల కెల్ల నోడికట్టి పాయ కెపుడు, శ్వేతుఁ డీరీతి లంజెయగాతి కొఱకు." భల్లా. 3, ఆ. (శ. ర.) చం. రా. ౬, ఆ. ౯౦. వై. వి. (సం. ఘాతిః. క. గాతి.) దెబ్బ. (చూ. గాతిగొను.)

గాతిగొను. ద్వి. అ. క్రి. (గాతి+కొను) కొట్టు "సీ....దేవరాద్దహానదండి, గాడుపాళిమరుత్తుల గాతిగొనిన, ధనదుఁ జెందిరి...వరాహ. ౬, ఆ.

గాతు. దే. వి. ప్రేల్చుట. (చూ. గాతుగాదంచు.).

గాతుకలఁగు. దే. అ. క్రి. (గాతు+కలఁగు) ప్రేలు, పగులు. "సీ. కణఁత లెల్లను గాతుకలఁగి దిక్కరులకుఁ బోటపాటఁ గన్నిటిబొట్లు పడియె."రామా. ౮, ఆ. ౭౪. జై.౭. ఆ. ౧౭౯.

గాతుగా. దే. అవ్య. ద్రు. తప్పక. "ద్వి. గాతుగా నాకొల్వుకాఁడ వై..."ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౭౯. పం.

గాతుగావించు. దే. స. క్రి. (గాతు+కావించు.) ప్రేల్చు. "గీ. లెక్క కెక్కుడు గాఁ దూఁగు రేకలాలు...పిరంగు, లొక్కమొగి గాతుగావింప నుక్కుమెఱసె, గుండ్లగుంపులు జడివాన గురిసినట్లు." రంగా. 3. ఆ. ౬౬.

గాతువు. సం. వి. ఉ. పుం. 1. గంధర్వుఁడు. 2. అన్నము. 3. మగ కోయిల. 4. గండుఁదుమ్మెద. స్త్రీ. భూమి. విణ. (ఉ) 1. కోపి. 2. గాయకుఁడు.

గాత్రము. ఉభ. దే. వి. కంఠము. "సీ. రహి వృట్ట జంత్రగాత్రముల రాల్గరఁగించు విమలగాంధర్వంబు విద్య మాకు." స్వా. ౨. ౪3. విణ. స్థూలము. "గీ. ఒమ్ముగాత్రమ్ము గమకము హొమ్ము నాఁగ,స్థూలమగు..."ఆం.భా.తృ.౨౦. సం. వి. అ. న. 1. శరీరము. 2. అవయవము. 3. ఏనుఁగు యొక్క ముందటిపిక్కలు లోనగుచోటు.

గాథ. సం. వి. అ. స్త్రీ. 1. చరిత్రము. 2. పాట. 3. ప్రాకృతభాష. 4. వృత్తభేదము.

గాథకుఁడు. సం. విణ. (అ. థకా. అ.) పాడెడువాఁడు.

గాద. యుం. దే. వి. 1. కదుము, నొప్పి. "ఉ... మేను పెనుగాదలు గట్టఁగ వ్రేసికొంచుఁ ద, స్మైచ్ఛక యున్నవానిఁ గని మే గరుదాల్పఁగ నిట్లు పల్కినన్. వాసిష్ఠ. ౨. ఆ. ౧౯౨. 2. చెమటకాయలతఱచు. (శ. ర.) 3. గడ్డి.

"సీ. పైరు మునుఁగ గాద బలిసినచేలలోఁ బెరలక కలుపులు దీసి తీసి". ఉ. హరివం. ౪, ఆ. ౧౩. వై. వి. (సం. గాథా) వృత్తాంతము, వార్త. "గీ...తత్ప్రాణసఖులు, దేవకీదేవి కీమాట చెల్ప వచ్చుఁ, గా దనుచుఁ జేరి చెలియున్న గాద దెలిపి, రి..." విజ. 3, ఆ. ౬౭.

గాదము. దే. వి. 1. కదుము, ఘాతభవగ్రంథి. 'గీ. గాద మనఁగను బొప్పిపాఁ గదుము నాఁగఁ, దగుచు ఘాతభవగ్రంథి..." ఆం. భా. ద్వి. ౧౩౦; 2. గడ్డి. "గీ...గాదమున మాటుపడి యున్న కాయవోలె". విక్ర. ౪, ఆ. ౬౦. ఆం. భా. ద్వి. ౭౬.

గాదిలి. దే. వి. 1. ప్రేమ. "గీ. అలరుఁ జుట్టము కూర్మి గాదిలి యనంగ." ఆం. భా. కృ. ౪౬. ఆం. శే. ౬; 2. చుట్టము. ఆం. భా. కృ. ౪౬; 3. భర్త. "ఉ...ధర్మబా, గమ్ములకర్త భారతికి గాదిలి మువ్వరతోల్త పేరు..." హరి. పూ. ౧. ఆ. 3; 4. భార్య. "ఉ...అల్కతోఁ, గన్నుల నిప్పు లొల్కవారుగాదిలి దక్షునిఁ జూచి యిట్లనున్." కు. సం. ౨, ఆ. ౨౭. విశే. 1. ప్రియమైనవాఁడు. "ద్వి...యత్తేశసఖునిసన్నిధిఁ బ్రసాదంబు గొనఁగ నాగాదిలి రావె" బస. పు. ౪, ఆ. ౪౪౬; 2. ప్రియమైనది. "సీ. కాశిరాజసుతానిగాదిలికూఁతులఁ గవలవారల నీలికాంతి మతుల." భార. సభా. ౧, ఆ. ౧౩౫.

గాదియ=గాజియ. "సీ. ఎదురుమాఱినపంది గదిసి గాదియక్రిందిపందికొక్కని మోరఁ బట్టి కెడపు." రా. వి. 3, ఆ. ౪౫.

గాదె=గాజె. "ద్వి. గంభీర మగుకొల్చు గాదెలలోన..." పండితా. దీక్షా. ౪౪. పు. ఆం. భా. ద్వి. ౨౪౦.

గాద్గద్యము. సం. వి. అ. న. గద్గదభావము. "సీ. దుర్వారతరతీవ్ర గర్వగళగ్రహ కలిత గాద్గద్య ఘర్ఘరము మాట." కాశీ. ౪, ఆ. ౭౦౨.

గాధము. సం. వి. అ. న. 1. స్థానము; 2. సంపాదనేచ్ఛ, లిప్స; 3. లోఁతులేనిచోటు, మిట్ట. విశే. (త్రి. ఆ. అ.) మెరకగా నున్నది, లోఁతు లేనిది. (వ్యతి. అగాధము.)

గాధి. సం. వి. ఇ, న్. పుం. విశ్వామిత్రుని తండ్రి.

గాధేయుఁడు. సం. వి. అ. పుం. గాధిపుత్త్రుఁడు, విశ్వామిత్త్రుఁడు. [స్తుతి.

గానము. సం. వి. అ. న. 1. పాట; 2. ధ్వని; 3.

గానిని. సం. వి. ఈ. స్త్రీ. వసకొమ్ము.

గానుఁగ. దే. వి. (క. గాణ. త. కాణమ్.) గానుఁగు, నూనె చెఱకురసము మొదలగునవి తీయు యంత్రము. "సీ. తిలయంత్రసంజ్ఞ యై యలరు గానుఁగ యన..." ఆం. భా. ద్వి. ౩౦౨.

గానుఁగది. దే. వి. (గానుఁగ+అది) గానుఁగాడు జాతి స్త్రీ. "ఉ...దీని గతికామనిఁ జేయక నిర్దయాత్ముఁడై, గానుఁగదానిఁ జేసెవికారవిధిం దల మొత్తఁగాఁ దగున్." క్రీడా. ౧౦౪.

గానుఁగపిండి=గానుఁగుఁబిండి. (బ్రౌ.)

గానుఁగరోఁకలి. దే.వి. ఔ. (గానుఁగ+రోఁకలి) గానుఁగాడుట కుపయోగించు రోఁకలి. "చ...తదంగము లొండొకటిం బొరిం బొరిం, గదియఁగ నొక్కి నొక్కి పెనుగానుఁగరోఁకట నిక్షుఖండముల్, చిదుపుతెఱంగునం జిదియఁ జేయుఁడు..." పరమ. ౧, ఆ. ౭౯.

గానుఁగపట్టె. దే. వి. (గానుఁగ+పట్టె) గానుఁగాడునపు డాడువారు కూరుచుండుపలక. "ఉ. ఈనలినాక్షి దాఁ దిరుపుటెద్దుఁ బ్రతోదము పూని రొప్పుచున్, గానుఁగపట్టెపైఁ దిరుగఁ గట్టెఁడిటిట్టిభమందరాద్రిమం, థానకమధ్యమానవిమిథామజలభ్రమిమందలం బధిష్ఠానము గా భ్రమించు నలసంపదచేసియఁ బోలతుందునే." క్రీడా. ౧౦౩.

గానుఁగఱోలు. దే. వి. ఔ. (గానుఁగ+ఱోలు) గానుఁగాడుటకుఁ గఱ్ఱతోఁ జేయఁబడు ఱోటి వంటిపనిముట్టు. "సీ. బూరుగు పెనుమ్రానుఁబోడవు గానుఁగఱోటివలయు దేహము వాఁకవంటినోరు." చంద్ర. వి. ౧, ఆ. ౭౫.

గానుఁగవాఁడు. దే. వి. (గానుఁగ+వాఁడు) తేలికవాఁడు, తిలఘాతుకుఁడు. "సీ...తిలఘాతుకుండొప్పుఁ దెలికవాఁడు, గానుఁగవాఁ డన..." ఆం. భా. ద్వి. ౨౭౫.

గానుఁగాడు=గానుఁగులాడు. (వా.)

గానుఁగు = గానుఁగ. (శ. ర. బ్రౌ.)

గానుఁగుబిండి. ద్వ. వి. (గానుఁగు+పిండి). తెలికపిండి. (చూ. గాన్గుఁబిండి.)

గానుఁగులాడు. దే. స. క్రి. (గానుఁగులు+ఆడు) చెఱకు లోనగువానిని గానుఁగలోఁ బెట్టి రసము తీయు. "క. చెఱ కొకటి గలుగఁగా మరు, చెఱకున్ లోనైతి మనుచుఁ జెఱకులగమి నే, తఱిఁగన గానుఁగులాడుదు, రెఱిఁగి ప్రజల్ సుగుణులన్న రేం ద్రునివీటన్." రామా. ౧, ఆ. ౧౨౭.

గానువు=గానుఁగు. దే. వి. "క...అతనివంశం బెల్లన్, గానువునఁ బెట్టి యార్చిన, నేనియుఁ జాల దిది పెద్దయే దక్షునకున్." కు. సం. ౨, ఆ. ౯౪.

గాన్గు=గానుఁగు. (చూ. గాన్గుఁబిండి.)

గాన్గుఁబిండి. ద్వ. వి. (గాన్గు+పిండి) తెలికపిండి. "సీ...తిలపిష్టమున కగుఁ దెలికపిండి. గీ. గాన్గుఁ బిండి యనంగ..." సాం. ని. మాన. ౪౭.

గాబ. దే. వి. తృణవిశేషము. "ద్వి. గాబ కోరిందలఁ గడు దట్టమైన." ద్వి. పరమ. ౭, ఆ. ౪౯౯. పు.

గాబము=గాబ. (శ. ర.)

గాబరా. దే. వి. (హిం. గాబరా.) భయము, కలవరము; తొందర. (శ. ర.)

గాబరాపడు. ద్వ. అ. క్రి. (గాబరా+పడు.) 1. కలఁగు, చలించు. (వా.); 2. కంగారుపడు. (వా.)

గాబాగూబీ. దే. వి. గడబిడ. "క. నీబానిసతో త్తిది దయ, చే బాసల నిచ్చి చాలఁ జేపట్టు మిఁకన్, గాబాగూబీ సేయక, నీబంతిని గూడు గుడుపు నిత్యము సామీ." చంద్ర. వి. ౩, ఆ. ౧౪౦.

గాబు. దే. వి. 1. కొప్పెర, మూతి వెడల్పు గలపెద్ద పాత్రము. "గీ. గాబు కొప్పెర యనఁగను గర్పర మగు..." ఆం. భా. ద్వి. ౨౪౫; 2. కలుపు మొక్క. (బ్రా.)

గాబుతొట్టి. దే. వి. (గాబు+తొట్టి.) నీటితొట్టి; నీరుకాఁగు. (బ్రా.)

గాబుదీయు. దే. అ. క్రి. (గాబు+తీయు.) కలుపు తీయు. వా: ఆచేనిలో గాబుతీయుచున్నారు. (బ్రా.)

గాభీర్యము. సం. వి. అ. న=గాంభీర్యము. లోఁతు. "క. గాభీర్య మమరఁ గూపము, సౌభాగ్యముఁ జెంది నుడికి సమమై బళిరా, యాభీరవునాభి కడున్, శోభిల్లె..." గాథే. ౧౧.

గామ. దే. వి. పిపీలికావిశేషము. (శ. ర.) "ది కలగొని చీమల గామలవలెను, జెలఁగుచు ముంద శిశువు లాడఁగను." ద్వి. పారిజా. ఉ. ౨౯౯ పం. [పొందునఁ

గామి. సం. విశే. (న్. సీ. న్) 1. పోవునది; !

గామిడి. వై. విశే. (సం. గ్రామణి.) 1. శ్రేష్ఠుఁడు "మ...ఊరిగా, మిడిబాఁపల్ చనుదెంచి రద్దపదభూమీభర్తయిల్ చేరఁగన్." పాంచాలీ ౪, ఆ. ౩౦. అచ్చ. బాల. ౯౭; 2. గయ్యాళి "ఉ. ఆమహితాత్ముఁ డొక్క వెలయాలికి మిక్కి తాను గూర్చువాఁడై మమత నైలంగుచు నొ ప్పుడు నేమియుం నీయకున్నచో, గామిడిదా తల్లి విటకంటకికి యి ల్వెడలింప..." వి. ప్ర. ౪ ఆ. ౪౨; 3 బలిష్ఠము. "ఉ. మో మఖిలంబు గన్నుఁగవ ముచ్చట మీఱఁగ పక్షమంతయున్ గామిడిచన్ను దోయి కనుఁగొను సమస్తము మిన్న..." బిల్హ. ౩, ఆ. ౭౯; 4. దుష్టము. "ఉ. గామిడిదైవ మీవితముగా మిడిమేలపుఁ జేఁత నిర్దయన్, సీమలు గానిసీమలకుఁ జెల్వఁడ యేఁగఁగఁ దెచ్చె నక్కటా." శశాం. ౨, ఆ. ౧౩౩. బస. ౩, ఆ. ౧౧౨౫.

గామిడికత్తె. వై. వి. (గామిడి+కత్తె స్వార్థమున.) (దుష్టురాలు.) "ఉ. సీమపొలంతు లెల్లఁ దమ చేతికి వచ్చినదాఁక నోయి నా, సామి వితీర్ణ కర్ణ యన సాగుదు రంతటిలోన నోయి నీ, గ్రామము నామ మెయ్యదియొకో యనఁ జూతురు కూఁతు రావగన్, గామిడికత్తె గాదు మిముఁ గన్నులఁ గప్పుకొనంగ నేరుచున్." బహు. ౫, ఆ. ౧౨౨.

గామిడికాఁడు. వై. వి. (గామిడి+కాఁడు) 1. గామిడి, దుష్టుఁడు. "క. కాఁక దొరబిడ్డతమ్ములఁ, గాఁకం బొరలంగఁ జేయు గామిడికానిం, గాకెనయ నిట్టు దూఱుచుఁ, గాఁ కెనయం బువ్వు రువ్వు కట్టిఁడిఁ దిట్టున్." కాళిందీ. ౩, ఆ. ౦౯. 2. వరాహయూథపము. "గీ. పంది సలు గేకలమ్మనఁ బరఁగు ఘృష్టి, తనరు గామిడికాఁ డనఁ దద్దణేశుఁడు..." ఆం. భా. ద్వి. ౭౨.

గాము. వై. వి. (సం. గ్రహః) 1. సూర్యాది గ్రహము. "సీ...నాలు, గవలగనంబున నన్ని

గాములును మేల్పొడ్పుల్లఁ దనరార వేడ్కఁ
బొదలి, మొదలివెలంది రాముని గాంచె..."
అచ్చ. బాల. ౫౮. కవిరా. 3, ఆ. ౧౫౩;
2. పిశాచము. "గీ. గాము సోకినరీతిని గలవ
రించు..." (రాధావధూటి.) రాధికా. ౨, ఆ.
౧౯. ఆం. భా. ప్ర. ౬౩; 3. తాపము; మదన
తాపము. "గాముగొన్నమేము మేని, గాము
దీఱ జేపకడను క్షేమ మరల నీటనాడి చెలఁగి
యుందుము." సప్త. ౮. [మొందు. సప్త. ౮.

గాముగొను. ద్వ. అ. క్రి. (గాము+కొను) తాప

గాములమేటి. ద్వ. వి. (గాములు+మేటి) గ్రహపతి,
సూర్యుఁడు. "ఉ. గాములమేటి లోకముల
కన్ను...భానుఁడు తూర్పునఁ దోఁచె నత్తఱిన్."
కృ. శకుం. 3, ఆ. ౫౮.

గాములఱేఁడు. వై. వి. (గాములు+ఱేఁడు)
సూర్యుఁడు. "ద్వి. కలువలపగవాఁడు గాముల
ఱేఁడు." ద్వి పారిశ్చ. పూ. ౨౨౦౧ పం.

గాయకము. దే. వి. మాయ, వంచన. "గే. చాయ
వాటులు సన్నలు గాయకములు, మెచ్చులును
దచ్చనలు పోరపొచ్చెములును, దగవులును వార
కాంతావితానములకు, జలజలోచనలార నైసర్గిక
ములు." కాశీ. ౮, ఆ. ౩౦. సా. ౨, ఆ. ౬౫.
విశే. 1. వంచకము. "గీ. ఓసి పాపాత్మురాల
నీవేసదారి, గాయకపుసుద్దు లెల్ల నాకాశవాణి,
తెలుప విని వచ్చి..." సా. 3, ఆ. ౭౦౮;
2. ఎక్కువవెల గలది. ఉదా:- వస్తువులన్నియుఁ
గడు గాయకము గా నున్నవి.

గాయకుఁడు. ఉభ. వై. విశే. (సం. గాయకః.)
చతురుఁడు. "ఉ. గాయకుఁ డొక్కగాయకశిఖా
మణి యీయెడఁ దద్గురున్ విభు, న్యాయతవృత్తి
వర్తిలుప్రియవ్రతసూనునిఁ గాంచి వైశ్వరా,
ధేయ సుధీజనావలి విధేయ భవత్సుతుఁ డిచ్చి
పట్టికా,శేయముఁ గంటె దానగుణశేఖరుఁ
డంచుఁ బదంబు వాడినన్". బహు. ౫, ఆ.
౧౫౮. విజ. ౧, ఆ. ౧౮. సం. విశే. (అ.ఆ.అ)
1. పాటపాడువాఁడు; 2. నర్తకుఁడు.

గాయత్. సం. శత్ర. గానముచేయుచున్న.

గాయత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. ద్విజులు సంధ్యో
పాసనావసమయమున నారాధించు దేవతా
విశేషము; 2. ద్విజులు సంధ్యోపాసనాసమయ
మున జపించుమంత్రవిశేషము; 3. ఒకానొక
ఛందస్సు; 4. చంద్రశ్రీ.

గాయనము. సం. వి. అ. న. పాట. [పాఁడు.

గాయనుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) పాట పాడు

గాయమానము. దే. వి. శస్త్రవిద్యావిశేషము. "స్త్రీ...
సాదకాఁ డనఁగను శస్త్రదక్షుఁ. గీ.దలపుఁదన్వివ్వ
సాధన యనఁగ నెగడు, నఱకుపరువడి గాయ
మానంబు విసరు, మొన లనంగను దద్భేదములు
చెలంగు."ఆం. భా. ద్వి. ౨౦౫. ప్రబంధ. ౭౮.

గాయము. దే. వి. (క. గాయ. త. కాయం.) కత్తి
లోనగువానితాఁకునఁ గల్గుగాయము, క్షతి. "శా...
అతఁడుగ్ర రాకాసిమేల్పఁతిప్పైఁ, దేజాకం బెడి
దంపుసారసము లెంతేని నవ్వడి నెవ్వచి మే, న్గాజుం
బూసకు సందులేక కదియం గాయంబులం జేసి
నన్." అచ్చ. యు. ౫౦౩. రా. వి. 3, ఆ. ౮౮.

గార. యు. దే. వి. వృక్షవిశేషము, ఇంగుది. "గే...
అంచు వడి గారచెక్కకై యఱచువారు, నైన
యసురుల కనిరె మత్స్యంపుమూర్తి." దశా.
౧, ఆ. ౨౭౯. ఆం. భా. ద్వి. ౮౭; 2. గార
చెక్కతోఁ దీసినగంధము. (ఇది త్రాగిన చేఁపలు
మత్తెక్కి పడిపోవును. బ్రౌ.) "గే. గారఁ ద్రావిన
మీనుసంగతి మనోజ, వేదన నతండు పొరల..."
వైజ. ౨, ఆ. ౧౮౦. భాగ. ౮ స్కం; 3.
మత్స్యవిశేషము (బ్రౌ.) ౬౮౬. దశా. ౧, ఆ.
౧౫౮. వై. వి. (సం. క్షారః. క. గారె.) 1.
గోడ లోనగువానికిఁ బూయుటకై యిసుక చేర్చి
దంచిన సున్నము. "సీ. చికిలిప్రాఁగెంపుటిట్టికలు
గోడలువెట్టి వజ్రంపుగారలపను లొనర్చి." ఉ.
రా. ౨, ఆ. ౨౯౨. ఆం. భా. ద్వి. ౧౭; 2.
రత్నదోషవిశేషము. "క. ఈరత్నమునకుఁ
బ్రువ్వియు, గారయుఁ గర్కశము ననఁగ గస
రులు మూఁడే, పొరు నవి యెల్లఁ దెలియక,
వారక ధరియింప జగతి వల దెవ్వరికిన్." రత్న.
౨౮; 3. డాఁగు. ఉదా:—పండ్లు గార పట్టినవి;
4. పట్టు. ఉదా:—కంటికి గార వేయవలెను.

గారకాఁడు. ద్వ. వి. (గార+కాఁడు) నూసరి,
సున్నపుఁబని చేయువాఁడు. "సీ. మీఱు నూసరి
యన గారకాఁడు." ఆం. భా. ద్వి. ౨౮౨.

**గారకాయ.** ద్వ. వి. 1. ఇంగుదీఫలము; 2. గార కాయతో మందు కూరి తయారుచేసిన ఒకరకపు బాణసంచు. (వా.)

**గారడము.** వై. వి. (సం. గారుడమ్. క. గారడ. త. కారడం.) 1. విషమంత్రము. (శ. ర.); 2. మాయ. "గీ. గారడపుదక్కుసుని సెండుఁ గాన కుండిరి..." అచ్చ. యు ౩౨౭; 3. పరిహాసము. "గీ. అచుచుఁ బరమేశ్వరుం డాడ నల్లనమణు, లమ్మ నేఁపెల్ల యెంతటివాఁడీఁడు, చెంతఁ జెలు లుండ నొక్కింత సిగ్గు వూనఁ, జిట్టివాఁ డింక చేపట్టి యీడ్వసన్నె." "గీ...అనుచుఁ దరితీపు వగలచే నాసఁ గొల్పి, యతనిఁగనుఁగొని గారడా లాడుకొనుచు." పార్వ. ౪, ఆ. ౧౮౯; 4. అసత్యము. "క. తలఁపున నిది గారడ మని, తలఁపకు మాసింగఁ డల్లతరిగొండదరిన్,దల మోచి తెచ్చినవి యివి, తల నుంచుము పసిఁడితాయెతల నుంచి నృపా." శుక ౧, ఆ. ౯౯.

**గారడి.** వై. వి. (గారడము+ఇ) పాములు పట్టు వాఁడు. "గీ. వ్యాళసంగ్రాహినామమై వఱలు గార, డీఁ డనంగను బాములవాఁ డనంగ, గారడి యనంగ..." ఆం. భా. ప్ర. ౧౪౮.

**గారడీ.** దే. వి. 1. మాయ; 2. ఇంద్రజాలము. (వా.)

**గారడీఁడు.** వై. వి. (గారడి+ఈఁడు) 1. పాములఁ బట్టువాఁడు. "ఆ. తను వెఱింగి భూపుఁ డను పాముఁ బట్టి యాడించుమంత్రి గారడీనికరణి." ద్వా. ౧; ఆ. ౧౯౪. ఆం. భా. ప్ర. ౧౪౮; 2. (గారడీ+ఈఁడు.) ఐంద్రజాలికుఁడు. "గీ. ఐంద్రజాలికసంజ్ఞయై యలరుచుండు, గారడీఁ డన..." ఆం. భా. ద్వి. ౧౮౭.

**గారనూనె.** ద్వ. వి. (గార+నూనె) ఇంగుదీతైలము (వా.)

**గారపిండి.** వై. వి. (గార+పిండి) గారకాయలపిండి. "ద్వి. మొనసి తిలోదకములు వోసివగలు, పెనఁగొన మఱి గారపిండిచేఁ బుణ్యుఁ డను లర్థిఁ బిండ ప్రదానముల్చేసి." రం. రా. అయో. ౧౩౮. పు. ౯౯. పం.

**గారము.** వై. వి. (సం. గౌరవమ్). 1. అపేక్ష, కోరిక. "సీ. కందుకక్రీడపై గారంబు పచరించు హస్తాబ్జములఁ బూను సత్పమాల." హర. ౪, ఆ. ౧౧; 2. మైత్రి, స్నేహము. "గీ. పొం దొరిమె పొత్తు గారము పొందిక యనఁ, బరఁగుచుండును మిత్రభావంబు..." ఆం. భా. ద్వి. ౭౯౬; 3. ప్రేమ, అనురాగము. "స్రగ్ధర. రమియించున్ దక్కుడిన్ వారణపరదుఁడు గారాన ధీరాను రక్తిన్." పాంచా. ౧. ఆ ౧౭౫: 4. మమకారము, అత్యనురాగము. "సీ. ఇల నెందుఁ దల్లిదండ్రుల గార మారఁగాఁ బెరిగి..." భో. ౬, ఆ. ౩౨౨. వి౹. అధికము. "క. నూరేల మురికాముదిసిం, గారము గార మయి పాము కన్వలె మెఱుఁగుల్, వాఱుచెలు వాడునొకతెలి, పారువ మిట వ్రాలె..." సా. ౨, ఆ. ౨౧౫.

**గారముచేయు.** ద్వ. అ. క్రి. (గారము+చేయు) ప్రేమించు. "ద్వి. సకియ నీయింటికి సారంగధరుఁడు, ఒకపావురము వెంట నుఱికి రాలేదె, రాఁగానె నీవు గారముచేయలేదె, బాగుగా నీ కాళ్లఁ బడి మ్రొక్కలేదె." ద్వి. సా. ౩, ఆ. ౧౦౪. పు. ౧౨. పం.

**గారవము.** వై. వి. (సం. గౌరవమ్.) 1. గొప్పతనము. "సీ. సిందుఁగొల్వునను గూర్చుండి ధర్మజుతోడఁ గార్యంబు దెలిపెడిగారవంబు." దశా. ౧. అ. ౯౪; 2. ప్రేమ. "క. ఈరాజు రాజముఖియును, గారవమునఁ గలసి మెలసి కందర్పసుఖ, శ్రీరతులై విహరించెద, రీరీతిని మనము నునికి యెంతయు నొప్పున్." విక్ర. ౭, ఆ. ౮౫; 3. వాత్సల్యము. "క. ఆరాజర్షి యొం దానికిఁ, గారణ మమ్మునియకాఁ బ్రకాశజ్ఞానో, దారమతి నెఱిఁగి కన్నియ, గారవమునఁ గొని పులస్త్యకడకుం జనియెన్. నిర్వ. ౨, ఆ. ౨౭; 4. గౌరవము, ప్రీతి. "ఆ. మత్స్యవిషయరాజ్యమహిమకు యుక్తుఁడు, గాఁ దలంచెనేని గారవమున, నట్ల చేసి భక్తి ననుచరింతు నమాత్య, సుతసుహృద్భటార్యయుతము గాఁగ." భార. విరా. ౧, ఆ. ౧౮౮; 5. లాలనము. "గీ. చెంచుఁ జిగురాకుఁబోణులచేత నెల్ల, నభినయింతురు పర్ణశాలాంతరమునఁ, దండ్రు లెందేని చనునప్డు తల్లు లెదుర, గారవము చేయుఁ మునికన్యకాజనంబు." హర. ౫, ఆ. ౩౭; 6. విధము. "సీ. శిటపాలిక మరుత్తుచెల్వునను దిలీపుకరణి సుహోత్రుని గారవమున." విక్ర. ౨, ఆ. ౬౯.

గారవించు. వై. స. క్రి. 1. లాలనచేయు. "సీ. తన మంజులాలాపతతిఁ గూడి భాషించుకీరంబు నోఁ కేల గారవించి." విక్ర. ౭, ఆ. ౧౭. ఉ. హరి. ౫, ఆ. ౬; 2. ఆదరించు. ప్రీతిచూపు. "గీ. నాకుఁ బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న, కాంగ భావించి యాదేవి గారవించు." భార. విరా. ౧. ఆ. ౩౧౬. భార. శాం. 3, ఆ. ౭౪; 3. అలంకరించు. "చ. అనుడు నొకింత లేఁతనగ వానన పద్మము గారవింప..." ఉ. హరి. ౨, ఆ ౧౮.

గారవిలు. వై. అ. క్రి. 1. లాలనము నొందు. "సీ. జనపంకకర్త నుత్పలబాంధవునిఁ బోలు కరము లర్మిలిఁ జూచి గారవిలుట." ఐజ. ౨, ఆ. ౪౦; 2 ప్రేమ మొందు. "క. చెలువా పవిచే లైనను, విలువా నిచుఁ జూచి గారవిలువారల కున్." చంద్ర. ౪, ఆ. ౧౧౪.

గారవిల్లు=గారవిలు. (చూ. గారము.)

గారాబము. వై. వి. (సం. గౌరవమ్.) 1. గొప్పతనము. "క. వారలలోఁ గౌసల్యా, నారీమణి యఖిలపావన శ్రీమద్గ, ర్భారూఢలక్షణంబుల, గారాబముఁ జెందె విభుఁడు గడు రంజిల్లన్." రామా. 3, ఆ. ౮౧; 2. వాత్సల్యము. "ఆ... కన్నతల్లి మిగుల గారాబమునఁ బెంపఁ, బెరిఁగెఁ జైత్రలతిక పెంపు మీఱ." వరా. ౮, ఆ. ౮౦. విణ. ప్రియము. "సీ. రాజశేఖరునిగారాబంపుఁ బూఁదోఁట విపులామహాదేవి వెల్లచేల... గీ... అంబురాశి". చిత్రభా. ౫. ఆ. ౫.

గారాబు. వై. విణ (సం. గౌరవమ్.) ప్రియము. "సీ. కమలాప్తసారథిగారాబుఁ దమ్ముండు..." పారి. ౨, ఆ. ౭౧. భీమ. 3, ఆ. ౬౨.

గారాము. వై. వి. (సం. గౌరవమ్.) 1. గొప్పతనము, ఉరుటు. "సీ. మారేడుపండుల గారాము నెఱచని యెలచన్నుఁగవ వేడుకలఁ బొసఁగ." భార. అను. ౧, ఆ. ౫౦, 2. ఆదరము, ప్రీతి. "క. ఆరాజుసేయుఁ నెయ్యము, గారామును జెప్పె దీవు గడుఁ దీపులుగా." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౦. 3. గౌరవము, మర్యాద. "ఆ. విగతనాథ లైన మగువల గారాము, సెడక యుండునట్లు నడపి కొనుచు." భార. మౌ. ౧౭౫; 3. ప్రేమాతిశయము. "శా. ఆరామామణి మీఁది ప్రేమమున నిట్టారామకుమారకో, వారంబు ల్దిలకించి యందు నతిమత్కారంబులై మీఱుభృంగ, గారావంబు లచే నెనంగ పజ కొంగారం కుకరాక్షి కృపం, గారాగారముఁ జేసి తాల్మి విలువం గా రాక గారామునునన్." వసు. ౩, ఆ. ౮౩; 4. అదృష్టము. "శా. కాకూ... కలలోపలం గలసె న న్నేకూపునం జేసి వా, కేమీ కింతటి మేటిమాఁటికిఁ దానిల్వాలుగా నోముచ. గ్గారా మేలలి తాఁగికిం గలుగు..." ఉ. హరి. ౫, ఆ. ౧౫౫. విణ. 1. ప్రియము. "సీ... భూరిశ్రవసుఁడు నీవు, గారాపుఁబట్టి..." భార. స్త్రీ. ౨, ఆ. ౧౨౭. నైష. ౧, ఆ. ౧౨; 2. గౌరవాస్పదము. "క. దేవకియుంబు రోహిణియుంచు, రేవతియుఁను రుక్మిణియుంచు ప్రియము లెసఁగ నం భావన లొనర్ప గారా, మై వెలసె జలంధ్రుపౌత్రి యమునకతి కెల్లన్." హరి. ఉ. ౮, ఆ. ౬౬౬.

గారు. దే. వి. బొ. ఇది లఘచుగా స్త్రీసమము లగు నట్టియు స్త్రీలింగము లగునట్టియు నేకవచనాంత దేశ్యశబ్దములకుఁ గొన్నిటికిఁ జివరఁ జేర్పఁబడి పూజ్యతఁ దెలుపును. "ఉ... తూఁమియల్లు నంపుచో, సెట్టిగిపాద మాత్మ నుదయించెనో మామను నత్తగారికిన్." నైష. ౭, ఆ. ౪. ఉ. రా. ౬, ఆ. ౧౧౯.

గారుడము. సం. వి. అ. పుం. 1. గరుడపచ్చ; 2. విషమంత్రము; 3. అస్త్రవిశేషము; 4. వ్యూహవిశేషము; 5. బంగారు. న. గరుడమంత్రము. విణ. 1. గరుడసంబంధమైనది, గరుడుఁ డధిదేవతగాఁ గలది. (అస్త్రాది); 2. గరుడాకారము గలది. (వ్యూహాది.)

గారుడికుఁడు. సం. వి. అ.పుం. పాములవాఁడు.

గారుత్మతము. సం. వి. అ. న. గరుడపచ్చ. విణ. (అ.ఈ.అ.) 1. గరుడసంబంధమైనది (అస్త్రాది); 2. గరుడాకారము గలది. (వ్యూహాది).

గారె. దే. వి. మినుపపప్పు రుబ్బి దానితో వండు భక్ష్యవిశేషము; వడ? "సీ. గారెలు బూరెలుం జాపలు మోరులుఁ గమ్మనిమాంసముల్ ఘుమ్మనుచు." ఉ. రా. ౬, ఆ. ౧౨౨. రామా. ౨, ఆ. ౧౫.

గార్దభము. సం. వి. అ. పుం. గాడిద.

గార్భిణము. సం. వి. అ. న. గర్భిణుల సమూహము. 2. గర్భిణీ సంస్కారవిశేషము, సీమంతోన్నయనము. విణ. (అ. ఈ. అ.) గర్భిణికి సంబంధించినది.

గార్హపత్యము. సం. వి. అ. పుం. శ్రౌతాగ్నులలో నొకటి. (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము నని శ్రౌతాగ్నులు మూఁడు.) న. గార్హస్థ్యము.

గార్హస్థ్యము. సం. వి. అ. న. 1. గృహస్థాశ్రమము; 2. గృహస్థునికి సంబంధించినది. (పంచయజ్ఞాదికము.)

గాలగాఁడు. ద్వ. వి. (గాలము+కాఁడు) గాలము వేసి చేఁపలఁ బట్టువాఁడు. "సీ...పాపనిర్ముక్తుఁడై మఱియోగ మాచరింపఁగ యోగ్యుఁ డగునరుండు. గీ. మనసు పట్టుట ముఖ్యపుటనువు దాని, కామిషము గాలగాని కెట్టట్టు..." భార. అను. ౫, ఆ. ౨౫౬.

గాలనము. సం. వి. అ. న. 1. వడఁబోయుట; 2. శరగించుట; 3. తిట్టు, శాపము.

గాలము. ఉభ. వై. వి. (సం. గాలమ్. క. గాళ.) 1. చేఁపలఁ బట్టుటకై యినుపకమ్మితో వంకరగాఁ జేసినసాధనము, బడిశము. (దీనిభేదములు: ఊంటగాలము, గోరుగాలము. మొ.) "ఆ. నీళ్ల లోనిచేప నెఱిమాంసమాశకు, గాలమందుఁ జిక్కికూలునట్లు, యాశ పుట్టి మనుజుఁ డారీతిఁ జెడిపోవు..." వేమన ౧, ప్ర. ౫౫. ఆం.భా. ప్ర. ౧౫౯; 2. నూతిలో చేఁద మొదలగునవి తీయుట కుపయోగించు సాధనవిశేషము. (వా.) సం. వి. అ. పుం. 1. గళనము; 2. ఉమ్మెత్త. న. 1. ఉమ్మెత్తకాయ; 2. గాలము, బడిశము.

గాలవము. సం. వి. అ. పుం. లొద్దుగు, లోధ్రము.

గాలాము=గాలము. వై. వి. "సీ. వాలారుగోరు మేల్ గాలాము చేసెనే జేజే హిరణ్యాసురశుకమునకు." పాండు. ౨, ఆ. ౧౩౭. కువల. ౨, ఆ. ౧౩౭.

గాలి. దే. వి. (క. గాళి. త. కాల్.) 1. వాయువు. "సీ. కమ్మని చల్లని గాలి మెల్లన వీచె వ్యోమానలంబు చెన్నొందె వెలిఁగె." భాగ. ౧౦. స్కం. పూ. ౧౦౫. ఆం. భా. తృ. ౫౩; 2. మృగాది గ్రాహ్యగంధము, పసి. "సీ. ఎగుచుకూఁతలు మట్టె యెత్తి బిట్టావించి గమికిఁ గన్నా కయి గాలి యరయు." స్వా. ౪, ఆ. ౪౭; 3. పిశాచము. "క. అన విన వదరకువే యీ, తని కేమియుఁ లే దటంచు దానిపిఱుందన్, జని పీరుఁ డతని యాకృతిఁ, గని క్రోవం గాలి సోఁకెఁ గావలె ననుచున్." శుక. ౨, ఆ. ౫౩౮. ఆం. భా. తృ. ౫౩. సావి. ౨, ఆ. ౬౦.

గాలించు. దే. స. క్రి. 1. బియ్యము లోనగువానిని నీళ్లలోఁ బోసి ఱాళ్లు లేకుండఁగ శోధించు. (శర. బ్రా.); 2. వెదకు. "సీ...కోటగవఁకు, లారసి బలితంపుఁదేరులు గాలించి..." అచ్చ. సు. రా భా. రా. సుం. ౧౭౭; 3. శోధించు, కలఁచు. "మ...కడుపులోఁ జేపెట్టి గాలించుబాగుల జాలయ్యెడు..." సావి. ౨, ఆ. ౧౦౧ పు.

గాలింపు. దే. వి. (గాలించు ధా.) శోధనము, వడఁబోఁత. "సీ. వడిఁగట్టు గాలింపు కడుగు డేరు. గీ. పఱు పనఁగ శోధనాభిధ పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౨౫౭.

గాలిఁబుచ్చు. దే. స. క్రి. (గాలిన్+పుచ్చు.) వ్యర్థమొనర్చు. "శా. వాలుంగేలున నంటఁ బట్టుకొని జేవం బింత నిస్సారమే, యేలా సాహస మింత క్రూరమతివై యేకాంత మిక్కానలో, గాలింబుచ్చెదు పౌరుషం బిది వినం గానం గడున్ దోసము..." దశ. ౬, ఆ. ౬.

గాలిఁబోవు. దే. అ. క్రి. 1. (గాలిన్+పోవు.) వ్యర్థమగు. "ఉ...వాఁ, డాయతశక్తి నన్ను నిట సంకిలిపెట్టి నష్టరామభూ, నాయకు నాజ్ఞ నైకొనిన నాపని చెల్లఁగ గాలిఁబోవదే." భా.రా. సుం. ౭౧; 2. నశించు. "సీ. ఎప్పుడు జంకించు వ్రాతజాతశింజినిఁ గావరంబునఁ దన్ను గాలిఁ బోవ." వరాహ. ౪, ఆ. ౭౧; 3. గాలి కెగిరిపోవు. "గీ. గాలిఁబోయెడివరుగాకుగతిఁ గరంబు, తూలిపోయెడినెమ్మేనితోడఁ జనుచు, విప్రవర్యుండు కన్నులవిందు గాఁగ, వీక్షణము చేసె రుక్మిణీవిభుపురమ్ము." కుచేల. ౨, ఆ. ౭.

గాలికబురు. దే. వి. (గాలి+కబురు.) నలుగురు చెప్పుకొనుమాట. (వా.)

గాలికుంటు. దే. వి. (గాలి+కుంటు.) పశువులకు గొరిజలయందు పుండుపడెడువ్యాధి. (శ. ర.)

గాలికొమ్ము. దే. వి. (గాలి+కొమ్ము.) వాద్యవిశేషము. "సీ. గాలికొమ్ములు డోల్లు కైముట్లు రుంజలు." మొ. రా. యు. 3, ఆ. ౨౬.

గాలిగంగలు. మి. వి. బ. (గాలి+గంగలు) గంగా నమ్మ మున్నగు క్షుద్రస్త్రీదేవతలు. "క. అతఁడు దన్నగరీపతి, జాతర సాటించెఁ బశువిసర మనిత రసా, ధ్యాతతవాతామయని, ర్ఘాతావాతిఁ దూల గాలిగంగల కెల్లన్." పాండు. 3, ఆ. ౭3.

గాలిగాఁడు. దే. వి. (గాలి+కాఁడు.) గాడిద. "చ.. అనఘుతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁద బెత్తుగాఁ, గనుఁగొని గాలిగానికడ కాళ్లకు మ్రొక్కఁడె నాఁడు భాస్కరా." భా. శ. ౩౦. వేంక. తిర్య. ౯౬.

గాలిగుడి. ద్వ. వి. (గాలి+గుడి) సూర్యచంద్రులకుఁ జుట్టు చేర్పడెడుమండలము, పరివేషము. (శ.ర.)

గాలిగొను. దే. అ. క్రి. (గాలి+కొను) తడి యాఱు, ఎండు. "వ...తి త్రోలిచి గాలిగొన వైచినకుక్క కలిమంబుఁ గనుంగొని..." భార. శాం. 3, ఆ. ౨౦౭.

గాలిగోపురము. మి. వి. (గాలి+గోపురము) మిక్కిలి యెత్తుగా నుండుదేవాలయపుగోపురము. (వా.)

గాలిగ్రుడ్డు. దే. వి. (గాలి+గ్రుడ్డు.) విణ. 1. పేడ. (శ. ర.); 2. అవివేకి, తెలివిమాలినవాఁడు. (బ్రౌ.)

గాలిచీర. ద్వ. వి. (గాలి+చీర) 1. తెరచాప. "క. కులిశహతిఁ బడనివారగిరి, పోలుపున నొకకలము చేరెఁ బుణ్యాముపొడవై, జలనిధి నడుఁ జేరు గతిం, జెలు వగుధవళంపు గాలిచీరలతోడన్." దశ. ౧౦, ఆ. ౫౦. వరాహ. ౫, ఆ. ౭౬; 2. చోరసాధనవిశేషము. "మత్త. గాలిచీరయు నొల్కిబూడిద గ్రద్దగోరును గొంకియుఁన్, గోల యుఁన్...ముచ్చులున్." ద్వా. ౧౦, ఆ. ౧౧౦.

గాలిచూలి. దే. వి. (గాలి+చూలు) 1. హనుమంతుఁడు; 2. భీముఁడు. "గీ.తుంగమదమున నాఁడు మాతంగవిభుని, భంగి భవదీయసైన్యంబు బడలు వడఁగ, లీల నిస్సంభ్రమం బయి కేలి సలిపె, గాలిచూలి లప్తు గగనచరాలి పొగడ." భార. భీష్మ. ౨. ఆ. ౨౨౨.

గాలితము. సం. విణ. (త. ఆ. అ.) 1. వడఁబోయఁ బడినది; 2. వస్త్రాదులలోఁ బోసి మెత్తనిది క్రిందికి దిగుపట్టు చేయఁబడినది. (ఉదా: వస్త్ర గాలితము.); 3. కరఁగింపఁబడినది.

గాలితిండి. దే. వి. (గాలి+తిండి). పవనాశనము, సర్పము. "గీ. మీలు కప్పలు తాఁ బేర్చి గాలి దిండ్లు, మొసళ్లు ఎండ్రులు ఎగడులు మొదలు గలుగు, నిరుద్రిమ్మరి పసుపులు..." అచ్చ. యు. 3.

గాలిద్రిమ్మరి. దే. వి. (గాలి+త్రిమ్మరి) పిశాచము. "సీ. ఏమీ పిశాచంబ యాశ్వయుండే నిన్ను భేద బుద్ధిఁ బంపఁ ద్రేరకుండు, కాక భూసుర యేను కర్తనే యయ్యాకునమలి మ్రింగెద నంటి నిన్ను...గీ...గాలిద్రిమ్మరి యాశుం దకల్మషుండు, హింసఁ జేయించునే..." శ్రీరం. మా. ౬. ఆ. ౧౧.

గాలిచెచ్చెలి. దే. వి. (గాలి+చెచ్చెలి) వాయుసఖుఁడు, అగ్ని. "ఆ. నీరుపావ గాలిచెచ్చెలి యన్నింటి తిండికాఁడు...అగ్ని యనఁగ నొప్పు ననలుఁ డీశ." ఆం. సం. దేవ. ౧౦.

గాలిపంట. దే. వి. నిర్ణయము లేనిపంట (శ. ర.)

గాలిపటము. మి. వి. (గాలి+పటము) 1. బాలక్రీడావిశేషము, గాలిపటముతో నాడుకొనునాట. "సీ...దోఁకిల్లి గాలిపటంబు సరిజేసి ఫుటచెండు చాకిమాట." హంస. 3, ఆ. ౧౪౬; 2. బాల క్రీడాసాధనవిశేషము, గాలిపడగ. "మ. అరు దారకన్ రఘుపీయుఁ డొక్కతతి బాల్యక్రీడ మారీచము, మ్కారుమే నాశుగ యుక్తి గాలిపట ముగా నింట నాడింపుచున్." చంద్రా. ౧, ఆ. ౨౧. శుక. 3. ఆ. ౪౪౭.

గాలిపట్టి. ద్వ. వి. (గాలి+పట్టి)= గాలిచూలి. (హనుమంతుఁడు.) "సీ...కడిఁదిపులుఁగు, నకుఁ దగి నట్టిచందము దీర్చి యరుగుచుఁ బంప చేరువ గాలిపట్టిఁ గాంచి." య. 3, ఆ. ౨౧.

గాలిపడగ. ద్వ. వి. (గాలి+పడగ) పిల్లలు గాలిలో నెగురవేసికొనుటకై కాగితము మొదలగువానితోఁ గట్టినపటము; బాలక్రీడాసాధనవిశేషము. "గీ.

ఆలజాలంబు నీటిపై నాడుజాడ, గాలిపడగ యాకసమునఁ బ్రాలుత్రోవ, నిమురలోపలఁ గలఁ బోఁచుసీడ పిదపఁ, గానవచ్చునె యప్పుడ కన్నుఁ గాక." ఉ. హరి. ౫, ఆ. ౧౧౦.

గాలిపిశాచము. మి. వి. (గాలి+పిశాచము) గాలి రూపమున నుండుపిశాచము. "ఉ. గాసిలి పట్టఁ గొల్పడినగాలిపిశాచమునోలెఁగష్టస, న్న్యాసి..." వేం. పంచ. ౧, ఆ. ౧౪3.

గాలిబిళ్ల. దే. వి. (గాలి+బిళ్ల) గొడలు వాయురోగ విశేషము. (వా.)

గాలిమాట. దే. వి. (గాలి+మాట) లోకప్రవాదము; ఆధారములేనిమాట. "సీ. మలయమారుత మైన మెలఁతఁ దెచ్చునటన్నఁ గానరా దడియును గాలిమాట." కవతీ. ౨, ఆ. ౭౯.

గాలిమెకము. ద్వ. వి. (గాలి+మెకము) లేడి. "సీ. తడవింట నేయక తఱిమి గాలిమెకంబు నును రుతోఁ గొనివచ్చునసమజవము." రా. వి. 3, ఆ. ౪౬.

గాలిమేఁతరి. దే. వి. (గాలి+మేఁత+అరి.) పవనాశనము, సర్పము. "సీ. కప్పుగుత్తుకవాఁడు గాలిమేఁతరియందెజోటివాఁ డరమెయిజోటివాఁడు" అచ్చ. బాల. ౧3.

గాలిమేపరి. దే. వి. (గాలి+మేపు+అరి) "సీ. ఘన వృషభేంద్రుండు గాలిమేపరిపిండు వాజిగా భూషణరాజి గాఁగ." చెన్న. ౨, ఆ. ౧౮౭.

గాలివాన. దే. వి. (గాలి+వాన) గాలితోడివాన, ఝుంఝు. "వ...అప్పు డప్పుర్వుఁదోఁట గాటంపు గాలివానచేత నేకీడునుం బొరయకునికి జనులు వెఱఁగందుచుండిరి..." కళా. ౪, ఆ. ౯3.

గాలీవేఁత. దే. వి. (గాలి+వేఁత) 1. గాలి కొట్టుట; 2. జ్వరభేదము. (శ. ర.)

గావు. దే. వి. బలి. "గీ. గొప్పచింబోతుకదుపులఁ గూర్చి సీమఁ, గావు పెట్టింతుసమ్మ యోగంగ నమ్మ." నీలా. ౧, ఆ. ౧౧3.

గావుకేక. దే. వి. (గావు+కేక) బలి యిచ్చునపుడు వేయుకేక; పెద్దకేక. (వా.)

గావుకొను. దే. స. క్రి. (గావు+కొను.) బలిగొను. "చ. గొఱియల మేఁకపోతులను గొమ్ముపొటేళ్లను గావుకొందువు..." కాళికేశ్వరీ. పీఠి. ౪౧.

గావుకోడి. దే. వి. మూలికావిశేషము. (శ. ర.)

గావుపట్టు. దే. స. క్రి. (గావు+పట్టు) 1. చంపు. "సీ. కడుదురిఁగయుంఁ బోలె వడిఁ దోలి కఱచి యాకస్తూరిదుప్పుల గావుపట్టు." సా. ౧, ఆ. ౯౭; 2. నాశ మొనర్చు. "ద్వి. పొదలెడు పురుషార్థముల గావుపట్టి, మదము మాత్సర్యంబు మట్టి మల్లాడి." విష్ణు. పూ. 3, ఆ. (శ. ర.) వి. గట్టిపట్టు, కార్యము నెఱవేరువఱకు వీడకుండఁ బట్టినపట్టు. (శ. ర.)

గాసటబీసట. దే. వి. సలక్షణము గానిచదువు. (శ.ర.) "ఉ. భాసురభారతార్థములభంగులనిక్క మెఱుంగ నేరమిం, గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువా రికిన్, వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లఁగఁజేసినట్టియ, బ్భాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్." నృసిం. పీఠి. ౯.

గాసము. వై. వి. (సం. గ్రాసః) 1. ఆహారము, తిండి. "సీ. నల్లదేవరకోలఁ బల్లెవేసిన మేటి విసము గాసము గాఁగ మెసఁగునయ్య." శివధ. 3, ఆ. ౧౫. భాగ. ౧. స్కం. ౪౪౭; 2. బత్తెము, జీతము. "గీ. బంటు నెఱుఁగవు గాస మిమ్మంటెఁ గసరె, దవసరము వచ్చె మముఁ జూడు మనెడు వారు, నైరి..." రా. వి. ౫, ఆ. ౫.

గాసి. దే. వి. (క. గాసి) 1. వ్యథ, దుఃఖము. "ఉ...ఆ, య్యో సరసీరుహాక్షి మదయోగభరంబున నిట్లు ఖిన్నయై, గాసి వహించి యున్నది..." శుక. ౧, ఆ. ౨౧౪. "సీ. అపుడు వైచినవచ్చి యరుఁగుమైఁ బవళింతఁ గలువకాఁడై మేను గాసిఁ బొదల." రా. వి. ౨, ఆ. ౭౦. ఆం. భా. ప్ర. ౧౫౦. విణ; 1. చెడినవాఁడు. "గీ. కర్ణశకుని దుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ, దలఁచి వారలఁ గొని మమ్ము గెలుచువాఁడ, వై మనంబున శంకింప కట్టు కీడు, చేసి తాపూఁపుదప్పిన గాసి యైతి." భార. శల్య. ౨, ఆ. ౫౯; 2. చెడినది, నశించినది. "గీ...బేహార మాడు, టయును గోరక్ష గావించుటయును మొదలు, గాఁగ బ్రతికెడు తెరువులు గాసి గావె." భార. శాం. ౨, ఆ. ౨౫౫; 3. నిష్ఫలము. "చ...నీదగుసహాయతఁ గౌరవసేన రూపుమా, పుట యవలీల నాకు ననుఁ

బొల్లుగఁ జేయుట నీకుఁ బాడియే, కటకట నాపరాక్రమము గాసిగఁ జక్రముచేత నంటిరే." భార. భీష్మ. ౨, ఆ. ౧౬౧; 4. నలఁగినది. "సీ. కమ్మక్రొవ్విరిసరుల్ గాసియై యసియాడ బలుకీలుఁ గొప్పులఁ బట్టి యీడ్చి." ఉ. రా. ౪, ఆ. ౯౩.

గాసించు. దే. స. క్రి. బాధించు. "క. చేసినమే లెఱుఁగుదు రారు, గాసింపరు మచ్చికంపుఁ గఱవ లెఱుఁగర, త్యాసక్తసౌహృదులు స, త్యాసీనులు సురలు వార లపకారకులే." హరి. ౫, ఆ, ౩౦౧. ద్వి. పరమ. ౪, ఆ. ౩౩౪. పు.

గాసిఁబడు. ద్వ. అ. క్రి. (గాసిన్+పడు) 1. చెడు. "క. ఆసమయమున రహస్యము, గాసింబడకుండ..." దశ. ౩, ఆ. ౧౧౭; 2. బాధపడు, దుఃఖించు. "సీ. హోమాజ్యగంధోర్మి కుక్కోగ మొందుచుఁ గ్రతుధూమములచేతగాసిఁబడుచు." శైవ. ౭, ఆ. ౧౨౩. "క. స్త్రీ సంతోషించు తెఱం, గానపడనిమనసు గలుగునట్టియధముఁ డి, చ్చో సడిఁ గనుఁ జని యచ్చో, గాసింబడు జమునిభటులు గాఱియపెట్టన్." భార. అశ్వ. ౪, ఆ. ౧౨౧.

గాసిఁబఱచు. ద్వ. స. క్రి. (గాసి+పడు. ధా. ప్రే.) 1. బాధించు. "సీ. బహురూపులను మీఱి పర్ణశాలలు దూఱి కడఁగి మునిస్త్రీల గాసిఁబఱచు." ఉ. హరివ. ౪, ఆ. ౧౪; 2. "వ...గడుసరి దానవులు పసిమి గలపసిఁడి కాసచేసి పడ ద్రోసి గాసింబఱచిన ప్రాసాదంబులును..." ఉ. హరి. ౧, ఆ. ౫౩.

గాసిఁబఱుచు. ద్వ. స. క్రి. (గాసిఁబడు. ధా. ప్రే.) పీడించు. "సీ. కవచకుండలవెక్కు గాంచురీచు దోయి కలికి యేకలినుండు గాసిఁబఱిచె." ఉ. రా. ౪, ఆ. ౨౨౭.

గాసిఁబెట్టు. దే. స. క్రి. (గాసిన్+పెట్టు) 1. చెడఁగొట్టు. "గీ...ఏకాంత మంతయుఁ గాసిఁబెట్టఁ గడగి..." దశ. ౬, ఆ. ౧౨; 2. దుఃఖపెట్టు, బాధపెట్టు. "క. ఆసభ నమ్మెయి నీవు, శ్యాసనుఁ దప్పాండుపుత్రపతిఁ గ్రూరాత్ముఁ, డై సంకలేక పెద్దయు, గాసింబెట్టంగ..." భార. స్త్రీ. ౨, ఆ. ౫౬. భార. శాం. ౩, ఆ. ౧౫౩.

గాసిచేయు. దే. స. క్రి. (గాసి+చేయు) 1. బాధపెట్టు. "గీ. కడియు నొక్కెండ్ర దన్నులఁ బాఱ విడిచె, గాసిచేయక కాకోలకంఠుపట్టి, తండ్రి పేరివా రగుట చిత్తమునఁ దలఁచి." కాశీ. ౭, ఆ. ౧౫; 2. నాశమొనర్చు, పాడుచేయు. "చ...సమస్తభూజముల్, బలుపిడి గాసిచేసి బహుభంగుల నిట్టులు త్రుళ్ళుచున్నెడన్." భా. రా. సుం. ౫౪౦. నిర్వ. ౭, ఆ. ౧౩౨.

గాసిలు. దే. అ. క్రి. 1. బాధపడు. "ఉ. గాసిలనీక రాసుతులఁ గౌశికుఁ డాఁకలి పీడపట్టు నా, యాసము లేనిమాత్రము...కృపచేసి కృతార్థులఁ జేసె నెంతయున్." రామా. ౪, ఆ. ౨౫. పారి. ౧, ఆ. ౧౩౩; 2. కోపపడు. "క. వాసవుఁడు నందగోపుఁడు, చేసినయపరాధమునకుఁ జిత్తము లోనన్, గాసిలి..." వి. పు. ౭, ఆ. ౨౪౩. ఉ. హరి. ౪, ఆ. ౧౨౧; 3. శ్రమపడు. "క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయున్, దా నైరణ నేయఁడు..." భార. విరా. ౪, ఆ. ౨౩౦; 4. నశించు, చెడు. "చ...నామనంబునఁ గడింది భయంబు జనించె దక్షిణాం, గసికరముల్ చలించె ధృతి గాసిలె మే నవశత్వ మొందె..." ఉ.రా. ౬, ఆ. ౨౩౬.

గాసిల్లు=గాసిలు. (చూ. గాసిలు.)

గాసిసేయు=గాసిచేయు. (బాధపెట్టు.) "ఉ. భంగము తోఁడ మున్ననుఁ బంపు విరాటునిమీఁద భూమికిం, జెంగటనుండు నావయునజీకపుటూళ్లలు సంతతంబు వా, నిం గడు గాసిసేయు నతనిం జెఱుపం దఱి యయ్యె..." భార. విరా. ౩, ఆ. ౧౧౯.

గాహనము. సం. వి. అ. న. 1. స్నానము, మునుక; 2. చొచ్చుట.

గాహమానుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) 1. స్నానము చేయుచున్నవాఁడు; 2. ప్రవేశించుచున్నవాఁడు.

గాహము. సం. వి. అ. పుం. 1. స్నానము; 2. చొచ్చుట. విశ. (అ. ఆ. అ); 1. స్నానము చేయునది; 2. చొచ్చునది.

గాహితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. మునిఁగినది; ప్రవేశింపఁబడినది.

గాళకుఁడు. దే.విశే. (క. గాళక.) 1. దిట్టఁడు, ధీరుఁడు. "ఉ. గాళక లాపురీభటశిఖామణు లెక్కటి యుక్కుతున్క లాభీలతరాశనుల్ చిదిమి వెట్టినబంటులు..." విజ. ౧, ఆ. ౧౦; 2. క్రూరుఁడు. "ఆ. అనుచు నెల్లవేల్పులను గొల్చి మనుకబ్బములను గన్నగాళకులను దలఁచి." నీలా. ౧, ఆ. ౧౧.

గాళు. దే. వి. (క. గాళు) నాశము, పాడు. (చూ. గాళుచేయు.)

గాళుచేయు. దే. స. క్రి. (గాళు+చేయు) నాశ మొనర్చు. "సీ. ఆటలిప్పలు ద్రచ్చి పాట బందులు గూల్చి కట్టువ లన్నియు గాళుచేసి." అచ్చ. సుం. ౯౫.

## గి

గి=గీ. దే. అప. నిందయందు హ్రస్వాది యైనయా మ్రేడితశబ్దముయొక్క యాద్యక్షరమునకు వచ్చు నాదేశము. "చ. హరి గిరి వహ్ని గిహ్ని మఱి యంతకు గింతకు చైత్యు గీత్యు వా, ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు..." భా. రా. యు. ౯౦౪. ఉ. హరి. ౪, ఆ. ౧౦౭.

గింగురు. దే. వి. వింటినారినుండి బాణము వెడలుట మొదలగువానియం దగుధ్వని కనుకరణము. "ద్వి. కొదమనాగముఁ బోనికోలమిణ్ణరులు, సెదరంగ దోనఁ దీసి శింజీని దొడిగి, తెగ గింగు రనఁ బావి దృష్టి సంధించి, తెగ నేయుంటయు..." ద్వి. హరిశ్చ. పూ. ౭౧౯.

గింజ. దే. వి. బీజము, విత్తు. "సీ. పీడెంపుబలుకెంపు విరిసి వెన్నెల గాయ వరిగింజ నొకటఁ బల్వరుస దోఁప". ఆము. ౧, ఆ. ౬౧. ఆం. భా. ద్వి. ౩౯.

గింజు. దే. స. క్రి. చిమ్ము, విదిలించు. "ద్వి. జయ కాముఁ డలుఁగులు జళిపించి చిమ్ము, క్రియఁ గర చరణముల్ గింజి యాడుచును". అ. మ. క. ౧, ఆ. ౨౮. పు. ౨౦. పం.

గింజుకొను. దే. అ. క్రి. (గింజు+కొను) 1. శ్రమపడు, బాధపడు. "వ. చండికాసముద్దండపాశంబునం దగులువడి గింజుకొనుమనుజాశనులు పన్నినవలలం బడి తన్నుకొనుచున్నఁబోతులరీతి నుండిరి..." వరాహ. ౧౧, ఆ. ౧౦౫; 2. బాధింపఁదలఁచు. "శా. ఏ నిన్నే శర ణందు బాంధవులు గానీ యెల్లవారుం బగే, కానీ మృత్యువు తల్లక్రిందు పడనీ కాలుండు గీవెట్టనీ, నానాకర్మచయంబు గింజుకొననీ నాకేమి చే రాజ నిం, తే నీచాటున దాఁగియున్నపుడు బీతే యింక సర్వేశ్వరా." స. శ. ౧౩౭. స. క్రి. చిమ్ము, విదిలించు. "శా... మీఁజేతులం గన్నులిం, పారం దోముచుఁ జేవఁ బూని పిఱుఁ దొయ్య స్నిఁది కల్హార్చుచున్, శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొనుచుం జెల్వంబు రెట్టింపఁగన్." హరి. పూ. ౫, ఆ. ౧౭౦. చైత. ౧, ఆ. ౧౦౧.

గింటెన. దే. వి. దింటెన. "సీ...గింటెన యనఁగను దింటెన యనఁ గిరికర్ణి చెలువొందు..." ఆం. భా. ద్వి. ౫౬.

గింటెము. దే. వి. జమిలిపోఁగునేఁతబట్ట. "గీ. మదత పసిమిడి గింటెముల్ మంజిడి జిగి, దోమతెర మంచములు హసంతులు జవాది, యగలు సిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలినెలలు తద్వధూకుచశరణుఁ డగుచు." కళా. ౭, ఆ. ౧౮౧. విశే. 1. సాంద్రము. "సీ. రింగులువాఱు గైరికపుగింటెంపుఁ బచ్చడము గటిప్రదేశమునఁ గట్టి." వరాహ. ౬, ఆ. ౪౦. వాల్మీకి. 3, ఆ. ౧౫౧; 2 ఘనము, గట్టిది. "ఉ. గెంటని ప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూ లొసంగి వా, ల్గంటి గిఱుక్కునం దిరుగఁ గమ్మనికస్తురి తావి గ్రమ్ముకో, గింటెపుగబ్బిగుబ్బలజిగిన్ వెలిఁ జిమ్ము నొయారి జిల్గుఁబ, య్యాంటచెఱం గొకింత దనయంగముపై నటు సోఁకినంతటన్." విజ. ౨, ఆ. ౧౩౪.

గిండి. వై. వి. (సం. కుండీ. క. గిండి) 1. సన్నని మెడ గలపాత్రము. "సీ. గొడుగు పావలు కేలఁ గొని నాగ్నజితి యుండ జలములగిండి లక్షణ వహింప." ప్రభా. ౨, ఆ. ౧౫. ఆం. భా. ద్వి. ౧౯౩; 2. కమండలువు. "సీ. దేవదేవుని నేల తెట్టితి పీ వని కీరవాణి యొకర్తు గిండి దోఁచె." పార్వ. ౪, ఆ. ౧౬౭. చంద్ర. 3, ఆ. ౨౧.

గిచ్చు. దే. స. క్రి. గీచు. (శ. ర. బ్రౌ.)

గిజిగాఁడు. దే. వి. పచ్చపిట్ట, బంగారుపిచ్చుక. "ఉ... శ్రృం, గారవనద్రుమాళి గిజిగాఁడులు గూడులఁ

జేర్చు...” స్వా. ౧, ఆ. ౩౬. ఆం. భా. ద్వి. ౯౭.

గిజిబిజి. దే. వి. నమలుటయందగు ననుకరణము. “చ. అజునివరంబుకల్మి నిటలాక్షమహోక్షముఁ దాఁకి గూల్చుచి, గ్గజముల మోపు మూఁపురముగాఁ గొన నోపుసురాసురాస్త్రముల్, గిజిబిజిఁ బిప్పిగానమలఁ గ్రొత్త తదీయముదాద్యశంపుట; క్కజములు తేరి గిబ్బల ప్రకారము లాతఁడ జేయుఁ డెష్మెయిన్.” కవు. ౫, ఆ. ౮౨.

గిజ్జిగాఁడు=గిజిగాఁడు. (శ. ర. బ్రౌ.)

గిజ్జిణి. దే. వి. భక్ష్యవిశేషము. “వ...బజ్జీలు గిచ్చళ్లు గిజ్జిణులు.” కాశీ. ౮, ఆ. ౧౭౫.

గిజగిజ. దే. వి. 1. కలవరము. (చూ. గిజగిజపడు); 2. కాళ్లుచేతులు విదిలించుటయందగు ననుకరణము. వా:—వాఁడు బాధచే గిజగిజ తన్నుకొను చున్నాఁడు.

గిజగిజకుడుచు. దే. అ. క్రి. (గిజగిజ+కుడుచు) కలవరమొందు. సీ. కదలించి యెత్తఁగాఁ గడు నశక్తుండయి గిజగిజకుడిచె నక్కేకయుండు.” చమ. ౩, ఆ. ౮౩.

గిజగిజపడు. ద్వ. అ. క్రి. (గిజగిజ+పడు) కలవరమొందు. “క...చిలుకులు, గిఱికొనఁ బఱపు టయుం వాఁడు గిజగిజపడుచుక్.” అచ్చ. యు. ౨౧౮.(ముద్రి. పా. “గిజగిజగొను.’ శ.ర.పా.)

గిజగిజయగు. దే. అ. క్రి. (గిజగిజ+అగు) బాధనొందు. “క. గజవదనాదులు గాంచిరి, నిజరక్షిత సీమఁ గాలనియమితభృత్యు, వ్రజకృతబహువిధ బాధల, గిజగిజయగుకూద్రభక్తుఁ గీలితదేహున్.” శ్రీరం. ౩, ఆ. ౫౨౨. బస. ౬౧౦. పం.

గిజగిజలాడు. దే. అ. క్రి. (గిజగిజలు+ఆడు) కలవరమొందు. “వ...ధవళకిరణకిరణంబులు చుఱుకు చుఱుకున మర్మంబు లంటిన గిజగిజలాడి తాళఁ జాలక మూర్ఛ గ్రమ్మి సొమ్మసిలిన...” మృ. వి. ౨, ఆ. ౭౪.

గిజేరు. దే. వి. 1. గింజ, బీజము. “గీ...బీజాఖ్య పరఁగు విత్తు విత్తనము గింజ గిజ రన...” ఆం. భా. ద్వి. ౩౯; 2. మామిడిపండుమున్నగువాని యం దుండు పిసెము. (శ. ర. బ్రౌ.); 3. జొడ్డి గ్రుడ్డులోనివచ్చునిపదార్థము. (బ్రౌ. వా.) విణ. ముదిరినది, గింజ ముదిరినది. వా:- గిజరుపం కాయ.

గిజురు=గిజేరు. (శ. ర. బ్రౌ.)

గిట. దే. వి. కృశించుటయందగు ననుకరణము. “క. పెటపెటపెటఁ గాసెన్ రవి, పటపటపటమనుచు గిరులు పగిలెన్ రగిలెన్, చిటచిటచిటమనుచున్ వని, గిటగిటగిటమనుచు జనము గృశియించె నెగన్”. రా. వి. ౫, ఆ. ౯౭.

గిటక. దే. విణ. పొట్టివాఁడు. “సీ. పొట్టి మొట్టి గిటక పొడిటి పొదడు...ిందణా యనఁగను వామనాఖ్య దనరు.” ఆం. భా. ద్వి. ౧౨౩.

గిటగిట. దే. వి. పండ్లు గీఁటుటయందగుధ్వని కనుకరణము. “ద్వి. గిటగిటఁ బండ్లను గీఁటి కౌశికుఁడు, చిటచిట మిడుఁగుర్లు చెదర వీక్షించి.” ద్వి. హరిశ్చ. పూ. ౧౧౭౩. పం; 2. వణఁకుటయందగు ననుకరణము. (చూ. గిటగిటమను.) విణ. సూక్ష్మము, సన్నము. (వృత్తియందు నిగామము) “క...కీల్జడ నటి, యింపక్ గిటగిటనికొ నొకింత చలింపన్.” విజ. ౩, ఆ. ౮౯. పరమ. ౩, ఆ. ౨౫.

గిటగిటన. దే. విణ. 1. అల్పము. “వ...మహేంద్రనిషధద్రోణంబులు దరిద్రాణంబులు హేమకూటంబు గిటగిటన తక్కుఁజెప్పుకొండలం బేర్కొనన గారణం బేమి...” కాశీ. ౧, ఆ. ౧౦౦; 2. కృశము. “వ...ఈబోటి...ప్రటపాకనిశాశం బగుకాఁకం జీకాకుపడి నాఁడునాఁటికి నగు చున్నట్ల గిటగిటనగుచున్నది...” ఆము. ౫, ఆ. ౫౫; 3. కొలఁది, కొంచెము. “వ...చదువదొర కొనిన నరునకుఁ గాలంబు నాలంబు విఘ్నంబు లఖిలోద్యమఘ్నంబు లందులకు సామగ్రి గిటగిటన.” ఆము. ౧, ఆ. ౮౭. (శ. ర. పా.); 4. సుకుమారము. “ద్వి. కటకట భారమెక్కడనుండి వచ్చె, గిటగిట నైనయీకీరవాణికిని...” ద్వి. హరిశ్చ. ఉ. ౯౧౭. పం.

గిటగిటమను. దే. అ. క్రి. (గిటగిట+అను) వణఁకు; చలించు “క. చనుఁగవ వ్రేఁగున గిటగిట, మను నెన్నఁడు మేమి యగునొ యనిసిరెయెనుశంకన్, గనకపుఁగట్టిడినాఁడో వనజాసనుఁ డనఁగ వనిత వసు లింపెనగున్.” ప్రభా. ౨, ఆ. ౭౩.

గిట్ట. దే. వి. 1. ఖురము, డెక్క. "గీ. గొరిజ డెక్క, గిట్ట యన ఖురనామంబు గేరుచుండు..." ఆం. భా. ద్వి. ౯౫౭; 2. బాణము. "వ...మైందునిఁ జొవంచగిట్టల గజు నెరిమిదికోలలఁ గుముకు నైదమ్ముల..."అచ్చ. యు. ౩౬౪. రా. వి. ౫, ఆ. ౧౨.

గిట్టకఱచు. దే. అ. క్రి. 1. చనిపోవునపుడు పండ్లు దగ్గఱగా పడు. వ్యవ:—వ్యాధి ముదిరినది. పండ్లు గిట్టకఱచుకొన్నవి; 2. కోపముచే పండ్లుబిగించు. (వా.)

గిట్టించు. దే. అ. క్రి. గిట్టుబడి యగు. (శ. ర.) స. క్రి.(గిట్టు.ధా.ప్రే) 1. చంపు. "దండకము... బల్లట్టివారక్కసున్ వెక్కసం బైన పేరుక్కుతో నుక్కుఁగంబంబునం బుట్టి గిట్టింపవా..." అచ్చ. యు. ౧౬౧; 2. భేదించు. "ద్వి. తనయుండు పిన్నని తలపోయ వలదు, కినిసినఁ గొండలు గిట్టింపనోపు." అ. మ. క. ౧, ఆ. ౩౫. పు. ౨౨. పం.

గిట్టింపు. దే. వి. (గిట్టించు. ధా.) 1. చావు (శ. ర.) 2. గిట్టుబడి. (శ. ర. బ్రౌ.)

గిట్టు. దే. అ. క్రి. 1. చచ్చు. "అ. వీరు కలియుంగ మున వేయేండ్లలోపలఁ, బుట్ట గిట్టఁ గలరు భూవ రేంద్ర." భాగ. ౯. స్కం. ౬౮౨. సా. ౧, ఆ. ౧౦౭; 2. నశించు, చెడు. "సీ. గుట్టు పోని చ్చిన గిట్టుఁ బెద్దఱికంబు దుర్వ్యయపరుఁ డైనఁ దొలఁగు మిసిమి." రామలిం. ౪౯; 3. అనుకూ లించు. (శ. ర.) 4. హితమగు. వా:—నన్నుఁ జూచిన వానికి గిట్టదు. ఆకూర నాకు గిట్టదు; 5. లాభించు. వా:—ఆధర కిచ్చిన నాకు గిట్టదు; 6. చాలు. వా:—కూలి గిట్టినచోఁ బనిచేయు దుము.

గిట్టుబడి. దే. వి. (గిట్టు+బడి) అమ్మకమునందలి లాభము. (శ. ర. బ్రౌ.)

గిడస. దే. విశే. పొట్టి, వామనము. (శ. ర. బ్రౌ.)

గిడి. దే. వి. బిగువు. (చూ. గిడికొను)

గిడికొను. దే. అ. క్రి. (గిడి+కొను) 1. బిగువెక్కు. (బ్రౌ.) 2. కప్పటలుగొట్టు (ఉదా:—గిడికొన్న చేతులు. బ్రౌ.)

గిడిగిడి. దే. వి. 1. నమస్కారము. "సీ...గిడిగిడి కొంకణాలు జోత. గీ...అన దండము పేళ్లు వేంక టేశ." వేంక. మాన. ౪౭. హంస. ౪, ఆ ౨౧౩; 2. చిరత, భజనచేయు సాధనవిశేషము. (బ్రౌ.)

గిడిబిడి. దే. వి. వాద్యవిశేషము. "సీ. చనియె దండ ధరుండు జయదుందుభులు మ్రోయ వెళ్లై వైత్యులు గిడిబిళ్లు మ్రోయ." వరాహ. ౨, ఆ. ౦. (గిడిగిళ్లు. అపముద్రి.) హంస. ౩. ఆ. ౭౯.

గిడియ. దే. వి. పటహవిశేషము. "సీ...తమ్మటం బనఁ గను దమటం బనంగను దమటాభిధానంబు దనరు చుండుఁ. గీ. దుదు మనంగను దముకునా గిడియ యనఁగ, నరగజ మనంగఁ దద్భేదనామము లగు." ఆం. భా. ప్ర. ౧౨౬.

గిడుగు. దే. వి. కామలేళిగొడుగు. (శ. ర.)

గిడ్డ. దే.వి.(క. గిడ్డ.) వామనమూర్తి, విష్ణుని యవతార భేదము. "రగడ. మీను తాఁబే ల్బంది మానిసి మెకము గిడ్డయు నేలవేల్పును..." అచ్చ. యు. ౬౪. విశే. పొట్టివాఁడు. "గీ...కుఱుచ రింగణ గిడ్డ గిఱక గుజ్జు, పొట్టె యన వామనాఖ్యలౌ..." సాం. ని. మాన. ౫.

గిడ్డంగి. దే. వి. (క. త. గిడ్డంగి) 1. సరకు లుంచి యమ్మెడియిల్లు; 2. చెఱసాల. (శ. ర.)

గిడ్డి. వై. వి. (సం. గృష్టిః. క. త. గిడ్డి.) 1. తేపువు, ఆవు. "సీ. దొడ్డిపెట్టిన పేల్పుగిడ్డి కాఁపు." స్వా. ౧, ఆ. ౬౬. ఆము. ౨, ఆ. ౯౭; 2. పొట్టియావు. "సీ...పేరు వామనగవి గిడ్డి యనఁగ..." ఆం. భా. ద్వి. ౨౬౩. విశే.పొట్టిది, వామనము. "సీ...ఆవు పొట్టియు గిడ్డి యనఁ జెలంగు..." ఆం. భా, తృ. ౪౬.

గిడ్డు. దే. వి. శ్యేనవిశేషము. "గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు, జాలె జలకట్టె కఱుజు వేసడము బైరి...అనుదేగకులము..." విన. శకుం. ౧, ఆ. ౧౧౦. య. ౧, ఆ. ౪౦.

గిత్త. దే. వి. 1. బుడ్డకొట్టనికోడె, అర్షభ్యము. "సీ. గిత్త నా గిబ్బ నాఁ గెరలు నార్షభ్యము..." ఆం. భా. ద్వి. ౨౬౨; 2. ఎద్దు, వృషభము. "సీ. గిత్తత త్తడివాఁడు బుత్తి మత్తు లిడంగఁ జాలువాఁ డొదలజాలువాఁడు." అచ్చ. బాల. ౧౩.

గిద్ద. దే. వి. సోలయందు నాల్గవభాగము. (శ.ర.వా.)

గిద్దు=గిడ్డు. "ఆ. ధర్మగుణము చేతఁ దగిలియుండియుఁ నీకు, నోప్రసేన యిట్టి యుగ్రకృత్య, మేల యనెదుకరణిఁ గోలాహలము చేసె, గిద్దు లలమి పొడువ ఖేచరములు." సాంబో. ౩, ఆ. ౨౩.

గినియ. దే. వి. కటభి ౘె. (శ. ర.)

గినుమాడు. దే. స. క్రి. (గినుము+ఆడు.) వంచించు. "మ. తను నాప్యాయితుఁ జేసి రేపు గృహ కృత్యంబుల్ వొనర్పం దొడం, గినతల్లిం గిను మాడి తప్పడుగులం గ్రీడారతిం బోయి..." హరి. పూ. ౫, ఆ. ౧౯౦.

గినుము. దే. వి. వంచన. (చూ. గినుమాడు.)

గిన్నియ=గిన్నె. (లోహాదిపాత్రము.) "సీ. పసిఁడిగిన్ని యలు చేపట్టి పుణ్యస్త్రీలు శిరమున మౌక్తికశేష లిడఁగ." ద్వా. ౨, ఆ. ౬౦. "చ...వజ్రపు గిన్నియలోనితీర్థము..." సాంబో. ౨, ఆ. ౭౦.

గిన్నె=గిన్నియ. దే. వి. (క. గిణ్ణిల్. త. గిణ్ణి.) 1. లోహాదిపాత్రము. "గీ. సాని యీశానిళ్లై మహోత్సవమునందుఁ, గేల నవచంద్రకాంతపు గిన్నె పూని..." భీమ. ౧, ఆ. ౧౦౪. దశా. ౪, అ. ౧౩౯; 2. పానపాత్రము, చషకము. గీ. గిన్నె యన డబ్బు రనఁ గోర యన్నఁ జష కము..." ఆం. భా. ద్వి. ౨౪౪.

గిబ్బ. దే. వి. 1. ఎద్దు, వృషభము. "వ...వడి గల గిబ్బలం బూన్చినశకటంబులు..." భాగ. ౧౦ స్కం. పూ. ౨౧౧; 2. బుడ్డకొట్టనికోడె, అర్ష భ్యము. ఆం. భా. ద్వి. ౨౬౨. విణ. శ్రేష్ఠవాచ కము. (ఇది యుత్తరపదమై యుండును.) "క. చన్నులు జక్కవగిబ్బలు..." నీలా. ౧, ఆ. ౫౫. దశా. ౧. అ. ౧౬౪.

గిబ్బరవుతు. ద్వ. వి. (గిబ్బ+రవుతు) వృషభవాహ నుఁడు, శివుఁడు. "క. బెబ్బులుల నంటవచ్చుం, బొబ్బమెకంబులను జేరి ముద్దిడవచ్చున్, గిబ్బ రవుతన్న నలుకుదు,ము..." పార్వ. ౨,ఆ. ౧౭౬.

గిబ్బలఱేఁడు. ద్వ. వి. (గిబ్బలు+ఱేఁడు) నంది, శివుని వాహన మగువృషభము. "ఉ.. హస్తమున న్నిశిత త్రిశూలము౦, బూని మెఱుంగు ఱంకెలిడుపోటరి గిబ్బలఱేని నెక్కి యీ, శానుఁడు వచ్చె..." పారి. ౪, ఆ. ౧౫.

గిబ్బవయాళిజోదు. ద్వ. అ. క్రి. (గిబ్బ+వయాళి+ జోదు) వృషభము నెక్కి విహరించువాఁడు, శివుఁడు. "ఉ. గుబ్బలిజేరితాలిమి నగున్ నిజ భూరివిభూతిసంపదన్, గిబ్బవయాళిజోదు నడఁ కించు..." రామా. కిష్కి. ౧౪.

గిబ్బు. దే. అ. క్రి. చంపు. "సీ. పోతరించి సివంగు లీకలాతల నేచి గబ్బిఘొల్లల నైన గిబ్బఁ జూచు. పా. ౧, ఆ. ౬౮.

గిరక. దే. వి. 1. నూతిరాట్నము, ఘటియంత్రము. (శ. ర. 'గిలక'. వా.) నూతిరాట్నముయొక్క చక్రము. "సీ. తంతుసంతతి సముత్పాటనయం త్రంబు రాట్న మంచనఁగను రహిఁకి నెక్కఁ, దవృద్ధహూత్రంబు తగు వడి యం చన గిరక నా భ్రమకంబు పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౨౬౪.

గిరగిర. దే. వి. తిరుగుట యున్నగువానియం దగుధ్వని కనుకరణము. "చ...ప్రచండమండలా, గ్రము జళి పించుచున్ గిరగిర న్దిరుగన్ స్నిగ్ధాక్షిచి పట్టు చున్." కళా. ౬, ఆ. ౧౪. భాగ. ౧౦. స్కం. ఉ. ౫౪౪.

గిరణము. సం. వి. అ. న. మ్రింగుట.

గిరదా. దే. వి. (హిం. గిర్దా) గుండ్రముగా చుట్టు కొని యుండు తలవెండ్రుకలు. (శ.ర. 'గిరజాలు.' వా.)

గిరవు. దే. వి. కుదువ, తాకట్టు. "సీ. కనువోయి మెఱుఁగులు కంతుతూపులకడ గిరవుగాఁ బెట్టినే హరిణనయన. విక్ర. ౭. ఆ. ౬౨. ఆము. ౧, ఆ. ౫౪; 2. కానుక. "గీ. హరిణకరిహరిచమ రంబు లక్షికుంభ, మధ్యవాలాకృతులు దెచ్చి మనువుకొఱకు, భిల్లపతియింట గిరవులు పెట్టె ననఁగ, దృక్కుచవలగ్నచికురచారిమల నొప్పు." వరాహ. ౨, ఆ. ౧౧౩.

గిరస. దే. విణ. పిఱికి, సమరభీరువు. (శ. ర.)

గిరాకి. దే. వి. 1. అధికమగుకొనుబడి. వా:—కాసు ధరతగ్గగానే గిరాకి హెచ్చినది. 2. అలభ్యత. ఉదా: వస్తువులగిరాకి హెచ్చుగా నున్నది. విణ. 1. అధికము. వా:—వస్తువులధర గిరాకిగా నున్నది; 2. వెల యధికముగాఁ గలది, ప్రియమైనది. వా:—సామాన్యులు గిరాకివస్తువులు కొనలేరు.

గిరాకీ=గిరాకి. (వా.)

గిరి. సం. వి. ఇ. పుం. 1. పర్వతము; 2. అచ్చనగాయలు; 3. నేత్రరోగవిశేషము; 4. జువ్వి ✤; 5. సన్న్యాసులనామములకుఁ జేర్పఁబడుబిరుదము. ఉదా: ఆనందగిరి. మొ.) స్త్రీ. మ్రింగుట. విణ. పూజ్యము.

గిరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టెలుక; 2. వసురాజు భార్య; 3. జలగ; 4. పార్వతి; 5. విధవ; 6. అడవిమల్లె ✤.

గిరికంటకము. సం. వి. అ. పుం. వజ్రాయుధము.

గిరికర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దింటెన ✤.

గిరికర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. దింటెన ✤.

గిరిగిట. దే. వి. ఆడునప్పుడు వాయించుకంచుతాళము. (శ. ర.) "ద్వి... పసిఁడిపానంబు, గిరిగిటల్గాఁ బట్టి కేళికల్ సేయు." భల్లా. ౨, ఆ. (శ. ర.) పండితా. వాద. ౨౩౯. పు.

గిరిజ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. కొండయరఁటి ✤; 3. మల్లెతీఁగ; 4. నది.

గిరిజము. సం. వి. అ. న. 1. లోహము, ఇనుము; 2. అభ్రకము; 3. శిలాజిత్తు; 4. కావిజాయి. విణ. (అ. ఆ. అ.) కొండయందుఁ బుట్టినది.

గిరిధరుఁడు. సం. వి. అ. పుం. గట్టుతాల్పు, విష్ణువు.

గిరిపుష్పకము. సం. వి. అ. న. శిలాజిత్తు.

గిరిభిత్తు. సం. వి. త్. పుం. 1. ఇంద్రుఁడు; 2. వజ్రాయుధము.

గిరిమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కొండమల్లె ✤.

గిరిరాజు. సం. వి. అ. పుం. హిమవంతుఁడు.

గిరిశయుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

గిరిశుఁడు. సం.=గిరిశయుఁడు.

గిరిసారము. సం. వి. అ. పుం. 1. ఇనుము; 2. తగరము; 3. మలయపర్వతము.

గిరిసెము. వై. వి. (సం. శిరీషః) దిరిసెనము, శిరీషము ✤. "సీ...దిరిసెము గిరిసెము దిరిసెన మనఁ, జనును శిరీషాఖ్య..." ఆం. భా. ద్వి. ౪౯.

గిరిస్తని. సం. వి. ఈ. స్త్రీ. భూమి.

గిరీశుఁడు. సం. వి. అ. పుం. కైలాసపతి, శివుఁడు.

గిర్గిట=గిరిగిట. "ద్వి. గెడగూడి పసిఁడిగిర్గిట కేళికలను, గడు నొప్పుసొన్నలికపురంబువారు." బస. ౨, ఆ. ౭౩. పం.

గిర్వు=గిఱుము. (గొప్పతనము; విభవము.) "గీ. సగము గనవచ్చియుండు మఱిసగము గాన, రానివలయాచలముగిర్వు దా నదెంత." సాంబో. ౨, ఆ. ౧౩౩.

గిఱక. దే. విణ. పొట్టి. (శ. ర. బ్రౌ.)

గిఱకతాడు. ద్వ. వి. టొ. (గిఱక+తాడు) హింతాలము ✤. (శ. ర. బ్రౌ.)

గిఱకపడు. ద్వ. అ. క్రి. (గిఱక+పడు) పొట్టిదగు. "క. గిఱకపడి కొనలు సాఁగక, యొఱలు లతాంగనలఁ బెనిచి యొప్పఁగఁ బుష్పం, బఱఁ బువ్వు మొగ్గగుబ్బలు, వఱల ఫలం బెసఁగఁజేసె వలపు బుతు వొగిన్." కాళింపీ. ౩, ఆ. ౧౨.

గిఱి. దే. వి. (క. గిఱి) వలయాకారపురేఖ. "మ... తనచుట్టున్ గిఱి గీసె నాఁగఁ బరిధిన్ ఖద్యోతుఁ డొప్పె న్దివిన్." పె. శకుం. ౩, ఆ. ౫౦.

గిఱికొను. దే. అ. క్రి. (గిఱి+కొను) వ్యాపించు. "చ...మెఱుఁగులు గర్జితంబులును మిక్కిలి సోనయుఁ గల్గుమేఘముల్, గిఱికొన నొప్పునాకసములీల..." భార. ద్రో. ౧, ఆ. ౨౭౮. సాంబో. ౨, ఆ. ౧౪౪; 2. స్థిరపడు, నిశ్చలముగానుండు. "క. ఈలీల నిజపదార్చన, కేళీతత్పరత నతఁడు గిఱికొని యుండన్." విప్ర. ౨, ఆ. ౩౪; 3. పాఱు. "గీ ఉడుగ కందంద త్రావుచో నురముమీఁద,వఱదలై క్రొత్తనెత్తురు గిఱికొనంగఁ, గత్తుల నున్నకుఱుపంబు కఱచి కఱచి, పలలకబళంబు మెసఁగుచు భయదభంగి." హరిశ్చ. ౩, ఆ. ౯౧; 4. అతిశయించు. "క. తెఱవపులకాంకురంబులుఁ, గిఱికొన నవ్వేళఁ జూడ్కికి ముదం బొసఁగెన్, గఱకుఁబువు మొగ్గతూపులు,గిఱికొన్న మనోజశరధికిం బ్రతినిధియై." శైవ. ౬, ఆ, ౬. ఉ. రా. ౪, ఆ. ౧౪౭. నరస. ౫. ప్ర. ౧౩. స. క్రి; 1. ఆవరించు, కప్పు. "క. అఱవఱలైన రథంబులు...కూలినకరులున్,గిఱికొనియెన్ సమరమేదినీతల మెల్లన్." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౬; 2. క్రమ్ము, చుట్టుకొను. "క. ఉఱక మదీయాంగంబులు, గిఱికొన నట్టేయుంటయును..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౦. ఆం. భా. తృ. ౧౧౭.

గిఱికొలుపు. దే. స. క్రి. (గిఱికొను ధా. ప్రే.) క్రమ్ముకొనఁజేయు. "క. మఱియును శరశతకము మెఱు

గిఱికొలిపిన వృష్ణివరుఁడు గినియఁగలే కే, వఱి యుఁన్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీతనయుఁ లుబ్బుమిగిలి నరేంద్రా." భార. ద్రో. 3, ఆ. ౨౭౧.

గిఱిపిల్లాఁడి. దే. వి. స్త్రీలు కాల ధరించెడి పిల్లాణి. (శ. ర.)

గిఱుకను. దే. అ. క్రి. (గిఱుకు+అను) చప్పుడగు. "క. అన విని వా రిది యగు నని, చనుటయుఁ నాసాఁటిరేయి శయ్యాపయి న్నా, ఘని ప్రక్క నుండి తమిరేఁ, గినఁజి త్తిని చనియెఁ దలుపు గిఱు కనకుండన్." శుక. ౨, ఆ. ౧౨౪.

గిఱుకు. దే. స. క్రి. (త. గిఱుక్కు) 1. అక్షరములు బటువుగా వ్రాయక వంకరకొంకరగా గీచు. (శ. ర. వా.); 2. తప్పువ్రాఁతను తుడుచు. (శ. ర.) వి. తుడుపు. (శ. ర.)

గిఱుక్కు. దే. వి. శీఘ్రముగా మరలుట మొదలగు వానియం దగునను కరణము. "సీ. చేరి మాటాడక చెవి గిఱుక్కున నేఁగ మతి చుఱుక్కని చాల వెతలఁ జెంద. శశాం. ౨, ఆ. ౯౭. దశా. ౨. ఆ. ౩౧౫.

గిఱుపు. దే.స.క్రి. 1. (కను) గీఁటు. "చ...అతఁడుం, దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి క, న్గిఱిపినమాత్ర లోన నతనింబటుబాణ చతుష్కయుగ్మ మే, డ్తెఱఁ దొడి మార్విగ్రమ్మఱ ఘటించు నెడనవ్వడినేసి యార్చినన్." భార.విరా. ౫, ఆ. ౧౪౧. హరి. ఉ. ౨, ఆ. ౧౪౨; 2. కదలించు. "చ. అసురేశ్వరుఁ డప్పుడు గాలుఁ జేయుఁ లా, వఱి రథసంబునం గుదువ నక్కడ నిక్కడ నూడఁ జూచి మై, గిఱుపఁగ నవ్వి శక్తి యొఱఁగించుట నెమ్మదిఁ గోరి వాని మైసుఱసుఱ ప్రక్క నొక్క బలసూదనసూనుఁడు ప్రక్క దాపునన్." నిర్వ. ౭, ఆ. ౧౪. మార్క. ౫, ఆ. ౩౫౯; 3. దువ్వు, నిమురు. "సీ. హరిమ్రోల వినతాంగుఁ డై యుఁన్నయుఁరగారియెఱకలు పలు మాఱు గిఱిపి గిఱిపి." నృసిం. ౧, ఆ. ౫౪. వి. గొప్పతనము; విభవము. (చూ. గిర్పు.)

గిఱ్ఱ. దే. క్రి. విశే. ద్రు. గుండ్రముగా. "సీ. పట్టి విదుల్చుచు నట్టె నిట్టూర్పు పుచ్చుచోఁ గిటకిటఁ గొండలు గిఱ్ఱఁ దిరుగు." సావి. ౧, ఆ. ౧౦౫.

గిఱ్ఱు. దే. వి. 1. గుండ్రముగాఁ దిరుగుటయం దగు ధ్వని కనుకరణము. "సీ. కీల్బొమ్మరము జాలె గిఱ్ఱునఁ ద్రిమ్మరు తెఱఁగున..." ప్రబంధ. ౧౦౯; 2. శీఘ్రముగా మరలుట మున్నగువానియం దగు ననుకరణము. "గీ. బరులకుఁజూతికై రాయఁ బడిన తరువు, తునిసి పెట్టిన విఱిగి గిఱ్ఱునను మరలి, పక్కనను రెంటుతునియలై పడఁగఁగొట్టె, భీకరం బగునొకదొడ్డసూకరంబు." చంద్రా. ౨, ఆ. ౯౨; 3. ముడుచుట మున్నగువానియం దగు ననుకరణము. "ద్వి. దుడిదుడి వచ్చి కత్తియుంబు తొడికి, నడికి గిఱ్ఱుచుఁ దొండములు వేవేగ, ముడిచి పాఱెడిని..." భా. రా. అర; ౧౫౩.

గిఱ్ఱుపురుగు. ద్వ. వి. (గిఱ్ఱు+పురుగు) చెట్లయం దుండి యెల్లప్పుడు గిఱ్ఱు మనికూయునట్టి యొకపురుగు. (శ. ర.)

గిల. దే. వి. 1. గిలక మున్నగువానిధ్వని కనుకరణము (దీనియామ్రేడితరూపము. గిలగిల.) "చ. అలర గళస్థలింగ మపు డాత్మకరంబున నిల్చి వింతగా, గిలగిల నాఁగ గిల్కు యొకకీలఁ గదల్పఁగ..." చెన్న. ౫, ఆ. ౧౯౪; 2. మట్టెలు మువ్వలు మొదలగువానిధ్వని కనుకరణము. "గీ...చలువ వలువ, పెళపెళల్ గిల్కుమట్టెల గిలగిలల్ ర, హించ రాయంచకడ నిల్చెఁ జంచలాక్షి." హంస. 3, ఆ. ౫౪. "ద్వి. మువ్వలగిలగిల మొఱయ జాడించి, క్రొవ్వన నుపొంగు కొమరుసాళ్వ ములు." అ. మ. క. ౫, ఆ. ౨౨౧. పు. ౨౭ పం.

గిలక. దే. వి. (క. గిలకె.) 1. గిలగిల మ్రోఁగు బాల క్రీడాసాధనము. "సీ. జలదేవతాపుత్రికలు దాల్చ నిచ్చినగిలకల క్రియఁ జెందొవలు దనర్చ." రాజ. చ. ౨, ఆ. ౧౫౨; 2. గిలగిలమని మ్రోఁగునినుప రేకుబిళ్ల. "గీ. పసిఁడిగిలకలచేరొక్కల..." కాశీ. 3, ఆ. ౧౨. నా. పంచ. ౨, ఆ. ౭౪; 3. అంత్రరోగవిశేషము. (వా.) 4. రేఫముయొక్క రూపాంతరనామము. "గీ. మొదల రేఫాక్షరంబు నావిడప దాని, జడ్డయును గూర్చి యొకటి గాఁ జదువుకొనుచు, ముందుజడ్డయుఁ వెస రేఫమునకు బదులు, గిలక విఘటించియుఁ లిఖింతు రలఘు మతులు." అప్ప ౨, ఆ. ౪౧. ల. బాలక్రీడా విశేషము. "సీ...గిలకలు చిటికెలు కీఁచుబుఱలు...

గీ...అకట యగచాట్లప్రాఁతచైయాఁకుకొనుచు." హంస. 3, ఆ. ౧౪౬.

గిలకచెట్టు. దే. వి. ఘంటారవళీ. "సీ. గిలగిలచెట్టునా గిలిగింతచెట్టు నా గిలిగిచ్చచెట్టన గిలకచెట్ట, టన్న ఘంటారవముసు..." ఆం. భా. ద్వి. ౫౭.

గిలకబండి. దే. వి. (గిలక+బండి) చిన్నచక్రముల బండి. (శ. ర.)

గిలకరించు. దే. స. క్రి. 1. చిలుకు, మథించు. "క. తరువం బెట్టినబానల, పెరుగులు మఱు గిలకరించి పేర్చినవెన్నల్, మరువు లెగఁ గ్రోలి..." హరి. పూ. ౫, ఆ. ౨౦3. రుక్మా. 3, ఆ. ౨3౧; 2. గిలకొట్టు. (శ. ర.)

గిలకలమంచము. ద్వ. వి. (గిలకలు+మంచము) గిలగిలమనిమ్రోఁగు గిలకలుగలమంచము. "చ.చలువ లెసంగుచప్పరపు జంత్రపుబొమ్మలు పావురంబులున్, గిలకలమంచము న్విరులు నిం దినసెజ్జయు... కలపడకింటి కేఁగి..." రాధికా. ౧, ఆ. ౧౦౪.

గిలకసరము. మి. వి. (గిలక+సరము.) స్త్రీలు ధరించు నాభరణవిశేషము. "ద్వి. కెంపులముక్కుఱ గిలక సరంబు, సొంపుతో వజ్రాలజోడుహారములు." ద్వి. శ. సా. ౧, ఆ. ౧3. పు. ౧౪. పరి.

గిలకొట్టు. దే. స. క్రి (గిల+కొట్టు) 1. కలుపు, రంగరించు. "ఉ. పాలడలోనఁ బోసి చచుఁబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై, బాలకు నుంచి..." సా. ౧. ౪౪; 2. చిలుకు. "సీ. పెన్నీరు గిలకొట్టి వెన్నమద్దలొనర్ప నుఘుపథం బంతయుఁ బిడికిలింప." సుద. ౪, ఆ. ౨౫. పాండు. ౧, ఆ. ౧౧౭; 3.(వ్రేళ్లతో)పుణుకు. "సీ.గిలకొట్టి యట్టె చక్కిలిగిలి యని పెట్టి కిలకొట్టినవ్వి నవ్వాలయఁ జేసి." చంద్రా. ౨, ఆ. ౫; 4. కలిగించు. "సీ. గళదనర్గళగళద్గళదుద్ధతధ్వను ల్గిలకొట్టి మండూకములు చెలంగ." శుక. ౧, ఆ. ౨౭౬.

గిలగిలచెట్టు. దే. వి. ఘంటారవళీ. ఆం.భా.ద్వి. ౫౭.

గిలగిలము. సం. వి. అ. పుం. మొసలి.

గిలగిలలాడు. దే. అ. క్రి. 1. బాధనొందు. (బ్రా. వా.); 2. బాధచే తన్నుకొను. (బ్రా. వా.)

గిలనము. సం. వి. అ. న. మ్రింగుట.

గిలము. సం. వి. అ. పుం. నిమ్మళీ. విశే. (ఆ. ఆ. అ.) మ్రింగునది.

గిలవకాయ. దే. వి. దేహమునందలి ధమనివిశేషము. "వ. బాడిసలఁ జెక్కినటుల నల్పబ్బ గిలవకాయ క్రొవ్వు మెదడు ప్రేవులు మట్టుకుఁ దెగఁ గొట్టుచు..." పార్వ. ౬, ఆ. ౦౪.

గిలాబా. దే. వి. (హిం. గిలాబీ.) గచ్చుచేయుట. (శ. ర.)

గిలి. ఉభ. దే. వి. (క. త. గిలి.) భయము. ఉదా:— పులి పోయినను గిలి పోలేదు. (శ. ర. బ్రా.)
సం. వి. ఇ. స్త్రీ. మ్రింగుట.

గిలిగించు. దే. స. క్రి. గిలిగింతపెట్టు. "చ. వెలికిలి సెజ్జమీఁద గడువిప్పుగుకన్నులచాయ లొప్పఁ జె, క్కిలి గిలిగించి వ్రేతలు నగింపఁగ నుండుట..." హరి. పూ. ౦, ఆ. ౧3౪. చంద్ర. ౪, ఆ. ౧౭.

గిలిగింత. దే. వి. (గిలిగించు. ధా.) 1. చక్కిలిగింత. "గీ...ఓసరసిజాక్షి, యేను జెక్కిలిఁ గిలిగింత లిడుటఁ దలఁతె." నైష. ౦, ఆ. ౦౬. హంస. ౧, ఆ. ౯౪; 2. రోమాంచము. "గీ...రుద్రకన్యలు మురారి, యిచ్చ కొంతయు గిలిగింతఁ దెచ్చి రపుడు." సాంబో. ౪, ఆ. 3౯.

గిలిగింతచెట్టు. దే. వి. ఘంటారవళీ. ఆం. భా. ద్వి. ౫౭.

గిలిగింతలార్చు=గిలిగింతలువోవు. "క. తను డాసి యున్నరుక్మిణిఁ, గనుఁగొని చేనన్నఁ బిలిచి గర్భోక్తుల నె.మ్మనము గిలిగింతలార్పఁగఁ, బనిగొనియెం జెప్పరానిపనిఁ బ్రియుఁ డెలమిన్." సాంబో. ౧, ఆ. ౧౯౦.

గిలిగింతవాఱు. దే. అ. క్రి. (గిలిగింత+పాఱు) గిలిగింతపెట్టినట్లగు; గులగులమను. "గీ. పాలు వోయించుకొని యాకృపాళుమూర్తి, శూలి నాంచారిపాలిండ్లచూచుకములు, పాలచేఁపున గిలిగింత వాఱుటయును, మెత్తమెత్తన నఱచేత నొత్తికొనుచు." హర. ౨, ఆ. ౯౫.

గిలిగింతవోవు. దే. అ. క్రి. (గిలిగింత+పోవు) గిలిగింత కల దగు; గులగులమను. "గీ. ఎదుట జలకేళి గావింపఁ దదఖిలాంగ, ములు నిరీక్షించి గిలిగింత వోవుమనసు, నిలుప లేనికతంబున నిర్గమించెఁ, జరమధాతువు శైలని ర్ఘరమువోలె." వరాహ. ౧౧, ఆ. ౦౧. ఇట్లే: గిలిగింతలువోవు. "వ... గొప్పచనుగుబ్బలు బొమ్మునఁ గాఁడిపాఱ బిగియఁ

గౌఁగిలించినవాఁడు...అంతఃకరణంబు గిలిగింతలు వోవ నర్హాంత యర్హాంత యనుచు నంతకంతకు నింద్రియవికారంబు బలవంతంబై పండిల్ల." ప్రబోధ. 3, ఆ. ౫౧. [౫౭.

గిలిగిచ్చెచెట్టు. దే. వి. ఘంటారవళి. ఆం. భా. ద్వి.

గిలిగిలి. దే. వి. 1 గిలిగింత. "చ. అలిపలవేణి మోర్తోకనిహ స్తమున స్మఖమజ్జనాంబుపూల్, గలఁతియ యెత్తి వోయ నవి గార్చుచునుండె నకంపు వోయిటన్, నెలకొని దాని క్రొమ్మెఱుఁగుపిద్దపుఁజెక్కు లుఁ ముద్దువెట్టుకోఁ, గెళవుల వారినూపు గిలిగిల్లి మొఱంగఁగ వేళఁ గోరుచున్." నైష. ౬. ఆ. ౧౧౭; 2. మంనముయొక్క నకినలధ్వని కనుకరణము. "క. ఒకచోటఁ బుష్పఁబుంజెరి, యొకచోఁ జప్పనము దూఁగుటుయ్యెల యొకచో, నకినల గిలిగిలిమంచం, బొకచోఁ గప్పురపుఁబుఁగుటొంవరి యొకచోన్." నైష. ౭, ఆ. ౧౪౯.

గిలిగిలించే. దే. స. క్రి=గిలిగించు. (చూ. గిలిగిలింత.)

గిలిగిలింత. దే. వి. (గిలిగిలించు ధా.) "సీ. లలిఁ గపోలంబులు గిలిగింతలు వృచ్చి నవ్వింపఁ గలఁల నవ్వి నవ్వి." హరి. పూ. ౫, ఆ. ౧౯౦.

గిలితము. సం. విణ. (త. ఆ. అ) మ్రింగఁబడినది.

గిలుకరించే. దే. అ. క్రి. మ్రోఁగు. "గీ. కలికిమాపులు వీనులఁ బలుకరింప, సొలపునడపులనందియ ల్గిలుకరింప." చంద్రా. 3, ఆ. ౯౨.

గిలుకు. దే. వి. 1. మట్టెలు మొదలగువానిధ్వని కనుకరణము. "సీ...గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి." హర. ౫, ఆ. ౫౫. ఉ. రా. ౫, ఆ ౨౪౮; 2. ధ్వని. "సీ. అంతరాంతరములం దస్థిబృందంబులు వెళవెళ మనియెడుగిలుకు లెసఁగ." భీమ. ౪, ఆ. ౧౩౮.

గిలుకుపలుకు. దే. వి. (గిలుకు+పలుకు) మణితము. "సీ...గిలుకుపలు కన మణిత మొప్పు..." వేంక. మాన. ౫౭.

గిలుక్కు=గిలుకు. "చ...మట్టెలు గిలుక్కు గిలుక్కురం చనన్..." పార్వ. 3, ఆ. ౪౯.

గిలుపు. దే. స. క్రి. గిఱుపు. 1. (కను) గీటు. "వ...కన్నియ మొఱంగి యచ్చెలులు ఖిభునకుం గన్నుగిలిపి యొండొరు లొక్కొక్క నెపంబునంజనిరి..." రామా. ౪, ఆ. ౧౫౬; 2. ఆసించు, కదలించు.



"ద్వి. మోఁకాళ్ల దొడలును మడిచిపన్నుకొనుచుఁ, గూఁకటి గిలుపుచుఁ గొక్కరించుచును." పండితా. పర్వ. 3౭౧.

గిలుబాడు. దే.స. క్రి. (గిలుబు+ఆడు) 1. అపహరించు "సీ. కని కని మాఁటిజనమనోధనములు తొలితొలి గిలుబాడుబొద్దకాఁడు." ద్వా. 3, ఆ. ౧౨౬. పాండు. 3, ఆ. ౧౬; 2. మోసగించు. "ద్వి. వనజాక్షి యొక్కతి మనసుఁ బంపుడును, జని మనోహరునితోడను రమియింపఁ, దను గిలుబాడెఁగదా మనం బనుచు, నెనయ నపుంసకంబిల మనక్కజ్జ, మరిన పాశేసినూత్ర మాలినేయుచును, వనిక నోలించుచు వచ్చునమ్మనను." పండితా. దీక్షా. ౭౭. పు; 3. ఎన్ను, పిఱు. "సీ. కేసరి ఘూమ్రాక్షు గిలుబాడుకొనె వానరేశ్వరుండు ప్రహస్తు నేఁకొనియె." రామా. ౭, ఆ. ౨౭౦.

గిలుబు. దే. స. క్రి. అపహరించు. "గీ. తలఁపుగతి వచ్చుఁ గోరినదాయ మనఁగ, శకునిజూదంబు దీవియచ్చోకొ యనంగ, గెలుపు నాయుదెకానొడ్డు గిలుబ నేర్చి, యొల్లపిడికిళ్ల విడిపించి యేనకొందు." ద్వా. ౧౦, ఆ. ౨౭౦. చంద్రా. ౫, ఆ. ౧౦౪. వి. అపహరణము, చౌర్యము. "సీ. పరఁగుఁ జెక్కలి యన బందిపోటనఁగను గిలు బనఁగాను కీలంకింపు నాఁగ, వాఁపర మనఁగను... చౌర్యంబు..." ఆం. భా. ద్వి. ౨౯౨.

గిలుబుకొను. దే. స. క్రి. (గిలుబు+కొను స్వార్థమున.) దొంగిలించు. "రగడ. గురికెంద నదె గిలుబుకొని యెఁబయ్యెరదొంగ." స్వా. 3, ఆ. ౭౪. రామ. 3౬౬.

గిలుబుచేయు. దే. స. క్రి. (గిలుబు+చేయు స్వార్థమున) అపహరించు. 'సీ. తలిదండ్రులకు నమ్మతంబుగా నతికిపతిక్రియ యటంచు నొకింత గిలుబు చేయు.' నిరం. ౨, ఆ. ౨౭. ఇట్లే: గిలుబు సేయు. 'సీ...కృతవీర్యునర్థంబు గిలుబుసేసి, కొనిడాఁచి యున్నవా రని భార్గవుల నెల్లఁ బలికిన...' భార. ఆది. ౭, ఆ. ౧33. (శ. ర. పా.)

గిలుక్కు=గిలుకు. (మట్టెలు మున్నగువానిధ్వని కనుకరణము.) "చ...మట్టెలుగిలుక్కు గిలుక్కురం చనన్..." పార్వ. 3, ఆ. ౪౯. క్రీడా. ౧3౬.

గిల్గింత=గిలిగింత. "మ...బాహుమూలయుగళి న్గిల్గింతఁ గావింప న, య్యరవిందానన నవ్వ నాతఁ డధరం

బాస క్తిమై నొక్కినన్." శశాం. 3, ఆ. ౯౨. విజ. ౧, ఆ. ౧౩౯.

ల్బాడుగిలుబాడు. (గ్రహించు.) "ఉ. వేమకతో విమర్దకుఁడు విశ్వసనీయుఁ డనంగఁ జాలి తా, నీడయుం బోలెఁ దోఁ దిరిగి నెయ్యము కల్మి విధంబు చెల్వఁగా, నీదగుమాటలం బసల నిచ్చలు నిచ్చకు వచ్చుభంగి గిఁ, ల్బాడి తదంతరంగము బయల్పడ మా కెఱిఁగించు నిచ్చటన్." దశ. ౬, ఆ. ౧౬. [మొ.)

గిల్ల. దే. విణ మెల్ల, కేకరము. (చూ. గిల్లకన్ను.

గిల్లకన్ను. దే. వి. బొ. (గిల్ల+కన్ను) మెల్లకన్ను, నేత్రదోషవిశేషము. "సీ. యింతవానిఁ గటాక్ష వీక్షణంబునఁ జూచుకిసలయోష్ఠి వహించు గిల్ల కన్ను." కాశీ. ౨, ఆ. ౧౦.

గిల్లచూపు. దే. వి. (గిల్ల+చూపు.) మెల్ల. "ద్వి. పిల్లి కన్నులు బల్ల పెరిగినకడుపు, గిల్లచూపులు చాల గిఱికొన్నబొచ్చు." నవనాథ. 3, ఆ. ౧౦౭. పు. ౧౯. పం.

గిల్లు. దే.స. క్రి. 1.గోళ్లతో త్రుంచు. "గీ. గిల్లి రవ్వుకు పతులు రాగిల్లి విరులు." రామా. ౧, ఆ. ౧౯౦. వి. శకుం. ౨, ఆ. ౧౫౦; 2. గోళ్లతో క్షతి చేయు, గిచ్చు. "క. అనుచుఁ దనూజాల నిద్దఱ, గొనగోటం గిల్లివారు కో యని యేడ్వన్." శుక. ౨, ఆ. ౨౫౭. వి. నఖక్షతము. (శ. ర.)

గిల్లుడు. దే. వి. (గిల్లు ధా.) నఖక్షతము (శ. ర.)

గివులు. దే. స. క్రి. గీయు. "గీ. వెడలుబిఱుదకును శరదవ్రక్షము డిగి, వార్షి కమె యెక్కి త్రోటి నిర్వంకపక్షులను గివులుచు వెట్టిచూపుల నురంబు, కెల కులు గనుంగొనుచుఁ గానఁ గేకు లుండె." ఆము. ౪, ఆ. ౧౯౧. (శ. ర. పా. 'నివురు' ముద్రి పా.)

గిసుకు. దే. వి. తుమ్ముటయందు దగుననుకరణము. "ద్వి. భసితంబుఁ బూయంగ గిసుకునఁ దుమ్మ, నావేమ విభుఁడు శతాయుష్య మనుచు." పండితా. పురా. ౧౬౦. పు.

## గీ

గీ=గి. అవ్య. నిందయందు దీర్ఘాంతమైనయామ్రేడితశబ్ద ము యొక్క యాద్యక్షరమునకు వచ్చునాదేశము. "మ...ఇాకన్ సాత్యకి గీత్యకిన్..." ఉ. హరి. ౪, ఆ. ౧౩౨. భా. రా. యు. ౯౦౪; 2. ఘంటా ధ్వని కనుకరణము. "ఉ...వహించి రా, భామిను లందఱున్ గుసుమబాణుఁడు గీయని ఘంటమ్రోయఁ గాన్." భాగ. ౯. స్కం. ౧౭౭.

గీఃపతి. సం. వి. ఇ. పుం. 1. బృహస్పతి; 2. పండి తుఁడు.

గీంగ్రు. దే. వి. పెద్దధ్వని వినుటవలన చెవులలోఁ గలుగుధ్వని కనుకరణము. "క. వినువక చను నెమ కెమక, పృసిపాపఁడు తల్లిదాపుఁ బాయుంచుఁ గనువె; క్కసపకుచు సారె సాఁచెప, నసురుసురై చెవ్వలు గీంగ్రు మన వాపోయెన్." వేం. పంచ. ౪, ఆ. ౪౩౩.

గీఁక. వై. వి. (సం. ఘీంకారః) ఏనుఁగుకూఁత, బృంహితము. "క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁక పెట్టఁ గులిశము నేలన్, భజనచెడి విడిచె నింద్రుఁడు..." భాగ. ౬, ఆ. ౪౦౭. ఆం. భా. ద్వి. ౧౯౪.

గీఁకు. దే. స. క్రి. గోరుమున్నగువానితో గీచు. "ద్వి. కొదమసింగములను గోరి తుండములు, మదమున నొయ్యనఁ బుకుకునేసుఁగలు, వానిచెక్కులతీఁట వక్రనఖాళిఁ, బూని గీకుచు నున్నపులులును..." ద్వి. హరిశ్చ. పూ. ౧౭౧ పం.

గీటించు. దే.స.క్రి. గీఁటు, (పన్ను) కొఱుకు. "సీ... బటువైనయొడలు నున్నతఘోణమును గడునిశిత దశనయుంగమును, గిటగిట గీటించుఘుటఘుటార్భట ముల నడరిమహార్ణవమందుఁ జొచ్చి. గీ. హేమ నయనాసురుని జంపి భూమి నవ్వ, రదమునను నానిఁ ట్టివరాహరూప..." రాజగో. శ. ౧౩.

గీఁటు. దే. స. క్రి. 1. (కన్ను) గిలుపు. "క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ, గనుగీఁటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం, చెను నందీశ్వరుఁడు..." భాగ. ౪, స్కం. ౧౧౯. ఉ. హరి. ౫, ఆ. ౫౯; 2. (పండ్లు) కొఱుకు. "మ...లగ్న మిదిగో డాసెన్ మహోగ్రుండు రాజునయో నిన్న నెఱుంగరా కదలుఁ డంచున్ బండ్లు గీఁటున్ వడిన్." పాంచాలీ. ౪, ఆ. ౨౦. 3. వరాహ. ౨, ఆ. ౧౩౭; 3. దిమ్ము. "క...కంటిమిరు గీఁటి యత నిపై, ధూళి వెనఁ దుడిచి..." వాసి. ౪, ఆ. ౪౦; 4. చీల్చు. "చ...ధరిత్రి కొమ్మునం, దల

పడ మాటి రక్కసుకియుఁగము గీఁటి బలీంద్రునిన్ రసా, తలమున మాటి..." దా. క. 33; 5. మీటు, స్పృశించు. "చ...లేజపరాలు చెక్క గీఁటిన వన వల్లుబాలపఁడు డెందమునం గలఁ గంగ నేర్చునే." నైష. ౧, ఆ. ౧౭. పా. ౧, ఆ. ౧౧; 6. కొట్టు. "క. ఏటికి నిరాచరికం, బాఁటని మొఱవెట్టఁ బశువు లాతురపడ నో. యాఁట దని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శపముక్రియ నుండె దిదే." భాగ. ౯. స్కం. ౪౦౫.

గీఁత. దే. వి. 1. గీటు, రేఖ. (శ. ర.) 2. గీయుట. (చూ. గీఁతకత్తి. మొ.)

గీఁతకట్టియ. ద్వి. వి. (గీఁత+కట్టియ.) వడ్లవాఁడు గీఁతలు గీయుట కుపయోగించుకఱిముట్టు, కత్తి కాదు. (శ. ర. బ్రా.)

గీఁతకట్టె=గీతకట్టియ. (శ. ర.)

గీఁతకత్తి. ద్వి. వి. (గీఁత+కత్తి.) గీఁత గీసెడికత్తి, ఈంద్రవానికత్తి. "మ. మొలమట్టు న్వడిగోలు దాన నగుబల్గోలాపయిం గీఁతకత్తులునూఁబున్..." చెన్న. ౫, ఆ. ౨౫౭.

గీచు. దే. స. క్రి. గీయు, వ్రాయు. "మ. కనకాంగీ మణి కంచు గీచినగలిన్ గంతంబు మీఱఁగన్ జటాం, తనిసూత్రశ్రుతిపాఠ మొందిన పులస్త్యబ్రహ్మవేద ధ్వనిన్, విని..." ఉ. రా. ౧, ఆ. ౧౦౦.

గీజు. దే. వి. పీఁకులాట. (బ్రా.)

గీజుపోరు. దే. అ. క్రి. (గీజు+పోరు) 1. విరామము లేకుండ జగడమాడు. "సీ. కీలుఁగం టిచి యేల పోలఁగా నునుఁగొప్పు గిల్కొల్పు కొమ్మంచు గీజుపోరు." శుక. ౨, ఆ. ౪౫౬; 2. మిక్కిలి మారము చేయు. "గీ. శిశువులు...చిఱుదిండి గని యిది తె మ్మటంచు, గీజుపోరుట కెద పెల్లగిల్లఁ బొగిలి, పాలఁతి యూరార్ప నతఁడు కాఁపురము సేయు." శుక. 3, ఆ. ౨౪౪.

గీటడఁగించు. దే. స. క్రి. (గీటడఁగుధా. ప్రే.) 1. చంపు. "సీ. ఆరామకేశవు లాతరించిన వసుదేవ ముఖ్యులఁ జంపి తెగువ మెఱసి, వృష్ణిభోజ దశార్హవీరులఁ జగటార్చి మదుకఁడు రాజ్య కాముకుఁడు ఖలుఁడు, నగును గ్రసేను మాయయ్య గీటడఁగించి...సఖులతోఁడ భూమిచక్ర మేలెద..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౧౭౭. భార. విరా. ౨, ఆ. ౧౩౫; 2. ఓడించు, జయించు. "సీ. ఉత్కంఠరము నంకు నొఅప్పు గీటడఁగించి వెలిదమ్మి తుటుములఁ జులకఁ జూచి." పె. శతు. ౧, ఆ. ౪౩.

గీటణఁగించు=గీటడఁగించు. (జయించు, ఓడించు.) "దండకము...భీమకోపంబున న్లోకవిద్రావణుఁ రావణుఁ ఘాటిచే గీటణంగించు వాచు..." కృ. శతు. 3, ఆ. ౧౪౭.

గీటడఁగు. దే. అ. క్రి. (గీటు+అడఁగు) 1. చచ్చు. "సీ. జననాథ శల్యుఁడు నమసె సౌబలుఁడు గీట డఁగె నులూకుంపు మడిసె సకల, సంశప్తకులుఁ గడచనిరి..." భార. శల్య. ౧, ఆ. ౯; 2. నశించు. "చ...మహాత్మ మీరు చెప్పినపరమార్థ తత్త్వముఁ బెంపున నాహృదయంబునఁ గ, ల్గినయవివేక మంతయును గీటడఁగెఁ సుఖ నైతి..." వి. పు. 3. ఆ. ౩౭౪.

గీటడఁచు. దే. స. క్రి. (గీటడఁగు ధా. ప్రే.) "క... మన, కీచకు లందఱను రాత్రి గీటడఁచె రహా, స్యోచితవిధమున గంధ, ర్వాచరణము పేర భీముఁడు..." భార. విరా. ౫, ఆ. ౩౩౧. భార. కర్ణ. ౧, ఆ. ౪౭.

గీటు. దే. వి. (గీయుధా.) 1. గీఁత, రేఖ. (శ.ర.వా.) 2. గర్వము. (బ్రా.); 3. అనాదరము. (చూ. గీటునఁబుచ్చు.); 4. నుదుటివ్రాఁత. (వా.)

గీటునఁబుచ్చు. దే. స. క్రి. (గీటునన్+పుచ్చు.) 1. అనాదరించు. "క. విని విననివానిచందం, బున గీటునఁబుచ్చి..." జై. ౮, ఆ. 3౯; 2. పోఁగొట్టు. "వ. అతండు భీమసేనపక్షపాతంబున నతనిచింత గీటునంబుచ్చె." భార. శల్య. ౧, ఆ. 3౦౧;3. తృణీకరించు. 'క. అనవుడు నమ్మాటలు గీటునఁ బుచ్చుచు...అరిగె నత్యంతధృతిన్." నిర్వ. ౯, ఆ. ౭.

గిట్టబద్ద. దే. వి. (గీట్టు+బద్ద) కాగితములు లోనగు వానియందు గీట్లు వేయుట కుపయోగించుకోల. (శ. ర.)

గీత. సం. వి. ఆ. స్త్రీ. ఆధ్యాత్మికతత్త్వవిషయమై ప్రశ్నోత్తరరూపమున నుండు గ్రంథవిశేషము. (ఉదా: భగవద్గీత, శివగీత. మొ.)

గితము. సం. వి. అ. న. 1. పాట; 2. ఆంధ్రఛ్ఛందో విశేషము. అప్ప. ४; ఆ. ౨౦४.

గితి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాట; 2. వృత్తవిశేషము. విశ. (న్. సీ. న్.) గానము చేయువాఁడు. 3. సంగీతముతోఁ జనువు వాఁడు.

గిదుపోరు=గిజుపోరు. "సీ. పోసాన కలిగిన నోసి పోలెమ్మనుఁ దేవపాదలఁ బ్రోవ గిదుపోరు. గి... అయ్యో ననుఁ గన్నకొయ్యగయ్యాళితల్లి." విప్ర. 3, ఆ. ౧౫.

గిపెట్టించు. ద్వి. స. క్రి. (గిపెట్టుధా. ప్రే.) మొఱ పెట్టఁజేయు, మ్రొక్కుకొను. "సీ. అలమి గిపెట్టింతు మలుకఁగోఁటలు నూఱి పైపచ్చభూదారపతులనైన." హా. స. ౨, ఆ. ౧౯.

గిపెట్టు. ద్వి. అ. క్రి. (గి+పెట్టు.) 1. ఏనుఁగు ఘీంకారము చేయు. "సీ. కెల్లలమెకముల గిపెట్టు టలును మావులసకిలింత లగ్గలపుఁదెర్ల, రొదలు కాలరుల యార్పులు వాయిదమ్ముల మ్రోఁతలు నొక్కటై..." అచ్చ. యు. 3౨౨; 2. మ్రోయు, ధ్వనిచేయు. "క. మదిరాక్షిజంఘు లంగజు, గద లగు నూహింపఁ గావు కాహళు లైన, న్నదుకు వడక గిపెట్టక, పదను డివిసి రాగిదేవి పలుకక యున్నే." పాండు. 3, ఆ. ౧౮౨; 3. మొఱ పెట్టు. "క. జాపిరము లేక యిప్పుడు, గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్, గిపెట్టఁగ మ్రింగెద నని, పాపపురక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా." భాగ. ౧౦. స్కం. పూ. ४౬౮.

గిము. వై. వి. (సం. గేహమ్. క. గిఱు.) 1. ఇల్లు. "సీ. ఎడపక గిమున కేతెంచువిందుల కెలిమి వల్వ లును సొమ్ములు నొసంగు." నీలా. ౧, ఆ. ४౯; 2. నివాసము. "శా. సామీ దేవరపేరు సెప్పి కొని యీసంద్రంపుఁబెన్గోనలో, గిము లైకొని చుట్టుపక్కములలోఁ గి డెన్నఁడున్ లేక మా, భూమి న్గల్గినవెఁటతోడఁ గడుపుల్ పూరింతుము..." చంద్ర. ౨, ఆ. ౬. ఉ. రా. ౫, ఆ. ౩౦౨.

గిమువేల్పు. ద్వి. వి. (గిము+వేల్పు) గృహదేవత, ఇలువేల్పు. "క...,పనోములు నోఁచి గిము వేల్పుల కెన్నో, కానుకలు నించి కాంచిన, కూనలఁ గానలకుఁ బంపుకొని నేరుతునే." అచ్చ. బా. ౧౦౨.

గిరుఁ=గిచు. దే. స. క్రి. 1. గోఁకు. "చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరవంభవర్షణాం, ఖుల పయి దట్టపుంజిలుము నోపఁగఁ దారల కంచు గిరఁగాఁ, బలె నలువంకలం గలయఁబాయక తేలుచుఁ బద్మరేణువుల్, కెలఁకులఁ బాసి పోఁ జెలఁగెఁ గ్రొంకృతు లిచ్చుసురాళమాలికల్." ఆము. ४, ఆ. ౧౮౦. ఉరా. ౮, ఆ. ౧౨౬. 2. చెక్కు, చివ్వు. "గి. నలువ సన్నంబుగా దీని నడుము గీసి, యావనమునకు నిచ్చె నాయంశ మెల్ల, నది యుపాదానముగఁ గదా యిది సృజించె, నున్నతము లై నయేతత్పయోధరములు." నైష. 3, ఆ. ౧౯౧. చంద్రా. ౨, ఆ. ౯४; 3. అఱఁగఁదీయు. "సీ. ఇందు గిసినరీతి నించుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁ గలపసిండి." పాండు. 3, ఆ. ౧౬; 4. బలవము మున్నగువానితోఁ బలక మున్నగువానిపై గిచు. (శ. ర.) 5. గంట మున్నగునవి కొడుపు మున్నగువానితో రాచు. "వ... అంతెచప్పుడున్ గింకిణీరవంబును నురుమ గిసినగతిన్ దేఁటి మ్రోసినక్రియ..." స్వా. ४, ఆ. ౧౧౫.

గిరనగింజ. దే. వి. బాల్యక్రీడావిశేషము. "సీ... గిరనగింజ కొండకోఁతి..." హంస. 3, ఆ. ౧४౬. శశాం. ౨, ఆ. ౧౯.

గిర్ణము. సం. విశ. (అ. ఆ. అ.) 1. మ్రింగఁబడినది; 2. పొగడఁబడినది; 3. వర్ణింపఁబడినది.

గిర్ణి. సం. వి. ఇ. స్త్రీ. 1. స్తోత్రము; 2. మ్రింగుట; 3. వర్ణించుట.

గిర్దేవి. సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి.

గిర్పతి. సం.=గీఃపతి.

గిర్వాణుఁడు. సం. = గీర్వాణుఁడు.

గిర్బొట్టు=గిఱునామము. "గి. వెలయ మృగనాభి గిర్బొట్టు పెట్టినారు..." నైష. ౭, ఆ. ౬3.

గిర్వాణకుసుమము. సం. వి. అ. న. లవంగముచెట్టు.

గిర్వాణుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

గిఱ. దే. వి. గీఁత, రేఖ. "రగడ. కన్నెచంటిముంటి గిఱఁ గన్నఁ గన్నతల్లి దిట్టు..." వరాహ. 3, ఆ. ౯౨.

గుంజు. దే. స. క్రి. (క. గుంజు) 1. (బాధకలుగు నట్లు) లాగు. "సీ. అవి చిన్నపూఁకటిఁ బెనఁచిన జడ పట్టి గుంజి యీడిచి చెంపఁ గొట్టి తిట్టి" హరిశ్చ. ౫, ఆ. ౧౭. ౮, ఆ ౧౬౨; 2. (వల. ము) జాడించు; "శా. తారాప్రోష్ఠులఁ గాల సూతుఁడు ఉయద్వారాశి వెంటాడి ప్రాష్ఠాదంభం బుబట్టఁ జెట్టి నులివాయం గుంజి యీఁదారఁ జేన్నార సైచ్యచిహ్నజాలమో యనఁగ శోభాకించ నత్వంబునన్, దారానాయకమండలం బమర నస్తగ్రావకూటంబునన్." కాశీ. ౮, ఆ. ౯౬; 3. ఉదుకు. "సీ...అయ్యోడకుఁ జీరలు గుంజునొక్క చాకితయుఁ దా నొంటివచ్చి..." భో. ౮, ఆ. ౧౮౫; 4. (బట్ట లుదికినట్లు గట్టిగా) కొట్టు. "సీ. పాదంబు లిరుచేతఁ బట్టి గుంజాండు జర్జరితంబుగా పీనిఁ జట్టురాత." కాశీ. 3, ఆ. ౧౫౭. వి. 1. ఈఁత, తాటిచెట్టుమున్నగువాని మొవ్వ. "గీ... ఈఁతగుంజు మొదలుగఁ బిచదొరకొనియె జనము." కాశీ. 3, ఆ. ౧౫౧; 2. తాటితేగ మొనయందుబుఱ్ఱలో నుండెడుగిజురు.(శ.ర.వా.). 3. తాళపేశము. "గీ. తాళపేశంబు గుం జన బోలు నభివ." ఆం. భా. ద్వి. ౭౭; 4. ఫలాదులలో అనుకుగా నుండుసారము, గుజ్జు. (బ్రా;) 5. క్రొవ్వు. "సీ...ఉరువడి నొకటిపై నొక దాని వైచి పై కుఱికి యాఱెంటిగుం జుఱక మట్టు...గీ...కామపాలుండు భీమసంగ్రామ కేళి." శ్రీరాధా. ౫, ఆ. ౬౯. [(బ్రా.)

గుంజుకొను. దే. అ. క్రి. (గుంజు+కొను.) లాగు.

గుంజెనుసుకు. దే. స. క్రి. (గుంజెనుసుఁగు. అని శ. ర.) పరిహసించు. (శ. ర. బ్రా.) వి. ఎలుఁగు బంటియాట. (శ. ర. బ్రా.)

గుంజుపిట్ట. ద్వ. వి. పక్షివిశేషము. (బ్రా.)

గుంజులాడు. దే. స. క్రి. పెనఁగులాడు. (బ్రా. వా.)

గుంట. వై. వి. (సం. కుండమ్. క. కుంటె. త. కుంటమ్.) 1. చిన్నగొయ్యి. "వ...గరువు నేలల గుంట లొనరించి..." స్వా. ౮, ఆ. ౬౦; 2. చిన్నచెఱువు. "గీ. కుండ గుంట యనంగఁ జెప్పఁ నఁగ వచ్చు,నల్పమైనతటాక మార్యాసమేత." ఆం. భా. ప్ర. ౧౬౨. ఆము. ౮, ఆ. ౨౩౬; 3. కొంద్ర. "గీ. ప్రబలం సీతానివృత్తి కొంద్ర యన గుంట యనంగ..." ఆం. భా. ద్వి. ౨౩౩; 4. భూపరిమాణవిశేషము. (శ. ర. బ్రా.); 4. జాతిపట్టు; 5. భిదవు. ఆం. భా. తృ. ౫౩.

గుంటక. దే. వి. (క. కుంటె.) దున్ని విత్తులు చల్లిన వెనుక నేల చదును చేయుసాధనము, పాపటము. (శ. ర. బ్రా.) "సీ. గుంటక నాఁగను గొఱ్ఱుంక నా...పరఁగును కృషిసాధన భేదముల్..." ఆం. భా. ద్వి. ౨౩౩.

గుంటకగుజ్జులు. దే. వి. బ. (గుంటక+గుజ్జులు.) పాపటమునందలిభాగములనుగలుపుకఱ్ఱముక్కలు. (బ్రా.)

గుంటకపాయు. దే. అ. క్రి. (గుంటక+పాయు) గుంటకతో చదును చేయు. (బ్రా.)

గుంటకలగర. ద్వ. వి. భృంగరాజము. "సీ... గుంటగలిజేరు కలగర గుంటకలగర యనఁ జెన్నొందునా భృంగరాజసంజ్ఞ." ఆం. భా. ద్వి. ౬౯.

గుంటక్రోవి. ద్వ. వి. (గుంట+క్రోవి.) ఒకరకము ఫిరంగి. (గుంటక్రోవ. బ్రా. శ. ర.) "గీ. గుంట క్రోవి, జబురుజంగి తుపాకి జజా యనంగ,వెలయు నగ్నిప్రసారణాఖ్యలు మహేశ." ఆం. భా. ద్వి. ౨౧౯.

గుంటగలిజేరు. ద్వ. వి. (గుంట+గలిజేరు.) గుంట కలగర, భృంగరాజము. ఆం. భా. ద్వి. ౬౯. హంస. ౮, ఆ. ౧౦.

గుంటచాళ్లు. ద్వ. వి. బ. (గుంట+చాళ్లు.) (గుంట జోళ్లు = గోళీఁయాట అని బ్రా.) బాల్య క్రీడావిశేషము. "సీ...పుట్టచెండ్లుప్పనఁబట్టె లాలంకులు గుడుగుడుగుంచాలు గుంటచాళ్లు... ఆదిగా శైశవక్రీడ లాడి రచట..." వి. పు. ౭, ఆ. ౨౦౨.

గుంటదూలము. వై. వి. గృహవిశేషములయందు కడ యొత్తులమీఁదనుండి గుజ్జులనడిమికిఁ జొప్పించెడు చిన్నదూలము. (శ. ర.)

గుంటనక్క. వై. వి. చిన్నజాతినక్క, కిఖ. (శ. ర.)

గుంటప్రొయ్యి. ద్వ. వి. (గుంట+ప్రొయ్యి.) గుంట త్రవ్వి యేర్పఱచిన ప్రొయ్యి. (శ. ర.)

గుంటమాన్యము. మి. వి. ఒకచిన్నమాన్యము. (భూమి. బ్రా.)

**గుంటమారి.** ద్వ. విణ. (గుంట+మారి.) దుష్టుఁడు. "గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వడలఁ బెటి గి, కాకలను దేఱి గడిమీఱి గట్టిపాఱి, రాలుగాయ తనాన బేరజపుదారి, నాతిలేఱియుం బలుగుంట మారి యయ్యె." హంస. 3, ఆ. ౧౧౦.

**గుంటలుపడు.** క్రై. అ. క్రి. (గుంటలు+పడు.) లోఁతగు. "వ...వెన్నంటుకొనిన యుందరంబులఁ గుంటలుపడినకన్నులు..." దశా. ౨, ఆ. ౫3.

**గుంటి.** దే. వి. 1. చేనిభాగము. "సీ...శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు గుంటిమీఁదటి ప్రత్తికొడుపువోలె." కాశీ. ౧, ఆ. ౧3౮; 2. దున్నుట మొదలగువాని కేర్పఱచుకొన్న పొలము యొక్క భాగము. (శ. ర. బ్రౌ.); 3. నెలవు, స్థానము. "క. ఆగపడికి వెఱచి మహా,నాగేంద్రుఁడు వచ్చి యసుదినము నొకపాము,న్నీ గుంటికడకు నేనై,వేగమె పుత్తెంతు నింక వేఁటాడ కుమీ." ద్వా. ౫, ఆ, ౧౮౯.

**గుంటికె** = గుంటక. (బ్రౌ.)

**గుంటిక్రోవి.** ద్వ. వి. (గుంటు+క్రోవి.) 1. ఒకవిధ మగు తుపాకి. "గీ. క్రోవులను గుంటిక్రోవులఁ గోటమూఁక, యలముఖంబున దొట్టినబలము నెల్ల,మంగలములోని పేలాలమాడ్కిఁ జేశ్చె." రా. వి. ౫, ఆ. ౨౭. ప్రబంధ. ౭౮౮; 2. ఒక విధమగు బాణసంచు. (ఇనుపగొట్టములోఁబోసి తమారుచేసి యేస్తంభము పైననోయుంచి కాల్చెడియొకరకపుమన్దు. బ్రౌ.)

**గుంటుకాఁడు.** దే.వి. బొ. (గుంటు+కాఁడు.) గుండు ఆయుధముగాకలవాఁడు. "సీ. ఎంప నుర్వును నేయు నేనికకానిమక్కొయ్యలు వడవ్రేసు గుంటుకాని." కు. సం. ౧౧, ఆ. ౬౧౦.

**గుంఠనము.** సం. వి. అ. న. 1. కప్పుట; 2. పూయుట.

**గుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కప్పఁబడినది; 2. పూయఁబడినది.

**గుండ.** యుం. దే. వి. గుడ్డ, బట్ట. "సీ. ఎండ గట్టిన కాలిగుండల కెంజాయ చిగురుజొంపంబులచెన్నుఁ బెంప." య. ౨. ఆ. ౫౦. (శ. ర. పా.) ప్ర. ద్రు. పంచమీవిభక్తి ప్రత్యయము. "గీ. కైకొనక సమిధలు తొంటికరణిఁ గోయుచుండె ఖండిత కర్ణనిగుండ నెత్తు,రొయుక మొదలుగ శే వయ్యెఁ గించుకైన, భూతిమొదలకె నాక తపోవిభూతి." వరాహ. ౧౨, ఆ. ౭గీ. ప్రబోధ. ౫ ఆ. ౯౫.

వై. వి. (సం. గుండకః,) పాడి. (శ. ర. పా.)

**గుండకి.** దే. వి. 1. పిఱుకోడి. "గీ. వకిలకుప్పట కాపుబా వెలకుం సిపుకోడి యుసఁ బిల్లగొర కన గుండకి యున." ఆం. భా. ద్వి ౯౭; 2. తెల్లనిమొగముగల నల్లనికోడి. (బ్రౌ.)

**గుండకిపిట్ట.** ద్వ. వి. (గుండకి+పిట్ట.) దాత్యూహము, ఒకజాతిపక్షి. (బ్రౌ.)

**గుండఁడు.** దే. వి. (క. కుండ.) దాసుఁడు, బంటు. "సీ. భానసేఁ డన బంటు వరపుఁడు గుండఁడు నాఁగ దాసాఖ్యలఁ గాఁగ వినుడు." ఆం. భా. ద్వి. ౭౮౮. హంస. ౫, ఆ. ౧౧3.

**గుండకము.** సం. వి. అ. పుం. 1. అవ్యక్తమధుర ధ్వని; 2. చమురుపాత్రము; 3. దుమ్ము; గుండ. విణ. (అ. ఆ. అ.) మలినమైనది.

**గుండక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. రాగవిశేషము. "సీ. గుజ్జరి మలహరి గుండక్రియ వరాళి దేవగాంధారి ..." ప్రబంధ. ౯౫.

**గుండగొయ్య.** ద్వ. విణ. (గుండ+గొయ్య) దుష్టుఁడు. (శ. ర. మూర్ఖుఁడు. బ్రౌ.)

**గుండము.** ఉభ. వై. వి. (సం. కుండమ్. త. కుంటం.) 1. నిప్పులగుంట. "ద్వి. ఈగుండములు సొచ్చి యెలమిఁ జుట్టియుఁడు, జాఁగిలి పడియుండు సర్ప మల్ పెక్కు." రం. రా. యు. ౭౫౦. పు. ౭౦. పం. క్రీడా. ౧౭౨; 2. లోఁతుభాగము. "ఉ. గాముల మెటి లోకములకన్న శమమ్ములమిత్తి యామినీ, భామతొలంగుబావ నెకవాఁకల గుండము..." కృ. శతం. 3, ఆ. ౫౮. విక్ర. ౫, ఆ. ౧౭౦. సం. వి. అ. పుం. వాసన గల యొకవిధ మగుగడ్డి.

**గుండవర్ధనము.** సం. వి. అ. న. వృక్షవిశేషము. "ద్వి. గుండవర్ధనములు కొండగోఁగులును." ప్రభులిం. 3,

**గుండా.** దే. వి. ధీరుఁడు. (శ. ర. బ్రౌ.) [అ. బ్రౌ.

**గుండాడు.** ద్వ. స. క్రి. (గుండ+ఆడు.) గుండగాఁ జేయు, నలిపివేయు. "సీ. మండగంబునఁబాల గుండాడవికరికవ్పత్తిఁ గల్పక వాటి పిటిఁబోయె." వరాహ. ౧౦, ఆ. ౧౫.

గుండికము. సం. వి. అ. పుం. బియ్యము మున్నగు వానికిపిండి.

గుండిగ. వై. వి. (సం. కుండికా. త. కుండిగై.) వెడల్పునోరు గల లోహపాత్రము. (శ. ర. బ్రా. వా.)

గుండితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడిచేయఁబడినది; 2. కప్పులసినది.

గుండియ. దే. వి. (క. గుండిగె. త. కుండి.) గుండెకాయ, హృదయము. "సీ. పాంచజన్యధ్వని పర్విన గుండియ లవిసి చేష్టింప లే కలసియలసి..." హరి. ఉ. ౭, ఆ. 3౪. ద్వా. ౪, ఆ. ౧౫౧.

గుండ్రి. దే. వి. (క. గుండ. త. గొండి.) 1. బొత్తాము. (శ. ర. బ్రా.); 2. ఒకవిధమగు పుష్పం. (బ్రా.)

గుండు. వై. వి. బొ. (సం. గండః. క. గుండు. త. కుం.) 1. గుండ్రపుఱాయి. "సీ. పర్వతశిలపేరు వఱలు గుం డనఁగను." ఆం. భా. ద్వి. ౮౫. భాగ. ౧౦. స్కం. ఉ. ౫౭౪. పాండు. ౫. ఆ. ౨౪౦; 2. తూనికఱాయి. (శ. ర. బ్రా.); 3. ఫిరంగి తుపాకి మున్నగువానిగుండు. "చ... జేలుపుం బెరువు గొప్పఫిరంగిని ఱాయమందుతోఁ గొలబెడునిన్ను మానికపుగుండు ఘటించి యగాదు చేసినన్." రసిక. ౪, ఆ. ౯౫. ఉ. హరి. 3, ఆ. 3౬; 4. ఉండ, గోళకము. "సీ...గుండ వసుంధ నా నమరు గోళకాఖ్య..." ఆం. భా. ద్వి. ౫౭౬; 5. పర్వతము. "సీ. ఒంటిగా మడికాను గుంటిపైఁ గూర్చుండి నుజకెంజాయ పెన్జడలు దాల్చి. నరస. ౨. ఆ. ౧౭౯. అచ్చ. సుం. ౫౭; 6. మోటుకు కట్టుగుండు. (శ. ర.); 7. పెద్దఱాయి. "గీ. ఎదుర ఘనమైనయొకశిలఁ గదియఁ బోయి, బరులకండమూలివాయ బిట్టొరసికొనఁగ, నంటుకొనె నష్వరాశ్వ మగ్గుంటితోడ, జిగురుగడ తాఁకి విహగంబు తగిలినట్లు." జై. ౪, ఆ. ౭౬ 8. లంగరు. "సీ. బెడిదంపుగాలిచే బెదరి యొత్తిన చాఁప విడిచి గుండ్లను డిగవిడుచుటయును."దశ. ౧౦, ఆ. ౬3; 9. నగలలోఁ బోదుగుఱాయి "సీ...రెండుగుండ్లముంగరలు మైజాఱుచీరలు" శుక. ౨, ఆ. 33౨. విణ. గుండ్రనిది. (చూ గుండుఁ బులుఁగు, గుండుసున్న.)

గుండుఁబులుఁగు. ద్వా. వి. (గుండు+పులుఁగు.) చక్రవాకపక్షి. "వ...గుండుంబులుఁగులవేటకాఁడు కాముకనంకేత నికేతన గచ్ఛదిచ్ఛావనులపై వైచిన పువ్వువలలచిమ్మిన...బహు. 3, ఆ. ౫౯. (గుండుఁబులుఁగులవేటకాఁడు = కోకారి, చంద్రుఁడు) ఇట్లే: గుండుఁబుల్గు. "గీ. గుండుఁబుల్గుల మదికుందు చెందు మందు, దోఁచె నెత్తమ్మివిరి విందు..." రా. వి. 3, ఆ. ౮౯.

గుండుక = గుంటక. (బ్రా.)

గుండుకొను. ద్వా. స. క్రి. (గుండు+కొను) చుట్టుకొను. "క. గుండుకొని చూచుమానిసి, తండమునఁ దొలఁగఁగఁ ద్రోచి తక్కరి వెస నా,చండాలుఁ దెచ్చి భూజనమండలి కభిషిక్తుఁ జేసె మంత్రులు చూడన్." వాసి. ౪, ఆ. ౧౦3.

గుండుగిలు. వై. అ. క్రి. చుట్టచుట్టుకొనిపడు, గుంపుగాపడు. "వ...అయ్యుభయబలంబులు దలపడునప్పుడు కొండలపాటులం జదియువారును దరువులవ్రేటుల వ్రాలువారును గండశైలంబుల తాఁకున గుండుగిలువారును..." భా. రా. యు. ౧౪3౨. నిర్వ. ౫, ఆ. ౫౭.

గుండుగుత్త. వై. వి. (గుండు+గుత్త.) సమస్తస్వాతంత్ర్యములతో నిచ్చెడుగుత్త. (శ. ర. బ్రా.)

గుండుగూడు. ద్వా. అ. క్రి. (గుండు+కూడు.) 1. ఏకయత్నము చేయు, ఒక్కుమ్మడిఁ బ్రయత్నించు. "వ ..అప్పు డందఱును హాహాకారంబుల గుండు గూడుకొని నవరింపఁగ వారిలో..." ద్వా. ౯. ఆ. (బ్రా. పా. 'గుంపులుగూడుకొని...పలవరింపఁగ...ముద్రి.); 2. (ఒక్కచో) నిలుచు, పూను. (అరుగ) "ద్వి...అప్పురి వెల్లివిరిసి, క్రిక్కిఱిసెక్కుకొని పిక్కటిల్లి గిరి,గ్రుక్కిదంబై కట్టుకొని గుండుగూడి, నిట్టద్రోచి..." పండితా. పర్వ. ౪౦౧. పు. ౬. పం.

గుండుజెల్ల. ద్వా. వి. (గుండు+జెల్ల.) పెద్దగంప.(శ.ర.)

గుండుములుపుగాఁడు. దే. వి. పక్షివిశేషము. (శ. ర. బ్రా.)

గుండువేయు. ద్వా. అ. క్రి. (గుండు+వేయు.) 1. చచ్చు. (బ్రా.); 2. తుపాకిపేల్చు. (బ్రా.)

గుండుసున్న. వై. వి. (గుండు+సున్న) గుండ్రని చుట్టు గీఁత. (వా.) విణ. 1. పూర్తిగాఁజెడినది. వా:—వానిపరీక్ష గుండుసున్న యైనది; 2. బొత్తిగా లేనిది.వా:—వానికి తెలివి గుండుసున్న.

గుండుసూది. (గుండు+సూది.) గుండుగలచిన్నసూది. (బ్రా. వా.)

గుండె. దే. వి. = గుండియ. 1. హృదయము. "సీ. ఎదిరించు కరిసైన బెదరించు హరి సైన గండ డంపఁగఁ జాలుగుండెదిట్టము." ఇందు. ౧, ఆ. ౧౪౨. ఉ. రా. ౧, ఆ. ౧౭౯; 2. ధైర్యము "సీ. పాండుపుత్త్రులబహిఃప్రాణంబు నుత్తమశీల సమగ్రఁ బాంచాలతనయఁ, గొనిపోవునంతటి గుండె వివేకహీనుఁడవైనసైంధవునకు." భార. అర. ౬, ఆ. ౧౯౭.

గుండెకాయ. దే. వి. (గుండె+కాయ.) హృదయము; కాయవలెనుండు హృదయావయవము. "ఆ. కపటధర్మకంచుకంబున వెలసిరి,గాని సత్యపురుష కారపరులు,గారు పాండుసుతులు వారలకమ్మఁగఁ, గాదు చేత గుండెకాయ యడిన." భార. శల్య. ౨, ఆ. ౩౯౭. భార. ద్రో. 3, ఆ. ౯౪.

గుండెతల. దే. వి. (గుండె+తల.) వక్షము, ఱొమ్ము. "గీ. గుండెతల బిట్టు దన్నినఁ గూలుటయును." దశ. ౬, ఆ. ౧౪౩.

గుండెదిగులు. దే. వి. (గుండె+దిగులు.) శత్రువు. "ఉ. ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్ ...సీతారకనామము..." దాశరథి. ౩౦. ఇట్లే: గుండెబెదరు. "ద్వి. కాలవాడులతుదినాఁటికఁ మల్లు. మూలెఱుకర్మవాదుల గుండెబెదరు." పండితా. వాద. ౪౧౧. పు. ౧౦. పం.

గుండ్ర. యు. దే. వి. 1. వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౯; 2. చెఱకురాట్నపుకోలలు. "మ. ఇలకు న్వ్రేఁగుగఁ బండి తీరవనపుండ్రేక్షు చ్ఛటల్ దీపు లగ్గలమై వ్రాల చతుర్వనంబు లెసఁగంగాఁ ద్రిప్పురాట్నంపుగుండ్రలు నాఁ జేసె కొలంకులం బొరలి పాఱ న్వచ్ఛపంకేరుహం. బుల నాడెం దొలుసంజఁ దేఁటిపలయంబుల్ తారఝుంకారముల్." ఆము. ౪, ఆ. ౧౪౭. కు. సం. ౧౧, ఆ. ౧౬౭; 3. భ్రమణము. (చూ. గుండ్రించు.) విశే. (వృత్తియందు 'గుండ్రము'న కంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీనికి వృత్తియందు నిగాగమము వికల్పము.) వర్తులము. ఉదా: గుండ్రమొగము. మొ.

గుండ్రకవము. వై. వి. (గుండ్ర+కవము.) వర్తుల త్వము. (బ్రా. వా.)

గుండ్రతుంగ. వ్యా. వి. (గుండ్ర+తుంగ.) ఒకవిధ మగు తుంగ. (శ. ర. బ్రా.)

గుండ్రన. వై. వి. వర్తులత్వము. (శ. ర. బ్రా.)

గుండ్రము. వై. విశే. (సం. కుండలమ్.) వర్తులము. (శ. ర)

గుండ్రలుకొను. దే. అ. క్రి. గుండ్రయనిధ్వనిచేయు. (చూ. గుండ్రలుకొలుపు.)

గుండ్రలుకొలుపు దే. అ. క్రి. (గుండ్రలు+కొలుపు.) గుండ్రగుండ్రయనిధ్వనిచేయు. "క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుండ్రలు కొలిపెన్." భాగ. ౧, స్కం. ౩౭౨.

గుండ్రా. వ్యా. వి. (గుండు+రా.) 1. సన్నెకల్లు. "శా...గుండ్రా డాఁచినఁ జెండ్లి యేమిటికిఁ జిప్పల్ గప్పముప్పించవా." స్వా. ౪, ఆ. ౧౭; 2. చట్రాయి. (చూ. గుండ్రాయి.); 3. పొత్రము. (శ. ర. బ్రా.).

గుండ్రాయి = గుండ్రా. వ్రా. (చట్రాయి.) "క. గుండ్రాతిరూపుఁ గైకొని, తండ్రీ పెక్కేఁడులిందుఁ దరలక యుంటిన్." అచ్చ. బాల. ౧౪౦.

గుండ్రించు. దే. అ. క్రి. 1. తిరుగాడు. "గీ. నీవు మఱి యింటిలోన గుండ్రించుచున్నఁ, గడుపు నిండునె దొరఁ జేరి గాస పడుగు." శుక. ౨, ఆ. ౩౭౧; 2. తిరుగఁబడు. "వ. ఇట్లు దాఁకి... జంభాసురేంద్రుం గిట్టి మట్టి మాదలించిన సతని కవిదల కబ్బగింపక గుండ్రించి..." కు. సం. ౧౨, ఆ. ౬౪; 3. కడుపులోఁద్రిప్పు. (శ. ర. బ్రా)

గుండ్రింపు. దే. వి. (గుండ్రించు. ధా.) గుండ్రించుట, కడుపులో త్రిప్పుట. (శ. ర. బ్రా.)

గుండ్లకమ్మ. దే. వి. నదీవిశేషము. "వ...తీర్థయాత్రా పరులకు సురకరుపుకొమ్మ యగు గుండ్లకమ్మయు ..." కాశీ. 3, ఆ. ౧౦౦.

గుండ్లుబొండ్లాడు. దే. స. క్రి. (గుండ్లు+బొండ్లు+ఆడు.) చలింపఁజేయు. "ద్వి...వాయువు లోని లోకపంక్తులన్నియుఁ గుండ్లుబొండ్లాడంగఁ బొణఁగె." రం. రా. ఉ. ౧౧. పు. ౧౪. పం.

గుంత. వై. వి. (సం. గర్తః.) 1. చిన్నగోయి. "గీ. కార్లోసట్ట నెగడ్డలు గవులు విడిచి, తరలి చెంతల

సూతిగుంతల వసించెఁ, గొరలి వర్తిలునమ్మహా గ్రీష్మమునను." వేం. పంచ. ౧, ఆ. ౩౦౮. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౩౬. పం; 2. పిఱిఁది మీఁది గుంట. (శ. ర.) విశే. పల్లమైనది. "సీ. పక్షంబు గుంతయై వర్ష్మంబు పసుపసై తెరనోరఁ ద్రేపుడు తీఁగసాఁగ..." కాశీ. ౬, ఆ. ౪౧. మార్క. ౯, ఆ. ౧౪౧.

గుంతపురువు. వై. వి. (గుంత+పురువు.) క్రిమిభేదము. "గీ. తుమ్మెపురువు చిక్కుపురువు గుంత పురువు, సుడిపురువు..." ప్రబంధ. ౧౩౦.

గుందలము. సం. వి. అ. పుం. మద్దెలమ్రోఁత.

గుంద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నాగముస్తె; 2. ప్రేంకణము.

గుంద్రాలము. సం. వి. అ. పుం. చకోరపక్షి.

గుంధము. సం. వి. అ. పుం. గుంజె.

గుంపించు. యు.దే. స. క్రి. అతిక్రమించు. (శ. ర.) "క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరి పలువ కఠినోక్తుల నన్, గుంపించెదు చావునకుం, దొంపరివై పదరువాని తెఱఁగున సుమతీ." భాగ. ౭, స్కం. ౧౭౦. వై. స. క్రి. కుప్పవేయు. "క. ఘూకంబు లున్నగుహకును, వాకిటఁ గాష్ఠములుఁ దృణము వడి గుంపింపన్, వే కదిసి చిరంజీవియు, దాకొని తనముక్కు కొనలఁ దగిలించి పడిన్." నా. పంచ. 3, ఆ. ౨౮౬. (శ.ర.పా.)

గుంపు. వై. వి. (సం. గుంఫః. ప్రా. గుంబో. క. గుంపు త. కుంబు.) 1. సమూహము, ప్రోగు. "సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరుముమ్మను మండు తపము నైకొనినచోటు." స్వా. ౨, ఆ. ౯. పారి. 3, ఆ. ౩౮. 2. నూలువడుకు నపుడు నడుమ నడుమ వచ్చునట్టియుండ. "గీ. దివసమంత వితాపోయె నవుర రాగ, గుంపువంపును లేకుండ గుందుపోఁగు, గాఁ బదాఱింటి తరమును గాఁగ నూలు, వడుకరే యంచు నొండొరుల్ నుడివికొనుచు." శుక. ౨, ఆ. ౪౧౮.

గుంపుదీర్చు. ద్వ. వి (గుంపు+తీర్చు.) (శిరోజములు) గుంపుగాఁ జేయు; సవరించు. "ఉ. అల్లన లేవఁగాఁ దిగిచి యంకతలంబునఁ జేర్చి కన్నులం, జల్లగ జాఱు నశ్రువులసంతతి కై ననఁ బాపి పెన్నెఱుల్, మెల్లన గుంపు దీర్చి..." కాళిందీ. ౨, ఆ. ౬౩.

గుంపెన. దే. వి. 1. ఒకానొకచెట్టు. "గీ. పూగముల నవ్యకుసుమపరాగ మెసఁగె, నిమ్మలందును శ్వేత పూరెమ్మ లమరె, నసలఁ బెరఁగొనెఁ జిన్నిగుంపెనల గుంపు, లభినవం బగునావసంతాగమమున." కవిజ. ౨, ఆ. ౬. య. ౪, ఆ. ౧౯; 2. గంతు. "గీ. వెట్టి యనరాదు పైఁబడి వెక్కిరించు, సామి యనరాదు మొగమున గంటువెట్టుఁ, బొంకె యనరాదు పట్టి గుంపెనలు వేయు." శుక. 3, ఆ. ౨౧. హంస. ౯, ఆ. ౬౬: 3. విజృంభణము. (శ. ర.): 4. పోటు. "సీ. బిబ్బోకవతి గబ్బిగుబ్బ గుంపెనసొంపు గనుసురంబున దివ్యకవచ మొప్ప." శశాం. ౯, ఆ. ౧౪. (బ్రౌ. పా.)

గుంఫన. సం. వి. ఆ. స్త్రీ. = గుంఫనము.

గుంఫనము. సం. వి. అ. న. 1. కూర్చుట; 2. రచించుట.

గుంఫము. సం. వి. అ. పుం. 1. కూర్పు; 2. బహుభాషణము; 3. శ్మశ్రువు; 4. రచన.

గుంఫించు. సం. అ. క్రి. గుంఫితమగు, చెదరకుండు. "మ. అసురాధీశసమర్పితంబు లగులీలారామ కల్పద్రుమ, ప్రసవంబుల్ కసుగందవయ్యె విలసత్పాటీరగోరోచనా, ఘుసృణాలేపనపండితాకలనమై గుంఫించె..." భీమ. ౪, ఆ. ౧౪౬.

గుంఫితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కూర్పఁబడినది; 2. రచింపఁబడినది.

గుంబము. దే. వి. గుమ్మము. (శ. ర.)

గుంభనము. సం. = గుంఫనము. (కొందఱు తెలుఁగు కవు లీరూపము గ్రహించిరి, కాని యీరూపము సంస్కృతనిఘంటువులఁ గానరాదు;) 1. కూర్పు. "ఉ. గోలతనానఁ బల్కెదవు కుంభకుచాపరిరంభగుంభనోద్వేలసుఖోదయం బనుభవింపని వాఁడవు గాన..." శశాం. 3, ఆ. ౭౦; 2. విధము. "క. కుంభీనసములు ప్రేలిన, గుంభనమునఁ గుంభిహస్తగురుతరధారా, రంభమున రేయుఁబగలున్, గుంభద్రోణములు వట్టి కురిసెన్ వానల్." కవిక. ౬, ఆ. ౨౩.

గుగ్గిలపొడి. ద్వ. వి. (గుగ్గిలము+పొడి.) గుగ్గిలము యొక్క పొడుము. "సీ. కుముదంబులకుఁ గలక్రొవ్వను గుగ్గిలపొడి యంచు దీపంబు పుటికయనఁగ." శశాం. ౪, ఆ. ౧౨౯.

గుగ్గిలము. వై. వి. (సం. గుగ్గులకః. క. గుగ్గిళ. త. కుంగిళియం.) 1. గుగ్గిలపుచెట్టు. "సీ. గుగ్గిల మంచున గుగ్గులువు దనర్చు." ఆం. భా. ద్వి. ౪౫౯. మాంస. ౪, ఆ. ౧౧; 2. గుగ్గులువృక్షపు బంక. "గీ. ఉగ్గి రవ్వలించి యావాలు గుగ్గిలంబు, దేశిపద్మకలు తానుగుచిరుగు లగరు..." ఆచ్చ. యు. ౪౩౦; 3. గుగ్గిలపుచెట్టుకట్టె. "క. గుగ్గిలపుం బొళ్లఁ గొని త్యాగ్మగ్గిని రగులుకొనురీతి..." పార్వ. 3, ఆ. ౫౯.

గుగ్గిళ్లు. దే. వి. బ. ఉడికించిన సెనగలు మొదలగునవి, అభ్యావము. "సీ...అలసంద గుగ్గిళ్లు కొణికెడు..." బహు. ౫, ఆ. 3. ఆం. భా. ద్వి. ౨౫3.

గుగ్గులము. సం. వి. అ. పుం. 1. గుగ్గిలపుచెట్టు; 2. గుగ్గిలము.

గుచ్ఛకము. సం. వి. అ. పుం. 1. పూలగుత్తి; 2. నెమిలిపురి; 3. బాగ; 4. సమూహము; 5. వది మున్నగువానిముబ్బు; 6. ముప్పదిరెండుపేటల హారము.

గుచ్ఛపత్త్రము. సం. వి. అ. పుం. తాటిచెట్టు.

గుచ్ఛఫల. సం. వి. ఆ. స్త్రీ. 1. అరటిచెట్టు; 2. ద్రాక్ష; 3. వాకుడుచెట్టు; 4. సిప్పాలిచెట్టు; 5. కాకమాచి, కాంచీ. [ఇండుగుచెట్టు.

గుచ్ఛఫలము. సం. వి. అ. పుం. 1. కుంకుమచెట్టు; 2.

గుచ్ఛము. సం. = గుచ్ఛకము.

గుజగుంపు. దే. వి. 1. సంరంభము, ఆడావుడి. "మ. భుజగర్వంబున నాశరుల్ సురలు నంభోరాశి ద్రచ్చ న్మహా, భుజగగ్రామణిమస్తపుచ్ఛములఁ నార్పు ల్మిఅ నందించునా, గుజగుంపుల్ గననయ్యె నీనెలవు మాకున్ జూపుమంచున్ నమో, రజముల్ సత్త్వగుణాంబుఁ బట్టి చలపోరం జూచుచుండంబు నన్." ల. వి. ౧, ఆ. ౧౧౪; 2. గుసగుస. "సీ. రమ్ము మారునిగుడారమ్ము మారు నిఁమ్ము గుంపు చోటుల గుజగుంపు లెల." శశ. ౪, ఆ. ౧౪౬

గుజగుంపుపెట్టు. ద్వ. అ. క్రి. (గుజగుంపు+పెట్టు.) అల్లరిపెట్టు. "ద్వి. గొల్లయిల్లాండ్రను గుజగుంపు పెట్టు, వల్లవాగ్రణిఁ బుణ్య పసుదేవతనయు..." ద్వి. సిం.; భాగ. ౨, స్క౦. 3౦. పు.

గుజగుజ. దే. వి. 1. గుసగుస, నింద. "ద్వి...గుజగుజలవు సెల్ల గుణి యైతి నింక, నగుబాటు పట్టి నాతులలోన, మొగ మెత్తనేర్తునే..." బస. ౫, ఆ. ౧౭౭. పు. ౫. పం; 2. రహస్యము. "ద్వి. ఇదియేమి గుజగుజ లెఱాఁగకమునను, విదితంబుగా నాకు వినిపింపుఁ డనిన." ప్రభులిం. ౨, ఆ. 3౬. పు. ౧౦. పం; 3. గజిబిజి. (మా. గుజగుజలాడు.) విణ. బాధికము. (మా. గుజగుజయగు.)

గుజగుజయగు. దే. అ. క్రి. (గుజగుజ+అగు.) బాధపడు. "క. గజము పద మూడగి తిరుగుచు, గుజగుజయై గీఁక పెట్ట..." భాగ. ౬, స్క౦. ౪౦౭. పూర. 3, ఆ. ౧౦.

గుజగుజపేషలు. దే. వి. బ. కాలికాక్రీడావిశేషము. "సీ. గుజగుజపేషలు గజ్జనగూళ్లను బొమ్మలపెండ్లిండ్లు నమ్మనములు." దశా. ౮, ఆ. ౭౧.

గుజగుజలాడు. దే. అ. క్రి. (గుజగుజలు+ఆడు.) 1. గుసగుసలాడు. "గీ...సతీవార లందఱు సంత సంత, నల్లనల్లన గుజగుజలాడుచుండిరి..." భార. విరా. ౨, ఆ. ౨3; 2. గజిబిజిపడు, త్రొక్కులాడు. "ద్వి. ఆతఁడగస్త్యుని నల్లన గొంకె, నాతఁడు జమదగ్ని నవిమె హస్తమున, నీవిధి నుత్తరం బీక యొండొరులు, నీవు నీవని చూపి నిఖిల సన్మునులు, గుజగుజలాడ..." ద్వి. హరిశ్చ. పూ. ౨౨3. పం.

గుజగుజలువోవు = గుజగుజపోవు. (రహస్యముగా మాటలాడు.) "వ. అనుచుం గలదు లే దని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలువోవు చుండుదురు..." భార. విరా. ౨, ఆ. ౨౦౧.

గుజగుజపోవు. దే. అ. క్రి. (గుజగుజ+పోవు.) రహస్యముగా చెప్పుకొను. "క. తాళధ్వజ మదె యగు నగుఁ, దాళాంకుం డనుచుఁ జాల దలఁకి కురు మహీ, పాలసిదళములు భయరస, కోలాహలతరళితముగ గుజగుజపోయెన్." సాంబో. ౫, ఆ. ౨౦౭. భాగ. ౧౯, స్క౦. ఉ. 3౭౯.

గుజరాతి. వై. వి. (సం. ఘూర్జరః.) 1. ఘూర్జర దేశము. "ద్వి. చిత్రజనకలక్ష్మీవివాహంబు, గుజరాతికెంపులగోడ లిఖింప." రం. రా. బాల. ౨3. పు. ౧౭. పం; 2. ఘూర్జరదేశభాష. "గీ. అరబి పారసి గుజరాతి యారె మచ్చు, తెనుఁగు కన్నోజ మొదలుగాఁ దెలిసి వ్రాయ, దారిగనట్టివాఁడు..." య. ౧, ఆ. ౪౨. 3. నాట్యవిశేషము

"సీ. కులిశాయుధునిరిందుఁగొలువులో గుజరాతి మేలుకోపులఁ గొంత మెప్పు వడసి." ఉ. రా. ౪, ఆ. ౧౭౫. అం. భా. ప్ర. ౧౩౦.

గుజెరాని. హిం. వి. వృత్తి, జీవనము. (బ్రౌ.)

గుజెరాను. దే. వి. (హిం. గుజరానా.) అర్పణము, ఇచ్చుట. (చూ. గుజరానుపఱచు.)

గుజెరానుపఱచు. దే. స. క్రి. అర్పించు, ఇచ్చు. "గీ. గుడిగుడీధూమపాన ఘూర్ణమాన, చకితదృగ పాంగుహైదరుజంగుఁ గాంచి,నజరు గుజరాను పఱచె సౌన్నాకడాని, జాలెమాతడు కూర్మి నిపాతు చేసి." రంగా. ౨, ఆ. ౯౫.

గుజెరాయించు = గుజరానుపఱచు. "మ...హైదరు జంగును...కని యాత్మన్నివ్వెఱం గందుచున్, హితముం దెల్పుచు నర్జిదాస్తు గుజరాయించెన్..." రంగా. ౨, ఆ. ౧౪౬.

గుజెరి = గుజరాతి. (ఘూర్జరదేశము.) "రగడ. చెప్పఁ జూపఁగ రాదు ముక్కుమసీమ లీగుజరాతి వాసులు." శుక. ౧, ఆ. ౨౨౨. (శ. ర. పా.)

గుజోడి. దే. విశే. ధనవంతుఁడు. (శ. ర.)

గుజిరి. దే. వి. 1. దొంగబజారు; బజారు; 2. చీకటి వేళ. (ఇట్లే: గుజిలి. బ్రౌ.)

గుజురు. దే. వి. గిజురు. (శ. ర. బ్రౌ.)

గుజ్జరాతి = గుజరాతి. (శ. ర. బ్రౌ.)

గుజ్జరి. వై. వి. (సం. ఘూర్జరః.) 1. ఘూర్జరదేశము. "శా...గుజ్జరినిద్రా తగటీకురాళములలో..." చంద్రా. ౪, ఆ. ౭౦. ఉ. రా. ౬, ఆ. ౧౬౦; 2. వర్ణవిశేషము. "రగడ. కంటకి గుజ్జరి మనువులు మొదలుగఁ, గలిగినవలువన్నెలపుట్టువులు." కవిక. 3, ఆ. ౧౫౫; 3. రాగభేదము. "గీ...మాళ వియుఁ బాండి సింధు రామక్రియయు వసంత సామంత శుద్ధవసంత గుజ్జరియును..." హంస. ౫, ఆ. ౧౨౪. ప్రబంధ. ౯౫. ఱ. ధాన్యవిశే షము. "వ...గుజ్జరులు బిరుసులు...అనునూట నాలుగువగల పైరులచేసుడుబియ్యంపుఁట్టి పసా దంబులు..." ప్రబంధ. ౧౧౨.

గుజ్జరీ = గుజ్జరి. (శ. ర.)

గుజ్జరివాఁడు. ద్వ. వి. (గుజ్జరి+వాఁడు.) ఘూర్జరదేశ స్థుఁడు. "సీ. గుజ్జరివాఁడన ఘూర్జరుఁ డగు." అం. భా. ద్వి. ౧౦౩.

గుజ్జు. వై. వి. (సం. కుబ్జః.) 1. అనుకగుడసద్రవ్యము. "క...కోకల నైవేద్యములను గుజ్జుల వస్యా,నేక ఫలభక్ష్యశర్కర,శాకాదులఁ గడిమిమానిజాతరఁ జేసెన్." శ్రీరం. మా. ౬, ఆ. ౧౦౩; 2. కుబ్జ త్వము. "చ. తనయులగుజ్జు మానుటకుఁ దండ్రి గనుంగొని సంతసించి...' భా. రా. బాల. ౩౩౬. (శ. ర. పా.); 3. కోడెదూడ. "సీ. మంకి నాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై వర్తించు శిక్షింపవలయునట్టి, గుజ్జుదోయిని జట్టి గొని ప్రీతి లంకించి యుండ లంకియతోన గండు మీఱి." భార. శాం. ౪, ఆ ౪౦. హరి. పూ. ౫, ఆ. ౧౪౧; 4. క్రొవ్వు. "వ...దాక్షాయణీ సుతుపొట్ట గుజ్జుఱుక మట్టి..." కాశీ. ౭, ఆ. ౯౫. కాశీ. ౩, ఆ ౩౨; 5. పొట్టికొయ్య. "...సీ గుజ్జు నాఁ దనరుఁ గుబ్జదారువు..." అం. భా. ద్వి. ౨౩౩. విశే. పొట్టివాఁడు. "సీ. గూనివాఁ డును బిచ్చుకకుంటు గుజ్జు..." భార. అను. ౫, ఆ. ౧౦౪. సుద. ౧, ఆ. ౭; 1. చిక్కనిది. "గీ. గుజ్జుగాఁ గాఁచినగోక్షీరపూరంబు జమిలిమండెఁ గలపైఁ జల్లి చల్లి." నైష. ౬, ఆ. ౧౨౦.

గుజ్జుఁదనము. ద్వ. వి. (గుజ్జు+తనము.) కుబ్జత్వము. (బ్రౌ.)

గుజ్జుప్రాలు. ద్వ. వి. (గుజ్జు+ప్రాలు.) ధాన్యవిశే షము. (బ్రౌ.)

గుజ్జుపొట్లు. వై. వి. (గుజ్జు+పొట్లు.) పొట్టికాయలు కాచుపొట్లు. (శ. ర.)

గుజ్జుమామిడి ద్వ. వి. (గుజ్జు+మామిడి.) పొట్టిరకపు మామిడి, రాజామ్రము. "సీ. గోరాజగమనుండు గుజ్జుమామిడిపండు కుసుమాస్త్రహరుఁడు ముం గొంగుపసిఁడి." పి. శతం. ౪, ఆ. ౪.

గుజ్జువేలుపు. ద్వ. వి. (గుజ్జు+వేలుపు.) విఘ్నేశ్వ రుఁడు. "సీ. కంఠరంబుననుండి గంధసింధుర మైన గుజ్జువేల్పుఁ గుమారగురునిఁ గొలిచి." భీమ. ౩, ఆ. ౧౪౫.

గుజ్జెనగూడు. దే. వి. (గుజ్జు+ఎన+కూడు. శ. ర.) 1. బాలికాక్రీడావిశేషము. "సీ. గుజ్జెనగూడులు కోలుకోలన్నలు గిరనగింజలు పారుపట్టు." హంస. ౫, ఆ. ౧౫౫. కళా. ౬, ఆ. ౧౫౫. కళా. ౬, ఆ. ౨౦౨; 2. బాలికలాడు కొనునపుడు వండెడు వంటకము. "సీ. పాంచాలికాకేళిపర్వాన్న

సామంబు గుజ్జెనగూ డనఁ గొఱలుచుండు." ఆం. భా. ద్వి. ౨౯౭. భాగ. ౧౦, స్కం. పూ. ౧౬. ౮౮.

గుటక. దే. వి. (క. గుటుకు.) ఒకసారి నోటఁ బోసికొని మ్రింగుట. (బ్రౌ. వా.)

గుటకలువేయు. దే. అ. క్రి. (గుటకలు+వేయు.) ఉవ్విళ్లూరు, అభిలషించు. (వ్యవ.) వాఁడు భక్ష్యములఁ జూచి గుటకలువేయుచున్నాఁడు. వాఁడా సుందరిఁ జూచి గుటకలువేయుచున్నాఁడు.

గుటగుట. దే. వి. (త. కుడుకుడు.) 1. వ్యాఘ్రభల్లూకవరాహాదులు చేయుధ్వనివిశేషమున కనుకరణము. "సీ. ఒకవాసరమున నైమిక తీర్థమాడుచో గుటగుట మనుచు నాఁకొన్నకోలు, పులి తటంబున బ్రేఁపపొదనుండి మానిపుంగవుమీఁద నుఱికిన ..." వరాహ. ౭, ఆ. ౮౦. య. ౨, ఆ. ౯; 2. అన్న ముడుకుట నీళ్లు త్రాగుట మొదలగువాని యందలిధ్వని కనుకరణము. (శ. ర.) బ. పెద్దఱికపుమాటలు. (శ. ర.) "వ... అటమటమున విద్యగొనుబయం గాక గుటగుటలు గురువుతో నాయని..." స్వా. ౫, ఆ. ౧౯. శశాం. ౩, ఆ. ౭౮.

గుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. మాత్ర; 2. గుండ్రని పదార్థము.

గుటిక. సం. వి. ఆ. స్త్రీ. = గుటి.

గుటుకు. దే. వి. మ్రింగుటయందగుధ్వని కనుకరణము. "క... విషము... మృత్యుఁడు గుటుకున మ్రింగెన్." హర. ౬, ఆ. ౬౮. పళా. ౧, ఆ. ౨౯౯. (దీనియామ్రేడితరూపము గుటుగుటుకు.) భాగ. ౧౦, స్కం. పూ. ౨౬౫.

గుటుక్కను. దే. అ. క్రి. (గుటుక్కు+అను) చచ్చు. (శ. ర. బ్రౌ.)

గుటుక్కు = గుటుకు. "సీ. దారుణాఖండమార్తాండ మండలము నుష్ణాంగి గుటుక్కున మ్రింగవచ్చు." నరస. ౫, ఆ. ౧౩౦. కవిక. ౨, ఆ. ౧౪౦.

గుటుక్కుమను = గుటుక్కను. (బ్రౌ.)

గుట్ట. వై. వి. (సం. గోత్రః. క. గుట్ట.) 1. పర్వతము. "సీ. వలిమెట్టు నాకుఁ గావలపట్టు దేవర సామిగుట్టకు నేను సామి నౌడయ." చంద్రా. ౨, ఆ. ౪౫. ఆం. భా. ద్వి. ౨౭; 2. ప్రాతగుట్ట. "వ. నలునిం బిలిచి నీవు వానరవీరులు తెచ్చి యుండిచ్చుగట్టుగుట్టలం ట్ట కట్టిన వనధి కట్టువడు." రామా. ౭, ఆ. ౧౨౨. య. ౧, ఆ. ౮౩; 3. ప్రోగు. "సీ. చెడిపెను మృదుశయ్యఁ జేర్చిన విడిచి జక్కొంటగుట్టలఁ బవళింపఁ జూచు." రామలిం. ౩౪. పళా. ౬, ఆ. ౧౩౭.

గుట్టకూలు. ద్వ. అ. క్రి. (గుట్ట+కూలు.) గుట్టగాఁబడు, ఒక్కుమ్మడిఁగూలు, చచ్చు. (చూ. గుట్టకూల్చు.)

గుట్టకూల్చు. ద్వ. స. క్రి. (గుట్టకూలు. ధా. ప్రే.) చంపు, నశింపఁజేయు. (బ్రౌ.)

గుట్టిచ్చు. ద్వ. అ. క్రి. (గుట్టు+ఇచ్చు.) తెలియనిచ్చు. "వ... గుట్టీక నలంగియు నత్తమామల చిత్తంబు వచ్చునట్లు భర్తకిత్తంబు మెఱసి పాటులం బడుచుఱుందలిసౌందర్యంబు..." పాండు. ౩, ఆ. ౨౪.

గుట్టు. వై. వి. (సం. గూఢమ్. క. త. గుట్టు.) రహస్యము. "క. ఏ మో యని యుంటిమి సుత్రాముసిగు ట్టెల్లఁ దెలిసె..." దశా. ౭, ఆ. ౬౧; 2. మోసము. "ఉత్సాహ. గుట్టుతోడ నిట్టొసంగఁ గ్రోలి యేచు నన్నుతో, గుట్టు పాఱి యుండునంతఁ గ్రుంకుమెట్టు నెత్తపుం, జట్టుమీఁదఁ బ్రొద్దు చేరె..." య. ౩, ఆ. ౧౨౩; 3. ధైర్యము. "ఉ. వ్రీడ దొఱంగి యాహరి విరించిముఖుల్ భ్రమ నొంది గుట్టుపో, నాడఁగా పంచసాయకశరాహతి పాల్పడి పువ్వుఁబొన్నులన్, వాడరొ..." రాజ. చ. ౩, ఆ. ౭౩.

గుట్టుకీడు. ద్వ. వి. (గుట్టు+కీడు.) గూఢశత్రువు. "చ. పలుకులు వేయు నేమిటికిఁ బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా, తలమున గుట్టుకీడు బహుధా యరయుంచి యడంచి..." ఆము. ౪, ఆ. ౨౫౦.

గుట్టుచెడు. ద్వ. అ. క్రి. (గుట్టు+చెడు.) అధైర్యపడు. "వ. ఇట్టి తెఱంగునం బిట్టువడి గుట్టుచెడి గట్టువడిం జేయుటకై యగడితం బడి మునింగి దరిం జేరి..." రా. వి. ౫, ఆ. ౩౭.

గుట్టుపట్టు. ద్వ. వి. (గుట్టు+పట్టు.) గుండె. "ఉ. బాల విరాళి నిట్టు సుమబాణశరాళికిఁ జంద్రచంద్రికా, పాళికి సన్నగాలికిని భావజు తేజివమాళికిన్ రవా, ద్వేలమదాళికిన్ బ్రసవదీప్తవనీయుతమాళి

కిక్ సదా,గోలక గుట్టుకట్టుగల గోఁగి పఠింపఁజు నా ర్తి చెందఁగన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౪౪.

గుట్టుసాక్షి. వై. విశే. (గుట్టు+సాక్షి.) వాది తన వ్యవహారము గెల్చుటకొఱకు రక్షింపఁగా వచ్చి డాఁగి యుండి ప్రతివాదియొక్కమాట లన్నియుం జక్కఁగా విన్న సాక్షి. (శ. ర.)

గుడ. సం. వి. ఆ. స్త్రీ. 1. గుళిక; 2. జెముడుచె; 3. ద్రాక్ష; 4. ప్రత్తి.

గుడకము. సం. వి. అ. పుం. 1. గుళిక; 2. కబళము. న. 1. బెల్లము; 2. బెల్లముతోఁ జేసినమందు.

గుడగుడ. దే. వి. 1. ఉడుకుటయందగుధ్వని కనుకరణము. "క. గుడగుడ నుడికెడునుదకము..." ద్వా. ౧, ఆ. ౧౧౧; 2. కడుపులోఁ గలుగు ధ్వని కనుకరణము. వా:— కడుపులో గుడగుడ మనుచున్నది.

గుడతృణము. సం. వి. అ. న. చెఱకు.

గుడదారువు. సం. వి. ఉ. పుం. న. చెఱకు.

గుడపిష్టము. సం. వి. అ. న. 1. బెల్లము కలిపిన పిండి, చలిమిడి; 2. బెల్లపుపాడి; 3. బెల్లపుపాకములో పిండికలిపి చేయునొకపదార్థము.

గుడపుష్పము. సం. వి. అ. పుం. మధూకము, ఇప్ప.

గుడఫలము. సం. వి. అ. పుం. గోనుగు.

గుడము. సం. వి. అ. పుం. 1. బెల్లము; 2. పొగడ; 3. ఏనుఁగుకవచము; 4. కబళము; 5. అచ్చనగాయ.

గుడలము. సం. వి. అ. న. బెల్లపుసారాయి. విశే. (అ. ఆ. అ.) బెల్లముతోఁ జేసినది.

గుడశర్కర. సం. వి. ఆ. స్త్రీ. పటికబెల్లము.

గుడాక. సం. వి. ఆ. స్త్రీ. 1. నిద్ర; 2. అలసత్వము.

గుడాకు. మి. వి. (గుడము+ఆకు.) బెల్లముతోఁ జేర్చి మర్దించినపొగాకు. (శ. ర. బ్రా.) "చ. గుడిగుడి డ్రాగ బుగ్గి జడఁ గూర్చినచిల్లుగుడాకుమద్ద..." పార్వ. ౨, ఆ. ౯౧.

గుడాకేశము. సం. వి. అ. పుం.—జెముడువలె మిక్కుటముగఁ బెరిగిన కేశము—జటాజూటము. "సీ. ధవళాబ్జలోచన ద్వయియైనయువారును దమ గుడాకేశంబు లిముడువారు." దశా. ౪, ఆ. ౧౧౩.

గుడాకేశుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. శివుఁడు.

గుడారము. వై. వి. (సం. గణాలయః.) పటకుటీరము, దేశా. "చ...నాల్గువంకల గుడారము లెత్తిరి జేసిపట్టుపగ్గములు బిగించి..." వాల్మీ. 3, ఆ. ౯౬. ఆం. భా. ద్వి. ౨౪౯; 2. గుడారమువలె నుండుచెవిభాగము. "సీ. శ్రవణైకదేశ మాచ్ఛాదనగేహంబు మీరుచునుండు గుడార మనఁగ." ఆం. భా. తృ. ౫౪.

గుడారు = గుడారము. (దేశా.) "క. అదిరిపనుల పట్టుగుడారుల్..." శుక. ౧, ఆ. ౧౯౯. చెన్న. ౨, ఆ. ౨౦౯.

గుడి. దే. వి. (క. గుడి.) 1. దేవాలయము. "క. తోడవ్రులు చిలికినయిమ్ములు, గుడిముట్టు గపాల మిల్లు గడి ముడియె ద్విక్కుఁడు గట్టువలంపు దోల గుబడదరకై నవయ నేమిప్రళయము వచ్చెన్." కు. సం. 2, ఆ. 39, సుద. ౨, ఆ. ౨౦; 2. వలయాకారపురేఖ. "గీ. పరిఖ గుడివోలెఁ దన చుట్టుఁ దిరిగి యుండఁ,బరుల కేరికి గ్రహణగోచరము గాక, సివధరాధీశభాషితవిషమభావ్య, ఫక్కికయుఁ బోలె నొప్పు నప్పట్టణంబు." నైష. ౨, ఆ. 3౧. సా. ౧, ఆ. ౧౧౯; 3. పరివేషము. "సీ. పరివేషనామంబు భాసిల్లుచుండును గుడి యన బరిది నా గుడుసు నాఁగ." ఆం. భా. ప్ర. ౧౨. 4. ఇకారచిహ్నము. "క. చెలులు తలకట్టులాచాఁ,పులు నైత్వోత్వములు మిత్రములు గుడిరి వయుఁన్, సుళిగవయుం నెత్వయుఁగమును, జెలువగు చుట్టములు ద్వివిధశృంగోత్వమ్ముల్." అప్ప. 3, ఆ. ౪౫; 5. ఒకరకపుగుడారము. "మ. ఒడఁబాటించుక లేక సీమనసులో నుత్ఫుల్లపత్త్రాక్షి యీ, యెడ నేకాదశి మానకున్న సుతునిన్ హింసింపుమా యంచు మా,కడనే యుండి వినంగరానిపలుకుల్ క్ష్మాపాలకున్ బల్కుటల్, గుడి నుండే గుడి త్రాళ్లు గోయుటయు నాకుం జూడ నీచందముల్." రుక్మాం. ౫, ఆ. ౧౧౯; 6. ఆఁడుగుఱి. శుక. ౨, ఆ. ౫౦౬. (గుడిముద్ర వేసికొను = బ్రహ్మచారిణిగానుండు.)ఇ. బాలక్రీడావిశేషము. "గీ. గుల్ల దాఁగిలిమ్రుచ్చులు గోడపెట్టెలు..." వి. పు. 2, ఆ. ౨౦౨. సా. 1. గుడి మ్రింగేదానికిఁ దలుపు లప్పడములు:— పెద్దపనిచేయువాఁడు చిన్నపనినవలీలగాఁ జేయఁగలఁడు." ప్రబోధ.

౨, ఆ. ౬౭; 2. గుడిమ్రింగువానికి నంది పిండి పడియము." విక్ర. ౨, ఆ. ౨౩౯; 3. గుడిమ్రింగు వానికి లింగ మార్బిండిపడియము. సిం. నార. శ. ౩౬.

గుడిక. సం. = గుళిక.

గుడికట్టు. దే. వి. (గుడి+కట్టు.) గ్రామము నాలుగు దిక్కులయెల్లలయేర్పాటు. (శ. ర బ్రా.) "గీ. సరవి గుడికట్టుగాఁ జెంగ వెరసు వ్రాసి, యంతకము చేసి కులవర్ణ లాయకట్టు, దీర్చి..." హంస. ౪, ఆ. ౨౯.

గుడికొను. దే. అ. క్రి. (గుడి+కొను.) 1. వ్యాపించు, క్రమ్ము. "క. పడముడి శల్యాని ..పడమై చిన యెడ నొడలం, గుడికొనుదు ష్మతఁడు తుడుచు కొనుచుం జనియెన్." పాంచాలీ. ౨. ఆ. ౬౮; 2. ఉబుకు. "క. అడలుచుఁ బెదవులు తడుపుచు. గుడికొనుకన్నీరు గ్రుక్కుకొనుచున్..." సా. ౩, ఆ. ౧౬౫; 3. అధికమగు. "చ...నార చీరలుం, గొడుకులు దాను గట్టుకొని కూరలఁ గాయల ద్రుత్తు మాన్పుచున్, గుడికొనువంత రేవగలుఁ గుందుచు నెంత నలంగియున్నదో, యడవులలోన సీత..." ఉ. రా. ౮, ఆ. ౭౩; 4. గుండ్రముగాఁ దిరుగు. "సీ...గుడికొంచు గిఱ్ఱున నడరు సుడులు." ఉ. హరిశ్చ. ౨, ఆ. ౧౨౬.

గుడిగి. దే. వి. (క. గుడిగి.) మోఁకాలువఱకుఁ దొడిగికొను వస్త్రకవచము. (శ. ర.)

గుడిగుడి. దే. విశే. పొంగివచ్చునది. "ద్వి. గుడిగుడి కన్నీరు గ్రుక్కుచు నొందు, నుడుగ నాలుక రాక నులివేఁడియూర్పు,లందంద నిగుడ..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭. పం. ద్వి. శ. సా. ౨, ఆ. ౭౬. పు. ౨౦. పం.

గుడిగుడీ. దే. వి. హుక్కాగొట్టము. "సీ. ఎలమితో సోమయాజులపెద్దవారలు గుడిగుడీలుగఁ జేసి కొనెడివారు." కాం. నార. ౨౦.

గుడిచుట్టు. దే. అ. క్రి. మండలాకారముగాఁ దిరుగు. "మత్తకోకిల. చూడ నీజగ మంతయున్ వెసఁ జుట్టి పట్టుక లీల నేఁజొచ్చుతేక రయంబునన్ గుడిచుట్టునట్టిస్వతంత్రతన్, గూడి యుండినకాల చక్రముఁ గోరి చూడనివాని కేఁజాడఁ గల్గును గర్మసంగతిఁ జారుమోక్షపదం బిలన్." భాగ. ౬, స్కం. ౨౩౬. (గుజ్జము) మండలాకారముగాఁ దిరుగు. (బ్రా.) వి. 1. సూర్యచంద్రుల చుట్టు నేర్పడువలయము, పరివేషము. (శ.ర.బ్రా.) 2. అశ్వగతివిశేషము. (వా.)

గుడిజెల్ల. దే. వి. (గుడి+జెల్ల.) మత్స్యవిశేషము. (శ. ర. బ్రా.)

గుడితిప్పు = గుడిదిరుగు. (బ్రా.)

గుడిదిరుగు. దే. అ. క్రి. గుండ్రముగాఁ దిరుగు. (చూ. గుడిదిరుగుకొను.)

గుడిదిరుగుకొను. దే. అ. క్రి. (గుడిదిరుగు+కొను. స్వార్థమున) గుండ్రముగాఁ దిరుగు. "క...గడను దిరుగఁదొడఁగెఁ దడవడగా. బొమ్మలము దిరుగుచు రవడిఁ, గుమ్మరసారె గుడిదిరుగుగొనెడిభమునన్." జై. ౫, ఆ. ౩౫.

గుడిపడు. ద్వ్య. అ. క్రి. (గుడి+పడు.) వర్తులమగు. "ద్వి. ఎడపక మరుఁడు సొమ్మేసుడు ల్పఱపఁగుడి పడు...కోదండ మనఁగ,నలరువిల్తునిమామ యగు చందమామ, కళలతోఁ బూర్వనగంబుపై నిలిచె." అ. మ. క. ౨, ఆ. ౮౬. పు. 3. పం.

గుడిసె. యు. దే. వి. 1. ఒకరకపుచింతపండు. ఆం. భా. ద్వి. ౪౭; 2. పక్షివిశేషము. "సీ. గుచ్చంగి కనకాక్షి గుడిసె...ఆ. అవి మైనపక్షు లతఁడు దీర్చె." హంస. ౩, ఆ. ౧౨. జై. వి. (సం. కుటీరక. క. గుడిసిలు. త. కుడిసై.) స్తంభములు గోడలు లేకుండఁ దృణాదులతో నేర్పఱచినచిన్న యిల్లు, కుటీరము. "మ. పసతు లైలల్పడి వానకై గుడిసె మోచన్ రాక..." ఆము. ౪, ఆ. ౧౩౩. భార. అను. ౧, ఆ. ౨౭౬.

గుడిసెవేటు. ద్వ్య. వి. (గుడిసె+వేటు.) కువేశ్య, కులట. "సీ. పట్టపురాజు చేపట్టి యుంచంగానె గుడిసెవేటుకు బాగుణము రాదు." వేమ. శ. ౭.

గుడిసెవేటుది. దే. వి. (గుడిసెవేటు+అది.) కువేశ్య, కులట. "సీ. గుడిసెవేటుని యన నడరుఁ గువేశ్యాఖ్య." ఆం. భా. ద్వి. ౧౧౭.

గుడుక్కు. దే. వి. మ్రింగుటయం దగుధ్వన్యనుకరణము. (ఆమ్రేడితరూపము గుడుగుడుక్కు.) "ద్వి. ఉడుగక వెడలు నిట్టూర్పులతోడ, గుడుగుడుక్కున మ్రింగు గ్రుక్కిళ్లతోడ." ద్వి. నల. ౫, ఆ. ౧౦౧. పం.

గుడుగుడు. దే. వి. (క. గుడుగుడు.) 1. పరుగెత్తుటయం దగునట్టుకరణము. (శ. ర. బ్రౌ.); 2. నడచుటయం దగునట్టుకరణము "క. అడుగులు పుడమిని వడి నిడి,గుడుగుడుమని నడచి..." పార్వ. ౪, ఆ. ౧౬౩.

గుడుగుడుగుంచేము దే. వి. బాల్యక్రీడావిశేషము "సీ. గొప్పసిబ్బుపుప్రేగునఁ దడఁబడునడల్ గుడుగుడుగుంచ మిండదర నాడ." నీలా. ౧ లాగ్. వి. పు. ౨, ఆ. ౨౦౨.

గుడుగురావిలము. దే. వి. పక్షివిశేషము. "సీ. కారోక్కడి గుముల క్రొక్కారంపుసందడి గుడుగురావిలముల బెడఁగుసారము." చంద్రా. ౨, ఆ. ౮౧. (శ. ర. పా.)

గుడుప. దే. వి. గుడియ. "గీ. గుడె గుడియ దుడ్డు గుడుపము గుడుప యనఁగ, మద్దరము..." ఆం. భా. ద్వి. ౨౧౬.

గుడుసు. యు. దే. వి. (క. గుడుసు. త. కుండు.) 1. పరివేషము. ఆం. భా. ప్ర. ౮౨; 2. ఇకారచిహ్నము. "గీ. గుడుసుపైఁ గ్రియనదుమ నాగుడుసువచ్చి, భిన్నయతి యగురానిచోఁ బెఱయతి యగు,నెడను లచ్చిని హరి ధరియించె నవఁగ ..." అప్ప. 3, ఆ ౮౦. కటీరము. "సీ... గుడిసె నా గుడుసు నా నీరెండు వెలయుఁ గుటీరమునకు." ఆం. భా. ద్వి. ౧౪. విణ వర్తులము. "సీ. గుడుసైన ఘ్రూవింటఁ గూడి క్రమ్మనితూపు కటకాముఖపుఁగేలఁ గరము మెఱయ." శైవ ౨, ఆ. ౪౧. భా. రా. అర. ౧, ఆ ౨౦౮. వై వి. (సం. కుటీరకః.) గుడిసె, కుటీరము.

గుడుసుకైదువ. దే వి. (గుడుసు+కైదువ.)చక్రము, విష్ణునిమాయుధము. "సీ. మడికత్తి చుట్టగ్గు గుడుసుకైదువ...అనఁగ రాగిల్లుఁ జక్రమునకు ..." వేంక. దే వ. ౨౦.

గుడుసుకైదువజోదు. ద్వ. వి. (గుడుసు+కైదువ+జోదు ) చక్రపాణి, విష్ణువు. "క. అని మొఱలిడు శేశేలం, గనుఁగొని యగ్గడుసుగుడుసుకైదువజోదిట్టనియెన్..." అచ్చ. బాల. ౨౧. ఇట్లే: గుడుసువాల్నెఱజోదు. వేంక. దేవ. ౪.

గుడుసుకొండ. ద్వ. వి. (గుడుసు+కొండ.) చక్రవాళపర్వతము. "గీ. ఒకగొడుగునీడ నీవు కడుముగ నడుపు, గుడుసుకొండకు లోనైనపుడమిఁ గలుగు,ప్రజల కెల్లను బ్రియ మైనపగిది..." చంద్రా. ౨, ఆ. ౬౬.

గుడుసుపడు = గుడుసువడు. (చూ. గుడుసుపఱచు.)

గుడుసుపఱచు. ద్వ. స క్రి. (గుడుసుపడు. ధా. ప్రే.) గుడుసుగఁ జేయు. "సీ. ఒకనితోఁ బెనఁగనోపక భంగమొందిన వడముడిసత్త్వంబు గుడుసుపఱచి." చంద్రా. ౧, ఆ. ౨౧.

గుడుసులువడు. ద్వ. అ. క్రి. (గుడుసులు+పడు.) పరివేష్టించు. "క. వడిఁ దూపు లెగయ గుడుసులు, వడి కార్ముకపంచశతము పరఁగ విభుఁడు సొం, పడరెఁ బరివేషమండలి, నడుమ కరద్యుతుల వెలయు నళినాప్తక్రియన్." భాగ. ౭, స్కం. ౪౯౯.

గుడుసువడు. ద్వ. అ. క్రి. (గుడుసు+పడు.) 1. గుండ్రమగు, వర్తులమగు. "క. మృడుఁడు కనకాద్రిచాపము, గుడుసువడం దివియ..." భీమ. ౪, ఆ. ౧౩౪. భార. కర్ణ. 3, ఆ. ౪౧; 2. హీనమగు. 'గీ...గడుసువిల్లు, గుడుసువడ వాఁడి యమ్ములఁ గొన్ని చేవి..." పార్వ. ౬, ఆ. ౪౯.

గుడుసువాలు. దేః వి. (గుడుసు+వాలు.) చక్రము. ఆం. భా. ప్ర. ౯౨. అచ్చ. యు. యు. ౬౪.

గుడూచి. సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగె.

గుడేరము. సం. వి. అ. పుం. 1. గుళిక; 2. కబళము,

గుడ్డ. దే. వి 1. వస్త్రఖండము. "సీ. గుడ్డ నాఁ జేలు వొందు వస్త్రఖండము..."ఆం. భా. ద్వి. ౧౯౭; 2. వస్త్రము. (శ. ర. వా.); 3. క్షేత్రభాగము. "గీ. గుడ్డవృత్తులు వృత్తులఁ గొలుచుగుత్త,చేలు నామాంశములు నాధి సేలలెల్ల,జనవరుల కమ్మఁ జూచు నిచ్ఛావిహారవర్తి వాఁడేమిగా నున్న వాఁడో మీఁద." పాండు. 3, ఆ. ౧౬; 4. స్థానము. "ద్వి. ప్రతినలగుడ్డ విశ్రుతభక్తి గడ్డ, వ్రతములపంట..." బస. ౨, ఆ. ౧౩౩. పం; 5. బిడ్డ. ద్వి. పోడ్డలబాచయ్య గడ్డయో నంబి, బిడ్డఁడో..." పండితా. పురా. ౧౯౬. పు.

గుడ్డము. దే. వి. చేను. "క. ఎడ్డైతనవుఁగైసేఁతల, రడ్డులు నడచిరి పురస్సరద్వార్యముగా, గుడ్డంబు చక్కఁగ గట్టం,బడ్డమహాశక్తి దివ్యభవనంబు నకున్." పాండు. 3, ఆ. ౭౯.

గుణీభూతవ్యంగ్యము. సం. వి. అ. న. వ్యంగ్య మప్రధానముగాఁ గలకావ్యము.

గుణుఁడు. సం. వి. అ. పుం. వంటలవాఁడు.

గుణ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. గుణింపఁదగినది; 2. శ్రేష్ఠమైనగుణములు కలది.

గుత్త. వై. వి. (సం. గుప్తమ్. క. గుత్తె, గుత్తిగె.) ఫలప్రద మైనభూమ్యాదుల సాసొత్తు గలవానికిఁ దగినధన మిచ్చి తనయనుభవమున నుంచికొనుట. "సీ...ఊళ్ల గుత్తకిక." పి. శకుం. ౪. ఆ. ౧౨౫. నిరం. ౨, ఆ. ౪౫. విశే. గుత్తకుఁ దీసికొనఁబడినది. "ఉ. చిన్నటనుండియుఁ మిగులఁ జేర్చిన ప్రేముడిఁ జిత్తవృత్తిఁ గైకొన్నయనుంగు గొల్ల తలగుత్తమగం డయి యున్నయట్టియ, వ్వెన్నుఁడు ..." శ్రీరాధా. 3, ఆ.౧౨౪. శుక. ౨,ఆ.౧౪౫.

గుత్తకాఁడు. ద్వ. వి. (గుత్త+కాఁడు.) గుత్తకుఁ దీసికొన్న వాఁడు. (శ. ర.)

గుత్తగట్టు. ద్వ. స. క్రి. (గుత్త+కట్టు.) గుత్తకిచ్చు. "ఆ. బత్తిఁ బత్తి రిడిన ముత్తిబుత్తులు రెండు నొత్తి గుత్తగట్టుచుండు హేఁడ." నీలా. ౧, ఆ. ౧౧౫.

గుత్తగొను. ద్వ. స. క్రి. (గుత్త+కొను.) గుత్తకుఁ బుచ్చుకొను. "లయగ్రాహి...మదమత్తఘనడాకినులు నృత్తగతిఁ బ్రేవుల్, చిత్తరములం దిగిచి మెత్తమెదడు ల్లానసి గుత్తగొనుచుండ భయవృత్తిఁ గల నొప్పెన్." భాగ. ౬, స్కం. 323. కళా. 3, ఆ. 23.

గుత్తము. వై. విశే. (సం. గుప్తమ్.) 1. కచ్చితము. ఎక్కువతక్కువలు లేక సరిగా నుండునది. "వ... గుత్తంబు లగుమెగులమెత్తని జలపోఁతతోలుపట్టెడలు మెడల నమర..." స్వా. ౪, ఆ. ౨౭. సాంబో. ౨, ఆ. ౧౫౧; 2. గట్టిది, ఘనము. "ఉ. చిత్తరియోర్తు ముత్తియపుఁ జేరు వలగ్నమునకా ఘటించి కేల్గుత్తపుఁజన్నుఁదోయి నొనఁ గూర్చి రయంబునఁ జూడవచ్చె రాజోత్తము ..." వసు. ౬, ఆ. ౧౪. వసు. ౨, ఆ. ౧౧; 3 రహస్యము. "క. కొఱమాలినదుర్లక్షణ, కొఱగా దివసీకు నాలె గుత్తంబుగ నిజ్జఱభి వధించెద నీతో, నఱ లేని మనోజకేళి నలరెద నెలమిన్." భా. రా. అర. ౧, ఆ. ౧౪౦. రా. వి. ౧, ఆ. ౪౭.

గుత్తపట్టు. ద్వ. స. క్రి. (గుత్త+పట్టు.) గుత్తకుఁ బుచ్చుకొను. "సీ. పచ్చిత్రితో ల్బట్టెచుచ్చాల మె ట్లందికొనఁ దాన యూరెల్ల గుత్తపట్టు." ఆము. ౬, ఆ. ౬౯.

గుత్తి. వై. వి. (సం. గుచ్ఛః. క. గుత్తు. త. కొత్తు.) 1. పూవులు మొదలుగువానిగుచ్ఛము. "ఉ...పురవరోపవనంబులు సొచ్చి యిచ్చఁ బూగుత్తుల వ్రాలి..." విక్ర. ౧, ఆ. ౯౪. ఆం. భా. ద్వి. ౪౦; 2. సమూహము. "క. కత్తులబోనులు మాఱుచు, గుత్తిగఁ బెక్కెండ్ర నొకటి గొని మోయుచు నుబ్బెత్తునఁ బంటను దూలము, నెత్తుచు మఱి కొంద ఱాకి రెలమి వహింపన్." చెన్న. ౨, ఆ. ౨౪. 3. చీలమండ. "సీ. గుత్తుల కొలఁదికి గృత్తంబులై పడి యున్న పాదంబు లొక్కొక్కచోట." నిర్వ. ౪, ఆ. ౬౧; 4. మనికట్టుక్రింది చేతిభాగము. (వా.); 5. వృక్షవిశేషము. "సీ...వేసుపనస గుత్తి వెట్టినారు పరేల పనస కరక కొమ్మి పుణుకరేణి ..గీ... మొదలుగాఁగల్గుబహువిధభూరుహములు." హంస. ౪, ఆ. ౧౧; 6. (కవ్వముయొక్క) బిళ్ల. "వ...కొండకవ్వంబుగుత్తి జిఱజిఱం దిరుగు వేగంబునఁ జటచటాయమానంబులై గుబులుగుబు ల్లనుచవ్వ ల్లుప్పరం బెగసి..." భాగ. ౮, స్కం. ౨౦౮; 7. బాధ, కష్టము. (చూ. గుత్తివడు.).

గుత్తిక. వై. వి. పాదము. (చూ. గుత్తికగువ్వ.)

గుత్తికగువ్వ. ద్వ. వి. (గుత్తిక+గువ్వ.) కపోతాంఘ్రి. (శ. ర.)

గుత్తికవ్వము. ద్వ. వి. (గుత్తి+కవ్వము.) వెదురుకొయ్యచివరను జీల్చి దారముతోఁ గట్టి యేర్పఱచినకవ్వము. (శ. ర. బ్రా.)

గుత్తిపండ్లు. ద్వ. వి. బ. (గుత్తి+పండ్లు.) గుత్తులు గుత్తులుగాఁ బండునొకజాతిపండ్లు. (శ. ర. బ్రా.)

గుత్తిబలుగుత్తులు. ద్వ. వి. బ. ధాన్యవిశేషము. "వ... పసుపుగన్నేర్లు గుత్తిబలుగుత్తులు రావిపూరాజనాలు..." ప్రబం. ౧౧౨. (దీనిరూపాంతరము. గుత్తిబల్లుత్తులు) హంస. ౪, ఆ. ౧౨౮.

గుత్తిమల్లెలు. వై. వి. బ. (గుత్తి+మల్లెలు.) ధాన్యవిశేము. "గీ. పచ్చగన్నెరు కస్తూరిపట్టెములను, గుత్తిమల్లెలు ప్రౌఢిగాఁ గూర్చి మఱియుఁ, సకల

జాతులఁ బోషింప శక్తి గలిగి, పాళికులు చైత్రుఁ బొగడుదు రప్పురమున." భాను. ౧, ఆ. ౯.

గుత్తివడు. వై. అ. క్రి. (గుత్తి+పడు.) కష్టపడు. "గీ. కొన్ని దేశంబు లెండచే గొవరువోయెఁ, గొన్ని దేశంబు లివముచేఁ గొంకువోయెఁ, గొన్ని దేశంబు లిరులచే గుత్తివడియె..." కాశీ. ౧, ఆ. ౧౩౭.

గుత్తుక = గుత్తిక. (చూ. గుప్పగుత్తుక.)

గుత్తుగుత్తు. దే. వి. మహాభయము కలిగినపుడు ప్రాణములు కొట్టుకొనుట కనుకరణము. "గీ. తలఁకి యన్నవా రున్న చోఁ దలలు గట్టికొనిర మఱి ప్రాణములు గుత్తుగుత్తనంగఁ, జనినగోకంబు క్రమ్మఱఁ దనుఁ బొదువఁగ, దేవకీదేవి మూర్ఛా విధేయ యయ్యె." హరి. పూ. ౯, ఆ. ౧౩౨.

గుత్తులుగొను. ద్వ. అ. క్రి. (గుత్తులు+కొను.) గుత్తులు బయలుదేఱు. "చ...కుసుమంబులు వాసన కెక్కి యెక్కి గుత్తులుగొని పండి పండి వితతుల్ దగ నారము లొప్పె నామనిన్." కు. సం. ౪, ఆ ౧౭.

గుత్సకము. సం. వి. అ. పుం. 1. పూలగుత్తి, గుచ్ఛకము; 2. గ్రంథభాగము.

గుత్సము. సం. వి. అ. పుం. 1. = గుచ్ఛము; 2. గ్రంథిపర్ణము.

గుదగుద. దే. వి. పరితపించుటయం దగు ననుకరణము. బ. సందేహము. "ద్వి. కడుపున కియ్యెడ గుద గుద లేల,కుడికెఁడు దెత్తునా గుజ్జనోగిరము." బస. 3, ఆ. ౪౨౬. (పాఠాంతరము గుదగుదలు.)

గుదగుదపడు. ద్వ. అ. క్రి. (గుదగుద+పడు.) పరితపించు. "ద్వి. ఇది యేల వెడకత లిన్నియుఁ బన్ని,గుదగుదపడక నెమ్మది నుండుఁ డనిన." బస. ౭, ఆ. ౨౯. పు. ౧౭. పం.

గుదగుదమను. దే. అ. క్రి. (గుదగుద+అను.) పరితపించు. "ద్వి. కుడి కేఁగరామిని గుదగుద మనుచుఁ, గుడువక..." బస. ౬, ఆ. ౧౫౦. పు. ౪ పం.

గుదగుదలాడు. దే. అ. క్రి. (గుదగుదలు+ఆడు.) దగ్గుత్తికతో నేడ్చు. (శ. ర. బ్రౌ.)

గుదము. సం. వి. అ. న. పాయువు, ముడ్డి.

గుది. యు. దే. వి. (క. గుడి.) 1. ఆకులు మున్నగువానిదండ. "చ. కరమున నున్న శూలమునఁ గ్రమ్మ మెఱుంగులు శత్రుసైన్యభీకరములుగా గజాశ్వరథకాయములన్ గుది గ్రుచ్చినట్లుగాఁ, జెరు వ్రేచు వచ్చువానిఁ గురుసింహుఁడు చూచి..." భార. భీష్మ. 3, ఆ. ౧౦౮. భార. శాం. 3, ఆ. ౯౯౬. కు. సం. ౨, ఆ. ౭౬; 2. తాళములు పూలు. మొదలగువానిగుత్తి. "సీ. ఇది సిగ్గుబిగంపుగుదికిఁ జేయగునేమొ కాదేని మరలి పోఁగాఁ బనేమి." సాంబో. ౨, ఆ. ౧౫౯. ఉ. రా. ౬, ఆ. ౧౦. ఆం. భా. ద్వి. వై. వి. (సం. గ్రంథిః.) 1. కంతి. "మ ..రోఁతపుట్టగుపూఁబోండ్ల నితంబముల్ కరటికుంభాంభోంబులే కొమ్ముదొబ్బ గుదుల్ చన్నులు హేమకుంభములె..." మల్ల. వై. వి. ౧౬; 2. పీఠము ద. ఆం.భా.ద్వి. ౧౩౫; 3. కొబ్బరచెట్టు మున్నగునవి యెక్కునపుడు కాళ్లకుఁ దగిలించుకొనుబంధము. (వా.)

గుదికాలు. ద్వ. వి. (గుది+కాలు.) చీలమండదిగువ నుండు పాదము వెనుకటిభాగము, పార్ష్ణి. "సీ. తని యక యెదురెక్కి దయసేయు మని మ్రొక్కి గుది కాళ్ల వెన్నునఁ గూర్చి నొక్కి." శశాం. 3, ఆ. ౯౫.

గుదికూర్పు. దే. వి.(గుది+కూర్పు.) మాటలు మున్నగువానికూర్పు. (శ. ర.)

గుదిగట్టె. ద్వ. వి. (గుది+కట్టె.) దుష్టమగు గోవు మొదలగువానికి పాఱిపోకుండుటకై మెడకుఁ గట్టెడుకట్టె. (శ. ర. బ్రౌ. వా.)

గుదిగుంజెలు. ద్వ. వి. బ. (గుది+గుంజలు.) పసుల దొడ్డి లోనగువానిద్వారమందు నిలువుగాఁ బాఁతిన కంబములు. (శ. ర. బ్రౌ.)

గుదిగుంపులు. ద్వ. వి. బ. (గుది+గుంపులు.) గుదిగా గ్రుచ్చినగుంపులు. (చూ. గుదిగుంపులుచేయు.)

గుదిగుంపులుచేయు. ద్వ. వి. బ. (గుదిగుంపులు+చేయు). ప్రోవుచేయు, గుదిగ్రుచ్చు. "క. అది గనుక దివిజవేశ్యల, సదనంబుల నున్న మానిసంతతి తలఁపుల్,గుదిగుంపుచేసి మ్రందిం,పఁగ యవకాశంబు గలుగ స్వర్గమునందున్." నిరం. ౨, ఆ. ౩౩.

గుదిగొను. దే. అ. క్రి. (గుది+కొను.) 1. అతిశయించు. "సీ. కుచమండలంబున గుదిగొను చెమ్మట విసరి పయ్యెదకొంగుఁ బొసఁగ వైచి." సురా. ౬౯. హంస. 3, ఆ. 3౪; 2. దట్టమగు. "క... మొగ్గలు, గుదులు తలిరుఁ గొమ్మలందు గుదిగొని పొదలెన్." ఉ. ఆ. ౬, అ. ౧౦; 3. స్థూలమగు. "సీ. బూరగాళులఁ బోలు సీచపోయిన చేతులుఁ గోల మూఁపులు గుదిగొన్నతొడలు." ఉ. హరి. ౨, ఆ. ౧౨౨; 4. మూటకట్టుగాఁ గూలఁబడు. "మ. మదిరాపాన వికారచేష్టలఁ గడున్ మత్తిల్లి రక్తాక్షుఁడై, యెదురుం దన్ను నెఱుంగలేక మిగులన్ హేయంబు వాటిల్లఁగాఁ, బదముల్ తొట్రుపడంగఁ జొక్కుచు మతిభ్రాంతిం బడం బాఱుచున్, గుదిగొంచున్ వెడపాటఁ బాడుచు దురుక్తుల్ ప్రేలుచున్ సోలుచున్." హరిశ్చ. ౪, ఆ. ౨౧౪; 5. తొట్రుపడు. "క. పెదవులు దడుపుచుఁ బదములు, గుదిగొనఁ దత్తఱపుమాట గుత్తుక దగులన్, ముదుసలితనమున బెదరున, వదలినయంగములు మిగుల వడఁకఁ గడంకన్." ఉ. హరి. 3, ఆ. ౧3౬. శుక. 3, ఆ. ౫౭౦; 6. మీఁదపడు. "సీ. గోముఖవ్యాఘ్రమై గుదిగొను మాయత్త..." రాధికా. ౪, ఆ. ౭౧; 7. గుంపులగు. "సీ. గుదికొని వెన్నాడు కుసుమపుంజము తోడఁ జంద్రసూర్యాది భూషణముతోడ." రాధికా. ౧, ఆ. ౯.

గుదిత్రాడు. ద్వి. వి. బొ. (గుది+త్రాడు.) దూడ కాలికిఁ గట్టుత్రాడు. (శ. ర. బ్రౌ.)

గుదిత్రోయు. ద్వి. స. క్రి. (గుది+త్రోయు.) కాళ్లు కట్టి త్రోయు. "క. ఇదె యిచ్చెద నదె యిచ్చెదఁ, బదపడఁ దని యాసఁ జూపి పలుతెఱఁగులు నా, హృదయము నొప్పించితి వికఁ, గుదిత్రోసెద నేఁడు నిన్నుఁ గొంకక యిచటన్." హరిశ్చ. ౪, ఆ. 3౪. ద్వి. హరిశ్చ. పూ. ౧౭౧౬. పం.

గుదియ. వై. వి. (సం. గదా. క. గుదిగె.) 1. గద. "గీ... అతనిశిరముఁ జేతిగుదియఁ బగులంగ నొక్క వ్రేటు గొనియె సిరి." మార్క. ౧, ఆ. ౧3౫. ఆం. భా. ద్వి. ౨౧౬; 2. దండము, కఱ్ఱ. "చ. గుదియను గేల నూనుకొని క్రొత్తున దగ్గుచు నోటి తుంపరల్, చెదరఁ గ్రమంబుఁ జెప్పుచును శీతన గాత్రజఁ జేర..." పార్వ. ౪, ఆ. ౬౭; 3. యమదండము, యమునిగద. "సీ. గుదియఁ జేకొని తద్ద కుంటిపోఁబు జముండు..." అచ్చ. బాల. ౬౮; 3. గుదికఱ్ఱ. (బ్రౌ. శ. ర.)

గుదియకఱ్ఱలు. ద్వి. వి. బ. (గుదియ+కఱ్ఱలు.) గుదిగుంజలకడ్డముగాఁ జొప్పించెడుకఱ్ఱలు. (శ.ర.బ్రౌ.)

గుదియతాలుపు. ద్వి. వి. (గుదియ+తాలుపు.) యముఁడు. "క. కొండలు పిండియొనర్తునొ, గండెసఁగఁగ నలువ గుద్దు గాలింతునొ వే, చెండుదునొ గుదియతాలుపు, కండలు గుండియలు వెల్వఁగమి నొంపుదునో." అచ్చ. సుం. ౨3. వేంక. దేవ. ౧౬.

గుదివడు. ద్వి. అ. క్రి. (గుది+పడు.) 1. బద్ధమగు, కట్టువడు. "మ... నిశ్చేష్టం బడ ద్వంద్వముల్, గుదివడ్డన్ బెగడొందియుండెన్..." భార. విరా. 3, ఆ. ౨౬. భార. కర్ణ. ౨, ఆ. ౨3౪; 2. కంపించు, వడఁకు. "చ. గుదివడుచున్న నెన్నడుము..." పద్మ. 3, ఆ. 3౬. (బ్రౌ.)

గుదివెట్టు. ద్వి. స. క్రి. (గుది+పెట్టు.) బాధించు, కట్టు. "చ... ఒక్కయెడఁ గని బోరనఁ బట్టి సరోజనాళతంతుల గుదివెట్టి..." దశ. 3, ఆ. ౧౦౭.

గుదులుకొను. ద్వి. అ. క్రి. (గుదులు+కొను.) 1. అధికమగు. "క. ఎదిరినవాఁ డరదము వడిఁ, గదియంగాఁ దోలి తూపుగమి లద్దొరపై, గుదులు కొన నేసి..." అచ్చ. యు. ౪౯౨. దశా. ౬, అ. ౧౧౫; 2. కూలు. "చ... వెలుంగ మ్రాసితోఁ, జదియఁగ నొక్కిపెట్టుకొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం, గుదులుకొనంగ బాలకులు గోయని యార్వ నఖర్వలీలతోన్." భాగ. ౧౦, స్కం. పూ. ౪3౫; 3. సంకటపడు. (బ్రౌ.)

గుదులుపట్టు. ద్వి. అ. క్రి. (గుదులు+పట్టు.) కదలకుండఁ గూర్చుండుటచేఁ గాళ్లు స్తంభించు. (వ్యవః- చాలసేపు కూర్చుండుటచే నాకాళ్లు గుదులు పట్టినవి.)

గుదె = గుదియ. 1. (గద.) "ఆ. తర్కవిద్యలను బ్రతాపించి మోఁదిరి, గుదెల నెముక లెల్ల గుల్లలుగను." ప్రబోధ. ౫, ఆ. ౯౯; 2. (దండముకఱ్ఱ.) "క. ఇది పెక్కుఁడులుపట్టెన్, సదనంబులుగట్టి నాకు

గునిసె. దే. విణ. పొట్టివాఁడు. "సీ...మట్టిసి మట్టము మట్టనము గొనప గొనప గొనిసె గిటక లింగణా యనఁగను వామనాఖ్య దనరు.' ఆం. భా. ద్వి. ౧౨౩.

గునుకు. దే. అ. క్రి. 1. నెమ్మదిగాఁ బరువెత్తు. "గీ. క్రొవ్వి నడగొండకైవడి గునుకు నొక్క, యొంటి గాని మహీనాథుఁ డొడిగి యేయ." స్వా. ౪, అ. ౪౭. ఆము. ౬, అ. ౭౧; 2. పరుగెత్తు. "క. అని కలపోయుచుఁ దమకో, మునుకుచుఁ దిక మకలు గొనుచు మురరిపుకడకుం, గునుకుచు నేఁగిరి వారలు,ఘనరాక్షసుఁ గన్నకన్నుఁగవ బెగ్గిలఁగన్." భాగ. ౬, స్కం. ౩౨౫; 3. తొలఁగు. "సీ. ఘటపూర్ణమంత్ర పుష్కరధార లెత్తించి గుణము గానక రోసి గునిసె నొకఁడు." వేం. పం. చ. ౧, అ. ౧౨౦. వి. 1. నెమ్మదిగాఁ బరువెత్తుట. "సీ. గునుకు దనంగను గును కనఁగా నల్పధావనసంజ్ఞ యై తనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౨౪; 2. తృణవిశేషము. "సీ. చీమలు ప్రాతిద్వఁ జీవికిన వెలుగుపట్టునఁ బండి యెండి త్రుంగినగునుకుల." ఆము. ౬, అ. ౧౩. వేంక. స్థా. ౭౪. బ. తృణ ధాన్యవిశేషము. "సీ...తృణ ధాన్యములు చెలంగు, గునుకులు దూసరుల్ గొలివె లనంగను ..." ఆం. భా. ద్వి. ౨౩౯. కాశీ. 3, అ. ౧౫౧. విణ. మందమైనది. "గీ. ఒనరు దుప్పట్లు కడనిల్పి గునుకునడల..." రా. వి. ౨, అ. ౪౪.

గునుకుడు. దే. వి. నెమ్మదిగాఁ బరువెత్తుట. ఆం. భా. ద్వి. ౨౨౫.

గునుకెత్తు. దే. వి. (గునుకు+ఎత్తు.) "క. గునుకెత్తు చున్నగాడిదఁ, గనుఁగొని సింహంబు పలికె..." పేం. పంచ. ౪, అ. ౫౨౧.

గునుపము. దే. వి. గద. ఆం. భా. ద్వి. ౨౧౬.

గునుపు. దే. వి. విలాసము. (విలాసవిశేషము. శ. ర.) "సీ...గునుపు గొనబు మురిపము మురువు సొగసు ...హొయ లనఁగ విలాస మొప్పుచుండు." ఆం. భా. ప్ర. ౧౩౯.

గున్న. వై. వి. (సం. కణకః. క. గున్న.) 1. పంది. ఏనుఁగు, హంస మున్నగువానికిల్లె. "వ...మొగము దప్పుమాటున బలుమాటునం గదిసి పెద్దగున్న లను బిఱుగున్నలను బిడిపందులను నెడమల్లరంబు లను గొమ్ముకాండ్రను నొక్కుమ్మడిం గ్రమ్మునప్పు డును." ద్వా. ౮, అ. ౭౯. "గీ. మిన్ను మట్టిన యేనికగున్నలార." అచ్చ. అర. ౭౬. "క... రాయంచల, గున్నలు..." చిత్ర. భా. ౨, అ. ౧౦౮; 2. బాలుఁడు. "క. ఇన్నాళ్ల నుండి పిలు వక, న న్నిప్పుడు పిలువ వచ్చినాఁ డస నాపైఁ, గన్నెఱ్ఱసేసినాఁడవా, గున్నలపైఁ గినుకసేయఁ గూడునె బావా." చెన్న. ౩, అ. ౧౪౬; 3. కుఱుచయైనకొమ్మలు నూడలు గలచెట్టు, క్షుపము. "సీ...గున్న యం చనఁగను క్షుపసమాఖ్య." ఆం. భా. ద్వి. ౩౬; 4. గుబురుగాఁ బెరిఁగిన మామిడి పొన్న మొదలగు వృక్షకము. "రగడ. కొఱవెఁ జిగురు లెలమావిగున్నలను..." రాఘవ. ౨, అ. ౬. "వ...మెఱుకగుఁబోడులు చిన్ని పొన్నలుం గని..." ఉ. రా. ౪, అ. ౧౬౩. విణ. పొట్టిది. 'సీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదడు గున్న...లింగణా యనఁగను వామ నాఖ్య దనరు." ఆం. భా. ద్వి. ౧౨౩.

గున్నంగి. దే. వి. 1. పక్షివిశేషము. "సీ...గున్నంగి పోపిట్ట గూడబాతు...గీ. అనఁగ నిట్టనిపక్షిభే దాఖ్య లలరు." ఆం. భా. ద్వి. ౯౮. హంస. ౩, అ. ౧౨; 2. వృక్షవిశేషము. "గీ...గున్నంగి దిరిసెనంబు, మొదలుగాఁ గల్గు బహువిధభూరుహ ములు." హంస. ౪, అ. ౧౧.

గున్ననకోడి. ద్వ. వి. వనకుక్కుటము. "సీ. గువ్వ గున్ననకోడి గోర్వంక కోయిల..." ప్రబంధ. ౨౩౪.

గుప్త. సం. వి. ఆ. స్త్రీ. 1. సురతగోపన మొనర్చు పరకీయనాయిక; 2. అంతఃపురస్త్రీ; 3. దూల గొండిచె; 4. వైశ్యునినామాంతమున వచ్చు పేరు. (ఇది శర్మ వర్మ వంటిది.)

గుప్తచారి. సం. వి. అ. పుం. చారుఁడు. విణ. (అ.ఈ. ఆ.) రహస్యముగా సంచరించువాఁడు.

గుప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రక్షితము; 2. గూఢము.

గుప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. రక్షణము; 2. దాఁచుట; 3. కప్పుట; 4. గోయి త్రవ్వుట; 5. పాఁతఱ; 6. చెఱసాల; 7. రంధ్రము.

**గుప్పలించు.** దే. అ. క్రి. చల్లు, చిమ్ము, ఊబుకు. "చ. అరయుచుగాక మాయదవి నన్నుసఁ గన్నుసఁ గానలేక మే,చిరిమిన మాత్రఁ గ్రొంజమూరు చిల్లున మీఁదికి గుప్పలింపఁగాఁ, గమపులుగట్టి యున్న యవి...మదకలకోలరాజములు..." సాంబో. ౨, ఆ. ౧౯౬.

**గుప్పళించు.** దే. అ. క్రి. 1. అతిశయించు. "చ. అరిగెల బంట్లచా లరిగె నప్పుడు చప్పుడు గుప్పళింపఁగాన్." రా. వి. ౨, ఆ. ౫౪; 2. ప్రకాశించు. "సీ. నవనీట గుప్పళించెను గళావతి యోర్తు జిగి మోవిబింబికె లెగయకుండ." ౨ ఆ. ౯౩. స. క్రి. 1. వస్త్రములు మున్నగువానిని ఊను (శ. ర. బ్రౌ.); 2. కలిగించు. "సీ. సోమబింబాస్యవశవాసోమకల్లి, కొప్పుచంద్రికనెఱసాలు గుప్పళించె, జిలుఁగుఁబలుచని వాసోవిశేషములకుఁ, జెన్నొసఁగుఁగాదు యెటువంటికన్నె కలిమి." పాండు. 3, ఆ. ౧౯౧; 3. వ్యాపింపఁజేయు. "వ... జెలకుచూపుల జెగడుకొజె జేసిసలబిత్త అంపుటూప్పుల మృగనాభిపరిమళంబులు గుప్పళించుచు..." దశా. ౫, ఆ. ౧౧౯; 4. చల్లు. "వ...ఇసుక మెదువు నెలవులం బన్నినపసుపుటాకుంజప్పరంబులలోనం గుప్పళించిన కప్పురంబుల తోడి కురువేరుపరిమళంబులును..." పాండు. ౪, ఆ. ౧౬; 5. (అడుగులు) వేయు. "గీ. అప్పుడొప్పులకుప్ప కనుప్పువిభులఁ, దప్పకుండఁ బ్రభులఁ గందర్పనిభుల, గొప్పకన్నుల జెప్పలు విప్పి కనుచు, నిప్పుడూడఁ గొన నడల్ గుప్పళించె." పాంచాలీ. ౨ ఆ. ౧౬; 6. ఎగయు. "వ...నిప్పుకల చొప్పున జెక్కు లప్పళింపుచుఁ గుప్పిగంతులం గుప్పళించునళులు గప్పికొనం జొప్పడు పూఁజప్పరమ్ములు." అచలా. ౨, ఆ. ౬౪.

**గుప్పించు.** దే. స. క్రి. 1. (బాణాదుల నధికముగా) ప్రయోగించు "మ...కల్పాంత భైరవభీమాకృతి నేచి భీష్ముఁడు శరవ్రాతంబు గుప్పించినన్." భార. భీష్మ. 3, ఆ. ౩౧౯. భార. శల్య. ౧, ఆ. ౧౯౨; 2. (అధికముగా) ఇచ్చు. "వ...కని నైగమిక వారివాంశిక వైతాళికాదు లగువర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు..." హర. పీఠి. ౭; 3. ఊరియు. "క. రప్పించి యధిక సంభ్రమ, ముప్పొంగఁగ నందగోపుఁ డున్నవ్రజ ముపై, జెప్పఁ దపుకాలవర్షము, గుప్పింపుఁడు గోగణములఁ గోపులు మరియున్." హ. పు. ౭, ఆ. ౨౪౪.

**గుప్పిడి** = గుప్పిలి. (బ్రౌ. వా.)

**గుప్పిలి.** దే. వి. పిడికిలి. "వ...విప్పగు వాగొప్పకప్పుఁగవం గప్పుకొనం గప్పురంపురజం బొప్పగు గుప్పుగుప్పున గుప్పిళ్లఁ గొలందిగ గుప్పుచు..." రసిక. 3 ఆ. ౧౪౩. క్రీడా. ౧౬౭.

**గుప్పు.** దే. స. క్రి. 1. (బాణాదుల నధికముగా) ప్రయోగించు. "ఉ...మూఁడుతూపులన్, గుప్పితి విప్ర.." ఉ. రా. ౬. ఆ. ౧౦౫. నిర్వ. 3, ఆ. ౧౬; 2. (అధికముగా) పెట్టు. ఈయు. "ఉ. చెప్పినఁ బ్రీతులై యతనిఁ జెచ్చెరఁ దోకొనిపోయి బాలులుం, బప్పును నెయ్యుఁ బాయసముఁ బక్వఫలాదులు నేత్రతృప్తిగా, గుప్పిరి ముక్కపక్రమము గూరిన మేరికి దప్పిదీఱున ట్లు.." భో. ౭, ఆ. ౨౧౬; 3. చల్లు. "సీ. భ్రూయుగే క్రొమ్మావిపూఁ దేనె సతులార గుప్పరే కపురంబు కొమ్మలార." చంద్రా. ౪, ఆ. ౧౬౩. పార్వ. ౬, ఆ. ౪; 4. వెలిగ్రక్కు, చిమ్ము. "గీ. కప్పురపుఁదావి గుప్పు బాగా లొసంగి." కువల. ౫, ఆ. ౧౦౯; 5. (బియ్యము మున్నగువానిని) గట్టిగా దంచు. "చ...చందనంపుఁజోటను నేఁగుఁగొమ్ముకోఁ గటన్, బ్రిదిలెడుకొప్పుతో వెడదబియ్యము గుప్పు నిజప్రియాంగనన్." వల్మీకి. ౨, ఆ. ౧౦౫; 6 పొంచుచు. "ఉ...వానియొద గబ్బిచనుంగవచేత నెప్పుడు డే.గుప్పుదు గుప్పి వాని రతి కోరుట యొప్పు నటించు నెంచుచున్." శుక. ౨. ఆ. ౩౭౯. భో. ౬, ఆ. ౨౧; 7. ఊరియు. "ద్వి. అప్పుడు దివినుండి యఖిలదేవతలుఁ, గుప్పిరి మందారకుసుమవర్షంబు." ద్వి. శ. సా. 3, ఆ. ౧౨౦. పు. ౧౦. పం; 8. కొట్టు, తాడించు. "సీ ..పట్టి వెలుకఁ ముక్కుగుట్టుదు నను వాఁడు గురియుల గుండులఁ జరియ గుప్పి, యదరంట గంటతో వాఁగి పట్టుదు ననువాఁడును..." హరి. పూ. ౬, ఆ. ౧౩౬. వి 1. వాసనగొట్టుట యందగునకరణము. "వ...కప్పురంపుటనంటి

గుప్పుమనఁగ గప్పుతావులకుఁ దావలం బగు తావుల..." ఉ. రా. ౬, ఆ. ౨౪; 2. ధ్వనించుటయందగుననుకరణము. "ద్వి. తప్పక రత్నాంగి తనయుని౯ జూచి, గుప్పుగుప్పున బొమ్ము గ్రుద్దుకొంచు..." ద్వి. శ. పా. ౨ ఆ. ౯౬. పు. ౧. కు. సానంకో. ౨, ఆ. ౨౪. పు. 4. మోచుటయం దగుననుకరణము. "సీ. గుప్పుగుప్పున మోదికొనియున్న వలలతోఁ బలలంప్ర: బొత్తరల్ పాఱవైచి." స్వా. ౪, ఆ. ౧౦3; 5. దిగుటయం దగు ననుకరణము. "క. అరదము గుప్పున డిగి సోదరికిం బ్రణమిల్లి...జై" ౧, ఆ. ౧౫౧. దశా. ౫, ఆ. ౨3; 6. దూకుటయం దగుననుకరణము. "చ. నలుపురు గుప్పుగుప్పునను వాలుగుమూలలనుండి దూకి..." హంస. 3, ఆ. ౧౧౦; 7. లేచుటయం దగుననుకరణము. "సీ. తలయూచు నెదలోనఁ దలఁకి గుప్పున లేచు..." రసిక. ౪, ఆ. ౭; 8. పడుటయం దగుననుకరణము. "వ...గుప్పుగుప్పునం బడుకిడుగులవడిన్..." సమీర. 3, ఆ. ౧౭౧; 9. పోవుటయం దగుననుకరణము. "క. అప్పుడమికాను నెత్తుక, ఱిప్పునఁ జదలునకు నెగసి తేసినకడఁకన్,గుప్పునఁ జనుతటి నొడయఁడు, తప్పక యొకకోల వాని తలఁ ద్రెగనేసెన్." అచ్చ. ఆర. ౫; 10. వాతి; దెబ్బ. (బ్రౌ.)

గుప్పుడు. దే. వి. (గుప్పు.ధా.) ప్రోగు,రాశి. "వ..ఇట్టి కొమ్మ సింగోలులగుప్పుడులును..."ప్రబంధ ౭౧.

గుప్పుతెప్పున. దే. క్రి. విశ. ద్రు. శీఘ్రముగా "ఉ. అప్పుడు తద్విధూటి చలితాధరయై వరు గుప్పుతెప్పునన్, జప్పుడుగా నదల్చి..." శుక. ౧, ఆ. ౫౪౦.

గుప్పున. దే. క్రి. విశ. ద్రు. 1. శీఘ్రముగా. "ఉ. ఇప్పుడునైత మల్లగిరికృంగ సమీపముఁ జేర సూర్యుఁ డెల్లప్పటికాంతి మాని వికృతాకృతి యౌనపరాహ్ణ శంభుతన్, గొప్పపులుల్ తనుం గనిన గుప్పునఁ దూఱునటంచుఁ దూఱునా, యప్పురమేశుపైని నతఁ డాగిరిఁ గేలున జెంక యుండెఁగన్." పార్వ. ౧, ఆ. ౫౫. చంద్రా. ౨, ఆ. ౬; 2. ఆకస్మికముగా. "ఉ. అప్పుడు వెళ్ళఁ దెలిసి యచ్చెరువారఁగ మోడ్పుఁగేలుతో, గుప్పున మ్రోలు వ్రాలి రఘుకుంజరుసేమపు వార్త మున్నుఁగాఁ, జెప్పి..." రామా. ౬, ఆ. ౧౭౬; 3. అత్యధికముగా. "ఉ. గుప్పున మేనితావి వగ గుల్కఁగఁ గమ్మనికందిపప్పు మాఁకప్పు నమీకురాదు..." బలరామ చరిత్రము. ౬. ౧3౫. (బ్రౌ.)

గుబక. దే. వి. తలుపుగంపకట్టె నిలువుదిగుబ్బ. (శ. ర. బ్రౌ.)

గుబగుబ. దే. వి. 1. కోకిలధ్వనియం దగుననుకరణము. "సీ. గుబగుబమని పల్కుకోకిలపల్కులు విని యివి సేర్తువా యనుచు నవ్వు." శశాం. ౨, ఆ. ౧౬; 2. కెరటములు మున్నగువానిధ్వనికనుకరణము. "సీ. గుబగుబధ్వనుల బల్ గుట్టలపైఁ బొర్లి మిడిసి క్రేళ్లుటకి త్రుళ్లెడుకరుల్లు." ఉ. హరిశ్చ. ౨, ఆ. ౧౨౬; 3. నీరు క్రమ్ముట మున్నగువానియం దగుననుకరణము. "సీ. గుబగుబ కన్నీరు కొలుకుల నానుచో హెచ్చిన మైకాఁక నింకఁజేయు."సుదంతా. ౨, ఆ. ౧౫౯.

గుబాటున. దే. క్రి. విశ. క్షణమాత్ర, వెంటనే. (బ్రౌ.)

గుబాబెబ. దే. వి. విలాసము, హొయలు. "చ... గుబాబెబ వీధులవెంట జంటలై ...ఏఁగెడు దుండెకాండ్రలోన్." హంస. ౫, ఆ. ౧౬౦

గుబాలున. దే. క్రి. విశ. వెంటనే. వా:—వాఁడు నీళ్ల గుబాలున దుమికినాఁడు. (బ్రౌ.)

గుబారు. దే. వి. (హిం. గుబాల్.) పుకారు, అపవాదు. (బ్రౌ) (చూ. గుబారుచేయు)

గుబారుచేయు. దే. అ. క్రి. (గుబారు+చేయు.) లేనిపోనిమాటలుకల్పించు. "చ...పడంతి యింతలో, మనలను జూడలేక నడుమంత్రపువారు గుబారుచేసి గొబ్బున నినువంటిదాని కెగఁబోసిరి నాతలఁ బొవ్వుకుండఁగన్." రాధా. 3, ఆ. ౭౧.

గుబాళించు. దే. అ. క్రి. పరిమళించు. "గీ. రాజసుతుఁడు చిత్రాంగదమైజవాది, కమ్మతావి గుబాళించు తమ్మికొలని,కెలకులకుఁ జేరి..." విజ. ౧, ఆ. ౧3౧. ఉ. రా. ౭, ఆ. ౪౭౨.

గుబిలి. దే. వి. (క. గుబిరి.) ఒకానొక శకునపక్షి, కనకాక్షి. "గీ. వెలయుఁ గనకాక్షి సకినాల పులుఁగు గుబిలి,పైఁడికంటి నా..." ఆం. భా. ద్వి. ౯౧; 2. గులిమి. "సీ. కర్ణమలనామ

మెుప్పును గుబిలి నా గులిబి నా గులిమి యనఁగ." ఆం. భా. ద్వి. ౧౩౪.

గుబిలిగాఁడు. దే. వి. ఒకానొకపక్షి. "సీ...కాల కంబర కాకి గుబిలిగాఁడు...గున్నంగి కనకాక్షి ...ఆదిగాఁగనపక్షు లకఁడు దీర్చు." హంస. 3, ఆ. ౧౨. "వ...మేను లుండ పండ వెకల కిష్ణ య్యెడు నని పత్రి పరికి యెుఱుకులు గుబిలిగాని కడ నుంచుజిఫరుగం డెలగూర్చుందునవిరుం..." పార్వ. 3, ఆ. ౧౭౮.

గుబుకు = గుముకు. (శ. ర. బ్రౌ.)

గుబురు. దే. వి. సమూహము. "క. వెఱచుచు వంగుచు ప్రాలుచు, నఱిముఱి గుబురులకుఁ జనుచు హరి హరి యనుచున్, నుఱుఁగుచు పులుకుచు దిరదిరఁ, గుదుమట్టపుఁబొట్టివడుగు గొంత నటించెన్." భాగ. ౮, స్కం. ౫౩౮. ఆం. భా. ద్వి. ౧౦౦.

గుబురుకొను. దే. అ. క్రి. (గుబురు+కొను.) 1. దట్టమగు. "గీ. గుబురుకొనుపట్టిపేడలఁ గొఱలి తెరువు, చెంత నొప్పారు ఫలతరుశ్రేణి లొసఁగు, సుక్షేత్ర గరిమంబునకుఁ జూడ జోడు గావు, సద్గుణాకర హాయ మేధశతము లయిన." జాహ్నవీ. 3, ఆ. 3౭; 2. గుంపుగూడు. (చూ. గుబురులుకొను.)

గుబురులుకొను. దే. అ. క్రి. (గుబురులు+కొను.) గుంపుగూడు. "క. మును రమ్యపదార్థంబులు, గొని వీథు లలంకరించుకొని జనులు గనుం,గొనియెడు వేడుక గుబురులు. కొనియున్న పురంబుఁ జొచ్చెఁ గొడుకుం దానున్." విక్ర. ౫ ఆ ౧౪౧.

గుబులు. దే. వి. 1. గుప్పుమనికొట్టువాసన. "క చొక్కపునడతోఁ దఱకుఁ,బుక్కా గుమగుమలు కట్టుపునుఁగుగుబులు నల్,దిక్కులు నిండఁగ నెంతయుఁ, జక్కని కాళింది యనెడుజవ్వని వచ్చెన్." చమ. ౧, ఆ. ౧౨. (శ. ర. పా. భూగల్ ముద్రి. పా.); 2. భయము. (శ. ర.); 3. ఉడుకు, తాపము. (వ్యవ.) గాలి లేక శరీరము గుబులుగా నున్నది; 4. ఉన్మాదము, పిచ్చి. (వ్యవ.) వాఁడు గుబులెత్తి పాఱిపోయినాఁడు.

గుబులుకొను. దే. అ. క్రి. (గుబులు+కొను.) (సువాసన) గుప్పున కొట్టు. "క...మేనన్, గొన బగు జవ్వాదితావి గుబులుకొనంగన్." శశాం. 3, ఆ. ౫౩. విక్ర. ౮, ఆ. ౭.



గుబును. దే. వి. కపటము. (శ. ర.)

గుబ్బ. దే. వి. 1. కుచము. "ఉ. కుప్పసము ల్వదల్చి పరిగుబ్బల నొత్తిరి..." ఆము. ౫, ఆ. ౧౦౪. ఆం. భా. ద్వి. ౧౩౭; 2. గొడుగుమీఁదిగుబ్బ. "సీ. మండుకేనపిచాఁటి మార్తాండబింబంబు నొరగించు పసిండిగుబ్బతోడ...గీ...విష్ణునకుఁ బట్టె వెనకయ్య వెల్లగొడుగు." కాశీ. ౪, ఆ. ౭౮౪. వరాహ. ౯, ఆ. ౭౬; 3. తలుపుగొండపట్టెలు మున్నగువానిమీఁదిగుబ్బ. "సీ. ఉడుటుగుబ్బలు గలకల్పుటురము: జూడి." ఆము. ౭, ఆ. ౧౦. ఆం. భా. తృ. ౩౪: 4. బాణమునలుఁగుక్రింది గుబ్బ. "వ...ఒకటి రెండు మూఁడు గొరకల నెఱఁకులు గాఁడ గుబ్బకోలంటికిం దిగనైచి..." స్వా. ౪, ఆ. ౧౧౫; 5. కంతి, గ్రంథి. "గీ... గుబ్బ, బుడిపి...అనంగను బొనఁగు గ్రంథి." ఆం. భా. ద్వి. ౭౪; 6. పర్వతము. "ఉ...పడంతు గుబ్బ పే, దుబ్బదఁగించి పాల్కడలి నోర్చి హసించు హళాహళిం దగన్, గొబ్బురివేంగళ క్షితిపకుంజరుమంజులకీర్తి కుంజరుల్." రామా. ౧, ఆ. ౭౬; 7. కాలిజోడుమీఁదిగుబ్బ. ఉదా:...గుబ్బలజోడు. (బ్రౌ.) విశే. గుండ్రమైనది. "సీ. కుదురునిండినమించుగుబ్బచన్నుల మీఁద జిలుఁగుపువ్వులపకం చెలయొఁ దొడిగి." నైష. ౬, ఆ. ౭౨. స్వా. ౨, ఆ. ౭౮.

గుబ్బకాయ. దే. వి. (గుబ్బ+కాయ.) వీణ కమర్చు సొఱకాయ. "సీ. తలుకుపీలపుకట్టములు వారె నీడలు గానంగఁ దగుగుబ్బకాయ లమర...గీ... వీణె యొకయింతి నిల్చెను వెలఁదియెుకట." వాల్మీకి. 3, ఆ. ౧౩౨. ఆం. భా. ప్ర. ౧౩౬.

గుబ్బటిలు. దే. అ. క్రి. తిరుగుడుపడు. "గీ...దిక్కులెనిమిదియును, బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె, శౌరి పూరింప నప్పాంచజన్యరవము." ఉ. హరి. ౪, ఆ. ౨౧౬. భో. ౪, ఆ. ౭౭. (రూ. గుబ్బటిల్లు.)

గుబ్బతి. = గుబ్బ. (పర్వతము.) (బ్రౌ.)

గుబ్బతిలు. దే. అ. క్రి. 1. అతిశయించు. "క. అబ్బాలికిఁ జేయెుత్తం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుంత్సాహంబున్, గుబ్బతిలఁ గొన్ని చెట్టకు, నిబ్బరముగ జలమునెత్తి..." హంస. ౧, ఆ. ౧౮౬,

2. ఉప్పొంగు. "క. బాలహారిణములఁ జూచిన, కోలుపులిగతిఁ మనంబు గుబ్బతిలఁగ..." జై. ౮, ఆ. ౯౨. క్ర). శకుం. 3, ఆ. 3౫; 3. మండు ప్రజ్వలించు. "క. విను చల్లనిమాటలలో, మునిఁగి యలుక గుబ్బతిలు సముద్రజలములో,నవ యుండి యూఱ కెప్పుడు, గనగనమను బాడ బాగ్నికరణి నరేంద్రా." భార. శాం. 3, ఆ. ౨౬3. నిరం. ౨, ఆ. ౯౯; 4. పరితపించు.

గుబ్బతిల్లు = గుబ్బతిలు. 1. (అతిశయించు.) "ఉ... నీలకంఠములు మ్రోయు...షట్పదీ, మాలికఁ దోఁచు నబ్బురపుమబ్బులయుబ్బులు గుబ్బతిల్లఁ గన్." వసు. ౧, ఆ. ౧3౭; 2. (పరితపించు.) "ద్వి...చిత్తజునిబారిఁ బడియింటికోఁన, నెక్కడ నింటివా రెఱిఁగెద రనుచుఁ, గ్రుక్కుచు లోలోనె గుబ్బతిల్లుచును, నుండిలి నిన్నాళ్ల నొకరీతి..." ద్వి. పరమ. ౫. ఆ. ౮౨౦. పు.

గుబ్బన. దే. క్రి. విశే. ద్రు. శీఘ్రముగా. "చ... గుబ్బనఁ బతిదివ్యభవ్యమణిపాదుక లంఘ్రుల సంఘటించి య,క్కనకపురంబు చొచ్చి..." విక్ర. ౨, ఆ. ౧౦౫.

గుబ్బమేకు. దే. వి. (గుబ్బ+మేకు.) గుండ్రనితలగల యొకరకపుమేకు. (బ్రౌ. వా.)

గుబ్బలకొమరాలు. దే. వి. ఔ. యువతి. "గీ... ఒక్కగుబ్బలకొమరాలు చక్కవచ్చి..." నైష. ౬, ఆ. ౬౬.

గుబ్బలాఁడి. దే. వి. (గుబ్బలు+ఆఁడి.) యువతి. "ఉ. చక్కెర పెట్టవే వికచసారసలోచన మాట దేర్పవే, చొక్కపుగుబ్బలాఁడి..." నరస. ౫,ఆ. ౧౭౭. "ఉ...ఆ,తుంటరిగుబ్బలాఁడి వగతో విగతోడువివేకపాకయై." శశాం. 3, ఆ. 3.

గుబ్బలి. దే. వి. పర్వతము. ఆం. భా. ద్వి. ౨౭.

గుబ్బలిపట్టి. ద్వ. వి. (గుబ్బలి+పట్టి.) పార్వతి. "ఉ. గుబ్బలిపట్టి గబ్బిపలిగుబ్బల జొబ్బిలుతావికుంకుమం, గబ్బికొనంగఁ జాలు నెదఁ గప్పినబెబ్బులి పన్నెపచ్చడం,బబ్బురమైతనర్పు...వచ్చెను హేళుఁ డత్తఱిన్." దశా. ౨, ఆ. ౬౫. ఇట్లే: గుబ్బలిరా కన్నియ." అచ్చ. బాల. ౧౭౦.

గుబ్బలిఱేఁడు. ద్వ. వి. (గుబ్బలి+ఱేఁడు.) పర్వతరాజు, హిమవంతుఁడు. "ఉ. గుబ్బలిఱేనితాలిమి నగు న్నిజభూరివిభూతిసంపదన్." రామా. ౧ ఆ. ౮౪.

గుబ్బలివిలుకాఁడు. దే. వి. ఔ. (గుబ్బలి+విలు+కాఁడు.) శివుఁడు. "క. అబ్బటువు వాలు దాల్పును, గుబ్బలివిలుకాఁడు నంచగుజ్జుపు జోదున్, గొబ్బున నడ్డమువచ్చిన, నిబ్బరముగఁ బోర నేఁడు నినుఁ జెగటార్తున్." అచ్చ. యు. ౫౦౧.

గుబ్బసరము. ద్వ. వి. (గుబ్బ+సరము.) ఒకరకమైన హారము. (పెక్కుచిరుసూసలు గ్రుచ్చినసరము. శ. ర.) "సీ. సరివాటు గాఁగఁ గేసరములు గ్రుచ్చిన గురివెంద విరిగుబ్బసరముతోడ." కళా. 3, ఆ. ౨౦౮. ఉ. హరి. ౨, ఆ. ౧౭౨.

గుబ్బిక. దే. వి. పక్షులు మున్నగువానిని బట్టుటకై యొగ్గునొకరకమైనయుచ్చు. "గీ...ఉపకాంత ముఖ్యచటక, సంఘములకును గుబ్బిక..." హంస. ౨, ఆ. ౮3. (ముద్రి. పా. గుబ్బికె 'గుబిరికె'అని బ్రౌ. పా.)

గుబ్బిరి. దే. వి. ఒకానొకవృక్షము. "సీ...ఉత్తరేణు...గీ...మొదలు, గాఁ గలుగునట్టిచిఱుచెట్లఁ గాంచి యంత." హంస. ౮, ఆ. ౧౦.

గుబ్బిలి = గుబ్బిలికాఁడు.

గుబ్బిలికాఁడు. దే. వి. (గుబ్బిలి+కాఁడు.) శకున పక్షి. "సీ. జరగు గుబ్బలికాఁడు నకినాలు వెలయించు పక్కి..." సాం. ని. తిర్య. ౮౨.

గుబ్బు. దే. వి. 1. గుండె యదరుటయం దగునను కరణము. (దీనిఆమ్రేడితరూపము గుబ్బుగుబ్బు.) "ఉ...దానన గుండె గుబ్బుమన..." కళా. ౮, ఆ. ౨౦. రా. వి. ౨, ఆ. ౬౮; 2. సముద్రఘోషమున కనుకరణము. "ఉ. వారి నంభోనిధి గుబ్బుగుబ్బు రనుచున్ బోర్కల్గ దేవాసురుల్, ఖరశౌర్యోన్నతి గల్గి తర్చిరి సుధాకల్లోలినీవల్లభున్." వీర. 3, ఆ. ౨౧౦; 3. పగులుటయం దగుధ్వని కనుకరణము. "వ...పెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బని యురల..." భాగ. ౮, స్కం. ౨౦౮; 4. అఱచుటయం దగునను కరణము. "క. నిబ్బరపుదప్పిమంటలు, ప్రబ్బిన ధృతి లేక నేత్రపదహస్తంబుల్, గొబ్బున వివృతము లగుచును, గుబ్బను

చున్నట్టితూంతఁ గూలె న్నేలన్." భాగ. ౧౦, స్కం. పూ. ౨౬౬. (శ. ర. సా.)

గుబ్బెత. దే. వి. (గుబ్బ+ఎత.) 1. యువతి. "ఉ... ఆ,గుబ్బెత రేపురెల్లఁ దలఁ గొంకు నిరంతుశలజ్జ పెంపునన్." ప్రభా. ౫, ఆ. ౯౯. ఆం. భా. ద్వి. ౧౦౬; 2. స్త్రీ. "సీ. కలిమి గుబ్బెతమిన్న గబ్బినిబ్బరపుబ్బు గుబ్బలో జక్కవగుబ్బజోళ్లు." దశా. ౧, ఆ. ౧౬౫; 3. భార్య. "క...తగవె డవి పలికి గుబ్బెతలు తలఁచైనన్." సత్య. సాం. ౪, ఆ. ౨౦౯. (బ్రౌ.)

గుభాలు. దే. వి. 1. పడుటయం దగుధ్వని కనుకరణము. "మ...గుభాలునఁ గలపమును లక్ష్మింపై పడుఁగ లేచు..." ఆము. ౧, ఆ. ౫౭. వరాహ. ౮. ఆ. ౧౬; 2. పరిమళము వ్యాపించుటయం దగునను కరణము. "చ...మద్దుగాఱుపులక్కలఁ జెవికమ్మచేఁ దళుకుఁబక్కెకు చెక్కులఁ బట్టఁ డేసి గుబ్బలఁ గనుమాపు మేరపు గుభాలను తావులు వీసికే తగున్." కువల. 3, ఆ. ౩౨; 3. పడు లుటయం దగుధ్వని కనుకరణము. "చ. దరులు గుభాలునం బగుల..." శేష. ౧, ఆ. (గుబాలు అని శ. ర.); 4. దుముకుటయం దగుధ్వని కనుకరణము. "చ. అని మొలవంకి దుస్సి సమరార్భటిఁ జావడిక్రిందికిన్ గుభాలున దుముకన్ ..." ఆహ. ౧, ఆ. ౧౧౪.

గుభిల్లు. దే. వి. = గుభాలు. (వ్రాలుటయం దగు ననుకరణము.) "ఉ...దిక్కటాహముల్, పెక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీస్రవంతిపై, రక్కున వ్రాలి యాఁగె భువనావళి..." వసు. ౨, ఆ. ౧౪౬.

గుభులు=గుభాలు. 1. (నీరు మొదలగువానిలో రాయి మొదలగునవి పడుటయం దగుధ్వని కనుకరణము.) "క. చని నూతిలోపల గుభుల్లున నొక గుండె త్తివైచి..." శుక. ౨, ఆ. ౧౩౫; 2. (భేరి, తుపాకి మున్నగువానిధ్వని కనుకరణము.) "సీ. గంధవాహములు సుగంధంబు వెదచల్లె గుభులున దేవదుందుభులు మొరసె." జాహ్నవీ. ౧, ఆ. ౯౪. ప్రబంధ. ౭౮౮, 3. గుండె అదరుట యం దగునను కరణము. "సీ...అధికమానుసుల గుండె గుభుల్లన..." సా. 3, ఆ. ౨౮.

గుభులు = గుభాలు. (దుముకుటయం దగుధ్వని కనుకరణము. ఆమ్రేడితరూపము గుభులుగుభుల్లు.) "చ. రథసగతు త్సైలంగ నతిరాజతకేళిసరోవరంబులో, గుభులుగుభుల్లురం దుమికి..." భాను. ౨, ఆ. ౮౦.

గుభేలు = గుభాలు. 1. (దుముకుటయం దగుధ్వని కనుకరణము.) "క. పలపలఁ గ్రాగెడు తైలము, కొలఁది యొఱఁగఁ దలఁచుథంగి గుణరత్నసము, జ్జ్వలుఁడు గుభేలున దుమికెను..." ద్వా. ౬, ఆ. ౧౩౫. పరమ. ౪, ఆ. ౧౦౭; 2. (పడుటయం దగుధ్వని కనుకరణము.) "క...పెనుగుబ్బలి పడినగతి గుభేలునఁ బడియెన్." రామా. ౮, ఆ. ౨౨౯; 3. (కూలుటయం దగుధ్వని కనుకరణము.) "సీ. నగశిఖాశిల లెగసి గుభేలునఁ గూలి." రామా. ౬. ఆ. ౯౯.

గుమంజి. దే. వి. సుగంధద్రవ్యవిశేషము. "రగడ. సంకుమదంబు గుమంజియుఁ బాతియుఁ జందన ఖండంబులుఁ గర్పూరము." కవిక. 3, ఆ. ౧౯౫.

గుమగుమ. దే. వి. 1. గుమగుమ యనువాసన. "క. చొక్కపువడతోఁ దళుకుంబుక్కా గుమగుమలు కట్టుపునఁగు గుబులు నల్దిక్కుల నిండఁగ నెంతయుఁ, జక్కని కాళింది యనెడుజవ్వని వచ్చెన్." చమ. ౧, ఆ. ౭౪. సా. 3, ఆ. ౧౫౨; 2. మండుటయం దగునను కరణము. "క...గుమగుమ మని శోకవహ్ని గుబ్బతిలంగన్." నిరం. ౨, ఆ. ౯౯.

గుమాస్తా. దే. వి. (హిం. గుమాస్తా.) క్రింది యుద్యోగస్థుఁడు. (శ. ర. బ్రౌ. వా.)

గుమి. దే. వి. 1. సమూహము, గుంపు. "ద్వి. వేడుకతో విసుపీథిఁ జన్యారు, నాదకాడను గుమురై యేఁగువారు." రం. రా. యు. ౧౩౭. పు. ౨౧. షం; 2. ప్రోవు. "సీ. చిమ్మఁజీకటి గ్రమ్ముక్రొమ్మావి గుమి నల్లిబిల్లిరుద్రాక్షపుండిల్లనడుమ." ఉ. రా. 3, ఆ. ౧౦౬. వసు. ౪, ఆ. ౧౨౮; 3. గుది. "సీ. తిమితిమింగిల ముఖ్యదీర్ఘమత్స్యంబులఁ గొమ్మున గుములుగా గ్రుచ్చి యెత్తు." దశా. ౧, ఆ. ౨౮౯; 4. పాద. "వ...ఫలవృక్షకంబులు ప్రేయ సమకట్టిన నేము వల దని యన్వెదురుగుమి సూపినం దడవ్రేసె." భార. ఆర. ౧, ఆ.

౧౨౫; 5. నడుఁగు. "తోటకము. జముకర్ణ గుమిఁ బొఱని జంకక వ్రేసముకన్..." అచ్చ. బా. ౧, ఆ. ౨౧. ప్ర.

గుమికట్టు. దే. అ. క్రి. (గుమి+కట్టు.) గుంపు గూడు. "సీ. గోడలదాపున గుమికట్టి నిలిచిన ..." దశ. ౫, ఆ. ౧౨౩.

గుమికాఁడు. దే. వి. (గుమి+కాఁడు.) కాకి, వాయసము. "సీ. గుమికాఁడు కాకి నాఁ గొఱలుఁ గాకము పేర్లు." సాం. ని. తిర్య. ౪౨.

గుమిగూడు. దే. అ. క్రి. (గుమి+కూడు.) 1. గుంపు గూడు. "వ...వైవనమస్కారంబులు దూరంబు చేసి పదుగురై మువురు గుమిగూడుకొని కోడె కాండ్రరూపాధిక్యహైన్యంబు లుపన్యసించు సామాన్యకన్యకలును..." శుక. ౨, ఆ. ౧౧. 2. ప్రోవగు. "క. క్రొక్కారుమెఱుఁగు లన్నియుఁ, జొక్కడ గుమిగూడి నిల్చి యున్నవిధముగా ..." వేం. మా. ౧, ఆ. ౧౩౦. చంద్రా. ౨, ఆ. ౬౨.

గుమిగొను. దే. అ. క్రి. (గుమి+కొను.) గుంపు కూడు. "చ. గుమిగొని పైలఁ బైలఁ బడికొంచు భటావళి చూడఁ బోవ వెచ్చయిఁ గొని పోవు దాదులు నిజంబు గనుంగొని..." శుక. ౨, ఆ. ౪౦.

గుమిడికము. దే. వి. విల్లు. "సీ. గుమిడికంబులరీతిఁ గొనలు వంగినబొమల్ పరచాటుకన్నులపై నటింప." శుక. ౨. ఆ. ౧౯.

గుమితి. దే. వి. ఆయుధవిశేషము. "శా. బాణావంకిణిఁ బెద్దకత్తి గుమితిన్ బాణాసనప్రాఢిమన్ ..." శశాం. ౨, ఆ. ౧౭.

గుమిలి. దే. వి. పక్షివిశేషము, కనకాక్షి. (శ. ర.)

గుముకు. దే. స. క్రి. (త. కుముక్కు.) పిడికిలి ముష్టిగువాసితోఁ బొడుచు. "క. తముఁ దామె బెదరి పులుఁగులు, గుముకై పైకెగసి యల్లుకొని కొమ్మతుదన్, గమకముగఁ దాఁకి తొలుతొలు, గుమికినక్రియఁ ద్రెళ్లి నేలకును వ్రేఁగగుచున్." చంద్రా. ౨, ఆ. ౬౩. వాల్మీకి. ౨, ఆ. ౯౬.

గుముడు. వై. వి. (సం. కుముదికః.) 1. ఒకవిధమగు టేఁకుచెట్టు. "ద్వి. గొనబైన తేఁకులు గుముడు తేఁకులును." ద్వి. పరమ. ౨, ఆ. ౫౪. పు. ౪. పం; 2. = గుమ్మడు. (బ్రౌ.)

గుమురు = గుబురు. వి. గుంపు, సమూహము. "ద్వి...మము వృథా చంప నిచ్చోటు, సమకట్టితే యంచు సకలవానరులు, గుమురులు గుమురులై కూడి యొండొరులు." రం. రా. కిష్కిం. ౨౩౧. పు. ౯, పం. ౧౦. రా. యు. ౨౯౯. పు, 2. ప్రోవు, రాశి. "గీ. అచటిమణిచిత్రభూములు నచట నమరు, నమరతరువుల గుమురులు..." వసు. ౨, ఆ. ౫; 3. కొమ్మలు చిగుళ్లు ఆకులు మున్నగువాని గుంపు, విటపము. "వ...మొగలిగములగుమురులనడుమఁ బొడవులుగ దీపించుతోఁపుగుడారంబులచెలువు నలరించు చివురుటెలమావితండంబులును..." కళా. ౬, ఆ. ౨౪. విశే. దట్టమైనది. "రగడ. గుమురులగులేమావిచిగురులు గోయఁ గో యని కూసెఁ బికములు..." పారి. ౪, ఆ. ౧౬.

గుమురుకొను. దే. అ. క్రి. (గుమురు+కొను.) గుంపగు, ప్రోవగు. "సీ. కఱుచలై గుమురులై గొనబులై వేఁబోఁపకొమ్మఁ జుట్టినజడల్ గుమురుకొనఁగ." పాండు. ౨, ఆ. ౯౧.

గుమురుకట్టు. దే. అ. క్రి. (గుమురు+కట్టు.) గుంపు గూడు. "క. హయముల మరల్పు మీతల్లియుఁ బంధులు నెడలు సంచరింప గుమురుగట్టి యెదురు సూతురు..." భార. విరా. ౫. ఆ. ౨౨౩. ఇట్లే: గుమురులుగట్టు. "చ. గుమురులుగట్టి యూరికలు గుట్టి ప్రవాళము పట్టి కింకతో, నమలక మ్రింగి...కూయఁ గోవెలల్." కు. సం. ౪, ఆ. ౧౦౭.

గుములుగట్టు = గుమురుగట్టు. "వ...కిరీటిపరాక్రమప్రకారంబులం దమదెస నానాదేశంబుల చతురంగబలంబులు వొలిసినవెల్లువు నంతంత గుములు గట్టి చెప్పుకొనుచుండ..." భార, భీష్మ. ౨, ఆ. ౧౬౬. స్వా. ౪, ఆ. ౩౭.

గుములుగూడు = గుములుగట్టు. "గీ. ఏఱులై పాఱు నెత్తురు లెందుఁ జూడఁ, గొండలై పడుకండలు గుములుగూడి, దానికై పోరుభూతబేతాళతతులు, గలిగి భీకరమయ్యె సంగరము గరము." దశా. ౨, ఆ. ౪౩౪.

గుముర్లుగట్టు = గుమురులుగట్టు. వీర. ౪, ఆ. ౧౨౨.

గుమ్మ. దే. వి. 1. పాలు పిండునప్పుడు వచ్చెడు ధార. "క. వేలుపుటావును గుమ్మెఁడు,పా లడిగెడు రీతి...అల్పదానము...అడుగవచ్చితి నిన్నున్." వారిశ్చ. ౪, ఆ. ౯౯. ఆం. భా. ద్వి. ౧౫౯; 2. స్త్రీ, ఆఁడుది. "గీ. చెలువ దనచెలికత్తెలఁ బిలిచి నాకుఁ, గూర్చుగుమ్మ లెవ రెవ రీకొమ్మ లందు." తు. సం. ౬, ఆ. ౨౭. ఆహ. ౧, ఆ. ౨; 3. గాదె; కుసూలవిశేషము. "సీ. గాదె బొట్టయును దుగ్ధాసారమును ముద్దుగుమ్మయును వెలయును గుమ్మ యనఁగ." ఆం. భా. కృ. ౬౪.

గుమ్మడు. దే. విశే. అలంకరించుకొనువాఁడు, సొగసుకాఁడు. "సీ...గుమ్మఁ డంచనఁగను జికిలికాఁ డనఁగ సొగసు,కాఁడనఁగను వన్నెకాఁడనంగను సెటుకాఁడనఁగా నలంకారి యొప్పు." ఆం. భా. కృ. ౧౦.

గుమ్మకాంభోజి. వి. వి. (గుమ్మ+కాంభోజి.) రాగభేదము. "సీ. కాంభోజమును గుమ్మకాంభోజి యును..." ప్రబంధ. ౯౬. హంస. ౫, ఆ. ౧౨౪.

గుమ్మటము. దే. వి. (క. గుమ్మట.) రాయి మన్నగు వానితో నిర్మించినదీపపుగూఁడు. "మ... మేల్ బొమ్మచిత్తరు బంగారుపటాలు నిచ్చలపునిద్దా కెంపు టాగుమ్మటాల్, మరువంపుస్విరిమల్లెపూన రులు చల్వల్ చిల్కుపందిళ్లు..." సానందో. 3, ఆ. ౪౬.

గుమ్మడి. వై. వి. (సం. కూశ్మాండః.) కూశ్మాండముళి. "క. అమ్మగువ గనుంగొనియెన్, మమ్మరముగఁ బట్టి నామములు మైసెల్లన్, గ్రమ్మిఁన నుట్టిఁ బెట్టిన, గుమ్మడికాయయునుబోలెఁ గూర్చున్నతనిన్." వైజ. ౨. ఆ. ౫౬. హర. ౨, ఆ. ౯౯. సా. "గుమ్మడికాయలోని యవగింజంత = కడు స్వల్పము." కాళ. శ. ౭౭. "గుమ్మడికాయలో నావగింజయుఁగాదు = కావలసినదానిలోఁ గొంచెమైనఁగాలేదు." ప్రభా. ౪, ఆ. ౫౨.

గుమ్మడిమూట. ద్వ. వి. (గుమ్మడి+మూట) గుమ్మడి పండువలె నుండుమూట. "ఉ. ప్రక్కలుపంచు వంచి మునిపండ్లును బండ్లును రాచు రాచి రొమ్మ క్కలఁ జేయఁ జేసి తల యల్లనఁగాళులసందు సందిలో, చక్కికి నొక్క నొక్కి యిరుచంబడ గుమ్మడిమూటఁగట్టి పి,పెక్కు మవాళి చేసి చలి యిక్కడనక్కడఁ బెట్టు వేకువన్." క్రీడా. ౪౬.

గుమ్మడిగింజతాపము. ద్వ.వి.(గుమ్మడిగింజ+తాపము.) గుమ్మడిగింజవలె నుండుబొట్టు. కుచేల. ౪, ఆ. ౧౮౫. ఇక్షేఁ గుమ్మడివిత్తునామము. ప్రభా. ౪, ఆ. ౧౩౭.

గుమ్మతీలు. దే. వి. బ. కర్ణభూషావిశేషము, చెవికమ్మల నుండెడిసొమ్ము. (శ. ర. జ్రా.)

గుమ్మపడు. ద్వ. అ. క్రి. (గుమ్మ+పడు.) గాదెలో ధాన్యము పడునట్లు. - కుప్పగాఁబడు, కుప్పకూలు. "వ... కూర్పుకఁబడి వలదాఁటి వెలిఁ జెంది గుమ్మపడునవియును..." పార్వ. ౬, ఆ. ౭౪.

గుమ్మము. దే. వి. వాకిలి, ద్వారము. (శ.ర.జ్రా.వా.)

గుమ్మసరులు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ...షష్టికములు గుమ్మసరులు నడుమాటనాలుగు పగల పైరుల..." ప్రబంధ. ౧౧౨.

గుమ్మితి. దే. వి. ఆయుధవిశేషము. "క...మొగలి జేకుగుమ్మితిఁ జిమ్మెన్." ఉ. వారిశ్చ. ౪, ఆ. ౧౧౪. శశాం. ౨, ఆ. ౭౦.

గుమ్మితీ = గుమ్మితి. "చ. మదనుని గుమ్మితీమొనలు మాటికి మర్మము లంటఁబొఱిసన్..." అహ. 3, ఆ. ౪౧.

గుమ్ము. దే. స. క్రి. పిడికిటితోఁ బొడుచు. (శ. ర.) వి. 1. పిడికిటిపోటు. (శ. ర.); 2. పరిమళించుట యం దగునసుకరణము. "ఉ. గుమ్ముగుకమ్మఁదెమ్మెరలకుం దులకించి..." కృ. శకుం. ౧, ఆ. ౭౩; 3. తిరుగుటయం దగునసుకరణము. (ఆమ్రేడితరూపము గుమ్ముగుమ్ము.) "ఉ. వేలుపులు న్నిశాచరులు వెండియుఁ గవ్వపుఁగొండ వార్ధిలోఁ, వేలుచు గుమ్ముగుమ్మనఁగఁ ద్రిప్పఁగఁ జొచ్చిరి..." హర. ౬, ఆ. ౭౪.

గుమ్ముడు = గుముడు. వై. వి. (సం. కుముదికా.) 1. కుముదిక, బేఁకుళీ. "గీ. గుమ్ముఁ డనఁగను కుముదిక సమ్మతిపడు." ఆం. భా. ద్వి. ౪౬; 2. బేఁకులోనొకరకము. (వా.)

గుమ్మెట. దే. వి. వాద్యవిశేషము, కుంభివాద్యము. "వ...మారి భేరి గారు గుమ్మెట తమ్మటంబు...

లోనగు ససంఖ్యాతవాహిత్రత్రితయ పరంపరలు ..." ఆము. ౪, ఆ. ౩౯. కాశీ. ౩, ఆ. ౩౬.

గుమ్మెత = గుమ్మెట. "సీ. గుమ్మెత యనఁగను గుంభ వాద్యము తోఁచు..." ఆం. భా. ప్ర. ౧౨౮. హంస. ౩, ఆ. ౧౮౮.

గుమ్మెతకాఁడు. దే. వి. (గుమ్మెత+కాఁడు.) గుమ్మెత వాయించువాఁడు. "ఉ. గుండసికిం బసిఁడిపసి గోరఁటిబాదకు వెండితాయెతుల్, లాడికిఁ జేక డెంబు పరిలంబుగ గుమ్మెతకాని కంటెలున్..." హంస. ౯, ఆ. ౧౩౬.

గుమ్మెతగుడారము. ద్వ. వి. (గుమ్మెత+గుడారము.) గుమ్మెతవంటియాకారము గలగుడారము. "క... రంభోర్వసులున్, గుమ్మెతగుడారములకడ, ఘుమ్మనుకపురంపుజగతిఁ గూర్చుండి తగన్." వాల్మీకి. ౩, ఆ. ౧౦౧.

గుయ్యారము. వై. వి. (సం. గుహ్యాగారమ్.) కారాగృహము, చెఱసాల. "గీ. ఆడరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱసాల యనఁగను..." ఆం. భా. ద్వి. ౨౨౬.

గురగుర. దే. వి. 1. పందియఱపున కనుకరణము. "ద్వి. గరువునేలలఁ దుంగగడ్డలు త్రవ్వి,గురగుర మనుపంది గున్నలబార్లు." ద్వి. శ. సా. ౨, ఆ. ౮౦. పు. ౧౪. పం; 2. ఇఱ్ఱిధ్వని కనుకరణము. "ఆ ..గురగుర, మనుచు వేఁటయిఱ్ఱు లరుగు దెంచె." చంద్ర. ౨, ఆ. ౨౧.

గురణము. సం. వి. అ. న. యత్నము.

గురస్తు. వై. వి. (సం. గృహస్థః.) గృహస్థుఁడు. "గీ. అమ్మ నేఁజెల్ల బాఁపనయ్యా మఱేమి, రజ్జులాడెడు మంచిగురస్తు వగుదు." శుక. ౨, ఆ. ౪౭౩. శుక. ౩, ఆ. ౨౩.

గురి. దే. వి. 1. మలక♆. "సీ...గురుగటంచన్నను గురి యనంగ, మలకటంచన్న నర్బుదఫలి మను చుందు..." ఆం. భా. ద్వి. ౬౪; 2. = గురిగి. ఆం. భా. ద్వి. ౨౪౭.

గురిగి. దే. వి. ఆఁడుపడుచు లాడుకొనుచిన్నపిడుత. "సీ...అత్యల్పభాండం బొప్పు గురిగియం చనఁగను గురి యనంగ." ఆం. భా. ద్వి. ౨౪౭.

గురిగింజె. ద్వ. వి. (గురిజ+గింజ.) గురిజపూస. "సీ. పందికొమ్ము వెదుళ్లఁ బండినముత్యాలు గురిగింజలను గూర్చుసరముతోడ." పార్వ. ౬, ఆ. ౮౯.

గురిజె. వై. వి. (సం. గుంజా.) 1. గురువెంద♆. "సీ. భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు గురిజపూసల గుబ్బసరులు గాఁగ." హర. ౭, ఆ. ౪౧. ఆం. భా. ద్వి. ౯౨; 2. గురిగింజ. "ఆ. గురిజపేరు లఱుతఁ గొమరార ధరియించి, యడవి మొల్లలఁ గురులందుఁ జెరివి." ద్వా. ౧౧, ఆ. ౬. య. ౧, ఆ. ౪౮.

గురిమిడి. దే. వి. ఒకజాతిదుంప. ఉదా:—గురిమిడిగడ్డ. (బ్రౌ.)

గురివెంద. ద్వ. వి. (గురిజ+వెంద. శ. ర.) గుంజాలత, గురిజ♆. "క. గురివెంద వేము సదరిన, పరుసున..." దశ. ౭, ఆ. ౪౪. హర. ౭, ఆ. ౧౪౦. (రూ. గుర్వెంద.)

గురు. దే. వి. గవయమృగము. "సీ...అడవి నేలసె కాసి సడయాడ సేరము గురులపాడియకాని కొసరనేరము..." సాంబో. ౨, ఆ. ౧౭౮. పాండు. ౩, ఆ. ౮౭. [చుట.

గురుకారము. సం. వి. పుం. గౌరవించుట; పూజిం

గురుగు. వి. 1 ఒకవిధమైనకూరాకు♆. "మ. గురుగుం జెంచలిఁ దుమ్మి..." ఆము. ౪, ఆ. ౧౩౪. ఆం. భా. ద్వి. ౭౩; 2. భక్ష్యవిశేషము. "వ...చాఁపట్టు లిడ్డెనలు తేనెతొలలు గురుగు లేలకికాయలు..." ప్రబంధ. ౧౧౨;3 గురిగి.(బ్రౌ.); 4. భూరుండి, శ్రీహస్తిని♆. "సీ...శ్రీహస్తినీ సంజ్ఞ చెలఁగు గురుగు, నాఁగ..." ఆం. భా. ద్వి. ౯౨.

గురుఘ్నము. సం. వి. అ. పుం. తెల్లఆవ♆.

గురుజె. దే. వి. ఒకరకముకూరాకుచెట్టు, ఉత్తుండి♆. (శ. ర.) "ఆ. కటికయ జీలకఱ్ఱ గఱివేము గురుజయుం,గువ ప్రవర్జనీయకోటి యగుట." భార. అను. ౩, ఆ. ౧౬౩.

గురుజోలు. దే. వి. వజ్రము. (బ్రౌ.) "సీ. పొలుచును వజ్రంబు మూలరా లన మగరాలనంగను గురుజా లనంగ." ఆం. భా. ద్వి. ౨౭౮.

గురుజె. దే. వి. తిరుగటికిఁగొట్టుకొయ్య. (వా.)

గురుపత్త్ర. సం. వి. ఆ. స్త్రీ. చింత♆.

గురుపోతు. ద్వ. వి. (గురు+పోతు.) పురుషగవయము. "సీ. తెరఁ దూఱి వెలువాఱు గురుపోతుపై నైనఁ బడి యెక్కి పొదుతు నీపాప మాన." స్వా. ౪, ఆ. ౩౫. ఆం. భా. ద్వి. ౭౫

గురురత్నము. సం. వి. అ. న. 1. గోమేధికము; 2. పుష్యరాగము; 3. శ్రేష్ఠమైన గురువు

గురువారము. సం. వి. అ. పుం. బృహస్పతివారము.

గురువు. ఉభ. దే. వి. పరుగు. (ద్రా. వేగపుపరుగు. శ. ర. చూ. గురువుదేఱు, గురువులువాఱు.) సం. వి. ఉ. పుం. 1. తండ్రి; 2. కులముపెద్ద; 3. తండ్రిసోదరుఁడు; 4. అన్న; 5. మేనమామ; 6. ఉపాధ్యాయుఁడు; 7. మంత్రోపదేశముచేసినవాఁడు; 8. రాజు; 9. బృహస్పతి; 10. తాత; 11. రక్షకుఁడు; 12. పుష్యనక్షత్రము; 13. మామ; 14. దూలగొండిచెట్టు. విశ. (ఉ. ఉ, స్త్రీ. ఉ.) 1. బరువైనది; 2. పెద్దది; 3. దీర్ఘము; 4. భరింపరానిది; 5. పూజింపఁదగినది; 6. అలఘువు. (ఛంద.); 7. బలీయమైనది.

గురువుదేఱు. దే. అ. క్రి. (గురువు+తేఱు.) రక్తము (మున్నగునవి) జిఱ్ఱునఁ బైకుబుకు. "ఉ. త్రెవ్వెడు గంటులన్ గురుగుదేఱుచు నెత్తురురాకమున్న ..." భా. రా. యు. ౨౧౪౫.

గురువులుదాఁటు = గురువులువాఱు. (మించు, అతిక్రమించు.) "ద్వి... గొబ్బునఁ గొంగుదొలంగ, గుబ్బచన్నులమించు గురువులుదాఁటి. తరళహారంబులు కళకులుచెదర..." నవనాథ. ౧, ఆ. ౪౩. పు. పం.

గురువులువాఱు. దే. అ. క్రి. (గురువులు+పాఱు.) 1. పరుగెత్తు. "చ. గురువులువాఱి బిట్టుఱికి కొమ్ములఁ జిమ్ముచు నంత నంత డగ్గుచుచు... ఆహారిణంబు లీలతోన్." భాగ, ౫. స్క. ౧, ఆ. ౧౦౬. వీర. ౧, ఆ. ౫; 2. అధికమగు. "క. నరుఁడును రాధేయుఁడు నొండొరులతోఁ బెనఁగుచేడ్క యుల్లంబులలో, గురువులువాఱఁగ నిల్చిరి..." భార. ద్రో. ౧, ఆ. ౧౩౫; 3. పొగరెక్కు. "చ... క్రొవ్వునం, గురువులువాఱు కంటకులఁ గొండగవల్ చొరఁ దోలి పోరుమం, బలిమఁలఁ గ్రాలఁ బింగళకుఁ డన్ మృగరాజు చరించు నచ్చటన్." వేం. పంచ. ౧, ఆ. ౧౦౧; 4. ఉప్పొంగు. "చ... మై, గురువులువాఱఁ గేలఁ బుచ్చుకొని చెకమోత్రల నవ్వు నింపు కొంచిరి గొనఁ గార్తికేయుఁడు కుక్కుటమ్మిక కల్లము కన్గొనంగఁగన్." కు. సం. ౧౦, ఆ. ౮౧.

గురువువాఱు = గురువులువాఱు. (పరుగెత్తు.) "ద్వి. కరములఁ గొఱఁతలఁ గైకొని పేర్చి, గురువువాఱెడిపెక్కొఱవిదయ్యములు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౪౩.

గురుసు. దే. వి. 1. ఆయుధపుపట్టు, మర్మము. "క. తురగముల సూతుఁ జాపినఁ, గురుసలి పొలివోక యనిగురుసున నేయన్." భార. ద్రో. ౫, ఆ. ౧౮౫, కాశీ. ౬, ఆ. ౬౦; 2. మొదలు, కుదురు. "చ... గండు తెత్తి స.త్వరగతిఁ గుంభముల్ వగల దంతుల నైచుచు దంతకాండముల్, గురుసుల గూడి రాఁ దిగిచి ఘోరనిశాచరకోటి మోదుచున్..." భా. రా. యు. ౬౭౪.

గుర్గురించు. దే. అ. క్రి. గుర్గురుమనిధ్వనిచేయు. (చూ. గుర్గురించుమెకము)

గుర్గురించుమెకము. ద్వ. వి. (గుర్గురించు+మెకము.) అడవిపంది. "సీ. గుర్గురించుమెకంబు గొమ్ముకాఁడొంటరి పంది యేకలముపు బంటుమెకము... వాలుమెకం బన వఱలు దంష్ట్రి." వెంక. నిఘ. ౯౫.

గుర్గురింత. దే. వి. 1. అడవిపంది. "గీ. ఏకలము గుర్గురింత తన నెపఁగు దంష్ట్రి. సాం. ని. తిర్య. ౭౫; 2 గుర్గురించుట. [దేశము.

గుర్జరము. సం. వి. అ. పుం. ఘూర్జరము, గుజరాతి

గుర్తు=గుఱుతు. (లక్షణము, లెక్క.) "ఉ...మాకునీ, యీవు లదేమి గుర్తు..." వైజ. ౨, ఆ. ౭౬.

గుర్వణఁగించు. ద్వ. స. క్రి. (గుర్వణఁగు ధా. ప్రే.) నశింపఁజేయు. "ద్వి. పూర్వజన్మార్జితభూరికర్మములు, గుర్వణఁగించు నాకొముక రావయ్య." బస. ౪. ఆ. ౧౧౬. పు. ౮. పం.

గుర్వణఁగు. ద్వ. అ. క్రి. (గుర్వ+అణఁగు.) ఆధిక్యమణఁగు; నశించు. (చూ. గుర్వణఁగించు.)

గుర్వి. సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి.

గుర్విణి. సం. = గుర్వి.

గుర్వ. వై. వి. (సం. గురు) ఆధిక్యము. (చూ. గుర్వణఁగించు.) విశ. 1. అధికము. "ఉ...

మూలి యుద్ధమై, బోరన వచ్చి యయ్యిహగపుంగవ కేతను నేసె నంతయుం, గ్రూరము లైనయమ్ములను గుర్వగ దానవు లుత్సహింపఁగన్.” నిర్వ. ౩, ఆ. ౨౯; 2. పూర్ణము. “ద్వి. సర్వమాన్యము నీకు గుర్వగా నిత్తు, శర్వనక్తుండవై చరియింపు మనుడు.” బస. ౪, ఆ.

గుర్వెట్టు. దే. అ. క్రి. (గుఱు+పెట్టు.) గుఱకపెట్టు. “శా...కాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టుచున్.” భాగ. ౧౦, స్కం. పూ. ౨౧౦. (శ. ర. వా.)

గుఱక. దే. వి. (క. గుఱకె.) 1. నిద్రయందలిధ్వని “క. సతి ప్రక్కఁ బండినప్పుడు, రతి కొగ్గక నిదుర వోవురా యయ్యో నా,చతురుఁడ గుఱకలు చాలున్, గతి చెప్పుమటంచు వానిఁ గడు బాధించున్.” శుక. ౨, ఆ. ౧౦౭. ఆం. భా. ప్ర. ౧౪౨; 2. వ్యాఘ్రాదులు చేయుధ్వని. “క... వాలము భూ, మిని దాఁటించుచుఁ దద్దశ,ము జూచుచు గుఱక నుఱకఁ బోవటు లున్నన్.” శుక. ౨, ఆ. ౨౯౨.

గుఱకపెట్టు. దే. అ. క్రి. (గుఱక+పెట్టు.) నిదురలో ధ్వనిచేయు. “గీ...పులివోలె గుఱకపెట్ట, నిదురవోవఁగ...” ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౯.

గుఱకపోతు. ద్వా. వి. (గుఱక+పోతు.) అతినిద్రకలవాఁడు, నిద్రపోతు. (వా.)

గుఱకలిడు. దే. అ. క్రి. (గుఱకలు+ఇడు.) గుఱకపెట్టు. “గీ...గుఱక, లిడుచు నిదురించు లేచు నల్లడలఁ దిరుగుఁ, గుంభకర్ణుఁడు నడయాడు కొండ కరణి.” ఉ. రా. ౨, ఆ. ౧౪౦. స్వా. ౨, ఆ. ౭.

గుఱకలుపెట్టు = గుఱకపెట్టు. “సీ. దిక్కరుల్ నెవ్వడొంద దేవతల్ వెఱనొంద బెట్టుగా గుఱకలు పెట్టుకొనుచు.” ఉ. రా. ౨, ఆ. ౨౮౯.

గుఱగుఱ. దే. వి. ఒకవిధమైనదురద. (శ. ర.) విణ. గురదగలది. “చ. కరినివహంబు రాచుకొనఁగాఁ జలియింపదు బొడ్డుబంటిగాఁ, బెరిఁగినపుట్టలో వెడలుభీకర భోగికులంబు ప్రాకఁగా, గుఱగుఱగాదు...మునిముఖ్యునియాతను వంచుఁ దాపసుల్.” వరాహ. ౧౦. ఆ. ౯౩.

గుఱము. దే. వి. అశ్వము. “సీ. ఖరధూళి శరధి గూర్కొన నోపునో యనఁ దగె సేతుబంధంబు లగుగుఱాలు.” రామా. ౭. ఆ. ౨౭౪. య. ఆ. ౧౯౯.

గుఱాలగోచే. దే. వి. అశ్వపాలకుఁడు. “సీ. గుఱ్ఱామన గుఱాలగోచనఁగా గులప యనంగఁ దగు నశ్వపాలకుండు.” ఆం. భా. ద్వి. ౨౦౪.

గుఱి. దే. వి. (క. గుఱి. త. కుఱి.) 1. లక్ష్యము. “చ...పువ్వులఁటె చిక్కనిచక్కనియమ్ము వేయుచో,గుఱి యటె చిత్తముల్...” దశ. ౩, ఆ. ౧౨౮; ఆం. భా. ద్వి. ౨౧౨; 2. విశ్వాసము. “గీ. వఱలుకఱివేల్పు మదినెంతు గుఱి దలిర్ప.” ౧, ఆ. ౩; 3. గుఱుతు. “గీ. వసుధలో నెట్టి శ్రీగలవారి వేని, కరభములు దాస్యములు చేయుం నరసిజాక్షి. యూరువుల కెట్టటన్నఁ బైఁ దారు మోచు, గొడుగులును నల్లకలశముల్ గుఱులు కావె.” అమ. ౯, ఆ. ౩౧; 4. దృష్టాంతము. “ఆ. గాలవుండ గుఱియుఁ గాఁడె మనకు.” భార. ఉద్యో. ౩, ఆ. ౩౦౯. అమ. ౪, ఆ. ౧౭౮; 5. సాక్షి. “తరళ. కడఁగి విన్నువెలుంగు దా గుఱిగాఁగ నబ్బలు కానలో, నడలుచున్ననుం గనుంగొని యప్పు డర్మిలి నూతిలో, వెడలఁ దీయుచుఁ గేలువట్టితివే కదా యిఁకఁ బెండ్లికిన్, గడమతెల్లను సొంపులు...” య. ౪, ఆ. ౬౦ భా. రా. యు. ౨౩౬౬; 6. నిర్ణయము. “క నానెమ్మనమునఁ గలయను,మానము పరతత్త్వ బోధమహామ గుడుపు ప్ర,జ్ఞానిధి యాశుల్కమ నిం,పూనఁగఁ గైకొనుట యనుచు నొకగుఱి చేసెన్.” పరమ. ౪, ఆ. ౧౮; 7. ఉపాయము “చ. కటకట మీర లాడుపెనుఁగష్టపువిద్దెల చూడఁ డాయె ము,చ్చటనుఁ బనేమి పోదము చామయ పల్కనఁ దత్తనూజ నా,ఱట సురవేశ్యో యనఁగ రాజిలుచుండెడి చెన్నసాని నీ,విట వగఁ జెంద నేమిటికి నే గుఱిఁ జెప్పెద నంచ నిట్టనున్.” చెన్న. ౨, ఆ. ౨౩౦; 8. మితి. “క్షీ ఏదేవుఁ డింతకు నింతయై యంతకు నంతయై గుఱి లేక యతిశయిల్లు.” పాండు. ౯, ఆ. ౯౭. ద్వి హరిశ్చ. ఉ. ౧౪౭౮. పం; 9. హద్దు. “సీ. గుఱి మాఱి రోదసీకుహర మొక్కట మఁ

సుభ్యాంగుప్రకృతూనిరాడిక్రిందె." ఉ. రా. ౭. ౧౪౧; 10. మర్యాద. "మ. మరుణార్క గుణి దశ్ని శా [illegible] నిర్జిత్తై" [illegible]

[illegible]

గుణించి = కూర్చి. [illegible] యన్న రేశ్వ రుండు [illegible] గుణించి యిట్టను..." భార.శల్య. ౨, ఆ. ౨౩. ఇష్టే: గుణియించి. కాశీ. ౨, ఆ. ౯.

గుణించు. దే. అ. క్రి. తలపోయు. "గీ...నాగవల్లి యొనర్చుటకై గుణింప." రాజ. చ. 3, ఆ. ౧౭౪. స. క్రి. 1. గుణిగాఁ జేసికొను. "వ... ఆశేషమునీషిపృచ్ఛయుంగమునఁ బెబ్బులు బహుళించియు నభిప్రాయంబు గుణించియు భావం బుపల క్షించియు రసంబు పోషించియు..." వైజ. ౧, ఆ. ౨౦౨. వరాహ. 3, ఆ. ౧౩౦; 2. మితి యిడు. "క. నగరిపురిపురగరుం దన్నగరీరక్ష యూథసౌధ నానావిధరుగ్ధగధగలు జూచు వేడుక, చిగిరింప గుణింపరానిచిడిమిడి పొడ మన్." కువల. 3, ఆ. ౧౫.

గుణికట్టు. దే. వి. (గుణి+కట్టు.) 1. అంచు. (శ.ర.); 2. మితి. (శ. ర.); 3. కట్టుపాటు, "గీ. వెట్టినై తెల్పెదను గాని వెలంది నీవు, వలపులను మించి గడిచేతి వద్దఁ జేరి, మారుసాములఁ జలపోరి పోరువేళ, నాడుగుణికట్టు నిలుచునా నలిన నయన." రాధికా. ౧, ఆ. ౧౧౩. వేం. మా. ౫, ఆ. ౨౦.

గుణికాఁడు. దే. విశే. (గుణి+కాఁడు.) లక్ష్యముతప్ప కుండగొట్టువాఁడు, కృతహస్తుఁడు. (శ. ర.) "క. చలిగుణికాఁడై నిగనిగఁ, గలువలచెలికాఁడు పుట్టుఁ గలశపయోధిన్." హర. ౬, ఆ. ౭౯. శుక. ౨, ఆ. ౪౯౦.

గుణికొండి. దే. వి. (గుణి+కొండి.) 1. ఆయము, జీవస్థానము. (శ. ర.); 2. గుఱుతునకై కొండి వలెఁ గట్టినత్రాడు (ముగ్గుగుర్తు.) "ద్వి. పెద బొబ్బలిడుసీదు పెడకట్టె బిడ్డ,కట్టినగుణికొండ్లు కట్టిన ట్టుండ,నే యొల్లఁ ద్రావు దంతి మెసంగు వెలఁగ,కాయలగతి రిత్త కడవ కిచిక్కు..." ఆ. [illegible] ౧, ఆ 3౫. పు. ౧౭ పం: 3. సాటి. పోలిక. "చ. [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]." [illegible] ౬. ఆ ౫౩

గుణిగొను. దే. స. క్రి. (గుణి+కొను.) లక్షించు, గుణిగాఁ జేసికొను. "చ. తటి యనుకోపు కారముఁ దుదగ్రతఁ బెట్టినదై లక్ష్యాంగమున్, గుణిగొని వేలుపుంజెరువ్ర గొప్పఫిరంగిని జాయ నుండుగోఁ, గొఱవెడుమిన్ను మానికపుగుండు మటించి యగాడు చేసికన్..." రసిక. ౪.ఆ. ౯౫.

గుణిచి = కూర్చి. "సీ. అజ్ఞానమునఁడు తన్ను శక్తితో గుణిచి యడించుట గోరి సృజించె సురల." హరి. పూ. ౨, ఆ. ౯౭. హరి. ఉ. ౧ ఆ. ౧౬౯.

గుణిచేయు = గుణిసేయు. (లక్ష్యపెట్టు.) "సీ. గుత్తంపుగుబ్బలు గుణిచేసి పైచెఁ బయోజకట్టల ములి నొకతె నొకతె." కవిరా. ౪, ఆ. ౯౫.

గుణిపడు. ద్వా. అ. క్రి. (గుణి+పడు.) 1. ప్రసిద్ధి గాంచు. "ద్వి. లోకైకమునఁ జాల గుణిపడ్డ రాతు, చక్రరక్షాణాంపుసామ్రాజ్య నెక్కె." రఘునా. ౧౯. పు. ౧౩. పం; 2. విర్చడు. (చూ. గుణిపఱచు.)

గుణిపఱచు. దే. స. క్రి. (గుణిపడుధా. ప్రే.) విర్చ ఱచుకొను, నిర్ణయించుకొను. "గీ. ద్వివిదుఁ డశని ప్రభుని వడఁ జెచ్చునోడె సుషేణుఁడు మహోదరుని విభజించుకొనియెఁ, బనసుఁడు నరాంతకుని గుణిపఱచుకొనియె, జాంబవంతుఁడు మకరాక్షుఁ జయముకొనియె." రామా. ౭, ఆ. ౨౮౮.

గుణియగు. దే. అ. క్రి. (గుణి+అగు.) చాలు, సమ ర్థుఁడగు. "మ. సరసీజాక్షునికీర్తి భక్తుఁడవు సంసారాబ్ధికిన్ నావయై, దరిఁ జేర్పన్ గుణి యైనవాఁడు మురవిధ్వంసుండు నిన్ బ్రోవఁడే." కుచేల. ౨, ఆ. ౫౧.

గుణివేయు. దే. స. క్రి. (గుణి+వేయు.) పళ పఱచుకొను. "సీ. పురుషుని నెచటికిఁ బోవంగ

నీయక వింతచేఁతల గుఱివేయవలయు." మల్హా. ౨. ఆ. ౨౨.

గుఱిసేయు. దే. స. క్రి. (గుఱి+చేయు.) 1. ఉద్దేశించు. "గీ. అన్యరాజన్యు గుఱిసేసి యరిగెవాణి." నైష. ౫. ఆ. ౧౩౬: 2. ఉదాహరణ మొనర్చు. "సీ. నీచందమున నన్ను నెఱయ సేవించక మద్భక్తు లగుదురు మత్పరులకు, గుఱిసేయ నీవ యోగ్యుఁడ వైతివి..." భాగ. ౭, స్కం. ౩౭౯; 3. సరకుచేయు. "క...ని న్నొకయించుక యును గుఱిసేయక యమ్మెయిఁ జెనకి తలఁకక దక్కఁడు సెను మడిన్." రాఘవ. ౪, ఆ. ౪౨. కళా. ౩, ఆ. ౨౧౩; 4. గణించు, ఎన్ను. "మ. కరుణాం జేకొనిరేని రౌరవపద గ్రస్తాత్మ దేవేంద్రుగాఁ, బరగం జేయుదు రాత్మలో నలిగిరేఁ బర్జన్యునారౌరవో, త్కరవంక ప్రవిలీన కీటకముగాఁ గల్పింతు రన్నట్టిచో, నరయన్ భక్తులశక్తి యెట్లు గుఱిసేయన్ వచ్చు సర్వేశ్వరా." స. శ. ౩౬.

గుఱు. దే. వి. = గుఱ్ఱు. (చూ. గుఱుపెట్టు.)

గుఱుకు. దే. వి. పశువ్యాధివిశేషము. "సీ...పశు వ్యాధిభేదాభిధ యొప్పుచుండును నంగిడి యనఁ, జరుక నా గుఱుకు నా..." ఆం. భా. ద్వి. ౧౨౫. (బ్రా. వా.) (గుఱుక. మాండ్రి.)

గుఱుకొను. దే. అ. క్రి. 1. యత్నించు, పూను. "క. గుఱుకొని కార్యాకార్యము, లెఱుఁగక దుశ్చరితుఁ డయి యహితుఁ డగునేనిన్, మఱవక గురునైనను జను, లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్." భార. ఆది. ౬, ఆ. ౧౦౩. భా. రా. బాల. ౪౦౯; 2. అధికమగు. "క...నలుగడలఁ బడ నవారితవృష్టుల్, గుఱుకొని కురియఁగఁ బంచెను, మఱియును నయ్యవలుమీఁద మఘవుం డలుకన్." భార. ఆది. ౮, ఆ. ౨౭౦. ద్వా. ౪, ఆ. ౯౭.

గుఱుగుఱ్ఱు. దే. వి. (ప్రాము) ఒఱలుటయం దగునను కరణము. "మ...గుఱుగుఱ్ఱం చెడసంది బిట్టొఱలునస్గ్రోరాహి నీయంఘ్రికిన్, గిఱుఁ జైవైవన విధంబు నామనములోఁ గీలించిన ట్టయ్యెడున్." శైవ. ౮, ఆ. ౧౨౫.

గుఱులించు. దే. స. క్రి. 1. ఆలోచించు. "సీ... తూమెఁ డిక్షురసమ్మున కెర్ని వలయుఁ, జేగాను గాడంగఁ జెఱకుదండము లని గుఱులింపఁగా నూఱుకోల లైనఁ, జాలుఁ బొమ్మనుబుద్ధి సంభవించెను..." హర. ౧, ఆ. ౨౦; 2. ఆనవాలు పట్టు. (వా.)

గుఱులిడు. దే. స. క్రి. (గుఱుతు+ఇడు.) అభిలషించు, కోరు. "ద్వి. ఫలములు గుఱులిడుభక్తుల కెట్టు, లలవడు లింగనిరంతరసుఖము." బస. ౫, ఆ. ౧౯౯. పం.

గుఱుతు. దే. వి. (క. గుఱుతు.) 1. ఆనవాలు. "ఆ... విశ్వనాథదేవుతరుణి, గుఱుతు చెప్పి తన్నుఁ గొలువఁగఁ బుత్తేర, వచ్చినాఁడ నేలకలదె తనకు." భీమ. ౩, ఆ. ౯. దశా. ౭, అ. ౨, ఆ. ౯౧; 2. యశము. "గీ. గుఱుతు గలరాజు మాగయ గురవరాజు." పాండు. ౧, ఆ. ౮౦; 3. విధము. "వ...కొందఱు దొమ్మరులగుఱుతున నహావో యని బడితీఁగెలవెంబడి నెగఁబ్రాఁకువారును..." ప్రబంధ. ౭౮౮; 4. పరిమితి. "సీ. దిక్కెవ్వరును లేనిదీనుల నురలఁగై కొన్న నీకరుణకు గుఱుతు కలదె." నృసిం. ౫, ఆ. ౧౪౨ జై. ౩, ఆ. ౩౪; 5. సాక్ష్యము. "క. ననుఁ జూడ రాఁ డదేమో, యని నిను దూఱికొనుచుందు ననయము నావై, నెనరు గలందుకు గుఱు తిదె, కనిపించెను..." సా. ౨, ఆ. ౬౧; 6. స్థానము. "చ... ని, న్నెఱుకపడన్ మృగేంద్రునకు నింపుగఁ జెప్పి తదీయభక్తికిన్, గుఱుతుగ నిన్నుఁ జేసి..." ..." నా. పంచ. ౧, ఆ. ౩౬౮. మార్క. ౪, ఆ. ౮౪; 7. లెక్క, లక్ష్యము. "ఉ. ఈవిటు రమ్ము పొమ్మనుటయే గుఱు తింతియకాక మాకు నీ, యీవు లదేమిగుర్తు విడెమే పదిలచ్చలు..." వైజ. ౨, ఆ. ౮౬; 8. మచ్చ, కళంకము. "గీ... గుఱి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె, లక్క లంబనఁగఁ గళంకు..." ఆం. భా. ప్ర. ౮౦. విశే. 1. ఘనము. "ద్వి. గుఱుతైన సెలయేటిఘుమఘుమ ధ్వనుల, నుఱుము లటంచుఁ బెల్లుబ్బి...నెమలి, పొరిఁబొరి నాడెడు..." రం. రా. అయో. ౧౩౫. పు. ౨౬. పం; 2. తెల్లమైనది, విస్పష్టము. "ద్వి. నెఱతనంబును గల్గునేర్పరి యనుచు,

గుఱుతుగ నలవరాంకుశముఖ్యములు, పలికిన దివ్యప్రబంధరత్నముల, వలన నిచ్చలు విని..." దిా. పరమ. ౩, ఆ. ౩౩౭. ౪; 3. సత్యమైనది. "చ. గుఱుతుగ స్త్రీలకు మగలకు మది నిల్కడ లెందు లేవు నీ, వెఱుఁగనిసిలియుం గలదె యేటికిఁ దత్తఱపాటు..." సా. ౨, ఆ. ౧౪. క్రి. విశే. చక్కఁగా. "క. గుఱుతుగ విని యభిమన్యుని, వరతనయుఁడు..." కుచేల. ౧, ఆ. ౧౨౨.

గుఱుతుపడు. ద్వ. వి. (గుఱుతు+పడు.) స్పష్టమగు, తెలియు. "ఆ. పర్వతవనవాసిపరిణామవర్తన, కూపవాసి కెట్లు గుఱుతుపడును, బ్రహ్మనిష్ఠవెంటఁ బ్రాకృతుఁ డరుగునా..." వేమన. ౧. భా. ౧౯౩.

గుఱుతుమాట. దే. వి. (గుఱుతు+మాట.) ప్రసిద్ధి కెక్కినమాట, లోకోక్తి. "గీ. ఎఱుక విడికెడుధన మన్న గుఱుతుమాట, శక్య మౌఁ గాదె..." కుచేల. ౧, ఆ. ౪౬.

గుఱుతువెట్టు. దే. స. క్రి. (గుఱు + పెట్టు.) లెక్కించు. "గీ. మనుజనాథ త్రివిక్రమమహిమ కొలఁది, యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపు, గుంభినీరేణుకణములు గుఱుతువెట్టు, వాఁడు నేరఁడు దక్కినవారివశమె." భాగ. ౮, స్కం. ౬౪౭.

గుఱుతెఱుఁగు. దే. స. క్రి. (గుఱుతు+ఎఱుఁగు.) ఆనవాలుపట్టు, తెలిసికొను. "క...తుమల మునను గుఱుతెఱుఁగక డాసిన నీపెనిమిటిఁ దునిమితి, వెనుక నెఱిఁగి పొక్కి పడితి వెలఁదిరో యచటన్." ఉ. రా. ౪, ఆ. ౧౦౪. కళా. ౩, ఆ. ౨౬౭.

గుఱుపెట్టు. దే. అ. క్రి. (గుఱు+పెట్టు.) 1. గుఱక పెట్టు. "సీ. ఔట్టుగఁ బలుమాఱు నిట్టూర్పు లిచ్చుచు భీకరంబున గుఱుపెట్టుకొనుచు...గీ... బ్రాహ్మణి సుప్తిఁ బొందె." హరిశ్చ. ౫, ఆ. ౫౫; 2. మొఱుఁగు. "సీ. క్రొత్త యౌ తనుఁ గని కుక్కలు గుఱుపెట్టి కఱచునో యని దవ్వుగా నరుగుచు." చెన్న. ౨, ఆ. ౨౯౨. వి. గుఱక, సుప్తరవము. "సీ. గుఱక యనంగను గుఱుపె ట్టనంగను శోభిలుచుండును సుప్తరవము." ఆం. ప్ర. ౧౪౨. ఇత్లే: గుఱువెట్టు. అచ్చ. యు. ౨౨౫.

గుఱుపొడుచు. దే. అ. క్రి. (గుఱు+పొడుచు.) గుఱకపెట్టు. "సీ. లంక సొచ్చితి మంచు హుంకారములు సెల్లఁ గలవరించుచు ఓట్టు తెలియువారు, పీచులతాకున నేమసర్ణనదవ మడఁగి పోవఁగ గుఱుపొడుచువారు." భా. రా. యు. ౨౭౬.

గుఱుము. దే. వి. గింజ, బీజము. "క. జీవుఁడు శుక్రచ్ఛాయా,భావితుఁ డైనప్రడు విష్ణు భావించుట కున్, దా వెరవరి యగుఁ దద్గత,భావ మ్మొసఁగు గుఱుము లేనిపం డగు నెలవున్." భార. శాం. ౫, ఆ. ౪౨౧. (గుఱుము. అకముద్రి.) భార. అను. ౫, ఆ. ౨౮. [నక్షత్రము. (శ. ర.)

గుఱ్ఱపుఁజుక్క. వై. వి. (గుఱ్ఱము+చుక్క.) అశ్వినీ

గుఱ్ఱపుఁదోఁకలు. ద్వ. వి. బ. (గుఱ్ఱము+తోఁకలు.) ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

గుఱ్ఱపుఁబీఁట. వై. వి. (గుఱ్ఱము+పీఁట.) ద్వారబంధముమీఁద నుండెడు గుఱ్ఱపుమూతికొయ్య. (శ. ర.)

గుఱ్ఱపుమోమువేల్పు. ద్వ. వి. (గుఱ్ఱము+మోము+వేల్పు.) కింపురుషుఁడు. (శ. ర.)

గుఱ్ఱపుఁబెరజే. ద్వ. వి. (గుఱ్ఱము+పెరజు.) సర్పవిశేషము. "సీ...చిల్వగుదియలు బ్రాఁచులు పెరజులు గుఱ్ఱపుఁబెరజు లచటఁ, గలవు..." ద్వా. ౮, ఆ. ౯౮.

గుఱ్ఱపుసౌరము. వై. వి. (గుఱ్ఱము+సౌరము.) సప్తస్వరములలో నొకటి, ధైవతము. (శ. ర.)

గుఱ్ఱము. వై. వి. (సం. ఖురః.) అశ్వము. "సీ. కళ్యాలఁ బదిలంబె గానిగుఱ్ఱంబులఁ గ్రొత్తమట్టున కియ్యకొలుపు వెరవు." భార. విరా. ౧, ఆ. ౯౫. పాండు. ౨, ఆ. ౩౮.

గుఱ్ఱమెక్కుడు. ద్వ. వి. (గుఱ్ఱము+ఎక్కుడు.) బాలక్రీడావిశేషము. "సీ. గచ్చకాయలు కిఱ్ఱుగానుగ త్రిప్పట్లు గుఱ్ఱమెక్కుడు మంటిగూండ్లు..." హంస. ౩, ఆ. ౧౪౬.

గుఱ్ఱు. దే. వి. 1. కోపించుటయం దగునను కరణము. "చ...ఎట్టివారినిఁ బొడగన్నను గుఱ్ఱని..." వాసిష్ఠ. ౧, ఆ. ౭; 2. గుఱక, నిద్రాధ్వని. (వా.); 3. కోపము. (బ్రా.)

గుఱ్ఱుగుఱ్ఱు. దే. వి. 1. దగ్గుటయం దగుధ్వని కనుకరణము. "సీ. గుఱ్ఱుగుఱ్ఱని కొఱ్ఱుకొఱ్ఱన దగ్గుచోఁ

దవిలినచెవ్వులు చిందర్లుపోవ." విప్ర. ౪, ఆ. ౧౫; 2. మూలుఁగుటయం దగుధ్వని కనుకరణము. "వ...గుజ్జుగుజ్జున మూల్గుచు..." ప్రబంధ. ౭౦౮; 3. నిద్రాధ్వనికనుకరణము. (వా.)

గుజ్జెత్తు. దే. అ. క్రి. (గుజ్జు+ఎత్తు.) గుజ్జుకలుగు. "గీ. పాదమి గుజ్జెత్తి తాల్పొవ్వపుటము లెండి." కవిక. ౫, ఆ. ౧౧౧. (బ్రౌ. పా. 'పాదమ గుజ్జెత్తి'ము ద్రి.)

గుఞ. ఉభ. దే. వి. మురద. (బ్రౌ. వా.) సం. వి. ఆ. స్త్రీ. స్నుహీ.

గులక. వై. వి. (సం. గుడికా.) ఒకరకమైనరాయి; గులకరాయి. (శ. ర. బ్రౌ.) [ములుగోను.)

గులకరములు. దే. వి. బ. మొలకలు. (చూ. గులకర

గులకరములుఁగొను. దే. వి. (గులకరములు+కొను.) మొలకలెత్తు, అంకురించు. "వ...నునుఁజెమటం దడంబడి పులకరములు గులకరములుగొన..." భాగ. ౧, స్కం. ౩౯౬.

గులకరించు. దే. అ. క్రి. 1. అంకురించు, కలుగు, "గీ. మొలకనగవులు మొగమున గులకరింప." చంద్రా. 3. ఆ. ౯౨; 2. వ్యాపించు. "గీ... అలరుకమ్మనివాసనల్ గులకరింపఁ,గెలనఁ దియ్యని తేనెలు చిలుకుచుండఁ, గలికి లతకూన యూకొమ్మ బలికె నపుడు." సా. ౨, ఆ. ౫౬; 3. వెలువడు. "సీ. మునుఁగువెట్టిన నేమి ముత్యాలకమ్మల క్రొమ్మించులీలలు గులకరించె." క్రీడా. ౯౫. స. క్రి. కల్గించు. "వ...చక్కెరమోవి చురుక్కున నొక్కినన్...కమనీయసీత్కార కంఠనాదభేదం బులం గులకరించుచున్..." వసు. ౪, ఆ. ౭౩.

గులకరింత. దే. వి. (గులకరించుధా.) క్షుద్రజల జంతువిశేషము. "సీ. గులకరింతయుఁ నీరుగుట్టు శంఖనఖంబు...గీ...ఆది దొరగాలిజంతువు లన్ని విడిచి." హంస. ౪, ఆ. ౧౪౬.

గులగుల. దే. వి. 1. (ఎలుఁగులు) పుట్టలు కోరాడుట యందగుననుకరణము. "వ...చీమకున్ జెదలునకు నెలుంగులు గులగులం బుట్టలు నిశితనిజనఖరకులిశ కోటుల న్గోరాడ..." స్వా. ౪, ఆ. ౩౭; 2. పక్షులకూఁత కనుకరణము. "వ...బిడ్డలారా యేలాగున నలితఋల్లపాసాకులంబులై కులాయ కూలంబులం గులగులం గూసెద రని విలాపంబు సేయుచు..." నైష. ౧, ఆ. ౧౦౮. శివరా. ౪, ఆ. ౨౧; 3. మురద. (శ. ర. బ్రౌ.); 4. చూర్ణము. "చ. కెలఁకిని జూపు మంచుఁ దొలి వేలుపురాయనియెమ్ము లొక్కటన్, గులగులగా నడంతునొ..." ఆచ్చ. సుం. ౨౨. బ. ఖండ ఖండములు, తునాతునకలు. "స్రగ్ధర. గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగుల లయి పో గోతము ల్లుద్దలీలన్." స్వా. ౪, ఆ ౧. భా. రా. యు. ౧౫౧౬. విశే. బ. "క. అని శ్రీమతి యానతి యిచ్చిన మందల విడిచె నతని సిద్ధ విభుఁడు వాఁడును గులగులలై లావగ,లిన మై విదిలించుకొనుచు లేచెఁ గిదుకుచున్." పాండు. ౪, ఆ. ౫౭. భాను. ౨, ఆ. (శ. ర.)

గులప. దే. వి. అశ్వపాలకుఁడు. "సీ. గుర్రా మన గుఱాలగో చనఁగా గులప యనంగఁ దగు నశ్వ పాలకుండు." ఆం. భా. ద్వి. ౨౦౪.

గులము. సం. = గుడము.

గులాబి. దే. వి. (హిం గులాబ్.) 1. పువ్వువిశేషము. (శ. ర.); 2. ఆపుష్పములుపూచు వృక్షవిశేషము. (వా.)

గులాము. దే. వి. (హిం. ఘులామ్. క. గులామ. త. గులామె.) దాసుఁడు; దాసురాలు. "క. ఇత్తడి పుత్తడి యగునే, తొత్తుది నగ లెన్ని యిడిన దొరసా నగునే, యుత్తమకులుఁ డౌనాడో, లత్తుక నరిచేసినను గులాము గులామే. (అడిదము సూరకవిచాటువు); 2. బిచ్చము. "చ. లలనరో యొందు నీవిఁక గులామునకున్ జన వద్దు..." వైజ. ౨, ఆ. ౧౭౦. వైజ. ౨, ఆ. ౧౨౨. విశే. హీనుఁడు, నీచుఁడు. "శా. వేదం దిట్టఁగ రాదు గాని భువిలో విద్వాంసులం జేయనే,లా ధీచాతురిఁ జేసెఁ జేసినగులా మాపాటనే పోక క్షుద్బాధముల్ కలిగింప నేల యది కృత్యంబైన దుర్మార్గులం,జే ధాత్రీశులఁ జేయ నేటి కకటా శ్రీకాళహస్తీశ్వరా." కాళ. శ. ౧౩. వేం. పంచ. ౧, ఆ. ౭౬౩.

గులి. సం. వి. ఈ. స్త్రీ. 1. మాత్ర; 2. గోళీ, బాలురాడుకొనుచిన్నరాయి మున్నగువానియందు; 3. రోగభేదము.

గులిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మాత్ర; 2. ఉండ; 3. గోళీ; 4. ఆటబంతి; 5. ముత్యము.

గులిబి = గులిమి. ఆం. భా. ద్వి. ౧౩౪.

గులిమి. దే. వి. కర్ణమలము. "సీ ..కర్ణమలనామ మొప్పును గులిబి నా గుబిలి నా గులిమి యనఁగ." ఆం. భా. ద్వి. ౧౩౪.

గులిమికదురు. దే. వి. (గులిమి+కదురు.) గులిమి తీసికొనెడుకదురు, గులిమితెడ్డు. (శ. ర. బ్రౌ.)

గులిమితెడ్డు = గులిమికదురు. (శ. ర. బ్రౌ.)

గుల్ఫము. సం. వి. అ. పుం. చీలమండ.

గుల్మము. సం. వి. అ. పుం. 1. బోదె లేనితీఁగ మొ.; 2. పొద; 3. ప్లీహము, హృదయవామభాగమున నుండుపచ్చనిమాంసఖండము; 4. తొమ్మిదిరథములు తొమ్మిదియేనుఁగులు నిరువదియేడుగుఱ్ఱములు నలువదేవురు కాల్బంటును గలసేన; 5. వ్యాధివిశేషము, కడుపులోవైక్యముచే పుట్టినమాంసగ్రంథి; 6. సైన్యరక్షణము; 7. గ్రామరక్షకభటస్థానము. (ఆ. ని.)

గుల్మమూలము. సం. వి. అ. న. అల్లము.

గుల్మి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉసిరికచెట్టు; 2. లవలి; 3. ఏలకి; 4. దేరా. విశే. (న్. నీ. న్.) గుల్మరోగము గలవాఁడు.

గుల్మిని. సం. వి. ఈ. స్త్రీ. 1. పొద, ఉలపము; 2. ఒకానొకయల్లుడుతీఁగ.

గుల్యము. సం. విశే. (అ. ఆ. అ.) మధురము, తియ్యనైనది.

గుల్ల. వై. వి. (సం. క్షుల్లకః.) 1. జలజంతువిశేషము, క్షుద్రశంఖము. "సీ. ఉలుచలఁ జిఱుతగుల్లల నమలుచు...గీ...తనరుబకపంక్తులకు..." ఆము. ౨, ఆ. ౫౩; 2. చింతపండు మున్నగువానిపై నాచ్ఛాదకముగా నుండుగుల్ల. (వా.) "గీ...అన్నిశాచరుని నొడిసి, కాలు పట్టి మీఁదికి నెత్తి నేలతోడ,నొడలు గుల్లలతిత్తి గానుదికి చంపె." భా. రా. యు. ౭౮౦. ప్రబోధ. ౫, ఆ. ౯౯; 3. బొబ్బ, పొక్కు. (శ. ర.); 4. కప్పచిప్ప, శంబూక. (శ. ర.) విశే. 1. అల్పము. "క. ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లా సౌఖ్యంబు వలికిఁ గొండంతైనన్, ఇల్లాలు మెలఁగుచున్నను, గొల్లా సౌఖ్యంబు వలికి గోరంతైనన్." శేష. ౧, ఆ. ౧౩౯; 2. బోలు, గట్టిదిగానిది. ఉదా: గుల్లకజ్జ, గుల్లకంబె మొ.

గుల్లకాఁడు. ద్వ. వి. (గుల్ల+కాఁడు.) పనియందు లేనివాఁడు, ఆకించనుఁడు. "గుల్లకాఁడై మన యింటికిఁజుఁకు లదుగ వచ్చెని." క్షేత్రయ. ౯౩౯. ప్ర. ౧౧౯. పదము.

గుల్లకావి. ద్వ. వి. (గుల్ల+కావి.) గొంటెము నీలిరంగుగలమొఱుపు. "సీ. నిజకటీతటిఁ జెక్కుసేలంపుఁ బిడిబాకు కనకశాటిక గుల్లకావి గట్టి." బహు. ౪, ఆ. ౧౪౧. రా. వి. ౧, ఆ. ౧౫.

గుల్లకాసు. ద్వ. వి. (గుల్ల+కాసు.) విలువ తక్కువయగునాణెము. "సీ. అటమటించిన ఁ బట్టెఁ దంతపొదము గాక కాజేని యొకగుల్లకాసు గాక... గీ...ఈగిన్నె మమ్ము,నంటివారలు గొన నెంతవారలయ్యె." విప్ర. ౫, ఆ. ౧౯.

గుల్లగుట్టు. ద్వ. వి. క్రి. (గుల్ల+గుట్టు.) తఱుఁగు, నశించు. "గీ. అక్కటోడపుమీ వాసు ముక్కురైనఁ,జేసి తెప్పించు మని దానిదాని కొంత, మెల్లమెల్లనఁ జేతిసొమ్మెల్ల నిట్టు,గుల్లగుట్టంగఁ జని తల్లడిల్లఁ జేయు." నిరం. ౨, ఆ. ౧౧౫.

గుల్లపడు. వై. అ. క్రి. (గుల్ల+పడు.) అవమానపడు (చూ. గుల్లపఱుచు.)

గుల్లపఱుచు. ద్వ. స. క్రి. (గుల్లపడు ధా. ప్రే.) "ద్వి. నిను నేఁడు ముఖమున నెత్తురుప్రామి,కొని గుల్లపఱుపక కొలికికి రావు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭. పం.

గుల్లపుటికె. ద్వ. వి. (గుల్ల+పుటికె.) చిన్నగంప. (బ్రౌ.)

గుల్లసున్నము. ద్వ. వి. (గుల్ల+సున్నము.) సున్నపుగుల్లలవలనఁ దయారైనసున్నము. (బ్రౌ. వా.)

గుల్లాము. దే. వి. 1. అశ్వపాలకుఁడు. "సీ. గుల్లామన గులాలగో చనఁగా గులవ యనంగఁ దగునశ్వపాలకుండు." ఆం. భా. ద్వి. ౨౦౪; 2. (గులాము) దాసుఁడు. "ఆ. కూలి నాలి చేసి గుల్లాముపనిఁ జేసి, తెచ్చిపెట్ట నాలు మెచ్చ నేర్చు." వేమన. ౧. భా. ౭౩.

గువాకము. సం. వి. అ. పుం. పోఁక.

గువ్వ. దే. వి. 1. అడవిపావురము. (శ. ర.) హంస. ౩, ఆ. ౧౩; 2. పక్షి. "సీ. పిట్ట పక్కి పులుఁగు

జిట్ట గువ్వ యనంగఁ బక్షి సామాన్యమై పరఁగు చుండు." ఆం. భా. ద్వి. ౯౬. (కుకుటగువ్వ, పొడగువ్వ, పచ్చగువ్వ, చిటిగువ్వ, రాగువ్వ, ఎటబొంతగువ్వ—గువ్వలలోనిభేదములు. బ్రౌ.)

గువ్వకరి. దే. వి. (గువ్వ+కరి.) విజృంభణము. "మ...నిర్భరగతి వ్రాలునమ్మధుకరమ్ములు గువ్వ కరికా నటింపఁగన్." భోజసుతా. 3, ఆ. ౭౬.

గువ్వకరిగొను. దే. అ. క్రి. (గువ్వకరి+కొను.) అతిశయించు. "క. ఆచ్ఛోటితీర్థవాసులు, వచ్చి తగునె నీకుఁ బుణ్యవాహిని నిటు వ్రాఁచ్చితి పని వడి నందఱు, గచ్ఛకదలినట్లు కరిగొని తిట్టన్." జై. ౪, ఆ. ౭౨. వరాహ. ౧౦, ఆ. ౪౧.

గువ్వగుత్తుక. దే. వి. (గువ్వ+గుత్తుక.) ఆఁకలిచేతఁ గలుగుహీనస్వరము. "క...కూడు లేక యాఁకటఁ గుతిలపడువతండు గువ్వగుత్తుకతోడన్." పాండు. 3, ఆ. ౨౦.

గువ్వగుత్తుకపడు. ద్వ. వి. (గువ్వగుత్తుక+పడు.) నీరసిల్లు. "ద్వి. సెవ్వగఁ గుందుచు నీరసాన్నములఁ, గ్రొవ్వి బల్లురె గువ్వగుత్తుకపడక." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦. పం.

గువ్వకొను. దే. వి. (గువ్వ+కొను.) గుమిగూడుట. (చూ. గువ్వకోలుకొను.)

గువ్వకోలు. దే. వి. (గువ్వ+కోలు.) గుమిగూడుట. (చూ. గువ్వకోలుగొను.)

గువ్వకోలుగొను. దే. అ. క్రి. (గువ్వకోలు+కొను.) గుమిగూడు. "గీ. కడుపు చుమ్మలు చుట్టఁగాఁ గన్నకన్నె, చిలుక నెడఁబాసి యేరీతి నిలుచువాఁడ, సెక్కడి వివేక మన మంత్రు లెల్లఁ గదిసి, కువలయేంద్రునితో గువ్వకోలుగొనుచు. గీ. మానుమీ మోహ మని తెల్పి..." శుక. ౧, ఆ. ౪౬౨, ౪౬౩. [౧౦౯.

గువ్వకోల్కొను = గువ్వకోలుకొను. స్వా. 3, ఆ.

గువ్వకోల్గొను=గువ్వకోలుగొను. శుక. ౨. ఆ. ౧౦౯.

గువ్వగుత్తి. ద్వ. వి. కపోతాంఘ్రి. ఆం. భా. ద్వి. ౬౫. (బ్రౌ. వా.)

గువ్వగుత్తిక. దే. వి. కపోతాంఘ్రి. "సీ. గువ్వగుత్తిక యన గువ్వగుత్తి యనంగఁ జనుఁ గపోతాంఘ్రి..." ఆం. భా. ద్వి. ౬౫. (బ్రౌ. పా.) హంస. ౪, ఆ. ౧౦.

గువ్వగుత్తుక. దే. వి. (గువ్వ+గుత్తుక.) కపోతాంఘ్రి. (శ. ర.)

గుసగుస. దే. వి. 1. రహస్యపుమాటలచప్పుడు. (శ. ర.); 2. సల్లాపము. 'సీ...గుసగుస ముచ్చట యన, సల్లాపసంజ్ఞయై యుల్లసిల్లుచు నుండు..." ఆం. భా. ప్ర. ౧౧౭; 3. రహస్యపుమాట. "గీ. చేరి చెవిలోన గుసగుసల్ చెప్పినట్లు, మోహమున వానిచెక్కిట మోముఁ జేర్చు." శశాం. ౨, ఆ. ౭౭.

గుసగుసలుపోవు. దే. అ. క్రి. (గుసగుసలు+పోవు.) గుసగుసలాడు. "వ. నిన్న మనము విన్నది నిజంబై తోఁచుచున్నది చూడుఁడు చూడుం డని గుసగుసలుపోవువారును..." ఉ. రా. ౬, ఆ. 3౪3. శుక. ౧, ఆ. ౧౦౮.

గుసగుసలాడు. దే. అ. క్రి. (గుసగుసలు+ఆడు.) రహస్యముగా మాటలాడు. "వ...మాటిమాటికిఁ గొరవి విరిగుత్తిపై వ్రాలి యెగయుంభసలపంక్తిఁ గొమ్మపువ్వుమంజరులు గ్రాయుమసలం బని గుసగుసలాడుచు." రా. వి. 3, ఆ. ౧౧౪. ముకుంద. 3, ఆ. ౨౪3.

గుసగుసలువోవు. దే. అ. క్రి. (గుసగుసలు+పోవు.) గుసగుసలాడు. "క. మెత్తుమఁ గదె మన మెపుడుఁ దిలోత్తమచక్కఁదన మీత, లోదరియెదుటన్, మెత్తబడె దానిచెలు వని, యత్తఱి గుసగుసలు వోయి రచ్చర లెల్లన్." విక్ర. 3, ఆ. ౧౦౭. కువల. ౨, ఆ. ౭౯.

గుహ. సం. వి. ఆ. స్త్రీ. 1. కొండయందలిబిలము; 2. కల్లము; 3. హృదయము; 4. దాఁగుట; 5. బుద్ధి.

గుహము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.

గుహాశయము. సం. వి. అ. పుం. 1. పరమాత్మ; 2. సింహాదిజంతువు. విణ. (అ. ఆ. అ.) గుహయందు శయనించునది.

గుహినము. సం. వి. అ. న. అడవి.

గుహుఁడు. సం. వి. అ. పుం. 1. కుమారస్వామి; 2. ఒకనిషాదరాజు.

గుహేరుఁడు. సం. వి. అ. పుం. కమ్మరి. విణ. (అ. ఆ. అ.) రక్షించువాఁడు.

గుహ్యకుఁడు. సం. వి. అ. పుం. దేవయోనివిశేషము.

గుహ్యకేశ్వరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

గుహ్యదీపకము. సం. వి. అ. పుం. మిణుఁగుఱుఁబురుగు.

గుహ్యపుష్పము. సం. వి. అ. పుం. రావిచెట్టు.

గుహ్యము. సం. వి. అ. పుం. 1. వంచన; 2. తాఁబేలు. న. 1. ఏకాంతము; 2. మగగుఱి; 3 ఆఁడుగుఱి.

గుళిక. సం. = గులిక.

గుళిగ. వై. వి. (సం. గుళికా. = గులిక.

గుళుచ్ఛము. సం. వి. అ. పుం. పువ్వుమున్నగువాని గుత్తి, గుచ్ఛము.

గుఱ్ఱ. దే. వి. బ. కుందెనగుఱి యనుబాలక్రీడావిశేషము. "సీ. కుప్పిగంతులు పిడిగుద్దులాటలు పిల్ల దీవులు గొబ్బిళ్ళ గూవనాలు. గీ. గుఱ్ఱ దాఁగిలి మ్రుచ్చులు గోడిపట్టె,లు..." వి. పు. 2, ఆ. ౨౦౩.

## గూ.

గూండ్ర. దే. వి. 1. గ్రుడ్డగూబకూఁత. (శ. ర.); 2. కడుపులో కలుగువికారము. (వా.)

గూండ్రించు. దే. అ. క్రి. 1. (గ్రుడ్డగూబ.) కూయు. (శ. ర.); 2. కడుపులో వికారముకలుగు. వా:— కడుపులో గూండ్రించి గూండ్రించి వమనము వెళ్లినది.

గూఁటి. వై. వి. (సం. ఘృష్టిః.) పంది. (శ. ర.)

గూఁటిగువ్వ. దే. వి. (గూడు+గువ్వ.) ఈఁకలు రాల్చినపక్షి. "గీ...గూఁటిగు వ్వన నణఁ జన. గురు జనంగ, నీఁక రాల్చినపక్షి యనా వింద మాళి." ఆం. భా. ద్వి. ౯౮.

గూఁటిపడు. ద్వ. అ. క్రి. (గూడు+పడు.) దాఁగు, మఱుఁగగు. (చూ. గూఁటిపఱచు.)

గూఁటిపఱచు. ద్వ. స. క్రి. (గూఁటిపడు. ధా. ప్రే.) దాఁచు, మఱుఁగుపఱచు. "గీ. ఆకిటుకు గూఁటి పఱచి గయ్యాళితనసి,యెంత ప్రియములు సెప్పిన నియ్యకొనక, చంద్రభానునిపై రన్న నైఁప కట్టు, పక్షపాతంబు మీఱ నుపేక్ష సేసెఁ." చంద్ర. ౧, ఆ. ౧౩౮.

గూఁడు. దే. వి. డు. (క. గూడు. త. కూడు.) 1. కులాయము, పక్షికట్టినయిల్లు. "ఉ...గిజిగాడులు గూఁడులఁ జేర్చుదీపికల్,గా..." స్వా. ౧, ఆ. ౩౬. ఆం. భా. ద్వి. ౯౯; 2. గోడయందు దీపములుంచుటకేర్పఱచినగూఁటు. "గీ. తన గృహంబున గూఁటిలోఁ దలఁప్రమాలఁ, బిడు తలో..." శుక. 3, ఆ. ౧౩౧; 3. వేఁట, పంజరము. "క ...పులుఁగులజేరి మహేంద్రుం. డాఁడు గులవెనుగూఁటుఁ జిక్కఁగట్టుగఁ జేరెన్." శాకు. ౫, ఆ ౨౭. ఆం. భా. ద్వి. ౧౬౯; 4. ఆకు గుడిసె. (శ. ర.); 5. సుఖోదకము మొ. పెట్టు కొనుగొట్టము. (బ్రౌ); 6. వాఁపు మొ. వానితోఁ గట్టిన బండిపైకప్పు. ఉదా:—బండిగూఁడు. (వా.)

గూఁడుకాకవు. దే. వి. (గూఁడు+కాకవు.) పిడెవ్వనము—పక్షి. "సీ. తెగిగూఁడు కాకపు గేఁదివ జీవుచే బిఱ్ఱుఁగాఁ గొక లేఁదిమెప్పెఁ దంఁ..." ఉచ్చ. ఘం. ౫౭. ఇద్దెః గూఁడుకాక్కు: అన్న. యం. ౧౬౧. గూఁడుపుట్టువు. అచ్చు. ఆక. ౭౫.

గూఁడుబండి. దే. వి. (గూఁడు+బండి.) గూఁడుగట్టిన బండి. (శ. ర. 'గూఁటిబండి' వా.)

గూటము. వై. వి. (సం. కూటః. క. గూట.) 1. వడ్లవానియొకానొకకొఱముట్టు. (శ. ర. బ్రౌ.); 2. మేకు. (శ. ర. బ్రౌ.); 3 గుంజ. (శ. ర. బ్రౌ.); 4. మాదిగవాని సాధనవిశేషము. (శ. ర. బ్రౌ); 5. డేరాగుంజ. "చ...నాల్గువంకలు గుడారము లెత్తిరి జీరిపట్టుపగ్గములు బిగించి గూటములఁ గట్టి సరాతులఁ గూర్చి..." వాల్మీ. 3, ఆ. ౯౬.

గూటాము = గూటము. (శ. ర.)

గూడ. దే. వి. (క. గూడె.) 1. వానలో తడియకుండుటకై తలపై వేసికొనుజమిచాఁప. "మ. వన తుల్ వెల్వడి వానికై గుడిసె నోవక రాక తా వాని యేపసగా నిల్చిన జమ్ముగూడ..." ఆము. ౪, ఆ. ౧౩౩; 2. తిరుపగూడ. (శ. ర.); 3. బుట్ట: "వ...పూరీలు...ఆదిగాఁ గలభక్ష్యంబులు గూడల నించి..." హంస. ౧, ఆ. ౧౦౫; 4. పూలసజ్జ. "సీ...విరుల,తో మాలెలు...గూడ నునుచు." ఆము. ౫, ఆ. ౩౯; 5. మత్స్యగ్రహణసాధనము. (శ. ర.); 6. నీరుతోడుసాధన విశేషము. ఆం. భా. ప్ర. ౧౫౭; 7. దొప్ప. "చ...ఒకయోగికి భిక్షము తోలుగూడఁజేఁ, దివిచిన వేఁడిపాయసముఁ దెచ్చి రయంబునఁ బెట్టె..." భో. 3, ఆ. ౫౫.

గూడకట్టు. దే. వి. (గూడ+కట్టు.) గోఁచి లేకుండ కట్టినబట్టకట్టు. (శ. ర. బ్రౌ.)

గూడకొంగ. దే. వి. (గూడ+కొంగ.) [illegible]

[illegible]

గూడబాతు. దే. వి. (గూడ+బాతు.) గూడవలె పెద్ద తిత్తులుగల ఒకజాతిబాతు. "గీ. గూడబాతుల గొట్టిరతుఁ జూడఁగలవె." పార్వ. ౬, ఆ. ౭౫. ఆం. భా. ద్వి. ౯౦.

గూడవేయు. దే. అ. క్రి. (గూడ+వేయు.) చేనికి గూడలలో నీరుపెట్టు. (బ్రౌ.)

గూడారము = గుడారము. ఆం. భా. ద్వి. ౧౫౯. సాం. ని. మాన. ౪౬.

గూడారు = గుడారము. వేంక. మాన. ౭౪.

గూడెము. దే. వి. 1. బోయపల్లె. 'సీ... వెండిగుబ్బలి గూడె మేలువాఁడు...," అచ్చ. బాల. ౧౩. ఆం. భా. ద్వి. ౨౩; 2. చిన్నగ్రామము. ఉదా:— దుమ్ముగూడెము; 3. పేట. వ్యవ:— కాఁపు గూడెములో గలభా బయలు దేఱినది.

గూఢచారి. సం. విశే. (న్. ఱీ. న్.) వేగు తిరుగు వాఁడు.

గూఢచారుఁడు. సం. వి. అ. పుం. వేగులవాఁడు. ఇట్టిదే: గూఢపురుషుఁడు.

గూఢపాత్తు. సం. వి. త్. పుం. = గూఢపాదము.

గూఢపాదము. సం. వి. అ. పుం. కానరానికాళ్లు గలది-పాము.

గూఢఫలము. సం. వి. అ. పుం. రేఁగుచెట్టు.

గూఢమణి. సం. వి ఇ. స్త్రీ. బాలికాక్రీడావిశేషము.

గూఢము. సం. విశే. (అ. ఆ. అ.) రహస్యమైనది.

గూఢమైథునము. సం. వి. అ. పుం. రహస్యమైనరతి గలది-కాకి.

గూఢరత్నము. సం. వి. అ. న. బాలికాక్రీడావిశే షము. "శ్లో. రత్నాదిభిర్వాలుకాదౌ గుప్తైర్ద్విష్ట వ్యకర్తృభిః,బాలికాభిః కృతక్రీడా నామ్నా గూఢ మణిస్మృతా." "మ. పెలఁదుల్ దానును గూఢ రత్నసికతా క్రీడవ్రంబుఁ గావించుచున్." వసు. ౩, ఆ. ౭౯.

గూఢవర్చస్కము. సం. వి. అ. పుం. రహస్యమైన మలము గలది-కప్ప.

గూఢసాక్షి. సం. విశే. (న్. ఱీ. న్.) గుట్టుసాక్షి, [illegible]

[illegible] ...చాటుగా వ్యవహారము [illegible] [illegible] వలనఁ బుట్టినవాఁడు.

గూథము. సం. వి. అ. న. పురీషము.

గూదము. వై. వి. (సం. గుదమ్.) క్రిందికి దిగినగుదము. (బ్రౌ. వా.)

గూన. దే. వి. 1. లోఁతు గలకుండ. ఆం. భా. ద్వి. ౨౪౭; 2. పెద్దకుండ. "వ...ఓపుగని గూనల నూనియ నించి..." ఆము. ౫, ఆ. ౧౦౪.

గూనివాఁడు. దే. వి. (గూను+వాఁడు.) 1. కుబ్జుఁడు. ఆం. భా. ద్వి. ౧౨౧; 2. గూనుగలవాఁడు. "గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జు." భార. అను. ౫, ఆ. ౧౦౪.

గూను. దే. వి. ఔ. (క. గూను.) 1. వీఁపుమీఁద వంపుగా నున్నభాగము. "సీ. దురితాత్మురాలు మంథర సహింపఁగ లేక కునుకుపర్వన గూను గునియ నేఁగి." దశా. ౧, ఆ. ౩; 2. వీఁపు మీఁద గలుగువికృతపువంకర. "సీ...గూని వీఁపులు..." ఉ. హ. ౨, ఆ. ౧౨౨. ఆం. భా. ద్వి. ౧౨౪.

గూనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) విష్ఠించినవాఁడు, మలము విడిచినవాఁడు.

గూనుగిలు = గూనుగిల్లు. "గీ. కుచభరంబున నలికొను గూనుగిలఁగ." శివరా. ౨, ఆ. ౨౧.

గూనుగిల్లఁబడు. ద్వి. అ. క్రి. (గూనుగిల్లన్+పడు స్వార్థమున.) వంగు. గూనుగలదగు; "వ...కపట కిటిజరఠకమఠభుజగపరివృఢులు గూనుగిల్లఁబడ ..." కాశీ. ౬, ఆ. ౧౭౫.

గూనుగిల్లు. దే. అ. క్రి. గూను గల దగు; వంగు. (చూ. గూనుగిల్లఁబడు.)

గూనువోవు. దే. అ. క్రి. (గూను+పోవు.) గూను కలుగు. "సీ. అనిశంబు వీఁడు వాఁ డనక యెక్కుఁగ వేల్పుటేను గునకు గూనువోయె." వరాహ. ౧౦, ఆ. ౧౫.

గూబ. యు. దే. వి. కర్ణమూలము. "ఆ. అతనిచెవులు గూబ లంటఁ బెఱికె." రామా. ౧, ఆ. ౧౪౧.

ఆం. భా. ద్వి. ౧౪౪. వై. వి. (సం. ఘూకః.) గ్రుడ్డగూబ. "సీ. చీకటికప్పు సేసిన సరోరుహనేత్ర గూబయై వసియించుఁ గోటరమున." కాశీ. ౫, ఆ. ౧౦. విశే. గూబవంటిది—1. నింద్యము, నీచము. "సీ. ఇరుగింటివారలకుఁ బొరుగింటివారికి గూబ..." శుక. 3, ఆ ౨౦; 2. దుష్టము, చెడ్డది. "ద్వి. కటకటా వెఱచు నె కాలకౌశికుఁడు. కుటిలవిచార నీగూబజాకెరల." ద్వి. హరిశ్చ ఉ. ౭౯౪. పం.

గూబతడ. దే. వి. (గూబ+తడ.) మహాబలి. ఆం. భా. ద్వి. ౯౬.

గూబరి. దే. వి. (గూబ+అరి.) మాదిగవాఁడు. ఆం. భా. ద్వి. ౨౪౯.

గూబి. వై. వి. ఘూకము, గ్రుడ్డిగూబ. (జ్ఞా.)

గూబు. దే. వి. ఒకజాతిగడ్డము. "గీ. పోటకపిరేవు మెసఁగుచు గూబు నాఁగ." ఆం. భా. ద్వి. ౧౯౬.

గూవనాలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ... గొబ్బిళ్లు గూవనాలు." పి. ప్ర. ౭. ఆ. ౨౦౨.

గూహనము. సం. వి. అ. న. గోపనము, దాఁచుట.

గూళి. వై. వి. (సం. గృధ్రిమ.) బోసవగ్రద్ద. (జ్ఞా.)

## గృ

గృంజనము. సం. వి. అ. పుం. 1. వెల్లుల్లి, 2. గంజాయి. న. విషము పూసిన బాణముతోఁ జంపఁబడిన జంతువుయొక్క మాంసము.

గృధువు. సం. వి. ఉ. పుం మన్మథుఁడు. విశే. (ఉ కామించువాఁడు.

గృధ్నువు. సం. విశే. (ఉ) లోభి.

గృధ్యము. సం. వి. అ. న. కోరిక. విశే. (అ. ఆ. అ.) కోరఁదగినది. [కోరిక గ_ది

గృధ్రము. సం. వి. అ. పుం గ్రద్ద. విశే. (అ. ఆ. అ.)

గృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకసారి యీనినయావు; 2. ఒకబిడ్డను గన్నస్త్రీ.

గృహకచ్ఛపము. సం. వి. అ. పుం. సన్నెకల్లు.

గృహగోధ. సం. వి. ఆ. స్త్రీ. బల్లి. ఇట్టే: గృహగోధిక, గృహగోలిక, మొ.

గృహపతి. సం. వి. ఇ. పుం. 1. గృహస్థుఁడు; 2. మంత్రి; 3. యజమాని; 4. కృషీవలుఁడు; 5. సత్రయాగము చేయువారిలోఁ బ్రధానుఁడు. విశే. (ఇ. ఇ త్నీ. ఇ.) గృహమునకు యజమాని.



గృహమణి. సం. వి. ఇ. స్త్రీ. దీపము, దివ్వె.

గృహము. సం. వి. అ. న. 1. ఇల్లు; 2. భార్య; 3. గృహస్థాశ్రమము; 4. జ్యౌతిషశాస్త్ర: 5. శిలాజిత్తు. పుం. బ. 1. ఇల్లు; 2. భార్య.

గృహమృగము. సం. వి. అ. పుం. కుక్క.

గృహమేధి. సం. వి. న్. పుం. గృహస్థుఁడు.

గృహమేధిని. సం. వి. ఈ. స్త్రీ. గృహస్థునిభార్య.

గృహస్థు. సం. = గృహస్థుఁడు.

గృహస్థుఁడు. సం. వి. అ. పుం. సాంగవేదాధ్యయనానంతరము గురువాజ్ఞచే భార్యను విధ్యుక్తముగా గ్రహించి ధర్మార్థకామముల నడపుచు పంచయజ్ఞములను జేయుచు ప్రవర్తించువాఁడు.

గృహస్థూణము. సం. వి. అ. న. పిట్టాము, ఇంటి నడిమి కంబము.

గృహాగతుఁడు. సం. వి. అ. పుం. అతిథి.

గృహావగ్రహణి. సం. వి. ఈ. స్త్రీ. దేహళి, గడప.

గృహి. సం. వి. న్. పుం. గృహస్థుఁడు.

గృహిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇల్లాలు, భార్య; 2. కుటుంబిని; 3. గడప.

గృహీతము. సం. వి. అ. న. గ్రహించుట. విశే. (అ. ఆ. అ.) గ్రహింపఁబడినది.

గృహీతి. సం. వి. ఇ. స్త్రీ. గ్రహించుశక్తి గలబుద్ధి. "శ్లో. ఊహాపోహాత్మికాబుద్ధి గృహీతి ర్గ్రహణక్షమా. (అమరపదపారిజాతము. ప్ర. దే.) విశే. (న్. సీ. న్.) గ్రహించువాఁడు.

గృహ్ణత్. సం. శత్రు. గ్రహించుచున్న.

గృహ్ణానుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) గ్రహించుచున్నవాఁడు.

గృహ్యా. సం. వి. ఆ. స్త్రీ. శాఖానగరము, పేట.

గృహ్యకము. సం విశే. (అ. ఆ. అ.) 1. ఇంట నుండునది. (పెంపుడుమృగముపక్షిమొ.); 2. పరాధీనము, ఇతరులయాధీనమున నున్నది.

గృహ్యము. సం. వి. అ. పుం. 1. పెంపుడుమృగము పక్షిమొ; 2. ఇంటిలోనియగ్నిహోత్రము. న 1. స్మార్తకర్మబోధకగ్రంథవిశేషము; 2. గుదము. విశే. (అ. ఆ. అ.) 1. గ్రహింపఁబడినది; 2. గృహమున పెంపఁబడుచున్నది. (మృగపక్ష్యాది); 3 ఇంట నుండునది; 4. అధీనము, సిద్ధమైనది.

# గె

గెంటరి. దే. విశే. (గెంటు+అరి) పిరికిడు. "రగడ. సెఱబిసుదు శూరులును సెన కెసరయుం గెంట రులు..." పిన. శకుం. 3, ఆ. ౨౨౯.

గెంటసము. దే. వి. 1. శౌరపాటుమాట. "గీ. ఒప్పు గెంటస మన స్ఖలితోక్తిసంజ్ఞ." ఆం. భా. ప్ర. ౧౧౭; 2. కఠినవాక్యం. "గీ. అనుచు ననవింటి వెనుదంట సాదరాపి, గెంటసము లాడి..." వసు. ౪, ఆ. ౪౪. భో. ౬, ఆ. ౩౩౦. విశే. తీక్ష్ణము; క్రూరము. "సీ. పరగించు నప్పటప్పటి కిని గడ్డపై గెంటసం బైన క్రేఁగంటిచూపు." వైజ. ౧, ఆ. ౧౧౮.

గెంటించు. దే. స. క్రి. (గెంటు. ధా. ప్రే.) 1. కదుపు. "వ...అయ్యావ్వ కూఁతు నెత్తుకొని మరల నింటికి గెంటింపక వచ్చి..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౪౯; 2. పాపు. "క...ప్రభువై యుంటకు నార్తులయాపద, గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ." భాగ. ౮. స్కం. ౨౩౩; 3. ధ్వంసముచేయు. "శా...మత్పురిం, గెంటింపం జనుదేరఁ బోలుదురు..." భాగ. ౧౧. స్కం. ఉ. ౮౮౭; 4. పడఁగొట్టు. "క. కంటకులు నృపులు సూడఁగ, మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్, గెంటించి మనము వాలుం, గంటిం జేకొంటి మతనికరుణన కాదే." భాగ. ౧. స్కం. ౩౯౯; 5. ఓడించు. "క. వల రాజు నిన్ను రూపున, గెలిచినజీమూతవాహు గెంటింపఁగ లే, కలఘుమతి నబల నొంచెదు, పలువురు వినిరేని బంటుపంతము డిగదే." ద్వా. ౯, ఆ. ౧౩౩.

గెంటు. దే. అ. క్రి. 1. చలించు. "ఉ...గాంగ్ గేయవసుంధరాధరము గెంటిన గెంటఁడు..." హరిశ్చ. 3, ఆ. ౧౨; 2. పోవు. "ఉ...మాసి రుల్, గెంటక యుండఁ బ్రోవు..." య. ౨, ఆ. ౧౨; 3. కడచను. "గీ...నూత్నయౌవనము దనకు గెంటి పోకుండ..." వి. పు. ౬, ఆ. ౧౪౭; 4. సంకోచించు. "సీ. వనిత నీమొఖ కాంతి కెన యొందు లే దని గెంటక ద్విజరాజు నంటవచ్చు." సా. ౨, ఆ. ౨౦౪; 5. తొలఁగు; తగ్గు. "ఉ. గెంటని ప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూ లొసంగి వా, ల్గంటి గిఱుక్కునం దిరుగ..." విజ. ౨, ఆ. ౧౩౪.

గెంటు. దే. స. క్రి. 1. త్రోయు. "గీ. మేటిరేద్రిమ్మరుల గెంటుపోటుబంటు." ఉ. రా. ౧, ఆ. ౮౦; 2. తీర్చు. "ద్వి. గెంటక యీమపు గెంటి యీ తుంబుప, బంటు నేలక పాముము కోప, ము..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౭౭. పం; 3. ఏయు. "చ. అరదం బొండొక టెక్కి విల్లు గొని పంచాస్త్రంబులం గెంటి భా, స్కరపౌత్రుం దెగలించి..." జై. ౯, ఆ. ౧౦. వి. 1. త్రోపు. వ్యవ:—వాని నొక్క గెంటు గెంటుము; 2. చలనము. "ఆ. పడఁతి కలదె జాతిపతిమకుఁ జక్కిలి, గింత నాదుధృతికి గెంటు లేదు." కళా. 3, ఆ. ౪౯.

గెంటుపడు. ద్వి. అ. క్రి. (గెంటు+పడు) తప్పి పోవు, వైతొలఁగు. "గీ. జంట వదలక తిరుగు మీవంటిచెలుల, వెంటఁ దిరిగెడుభాగ్యంబు గుంటు పడియె, గెంటుపడఁ జూడుఁ డింకఁ దొల్లింటి నెయ్య, మింటి కేఁగుఁడు మీరు వాల్గంటులార." చంద్రా. ౪, ఆ. ౧౬౯.

గెంటువడు=గెంటుపడు. "క...పవనజుఁడు గదా హతి నొకఁడున్, గెంటువడకుండఁ బీనుఁగుఁ, బెంటలు గావించె దివిజబృందము పొగడన్." జై. 3, ఆ. ౧౦౯.

గెంటెము. దే. వి. జంటనేఁతవస్త్రము. "సీ...హొం బట్టుజిలుఁగు గెంటెంబుతోడ." స్వా. ౬, ఆ. ౧౦౨. విశే. దట్టము, అధికము. "శా...మదిన్, గెంటెంపుంజల ముప్పతిల్ల..." స్వా. ౯, ఆ. ౧౪.

గెండియ=గెండె. (బ్రా.)

గెండె. వై. వి. (సం. గండకః.) ఒకజాతిచేఁప. ఆం. భా. ప్ర. ౧౯౯. ద్వా. ౧, ఆ. ౨౪౦.

గెగ్గిలి. దే.వి. (గేలి+గేలి) మిక్కిలిగేలి, పరిహాసము. (బ్రా. 'గెగ్గలు' అని శ. ర.)

గెచ్చె. దే. వి. ఒకజాతిచేఁప. "గీ. ఫుల్లరుజు గెచ్చె గెండెయుం బొమ్మిడాయ." హంస. ౪, ఆ. ౧౮౭. (బ్రా. పా. 'గెజ్జె' ముద్రి. పా.)

గెడ. దే.వి. 1. సమీపము, దగ్గఱ. "క. విను ప్రద్యుమ్నాదిభవ, త్తనయుంలగెడ నైన నేకతంబున

నేకా, సనమున నుండుట దూష్యం, బని యెఱుఁగుము..." భార. ఆర. ౫, ఆ. ౩౭౦. ఆము. ౫, ఆ. ౧౭౭; 2. లోపల, అంతరము. "చ. తమ తమ నెచ్చెలులు, దారును నెప్పటియట్ల యాటఁ జి, క్రమ దీసివోక వాంగెడఁ దామరసాక్షియుఁ రామదేవుఁడున్, సముచితలీలమై వివిధచారువిహారము లర్థి సల్పిరి..." నిర్వ. ౮, ఆ. ౬౩; 3. చెలిమి, స్నేహము. (చూ. గెడకత్తియ.) 4. జత. "సీ...వెలిమావుగెడల వాగెలు ధరించి, నొగలపై వారి యొప్పు..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౭౫; 5. పోలిక, పగిది. "క. దొరయుం గెడ జోడు పోలిక..." కావ్యా. ౫, ఆ. ౧౬; 6. ఒకానొకవేఁటసాధనము. "క. వడవోల్లుఁ మువ్వల్లును, నడిదంబులు వెడఁదవాతియలుఁగులపొదలున్, దడపెండ్లుఁ బందిగోల్లును, గెడలున్ ధరియించి ఛేటులు కెలఁకులఁ గొల్వన్." భీష్మా. ౩, ఆ. (శ. ర.)

గెడకత్తియ. స్త్రీ. వి. (గెడ+కత్తియ.) చెలికత్తె, స్నేహితురాలు. "చ. మెల పొవవించి తీవలకు మేనల...పెక్కురే, ఖలుఁ దమతోడ నాడుగెడ కత్తియ కాఁ గయిసేసి రామనిన్." కు. సం. ౯, ఆ. ౧౦౮.

గెడకత్తె=గెడకత్తియ.

గెడగూడు. దే. అ. క్రి. (గెడ+కూడు.) 1. జతపడు, కలియు. "క. గెడగూడ దీవి సీతని, యొడలిపయిం బెట్టి కాల్చు టుచితం బరయన్." భార. విరా. ౩, ఆ. ౧౭; 2. రతికూడు, మిథునకృత్యమునఁ గలియు. "గీ. ఉష్ణశీతాన్నకబళము లొకఁడు నూపఁ, బవలో రాత్రియొ గెడగూడ నవసర మని, దాని కుత్తర మొక లతాతన్వి యిచ్చె, నధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని." నైష. ౯, ఆ. ౧౮౭; 3. వెంటఁబడు, వెన్నంటు. "క. మిన్నుదలఁ బాఱె ఖగపతి, యన్నదియును బాఱఁ దొడఁగె నవనియద్రువ నే, మున్నో తా మున్నో యని, పన్నిదమునకు గెడగూడి పాఱిన భంగిన్." భో. ౭, ఆ. ౪౨.

గెడసేయు. ద్వి. అ. క్రి. (గెడ+చేయు.) కూర్చు, కలుపు. "క. కడువేడ్కతోడ నీకుం, గొడుకయ్యెడు నంతకంటెఁ గోర్కియుఁ గలదే, జడుఁ దకక నన్నుఁ బైకొని, గెడసేయుము నన్నుఁ గార్తికేయునితోడన్." ఉ. హరి. ౫, ఆ. ౧౩. (శ. క. పా.)

గెడుము. దే. స. క్రి. గెంటివేయు, పాఱఁద్రోలు. "మ...మృత్యువున్, గెడుమంగాఁ గలబాహావిక్రముఁడు సుగ్రీవుండు సామాన్యుఁడే." శతకంఠ. ౧, ఆ. ౧౦౩.

గెనయు. దే. అ. క్రి. వెంపొందు. "చ...ఆ పృథుఁడు దా, ఒననము నొందు బెట్టులు రసావతి ధేనువుఁ జేసి లోకముల్, గెనయఁగ నేల పాలు పిదికెన్ ఐవిపింపుము నాకు నేర్పడన్." వి. పు. ౭, ఆ. ౯౮.

గెనసు. దే. వి. (క. గెణసు.) ఆలువు, ఒకానొక దుంప. "గీ. తనుసుమధ్యము గెనసు...ఆసవ్యశాంగి, పసిమిఁ గందనిమంకాయ బండి కిడియె." బహు. ౪, ఆ. ౧౫. హంస. ౪, ఆ. ౧౩౧.

గెబ్బు. యు. దే. స. క్రి. 1. గెంటు. "సీ. వెలిమబ్బు బలునుబ్బు వడి గెబ్బరుచి నబ్బురం బొసంగెడువసనంబుతోడ." కాళిందీ. ౧. ఆ. ౧౦. విజ. ౧, ఆ. ౮౪; 2. చంపు. "సీ. అలమబ్బు వెలిఁ బ్రొబ్బు పొలగబ్బు గలయుబ్బుతలబెబ్బులుల గెబ్బుఁ దరల కొకఁడు." చంద్రా. ౭, ఆ, ౭౮. ఉ. రా. ౭, ఆ. ౩౯౧. వై. వి. (సం. గర్వః. పా. గబ్బో.) గర్వము, పొగరు. "సీ...కావరము గెబ్బు. గీ...నా గర్వ మొప్పుచుండు." ఆం. భా. ప్ర. ౧౩౩.

గెఱ. దే. వి. (క. గెఱ.) 1. రేఖ, గీత. "సీ. గెఱవ్రాసి మాయ నంగీకరింపనిభంగి వసనంబు గట్టక వచ్చువాని." భాగ. ౧. స్కం. ౫౧౬. (ప్రాఁత వ్రాఁత ప్రతులపా. 'అంగీకరించినభంగి' శ. ర. సూ. ని. ముద్రి. పా.) హంస. ౩, ఆ. ౭౧౯; 2. ఆకారము, రూపము. (చూ. గెఱకట్టు.) 3. గిరి, సున్న. "ద్వి. అనపోతు గెఱవ్రాసె నా గెఱ లోన, పసిఁడిటంకము పెట్టె బ్రహ్మణోత్తముఁడు.' పల్నా. ౩౧౮. పు. (బ్రౌ.)

గెఱకట్టు. దే. అ. క్రి. (గెఱ+కట్టు.) ఆకృతి గలుగు, రూపేర్పడు. "సీ. గెఱకట్టుకొని పుట్టు నెఱపూపచనులతోఁ గడు సన్నగిలుచున్న కౌనుతోడ." రాధికా. ౧, ఆ. ౫౩. "సీ. గెఱకట్టి కళకుత్తై

కెరలి పోఁకంతనై యంతనై చెంతల విరిసె చెంప." సరస. ౫, ఆ. ౧౧౩.

గిఱిగొను. దే అ. క్రి. (గిఱి+కొను.) రూపమందు. "సీ. క్రేఁగంటిచూపున గిఱిగొన్న పన్నగేవంగి జేకుల కన్నదమ్ము లగుచు." ఉ. హరి. ౧, ఆ ౧౫౧.

గెల. దే. వి. పండ్లయొక్కకాని కాయలయొక్కకాని గుత్తి. "ఉ... గెలల్ సుగంధి కదళీవనపంక్తుల నొప్పు నప్పురిన్." ఆము. ౧, ఆ. ౬౯.

గెలిపించు. దే. స. క్రి. (గెలుచు. ధా. ప్రే.) గెలువఁజేయు "క... గెలిపించెద నిను వెఱవకు..." శుక. 3, ఆ. ౮౨.

గెలివి. దే. వి. 1. ఆనందము, సంతోషము. "మ... ప్రియునిం గూర్పఁగ మనం బొంతయున్, గెలివిం దానికిఁ బెండ్లిపీఁడియము సాగింపన్ మదిం జూచెనో." చంద్రా. ౮, ఆ. ౧౫౮; 2. ఆనందమున చేయుం కేక; గోదవ. (చూ. గెలివివాఁడు.)

గెలివిడి. దే. వి. గెలివి. (శ. ర.)

గెలివివాఁడు. దే. విశ. (గెలివి+వాఁడు.) ఆనందాతిశయముచే—గోలచేయువాఁడు, రవణుఁడు. "సీ... గెలివివాఁ డనఁగను జెలఁగు రవణుఁడు ..." ఆం. భా. తృ. ౧౨.

గెలుచు. దే. అ. క్రి. 1. జయమందు, విజయము గను. "మ వినవచ్చెన్ వినువీథిదిక్కున సుధీ వేద్యంబులై యింద్ర వాహన పర్థిల్లు పురంజయా మనుకకుత్స్థా గెల్వు మన్వాక్యముల్." కను. ౮, ఆ. ౩౫; శుభాకాంక్షతో పోయి రమ్ము. "(సీత). గీ... జనకజానిరక్ష మింద మనుచు, నిచ్చి తెలతెలవాఱఁగ వచ్చె గెలువుమనిలజా యించు దీవించి యనుపుటయును." రామా. ౬, ఆ. ౧౯౭. స. క్రి. 1. జయించు. "గీ. వాద మొనరించి గెలిచి..." ఆము. ౨, ఆ. ౭౫. "గీ. పూఁపట్టంబు దొల్పుము పొడిచి గెలుము." భార. ఉద్యో. ౮, ఆ. ౧౮౬; 2. పోఁగొట్టు. "క. రోషము గెలిచిన జనుఁడు వి, శేషస్థితి దివిజపదము జేరున్..." జాహ్నవీ. 3, ఆ. ౭౭; 3. కడపు, పుచ్చు. "క. కంతుఁ డయి ధర్మజుఁడు వల్లాలుండై వాయుజుఁడు బృహన్నలయై నిశ్శంకుఁడు పార్థుఁడు వాయ గోకింకరులై కవలుఁ దొల్లి గెలువరె దినములు." భో. ౭, ఆ. ౨౦౭. (శ. ర. పా.)

గెలుపు. దే. వి. (గెలుచు. ధా.) విజయము. "క... గెలుపు పడిపుమీ." భార. ఉద్యో. 3, ఆ. ౩౮౦. "ఆ. పలువు రొకని గెలుపు గెలుపు గా దోడిన, వాఁడు గాఁ డితండు వారి కాడి." మార్క. ౯, ఆ. ౧౨౭.

గెలుపుఁగంబము. ద్వ. వి (గెలుపు+కంబము.) విజయసూచకముగా నాఁటిన స్తంభము "వ... సుంద్రాజు దుండగపు రాచకండంబులఁ జెండి మండాలగ్రావంబుల కెలంకుల గెలుపుఁగంబములు నిలిపె." వరాహ. ౧, ఆ. ౨౦.

గెలుపుకాఁడు. దే. విశ. (గెలుపు+కాఁడు.) జయించువాఁడు, జేత. "ఆ. అలరి వేల్పురాచ గెలుపుకాఁడు." అచ్చ. యు. ౧౫౨. (వేల్పురాచగెలుపుకాఁడు = ఇంద్రజిత్తు.)

గెలుపుకొను. దే. స. క్రి. (గెలుపు+కొను.) జయించు. "చ. కలువల గండుమీలఁ దొలుకారు మెఱుంగుల ..., గెలుపుకొనంగఁ జాలు మృగనేత్రయపాంగనిరీక్షణద్యుతుల్." విక్ర. ౬, ఆ. ౨౬.

గెలుపుపేరువజీరు = గెలుపుబాసయొడయఁడు. ప్రబంధ. ౧౬౦.

గెలుపుబాసయొడయఁడు. ద్వ. వి. (గెలుపు+బాస+ఒడయఁడు.) కవ్వడి, అర్జునుఁడు. వేంక. దేవ. ౨౧.

గెలుపులచ్చి. ద్వ. వి. (గెలుపు+లచ్చి.) విజయశ్రీ, జయలక్ష్మి. ప్రబంధ. ౧౮౨.

గెలుపుసిరి = గెలుపులచ్చి. య. ౧, ఆ. ౬౬.

గెలుపోటములు. దే. వి. బ. (గెలుపు+ఓటములు.) జయాపజయములు. పిన. శకుం. ౧, ఆ. ౧౬౮.

గెలువడి దే. వి. (గెలుచు+వడి.) జయము. ఆం. భా. ద్వి. ౨౨౩.

గెలువము. దే. వి. (గెలుచు ధా.) గెలుపు, జయము. "క... ఈ గెలువం బీబుద్ధి యెరికెం గలదు..." కళా. ౧, ఆ. ౧౯౭. "గీ... జయము, గెల్పు గెలువడి గెలువము గెలుపనఁ దగు." ఆం. భా. ద్వి. ౨౨౩.

గెల్చు = గెలుచు. (జయించు.) "మ... గెల్చిన జోదీశ్వరుఁడు..." శైవ. ౧, ఆ. ౨.

గేలిసేయు = గేలిచేయు. బస. ౨. ఆ. ౪౧౮. పం.

గేష్ణువు. సం. విణ. (ఉ) పాడువాఁడు.

గేస్తు. వై. వి. (సం. గృహస్థః.) 1. గృహపతి. "సీ. కలవు గేస్తులయిండ్ల కప్పనేఁతలయందు.." అచ్చ. బాల. ౪౭. ఆం. భా. ద్వి. ౧౭౬; 2. సోమయాజి. (చూ. గేస్తుఁడు.); 3. పతి, భర్త. (చూ. గేస్తుఁడు.)

గేస్తుఁడు = గేస్తు. 1. (పతి, భర్త.) "సీ. దురములో గిరిగేస్తు సెరసొచ్చి పగవారి గెలిచినకవ్వడియలవ దెంత." య. ౧, ఆ. ౧౭; 2. (సోమయాజి, యజ్వ.) "గీ. మన్ను గేస్తుఁడు నగ్గియు మిన్ను సీరు,ప్రొద్దుసెలగాడ్పు లెవ్వానిరూపు లయ్యె." సీలా. ౧, ఆ. ౧౨. అచ్చ. బాల. ౨౧౫.

గేస్తురాలు. ద్వ. వి. (గేస్తు+ఆలు.) 1. ఇల్లాలు, కలస్త్రీ. "సు...దర్పకజన్యంబున గేస్తురాలనయితిం బ్రావీణ్యవైహన్యంబునన్." కువల ౫, ఆ. ౩౦. సా. ౩. ఆ. ౫౬; 2. గృహిణి, భార్య. "గీ. గేస్తురా లొకపరి రతికేళిమీఁద, మనసు పాటినఁ గంటి మైలచీరఁ, బఱచి విడి మొల్లరేయంచుఁ బలుకరింపఁ, గుక్కుటూఁతుర వల దంచు వెక్కిరించు." శుక. ౨, ఆ. ౪౫౮. అచ్చ. అయో. ౧౨.

గేహము. సం. వి. అ. న. గృహము, ఇల్లు.

గేహి. సం. = గృహి.

గేహిని. సం. = గృహిణి.

## గై

గైత. దే. వి. కిరాతభేదము. "సీ...గైత సీ వాజాడ గనఁగఁ జూపు." ప్రబంధ. ౧౯౩.

గైరము. సం. విణ. (అ. ఈ. అ.) 1. కొండయందలిది; 2. కొండకు సంబంధించినది.

గైరికము. సం. వి. అ. పుం. న. జేగుఱు. న. బంగారము.

గైరికుఁడు. సం. వి. అ. పుం. గిరిచరుఁడు, కిరాతుఁడు.

గైరేయము. సం. వి. అ. న. శిలాజిత్తు; 2. జేగుఱుతాయి. విణ. (అ. ఆ. అ.) కొండలలో పుట్టినది.

## గొ

గొంగ. దే. వి. 1. శత్రువు. "చ. కువలయపర్వ మబ్జములగొంగ..." భా. రా. సుం. ౧౭౦; 2. మృత్యువు. "మ...వైరిమనుజేంద్రశ్రేణికిం గొంగ..." నిర్వ. ౧, ఆ. ౩౯.

గొంగడి. దే. వి. (క. గొంగడ.) 1. కంబళి. "క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచున్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౭. ఆం. భా. ద్వి. ౧౫౮; 2. ఒకజాతిపక్షి. "సీ. గొంగడి కక్కెర..." హంస. ౩, ఆ. ౧౨.

గొంగడికాఁడు. దే. వి. (గొంగడి+కాఁడు స్వార్థమున.) ఒకజాతిపక్షి. "వ...డాబ గొంగడికాఁడు మున్నగుపక్షులు..." చంద్రా. ౨, ఆ. ౧౪.

గొంగళి = గొంగడి. (కంబళి) "క. గొంగళిముసుంగుతో నయ,సంగతి నిలు వెడలి..." పరమ. ౪, ఆ. ౬.

గొంగళిపురుగు. ద్వ. వి. (గొంగళి+పురుగు.) కంబళిపురుగు. (శ. ర. బ్రౌ. వా.)

గొంజ. దే. వి. వంధ్య, గొడ్డుటావు. "గీ. గొడ్డన వంజ నా గొంజ నా వంధ్య యనా..." ఆం. భా. ద్వి. ౬౬౩.

గొంజి. దే. వి. వృక్షవిశేషము. "గీ. కొమ్మిపం డ్లీత పండ్లును గొంజిపండ్లు." కాళ. ౩, ఆ. ౬౯.

గొంటరి. వై. విణ. (గొంటు+అరి. స్వార్థమున.) కఠినుఁడు, క్రూరుఁడు. "సీ. గొంటరిధాత కీకుసుమ కోమలయంగ మలయంగఁ జేయ నేచల మటంచు." వా. న. ౪, ఆ. ౪౧; 2. నేర్పరి, చతురుఁడు. "ఉ. కోయిలపేరి గారడపుగొంటరి తా ఋతురాజుముందటన్, మాయ వహించి లేఁజిగురుమారునికత్తులు మ్రింగ వాఁడు ము,క్తాయత హారపంక్తులు ప్రియమ్ముగ సీయఁగ దెచ్చి నించె నా,నేయెడ మొగ్గచాలు జనియించెను భృంగకులంబు మెచ్చఁగన్." శశాం. ౨, ఆ. ౧౧౬.

గొంటు. ఉభ. దే. ప్ర. కలది, కలవాఁడు. ఉదా:—తెవులుగొంటుమొ. వై. విణ. (సం. కుంఠః.) 1. క్రూరుఁడు; క్రూరురాలు. "సీ. నీపట్టు వదల వన్నిట గొంటువు..." మృ. వి. ౧, ఆ. ౪౫. "ఉ...ఈతఁ డా,గొంటునిశాచరిన్ వసుధఁ గూల్చుట వింటిమికాద యేర్పడన్." హరి. ఉ. ౪, ఆ. ౨౩౩; 2. దుష్టుఁడు. "శా...కపటాంతే

గొంతుక. దే. వి. (గొంతు+ఉక స్వార్థమున.) (కంఠము.) "ఉ...దానవున్, గొంతుక త్రుంచి ..." జై. ౬, ఆ. ౧౭౫. "ఉ...గొంతుకల్. గోసితి..." వరాహ. ౭, ఆ. ౭౫.

గొంతుపోఁక. ద్వ. వి. (గొంతుక+పోఁక.) గొంతు ముడి. (శ. ర.)

గొంతుకూర్చుండు. దే. అ. క్రి. (గొంతు+ కూర్చుండు.) పాదములు నేల నాని మోఁకాళ్లు గొంతువఱకు వచ్చునట్లు కూర్చుండు. (వా.)

గొంతుకూర్చుండుకొను. దే. అ. క్రి. (గొంతు కూర్చుండు+కొను స్వార్థమున.) గొంతు కూర్చుండు. "సీ. కార్తిమీదను గొంతుకూర్చుండు కొనినట్లు నూతిపైఁ బసిబిడ్డ నునిచినట్లు." వేఱు. ౫౦.

గొంతుకొను = గొంతుకూర్చుండు. "ద్వి. ఒరుగాళ్ళ నడచుచు ధరగొంతుగొనుచు." పండితా. పర్వ. ౪౪౦. పు. ౦. పం.

గొంతుమాఱు. దే. వి. ఒకానొకమల్లబంధము. ఆం. భా. ద్వి. ౨౦౯. హంస. ౧, ఆ. ౨౦౬.

గొంతుముడి. దే. వి. (గొంతు+ముడి.) గొంతుముంపటి ప్రక్క బోఁకవలె నుండునెముక. (శ. ర.)

గొంతెమ. ద్వ. వి. (గొంతి+అమ.) ఒకానొకగ్రామ దేవత. (బ్రా. ఈదేవత యెప్పుడు నపొత్యపుః గోరికలే కోరుచుండును. అమెనుబట్టియే గొంతెమ కోరికయనుసామెత యేర్పడినది.) "గీ. చాల కుండిన నగుఁ జెట్టబాలుఁ డికఁడు, కొసరి గొంతెమ కోరికల్ గోర నేని,యడక బోఁబోల దడఁబోలదు ..." పాండు. ౪, ఆ. ౧౬౬.

గొంతెమగోరు. ద్వ. వి (గొంతెమ+కోరు.) సారణి, లంజెసవరము. "సీ...సారణి గొంతెమగోరు లంజెసవర మన నగు..." ఆం. భా. ద్వి. ౭౦.

గొంతెమ్మ = గొంతెమ. (బ్రా. వా.)

గొంది. దే. వి. (క. గొంది.) 1. నిర్వల్పకోణము, కొండమఱుఁగుచోటు. ఆం. భా. ద్వి. ౨౧; 2. మూల, మఱుఁగుచోటు. "క. పులి నమలెడు మాంసము వెర,వలవడఁ దా మపహరించి యా నక్కకు ని.మ్ముల నిల్వం గావించిన, నిలయఁబున గొందిఁజెట్టి నేర్పారఁగన్." భార. శాం. 3, ఆ. ౬౨ తని. 3, ఆ. ౦౫; 3. స్థానము, చోటు. "గీ. కత్తిశేల్పు మఱంది భోగములగొంది." కృ. శతం. ౧, ఆ. ౨౨; 4. లోకము, జగము. "చ...దుష్కృ తానికలిఁ జరించువారలును నేరరు పొందఁగ నిం దిరా మ నో, హరచరణారవిందభజనాత్మకు లుం డెడుఁగొంది సారయన్." భాగ. 3, స్కం. ౫౦౦.

గొందిపెట్టు. దే. స. క్రి. (గొంది+పెట్టు.) దాఁచు, మఱుఁగుపఱుచు. (బ్రా.) ఇట్లే: గొందులపెట్టు. (బ్రా.)

గొగ్గి. దే. వి. 1. ఎచ్చుతగ్గులుగా నుండుట. (వా.); 2. శిరస్త్రము, బొమిడికము. ఆం. భా. ద్వి. ౨౦౪; 3. సెరవైనముత్యము, ఎచ్చుతగ్గులు గల ముత్యము. ఆం. భా. ద్వి. ౨౭౬. విశే. ఎచ్చు తగ్గులు గలది. "గీ. డొప్పచెవులును గొగ్గిపండు లును గలిగి." సైమ. ౭, ఆ. ౯౩.

గొజ్జఁగ. వై. వి. (సం. కుబ్జకః. క. గొజ్జగె.) కుబ్జ కము. (పచ్చపువ్వులమొగిలి, అడుమొగిలి అని బ్రా. చిన్నఱేకులచేమంతి అని కొందఱు.) "సీ. గొరంటలును గొండగోఁగులు దేవకాంచన కుసుమములు గొజ్జఁగవిరులు." ఉ. రా. 3, ఆ. ౨౦౧. స్వా. 3, ఆ. ౦౪.

గొజ్జఁగనీరు. ద్వ. వి. బొ. (గొజ్జఁగ+నీరు.) పన్నీరు. "గీ. దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు, చంద్రకాంతపుగిండి గొజ్జంగనీటఁ, బసిఁడివళ్లె ములోఁ బదాబ్జములు గడిగి, తనదు మేనల్లునకుఁ గన్య ధారవోసె." విజ. 3, అ. ౧౧౧. పారి. ౨, ఆ. ౧౦.

గొజ్జఁగి = గొజ్జఁగ. "సీ. గొజ్జంగి యిజ్జాజిపజ్జు గిసల మొందు నెలకె కస్తురియుఁ గన్నెరయుఁ జూచె." బహు. ౨, ఆ. ౨౧. ఆం. భా. ద్వి. ౫౨.

గొజ్జఁగిమంచు = గొజ్జఁగనీరు. 'ఉ. గొజ్జఁగిమంచు లల్ గలపి కూర్చనపుప్పొడితిన్నెమీఁద...." వసు. 3. ఆ. ౧౬౮.

గొజ్జె. దే. వి. చిక్కనిపులుసు. (బ్రా.)

గొజ్జుఁబ్రాలు. దే. వి. బ. (గొజ్జు+ప్రాలు.) ధాన్య విశేషము. "సీ...ప్రయాగలు గొజ్జుఁబ్రాలు." హంస. ౪, ఆ. ౧౨౮.

గొజ్జెగ = గొజ్జఁగ. "ఉ...కప్పుగొజ్జెంగలు..." పరమ. 3, ఆ. ౧౮౯. "గీ. చిలుకుఁ దేనియతోడి

గొజ్జెంగపూవుఁ,దలగడ యమర్చి..." కళా. ౬, ఆ. ౨౫౧.

గొజ్జెఁగనీరు = గొజ్జఁగనీరు. "గీ. బహుళకస్తూరి కామేఘపటలమునకు, శీకరాసార మయ్యె గొజ్జెంగనీరు." భీమ. ౫, ఆ. ౧౨౧.

గొటగొట. దే. వి. గొంౙిడ్రించుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. "సీ. క్రొల్బులుల్ మత్తిల్లి గొటగొట మని రొప్పి బలుసింగములనైనఁ బట్టఁ జూచు." సా. ౧, ఆ. ౬౭. ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౪౭. పం.

గొట్టము. దే. వి. లోపల బోలుగా నుండు వెదురు మొ. వాని క్రోవి. (శ. ర. బ్రౌ. వా.)

గొట్టి. దే. వి. 1. ఒకవిధమగుగడ్డ, కశేరుకము. (శ. ర. బ్రౌ.)(తడిప్రదేశములలో బయలుదేఱు జావైన పెద్దవేరుగడ్డ గుడి; దీనిని పేదలు తిందురు. బ్రౌ.); 2. గచ్చతీఁగవంటిముండ్లజాతి వృక్షవిశేషము. (బ్రౌ.)

గొట్టికంటి = గొట్టి. (బ్రౌ.).

గొట్టు. దే. వి. 1. దౌష్ట్యము, పెడ్డతనము. (చూ. గొట్టుసేయు.); 2. అల్లరి, గొడవ. (చూ. గొట్టుసేయు.) వి. వాయువు, గాలి. ఆం. సం. దేవ. ౨౩. విణ. 1. కఠినము, కర్ణకఠోరము. "వ... ఈగొట్టుమాట దిట్టతనంబుతో నధిపతిం జేరి యింక నెట్టు విన్నపంబు సేయుదు..." ఉ. రా. ౬, ఆ. ౩౪౩; 2, బీభత్సుఁడు. "మత్తకోకిల...ఆ గొట్టుపిరుఁడు వార లేసిన క్రూర శస్త్రము లన్నియుం, జుట్టి పట్టుక మ్రింగి ఘోరత జోక నార్చె మహోగ్రుఁడై." భాగ. ౬, స్కం. ౩౨౧; 3. దుష్టము. (చూ. గొట్టుతనము.); 4. శత్రువు, విరోధి. "చ...జక్కవలగొట్టు చకోరులమేలియట్టు..." రా. వి. ౩, ఆ. ౭. ప్ర. 1. తాచ్ఛీల్యార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:—గొడవగొట్టు మొ; 2. స్వార్థమున వచ్చు ప్రత్యయము. ఉదా:—కసినిగొట్టు, వాకిరిగొట్టు మొ.

గొట్టుతనము. ద్వ. వి. (గొట్టు+తనము.) దౌష్ట్యము, పెడ్డతనము. "ఉ. గొట్టుతనానఁ దల్లి వెడలఁ గొట్టినదిట్టలు రట్టడించుతోఁ బుట్టువునాట నొండనక పోయితి..." ఉ. రా. ౨, ఆ. ౩౦౯.

గొట్టుసేయు. ద్వ. స. క్రి. (గొట్టు+చేయు.) 1. బాధించు. "గీ. ఇట్టు లారాధకట్టిని బట్టి చాల, గొట్టుసేయుచు నదురేయుఁ గొంచుఁ బోయి, నఱకుదు మటంచు..." సా. ౩, ఆ. ౩౯; 2. ప్రకటించు. వెల్లడిచేయు. "గీ. ఆలుమగఁడుకు నియ్యాకియుకుక నిలిచి, చలిది భుజియింప వాసామ్ము సంగ్రహించె; గొట్టుసేయక పిలిఁ జూవెట్టుకొమచు, నిచ్చటికిఁ దెచ్చితిమి పట్టుఁ డిప్పుడితని." శుక. ౩, ఆ. ౫౦౬; 3. నిందించు, తిట్టిపోయు. "సీ...గుడ్డిక న్నవరాదు గొట్టుసేయు. గీ. వెఱ్ఱి యనరాదు వైఁబడి వెక్కిరించు." శుక. ౩, ఆ. ౨౧.

గొట్టె. వై. వి. ఘోటజటిలి. (శ. ర.)

గొట్టె. వై. వి. (సం. ఘోంటా.) రేఁగుచెట్టు. (శ.ర.)

గొడఁగు. దే. అ. క్రి. స. క్రి. 1. మాట విని విననట్లుండ నోటిలో నేదో యనుకొను. (శ. ర. బ్రౌ. వా.); 2. (మంత్రములు మెల్లగా) ఉచ్చరించు. "ఆ...హనుమంతునకు...,కడఁకఁ బ్రాంతమిను కునుమువులు గొడఁగినఁ, గడిఁదిమిలి బమ్మకట్టు వీడె." అచ్చ. సుం. ౧౭౦. కకు. ౪, ఆ. ౧౩౦. 3. కసరు. కోపముతోఁ బలుకు. "సీ. గొడఁగుచుఁ దిట్టి..." చంద్రా. ౩, ఆ. ౯౭; 4. కూయు. "చ. గొడఁగెడుపావురాలరొదఁ గూడి..." చంద్రా. ౪, ఆ. ౪౯; 5. అను, పలుకు. "సీ. ఆగుదురా తోఁబుట్టు లళికుమారకులార కురులతో ముచ్చటల్ గొడఁగికొనుఁడు." కకు. ౧, ఆ. ౧౦౪.

గొడక. వై. వి. (సం. కూటకమ్.) ఏడికోల లేని నాఁగలి. (శ. ర.)

గొడగర. దే. వి. చెప్పులు కుట్టి జీవించెడుజాతి. (ఉదా:—గొడగరది, గొడగరవాఁడు.) శ. ర. (బ్రౌ.)

గొడగరి. దే. వి. (గొడగర+ఇ.) గొడగరవాఁడు, మాదిగవాఁడు. "ఆ. చాకి బోయవాఁడు జలగరి గొడగరి, కుక్క మాసగాఁడు కోడి పంది, బొడ్డు క్రిందియంగముల విప్రు సోఁకిన, నచటు గడుగ వలయు నంద్రు బుధులు." విష్ణు. ఆచా. ౫౧.

గొడవ. దే. వి. (క. గొడవ.) 1. ఆపద, కీడు. "క... ఇత్తటి నగునిమిత్తములు నృపకోటిగా విచా

మనకుఁ బెద్దగొడ వను ననిసన్." స్వా. ౪, ఆ. ౬౩; 2. దోషము, తప్పు. "చ. అడుగక కాని డాఁచినపదార్థము లిచ్చుట నీతి గాదు నీ వడిగితి కాన నివ్వడు సమర్పణ చేసితి నింక నాయెడన్, గొడవలు లేవు..." వి. పు. ౬, ఆ. ౩౩౯; 3. దుఃఖము, బాధ. "గీ. కడవ నాడకు చాలు నీగొడవ యేల." స్వా. ౫, ఆ. ౧౩. అచ్చ. యు. ౧౯; 4. యుద్ధము, పోరు. ఆం. భా. ద్వి. ౨౭౨; 5. కలహము, జగడము. "సీ. పూసిగొండి తనానఁ బోయి యెవ్వరికైన గొడవలు గావించు కొండెగాఁడు." వరాహ. ౯, ఆ. ౭౬; 6. జోలి, సంబంధము. "గీ. అమ్మగొడ వేల యాగవయమ్ము లకును." చంద్రా. ౭, ఆ. ౪౩. రం. రా. కిష్కిం. ౧౯౦. పు. ౭౯. పం; 7. ఒల్లరి. వ్యవ: ...పిల్లలు గొడవ చేయుచున్నారు; 8. కలఁత, క్షోభము. (శ. ర.); 9. అడ్డి, నిరోధము. (శ.ర.); 10. గంద్రగోళము. (వా.)

గొడవగొట్టు. దే. విణ. (గొడవ+గొట్టు.) గొడవ చేయు స్వభావము గలవాఁడు. "ద్వి. గొడవ గొట్టులు మడివిడుపులు...వారవనితలు..." పండితా. పురా. ౧౧౬. పు.

గొడవపోతు. దే. విణ. (గొడవ+పోతు.) గొడవ చేయుస్వభావము గలది. "ద్వి. గొడవపోతైన నింపడుచండ్లదైన." ద్వి. శిల్హా. ౭, ఆ. ౭౦. పు.

గొడారి = గొడగరి. "ద్వి. మాలకు మాసంబు మఱి గొడారికిని, దోలును సన్నట్టు..." బస. ౪, ఆ. ౧౦౦. పం.

గొడిగ. వై. వి. (సం. గుడికా.) గులకఱాయి. (శ.ర.)

గొడియ. దే. వి. 1. అందలముయొక్కయవయవ విశేషము. "సీ. జిగి గుల్కులేమావిచిగురుటాకు పదము తొగరుసెత్తామరతూఁడు గొడియలు ..." చంద్రా. ౩, ఆ. ౬౦. దశా. ౭, అ. ౧, ఆ. ౭౯; 2. నేరము చేసినవానిచేతులకు వేయు బంధనసాధనము. "సీ. వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత నియ్యంమందెనుగదా వెదురుగొడియ." పీఠి. ౪౦.

గొడిపె. దే. వి. కష్టము, ఇడుమ. "క. అడవులఁ బడునాఁడేఁడులు, గొడిపెల గొడిగట్టి సాఁకు కొంటివి మమ్మా,బడలిక నిపు డిజ్జగడపుఁ,బడమిం బవళించి నిదురవోయితో తండ్రీ." అచ్చ. యు. ౩౯౩; ౧౯౯.

గొడిసె. దే. వి. 1. చింతకాయ. "క. ఉడుపతి తనలో నమృతము, గడలుకొనియుం: బెక్కుచవులు గానక కృశుఁడై, విడిచినకళ లన్నియుం సీ,గొని నెలయాపమునఁ జింతఁ గొలుచుఁగఁ బోలున్." ద్వా. ౩, ఆ. ౧౫౯; 2. పండినచింతకాయలో నొకగింజ యుండుభాగము. (వా.)

గొడుగు. దే. వి. 1. ఆతపత్త్రము, ఛత్త్రము. "సీ. పూర్వదిక్పతియొద్దఁ బోలుపాపగొడుగుపై ఖచిత మా మాణిక్యకలశ మనఁగ." ద్వా. ౫, ఆ ౧౫. ఆం. భా. ద్వి. ౧౯౩; 2. పాపకొడ్డు మొ. వానికి గొడుగువలె నుండుగుబ్బ. "వ...గొడుగుపావల గిలకలు గులకరింప..." భీమ. ౨, ఆ. ౧౨౭. శుక. ౩, ఆ. ౩౨౫; 3. హస్తరేఖావిశేషము. "గీ. వసుధలో సెట్టిశ్రీ గలవారివేని, కరభములు దాస్యములు చేయు సరసిజాక్షి, యూపముల కెట్టటన్నఁ బైఁ దారు మోఁచు, గొడుగులును నల్ల కలశముల్ గుఱులు కావె." ఆము. ౫, ఆ. ౩౧; 4. గొడుగువంటికట్టడము. "ద్వి. క్రొత్తదంబులఁ గోటకొమ్మల గొడుగు, లెత్తించి..." బస. ౩, ఆ. ౫౧౪. పం.

గొడుగుగడ్డి. దే. వి. (గొడుగు+గడ్డి.) అతిచ్ఛత్రము, గ్రుడ్డికామంచి. (శ. ర. బ్రౌ.)

గొడుగుబల్ల. దే. వి. (గొడుగు+బల్ల.) తలుపుమీఁది కుఱుసము తిరిగెడుపట్టె (శ. ర.)

గొడుగుమెట్టెలు. దే. వి. (గొడుగు+మెట్టెలు.) వాటము పెట్టి ఓరలు సన్నగాఁ దీర్చినవెడలుపు మెట్టెలు. (శ. ర.)

గొడె = గొడియ. (అందలముయొక్క అవయవవిశేషము.) "సీ. ఉపెరికంకణము లింపొసఁగుదంతపు గొడెల్ నయము మించినముసనాఋపడము." రా. వి. ౨, ఆ. ౪౩.

గొడ్డ. దే. వి. బిఱుసు. (శ. ర.) బ. బిఱుసుమాటలు. "గీ. నాఁడు నేఁడును దమ కీడు లేఁ డటంచు, గొడ్డలాడుదు రొండొరు లొడ్డులేక." రా. వి. ౧, ఆ. ౫౪. విణ. బిఱుసైనవాఁడు. "ద్వి. ఘుటిక సిద్ధుఁడు ఱాయి గొట్టినగొడ్డ." ద్వి. హారిశ్చ. ఉ. ౬౪౭. పం.

గొడ్డువోయెఁ గడపట ననుచున్." జై. ౬, ఆ. ౧౧౫; 4. (భూతకోటి) సృష్టిలేకుండు. "గీ... సప్తార్ణవములు, నిండుకొని యుండఁగా రిత్తనింగి తోడఁ, గొంతకాలంబు శూన్యమై గొడ్డువోయె." శివరా. ౧, ఆ. ౫౧.

గొడ్డేఱు. దే. స. క్రి. (గొడ్డు+ఏఱు.) గుత్తయెత్తు, గుత్తకుఁ దీసికొను. (శ. ర. బ్రౌ.) "గీ. బొడ్డు పల్లెను గొడ్డేఱి మోసపోలి, సెట్టు చెల్లింతుఁ డంకంబు లేదునూర్లు." పీఠి. ౪౮. ఆ. క్రి. 1. సంతు విడుచు. "క. ఒడ్డారించి విషంబున, కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్, గొడ్డేఱి మ్రంది రాలన, బిడ్డన నెడ లేక జనులు పృథ్వీనాథా." భాగ. ౮, స్కం. ౨౧౭; 2. సంతు లేకపోవు. "గీ. చెలియలికి నాకు గొడ్డేఱి కలఁక పుట్టె." క్రీడా. ౨౪౮. వి. 1. చిన్నయేఱు, అల్పవాహిని. (బ్రౌ.); 2. నీరులేనియేఱు. (చూ. ఒడ్డుపఱుచు.) (ఈపదము విణ. వ్యర్థము. క్రి. విణ. వ్యర్థముగా; దిక్కులేకుండఁగా ననునర్థములతో సూ. ని. గ్రహించినది. కాని, యీపాఠములు నర్థములు భాషాభాగములును జింత్యములే.)

గొడ్రాలు = గొడ్డురాలు. "మహాస్రగ్ధర. కననీ గొడ్రాలు బిడ్డన్ గగన కుసుమమున్ గల్గనీ..." శాండు. 3, ఆ. ౧౨౮. నైష. ౭, ఆ. ౧౩౮.

గొణఁగు = గొడఁగు. 1. (ఇతరులకు వినపడి వినపడ నట్లు నోటిలో నేదో యనుకొను.) "ఉ...నాథులోఁలోన గొణంగి లిట్టుచు..." చెన్న. ౨, ఆ. ౪౬; 2. (దూఱు, నిందించు.) "సీ. పిలిచి పెట్టని పన్యభిత్త గైకొనువాఁడె కోరి పెట్టరటంచుఁ గొణఁగసాఁగె." కుచేల. ౨, ఆ. ౨౪; 3. (పాడు. గానము చేయు.) "గీ. నోర జగముల యొకిమీనిపేరు సారె,గొణఁగుచును వచ్చె జగదంపుఁగూటి తపసి." అచ్చ. యు. ౧౫౪.

గొణగ = గొడగ. (శ. ర.)

గొణగొణలాడు. దే. వి. గొణఁగుటయం దగుధ్వని కనుకరణము. (శ. ర.)

గొణగొణలాడు. దే. అ. క్రి. (గొణగొణలు+ఆడు.) గొణగొణ యను. (శ. ర.)

గొణిజె = గొణిద. (శ. ర.)

గొణిద. దే. వి. తలుపుగ్రంచె తగిలించుటకై దార బంధమున బిగఁగొట్టినచీల. (శ. ర.)

గొతుపు. దే. వి. నీలమణివిశేషము. "సీ. కప్పురాలనఁగను గనుపట్టు నీలముల్ గొతుపునాఁ దద్భేదమతిశయిల్లు." ఆం. భా. ద్వి. ౧౭౮.

గొత్తు. యు. దే. వి. వెన్న మొదలగునవి పాసిపోయిన కంపు. (శ. ర. బ్రౌ.) వై. వి. (సం. గుచ్ఛః.) 1. గుత్తి. "గీ. జలరుహాము పువ్వుగొత్తులు పట్టు దాళి." దశా. ౭, ఆ. ౨, ఆ. ౬౮; 2. క్రమము, వరుస. (బ్రౌ.)

గొద. వై. వి. (సం. క్షుధా. క. గొద.) 1. ఆఁకలి, క్షుత్తు. ఆం. భా. ద్వి. ౨౬౦; 2. అతిశయము, విజృంభణము. (చూ. గొదగొను.)

గొదగొద. దే. వి. పగ, విరోధము. "క. నా విని విహగము లను నయ, కోవిద యీరెంటికి కేల గొదగొద పొడమెన్, జూ వేల వచ్చె నోతువు,చే వానికి నింతపట్టు చెప్పుమా తెలియన్." వేం. పంచ. 3, ఆ. ౯౯.

గొదగొను. ద్వ. అ. క్రి. (గొద+కొను.) 1. ఆఁకలి గొను, క్షుద్బాధ నందు. "సీ. కోల్పులి పీఁకమై గొదగొని లేళ్లకు నుఱుకుతెఱంగునఁ దఱియఁ జొచ్చి." భార. ఉద్యో. ౨, ఆ. ౧౩౯. హరి. పూ. ౯, ఆ. ౧౩౯; 2. విజృంభించు, చెలరేగు. "క. ఒదవినకినుకం గొదగొని,గద గొని వాల ధరుఁడు రథముకండ్లును నొగలున్, జదిపి..." ఉ. హరి. ౪, ఆ. ౨౪౬; 3. అతిశయించు, అధికమగు. "ఉ...చనుదెమ్ము లె మ్మనన్, ప్రీగరిమంబు వాపుచు నొకించుక లేవఁగఁ బూను మాను నాఁలో గొదగొన్న సిగ్గునఁ జెలంల్ బలిమిం దగు దివ్వఁ గోరుచున్." కళా. ౭, ఆ. ౧౧౭; 4. త్వరచెందు, వేగపడు. "క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగనీక గాండీవి వెసం,బోదివియటు గడపె నవియును, గొదగొని తమపాలము నొచ్చె గోపాలురతోన్." భార. విరా. ౪, ఆ. ౨౭౧. ౨, ఆ. ౨౪౦. స. క్రి. ఆవహించు, తాల్చు. "గీ...గొదగొనె ననఁ దనరు నావ, హించె ననుమాటగా..." ఆం. భా. త్రి. ౧౧౯.

గొనకొను. దే. అ. క్రి. 1. ఉత్కటయించు. "ద్వి గొనకొన్న ప్రేమమైఁ గొలువు చాలించి." రం

రా. అర. ౧౭౦. పు. 3. పం; 2. స్థిరపడు. "చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు..." భాగ. 3, స్కం. ౬౭౭; 3. ఒప్పు. "చ. గొనకొని పేఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు..." భార. ఆది. ౪, ఆ. ౧౦౫; 4. బయలుదేఱు. "క. జననాథ వేఁట నెపమున, గొనకొని కణ్వాశ్రమమునకుఁ వచ్చి..." భార. ఆది. ౪, ఆ. ౭౪. 5. చొప్పడు. "చ. ...న ధర్మవృత్తికిం, గొనకొనఁడేని ..." భార. శాం. ౬, ఆ. ౨౪౩.

గొనకొలుపు. దే. స. క్రి. (గొనకొను. ధా. ప్రే.) చొప్పడఁజేయు, పురికొల్పు.

గొనకొల్పు = గొనకొలుపు. "క...విక్రమమునకుం గొనకొల్పి తిట్టు పేరల..." భార. అశ్వ. ౧, ఆ. ౧౬౧.

గొనను. దే. విణ. పొట్టివాఁడు. "సీ...గొనను గొనప...అనఁగను వామనాఖ్య కనరు. ఆం. భా. ద్వి. ౧౨౩.

గొనప. దే. వి. 1. జీర్ణలాంగలము, అఱిగిననాఁగేలు. (శ. ర.); 2. = గొనను. ఆం. భా. ద్వి. ౧౨౩.

గొనబారు. దే. అ. క్రి. (గొనబు+ఆరు.) ఇంపగు, సుందరమగు కు. సం. ౮, ఆ. ౧౩౬. "సీ. గొనబారునాఁగారు కొదమతుమ్మెదబారు..." నిలా. ౧, ఆ. ౯౬. రసిక. 3, ఆ. ౭౨.

గొనబు. దే. వి. 1. సొగసు, విలాసము. "స్త్రీ... గొనబు...వారాయ లనఁగ విలాస మొప్పుచుండు."ఆం. భా. ప్ర. ౧౩౯; 2. సౌందర్యము, సుందరత. (చూ. గొనబుకాఁడు.) విణ. 1. మనోజ్ఞము, సొగసైనది. "చ. గొన బగుముద్దు మోము..." శుక. 3, ఆ. ౧౦౯. ఆం. భా. తృ. ౧౪; 2 మధురము, తియ్యనిది. "ఉ. చాలుర చాలు సిగొనబుచక్కెరమోవి యొసంగి యేలరా." శశాం. 3, ఆ. ౭౦; 3. సురభి చక్కఁగాఁ బరిమళించునది. "క. అని చింతించుచు నుండఁగ, వనజాయత నేత్ర వచ్చి వానిసమీపం,బునఁ గూర్చుండెను పేసం,గొనబగుజవ్వాది తావి గుబులుకొనఁగన్." శశాం. 3, ఆ. ౯౩; 4. శ్రావ్యము. చెవికిండువైనది. "గీ. గొనబుఁ గోకిలరవములఁ గొంతసేపు." శకుం. ౪, ఆ. ౬౮; 5. మృదులము, లేఁతయైనది. "గీ. అకెవి నూదంటు కెలవరె హత్తి హత్తి, గొనబుఁ జివియఁబొందానఁ బెనఁగి పెనఁగి, కొమ్మదిని జంద్రకలపజేఁ గరఁగి కరఁగి, సమరతుల నేరె నాజాల నరసలీల." శశాం. 3, ఆ. ౯౫.

గొనబుకాఁడు. దే. విణ. (గొనబు+కాఁడు.) 1. అందగాఁడు, సుందరుఁడు. (శ. ర.); 2 విలాసవంతుఁడు, సొగసుకాఁడు. 'క. ఎవ లేని గొనబు కాఁడా..." అచ్చ. సు. ౧౯౧.

గొనమ = గొనప. (జీర్ణలాంగలము.) ఆం. భా. ద్వి. ౨౩౨.

గొనము. వై. వి.(సం. గుణః.) 1. లక్షణము, శౌర్యాది గుణము. "క...ఈ,గొనములు గలనృపులఁ జేసు కొని చెప్పం జూచిన జగమున ఋజ్జయిని, మను జేంద్రుఁడు గాక యితరమనుజుఁడు గలఁడే." ద్వా. ౨, ఆ. ౬౪; 2. సౌశీల్యాదిగుణము. "చ. గొనబులప్రోక నియమంగఁ గూఁతురు దీలితలంపు మాన్పఁగా, మనకు నశక్యము..." భార. అర. ౭, ఆ. ౧౮౪; 3. వింటినారి. "గీ. గొన మత్తై నారి నా గుణము వరఁగు." సాం. ని. మాన. ౪౪.

గొనయము. వై. వి. (సం. గుణః.) 1. మౌర్వి, వింటి నారి. "క. అని వెస నాదివ్యశరం,బు మానమంత్ర ప్రకాశ మానట్టులు గా, గొనయమునఁ జేర్చి ..." భార. ద్రో. 3, ఆ. ౨౦౪. ఆం. భా. ద్వి. ౨౧౧; 2. ధనురగ్రము, వింటికొప్పు. ఆం. భా. తృ. ౯౧.

గొనిసె = గొనను. ఆం. భా. ద్వి. ౧౨౩.

గొనుగు. దే. వి. గుడఫలము. (శ. ర.)

గొప్ప. దే. వి. 1. గొప్పతనము, కీర్తి. వ్యవ:—వాఁడు గొప్పకోసము తంటాలుపడుచున్నాఁడు; 2. ఘనత, భాగ్యము. వ్యవ:—ఎవరిగొప్ప వారిదే. విణ. 1. పెద్దది, స్థూలము. (చూ. గొప్పడుగు మెకము.); 2. విలువ గలది, మూల్యమైనది. "చ...గొప్పతమ్మికెం,పులు..." నీలా. ౧, ఆ. ౬౧; 3. బహుళము, అనేకము. "సీ...కప్పులు గొప్పలుగలవు ప్రమంగ." దశా. ౧, ఆ. ౧౩౭; 4. పెడఁద, విశాలము. "సీ. గొప్పకన్నులవాఁడు..." విజ. ౨, ఆ. ౧౭౪; 5. గౌరవము కలది, ఆము ష్యాయణము. వ్యవ:—వారిది గొప్పకుటుంబము.

(ఇట్టే ఆయాయర్థములు సందర్భపూర్వకముగా గ్రహించునది.)

గొప్పచేయు. ద్వ. వి. (గొప్ప+చేయు.) హెచ్చించు, పెంచు. "సీ. కస్తూరిపీఠెలఁ గానుకగాఁ దెచ్చు కోయకు జీతంబు గొప్పచేయు." పార్వ. ౧, ఆ. ౬౨.

గొప్పడుగుమెకము. ద్వ. వి. (గొప్ప+అడుగు+మెకము.) ఏనుఁగు. వేంక. లిర్వ్య. ౩౩.

గొప్పు. యు. దే. వి. 1. నిమ్నోన్నత మగుభూమి. వ్యవ:— ఆదారి యంతయు గొప్పులతో నున్నది; 2. మిట్ట, మట్టి ప్రోగై యేర్పడి గట్టిపడినదిబ్బ. వ్యవ:— ఆగొప్పు తగిలి నాకాలు బ్రద్దలైనది. పొలములో గొప్పుల త్రవ్వవలయును. వై. (సం. గోవాసరీ.) చూరుపట్టె. (శ. ర.)

గొబ. వై. వి. (సం. గుహా.) 1. గుహ. "గీ. పఱచు నురవడిఁ బొడమునిబ్బరపు మ్రోఁత, కొండగొబలెల్లఁ జొచ్చి యొండొండ పెరుఁగు." హరి. ఉ. ౯, ఆ. ౧౬౧; 2. గొంది. "క. మార్జాలంబులు సెలఁగుచు, గర్జించెను గొబల నడఁగి..." ఉ. హరి. ౯, ఆ. ౩౬.

గొబడి. దే. వి. పక్షివిశేషము. ఆం. భా. ద్వి. ౭౮.

గొబ్బండు. దే. వి. (గొప్ప+పండు.) పెద్దపండు. "సీ. పాకవేగారంభిపరిపాటిఁ దమయంతిఁ బగిలిన కనకగొబ్బండ్లఁ బేస. గీ. ము..." పాండు. ౧, ఆ. ౧౧౮. (శ. ర. పా. 'పాకవేళారంభ... క్రొంబండ్ల.' ముద్రి. పా.)

గొబ్బన. దే. అవ్య. ద్రు. గొబ్బున, శీఘ్రముగా. "చ... గొబ్బన వెడలించె వామకరపద్మమునన్..." భాగ. ౧౦, స్కం. ఉ. ౪౯౬. విక్ర. ౪, ఆ. ౧౩౪.

గొబ్బరము. దే. వి. ఎరువు, చేలకు వేయుపెంట. (శ. ర. బ్రౌ.)

గొబ్బి. దే. వి. 1. ధనుర్మాసదినములలో ప్రాతఃకాలములందు (సాయంకాలములందు అని శ. ర.) కడపలకు ముందు గోమయముతో తయారుచేసి బొమ్మలు పెట్టి పూవులు చల్లుచు పాటలు పాడుచు చేయు నొకవినోదము. "సీ... గొబ్బికిని... గీ..., కొలఁతవడకుండఁ గుండ లాకుమ్మ రిచ్చు." హంస. ౯, ఆ. ౧౪; 2. సమర్తాడినప్పుడు బాలికలు పాటలు పాడి చేతులు తట్టుచుఁ జుట్టి వచ్చి జరపించెడియొకవేడుక. (శ. ర.); 3. ఝురము, గొలిమిడిశీ. ఆం. భా. ద్వి. ౯౬. బ. నమస్కారము." సాం. ని. మాన. ౨౯.

గొబ్బికాయలు. దే. వి. బ. (గొబ్బి+కాయలు.) ధాన్యవిశేషము. "సీ. గొబ్బికాయలు బలుగుత్తులు పాలమీఁగడలు..." హంస. ౪, ఆ. ౧౨౮.

గొబ్బిళ్లు. దే. వి. బ. 1. బాలక్రీడావిశేషము. "సీ... గొబ్బిళ్లు గూవనాలు." వి. పు. ౭, ఆ. ౨౦౨. హంస. ౯, ఆ. ౧౯౯; 2. ఒకానొకపాట. "సీ. బెళుకునందములు గొబ్బిళ్ల పాటలు..." శుక. ౨, ఆ. ౪౩౩; 3. నమస్కారభేదము. వేంక. మాన. ౪౭. ఆం. భా. ద్వి. ౧౭౯. "రగడ... గోపప్రియుఁనకు గొబ్బి ళ్లనుచును." హంస. ౪, ఆ. ౨౧౩.

గొబ్బున. దే. అవ్య. ద్రు. 1. శీఘ్రముగా. "సీ. తతపయోవిభవ కీలతమాన కాసన్నపున్నాగవిహృతి గొబ్బునసె యబ్బు." వసు. ౨, ఆ. ౯౮. సాం. ని. మాన. ౨౧; 2. ఆకస్మికముగా. "సీ... గొబ్బునఁ బయ్యెదకొంగు సడల." విక్ర. ౧, ఆ. ౧౨౨. నైష. ౩, ఆ. ౧౧౬.

గొబ్బెమ్మ. ద్వ. వి. (గొబ్బి+అమ్మ.) గొబ్బియను వినోదము. (బ్రౌ.)

గొమలి. దే. వి. పుష్పవిశేషము. (మొగలిపూవు. మొగలి వర్ణవ్యత్యయముచే గొమలి కావచ్చును.) "గీ. జాణవిప్రుండు సిగఁ దాల్చెఁ జందమామ, గొండనాలుక యగునొక్క గొమలిరేకు." క్రీడా. ౧౭౬.

గొయి. దే. వి. గోయి, పల్లము. "చ... ముందట నుయ్యి వెనుక లోఁతగుగొయి యున్నలాగయిన..." విక్ర. ౩, ఆ. ౭౧.

గొర. వై. వి. (సం. ఘుర్ఘురః.) పందిచేయు ఘుర్ఘురధ్వని. (బ్రౌ.)

గొయ్యి = గొయి. (శ. ర. బ్రౌ. వా.)

గొరక. యు. దే. విశే. గఱకు, బిఱుసు. "ఆ. గొరక వెండ్రుకలును గుఱుచచేతులు నయ్యోఁదరుణులకుఁ బిశాచతనువు లౌదవె." పద్మ. ౩, ఆ. ౧౮౫. జాహ్నవీ. ౪, ఆ. ౨౦. వై. వి. 1. (సం ఖురాకః.) పశువు, జంతువు. (మృగవిశేష మని శ. ర.

కారెను మని (బ్రౌ.); 2. (సం. ఖురాలకః.) ఇనుపబాణము. (శ. ర.)

గొరకకత్తి. వై. వి. (గొరక+కత్తి) 1. అలుఁగు గల చేతికత్తి. (శ. ర.); 2. చేతియీఁటె. (బ్రౌ.)

గొరకచేఁప. దే. వి. (గొరక+చేఁప.) క్షుద్రమత్స్య విశేషము. (బ్రౌ.)

గొరగ. దే. వి. 1. మైలారుక్షుద్రదేవతను గొలుచు మతమువాఁడు. "సీ. గొరగయై మైలారుఁ గొని యాడు నొకవేళ నొసలిపై బండారుపసుపుఁ దాల్చి." కాశీ. ౭, ఆ. ౨౩౦; 2. మైలారును గొలుచుమతముస్త్రీ. "గీ. వీరమైలారుదేవర వీరభటులు, గొండ్లియాడుచు నున్నారు గొరగ పడుచు, నాడుచున్నది..." క్రీడా. ౧౪౩; 3. శైవుఁడు. "ద్వి. దొరగ లుమ్మెత్తపత్తిరిఁ బూజ సేయు, మరలెత్తి పచ్చితో యుండుతరాటబికి." బస. ౩, ఆ. ౭౪౯. పం; 4. బిచ్చగాఁడు. "క. పులిహూవు తిండిగొరగం,గలిచియు నోచెల్ల యింత గల్పించెను..." కు. సం. ౭, ఆ. ౪౩.

గొరగొర. యను. దే. వి. పక్షులుమొ. బారుదీరి వచ్చుటయం దగుధ్వని కనుకరణము. (వేగ మని శ. ర.) "క. ఇరువంకలఁ దన్నుఁ బొదివి, గొరువంకలుఁ దుమ్మెదలును గోయిలలుం దక్కరిచిలు కలుఁ బురిపులుఁగులు, గొరగొర రా మరుఁడు వెరలెఁ గొమ్మఁ గలంపన్." సిరా. ౩, ఆ. ౧౧; 2. (సం. ఘుర్ఘురకః.) పందిచేయు ఘుర్ఘురధ్వని. (బ్రౌ.)

గొరజె. దే. వి. కాలిత్రోవ. (బ్రౌ.)

గొరము. దే. వి. మిట్ట. "ద్వి...వాగుల మడులఁ బల్లముల,గొరమల గుడుఁగులఁ గొండలపరిని." నవనాథ. ౪౭. పు. (బ్రౌ.)

గొరవంక = గోరువంక. "క. చిలుకలు గొరవంకలుఁ గో,యిల లంచలు..." శివలీ. ౨, ఆ. ౭౬. ఆం. భా. ద్వి. ౧౯. య. ౨, ఆ. ౨౪.

గొరవంకరాజనాలు. వై. వి. బ. ధాన్యవిశేషము. "వ...గొరవంకరాజనాలు కాటుకరేకులు..." ప్రబంధ. ౧౧౨.

గొరవక = గొరవంక. "ద్వి...పిచ్చుకలఁ గ్రోతులను బిచ్చుకల గొరవకల." పండితా. పర్వ. ౩౪౨. పు. ౩. పం.

గొరిజె = గొరిసె. "క...మునిఁగెం,గపటకిటిస్వామి గొరిజఁ గాఁడిరభోఁటియున్." రామా. ౭, ఆ. ౧౩౧. సాం. ని. తిర్య. ౭౨.

గొరిసె. వై. వి. (సం. ఖురః. క. గొరిసె.) పశువుల కాలిగిట్ట, ఖురము. "చ. గొరిసెలయందమూఁ గొఱచకొమ్ములచందము వెన్నుమందమున్." దశా. ౨, ఆ. ౨౨౪. సాం. ని. తిర్య. ౭౨.

గొరిసెగాలి. వ్యా. వి. (గొరిసె+గాలి.) పశువులగొరిసెలనడుమ పుండ్లై పురుగులు పడెడువ్యాధి. (శ. ర.)

గొర్గు = గొఱుగు. "క. అల పక్షి రుక్మవసనుఁడు, తలయందు మూఁతిపెట్టు గొర్గి తను పిడుచుట యున్." భోజరుతా. ౪, ఆ. ౧౪౪.

గొఱక. దే. వి. కారుపోతు, అడవిదున్న. (బ్రౌ.)

గొఱకవేఁట. దే. అ. క్రి. (గొఱక+వేఁట.) కారుపోతువలె నఱచు. "గీ. ఒక్కఁ డనుగెత్తి గొఱక వేయుమనుచు డాఁచి, నట్టనిఁ బొంకిఁ గని పిఁకఁ బట్టుటయును, మృగయు లరుగఁ జని పెల్లరించి నిశిత, కాండములఁ జెండె నొకపెద్దకారుపోతు." స్వా. ౪, ఆ. ౪౧.

గొఱకు. వై. విశే. (సం. క్షుల్లకః.) నీచుఁడు, దుర్మార్గుఁడు. "ఆ. తాను చెడుట గాక తక్కినవారిని, జెఱుకఁ జూచె నార గొఱకుఁ బడుచు, వీని నెట్టు లైన విసువక శాలియింప,వలయు..." నృసిం. ౪, ఆ. ౧౭.

గొఱకుఁదనము. వై. వి. (గొఱకు+తనము.) దౌష్ట్యము, దుర్మార్గత్వము. "చ. ఎఱుకలఁ గూడి భూములకు నేఁగుచు చూర్ణము జొచ్చి ప్రేల్మిడిం,బఱిపఱి సేయుచుఁ సతుల బాలురఁ నేపునఁ బట్టి తెచ్చుచున్, జెఱ నిడి దండువుల్ గొనుచుఁ జెట్టలపుట్టి యాతండు సాఁగ నే,గొఱకుఁదనంబు మీఱి ధరఁ గ్రుమ్మరుచుండుదు నెల్లకాలమున్." దశ. ౩, ఆ. ౧౦.

గొఱపము. వై. వి. (సం. క్షురప్రః.) 1. గొఱపము, గఱ్ఱమును దోముసాధనవిశేషము. "వ...పిడుక గొఱపంబు తోమకంబునఁ బుటపుటనై కొదమ తట్టుపగుంపు..." ఆము. ౪, ఆ. ౩౫; 2. గొఱపముతోఁ దోముట. "గీ. గొఱపమా లేదు పెరార్చు గొడవ యొఱుఁగ,గడ్డి వేయఁడు..." శుక. ౩,

ఆ. ౪౦౮; 3. అర్ధచంద్రాకార మగుబాణము. "ద్వి. కరగసంబులఁ ద్రెంచి కత్తులఁగోసి, గొఱపంబులను దున్ని కొఱవులఁ జూఁడి." రం. రా. ఉ. ౫౨. పు. ౮. పం.

గొఱిగించు. వై. స. క్రి. (గొఱుగుధా. ప్రే.) గొఱుగఁజేయు. "చ...తల గొఱిగింపఁ బంచె..." కాళ. ౧. ఆ. ౪౮.

గొఱియ. వై. వి. (సం. కురరీ.) 1. మేషి. "క. ఊఱ పగునారుగపంటలు, గొఱియలపాడియును దఱచగున్..." భార. ఆర. ౪, ఆ. ౨౯౫. అచ్చ. యు. ౨౩౧; 2. నికృష్టుఁడు; నికృష్టజంతువు. "ద్వి. కొఱగానిజఱభుల కొయ్యనగాండ్ర, గొఱియలువార్తలు కూడునే త్రవ్వ." బస. ౫, ఆ. ౯౧. పం.

గొఱియగొంగ. ద్వ. వి. (గొఱియ+గొంగ.) తోడేలు. వేంక. తిర్యా. ౯౧. ఇట్లే: గొఱియలసూదుమొ. సాం. ని. తిర్యా. ౭౬.

గొఱియపోతు. ద్వ. వి. (గొఱియ+పోతు.) మగగొఱ్ఱె. ఏడిక. "గీ. గొఱియపోతుల నఱికి ప్రోగులుగ నిడ్డ, వెగ్గలపుఁబచ్చి నంజుళ్లు..." అచ్చ. యు. ౨౩౧. సాం. ని. తిర్యా. ౭౪.

గొఱుగు. వై. స. క్రి. (సం. క్షుర్.) క్షౌరముచేయు. "ఆ. వాఁడి యైనకృత్తివాఁతియమ్మునఁ గొని, పగతుశిరము చెక్కు లెగయ గొఱిగి,నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లుగాఁ,గలయ నైదుగూఁకటుల నొనర్చె." భార. ఆర. ౬, ఆ. ౨౫౦. భాగ. ౧౦, స్క. పూ. ౧౭౭౦. వి. వపనము, క్షౌరము. (చూ. గొఱుగులువడు.)

గొఱుగులువడు. వై. అ. క్రి. (గొఱుగులు+పడు.) గొఱుగఁబడిన పగు,క్షురిత మగు. "చ. గొఱుగులు వడ్డ వెండ్రుకలుఁ గ్రూరపుఁజూపులు..." పద్మ. ౨, ఆ. ౧౯౧.

గొఱుపడము. వై. వి. గోరుపడము, నల్లకంబళము. "ద్వి. నెఱి నెన్నిమాఱులు నీళ్ల లోపలను, గొఱుపడం బుదికిన మఱి తెల్ల నగునె." బస. ౭, ఆ. ౧౬౫. పం. చెన్న. 3, ఆ. ౩౧.

గొఱె. వై. వి. గొఱియ, మేషి. "చ...గొఱెతోళ్ల..." పాంచాలీ. ౨, ఆ. ౪.

గొఱ్ఱియ = గొఱ్ఱె "గీ. గొఱ్ఱె గొఱ్ఱియ యనఁగను గొఱలు మేషి." ఆం. భా. ద్వి. ౨౬౫.

గొఱ్ఱు. దే. వి. 1. ముప్పదిరెండుకుంటలపరిమితి. (శ. ర.); 2. దున్నినపొలము చదునుచేయు సాధనము. ఆం. భా. ద్వి. ౨౩౩. శుక. ౨, ఆ. ౪౦౮.

గొఱ్ఱె=గొఱ్ఱియ. "సీ...గొఱ్ఱెలుఁ బఱ్ఱెలున్..." నీలా. ౨, ఆ. ౪౧. [(బ్రౌ.)

గొఱ్ఱెపెదలు. దే. వి. బ. ఒకజాతికీటకసమూహము.

గొఱ్ఱెపోతు = గొఱియపోతు. సాం. ని. తిర్యా. ౭౪.

గొల. వై. వి. (సం. గుళుచ్ఛః. క. గొలె.) 1. (పూవుల) గుత్తి. "చ...కొండగోఁగుపూ, గొల... పారి. ౨, ఆ. ౬౯. 2. (పండ్లు) గెల. "గీ... అరఁటిపంటి, గొలలు..." శుక. ౨, ఆ. ౩౭. (బ. గొల్ల అనురూప మిక్రింది ప్రయోగమునఁ గానవచ్చుచున్నది.) "గీ. చారుబిసబాహులార రంభోరులార, కందఁగా నేల ముడుఁగుచుఁ గుంద నేల, కుళ్లఁగా నేల తలవంపుగొల్ల వేల." చంద్రా. ౪, ఆ. ౨౫౮.

గొలక. వై. వి. 1. (పూల) గుత్తి. "గీ. పొడుపు మలపొన్నపై నెలపువ్వుగొలక, నెలకొన నొకింత నగియె నాఁ డెలుపు దోఁచె." హ. స. ౪, ఆ. ౧౪; 2. కలకలధ్వని. ఆం. భా. ప్ర. ౧౨౧.

గొలగొల. వై. వి. 1. కలకలధ్వని. "సీ ..కొదమ కోయిలచాలు గొలగొలలకు." నీలా. 3, ఆ. ౧౫; 2. మూఁగుటమొ. వానియం దగుధ్వని కనుకరణము. "చ. గొలగొల మంచు మూఁగి చిఱిగుంపులఁ దేనియ లాను తేఁటి తేఁ,టిలకలు మించ..." పార్వ. 3, ఆ. ౧౫.

గొలగొలలాడు. ద్వ. అ. క్రి. (గొలగొలలు+ఆడు.) గొలగొలధ్వని చేయు. "క. చిలుకలు గొర వంకలుఁ గో,యిల లరిచలు నెమలిగములు నెడపక యెపుడున్, గొలగొలలాడుచు విరహుల, నిలువఁగ నిచ్చునె వనంబు నీకుం గొఱయే." శివలీ. ౨, ఆ. ౭౬.

గొలిమిడి. దే. వి. క్షురము, గొబ్బిళి. ఆం. భా. ద్వి, ౫౬. ౪, ఆ. ౧౦.

గొలివె. దే. వి. తృణవిశేషము. (శ. ర.) బ. తృణధాన్యవిశేషము. ఆం. భా. ద్వి. ౨౩౯.

గొలుగు = గొనుగు. (శ. ర.)

గొలుసు. దే. వి. (క. గొలసు.) 1. చేతులఁ గాని మెడలోఁ గాని ధరించు నాభరణవిశేషము. "సీ...గొలు సన లలంతికావిశేషం బగు..." ఆం. భా. ద్వి. ౧౮౯; 2. ఏనుఁగుకాలికిఁ గట్టెడు గొలుసు. (శ. ర.); 3. శృంఖల. సంకెల. "గీ. అడుగొ మువ్వలు గల్లుగల్లనుచు మ్రోయ, నొడలు జళిపించు నష్వెపిగొందుటు వినుము, పున్న మలరేల గొలుసు... గొల్లసేయుం, సింధునంవలి సుందేటి కెగసి రొంగసి." పార్వ. ౬, ఆ. ౯౯ హేమం. ౨. ౪౩.

గొలుసుగొను. దే. అ. క్రి. (గొలుసు+కొను.) గొలుసు వలె నొకదాని నొకటి యంటి యుండు. "గీ. ఆదిశబ్దంబుల మీఁద నడరుపదము, దగువిశేష ణములతోడఁ దగిలి వసుప, గొలుసుగొని యర్థ సంగతిఁ గూడెనేని. నదియుం నేకావళీ సంజ్ఞ వతఁగ నం ప్ర." కావ్యా. ౬, ఆ. ౨౧.

గొలుసుమోడి. దే. వి. విడివిడిగాఁ గాక గొలుసువలె నొకటితో నొకటి కలిసి యున్నయక్షరముల వ్రాఁత. (శ. ర.)

గొల్ల. యు. దే. వి. 1. ద్వారపాలకుఁడు. "సీ. వెలిహాజారంబున నిలిచి గొల్లలు నిల్వ..." దశా. ౨, అ. ౯౭. పరమ. ౩, ఆ. ౬౪; 2. ధన పాలుఁడు, కోశరక్షకుఁడు. (శ. ర. బ్రౌ.) వై. వి. (సం. గోపాలకః. క. గొల్ల.) పశువులను మేపియుం పాలుపెరుఁగు లమ్మియుం జీవించునొక జాతి. (ఉదా:—గొల్లవాఁడు, గొల్లది. శ. ర.) విణ. గొల్లజాతివాఁడు; గొల్లజాతిది. "క. తా నప్పుడు గొల్ల మెచ్చఁ దనకులకాంతన్." నా. పంచ. ౧, ఆ. ౪౯౯. "సీ. గొల్లయిల్లాం డ్రతోఁ గోడిగించుటఁ జేసి పరకామినీసహోదర రతఁ బూన." పారి. పీఠి. ౧౭.

గొల్లఁడు. వై. వి. ఆలకాపరి. విణ. మూర్ఖుఁడు, తెలివి తక్కువవాఁడు. "క. ఒల్లనిసతి నొల్లనిపతి, నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే, గొల్లఁడు కాక ధరలో, గొల్లండును గొల్లఁ డౌనె గుణమున సుమతీ." సు. శ. ౨౩.

గొల్లత. వై. వి. (గొల్ల+త.) గొల్లది, గోపిక. "గీ. అనిన వేఱొక్కగొల్లత..." హరి. పూ. ౯, ఆ. ౨౨౬.

గొల్లతనము. వై. వి. (గొల్ల+తనము.) ఆలకాపరి తనము; అనాగరికత. "ఉ. ఎక్కడిమాట గొల్ల తన మించుకయేనియుం లేదు నీదెసన్." భార. విరా. ౧, ఆ. ౨౮౧.

గొల్లదొండు. ద్వ. వి. (గొల్ల+దొండు.) ఒకజాతి చేఁప. "గీ. ఆల్లెదమ్ముప్పుఁ జేఁపగుం గొల్లదొండు." హంస. ౪, ఆ. ౧౮౭.

గొల్లపల్లియ = గొల్లపల్లె.

గొల్లపల్లె. వై. వి. (గొల్ల+పల్లె.) వ్రేపల్లె, ఘోషము. ఆం. భా. ద్వి. ౨౩.

గొల్లభామ. మి. వి. (గొల్ల+భామ.) 1. గొల్లజాతి స్త్రీ. (బ్రౌ. వా.); 2. కీటకవిశేషము. (బ్రౌ. వా.)

గొల్లము. వై. వి. 1. నీళ్లగుంట. "గీ. కూడి గిరులఁ దరులు గొల్లంబుఁ బల్లంబు నరసి..." ఉ. హరి. ౯, ఆ, ౩౧౧; 2. పల్లము. "ఆ...ఎల్లగుహాల యందు, వెదకి రోలములు వివేకించి చఱుల భావించి గొల్లములకుఁ బంచె దృష్టి." భో. ౯, ఆ. ౯౩.

గొల్లవాఁడు = గొల్ల. ద్వా. ౩, ఆ. ౧౦.

గొల్లసివాలు. ద్వ. వి. బ. (గొల్ల+సివాలు.) గొల్ల వాఁడు సివమెత్తి వేయుకేకలు పాడుపాటలు మొ. "సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బి పాటు గొల్లసివాలు పాడుకొనుచు." కువల. ౨, ఆ. ౧౧౯.

గొల్లియన. దే. వి. ఒకవిధమైనగుడారు. "క. పసిఁడి జలపోసనంబుల, నసమరుచిం బొలుచుగొల్లియ నలు..." కవిక. ౨, ఆ. ౯౬. ఉ. హరి. ౪, ఆ. ౨౦౬.

గొల్లు. వై. వి. 1. కలకలధ్వని. "క. అది యేమి గొల్లు బైటను, పద నందీ యనినఁ జూచి వచ్చి..." పార్వ. ౬, ఆ. ౨౩. ఆం. భా. ద్వి. ౧౨౧; 2. నవ్వుటయం దగుధ్వని కనుకరణము. "ఉ...గొల్లున నవ్విరి ప్రౌఢభామినుల్." భాను. ౨, ఆ. ౭౮; 3. నక్కకూఁతయం దగుధ్వని కను

గొల్లుమను. ద్వ. అ. క్రి. (గొల్లు+అను.) 1. దుఃఖించు, ఏడ్చు. "ఉ...కానకు రాఘవుండు పోఁగా నిపు డెంతపుట్టెః గడగం డ్లుగువా ర్తలు మిన్ను ముట్టి బి,ట్టై నగ రెల్ల గొల్లుమన నాగత మయ్యెఁ బ్రభాత మంతటన్." చం. రా. ౪, ఆ. ౮౫; 2. మాఱుమ్రోగు, అతిశయించిమ్రోగు. "సీ. పాదుకల్ మెట్టుచోఁ బటువేత్రధరసౌవి దల్లపావాఘోష్వశల్ గొల్లుమనఁగ." ఇందు. ౨, ఆ. ౧౨౩; 3. గొల్లుమనుధ్వని బొబ్బలిడగా నేడ్చు. వా:—అతనిప్రాణము పోఁగానే నలుగురు నొక్కసారి గొల్లుమనిరి.

గొల్లెత = గొల్లత. "ద్వి. గొల్లెతరూపంబు గొల్లెత యిల్లు." బస. ౨, ఆ. ౫౨౫. పం. వేం. పంచ. ౧, ఆ. ౫౧౪.

గొల్లెన = గొల్లియన. "మ...ఎల్లి గొ,ల్లెన లెత్తించు విరోధు లంబునిధి వెల్లిం డోల్ల జల్లింపగన్." ఉ. హరి. ౪, ఆ. ౨౦౬. సాం. ని. మాన. ౪౬.

గొల్లెనబండి. దే. వి (గొల్లెన+బండి) గూఁటిబండి "ఉ. పల్లకులన్ మహోష్ట్రముల భద్రగజంబుల నందలంబులన్, గొల్లెనబండులన్...ఎక్కి..." జై. ౨, ఆ. ౧౧౩.

గొవరు. దే. వి. ఉడుకు, తాపము. (చూ. గొవరు వోవు.)

గొవరువోవు. దే. అ. క్రి. (గొవరు+పోవు.) ఉడికి పోవు, తప్తమగు. "గీ. కొన్ని దేశంబు లెండచే గొవరువోయె." కాశీ. ౧, ఆ. ౧౭౭.

గొహరు. దే. వి. 1. ఆఘోషణము, అంతు. "సీ... గొహరు గోర పన వెలయు, నాఘోషణసమాఖ్య..." ఆం. భా. ప్ర. ౧౧౫. "గీ. ఏటికి గొహరు తవదు నా కేల వెరవు." కువల. ౫, ఆ. ౧౬; 2. తాపము. (చూ. గొహరుసేయు.) విణ. శుష్కము, అఘోషణముతోఁ గూడినది "సీ. అందఱిలో ముస్నె యగడౌట చాలదే యింక గొహరువా పేల కనకు." కువల. ౫, ఆ. ౧౯.

గొహరుసేయు. ద్వ. స. క్రి. (గొహరు+చేయు.) తపింపఁజేయు, ఉడికించు. "పంచచామరము. జొహారు మీకుఁ జల్లఁ గాఁగఁ జూడుఁ డోప మీరకం,జహారులార మంట మాని శంబరారిఁ గూడినన్, గొహరుసేయ నేల సారెకుం జలంబు నన్..." సా. ౨, ఆ. ౧౮౦. విజ. 3, ఆ. ౪౯.

గొళ్లెము. దే. వి. ద్వారకవాట బంధనవిశేషము. "చ...లేచి, సత్వరమున తన్మణీగృహకవాటము గొళ్లెము పెట్టి మళ్లినన్..." చెన్న. ౪, ఆ. ౨౮౮.

## గో

గో. దే. అవ్య. ఆహా, సెబాసు. (బ్రా.)

గోంగూర. దే. వి. (గోఁగు+కూర.) గోఁగుకూర. (బ్రా. వా.)

గోంకుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకపామర కొండజాతివాఁడు. విణ. (అ. ఆ. అ.) ఊఱుకు బొడ్డు గలవాఁడు.

గోంద్ర. దే. వి గర్జనము అఱపు. (చూ. గోంద్రలు పెట్టు.)

గోంద్రలుపెట్టు. దే. అ. క్రి. (గోంద్రలు+పెట్టు.) గర్జించు ఊఱుము. "ఉ. గోంద్రలు పెట్టి మేఘుఁ డతికోపమునన్ గురియంగఁ జొచ్చె..." చాటు. ౨, భా. ౪౩. పు. ౧. ప.

గోంద్రించు. దే. అ. క్రి. అఱచు. "ద్వి. గొటగొట గోండ్రించి కోఱ లాండ్రొంటి, గటగటఁ దాఁకింప గర్భంబు గలఁగి." నవనాథ. 3. భా. (శ. ర.)

గోండ్రిలు = గోండ్రించు. "ద్వి. బిలముల గుహ లందు బెబ్బులుల్ చిఱుత,పులులు గోండ్రిలు చుండు..." ద్వి. నల. 3. భా. ౧౩౯. పు. కృ. శమం. ౧, ఆ. ౬౧.

గోండ్రిల్లు = గోండ్రిలు. (శ. ర.)

గోండ్రు. దే. వి. 1. అంగలార్చుటయం దగుధ్వని కనుకరణము. "చ...ఆ,కెళవున నాడునాల భుజగిం గని గోంద్రని యంగలార్చుచున్." ఆము. 3, ఆ. ౧౯; 2. గర్జించుటయం దగుధ్వని కనుకరణము. "గీ. గోండ్రు గోండ్రని గర్జించుఁ గొంతతడవు." వరాహ. ౧౧, ఆ. ౭౬.

గోండ్రుపెట్టు = గోండ్రలుపెట్టు. 1. (గర్జించు, ఊఱుము.); 2. (అంకెవేయు.) (బ్రా.)

గోఁకు. దే. స. క్రి. 1. దురదపోవునట్లు నెమ్మదిగా గీఁకు. "గీ. శిరము గోఁకంగఁ దగ దిరుసేత..." భార. అను. ౪, ఆ. ౧౦౨; 2. తోలు లేచునట్లు గీఱు. "గీ. ధరణి మఱి యును బెక్కువిధంబు లందు, బ్రహ్మవిదు లైనబ్రాహ్మణప్రభులమహిమ,

వినమె యెఱిఁగి యెఱిఁగి సద్వినుతచరిత, కొఱవి గొని పెట్టినే తలగోఁకికొనఁగ." భార, అర. ౫, ఆ. ౧౯. ('గ్రోఁకికొనఁగ.' అపముద్రి.)

గోఁకుడుపాఱ. దే. వి. (గోఁకుడు+పాఱ.) దోఁకుడు పాఱ, తవుగోల. (శ. ర.)

గోఁకు. దే. వి. (క. గోగి.) గోను, తీక్ష్ణవృక్షము (ఇందలిభేదములు: ఊరగోఁగు, కొండగోఁగు, చిక్కగోఁగు, ధరాసరిగోఁగు, పుల్లగోఁగు, వరగోఁగు, సీమగోఁగుమొ.) "సీ. కాకి తూ కందుగు కానుగు వరగోఁగు గోఁగు బొట్టుగు చిక్కగోఁగు కొండ,గోఁగు..." హంస. ౪, ఆ. ౧౧.

గోగులమ్మ. ద్వ. వి. (గోఁగులు+అమ్మ.) దుర్గాభేదము; దేవతాభేదము. "గీ. కోమలార్ధేందుధరుకొమ్మ గోఁగులమ్మ." భీమ. ౧, ఆ. ౯౭.

గోఁచి. దే. వి. ఖండకము, కచ్చడము. ఆం. భా. ద్వి. ౧౫౭. ప్ర భా. ౧, ఆ. ౧౦౨.

గోఁచికట్టు. దే. వి. (గోఁచి+కట్టు) బ్రహ్మచారి. "గీ. ఆస లన్నియుం మొదలంటఁ గోసి యున్న, గోఁచికట్టున కటువంటిగొడవ గడవ,రాక మెడఁ జుట్టుకొనియె..." పాండు. ౫, ఆ. ౧౩౮.

గోఁచికాఁడు. దే. వి. గోఁచి+కాఁడు. బ్రహ్మచారి. (శ. ర.) విణ. గోచియే మిగిలినవాఁడు—దరిద్రుఁడు. "గీ. అరివేరంబు రీతి నిందందుఁ బిడుగు, గోఁచికాఁడయ్యె బాఁపఁడు కోడెగాఁడు." ప్రబంధ. ౭౫౪.

గోఁచిపాఁత. దే. వి. (గోఁచి+పాఁత.) గోఁచిగుడ్డ, గోఁచి. "గీ. కుక్కిమంచము బొంతయుం గోఁచిపాఁత." శివధ. ౫, ఆ. ౬౮.

గోఁచిపాఁతరాయఁడు = గోఁచికాఁడు. (దరిద్రుఁడు.) "ఆ. పేర్మి నదరు గుండెపిక్కచెవరు లేక,యుండ వచ్చుఁ జేద యుంటకు దక్కి, రమణ గోఁచిపాఁత రాయఁడు దొంగలు, మిండఁ డనెడుమాటమేలు దెలిసి." కుచేల. 3, ఆ. ౪౭.

గోఁచిబాఁపఁడు. ద్వ. వి. (గోఁచి+బాఁపఁడు.) గోఁచికట్టు. ఆం. సం. మాన. ౨.

గోఁచివాఁడు = గోఁచికట్టు. "గీ. ప్రతినవబ్రహ్మచర్యాప్తి, భవ్యతరత,పొబుఁ ఒఖునఁ గడు బీఱ వోని గోఁచివాఁడ ననుచు నిజానుభావంబుఁ దెలిపి." హ. స. పీఠి. ౧౧.

గోఁజోటు. దే. వి. (గోఁజాడుధా.) పీడించి యడుగుట. (శ. ర. బ్రా.)

గోఁజాడు. దే. స. క్రి. (గోఁజు+ఆడు.) పీడించి యడుగు. (శ. ర. బ్రా.)

గోఁజు. దే. స. క్రి. పీడించియడుగు. (శ. ర.) వి. 1. పీడించి యడుగుట. (శ. ర. బ్రా.) "క. కావున వేఁజే గోఁజులు, గావు నను జూడ నేను గన్నది యింతే." పార్వ. ౨, ఆ. ౭౫; 2. తాపము, బాధ. "ఉ. శైలవరేణ్యకన్యకలకాం ఋధిరత్నమ కోడెప్రాయపు,స్వేళఁ దపం బటంచుఁ దలపెట్టెడుగోఁజులు చూడఁ జాలఁ జాల్చాలు ..." పార్వ. ౪, ఆ. ౧౬౧.

గోఁజులాడు = గోఁజాడు. (బ్రా.)

గోఁటు. దే. వి. 1. కోకయంచునఁ జేర్చి కుట్టెడు సన్ననిసరిగపట్టె. (శ. ర. బ్రా.); 2 ఒయ్యారము. (శ. ర. బ్రా. వా.); 3. రేఖ. (శ. ర.); 4. హస్త భూషావిశేషము. ఆం. భా. ద్వి. ౧౪౯.

గోఁటుకత్తె. ద్వ. విణ (గోఁటు+కత్తె.) ఒయ్యారము కలది, విలాసిని. (శ. ర. బ్రా.)

గోఁటుకాఁడు. దే. విణ. (గోఁటు+కాఁడు.) ఒయ్యారము కలవాఁడు, విలాసవంతుఁడు. (శ. ర. బ్రా.)

గోఁదు. దే. వి. బంక, బంధన. (శ. ర.)

గోఁదురు = గోఁదురుకప్ప. (శ. ర. బ్రా.)

గోఁదురుకప్ప. దే. వి. (గోఁదురు+కప్ప.) పెద్దజాతి కప్ప. "సీ...గోఁదురుకప్ప కప్ప..." హంస ౪, ఆ. ౧౮౬.

గోఁదురుగవ్వ. దే. వి. (గోఁదురు+గవ్వ.) ఒకపెద్ద జాతిగవ్వ. (బ్రా.)

గోకంటకము. సం. వి. అ. న. పుం. న. 1. ఆవుడెక్క; 2. పల్లేరుకాయ.

గోకర్ణము. సం. వి. అ. పుం. 1. దక్షిణదేశమందలి శివక్షేత్రవిశేషము; 2. ఒకానొకగణదేవత; 3. జాత్; 4. కంచరగాడిద; 5. ఆవుచెవియాకారము గలపాత్ర; 6. మృగవిశేషము.

గోకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. మూర్వ, చాఁగకీ.

గోకిలము. సం. వి. అ. పుం. 1. రోఁకలి; 2. నాఁగలి.

గోకీలము. సం. = గోకిలము.

గోకులము. సం. వి. అ. న. 1. ఆవులమంద; 2. గోశాల, గోష్ఠము; 3. వ్రేపల్లె.

గోకులిక. సం. వి. ఆ. స్త్రీ. అడుసునఁ బడినయావు.

గోకులికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. అడుసునఁ బడినయావు నుపేక్షించువాఁడు; 2. మెల్లకంటి వాఁడు.

గోకృతము. సం. వి. అ. న. ఆవుపేఁడ.

గోక్షురము. సం. = గోకంటకము.

గోగ్రంథి. సం. వి. ఇ. పుం. 1. పసులపాల; 2. ఏఱు పెడుక; 3. గోజిహ్వ, బెండకీ.

గోచందనము. సం. వి. అ. న. గోశీర్షము, పచ్చచందనము.

గోచరము. సం. వి. అ. పుం. 1. ఇంద్రియములకుఁ గనుపడువిషయము; 2. జ్ఞానాదివిషయము.
ఉదా:—పితృసద్మగోచరః. (సం. కు. సం. ౫. ౭౭.)

గోచరించు. సం. అ. క్రి. 1. కనఁబడు. "చ... దృష్టికి గోచరించినన్." సమీర. ౧, ఆ. ౧౩౩; 2. తోఁచు. "గీ. మొనసి హితము చరించిన మందమునకు, కోఁతపడు నను మాట నకట గోచరించె." కాశీ. ౬, ఆ. ౨౨౫.

గోచారము. సం. వి. అ. పుం. మేషాదిరాసులయందు సూర్యాదిగ్రహములసంచారము.

గోజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. బెండకీ.

గోటాపన. వై. వి. ఘోషించుట, ఘోష. ('పక్షియాఁక' అని శ. ర. సూ. ని.) "క. సేటుకొర పండ్లు కొఱుకుచుఁ, జీటికి మాటికిని గసరుచిలుకకన్ జిలుకా, బోటుల నలయించెదునీ, గోటాపన యెన్నఁ డింక గూఁటంబడునో." నీలా. ౩, ఆ. ౨౬.

గోటిచెనకు. దే. వి. (గోరు+చెనకు.) నఖక్షతము. ఉ. రా. ౪, ఆ. ౨౨౧.

గోటినాటు = గోటిచెనకు. కవిరా. ౫, ఆ. ౨౩౦. సాం. ని. మాన. ౫౧.

గోడ. వై. వి. (సం. కుడ్యమ్.) 1. కుడ్యము, భిత్తి. ఆం. భా. ద్వి. ౧.౨. అచ్చ. సుం. ౯౫; 2. (సం. ఘోటకః. హిం. ఘోడా) గుఱ్ఱము. "చ... సెబాసగుగోడ యటంచు మెచ్చుచున్." ఇందు. ౨, ఆ. ౫౬.

గోడకాలు. ద్వ. వి. (గోడ+కాలు.) కరగోడ, కంచె నాటుటకై పాడిమట్టితో నేర్పఱచినగోడ. "సీ. కమ్మతేనియనీళ్ల గట్టి పుళ్ళాడి మట్టి గోడకాల్వెర్చినప్రోడతనము." రా. వి. ౩, ఆ. ౧౧.

గోడగించు. దే. అ. క్రి. (శృంగారము)పాడు. "ఉ. వారణరాజయాన కనువారముఁ గుంతలమధ్యవీథి సిం,దూరము దూరమయ్యె మగతుమ్మెదప్రోదలు గోడగించు ఝుం,కారము కార మయ్యె..." కవిక. ౩, ఆ. ౧౭౭. స. క్రి. మించు. "సీ. మండు వేసవినాఁటిమార్తాండబింబంబు గోడగించు పసిండి గుబ్బలోడ." కాశీ. ౪, ఆ. ౭౯౪.

గోడచేర్పు. ద్వ. వి. (గోడ+చేర్పు.) గోడదరిని జేరుట. విశే. మందుఁడు, జడుఁడు. "ద్వి. ఈ రాజు....మొండరి చల్లచప్పుడు గోడచేర్పు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౯౯. పం.

గోడపురువు. వై. వి. (గోడ+పురువు.) మత్కుణము, నల్లి. సాం. ని. తిర్య. ౧౩.

గోడా. వై. వి. వి. (సం. ఘోటకః. హిం. ఘోడా.) గుఱ్ఱము. "క. జోడనలు నిబ్బరంబులు, వేడెంబులు మెఱయ రాజు వేడుకతోడన్, గోడా దుమికింపఁగ జత,గూడిరి దొరలెల్ల భటులగుమి వెను కొఁగియెన్." ఉ. రా. ౭, ఆ. ౩౯౯.

గోడాడు. దే. అ. క్రి. (గోడు+ఆడు.) ఏడ్చు, విలపించు. "ఉ. ఏడువ నేల తండ్రి తను వేమఱ కుండుఁడు తోడులార నేఁసూడిచెదీర్తు నందుఁ బరశుష్యతి భీముఁడు రాముఁడు గ్రుద్ధై,యోడక యర్జునాత్మభవు లున్నపురంబున కేఁగి చొచ్చి గోఁ,డాడఁగఁ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్." భాగ. ౯, స్కం. ౪౧౩. ద్వా. ౭, ఆ. ౨౩౬.

గోడి. దే. విశే. 1. ఏటవాలైనది. (చూ. గోడివడు.); 2. వంపు గలది. "సీ. గూనివీఁపుతోడ గోడియై బోదెత్తి తటివడ్డకంకాణతండములును." కాశీ. ౩, ఆ. ౧౩౧; 3. లోప ముండియుం లేనట్లు కనుపడునది. వ్యవ:—వాఁడు గోడిగా సంసార మీడ్చుచున్నాఁడు.

గోడిగ. వై. వి. (సం. ఘోటికాః.) ఆఁడుగుఱ్ఱము. "సీ. గోడిగజాతితోఁ గోదమకెంటుల నేర్చి మావుల హత్తించుమార్దవంబు." భార. విరా. ౧, ఆ. ౯౫. ఆం. భా. ద్వి. ౧౯౭.

గోడిపట్టెలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "గీ. గుజ్జు దాఁగిలిముచ్చులు గోడిపట్టెలు..." వి. పు. ౭, ఆ. ౨౦౨.

గోడివడు. ద్వి. అ. క్రి. (గోడి+పడు.) ఏటవాలగు. "గీ. గోగణము ముంగలిగ నేల గోడివడఁగ, నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె." భార. విరా. ౪, ఆ. ౨౧౦. రామా. ౬ ఆ. ౧౬.

గోడివెట్టు. దే. స. క్రి. (గోడి+పెట్టు.) గోడిగాఁ బెట్టు, వంచు. (శ. ర.)

గోడు. దే. వి. 1. దుఃఖము, బాధ. "క. పరమమునీంద్ర సమరమృత, కురువీరుల మానసముల గో డుడుగ భవ,త్కరుణ వెలయ లోకం బచ్చెరు వందఁగఁ జూపవే విచిత్రప్రమహిమన్." భార. ఆశ్ర. ౨, ఆ. ౯౨. సాం. ని. మాన. 33; 2. రోదనము, ఏడ్పు. "సీ...కొఱలు రోదన మేడ్పు గోడు నాఁగ." ఆం. భా. ప్ర. ౧౪౧; 3. ఏడ్పుట యం దగుధ్వని కనుకరణము. "ఉ...,గో డని యేడ్చుచున్..." కుచేల. 3, ఆ. ౧౦౨; 4. నిందను దెలుపును. (ఇది సంస్కృతమందలి 'ధిక్' వంటిది.) "చ...ముప్పిరిగొన్నభయంబు ఖేదమున్, మనమున నిండఁగాఁ దొడఁగి మార్కొనలేక కుబేరుఁ డేఁగె న,ద్దనుజుల నింత చేసినవిధాతను గో డనఁబోవు చాడ్పునన్." ఉ. హరి. ౧, ఆ. ౪౨; 5. లోపమున్నను లేనట్టు కనఁబఱచు నైపుణ్యము. వ్యవ:—వాఁడు గోడు చెడకుండఁగ కాలక్షేపము చేయుచున్నాఁడు; 6. ఓటమి, అపజయము. (చూ. గోడుసేయు.); 7. ఉసురు, బాధించినపాపము. (చూ. గోడుపోసికొను.)

గోడుపోసికొను. దే. అ. క్రి. (గోడు+పోసికొను.) ఉసురందు, క్షోభపెట్టిన పాపము కట్టుకొను. "ఆ. లంజెకట్లు లనఁగ లక్షింపఁగా నిట్టి, కట్టిఁడులకు నలువ కరుణ లేక, బ్రాలిమాలినట్టి బ్రతుకులు నిడుపుగాఁ, జేసి ఓటుల గోడుపోసికొనియె." కవిక. ౪, ఆ. ౧౧౦. ఉ. రా. ౪, ఆ. ౯౪.

గోడుసేయు. ద్వి. స. క్రి. (గోడు+చేయు.) ఓడించు; మించు. "సీ. కోటిచంద్రులడాలు గోడుసేయఁగఁ జాలు మొగముతోఁ దమచక్క సొగసుగుల్క." పీఠి. ౯.

గోడెము = గూడెము. (కొండదొన శాస్త్రయించి యుండు బోయపల్లె.) ఆ. భా. ద్వి. ౨౩.

గోణము. వై. వి. (సం. కౌపీనమ్.) గోఁచి. "ఉత్సాహ...కావిగోణములు గట్టుదారి జైన నగుచుఁ జిత్తజుండు చిత్తములు గలఁచి చెఱచు ..." శివ. ఉ. ౨, ఆ. ౩౫. ఆం. భా. ద్వి. ౧౫౭.

గోణముదారి. వై. వి. (గోణము+దారి.) కౌపీనధారి—సన్న్యాసి. సాం. ని. మాన. ౭.

గోణాము = గోణము. "సీ. బంగారుప్రాఁతచెఱంగుల గోణాము గళమున రుద్రాక్షకంఠమాల." కాశీ. ౧, ఆ. 30.

గోణి. ఉభ. దే. వి. ఎద్దు (శ. ర.) సం. వి. ఈ. స్త్రీ. గోనె.

గోతము. దే. వి. 1. అల్పగోణీవిశేషము, జనుపనారసంచి. (శ. ర.) "సీ...గోనెలు తఱగాలు గోతములును." హంస. ౪, ఆ. ౧౪. ఆం. భా. ద్వి. ౨౬౬; 2. మల్లసాధనవిశేషము, మల్లులు సాదన కొఱకు జాల్గి నించి యుంచుకొనెడుగోనె. (శ. ర.) "స్రగ్ధర. గ్రుద్దుల్ గోత్రాచలంబుల్ గులగుల లయి పో గోతముల్ గ్రుద్దులీలన్." స్వా. ౪, ఆ. ౧.

గోతాము = గోతము. (మల్లసాధనవిశేషము.) ఆం. భా. ద్వి. ౨౦౭.

గోతి. దే. వి. 1. స్త్రీ, ఆఁడుది. "క. జ్ఞాతులయెడ గోవులయెడ, గోతులయెడ ధర్మ మెడలి క్రూరుఁ డగుట..." భార. అను. 3, ఆ. ౨3౪. ఆం. భా. ద్వి. ౧౦౪; 2. భార్య, పత్ని. "క. ఆతండు పుష్కరిణి యను,నాతికి వీరణసమాఖ్యనందనుఁ గనియెన్, బ్రీతి యెసఁగ నద్వ్యలయను, గోతికి యతనివలనఁ గాంచె గొడుకులవరుసన్." హరి. పూ. ౧, ఆ. ౬౧. భో. 3, ఆ. ౨౪౪.

గోతుంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. పిన్నపాపరపీ; 2. పుచ్చపీ; 3. బుడమపీ.

గోత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. గోసమూహము.

గోత్రకీల. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

గోత్రభిత్తు. సం. వి. ద్. పుం.—1. పర్వతభేది, ఇంద్రుఁడు; 2. వంశభేది—కుపుత్రుఁడు. ఇట్లే: గోత్రభిదుఁడుమొ.

గోత్రము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. మేఘము. న. 1. వంశము; 2. ధనము; 3. పేరు; 4. గొడుగు; 5. అడవి; 6. బలిమి; 7. పరిమడి; 8. దారి; 9. గుంపు.

గోత్రస్ఖలనము. సం. వి. అ. న. ఒకరెని మఱియొక పేరుతోఁ బిలుచుట. ఇట్లే: గోత్రస్ఖలితము.

గోత్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గోవులను గాఁచువాఁడు; 2. భూమి పాలించువాఁడు.

గోద. ఉభ. దే. వి. ఎద్దు. "ద్వి. భయమంది యొంటి గోదయును మీఁదఁ గనక, వయిచుక యున్నది వఁదరుచు నెమర." బస. 3, ఆ. ౯౭. పు. ౪౯౩. సం. వి. ఆ. స్త్రీ. 1. గోదావరి; 2. గోదాదేవి, వైష్ణవోపాస్య యగుదేవతాభేదము.

గోదము. సం. వి. అ. పుం. మెదడు. విణ. (అ.ఆ.అ) గోవుల నిచ్చునది.

గోదరి. దే. వి. చర్మకారుఁడు, ముచ్చివాఁడు. ఆం. భా. ద్వి. ౨౭౩.

గోదానము. సం. వి. అ. న. 1. గోవును దానము చేయుట; 2. కేశాంతము, కేశచ్ఛేదనసంస్కారము. (ఇది బ్రాహ్మణునకుఁ బదునాఱవయేఁటను క్షత్త్రియున కిరువదిరెండవయేఁటను వైశ్యున కిరువదినాల్గవయేఁటను జేయఁదగినది. మనుస్మృతి. ౨, ఆ. ౬౫. శ్లో.)

గోదారణము. సం. వి. అ. న. 1. భూమినిఁ జీల్చునది నాఁగలి; 2. గొడ్డలి.

గోదారి. యు. దే. వి. వెన్నకాఁచినమడ్డి. వై. వి. (సం. గోదావరీ.) గోదావరినది. (వా.)

గోదావరి. సం. వి. ఈ. స్త్రీ. నాసికయందు దుద్భవించి రాజమహేంద్రవరముమీఁదుగాఁ బ్రవహించు నది." హర. ౬, ఆ. ౫౯.

గోదు. హిం. వి. తుమ్మజిగురు. (శ. ర.)

గోదుమ. వై. వి. (సం. గోధుమః.) సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము. ఆం. భా. ద్వి. ౨౩౪.

గోదుమపూసలు. ద్వ. వి. బ. (గోదుమ+పూసలు.) స్త్రీకంఠభూషావిశేషము. (శ. ర.)

గోదుహుఁడు. సం. వి. హ్, అ. పుం. గొల్లవాఁడు. విణ. (హ్, అ. ఆ. అ.) ఆవుపాలు పితుకువాఁడు.

గోద్రవము. సం. వి. అ. పుం. గోమూత్రము.

గోధ. సం. వి. ఆ. స్త్రీ. ఉడుము.

గోధనము. సం. వి. అ. న. గోరూపధనము, గోకులము.

గోధాపది. సం. వి. ఈ. స్త్రీ. చెప్పుతట్ట♆.

గోధి. సం. వి. ఇ. పుం. 1. అలికము నొసలు; 2. గోధ, ఉడుము.

గోధుక్కు. సం. వి. హ్. పుం. గోదుహుఁడు. విణ. (హ్) గోదుహుఁడు.

గోధుమము. సం. = గోధూమము.

గోధూమము. సం. వి. అ. పుం. 1. గోదుమధాన్యము; 2. నారింజ♆.

గోధూళి. సం. వి. ఇ. స్త్రీ. సాయంసంధ్యాకాలము.

గోధేనువు. సం. వి. ఉ. స్త్రీ. క్రొత్తగా ఈనినయావు. "క...కొను మిచ్చెద నీకు లక్షగోధేనువులన్." భార. ఆది. ౭, ఆ. ౯.

గోనంది. సం. వి. ఈ. స్త్రీ. గోనర్దము, బెగ్గురుపక్షి.

గోనర్దము. సం. వి. అ. పుం. గోనంది, బెగ్గురుపక్షి. న. కైవడిముస్తె♆.

గోనసము. సం. వి. అం. 1. కొండచిలువ; 2. వైక్రాంతమణి.

గోనాసము. సం. = గోనసము.

గోనియ. వై. వి. (సం. గోణీ) ధాన్యాదికము నించుజనుపనారసంచి. (శ. ర.)

గోను = గోఁగు. "సీ...గురివెంద గోను రేను." వేం. పంచ. ౪, ఆ. ౫౨౨. ఆం. భా. ద్వి. ౪౩.

గోనె = గోనియ. "సీ...గోనెలుఁ దణగాలు గోతములును." హంస. ౪, ఆ. ౧౪.

గోనెసంచి = గోనె. (గోత మని శ. ర.)

గోపకుఁడు. సం. వి. అ. పుం. గొల్లవాఁడు. విణ. (అ. విశే. అ.) 1. ప్రోచువాఁడు. 2. గాఁచువాఁడు. 3. ఆవులను గాచువాఁడు.

గోపతి. సం. వి. ఇ. పుం. 1.—గోవులపతి ఆఁబోతు; 2. స్వర్గపతి-ఇంద్రుఁడు; 3. భూపతి; రాజు; 4. పశుపతి-శివుఁడు; 5. అంశుపతి-సూర్యుఁడు; 6. దిక్పతి-దిక్పాలకుఁడు; 7. గోవుల కధిపతి = గోపాలుఁడు.

గోపదలము. సం. వి. ఆ. స్త్రీ. పోఁక♆.

గోపన. సం. వి. ఆ. స్త్రీ. 1. కాచుట; 2. దాఁచుట; 3. దూఱుట; 4. కాంతి; 5. ఈర్ష్య; 6. కలఁత

గోపనము. సం. = గోపన.

గోపనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రోవఁదగినది; 2. దాఁచఁదగినది.

గోపము. సం. వి. అ. పుం. 1. గోపన; 2. బాలెంత బోళము.

గోపానసి. సం. వి. ఈ. స్త్రీ. చూరుపట్టె, గొబ్బ.

గోపాయకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాచువాఁడు; 2. దాఁచువాఁడు.

గోపాయనము. సం. వి. అ. న. 1. కాచుట; 2. దాఁచుట. [కుఁడు.

గోపాయిత. సం. విణ. (ఋ. త్రీ ఋ.) = గోపాయ

గోపాయితము. సం. వి. అ. న. = గోపనము. విణ. (అ. ఆ. అ.) 1. కావఁబడినది; 2. దాఁపఁబడినది.

గోపాలము. సం. వి. అ. పుం. దాసరులు బిచ్చమెత్తుట కుపయుక్త మగుపదము. (సూ. ని.) "గీ... గోపాల మనుచు,వీథి కెవ్వారు నుడిసిన వెక్కిరించు." విప్ర. ౩, ఆ. ౧౫.

గోపాలమెత్తు. మి. అ. క్రి. బిచ్చమెత్తు. (బ్రౌ.)

గోపాలుఁడు. సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. రాజు; 3. శివుఁడు; 4. కృష్ణుఁడు. విణ. (అ.ఆ.అ.) గోవులను గాచు వాఁడు. ఇట్లే: గోపాలకుఁడు మొ.

గోపి. సం. వి. ఈ. స్త్రీ. గొల్లది.

గోపించు. వై. స. క్రి. (సం. గుప్.) ప్రచ్ఛన్నముగ నుండు. "ద్వి. వనమునఁ బండ్రెండువత్సరంబులును, జనగోప్యమై యొక్క సంవత్సరమును, నియతితో గోపించి నేఁ డెల్లి వారు,రయ మొప్ప గోపించి రానున్నవారు." ద్వి. భార. విరా. ౧, ఆ. ౧౧. పు.

గోపిక. సం. వి. ఆ. స్త్రీ. గొల్లది.

గోపిచందనము. సం. వి. అ. న. ఒకజాతిసుద్దమన్ను. "ఉ. ద్వారకనుండి వచ్చెవటు వస్తుఁ డొకండు వినీలకంధ రా,కారుఁడు గోపిచందనవికస్వర పాలుఁడు..." విష్ణు నా. ౧, ఆ. ౧౦౮.

గోపిత. సం. = గోపాయిత.

గోపీనము. సల. వి. అ. న. నీటిదొన.

గోపు. వై. విణ. (సం. గోపాల.)—గొల్లవానివంటి వాఁడు—మూర్ఖుఁడు. "సీ. అకతాయి బికారి ...మొప్పె గోపు." హంస. ౫, ఆ. ౧౧౩.

గోపుఁడు. సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. రాజు; 3. గోపాలుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. కాచువాఁడు; 2. దాఁచువాఁడు; 3. గోరక్షకుఁడు.

గోపుచ్ఛము. సం. వి. అ. పుం. 1. ఆవుతోఁక; 2. కొండముచ్చు; 3. హారవిశేషము.

గోపురము. సం. వి. అ. న. 1. దేవాలయద్వారము; 2. కైవడిము స్తైౕ; 3. పురద్వారము; 4. స్వర్గము. "వ...ఉదగ్రగోపురశ్రీ చుంబితగోపురంబును ధరాపురంధ్రీరత్ననూపురంబును నగునాపురంబు నకు..." రామా. ౧, ఆ. ౧౫౩.

గోప్త. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) = గోపాయిత.

గోప్యము. సం. = గోపనీయము.

గోప్యుఁడు. సం. వి. అ. పుం. 1. సేవకుఁడు; 2. దాసీపుత్త్రుఁడు.

గోప్రవేశము. సం. వి. అ. పుం. గోధూళి, సాయంసంధ్యాకాలము.

గోమంతుఁడు. సం. విణ. (త్. మతీ. త్.) గోవులు కలవాఁడు. [౧. అం.

గోమతి. సం. వి. ఈ. స్త్రీ. నదీవిశేషము. కుందమాల.

గోమయచ్ఛత్రము. సం. వి. అ. న. కుక్కగొడుగు.

గోమయప్రియము. సం. = గోమయచ్ఛత్రము.

గోమయము. సం. వి. అ. పుం. న. 1. ఆవుపేఁడ; 2. ఆవుపేఁడపిడుక. ముద్రారా. ౩. అం ౧౫. శ్లో.

గోమాయువు. సం. వి. ఉ. పుం. వికృతముగా నఱచునది- నక్క.

గోమారి. సం. వి. ఈ. స్త్రీ. (ఇది జంతుమారి వంటిది. మి. వి. అని. శ. ర.) ఆం. భా. ద్వి. ౮౮.

గోమి. సం. వి. న్. పుం. నక్క. విణ. (న్. నీ. న్.) గోవులు కలవాఁడు.

గోమించు. దే. స. క్రి. గారాబము చూపు, అమిత వాత్సల్యము చూపు. "క. ఈమాడ్కి నమిత భోగశ్రీ మెఱయఁగ నొక్కనాఁడు చిత్తమున నిజ,స్వామియుఁ దలిదండ్రులుఁ దను,గోమించిన నడతఁ దెలిసికొని యతఁ డెలమిన్." శుక. ౧, ఆ. ౪౨౮.

గోమిడి. దే. వి. ఒకానొకజాతిపూరేడుపిట్ట. (బ్రౌ.)

గోము. దే. వి. 1. సౌందర్యము, అందము. 'సీ. మరకతంబులయొప్పు మై నుప్పతిల నొప్పగోమువాఁ డెలనవ్వు మోమువాఁడు." శుక. ౧. ఆ. ౧౧; 2. సౌకుమార్యము, శ్రమమెఱుఁగనితనము. "సీ. చెలువ నీజిగి గోము గలమోము మఱి వానితోట్టి నోరున ముద్దువెట్టఁ దగునె." హంస. ౧, ఆ. ౯౧; 3. వికాసము, ఫుల్లత. "చ. కుముదిని పొంగెఁ బద్మినులగోము దొలంగె...విధుండు పూర్వభాగమున వెలింగె..." కృ. శతం. ౨, ఆ. ౯౯౫; 4. గారాబము, అతిలాలనము. "క. గోము మిగుల

ప్రపత్తెను, ధీమంతులు రామవాసుదేవులు బాల్య, శ్రీ మెఱసి..." హరి. పూ. ౫, ఆ. ౨౫౦; 5. మదము, పొగరు. "మ. ఆనిలో నిం(దు)నిగోము మాన్పి పెరదేవాళీకముం జీరికిం,గొనక..."హరి. ఉ. ౪, ఆ. ౧౩౯; 6. విధము, రీతి. "వ... పుష్పంధయ స్తనంధయస్తోమంబు వహోమధూమం బుగోమున నెసంగ..." ఇందు. ౨, ఆ. ౪౪. విశే. 1. సుందరము, అందమైనది. "క. గోముగా శాకురుల్ గొప్పవెట్టిన వార్త సఖియ చెప్పిన బన్నసరమై లోన గె." కలు. ౪ ౨౬; 2. సుకుమారము, శ్రమమెఱుఁగనిది; 3. మృదువు మెత్తనిది. ఆం. భా. తృ. ౨౪; 4. ఒలిష్ఠము, బిగువైనది. "శా... పీనామాధుర్య కలస్తనంబు దోలుకం దా నేడ్చెఁ గన్నీట నుర్, గోముం జన్నులు దొప్పఁదోఁగి కడకన్ లోపెక్కుచున్ పుక్కుచున్." రాధా. 3, ఆ. ౪౧.

గోముఖము. సం. వి. అ. పుం. న. వాద్యవిశేషము. పుం. మొసలి. న. అలుకుట.

గోముఖవ్యాఘ్రము. సం. వి. అ. పుం. 1.—పైకి గోముఖము గలిగి లోపల వ్యాఘ్రస్వభావము గల జంతువు; 2. అట్టిస్వభావముగల జనుఁడు.

గోమూత్రిక. సం. వి. ఆ. స్త్రీ. చిత్రకవిత్వములోని బంధవిశేషము.

గోమేదకము. సం. వి. అ. న. పుం. పీతమణి, పసుపు రంగు గలరత్నవిశేషము.

గోమేదము. సం. వి. అ. పుం. గోమేదకము.

గోమేదికము. వై. వి. (సం. గోమేదకమ్.) పీతమణి. "గీ. రమణ మీఱఁగ గోమేదికములు చాలఁ, జెలువ మొప్పార నంచులఁ జేర్చి చేర్చి." య. ౪, ఆ. ౧౧౬.

గోమేధము. సం. వి. అ. పుం. గోవును జంపి చేయు యజ్ఞము.

గోయి. వై. వి. కౌ. (సం. గర్తః.) గర్తము, గొయ్యి. "సీ... తెలిపుల్లు బురదగోతులకుఁ జనునె." సీలా. ౨, ఆ. ౭౬.

గోర = గోరువంక. "సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు ..." రసిక. ౧, ఆ. ౬౭. (శ. ర. పా. 'గోవలు' పాఠాంతరము.)

గోరంక = గోరువంక. ఆం. భా. ద్వి. ౦౯.

గోరంకువు. సం. వి. ఉ. పుం. 1. గోరువంక; 2. నగ్నుఁడు; 3. బట్టు.

గోరంట. దే. వి. గుడము, బెల్లము. వేంక. మాన. ౭౪.

గోరఁట. వై. వి. (సం. కురంటకః.) 1. కురంటకము, మైదాకు. ఆం. భా. ద్వి. ౫౩; 2. గోరఁటాకు నూరితి పెట్టుకొనఁగాఁ గలిగినయెఱుపు. "సీ. గోరంటో గోళ్లనిక్కువపుఁగెంపో యని చెయి పట్టి నయమున నెజ్జఁ జేర్చు." స్వా. ౬, ఆ. ౦.

గోరక్షణము. సం. వి. అ. పుం. 1. పసుల గాఁచుట; 2. నారింజాకు; 3. బుడమభోషధి.

గోరగించు. వై. అ. క్రి. భయంకరమగు. (చూ. గోరగింత.)

గోరగింత. వై. వి. (గోరగించుధా.) ఘోరత, భయంకరకృత్యము. "గీ. గోరగింత యనంగను గోరత యగు." ఆం. భా. ప్ర. ౧౩౨.

గోరడి. వై. వి. (గోరు+అడి.) నఖక్షతము, గోటి నొక్కు. "క. వెడలి సతి రతిఁ బెనంగిన, బడలిన నిట్టూర్పు తోట్రుపాటును జనుగో,రడి మోవి కాటు చిమచిమ, జడిచెమట నటింపఁ జూపె సోపానగతుల్." పాంచా. ౫, ఆ. ౩౨.

గోరతనము. వై. వి. (గోరము+తనము.) దుష్ప్రవర్తనము, చెడునడత. "గీ గోరతనములు మాన రాకొడుకుఁగుఱ్ఱ." కాశీ. ౪, ఆ. ౯౧.

గోరప. దే. వి. అంతు, అఘోషణము ఆం. భా. ప్ర. ౧౧౫.

గోరపడు. వై. అ. క్రి. (గోరము+పడు.) బాధపడు. "క. చేరినఁ గాసారాఖ్యుఁడు,రా రమ్మని మిగుల నాదరమ్మునఁ జూచిం,పార నొసఁగెఁ గక్కస మని.గోరపడక యివిసు సాత్త్వికులచరితంబుల్." పరమ. ౧, ఆ. ౦౪.

గోరము. వై. వి. (సం. ఘోరమ్.) 1. దేహము యొక్కఅస్వాస్థ్యము. (శ. ర.); 2. ఆపద, కష్టము. "క... మాయన్నకుఁ జే,టగపడియెనేని జేజేల్, ముగురును గడ లేనిగోరములపా ల్గారే." అచ్చ. ఆర. ౪౭; 3. దారుణకృత్యము, ఘోరపుఁబని. "సీ. కొడుకునకై యిట్టిగోరంబు సేసినయింతి యీ కైకేయి యేమి గనియె." భా. రా. యు. ౨, ఆ. ౬౧౧; 4. రోఁత, అసహ్యత. (శ. ర.); 5.

పోరు, జగడము. "చ...సవతిగోరము గాన మటంచు నెంచి..." శుక. ౨, ఆ. ౧౧౨.

గోరవంక = గోరువంక. వేంక. తిర్య. ౯౮.

గోరసము. సం. వి. అ. పుం. 1. ఆవుపాలు; 2. పెరుగు; 3. మజ్జిగ.

గోరాటి. సం. వి. ఈ. స్త్రీ. గోరువంక, శారిక.

గోరి. హిం. వి. కట్టినసమాధి.

గోరించు. దే. అ. క్రి. ఎగయు. "సీ. చెండు గోరించిన దండిగాc జై నుండి సఖుచనుల్లుc బడుc గొంత సేపు." రాధికా. ౪, ఆ. ౧౦౫. కళా. 3, ఆ. ౧౧౧.

గోరింపు. దే. వి. (గోరించు. ధా.) ఎగపు, ఎగరుట. "సీ. కసిదీఱ కేళు లేని గ్రక్కునc దమి రేcచి కుఱుచగోరింపులc గొంత సేపు." కళా. ౪, ఆ. ౬౮;

గోరింపుబంతులు. దే. వి. బ. (గోరింపు+బంతులు.) బాలక్రీడావిశేషము. "సీ పావరింటిపట్టులc జవరింపుపట్టులc బంతుగా గోరింపుబంతు లాడు." ఉ. హరిశ్చ. 3, ఆ. ౧౫.

గోరింపులాడు. దే. అ. క్రి. (గోరింపులు+ఆడు.) ఎగురcగొట్టు, చంపు. "సీ. తోలి వేలుపులమూక దురములో గోరింపులాడి తాండవమాడునట్లు గాదు." నిరం. 3, ఆ. ౯.

గోరు. వై. వి. ఔ. (సం. ఖురః.) 1. నఖము. "శా. వాలారుంగొనగోళ్ల నీ వలసతకా వాయించుచో నాటకుకా, మేళం బైనవిపంచి..." స్వా. 3, ఆ. ౫౭; 2. తంటి మీటుటకు బంగారు మొ. వానితోc జేసి వ్రేలికిc దగిలించుకొను ప్రతినఖము. "ఉ. కీర మనోజ్ఞవాణి యొకకిన్నరి కిన్నెర మీటి మీటి యొయ్యారపులీల నేగి వసుధాధిపుc గన్గొని జిల్గుపయ్యెదన్, హారముc జక్కcబెట్టెడు కుచాయితహస్తము పైడిగోళ్ల హిం,సారతి సేయు దర్పకుని సంపcగిములుక్కులువోలె మించcగన్." స్వా. ౫, ఆ. ౬౪. 3. గద్దగోరు, చోరునిసాధనములలో నొకటి; 4. అరcటిపువ్వులోని కేసరములపైc గల వృత్తాంశము. "గీ. కదళి దివియించె వ్యాఘ్రాంఘ్రి కంబు తొడల, పెనుపు పెట్టన్నc బొరలసోదన నడcచు, కొన్నమూcదోcకపాటును గొప్పు విప్ప, మెఱయుంగోర్ప్రిచ్చులను గెంపు గుఱులు గావె." ఆము. ౫, ఆ. 3౦. (ఇది మూcడుసాలుగర్థముల రెండిటికి నుదాహరణమే.) విశ. 1. అల్పము. చిన్న. ఉదా:—గోరుచిక్కుడు; 2. గోర సహింపc దగినది. ఉదా:—గోరువెచ్చ. సా:— 1. గోరంతాలస్యమునc గొండంత ప్రయోజనము తప్పును." కళా. ౨, ఆ. ౧౭౦; 2. గోరంతలు కొండంతలు చేయు. ఆము. ౫, ఆ. ౭౭; 3. గోటి నాపనికి గొడ్డలి యన్నట్లు. కళా. ౪, ఆ. ౧౬౦ 4. గోళ్లు గిల్లుకొనుచు కూర్చుండు = వ్యర్థముగc గాలము కడపు. (వా.) 5. గోళ్లు మీటుచు వ్యర్థముగc గాలము కడపు. శుక. ౨, ఆ. 333.

గోరుగల్లు. ద్వ. వి. ఔ. (గోరు+కల్లు.) నఖోత్పాటని, గోళ్లు తీయుసాధనము. "ఆ. పదను గోరు గండ్లc బదరక కొందఱు, కండ్లు పెఱికి..." సానంద. 3, ఆ. ౧౦౮.

గోరుగాలము. ద్వ. వి. (గోరు+గాలము) చేపలను బట్టుటకు చివర గోటివలె నున్న సాధనము గల గాలము. (శ. ర. వా.)

గోరుగొండి = గోరుగల్లు. "ద్వి. దండియై యాముష్టి హస్తంబున గోరు,గొండి వల్పటికంటి గొలికిలో నుంచి." పండితా. మహిమ. ౨౫౧. పు. 3౦. పు. ౮. పం.

గోరుచిక్కుడు. ద్వ. వి. (గోరు+చిక్కుడు.) ఒకజాతి చిక్కుడు. (శ. ర. వా.)

గోరుచీరణము. ద్వ. వి. (గోరు+చీరణము.) గోటివలెc గొనయందు వంపు గలయుంలి. (శ. ర.)

గోరుచు. దే. స. క్రి. బంతినిగొట్టు. (చూ. గోర్పు.)

గోరుచుట్టు. ద్వ. వి. (గోరు+చుట్టు.) గోటిచుట్టు లేచుకురుపు. సా:—గోరుచుట్టుపై రోcకటిపోటన్నట్లు = బాధపై మఱియొకబాధ. "ఆ. సుజనవినుత గోరుచుట్టుపై రోcకటిపోటు తాcకి నట్లపో తలంప." హరిశ్చ. ౫, ఆ. ౭౯.

గోరుపడము. వై. వి. గోఱుపడము, నల్లకంబళి. ఆం. భా. ద్వి. ౧౫౮. [గోరుపులాడు.)

గోరుపు. దే. వి. (గోరుచు. ధా.) గోర్పుట. (చూ.

గోరుపులాడు. దే. స. క్రి. (గోరుపులు+ఆడు.) బంతి కొట్టు, ఎగురcగొట్టు. "చ. గురుకుచగుబ్బచన్నుc గవ గోరుపులాడును బుట్టచెండ్ల..." చంద్రా. ౨, ఆ. ౧౭౭. (ఇట ఔపమ్యద్యోతకము.)

గోరురాజనాలు. ద్వ. వి. బ. (గోరు+రాజనాలు.) ధాన్యవిశేషము. "సీ. జిలకఱరాజనాల్ చింత పువ్వులు గోరురాజనాలు..." హంస. ४, ఆ. ౧౭౫.

గోరువంక. వై. వి. (సం. గోరంకుః.) 1. శారిక. "గీ. గోరవంక గోరంక నా గోరువంక." వేంక. తిర్య. ౯౫; 2. నఖక్షతము. ఆం. భా. తృ. ౬౦.

గోరువెచ్చ. ద్వ. వి. (గోరు+వెచ్చ.) గోరు పట్టు వెచ్చదనము. విశ. గోరు సహించువెచ్చఁదనము కలది. (చూ. గోర్వెచ్చ.)

గోరొత్తు. ద్వ. వి. అ. క్రి. (గోరు+ఒత్తు.) నఖ క్షతము. "సీ...గోరొత్తులకుఁ జబుగుబ్బ లొసఁగి." కళా. ౭, ఆ. ౧౬౧. భాను. ౨, ఆ. 3౯.

గోరోచనము. సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

గోరోజనము. వై. వి. (సం. గోరోచనా.) పశువుల పిత్తరసమునుండి తీయఁబడిన యొకానొకపసుపు పచ్చనిపదార్థము, గోరోచన. ఆం. భా. ద్వి. ౧౩3.

గోర్గొండి = గోరుగొండి. "సీ. మెడ మెట్టి గోర్గొండి మెఱికె పుచ్చఁడు వీని గ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింప." కాశీ. 3, ఆ. ౧౫౨. "గీ. వాఁడి గోర్గొండిఁ గన్నులు దోఁచియైన." భీమ. ౬. ఆ. ౧౦౦.

గోర్చు = గోరుచు. 1. (బంతియెగురఁగొట్టు.) "మ. తరుణుల్ వీటిశిరోగృహాళి నిసి ముక్తాకందుకం బాడుచోఁ, గరకంజంబున జాఱి బంతి కడ కేఁగం దత్స్వలిం జేరుచం,మురుఁ దద్బుద్ధి గ్రహించి గోర్వఁగఁ దదస్తోకాహలిం గందెఁ గా, కురుమాలిన్యము సత్కలాధిపతి కె ట్లొందుఁ మదిఁ జూడఁగన్." చంద్రి. ౧, ఆ. ౧౦౨; 2. (ఖండించి-ఎగురఁగొట్టు.) "మ...మారిచము,వక్కరుమే నాశుగయుక్తి గాలిపటముం గా వింట సాడించుచున్, సొరిదిం దక్కినదైత్యకోటితలబంతు ల్గోర్చి మెప్పించె..." చంద్రా. పీఠి. ౨౧.

గోర్చుట్టు = గోరుచుట్టు. శేష. 3, ఆ. ౨౬3.

గోర్పడము = గోరుపడము. "గీ...వేలుపుం జూపి నపుడె,యెలమి నాపయిగోర్పడం బిత్తు నీకు." చెన్న. 3, ఆ. ౭౭. వేం. పంచ. ౧, ఆ. ౫౫౫.

గోర్పిల్లి. దే. వి. బ. గోరింపులు, బంతులాట. (చూ. గోర్పిల్లార్చు.)

గోర్పిల్లార్చు. దే. స. క్రి. (గో.్పిల్లార్చు.ధా. ప్రే.) చెండువలె నెగయఁజేయు; బంతులవలె నెగురఁ జేయు. "శా.. అతండు...దాంతిరథరథ్యవ్రాతముల్ చేతులన్, గోర్పిల్లార్చుచు వచ్చుచున్నఁ గని రక్షోనాథసేనాధిపుల్." రామా. ౬, ఆ. ౨౦౬.

గోర్వంక = గోరువంక. ఆం. భా. ద్వి. ౦౯.

గోఱజము. వై. వి. గోరోజనము. "ఆ. గోఱజంబు జొన్న చాఱపప్పు." స్వా. ४, ఆ. ౧४.

గోల. ఉభ. దే. వి. 1. స్త్రీ, ఆఁడుది. "గీ. గోల లెచ్చట గాటంపుఁగోప లెచట." అచ్చ. అయో. ౭౭. ఆం భా. ద్వి. ౧౦४; 2. అవ్యక్తధ్వని; కలకలము. (వా.) విశ. 1. ముగ్ధుఁడు. "ఉ... విప్రవరుండు గోలయుండు, బాలుఁడుఁ గాన నప్పటికిఁ బై బడఁ గొంకెను..." స్వా. 3, ఆ. ౬४; 2. ముగ్ధ,ముద్దరాలు." ఆం. సం. మాన. ४. సం. వి. ఆ. స్త్రీ. 1. గోదావరి; 2. కాఁగు; 3. మణిసిల; 4. చెలికత్తె; 5. చెండు; 6. గోలీ.

గోలకము. సం. = గోళము.

గోలకుఁడు. సం. గోళుఁడు.

గోలతనము. ద్వ. వి. (గోల+తనము.) మౌగ్ధ్యము, ముద్దరాలితనము. "ఉ. గోలతనంపుఁజిల్కయని కోమలి నవ్వకు నీవు ముందుగా,బేలవు గాక తప్పదు..." రాఘా. ౨, ఆ. ౧४౨. రసిక. ౧, ఆ. ౧౭౨. [ఖంజోటి.

గోలత్తిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుకాటుకపిట్ట,

గోలము. సం. = గోళము.

గోలాంగులము. సం. వి. అ. పు. ఆవుతోఁకవంటితోఁక కలది-కొండముచ్చు.

గోలాంగూలము. సం. = గోలాంగులము.

గోలించు. దే. స. క్రి. చమురు పోసి వేఁచు. (శ. ర.) (బ్రౌ.)

గోలి. వై. వి. (సం. గోలాంగూలః.) కొండముచ్చు (చూ. గోలికాఁడు.)

గోలికాఁడు. వై. వి. (గోలి+కాఁడుస్వార్థమున.) గోలి. "ద్వి. గోలికాఁడునుబోలె గోర్నేసఁ గొనుచు." పండితా. పర్వ. ౪౪౧. పు. ౧౪. పం.

గోలిహము. సం. వి. అ. పుం. మూష్కకము<sup>*</sup>.

గోలీ. వై. వి. (సం. గోలకః.) బాలు రాడుకొను చిన్నతాలియుండ. (శ. ర. వా.)

గోలీకాయ. ద్వ. వి. (గోలీ+కాయ.) గోలీ. (వా.)

గోలీఢము. సం. = గోలిహము.

గోలు. దే. వి. 1. పేముబొద్దునకు ప్రక్క నేర్పఱ చెడుసన్నని పేముబొద్దు. (శ. ర.); 2. ఏడ్పుట యం దగుధ్వని కనుకరణము. (ఆమ్రేడితమున గోలుగోలు.) "వ...గోలుగోలున నేడ్చిన..." నైష. ౧, ఆ. ౯౭.

గోలురించు. దే. అ. క్రి. గాండ్రించు, పులి యఱచు. (శ. ర.)

గోలురింపు. దే. వి. (గోలురించుధా.) వ్యాఘ్రగర్జా ధ్వని, పులియఱపు. ఆం. భా. ద్వి. ౭౨.

గోలెము. వై. వి. బాన, (కాఁగు అని శ. ర.) "ఆ. మగనిరాక యెఱిఁగి మగువ యొయ్యన ఱంకు, మగనిఁ దెచ్చి యింటిమఱుఁగునందుఁ, గల్లు గోలెమునను గదియించి యామీఁద, గంపదబ్బు వెట్టెఁ గదలకుంట." భల్లా. ౧, ఆ. (శ. ౦.)

గోలోమి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగఱికవి; 2. మరులుమాతంగివి; 3. వసవి; 4. నేలగొలిమిడివి; 5. వేశ్య.

గోల్గోలు. దే. వి. గోలు. (గోలుయొక్క ఆమ్రేడిత రూపము.) "క...దుల్గోలున నేడ్చెన్..." పరమ. ౪, ఆ. ౧౧౩. (శ. ర. పా. 'గోడ్గోము పాఠాం.)

గోవ. దే. వి. 1. గవయము, గురుపోతు. ఆం. భా. ద్వి. ౭౫; 2. యౌవనము. (చూ. గోవాల్లు.); 3. పశ్చిమసముద్రతీరమందలి నగరవిశేషము. "ఉ. గోవజవాది..." విజ. 3, ఆ. ౧౯౧. విశ. 1. మనోజ్ఞ. (శ. ర.) "ఉ. గోవపికవ్రజంబునునుఁ గూఁతకు..." దశ. ౬, ఆ. 3౭; 2. దుష్టము, చెడ్డది. (చూ. గోవావు, గోవతనము.)

గోవందని. సం. వి. ఈ. స్త్రీ. ప్రేంకణమువి.

గోవంధిని. సం. = గోవంధని.

గోవణము = గోణము. "గీ. వృక్షశాఖాంచలంబులపై వ్రేలుచున్న,కోటిసంఖ్యలనీరాక్కవిగోవణములు." కాశీ, ౨, ఆ. ౫౫. ౪, ఆ. ౬౧.

గోవతనము. ద్వ. వి. (గోవ+తనము.) దౌష్ట్యము, చెడ్డతనము. "క. మీపీటిమ్రుచ్చు లేవురు,మాపీటం గన్నపెట్టి మణిభూషణముల్, గోవతనంబునఁ దెచ్చిరి,నీ విటు సేయించు టెల్ల నేరము కాదే." దశ. ౪, ఆ. ౨౪.

గోవత్సము. సం. వి. అ. పుం. ఆవుదూడ.

గోవమొలత్రాడు. దే. వి. మగవానిమొలనూలు, శృంఖలము. (శ. ర. వా.)

గోవర్ధనము. సం. వి. అ. పుం. గిరివిశేషము. న. గోవుల వృద్ధి. విశ. 1. (అ. ఆ. అ.) గోవృద్ధి గలిగించు నది; 2. (అ. ఈ. అ.) గోవృద్ధికి సాధన మైనది.

గోవశ. సం. వి. ఆ. స్త్రీ. గొడ్డావు.

గోవావు. దే. వి. (గోవ+ఆవు.) దుష్ట మగుగోవు- కపట. "వ...దూడలం గుడువ విడిచి దుగ్ధదోహ నంబునకుం జేరవచ్చిన బెదరి పసులసందునం బాఱిపోవుగోవావుల వెనుదగిలి..." వి. పు. ౭, ఆ. ౧౪౭.

గోవాళులు. దే. వి. బ. (గోవ+వారలు.) 1. యౌవన వంతుఁడు. (చూ. గోవాల్లు.); 2. యౌవన వంతులు. "మ...ఎఱుకుగోవాళుల్ ప్రసూనా శుగ,ప్రదరప్రేరితచిత్తవృత్తు లగుచున్ భ్రాంతమ్ము లం ద్రిమ్మరన్." కాళ. 3, ఆ. ౧౧; 3. విటుఁడు. (చూ. గోవాల్లు.)

గోవాల్లు = గోవాళులు. 1. (యౌవనవంతుఁడు.) "క. తిమిరంపువయసుగుబ్బల, కొమరాలవు నీకుఁ దగినగోవాల్ల మహిన్, నెమకె నగరాజు మఱిసిన, మమ్ముఁ జెనకిన నేమి గలదు మద మేమిటికిన్." స్వా. ౪, ఆ. ౭3; 2. (విటుఁడు, జారుఁడు.) ఆం. భా. ద్వి. ౧౧౬; 3. (విటులు, జారులు.) సాం. ని. మాన. ౭.

గోవిందుఁడు. సం. వి. అ. పుం. 1. గోపాలుఁడు; 2. కృష్ణుఁడు; 3. బృహస్పతి.

గోవిట్టు. సం. వి. ష్. స్త్రీ. గోమయము, ఆవుపేఁడ.

గోవు. సం. వి. ఓ. స్త్రీ. 1. ఆవు; 2. ఆఁడుగుఱ్ఱము. 3. గుఱ్ఱము. పుం. స్త్రీ. 1. స్వర్గము; 2. వజ్రము.

3. ఉదకము; 4. కిరణము; 5. నేత్రము; 6. బాణము; 7. రోమము; 8. సారి, అష్టైత్రాడు.

గోవృషభము. సం. = గోవృషము.

గోవృషము. సం. వి. అ. పుం. ఆఁబోతు.

గోశీర్షము. సం. వి. అ. న. హరిచందనము, అరిదళము.

గోషా. హిం. వి. ఘోషా, అంతఃపురము. (శ. ర.)

గోష్ఠము. సం. వి. అ. పుం. న. 1. పసులసాల; 2. గొల్లపల్లె.

గోష్ఠశ్వము. సం. వి. అ. పుం. గోష్ఠమందలికుక్క. విణ. (ఆ. ఆ. అ.) పసులసాల యందలికుక్కవంటి వాఁడు—తా నుండుచోటనుండి పరులను దూషించి ద్వేషించువాఁడు.

గోష్ఠి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. సభ; 2. సంఘము; 3. సల్లాపము; 4. ఒక్కయంకముతో ముగియు రూపకవిశేషము.

గోష్పదము. సం. వి. అ. న. 1. గోపాదపరిమాణము గలచోటు; 2. గోపాదమున నేర్పడినగుంట; 3. గోవులు సంచరించుతావు.

గోసంఖ్యుఁడు. సం. వి. అ. పుం. గొల్లవాఁడు.

గోసంగి. వై. వి. (సం. గోహింసకః.) 1. మాదిగవాఁడు, గూబరి. "క. సంగీతఫలంబున గో,సంగి నగ మైన దయ పొసఁగ నీవే..." ఆము. ౬, ఆ. ౬౮. ఆం. భా. ద్వి. ౨౮౯; 2. ఆతతాయి, గురుభార్య నపహరించినవాఁడు. "గీ. అరయఁ బాశ్చాత్యమహిభృత్పదాంతరమునఁ, దిరిగి సురపానహితరితి సొబగెసంగి,సరగ గురుభక్తి దొరగి గోసంగి వైతె,నీకుఁ జెల్లునె ద్విజరాజనియతిచంద్ర." కృష్ణ. ౮, ఆ. ౮౬.

గోసడఁచు. దే. స. క్రి. (గోసు+అడఁచు.) నిందించు, తిట్టు. "మ. మనలన్ ధూర్జటితోడ గోసడఁచి కామధ్వంసి కట్టీక పొం,దని చక్రాంకునిఁ జూచి..." నిర్వ. ౨, ఆ. ౯౩.

గోసన. వై. వి. (సం. ఘోషణా.) 1. చాటింపు, ప్రకటనము. (చూ. గోసనపుచ్చు.) ఆం. భా. ప్ర. ౧౧౮. 2. ఘోషము, గోల. "క. మా సొమ్ము మాకు నొసఁగిన, మీసొమ్ముల్ మీకు మగుడ మీమాసొమ్ముల్, వాసివడకుండ నూరక,గోసన యేమిటికి మార్చుకొనియెద మొండెన్." పిన. శకు, ౩ ఆ. ౧౨.

గోసనపుచ్చు. ద్వ. స. క్రి. (గోసన+పుచ్చు.) 1. చాటించు, వెల్లడచేయు. "చ...దాసియుఁన్, గొఱగొఱ వీట నెల్లెడల గోసనపుచ్చిన..." దశ. ౧౦, ఆ. ౧౨౬; 2. మెచ్చు, కీర్తించు. "మ. తనదుర్వారతరప్రతాపమునఁ జిత్తస్నేహముల్ గట్టిసే,యునితం డెట్టివిదగ్ధుఁడో దలఁప నోహో యంచు లోకంబు గో,సనపుచ్చున్..." దశ. ౧. ఆ. ౭.

గోసము. సం. వి. అ. పుం. 1. బాలెంతబోళము; 2. వేకువ.

గోసర్గము. సం. వి. అ. పు. ఆవులను (మేఁతకు) విడుచువేళఁ ప్రభాతము. వేకువ.

గోసు. వై. వి. (సం. ఘోషః.) 1. గోటింపు, ప్రకటనము. ఆం. భా. ప్ర. ౧౧౮; 2. నింద, దూఱు. (చూ. గోసడఁచు.) హరి. పూ. ౫, ఆ. ౨౩౮.

గోసెక్కించు. ద్వ. స. క్రి. (గోసెక్కు ధా. ప్రే.) మెచ్చు, కీర్తించు. "క. కఱదులమాటలమమ్ముం, గుఱుచపడుగ యేల యింత గోసెక్కింపన్, నెఱయఁగ నీయిష్టము మా,కెఱిఁగింపుము వేడ్కనిత్తు మెయ్యది యైనన్." హరి. ఉ. ౧౦, ఆ. ౨౮౩. కాశీ. ౧, ఆ. ౫౩.

గోసెక్కు. ద్వ. అ. క్రి. (గోసు+ఎక్కు.) 1. మెప్పగను. (చూ. గోసెక్కించు.); 2. గోరంతలు కొండంత లగు; దోషారోపణ మగు. "ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడునాసవ మర్థిఁ దేరఁగా, నొక్కనికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో,సెక్కఁగఁ జేసి నన్ను నతిహీనవిధానవియుక్తఁ జేఁత గా,నిక్కమ యుమ్మలించి తిది నెయ్యము తియ్యముకల్మియే సతీ." భార. విరా. ౨, ఆ. ౯౦.

గోస్తనము. సం. వి. అ. పుం. 1. ఆవుచనుకట్టు; 2. నలుపది పేఁటలు గలరత్నహారము.

గోస్తని. సం. వి. ఈ. స్త్రీ. 1. ద్రాక్ష; 2. నదీవిశేషము.

గోస్వామి. సం. వి. న్. పుం. 1. గోపాలుఁడు; 2. జితేంద్రియుఁడు. (గోస్వామితులసీదాసు.); 3. (నాట్యపరిభాషయందు) రాజకుమారుఁడు.

గోహత్య. సం. వి. ఆ. స్త్రీ. ఆవును జంపుట.

గోహత్యగాఁడు. మి. వి. (గోహత్య+కాఁడు.) ఆవును జంపినవాఁడు. వరాహ. ౧౦, ఆ. ౬౫.

గోహరి. దే. వి. శౌర్యము, పరాక్రమము. "సీ. హరికిశోరములగోహరికి శోషలనిమర్వారగర్వా టోపవీరభటులు." జై. ౬, ఆ. ౧౫౪.

గోహరీతకి. సం. వి. ఈ. స్త్రీ. మారేడుచెట్టు.

గోళకము. సం. = గోళము.

గోళకుఁడు. సం. = గోళుఁడు.

గోళము. సం. వి. అ. పుం. న. 1. (భూమ్యాది) మండలము; 2. గోలీ. పుం. బాలెంతబోళము.

గోళి. వై. వి. (సం. ఘోలీ) ఒకానొకఆకుకూర. "గీ...చిల్కకూరగోళికూర..." హంస. 3, ఆ. ౧33. "సీ...గోళి యటన్నను ఘోలియొప్పు." ఆం. భా. ద్వి. ౭౪.

గోళుఁడు. సం. వి. అ. పుం. విశంతువువకు జారుమగనివలనఁ బుట్టినకొడుకు.

గోళ్లకులికంటు. ద్వ. వి. స్త్రీకంఠభూషావిశేషము. (శ. ర.) గోళ్లగొండి. ద్వ. వి. తృణవిశేషము. బ. తృణధాన్యవిశేషము. "గీ. గునుకు టావర్లు బరపటల్ గోళ్లగొండు,లు..." కాళ. 3, ఆ. ౧౫౧.

## గౌ

గౌండ్లవాఁడు. వై. వి. (సం. గోండః.) గవుండ్ల వాఁడు. (శ ర.)

గౌఁడు. వై. వి. 1. సారాయి అమ్మువాఁడు; 2. కాఁపువారిపట్టపుపేరు. (శ. ర.) విశ. మోటు సింగారము గలది. "ఉ. జీటికకల్లు ద్రావి మదసింధురగామినులన్ని కేరియల్, వాఱుచుఁ గౌఁడు గీతములు వాడుచుఁ బొల్పుగఁ గ్రాలి యాడుచున్." కు. సం. ౬, ఆ. ౪౫.

గౌడ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకస్త్రీరాగము.

గౌడపేరు = గవుడపేరు. (చూ. గవుడపేరు.)

గౌడము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము. న. భక్ష్యవిశేషము, గుడముతోఁ జేసినపిండివంట.

గౌడలి. దే. వి మసలి, బల్లి. వేంక. మాన. 3౬.

గౌడసరము. ద్వ. వి. (గౌడ+సరము.) 1. చెంపసరము. కళా. ౭, ఆ. ౬౫; 2. హస్తాభరణవిశేషము. "గీ. కేల గాజులు గౌడసరాలు దొడిగి." వైజ. ౪, ఆ. 3౦.

గౌడి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకరీతి; 2. ఒకానొకస్త్రీరాగము.

గౌడికము. సం. వి. అ. పుం. చెఱకుచెట్టు. న. ఒకరకపు మద్యము. విశ. (అ. ఆ. అ.) బెల్లముతోఁ జేయఁబడినది.

గౌణము. సం. విశ. (అ. ఈ. అ.) 1. అప్రధానము; 2. ఔపచారికము; 3. గుణసంబంధమైనది.

గౌణ్యము. సం. వి. అ. న. అప్రాధాన్యము.

గౌతమి. సం. వి. ఈ. స్త్రీ. 1. గోదావరి; 2. గౌతమన్యాయశాస్త్రము; 3. గోమతీనది; 4. బుద్ధబోధ; 5. పసుపు; 6. గోరోజనము.

గౌతముఁడు. సం. వి. అ. పుం. 1. గోతమవంశజుఁడు, గౌతమమహర్షి; 2. శతానందుఁడు; 3. భరద్వాజమహర్షి; 4. కృపాచార్యుఁడు; 5. బుద్ధదేవుఁడు.

గౌద. దే. వి. 1. చుబుకము. "సీ...హస్తాంగుళిద్వము మబలగౌదక్రింద నివ్వగ నిడి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౭౭; 2. చెంప. ఆం. భా. ద్వి. ౧౪3.

గౌదకట్టు. దే. వి. (గౌద+కట్టు.) 1. చెంపలను మూసి కట్టుట. ఆం. భా. తృ. 3౭; 2. అట్లు కట్టినకట్టు. "చ...గౌదకట్టు గసచేరులటెక్కియుం దోఁపు నొల్చి పోన్." ఆము. ౬, ఆ. ౮౧.

గౌధారము. సం. వి. అ. పుం. ఉడుముపిల్ల. ఇట్లే గౌధేయము, గౌధేరము మొ.

గౌర. దే. వి. బేహారి, వర్తకుఁడు. "గీ. అతనినగరున నోడకాఁ డగుచు నొకఁడు, వెలయు వసుమంతుఁ డనుగౌర చెలువు మీఱ." శుక. ౧, ఆ. ౧౭౨. హంస. ౧, ఆ. ౧౧౨.

గౌరము. సం. వి. అ. పుం. 1. తెలుపు; 2. పసుపు; 3. ఎఱుపు; 4. తెల్లావచెట్టు; 5. ఒకానొకజాతి మృగము. న. 1. అకరువు; 2. బంగారు; 3. కుంకుమపువ్వు. విశ. (అ. ఈ. అ.) 1. తెల్లనిది; 2 ఎఱ్ఱనిది; 3. పసుపుపచ్చనిది; 4. స్వచ్ఛమైనది.

గౌరవము. సం. వి. అ. న. 1. బరువు; 2. గొప్పతనము; 3. మన్నన. విశ. (అ. ఆ. అ.) గురుసంబంధమైనది.

గౌరవించు. సం. స. క్రి. మన్ననచేయు. హర. 3, ఆ. ౫3.

గౌరవితము. సం. విశ. (అ. ఆ. అ.) పూజ్యము, గౌరవము గలది.

(గౌ)రి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. ఎనిమిదేండ్లపిల్ల. (శ్లో. అష్టవర్షా భవే ద్గౌరీ నవవర్షాతు రోహిణీ.); 3. సమర్తాడనికన్య; 4. భూమి: 5. పసుపు; 6. గోరోజనము; 7. తులసి♆; 8. వాక్కు; 9. సువర్ణకదళి♆; 10. మంజిష్ఠ♆; 11. ఒకానొకరాగము. "ఉ...గౌరి బిలావరి..." చెన్న. ౨, ఆ. ౨౩౬.

(గౌ)రికుంకుమలు. మి. వి. బ. ధాన్యవిశేషము. "సీ... సీతాభోగసరులు గౌరికుంకుమల్ ..." హంస. ౪, ఆ. ౧౨౫.

(గౌ)రిగనయము. మి. వి. వస్త్రవిశేషము. "ద్వి. గౌరి గనయమును క్షీరోదకంబు." బస. 3, ఆ. ౯౬. పు. ౧౨. పం. (గౌరిగణ్యము లని. బ్రౌ.)

(గౌ)రిజము. సం. వి. అ. న. అభ్రకము.

(గౌ)రు. దే. వి. 1. ఏనుఁగు. "చ...ఏనుఁ గటంచుఁ గొమ్ములం, జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసినమొత్తపు సింగపుంగమిం, గనుఁగొని పాఱు వేల్పుదొర గౌరతఁడౌదల కు స్తరింపఁగన్." య. ౧, ఆ. ౭౭. భార. అను. ౧, ఆ. ౨౨౧; ౨౨3; 2. కావాళి, బా. రా. అం. భా. త్రి. ౪౪; 3. కపటము. అం. భా. ప్ర. ౧౩౫. విశే. కావాళివంటి, బిగ్గఱయైనది. "ఆ. నమ్మివేగమిటకురమ్ము బాలక యని, యెలుఁగు పిలిచె గౌరుటెలుఁగునెలఁగ." ద్వా. ౧, ఆ. ౨౯౧. (బ్రౌ. పా. 'కాఱుటెలుఁగు' ముద్రి.)

గౌరుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. బ్రహ్మ.

గౌరుకాకి. ద్వి. వి. (గౌరు+కాకి.) బిగ్గఱగాఁ గూయునది, బొంతకాకి. (బ్రౌ.)

గౌలు. ద్వి. వి. 1. వాసన. "చ...లేఁగపులితండము నెత్తుటిగౌలుకై వాళావాళిమెయి రాఁగ..." సా. 3, ఆ. ౧౧౭; 2. దుర్వాసన. "గీ. మూఁడు వేళలఁ బురువులఁ దోఁడి వేసి, నీళ్లచే గౌలు వోవంగ నెమ్మి గడిగి." భిల్హ. ౨, ఆ. (శ. ర.)

గౌష్ఠీనము. సం. వి. అ. న. అంతకుముందు గోవుల మంద యున్నచోటు.

గౌసెన. వై. వి. (సం. కోశః.) వీణె మొదలగువాని మీఁదిమొఱ. "క...నాదగు, కౌశిమియ నీసైన్య మునకు గౌసెన గాదే." భార. ఉద్యో. ౪, ఆ.

గౌళ. ఉభ. దే. వి. ఒకానొకజాతి. (బ్రౌ.) విశే. కఠినము, బిగ్గఱయైనది. ఉదా:—గౌళగొంతు. (బ్రౌ.)

గౌళము. దే. వి. వాసనకై యఱుఁగఁదీసి గందము నూనెలోఁ గలుపునొకగింజ. "సీ. గౌళముల్ పచ్చాకు కచ్చూరములు..." హంస. ౧, ఆ. ౮౧.

గౌళి. దే. వి. బల్లి, గౌడలి. "గీ. బల్లి గౌళన మసలికిఁ బరఁగు సొంబ." సాం. ని. తిర్య. ౭౪.

## గ్ర

గ్రంథకుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. గ్రంథాలయము; 2. గ్రంథములు వ్రాసికొనుగది.

గ్రంథన. సం. వి. ఆ. స్త్రీ. 1. కూర్పు, రచన; 2. మాలికాదులను గ్రుచ్చుట.

గ్రంథనము. సం. వి. అ. న. గ్రంథన

గ్రంథము. సం. వి. అ. పుం. 1. కావ్యము; 2. పుస్తకము; 3. మాలికాదులను గ్రుచ్చుట; 4. ధనము; 5. అనుష్టుప్పు, ముప్పదిరెండక్షరములశ్లోకము.

గ్రంథి. సం. వి. ఇ. పుం. 1. కంతి; 2. గనుపు; 3. ముడి; 4. గండివనము♆; 5. కుటిలత్వము; 6. బట్టకొంగున ముడివేయఁబడినధనము; 7. కీలు, అవయవసంధి. న్. పుం. 1. గ్రంథములు కలవాఁడు; 2. గ్రంథపాఠకుఁడు.

గ్రంథికము. సం. వి. అ. న. 1. పిప్పలీమూలము; 2. గండివనము♆; 3. శరీరము.

గ్రంథికుఁడు. సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు; 2. సహదేవుఁడు.

గ్రంథితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. రచింపఁబడినది. (మాలికాది.)

గ్రంథిపర్ణము. సం. వి. అ. న. 1. గండివనము♆; 2. పచ్చాకు♆; 3. మాచిపత్రి♆.

గ్రంథిలము. సం. వి. అ. పుం. వెణుతురు♆. న. 1. పిప్పలివేరు; 2. అల్లము♆. విశే. (అ. ఆ. అ.) గనుపులు గలది.

గ్రందె. దే. వి. ద్వారబంధములోనగువాని నిలువుల బిగఁగొట్టినచీలలకు తగిలించెడు తలుపులయందలి యినుపపట్టె. (శ. ర. గ్రంథి అని వాడుక.)

గ్రక్కతిలు. దే. అ. క్రి. కంపించు, వణఁకు. "ఉ...

రా. యు. ౧౭౩౪. రామా. ౨, ఆ. ౭. దశా. ౭, అ. ౨, ఆ. ౧౧౪.

గ్రక్కదలు. దే. అ. క్రి. (గ్రక్క+అదలు.) 1. చలించు, కంపించు. "చ. కదఁ గొని భీమ దంత్యలయకాలకృతాంతుఁడపోలె నేల గ్రక్క దల నదల్చి నిల్చిన." భార. అర. ౪. ఆ. ౧౯; 2 తూలు, పొడగు. "చ...కంతుశరవ్యథ మాన మెల్ల గ్రక్కదలి కలంగకుండ..." వరాహ. ౪, ఆ. ౪౨.

గ్రక్కన. దే. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా. "మ... ధాత...గ్రక్కన లంకాపురి కేఁగెఁ జారణ ముఖుల్ కైవారముల్ సేయఁగన్." ఉ. రా. ౫, ఆ. ౧౨. పాని. పీఠి. ౨౩.

గ్రక్కిలు = గ్రక్కతిలు. (చూ. గ్రక్కిలువడు.)

గ్రక్కిలువడు. ద్వ. అ. క్రి. (గ్రక్కిలు+పడు.) చలించు. "ద్వి. గ్రక్కిలువడకనరంబులు స్రుక్క." పండితా. పురా. ౨౭౫. పు. ౧౯. పం.

గ్రక్కున = గ్రక్కన. 1. (శీఘ్రముగా.) "చ... గ్రక్కున నవలప్రవేశమునకుం గృతనిశ్చయ యయ్యె నంతటన్." విక్ర. ౬, ఆ. ౧౨౬; 2. (మిక్కిలిగా) "ఉ...కపోతహంస కృతిన్ గ్రక్కున మ్రాల్గుచున్..." వసు. ౨, ఆ. ౯.

గ్రచ్చ = గచ్చ. "క. గ్రచ్చ కదలినట్టు..." జై. ౪, ఆ. ౭౨. ఆం. భా. ద్వి. ౪౯.

గ్రచ్చకాయ. దే. వి. (గ్రచ్చ+కాయ.) గచ్చకాయ. "సీ. కలి వోసి నాన్చిన గ్రచ్చకాయలభంగి..." కాశీ. ౩, ఆ. ౧౩౯. బ. బాలక్రీడావిశేషము, గచ్చకాయలు కొన్ని క్రిందఁ బెట్టి కొన్ని పైకి రువ్వుచు క్రిందపెట్టినవి పైకి రువ్వినవి పట్టు కొనుచు నాడునాట. "సీ.డాఁగిలిమ్రుచ్చులాటలు గ్రచ్చకాయలు..." కాశీ. ౩, ఆ. ౩౩.

గ్రచ్చ. వై. విణ. (సం. గ్రస్తమ్.) వర్ణలోపము గాని పదలోపము గాని కలిగినది. (మాట. శ. ర.)

గ్రథనము. సం. వి. అ. న. 1. (రక్తాదులు) గడ్డ కట్టుట; 2. (మాలికాదులు) గ్రుచ్చుట; 3 (గ్రంథాదులు) రచించుట.

గ్రథితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. గడ్డకట్టినది. (రక్తాదు.); 2. గ్రుచ్చఁబడినది. (మాలికాది.); 3. రచింపఁబడినది. (గ్రంథాది.)

గ్రద్ద. దే. వి. పక్షము, రీతి. "వ...కుమారచరిత్రంబు తేర... జను గద్దంబుబాతి...మాఘరవిచా రంబు గ్రద్ద..." భాగ. ౯. స్కం. ౧౩౦. ౯, స్కం. ౪౪౭ వై. వి. (సం. గృధ్రః.) గద్ద. ఆం. భా. ద్వి. ౯౩.

గ్రద్దగోరు = గద్దగోరు. 1. (చోరసాధనములలో నొకటి.) "మత్త. గాలిచీరయుం నొల్కిబూడిద గ్రద్దగోరుచు గ్రొంకికుఁన్." ద్వా. ౧౦, ఆ. ౧౧౯; 2. (మల్లసాధనములలో నొకటి.) "గీ... గ్రద్దగోళ్లు, చూరిబాణా ధరించు చవ్వీరుఁ డెపుడు." హంస. ౧, ఆ ౨౦౫.

గ్రద్దన. దే. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా. "క... అయ్యిద్దఱుఁ దమరథములపై, గ్రద్దన నిడికొని తొలంగఁగాఁ జని రథిపా." భార. భీష్మ. ౩, ఆ. ౪౩.

గ్రద్దముక్కువాఁడు. ద్వ. వి. (గ్రద్ద+ముక్కు+ వాఁడు.) ఖరణసుఁడు, వాఁడముక్కు గలవాఁడు." ఆం. భాం. ద్వి. ౧౨౧.

గ్రమ్మన = గ్రద్దన. "క. గ్రమ్మన నెత్తురుటేరులు, గ్రమ్మన్..." జై. ౭, ఆ. ౧౬౧.

గ్రసనము. సం. వి. అ. న. 1. కబళించుట; 2. కబళము; 3. తినుట.

గ్రసించు. సం. స. క్రి. 1. తిను; 2. ఆకర్షించు. "చ...సుందరహారి నీలజాలము తృణంబుఁ గ్రసించెఁ దదీయశైల్యభాగురుకచమంజిమంబు నకు నోడి..." కవిజ. ౧, ఆ. ౬౫. (పైరెండర్థములకు నుదాహరణము.); 3. అంతర్గతము చేసి కొను, లోనడఁచుకొను. "చ...తదీయదోషమునఁ గుంభిని యోషధులన్ గ్రసించెఁన్." మార్క. ౪, ఆ. ౪౨.

గ్రసియించు = గ్రసించు. (మ్రింగు.) "వ...అవ్వి యత్తత్త్వంబు మనంబు గ్రసియించు..." భార. శాం. ౬, ఆ ౯౯.

గ్రసిష్ణువు. సం. విణ. (ఉ) 1. మ్రింగువాఁడు; 2 తినువాఁడు.

గ్రస్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తినఁబడినది; 2. మ్రింగఁబడినది; 3. ఆక్రమింపఁబడినది; 4. లోఁగఁదీయఁబడినది. (రోగగ్రస్తము దేహము.); 5. వర్ణలోపముగాని పదలోపముగాని కలిగినది. (మాట.); 6. గ్రహింపఁబడినది.

గ్రస్తి. సం. వి. ఇ. స్త్రీ. = గ్రసనము.

గ్రహణము. సం. వి. అ. న. 1. ఉపరాగము, రాహుకేతువులు సూర్యచంద్రులను బట్టుట; 2. పట్టుకొనుట; 3. తెలిసికొనుట; 4. తీసికొనుట; 5. బుద్ధి; 6. ఆదరించుట; 7. చేయి; 8. ఇంద్రియము; 9. శబ్దము; 10. బంది.

గ్రహణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. అతిసారరోగము; 2. ఒకానొకనాడి.

గ్రహణీయము. సం. విశే. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది.

గ్రహణీహరము. సం. వి. అ. న — గ్రహణిని బోఁగొట్టునది-లవంగము.

గ్రహనేమి. సం. వి. ఇ. పుం. చంద్రుఁడు.

గ్రహపతి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు; 2. జిల్లేడుచెట్టు; 3. చంద్రుఁడు. "శ్లో. తస్య విస్తీర్యతే రాజ్యం జ్యోత్స్నేవ గ్రహపతేరివ." భార. శాం. (వాచ.)

గ్రహము. సం. వి. అ. పుం. 1. సూర్యాది; 2. గ్రహించుట; 3. గ్రహణము, 4. చెఱ; 5. పిశాచము; 6. అనుగ్రహము; 7. ఆగ్రహము; 8. రాహువు; 9. నవసంఖ్య.

గ్రహాధారము. సం. వి. అ. పుం. ధ్రువనక్షత్రము. ఇట్లే: గ్రహాశ్రయము మొ.

గ్రహించు. సం. స. క్రి. 1. స్వీకరించు 2. పట్టుకొను. "గీ. పదియుఁ నెనిమిదివిద్య లీపద్మనయన, శ్రవణముల రెంట నర్థ మర్థము గ్రహించె" నైష. 3, ఆ. ౧౦౪.

గ్రహియించు = గ్రహియించు. (పట్టుకొను.) "సీ... గ్రహియించు విరులచాల్ గగనలక్ష్మి." ఉ. రా. ౧, ఆ. ౫౯.

గ్రహిలుఁడు. స. విశే. (అ. ఆ. అ.) 1. గ్రహించువాఁడు; 2. చలనము గలవాఁడు.

గ్రహీత. సం విశే. (ఋ. త్రీ. ఋ.) 1. పట్టుకొనువాఁడు; 2. తెలిసికొనువాఁడు.

గ్రహీతవ్యము. సం. = గ్రహణీయము.

గ్రా

గ్రాంథికము. సం. విశే. (అ. ఈ. అ.) గ్రంథమునందలిది. (భాష మొ.)

గ్రాఁజె. దే. వి. వృక్షవిశేషము. "గీ. కడిమి చిగిరించె గ్రాఁజవంగడము ననిచె, నఖిలహిత మైన మేఘోదయంబునందు." పాండు. ౪, ఆ. ౨౧.

గ్రామటిక. సం. వి. ఆ. స్త్రీ. స్వల్పగ్రామము, పల్లెటూరు.

గ్రామణి. సం. వి. ఈ. పుం. మంగలి. ఈ. స్త్రీ. 1. వేశ్య; 2. నీలిచెట్టు. విశే. (ఈ. ఈ. ఇ) గ్రామాధిపతి; 2. ముఖ్యుఁడు.

గ్రామతా. సం. వి. ఆ. స్త్రీ. గ్రామములసమూహము.

గ్రామతక్షుఁడు. సం. వి. అ. పుం. గ్రామస్థులవశముందున్న వడ్లంగి.

గ్రామము. సం. వి. అ. పుం. 1. ఊరు; 2. షడ్జాది స్వరము; 3. (శబ్దభూతగుణాదులకంటె పరమగునది) సమూహము. (ఉదా:—ఇంద్రియగ్రామము.); 4. గ్రామ్యధర్మము, మైథునము. (వాచ.)

గ్రామముపని. మి. వి. (గ్రామము+పని.) గ్రామాధికారిత్వము భార. అను. 3, ఆ. ౧౭౫.

గ్రామమృగము. సం. వి. అ. పుం. కుక్క.

గ్రామసింహము. సం. = గ్రామమృగము.

గ్రామి. సం. విశే. (న్. ణీ. న్.) 1. గ్రామము కలవాఁడు; 2. గ్రామాధిపతి; 3. గ్రామవాసి; 4. స్త్రీలంపటుఁడు.

గ్రామికుఁడు. సం. వి. అ. పుం. గ్రామాధికారి.

గ్రామీణ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; పాలంక్యశాకముచెట్టు.

గ్రామీణము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. కాకి; 3. ఊరఁబంది. విశే. (అ. ఆ. అ.) 1. ఊరిలోనున్నది; 2. నాగరికత లేనిది.

గ్రామేయము. సం. విశే. (అ. ఆ. అ.) ఊరిలోనున్నది.

గ్రామేయి. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య.

గ్రామ్యకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. గుమ్మడిచెట్టు.

గ్రామ్యకర్మము. సం. వి. న్. న. మైథునము, రతి.

గ్రామ్యధర్మము. సం. వి. అ. న. గ్రామ్యకర్మము.

గ్రామ్యము. సం. వి. అ. పుం. 1. కావ్యదోషవిశేషము; 2. గ్రామమండలివశువు. న. 1. మైథునము, రతి; 2. ఒకానొకరతిబంధము; 3. అసభ్యవాక్యం. విణ. (అ. ఆ. అ.) 1. గ్రామమున నున్నది; 2. మూర్ఖము; 3. పామరము; 4. అసభ్యము; 5. అపభ్రంశము.

గ్రామ్యవాది. సం. విణ. (న్. నీ. న్.) 1. అపశబ్దములు మాటలాడువాఁడు; 2. అసభ్యముగా భాషించువాఁడు.

గ్రామ్యసుఖము. సం. వి. అ. న. మైథునము, రతి.

గ్రామాశ్వము. సం. వి. అ. పుం. గాడిద.

గ్రావము. సం. వి. న్. పుం. 1. ఱాయి; 2. కొండ; 3. మేఘము.

గ్రాసము. సం. వి. అ. పుం. 1. ముద్ద; 2. మ్రింగుట; 3. ఆహారము; 4. గ్రహణము.

గ్రాహకము. సం. వి. అ. పుం. డేగ. విణ. (అ. హికా. అ.) 1. గ్రహించునది; 2. గ్రహింపఁ జేయునది.

గ్రాహకుఁడు. సం. వి. అ. పుం. పాములవాఁడు.

గ్రాహము. సం. వి. అ. పుం. 1. మొసలి; 2. గ్రహణము; 3. ఆగ్రహము.

గ్రాహి. సం. వి. న్. పుం. వెలఁగచె. విణ. (న్.ణీ.న్.) గ్రహించువాఁడు.

గ్రాహించు. సం. స. క్రి. స్పృశించు,ముట్టు. "శా... మూర్ప్రధ్వంసి లంఘించి యు,త్సాహం బొప్పఁగ నెత్తె మందరమహీధ్రంబు...దిక్సీమలం,గ్రాహింపఁ బతయాళునిష్ఠురమహాగండోపలధ్వానముల్." భీమ. ౪, ఆ. ౧౭.

గ్రాహ్యము. సం. విణ. (అ. ఆ. అ) గ్రహింపఁదగినది.

గ్రి

గ్రిక్కొను. దే. స. క్రి. వేష్టించు. "గీ...గ్రిక్కొనెనన,వెలయు వేష్టించె ననుటకు..." ఆం. భా. తృ. ౧౧౭.

గ్రీ

గ్రీవ. సం. వి. ఆ. స్త్రీ. మెడ.

గ్రీవి. సం. వి. న్. పుం. లొట్టిపిట్ట. విణ. (న్.ణీ.న్.) గ్రీవము కలవాఁడు.

గ్రీష్మము. సం. వి. అ. పుం. 1. వేసవికాలము; 2. వేఁడిమి. విణ. (అ. ఆ. అ.) వేఁడిమి గలది.

గ్రీష్మి. సం. వి. ఈ. స్త్రీ. నవమల్లికశీ.

గ్రు

గ్రుంగుటగుట. దే. వి. (గుటగుట+గుటగుట.) త్రాగుటయం దగుధ్వని కనుకరణము. "చ. జోటజోట ధారగా వడియుచుం గడలాస్తనుధార సంబు గ్రుం,గుటగుట నప్పటప్పటికిఁ గ్రోలుచు ..." పాండు, ౪, ఆ. ౪౭.

గ్రుంత. వై. వి. (సం. గర్తః.) గుంట, పల్లము "గీ... పెద్దవాన...,కురియుచుండంగ వఱదలు గ్రుంతమిట్ట,లొక్కకొలందిగఁ బాఱె నీ ల్లక్కజముగ." ద్వా. ౧౦, ఆ. ౪౪.

గ్రుక్క. దే. వి. ఒకసారి మ్రింగుట "ఉ. గ్రుక్కకు గ్రుక్కకుం జవులు క్రొత్తలు సేయఁగ..." చంద్రా. 3, ఆ. ౧౦౬: 2. ఒకసారి నోటఁ బోసికొని మ్రింగెడు కొలఁది. "క. నాచనుఁబా లొకగ్రుక్కెం, డోచిన్ని కుమార త్రావుము..." భాగ. ౧౦, స్కం. పూ. ౨౨౧; 3. ఒకసారి నోటఁ బోసికొని మ్రింగుటకు సరిపడుజలము. "క...మీన్‌,మ్రింగిన గ్రుక్కఁ వారిధి,కిం గొఱఁతయె..." ఆము. ౬, ఆ. ౬౪, 4. ఊపిరి. "సీ. గడియదైనను గ్రుక్క విడువక హాయులుగా నవగడంబుగఁ దాన మనెడు చేర్పు." కువల. ౪, ఆ. ౧౧౧.

గ్రుక్కగొను. దే. స. క్రి. (గ్రుక్క+కొను.) 1. మ్రింగు. (శ. ర.); 2. త్రాగు. "ద్వి. అక్కజంబుగ నబ్ధి నాపోశనముగ, గ్రుక్కగొన్నట్టి యాకుంభజుఁ డుండ." ద్వి. హరిశ్చ. పూ. 3౦౨. పం. హా. ౧, ఆ. ౯౭.

గ్రుక్కలుపెట్టు. దే. అ. క్రి. (గ్రుక్కలు+పెట్టు.) త్రాగు. "క. కిక్కురు మన కమృతంబును, గ్రుక్కలుపెట్టుదురు సురలు..." హర. ౬, ఆ. ౧౨౨.

గ్రుక్కలుమ్రింగు. దే. అ. క్రి. (గ్రుక్కలు+మ్రింగు.) 1. ఆపేక్షించు, కావలయునని యుంబలాటపడు. "చ. మునుకొని మూఁడుమూలలును ముప్పరు గ్రుక్కలుమ్రింగ..." హంస. 3, ఆ. ౧౦3; 2. సంకోచించు, సందేహపడు. (శ. ర.)

గ్రుక్కిలి. దే. వి. ఔ. గ్రుక్క. "గీ. చందమామకు గ్రుక్కి లాయిందువదన." కవిక. 3, ఆ. ౪౯.

గ్రుక్కిళ్లు మ్రింగించు. దే. స. క్రి. (గ్రుక్కిళ్లు మ్రింగు ధా. ప్రే) ఆపేక్షించు. "సీ. కోకిల ప్రాకంబు గ్రుక్కిళ్లు మ్రింగించు క్రొమ్మావిచిగురాకు గొడుగుతోడ." హర. ౩, ఆ. ౩౪.

గ్రుక్కిళ్లు మ్రింగు=గ్రుక్కలు మ్రింగు. (కావలయు నని మిక్కిలి యుబలాటపడు.) "సీ భోగించు వారలఁ బుల్కుపుల్కనఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లు మ్రింగువాడు." నైష. ౭, ఆ. ౫౩. "గీ...చందమామ చెలులు, కెంపు మోవులమధువు గ్రుక్కిళ్లు మ్రింగ." శశాం. ౫, ఆ. ౧౩౭.

గ్రుక్కు. దే. అ. క్రి. 1. సంకోచించు, (చెప్ప నొల్లక) మాటలు మ్రింగు. "ఉ...ఓ,యక్కరో యెవ్వఁడే తపసి యాతఁడు మాట లవేవి యాడితే. గ్రుక్కకు మింక..."సావి. ౨, ఆ. ౩౮. ప్రభా. ౫, ఆ. ౨౪; 2. తడవుకొను, తొట్రుపడు. "క. పీయులకు సుధారసముల, సోనలు వర్షించు కృపు లనువ్వరఫణితిన్, దా నిట్టటు గ్రుక్కక..." ప్రభా. ౮, ఆ. ౬౦.

గ్రుక్కుమిక్కను. దే. అ. క్రి. (గ్రుక్కు+మిక్కు+ అను.) ఏమైనఁ బలుకక, కొంచెమైన మాట్లాడదు. "క. ఒక్కతె నె గ్రుక్కుమిక్కన దిక్కెడసిన రీతి నుంటి..." హంస. ౮, ఆ. ౨౩౬. (ఇట్టే: గ్రుక్కుమిక్కుమను. ప్రభా. ౧, ఆ. ౪౨ గ్రుక్కుమిక్కురను. శుక. ౩, ఆ. ౬౩౩. కాని, తుదిరెండు ప్రయోగములందును వ్యతిరేకార్థము నసే ప్రయోగము లుండుట సూ. ని. అవ్య. గా గ్రహించినది; ఇది చింత్యము.)

గ్రుచ్చు దే. అ. క్రి. నాటు. "చ...భీకరముగ మూఁడుమూఁడుశిత కాండములన్ దగ గ్రుచ్చ నేసినన్." భాగ. ౮, స్కం. ౩౨౫. అ. క్రి. స. క్రి. బిగ బట్టు. గట్టిగా పట్టుకొను. "ఆ. గ్రుచ్చి కవుఁగిలించుకొని యమ్మహీధర, సార్వ భౌమదేవి..." హర. ౮, ఆ. ౫. స. క్రి. 1. నాటఁజేయు. "శా...,నారాచంబులు పెక్కు లొక్కమొగి నేసెన్ గ్రుచ్చ మూర్ఛిల్లె.." భార. కర్ణ. ౧, ఆ. ౧౬౫; 2. గాఢముగా పట్టుకొను. గాఢముగాఁ గౌఁగిలించుకొను. "గీ...ని న్నతఁ డెత్తి గ్రుచ్చి...కౌఁగిలింపఁగ..."భార. ఉద్యో. ౩, ఆ. ౩౫౩. "సీ...గ్రుచ్చెఁ దావులు పోఁకఁ గ్రోవిరెమ్మ." వసు. ౧, ఆ. ౧౫౪; 3 చీల్చు. "చ...నరసింహమూర్తివై,కుటిలనఖాగ్రకుంచికల గ్రుచ్చవె వానియురఃకవాటమున్." పారి. ౩, ఆ. ౩౨; 4. (మాలికాదులు) కూర్చు. "సీ...సరసోక్తులకు నవ్వ సరులు గ్రుచ్చ." విక్ర. ౫, ఆ. ౧౮౭; 5. తూర్చు. "మ. తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతరస్థలి నిద్రింపఁగ..." ఆము. ౧, ఆ. ౬౫.

గ్రుచ్చుకొను. దే అ. క్రి. (గ్రుచ్చు+కొను స్వార్థమున) నాటు. లోనికి దిగు. వ్యవ: —అతికాలికి ముల్లు గ్రుచ్చుకొన్నది.

గ్రుచ్చెత్తు దే. స. క్రి. (గ్రుచ్చు+ఎత్తు.) చేర్చు, కలుపు. "సీ. గొజ్జఁగినీరున గ్రుచ్చెత్తి కపురాన రంగు మీఱంగ నరంగు వైచి."చమ. ౧, ఆ.౪౪.

గ్రుడ్డి = గుడ్డి. 1. (అంధుఁడు) ఆం. భా. ద్వి. ౧౨౦; 2. (అంధురాలు.) "సీ. గ్రుడ్డవ్వ..." హర. ౨, ఆ. ౮౭. (గ్రుడ్డికనము) ఆం. భా. ద్వి ౧౨౮.

గ్రుడ్డింగిలాయి. దే. వి. (గ్రుడ్డి+ఇంగిలాయి.) ఒక జాతివేఁప. (శ. ర.)

గ్రుడ్డికన్పాదుషా. దే. వి. (గ్రుడ్డి+కన్ను+ పాదుషా.) కుబేరుఁడు. వేంక. దేవ. ౧౭.

గ్రుడ్డికామంచి. దే. వి. (గ్రుడ్డి+కామంచి.) అతిచ్ఛత్రము, గొడుగుగడ్డి. (శ. ర.)

గ్రుడ్డికాసు. దే.వి. (గ్రుడ్డి+కాసు.) చిల్లిగవ్వ. "మ... గ్రుడ్డికా సైన లేదు..."మల్లభూ. వైరా. ౩.

గ్రుడ్డిగొక్కరాయి. ద్వ. వి (గ్రుడ్డి+గొక్కరాయి.) కోయష్టికము, చీకుకొక్కెర. (శ. ర.)

గ్రుడ్డికొక్కెర. ద్వ. వి. (గ్రుడ్డి+కొక్కెర.) కోయష్టికము. ఆం. భా. ద్వి. ౯౮.

గ్రుడ్డిగవ్వ = గ్రుడ్డికాసు. (వా.)

గ్రుడ్డిదీపము. దే వి. (గ్రుడ్డి+దీపము.) మిణుకు మిణుకు మను కాంతిహీనమగు దీపము. (బ్రౌ. వా.)

గ్రుడ్డిబేరము. ద్వ. వి. (గ్రుడ్డి+బేరము.) తెలివి తక్కువ బేరము. (బ్రౌ. వా.)

గ్రుడ్డిపడు. ద్వ. అ. క్రి. (గ్రుడ్డి+పడు.) కన్ను కన్ను గానకపోవు. "గీ. కొన్ని దేశంబు లిరులచే గ్రుడ్డి వడియె."కాశీ. ౧, ఆ. ౧౩౭. [కము. (శ. ర.)

గ్రుడ్డివాటు. ద్వ. విణ. (గ్రుడ్డిపడు. ధా.) దైవి

**గ్రుడ్డివెన్నెల.** దే. వి. (గ్రుడ్డి+వెన్నెల.) కల్ల జ్యోత్స్న, కాంతిహీన మగు వెన్నెల. (శ్రా. వా.)

**గ్రుడ్డు.** దే. వి. 1. కనుగ్రుడ్డు. "సీ... భగుని గ్రుడ్డులు ధరఁ జడ గఁ జిదిమె." కాశీ. ౭, ఆ. ౧౪; 2. తారక, నల్లగ్రుడ్డు. ఆం. భా. తృ. ౫౩; 3 (పాము పక్షి మొ. వాని.) అండము. 'సీ. అఱ జాఱునెఱి వేణికతి పాఁపకొమ్మకు వెడలు గ్రుడ్డులు వోలె విరులు రాల." సాంబో. ౧, ఆ. ౧౧౯. నీలా. ౧, ఆ. ౭౮; 4. గ్రుడ్డిజనము. "క. కని గ్రుడ్డుక్ విని యఁ దేవుడు కాదె తలంపన్." శేష. ౪, ఆ. (శ. ర.)

**గ్రుడ్డుకానుపు.** దే. వి. (గ్రుడ్డు+కానుపు) అండజము. 1. పక్షి; 2. పాము. "సీ. గ్రుడ్డుకానుపుఱేఁడు గ్రుడ్డుకానుపుఱేఁడు గుఱ్ఱంబు పాన్పునై కొమరు మిగుల." అచ్చ. బా; 3. (పై రెండర్థములకు నుదాహరణము)

**గ్రుడ్డెఱ్ఱ.** దే. వి. (గ్రుడ్డు+ఎఱ్ఱ) కోపము. "గీ. ఎదురు లేమ లేల కోపించె నిందుధరుఁడు, అకట గ్రుడ్డెఱ్ఱ బాదరాయణునిమీఁద." భీమ. ౪, ఆ. ౧౨.

**గ్రుడ్డగూబ.** ద్వి. వి. (గ్రుడ్డు+గూబ.) ఘూకము, పెద్దగ్రుడ్లు గలగూబ. సాం. ని. తిర్య. ౧౦.

**గ్రుద్దు.** దే.స. క్రి. (క. గుద్దు. త. కత్తు.) 1. పిడికిటితో బలముగాఁ గొట్టు. "స్రగ్ధర. గ్రుద్దుక్ గోత్రాచలంబుల్ గులగులలయిపో గోతముల్ గ్రుద్దులీలన్." స్వా. ౪, ఆ. ౧; 2. పొడుచు. "గీ... గేదంగి చేయమ్ముకొద్ది గ్రుద్ది." చంద్రా. 3, ఆ, ౧౧౭. పార్వ. ౪, ఆ. ౧౧౯. వి. పిడికిటిపోటు. వ్యవ:— వాని నొకగ్రుద్దు గ్రుద్దుము.

**గ్రుద్దులాట.** దే. వి. (గ్రుద్దులాడు ధా.) 1. యుద్ధము. "సీ... గ్రుద్దులాటనిన యుద్ధము..." ఆం. భా. ద్వి. ౨౨౨; 2. పోట్లాట, జగడము. (వా.)

**గ్రుద్దులాడు.** దే అ. క్రి. (గ్రుద్దులు+ఆడు.) ఒకరి నొకరు గ్రుద్దుకొనుచు పోట్లాడు. (శ. ర. వా.)

**గ్రుయ్యు.** దే. స. క్రి. గుచ్చు, నాటు. ఆం. భా. తృ. ౧౨౨.

**గ్రువ్వ.** దే. వి. గువ్వ, అడవిపావురము. "గీ. గ్రువ్వ గద్ద దివ్యాఖుపుఁ బువ్వ..." భార. అను. ౪, ఆ. ౧౧౯; ౨౩౩.

## గ్రె

**గ్రెమ్ము.** దే. స. క్రి. సొంగఁ జేయు. "గీ. మేటిజమ్మేటి యనటఁ గ్రొమ్మించుమించుఁ బోడివిమఁన ప్రతాపాగ్నిఁ బటము వెట్టి, తమ్మిగద్దియదాకట గ్రెమ్మియట్టి, కొమ్మ గావింపఁబోలు నెత్తమ్మిమాలి." వసు ౨. ఆ. 3౨.

## గ్రై

**గ్రైవము.** సం. = గ్రైవేయకము.

**గ్రైవేయకము.** సం. వి. అ. న. (పుం. అని కొందఱు. న. అని సంస్కృతనిఘంటువులు.) కంఠభూషణము, మెడఁ దాల్చునలంకారము.

**గ్రైష్మము.** సం. విణ. (అ. ష్మి కా. అ.) గ్రీష్మ ఋతువునందు పుట్టినది.

**గ్రైష్మకము.** సం. విణ. (అ. ఈ. అ.) గ్రీష్మర్తుసంబంధమైనది.

**గ్రైష్మి.** సం. వి. ఈ. స్త్రీ. నవమల్లిక, విరజాజితీగె.

## గ్రొ

**గ్రొచ్చు.** దే. స. క్రి. (గ్రొయ్యుధా. ప్రే.) 1. వెళ్లగొంచు. "గీ. గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల." భాగ. ౯, స్కం. ౨౦౫. దశా. 3, ఆ. ౨౦౮; 2. త్రవ్వు. "వ... అంత నాక్షత్రియులు లోకక్క భార్గవునియిల్లు గ్రొచ్చి యనంతం బైన యర్థంబుం గని యలిగి రాజధనవంచకులై రని భార్గవుల నెల్ల నిగ్రహించి..." భార. ఆది. ౭, ఆ. ౧3౪. కు. సం. ౧, ఆ. ౫౨; చీల్చు. "స్రగ్ధర. గ్రొచ్చుక్ రథ్యవ్రజంబుక్ ఘుటఘుటరథటిక్ ఘోటిరియై..." రాజ. చ. ౨, ఆ. ౭౬.

**గ్రొప్పించు** = గ్రొచ్చు. (త్రవ్వు.) "గీ. మిన్ను మిడుఁగురుల బట్టులై మెఱసి రెండు, మెఱుఁగు లోకపుట్టలో నున్న నెఱుఁగ కేను, బుట్ట గ్రొప్పించి యారెంటిబోలుపుఁ గాన, కుడిగి వచ్చితి విస్మయపడి మనమున." భార. అర. 3, ఆ. ౧౭౯.

**గ్రొప్పు** = గ్రొయ్యు. (చూ. గ్రొప్పించు.)

**గ్రొయ్యు.** దే. అ. క్రి. పల్లముపడు, గుంటయగు. "గీ. ఆమహాత్ముఁడు... ఇచ్చు. గోగణంబుల గొరిజల గ్రొస్సి యయ్యెఁ, గాదె యీసరోవరము జగన్నుతముగ." భార. అర. ౪, ఆ. 3౬౮.

## గ్ల

గ్లపనము. సం. వి. అ. న. గ్లాని కలిగించుట. విణ. (అ. ఆ. అ.) గ్లాని కలిగించునది.

గ్లపితము. సం. విణ. (అ. ఆ. అ.) గ్లపనము. "మహాస్రగ్ధర. హరివాణీంద్రామరేంద్రాద్యమరగణ ఫణీంద్రాసురేంద్రోరుజాలో,త్కరసద్రత్నాలిభామా గ్లపితపదనఖౌఘః ప్రపూర్ణేందురశ్మి, స్ఫురితాంగోద్యత్సభాబ్ధి క్షుభితవరనిభస్తోత్ర సంగీతరావా,వరితాశాద్యంతశోభావహుఁ గనియె మునివ్రాతమా దేవదేవున్." కు. సం. ౮, ఆ. 3.

గ్లహము. సం. వి. అ. పుం. 1. జూదము; 2. పాచిక; 3. పణము.

## గ్లా

గ్లానము. సం.వి. అ. న. 1. దౌర్బల్యము; 2. దైన్యము; 3. తెగులు; 4. వాడిపోవుట. విణ. (అ. ఆ. అ.) 1. రోగముచే దుర్బలమైనది; 2. దీనత చెందినది; 3. వాడిపోయినది.

గ్లాని. సం. వి. ఇ. స్త్రీ. 1. (శ్రమాదికముచేఁ గలిగిన) దౌర్బల్యము; 2. అసమర్థత; 3. తెగులు; 4. బడలిక; 5. హాని; 6. వాడుట. [నందినవాఁడు.

గ్లాస్నువు. సం. విణ. (ఉ) రోగముచే దౌర్బల్యము

## గ్లో

గ్లౌః. సం. వి. ఔ. పుం. 1. చంద్రుఁడు; 2. కర్పూరము.

## గ్లౌ

గ్లౌ. సం. వి. ఔ. పుం. 1. చంద్రుఁడు; 2. కర్పూరము.

## ఘ

ఘ. ఒక నొకయక్షరము. సం. వి. అ. పుం. 1. గంట, 2. ఘర్ఘరధ్వని. ఆ. స్త్రీ. మొలనూలు.

ఘంట. సం. వి. ఆ. స్త్రీ. 1. గంట; 2. అఱువది నిముసములకాలము; 3. బీఱపు.

ఘంటాపథము. సం. వి. అ. పుం. 1. పదిబారలు వెడల్పుగల రాజమార్గము; 2. మల్లినాథుఁడు రచించినకిరాతార్జునీయవ్యాఖ్య; 3. స్పష్టరీతి, నిస్సందేహమార్గము.

ఘంటారవ. సం. వి. ఆ. స్త్రీ. గిలిగిచ్చపు.

ఘంటాలి. సం. వి. ఈ. స్త్రీ. బీఱపు. [నాలుక.

ఘంటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిఱుగంట; 2. కొండ

ఘండము. సం. వి. అ. పుం. తుమ్మెద.

ఘట. సం. వి. ఆ. స్త్రీ. 1. సమూహము; 2. ఏనుఁగులసమూహము; 3. గోష్ఠి; 4. కూర్పు.

ఘటక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ఆంధ్రమున కొన్ని ధాతుజన్యరూపముల కనుప్రయుక్త మగు ధాతువు. ఉదా:— అగు, పోవు మొ. ఇది కొన్ని యెడల నిరర్థకముగను గొన్నియెడల విశేషార్థకముగను నుండును. ఉదా:—రాఁడయ్యెన్, రాకపోఁడు.

ఘటకము. సం. వి. అ. పుం. వనస్పతి, పూవులు లేకయే కాయలుకాచువృక్షాది. [వాఁడు.

ఘటకుఁడు. సం. విణ. (అ. టికా. అ.) ఘటిల్లఁజేయు

ఘటదాసి. సం. వి. ఈ. స్త్రీ. నాయికానాయకులను సంఘటింపఁజేయుస్త్రీ.

ఘటన. సం. వి. ఆ. స్త్రీ = ఘటనము.

ఘటనచేయు. మి. స. క్రి. సంఘటిలఁజేయు, కూర్చు. "గీ. వనజసంభవుఁ డీరీతి వరుసగాను, గలికియంగంబు లెల్లను ఘటనచేసి, కవును లే దనుమాటను వివరపఱుచు, సున్నపెట్టెనో యన నాభి చూడఁదగియె." పార్వ. ౬, ఆ. ౯3.

ఘటనపడు. మి. అ. క్రి. (ఘటనపడు ధా. ప్రే.) కూర్చు, సంఘటిలఁజేయు. "గీ. అవధరింపుము నీ పేర నంకితముగ, సకలలక్షణగ్రంథవిస్తారసార, పటిమ లన్నియు నొకటిగా ఘటనపఱిచి, లక్షణగ్రంథ మొనరింతు రంగనృపతి." అనంద. ౧, ఆ. ౨.

ఘటనము. సం. వి. అ. న. 1. ప్రయత్నము; 2. సంభారము; 3. కూర్పు; 4. సమూహము.

ఘటమానము. సం. విణ. (అ. ఆ. అ.) ఘటిల్లుచున్నది, సంభవించుచున్నది. భార. అర. ౧, ఆ. ౨౬౬, ౩౩౦.

ఘటము. సం. వి. అ. పుం. 1. కుండ; 2. ఏనుఁగు కుంభస్థలము; 3. కుంభకము; 4. కుంభరాశి; 5. శిఖరము. [ఏతము.

ఘటయంత్రము. సం. వి. అ. న. 1. నూతిగిరక; 2.

ఘటశాసి. సం. వి. న్. పుం. ఘటికోపాధ్యాయుఁడు, తార్కికుఁడు. ఆము. ౬, ఆ. ౮౯.

ఘటాఘటీలు. దే. విణ. బ. అధికులు, గొప్పవారు. "శా... హేమాహేమీలు ఘటాఘటీలు..." వరాహ. ౧౦, ఆ. ౮.

ఘటి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిన్నకుండ; 2. గడియ, ఇరువదినాలుగునిముసములకాలము; 3. గడియలు తెలుపుట కుపయోగించుచున్న నీటికుండ." న్. పుం. కుంభరాశి.

ఘటించు. సం. అ. క్రి. 1. ఘటిల్లు, కలుగు. "క. ఆసదింద్రియఘర్షణమున, వసుమతి నిర్విణ్ణ తగుచు వనరెడినా కే,యసదృశ మోహాత మోవిని, రసనం బనఘాత్మ యేవెరవున ఘటించున్." భాగ. 3, స్కం. ౨౬౭; 2. పనిచేయు, ఫలితముకలుగు. "చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందుననర్థక ముల్ ప్రబోధమం,దరయఁగ మిథ్యలై పురుష నందు ఘటింపనికై వడిన్..." భాగ. 3, స్కం. ౯౧౬. స. క్రి. 1. కలిగించు, చేయు. "ఉ... మీరు వెఱ కుండుఁడు భూప్రజలార నేఁడ యా,నందవనంబునందు దహనంబు ఘటించెద యోగసంపదన్." కాశీ. ౫, అ. 3౧౦; 2. సంపాదించు, పొందు. "చ...భోగపరుండు గావు నన్, ధనము ఘటింపఁగాఁ దగువిధం బని చూచి ..." భార. శాం. 3, అ. ౪౭౨.

ఘటిక. సం. వి. అ. స్త్రీ. 1. = ఘటి; 2. ముహూర్తము, రెండుగడియలకాలము.

ఘటితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కలిగింపఁబడినది.

ఘటియించు = ఘటించు. (కలిగించు) "క... మేలు ఘటియించి..." ఉ. రా. ౧, ఆ. ౧౦౭.

ఘటియిల్లు. సం. అ. క్రి. కలుగు. "చ...తాండవారభటిపాటనముం ఘటియిల్లు." భార. శాం. ౫, ఆ. ౨౭౮.

ఘట్టన. సం. వి. ఆ. స్త్రీ. = ఘట్టనము.

ఘట్టనము. సం. వి. అ. న. 1. గట్టించుట; 2. కదల్చుట; 3. ఒరయిక; 4. బ్రతుకుతెరువు.

ఘట్టము. సం. వి. అ. పుం. 1. నద్యాదులరేవు; 2. సుంకము పుచ్చుకొనుచోటు; 3. కదల్చుట; 4. రపవంత మగుకట్టు. ఉదా:—ఈగ్రంథమున నిది మంచిఘట్టము.

ఘట్టించు. సం. స. క్రి. పొడుచు. "వ...ముసలంబుల మోఁదుచు ముద్గరంబులం జడియుచు ముష్టివల యంబుల ఘట్టించుచు..."భాగ.౭,స్కం.33౪.

ఘట్టితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. గట్టింపఁబడినది; 2. నిర్మింపఁబడినది; 3. కదల్పఁబడినది.

ఘణఘణ = గణగణ.

ఘణంఘణ = గణగణ. "సీ...మణికింకిణులఘణం ఘణలు..." దశా. 3, ఆ. ౪3.

ఘణిల్లు. దే. వి. ఖణిల్లు, అంకెవేయుట, భూషణాదులయొరయిక మున్నగువానివలనఁ గలుగుధ్వని కనుకరణము. (దీనియామ్రేడితరూపము ఘణిఘణిల్లు. "గీ...ఘణిల్లన అంకెలిడుచు." కవిక. ౧, ఆ. ౨౩. "సీ. ఘణిఘణిల్లురటంచు గగన మార్గంబున వైమానికులవిమానములు తాఁక." దశా. 3, ఆ. ౧౧౦.

ఘన. సం. వి. అ. పుం. వేదపాఠవిశేషము. ఆ. స్త్రీ. 1. మేషశృంగి; 2. రుద్రజటి.

ఘనచ్ఛదము. సం. వి. అ. న. మునగ.

ఘనకల్లవము. సం. వి. అ. పుం. మునగ.

ఘనము. సం. వి. అ. పుం. 1. తుంగముస్తె; 2. దార్ఢ్యము; 3. మబ్బు; 4. పిరివి; 5. ముద్గరము; 6. సమూహము; 7. శరీరము; 8. కఫము; 9. అభ్రకము; 10. సమానమైనమూఁడుసంఖ్యలు గుణింపఁగా వచ్చినలబ్ధము. ౨×౨×౨ = ౮.) న. 1. నృత్యాదిమధ్యమానము; 2. కంచుతాళము మొ. వాద్యము; 3. తగరము; 4. చెట్టుపట్ట. విణ. (అ. ఆ. అ.) 1. గట్టిది; 2. దట్టమైనది; 3. గొప్పది; 4. అధికమైనది.

ఘనరసము. సం. వి. అ. పుం. న. 1. నీళ్లు; 2. కర్పూరము; 3. కషాయము; 4. చెట్టుబంక; 5. చాఁగ. విణ. (అ. ఆ. అ.) 1. దిక్కానిరసము గలది; 2. చాలరసము గలది.

ఘనసారము. సం. వి. అ. పుం. 1. నీళ్లు; 2. కర్పూ [రము.

ఘనసారోదయము. సం. వి. అ. న. ఒకానొకసుగంధి ద్రవ్యము. ద్వా. 3, ఆ. ౨౦౬.

ఘనాగమము. సం. వి. అ. పుం. వర్షాకాలము.

ఘనాఘన. సం. వి. ఆ. స్త్రీ. కాకమాచి.

ఘనాఘనము. సం.వి. అ. పుం. 1. కురియు మేఘము; 2. పరస్పరఘర్షణము; 3. హింసించుమదపుటేనుఁగు.

ఘనాఘనుఁడు. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

ఘనాత్యయము. సం. వి. అ. పుం. శరత్కాలము.

ఘనాశ్రయము. సం. వి. అ. పుం. ఆకాశము.

ఘనీభవించు. సం. అ. క్రి. 1. ముద్దకట్టు. "ఉ... కుముదినీపతికాంతి ఘనీభవించెనో..." కాశీ.

౪. ఆ. ౧౫౭; 2. కూడియుండుట. "మ. కనకంబందు ఘనీభవించినకళంకం బెల్ల సువ్యక్తిగా నసలాస్యంబునఁ గ్రాఁగిపోవుగతి జీవాత్మం బ్రవేశించి చేకొని వర్తించినదుర్మలత్రయ పరిక్షోభంబు నీభక్తిచేఁ దన భావంబుడుఁ గాని వేఱొకటిచేతం బోదు సర్వేశ్వరా." స. శ. ౭౮.

ఘనోపలము. సం. వి. అ పుం. వడగల్లు.

ఘమ్ము = గమ్ము. "గీ. మధురతరశీత మధుపూరమహిత కుసుమ,పటమళమ్ములు ఘమ్మని పరిమళించె." చంద్రా ౪, ఆ. ౭౮.

ఘరట్టము. సం. వి. అ. పుం. తిరుగలి.

ఘర్ఘర. సం. వి. ఆ. స్త్రీ. చిఱుగంట. "సీ. మదకుంభితోడఁ జతుస్సముద్రములతో గాలులఘర్ఘరలవగిదిఁ గలసి మ్రోయ." హ. సం. ౮, ఆ. ౨౨. ('ఘర్ఘరము' అపపాఠము.)

ఘర్ఘరము. సం. వి. అ. పుం. 1. ఊఁకనిప్పు; 2. కొండకనము; 3. వాకిలి; 4. గుడ్లగూబ; 5. హాస్యము. విశ. (అ. ఆ. అ.) అస్పష్టము. "సీ సుధ్వానకరశీవ్రగర్వ గళగ్రహాకలిత గాద్గద్య ఘర్ఘరము మాట." కాశీ. ౪. ఆ. ౨౦౨.

ఘర్ఘరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిఱుగంట; 2. ఒకానొకవాద్యము.

ఘర్మము. సం. వి. అ. పుం. 1. చెమట; 2. ఉక్క; 3. ఎండ; 4. వేఁడిమి; 5. వేసఁగి; 6. విరుఁగుగండస్థలమండలీమదము.

ఘర్షకము. సం. విశ. (అ. క్లి కా. అ.) 1. ఒరయునది; 2. తోమునది; 3. మర్దించునది; 4. స్పర్ధవడునది.

ఘర్షణము. సం. వి. అ. న. 1. ఒరయిక; 2. మర్దనము; 3. తోముట; 4. స్పర్ధ; 5. వాగ్వివాదము. విశ. 1. (అ. ఆ. అ.) ఘర్షణము చేయునది; 2. (అ. ఈ. అ.) ఘర్షణసాధన మైనది.

ఘర్షము. సం. వి. అ. పుం. 1. = ఘర్షణము; 2. పాత్రము.

ఘర్షించు. సం. స. క్రి. 1. ఒరపెట్టు. "సీ. ఘర్షించు గండభాగముఘటోల్కాదిత్య ఘనోపకంఠాంఘ్రిపంబు శాఖ." కాశీ. ౬, ఆ. ౧౭౮; 2. బాధించు "గీ. సాధ్వి ఘర్షింప నొకఁ డెట్టు చాలఁ గలఁడు." కాశీ. ౨, ఆ. ౭౮; 3. కసరు. "సీ. శాకోదర స్వామి ఘర్షించుఁ బలుమాఱు ఫలిగాడ్పు దనుఁజేర వచ్చె నపుడు." దశా. ౨, అ. ౯౦; 4. చదునుచేయు. "సీ. కవ్వంపుఁగొండ నిమ్మంట కంబుగఁ జేసి ఘర్షించి యతనిభోగంబుఁ జుట్టి." భాగ. ౮, స్కం. ౧౯౨.

ఘర్షిత. సం. విశ. (బు. త్రీ. బు.) ఘర్షించువాఁడు.

ఘర్షితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఘర్షణము కలది; 2. ఘర్షింపఁజేయఁబడినది.

ఘల్లు. దే. వి. మువ్వలు మొ. వానిమ్రోఁత కనుకరణము. (దీనియామ్రేడితరూపములు. ఘల్లుఘల్లు, ఘలుఘల్లు, ఘులుఘులు మొ.) "చ...ఘల్లునుంచులియఁ బసిండిమువ్వగమి..." ఆము. ౧, ఆ. ౭౪. భీమ. 3, ఆ. ౭౨; 2. సింహము మొ. వానియఱపునం దగధ్వని కనుకరణము. "సీ. ఘల్లురంచు నెదుర్చు కంఠీరవంబుల..." కృ. శతం. ౧, ఆ. ౭౧.

ఘస్మరుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. తిండిపోతు. తినువాఁడు; 2. చంపినవాఁడు.

ఘస్రము. సం. వి. అ. పుం. దినము. విశ. (అ ఆ.అ.) హింసించునది, బాధించినది.

ఘళ్. దే. వి. తరంగాదిధ్వని కనుకరణము. (దీనియామ్రేడితరూపములు: ఘళ్ఘళ్, ఘళ్ఘళ్ఘళ్ మొ.) "క. జలసేవనఘళ్ఘళలు..." బహు. ౪, ఆ. ౭౮, దశా. ౪, అ. ౨౧3.

ఘుటుకు = ఘుల్లు. "వ ..సాలెవాఁడు ఘుటుఘుటుకుమనఁ బలక చులకఁగాఁ దాటించువాటంబున..." చంద్ర. వి. 3, ఆ. ౧3౧.

ఘుల్లు. దే. వి. ఘుల్ ఘుల్ మనుధ్వని. (చూ. ఘుటుకు.)

ఘూ

ఘూంటికము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త.

ఘూంటికుఁడు. సం. వి. అ. పుం. 1. ఘంటలు వాయించువాఁడు; 2. వేకువను గంట వాయించి రాజును మేల్కొలుపువైతాళికుఁడు.

ఘూట. సం. వి. ఆ. స్త్రీ. పెడతల. (అందలి ముచ్చిలిగుంట యని కొందఱు.)

ఘూటము. సం. వి. అ. పుం. 1. = ఘూట; 2. ఘట్టము; 3. గోపు మొ. తిరుగుప్రదేశము.

ఘూటించు. సం. అ. క్రి. చెలరేఁగు. "ద్వి. ఘూటించి ఘోరమృగంబులు బిట్టు గఱచిన..." నవ. ౧. భా. ౪౧. పు.

ఘాతకుఁడు. సం. విణ. (అ. తికా. అ.) హింసకుఁడు, బాధించువాఁడు.

ఘాతనము. సం. వి. అ. న. 1. చంపుట; 2. చంపించుట. విణ. (అ. ఆ. అ.) 1. చంపునది; 2. చంపించునది.

ఘాతము. సం. వి. అ. పుం. 1. దెబ్బ; 2. చంపుట; 3. గుణించుట; 4. బాణము; 5. గుణింపఁగా వచ్చినలబ్ధము; 6. దోఁపిడి; 7. ఉచ్చేదము; 8. (జ్యోతి) వైధనతార.

ఘాతి. సం. వి. ఇ. పుం. పక్షులను బట్టువల. విణ. (న్. సీ. న్.) చంపిన వాఁడు.

ఘాతించు. సం. స. క్రి. చంపు. "క...నాకేశు ననిన్,ఘాతింపఁగ నోపెను నుతు, నాతతబలు నవ్వరాంగి యర్థించుటయున్." హరి. పూ. ౧, ఆ. ౭౯.

ఘాతుకుఁడు. సం. = ఘాతకుఁడు.

ఘాత్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చంపఁదగినది; 2. గుణింపఁదగినది.

ఘార. సం. వి. అ. పుం. సేచనము, తడుపుట.

ఘాసము. సం. వి. అ. పుం. 1. ఆహారము; 2. లేఁత పచ్చిక. "చ. పురగరుడాశ్మసౌధరుచిపుంజము ఘాస మటంచు నెంచి లో,హరిణము చొకళింప ..." కాళింది. ౧, ఆ. ౬౪.

ఘి

ఘిరాయించు. దే. స. క్రి. (హిం. ఘిరానా.) ముట్టడించు, వందెత్తు. "గీ. అపుడ రంధ్రశ్రుతి ప్రభురాజ్ఞ వడసి, తడసి కొన కేఁగి పడవాళ్లు దండువెంట, గడి ఘిరాయింపఁ బైనముల్ గం దటంచు. సైనికులకెల్ల మోహీము సాటి రపుడు." రంగా. 3, ఆ. ౧.

ఘీ

ఘీంకరించు. సం. అ. క్రి. ఘీంకారము చేయు. "చ. కనుఁగొని నీలదానవుఁడు గంధగజాకృతి ఘీంక రించి వచ్చిన..." వరాహ. ౬. ఆ. ౧౧౨.

ఘీంకారము. సం. వి. అ. పుం. ఏనుఁగుగీఁక, బృంహితము.

ఘీంకృతి. సం. వి. ఇ. స్త్రీ. ఘీంకారము.

ఘు

ఘుండము. సం. వి. అ. పుం. తుమ్మెద.

ఘుక్కు. దే. వి. ఘూకధ్వనియం దగుననుకరణము. "ఉ. ఘుక్కని మాటిమాటికిని గోటఁడు పల్కెడు వామదిక్కునన్." క్రీడా. ౫౧.

ఘుటఘుట. దే. వి. గ్రొచ్చుటయం దగుధ్వని కనుకరణము. "స్రగ్ధర. గ్రొచ్చుక్ రక్తప్రజంబుల్ ఘుటఘుటరభటిన్ ఘూర్ణిల్లెయి..." రాజ. చ. ౨, ఆ. ౭౬.

ఘుటము. సం. వి. అ. పుం. చీలమండ.

ఘుటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చీలమండ; 2. గుళిక,

ఘుణము. సం. వి. అ. పుం. మ్రానుతొలుచు పురుగు. నుసిపురుగు.

ఘుమఘుమ. దే. వి. 1. సువాసన వ్యాపించుటయం దగుననుకరణము. వ్యవ:—పువ్వు ఘుమఘుమ పరిమళించుచున్నది; 2. శంఖము మ్రోయుట తరంగము లొరయుట మొ. వానియం దగుననుకరణము. "క...శంఖ మపుడు ఘుమఘుమ మ్రోసెన్." పారి. ౨, ఆ ౭౭. హర. 3, ఆ. 30.

ఘుమ్మ. దే. వి. 1. గుమ్ము, పరిమళించుటయం దగుననుకరణము. "క. ఘుమ్మనుకప్రపుంజగతిఁ గూర్చుండికగన్." వాల్మీ. 3, ఆ. ౧౦౧; 2. వీణాది ధ్వని కనుకరణము. "సీ. ఆపిమ్మట వియచ్చరీపాణి వల్లకీపంచస్వరంబులు ఘుమ్మురనియె." వసు. ౫, ఆ. 3.

ఘుర్ఘుర. సం. వి. ఆ. స్త్రీ. పందియఱపు.

ఘుర్ఘురము. సం. వి. అ. పుం. ఘుర్ఘుర.

ఘుర్ఘురి. సం. వి. ఈ. స్త్రీ. ఘుర్ఘురము.

ఘుర్ఘురించు. సం. అ. క్రి. ఘుర్ఘురధ్వని చేయు. "సీ...ఘుర్ఘురించుచు బయల్ కొమ్ముఁ జిమ్ము." స్వా. ౪, ఆ. ౪౨.

ఘుషము. సం. విణ. (అ. ఆ. అ.) ఘోషించునది.

ఘుషితము. సం. విణ. (అ.ఆ.అ.) ఘోషింపఁబడినది.

ఘుష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పేరఁబడినది; 2. ఘోషింపఁబడినది.

ఘుసృణము. సం. వి. అ. న. కుంకుమపువ్వు.

ఘూ

ఘూకము. సం. వి. అ. పుం. గ్రుడ్లగూబ.

ఘూకారి. సం. వి. ఇ. పుం. కాకి.

ఘూకి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగ్రుడ్లగూబ.

ఘూర్జరము. సం. వి. అ. పుం. గుజరాతిదేశము.

ఘూర్జరి. సం. ఈ. స్త్రీ. 1. ఘూర్జరస్త్రీ; 2. రాగవిశేషము. "ఉ...ధనాసరి ఘూర్జరి పూరి..." చెన్న. ౨, ఆ. ౨౩౬. [కునికిపాటు.

ఘూర్ణనము. సం. వి. అ. న. 1. భ్రమణము; 2.

ఘూర్ణము. సం. వి. అ. పుం. భ్రమణము, తిరుగుడు విణ. (అ. ఆ. అ.) 1. భ్రమణము చేయునది; 2. కునికిపడునది. [చేసినది; 2. కునికిపడినది.

ఘూర్ణితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. భ్రమణము

ఘూర్ణిల్లు. సం. అ. క్రి. 1. కలఁగుడువడు. "క. ఆశాధినాథులును వాగీశానునిలోకమునకు నేఁగి, నిజమనశ్శ్లేశంబు గానఁబడ నాక్రోశించిరి సలిలనిధులు ఘూర్ణిల్లఁగన్." మార్క. ౬, ఆ. ౧౩౨; 2. తిరుగుడువడు. 'మ...కొండలమందెం ద్రిదశేంద్రపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె..." భార. విరా. ౪, ఆ. ౧౪౨.

ఘృ

ఘృణ. సం. వి. ఆ. స్త్రీ. 1. కనికరము, దయ; 2. జుగుప్స, రోఁత.

ఘృణాళువు. సం. విణ. (ఉ) కనికరము గలవాఁడు.

ఘృణి. సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. కిరణము; 2. జ్వాల; 3. అల; 4. గ్రీష్మము; 5. పగలు. విణ. (న్. నీ. న్.) ఘృణకలవాఁడు.

ఘృతకోశాతకి. సం. వి. ఈ. స్త్రీ. నేతిబీఱకాయ.

ఘృతము. సం. వి. అ. పుం. న. 1. నెయ్యి; 2. నీరు. విణ. (అ.ఆ.అ.) 1. తడుపఁబడినది; 2. వెలిఁగినది.

ఘృతాచి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. త్రిదశవేశ్యలలో నొకతె.

ఘృతేలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱచీమ; 2. గబ్బిలము.

ఘృతోదము. సం. వి. అ. పుం. నేతిసముద్రము.

ఘృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒరయఁబడినది; 2. రుద్దఁబడినది; 3. మర్దింపఁబడినది.

ఘృష్టి. సం. వి. ఇ. పుం. 1. కిరణము; 2. పంది. స్త్రీ. 1. స్పర్థ; 2. ఘర్షణము; 3. పాఁచితీఁగె.

ఘృష్టిల. సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న చెట్టు.

ఘో

ఘోంట. సం. వి. ఆ. స్త్రీ. 1. పోఁకచెట్టు; 2. రేఁగుచెట్టు.

ఘోటకము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.

ఘోటము. సం. = ఘోటకము.

ఘోటి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగుఱ్ఱము.

ఘోటించు. సరి. అ. క్రి. యథేచ్ఛముగా సంచరించు. "క. వేఁటాడుచుఁ బురవీథుల, ఘోటింపుచు వారి లెక్క గొనఁ డెవ్వరి..." మై. 3, ఆ. ౩౧. స. క్రి. ఊఁచు, అటునిటు కదల్చు. "ద్వి...వదనగహ్వరములు విచ్చి, ఘోటించి..." ద్వి. పారిజా. పూ. ౧౯౬౯. ప.

ఘోట్టాణము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము; ఆదేశమందలిగుఱ్ఱము. "మ...రూపోచ్చతుల్ వాజులం,దలరున్ బాహ్లికపారసీకశకధారారట్టఘోట్టాణముల్." ఆము. ౨, ఆ. ౨౯.

ఘోణ. సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.

ఘోణి. సం. వి. న్. పుం. పంది. [డంగిచెట్టు.

ఘోర. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. దావర

ఘోరదర్శనము. సం. వి. అ. పుం. గుడ్లగూబ. విణ. (అ. ఆ. అ.) భయంకరమైనది.

ఘోరము. సం. వి. అ. న. 1. విషము; 2. భయానకరసము. పుం. నక్క. విణ. (అ.ఆ.అ.) భయంకరము.

ఘోరరాసనము. సం. వి. న్. పుం. నక్క. విణ. (అ. ఆ. అ.) ఘోరమగుధ్వని కలది. ఇట్లే: ఘోరవాశనము, ఘోరవాశి మొ.

ఘోరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

ఘోలి. సం. వి ఇ, ఈ. స్త్రీ. ఒకజాతికూరాకుచెట్టు.

ఘోష. సం. వి. ఆ. స్త్రీ. 1. శతపుష్పి, సదాపచెట్టు; 2. కర్కటశృంగిచెట్టు.

ఘోషకము. సం. వి. అ. పుం. చేఁదుబీఱచెట్టు.

ఘోషకుఁడు. సం. విణ. (అ. షికా. అ.) ఘోషించువాఁడు, ప్రకటించువాఁడు

ఘోషణ. సం. వి. ఆ. స్త్రీ = ఘోషణము. [ధ్వని.

ఘోషణము. సం. వి. అ. న. 1. ప్రకటనము; 2.

ఘోషము. సం. వి. అ. పుం. 1. ధ్వని; 2. ఊఱుము; 3. గొల్లపల్లె; 4. ఆవులమంద; 5. దోమ; 6. చేఁదుబీఱచెట్టు; 7. కంచు; 8. చాటుట.

ఘోషయిత్నువు. సం. వి. ఉ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. బట్టువాఁడు; 3. కోయిల. విణ. (ఉ) ప్రకటించువాఁడు.

ఘోషవతి. సం. వి. ఈ. స్త్రీ. వీణె.

ఘోషించు. సం. అ. క్రి. మ్రోయు. (శ. ర.) స. క్రి. చాటించు, ప్రకటించు. భార. విరా. ౫, ఆ. ౨౩౧., వరాహ. ౫, ఆ. ౧౨౧.

ఘోషిల్లు. సం. అ. క్రి. ప్రయోగము. "చ. బెకెకి మృదంగనిస్వహణ భేరులు ఘోషిల..." భా. రా. సు. ౪౬౧.

ఘోషుఁడు. సం. వి. అ. పుం. గొల్లవాఁడు.

ఘ్రా

ఘ్రాణతర్పణము. సం. వి. అ. న. మంచి వాసన. విణ. (అ. ఆ. అ.) మంచివాసన గలది.

ఘ్రాణము. సం. వి. అ. న. 1. ముక్కు; 2. వాసన చూచుట. విణ. (అ. ఆ. అ.) వాసనచూడఁబడినది.

ఘ్రాణించు. సం. న. క్రి. వాసన చూచు. "శా. ఉత్సాహంబున నొక్క పాఁడిమొదవై యూధంబు ఘ్రాణించుచున్..." భాగ. 2, స్కం ౪౦౦.

ఘ్రాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) వాసనచూచువాఁడు.

ఘ్రాతము. సం. విణ. = ఘ్రాణము.

ఘ్రాతవ్యము. సం. వి. అ. న. వాసన. విణ. (అ. ఆ. అ.) వాసనచూడఁదగినది.

ఘ్రాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వాసన; 2. ముక్కు; 3. వాసన చూచుట.

ఘ్రే

ఘ్రేయము. సం. వి. అ. న. వాసన. విణ. (అ. ఆ. అ.) వాసనచూడఁదగినది.

ఙ

ఙ. సం. ఒకానొకయక్షరము. వి. అ. పుం. 1. విషయము; 2. విషయేచ్ఛ.

ఙవనము. సం. వి. అ. న. ధ్వని.

ఙవమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వనిచేయుచున్నది.

ఙా

ఙావకుఁడు. సం. విణ. (అ. వికా. అ) ధ్వని చేయువాఁడు. [చేయించునది.

ఙావయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ధ్వని

ఙు

ఙుతము. సం. వి. అ. న. ధ్వని.

ఙుతి. సం. వి. ఇ. స్త్రీ. ధ్వని.

ఙో

ఙోత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ధ్వని చేయువాఁడు, ధ్వని చేయునది.

చ

చ. ఉభ. దే. ఒకానొకయక్షరము. సం. వి. అ. పుం. (దీనికి తెలుఁగున వల్ల స్వప్రయోగము లేదు.) 1. శివుఁడు; 2. తాఁబేలు; 3. చంద్రుఁడు, 4. దొంగ. (మే. ని.)

చంకురము. సం. వి. అ. పుం. 1. రథము; 2. వృక్షము. (మే. ని)

చంక్రమణము. సం. వి. అ. న. 1. మరల మరలఁ దిరుగుట; 2. దాఁటుట. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తిరుగునది.

చంక్రమము. సం. వి. అ. పుం. 1. మిక్కిలి తిరుగుట; 2. మెల్లదిగాఁ దిరుగుట. "చ. అమితకుచగర్వభార మున నంకన చంక్రమకేళికి సహింపనియల మందగామిని..." రామా. 3, ఆ. ౯౬. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తిరుగునది.

చంగుఁడు. సం విణ. (అ. ఆ. అ.) 1. నేర్పరి; 2. సుందరుఁడు; 3. ఆరోగ్యవంతుఁడు.

చంచ. సం. వి. ఆ. స్త్రీ. 1. చాఁప; 2. గడ్డితోఁ జేసినబొమ్మ.

చంచత్. సం. శత్రు. కదలుచున్న.

చంచరీకము. సం. వి. అ. పుం. తుమ్మెద.

చంచలము. సం. వి. అ. పుం. 1. గాలి; 2. మారవిచ్చుక. విణ (అ. ఆ. అ.) 1. కదలునది; 2. అస్థిరము; 3. కాముకము.

చంచలించు. సం. అ. క్రి. 1. కదలు. "క...మేఘముఖంబునఁ జంచలించు మెఱపును బోలెన్." వరాహ. ౪, ఆ. ౭౫; 2. జంకు. "ఆ. చంచలింపకిట్టిసాహసకృత్యంబు, చేసినావు గాన నోసి పోయి, భయదరూప మైనపాషాణ మై పుట్టు ..." నిరం. ౪, ఆ. ౪౪.

చంచురుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి.

చంచువు. సం. వి. ఉ. ఊ. స్త్రీ. పక్షిముక్కు. పుం. ఆముదపుచెట్టు; 2 వేఁడి.

చంచుసూచి. సం. వి. ఇ. పుం. సూదివంటిముక్కు గలది—కారండవపక్షి.

చండ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. కోపశీలయగుస్త్రీ; 3. నల్లకచోరము; 4. బలురక్కెస; 5. శంఖపుష్పి; 6. దూలగొండి; 7. ఎలుకచెవి; 8. లింగబొట్లు; 9. తెల్లదూర్వ.

చండము. సం. వి. అ. పుం. చింతచెట్టు. న. 1. తీవ్రత; 2. కోపము; 3. తీక్ష్ణత. విణ. (అ.ఆ.అ.) 1. తీవ్రమైనది; 2. మిక్కిలికోపము గలది; 3. మిక్కిలి చురుకైనది; 4. దుష్టమైనది; 5. తీక్ష్ణమైనది. [జిల్లేడుచె.

చండాంశువు. సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు; 2.

చండాతకము. సం. వి. అ. పుం. న. వేశ్యలు నాట్యము చేయునపుడు ధరించులాఁగు, అరచట్ట.

చండాతము. సం వి. అ. పుం. గన్నేరుచె.

చండాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మాలలు వాయించు వీణ; 2. ఓషధివిశేషము; 2. పార్వతి. (వాచ.)

చండాలుఁడు. సం. వి. అ. పుం. మాలవాఁడు. బ్రాహ్మణస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినసంకర జాతివాఁడు. విణ. (అ. ఆ. అ.) క్రూరకర్ముఁడు.

చండి. సం. వి ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. మిక్కిలి కోపము గలస్త్రీ.

చండించు. సం. అ. క్రి. 1. మిక్కిలికోపించు; 2. కలహించు. "క. ఇలునించికొనుట మొదలుగఁ, జలమున మెం డొడ్డి మిగులఁ జండించుచు దక్కులకంతి గురుజనంబుల, కులధర్మం బెంచ కేలుకొంచుం దిరుగసన్." శుక. 3, ఆ. ౩౪౪: 3. ప్రతిఘటించు. "సీ. చండించ నామహేశ్వర కుమారునితోడఁ గ్రౌంచభూధర విదారణ నిరూఢి." దశా. ౭, అ. ౧, ఆ. ౧౩౦.

చండిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. ఏడేండ్ల కుమారి. (వాచ.)

చండిమ. సం. వి. న్. పుం. 1. వాఁడిమి; 2. వేఁడిమి.

చండిలము. సం. వి. అ. పుం. చక్రవర్తికూరచె.

చండిలుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. మంగలి.

చండీకుసుమము. సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరుచె.

చండుఁడు. సం. వి. అ. పుం. 1. యమకింకరుఁడు; 2. ఒకానొకరాక్షసుఁడు; 3. శివుఁడు; 4. కుమారస్వామి.

చందకుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

చందన. సం. వి. ఆ. స్త్రీ. 1. మామెనచె; 2. నదీభేదము.

చందనగిరి. సం. వి. ఇ. పుం. మలయపర్వతము.

చందనము. సం. వి. అ. పుం. మలయజము, మంచిగందపుఁజెట్టు." పుం. న. మంచిగంధము.

చందనీయ. సం. వి. ఆ. స్త్రీ. గోరోజనము.

చందము. సం. వి. అ. పుం. కర్పూరము. (వాచ.)

చందిరము. సం. వి. అ. పుం. ఏనుఁగు. న. జలము. (కే. ని.)

చందిరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. "... విమలశారదచందిరచంద్రికా..." భట్టికావ్యము. వై జ. ౧. ఆ. ౪౯.

చందుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. (కల్ప.)

చంద్ర. సం. వి ఆ. స్త్రీ. 1. ఏలకిచె; 2. మేలుకట్టు;

చంద్రకము. సం. వి. అ. పుం. 1. నెమలిపురికన్ను. 2 గోరు; 3. నీటియందు చమురు మొదలగునవి పడినందువలన నేర్పడుమండలము; 4. ఒకజాతి చేఁప. న. తెల్లమిరియము.

చంద్రకాంత. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. ఒక జాతివృక్షము. "సీ...చంద్రకాం తెట్టిరియ బ్బెంప యెట్టితుమ్మి." హంస. ౪, ఆ. ౪౦.

చంద్రకాంతము. సం. వి. అ. పుం. ఒకజాతిమణి. న. 1. తెల్లకలువ; 2. భక్ష్యవిశేషము. "వ... తేనెతొలలు గురుగు లేలకికాయలు వెన్నమెఋఱంగులు నిడి కుడకలు లడ్వాలు ముత్తెపుఁజిప్పలు చంద్రకాంతంబులు..." ప్రబంధ. ౧౧౨. హంస. ౧. ౧౦౫. [వెండి.

చంద్రకాంతి. సం. వి. ఈ. స్త్రీ. వెన్నెల. ఇ. న.

చంద్రకి. సం. వి. న్. పుం. 1. నెమలి; 2. పెద్దపులి.

చంద్రకితము. సం. విణ. (అ. ఆ. అ.) నెమలిపురికన్నులవంటిజాడ కలది. "చ...చంద్రకితోద్ధసరిత్తటమార్గసీమలన్." పారి. ౨, ఆ. ౧౦౭.

చంద్రఖండము. సం. వి. అ. పుం. న. భక్ష్యవిశేషము. "శా. దోర ల్వట్టిన చంద్రఖండములు దొంతుల్ గొన్నవెన్నప్పముల్." పాంచా. ౪, ఆ. ౫౩.

చంద్రజ్యోతి. సం. వి. న్. పుం. మతాబు. "సీ. బిఱుసులు చిచ్చులు బెడఁగుఁ జంద్రజ్యోతులును నభం బెల్ల వెలుంగఁజేయు." రసి. ౬, ఆ. ౧౯౧.

చంద్రద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. వెన్నెల. పుం. చందనము. (వాచ)

చంద్రనామము. సం. వి. న్. పుం. కర్పూరము.

చంద్రబాల. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకిచె.

చంద్రభస్మము. సం. వి. న్. న. కర్పూరము.

చంద్రమసుఁడు. సం. వి. న్. పుం. చంద్రుఁడు.
చంద్రము. సం. వి. అ. పుం. 1. కర్పూరము; 2. నెమలిపురికన్ను; 3. కంపిల్లము¥. న. 1. కలువ; 2. వెండి. పుం. న. బంగారు.
చంద్రముఁడు. సం. వి. న్. పుం. చంద్రుఁడు.
చంద్రవంక. మి. వి. 1. ఆభరణవిశేషము; 2. ధాన్య విశేషము. "సీ. చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు..." హంస. ౪, ఆ. ౧౨౭. 3. నదీభేదము.
చంద్రవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. బండిగురివెంద తీఁగ¥, 2. సోమలత¥.
చంద్రవ్రతము. సం. వి. అ. న. చాంద్రాయణము.
చంద్రశాల. సం. వి. ఆ. స్త్రీ. 1. పైమేడ; మేడ మీఁదియిల్లు; 2. వెన్నెల.
చంద్రసంభవ. సం. వి. ఆ. స్త్రీ. చిట్టేలకి¥.
చంద్రహాస. సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ¥.
చంద్రహాసము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. రావణునికత్తి. న. వెండి.
చంద్రాతపము. సం. వి. అ. పుం. 1. వెన్నెల; 2. మేలుకట్టు.
చంద్రాలోకము. సం. వి. అ. పుం. వెన్నెల. "శా. ఆనందంబున నర్ధరాత్రములఁ జంద్రాలోకముల్ కాయఁగా..." భీమ. ౫, ఆ. ౯౧.
చంద్రాస్పద. సం. వి. ఆ. స్త్రీ. కర్కటశృంగి¥.
చంద్రి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చ¥.
చంద్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వెన్నెల; 2. పెద్ద యేలకి¥; 3. మల్లెతీఁగ; 4. మత్స్యవిశేషము; 5. తెల్లవాఁకుడు¥; 6. మెంతి¥.
చంద్రిలము. సం. వి. అ. న. చక్రవర్తికూర¥.
చంద్రిలుఁడు. సం. = చండిలుఁడు.
చంద్రుఁడు. సం. వి. అ. పుం. చందమామ. విణ. (అ. ఆ. అ.) సుందరుఁడు; 2. శ్రేష్ఠుఁడు. (సామాన్యముగా నీయర్థమున నిది సమాసాంతగతమై యుండును. ఉదా: రాజచంద్రుఁడు.)
చంద్రోదయము. సం. వి. అ. పుం. 1. నెలపొడుపు; 2. మేలుకట్టు; 3. ఔషధవిశేషము¥.
చంపకమాల. సం. వి. ఆ. స్త్రీ. 1. స్త్రీలకంఠాభరణవిశేషము; 2. సంపెంగపూలదండ; 3. వృత్త విశేషము. [కదళి¥.
చంపకము. సం. వి. అ. పుం. సంపెంగ¥; 2. సువర్ణ

చంపకాలువు. సం. వి. ఉ. పుం. పనస¥.
చంపకోషము. సం. వి. అ. పుం. పనస¥.
చంపాలువు. సం. వి. ఉ. పుం. పనస¥.
చంపువు. సం. వి. ఊ. స్త్రీ. గద్యపద్యమయకావ్యము.
చకచక. సం. వి. అ. పుం. కాంతి. "చ. చికిలిపసిండి వ్రాఁతనునుఁజెంద్రిక వన్నియమేలుకట్టునం, జకచక పర్వ..." వసు. ౬, ఆ. ౭౪.
చకచకత్. సం. శత్ర. ప్రకాశించుచున్న. "ఉ... మరందసంఘాతవియద్ధునీచకచకద్విక చోత్పల సారసంగ్రహా,యాతకుమారగంధవహహారిసుగంధ విలాసయుక్తమై..." (పెద్దనచాటువు.)
చకాసత్. సం. శత్ర. ప్రకాశించుచున్న.
చకచక. దే. అవ్య. పను వెత్తుట మొదలగువానియందలియనుకరణము. (వా.)
చకచకలాడు. దే. అ. క్రి. (చకచకలు+ఆడు.) చురుకుగా నుండు. ఉదా: వాఁడుతనపనిచకచకలాడుచు చేయుచున్నాఁడు.
చకితము. సం. వి. అ. న. 1. భయము; 2. నాయికకు ప్రియునియెదుట కలిగెడుభయసంభ్రమము. విణ. (అ. ఆ. అ.) వెఱచినది.
చకోరకము. సం. వి. అ. పుం. వెన్నెలపులుఁగు.
చకోరము. సం. = చకోరకము.
చక్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నాగరముస్త¥; 2. కర్కటశృంగి¥.
చక్రకము. సం. వి. అ. న. 1. తర్కదోషవిశేషము; 2. దద్రురోగము. విణ. (అ. ఆ. అ.) చక్రాకారము గలది.
చక్రకారకము. సం. వి. అ. న. 1. పులిగోరు¥; 2. గోరు.
చక్రకుల్య. సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న¥.
చక్రగజము. సం. వి. అ. పుం. తగిరిసచెట్టు¥.
చక్రగుచ్ఛము. సం. వి. అ. పుం. అశోకము¥.
చక్రచరము. సం. విణ. (అ. ఆ. అ.) గుమిగూడి తిరుగునది. (పక్ష్యాది.)
చక్రచరుఁడు. సం. వి. అ. పుం. గారడివాఁడు.
చక్రచారి. సం. వి. న్. పుం. రథము.
చక్రజీవకుఁడు. సం. వి. అ. పుం. కుమ్మరి.
చక్రడోల. సం. వి. ఆ. స్త్రీ. అంగుడురాట్నము.

చక్రదంతి. సం. వి. ఈ. స్త్రీ. నేపాళము✓.
చక్రదంష్ట్రము. సం. వి. అ. పుం. పంది.
చక్రధరము. సం. వి. అ. పుం. సర్పము.
చక్రధరుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. చక్రవర్తి; 3. గారడివాఁడు.
చక్రధారణము. సం. వి. అ. న. బండికుంచము.
చక్రనాభి. సం. వి. ఇ. పుం = చక్రధారణము.
చక్రనాయకము. సం. వి. అ. పుం. పులిగోరు✓.
చక్రపక్షము. సం. వి. అ. పుం. హంస.
చక్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న✓.
చక్రపాణి. సం. వి. ఇ. పుం. విష్ణువు.
చక్రపాలుఁడు. సం. వి. అ. పుం. 1. యుద్ధమున చక్రములను రక్షించుట కేర్పడినయోధుఁడు; 2. సేనానాయకుఁడు; 3. రాష్ట్రాధిపతి; 4. విష్ణువు.
చక్రబంధువు. సం. ఉ. పుం. సూర్యుఁడు.
చక్రభేదిని. సం. వి. ఈ. స్త్రీ. రాత్రి.
చక్రభ్రమము. సం. వి. అ. పుం. సానపట్టుబాయి.
చక్రమండలి. సం. వి. న్. పుం. కొండచిలువ.
చక్రమర్దనము. సం. వి. అ. పుం. తగిరిస✓.
చక్రమర్దము. సం. = చక్రమర్దనము.
చక్రము. సం. వి. అ. న. 1. సుదర్శనము. (విష్ణుని చక్రము.); 2. బండికల్లు; 3. సమూహము; 4. కుమ్మరిసారె; 5. సేన; 6. రాష్ట్రము; 7. వ్యూహవిశేషము; 8. నీటిసుడి; 9. గ్రామసమూహము; 10. గానుగు, నూనెయంత్రము; 11. వలయము; 12. మూలాధారము మున్నగు నాఱుపద్మములు; 13. కావ్యబంధవిశేషము; 18. శ్రీచక్రము మొదలగు దేవార్చనయంత్రము; 19. దద్దురు. పుం. చక్రవాకపక్షి.
చక్రముఖము. సం. వి. అ. పుం. పంది.
చక్రల. సం. వి. ఆ. స్త్రీ. పట్రవముస్తె✓.
చక్రలక్షణ. సం. వి. ఆ. స్త్రీ. గుడూచి, తిప్పతీఁగె✓.
చక్రవర్తి. సం. వి. న్. పుం. 1. సార్వభౌముఁడు; 2. శాకవిశేషము.
చక్రవర్తిని. సం. వి. ఈ. స్త్రీ. 1. సార్వభౌమురాలు; 2. కొరిందె✓; 3. లత్తుక; 4. జటామాఁసి✓.
చక్రవాకము. సం. వి. అ. పుం. చక్రవాకపక్షి.
చక్రవాటము. సం. వి. అ. పుం. 1. హద్దు; 2. దీపస్తంభము; 3. కార్యప్రారంభము.
చక్రవాతము. సం. వి. అ. పుం. సుడిగాలి.
చక్రవాళము. సం. వి. అ. పుం. చుట్టుఁగొండ, లోకాలోక మనుపర్వతము. న. 1. గుంపు; 2. మండలము.
చక్రవృద్ధి. సం. వి. ఇ. స్త్రీ. వడ్డికివడ్డి.
చక్రశల్య. సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురివెంద✓.
చక్రశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. అజశృంగి, జుట్టుపు✓.
చక్రాంగ. సం. వి. ఆ. స్త్రీ. సుదర్శన✓.
చక్రాంగము. సం. వి. అ. పుం. చక్రవాకపక్షి; 2. హంస.
చక్రాంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుహంస; 2. ఆఁడుజక్కవ; 3. కటుకరోహిణి✓; 4. కర్కాటశృంగి✓; 5. మంజిటి✓.
చక్రాటుఁడు. సం. వి. అ. పుం. 1. మోసగాఁడు; 2. పాములవాఁడు.
చక్రాధివాసి. సం. వి. న్. పుం. నారింజ✓.
చక్రి. సం. వి. న్. పుం. 1. విష్ణుఁడు; 2. రారాజు; 3. కుమ్మరి; 4. గారడివాఁడు; 5. గాండ్లవాఁడు; 6. వైశ్యస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు; 7. చక్రవాకము; 8. పాము; 9. తినాసము✓; పులిగోరు✓. విశే. (న్. జీ. న్.) 1. చక్రము కలవాఁడు; 2. కొండెములు చెప్పువాఁడు.
చక్రిక. సం. వి. ఆ. స్త్రీ. మోఁకాలు.
చక్షణము. సం. వి. అ. న. 1. కథనము, చెప్పుట; 2. నంజుకొనునొకద్రవ్యము.
చక్షుర్వహణము. సం. వి. అ. న. జుట్టుపు✓.
చక్షువు. సం. వి. న్. పుం. కన్ను.
చక్షుశ్శ్రవము. సం. వి. న్. పుం. పాము.
చక్షుష్య. సం. వి. ఆ. స్త్రీ. అంజనవిశేషము.
చక్షుష్యము. సం. వి. అ. పుం. 1. మొగలి✓; 2. మునగ✓. పుండరీకము✓. న. 1. సౌవీరాంజనము; 2. పాలుతుత్తము. విశే. (అ. ఆ. అ.) 1. కంటికి హితమైనది; 2. కంటి కింపైనది; 3. కంటినుండి పుట్టినది.
చక్షూరాగము. సం. వి. అ. పుం. 1. కంటియెఱుపు; 2. నాయికానాయకులకు పరస్పరదర్శనమువలనఁ గలుగు ననురాగము.

చటక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుపిచ్చుక; 2. పిచ్చుకయొక్క ఆఁడుపిల్ల; 3. పిప్పలివేరు.
చటకము. సం. వి. అ. పుం. పిచ్చుక. రూ. చటకకము.
చటకారి. అర. వి. ఈదేశమునఁ బుట్టినఆంగ్లేయ సంతతివాఁడు; 2. సంకరజాతివాఁడు.
చటకాశిరము. సం. వి. న్. న. పిప్పలివేరు.
చటనము. సం. వి. అ. న. 1. పెట్లుట; 2. తునియ లగుట.
చటాకు. వి. (హిం. ఛటాక్.) సేరులోఁ బదునాఱవ వంతు.
చటుల. సం. వి. ఆ. స్త్రీ. మెఱపు.
చటులము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలునది; 2. మనోహరమైనది.
చటువు. సం. వి. ఉ. స్త్రీ. న. చాటువాక్యము. పుం. పశువులకడుపు; 2. ఆసనవిశేషము. విణ. (ఉ.) చంచలము.
చణకము. సం. వి. అ. పుం. సెనగ చెట్టు.
చణము. సం. వి. అ. పుం. సెనగచెట్టు. విణ. (అ.ఆ.అ.) 1. ప్రసిద్ధము; 2. నిపుణము; 3 ధనికము. "ఉ... మాధవుండు...పత్రి కావళీజయ శ్రీ చణుఁ డయ్యె ..." ఆము. ౫, ఆ. ౧౨౦.
చతుర్. సం. విణ. (ర్.) నాలుగు (ఇది తెనుఁగున వ్యస్తముగా నుండదు.)
చతుర. సం. వి. ఆ. స్త్రీ. మృగీవిశేషము.
చతురంగము. సం. వి. అ. న. 1. సేన; 2. చదరంగము. విణ. (అ. ఆ, ఈ. అ.) నాలుగంగములు గలది.
చతురంగుళము. సం. వి. అ. పుం. రేలచెట్టు.
చతురంతయానము. సం. వి. అ. న. పల్లకి.
చతురము. సం. వి. అ. పుం. 1. గుండ్రనిదిండు; 2. వంకరనడక. న. గజశాల; 2. అల్పభ్రుకుటి.
చతురశ్రము. సం. వి. అ. పుం. చదరము. విణ. (అ.ఆ. అ.) 1. అందమైనది; 2. నాలుగుమూలలు గలది.
చతురాననుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ. ఇట్లే: చతుర్ముఖుఁడు మొ.
చతురిమము. సం. వి. న్. పుం. నేర్పు.
చతురుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిపుణుఁడు; 2. చురుకైనవాఁడు; 3. బుద్ధిమంతుఁడు; 4. అందమైనవాఁడు.
చతుర్గతి. సం. వి. ఇ. పుం. తాఁబేలు.
చతుర్థము. సం. విణ. (అ. ఆ. అ.) నాలుగవది.
చతుర్థి. సం. వి. ఈ. స్త్రీ. 1. చవితి; 2. ఒకవిభక్తి.
చతుర్థిక. సం. వి. ఆ. స్త్రీ. పలము.
చతుర్దంతము. సం. వి. అ. పుం. ఐరావతము.
చతుర్దశి. సం. వి. ఈ. స్త్రీ. 1. పదునాలుగవతిథి; 2. పదునాల్గుకంతులు గలవీణ
చతుర్దోలము. సం. వి. అ. పుం. న. పల్లకి.
చతుర్బాహువు. సం. వి. ఉ. పుం. విష్ణువు. న. చదరము. విణ. (ఉ.) నాలుగు చేతులు కలవాఁడు.
చతుర్భద్రము. సం. వి. అ. న. బలయుక్తము లైన ధర్మార్థకామమోక్షములు.
చతుర్భుజుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.
చతుర్వర్గము. సం. వి. అ. పుం. ధర్మార్థకామమోక్షములసముదాయము.
చతుర్వర్షిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నాలుగేండ్లవయసు గల ఆవు; 2. నాలుగేండ్లప్రాయము గలకన్య.
చతుర్వ్యూహుఁడు. సం. వి. అ. పుం. విష్ణుఁడు.
చతుర్హాయనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాలుగేండ్లవయసు గలది; 2. నాలుగేండ్లనుండి యున్నది. (ఇది చేతనములం దుపయుక్తమై నపుడు స్త్రీలింగమున నీకారాంతమై ణత్వము నొందును. ఉ. చతుర్హాయణి. మొ.)
చతుశ్శాలము. సం. వి. అ. న. నాలుగిండ్లబవంతి.
చతుష్కము. సం. వి. అ. న. 1. నాల్గింటిసముదాయము; 2. నాల్గుపేటలు గలహారము; 3. చవికె.
చతుష్కి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దకోనేఱు; 2. దోమతెర.
చతుష్టయము. సం. వి. అ. న. 1. జ్యోతిశ్శాస్త్ర సంబంధమైనకేంద్రస్థానము; 2. నాల్గింటిసముదాయము.
చతుష్పత్రి. సం. వి. ఈ. స్త్రీ. పాషాణభేదిచెట్టు.
చతుష్పథము. సం. వి. అ. పుం. నాలుగుమార్గములు కలియుచోటు, చదుకము.
చతుష్పథుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.
చతుష్పద. సం. వి. ఆ. స్త్రీ. బుఱ్ఱ.
చతుష్పదము. సం. వి. అ. పుం. 1. ఒకకరణము, 2. నాలుగుకాళ్లజంతువు. విణ. (అ. ఆ. అ.) నాలుగు కాళ్లు కలది.
చతుష్పది. సం. వి. ఈ. స్త్రీ. పద్యము.

చతుష్పాత్తు. సం. వి. ద్. పుం. 1. ఒకకరణము; 2. నాల్గుకాళ్లజంతువు. విణ. (ద్. ష్పదీ. ద్.) నాల్గుపాదములు గలది.

చతుష్షష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఋగ్వేదము; 2. అఱువదినాల్గుకళలు; 3. అఱువదినాలుగు. విణ. (ఇ స్త్రీ.) అఱువదినాల్గవది.

చత్వరము. సం. వి. అ. న. 1. అగ్నిస్థాపనమునకై సంస్కరింపఁ బడిన ప్రదేశము; 2 వ్రతము పూనినవాఁడు పండుకొనఁదగిన ప్రదేశము; 3. ముంగిలి; 4. నాల్గుమార్గములు కలియుచోటు.

చత్వారము. దే. వి. (సం. చత్వారింశత్.) నలువదియేండ్లకు వచ్చు దృష్టిమాంద్యము. (అత్వవిశిష్టమైనచకారము దంత్య మని వ్యాకరణము. కాని యిది తాలవ్యముగనే వాడుకలో నుచ్చరింపఁబడుచున్నది.) "క. కంఢ్లకుఁ జత్వార మొదవెఁ గాయము ముదిసెన్." చంద్ర. వి. ౪. ఆ. ౫౧.

చత్వారి. సం. వి. ఈ. స్త్రీ. 1. వినినదానిఁ దెలిసికొన సమర్థమైనబుద్ధి; 2. చదుకము.

చదిరము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2. పాము. 3. కప్పురము.

చదిరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

చపల. సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱపు; 2. లక్ష్మి; 3. ఆఁకుటాలు; 4. పిప్పలిచె; 5. గంజాయిచె; 6. వృత్తవిశేషము.

చపలత. సం. వి. ఆ. స్త్రీ. రాగద్వేషాదులచే పనులయందు కలుగు తబ్బిబ్బు, వ్యభిచారిభావములలో నొకటి.

చపలము. సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. చేఁప; 3. చేలుపటాయి; 4. పాదరసము; 5. చోరక మను గంధద్రవ్యము. విణ. (అ. ఆ. అ.) 1. కదలునది; 2. నిలుకడ లేనిది; 3. వడి గలది; 4. తొందరపడి చేయునది; 5. నీచము.

చపేటము. సం. వి. అ. పుం. 1. చాఁచినవ్రేళ్లు గల అఱచేయి; 2. అట్టిఅఱచేతితో చెంపమీఁదఁ గొట్టినదెబ్బ, చెంపకాయ.

చపేటిక. సం. వి. ఆ. స్త్రీ. చపేటము.

చమత్కరణము. సం. వి. అ. న. = చమత్కారము.

చమత్కరించే. సం. అ. క్రి. చమత్కారము చేయు. "ఉ. . . . కపోలపాళిచుంబించి చమత్కరించి వలపించి కళల్ గరఁగించి మించి సొక్కించి కడుఁగ్ సుఖించి కిలికించితకేళి రమించె వేడుకన్." అని. 3, ఆ. ౭౯. స. క్రి. మెచ్చుకొను. "చ. మొదలఁ బురందరాళఁ దగముట్టితి రాగముతోడఁ బద్మినిన్, బిదపఁ జమత్కరించితిని వేడ్కఁ గరంబులు సాఁచి యింక నన్, బోదువకు మంచు దూఱుచు నపూర్వనిశాంగన కాలఁ దాఁచినన్, దవమితయావకద్రవముఁ దాల్చెను నా నినుఁడొప్పె రక్తిమన్." ఉద్భ. ౩, ఆ. 33.

చమత్కారము. సం. వి. అ. పుం. 1. నేర్పు; 2. వింత.

చమత్క్రియ. సం. = చమత్కరణము. "లయవిభాతి . . . చంక్రమణవిలసన చమత్క్రియలఁ బొలయు నెలయించున్." రామా. ౧, ఆ. ౧౬౦.

చమరపుచ్ఛము. సం. వి. అ. పుం. ఉడుత. న. వింజామరము.

చమరము. సం. వి. అ. పుం. సవరపుమెకము. వింజామరము.

చమరి. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుసవరపుమెకము.

చమరికము. సం. వి. అ. పుం. ఎఱ్ఱకాంచనముచె.

చమసము. సం. వి. అ. పుం. ఒకానొకయజ్ఞపాత్రము.

చమసి. సం. వి. ఆ. స్త్రీ. మినుపపిండి.

చమువు. సం. వి. ఊ. స్త్రీ. 1. సేన; 2. ౭౨౯ రథములు; ౭౨౯ ఏనుఁగులు, ౨౧౮౭ గుఱ్ఱములు, ౩౬౪౫ పదాతులు కలసేన. భార. ఆది. ౧, ఆ. ౬౦.

చమూచరుఁడు. సం. వి. అ. పుం. సేనానాయకుఁడు.

చమూరువు. సం. వి. ఉ. పుం. హ్రస్వపుచ్ఛము గల మృగవిశేషము.

చయనము. సం. వి. అ. న. 1. సేకరణము; 2. యజ్ఞవిశేషము.

చయము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. అగడ్తనుండి త్రవ్వి కోటగోడ చుట్టును పోసిన మట్టిదిబ్బ; 3. చయన మనునొకయజ్ఞము; 4. సంగ్రహించుట; 5. పీఠము.

చరకము. సం. వి. అ. పుం. 1. చరకరచితమైనవైద్యశాస్త్రగ్రంథము; 2. పాపటచె; 3. దుష్పటి.

చరకుఁడు. సం. వి. అ. పుం. 1. చారుఁడు; 2. చరక మనువైద్యశాస్త్రగ్రంథమును రచించినవాఁడు; 3. భిక్షువు.

చరటము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట.
చరణగ్రంథి. సం. వి. ఇ. పుం. చీలమండ.
చరణపర్వము. సం. వి. న్. న. చీలమండ.
చరణము. సం. వి. అ. పుం. 1. ఋగ్వేదాది; 2 కిరణము. పుం. న. 1. పాదము; 2. చెట్టువేరు 3. పద్యముయొక్క పాదము; 4. పాతిక పాలు న. 1. భక్షణము; 2. సంచారము; 3. ప్రవర్తనము; 4. ఆచరణము. పుం. బ. గుర్వాదిశబ్దముల కనుప్రయుక్తమై పూజ్యతను దెలుపును. ఉదా: గురుచరణాః.
చరణాయుధము. సం. వి. అ. పుం. కోడి.
చరణీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. భక్షింపఁదగినది; 2. సంచరింపఁదగినది; 3. అనుష్ఠింపఁదగినది.
చరత్. సం. శత్రు. చరించుచున్న.
చరద్రవ్యము. సం. వి. అ. న. కదల్పఁదగినవస్తుసంపత్తి. (వ్యతి. స్థిరద్రవ్యము.)
చరమకాలము. సం. వి. అ. పుం. 1. మరణసమయము; 2. చివరకాలము.
చరమక్రియ. సం. వి. ఆ. స్త్రీ. దహనాదికమైన అంత్యకర్మము.
చరమదశ. సం. వి. ఆ. స్త్రీ. 1. మరణావస్థ; 2. ముదిమి.
చరమము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అంత్యము; 2. పడమటిది; 3. వెనుకటిది.
చరమాద్రి. సం. వి. ఇ. పుం. అస్తగిరి, క్రుంకుమల
చరము. సం. వి. అ. పుం. 1. ఒకానొకజూదము; 2. కాటుకపిట్ట; 3. గవ్వ; 4. మంగళవారము. న. కదల్పఁదగినవస్తుసంపత్తి. (వ్యతి. స్థిరము.) విశే. (అ. ఆ. అ.) 1. కదలునది; 2. నిలుకడ లేనిది; 3. సంచరించునది.
చరాచరము. సం. వి. అ. న. 1. జగత్తు; 2. ఆకసము. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తిరుగునది; 2. చరస్థిరరూపమైనది.
చరి. సం. వి. ఇ. పుం. పశువు. (వాచ.)
చరించు. సం. అ. క్రి. 1. తిరుగు. "ఉ. ఇచ్చ హితాహితంబు గణియింపనిగోలవు గాన గానకున్, వచ్చితిగా కయో పథికవర్గము నొంటిఁ జరింప నిచ్చునే, యిచ్చటి యన్యపుష్పచయము..." వసు. 3, ఆ. ౧౨౨; 2. వ్యభిచరించు. "క. విడువఁదగు సతి చరించిన, విడువఁగా రాదు ప్రాణవిభుఁ గులసతికిన్." రుక్మా. ౪, ఆ. ౧౧౨. స. క్రి. చేయు. "మ. వ్రతముల్ చరించె నధికేచ్ఛన్ గుంభకర్ణుండు..." భార. అర. ౬, ఆ. ౨౪౮.
చరిత. సం.=చరితము. "క. ధరణిప్రజ ధర్మసుతుసు, స్థిరనిర్మలచరితఁ జేసి..." భార. ఆని. ౧, ఆ. ౧౩.
చరితము. సం. వి. అ. న. 1. నడవడి; 2. స్వభావము; 3. జీవితము; 4. తిరుగుట. విశే. (అ.ఆ.అ.) 1. ఆచరింపఁబడినది; 2. పొందఁబడినది; 3. భక్షింపఁబడినది; 4. తెలియఁబడినది; 5. కదలినది.
చరితార్థము. సం. విశే. (అ. ఆ. అ.) కృతార్థము; 2. సార్థకము.
చరిత్ర. సం. వి. ఆ. స్త్రీ. చింతచెట్టు. అ. న. = చరిత్రము. చరిత్రము. సం. వి. అ. న. 1. జీవితగ్రంథము; 2. నడవడి; 3. స్వభావము; 4. ధర్మము.
చరిష్ణువు. సం. విశే. (ఉ.) తిరుగుస్వభావము కలది.
చరుఁడు. సం. వి. అ. పుం. 1. చారుఁడు; 2. అంగారకుఁడు.
చరువు. సం. వి. అ. పుం. 1. దేవతలకు హోమము చేయునిమిత్తమై వండినయన్నము; 2. హవ్యము వండెడిస్థాలి; 3. మేఘము.
చర్చ. సం. వి. ఆ. స్త్రీ. 1. అధ్యయనముచేయుట. 2. విచారణ; 3. చందనాద్యనులేపము; 4. పార్వతి; 5. పుంశ్చలి.
చర్చకుఁడు. సం. విశే. (అ. ృకా. అ.) 1 అధ్యయనము చేయువాఁడు; 2. విమర్శించువాఁడు; 3. చందనాదులను పూయువాఁడు.
చర్చనము. సం. వి. అ. న. 1. అధ్యయనము; 2. విమర్శనము; 3. చందనాదులను పూయుట.
చర్చము. సం. వి. అ. పుం. కుబేరుని నవనిధులలో నొకటి.
చర్చరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గీతిభేదము; 2. చప్పట; 3. ఇచ్చకము; 4. దంభవాక్యము; 5. నెఱికురులు.
చర్చరీకము. సం. వి. అ. పుం. 1. తల దువ్వుకొనుట; 2. శాకము.
చర్చరీకుఁడు. సం. వి. అ. పుం. మహాకాలుఁడు. (వాచ.)

చర్చించు. సం. స. క్రి. 1. విమర్శించు. "సీ. చర్చించి చూచిన సర్వజ్ఞతాపటు ప్రౌఢిమయుదయంబు పరిమళంబు, పరికించిచూచిన నిరుపమత్యాగలక్ష్మీ విలాసము దేవతాపరంబు." వరాహ. ౧, ఆ. ౩౯; 2. వస్ను. "క. ముందర శిఖండి నిడి సంక్రందన నందనుఁడు నేరి గంగాతనయున్, క్రందించెఁ గపటమున న్యాచంద మొక్కటి కర్ణునందుఁ జర్చించి రొక్కో." భార. కర్ణ. ౧, ఆ. ౩౯.

చర్చితము. సం. వి. అ. న. 1. విమర్శనము; 2. చందనాద్యనులేపనము. విణ. (అ. ఆ. అ.) 1. చందనాదులచే పూయఁబడినది; 2. విమర్శింపఁబడినది.

చర్పటము. సం. వి. అ. పుం. 1. పాపటవిశే; 2. చెంపకాయ.

చర్మకష. సం. వి. ఆ. స్త్రీ. సంబరేనువిశే.

చర్మకారి. సం. వి. ఈ. స్త్రీ. 1. సంబరేనువిశే; 2. మాదిగస్త్రీ.

చర్మకారుఁడు. సం. వి. అ. పుం. మాదిగవాఁడు. విణ. (అ. ఆ. అ.) చెప్పులు కుట్టుట మున్నగుపని చేయువాఁడు.

చర్మచటకము. సం. వి. అ. పుం. గబ్బిలము.

చర్మచిత్రకము. సం. వి. అ. న. బొల్లిరోగము.

చర్మజము. సం. వి. అ. న. 1. నెత్తురు; 2. శరీరమందలివెంట్రుక.

చర్మణ్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. నదీవిశేషము; 2. అరఁటిచెట్టు.

చర్మదండము. సం. వి. అ. పుం. తోలుకట్టి.

చర్మద్రుమము. సం. వి. అ. పుం. భూర్జమువిశే.

చర్మనాళిక. సం. వి. ఆ. స్త్రీ. తోలికట్టి.

చర్మపత్ర. సం. వి. ఆ. స్త్రీ. గబ్బిలము.

చర్మపాదుక. సం. వి. ఆ. స్త్రీ. పాదరక్ష.

చర్మప్రభేదిక. సం. వి. ఆ. స్త్రీ. చెప్పులుకుట్టుసూది.

చర్మప్రసేవిక. సం. వి. ఆ. స్త్రీ. కొలిమితిత్తి.

చర్మభేదిక. సం. = చర్మప్రభేదిక.

చర్మము. సం. వి. న్. న. 1. తోలు; 2. డాలు.

చర్మముండ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

చర్మయష్టి. సం. వి. ఈ. స్త్రీ. తోలికట్టి.

చర్మరి. సం. వి. ఈ. స్త్రీ. విషభేదము.

చర్మరువు. సం. వి. ఉ. పుం. మాదిగవాఁడు.

చర్మళము. దే. వి. చదర. (బ్రౌ. వా.)

చర్మసంభవ. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకివిశే.

చర్మారుఁడు. సం. వి. అ. పుం. మాదిగవాఁడు.

చర్మి. సం. వి. న్. పుం. 1. భూర్జపత్రమువిశే; 2. అరఁటివిశే; 3. నందికేశ్వరుఁడు. విణ. 1. చర్మము కలవాఁడు; 2. డాలు ధరించినవాఁడు.

చర్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆచరణము; 2. నడవడి; 3. చేయఁదగినపని; 4. గమనము; 5. ఆచారము; 6. తినుట.

చర్వ. సం. వి. ఆ. స్త్రీ. నమలుట.

చర్వణ. సం. వి. ఆ. స్త్రీ. 1. నమలుట; 2. ఈఁగ.

చర్వణము. సం. వి. అ. పుం. న. 1. నమలుట; 2. అనుభవించుట.

చర్వితచర్వణము. సం. వి. అ. న. 1. నమలినదానినే నమలుట, నెమరువేయుట; 2. చేసినదానినే చేయుట.

చర్వితము. సం. విణ. 1. నమలఁబడినది; 2. అనుభవింపఁబడినది.

చల. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. మెఱుపు; 3. అంకుటాలు; 4. సిల్హాక మనుగంధద్రవ్యమువిశే. (వాచ.)

చలచంచువు. సం. వి. ఉ. పుం. చకోరము.

చలత్. సం. శత్రు. చలించుచున్న.

చలదంగము. సం. వి. అ. పుం. మత్స్యవిశేషము.

చలదళము. సం. వి. అ. పుం. రావిచెట్టు.

చలనకము. సం. వి. అ. న. నృత్యసమయమున వేశ్యలు ధరించుచల్లడము.

చలనము. సం. వి. అ. న. 1. కదలుట; 2. తిరుగుట; 3. వణఁకుట. విణ. (అ. ఆ. అ.) 1. కదలించునది; 2. వణఁకించునది.

చలని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏనుఁగును కట్టుగొలుసు; 2. నృత్యసమయమున వేశ్యలు ధరించుచల్లడము.

చలమంచము. సం. వి. అ. పుం. ఊయెలమంచము.

చలము. సం. వి. అ. పుం. 1 వణఁకు; 2. వాయువు; 3. పాదరసము. విణ. (అ. ఆ. అ.) కదలుట.

చలాకీ. హిం. విణ. చుఱుకైనది. (వా.)

చలాచలము. సం. వి. అ. పుం. కాకి. విణ. (అ. ఆ. అ.) 1. చలించునది; 2. చలించునదియు చలింపనిదియు.

చలామణీ. హిం. వి. చెల్లుబడి. (వా.)

చలాయించు. హిం. స. క్రి. 1. సాగించు; 2. పాఱిపోవు. (వా.)

చలించు. సం. అ. క్రి. కదలు. "ఉ...భాసురవక్షమారుతము పర్వతకోటిఁ జలింపఁజేయ..." మార్క. ౧, ఆ. ౩౪౪.

చలితము. సం. వి. అ. న. 1. కదలుట; 2. వణఁకుట; 3. గమనము; 4. నృత్యభేదము విణ. (అ.ఆ.అ.) 1. కదలింపఁబడినది; 2. వణఁకింపఁబడినది; 3. గతించినది; 4. పొందఁబడినది.

చలుకము. సం. వి. అ. పుం. పుడిసిలి.

చలువు. సం. వి. ఉ. పుం. పుక్కిలింత. (వాచ.)

చవలము. సం. వి. అ. పుం. బొబ్బరలు.

చవి. సం. వి. ఈ. స్త్రీ. = చవ్యము.

చవిక. సం. వి. ఆ. స్త్రీ. = చవ్యము.

చవ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. వస; 2. ప్రత్తి.

చవ్యజ. సం. వి. ఆ. స్త్రీ గజపిప్పలి.

చవ్యము. సం. వి. అ. న. ఒకమందుదినుసు.

చషకము. సం. వి. అ. పుం. కల్లుత్రాగెడుగిన్నె. 2. గిన్నె న. 1 ఒకవిధముగుకల్లు; 2. తేనె.

చషతి. సం. వి. ఇ. పుం. 1. చంపుట; 2. తినుట.

చషాలము. సం. వి. అ. పుం. 1. యూపస్తంభమునందుండుకట్టెకడియము; 2. తేనెపట్టు.

చా

చాంగము. సం. వి. అ. పుం. 1. పులిచింత; 2. దంతపటుత్వము.

చాంగేరి. సం. వి. ఈ. స్త్రీ. పులిచింత.

చాంచల్యము. సం. వి. అ. న. చంచలత్వము.

చాండాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. చండాలజాతిస్త్రీ; 2. లింగపొట్ల.

చాండాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. మాలవీణె.

చాండాలుఁడు. సం. = చండాలుఁడు.

చాంద్రకము. సం. వి. అ. న. సొంటి.

చాంద్రమసము. సం. వి. అ. న. మృగశీర్ష నక్షత్రము. విణ. (అ. ఆ. అ.) చంద్రునకు సంబంధించినది.

చాంద్రమానము. సం. వి. అ. న. చంద్రునిగతినిఁ బట్టి యేర్పఱచెడికాలమానము.

చాంద్రము. సం. వి. అ. పుం. 1. శుక్లపక్షము; 2. చంద్రకాంతమణి. న. 1. చాంద్రమానము; 2. మృగశీర్షనక్షత్రము. 3. అల్లము.

చాంద్రాయణము. సం. వి. అ. న. ఒకానొకవ్రతము. (ఈవ్రతమును భుజింపఁదగిన కబళములలో చంద్రునియొక్కవృద్ధిక్షయముల ననుసరించి శుక్లపక్షమున నొక్కొక్కకబళమును హెచ్చించుచు కృష్ణపక్షమున నొక్కొక్క కబళమును తగ్గించుచు నాచరింతురు.)

చాందిని. హిం. వి. మేలుకట్టు. (వా.)

చాంద్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. వెన్నెల; 2. తెల్లవాకుడు.

చాంపిల. సం. వి. ఆ. స్త్రీ. చంపానది.

చాంపేయకము. సం. వి అ. న. కింజల్కము.

చాంపేయము. సం. వి. అ. పుం. 1. బంగారు; 2. కింజల్కము; 3. సంపెంగ; 4. నాగకేసరము.

చాకచక్యము. సం. వి. అ. న. చుఱుకుఁదనము.

చాకచిచ్చ. సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది.

చాకిరి. హిం. వి. నీచమైనకొలువు. (వా.)

చాకోరకము. సం. వి. అ. న. చకోరపక్షులగుంపు. "ఉ...పొంగెఁ జంద్రికాసారము తత్ప్రమోదమున సంయమికోటి చెలంగుపట్ల చాకోరకముల్ చెలంగె..." విష్ణు. నా. ౫, ఆ. ౨౦౬.

చాకోరము. సం. వి. అ. న. చకోరపక్షులగుంపు. విణ. (అ. ఆ. అ.) చకోరములకు సంబంధించినది.

చాక్రికుఁడు. సం. వి. అ. పుం. 1. గాండ్లవాఁడు; 2. బండివాఁడు; 3. కుమ్మరి; 4. వేకువను రాజును నిద్రనుండి మేల్కొలుపువాఁడు; 5. వైశ్యస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినవాఁడు. విణ. (అ.ఆ.అ.) చక్రముతోఁ దిరుగువాఁడు.

చాక్షుషము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్షువులచే గ్రహింపఁబడునది; 2. చక్షుస్సంబంధమైనది.

చాచలి. సం. విణ. (ఇ. ఈ. ఇ.) మిక్కిలి చలించునది.

చాటకైరము. సం. వి. అ. పుం. పిచ్చుకమగపిల్ల.

చాటము. సం. వి. అ. పుం. ఒకానొకసంకీర్ణవర్ణము.

చాటుఁడు. సం. వి. అ. పుం. న. మోసగాఁడు.

చాటుకము. సం. వి. అ. పుం.ఇంపైన సంభాషణము.

చాటుకారము. సం. వి. అ. పుం. బంగారుపూసలు గ్రుచ్చినయొంటిపేటహారము.

చాటుకారుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ప్రియవాక్యములు పలుకువాఁడు.

చాటుపటుఁడు. సం. వి. ఉ. పుం. ఆకతాయ. విణ. (అ. ఆ. అ.) ప్రియముగా మాటలాడుటయందు సమర్థుఁడు.

చాటుపటువు. సం. వి. ఉ. పుం. విదూషకుఁడు.

చాటువు. సం. వి. ఉ. పుం. న. 1. ప్రియవాక్యము; 2. మిథ్యాప్రియవాక్యము. స్త్రీ. న. రాజాది ప్రియవాక్యము. పుం. 1. త్రేడ్పు; 2. పసుల కడుపు; 3. త్రేడ్పుచివర.

చాణకీనము. సం. విణ. (అ. ఆ. అ.) సెనగలపంటకు తగినది (క్షేత్రము.)

చాతకము. సం. వి. అ. పుం. వానకోయిల.

చాతకానందనము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. వర్షాకాలము.

చాతురము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాల్గింటికి సంబంధించినది; 2. నేర్పు గలది; 3. కంటికిఁ గన బడునది; 4. నాల్గింటిచే లాగఁబడునది (శకటాది)

చాతురి. సం. వి. ఈ. స్త్రీ. నేర్పు.

చాతురికుఁడు. సం. వి. అ. పుం. సారథి.

చాతుర్థకము. సం. విణ. (అ. ర్థికా. అ.) నాల్గేసి దినముల కొకసారి వచ్చునది. (జ్వరము.)

చాతుర్థికము. సం. విణ. (అ. ఈ. అ.) నాల్గేసిదిన ముల కొకసారివచ్చునది (జ్వరము.)

చాతుర్మాసి. సం. వి. ఈ. 1. ఇష్టిభేదము; 2. నాలు గేసి నెలలకు వచ్చుపూర్ణిమ;3.చాతుర్మాస్యవ్రతము చేయువాఁడు.

చాతుర్మాస్యము. 1. నాలుగునెలలు చేసెడియొక యజ్ఞము; 2. నాలుగునెలలు చేయునొక వ్రతము.

చాతుర్యము. సం. వి. అ. న. నేర్పు.

చాతుర్వర్ణ్యము. సం. వి. అ. న. బ్రాహ్మణాదికచతు ర్వర్ణములు.

చాదస్తము. దే. వి. 1. వెఱ్ఱితనము. (వా.); 2. ఛాందసము. (వా.)

చాదస్తుఁడు. దే. వి. వెఱ్ఱివాఁడు. (వా.)

చాపము. సం. వి. అ. పుం. 1. విల్లు; 2. ధనూరాశి.

చాపలము. సం. వి. అ. న. 1. వణఁకు; 2. విమర్శింపక చేయుట; 3. పొగరుఁబోతుతనము; 4. నిలుకడలేమి.

చాపల్యము. సం. = చాపలము.

చాపి. సం. వి. న్. పుం. ధనూరాశి. విణ. (ఇ.ఈ. ఇ.) చాపము గలవాఁడు.

చామర. సం. వి. ఆ. స్త్రీ. 1. వింజామరము. "ఉ... చామరల్ కవ లిడన్." భార. శాం. ౧, ఆ. ౧౪౭; 2. దండము.

చామరపుష్పము. సం. వి. అ. పుం. 1. పోఁకచెట్టు; 2. మామిడిచె; 3. మొగలిచె. 4. జెల్లుచె.

చామరము. సం. వి. అ. న. 1. వింజామరము; 2. దండము; 3. వృత్తవిశేషము.

చామరాలు. సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము.

చామరి. సం. వి. ఈ. స్త్రీ. = చామరము. న్. పుం. గుఱ్ఱము.

చామరికుఁడు. సం. వి. అ. పుం. వింజామరపట్టుకొను వాఁడు.

చామీకరము. సం. వి. అ. న. 1. బంగారము; 2. ఉమ్మెత్తచె.

చాముండ. సం. వి. ఆ. స్త్రీ. సప్తమాతృకలలో నొకతె.

చారకము. సం. వి. అ. న. 1. కారాగృహము; 2. మోరటిచె.

చారకుఁడు. సం. వి. అ. పు. చారుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. పసులకాపరి; 2. సేనలుమున్నగు వానిని నడపువాఁడు.

చారచక్షువు. సం. వి. న్. పుం. రాజు.

చారటి. సం. వి. ఈ. స్త్రీ. 1. మెట్టతామరచె; 2. నేలయుసిరికచె.

చారణుఁడు. సం. వి. అ. పుం. 1. నానాదేశసంచారి యైననట్టువుఁడు; 2. నానాదేశసంచారకుఁ డైన బట్టువాఁడు; 3. ఒకజాతిఖేచరుఁడు; 4. చారుఁడు.

చారపథము. సం. వి. అ. పుం. రాజవీధి.

చారమికుఁడు. సం. వి. అ. పుం. గ్రంథాములు చివర వఱకుఁ జదువు వాఁడు.

చారము. సం. వి. అ. పుం. 1. కారాగారము; 2. తిరుగుట; 3. ఆచరణము; 4. సంకెల; 5. చేఱుచె. న. కృత్రిమవిషము.

చారి. సం. వి. ఈ. స్త్రీ. నృత్యక్రీడావిశేషము.

చారిక. సం. వి. ఆ. స్త్రీ. పరిచారిక.

చారితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తినిపింపఁబడి నది; 2. నడపఁబడినది,

చారిత్ర. సం. వి. ఆ. స్త్రీ. చింతచెట్టు.

చాత్రము. సం. వి. అ. న. = చరిత్రము.

చారుఁడు. సం. వి. అ. పుం. వేగువాఁడు.

చారుకేసర. సం. వి. ఆ. స్త్రీ. నాగరముస్తచెట్టు.

చారునేత్రము. సం. వి. అ. పుం. జింక. విశే. (అ. ఆ. అ.) అందమైనకన్నులు గలది.

చారుపుటము. సం. వి. అ. పుం. ఒకవిధమైన తాళము (సంగీ.)

చారుఫల. సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్షచెట్టు.

చారువు. సం. వి. ఉ. పుం బృహస్పతి. న. కుంకుమ పువ్వు. విశే. (ఉ. ఉ, ర్వీ. ఉ.) మనోహరము.

చార్చికుఁడు. సం. విశే. (అ. ఈ. ఆ.) విమర్శవిషయక గ్రంథములఁ జదువువాఁడు.

చార్చిక్యము. సం. వి. అ. న. చందనాదికములను పూయుట.

చార్మణము. సం. వి. అ. న. చర్మములసమూహము. విశే. (అ. ఈ. అ.) చర్మముతోఁ జేయఁబడినది.

చార్వాకము. సం. వి. అ. న. 1. లోకాయత మను నాస్తికమతము; 2. వాగ్వాదము. "ఉ...దేవుని తోడ నేలచా, ర్వాక మొనర్చితిన్..." కాశీ 3, ఆ. ౧౭౪.

చార్వాకుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకరాక్షసుఁడు; 2. చార్వాకమతమువాఁడు; 3. చార్వాకమత స్థాపకుఁడు.

చార్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఊహాపోహక్షమ మైన బుద్ధి; 2. అందగత్తె; 3. వెన్నెల; 4. కుబేరుని భార్య; 5. కాంతి.

చాలకుఁడు. సం. విశే. (అ. లికా. అ.) 1. మఱొక చోటికిఁ గొంపోవువాఁడు; 2. చలింపఁజేయు వాఁడు.

చాలనము. సం. వి. అ. న. 1. జల్లెడ; 2. కదల్చుట; 3. వణఁకించుట; 4. జల్లించుట.

చాలని. సం. వి. ఈ. స్త్రీ. జల్లెడ.

చాలము. సం. వి. అ. పుం. 1. కదలిక; 2. కదల్చుట; 3. ఇంటిపూరికప్పు.

చాషము. సం. వి. అ. పుం. పాలపిట్ట.

చి

చింక. దే. వి. బ. తుషయుక్తములగు స్వల్పధాన్యములు, రెల్లులలో నుండుజొన్నలు. ఆం. భా. ద్వి. ౨౩౮; వి. చిన్నకాలువ. (శ. ర. బ్రౌ.)

చింకలిక్కి. వై. వి. (సం. క్ష్వింకకః.) ఎఱ్ఱనిమొగము గలకోఁతి. (శ. ర.)

చింకిలీకము. వై. వి. = చింకలిక్కి. (బ్రౌ.)

చింగటము. సం. వి. అ. పుం. ఒకజాతిచేఁప.

చింగులువాఱు. దే. అ. క్రి. మడతమడతలుగా నుండు. "ద్వి. బంగరుచెఱఁగు పట్టంచుదట్టి, చింగులువాఱంగ జెలువుగాఁ గట్టి." ద్వి. భక్తా. ౨, ఆ. ౨౬. పు.

చింగోటి. దే. వి. ఆయుధవిశేషము. (శ. ర.)

చించ. సం. వి. ఆ. స్త్రీ. చింతచెట్టు. "క...ని,శ్చంచల శాఖాంచిత మగు,చించావృక్షంబుఁ జూడు చిత్తజరూపా." ద్వా. 3. ౧౫౩.

చించేలము. దే. వి. ఓషధివిశేషము.

చించు. దే. స. క్రి. (చినుఁగు. ధా.) 1. చినుఁగఁ జేయు. "గీ. అతనుఁడేఁట జోదు పూమొగ్గయఁట శరంబు, చించినదియఁట తత్కార్యకంచుకంబు." నైష. ౧, ఆ. ౮౦. శుక. ౨, ఆ. ౪౩౭; 2. పాఱఁద్రోలు. "శా...తమముం జించున్..." పాండు. ౪, ఆ ౧౨౬.

చింత. ఉభ. వై. వి. (సం. చించా. త. చింతమ్.) తింత్రిణీవృక్షము. "గీ...క్రొవ్విసగొఱియ దాఁ, జింతకట్టె మేయఁ జేరు టయ్యె." ద్వా. ౪, ఆ. ౧౩౫. "సీ. చింత యనంగను జించ యనా..." ఆం. భా. ద్వి. ౪౭. కాశీ. శ. 3. సం. వి. ఆ. స్త్రీ. 1. దుఃఖము; 2. ఆలోచనము; 3. తలఁపు.

చింతకుఁడు. సం. విశే. (అ. తికా. అ.) చింతించువాఁడు.

చింతగుల్ల. వై. వి. బెరడుతో నుండుచింతపండు.

చింతన. సం. వి. ఆ. స్త్రీ. = చింత.

చింతనము. సం. వి. అ. న. = చింతన.

చింతనాగు. దే. వి. సర్పవిశేషము. (బ్రౌ.)

చింతనీయము. సం. విశే. (అ. ఆ. అ.) చింతింపఁ దగినది.

చింతపండు. ద్వం. వి. ఏ. (చింత+పండు.) బెరడు తీసినతింత్రిణీఫలపుముద్ద. "క. కలములఁ బోలిన

భియదై.కలము లిపుడు చింతపంటికందువ యగుటన్, గళవఘ్న దర్పసంపదఁ, జెలఁగెడుతా లెల్ల మేనిజిడ్డున దోఁగన్." సాంబో. ౨, ఆ. ౧౪౭.

చింతపూవు. ద్వం. వి. (చింత+పూవు.) 1. బాలక్రీడావిశేషము. "వ...గుజగుజరేకులు చింతపూవులు చిట్టిపొట్టిలును..." భోజసుతా. ౨. ఆ. ౯. బ. ధాన్యవిశేషము. "సీ. జిలకఱ రాజనాల్ చింతపూవులు..." హంస. ౪, ఆ. ౧౨౪.

చింతయత్. సం. శత్రు. చింతించుచున్న.

చింతాకు. ద్వం. వి. క. చింతాక. త. చింతాక్కు.) 1. బాలక్రీడావిశేషము. "సీ. చీకటిమొటికాయ చింతాకు చుణుదులు పులిమూటలును...' హంస. ౪, ఆ. ౧౩౬; 2. స్త్రీభూషణవిశేషము. (వా.); 3. చింతయాకు. "శా. చింతాకంతయుఁ జింత నిల్వఁడుగదా..." కాళ. శ. 3.

చింతామణి. సం. వి. ఇ. పుం. కోరికల నొసఁగుమణి, దేవమణి.

చింతావేశ్మము. సం. వి. న్. న. రాజాదులయాలోచనామందిరము.

చింతించు. సం. అ. క్రి. దుఃఖించు. స. క్రి. 1. ధ్యానించు, తలపోయు. "శా. చింతింపన్ వలె నీపదాంబుజములో శ్రీకాళహస్తీశ్వరా." కాళ. శ. ౧౧౬; 2. పరిశీలించు, ఆలోచించు. "మ... చింతింపంగ నాశ్చర్యమే." భాగ. ౧, స్కం. ౯౨౨.

చింతిడి. సం. వి. ఈ. స్త్రీ. చింతళి.

చింతితము. సం. వి. అ. న. ఆలోచనము. "వ...తన చింతితంబునుడివి." గాథే. ౮. విణ. (అ. ఆ. అ.) చింతింపఁబడినది.

చింత్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) చింతింపఁబడుచున్నది.

చింత్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చింతింపఁదగినది; 2. విచార్యము.

చింద. వై. వి. (సం. చిల్లిక) చీపరపిట్ట, చిన్నగ్రద్ద. "గీ. పాదివేటఁ జూడఁ బదరెడు రాణేని, మది నెఱింగి తడవు మనిన వెలిచె, కొఁజు కారుకోడి కక్కెర పూరేడు చింద లున్నగూండ్లు చేరఁ దెచ్చి." య. ౧, ఆ. ౨౧.

చిందము. దే. వి. శంఖము. "ఉ...చానమెడచందము చిందము కొంద..." గాథే. ౮౩. "క. చిందముల మ్రోఁతఁ బగతుర, డెందంబులతోడ దిక్తటీసంధులు నం, దంద పగులంగన్." భార. ఉద్యో. ౧, ఆ. ౨౭౨. వేంక. దేవ ౨౦.

చిందఱ. యు. దే. వి. 1. కోపము. "ఉ. అంతట నొక్కచెంచు కడు నగ్గలికం జని పందిపోటుమైఁ, జెంతకుఁ బోవఁ జూచుటయుఁ జిందఱఁ గొమ్ముల నెత్తఁ బంది నిం,తింతలు చెక్కలై పడఁ బయిం బడి నొంచెన్..." య. ౨, ఆ. ౯. అం. భా. ప్ర. ౧౩౫. వై. వి. 1. చిల్లి. "ద్వి. చెవులు సిందఱలు వోఁజెలఁగెఁ జిమ్మటలు." హరిశ్చ. ౧, భా. ౧౮౪౫. 2. చీలిక." సీ. తనదేహ మిటులు చిందఱ తానసెడిరీతిఁ గులుకుగుబ్బలు వాఁడిగోళ్లఁ వ్రచ్చి." సా. ౨, ఆ. ౧౫౦. 3. బాలక్రీడావిశేషము. "గీ. బంతినొకమాట చిందఱపఱపులాట, లనెడు శైశవదుర్వృత్తి నధిగమించి." ప్రబంధ ౬౧౩.

చిందఱకొట్టు. దే. అ. క్రి. (చిందఱ+కొట్టు) చెలరేఁగు. విజృంభించు. "ద్వి. గోడలు వడ నూఁకి కొమ్ములనేలఁ, గ్రోడాడి తోఁ కెత్తుకొని పంచితిలుచుఁ, గడిదిఁ జిందఱకొట్టి కడిమిక్రేళ్లుఱికి, వడి అంకెవిడుచుఁ గ్రేవల నాకికొనుచు" అ. మ. క. ౨, ఆ. ౧౧౭ పు. ౨౪. పం.

చిందఱగొను. దే. అ. క్రి. (చిందఱ+కొను.) విజృంభించు. "సీ. అడఁపంగవచ్చిన నదటునఁ జిందఱగొని యెట్టిబలియుంరఁ గొనక కవియు." హరి. పూ. ౬, ఆ. ౧౭౬. 2. చిల్లులువడు. "క. అప్పాలవెల్లిలోపల, నప్పటికప్పటికి మంద రాగము దిరుగం, జప్పుడు నిండె నజాండము, నెప్పుడి దే మజునిచెవులు సిందఱగొనియెన్." భాగ. ౮, స్కం. ౨౦౯.

చిందఱరేఁగు. దే. అ. క్రి. (చిందఱ+రేఁగు.) చెలరేఁగు, విజృంభించు. "వ...నందినియుఁ దన వత్సంబు బట్టుకొన వచ్చినజనుల కలిగి చిందఱ రేఁగి..." భార. ఆది. ౭, ఆ. ౧౦౭.

చిందఱలాడు. దే. అ. క్రి. (చిందఱలు+ఆడు) ఖండించు. "వ...మావుతుల నిర్జీవితులఁ జేసియుఁ గంధరంబులు చిందఱలాడియు పదుములుకడి కండ లొనర్చియు..." వరాహ. ౨, ఆ. ౨౯.

చిందఱవందఱ. దే. వి. (చిందఱ+వందఱ) 1. తునుక. "వ. ఉపంచితంబు లగుబాణపరంపరల చేత నరాతిసైన్యంబులంనుఁ జిందఱవందఱ లగు నరదంబులును." కళా. ౪, ఆ. ౧౨౩. 2. కలవరము "క...అందఱముందఱ నీవని, చిందఱ వందఱల గుట్టుచిట్టాడంగాన్." సా. 3, ఆ. ౧౫. 3. చిల్లి. "చ...చెలఁగి రొలుంగు చేఁ జెవులు చిందఱవందఁఱనొందఁ గూయుచున్..." కవిరా. 3. ఆ. ౧౪౭. విణ. 1. కలవరపడినది. "క. వెఱఁ కుఁడు పాఱకుఁడు చిం, దఱవందఱ గాకుఁ డే, స్థైర్యము దూలన్." ఉ. హరి. ౫, ఆ. ౨౨౭; 2 వ్యత్యస్తమైనది. "చ. చిరిఁగె దిశల్ నభం బవిసెఁ జిందఱవందఱయై గ్రహస్థితుల్, సనియె ..." కళా. ౨, ఆ. ౧౩౩.

చిందఱవందఱచేయు. దే. స. క్రి. (చిందఱవందఱ+చేయు.) 1. ఖండించు. "సీ. మదభరభీషణ మాతంగముల ముట్టి చిందఱవందఱచేసి చేసి." భార. విరా. ౫. ఆ. ౫౬; 2. చిల్లులువడఁజేయు. "చ. చిలుకలు గోయిలల్ చెవులు చిందఱ వందఱసేయ..." సా. ౨, ఆ. ౧౫౪. 3. బాధించు. "చ. శిశువులఁ కూడు కూడనుచుఁ జిందఱవందఱసేయఁగా..." భో. ౬ ఆ. ౧౪౯; 4. చెదరఁగొట్టు. "చ...గజమొండుమైఁ గవిసి చిందఱవందఱసేసె మూఁకలన్." భార. ద్రో. ౧, ఆ. ౩౨౪.

చిందఱవందఱలాడు. దే. స క్రి. (చిందఱవందఱలు+ఆడు) ఖండించు. "ఉ... తేరిచక్రముల్, చెక్కులుచేసి పైపడవు చిందఱవందఱలాడి వాజులన్, వ్రక్కలువాపి సూతుఁ బడవైచి".. భా. రా. యు. ౪౪౭.

చిందఱవందు. దే. విణ. చిందఱవందఱయైనది. "ఉ. ...డెందము చిందఱవందు గాఁగ నొ,క్కించుక స్థైర్య మూఁది...సావి. ౨, ఆ. ౪౨.

చిందఱవోవు. ద్వ. అ. క్రి. (చిందఱ+పోవు.) చిల్లిపడు. "సీ. చెవులు చిందఱవోవఁ జెలఁగు కవీంద్రులపోరంటిమా శనివారపుజపి." కళా. ౭, ౧౯.

చిందఱసేయు ద్వ. స. క్రి. (చిందఱ+చేయు) ఛేదించు. "చ. ఒడిసెలఱాలచందమున నుర్వడి సింగిణికోల వాఱుకైవడి లకుడాఁకలం బఱచు వైఖరి బిస్సున సాళువంబు దూఁటెడు క్రియఁ దూఱఁబాఱి కిటిబృందముఁ జిందఱసేసెఁ జెంచులు...సా. ౧, ఆ. ౩౯.

చిందాడు. దే. అ. క్రి. (చిందు+ఆడు) గంతులు వేయు. "ఉ...పెదవిమీఁదను లేనఁగ వంకరించి చిం,దాడఁగ"...హంస. ౨, ఆ. ౨౪.

చిందియ=చిందె. (చూ. చిందె.)

చిందిలి. దేవి. సంభ్రమము (చూ. చిందిలిపడు.)

చిందిలిపడు. ద్వ. అ. క్రి. సంభ్రమించు. "వ. ఇందుండు చిందిలిపడపాగె." కాశీ ౨, ఆ. ౧౫౯.

చిందిలిపాటు. ద్వ. వి. (చిందిలిపడు ధా.) తొందఱపాటు. "ద్వి. తిన్నగా నతని చిందిలిపాటు మాన్చి." విష్ణు. ఉ. ౫, ఆ. (శ. ర.)

చిందిలిమందిలియగు. దే. అ. క్రి. (చిందిలి+మందిలి+అగు.) చలించు "ఉ. మీ రిటుఁ బూని యాక్రమము మేకొని చేసిన దివ్యరాజ్యల, క్ష్మీరమణీయవైభవము చిందిలిమందిలిగాక తక్కుఁ బెం, పారఁగ నాకు..." నృసిం. ౨. ఆ. ౫౩.

చిందిలు. దే. అ. క్రి. చలించు. "ఉ...మదీయ కాంతుపైఁ జేసినభక్తియెన్నఁడును జిందిలదేని." నా. పంచ. ౧, ఆ. ౧౯౭.

చిందు. దే. అ. క్రి. 1. (జలాదులు పాత్రమునుండి) ఒలుకు. "వ. మకరందంబు చిందఁ బొరలు విఱుగం బుప్పొడి సడల..." హర. ౬, ఆ. ౧౬; 2. రాలు. "మ...వడిఁ విరులు చిందన్..." స్వా. ౨, ఆ. ౬౭; 3. వ్యాపించు. "చ. చెలువలు వీఁచుపూఁగురఁటిఁ జిందిన తెమ్మెరలన్ రుమాలు చుంగులు గదలంగ..." కువల. ౨, ఆ. ౬; 4. పోవు. "గీ. లజ్జ వొలియించుఁ దాలిమి యుఁజ్జగించు, నింద కొడిగట్టు శీలంబు చిందఁజేయు... పానగోష్ఠివిధంబు..." పి. శకుం. ౪, ఆ. ౧౬౬; 5. తెల్లమగు. "ద్వి...నారదుఁడు, చనుదెంచి హితవు పిసాళించి నవ్వి, తననాలితనము చిందఁగఁ జెవిఁ జేరి..." అ. మ. క. ౧, ఆ. ౧౭. పు. ౧౬. పం. స. క్రి. 1. వ్యయముచేయు. "గీ. చంపి ధార్మికుండు సతిఁ బొంది మఱి భ్రష్ట, చారి భోంకి సత్యశాలి యార్జించి సదుపవాసి

కేడించి శూరుండు, చిఁది ధనియు నగు విచిత్ర సరణి." ఆము. ౪.ఆ. ౭౨౮; 2. ఒలికించు. "క... సింగారము, చిందుచు నున్నాఁడటంట సిద్ధము గాఁగన్." సా. 3, ఆ. 3౮.వి. 1. బిందువు. "చ. కలప మలందుచో నొలుకుకస్తురి బిందులచేత..." కువల. ౪. ఆ. ౧౭౨; 2. నాట్యవిశేషము. "సీ. మాతంగనాట్యనామం బగుఁ జిందు నా..." ఆం. భా. ప్ర. ౧3౧; 3. కోపము. "సీ. అలుక యనంగఁ జిం దనఁగఁ గాంతాళ మనఁగఁ రోస మనఁగఁ జిందఱ యనంగ...గీ...తనరుఁ గోపము." ఆం. భా. ప్ర. ౧3౫; 4 ఒకవిధమైనపాట. "సీ. గీతంబుదరువు జక్కిణి చిందు మొదలుగా నొక్కొక్కపర్ణంబు నుగ్గడించి." వి. పు. ౭. ఆ. ౨౭౫. విణ. పడినది. "మ. సికతాసేతువు నిమ్నగా రయముచేఁ జిందైనచందాన సా, త్యకి జేతం బడు శత్రుసంఘము." ఉ. హరి. ౪, ఆ. ౧౭౬.

చిందుగ. దే. వి. 1. వృక్షవిశేషము. "సీ. తాండ్ర చందన మేపె దాసాన మెట్టదాసానము చిందుగ చాల జొన్న." హంస. ౪, ఆ. ౧౧; 2. క్రూరమృగవిశేషము. (...బ్రౌ.)

చిందుగొను. దే. అ. క్రి. (చిందు+కొను.) కదలియాడు. "చ...అబ్బురపుబ్వోలి గబ్బిగుబ్బపై సరులినుమంత చిందుగొనఁ జక్కనిమాడ్కులు సూచువారి పే,రురమునఁ గాఁడ నవ్వలఁది యోర్పునఁ గండెలు సుట్టు నేర్పునన్." హంస. ౨, ఆ. ౨3.

చిందుద్రొక్కు. దే. అ. క్రి. (చిందు+త్రొక్కు.) నర్తించు. "సీ. పీడెపో నందునివిరిఁబోఁడిముందఱ మొనసి చిందులుద్రొక్కుముద్దులాఁడు." నీలా. 3, ఆ. ౫౨. "ఉ. బంగరుఁదట్కుఁజెక్కులును బంజాలకమ్ములడాలు చిందుద్రొక్కంగ..." ఉ. రా. 3, ఆ. ౭౧.

చిందుపరుపు. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. వెన్నెలకుప్పలు ప్రేలు బొ ట్టన సిరిసింగన్న వత్తియుఁ జిందుపరుపు." హంస. 3, ఆ. ౧౪౬.

చిందులువాఱు. దే. అ. క్రి. (చిందులు+పాఱు.) నాట్యముచేయు. "ఉ. చిందులువాఱుచున్ జిగురుచేతులఁ దాళము లొత్తి యాడుచున్..." హరిశ్చ. ౨, ఆ. ౧౨౪. భాగ. ౯, స్కం. ౪౫౦.

చిందువ. దే. వి. 1. చిన్నపెట్టె. "సీ. చిటిచాఁప ధూపంబు చిందువ బకదారి పంజరమ్ములు సొమ్ము బరణి మంచి, సీర్లగిండియు..." సురా. ౧౧౬; 2. = చిందుగ. (శ. ర.)

చిందువందు దే. అ. క్రి. బొట్టుబొట్టుగా రాలు. "ఉ...అశ్రులు చిందువందఁగన్." స్వా. ౨, ఆ. ౭౦. విణ. 1. చెదరినది. "వ...డెందంబు గంది తాలిమి చిందువందై." స్వా. 3, ఆ. ౨౮. సాంబో. ౧, ఆ. ౧౧౧; 2. కలఁతనొందినది. "గీ. దత్తుఁ డెచ్చోటఁ బొట్టేలితల ధరించెఁ, జిందువందయ్యె నెచ్చోట నిందుఁడు..." భీమ. 3, ఆ. 3౭.

చిందువందుచేయు. ద్వి. అ. క్రి. (చిందువందు+చేయు.) 1. చెదరఁగొట్టు. "వ...అందంద ముందటం గ్రందుకొనుమణిమయస్యందనంబులం జిందువందుచేసియును." జై. ?, ఆ. ౧౧౧; 2. వ్యయముచేయు. "సీ. జనని చేయించిన జాళువాతాయెతుల్ వడ్డిలెక్కకుఁ జిందువందుచేసె." నిరం. ౨, ఆ. ౧౧౬.

చిందె దే. వి. జెట్టుధరించుకల్లాయి. "ద్వి...పట్టు తప్పనమును బట్టుతప్పరము, పట్టుచిందియ..." పండితా. మహిమ. ౨౭౯. పు. ౨౬. పం.

చింపి. దే. విణ. (చింపు. ధా.) చినిఁగినది. "గీ. చింపులైనమైముఱువులు చిద్రుపలైన,సీసకంబులు నలి యైనచిందములును." జై. ౫, ఆ. ౧౯౩. వి. 1. చినిఁగిపోయిన వస్త్రభాగము. "చ...లాఁగులు రావిరేకులుం, గలిగినగుజ్జురూపములుఁ గంబడిచింపులు..." సా. ౧, ఆ. ౧౧౬. ఆం. భా. ద్వి. ౧౫౭; 2. చిరుఁగు. "ఉ. చెప్పిన నేమి లేమగద చింపులదోవతిన్..." శుక. ౨, ఆ. ౪౪౪.

చింపిఱి. దే. విణ. పొట్టిదిగాను చెదఱినదిగాను వంకరగాను బిరుసుగాను ఉండునది. (జుట్టు.) "సీ. కల్ల చింపిఱితల..." హరిశ్చ. ౪. ఆ, ౧౬౮.

చింపు = చించు. (వా. శ. ర.)

చింపుడు. దే. వి. (చించు ధా.) గుడ్డముక్క. "సీ. దాఁచికొన్నను బలితంపుఁ జింపుడు గాక పెక్కైన

నొకపోఁకవక్క గాక." విప్ర. ౫, ఆ. ౧౯. విణ. చినిఁగినది. "క...కటిః జింపుడువల్కలము దూల..." ప్రబోధ. ౩, ఆ. ౨౦.

చింబు. దే. వి. ఆఁడుమేఁక. ఆం. భా. ద్వి. ౨౬౫.

చింబోతు. దే. వి. (చింబు+పోతు.) మేఁకపోతు. "ద్వి. బక్కచింబోతు లంపటపెట్టినట్లు." ద్వి. హరిశ్చ. ఉ. ౯౬౫. పం.

చింబోర. దే. వి. ఎద్దునకుఁ గట్టెడునొకానొకయాభరణము. "ఉ...పేరుచింబోరయుఁ గంచుపెప్పలును...ఒప్ప మహోక్షము బొల్చువానికిన్." హంస. ౫, ఆ. ౬౯.

చికటారి = చిక్కటారి. 'సీ. వికటారివీపుల ప్రకటాహవము మాన్చు చికటారిపొదలికల్ చెన్ను మిగుల." శశాం. ౨, ఆ. ౧౬.

చికమక. దే. వి. చిక్కు. "క. పికమా యభినవమణిదీపికమాడ్కి వెలుంగునింపుబింబాసన యో పికమాలి యొందుఁ గుందెనె, చికమకలం బెట్ట కిపుడు చెపుమా మాకున్." రసిక. ౬, ఆ. ౭౫.

చికాకు. దే. వి. 1. కలఁత. "గీ. కన్నుఁగవ నీరు నించుఁ జికాకు నొందు." మృ. వి. ౩, ఆ. ౯౭; 2. విసుగు. వ్యవః—అకజ్జివానికి చదు వన్నఁ జికాకు. విణ. కలఁత నొందినది. "గీ. ఆఘిరంగుల రవళికి నాన్పపాలు, శిబిర మెల్లఁ జికాకయి చెదరఁదొడఁగె." రంగ. ౩, ఆ. ౭౬౫.

చికాకుపడు. ద్వ. అ. క్రి. (చికాకు+పడు.) 1. కలఁతనొందు. (వా); 2. విసుకుకొను. (వా.)

చికి. దే. విణ. చిన్న. (చూ. చికిరాయఁడు.)

చికిచికి. దే. విణ. చిన్న. "వ. చెదరినచికిచికివెండ్రుకలు పొదువ్రటాజిఱుమొగులు మొలకులు బలసిన కొఱనెలఁకుం బాటి యగువెన్నదురుల నున్నచెమరులు తుఱంగలింప." హరి. పూ. ౫, ఆ. ౧౪౩. ప్రబంధ. ౬౨౧.

చికిత్స. సం. వి. అ. స్త్రీ. రోగమునకుఁ జేయుప్రతిక్రియ.

చికిత్సకుఁడు. సం. విణ. (అ. త్సికా. అ.) వైద్యుఁడు, వెజ్జు.

చికిత్సనము. సం. వి. అ. న. వైద్యముచేయుట.

చికిత్సించు. సం. అ. క్రి. వైద్యముచేయు. స. క్రి. ఆరోగ్యవంతు నొనర్చు. "వ...తెవులుగొంటులఁ జికిత్సించువారును..." హరి. పూ. ౫, ఆ. ౧౪౨.

చికిత్సితము. సం. వి. అ. న. వైద్యముచేయుట. విణ. (అ. ఆ. అ.) వైద్యముచేయఁబడినది.

చికినము. వై. వి. (సం. చిక్కణమ్.) మంచివన్నెగలవక్క. (శ. ర.)

చికిని = చికినము. (శ. ర.)

చికిబికి. దే. విణ. చెదరినది. "వ...కొకిబికిమొకంబునఁ జికిబికి వెండ్రుకలు..." విప్ర. ౪, ఆ. ౨౪.

చికిరాయఁడు. ద్వ. వి. (చికి+రాయఁడు.) యువరాజు. "సీ. శ్రీరామచంద్రునిఁజికిరాయపట్టంబు గట్టగా..." దశా. ౭, అ. ౨. ఆ. ౨.

చికిలి. దే. వి. మణిఖడ్గాదులకు మెఱుఁగువెట్టుట. "క. బెళికి కుం బెళుకనిచూపుల, మొలచియు మొలవనియురోజములఁ దేనియలన్, జిలికియుఁ జిలుకనిపలుకులఁ, జెలిమై నూనూఁగు వయసు చికిలిఁ దనర్చెన్." ప్రబంధ. ౧౮౮. విణ. 1. ప్రకాశించునది. "గీ...చికిలికంకణములు..." ఇందు. ౧, ఆ. ౧౮; 2. మెఱుఁగుపెట్టినది. "చ. చికిలికిరీటిపచ్చల రచించినచిల్కలకోళ్ల నందమౌ, నకినెలపట్టిమంచము..." హంస. ౧, ఆ. ౬౯; 3. పదునైనది. "సీ. చికిలితూపున మూఁడుచీరికల్గా జివ్వా సించి..." కళా. ౫, ఆ. ౮౭; 4. అందమైనది. "ద్వి. చికిలిచూపులు నునుఁజెక్కులు ముద్దు, మొకము కెంపులమోవి మొలకనవ్వులును" రం. రా. బాల. ౬౦. పు. ౧౫. పం; 5. స్వచ్ఛమైనది. "సీ. సిగ్గునఁ దలవంచి చిఱునవ్వు నవ్వుచోఁ గెలఁకులఁ జికిలివెన్నెలలు గాయ." కుచల. ౨, ఆ. ౩౦.

చికిలించు. దే. స. క్రి. (చికిలు. ధా. ప్రే.) కనుఱెప్పలు మాటిమాటికి మూసితెఱచు. (వా.)

చికిలికాఁడు. దే. విణ. (చికిలి+కాఁడు.) అందగాఁడు. "గీ. చికిలినెఱవన్నెకాండ్రకు సివములెత్త, నెనసి చరియించు నాపీట హేమరేఖ." హంస. ౧, ఆ. ౨౨౦; 2 కత్తులు మొదలగువానికి మెఱుఁగుపెట్టువాఁడు. (శ. ర.)

చికిలిచేయు. దే. స. క్రి. (చికిలి+చేయు.) మణిఖడ్గాదులకు మెఱుఁగుపెట్టు. "సీ. శృంగారరసమునఁ జికిలిచేయించినకంతుమోహనసాయకంబు

లవఁగ." రుక్మాం. ౧, ఆ. ౭౧. "సీ. ఒంటిముత్తెములతో కొంట్లకెంపులకాంతి చెక్కులజవ్వాదిఁ జికిలిచేయు." సా. ౧. ఆ. ౭౯.

చికిలివాఁడు. దే. వి. (చికిలి+వాఁడు.) కత్తులు మొదలగువానికి మెఱుఁగు పెట్టువాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౨.

చికిలిసాన. దే. వి. (చికిలి+సాన.) ఒఱపిడిరాయి. "ఆ. వె. చికిలిసానఁ దీర్చుజీవరత్నమురీతి." రాధికా. ౧, ఆ. ౬౮.

చికిలు. దే. అ. క్రి. చనవుచే నేఘ్చు. "సీ. కల్పరితన మునకై తల్లి కోపించి చేయెత్తి కొట్టిఁ జికిలి చికిలి." శేష. ౩, ఆ. (శ. ర)

చికీర్ష. సం. వి. ఆ. స్త్రీ. చేయునిచ్ఛ.

చికీర్షకుఁడు. సం. విణ. (అ. ర్షికా. అ.) చేయఁగోరువాఁడు.

చికీర్షితము. సం. విణ. (అ.ఆ.అ.) చేయఁగోరఁబడినది.

చికీర్షువు. సం. విణ. (ఉ.) చేయఁగోరువాఁడు.

చికురము. సం. వి. అ. పుం. 1. వెండ్రుక; 2. కొండ; 3 పక్షివిశేషము; 4. వృక్షవిశేషము; 5. చుంచెలుక. స. ఈషన్నిమీలితముగు యువతి నేత్రము. (కే. ని.) విణ. (అ.ఆ.అ.) చంచలము.

చిక్క. ఉభ. దే. విణ. 1. (దీనికి కర్మధారయమున బహుళముగా నిగాగమము వచ్చును.) 1. సాంద్రము. "చ. తనగుహలోపల న్నిలిపి తామును గ్రోలఁగఁ జిక్కనట్టి చి,క్కనితరిపాలు దానపుడు కంఠము పోవఁగఁ ద్రావఁజేయుం..." సా. ౩, ఆ. ౧౯౫; 2. బలమైనది. 'క. చక్కని చిక్కని మేనులు, నిక్కొదండములు నైన నెఱుఁగరె మన మీ,చక్కటి పిలుతమె శస్త్రము, లొక్కెడ రాఁచుటకు వేషయోజనములకున్." భార. విరా. ౧, ఆ. ౧౫౬; 3. కఠినము. "సీ చపలాక్షిచూపులచాడ్పున కెడమిచ్చు చక్కని చనుఁగవఁ జేరఁ గోరు." భార. ఆది. ౩, ఆ. ౩౮. క్రి. విణ. ద్రు. 1. గట్టిగా. "సీ. కఱకురక్కసుని నొక్కరునిఁ జిక్కఁగఁ ద్రొక్కి భద్రకాళిక యొందుఁ బ్రస్ఫురించు." పాండు. ౫, ఆ. ౨౯; 2. అధికము. "సీ. శ్రీగంధవాసనల్ చిక్కంగ నిక్కంగ..." సా. ౩, ఆ. ౨౩౮.

సం. వి ఆ. స్త్రీ. 1. పోఁకశ్రీ; 2. పోఁకపండు (వాచ.); 3. వక్క. (విల్యమ్సు.)

చిక్కఁబట్టు. ద్వి. స. క్రి. (చిక్కని+పట్టు.) "ఆ... గత,చేష్టుఁ డయిన యసురుఁ జిక్కఁబట్టె." భార. ఆది. ౬, ఆ. ౨౧౫.

చిక్కంటె. దే. వి. (చిక్కు+ధా. చిక్కంటి, చిక్కంటె. రూ.) తలచిక్కు తీసికొనెడునిడుపుదువ్వెన. "సీ. చిక్కంటె యొరవు దెచ్చెద నంచుఁ జని యిచ్చు గమకాతురున కింపుకౌఁగిలింపు." శుక. ౨, ఆ. ౩౬౮. ఆం. భా. ద్వి. ౧౬౮.

చిక్కఁదనము. దే. వి. ధైర్యము. "ఉ. అచ్చట లోకమంతయును నక్కటికంబున నుమ్మలింప నీ,చిచ్చు చొరంగఁ బోక మది చిక్కఁదనంబున నియ్యకొన్న నా, కిప్పుడఁ దెచ్చి ని న్నొడుచు చెంతటి పెద్ద..." నిర్వ. ౯, ఆ. ౮౯; 2. అరుచి. "సీ. ఒకనిసొమ్మేమి వే ఱొక్కనిసొమ్మేమి చక్కెర కమరునే చిక్కఁదనము, లోకులు గన నేమి తా కనుంగొననేమి వెన్నెల ఘనునే విన్నఁదనము." రాధా. ౩, ఆ. ౧౪౭.

చిక్కఁబడు. ద్వి. అ. క్రి. (చిక్కన్+పడు.) సాంద్రమగు. "వ... సేవించుచకోర కదంబంబుల పుక్కిళ్ళకు వెక్కసంబై ముక్కులకు చెక్కి చిక్కఁబడి..." స్వా. ౩, ఆ. ౨౮.

చిక్కటారి. ద్వి. వి. (చిక్క+కటారి.) చిన్నకటారి. "గీ. చికిలిచేసిన మరుచేతిచిక్కటారి." కవిజ. ౩, ఆ. ౩౦.

చిక్కటి. దే. వి. మల్లు. "సీ. చిక్కట్టు పట్టినచివ్వలపైఁ గుట్టుపాఱుటాకులు వైచి తూఱువారు." పార్వ. ౨. ఆ. ౭౦. (చిక్కట్టుబట్టిన ముద్రి.)

చిక్కణ. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తమగోవు.

చిక్కణము. సం. వి. అ. పుం. పోఁకశ్రీ. స. పోఁకకాయ. విణ. (అ. ఆ. అ.) 1. తఱచైనది; 2. నునుపైనది.

చిక్కణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పోఁకశ్రీ; 2. పోఁకకాయ.

చిక్కన. వై. వి. (సం. చిక్కణమ్. క. చిక్కణ. త. చిక్కణమ్.) 1. చిక్కఁదనము. విణ. 1. బలమైన. "ఉ. చిక్కనిపోటుమానిసి విసీ వినువారలు

నవ్వ నేమిగా, నెక్కుడుమాట లాడెదవు..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౫౩; 2. గట్టిదైన. "క...చిక్కనిదండము గొని పాములఁ గవి నప్పుడ యడువఁ దొడఁగె..." భార. ఆది. ౧, ఆ. ౧౫౨; 3. నునుపైనది. ఆం. భా. ద్వి. ౨౫౨

క్రి. వి. ద్రు. 1. బలముగా. "మ. అనిశ౯ ప్రస్వేణి వల్కెఁ దన్నుఁ జెలులారా నే లతా డోలఁ జిక్కనమూపం దెగి వ్రాల..." ఆము ౫, ఆ. ౬౩; 2. స్థిరముగా. "క...నీయుఁయుక్కను బీరముఁ జూచెదఁ, జిక్కన నిలు మనుచుఁ గడు విజృంభించి పడిన్." భార. ఆది. ౬, ఆ. ౨౦౩.

చిక్కసాబిళ్ల. దే. వి. బాలక్రీడావిశేషము. కాళ. 3, ఆ. ౩౩. హంస. 3, ఆ. ౧౪౬.

చిక్కపట్టు. ద్వ. వి. (చిక్కని+పట్టు.) నిర్ణయము. (శ. ర.)

చిక్కము. వై. వి. (సం. శిక్యమ్. క. చిక్క. త. చిక్కమ్.) 1. ఉట్టి. "మ...శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులుం బుర్వ లాకలు కంచంబులు గా భుజించి రచటన్..." భాగ. ౧౦, స్కం. పూ. ౪౯౫; 2. త్రాళ్లు మొదలగువానితో నల్లి పసులమూతికిఁ దగిలించు బంధనసాధనము. "సీ...కోడె, దామెనపగ్గముల్ కల త్రాళ్లు చిక్కంబులును చల్దిచిక్కములను..." శుక. ౨, ఆ. ౫౪౫; 3. దారము మొదలగు వానితో నల్లినసంచి. "ద్వి. చిక్కముల్ కాసులచిక్కముల్..."అ. మ. క. ౧, ఆ. ౪౯. పు. ౨౦. పం; 4. ఒకరకమైనవల. ఆం. భా. ద్వి. ౨౯౩. సం. వి. అ. పుం. చుంచెలుక. విణ. (అ. ఆ. అ.) చప్పిడిముక్కు గలది.

చిక్కసము. ఉభ. వై. వి. (సం. చిక్కసమ్. ప్రా. చికసా.) నలుఁగుపిండి. "సీ. వనదేవతాగాత్ర మానను జైత్రుఁడు నించి కడఁగి రాలిచిన చిక్కస మనంగ." శు. రా. ౬, ఆ. ౫. సం. వి. అ. న. యవలపిండి.

చిక్కి = చికి. (చూ. చిక్కిగోఁగు.)

చిక్కించు. ద్వ. స. క్రి. (చిక్కు. ధా. ప్రే.) 1. తగులువడఁజేయు. "మ...తద్బాభామాజనుల్ పాంథులన్, సురతప్రౌఢివిహారవైభవములన్ జొక్కించి చిక్కించుచున్." జై. ౫, ఆ. ౧౦౭;

2. పట్టుకొను. "గీ...చుక్క లెక్క, పిక్క ప్రక్కయు డొక్క పేరుక్క చెక్కు, ముక్క చిక్కించుకొన స్రుక్కె నక్కటికుఁను." రా. వి. 3. ఆ. ౬౬.

చిక్కిగోఁగు. ద్వ. వి. (చిక్కి+గోఁగు.) చిన్నజాతి గోఁగుచె. హంస. ౪, ఆ. ౧౧.

చిక్కిణి. దే. వి. సాత్యవిశేషము. "సీ. మొగవరి కట్టడ మొనవుకోలాటంబు చొక్కంపుమురువులు చిక్కిణిలు." మల్హణ. ౧, ఆ. ౮౦.

చిక్కు. దే. అ. క్రి. 1. కృశించు. "సీ. ధరణి శైత్యం బొందు దొరకదాయెను చిక్కి సగమైతి విది యేల చంద్రమాళి." దశా. ౨, అ. ౭౫; 2. గలించు. "క. ఎల్లసుఖంబులఁ జేకొనఁ,జెల్లుట యౌవనమునంద చిక్కిన మఱి పాటిల్లునె..." భా. రా. సుం. ౧౮౧; 3. మిగులు. "చ. తన గుహాలోపల న్నిలిచి తాము ప్రోలఁగఁ జిక్కి నట్టిచిక్కని తరిపాలు..." సా. 3, ఆ. ౧౯౫. నిరం. ౨, ఆ. ౧౧౬; 4. మరణించు. "మ. కెరసెన్ దుష్టులు డింకవేసి నెలుఁగుల్ గిట్టెన్ బులుల్ సింగముల్, కడగొట్టెన్...కడుతున్." సా. ౧, ఆ. ౧౦౭; 5. వెనుదీయు. "ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సంశీలుఁడు వీఁ డవధ్యుఁ డని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై, శూలములం దదంగముల నుస్థిరులై ప్రహరించిరి." భాగ. ౭, స్కం. ౧౯౧; 6. ఆఁగిపోవు, నిలుచు. "శా. గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కన్ గష్టముష్టింపచా." స్వా. ౫, ఆ. ౧౭. "గీ...దాశరథియుఁ, జిక్కి యారాత్రి మఱునాఁడు చిత్రకూట, శిఖరి తెరువు భరద్వాజుచేత నెఱిఁగి." భా. రా. అయో. ౨౫౧; 7. బద్ధుఁడగు. "క. చిక్కఁడు సిరికొఁగి టిలో..." భాగ. ౧౦, స్కం. పూ. ౩౮౩; 8. దొరకు. "క...దేవా కుఱ్ఱఁగటని వెదకి తెలియఁగ వచ్చున్,జూవె చోరులఁ జారులఁచే వీటికి దవ్వ వోరు చిక్కఁడు రింతన్." ఉ. హరి. ౫, ఆ. ౨౮౯; 9. లోఁబడు. "క. పెక్కండ్రు గోవులం గొని, యుక్కుమిగిలి నడవ వెనుక నుద్ద నడిం దా,నొక్కఁడ నరుఁ డేతెంచినఁ, జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధము కాదే." భార. ఉద్యో.

౩, ఆ. ౩౩౯; 10. తగులుకొను. "మ. వలలోఁ జిక్కినకల్కి జిక్కవలతే,వన్..." దశా. ౨, ఆ. ౩౫౧. స్వా. ౨, ఆ. ౫౧; 11. ఇమిడియుండు. "సీ. పెక్కువన్నెలకంధచక్కిఁ జిక్కక నిక్కి చనుదోయి కెలఁకులఁ జొక్కళింప." విక్ర. ౭, ఆ. ౧౪. వి. 1. మెలిక. "సీ. చెదరినయలకల చిక్కు చక్కఁగఁ దీర్చి..." శుక. ౧, ఆ. ౧౫౮; 2. బంధము. "గీ...అఱుతఁ దాళంబు వైచి చిక్కులవరించి..." కాశీ. ౫, ఆ. ౬౧; 3. పట్టు. "ఉ. చిక్కటి కాలభైరవుని చేతివిధాతృకపాల పాత్రయే,చక్కటియందు జాఱిపడె..." భీమ. ౩, ఆ. ౧౩౯; 4. సంకటము. ఉ...సురాసురాదులందొట్టి జయింపఁజాలు నృకధూర్జటి కెక్కుడి చిక్కు గల్గు..." భా. రా. అర. ౨, ఆ. ౭౨౧ 4. సంశయము. "ఉ. జీవుఁడుక్ విశేషనకుఁ జెప్పెఁ జామి హరిభక్తి మున్ను నీ,చే వివరంబుగా వినినఁ జిత్తములోపలిచిక్కు దీఱ నం,చున్..." ప్రబోధ. ౫, ఆ. ౭౪. భాగ. ౮, స్కం. ౭౩౦

చిక్కుజీరు. దే. విశే. (చిక్కు+జీరు.) తుత్తుమురు. "సీ. చిక్కుజీరుగఁ గూల్చుసింహపోతకములఁ దోలి తొప్పఱలాడుఁ గ్రోలుపులుల." వి. శకుం. ౨, ఆ. ౧౨. విశే. 1. జీఱువాఱునది. "సీ. జడలూడి యహులకై వడిఁ జిక్కుజీరుగా నవనిపైఁ బడి పొరలాడువారు." పి. శకుం. ౩. ఆ. ౧౦౫; 2. ఆవృతము. "సీ. మనసు నా కేమిట మట్టుపడక, మాటికిమాటికి మారుతాహతఘనప్రచ్ఛన్న చంద్రబింబంబుపోలెఁ, జింతాపరంపరఁ జిక్కుజీరయ్యెడు..." ప్రబోధ. ౫, ఆ. ౩౨.

చిక్కుజీరుపడు. ద్వ. అ. క్రి. (చిక్కుజీరు+పడు.) 1. తుత్తుమురగు. "వ. కరిఘటలం సొచ్చినం గొమ్ములం దగిలియుఁ దొండంబులం దొడరియుం ద్రొక్కునం జిక్కియుఁ జిక్కుజీరుపడుతురంగమ్ములును..." హరి. ఉ. ౩, ఆ. ౧౩౦; 2. చిక్కుపడు, మెలికలుపడు. "చ. స్వకుతుకపూర్తిగాఁగ రతి సల్పి సుషుప్తి వహించి రంత నా,యిక యును నాయకుండుఁ దమయిద్ధఅయంగములున్విమిశ్రభా,వకలనఁ జిక్కుజీరుపడ వైచినచంపక నీలకంజమా,లికల తెఱంగునం బరఁగ..." ప్రభా. ౫, ఆ. ౪౯.

చిక్కుఁడు. దే. వి. (చిక్కు ధా.) ఒకానొకతీఁగ. ఆం. భా. ద్వి. ౭౨.

చిక్కుతాళము. దే. వి. (చిక్కు+తాళము.) క్రొత్తవారు తేలికగా తీయలేనితాళము. (బ్రా.)

చిక్కుపడు. ద్వ. అ. క్రి. (చిక్కు+పడు.) మెలికలుపడు. 'సీ. కొదమతుమ్మెదలట్లు పొదలునీ నెఱికురుల్ చెలియ యేనులినుండు చిక్కుపఱిచె." ఉ. రా. ౪, ఆ. ౨౬౭; 2. బాధపడు. "సీ. కాలంబుకొలఁది లెక్కలువెట్టనేరక చిత్రగుప్తాదులు చిక్కుపడిరి." కాశీ. ౧, ఆ. ౧౩౭; 3. నిరోధింపఁబడు. "క. మాహిష్మత్యధినాయకు, బాహాసేతువునఁ జిక్కువడి కరతోయా,వాహిని కడు సుడివడియెన్..." ఉ. రా. ౩, ఆ. ౨౧౬; 4. పట్టుపడు. "సీ. సరియుంరి లేనిచో శకునాంతకునిచేతఁ జొక్కంపుఁబక్షులు చిక్కుపడునె." సీతారా. ౧, ఆ. ౧౧౪. ఆం. భా. తృ. ౧౧౫; 5. ఆగఁబడు. "వ...చెండాడుచుండం జండకిటియొక్కటి చిక్కువడక యొక్కనడకతో వెలువడి వడిగల బంట్లమొత్తముల కుంతమ్ములదంతమ్ములఁ దుత్తుమురుగా నప్పళించి..." రా. వి. ౩, ఆ. ౬౫.

చిక్కుపాటు. ద్వ. వి. (చిక్కుపడు ధా.) 1. ఇబ్బందిపడుట. "వ...తాఁ బడినచిక్కుపాట్లును..." వేం. మా. ౫, ఆ. ౧౦౧; 2. మెలికలుపడుట. "ఉ...కుంతలపంక్తుల చిక్కుపాటులున్..." శ్రీరాధా. ౪, ఆ. ౫౨.

చిక్కుపురువు. దే. వి. (చిక్కు+పురువు.) ఒకవిధమగు పురువు. "గీ. కుమ్మపురువు చిక్కుపురువు గుంత పురువు,..." ప్రబంధ. ౧౩౦.

చిక్కువఱచు. ద్వ. స. క్రి. (చిక్కుపడు ధా. ప్రే.) బాధపెట్టు. "క. కలఁగని మేల్కని మును మదిఁ, గలసంశయ మెల్ల విడువఁగా నప్పుడు కో,ర్కులు చిక్కువఱచె మరుఁ డ,మ్ములవానలు చూపెఁ దాపమున కిరవై తిన్." దశ. ౭, ఆ. ౯౬.

చిక్కులమారి. దే. విశే. (చిక్కులు+మారి.) చిక్కులు పెట్టువాఁడు. "ఉ. చిక్కులమారి యాబలిజసెట్టి..." హంస. ౫, అ. ౪౮.

చికొ్కట్టు. దే. అ. క్రి. చీకొట్టు. "క. ఇక్కన్యకు మగఁడే యితఁ,డక్కట యీమగని కేటియా

లిది యనుచుం,జిక్కొట్ట వలదు..." ఉ. హరి. ౫, ఆ. ౧౪౭.

చిక్కోల. దే. వి. (చిక్కు+కోల.) చిక్కంటె. (శ. ర.)

చిక్రోడము. సం. వి. అ. పుం. ఉడుత.

చిక్లిదము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తడి గలది.

చిక్లిదుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

చిగరుగోరు. దే. వి. జుట్టుముడి బిగించుట కుపయోగించుసాధనవిశేషము. "సీ. చిగురుగోళ్లను జాఱుసిగ నిక్కఁగా వేసి కదలిపూరేకులు గానఁజెరివి." మల్హా. ౩, ఆ. ౯.

చిగిరించు. దే. అ. క్రి. 1. చిగురువెట్టు. "శా. దంభాపేత విశీర్ణితోయములు దగ్ధ్వా దొట్టి హాట్టస్థిత, స్తంభంబుల్ చిగిరించుచున్నవి యనన్..." ఆము. ౨, ఆ. ౩౫; 2. వర్ధిల్లు. "క. పగవెలిఁ గని లో దస్యులఁ, జిగిరింపఁగఁజేసి నృపతి చిక్కువడఁ బనుల్, తెగి చేయక తారే దిక్కగ నడతు రశంక నల్లికొని దుస్సచివుల్." ఆము. ౪, ఆ. ౨౭౮.

చిగిరింత. దే. వి. (చిగిరించు ధా.) తృణవిశేషము. "సీ. సగము దుమ్మునఁ బూడి చిగిరింత వామాయఁ బెరిఁగిననూతిపాఁతరబోటియల." ఆము. ౬, ఆ. ౧౩.

చిగురాకు. దే.వి. (చిగురు+ఆకు.) లేఁతయాకు. "సీ. చిగురాకుఁ బోగరాని చెలఁగి యొలుంగించు పికనికాయములకు బెదరి బెదరి." విక్ర. ౭, ఆ. ౬౦. ఇట్లే: చిగురుటాకు. పారి. ౧, ఆ. ౫౨.

చిగురాకుదిండి. దే. వి. (చిగురాకు+తిండి.) కోయిల. "సీ. చిగురాకుఁదిండ్లపల్లవ మంట కెసఁగుకల్లవమంటపమున నిల్వంగ నునిచి." చంద్రా. ౪, ఆ. ౧౯౧.

చిగురాకుఁబోఁడి. దే. వి. (చిగురు+ఆకు+పోఁడి.) చిగురువంటిమృదుశరీరముగలస్త్రీ; స్త్రీ. దశా. ౨, ఆ. ౨౪౧.

చిగురాకువిలుకాఁడు. దే. వి. (చిగురు+ఆకు+విలుకాఁడు.) మన్మథుఁడు. "సీ. చిగురాకువిలుకాని చేతిచక్రమురీతి..." శశాం. ౩, ఆ. ౨౦.

చిగురు. దే. వి. 1. పల్లవము. "గీ...పట్టిమ్రాకులఁ జిగురులు పుట్టునట్టు." విక్ర. ౧, ఆ. ౧౧౨. ఆం. భా. ద్వి. ౩౯; 2. మ్రుగ్గుతో పెట్టునలంకారవిశేషము. వ్యవ:—గడపకు చిగురు కొట్టిరి; 3. దంతములచుట్టు నుండుమెత్తనిమాంసఖండము. (బ్రా.) విణ. లేఁతది. "వ. అనంతరంబ చిగురుముదురునుం గానినడుపు వెడలుపుం గలకదళీపలాశంబు..." హర. ౨, ఆ. ౧౨౫. స్వా. ౧, ఆ. ౫౦.

చిగురుగైదువుజోదు. ద్వ. వి. (చిగురు+కైదువు+జోదు.) మన్మథుఁడు.

చిగురుఁగొమ్మ. దే. వి. (చిగురు+కొమ్మ.) లేఁతకొమ్మ. స్వా. ౧, ఆ. ౫౦.

చిగురుఁబోఁడి = చిగురాకుఁబోఁడి. "మ. చిగురుంబోఁడి..." కళా. ౩, ఆ. ౧౩౧.

చిగురుఁబోణి = చిగురాకుఁబోఁడి. స్త్రీ. "క...నెలయేఱులలోఁ జల్లులుఁ, జిలుకులం నాడుదురు మునులచిగురుంబోణుల్." హర. ౫, ఆ. ౩౭. నైష. ౩, ఆ. ౧౯౫.

చిగురుకొను. దే. అ. క్రి. (చిగురు+కొను.) 1. పుట్టు, అంకురించు. "గీ. సొగసునగవులు మొగమునఁ జిగురుకొనఁగ." చంద్రా. ౩, ఆ. ౯౮; 2. ఎఱ్ఱనగు. "చ. మగఁ డపరాధియై కుచముమక్కువనంటఁ గటాక్షమాలికల్, చిగురుకొనంగఁ జూచె నటు చిట్టునఁగోపముతోడ..." గంధ. ౧౬౦.

చిగురుచు. దే. అ. క్రి. 1. చిగురొత్తు. ఆం. భా. ద్వి. ౩౫; 2. కలుగు, బయలుదేఱు. "గీ...చిగిరిచెం గెంపుజిగి నింపుచిగురుగుంపు." ఇందు. ౨, ఆ. ౩౮; 3. ఎఱ్ఱనగు. (చూ. చిగుర్చు.)

చిగురువిలుకాఁడు. దే. వి. (చిగురు+విల్లు+కాఁడు.) మన్మథుఁడు. "గీ. అన్నుతలమిన్న క్రొమ్మెఱుఁగారుచూపు, చిగురువిల్కాని వాల్దూపుఁ జెనక నోపు." పె. శకుం. ౧, ఆ. ౧౬౩.

చిగురెక్కు. దే. అ. క్రి. (చిగురు+ఎక్కు.) వాసికెక్కు. "ద్వి. ఎడపక జంగమం బేవస్తువైన, నడుగ కుండినవొట్టు నడిగిన లేదు, అనినచో నాయొట్టు నఖిలంబు వినఁగఁ, దనకని గర్వించి దండితో గంట,మొగసాలఁ గట్టించి మ్రోయించికొనుచుఁ, జిగురెక్కియున్నాఁడు..." ద్వి. భల్లా. ౨, ఆ. ౨౪. పు.

చిగురొత్తు. దే. అ. క్రి. (చిగురు+ఒత్తు.) 1. పల్లవించు. "గీ. చెప్పవే కరుణాలత చిగురొత్త." భార. శాం. ౫, ఆ. ౫౪౭; 2. కలుగు. "క మొగమునఁ గయ్యపువేడుక, చిగురొత్త..." భార. ద్రో. ౧, ఆ. ౫౫; 3. అనురక్తమగు. "చ. అలరిన ప్రేమ వెన్నెలబయల్లఁ జెలంగుదు రట్టి వేసవిన్, మలయపుగాలిరాకలకు మానసముల్ చిగురొత్త దంపతుల్." ఇందు. 3, ఆ. ౧౦౭. హరి. ఉ. ౪, ఆ. ౧౯౭.

చిగుర్కొను = చిగురుకొను. (అతిశయించు.) ఆము. ౧, ఆ. ౨౭ (వ్యాపించు.) ఇందు. ౫, ఆ. ౧౨౭.

చిగుర్చు = చిగురుచు. (ఎఱ్ఱనగు.) "మ...కన్గొనల్ చిగుర్పంగ వేశపియించెన్..." జై. ౪, ఆ. ౧౦౧.

చిచ్చఱ. వై. వి. (సం. శుచిః. ప్రా. చిచ్చి. క. కిచ్చు.) అగ్ని. "క. మెచ్చిర మచ్చిక కలిగిన, నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం, జిచ్చుఁ గడికొనఁగ వచ్చునె చిచ్చఱయూ వచ్చుపడినశివునకుఁ దక్కన్." భాగ. ౨, స్కం. ౭౪౬. విఱ. అగ్నిమయము." భార. విరా. ౫, ఆ. ౧౪3.

చిచ్చఱకంటి. ద్వ. వి. (చిచ్చఱ+కన్ను+ఇ.) శివుఁడు. "సీ. కొఱఁత గానీక చిచ్చఱకంటిచెంగట గుఱుతుగా విలువిద్దె గఱచినాఁడ." అచ్చ. బాల. ౭౦౧.

చిచ్చఱపిడుగు. ద్వ. వి. (చిచ్చఱ+పిడుగు.) అగ్గి పిడుగు. భార. విరా. ౫, ఆ. ౧౪3.

చిచ్చఱమ్ము. ద్వ. వి. (చిచ్చఱ+అమ్ము.) ఆగ్నేయాస్త్రము. భా. రా. సు. ౫౭.

చిచ్చి. దే. అవ్య. బిడ్డలకు జోలపాడునపుడు పీడాపరిహారార్థము చెప్పఁబడుమాట. (శ. ర.)

చిచ్చీ దే. అవ్య. (చీ+చీ.) 1. ధిగర్థకము. "క. లచ్చన మెఱుఁగనికవులను, జిచ్చీ యని సుకవివరులు చేపట్టరు గా." కవిజ. అవతారిక. ౪; 2.= చిచ్చి. (శ. ర.)

చిచ్చు. వై. వి. (సం. శుచిః. ప్రా. చిచ్చి. క. కిచ్చు.) 1. అగ్ని. "ఉ. అచ్చట లోక మంతయుందు నక్కటికంబున నుమ్మలింపనీ, చిచ్చు చొరంగఁ బోక మది చిక్కఁదనంబున నియ్యకొన్న నా, కిచ్చటఁ దెచ్చి ని న్విడుచు టెంతటిపెద్ద జఘన్యవృత్తిచే, నచ్చట రచ్చ కెక్కుటకు నాఱడిపోకకు నోర్తు మైథిలీ." నిర్వ. ౯, ఆ. ౨౯; 2. తాపము. "సీ. ఈవెండ్రుకలు పట్టి యీడ్చినయీచేయి తొలుతగాఁ బోరిలో దుస్ససేను, తను వింత లింతలును తునియలై చెదరి రూపఱియున్నఁ గని యందుకొఱఁగాక, యలుపాలఁ జొనుపడునట్టి చిచ్చె యది..." భార. ఉద్యో. 3, ఆ. ౧౧౭.

చిచ్చుపిడుగు. ద్వ. వి. (చిచ్చు+పిడుగు.) అగ్గి పిడుగు. "గీ...ముచ్చు దొరకోలుసన్నాసి చిచ్చుపిడుగ." ప్రబోధ. ౭౯౪.

చిచ్చుబుడ్డి. ద్వ. వి. (చిచ్చు+బుడ్డి.) ఒకరకపుబాణసంచు. (శ. ర.)

చిచ్చుఱ = చిచ్చఱ. అచ్చ. యు. ౬౪.

చిచ్చుఱపిడుగు = చిచ్చుపిడుగు. "చ...చిచ్చుఱపిడు గెట్టు లట్టడరి శూరులమొత్తము నుగ్గుసేసెటన్." భార. విరా. ౪, ఆ. ౨3.

చిచ్ఛక్తి. సం. వి. ఇ. స్త్రీ. చైతన్యము.

చిటచిట. దే. వి. (క. చిటచిట. త. చిడుచిడుప్పు.) 1. కాఁగిననూనె మున్నగువానియందు నీటిబొట్లు పడఁగాఁ గలుగుధ్వని కనుకరణము. "సీ. నఖముఖోజ్ఝితపరాఙ్ముఖముక్త బాష్పాంబుసటిమ దీపపుఁజిటచిటలు దెలుప." ఆము. ౫, ఆ. ౬౦; 2. మిడుఁగుఱులు చెదరుట లోనగువానియందగుధ్వని కనుకరణము. "క. కటతటము లదరఁ గన్నులఁ, జిటచిట నిప్పుకలు చెదర..." ఉ. రా. ౭, ఆ. ౧౭౫. రా. వి. ౫, ఆ. ౧౭; 3. జ్వాలలు లేచునపుడును చెట్లు మొదలగునవి కాలునపుడును గలుగుధ్వని కనుకరణము. "క. సట లూడ్వఁబడిన కేసరి, యటువలెః గేసరి భయంకరార్భటి దిక్కుల్, పెటిలిపడఁ గన్నుఁగొనలఁ, జిటచిటశిఖ లెగయ శిఖరిఁ జేకొని వైవన్." సమీర. ౧, ఆ. ౧౬౨.

చిటచిటమను. దే. అ. క్రి. (చిటచిట+అను.) 1. మండిపడు, మిక్కిలికోపగించు. (శ. ర.); 2. చిటచిట అని ధ్వనించు. "క...రగిలెన్; జిటచిట మనుచు నవని..." రా. వి. ౫, ఆ. ౯౨.

చిటచిటలాడు. దే. అ. క్రి. (చిటచిటలు+ఆడు.) 1. మిక్కిలి కోపగించు. "చ. సట లిట మాన రోరి హరి సర్వమయుం డటె యంచుఁ బట్టితోఁ

జిటచిటలాడి యందుఁ గనఁజేయుము నీ పని దైత్యుఁ డాడినన్, బటబటతాళికంబ మిరువా యలు గా నరసింహమూర్తివై, కుటిలనఖాగ్ర కుంచికల గ్రుచ్చవె వానియురఃకవాటమున్." పారి. 3, ఆ. 3౨, 2. చెమటచే చర్మము తాపమునొందు. వ్యవ:—నాశరీర మిపుడు చిట చిటలాడుచున్నది.

చిటపెట. దే. వి. తాళమును దెలుపుటకు వీణప్రక్క తీఁగలు మీటునపుడు కలుగుధ్వని కనుకరణము. "సీ. గోట నూనంబుగాఁ బొటలొయపలఁ గేల జిట పెటఁ దాళంబుఘటన నడుపు." వైజ. ౧, ఆ. ౧౧౭.

చిటపొట. దే. వి. 1. చినుకులు కాయలు మొదలగు నవి రాలుటయందగుధ్వని కనుకరణము. "క. అటమున్న మొగులు బలియుచుఁ, జిటపొటమని పాటపాటఁ జినుకులు వడఁ జొచ్చుట యూది గాఁగ..." కళా. ౪, ఆ. ౧౬. "ద్వి. చిమిడి కాయలు నేలఁ జిటపొట రాల." ద్వి. హరిశ్చ. పూ. ౨౨౪౬. పం; 2. అవులు తినుటయందగు ధ్వని కనుకరణము. "క. నటనపరకేకిపాత్రస్ఫుట యవనిక లన మొగుల్లు పొదివెక్ భూభృత్తటు లనవి దూకుఁ దిను చిటపొటరవములు చెలఁగెఁ దాళములచప్పుడుసై." ఆము. ౪, ఆ. ౧౧౫; 3. ప్రణయకోపము. "చ. కుటిలకటాక్షవీక్ష ణముఁ గోమలనూత్నకపోలరాగముం, జటుల సముంచితభ్రుకుటి సంవళనంబులు జూచువేడు కన్, జిటపొట రేఁచె రాజు సరసీరుహనేత్రకు ..." నైష. ౭, ఆ. ౪౨.

చిటాలు. దే. వి. చిటచిట మనుధ్వని. (దీనియామ్రే డితరూపము చిటాలు చిటాలు.) "వ... మిటా రంపుఁ గటారంబులఁ జిటాలుచిటాలునఁ దుటారం బడర హుటాహుటిం బటాపంచలుగఁ దఱుముచు ..." అచ్చ. యు. ౩౬౪. (శ ర. పా.) విణ. తుదిది, చివరిది. వ్యవ:—చిటాలుకొమ్మ.

చిటి. దే. విణ. (క. చిటి.) 1. చిన్న. "ఉ...కట్టు కొన్నచిటికమ్ములచీర తగంగ..." శుక. ౨, ఆ. ౩౯౬; 2. సుందరము. "క...నీ కిపు డాబంగరు చిటిపాపచెలిని పాటిలపలదే." అచ్చ. అర. ౩౨; 3. సన్నము. ఉదా:—చిటిచాఁప. (శ. ర.)

చిటిక. వై. వి. (సం. ఛోటికా. క. చిటికె. త. చిటిక్కై.) 1. చేతినడిమి వ్రేలినిబొటనవ్రేలితోఁ జేర్చి చేయుధ్వని. "మ...చిటిక లైన్వచిన మ్రోఁగు పారువములక్ జేకానుకల్ సేయుచున్." వేం. పంచ. ౨, ఆ. ౧౫౨; 2. మిక్కిలికొలఁదికాలము. ఆం. భా. తృ. ౩౦.

చిటికన. వై. వి. కనిష్ఠిక. "ద్వి. కనుపట్టునల చిటికన వ్రేలు గొలుచు." ద్వి. పరమ. 2, ఆ. ౫౪౭. పు.

చిటికరించు. వై. అ. క్రి. చిటికవేయు. (చూ. చిటికరింత.)

చిటికరింత. వై. వి. (చిటికరించు ధా.) 1. అత్యల్ప కాలము. ఆం. భా. తృ. ౩౦; 2. చిటిక. (బ్రా. శ. ర.)

చిటికాఁడు. వై. వి. (చిటి+కాఁడు) 1. చిన్న వయసు గలసేవకుఁడు. (జాగిలంబులన్.) "క. నిగనిగనిపైఁడిగొలుసులు, నిగిడింపుచుఁ బట్టినట్టి నిద్దపుఁజిటికాండ్రగణంబు వెంటరా విభుఁ శ్వ గణికుఁ డీక్షించి మ్రొక్కి చక్కం జనియెన్." రా. వి. 3, ఆ. ౫౫. విణ. చిన్నవాఁడు. (శ.ర.)

చిటికె. వై. వి. చేతినడిమి వ్రేలిని బొటనవ్రేలితోఁ జేర్చి చేయుధ్వని. "చ...చిట్కె వేసి..." హంస. 3, ఆ. ౨౧౬. బ. బొలక్రీడావిశేషము. "సీ...గిలకలు చిటికెలు కీచుబుఱలు." హంస. 3, ఆ. ౧౪౬.

చిటికెన. దే. వి. కనిష్ఠిక. "చ. ఇటు తగునయ్య విప్రుడ వహీనగుణాఢ్యుఁడ వీవు నీక నేఁ, మిటి కిటువంటిదౌష్ట్యము శమించును నె మజ్జనకుండు కొన్నఁ ద,క్కటిజను లేమి యాంత్రుడు మదిఁ గాంక్షయె కల్గిన నగ్నిసాక్షిగాఁ, జిటికెనపట్టి కాక పృథ చేయుట ధర్మమె కన్యకాత్వమున్." భో. ౪, ఆ. ౨౩౩. (చిటికెనపట్టు అనగా నిచట పాణిగ్రహణము చేసికొని అని యర్థము.)

చిటికెనవ్రేలు. దే. వి. (చిటికెన+వ్రేలు.) కనిష్ఠిక. ఆం. భా. ద్వి. ౧౪౦.

చిటికెనబొద్దులు. దే. వి. బ. (చిటికెన+బొద్దులు.) కాళ్ల చిటికెనవ్రేళ్లయం దుంచుకొనుభూషావిశే షము. (శ. ర.)

చిటికెలిడు. వై. అ. క్రి. (చిటికెలు+ఇడు.) చిటి కలువేయు. "గీ. ఏమి మాటాడినను నులియించుఁ...

మిగులఁ జిటికెలిడు జృంభణంబునఁ జేరి దివిజ, వైరి కగదారి యిచ్చకదారి యగుచు." దశా. ౨, ఆ ౧౩౧.

చిటిగార. దే. వి. (చిటి+గార.) చిన్నజాతియింగువిశే. హంస. ౪, ఆ, ౯.

చిటిగొట్టె. దే. వి. (చిటి+గొట్టె.) చిన్నజాతిగొట్టె చెట్టు. హంస. ౪, ఆ. ౧౧.

చిటిచాఁప. దే. వి. (చిటి+చాఁప.) పట్టువలె మెత్తగా నుండుజమ్ముతో అల్లినచాఁప. (బ్రా. సన్ననిచాఁప. శ. ర.) "సీ. బాలీసురతనంపు గీలుఁ బొమ్మలు చిటిచాఁపలు వెడఁదవింజామరములు." రసిక. ౧, ఆ. ౬౧. సురా. ౧౦౬.

చిటితాళము. మి. వి. (చిటి+తాళము.) వాయించుట కుపయోగించు చిన్నతాళము. (మ్రానితోఁ జేసిన తాళవిశేష మని. శ. ర.) "సీ. చిటితాళములుఁ జంకపుటిక నొక్కొకమాటు గతిరయంబునఁ దాఁకి కలసి మొఱయ." ఆము. ౬, ఆ. ౬. ఆం. భా. ప్ర. ౧౨౯.

చిటిపొటి. దే. విశే. (చిటి+పొటి.) 1. చిన్న. "క. చిటిపొటినవ్వులు కనుఁగవఁ బొటకరిలన్..." సా. 3, ఆ. ౧౪౫; 2. అత్యల్పము. (శ. ర.)

చిటిబొట్టు. దే. విశే. (చిటి+బొట్టు.) 1. ముత్తైదువలు అక్షతలు మొదలగువానితో ధరించుచున్న బొట్టు. "సీ. కాశ్మీరతిలకరేఖామధ్యమునయందుఁ బుణ్యంపుఁజిటిబొట్టు పొందుపఱిచి." కాశీ. 3, ఆ. ౨౧౨; 2. దృష్టిదోషపరిహారార్థము పెట్టుచిన్న బొట్టు. "చ...కేళివనాంతరలక్ష్మి బోటియై, మసిఁ జిటిబొట్టు పెట్టె..." రాజ. చ. ౨, ఆ. ౧౧౪.

చిటిబొద్దు = చిటికెనబొద్దు." ఆం. భా. ద్వి. ౨, ఆ. ౧౫౧.

చిటిమటి. దే. వి. వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౦. కాళ. 3, ఆ. ౬౯.

చిటిముడి. దే. వి. (చిటి+ముడి.) దొంగయెత్తు. మోసము. "క. విటతాటకి యనులంజెయు, సట లంబడి సొక్కి సొక్కి సదమదమై తా నటునిటుఁ బోవను జాలక చిటిముడిచేఁ గాసుల్లెల్లఁ జెల్లఁగఁ గొఱికెన్." మల్హణ. 3, ఆ. ౧౨.

చిటిముత్తెములు. ద్వ. వి. బ. (చిటి+ముత్తెములు.) ఒకజాతి సన్నధాన్యము. (శ. ర.)

చిటిలించు. దే. స. క్రి. (చిటులుధా. ప్రే.) 1. చెడఁగొట్టు. "క. చటులతరసురబాణో,త్కటనటన పటుప్రతాపతాపాగ్నిశిఖన్, జటివరునితపో రాశిన్, బెటిలింతుఁ గా వానిమనసు బిగిఁ జిటి లింతున్." చంద్రా. 3, ఆ. ౮3; 2. చెదరఁగొట్టు. "చ. ఘన కనురక్తి హెచ్చ నిదె మం దని కంఠముఁ గౌఁగిలించి నిక్కినఫణిరాజవల్లి యెఱిఁ గింపఁగనో యనఁ బూగముల్ థిరంబునఁ బడు మట్టచేఁ జెఱకుముత్తియముల్ చిటిలించి తద్ర సంబనిశము వంచు నంతికతలాంతికఁ జూర్ణము చేయు నప్పురిన్." ఆము. ౧, ఆ. ౭౦; 3. ముదుతలు పడఁజేయు. వేం. మా. ౧, ఆ. ౨౩౦.

చిటిలిపడు. ద్వ. అ. క్రి. (చిటిలి+పడు.) 1. చెదరిపడు. "వ...పంచశర పంచశాఖామండలిత పుండ్రకోదండదండంబునందుండి చిటికిలిపడు బటువు కట్టాణిముత్తియంపుఁబూసకరణి..." చం. రా. 3, ఆ. ౨౫; 2. మిక్కిలి కోపించు. "క. కటములుఁ బెదవులు నాసా,పుటములు నదరంగ మేనుపొరిఁ గంపింపం,జిటిలిపడి మండి యెవ్వం,డిటు నిన్నుం జేసె ననిన నిట్లను నది యున్". భా. రా. అర ౧. ౨౬౬. 3. గర్వించు. "గీ. తగవు వినఁజాల కేల మీతండ్రి యట్లు,చిటిలిపడుచున్నవాఁడవు చెడఁ దలంచి." భా. రా. యు. ౧౨౯.

చిటిప్రేలు. దే. వి. ఔ. (చిటి+ప్రేలు.) కనిష్ఠిక. "సీ. చిటిప్రేలిపూసపై ఘుటియిల్లు పెడపట్టుచిమ్ముల సురియడాల్లుమ్మరముగ." ఆము. ౬, ఆ. ౮౦. ఆం. భా. ద్వి. ౧౪౦.

చిటుకను. దే. అ. క్రి. (చిటుకు+అను.) అల్పధ్వని యగు. "క. చిటుకనక మాఁటుమడఁగిన..." విప్ర. ౪, ఆ. ౫౭. ఇట్లే: చిటుకుమను, చిటుకురను, చిటుక్కుమను. "క. వినుమెందుఁ జిటుకు మన్నను..." రాధికా. 3, ఆ. ౧౬౫. "గీ. చీమ చిటుకురన్నఁ జిమ్మట జిఱ్ఱన్న, నెదుర మూషకములు మొదలుకొనిన, నిదురలేక భూమినిర్ఘరుఁ డాలించు, నప్పు డబల కాలిచప్పుడనుచు." వేం. పంచ. ౪, ఆ. ౧౪౭. "క. కొనగోరఁ దీసి కాటుక,కనునీరు చిటుక్కు మనఁగఁ గడమీటుచు వం,చినతల యెత్తక యుండెడు, నన్నృతోదరి..." సా. 3, ఆ. ౭.

చిటుకు. దే. అ. క్రి. చిటికలువేయు. ఆం. భా. కృ. ౧౩౪. వి. 1. అల్పధ్వని కనుకరణము. (దీని యామ్రేడితరూపము. చిటుకు-చిటుకు, చిటుకు చిటుక్కు.) "చ...కన్నుఁగొనలన్, బొటపొట రాలునశ్రుకణముల్ కొనగోళ్లను మాటిమాటికిన్, జిటుకు-చిటుక్కునన్ జెదరఁ జిమ్ముచు..." రఘునాథరామాయణము. ౨, ఆ. ౧౨౯; 2. సరసము? (చూ. చిటుకులాఁడి.)

చిటుకుపొటుకు. దే. వి. వాన వెలిసినపిదప వృక్షాదులనుండి నీటిబొట్లు పడునప్పుడు కలుగుధ్వని కనుకరణము. వ్యవ:—చిటుకుపొటుకన చినుకులు పడుచున్నవి.

చిటుకుపొటుకుమను. దే. అ. క్రి. (చిటుకుపొటుకు+అను.) పలుకు. వ్యవ:—వాఁడు చిటుకుపొటుకుమనక యున్నాఁడు. (శ. ర.)

చిటుకులాఁడి. దే. విశే. (చిటుకులు+ఆఁడి.) సరసురాలు, రసికురాలు? "క. అని చిలుక తేనియలఁ బో,రనిమొదుఁజడివాన వెలిసినటువలెఁ బలుకం, దనయంతనె తా నిల్చిన,విని కోమటిచిటుకులాఁడి వెస నిట్లనియెన్." శుక. ౨, ఆ. ౨౯.

చిటులు. దే. అ. క్రి. 1. చిటిలుపాఱు. "చ. చిటిలినగందముం దళుకుఁజెంపను వ్రేలురుమాలు..." శుక. ౧, ఆ. ౪౧౫; 2. చెదరు. "చ. పటుతర విక్రమస్ఫురణఁ బాహుపతంబులు రెండుఁ బోరఁగాఁ, జిటిలిన విస్ఫులింగములఁ జిల్లులువోయె నభస్థలంబు..." శివరా. ౧, ఆ. ౯౦.

చిటులుచు. దే. స. క్రి. (చిటులు ధా. ప్రే.) పోఁగొట్టు. "క. అటులు ప్రణమిల్లి దివిష,త్కుటిలాలక రాచతపసికొమరుఁ గని బలా,జటులా వీఁకఁ దాలిమిఁ,జిటిలిచి యే నెప్పు డొక్కొ సిగవేయింతున్." కళా. ౧, ఆ. ౧౬౩.

చిట్టి. దే. వి. చిటిక. "శా...జింక ల్పుట్టిగొనంగ నేమిటికిరా చేచిట్టి మ్రోయించి యాం,తంకంబుల్ ఘటియించితి..." హార. ౧, ఆ. ౪; 2. చిన్నపొద. "చ. పగడపుఁజిట్టులన్ మనికిపట్టుగఁ గట్టిన పట్టు జీనువుల్..." వసు. ౧. ౧౦౪; 3. వేదప్రశ్నములలోని యధ్యాయముల యొక్కయు నధ్యాయములలోని ఋక్కులు మొదలగువానియొక్కయు క్రమము జ్ఞప్తికి వచ్చుటకై కూర్పఁబడినపదములవరుస. ఉదా:— నమస్తే నమో హిరణ్యబాహవే నమస్సహమానాయ...పుష్పమగ్నిర్వాయుం రసౌ వై తపన్న...యజుర్వేదము. విశే. కల్పితము. వ్యవ:—ఇది చిట్టిగా నున్నది. (శ. ర.)

చిట్టంటుచేఁతలు. దే. వి. బ. (చిట్టంటులు+చేఁతలు.) విలాసచేష్టలు. "ద్వి...కైకేయి, వరవు డామంధర వడి నేఁగుదెంచి, చిట్టంటుచేఁతలఁ జెంది దట్టుదట్టుటయుఁ,గట్టల్క రాముఁ డాశాస్థంబు చేశ, నడిచిన నొక్కొకా లప్పుడే విఱిగె." రం. రా. బాల. ౨౧. పు. ౧౧. పం. "సీ. చిట్టంటుచేఁతల సిగ్గుకే లెడలించి పలికింప నల్లనఁ బలుకుటయును." భో. ౪, ఆ. ౧౦౯.

చిట్టంటులు. దే. వి. బ. (చిట్టి+అంటులు.) నఖదంతక్షతాదులు. (వృత్తియం దేకవచనాంతము. చూ. చిట్టంటుచేఁతలు.) "గీ. అంతకంతకుఁ జిట్టంటు లంటి యంటి, చెలువలకు యౌవనము విందుసేయ మన్న,మానగుణబద్ధు మన్మథమంత్రసిద్ధు,రుచిరరసవృద్ధు నాయనిరుద్ధుఁ జూచి." ఉ. హరి. ౫, ఆ. ౧౦౨. "సీ. పారవశ్యదము లై పరఁగు చిట్టంటులఁ జనవున గనయంబు సడలఁ జేసి..." విక్ర. ౪, ఆ. ౨౨౩.

చిట్టకపుఁదనము. దే. వి. (చిట్టకము+తనము.) పరిహాసము. "గీ. కప్పురము గుల్కు కమ్మబాగాలు మడుపు, లలవచే నిడి తా నవి యందుకొనియెఁ, జిట్టకంపుఁదనాలకుఁ జేయి సాఁచి,విడెము పెట్టు ననంగ నవ్వేళ విభుఁడు." రామా. ౪, ఆ. ౧౬౭.

చిట్టకము. దే. వి. 1. శృంగారచేష్ట. "ఉ. ఇంతులు కూడి చిట్టకము లిట్లొనరింపఁగ నించుకేనియున్, వింత తెలుంగు లేక ధరణీధరముంబలె నున్న యా దృఢస్వాంతునిఁ జూచి..." పరమ. ౩, ఆ. ౧౯౯; 2. లీల. "క. నీకొడుకు నీక యిచ్చితిఁ, గైకొనుము విరించిచిట్టకాలకు లోనై..." ఉ. హరి. ౨, ఆ. ౧౫౪; 3. కపటము. "ఉ... లోభపుం,బొం దనృతంబు చిట్టకపుఁబోకలు దబ్బఱ లౌర కీర్తి మిన్నందిన వేంకటాఖ్యసచివాగ్రణికిన్ బరికించి చూడఁగన్." పె. శకుం. ౧, ఆ. ౫౦. ఆము. ౨, ఆ. ౫౯. ఆం. శే. ౭౦;

4. పరిహాసము. పి. శకుం. ౧, ఆ. ౭౭. స్వా. 3, ఆ. ౧౮.

చిట్టచివర. దే. వి. (చివర+చివర.) తుట్టతుద.(శ. ర.)

చిట్టడవి. ద్వ. వి. (చిట్టి+అడవి.) తుప్పయడవి. పి. శకుం. ౧,ఆ. ౮.

చిట్టడుగుకత్తెర. దే. వి. (చిట్టి+అడుగు+కత్తెర.) సాములో నడుగులు వేయుక్రమములలో నొకటి. ప్రబంధ. ౭౮.

చిట్టతుమికి. దే. వి. రావణవృక్షము. (శ. ర.)

చిట్టమిడి. దే. వి. (చిట్టమిడుచు ధా.) చిటికవేయుట. "వ...అమ్మునీంద్రుండు హరిణపక్ష్మంబులకుం జేయుంవాత్సల్యంబునకు నద్భుతంపడి యంగుళిస్ఫోటనంబు సేసె నచ్చిట్టమిడికి నాలేడికిల్లులు బిట్టు బెదరి చెదరి చేయాక పఱచిన..." హర. ౧, ఆ. 3.

చిట్టమిడుచు. దే. అ. క్రి. (చిట్ట+మిడుచు.) చిటికవేయు. "సీ. సకలాంగకంబులు జాదకోటఁ బుల కించి చెయ్యెకించుక యెత్తి చిట్టమిడిచి." శైవ ౧, ఆ. ౭.

చిట్టలు. దే. వి. ఏ. ఆశ్చర్యము. "క. మునినాథ చెప్పఁ జిట్టలు, మనయనిరుద్ధుండు నిన్న మగు వలు గొలువన్,దనయింట రాత్రి నెమ్మది,నునికి గలిగెఁ బిదప నున్నయునికిన యడఁగెన్." ఉ. హరి. ౬, ఆ. ౫. విశ. ఏ. అద్భుతమైనది. "ఉ...నీమహత్త్వ మెంతయుం, జిట్టలుగాదె ..." భార. అర. ౫, ఆ. ౧౨3. "శా.. వాని వర్తనము చెప్పం జిట్టలు..." నిర్వ. ౭, ఆ. ౯౯.

చిట్టా. హిం. వి. దినపులెక్క. (శ. ర.)

చిట్టాడు. దే. అ. క్రి. (చిట్టి+ఆడు-శ. ర.) 1. సంచరించు. "శా. ఆవేశన్ గినుకన్ దుంగం ధరుఁడు హాహాకారముల్ పర్వఁగా, నావైరిక్షితిపాలకోత్తముని బ్రహ్మాస్త్రానుసంధానవిద్యావైదుష్యధురీణతాప్రథితబాహాశక్తిఁ గూల్చెన్ సురల్, వ్యోమవీథిన్ వినుతింపఁ దర్పబలము గొందుల్ దూరి చిట్టాడఁగన్." చంద్రా. ౬, ఆ. ౧౧౧, పి. శకు. ౧, ఆ. ౮; 2. తప్పటడుగులు వేయు. "సీ. చిట్టాడునాఁడు నాచిటికెనప్రేల్ పట్టుచేతులా యివి మద్దుఁజిన్నకూన." సా. 3, ఆ. ౧౪౬, 3. చలించు. "క. కందోయి చల్లఁగా నిటు, కందోయి నృపాల లెస్సగా నిఁక నొకమాఱుం దెఱముందఱ నీ పని, చిందఱవందఱల గుట్టు చిట్టాడంగన్." సా. 3, ఆ. ౧౫ శుక. ౧, ఆ. ౧౧౭; 4. ప్రసరించు. "శా. గాంగేయాదులు నీకడఁ జిలిచి వేడ్కం జూడఁగా సర్వసేనాం గాంగంబులమీఁద గాలియను జిట్టాడంగఁ గేతులీల్కం గొంతేయుల దాఁకి..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౬౮; 5. అతిశయించు. "క. దితియును నిషిద్ధకర్మస్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నాననదవదన యగుచు..." భాగ. 3, స్కం. ౪౭౧, రంగా. ౧, ఆ. ౧౫3. స. క్రి. చలింపఁజేయు. "మ...రణక్షితియందుం బీఁగువెంటఁ జేసెఁ జెనయం జిట్టాడఁగా శక్యమే." భార. ద్రో. 3, ఆ. ౧౬౭.

చిట్టాముదము. ద్వ. వి. (చిట్టి+ఆముదము.) 1. బల, చిన్నగింజలు గలయాముదపుఁజెట్టు. (శ. ర.); 2. చిన్నయాముదపుగింజలచమురు. "సీ. చిట్టాముదమ్మున శిరసంటి..." ఇందు. ౧, ఆ. ౧౫౦బ చిట్టాముదపుగింజలు. (వా.)

చిట్టి. దే. వి. (త. చిట్టి). 1. సోలలో నాలుగవ భాగమైన మానవిశేషము. ఆం. భా. ద్వి. ౧౭౦. శుక. ౧, ఆ. ౩౮౧; 2. కలశము. "ద్వి. గట్టులై గుట్టలై కామునిపసిఁడి, చిట్టులై బెట్టులై చెలఁగు పాలిండ్లు." ద్వి. పరమ. 3, ఆ. ౧౮౧ పు. ౧౦, పం. విశ. 1. చిన్నది. "సీ. చిట్టికుంకుమ బొట్టుఁ బెట్టు నెన్నుదుటికి..." వైజ. 3, ఆ. ౭౧. విక్ర. ౪, ఆ. ౧౬౪; 2. అసాధారణము. "వ. అని పలికినవటునిపలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు. ఆ. పుట్టి నేర్పు గొనెనొ పుట్టక నేర్చెనో, చిట్టిబుద్ధు లిట్టిపొట్టి వడుగు, పొట్టనున్న లెల్ల బూమెలు నని నవ్వి, యెలమి ధరణి దాన మిచ్చె నపుడు." భాగ. ౮, స్కం. ౬౧౮, ౬౯౯.

చిట్టితాళము = చిటితాళము. "ద్వి. అట్టిదకాకంచు నప్పుడు నంబి, చిట్టితాళము వేసి చేయెత్తి మ్రొక్కి" పండితా. మహిమ. ౧౯౯. పు.

చిట్టిపొట్టి. దే. వి. (చిట్టి+పొట్టి) చిన్ననగ. "సీ.... చిట్టిపొట్టి ధరించి రిట్టునట్టు." పాండు. 3,ఆ. ౭౪.

చిట్టుకొఱవి. దే. విణ. తాపకారి. "సీ. పంచశరుం డొకప్రళయకాలయముండు చిన్నపెంపుడు చిల్క చిట్టుకొఱవి." కలు. ౪. ౫౫.

చిడిపి. దే. విణ. 1. అల్పము. "చ...అంతధనంబును నట్టిరాజ్యముర్, గొనకగునయ్య యిచ్చిడిపికుట్టికి నీ కిది యేల యేను ద్వీనపితృదేవతాతిథిజనం బులఁ దృప్తులఁ జేయుచుండుదుర్, జనవుత దీని ద్రోచుటయె చాలుఁ దపస్వుల కేల సంపదల్." భార. ఆది. ౭, ఆ. ౧౦౨; 2. కఠినము. "గీ చిడిపిజంగము వాని గాంక్షించఁదగునె." శివరా. ౨, ఆ. ౭౪. "గీ. కొన్ని జీవులు చిడిపిలై ల్లొఱికి బ్రదుకుఁ,గొన్ని నుచుపోగవెన్నెల కో,లి బ్రదుకు." శైవ. 3, ఆ. ౧౪౦. (శ. ర. పా)

చిడిముడి. దే. వి. సంభ్రమము, తొందర. "ద్వి. చిడిముడిఁ దనమైఁటచేఁ దడినొత్తి." సా. ౧ ౪౮3. ఆం. భా. ప్ర. ౧౪౦; 2. కలఁత. "ద్వి. సింహాసనంబుపైఁ జికీను తోడ. సింహాద్రికృష్ణ శాలి చింతసేయఁగా" ద్వి. శ. సా. ౭, ఆ. ౧౦౦. పు. ౧. పం; 3 కోపము. (చూ. చిడిముడిపడు.); 4. అసూయ. ప. "సకియా కాముసకు రతియును గోదుకకు హింసయును లోభునకుఁ దృష్ణయుఁ బ్రాణనాయకలు వీరలకు నీయెడం జిడిముడి లే కుండుట చోద్యంబు..." ప్రబోధ. ౨, ఆ. ౬౯.

చిడిముడిపడు. ద్వ. అ. క్రి. (చిడిముడి+పడు.) త్వరపడు. "క. అత్తఱి సురఖచరాదుల,చిత్తము లనిఁ జూచువేడ్కఁ జిడిముడిపడఁగా, నొత్తారువున నిరుదెఱఁగుల, యుత్తమవీరులను దాఁకనుంకింపంగన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౫౧. మార్క. ౫. ౧౨౨; 2. కలఁతనొందు. (రాముఁడు) "క. అడలడచి నెమ్మనంబున, వెడతెలి వొడఁ గూర్చి మాట వేర్పడకుండం, జిడిముడిపడక నయంబున, నెడమడు వాక్కింత లేక యిట్లను సతితోన్." నిర్వ. ౮, ఆ. ౧.3౧. భార ఆర. ౭, ఆ. ౧౪౪; 3. "క. నడతెంచి పదముడినిఁ గని, చిడిముడిపడి నన్నుఁ బరిహసించెద వోరీ, యొడ లెఱుఁగక నాదృష్టిం, బడి తెటు వోయె దని క్రెంటఁబడి పడి రాఁగన్." సమీర. ౭, ఆ. ౧౨౭.

చిడిముడిపాటు. ద్వ. వి. (చిడిముడిపడు. భా.) 1. సంభ్రమము, తొట్రుపాటు. ఆం. భా. ప్ర. ౧౪౦; 2. కలఁత. "సీ...దేవకి నీళ్లాడె రమ్ము రమ్మని భోజరాజుతోడఁ, జెప్పిన నాతఁడు సిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి..." భాగ. ౧౦, స్క. ౧. పూ. ౧౪౮. భార. ద్రో. 3, ఆ. ౨౫౦; 3. కోపము. "చ. కడఁక యొకింత లేని పలుకాఁకలఁ గాఁగుచు లోఁగి క్రాఁగలై, చిడిముడిపాటుతోఁ జెలులఁ జేరఁగలఁ జేరఁగపోక..." నీలా. ౨, ఆ. ౧౦3. సా. ౨, ఆ. ౯౧.

చిడుకు. దే. విణ. అల్పము. "క. వెడబడుగుం జడదారుల, చిడుగుంబోడుము. మఁ చిడుగఁజేయుంట యరుదే .." చంద్రా. 3, ఆ 3౫. (శ.ర.పా.)

చిడుగుడు. దే. వి బాలక్రీడావిశేషము. "సీ. చిడుగుడు న్వలపోటి కెండు కట్టిన కోడి యుల్లిపొంకున్నవఁ బట్టె లప్పళాలు." హాళ. 3, ఆ. 33. చంద్రా. ౧, ఆ. ౧.

చిడుగుడుపరువులు = చిడుగుడు. "మహాస్రగ్ధర. సిరి సింగణ్ణాలవత్తుల్ చిడుగుడుపరువుల్ చిందరాటల్ మొదల్గా..." ఇందు. ౨, ఆ ౧౮.

చిడుప. దే. వి. మర్మస్థలము? "వ...మరుబందనం బెక్కించి కొనినొద నని దాని కెఱింగించి. "సీ. చేసంకు పట్టుచుఁ జిడుపలు వెదపచు నోరిగాల దేవుచు నడికి పడుచు." దశ. ౯, ఆ. ౧౫౭.

చిడుము. దే. వి. గజ్జి. "ద్వి. చిడుము గోఁకుచు జరఁ జిక్కిన ట్లుండి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౫3. పం. ఆం. భా. ద్వి. ౭౯౮.

చిత. సం. వి. ఆ. స్త్రీ. 1. చితి; 2. ప్రోగు.

చితము. విణ. (అ. ఆ. అ.) 1. కూడఁబెట్టబడినది; 2. కప్పఁబడినది; 3. సంపాదింపబడినది; 4. చెక్కఁబడినది; 5. వ్యాప్తము.

చితాచూడకము. సం. వి. అ. న. చితి.

చితి. సం. వి. ఇ. స్త్రీ. 1. శవమును దహించుట కేర్పఱిచినకాష్ఠాదికము; 2. ప్రోగు; 3. ప్రోగు చేయుట; 4. జ్ఞానము.

చితిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రోగు; 2. చితి; 3. మొలత్రాడు.

చితుకు. దే. అ. క్రి. 1. పగులు. వ్యవ:—కురుపు చితికినది; 2. నలఁగు. వ్యవ-అల్లము నలుఁగఁగొట్టి రసముఁదీయుము.

చిత్త. వై. వి. (సం. చిత్రా. ప్రా. చిత్తా.) 1. చిత్రా నక్షత్రము; 2. చిత్తకార్తె. (శ. ర.)

చిత్తగించు. వై. అ. క్రి. (సం. చిత్తమ్. క. చిత్త యిసు.) 1. వినుచు. "ఆ. తెలిసినంత నేను దెలిపెద సంక్షేపమున విను జిత్తగించి వినుము తెలియ..." భాగ. ౯. స్కం. ౭, ఆ. ౧౬. వాసిష్ఠ. 3, ఆ. ౪౯; 2. దయయుంచు. "గీ... వంశ మేరీతి వర్తించె వారిలోనఁ, జనినవారినిఁ జనువారిఁ జనెడువారిఁ, జెప్పవే వ్యాసనందన చిత్తగించి." భాగ. ౯, స్కం; స. క్రి. 1. తలఁచు. "సీ... ప్రవరసేనుని దండ భాసుఁ దలఁచి, హార్ద్ర బిల్వాఖ్యుని మల్వాఖ్యుఁ జోరుఁ గొనియాడి క్షేమేంద్రు వేడుక జిత్తగించి..." కాశీ. ౧, ఆ. ౧౯. "గీ. తలఁపకుము మాత్స్యపురమున దైన్యపడుట, బుద్ధిసేయకు భీష్మాదియుద్ధతంత్ర, మారయంగ యుద్ధంబు గా దండుఁ బుట్టు, కీడు మే లేమియును జిత్తగింప కుండు." భార. అశ్వ. ౧, ఆ. ౧౧౬. భార. విరా. ౧, ఆ. ౧౪౧. 2. ఆలోచించు. "ఆ. విన్న కన్నకొన్ని వింత లెంతయు మీఱఁ, దెలుపవలయుఁ గానఁ దేటపడఁగ, విన్నవించి వార మిన్ని యాకర్ణించి, కొంచె మనక చిత్తగించవలయు." కృష్ణ. ౫. ఆ. ౧౩౯. "గీ. స్త్రీలబుద్ధులు ప్రళయములె చిత్తగింప." కుచేల. ౧, ఆ. ౧౧౫; 3. చిత్తమునకు పట్టించుకొను. "క. పౌరులవృత్తాంతంబులు, చారులచేఁ జిత్త గింప సమయం బని..." జై. ౬, ఆ. ౫౩. భాగ. ౧౦, స్కం. ఉ. ౪౩౦. వ్యవ:—నావిన్నప మొక సారి చిత్తగింపుఁడు.

చిత్తజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

చిత్తజల్లు. ద్వ. వి. (చిత్త+జల్లు.) చిత్తకార్తె కురియుండబ్బాటువాన. (ఇదియుంచుక సేపుపట్టముగా కురిసి వెంట నెనిలచిపోవును.) "శా. ...కప్పి విల్, మ్రోయం బెల్లగు చిత్తజల్లుగతిగాఁ గ్రొవ్వాడి బాణంబులన్." భా. రా. యు. ౧౦౫౬. విణ. అధికము. "సీ. జల్లుగా విసఁ జిత్త జల్లుగా వెదజల్లు పెంపరుల్ బెంపాఱునంపగ ములు." కృష్ణ. 3, ఆ. ౯. కళా. ౬, ఆ. ౪.

చిత్తడి. దే. వి. (చిఱు+తడి.) 1. కొంచెముతడి. "క. మొగు లెఱుఁగని బలుచిత్తడి, మిగుల నొగిలెఁ గన్నుదోయి మెలఁతకు..." కాళిందీ. ౫, ఆ. ౧౮౦. "సీ. సిందూరతిలకంబు చెమటచిత్తడి దాఁకి యలికభాగంబునం దసలుకొనఁగ." కాశీ. ౧, ఆ. ౯౦; 2. ద్వ. వి. (చిత్త+తడి.) చిత్త కార్తెవాన. "సీ. చిత్తజరాజ్యాభిషేకాంబువుల మాడ్కి జల్లు గాఁ జెమటచిత్తడ్లు గురియ." అహ. 3, ఆ. ౧౦౯.

చిత్తము. సం. వి. అ. న. 1. మనస్సు; 2. దయ. "మ... జవ్వని నీచేతిసి నాదు దేహమును జీవం బున్ వృథామాటలే, లనె నీచిత్తము నాదు భాగ్య మిఁక నీక్షేమ్మంచినం బాలముం, చిన నీవే మఱి యొం డెఱుంగ నిదియే సిద్ధంబు ముమ్మాటికిన్." దశా. ౭, ఆ. ౩౮౦; 3. ప్రజ్ఞ. దే. అవ్య. అంగీకారసూచకము. వ్యవ. గురువు; నీ విపాఠమును జక్కఁగఁ జదువుము. శిష్యుఁడు; చిత్తము.

చిత్తర. దే. వి. మత్స్యవిశేషము. హంస. ౧, ఆ. ౧౪౭.

చిత్తరము. వై. వి. (సం. చిత్రమ్.) ఆశ్చర్యము. "చ. చెలువలు మేడలోఁ జెలిమిచే నిడుసొమ్ము ధరించి వేల్పురా, చెలువలు చిత్తరంపడుచుఁ జెల్వగుసొమ్మది వేడఁ బోయినన్..." కాళిందీ. ౧, ఆ. ౪౯. విణ. ఆశ్చర్యకరము. "సీ. చిత్తరుల్ ఘటియించె జిత్తరు బగిలి నంపంద యొకచాన యాందమాన." ఇంపు. ౯, ఆ. ౫౦.

చిత్తరించు. వై. స. క్రి. చిత్తరువు వ్రాయు. "ద్వి. మత్తిల్లు పండితమల్లు చక్కులను, జిత్తరించిన మాడ్కి జిటిబిటివోవ." పండితా. దీక్షా. ౭౦. పు. "సీ. చిత్తరించనభాతి చెప్పలు దవిలినయా కారరేఖా సముచితముగ." చెన్న. సీ. ౩౧.

చిత్తరువు. వై. వి. (సం. చిత్రమ్.) 1. పటము మొద లగునది చిత్రములు వ్రాయుట కుపయోగించు. "శ. కరువున గండరువునఁ జిత్తరువున నినచంద్ర రుచులఁ దారలరుచులన్, హరిహారంధాత్రాదుల కీఁ, హరిణము సరిరూపు పడయు నలకుయో యుంకన్." భా. రా. అర. ౫, ఆ. ౩౩. దశా.

౯, అ. ౩౮౫; 2. పటము మొదలగువానియందు వ్రాసినరూపము. "ఉ....జగతీవర చిత్రమపాంగ దృష్టిచేఁ,దప్పక చూచి రాజసుత తానును జిత్తరువయ్యె నత్తఱిన్." కవిక. ౩, ఆ. ౬౯. విశే. ఆశ్చర్యకరము. "మ...తనతుష్కారంబు తేజీఁ జివ్రుఁ, కృ్కనఁ దాఁటించి గుదించి చిత్తరువుబాగు ల్మీఱ నాడించె శో,భన తద్వల్గనవల్గ దగ్రిమరుచిస్ఫాయత్కిరీటంబుతోన్." కళా. ౫, ఆ. ౧౧౧. సా. ౧, ఆ. ౭౮.

చిత్తఱి. ద్వ. వి. (చిత్త+తఱి.) వర్షఋతువు. "సీ. కారు చిత్తఱి తొలుకార తొలుకారి నా వర్షరు సంజ్ఞలై పరఁగుచుండు." ఆం. భా. ప్ర. ౧౬. (బ్రౌ. పా.)

చిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. జ్ఞానము; 2. చైతన్యము.

చిత్తిని. వై. వి. (సం. చిత్రిణీ. ప్రా. చిత్తిసి.) చిత్రిణీ, స్త్రీజాతివిశేషము. ద్వా. ౧, ఆ. ౫౧౬.

చిత్తు. ఉభ. దే. వి. 1. దిద్దిచక్కఁబఱుపని మొదటి వ్రాఁత. (శ. ర.); మొదట గుణించుకొనులెక్క. (శ. ర.) వై. వి. సమిధ. "క. ధుత్తూరప్రసవము గతి, నత్తు గడన్ హేమనాళ మలరించి కడున్, జిత్తులు నమఱిచి, యత్తఱి బెడిదముగ జ్వాలలల్లాడుతఱిన్." శ్రీరం. మా. ౮, ఆ. ౫౮. సం. వి. త్. స్త్రీ. 1. జ్ఞానము; 2. చైతన్యము. విశే. (త్.) 1. ప్రోగుచేసినవాఁడు. (పుష్పచిత్తు.); 2. చయనముచేసినవాఁడు. (అగ్నిచిత్తు.)

చిత్రేశుఁడు. సం. వి. అ. పుం. భర్త. "మ...వసుదేవనందనుఁడు నాచిత్తేశుఁ డౌఁగాక..." భాగ. ౧౦, స్క. పూ. ౧౭౦౫. దైవమును, ప్రభువును, భక్తితో హెచ్చరించునపు డుపయోగింపఁబడును. (ఇది తెలుఁగు గ్రంథములమాత్రమే కన్పట్టును.) "సీ. పంచమస్వరమునఁ బద్మాక్షి యొక్కతె యవధారు చిత్తేశ యనుచుఁ బలుక." వి. పు. ౧, ఆ. ౧౮. "మ. తపనీయాంసితవేత్రముల్ గొని ప్రజ నట్టించి చిత్తేశ దేవ పరాకెచ్చరి కంచు భూపతులు సేవావృత్తిమై మ్రోల..." ఉదయనోదయము. ౫, ఆ. ౧౧౬. కాశీ. ౧, ఆ. ౪౫.

చిత్యా. సం. వి. ఆ. స్త్రీ. చితి.

చిత్యము. సం. వి. అ. న. గోరీ. విశే. (అ. ఆ. అ.) 1. ప్రోగుచేయఁదగినది. (పుష్పాది.); 2. సంస్కరింపఁదగినది. (అగ్ని.)

చిత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకనక్షత్రము; 2. ఎలుకజెవి; 3. గుమ్మడి; 4. ఋడమ; 5. పిన్నపాపర; 6. దంతి; 7. మంజిష్ఠ.

చిత్రకంఠము. సం. వి. అ. పుం. కపోతము.

చిత్రకము. సం. వి. అ. పుం. 1. పులి; 2. చిఱుతపులి; 3. ఆముదపుఁజెట్టు; 4. గుమ్మడి; 5. చిత్రమూలము. న. తిలకము, బొట్టు.

చిత్రకుఁడు = చిత్రకారుఁడు.

చిత్రకర్మము. సం. వి. న్. పుం. తినాసము. న. 1. చిత్తరువువ్రాత; 2. అద్భుతకృత్యము; 3. చిత్తరువు. (విల్యమ్సు.)

చిత్రకాయము. సం. వి అ. పు. 1. పెద్దపులి; 2. చిఱుతపులి. విశే. (అ. ఆ. అ.) చిత్రమగుశరీరము కలది.

చిత్రకారుఁడు. సం. వి. అ. పుం. విశ్వకర్మకు శూద్రస్త్రీయందు పుట్టిన సంకరజాతివాఁడు. విశే. (అ. ఈ. అ.) 1. చిత్తరువులు వ్రాయువాఁడు; 2. అద్భుతకృత్యములు చేయువాఁడు.

చిత్రకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చిత్తరువులు వ్రాయువాఁడు.

చిత్రకూటము. సం. వి. అ. పుం. ప్రయాగసమీపమున నున్నయొకపర్వతము.

చిత్రకృత్తు. సం. వి. త్. పుం. 1. తినాసము; 2. చిత్రకరుఁడు. విశే. (త్.) 1. చిత్తరువు వ్రాయువాఁడు; 2. అద్భుతకృత్యము చేయువాఁడు.

చిత్రకోలము. సం. వి. అ. పుం. ఒకజాతిబల్లి.

చిత్రగంధము. సం. వి. అ. న. హరిదళము.

చిత్రగుప్తుఁడు. సం. వి. అ. పుం. యమునియొద్ద జీవులపాపపుణ్యములలెక్క వ్రాయువాఁడు.

చిత్రతండుల. సం. వి. ఆ. స్త్రీ. వాయువిడంగము.

చిత్రతండులము. సం. వి. అ. న. = చిత్రతండుల.

చిత్రత్వక్కు. సం. వి. చ్. పుం. భూర్జవృక్షము.

చిత్రత్వచము. సం. వి. చ్. పుం. భూర్జవృక్షము.

చిత్రదండము. సం. వి. అ. పుం. కంద.

చిత్రదేవి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాపర.

చిత్రనేత్ర. సం. వి. ఆ. స్త్రీ. గోరువంక. ఇష్టే: చిత్రలోచన మొ.

చిత్రపక్షము. సం. వి. అ. పుం. తీతుపుపిట్ట. విణ. (అ. ఆ. అ.) చిత్ర మగుఱెక్కలు గలది.

చిత్రపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. నీరుపిప్పలిచెట్టు.

చిత్రపత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కోలపొన్నచెట్టు; 2. తుమ్మిచెట్టు; 3. కస్తూరి. "ఉ. మానవతీ కపోల కుచమండలమండిత చిత్రపత్త్రికా, నూనవిశేష వాసనల..." (బ్రౌ.)

చిత్రపద. సం. వి. ఆ. స్త్రీ. 1. వృత్తవిశేషము; 2. హంసపదిచెట్టు.

చిత్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కోలపొన్నచెట్టు; 2. నీరుపిప్పలిచెట్టు; 3. మంజిష్ఠ.

చిత్రపాద. సం. వి. ఆ. స్త్రీ. గోరువంక.

చిత్రపిచ్ఛకము. సం. వి. అ. పుం. నెమలి.

చిత్రపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్దిచెట్టు.

చిత్రపృష్ఠము. సం. వి. అ. పుం. ఊరపిచ్చుక.

చిత్రఫల. సం. వి. ఆ. స్త్రీ. 1. దోసచెట్టు; 2. బుడమచెట్టు; 3. లింగదొండచెట్టు; 4. పెద్దపాపరచెట్టు; 5. ములకచెట్టు; 6. వాకుడుచెట్టు.

చిత్రఫలకము. సం. వి. అ. న. 1. మత్స్యవిశేషము; 2. చిత్తరువు వ్రాసినపలక.

చిత్రబర్హము. సం. వి. అ. పుం. నెమలి.

చిత్రభాను. సం. వి. ఉ. పుం. ఒకానొకసంవత్సరము.

చిత్రభానువు. సం. వి. ఉ. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు; భైరవుఁడు; 4. చిత్రమూలముచెట్టు; 5. జిల్లేడుచెట్టు. ద్వి. అశ్వినీకుమారులు. విణ. (ఉ.) చిత్ర మగుకాంతి గలవాఁడు.

చిత్రభేషజ. సం. వి. ఆ. స్త్రీ. కాకిమేడిచెట్టు.

చిత్రము. సం. వి. అ. పుం. 1. ఆముదపుఁజెట్టు; 2. అశోకముచెట్టు; 3. చిత్రమూలముచెట్టు. న. 1. ఆశ్చర్యము; 2. ఆలేఖ్యము; 3. కర్బురవర్ణము; 4. తిలకము; 5. ఆకాశము; 6. కుష్ఠభేదము; 7. కావ్యభేదము.

చిత్రమూలము. సం. వి. అ. పుం. ఓషధివిశేషము. హంస. ౪, ఆ. ౧౦.

చిత్రమృగము. సం. వి. అ. పుం. దుప్పి.

చిత్రమేఖలము. సం. వి. అ. పుం. నెమలి.

చిత్రయోధి. సం. వి. న్. పుం. 1. అర్జునుఁడు; 2. మద్దిచెట్టు.

చిత్రరథుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. ఒకానొకగంధర్వరాజు; 3. ఇంద్రుఁడు.

చిత్రల. సం. వి. ఆ. స్త్రీ. 1. కుందామువుచెట్టు; 2. ఆఁడుమేక.

చిత్రలత. సం. వి. ఆ. స్త్రీ. మంజిష్ఠచెట్టు.

చిత్రలేఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. చిత్తరువు. (విల్యమ్సు.); 2. ఒకానొకయప్సరస; 3. వృత్తవిశేషము.

చిత్రవాలము. సం. వి. అ. పుం. పాలపిట్ట.

చిత్రవీర్యము. సం. వి. అ. పుం. ఎఱ్ఱాముదపుఁజెట్టు.

చిత్రశిఖండిజుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి.

చిత్రశిఖండి. సం. వి. న్. పుం. నక్షత్రములలో నేడింటిలో యొకఁడు. "శ్లో. మరీచి రంగిరా అత్రిః పులస్త్యః పులహః క్రతుః. వసిష్ఠశ్చేతి సప్తైతే జ్ఞేయా శ్చిత్రశిఖండినః. (వాచ.)

చిత్రసర్పము. సం. వి. అ. పుం. ముణ్ఢుఁబాము.

చిత్రాంగద. సం. వి. ఆ. పుం. 1. ఒకానొకయప్సరస; 2. అర్జునునిభార్యలలో నొకతె.

చిత్రాంగదుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకగంధర్వుఁడు; 2. ఒకానొకచంద్రవంశపురాజు; 3. బ్రహ్మపాదమునఁ బుట్టినచిత్రగుప్తాదులు మువ్వరలో నొకఁడు.

చిత్రాంగము. సం. వి. అ. పుం. ఎఱ్ఱనిచిత్రమూలముచెట్టు. న. 1. హరిదళము; 2. ఇంగిలీకము.

చిత్రాత్మపము. సం. వి. అ. పుం. తుమ్మిచెట్టు.

చిత్రాటీరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

చిత్రాయసము. సం. వి. అ. న. ఉక్కు.

చిత్రాసనము. సం. వి. అ. న. జపముచేయునపుడు కూర్చుండుటకు ఉపయోగించు చిత్రవర్ణము గల యాసనవిశేషము.

చిత్రించు. సం. స. క్రి. చేయు. "క. పుత్రవతి వైతి వని భూపుత్త్రిక నక్కించి పేరుపునఁ బ్రసవ విధుల్, చిత్రించి మునికి మానికళత్రము తెత్తెఁగింవ పటువులం బనుచుటయుంన్." శై. ౫, ఆ.

౨౭. మార్క. 3, ఆ. ౯3; 2. చిత్రము వ్రాయు. (శ. ర.)

చిత్రిక. దే. వి. మ్రాను నునుపుచేయుటకై వడ్రంగు లుపయోగించు సాధనవిశేషము. (వా.)

చిత్రికగుల్ల = చిత్రిక. (వా.)

చిత్రికపల్లు. = చిత్రిక. "సీ. పదను దప్పక లోహపాషాణములఁ బట్టు చిత్రికపల్లు డాచేతఁ బూని." కళా. ౨, ఆ. ౨౩.

చిత్రిణి. సం. వి. ఈ. స్త్రీ. పద్మిని చిత్రిణి శంఖిని హస్తిని అను నాలుగు స్త్రీజాతులలో నొకజాతిది "శ్లో. భవతి రతిరసజ్ఞా నాతి ఖర్వా న దీర్ఘా, తిలకసుమసునాసా స్నిగ్ధనీలోత్పలాక్షీ, ఘనకఠినకుచాఢ్యా సుందరీ బద్ధశీలా, సకలగుణవిచిత్రా చిత్రిణీ చిత్రవక్త్రా". (రతిమంజరి.)

చిత్రితము. సం. విణ. (అ. ఆ. అ.) చిత్రింపఁబడినది.

చిత్రీయమాణము. విణ. (అ. ఆ. అ.) 1. ఆశ్చర్యపడుచున్నది. "క...ఆట్టివిచిత్రవధం జూచి చిత్రీయమాణచిత్తులై భీమసేనుపరాక్రమంబు వొగడుచు నందఱు..." భార. ఆది. ౬, ఆ. ౨౧౬; 2. వింత కలిగించుచున్నది. భట్టి. ౫. స. ౫౭.

చిదంబరము. సం. వి. అ. న. 1. చిదాకాశము; 2. ఒకానొకపుణ్యక్షేత్రము.

చిదక. దే. విణ. చప్పిడి, లోపల కడఁగినది. "ద్వి... జీరసరములును జిదుక, మఱ్ఱాకు మడిబోమల్ మొగి దోనికములు." బస. పు. 3, ఆ. ౧౧౧౪. పు.

చిదగోడ. దే. వి. వ్యత్యాసము. "క. మొదల నవాయం బెన్నుట, పదప నుపాయంబు లెక్కవెట్టుట తగునీ, చిదగోడలఁ గాదె ము న్నొక, ముదకొక్కెర యనుఁగు సుతుల మ్రింగిన కచ్చెన్." వేం. పంచ. ౧, ఆ. ౭౪౭; 2. గృహకలహము. (బ్రా.)

చిదమిద. దే. విణ. నలఁగినది. "సీ. కల్పాంతశిఖికల్పకాళియఫణములఁ జిదమిదగాఁ బట్టి మడమడంచె." చిత్ర. భా. ౬, ఆ. ౭౭.

చిదాత్మ. సం. వి. న్. పుం. పరమాత్మ.

చిదిమిపెట్టు. ద్వి. స. క్రి. (చిదిమి+పెట్టు.) 1. పంచిపెట్టు. "క. మృతులైనవీర లందఱు, నలవీరులు విని కెల్ల నడఁగిరి నమరావతిఁ బట్టలేమి పరసుర్ఞలు లందఱఁ జిదిమిపెట్టఁజాలరు వరుసన్." కు. సం. ౧౧, ఆ. ౧౭౦; 2. చక్కని రూపమేర్పఱుచు. "ఉ. బిడ్డయొ పాపయో చిదిమిపెట్టినకైవడి నున్న నిన్నుఁదా, సడ్డ యొనర్ప కప్పులఁ బిశాచమువంటిగరాసుఁ గూడె నీ, యెడ్డెఁడు..." శుక. ౧, ఆ. ౫౨౭; 3. అరితేఱు. "క... ఎవ్వనిఁ జాతమున్న దొంగిలు, పనికిఁ జిదిమిపెట్టినట్టిబంటులుసుమ్మీ." పరమ. ౫, ఆ. ౧౨. చిత్ర. భా. ౯, ఆ. ౧౧.

చిదియు. దే. అ. క్రి. (త. చిద్రై.) నలఁగు. "చ. చిదియవు కొండపైఁ బడిన..." హరి. ఉ. ౫, ఆ. ౨౧. "ఆ...అశనులో యనంగ నసురవరుల, శిరములోన మేను చిదిసి పోవఁగ నుచ్చి, యింటికి చంపి రిట్టు లురక కపులు." భా. రా. యు. ౧౯౬౦.

చిదుకు. దే. అ. క్రి. (క. చిదుకు.) 1. నలఁగు. "సీ... శిలఁ దృణధాన్యముల్ సిదుక నడిచి, కొందఱు... అహరింతు రొందరు..." భార. అను. ౫, ఆ. ౨౭; 2. పైపుటుకు, చిప్పిలు. "చ. పదములు కొంకుతోఁ బిసికి ప్రక్కల స్రుక్కడలించి దంశవంశదమనవృత్తి నింపొసఁగి సాస్నఖంబుల దువ్వి నెత్తురుల్, చిదికెడుగండ్ల భూరజము చిల్కి..." పాండు. ౫, ఆ. ౨3౬. వి. చిదుకుటయం దగుధ్వనికనుకరణము. (దీనియామ్రేడితరూపము చిదుకుచిదుకు. "వ...శీకరపరంపరల చోదుగులు మదుగులుగోనినఁ చిదపిదనగుచుఁ జిదుకుచిదుకు మనురొంపులును..." భాగ. ౧౦, స్క. పూ. ౭౫౬.

చిదుగు. దే. వి. సమిధ, ఎండినపుల్ల. "చ. చిదుగుల వృద్ధిఁబొందుశిఖిచెల్వున..." ఉ. రా. ౨, ఆ. ౨౭౯. ఆం. భా. ద్వి. 3౭.

చిదుపు. దే. స. క్రి. (చిదియుంధా. ప్రే.) చిదియఁజేయు. "గీ. విశ్వరూపభవద్ఘోరవిభవమహిమ, యెంతపర్విపఁ జాలు మాయామనంబు, ప్రాఁతపైచీరవలెఁగున బడుగువాఁడు, హేమకైలంబు చిదిపి తా లెన్నిమడుచు." వైష. ౭, ఆ. ౧౮౭. పరమ. ౧, ఆ. ౭౬.

చిదుము. దే స. క్రి. 1. గిల్లు. "గీ. అదరనీయక యఱ్ఱన నదమి చెక్కు, చిదిమి నెమ్మోము మోమునఁ జేర్చి..." శుక. ౧, ఆ. ౨౧౧; 2.

"చిప్పతోనఁ బడ్డచినుకు ముత్యం బాయె,నీళ్ల బడ్డ చినుకు నీళ్లఁ గలసె." వేమన. ౨, ఆ. ౧౩౬; 2. బిందువు. "సీ. ప్రాయంపుఁబడుచులఁ బనిగొంటి వే దూది యశెడుపాటలఁ దేనెచినుకు లీన." శుక. ౨, ఆ. ౪౨౧; 3. చిన్నవాన. "చ...ప్రొద్దు వోయినం,జినుకున కోర్చి యింటనె వసించుట మేలనుఁ బెక్కుభంగులన్." విప్ర. 3 ఆ. ౬౫. ఆం. భా. ప్ర. ౭౫.

చినుకుఁబూస. దే. వి. (చినుకు+పూస.) ముత్యము. "సీ. అనిదిండిజడదాకి చినుకుఁబూసల కోవ మగరాలువెన్నెలల్ తొగలజేఁడు." అచ్చ. యుం. ౫౯౨. సాం. ని. స్థా. ౬౧. వేంక. స్థా. ౦౬.

చినుకుమేఁపుడుపుల్గు. దే. వి. (చినుకు+మేపుడు+పుల్గు) చాతకము. "సీ. తనచాగ మరుమబ్బు మొనవేఁడువా రనుచినుకు మేపుడుపుల్గు వెఱకి పొదల." య. ౧, ఆ. ౫౭.

చిన్కుదారి. ద్వ. వి. (చిన్కు+దారి.) మేఘము. "గీ. అనిన నాతఁడు పల్కె నోయయ్య చిన్కు-దారిదారియనుఁగుఁగూన గోరి కూర్మి, దనరఁ, గేసరి యనుకోన మటికిపట్టు, కలికియంజన యను నది కన్నవాఁడ." అచ్చ. కిష్కిం. ౧౧. (చిన్కు-దారిదారియనుఁగుఁగూన = మేఘములకు దారి యగు నాకాశమునకుఁ బ్రియసుతుఁడు, వాయువు.)

చిన్న. దే. వి. 1. వృక్షవిశేషము. "సీ. చెలఁగుచుఁ గిలకిలల్ గులుకుకో వెలలకు నలఁతువల్ నడపుచిన్న లకునుతికి." య. ౧, ఆ. ౧౫; 2. పిల్లవాఁడు. "క. కన్నులుగలిగినఫలమా, చిన్నం గనుఁగొంటి ..." సుద. ౨, ఆ. ౧౧౫. ఆం. భా. ద్వి. ౧౧౨; 3. పిల్ల. "రగడ. పడఁతి రాతి నా పాలిటి పొన్నకు, ముడి విడె రోసము మొన్నటిచిన్నకు." కువల. 3, ఆ. ౧౨౭. విశే. 1. అల్పము. "ద్వి. ఆకడ వైష్ణవు లగువారిలోన, నాకన్న నెన్నఁ జిన్నలు లేరు గాన." ద్వి. పరమ. ౦, ఆ. ౬౨౭. పు. ౧౨. పం. ఆం. సం. మాన. ౭౦; 2. కనిష్ఠము. (శ. ర.)

చిన్నఁబుచ్చు. దే. స. క్రి. 1. న్యూనపఱచు. "సీ. చిగురుటాకులడాలుఁ జిన్నఁబుచ్చఁగఁ జాలు సాంద్రంపుఁగెంపుహస్తములు చూచి." వీ. శకుం. ౨, ఆ. ౧౪౦; 2. విఫలముచేయు. "గీ. కీర్తి నటియించి మావేడ్క చిన్నఁబుచ్చి." క్రీడా. ౯౫. "క...కులకాంతలు కోరినకోరికఁ జిన్నఁబుత్తురే బుధు లనుచున్." దశా. 3, ఆ. ౦౨; 3. నిరాకరించు. "శా. చిన్నంబుచ్చక నన్ను నేలుకొనవే..." కాళ. శ. 33.

చిన్నఁబోవు. దే. అ. క్రి. 1. ఖిన్నమగు. "గీ... నెవ్వగ మనమునఁ బికొనంగఁ, జిన్నఁబోయిన మొగముతో సింహబలుఁడు." భార. విరా. ౨, ఆ. ౫౯. దశా. ౫, ఆ. 3౨; 2. విఫలమగు. "గీ. వగవ నేటికి నేమనవచ్చు నిపుడు, చేతనావానిఁ గార్యంబు చిన్నఁబోయె." నైష. ౪, ఆ. ౯౬. కుల. ౪, ఆ ౦౦; 3. శోభాహీన మగు. "మ. అనేకా సంపద లెన్ని గల్గిన నరేంద్రా యింద్ర సంకాశనం,దనుఁ డొక్కండును లేమి నీనగరు చిన్నంబోయె..." వరాహ. ౨, ఆ. ౯౨. ఉ. హరి. ౧, ఆ. ౫౭.

చిన్నకన్నువడు. ద్వ. అ. క్రి. (చిన్న+కన్ను+పడు.) మ్రాఁగన్నగు, సోలినకన్నుగలుగు. "చ. తొలఁగవు చిన్నకన్నువడి దుప్పులు చప్పుడు గాక యుండ..." సాంబో. ౨, ఆ. ౧౦౦.

చిన్నకారు. దే. వి. (చిన్న+కారు.) బాల్యము. (బ్రౌ.)

చిన్నచూపు. దే. వి. లఘుభావము, అగౌరవము. (వా.)

చిన్నతనము. దే. వి. (చిన్న+తనము.) 1. బాల్యము; 2. అల్పత్వము. "ఉ... మోవిజిగి చిన్నతనంబు వహించె..." జాహ్నవీ. ౪, ఆ. ౫౫; 3. లాఘవము, అగౌరవము. "లయగ్రాహి. చిన్నతన మేర్పడఁగఁ గన్నియలకున్ వలచి నన్ను మఱవం దగునె..." వీర. ౨, ఆ. ౨౧; 4. శోభాహీనత. "చ...అసంస్కృతాంగియై,జిగి విడనాడుకాక నల చిన్నతనంబు వహించు నెచ్చెలిన్." కాళిందీ. ౨, ఆ. ౧౭౫.

చిన్నది. విశే. (చిన్న+అది) చిన్నదైనది. పాండు. ౨, ఆ. ౯౧. వి. బాలిక (శ. ర.)

చిన్నటనాఁడు. దే. వి. ఔ. (చిన్నటు+నాఁడు. శ. ర.) బాల్యము. "ఉ. చిన్నటనాఁటనుండియును

జెల్వాతుఁ గూర్చినదాన వౌట..." వసు. ౪, ఆ. ౧౦౬.

చిన్ననాఁడు = చిన్నటనాఁడు. "క. ఎలదోఁట తీఁగె యుయ్యేల,కలకంఠికిఁ జిన్ననాఁటికత లెత్తి తోఁచెన్." శివరా. ౨, ఆ. ౪౬. ఉ. ౨, ఆ. ౨౯.

చిన్నపడుచు. దే. వి. (చిన్న+పడుచు.) బాలిక. వేంక. మాన. ౨౮.

చిన్నము. దే. వి. 1. నాలుగుగురిగింజలయెత్తు గలబంగారునాణెము. (శ. ర. పరహాలో నెనిమిదవవంతువిలువ గలనాణెము. బ్రౌ.) "చ. ముని ఋణ మేగతిఁ దీర్చెద ర్రొక్క చిన్నము న్జనపతి చేఁ లేదు..." హరిశ్చ 3. ఆ. ౧౫౭; 2. బంగారము. "సీ. చిన్నంబుచే కొడిచే నుక్కు లేదు... దశ. ౯. ఆ. ౭; 3. నాల్గు గురిగెందగింజల యెత్తు. "గీ. చిన్ననాఁడొను బ్రిగము నొకటి ప్రమంత మాట యాడిన విని తావమన్న వకడు." కళా. ౪. ఆ. ౧౨౮. (చిన్న మంత = కొంచెము అని భావము.) "క. చిన్న ములుఁ బాలికెలఁ బలె..." సాంబో. ౫, ఆ. ౯.

చిన్నరి. దే. విణ. సుందరము. "ఉ. చెన్నగుజాలవాయెళ్వుచిన్నరికెంపులమెట్టు..." చంద్రా. ౨, ఆ. ౯౫.

చిన్నరిపొన్నరి. దే. విణ. (చిన్నరి+పొన్నరి.) ముద్దులొలుకునది. ఆం. భా. తృ. ౪౬.

చిన్నతనము. దే. వి. (చిన్న+తనము.) బాల్యము. ఆం. భా. ద్వి. ౧౧౭.

చిన్నవాఁడు. దే. వి. (చిన్న+వాఁడు.) బాలుఁడు. "గీ. సకలవిద్యలలోపల సారమైన, విద్యయొక్కటి వినుటకు వేడ్క యయ్యెఁ,గాన నను జిన్నవాఁడని గడుపు కిపుడు,పన్యసింపు మటన్న నప్పద్మభవుఁడు." చెన్న. ౧, ఆ. 3౨. విణ. చిన్నదైన వాఁడు. (శ. ర.)

చిన్నారి. దే. విణ. 1. మనోహరము. "ఉ. వారణలేక హాస్తిగిరిపల్లభుసేవకు వచ్చి పోవుచిన్నారిమిటారు లీపురమునం గలరు..." వేం. పంచ. ౪, ఆ. ౪౫౯. ఉ. హరిశ్చ. ౨, అ. ౫౫; 2. అల్పము. "ద్వి. చన్నుఁగొండల వ్రేఁగు సైరింపలేక, చిన్నారికౌఁదీఁగ జివ్వాడుచుండ." ద్వి. పరమ. ౪, ఆ. ౭౯౧. పు. ౧. పం.

చిన్నారిపొన్నారి. దే. విణ. (చిన్నారి+పొన్నారి.) 1. మనోహరము, ముద్దయినది. "సీ. చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర." కాశీ. ౧, ఆ. ౭. ఆం. భా. తృ. ౪౬; 2. చిన్నది. "సీ. చిన్నారి పొన్నారి శిశిరాంశుఁ దలఁ దాల్చి కొనగోటిజత వేడికొడమఁ బూని." హర. ౫, ఆ. ౫౭. చిత్రభా. ౪, ఆ. ౧౧౫.

చిన్ని. దే. వి. 1. ఎండఁబెట్టి తేనెమున్నగువానిలో నైచినమామిడిముక్క. (వా.); 2. ఒకానొకచెట్టు. ఉదా:...చిన్నిపువ్వుఁదేనె. విణ. ఇది సమాసపూర్వపదముగనే కన్పట్టుచున్నది. 1. చిన్నది. "సీ. అలంతిలే-జెమటచే నసలుకొన్నలలాట కుంకుమంబునఁ జిన్నికురులు మునుఁగ." కాశీ. ౧, ఆ. 3. "సీ...చిన్నిజాబిల్లిచే సిందూరతిలకంబు చెమ్మగిల్ల." స్వా. ౧, ఆ. ౫; 2. మనోహరము. "గీ. అనుచుఁ గొనియాడి తిలకించి యావధూటి, చిన్నిలేనవ్వుచెక్కులఁ జిరువాఱ, సిగ్గు నెగ్గించుమధురోక్తి చెవులఁ జిలికి..." విక్ర. ౭, ఆ. ౨౮. స్వా. ౨, ఆ. ౪3.

చిన్నిచుక్కలు. దే. వి. బ. (చిన్ని+చుక్కలు.) ధాన్యవిశేషము. ప్రబంధ ౧౧౨.

చిన్నిదము. దే. వి. 1. చిన్నిపువ్వు; 2. బంగారు. (శ. ర. బ్రౌ.)

చిన్నినవ్వు. (చిన్ని+నవ్వు.) మందహాసము. "సీ. చిప్పకూఁకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జెలివిన మంచిపించియమువాని." పాండు. ౧, ఆ. ౨౧3. కావ్యా. ౧, ఆ. ౨౧.

చిన్నిపువ్వు. ద్వ. వి. 1. నమస్కారవిశేషము. "రగడ. అష్టభుజస్థలి నష్టభుజునకుఁ జిత్తము రంజిల్లఁ జిన్నిపువ్వు లని." హంస. ౪, అ. ౨౧3. ఆం. భా. ద్వి. ౧౭౫. వేంక. మాన. ౪౭; 2. కుంకుమకర్పూరాదిచూర్ణము. (భూషణవిశేష మని శ. ర. బ్రౌ.) "సీ. తురగఖురోద్ధూతధూళి యప్పరసలచిన్నిపువ్వులతోడఁ జెలిమిసేయ." భార. భీష్మ. ౧, ఆ. ౧౦౪. కు. సం. ౯, ఆ. ౧౨౬. కాశీ. ౭, ఆ. ౧౪౭.

చిన్నిభ్రూజేకు. ద్వ. వి. (చిన్ని+భ్రూ+జేకు.) అలంకారవిశేషము. "వ...అంగనలు ముత్యాలజిల్లి చెందిరంపుఁజేరుచుక్క చిన్నిభ్రూజేకులు... ఆదిగాఁ గలయలంకారంబుల నలంకరించిరి." జై, ఆ. ౪౪.

చిన్నియ = చిన్నె. (శ. ర.)

చిన్నె. వై. వి. (సం. చిహ్నమ్. ప్రా. చిణ్హమ్. క. చిన్నె.) 1. గుఱుతు. "సీ. వెన్నెలసోఁగ కీచిన్నె లున్నవె యిది మరునిరాచిల్కసాంబ్రాణి యేమొ." ఉ. రా. ౪, ఆ. ౧౯౯. "ఆ. కొలము గొనము రూపు గలుగక యుండు నీ,కిట్టిరాచ చిన్నె లేల యిపుడు." అచ్చ. యు. ౨౫౭; 2. విలాసచేష్ట. "ఉ. చిన్నెలు దక్కియుండె నఖి చేసినజంత్రపుబొమ్మకై వడిన్." అని. ౨, ఆ. ౧౩౨. నీలా. ౨, ఆ. ౯౨.

చిన్నెలాఁడి. ద్వ.,విణ. (చిన్నెలు+ఆఁడి.) విలాసవతి. (శ. ర.)

చిన్నెలాఁడు. ద్వ. విణ. (చిన్నెలు+ఆఁడు;) విలాసవంతుఁడు. (శ. ర.)

చిపిటకము. సం. వి. అ. పుం. పృథుకము, అటుకులు.

చిపిటము. సం. వి. అ. పు. అటుకులు. విణ. (త్రి. ఆ. అ.) చప్పటముక్కు గలది.

చిపుటము. సం. = చిపిటకము.

చిప్ప. వై. వి. (సం. శుక్తిః. ప్రా. సిప్పీ. క. చిప్పు. త. చిప్పి.) 1. నత్త మున్నగుకొన్ని జలజంతువులపై నుండు పెంకు, కప్పచిప్ప. "ద్వి. చిప్పలుగుల్లలుఁ జిక్కంగఁ దన్ను, నిప్పడ ధూళిగా నింకించువాఁడు." రం. రా. యు. ౩౦౨. ౭౯. పం; 2. కల్లు మొదలగునవి త్రాగుట కుపయోగించు పాత్రము. "క...కనకపుఁజిప్పల నిండించి మదము చిప్పిలుచుండన్. ఉ. అందఱుఁ గైకొనం బనిచి యాదటఁ గాంతయుఁ దాను నొక్కకో,రం దనుపార దివ్యమదిరామధురామృతపానకేళి యం, దంద యొనర్పఁగాఁ దొడఁగె..." నృసిం. 3, ఆ. ౯౩, ౯౪. పారి. ౨, ఆ. ౫౨; 3. ముత్తెపుఁజిప్ప. "సీ. ఏవీటిసతులపాలిండ్లపై గంబూర నవహారములచిప్పకవుచు మాన్చు." ఆము. ౨, ఆ. 3; 4. చిప్పయాకారముగా నుండుశరీరమందలి యెముక. "క. పఱచు నొకకడిలిఁ బలిమికుఁ జెఱమలకై యేయఁ జిప్ప చిసుఁగఁగ నది యుఁ,క్కఱఁ గాడి పాఱె..." స్వా. ౪, ఆ. ౪౫. భాగ. ౯, స్కం. ౫౫; 5. తాఁబేటివీఁపు చిప్ప. "సీ. తలచూప లేక చిప్పలు పూని వంకల మెలఁగెడితామేటిమేలి నవ్వి." అచ్చ. బాల. ౪౬. సా. ౪, ఆ. ౩౧; 6. (బ్రహ్మాండము యొక్క.) అర్ధభాగము. "క. ఉప్పర మెగసి యజాండము, చిప్పలు రాలంగ. ." కాశీ. ౧, ఆ. ౧౧౨; 7. కాయ మున్నగువానిచిప్ప; ఉదా: కొబ్బరచిప్ప. గరిఁటె. "ఉ...సుధారసము చిప్పెకువోయక మున్న..." హర. ౬, ఆ. ౧౭౨; 8. ముక్క, శకలము. "ద్వి. అప్పు డాకపిసేనయంగంబు లెల్లఁ,జిప్పలు చిద్రుపలై చెదరంగఁ జూచి." రం. రా. యు. ౩౫౯. పు; 9. తలపుత్తె. (శ. ర.); 10. చేఁపలదేహము మీఁదిపొలుసు. "గీ. అడుగునడుగునఁ బొడము చిహ్నంపుమీల, మేని చిప్పలువోలె..." పాండు. 3, ఆ. ౧౬౭; 10. తృణవిశేషము, చిప్పవలె ఆవరించినదుబ్బు గలగడ్డి. "సీ...చిప్పర చిప్పనా భూస్తృణ మొప్పు." ఆం. భా. ద్వి. ౭౬. విణ. అల్పము. (శ. ర.)

చిప్పకత్తి. దే. వి. (చిప్ప+కత్తి.) చెట్లకొమ్మలు మున్నగునవి నఱుకెడు మోటకత్తి. "ఉ. చెల్లవు చిప్పకత్తుల నశింపవు ప్రేకపుబాఁకుతాఁకులన్." చంద్ర. ౨, ఆ. ౨౦.

చిప్పకసవు. ద్వ. వి. (చిప్ప+కసవు.) భూస్తృణము, చిప్పగడ్డి. (శ. ర. బ్రౌ.)

చిప్పకూఁకటి. ద్వ. వి. (చిప్ప+కూఁకటి.) పిల్లజుట్టు. "ద్వి. కదలెడిచిప్పకూఁకటిగలవాఁడు." రం. రా. బాల. ౨౨. ౧౯. పం. చం. రా. ౨, ఆ. ౬౧.

చిప్పగడ్డి = చిప్పకసవు. (శ. ర. బ్రౌ.)

చిప్పగుద్దలి = చిప్పగొడ్డలి. (శ. ర. బ్రౌ.)

చిప్పగొడ్డలి. ద్వ. వి. (చిప్ప+గొడ్డలి.) వెడల్పైన ఆరు గలగొడ్డలి. "సీ. ఖండపోఁగులు చిప్పగొడ్డండ్లు నెలగోలలు..." నీలా. 3, ఆ. ౪౯.

చిప్పచిప్పగోడ్లు. వి. బ. బాల్యక్రీడావిశేషము.

చిప్పతిల్లు = చిప్పిల్లు. (స్రవించు, కాఱు.) "సీ... చెమటచిత్తడిసోన చిప్పతిలఁగ. విక్ర. ౧, ఆ. ౧౨౨.

చిప్పెణక. దే. వి. (చిప్ప+పెణక.) ఇంటిపార్శ్వ మలకప్పు. (శ. ర. బ్రా.)

చిప్పము. దే. వి. పెద్దమూట. (శ. ర. చిన్నమూట అని బ్రా.)

చిప్పముత్తెము. దే. వి. (త. చిప్పముత్తు.) చేసిన ముత్తెము. "సీ...మౌక్తిక మొప్పు...గీ. చిప్ప ముత్తెం బటం చ్రదే చేయఁబడిన." ఆం. భా. ౨౭౬.

చిప్పమూతి. దే. వి. (చిప్ప+మూతి.) చిప్పవలె నుండుమూతి. (శ. ర.)

చిప్పయమ్ము. దే. వి. (చిప్ప+అమ్ము.) వెడల్పు గల బాణము. "చ...తుంచెఁ జిప్పయమ్ములనవి... విజయుండు..." భార. అశ్వ. ౪, ఆ. ౮.

చిప్పర. దే. వి. చిప్పిగడ్డి. "క...పొలుపుగఁ జిప్ప రలు గవిసె భూతల మెల్లన్." 'చిప్పరువు' (వావిళ్ల పా.) కు. సం. ౬, ఆ. ౧౦౦. ఆం. భా. ద్వి. ౭౬.

చిప్పిల్లు = చిప్పతిల్లు. దే. అ. క్రి. 1. కాఱు, స్రవించు. "క. అప్పుడు పదిపదియమ్ములఁదప్పక యాదవుల బ్రహ్మాదత్తకుమారుల్, నొప్పింప రుధి రధారలు, చిప్పిల్లనివారు లేరు..." ఉ. హరి. ౪, ఆ. ౨౭౭; 2. కలుగు, పుట్టు. "క...నలు వకుఁ జెప్పిన నతఁ డాగ్రహంబు చిప్పిలుమది లోన్." వరాహ. ౬, ఆ. ౭౨; 3. చిమ్ము, పైకి వచ్చు. "ఉ...చిప్పిలి వేడినెత్తురులు జేగురు టేరులు కొండనుండి జాఱుచొప్పునఁ గాఱ..." కాళ. ౨, ఆ. ౫౬. రాజ. చ. ౧, ఆ. ౮.

చిప్పె. వై. వి. (సం. శిల్పి. త. ఛిప్పి.) బట్టలు కుట్టువాఁడు. "గీ. చిప్పె యనఁగను విలసిల్లు చిప్పెవాఁడు." ఆం. భా. ద్వి. ౨౮౨.

చిప్పెవాఁడు = చిప్పె. ఆం. భా. ద్వి. ౨౮౨.

చిబుకము. సం. వి. అ. న. గడ్డము.

చిబుకు. దే. స. క్రి. చప్పరించు. "సీ. కోమలతర పదాంగుష్ఠంబు చిబుకుచు..." జై. ౮, ఆ. ౧౩.

చిమచిమ. దే. వి. 1. పుండు గాయము మున్నగునది మండుట. "క...మోవికాటుచిమ చిమ..." పాంచాలీ. ౫, ఆ. ౩౨; 2. మండుటయందగు ననుకరణము. "సీ. మొలవపంట మొలసి నొక్కిన నొక్కచేఁ గొంపుటధరంబు చిమచిమ యనిన యట్టు." అని. ౨, ఆ. ౭౧.

చిమచిమలాడు. దే. అ. క్రి. (చిమచిమలు+ఆడు.) చిమచిమ కలుగు. (వా) తేలు కుట్టినచోట చిమ చిమలాడుచున్నది.

చిమట. దే. వి. (క. చిమట. త. చిమిట్టా.) 1. తండ సము, మంగలవాఁడు వెంట్రుకలను బీకుసాధన విశేషము. "గీ. చిమటవలె మీసములకప్పుఁ జెంత కురులు." దశా. ౭, ఆ. ౧, ఆ. ౨౨౫; 2. కత్తి మొదలగువానిపిడికొన. "సీ. పరుఁజులోపలఁ జీల పట్టించునలుగువా యమరుప యోగ్య మైనట్టి తావు, మొసలికా టనఁగను మొసలివా యనఁ గను జిమట యనంగను జెలఁగుచుండు." ఆం. భా. ద్వి. ౨౧౬; 3. చిమ్మట ఈలపురుగు. (శ. ర. బ్రా.)

చిమి. సం. వి. ఇ. పుం. చిలుక.

చిమిడిక. దే. వి. చిమిడిపోయినయన్నము. "గీ. చిమి డిక యనంగ...చెలఁగుచుండు నధికపక్వాన్నము ..." ఆం. భా. ద్వి. ౨౫౭.

చిమిడిపడు. ద్వి. అ. క్రి. (చిమిడి+పడు స్వార్థ మున.) బాధపడు, తపించు. "క. ఉడురాజ నీవు పొడిచిన, జడనిధి యందు కెక్కె వెక్కసంబునఁ బొంగున్, బడబాగ్ని మీఱి నావుడుఁ, బడఁతుక నీవేఁడిఁ జిమిడిపడ కెట్లుండున్." ద్వా. ౫, ఆ. ౧౪౨.

చిముటాలు. దే. వి. బ. (క. చిముటి.) క్షౌరమప్పుడు తండసముతో వెండ్రుక లూడఁదీయుట. (శ.ర.)

చిముటు. దే. స. క్రి. (క. చిముటు.) సైఁగచేయుం టకై కన్ను మూసితెఱచుట. (శ. ర.)

చిముడు. దే. అ. క్రి. 1. ఉడికిపోవు; అన్నాదులు అమితముగా నుడికి ముద్దయగు. "ద్వి. కమరి పువ్వులు మ్రందగాఁ జిప్పరనుచుఁ, జిమిడి కాయలు నేలఁ జిటపొట రాల." ద్వి. హరిశ్చ. పూ. ౨౨౩౬. పం. "వ...చిముడ నుడికిన వెలుప రించి..." స్వా. ౪, ఆ. ౬౦; 2. కాలు, తప్త మగు. "సీ. పట్టఁజాలనిచూపు లట్టిట్టు పఱచుచోఁ జిటజిట నడలెల్లఁ జిమిడి మండు." సావి. ౧, ఆ. ౧౦౫; 3. (నిర్వాహాదులచే) బాధపడు. (చూ. చిమిడిపడు.)

చిముడుచేయు. దే. స. క్రి. (చిముడు. ధా. ప్రే.) తప్తము గావించు. చిముడఁజేయుం, "చ... అజాండ మంతయుఁన్, జిమిడి చెడన్..." రామా. ౭, ఆ. ౩౬. (రూ. చిముడ్చు.)

చిమ్మ. దే. వి. జలకణసమూహము. "మ...లోచన గోళంబులఁ జిమ్మలై చిలుపలై...బాష్పాంబుపూరంబులుప్పతిలె..." స్వా. ౩, ఆ. ౧౩౬.

చిమ్మఁజీకటి. దే. వి. (చిమ్మ+చీకటి.) 1. గాఢాంధకారము. "శా...సంసారపుం,జిమ్మంజీకటి కప్పి నన్ గడపు నన్ శ్రీకాళహస్తీశ్వరా." కాళ. శ. ౨౭; 2. చిన్నచీకటి. 'సీ...చిమ్మజీకటి మునిచీకటి ముఱి. గీ. చీకటి మసక ముఱిముఱి చీకటి యన,నవతమసనామధేయమై యలరుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౬.

చిమ్మట. దే. వి. ఈలపురుగు, ఝిల్లి. "గీ...చిమ్మట యనఁగ ఝిల్లి, దనరు..." ఆం. భా. ద్వి. ౯౫; 2. తండసము, మంగలవానిపనిముట్టు. "సీ...కేశోత్పాటి తండస మనఁగను జిమ్మట యనఁగను జెలఁగుచుండు." ఆం. భా. ద్వి. ౩౦౧.

చిమ్మటతార. దే. వి. (చిమ్మట+తార) సుషిరవాద్యవిశేషము, ఊదెడునొకానొకవాద్యము. "సీ. తారలు చిమ్మటతారలు శంఖముల్ కాహాళాల్ పసిఁడిఢక్కలును బిడులు." మొ. రా. యు. ౩, ఆ. ౨౬.

చిమ్మదిరుగు. అ. క్రి. (చిమ్మ+తిరుగు.) గిరగిరఁ దిరుగు. "గీ. చిమ్మదిరుగుచు నిలువక శిరము వ్రాల." భాగ. ౧౦, స్కం. పూ. ౨౨౫.

చిమ్మచీకటి = చిమ్మఁజీకటి. "క. క్రొమ్మెఱుఁగుల దగదగరుచి, చిమ్మనచీకటుల విరియఁజేసిన..." విప్ర. ౩, ఆ. ౭౧.

చిమ్మనగ్రోవి. దే. వి. (చిమ్మన+క్రోవి.) 1. జలక్రీడయందు నీళ్లు చిమ్మెడిగొట్టము, శృంగము. "సీ. చిమ్మనగ్రోవి నా శృంగ మా..." ఆం. భా. ద్వి. ౧౭౭. "ఉ...వేలఁపుటేటిపయిం గుతూహాల,శ్రీలమరు న్నదీవిభుఁడు చిమ్మెడిచిమ్మగ్రోవినీరనన్." కళా. ౪, ఆ. ౧౯౪; 2. బాల్యక్రీడావిశేషము. (ఈయర్థమున నిది బహువచనాంతము) "సీ...బంతులు చిమ్మనగ్రోవులు..." హంస. ౩, ఆ. ౧౪౬.

చిమ్మనపుఁగ్రోవి = చిమ్మనగ్రోవి. "గీ. చారుతరనాభియనెడుగంభీర సరసిఁ, గడఁగి క్రీడించుమరుని శృంగారరసపుఁ, జిమ్మనపుఁ గ్రోవిధార నాఁ జెన్నుమీఱు." ప్రభా. ౨, ఆ. ౮౧.

చిమ్మనచిల్లలు = చిమ్ముచిల్లలు. (చిమ్మనము+చిల్లలు.) "ద్వి. చిమ్మనచిల్లలు చిఱుతనగోల, బొమ్మతమ్ములు సూత్రములు కందుకములు." ద్వి. భాగ. ౧౦. స్కం. (శ. ర.)

చిమ్మనము. దే. వి. చిమ్ముట, విక్షేపించుట. (చూ. చిమ్మనపుఁగ్రోవి.)

చిమ్మిట=చిమ్మట. (వా. చిమ్మటలు ఎక్కువగా నున్నవి.)

చిమ్మిలి. ఆం. వి 1. పొగగూడు, పొగగొట్టము; 2. లాంతరుమున్నగువానికి పెట్టెడుగాజుగొట్టము.

చిమ్మిరి = చిమ్మిలి. (జా.)

చిమ్మిరేఁగు. దే. అ. క్రి. (చిమ్మి+రేఁగు.) 1. మిక్కిలి విజృంభించు. "వ...ఇత్తెఱంగున సుగ్రీవుండు మూర్ఛిల్లిన నుల్లంబుల ఖేద క్రోధంబులు గ్రమ్మం జిమ్మిరేఁగి..." రామా. ౭, ఆ. ౯౩. "చ...కాలువవెంటఁ బూచుమల్లికలవలం బనం బుగ నలిప్రకరధ్వని చిమ్మిరేఁగ..." స్వా. ౨, ఆ. ౨౧; 2. అతిశయించు, ఒప్పు. "ఉ. చెప్పఁదొడంగెఁ దేనియలు చిల్కఁగ ద్రాక్షలు రాలఁ గప్రపుం, దిప్పలు చిమ్మిరేఁగ..." హంస. ౧, ఆ. ౩౪; 3. భయము మున్నగువానిచే చెదరు. "శా...చూపులు చిమ్మిరేఁగి విరోలంబాళిఁ గల్పింప..." స్వా. ౪, ఆ. ౯౮.

చిమ్మిలి. దే. వి. బెల్లమును నూలపప్పును గలిపి దంచి చేసినముద్ద. "గీ. ప్రేమ మీఱంగ లతకూనపేరఁటాండ్రు, కొమరుక్రొవ్విరివెండిపళ్లెములఁ దేఁటి, యలఁతి చిమ్మిలివాయన మందుకొనఁగఁ, బ్రథమ ఋతువయ్యె..." దశా. ౭, ఆ. ౩౫౨. "సీ. చిలుకునూనియలఁ జిమ్మిలిముద్దయునుబోలె..." సాంబో. ౪, ఆ. ౮౮.

చిమ్ము. దే. స. క్రి. (క. చిమ్ము. త. చింబు.) 1. చల్లు, విక్షేపముచేయు. "వ...అచ్చరలు చిమ్మినఁ గ్రమ్ముకుసుంభాంభఃపూరంబులును..." భీమ. ౫, ఆ. ౧౭౯. ద్వి. హరిశ్చ. పూ. ౪౯౪. పం; 2. సమ్మార్జనము చేయు,చీపురు మున్నగువానిచే తుడుచు. (శ. ర.); 3. పడలఁగొట్టు, తోలు.

"ఉ...ఓషధిం,బమ్ముసమీపదేశమునఁ బాయక యాడెడి తేటిఁ గేళిపద్మమున మాటిమాటికి సమంచితవిభ్రమలోలదృష్టియై, యమ్మదిరాక్షి చిమ్ము..." పార. ౭, ఆ. ౭౧; 4. కొట్టు, తాడించు. "సీ. చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగనీటఁ గాలభైరవు నొక్కకలువకంటి." భీమ. ౫, ఆ. ౧౧౩; 5. పొడుచు. "సీ. క్రొవ్వాఁడికొమ్ముల కొనలఁ జిమ్మిన వలాహకసమూహము వకావకలు గాఁగ." అని. ౪, ఆ. ౪౫. స్వా. ౪, ఆ. ౪ ; 6. విసరు, వైచు. "ఉ. చేరి మనోజధీవరునిచేత భవాంబుధిలోన సంగసా,కారముఁ బూని యున్న పెనుగాలము చిమ్మఁగ నయ్యె..." భర్తృ. ౨, శ. ౫౨; 7. ప్రయోగించు, వేయు. "మ... పెడంద నెఱితూపుల్ సింగిణిం గూర్చి వా,విరి నార్వుల్ నిగుడంగ రాకొమరుపై వే చిమ్మి నొప్పింప..." అచ్చ. యు. ౩౪౪; 8. మీటు, సులువుగా నెట్టు. "క...రాఘవుఁ డంగుష్ఠమ్మున ...దుందుభిఘనకాయమ్ముల్ ...చిమ్మెన్." భా. రా. కిష్కిం. ౧౬౪. వి. 1. పోటు. "మ. రదఘాతోత్థితరాజతాచలరజోవ్రాతంబు నిండారుకా, మదియై దిక్కులఁ బిక్కటిల్లఁ దనకొమ్ముంజిమ్ము లన్ పీడు వెల్ల దివిన్ జందురుఁడై వెలుఁగ..." భోజసుతా. ౧, ఆ. ౭; 2. త్రిప్పు. "ఉ... మరుచేచిగురాకడిదమ్ము చిమ్ములన్..." భాగ. ౯, స్కం. ౩౯౦; 3. మీటుట, చిట్టించుట. "సీ. గోటిచిమ్ములు తెచ్చికోలునివ్వెఱ లేనివెఱపును నెచ్చెలివెన్నుచఱపు." శుక. ౨, ఆ. ౪౩౩.

చిమ్ముడు. దే. వి. చిమ్ముట, విక్షేపము. (శ. ర.)

చిమ్ముబిల్లలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. చీకటిమొటికల్లు చిమ్ముబిల్లలు నెట్టుబొట్టనఁగోలలు బొమ్మరాలు." వి. పు. ౭, ఆ. ౨౦౨.

చిమ్ముతాయి. దే. వి. (చిమ్ము+తాయి.) బాలక్రీడావిశేషము. "సీ. చెఱకులపందెముల్ చిమ్ముతాయి ...గీ...అకట యగచాట్లపాలైతి నాడి కొనుచు." హంస. ౩, ఆ. ౧౪౯.

చిమ్ములాట. దే. వి. (చిమ్ములాడు ధా.) చిమ్ములాడుట, ఒకరిమీఁద నొకరు నీళ్లు చిమ్ముకొనుట. (శ. ర.)

చిమ్ములాడు. దే. స. క్రి. (చిమ్ములు+ఆడు.) చల్లులాడు; ఒకరిమీఁద నొకరు చిమ్ముకొను. "సీ. చిమ్మిన గ్రోవులఁ జిమ్ములాడుచు..." పరమ. ౪, ఆ. ౧౦౭. [౧౩౧.

చియ్య. దే. వి. కండ, మాంసము. ఆం. భా. ద్వి.

చిరంజీవి. సం. విణ. (న్. నీ. న్.) వాత్సల్యముగల పుత్రులు మొ. వారియెడనుపయోగించునది. "గీ. మనచిరంజీవికి వివాహ మొనరఁ జేయవలయు..." ఇందు. ౫, ఆ. ౧౭.

చిరంజీవుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చిరకాలము జీవించువాఁడు.

చిరంటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఐదువరాలు, సువాసిని; 2. జవరాలు.

చిరంతనము. సం. విణ. (అ. ఆ. ఆ.) ప్రాఁతది, చిరకాలమునుండి యున్నది.

చిరకారి. సం. విణ. (న్. ణీ. న్.) దీర్ఘసూత్రుఁడు, తామసించి పని సలుపువాఁడు.

చిరకాలము. సం. వి. అ. పుం. చాలకాలము.

చిరజీవకము. సం. వి. అ. పుం. వేఁగిసచె. విణ. (అ. వికా. అ.) చాలకాలము జీవించునది.

చిరజీవి. సం. వి. న్. పుం. 1. కాకి; 2. వేఁగిసచె; 3. బూరుగుచెట్టు; 4. విష్ణుమూర్తి; 5. మార్కండేయుఁడు. (ఈచిరజీవు లేఁడుగురు. 1. అశ్వత్థామ; 2. బలి; 3. వ్యాసుఁడు; 4. హనుమంతుఁడు; 5. విభీషణుఁడు; 6. కృపాచార్యులు; 7. పరశురాముఁడు.) విణ. = చిరంజీవి.

చిరజీవిక. సం. వి. ఆ. స్త్రీ. చిరకాలము జీవించుట.

చిరతిక్తము. సం. వి. అ. పుం. భూనింబము, నేలవేముచె.

చిరత్నము. సం. విణ. (అ. ఆ. అ.) = చిరంతనము.

చిరపాకి. సం. వి. న్. పుం. వెలఁగచె.

చిరపుష్పము. సం. వి. అ. పుం. చాలకాలముపరిమళించుపూలుగలది—పొగడచె.

చిరప్రసూత సం. = చిరసూత.

చిరబిల్వము. సం. = చిరిబిల్వము. (కల్ప.)

చిరచిర. దే. వి. భేదము. "సీ...చెలిమి వేర్పాటను జిరమరలకుఁ,జొరక..." భార. శాం. ౧, ఆ. ౫౪.

చిరము. సం. వి. అ. న. దీర్ఘకాలము, బహుకాలము అవ్య. వా. బహుకాలము. (ఉదా. చిరంజీవి.) "వ. చిరముగ బ్రహ్మాకుం దపము సేసి..." భార.

ఆది. ౭, ఆ. ౧౭౮. విశే. (అ. ఆ. అ.) చాల కాలమువఱకు నుండునది.

చిరసూత. సం. అ. ఆ. స్త్రీ. చిరకాలముక్రిందట నీనిన గోవు.

చిరాకు. దే. వి. కోపము. "పంచచామరము. చిరాకు మీఱ దట్టమైనసింగిణీలకోరుఁన్." కృష్ణ. 3, ఆ. 3౦.

చిరాటిక. సం. వి. ఆ. స్త్రీ. తెల్లగలిజేరుచెట్టు.

చిరాయువు. సం. వి. స్. పుం. వేలుపు, దేవుఁడు. విశే. (స్) దీర్ఘాయుర్దాయము గలవాఁడు.

చిరి. సం. వి. ఇ. పుం. 1. చిలుక; 2. అగ్ని.

చిరివి. దే. వి. తైలమార్జకము. ఆం. భా. ద్వి. ౭౪3.

చిరిబిల్వము. సం. వి. అ. పుం. కానుగుచెట్టు.

చిరిమిడి. దే. వి. భక్ష్యవిశేషము. "వ...వడ లామ వడ లొబ్బట్లు...చిరిమిట్లు..." హంస. ౧, ఆ. ౧౦౯.

చిరుఁగు = చినుఁగు. 1. (చలు). "గీ. నరపతులకీర్తి పటములు చిరుఁగకుండ." హరి. ౪, ఆ. ౭; 2. కన్నములుపడు. "సీ. చిలుకపోటులచేతఁ జిరిఁగిన సహకారఫలములఁ దొరఁగెడిపచ్చితేనె." పాండు. ౧, ఆ. ౧౧౮; 3. వీడు. "చ...చిరిఁగినసిగ్గులున్ గలిగి..." పాండు. 3, ఆ. ౬౯. వి. రంధ్రము, కన్నము. (వ్యవః—మూఁట చిరుఁగులోనుండి బియ్యము కాఱుచున్నది.

చిరుఁగుడు. దే. వి. చర్మవ్యాధివిశేషము. ఆం. భా. ద్వి. ౧౭౮.

చిరుగడము. దే. వి. తీయకంద, ఒకజాతిదుంప. ఆం. భా. ద్వి. ౭౭.

చిరుతలు. దే. వి. బ. మిఱుమిట్లు. (చూ. చిరుతలు కవియు.)

చిరుతలుకవియు. దే. అ. క్రి. (చిరుతలు+కవియు.) మిఱుమిట్లుగొను. "ద్వి. కుమారాపటునిఁ గనుఁ గొని సభాసదులు, కనుఁగవల్ చిరుతలుకవియఁగఁ దిరుగ." ద్వి. భాగ. ౮, స్కం. (శ. ర.)

చిరుతలుక్రమ్ము = చిరుతలుకవియు. (శ. ర.)

చిరుతలువాఱు = చిఱుతలుకవియు. (శ. ర.)

చిరునామా. వై. వి. (హిం. సర్నామా) జాబుల మీఁదను వ్రాయుపేరు మొదలగునది. విలాసము. (శ. ర. బ్రౌ. వా.)

చిరువడము = చిరుగడము. "క. అరుదుగ నపు డొక్కొకయెడ, మరకతమణిపాత్ర గగనమండల మయ్యెన్, చిరువడముల పాకము శశ,ధరుఁ డయ్యెన్..." నైష. ౬, ఆ. ౧౧3. ఆం. భా. ద్వి. ౭౭.

చిరువు. సం. వి. ఉ. పుం. బాహుసంధి.

చిర్నవ్వు = చిఱునవ్వు. (శ. ర.)

చిర్భటము. సం. వి. అ. పుం. నక్కదోసచెట్టు.

చిఱ. దే. వి. కోపము. (శ. ర.)

చిఱచిఱ. దే. వి. కోపప్రకటనయం దగుధ్వని కనుకరణము. (చూ. చిఱచిఱలాడు.)

చిఱచిఱలాడు. దే. అ. క్రి. (చిఱచిఱలు+ఆడు.) కోపముచే మండిపడు. "వ...చిఱచిఱలాడుచుఁ జుఱచుఱం జూచుచున్నం గని వెన్నుండు..." మృ. వి. 3, ఆ. ౯3.

చిఱి. దే. వి. ఒకజాతికూరాకుచెట్టు. (శ. ర.)

చిఱిగోరు. దే. వి. ఒకజాతిదుంప. "ఆ. చేమకంద గెనుసు చిఱిగోరు పెండ్లము..." హంస. ౪, ఆ. ౧3౧.

చిఱినెల్లి. దే. వి. ఒకజాతినెల్లిచెట్టు "సీ...చిఱినెల్లి కాయయుఁ జిల్లకాయ..." హంస. ౪, ఆ. ౧3౯.

చిఱు. వై. విశే. (వృత్తియందుఁ జిఱుతశబ్దమునకు మీఁదివర్ణము లోపింపగా మిగిలినరూపము.) 1. అల్పము, నీచము. "ఉ...చిఱువేల్పులు దైత్య దానవుల్..." కాశీ. ౯, ఆ. ౭౬౧; 2. కొంచెము, స్వల్పము. "గీ. చిటిలుకస్తూరితిలకంబు చిఱుచెమటయుఁ." దశా. 3, ఆ. ౧౪౯.

చిఱుఁదొడ. ద్వ. వి. (చిఱు+తొడ.) పిక్క, జంఘ. "క. పఱతెంచి కుంభసంభవు, చిఱుఁదొడ వడిఁ బట్టుకొనియె..." భార. ఆది. ౯, ఆ. ౭౯౬. "చ...సరబృంహితశాల విశేషగర్భసం,పదయును బొల్లుసేసి నగు భామచిఱుందొడదోయి యాయ తిన్." సాంబో. 3, ఆ. ౯౧.

చిఱుగంట. వై. వి. (చిఱు+గంట.) చిన్నగంట. "గీ. కాన సిగ నొక్కచిఱుగంట గట్టుకొన్న,వాఁడ వగుచును..." శుక. 3, ఆ. ౧౭౯. ఆం. భా. ద్వి. ౧౯౧.

చిఱుగాజునొక్కు. ద్వ. వి. (చిఱు+గాజు+నొక్కు.) గాజుయొక్క చిన్ననొక్కు. "సీ. నునుమేనఁ జిఱు గాజునొక్కు లే డవి కృష్ణ..." రాధా. ౧, ఆ. ౯౦.

చిఱుగాలి. ద్వ. వి. (చిఱుత+గాలి.) పిల్లవాయువు, మందమారుతము. "గీ. వచ్చుచిఱుగాలిసోఁకును మెచ్చి మెచ్చి." భార. అను. ౧, ఆ. ౧౮౨.

చిఱుగూబ. వై. వి. (చిఱు+గూబ.) చిత్రఘూకము పైఁడికంటి అనునొకజాతిపక్షి. (శ. ర.)

చిఱుటేఁకు. ద్వ. వి. (చిఱు+టేఁకు.) భారంగివృ. "గీ. చిఱుటేఁకి లొద్దుగు జీడిపాల..." హంస. ౪, ఆ. ౧౧. ఆం. భా. ద్వి. ౫౪.

చిఱుత. వై. విశే. (సం. చిత్రకః.) 1. చిన్నది, అల్పము. "గీ. చిఱుతకూఁకట్లు దూఁగాడ..." హరి. పూ. ౨, ఆ. ౨౫౨. ఆం. భా. తృ. ౧౬; 2. లేఁతది. "సీ. నెఱిమించుచిఱుతవన్నియచేల మిరుమేన నిరుమేన రతిమోహారవిభూతి." వసు. ౧, ఆ. ఉ. వి. 1. చిన్నపులి. "సీ...చిఱుతమీసపు నేఁతచిఱుత దట్టి." చంద్రా. ౨, ఆ. ౩౦. ఆం. భా. ద్వి. ౦౨; 2. బాలుఁడు, బాలిక. "క... నాతా,ల్చినవ్రతమును జెఱుప నంతచిఱుతని చెపుమా." భార. ఆది. ౪. ౨౨౨. ఆం. భా. ద్వి. ౧౧౦. "సీ...ఎఱిగింపు మనుటయుఁ జిఱుత తాను." చెన్న. ౩, ఆ. ౧౦౦; 3. సాముచేసెడి వారుత్రిప్పెడుచిన్నకోల. (శ. ర.); 4. ఎద్దుల మెడపై కాఁడికి తగిలించుకఱ్ఱచీల. (వ్యవ:— కాడికి చిఱుతలు లేవు; 5. భజనమున్నగువాని యందు తాళమువేయుట కుపయోగించుకఱ్ఱతాళములు. (వా.)

చిఱుతఁడు. వై. వి. (చిఱుత+వాఁడు.) బాలకుఁడు. "వ. అనిన నచ్చిఱుతం డిట్లనియె." చెన్న. ౩, ఆ. ౫౩.

చిఱుతగండు. ద్వ. వి. (చిఱుత+గండు.) మగచిఱుత పులి. "వ...చిఱుతగండ్లగమిచేత దైవికంబున డాప్రక్క మీఁదువడ దాఁటువడి..." స్వా. ౪, ఆ. ౩౭.

చిఱుతతనము. ద్వ. వి. (చిఱుత+తనము.) బాల్యము, చిన్నతనము. "చ. చిఱుతతనంబునం దగవుచిత్త మునం దలపోయ లేక..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౬౧. స్వా. ౧, ఆ. ౭౩.

చిఱుతనగోరు. ద్వ. వి. (చిఱుత+గోరు.) బాల క్రీడావిశేషము. "సీ. చిఱుతనగో డాడ విఱు తురు పెక్కన గఁదంత మొక్కత్రేలఁ గరము వట్టి." చమ. ౩, ఆ. ౧౦౯. ఆం. భా. ద్వి. ౩౦౭.

చిఱుతనబిల్లలు. ద్వ. వి. బ. (చిఱుత+బిల్లలు.) బాల్యక్రీడావిశేషము. "గీ. పేర్మిఁ జెలరేఁగి చిఱుతనబిల్ల లాడు." రుక్మి. ౧, ఆ. ౧౬.

చిఱుతనవ్వు. ద్వ. వి. (చిఱుత+నవ్వు.) మందహాసము, చిన్ననవ్వు. "ద్వి. చిఱుతనవ్వులు తీయవెయ్యోలఁ గద్గి..." రం. రా. ఉ. ౧౧౦. పా. ౧౧. వం.

చిఱుతనాఁడు. ద్వ. వి. (చిఱుత+నాఁడు.) చిన్నతనము, బాల్యము. "గీ. చిఱుతనాఁడునువాఁడు దాశిప్పఁబోఁడు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౭.

చిఱుతపడు. వై. అ. క్రి. (చిఱుత+పడు.) పొట్టి యగు. "సీ. అభ్రంకషముతైనమానశిరశ్శృంగ శృంగాటకములిట్లు చిఱుతపఱచి." కాశీ. ౨, ఆ. ౧౬౩.

చిఱుతపాయము. వై. వి. (చిఱుత+పాయము.) బాల్యము. "సీ. చిఱుతపాయపుగొల్ల తెఱవలవల పించి..." నీలా. ౧, ఆ. ౩.

చిఱుతపిప్పలి. మి. వి. (చిఱుత+పిప్పలి.) చిన్నజాతి పిప్పలివృ. "సీ...చిఱుతపిప్పలి..." అప్ప. ౨, ౪౩౧.

చిఱుతపులి. ద్వ. వి. (చిఱుత+పులి.) చిత్రకము, ఒకజాతిపులి. ఆం. భా. ద్వి. ౯౨.

చిఱుతవోవు. ద్వ. అ. క్రి. (చిఱుత+పోవు.) 1. తగ్గు. "సీ. ఘ్రాణేంద్రియ జ్ఞానకళయూరుసొరుగా జిహ్వవివేకంబుచిఱుతవోవ." కాశీ. ౧, ఆ. ౧౩౯; 2. చిన్నదగు. "గీ. చిఱుతవోయినమూఁపుటి చెలువుదాల్చి." కాశీ. ౧, ఆ. ౧౩౦.

చిఱుతుక. వై. విశే. (చిఱుత+ఉక. స్వార్థమున.) 1. చిన్నవయసుగలది. "ఆ. చెలఁగి లేవనేడ్చు చిఱుతుకదానిఁ గ్రవ్యాదఘోరమృగములకన బుద్ధిఁ బట్టుకుండ..." భార. ఆది. ౪, ఆ. ౪౬; 2. చిన్నవయసువాఁడు. "గీ...చిఱుతుకజేని జూచి..." సా. ౩, ఆ. ౧౬౦.

చిఱుతేకు. ద్వ. వి. (చిఱుత+తేకు.) భార్జిశీ. ఆం. భా. ద్వి. ౫౪.

చిఱుదిండి. ద్వ. వి. (చిఱుత+తిండి.) భక్ష్యము. "సీ. చిఱుదిండితనవారిమెుఱఁగి యాహారించు..." కాశీ. ౨, ఆ. ౮౦.

చిఱునవ్వు = చిఱుతనవ్వు. "మ...నీసెమ్మోము నందియ్యనై చిఱునవ్వొప్పఁగ..." భార. అర. ౭, ఆ. ౩౪౨.

చిఱునాలుక. ద్వ. వి. (చిఱుత+నాలుక.) 1. వ్యాధి విశేషము, గళశుండిక. (శ. ర.); 2. కొండ నాలుక. (బ్రౌ.)

చిఱుపాల. ద్వ. వి. (చిఱుత+పాల.) క్షీరావిశీ. ఆం. భా. ద్వి. ౫౫.

చిఱుపాలు. ద్వ. వి. (చిఱుత+పాలు. క. చిరపాల్ చిఱుపాలు. అని. శ. ర. సూ. ని.) పగ మిగురఁ గాచినపాలు. "మ...చేసురుచుల్ను నేయుం జిఱుపాలు వెల్లువగ నాహారంబు న్ ..." ఆము. ౧, ఆ. ౮౨. ఆం. భా. ద్వి. ౧౯౮.

చిఱుపులి = చిఱుతపులి. ఆం. భా. ద్వి. ౮౨. 'క. ఓడక చిఱుపులి మొత్తము, నేడికపొట్టేళ్లగీతి నెదిరి ..." రామా. ౨, ఆ. ౧౬.

చిఱుబంతిపసుపు. వై. వి. (చిఱుత+బంతిపసుపు.) చాయగలపసుపు, హరిద్రము. "క. అంతటఁ గను పట్టెను భాస్వంతుఁడు...చిఱుబంతిపసుపుముద్ద సన్నెపై నిడుభంగిన్." జై. ౨, ఆ. ౧౦౦. "సీ. సిద్ధవాహినినీటఁ జిఱుబంతిపసు పాడి శ్రీవిశా లాక్షి స్త్రైనేయఁదొడఁగె." భీమ. ౨, ఆ. ౭౮.

చిఱుబొద్ది. ద్వ. వి. (చిఱుత+బొద్ది.) పాఠశీ. (శ.ర.)

చిఱుమాను. ద్వ. వి. (చిఱుత+మాను.) అర్జునము, మద్దిశీ. (బ్రౌ.)

చిఱుము. దే. అ. క్రి. చెలరేఁగు, విజృంభించు. "ద్వి. చిఱిమి వసిష్ఠకౌశికులకోపాగ్నులుఱక అలోకంబు లాహుతిఁ గొను ననుచు." ద్వి. హరిశ్చ. పూ. ౪౧౭. పం. "ఆ. పేఁపు చిఱుమునేల నేఁటి రాత్రి." దశా. ౬, ఆ. ౫౪. స. క్రి. 1. చిమ్ము. "చ...మందర మంగుటంబునం, జిఱుముదునే ..." భా. రా. అర. ౨, ఆ. ౧౦౪; 2. కోరాడు. ఆం. భా. తృ. ౧౩౭.

చిఱువరి. ద్వ. వి. (చిఱుత+వరి.) ధాన్యవిశేషము. "సీ. చిఱువరి పచ్చగన్నెరు..." ఆం. భా. ద్వి. ౨౩౪.

చిఱువాడు. ద్వ. వి. (చిఱుత+వాఁడు. త. చిఱు వాఁడు. మిగులుచుకొన్న చిల్లరధనము. "గీ. చేరి రక్ష్వేశఁ దమమునిచెఱఁగులందుఁ, గానుదుడ్డును బంగారుభూస వెండి,తురుక మొదలింటిచిఱువాడు గనిస డల్ల ..." శుక. 3, ఆ. ౧౧౭.

చిఱువేరు. ద్వ. వి. (చిఱుత+వేరు. త. చిఱువేర్.) ఎఱ్ఱరంగువేయుటకుపయుక్త మగునొకానొక వేరు. "సీ. చిఱువేరుచాయతోఁ జెలిమిచేయును గాని..." తపతీ. ౨. ఆ. ౭౦.

చిఱుసాన. ద్వ. వి. (చిఱుత+సాన.) ఆయుధములకుఁ బదను పెట్టుచున్న సాన. "సీ. చిఱుసానఁ బట్టించి చెక్కి సేయించిన గండగొడ్డలి నిశాగహనలతను." కాశీ. ౧, ఆ. ౧౨౧. స్వా. ౬, ఆ. ౧౩౧.

చిఱుసెనగలు. వై. వి. బ. (చిఱుత+సెనగలు.) చిన్నజాతిసెనగలు. (శ. ర.)

చిట్టు. ? వి. కోపము. (శ. ర.) విశే. చింపిరి యైనది, చెదరిపోయినది. "ఆ. గొఱ్ఱెబోచ్చుకంబె చెట్టనై చిట్టు తాళ్లువెండ్రుకలను గూడ దుబ్బి." చంద్ర. వి. 3, ఆ. ౮౩.

చిట్టుగొట్టు. దే. విశే. (చిట్టు+గొట్టు.) కోపిష్ఠి. "సీ... వెట్టిపెద్దములడో చిట్టుగొట్టా." చెన్న. ౪, ఆ. ౩౯.

చిట్టుచిట్టు. దే. వి. సంభ్రమము, తొందర. "వ... చిట్టుచిట్టు నట్టాడుధేనువుల వేఱువేఱం బిలుచు వారును..." వి. పు. ౭, ఆ. ౧౪౭.

చిట్టులువోడుచు. దే. అ. క్రి. (చిట్టులు+పోడుచు.) సంభ్రమించు. "వ...పసులు వెసం దిరిగి మున్ను విచ్చుచ్చుండు వచ్చినజాడఁ గైకొని దక్షిణదిశకు చిట్టులువోడుచుచుం దెరలం బాఱిన..." భార. విరా. ౪, ఆ. ౨౬౫.

చిట్టి. వై. వి. (సం. చిల్లీ.) ఒకదినుసుకూరాకు, తండు లీయముశీ. ఆం. భా. ద్వి. ౬౭. "ఆ. చిట్టిమేడి కాయచెంచలివంకాయ..." జై. ౪, ఆ. ౯౬.

చిట్టిపట్టె. ద్వ. వి. (చిట్టి+పట్టె.) బాలక్రీడావిశే షము. (శ. ర.)

చిఱ్ఱు. దే. వి. 1. కోపము. (శ. ర.); 2. కోపమం దగుననుకరణము. "సీ. పౌర లూని మేతాలుపులఁ జిఱ్ఱు మని వెఱకొలుపుచు..." అచ్చ. బాల. ౧౦౬.

చిఱ్ఱుద్ది. ద్వ. వి. (చిఱుత+ఉద్ది.) చిన్నజత. "వ... ఇతరవల్లవులెల్ల చిఱ్ఱుద్దులై వచ్చినసమయంబున..." భాగ. ౧౦, స్కం. పూ. ౭౩౦

చిఱ్ఱుబుఱ్ఱులు. దే. వి. బ. (చిఱ్ఱు+బుఱ్ఱు) "సీ... చిమ్మనఁ గ్రోవులు చిఱ్ఱుబుఱ్ఱులు..." హంస. 3, ఆ. ౧౪౬.

చిఱ్ఱుబుఱ్ఱు. దే. వి. (చిఱ్ఱు+బుఱ్ఱు) 1. కోపమునం దగుధ్వని కనుకరణము. "సీ...ఆఁబోతుతత్తడి చిఱ్ఱుబుఱ్ఱనంగ." హర. ౫, ఆ ౧౬; 2 గొంతుకకు శ్లేష్మ మడ్డుపడునపు డగుధ్వని కనుకరణము. "సీ. శ్లేష్మంబు కుత్తుకఁ జిఱ్ఱుబుఱ్ఱన..." శుక. 3, ఆ. 3౦.

చిఱ్ఱుబుస్సు. దే. వి. (చిఱ్ఱు+బుస్సు.) కోపమం దగు ధ్వని కనుకృతి. "శా. ఆమందోదగ్ర చిఱ్ఱుబుస్సను చసూ కూక్రాంతమై పోయి." శుక. 3, ఆ. ౨౭౭.

చిఱ్ఱుమను. దే. అ. క్రి. (చిఱ్ఱు+అను) 1. కోపించు. (శ. ర.); 2. బుసకొట్టు "సీ. పౌర లూని మేతాలుపులఁ జిఱ్ఱుమని వెఱకొలుపుచు రెండు నాల్కలు దలిర్ప." అచ్చ. బాల. ౧౦౬.

చిఱ్ఱుముఱ్ఱాడు. దే. అ. క్రి. (చిఱ్ఱుముఱ్ఱు+ఆడు. స్వార్థమున); 1. పెనఁగులాడు. "సీ. ఒగరు జొంపములలోఁ జిఱ్ఱుముఱ్ఱాడుచు..." మార్క. ౫, ఆ. ౭. "ఉ...చిఱ్ఱుముఱ్ఱాడుచు...ఆడె సమదాలికులంబు..." కు. సం. ౯. ఆ. ౧౦౨. 2 అతిశయించు, మించు. "గీ. అకరి కోర్కులు చిఱ్ఱుముఱ్ఱాడ..." భార. విరా. ౨, ఆ. ౮౯౨. 3. వ్యాపించు "మ...కనుమించున్ చిఱ్ఱుముఱ్ఱాడఁగన్." ఆము ౬. ఆ. ౧౩౧. స. క్రి. 1. చీల్చు, ఛేదించు. "ద్వి. చేకొని శవములఁ జిఱ్ఱుముఱ్ఱాడు, కాకఘూకానేకకంక గృధ్రములు." రం. రా. యు. ౫౩౭. పా. ౧౩. సం. 2. నిరాకరించు, త్రోసిపుచ్చు. "ద్వి. జిన దర్శనంబులఁ జిఱ్ఱుముఱ్ఱాడు, మనవీరభద్రుని మహి కరి వచ్చె." బస. ౫, ఆ. ౧౯౨. పం.

చిఱ్ఱుముఱ్ఱు. దే. వి. (చిఱ్ఱు+ముఱ్ఱు.) కోపమందు కలిగెడిధ్వని కనుకరణము. "ఉ. ఏ నటు చిఱ్ఱుముఱ్ఱుచు నించుకకోపము తాళలేమి..." విప్ర. ౪, ఆ. ౭౨. "మత్త...బౌద్ధుఁడు చిఱ్ఱుముఱ్ఱు మటంచు నో,రోరి జైనపిశాచ నగ్నుఁడ." ప్రబోధ. ,3 ఆ. ౨౨.

చిలచిల. దే. వి. 1, ఎండుటయం దగుననుకరణము. "క...చిఱుగందపుటన లాకింత చిలచిల మని వేఁగిరమ దరువట్టుగొన..." కళా. ౬, ఆ. ౨౫౪; 2. రసము మున్నగునవి చిమ్ముటయం దగుననుకరణము. "క. చిలుకలు ముక్కున నొక్కినఁ, జిలచిలబొండ్లమఁలకండ్లఁ జిమ్ముచు రసముల్." కార్తిక. 3, ఆ. 3౫ పా.

చిలవ. దే. వి. నీరుకోడి. (శ. ర.)

చిలాయి. దే. వి. బొట్టుపెట్టుకొనుచాఁదు. (వా.)

చిలికించు. దే. స. క్రి. (చిలుకు. ధా. ప్రే.) నీరు మొదలగువానిని చల్లు. "సీ...కలయంపి చిలికించుఁ గమ్మఁదేనె." భీమ. 3, ఆ. ౬౨. "గీ. ఇంచుక విభూతిఁ గొని చిలికించుటయును." చెన్న. ౧ ఆ. ౨౪౦; 2. వ్యాపింపఁజేయు. "సీ. చెక్కుటద్దములపైఁ జిఱునవ్వు చిలికించి..." విక్ర. ౧, ఆ. ౧౫౯.

చిలిపి. దే. విశ. అల్పము, చిన్నది. "మ...అరయన్ వాసము లేక యీచిలిపిపుట్టా కేమి ప్రాపయ్యెడన్." జై. ౯, ఆ. ౧౦౪. (ఇట నికృష్ట మనియు నర్థాంతరము.) "సీ...సిద్ధలింగము లిట చిలిపిటాలు." రుక్మా. ౫, ఆ. ౬౧.

చిలిమిడి. దే. వి. అక్షోళముఁ ఆం. భా. ద్వి. ౬౩.

చిలివిలి. దే. వి. దట్టము. (చూ. చిలివిలివోవు)

చిలివిలివోవు. దే. అ. క్రి. (చిలివిలి+పోవు.) దట్టమగు, "చ. చిలివిలివోవుకోరికలు చిత్తమునం దలలెత్త..." విక్ర. ౪, ఆ. ౨౨౪.

చిలివిసము. ద్వ. వి. (చిలిపి+విసము) 1. కొఱమాలినపని. "ద్వి. చిలివిసంబులు కొన్ని చేయుచున్నాఁడు." ద్వి. పరమ. ౫, ఆ. ౩౬౧; 2. అసూయ. (బ్రౌ.)

చిలుక. వై. వి. (సం. చికిః, శుకః.) 1. శుకము. "క. చికలుకలకొలి కిది నాతోఁ, బలుకంగాఁ గొంత సిగ్గుపడియెడు..." విజ. ౨, ఆ. ౧౯౩;

2. తలుపునకు వేయుంగడె. (బ్రౌ.); 3. ఇరుసునకు వేయుచీల. ఆం. భా. ద్వి. ౨౦3; 4. తోఁటకూరలోనిభేదము, హిలమోచికళీ. ఆం. భా. ద్వి. 23.

చిలుకకూర. ద్వ. వి. (చిలుక+కూర) చిలుకతోఁట కూరళీ. (శ. ర.)

చిలుకకొయ్య ద్వ. వి. (చిలుక+కొయ్య) నాగదంతము,. వస్త్రములు తగిలించుటకై చిలుకరూపాకారముగఁ జెక్కినదారువిశేషము. ఆం. భా. ద్వి. ౨౦.

చిలుకగోణము. ద్వ. వి. (చిలుక+గోణము) అతుకులు గలగోఁచి. (బ్రౌ.)

చిలుకడ. ద్వ. వి. (చిలుకు+కడ) 1. కొలికిగా వేయుముడి, బంధవిశేషము. (శ. ర.); 2. ఎద్దునకుఁ గట్టుగంత త్రాటికొనముడి. (బ్రౌ.); 3 కత్తియొఱకుఁ గట్టుత్రాడు. ఆం. భా. ద్వి. ౨౧౫.

చిలుకతత్తడిరౌతు. ద్వ. వి. (చిలుక+తత్తడి+రౌతు) చిలుకయే గుఱ్ఱముగాఁ గలవాఁడు, మదనుఁడు "సీ. చిలుకతత్తడిరౌతు చేతిలియ్యానివింట..." చంద్రి. ౨, ఆ. ౬౯. ఇట్లే చిలుకరవుతు, చిలుకవటాణిరౌతు, చిలుకసాంబ్రాణిసామి, చిల్కతేజీదొర.

చిలుకతాళి. ద్వ. వి. (చిలుక+తాళి.) ఇరువ్రక్కల చిలుకరూపేర్పఱచినపతకము. "సీ. జాళువాజిగిజిరాసరపెణలమెఱుంగు చిలుకతాళికి నొకసిరి యొసంగ." శుక. ౧, ఆ. ౨౪౯.

చిలుకత్తు = చిలుకొత్తు. ద్వ. వి. (చిలుకు+ఒత్తు) కవచము. ఆం. భా. ద్వి. ౨౦౪.

చిలుకముక్కు. ద్వ. వి. (చిలుక+ముక్కు) చిలుకముక్కువంటిపువ్వుగల, వృక్షవిశేషముళీ. ఆం. భా. ద్వి. ౬౬. బ. ధాన్యవిశేషము. "సీ...చిలుకముక్కు, లేసుకఱ్ఱులు వంకెలు..." హంస. ౪, ఆ. ౧౨౮.

చిలుకయారె. వై. వి. (చిలుక+ఆరె) ఒకవిధమైన మాదిగవానిసూది. (శ. ర.)

చిలుకరించు = చిలికించు. దే. స. క్రి. చల్లు (శ. ర. వా.)

చిలుకరింపు. దే. వి. (చిలుకరించు. ధా.) నీరు మొదలగు వానిని చిలుకుట, చల్లుట. (శ. ర.)

చిలుకలకొలికి. ద్వ. వి. (చిలుకలు+కొలికి) చిలుకకుండుకొలుకులవంటి కొలుకులు గలది, ఆఁడుది. "గీ. వలుకుపలుకున నమృతంబు చిలుకుచుండఁ, చిలుక వేఁటికిఁ జిలుకలకొలికి కాన." నైష. ౭, ఆ. ౫౦. ఆం. సం. మాన ౯.

చిలుకు. దే. అ. క్రి. (క. చిమకు) 1. చిందు, చెదరిపడు. "క...ఆత్మానందరసం బొకకణమైనఁ జిలుకనీక..." భార. శాం. ౬, ఆ. ౧౨౧. హర. ౫, ఆ. ౧౬; 2. ప్రవేశించు. "మ...అ, మ్మురళీగానము వీనులం జిలికినన్..." భాగ. ౧౦. స్క. ౦. ఉ. ౧333; 3. ప్రసరించు, వ్యాపించు. "సీ. చిలికినచో నెల్ల సిరి వెలయించునీయవనీశు దరహాస మమృతనిధియొ." హ.వ. 3, ఆ. 3౦; 4. మీఱు, చెలరేఁగు. "సీ. చేఁదు మ్రింగెద వంచుఁ జిలికి నవ్వె ఘృతాచి..." స్వా. 3, ఆ. ౧౦౯; 5. కురియు, వర్షించు. "చ. కొలఁకులపజ్జ నజ్జకపుగొజ్జఁగిపూఁబొదరిండ్ల జోరునం, జిలుకు హిమాంబుపూరములు..." వసు. ౨, ఆ. ౧౨. పాండు. ౪, ౧౧౨; 6. ప్రకటితమగు. "సీ... రిపులవలన మంత్రము వెలిఁ జిలుకనిచ్చుట లెస్స..." మార్క. 3, ఆ. ౧౨౮. స. క్రి. 1. ప్రోక్షించుకొను. "క. తల నీగంగాతీర్థము, చిలికిన వాఁ డీశ్వరుండు..." విజ. ౧, ఆ. ౫౪; 2. చల్లు. "చ...చిలుకు నిశారజఃపటలిచొప్పు వహించె..." ఆము. ౪, ఆ. ౧౪2; 3. కురియు, వర్షించు. "సీ...తొండంబుముక్కున శీకరాసారంబుఁ జిలుకు దుంతి." కాశీ. ౨ ఆ. ౫3; 4. ప్రకటించు. "ఆ..ఇంటఁ జక్కెరల్ దిని మని, వెగటు చిలుకు నీకుఁ దగునె చిలుక." రసిక. ౪, ఆ. ౧2౨; 5. ప్రసరింపఁజేయు. "క...రసమొలుకచూపు వదనాబ్జముపైఁ, జిలుకుచు..." కవిరా. ౫, ఆ ౨23; 6. మథించు "గీ. పాలు చిలుకంగ వెన్న యేలీలఁ బొడమె." దశా. ౨, ఆ. ౨౪౨. (వి. త. చిలుక్కు) 1. కొలికి, ముడి. "సీ. శిథిలత్వ మందినచెంగావిజడిముడి చిలుకూడి నెలపువ్వు చెంప నంట." పాండు. ౫, ఆ. ౧3౬; 2. అలుఁగు, బాణాగ్రము. ఆం. భా. ద్వి. ౨౧3; 3. గొండ్లెము; తాళము. శుక. 3, ఆ. 3౪౮. (శ. ర.); 4. బాణము "సీ...

చిలుకు శరము..." ఆం. శే. ౫౬. "సీ...సింగి
నొకదొడ్డచిలుకు గూర్చి." అచ్చ. కిష్కిం. ౪౫; 5. మిగులు, శేషము. (బ్రౌ. వా.); 6. జలక్రీడావిశేషము. "క...సెలయేటులలోఁ జల్లులు, చిలుకులు నాడుదురు..." హర. ౫ ఆ. ౩౬.

చిలుకుటమ్ము. దే. వి. (చిలుకు+అమ్ము.) ములికితోఁ గూడినబాణము. "చ...కుంపపుమొగ్గచిలుకుటమ్ములు మరు డేయ..." చంద్రి. ౪, ఆ. ౧౨౫. "వ. చిలుక లేజీవజీరునిచిలుకుటమ్ములు..." దశా. ౫, ఆ. ౧౧౫. ఇట్లే. చిలుకుతూపు, చిల్కులకోరి మొ.

చిలుకుడు. దే. వి. (చిలుకు ధా.) చిలుకుట. (శ. ర.)

చిలుకుడుగుంజె. దే. వి (చిలుకుడు+గుంజ) పెరుగు మ న్నగునవి మధించుగుంజె. (బ్రౌ.)

చిలుకొత్తు. దే. వి. (చిలుకు+ఒత్తు.) "ఉ...తలిర్చిలుకొత్తుఁ దాల్చి..." ప్రబంధ. ౫౧౪.

చిలుగు. దే. వి. దీర్ఘయష్టికి. (శ. ర.)

చిలువ. దే. వి. 1. కొంచెము నిలిచినసీరు. "మ...లోచనగోళంబులఁ జెమ్మలై చిలువలై..." స్వా. 3. ౧౩౬; 2. ఖండము, ముక్క. "క. మిలమిలని గోళ్లఁ జిలుపలం, గులగులలుగ..." చంద్రా. ౨, ఆ. ౯. విణ. అల్పము. "సీ...చిలువ వెన్నెలలోని తారకాపఙలు..." దశా. 3, ఆ. ౨౦. నైష. ౧, ఆ. ౧౯౨. "గీ. చిలువ చిలువ నినేతులజిడ్డు దేఱ." స్వా. ౪. ఆ. ౧౭.

చిలుము. దే. వి. (త. చిలుంపు.) 1. లోహాదుల మలము. "సీ. శృంగారరసముఁ జిలుము వోఁ గడిగినలలితసువర్ణశలాక యనఁగ." హ. వరాహ. ౨, ఆ. ౭౯. పా. శుక. ౨, ఆ. ౪౫౧; 2. విషము. ఆం. భా. ప్ర. ౧౪౦. విణ. విషము కలది. (చూ. చిల్మ.)

చిలుమువాలు. ద్వ. వి. (చిలుము+వాలు.) త్రుప్పు పట్టినకత్తి. ఆం. భా. తృ. ౫౨. విణ. తులువ, కుత్సితుఁడు. ఆం. భా. తృ. ౫౨.

చిలువ. దే. వి. (చిలుము+వా.) 1. కోటియందు విషముగలది, పాము. "చ. చిలువలగుంపు వెల్వడిన చెల్వన..." ఉ. రా. ౨, ఆ. ౨౧౨. ఆం. భా. ప్ర. ౧౪౦; 2. బొట్టిబాతు. (బ్రౌ.)

చిలువగట్టు. వై. వి. (చిలువ+గట్టు.) శేషశైలము. "క. తోఁచినవగ రచియింపెదఁ, దోఁచనిచోఁ జిలువగట్టుదొరతోఁడై నా, యాఁచకయె..." ప్రబంధ. ౨౫.

చిలువజగము. ద్వ. వి. నాగలోకము, పాతాళము. "ఆ...మూఁకఁ, జిదిమివై చివానిఁ జిలువజగంబున కనిచి..." అచ్చ. యు. ౪౭౯.

చిలువజందెపుమేటి. ద్వ. వి. పాములు జందెముగాఁ గలవాఁడు, శివుఁడు. వేంక. దేవ. ౦.

చిలువటెంకి. దే. వి. (చిలువ+టెంకి.) వల్మీకము, పుట్ట. వేంక. స్థా. ౯౦. యయా. ౪, ఆ. ౩౯.

చిలువతాలుపు. ద్వ. వి. (చిలువ+తాలుపు.) ఈశ్వరుఁడు, శివుఁడు. "సీ...దళవాయియైగొల్చు తాల్పు." అచ్చ. సుం. ౪౧.

చిలువతాలుపుబిత్తళిక ద్వ. వి. (చిలువ+తాలుపు+బిత్తళిక.) ఈశ్వరునియమ్ములబోది. సముద్రము. వేంక. దేవ. ౧౦.

చిలువతిండి. దే. వి. 1. సర్పాశనుఁడు, గరుడుఁడు. "గీ. చిలువతిండిహుమాయుపైమెలఁగువాఁడు." ఉ. రా. ౫, ఆ. ౧౯౨; 2. నెమిలి. "సీ. చిలువ తిండులకుఁ జెచ్చెరనాటతమినీాటె..." అచ్చ. కిష్కిం. ౬౭.

చిలువపట్టు. దే. వి. (చిలువ+పట్టు.) = చిలువటెంకి.

చిలువమేఁత. దే. వి. (చిలువ+మేఁత.) పాములతిండి, గాలి. ఆం. భా. ప్ర. ౫౯. (ఇట్లే చిలువలమేఁత. వేంక. దేవ. ౧౪.)

చిలువమేపరి. దే. వి. (చిలువ+మేపరి) గరుడుఁడు. "గీ. చిలువమేపరితలపులోపల నెవచ్చి." సమీర. ౬. ౧౪౧. [గరుడపచ్చ. ప్రబం. ౫౬౬.

చిలువమేపరిపచ్చ. దే. వి. (చిలువమేపరి+పచ్చ.)

చిలువరాయఁడు. ద్వ. వి. (చిలువ+రాయఁడు.) సర్పరాజు, శేషుఁడు. రామ. ౨౪౧.

చిలువఱేఁడు. ద్వ. వి. (చిలువ+ఱేఁడు.) సర్పరాజు. ఇందు. ౨, ఆ. ౭౪.

చిలువసొమ్ము. దే. వి. (చిలువ+సొమ్ము.) సర్పభూషణుఁడు, శంకరుఁడు. "గీ. ముమ్మరపుటల్కతోఁ జిల్వసొమ్ముమల్కఁ, గ్రమ్మఱనిగుడ్వ..." అచ్చ. యు. ౧౦౪.

చిలువానము. దే. వి. (త. చిలువాణమ్.) కర్పూరకుప యోగించుచిల్లరసరకు. "సీ. వంటకొట్టము చిలువానమం చినమిట్ట..." శుక. 3, ఆ. ౪౮౧

చిలువాయనము. దే. విణ. క్షుద్రము, నీచము. "సీ. చిలువాయనపువేల్పుకొలముఁ గొల్వక..." పాండు. ౨, ఆ. ౪౫.

చిలువాలు. దే. వి. ఇగురఁగాచినపాలు. "గీ. పండు వెన్నెలచిలువాలపాయసంబు." చంద్ర. ౪, ఆ. ౭౭. "ద్వి. చిలువాలువెన్నలుచీనిచక్కెరలు." రం. బాల. ౫3. పా.

చిల్మ = చిలుము. (విణ. విషముగలది.) "ఉ. అంచిత హారవల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁ జిల్మంచు బసిండి..." ఆము. ౧, ఆ. ౬౧.

చిల్మగులియ. దే. వి. సర్పభేదము. "సీ. కూఁకటికేటులు చిల్మగులియలు..." ద్వా. ౪, ఆ. ౯౪.

చిల్ల. ఉభ. వై. వి. (సం. శల్యమ్.) 1. బాణపు ములికి. "క. విను చిల్ల యుడిగయాయుధమును..." భార. శాం. ౨, ఆ. ౪౨౧; 2. చీలిక, పాయ, (చూ. చిల్లజడ.) విణ. వట్టిది, శూన్యము. (బ్రౌ.); 3. కతకము. ఇందుగుచె. ఆం. భా. ద్వి. ౬3. ౪. సిధ్రకము, ఒకానొక వృక్షము. ఆం. భా. ద్వి. ౬౬; 5. (సం. సిహ్లకః.) సిహ్లము, ధూపద్రవ్యము. (చూ. చిల్లమడి.) సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుచీపరపక్షి; 2. ఆఁడుగ్రద్ద.

చిల్లంగి. దే. వి. 1. ఉచ్చాటనాదికము; పంపుమున్న గునది. (వా. చిల్లింగి అని శ.ర.) 2. కలహము. (చూ. చిల్లంగిగొండి.); 3. కొంటెతనము. (చూ. చిల్లంగిచేఁతలు.)

చిల్లంగిగొండి. దే. విణ. (చిల్లంగి+గొండి.) జగడాల మారి. (బ్రౌ. శ. ర.)

చిల్లంగిచేఁతలు. ద్వ. వి. బ. (చిల్లంగి+చేఁతలు.) కొంటెచేఁతలు. "సీ...ముద్దులపట్టి చిల్లంగిచేఁతలు చేయుచుండ." ద్వా. ౪, ఆ. ౨౨.

చిల్లంగిపోతు. దే. విణ. (చిల్లంగి+పోతు.) దయ్యములఁ బెట్టునతఁడు. (వా.)

చిల్లక. సం. వి. ఆ. స్త్రీ. ఝిల్లిక, ఈలపురుగు. (కల్ప.)

చిల్లకట్టె. దే. వి. (చిల్ల+కట్టె.) క్రీడావిశేషము. "సీ...చిడుగుడు మొకమాట చిల్లకట్టె." హంస. 3, ఆ. ౧౪౬.

చిల్లకోల. ద్వ. వి. (చిల్ల+కోల.) 1. తోమరము (శ. ర.); 2. కొరడా. (బ్రౌ.); 3. తూఁటులు గలఅమ్ము. "గీ...పాఱవాతియమ్ములును జిల్లకోలలు..." పి. శకుం. ౧, ఆ. ౧౧3; 4. భిండిపాల మనునాయుధము. ఆం. భా. ద్వి. ౨౧౬.

చిల్లగింజ. దే. వి. (చిల్ల+గింజ.) ఇందుగుగింజ. "సీ. వానకాలంబుచే వఁడువట్టినజలం బెల్లఁ దేర్పఁగఁ జాలుచిల్లగింజ." వరాహా. ౪, ఆ. ౪౯.

చిల్లగొండి దే. విణ. (చిల్ల+గొండి.) కలహశీలుఁడు. (బ్రౌ. శ. ర.) [కలహము. (వా.)

చిల్లజగడము. దే. వి. (చిల్ల+జగడము.) అనవసరపు

చిల్లజడ. ద్వ. వి. (చిల్ల+జడ.) పాయలు తీసి వేసినజడ. "గీ. చేరుఁబో వారగణికాకటీర తటులఁ, జిల్లజడనల్లఁ గెలువ..." కళు. ౧, ఆ. ౧౨౦.

చిల్లపెంకు. దే. వి. (చిల్లర+పెంకు.) కుండ లోనగు వానిశకలము. "క. నా కనఁగాఁ గనకము భ్రామకనుఁగొనఁ జిల్లపెంకుమాత్రము..." శుక. ౧, ఆ. ౫౨౦.

చిల్లపెంచు = చిల్లపెంకు. "ద్వి. సంచితం బగువస్తు సమితియుఁ జిల్ల,పెం చాదిగా..." బస. 3, ఆ. ౪౯౯. పం.

చిల్లమడ్డి. ద్వ. వి. (చిల్ల+మడ్డి.) అందుగుజిగురుతోఁ జేసినధూపద్రవ్యము. (శ. ర.)

చిల్లము. ఉభ. దే. వి. హుక్కాకు నిప్పు పెట్టుకొనెడి పాత్రము. (శ. ర.) సం. వి. అ. న. తడిసినకన్ను. పుం. 3 చీపరపిట్ట. విణ. తడికంటిది. (శ. ర.)

చిల్లర. దే. వి. (క. చిల్లఱ. త. చిల్లఱై.) "క. ఎల్లుండి సమారాధన, చిల్లరవెచ్చములు గొనఁగ..." శుక. ౨, ఆ. ౧౪3; 2. కొంచెపాటినాణెములమొత్తము. (వా. శ. ర.); 3. మిగిలియున్న అల్పభాగము (వా); 4 దుష్టకృత్యము. "చ...శూరతారచనలఁ జిల్లరల్ చలుపురక్కసిపాలియగాండ్రఁ గొట్టుచున్." కువల. 3, ఆ. ౭. విణ. అల్పము; సామాన్యము. "ఉ...చిల్లరవేల్పులవాఁడితూపులన్, భీరులఁ జేసి..." ఉ. రా. ౪, ఆ. 33౫.

చిల్లరకాఁడు. దే. విణ. (చిల్లర+కాఁడు.) సామాన్యుఁడు. (శ. ర.)

చిల్లరమ్ము. దే. వి. (చిల్ల+అమ్ము.) ఆయుధవిశేషము భిండిపాలము. "వ...చల్లరమ్ములఁ జిల్లరమ్ములఁ జామరమ్ములఁ దోమరమ్ముల...చెండాడుచుండ." రా. వి. 3, ఆ. ౬౫.

చిల్లరవాఁడు = చిల్లరకాఁడు. ఆం. భా. తృ. ౧౬.

చిల్లరసేయు. ద్వి. స. క్రి. (చిల్లర+చేయు.) కలఁత కలిగించు. "చ. అనుపమలీలఁ దొట్టినభయంబును జిల్లరసేయ..." శుక. 3, ఆ. ౫3౧.

చిల్లాడము. దే. వి. బాకు, వంకరకత్తి. (ఆయుధవిశేషము—అని. శ. ర.) "శా. చిల్లాడంబులమీఁద టన్ బిగువుకాసెల్ చుట్టి..." అని. ౪, ఆ. 3౪

చిల్లాణము = చిల్లాడము. (క. చిల్లాణ) బాకు,వంకరగలకత్తి. ఆం. భా. ద్వి. ౨౧౭. "క...చెడిదపుఁ జిల్లాణమలఁది గ్రుచ్చి చీరెక్ గీరెన్." చంద్రా. ౨, ఆ. ౯౯.

చిల్లాభుఁడు. సం. వి. అ. పుం. గ్రద్దవలె హఠాత్తుగా చౌర్యము చేయువాఁడు, బందిపోటుదొంగ. (శ. ర.)

చిల్లి. ఉభ. దే. వి. (సం. ఛిద్రమ్. ప్రా. ఛిల్లా. క. జిల్లి.) కన్నము రంధ్రము. "క. చిల్లి గలఘటంబునం దుఁ జేర్చననీరున్." వైజ. 3, ఆ. ౧౨3. ఆ. భా. ప్ర. ౧౪౫. సం. వి. ఇ. పుం. కనుబొమల మధ్య. ఈ. స్త్రీ. 1. వాస్తుకశ్రీ; 2. లోధ్రముశ్రీ; 3. ఈలపురుగు.

చిల్లు. దే. వి. చమురు మున్నగు ద్రవములు పైకి చిమ్ముటచుం దగుననుకరణము. "వ...చంద్రశాలాఖేలనాలోలనాళీకలోచనాలోచనంబుల మరీచివీచికల పెల్లు చిల్లునం జిమ్మఁ గ్రొవ్వుల..." కళా. ౨, ఆ. ౯. సార. ౧, ఆ. ౭౧. (దీనియామ్రేడితరూపము చిల్లుచిల్లు) "వ...చిల్లుచిల్లున కెల్లనుల్కులజ్వాలామాలికల..." కళా. ౮, ఆ. ౧౧౨.

చిల్లుపొల్లు. దే. వి. (చిల్లు+పొల్లు) తుత్తునియలు, ఖండఖండములు. "పంచ. జిరాగుటాల నేసి డాసి చిల్లుపొల్లు సేయుచున్." కృష్ణ. 3,ఆ.3౦.

చిల్లులుపుచ్చు. దే. స. క్రి. (చిల్లుపోవు. ధా. ప్రే.) చిల్లులుపడఁజేయు. సోరణగండ్ల రాఁ గొదమ చుక్కలు పట్టి నటుల్ కవాటముల్, చేరుబమౌక్తికంబు లని చిల్లులువుత్తురు..." ఆము. ౨, ఆ. ౧3.

చిల్లులువోవు. దే. అ. క్రి. (చిల్లులు+పోవు) తూటులుపడు. "ఉ. అస్థిగృహంబు దేహము దురాశలఁ జిల్లులువోవ స్రుక్కి..." ద్వా. ౫, ఆ. ౨౪౧. సైష. ౪, ఆ. ౨౪.

చిల్లోటి. దే. వి. ఒకవిధమైనడాలు. ఆం. భా. ద్వి. ౨౧౬.

చివఁగి = సివఁగి. (శ. ర.)

చివక. దే. వి. సన్ననిచిన్నపిడుపాటికొమ్మ. ఉపశాఖ ఆం. భా. ద్వి. 3౭.

చివచివ. దే. వి. తొందరగా నడచుటయం దగుధ్వని కనుకరణము. "లయవిభాతి...పడిఁ జివచివక్ రెండడుగు లెదురేక్కి..." కళా. ౧, ఆ. ౯౫. అచ్చ. యు. ౨౧౧.

చివర. దే. వి. కొన. 1. అగ్రము. (వా); 2. తుద. అంతము వ్యవ:—వాఁడు చివర కన్నంతపనియుఁ జేసినాఁడు; 3. ఉపశాఖ. ఆం. భా. ద్వి. 3౭.

చివాలున. దే. క్రి. విశే. ద్రు. తటాలున, "ఉ. తోయధి గోష్పదంబు క్రియఁ దోఁపఁ జివాలున దాఁటి..." అప్ప. ౧, ఆ. ౧౫.

చివికివెలమ. దే. వి. కాకజంఘశ్రీ. ఆం. భా. ద్వి.౬౬.

చివుక. దే. వి. కాలుగణాలనాణెము, పావులా.(శ.ర.)

చివుకపిట్ట. దే. వి. ఒకజాతిగబ్బిలము, జతుక. (శ.ర.)

చివుకపిల్లి; ద్వి. వి. ఒకజాతిమార్జాలము. (శ. ర.)

చివుకము. సం. వి. అ. న. చిబుకము, గడ్డము.

చివుకు దే. అ. క్రి. 1. (నీరు మొ. వానిలో నాని) బలములేని దగు. "గీ. తపము సేయంగఁ దొల్లిటి తనువు లెల్ల. శీతవర్షాతపంబులఁ జివికి యెండి." వాసిష్ఠ. ౨, ఆ. ౧౬౧. నీటిలోఁ జివుకక నిలిచి ..." పాండు. ౨, ఆ. ౬౬; 2. క్షోభించు, కలఁతపడు. "ఆ. సింహాకల్పువంకశేఖరజన్ముఁ ద్రుంచి మనంబు పగలఁ జివుక కున్నె." భార. శాం. ౧, ఆ. ౧౯౭. వాసిష్ఠ; ౧, ఆ. ౧౨౪; 3. బలాదులుతగ్గు, చిక్కు. "క...నీ,యవరజు లిడుమలఁ బడకడుఁ, జివికిరి..." భార. అర. ౧, ఆ. ౨౧౧. హరి. పూ. ౭, ఆ, ౧౫౦; 4. క్షతమందు, చిన్నగాయముకలవగు. "సీ. పేరులు చక్కఁగాఁ బెట్టైడుమిషమునఁ జిన్నిగుబ్బలు గోరఁ జివుకఁ జేసి చిత్ర.భా.౫,ఆ. ౧౪౭; 5. చచ్చు,మరణించు. "క. భయపడి యుపవాసంబులఁ, జిరతపములఁ బొరలి పొరలి చివికితినేనిక్, నరపతిక్రియ నఖిలసుఖో,త్తర మగుజన్మంబుఁ బొందెదను..." హరి.

ఫూ. ౨, ఆ. ౯౭. విణ. సారములేనిది, "ఆ. శిప్రసి చిప్రుకువిల్లు శీఘ్రించె యానాఁడు. విఱిచినాఁడ..." మొల్లరా. బాల. ౯౩, అచ్చ. బాల. ౧౩౧. వి. 1. ఎగయుట లోనగువానియం దగుననుకరణము. ద్వి...చిప్రుకున మింటి, కెగయుఁ నిప్పులకుప్పలు..." విష్ణు. ౨, ఆ. (శ. ర.); 2. మనసు నొచ్చుటయం దగుననుకరణము. "క. కని మనసు చిప్రుకు మన..." వరాహ. ౧౧, ఆ ౬౧. వల్మీ. ౨. ఆ. ౧౧౦.

చిప్రుకుచెదారము. దే. విణ. (చిప్రుకు+చెదారము.) మిక్కిలి చివికినది. "చ. చిప్రుకుచెదారపుంధనువుఁ జేల్చుట కింత మదింప నేఁటికిన్." చం. రా. 3, ఆ. ౧౪౭.

చిప్రుక్కు. దే. వి. 1. ఎక్కుట దాఁటుట లోనగువానియం దగుననుకరణము. "మ...తనతుక్షారం పు లేళ్ఁ జిప్రుక్కున దాఁటించి..." కళా ౫, అ. ౧౧౧. ఉ. రా. 3. ౪౦౪.

చిప్రుక్కురు. దే. వి. మనస్సు నొచ్చుటయందలియనుకరణము. "క. కళ లంటి కరఁచి తనచెయ్యులఁ జొక్కెడు తపసిమది చిప్రుక్కురు మనఁగా. కళా 3. ఆ. ౪౬. "క. అన విని మనసు చిప్రుక్కురు, మనఁగఁ బ్రభావతి..." ప్రభా. 3, ఆ. ౯౨.

చిప్రురు = చిగురు. (పల్లవము.) "ఆ. చిప్రురుసవురు జవురునువిదమోవి." విజ. ౧, ఆ. ౮౪. ఆము. ౪, ఆ. ౮౪.

చివ్వ. దే. వి. 1. యుద్ధము. "ఉ. చివ్వకు వచ్చి ని న్నెదురఁజెల్లెనె?..." రామా. ౬. ఆ. ౯౯. ఆం. భా. ద్వి. ౨౨౨; 2. సన్నముగా నుండు రివ్వ. చువ్వ. ఆం. భా. ద్వి. ౩౬. పార్వ. ౨, ఆ. ౬౦; 3. ఈఁటె. సాం. ని. మాన. ౪౩. బ. ఒకానొకబాణసంచు. "సీ. బిఱుసులు చివ్వలుం బెడఁగుచంద్రజ్యోతులు...రసిక. ౭, ఆ. ౯౧.

చివ్వంక. ద్వ. వి. (చిఱు+వంక) చిన్నవంకర. "క. చివ్వలిచన్నులప్రేఁగునఁ, జివ్వంకలు వంగఁగాను..." కు. సం. ౯, ఆ. ౧౧౩.

చివ్వఁగి. దే. వి. సివంగి. ఆం. భా. ద్వి. ౮౨. "ప్రగ్గర...త్రుంచెఁ జివ్వంగిమూఁకన్..." య. ౨, ఆ. ౩౨.

చివ్వపట్టు. దే. వి. (చివ్వ+పట్టు.) యుద్ధరంగము. "గీ. చివ్వ పట్టెల్ల నల్లయుఁ గ్రొవ్వు మెదడు." అచ్చ. సుం. ౧౦౮.

చివ్వలయోగిరపుఁదపసి. ద్వ. వి. (చివ్వలు+ఓగిరము+తపసి.) కలహాభోజనుఁడు, నారదుఁడు. "క. ఇవ్విధమున దానముగొని, చివ్వలయోగిరపుఁదపసి...ల్లన నగుచున్." పారి. ౯, ఆ. ౮౪.

చివ్వవెదురు. దే. వి. (చివ్వ+వెదురు) ఒకానొక వేఁటసాధనము. "గీ. జిగురుఁగండెలు గాలపుఁ జివ్వవెదురు, లాది యగుసాధనంబులు..." శుక. ౧, ఆ. ౧౭౯.

చివ్వలతడిక. దే. వి. (చివ్వలు+తడిక.) వేఁటసాధనము. "చ...వల్లెత్రాళ్లు చివ్వలతడికల్"... చంద్ర. ౨, ఆ ౧౬౬.

చివ్వలాఁడి. (చివ్వలు+ఆఁడి) కలహాశీల. "గీ. తగవు చెప్పంగ నిన్నుఁ బ్రార్థన యొనర్చి, యొవ్వ రిచటికిఁ దెచ్చిరో చివ్వలాఁడి." హరిశ్చ. ౪, ఆ. ౧౬౬.

చివ్వు. దే. స. క్రి. (క. చివ్వు.) 1. చెక్కు. "ఉ. తోరపుఁబోటకత్తుల వెదుల్లు సమగ్రము గాఁగఁ గొట్టి..." పరమ. ౧, ఆ. ౧౨౬; 2. గీఁకు. "ఉ. క్రొవ్విననయేకలంబులను గొన్నిటిఁ గూర్చి కమర్చి పెంచులం, జివ్వుచు..." కాశీ. 3, ఆ. ౯౦; 3. నఱకు, ఖండించు. "ఉ. చివ్వెదఁ గ్రొవ్వెదం గలయశేషవిరోధుల యాశిరోధులన్." పాంచాలీ. ౨, ఆ. ౯౮. కళా. ౧, ఆ. ౬౬; 4. రువ్వు, విసరు. "రగడ. పువ్వుల గోల గొని పొలతుక చివ్వకు మెవ్వ రేఁగిరే యిప్పుడు చివ్వకు." రాజచ. ౨, ఆ. ౧౪౮.

చివ్వున. దే. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా, (దీని యామ్రేడితరూపము చివ్వచివ్వున.) "వ...చివ్వునఁ జేరుదుము..." భార. మా. ౧౮౧. రామా. ౬, ఆ. ౨౬౭. "చ...చివ్వచివ్వునన్, రథసగతుల్ చెలంగ..." భాను. ౨, ఆ. ౮౦.

చిహ్న. సం. = చిహ్నము. (గుర్తు.) "మ...రుద్రచిహ్న లివె పీసిం బుచ్చి రా నేఁ్చరే". కు. సం. ౨, ఆ. ౨౩.

చిహ్నము. సం. వి. అ. న. 1. గుర్తు; 2. ముద్ర; 3. టెక్కెము. [బడినది.

చిహ్నితము. సం. విణ. (అ. ఆ. అ.) గుఱు తుంచఁ

## చీ

చీ. దే. అవ్య. ధిగర్థకము. నిందను సూచించును. "క...పాండవేయుల, శ్రీయిమ్మెయిఁ గొనిన నిన్నుఁ జీ యనరె యొరుల్." భార. సభా. ౨, ఆ. ౧౬౫. "వ...అవిము క్తమహిమెల్లఁ జీయనంగ..." ఉ. హరి. 3, ఆ. (శ. ర.)

చీంబోతు = చింబోతు. "గీ...చీంబోతుఁ దా నచటఁ గట్టి." నా. పంచ 3, ఆ. ౧౫౬.

చీకిలి. దే. వి. చీపురుగట్టు, సమ్మార్జని. (శ. ర. బ్రౌ.)

చీఁద. వై. వి. (సం. చిల్లిః.) చీపరపిట్ట. "సీ...చెమరుంగాకి కోయిల చీఁద గొరువంక..." పార్వ. ౬, ఆ. ౭౭.

చీఁదఱ. దే. వి. 1. బాధ. "మ. ఎలదేఁటుల్ దవు వాలుఁగన్దవలపై నిందీవరభ్రాంతిచే, మెలఁగం జేరలఁ గప్పుకో నలవి గామిం జీదఱం జెంది ..." పారి. ४, ఆ. ౧४; 2. (క. సీకర్.) కోపము. (చూ. చీఁదఱగొను.); 3. రోఁత.(బ్రౌ.)

చీఁదఱగొను. ద్వ. అ. క్రి. (చీఁదఱ+కొను.) 1. ఉపద్రవపడు. (శ. ర.); 2. రేఁగు. "సీ. చీఁదఱగొని పాఱుచోఁ దరుశ్రేణులు దుర్వాతహతిఁ బోలెఁ దుమురు గాఁగ." భో. ౬, ఆ. 3౧౫. సీలా. 3, ఆ. ౪౯.

చీఁదఱరేఁగు. ద్వ. అ. క్రి. (చీఁదఱ+రేఁగు.) 1 చిందరేఁగు, రెచ్చు. "సీ. చీఁదఱరేఁగి గర్జించి గోపతి మేను పెంచి..." కు. సం. ౧౧, ఆ. 3; 2. ఆవేశమెత్తు. "ఉ. చీఁదఱరేఁగినట్లు రిపుసేనల నెల్లను ముట్టి..." హరి. ఉ. ౧, ఆ. ౧౦౧.

చీఁదఱలువోవు. ద్వ. అ. క్రి. (చీఁదఱలు+పోవు.) తూటులుపడు. "క...శునకము శ్రుతిపుటములు చీఁదఱలువోవ మనుకొని మొఱుఁగున్." భో. ౬, ఆ. 3४౭.

చీఁదు. దే. స. క్రి. మొదటిరెండువ్రేళ్లతో ముక్కు నదిమిపట్టి చీమిడి వెలికి రా బుఱ్ఱన నూపిరి విడుచుట. "సీ. కడుకపాలము దాఁకి కలగంగఁ జక్కఁగాఁ జేసాఁచి జిఱ్ఱునఁ జీఁది చీఁది." కాళ. ౨, ఆ. ౧४౭. "గీ. జిఱ్ఱుమని చీఁద రెవ్వారు చిత్రకలన." ఉద్భ. ౧, ఆ. ౧౦౭.

చీఁదుడు. దే. వి. (చీఁదుడు. ధా.) నాసికామలమును దొలఁగించుట. ఆం. భా. ద్వి. ౧౭౬.

చీఁపర. దే. వి. ఒకానొకజాతితీఁగ. "క. చీఁపరపాఁపరతీఁగల..." (చాటువు)

చీఁపుఱు. దే. వి. చీఁపురుకట్ట, సమ్మార్జని. (చూ. చీఁపురుఁగట్ట.)

చీఁపురుఁగట్ట. దే. వి. (చీఁపురు+కట్ట.) సమ్మార్జని. "ఉ...చేతిచీఁపురుంగట్టనుఁ దానుఁబొ చ్చి..." కాశీ. ౬ ఆ. ౨౬౨.

చీఁబోతు. దే. వి. చింబోతు, బలిసినమేఁకపోతు. "గీ. సరభసంబునఁ జీఁబోతుఁ జంపి తినిరి." నా. పంచ. 3, ఆ. ౧౫౭.

చీకటి. దే. వి. 1. అంధకారము. "క. నాకొఱకు దీప్చి వచ్చితి, నీకొఱకయ యింక నూతునిం దెగఁజూడన్, లోకము వంచింపను దగుఁ,జీకటికే యొడవె నేమి నేసెదొ చెపుమా." భార. విరా. ౨, ఆ. ౨౭౧. "ఉ. ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధాని...చీకటియుం గళింగ యును..." కాశీ. పీఠి. ౬౦. "క. లోకాలోకముఁలోఁ గలఁ,చీకటి నెల్ల నొకపొడవు నేకొని యెనో..." కు. సం. ౨, ఆ. ౬3. నిర్వ. ౬, ఆ. ౧౦౭.(ఈపదము సానుస్వారముగాఁ గొండఱు ప్రాసముల నిలిపిరి. "ఉ. చీఁకటి కానచిచ్చు భవుచేలకుసుంభము తూర్పుఁ గొండకున్, గూఁకటిరత్న మబ్జరమకూరిమిపంట చకోరరాజిపేఁ,రాఁకటిముంట శోణకిరణావళిగంట రథాంగకేళికిం,దేఁకువ పెంట మింటఁ జనుదెంచె దినేంద్రుఁడు కాలఘంటయై." కాళ. ४, ఆ. ౯౭. "ఉ. అఁకొనిదాడ...కాఁకకు...చీఁకటి...తోఁకల..." రామా. ౭, ఆ. ౬౬. "ఉ. చీఁకటి...తాకు...అట్టాఁకల...కాఁకలవేల్పు..." సుద. ౫, ఆ. ౨౫); 2. దుఃఖము. "ఉ. చీకటి రాజశేఖరునిచీకటితోడనె కూడి పాయఁగా..." ద్వా. ౬, ఆ. ౦౦; 3. రాత్రి, చీకటిగలరేయి. "శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనికి వేరు కిం,చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలుత్సే కంబుతోఁ జీకటిన్, భద్రాకారులఁ జిన్నపాపల...సంహరింప నకటా నీచేతు లెట్లాడెనో." భాగ. ౧, స్కం. ౧౬౧.

చీకటిగాము. ద్వ. వి. (చీకటి+గాము.) రాహువు. (శ. ర.)

చీకటిగుండెవిగులు. దే. వి. (చీకటి+గుండెవిగులు.) సూర్యుఁడు. వేంక. దేవ. ౧౨.

చీకటిగొంగ. దే. వి. (చీకటి+గొంగ.) సూర్యుఁడు. "సీ. ఆకశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై చీకటిగొంగ వాఁడమె." భాగ. ౯, స్కం. ౮. ఆం. సం. దేవ. ౧౬. [(శ. ర)

చీకటిచెట్టు. దే. వి. (చీకటి+చెట్టు) తమాలము.

చీకటితప్పు. దే వి. (చీకటి+తప్పు.) జారత్వము, వ్యభిచారము. "సీ. చీకటితప్పుచేసిన సరోరుహనేత్ర గూబయై వసియించుఁ గోటరమున." కాశీ. ౨, ఆ. ౮౦. నైష. ౭, ఆ. ౪౨.

చీకటిమొటికాయ. దే. వి. (చీకటి+మొటికాయ.) మోము గప్పి తలపై మొట్టి ఎవరు మొట్టిరని యడుగునట్టి కూట. "సీ. చీకటిమొటికాయ చింతాకు..." హంస. ౩, ఆ. ౧౪౬.

చీకటిమొటేకిళ్లు. దే. వి. బ. (చీకటి+మొటికిళ్లు) బాల్యక్రీడావిశేషము. "సీ. చీకటిమొటికిళ్లు చిమ్ముబిల్లలు..." వి. పు. ౭, ఆ. ౨౦౨.

చీకటియీఁగ. దే. వి. (చీకటి+ఈఁగ.) చిన్నదోమ. (శ. ర.)

చీకటివిరిచుక్క. దే వి (చీకటి+విరిచుక్క.) శుక్రుఁడు, తెల్లవారుజామున పొడిచెడిచుక్క. "ద్వి. కడు దూర మరిగి చీకటివిరిచుక్క, పొడుచువేళకుఁ గృష్ణపురిఁ జేర వచ్చి." ద్వి. పరమ. ౭, ఆ. ౯౩౦. ౭, పం.

చీకటివేరువిత్తు. దే. వి. (చీకటి+వేరువిత్తు.) చీకటిని పోఁగొట్టునతఁడు, చంద్రుఁడు. 'గీ. వేలుపుల బువ్వ చీకటివేరువిత్తు." ఆం. సం. దేవ. ౧౯.

చీకటులమిత్తి. దే. వి. (చీకటులు+మిత్తి) చంద్రుఁడు "గీ. కందు గలమండగీఁడు చీకటుల మిత్తి." సాం. ని. దేవ. ౧౦.

చీకట్లుగొను. దే. అ. క్రి. (చీకట్లు+కొను.) చీకటితో నిండు. "గీ. కరము భూనభోంతరము చీకట్లు గొనియె." కళా. ౪, ఆ. ౮౮.

చీకర. దే. వి. అమ్ము. "క. ఈకరణి విధునికరములు. శ్రీకాంతాసుతునిచివురు చీకరలగలిన్, దాఁకఁగ." కృ. శకుం. ౨, ఆ. ౧౯౭.

చీకాకు. దే. వి. (చీకు+ఆకు.) 1. చివికినయాకు. (శ. ర.); 2. కలఁత, క్షోభ, (చూ. చీకాకుపడు.); 3. శ్రమము, ఆయాసము. "క... వేల్పులు, చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరిదక్కన్." భాగ. ౮, స్కం. ౨౭౮. విశ. 1. బాధనందినది. "క. చీకాకగుచును వేలుపులు..." య. ౨, ఆ. ౧౦౭; 2. చెదరిపోయినది. "క. చీకాకగు ధైర్య మెడలఁజేయుఁడై మరుఁడున్." ౨, ఆ. ౨౬. "శా... చీకాకై పోయెను జోక నొచ్చి చని రాకంపింప సర్వాంగముల్." ఉ. రా. 3, ఆ. ౨౮౯; 3. కలఁగినది. "ఉ... చీకాకయి యూరకే యొగదిగం దలపోయుచు నున్నవారికిన్." రామా. ౭, ఆ. ౯౬.

చీకాకుచేయు. దే. అ. క్రి. (చీకాకు+చేయు.) 1. చెదరఁగొట్టు. "సీ. పై మిన్ను వ్రాలినఁ బదరని ధైర్యంబుఁ గటకటా కలఁచి చీకాకుచేసె." చంద్రా. ౪, ఆ. ౯౬; 2. కలఁచు. "సీ. పదియును నిర్వదియును ముప్పదియును నల్వది చొచ్చె కదుపులు చెదరఁ జీకాకుచేయు." శుక. ౧, ఆ. ౧౭౦.

చీకాకుపడు. ద్వ. అ. క్రి. (చీకాకు+పడు.) 1. కలఁగు. "ద్వి. చీకాకుపడియె నాశేషలోకంబు." రం. రా. ఉ. ౨౧. పా. ౨౦. పం. "వ... కాంది శీకత్వంబునఁ జీకాకుపడియు..." కాశీ. ౬, ఆ. ౨౯౨; 2. చెదరు (చూ. చీకాకుపఱుచు.)

చీకాకుపఱుచు. ద్వ. స. క్రి. (చీకాకుపడు. ధా. ప్రే.) 1. చెదరగొట్టు. "క. కేకయుఁ వేవురబలములు, నాకుతలంబాద మార్గణాసారమునం, జీకాకుపఱిచె భీష్ముఁడు..." భార. భీష్మ. ౧, ఆ. ౨౯౯. ఉ. హరి. ౬. ఆ. ౧౧౮; 2. ముక్కలు ముక్కలగు. "గీ. అలసవళితంబులైనకటాక్ష వీక్షణాంచలంబుల యుంవధైర్యకంచుకములు చించి చీకాకుపఱిచి..." వైజ. ౧, ఆ. ౧౩౧; 4. పాడగు. ధ్వంసమగు. "వ... పౌండ్రభూపాలుండు యదువీరునగరంబుకలుఁగోట..." చీకాకుపఱిచియు..." ఉ. హరి. 3, ఆ. 3౬.

చీకిరేను. దే. వి. వృక్షవిశేషము. "ఆ. చిల్ల చింత మొగలి చీకిరే నూడుగు." వేం. పంచ. ౪, ఆ. ౯౨౨. హంస. ౪, ఆ. ౧౧.

చీకిలించు. అ. క్రి. మిఱుమిట్లుగొను. "సీ. చీకిలించుక యుండుఁ జిగురుజెప్పులలోనఁ గుసుమశాయకవైరి కొనలికన్ను." కాశీ. 3, ఆ. ౧౯౫. స. క్రి. కన్నులుమాటిమాటికి మూసితెఱచు. "ద్వి... నేత్రములు, చీకిలింపుడు..." అ. మ. క. ౫, ఆ. ౨౩౮. పా. ౨౦. పం.

చీకిలిమాకిలి. దే. విశే. కొక్కిరిబిక్కిరి, వంకర. "క... చీకిలిమాకిలిగా నల్లిన, చెలఁది తెరల్ సూచి సంత సించుటలేదే." సా. ౧, ఆ. ౧౫.

చీకు. దే. విశే. అంధము, గ్రుడ్డిది. "ఉ. కన్నులు చీకులై..." భార. శల్య. ౧, ఆ. ౧౬. భార. సభా. ౨, ఆ. ౧౮; 2. చివికినది. "సీ. మాటికి మాటికి నొకపేదమానిసి నెన్నుచుఁ జీకున కెంతయుఁ జేవ యిచ్చుచు." అచ్చ. యు. 3౬. "సీ. చీకుదాసర్లకు జీతముల్ సహాజముల్..." వేఁకు. ౭౮. వి. 1. అంధకారము, చీకటి. "ఉ...నభ మంతయుఁ జేకొని చీకు పర్వ..." ద్వా. 3, ఆ. ౯౦; 2. అంధ్యము, ఏమి చేయ వలెనో తెలియదు. "క. శోకము హర్షము వెఱఁ గును, జీ కొనరింపంగ..." సా. 3, ఆ. ౨౦౨. స. క్రి. 1. చప్పరించు. "సీ. ఎగిచి గీఱికజాఱ లేర్పడఁ దుదముట్టఁ జీకినఁ బులిపచ్చికేకసములు." ఆము. ౬, ఆ. ౧౭. వసు. ౧, ఆ. ౫౬; 2. చుంబించు, ముద్దువెట్టుకొను, "చ...కుచంబు లంటుచుం, బెనవులు చీకుచున్..." భా. రా. సుం. ౮౦౬; 3. కొఱుకు. "సీ. ఈఁతకాయలెండి రోఁతప్రామిడినోరఁ జీకఁ జేసెర దీనిచిగురు మోవి." సురా. ౫౯. "సీ. విస్ఫురత్తాగ్రరదనులై ప్రేష్ఠ చీకెడి వారి మోము చేర్చి..." వసు. ౧, ఆ. ౫౬.

చీకుకొక్కెర. ద్వ. వి. (చీకు+కొక్కెర) ఒకజాతి కొంగ. (శ. ర.)

చీకుబండ. దే. వి. (చీకు+బండ) జాఱుడుతాయి. "మ...చీకుబండపయిక్ వేడుక నెక్కి జాఱు కొనుచుండన్." నిరం. ౨, ఆ. ౬౯.

చీకురాయి = చీకురువాయి. 1. (ఒకజాతిగబ్బిలము) ఆం. భా. ద్వి. ౯౬; 2. (గబ్బిలము, తైల పాయిక యనునొక గబ్బిలముజాతి) సాం. ని. తిర్య. ౦౧. "ఆ...శమము నల్దిక్కులఁ గ్రమ్మఁ జీకురాలరవము లెసఁగె." చెన్న. ౨, ఆ. ౨౦౭; 3. ఇలకోడి. (బ్రౌ.)

చీకురించు. దే. అ. క్రి. అంధమగు. "సీ. పంకేరు హంబులు బాగుగా వికసించె ఘూకముల్ కన్నులు చీకురించె." సురా. ౧౧౬.

చీకురువాయి. దే. వి. (క. చీకురువాయి) 1. ఒకా నొకజాతిగబ్బిలము. "ద్వి. కుఱుకులుగట్టి చీకురు వాయు లడరె." ద్వి. హరిశ్చ. పూ. ౧౦౮౨; 2. ఇలకోడి, చిమ్మటపురుగు. "సీ. అలివ చీకురు వాయి యాలాపముల పేర..." గంధ. ౧౮౧.

చీకువాలు. దే. వి. చీకటి. "క...రూపింపఁగ జీకు వాలు రోదసి నిండెన్." భా. రా. యు. 3౫. "ఉ...చీకువాలు పెంపారె జగంబు బెగ్గలము నచ్చెరుపాటును బొంద .." దశ. ౬, ఆ. ౬౦.

చీకొట్టు. దే. స. క్రి. (చీ+కొట్టు) చీచీ యను, నిందించు. "క. కోకలు డబ్బులు సొమ్ములు, జోకలు గలయట్టి నరులఁ జూచిన సభకుం, గైకొని యిటు రమ్మందురు, చీకొట్టుదు రందఱును గుచేలుండైనన్." కుచేల. ౨, ఆ. ౩౨. చమ. ౨, ఆ. ౦౯.

చీటకము. వై. వి. రీతి, విధము. "గీ. హస్తములు రెంట నందంద యదిమి యదిమి, తాటిపం డార గించెడిచీటకమున." కాశీ. ౫, ఆ. ౦౧.

చీటము. దే. వి. 1. శృంగారచేష్ట. "వ...తారా దేవిమీఁదఁ దారకారాజు వలపుచీటంబు వాటంబుసేయుం లలితకటాక్ష...విక్షేపంబులును ..." హర. ౫, అ. 3౯; 2. క్రీడ, ఆట. క...కాటెఱుకు కోఱివింటన్, చీటంబున వేడ్క యొల్లఁ జెఱచితిగదరా." హర. ౭, ఆ. ౭౨.

చీటి. దే. వి. (క. చీటి, త. చీట్టు.) 1. చిన్నవ్రాఁత గలకాకితము, ఖండపత్త్రిక "గీ. మును కళా వంతుఁ డానతిచ్చినసుభాషితము లిఖించినచీటి ..." శుక. ౧, ఆ. ౧౨౧. ఆం. భా. ద్వి. ౧౦౦; 2. జాబు, ఉత్తరము. "సీ. చెక్కుచెమ్మట చేలకొఱఁగునఁ దుడుచుట చెలిమికి నదితుదిచీటి యేమొ." ఉ. రా. ౬, ఆ. 3౦౨; 3. ఆజ్ఞా పత్త్రము. "సీ. తనచీటి యష్టదిక్తటు లేలువేల్పుల జిలువపాగల తురాచెలువు చూడ." దశా. ౧, ఆ.

౧౧౯. శుక. ౪, ఆ. ౧౨; 4. అర్ధకపుగుడ్డ. (బ్రా. వా.)

చీటికిమాటికి. దే. అవ్య. ద్వి. (చీటికిన్+మాటికిన్) 1. మాటిమాటికి. "ఉ. చీటికిమాటికిం దెసలు చిల్లులువోవఁగఁజేసె హేషలన్." కాశీ. ౪, ఆ. ౨౭౦. ఆం. భా. తృ. ౭౦; 2. నిష్కారణముగా "ద్వి. చీటికిమాటికిఁ జెడుదురే బుధులు." రం. రా. అర. ౧౫౫. పౌ. ౨౨. పం.

చీడ. ఉభ. దే. వి. 1. సస్యాదులను పాడొనర్చు ఒకానొకపురుగు. "క. వనజములు చీడ విడి విక, సనలక్ష్మీగృహము లయ్యె..." జాహ్నవీ. ౨, ఆ. ౧౪౪. ఆం. భా. ద్వి. ౧౨౪; 2. బాధ, వ్యథ. (బ్రా. వా.) సం. వి. ఆ. స్త్రీ. దేవదారు. విశేషము.

చీడపురుగు. దే. వి. (చీడ+పురుగు) సస్యాదుల పాడొనర్చుపురుగు, "ఆ. చీడపురుగు జేరి చెట్టుఁ జెఱుచు." వేమ. ౧. భా. ౧౭. ఆం. భా. ద్వి. ౦౭.

చీదు. దే. వి. విదుపుంజములనూలు. (శ. ర.); 2. ఒకానొకవృక్షవిశేషము. (వా.)

చీదుదబ్బ. దే. వి. (చీదు+దబ్బ) వెదురుబద్దలతో సుమ్మటమువలె కట్టఁబడిన సాలెవానిసాధనము. "సీ. పరివరియచ్చులు చరికుండ యూడిత చీదు దబ్బలు దండె..." హంస. ౨, ఆ. ౧౧.

చీత్కారము. సం. వి. అ. పుం. గాడిద వినఁగు మున్నగువానిరొద.

చీత్కృతము. సం. వి. అ. న = చీత్కారము.

చీనకర్పూరము. సం. వి. అ. పుం. చీనాదేశమందుఁ దయారగునొక రకముకర్పూరము.

చీనజము. సం. వి. అ. న.— చీనదేశమునఁబట్టినది. ఉక్కు. [సీసము.

చీనపిష్టము. సం. వి. అ. న. 1. సిందూరము; 2.

చీనము. సం. వి. అ. న. 1. సీసము; 2. పుం. చీనా దేశము; ఒకజాతిజింక; 3. పీతముద్గము, పచ్చ పెసరలు; 4. మాను; 5. వస్త్రవిశేషము. (చీనదేశ మందలిది.)

చీనవంగము. సం. వి. అ. న. సీసము.

చీనా. వై. వి. (సం. చీనః. క. చీనా.) 1. చీనా దేశము. "వ...చీనానూలిత్రాష్ట..." ప్రబంధ ౬౦; 2. చీనాదేశపుమెత్తనిచక్కెర. (వా.)

చీనాంబరము. సం. వి. అ. న. చీనదేశమునందు నేసినబట్ట- పట్టుచీర.

చీనాంశుకము. సం. వి. అ. న. = చీనాంబరము.

చీనాకము. సం. వి. అ. పుం. కర్పూరము.

చీనాపంచదార. ద్వ. వి. (చీనా+పంచదార) చీనా దేశమునఁ దయారయి ఇసుకవలె నుండుచక్కెర. (వా.)

చీని. వై. విశ. (సం. చీనః. క. చీని) చీనదేశసంబంధమైనది. (చూ. చీనిచక్కెర.)

చీనిచక్కెర. వై. వి. (చీని+చక్కెర.) ప్రశస్తమైనపంచదార. "ద్వి. ఫలవిశేషంబులు పాయ సాన్నములు, చిలువాలు వెన్నలుఁ జీనిచక్కెరలు." రం. రా. బాల. ౫౩. పౌ. ౨౧. పం. దశా. ౨, ఆ. ౨౩౦.

చీనిపావడ. ద్వ. వి. (చీని+పావడ) ప్రశస్తమైన లంగా. "చ. తొడవులు పుచ్చి నిర్జరవధూటులు వేలుపుమానిచీనిపా, వడలు ధరించి..." పారి. ౪, ఆ. ౨౪.

చీనీలు. దే. వి. బ. వస్త్రవిశేషములు. "వ...పచ్చ పట్టులు చీనీలు సేలువలు..." ప్రబంధ. ౬౧౫. హంస. ౫, ఆ. ౩౫౬.

చీపర. దే. వి. ఒకజాతిపక్షి, ఆతాయి. (శ. ర.)

చీపి. దే. వి. 1. ఒకవిధమగునేత్రరోగము. "సీ... చీపికన్నులఁ బుసు లేపుమీఱ." చంద్ర. వి. ౧, ఆ. ౬౯. వి. పశురోగవిశేషము. (బ్రా.)

చీపు. దే. వి. అరఁటి అస్తమునందలి యొకభాగము. ఆం. భా. ద్వి. ౫౮.

చీము. దే. వి. పిపీలిక. (దీనిలోనిభేదములు. చలిచీము, కండచీము, కొండచీము, పుల్లచీము, మొ.) "గీ. చెలఁగి యార్పెను మశకంబు చీమ నల్లి." కాశీ. ౬, ఆ. ౭౯. "ఉ. చీమవితంబునం బరువు సేయనివాని..." పార్వ. ౩, ఆ. ౧౭౫. ఆం. భా. ద్వి. ౦౦.

చీముచింత. దే. వి. (చీము+చింత) ఒకవిధమైన ముండ్లు గలచెట్టు. (వా.)

చీమచిప్పుర. దే. వి. (చీమ+చిప్పుర) తృణవిశేషము. "గీ. చీమచిప్పుర చిప్పుర చేఁతిబోధ." హంస. ౫, ఆ. ౪౫.

చీమిడి. దే. వి. నాసామలము, సింహాణము. "సీ...పుసులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు" ...ద్వా. ౧, ఆ. ౧౦౦.

చీము. దే. వి. చెడిపోయి తెల్లనైన నెత్తురు, పూయము. "క. మొదవులు నెత్తురుఁ జీమును..." భాగ. 3. స్క. ౬౦౯. ఆం. భా. ద్వి. ౧౩౨.

చీముపట్టు. దే. అ. క్రి. (చీము+పట్టు) చెడినరక్తముచే నిండు, చీముగలది యగు. వ్యవ:—పప్పు తినుటచే పుండు తిరిగి చీముపట్టునది.

చీముపోయు. దే. అ. క్రి. (చీము+పోయు) చీముపట్టు. (నా.)

చీముంత. దే. వి. చెంబు, ముంత. (శ. ర.)

చీములుంగట్టు. దే. అ. క్రి. (చీములు+కట్టు.) (చీముపట్టినపుండు కలవానివలె) బాధచెందు. "చ. పుడమిజనంబు లెల్ల నినుఁ బ్రవ్వఁగఁ దిట్టఁగ వించు నుస్కి నొచ్చెదు మది యెప్పుడున్ చెవులు చిములుంగట్టెడుఁ గౌరవేశ్వరా." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦.

చీర. వై. వి. (సం. చీరమ్. క. సీరె.) 1. వస్త్రము, బట్ట. "వ...రజకుఁ బొరిగొని కొనియెఁ జీరలు ..." హరి. ఉ. ౫, ఆ. ౨౭౬. "క. పేరు వలలుండు కూడును,జీరయు నిడి..." భార. విరా. ౧, ఆ. ౨౧౯; 2. స్త్రీలు ధరించుకోక. "చ... తనువల్లి యుంచ్చికం,చల తెగిపడ్డఁ గేతనము చీర చెఱంగున మూసెఁ జన్నులన్." స్వా. ౫, ఆ. ౬౪. ఆము. ౨, ఆ. ౨౩.

చీరచాప. ద్వ. వి. (చీర+చాప.) పడవలకుఁ గట్టు తెరచాప. (బ్రౌ.)

చీరచింపు. ద్వ. వి. మత్స్యవిశేషము, ఒకజాతిచేప. "ఆ...చీరచింపు జెల్ల నారజెల్ల." ద్వా. ౧, ఆ. ౨౪౦.

చీరచిక్కు. ద్వ. అ. క్రి. (చీర+చిక్కు.)—చీర చాలకపోవు—గర్భిణి యగు. "ఉ...కనుంగప స్తైరుఁగు లేర్పడె నప్డు మనంబుఁ గోరికల్, పెక్కువిధంబులై పొదలెఁ బ్రీతిగ నాతికిఁ జీర చిక్కెనన్." ద్వా. 3, ఆ. ౨౮. "మ. నెల రెణ్ణెల్లకుఁ జీరచిక్కెఁ ద్రిజగన్నిర్మాతయిల్లాలికిన్." కాశి. ౨, ఆ. ౭౮.

చీరణము. దే. వి. (క. చీరణ.) చిన్నయులి, చెక్కుడు పనిముట్టు. "సీ. కొడిదిపూసలు నంటుకొలిపిన మొలత్రాడు తలదుద్దు చీరణంబుఁ బొదియును." వెం. పంచ. ౧, ఆ. ౯౫౦. హంస. ౨, ఆ. ౧౮౧.

చీరపట్టు. ద్వ. వి. (చీర+పట్టు.) చీరపేను. (బ్రౌ. శ. ర.)

చీరపేను. ద్వ. వి. (చీర+పేను.) బట్టనంటుకొని యుండు తెల్లనిపేను. (శ. ర.) "వ...పేను నల్లి చీరపేను లోనైనజంతువులం జంపక..." భార. అను. ౫, ఆ. ౫౪. నా. పంచ. ౧, ఆ. ౩౦౨.

చీరపోతు. ద్వ. వి. (చీర+పోతు.) చీరపేను. (శ. ర. బ్రౌ.)

చీరము. సం. వి. అ. న. 1. వస్త్రభాగము, పీలిక; 2. నారబట్ట, వల్కలము; 3. గతి, రేఖ; 4. జుట్టు; 5. త్రపువు; 6. జిలుగువ్రాఁత; 7. సరము, హారము.

చీరావి. ద్వ. వి. (చీర+ఆవి.) కంటికి దెబ్బ తగిలినప్పుడు బట్ట నోటిలో నిడి ఊఁదికలిగించు వేఁడి, నోటియావిరి. "ద్వి. చీరావి గొని కంటఁ జేర్చి హత్తించి." బస. 3, ఆ. ౦౪. పా. ౭౭౫. పం.

చీరి. ఉభ. దే. వి. చీరిక, లేశము. "ఉ. వేయును నేల పార్థులును విష్ణులు నేఁబదివేలు వచ్చినన్, జేయుదు మేము గయ్యి మొకచీరియుం సంపదఁ బంచి యిత్తుమే." భార. ఉద్యో. ౪, ఆ. ౨౦౧; 2. లక్ష్యము. "సీ. ఎత్తుపడ్డమహాకుభృత్తుల నతులిత ధృతిఁ జీరికిఁ గొననిధీరభటులు." వసు. ౨, ఆ. ౧౫౨. నిర్వ. 3, ఆ. ౧౦౮. "మ...నృపాలుండు భిటెతరుం డయిన శత్రుల్ చీరికిం గొందురే." ఉ. రా. ౭, ఆ. ౬౯. సం. వి. ఇ. స్త్రీ. 1. కన్నులకుఁ గట్టుగంత; 2. ఈలపురుగు; 3. గోఁచి.

చీరిక. ఉభ. దే. వి. 1. చీలిక, ముక్క. "సీ. చికిలి తూపున మూఁడుచీరిక ల్గా జివ్వ సించి." కవు. ౫, ఆ. ౦౭; 2. చింపిగుడ్డ. ఆం. భా. ద్వి. ౧౫౭. సం. వి. ఆ. స్త్రీ. ఈలపురుగు.

చీరు. దే. స. క్రి. (క. చీరు) 1. చీలుచు. "ఉ... శాత్రవకుంభకుంభముల్, చీరుచు..." భార. ఆర. ౬, ఆ. ౧౮౭. "గీ. నగరపరిఖాపయఃపూరణంబు సేయ,సీరముఖమునఁ గాళిందిఁ జీరి తెచ్చె." ఉ. హరి. ౧, ఆ. ౮; 2. గోకు, గీఱు. "సీ. చప

లాక్షీచూపులచాడ్పున కెరద మెచ్చుఁ జిక్కని చనుగవ చీరఁ గోరు." భార. ఆది. ౩, ఆ. ౩౮; ౩. పిలుచు, ఆహ్వానముచేయు. "శా. ఈరూపం బున సంస్కృతిం దొఱఁగి మీ రేచింతలం జెంతలం, జీరం గోరక..." ఉ. హరి. ౪, ఆ. ౧౯. "సీ. తమమ్రోల నుండునందలముఁ గానక దాఁటి పే రెలుంగున బెస్తఁ జీరువారు." ఆము. ౫, ఆ. ౭; ౪. ఖండించు, ముక్కలుచేయు. "ఉ...రథంబుఁ బగిల్చి కేతువుం,జీరి..." భార. అశ్వ. ౪, ఆ. ౧౦౪. ఆం. భా. తృ. ౧౭౬.

చీరుక. సం. వి. ఆ. స్త్రీ. ఝిల్లి, ఈలపురుగు. (శ.ర.)

చీరుడు. దే. వి. (చీరుధా.) 1. చీల్చుట, విదారణము (శ. ర.); 2. పిలుపు, ఆహ్వానము. ఆం. భా. ప్ర. ౧౧౨.

చీరువాఱు. దే. అ. క్రి. (చీరు+పాఱు.) పిలుచు? "సీ...సిగ్గువఱుంగునఁ జీరువాఱు." శ్రీరాధా. ౫, ఆ. ౧౪౭.

చీర్ణపర్ణము. సం. వి. అ. పుం. 1. ఖర్జూరము?; 2 వేఁపచెట్టు.

చీర్ణము. దే. వి. సం. విశే. (అ. ఆ. అ.) 1. చేయఁ బడినది; 2. నేర్వఁబడినది; ౩. సంపాదింపఁబడినది; 4. చీల్పఁబడినది.

చీఱు. దే. అ. క్రి. పలవించు, రోదించు. "క. పాఱుఁడ ముదిసినవాఁడన్, గాఱడవిం దెరువు దప్పి గాదిలిసుతునిం,జాఱకు నొప్పించితి నని, చీఱితి నెలుఁగెత్తి వారిచేరువఁ గలయన్. వ...ఇట్లు పలవింపఁగ." దశ. ౨. ఆ ౭౨, ౭౩. స. క్రి. 1. చీరు, గీరు; 2. చీల్చు. (శ. ర.); 3. పిలుచు,ఆహ్వానముచేయు. "ఉ...ఆఱు మొగంబు లాతఁడు...ఆఱుమ ఖాంబులుఁ...ఆఱుమఖాంబు లయ్యెడి...నవ్వుచుం, జీఱుట యోగివర్యునకుఁ జింత్యమగున్..." భో. ౫, ఆ. ౨౦౧; 4 వదరు, తొందరమాటలాడు. "ఉ...నీకొఱగాని వాక్యముల్, చీఱక శంభుఁ గొల్వుము..." పద్మ. ౭, ఆ. ౫౭.

చీఱుడు = చీరుడు. (శ. ర.)

చీలమండ. దే. వి. (చీల+మండ. క. చీలమండె.) గుల్ఫము, కాలివేలు. ఆం. భా. ద్వి. ౧౩౫.

చీలమన్ను. దే. వి. జా. (త. చీలైమణ్.) పుటము వేయుపాత్రలకు గుడ్డ చుట్టి పూయుమన్ను. (వా.) మూసకు పూయుమన్ను. (బ్రౌ.)

చీలి. దే. వి. 1. పిల్లి, మార్జారము. వెంక. తిర్య. ౯౨. (శ. ర.); 2. పిల్లిని పిలుచునపు డుచ్చరించు నుడి. (బ్రౌ); 3. తాచ్ఛీల్యమున వచ్చుతద్ధిత ప్రత్యయము. "సీ. జగడాలచీలివై సవతితోఁ బోరాడి వీఁగి వచ్చియిచ్చట డాఁగితొక్కొ." (చాటువు.)

చీలిక. ఉభ. దే. వి. బద్ద, పాయ. "వ...మేఘ మాలికలఁ జీలికలు సేయ..." ఉ. రా. ౩, ఆ. ౨౪౬. చంద్రా. ౩, ఆ. ౧౫. స.. వి. అ. స్త్రీ. ఈలపురుగు. (వాచ.)

చీలిగాఁడు. దే. వి. (చీలి+కాఁడు-స్వార్థమున.) పిల్లి. బిడాలము. "ఉ. తత్తరపాటుతో నెలుకదారికిఁ గాఁచినచీలికాని గో,రొత్తుల సోకుం బడుటకు..." గంధ. ౬౪.

చీలు. దే. అ. క్రి. 1. విదారితమగు, బద్దలగు. "దండ...ప్రాలేయశైలాది కుత్కీలముల్ చీలె..." దశా. ౪, అ. ౨౩౨; 2. చెడు, నశించు. "ఉ...లోఁ,జేవగొనంగ లేక ధృతి చీలఁగ మాకము దూల..." భా. రా. అయో. ౪౦.

చీలుచు = చీల్చు. (చూ. చీల్చు.)

చీల్చు. దే. స. క్రి. 1 నఱకు, ఖండించు. "వ...కొమ్ములఁ,జీల్చుచు..." ఉ. రా. ౨, ఆ. ౬౧; 2. చీరు, ముక్కలుచేయు. "చ...భైరవాశ్వ పం,క్తులు పదివైదు లొక్కమొగిఁ, దూఱినఁ గోఱలఁ జీర్చివైచుచున్." ఉ. రా. ౭, ఆ. ౪౧౫.

చీవరము. సం. వి. అ. న. 1. సన్న్యాసి, అడుగుకొను వాఁడు; 2. సన్న్యాసివస్త్రము. (శ. ర.)

చీవట్లమారి. దే. విశే.(చీవాట్లు+మారి.) చీవాట్లులు తినువాఁడు, అల్లరచిల్లరవాఁడు. "గీ. ధర్మవిదుఁ [illegible] చేసు నొక్కొక్క

చీవాట్లు. దే. వి. బ. (చీ+వాటులు.) నిందావాక్యములు, తిట్టులు. (చూ. చీవాట్లుమారి.)
చీవాట్లులిను = చీవాట్లుపడు. (వా.)
చీవాట్లుపడు. ద్వ. అ. క్రి. (చీవాట్లు+పడు.) నిందావాక్యము లనుభవించు. (వా.)
చీవాట్లుపెట్టు. దే. స. క్రి. (చీవాట్లు+పెట్టు.) గర్హించు, నిందించు. (వా.)
చీవ్రక. దే. వి. ఒకజాతిగబ్బిలము. ఆం. భా. ద్వి ౯౪.
చీళితపెట్టు. దే. స. క్రి. (చీళితము+పెట్టు.) తోలగఁబెట్టు, రాల్చు. "ఉ. వాలుగడాలు వానిదళవాయి వసంతుఁడు చైత్రయాత్రకై, సాలములందు జీర్ణదళసంఘము చీళితపెట్టి క్రొత్తఁగా, మేలిదళంబులన్ నిలిపి..." శశాం. ౨, ఆ. ౧౧౨. (చీళితబెట్టు. ముద్రి.)
చీళితము. దే. వి. తోలఁగుట; రాలుట. (చూ. చీళితపెట్టు.)

చు

చుంబరి. సం. వి. ఈ. స్త్రీ. చింతగింజలతో నాడు ఆట.
చుంచువు. సం. విణ. (ఉ.) ప్రసిద్ధము, నేర్పుగలది. (ఉదా:—విద్యాచుంచువు.)
చుంటి. సం. వి. ఈ. స్త్రీ. 1. బావి; 2. నిపానము, నూఁతిదగ్గఱిజలాశయము. (వాచ.)
చుంది. సం. వి. ఈ. స్త్రీ. తార్పుకత్తె. (వై. వి.)
చుంబ. సం. వి. ఆ. స్త్రీ. ముద్దు, చుంబనము. "(చుంబావిరామే వదనం ప్రమార్ష్టి." వాచ.)
చుంబకము. సం. వి. అ. పుం. 1. త్రాసుముల్లు; 2 సూదంటురాయి.
చుంబకుఁడు. సం. విణ. (అ. బీ కా. అ.) 1. ముద్దిడువాఁడు; 2. ధూర్తుఁడు, పోకరుబోతు; 3. అన్నివిషయములను కొంతకొంత తెలిసినవాఁడు; 4 స్పృశించునది. "శ్లో. జంభారిమాళిమందారమాలికామధుచుంబికః, పిబేయుం రంతరాయాబ్ధింహేరంబపదపాంసవః." కుందమాల. ౧, అం. ౧. శ్లో.
చుంబనము. సం. వి. అ. న. ముద్దు.
చుంబనీయము. సం. విణ. (అ. ఆ. అ.) చుంబింపఁదగినది.
చుంబయము. సం. వి. అ. పుం. ముద్దు. (వాచ.)
చుంబిక. సం. విణ. (బు. త్రీ. బు.) చుంబనము చేయునతఁడు.
చుంబితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ముద్దిడఁబడినది; 2. తాఁకఁబడినది; 3. తెలిసికొనఁబడినది.
చుంబితవ్యము. సం. = చుంబనీయము.
చుంబ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) ముద్దుపెట్టుకొనఁబడుచున్నది.
చుంబ్యము. సం. = చుంబనీయము.
చుక్కారము. సం. వి. అ. పుం. సింహనాదము. (త్రి. ని.)
చుక్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. పులిచింతచెట్టు; 2. చింతచెట్టు.
చుక్రము. సం. వి. అ. పుం. పుల్లప్రబ్బచెట్టు. న. 1. పులికడుగు; 2 చింతపండు.
చుక్రిక. సం. వి. ఆ. స్త్రీ. పులిచింతచెట్టు.
చుచువు. సం. వి. ఉ. పుం. నీటిచెంచలిచెట్టు.
చుబుకము. సం. వి. అ. న. గడ్డము.
చుబ్రము. సం. వి. అ. న. మోము.
చుర. సం. వి. ఆ. స్త్రీ. దొంగతనము.
చురి. సం. వి. ఆ. స్త్రీ. బావిదగ్గఱ నున్ననీటిగుంట.
చులంపము. సం. వి. అ. పుం. బాలురను లాలించుట.
చులుకము. సం. వి. అ. పుం. 1. పుడిసిలి; 2. చిక్కని బురద; 3. ముంత; 4. మినుమునింజముపఁగు నీరు.
చుల్లకి. సం. వి. ఈ. స్త్రీ. భాండవిశేషము. (మే.ని.)
చుల్లము. సం. వి. అ. న. అక్షిరోగముచే దడిసిన నేత్రము, చిల్లము. విణ. (అ. ఆ. అ.) పడిసిన కన్ను గలది.
చుల్లి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. చితి; 2. పొయ్యి; 3. మూఁడుముఖములు గలఇంటి.

చూ

చూడ. సం. వి. ఆ. స్త్రీ. 1. సిగజుట్టు; 2. చౌలము; 3. దండకడియము; 4. నెమిలిజుట్టు; 5. బావి; 6. వలభి, 7 చివర, అగ్రము; 8. శిరస్సు, తల.
చూడకము. సం. వి. అ. పుం. 1. బావి; 2. అగిసెచెట్టు; (వై. ని.)
చూడాకరణము. సం. వి. అ. న. చౌలము.
చూడాకర్మము. సం. వి. న్. న. = చూడాకరణము.
చూడామణి. సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. 1. శిరముమానికము; 2. గురిగింజ; 3. గ్రహణము. విణ. శ్రేష్ఠము. (ఉదా: గోపాలచూడామణి.)

చూడామ్ణము. సం. వి. అ. న. చింతపండు.
చూడాల. సం. వి. ఆ. స్త్రీ. 1. నాగముస్తెలి; 2. ఒకరకపుముస్తె.
చూడాలము. సం. వి. అ. న. శిరము, తల. విణ. (అ. ఆ. అ.) జుట్టు కలది.
చూడికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చూడాలుఁడు, జుట్టుకలవాఁడు.
చూతము. సం. వి. అ. పుం. 1. మామిడిలి; 2. నూయి (మే. ని.)
చూతకము. సం. వి. అ. పుం. మామిడిలి.
చూరి. సం. వి. ఈ. స్త్రీ. నూయి. (విల్యమ్సు.)
చూర్ణకము. సం. వి. అ. పుం. సక్తుపిండి. న. ఒకానొకకావ్యవిశేషము. విణ. (అ. ర్ణికా. అ.) గుండ చేయునది.
చూర్ణకారుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. గుండ చేయువాఁడు; 2. ఒకానొకసంకరజాతివాఁడు; 3. గుల్ల కాలుచువాఁడు, ముగ్గు చేయువాఁడు.
చూర్ణకుంతలములు. సం. వి. అ. పుం. బ. ముంగురులు, అలకలు.
చూర్ణఖండము. సం. వి. అ. పుం. న. కంకరరాయి.
చూర్ణనము. సం. వి. అ. న. పొడిసేయుట.
చూర్ణనీయము. సం. విణ. (అ. ఆ. అ.) గుండచేయఁదగినది. [(రాజ. ని.)
చూర్ణపారదము. సం. వి. అ. పుం. ఇంగిలీకము.
చూర్ణము. సం. వి. అ. పుం. న. 1. పిండి, పొడి; 2. ధూళి; 3. గందవొడి; 4. పొడిసేయుట. 5. సున్నము. విణ. (అ. ఆ. అ.) తగులఁబెట్టఁబడినది.
చూర్ణయమానము. సం. విణ. (అ. ఆ. అ.) గుండ చేయఁచున్నది.
చూర్ణయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) పొడి చేయునది.
చూర్ణయితవ్యము. సం. = చూర్ణనీయము.
చూర్ణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. గవ్వ. 2. గద్యభేదము; 3. మహాభాష్యము; 4. నూఱుగవ్వలు.
చూర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పిష్టము; 2. గద్యభేదము.
చూర్ణ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) గుండ చేయఁబడుచున్నది.
చూర్ణ్యము. సం. = చూర్ణనీయము.
చూర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తిరుగుట; 2. పోవుట.
చూల. సం. వి. ఆ. స్త్రీ. 1. జుట్టు; 2. చంద్రశాల.
చూలము. సం. వి. అ. పుం. వెంద్రుక. (కల్ప.)
చూలి. సం. వి. ఇ. స్త్రీ. 1. చాపాగ్రము. 2. అప్పము.
చూలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గజకర్ణమూలము; 2. నాటకాంగము; 3. కోడిపుంజునెత్తిపైజుట్టు.
చూలికము. సం. వి. అ. న. గోదుమపిండితో చేసిన వంటకము. పుం. నువ్వులు.
చూష. సం. వి. ఆ. స్త్రీ. 1. నడికట్టు. 2. పీల్చుట. 3. తోలిపోఁకు.
చూషకము. సం. విణ. (అ. షికా. అ.) త్రాగునది.
చూషణము. సం. వి. అ. న. 1. త్రాగుట; 2. పీలుచుట.
చూషణీయము. సం. = చూషితవ్యము.
చూషితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) త్రాగఁదగినది.
చూష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) త్రాగఁబడుచున్నది. [పీల్వఁదగినది.
చూష్యము. సం. విణ. (అ. ఆ. అ.) త్రాగఁదగినది,

చె

చెం. దే. విణ. (ఇది వృత్తిలో చెన్నుశబ్దముమీఁది వర్ణము లోపింపఁగా మిగిలినది. దీనికి నుగాగమము వచ్చును.) శోణార్థకము, ఎఱ్ఱనైనది. (ఉదా. చెంగలువ, చెంగావిమొ.) [౧౪౩.
చెంక. దే. వి. కపోలము, చెక్కిలి. ఆం. భా. ద్వి.
చెంకవేయు. దే. అ. క్రి. (చెంక+వేయు.) చెంప మీఁదకొట్టు. (బ్రా.)
చెంగఁగొట్టు. దే. స. క్రి. (చెంగట+కొట్టు.)ఓడించు. "సీ. సింగంపుగుంపులఁ జెంగఁగొట్టినవాఁడు..." భాను. ౨, ఆ. ౨౦౯.
చెంగనలు. దే. వి. బ. నమస్కారవిశేషము. "రగడ. అవని వటస్థలమందలివిష్ణు శ్రీమూర్తికి నిడె చెంగనలో యని." హంస. ౪, ఆ. ౨౧౩.
చెంగనాలు. దే. వి. బ. 1. చెంగనలు, నమస్కారవిశేషము. "వ...క్షీరాబ్ధిస్థలియందలి శేషశయనునకుఁ జెంగనాలు..." ప్రబంధ. ౮౮౦. ఆం. భా. ద్వి. ౧౭౫; 2. బాలక్రీడావిశేషము. ఆం. భా. తృ. ౪౪; 3. పశువులు వేయుదాఁటులు. "వ...తొంగలించినచెంగలి మేసి చెంగలించి చెంగళ చెంగటఁ జెంగనాలం బొసంగుసాలకదుపుల..." బహు. ౨, ఆ. 3.

చెంగలి. దే. వి. జొ. 1. సమీపప్రదేశము. "క. ఎవ్వరిదానవు నీ పేరెవ్వతె యేమిటికి వచ్చి తిచ్చెంగటికిన్." రసిక. ౩, ఆ. ౨౨. హర. ౬, ఆ. ౧౪. 2. ప్రక్క, పార్శ్వభాగము. "క. ముంగటను సప్తసింధువు, చెంగటఁ గ్రతుపరసి..." భీమ. ౩, ఆ. ౧౨౬; 3. చెంగలిగడ్డి "వ... చెంగలి మేసి..." బహు. ౨, ఆ. ౩. ఆం. భా. ద్వి. ౨౬. విశ. సమీపము, దగ్గఱ. "వ...చెంగటి విమానంబు లెక్కికొని..." ఉ. రా. ౩, ఆ. ౨౯. ఆం. భా. ద్వి. ౨౬.

చెంగలించు. దే. అ. క్రి. 1. పుట్టు. "గీ. సిగ్గుతోఁ గూడి పులకలు చెంగలించె." చిత్ర. భా. ౫, ఆ. ౧౩౦. శేష. ౪, ఆ. ౨౧౬; 2. ప్రకాశించు. "వ...కొత్తతఱచుచు గసగసలివయును జెంగలించు జాంగలప్రదేశంబున..." భీమ. ౩, ఆ. ౫౨. 3. నవ్వు. ఉ...ఎత్తికొనంగఁ బిల్వ నిం, పొందఁగ జేరి పైఁబడుచు నుబ్బునఁ గేరుచుఁ జెంగలించుచున్. కళా. ౬, ఆ. ౨౦౦; 4. అతిశయించు. "చ. కనుఁగొని యద్భుతంబును వికాసము భక్తియుఁ జెంగలింప..." వి. పు. ౨, ఆ. ౩౬౨. హంస. ౩, ఆ. ౧౦౩, 5. వి. వికసించు. "చ. వదనము చెంగలింప నిడువాలికకన్నులు వాడుదేర..." వి. పు. ౬, ఆ. ౯౩; 6. విజృంభించు. "గీ. సింహనాదంబు గావించెఁ జెంగలించి." జై. ౨, ఆ. ౧౫౯; 7. ఉత్సాహపడు. "గీ... బంగారుకొలువుసాల, ముంగలను నిల్చి మదిలోనఁ జెంగలించి." య. ౪, ఆ. ౨౬.

చెంగలింపు. దే. వి. (చెంగలించుధా.) చెంగలించుట. (శ. ర.)

చెంగలికోష్టు. దే. వి. ఒకానొకమందుచెట్టు. (బ్రౌ.)

చెంగలిపట్టు. దే. వి. (చెంగలి+పట్టు) నగరవిశేషము. "శా. అంతం జెంగలిపట్టునం దనరు శేషాద్రీంద్రుసత్పుత్రి యాకాంతారత్నము..." ఆనంద. పీఠి. ౨౦

చెంగలువ. దే. వి. ఎఱ్ఱకలువ. (చూ. చెంగల్వ.)

చెంగలువనేస్తి. దే. వి. (చెంగలువ+నేస్తి.) కలువలకు మిత్రుఁడు. చంద్రుఁడు. గీ. కొదమరాయంచ యంచల మెదలె ననఁగ, గులుకునడ యంద మయ్యెఁ జెంగలువనేస్తి. ప్రబంధ. ౨౯౦. ఆం. భా. ప్ర. ౨౨.

చెంగల్వ. దే. వి. (చెన్ను+కలువ) 1. హల్లకము, ఎఱ్ఱకలువ. "మ. ఇనుఁ డస్తంగతుఁ డైన...జగాచెంగల్వపూములు్కలో, యన..." ఉ. రా. ౪, ఆ. ౧౫౩. ఆం. భా. ప్ర. ౧౬౪; 2. ఎఱ్ఱతామర. "సీ. చెంగల్వపగవాఁడు చెంగల్వచెలికాఁడు కటికచీకటివిందికరమువాఁడు." ఇందు. ౪, ఆ. ౨౧.

చెంగల్వకోష్టు = చెంగలికోష్టు. (త. చెంగోటు) "సీ. చెంగల్వకోష్టును జీలుకపిప్పలియును..." అప్ప. ౨, ఆ. ౪౩౧.

చెంగల్వదొర. దే. వి. (చెంగల్వ+దొర) చంద్రుఁడు "సీ. పాఁపమేపరిపచ్చపలకలఁ జెంగల్వదొర తాలఁ దీర్చినదూలములును. య. ౧, ఆ. ౨౫.

చెంగావి. దే. వి. (చెన్ను+కావి. త. చెంగావి) 1. అందమైనరక్తిమ, మంచిరొంపు. "సీ. మెఱుఁగుఁ గుచ్చెలమీఁద జరతాఱుపని మీఱుచెంగావిరంగారుచీర గట్టి." హంస. ౧, ఆ. ౧౨౦; 2. కుంకుమరంగు గలబట్ట. "సీ. చెంగావి గట్టె నెచ్చెలి యోర్తు..." రాజ. చ. ౩, ఆ. ౧౧౦. ఆం. భా. ద్వి. ౧౫౪.

చెంగు. దే. అ. క్రి. 1. తొలఁగు, పాయు. "గీ. తమము చెంగె ద్విజప్రతాపము చెలంగె." రసిక. ౫, ఆ. ౧౧౯. "సీ...భంగించి మస్మంత చెంగఁద్రోలి. భాగ. ౬. స్కం. ౧౬౨; 2. చలించు, చెదరు, "ఉ. చెంగినతాల్మికల్మి రఘుసింహము." రామా. ౫, ఆ. ౨౨౪. స. క్రి. విసర్జించు, విడుచు. "క. అంగజుని గెలిచె నొక్కఁడ. గాంగేయుఁడు తమకు నలవిగా దని మహిభృత్పుంగవు లీవ్రత మోపక, చెంగిరి నీకలవి యైనఁ జేయుము నియతిన్." జై. ౧, ఆ. ౨౯. వి. 1. కొంగు. "సీ. మొలఁ బింజె పట్టి చెంగులు మాఁటి కట్టినవలిసీరక్కావిదోవతి సెలంగ." నీలా. ౧. ఆ. ౬౦; 2; వాద్యము "సీ. చిటితాళ మనఁగను జెంగు నా జేగంట యనఁ వాద్యభేదంబు లలరుచుండు." ఆం. భా. ప్ర. ౧౨౯. "క. చెంగులు ముఖవీణియలు నుపాంగము..." ప్రబంధ. ౯౩; 3. గంతులు, దాఁటుట మున్నగు

వానియుం దగునసుకరణము. "వ...మేటిపెనం కువం జెంగన నెగసి..."సీలా. ౩, ఆ. ౨౪. (దీని ఆమ్రేడితరూపము చెంగుచెంగు) "సీ. శరభంబు లావరి మరసి పోషింపఁగఁ జెంగుచెంగున దాఁటుసింగములును." శశాం. ౧, ఆ. ౧౯.

చెంచిత = చెంచెత. "క. మంచిఫలంబులు హరిచే, నించి కరాలంబనముల నెగడుచు నిడ క్రీడించెద రంగనఁ జూడుము, చెంచితలం బింఛపత్త్రచేలాంచితలన్." భాగ. ౧౦, స్కం. పూ. ౨౯౩.

చెంచెత. వై. వి. (సం. చఞ్చుక) ఒకజాతికిరాతకస్త్రీ. "గీ. చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము, చెప్పి..."కాశీ. ౫, ఆ. ౨౧. సాంబో. ౭, ఆ. ౧౪౪.

చెంచేడము. దే. వి. ఒకజాతిడేగ. "సీ. జలకట్టె గిద్ద చెంచడ మన శ్యేనభేదములు..."ఆం. భా. ద్వి. ౯౦. "సీ. ఈచెంచడపుడేగ యెటువంటికత్తెటి వేటునఁ బాటన విడక పట్టు." చంద్రా. ౭, ఆ. ౨౨. (ఇటు నింద్యుఁడు అని యర్థము.)

చెంచేలి. దే. వి. ఒకజాతికూరాకు. ¶ ఆం. భా. ౬౮.

చెంచు. వై. వి. (సం. చఞ్చుః) కిరాతభేదము. "గీ. బోయ నాఁగఁ గిరాతుఁ డాఁ గోయ చెంచు..." ఆం. భా. ద్వి. ౭౮౯. హర. ౨, ఆ. ౬౪.

చెంచుమల. ద్వ. వి. (చెంచు+మల) చెంచుదుర్గము. "క. చెంచుమలచూఱ కారున,కు..."శైష. ౧, ఆ. ౪౭. వి. పు. ౧, ఆ. ౧౫.

చెంచుమలహరి. ద్వ. వి. (చెంచు+మలహరి.) ముప్పది రెండురాగములలో నొకటి. "గీ. చెంచుమలహరి దేశాక్షి శ్రీవరాళి." హంస. ౫, ఆ. ౧౭౪.

చెండాడు. దే. స. క్రి. (చెండు+ఆడు స్వార్థమున) 1. చంపు. "మ. శిశుపాలుఁడు నరకాదులం బరువడిం జెండాడి..."ఉ. హరి. ౭, ఆ. ౮౬; 2. ఖండించు. "క. కరితురగ రథపదాతులు, బెరసి ...చేరిన...విజయుం డించి చెండాడె వడిన్." భార. ద్రో. ౧, ఆ. ౭౫౬. మనుచ. ౪, ఆ. ౮.

చెండిపోతు; దే. విశే. (చెండు+పోతు) చెప్పినమాట విననిది. "ద్వి. చెండిపోతైనఁ దుచ్ఛపులాగు వైన." ద్వి. భల్లా. ౭, ఆ. ౩౮. పు.

చెండు. దే. స. క్రి. 1. ఖండించు. "సీ. పలుమరు నొరయ నిప్పుగిరి శత్రుశిరంబు చెండుదు నను మాడ్కిఁ జెండుగొనుచు." రా. వి. ౭, ఆ. ౭౩. "క...చెండెదఁ, జిన్నాభిన్నములు గాఁగ సేనల నెల్లన్." విజ. ౩, ఆ. ౧౪౫; 2. చంపు. "గీ. అడఁచె జెండె ననఁగఁ బొం దగు వధించె, ననుటకు..."ఆం. భా. తృ. ౧౭౩. నీలా. ౧, ఆ. ౩; 3. పోఁగొట్టు. "గీ. ఉదయగిరిదుర్గమునఁ దమోభ్యుదయబలముఁ గూల్పఁగా నొడ్డిన విరంగిగుం డనంగ, గుండుఁ బుల్గుల మదికుందు చెండుచుండు." రా. వి. ౩, ఆ. ౭౯; వి. (క. చెండు) 1. కందుకము. "గీ. కందుకము చెండు బంతి నాఁగను దనర్చు." ఆం. భాం. ద్వి. ౧౬౪. భాగ. ౧౦. స్కం. పూ. ౯౧౪; 2. పుష్పములు చున్నగువానిచెండు, బంతి. "దండ...జాళువాగిండ్లఁ బూఁజెండ్ల దానిమ్మపండ్లన్." దశా. ౪, ఆ. ౭౩౭; 3. బాలక్రీడావిశేషము. "సీ. చిడుగుడువ్వలపోటి చెండు గట్టినబోది..."కాశీ. ౩, ఆ. ౩౩.

చెండుగోరింపులు. దే. వి. బ. (చెండు+గోరింపులు.) బాల్యక్రీడావిశేషము, ఒకవిధమగు బంతియాట. "సీ. పింపిళ్లు చెండుగోరింపు లోమనగుంటలు ..."దశా. ౮, ఆ. ౮౧.

చెండుదానిమ్మ. ద్వ. వి. (చెండు+దానిమ్మ) కాయలు లేక పూవులుమాత్రము చెండువలెఁ బూచెడి యొకజాతి దాడిమి. (శ. ర.)

చెండుబెండాడు. దే. స. క్రి. (చెండు+బెండు+ఆడు) నఱకు, ఖండించు. "గీ. చెండుబెండాడి కండలు గుండియలును." అచ్చ. యుం. ౭౯౯. రా. వి. ౩, ఆ. ౬౪.

చెండుబెండొనరించు = చెండుబెండాడు. "సీ. చేగల మెకములఁ జెండుచెండొనరించి..."అచ్చ. సుం. ౧౦౮.

చెండుమల్లె. ద్వ. వి. (చెండు+మల్లె.) ముద్దమల్లె, ఒకజాతిమల్లె. (బ్రౌ. వా.)

చెంత. దే. వి. 1. సమీపము, దగ్గఱ. "గీ...రాముఁడనుజ, సహితముగ వంశగురుచెంత సకలవిద్య లభ్యసించి..."దశా. ౨, ఆ. ౧౭౩. ఆం. భా. తృ. ౭౧; 2. ప్రక్క, పార్శ్వభాగము. "సీ. ఏచెంతఁ జూచిన నిందు బింబాస్యలగములు

నటించురంగస్థలములు." కుచేల. ౨, ఆ. ౮. దశా. ౪, ఆ. ౪౮.

చెందమ్మి. దే. వి. (చెన్ను+తమ్మి.) ఎఱ్ఱతామరపువ్వు. "సీ. కొమ్మచేదోయి చెందమ్ముల హత్తించి..." వసు. 3, ఆ. ౧౮౨. ఆం. భా. ప్ర. ౧౬౪.

చెందల. దే. వి. (చెన్ను+తల.) అందమగుశిరస్సు. "సీ. చందురులో నున్నకందుఁ దా మఱఁగించు తేవఁ జెందలఁ గొండియలు చెలఁగ." విప్ర. ౧, ఆ. ౯౮.

చెందామర. ద్వ. వి. (చెన్ను+తామర.) ఎఱ్ఱతామర; సుందరమగుపద్మము.

చెందిరము = చెంద్రము. (దీనికి వృత్తియందు మువర్ణ లోపము వైకల్పికము.) 1. రససిందూరము. ఆం. భా. ద్వి. ౨౮౦; 2. గంగసిందూరము. "గీ. చెందిరపుఁగావిపావడల్ పొందుపఱచి." య. 3, ఆ. ౫౯. ఆం. భా. ద్వి. ౧౬౧.

చెందిరిక = చెంద్రిక. (త. చెందిరిక్కౖం.) 1. దుద్దు. "చ...చెం,దిరికతెఱంగునఁ బసిఁడికీలఁగెలు నిం బిన జిల్గుపాగ..." స్వా. ౫, ఆ. ౫౮; 2. కుసుంభవర్ణము. "చ. పడఁతి యొకర్తు చెందిరిక పావడఁ బైఁ దడియొత్తి తైవ..." వసు. ౫, ఆ. ౮౧. చంద్రి. ౬, ఆ. 3౬.

చెందిలి. దే. వి. న్యూనత, తక్కువ. "చ. చెదరని యట్టికోరికలు చెందిలి నందనియట్టి వేడ్కలున్." మల్హ. ౧, ఆ. 3౭. పా.

చెందు. దే. అ. క్రి. 1. కలుగు. "క. నిన్నింతవానిఁ జేసిన, యన్నలినజుతండ్రి విష్ణుఁ డట్టివిభునిచే మన్ననలు గన్నవారల,కెన్నఁడు దుఃఖములు చెంద వెఱుఁగుము దండ్రీ." వి. పు. ౨, ఆ 303. "ఉ. మిత్రులచేఁ దలఁక సుఖము మేకొను నంటయుఁ జెందు దుఃఖముల్." భార. శాం. ౧, ఆ. ౨౦౭; 2. సిద్ధించు. "ఉ. చేసిననామనో రథము చెందదు కారణ మేమి చెప్పఁడా." పరాహ. ౨, ఆ. ౯౧; 3. చేరు, సమీపించు. "ఉ. కందువిసాళిసాళియలు గట్టి కదంబపు బూఁత తావికిం, జెందిన తేఁటిదాఁటు లన..." వాల్మీకి. 3, ఆ. ౧౧౨. భార. అను. ౨, ఆ. ౨౫౮; 4. వసించు. "సీ...మునీంద్రులు సిద్ధులు శాఖలఁ జెందియుండు, విహగకులంబులవిధమున వసి యింతురు..." భార. శాం. ౪౬, ఆ. ౫౮౯; 5. అంటుకొను. "చ. చలువలరేనియప్పొడుపుఁ బాయఁ దొఱంగినకందు దోఁచె రే,చెలువకనుం గవం గమియఁ జెందినకాటుకకప్పుకై వడిన్." పారి. ౨, ఆ. ౪౫. స. క్రి. (రతియందు) కలయు, కూడు. "ఉ...ఇత్తలోదరిం, జెందఁగఁ గాన్పుకాదె ఫలసిద్ధి పురాతనపుణ్యవృద్ధికిన్." భార. విరా. ౨, ఆ. ౨౬; 2. పొందు. "క... విద్వ,ద్వందిత నాపుణ్యంబునఁ, జెందితి ని న్నిష్ట ఫలము చెందినపాటన్." భార. ఆది. ౪, ఆ. ౨3౧. హరి. పూ. ౧, ఆ. 3౨. 3. చేరు. "క...బుద్ధిమంతులఁ జెందఁడు సాక్షరుఁడు గాఁడు శిశుకాలమునన్." కేయూర. 3, ఆ. ౭౦. భార. ఆది. ౪, ఆ. ౨3.

చెందుగపులి. దే. వి. చిఱుతపులి; సివంగి. (గ్రా.)

చెందుప్పు. ద్వ. వి. సైంధవలవణము. "సీ. ఇందు బింబముఁ జూచి చెందుప్పు గలసావి యఱలెత్తి నాకంగ నాసపడిన." కాశీ. 3, ఆ. ౧౨.

చెందొవ. దే. వి. (చెన్ను+తొవ.) ఎఱ్ఱకలువ. "క. మినుకుఁగొలఁకునఁ బూచినచ,క్కని చెందొవ యనఁగఁ దనరెఁ గలువలదొర..." నీలా. 3, ఆ. ౯.

చెందొవచెలి. దే. వి. (చెందొవ+చెలి.) చంద్రుఁడు. "క. పొందిన నృసింహనృపనం,క్రందనుసత్కీర్తి చేత ... చెందొవచెలియంకరుచివిశేష మడం గెన్." నరస. ౫, ఆ. ౭3.

చెందొవరా. దే. వి. (చెందొవ+రా.) కలువలరాజు, చంద్రుఁడు. ప్రబంధ. ౭౨.

చెందొవవిందు. దే. వి. (చెందొవ+విందు.) చంద్రుఁడు. "ఉ. చెందొవవిందుపట్టణము చేరఁగ నేఁగి..." శశాం. ౪, ఆ. ౧౬౨.

చెంద్రకావి. ద్వ. విశే. (చెంద్రము+కావి.) సిందూరమువంటియెఱుపు గలవి. "క. చరమాద్రినితం బంబుల, నెరకినయెఱసంజకెంపునిగ్గులు వోలెన్, దరుణీజనకటిబింబో, పరితలములఁ జెంద్రకావి పావడ లమరెన్." సాంబో. ౫, ఆ. ౪, "చ. కలయఁగఁ జెంద్రకావిఱవికంబలె..." విజ. ౨, ఆ. ౯౨.

చెంద్రము. వై. వి. (సం. సిందూరమ్.) గంగసిందూరము. "సీ...వాతెఱ చెంద్రంపువాన గురియ." అము. ౫, ఆ. ౬౭.

చెంద్రవంకలు. వై. వి. బ. ధాన్యవిశేషము. (శ.ర.)

చెంద్రిక. వై. వి. (సం. సిందూరమ్.) 1. కుసుంభవర్ణము. "చ. జిలుఁగులఁ బెట్టుచుక్ దొడలఁ జెంద్రికపావడ యంట మైతడిన్." స్వా. ౫, ఆ. ౬౮; 2. ఒకజాతిపూలచెట్టు. "సీ. చెంద్రికపూవన్నెజిలుఁగురుమాలుపై..." దశా. ౧, ఆ. ౭౧. పారి. ౨, ఆ. ౧౨; 3. కుంకుమపువ్వు. "ఉ...అందుపయిఁ జెంద్రికవన్నియసాలు చుట్టి..." విజ. 3, ఆ. ౧౩౧; 4. స్త్రీలసాసాభూషావిశేషము. (వా.); 5. తాటాకుజాబు మున్నగువానిమీఁదివలయము. "ఉ. ఇంద్రజురాక ధర్మజున కేర్పడగా శుభలేఖ వ్రాసి వే, చంద్రిక పెట్టి..." విజ. 3, ఆ. ౧౩౧.

చెంద్రికవన్నె. వై. వి. (చెంద్రిక+వన్నె.) కుంకుమరంగు గలబట్ట. ఆం. భా. ద్వి. ౧౫౮.

చెంప. దే. వి. 1. కపోలము, చెక్కిలి. "సీ. శిథిలత్వమొందినచెంగావిజడముడి చిలుకూడి నెలపువ్వు చెంప నంట." పాండు. ౫, ఆ. ౧౩౬. ఆం భా. ద్వి. ౧౮౩; 2. పార్శ్వము, ప్రక్క. "సీ మకరధ్వనిజునికొంప యొకచెంపఁ గనుపింపఁ జీరఁ గట్టినదయా చిగురుఁబోడి." క్రీడా. పీఠి. ౬౫. ౮, ఆ. ౧౯౭.

చెంపకల్లి. దే. వి. స్త్రీ. భూషావిశేషము. "సీ. తోరమాముత్యాల తులకించుకెంపుల చెంపకల్లీరుచుల్ చిందుద్రొక్క." కఱి. శ. ౧౫.

చెంపకాయ. దే. వి. (చెంప+కాయ) చెంపదెబ్బ. (శ. ర. బ్రౌ.)

చెంపకొప్పు. దే. వి. (చెంప+కొప్పు) చెంపవైపుండునట్లు పెట్టినకొప్పు. "సీ. మూఁపుపైఁ గురులు క్రొమ్ముడిసేయుం నొకవేళ నొకవేళఁ జెంపకొప్పారగ దిద్దు." వైజ. ౨, ఆ. ౧౩౮. శుక. ౨, ఆ. ౩౩౨.

చెంపగిల్లు. దే. అ. క్రి. పెడదారి పట్టు. ప్రక్కకుఁ దిరుగు. (బ్రౌ.)

చెంపతల. ద్వ. వి. (చెంప+తల) మిక్కిలి సమీపము. "చ. అరిమర్దనుండు క్రూరోరగభంగిఁ జెంపతల నుండఁగ నెవ్విధిని ద్రవచ్చు..." వేం. పంచ. 3, ఆ. ౧౬౮. (బ్రౌ. పా. 'చంపఁదల' ముద్రి.)

చెంపపెట్టు. దే. వి (చెంప+పెట్టు) చెంపకాయ. "సీ. క్రొవ్వాఁడికొనగోటికుమ్మెలు బిగియించు చెంపపెట్టు కపోలసీమ వెలుఁగ." చంద్రా. 3, ఆ. ౭౭. హంస. ౮, ఆ. ౩౯.

చెంపబిళ్ల. దే. వి. (చెంప+బిళ్ల) మెత్త, తలగడవంటి గంత. "సీ తరుణిలేనునుఁదొడల్ తలగడదిండ్లాయె వెలఁదిగుబ్బలు చెంపబిళ్లలాయె." రాధికా. 3, ఆ. ౮౦.

చెంపలువేయు. దే. స. క్రి. (చెంపలు+వేయు) చెంపమీఁద కొట్టు. "క. వెంపు విచారింపక విని, పింపఁగ రా దనక వచ్చి ప్రేలెడుపిరిం, జెంపలు వేయరు..." కువల. ౨, ఆ. ౧౧౦.

చెంపసరులు. దే. వి. బ. (చెంప+సరులు) స్త్రీభూషావిశేషము. (శ. ర.)

చెంబట్టు. దే. వి. (చెన్ను+సట్టు.) ఎఱ్ఱపట్టు. "సీ. వేయికన్నులుం గలవేల్పుఁ దొయ్యలిచేతఁ జాపట్టుచెంబట్టు సురటి యనఁగ." విక్ర. ౬, ఆ. ౬౭.

చెంబడి. దే. వి. పల్లెవాఁడు. "సీ. చెడఁగు చెంబడిబిడ్డ కడుపునఁ బొడమిన జడదారివడి నుడి నడరునాఁడ." ప్రబంధ. ౨౧౭.

చెంబు. వై. వి. (సం. శుల్బమ్. క. త. మ. తు. చెమ్బు.) ఇత్తడి మున్నగువానితో చేసినచిన్న పాత్రము. "గీ. చేర గొజ్జంగిపూ నీటఁ జెంబు లిడుఁడు." హార. 3, ఆ. ౯౮. శశాం. ౫, ఆ. ౧౮౫.

చెంబుతల. ద్వ. వి. (చెంబు+తల) చెంబువలె నున్న నైఃశిరము. "గీ. చెంబుతలవాని నవటుకచంబువాని." అము. ౬, ఆ. ౧౯.

చెకడము = చెక్కడము. "చ. చెకడపుఁగోళ్ల నొప్పు జిగి చిప్పిలుచప్పర మొప్పు శయ్యాయందు..." ముకుంద. ౧, ఆ. ౩౧౮.

చెకడా. వై. వి. (సం. శకటః.) సరకులు మోసెడి రెండెడ్లబండి. (శ. ర.)

చెకపికలాడు. దే. స. క్రి. చెక్కుముక్కు లొనర్చు. "గీ. కొట్టి కోలాహలము చేసి కూలఁ గ్రుమ్మి, చెండి చెకపికలాడమా యుండనేని." సా. ౧, ఆ. ౭౮.

చెకబొకలాడు = చెకపికలాడు. "సీ...దీనసే రామ రావణరణసవేళఁ, "గీ. చెంది చెకబొకలాడితి దుందగంపు, సోఁకుమూఁకల జగ మెల్లఁ జోద్య మంద." సాంబో. 3, ఆ. ౧౪౬.

చెకము. దే. వి. వస్త్రము మొదటిబద్దె. (శ. ర. బ్రౌ.)

చెకాచెకలు. దే. వి. బ. చెక్కుచెక్కలు. "చ. కదన మపారమై బరఁగె గత్తులు కత్తులు నీటె లీటియల్ గదియ నెకాయెకిం బడి చెకాచెకలై తునియంగ ..." రంగా. 3, ఆ. ౧౯౦.

చెకుందము. దే. వి. నైపుణ్యము. "పంచ. ముకుంద బల్లెముం గరంబుఁ బూని శత్రుసైన్యముల్, చెకుందముం జెలంగఁ జొచ్చి చింతు వింతగా నణెన్." కృష్ణ. 3, ఆ. ౧౭.

చెకుముకి. దే. వి. నిప్పు పుట్టుటకై రాతిని కొట్టు ఉక్కుముక్క. "సీ. అగ్నిసాధన విశేషాభిధ చెకుముకి..." ఆం. భా. ద్వి. ౧౭౨. శుక. 3, ఆ. ౪౪౯.

చెకుముకిరాయి = చెకుముకి. (బ్రౌ.)

చెక్కు. వై. వి. (సం. శకలః) 1. పేడు, చిన్న ముక్క. "ఉ. అక్కనకాద్రి బి ట్టదర నంటి యదల్చి యెదిర్చి యవ్విభుం, డెక్కిన తేరు సెక్కలుగ నేసి..." ఉ. రా. ౪, ఆ. ౬౦. భార. శాం. ౬, ఆ. ౧౨౬; 2. చెక్క, బద్ద. (మామిడి చెక్కలు, పనసచెక్కలు (వా.); 3. చెట్టుపై బరడు, పట్ట. ఆం. భా. ద్వి. 3౭. "గీ. వెనువలల వేయఁగా రవి పనికి రా వ,టంచు వడి గార చెక్కలై యఱచువారు." దశా. ౧, ఆ. ౨౭౯.

చెక్కకొఱఁజే. ద్వ. వి. (చెక్క+కొఱఁజు) పశువుల మేనిరక్తము పీల్చునొకజాతి జంతువు. (శ. ర.)

చెక్కపేరు. ద్వ. వి. (చెక్క+పేరు.) చెక్క కొఱఁజు. (బ్రౌ.)

చెక్కచెట్టు. ద్వ. వి. ఎఱ్ఱరంగు వేయుట కుపయోగించు నొకానొకవృక్షము. (శ. ర.)

చెక్కడము. దే. వి. 1. రత్నములను పొదుగుట. "సీ. కటకంబు చేరి కీకటభర్త పని చెక్కడపుఁ జొక్కటపు మకుటంబుఁ దాల్చె." పాంచా. ౧, ఆ. ౬౦. విజ. ౭, ఆ. ౧౯౯; 2. శిలాదుల చెక్కి చేసిననగిషీపని. "గీ...చెంతఁ జెక్కడపు సింగ, ములను గన్గొని..." నీలా. ౧, ఆ. 3౨.

చెక్కతాపి. ద్వ. వి. (చెక్క+తాపి.) బేలుదారిగోడ మొదలగువానిమీఁద పూసినగారను తాచి మట్టపఱచెడు వీఁపున పిడియమర్చిన గుండ్రని నిడుపు జేసెఁడు పలక. (శ. ర.)

చెక్కపిడుఁజే. ద్వ. వి. (చెక్క+పిడుఁజు) పశువుల మేనిరక్తము పీల్చు ఒకజాతి జంతువిశేషము. (శ. బ్రౌ.)

చెక్కలుచేయు. ద్వ. స. క్రి. (చెక్కలు+చేయు) ఖండించు, నఱకు. "శా... సేజాలు సా,రాజుల్ గైకొని కోటలోఁ గొలఁచు సారాజుల్ తదంగంబు లు,గ్రాజిం జెక్కలుచేయుచో..." రావి. ౫, ఆ. ౨౧.

చెక్కలువాపు. ద్వ. స. క్రి. (చెక్కలు+వాపు.) పగులఁగొట్టు "ఉ. ఒక్కశతాంగ మాతఁడు సమున్నతిఁ గైకొని మోహరించినన్, జెక్కలు వాపెఁ బార్థుఁ డది..." జై. ౫, ఆ. ౭౨.

చెక్కలువాఱు. ద్వ. అ. క్రి. (చెక్కలు+వాఱు) ముక్కలగు. "సీ. తనరు దిగ్దంతిదంతములు సెక్కలువాఱ, నుగ్రదంష్ట్రలు త్రిప్పునుక్కు మిగిలి." భాగ. ౬ స్కం. 3౨౦.

చెక్కికొను. దే. స. క్రి. (చెక్కు+కొను స్వార్థమున.) సవరించు, దిద్దు. "చ. నగుచుం బయ్యెద జక్కఁ జెక్కికొను వీణాపాణిఁ బ్రార్థించెదన్." బహు. ౧, ఆ. ౬. సురా. ౧౨౪.

చెక్కిపుచ్చు. దే. స. క్రి. (చెక్కు+పుచ్చు - స్వార్థమున.) మెఱుఁగునకై చెక్కు "చ. కనకము చెక్కిపుచ్చిర ప్రకారమునన్ గిరికొన్న వన్నియం దనరునితంబబింబమును..." విష్ణుపు. 3, ఆ. ౨౦౭.

చెక్కిలి. దే. వి. ఔ. గండస్థలము. "ఉ. చెన్నఱి పాణిపల్లవము సెక్కిటఁ జేరిచి కుందుసుందరిన్." భా. రా. అర. ౨, ఆ. ౧౯౦. ఆం. భా. ద్వి. ౧౪3.

చెక్కు. దే. స. క్రి. (క. సెక్కు.) 1. దోఁపు, పెట్టుకొను. "సీ...కొప్పులోఁ జెక్కుకొన్నకాగిత మొసంగ." సావి. ౧, ఆ. ౯3. "క. మొల దట్టి చెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్టకిరాతుఁ డొకఁడు." స్వా. ౪, ఆ. ౫౭; 2. సవరించు, దిద్దు (చూ. చెక్కికొను); 3. రత్నాదులను పొదుగు, తాపటముచేయు.

"మ. అసురాధీశుఁడు రోహణాచల సముద్యద్రత్నముల్ చెక్కి రమ్యసువర్ణాద్రిని మాళిఁ జేయ..."దశా. 3, ఆ. ౧౭౨; 4. ఖండించు, "ఉ...దారుణవజ్రముఁ దాల్చి సంతతో,త్తాన తదీయపక్ష సముదాయము మోదముగఁ జెక్కుచుక్కువన్." హరి. ఉ. ౯, ఆ. ౧౮౮. "శా... రాజు రావలెఁ గదా చెక్కింతు నీకీలు కేల్." సా. ౨, ఆ. ౧౩౭; 5. నశింపఁజేయు. "చ... ప్రాణదువుల వన్నె కెక్కి మహీ నూల్కొను విక్షమము లెల్లఁ జెక్కి..."అహ. ౧, ఆ. ౮; 6. బొటిగ మున్నగువానితో గోకు. వ్యవ:—వాఁడు చెంగలి చెక్కుచున్నాఁడు; 7. (దేవతారూపములను) రచించు; చిత్రించు. "సీ. జేజేలరయొకిమోలఁ జెక్కినగండపెండారంబు పదమున గండుమీఱి." దశా. ౭, ఆ. ౧౮౬.

వి. 1. ఫలకము, చెక్క. "గీ. చెక్కులు కడాని జాళువాచెక్కు లరయ." సానందో. ౧, ఆ. ౮; 2. చెట్టుపట్ట. త్వక్కు. ఆం. భా. ద్వి. ౩౭; గండము, చెక్కిలి. "చ...లేజవరాలు చెక్కు గీఁటినఁ బసవల్చుబాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే." నైష. ౧, ఆ. ౧౭; 4. ఆం. వి. హుండి.

**చెక్కుచెమరించు.** దే. అ. క్రి. చెక్కు+చెమరించు. చెక్కుచెమరు. ధా. ప్రే.) బడలు. "సీ. ఈ క్రొవ్విరులు గ్రోలు నెలితుమ్మెదలు చెక్కుచెమరింపఁగన్న వాఁచిగురుఁబోఁడి." విజ. 3, ఆ.౬౨.

**చెక్కుచెమరు.** దే. అ. క్రి. (చెక్కు+చెమరు.) అలయు. (చూ. చెక్కుచెమరుచు)

**చెక్కుచెమరుచు.** దే. అ. క్రి. (చెక్కు+చెమరుచు) అలయు, ఆయాసమందు. (రూ. చెక్కుచెమర్చు) "ద్వి.చిలుక నక్కునఁ బెట్టిఁ జెక్కుసెమర్చు..." ద్వి. హరిశ్చ. పూ. ౧౯౬ పం. (ఈపదము వ్యతిరేకమున నుండి ఎంతమాత్రమును అలయక అనునర్థ మిచ్చును.) "ఉ...అడ్డినఁ గల్గు యోధులు...నిశ్చింతతనుల్లసిల్లెదరు చెక్కుచెమర్పక కౌరవేశ్వరా." భార. శల్య. ౧, ఆ. ౫౦.

**చెక్కుడు.** దే. వి. (చెక్కు ధా.) చెక్కుట. (చూ. చెక్కుడుపాఱ)

**చెక్కుడుపాఱ.** దే. వి. (చెక్కు+పాఱ) గడ్డి మున్నగువానిని గెక్కుట కుపయోగించు ఇనుప సాధనము. "ఉ...కస వారసి తెమ్మని కూఁతు చేతికిం, జెక్కుడుపాఱ యీయ." శుక. 3, ఆ. ౪౧౦.

**చెక్కులుసేయు.** ద్వి. స. క్రి. (చెక్కులు+చేయు) నశింపఁజేయు. "శా. ఘోరాపారమహోఘ పంచకముఁ జెక్కుల్ సేయఁగా..."ఆము. ౪, ఆ.౩౧.

**చెక్కులొత్తు.** దే. అ. క్రి. (చెక్కులు+ఒత్తు) మొలకలెత్తు, పుట్టు. "సీ. పిదపిదనై లజ్జ మదిఁ బదనిచ్చినఁ జెలిమేనఁ బులకలు చెక్కులొత్తె." భాగ. ౧౦. స్కం. ఉ. ౩౩౧.

**చెక్కెము.** దే. వి. ఎమ్ములయందు దుంపుసేయు. "ఉ...డేగ పడిం జని గిట్టి పట్టి మేసించినఁ గాలి మూలగయుఁ జెక్కెముఁ జక్కెర నద్ది యిచ్చియే,తెంచె నొకండు..."చంద్రా. ౬, ఆ. ౧౦౫. (శ. ర. పా.)

**చెచ్చెర.** దే. క్రి. విశే. ద్రు.(చెర+చెర.) 1. శీఘ్రముగా. "శా...సం, పన్నస్నేహముతోడ నీకు నెఱిఁగింపన్ వచ్చితిం జెచ్చెరన్." హర. ౨, ఆ. ౭౪. ఉ. రా. ౨, ఆ. ౪౦; 2. సులభముగా, సులువుగా. "సీ. చెచ్చెర నరఁగను జెలఁగును సులభంబు..."ఆం. భా. తృ. ౩౦.

**చెట్ట.** వై. వి. (సం. చేష్టా.) 1. కీడు, "కం. మయ లం జెప్పిన సౌఖ్యము, ర య లం జెప్పినను జెట్ట రయమున వచ్చున్." కవిజ. సం. ౩౯. "ఉ... అతివ్యసనత్వము గల్గువారలుం, జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు..."భార. శాం. 3, ౪౯౯; 2. ఆపద. "సీ. చేటు చెడిది చెట్ట సేగి సిలు గనంగ నాప దభిఖ్యలై యలరుచుండు." ఆం. భా. ద్వి. ౨౧౧; 3. అశుభము, అమంగళము. "గీ. చేటు చేట్పాటు గీడ్పాటు చెట్ట కీడు, సేగి చెడిది సిలుంగు నాఁగఁ జెలఁగు నశుభ,ము..."ఆం. భా. ప్ర. ౯౯; 4. చేయి,హస్తము "గీ. గౌరి శ్రీవిశ్వనాథుండు కనకరత్నపాదుకలు మెట్టి చెట్టలు పట్టుకొనుచు, నేఁగుదెంచిరి ..."భీమ. ౨, ఆ. ౧౪౭. ఆం. భా. ద్వి. ౧౩౮. విశే. ద్రోహ మెంచు... దుష్టుఁడు. "చ... మోఁదు పరకింపక యమ్మి... [illegible]

దనులకుఁ జెట్టవై హృదయతాపము వచ్చినఁ బల్కె దొందులన్." భార. ద్రో. ౪. ఆ. ౨౦౯. ఆం. భా. తృ. ౪౪.

చెట్టగొను. వై. స. క్రి. (చెట్ట+కొను) చేయి పట్టుకొను. "క. తనకుఁ గలయర్థ మంతయుఁ, దనురాగముతోడ నిచ్చి యర్థులచే నిర్ధనవృత్తిఁ జెట్టగొనియెను, యనఁగ..." దశ. ౭, ఆ. ౯౧.

చెట్టతనము. వై. వి. (చెట్ట+తనము.) దుష్టత్వము. "సీ. చుట్టాలు సీదగుచెట్టతనంబునఁ బాసి పశ్చాత్తాపపరుఁడ వగుచు." భార. అను. ౪, ఆ. ౩౯౨. ఉ. రా. ౩, ఆ. ౨౭౨.

చెట్టపట్టలు = చెట్టాలు. (చూ. చెట్టపట్టలుపట్టు.)

చెట్టపట్టలుపట్టు. ద్వా. అ. క్రి. (చెట్టుపట్టలు+పట్టు.) ప్రేమాదులచె నన్యోన్యము చేతులుకలుపు. "ద్వి. బంతులేర్పడఁ జెట్టపట్టలుపట్టి." పండితా. పర్వ. ౪౦౧. పు.

చెట్టపట్టాలు. వై. వి. బ. అన్యోన్యము చేతులు పట్టుకొనుట. "గీ. జవ్వనం బంతఁ దనదుశైశవముతోడఁ, జెట్టాలకును గొంత చెయ్యి చాప."పరమ. ౪, ఆ. ౭౯.

చెట్టపట్టు. వై. స. క్రి. (చెట్ట+పట్టు) 1. చేయిపట్టు, పెండ్లాడు. "గీ. చెలఁగు శ్రీకృష్ణరాయలఁ జెట్ట పట్టి." కృష్ణ. ౪, ఆ. ౨౪. వైష. ౪, ఆ. ౪౯; 2. ఆదరించు. "సీ. గట్టుపట్టినిఁ జెట్టపట్టి చట్టుపతేలినట్టి జెట్టిని గ్రోలుదిట్టతనము." ఆచలా. ౩, అ. ౪౧. వి. పాణిగ్రహణము, పెండిలి.(శ. ర.)

చెట్టాపట్టాలు = చెట్టపట్టాలు. "క. అట్టియెడ నైంద వోపల, పట్టికలం గట్టినట్టి పలుమెట్టికలన్, మెట్టిడిగి కొలను జొచ్చిరి, చెట్టాపట్టాలు పట్టి శీతాంశుముఖుల్." బహు. ౨, ఆ. ౭౪.

చెట్టు. దే. వి. (క. చెట్టు.) 1. వృక్షము. "చ. శిలలఖిలంబు లింగములు చెట్టు సమస్తము కల్పభూజముల్."విక్ర. ౧, ఆ. ౧౯౯. ద్వి. పరమ. ౨, ఆ. ౧౦౭. పా; 2. గుల్మము. (శ. ర.); ౩. ఓషధి. "సీ. మ్రాఁకు ప్రూ ననఁగ ననోకహ సంజ్ఞయాఁ, జెట్టన నోషధ చెప్పఁబడును." ఆం. భా. ద్వి. ౩౭. సా. చెట్టెక్కి చేతులు విడిచినట్లు = గొప్పతనము సంపాదించి యంతలోనే భ్రష్టుఁడయినట్లు. "గీ. శిష్యత్వంబున నాఁడు బల్ల మోటు, పడినఁ జెట్టెక్కి చేతులు విడిచినట్లు, శోకచింతానిమగ్నుండవై ..."వరాహ. ౧, ఆ. ౯౬; 2. చెట్టుపేరు చెప్పికొని పండ్లమ్మినట్లు = పెద్దలపేరు చెప్పి తాను కీర్తిసంపాదించునట్లు. (వా.)

చెట్టుఁద్రిమ్మరి. దే. వి. (చెట్టు+త్రిమ్మరి) చెట్లమీఁదఁ దిరుగునది. కోఁతి "క. క్రమ్మకొని మీరు చెట్టుం, ద్రిమ్మరులై పుట్టుఁడు..."అచ్చ. బాల. ౬౨.

చెట్టుకట్టు. దే. అ. క్రి. (చెట్టు+కట్టు.) చెట్టుగా ఏర్పడు, వర్ధిల్లు. "సీ. నినుఁగూర్చి చెట్టుకట్టెను గాలవతిపస్వి ప్రబలించె రుచి మందపాలమౌని." బహు. ౧, ఆ. ౧౧౬. "గీ. భక్తిసంయుక్తి యమపోఁతపాల నొయ్యఁ, జెట్టుకట్టుచు ముని శాఖ నిట్టచూప." పాండు. ౩, ఆ. ౧౩౯.

చెట్టునట్టు. దే. వి. (చెట్టు+నట్టు) చెట్టునివాసముగాఁ గలది వానరము. "గీ. అనిన విని తొలివేల్పు రాయశికిఁ జెట్టునట్టు మొనగాఁడు వెండియుం నిట్టు లనియె." అచ్చ. సుం. ౧౪౬.

చెట్టుప. దే. వి. (త. చెట్టై.) ఎఱక, ఱెక్క. "ఆ. పట్టుకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు, కొని శకుంతతతులు గూడ యుండె." భార. ఆది. ౪, ఆ. ౪౬. వైష. ౯, ఆ. ౧౭౩.

చెట్టుపడు. ద్వా. అ. క్రి. (చెట్టు+పడు) స్తంభించు. "వ...అట్టిరట్టు వినినప్పుడె చెట్టుపడి పుట్టిన కోపంబు పట్టఁజాలక..."ఉ. రా. ౬, ఆ. ౩౪౩.

చెట్టుబిడారు. దే. వి. (చెట్టు+బిడారు) క్రోఁతి, "సీ...బల్కి,దంక నచ్చెట్టుబిడారు బొబ్బమెకంబుపై నగ్గలంబుగఁ బాఱవాలె, యమ్ములు పసుప..."అచ్చ. సుం. ౧౧౯.

చెడఁగొట్టు. దే. స. క్రి. (చెడన్+అడు) పాడు చేయు. "వ. ధ్వజంబులఁ జెడఁగొట్టుచు..." ఉ. రా. ౨, ఆ. ౬౧. చెడనాడు. దే. స. క్రి. చెడన్+ఆడు) దూషించు "ఉ. ఆవనజాతునిట్టు చెడనాడిన నక్కట నోరు ప్రువ్వదే." నిర్వ. ౯, ఆ. ౧౧౭. భార. శాం. ౧, ఆ. ౧౧౭.

చెడిది. దే. వి. 1. అమంగళము. "గీ. చేటు చెట్పాటు గిడ్పాటు చెట్ట కీడు,సెగి చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభము..."ఆం. భా. ప్ర. ౯౯; 2. పటిష్ఠు తపదు. ఆం. భా. ద్వి. ౨౧౧.

చెడిప. దే. వి. (త. చెడియళ్. చెడిన+అప్పు) స్వేచ్ఛా విహారిణి, అంకటాలు. "క. దినమున సురతం బెయ్యెడఁ, జనదు చెడిపఁ గన్యఁ గవయఁ జనదు ..." భార. అను. ౪, ఆ. ౧౧౫.

చెడిపె = చెడిప. "గీ. చెడిపెలోఁ జాల పోరామి సేయఁ జనదు." కాశీ. ౨, ఆ. ౭౪. ఆం. భా. ద్వి. ౧౦౬.

చెడిపోవు. దే. అ. క్రి. (చెడి+పోవు స్వార్థమున) పాడగు. "చ. పుర మిది చూడ నింత చెడిపోయె నహో..." శుక. ౨, ఆ. ౩౬౯.

చెడు. దే. అ. క్రి. (క. కెడు. మ. కెటు) 1. ప్రతికూలమగు. కానిదగు. "ఉ...లక్ష్మి...వావి సెడఁ జెందుసె సోదరుఁ డైనరుద్రునిన్." ఆము. ౧, ఆ. ౩౦; 2. వ్యర్థమగు, రిక్తయగు. "మ. అని సంధాపరతంత్రుఁడై నిలువ నయ్యస్త్రంబు శత్రుఘ్నుఁ డేసిన నాతం డెడఁద్రుంచినం జెడక తచ్ఛేషంబు సీతాతనూ, జునికోదండము రెండుగా నటికి..." రై. ౬, ఆ. ౧౨౫; 3. నశించు, పోవు. "క...అర్జునువలని భయము సెడి యొమ్మునఁ జే యిడి నిద్రవోయె ముదితాత్ముండై." భార. ఆది. ౬, ఆ. ౬౨. "గీ. మంటి మిద్దలవారికి మరుపనులకు, సెలఁత వాసినవారికి నిదుర చెడియె" ఆము. ౪, ఆ. ౧౨౩; 4. దొంగిలిపోవు. "సీ. చెడినసొమ్మెవ్వనిచే నుండువాని...పట్టి యరయవలయు." విజ్ఞా. ప్రా. ౨౫. భో. ౫, ఆ. ౨౭౪; 5. తగ్గు, క్షీణించు. "చ. అడుగుననుండియుం బదిలమై చదలంటెడు నొప్పు ప్రోక, చెడనికడంక దంచనపుఁజేతుల గం గనుకొని దూఱఁగా..." ఆము. ౨, ఆ. ౯; 6. దురవస్థను బొందు, 'గీ. సంచితార్థంబు నివ్విప్రయోజనము గాఁగ, నల వెలుంగక వెచ్చించునతఁడు చెడఁడె." విక్ర. ౨, ఆ. ౧౬౯. పార. ౩, ఆ. ౧౫; 7. చచ్చు, మరణమందు. "ఆ. జీవుఁ డెల్లభంగిఁ జెడియెడివాఁడుఁ గాఁ,దలఁచితేని వగవవలదు మున్న." భార. భీష్మ. ౧, ఆ. ౯౫౭. భాగ. ౯ స్కం. ౬౬౦; 8. దూరమగు. "ఉ...ఇహపరంబుల కూరక దూరమై వయస్స్త్రీ చన రెంటికిం జెడినచేష్టడ నొడ సె నీరజేక్షణా." స్వా. ౩, ఆ. ౯౦౫. [illegible] ౬, ఆ. ౧౨౫; 9. భయపడు. "క. మండి పదాతులఁ గొందఱఁ, జెండాడిన నున్నవారు చెడి పాఱిరి..." ఉ. హరి. ౫, ఆ. ౨౨౫; 10. మకిలికల దగు, "ఉ...దుర్యశము...వాజులూర్పుం జెడు మాణిబంధముకురంబులకాళిమ పేరఁ గార్కొనున్." ఆము. ౨, ఆ. ౨౦; 11. ఇది తుమున్నంతమైనపుడు మిక్కిలి,యనునర్థము గల దగును."చ...కృతధ్వజనందను సైనికావళి, హాళహాళికిం జెడ న్వికిగె నార్తి మితధ్వజనందనుం డనిన్." ఆము. ౩, ఆ. ౧౬; 12. చిముడు, పాడగు ఆము. ౪, ఆ. ౨౨౩. విశే. దుష్టమైన, చెడ్డదైన. "క. చెడుతెరు వాకౌరవ్యుల, కడ నిలుచుంగాక, మనకుఁ గ్రౌర్యం బేలా." భార. ఉద్యో. ౩, ఆ. ౯౧. సా. ౨, ఆ. ౧౪౫.

చెడుగఁడు. దే. వి. (చెడు ధా.) క్రూరుఁడు. "మ. అడవిం గోల్పడుప్రాణి యెయ్యదియు లేకాటోవ మేపార న,చ్చెడుగం డుగ్రతఁ దద్వ్రజంబుకడకుక్ శీఘ్రంబ యేతెంచె..." హరి. పూ. ౮, ఆ. ౧౦౩.

చెడుగరము. దే. విశే. (చెడు. ధా.) 1. దుష్టము, దుర్మార్గము. "గీ. చెడుగరపుడొక్క యోరోరి సెట్టికుక్క." వేం. పంచ. ౧, ఆ. ౭౬౩. భద్రా. ౨, ఆ. ౩౦. పా.

చెడుగట్టి. దే. వి. (చెడు+కట్టి) మాంసపుముక్కలు గ్రుచ్చి కాల్చుట కుపయోగించు కట్టి, శూలము. "క. చెడుగట్టిల గ్రుచ్చిననం,జూడు మంటలఁ దగిలి కొయ్యెజొటజొట పడియెన్." స్వా. ౪, ఆ. ౧౯.

చెడుగాడు. దే. స. క్రి. (చెడుగు+ఆడు) నిందించు, తిట్టు."మ.సమక్షానం జెడుగాడు గాని యొరులం జాలింపఁ దుచ్ఛ ప్రౌంఖల,త్వమునన్ వర్తిలు..." మల్ల. నీతి. ౪౯.

చెడుగు. దే. విశే. (క. కెడుకు) 1. దుష్టము, "మ...పింగళశ్మశ్రుకేశంబులుం,జెడుగుంగంపును గల్గి హేయ మగునీచీభావముం దాల్చి..." మార్క. ౧, ఆ. ౨౪౪. భో. ౪, ఆ. ౧౫౭; 2. క్రూరము. "చ...కడుం జెడు గీపాడపాపపుర్వు..." భార. అను. ౧, ఆ. ౬; 3. ధూర్తుఁడు, పొగ...బోతు. "సీ. చెడుగు గావరి నీచు చెనికి

కేడ ములుచ చేరజ మన ధూర్తు పేరు వెలయు." ఆం. భా. తృ. ౭. వి. చెడ్డమాట. (చూ. చెడు గాడు.)

చెడుగుందనము. దే. వి. (చెడుగు+తనము.) దౌష్ట్యము "చ...అగ్రజుబుద్ధిమాటఁ జేకొనుమీ శుభంబు మాన్పుచెడుగుందన మే లని దూత తెల్పినన్." ఉ. రా. ౨, ఆ. ౩౧౮.

చెడ్డ. దే. వి. (చెడు ధా.) కీడు. (ఉదా:—మంచి చెడ్డలు.) విశే. దుష్టము. "క...వలపు చెడ్డది సుమ్మీ." శుక. ౨, ఆ. ౪౭౯.

చెడ్డి. దే. వి. మోఁకాలివఱకుఁ దొడిగికొనుగుడిగి. (శ. ర. వా.)

చెడ్డు. దే. స. క్రి. తొడచఱచు. (శ. ర.)

చెణుకు. దే. వి. చమత్కారము. "క. అన విని శుక మి ట్లనియెను, వనితా యేమందు దానివగలో త్రుళ్లోచెణుకో తెలివో..."రాధికా. ౩,ఆ.౧౬.

చెత్త. దే. వి. (త. శెత్తై) 1. పెంట, తుక్కు. ఆం. భా. ద్వి. ద్వి. ౧౨; 2. ఎండినగడ్డిఆకులు మున్నగునిస్సారపదార్థము. "గీ. సాగ రమ్మనుపలుకు మించంగఁ గరము, వీచి వైటికిఁ జెత్తలఁ ద్రోచి వైచి..."రావి. ౫, ఆ. ౮. (ఇట చెత్తలు = బలహీనులు అని తాత్పర్యము.)

చెత్తగొడుగు. (చెత్త+గొడుగు.) గడ్డి ఎండుటాకులు మున్నగువానితోఁ జేసినగొడుగు. "సీ. జాఱు బొజ్జయు నునుదబ్బసంబెళయును, జెత్తగొడుగును జక్కఁ దాల్చి కుతుకమున." మార. ౭, ఆ. ౧౨.

చెద. వై. వి. (సం. శిథిలీ. త. చిదల్) "ఆ. పుట్ట లోను జెదలు పుట్టవాగిట్టవా." వేమన. ౧, ఆ. ౭౬. "ఉ...చెద పట్టినభార్ద వుడొక్కఁ గాంచిరి ..."వాసిష్ఠ. ౩, ఆ. ౨౯.

చెదరఁబడు. దే. అ. క్రి. (చెదరక్+పడు స్వార్థమున) వికీర్ణమగు, ఇటునటుపడు. "ఉ. రాలినభూవ జాలిఁ జెదరంబడియున్న శతాంగకోటి సాంభీ లత నొంచె నారణము..."భా. రా. యు. ౧౧౮౨.

చెదరఁబాఱు. దే. అ. క్రి. (చెదరక్+పాఱు. స్వార్థమున) 1. వ్యాపించు. "మ. చెదరంబాఱు దశ ప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునన్, గుదియంబట్టి..."సర్వే. శ. ౪౮; 2. ఇటునటు చెదరిపడు. "వ...నిశావిశాలలోచన చెదరఁబడిన నెఱికురులం దవిలి కొఱలు క్రొవ్విరుల సంచున ..."చంద్రా. ౫, ఆ. ౬౩.

చెదరించు. దే. స. క్రి. (చెదరు. ధా. ప్రే.) 1. చెదరఁజేయు, అటునిటు పరుగెత్తఁ జేయు. "క. తదనీకంబు గజంబులు, నొదివిన బలుగాలి మేఘములఁ దీవ్రగతిం, జెదరించుకరిది నరుఁ డున్మదుఁడై నలుదెసలఁ దోలె మనుజాధిపా." భార. కర్ణ. ౨, ఆ. ౩౧౬; 2. చెడఁజేయు. "క. అది యొప్పు డనుచు మీరలు, పదటంబును జేసి కార్యభాగం బెల్లన్ జెదరింపవలదు..." పార్వ. ౪, ఆ. ౫౪; 3. చిమ్మఁజేయు, చిందఁ జేయు. "మ...ఘోరపరస్పరప్రహతు లత్యుగ్రంబుగా నెత్తురుల్, సెదరింపన్..."భార. ద్రో. ౧, ఆ. ౧౮౫.

చెదరు. దే. అ. క్రి. (క. చెదఱు. త. చిదఱు) 1. ఇటునటుఁ బోవు. "సీ. ఆవెనుకను నరూపా శ్వాలి చెదరక చక్రాకృతిని బర్వెసరణి తోఁచె." ప్రభా. ౨, ఆ. ౩౭. "గీ. తుహిన ధారాగృహాంగిబిరదువులు చెదర." ఆము. ౫, ఆ. ౮౬; 2. తప్పిపోవు. "క. అది గని యూర్వశి నవ్వుచు, నదిరా మది జాఱువంటి దనియెడి పలుకుం, జెదరె నుపమాన మొక్కటి వెదక వలయు వీనిమదికి..."వాల్మీకి. ౩, ఆ. ౧౩౫; 3. పాడగు, చెడు. "ఆ. మునులు తపము చేయుచును బహిరింద్రియంబుల మనంబుతోడఁ గలిపి నిలిపి, యచలనిష్ఠఁ దాల్తు రది గాన వారి మనంబుఁ గలఁపఁ దద్వ్రతంబు చెదరు."చిత్రభా. ౨, ఆ. ౫౮. కళా. ౭, ఆ. ౧౦౦; 4. పాఱి పోవు, దాఁటిపోవు. "సీ. చెట్టొక్క పిట్టయై చెదరిరి దిక్కుల బలు వెతఁ బడరానిపాట్లు బడిరి. సిం. నార. ౫౭. భార. ఉద్యో. ౨, ఆ. ౧౩౯. 5. చలించు, సడలు. "క. చెదరని నిజభక్తిని దృఢపదపద్మము లాత్మ నిలిపి..."భాగ. ౧౦. స్కం. ఉ. ౮౩౩. ఉ. రా. ౨౦౭; 6. కలఁత నొందు. "మ. ఇది యేలోకమొ యేపురంబొ... నాడెందంబు విభ్రాంతతన్, జెదరన్ మ్రాన్పడి యున్నవాఁడ..."కళా. ౫, ఆ. ౭౫. రం. రా. బాల. ౬౫ పొ. ౨౮. పం; 7. మిఱుమిట్లు

కొను. వా. ఈమెఱుపుకాంతికి నాకన్నులు చెదరి నవి; 8. ప్రసరించు. క్రమ్ము. "మ...పల్మాఱున్ మహోర్మీంకృతుల్, నెదరన్ వెండియుఁ దొండమున్ విద్రుచుచున్..."కేయూర. ౨. ఆ. ౧౦౨. "వ...కంకణంబురత్నంపుఁ దళుకులు సెదర..."స్వా. ౩, ఆ. ౨౮. వి. 1. చెదరుట (శ. ర.); 2. కలఁత. "క...అవ్వనితమదిఁ జెదరు గదుర నతని కిట్టను..."భో. ౭, ఆ. ౧౮౬.

చెదలు. వై. వి. చెద. పుట్టలుపోయుచీమజాతి యొకా నొక జంతువు. "వ...పొట్టకై...చీమలకుం జెదలునకు నెలుంగులు...పుట్టలుగ్ గోరాడ..." స్వా. ౪, ఆ. ౩౬. ఆం' భా. ద్వి. ౮౮.

చెదారము. దే. వి. చెత్త. "గీ. చెడ్డయింటి చెదారమై శివునికరుణ, నిప్పటిలు..."కాశీ. ౪౯౧. ఆం. భా. ద్వి. ౨౨.

చెదురు. దే. అ. క్రి. పాఱిపోవు. "క. అదురుదురే పగదాయకుఁ, జెదురుదురే ధైర్య మెడలి..." చంద్రా. ౬, ఆ. ౯౬.

చెనఁగి. దే. వి. పొట్టికొబ్బరచెట్టు. (శ. ర.) బ. ధాన్యభేదములు. "గీ. తెల్లనల్లచెనంగులుఁ దీవ సరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

చెనఁటి. దే. విణ. 1. శూన్యము, రిక్త. "గీ. మేను మృదుశయ్య నగమ సామేలిమీఁద, సగము గాఁ జేర్చికొని ముద్దుమిగుల నిద్ర సేయుఁ నట్టినీ విప్పుడు చెనఁటినేలఁ, దనువు వొందుట కోర్చితే తండ్రి సెప్రుమ." భార. ద్రో. ౨. ఆ. ౩౩౪; 2. వ్యర్థము, వికి. "ఉ...విప్రావళిమాటలు జెనఁటి యయ్యోని కార్యముతప్పెనోగదే." భో. ౬, ఆ. ౮౪. "అనుచు వగచుకలుకు లాలించి భీష్మాది, యోధవరులతో సుయోధనుండు, చెనఁటిమాట లేమి వినియెవ రనిన..."భార. భీష్మ. ౨, ఆ ౨౨౮; 3. దైవబలము లేనివాఁడు. "ఆ. అఖిల రాజ్య మేలువారి సఖుఁ డయ్యు నా చెనఁటి భూసురుఁడు కుచేలుఁ డయ్యె." కుచేల. ౨, ఆ. ౧౧౦. శుక. ౩. ఆ. ౧౯౨; 4. కఠినము, క్రూరము, "ద్వి. అని, భయంకరముగా నమ్మ హామునులు, చెనఁటిప్రతిజ్ఞలు సేసిన..."ద్వి. హరిశ్చ. పూ. ౪౦౪. పం. "ద్వి. చెనఁటియై ని న్నింతచేసినగాధి, తనయుని..."ద్వి. హరిశ్చ. పూ. ౧౮౮౩. పం; 5. కుత్సితము, దుష్టము. "ఆ. మంచివారి నెల్ల మనిచి చెనంటుల, నడఁచి ..."అచ్చ. అయో. ౬. భో. ౬, ఆ. ౩౧౧; 6. నీచము, తుచ్ఛము. "చ...హేయ మైనయిచ్చె నఁటి శరీరమున్ విడిచి..."భా. రా. ఆర. ౨, ఆ. ౩౯౬. "గీ. చెల్లఁబో యింక నెటువంటి చెనఁటిగొల్లఁ, జెట్టపట్టంగ దయ్యంబుసేయు నొక్కొ." నీలా. ౨, ఆ. ౭౬. క్రి. విణ. అనవ సరముగా."వ...అశ్వికులు నేల కొఱిగినం జెనఁటి దిరిగియుం ననేకఘోటకంబులు రూపఱిన..." భార. భీష్మ. ౩, ఆ. ౨౩౯.

చెనకియాడు. దే. స. క్రి. (చెనకి+ఆడు. స్వార్థమున) కొట్టు. "క. గొబ్బునఁ గొబ్బునఁ జేతికి, నబ్బినకై దువులఁ జెనకియాడిన జెనకుల్." కవు. ౧, ఆ. ౧౮౧.

చెనకు. దే. స. క్రి. 1. ముట్టుకొను, "సీ. గుజ్జు మామిడి బాత గోరాత్తనీవుగా యని చేతఁ జెనకె గయ్యాళి యొకతె." రామా. ౨, ఆ. ౧౦౦. ఆం. భా. తృ. ౧౩౨; 2. రమించు. "సీ...త్రిదశేశ్వరుఁడు కాంతఁ గామించి ఘోటకాంగంబు పొచ్చి,గీ. చెలువఁ జెనకుటకై చరించిన నెఱింగి." హరి. ఉ. ౮, ౬౯; 3. ఎదుర్కొను. "క. బాల ధ్వంసకు నాదుశ్శీలుం గాచుటకు నన్నుఁ జెనకిన ..."భార. ద్రో. ౨, ఆ. ౨౭౮. హ. న. ౧. ౨౬; 4. రేఁగునట్లు చేయు. "గీ...నర్మోక్తిఁ జెనకుచు మించఁబోండ్లఁ గూడి జలకేళి గావించు కొండేకాని." దశా. ౬, అ. ౭౪. కళా. ౬, ఆ. ౬౦; 5. ద్వేషించు, అప్రీతిచూపు. "క. అకట భవద్గురుసేనాదిక మిపు డేమియుఁ బరస్థితిం బర:గమి ని,న్నొకయించుకయును గుఱిసే, యక యిమ్మెయిఁ జెనకి తలఁకఁ డతఁడు సెడుమదిన్." రాఘవ. ౪, ఆ. ౪౨; 6. కఱచు. (చూ. చెన్కు.) వి. 1. కలియుట, రమించుట. "గీ. దినదినంబును గసికాటుచెనకువలన, దప్పితీఱనితమకంబు దెప్ప రంబుఁ, బాప సమకట్టి జారుఁ డప్పాఱుఁ దనలి, నెత్తుకొనిపోవ నిందందు నెడరు వేచె." పాండు. ౩, ఆ. ౭౨; 2. (గోరు మున్నగువాని) క్షతము "క. ఇవి పులిగోరులచెనకులు..."రా. వి. ౩, ఆ. ౬౮; 3. పోటు, దెబ్బ. "క. గొబ్బునఁ

గొబ్బునఁ జేలికి, నబ్బినకై దువులఁ జెనకియాడిన చెనకుల్.' కకు. ౨, ఆ. ౧౮౧.

చెనయు. దే. అ. క్రి. ఒప్పు. "సీ. అతిథిభక్తిత్రోడ జొన్నటుకులు పిడికెడు చినిఁగినకొంగునఁ జెనయ ముడిచి." పద్మ. ౧౦, ఆ. ౨౮౦. పండితా. దీక్ష. ౨, పా. స. క్రి. 1. తాఁకు, స్పృశించు. ఆం. భా. తృ. ౧౩౨; 2. మార్కొను, ఎదుర్కొను. "మ. ఇతఁ డిన్నింటిని రిక్తపుచ్చు గుమదం బేపార నిష్ఠాౘరణ, క్షితియుం బీనుఁగు పెంటఁ జేసిఁ జెనయం జిట్టాడఁగా శక్యమే." భార. ద్రో. 3, ఆ. ౧౬౭. నిర్వ. ౧౦, ఆ. 3; 3. పోలు, ఎనయు. "సీ. పరువంబు దప్పిన విరుల రాలఁచుఁ దరుచయము చుక్కలు లేని చదలఁ జెనయ." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౨. హర. ౪, ఆ. ౯౭; 4. పొందు. "సీ. మదురంగఁ బండిన మాలూరఫలములు చెంచుకన్యలకుచశ్రీలఁ జెనయ." కాశీ. ౧, ఆ. ౯౧.

చెనుపరి. దే. విశ. గ్రామ్యము. "సీ. చెదరినకేశముల్ చెనుపరిమాటలు వికృతస్వరంబును వెలయఁ గలిగి." భా. రా. బాల. ౯౩.

చెన్కు = చెనఁకు. 1. (ఎదుర్కొను) "గీ. గురుభుజాశౌర్యు నినుఁ జెన్కఁదరమె.." నరస. ౫, ఆ. ౧౫౦; 2. (కలచు) "చ. అదియుఁ నుగాక తత్క్షణ దహంకృతి నేఁటికి లోహితాస్యునిన్, రవముఁ జెన్క..." ఉ. హరిశ్చ. ౨, ఆ. ౧౯.

చెన్నఁగి = చెనఁగి. "ద్వి. చిఱుపాల బూరుగు చిల్ల చెన్నంగి." ద్వి. శ. సా. ౨, ఆ. ౭౦ పొ. ౧ పం. బ. ఒకజాతిధాన్యము. "గీ. గన్నెరులు నేన్గుకొమ్ములు చెన్నఁగులును." వేంక. మాన. ౭౬. "సీ. నాగకేసరులు చెన్నంగులు కురువులు ..." సాం. ని. మాన. ౫౨.

చెన్నఁటి = చెనఁటి. 1. (నీచము.) "ఉ. నృత్తవిరోధిముఖ్యు లగువేల్పులఁ బుట్టఁ దలంతురు... పౌండరీకను, క్షేత్రపతిన్ భజించి తమచెన్నఁటి పుట్టువు నీఁగుకోరికన్." పాండు. ౨, ఆ. ౯౦. హరి. పూ. ౭, ఆ. ౩౭; 2. (దౌష్ట్యము,) "క. మిన్నక యేఁడుగర యిఁడుమీ, చెన్నఁటితన ముడిగి రాచసింగంబునకున్." అచ్చ. సుం. ౧౪౫. ఆం. భా. తృ. ౭; 3. (రిక్త, వట్టిది.) "సీ. ఒడఁబడ్డయట్లైన నదరి పైకొనఁ జూచి చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయుఁ." భార. విరా. ౨, ఆ. ౩౦౧.

చెన్నఁటిపోవు. దే. అ. క్రి. (చెన్నఁటి+పోవు.) వ్యర్థమగు. "ఉ. మీరును సేవిచారములు మిన్నక చేయక పెంపుమీఱ నాచేరువ రండు గెల్పుటను శ్రీయును గీర్తియుం ముక్తియుఁన్ మృతిం, జేరురణప్రయత్నవిధి చెన్నఁటిపోవునె..." హరి. ఉ. ౧౦, ఆ. ౧౨౩.

చెన్నచెర్ణ. దే. వి. లాంగలీ. (శ. ర.)

చెన్నచెఱకు. దే. వి. అగ్నిశిఖ, కరిగొట్టి. ఆం. భా. ద్వి. ౭౮.

చెన్నపట్నము. స. వి. (చెన్నప+పట్నము) మదరాసు నగరము. (దామెర వెంకటాద్రినాయకుఁడు పాలించి తనతండ్రిపేరిడిన నగరవిశేషము.(బ్రా.)

చెన్నపురి = చెన్నపట్నము. (వా.)

చెన్ను. దే. వి. 1. అందము. "మ...ఒక్కలతా తన్వి పొలంగి పొంగుమదికాంక్షల్ దీర మేసెల్లఁ గన్నులు గావించి కుమారుజవ్వనము చెన్నున్ జూచుచందంబునన్." స్కా. ౫, ఆ. ౭౦. ఆం. భా. తృ. ౪౧; 2. కాంతి, "సీ. రాణించు జాలివజ్రాలమేడలడాలు కఁడువెన్నెలచెన్ను పరిఢవింప." దశా. ౧, ఆ. ౨౬౨. ఆం. భా. ప్ర. ౧౩౯; 4. విధము. "క. వెన్నెలఁ బయనము నడచిన,చెన్నున..." కు. సం. ౧౧, ఆ. ౨౫. సమీర. 3, ఆ. ౨౭౭. విశ. అందమైనది. "సీ. చెలువంపు మేనును జెన్ను మొగంబులై యెప్పుడు పొడసూపె దింకఁ గట్టి." భార. ద్రో. ౨, ఆ. ౩౩౮.

చెన్నలరు. దే. అ. క్రి. (చెన్ను+అలరు) ఒప్పు. "క...,విన్నప్పటినుండి తలఁపు వేళొకపనిపైఁ, జెన్నలర చెన్ని తెఱఁగుల..." నీలా. ౨, ఆ. ౩౮. (ఇట ప్రవర్తింపదు అని భావము.)

చెన్నారు = చెన్నలరు (చెన్ను+ఆరు) "క. వారణయానలు గరములు, నీరడిచినరవము మురజనిస్వనముగఁ జెన్నారఁగఁ బద్మినులాడెను..." పారి. ౪, ఆ. ౩౧.

చెన్నుఁడు. దే. విశ. అందగాఁడు. (శ. ర.)

చెన్నుపడు. ద్వ. అ. క్రి. (చెన్ను+పడు.) శోభ గలుగు. (చూ. చెన్నువఱచు.)

చెన్నువఱచు. ద్వ. స. క్రి. (చెన్నుపడు. ధా.) శోభకలిగించు. అలంకరించు. (బ్రౌ.)

చెన్నుమిగులు. దే. అ. క్రి. (చెన్ను+మిగులు.) ఒప్పు. "సీ. వికటాంబువీచుల ప్రకటాహమిక మాన్పుచిక టారిపాదలిక్షల్ చెన్నుమిగుల." శశాం. ౨, ఆ. ౧౬.

చెన్నుమీఱు = చెన్నుమిగులు. (చెన్ను+మీఱు) ఒప్పు "గీ. చేత సుమ్మొనకై దువ్వ చెన్నుమీఱ." హరి. ఉ. ౬, ఆ. ౩౪.

చెన్నెసలారు=చెన్నారు. (చెన్ను+ఎసలారు) ఒప్పు "ఉ. క్రన్నన సేన యన్నియును గైకొని యేతెద నీసహాయులై, చెన్నెసలారువీరు గతచేష్టత నద్దెస దూలి పాఱఁగన్." హరి. ఉ. ౨, ఆ. ౧౨౮.

చెన్నుఁదనము. దే. వి. (చెన్ను+తనము.) అందము, సొగసు. "సీ. వెన్నెలపులుఁగుల చెన్నుఁదనం బుతోఁ జక్రాంగఖేదంబు చాల మించె." కాళిందీ. ౩, ఆ. ౩౯.

చెప్పించు. దే. స క్రి. (చెప్పు. ధా. ప్రే.) చెప్పఁజేయు. (బ్రౌ.)

చెప్పిచూచు. దే. స. క్రి. (చెప్పు+చూచు స్వార్థమున) చెప్పు. "సీ. చెలులతో నింతయుఁ జెప్పిచూచెద నన్న సిగ్గు నాచనవులు చెల్లనీదు." విక్ర. ౧. ఆ. ౧౨౯.

చెప్పు. దే. స. క్రి. (త. చెప్పు.) 1. వచించు, పలుకు (దీనిద్విత్వము ప్రార్థనాదులయందు వికల్పముగా లోపించు. "చ...కారణం, బమల చరిత్ర యేమి చెపుమయ్య వినం గడువేడ్క యయ్యెడున్." భార. ఆది. ౧, ఆ. ౧౨౮. స్వా. ౬, ఆ. ౯౧;) 2. స్తుతించు, పొగడు. "చ. విరటుఁడు నిన్ను నెప్డు బవి వేపురమందటఁ జెప్పు బాహువిస్ఫురితుఁడు శౌర్యశాలి...అనుచు..." భార. విరా. ౪, ఆ. ౭. "గీ. నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన, నాత్మసంస్తుతి పౌరుషం బగునె చెపుమ." భార. ఉద్యో. ౨, ఆ. ౨౬౪; 3. (గ్రంథాదికము) రచించు "క. విజ్ఞానేశ్వరము జగతి వెలయఁగఁ జెప్పెన్." విజ్ఞా. వ్యవ. ౧౫౨. "ఉ...నీ వెఱం బద్యము చెప్పకుండినను..." పరమ. ౩, ఆ. ౭౩; 4. ఆజ్ఞాపించు, నియమించు. "గీ. బాలుఁ డీతండు మీమీఁద భక్తి గలఁడె, చేయుఁడా వీడు సులభుఁడై చెప్పినట్లు." కాశీ. ౪, ఆ. ౧౫. జై. ౪. ఆ. ౯౪; 5. తెలుపు, ఎఱిఁగించు. "వ ..కేరళభూరమణుండు కళాపూర్ణకునకు... శౌర్యంబుకొలంది నెఱుపుద మని చెప్పించిన..." కళా. ౮, ఆ. ౯౮ జై. ౧, ఆ ౧౩౮. వి. 1. మాట, పలుకు. "గీ. సారసంసార మెల్ల నిస్సార మేల, చేయనెత్తెను వలదు నా చెప్పు సేయుం." కు. సం. ౭, ఆ ౪౦; 2. పాదరక్ష. "ఆ. కాలఁ జెప్పులిడక కదలరాదు." వి. పు. ౪, ఆ. ౨౪౫. ఆం. భా. ద్వి. ౭౯౮.

చెప్పుడుమాట. దే. వి. (చెప్పుడు+మాట) అసత్యము వా: వాఁడు చెప్పుడుమాటలు విని చెడినాఁడు.

చెప్పుతట్టు. దే. వి. (క. చెప్పుటట్టు) గోధాపదివ్రీ. "సీ. చెప్పుతట్టనఁగను జెలఁగు గోధాపది..." ఆం. భా. ద్వి. ౬౧.

చెమ. దే. వి. చెమట. "గీ... స్వేదము నకుఁ జెమట యనఁ జెమ్మట యనఁగఁ జెల్లు." వేంక. మాన. ౪౫.

చెమట = చెమ. "సీ. చెమటతొల్కరివానచే నంకు రించు కందళములభంగి..." వరాహ. ౪, ఆ, ౧౬౨. "గీ. సతత బహువిధరత పరిశ్రాంతి నొంది, యుఁన్న వనపాలదంపతు లొడల నున్న, చెమట లల్లనఁ బాయంగ..." విక్ర. ౧, ఆ. ౯౫. ఆం. భా. ప్ర. ౧౪౦.

చెమటకాయ. దే. వి. (చెమట+కాయ) చెమట వలనఁ గలిగినపొక్కు. (వా. బ్రౌ.)

చెమటకోక. దే. వి. (చెమట+కోక) చెమటపాఁత, ఒకవిధ మగు వేఁటసాధనము "ఆ. అచటఁ జెమట కోక యమరించి కుడిచేతఁ, గడిఁది డేగఁ బట్టి..." ద్వా. ౧, ఆ. ౨౩౫.

చెమటగొట్టు. దే. విశే. (చెమట+గొట్టు) చెమటపట్టిన వాఁడు. (శ. ర)

చెమటపట్టు. దే. అ. క్రి. (చెమట+పట్టు.) దేహము నందు చెమటకలుగు. (వా.)

చెమటపాఁత. దే. వి. (చెమట+పాఁత) వేఁటకాఁడు డేగవ్రాలుటకు మణికట్టునకు కట్టుకొను గుడ్డ. (బ్రౌ.)

చెమటపోయు. దే. అ. క్రి. (చెమట+పోయు) చెమటకలుగు. (వా.)

చెమటిఆవు. దే. వి. చిత్రవర్ణము గలగోవు. ఆం. భా. ద్వి. ౨౬౨.

చెమరించు. దే. అ. క్రి. చెమరుచు, స్వేదముకల దగు. "క. ఆచెమరించుట సుమ్మీ, యాచెమరించుట భవాని..." హర. ౨, ఆ. ౧౨. "సీ. చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంచు బోయ్యాన విసరుచు రుత్సహించి." భాగ. ౧౦, స్కం. పూ. ౬౦౯.

చెమరు. దే. అ. క్రి. కరఁగు, ద్రవించు. "సీ. చెమటఁ గస్తురిబొట్టు చెమరి ఫాలములపై నలకంబులకు వింతచెలువు దెలుప." ప్రబంధ ౧౯. వి. 1 చెమట. "చ. జిలుఁగుఁ బయొంట దూల నునుఁ జెక్కుల లేఁజెమ రంకురింప..."కవిజ. 3, ఆ. ౨౬. "సీ...చెమరించె దుర్గ లేఁజెమరునొసలు." పాండు. ౫, ఆ. 300; 2. చెమరుఁగాకి. "సీ. చెమటపో తెదురయ్యెఁ జెమరు దాదెసఁ జూపె..."ఉరా. ౬, ఆ. ౨3౫. పి. శకుం. ౧, ఆ. ౧3౨.

చెమరుఁగాకి. ద్వ. వి. (చెమరు+కాకి) ద్రోణ కాకము, ఒకజాతికాకి. "గీ...చెమరుఁ, గాకి నొకబోయ కదలంగనీక వైచె." పార్వ. ౬, ఆ ౬౬. "క. చెమరుంగాకిం గని వైచె మరుద్వేగంబు డేగఁ జేకొని..."రా. వి. 3, ఆ. ౬3. ఆం. భా. ద్వి. ౯3.

చెమరుఁగాయ = చెమటకాయ. (బ్రౌ.)

చెమరుఁబోతు. దే. వి. (చెమరు+పోతు) చెమరుఁగాకి. "గీ. చెంత వలజక్క చూపెను జెమరుఁ బోతు." తపతీ. ౫, ఆ. ౧౫. విణ. మిక్కిలి చెమట గలవాఁడు. (శ. ర.)

చెమరుచు. దే. అ. క్రి. చెమట గల దగు. "చ... ఏఁ,జెమరిచి తంచు..." హరి. ౧, ఆ. ౨౫.

చెమర్కాకి=చెమరు. గాకి. వేంక. తిర్య. ౧౦3.

చెమర్చు=చెమరుచు. "చ...అ:వ్వనిత చెమర్చు మోమమృతవర్షి సుధాకరబింబము..." సాంబో. ౪, ఆ. ౧౪౧. కళా. 3, ఆ. ౯౦.

చెమికి. దే. వి. బ. నేయునపుడు తెగిననూలు అదకుట కుపయోగించునూలుముక్కలు. "గీ. గంపల్లఁ గళాసంబు కదురు చెమిక, నూలు రాట్నంబు ..." హంస. ౨, ఆ. ౧౧.

చెమికె. దే. వి. బట్ట నేసిననూలికంటె వేఱురంగు నూలితో నేసినబట్టఅంచు. (బ్రౌ) "ద్వి. వద్ద మొగంబులు వలిపెంపుఁజెమికె, బద్దెలఁ గూర్చిన పచ్చడంబులును." పండితా. పర్వ. 3౪౪. పా.

చెముడు. వై. వి. సింహుండముపె. (సం. సింహుణ్డికా.) "సీ. చెము డన జెము డనఁ జెలఁగు సింహుండము ..." ఆం. భా. ద్వి. ౪౬.

చెమ్మ. దే. వి. 1. తడి, ఆర్ద్రత్వము. "ఉ... చంద్ర జ్వరతాపకంచుకము చాయమడుంగుల నొత్తెఁ జెమ్మనీ,రుజ్జగిలన్ ..." స్వా. ౫, ఆ. ౫౭; 2. చెమ్మచెట్టు (చూ. చెమ్మకాయ.) విణ. తడిదైనది. "ఉ...రోయు జిడ్డంచు జవాది ధూపితము యొదుటతక్క నిదుర్చుఁ బూవుఁ జెమ్మంచు..." ఆము. ౫, ఆ. ౬౧.

చెమ్మకాయ. దే. వి. (చెమ్మ+కాయ) ఎనిమిది మొదలు పదియంగుళముల పొడువుగల యొకజాతి చిక్కుడు. (బ్రౌ.)

చెమ్మగించు. దే. స. క్రి. తడిచేయు, తడుపు. "క. అని బాష్పవారిధార,ల్గనుదోయిం జెమ్మగింపఁగా." వేం. పంచ. 3, ఆ. ౧౦3.

చెమ్మగిలు. దే. అ. క్రి. ఆర్ద్రమగు. "చ...చెమ్మగిలు జెక్కుల తేటలు ముద్దుమాటలున్." ఉ. రా. ౬, ఆ. ౯౨.

చెమ్మగిల్లు = చెమ్మగిలు. "చ...చిత్రజుదేహము చెమ్మగిల్లఁగా." రాధికా. 3, ఆ. ౧౦౭. "సీ... సింధూరతిలకంబు చెమ్మగిల్ల." స్వా. ౧, ఆ. ౫౦.

చెమ్మట. దే. వి. స్వేదము. "క...చిలుపదిలుపచెమ్మట లూడలఁ గడలుకొన..." ఉ. రా. ౭, ఆ. ౧౨౫. కృ. శకు. 3, ఆ. 3౫.

చెమ్మయెక్కు. దే. అ. క్రి. (చెమ్మ+ఎక్కు.) చెమ్మగిల్లు. "క. బహుళజలప్లవ మాన, ద్రుహిణాండము చెమ్మయెక్కి రూపోర్క విభా,రహితతఁ గాటుక పట్టెను..." స్వా. 3, ఆ. ౧౯.

చెమ్మరించు = చెమరించు. "మ. తను వాద్యంతము చెమ్మరింప భయగాద్గద్యంబు గాన్పింప..." ఉ. రా. 3 ఆ. ౨౯౯. సా. 3, ఆ. ౪౦.

చెమ్మరు = చెమరు. (చూ. చెమ్మరించు.)

చెయి = చెయ్యి. వై. వి. (సం. శయః. క. కెయి.) 1. హస్తము. "క. చెయువులసాకిరికుఱ్ఱఁడు. సెయిదోయి మొగిడ్చి రాచసింగముతోడన్." అచ్చ. యు. ౨౩౩. "గీ... చెయి సాఁచి చెయి వేసి పరిత సగిస." దశా. ౭, అ. ౧, అ ౧౭౫; 2. హస్తము, తొండము. "సీ. గొప్పడుగు మెక మేన్దు చెయి గలమెకమ్ము." వేంక. విర్య. ౯౧. "క. తేరులు చెయిగలమెకములు..." అచ్చ. యు. ౩౬౫; 3. రెండుమూరలకొలఁది. (శ. ర. చూ. చెయ్యాడు.); 4. శక్తి, సమర్థత. "గీ. నా చెయినిఁ జూడు మటు పెన్కుఁ దోఁచు నీకు." పార్వ. ౬, అ. ౭౦.

చెయిచాఁచు. ద్వ. అ. క్రి. (చెయి+చాచు.) 1. చేయిచాఁచు; 2. అర్థించు, కోరు. "చ...అబ్బి నరుహామిత్రవంశ్యుఁ డొకచిత్తరికై చెయిచాఁచెఁ గామినీ, వ్యసనపరాయణుం డెఱుఁగునా నిజ గౌరవప్రభవోన్నతిన్." సుద. ౪, అ. ౧౪౬. (రెండర్థములకు నిది యుదాహరణము.)

చెయిదము. వై. వి. కృత్యము, పని. "క. కానిచెయిదములుసేయక..." భార. శాం. ౨, అ. ౪౦౬. "క...ధూర్తగోపాలుఁడు చేసినచెయిద మేమి సెప్పుదు..." పారి. ౧, అ. ౭౬.

చెయిది = చెయిదము. "ఆ. కర్ణునగవు లోకగర్హితుం డగు దుస్స సేనుచెయిదికంటె శిక్షయపాలె" భార. అర. ౧, అ. ౧౩౯.

చెయిపట్టు. ద్వ. స. క్రి. (చెయి+పట్టు.) 1. కాపాడు; 2. పెండ్లాడు. (బ్రా.)

చెయిమించు. ద్వ. అ. క్రి. (చెయి+మించు.) 1. గొప్పవాఁడగు, అధికుఁడగు. "గీ. తనకుఁ జెయి మించునట్టిఁడు ధరణి లేని,ఘనుఁడు..." చిత్రభా. ౨, అ. ౧౦౭; 2. వశము దాటిపోవు. వ్యవ:— చెయిమించినతరువాత నేమి చేసిన నేమి లాభము.

చెయిమీఱు. ద్వ. అ. క్రి. (చెయి+మీఱు.) 1. చేతఁగొట్టు. "ఉ...మేలముతోడఁ బిల్చి చెయి మీఱెద నంచునో వేంకటేశ్వరా." (తాళ్ల పాక వారి) శృం. శ. ౧౦౩; 2. వశముదాఁటిపోవు. (వ్యవ.

చెయువు. దే. వి. 1. పని, కార్యము. "మ. చెయువుల్ సెయుటలకై విధాలకుంబిక్ చేసొ్ని దు ... " భాగ. ౧౦, స్క౦. పూ. ౯౪; 2. విలాస చేష్ట. (చూ. చెయువ్వ.)

చెయువులసాకిరి. ద్వ. వి. (చెయువులు+సాకిరి.) కర్మసాక్షి, సూర్యుఁడు. "క. చెయువులసాకిరి కుఱ్ఱఁడు, సెయిదోయి మొగిడ్చి..." అచ్చ. యు. ౨౭౩.

చెయ్దము. = చెయిదము. "ఉ...భయం,పడక మదీయ పుత్త్రి బల్మి రమించిన క్రించుచెయ్దముల్." ఉ. రా. ౭ ఆ. ౩౩౬. పారి. పూ. ౯, అ. ౪౪.

చెయ్ది = చెయిది. "తోటకము...పీరికద,ద్విశయంబు గదుం జెడఁదిన్నది సూ,చితె నక్కలు దైవము చెయ్ది,గటా." భార. స్త్రీ. ౨, అ. ౧౨౧.

చెయ్యాడు. దే. అ. క్రి. (చెయ్యి+ఆడు.) రెండు మూరలకొలఁది యగు. "క. శయ్యాగార సమీప ని,కాయ్యాజిర రచితరత్న ఖచితవితర్ది,చె య్యాడురత్నకంబళి నయ్యాదవసార్వభౌము నయ్యెడ నుంచెన్." బహు. ౩, ఆ. ౨౩.

చెయ్యి. దే. వి. (క. కెయ్యి.) 1. చేయి, హస్తము. 'గీ. చేర రాఁ దెల్పుఁ దంచును జెయ్యిఁ బట్టి." పార్వ. ౩, ఆ. ౬౩. ఆం. స. మాన. ౨౧; 2. తొండము. "క. చెయ్యి గలమెకపుబారుల, బయ్యరపడి గల్లుజక్కి పదుపులనిడి..." అచ్చ. బాల. ౧౯౪.

చెయ్యివిప్పకోలుపు. ద్వ. వి. (చెయ్యి+విప్పు+కోలుపు.) నమస్కారము. వేంక. మాన. ౪౭.

చెయువ్వ = చెయువు. "సీ. పలుకులఁ జెయువ్వలఁ బాండవులకుఁ బ్రీతి గలయట్లు యుండుదు గాని ..." భార. ఆది. ౮, ఆ. ౨౧.

చెర. దే. వి. 1. శీఘ్రముగాఁ బోవుటయం దగుధ్వని కనుకరణము (వా.); 2. శీఘ్రత. (చూ. చెరచెర.); 3. కోపాదులం దగుధ్వనికనుకరణము. (బ్రా.)

చెరచెర. దే. క్రి. విశ. చెచ్చెర, శీఘ్రముగా. ఆం భా. ప్ర. ౬౪.

చెరప. దే. వి. చెక్కిలి. (బ్రా. శ. ర.)

చెరమ. దే. వి. నాసాపుటము. "గీ ..నా,సికాబిలం బు నూర్పుల గడలుకొనఁగఁ జెరమ లొక్క లావున నొత్తి..." భా. ... ౭౬౧ ద్వ. హ... ఆ. ౯ ... (చూ ...

చెరలాట. దే. వి. చెరలాడుట. "ద్వి. చిలుకలు పిల్లులు చెరలాటలాడు." ప్రభు ౪, ఆ ౧౩౧ పా. ౭.౫౦.

చెరలాటము = చెరలాట. "సీ. తుళ్లాటగొండ్లికాఁ దోఁచుచు గ్రీడాఖ్య యది మించఁదగుఁ జెరలాట మనఁగ." ఆం. భా. ప్ర. ౧౪౦.

చెరలాడు. దే. అ. క్రి. (చెరలు+ఆడు) 1. ఎక్కువగా ఆడు. "ద్వి. పురములోపలనుండి పులుఁగులఁ బట్టి చెరలాడుచును బోయి చిత్రాంగిఁ జూచి." ద్వి. శ. సా. ౧, ఆ. ౪౯. పా. ౧౫. పం. "సీ. గుంజమంటపకుటీ క్రోడమధ్యంబున సాఖుతోఁ జెఱలాడునడవిపిల్లి." కాశీ. ౨, ఆ. ౪౩; 2. వ్యాపించు. "సీ. చెక్కుటద్దములపైఁ జెరలాడు నప్పుడు కస్తూరికాపత్రకములఁ బోలె." శైవ. ౬, ఆ. ౧౦౩.

. చెరలు. దే. అ. క్రి. ఉత్సహించు. "ద్వి. చెరలుచు గోహత్య చేసినయూర..." బస ౭, ఆ. ౪౦. పం. వి. ఉత్సాహము. (చూ. చెరలుకొట్టు.)

చెరలుకొట్టు. దే. అ. క్రి. (చెరలు+కొట్టు.) ఉత్సహించు. "వ... క్రొన్ననమునికోలఁ గదల్చినం గెరలి చెరలుకొట్టుచు మిన్నులపైఁ బాఱుచిలుకవారువంబుల..." శ్రీరం. ౨, ఆ. ౫౯.

చెరవ. వై. వి. (సం. చరుః) వెడలుపుమూతి గల పాత్రము. "గీ. ఇలఁ జెరవ మూయ మూఁకుడు గలదు గాక, నోరు మూయంగ మూఁకు డెందులను గలదె." సా. ౨, ఆ. ౨౪౯. ఆం. భా. ద్వి. ౨౪౫.

చెరి. దే. వి. మట్టి, కఱ్ఱ మున్నగువానితోఁ జేసిన శిల్పము. ఆం. భా. ద్వి. ౨౯౬.

చెరికి. దే. విశే. ధూర్తుఁడు. "సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ మలుచ..." ఆం. భా. తృ. ౭.

చెరుగు. దే. స. క్రి. (ధాన్యాదులు) చేటతో నిష్పించు. "సీ. చేటఁ జైకొని యూల్ల చెరిగెద నని పోవు..." శుక. ౨, ఆ. ౨౧౮. దశా. ౮, ఆ. ౬౦

చెరువు. యు. దే. స. క్రి. (త. సెరుక్కు..క. సెర్కు.) 1. గ్రుచ్చు, నాటు. "చ. కరమున నున్న శూలముననఁ గ్రమ్ము మెఱుంగులు శత్రుసైన్య భీకరములు గా గజాశ్వభటకాయములఁ గుదిగ్రుచ్చినట్లుగాఁ, జెరువుచు..." భార. భీష్మ. 3. ఆ. ౧౦౮. "క. కృతివర్మయొడల సాత్యకి శితసాయకములు పదాఱు సెరివిన..." భార. ద్రో. ౪, ఆ. ౧౫; 2. పువ్వులు మున్నగునవి, కూర్చు, సంఘటించు. "సీ. చెరువంగఁ గలిగెఁ గ్రొవ్విరి పురాణాతికి..." సాంబో. ౧, ఆ. ౨౦౧. శైవ. ౮, ఆ. ౧౬౧; 3. దువ్వు. దిద్దు. "ఆ. ఎఱుక లాయ్యెఁ జక్కఁ జెరివి మోమొత్తించి, కొఁజూ కక్కురలను గదియ వైచె." ద్వా. ౧, ఆ. ౨౩౫; 4. దోఁపుకొను. "సీ. బిట్టులిక్కి గట్టురా పట్టి దొట్టినభీతిఁ జేవులఁ జుట్టనవ్రేళ్లు చెరివికొనియె." గీ... భేరిధణధణం ధణల నపుడు." దశా. ౨, ఆ. ౫౫. వి. 1. దోఁపుడు. "వ... మలయానిలంబు మలయుపలుచని తావులకు వలయుంచెరువులు సెరివి..." ఉ. హరి. ౫, ఆ. ౧౩౬; 2. (సం. సరః) తటాకము. "రగడ. చిన్నిచెందొవలచేఁ జెరువులును దొరువులును." రాఘవ. ౨, ఆ. ౬.

చెరువుకోడి. దే. వి. (చెరువు+కోడి) నీటికోడి. "సీ...గొరవంక జక్కవ చెరువుకోడి." హంస. 3, ఆ. ౧౨.

చెర్లాట = చెర్లాటము. "సీ. తేళ్లచెర్లాట రంజిల్లెడు హరులును..." కళా. 3, ఆ. ౧౦.

చెర్లాటము. దే. వి. మిక్కిలిఆడుట. "ఉ... దానవుల్ ... త్రిప్పి చెర్లాటము చూపి..." ఉ. హరి. ౪, ఆ. ౨౬౯.

చెర్వు = చెఱువు. "క...చెర్వున నూనియ సెరసిన క్రియ..." సాంబో. 3, ఆ. ౩౬.

చెఱ. వై. వి. (సం. చారః. క. సెఱె. త. చిఱై) 1. కారాగృహము "నఱకుట యర్థము గోనుటయుఁ, జెఱ నునుచుట..." భార. శాం. ౨, ఆ. ౩౭౬; 2. బంది. ఆం. భా. ద్వి. ౨౨౫; 3. దాస్యము, "చ. యోధులం. బఱిపఱిచేసి వేలుపులపాలి సుధాధన మీవు తెచ్చి వేఁచెఱ యుడిగించి తల్లికిఁ బ్రసిద్ధిగఁ జూపవె పుత్రకృత్యము ల్." హరి. ఉ. ౮, ఆ. ౪౭; 4. నిర్బంధము. "ఉ. నీచెఱఁ బాసిపోయి రజనీచర చక్రి భీఠింప ..." ఆము. ౬. ఆ. ౪౫; 5. బాధ. "సీ. చెఱనుఁ బాలాడపు వ తెఱయాని గోఁగంతు చెఱనుఁ బొ లొయునే ఉగుడు.బోతే." విజ. ౨, ఆ. ౧౯౪.

చెఱఁగు. దే. వి. (క. సెఱంగు.) 1. కొంగు, బట్ట యొక్క అంచు. "గీ. అవని గంపింప లలితపీతాంబరంబు, చెఱగు దూలఁ జక్రాంకుశులఁ దుఱఁగలింప." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౫. "చ. అవి కరయుఁ బట్టుఁబుట్టము చెఱంగుననుఱుం గయి యునిక్కఁ జేసి..." నైష. ౬, ఆ. ౧౩౧; 2. కొస, చీరకొన. "చ. పుడమిచెఱంగు లెత్తి యఱట బోరగిలంబడఁ ద్రిప్పిపైతుమో." రామా. ౭, ఆ. ౫౪; 3. వస్త్రము "సీ...చెఱఁగుమట్ట దనుచుఁ జెందు మఱపు." చంద్రి. ౧, ఆ. ౬౫; 4. భాగము, ఖండము. "ఆ. బలభిరంబుచేత భారతవర్షంపుటుర్వి చెఱగు వొదియున్నదిక్కు, పడగ లొరగి శేషఫణికి..." రామా. ౭, ఆ. ౩౨; 5. ప్రక్క, దిక్కు. "క. నాలుగుచెఱఁగుల నేలయుఁ, బాలింపుం డంచు..." భాగ. ౯, స్కం. ౫౮౫. వేంక. దేవ. ౨౧.

చెఱఁగుమాయు. దే. అ. క్రి. (చెఱఁగు+మాయు) బట్టమాసినదగు, ముట్టగు. "గీ. చెఱఁగుమాసిన మానినుల్ తోఁగ్గుతోడఁ, బలిపిలోకనమార్గంబు పరిహరించి." కాశీ. ౨, ఆ. ౭౨, "గీ. జిగురు కొన్నరజస్స్ఫూర్తిఁ జెఱఁగమాసి." కాళ. ౩, ఆ. ౨౧.

చెఱకడము. దే. వి. (చెఱకు+అడము.) బెల్లము. "సీ. వడఁబెట్టిలోఁ జెఱకడము సాంబా లూన్ప జేలఁగు సంబారంపుఁ జింతపండు." ఆము. ౨, ౨. ౯౭.

చెఱకు. దే. వి. (క. చెరుకు) 1. ఇక్షువు. చెఱకువి. "క. చెఱ కొకటి కలుగఁగా మరుచెఱకున్ జోలైతి వనుచుఁ జెఱకులగమి నేతఱిఁ గలుగానుగులాడుదు, రెఱిఁగి ప్రజల్ సుగుణ లన్న రేంద్రు నివీటన్." రామా. ౧, ఆ. ౧౨౭. ఆం. భా. ద్వి. ౭౪; 2. వంటచెఱకు, కట్టె, (ఈయర్థమున నిది 'వంట' పూర్వకముగానే యుండును.) వా - వంటచెఱకు ఒకపుట్టి కొనితెమ్ము,

చెఱకుఁగట్టె. దే. వి. (చెఱకు+కట్టె.) ఇక్షుదండము. (వా.)

చెఱకుఁగోల. దే. వి. (చెఱకు+కోల) చెఱకుగడ. "ఆ. మఱియుం నట్టిషష్టమాసవుఁ గింకనుల్, విఱిచి చెఱకుఁగోల విఱిచినట్లు, బాధపెట్టుచుండ..." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౧౭౪.

చెఱకుఁదీఁగె = చెఱకుఁగోల. (చెఱకు+తీఁగె) "క. చేగానుగాడు చెఱకుం, దీఁగెరసంబునఁ బరాదిఁ దేల్పక గుడుపన్." పార. ౧, ఆ. ౧౮.

చెఱకుపందెము. దే. వి. (చెఱకు+పందెము) పందెము వేసికొని చెఱకుఁగట్టలను విఱుచునొకానొక యాట. "గీ. కికలిపిట్టలఁ గొట్లాటఁ బెట్టి చూచు, దిట్టతనమునఁ జెఱకుపందెంబు లాడు." కువల. ౫, ఆ. ౯.

చెఱకులపందెము = చెఱకుపందెము. "సీ. వామన గుంటలు వడిఁగుప్పిగంతులు చెఱకులపందెముల్ చిమ్ముతాయి." హంస. ౩, ఆ. ౧౪౬.

చెఱకుపాలు. దే. వి. (చెఱకు+పాలు) చెఱకురసము. "సీ. విరివియై చెఱకుపాల్ వెల్లువ వాఱెడిక్రమమున నాలాపగతులు వెలయ." ఉ. రా. ౭, ఆ. ౧౬౪.

చెఱకువిలుకాఁడు. దే. వి. (చెఱకు+విలుకాఁడు) - ఇక్షుధన్వుఁడు - మన్మథుఁడు. "గీ. చెఱకువిలుకానిబారికి వెఱచి నీదు, మఱుఁగుఁ జేరితిఁ జేపట్టి మనుపు నన్ను." విజ. ౧, ఆ. ౯౩.

చెఱకువిల్కాఁడు = చెఱకువిలుకాఁడు. "సీ. ఎబ్బెఱిక మఱ లేక యేలుచునున్నాఁడు చెఱకువిల్కానికి జిక్కినాఁడు." ఉ. రా. ౬, ఆ. ౨౦౦.

చెఱకువిల్తుఁడు. దే. వి. (చెఱకు+విల్తుఁడు) మదనుఁడు. "సీ...చెలి నీకు వశి యగుఁ జెఱకు విల్తుఁడు..." ఉ. రా. ౩, ఆ. ౧౦౭.

చెఱగొను. ద్వ. స. క్రి. (చెఱ+కొను) చెఱపట్టుకొను. "గీ. నన్నుఁ జెఱగొని గంధర్వనాయకుండు." భార. అర. ౬, ఆ. ౯. హరి. ఉ. ౪, ఆ. ౪౩.

చెఱచు. దే. స. క్రి. 1. (చెడఁజేయు, వ్యర్థము చేయు) "వ...అయిన మీవచనంబులు చెఱపంజాల..." హర. ౬, ఆ. ౧౧౫. (మానభంగము చేయు) "క. అతనిపొరుగింటియంగన...చెఱపఁ గోర్కి తీఁగలు సాగన్." కేయూర. ౨, ఆ. ౨౧. 2. (తగ్గించు) "వ...పలుకంబడిన మా కేడుపండ్లగా రాముఁ జెఱచు గబ్బిగుబ్బలుఁను." హర. ౩, ఆ. ౨౩.

చెఱచెఱలాడు. దే. అ. క్రి. (చెఱచెఱలు+ఆడు) కోపముచే మండిపడు. (శ. ర.)

చెఱదెచ్చు. ద్వి. స. క్రి. (చెఱ+తెచ్చు) బందిగా తీసికొనివచ్చు "ఉ...ధరాతనూజుఁ డు,త్తేజిత శక్తిఁ దొల్లి చెఱదెచ్చినవారిఁ బదాఱువేల ధా,త్రీ జనమాన్యలన్..." భాగ. ౧౦, స్కం. ఉ. ౨౦౬.

చెఱపట్టు = చెఱగొను. "సీ. శతమన్యుఁ జెఱపట్టఁ జాలిరే పగవార లని తపోలోకంబుమునుల బెగడ." ఉ. రా. ౫; ఆ. ౬. భార. అర. ౭ ఆ. ౬౧.

చెఱపనచేట. దే. విశే. (చెఱచు ధా.) 1. అగ్నియందుఁ బాడొనర్చునతఁడు - నాశకుఁడు. "క. అతివ మించి చొచ్చిని ల్లటు, చెఱిచిలి వీఁకఁ బుట్టి నిల్లు చెఱిచెద ననియే, బఱతెంచిలి రెండింట్లకుఁ జెఱపనచేట వయి యేమి చేసెకి దనుచున్." జై. ౪, ఆ. ౬౯. హంస. ౫, ఆ. ౧౧౩; 2. తొందరపడి పనిచేయువాఁడు, జాల్ముఁడు." ఆం. భా. కృ. ౬.

చెఱపోవు. ద్వి. అ. క్రి. (చెఱ+పోవు) నిర్బంధముపై పట్టువడు. "వ...సైంధవుచేతం బాంచాలి చెఱపోయె నని పలుకుచు..." భార. అర. ౬ ఆ. ౧౯౬. ఉ. రా. ౬; ఆ. ౩౧౮.

చెఱమ = చెరమ. "క. బఱచునొకకడిలిఁ బతిముకుఁ, జెఱమలకై యేయఁ జెప్పుచినుఁగఁగ..." స్వా. ౪, ఆ. ౪౫.

చెఱలుగొను = చెఱగొను. "సీ. ఆకతాయలు మూఁకలై దేశమంతయుఁ జెఱచి పుణ్యస్త్రీలఁ జెఱలు గొనిరి." వి. పు. ౨, ఆ. ౧౨౩.

చెఱలుదెచ్చు = చెఱదెచ్చు. "వ...సముంచితరూప విభవాభిరామలం జెఱలుదెచ్చి యొప్పింప..." హరి. ఉ. ౪, ఆ. ౪౫.

చెఱలుపట్టు = చెఱపట్టు. "సీ. తొలివేల్పుదొరను నల్గొలువ రా రేలంచుఁ దెఱగంటితెఱవలఁ జెఱలుపట్టు." సమీర. ౧, ఆ. ౧౫౦

చెఱవడు. వై. అ. క్రి. (చెఱ+పడు) బందియగు, "క. ఖలుచేఁ జెఱవడి భీతిం,గలఁ గెడుసీతఁ గని..." భా. రా. అర. ౨ ఆ. ౧౬౩.

చెఱసాల. వై. వి. (చెఱ+సాల) కారాగారము. "క. చెరసాలలందుఁ జెలిఁ బల్మఱు నారసి..." అచ్చ. సుం. ౧౮. ఆం. భా. ద్వి. ౨౨౬.

చెఱి = చెఱు. (శ. ర.) "వ...అంత...ధృష్టకేతుండును...సహదేవుండును జెఱియొక యక్షౌహిణితోడం జనుదెంచిరి..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౧౯.

చెఱు = చెఱి. దే. అవ్య. (ఇది ఉన్మధ్యమునటకుఁ గాని కాదనుటకుఁగాని నిర్ధారకముగాఁ గావ రాదు.) ఒక్కొక్కనికి. ఒకొక్కనికి. 'ఉ... [illegible] జెఱువేయి నేఁ ..." భార. సభా. ౧. ఆ. ౧౪. భార. ఆది. ౭. ఆ. ౫౧.

చెఱుక = చెఱి. 1. ఒక్కొకదానికి. (శ. ర.); 2. [illegible]రస్వకము. (బ్రౌ.)

చెఱుచు = చెఱచు. 1. (పాడుగొట్టు) "ఆ. అట్టి యొఱుక జనుల కాకున్మాత్రన, చెఱుచుమద్య సేవ సేయఁదగునె." భార. ఆని. ౩, ఆ. ౧౨౦; 2. (త్రోసిపుచ్చు) "వ...అయిన మీవచనంబులు చెఱుపంజాల..." హరి. ౬, ఆ. ౧౧౫; 3. (చంపు, నశింపఁజేయు.) "సీ. తొల్లి యిచ్చటన యూదూరదృష్టియును దూరశ్రవణము నిద్దురాత్మకుండు, సాధించి నాఁడె తత్సాధన కెందఱుదఱుకత్తుకలు కోసి చెఱిచెనొక్కొ." కళా. ౩, ఆ. ౧౦౨; 4. మానభంగము చేయు. "మ...అద్దుష్టుఁడు బల్మిఁ బట్టి చెఱిచెన్ వేమాటలింకేటికిన్." ఉ. రా. ౪, ఆ. ౨౮౯; 5. పాడుచేయు. "ఆ. ఫణిశలాటు లురుల నణలకై తమ కూడు, చెఱుప మావులంటి చెలువపిండు..." ఆము. ౫, ఆ. ౧౨౭. (దీనిరూపాంతరము చెఱ్చు) "ద్వి. యజ్ఞేశుఁడేని క్రియాదక్షునకును, యజ్ఞమేటికి జెర్చె..." పండితా. వాద. ౨౦౫, పా.

చెఱుపరి. దే. విశే. (చెఱుపు+అరి. త. సెఱుప్పవర్) చెఱచువాఁడు, నాశకుఁడు. 'గీ...సీకుఁ, గొంప చెఱుపరిపొమ్మను కూడె నపుడు." చంద్రా. ౫, ఆ. ౧౦౮. (కొంపచెఱుపరి = అగ్ని అని తాత్పర్యము.)

చెఱుపు. దే. స. క్రి. చెఱచు, తుడిచివేయు. (వా.) వాఁడు పలకమీఁది వ్రాఁత చెఱుపుచున్నాఁడు. వి. 1. విధ్వంసము. "గీ. శక్రుసులభేఁడ నీ కిటులన్ సుశక్రునేల, దురములోప మార్తురఁ దొడరి గెలుచు జాడ లెన్నేని గల వెవ్వ జంతుమాలి, చెఱుపుదొర లని ప్రేలిమి సేయు మొకటి."

అచ్చు. యం. ౪౩౫; 2. కీడు, ఆపద. వా:— దేవుని నమ్మినచోఁ జెఱుపు గలుగదు.

చెఱువు. దే. వి. (క. కెఱె.) తటాకము. "చ. చెఱు వొకరుండు గట్టిన విశేషపుఁ లాభము లేక యుండున్నచో, నెఱుఁగఁ గేత్ కొకండు తగ నేర్పునఁ గట్టఁ దలంచె నేనియుం, జెఱు వొగిఁ గట్టనాతనికిఁ జెప్పి యొకండబడఁ గట్టు టొప్పు..." విజ్ఞా. వ్యవ. ౧౫౦. భార. శాం. 3, ఆ. ౧౬.

చెలంతు. దే. వి. ఉత్సాహము. "ఉ...మహీ పాలునివీక్షణభ్రీకురపంక్తులు గంతు లిడుం జెలం తులన్." కృ. శకుం. ౨, ఆ. ౨౦.

చెలఁగించు. దే. స. క్రి. (చెలఁగు. ధా. ప్రే.) 1. వ్యాపింప జేయు. "వ...సింహనాదంబులు చెలం గించి...మై. ౨, ఆ. ౯౭; 2. చేయు. "సీ. ఈలఁగి గళధ్వనుల్ చెలఁగించి చెలఁగించి..." అని. ౨, ఆ. ౯౧; 3. మెప్పింపఁజేయు. "గీ. తెలుపకయు తెల్పి కడునేర్పు తేటపడఁగ, సలరుబొంకులఁ జెలఁగించి..." ద్వి. పరమ. ౭, ఆ. ౫౩౦.

చెలఁగు. దే. అ. క్రి. 1. మిక్కిలిఉత్సహించు. "ఆ. చెలఁగి చెలఁగి మలఁగి మలఁగియల్లల్లన, క్రావి క్రావి...చకోరచయంబు చదలు దమమయంబు గాఁగ." నిర్వ. ౬, ఆ. ౪౮. భీమ. ౫, ఆ. ౧౯౬; 2. విజృంభించు, దండెత్తు. "క. జననాథులపైఁ బెల్లేసిన వారలు నొక్క పెట్ట చెలఁగి ముకుందా, ర్జునులఁ బటుబాణవర్షం, బున ముంచిన నార్చె నీదుపుత్రబలంబుల్." భార. భీష్మ. 3, ఆ. ౧౩. సా. ౧, ఆ ౯౪; 3. విప్పారు, విచ్చు. "సీ. ఆరాజదర్శనం బబ్బక యుండిన నయనోత్పలంబు లేక్రియఁ జెలంగు." రసిక. ౫, ఆ. ౧౪; 4. ప్రకటించు. "క. జైమిని మునితా నేర్చిన,సామ మునకు బహుసహస్రశాఖలు గలుగం,గా మున్నొనర్చి శిష్యులచే మూఁడుజగంబులం దుఁ జెలఁగఁగ జేసెన్." విప్ర. 3, ఆ. ౯౫; 5. పిక్కటిల్లు. "స్రగ్ధర...దేవతల్ పొంగి యార్వన్, గుతలం బల్లాడఁగా దిక్కులు సెలఁగ పడిం గూలె..." కు. సం. ౧౨, ఆ. ౧౯౧; 6. ధ్వనించు, వాగు. "ఉ...ఆనకదుందుభుల్ సెలఁగ..." భార. ఆది. ౭, ఆ. ౨౧౭. కా శీ. ౭, ఆ. ౨౦౨;

7. ఒప్పు. "చ. కనుఁగొని యర్ధచంద్రవిశిఖం బడ రించినఁ గర్ణసూతి ముత్తునియలు నేయుచుం జెలఁగ..." జై. ౭, ఆ. 3౨. ఆం. భా. తృ. ౯3; 8. మోదించు, సంతసించు. "చ. కలిమియుం లేమియుఁ జ్ఞ సతముగా వని చెందినచోఁ జెలంగు చున్, గలఁగుచు నుక్కు ధీరులప్రకారమె..." భార. అర. ౭, ఆ. ౧౯3. "క. చెలఁగరు కలఁ గరు సాధులు..." భాగ. ౧, స్కం. ౪౯౭; 9. ఉండు. "ఉ...పాఱకిట్టున్న గతిం జెలంగు మరి..." ఉ. హరి. ౬, ఆ. ౨౧3. "ఆ... మన్మథు వచ్చునదాఁక, సంబరాన లేకమై చెలంగు." వి. పు. ౧, ఆ. ౬౯; 10. ప్రకాశించు. "చ...చందమామ కడు నింగిఁ జెలంగి మెలంగె నెంతయున్." రామా. ౨. ఆ. ౯౫; 11. కలుగు, జనించు. "ఉ...చుట్టు సానందన మస్రులై బలసి నవ్యవికాసవిరిసంభ్రమస్పంద నముల్ నిజంబు లగుభావములం జెలఁగంగ నత్తఱిన్." హరి. పూ. ౭, ఆ. ౨3౦.

చెలఁది. దే. వి. (క. సిలంది.) సాలెపురుగు. "శా. గౌరీశుండు చెలంది బాము గజముల్..." కాశీ. ౨, ఆ. ౯3. ఆం. భా. ద్వి. ౯౭.

చెలఁదితెర. ద్వ. వి. (చెలఁది+తెర.) సాలెపట్టు. "క. సెలపూఁదాలుపు మనపూ,జలు మెచ్చునె యని మఱి విచారింపక చీ,కిలిమాకిలిగా నల్లిన,చెలఁది తెరల్ సూచి సంతసించుట లేదే." సా. ౧, ఆ. ౧౫.

చెలఁదిపుర్వు. ద్వ. వి. (చెలఁది+పుర్వు.) సాలెపురుగు. "సీ. నులిగొన్న చెలఁదిపుర్వుల నూలివల్లె నా నవు రెమముడుతకన్నొమలవలన." కళా. 3, ఆ. ౯3.

చెలక = చెలిక. (బ్రౌ.)

చెలగము = చెలఁది. (శ. ర.)

చెలమ. దే. వి. మంచినీటికై త్రవ్వినగోయి, నూయి. "సీ. కుండికానదిలంబు గుల్యాప్రపూరంబు సెల యేటిపాథస్సు చెలమనీరు." కాశీ. 3, ఆ. ౨౨౪. ఆం. భా. ప్ర. ౧౬౨.

చెలయు = సెలయు. (శ. ర.)

చెలరేఁగు. దే. అ. క్రి. (చెలఁగి+రేఁగు.) 1. మిక్కిలి రేఁగు, సంతసించు. "క. అనుచు జెలరేఁగి మంత్రులు, గొనియాడుచు నుండిరి..." సా.

౧, ఆ. ౩౨. "గీ. బాలికలతోడఁ జెలరేఁగి బంతు లాడు." భాగ. ౧౦, స్కం. పూ. ౧౬౭౭; 2. విజృంభించు. "చ...ముదం,బునఁ జెలరేఁగి యూర్వ..." ఉ. రా. 3, ఆ. ౨౩౩. ఆం. భా. తృ. ౯౭; 3. తొందరపడు. "చ. అనలశిఖాలిఁ గాంచి యభయం బభయం బని దేవతల్ నభం, బున జెలరేగి చీదరటకుమన్న మనోభవు నీఱు చేసి పోయిన..." కు. సం. ౫, ఆ. ౫౩; 4. అతిశయించు, మించు. "వ...సముజ్జృంభమాణ సత్ప్రభావాప్తిం జెలరేఁగునికాయ్చైచికిం బట్టి..." చంద్రి. ౪, ఆ. ౧౦౭.

చెలఁగు. దే. స. క్రి. నఱకు. వా:—దారిలోని తుప్పలు చెలఁగినారు.

చెలవు = చెల్వు. "సీ. కెలఁగి మహోద్యదుమాఱులు గొండగొడ్డు...దుల పగాపా...జులఁ జెలవినాఁడ." అచ్చ. బాల. ౨౦౧. ద్వి. తి. సా. ౧, ఆ. ౧౭. ... ౩౦. ౧.

చెలామణి. దే. వి. చెల్లుబడి. (వా.)

చెలామణియగు. దే. అ. క్రి. (చెలామణి+అగు.) నాణెము మొ. వ్యవహారమునఁ జెల్లుబడియగు, అడ్డులేకవాడఁబడు. వా:—వెనుకటినాణెము లిపుడు చెలామణికావు.

చెలి. దే. వి. (క. సెళ్ఫి.) 1. ఆఁడుది. "గీ. పురుషులన నెంత చెలులకు మరులుకొలుప." కవిరా. ౪, ఆ. ౭౯. ఆం. భా. ద్వి. ౧౦౪; 2. హితుఁడు. "క. ఈనలువురు దక్కఁగ మన, సేనల నొక్కరుని నైనఁ జేద్పదనిభటుం, గానం జెలి కెద రైనం, బూని తలఁగునతఁడచూపె పురుషుం డెందున్." భార. విరా. 3, ఆ. ౨౩౧; 3. చెలికత్తె. "సీ. చెలి యనఁ జెలిఁకాడు చెలికత్తెయును దోఁచు..." ఆం. భా. తృ. ౪౪.

చెలిక. దే. వి. 1. క్షేత్రము, చేను. ఆం. భా. ద్వి. ౨౩౦; 2. బీడు. (చూ. చెలికపట్టు.)

చెలికపట్టు. = చెలిక. (చేను.) "వ...సారంగంబుల ఖురళికారంగంబు లనఁ గనుపట్టు చెలికపట్టులును..." స్వా. ౪, ఆ. ౩౭.

చెలికత్తియ. దే. విణ. (చెలి+కత్తియ. స్వార్థమున.) స్నేహితురాలు, సఖి. "క. అత్తఱి మురిపమునఁ జెలికత్తియగమి గొలువ..." స్వా. ౬, ఆ. ౩౦.

చెలికత్తె = చెలికత్తియ. "సీ. చెలికత్తె నెలుఁగెత్తి చీరుతో య్యాలిఁ దమకుల మని కోయిలల్ గుంపు గూడ." ఉ. రా. ౬, ఆ. ౨౭. వైష. ౧, ఆ. ౫.

చెలికవెలుఁగు. దే. వి. (చెలిక+వెలుఁగు.) కాళ జంఘుళి. (శ. ర.)

చెలికాఁడు. దే. వి. (చెలి+కాఁడు. స్వార్థమున.) స్నేహితుఁడు. "చ. అనవుడు నిట్టునుల్ విదురుఁ డక్కడ ధర్మసుతుండు బాంధవుం,డును జెలికాఁడునున్..." ఉద్యో. ౨, ఆ. ౭౪. ఆం. భా. ద్వి. ౧౯౬.

చెలికారము. దే. వి. (చెలి+కారము.) స్నేహము. "రగడ. బహుకాలము తన మొనరించినధనపతి చెలికారము సుపక్కృతి చేసితి." ఉద్భ. 3, ఆ. ౨౯౭. "సీ. అబ్ధితోఁ జెలికార మంది మైనాకంబు రచియించె నిజపక్షరక్షణంబు." సాంబో. ౧, ఆ. ౧౩౪.

చెలితనము. ద్వ. వి. (చెలి+తనము.) స్నేహము, మైత్రి. "తరువోజ. చెలితనంబున గౌరి చెల్వ పార్వతికిఁ జేసె సత్కృతు లెల్ల శ్రీసొంపు మెఱయ." హరి. ఉ. 3, ఆ. ౭౫.

చెలిది. దే. వి. 1. మేహరోగము. (శ. ర.); 2. చర్మరోగము. "గీ...చెలిది యనఁగఁ ద్వగ్గతవ్యాధి భేదమై పఱలుచుండు." ఆం. భా. ద్వి. ౧౨౯

చెలినరి. దే. విణ. (చెలిమి+అరి.) చెలికాఁడు, చెలికత్తె. (శ. ర.) సాం. ని. మాన. ౫.

చెలిమి. దే. వి. (చెలి+ఇమి.) 1. స్నేహము. "క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాహంబు..." భార. ఉద్యో. ౨, ఆ. ౪౬. ఆం. భా. ద్వి. ౧౯౬; 2. సంబంధము. (చూ. చెల్మి.)

చెలిమికత్తియ = చెలికత్తియ.

చెలిమికత్తె. = చెలిమికత్తియ. "క...చెలిమికత్తెలు సగరే." ఉ. హరి. ౫, ఆ. ౧౬౩. వాల్మీకి. ౧, ఆ. ౨.

చెలిమికాఁడు. దే. విణ. (చెలిమి+కాఁడు.) మిత్త్రుఁడు. "క...గతకల్మషులోడఁ జెలిమికాఁడై యుండెన్." వేం. పంచ. ౨, ఆ. ౬౩. కాశీ. ౧, ఆ. ౧౨౧.

చెలిమిచెలువ. దే. వి. (చెలిమి+చెలువ.) చెలిమికత్తె. "గీ. చెలిమిచెలువలతోఁ గూడఁ జిదిమికొనుచు." కృష్ణ. ౪, ఆ. ౪౯.

చెలిమిడి. దే. వి. నీరుచిట్టిళ్లీ. ఆం. భా. ద్వి. ౬౭.

చెలిమివాఁడు. దే. విణ. (చెలిమి+వాఁడు.) ప్రియుఁడు. "సీ. బలిమి వాసవుచెట్టు నులిమి వాకిటఁ బెట్టుకలిమివాలుగకంటి చెలిమివాని." చంద్రా. ౧, ఆ. ౧౪.

చెలియ. దే. వి. 1. ఆఁడుది. సాం. ని. మాన. ౨౦; 2. చెలికత్తె. "క...మెలఁతకుఁ బలికెన్, వలపు సమం బగుట జన్మవాసన చెలియా." స్వా. ౬, ఆ. ౬౬.

చెలియలికట్ట. దే. వి. (చెలియలు+కట్ట. చెల్లు+అల+కట్ట అని బ్రౌ.) సముద్రపుటొడ్డు, వేల. "క. చెలియలికట్ట సముద్రము, నిలిపినక్రియ సేన పార్థు నిలిపెద ననుచున్." భార. ద్రో. 3, ఆ. 3౮. భార. ఉద్యో. ౪, ఆ. ౨౨.

చెలియలు = చెల్లెలు. "వ...తమచెలియలినివాహంబుసేయ..." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౪. భార. ఆది. ౬. ఆ. ౨౧౧.

చెలివి. దే. వి. వృక్షవిశేషము. (బ్రౌ.)

చెలుకు. దే. స. క్రి. 1. పెఱుకు, పెల్లగించు. "సీ. శ్రీకంఠుమూర్తి నీక్షింపనివారలకన్నులు చెలుకుఁడు గత్తిమొనల." సానందో. ౨, ఆ. 33. పా; 2 చిమ్ము, పోవునట్లుచేయు. "సీ. పొదరిండ్లు చెలిక తపోధనులె చనుత్రోవ ఘంటాపథము సేయఁ గాసరములు." కళా. ౧, ఆ. ౧౭౨.

చెలుపు. దే. స. క్రి. పూయు, అలఁదు. "సీ. వెలిమిడి నలికంబు చెలుపంగఁ బోవుచు తెలుపార మైనిండ నలఁది కొనుచు." కు. సం. ౮, ఆ. ౬౬.

చెలువ. దే. వి. (చెలువు+అ.) 1. స్త్రీ, ఆఁడుది. "ఉ. వారివిహారవేళఁ జెలువా చెలువారెడు పీచకుంగవన్." నైష. ౫, ఆ. ౧౧౮. ఆం. భా. ద్వి. ౧౦౪; 2. పత్ని, భార్య. "ఆ. చనుచుచుండి తనదు సంగీతచాతురీ, గరిమపసకు మున్ను సరసిజాక్షు, చెలువ లాత్మ మెచ్చి..." కళా. ౨, ఆ. ౪౦. హరి. ఉ. ౪, ఆ. ౧౫౪.

చెలువము. దే. వి. 1. సొగసు, అందము. "ద్వి. అన్నియుసేల యీయాయలివేణిచెలువ, మెన్నినజగతి నహిప్రతి యనఁగ." ద్వి. పరమ. ౫, ఆ. ౪౪3. పా. నైష. 3, ఆ. ౧౦; 2. కుశలము. "మ. చెలువంబే వినుపీటిసీటరులకున్ జేజేలకున్ తెన్నయే." చం. రా. ౨, ఆ. ౨౦; 3. విధము. "క...వివ్వచ్చుకొడుకు కోపించినఁ, జిచ్చు మిడుతపిండు నేర్చుచెలువము దోఁచెన్." భార. ద్రో. ౨, ఆ. ౭౭. విణ. అందముగలది. "సీ. జేజేలరాతాలచెలువంపు గృహపాళికటికి పీకటి గుంపు గరిమ నింప." దశా. ౧, ఆ. ౨౬౨. నీలా. ౧, ఆ. ౬.

చెలువారు. దే. అ. క్రి. (చెలువు+ఆరు.) ఒప్పు. "సీ. శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువారుబిసములు తన్నగ్నసురదంతిదంతములుగ." నైష. ౧,ఆ.౯౬.

చెలువు = చెలువము. 1. (అందము.) "గీ. చిట్టిముట్టాడుచుండ నచ్చెలువచెలువుఁదగిలి..." భార. విరా. ౨, ఆ. ౧౫౹. ఆం. భా. తృ. ౪౧; 2. క్షేమము. "క. ఇలపతులచిత్తస్వస్థులు, కలయికలం జెలిసి మెల శుభాంతల కెలమిని, జెలువొనరు జయము చేకుఱు.." హంస. ౧, ఆ. ౧3౫; 3. విధము. "క...చెలి చెపఁకినసడ మానిమిడి,చె వునఁ బఱతెంచె భీషసేనుఁ డచటికిన్." భార. భీష్మ. 3, ఆ. ౨౨3. విణ. 1. యుక్తము, అర్హము. "చ చెలువుగ దానధర్మములు చేసినవారలు...కాంతురు పుణ్యలోకములే." జామ్మాపీ. 3, ఆ. ౧౦౧; 2. ఇష్టము. ప్రియము. "క. శ్వేతులు నిద్రితర్జిత, చేతస్కులు నైనసరులఁ జెలువుగ మానో, పేతులఁ గాటినచట..." భార. శాం. ౬, ఆ. ౪౬౬. "గీ. శివకథాగోష్ఠి చెవులకుఁ జెలువు కాదు." భీమ. 3, ఆ. ౭౨.

చెలువుఁడు. దే. వి. 1. ప్రియుఁడు. "చ...తల్కువచ్చునో, చెలువునిచెంగటం బరునిచెంగటఁ బోలెఁ గురంగలోచనా." శుక. ౧, ఆ. ౪౪౦; 2. మగఁడు. ఆం. భా. ద్వి. ౧౧౫; 3. విటుఁడు. "క. వ్యాఘ్రాదికభయదాటవి, శీఘ్రగతి న్మెలఁగు నసతిఁ చెలువుఁడు దానున్." పాండు. 3, ఆ. ౦౫; 4. అందగాఁడు. "చ. చెలువుఁడ నీయొడం జెవులు చీఁడఱఁ జెందఁగఁ బెక్కులాగులం,బలుకఁగ నేల యాతలిరుఁబోయపుటన్నులమిన్న చెల్మి నీ,కలవడెనేని...పసిండితోడ...మానికంపు రవ బొందుగఁ గూర్చినచందమౌఁ జుమీ." నీలా. ౨, ఆ. 3౦.

చెల్క = చెలిక. (చేను.) "ఉ. అంటలు గట్టి చెల్క లకు సాంద్రము బిడ్డలు..." ఆము. 3, ఆ 33.

చెల్గు = చెలఁగు. (అతిశయించు.) "సీ. లాకసొచ్చితి మంచు హుంకారములు సెల్గఁ గలవరించుచు బిట్టు తెలియువారు." భా. రా. యు. ౨౬౬.

చెల్మికత్తె. దే. విణ. (చెల్మి+కత్తె స్వార్థమున) సఖురాలు. "తత్తరమ్ము మాని నిద్రమత్తు వీడి వచ్చి చెల్మి, కత్తెలలో నిపుడు నీవు పొత్తు గూడవే." సప్త. ౧౦. "శా...తానును జెల్మికత్తె లగు సుశ్రోణుల్ ప్రవీణాత్మలై." గాథే. ౧౬౧.

చెల్ల. దే. అవ్య. 1. సంతాపము సూచించుటకు. "గీ. చెల్ల పనులకుఁ బోవలెఁ జేల విడువుము..." దశా. ౭, ఆ. ౧. ఆ ౧౪౪; 2. ఆశ్చర్యము సూచించుటకు. "రగడ. చెల్ల విరులనె కనిరి చెలులు భమరనములు." ఉ. రా. ౬, ఆ. ౬౧.

చెల్లఁబెట్టు. దే. స. క్రి. (చెల్లన్ + పెట్టు.) పోఁజేయు. "ఆ. విమనిభంబు లైనవిషయాభిలాషంబు, లెల్లఁ జెల్లఁబెట్టి యేను బ్రహ్మ, చర్యధుర్యవృత్తి నవరించు చున్నాఁడ..." పాండు. ౫, ఆ. ౨౦౮.

చెల్లఁబో. దే. అవ్య. (చెల్లన్+పో.) 1. ప్రశంసార్థమునకు. "క. చెల్లంబో యితనికరుణచెలు విట్టున్నే." భార. అశ్వ. ౪, ఆ. ౧౨౦; 2. సంతాపార్థమునకు. "క...దీనికిఁ జెల్లంబో యిట్టి మగఁడు సేకుఱె ననఁగన్." భో. ౫, ఆ. ౩౨౬. వరాహ. ౨, ఆ. ౧౭; 3. ఆక్షేపార్థమునకు. "ఆ. రాజసూయకర్త బ్రహ్మదత్తుం డట్టెరసభ మెసఁగ హంసడిభకులట్టె, చేయఁ బనుచువారు చెల్లఁబో లవణంబు, హెచ్చువాఁడఁ గాక మురవిరోధి." ఉ. హరి. ౪, ఆ. ౧౫౪.

చెల్లచెదరు. దే. విణ. (చెదరు+చెదరు.) ఎక్కువగా చెదరు. "గీ. అరయ దెస లేక నీధనం బడవిలోనఁ జెల్లచెదరయ్యె..." హరి. పూ. ౭, ఆ. ౩౯. భా. రా. యు. ౭౪౮.

చెల్లరా = చెల్ల. (సంతాపార్థకము.) "క. సౌమిత్రియుం దుఃఖించుచు, రాముని కెడమైతిఁ జెల్లరా యని యార్తన్." పద్మ. ౯, ఆ. ౪౭.

చెల్లరె = చెల్ల. (సంతాపార్థకము.) "చ. నరుఁడు విహీనసాధనుఁడు నా కెదురై లలిఁ ద్రుష్టి యూడఁ జెల్లరె యిటు సూడఁగాఁ దగునె..." హరి. ఉ. ౭, ఆ. ౨౧౫.

చెల్లరే = చెల్ల. 1. (సంతాపార్థకము) "ఉ. తాపసవృత్తి నుంచువలదైవము నేమననేర్తుఁ జెల్లరే..." విక్ర. ౨. ఆ. ౭౬౦; 2. (ఆశ్చర్యార్థకము) "ఉ. క్రొందలిరాకుబాకు దొరకన్ దొరకించుభవంబు చెల్లరే, చందనగంధి చన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యామహేంద్రుఁడో." కృ. శకుం. ౨, ఆ. ౧౨.

చెల్లాకుఁజెదరు. దే. క్రి. విణ. చెల్లాచెదరుగా. "క...చెల్లాకుంజెదరు చేసె శీఘ్రమె వానిన్." రంగా. ౨, ఆ. ౨౪౭.

చెల్లాచెదరు = చెల్లచెదరు. "క...చెల్లాచెదరై యక్షులు పెల్లగిలం బఱచిరి..." నిర్వ. ౪. ఆ. ౭౫. హరి. ఉ. ౬, ఆ. ౧౩౫.

చెల్లాట. దే. వి. ఆట. "సీ. సతతపుష్పితలతాయుతమైనరైవతకాద్రి యెవ్వానిచెల్లాటగట్టు." గట్టు. సువ. ౧, ఆ. ౮౯. "క...గోపాలునితో, మల్లాడుచు నెల్లప్పుడు చెల్లాటల నుండురాధ జిలిబిలితమిచేన్." రా. ౧, ఆ. ౧౫.

చెల్లాటము = చెల్లాట. "గీ. అనుచుఁ జెనుచూఱ వోలెఁ జెల్లాట మెసఁగ." వేం. పంచ. ౪, ఆ. ౧౨౭. హంస. ౧, ఆ. ౧౩౪.

చెల్లాడు = చెరలాడు. (క్రీడసలుపు) "శా. ముల్లోకంబులు దల్లడిల్లు నిపు డీముంగోపి కేసుంగులోఁ, జెల్లాడంజను బాలలీల..." చం. రా. ౩, ఆ. ౧౪౨. రాజచ. ౧, ఆ. ౪౭.

చెల్లించు. దే. స. క్రి. (చెల్లు. ధా. ప్రే.) 1. గెలిపించు. "గీ. అఖిలధర్మపరాఙ్ముఖుఁ డయిన నతని, మతము చెల్లించె నెందును మనుజకోటి." హరి. పూ. ౧, ఆ. ౧౦౦; 2. తీర్చు, నెఱవేర్చు; "సీ. తల వంచుకొని భవద్భర్త వీకోరిక చెల్లించెఁ గదలి విచ్చేయవలయు." జై. ౬, ఆ. ౪౬. మార్క. ౮, ఆ. ౧౫౩; 3. ఇచ్చు, "ఉ. ఇంతయు నేల మీకు నెదురెక్కటి నొక్కటికిం బదాఱు చెల్లింతు..." ఉ. హరి. ౩, ఆ. ౧౧౭. "గీ. ఎట్లు చెల్లింతుఁ దంకంబు లేడునూర్లు." (చాటువు) 4. వధింపు, చంపు. "క...ఇం, కెల్ల తెఱంగుల మిమ్ముం, జెల్లించెద వెల్పుగములు చెలఁగుచు

నుండన్." నీలా. 3, ఆ. ౭3; 5. సాగించు, నడపు. "సీ...అప్సరస్త్రీజనంబు, నాట గంధర్వులపాటుఁ జెల్లింపుఁడు నావుడు వా రట్ల నడపి..." భార. ఆశ్వ. ౧, ఆ. ౧౦౨. హర. ౫, ఆ. ౪౦.

చెల్లియ = చెల్లె. (వా.)

చెల్లియలు = చెలియలు. (శ. ర.)

చెల్లు. దే. అ. క్రి. (త. చెల్.) 1. తగు, అర్హమగు. "మ...ఇమ్మంచుకొం, దను రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్." స్వా. ౨, ఆ. ౧౬. వరాహ. ౯, ఆ. ౧౨౭; 2. నెగ్గు; అడ్డులేకుండ సాగు. "ఉ...నీపలుకుఁ బంతము సెల్ల మదీయగేహకేళీవనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము..." పారి. ౪, ఆ. ౧౧. ఆము. ౪, ఆ. ౨౦౬. "చ. అతఁడు పరప్రసాద మహిమాతిశయంబునఁ జేసి విష్టపత్రితయము గీర్వాణం దనదు తేజము చెల్లుచు నుండ..." నిర్వ. ౨, ఆ. ౬3; 3. నెఱవేఱు. "గీ. పెద్దకాలంబు యత్నసంపీడ నంది, చెల్లఁజేసినపని యొక్క ఫొల్ల పగతుచే నసిద్ధతఁ బొందుట..." భార. అను. ౪, ఆ. 3౭౬; 4. శక్తికలవాఁ డగు. "గీ. చెల్లియుండియు సైరణ సేయునతఁడు." భార. ఉద్యో. ౨, ఆ. ౪౨; 5. సరిపడు. "సీ...ఉత్పలమాలికలు నేత్రములకుఁ జెల్లు." హంస. ౧, ఆ. ౬౨; 6. కడచు. "వ...ప్రౌఢ్ధుగ్రుంకి నప్పుడు రణం బుపసంహరించుచు శేష కడఁ దొడంగుచుం బెనంగ నిరువదిరెండుదివసంబులు చెల్లిన..." భార. ఉద్యో. ౪, ఆ. 33౦. 7. (అప్పు మొ.) తీఱు. "ద్వి. అనఘాత్మ పీఱుణం బంతయుం జెల్లె." ద్వి. హరిశ్చ. పూ. ౧౯33. "మ...;విను సానీయొడఁబాటు సెల్లె..." భార. అను. ౧, ఆ. ౨౬3. 8. నశించు, 'గీ...మాత్సర్య మతిశయిల్లెఁ, జెల్లె దయ..." వరాహ. ౭, ఆ. 3౧. పరమ. ౧, ఆ. ౪3; 9. మరణించు, చచ్చు. "సీ. శార్దూలముఖుఁ డీల్గె స్తనితహస్తుఁడు సెల్లె..." అచ్చ. సుం. ౧౨౪. భార. శల్య. ౧, ఆ. 3౭౦; 10. ప్రవర్తిల్లు. "క...రణ, మెన్విధి నూలుకొని చెల్లె నెఱిఁగింపు తగన్." భార. భీష్మ. ౧, ఆ. ౨3౨. దశ. ౯, ఆ. ౧౯; 11. పీలగు. "ఉ...వాఁడు తనయుం గ్రతుఁ జూపెద నన్ను మిమహీవల్లభు వారి కేల యమవహ్నులకై నసురూపు తోడఁ బోఁ, జెల్లదు..." భార. కర్ణ. ౧, ఆ. ౨౧౦. భా. రా. యు. ౬౦౧; 12. ముగియు, పూర్తియగు. "క. కడునుగ్రం బగువ్రత మిది, దొడఁగితి దివసత్రయంబుతో నిది సెల్లెన్." భార. అర. ౭, ఆ. ౨౦౪. శుక. ౨, ఆ. ౧౬౦; 13. అయిపోవు. "ఆ. చేతికానుక లెల్లఁ జెల్లంగవచ్చిన." భల్లా. 3. (శ. ర.) "తరల...తరలమై వరి యెల్లఁ జెల్లఁగ..." వరాహ. ౧౦. ఆ. 3౮; 14. ఒప్పు. "గీ...బహువిధములఁ, జెల్లుబోధసాధనముల కెల్ల సిద్ధ, యొక్కటియె యిది భిన్నవిస్తారితములు." భార. శాం. ౬. ఆ. ౫౧౨. భాగ. ౧౦, స్కం. ఉ. ౨౫౮; 15. చెందు, ప్రాప్తించు. వ్యవ:— ముడుపు చెల్లినది; 16. మాఱు. వ్యవ:—ఈరూపాయి చెల్లదు; 17. సమ్మతమగు. (వా) ఈపాటు చెల్లను. విణ. చేరినది. (శ. ర.)

చెల్లుచీటి. దే. వి. (చెల్లు+చీటి.) రసీదు. "ద్వి. క్షితినాథుచే సొమ్ము చెల్లినందులకు, నితనికి నిప్పింపుఁ డిటఁ జెల్లుచీటి." ద్వి. పరమ. ౬, ఆ. ౪౮౦ పా.

చెల్లుబడి. దే. వి. చెల్లు ధా.) 1. సాగుట. "మ...ఈయంచత త్తడి రాహుత్తునిమాట చెల్లుబడి..." చం. రా. ౨, ఆ. 3౫. కళా. ౧, ఆ. ౭౦; 2. అధికారము "గీ. పీటఁ దమ కెవ్వరెదు రని వెఱపు లేక, చెల్లుబడిఁ బ్రల్లదంబులు సేయఁ దొడఁగి, రథపులెంకలు..." హర. ౫, ఆ. ౮; 3. సమర్థత. "క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, దల్లికిఁ దండ్రికిని దేహధనములవృత్తుల్, వెల్లింపఁడు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧3౯౨. విణ. 1. చెందినది. "సీ. పొదుపుఁ గొండకుఁ జెల్లుబడికోన లవి యెల్ల..." ప్రబంధ. ౧౬౧; 2. నెగ్గినది, గెలిచినది. "ద్వి. పలుకుపంతము చెల్లుబడి గాఁగ నతనిఁ, జలపట్టి బొంకింపఁ జాలకయున్న." ద్వి. హరిశ్చ. పూ. 3౭౮ పం.

చెల్లె. దే. వి. 1. సోదరి. "శా. ఏమే చెల్లె బిటేన రా. గడవె..." ఉ. హంశ్చ. 3, ఆ. ౩౭ అం. భా. ద్వి. ౧౦3; 2. వాత్సల్యసూచకము. "సీ.

చెల్లె బొమ్మలపెండ్లి చేసె దీ వేఁటికి..." దశా. ౮, ఆ. ౭౨.

చెల్లెలికట్ట = చెలియలికట్ట. (చెల్లెలు+కట్ట) "సీ. వాటంపుమున్నీటివలని చెల్లెలికట్టఁ గలిగిన నళికల వలపు గొంత." సాంబో. ౫, ఆ. ౧౮. భాగ. ౮, స్కం. ౨౦౯.

చెల్లెలు. దే. వి. ఔ. సోదరి. "క. బలియుం డగు దొరలు తమగాదిలిచెల్లెంద్రకు ధనంబుఁ దెత్తురు..." ఉ. రా. ౪, ఆ. ౧౦౩. నైష. ౭. ఆ. ౧౧.

చెల్వ = చెలువ. 1. (ఆఁడుది.) "చ...నీచెలువము గల్గునే కడమచెల్వలకన్న..." దశా. ౭, అ. ౧. ఆ. ౭౪; 2. పెండ్లాము. "చ...అఖిలలోక రక్షకుని చెల్వవయుం బటుదీప్తబాణముల్." హరి. ఉ. ౪, ఆ. ౧౫౪.

చెల్వము = చెలువము. "ఉ. అక్కజమైనచెల్వమున నాత్మకు ప్రేఁ గయిపొల్చుపొల్తిపై." భార. విరా. ౨, ఆ. ౨౩. స్వా. ౧, ఆ. ౫౫. విశ. 1. అందమైనది. "మ...జిగిజాళ్వా చెల్వపుఁ ముద్దుఁజెక్కిలి ముద్దాడుచు..." దశా. 3, ఆ. ౭౭; 2. మనోహరము. "చ. చిలువసుధారసాధరల చెల్వపుఁబుక్కిటితావి..." ఆము. ౫, ఆ. ౧౦౭.

చెల్వారు = చెలువారు. "శా. శ్రీకాంతాకుచహేమ కుంభములపైఁ జెల్వారు కాశ్మీరము..." వి. పు. ౧, ఆ. ౧.

చెల్వు = చెలువు. (కాంతి.) ఆం. భా. ప్ర. ౮౦. భార. ద్రో. ౫, ఆ. ౧౧౪; 2. (విధము.) "చ. చిలువలగుంపు వెల్వడిన చెల్వున..." ఉ. రా. ౨, ఆ. ౨౧౭.

చెల్వుఁడు = చెలువుఁడు. 1. (ప్రియుఁడు.) "ఉ. చెల్వగ నన్నియుం దెలిసి చెల్వుఁడు తానెటుగాఁ దలంచునో." నీలా. ౧, ఆ. ౧౦౬; 2. (విటుఁడు.) "ఉ...ఏసుద్దియుం లేక కన్మోగిచి చూచు మనో గతిఁ దోఁచుచెల్వునిన్." పాండు. 3, ఆ. ౩౧.

చెవాకు. ద్వ. వి. (చెవి+ఆకు.) "ఉ...చెవాకు గాజు లుంగొంచెపువిద్యమున్..." పి. శకుం. ౪, ఆ. ౭౮.

చెవి. తై. వి. (సం. శ్రవః. క. కివి. త. మ. చెవి. తు. కెబి.) 1. కర్ణము. "సీ. అచ్యుతుచరితంబు లాలకింపనిచెవి చెవి గాదు..." తై. ౧, ఆ. ౮౬. ఆం. భా. ద్వి. ౧౪౪; 2. రాట్నపుచెవి. "క. వడిదారముచెవులుం ద్రొక్కుడుసలకయుం..." శుక. ౨, ఆ. ౪౧౯; 3. ఆళ్వుఁజెవి. (శ. ర.)

చెవియూరు. ద్వ. అ. క్రి. (చెవి+ఊరు.) వీనులవిందగు. "గీ. అమ్మహోవస్తువును సుదానాకృతియ యనంగఁ జెవియూర విందుము..." భార. అశ్వ. ౨, ఆ. ౪౯.

చెవులారు = చెవియూరు. "గీ. నీవు వేదశాస్త్రార్థముల్ భావితాత్ములగుమునీంద్రులచేఁ జెవులార వింటి." భార. అశ్వ. ౨, ఆ. ౩౦.

చెవిఁజెందు. ద్వ. అ. క్రి. (చెవిన్+చెందు.) వినంబడు. "ఉ...చెవిఁజెందె వధూమృదుగీతనాదముల్." భో. ౫, ఆ. ౨౨౨.

చెవిఁబడు. వై. అ. క్రి. (చెవిన్+పడు.) వినుపించు. "క. అనుకలకలంబు చెవిఁబడ..." కువల. ౪, ఆ. ౧౨౮.

చెవిఁబెట్టు. ద్వ. స. క్రి. (చెవిన్+పెట్టు.) విను. "ఉ. కట్టఁడు యోగ్యశాటిఁ బొడకట్టఁడు రాచ నగణ్ణనుం జెవిం,బెట్టఁడు కీర్తి..." బహు. ౫, ఆ. ౬.

చెవులపండువు. ద్వ. వి. (చెవులకు+పండువు.) శ్రవణానందము, వీనులవిందు. "సీ. ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ గవులకుఁ జెవుల పండువులు గాఁగ." వి. ప్ర. ౧, ఆ. ౧౩. ఇంను. ౬ ఆ. ౬౫.

చెవులుగఱచు. ద్వ. అ. క్రి. (చెవులు+కఱచు.) చాడీలుచెప్పు. "క. పలుగూఁ తలఱచు వానిం గలుద్రావెడువానిఁ జెవులుగఱచెడివానిన్." వేం. పంచ. ౧, ఆ. ౪౪౫.

చెవికొఱక. ద్వ. వి. (చెవి+కొఱక.) కొనచెవి. (శ. ర.)

చెవిచోరుపాము. ద్వ. వి. (చెవి+చోరు+పాము.) కర్ణజలూక. (శ. ర.)

చెవిటి. ద్వ. విశ. (చెవి+అవిటి.) చెవిటివాఁడు. "సీ...ఉన్మత్తునిభంగిఁ జెవిటి, గీ...వదువునను..." భాగ. ౪, స్కం. ౩౮౮. ఆం. భా. ద్వి. ౧౨౦.

చెవిటిమూఁగ. ద్వ. విశ. (చెవిటి+మూఁగ.) చెవిటియు మూఁగతనమును గలవాఁడు. (శ. ర.)

చెవిదోరఁబెట్టు. ద్వ. అ. క్రి. (చెవి+దోరన్+పెట్టు.) చెవి యొగ్గి విను. ఆం. భా. తృ. ౧౧౯.

చెవియాకు = చెవాకు. 1. లక్కాకు. (శ. ర.); 2. కర్ణభూషావిశేషణము. "మ. కుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్." కాశీ. ౨, ఆ. ౭౩.

చెవుడు. వై. వి. (సం. శ్వేడః.) బధిరత్వము. "సీ. కమనీయశతకోటి ఘంటికాఘణఘణారవము చే దిక్కురుల్ సెవుడువారయ." ఉ. రా. ౪, ఆ. ౩౨౧. ఆం. భా. ద్వి. ౧౨౪.

చెవుడుపడు. వై. అ. క్రి. (చెవుడుకల దగు. "గీ... ప్రచండఘంటాస్వనంబున సకలదిశలు, చెవుడు పడఁ జేసె..." మార్క. ౬, ఆ. ౧౯౭. భార. మా. ౫౦. రూపాంతరము: చెవుడ్పడు. "ఉ. పుష్పధనుర్లతామధుపపుంజగుణక్వణనం బొనర్చి వా,ప్తోష్ఠలికర్ణముల్ మనసిజుండు చెవుడ్పడఁ జేసె నక్కటా." నైష. ౪, ఆ. ౨౯.

చెవుడుపఱుచు. వై. అ. క్రి. (చెవుడుపడుధా. ప్రే.) "సీ. గోపికావల్లకీఘోషణంబులు గావు శింజినీరవములు చెవుడుపఱుచు." భాగ. ౧౦. స్కం. పూ. ౧౫౪౪.

చెవుడుపాటు. వై. వి. (చెవుడుపడుధా.) చెవుడు గలుగుట. (శ. ర.)

చెవుడ్పాటు = చెవుడుపాటు. "వ... తత్పటు ఘోషంబుల దిక్తటంబులఁ జెవుడ్పాటొంద..." రుక్మి. ౫, ఆ. ౭౫.

చెవులపిల్లి. వై. వి. (చెవులు+పిల్లి.) శశకము. (శ.ర.)

చెవులపువ్వు. వై. వి. (చెవులు+పువ్వు.) కర్ణభూషావిశేషము. "సీ. చెవులపువ్వు బోగడ...అనఁగఁ గర్ణభూషావిశేషముల్ పొల్చు..." ఆం. భా. ద్వి. ౧౪౯.

చెవులపూవులు. వై. వి. బ. (చెవులు+పూవులు.) కర్ణభూషలు. "గీ. చెవులపూవులు బవిరలు..." కళా. ౭, ఆ. ౬౬.

చెవులపోతు. ద్వ. వి. (చెవులు+పోతు.) కుందేలు. "సీ. చెవులపో తెదురయ్యె చెమరు డాదెసఁ జూపె..." ఉ. రా. ౬, ఆ. ౨౩౫. ఆం. భా. ద్వి. ౯౫.

చెవ్వ. దే. వి. పిల్లలకు గలుగుగజ్జి. ఆం. భా. ద్వి. ౧౭౮. [(శ. ర. బ్రౌ.)

చెవ్వాకు. ద్వ. వి. (చెవి+ఆకు.) కర్ణభూషావిశేషము.

## చే

చే = చేయి. వై. వి. 1. హస్తము. "క. చే సఱచి నవ్వుచుం బరి,హాసోక్తులు మెఱయుచుండ నాయంగ్మలులు..." హరి. ఉ. ౭, ఆ. ౬౬. భార. భీష్మ. ౩, ఆ. ౩౦౧; 2. తొండము. "వ...అతని రాజ్యంబునఁ గసవుఁ గఱచి చే యెత్తి మొఱఁ బెట్టుట కరులయంద..." ఆము. ౪, ఆ. ౧౯౭; 3. అధీనత. "క. పూనఁగ రాదే నా కై,ద్దానిం బూనినను నీవు తలకొని తీర్పం,గా నునికి గలుగ నే నీ,చేనుండఁగ నిట్టు లేల చెప్పెదు చెపుమా." భార. ద్రో. ౨, ఆ. ౩౧౫; 4. తృతీయావిభక్తిప్రత్యయము. (ద్రు.) "క...కోల్పడితి గోధనము ముచ్చులచేన్." భార. ఆది. ౯, ఆ. ౧౧౭. భాగ. ౯, స్కం. ౭౩.

చేంతాడు. దే. వి. (చేఁదు+తాడు.) నూతిలో నీరు తోడుసాధనమునకుఁ గట్టుకొబ్బెరమొ. వాని నారతోఁ జేసిన త్రాడు. (బ్రౌ. వా.)

చేఁత. వై. వి. (చేయుధా.) 1. రచించుట. "శా. సర్వజ్ఞుల్ భువి మీరు భారతము ప్రజ్ఞం జేఁతయిం తొప్పదే." హరి. ఉ. ౫, ఆ. ౨౦; 2. కృత్యము, పని. "ఉ...సురాంగన లెల్ల యిట్టి నీ,చేఁతకు మెత్తురమ్మ..." స్వా. ౩, ఆ. ౩౩. భార. అను. ౩, ఆ. ౩౩౯; 3. చేయుంట, ఆచరించుట. "ఉ...సత్యభామ...అవ్వరమహీరుహదనసొమ్ము సేఁతకై, మెత్తన వేఁడెఁ జిత్తవిభు ..." హరి. ఉ. ౪, ఆ. ౨౦౪. భార. ఆది. ౬, ఆ. ౨౫౫; 4. సంకల్పము. "సీ...సృష్టియెవ్వనిచేఁతచే జనించు." భాగ. ౯, స్కం. ౧౦.

చేఁతకత్తె. ద్వ. విశే. (చేఁత+కత్తె.) పరిచారిక. "ఆ. అతనుచేఁతకత్తె లమరంగఁ గాంతలు." వేమన. ౩, ఆ. ౨౫౩.

చేఁతకాని. ద్వ. విశే. (చేఁత+కానిది) 1. అసహాయము; 2. వ్యర్థము. బ్రౌ.); 3. తెలివితక్కువది.

చేఁతకానితనము. ద్వ. వి. (చేఁతకాని+తనము) 1. అశక్తత; 2. అసహాయత. (వా.); 3. తెలివిలేమి.

చేఁతగట్టు. ద్వ. వి. (చేఁత+గట్టు) కృతకాద్రి. "సీ. పైఁడిమెట్టుక లెక్కి పై కేఁగిన చేఁతగట్టందు దాఁగుడుమూఁత లాడి యాడి." య. ౩, ఆ. ౫౩.

చేతరాసి. వై. వి. చేతలాసి, ఒకానొక కూరాకు చెట్టు. (శ. ర.)

చేతఱికము. ద్వ. వి. (చేత+ఱికము.) కీడు. "క. ప్రాంత యగుమంత్రి తనకుం, జేతఱికముఁ జేసి ననుచు శిక్షించి..."నా. పంచ. ౧, ఆ. ౨౯౦.

చేతలాసి = చేతరాసి. (శ. ర.)

చేతికాయ. దే. వి. (చేఁదు+కాయ) చేఁదు గల కాయ. "ఆ. జిహ్వ కింపుగాని చేతికాయలు ద్రెంప, నేల పాఱవైవనేల పిదప." భో. ౫. ఆ. ౯౨.

చేతిదొండ. దే. వి. (చేఁదు+దొండ) చేఁదు గల దొండ. (శ. ర.)

చేతిదోస. దే. వి. (చేఁదు+దోస) చేఁదు గలదోస. ఆం. భా. ద్వి. ౭౧.

చేతిపుచ్చ. దే. వి. (చేఁదు+పుచ్చ.) చేఁదు గల పుచ్చ. (శ. ర.)

చేతిపొట్ల. దే. వి. (చేఁదు+పొట్ల.) చేఁదు గల పొట్ల. ఆం. భా. ద్వి. ౬౦.

చేతిబీర. దే. వి. (చేఁదు+బీర) అవడ, ధామార్గవము. ఆం. భా. ద్వి. ౬౦.

చేతిసొర. దే. వి. (చేఁదు+సొర) కటుతుంబి. ఆం. భా. ద్వి. ౭౧.

చేత్రాడు. దే. వి. (చేఁదు+త్రాడు) నీళ్లు చేఁదు త్రాడు. (శ. ర.)

చేఁద. దే. వి. (చేఁదు+అ.) నీటిని తోడెడిపాత్ర. "వ...కొంకి గల నిడుపువెదురునం జేఁద పుచ్చి..."దశ. ౧౧, ఆ. ౭౮. ఆం. భా. ద్వి. ౨౯౩.

చేఁదు. దే. స. క్రి. 1. లాగు. "సీ. చెప్పనిపని నీళ్లు చేఁదెద నని పోవు..."శుక. ౨, ఆ. ౨౦౮; 2. ఉద్ధరించు. "ద్వి. చేఁదుకో చేఁదుకో సిరిగిరి నాథ, చేఁదుకో మల్లయ్య చేఁదుకో మ్మనుచు." పండితా. పర్వ. ౩౫౧, పు; 3. ప్రయోగించు. "సింగాణిఁగోలలు చేఁదినఁ దఱచుగా నవి యెల్ల విఫలంబులగుచుఁ బడియె..."దశా. ౪, ఆ. ౧౭౭; 4. కూల్చు. "వ...పెడచేతులం బఱచియుం బచ్చడబ్బలన్ మోఁదియుఁ బాడుబావులం జేఁదియుం నిట్టధికావస్థలం బెట్టుచు..."సానందో. ౨, ఆ. ౨౪ పా. వి. ఔ. అనా. 1. షడ్రసములలో నొకటి, తిక్తము. ఆం. భా. ప్ర. ౧౦౪; 2. గరళము, విషము. "సీ. చేఁదుభోజనము చేసిన మొక్కలీఁడు దక్షాధ్వరధ్వంసదీక్షాధికారి." వరాహ. ౬, ఆ. ౮౯. హ. న. ౪, ఆ. ౬౭. విశే. 1. తిక్తము. "గీ. పైత్యదోషోదయంబునఁ బరుస నైన, జిహ్వకకుఁ బంచదారకూఁ జేఁదు గాదె." నైష. ౨, ఆ. ౮౨. ౧౨౩; 2. పీనుల కింపు కానిది. "క. పీనులకుం బలుకులు నేఁ, డైనను జెప్పుదు..."భార. కర్ణ. ౧, ఆ. ౩౧౦. జై. ౭, ఆ. ౯౧. [(వా.)

చేఁదుకట్టు. దే. వి. (చేఁదు+కట్టు) పిత్తకోశము.

చేఁప. దే. వి. మత్స్యము. "చ. మిఱిగడవం దిమింగిల తమెఱ్ఱెయి వెంచిన నీవు వాతఁ గ్రుత్సి... [illegible] పడి ప్రష్టట నీవు మ్రింగుటే." ౪ ఆ. ౧౯. ఆం. భా. ప్ర. ౧౫౯.

చేకటు. ద్వ. వి. (చే+కట్టు) 1 చేతుల తొడుకొను భూషావిశేషము. "వ...అవ్విరించి జనకునకు నరణంబుగా...అంగదంబులు చేసరులు చేకటులు" ప్రబంధ. ౬౦౫ "సీ. నూలచేకటు లోకమూల హైచి సిరాజిగచుప్పల గళ్ల చేకటుల. దాల్చి." శుక. ౧, ఆ. ౨౩౭; 2. సంకెలలు. (చూ. చేకట్టు.)

చేకట్టు = చేకటు. హస్తభూషావిశేషము. బంగారపు గుండ్లు చిన్నశంఖపుగల్లులు మొ. కలిపి గ్రుచ్చు హారము. (బ్రౌ.) "సీ... చేకట్టుపాలెలు చెన్నుమెఱుగుటాకులు..."దశ. ౩, ఆ. ౭౭. వేం. మా. ౧, ఆ. ౧౩౦. బ. (సంకెలలు.) "సీ. కొమ్మ వాతెఱతోరణమ్ము గ్రుక్కొన వచ్చి కఠినవిద్రుమము చేకట్టఁ బడియె." వసు. ౨, ఆ. ౪౫.

చేకట్టుదండ. దే. వి. (చేకట్టు+దండ) హస్తమును కదలకుండఁ జేయుదండ. "సీ. వాకట్టు బదనిక చేకట్టుదండలు..."పిన. శకుం. ౧. ఆ. ౧౧౩.

చేకత్తి. ద్వ. వి. (చే+కత్తి) చిన్నకత్తి. "మ. సెల కట్టైల్ తడవిండ్లు నమ్ములపొదుల్ చేకత్తులున్..."రామా. ౨, ఆ. ౨౨. ఆం. భా. ద్వి. ౨౦౬.

చేకత్తికాఁడు. ద్వ. వి. (చే+కత్తి+కాఁడు) చేకత్తి యున్నవాఁడు, వీరుఁడు. "గీ. తీండ్రవయ నెచ్చఁ జేకత్తికాండ్రఁగూడి, గరిడిమాస్టీల జెట్ల

తో (కత్తిసాము, పెనగులాట లోనర్చుచు..." ప్రబంధ. ౬౧౬. [౧౫౩.

చేకము. దే. వి. దశ, బట్టఅంచు. ఆం. భా. ద్వి.

చేకలవాఁడు. ద్వ. విణ. (చే+కలవాఁడు) 1. పరాక్రమశాలి. "ఉ...నీరజగర్భరమావిభుం గడుం, జేకలవాఁడటం డ్రతనిచిత్రము లా పసురంబు సేసి..." శేష. ౪, ఆ. ౯౨; 2. దాత. (శ. ర.)

చేకానుక. ద్వ. వి. (చే+కానుక) ఉపాయనము. "ఉ...నాకుఁ జేకానుక చేసె నీకృపతికామిని..." శుక. 3, ఆ. ౫3౪. (దీని రూపాంతరము చేకాన్క) "మ...ఇది కొంచుం బోయి చేకాన్కగా ఘటియింపం దగు దైత్యనేత కని..." దశా. ౧, ఆ. ౨౭౮.

చేకితానుఁడు. సం. వి. అ. పుం. 1. ఈశ్వరుఁడు; 2 ఒకానొకయాదవుఁడు. విణ. (అ. అ.) ... తెలివిగలవాఁడు.

చేకురు = చేకుఱు. ద్వ. అ. క్రి. 1. లభించు, దొరకు. "చ. తరుణులు చిల్కబొమ్మలును దంతపుబొమ్మలు మేలిగాజు బన్నరులును..." పేర్చి లీలఁ జేకుర బొమ్మరిండ్లఁ జేయనగు కూళ్లను వండుచు..." కు. సం. 3, ఆ. 3౬; 2. సిద్ధించు. ఫలించు. "చ. హరిపదసేవఁ జేయుచు ననంతగుణాకరు సన్నుతించుచున్, సరసిజనాభుఁ గొల్చుచును జక్రికథాస్థితు లాలకించుచున్ నిరతముఁ గాలముం గడపునీకు నభీష్టఫలంబు లెల్లఁ జేకురు టది యబ్రమే..." రామా. ద్విశేష దర్పణము. ౪, ఆ.

చేకుఱు = చేకురు. 1. లభించు. "క. వెఱవక కలలోఁ జేసిన, కొఱగామికి వగచుచోట గుణరత్నము చేకుఱె నీకు నలిగి తన్నినఁ, బఱపు పయిం బడినయట్లు పద్మదళాక్షీ." ఉ. హరి. ౫, భార. భీష్మ. 3, ఆ. ౭౯; 2. కలుగు. "క... చేకుఱుఁ బూర్వాకారము నీ, కుఱువుగ శాపమున కవధియును నవ్వు డగున్." భా. రా. అర. ౨, ఆ. ౫౦౦. కళా. ౬, ఆ. ౧౬౦; 3. నెఱవేఱు. "ఉ...గృహాంబులక్ష్మికిన్, సేవితమయ్యె నిష్టములు సేకుఱె..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౬౬౫; 4. కట్టుపడు. "సీ. కడకాళ్ల నందంద యొడిసి చేకుఱఁ బట్టి..." దశ. ౫, ఆ. ౧౨3.

చేకూడు. ద్వ. అ. క్రి. (చే+కూడు.) 1. లభించు, దొరకు. "శా. ఆశాపాశము దాఁ గడున్నిడుపులే దంతంబు రాజేంద్ర వారాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు సేకూడియుం, గాసింబొందిరి..." భాగ. ౮, స్కం. ౫౭౫. ఆం. భా. తృ. ౯౯; 2. నెఱవేఱు. సిద్ధించు. "గీ. నిన్నుఁ గనుఁగొనఁగాఁ గల్గె గన్నులారఁ, గోర్కు లెల్లను మాకుఁ జేకూడె నేఁడు." య. ౫, ఆ. 3౨.

చేకూరు = చేకురు. 1. (కలుగు.) "గీ...శృంగారవతులరతులఁ బెనయించి...కేరు నేరుపు నీకె చేకూరె నార." రసిక. ౪, ఆ. ౧౭. చంద్ర. 3. ఆ. 3౧; 2. సమర్థమగు. "ద్వి. శేషుని క్షేపింపఁ జేకూరదన్న, భీమణగతి వీఁచెఁ జేర్చి...యున్నాలు." రం. రా. యు. 303. శా. ౨. ప... 3. వశపడు. (చూ. చేకూర్చు.); 4. సిద్ధించు. (చూ. చేకూర్చు.)

చేకూరుచు. ద్వ. స. క్రి. (చేకూరు. ధా. ప్రే.) 1. వశపఱచు; 2. సిద్ధింప జేయు. (చూ. చేకూర్చు.)

చేకూర్చు = చేకూరుచు. 1. (వశపఱుచు.) "క. నాకనఁగాఁ గనకము భ్రామా కనుఁగొనఁ జిల్లపెంకుమాత్రము దానిం,జేకూర్చిన నాతను విడె,నీకుం గైవన మొనర్తు..." శుక. ౧, ఆ. ౪3౦; 2. (సిద్ధింపఁజేయు.) "క. నిను సేవించితిఁ గావున, ననఘా నీవాంఛ తెల్పు మదిచేకూర్తున్." దశా. ౫, అ. ౯౨.

చేకూలి. ద్వ. వి. (చే+కూలి.) పనిదినమున కాదినము ఇచ్చెడుకూలి. "ద్వి. ప్రాకటంబుగ నొక్కబాఁపని యింటఁ,జేకూలి గొని కాల్చి జీవించుచుండి." పండితా. దీక్షా. ౪౯. పు.

చేకొండ. దే. వి. క్షీరవారాఁటు. (శ. ర.)

చేకొఁజె. దే. వి. పచ్చరంగు గలచెదలు. (శ. ర.)

చేకొఱుదు = చేకొఱుజు. "సీ. గంధర్వనగరరేఖలు మేఘపదమునఁ జేకొఱదులు వేశ్మసీమలందు." కాశీ. ౬, ఆ. ౫౮.

చేకొను. ద్వ. స. క్రి. (చే+కొను) 1. పరిగ్రహించు. "చ...చేకొని భరియింపు మీతని శకుంతల సత్యము పల్కె..." భార. ఆది. ౪, ఆ. ౧౦౪; 2. పుచ్చుకొను, "చ. కనుఁగవఁ బిన్ననవ్వు దోలఁ

కన్ మునినాథునికన్నుసన్నని, చ్చినఁదగ భోజనందనయుఁ జేకొని..." పారి. ౧, ఆ. ౫౫. భార. ఆది. ౨, ఆ. ౧౯౫; 3. పట్టుకొను. "క. కట్టియఁ జేకొని దేగం,బట్టి..." ప్రా. ౪, ఆ. ౨౪. దశా. ౨ ఆ ౨౬౦; 4. పెండ్లాడు, "గీ శచినిఁ జేకొన్న పాకశాసనులీలఁగి..." జామ్నవీ. ౧. ఆ. ౧౪౦. భాగ. ౧౦, స్కం. ఉ. ౧౩౫; 5. మన్నించు. "క. తన కపకారము మదిఁజే,సినఘనుఁడల్ప దనినమ్మిచేకొనియుండఁడక్ జనదు..." భార. ఆది. ౬, ఆ. ౧౧౫. "ఉ... అ,చ్చేదివిభుండు వారలన చేకొనువాఁ డగు..." భార. ఆది. ౮, ఆ ౧౩; 6. జయించు. "క... ఇష్టం, బేయది దానిక తెత్తు న,జేయుండనై యమరవరులఁ జేకొని దైత్యన్." భార. ఆది. ౨, ఆ. ౫౨; 7. వశము చేసికొను "చ...పోవు యాజి మనుష్యపత్తులు చేకొను నెల్లవెంటలన్. జెముడుముగాడె నీకకన్నఁ జీరయుఁగూడను లేక పుత్రకా." కాశీ. ౪, ఆ ౯౩; 8. తోడ్కొను, "క. నాయనుజునకు వివాహము, సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం, బోయెద నద్దం బగువా,నాయతభుజశక్తి నద్దమగుఁ డాజి మొనన్." భార. ఆది. ౪, ఆ. ౧౯౮; 9 ధరించు. "క...శౌర్యస్ఫూర్తిమూర్తి చేకొన్నక్రియన్." భార. భీష్మ. ౧, ఆ. ౨౪౬; 10. పొందు. "సీ. హరిచందనాస్పదం బగుచనుఁగవమీఁద బట్టు చేకొనుఁగాక భసితధూళి." హర. ౪, ఆ. ౨౮ భార. ఉద్యో. ౧, ఆ. ౨౧౦; 11. కాపాడు. "ఉ...కౌరవబలంబులు నెత్తురువెల్లిఁ దేలఁగాఁ, జేసినఁ గర్ణ కర్ణ మముఁ జేకొనవే యనుచున్ భయంబునన్." భార. ద్రో. ౧, ఆ. ౩౮౨. భా. రా. కిష్కిం. ౫౦౦; 12. అనుభవించు. "చ... సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దటి లేమి..." విక్ర. ౧, ఆ. ౭౧. వరాహ. ౧౧, ఆ. ౫౬; 13. తెలిసికొను. "క. నాకుం బ్రియ మిటు చెప్పితి, చేకొని హితమగుట సంతసించితిఁ దరుణీ" భా. రా. కిష్కిం. ౨౧౦. విక్ర ౧, ఆ. ౧౧౦; 14. లెక్కచేయు. "క. గోకులమును గోపాలకుఁ,డాకులమునఁ దోలునట్టు లమరుల నెల్లం,జేకొనక తోలి పంపె మ,హాకోపుఁడు వీరభద్రుఁ డలిబలుఁడు శివా." శివ. సా. ౩౦౮; 15. విశ్వసించు. "క. నీకతమున నాదాస్యము, ప్రాకటముగఁ బాయు ననినపలు కెవలోనం,జేకొని యూఱడి నిర్గత, శోకస్థితి నున్నదాన..." భార. ఆది. ౨, ఆ. ౫౦. అ. క్రి. పూను. "క. నా కభిమతంబు నిట్టిద.మీకును నుపకార మగు సమాహితబుద్ధిం, జేకొని చేసెద..." భార. ఆది. ౪, ఆ. ౧౨౯. ప్రభా. ౫. ఆ. ౯౦.

చేకోల. ద్వ. వి. (చే+కోల.) చేతికఱ్ఱ. "సీ. చీకులు వట్టినచేకోల యది పోయె..." భా. రా. అయో. ౨౦౫.

చేకోలు. ద్వ. వి. (చేకొను. ధా.) చేకొనుట. "సీ... నీకుఱఁదికి నేడుగడయు నీవ చేకోలు గలిగి రక్షింపు మింక." దశ. ౧౨, ఆ. ౧౦.

చేగ. దే. వి. (క. చేగు. త. చేకమ్) 1. చేవ, చెట్టు మ్రానులోనిసారము. ఆం. భా. ద్వి. ౩౭. "క. చేగ గలచెఱకువింటను, బాగగు నీలోత్పలంబు బాణంబుగ..." భాగ. ౧౦, స్కం. పూ. ౭౬౭; 2. శ్రేష్ఠత. "సీ...విపాశవాసియుఁ జంద్రభాగ చేగ,యును శరావతిభూతియును..." పాండు. ౧, ఆ. ౧౩౮; 3. ముద్ద. అచ్చ. "ఉ... బం,గారముచేగ యాతరుణి కన్నులపండువుగాదె చూచినన్." ద్వా. ౫, ఆ. ౧౫౫. విణ. దృఢము. "గీ. సెలసువిండ్లును మొదలైన చేగవిండ్లు." కాశీ. 3, ఆ. 3౫.

చేగగడ్డ. దే. వి. (చేగ+గడ్డ.) ఒకానొకయోషధి. (బ్రౌ.)

చేగడియ. ద్వ. వి. (చే+గడియ.) చేతిలోఁ దీసికొనఁ దగినగడియ. "గీ. వచ్చి యరరనిరోధంబువలను జూచి, కాంతుచేష్ట యొఱంగి చేగడియఁ దివియఁ గూడదు..." శుక. ౨, ఆ. ౧౨౭.

చేగలమెకము. ద్వ. వి. (చే+కల+మెకము.) ఏనుఁగు, హస్తి. "సీ. చేగలమెకములఁ జెండుచెండాన రించి..." అచ్చ. సుం. ౧౦౮.

చేగానుఁగు. ద్వ. వి. (చే+గానుఁగు.) చేతితోఁ ద్రిప్పెడిగానుఁగు. "క. చేగానుఁ గాడుచెఱకుం, దీగెరసంబునఁ బురారిఁ దేల్పక కుడువన్." హా. ౧, ఆ. ౧౮.

చేగిండి. ద్వ. వి. (చే+గిండి.) చిన్నకూజా. "సీ. చిత్రరేఖ పసిండిచేగిండి ధరియింపఁ గ్రతుశుల్క-మణిపాదుకలు వహింప." దశా. ౪, ఆ. ౯౭.

చేగు. దే. విశే. (త. చేకు.) 1. క్రూరుఁడు. "ద్వి. అసమయమునఁ దృణావర్తుఁ డనెడి,యాసుగ సుర గాలి యై భోజుఁ డనుప...అయ్యెడ మింట నడ రుచచ్చేఁగు,ఖుడమిపైఁ గెడపి..." ఆ. మ. క. ౧, ఆ. ౯౯. ౧౧. పం.

చేగురు. దే. వి. వృక్షవిశేషము. (బ్రౌ. దీనివేళ్లనుండి యెఱ్ఱరంగు తయారుచేయుందురు. బ్రౌ.)

చేగొడ్డలి. ద్వ. వి. ఔ. (చే+గొడ్డలి.) పరశువు. గండ్రగొడ్డలి. "క...రాముండిరువదియొకమఱి నృపతుల, శిరములఁ జక్కడిచెఁ దరదుచేగొడ్డం టన్." భాగ. ౯, స్కం. ౪౬౭.

చేగోడి. ద్వ. వి. (చే+కోడి.) కోడివడ, భక్ష్యవిశేషము. (శ. ర.)

చేచేమురు. ద్వ. వి. (చే+చమురు.) ఘృతము, నేయి, "సీ...నే నెయ్యి చేచమురు రస సాజ్య మొప్పు ..." వేంక. మాన. ౭౨.

చేచాచు. ద్వ. అ. క్రి. (చే+చాచు.) 1. ఆశించు, "శా...ఎవ్వారికిం జేరరాని మహానిధానము నకుం జేచాఁచితిం దొయ్యలీ." ఉ. హరి. ౫, ఆ. ౧౫౫; 2. సిద్ధపడు. ఇట్టే: చేసాఁచు. (సిద్ధపడు.) "క. ఎవ్వనితో నెచ్చోటం,జీవ్వకుఁ జేసాఁపవలదు చేసాఁచినచో...పగ సనం దీర్పఁ దగున్." కాశీ. ౧, ఆ. ౧౦౯.

చేచేపు. దే. అ. క్రి. (చేపు+చేపు.) ఎక్కువగా చేపు. "ద్వి...పాలిండ్లుచేచేప,మదిఁ బుత్రుపైఁ బ్రేమమల్లడిగొనఁగ."ద్వి. పరమ. 3, ఆ. ౧౫౭. పా. పు.

చేట. దే. వి. ఔ. చెరిగెడిసాధనము, శూర్పము. "ఉ...నిండుబండికిం,జేట భరంబె..." నైష. ౭, ఆ. ౭౬. "క...పిట్టలు, చెట్టడిచినఁ జేటెఁ డన్ని జిలజిలనెగయున్." సాంబో. ౨, ఆ. ౧౯౪. (చేటెఁడన్ని = అనేక మని భావము)

చేటకొల్లారు. దే. వి. (చేట+కొల్లారు.) గృహవిశేషము, త్రిశాల. ఆం. భా. ద్వి. ౧౪.

చేటగోళ్లబోఁటి. దే. వి. (చేట+గోళ్లు+బోఁటి.) శూర్పణఖ. "ఆ. సంతసించి యతనిచెంత కట్టులు వోవఁ, జేటగోళ్లబోఁటి ఖూటకంబు, దెలిసి..." అచ్చ. ఆర. ౧౧.

చేటచేరుపు. దే. వి. (చేట+చేరుపు) అనుకూలమై కొంచెమేటవాలుగానుండుట.

చేటచేఱు. దే. వి. (చేట+చేఱు.) ఆఁడువానిఒక విధమైనకోకకట్టు. (శ. ర.)

చేటవెయ్య. దే. వి. (చేట+వెయ్య.) 1. దూడ పోయిన వెనుక దానిచర్మముతోఁ జేయుఁకృత్రిమ వత్సము. (వా.); 2. ఒకానొకలిట్టు. "గీ...చేట, వెయ్య కల్లుచ్చు చెనుగు." హంస. ౫, ఆ. ౧౧౩; 3. లేనిపోనిమాట, కృత్రిమపుమాట. ఉదా:— పా. చెఱుపుటకు చేటవెయ్య చాలును.

చేటప్పు. దే. వి. (చేట+అప్పు) చేటతో బదులిచ్చు ధాన్యాదికము. (బ్రౌ.)

చేటరిక్క. ద్వ. వి. (చేట+రిక్క.) విశాఖానక్షత్రము. (శ. ర.)

చేటి. సం. వి. ఈ. స్త్రీ. దాసి, పనిచేయునాఁడుది.

చేటిక. సం. వి. ఆ. స్త్రీ. = చేటి.

చేటు. దే. వి. (చెడు. ధా.) 1. నాశనము. "ఆ తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి, చేటె కాదు విత్తుచేటుఁ గలుగు." భార. ఉద్యో. ౨, ఆ. ౫౬. భార. శాం. ౨, ఆ. ౧౭౧; 2. మరణము. "ఆ. నలునిబుద్ధిఁ జూచి నాకారిచే టింక, నిక్క మయ్యె నంచు నిశ్చయించె." భా. రా. ఆర. ౨, ఆ. ౧౪౯; 3. అశుభము. ఆం. భా. ప్ర. ౯౯; 4. ఆపద. ఆం. భా. ద్వి. ౨౧౧; 5. నొప్పి. "ఆ. పేదకోప మెందుఁ బెదవులచేటు గా,కుడికి యేమి సేయనోపు నన్ను." కళా. ౬, ఆ. 30. భార. కర్ణ. ౨, ఆ. ౨౪.

చేటుఁడు. సం. వి. అ. పుం. 1. దాసుఁడు; 2. నాయికానాయకులఁ గూర్చుటయందు తగు సచివుఁడు. (వీరు పీఠమర్దుఁడు, విదూషకుఁడు, చేటుఁడు మొ. వారు. వీరిలో చేటు దధముఁడు.)

చేటుకాలము. మి. వి. (చేటు+కాలము.) వినాశకాలము, అంత్యకాలము. "సీ...చేటుకాల, గీ. మైనఁ బ్రతినపట్టె నంతెయు..." భార. ద్రో. ౪, ఆ. ౨౯౧. "క...నరకుఁ డిట్మెయిఁ,గారించెం దనకుఁ జేటుకాలంబునకున్." ఉ. హరి. ౧, ఆ. ౧౧౪.

చేటుతఱి. దే. వి. (చేటు+తఱి.) అంత్యకాలము. "గీ. ఇనకులీను డు...అగ్రశిఖర మెక్కి వెలిఁగె లంకచేటుతఱికి..." భా. రా. యు. ౪౬౧.

చేటుపడు = చేడ్పడు. (చూ. చేటుపాటు.)

చేటుపాటు. ద్వ. వి. (చేటుపడు. ధా.) భంగపాటు. "గీ...చిరజీవి జాత,బాష్పుఁడై చెప్పెఁ దనచేటు పాటు మతికి." వేం. పంచ. ౩, ఆ. ౧౬౪.

చేటుమణఁగు. దే. అ. క్రి. (చేటు+మణఁగు.) నశించు, చెడు. (బ్రౌ.)

చేటుమణఁచు. దే. స. క్రి. (చేటు+మణఁగు ధా. ప్రే.) చెఱచు, నశింపఁజేయు. (బ్రౌ.)

చేట్టకొలివి. దే. విశే. (చేట్టు+కొలివి.) నిర్భాగ్యుఁడు, ఖలుఁడు. "సీ...ఖలుం డొప్ప వాట్టఁ డనంగ నురిపికట్టె, యనఁగను బొట్టని యనఁ జేట్టకొలివి నా..." ఆం. భా. తృ. ౧౩. (శ. ర. బ్రౌ పా-'చెల్లుకరివి.' లక్ష్మీనారాయణీయము. ఆం. పదా.)

చేడియ. వై. వి. (సం. చేటికా.) 1. స్త్రీ. ఆఁడుది. "గీ...ఇట్టిచేడియలు గలరె." భార. విరా. ౨, ఆ. ౨౭; 2. పత్ని, భార్య. "సీ. కూడులే కాతని చేడియ మువ్వురు కొడుకులలోపల నడిమివాని, మెడఁ ద్రాడువోసి..." హరి. పూ. ౨, ఆ. ౪౦.

చేడె = చేడియ. (స్త్రీ, ఆఁడుది.) "గీ. చెట్ట యని తిట్టరే తోడిచేడె లెల్ల.' ఉ. రా. ౧, ఆ. ౧౮౩. ఆం. భా. ద్వి. ౧౦౪.

చేడ్పడు. ద్వ. అ. క్రి. (చేటు+పడు.) 1. చచ్చు నశించు. "చ...కాల్పఁబోడం గె హుతాశనుండు నేడ్పడఁగ వనంబులోని మృగపక్షిభుజంగమ భూతసంఘముల్." భార. ఆది. ౮, ఆ. ౨౫౮. అచ్చ. యు. ౧౦౧. 2. భగ్నమగు. "శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభోభాగంబుపైఁ జేడ్పడం, గాలుం దన్నుట యెక్కడ..." భాగ. ౧౦, స్కం. పూ. ౨౫౭; 3. వ్యాకులపడు. "క. కమభయమున మాతలి చేడ్పడి రథచోదన మునం దపాటువుఁ డైనన్." భార. అర. ౪, ఆ. ౬౩. ఉ. రా. ౮, ఆ. ౮౧; 4. కష్టపడు, బాధ చెందు. "ఉ. ఈవును నేనవాలెయు మునీశ్వర భాగ్యములేమిఁ జేసి కార్శీరహాగ్ని తాపము

జేడ్పడినాఁడవు..." భీమ. ౩, ఆ. ౫. మల్లభూ. వై. ౭౮.

చేడ్పాటు = చేటుపాటు. (చేడ్పడు ధా.) 1. అశుభము. ఆం. భా. ప్ర. ౯౯. 2. ఆపద. ఆం. సం. మాన. ౫౯; 3. బాధ. "శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమె నుండి..." భార. విరా. ౪, ఆ. ౯౫. భీమ. ౩, ఆ. ౬.

చేత = చే. వై. ప్ర. ద్రు. 1. తృతీయావిభక్తి ప్రత్యయము. (సమాసమం దిత్వము వచ్చును.) "వ...అంత ద్రోణుచేత ననుజ్ఞాతుండై..." భార. ఆది. ౬, ఆ. ౩౪. "క...తేజోధనుఁడఁ బరేశుఁడ నీచేతను గానంబడితి నిదె పితామహ కంటే." భాగ. ౩, స్కం. ౩౨౧. "ఉ...కాలు చేతిబల్, త్రొక్కుల నమ్మనుప్రభృతుల్ దుద రూపఱ కుండ నేర్చిరే." ఆము. ౨, ఆ. ౭౮; 2. పంచమ్యర్థము "గీ...నారదు చేతవింటి." హరి. ఉ. ౨, ఆ, ౧౨౨. "శా. అప్పుల్ వారిధిచేతఁ బుచ్చికొని..." ఆము. ౪, ఆ. ౧౫౮.

చేతఁబట్టు. ద్వ. స. క్రి. (చేతన్+పట్టు) ఆధారముగాఁ జేసికొను. "ఆ...నరనాథ...విదువు శోక మతనిఁ, జేతఁబట్టి నీవు మాతంగతురగాది, కముల బంధుజనులఁ గాచికొనుము." భార. మా. ౧౧౭.

చేతకము. సం. విశే. (అ. లికా. అ.) 1. తలఁపించునది; 2. తలఁచునది.

చేతకి. సం. వి. ఈ. స్త్రీ. 1. కరకచెట్టు; 2. కరకకాయ; 3. జాజిచెట్టు. (వా. చ.)

చేతడి. ద్వ. వి. (చే+తడి.) (చూ. చేతడియాఱు.)

చేతడియాఱు. ద్వ. అ. క్రి. (చేతడి+ఆఱు) చేయి యాఱునంతమాత్రపు లేనియు మైన లేపుండు. స్వల్పకాలమగు "గీ. ఆజ్ఞ వట్టించి చేతడియాఱ దిపుడు, దీని కెబ్బంగి మోహానం బైనజేసి, గలిగె..." కాశీ. ౧. ఆ. ౫౪.

చేతన. సం. వి. ఆ. స్త్రీ. 1. జ్ఞానము; 2. బుద్ధి; 3. చైతన్యము; 4. చిత్తవృత్తిభేదము; 5. మనస్సు. "ఉ. చేతన కింపుగుల్కఁగ వచింపు మనంగ..." సమీర. ౪, ఆ. ౫౬.

చేతనఁబ్రాలు. దే. వి. బ. తలఁబ్రాలు, సేసలు. "ఉ...తరంగమాలి కానికము లైనమ ముత్తెములు నిచ్చలుఁ బైపయిఁబాడు ము_క్తికం, జాతదళాయతాక్షి ఘనసంభ్రి)ను మొప్ప మముత్తుమాళిపైఁ, జేతనఁబ్రాలు వోయుఁగలి శీతసమీరసమీరితంబులై." వాల్మీ. ౧, ఆ. ౭౦. [కాయ.

చేతనకి. సం. వి. ఈ. స్త్రీ. 1. హరీతకి; 2. కరక.

చేతనపడు. మి. అ. క్రి. (చేతనము+పడు.) చైతన్యమునొందు. "సీ. సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు..." భాగ. ౮, స్కం. ౧౦.

చేతనము. సం. వి. అ. పుం. జంతువు. విణ. (అ ఆ. అ.) ప్రాణముగలది.

చేతనించు. సం. అ. క్రి. చైతన్యమునొందు. "ఆ. అతని కన్నునీడ నాప్లుతం బైనయా, శవము చేతనించి చలన మొందె." భార. అను. ౨, ఆ. ౪౧౦.

చేతనీయ. సం. వి. ఆ. స్త్రీ. ఋద్ధి అనునోషధి.

చేతనీయము. సం. విణ.(అ. ఆ. అ.) తెలియఁదగినది.

చేతనుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2 జీవుఁడు; 3. దేవుఁడు.

చేతన్నఁబ్రాలు = చేతనఁబ్రాలు. "మ. చెలఁ బొందించుచు రాలుఁ బువ్వువితతుల్ చేతన్నఁబ్రాలో యనన్." ప్రద్యుమ్నచరిత్రము. (బ్రా.)

చేతప్పు. ద్వ. వి. (చే+తప్పు) వ్రాయునపుడు వచ్చినపొరపాటు, వ్రాఁతతప్పు. "గీ...వ్రాయ వ్రాయఁ, గొంతకొంతసరును జేతప్పుఁ గొనక యుండు." పాండు. ౧, ఆ. ౭౧.

చేతము. సం. = చేతస్సు. "ఉ. చేతము చల్లఁజేయవలెఁ జిల్లనఁ జల్లవలెన్..." (పెద్దనచాటువు.)

చేతముక. ద్వ. వి. (చే+తముక) చిన్నతముక. (శ. ర.)

చేతయితవ్యము. సం = చేతనీయము.

చేతరించు. వై. అ. క్రి. (క. చేతరిసు.) చైతన్యము గలదగు. "సీ. భావామృతముఁ గర్ణపథముల జొనుపవే చెలువ నీజీవంబు చేతరింప." కు. సం. ౫, ఆ. ౧౩౫. పండితా. దీక్షా. ౩౬, పొ.

చేతవులు. ద్వ. అ. క్రి. (చే+తవులు) దొరకు, లభించు. "క. చేతులకసివోఁ గయ్యము, సేతవిలెదుఁగట్టి విధము చింతించి నను, బ్రీతుంగాఁ గరుణింపుము..." ఉ. హరి. ౫, ఆ. ౨౨.

చేతస్సు. సం. వి. స్. న. 1. చిత్తము, మనస్సు; 2. చిత్తవృత్తి; 3. చైతన్యము; 4. తెలివి.

చేతాఁకు. ద్వ. వి. (చే+తాఁకు.) సాహసము. "క. నాతోఁ దలఁపోయక రో షాతురతన్ బ్రతివచ్చి కవనీనాథ, వ్రాతంబు వినఁగ నిట్టులు, చేతాఁకున దెప్పరంబు సేసితి కంటే." భా. ద్రో. ౨, ఆ. ౩౦౨.

చేతాళ్లు. ద్వ. వి. బ. మల్లుని యాయుధవిశేషములు. అం. భా. ద్వి. ౨౦౭.

చేతించు. సం. అ. క్రి. చైతన్యమునొందు. "ద్వి. ఆత్మయు నొడలు వేఱై యుండియును ద,దాత్మ చేతను వ్యాప్త మైనదేహంబు, చేతించినట్లు దోఁచియుఁ శరీరంబు,చేతింప దాత్మయే చేతించుఁ గాని." పండితా. వాద. ౧౯౫.

చేతిబిడ్డ. ద్వ. వి. (చేయి+బిడ్డ) పసిబిడ్డ. (శ. ర.)

చేతిలోనియది. ద్వ. విణ. హస్తగతము, అధీనము. "గీ...సజ్జనుని చేతి, లోనియది బ్రహ్మలోకంబు దీని మీఱ, లేర్పడఁగ నెన్నఁడును విని యెఱుఁగ రెట్టు." భార. శాం. ౬, ఆ. ౨౮౮.

చేతిలోనివాఁడు. ద్వ. విణ. హస్తగతుఁడు, అధీనుఁడు. "ఆ. ఇట్లు సేయవేని యింద్ర నీరెల్ల నా,చేతిలోని వార చెప్ప నేల." ప్ర. భా. ౧, ఆ. ౮౮.

చేతివ్రాలు. ద్వ. వి. బ. (చేయి+వ్రాలు.) 1. హస్తరేఖలు. (శ. ర.); 2. సంతకము. (వా.)

చేతోంశువు. సం. వి. ఉ. పుం. జీవుఁడు.

చేతోభవుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

చేత్రాడు. ద్వ. వి. (చే+త్రాడు) మల్లునియలంకారవిశేషము. ప్రబంధ. ౭౮.

చేదండ. ద్వ. వి. (చే+దండ) కైదండ, హస్తావలంబనము. "ద్వి. చేయెత్తి లెమ్మని చేదండ యిచ్చి." ద్వి. శ. సా. ౩, ఆ. ౧౧౫, పొ. ౩, పం.

చేదప్పు. ద్వ. అ. క్రి. (చే+తప్పు) చేయిదాఁటి పోవు, గతించు. 'క. చేదప్పినకార్యములకు, వెదనఁ బొందుదురె..." ఉ. రా. ౪, ఆ. ౧౦౫.

చేదరిసెనము. వై. వి. (చే+దరిసెనము) చేకానుక. (చూ. చేదర్సెనము.)

చేదర్సెనము. వై. వి. (చే+దర్సెనము) చేకానుక. "గీ. సెమ్మి నీరీతిఁ జేదర్సెనమ్ము లొసఁగి." కై. ౩, ఆ. ౭౬.

చేది. సం. వి. ఇ. పుం. ఒకానొకదేశము.

చేదిరాజు. మి. ,వి. (చేది+రాజు) చేదిదేశమునకు రాజు - శిశుపాలుఁడు.

చేదివియ. వై. వి. (చే+దివియ.) దివ్వటీ, కరదీపము. "వ...త్రందుగా మందు చేదివియలు చెందొవలుసుగా...". స్వా. ౫, ఆ. ౨౧.

చేదివ్వె = చేదివియ "సీ. చేదివ్వెప్రతిమ చౌసీతి బంధములమేల్కట్టు గొజ్జఁగి నీటిగాజుకుప్పె." వైజ. ౩, ఆ. ౨౪.

చేదుడ్డు. ద్వ. వి. (చే+దుడ్డు) చేతికఱ్ఱ, లగుడము. "మ...చోఁపుడు కోలలున్ కుఱుచ చేదుడ్డుల్ సమగ్రంబులై, చెలువారన్..." హరిశ్చ. ౨. ఆ. ౯.

చేదోడు. ద్వ. విశే. (చే+తోడు) సహాయము, "శా...శుంభచ్ఛమా, సంపద్వైభవ మొల్లకేఁగెఁ దనయజ్ఞానంబు చేదోడుగన్." దశ. ౪, ఆ. ౮౪. హరి. పూ. ౧, ఆ. ౨౫. య. ౧, ఆ. ౬౧.

చేదోడుపడు. ద్వ. అ. క్రి. (చేదోడు+పడు) సహాయమగు. "క...హరిపైఁ, జిక్కినచిత్తంబు దనకుఁజేదోడుపడన్." హరి. ఉ. ౫, ఆ. ౨౦౧.

చేను. దే. వి. ఔ. (బ. చేలు.) 1. క్షేత్రము, పొలము. "సీ. చేనఁ బండినవిత్తు చేనికె ఫలకాంతుఁ జేర్చెఁ గ్రమ్మఱ వెదవెట్టేకట్లు." కు. సం. ౧, ఆ. ౪౯. అం. భా. ద్వి. ౨౩౦; 2. సస్యము. "సీ. ఏఁటేఁట విరిసీట నిరుగారునుం బండఁ బ్రాసంగుపరిచేలఁ బసిఁడిచాయ." భీమ. ౨, ఆ. ౫౪; 3. అరణ్యము. "సీ. అల కంబమయ్యెడు దానైన దేమోకాని సింగ మొక్కటియైనఁ జేల లేదు." య. ౧, ఆ. ౧౦౬.

చేపట్టు. ద్వ. అ. క్రి. చేపట్టుపట్టు. "గీ. జెట్టితండంబులోడఁ జేపట్టి హొంత, కారి విఱిచిన యట్టు నగ్గలిక విఱుతు." భార. విరా. ౧, ఆ. ౮౧. స. క్రి. (చే+పట్టు) 1. చేతితోఁ బట్టుకొను. "సీ. తడపండ్లు సేపట్టి తడయక యొఱుకులై యార్పుచు..." భార. అర. ౧, ఆ. ౩౦౦. భీమ. ౫, ఆ. ౧౧౦; 2. పెండ్లాడు, "మ. అలిలోకుండు స్వరోచి నీకుఁ బతి యా సారాజ్యఁ జేపట్టి యప్రతిమశ్రీవిభవంబుఁ గాంచెదవు..." స్వా. ౬, ఆ. ౫౬. ఆనంద. పీఠి. ౭౩. 3. ఆశ్రయించు. "క. పుట్టితి వజునకుఁ జేఁపట్టితివి పురాణపురుషు భవనము..." భాగ. ౧, స్కం. ౯౧; 4. తీసికొను. "మ...నీపట్టంబు నీమంత్రులిచ్చిరి నా కింతయుఁ నీసురాజ్య మిదివే చేపట్టు సేఁ బోయెదన్." భా. రా. కిష్కిం. ౧౩౦; కాశీ ౩, ఆ. ౨౦౮. 5. ఆదరించు; "శా. నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిస్సారత, శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటన్." హరి. పూ. ౧, ఆ. ౩౭, నృసిం. ౫, ఆ. ౧౪౫; 6. నిశ్చయించు, స్థిరపఱచు. "సీ... వారును సట్టిలగ్న, గీ. మరసి చేపట్టి యాసన్న మయ్యె దేవ." నైష. ౬, ఆ. ౩౬; 7. పూను. "క. ఈపనికి మీరు ధైర్యముఁ, జేపట్టుట యరవు గాదె..." రుక్మా. ౫, ఆ. ౧౨౭. శివరా. ౧, ఆ. ౧౦౩; 8. పూను. "గీ. భాగ్యదేవత రూపు చేపట్టినట్లు." ఉ. హరి. ౨, ఆ. ౧౪౬. కాశీ. ౫, ఆ. ౩౧౨; 9. సంపాదించు. "ఉ. పెట్టితి బంధుకోటికి నభీప్సితవస్తుచయంబు కీర్తిచేఁబట్టితి..." కాశీ. ౩, ఆ. ౨౧౫. నైష. ౨, ఆ. ౭౭; 10. కలియు, రతియందుఁగూడు. "మ. కృతివిశ్వాస మెఱింగి చేకొనియెదున్ శృంగారవద్వల్లవీ, రతులం జొక్కియుఁ గుబ్జమేను వగ మీఱన్ దీర్చి చేపట్టఁడే." అని. ౧, ఆ. ౧౬. కళా. ౪, ఆ. ౧౨౮. వి. 1. (మ్రుగ్గమున్నగువానితో) పెట్టుపట్టు, "క. చూపట్టఁగ గోమయమునఁ, జేపట్టొనరించి..." శుక. ౨, ఆ. ౩౮. పాండు. ౪, ఆ. ౧౬౮; 2. పెండ్లి. అం. భా. ద్వి. ౧౭౭. ద్వా. ౪, ఆ. ౨౩; 3. ఆధారము. "క. ఆపర్వతశిఖరస్థలి; బ్రాపున నొకయొఱుకుపల్లె పటుతరలోకై, కాపాదిత సౌఖ్యశ్రీ, చేపట్టయి వెలయు..." భల్లా. ౩. (శ. ర.) బ. 1. చేతిపట్టు. "సీ. ఎలతుమ్మెదలదిమ్ము తలఁ గ్రమ్మకయె మున్న చిగురుచేపట్టుకు డిగకమున్న." వసు. ౪, ఆ. ౨౫; 2. కలహము, "మ...సిగవీడన్ వెను చక్కిపింజె వదలన్ జేపట్టుకున్ వచ్చినన్." ఉ. రా. ౬, ఆ. ౩౬౧. "సీ. హెచ్చి చేపట్టుకు వచ్చు నాతని విలోకించి ప్రార్థనము గావించవలయు." ప్రబోధ. ౪, ఆ. ౨౭.

చేపట్టుఁగుంచము. ద్వ. విశే. (చేపట్టు+కుంచము.) 1. ఎవ రేది యడిగినను లేదనక యిచ్చుటకు సిద్ధమైనవాఁడు—మహాదాత. "సీ. చేపట్టుఁగుంచమత్కీణరంగదభంగ శృంగారశాస్త్ర ప్రసంగలోలుఁడు..." శుక. ౧, ఆ. ౪౭; 2. పశుఁడు, సులభుఁడు, "గీ... చేపట్టుఁగుంచ మగుచు, వాఁడు వర్తింప..." శుక. ౨, ఆ. ౨౦౪. ౧, ఆ. ౧౬౧.

చేపట్టుఁగొమ్మ. ద్వ. వి. (చేపట్టు+కొమ్మ) హస్తావలంబనము, ఆధారము. "గీ... సదాచారమునకుఁ, బ్రాపు నైపుణ్యమునకుఁ జేపట్టుకొమ్మ, యలవియె నుతింపఁ గంకంటియప్పఘనుని." ఉ. రా. ౧, ఆ. 32.

చేపడవ. ద్వ. వి. (చే+పడవ.) చిన్నదోనె. "గీ. చేపడవ లోడ లాదిగాఁ జెలఁగునట్టి, యంబుతరణంబులకునెల్ల యధిపుఁ డతఁడు." హంస. ౪, ఆ. ౧౮౨.

చేపడు. వై. అ. క్రి. (చే+పడు.) 1. లభించు, దొరకు. "క... తుదిసెట్టులఁ, శ్రీవిభవము పొందఁ గలకుఁ జేపడునుగదే." భార. భీష్మ. ౨, ఆ. ౧౯౯. శేష. ౨, ఆ. ౯౪; 2. అగు, కలుగు. "క... శ్రీయును బ్రాయంబుఁ దెలియఁ జేపడును దుదిన్." హరి. ఉ. 2, ఆ. ౧౦౬; 3. వశమగు, అధీనమగు. "క... అత్యంతపరీ, తాపంబునందు మాలని, చేపడుటకుఁ దేరు పెంపు చెడిపోవుటకున్." మార్క. ౧, ఆ. ౨3౪. ఆము. ౪, ఆ. ౨౦౦; 4. పట్టుపడు. "ఉ. ఈపనిమీఁది భారమున నీ విట వచ్చితి గాన పాండవుల్, సేపడిరేని చంప..." భార. ఉద్యో. ౪, ఆ. ౬౭. ఆం. భా. శృ. ౧౦౫.

చేపావడ. ద్వ. వి. (చే+పావడ.) చేతిరుమాలు. "వ... చేపావడల మొగంబులు దుడిచికొనుచు..." రఘు. రా. ౨, ఆ. ౧33.

చేపు. దే. అ. క్రి. (క. చేపు. ఇదిసానుస్వార మని శ. ర.) పాలు స్రవించుట కనుకూలమగు. "క... ఆ, ధ్వనితకుఁ బాలెంత తెఱంగునఁ జన్నులు సేపెనపుడు. సూరిమి పేర్మిన్." భార. అర. 2, ఆ. 3౫౩. భార. ఉద్యో. ౪, ఆ. 33. "క. కొని పోయి ధర్మగేహిని, కనురక్తి నొసంగఁ బొంగి యాయమయమును జేపున జన్యంబుల చేఁ దెనిచెన్..." ఆము. ౫, ఆ. ౬. స. క్రి. 1 (పాలను) స్రావోన్ముఖముగాఁ జేయుట. "క... అతనియందున్న యెడ గోధనముల్, మెఱుఁగెక్కి పాఁడి నేమిక్, గో ఱతవడక యుండఁ జేపి కురియుంచునుండున్." భార. విరా. 3, ఆ, ౧౦3; 2. (పాలను) స్రవింపఁజేయుట. "క. క్రేపుఁ దలఁచి పసి మేయుచుఁ, జేపినపాల్ గలయ నెండచేఁ బాంథజనుల్, దూషింపమి కఱుఁ డంపిన, యూపాగా యనఁగ నదుల నంచలు మెఱసెన్." ఆము. ౪, ఆ. ౧౬౮. వి. (పాలు) స్రావోన్ముఖమగుట, "గీ. కూలి నాంచారిపాలిండ్ల చూచుకములు, పాలచేపున గిలిగింతవాఱుటయును." పారి. ౨, ఆ. ౯౫. వరాహ. ౧౦, ఆ. ౪౮.

చేపుణికిళ్లు. ద్వ. వి. బ. (చే+పుణికిళ్లు) చేతితో తడవులాటలు. "క. రా పొమ్మని పిలువనియా, భూపాలునిఁ గొల్వ భుక్తిముక్తులు గలవే, దీపంబు లేనియింటను, జేపుణికిళ్లాడినట్లు సిద్ధము సుమతీ." సు. శ. ౯౨.

చేపురించు. దే. స. క్రి. (చేపు ధా. ప్రే.) చేపఁ జేయు. (బ్రౌ.)

చేపెట్టు. ద్వ. వి. (చే+పెట్టు) చేతిదెబ్బ, గ్రుద్దు. "క. మాని నయినాఁడ రాముని, చే నొకచేపెట్టు మేసి..." చం. రా. ౫, ఆ. ౬౦.

చేపెట్టె. ద్వ. వి. (చే+పెట్టె) చిన్నపెట్టె. (శ. ర.)

చేబ. దే. వి. ఒకానొకవిన్నాణము. ప్రబంధ. 2౮. ఆం. భా. ద్వి. ౨౧౯.

చేబంతులు. ద్వ. వి. బ. (చే+బంతులు.) కందుకవిశేషము. "సీ. పుష్పవాటికలలోఁ బొదలందు విహరించుఁ బంతంబు మెఱసి చేబంతు లాడు." బ్రహ్మో. 3, ఆ. 30.

చేబడి. ద్వ. వి. (చేయు ధా.) చేఁత, చేష్ట. "సీ. నీ నాభి జనియించునిసువుచేబడిఁ గాదె భువనప్రచారంబు పొంకపఱుట." సాంబో. ౪, ఆ. ౨౧.

చేబదులు. ద్వ. వి. (చే+బదులు.) పద్దు మున్నగునవి వ్రాయకుండ మాటపై స్వల్ప మగుసొమ్మును బదులు పుచ్చుకొనుట. (వా.)

చేబాడిత. ద్వ. వి. (చే+బాడిత.) చిన్నబాడిత. "సీ. చికిలినిద్దపు చిమ్ముచిన్నారి క్రొవ్వాడిచేబాడిత హుం[illegible]గ్రసేయఁ జెల్వు." [illegible] ౨, ఆ. ౨3.

చేబాడిస. = చేబాడిత. (శ. ర.)

చేబియ్యము. ద్వ. వి. (చే+బియ్యము.) తవుడు పోవనియొఱ్ఱపొరగల బియ్యము. (బ్రౌ. వా.)

చేబిరుసులు. ద్వ. వి. బ. (చే+బిరుసులు.) ఒకవిధమైనబాణసంచు. "క...వంజులు బగలువత్తులు. పుంజము లాకాశబాణములు చేబిరుసుల్." రాధి ౫, ఆ. ౬౧.

చేబుఱ్ఱ. ద్వ. వి. (చే+బుఱ్ఱ) ఊదునట్టిసాధనము. "గీ. అంతఁ బరకాలుఁ డెలచూచుసాక్షభృత్యు లీలవెట్టియుఁ జేబుఱ్ఱ లిడియు మిగులఁ దన్ను నెచ్చరింపఁగ..." పరమ. ౪, ఆ ౨౦౫.

చేబోడి. ద్వ. విశ. (చే+బోడి.) చేత నేమియు లేనివాఁడు, నిర్ధనుఁడు. "గీ...తనవల్పులంజె సుఁబాయ లేక, ప్రీడ యించుక లేనిచేబోడిబొజుఁగు." కవిక. ౪, ఆ. ౯౯.

చేమ. దే. వి. ఒకరకపుదుంప. "గీ. గాజనలతోడఁ, జిరుగడపుఁ బెండలముతోడఁ జేమతోడ." భీమ. ౨, ఆ. ౫౬. ఆము. ౨, ఆ. ౫౩.

చేమంతి. వై. వి. (సం. సేమన్తీ.) 1. ఒకానొకపూలమొక్క. ఆం. భా. ద్వి. ౫౨; 2. పువ్వువిశేషము, చేమంతిపూవు. "సీ. సెజ్జపైఁ బఱచిన చేమంతి ఱేకులు కలయనిందీవరదళము లయ్యె." విక్ర. ౧, ఆ. ౧౩౯.

చేమంతిపువ్వు. వై. వి. (చేమంతి+పువ్వు.) 1. పువ్వువిశేషము. (వా.); 2. కదాకారముగుబంగారుభూషావిశేషము. (వా.)

చేమపూరాజనాలు. దే. వి. బ. ధాన్యవిశేషము. (శ. ర.)

చేమిరి. ద్వ. వి. (చే+మిరి.) కాఁచినపాలలో వేయుతోడు. "సీ. కలదండిపసిఁ బిండి కాఁచి చేమిరిఁ బెట్టి యొఱఁగకుండఁగఁ బట్టియుట్టి నొట్టి." వేం. పంచ. ౪, ఆ. ౪౫౫. శుక. ౨, ఆ. ౫౬౧. ఆం. భా. ద్వి. ౨౫౬.

చేముట్టు. ద్వ. వి. (చే+ముట్టు.) పనిముట్టు, "దం... అంభోజసంభూతమూర్ధంబు భిక్షాటనప్రక్రియాపాత్రగా గోత్రభృత్కూర్మకంకాళముం దాళమై చేముట్టుగా..." ఉద్భ. 3, ఆ. ౨౯.

చేమొగుచు. ద్వ. అ. క్రి. (చే+మొగుచు.) 1. చేతులు దగ్గఱకు చేర్చు, చేమోడ్చు. "క. కాంచి యతుష్ఠానము ముగి, యించి యరుగునట్టివేళ నెదుట నిలిచి యాచంచలలోచన లతనికిఁ గించిద్ధూరమునఁ జేమొగిచి మ్రొక్కుటయుఁన్." వైజ. ౨. ఆ. ౭; 2. నమస్కరించు. (వా.)

చేమొగుపు. ద్వ. వి. (చే+మొగుపు.) నమస్కారము. "వ స్త్రీజైతురత కుదలి నాపదేవ్రానకు మ్రొక్కు లామోదస్థలముదలి సాక్ష్ణ ఖనకుఁ జేమొగుపు..." ప్రబంధ. ౯౯౦.

చేమోడుచు. ద్వ. అ. క్రి. (చే+మోడుచు.) నమస్కరించు. ఆం. సం. మాన. ౩౧.

చేమోడ్చు = చేమోడుచు.

చేమోడుపు. ద్వ వి. (చే+మోడుపు.) నమస్కారము. (చూ. చేమోడ్పు.)

చేమోడ్పు = చేమోడుపు. "మ...అవధారు దేవ యనుచు జేమోడ్పుతోఁ గంచుకుల్, విని పింపన్..." కు. రా. ౪, ఆ. ౨౭౪. పాం. ని. మాన. ౨౫.

చేయఁబెట్టు. ద్వ. స. క్రి. (చేయన్+పెట్టు.) చేయించు. "గీ. భోజనము చేయఁబెట్టిన భూవరేణ్యు, పైతృకం బొప్పు సర్వసంపన్న మగుచు." వి. పు. ౪. ఆ. ౨౬౬.

చేయప్పు = చేబదులు. "సీ. చేయప్పు లడిగి తెచ్చెన నంచుఁ జని కొందుఁ గోడెమిండనితప్పుకోలు మ్రొక్కు." శుక. ౨, ఆ. ౭౬౯.

చేయము. సం. విశ. (అ. ఆ. అ) 1. కూర్పఁదగినది; 2. కోయఁదగినది.

చేయమ్ము. ద్వ. వి. (చే+అమ్ము.) చేత విసరెడి బాణము. "సీ. తళుకుక్రొవ్వాఁడి బెబ్బులికోఱ చేయమ్ము గుత్తంపుటెలుఁగుతో లుక్కప్పసాబు." చంద్రా. ౨, ఆ. ౩౯. ఆం. భా. ద్వి. ౨౧౩.

చేయలఁతి. ద్వ. విశ. (చే+అలఁతి.) 1. అధీనము, స్వాధీనము. "సీ. నే నిన్నుఁ గీర్తింతు నిట్టికీర్తనమున వరద ముకుంద నిర్వాణరూప, నాచిత్తమే కీడునకుఁ జేయలంతిగా కేశొద్దు నీయంద యలరుఁగాత." హరి. ఉ. ౫, ఆ. ౨౦౩. భార ద్రో. ౨, ఆ. ౨౯౬; 2. సాధ్యము, శక్యము. "క. అడిబీర మడిగి రాక్షస, చెదక మరలిపొమ్ము నీకుఁ జేయలఁతియె యీ, యెడ యింక నీవు నిలిచివఁబడ నడుఁతురు గన్న నిన్నుఁ బ్రమథగణంబుల్."

నిర్వ. ౪, ఆ. ౮౪. వి. 1. హస్తకౌశలము. "క. చేయలఁతిం గని సమరము, సేయుము నను(బోటి తోడ..." భార. ద్రో. ౪, ఆ. ౨౪౩; 2. దగ్గఱ. "మ. ఘటనుం దవ్వులఁ జేయలంతి నిలుచున్..." భాగ. అర. ౬. ఆ. ౩౭౨. భా. రా అర. ౨, ఆ. ౪౬.

చేయి. వై. ది. (సం. శయః.) 1. హస్తము. "క. పుడమిం జేయవు చేతులు, కుడువవు నోరిది నొడి మాటకును దప్పగునే." కుచేల ౧, ఆ. ౯౪. సైష. ౧, ఆ. ౬౮; 2. తొండము. "ఉ. భీమునిఁ దుద గ్రాహం గదియఁ బెల్లగు చేతిశీకర స్తోమ మనక్ దురంగములు దోఁగి..." భార. ద్రో. ౧, ఆ. ౩౨౬. దశా. ౨, ఆ. ౨౮; 3. కిరణము. ఆం. సం. దేవ. ౧౬. "మ. తొగనూ దల్లిన తమ్మికు ద్దియుఁ జేరుల్ సాచి నిద్దంపుమేల్, జిగి కప్పట్టుమడుంగుచుప్పులువలిచ్చెంగూర్చి, నా..." అచ్చ. ఉదో. ౪౪; 4. ఇరువదినాలుగు అంగుళములకొలది. "గీ. పరమనాథుఁ డిరిగిరా నిరువదేను, చేతుల ప్రమాణమునఁ గల్గు భూతలంబు." పాండు. ౨, ఆ. ౧౧౬. పండితా. పర్వ. ౩౦౪. పా; 5. ఐదింటి మొత్తము. (వ్యవ:—నూటికి ఒకచేయి సెలగు; 6. వశము. అధీనత. "గీ. దూతి యున్నాను నేను నీచేతిలోన." కంఠ. ౨౦౩; వరాహ. ౯, ఆ. ౧౩; 7. పక్షము, వైపు. (శ. ర. వా.); 8. శక్తి. "క. పొడిచెద నొడిచెద సహితుల, నుడుగక నాచేయి చూచుచుండుఁడు మీరల్." హరి. ఉ. ౧౦, ఆ. ౧౧౮; 9. తాళపుఁ జెవి. "సీ. ఇదిసిగ్గుబీగంపుగుదికిఁ జేయగునేమొ కాదేని మరలిపోఁగాఁ బనేమి." సాంబో. ౨, ఆ.

చేయించు. వై. స. క్రి. (చేయు. ధా. ప్రే.) 1. ఒన రింపఁజేయు. "క...చెచ్చెర ధర్మజుఁ దీర్ఘసేవ సేయింపు మొగిన్." భార. అర. ౨, ౩. ౧౯౯. విక్ర. ౪, ఆ. ౧౯౨; 2. ఆచరింపఁజేయు. "ద్వి...మీరైన నన్నుఁ, జేకొని యజ్ఞంబు సేయింపవలయు." రం. రా. బాల. ౫౬. పా. ౧౭. పం; 3. నిర్వహింపఁజేయు. "గీ. మగువ నీ వింక రాముసిమాట వఱపు, తీవ్ర మిది యేల నీకుఁ బలిప్రతంబు, వచ్చి మందోదరీచంద్రవదన చేతఁ, బనులు సేయించుకొన నీకు మనసు రాదె." రామా. ౬, ఆ. ౧౫౬.

చేయిచ్చు. దే. అ. క్రి. (చే+ఇచ్చు.) అందు, దొరకు. "సీ. జఘనంబుఁ బైకొన సమకట్టు నమ కట్టి చేయాక తారినఁ జిన్నవోవు." సాంబో. ౯, ఆ. ౭౦. హర. ౧, ఆ. ౩.

చేయిపోటు = చేపోటు. (సహాయము.) "సీ. అది కల్పంబునాఁ డఖిలప్రపంచంబు సృజియించు బ్రహ్మకుఁ జేయిదోడు." భీమ. ౧, ఆ. ౪౫.

చేయీఁత. ద్వ. వి. (చేయి+ఈఁత.) చేయీతులతో నీదు ఈఁత. "ద్వి. చెనఁటియీభవవార్ధి చేయీఁత నీఁదు." ద్వి. పరమ. ౨, ఆ. ౭౬. పా. "గీ...ఏది మున్నీరు నేయీఁత నీఁద." భార. విరా. ౪, ఆ. ౨౧౩.

చేయు. వై. స. క్రి. (క. కెయ్. త. సెయ్.) 1. ఒనరుచు, కావించు. "ఉ...చేయుము దూత కృత్యమున్." సైష. ౩, ఆ. ౬౩. భార. ఆది. ౮, ఆ. ౩౦౪; 2. సృజించు, పుట్టించు. "గీ. అంత మేల్కని కూర్చుండె నాదిపురుషుఁ డాదిమ బ్రహ్మ జగము సేయంగఁ దలఁచి." శివరా. ౧, ఆ. ౫౪. సైష. ౨, ఆ. ౪౧; 3. వచనము చేయు. వండు. "సీ...అన్నంబు సేయుంగ నతనిఁ బనుప." భాగ. ౯, స్కం. ౨౩౭. హర. ౨, ఆ. ౧౨౬; 4. మార్చు. "సీ. ఉల్ల తెల్లనితురగోత్తమువాలంబు నల్ల సేసితిరేని..." భార. ఆది. ౨, ఆ. ౩౪. శుక. ౩, ఆ. ౭౬; 5. నెఱవేర్చు. "క. పితృసం కల్పము సేయఁగ, సుతుల కవశ్యమును వలయు ..." భార. సభా. ౧, ఆ. ౯౩. సైష. ౩, ఆ. ౧౨౫; 6. కలిగించు. "ఉ...పరాశరుఁడు గర్భము సేసిన..." భాగ. ౯, స్కం. ౬౬౯. హర. ౩, ఆ. ౯; 7. ఆచరించు, "ఉ. చేయుము రాజసూయ మెడసేయక దానన చేసి దోష ముల్, వాయు..." భార. సభా. ౧, ఆ. ౯౪; 8. (పేరు మున్నగునవి) పెట్టు, "వ...అతనికి ...ఉగ్రుండును మహాదేవుండు ననునామ ధేయంబులు సేసి..." వి. పు. ౧, ఆ. ౧౭౭. భా. రా. బాల. ౧౭౦; 9. (విచారాదులు) పూను, వహించు. "ఉ. ఓయి మహీసురప్రవర యుల్లమునం దిఁక చింత యేమియుం, జేయకు

..."సీమం. ౧, ఆ. ౪౦. శు. సం. ౧, ఆ. ౭౬; 10. విభజించు, "ఉ. ఆవి నవంతసాఖ్యంబు దనరారుచు నేఁ కగమ్యమైన యావేదము లెల్ల... నాలుగుగాఁ జేసినపుణ్యుఁ బరాశురాత్మజున్." విక్ర. ౧ ఆ. ౧౦; 11. ఏర్పఱచు. 'గీ. కావు పరమేష్ఠి నీమనఃక్రౌర్య మెఱిగి, శాస్త్రములు నీకు సాయంభమ్ములుగఁ జేసె." శైవ. ౨, ఆ, ౧౩౬. భా. రా. యు. ౧౩౪౧; 12. పోలు. "శా. ఆదేశంబున నేకదేశమును జేయం జాల దేదేశముల్" రఘు. రా. ౨, ఆ. ౯; 13. పాలించు. "క. చేయఁ నది రాజ్యమట..." ఆము. ౪, ఆ ౨౧౪; 14. పెండ్లిచేయు. "క. చాలుంజెప్పఁగ నీకా, యాలేటికి మేదినీసురాధిప యేనొండాలిఁ జేసెదఁ జేకొను..." మార్క. ౯. ఆ. ౧౪౪.

చేయూఁత. ద్వ. వి. (చేయి+ఊఁత.) హస్తావలంబము. "గీ. గగనవీథి విమాన మెక్కకయె చనిరి, యోగవిద్యాబలంబు చేయూఁత గాఁగ." శైవ. 3, ఆ. ౯.

చేయేకము. ద్వ. వి. (చే+ఏకము) చేతితో తోడు ఏకాము. "క. అబ్బాయికిఁ జేయేకం, బుబ్బుచుఁ దంబళి యొసర్చి..." హంస. ౧, ఆ. ౧౭౬.

చేర. దే. వి. (త. సేరై. క. సేరె) ప్రకృతి. "ఉ... కన్ను లంటిమా, చేరలఁ గొల్వఁగా వలయు..." విజ. ౧, ఆ. ౬౬. ఉ. రా. ౨, ఆ ౨౨౭.

చేరఁదీయు. దే. స. క్రి. (చేరన్+తీయు) ఆదరించు. "ఉ. ప్రేయసిఁ జేరఁదీసి రతిభేదములం గరఁగించి..." హ. వరాహ. ౪, ఆ. ౬౧ పా.

చేరఁబడు. ద్వ. అ. క్రి. (చేరన్+పడు.) 1. కలియు, ఏకీభవించు. 'ఓరోరి నీవు సేసిన, గోరపుఁబాపములు నీవుఁ గొడుకులు నాలుం, జేరఁబడి పంచుకొందురో, వారికిఁ బనిలేక నీక వచ్చునో చెపుమా." వాల్మీ. ౨, ఆ. ౧౦౦; 2. క్రుంకు. "ఆ. ప్రొద్దు చేరఁబడినఁ బోయి రింద్రుకు వారలు..." నా. పంచ. ౧, ఆ. ౯౦.

చేరవేయు. దే. స. క్రి. (చేరన్+వేయు) 1. దగ్గఱగాఁబెట్టు. (వా.); 2. ఒకస్థలమునకు చేర్చు. (వా).



చేరిక. దే వి. (చేరు. ధా.) 1. కలసియుండుట. "సీ. ఒడిమీఁద నిడికొని శిరముపైఁ జేర్చుట చేరిక కది కడసారి యేమొ." ఉ. రా. ౬, ఆ. ౩౦౨; 2. సమీపము. "గీ. హుంకరించినఁ జేరిక నుండ లేక." పార్వ. ౪. ౨. రాఘవ 3. ఆ. ౧౪౧; స్నేహము. "గీ. చేరిక లొనర్చి తేపియల్ చిలుకఁ బట్టి." హంస. ౭ ఆ. ౧౬౯. 4 రతి "ఉ. చెల్లుగ మాకు నిద్దఱకుఁ జేరిక యేగతిఁ గల్గుఁ జెప్పుమా." రాధా. ౨ ఆ. ౧౬; 5. నియమము? "ఉ. తదీయశిష్యుఁ డొకచేరికఁ గైకొని కొంతవేదము, భ్యాసము చేసె..." విష్ణు. నా. ౧, ఆ. ౧౧.

చేరికయగు. దే. అ. క్రి. (చేరిక+అగు.) సమీపించు "క. అనయముఁ జేరిక యగుతఱి, ననివార్యప్రీడభయభరాకులగతియై." ప్రభా. ౯, ఆ. ౩౧ ఉ. రా. ౨, ఆ. ౧౭౭.

చేరు. దే. అ. క్రి. (త. సేరు.) 1. సమీపించు. "శా...అప్రేతుల్ వల్కిన పాతకంబునకుఁ జేరం గాల మిప్పేళ..." జై. ౭, ఆ. ౪౭. ఆము. ౨, ఆ. ౨౧; 2. లభించు, దొరకు. "శా... ఎవ్వారికిం జేరన్ రాని మహానిధానమునకుం జే సాచిలిం దొయ్యలీ." ఉ. హరి. ౯, ఆ. ౧౯౯; 3. కలుగు. "క...సవతుల చే, నీచులుకఁ దనంబు చేరనీకముకృష్ణా." ఉ. హరి. ౨, ఆ. ౭౭. వి. పు. 3, ఆ. ౩౦; 4. నెఱవేఱు. "క. అవ్వల నొకనికి మీఁదుగ, జవ్వన మిటు గట్టియున్న జలజేక్షణతో, నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగయె కాని చేరనేరవు కోర్కుల్." శుక. 3, ఆ. ౩౯. ఆము. 3, ఆ. ౯౭; 5. పడు. "చ... న్నల్లని పగువెన్నెలల్ సలిలజాటతటంబునఁ జేర వ్రేఁగుచున్." గంధ. ౧౯౩; 6. ఒఱగు. (శ. ర.); 7. అధీనమగు. "శా. ఆకేళిధ్వజుఁ డంత నాన్నృపునిరాజ్యం బెల్లఁ జేరన్..." ఆము. 3, ఆ. ౧౭; 8. పోవు. "ఉ. స్వైరవిహారధీరలగుసారసలోచన లున్నచోటికిన్... నే,చేరక ..." వసు. ౨, ఆ. ౯౯; 9. అందు వ్యవ:— నాసొమ్ము నాకు చేరినది.(వా.); 10. ప్రవేశించు. వ్యవ:—వాఁడుబడిలో చేరినాఁడు. స. క్రి. 1. పొందు. "చ. దినకరమండలం బపరదిగ్గిరి

కూటము: జేరె..." పారి. ౨, ఆ. ౨౯. జాహ్నవీ. ౩, ఆ. ౭౭; 2. (రతియందు.) కూడు, కలియు. "ఉ. సిరి నొక్కప్పుడు కన్గొనంగి హరి తన్ జేరం బ్రహర్షించుచు,న్వరకున్..." ఆము. ౧, ఆ. ౭. హంస. ౧, ఆ. ౧౩౧; 3. తగులు. స్పృశించు. "క. కూరిమి మీఱఁగఁ జేరం, జేరిచి సర్వజ్ఞు కరుణఁ జేరె నటంచున్." విక్ర. ౩, ఆ. ౧౩. ఆం. భా. ౩, ఆ. ౧౨౯; 4. సమీపించు. "ఉ. భావము చూడఁ గోరి యొకపార్శ్వము నన్ దమయంతి చేరిధాత్రీపరుఁ డుండె..." నైష. ౩, ఆ. ౧౧౮. భార. ఉద్యో. ౪, ఆ. ౨; 5. ఆశ్రయించు. "క. చేరితి నిను నాదుకోర్కెఁ జింతింపు తగన్." విక్ర. ౧, ఆ. ౧౧౧. వి. 1. మిరియములు మున్నగువానిగుండ వేసికాఁచిన చింతపంటిరసము, చారు. "ద్వి. మించుజీరక కొత్తిమిరిమిరియముల, మెఱయుంచు మించుచే మించుచేరులును." అ. మ. క. ౫, ఆ. ౨౪౮. షొ. ౧౭. పం. ఉ. ౫, ఆ. ౨౮౮; 2. హారము యొక్కపేట. "క...జిలిబిలి బదనికలపూస చేరులు..." వా. రా. ౨, ఆ. ౨౧౦. ద్వి. శ. సా. ౧, ఆ. ౨౧. షొ. ౪. పం; 3. త్రాడు. "గీ. ఉట్టిచేరులు గోయంగ నుత్సహించి." విక్ర. ౨, ఆ. ౪౬. పారి. ౨, ఆ. ౩౯; 4. బారు వరుస. "సీ. మగువకొప్పు నభంబుఁ దగడ సిర్దో మంపుఁజుక్కచేరు ఘటించె సుదతి యోర్తు." వసు. ౫, ఆ. ౧౧౬; 5. కంటిలోజీర. "సీ. కోరచూపుల యొఱ్ఱ చేరుగ్రుడ్డులవాఁడు..." వరాహ. ౨, ఆ. ౪౫; 6. త్రాళ్లవంటిచరము. (వా. ఎత్తునుండి యురికినచో చెరులు దిగును.); 7. పశువులమగసుఱి. (వా.)

చేరుకోల. ద్వ. వి. (చేరు+కోల.) బండిగట్టిమను తోలుకోరడా. "సీ...వానియఖిలబిలముఁ, జేతి సమ్మెటలను జేరుకోలల వ్రేసి..." భార. భీష్మ. ౩, ఆ ౨౩౪. హరి. ఉ. ౧, ఆ. ౧౩౬.

చేరుగడ. దే. వి. (చేరు+గడ.) 1. రక్షణము, దిక్కు. "సీ. ఐహికసుఖము లుపార్జింప వలసిన వారికి విప్రులు చేరుగడలు." భార. అను. ౫, ఆ. ౩౭౦. భార. ఉద్యో. ౩, ఆ. ౨౦౯; 2 ఆశ్రయము, ఆధారము. "క- ధరణి నెఱి దప్ప నొఱఁగిన, కరిహయరథచయము లొఱలఁగా గరుణము భూవర యొప్పెసె శిబిరమునఁ దన, కర యఁగఁ జేరుగడ లేమి నని వృథ యయ్యెన్." భార. సౌ. ౧, ఆ. ౧౯౮; 3. స్థానము. "క... వట్టియపకీర్తులకు, జేరుగడ దోసములకు హా,కా రము..." విప్ర. ౩, ఆ. ౧౨.

చేరుగొండి. దే. వి. 1. తగుబాటుకత్తె. (శ. ర.); 2. చేరవచ్చినభార్య. (బ్రా.) విశే. 1. చేరివచ్చినది. (శ. ర.); 2. దుష్టము. (ఇది చేరుగొండి యావు. శ. ర. తప్పిపోయి మరలవచ్చినది. 'చేరుగొండి పశువు' అని బ్రా.)

చేరుచే = చేరుచు. దే. స. క్రి. 1. దఱిగానుంచు. చేరఁబెట్టు. "ఉ. తోరణగంధ్ల రాఁ గొదమ చుక్కలు పట్టసతుల్ కవాటముల్, చేరుచ..." ఆము. ౨, ఆ. ౧౩; 2. ఉంచు, నిలుపు. "శా...ఏ,దద్వారాంతరపీఠిఁ జేరుచుఁ గుచద్వంద్వంబు నీసక్కృపన్." నైష. ౨, ఆ. ౭౪.

చేరుచుక్క. దే. వి. (చేరు+చుక్క.) పాపట యందుఁ బెట్టుకొను రత్నభూషావిశేషము. "సీ. కలువపల్లోబ్డాది కటకాధిపతివధూ సీమంత వీథులఁ జేరుచుక్క." కాశీ. పీ. ౩౪. ఆం. భా. ద్వి. ౧౪౭.

చేరుడుబియ్యము. దే. వి. (చేరుడులు+బియ్యము.) "సీ. చిమగు లేఁజిగురాకు చేరుడుబియ్యాలకవ ణాంపుటేపుంగుగములు గదల." ఉ. హరి. ౩, ఆ. ౧౩. ప్రబంధ. ౧౧౭.

చేరుడులు. దే. వి. బ. కొంచెముగా దంచినబియ్యము, అక్షుణ్ణతండులములు. (చూ. చేరుట్లు.)

చేరుపు. దే. వి. సమీపస్థలము. (చూ. చేర్పు.)

చేరుబడి. = చేర్పు. (శ. ర.)

చేరువ. దే. (విశే. దగ్గఱది, సన్నిహితము. "క. చేరువ తీర్థముకంటెను దూరపుతీర్థంబు మేలు..." భార. అను. ౫, ఆ. ౧౯౭. భాగ. ౬, స్కం. ౧౫౯.)వి. సమీపప్రదేశము. "సీ. ద్వారకానగరంబు చేరువ ఘోటక మరుగంగఁ బ్రీతులై యదుకుమారులు..." భార. అశ్వ. ౪, ఆ. ౧౧౪; 2. సమీప కాలము. "ఆ...నీకుఁ,జేరఁ జేరువను మనో రథంబు..." వరాహ. ౧౧, ఆ. హర. ౩, ఆ. ౯౫; 3. మనుజసంఘము. "సీ. అభిసారికా

సమూహాము కాలిసంకెల మ్రుచ్చు చేరువలను విచ్చు మొగ్గ." కవిజ. ౩, ఆ. ౮౧. ఆం. భా. తృ. ౫౩; **4.** సేన. (శ. ర.); **5.** సేనాధిపతి. "ద్వి... మున్నూరు రెండుకోట్లచేరువలు, కెమ్మి నం దొక్కొక్కనికి జేయివేయి." రం. రా. యుం. ౩౩౪. పా. ౨౭. పం; **6.** కలయిక. "క. ఊరకయుండక పలుపురతో రవ మెసఁగంగఁ బలుకఁ దొడరుచు మదిం, జేరువ గలనాగరకులుం దారుఁ గలసి పలుకవలయు ధరణీశుకడన్." భార. విరా. ౧, ఆ. ౧౨౭; **7.** సమూహము. "గీ. అంతికంబున కును సమూహంబునకును, నామమై యొప్పు చేరువ నాఁగ నభవ.." ఆం. నం. నానా. ౧౯. సాం. వి. మాన. ౩౭.

చేరువకాఁడు. దే. వి. (చేరువ+కాఁడు.) **1.** సేనానాయకుఁడు. "గీ. జాంబవంతునిఁ జూపి యో స్వామి యితఁడు, వెరవునకు లావునకు ధురంధరుఁడును వ్వేకలరు నా కిట్టిచేరువకాండ్రు జేవ." రామా. ౭, ఆ. ౨౭ రా. వి. ౫, ఆ. ౧౭: **2.** అధిపతి. "క. సారసభవునకు సుతుఁడగు, నీరజనాభాంఘ్రిభక్తనివహాంబునకున్, జేరువకాఁడవు ..." శేష. ౫, ఆ. ౯౮. చంద్రా. ౨, ఆ. ౩౯; **3.** కావలివాఁడు. (శ. ర.)

చేరువడు. ద్వ. అ. క్రి. (చేరువ+పడు.) సిద్ధించు. (చూ. చేరువఱుచు.)

చేరువఱుచు. ద్వ. స. క్రి. (చేరువపడు. ధా. ప్రే) సిద్ధింపఁజేయు. "క. గౌరవముఖుఁడు మందస్మిత, గౌరముఖుం డగుచు మానికము గామితములన్, చేరువఱుప నానృపతికిఁ, జేరువ నిడి వాసుదేవుఁ జింతించుటయున్." వరాహ. ౪, ఆ. ౧౨౧.

చేరుట్లు = చేరుడులు. "సీ. అక్షుణ్ణకాండులావ్యాయము చేరుట్లు నాఁగను దనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౫౪.

చేర్కోల = చేరుకోల. "గీ. చిన్నచిగురాకుఁ జేర్కోలఁ జేతఁ బట్టి, పేరుటామనిరాజిల్కు తేరు నడుప." నైష. ౭, ఆ. ౪౧. కాశీ. ౨, ఆ. ౧౨.

చేర్చు=చేరుచు. **1.** (సమీపమున నుంచు.) 'సీ... ఉపకరణంబుల నొయ్యఁ జేర్చు." హర. ౩, ఆ. ౩౬; **2.** (లభింపఁజేయు.) "సీ. కల్యాణసామగ్రి ఘటియించె నిధిరాజు జితదర్పకత్వంబుఁ జేర్చె శివుఁడు." వసు. ౬, ఆ. ౪౩; **3.** (ఉంచు, వైచు.) "ఉ...మంచ మెక్కి చేర్చె నమ్మానవనాథుకంఠమున మంగళసవ్యమధూక దామముల్." నైష. ౬, ఆ. ౩; **4.** (ప్రసరింపఁజేయు.) "సీ. కర్ణికారముఁ బొడగన్న మాటాడదు సిందువారముమీఁదఁ జేర్పఁ దూర్పు." విక్ర. ౧, ఆ. ౧౩౩; **5.** (పొందించు.) "చ... ధర్మనందనునకు నెవ్వరీహాయవతంసముఁ జేర్చెదువారు పిమ్మటన్." జై. ౫, ఆ. ౧౧౮. భార. శాం. ౪, ఆ. ౩౫౭; **6.** (తెచ్చు.) "గీ. సింధురమహాశ్వముఖ్యముల్ చేర్చుదొల, దీవివణి కూర్లు సద్గృహములు పురి..." ఆము. ౪, ఆ. ౨౫౮; **7.** (రప్పించు.) "వ...అని పెక్కుభంగుల నక్కుమారునిభయంబు దీర్చి తనసమీపంబునకుఁ జేర్చి యుచితోపచారంబు లొనర్చి..." విక్ర. ౩, ఆ. ౮౪; **8.** (పేర్చు. ఒకదానిపైనొకటిగా నుంచు) "గీ...దొంతులు సేరి నాయి, దోర్ప నేర్చుఁ గా కది యేమి సేర్ప నేర్చు." శు. సం. ౧, ఆ. ౨౯.

చేర్చుక్క = చేరుచుక్క. "గీ. చొనిపె సీమంతవీథిఁ జేర్చుక్క యొర్తు." ఆము. ౬, ఆ. ౧౨౮.

చేర్పు. దే. వి. సమీపస్థలము. "ఉ. తావల మెద్దికూకపటదైత్యుఁ పు చేర్పున కేగుదెంచి..." కళా. ౬. ఆ. ౧౧.

చేర్వ = చేరువ. (వి. సమీపప్రదేశము.) "శా... కాంత న్నీవు గొంపోయి యా,వాల్మీకుల్ వసియించునాశ్రమము చేర్వక్ డింపి రమ్మా యనెన్." ఉ. రా. ౬, ఆ. ౨౨౨.

చేర్ణకోల = చేరుకోల. (చేరులు+కోల.) "సీ. పవమానములు నేమి రవము వేదములు తేజీలు త్రివృత్తులు చేర్ణకోల." వరాహ. ౫, ఆ. ౧౦౮. పరమ. ౫, ఆ. ౨౮.

చేఱు = చేరు. (చూ. చేఱుకోల.)

చేఱుకట్టు. దే. వి. (చేఱు+కట్టు.) రోగవిశేషము. (వా.)

చేఱుకోల = చేరుకోల. "గీ. అపుడు సమ్మెటకోలల ప్రేటుల నీఱుతాఱు, యదలుపుల వాహనంబులు సెదరి పఱచె." భార. ద్రో. ౩, ఆ. ౪౮.

చేయుబోంయు. దే. వి. (చేయు+బోందు.) కొట్టైడు తోలుపట్టైడ. (శ. ర.)

చేయులకోల = చేయుకోల. (శ. ర.)

చేల. వై. వి. (సం. చేలమ్.) వస్త్రము. "చ...ఒక బోటియుం బంగరుచేల వైచె..." య. ౪, ఆ. ౮౮. నిరం. ౨, ఆ. ౬౯.

చేలని. సం. వి. ఈ. స్త్రీ. జూదమునందలిసారె.

చేలము. సం. వి. అ. న. వస్త్రము. విణ. (అ ఈ. అ.) అధమము.

చేలా = చేల. "మ...సాంధ్యరాగంపు హేమపుఁ జేలా దిగజాలి..." నిరం. ౨, ఆ. ౬౯.

చేలాగు. వై. వి. (చే+లాగు.) చేయూఁత. "సీ. చేరి చేలా గిచ్చు చినయూడిగపుఁగూర్మి డెందంపుఁ బ్రోడ చేడియలతోడ." ఇందు. 3, ఆ. ౨౭.

చేలాలము. సం. వి. అ. పుం. తీఁగపనస.

చేలించు. సం. అ. క్రి. చలించు. "క. అణఁగని చేతోధృతి, చేలింపక మిమ్ముఁ గూడి చెప్పితి నది యుఁన్, జాలింపక కైశికజిత, రోలంబకదంబ యో నరుంధతిఁ గానన్." నిరం. ౨, ఆ. ౫౭.

చేలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వస్త్రము; 2. ఆవిక.

చేవ = చేగ. 1. (వృక్షసారము.) "సీ. సకలాగమ జ్ఞానసారమహీజాతజాకంబులోఁ జేవ శంభు సేవ." రాజ. చ. ౧, ఆ. ౬౭. ఆం. భా. ద్వి. ౩౭; 2. (సమర్థత.) "క. ఎఱుఁగవె యజాత శత్రుని, సెఱియును...తగుచేవ గలుగు టెఱుఁ గవె యధిపా." భార. ఉద్యో. 3, ఆ. ౨౭౮. నీలా. ౨, ఆ. ౪౪; 3. (బలమెక్కుట.) "ఉ. నీవు మహానుభావుఁడవు నీహృదయాంబు మదీయ భక్తితోఁ, జేవ వహించియుండుట ప్రసిద్ధము ..." వి. పు. ౨, ఆ. ౩౧౯; 4. (ధీరత.) "గీ. సింహనాదంబుఁ జేసినఁ జేవ దక్కు." దశా. ౪, ఆ. ౧౦౧. ఉ. హరి. 3, ఆ. ౩౫; 5. (గర్వము.) "ఉ. ఇక్కడఁ బౌండ్రభూపతి వివేకహీనతఁ జేవ యెక్కఁగా, నెక్కడి వాసుదేవుఁడు..." ఉ. హరి. 3, ఆ. ౪; 6 (సారము.) "సీ. గిసి గొజ్జఁగినీరు పోసి నూఱినక్రొత్తచిలు బంతి కసుపులోఁ జేవ నలఁది" హర. ౨, ఆ. ౧౦౭. (విణ. చేవగలది.) "గీ. అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ జేవ." స్వా. ౧. ౫౦. పసు. 3, ఆ. ౧౭౩.

చేవదలు. ద్వ. స. క్రి. (చే+వదలు.) విడిచిపెట్టు. "ఉ...గ్రావభుజాది రాక్షసులఁ జేవదలన్ జలజంతుభూమికల్, భూవర భూవరుండు ముని పుంగవు మోమును విల్లుఁ జూడఁగన్." కళా. ౨, ఆ. ౯౧.

చేవలఁతి = చేయలఁతి. 1. (చేతనున్నశక్తి, భుజ శక్తి. "గీ. వాఁడిపండ్లు బిగించి చేవలఁతి నెగిరి, యెత్త మో పెత్తరాదయ్యె..." హర. ౧, ఆ. ౨౦; 2. (సమీపము.) "సీ...వలకెక్కు సూపెఁ జేవలఁతిఁ జెసురు." పిఠ. శకుం. ౧, ఆ. ౧౩౨. (విణ. అధీనము. వశమైనది.) "క. కావున నరులకుఁ దత్త్వాభ్యాస మొసర్పు నైహికాముష్మికముల్, చేవలఁతు లగుచుఁ దలకొను..." పాండు. 3, ఆ. ౧౧౮.

చేవాఁడి. ద్వ. వి. (చే+వాఁడి.) 1. చేతిపరుసుత నము. "క. లో వాఁడియుం బై వాఁడియుఁ, జేవాఁడియుఁ గలిగి..." ప్రబంధ. ౭౬౭; 2. దొంగతనము. (చూ. చేవాఁడికాఁడు.)

చేవాఁడికాఁడు. ద్వ. వి. (చేవాఁడి+కాఁడు.) చేతి చుఱుకు గలవాఁడు—దొంగ. "సీ. గడిదొంగ చేవాఁడికాఁడు దోఁపుడుకాఁడు..." వేంక. మాన. ౩౧.

చేవాటు. ద్వ. విణ (చే+వాటు.) సమీపము, దగ్గఱ. "ద్వి. చెలువార నిచటికిఁ జేవాటునేలఁ, గల దొకనిర్మలకమలాకరంబు." ద్వి. హరిశ్చ. పూ. ౧౮౩౦. పం.

చేవార్చు. ద్వ. అ. క్రి. (చే+వార్చు.) చేతులు గడుగు. "గీ. అందఱు భుజించి చేవార్చు నవసరమున." పార్వ. ౫, ఆ. ౧౮౬.

చేవిచ్చు. ద్వ. అ. క్రి. (చే+విచ్చు.) నమస్క రించు. (శ. ర.)

చేవిప్పు. ద్వ. వి. (చే+విచ్చుధా.) నమస్కారము. "గీ. వందనంబును జేవిప్పుఁ బ్రణతు లిడుదు." కార్తిక. ౨, ఆ. ౨౦. పా. ప్రబంధ. ౮౮౦.

చేవెలుఁగు. ద్వ. వి. (చే+వెలుఁగు.) 1. ఎదుటివారు చక్కఁగా కనఁబడుటకై చేతితోఁ గావించెడి అడ్డు. "క. దీవించి యతనివదనము, చేవెలుఁ గిడి

చూచి..." హర ౨, ఆ. ౪౯. ౧౫౫; 2. కర దీపము, కాగడా. (శ. ర.)

చేవ్రాలు. ద్వి. వి. బ. (చే+వ్రాలు.) 1. సంతకము. (శ. ర); 2. చేతియందలిరేకలు. "ద్వి...అతని, చెవి డాసి కూఁతురిచేవ్రాలఫలము, వివరించి చూచితి..." నవ. 3, ఆ. ౧౪౫. పా.

చేష్ట. సం. వి. ఆ. స్త్రీ. 1. శరీరవ్యాపారము, పని; 2. నడవడి. [(వాచ.)

చేష్టకము. సం. వి. అ. పుం. ఒకానొకరతిబంధము.

చేష్టకుఁడు. సం. విణ. (అ. స్త్రీ. ఆ.) పనిచేయువాఁడు.

చేష్టనము. సం. వి. అ. న. చేష్టించుట, పనిచేయుట.

చేష్టించు. సం. అ. క్రి. పనిచేయు. "క. జనకుం డోడ్పడి యని నొచ్చినవారిం గాంచి కడఁగి చేష్టింపక యున్నసరేంద్రుఁ బొందుపాపం,బు నకుఁ గొలఁదిగలదె..." భార. శాం. ౨, ఆ. ౪౨. స. క్రి. 1. కదల్చు. "శా. చెల్లాడం జను బాలులీల నికసిం జేష్టించినం గీడువాటిల్లున్..." చం. రా. 3, ఆ. ౧౪౨; 2. ప్రవర్తించు; సంచరించు. "వ. మఱియుం బ్రమత్తులై యధీరులగునరులందు వృకంబుచందంబున నొక్కొగి లాఁచుకొని యుండి చేష్టించుం గాని ధీరు లైన వారికిం గలివలన భయంబు లేదు..." భాగ. ౧, స్కం. ౪౪౩.

చేష్టితము. సం. వి. అ. న. 1. గతి; 2. చేష్ట; 3. నడవడి. విణ. (అ. ఆ. అ.) చేష్టగలది.

చేసడలు. ద్వి. స. క్రి. (చే+సడలు.) వదలు. "సీ. వరకరద్మమకరములే కరగతంబులు నీకు నలినీవి యుత చేసడలరాదె." వసు. ౬. ఆ. ౮౪.

చేసరులు. ద్వి. వి. బ. (చే+సరులు.) హస్తాభరణములు. "రగడ. చౌకట్లు నొంట్లు చేసరులుసుక్ మొలకట్లు, రాకట్టు చుట్టుంగరములు బల్చే కట్లు." హంస. ౫, ఆ. ౩౫౬. ప్రబంధ. ౬౦౫.

చేసి. దే. అవ్య. 1. తృతీయావిభక్త్యర్థకము. "చ. అరుదుగ దివ్యరత్ననివహంబులఁ జేసి వెలుంగుచున్న మందరశిఖరంబు నెత్తికొని..." భార. ఆది. ౮, ఆ. ౨౮౨. "ఆ...తండ్రిపనుపు జేసి మఱిమిగోని జవ్వనం బిచ్చె..." భార. ఆది. 3, ఆ. ౯౫; 2. వంతున. "క. ఉరుశస్త్రవృష్టి నాప్తైఁ, గురిసినఁ దల్తీణమె యొక్కొకనిపయి నేనున్, వరుసఁ బదినేసిబాణము, లరుదుగ నేసితి..." భార. అర. ౪, ఆ. ౬౧. మార్క. ౪, ఆ. ౧౭౪.

చేసే. వై. అవ్య. ద్రు. (చేక్+చేక్.) చేసేత. స్వహస్తముగా. "మ. చెలువల్గొందఱు హేమ కుంభములతోఁ జేసే నొసంగన్..." పారి. ౨, ఆ. ౧౧.

చేసేత = చేసే. (చేతక్+చేతక్.) 1. ఒకరొకరి చేతిమీఁదుగా. "శా. చేసేతక్ బృథివీశులందు కొనఁ గాశీసింధుతోయంబులన్." నిర్వ. ౧, ఆ. ౨౬. భార. అశ్వ. ౧, ఆ. ౧౦౩; 2. స్వయముగా. "శా...చేసేత మథింపఁగాఁ దొడఁగె దుగ్ధాంభోనిధిక్ భూవరా." పరాహ. ౭ ఆ. ౬౦; 3. వెంబడి నే "క. చేసె సుఖము తత్ఫలము, చేసేతం గుడిచెఁ గాని..." భార. శాం. 3, ఆ. ౨౫౧. ద్వి. పరమ. ౪, ఆ. ౩౧౬. పా.

## చై

చై. = చెయి. "క. కై యనఁ గయ్యి నాఁ గేలనఁ, జెయి యనఁ జై నాఁగఁ జెయ్యి చే నాహస్తా, హ్వాయము లగు..." ఆం. సం. మాన. ౨౧.

చైతన్యము. సం. వి. అ. న. 1. ప్రాణము; 2. తెలివి; ప్రకృతి.

చైతసికము. సం. విణ. (అ ఈ. అ.) మానసికము, చిత్తమునందైనది.

చైత్యము. సం. వి. అ. న. 1. యజ్ఞశాల; 2. దేవాలయము; 3. బౌద్ధస్తూపము. పుం. 1. రావిచెట్టు, 2. రచ్చమ్రాను; 3. గ్రామాదులకు ఎల్లగా కట్టినజాతికట్టడము.

చైత్రము. సం. వి. అ. పుం.—1. చిత్రానక్షత్రయుక్తపూర్ణిమ గలది. ఒకానొకనెల; 2. పర్వ పర్వతవిశేషము. న. 1. మృతి; 2. దేవకులము; 3. యజ్ఞస్థానము.

చైత్రరథము. సం. వి. అ న. కుబేరునితోఁట.

చైత్రసఖుఁడు. సం. వి. అ. పుం. ఆమనిచెలి, మన్మథుఁడు.

చైత్రి. సం. వి. ఈ. స్త్రీ. చిత్రానక్షత్రయుక్తపూర్ణిమ, చైత్రపూర్ణిమ.

చైత్రికము. సం. వి. అ. పుం. చైత్రమాసము.

చైద్యుఁడు. సం. వి. అ. పుం. చేదిదేశపురాజు, శిశుపాలుఁడు.

చైలము. సం. వి. అ. న. వస్త్రము. విణ. (అ.ఈ.అ.) వస్త్రసంబంధమైనది.
చైవు = చెయువు. "ఉ... పేరక్కునం జేర్చి గబ్బచనులంటం గవుంగిట నొత్తునప్పు డ్యాచక్కెర బొమ్మ మార్మలయుఁచైవులకున్ విభుఁడు డల్లసిల్లుచున్." శుక. ౧, ఆ. ౨౧౩.
చైవులసాకిరి = చెయువులసాకిరి. "సీ. వేయిచేతుల జేడు వెలుఁగులయొకివాఁడు చైవులసాకిరి చాయ మగఁడు.." అం. సం. దేవ. ౧౬.

చో

చోక్షము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పరిశుభ్రము; 2. సమర్థము; 3. ఇంపైనది; 4. తీక్ష్ణము.
చోచము. సం. వి. అ. న. 1. చెట్టుపట్ట; 2. చర్మము; 3. కొబ్బరికాయ; 4. లవంగపుపట్ట.
చోదకుఁడు. సం. విణ. (అ. దికా. అ) 1. త్రోలువాఁడు; 2. ప్రేరేపించువాఁడు; 3. నడపువాఁడు.
చోదన. సం. వి. ఆ. స్త్రీ. 1. త్రోలుట; 2. నడపుట; 3. పురికొలుపుట; 4. విధివాక్యము, ప్రవర్తనావాక్యము.
చోదనము. సం. వి అ. న. 1. త్రోలుట; 2. నడపుట; 3. పురికొల్పుట; 4. విధివాక్యము. విణ. (అ. ఆ. అ.) 1. త్రోలునది; 2. పురికొల్పునది. (అ. ఈ. అ.) చోదనసాధనమైనది.
చోదము. సం. వి. అ. పుం. చబుకు. న. లవంగపుపట్ట. విణ. (అ. ఆ. అ.) 1. ప్రేరేపించునది; 2. త్రోలునది; 3. నడపునది.
చోదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నడపఁబడినది; 2. త్రోలఁబడినది; 3. విధింపఁబడినది; 4. పురికొల్పఁబడినది.
చోద్యము. సం. వి. అ. న. 1. ప్రశ్నము; 2. ఆశ్చర్యము; 2. పూర్వపక్షము. విణ. (అ.ఆ.అ.) 1. త్రోలఁదగినది; 2. నడుపఁదగినది; 3. పురికొల్పఁదగినది; 4. ప్రస్తావింపఁదగినది; 5. ఆక్షేపింపఁదగినది; 6. ఆశ్చర్యకరమైనది.
చోరకము. సం. వి. అ. పుం. ఒకానొకగంధద్రవ్యము.
చోరపుష్పి. సం. వి. ఆ. స్త్రీ. కట్లతీఁగ.
చోరము. సం. = చోరకము.
చోరస్నాయువు. సం. వి. ఉ. పుం. కాకిదొండచెట్టు.
చోరిక. సం. వి. ఆ. స్త్రీ. దొంగతనము.
చోరితము. సం. వి. అ. న. దొంగతనము. విణ. (అ. ఆ. అ.) దొంగిలింపఁబడినది.
చోరుఁడు. సం. వి. అ. పుం. దొంగ.
చోలకము. సం. వి. అ. పుం. 1. కవచము; 2. చెట్టునార; 3. రవిక.
చోలకి. సం. వి. న్. పుం. 1. నారింజచెట్టు; 2. మనికట్టు; 3. వెదురుమొలక.
చోలము. సం. వి. అ. పుం. 1. ఒకానొకదేశము; 2. రవిక; 3. చొక్కా; 4. పాదాగ్రమువఱకు వ్రేలాడుబట్ట.
చోషము. సం. వి. అ. పుం. 1. పీల్చుట; 2. అధికతాపము. [2. వావిలిచెట్టు.
చోస్కము. సం. వి. అ. పుం. 1. మంచిగుఱ్ఱము;

చౌ

చౌక్షము. సం. విణ. (అ. ఈ. అ.) మనోజ్ఞము, అందమైనది.
చౌడము. సం. వి. అ. న. చూడాకర్మ. విణ. (అ. ఆ. అ.) 1. చూడాసంబంధమైనది; 2. చోడదేశసంబంధమైనది. [శక్తి.
చౌరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చౌర్యము; 2. గాయత్రీ
చౌరుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు.
చౌర్యము. సం. వి. అ. న. దొంగతనము.
చౌలము. సం. వి. అ. న. చూడాకర్మము.

చ్య

చ్యవనము. సం. వి అ న. 1. జారుట; 2. కాఱుట; 3. పోవుట.
చ్యవమానము సం. వి. అ. న. 1. చ్యవనముగలిగించుట; 2. తఱిమివైచుట. విణ. (అ. ఆ. అ.) చ్యవనము గలిగించునది.

చ్యు

చ్యుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జాఱినది 2. కాఱినది; 3. పోయినది.
చ్యుతి. సం. వి. ఇ. స్త్రీ. 1. జాఱుట; 2. కాఱుట; 3. గతి, పోక; 4. గుదము; 5. భగము.

చ్యో

చ్యోతకము. సం. విణ. (అ. తికా. అ.) 1. కాఱునది; 2. జాఱునది; 3. పోవునది.
చ్యోతము. సం. వి. అ. న. 1. జాఱుట; 2. కాఱుట.

చ్యోతితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాఱినది; 2. జాఱినది; 3. పోయినది; 4. స్రవింపఁజేయఁబడినది; 5. జాఱునట్లు చేయఁబడినది; 6. పోవునట్లుచేయఁబడినది.

ౘ

ౘంక. వై. వి. (సం. కక్షః.) బాహుమూలము కక్షము. "చ...తగునే కఱకుట్లును జంకఁ బొత్తముల్." ఉ. హరి. ౨, ఆ. ౧౩౭. విజ. 3, ఆ. 3౪. "క. శరచాపధారణంబున్,పరమమనశ్శాంతి దాంతిపరిపాకంబున్, బరికింపఁ జాకదుద్దురు, శరణార్థియుఁ జసెదునట్టిచందము దోఁచెన్." హర. ౭, ఆ. ౧౭. (చంకదద్దు శరణార్థి = చంకలో కట్టి నుంచుకొని రక్షింప వేఁడువాఁడు.

ౘంకకఱ్ఱలు. ద్వ. వి. బ. (చంక+కఱ్ఱలు.) కుంటివాఁడు నడచుటకు చంకల క్రింద నుంచికొనెడి కఱ్ఱలు. (వా.)

ౘంకకాళ్లు = ౘంకకఱ్ఱలు. (వాచ.)

ౘంకతాళి. ద్వ. వి. (చంక+తాళి.) చంకను తగిలించుకొను మూట. (శ. ర.)

ౘంకలువైచుకొను. ద్వ. అ. క్రి. (చంకలు+వైచుకొను.) సంతోషపడు. "సీ. కానున్న పనికిఁ జంకలు వైచుకొనరాదు గడచినవెత దుఃఖపడఁగరాదు." రామలిం. ౫౭.

ౘంకిలి = చంక. ఔ. "క. ఆతరుణి మెచ్చి కైకొను, నాఁతడె మాయల్లుఁ డనుచు నచటికిఁ జని క,న్యాతిలకముఁ జంకిట నిడి, వాతెఱ ముద్దిడుచు ముజ్జ వంబునఁ బలికెన్." ద్వా. ౪, ఆ. ౫౫. శ్రీరాధా. ౪, ఆ. ౨౧3.

ౘంగలించు. దే. అ. క్రి. చలించు, తొలఁగు. "గీ. కమ్మఁగస్తురి చెక్కులఁ గరఁగి జాఱఁ, జన్నుఁగవ మీఁదిపయ్యెద చంగలింప, నడుగుఁదమ్ములు మిక్కిలి తడఁబడంగ, నరిగె..." మై. ౧, ఆ. ౧౬౦.

ౘంగు. దే. వి. (క. చంగనె.) వేగముగా దాఁటుట నడచుట మున్నగువానియందు దగుననుకరణము. "ఉ. శ్వసనుని ఘోటి ఘోటివలె జంగునఁ దాఁటి పయిం జనంగ..." సా. ౧, ఆ. ౧౦౪. "ఉ... ప్రచ్ఛన్నముఖాబ్జయై నడచెఁ జంగున బొండిలి భామ గోమునన్." వీథి. 3౬.

ౘంచేడము. దే. వి. శ్యేనభేదము, ఒకజాతిడేగ. "గీ. ఓరణంబును జలకట్టె బైరి గిద్దు, చంచడము సాళువము కనికరము..." ప్రబంధ. ౧౯౧.

ౘంటిపాప = చంటిపాఁపడు. (శ. ర.)

ౘంటిపాపఁడు. దే. వి. (చన్ను+పాపఁడు.) చనుఁబాలుఁ ద్రాగుపిల్లవాఁడు. "ఉ. ఆలఁట చంటిపాపఁడట యంగడి లేచె పచారముల్ గృహాం, బేల ప్రవాసి గాఁడె..." వేం. పంచ. ౪, ఆ. ౪౫౦. ఆం. భా. ద్వి. ౧౧౯.

ౘంటిపిడి. దే. వి. (చన్ను+ఇడి.) స్తనంధయుఁడు, పాలు త్రాగుపిన్నది. (వా.)

ౘంటివాఁడు. దే. వి. (చన్ను+వాఁడు.) చంటిపాపఁడు. ఆం. భా. ద్వి. ౧౧౯.

ౘండి. వై. వి. (సం. చండీ. క. త. చండి.) పార్వతి. ఆం. భా. ప్ర. ౪౦. విణ 1. సిగ్గుమాలినవాఁడు. "చ...తనూభవు లాఱడివోయి రింకఁ గా,నలఁజరియింపఁబోవుటయె నా కుచితం బటుగాక చండినై, నిలిచితినేని మాటలనె నిచ్చట భీముఁడు చూఁడుచుండఁడే." భార. శల్య. ౧, ఆ. 3౧; 2. లోభి. "ఉ...అర్థమహాభిలాషినై, యోడిన పన్నిదం బిడక యుండినఁ జండిన కాఁ దలంపరే." నిరం. 3, ఆ. 3౯; 3. సోమరిపోతు. ఆం. భా. త్రి. ౬; 4. మూర్ఖుఁడు. (చూ. చండితనము.)

ౘండించు. వై. అ. క్రి. 1 చలపట్టు, మచ్చరించు. "ద్వి...తొల్లి, రెండువరంబు లర్థించినదొటఁ, జండించి కాననస్థలికి రాఘవునిఁ,బనిచిన..." రం. రా. బాల. ౫. పు. ౭౯. కం. చం. రా. 3, ఆ. ౧౪౨; 2. మందగించు. "శా... తూర్యాలు నందడించె నడ చండించెన్..." విజ. ౨, ఆ. 3౬. ౧, ఆ. 3౫.

ౘండితనము. వై. వి. (చండి+తనము.) మొండితనము. "ఉ. చండితనంబునన్ మిగుల సందడిసేయుచు..." పాండు. ౨, ఆ. ౧౯౪. హరి. పూ. ౯, ఆ. ౧౦౮.

ౘండిపోతు. ద్వ. విణ. (చండి+పోతు.) 1. మూర్ఖపు పట్టుదల గలవాఁడు. (శ. ర.); 2. సోమరి. "ద్వి... ఈరాజు, సుకవాసి పనిపాద చూపు గుట్టంబు...చండిపోతనునట్టిబాడ నున్నాఁడు."

ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౦. పం; 3. దుర్జనుఁడు. ఆం. సం. మాన. ౧౧.

చేండిపడు. వై. అ. క్రి. (చండి+పడు.) మొండి తనము వహించు. "వ...రుధిరపల్వలంబులు ఒఱిసి మజ్జనక్రీడాపరాయణంబై చండిపడి కదల మిం గృతాంతుండు విడిచిపోవున...లులా యంబువలనను..." పాం. ౫, ఆ. ౧3.

చేండ్ర. దే. వి. ఖదిరవృక్షము. "సీ. జమ్మి బలుసు గార చండ్ర..." హంస. ౪, ఆ. ౯. ఆం. భా. ద్వి. ౪౦.

చేండ్రనిప్పు. దే. వి. (చండ్ర+నిప్పు. చండ్రకట్టె కాల్పగాఁ గలిగిననిప్పు, ఖదిరాగ్ని "సీ. చండ్ర నిప్పులకంటె వేండ్రంబు లగునట్టికన్నులఁ గోపాగ్నికణము లురల." హరిశ్చం. 3, ఆ. ౯౧. స్వ. ౪, ఆ. ౧౭.

చేండ్రలాటలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. అఁకుచీ.కెలు చండ్రలాటలు చుండ్రాట్ల ..." హంస. 3, ఆ. ౧౪౬.

చేందనము. వై. వి. (సం. చందన.) 1. మంచి గంధము. (చూ. చందనకావులు.); 2. మంచి గంధపుఁజెట్టు. "ద్వి. చందనంబులచెల్వఁ జాదుల కావ్య, నరటుల..." పండితా. పర్వ. 3౬౪. పు. ౫. పం.

చేందనకావులు. ద్వ. వి. బ. (చందనము+కావులు.) వస్త్రవిశేషము. "ద్వి. చందనకావులు.నరిసాటి కావు, లందంబులగు కఱకంచుకావులును." పండితా. పర్వ. 3౦౭. పు. ౨౪. పం.

చేందమామ. వై. వి. (సం. చంద్రమాః. పా. చందిమా. క. చందమామ.) 1. చంద్రుఁడు. "గీ చలువజోతి మైపులదొర చందమామ." వేంక. దేవ. ౧3. ఉ. రా. ౪, ఆ. ౨౪౦; 2. శ్రేష్ఠవాచకము. (ఈయర్థమున నిది యుత్తరపద మగును.) 'గీ...ఆరాచచందమామ, అగ్రవాకో దగ్రవిగ్రహుం డగుచు నడిరె." శుక. ౧, ఆ. 3౧౫. ఆం. భా. తృ. ౧౫; 3. తేగ చీల్చఁగా లోనుండు కాఁడ. (బ్రౌ. వా.); 4. గ్రద్దగా నుండుపసుపుపచ్చనిజెఱ. (బ్రౌ.)

చేందమామగుటకలు.. ద్వ. వి. బ. (చందమామ+ గుటకలు.) "చందమామ రావె,జాబిల్లి రావె" యని పాడుచు చంటిపిల్లలకు నోట పట్టి చేతులతో దిగిపింపఁగా వారు తినునట్లు నటించుచు వేయు గుటకలు. ఇది పదార్థముయొక్క అలభ్యభావము సూచించును.) "ఉ. అందనిపంటి కేమిటికి నట్టు నిగిడ్చెదు చిష్టు డున్న యా,కందుప చందమామ గుటకల్ చిఱ మీపని గట్టిపెట్టి నా,డెందము ...ని తుమ్మలిక డిందుపడం జనుదెమ్ము పోవము ..." వి. పు. ౨, ఆ. ౫౧.

చేందమామగుక్కిళ్లు. ద్వ. వి. బ. (చందమామ+ గుక్కిళ్లు.) చందమామగుటకలు. "గీ. ఎలమి సుమహార్తమునఁ దెర యెత్తునంతఁ బ్రేమ మది మీఱఁగాఁ జందమామచెలుల, కెంపు మోవులసుధకు గ్రుక్కిళ్లుమ్రింగ, క్షితిఁ గలిగెఁ జందమామగ్రుక్కిళ్లు నాఁడు." శశాం. ౫, ఆ. ౧3౭.

చేందమామఘుటిక = చందమామగుటకలు. "గీ. పాత్రసంశుద్ధి కాద్యఁ సుపస్తరించి, యూర కుండిరి యిదియేమి యొక్కొ పీరు, కానరానిప్పు శాకపాకములు నెమర,మనకు నిజముయ్యె నలచంద మామఘుటిక." భీమ. ౨, ఆ. ౧3౫.

చేందమామపక్కి. ద్వ. వి. (చందమామ+పక్కి.) ఒకజాతిపే.ప. (శ. ర. బ్రౌ.)

చేందమామపురుగు. ద్వ. వి. (చందమామ+పురుగు.) ఇంద్రగోపము, ఆరుద్రపురుగు. (బ్రౌ.)

చేందమామపులుఁగు. ద్వ. వి. (చందమామ+పులుఁగు.) చకోరము. "క. వాలికలై విలిదమ్ముల, పోలికలై చందమామపులుఁగులకును దా,మేలికలై..." నరస. ౨, ఆ. ౦౬.

చేందమామయల్లుఁడు. ద్వ. వి. (చందమామ+ అల్లుఁడు.) మన్మథుఁడు, కంతుఁడు. "గీ...చంద, మామయల్లుఁడు వలరాజు...కుసుమధ్వని." ఆం. సం. దేవ. ౧౪.

చేందమామల్లుఁడు = చేందమామయల్లుఁడు. "ఉ... చందమా,మల్లునిఁ బోలునీతలిరుటాఁదపుఁ జక్కని కోమలాంగుశిన్." సా. 3, ఆ. ౧౦౨.

చేందము. వై. వి. (సం. ఛన్దః. క. చంద.) 1. విధము, రీతి. "గీ. మందునకు బిడ్డనిచ్చినచంద మొందు." భార. శాం. ౧, ఆ. 33౨; 2. ఆకారము, రూపము. 'సీ...ఉష్ణశిఖరగోహ

యంబులయందులో నొక్కటిచంద మొంది." భార. శాం. ౪, ఆ. ౪౯౭; 3. మర్యాద, న్యాయము. "గీ. చెల్లునే రోషరస మింత చిలుకఁ జిలుక, సారెఁ గుందింపఁ జందమా చందమామ." రామా. ౬, ఆ. ౨౫. ఇందు. 3, ఆ. ౭౨; 4. ఛందస్సు. "సీ. పదబంధశిథిలత వాటిల్లఁగానీక యేచందములయందు నేమరిలక." కళా. పీఠి. ౯.

చేందా. దే. వి. 1. ప్రతిఫలాపేక్షతోఁ గాని ప్రతిఫలాపేక్ష లేకగాని యిచ్చెడిద్రవ్యము. (బ్రౌ.) 2. దేశవిశేషము. (చూ. చందాకెంపు!)

చందాకెంపు. దే. వి. (చందా+కెంపు.) ఒకజాతి కెంపు. "సీ. మేనఁ జందాకెంపు మించుటొడ్డాణంబు మొలనూలిచిఱుగంటఁ గులుకుననళి." సమీర. ౨, ఆ. ౬౩. కా. రా. ౪, ఆ. ౨౫౨.

చేందాదారు. దే. వి. చందాయిచ్చువాఁడు. (వా.)

చేందిరిక. వై. వి. (సం. చంద్రికా క. చందిరిక.) వెన్నెల (శ. ర.)

చేందు. వై. వి. (సం. చంద్రః. క. చందు.) 1. చంద్రుఁడు. "మ. చెవి యజ్ఞంబు భవన్ముఖాకృతి రచించెం గానఁ జం దజ్ఞుఁడై, యలచెన్నీముఖవైఖరిన్..." ఉ. రా. ౬, ఆ. ౭౭. వేంక. దేవ. ౧3; 2. నెల. మాసము. సాం. ని. దేవ. ౨౦; 3 అందము. "సీ. నకశరక్షోపాయ చణములై భుజములశంఖచక్రంబులు చందు మీఱ" శశాం. ౨, ఆ. ౪౬. విణ. 1. అందమైనది. (శ. ర.); 2. హితము. "ఉ. ఏను హితంబు చెప్పనిటు లేచి సురాచరణంబు లిష్టమై యున్, మానవ్రరోగిచందమునఁ దఱువుందెవు లంటఁదాఁకి నం,గాని యెఱుఁగఁడు..." నిర్వ. ౪, ఆ. ౬౫.

చేందుగు. దే. వి. 1. వృక్షవిశేషము. "మ. సురపొన్నల్ కలిగొట్టు చందుగులు కజ్జూరంబు లబ్బెందలున్." య. ౫, ఆ. ౪౯; 2. చందుగు పెట్టె, చిన్నపెట్టె. ఆం. భా. ద్వి. ౨౮౭.

చేందుచేట్టు = చేందురా. (చేందు+చేట్టు) "ఉ... చందుచట్టులన్, గట్టినమెట్టులు..." ఉ. రా. ౬, ఆ. ౧౨౬.

చేందునయ. వై. వి. (చందు+అయ.) చంద్రుని తండ్రి; సముద్రుఁడు. "గీ. చందునయ లచ్చి తండ్రి నా జలధి పరఁగు." సాం. ని. దేవ. ౧౭.

చేందునయ్య = చందునయ. వేంక. దేవ. ౧౯.

చేందురకావి = చంద్రకావి. 1. (సిందూరవర్ణము.) "సీ. విశదముక్తాదామరశనఁ జందురకావి వలిపపువలువ పైనలవరించి." స్వా. ౬, ఆ, ౫. విజ. ౨, ఆ. ౧3౦; 2. ఎఱ్ఱబట్ట. "సీ. సంపంగికావులుఁ జందురకావులు వెలిపట్టుజీబులు..." ప్రబంధ. ౨౭౨. ఆం. భా. ద్వి. ౧౫౪.

చేందురజోతి. వై. వి. (సం. సిందూరజ్యోతిః. చందురము+జోతి) ఒకవిధమైనబాణసంచు. (శ. ర.)

చేందురపూవు. వై. వి. (చందురము+పూవు.) కుసుంభపుష్పము. (శ. ర.)

చేందురమామ. వై. వి. (సం. చంద్రమాః) చంద్రుఁడు "ఉ. చల్లని వాఁడు మా నెలవు చందురమామ..." నస. ౨, ఆ. ౧౨౧.

చేందురము. వై. వి. (సం. సిందూరం. ప్రా. సిందూరం.) సిందూరము. (శ. ర.)

చేందురా. ద్వ. వి. (చందు+రా) చంద్రకాంతము, ఇందుమణి. "సీ. చక్కనిచెలికిఁ దా నొక్కనప్పుడుగజా యీచందురాతిన్నె యుండొనర్చు." ఉ. రా. ౪, ఆ. ౧౭౨.

చేందురుఁడు. వై. వి. (స. చంద్రః.) చంద్రుఁడు. "గీ. కంటి యొంతయుఁ జెలు వేచెఁ జందురుండు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౭. నృ. సిం. 3, ఆ. ౯౭.

చేందురుకూనలు. ద్వ. వి. బ. (చందురుఁడు+కూనలు) నక్షత్రములు. "క...కరరుహక్షతములు మెఱయుచుండు. "గీ. గోరువంకలు చందురుకూన లనఁగ." ఆం. భా. ద్వి. ౧౯౦.

చేందురురాయి = చేందురా. "ఉ. చందురురాతిచాగదపు జంటబవంతి వెడందయంకణంపుం దగులూని..." విజ. 3, ఆ. ౧౯౯.

చేందురువంకలు. వై. వి. బ. (చందురుఁడు+వంకలు) నక్షత్రములు. (శ. ర.)

చేందుఱా = చేందురా. "గీ. అంద మగుచందుఱాతిన్నెలందు..." ఉ. రా. ౬, ఆ. ౧౭3.

చేందువ. దే. వి. 1. ఆస్తరణవిశేషము. రగడ. దుద్దు కంబళ్లు చందువలు తివాచీలు." హంస. ౫, ఆ. 3౫౬; 2. మేలుకట్టు. "సీ. వన్నెకోకలు చందు

వలు గలమంటపం బొకటి నిర్మించి..."అనంద. పీఠి. ౯౭. శతాం. 3, ఆ. ౧౦౪.

చేందువా. వై. వి. (సం. చంద్రోదయః?) మేలుకట్టు. "చ. ధరణి విశాలతల్ప ముపధానము బాహువునింకి చందువా, సురటులు గంధవాహములు..."చర్త్ర. 3, వై. ౯౪.రసిక. ౧,ఆ ౬౧.

చేందుగాయి. దే. వి. వృక్షవిశేషము. (బ్రౌ.)

చేంద్రకావి = చందురకావి. (సిందూరవర్ణము) "చ...మెరుంగులతో డ్లగు. బ్బలపయి చంద్రకావిజిగి పస్మ్యదకొంగు లెడల్చి.."సకల. ౧, ఆ ౮౭. రామా. ౧. ఆ ౧౬౯.

చేంద్రము = చందురము. "సీ. చక్రవాకములకుc జల్లcగా మందు ద్రాగించిన చంద్రపురికెన్ను వోలె" ఉ. హరి. 3, ఆ. ౮౬. ఆము. ౧, ఆ. 3౯.

చేంపు. దే. స. క్రి. (చచ్చు ధా. ప్రే.) 1. చావcజేయc. "గీ. వాకట రాక్షసులc జంపించు టర్హమగునె." వైష." ౮. ఆ. ౧3౪. భార. విరా. ౨, ఆ. 3౪3; 2. బాధించు. "క...నృప. చాలక్ గారాకు మేపి చంపకు ప్రజలన్." ఆము. 3, ఆ. 3౨. వి. చంపుట. "గీ. అప్పు డతికాయుc డాకార యద్రిచరులు, జమిలి చంపులు చంపి రిచ్చట నటంచు." రామా. ౮, ఆ. ౧౬౪.

చేంపుడు. దే. వి. (చంపు. ధా.) చంపుట. "గీ. పారి గొనుట పిల్కుమార్పు చంపుడు దునుముట, యనcగc దగు హింస..."ఆం. భా. ద్వి. ౨౨౪.

చేంపుడుగట్ట. దే. వి. (చంపుడు+కట్ట) వధ్యస్థానము. "వ...చంపుడుగట్ట యగు శిలాపట్టంబు మెట్టి నిలిచి..."కాశీ. ౪, ఆ. ౧౬౯.

చేంపుడుగట్టు. దే. వి. (చంపుడు+గట్టు) వధ్యస్థానము. (శ. ర.)

చేకచేక. దే. వి. (క. చకచక.) వేగముగా పరుగెత్తుట వ్రాయుట మున్నగువానియందలి యనుకరణము. "చ...మోరటీపుతోc, జకచకc బాఱు తెంచు..."భిల్హా. ౨, ఆ. (శ. ర.) (వా:—వాcడు చకచక వ్రాయుచున్నాcడు.)

చేక్కు. వై. విశ. (సం. చక్షః.) 1. ఋజువు, తిన్ననిది. "సీ. చక్కచాయcc జరింప సమకూరకుండుట నిడ పింగళను గాలి యెక్కుడిగ్గు." కాశీ. ౨, ఆ. ౧౨౧; 2. సుందరము, అందమైనది. "ఉ. అక్కడ నొక్కభూపతి ననంగునికంటెను రూప సంపదం, జక్కనివానిc జూచి..."వైష. ౪,ఆ. ౧౧౪. క్రి. విశ. ద్రు. 1. అందముగా. "వ...కొప్పు చక్కన్ జెక్కుచు..."స్వా. ౨, ఆ. ౬౧; 2. తిన్నగా. "గీ...చక్క నాపాలి కేతెంచునొక్క పీcడు." భార. శల్య. ౨, ఆ. ౧౯౯. విప్ర. ౪, ఆ. ౪౯; 3. సంపూర్ణముగా. "గీ అప్పు చక్కంగc దీర్చినయనువు మెఱయ." హరి ౨, ఆ. ౧౧౯.

చేక్కcజేయు. వై. స. క్రి. (చక్కన్+చేయు) 1. చక్కcబఱుచు. "ఆ. విరసమయ్యేని వెరవెగ్గి మఱి చక్కcజేయ నీవ చింతచేసి చూడు." ప్రభా. ౪. ఆ. ౮౯; 2. సంస్కరించు. "సీ. స్నానంబు గావించి చనుదెంచునంతలో జపవేదిc దపురీతిc జక్కcజేయు." ఉ. రా. ౧, ఆ. ౮౯౯; 3. పూర్తిచేయు. "చ...పోయి వచ్చి నీపని మఱి చక్కcజేసెద నెపంబు సహింపుము వేగ మేటికిన్." భా. రా. సుం. ౮3; 4. నశింపcజేయు. "శా. గంగానందనుc గూల్చి ద్రోణుపని సక్కంజేసి కౌరవ్యుపీ, రాంగమ్ముల్ నుఱుమాడి..."భార. భీష్మ. ౨, ఆ. ౧౪3; 5. అణcచు. "సీ...జలరాశిగర్వంబుc జక్కcజేసి." భాగ. ౬, ఆ. 3౦౬.

చేక్కcదనము. వై. వి. (చక్క+తనము) 1. సౌందర్యము. "గీ. చక్కcదనమున నొకవింతచక్కc దనము." పారి. ౧, ఆ. ౪౬. ఆం. భా. తృ.౪౧.

చేక్కcబడు. వై. అ. క్రి. (చక్కన్+పడు) 1. బాగుపడు. "క. ఎదిరిం దమయట్టుల కామదిc దలcచినc బొసcగుc గాక మాకుం గుడు మిం,డిదమీరు ప్రక్కc గొనుc దని, చదురడిచిన మనసు పొందు చక్కంబడునే." భార. ఉద్యో. ౧, ఆ. 3౧౨; 2. మంచిమార్గమునకు వచ్చు; "గీ. సముచితము లగుమాటలc జక్కcబడక, తక్కె నీసుక్కువుం దగుధార్తరాష్ట్రు." భార. ఉద్యో. ౧, ఆ. ౨౭; 3. తీరు. "వ...పీరలవాడు మన చేతc జక్కంబడనేరదు..."భార. ఆర. ౪, ఆ. ౨౦౨; 4. నెఱవేఱు. "గీ. జాంబవంతునిc జూచి

యోస్వామి యితఁడు, వెరవునకు లావునకు ధురంధరుఁడునువ్వ, కలరు నాకిట్టిచేరువకాండ్రు దేవ, చక్కఁబడకున్న మీప్రయోజనము లెల్ల." రామా. ౭ ఆ. ౨౭; 5. తృప్తిపడు, "క. వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తం బగులేశ మైనఁ బదివే లనుచుం, దృప్తిం జెందనిమనుజుఁడు, సప్తద్వీపములనైనఁ జక్కఁబడునే." భాగ. ౮ స్కం ౫౭౪.

చేక్కఁబెట్టు. ద్వి. స. క్రి. (చక్కన్ + పెట్టు.) 1. సవరించు, సరిచేయు. "సీ. చనవరియై వడి జాఱెడురత్నభూషణము నెప్పటి కప్డు చక్కఁ బెట్టు." దశా. ౨, ఆ. ౧౭౯. స్వా. ౫, ఆ. ౬౪; 2. బాగొనర్చు. "సీ. అది జంత వానిమాయలకు లోఁగునె యొందఱు జక్కఁబెట్టిన యనెడువారు." కువల. ౪, ఆ. ౧౮౪. (ఇట పాడుచేయు అని భావము.); 3. "గీ. చన్నుగుబ్బలపోరాటఁ జక్కఁబెట్టఁ, బోయి మధ్యస్థ భావంబు బొందలేని, కతన లజ్జించెననఁగ మొగాలు నల్ల, వాఱు గురివెందపూసల పేరు వైచు." వరాహ. ౨, ఆ. ౧౧౫. వై. ౧, ఆ. ౧౨౪; 4. పోఁగొట్టు. "సీ...చుక్కల తేజంబు చక్కఁ బెట్టి." వీర. 3, ఆ. ౨౨౨. "ఆ...వేలుపు, బీర మెల్లఁ జక్కఁబెట్టి యంత." య. 3, అ. ౧౩; 5. చంపు. "క. నీచెప్పెడిపెద్దలు ద్రోణాచార్యులు మొదల గాఁగ ననికొల్లనివా,రై చేసని వారిం గొని, యే చక్కంబెట్టువాఁడ నేఁ బాండవులన్." భార. ఉద్యో. ౨, ఆ. ౨౫౦; 6. నిర్వహించు. "గీ. వినుతబలు లైనయాదవవీరవరులు, గలుగ వారలచేఁ గానికార్య మీవు, సక్కబెట్టుట యెట్లు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౨౨౦౬; 7. పరిపాలించు. "ద్వి. జనపతి రాజ్యంబుఁ జక్కఁబెట్టుచును." పండితా. దీక్షా. ౭౨. పా. భార. విరా. ౧, ఆ. ౨౮౨.

చేక్కటి. యు. దే. వి. 1. ప్రదేశము, స్థానము. "క. చక్కనిచిక్కనిమేనులు, నిక్కొండదండములు నైన నెఱుఁగరె మన మీ, చక్కటి నిలుతమె శస్త్రము, లొక్కెడ డాఁచుటకు వేషయోజనములకున్." భార. విరా. ౧, ఆ. ౧౫౬. భీమ. 3, ఆ. ౧౩౯; 2. అగ్రభాగము, ఎదురు. "గీ. కంటె గాంగేయుం డతనిచక్కటి శిఖండిఁ, బెట్టుము ..." భార. భీష్మ. 3, ఆ. ౧౯౦; 3. దిక్కు, వైపు. "క. ఎంతమహాత్ముఁడ వయ్యా సంతసమున నీవు దిరుగుచక్కటికి రమా, కాంతుఁడు మొగఁ బుద్రిప్పుచు, నెంతయుఁ బ్రేమమునఁ జూచె..." పరమ. ౨, ఆ. ౧౨౫. రాజ. చ. ౨, ఆ. ౯౯; 4. సమీపము, చెంత. "క. ఎక్కడిసుతు లెక్కడి సతు, లెక్కడి బంధువులు సఖులు నెక్కడి భృత్యుల్, డొక్క పడిపోవువేళలఁ, జక్కటికిని నెవరు రారు..." వేమన. ౧, ఆ. భా. ౧౬౭; 5. న్యాయము, ధర్మము. "ఉ. చక్కటి లేని యాలమునఁ జంపె ననన్ వలదు..." భార. శల్య. ౨, ఆ. ౩౨౧. భా. రా. యు. ౮౬; 2. రీతి, పద్ధతి. "క. కక్కురితివాఁడు కార్యము చక్కటి యెఱుఁగండు..." నా. పంచ. ౧, ఆ. ౩౨౦. "ద్వి. తెరువులచక్కట్లు తెలనడ్గువారు." పండితా. పర్వ. ౩౫౦. పా; 3. ఆర్జవము, తిన్నఁదనము. "గీ...ఎంతప్రియము, చేసి తిరిగిన ధూర్జను చిత్త మేల, చక్కటికి వచ్చు..." నా. పంచ. ౧, ఆ. ౨౯౪. భార. ఉద్యో. ౨, ఆ. ౩౧౭; 4. కలహము, పోరు. "గీ...విటులవేశ్యాజనముల చక్కటులఁ దీర్చు, వారలును గల్గి శంబరవైరి సంత, పేఁట యన నొప్పునవ్వేశవాటమునను." వైజ. 3, ఆ. ౬౯; 5. విధానము, ఏర్పాటు. "క...దైవము, చక్కటి యెగలియె కాని సంగ్రామమునన్." భా. రా. యు. ౮౦౮. విణ. ఎదుటిది. "ఉ. పాండునృపాలనందనులు పావని ముఖ్యగ నేచి యప్డు భీ, ష్ముండు కడంకమై నడచు చోటికిఁ జక్కటి గాఁగఁ ద్రోచి యొుండొండ కడంగి..." భార. భీష్మ. ౧, ఆ. ౨౪౪.

చేక్కటిమాటలు. దే. వి. బ. (చక్కటి + మాటలు.) నీతివాక్యములు. "చ...జనని కడంగి యే నతనిఁ జక్కటిమాటలఁ దేర్చువాఁడనై." భా. రా. యు. ౧౫౭.

చేక్కటియని. దే. వి. (చక్కని + అని.) ధర్మయుద్ధము. "సీ. గాంగేయగురుకర్ణ కౌరవపతులఁ జక్కటి యనిఁ బరిమార్పఁ గానైతిమి..." భార. శల్య. ౨, ఆ. ౩౯౧.

చేక్కట్టుదిద్దు. దే. స. క్రి. (చక్కట్టు+దిద్దు.) 1. చక్కఁజేయు, సవరించు. "శా...ఏణాంకుచిన్, శంకల్ సేయు మొగంబు జక్కవకవన్ జక్కట్టు దిద్దున్ గుచా,హంకారంబు..." విజ. ౭, ఆ. ౧౬; 2. (ఔడ్డది మంచి దని) సమర్థించు. "చ... నిక్కము గాఁగను నాతఁడేమియుం,దెలియఁడు సాదుబిడ్డఁ డని సేరుపుమాటలఁ దేలనాడి గా,దిలి సుతుచేతఁ జక్కటులుఁ దిద్దెద వెంతటీనంగ నాచివే." సా. 3, ఆ. ౫౫.

చేక్కడఁగు. దే. అ. క్రి. (చక్క+అడఁగు.) చచ్చు. "సీ. సమయుంట యీల్గుట చావు చక్కడఁగుట...నా మీఁఱు మరణము..." ఆం. భా. ద్వి. ౭౭౫.

చేక్కడఁచు. దే. స. క్రి. (చక్కడఁగు. ధా. ప్రే.) 1. ఖండించు, తునియలుచేయు. "వ...రథిక సారథిసహితంబుగా నరదంబులు చక్కడంచి..." భార. భీష్మ. ౭, ఆ. ౨౧. భీమ. ౬, ఆ. ౯౯; 2. చంపు. "క. ఒక్కడ మనసైన్యంబుల్, సక్కడఁచుచు నున్నవాఁ డలంబున 'కంటే." భార. భీష్మ. 3, ఆ. ౯౯. ప్రభా. ౧, ఆ. ౧౦౮.

చేక్కడుచు = చక్కడఁచు. 1. (ఖండించు, నఱుకు.) "క. ...సాత్యకి మఱియుం,ద్వరితముగ నొక్క పెట్టుగ, శరాసనము లెన్నియేనిఁ జక్కడిచె వడిన్." భార. ద్రో. 3, ఆ. ౧౩౭; 2. (చంపు.) "ఉ. ఇక్కడిసేనఁ జక్కడిచె నేనియుఁ జూతున కాక..." భార. భీష్మ. 3, ఆ. ౩౦౨; 3. (మించు, అతిశయించు.) "సీ. ఈవిచేతనె కాదు తీవిచేతనుగూడ శశిరేఖ నెంతయుఁ జక్కడంచు." రాధికా. ౧, ఆ. ౭౩.

చేక్కదము. దే. వి. 1. అందము. (బ్రౌ.); 2. విధము. "చ. ఒదవెడు పేడ్కఁ దన్ను మును నూఱడఁ బల్కి మెఱుంగి చన్నచ,క్కదములు రోషబాష్పకణగద్గదభాషలచేతఁ జెప్పుచున్." కావ్యా. 3, ఆ. ౪౮. విణ. తగినది. "మ...కంచి నయ మొప్పం జొచ్చి యచ్చోటఁ జ,క్కద మాభావనఁ జేర నేఁగె నృపుఁడు..." ద్వా. ౯, ఆ. ౩౭.

చేక్కన. వై. వి. అందము, చక్కఁదనము. (బ్రౌ.) విణ. 1. సుందరము. "సీ. జడలుగట్టియు నింత చక్కనైనది వేణి..." కు. సం. ౨, ఆ. ౨; 2. [illegible]క్రమము, "చ. తనమునుపడ్డబన్నములు దమ్ములపైఁ గలకూర్మి పేర్మి నీ, జనపతి సైఁపకున్నె యిది నక్కన రాజ్యము పాలు లేక తీ,యున కొఁడఁబాటు గల్గిన నెఱుంగమి పెట్టెరె..." భార. ఉద్యో. 3, ఆ. ౧౦౩; 3. సిద్ధము. "ఉ...కాలుప్రోలి కేఁగింపెదఁ జక్కనై నిలుము కిట్టి రణంబున రాక్షసాధమా." భార. ఆది. ౬, ఆ. ౯౯౪. "క. చక్కనగు మనిన రక్కసుఁ, డక్కజముగఁ బెట్టఁగి..." భార. ఆది. ౬, ఆ. ౭౦౩; 4. తిన్ననగు, ఋజువు. "సీ. స్వస్తికాసనము నిశ్చలముగా బంధించి తనువుఁ గంధరయు మస్తకము సరిస,చక్కనై నిలువ..." హరి. ఉ. ౫, ఆ. ౧౨౪; 5. స్పష్టము. "మ...చక్కనగా ముందటఁ గానుపించుఘటముం గన్నట్టు బ్రహ్మంబుగాఁ, దనుఁ దాఁ గాంచినయంతలో నిఖిలముక్ దానై వెలుంగున్ దగన్." సీతా. 3, ఆ. ౫౫.

చేక్కనగు. ద్వ. అ. క్రి. (చక్కన+అగు.) 1. న్యాయమగు. "సీ. కలికిభుజంగ సంగతిఁ గన్న కేతకి సాధ్విచెంత వసింపఁ జక్కనౌనె." ఇందు. 3, ఆ. ౨౭; 2. సిద్ధించు. "గీ...శృంగారవనికి, నరుగ నన్నియుఁ జక్కనౌ నచట ననుచు." వసు. 3, ఆ. ౧౧౬; 3. సిద్ధమగు. "మ. శరచాపంబులఁ గేలఁ బూని రథినై సంగ్రామ మర్థించి భూ,వర నీపై నిదె వచ్చినాఁడ మొదలన్ వారాశిపై వాలిపై, ఖరుపై నేసినకోల లేయుఁ మిటఁ జక్కం గమ్ము నాయమ్ము లిం,కొరుపైఁ బాఱవు..." భా. రా. యు. ౧౦౭౮; 4. పూర్తియగు. "క. పగతుపనిఁ జక్కనయ్యెన్, వగ మానుము..." భార. సౌ. ౭, ఆ. ౮౯; 5. నశించు. "ఉ...వంచనా, కృత్యజమైనయీ నిబిడకిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్." జై. ౧, ఆ. ౫౬. కేయూర. ౪, ఆ. ౧౫౯.

చేక్కనయ్య. వై. వి. (చక్కని+అయ్య.) 1. మన్మథుఁడు. "గీ...పూర్ణచంద్రముఖి నేఁచకయ్య యోచక్కనయ్య." వసు. 3, ఆ. ౧౨౨; 2. అందగాఁడు. "గీ. ఉక్కగంబు[illegible] వెడలినచక్కనయ్య." గంధ. ౭౩.

చేక్కనిమిన్ను. వై. వి. (చక్కని+మిన్ను.) ఆకాశ మధ్యము, నడిమిన్ను. "వ...అప్పుడు కయ్యంబు కలరూపాతయుఁ గనుంగొనుట మింటిక్రేవ నున్న వెరవు గా దనువరుసన సవిత్రుండు చక్కని మింటికిం జను చెంచె..." భార. భీష్మ. ౩. ఆ. ౩౮౬.

చేక్కరవతి. వై. వి. (సం. చక్రవర్తీ.) చక్రవర్తి, సామ్రాట్టు. వేంక. మాన. ౨.

చేక్కసగము. ద్వా. వి. (చక్క+సగము.) సరియైన సగము. "గీ. ధవళకేతకిధూళి గాత్రమునఁ జెరివి. మోకమామిడి కొకకొంత మ్రొక్క నిలిచి, యొద లిట్లోఁ జక్కసగము నాకొసఁగు మనుడు." ఉ. హరి. ౫, ఆ. ౫౬. ఇట్లే: చక్కసమము. "ఉ... పంచిపెట్టెదం,జక్కసమంబు గాఁగ నిది సమ్మత మాఁగద మీకు వారికిన్." దశా. ౨, అ. ౩౪౩.

చేక్కాడు. ద్వా. స. క్రి. (చక్కు+ఆడు.) 1. ఖండించు, నఱకు. "క....వరదివ్యాస్త్రముల నెల్ల వడిఁ జక్కాడెన్." భా. రా. బాల. ౫౭౬; 2. చంపు, వధించు. "గీ. అఖిలబలములతోడఁ జక్కాడు నిన్ను." భా. రా. ఆర. ౨౦౧. ఆం. భా. తృ. ౧౨౩.

చేక్కి. దే. వి. 1. ప్రదేశము, స్థానము. "క. చనుఁ గవ ఘనమో జఘనము, ఘనమో యని నడిమి చక్కిఁ గమిచి విధి కరంబునఁ దూఁచె దీనిఁ గాకిట్టనువుపడునె వళులపేర నంగుళిరేఖల్." సైమ. ౫, ఆ. ౧౬. సా. ౨, ఆ. ౭౨; 2. పార్శ్వము. ప్రక్క. "ద్వి. చక్కల నున్న భూజము లెక్కి కొంద, ఱిక్కవ చూపట్ట నీలలు వెట్ట." ద్వి. పరమ. ౭, ఆ. ౪౯౦ పా. ౧౩, పం. విక్ర. ౮, ఆ. ౧౯; 3. విధము, రీతి. "గీ. అతఁడు పంచత్వ మొందినయచటు వాసి, యొక్కపురిఁ జేరి యింటింటఁ గుక్కచక్కి, మెలఁగి..." సానందో. ౫, ఆ. ౮౬, పా; 4. మార్గము, దారి, "గీ. ప్రోలిపల్గోటకొమ్మలఁ బులుఁగుజాల, గఱిక యని డాసి చెంతఁ జెక్కడపుసింగ,ములను గన్గొని నడుచక్కిఁ బోవ వెఱచి." నీలా. ౧, ఆ. ౩౨: 5. చేరువ, నికటము. "సీ. పంచెంగపొదరింటి చక్కి గోరఁట గాంచి యమునురంచు పుగిడి నోరూరు ననియు." పారి.

౩, ఆ. ౫౧; 6. విషయము, పట్టు. "క. ఏపట్టున విసువక రఘాపరుఁడవు కమ్ము ప్రజలచక్కన్ ..."ఆము. ౪, ఆ. ౨౦౪; 7. వాద్యవిశేషము. "వ...డక్కి చక్కి చుయ్యంకి లోనగునసంఖ్యాతవాదిత్రత్రితయపరంపరలు..."ఆము. ౪, ఆ. ౩౫.

చేక్కియ = చక్కి. 1. (పార్శ్వము.) "గీ...అయ్యోఱకురాజు, నుందఱను జక్కియల నొక్కమోఁగ నిలిచి." భార. ఆర. ౧, ఆ. ౩౦౦. హర. ౨, ఆ. ౨౦.

చేక్కిలము. వై. వి. (సం. శష్కులీ. క. చక్కలి) పిండి మెలిపెట్టి చేసెడిభక్ష్యవిశేషము. "సీ. కైటభారాతి చక్రము ప్రయోగించిన వెసఁ జక్కిలముఁ బోలె విఱిచి బొక్కె." కాశీ. ౭, ఆ. ౮౪. ఆం. భా. ద్వి. ౨౫౬.

చేక్కిలి. వై. వి. (సం. కక్షః) చంక, బాహుమూలము. (చూ. చక్కిలిగింత.)

చేక్కిలిగింత. ద్వా. వి. (చక్కిలి+గిలిగింత) చంక మున్నగుచోట్ల అన్యకరస్పర్శముచేతఁ గలిగెడు కంపము. "ఆ. పడఁతి కలదె జాతిపతిమకు చక్కిలి,గింత నాదుధృతికి గెంటు లేదు." కళా. ౩, ఆ. ౪౫. పి. శకుం. ౨, ఆ. ౧౪౦.

చేక్కిలిగింతలువోవు. ద్వా. అ. క్రి. (చక్కిలిగింతలు+పోవు) అన్యకరస్పర్శముచేత చంక మొదలైన యంగములు కంపించు. "చ. తనదుమెఱుంగుఁ జెక్కిళులు దాఁకఁగనీక మొగంబు నాఁపుచున్, జనుబోగడల్ నఖాకలనఁ జక్కిలిగింతలువోవ లోఁగుచున్." కళా, ౧, ఆ. ౨౭.

చేక్కిలిగిలి. ద్వా. వి. (చక్కిలి+గిలిగిలి.) చక్కిలిగింత. (శ. ర.)

చేక్కీ. దే. వి. 1. పల్లకీ మొదలగువానిలో వేయుటకును తీయుటకును వీలగునట్లు పేము పట్టెడ మున్నగు వానితో నేసెడుచట్టము. (వా.); 2. ఒకానొక రకము పంచదార. (చూ. చక్కీపంచదార.)

చేక్కీపంచదార. దే. వి. 1. గడ్డకట్టిన తెల్లచక్కెర. (శ. ర. శుద్ధిచేసినచక్కెర అని బ్రౌ.)

చేక్కీమంచము. ద్వా. వి. (చక్కీ+మంచము) చక్కీగలశయ్య. (వా.)

చెక్కు. వై. వి. (సం. షట్కం.) 1. ఆఱు, "క. ఇరు చక్కుమేను లూకొబలు, దొరకొలుపు బాల వాఁసు తొగలయనుంగై." అచ్చ. బాల. ౧౨౭; 2. (సం. శల్క, మ్.) ఖండము, శకలము "సీ. చక్కుగా నఱికిన జాడుచొప్పలు నులపలపిష్ట ములు బలీవర్దములకు." వరాహ. ౪, ఆ. ౧౩౬; ప్రబంధ. ౧౮౬; 3. ఆడుటయందు దగునను కరణము. "చ. అనయముఁ జక్కుచక్కనఁగ నాడెడురూపులు నోలి ఝుమ్మఝుమ్మని కలయంగఁ బాఱువివిధారుణధారలు..." కు. సం. ౧౧, ఆ. ౧౯౧.

చెక్కుచేయు. వై. స. క్రి. (చక్కు+చేయు.) ముక్కలుచేయు. "సీ. భిల్లపరంపరల్ పరఁగించి ధనురాదిసాధనప్రకరంబు చక్కుచేసి." భా. రా. యు. ౪౨; 2. ఖండించు, నఱకు. "గీ. చక్రమున నక్రశిరమును జక్కుచేసి." వాల్మీకి. ౧, ఆ. ౧౦౬; 3. అడఁచు. "ఉ. మూఁగినదైత్యదానవులమొక్కల ముక్కునఁ జక్కుచేసి..." ఉ. హరి. ౬, ఆ. ౧౩౧.

చెక్కుపగడ. ద్వ. వి. (చక్కు+పగడ.) సప్తసంఖ్య; ఏడు. వేంక. మాన. ౯౨.

చెక్కెర. వై. వి. (సం. శర్కరా, ప్ర. సక్కరా. క. తు. సక్కరె. త. చక్కెరె.) పంచదార "క. చక్కెరలొ నిండువెన్నెల, యక్కెరలో యమృతధారలో యివి..." సుద. ౨, ఆ. ౧౨౯, ఆం. భా. ద్వి. ౨౯౧.

చెక్కెరలిండి. ద్వ. వి. (చక్కెర+లిండి) చిలుక. "ఉ. చక్కెరలిండితత్తడి వెసన్ దుమికించుచు..." ఉ. రా, ౪, ఆ. ౧౭౧. (ఇట్లే చక్కెరలిండిపులుఁగు, వేంక. తిర్య. ౧౦౧).

చెక్కెరబుగడ. ద్వ. వి. (చక్కెర+బుగడ) భక్ష్యవిశేషము. "వ... బొఁగులుఁ జక్కెరబుగడలుక్కెరలు..." హంస. ౧, ఆ. ౧౦౯.

చెక్కెరబొమ్మ. వై. వి. (చక్కెర+బొమ్మ.) చక్కెర బొమ్మవలె ఇష్టమైనది. 1. భార్య. "వ...ఆమె తనుఁ జేరినయనుంగులుం దామ బంతులుదీరి క్రొత్తవెన్నెలలఁ గ్రుత్తుకబంటిగా మెక్కి తమతమ చక్కెరబొమ్మలం గలసి ముక్కుముక్కునం గదియ నొక్కుచు..." భోజసుతా. ౯, ఆ. ౨౮; 2. మనోజ్ఞురాలు. "ఉ. చొక్కపుఁగుందనంపుజిగిసోయగముం గలముద్దుగుమ్మయో, చక్కెరబొమ్మ..." పె. శ. కుం. ౨, ఆ. ౧౪౧.

చెక్కెరముద్దుగుమ్మ. ద్వ. వి. (చక్కెర+ముద్దుగుమ్మ.) మనోజ్ఞురాలు. "ఉ...ఈ, చక్కెరముద్దుగుమ్మ సరసప్రియభామల నింపొనర్చెడిన్." వేం. పంచ. 3, ఆ. ౨౮౮.

చెక్కెరవిలుకాఁడు. ద్వ. వి. (చక్కెర+విలుకాఁడు, మన్మథుఁడు. ఆం. భా. ప్ర. ౪౯.

చెక్కెరవిల్కాఁడు = చక్కెరవిలుకాఁడు. మృ. వి. ౨, ఆ. ౭౦.

చెక్కెరవిల్తుఁడు = చక్కెరవిలుకాఁడు. చంద్రి. ౨, [ఆ. ౭౯.

చెకొ్కను. దే. అ. క్రి. (చక్క+కొను) సరియగు. (చూ. చకొ్కలుపు.)

చెకొ్కలుపు. దే. స. క్రి. (చకొ్కను ధా. ప్రే.) సరిచేయు; నిలుపు. (బ్రా.)

చెగుడు = చేవుడు. (శ. ర.)

చెచ్చెవుకము. వై. విశే. (చవుకము+చవుకము.) చచ్చౌకము. (శ. ర.)

చెచ్చెదరము. వై. విశే. (చదరము+చదరము) సరియైనచదరము. "చ. పొసఁగు మెఱుంగుఁ జచ్చదరపుం జిగిరత్నపుమేలిచట్టుపై." కాళిందీ. ౨, ఆ. ౧౬౪.

చెచ్చు. దే. అ. క్రి. 1. మృతినొందు. "గీ....బకుని యట్ల, చత్తు రని రక్కసుల కెల్లఁ జాటె వినఁగ." భార. ఆది. ౬, ఆ. ౩౦౪. నైష. ౨, ఆ. ౪; 2. నశించు, తగ్గు. వా:—ఆవాలలో కారము చచ్చినది. (బ్రా.) విశే. 1. నిస్సారము. ఉదా:—చచ్చుమన్ను. (బ్రా.) 2. అశుభము. ఉదా:—చచ్చుమాట. (బ్రా.)

చెచ్చెడి. దే. వి. చండాలజాతిభేదము. (శ. ర.)

చెచ్చెదు. విశే. చచ్చినది. (ఉ. చచ్చుదుబాకి. శ.ర.)

చెచ్చౌకము = చెచ్చెవుకము. (బ్రా.)

చేటాలు. దే. వి. (క. చటల్) కొట్టుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. "శ...బొమ్మనినను శైక్కున నెత్తు రుట్టిపడ పీడనిరోషావేశమునఁ జటాలునఁ గొట్టెన్." వరాహ. ౨, ఆ. ౧౩౪. నరస. ౯, ఆ. ౧౩౦.

చేటిల్లు = చేటాలు. (క. చటిల్) చఱచుటయం దగు ననుకరణము. "గీ. బాహులెత్తి చటిల్లనఁ బటిత శించి, దేవదేవుఁడు పలుకు...." ఉ.హరి.౬,ఆ.౯౫.

చేటీలు = చటాలు. (కొట్టుటయం దగుననుకరణము.) 'సీ. తవిలి రావణుని సౌదముఁ జటీలునఁ గొట్టి సురల మెప్పించునీయరిది తెగువ." చంద్రా. ౩. ఆ. ౫౬.

చేటులు. దే. వి. శాశము? (చూ. చటులుఁవడు.)

చేటులువడు. ద్వి. అ. క్రి. (చటులు+పడు.) 1. నశించు? 'సీ. ప్రాకారగోపురప్రాసాదమంటప చంద్రశాలలపెంపు చటులువడియె." విష్ణు. సా. ౨, ఆ. ౩౫; 2. మొక్కవోవు. "సీ. సర్వభూతంబుల శాసింపఁ జాలెడు జములావు గిరియంతుఁ జటులువడునె." కాశీ. ౨, ఆ. ౧౦౫.

చేట్ట. యం. దే. వి. 1. ధాన్యము పోసెడిచిన్నగోనె. (శ. ర.); 2. చర్మము. "సీ. రెట్టిప్రావృడు గామ చట్టదువ్వలువతో..." శ్రీరం. మా. ౪, ఆ. ౯౦. ఆం. భా. ద్వి. ౧౩౧; 3. తొడయొక్క వెలుపలిభాగము. "వ...ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచు వివిధకేదారంబులం ద్రెక్కి చట్టలు వగంబడి వెడల లేకుండ..." ఆము. ౪, ఆ. ౩౫. రం. రా. యం. ౪౭౭. పా. ౫. పం; 4. కవచము. "ఉ. చట్టలు చీరియుం దొడలు చక్కలు చేసియుఁ జెండివైచియున్, బొట్టలు చించియుం మెడలు బోరనఁ ద్రుంచియుఁ బోరొనర్పఁగన్." భా. రా. యం. ౧౩౩౩; 5. భుజము. "క. చట్టలు చఱచుచుఁ బలుమఱుఁ జిట్టలు మిడుచుచు దివంబు చేతుల విరియం దట్టుచు..." దశ. ౪, ఆ. ౪౯. ఆం. భా. ద్వి. ౧౩౯; 6. పూఁత. "సీ. పాడుపుగుబ్బలినెల పురుటింటియిడుపునఁ జఱచినగందంపుఁజట్ట లనఁగ." 7. చొక్కా. "సీ. అఱచట్ట తొడిగి మైనడ్డంబు వలిపదుప్పటి వల్లెవాటు వేసి." వైజ. ౨, ఆ. ౪౭. (అఱచట్ట = చిన్నచొక్కా.) విశే. వ్యర్థము. "ద్వి. అంతరంగమున లింగావధానంబు, సంత రింపనిభక్తి చట్టసూ బసవ." ప్రభులిం. ౪, ఆ. ౧౧౭. పా. ౧౦. పం. క్రి. విశే. ద్రు. శీఘ్రముగా. "సీ. పలుకుల కెడ లేదు బాణాసనము గొని చనుదెమ్ము నాతోడఁ జట్ట ననిన." భార. ఆది. ౯, ఆ. ౧౧౯.

చేట్టన. దే. క్రి. విశే. ద్రు. (త. సట్టెనల్.) శీఘ్రముగా. "ఉ. చట్టన నన్నుఁ బాపుము భృశంబుగ నెయ్యది కార్య మిత్తఱిన్." భార. అర. ౫, ఆ. ౨౭౯.

చేట్టపుమెకము. ద్వి. వి. (చట్టము+మెకము.) పునుఁగుపిల్లి. సాం. ని. తిర్య. ౯౨.

చేట్టము. ౯౪. దే. వి. 1. పట్టెలతో చేసినమంచము లోనగువానిభాగము. "సీ. ముత్యాల బవిరి కెంపులచట్టము తదంశుధట్టంబుమాడ్కిఁ గెంటట్టు పఱపు." వసు. ౧, ఆ. ౧౪౪; 2. పునుఁగుపిల్లి దేహములోఁ బరిమళద్రవ్య ముండుతిత్తి. "సీ. పునుఁగుచట్టంబులు బుక్కారజంబులు పొంతమాముళిగఁ బొంతఁ దకలి." హంస. ౧, ఆ. ౯౧. శుక. ౧, ఆ. ౧౫౭; 3. (సం. శాస్త్రమ్.) శాసనము, న్యాయశాస్త్రము. (వా. ఆచట్టము శాసనసభవారు నిర్మించినది.)

చేట్టలుచీరు. ద్వి. స. క్రి. (చట్టలు+చీరు.) వధించు, చంపు. "ఉ. అంగదుఁ డద్దురాత్ముల రయంబున నీడిచికొంచు నింగికిన్, చంగున దాటి నల్వురను జట్టలుచీరి..." రామా. ౭, ఆ. ౨౬౫. సా. ౧, ఆ. ౯౦.

చేట్టలుదూయు = చట్టలుచీరు. "శా. కట్టెల్ గట్టిదాన్ మహోమకర మబ్రహ్మణ్యమై దానను, జట్టల్ దూయకయుండ రమ్ము..." వరాహ. ౬, ఆ. ౨౨.

చేట్టలుద్రుంచు = చట్టలుచీరు. "ఉ. చట్టలుద్రుంతు రావణుని సారసలోచనఁ జూపకుండినన్." మొ. రా. సుం. ౩౬.

చేట్టలువాపు. ద్వి. స. క్రి. (చట్టలు+పాపు.) నాశనముచేయు. "చ...క్రోధకామముల గండడఁగించి పరోపకారముల్, జఱఁబడఁ ద్రోచి వాచవులఁ జట్టలువాపి..." ఉ. హరి. ౪, ఆ. ౯౭.

చేట్టి. దే. వి. (క. త. మ. తు. చట్టి.) 1. నోరు వెడల్పుగా నుండుచిన్నమట్టిపాత్రము. "మ... చట్టి చుయ్యను నా దాఱనికూరగుంపు..." ఆము. ౧, ఆ. ౯౨. ఆం. భా. ద్వి. ౨౪౭; 2. చిన్నగిన్నె; పళ్లెము. (బ్రౌ.)

చెట్టు. ఉభ. దే. వి. **1.** భూమిలో నున్నతాయి. ఆం. భా. ద్వి. ౨౯; **2.** తాయి. "గీ. చెట్టుబొమ్మకు గిలిగింత పెట్టునట్టు,లు..." పార్వ. ౩, ఆ. ౫౭; **3.** పర్వతము. "సీ. చెట్టుకూఁతు నొకర్తు సర్వజ్ఞుఁ డగుమహేశ్వరునితోఁ దాల్చినవాకురచన." చంద్రి. ౬, ఆ. ౧౦౮; **4.** (నలఁగఁగొట్టు) కల్వను? "సీ. చెట్టుపై పోఁకలై చనిరి గం... ర్వలు..." హరి. ౫,ఆ. ౩౭; **5.** (సం. శాత్రవి) శిష్యుఁడు. "గీ. చెట్టు పఠియింప బోధించు సద్గురుఁడు." కాశీ. ౬, ఆ. ౭౪. య. ౩, ఆ. ౧౧౩ విణ. మూర్ఖము. (చూ. చెట్టుతనము.)

చెట్టుతనము. ద్వి. వి. (చెట్టు+తనము.) మితిమీఱిన మూర్ఖత్వము. (బ్రౌ.)

చెట్టుపు. దే. వి. తెక్కు, కత్తము. "ఊ...మాని సముత్థితుఁ డయ్యె షేనిపై, బెట్టినపుట్ట కెట్టువిస చట్రలువాఱ శ్రవశ్యకుంతకుల్, చెట్టుప లెత్తి మూఁపటికి సాఁదలాప .." పాండు. ౫, ఆ. ౨౪౯. ఆం. భా. ద్వి. ౯౯.

చెట్టుపడు. ద్వి. అ. క్రి. (చెట్టు+పడు.) **1.** క్షీణించు, నశించు. వ్యవ:—వాని తెలివి చెట్టుపడినది; **2.** (తాలిమియడఁగుటచే) విసువఁబడు. వ్యవ:—చెట్టుపడ్డపుయ్యి. (బ్రౌ.)

చెట్టుమోపు. దే. స. క్రి. (చెట్టు+మోపు.) శిక్షగా తాలిని మోపఁజేయు. "గీ. పరల సొమ్మిచ్చుటకు బహుమధనపడిన, యజ్ఞుని రోసి పూఁట కాఁ పైఁపహరిని, జట్టు మోపి రనంగ..." దశా. ౨, ఆ. ౧౯౦.

చెట్టువ = చెట్టువము. ఆం. భా. ద్వి. ౨౪౪.

చెట్టువము. దే. వి. (త. చెట్టువం.) గిఁటె, త్రెడ్డు. "సీ. చెట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము నొకఁ దగిలించి..." భార. విరా. ౧, ఆ. ౨౧౧. కాశీ. ౭, ఆ. ౧౪౧.

చెట్రాయి. దే. వి. బౌ. (చెట్టు+తాయి.) చాఁపరాయి. "సీ. వేసవి గనగన వేఁగుచెట్రాలిపై నగ్గి సల్లడ నుండ నర్కుఁ జూచి." నిర్వ. ౩, ఆ. ౬౩. ఉ. హరి. ౩, ఆ. ౩౦.

చెట్రోలు. దే. వి. బౌ. (చెట్టు+ఱోలు.) తాలి ఱోలు. "దండకము...నిప్పట్టి చెట్రోలితోఁ గట్టినన్..." పారి. ౩, ఆ. ౩౮.

చెడికి. వై. వి. (సం. ఛడికీ) చలికి. (శ. ర.)

చెడ్డు. దే. విణ. అల్పము, నీచము. (బ్రౌ.)

చెదికిలఁబడు. ద్వి. అ. క్రి. (చదికిలన్+పడు) కూలఁబడు. "క. మెడఁ బట్టుకొని తనూలత జడియం గుదిరించి నేలఁ జదికిలఁబడి..." శుక. ౧, ఆ. ౪౧౧. కాశీ. ౨, ఆ. ౧౪౧.

చెదికిలు. దే. అ. క్రి. పిఱ్ఱలు నేల నాను. (చూ. చదికిలఁబడు.)

చెత్వారము. వై. వి. (సం. చత్వారింశత్.) నలువదియేండ్లకు వచ్చుదృష్టిమాంద్యము. "క. కండ్లకుఁ జత్వార మొదవెఁ గాయము ముదిసెన్." చంద్ర. వి. ౨, ఆ. ౨౧.

చెదర. వై. వి. (సం. చతురశ్రమ్.) **1.** సమచతురశ్రమై యుండుట కుపయోగించుచాఁప. (వా); **2.** చిన్నవిస్తరాకు. (శ. ర.)

చెదరంగము. వై. వి. (సం. చతురఙ్గమ్. క. చదరంగ) ఒకవిధమగుఆట. "గీ. మంచివిసగటుపై నిడె మంత్రి కావ,లున్న దీచదరంగ మిట్టుండ నిమ్ము." శుక. ౪, ఆ. ౧౦౮. ఆం. భా. ద్వి. ౩౦౫.

చెదరము. వై. విణ. (సం. చతురశ్రమ్. క. చదర.) **1.** చతురశ్రము. (బ్రౌ.); **2.** ఎత్తుపల్లములు లేనిది, చదునైనది. "సీ. కల్లోలములు లేని కమలాకరముఁ బోలెఁ జదరమై యున్న పాషాణమందు." భాగ. ౫, స్కం. ౧౫౫; **3.** సమానమైనది. "గీ. సారె మోపును బోరలును జదరమైన, నెఱిఁగి లాగైనఁ గైకొని యుంచుకంత, పొసఁగకుండిన రుక్మిణి బొంకు..." ౩, ఆ. ౧౨౮; **4.** నలువు, సుభము. "ద్వి. చదరంబుగా దిద్దు జాడఁ గైకొనక." ద్వి. హరిశ్చ. పూ. ౧౬౦౦. వం. పాండు. ౫, ఆ. ౨౧౪. వి. బ. ఇంటికరుఁ జులమీఁదివిరిగుపుపట్టెలు. (శ. ర.)

చెదలము. దే. వి. **1.** సైన్యము. "సీ. వాయుసూనుని కృతవర్మాదియోధులఁ జదలంబు వెంటనే కదలఁ బనిచి." జై. ౩, ఆ. ౮౧. ఆం. భా. ద్వి. ౧౯౪; **2.** దండువిడియుచోటు, శిబిరము. "గీ. సకల జనులకుఁ బయనంబుఁ జాటఁ బంచి,జలముఁ జదలంబుఁ గదలింపఁ బంచిపెట్టి." జై. ౨, ఆ. ౧౦౬.

చెదలు. దే. వి. **1.** ఆకాశము, మిన్ను. "సీ...చదలఁ దిరుగు,నయ్యంత్రమేసి..." భార. ఆది. ౮, ఆ.

౧౦. ఆం. భా. ప్ర. ౫౯; 2. స్వర్గము. (చూ. చదలుమ్రాను.)

చేదలుకాఁపు. దే. వి. (చదలు+కాఁపు) దివౌకసుఁడు, వేల్పు. (శ. ర.)

చేదలుకుఱ్ఱఁడు. దే. వి. (చదలు+కుఱ్ఱఁడు.) గాలి. "చ...చదలుకుఱ్ఱనిఁ గొట్టి..." అచ్చ. యు. ౪౯౬.

చేదలుకెంపు. దే. వి. (చదలు+కెంపు.) సూర్యుఁడు, ద్యుమణి. ([illegible])

చేదలుకోడి. దే. వి. (చదలు+కోడి.) పక్షివిశేషము. "ఆ. చదలుకోడి గువ్వ పదపుటోఁకలపేఁ, తూరి యైనపత్తు లకేఁడు దీర్పు." పాంచా. 3, ఆ. ౧౩.

చేదలుచూలి. దే. వి. (చదలు+చూలి.) గాలి. "ఆ. జమునికరణిఁ బోఁగెఁ జదలుచూలి." అచ్చ. కిష్కిం. ౧౦౦.

చేదలుతొడుకు. దే. వి. (చదలు+తొడుకు.)-స్వర్గమందుండు ఆవు - కామధేనువు. "సీ...జేజేగడ్డ చదలుతొడుకు తెల్లమొదవనంగ సురగవి పేర్లగు..." సాం. ని. దేవ. ౧౯.

చేదలుమానికము. ద్వి. వి. (చేదలు+మానికము.) ద్యుమణి, సూర్యుఁడు. "ఆ. చదలుమానికంబు జగముకన్ను." నీలా. 3, ఆ. ౪౫. ఆం. నా. దేవ. ౧౬.

చేదలుమ్రాను. దే. వి. (చదలు+మ్రాను.) కల్పవృక్షము, వేల్పుమ్రాను. "సీ. చదలుమ్రాకుల నీడఁ జలివెల్లురానెడికలఁ ద్రోదిద్రాక్షపందిరుల క్రింద." పె. శకుం. ౨, ఆ. ౧౮3. వసు. ౨, ఆ. ౪.

చేదలువాఁక. దే. వి. (చదలు+వాఁక.) ఆకాశనది-గంగానది. "సీ...జడదారితొవయేఱు చదలువాఁక." సాం. ని. దేవ. ౧౬.

చేదలేఱు. దే. వి. ఔ. (చదల+ఏఱు.) మందాకిని. "సీ. కపికీశ...అంప్రచదలేటి సుర...జలకేళి సవరించు...వెలసెంగె." స్కా. ౧, ఆ. ౧౧. శైవ. ౨, ఆ. ౪౯.

చేదలేటిపట్టి. దే. వి. (చదలేఱు+పట్టి.) గంగాసుతుఁడు, భీష్ముఁడు. "సీ. పలుకఁ గల్గిన బాలుఁ బనులు నీ...చును వెట్టిమైఁ జదలేటిపట్టినైన." య. ౧, ఆ. ౭౫.

చేదికిలఁబడు = చతికిలఁబడు. 1. (కూలఁబడు) "చ. అవి నదు సొంద మాడుటయు ...తఁడు మూర్ఛ మునింగి తేరపైఁ, జదికిలఁబడ్డ..." భార. కర్ణ. ౨, ఆ. ౨౩౭. పె. శకుం. 3, ఆ. ౭౦; 2. (కదలకుండు) "గీ. పాయకోకచోటఁ జదికిలఁబడఁగ నుండ, నైన ఫలమేమి యటుగినోదార్థమరిగి." భీమ. ౫, ఆ. ౧౫.

చేదికిలు = చతికిలు. (చూ. చదికిలఁబడు.)

చేదియు. దే. వి. నలఁగుడు. (శ. ర.) "ద్వి...మొట్టిఁ జదిపొరల గజములు చదియఁగా..." ద్వి. మార్క. పూ. ౧౯౭౬. పం.

చేదియఁబడు. ద్వి. అ. క్రి. (చదియన్+పడు. స్వార్థమున) "క. మిన్నునఁ జుంచి ధరంబునఁ, బన్నగ...లు చదియఁబడ ...వైన తేరఁ... యొనర్చెన్." పారి. ౨, ఆ. ౭౨.

చేదియించు. దే. స. క్రి. (చదియు ధా. ప్రే.) నశింపఁజేయు. "మ. చదియించెన్ సకలార్థి దైన్యము... రాజకల్పభూజాతమై." నా. పంచ. ౧, ఆ. ౨౫.

చేదియు. దే. అ. క్రి. 1. నలఁగు. "సీ...పదఘట్టనంబులఁ జదిసి రాలునుఱుము గాఁగ..." భార. ఆది. ౬, ఆ. ౧౬౦. నృసిం. ౪, ఆ. ౫౯. 2. చచ్చు "మ...బల్ పిడుగు...దాఁకుడుం గుఱ్ఱముల్, సదిసెన్ సారథి మ్రగ్గెఁ దేరు వ్రాలెన్..." భార. ద్రో. ౪, ఆ. ౧౫౦; 3. నశించు. (చూ. చదియించు.)

చేదిరిక. వై. వి. చదర. "గీ...కటాసనము చదిరిక యనఁగఁ జర్మక మనఁ దనరు." ఆం. భా. ద్వి. ౧౬౫.

చేదివించు. దే. స. క్రి. (చదువు. ధా. ప్రే.) 1. చదువఁజేయు. "సీ. వేదాధ్యయనవిద్య వేవిధంబుల నిచి చదివింపఁ బవనంబు చదువఁ బోలు." పాంచా. 3, ఆ. 3; 2. (కట్నకానుకలు) పురోహితునిచే చెప్పించు. "మ...కాటికాపేటికల్ సరసా...జదివించి రాష్ట్రలగురాజన్యుల్ గురుల్ మీఱఁగన్." వేం. పంచ. ౪, ఆ. ౩౭౦; 3. పలికించు. "సీ. కనకపంజరశారికలకుఁ జక్కర

పెట్టి చదివింప శిలాశో నకితు లిపుడు." పారి. ౧, ఆ. ౧౦౬.

చదివింపు. దే. వి. (చదివించు ధా.) కట్నాదులు పురోహితాదులచేఁ జదివించుట. (బ్రౌ. వా.)

చదుకము. వై. వి. (సం. చతుష్కమ్. ప్రా. త. చదుక్కం.) చతుష్పథము, నాలుగువీథులు కలియుచోటు. "గీ. ఏను జర యను రాక్షసి నిప్పుర మునఁ, జదుకమున బాయకుందును సంతతంబు." భార. సభా. ౧, ఆ. ౧౯౦.

చదుకు. దే. వి. 1. బురద. "గీ...ఊష్మలి యవ్వజా చదుకు నా నొప్పఁ బంక,ము..." ఆం. భా. ప్ర. ౧౯౯; 2. జారుట. (చూ. చదుకుపడు.)

చదుకుపడు. ద్వ. అ. క్రి. (చదుకు+పడు.) 1. చలి కిలఁబడు. ఆం. భా. తృ. ౯౮; 2. ఊఁబిపోవు "ఆ. మురిసి మురిసి రావె మునిశ్రేష్ఠ నమ్ముక్క, చదుకుపడిరొః దీము జాలుకొనిరొ." వరాహ. ౯, ఆ. ౭౮.

చదుకెక్కు = చదుకుపడు. (చదుకు+ఎక్కు.) రాలు. "ఉ. కెంజిగు రాకుడాలు దులకించు ధాతుపటంబు చాయఁ జేయుం జదుకుక్కుపుష్పాదుల నంటిన తేటులు..." పాండు. ౪, ఆ. ౧౪.

చదును. దే. వి. సమమగుభూమి. "ఆ. చదును నా నమోర్వి సాంబమూర్తి." ఆం. భా. ద్వి. ౪. విణ. సమము, పల్లము మెరక లేనిది. "ద్వి. సన్నపునునుఁబూత చదునుగాఁ బూసి." రం. రా. ఉ. ౭౦. శా. ౧౨. పం. విక్ర. ౨, ఆ. ౨౧.

చదువు. దే. స. క్రి. (చదియు. ధా. ప్రే.) 1 చదియఁజేయు, నలఁగఁగొట్టు. "క. పదకుల రథ వాహంబులఁ, జదుపుచు..." భార. ద్రో. ౧, ఆ. ౩౨౮. హరి. ఉ. ౧, ఆ. ౧౩౫; 2. చంపు, నశింపఁజేయు. "క. కదనమునందును క్రోధునిఁ, జదిపినఁ బము దామె మిగుల సదమదమై కూలఁ దుసు..." ప్రబోధ. ౪, ఆ. ౨౭. ఆం. భా. తృ. ౧౨౩; 3. పోఁగొట్టుకొను. "సీ. పుండరీకాక్ష నీపుణ్యతీర్థములకుఁ జరికాని కలుషంబు చదుపరాదు." వరాహ. ౭, ఆ. ౩౮; 4. తాడించు, కొట్టు. "అ...ధనువు మ్రోయించుచు, నంభగములు పటుప సవ్వళుందు, వానినెల్ల వింట పడిఁ బొరఁ జదుపుచు..." భా. రా. అర. ౧, ఆ. ౨౨౮. ఆం. భా. తృ. ౧౩౨.

చదుము. దే. స. క్రి. 1. నలఁగఁగొట్టు. "ద్వి. పొదివి యూయంబితో భువనంబు లెల్లఁ, జదిమి ప్రింగెద..." రం. రా అర. ౧౪౯. పా. ౧౯. పం. అచ్చ. యం. ౨౩౪; 2. గ్రుద్దు. "ద్వి. కాకోదరంబుల ఘనమ్మగాపడలఁ, జదిమఁ ద్రొక్కియు నేలఁ జమరియుం ముష్టిఁ, జదిమియుం..." ద్వి. హరిశ్చ. భూ. ౧౯౭౬. పా. వి. సమానమైనస్థలము. "గీ. ఇందు విహరించువిద్యాధరేందుముఖుల, చరణ లాక్షాంకములతోడిచదుము లమరు." వరాహ. ౧౦, ఆ. ౫౦. "రగడ. ఒనరఁగ నస్గిరిచదుమున నొకసభ యోజన శతవిస్తృతిమై వెలుఁగును." వరాహ. ౧౦, ఆ. ౧౪౪.

చదుర. వై. విణ. (సం. చతురా.) చాతుర్యము గల స్త్రీ. "గీ. పేరు కలభాషిణివిగత బిసుదుచదుర, వగుదు..." కళా. ౧, ఆ. ౭౭.

చదురడుచు. ద్వ. అ. క్రి. (చదురు+అడుచు.) పరిహాసమాడు. "క. చదురడిచిన మనసుపొందు చక్కంబడునే." భార. ఉద్యో. ౧, ఆ. ౩౧౨.

చదురము. వై. వి. (సం. చతురమ్.) 1. శక్యము, సాధ్యము. "గీ. రుద్రజాలిమహిమంబుఁ గొని యాడఁ జదుర మగునె" సాంబో. ౧, ఆ. ౧౫౩; 2. నేర్పరితనము. (చూ. చదురురాలు.)

చదురాలు. ద్వ. వి. (చదురు+ఆలు.) చాతుర్యము గలస్త్రీ. "చ. తనముఖ మంబుజాత మని దండడి మూవునళివ్రజాబుతోఁ, బెనఁగువిదగ్ధప్రోల నొక బేలుసతిం గని యోలఁ బెట్టి పిల్చిన నది దన్నుఁ బట్టు నని చేరినఁ దేఁటుల దాని మూవికొం,డను చును గ్రుంకిపోయి చదురా లయి నవ్వుచు లేచె నొక్కెడన్." కు. సం. ౯, ఆ. ౮౮. ద్వా. ౮, ఆ. ౧౬౬.

చదురు. వై. వి. (సం. సదః.) 1. సభ. "సీ. స్వర్గాధిపతి వచ్చి చదురునఁ గూర్చుండ నాతఁ డే యూరివాఁ డనెడివాఁడు." పార్వ. ౫, ఆ. ౧౧౩. విక్ర. ౨. ఆ. ౪౪; 2. సింహాసనము, గద్దె. "క. మృగయావిహారలంపటుఁ,డగుచు నపుడె చదుర డిగ్గి యతిరయమున...నంతఃపురికిఁ జనిన..." రసిక. ౧, ఆ. ౫౮; 3. పెండ్లిండ్లలో జరిగించు

ఆటకచ్చేరి. (శ. ర.): 4. (సం. చతురమ్ శ. చదురు.) చాతుర్యము, నేర్పు. "క. మది సుఖముఁ గోరి దుఃఖం,బొదవం గలకార్యములకు నుత్సాహముగే, యుందురొప్పనితృణ్ణంబడి,చను శేమియుం లేనియట్టిజను లాతురులై." భార. ఉద్యో. ౧, ఆ. ౩౦౭. నిర్వ. ౧, ఆ. ౭; 5. చతురోక్తి, చాతుర్యముగలమాట. "చ. చదురుల్ వల్కుచుం గూర్మి నిట్టనిరి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౭౨. ఆం. భా. ప్ర. ౧౧౮; 6 విధము, రీతి. "ద్వి. పాదలు రేవారికొప్పన నొప్పవిరుల, చదురున మింట నక్షత్రము లెసఁగె." ఆ. మ. క ౩, ఆ. ౧౪౪. పా. 3. పుం. విశే. నిపుణము. "సీ. చదురైనమాటలు సడిసన్నఁ జెప్పి..." దశ. ౯, ఆ. ౧౪.

చదురుఁడు. వై. విశే. (స. చతురః. ప్రా. చదురో) చతురుఁడు, నేర్పరి. "క. చదురుఁడు బ్రహ్మ వ్రాసిన, నుదుటివ్రాఁతలు దుడుపఁ గలవె నూల్కొను నెరవుల్." హరి. ఉ. ౯, ఆ. ౭౯. "ద్వి. చదురుండు గాఁ డని మది నొల్లవేని..." పండితా. పురా. ౧౧౩, పా.

చదురుఁదనము. వై. వి. (సం. చతురత్వమ్ - చదురు+తనము.) నేర్పరితనము. "క. చదురుందనమున మును ద్రామదిఁ గనినయంతాయ యీనమయ మనఁ దగఁ జేయుఁదు..." దశ. ౬, ఆ. ౮౧.

చదురుమెసన. ద్వ. వి. (చదురు+మెసన) పల్లబంధ విశేషము, ప్రబంధ. ౭౮.

చదురులాఁడు. ద్వ. వి. (చదురులు+ఆఁడు) నేర్పరి. "సీ...జగములఁ గలిగించు చదురులాఁడు." భోజనుతా. ౧, ఆ. ౨౯.

చదువయ్య. ద్వ. వి. (చదువు+అయ్య) పండితుఁడు. "క. ఇది యెఱుఁగరు చదువయ్యలు, మది ముక్తికి నాస్పదంబు మహిలో వేమా." వేమన. ౩, ఆ. ౧౯౭.

చదువరి. దే. విశే. (చదువు+అరి.) 1. పండితుఁడు. "గీ. చదువరులు గాని విప్రులు చాల మూర్ఖులకట..." హరి. ఉ. ౧౦, ఆ. ౨౪౪. ఆం. భా. ద్వి. ౧౭౦; 2. వంది; స్తోత్రపాఠకుఁడు. సాం. ని. మాన. ౬.

చదువు. దే. స. క్రి. 1 పఠించు. "గీ...శివా,గము వలు చదువుచును..." కు. సం. ౭, ఆ. 3. "ద్వి. అనఘ రామాయణం బర్థితోఁ జదువ." రం. రా. బాల. ౮ పా. ౨౭ పం; 2. పలుకు. "సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు చదివెడి శుకములచదువుఁ దవిలి." భార. ఆది. ౪, ఆ. ౨౩. వి. 1. విద్య. "చ. గురువులు చెప్పరే చదువు కొంత వివేకము మిమ్ముఁ జేరదే." ఉ. హరి. ౪, ఆ. ౫౫. ఆం. భా. ప్ర. ౧౧౧; 2. బ్రహ్మయజ్ఞము. ఆం. భా. ద్వి. ౧౭౧; 3. వేదము. "క. మచ్చెమయి సోమకుఁడు మును, ముచ్చిలి వేదములు గొనుచు మున్నీరు సొరం, జొచ్చి పరిమార్చి మగుడఁగ, నచ్చదువులు దెచ్చి నాఁడ వచ్యుత లీలన్." భా. రా. యు. ౬౧౫. రా. ౭, ఆ. ౧౩; 4. పలుకు. భార. ఆది. ౪, ఆ. ౨౩.

చదువఁబెట్టు. దే. స. క్రి. (చదువన్+పెట్టు) 1. చదివించు. "క...చదువఁబెట్టఁగ, నున్నమతియుఁ బోయె నను టవశ్యో నిజమయ్యెన్." విజ. ౩,ఆ. ౧౦; 2. పోఁగొట్టు. "సీ. ఆత్తవా రిచ్చినయుపరంజిగంటీలు నంశయింపక వేగఁ జదువఁబెట్టె." నిరం. ౨, ఆ. ౧౧౭. కళా. ౬, ఆ. ౬౬.

చదువుతొయ్యలి. దే. వి. (చదువు+తొయ్యలి) సరస్వతి. "సీ. కొండరాఁ ల్లుని మేనఁ గొమరారు సిరి మించి చదువుతొయ్యలి మేనిచాయఁ దొరఁడి." చిత్ర భా. ౯, ఆ. ౧౦.

చదువుపిట్ట. దే. వి. (చదువు+పిట్ట) శుకము, చిలుక. వేంక. తిర్య. ౧౦౧.

చదువులజవరాలు. ద్వ. వి. (చదువులు+జవరాలు) సరస్వతి. "వ...అచ్చదువులజవరాలు వలె యెదుట క్రుదించి..." ఉ. రా. ౨, ఆ. ౨౦౨.

చదువులదేవర. దే. వి. (చదువులు+దేవర) బ్రహ్మదేవుఁడు.

చదువులపులుఁగు. దే. వి. (చదువులు+పులుఁగు) చిలుక. ఆం. సం. తిర్య. ౧౪.

చదువులముదుకఁడు. దే. వి. (చదువులు+ముదుకఁడు) బ్రహ్మ. "క. చదువులముదుకఁడు మొదలం, బొదలించిన బలిమివలన..." అచ్చ. బాల. ౬౭.

మేజయుఁ, తను జనపతి సేయుఁగర్వతూగనిమి త్తం,బునఁ బొమలు సంచన్నను, సనిసెమమటి పొంగగమింతు శాపం బిచ్చెన్." భార ఆది. ౨, ఆ. ౩౭. భార. ద్రో. ౨, ఆ. ౨౦౩. వై. వి. (సం. స్తనః) చన్ను. "సీ. నును మహీధరవు చను వక్షమై కుడ్చి..." కు. సం. ౭. ఆ. ౧౩౧. స్వా. ౧, ఆ. ౪.

చేనుఁగప్పు. ద్వా. వి. (చను+కప్పు) పయ్యెద. వైఁట. "గీ. తొలఁగిపోయిన చనుఁగప్పు మలినపటము." హరిశ్చ. ౫, ఆ. ౭౧. స్వా. ౩, ఆ. ౩౧.

చేనుఁగవ. ద్వా. వి. (చను+కవ) కుచద్వయము. "ఉ. బంగరుబొంగరాల పరిపాటిచనుంగవ..." విజ. ౧, ఆ. ౧౫౦. శ్రీర్తి. ౨, ఆ. ౯.

చనుఁబాల. ద్వా. వి. (చను+పాల) ఓషధివిశేషము. (శ. ర)

చేనుఁబాలు. ద్వా. వి. (చను+పాలు.) మానుషీ స్తన్యము. "ఉ. పాలడఁపోవఁ దోసి చనుఁబాలు సెయిం గిలకొట్టి..." సా. ౧, ఆ. ౪౫.

చేనుకట్టు. ద్వా. వి. (చను+కట్టు.) 1. స్తనప్రదేశము. "క. పట్టినమాత్రనె దేవకి,పట్టి కరాబ్జము లలాట పట్టికచెమటల్,వెట్టె గపురొప్పిడిసెం జన్న,క ట్టొక యిసుమంత వీడెఁ గట్టుంగొంగున్." విజ. ౨, ఆ. ౧౭౮. కు. సం. ౮; ఆ. ౧౨; 2. అవిక. "ఉ... చనుకట్టులో బిగువ్రజక్కవగుబ్బలయొంబ్బు దెల్ప..." ఉ. రా. ౬, ఆ ౧౩౯.

చేనుగుబ్బ. ద్వా. వి. (చను+గుబ్బ.) గుబ్బలవంటిచన్ను. "చ. వలెగఁ జనుగుబ్బలకె గస్తురిజలుఁగున్నసిగ చలువపయ్యెంటపయిన్." దశా. ౩, ఆ. ౭౫.

చేనుగొయ్య. ద్వా. వి. (చను+గొయ్య.) బాడిచట్టము నకు రెండువైపుల నాటెడుగొయ్యలలో నొకటి. "సీ. పంకరుహాంబులు బండికన్నులు...జాదులు చనుగొయ్యలు..." కు. సం. ౪, ఆ. ౯౩. వీర. ౨, ఆ. ౯౪.

చేనుచెంచు. దే. అ. క్రి. (చను+చెంచు.) స్వార్థమున. 1. వచ్చు. "ఉ...ధర్మసందేహనివృత్తి పొంటెఁ జనుదెంచెఁ బరాశరసూనుఁడు..." భార. ఆది. ౭, ఆ. ౨౪౪; 2. పోవు. "వ... హాస్తిపురంబు నిరర్గళప్రచారంబు...చనుదెంచి..." వై. ౨, ఆ. ౨ (దీనికి చనుదేరక, చను దేక్, చనుదేక, మున్నగురూపాంతరము లున్నవి.)

చేనుదోయి. వై. వి. (చను+దోయి) కుచద్వయము. "సీ. కోమలిచనుదోయి కొదమజక్కవదోయి..." విక్ర. ౧, ఆ. ౧౧౯. ఆము. ౧, ఆ. ౫౬.

చేనుప. దే. వి. 1 సార్థము, వర్తకసంఘము. "వ... ముందట నొక్కచనుపం గని..." భార. అర. ౨, ఆ. ౧౦౧; 2. మార్గము. ఆం. భా. ద్వి. ౯.

చేనుపకము. వై. వి. (సం. చంపకః.) సంపెంగ. "ఆ. చనుపకములతావి గొనక రోజాలుండి..." సాంబో. ౨, ఆ. ౧౦౩. కు. సం. ౪. ఆ. ౯౩.

చేనుమఱ. ద్వా. వి. (చను+మఱక.) చనుచుట్టు నుండు నల్లనిచోటు "చ. చనుమఱలందు పక్షుతఁ జత్తుకపాంతములందు జెప్పలన్." హరి. ౧, ఆ. ౬. హరి. ౪, ఆ. ౨౫౦; 2. బొమ్మ. "గీ. చిక్కువడఁజేసి చనుమఱ యొక్కదొడ్డ నారసంబున బిట్టేసు..." భార. ద్రో. ౪, ఆ. ౧౫౫. ఆము. ౬, ఆ. ౯౦.

చేనుమఱువు. ద్వా. వి. (చను+మఱువు.) అవిక. (చూ. చన్మఱువు.)

చేనుమానము. దే. వి. స్నేహము. "ఉ...చనుమా చనుమానముతోడ నావ్రభున్." సా. ౨, ఆ. ౬౩. దశా. ౧, ఆ. ౧౫౭; 2. అధికారము. "గీ. అంతచనుమానమునకు రా నింతెకాని." నిరం. ౨, ఆ. ౫౫.

చేనుముక్కు. ద్వా. వి. (చను+ముక్కు.) చూచుకము. "సీ. ఇంకఁ జూడఁ గప్పితి నిదె యంచుఁ జను ముక్కునతఁడు పాణుల నంట నలఁగి యలఁగి." కళా. ౭, ఆ. ౧౬౫. పా. శకుం. ౩, ఆ. ౫౭.

చేనుమొన = చనుముక్కు. "క...చనుమొనలు నల్ల వడియెన్..." స్వా. ౩, ఆ. ౧౧౯. ఆం. భా. ద్వి. ౧౩౭.

చేనుమోము. ద్వా. వి. (చను+మోము.) చనుముక్కు. (శ. ర.)

చేనుమోర = చనుమోము, చనుమర. (బ్రౌ.)

చేనువాఁడు. దే. వి. (చను+వాఁడు.) చెల్లుబడి గల వాఁడు. "చ. కడుఁ జనువాఁడునై ప్రధాను, కారుఁడు పక్షుఁడు నైనమంత్రి..." భార. సభా. ౧, ఆ. ౩౧.

చేనువు = చనవు. 1. (పరిచయము.) "చ...పిల్చి న,చ్చుచువునకే ధనాది గొని..." ఆము. ౪, ఆ. ౨౬౫; 2. (అధికారము.) "క. చనువు ననువు లేదు దీనిసమ్మతి నడపన్." భార. ఉద్యో. ౩, ఆ. ౩౨౮; 3. (ప్రార్థన.) "చ...ఇంతపట్టు నా, చనువునఁ బోవనిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే." భార. భీష్మ. ౩, ఆ. ౧౭౧; 4. (గొప్ప తనము.) "సీ. ముకురువేల్పులు మెచ్చు భృగువున కర్మిలిమనుమఁ డన్నది నీకుఁ జనువుగాదె." య. ౩, ఆ. ౧౫౩.

చేన్కట్టు = చనుకట్టు. "శా. కంగుల్ తీరినపైత్రిణీ అవిక చన్కట్టంటి రాణింపఁగా." విజ. ౨, ఆ ౧౫౮.

చేన్గవ = చనుఁగవ. "లయగ్రాహి...మణిహారములు చన్గవలఁ దారసిల...' ఉ. రా. ౨, ఆ. ౧౯౫.

చేన్దొంచు = చనుదొంచు. "ఆ. ఇచ్చటికి నలాపి యే మిటికి కెపుడు స,న్దొంచె..." భార అశ్వ. ౪, ఆ. ౦౫.

చేన్దోయి = చనదోయి. "మ...చన్దోయి లేఁగొను ప్రైదయతప్పన్..." ఆము. ౧, ఆ. ౫౬.

చేన్నీళ్లు. దే. వి. బ. (చల్ల+నీళ్లు.) శీతోదకము. (శ.ర.)

చేన్ను = చను. వై. వి. ఔ. (సం. స్తనము.) "ఉ. చంటు విషంబు మెత్తుకొని చంపుదు నర్భకు నంచు వచ్చి..." హరి. ఉ. ౪, ఆ. ౨౩౬; 2. స్తన్యము. పాలు. "గీ. కడుపు నిండఁగఁ జన్నిచ్చి..." హరి. పూ. ౫, ఆ. ౧౫౬. హంస. ౪, ఆ. ౧౫౦; 3. మొగలియూడ. "వ...ముదిరిన మొగలిచెట్టు నుంబోలె నేల మోవఁ జన్నులు దిగి..." కవిక ౪, ఆ; ౧౧౩; 4. తాటిచన్ను. (శ. ర.); 5. మేఁకమెడలో వ్రేలాడుచర్మవిశేషము. "మ...విఁసద్భాలత్వభాక్లేశదు,ష్టవిధుల్ మానుచె చూడ మేఁకమెడచంటల్ దల్లి కారుణ్యదృ,ష్టిపశేషంబున నిచ్చుచంటబలె..." కాళ. శ. ౪౪.

చేన్నుఁగప్పు = చనుఁగప్పు. ద్వి. వి. (చన్ను+కప్పు.) పైఁట. "పంచ. నరుల్ పెనంగొనంగ జిల్గుఁజన్నుఁగప్పుజాఱఁగా." య. ౪, ఆ. ౧౯.

చేన్నుఁగవ = చనుఁగవ. (బ్రా. శ. ర.)

చేన్నుఁబాలు = చనుబాలు. "ఉ...శ్రోతన యవారణ నెత్తికొనంగఁ జనుఁబాల్ గొంటయు..." హరి. ఉ. ౪, ఆ. ౨౩౩.

చేన్ప = చనుప. "సీ. ఇచ్చన్పతోఁ జనియుష్వన క్లేశంబుఁ దలఁగుడు నని బుద్ధిఁ దలఁచియుండు." భార. ఆర. ౨, ఆ. ౧౧౩.

చేన్పకము = చనుపకము. "చ ..చారునాసికన్, సొగసులచన్పకంబు లని స్రుక్కుచు మూర్కొన లేవు భీతి చేన్." కాళిందీ. ౧, ఆ. ౭౦.

చేన్మఱ = చనుమఱ. (వక్షము.) "ద్వి. మహితాస్త్ర మొకటి చన్మఱ గాఁడ నేయు." రం. రా. బాల. ౨౭. పా. ౨౨. పం.

చన్మఱువు = చనుమఱువు. "చ...అచ్చెలి వేకువ మేలుకాంచి మ,జ్జనవిధి దీర్చి సొమ్ములిడి చన్మఱువుం దలకొండె...మెఱయ..." వేం. పంచ. ౧, ఆ. ౧౧౧.

చేన్ముక్కు = చనుముక్కు. "క. జక్కవలముక్కు తుదలుం, జిక్కనయుత్పలదళంబు చిదురలగతిఁ జ,న్ముక్కుల నలు పెక్కెను." సుద. ౨, ఆ. ౯౩.

చేన్మొన = చనుమొన. "మ...చ,న్మొనలక్ నీలిమ యావరించె..." ఉ. రా. ౧, ఆ. ౧౭౧.

చేపచేపగా. దే. క్రి. విశ. ద్రు. వ్యర్థముగా. "ద్వి. సుఖహీనసంసారసుఖముల మైన,కాయంబు చపచపగా విడనాడి." నవ. ౧, ఆ. ౬౭. పా. ౨. పం.

చేపచేపన. దే. విశ. వ్యర్థము. "చ.. పలా,శిపతుల ముక్కులుం జెవులుఁ జెక్కఁగ వచ్చియుండఁగాఁ, జపజప నైనతద్వ్యభిచారవిశేషముతోఁ గనత్తుఁ డున్." కళ. ౫, ఆ. ౧౬౨.

చేప్టు = చప్పుడు. (శ. ర.)

చేప్పు. దే. వి. (క. చప్పె. త. చప్పై.) 1. ముద్ర. ఆం. భా. ద్వి. ౨౨౬; 2. రథమునకు సరియైన త్రోవకుఁ ద్రిప్పుటకై చక్రముల క్రిందఁ బెట్టెడి కొయ్యముక్క. (వా. చీల, మేకు. అని బ్రా.) విశ. 1. రసహీనము. నీమాట చప్పగా నున్నది; 2. ఉప్పులేనిది, ఉప్పుచాలనిది. వ్యావ:—కూర చప్పగానున్నది. క్రి. విశ. ద్రు. రసహీనముగా. "సీ. శిఖిహావిర్భాగ మిచ్చిన మెసంగుచుఁ జప్ప నున్నది యనుచుఁ బై నుమియవచ్చు." దశా. ౪, ఆ. ౧౧౯.

చేప్పుఁదనము. వై. వి. (సం. చర్పటః. క. చప్పటె.) చపేటము, "ఉ. చప్పటతాళముల్ మొఱయ

నంస్తుతిపూర్వము గాఁగ నాడుచున్." భీమ. ౪, ఆ. ౧౫౭. ఆం. భా. ద్వి, ౧౪౦. బ. ప్రేళ్ల చాఁచినఅఱచేతులు కలియునట్లు కొట్టుదెబ్బలు. "సీ. తొగలమొగ్గల పైవ దూర మేఁగమిఁ బెట్టు చప్పట్లఁ జవ్వనులు జతలుఁ గదల." ఆము. ౪, ఆ. ౧౬౩. విణ. అణఁగినది. ఉదా:—చప్పట ముక్కు.

చేప్పటకొట్టు = చప్పటలిడు. (వా.)

చేప్పటలగు. ద్వ. అ. క్రి. (చప్పటలు+అగు.) 1. పన్నగిల్లు. (బ్రౌ.); 2. అణఁగు; అడుగుడుమడు. "చ. పదవెడుజవ్వనంబు వెలికొత్తఁగ బయ్యెద సిగ్గుఁ గూడి చిట్టడుమఁగ లేఁత లొట డిగ నాఁకకు మీఱను లేక వక్షపుం, జదుపునఁ బ్రక్కల న్నెఱసి చప్పటలై మఱి లాఘవఁ గూడఁ బైఁ, బొదవె ననంగ..." ఆము. ౫, ఆ. ౨౧.

చేప్పటలిడు. ద్వ. వి. (చప్పటలు+ఇడు.) చప్పటలు కొట్టు, రెండఱచేతులుఁ బలుమఱుచఱుచు. "ద్వి. సరసంబులాడుచుఁ జప్పటలిడుచు." పండితా. పర్వ. ౪౪౦. పు.

చేప్పటలువెట్టు = చప్పటలిడు. పండితా. పర్వ. ౨౯౬. పు. ఇట్లే: చప్పట్లువెట్టు. పండితా. పర్వ. ౩౦౪. పు.

చేప్పటించు. వై. స. క్రి. చఱచు. "ఉత్సాహ... అతండు డాకాలిమడమఁ జప్పటించుఁ గాల మృత్యు వక్త్రమున్." కాశీ. ౬, ఆ. ౨౭౮.

చేప్పడి = చప్పట. (బ్రౌ.)

చేప్పడించు = చప్పటించు. (బ్రౌ.)

చేప్పన. దే. వి. చప్పఁదనము. (శ. ర.) విణ. 1. చప్పనిది, ఉప్పు కారములు లేనిది. "సీ. అమృతోపమానంబు లగుభోజ్యములు చప్పనైన మహానసాధ్యక్షుఁ దఱుము." సాంబో. ౪, ఆ. ౧౪౪. ఆం. భా. ప్ర. ౧౦౫; 2. రసహీనము, నిస్సారము. (వా.)

చేప్పరమంచము. ద్వ. వి. (చేప్పరము+మంచము.) (శ. ర.) వసు. ౪, ఆ. ౭౮.

చేప్పరము=చప్రము. దే.వి. (క. చప్పర. త. చప్పరం.) 1. మీఁదపందిరివలె నేర్పఱచిన నలుచదరపు ప్రానిచత్రము, కాయమానవిశేషము. "ఆ. రమ్యమైన చప్పరంబుల దర్పణంబు, స్తరణములను..." భార. అశ్వ. ౩, ఆ. ౧౪౯. వి. ౨, ఆ. ౯౫; 2. మంటపము. "సీ. తొవలచ్చి విభుఁడు వేడ్కవరింప రా మ్రోలఁబన్నిన కెంపుచప్పరమునంగ." చంద్ర. ౪, ఆ. ౭౭. రావి. ౨, ఆ. ౩౫: 3. నృత్యము మున్నగునవి చేయుటకు కొంచెమెత్తుగా నిర్మించినగద్దె. "గీ. ఓమథిప్రష్ఠపురమున నుబ్బి యుబ్బి, హేమపుంజప్పరంబుల నెక్కియాడు." హర. ౫, ఆ. ౬. విక. ౧, ఆ. ౧౫; 4. గుడారము, డేరా. "చ తెరయును మేలుకట్టు తగుదీవియలుం జెలువొంద మేటిచప్పరమునఁ జాల వ్యాప్య మగు పాన్పున..." భార. సౌ. ౧, ఆ. ౧౪౭. భార. మా. ౩౩; 5. దేవతావిగ్రహముల నుంచి ఊరేఁగించుటకై యేర్పఱచినకప్పు గలకట్టపము. (బ్రౌ.)

చేప్పరించు. దే. స. క్రి. (క. చప్పరిసు.) 1. భక్ష్యాదులరసము నాలుకతో నాస్వాదించు. "వ... నెలవులు చప్పరించుచు..." దశా. ౩, ఆ. ౧౯౭. "సీ. అరుచి దీఱఁగ వాతెఱ యూని యూరార చవులూచు వెడవెడఁ జప్పరించు." సా. వి. ౧, ఆ. ౧౧౪; 2. నమలు. "సీ. చప్పరించు వెదుళ్లసట లుబ్బ దంష్ట్రాగ్ని చొంగపై బడి ఘుంఘుంఘుమనఁగ." స్కా. ౪, ఆ. ౧౨; 3. నిమురు. "ఉ. సన్నలంవాఱఁ బల్కుచుఁ గుచంబులు సూపుచు... వెన్నెఱివేణులు సప్పరించుచున్..." కు. సం. ౮, ఆ. ౧౦౧; 4. ఒప్పించు. "ద్వి...భక్తులమహిమ, కథలును నీతులు శారణంబులును, జెప్పి మాటల మిమ్ముఁ జప్పరించుటలు, చొప్పగునే ప్రతి చూపెద మీకు." పండితా. దీక్షా. ౫౨. పు; 5. నిర్లక్ష్యము చేయు. "గీ. జపతపంబులు దలఁచినఁ జప్పరించు." మల్హ. ౩, ఆ. ౩. రం. రా. యు. ౩౬౯. పు. ౨౯౦. అ. క్రి. చప్పుడించు. "వ...దిశావలి యద్రువఁ జాచా యని చప్పరించుచు..." పండితా. పర్వ. ౪౮౩. పు.

చేప్పరింత. దే. వి. (చప్పరించుభా.) 1. నాకుట. "సీ. అన నిద్దైన నేత నద్ది నిల్పినదొప్పపై చప్పరింతఁ బసనతోనలు." పాంచా. ౪, ఆ. ౫౯; 2. వరాహము, పంది. సాం ని. తిర్య. ౭౫.

చేప్పలించు = చప్పరించు. 1. (లొట్టలువేయు) "శా. ఆడెదురుస్పాపులం గలియసాడెదు గ్రద్దలఁ జప్పలించి పో,రాడుపిశాచముల్..." కు. సం. ౧౧, ఆ. ౧౮౪; 2. (ఆస్వాదించు.) "చ. ఫలము చప్పలించి..." జై. ౧, ఆ. ౫౧.

చేప్పి. దే. విశే. లోనికి అణఁగినది. "సీ...ముడి బొమ్మలును జప్పిపంక్తు..." హరిశ్చ. ౪, ఆ. ౧౬౮.

చేప్పిడి. దే. వి. ఉప్పు వేయనిభోజనపదార్థము. వా:— వాఁడుచప్పిడితినుచున్నాఁడు. విశే. 1. లోనికి అణఁగిపోయినది. (వా. చప్పిడిముక్కు.); 2 ఉప్పు వేయనిది. ఉదా:—చప్పిడికూర.

చేప్పు. దే. స. క్రి. (క. సప్పు.) వచులు. "సీ. సకల వేదామృతజలధి గంధూషించి డప్పి నంగేత్రు వుల్ చప్పి చప్పి." కాశీ. ౪, ఆ. ౧౩౭.

చేప్పుడించు. దే. అ. క్రి. చప్పుడు చేయు. "అ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ, జప్పుడించి నగుచుఁ జలము మీఱ." భాగ. ౧౦, స్కం. పూ. ౧౧౪౦. "గీ. అప్పటప్పటి కాకోలఁ జప్పు డించి." నా. పంచ. ౨, ఆ. ౭౫.

చేప్పుడు. దే. వి. ధ్వని. "చ. కడునడి గాడ్పుచే విఱుఁగఁగా బడి త్రెళ్ళుమహారు హాళిచప్పుడు విని ..." భార. అర. 3. ఆ. ౨౯౬. "క. జలజల ప్రవహించునెలఁ చప్పుళ్ళు..." స్వా. ౪, ఆ. ౧౨.

చేప్పున. దే. క్రి. విశే. 1. శీఘ్రముగా, వెంటనే. వ్యవ:—నీవుచప్పునరమ్ము; 2. పూర్తిగా. ఉదా:— నీరు చప్పున తీసిపోయినది. (బ్రౌ.)

చేప్రము = చప్పరము. (పందిరి.) "గీ. మేలుకట్ల చంప్రము విర్మించి యనంటి, కంబములు నిల్పి తోరణా ల్గట్టి యందు." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౬౪.

చేబుకు. దే. వి. (క. చబుకు.) కొరడా. "గీ. చబుకు పాదులు మ్రోలఁ గైజా యొరప్పి." చిత్ర.భా. ౪, ఆ. ౬౩.

చేబుకుసేయు. ద్వి. స. క్రి. (చబుకు+చేయు.) చబుకుతోఁ గొట్టు. "గీ. సైంధవంబుల ఛే యని చబుకుసేయ." జై. ౬, ఆ. ౫౩.

చేమరు. దే. స. క్రి. 1. కొట్టు. "మ...అస్త్రంబు లం,జమరం జొచ్చిర నొచ్చి విచ్చి..." ఉ. హరి. 3, ఆ. ౩౦; 2. చఱచు. "చ...మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా,నలుఁ జమరంగ శక్యమె ..." భార. ఉద్యో. 3, ఆ. ౪౦౩; 3. చంపు. "గీ. కరసహస్రంబు దునుమాడి కార్తవీర్యు,జంపి మయ్యేడుసరుసల సకలనృపులఁ, జమరి..." భా. రా. యు. ౬౫౧; 4. నలఁచు, రాచు. "చ. అఁఘుజలుండు భీముఁడును నంతన మేల్కని యస్త్రపారగంబులఁ జరాంబులం జమరి..." భార. ఆది. ౫, ఆ. ౧౭౭; 5. = చెమరు. (బ్రౌ.)

చేమరుగాకి = చెమరుగాకి. (బ్రౌ.)

చేమరుచు = చెమరుచు. (బ్రౌ.)

చేమురు. దే. స. క్రి. రాచు. "గీ. మందమునకు గడ్డునకు బెట్టు మాలిత్తిడ్డు, మోమునను మేనఁ జమిరి..." హరి. పూ. ౫, ఆ. ౧౫౪. వి. 1. నూనె మొదలగు ద్రవ్యము. "ఆ. నందుఁ డాది గాఁగఁ గొందఱుగొల్లలఁ బసిది ధనము దీర్పఁ బాలుఁ జమురు, నులుప గొంచు..." వి. పు. ౭, ఆ. ౭౩. ఆం. భా. ద్వి. ౨౯౯; 2. సేయు. సాం. ని. మాన. ౪౭; 3. జిగురు. (బ్రౌ.)

చేమ్మ. దే. వి. 1. తంబళి. "సీ...శింబియాఁ జమ్మ తంబ యనంగ..." ఆం. భా. ద్వి. ౭౨; 2. మినుములు కందులు మొదలైనవాని పొట్టు. (బ్రౌ.)

చేయ్యన. దే. క్రి. విశే. ద్రు. శీఘ్రముగా. "ఉ. చయ్యన నేఁగి యంబుజవిశాలవిలోచనఁ గాంచి ..." భార. విరా. ౨, ఆ. ౨౪౫. ఆం. భా. తృ. ౭౧.

చేరచేర. దే. వి. (క. చరచర.) 1. వేగమువలన గలుగుధ్వని కనుకరణము. "వ...బాణములుచర చరలు..." వ బం. ౭౭౨. ఆం. భా. ప్ర. ౧౨౪; 2. శీఘ్రము. (వా. నీవు చరచర అన్నము తెచుము.)

చేరలాట. దే. వి. (క. చల్లాట. చరలాడుభా. సరస మాడుట. (చూ. చరలాటము.)

చేరలాటము = చేరలాట. (చూ. చరలాటమాడు.)

చేరలాడు. దే. అ. క్రి. (చరలాటము+ఆడు.) సరస మాడు. "సీ. సుంజపంటపసుట క్రోడమధ్యంబున నాఖుతోఁ జరలాడునడవిక ల్లి." కాశీ. ౨, ఆ. ౪౩.

చేరలు = చెరలు. (చూ. చరలాటము.)

చేరవ. వై. వి. (సం. చరుః.) చరికుండ. (బ్రా.)

చేరాలున. క్రి. విశే. ద్రు. శీఘ్రముగా. (చూ. చరాల్న.)

చేరాల్న = చరాలున. "సీ. ఉచ్చైశ్శ్రవంబు చుం చొడిసిపట్టి చరాల్న నెగిరి యెక్కుమ్మడి నెక్కు వాఁడు." రంగా. ౧, ఆ ౬౨.

చేరి. దే. వి. గంజి. (చూ. చరికుండ.)

చేరికుండ. ద్వ. వి. (చరి+కుండ.) సాలెవానిగంజి కుండ. "సీ. పరిపరియద్భులు చరికుండ యూశిత ..." హంస. ౨, ఆ. ౧౧. [(బ్రా.)

చేరిగెలు. దే. వి. బ. ఒకవిధమైన పొల్లుధాన్యము.

చేరిజె. దే. వి. సీలిభేదము. "ద్వి. చరిజలు చిందులు చొపదాక్ ..." పండితా. పర్వ. ౩౪౨. పా.

చేరిది. వై. వి. (సం. ఛర్ది.) క్రక్కురోగము. ఆం. భా. ద్వి. ౧౨౭. [౧౨౫.

చేరుక. దే. వి. పశురోగవిశేషము. ఆం. భా. ద్వి.

చేరుకుడు. దే. వి. ఒకబండియొందుగడ్డి. (బ్రా.)

చేరుము. దే. స. క్రి. 1. నిమురు, మెల్లఁగ రాచు. "సీ...గంబురా ఎట్టి దెక్కడ లేదు చూచుమా యని రవకను జెప్పలందుఁ జరిమి." ప్రబంధ. ౨౧; 2. ఎన్ను, ఏఱు. "గీ. జాంబవంతుఁడు మకరాక్షుఁ జరుముకొనియె." రామా. ౭, ఆ. ౨౯౫. భా. రా. ఆర. ౧, ఆ. ౦౧.

చేర్లాట = చరలాట. "సీ. వేళ్లచర్లాట రంజిల్లెడు హారులుకు ..." కళా. 3, ఆ ౧౦.

చేర్లాటమాడు. దే. అ. క్రి. (చర్లాటము+ఆడు.) క్రీడించు, ఆడు. "సీ. వాఁడుకు మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ జర్లాటమాడుచు సంచరించు." భార. శాం. 3, ఆ. ౨౪౫. పాండు. 3, ఆ. ౬3.

చేర్లాటము = చరలాటము. (చూ. చర్లాటమాడు.)

చేర్లాడు = చరలాడు. (చూ. చరలాడు.)

చేఱచే. దే. స. క్రి. 1. అఱచేతితోఁ గొట్టు. "క. చఱచి యొకచేతఁ గూర్మముఁ, బెఱచేత గజంబుఁ బట్టి పెనఁచి..." భార. ఆది. ౨, ఆ. ౬౯; 2. కొట్టు. "క. ఇయ్యకొని నగను గట్టుచు, నయ్యెడ నొకచేగదూల మసె వ్రక్కలు గా వ్రయ్యటుక నాశకాడకుఁ, జయ్యనఁ గీలములు గాఁడఁ జఱచినపిదపన్." నా. పంచ. ౧, ఆ. ౦౦. ఆము. ౪, ఆ. ౩౫; 3. సాఁగఁగొట్టు. "సీ ..మాధవ్యుఁ దనెడికవ్మరి...మొగడ లక్ష్ములుకులమొనలు చఱచు. (చాటువు.) "సీ. ఇటు లుండవలదా చెలీ సోగవగచూపు మెఱుఁగువెన్నెలఁజేసు చఱచి నటులుఁ." రావి. ౪, ఆ. ౯3; 4. ఆస్ఫాలన మొనర్చు. "క. గొబ్బున లేచి బుజంబులు, దబ్బునఁ జఱచుకొని..." నీలా. 3, ఆ. ౬౨; 5. మ్రోయించు. "వ...ప్రస్థానభేరి సఱవం బంచిన..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౧౫; 6. తుడుచు. "గీ. చరణములు కేలు గడిగి ముచ్చట్లు చఱచి." విజ్ఞా. ఆచా. ౬౭; 7. ఒద్దు. "గీ. పన్నిదము సఱు మని తెగఁబాఱి పలికె." భార. అను. ౧, ఆ. ౧౯౦; 8. వ్యాపించు. "గీ. తఱపి చంద్రాతపము నేల చఱచి కాయ." భీమ. ౨, ఆ. ౪౬. అ. క్రి. మించు, అతిశయించు. "క. ఊఱు ముఱిమి మూలగాన్పులు. చఱచి విసరఁ జొచ్చె ..." హర. ౨, ఆ. ౧౭. హరి. పూ. ౬, ఆ. ౩౪.

చేఱపించే. దే. స. క్రి. (చఱచు. ధా. ప్రే.) మ్రోఁగించు. "సీ. ప్రస్థానపటహము ముచ్చటభంగి చఱపించె రతిరాజువేపుల్గురవళిచేత." సాంబో. ౨, ఆ. ౧౪౫. వరాహ. 3, ఆ. ౨౬.

చేఱపు. దే. వి. (చఱచుధా.) 1. అఱచేతిదెబ్బ. వ్య. వ:—వానివీపుపై రెండు చఱపులుపడినవి; 2. జేను. "సీ. బంగారుచఱపులపస మించుతముల పాకుల మాపటాలు కొండలుగ వైచి." కళా. ౭, ఆ. ౬౦. [తట్టినపిడక. (శ. ర.)

చేఱపుఁబిడుక. దే. వి. (చఱపు+పిడుక.) గోడను

చేఱి. దే. వి. (క. సఱి. త. చరివు.) తటము, పర్వత శిఖరమునకు క్రిందిచోటు. "గీ. దీనితేనియ ద్రావినమానవ్రులకు, జరయుం రుజయును దప్పియుఁ జావుఁ గలుగ, దనఁగఁ గొండఱుబోయలు విని కడంగి, యుఱక మొఱకులై చఱిఁ బడ నుఱికి రపుడు." భార. ఉద్యో. ౨, ఆ. ౨౭౦. హరి. పూ. ౭, ఆ. ౧౦౫.

చేఱిచు = చేఱి. "గీ. గిరులచఱియులఁ బసివట్టి తిరుగు చోట." స్వా. ౪, ఆ. ౫౧. ఆం. భా. ద్వి. ౩౦.

చేలచేల. దే. వి. ద్రవపదార్థముల పలుచఁదనము తెలుపుటయం దగుధ్వని కనుకరణము. "గీ. అంతఁ జలచల పిదపిద మచుచు ననిచి, కలంపై విప్పు

పవనాహతి నొకింత గదలియాడు, పల్లవముమాటు నను దోఁచుమొల్లమొగ్గ, చాలఁగలెఁ బల్కుఁబడి మోవిచాటునఁ గనఁబడుచు నింతిపల్వరుస కస్ఫ్రాంతిపఱుచు." ప్రభా. ౨ ఆ. ౭౬; 3 సమూహము. "సీ. చిలువచాల్ కలుఁగులోపల స్రుక్కి యన్యోన్యపూత్కారపవనాప్తిఁ బొట్ట నించె." కువల. ౧, ఆ. ౯౫ శుక. ౧, ఆ. ౩౭౫; 4. నాఁగేటిచాలు. ఆం. భా. ద్వి. ౨౩౩. ఆం. సం. నానా. ౨౪; 5. (హిం. సాల్) 1. సంవత్సరము. (బ్రా. వా.); 2. సంవత్సరాంతము. "సీ. రాజియు సంవత్సరాంతంబు లాంగలపద్ధతి చాలు నాఁ బరఁగుచుండు." ఆం. భా. తృ. ౬౩.

చాలుకొను. దే. అ. క్రి. (చాలు+కొను.) వరుసగా నేర్పడు. "సీ. బలునింత చిఱుతమొగ్గలు చాలుకొని యున్నవనమాలిక లటంచు వలపు నించు." ముకుంద. ౨, ఆ. ౧౩౨.

చాలుపు. దే. వి. 1. వరుస, పంక్తి. "గీ...మొనల్గలవలుచాలుపున దనర్చెఁ, గన్నియలమిన్నకు ..." సీలా. ౧, ఆ. ౯౯: 2. సమూహము, గుంపు. "క. వేలుపుచాలుపు రా..." అచ్చ. భా. ౩, ఆ. ౫౫ పొ; 3. వైశాల్యము. "వ...అనేక బ్రహ్మాండసహస్రంబులఁ గలప్రాణు లెల్ల నొక్కపరి పఱతెంచి నిల్చిన నొక్కయంకణంబునకుఁ జాలి రనంజాలుచాలుపు గలిగి..." ఉ. రా. ౯, ఆ. ౩౧౩.

చాలుపేరింటిపూఁబోఁడి. దే. వి. (చాలు+పేరు+పూఁబోఁడి.) సీతాదేవి. "గీ...సెకబాసఁ దేఱినట్టి, చాలుపేరింటిపూఁబోఁడి నోలిఁ గూడి." య. ౩, ఆ. ౩౭.

చాలుబడి. దే. వి. (చాలు+బడి) శక్తి. (శ. ర.)

చాలుమానిసి. ద్వ. విణ. (చాలు+మానిసి.) 1. సమర్థుఁడు. "వ...అభిమన్యుండు ద్రౌపదేయులు వారందఱుం జాలమానిసుల..." భార. భీష్మ. ౧, ఆ. ౧౭౪. భార. విరా. ౪, ఆ. ౨౨౧; 2. ముఖ్యుఁడు, ప్రధానుఁడు. "గీ. తనయులను దాము రావలె ననుచుఁ జాలు, మానిసులు దశరథరాజమాళితోడ..." దశా. ౭. ఆ. ౧. ౨౨౫.

చాలుమాసి. దే. విణ. పరాధీనుఁడు. ఆం. భా. తృ. ౫.

చాలుపట్టు. దే. స. క్రి. (చాలు+పట్టు) దున్ను. "చ. అలఘుజగద్ద్విషద్ద్విప ఘటాంకుశశాతన ఖాంకురాగ్రజాం, గలముల మున్ను నీ వసుర ఘస్మరవైరిభుజాంతరాళజాం, గలమహిఁ జాలు పట్టి పయిఁ గ్రమ్మెను నెత్తురు నీరు వెట్టి..." పాండు. ౨, ఆ. ౫౯.

చాలువాఁడు. దే. విణ. (చాలు+వాఁడు.) శక్తుఁడు, సమర్థుఁడు. "చ...ఇ,త్తెఱఁ గొకచాలువాని బలుతిర్పునఁ గాక ప్రాసంగ నేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౩.

చాలువాఱు. దే. అ. క్రి. (చాలు+పాఱు) సమృద్ధమగు. "క. మొలచి తలలెత్తి నిక్కుచు, సలలిత గతిఁ జాలువాఱె సస్యము లధిపా." భాగ. ౧౦ స్కం. పూ. ౭౫౫.

చాలెడువాఁడు. దే. విణ. (చాలెడు+వాఁడు.) సమర్థుఁడు. "ఉ. చాలెడువాఁడ వెన్నఁడును జావును జేటును బొందవు..." హరి. పూ. ౯, ఆ. ౧౫౭.

చాలెత్తు. దే. వి. (చాలు+ఎత్తు) దున్ను. "సీ. అతఁ డేలుచున్నట్టి యామదానగరంబు చాలెత్తి మఱి యామదాలు వేసి." రామ. ౨౯౧.

చాల్పడు. ద్వ. అ. క్రి. (చాలు+పడు) వరుసయగు. "చ. చరణహతిన్ లతాతరులు సాల్పడి జర్ఝరితంబులై..." భార. ఆది. ౬, ఆ. ౨౦౭.

చాల్వ = చాలుపు. 1. (వరుస.) "సీ. దట్టంపు మిన్నాఁకతరఁగచాల్వనఁ దేలు తెలిపుల్గు బురద గోతులకుఁ జనునే." సీలా. ౨, ఆ. ౭౬; 2. (సమూహము.) "సీ. తెలిమొల్లమొగ్గచాల్వలు తలఁబ్రాల్ గాఁగ..." రసిక. ౨, ఆ. ౧౪; 3. వైశాల్యము.) "వ...రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్వ గలవేల్పులనెలవు దఱియంజొచ్చి ..." భాగ. ౯, స్కం. ౪౪౭.

చాల్వతేర్తదొర. దే. వి. (చాల్వ+తేరుల+దొర.) దశరథుఁడు. "గీ...వార్,లరిగి రిమ్ముల కిమ్ముల నంతచాల్వ, తేర్తదొరవ్రేల్మి నెఱిఁ గడతేర్చి యున్న." అచ్చ. బాల. ౪౭.

చాల్పెరింటిమగువ. దే. వి. సీతాదేవి. "సీ. వఱచెఁ జాల్పెరింటి మగువ నేలినవేల్పు..." య. ౧, ఆ. ౯౫.

చాల్వడు = చాల్పడు. "క...కంతధరు లుగ్ర భూరి బలం బేర్పడ హయగజభటతతి సాల్వడి వడి మ్రొగ్గఁబడి మిట్టిపడ రథసమునన్." కు. సం. ౧౧, ఆ. ౧౪౮.

చావఁజూచు. దే. స. క్రి. (చావన్ + చూచు) చంపు. "గీ...నిను ధార్తరాష్ట్రులొండె, నీవు వారల నొండెను జావఁజూడ, వలయు టప్పు డెఱుంగవే..." భార. శాం. ౧, ఆ. ౧౨౦.

చావడి. దే. వి. (క. తు. చావడి. త. సావటి.) 1. నడవ. "చ...మొదటిచావడి ముందర సందడింప ..." కాశీ. ౪, అ. ౧౫౫; 2. మండపము. "సీ. తోఁటలు నఱకినదొడ్డచావడికంటె ననఘుమై తగుపంచటరుఁగు మేలు." రామలిం. 3. సా. ౨, ఆ. ౧౯౦; 3. కొలువుకూటము. "క. అన రాదు గాని తక్కిన, మను జేంద్రులచొప్పు గాదు మనచావడిలో, ననయము నెవ్వరిఁ జూడిన ..." పరమ. 3, ఆ. ౬౦; 4. శాల. (ఉదా:— ఎడ్లచావడి. బ్రా.) విణ. నగరసంబంధమైనది, వీథిలోనిది. ఉదా:—చావడిమాటలు. (బ్రా.)

చావి. దే. అవ్య. ద్రు. ఒప్పుకట్టు. "ద్వి. చావి మాధ్యందినశాఖ నిర్మాల్య, మేవ యంచును..." పండితా. దీక్షా. ౯౨ పు.

చావు. దే. వి. (క. తు. సావు. త. మ. చావు.) మరణము. ఆం. భా. ద్వి. ౨౨౫.

చావుతల. దే. వి. (చావు+తల) మరణముసమీపించిన వేళ. "గీ. చావుతల నైన నిందుక సత్యవాక్య ముగ్గడింపర నీ వన్న నూరకుండె. భో. ౫, ఆ. 3౧౫.

చావుతెలివి. దే. వి. (చావు+ తెలివి) మరణకాలమందుఁ గలుగు తెలివి. (వా.)

చావుబిడ్డ. దే. వి. (చావు+బిడ్డ) కడుపులోనే చచ్చి పుట్టెడుబిడ్డ. (బ్రా.)

చావుపిట్ట. ద్వ. వి. (చావు+పిట్ట.) తీతువు. (బ్రా.)

చాళి. దే. వి. 1. విధము, రీతి. "ద్వి. క్రాలుచుండెడి మత్తగంధగజంబు, చాళి నిల్చుండెడి యూసథ నిరీక్షించి." పండితా. మహిమ. ౨౪౯ పు; 2. కొండెము, నేరము. "రగడ. సతి తదీయ భావ ణము పిసాళి సాళిఁ జెప్పఁజుమ్ము." వరాహ. 3, ఆ. ౯౨.

చాళియ = చాళె. (క. చాళియు.)

చాళిసము. దే. వి. 1. నాట్యపద్ధతులలో నొకటి. (చూ. చాళెము); 2. వందనాద్యుపచారము? "ద్వి...ఎల్లెడఁజాళియం బిస్సింబి..." పండితా. మహిమ. ౧౭౯ పు.

చాళె. దే. వి. 1. గతిలాఘవము; 2. మల్లబంధవిశేషము. "వ...గొండ్లి పరిభవించునట్టివులునుం బోలెఁ జాళెలు చూపి." ఉ. హరి. ౪, ఆ. ౨౫౬. (రెండిటికి నుదాహరణము.)

చాళెము. దే. వి. నాట్యపద్ధతులలో నొకటి. "ద్వి. భ్రమరముల్ చాళెముల్ బయకముల్ మెఱసి, రమణిః బంచాంసి పేరణి యాడువారు." పండితా. పర్వ. ౪3౫ పు.

## చి

చి. ప్ర. ద్రు. 1. శత్రర్థకప్రత్యయము. "ఉ... ధర్మ దార వట్టించుచు నున్న వాడు..." క్రీడా. ౫౫. శివరా. 3, ఆ. ౬౭; 2. భూతకాలసూచకము. "క...వీపుగ, ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్." భార. కర్ణ. ౨, ఆ. ౮౦; 3. భవిష్యత్కాలసూచకము. "క. ఈడు వర్ణ్యం బింతయు, నేపఁగ నెల్లెడల దీని నెఱిఁ గించుచు నే, వేదవిహితవిధిని యరిక్, ద్వాదశ సంవత్సరవ్రతము చరియింతున్." మార్క. ౧, ఆ. ౧౪౦; 4. కొన్నిధ తువ్వలపై వచ్చుప్రేరణార్థకప్రత్యయము. (అడఁచు. తెలువఱుచు మొ) అవ్య. చుము. చుఁడు. వీనిలు ప్తరూపము. (ఇది ప్రసిద్ధి నిశ్చయము మన్నగువానిని దెలుపును.) "క. మాయమ్మానసు నీవే, రాయలవై ..." కళా. ౬, ఆ. ౧౬౧.

చెంగు. దే. వి. (క. చుఁగు. త. చుంకు) "చ. సొరిదిఁ బసిండిమువ్వలువచుంగులు క్రేవల జాఱు ..." హ. సం. 3, ఆ. ౧౭౨. కువల. ౨, ఆ. ౬; 2. కచ్చ. "సీ. పాటలానిలము లార్వఁగఁ దపారపుఁజుంగు లలరుఁబావికె మూఁగ నలులఁ జోఁపు." ఆము. ౨, ఆ. ౭౫. "సీ... పదినూఱుచుంగుల పొగఁ జుట్టి." వ ల్మీకి. ౨, ఆ. ౬౧.

చెంగుడు. దే. వి. నిలువ యగుపిల్లరద్రవ్యము. (శ. ర. బ్రా.)

చెంగులువాఱు. దే. అ. క్రి. (చెంగులు+పాఱు.) మడతలుగా నుండు. "క. గంధము పూసిన కై వడి, సంద మ్మగుబొమ్ము తెఱపి చాఁఱచట్టపయిన్, గుందనపుటంచు దుప్పటి, సుందరి యొక్కర్తు గట్టె చెంగులువాఱన్." చంద్రా. ౬, ఆ. ౧౫.

చెంచు. యు. దే. వి. (క. చెంచు.) 1. పిల్లజుట్టు. "క. చెం చెనఁగఁ బాలుద్రావు ము,దంచితముగ ననుఁడు బాలు ద్రావి జననితోఁ,బూం చెనఁగ దనుచు లీలా,చెంచుండై యతఁడు చెంచుఁ జూపు నరేంద్రా." భాగ. ౧౦, స్కం. పూ. ౪౧౯. రామా. ౪, ఆ. ౯. 2. జుట్టు, సిగ. ఆం. భా. ద్వి. ౧౪౬; 3. సింహము గుఱ్ఱము మున్నగు వానిమెడజూలు. "మ. పులితోల్కాసెల నంట దోఁపినవి డెంబుల్ నూలికుగ్రాఁబావళం,బులు బల్ సింగపుఁజూంచుదండకడియంబుల్ ..." సా. ౧, ఆ. ౬౩. "సీ...ఉపై చక్రపంజుచుం చౌడిసి పట్టి చరాల్న సెగిరి యొక్కమ్మడి సెక్కువారు." రంగా. ౧, ఆ. ౬౨. 3. సెమిలిజుట్టు. ఆం. భా. ద్వి. ౯౬; 4. (సం. చుచుందరీ. క. చెంచు.) కంపెలుక. భార. అను. ౪, ఆ. ౨౬౫. ఆం. భా. ద్వి. ౭౬. విణ. పసిది, లేఁతది. "ఉ. అక్కట కోసలక్షితిపరాత్మజ కానకకన్నుముద్దులేఁ, జక్కని చెంచురాకొమరుఁ జందురు లెక్కడ..." రామా. ౪, ఆ. ౯. (చెంచురాకొమరుఁడు = పసివాఁడగు రాజకుమారుఁడు.

చెంచుకఱ్ఱ. దే. వి. (చెంచు+కఱ్ఱ.) పసిబాలుఁడు. "ఉ. ఇల్లాకట్టునం గడచి యేఁగఁగ నేరని చెంచుకఱ్ఱఁన్." అచ్చ. బాల. ౧౦౪. ఇట్టే: చెంచుబాలుఁడు. (బ్రౌ.)

చెంచుమిద్దె. ద్వ. వి. (చెంచు+మిద్దె.) గోపురము వలె పొడవుగా గట్టినకట్టడము. (శ. ర. కట్టడ మునకు ముందుభాగమం దుండుమిద్దె. బ్రౌ.)

చెంచెతాయి. దే. వి. (చెంచు+తాయి.) ఇంటికప్పన కుపయోగించెడిపలకతాయి. (శ. ర. బ్రౌ.)

చెండించు. దే. అ. క్రి. (చెండు. ధా. ప్రే.) ఎండఁ జేయు, శుష్కింపఁజేయు. (బ్రౌ.)

చెండు. దే. అ. క్రి. ఆకులు లోనగునవి వాడు, శుష్కించు. (శ. ర. బ్రౌ.) వి. 1. ఉప్పు చఱచినట్లు తలమీఁదఁ గలుగువ్యాధివిశేషము. (శ.ర.); 2. చెంచు. ఆం. భా. ద్వి. ౭౬.

చెండెలుక. దే. వి. (చెండు+ఎలుక.) చెంచు, కంపెలుక. (శ. ర. బ్రౌ.)

చెండ్రాట్లు. దే. వి. బ. (చెండు+ఆట్లు) బాల క్రీడావిశేషము. "సీ. అకుఁబాకెలు చంద్ర లాటలు చెండ్రాట్లు..." హంస. 3, ఆ. ౧౪౬.

చెంయి. దే. వి. నిప్పు గాని కాలినపాత్రము గాని నీటిసంపర్కమువలన చేయుధ్వని కనుకరణము. (దీనియామ్రేడితము చుంయిచుంయి.) "ద్వి. తల వార్ధిజలము చుంయన నింకఁ గ్రోలి." ద్వి. హరిశ్చ. పూ. ౨౨౪౫. పం. అను. ౧, ఆ. ౯౨. "సీ. చప్పరించు వెదుట్ల సట లుబ్బి దంష్ట్రాగ్ని చొంగపైఁ బడి చుంయిచుంయి మనఁగ." స్వా. ౪, ఆ. ౧౭.

చేఁడు. వై. క్రి. ని. (మాడుఁడు. అనుదానిలుప్త శేషరూపము.) ప్రసిద్ధి విధి నిశ్చయములను దెల్పును. "ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరుఁ కోడలరాముభార్యఁ బెం,డ్లొజకులార యడ్డుపడరో సురలార..." భా. రా. యు. ౪౧. 'శా... దేవతా,కోటుల్ మేదిని సున్నఁ దప్పుగుఁజూడో ...' కాశీ. ౫, ఆ. ౨౭౦. "క. కొండికబాలిక యెఱుఁగదు,సుఁడీ యెంతయును మగుదనుండీ ..." వీర. ౧, ఆ. ౨౦౫.

చెక్క. వై. వి. (సం. శుక్ర.) 1. శుక్రుఁడు. "ఉ. చుక్క యొకింత నిక్కి బలసూదనుదిక్కున రాయఁచుండుటన్." క్రీడా. ౫౧; 2. నక్షత్రము. "ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె..." భార. విరా. ౨, ఆ. ౩౧౯; 3. బొట్టు, తిలకము. 'సీ. కమ్మకస్తురితిలకము దిద్దు నొకవేళ నొక్కవేళ జవాదిచుక్క యుంచు." సుదంతా. ౧, ఆ. ౧౭. ఆం. భా. ద్వి. ౧౬౦; 4. రెండవరకపువస్తువు, మొదటిరకముకంటె నాణెము తగ్గినవస్తువు. "చ. జలరుహగంధిపీనుల కసల్ నవసంఖ్య నదేమి లెక్కసున్, వెలియన భ్రాంతురాశి నెలచేడిము పైకముఁ దాను జుక్కసున్." విజ. ౧, ఆ. ౩౭; 5. నీరు లోనగువాని బిందువు. (హాలాహాలము.) "చ...శివుని హస్తసరోరుహా మెక్కి చుక్కగన్." హార. ౬,

ఆ. ౬౮; 6. గఱ్ఱు; క్షతము. "వ...దక్కిలి వని చురుక్కనం జుక్క లేర్పడ నొక్కుచు..." రాధా. ౧. ఆ. ౯౬; 7. (సం. చుక్రః.) అమ్లవేతసము. ఆం. భా. ద్వి. ౬౮.

చుక్కకాఁడ. ద్వ. వి. (చుక్క+కాఁడ.) మాగాణిపొలములలో మొలచెడియొక జాతి మొక్క. (బ్రౌ. శ. ర.)

చుక్కకొర. ద్వ. వి. మత్స్యవిశేషము. (బ్రౌ. శ. ర.)

చుక్కకూర. ద్వ. వి. (చుక్క+కూర.) ఒకజాతి కూరమొక్క. (శ. ర. వా.)

చుక్కచేరు. ద్వ. వి. (చుక్క+చేరు.) 1. చుక్కల చాలు; 2. సుదుటి ప్రేలునట్లు తలపై రిఁకించుకొను స్త్రీభూషావిశేషము. "సీ. మగువకొప్పు నభంబుఁ దెగడ నిర్దోషంపుఁజుక్కచేరు ఘటించె సుదతి యొార్తు." వసు. ౫, ఆ. ౧౧౬. (రెండర్థములకిది యుదాహరణము.)

చుక్కతోలువేల్పుగొంగ. ద్వ. వి. (చుక్క+తోలు వేల్పు+గొంగ.) కుమారస్వామి. వేంక. దేవ. ౭

చుక్కనుదుటిపిట్ట. ద్వ. వి. (చుక్క+నుదురు+పిట్ట.) గరుడఁడు. వేంక. దేవ. ౨౦.

చుక్కపిల్ల. వై. వి. (చుక్క+పిల్ల.) మత్స్యవిశేషము. (బ్రౌ. శ. ర.)

చుక్కపిల్లి. వై. వి. (చుక్క+పిల్లి.) చుక్కలు గల పిల్లి. (బ్రౌ.)

చుక్కబొట్టు. ద్వ. వి. (చుక్క+బొట్టు.) చుక్కవలె నుండెడిబొట్టు. 'సీ. ఒనరఁగా గాటుకయంను జుక్కబొట్టును బాటించి..." ద్వా. 3, ఆ. ౪౫. ఆం. భా. ద్వి. ౧౭౦.

చుక్కయెదురు. ద్వ. విశ. (చుక్క+ఎదురు.) హాని కరము, ప్రతికూలము. "గీ. ఇరుగుపొరుగులవారికి నెల్లఁ జుక్కయెదురు నాయిల్లు వేయనునేల యింక." హరిశ్చ. ౪, ఆ. ౧౭౯. వి. ప్రాతికూల్యము. "సీ. దైత్యావరోధనదయితాధరముఁతో సొబగువీడెముల కుఁ జుక్కయెదురు." ఉ. హరి. 3. ఆ. ౧౪౭.

చుక్కఱేఁడు. వై. వి.(చుక్క+ఱేఁడు.) చంద్రుఁడు. "గీ. సన్నపుంగుఁడ యన నిక్కెఁ జుక్కఱేఁడు." రా. వి. 3, ఆ. ౧౦.

చుక్కలతెరువు. ద్వ. వి. (చుక్కలు+తెరువు.) తారాపథము, ఆకాశము. "క...చుక్కలతెరువున వేగఁజుక్క గనుఁగొననయ్యెన్." అచ్చ. అయో. 3౭.

చుక్కలత్రోవ. ద్వ. వి. (చుక్కలు+త్రోవ.) ఆకాశము. 'క. నిక్క మెయి నిలిచె ధరణియుఁ, జుక్కలత్రోవ యును విప్రసురసేవ్యములై." భాగ. ౮, స్కం. ౫౧౯.

చుక్కలదొర. ద్వ. వి. (చుక్కలు+దొర.) చంద్రుఁడు. పె. శకుం. ౨, ఆ. ౧౮౭.

చుక్కలరాజు. వై. వి. (చుక్కలు+రాజు) చంద్రుఁడు. "సీ. శృంగారరసమంబు చిన్ని చుక్కలరాజు పసిఁడికిన్నెరవీణ పలుకుఁదోడు." నైష. ౧, ఆ. ౫.

చుక్కలరాయఁడు. వై. వి. (చుక్కలు+రాయఁడు.) చంద్రుఁడు. అచ్చ. బాల. ౧౮౫.

చుక్కలఱేఁడు=చుక్కఱేఁడు. "సీ. లిపుటఁ జుక్కల ఱేని నిన గోరు మెసగిరి..." నైష. ౭, ఆ. ౮౨.

చుక్కలి. దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర. బ్రౌ.)

చుక్కవాలు. ద్వ. విశ. (చుక్క+వాలు.) ఎదురు చుక్క. "చ...పుంశ్చలీసమితికిఁ జుక్కవాలు..." హరి. ౨, ఆ. ౪౦. రా. వి. 3, ఆ. ౭౦.

చుక్కాని. దే. వి. (హిం. సుక్కాన్.) పడవ నడుపు సాధనము. (బ్రౌ. వా.)

చుక్కాను = చుక్కాని. "సీ. నీటిలోఁ జీవుకక నిలిచి క్రమ్మఱుఁ బ్రాన్కిఁ గఠినకర్పరపుఁజుక్కాను బిగువు." పాండు. ౨, ఆ. ౬౬.

చుక్కి. దే. వి. మఁడుక; వంపు. (బ్రౌ.)

చుక్కివెండ్రుకలు. దే. వి. బ. అలకలు, ముంగురులు. "ద్వి. చుక్కలు బొట్టును జుక్కివెండ్రుకలు, చక్కనిపాపటల్..." పండితా. పర్వ. 3౪౧. పు.

చుక్కెదురు. ద్వ. వి. (చుక్క+ఎదురు.) ప్రతికూలము. "గీ. సుదతిపాపములకును జుక్కెదురు కాశి." కాశీ. ౭, ఆ. ౨౧౫.

చుచ్చా. దే. వి. తోలు, చర్మము. "సీ. పచ్చిపట్టి తోల్ బట్టెచుచ్చాలమె ట్లందికొనఁ దాసయూరెల్ల గుత్తపట్టి." ఆము. ౬, ఆ. ౬౬.

చుచ్చు. దే. వి. 1. ఆఁడుమేఁక, ఆం. భా. ద్వి. ౨౬౫; 2. సంతాపమును దెల్పుధ్వని కనుకరణము. (చూ. చుచ్చుకొట్టు.)

చుచ్చుకొట్టు. దే. అ. క్రి. (చుచ్చు+కొట్టు.) సంతాపముచే చుచ్చు అను. (శ. ర.)

చుచ్చుఱుకు. దే. విశే. (చుఱుకు+చుఱుకు) మిక్కిలి తీక్ష్ణము. "వ... చుచ్చుఱుకుపలుకులు..." రామా ౫, ఆ. ౧౯౯.

చుటుక్కు. దే. వి. నీరుమున్నగునవి గొంతులో మిటుటయందగుధ్వని కనుకరణము. "క. కను నీరు చుటుక్కు మనఁగఁ గడమిటుకుచు..." సా. 3, ఆ, 2.

చుట్ట. దే. వి. (క. చుట్టి. హిం. చుట్టా.) 1. వలయము. "సీ. వర్వీకరాధిపుకలలచుట్టలు విడి పడగ లొంసొంటిలోఁ దొడరి మ్రొగ్గ." హరి. ఉ. ౯, ఆ. ౨౭౦. ఆం. భా. త్రి. ౫౪; 2 పొగచుట్ట. (వా.)

చుట్టకుదురు. దే. వి. (చుట్ట+కుదురు) కుండనిలుచుటకై దానిక్రింద నుంచెడిదిండు. "సీ కపట కచ్ఛప మైనకై టభాంతకుపీఁపు కొమరుమీఁతిన చుట్టకుదురుగాఁగ." భీమ. ౪, ఆ. ౪౯. మృ. వి. 3, ఆ. ౫.

చుట్టపుఁజూపు. దే. వి. (చుట్టము+చూపు) ఎప్పుడో ఒకసారి వచ్చి చూచెడిచూపు. వా:—నేను చుట్టపుఁజూపునకైన పోలేదు.

చుట్టపుఁదనము. ద్వ. వి. (చుట్టము+తనము) బంధుత్వము. "క. ఇట్టవ్వనె మాద్రితోడం, బుట్టె ననక యితని ధర్మపుత్త్రునకుఁ గడుర్, బెట్టిదుఁడై చంపవలనెఁ జుట్టపుఁదన మేల రాజసుతులకుఁ గలుగున్." భార. స్త్రీ. ౨, ఆ. ౧౦3.

చుట్టపుమేరువు. దే. వి. (చుట్టము+మేరువు)—చుట్టముల కాశ్రయమైనవాఁడు చుప్పచుట్టము. "ఉ. చుట్టపుమేరు వుగ్రరణకోవిదుఁ డిద్రుపదుండు..." భార. ఉద్యో. ౧, ఆ, ౨౯2. హరి. పూ. ౧, ఆ. ౨౦. సా. తల చుట్టము తోఁక పగ, చూడఁ జుట్టమును మ్రొక్క బైపము లేనివాఁడు. చెఱువునకుఁ జేరువగను చుట్టాలకు దూరముగను నుండవలెను; చుట్టమని చూడ వచ్చి దయ్యమై పట్టుకొన్నాఁడు.

చుట్టపువాఁడు. దే. వి. (చుట్టము+వాఁడు) బంధుఁడు. "క. పతిపాతివ్రత్యంబును, సుతువిగురాష్ట్రకరుఁ దెలిసి చుట్టపువారల్, మతి సమ్మతించుచుండఁగ ..." శుక. ౧, ఆ. ౧౪౨.

చుట్టము. దే. వి. (బ. చుట్టములు, చుట్టాలు, చుట్టలు.) 1. బంధువు. "మ... శమితారాతి బలుండు వారలకుఁ బాంచాలప్రభుం డిష్టసు చుట్టము తానయ్యె..." భార. ఆది. ౮. ఆ. ౪౪. ఆం. భా. ద్వి. ౧౧౨. "క. చెలులును జుట్టలు..." భార. ఉద్యో. 3, ఆ. 3౯. 2. స్నేహితుఁడు. నెచ్చెలి. "ఆ. బాలకుండు వృద్ధుపగవాఁడు చుట్టంబు... కల్లత్రాగువాఁడు గాఁడు సాక్షి." విజ్ఞా. వ్య. ౧౦౪. "గీ... పగవారిపగవారు చుట్టలగుట." కాశీ. ౫, ఆ. ౭౯౨. ఆం. భా. ద్వి. ౧౯౬; 3. విటుఁడు. 'సీ. అలవాఁడు నీచుట్ట మరుదెంచె ననిన నేమాయెలే వచ్చుఁగాక కంచు బిగిరుం." కువల. ౪, ఆ. ౧౯౪. స్వా. ౪, ఆ. 32.

చుట్టఱికము. దే. వి. (చుట్టము+ఱికము) 1. బంధుత్వము. "గీ. పాండవులు ధార్తరాష్ట్రులు పుండరీక, నేత్ర చుట్టఱికంబున నీకు నొక్క రూప..." భార. ఉద్యో. 3, ఆ. ౧౨౬. దశా. 3, ఆ, ౪౯; 2. స్నేహము. "క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీడు..." భార. విరా. ౧, ఆ. ౧3౦. ఆం. భా. ద్వి. ౧౧౫; 3. సంబంధము, కలయిక. "సీ. కులములో వన్ని తక్కువ యయ్యెనే గాధిపట్టికి మేనకచుట్టఱికము." స్వా. ౨, ఆ. 23.

చుట్టలుఁగు. దే. వి. (చుట్టు+అలుఁగు.) చక్రాయుధము. "ఉ... చుట్టలుఁగుఁజెందము నందిన వాని ..." రామా. 3, ఆ. ౪౪. వేంక. దేవ. ౧౯. య. ౫, ఆ. 3౦.

చుట్టలుగొను. దే. అ. క్రి. (చుట్టలు+కొను) పెనగొను, చుట్టుకొను. "ఉ. ఏపను బిల్లలుం గలయ నెల్లెడఁ ద్రుష్టచు నుల్లసిల్లుచున్, గానన భూమిలోఁ దిరుగఁగా నొకచెం చురులొడ్డి పోయినం, గానక తూలుచో మెడలుఁ గాళ్లును జుట్టలుగొన్న దిక్కులన్, దీనులమై కలంగి..." ద్వా. ౫, ఆ. ౭౪.

**చుట్టాలసురభి.** దే. విశే. (చుట్టాలు+సురభి)-చుట్టాలకు కామధేనువువంటివాఁడు. బంధుప్రియుఁడు. "సీ...వీఁడు, సుఖభోగి చుట్టాలసురభి రాచ, బిడ్డయై యుండె..." ఉ. హరి. ౫, ఆ. ౨౭౮. ద్వి. పారిజా. పూ. 3 పా. ౪౦. పం.

**చుట్టిల్లు.** దే. వి. (చుట్టు+ఇల్లు) చుట్టును గుండ్రముగా గోడపెట్టి నడుమనిట్రాడు నాఁటి దూలములు లేక కట్టినయిల్లు. (శ. ర.)

**చుట్టివచ్చు.** దే. స. క్రి. (చుట్టి+వచ్చు) 1. చుట్టుకొను. "మ...కొందఱ అమాత్యులన్ దనుఁ జుట్టిరా నమరె నాస్థానంబునం గృష్ణుఁడు..." ఉ. హరి. ౨, ఆ. ౧౪౮. ఆము. ౧, ఆ. ౬౧; 2. ప్రదక్షిణించు. (శ. ర.)

**చుట్టు.** దే. అ. క్రి. 1. గిరగిరఁ దిరుగు. "గీ. ఇలకు డిగి చుట్టి చుట్టి దుమ్మెత్తి యెగసిపోయి..." ఆము. ౪, ఆ. ౧౧; 2. మూఁగు. "ఉ... మొగంబు తావికిం, జుట్టిన తేంట్లకున్..." కవిక. ౬, ఆ. ౧౭. పారి. ౪, ఆ. ౭౨. స. క్రి. 1. (తమలపాకులు, చాప మున్నగునవి) చుట్టు. "చ...తనదు తొయ్యలి వీవ్యము చుట్టి..." పాండు. 3, ఆ. ౨౧; 2. బంధించు, కట్టివేయు. "శా...ఆశాపాశంబులు చుట్టలా వెఱిఁగియుం జావేడి మారొంటు రిం, తే పో తమ్ము కపిధ్వజప్రభృతుల యంధీభూతులం జేయవే." భార. ఉద్యో. ౧, ఆ. ౩౨౧; 3. ముట్టడించు. "గీ. అరుగుదెంచె మాహిష్మతీపురము సుట్టి వేగ పోరికి సర్జుడు వెడలు మనుఁడు." నిర్వ. ౭, ఆ. ౧౯. శుక. ౨, ఆ. ౬; 4. పరివేష్టించు. "గీ. నిండునెలఁ జుట్టెఁ బరివేషమండలములు." హర. ౨, ఆ. ౧౫. ఆం. భా. తృ. ౧౧౭; 5. ఆవరించు. "ఉ. ఇట్టివి గల్గునే జనుల కెవ్వరికిన్ నరవాధునెల్ల నే, పట్టున నైన నేల ననుఁ బాపము చుట్టె నొకాక..." నిర్వ. ౧౦, ఆ. ౫౬; 6. ప్రదక్షిణించు. "గీ. మెట్టి తత్పుణ్యభూములు చుట్టి చూచి." వాల్మీ. ౧, ఆ. ౯౦. శుక. ౨, ఆ. ౩౪; 7. వ్రాయు. వా: సున్న చుట్టుము. వి. 1. చుట్టుట. "సీ. ఛిద్రోత్థవాతవలక్రౌద్రాజమనఁ జుట్టుతో విప్పుతో దరిఁ దొండ మాడ." ఆము. ౪, ఆ. ౧౫౩; 2. ఆవృత్తి, తడవ. వా:—వానికొఱకు పదిచుట్లు తిరిగితిని; 3. చుట్టి, వలయము. "ఉ. భోగపుఁజుట్టు కోటఁగా భూరికిరీటసముజ్జ్వలత్ఫణా, భోగము సౌధబృందముగ..." ప్రభా. ౧, ఆ. ౬౦; 4. ఆఁడుదాని కాలి జుట్టనవ్రేలికి పెట్టుకొనువలయాకార మగుభూషణము. "శా. మ్రబ్బుంజాయలకీలుగంట్లు చెవియోరం జాలుకొక్క పోఁగులు... పాదపుఁజుట్లు..." రా. వి. ౨, ఆ. ౬౦; 5. ప్రక్క, వైపు. "సీ. సుడిగాడ్పు తేరి నల్చుట్టుఁ జుట్టులువెట్టె..." ఉ. రా. ౬, ఆ. ౨౩౫. విశే. 1. దూరము. "క. ఎంచఁగ నాగమనమునకు నించుకచుట్టైన నయ్యె..." కళా. ౨, ఆ. ౪; 2. సమీపము. వా:—చుట్టుపట్టులు. అవ్య. ద్రు. నలువైపులను. "క. గోరథమును ఋషభము వైహారము ఋషిగిరియుఁ జైత్యకాద్రియు ననఁగా, నూరెలగిరు లేనును నివి, శూరథటులువోలెఁ గాచి చుట్టును నుండున్." భార. సభా. ౧, ఆ. ౧౭౪. భార. శాం. ౨, ఆ. ౧౩౮.

**చుట్టుఁగైదువు.** దే. వి. (చుట్టు+కైదువు.) చక్రాయుధము. "శా. చుట్టుంగైదువుజోదు ప్రామినుకటంచుల్ మెట్టు పెక్కొడ..." రామా. 3, ఆ. ౫౪.

**చుట్టుఁగొల్లారము.** దే. వి. (చుట్టు+కొల్లారము.) నడుమ ఖాళీప్రదేశమును చుట్టును గట్టడము గలకట్టడము. "క. లలితాధరబిద్రుమదేహాళులును దంతంపుఁ దలుపు లమరినపలెపోకములు చుట్టుంగొల్లారపుటిలుగా వర్తించువాణి నేఁ బ్రణుతింతున్." సాంబో. ౧, ఆ. ౮.

**చుట్టుఁజవికె.** దే. వి. (చుట్టు+చవికె) నిట్రాడు లేకుండఁ గట్టినచుట్టిల్లు. "గీ. చుట్టుఁజవికెయు సర్వవస్తువులుఁ గలవు." హంస. ౫, ఆ. ౨౦౫.

**చుట్టుఁజవిరె** = చుట్టుజవికె. (చుట్టు+చవిరె) "గీ. చుట్టుఁజవిరెయుఁ గొమరొప్ప సొలయు నతఁడు." హంస. ౨, ఆ. ౭౫.

**చుట్టుఁబట్టు.** దే. వి. (చుట్టు+పట్టు) సమీపప్రదేశము. "వ...క్రింద మీఁదఁ జుట్టుఁబట్టున సెట్టిబెట్టినంపుసింగంబులుం జన వెలిచు..." కళా. 3, ఆ. ౧౨. ఉ. రా. ౮, ఆ. ౨౬౮.

**చుట్టుఁబర్వు.** దే. వి. (చుట్టు+పర్వు) అశ్వమండల గతి. "సీ. చుట్టుఁబర్వులఁ ద్రిప్పి చుకయలుం నీడొం దఁతే కెనుహరుల్ పిచ్చుకుంటును కగవడె." ఉ. రా. ౧, ఆ. ౬౭.

**చుట్టుఁబుల్గు.** దే. వి. (చుట్టు+పుల్గు.) చక్రవాకము. "చ. కలువలఱేఁడు తమ్మిచెలికాఁడు నిశావిభు జంట చుట్టుఁబుల్గులఁగమినోములపంట..." కవిజ. ౩, ఆ. ౧౨౧.

**చుట్టుకొను.** దే. అ. క్రి. (చుట్టు+కొను-స్వార్థమున.) వలయితమగు. "చ. నిడుదమధూళికల్ నడుమనే కొని తీఁగెలుపాఁకఁ జుట్టుకొం,చడరి..." ఆము. ౫, ఆ. ౧౨౩. స. క్రి. 1. (పూలదండమొ.) తాలుచు. "ఉ. ఊరక చుట్టుకొన్న కమలోత్పల పంక్తులు..." ఉ. రా. ౧, ఆ. ౪; 2. ముట్టడించు. "ఉ. ఈమటుమాపులోఁడిగద యింత యొనర్చె నటంచు దానవస్తోమము సుట్టుకొన్న మఘసూదనుఁడు..." దశా. ౨, అ. ౩౭౫; 3. క్రమ్ము, ఆవరించు. "వ...అని యివ్విధంబున నొంత సెప్పిన విధాతృమహుమార్తుల జుట్టుకొన్నయజ్ఞానతిమిరంబు..." కాశీ. ౫, ఆ. ౧౦౦; 4. అలముకొను "సీ...సుర కొమ్న కూటాలఁ జుట్టుకొనిన. "గీ. బండిగురిచెందతీఁగె చప్పరము లెనసి." పరు. ౨, ఆ. ౨౧.

**చుట్టుకొలుపు.** దే. స. క్రి. (చుట్టుకొనుధా. ప్రే.) చుట్టుకొనఁజేయు. "క. లీలావతి కెంగేలను, గీలించిరి యతులరత్నకీలితభూషా, జాలములు మరునిబొట్టితమ, కోలలకు న్విరులు చుట్టుకొలిపిన పగిదిన్." సాంబో. ౫, ఆ. ౨౪౯.

**చుట్టుకొల్లారము** = చుట్టుబవంతి. (బ్రా.)

**చుట్టుకోలు.** దే. వి. (చుట్టుకొను. ధా.) చుట్టుకొనుట. "మ. చిగురుంగెంజడ లొప్పఁ బువ్వరజముల్ చెల్వారుననూచివ్రూఁ,తగలేఁదేఁటులచుట్టుకోలు జపసూత్రశ్రీలు గా..." హరి. ఉ. ౭, ఆ. ౪౯.

**చుట్టుగట్టు.** దే. వి. (చుట్టు+గట్టు.) చక్రవాళపర్వతము. "చ. అవలితమంబు పొచ్చి తుద నాఁగఁగ నీయక చుట్టుగట్టులై..." ఉ. హరివ. ౧, ఆ. ౩౧.

**చుట్టుగుల్ల.** దే. వి. (చుట్టు+గుల్ల.) శంఖజాతిగుల్ల. (బ్రా.)

**చుట్టుసుగుల్ల** = చుట్టు+గుల్ల. "సీ...వర్తగుల్ల చుట్టుసుగుల్ల..." హంస. ౪, ఆ. ౧౫౬.

**చుట్టుదల** దే. వి. చుట్టులు. (శ. ర. బ్రా.)

**చుట్టుబవంతి.** దే. వి. (చుట్టు+బవంతి.) నాలుగిండ్ల బవంతి. "వ...చుట్టుబవంతి మొత్తపుజగ్గులం బిక్కటిల్లువసుకయిల్లుఁ జేరి..." సావి. ౧, ఆ. ౧౧౧.

**చుట్టుమాలె.** ద్వ. వి. (చుట్టు+మాలె.) చుట్టుకొల్లారము. "సీ. తిరుముట్టుమాలెలోఁ దిక్కైనగణపతి యేకాంతమునఁడిని ఘ్నేశ్వరుండు." భీమ. ౩, ఆ. ౩౧.

**చుట్టుముట్టు.** దే. స. క్రి. (చుట్టు+ముట్టు.) ముట్టడించు. "వ...హరిపుంగవు లెల్లను లంక నుగ్ర విక్రమమునఁ జుట్టుముట్టిరి..." చం. రా. ౮, ఆ. ౬౪. అచ్చ. యు. ౧౮౭.

**చుట్టువడు.** ద్వ. అ. క్రి. (చుట్టు+పడు.) పెనఁగొను. "సీ. ఇలఁ జుట్టువడుతొండములు మించు పూర్వాంగ మొక్కరంబై పెఱుం దత్తమిల్లు." స్వా. ౫, ఆ. ౯౮.

**చుట్టువాఱు.** దే. స. క్రి. (చుట్టు+పాఱు.) 1. చుట్టుకొను. "చ. కోలకోలఁ గూయుచుఁ బై నొఱగుఁ గుత్తుకఁ గుత్తుక చుట్టువాఱు..." స్వా. ౩, ఆ. ౫౭. రామా. ౮, ఆ. ౯౯౦; 2. ముట్టడించు. "గీ. ఇన్నినాళ్లకు నాచేతియోటు దప్పె, నౌర యీజడదారుల కంపకప్ప,గలదు గాఁబోలు ననుచును గఱకుదుఱుకుఁ,బాపు లదరంగ నటు వారిఁ జుట్టువాఱె." వాల్మీకి. ౨, ఆ. ౯౫.

**చుట్టువాలు.** ద్వ. వి. (చుట్టు+వాలు.) చక్రాయుధము. "గీ. చుట్టువాలును నెవ్వపోఁ గొట్టునాలు." అచ్చ. బాల. ౩.

**చుట్టువాల్దాలుపు.** ద్వ. వి. (చుట్టువాలు+తాలుపు.) చక్రధరుఁడు, విష్ణువు. "దం...చుట్టువాల్దాల్పవై మెట్టువిల్ వేల్పవై..." అచ్చ. యు. ౧౭౧.

**చుట్టువాల్పేరిపిట్ట.** దే. వి. (చుట్టువాలు+పేరు+పిట్ట.) చక్రవాకము. వేంక. తిర్య. ౧౦౨.

**చుట్టువాల్దొర.** దే. వి. (చుట్టువాలు+దొర.) విష్ణువు. ల. వి. ౩, ఆ. ౭౧.

**చుట్టువేడెము.** ద్వ. వి. (చుట్టు+వేడెము.) అశ్వగతి విశేషము. "సీ. చుట్టువేడెము పెట్టుఁ జోళ

మాళవగౌళ పాంచాలములు పటాపంచ గాఁగ." దశా. ౧౦, ఆ. ౧౧౩.

**చుట్టఁబెట్టు.** దే. స. క్రి. (చుట్టుక్ + పెట్టు.) 1. ప్రదక్షిణించు. "గీ. వీటివాకిటిచోటినే విమల కెవుడుఁ, జుట్టఁబెట్టుచునుందురు సోమరవులు." అము. ౨, ఆ. ౧౦; 2. చిక్కులుపెట్టు. "సీ. పాలచేరుబు వట్టి తూలింప బలిమి నీడ్చికొని కొండలఁ దూఱి చుట్టఁబెట్టు." స్వా. ౪, ఆ. ౪౨.

**చుఱుదులు.** దే. వి. బ. (త. చుఱుక్కై.) బాలక్రీడావిశేషము. "సీ. చీకటిమొటికాయ చింతాకు చుఱుదుల పులియాటలును..." హంస. ౩, ఆ. ౧౪౬.

**చుసాయించు.** దే. స. క్రి. (బట్టలు) మడతపెట్టు. (శ. ర. బ్రౌ.)

**చుప్పనాక.** వై. వి. (సం. శూర్పణఖా.) శూర్పణఖ. "ఉ. అత్తఱిఁ బంక్తికంఠుచెలియల్ కఠినాత్మిక చుప్పనాక..." భా. రా. అర. ౧, ఆ. ౧౩౩.

**చుప్పనాతి** = చుప్పనాక. "చ... హా రరిగిరి చుప్పనాతిమూద మండుచు..." భా. రా. అర. ౧, ౧౬౧.

**చుప్పరము.** దే. వి. మదము. "సీ. ఒకజజాయీ వ్రేటు ప్రకటధాటీపట ద్వరఘోటకముల చుప్పర మడంచె." రంగా. ౩, ఆ. ౧౮౫.

**చుబ్బనమాఱి** వై. వి. (మాఱి+మాఱి.) పుష్కలము. "గీ. జనయుఁ దేవులును నగయును బోరయ పసఘుసుఖము లెప్పుడుఁ జుబ్బనమాఱిలు..." మార్క. ౪, ఆ. ౧౨౮. విశ. సమృద్ధిగా. "సీ... దివ్యభోగములు దనుకు, జుబ్బనమాఱిలై..." హరి. పూ. ౨, ఆ. ౨౦౪.

**చుబ్బనమాఱిలాడు.** ద్వి. స. క్రి. (చుబ్బనమాఱిలు + ఆడు.) మిక్కిలికొల్లగొను. "ఉ... వేల్పువెలగుబ్బెతలం గవగూడి పైఁబయింబజుబ్బనమాఱిలాడుటకుఁ జొత్తుపె తన్మధురాధరామృతంబు..." రామా. ౧, ఆ. ౪౫. హరి. ఉ. ౯, ఆ. ౮౩.

**చుమి.** వై. ని. చూమమి. (శ. ర.)

**చుము.** వై. ని. (చూడుము అనుదానిలుప్తశేషము.) 1. నిశ్చయము తెల్పును. "గీ. వామదేవుని రప్పింప వలెఁజుమయ్య." కాశీ. ౬, ఆ. ౩౨. భో. ౨, ఆ. ౧౯౦; 2. ప్రసిద్ధిని దెలుపును. "క. కడు సన్నపుఁగార్యము సెక్కుడురోసముతోడఁ బెనఁగి కుమతులు మూర్ఖ్యంబుఘనకక పెద్దయుం జేగింబడుదురుచుమి..." కేయూర. ౨, ఆ. ౧౧౮.

**చుమ్మ.** దే. వి. తీవ్రవేదన. "సీ...చుమ్మ కుతి జాలి చూకురు కస్తి నా శోక మొప్పు." ఆం. భా. ప్ర. ౧౩౫.

**చుమ్మచుట్టు.** దే. వి. బ. (చుమ్మ+చుట్టు.) కడుపులోఁ గలుగుబాధ. ఆం. భా. త్ర. ౩౭.

**చుమ్మలుచుట్టు.** దే. అ. క్రి. (చుమ్మలు + చుట్టు.) మిక్కిలి బాధనొందు. "క. అట్టులఁ దొంగలి రెప్పలఁ, దొట్టెడు బాష్పములతోడఁ దొత్రిలు మద్దుం, బట్టిఁ గని కడుపు చుమ్మలు, చుట్టఁగ నది మట్టుపఱచి శుభ మొసరంగన్." విజ. ౩, ఆ. ౧౩౫.

**చుమ్మలువాఱు** = చుమ్మలుచుట్టు. "గీ. కడుపు చుమ్మలు వాఱఁ దాఁ గన్నకన్నె, చిలుకనెడఁబాసి యేరీతి నిలుచువాఁడ." శుక. ౧, ఆ. ౩౭౩.

**చుమ్మి** = చుమి. (శ. ర.)

**చుమ్ము** = చుము. "చ...తప్పసుమ్మర యని ధర్మజుండు దివి ముట్టునెలుంగున బిట్టదల్పఁగన్." భార. ద్రో. ౫, ఆ. ౩౨౪. భార. కర్ణ. ౩, ఆ. ౧౦౨. "క. ఏరాకన్నియలయందు నెఱుఁగము సుమ్మీ." అచ్చ. అర. ౧౮.

**చుయ్యంకి.** దే. వి. వాద్యవిశేషము. "వ...తుడుము చక్కి చుయ్యంకియును..." హంస. ౩, ఆ. ౨౯. ఆం. భా. ప్ర. ౧౨౮.

**చుయి** = చుంయి. (చూ. చుయికొట్టు.)

**చుయికొట్టు.** దే. అ. క్రి. (చుయి+కొట్టు.) చుంయి మనుశబ్దము చేయు. "క. తను వంట నోడి వనజాసనకును జేమంతిపువ్వనం గొని పన్నీ, రెనయ మెయిఁ బూయుచోఁ గ్రాఁగిన పెనమున నొలుకు నూనెక్రియఁ జుయికొట్టెన్." ద్వా. ౫, ఆ. ౧౩౯.

**చుయ్యి** = చుయి. (బ్రౌ.)

**చుర.** దే. వి. మండుటెము. వానియందగుధ్వని కనుకరణము. (చూ. చురచుర.)

**చురకత్తి.** వై. వి. చిన్నకత్తి. "సీ. చిఱుతొండనంబి క్రొమ్మెఱుగారుచురకత్తి వాఁడిగా నూఱుచు పంక దీర్చి." హర. ౨, ఆ. ౧౧౫.

**చేరచుర.** దే. వి. మండుటయం దగుధ్వనికరణము. "ద్వి...మతో ్క్రవదావాగ్నిశిఖలఁ, జురచుర నెరియించి స్రుక్కించి నిన్ను." ద్వి. హరిశ్చ. పూ. ౧౮౭౩.

**చేరచేరపోవు.** దే. అ. క్రి. (చురచుర+పోవు) మండు. "క. తురగంబులతోఁ గూడఁగ, నరదము సకలంబు నుజ్జ్వలానలశిఖలం, జురచురపోయినఁ గని..." భార. శల్య. ౨, ఆ. ౩౩౫.

**చేరి.** దే. వి. చురకత్తి. (శ. ర.)

**చేరిమ్రాను.** దే. వి. వెలమపూ. ఆం. భా. ద్వి. ౪౫.

**చేఱు** = చుర. (మా. చుఱుపుచ్చు.)

**చేఱుచేఱు** = చురచుర. (1. మండుటయం దగునను కరణము) "చ. ఎఱకలధూళి పన్నగుల యాక్షణ ముల్ కబళించి చుట్టునుం, జుఱచుఱఁ బేర్చు మంటలు..." హరి. ఉ. ౭, ఆ. ౪౭; (2. తీక్ష్ణముగాఁ జూచుటయం దగునను కరణము.) "క. ఎఱమంట లుమియఁచూడ్కులఁ, జుఱచుఱఁ జూచుటయుం..." హరి. పూ. ౨, ఆ. ౬౬; (3. చీరుటయం దగుధ్వని కనుకరణము) "క...అతని శాతనఖములం, జుఱచుఱఁ జీరియుం మొత్కనఁ, గఱచియుం..." భా. రా. యు. ౧౭౦౪; 4. (అగ్ని, నిప్పు.) "చ. కఱకలు దుష్టవర్తనుల కామమదాదుల శోచ్య తాట నే, నెఱిఁగినఁ దోడఁబుట్టు లని యీమమకారదురంతదుఃఖపుం, జుఱచుఱయంతరాత్మఁ జుఱచూఁడులు చూఁడెడి మర్మసంధులన్." ప్రబోధ. ౪, ఆ. ౫౪.

**చేఱుపుచ్చు.** దే. స. క్రి. దహించు, కాల్చు. "క. వచ్చురిపుఁ జూపులనె చుఱుపుచ్చుచు సిరిఁ గొనుట..." ఆము. ౩, ఆ. ౨౭.

**చేఱుపుచ్చు.** దే. స. క్రి. (చుఱు+పుచ్చు) 1. దహించు, కాల్చు. "క. ఎఱమంట లెగయ నాతని, నెఱచూపటు నిలువునంద నీఱుగఁ దరువుం, జుఱుపుచ్చు పిడుగుక్రియఁ గను, గిఱిపిన యంతటనె చేసెఁ గిల్బిషుఁ బగతున్." హరి. ఉ. ౨, ఆ. ౧౩౯; 2. నాశముచేయు. "గీ. కడిఁదియాఁబోతుఁ జుఱుపుచ్చెఁ గైటభారి." సాంబో. ౧, ఆ. ౧౦౯. సాంబో. ౩, ఆ. ౬౭.

**చేఱుకరి.** దే. విశ. (చుఱుకు+అరి) 1. చోరవగలవాఁడు. (శ. ర.) 2. కూరుఁడు. ఆం. భా. ద్వి. ౧౭౫.

**చేఱుకు.** దే. వి. 1. ముల్లుమొ. గ్రుచ్చుకొనుటయం దగునను కరణము. "రగడ. అజిమి నపుఁ జినుకు నకు నగునె కంటక మాడఁ, జుఱుకుమనె పెకోక్క చోటఁ గంటక మాడ." స్వా, ౩, ఆ. ౮౪; 2. ఎండ సోఁకుటయం దగునను కరణము. "గీ. తమకుఁ బాసినతరణికాంతములు పొదల, యూకుదుదులఁ బొడయొండ లంటి ప్రక్క, చుఱుచుఱుకు మన్న మొకములు గెరలి బెదరి..." కువల. ౧, ఆ. ౯౫; 3. తీక్ష్ణముగాఁ జూచుటయం దగునను కరణము. "గీ. చుఱుకుచుఱుకున దశకంఠుఁ జూచి ..." ఉ. రా. ౪, ఆ. ౬౨; 4. గాయము, దెబ్బ. "సీ. తెఱవ నీకొనగోళ్లచుఱుకు లంటఁ గఁ జేయుం..." చెన్న. ౫, ఆ. ౧౩౦; 5. వేఁడిమి. "ఉ. అప్పుడు క్రీడి వహ్నికిఁ బ్రియంబునఁ జేతులు మోడ్చి దేవ యీచొప్పున నీకుం జుఱుకుఁ జూపుదురే..." జై. ౪, ఆ. ౨౫; 6. వాఁడి, పదను. "క. చుఱుకు గలయొక్కకోలను, గుఱిగాఁ దిగబ్రోల్ల నేలఁ గూలిచి..." నీలా. ౧, ఆ. ౧౯; 7. శౌర్యము, "క. నీకార్ముకవిద్య కలిమి, నేకీను నతనిఁ బొరయసికి రణమునను, జీకాకుఁ బఱుపు మని యక్కాకుత్స్థుఁడు పనుపఁ జుఱుకు గలసేనలతోన్." జై. ౬, ఆ. ౧౪౦; 8. వేగము. "వ...చుఱుకు గలతురంగంబులం బఱపిన..." రుక్మి. ౨, ఆ. ౧౧౬; 9. చెట్టుపై నుండుచీమ. ఆం. భా. తృ. ౪౯; 10. ఉరి. ఆం. భా. తృ. ౪౯; 11. పౌరుషము, మగతనము. "గీ. అఁడుదానిని నొంచుట న్యాయ మింతె. హరునికడఁ జేరు మపుడు నీచుఱుకు దెలియు." పార్వ. ౪, ఆ. ౪. విశ. 1. తీవ్రము. "చ...పొలఁతి మిన్నవాల్, చుఱుకుబిశాళి క్రొందళుకుఁ జూపులకోపు మదిం దలంచెదన్." రసిక. ౫, ఆ. ౧౨౫. ఆం. భా. ప్ర. ౧౨౪; 2. వాఁడియైనది. "వ.. ఒఱులపఱులు కఱకు చుఱుకుటడిదంబులు దెఱికి." అచ్చ. యు. ౩౬౪; 3. వేఁడిమి గలది. (మా. చుఱుకు మినుకుతేఁడు.); 4. వేగవంతము. ఆం. భా. ప్ర.

౫౭. భో. ౬, ఆ. ౩౭; 3. పలుచన. (చూ. చుల్కన)

చేలుకపడు. ద్వ. అ. క్రి. (చులుక+పడు.) న్యూనమగు. (చూ. చుల్కపాటు.)

చేలుకపాటు. ద్వ. వి. (చులుకపడు. ధా.) న్యూనత. "ఉ... తప్పి నీపాలికి వచ్చినం జులుకపాటొనరించెదవే రఘూత్తమున్." అధ్యా. కిష్కిం. ౧౬౩.

చేల్క = చులుక. క్రి. విణ. అనాయాసముగా. ముగా. "శా. కర్ణుండుఙ్ విజయుండు నొండొరులఁ జుల్కం దాఁకి..." భార. ఆది. ౭, ఆ. ౧౯౭.

చేల్కన = చులుకన. 1. (హీనము.) "క. వినుఁ డీడగుసంబంధపు, టెఱయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చుల్కనినరులు..." ఆము. ౬, ఆ. ౧౧౯; 2. (తేలికయై.) "మ... బెండుబొమ్మ గతినుండెఙ్ సంజెటం జుల్కనై." ఆము. ౫, ఆ. ౬౩; 3. (గౌరవహీనము.) "ఉ... నేఁ, దాళఁగఁజాల నింతి తనుఁదానతొడంగినఁ జుల్కనౌఁగదా." బిల్హ. ౨, ఆ. ౧౨౮; 4. (పలుచన.) "చ. కనుఁగొనఁ జుల్కనైనయది కౌరవసైన్యము..." భార. కర్ణ. ౧, ఆ. ౬౬.

చేల్కపాటు. ద్వ. వి. (చుల్కపడు. ధా.) లాఘవము. "చ. కుసుమశరాసనుం డధికకోమల లక్ష్యము లేయుచోఁగ ముష్ణిసఁగిన చుల్కపాటు మది నేమియు నోర్వఁగలేక..." హరి. ఉ. ౮, ఆ. ౯౮.

చేల్లి. దే. వి. చుల్లి. వేం.క. మాన. ౪౦.

చేల్లజొండు. దే. వి. మొటిమలవంటిచిన్నసెత్తురుగడ్డ. (శ. ర. బ్రా.)

చేల్లరము. దే. వి. 1. కోడెవయసు గలపంది. "క. నరపతి కని యరు దందఁ గ, థరఁ బ్రేవులు కుప్ప పడఁగఁ దనుఁ గొట్టిన చుల్లరముకులికకటచు కతా, సరిచావుగఁ జచ్చె నొక్కజాగిల మచటన్." చంద్రా. ౨, ఆ. ౯౪. కళా. ౪, ఆ. ౭౭; 2. హింస, బాధ. (చూ. చల్లరపెట్టు.) విణ. కఠినము. "వ. మోమోటములేక చుల్లరపువాకుల దెప్పి..." ప్రబంధ. ౭౯౮.

చేల్లరపెట్టు. దే. స. క్రి. (చుల్లరము+పెట్టు.) బాధపెట్టు. "చ. చుల్లరపెట్టఁ బల్లవప్రజావరి సిగ్గుపడం జటావలుల్." సాంబో. ౧, ఆ ౯౯.

చేల్లి. దే. వి. మగగుఱి, శిశ్నము. సాం. నీ. మాన. ౧౯.

చేవక. దే. వి. చువ్వ, (బాణాదుల) తుద. (శ.ర బ్రా.)

చేవ్వ = చువక. "సీ. గంధాబు బంధమై కమ్మని పూవులు చువ్వలై నవ్వులు దవ్వు లగుచు." చిత్రభా. ౧, ఆ. ౭.

చేవ్వన. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా. "ద్వి. అల వోకడాకేల నలధను వంటి, వలకేల మార్వి చువ్వన సెక్కువెట్టి." ఆ. మ. క ౫. ఆ. ౨౭౭. పా. ౨౨. పం.

చేవ్వన=చువ్వన. "ద్వి...తోఁక చుక్కచందంబునఁ జువ్వన నిగిడె." నవ. ౧, ఆ. ౫౩. పా. ౮. పం.

చేవ్వె=చుమ్ము. (చుమ్ము+ఎ.) 1. ప్రసిద్ధిని దెలుపును. "క. దండార్హులైనవారల, దండింపక యున్నఁ జువ్వె...కిల్బిషము వొందు..." భార. శాం. ౧, ఆ. ౯౬; 2. నిశ్చయమును దెలుపును. "సీ. ఓసుమంతుఁడ దక్షిణోద్యానవాటికానిలయుండు వనపాలిఫలముసువ్వె." భీమ. ౩, ఆ. ౨౧౫.

చేవ్వే = చువ్వె. (శ. ర)

## చో

చో. వై. అవ్య. చూడుఁడు, చూడుము. అనువాని యుత్తరరూపము. 1. నిశ్చయము తెలుపును. "క... నీ, వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బాని యేనచుమ్ము పలికెదన్." భార. కర్ణ. ౩, ఆ. ౧౧౨. ప్రభా. ౩, ఆ. ౬౪; 2. ప్రసిద్ధిని దెలుపును. "క. శ్రోతకుఁ దనపం ప్రియమగు, నే తెరువుల నట్టిమెయి సమీరితమైనం, జూ తగు వాక్యం బది..." భార. శాం. ౬, ఆ. ౧౯౦.

చోఁడి. దే. విణ. (చూఁడు+ఇ.) గర్భము గలది. (బ్రా.) వి. పశుగర్భము (శ. ర.) "క. అనవుడు విను సీగృహమున, నొసరఁగ నొకచూఁడిపంది యున్నది..." భో. ౪, ఆ. ౧౭౯.

చోఁడు. దే. స. క్రి. 1. కాల్చు, దహించు. "క. వీఁడు మనలంక తోఁకం, జూఁడినమర్కటము వీనిఁ జూచిన గుండెల్, వీఁడును గలఁగుచు నున్నవి, వీఁ డేటికి వచ్చెవేరువిత్తయి యటకున్."

శై. ౫, ఆ. ౧౩౮. మార్క. ౧, ౨. ౧౯౮; 2. (దీపము మొ.) అంటించు, వెలిఁగించు. "సీ. ధ్వజ వాతహతి నాఱ వైద్యుతాగ్నులఁ జూఁడి..." స్వా. ౫, ఆ. ౪౪. వి. పశువులగర్భము. "సీ. కినుకతో రెచ్చి దొడ్డిరి గట్టుచూఁడ్వాఁడి మొదవులలేఁగలఁ బొదివి..." సీతా. 3, ఆ. ౫౫.

చూఁడుఁగొడుపు. దే. వి. (చూఁడు+కొడుపు) పసరములకు వాఁతపెట్టెడియినుపకోల. "ఉ...గురుత్వసంహారక మైనచూఁడుఁగొడు పౌ నిది లంకకు..." రామా. ౭, ఆ. ౮. "సీ...కొడవలి కత్తి సూఁడుఁగొడుపు వాదోళ్లు మొదలుగా..." హరి. పూ. ౬, ఆ. ౨౨.

చూకరు. వై. వి. (సం. శోకః.) దుఃఖము. "ఆ. చూచి యూస లేమి చూకరుఁ బొందుచు..." ద్వా. ౧౨. ఆ. ౭౭. ఆం. భా. ప్ర. ౧౩౫.

చూకరుపడు. వై. అ. క్రి. (చూకరు+పడు.) శోకించు. "క. ఆకపటరోదనము విని,మూఁకలు గొని యింటిపొరుగుముదితలు వడితో, నాకడ కేఁగిన నది కడు,శోకింపఁగ దానిఁ జూచి చూకరు పడుచున్." బ్రహ్మో. ౨, ఆ. (శ. ర.)

చూచాయ. వై. వి. (చూపు+చాయ) 1. జాడ; 2. తెలిక. (శ. ర.) విణ. అవిస్పష్టము, సరిగాఁ దెలియనిది. వా:—ఈసంగతి చూచాయగా వింటిని (బ్రౌ.)

చూచు. వై. స. క్రి. 1. కనుఁగొను. "క. ఏ కన్నెఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను విన్నన్." భార. ఆది. ౪, ఆ. ౯౯. విక్ర. ౧, ఆ. ౨౦౦; 2. ప్రతీక్షించు. "గీ. ఇంక రెన్నాళ్లు చూచి నీవంక తెగువ,గలుగకుండిన..." ఆము. 3, ఆ. ౩౯; 3. ఆలోచించు. "చ. అరిపయిఁ బోయి వానిపుర మగ్గలికం బెఱుపంగఁ దద్ధరం,బరఁగు ప్రజం జలంబు మెయి బాధలఁ బెట్టు టధర్మ, మట్టిని,మ్మరత యొనర్చు టప్పటికిఁ జూడఁగ మానఁగరాద..." భార. శాం. ౨, ఆ. ౪౨౪. శైవ. ౨, ఆ. ౧౩౫; 4. తలఁచు. "చ...అబ్జగర్భుచేఁ, బడసిన విద్య గాక నిజబాహుబలం బని చూతె..." కు. కు. సం. ౧౦, ఆ. ౧౫౦. ఉ. హరి. 3, ఆ. ౯౬; 5. లక్ష్యపెట్టు, లెక్క చేయు. "క. విపరీతపుఁ గఱపున నేఁ,యుంక్తద్రవము నందకుండ నోమిన మునికిన్, గడటింతురె సవితాయ,స్తు పోష్యక యటన్నమాట చూడఁగ వలదే." వరాహ. ౧౦, ఆ. ౩౬; 6. తెలిసికొను. "ఆ. ఎట్టు సూచి సూచి యది పాప మనక య,య్యసురవాతఁ ద్రోతు నదయవృత్తి." భార. ఆది. ౬, ఆ. ౨౪౯. విక్ర. ౨, ఆ. ౫౫; 7 పరిశీలించు. "ఉ. ఓమగరాజ నీవు చన నొంటిగ నే నిట నుండ నేర్తునే, నామది చూడఁ గోరి యిటు నన్నలయించెదు..." హంస. ౧, ఆ. ౧౦౭. భార. భీష్మ. ౧, ఆ. ౧౩; 8. పఠించు. "సీ నవరసోజ్జ్వలకావ్యనాటకాలంకారసమితి సామూలచూడముగఁ జూచె." విక్ర. ౧, ఆ. ౧౯౦. కాశి. ౪. ౧౩; 9. ఆదరించు, మన్నించు. "క. హరి యిట్లు సతుల నందఱ, సరిగాఁ జూచియును..." పారి. ౧, ఆ. ౪౦; 10. గుఱిచేయు. "గీ చేరి యటు వ్రేసి దనుజుండు సింహనాద,చటులవదనుఁడై దొడ్డపాషాణ మొకటి, శతగుణము ద్రిప్పి శౌరి వక్షంబు చూచి, వైచె..." ఉ. హరి. ౪, ఆ. ౨౩౪; 11. రక్షించు. "శా...తోఁట దొడ్డిగను లాపుల్ చూడఁ బంపం దగున్." ఆము. ౪, ఆ. ౨౪౫; 12. పరీక్షించు. వా: వైద్యుఁడు చేయిచూచి వాఁడు; 13. అనుభవించు. "ఉ... పూర్వపక్షపుం,గంతుల కేమి చూచెదవుగాఁ దుది నీబహుళార్థిభేదముల్." వసు. ౪, ఆ. ౨౫. జాహ్నవీ. 3, ఆ. ౭౭; 14. అంటు, తాఁకు. "చ. చెలువపుమద్దుపల్కులను జేరలఁ గొల్వఁగఁ జాలుకన్నులన్, మొలక మెఱుంగుఁజన్నులను నున్నపుదండలు దాల్పఁ గందుమే, నలికముఁ జూచు క్రొన్నెఱులు నందపు మోమును..." జాహ్నవీ. ౪, ఆ. ౩౪; 15. వెదకు. "శా. చూడం బోయి,నతీవ కాళ్లఁ దగిలెన్..." సుద. ౨, ఆ. ౬౪. విప్ర. ౫, ఆ. ౬; 16. చేయు, కావించు. "వ...నిమ్మోన్నతభాగంబులవలన సమంబు గా నన్న సాయూకారఁబు చక్క నగు నట్లుగాఁ జూడు మనిన..." హరి. పూ. ౧, ఆ. ౧౩౦. అ. క్రి. 1. యత్నించు. "చ. పదియగు జేయి నిండఁ టయుఁ బంక్తిముఖుండు మనంబునన్ ముదం,బొదవఁగ నిర్వికారముగ సన్నశిరంబును గోయఁ జూచినన్." నిర్వ. 3, ఆ. ౬౩. కవిక.

౩, ఆ. ౭౮; 2. ఉత్సహించు. "సీ. సుతుమాళి మూర్కొనఁ జూచుఘ్రాణంబున కేర్పుయుఁ బసిగొన నేవ మయ్యె." కవిక. ౧, ఆ. ౩౬.

చూడఁగలవాఁడు. దే. విణ. (చూడన్ + కలవాఁడు.) 1. దర్శనీయుఁడు, సుందరుఁడు. "గీ. చూడఁగల వాఁడు మేలైనసొబగువాఁడు." విజ. ౨, ఆ. ౧౬౪. వి. మదనుఁడు. "సీ. చూడఁగలవానిచెలి కానిజోడుకోడె." రా. వి. ౩, ఆ. ౭౯.

చూడికి. వై. వి. దృష్టి. "ద్వి. త్రాడును బాము ను రజతంబు శుక్తి,చూడికిఁ గొఱకుడు జోరుండు దెలియ,కున్న..." పండితా. దీక్షా. ౯౨. పొ.

చూడ్కి = చూడికి. 1. (దృష్టి.) "సీ. ఎఱకంటి చూడ్కిఁ దాయెతుల బాహుబు వంచి నారాజు లల్లార్చునారజములు." స్వా. ౬, ఆ. ౪౪. ఆం. భా. ద్వి. ౧౪౪; 2. (కన్ను.) "సీ. అలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప నది శౌరిపలచూడ్కి యందు డిందె." పారి. ౯, ఆ. ౩౦; 3. (విధము, రీతి.) "సీ. అల్లపౌలోమి జయంతుఁ గాంచిన మాడ్కి గౌరి కుమారుని గన్నచూడ్కి." ఇందు. ౧, ఆ. ౧౧౮.

చూపట్టఁగలది. ద్వ. విణ. (చూపు+పట్టన్ +కలది.)- చూడఁదగినది, రూపవతి. "శా. చూపట్టంగలదాన నొంటిమెయి నిచ్చోఁ బోవరా దంచు..." శుక. ౩, ఆ. ౧౯౧.

చూపట్టు. ద్వ. అ. క్రి. (చూ+పట్టు.) 1. కనఁబడు. "సీ. చూపట్టె నొకచాయ పాపికాజలజాతజాల వాచాలహంసవ్రజంబు." పారి. ౩, ఆ. ౪౬; 2. తోఁచు. "క. రూపింపఁ జిత్తసంభృత, చాపల్యముచేతఁ బుప్పచాపొదులచేఁ, నేరఱక యుండు తాలిమి, చూపట్టును ధైర్య మనఁగ సుస్థిర బుద్ధిన్." కావ్యా. ౨, ఆ. ౩౮; 3. జన్మించు. "గీ. సర్వలక్షణపరిపూర్ణ చారుమూర్తి, కట్టి జాంబవతికిని జూపట్టినపుడు." సాంబో. ౪, ఆ. ౭౯.

చూపడు. వై. అ. క్రి. (చూపు+పడు.) కనఁబడు. "చ. తెలియక యజ్ఞలంధరుఁడు దీపికకోపవిఘూర్ణి తాంగుఁడై, కలనికి దైత్యకోటులను గ్రక్కున రమ్మని బైలుదేఱుచో,సొలయక ముందుగా నిలిచి చూపడె శుక్రుఁడు..." కార్తీ. ౩, ఆ. ౪౭. సమీర. ౧, ఆ. ౧౭౯.

చూపరి. ద్వ. విణ. (చూపు+అరి.) 1. అందగాఁడు. "క. ఆపావ మేమి సెప్పుదుఁ,గాఁపుది మదమెత్తి కన్నుగానక పురిలోఁ,జూపరుల నెవరినైనను, నేపుర సంభోగకేళి నెనయం జూచున్." హంస. ౪, ఆ. ౧౪౭; 2. అందగత్తె. (బ్రా.)

చూపఱు. ద్వ. విణ. బ. (చూపు+పాఱువారు.) చూచువారు. "క. మెఱయ వెలి మావులను గదు,మెఱుఁగారెడు నరదములను మింటను మంటన్, వఱపెడువాలమ్ములఁ జూపఱ సత్త్రోలు తాఁకు వెఱగువడఁ జేసె నృపా." భార. కర్ణ. ౩, ఆ. ౨౭౮.

చూపఱులు = చూపఱు. "గీ. చూపఱులచూడ్కి కొకవింతసొబ గొనర్చె." కళా. ౩, ఆ. ౩౬.

చూపించు. ద్వ. స. క్రి. (చూపుధా. ప్రే.) కనఁబఱచు. "గీ...ఆతఁ డుండు, చోటు చూపింపు..." చెన్న. ౩, ఆ. ౩౭.

చూపిడు. ద్వ. స. క్రి. (చూపు+ఇడు. స్వార్థమున.) చూపు. "ఉ...ము,న్నెన్నినవానిఁ జూపెడక..." చెన్న. ౩, ఆ. ౭౬. "ఉ. చూపిడుకంటె జ్యోతు లలి కూరు లెట్లైనను బోవనిత్తురే." పార్వ. ౯, ఆ. ౯౧.

చూపు. వై. స. క్రి. (చూచు. ధా. ప్రే.) 1. కనఁబఱచు. "క...మా,కీపుట్టువునకుఁ బాండు, త్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా." భార. ఉద్యో. ౩, ఆ. ౬. స్వా. ౧, ఆ. ౨౩; 2. ప్రకటించు. "సీ...పరకామినీసహోదరకఁ జూప." పాౘి. పీఠి. ౧౭. "క...తనయస్త్రవిద్య చూపఁగ..." భార. ఆది. ౬, ఆ. ౧౨; 3. కలిగించు. "సీ. ఘన మైనరారాపుచనుదోయి రాయిడి నిఱుపేదనడిమికి వెఱపు చూప." కాశీ. ౧, ఆ. ౯౧; 4. త్రొక్కు, అవలంబించు. "ఉ. నన్నయ భట్టతిక్కకవిసాధులు చూపినత్రోవ పావనంబు..." హరి. పూ. ౧, ఆ. ౪౦; 5. ఇచ్చు. "గీ. చూపులను భక్తులకు సిరుల్ జూపు వాఁడు." బహు. ౧, ఆ. ౧౪. కాశీ. ౨, ఆ. ౯; 6. పెట్టు. "చ...నవనవాయంబు వచ్చుట కనంబడ దింటన గట్టి గడ్డియుం, కఁణము నీరు చూపఁ బలి కట్టడచేయఁగఁ బోలు..." జై. ౨, ఆ. ౧౬. అ. క్రి. "క. తుల నిడి తూఁపఁగ

సత్యము, వలచన మూలం రూపు..." భార. ఆది. ౪, ఆ. ౫౭౪. జాహ్నవీ. ౪, ఆ. ౯౯. వి. 1. చూచుట. "మ...వి,శ్వజనీనుం డగుచిచ్చుఁ జూపు సవతుష్టావంబు గాదే..." నిర్వ. ౭, ఆ. ౧౩౯. భార. ఆశ్ర. ౨, ఆ. ౧౮; 2. దృష్టి, వీక్షణము. "గీ...చూపులు మిఱుమిట్లు గొనఁగ." భార. ద్రో. 3, ఆ. 3౪. ఆము. ౧, ఆ. ౧౨; 3. కనఁబడుట. "శా...దివ్య త్తవహ్నిలుఁ డీ,గోపాలుం డనఁ గీర్తితుండ నగునాగో మిమ్మెయిక్ వమ్ముగాఁ, జూపాక్ష్క గణింతివ దైవము గదుం జూపోప దయ్యెంబుమీ." హరి. పూ. ౭, ఆ. 33; 4. కన్ను, నేత్రము. "సీ. చతురాస్యనాభ సంగతివిరాజితుఁ డయ్యె శ్రుతిచూర్గములఁ జెందు చూపు లొనర." ఇందు. ౨, ఆ. ౨౦.

చూపుగుఱ్ఱము. ద్వ. వి. (చూపు+గుఱ్ఱము.) చూపునకు గుఱ్ఱమువలె నుండి పనికుపయోగింపని వాఁడు. "ద్వి. సుక వాసి పనిపంద చూపుగుఱ్ఱంబు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౯౬. పం.

చూపుడు. ద్వ. విణ. (చూపు. ధా.) 1. చూపునది. (ఉ:—చూపుడువ్రేలు.); 2. మనోహరము. "ద్వి. లోపలియంకస్తంభ నడిమిద్దె, చూపుడు గంబాలచుట్టుకొల్లారు." ద్వి. శ. సా. ౧, ఆ. ౨౧. పా.

చూపుడుఁగొంగు. ద్వ. వి. (చూపుడు+కొంగు.) క్రొత్తకోకలమడతలో పైకి వచ్చునట్టు చేసెడిదిట్ట మగుచెంగు. (వా.)

చూపుడుఁగోక. ద్వ. వి. (చూపుడు+కోక.) మిక్కిలి పలుచనినేఁత గలకోక. (బ్రౌ.)

చూపుడుగుఱ్ఱము. ద్వ. వి. (చూపుడు+గుఱ్ఱము.) చూపుగుఱ్ఱము. (శ. ర.)

చూపుడుఁబూఁట. ద్వ. విణ. (చూపుడు+పూఁట.) చూప నొప్పుకొన్నపూఁటకాఁపు, ప్రతిభువు. "క. చూపుడుఁబూఁట యతఁడు బుణిఁ,జూపవలయుఁ జూపఁడేని సొమ్మరువఁ దగున్." విజ్ఞా. వ్యవ. ౭౬.

చూపుడువ్రేలు. ద్వ. వి. రూ. (చూపుడు+వ్రేలు.) తర్జని. (శ. ర.)

చూపెట్టు. ద్వ. స. క్రి. (చూపు+పెట్టు.) 1. కని పెట్టు. "వ...వెంట వెంట వచ్చునిజచ్ఛాయం గని తమ్ము నంత నంతఁ జూపెట్టుక వచ్చు నొంటరి తమ్మికంటు లని..." చంద్రా. ౯, ఆ. ౬౩. ౧, ఆ. ౧౭౨; 2. ఉపేక్షతో చూచు. "ఉ...అకస్తురిచంద మొంది చూ,పెట్టుక యుండ నేల..." ఉ. రా. ౯, ఆ. ౧౧; 3. చూపించు. (వా.)

చూపోపమి. ద్వ. వి. (చూపు+ఓపమి.) ఓర్వలేమి, అసూయ. "వ...సుత్రాముం డతని కామనీయకంబునకుఁ జూపోపమియును..." నైష. 3, ఆ. ౪౧.

చూరకత్తి. ద్వ. వి. (క. చూరికత్తి. త. చూరకత్తి.) ఒకవిధమైన చిన్నకత్తి. "ద్వి. చూరకత్తుల మొత్తి సురియలఁ గూల్చి." ద్వి. భార. ౧, ఆ. ౧౯. పా.

చూరి. వై. వి. (సం. చురికా.) 1. ఒకవిధ మగు చిన్నకత్తి. "ద్వి...మృత్యువుకోఱ, వడువున మిక్కిలి వాఁడైన చూరి." నవ. ౪, ఆ. ౧౩౯. పా. ౧౩. పం. ఆం. భా. ద్వి. ౨౧౬; 2. కత్తి మొన. ఆం. భా. ద్వి. ౨౧౪.

చూరియావు. దే. వి. (చూరి+ఆవు.) ఒకవిధమైన ఆవు. (బ్రౌ. శ. ర.)

చూరీ = చూరి. (శ. ర.)

చూరు. యు. దే. అ. క్రి. (పాగ మున్నగునవి) తగులు. (శ. ర. బ్రౌ.) వి. రూ. ఇంటికప్పు మున్నగువాని అంచు. "ద్వి. వారిసెంబళికోల వడిఁ జూరఁ జెక్కి." పండితా. దీక్షా. ౪౧. పా. వైజ. ౪, ఆ. ౮౦. వి. (సం. చూర్ణమ్) వక్కలు మున్నగువానియొక్కపొడి. "గీ. బ్రాహ్మి బోడతరంబు పిప్పలియుం వరయు,శుంఠియు నమంబులుగఁ దూఁచి చూరు చేసి." అప్ప. ౨, ఆ. ౪౨౯.

చూరుకత్తి. ద్వ. వి. (చూరు+కత్తి.) ఒకరకపు చిన్న కత్తి. (బ్రౌ.)

చూరుకమ్మి. వై. వి. పెండెలు జాతి రాకుండ ముంజూర నెత్తుగా నమర్చినపట్టె. (శ. ర. బ్రౌ.)

చూరుకట్టు. ద్వ. వి (చూరు+కట్టు.) ఇంటిమీఁది యాకులు మున్నగునవి గాలికి ఎగిరిపోకుండ గట్టిగా నుండుటకై నారతో కట్టెడుకట్టు. (శ.ర.బ్రౌ.)

చూరుకట్టుబద్ద. ద్వ. వి. (చూరుకట్టు+బద్ద.) చూరుకట్టుటకై నారగ్రుచ్చి దబ్బనమువలె నుపయోగించువెదురుబద్ద లోనగునది. (శ. ర.)

**చూరుకుట్టుదబ్బ** = చూరుకుట్టుబద్ద. (శ. ర.)

**చూరుపట్టె.** వై. వి. (చూరు+పట్టె.) చూరుకమ్మి. "సీ. చెలికొప్పుపయి నుప్పతిలుకప్పునకుఁ దోడు చూరుపట్టెలమెయిల్ చుట్టుకొనఁగ." కరివేల్పు శతకము. ౨, ౮. (శ. ర.)

**చూరుమొగ్గ.** వై. వి. (చూరు+మొగ్గ.) చూరుకమ్మియందు మొగ్గవలె నేర్పఱచిన యలంకారవిశేషము. "సీ. తోరంపుముత్యాలచూరుమొగ్గలచేత..." జై. ౫, ఆ. ౧౫౭. చం. రా. ౧, ఆ. ౨౩.

**చూరె.** వై. ని. 1. ప్రసిద్ధిని తెలుపును. "సీ. భూరితపంబునఁ జూరె ప్రజాపతుల్ బహువిధసృష్టి నిర్వహణనిపుణులైరి..." భార. అశ్వ. ౨, ఆ. ౨౦౩. కళా. ౫, ఆ. ౫౦; 2. నిశ్చయమును దెలుపును. (చూ. చూరే.)

**చూరెలుక.** ద్వ. వి. (చూరు+ఎలుక.) చూరులయందుండునొకజాతియెలుక. (శ. ర. బ్రౌ.)

**చూరే** = చూరె. (ప్రసిద్ధి.) "క. భూతంబులదర్శింపమి, భూతాన్వర్ణనము భూతములయెడ సంభా, షాతరలత నొందమి చూరే తెరువు విమోక్షసుఖగరిష్ఠత పడయన్." భార. శాం. ౬, ఆ. ౩౧౮. (నిశ్చయము.) "క...నాపుతనయ కాంతారములో, మారుతసఖు పాల్ వడియెడుఁ, జూరే యుపహుకు చెవులు సోఁకం బెలుచన్." దశ. ౩, ఆ. ౮౯.

**చూఱ.** వై. వి. (సం. చూరా. క. సూఱె.) కొల్ల. దోపిడి. "క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ జూఱ విడిచినట్టు తనదుసుజ్ఞానము న్రక్కయ విడిచి తన కంటెచు, మీఱ నొకటి లేమి గాను మెయికొనవలయున్." భార. అర. ౪, ఆ. ౨౦౨. దశ. ౨, ఆ. ౭౨; 2. కొల్లగొనువస్తువు. "శా... పౌండ్రవిభుం డాత్మీయులం జూచి చేపీచెం ద్రోయుండు కోటమేడలు పదర్ వ్రేయుండు డాయుండు లెండే చూఱెప్పుఁడు గొన్న నిత్తు నవిలావెక్కించె సంరంభియై." ఉ. హరి. ౩, ఆ. ౩౨.

**చూఱకాఁడు.** ద్వ. విశ. (చూఱ+కాఁడు.) కొల్లగొట్టువాఁడు. "సీ. జూదంబునకుఁ జొచ్చి చూఱకాండ్రను గూడి..." దశ. ౬, ఆ. ౬౫. సుద. ౧, ఆ. ౭౭.

**చూఱకారుఁడు.** మి. గ్రా. విశ. (చూఱ+కారుఁడు.) కొల్లపెట్టినవాఁడు. "వ...అపవరతమకవినికర స్తోత్రవచనరచనాసమయనిర్వికారుండును పెంచు పలచూఱకారుండును..." ఐ. పు. ౧, ఆ. ౧౫.

**చూఱకొను.** ద్వ. స. క్రి. (చూఱ+కొను.) కొల్లగొట్టు. "క. సురగరుడోరగకిన్నరప్రముఖుల వడిఁ జూఱకొనుచు..." భార. ఆది. ౮, ఆ. ౧౦౯. భార. మా. ౨౧౩.

**చూఱకోలు.** ద్వ. వి. (చూఱకొను. ధా.) చూఱకొనుట, కొల్లగొట్టుట. "చ...విప్రులఁ ద్రుంచి యశంబిల నించి పుత్త్రుఁ డెక్కటిచివి చూఱకోల్ ప్రియము గా కివి యప్రియమే తలంపఁగన్." భార. ద్రో. ౨, ఆ. ౨౫౭; 2. దోఁపుడు, చూఱ. "సీ...నెలఁతపిండు, హృత్కులు మనములుఁ జూఱకోలు గఁ గొని కాముక కటఁ డోరగట్టు గాఁడె." దశ. ౭, ఆ. ౬౦.

**చూఱకోలుగొను.** ద్వ. స. క్రి. (చూఱకోలు+కొను.) చూఱగొను. "మ...నాచిత్తము చూఱకోలుకొన రాగవ్యక్తి పుట్టించెనా..." దశ. ౩, ఆ. ౬౩.

**చూఱగైకొను.** ద్వ. అ. క్రి. (చూఱ+కైకొను.) చూఱగొను. "ఉ...రాక్షసులు పుణ్యజనాఖ్యులు పూర్వవైరముల్, భావములందుఁ గ్రందుకొన బల్విడి నాతని దేశ మెల్ల నిచ్ఛావిధిఁ జూఱగైగొని..." వి. పు. ౬, ఆ. ౬౦.

**చూఱగొను** = చూఱకొను. "వ...సమస్తవస్తువులను చూఱగొందము..." భార. విరా. ౩, ఆ. ౧౧౮.

**చూఱదెచ్చు.** ద్వ. స. క్రి. (చూఱ+తెచ్చు.) కొల్లగొట్టి తెచ్చు. "ఉ...అతనిం జెఱపం దఱి యయ్యె మట్టి సప్తాంగముఁ జూఱదెచ్చెద..." భార. విరా. ౩, ఆ. ౧౯౯.

**చూఱపట్టు.** ద్వ. స. క్రి. (చూఱ+పట్టు.) చూఱకొను. "చ...చెన్నలర మనోభవుండు విశిఖాహతి మానసము చూఱపట్టె..." పె. శతం. ౨, ఆ. ౧౫౬.

**చూఱపుచ్చు.** ద్వ. స. క్రి. (చూఱ+పుచ్చు.) 1. కొల్లగొట్టు. "క. నడచి విదర్భప్రాంతము, పొడియగఁ గాల్చియును జూఱపుచ్చియు..." దశ. ౧౧, ఆ. ౧౨౦; 2. ఆక్రమించు. "వ...విస్ఫులింగంబు లాస్ఫోటించి దిక్కులం జూఱపుచ్చ

జిచ్చు పెచ్చు పెఱిగె..." భీమ. ౪, ఆ. ౬౦; 3. అపహరించు. (చూ. చూఱపుచ్చు.); 4. చెడఁగొట్టు. "గీ. కటకటా చూఱవిడిచి యాకరణి ధరణి, సురకులాచారధర్మంబు చూఱపుచ్చుచుకొని దుశ్చేష్ట లారక మాచుచున్న." నిరం. ౨, ఆ. ౫౧.

చూఱపోవు. ద్వి. అ. క్రి. (చూఱ+పోవు.) (చూ. చూఱవోవు.)

చూఱయిచ్చు. ద్వి. స. క్రి. (చూఱ+ఇచ్చు.) యథేచ్ఛముగా ననుభవించుటకై యిచ్చు. "సీ. భూపల్లవుని మేనిపొందు నింపెసలార సొగయ మైత్రీ గొసఁ జూఱయిచ్చు." దశ. ౪, ఆ. ౬౪.

చూఱలాడు. ద్వి. స. క్రి. (చూఱలు+ఆడు) అపహరించు. "మ. అమరావాసము లెల్లఁ జొచ్చి దళజుం డత్యర్చిత ద్రవ్యజాతము నెల్లం బొరిఁ జూఱలాడినకథల్ ద్రవ్వంగఁ బెక్కేమి..." హరి. ఉ. ౪, ఆ. ౧౦౯. భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౪౯.

చూఱలిచ్చు = చూఱయిచ్చు. "సీ. నానామధుపవ్యగానామృతము మెచ్చి మానాసవము లెల్లఁ జూఱలిచ్చె." వసు. ౧, ఆ. ౧౩౩.

చూఱలుకొను = చూఱకొను. "ఉ. కోరిన మంచి తేనియలు క్రోలఁగ నిచ్చి సుగంధసంపదన్, జూఱలుగొన్న నోరిచి..." ఉ. రా. ౪, ఆ. ౧౫౭.

చూఱలుపట్టు=చూఱపట్టు. "చ. సురల జయించి దేవపురి చూఱలుపట్టి సమస్తలోకముల్, పొరిఁబొరి నేర్చునయ్యసురపుంగవకోటుల..." చిత్రభా. ౬, ఆ. ౧౫౭.

చూఱలువట్టు = చూఱపట్టు. "సీ. చెరలు చూఱలు వట్టునేఁగి మాన్పుమటన్న పెస నదే మఱియుఁ గావించె దీవు." సిం. సార. ౪౫.

చూఱలుసేయు = చూఱయిచ్చు. (చూఱలు+చేయు.) "ఉ...పన్నగరాజశాయికిన్, సొమ్ముగ వాక్యసంపదలు చూఱలుసేసినవాని..." భాగ. ౬, స్కం. ౧౨.

చూఱలువుచ్చు = చూఱపుచ్చు. "చ...అత్తమామల నెరియించి సోదరులమానము చూఱలువుచ్చి..." భాగ. ౧౦, స్కం. పూ. ౯౭౭.

చూఱలొసఁగు = చూఱయిచ్చు. "ఉ. క్రమ్మిన బాళి నంటి యెలప్రాయము చూఱలొసంగెవానికిన్." శుక. ౨, ఆ. ౫౫౫.

చూఱపట్టు = చూఱకట్టు. "శా. వేమాఱు న్మలయానిలుం డడరి యాపీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెస ముట్టి యందలియలివ్రాతంబుఁ బోఁ జోపి తా, నా మోదంబులు చూఱపట్టి బలియుండై..." విక్ర. ౧, ఆ. ౯౬. "సీ... జిష్ణు, గీ. సూదనుం డింద్రభామంబు చూఱపట్టి." సుద. ౫, ఆ. ౧౨౩.

చూఱవిడుచు. ద్వి. స. క్రి. (చూఱ+విడుచు.) చూఱకొన నిచ్చు. "గీ. కటకటా చూఱవిడిచి యాకరణి ధరణి, సురకులాచారధర్మంబు చూఱపుచ్చు" నిరం. ౨, ఆ. ౫౨. భార. అను. ౪, ౨౦౨.

చూఱవుచ్చు = చూఱపుచ్చు. (అపహరించు.) "ఉ. నా దగుసత్త్వధైర్యము మనంబును విన్కలి చూఱవుచ్చినన్." పద్మ. ౧, ఆ. ౧౬౨.

చూఱవోవు = చూఱపోవు. 1. (అపహృతమగు.) "గీ. నరున కెప్పాటవిద్యాధనంబు ధనము, చోరబాధాదికముల చేఁ జూఱవోవు ధనము ధనమా నె..." కాశీ. ౪, ఆ. ౧౧౨; 2. (నశించు.) "ద్వి. సుస్థిరగుణరత్న చూఱవోయితివె, నరలోకమెల్ల శూన్యం బయ్యె నేఁడు." పండితా. దీక్షా. ౪౨. పా.

చూఱాడు. ద్వి. స. క్రి. (చూఱ+ఆడు.) అపహరించు. "గీ. అమరగురుమానధనము చూఱాడు బోయి." సురా. ౧౦౨. ఉ. హరి. ౧, ఆ. ౧౧౦.

చూలాలితనము. ద్వి. వి. (చూలాలు+తనము.) గర్భిణీత్వము. "గీ. వ్రేఁకఁజూలాలితనమున వేవ్రెఁబెద్ద కాలఁతి కంతటు సిగ్గుఁబ్రొద్దు లయ్యె" భాగ. ౪, స్కం. ౫౦౨.

చూలాలు. దే. వి. స్త్రీ. (చూలు+ఆలు) కడుపుతో నున్న స్త్రీ. "శా. ఆలోకించి దరస్మితం బెనయ రామాధీశుఁ డప్పొంగి యచ్చూలాలిం దొడమీఁద నుంచికొని..." ఉ. రా. ౬, ఆ. ౧౪౦. ఆం. భా. ద్వి. ౧౦౯.

చూలి. దే. వి. చూలు, సంతతి. "గీ. అట్టివాసంతవేళ రామావనీశ, మాలిమున్నిటి మొలకూలిమగువ

చూలి..." ఉ. రా. ౬. ఆ. ౧౯. విణ. చూలుతో నున్నది.

చూలు. దే. వి. జొ. (క. చూలు. త. చూల్.) 1. గర్భము. "క...యశోదాదేవియును గూడఁ జూలు ధరించెన్." హరి. పూ. ౫, ఆ. ౧౧౪. ఆం. భా. ద్వి. ౧౦౯; 2. బిడ్డ. "మాలిని నలు మొగములచూలుక నల్ల నామేనిడాలున్." య. 3, ఆ. ౧౬౧. భాగ. ౪, స్కం. ౬; 3. గర్భస్థపిండము. (బ్రౌ)

చూలుకొను. దే. అ. క్రి. (చూలు+కొను.) గర్భము తాల్చు. "గీ...నిద్ర పోయినను జూలుకొన్నను బొర్లుచున్న." కాశీ. ౪, ఆ. ౬౦.

చూలుచేయు. ద్వ. అ. క్రి. (చూలు+చేయు.) గర్భమునిలుపు. "గీ...తారకావల్లభుండు, చూలు చేసినవాఁ డంచు సూక్ష్మఫణితి." కాశీ. ౪, ఆ. ౨౯.

చూలువడు. ద్వ. వి. (చూలు+పడు) చూలుకొను, కడుపుతో నుండు. (శ. ర.)

చూవె. ద్వ. వి. 1. నిశ్చయార్థకము. 'క...నిర్గత శోకస్థితి నున్నదానఁ జూవె ఖగేంద్రా." భార. ఆది. ౨, ఆ. ౫౦. నైష. ౧, ఆ. ౭3; 2. ప్రసిద్ధార్థకము. "సీ జలజాక్షి యిది పారిజాత ప్రసూనంబు నరులకు ధరియింప నరిది చూవె" పారి. ౧, ఆ. ౫౯. భార. ఆది. ౪, ఆ. ౭౪; 3. కావ్యాలంకారము. "చ. సురలవరప్రసాద మునఁ జూవె సుపుత్రులఁ బాండురాజుభా,సుర ముగఁ గాంచె..." భార. ఆది. ౫, ఆ. ౧౫౦. భార. సభా. ౨, ఆ. ౧౧౪.

చూవే = చూవె. (నిశ్చయార్థకము.) "క. నావుడు సాత్యకి యిట్లను,దేవా కుఱఁగటనె వెదకి తెలి యఁగవచ్చుం,జూవే చోరులఁ జారుల,చే వీటికి దవ్వు వోరు చిక్కుదు రింతన్." ఉ. హరి. ౫, ఆ. ౨౯.

## చొ

చొంగ. దే. వి. 1. నోటినుండి ఊరుద్రవము, చొల్లు. "సీ. చప్పరించుచువెడల్లు నట లబ్బ దంష్ట్రాగ్ని చొంగపైఁ బడి చుఁయి చుఁయి మనఁగ." స్వా. ౪, ఆ. ౧౭; 2. శాగత్రాగు గొట్టము. (శ. ర.)

చొక. వై. విణ. ఒప్పిదమైనది. ఆం. భా. తృ. ౧౪.

చొకము. వై. విణ. ఒప్పిదమైనది. "సీ. ప్రేంకనియ లుక కల్పించి మంచపుకోడు నొఁగలించుఁ జొకమ్ము కానివింత." కువల. ౫, ఆ. 3౫.

చొకా. వై. వి. కంచుకము. ఆం భా. ద్వి. ౧౫౬. విణ. 1. స్వచ్ఛమైనది. "మ. నిరతంబుకా బిలు కన్నిటారికిఁ జొకాలిద్దంపుటద్దంబులై." చం. రా. ౧, ఆ. ౧3. చంద్రా. ౪, ఆ. ౭3; 2. మంజులము. "ఉ. మాయచే,గాలఫుఁజివ్వఁ బో ల్చెలిచొకామెయి యెమ్మెయి డాయ నబ్బునో." ప్రబంధ." ౬౭3.

చొకాటము. విణ. 1. స్వచ్ఛమైనది. (చూ. చొక్కాటము.); 2. ఒప్పిదమైనది. "సీ. రోహణాచల శృంగమోహనాకృతిఁ జొకాటం బగుమనికిరీ టంబువాని." చం. రా. ౨, ఆ. ౫. ఆం. భా. 3, ఆ. ౧౪; 3. నిర్దోషము. "చ. పలుకువెలంది కిక మనికిప ట్టగుచాలుపు మోముఁదామరల్, గలిగియుఁ బ్రాఁతవల్కులు చొకాటముగా నుడు వంగ..." అచ్చ. బాల. 3౯. వి. అందము. సొంపు. "చ. కలికితనంపుర వ్వాకచొకాటము మేనిమెఱుంగుఁదీవకున్." శుక. ౧, ఆ. 3౫౧.

చొకాయి. వై. వి. కంచుకభేదము. ఆం. భా. ద్వి. ౧౫౬.

చొకారము. విణ. 1. స్వచ్ఛము. "ఉ. కారు మెఱుంగుసంపుల చొకారవు మేనిమెఱుంగు..." చంద్రా. ౨, ఆ. ౧3౫; 2. సుందరము. "క. ఎన్నఁడు చూతు నయో నిన్,గన్నులపండువుగ నిఁకఁ జొకారపునవలా,మిన్న..." రసిక. ౬, ఆ. ౪౮. వి. శోభ, కాంతి. "సీ. చానకాడెంపును న్మేనిచొకారంబు హేమాలిశయలీల నెగ్గు లెన్ను." రసిక. ౨, ఆ. ౭౭.

చొక్క. వై. వి. చక్కనిది. "సీ. ఉదిరిలంగరు వ్రాఁత హదనిపూపటి చొక్క నగతుఁ వహాంబట్టు మొగలి కల్లము..." చంద్రా. ౨, ఆ. ౬౯.

చొక్కటము = చొక్కము. (విణ. 1. చక్కనిది.) "గీ. పలుకుఁజెలి చొక్కటంపుబాట పట్టిమాట." చంద్రా. ౧, ఆ. ౫౪. పాండు. ౫, ఆ. ౨౦; (2. మంజులము.) "గీ. చొక్కటంబని వెలయుం మంజులసమాఖ్య." ఆం. భా. తృ. ౧౪; (3.

నిర్విఘ్నుఁడు.) "ఉ. చొక్కటమై ఫలించు మన శోభనకార్యము లెల్ల టిట్టిభా." క్రీడా. ౫౧. (వి. అందము.) "చ. చెఱుదొడలందమా చికిలి చెక్కులచొక్కటమా..." శుక. ౧, ఆ. ౩౯౪. ప్రబంధ. ౪౯౫.

చొక్కణ. దే. వి. శీతలకీ. (శ. ర.)

చొక్కతరము. వై. విణ. (సం. చోక్షతరమ్.) 1. స్వచ్ఛము. "గీ. చొక్కతర మైనవేసురుఁజుక్క వొడిచె." చంద్రా. ౫, ఆ. ౧౧౪; 2. నిర్దోషము. "గీ. చొక్కతర మైనగోపకస్తూరి యులఁది." చంద్రా. ౪, ఆ. ౨౬౭.

చొక్కము. వై. వి. కాంతిగలకెంపు. ఆం. భా. ద్వి. ౨౭౭. విణ. (సం. చోక్షమ్. క. తు. చొక్క. త. సొక్కం.) 2. నిర్దోషము. "శ... నీచొక్కపుఁగొడుకును నీవును, వొక్కతమై స్రుక్కుమాని యుండుఁడు నెమ్మిన్." హం. పూ. ౫, ఆ. ౨౩౧. రామా. ౪, ఆ. ౬౯, 2. సుందరము. "క... మొగము తేట స్రీబడలీరా, చొక్క మగుదీనిఁ జూచినఁదొక్క మనం గూడ దెట్టిసుజ్ఞానులకున్." విజ. ౨, ఆ. ౧౦౩; 3. మనోజ్ఞము. "ఉ... కంకణనూపురాకృతిఁ, జుట్టిరి పాణిపాదములఁ జొక్కముగా బిసకాండ కాండముల్." విక్ర. ౪, ఆ. ౧౬౦. ఆం. భా. తృ. ౧౪; 4. స్వచ్ఛము, విశదము. "వ... తమ చక్కనినగవు చొక్కపుజీనిచక్కె రని..." దశా. ౧, ఆ. ౧౪; 5. అనుకూలము. "క. దిక్కు లకుఁ గొంద అరుగుం,డక్కడ జల మరసి యిచటి కరుదేరంగాఁ,జొక్క మగుచోటి కరుగుదము ..." నా. పంచ. ౩, ఆ. ౮౦. వరాహ. ౩, ఆ. ౯౨.

చొక్కా. వై. వి. చొక్కాయి. ఆం. భా. ద్వి. ౧౬౫. విణ. మిక్కిలి స్వచ్ఛమైనది. (ఉ. చొక్కాపొత్తము. శ. ర.)

చొక్కాకు. ద్వ. వి. (చొక్కు+ఆకు.) జొన్న మున్నగువానియెండినఆకు. "ద్వి. చొక్కాకు గాలికి స్రుక్కుచు..." బస. ౪, ఆ. ౭౬౯. పం. హరి. ఉ. ౬. ఆ. ౧౩౫.

చొక్కాటము = చొక్కటము. (మనోజ్ఞము.) "మ... క్రొం,దళుకుంగందపు రేక బల్ సరిపెణల్ బాగైనచొక్కాటపుం,బలుకుందత్తడి నెక్క..." చంద్రా. ౩, ఆ. ౬౪.

చొక్కాయ. వై. వి. (తె. సొక్కాయ్.) చొక్కా, అంగరేఖ. "సీ... కంచుకభేద మలరారుఁ జోలా చొకాయ చొక్కాయ చొక్కా చొకా చొ,గా నాఁగ..." ఆం. భా. ద్వి. ౧౫౬.

చొక్కారము. వై. వి. మిక్కిలిస్వచ్ఛత. (చూ. చొకారము.) విణ. మిక్కిలిస్వచ్ఛమైనది. "ఉ... చొ,క్కారపువల్వపావడలు గట్టి..." షోడ. ౮, ఆ. ౮౭.

చొక్కించు. దే. స. క్రి. (చొక్కుధా. ప్రే.) చొక్కఁజేయు. "శా... కౌఁగిట శయ్యాతుం దిగిచి సొక్కించుం గళాపై ఖరిన్." కృ. శతం. ౩, ఆ. ౪౭. వేం. పంచ. ౩, ఆ. ౨౫౨.

చొక్కిడు. దే. స. క్రి. (చొక్కు+ఇడు.) మోస పుచ్చు. "చ... స్రుచ్చితి వధూటిఁ గొందుఁ బ్రజః జొక్కిడి పోయినవాఁడు చూచితే." విక్ర. ౬, ఆ. ౭౬.

చొక్కిపడు. ద్వ. అ. క్రి. (చొక్కి+పడు.) 1. ఆశ్చర్యపడు. "గీ... ఈశన్న చక్కఁదనము, నక్క మెక్కడ తే దని చొక్కిపడఁగ." దశా. ౮, ఆ. ౭౯; 2. సోలిపడు. "ద్వి... పాటిదప్పినఁ జొక్కిపడియెడువారు." పండి తా. పర్వ. ౪౩౪. పు.

చొక్కిలి. దే. వి. చొట్టు. (చూ. చొక్కిల్లపోవు.) (శ. ర.)

చొక్కిలు. దే. అ. క్రి. వ్యామోహపడు. "చ. చక్కెరలప్పుకున్ మిగుల జవ్వనికెంజిగురాకు మోవికిన్, జొక్కపుజుంటితేనియకుఁ జొక్కిలుచుం గనలేరుగాక..." దా. శ. ౨౮.

చొక్కిల్లపోవు. దే. అ. క్రి. (చొక్కిల్ల+పోవు.) చొట్టలుపడు. "సీ. కదిసి మై గదంగఁ గౌఁగిట బిగియింపఁ జొక్కిల్లపోయినసొమ్ము లోడ." య. ౨, ఆ. ౯౯.

చొక్కు. యు. దే. అ. క్రి. (క. సొక్కు. త. చొక్కు.) 1. పరవశమగు. "క. సుదతికి మధు సేవఁ దనువు చొక్కఁగఁ జొచ్చెన్." కవిక. ౪, ఆ. ౧౫౯. నైష. ౨, ఆ. ౧౧౫; 2. వలపుగొను. "సీ. చూచిన మగత్తైనఁ జొక్కఁజేయఁసౌందర్య...

సంపద సొంపుదాల్చె నతియం." నిర్వ. ౧, ఆ. ౪. వరాహ. ౧౧, ఆ. ౪౧; 3. లొంగు. "గీ. ఇట్టితఁడు శైలజకుఁ జొక్కి తెలిఁగియొక్క." పసు. ౬, ఆ, ౯౮. దశా. 3, ఆ. ౯౪; 4. మరణించు. "మ. మడిసెం గారెవుపోతు లేదు లిలిగెన్... గజాళి చొక్కె..." సా. ౧, ఆ. ౧౦౭; 5. ఇష్టమగు. (వా:— ఈకూర నాకు చొక్కదు.) వి. 1. పారవశ్యము. "క. అని వనజముఖులు చొక్కునఁ దను వెఱఁగక పలుకుచుండ..." రుక్మా. 3, ఆ. ౨౩౬. స్వా. ౫, ఆ. ౭౬; 2. వలపు. "ఉ. అక్కట నీదెసం బిలికి నాతిడి కూరిమి యుగ్యో మాయపుం జొక్కులు నీవు నిక్క మఁగఁ జూచి..." భార. అర. ౬, ఆ. ౨౯౭; 3. మద్యపానాదులమత్తు. "ఉ. ఆనమయంబునఁ గా(?) సరిజాసవు పెట్టిన చొక్కు కుంభకర్ణాసురు మోమునం గదిరె..." నిర్వ. ౪, ఆ. ౧౯. దశా. ౨, ఆ. ౧౨౯; 4. మూర్ఛ. "సీ. ఇక్కురు సైన్యంబు చొక్కు దక్కక యున్న గ్రక్కునఁ జనుము..." భార. విరా. ౫, ఆ. ౨౧౦. భార. విరా. ౫, ఆ. ౨౦౭; 5. మత్తుమందు. "గీ. గొల్లపల్లియలో నున్న గొల్ల వారు, చొక్కు చల్లినవైవడి నొక్కరైన, మేలుకొనక నిద్రింప..." వి. పు. ౭, ఆ. ౭౬. పరమ. ౪, ఆ. ౧౮౪.

చొక్కుటాకు = చొక్కాకు. "సీ. సొంపుగాకు శారాకు చొక్కుటాకు వగచు..." ఆం. భా. ద్వి. ౨౩౮.

చొక్కునీరు. ద్వ. వి. (చొక్కు+నీరు.) కల్లు. "క. అడవికి వ్రేలిమి పసరము, బడిఁ జన రక్కసు లెలిఁగి పట్టుకొని కచున్, వడి మాదిసేసి కనకున్, దొడిఁబడఁగాఁ జొక్కునీటితో నిచ్చి రొగిన్." య. 3, ఆ. ౧౨౨.

చొక్కువెట్టు. దే. స. క్రి. (చొక్కు+పెట్టు.) చొక్కుపొడి మున్నగువానిచే వశముతప్పునట్లు చేయు. "వ... అమ్మాయలాఁడి యక్కుమారునిఁ జొక్కువెట్టి తెచ్చుకలంపునం జని..." వి. పు. ౮, ఆ. ౧౬౪. పండితా. మహిమ. ౩౦౬. పా.

చొక్కుపొడి. దే. వి. (చొక్కు+పొడి.) మీఁద చల్లినంతనే మత్తు గలిగించుమందు. "గీ. కపుచ కన్నపుఁగత్తి చొక్కుపొడిబరణి." దశా. ౧, ఆ. ౨౬౦

చొక్కుమందు = చొక్కుపొడి. "ఆ. చొక్కుమందు లనఁగ సోకుగంబుల గనులనఁగ..." నృసిం. ౧, ఆ. ౪౭. రావి. 3, ఆ. ౧౧.

చొక్కుమడఁగు. దే. అ. క్రి. (చొక్కు+మడఁగు.) 1. (నిద్రాదులచే) వివశమగు. "వ... అంతంత సాగి ప్రజలు చొక్కుమడంగి యుండఁ దానయ్యవసరంబున..." కాశీ. ౪, ఆ. ౧౨౦; 2. పోవు. 'సీ. నేత్రంబు లున్మేషనిష్ప్రహత్వము నొంద శ్రుతిపుటంబులశక్తి చొక్కుమడఁగ." కాశీ. ౧, ఆ. ౧౩౯.

చోగా = చొక్కాయ. ఆం. భా. ద్వి. ౧౫౬.

చొచ్చినిల్లు. దే. వి. (చొచ్చిన+ఇల్లు.) 1. శ్వశ్రుగృహము. (గా.); 2. ఆశ్రయస్థానము. "ఆ. సుగుణములకు నెల్ల జొచ్చినిల్లు." భార. శాం. ౧, ఆ. ౩౩౬.

చొచ్చిలు. దే. అ. క్రి. (చొచ్చు+ఇల్లు.) ప్రవేశించు. "క. ముచ్చులు తెక్కలికాంద్రుం, జొచ్చిలి యొప్పింతు రెపుడు జూదపుసభలన్." విజ్ఞా. ప్రా. ౪౦. (రూ. చొచ్చిల్లు.)

చొచ్చివచ్చు. దే. అ. క్రి. (చొచ్చి+వచ్చు.) మీఁదికి త్రోసికొని వచ్చు. "సీ. జ్యోత్స్నతృణ యటంచుఁ జొచ్చిరాకు చకోర..." ఇందు. ౪, ఆ. ౫౮.

చొచ్చు. దే. అ. క్రి. 1. యత్నించు. "క. కురునఁ దనము మెయి నరిగొనఁ జొరఁ దగ దది పొదుఁగు కొయుంచొ ప్పగు విను..." భార. శాం. ౨, ఆ. ౨౯౯. విప్ర. ౫, ఆ. ౧౯; 2. మొదలుపెట్టు. "గీ. అరుగనుదయాస్తమయములయందుఁ గృష్ణ, కాంతి ఘోరకబంధంబు కప్పఁజొచ్చె." భార. భీష్మ. ౧, ఆ. ౧౧. హర. ౨, ఆ. ౧౭; 3. సిద్ధపడు. "ఉ... ఈతఁడు దొంగకూటికే, లాగునఁ జొచ్చె..." విప్ర. ౫, ఆ. ౪౧. కళా. ౪, ఆ. ౯౯; 4. అంగీకరించు. "క. గురుభీష్మాదులవచనములు, దఁరమఁనకుం జొరకయుండ..." భార. ఉద్యో. ౧, ఆ. ౫౮. భార. శాం. ౨, ఆ. ౨౫౭; 5. ప్రవేశించు. "గీ. అంతఁ ద్రేతాయుగము చొచ్చె..." కవిరా. ౫, ఆ. ౨౯౨. కళా. ౫,

ఆ. ౧౨౫; 6. పుట్టు. "క. పితృకార్యయజ్ఞ ముఖముల, శ్రుతిచోదితహింసఁ గీడు సొర నేరదు ..." భార. అను. ౪, ఆ. ౨౯౧. స. క్రి. 1. ప్రాపించు. "క...చొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్." భాగ. ౭, స్కం. ౨౪౯; 2. ఆశ్రయించు. "క...ముకుంowdమని నాశ్రయించవయ్య యతని జొచ్చిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్." భార. ఉద్యో. ౨, ఆ ౩౨౧. స. క్రి. అ. క్రి. ప్రవేశించు. "క. పరిహాసము భాషణమును, నిరీక్షణము లోనుగాఁగ మనసు సొత్తురు సుదతుల్." భార. శాం. ౪, ఆ. ౩౦౦. భార. భీష్మ. ౨, ఆ. ౩౬౭. భార. విరా. ౪, ఆ. ౨౪౯.

చొంచొ్ఛ. దే. వి. పశువులు మున్నగు వానిని తోలుట యందలియనుకరణము. "క. వచ్చినది లాగికొని మఱి,చొంచొ్ఛ యనిపింతు నిదియసూ మత మను చున్." వైజ. ౩, ఆ. ౯౯. (చొంచొ్ఛయనిపింతు = వెడలఁగొట్టుదు అని భావము.)

చొటచొట. దే. వి. చెమట మున్నగునవి కాఱుట యం దగున నుకరణము. "క...చొటచొటఁ గన్నీరు దొరుఁగ..." భో. ౫, ఆ. ౩౬. "క... మేనం, జొటజొటఁ జెమటలు కాఱఁగ..." వరాహ. ౨, ఆ. ౧౦౫. "చ. చొటచొటగా సుధారసము జొబ్బిలుచున్న శశాంకురీతి..." బిల్హ. ౩, ఆ. ౫౧.

చొట్ట. దే. వి. 1. చెంబు లోనగునవి క్రిందఁబడుటచేఁ గలుగునొక్కు. (వా.); 2. దేహమునందు వ్యాధి మున్నగువానిచేఁ గలుగుపల్లము, వంకర. (బ్రౌ. వా.) విణ. వ్యాధి మొదలగువానిచే వంకరైనది. "చ...ప్రకం,పనునకుఁ గేలు చొట్ట ..." రసిక. ౧, ఆ. ౪౧.

చొడచొడ = చొటచొట. "చ. ఆడిదముప్రేటునం బఱియ లైనశరీరమునందు నెత్తురుల్, చొడ చొడఁ గ్రమ్మ..." హరి. ఉ. ౪, ఆ. ౨౭.

చొడిమిడి. దే. వి. వృక్షవిశేషము. (బ్రౌ.)

చొత్తెంచు. దే. అ. క్రి. (చొచ్చు+తెంచు. స్వార్థమున.) ప్రవేశించు. "మ...తపోరణ్యంబు సొత్తెరఁగన్." ద్వా. ౫, ఆ. ౧౦౭. "క. అగ్రహారోపలి కెంతయుం, దిగ్గనఁ జొత్తెంచి..." రసిక. ౬, ఆ. ౧౩౪.

చొవగు. దే. వి. తడి, చెమ్మ. స్రగ్ధర. హస్తీంద్ర హస్తాంచితవమథుల జేజేలపెంద్రోవ లెల్లన్ జొదు గొందన్." ఉ. రా. ౪, ఆ. ౨౫౫.

చొదుము. దే. వి. ఎండినఅరఁటిపట్ట. (శ. ర.)

చొనుపు. దే. స. క్రి. ప్రవేశపెట్టు. "సీ. ఆహార ములు గొనునవియందు నగునవి గానివి యనువివే కంబు బుద్ధిఁ,జొనుపఁడు..." భార. అశ్వ. ౧, ఆ. ౧౬౬; 2. గ్రుచ్చు. "క. తనువున శితశరములు వడిఁ,జొనిపి యతం డతనిఁగళితశోణితుఁ జేసెన్." భార. కర్ణ. ౧, ఆ. ౧౬౨; 3. ధరించు. "గీ. చొనిపె సీమంతవీథిఁ జేర్చుక్కయొత్తు." ఆము. ౬, ఆ. ౧౨౭, 4. ప్రయోగించు. "క...దర్పలు, గొని మారణమంత్రములను ఘోరతరముగాఁ, జొనిపిన దివ్యాస్త్రము లయి..." వి పు. ౨, ఆ. ౧౨౦; 5. తూర్చు, పెట్టు. "సీ...శార్దూల చర్మంబు చంకఁ జొనిపి..." పారి. ౫, ఆ. ౭౬. కాశీ. ౪, ఆ. ౧౨౧; 6. కలిగించు. "ఆ. బాల కేళి మీఁదిభరము క్రమంబున, విడువఁ గళలయందు వేడ్క సొనిపి." భార. విరా. ౧, ఆ. ౨౫౧; 7. ఆచ్ఛాదించు, కప్పు. "సీ...చేలాంచలము పెఱచేతఁ దడవి తెచ్చి పాలిండ్లమీఁదికిఁ జొనుపుచు..." ప్రభా. ౫, ఆ. ౫౩; 8. వ్యాపింపఁ జేయు. "చ...హాసము నునువాతెఱం జొనుపు శారద శొల్పుఁ గృతీంద్రుసూక్తులన్." చం. రా. ౧, ఆ. ౬; 9. ప్రేరేపించు. "సీ. హార్యక్ష దుస్సహశౌర్యగుణాకల్పఘనపదాతులఁ బయిఁ జొనిపి." భా. రా. యు. ౧౯౪౭. భార. భీష్మ. ౧, ఆ. ౧౬౯.

చొప్ప. దే. వి. 1. జొన్న లోనగువాని దంటు. "చ...పండువెదు ళ్లవలీల మోరత్రోపులఁ బడఁ జొప్ప వంచుకొనుపోలిక వంచి..." స్వా. ౪, ఆ. ౧౦. ఆం. భా. ద్వి. ౭౬; 2. కోసి యెండించిన జొన్న లోనగువానిదంటు. "గీ. ఇఱుకుప్రాను పెరంటిలో నెక్కబావి,మునగలును జొప్ప పెను వామి జనుము..." శుక. ౨, ఆ. ౪౦౭. "సీ. భిన్నయవము ఖనాళంబు చెలఁగఁ జొప్ప, యనఁగ ..." ఆం. భా. ద్వి. ౨౩౭.

చొప్పకాఁడి. దే. వి. (చొప్ప+కాఁడి.) రెండెడ్లను గట్టి త్రోలెడు దిండువంటి చొప్ప మోపు. (శ.ర.)

చొప్పడు. ద్వి. అ. క్రి. (చొప్పు+పడు.) 1. కలుగు. "క. శ్రుతులును శాస్త్రములు బహు, శ్రుతులవలన వింటి శాంతి చొప్పడ వలదే. మృతికి నృపు లదరుడురె ధీ,యుతు లీవిధమునకు శోయకుండుదురె నృపా." భార. స్త్రీ. ౧, ఆ. ౧౫. భార. శల్య. ౧, ఆ. ౩౦౭; 2. సరిపడు. (శ. ర.); 3. నిద్ర మొ. వచ్చు. "క. అప్పుడు నుండియు జాగ్ర,గప్పిలోనిన చిత్తవృత్తి గల్గెడు మేనున్, నిప్పులఁ బొరలినయట్లయి,చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯. నిర్వ. ౧౦, ఆ. ౭౮; 4. దొరకు. "గీ. ఆఁకటను నీరువట్టున నగ్గలంపు,డప్పిఁ బుట్టఁగను నొకచోటఁ జొప్పడమిని, దొంటిపగను జిట్టనఁ గిరాతుండువోలెఁ,జంపి యగ్గోవురక్త మాంసములు గొనియె." హరి. పూ. ౨, ఆ ౪౫ దశ. ౭, ఆ. ౧౦౭; 5. లభించు, ప్రాప్తించు. "క. ఎప్పుడు శ్రీగిరి కరుగుదు, మెప్పుడు శంకరునిఁ జూతు మెప్పుడు శుభముల్, చొప్పడు..." శివ. ౫, ఆ. ౯౨; 6. సాగు, జరగు. "సీ. చూఱ యెప్పుడు నిట్లు చొప్పడునట్టుగా..." దశ. ౨, ఆ. ౭౧; 7. అర్హమగు. "క. అధన్యుఁడు గాఁ డన్యుఁ,డసాధారణుఁ డతఁడు దైవసన్నిధి నతనిన్, శోధనచేసినఁ గాక యు,శోధన యుండో కటి దలఁచ జొప్పడ దింకన్." సా. ౩, ఆ. ౪. రాఘవ. ౧, ఆ. ౪. శక్యమగు. "క. తినుము హరితోడు గలయర్జును గెలువ నదీసుతునకుఁ జొప్పడునె..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౧౧; 9. తిన్నఁబడు. "సీ. పేరుకోఁ దగినట్టియూర లేనియుంటను వరులబుద్ధులకుఁ జొప్పడనిమంకు." శుక. ౩, ఆ. ౧౮; 10. సహాయపడు. "సీ అంగనాజితుఁ డైనయట్టి పాలసునకు బంధుసంఘంబు చొప్పడనియట్లు." జై. ౨, ఆ. ౧౮. మార్కం. పీఠి. ౫; 11. ప్రాలు. "క...కడువేగమ్మునఁ, త్రిపురహరునిహా,స్తమ్మునఁ జొప్పడియెఁ గని యతఁడు వెస మ్రింగెన్." భార. శాం. ౫, ఆ. ౪౭౧; 12. ఒప్పు. "మ...కినుకం జాబిల్లిముక్కంటి దాఁ,బొడుపుం గెంపును వేఁడి కంటి నిరులన్ ధూమిల్లుమే నేర్చి చొప్పడఁ దద్భాతి యలంచె నా నపుడు బింబం బొప్పెఁ బాండుద్యుతిన్." హరి. ౨, ఆ. ౫౪. భార. ద్రో. ౧, ఆ. ౩౫౫.

చొప్పబెండ్లకుంచెములు. ద్వి. వి. బ. బాలక్రీడా విశేషము. "సీ. బండ్లకల్లను జొప్పబెండ్లమంచములు గంగెద్దులాటలు..." హంస. ౩, ఆ. ౧౪౬.

చొప్పరి. దే. విశే. (చొప్పు+అరి.) 1. త్రోవ తెలిసినవాఁడు. "వ...అప్పటప్పటికిం జొప్పరులవలన నుప్పతిల్లిన దప్పళ్లకు దెప్పరంబై తిప్పలం దూఱుదుప్పులను..." ఉ. హరి. ౪, ఆ. ౨౯; 2. గుర్తు తెలిసినవాఁడు. ఆం. భా. ద్వి. ౧౮౬.

చొప్పరించు. దే. స. క్రి. (చొప్పఱు. ధా. ప్రే.) చొప్పడఁజేయు. (శ. ర.)

చొప్పరికించు. దే. స. క్రి. (చొప్పు+పరికించు.) పరికించు, చూచు. "ఉ. ఎప్పుడు గంగకుం జనుదు నెప్పుడు మానులపావపద్మముల్, చొప్పరికింతు..." శివ. ౩, ఆ. ౧౩౩.

చొప్పఱచు = చొప్పరించు. (ఆరోపించు) "క. అప్పుడు నీయెడ దోసము, చొప్పరుపు దలఁచు నట్టిచో మీఁ దెట్లో,యొప్పరికింపుము..." అచ్చ. భా. ౧, ఆ. ౭. పా.

చొప్పించు = చొనుపు. (శ. ర. బ్రా.)

చొప్పిక. దే. వి. బొమ్మ. "చ. తరుణులు చిల్కబొమ్మలును దంతపుబొమ్మలు మేలిగాజు బస్సరులును మ్రానిచొప్పికలు..." కు. సం. ౨, ఆ. ౭౯.

చొప్పిల్లు. దే. అ. క్రి. చొప్పడు, తగు. (శ. ర.)

చొప్పు. దే.వి. 1. మార్గము. "వ...ముక్కంటి మింటి చొప్పునం జనియె..." స్వా. ౬, ఆ. ౫౮. ఆం. భా. ద్వి. ౮; 2. పద్ధతి,రీతి. "ఉ. అమ్మొన సొచ్చు చొప్పు తెలియన్ విని నంతియె కాని యిమ్ములం,గ్రమ్మఱుభంగి వాఁడు వినఁ గానఁడు..." భార. ద్రో. ౨, ఆ. ౨౩౫; 3. పోలిక. "చ. సురలకుఁ గల్పభూరుహము చొప్పునఁ గోరిన కోర్కు లన్నియుం గురియుదు వీవు..." హరి. ఉ. ౨, ఆ. ౧౫౬; 4. జాడ. "గీ. కాల్పలంబులు నానాఁటఁ గలయఁ బొలిసెఁ,జొచ్చి యొకఁడును

ప్రతికినచొప్పు లేదు." భా. రా. యు. ౧౯౨౪. భార. అర. ౭, ఆ. ౪౦౯; 5. హేతువు. "ఆ. వృత్తి లేనిచొప్పు విప్రుల నడిగిన..." భాగ. ౯, స్కం. ౬౬౨; 6. కృత్యము. "క. కలు దోసంబున రాక్షసులు చేసినయట్టికాలిచొప్పును మదిలోఁ దెలిసికొని..." య. ౩, ఆ. ౧౩౫; 7. సత్యము. "ఉ. కీడున కోడ కించుకయుఁ గేకయభూపతియింటఁ బుట్టి చొప్పాడక పాప జాతి వయి తక్కుట..." భా. రా. అయో. ౨౦. రం. రా. ఉ. ౧౬౪. శా. ౧౨. వం; 8. అవకాశము. "గీ. పురము వెల్వడి కాళికాపుణ్య భవనసీమ సంకేత మట కేపు చేసి మనుచుఁ, జెప్పి వాచాలి పతిలేనిచొప్పుఁ జూచి, పుత్త్రు నిద్దురపుచ్చి తాఁ బోయె నటకు." హంస. ౩, ఆ. ౩౯; 9. వంతు. (వా. ఒక్కొక్కరికి రెండు పండ్లచొప్పున నిచ్చిరి.); 10. వేషము. "సీ. చొప్పు మార్చితిఁ బెక్కుచోట్ల శాత్రవభీతి నావారుఁ గన లేరు నన్ను నరసి." కళా. ౯, ఆ. ౧౬౬. స్వా. ౩, ఆ. ౫౬.

చొబలము. దే. వి. గుబ్బముగర్భమునం దుండుపిండము. (శ. ర. బ్రౌ.)

చొరఁబడు. ద్వి. అ. క్రి. (చొరన్+పడు.) ప్రవేశించు. "క. అనుచు సరోవరమున నవ్వనితలు కొండొరులమీఁటి వడిఁ జొరఁబడిరి..." ఉ. హరి. ౩, ఆ. ౩౭. నిర్వ. ౩, ఆ. ౩౪.

చొరఁబాఱు. దే. అ. క్రి. స. క్రి. (చొరన్+పాఱు.) చొచ్చు, ప్రవేశించు. "చ...గార వంపుఁజూపు, తమకడ నిల్చి నిల్చి యది తాపముఁ బెంచిన లేఁతలేపనజాంపముఁ జొరఁబాఱు..." భార. విరా. ౨, ఆ. ౩౦౩. ఆం. భా. తృ. ౧౨౨. అ. క్రి. కలహమునకు డీకొను. "క... కరి కరియుంన్ భటుఁడు భటుఁడు గాఢచ్ఛలనన్, జొరఁబాఱి పోరుతఱి..." రా. వి. ౫, ఆ. ౬.

చొరఁబెట్టు. దే. స. క్రి. (చొరన్+పెట్టు.) చొరఁ జేయు, ప్రవేశపెట్టు. (బ్రౌ.)

చొరపోఁత. దే. విశే. (చొరవ+పోఁత.) 1. నిరంతరము. (శ. ర. బ్రౌ.); 2. ఏకవరుసగా. (బ్రౌ.)

చొరవ. దే. వి. 1. ప్రవేశము. "వ...కలియుగంబు చొరవ యాసన్నం బయ్యె..." భార. శల్య. ౨, ఆ. ౩౦౫. భార. ద్రో. ౫, ఆ. ౫౬; 2. సాహసము. "ఆ. తెఱవ నేను నోరు దెఱవ నుండఁగఁ గాక, చొరవ గొనుచు నిల్లు చొర వశంబె." వైజ. ౩, ఆ. ౯౭; 3. (పదార్థముల) రుచి. "వ...ముట్టంబడినరోగంబు నుం బోలెఁ జొరవ యీక..." కవిక. ౪, ఆ. ౧౧౩. భాగ. ౧౦. స్కం. పూ. ౧౯౪; 4. బుద్ధి కుశలత. "క. తను వొప్పెడునది యౌవనమును నూతన మిట్టి నీచఁ బోలఁటి యోగంబున నింత చొరవ యెమ్మెయిఁ బనుపడియెం జెపుము దాఁపఁ బని లే దింకన్." భార. శాం. ౬, ఆ. ౧౮౭. "సీ. మున్ను నాపెట్టినకన్నంబు నచ్చోటు చొరవకు నిమ్ముగు తెరువు గాఁగ." దశ. ౬, ఆ. ౧౮౦.

చొరవకత్తియ. ద్వి. విశే. (చొరవ+కత్తియ.) చొరవగలది. (శ. ర.)

చొరవకత్తె = చొరవకత్తియ (శ. ర.)

చొరవకాఁడు. దే. విశే. (చొరవ+కాఁడు.) 1. ప్రవేశించువాఁడు. "సీ. తెలియంగ మీమాటములు వేలకొలఁదులు చూడ మీరలు గండిచొరవ కాండ్రు." చంద్రా. ౪, ఆ. ౬౧; 2. సాహసము గలవాఁడు. "గీ. జూటుఁదనమున సభ లెక్క చొరవకాండ్రు." ఆము. ౪, ఆ. ౬౧.

చొరపడి. దే. వి. (చొరవ+పడి.) చొరవ, సాహసము. (బ్రౌ.); 2. ఒకవిధమైన పోటుబండి. (బ్రౌ.)

చొరియ. దే. వి. చరియ, ఏటవాలుగానుండుకొండ గట్టు. (బ్రౌ.)

చొరుగు. దే. వి. 1. చొక్కు. "క. సురగాలిం బడినచొప్పుచొరుగును బోలెన్." జై. ౫, ఆ. ౯౪; 2. బీసువాముష్కగు వానిఅర. (వా.) విశే. ఎండినది. (చూ. చొరువు.)

చొరుదల. దే. వి. మొదలు. "వ...ఆపురుషోత్తముం డప్పెను రేయి చొరుదలయందు..." భాగ. ౯, స్కం. ౭౧౬.

చొరువు = చొరుగు. వి. (ఎండినయాకు.) "క. అనిలాస్త్రంబు ప్రయోగించిన సంశప్తకులు దెసలఁ జెదరి చొరువుచాడ్పునఁ దూలఁగ..." భార. ద్రో. ౧, ఆ. ౨౬౪. విశే. ఎండినది, శుష్కించినది. "క. విరులుఁ జిగుళ్లను జొరువుగ, సిరిగందపు

టస లోకింత చిలచిల మని వేగిరము వరుపట్టు గొన..." కళా. ౬, ఆ. ౨౫౪.

చోఱ. దే. వి. 1. మత్స్యవిశేషము. "చ...అబ్ధిఁ బెట్టోఱ దఱియంగఁ జొచ్చుగతి చొప్పడ వానరసేనఁ జొచ్చి..." భా. రా. యు. ౯౦౭. ఆం. భా. ప్ర. ౧౫౯; 2. బాలుఁడు "ద్వి. చోఱ నీకుఁ జోరరాదు చోరఁగ నుద్వృత్తి, కోఱ గాదు..." రం. రా. సుం. (శ. ర.)

చోఱచోఱ. దే. వి. నెత్తురు కాఱుట నిప్పులు రాలుట యం దగు ననుకరణము. "క. నెఱకులు దాఁకినయమ్ములు, చోఱచోఱ నెత్తురులు వడియ ...." హరి. ౧౦, ఆ. ౧౯౪. "చ...కన్నులం, జోఱచోఱ దుర్విషానలము జొబ్బిలుచుండఁగ ...." భాగ. ౧౦, స్కం. పూ. ౬౬౨.

చోఱిగాఁడు. దే. వి. బోయ. "చ...పిఱుంద తొప్పు చోఱిగాఱకుఁ గాక..." ఉ. హరి. ౪, ఆ. ౨౯.

చోలచు. దే. స. క్రి. బాధించు. "క. పలుమఱు నీచందమునన్, బలవింపఁగ దైవగతిఁ గృపాతత్పరులై, పిలిచి కిరాతులు బాలకుఁ, జోలవక గొని వచ్చి నాకుఁ జూపి ముదమునన్." దశ. ౨, ఆ. ౭౩.

చోలయు. దే. అ. క్రి. 1. జాఱు, వెసదీఱు. "క. నీవగచినయీయర్థము, మావిమనంబునఁ దలంతుఁ జోలయక యేనున్." భార. ఆది. ౫, ఆ. ౧౩౧. భార. సభా. ౧, ఆ. ౧౧౯; 2. మూర్ఛపోవు. (శ. ర.); 3. వైముఖ్యమునందు. (శ. ర.); 4. వైరస్యము నందు. (శ. ర.) [(బ్రా.)

చోలిమిడి. దే. వి. అల్పమారిషము, చిఱ్ఱికూరకు.

చోల్లు. దే. వి. చొంగ. "సీ. చోల్లు గారెడినోరు తెల్లనిగడ్డంబు..." చెన్న. ౨, ఆ. ౨౯. బస. ౬, ఆ. ౭౧౬.

చోల్లియము = చొల్లెము. "సీ. జడ లల్లి చొల్లి యం బిడి..." కాశీ. ౨, ఆ. ౧౪౬.

చోల్లెము. దే. వి. జడతో చుట్టినచుట్టు. "చ. జడలు మలంచి చొల్లెముగ సన్నపుఁబాగ నడంగఁ జుట్టి ..." స్వా. ౪, ఆ. ౯౩. ఉ. హరి. ౧, ఆ. ౫౯.

## చోఁ

చోఁ. దే. ద్రు. (అచ్చోటన్, ఇచ్చోటన్. కాని చోటన్, లేనిచోటన్ ఇత్యాదిసమాసములయందు ఉత్తరపదమైన 'చోటు' శబ్దము యొక్క సప్తమీవిభక్తిరూపమునందు టవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.) 1. ప్రదేశమందు. "చ...ఆనృపపుంగవుఁ డేలుచుండ నొండుచో, నిరవయి యుండకుండుటఁ జామీయలివర్గము లాశ్రయించె..." హైమ. ౧, ఆ. ౫౦. కాశీ. ౧, ఆ. ౧౩౯; 2. వైపున. "క. ఒకచక్కిఁ జక్రసమకుచ, లొకదండఁ దండసాధు లొకచో శకచో, శకళింగవంగఘూర్జరకుకురన్నృపుల్ గొలువ..." శుక. ౧, ఆ. ౧౫౪; 3. విషయమున. "గీ. అదియుఁ బ్రియుఁ బూర్వనములచో నమృతమయ్యె." ఆము. ౪, ఆ. ౧౦౨; 4. కాలమందు. "సీ. దేవిఁగాఁ బ్రీతితో దీని నీఁగాంచితి నని యున్నచో విధాతృవకు నిట్లు, పాడియె విఘ్నము పాదింప..." భార. ఆది. ౭, ఆ. ౨౩; 5. ఏనిన్, అప్పటికిన్. "సీ. వసియింపఁ బ్రభుఁ డురం బొసఁగినచో ..." ఉ. రా. ౧, ఆ. ౩౪; 6. హేత్వర్థకము. "ఆ...నన్ను, నెన్నఁడైన నొరుల కిచ్చుచో నసురకు, భోజనముగ నిచ్చి పుచ్చెఁ డిపుడ." భార. ఆది. ౬, ఆ. ౨౫౭; 7. చేదర్థకము. "క. ఎవ్వనితో నెచ్చోటం, జిక్కుఁ జేసాఁపవలదు చేసాఁచినచో, నివ్వల నవ్వల నెవ్వరు, నవ్వక యుండంగఁ బగ సనక దీర్పఁదగున్." కాశీ. ౧, ఆ. ౧౦౯.

చోఁకు. దే. అ. క్రి. స. క్రి. తగులు. "సీ. వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున నెగసి మోమునఁ జోఁకి మగిడి వచ్చు." భార. విరా. ౫, ఆ. ౩౯౫. "క. అనవుడు మును గన్నుల కొద,వినయవ్వలవంత పిదప వీనులకుం జోఁకె, ననఁగఁ దన్మధురోక్తులు,విని తనుఁ దా నెఱుఁగ లేనివిస్మృతి పేర్మిన్." భో. ౩, ఆ. ౬౯. స. క్రి. (గ్రహాదులు) ఆవేశించు. "శా...చేతో జాతుఁడు తన్నుఁ జోఁకుటఁ బ్రశంసింపన్..." కావ్యా. ౨, ఆ. ౨౫. భా. రా. బాల. ౨, ఆ. ౧౨. వి. 1. ఘాతము, దెబ్బ. "చ...మీఁసుని శితబాణజాలములచోఁకున కోర్వక..." భా. రా. యు. ౧౯౧; 2. స్పర్శము. "సీ. ఇంపారు

చోఁకున నిగురొత్తుచిత్తంబులు..." భార. విరా. ౧, ఆ. ౧౬౮.

**చోటు.** దే. వి. టౌ. 1. స్థానము. "ఆ. జున్ను డెప్ప రంపుఁజో టైనచటి నున్న..." భార. స్త్రీ. ౧, ఆ. ౧౯. విక్ర. ౧, ఆ. ౧౭; 2. సమయము. "గీ. గిరిజ నొడఁగూర్చి పరదుచే వరము వడయు, నోపుఁ బొమ్మని నమ్మి యేమున్న చోట, నెట్టినిడు మర వచ్చి నీ కెట్టిచావు, సంభవించెనె మనసిజ చక్రవర్తి." కు. సం. ౫, ఆ. ౭౩. భార. శల్య. ౧, ఆ. ౩౪౩. 3. విషయము. "క. సిరి విడుచును బురుషుని విను,పురుషుఁడు సిరిఁ దొరఁగు నిది యపూర్వమె ఫలమూ,లరతుండై వాజ్ఞియ లిం, చొరసి యంబికి యట్టిచోటఁ బురుషుం కమ రున్." భార. శాం. ౩, ఆ. ౩౩; 4. నివాస స్థానము. "సీ. శమదమోన్నతుల కేచతురుఁ డాధారంబు దాక్షిణ్యమునకు నీకంటు చోటు." ఉ. రా. ౫, ఆ. ౧౪౦; 5. అవకాశము. "చ... వివాహాశకుఁ జోటు సూపనికితామహాసర్గనిసర్గ వైభవంబు..." కు. ౧, ఆ. ౧౭.

**చోడి.** దే. వి. సస్యవిశేషము. బ. చోళ్లు, ధాన్య విశేషము. "సీ. అశనార్థియై చేరనతని కించుక చోడి నున్న పెట్టిన నది చొరక..." చెన్న. ౧, ఆ. ౭౩. వి. పు. ౪, ఆ. ౧౭౩.

**చోదుము.** దే. వి. చోద, కష్టము. ఆం. భా. ప్ర. ౧౫౦.

**చోద.** దే. వి. 1. కష్టము. "మ. చిలుకా యెవ్వతె లేనిచోద లిడి డాచేతం గడం ద్రోయునో." రాధికా. ౩, ఆ. ౬౫. వే. పంచ. ౧, ఆ. ౩౧౭; 2. తప్పుపని. "ఉ...ఈ,చోదలదానఁ గాను ననుఁ జుల్కనగా నెదలోఁ దలంపకే." టి అహల్యా. ౩, ఆ. ౭౪.

**చోద్యము.** దే. వి. 1. వేడుక, వినోదము. "ద్వి. చూచినఁమనువిన్నఁ జోద్యముల్ గలుగు." పండితా. పర్వ. ౪౭౦. పు; 2. ఆశ్చర్యము. "ద్వి. చూపఱకును భీతిచోద్యంబుఁబొంద." పండితా. మహిమ. ౧౯౭. పు.

**చోపా.** దే. వి. అలిందము, తలవాకిటిప్రక్కనుండు గృహము. (ప్రా.)

**చోపిడు.** ద్వ. స. క్రి. (చోపు+ఇడు.) 1. పాఱఁ ద్రోలు. "క. ఇటు చూడు సాప్రతాపము, లిటులం జోపిడుట సామువిద్య..." వైజ. ౩, ఆ. ౯౦; 2. కలఁచు. "గీ. చోపిడినఁ జాలఁ గారగ్గి సోఁకి కమలి,మిగులఁగొయ్యాలె వను లయి మించఁగలవు." చంద్ర. ౧, ఆ. ౧౩.

**చోఁచు.** వై. స. క్రి. (సం. క్షుభ్.) 1. (పక్షులు మున్నగువానిని) పాఱఁద్రోలు. "సీ. పాటలా నిలము లొప్పఁగఁ దపారపుఁజొంగు లలరుఁదావికి మూఁగునళులఁ జోఁచు." ఆము. ౧, ఆ. ౭౫. భార. స్త్రీ. ౧, ఆ. ౯౩; 2. (మృగములు మున్నగువానిని) కలఁచు. "సీ. అగ్గాట వసియించు నతఁడు దయాళుఁడై వానిఁ జోపక యుండి ..." భార. శాం. ౫, ఆ. ౧౭౪. కకు. ౪, ఆ. ౯౦; 3. పరుగెత్తింపఁజేయు. "ద్వి. సమ్మదంబుగఁ జోపి జక్కుమొగుఁగాక." ద్వి. భాగ. ౧౦, స్కం. (శ. ర.) "మ. వరుణుం దోలితి నర్థపుం జదిపితిక్ వైవస్వతుం గెల్చితిన్, హరిఁ బోఁ జోపితి..." హరి. ఉ. ౪, ఆ. ౪౦; 4. పంపించు. "మ. హరిణీ వచ్చెద కానకుక్...మామిడి సీవు క్రమ్మఱెద నక్ బోఁ జోపి యుంచుచున్..." కు. సం. ౬, ఆ. ౧౬; 5. ప్రవేశపెట్టు. "చ. కలువల నిద్ర లేపి రతి కాంతుశిమాంద్యము వాపి పున్కరస్థలిఁ దిమిరంబుఁ జోపి...కలువలరేని మండలము కాంతిలుచున్నది..." బిల్హ. ౧, ఆ. ౫౧; 6. (పిశాచాదులను) విడిపించు, వెడలఁ గొట్టు. "ఉ...బ్రహ్మరాక్షసుం, బోవఁగఁ జోపి నేరక..." దశ. ౧౧, ఆ. ౫౧. వి. 1. మృగాదులను కలఁతపెట్టుట. (చూ. చోపువెట్టు.); 2. విసరుట. "చ. ఉడిగపుఁటెంతి కట్టెదుట నుంచిన పావలు రాజసంబునన్, దొడిగి మెఱుంగుటుంగ రపుఁ దోఁపపుహీరపుమించుమంచుపైఁ,బడఁ దుల కించుకల్వవిరిబంతుల మించుమదాళిమాలికల్,బడి నిరుపంక వైచు తెలిపావడచోపుల పీఁగిపోవఁ గాన్." కుపల. ౧, ఆ. ౫.

**చోపుడు.** వై. వి. (చోపు ధా.) వేఁటలో మృగాదులకుఁ గావించుకలఁత. (చూ. చోపుడుఁగోల.)

**చోపుడుఁగోల.** ద్వ. వి. (చోపుడు+కోల.) చోపుడు పెట్టుట కుపయోగించుకఱ్ఱ. "వ...అత్తఱిం

దత్తరంబున మొత్తంబై చోపుడుఁగోలలు గొని కెలంకులబొలంబులఁ బులుఁగులం జోపుచు..." ..." స్వా. ౪, ఆ. ౧౧౧. హరిశ్చ. ౨, ఆ. ౯.

**చోపుడు పెట్టించు.** ద్వ. స. క్రి. (చోపుడు పెట్టు ధా.) మృగములను కలఁచు. "గీ. కలయఁ జోపుడు పెట్టింపఁ గరిరొండఁ గిరియుఁ గానరముఁ గేసరియుం దుస్సి కడిలి యెలుఁగు..." ఉ. రా. ౭, ఆ. ౪౦౯.

**చోపుడు పెట్టు.** ద్వ. అ. క్రి. (చోపుడు+పెట్టు) మృగాదులను గలఁచు. "గీ. పొలముచోపుడు పెట్టనస్మ్రో వరుఁడు, సెలవొసంగిన..." శుక. ౧, ఆ. ౨౧౭.

**చోపుదారుఁడు.** ద్వ. వి. (చోపు+దారుఁడు..హిం. చోబ్ దార్.) వెండిబెత్తము కట్టుకొని రాజుల ముందు బరాబరి చేయుచు నడచు సేవకుఁడు. (బ్రౌ. శ. ర.)

**చోపువెట్టు** = చోపుడు పెట్టు. "సీ. పొఁగుచు నెలం గొబ్బునఁ జోపువెట్టి..." రామా. ౨, ఆ. ౨౯. రా. వి. 3, ఆ. ౧౯.

**చోఱ** = చొఱ. "సీ. చోఱవై సారాళిఁ దూటి చోరుమిఁ జీటి మీఱ చారునిహార మేలు కొనుము." ఉ. రా. ౧, ఆ. ౨౪౨. స్వా. ౬, ఆ. ౧౦౭. ఆం. భా. 3, ఆ. ౪౪.

**చోఱుబుడుత.** దే. వి. (చోఱ+బుడుత.) 1. పిల్ల చేప, చోఱమీను పిల్ల; 2 చేపలవంటికన్నులు గల ఆఁడుది. "సీ. అనిమిషాక్షి మనుంగుసాట లాడెదమేమె వడఁకుక నేఁ జోఱుబుడుతఁ గానె." చంద్రా. ౪, ఆ. ౨౪౭. (పైరెండర్థములకు నిది ప్రయోగము.)

**చోఱువాఁడు** = చోఱ. 'సీ. అదవంబు చోఱవాఁ డెడఁ బాయ కెడనెడ మడచిన తెలనాకుమడుపు లొసఁగ." ఉ. రా. ౬, ఆ. ౧౯౦.

**చోలా.** వై. వి. (సం. చోళః.) చొక్కా. ఆం. భా. ద్వి. ౧౧౬.

**చోవి.** దే. వి. బూరెలు చేయునపుడు పూరణము పొదుగుటకై యుపయోగించు పలుచని పిండి. (బ్రౌ. వా.)

**చౌ**

**చౌ** = వర్ణ. (స్పృష్టియందు 'చౌక'మనుట మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము.) సం. నాలుగు. "ద్వి. అచ్చుగాఁ దాఁ జౌదళాబ్జంబుఁ గడచి,వచ్చి త్రికూటంబునకుఁబై నిలిచి." బస. ౧, ఆ. ౧౧౧. పు. విశ. చతురస్రము. (ఉదా:- చౌడోలి. మొ)

**చౌక.** దే.వి. లాఘవము. "క. పుత్రకళత్రంబులయెడ, శత్రుం డఁట వానిబ్రదుకు చౌకఁ గాదే." స్వా. 3, ఆ. ౧౫౪. "సీ. చక్కదనంబుపైఁ జౌక తోఁచినఁగాని సురభామ మీసీను చొప్పుగ వెలయదు." కుచేల. ౨, ఆ. ౧౧. విశ. 1. స్వల్పము. "గీ...ఇట్టిచౌకపనికి, మీరు వేంచేయ వలయునే ..." కుచేల. ౨, ఆ. ౪౧. పండితా. పురా. ౧౨౧. పా; 2. వెల తక్కువ యైనది. వా:— బజారులో పండ్లు చౌకగా నున్నవి.

**చౌకచేయు.** ద్వ. స. క్రి. (చౌక+చేయు.) చులకన చేయుట. "గీ. దృష్టశివ యైనయుకాంత దిన దినమ్ము, నర్చనేయుచుఁ దచ్చివు ననుసరింపఁ, దానుగాఁ గోరి వచ్చినతరుణి యగుట, నడ్డసేయక యూతఁడు చౌకచేయ." పార్వ. ౪, ఆ. ౧౬3.

**చౌకటులు.** ద్వ. వి. బ. (చౌ+కట్టులు.) ముత్యములు మున్నగునవి నాలుగు చేర్చి కట్టినపోఁగులు. "సీ. బలుముత్తియపుఁజౌకటులదాలు నిద్దంపు బవిరి గడ్డముమీఁదఁ జవుకళింప." నీలా. ౨, ఆ. ౧౦.

**చౌకట్టులు**=చౌకటులు. "వ...కంఠమాలికలు కంటసరు లుత్తరిగెలు చౌకట్టు లొంటులు..." ప్రబంధ. ౬౦౧.

**చౌకట్టు.** ద్వ. వి. బ. (చౌ+కట్టు.) 1. ముత్యములు మొ. నాలుగుచేర్చికట్టినపోఁగులు. "సీ. తెలినవ్వు డాలుకు త్తియపుఁ జౌకట్టుఁ బెంచఁగ సర్మసచివుతో సరసమాడు." కళా. ౧, ఆ. ౧౧3; 2. తోరణపుఁబట్టమీఁద కిటికెలిల్లకు సాధారణముగా నిరుప్రక్కల నమర్చినగజ్జులు. (శ. ర.) "ద్వి. పగడంపుఁజౌకట్లు పసిఁడితలుపులును." ద్వి. శ. సా. ౨౧. పా. ౬. పం; 3. చట్టము. (శ. ర.)

**చౌకపడు.** ద్వ. అ. క్రి. (చౌక+పడు.) తేలిక యగు. "సీ. పలుప్రౌఢ వీక్షించి భావంబులో పల

సందియంబుల నొంది చౌకపడక." మత్స్య. ౧, ఆ. ౧౫౧.

చౌకపఱచు. దే. స. క్రి. (చౌకపడు ధా. ప్రే.) తేలికచేయు. "సీ. తనదానవిభవంబు ధనదాన వవ్యవిశ్రాణనపుక్రియఁ జౌకపఱుప." ఉద్భ. ౧, ఆ. ౨౧.

చౌకము. వై. వి. (సం. చతుష్కమ్.) 1. నాలుగు. "ద్వి. అడిగిన ధనముఁ జయ్యనఁ జౌక మెన్ని." ద్వి. హరిశ్చ. ౨. భా. ౭౫౦. ఆం. భా. ద్వి. 3౦౬; 2. నాల్గింటిసమూహము. పుంజీ. "ఉ. కట్టొనఁగూర్చి వైశ్యునకు నిచ్చి చనక్ మఱి పుచ్చి చౌకముల్, పెట్టుచు వడ్డిలెక్కలటు పెట్టుచు..." ఆము. ౬, ఆ. ౭౦. బస. ౫, ఆ. ౯౮. షం; 3. నలుచదరపుగడ్డి. "సీ. చలివానిగడితంపుఁజలుత చౌకంబుల తొగరుఁబుట్టము కచ్చఁదోడివి కట్టి" క్రీడా. ౧3౪; 4. అశ్వగతివిశేషము. "చ. జవమున భంజ శిక్ మురళిఁ జౌకమునక్ నడ నైదుధారలన్." భా. రా. బాల. 3౦. కృష్ణ. ౧, ఆ. ౫3; 5. చదరముగా నుండుతుండుగడ్డ. (శ. ర.) విణ నలుచదరమైనది. "మ. దివిజద్వేషి సుదారవారి చరమూర్తిం ద్రుంచి చాతుర్య మొప్ప వడిం జౌకపు డల్లకాచుగమి దంభం బొంద నైఁ దాల్చి ..." ఆము. ౪, ఆ. ౧౭. దశా. ౬, అ. ౪౭.

చౌకళి. ద్వ. వి. (చౌ+కాళ్లు. క. చౌకళి.) 1. ముత్యాలు మున్నగునవి నాలుగు అమర్చినచెవి పోఁగులజత. "సీ. జాతెడి సిగ కేలఁ జక్క నొక్కచును జెక్కులను గట్టాణిచౌకళి నటింప." దశ. ౭, ఆ. ౨౦౧; 2. ఆఁడువారికోఁకలనేఁత యందు నూలిపోఁగులచే నేర్పడిన చచ్చౌకపుగడి. "చ...సుపాణులచౌకాటపుఁ జౌకళికట్టుపర్గ ముఁన్, గడుఁ బ్రియమొప్ప నిచ్చి..." శుక. ౧, ఆ. ౨౪.

చౌకళించు. ద్వ. అ. క్రి. 1. ఎగురు. "క. అనగరు వెడలి యొకకేళీనగకూటాగ్ర మెక్కి లీలాగతి సంధానముగఁ జౌకళించెన్, వానరవీరుండు..." రామా. ౬, ఆ. ౧౨౨; 2. చలించు. "మ. సొరిదిక్ సన్నరుచూలు హొన్నరిగెటుచ్చుచు బెన్నునం జౌకళింప..." ఇందు. ౨, ఆ. ౫౫; 3. ప్రకాశించు. "మత్త. అత్తమిల్లుమహోగ్ర విక్రమ మూర్కసమ్మతి నొప్పఁగాఁ సత్తు తార సజాతి రేఫలు చౌకళింపుచు నొందఁగా." అప్ప. ౪, ఆ. ౨౬౭. పొ; 4. వ్యాపించు. "సీ. కుందనంపుఁ బసిఁడికల్లాయి జగలపైఁ జౌకట్లనిగనిగల్ చౌకళింప." విజ. పీఠి. 3౬. స. క్రి. దాఁటు, లంఘించు. "సీ. క్షణము గోపల నద్రిఁ జౌకళించఁ జవంబునను మించుహయములు నాల్గువేలు." ఉ. రా. ౭, ఆ. ౬౬. చిత్ర. భా. 3, ఆ. ౧౨౮.

చౌకళింత. ద్వ. వి. (చవుకళించు ధా.) 1. చౌకళించుట; 2. అశ్వగతివిశేషము. వల్గితము. (శ. ర.)

చౌకళింపు. ద్వ. వి. (చౌకళించు. ధా.) అశ్వగతి విశేషము. ఆం. భా. ద్వి. ౧౯౮.

చౌకసేయు = చౌకచేయు. "సీ...చౌకసేయుచుఁ గవీశ్వరులు పొగడ." చిత్ర. భా. 3, ఆ. 3. "చ. వనజదళాయతాక్షి మగవాఁడు పరాంగనపొందుఁ గోరువాఁడని వినవే మొ యట్టిచవు లంటినచో మఱి చౌకసేయుఁడే." శుక. ౧, ఆ. ౫౪౪.

చౌకాఁడిగుదియ. ద్వ. వి. (చౌ+కాఁడి+గుదియ.) నాలుగుప్రక్కలు తీసినయినుపదండము. "వ. చౌకాఁడిగుదియల మోఁదిన..." కవిక. ౨, ఆ. ౧౯౭.

చౌకారము. దే. వి. (చౌడు+కారము.) సబ్బు వస్త్రధావకపదార్థము. ఆం. భా. ద్వి. 3౦౧.

చౌకాలిపీట = చవుకాలిపీట. (శ. ర. బ్రౌ.)

చౌకి. హిం. వి. కాపు; కాపుకై యేర్పడినస్థలము. (బ్రౌ. వా.)

చౌకీ = చవుకీ. (భూలదండ.) "సీ. పుఱియలచౌకీలు పాలుమైనకడపాలు పన్నగవిసరము బన్నసరము." వరాహ. ౯, ఆ. ౦౦.

చౌకు = చబుకు. (కళ. కొరడా.) "సీ. పాలయల్కఁ జుఱుకుఁజూపుల జూచి యుఁర్వశిబిబ్బోకవతి చౌకు వేట్లు వడియె." కువల. ౧, ఆ. 3౯.

చౌకుచెట్టు. దే. వి. వృక్షవిశేషము. (శ. ర.)

చౌగంటి = చవుగంటి. నాలుగుకన్నులుగలవాఁడు, 1. అగ్నిదేవుఁడు; 2. శరభమృగము. (శ. ర.)

చౌగియ. దే. వి. (హిం. చౌగాని.) హుక్కా పీల్చు గొట్టము. "సీ. కేరళేంద్రకుమారి గిండి కేల

ధరించెఁ గేకయతనయ చౌగియ వహించె." తపతీ. ౧, ఆ. ౧౩.

చౌట. దే. వి. పెంపుడుచిలుకలు లోనగునవి ఉండు పంజరము. ఆం. భా. ద్వి. ౧౬౮.

చౌటకొమ్మ = చవుటకొమ్మ. (వా.)

చౌటవరి = చవుటవరి. 1. ఒకజాతివరిపైరు. 2. ఒక జాతివడ్లు. "వ... రెడ్డిపంకెలు చౌటవరులు..." ప్రబంధ. ౧౧౨.

చౌటుప్పు. దే. వి. (చౌటి+ఉప్పు.) లవణభేదము. ఆం. భా. ద్వి. ౨౪౯.

చౌడు. దే. వి. 1. చౌటిమన్ను. "సీ. నీరదాగను మేనునిర్యత్పయఃపానచాతకం బేగునే చౌటి పడెను." భాగ. ౧౦, స్క౦. ఉ. ౨౫౭. విప్ర. ౨, ఆ. ౧౮; 2. చౌటినేల. "గీ...చౌట,కిడిన విత్తునుబోలె నైచెడు నృపాల." భార. ఆను. ౩, ఆ. ౧౮౧. ఆం. భా. ద్వి. ౫.

చౌడోలి = చవుడోలి. (అంబారి.) "క. చిత్తజుండను గజముపై దం,డెత్తుచు నని నిడ్డమదవుటేనుఁ గనంగా,హత్తుకొని దిశలఁ దిమిరము, ముత్తెపుఁ జౌడోలి యనఁగ మొనసెం ధారల్." రసిక. ౪. ౯౮.

చౌడోలీ = చౌడోలి. "సీ. కసిఁడిపక్కెరలబాబాలు మానికపుఁజౌడోలీల యేనుఁగు లోలిఁ జెలఁగ." అచ్చ. యుద్ధ. ౨౦౫.

చౌడోలు = చవుడోలు. (అంబారి.) "సీ. ఉదయాద్రికరిమీఁద పూరుముంజిచౌడోలు పెడ వింటిపాదుపా పెల్లగొడుగు." మృ. వి. ౨, ఆ. ౮౩. వేయి. ౩౪.

చౌతా = చవుతా. దే. వి. డోలి. (శ. ర.)

చౌలి = చవులి. (శ. ర. బ్రౌ.)

చౌతు = చవుతు. (ఒకవిధమైనకుళ్లాయి.) "సీ. బూది బ్రుంగినమొగంబున గోవకట్టు మైనపుమైల ప్రాఁజౌతు నా వెలుంగ." ఆము. ౬, ఆ. ౮౦. ఆం. భా. ద్వి. ౧౫౫.

చౌదంతి = చవుదంతి. "గీ...బృంహితరవంబు,గలిగి చౌదంతి పొడమె నాజలధియందు." దశా. ౨, ఆ. ౨౨౯.

చౌదరి = చవుదరి. (పరగణాకైనను గ్రామమున కైనను పెత్తనకాఁడుగా నుండెడివాఁడు.) "క. ప్రోదిగ రాట్నములం దగ,సాదరముగ నిరుగు పొరుగుచానలు గదియన్, జౌదరికోడలు దానును,మోదంబునఁ జెలులఁగూడి..." ఉ. హరివ. ౪, ఆ. ౨౩; 2. (అధికారి.) "సీ. దొరయొద్ద నెంతచౌదరియైనఁ దనమన్నిత్రాఁ జెప్పఁ గార్యసాధనము లేదు." వేణు. ౩౮.

చౌదరితనము. వై. వి. (చౌదరి+తనము.) గొప్ప తనము. "గీ. వచ్చి జమళిగ వాయించి పరుస తోడఁ,దాత కందుల చౌదరితనము నెల్ల నెన్ని..." శుక. ౨, ఆ ౪౧౪.

చౌని. హిం. వి. దండువిడిసినచోటు (బ్రౌ.)

చౌపద. వై. వి. (చౌ+పద. సం. చతుష్పదీ.) పద్యవిశేషము. కవిజన. జాతి. ౩౨.

చౌపదము. వై. వి. (చౌ+పదము.) గీతివిశేషము. "సీ. ఫలకగ్రహణము చౌపదములగరిమంబుఁ బరఁగె బాలకులకు గురువులిఁడ్డ." పాండు. ౪, ఆ ౪౪. "సీ. దంతిదంతమ్మలాతముగఁ ద్రిప్పుడు నాడుఁ జౌపదంబులకుఁ బిశాచమొకటి." జై. ౫, ఆ ౧౯౬.

చౌపుటము = చవుపుటము. (కాల్గుకాల్లపై కెత్తి దాఁటెడిదాఁటు.) "సీ. నెఱజాతిపాలమున్నీటి మీఁగడనిగ్గు దేలువార్వము చౌపుటాలు ద్రొక్కె." ఉ. హరివ. ౩, ఆ. ౧౩౧. "సీ. కళ్లెమింగిని జౌకళించుచౌపుటము లొక్కమ్మడిఁ బదునైదు నుఱికె యుఁఱికి." అని. ౪, ఆ. ౩౨.

చౌరు = చవురు. 1. (లొట్ట); 2. (తీపితోఁగలిసిన ఉప్పు.) (శ. ర.)

చౌరుకొట్టు = చవురుగొట్టు. "గీ విరులు సిగఁ దాల్చి కర్పూరవీటిఁ జౌరుగొట్టుచు ద్విజుండు..." ఆము. ౨, ఆ. ౭౩.

చౌరుగొట్టు. దే. అ. క్రి. (చౌరు+గొట్టు.) లొట్టలు వేయు. "ద్వి. గొంటువక్కలు చౌరుగొట్టుచు నమలి." అనుక. ౨, ఆ. ౮౨. పా. ౧౯. పం.

చౌలము = చవులము. వి. అర్ధరూప్యము ఆం. భా. ద్వి. ౨౩౩.

చౌలు. దే. వి. బ. (ఈరూపము చింత్యము.) చెవులు, కర్ణములు. "మ. అని యావృద్ధధరాసురుండు పలుకన్ హా శంకరా యంచుఁ జౌలను గేల్దోయిని బట్టి మూసికొని..." పార్వ. ౪ ఆ. ౧౦౪.

చౌవంచే = చవ్వంచ. "సీ. వలపటపుండి చౌవంచ మోములదునేదారి నెయ్యమునఁ గైదండ యొసఁగె." ఉ. రా. ర, ఆ. ౫౫౫. కళా. 3, ఆ. ౧౩౧.

చౌవంచి = చౌవంచ. "ద్వి. వనిత మెచ్చవు వంచి వైచిన ననుచు, ననఘుఁ డచ్చౌవంచి యను హారము మాడు." పండితా. పురా. ౧౨౫. పా. దశా. ౫, అ. ౪౬.

చౌవీథి = చవ్వీథి. (చూ. చవుపీథి.)

చౌషష్టి = చవుషష్టి. (అఱువదినాలుగు.) "గీ. ఖగము లగములు చౌషష్టికళలు గళలు." రుక్మా. ౫, ఆ. ౧౬౫.

చౌసాల = చవుసాల. (శ. ర.)

చౌసీతి = చవుసీతి. "ద్వి. చిత్తజుకేళిఁ జౌసీతి బంధములు." ద్వి. శ. సా. ౧, ఆ. ౨౫. పా. ౧౪. పం. వైజ. 3, ఆ. ౭౪.

ఛ

ఛ. సం. ఒకానొకయక్షరము. ౯. ఆ. స్త్రీ. ఛాదనము, కప్పు. విశే. (అ. ఆ. అ.) 1. నిర్మలము; 2. చంచలము. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ఛందము. సం. వి. అ. పుం. 1. ఇచ్ఛ; 2. అభిప్రాయము; 3. విషము; 4 అధీనత. న్. న. 1. ఛందశ్శాస్త్రము, పద్యలక్షణములు చెప్పుశాస్త్రము; 2. గాయత్రి మున్నగునిరువదియాఱింటి నొకటి; 3. వేదము; 4. అభిలాషము; 5. కపటము; 6. పద్యము.

ఛందస్సు. సం. వి. న్. న = ఛందము.

ఛందితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సంతోషపెట్టఁబడినవాఁడు.

ఛగణము. సం. వి. అ. పుం. ఏటిపిడుక.

ఛగము. సం. వి. అ. పుం. మేఁకపోతు.

ఛగలము. సం. వి. అ. పుం. 1. మేఁకపోతు; 2. బొద్దివృ; 3. ఒకదేశము.

ఛగలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుమేక; 2. బొద్దివృ.

ఛట. సం. వి. ఆ. స్త్రీ. 1. సమూహము; 2. కాంతి.

ఛటచ్ఛట. సం. వి. ఆ. స్త్రీ. యుద్ధమునందగుధ్వని కనుకరణము. "క. భీమాసురపీడలను స్తూపముస్ఫురణచ్ఛటచ్ఛటాశబ్దము..." భార. అర. 3, ఆ. ౩౯౫.

ఛటాఫలము. సం. వి. అ. పుం. పోఁకచెట్టు.

ఛడికి. సం. వి. ఈ. స్త్రీ. పల్లబంధవిశేషము.

ఛత్త్ర. సం. వి ఆ. స్త్రీ. 1. గుడ్డికామంచిచెట్టు; 2. కొత్తిమీరచెట్టు; 3. మంజిష్ఠచెట్టు.

ఛత్త్రకము. సం. వి. అ. పుం. 1. గుడ్డికామంచిచెట్టు; 2. పక్షివిశేషము. న. గొడుగు.

ఛత్త్రగ్రాహి. సం. విశే. (న్. ణీ. న్.) గొడుగు పట్టుకొనువాఁడు.

ఛత్త్రగ్రాహుఁడు. సం. విశే (అ.ఆ.అ.) ఛత్త్రధరుఁడు.

ఛత్త్రపతి. సం. వి. ఇ. పుం. చక్రవర్తి.

ఛత్త్రపత్త్రము. సం. వి. అ. పుం. 1. మెట్టతామరచెట్టు; 2. బుజపత్తిరిచెట్టు.

ఛత్త్రభంగము. సం. వి. అ. పుం. 1. రాజనాశము; 2. వైధవ్యము; 3. స్వాతంత్ర్యము.

ఛత్త్రము. సం. వి. అ. పుం. తృణభేదముచెట్టు. న. 1. గొడుగు; 2. అచ్ఛాదనము; 3. తేనెపెఱ.

ఛత్త్రాకి. సం. వి. ఈ. స్త్రీ. పుట్టగొడుగుచెట్టు; 2. సర్పాక్షిచెట్టు.

ఛత్త్రాధాన్యము. సం. వి. అ. న. కుస్తుంబురుచెట్టు.

ఛత్త్రి. సం. వి. న్. పుం. మంగలి. విశే. (న్. ణీ. న్.) గొడుగుకలవాఁడు.

ఛత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. పుట్టగొడుగు.

ఛత్వరము. సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. పొదరిల్లు.

ఛదనము. సం. వి. అ. న. 1. ఆకు; 2. ఱెక్క; 3. కప్పు; 4. చీఁకటిన్రాను.

ఛదము. సం. వి. అ. పుం. 1. ఆకు; 2. ఱెక్క; 3. కమాలముచెట్టు.

ఛదిస్సు. సం. వి. స్. స్త్రీ. 1. పటలము; 2. ఇంటి కప్పు; 3. ఇల్లు.

ఛద్మనసేయు. మి. స. క్రి. (ఈరూపము చింత్యము) మోసగించు. "మ. అనుచుం దిగ్గన లేచువానిఁ గని యవ్యాఘ్రేంద్ర మారెర ఛద్మనసేసెం గద నక్క..." శుక. ౨, ఆ. ౩౦౧.

ఛద్మము. సం. వి. న్. న. 1. స్వరూపాచ్ఛాదనము; 2. నెపము; 3. మోసము; 4. గృహము.

ఛద్మి. సం. విణ. (న్. సీ. న్.) మాఱువేషము వేయుం వాఁడు.

ఛన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కప్పఁబడినది; 2. దాఁచఁబడినది; 3. ఏకాంతము.

ఛర్దనము. సం. వి. అ. పుం. 1. వేముచెట్టు; 2. ఉమ్మెత్తచెట్టు. న. డోకు, వమనము. విణ. (అ. ఈ. అ.) వమన సాధనమైనది.

ఛర్దము. సం. వి. అ. పుం. వమనము.

ఛర్ది. సం. వి. ఇ. స్త్రీ. వమనము.

ఛర్దిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వమనము; 2. విష్ణుక్రాంతచెట్టు.

ఛర్దిస్సు. సం. వి. స్. న. = ఛర్ది.

ఛలకుఁడు. సం. విణ. (అ. లికా. అ.) మోసపుచ్చువాఁడు.

ఛలన. సం. వి. ఆ. స్త్రీ. = ఛలనము.

ఛలనము. సం. వి. అ. న. 1. మోసపుచ్చుట; 2. మిష, వ్యాజము.

ఛలము. సం. వి. అ. న. 1 ఉన్నరూపము ను గప్పుట; 2. వ్యాజము, మిష; 3. అన్యాయయుద్ధముచేయుద్ధమర్యాదలు దప్పుట; 4. శఠత్వము, మూర్ఖపుపట్టుదల; 5. స్ఖలితము, తొట్రుపాటు; 6. మోసము; 7. జల్పదోషములలో నొకటి.

ఛలి. సం. విణ. (న్. సీ. న్.) మోసగాఁడు.

ఛలితము. సం. వి. అ. న. మోసము, వంచించుట. విణ. (అ. ఆ. అ.) మోసముచేయఁబడినది.

ఛల్లి. సం. వి. ఇ. పుం. న. ఇ. ఈ. స్త్రీ. 1. చెట్టుపట్ట; 2. తీఁగ; 3. సంతానము.

ఛవి. సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి; 2 కిరణము.

## ఛా

ఛాందసము. సం. వి. అ. న. 1. వేదజడత్వము; 2. లోకజ్ఞానములేమి. విణ. (అ. ఆ. అ.) 1. వేదసంబంధమైనది; 2. ఛందశ్శాస్త్రసంబంధమైనది.

ఛాందసుఁడు. సం. వి. అ. పుం. 1. శ్రోత్రియుఁడు; 2. వేదజడుఁడు; 3. లోకజ్ఞానము లేనివాఁడు.

ఛాందోగ్యము. సం. వి. అ. న. సామవేదోపనిషత్తు, ఉపనిషత్తులలో నొకటి.

ఛాగము. సం. వి. అ. పుం. 1. మేఁక; 2. మేఁకపాలు; 3. పురోడాశము.

ఛాగముఖుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి.

ఛాగి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుమేఁక.

ఛాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నఱకఁబడినది; 2. బలహీనము.

ఛాత్రదర్శనము. సం. వి. అ. న. తొలినాఁటిరాత్రి పాలనుండి మఱునాఁడు వెన్నతీసి వెంబడినే కాఁచిన నేయి. హైయంగవీనము.

ఛాత్త్రము. సం. వి. అ. న. ఒకరకపుతేనె.

ఛాత్త్రుఁడు. సం. వి. అ. పుం.—గురువుయొక్క నేరములను గప్పి యుండువాఁడు-శిష్యుఁడు.

ఛాదనము. సం. వి. అ. పుం. నల్లగోరంటచెట్టు. న. 1. కప్పుట; 2. మూఁత; 3. ఆకు; 4. వస్త్రము. విణ. (అ. ఆ. అ.) 1. కప్పునది (అ. ఈ. అ.) 2. కప్పుటకు సాధనమైనది.

ఛాదము. సం. వి. అ. న. ఇంటికప్పు.

ఛాదితము. సం. విణ. (అ. ఆ. అ.) కప్పఁబడినది.

ఛాద్మికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) మోసకాఁడు.

ఛాయ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీడ; 2. ప్రతిబింబము; 3. సూర్యునిభార్య; 4. కాంతి; 5. గ్రహము; 6. పంక్తి; 7. పార్వతి; 8. చీఁకటి; 9. రంగు; 10. పోలిక.

ఛాయాంకుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

ఛాయాతరువు. సం. వి. ఉ. పుం. సురపొన్నచెట్టు.

ఛాయాపథము. సం. వి. అ. పుం. నక్షత్రవీథి.

ఛాయాపుత్త్రుఁడు. సం. వి. అ. పుం. శని.

ఛాయాపురుషుఁడు. సం. వి. అ. పుం. తననీడవలె పురుషాకారముగా నుండి ఆకాశమునఁ గనఁబడు నొకపదార్థము.

ఛాలిక్యము. సం. వి. అ. పుం. గానభేదము.

## ఛి

ఛి. సం. వి. ఇ. స్త్రీ. నిందార్థకము.

ఛిక్క. సం. వి. ఆ. స్త్రీ. తుమ్ము.

ఛిక్కని. సం. వి. ఈ. స్త్రీ. ముక్కుదగ్గఱ నుంచిన తుమ్ము పుట్టించునోషధిచెట్టు.

ఛిక్కిక. సం. వి. ఆ. స్త్రీ. = ఛిక్కని.

ఛిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నఱుకుట; 2. కానుఁగుచెట్టు.

ఛిత్తు. సం. విణ. (త్.) ఛేదించునది.

ఛిత్వరము. సం. వి. అ. పుం. బాణము.

ఛిత్వరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఛేదించువాఁడు; 2. ప్రతికూలుఁడు; 3. ధూర్తుఁడు.

ఛిదా. సం. వి. ఆ. స్త్రీ. నఱకుట.

ఛిదకము. సం. వి. ఇ. స్త్రీ. గండ్రగొడ్డలి.

ఛిదిరము. సం. వి. అ. పుం. 1. గొడ్డలి; 2. అగ్ని; 3. త్రాడు; 4. కత్తి; 5. ఎలుక.

ఛిదురము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఛేదించునది; 2. తెగునది; 3. వ్యతిరేకమైనది; 4. ధూర్తము.

ఛిద్రము. సం. వి. అ. న. 1. రంధ్రము; 2. తెఱపి; 3. పల్లము; 4. అపరాధము; 5. నింద; 6. తొమ్మిది అనుసంఖ్య.

ఛిన్న. సం. వి. ఆ. స్త్రీ. 1. పుంశ్చలి; 2. తిప్పతీఁగ♣.

ఛిన్నము. సం. వి. అ. న. ఒకానొకజాతికురుపు. విశే. (అ. ఆ. అ.) 1. ఛేదింపఁబడినది; 2. వేఱుచేయఁబడినది.

ఛిన్నరుహా. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ♣; 2. పచ్చమొగలి♣; 3. ఆందుగు♣.

ఛిన్నాభిన్నములు. సం. వి. అ. న. బ. ముక్కముక్కలు. "క...చెండెద ఛిన్నాభిన్నములుగాఁగ నేరల నెల్లన్." విజ. 3, ఆ. ౧౪౯.

ఛు

ఛుచ్ఛుందరము. సం. వి. అ. పుం.—ఛు ఛు-అను శబ్దమును చేయునది-చుంచెలుక.

ఛుచ్ఛుందరి. సం. వి. ఈ. స్త్రీ. గంధమూషి, చుంచు.

ఛుచ్ఛువు. సం. వి. ఉ. స్త్రీ. చుంచు.

ఛుద్రము. సం. వి. అ. న. 1. ప్రతిక్రియ; 2. కిరణము.

ఛుపము. సం. వి. అ. పుం. 1. తాఁకు; 2. చిన్నదుప్ప; 3. యుద్ధము; 4. గాలి.

ఛుర. సం. వి. ఆ. స్త్రీ. సున్నము.

ఛురణము. సం. వి. అ. న. 1. పూయుట; 2. గచ్చు చేయుట.

ఛురి. సం. వి. ఈ. స్త్రీ. చూరకత్తి.

ఛురితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తాఁకఁబడినది; 2. ఛేదింపబడినది; 3. కప్పఁబడినది.

ఛుల్లి. సం. = చుల్లి.

ఛూ

ఛూరి. సం. వి. ఈ. స్త్రీ. చూరకత్తి.

ఛూరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చూరకత్తి; 2. గొడ్డుటావు.

ఛే

ఛేక. సం. వి. ఆ. స్త్రీ. మదవతి.

ఛేకము. సం. వి. అ. పుం.—ఒకప్రాసభేదము. విశే. (అ. ఆ. అ.) 1. పెంపుడు; 2. నేర్పు గలది; 3. నగరమున జన్మించినది.

ఛేకాపహ్నుతి. సం. వి. ఇ. స్త్రీ. అపహ్నుత్యలంకారములలో నొకజాతి.

ఛేకోక్తి. సం. వి. ఇ. స్త్రీ. అర్థాలంకారభేదము.

ఛేత్త. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) నఱకువాఁడు.

ఛేత్తవ్యము. సం. వి. అ. పుం. భాజకము, హారము. విశే. (అ. దికా. అ.) ఛేదించునది.

ఛేదనము. సం. వి. అ. న. 1. నఱకుట; 2. విభాగించుట; 3. ముక్కలు చేయుట; 4. నశింపఁజేయుట, విశే. (అ. ఆ. అ.) 1. ఖండించునది; 2. విభాగించునది; 3. పోఁగొట్టునది. (అ. ఈ. అ.) ఛేదనసాధనమైనది.

ఛేదము. సం. వి. అ. పుం. 1. నఱకుట; 2. ఖండము; 3. భాజకము; 4. తెవు; 5. నాశనము.

ఛేది. సం. వి. ఇ. పుం. 1. వడ్రంగి; 2. వజ్రము.

ఛేదించు. సం. స. క్రి. 1. నఱకు. "వ...కొమ్ములం జీల్చుచు ఛత్రంబుల ఛేదించుచు..." ఉ. రా. ౨, ఆ. ౨౧; 2. త్రుంచు. (శ. ర.)

ఛేదిల్లు. సం. అ. క్రి. తెగు. "మ. శిరముల్ పాదములున్ భుజాయుగళముల్ ఛేదిల్లి..." భాగ. ౯, స్కం. ౧౩౦.

ఛేద్యము. సం. = ఛేత్తవ్యము.

ఛేలకము. సం. వి. అ. పుం. మేఁకపోతు

ఛై

ఛైదికము. సం. విశే. (అ. ఆ. అ.) నిత్యము ఛేదింపఁదగినది.

ఛో

ఛోటి. సం. వి. న్. పుం. జాలరి.

ఛోటిక. సం. వి. ఆ. స్త్రీ. చిటిక.

ఛోరణము. సం. వి. అ. న. విడిచిపెట్టుట.

ఛోలంగము. సం. వి. అ. పుం. మాదిఫలము♣.

జ

జ. ఒకయక్షరము. (దీనికితత్సమేతరములందు ఇ. ఈ. ఎ. ఏ. ఐ. లతోఁ గూడినపుడు తాలవ్యోచ్చారణమును, అ. ఆ. ఉ. ఊ. ఒ. ఓ. ఔలతోఁ గూడినపుడు దంత్యోచ్చారణమును గలదు. తత్స

ణములు తాలవ్యములుగఁ దలఁచుక నుచ్చరింపఁబడును.) సం. వి. అ. పుం. 1. మృత్యుంజయుఁడు; 2. జననము; 3. విష్ణుమూర్తి; 4. తండ్రి; 5. విజయము. విణ. (అ. ఆ. అ-సమాసాంతములందే ప్రయోగము.) పుట్టినది. (ఉదా:- రవిజుఁడు, సరసిజము.

జంగమము. సం. వి. అ. పుం. జంగముజాతివాఁడు. "ద్వి. ఎడపక జంగముం దేవస్తుత్యైన, నడుగకుండిన నొట్టు నడిగిన లేదు." ద్వి. భల్లా. ౨, ఆ. ౨౪. పు. పండితా. దీక్ష. ౧౧౮. పా. విణ. (అ. ఆ. అ.) 1. తిరుగునది. "శా...జంగమనగద్వేదండ ఘూర్ణాంగణా." వసు. 3, ఆ. ౧౭౬; 2. నడచునది. "ఉ...జంగమగ్రామముఖాంగి..." వేం. పంచ. ౧, ఆ. ౧౯౫.

జంగముఁడు. సం. వి. అ. పుం. జంగమువాఁడు. "ద్వి. జంగమారాధనముల్ జక్కఁజల్పి నిత్యలింగార్చనములు సల్లీలఁ గావించి." పండితా. పర్వ. ౩౯౯. పా.

జంగలము. సం. వి. అ. పుం. న. మాంసము. విణ. (అ. ఆ. అ.) 1. విజనము; 2. నిర్జలము.

జంగాలము. సం. వి. అ. పుం. పొలముకట్ట.

జంగితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కులము లేనివాఁడు.

జంఘ. సం. వి. ఆ. స్త్రీ. కాలిపిక్క.

జంఘాకరికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పసిగెత్తువాఁడు; 2. దూరసమాచారములు మోసి చెప్పి జీవించువాఁడు.

జంఘాత్రాణము. సం. వి. అ. న. పిక్కలకు తొడిగికొను కవచము.

జంఘాలము. సం. వి. అ. పుం. వేగముగా పోవునది.

జంఘాలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వడిగ నడచువాఁడు.

జంఘి. సం. విణ. (న్. నీ. న్.) జంఘలు కలది. ("తూణీరదర్పోన్మథనజంఘికామ్." లలితా స్తోత్రము.)

జంజపూకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి జపము చేయువాఁడు.

జంజము. సం. వి. అ. పుం. యుద్ధము చేయుట. విణ. (అ. ఆ. అ.) యుద్ధము చేయునది.



జంతుక. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్క; 2. ఒకవిధమగు ఇంగువ; 3. కోరిందచెట్టు.

జంతుఘ్నము. సం. వి. అ. పుం. మాదిఫలము. న. 1. వాయువిడంగము; 2. ఇంగువ.

జంతుఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. వాయువిడంగముచెట్టు.

జంతుఫలము. సం. వి. అ. పుం. మేడిచెట్టు.

జంతుల. సం. వి. ఆ. స్త్రీ. ఱెల్లుచెట్టు.

జంతువు. సం. వి. ఉ. పుం. ప్రాణి.

జంపతులు సం. వి. ఇ. పుం. ద్వి. దంపతులు. "క. జంపతు లయ్యిద్దఱు .." సుద. ౧, ఆ. ౧౦౮. దశ. ౪, ఆ. ౬౬.

జంబాలము. సం. వి. అ. పుం. న. 1. అడుసు; 2. నాఁచు; 3. మొగలిచెట్టు.

జంబాలిని. సం. వి. ఈ. స్త్రీ. అడుసు గలది—నది

జంబిరము. సం. = జంబీరము.

జంబీరము. సం. వి. అ. పుం. 1. నిమ్మచెట్టు; 2. నిమ్మపండు. శకాం. 3, ఆ. ౧౦; 3. మరువముచెట్టు; 4. తెల్లగగ్గెరచెట్టు.

జంబుకము. సం. = జంబూకము.

జంబూకము. సం. వి. అ. పుం. 1. నక్క; 2. నేరేడుచెట్టు; 3. శ్యోనాకముచెట్టు

జంబుకుఁడు. సం. వి. అ. పుం. 1. వరుణదేవుఁడు; 2. నీచుఁడు.

జంబువు. సం. వి. ఊ. స్త్రీ. 1. నేరేడుచెట్టు; 2. నేరేడుదీవి; 3. జంబూనది. ఉ. న. నేరేడుపండు.

జంబూద్వీపము. సం. వి. అ. పుం. న. భూమియందలి ద్వీపములలో నొకటి.

జంబూనది. సం. వి. ఈ. స్త్రీ. జమ్మేఱు.

జంబూలమాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పెండ్లి; 2. పెండ్లివారొనర్చుకొనుపరిహాసము.

జంబూలము. సం. వి. అ. పుం. 1. నేరేడుచెట్టు; 2. మొగలి; 3. పెండ్లివారు చేసికొనుపరిహాసము.

జంబూవనము. సం. వి. అ. పుం. తెల్లదాసనముచెట్టు.

జంభ. సం. వి. ఆ. స్త్రీ. ఆవులింత.

జంభకము. సం. వి. అ. పుం. నిమ్మ. విణ. (అ. భికా. అ.) 1. భక్షకము; 2. ఆవులించునది.

జంభభేది. సం. వి. న్. పుం.—జంభాసురుని భేదించినవాఁడు—ఇంద్రుఁడు.

జంభము. సం. వి. అ. పుం. 1. నిమ్మచెట్టు; 2. కోఱల ప్రక్క నుండుపల్లు; 3. దంతము; 4. తిండి; 5. పాలు; 6. అమ్ములపొది; 7. భక్ష్యము. 8. దంభము.

జంభీరము. సం. వి. అ. పుం. నిమ్మచెట్టు.

జంభలము. సం. = జంభీరము. ఆము. ౫, ఆ. ౧౪౩.

జంభారి. సం. వి. ఇ. పుం. 1. ఇంద్రుఁడు; 2. వజ్రాయుధము; 3. అగ్ని.

జంభి. సం. వి. న్. పుం. నిమ్మచెట్టు. విశే. (న్. నీ. న్.) ఆవులించువాఁడు.

జంభీరము. సం. వి. అ. పుం. 1. నిమ్మచెట్టు. 2. మరువముచెట్టు.

జంభుఁడు. సం. వి. అ. పుం. ఒకరాక్షసుఁడు.

జకుటము. సం. వి. అ. పుం. 1. మలయపర్వతము; 2. కుక్క. న. 1. వంగపువ్వు; 2. జత, కవ.

జక్షణము. సం. వి. అ. న. 1. తినుట; 2. నశింపఁజేయుంట.

జక్షించు. సం. స. క్రి. భక్షించు. "గీ. అపుడు పరమేష్ఠి జక్షింతు మని పలికిన.—హ. రా. ౧, ఆ. ౫౪౬.

జగచ్చక్షువు. సం. వి. స్. పుం. సూర్యుఁడు.

జగతి. సం. వి. ఈ. స్త్రీ. 1. లోకము; 2. ఫుట్టుక; 3. భూమి.

జగత్కర్త. సం. వి. ఋ. పుం. 1. ఈశ్వరుఁడు; 2. బ్రహ్మ.

జగత్తు. సం. వి. త్. పుం. గాలి. న. లోకము. స్త్రీ. 1. భూమి; 2. కామధేనువు. విశే. (త్. తీ. త్.) తిగునది.

జగత్ప్రాణుఁడు సం. వి. అ. పుం. గాలి.

జగత్సాక్షి. సం. వి. న్. పుం. 1. పరమేశ్వరుఁడు; 2. సూర్యుఁడు.

జగత్సేతువు. సం. వి ఉ. పుం. పరమేశ్వరుఁడు.

జగత్క్షయము. సం. వి. అ. పుం. బ్రహ్మదేవునిరాత్రి, ప్రళయము.

జగదాధారము. సం. వి. అ. పుం. 1. గాలి; 2. కాలము; 3. జగత్తున కాధారము.

జగద్బలుఁడు. సం. వి. అ. పుం. గాలి.

జగన్నాథప్రియములు. సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

జగన్నాథము. సం. వి. అ. న. ఒకానొకవిష్ణుక్షేత్రము.

జగన్నాథుఁడు. సం. వి. అ. పుం. 1. పరమేశ్వరుఁడు; 2. విష్ణువు; 3. దత్తాత్రేయుఁడు; 4. జగన్నాథక్షేత్రమం దున్నవిష్ణువు; 5. ఒకానొకకవి.

జగన్నువు. సం. వి. ఉ. పుం. 1. జగత్తుచే నమస్కరింపఁబడునది— అగ్ని; 2. జంతువు.

జగన్మోహిని. సం. వి. ఈ. స్త్రీ. 1. మహామాయ; 2. దుర్గ; 3. విష్ణునియవతారములలో నొకటి.

జగము. సం. = జగత్తు.

జగరము. సం. వి. అ. పుం. కవచము.

జగలము. సం. వి. అ. పుం. 1. మంగచెట్టు; 2. పిండితో చేసినకల్లు; 3. కవచము. న. గోమయము, పేఁడ.

జగలుఁడు సం. విశే. (అ. ఆ. అ.) ధూర్తుఁడు, మోసము చేయువాఁడు.

జగ్ధము. సం. వి. అ. న. భోజనము. విశే. తినఁబడినది.

జగ్ధి. సం. వి. ఇ. స్త్రీ. భోజనము.

జగ్ని. సం. వి. ఇ. పుం. గాలి. విశే. (ఇ.) పోవునది.

జగ్మివాసుఁడు. సం. విశే. (న్. గ్మషీ. న్.) 1. వెళ్లినవాఁడు; 2. పొందినవాఁడు.

జఘనచపల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఱంకుటాలు; 2. ఒకానొకమాత్రావృత్తము.

జఘనము. సం. వి. అ. న. 1. మొల; 2. స్త్రీ శ్రోణి పురోభాగము; 3. శ్రోణిపశ్చాద్భాగము, పిఱుఁదు.

జఘన్యజుఁడు. సం. వి. అ. పుం. 1. తమ్ముఁడు; 2. శూద్రుఁడు.

జఘన్యము. సం. వి. అ. న. 1. మగగుఱి; 2. రక్తచందనముచెట్టు. విశే. (అ. ఆ. అ.) 1. కడపటిది; 2. నీచము; 3. నిందితము.

జఘన్యుఁడు. సం. వి. అ. పుం. శూద్రుఁడు.

జఘ్ని. సం. వి. ఇ. పుం. చంపుటకు సాధనమైన యాయుధము.

జఘ్నువు. సం. విశే. (ఉ.) చంపువాఁడు.

జట. సం. వి. ఆ. స్త్రీ. 1. అల్లుకొనినజుట్టు; 2. ఊడ; 3. శాఖ; 4. రుద్రజడచెట్టు; దూలగొండిచెట్టు; 6. జటామాంసిచెట్టు; 7. పిల్లపీఁచరచెట్టు; 8. వేదపాఠము.

జటాజూటము. సం. వి. అ. పుం. 1. జడలగుంపు; 2. శివజటాజూటము.

జటాయువు. సం. వి. ఉ. న్. పుం. 1. గ్రద్దలరాజు; 2. ఒకజాతిపక్షి. "సీ. చిలుక చకోరంబు జిబ్బ డాయి జటాయువు..." హంస. 3, ఆ. ౧౨.

జటాలము. సం. వి. అ. న. 1. పుత్తి; 2. కచ్చురము⚜; 3. గుగ్గిలము⚜.

జటావల్లి. సం. వి. ఈ. స్త్రీ. రుద్రజడ⚜.

జటాసురుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకఅసుర.

జటి. సం. వి. ఇ. పుం. 1. పుత్తి⚜; 2. జువ్వి⚜; 3. సమూహము. ఈ. స్త్రీ. 1. జటామాంసి; 2. జువ్వి⚜; 3. జట.

జటిలము. సం. వి. అ. పుం. 1. సింహము; 2. మచ్చలు గలమేఁకపోతు; 3. బ్రహ్మచారి; 4. ముని. న. కురువేరు⚜. విశే. (అ. ఆ. అ.) 1. జడలు గలది; 2. పెనగొన్నది; 3. దట్టమైనది.

జటులము. సం. వి. అ. పుం. పుట్టుమచ్చ.

జఠరము. సం. వి. అ. పుం. న. కడుపు. విశే. (అ. ఆ. అ.) 1. గట్టి; 2. కట్టఁబడినది; 3. ముదిసినది.

జఠరాగ్ని. సం. వి. ఇ. పుం. కడుపులోని అన్నాది పదార్థములను జీర్ణము చేయు అగ్ని.

జడ. సం. వి. ఆ. స్త్రీ. 1. దూలగొండి⚜; 2. నేలయుసిరిక⚜.

జడధి. సం. వి. ఇ. పుం. సముద్రము. విశే. (ఇ. ఈ. ఇ.) మందమతి గలవాఁడు

జడనిధి. సం. వి. ఇ. పుం. సముద్రము.

జడము. సం. వి. అ. పుం. 1. చల్లఁదనము; 2. తెలివిలేమి. న. 1. జలము; 2. సీసము. విశే. (అ. ఆ. అ.) 1. చల్లనిది; 2. మ్రాన్పడినది; 3. మూఢము; 4. మూఁగది; 5. అచేతనము.

జడిమ. సం. వి. న్. పుం. జడత్వము.

జడిమము. సం. = జడిమ.

జడ్జి. ఆం. వి. న్యాయాధిపతి, తీర్పు చెప్పువాఁడు.

జడ్జిమెంటు. ఆం. వి. తీర్పు.

జతవిలము. సం. వి. అ. పుం. అగ్నిని మండఁజేయు ద్రవ్యవిశేషము. విశే. (అ. ఆ. అ.) లక్కతోఁ జేయఁబడినది.

జతుక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకజాతిగబ్బిలము; 2. కొరింద⚜.

జతుకము. సం. వి. అ. న. 1. ఇంగువ; 2. లక్క.

జతురసము. సం. వి. అ. పుం. లత్తుక.

జతువు. సం. వి. ఉ. న. లత్తుక. ఊ. ఊ. స్త్రీ. ఒకజాతిగబ్బిలము.

జతూక. సం. వి. ఆ. స్త్రీ. 1. గబ్బిలము; 2. కొరింద.

జత్రువు. సం. వి. ఉ. న. మూఁపుసు ఱొమ్మును గలుపు సెముకలు గలప్రదేశము.

జత్వశ్మకము. సం. వి. అ. న. సిలాజిత్తు.

జనంగమి. సం. వి. ఈ. స్త్రీ. చండాలస్త్రీ.

జనంగముఁడు. సం. వి. అ. పుం. చండాలుఁడు.

జనకుఁడు. సం. వి. అ. పుం. 1. తండ్రి; 2. విదేహరాజు. విశే. (అ. నికా. అ.) పుట్టించువాఁడు.

జనత. సం. వి. ఆ. స్త్రీ. 1. జనసమూహము; 2. జనత్వము.

జనత్ర. సం. వి. ఆ. స్త్రీ. గొడుగు.

జననము. సం. వి. అ. న. 1. పుట్టుట; 2. పుట్టించుట; 3. వంశము. విశే. (అ. ఈ. అ.) పుట్టించునది.

జనని. సం. వి. ఈ. స్త్రీ. 1. దయ; 2. తల్లి; 3. చిలుకపిట్ట; 4. అడవిమొల్ల⚜; 5. లత్తుక; 6. జటామాంసి⚜.

జనపదము. సం. వి. అ. పుం. జనులునివసించునది. 1. దేశము; 2. పల్లె.

జనపది. సం. వి. న్. పుం. జనపదమునకు రాజు.

జనపదుఁడు. సం. వి. అ. పుం. మనుజుఁడు.

జనప్రవాదము. సం. వి. అ. పుం. 1. కింవదంతి; 2. నింద.

జనప్రియము. సం. వి. అ. పుం. 1. మునఁగ⚜; 2. కొత్తిమిరి⚜. విశే. (అ. ఆ. అ.) జనులకిష్టమైనది.

జనము. సం. వి. అ. పుం. 1. మనుజసంఘము. (దీనికి బహువచనమునఁ గూడ ప్రయోగములు కలవు.) "క. జనములు దను నవమానించిన..." భార. శాం. ౫, ఆ. ౫౪౭; 2. జన్మము. న. దవనము⚜.

జనయిత. సం. వి. ఋ. పుం. తండ్రి. విశే. (ఋ. త్రీ. ఋ.) పుట్టించువాఁడు.

జనయిత్రి. సం. వి. ఈ. స్త్రీ. తల్లి.

జనరవము. సం. వి. అ. పుం. 1. నింద; 2. కింవదంతి; 3. జనులకలకలధ్వని.

జరఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ముసలివాఁడు. "క...శుక్రుఁడు, జనవరునకు శాపమిచ్చె జరఁడై యుండన్." వి. పు. ౬. ఆ. ౧౬౨.

జర్జరము. సం. వి. అ. న. 1. సాచు⚘, 2. ఇంద్రధ్వజము; 3. ఒకానొకరత్నదోషము. విణ. (అ. ఆ. అ.) 1. ముదిసినది; 2. జీర్ణించినది; 3. తునియలైనది.

జర్జరితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జీర్ణము చేయఁబడినది; 2. ముక్కలు చేయఁబడినది.

జర్జరీకము. సం. విణ (అ. ఆ అ.) 1. పెక్కురంధ్రములు గలది; 2. శిథిలమైనది.

జర్జుఁడు. సం. వి. ఆ. పుం. చంద్రుఁడు. విణ. (అ. ఆ. అ.) వృద్ధుడు.

జర్తువు. సం. వి. ఉ. పుం. 1. యోని; 2. ఏనుఁగు.

జలకంటకము. సం. వి. అ. పుం. 1. శృంగాటకము⚘; 2. మొసలి.

జలకరంకము. సం. వి. అ. పుం. 1. నారికేళము; 2. మేఘము; 3. తామర; 4. శంఖము.

జలకల్కము. సం. వి. అ. పుం. బురద.

జలకాకము. సం. వి. అ. పుం. నీరుకాకి.

జలకుక్కుభము. సం. వి. అ. పుం. కోయష్టికము, ముసలికొంగ.

జలకూపి. సం. వి. ఈ. స్త్రీ. 1. నీటిచెలమ; 2. కోనేఱు.

జలకేళి. సం. వి. ఇ ఈ. స్త్రీ. జలక్రీడ.

జలక్రియ. సం. వి. ఆ. స్త్రీ. పితృతర్పణము

జలక్రీడ. సం. వి. ఆ. స్త్రీ. నీటిలో దిగి చల్లులాడుట.

జలగుల్మము. సం. వి. అ. పుం. 1. నీటిసుడి; 2. తాఁబేలు; 3. నలుచదరపుకొలను.

జలజంతుక. సం. వి. ఆ. స్త్రీ. జెలగ.

జలజన్మము. సం. వి. న్. న. తామర⚘. విణ. (న్. ఆ, న్. న్.) జలమందు పుట్టునది.

జలజము. సం. వి. అ. పుం. 1. జలజంతువు; 2. చేఁప; 3. సముద్రపుటుప్పు; 4. సాఁచు; 5. ప్రబ్బ⚘; 6. ఎఱ్ఱగన్నేరు. న. 1. శంఖము; 2. పద్మము; 3. సున్నపుగుల్ల.

జలజాసనుఁడు. సం. వి. అ. పుం. పద్మమే పీఁటగాఁ గలవాఁడు-బ్రహ్మ.

జలజిహ్వము. సం. వి. అ. పుం.—రుచి తెలియలేని జిహ్వ గలది-మొసలి.

జలజీవి. సం. వి. న్. పుం. జాలరి. విణ. (న్. నీ. న్.) 1. జలముచే జీవించునది; 2. జలమందు జీవించునది.

జలజాఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

జలతరంగము. సం. వి. అ. పుం. 1. కెరటము, అల; 2. వరుసగా గిన్నె లుంచి షడ్జాదిస్వరముల కనుగుణముగా ధ్వనించునట్లు నీరు పోసి పుడుకలతో వాయించు వాద్యము.

జలద. సం. వి. ఆ. స్త్రీ. విద్యుత్తు.

జలదక్షయము. సం. వి. అ. పుం. 1. మేఘక్షయము; 2. మేఘక్షయము గలది-శరత్కాలము.

జలదము. సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. కర్పూరము; 3. ముస్తె⚘.

జలదాగమము. సం. వి. అ. పుం. వర్షాకాలము.

జలధరమాల. సం. వి. ఆ. స్త్రీ. ద్వాదశాక్షరపాదము గలఛందస్సు.

జలధరము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. ముస్తె; 3. సముద్రము.

జలధి. సం. వి. ఇ. పుం.—నీటికి ఆధారమైనది-1. సముద్రము; 2. కోటికోట్లు.

జలధిరశన. సం. వి. ఆ. స్త్రీ.—సముద్రము మొలనూలుగాఁ గలది-భూమి.

జలనిధి. సం. వి. ఇ. పుం. 1. సముద్రము; 2. నాలుగు అనుసంఖ్య.

జలనిర్గమము. సం. వి. అ. పుం. 1. నీళ్లు పోవుట కేర్పఱచినతూము; 2. నీటిబుగ్గ: 3. నీరు పైకుబుకుట.

జలపంజరము. సం. వి. అ. న. వస్త్రవిశేషము. "వ...జలపంజరంబులును కామవరంబులును..." ద్వా. 3, ఆ. ౨౦౬.

జలపతి. సం. వి. ఇ. పుం. 1. వరుణుఁడు; 2. సముద్రుఁడు; 3. పూర్వాషాఢానక్షత్రము.

జలప్రాయము. సం. వి. అ. న. అనూపము, జవుకుభూమి. విణ. (అ. ఆ. అ.) జలాధిక్యము గలది.

జలప్రియము. సం. వి. అ. పుం. 1. వానకోయిల; 2. చేఁప.

జలబాలిక. సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు.

జలబిందుజ. సం. వి. ఆ. స్త్రీ. జొన్నచక్కెర. (విల్సను.)

జలబింబము. సం. వి. అ. పుం. న. 1. నీటిబుడగ; 2. నీటిలోని ప్రతిరూపము.

జలబిల్వము. సం. వి. అ. పుం. 1. ఎండ్రి; 2. తాఁబేలు; 3. జలము గలనలుచదరపుకొలను.

జలభృత్తు. సం. వి. త్. పుం. 1. మేఘము; 2. కర్పూరము. విణ. (ఉ.) జలమును భరించునది. (శబ్దర.)

జలమాడు. ని. అ. క్రి. (జలము+ఆడు) స్నానము చేయుట. "చ. వల్లవవల్లభుండు చెలువల్ జలమాడఁగఁ దక్కటీ, పల్లవముల్ హరించి..." సాంబో. ౧, ఆ. ౮౫.

జలమాతృక. సం. వి. ఆ. స్త్రీ. జలమం దుండెడి మాతృక. (జలమాతృకలేవియన్నరు.—1. మత్సి; 2. కూర్మి; 3. వరాహి; 4. దర్దురి; 5. మకరి; 6. జాలుక; 7. జంతుక. వాచ.)

జలము. సం. వి. అ. న. 1. నీరు; 2 కురువేరు, 3. గోగర్భపిండము; 4. పూర్వాషాఢానక్షత్రము. విణ. (అ. ఆ. అ.) జడము.

జలముచము. సం. వి. చ్. పుం. 1. మేఘము; 2. కర్పూరము.

జలయంత్రము. సం. వి. అ. న. 1. ధారాయంత్రము; 2. నూతిగిరక; 3. నీటిగడియారము.

జలరండము. సం. వి. అ. పుం. 1. జలావర్తము; 2. నీటిబొట్టు; 3. పాము.

జలరసము. సం. వి. అ. పుం. సముద్రపుటుప్పు.

జలరాక్షసి. సం. వి. ఈ. స్త్రీ. సింహిక. (ఇది ఉప్పుసంద్రమున నున్నఛాయాగ్రాహము.)

జలవిషువము. సం. వి. అ. న. 1. తులారాశి; 2. తులాసంక్రమణము.

జలవృశ్చికము. సం. వి. అ. పుం. రొయ్య, మత్స్యభేదము.

జలవ్యాళము. సం. వి. అ. పు. నీరుపాము.

జలసూచి. సం. వి. పుం. 1. మత్స్యవిశేషము; 2. పరికెగడ్డి; 3. కాకి; 4. శింశుమారము.

జలసూత్రము. సం. వి. అ. న. 1. ఒకపాత్రలో నుండి వేఱొకపాత్రలోనికి నీరు పడుటకై రెండుకొనలను గొట్టములు కట్టి ఆపాత్రములలో ఉంచినదారము; 2. పైకి చిమ్ముచుండెడికృత్రిమమైననీటియూట. (బ్రౌ.) "ఉ. తీరిచినట్లు గాఁగ నిరుదిక్కుల నొక్కట జాలువాఱుసిం, గారపుబుగ్గ చెంతఁ గడఁకన్ జలసూత్రము వన్నినట్టుగా, సారసగంధి రొొమ్ము బొమసంమునఁ గస్తురిబొట్టు వెట్టి యెం,తే రహిఁ జేర్చె వజ్రములఁ దీరిన పాపట బొట్టు వేసుకన్." చంద్రా. ౬, ఆ. ౨౫.

జలస్తంభము. సం. వి. అ. పుం. 1. జలమును స్తంభింపఁజేయుమంత్రాది; 2. జలమును స్తంభింపఁజేయుట.

జలహాసము. సం. వి. అ. పుం. నురుఁగు.

జలాంచలము. సం. వి. అ. న. 1. నాఁచు; 2. నీరు పాఱునట్టిదారి.

జలాంజలి. సం. వి. ఇ. పుం. 1. నీటిదోయిలి; 2. పితృదేవతలకు తర్పణముగా విడుచుదోసెడునీరు.

జలాంబిక. సం. వి. ఆ. స్త్రీ. నూయి.

జలాక్షరము. సం. వి. అ. న. - నీటిమీఁద వ్రాయు నక్షరమువంటిది—నీటివ్రాఁత. "క. చెలిమి శిలాక్షర మెప్పుడు, నలుక జలాక్షరము సుజను లగు వారలకున్, జెలిమి జలాక్షర మెప్పుడు, నలుక శిలాక్షరము కుజను లగువారలకున్." కేయూర. 3, ఆ. ౨౯. (అశాశ్వత మని భావము.)

జలార్ద్ర. సం. వి. ఆ. స్త్రీ. నీటిచేతతడిసినవిసనకఱ్ఱ.

జలాలుకము. సం. వి. అ. పుం. తామరదుంప.

జలాశయము. సం. వి. అ. పుం. 1. నీటికుట్టు; 2. చేఁప; 3. సముద్రము; 4. పరికెగడ్డి. న. వట్టివేరు. విణ. (అ. ఆ. అ.) 1 జలమే స్థానముగాఁ గలది; మందబుద్ధి గలది.

జలాశ. సం. వి. ఆ. స్త్రీ—జలముస్థానముగాఁ గలది—జలగ

జలేంధనము. సం. వి. అ. పుం—జలములే కట్టెలుగాఁ గలది—1. బడబాగ్ని; 2. మెఱుపు మున్నగువాని తేజస్సు.

జలేవాహుఁడు. సం. వి. అ. పుం. జలమందు పడిన వస్తుజాలమును మునిఁగి తీయువాఁడు.

జలోచ్ఛ్వాసము. సం. వి. అ. పుం. 1. ఎక్కువైన నీరు పోవుటకు నియమించినతూముమొ.; 2. ఎక్కువైననీరు పొరలి ప్రవహించుట.

జలోదరము. సం. వి. అ. న. కడుపులోనీరు చేరుట వలనఁ గలుగునొకానొక రోగవిశేషము.

జల్పకుఁడు. సం. విణ. (అ. ల్పికా. అ.) జల్పాకుఁడు,

జల్పనము. సం. వి. అ. న. 1. చెప్పుట; 2. ప్రేలుట. విణ. (అ. ఆ. అ.) 1. మాటాడునది; 2. ప్రేలునది.
జల్పము. సం. వి. అ. పుం. 1. మాట; 2. మాటాడుట; 3. ప్రలాపము; 4. పరమతమును నిరాకరించి తనమతము నిలుపుట.
జల్పాకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. వదరుఁబోతు; 2. కథకుఁడు.
జల్పితము. సం. వి. అ. న. 1. చెప్పుట; 2. వదరుట. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది; 2. ప్రేలఁబడినది.
జప. సం. వి. ఆ. స్త్రీ. 1. దాసనము *; 2. దాసనపుఁబువ్వు.
జవనము. సం. వి. అ. పుం. వడి గలగుఱ్ఱము. న. వడి, వేగము. విణ. (అ. ఆ. అ.) వడి గలది.
జవని. సం. వి. ఈ. స్త్రీ. 1. యవనిక, తెర; 2. ఓషధివిశేషము.
జవనిక. సం. వి. ఆ. స్త్రీ. తెర.
జవనిమ. సం. వి. న్. పుం. వేగము.
జవము. సం. వి. అ. పుం. వేగము. విణ. (అ. ఆ. అ.) వేగము గలది.
జవి. సం. వి. న్. పుం. 1. గుఱ్ఱము; 2. లొట్టియ. విణ. (న్. నీ. న్.) వేగము గలది.
జవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) అతివేగముగలది.
జవీయము. సం. విణ. (న్. యసీ. న్.) మిక్కిలి జవము గలది.
జహాత్స్వార్థ. సం. వి. ఆ. స్త్రీ. ప్రకరణము ననుసరించి పదము తననున్నయర్థమును విడిచి యర్థాంతరమును తెలుపుట.
జహాదజహల్లక్షణ. సం. వి. ఆ. స్త్రీ. పదము వాచ్యార్థమున కొంతభాగము విడిచి కొంతభాగము గ్రహించునట్టిలక్షణ.
జహల్లక్షణ. సం. = జహాత్స్వార్థ.
జహానకము. సం. వి. అ. పుం. ప్రళయము.
జహువు. సం. వి. ఉ. పుం. సంతతి, బిడ్డ.
జహ్నుకన్య. సం. వి. ఆ. స్త్రీ. గంగ.

జా

జాంగలము. సం. వి. అ. పుం. 1. ఒకానొకదేశము; కపింజలము; 3. మాంసము. న. చేంటిబీలు. విణ. (అ. ఈ. అ.) 1. వనప్రాయము, అడవిఎక్కువగాఁగలది; 2. అరణ్యప్రదేశమునకు సంబంధించినది; 3. అరణ్యమందైనది.
జాంగలి. సం. వి. ఇ. పుం. విషవైద్యుఁడు. ఇ, ఈ. స్త్రీ. విషము పోఁగొట్టువిద్య. ఈ. స్త్రీ. దూలగొండి.
జాంగలికుఁడు. సం. వి. అ. పుం. విషవైద్యుఁడు.
జాంగులి. సం. వి. ఇ. పుం. 1. విషవైద్యుఁడు; 2. పాములవాఁడు. ఇ. ఈ. స్త్రీ. విషమును హరించు నొకానొకవిద్య.
జాంగులికుఁడు. సం. వి. అ. పుం. 1. విషవైద్యుఁడు; 2. పాములవాఁడు.
జాంఘికము. సం. వి. అ. పుం. లొట్టియ.
జాంఘికుఁడు. సం. = జంఘాకరికుఁడు.
జాంపత్యము. సం. వి. అ. న. దాంపత్యము. "మ... తుషారశైలతనయారాజాంపత్యస్పృహస్పన్నపా, వనగార్హస్థ్యము..." కాళ. 3, అ. ౨౨.
జాంబవము. సం. వి. అ. న. 1. జంబూఫలము; 2. బంగారము.
జాంబీరము. సం. వి. అ. న. నిమ్మపండు.
జాంబూనదము. సం. వి. అ. న.—జంబూనదియందుఁ బుట్టినది—1. బంగారము; 2. కనకాహ్వయము, ఉమ్మెత్త*.
జాగర. సం. వి. ఆ. స్త్రీ. మేలుకొనుట.
జాగరణము. సం. వి. అ. న. 1. మేలుకొని యుండుట; 2. ప్రమాదము లేకుండుట.
జాగరము. సం. వి. అ. పుం. 1. మేలుకొనుట; 2. కవచము; 3. ప్రమాదము లేకుండుట. విణ. (అ. ఆ. అ.) 1. మేలుకొని యుండునది; 2. జాగ్రత్తగలది.
జాగరి. సం. విణ. (న్. ణీ. న్.) 1. జాగరణశీలుఁడు; 2. ప్రమాదము లేనివాఁడు, జాగ్రత్త కలవాఁడు.
జాగరూకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మేలుకొనువాఁడు; 2. జాగ్రత్త గలవాఁడు, ప్రమాదము లేనివాఁడు.
జాగర్తి. సం. వి. ఇ. స్త్రీ. జాగారము, మేలుకొని యుండుట.
జాగర్య. సం. వి. ఆ. స్త్రీ = జాగర్తి.
జాగుడము. సం. వి. అ. పుం. కుంకుమపువ్వునకుఁ బ్రసిద్ధియైన ఒకానొకదేశము. న. కుంకుమపువ్వు.

జాగ్రత్. సం. శత్రు. 1. మేలుకొనియుండునది; 2. పరాకులేనిది; 3. ప్రకాశించుచున్నది.

జాఘని. సం. వి. ఈ. స్త్రీ. తోఁక; 2. తొడ.

జాజి. సం. విణ (న్. సీ. న్.) యుద్ధము చేయు వాఁడు. (శిశు. ౧౯ స. ౩, శ్లో.)

జాజ్వల్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిగుల ప్రకాశించుచున్నది; 2. మిగుల మండుచున్నది.

జాఠరము. సం. వి. అ. పుం. 1. జఠరాగ్ని; 2. మృత్యములలోని యొకదోషము. విణ. (అ. ఈ. అ.) 1. జఠరసంబంధమైనది; 2. జఠరమందున్నది.

జాఠరుఁడు. సం. వి. అ. పుం. పుత్త్రుఁడు.

జాడ్యము. సం. వి. అ. న. 1. మాంద్యము. 2. మూర్ఖత్వము.

జాడ్యారి. సం. వి. ఇ. పుం. నిమ్మచెట్టు.

జాత. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. నాటకోక్తి యందు ప్రేమసూచకముగ స్త్రీబాలపాత్రలను బిలుచుమాట.

జాతకము. సం. వి. అ. న. 1. జాతకశాస్త్రము; 2. రాశిచక్రము; 3. సజాతీయసమూహము. విణ. (అ. ఆ. అ.) పుట్టినది.

జాతకర్మము. సం. వి. న్. న. 1. పుట్టినవెంటనే తండ్రి బిడ్డకుచేయవలసిన సంస్కారవిశేషము.

జాతమాత్రము. సం. విణ. (అ. ఆ. అ.) అప్పుడే పుట్టినది.

జాతము. సం. వి. అ. పుం. జంతువు. న. 1. జన్మము; 2. జాతి; 3. సమూహము. విణ. (అ. ఆ. అ.) 1. పుట్టినది; 2. సంభవించునది; 3. స్పష్టము.

జాతరూపము. సం. వి. అ. న. 1. బంగారు; 2 ఉమ్మెత్త; 3. నగ్నత్వము. విణ. (అ. ఆ. అ.) దిగంబరము.

జాతవాసగృహము. సం. వి. అ. న. పురిటిల్లు.

జాతవేదసుఁడు. సం. = జాతవేదుఁడు.

జాతవేదుఁడు. సం. వి. న్. పుం. అగ్ని.

జాతపత్యా. సం. వి. ఆ. స్త్రీ, బాలెంతరాలు.

జాతాశౌచము. సం. వి. అ. న. పురుడు.

జాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. జన్మము; 2. వంశము; 3. బ్రాహ్మణాదివర్ణము; 4. రీతి, విధము. "చ. సరసు లరిలేఁ గ్రొన్నెలలజాతి బిసంబులఖ్యాతి..." జై. ౪, ఆ. ౧౯౯; 5. అర్థాలంకారభేదము. "ఉ. తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుం జమత్కారము..." విజ. పీఠి. ౩౧; 6. సప్తస్వరములు; 7. పద్యభేదము; 8. భ్రాంతి; 9. ఉసిరికచెట్టు. ఇ, ఈ. స్త్రీ. 1. జాజికాయ; 2. మాలతిచెట్టు విణ. (ఇ) 1. మంచిజాతిది. "సీ. రాణించుజాతివజ్రాలమేడలడాలు..." దశా. ౧, అ. ౨౬౫; 2. సొగసైనది. "గీ. కలికికాటుక గీర్బొట్టు కలుఁగుపేరు, జాతిగాఁ దాల్చి నెలఁత మిండజంగ మగుచు." హర. ౫, ఆ. ౪.

జాతినాగు. మి. వి. (జాతి+నాగు.) ఒకానొకజాతి పాము. "సీ. శంఖపాలకులును జాతినాగులు..." ద్వా. ౪, ఆ. ౧౧౦.

జాతిపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. జాపత్రి.

జాతిఫలము. సం. వి. అ. పుం. జాజికాయ.

జాతిసారము సం. వి. అ. న. జాజికాయ.

జాతిస్మరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పూర్వజన్మము సంగతి తెలిసినవాఁడు.

జాతీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒకజాతికి సంబంధించినది; 2. ఏదోఒకజాతియందు పుట్టినది; 3. ఒకతద్ధితప్రత్యయము. (ఉదా:—పటుజాతీయము.)

జాతుఁడు. సం. వి. అ. పుం. 1. కొడుకు; 2. నాటకోక్తియందు కొడుకును పిలుచుటయం దుపయోగించుమాట.

జాతుషము. సం. విణ. (అ. ఈ. అ.) లక్కతోఁ జేయఁబడినది.

జాత్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సత్కులమందుఁ బుట్టినది; 2. కులీనము; 3. ఇంపైనది; 4. శ్రేష్ఠము.

జానత్. సం. శత్రు. తెలిసికొనుచున్న.

జానపదము. సం. వి. అ. పుం. 1. గ్రామము; 2. గ్రామములనుండి పొందుపన్నెము. విణ. (అ. ఆ. అ.) 1. జనపదమందలిది; 2. జనపదసంబంధమైనది.

జానము. సం. విణ. (అ. ఈ. అ.) జనసంబంధమైనది.

జానానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తెలిసికొనుచున్నవాఁడు.

జానువు. సం. వి. ఉ. పుం. న. మోఁకాలు.

జాపము. సం. వి. అ పుం. జపము. విణ. (అ.ఆ.అ.) జపించునది. (అ. ఈ. అ.) జపసంబంధమైనది.

జాబాలుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకఋషి; 2. మేఁకలకాపరి.

జామ. సం. వి. ఆ. స్త్రీ. కుమార్తె.

జామాత. సం. వి. ఋ. పుం. 1. అల్లుఁడు; 2. పెనిమిటి; 3. స్వామి; 4. ప్రొద్దుతిరుగుడుచెట్టు.

జామి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. ఆఁడుఁబడుచు; 2. కులకాంత; 3. కూఁతురు; 4. కోడలు; 5. గడ్డి. ఇ. న. 1. జలము; 2. ఒకానొకదేశము.

జామిత్రము. సం. వి. అ. న. జాయామిత్రము; కళత్రస్థానము.

జాయ. సం. వి. ఆ. స్త్రీ. భార్య. (దీనికి బహువ్రీహి సమాసమున నిజాదేశము. ఉదా:—జానకీజాని జానకి జాయగాఁ గలవాఁడు.)

జాయాజీవుఁడు. సం. వి. అ. పుం. 1. నటుఁడు; 2. భార్య సంపాదించినధనముచే జీవించువాఁడు.

జారిణి. సం వి. ఈ. స్త్రీ. స్వైరిణి.

జారుఁడు. సం. వి. అ. పుం. 1. ఉపపతి; 2. పరస్త్రీని గూడువాఁడు.

జాలంధరము. సం. వి. అ. పుం. 1. ఒకదేశము; 2. ఆసనవిశేషము. "గీ. కంఠ మాకుంచనము చేసి కడు దృఢముగ, హృదయమునఁ జుబుకము నిల్పు నిదియె కాఁడె,ధన్యజాలంధరాభిఖ్యబంధము ..." సీతారా. ౧, ఆ. ౧౨౫.

జాలకము. సం. వి. అ. న. 1. వల; 2. సమూహము; 3. లేఁతమొగ్గ; 4. కపటము; 5. పక్షిగూడు; 6. అరఁటిచెట్టు; 7. ఆభరణవిశేషము; 8. అరఁటి పండు. పుం. న. గవాక్షము, కిటికీ.

జాలగోణిక. సం. వి. ఆ. స్త్రీ. పెరుగుచిలుకుకుండ.

జాలపాదము. సం. వి. అ. పుం. 1. రాజహంసము; 2. హంస; 3 కోడి; 4. నీటికోడి. విశే. (అ. ఆ. అ.) వలవంటిపాదము గలది.

జాలము. సం. వి. అ. న. 1. వల; 2. ఇనుపతీఁగెలతో అల్లినకవచము; 3. సమూహము; 4. కిటికీ; 5 మొగ్గ; 6. దంభము; 7. మాయ. పుం. కదంబము, కడిమిచెట్టు.

జాలి. సం. వి. ఈ. స్త్రీ. పొట్ల. న్. పుం. 1. జాలరి [వాఁడు; 2. మాయకాఁడు.

జాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మేలిముసుగు; 2. జలగ; 3. విధవ; 4. ఇనుము; 5. సాలెపురుగు; 6. కవచము; 7. అరఁటిచెట్టు.

జాలికుఁడు. సం వి. అ. పుం. 1. ఐంద్రజాలికుఁడు; 2. జాలరి; 3 గ్రామాధిపతి; 4. బోయవాఁడు.

జాల్ముఁడు. సం విశే. (అ. ఆ. అ.) 1. క్రూరుఁడు; 2. పామరుఁడు; 3. అసమీక్ష్యకారి.

జాహకము. సం. వి. అ. పుం. 1. పిల్లి; 2. మంచము; 3. జలగ; 4. నల్లనిత్తొండ.

జాహ్నవి. సం. వి. ఈ. స్త్రీ. గంగానది.

జి

జి = జీ. (పూజ్యనామములతుదఁ జేర్చుపదము.) "మ...ఆరాయలవారితోఁ బలికె నయ్యప్పాజి ..." కృష్ణ. ౨, ఆ ౯౦.

జింక. దే. వి. (క. జింకె.) 1. ఒకజాతిలేడి. ఆం. భా. ద్వి. ౧౪౫; లేడి, మృగము. "సీ...పులి కగ్గమైన జింకలవిధమున." భార. కర్ణ. ౨, ఆ. ౨౭౩. ఆము. 3, ఆ. ౧౯.

జింకతలచుక్క. ద్వ. వి. (జింకతల+చుక్క.) మృగశీర్షనక్షత్రము. (శ. ర.)

జింకతాలుపరి. ద్వ. వి. (జింక+తాలుపు+అరి.) 1. మృగధరుఁడు, చంద్రుఁడు; 2. శివుఁడు. "సీ. జింకతాలుపరియుం జింకతాలుపరియుం బుఱఁదియు ననుఁగునై యొఱపుఁజూపు." అచ్చ. బాల; 3. (రెండర్థములకు నిది యుదాహరణము.)

జింకతాల్పు. ద్వ. వి. (జింక+తాల్పు.) 1. చంద్రుఁడు. "అ...నీకు,పంక గల్గదొటు జింకతాల్పు." నీలా 3, ఆ. ౨౧; 2. శివుఁడు. "రగడ. చిలువరాయఁడు ప్రొద్దుచూలియుం జింకతాల్పును వేల్పుఁబెద్దయుం." అచ్చ. యుం. ౬౪.

జింకపొక్కిలి. దే. వి. (జింక+పొక్కిలి.) మృగనాభి, కస్తూరి. "గీ. ఓలిఁ దగుచోట్ల వారిఁ గూర్చుండఁ బెట్టి,కమ్మలమ్ములు మంచిగందములు జింక,పొక్కిలియుఁ గప్పురము..." అచ్చ. బాల. ౧౬౭.

జింకమావుదేవర. దే. వి. (జింకమావు+దేవర)- మృగమే గుఱ్ఱముగాఁ గలవాఁడు - గాలి. "క. పిల్లారిజెయ్యతేజమునఁ,దల్లంబుగ జింకమావుదేవర కతనన్." అచ్చ. కిష్కిం. ౯౩.

జింకరవుతు. దే. వి. (జింక+రవుతు) మృగమే వాహనముగాఁ గలవాఁడు—గాలి. (శ. ర.)

జింకవార్వపుజోదు. ద్వ. వి. (జింక+వార్వము+జోదు) గాలి. "అ. తై చుటయుఁను జింకవార్వపు

జోదుబి, డ్డండు వెండియుంను గడంగి వాని తేరుగడపువాఁడు దేరును గుత్తిమున్, చదియ నొక్క పెద్దచట్టు వయిచె." అచ్చ. యు. ౧౨౪. ఇట్లే: జింకవార్వపువజీరు. "గీ. అపుడు రాచూలి జింకవార్వపువజీరు, గారవపుఁబట్టి..." అచ్చ. కిష్కి. ౭౯.

జింజిరి. దే. వి. (హిం. జింజీర్) గొలుసు. (శ. ర.)

జిక్కతురక. దే. వి. పక్షివిశేషము. "సీ. గున్నంగి కనకాక్షి గుడిసె బయ్యకపుల్లు జీలువు బెగ్గురు జిక్కతురక." హంస. 3, ఆ. ౧౫.

జిగట. దే వి. (క. జిగటు.) బందన, బంక. ఉదా:— తుమ్మజిగటమొ ), విణ. నున్ననిది. ఆం. భా. ద్వి ౫౭౫.

జిగమిష. సం. వి. ఆ. స్త్రీ. పోవునట్టికోరిక.

జిగమిషువు. సం. విణ. (ఉ) పోవ నిచ్ఛ గలవాఁడు

జిగి. దే. వి. 1. కాంతి, ప్రకాశము. "సీ. అరుణాంబుజాంబులయంతర్దళంబుల తళతళ యనుజిగి దళము కొల్పి." భార. ఉద్యో. ౫, ఆ. ౧౧౪; 2. సుషమ. "సీ...తగు సుషమాభిధ జిగి యనంగ." ఆం. భా. ప్ర. ౧౦; 3. కాంతి యను నొక కావ్యగుణము. "చ. మెలఁకువ గాంచు బెళ్కుజిగి మించు ప్రబంధతతుల్ ఘటింతువా." ఇందు. ౧, ఆ. 3౪.

జిగిదేఱు. దే. అ. క్రి. (జిగి+తేఱు) కాంతివంత మగు. "గీ. కొప్పునకుఁ జేర జిగిదేఱుగొల్లఁ దీర్చి." పార్వ. 3, ఆ. ౭౧. [షము. (వా.)

జిగిని. దే. వి. (హిం. జిగ్ని.) స్త్రీలకంఠాభరణవిశే

జిగిమానము. గ్రా. వి. పిసినితనము. (శ. ర.)

జిగిలి. దే. విణ. చిక్కనైనది. (శ. ర.)

జిగీష. సం. వి. ఆ. స్త్రీ. 1. గెలుచునిచ్ఛ; 2. ప్రయత్నము; 3. అతిశయము, ప్రకర్ష.

జిగీషువు. సం. విణ. (ఉ) గెలువ నిచ్ఛ గలవాఁడు

జిగురు. దే. వి. 1. బంక, నిర్యాసము. ఉదా:— తుమ్మజిగురు; 2. పక్షులను బట్టుటకై పుల్లలు మొదలైనవానికి రాచినబందన. "చ. జిగురునఁ బడ్డరాచిలుక చెల్వున..." కాశి. ౪, ఆ. ౫౯. "సీ. జిగురంటినటుల వెన్దగిలి పోనీక యాసింగాణి మసఁబోతుఁ జెండివైచు." సా. ౧, ఆ. ౯౫; 3. ననుపు. ఆం. భా. ద్వి. ౫౭౫.

జిగురుఁగండె. దే. వి. (జిగురు+కండె) పక్షులను బట్టువేఁటసాధనములలో నొకటి "క. వలలు రులఁ జిగురుఁగండెలుఁ, జిలిబియుఁ జిక్కంబు... భాగ. ౭, స్కం. ౭౭, పి. కసం. ౧, ఆ. ౧౧౬.

జిగురుకొను. దే. అ. క్రి. (జిగురు+కొను.) అంటుకొను. "గీ. జిగురుకొన్నగజసూన్ఫూర్తిఁ జెఱఁగు మాసి." కాశి. 3, ఆ. ౫౧.

జిగురుగడ. దే. వి. (జిగురు+గడ) పక్షులను బట్టుటకై చివర జిగురు రాచినగడ. "సీ. పాంచి పెన్నుం డెక్కపులుఁగురాయనికైన నిడుపుజిగురుగడఁ బొడువఁగలము." వరాహ. ౪, ఆ. ౭౭. శై. ౪, ఆ. ౭౬.

జిగురుటంబలి. దే. వి. (జిగురు+అంబలి) చింతగింజలు మొదలగువానితో జిగురుగా చిక్కగాఁ గాఁచినయంబలి. 'సీ. జిగురుటంబలి వేఁడి దిగు పాఱ జాఱఁగాఁ గుండలకొలఁదిగాఁ గ్రుమ్మరించి." రంగా. 3, ఆ. ౯౭.

జిగుర్గండె = జిగురుఁగండె. "సీ. చనువుపన్యమునఁ దా సంఘటించినశంక కవికోటులకు జిగుర్గండె గాఁగ." బహు. ౧, ఆ. ౭౯. (తప్పించుకొన శక్యము కాని దని భావము.)

జిగుర్మీట. దే. వి. (జిగురు+మీట) జిగురురాచిన మీట. "మ...ఎద్దుల్ పోఁగులుల్ బోటుకో, లలు జాలంబులు గంటలుల్ దివెలు గాలంబుల్ జిగుర్మీటలున్." ప్రబంధ. ౧౯౦.

జిఘత్స. సం. వి. ఆ. స్త్రీ. 1. తినఁగోరిక; 2. ఆఁకలి

జిఘాంస. సం. వి. ఆ. స్త్రీ. చంపఁ గోరిక.

జిఘాంసువు. సం. వి. ఉ. పుం. శత్రువు. విణ. (ఉ) చంపుకోరిక గలవాఁడు.

జిఘృక్ష. సం. వి. ఆ. స్త్రీ. గ్రహింపఁగోరిక, తెలియవలె ననునిచ్ఛ.

జిఘ్రుడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూర్కొను వాఁడు; 2. జాడ కనిపెట్టువాఁడు.

జిజీవిషువు. సం. విణ. (ఉ) బ్రదుకనిచ్ఛ గలది. "వ...ఏ మిందె వచ్చుచున్నార మని ఖిజ్జింబిన సుజ్జిజీవిషు వగునజ్జోటి లజ్జామజ్జదవనతాననాబ్జయై..." ద్వా. ౭, ఆ. ౧౭౯.

జిజ్ఞాస. సం. వి. ఆ. స్త్రీ. 1. తెలియవలె ననుకోరిక; 2. తెలియుటకు చేయువిచారణ.

జిజ్ఞాసువు. సం. విణ. (త్రీ) తెలియనిచ్ఛ గలవాఁడు.

జిట్ట. దే. వి. 1. పెసరుమొక్కయెన్ను. "చ...తద గ్ర ధాన్యములన్, సెలవుల ఫేన పుట్టినడ జిట్టుల తోడనె చప్పరించు నన్నవ్వాలమువరావాసిత ములు..."స్వా. ౪, ఆ. ౧౮; 2. పక్షివిశేషము. "సీ. జీలువ్వ జీసువ జిట్ట చింద వెలిచె..."సుద. 3, ఆ. ౧౯౪. ప్రబంధ. ౨౩౪; 3. చాఱ,గీత. "సీ. భిత్తిభాగముననఁ గ్రొన్నెత్తురు జిట్టలు చూపల మాంసపుఁదోరణములు." వైజ. ౪, ఆ. ౮౦; 4. నేతఁగాఁడు బట్ట నేయునపుడు గుఱుతునకై వేయురంగులనూలినేత. (వా.) 5. జేన. (శ. ర.)

జిట్టంగి. దే. వి. కాటుకపిట్ట. (బ్రౌ.)

జిట్టువ. దే. వి. పక్షివిశేషము. 'సీ. జిట్టువ మునుగ పూజిట్టువ గిజిగాఁడు..."హంస. 3, ఆ. ౧౨.

జిడికిరించు. దే. అ. క్రి. మోసపుమాటలాడు. (చూ. జిడికిరింత.)

జిడికిరింత. దే. వి. (జిడికిరించు. ధా.) మోసపుఁ బలుకు. "ద్వి. గడుసరిమనసులు గరఁగించివుచ్చి, జిడికిరింతలు గట్టి చెవి యూనకున్న." ద్వి. పారిజా. ఉ. ౬౨౦ పం.

జిడుగు = గిడుగు. "గీ. వర్షవారణనామమైపఱలు గిడుగు, జిడుగనఁగ..."ఆం. భా. ద్వి. ౧౯౩. ఆం. పదా. పరి. ౫౧.

— జిడ్కడలి = జిడ్డుకడలి. "ఉ...౨, తున్నలి కన్న జిడ్కడలి నుద్ధత మై వెలిదీవి చెన్నగున్." పాండు. 3, ఆ. ౧౫౧.

జిడ్డి. దే. వి. మోటుగుడ్డ. "ఉ...పెండ్లికూఁతు ర,త్యాయతవైభవస్ఫురణ నంతిపురంబున కేఁగు దెంచెఁ బై,డాయఁగ జిడ్డివై చినకడాని మెఱుంగు పసిండిపాలకిన్." శైవ. ౭, ఆ. ౧౪౫. విణ. మోటైనది. (శ. ర.)

జిడ్డు. దే. వి. (క. జిడ్డు) 1. నేయిలోనగువానినునుపు, మెఱుఁగు, "గీ. ముదముసను గద్వఁనకుఁ బెట్టి మూఁటిజిడ్డు, మోమునను మేనఁ జమిరి..." హరి. పూ. ౫, ఆ. ౧౯౪. కాశీ. ౪, ఆ. ౨౮; 2. జిగురు. "చ. అనఘుఁ డతండు నిత్యము నహర్ముఖ కృత్యము లాచరించి ప్రాపనమతి జిడ్డు లేక కయివ్రాలక వడక...పరువంపుఁ గ్రొవ్విరులఁ గోయుచు..."విప్ర. ౨, ఆ. ౭౯. 3. వృక్షవిశేషము "సీ. జమ్మి బలుసు గార చంద్ర పాకి...లొద్దుగ జిడ్డు..."హంస. ౪, ఆ. ౯. విణ. 1. జిడ్డు గలది. "ఉ...ఏణమద మంగముఁ జెప్పటజక్క రోయు జిడ్డుంచు జవాది..." ఆము. ౧, ఆ. ౬౧; 2. సన్ననిది. ఆం. భా. ద్వి. ౨౫౬.

జిడ్డుకడలి. దే. వి. (జిడ్డు+కడలి) పాలసముద్రము. "సీ. ఉప్పు కడఁకతో రెల్లుదీవియుం జిడ్డుకడలియుం గడచిరి..."అచ్చ యుం. ౪౦౩. "క. జిడ్డుకడలి దొరయల్లుం, డొడ్డుగొనందొడఁగె..."బహు. ౪, ఆ. ౩౧.

జిడ్డుగొను. దే. క్రి. (జిడ్డు+కొను) జిడ్డుకలదగు. "క. కాయమ్ములి జిడ్డుగొనఁగ, నాయూఁగల మొత్త మాత్రి తాఖండశమై." పాండు. ౪, ఆ. ౨౫౩.

జిడ్డునీర్వామి. దే. వి. (జిడ్డు+నీరు+వామి) పాల సముద్రము. "సీ. చదువుల దేవర మొదలగు వేలుపులు జిడ్డునీర్వామికిఁ జేరి యందు." అచ్చ. బాల. ౭౮౨.

జిడ్డుపడు. ద్వ. అ. క్రి. (జిడ్డు+పడు) వ్యర్థమగు. (చూ. జిడ్డుపఱచు)

జిడ్డుపఱుచు. ద్వ. స. క్రి. (జిడ్డుపడు. ధా. ప్రే.) వ్యర్థముచేయు. "వ...అటుగాక యొఱగొడ్డెంబు లాడి నీకడ్డపాటు గొడ్డేఱుగా జిడ్డుపఱుపంగల వారమె..."హర. ౨, ఆ. ౧౩౨.

జిడ్డువెంపలి. దే. వి. (జిడ్డు+వెంపలి) వృక్షవిశేషము "సీ. జిల్లేడు వెంపలి జిడ్డువెంపలి..."హంస. ౪, ఆ. ౧౦.

జిత. వై. విణ. (సం. స్థిత్. క. జిత.) అనుకూలము (చూ. జితపడు.)

జితకాశి. సం. విణ. (న్. నీ. న్.) జయముచే ప్రకాశించువాఁడు. "క...ప్రజలకు విహితా, హితు లగుచుండి రనేకులు, జితకాశులు ధరణి పతులు శిశుపాలాదుల్." భార. ఆది. 3, ఆ. ౫౫.

జితనేమి. సం వి. ఇ. పుం. రావికఱ్ఱ.

జితపడు. ద్వ. అ. క్రి. (జిత+పడు.) అనుకూలపడు. (వా.)

జితపాటు. ద్వ. వి. (జితపడు ధా.) అలవాటు. (వా.)

జితము. వి. అ. స. గుణ్య. సం. విశే. (అ.ఆ.అ.) 1. జయింపఁబడినది; 2. లోఁగఁదీయఁబడినది.

జితి. సం. వి. ఇ. స్త్రీ. జయము.

జితించు. దే. అ. క్రి. అనుకూలపడు. (వానికి తిన్న అన్నము జితింపదు. బ్రౌ.)

జిత్తు. వై. వి. (సం. యుక్తి.) 1. మాయ. "గీ. జిత్తులకు డెంకి యగునింద్రజిత్తుచేత." భా. 3. ఆ. ౮౪; 2. యుక్తి. "సీ. ఎత్తు జిత్తునఁగ నింపెసఁగు యుక్తి." ఆం. భా. ప్ర. ౧౧3.

జిత్తు. సం. విశే. (త్) జయించినవాఁడు. (సమాసాంతము లందే ప్రయోగింపఁబడు చుండును. ఉదా:—ఇంద్రజిత్తు. మొ.)

జిత్తులకత్తె. ద్వ. విశే. (జిత్తులు+కత్తె.) మాయలాఁడి. "ఉ. జిత్తులకత్తె లిచ్చకముఁ జేయుచుఁ బైపయి నాసచేయ..." రాధా. 3, ఆ. ౮౯.

జిత్తులమారి. ద్వ. విశే. (జిత్తులు+మారి.) మాయ చేయుటయందు నేర్పు గలది, మాయకాఁడు. (వా.)

జిత్తులవాఁడు. ద్వ. విశే. (జిత్తులు+వాఁడు.) మోసగాఁడు. "సీ. అలరు జూటనఁగ జిత్తులవాఁడనంగ వంచకుఁడు..." ఆం. భా. కృ. 3.

జిత్వరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) జయశీలుఁడు.

జిత్వుఁడు. సం. విశే. (న్. త్వరీ. న్.) 1. జయశీలుఁడు; 2. యోధుఁడు; 3. ఇంద్రుఁడు.

జిద్దు. దే. వి. కలహము. (శ. ర.)

జిద్దుగొను. దే. స. క్రి. (జిద్దు+కొను.) ఎదుర్కొను. "గీ. శిఖామసరదారుగారితో జిద్దుగొన్న కవ్వడికి నైనఁ గాండీవకల గడంగు." రంగా. ౨, ఆ. ౮౦.

జినుఁగు. దే. విశే. 1. మృదువైనది. "ద్వి. జినుఁగు దువ్వలువ కచ్చెలపట్టి కట్టి." ద్వి. పరమ. ౯, ఆ. ౮౨౮. పా. "చ. వెలిపడఁటి కచుట్టజిగి మించిన పాగ జినుంగుపచ్చడం,బలవడ చల్వదోవతి..." హంస. ౧, ఆ. ౨3౨; 2. నున్నితమైనది. "సీ. పచ్చటాజినుఁగుఁ గ్రొంబనులసోరణగండ్ల బుడిబుడిఁ బొదలి దూబూచులాడు." చంద్రా. ౧, ఆ. ౮౨; 3. సన్ననిది. "ద్వి. జినుఁగులై చినుఁగులై సింహమధ్యముల, కనుఁగులై పెనఁగులై పట్టికొనులను, గలిగి..." ద్వి. పరమ. 3, ఆ. ౨౮3. పా.

జినుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధుఁడు; 2. విష్ణువు. విశే. (అ. ఆ. అ.) 1. జయించుస్వభావము గలవాఁడు; 2. అతివృద్ధు.

జిన్న. దే. వి. వృక్షవిశేషము. "సీ. అన్నులతలమిన్నఁ గన్నారఁజూడరే పొన్నలార పెఱుంపజిన్నలార." రసిక. ౬, ఆ. ౮౪.

జిబిలిక. దే. వి. ఒకదినుసుబిఱ్ఱి. (శ. ర.)

జిబ్బటి. దే. వి. గబ్బిలము. "సీ. ఎడ తేక తఱచు వ్రేలెడుజిబ్బటీలచే గబ్బులు వెదచల్లుగర్భగృహము." చంద్ర. 3, ఆ. ౮౮.

జిబ్బడాయి. దే వి. గబ్బిలము. 'సీ. చిటుక చెక్కరంబు జిబ్బడాయి జటాయు...' హంస. 3, ఆ. ౧౨.

జిబ్బు. దే. వి. (క. జిబ్బు.) అంటిపట్టుకొని యుండుట. "శా. అల్లన విచ్చుచెంగలువలందు రజంబగు కప్పురంబులై,జల్లఁగఁ జల్లనై వలమహాసౌరభముల్ వెదచల్లుభావముల్, పల్లవహస్తవన్నెఁగనుపయ్యెద జిబ్బునఁ దోఁచు భాతిగాఁ,బిల్లలవత్తిపట్టు యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చెఁ గబ్బముల్." జై. ౧, ఆ. ౨౯.

జిమిడిక. దే. వి. వాద్యవిశేషము. "వ...సంబయుం జిమిడిక తప్పెట..." హంస. 3, ఆ. ౨౯.

జిమ్ము. దే. విశే. 1. అధికము. "గీ...గుండెలు తల్లడిల్ల, జిమ్ముఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల." భాగ. ౧౦, పూ. పూ. ౨౨౯. 2. అధీనము.

జిమ్ము. దే. అ. క్రి. (ద్రవపదార్థము మొ.) పైకుబుకు. "శా. క్రమ్మెడుశోణితంబు శరకట్టఁగ గంటుల వెంటఁ జెట్టుగా,జిమ్మఁగ..." జై. ౬, ఆ. ౧౯౬.

జియ్య. దే. వి. 1. దేవుఁడు. 'సీ. వలపుమోపరి జియ్య వలమూలదయ్యంబు గుండులతలకట్టు పండుదండి." అచ్చ. బాల. ౮. పండితా. మహిమ. ౨౮3. పా; 2. రాజు. "గీ. జియ్య యిఁకనైనఁ బ్రోవవే చిత్తగించి." య. ౨, ఆ. ౧౧౯. రామా. ౯, ఆ. ౨౦౪; 3. వైష్ణవదేవాలయాధికారి. "క. తలవరియెదుటం బెట్టిన,నల వేశ్యఁ దదీయమాత నగ్గిన్నియ జియ్యలకడకుం గొని చనఁగా,లసానుజతల్లి వారలకు నిట్లని యెన్.' వైజ. ౪, ఆ. ౮3. "శా. ఈమాడిక్రం గుడి జియ్యతోడ సభవారేకోక్తిగా నాడఁగా." వైజ. ౪, ఆ. ౧౧౪; 4. జనకుఁడు, తండ్రి.

"క. పిల్లారిజియ్య తేజునఁ, దెల్లంబుగ జింకమావు దేవరకతనన్." అచ్చ. కిష్కిం. ౯౩; 5. గౌరవ సూచకము. "గీ. రార నాపట్టి నాజియ్య రార యనుచు." హర. ౨, ఆ. ౧౧౩. భా. రా. యు. ౩౯౪.

జియ్యరు. దే. వి. (త. జీయర్.) 1. వైష్ణవసన్న్యాసి. "వ... అద్దేవునికోవెలకు సర్వాఖునకుం కర్త యగుజియ్యరునకు విన్నవించిన..." పరమ. 3, ఆ. ౨౦౪; 2. వైష్ణవదేవాలయాధికారి.

జిరా. దే. వి 1. కవచము, గుఱ్ఱములు మున్నగువాని మీఁద వేయుకవచము. "పంచచా... జిరాగుఱాల చేసి..." కృష్ణ. 3, ఆ. ౩౦. ద్వా. ౦, ఆ. ౭౧; 2. బాణము. "చ. తలిరుజిరావజీరుబలుదాడికి నోడి..." నీలా. 3, ఆ. ౧౧౪. సా. ౨, ఆ ౧౨౦.

జిరాయతి. దే. వి. (క. జిరాయితు. హిం. జిరాయత్.) దుక్కి, కృషి. (శ. ర.) (ఉదా: జిరాయతి పల్లపు నేల.)

జిఱ. దే. వి. తిరుగుటయందలిధ్వని కనుకరణము. (దీని ఆమ్రేడితరూపము జిఱజిఱ.) "సీ. వడి జిఱఁ దిరిగి మ్రొగ్గడుసుదావళములు..." శై. ౫, ఆ. ౧౯౨. "చ. జంబుకున్న... బొట్టులుకట్టి నేలపై జిఱజిఱఁ ద్రిప్పి కొట్టి..." అచ్చ. కిష్కిం. ౦, ఆ. 3. భాగ. ౧౦, స్కం. పూ. ౬౮౨.

జిఱకొట్టు. దే. అ. క్రి. (జిఱ+కొట్టు.) జిఱజిఱ యని ధ్వనిచేయు. "ద్వి. కదియఁబోవుటయుం నక్కపటమృగంబు, చెరలాడు జిఱకొట్టుఁ జెలగి పేరెంబు, దిరుగు..." ద్వి. హరిశ్చ. పూ. ౬౯౯. పం. పారి. ౫, ఆ. ౧౩.

జిట్టి = జిఱ. వి. తిరుగుటయందగుధ్వనికరణము. (శ. ర.) దీనియామ్రేడితముజిట్టిజిట్టి.) "క. సూత తనయసారాచ, స్యూతమలై వారణంబు లాలులను పొగయుచున్, భూతలమునఁ బొరలుఁ దెరలు. చేతూలను జిట్టిఁ దిరుగు ఛిచ్చుక్ జచ్చున్." భార. కర్ణ. ౧, ఆ. ౦౦. శైవ. 3, ఆ. ౧౫౧.

జిట్టిజిట్టిన. దే. క్రి. విశ. దు. జిట్టిజిట్టి యని ధ్వనించునట్లు. "వ... జిట్టిజిట్టి నట్టాడు ధేనువులఁ బేరు పేరం బిలుచువారును..." వి. పు. ౭, ఆ. ౧౪౭.

జిట్టిత్రాడు. దే. వి. (జిట్టి+త్రాడు.) పిరి యెక్కించిన త్రాడు. (శ. ర.) "ద్వి. జనకు పుట్టించి నీసకల రాజ్యంబు గోడు గుడువఁ బుచ్చుకొని యొక జిట్టిత్రాడుగా మదుపనిదావలఁ బెనఁచి." ద్వి. హరిశ్చ. పూ. ౧౦౭౫. పం.

జిట్టిపోవు. దే అ. క్రి. (జిట్టి+పోవు.) జిట్టి అను ధ్వనితో చెవులు దిబ్బడ వేయు. "సీ. దండిసంతాన దుర్దాంతఘీంకృతులచేఁ జెవులు బూమ్మనుచును జిట్టిపోవ." పి. శకుం. 3, ఆ. ౧౧౫.

జిట్టు. దే. వి. 1. తిరుగుటయందలిధ్వని కనుకరణము. (దీనిఆమ్రేడితము జిట్టుజిట్టున.) "వ... విశిఖంబులు ముఖంబుల నాఁటిన జిట్టునఁ దిరుగుతుండాలంబులును..." భార. భీష్మ. ౧, ఆ ౧౬౭. కు. సం. 3, ఆ ౫; 2. చీఁదుటయం దగుధ్వని కనుకరణము. "సీ. కదుఁ గపాలము దాఁకి కలఁగంగఁ జక్కఁగాఁ జేసాచి జిట్టునఁ జీది చీఁది." కాశ. ౨, ఆ. ౪౧౭; 3 గోరు మున్నగువానితో పెల్లగించుటయం దగ ననుకరణము. "చ. చిటికెనవ్రేలి గోరఁ గొని జిట్టునఁ దీసెను లోచనంబు..." భీమ. ౬, ఆ. ౬౫; 4. మీఁదికి లేచుట ఎగయుట మొదలగువాని యందలి యనుకరణము. "సీ. తగిలింప జిట్టున నెగయుం నాకాశబాణంబు లంబరవిమానంబు దాఁటు." దశా. ౭, ఆ. ౨౬౩. చంద్ర. 3, ఆ ౬౪.

జిల. దే. వి. దురద "గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగ." ఆం. భా. ద్వి. ౧౨౯.

జిలకఱ. దే. వి. జీలకఱ్ఱ. "సీ. గంటు ఖారంగియుఁ గంతమ్మమును మెంతి మంజిష్ఠ జిలకఱ మ్రాని పసుపు." హంస. ౨, ఆ. ౨౨౯.

జిలకఱరాజశాలులు. దే. వి. బ. (జిలకఱ+రాజశాలులు.) జిలకఱవలె నుండుధాన్యవిశేషము. "సీ. జిలకఱ రాజనాల్ చింతపువ్వులు గోరురాజనాల్..." హంస. ౪, ఆ. ౧౨౦.

జిలకఱ్ఱ = జిలకఱ. (వా.)

జిలజిల. దే. వి. 1. నాలుక మొదలగునవి తడియగుటయం దనుకరణము. "క. జిలజిల మరుసిల్లు పెల్లు చెమ్మగిలంగన్." రసిక. ౧, ఆ. ౯౦. "గీ జిల జిలను సన్నబిడిగఁ బట్టెలను దీర్చు." పార్వ. ౨, ఆ. ౧౧౭; 2. వ్యాపించుటమున్నగువానియందగు

నసుకరణము. "క. జిలజిల వడిసెగ్ వెన్నెల, జిలజిల దిక్కులకు నొడిసెఁ జీఁకటు లెడసెన్." రంగా. ౩, ఆ. ౧౭౨.

జిలమ. దే. వి. ఒకానొకరకపుపైరు. (చూ. జిలమ ఋడుతలు.)

జిలమఋడుతలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ... కాంబోజులు మదసనరులు జిలమఋడుతలు..." ప్రబంధ. ౧౧౫.

జిలితోగలరాజనములు. దే. వి. బ. ధాన్యవిశేషము. "గీ. జిలితోగలరాజనమ్ములు నలవరులును." హంస. ౪, ఆ. ౧౫౭.

జిలిబి. దే. వి. కర్ణమలము. "సీ. జిలిబికిం బుసులకుఁ జీమిడికిని బుట్టి." ద్వి. ౧, ఆ. ౧౦౦.

జిలిబిలి. దే. వి. కొప్పులో పెట్టుకొను అలంకారవిశేషము. "సీ...తసరును వాలపాళ్యావిశేషముబు సూసక తురాయి...జిలిబిలి జల్లియుం..." ఆం. భా. ద్వి. ౧౪౨. విశే. 1. మధురమై స్పష్టము కానిది. "సీ. జిలిబిలిపలుకులు పలుక నేర్చిన నాఁడె సత్యభామాహరిశ్చంద్రుఁ డయ్యె." పాండు. ౧, ఆ. ౪౧. "సీ. తరుణాంగశీధూత తంత్రీస్వనంబుతో జిలిబిలిపాట మద్దులు నటింప." స్వా. ౫, ఆ. ౫౫౨, 2. ఇంపైనది. "సీ. జిలిబిలివలిసాలిమొలకతెమ్మరలు గమ్మనిమేని తావుల ననుసరింప." విజ. ౩, ఆ. ౫౫౯; 3. స్నిగ్ధమైనది. "చ. జిలిబిలిచెక్కు మద్దుగొను చేడియవాతెఱ లేసె లానుచున్." దశా. ౭, ఆ. ౪౩; 4. అల్పము, చిన్నది. "క. జిలిబిలియొలుఁగులు ఘంటానిలయములోఁ జెలఁగుటయుం..." మార్క. ౧, ఆ. ౪౭. "ద్వి. జిలిబిలిసిగ్గును జిఱునవ్వుతోలఁక, బలికె జానకి తనపతిని వీక్షించి." రం. రా. అర. ౧౪౯ పం. ౧౯ పం. క్రి. విశే. 1. మెల్లగా. "క. జిలిబిలి మంత్రములు సెప్ప శెలవులు గదలన్." పద్మ. ౨, ఆ. ౧౬౭; 2. చక్కఁగా. "గీ. నిలిచె జిలిబిలి జడదారి జెలుఁగఁ జేరి." కువల. ౫, ఆ. ౫౯.

జిలిబిలిచీర. దే. వి. (జిలిబిలి+చీర) చిన్నచిన్నగళ్లు గలసన్ననిపట్టుచీర. (శ. ర.)

జిలిబిలిపోవు. దే. అ. క్రి. (జిలిబిలి+పోవు) 1. ప్రకాశించు, ఒప్పు. "ద్వి. జిలిబిలిపోవంగ శివతత్త్వగోష్ఠి, పండితా." మహిమ. ౫౬; 2. ఉత్తలపడు, తొట్రుచెందు. "వ...చిత్తంబులు జిలిబిలిపోవ..." శైవ. ౨, ఆ. ౧౦౩; 3. అధికమగు. "చ. జిలిబిలిపోవకోరికలు చిత్తములం దలరెత్తి..." విక్ర. ౪, ఆ. ౫౨౪.

జిలుఁగు. వై. వి (సం జాలికా.) 1 సన్ననివస్త్రము "ఉ...జిలుంగుతక్కు నగుయాపత మొత్తు నటంచు నన్యమున్." ఆము. ౧, ఆ. ౬౧. రం. రా. బాల. ౨౪ పం. ౯ పం; 2. ఇంపు. "సీ. చెలఁగు మద్దెలమ్రోఁతజిలుఁగు రాణింపఁగఁ బదపద్మముల లయప్రాప్తి చూపి." కవిరా. ౧, ఆ. ౧౯౨. విశే. 1. మృదువైనది. "క. అని పొగడుచు నొయ్యారపు టనువున జడ లల్లి జిలుఁగు లగుపయ్యెదలన్, జతుకట్టు గట్టి గట్టిగ ..." స్వా. ౩, ఆ. ౭౩. చం. రా. ౩, ఆ. ౧౧౯; 2. అల్పము. "గీ. తారకాధీశుకిరణకదంబకంబు, ఒలికెఁ బలుచనివలిపెంపుజిలుఁగు మంచు." పారి ౫, ఆ. ౪౨. "మ. జిలుఁగుం బల్కులు విన్న..." సా. ౧, ఆ. ౧౦; 3. పదను గలది. "వ...అవ్వచనంబులు కర్ణపుటంబులకు జిలుఁగుటంపములుకుల పోలుపుఁ దెలుప..." శుక. ౧, ఆ ౨౪.

జిలుఁగువన్నెలు. దే. వి. బ. (జిలుఁగు+వన్నెలు) వస్త్రవిశేషము. "గీ. జిలుఁగువన్నెలు మంజిష్ఠ చిలుకచాలు." య. ౪, ఆ. ౧౫౫.

జిలుగు. దే. అ. క్రి. గొలుసుమోడిప్రాయు. (శ. ర.) వి. 1. గొలుసుమోడివ్రాఁత. (శ. ర.); 2. చిక్కు. "చ. జిలుఁగులఁ బెట్టఁగా వెదకు చీఁకటి సోకుడుఁ బిల్లలో యనన్." య. ౫, ఆ. ౨౩.

జిలువు = జిలుఁగు. (అందము) "సీ. సింహాసనము చారుసితపుండరీకంబు చెలికత్తె జిలువారుపలుకుఁ జిలుక." శైవ. ౧, ఆ. ౯.

జిలేబి. దే. వి. (హిం. జిలేబీ) భక్ష్యవిశేషము. (శ. ర. వా.)

జిల్కఱ = జిలకఱ. "ద్వి. గుడములో జీఁకఱ గూర్చి యిద్దఱకు, వశి శిరస్సులమీఁద వలనొప్ప నుంచి." రం. రా. బాల. ౨౬ పం. ౭ పం.

జిల్గు = జిలుఁగు. (విశే.) 1. సూక్ష్మమైనది. "ఉ. అప్పుడు జిల్గుదువ్వలు వొయారముగా సవరించి

..."వి. పు. 3, ఆ. ౭౯. కాశీ. 3, ఆ. ౧౧౮; 2. అల్పమైనది. "ఉ...జిల్గునవ్వులక్, వారక మాటు నేసెదవు..." ఉ. రా. ౬, అ. ౫౦; 3. సున్నితము. "చ...ము, త్రిగరశసంబు జిల్గుఁబని లెన్నియలున్..." నీలా. ౧, ఆ. ౩౦.

జిల్మ = జిలను. (చూ. జిల్మబుసుతలు)

జిల్మబుడుతలు = జిలమబుసుతలు. "సీ. రామ బాణాలు రేకాకువములు వెన్నముద్దలు జిల్మ బుడుతలు దాళువాలు" హంస. ౪, ఆ. ౧౨౮.

జిల్ల. దే. వి. (త. సిల్లు.) బిల్లగోడాటయందలిబిల్ల. (శ. ర.)

జిల్లజీర్కలు. దే. వి. బ బాలక్రీడావిశేషము. "సీ. చల్లనితలఁపులకాఁజిల్లుమీఁదట జిల్లజీర్కలాడెదు వేల్పుచేడియలుతు." య. ౨, ఆ. ౩౫.

జిల్లా. దే. వి. (హిం. జిల్లా.) కలెక్టరనంటిగొప్ప యుద్యోగస్థునియధీనమున నుండుప్రదేశము. (ఇందుఁ గొన్ని తాలూకా లుండును. శ. ర.)

జిల్లి. దే. వి. మాంసముపైనుండు చిన్నపొర. "ద్వి. తోలఁకుజిల్లియుఁ ద్రిప్పేసులవారిపాలు." బస. ౭, ఆ. ౩౯ పం.

జిల్లు. దే. వి. జి కాఱుటయందలిధ్వని కనుకరణము. "క. తెల్లనిఫేనము నమృతము, జిల్లున జల్లించు చాడుఁగు..."భాగ. ౮ స్కం. ౨౫౨; 2 చల్లుటయం దగుధ్వని కనుకరణము. "ఉ...జిల్లునఁ జల్లవలెక్ మనోహర, దోహ్నతక గోస్తనీఫలసుధ ద్రవ గోఘృతపాయసప్రపా, రాతిరసప్రసార రుచిరప్రసరంబుగ..." (పెద్దనచాటువు.); 3. మిక్కిలిచల్లఁదనము తెలుపుటయం దగుధ్వని కనుకరణము వా:—మంచుగడ్డ తాఁకిన చేయి జిల్లు మనుచున్నది; 4. మందమెుఁ మ్రింగుటవలన నాలుకలోనికి లాగుటయం దగునుకరణము (వా.)

జిల్లెడు = జిల్లేడు. (శ. ర.)

జిల్లేడు. దే. వి. అర్కవృక్షము. "శా...పాల్ద్రాగఁగా...జిల్లేడాకులదొప్ప కావలయుఁ జే..." సావి. ౨, ఆ. ౪౯. దశా. ౪, అ. ౪౨.

జిల్లేడుకాయ. దే. వి. (జిల్లేడు+కాయ) 1. జిల్లేడు యొక్కకాయ. (శ. ర.); 2. జిల్లేడుకాయలవలె లోనపూర్ణ ముంచి చేయు ఒకానొకపిండివంట. "వ...అప్పడంబులు నిప్పట్లు జిల్లేడుకాయలు దోసియలు..." కాశీ. ౭, ఆ. ౧౮౫.

జివురు = జిగురు. (శ. ర.)

జివ్రి. సం. వి. ఇ. పు. 1. కాలము. 2. పక్షి. (కౌముది.)

జివ్వాడు. దే. అ. క్రి. (జివ్వ+ఆడు.) చలించు, కదలు. "ద్వి. చిన్నారికాఁడిఁగ జివ్వాడుచుండ." ద్వి. పరమ. ౪. ఆ. ౨౯౧ పా. అ. మ. క. ౧, ఆ. ౪౯. పా. పం.

జివ్వు. దే. వి. 1. ఎండుట లోనగువానియం దగు ననుకరణము. "ద్వి. కమరి పువ్వులు మ్రందఁగా జివ్వు రమచు." ద్వి. మారిశ్చ. ఘా. ౨౨౩౬ పం. జై. ౮, ఆ. ౧౦౧; 2. వేఁడివలన అకు మొ. ముణుఁగుటయం దనుకృతి. "సీ. చిగురుతామర పాకు జివ్వంచుఁజనుదోయి మొనలక్రొవ్వేఁడిని ముణుఁగఁబాఱె." శైష. ౫, ఆ. ౧౧౯; 3 నీరు మొ. ఇగురుటయం దనుకరణము. "ఉ. క్రొవ్విన యేకలంబులను గొన్నిటిఁగూల్చి కమర్చి పెంచు లం, జివ్వుచు నెత్తుమ న్నలఁది జివ్వన నీ రివు రంగ నేర్చి..." కాశ. 3, ఆ. ౫౦; 4. చల్లని పదార్థసంపర్కమున పండ్లు మొ. లాగుకొని పోవుటయం దనుకృతి. (వా. మంచుగడ్డ నోటఁ బెట్టుకొనినంతనే పండ్లు జివ్వు మనుచున్నవి.)

జిష్ణువు. సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు; 2. ఇంద్రుఁడు; 3 అర్జునుఁడు; 4. విష్ణుమూర్తి; 5. అగ్నిదేవుఁడు.

జిహాస. సం. వి. ఆ. స్త్రీ 1. విడువవలె ననుఇచ్ఛ; 2. పోవుటయం దిచ్ఛ.

జిహీర్ష. సం. వి ఆ. స్త్రీ. దొంగిల నిచ్ఛ.

జిహ్మగము. సం. వి. అ. పుం.—కుటిలముగా నడచునది—పాము. విశ. (అ. ఆ. అ.) 1. మెల్లగా పోవునది; 2. వంకరగా పోవునది.

జిహ్మము. సం. వి. అ. న. 1. కౌటిల్యము; 2. కపటము; 3. పాపము. పుం. పాము. విశ (అ. ఆ. అ.) 1. వంకరైనది; 2. సోమరియైనది; 3. కపటము గలది.

జిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. నాలుక; 2. జ్వాల; 3. మాట.

జీనిసరులు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ...జీని సరులురాయసరులు..." ప్రబంధ. ౧౧౨.

జీనిసురటి. దే. వి. (జీని+సురటి.) శిల్పము చెక్కిన వీవన. "సీ. రతిచేలిజీనిసురటి యూనిచి యనంగుఁ గళకుచుంగరువ్యాళకానె మెఱయ." వాల్మీ. 3, ఆ. 30.

జీనీ = జీని. "క. వానికి మనోహర యనం,గా నొక యంగన యొసంగు గంతును లేజీ,నూన యన వాని నేనఁగి, జీనీ జమదాడి యనఁగ..." శుక. ౨, ఆ. ౫౪౯.

జీబు. దే. వి. (హిం. జేబ్.) 1. లంగరు. "క... ఉక్కుజీబు దిగవైచిన వే,సెర్వ్వౌని కదల కుండెను, కప్పవిధమునకు దేరు గదలక నిలిచెన్." శుక. ౨, ఆ. ౧౧. "గీ...ముస్నిటినట్టనడిమి, కరుగఁగా జీబువైచిన తరణి యనఁగ." రా. వి. 3, ఆ. ౧౯; 2. గుఱ్ఱపుఁబల్లము. "సీ. కుక్క పోతుకు జరీకుప్పులజీ నేల భూ టకూళ్లమ్మకుఁ బుణ్యా మేల." వేణు. శ. ౧3.

జీబుఁగ్రోవి. దే. వి. (జీబు+క్రోవి.) పొకులవాఁడూ మబుఱ్ఱు. (శ. ర.)

జీబువ. దే. వి. పక్షివిశేషము. "సీ. మానిపుక్కిటి గాఁచు జీబువ యెల్లంకి..." పార్వ. ౬, ఆ. ౭౭.

జీబువముక్కులు. దే. వి. బ. (జీబువ+ముక్కులు) ధాన్యవిశేషము. "సీ. జీబువముక్కులు చిలుక ముక్కులు..." హ స. ౪, ఆ. ౧౫౦.

జీబువాయి. దే. వి. (జీబు+వాయి.) పక్షివిశేషము. శశాం. ౨, ఆ. ౯౦.

జీబిలిక = జిబిలిక. (శ. ర.)

జీబు. దే. వి. 1. వస్త్రవిశేషము. "రగడ వలివంబులు దుప్పట్లును మాదా,వళులును జీబులు జిలిబిలి జాతులు." కుక. 3, ఆ. ౧౯౫; 2. కోక, స్త్రీ పరిధానము. "ఉ...కటిం,జుదురకావిజీబుచుఁ..." ఆము. ౫, ఆ. ౯౦; 3. పురుషపరిధానము "సీ. పొన్నంచువైరాణిసన్నజీబు లోనం గెం గొంచనపటికటీరాంచితునకు." ఘటికా. ౨, ఆ. ౧౧; 4. సమూహము. "సీ. జిత్రరజోంపపుమావి జీబు మాయముసేసి పసిడియుప్పరిగఁ దాఁ బ్రబలు టేమి." విజ. ౧, ఆ. ౭౫; 5. గొబ్బరి చెట్టు మొదలగువానిమొవ్వులను చుట్టియుండు పీచు. (బ్రా.) విశే. 1. దట్టమైనది. "ఉ. దాఁగినిమూఁకలాముకతిఁ దా నొకకొంజిగురాకు జీబులేఁ,బిఁగపాద న్నిలన్..." పార్వ. ౨, ఆ. ౧౯. ఆం. భా. తృ. ౫౪; 2. చొరరానిది. "గీ. ఆత్మనాయక యీజీబుటవిపోనఁ,జుడ ఘానుండు లేలఁ దాఁగుండునే మొ." సావి. ౨, ఆ. ౯౦. పు.

జీబుకొను. దే. అ. క్రి. (జీబు+కొను.) తఱుచగు. "రగడ. కురిగుం తేనెల జీబుకొన్న దంతట వనము." సా. 3, ఆ. ౧౪. ద్వి. పరమ. 3, ఆ. ౪౯౯.

జీమూతకము. సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. పర్వతము; 3. దండకవిశేషము. "దండకము. నకారంబులుం రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబుల న్నిల్ప జీమూత మయ్యెన్." అప్ప. ౪, ఆ. ౨౬౩.

జీమూతుఁడు. సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు; 2. పోషించువాఁడు.

జీయు = జిష్ణు. (క. జీయు.) దేవుఁడు; "ద్వి. అన్యాయమున నీకు సహితంబు సేయ,ధన్యత్వ మిగా చోద్యముగాదె జీయు." బస. ౬, ఆ. ౨౭౦. పం.

జీర. వై. వి. (సం. చీరమ్.) గీఱ, రేఖ. "క. ఇవి పందికొమ్ము గాయము లివి సింగపుగోరజీరలు..." రా. వి. 3, ఆ ౪౦. య. ౪, ఆ. ౪౫.

జీరకము. సం. వి. అ. పుం. జీలకఱ్ఱ.

జీరగుండు. దే. వి. పందిలికిఁ గట్టుపొదరసపుబుడ్డి. (బ్రా.) "వ...మేలుకట్లును జీరగుండ్లును..." ద్వా. ౨, ఆ. ౪.

జీరము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. జీలకఱ్ఱ; 3. నలుసు.

జీరా = జిరా. (ఫ. సిరా. హిం. జిరా.) కవచవిశేషము. "సీ. జోడనఁ గవచంబు సోభిలుఁ జిలు కత్తు జీరా యనఁగఁ దన్విశేషము లగు." ఆం. భా. ద్వి. ౨౦౪.

జీరాడు. దే. అ. క్రి. (జీరు+ఆడు) బట్టకొంగు లోనగునది వ్రేలాడు. "సీ. జీరాడుదుప్పటి చెఱఁగు చేఁబూని వెంబడి గిండి గొనివచ్చు బుడుతఁ డొదుగ." ఉ. రా. ౬, ఆ. ౧౯౦. దశా. ౨, ఆ. 3౩౦. "ద్వి. వసుధపై జీరాడు

వలెవాటుతోడ." రం. రా. సుం. ౨౪౯ ప. స. క్రి. దిగలాగు. "వ...ప్రౌఢ లగు నెచ్చెలులు జీరాడుసిగ్గుల నీడిగిలంబడ..." పారి. ౨, ఆ. ౭౨.

జీర. దే. వి. రేఖ. "మ...విఱ్ఱజీరులుగల గ్రీవల సబ్జపత్రములబారుల్ దీర్చుభద్రాకృతిన్." చం. రా. ౨, ఆ. ౪. అ. క్రి. జీరాడు. "గీ. మహి తకుచభారకంపితమధ్య లగుచు, నద్ది మొలనూల్లు మెఱయఁ బయ్యెదలు జీర..." భాగ. ౧౦ స్కం. ఉ, ౯౦౩. శుక. ౧, ఆ. ౩౨౧. స. క్రి. గీఱు. (శ. ర.)

జీరకాడు. దే. అ. క్రి. (జీరకు+ఆడు.) వ్రేలాడు. "చ...తదార్ద్రబంధురపిశాలజటుల్ ధర జీర కాడ..." కువల. ౨, ఆ. ౬౪.

జీరకు. దే. వి. 1. తొట్రుపాటు. "సీ. జీరకు నాఁగను...స్ఖలనసమాఖ్యలై వెలయుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౩; 2. జాఱుట. "రగడ. వరిగాను బూఁదేనియజీరకున జవమ్ములు దక్కుచు ..." చను. ౧, ఆ. ౬౭. విణ. జాఱునది. "క...మెట్లు కడుఁ, జీరకు జతనం బనుచున్ ..." సూర్యతనయాపరిణయము. (శ. ర.)

జీరకుపాటు. దే. వి. (జీరకు+పాటు) జీరకు. "సీ. జీరకు నాఁగను జీరకుపాటు నాఁ దొట్రుపా టనఁగను దొట్రు నాఁగ...స్ఖలన సమాఖ్య..." ఆం. భా. ప్ర. ౧౪౩.

జీరకుబండ. దే. వి. (జీరకు+బండ) 1. జాఱుడు రాయి. "వ...జీరకుబండమీఁదిపోఁకలై..." ప్రబంధ. ౭౯౯. 2 బాలక్రీడా విశేషము. "సీ. తొగరాచలువమేడ మగరాణిగలోనఁ బలకల జీరకుబండ లాడి." చంద్రా. ౧, ఆ. ౪౨.

జీరకురాయి = జీరకుబండ. (చూ. జీర్కురాయి)

జీరకువాఱు. దే. అ. క్రి. (జీరకు+పాఱు) జాఱు. "ఉ...వారణయానల పాదపద్మముల్, జీరకు వాఱ నవ్వుదురు చేతులు ప్రేయుచుఁ బ్రౌఢ పల్లవుల్." సాంబో. ౧, ఆ. ౧౪౭. రామా. ౬, ఆ. ౧౨౯.

జీరలాడు. దే. అ. క్రి. (జీరలు+అడు) జీరాడు. "వ...పేల్చుఁగలువకంటులు బ్రొమ్ముడులు వీడఁ గీలుగంటు లంసంబులపై జీరలాడ..." ఉ. రా. ౩, ఆ. ౭౯. ద్వి. ఠి. సా. ౬, ఆ. ౧౭౨. (శ. ర. పా.)

జీరువాఱు. దే. అ. క్రి. (జీరు+పాఱు) 1. వ్రేలాడు "సీ. ముడువంగ నేర్తురు మూలదాపటికి రాఁ జికురబంధము లీగి జీరువాఱ." కాశీ. ౩, ఆ. ౧౦౯; 2. జాఱు. "చ. చిలుపవికమ్మ లేనియలు చిప్పిలి హాస్తము లస్తకంబునన్, నిలువక జీరు వాఱునెడ..." శైవ. ౧, ఆ. ౯౨. సీమం. ౩, ఆ. ౬౭; 3. వ్యాపించు. "గీ. చిన్ని లేనవ్వు చెక్కుల జీరువాఱ." విక్ర. ౮, ఆ. ౨౮. పాం. ౭, ఆ. ౨౯.

జీరులువాఱు = జీరువాఱు. (జాఱు) "సీ. చెక్కుటద్దములపైఁ జింది జీరులువాఱ విభ్రుతుఁడై కన్నీరు నించువాని." కృ. శతం. ౩, ఆ. ౮.

జీర్కు = జీరకు. "శా...అమ్మలారా మెల్లం దిగ రమ్మ మెట్లు కడుఁ జీర్కు..." ఉ. హరిశ్చ. ౩, ఆ. ౩౭.

జీర్కుబండ=జీరకుబండ. (జాఱుడురాయి) "క.దరి మెట్టి జీర్కుబండలఁ, జరణంబులఁ జక్కఁ జాచి జాఱిరి చామల్." బహు. ౨, ఆ. ౭౮; 2. (బాలక్రీడావిశేషము) "సీ. తర్కపాతంజల కర్కశప్రస్తరమండలంబున జీర్కుబండ లాడి." కాళిఁది. ౧, ఆ. ౩౨.

జీర్ణకము. సం. విణ. (అ. ఆ. అ.) శిథిలమైనది.

జీర్ణము. సం. వి అ. పుం. కడిమిచెట్టు. న. ఎండివాడిన యాకు.

జీర్ణము. సం. వి. అ. పుం. జీలకఱ్ఱచెట్టు. వ. రాపూవు. విణ. (అ. ఆ. అ.) 1. ప్రాచీనము; 2. ముదిసినది; 3. శిథిలమైనది; 4. చినిఁగినది; 5. అఱిగినది.

జీర్ణి. సం. వి. ఇ. స్త్రీ. 1. అఱుగుట; 2. ముదిమి. 3. శైథిల్యము.

జీర్ణించు. సం. అ. క్రి. 1. అఱుగు. "క. వాతాపివలన నెఱిఁగితొ, శీతకిరణ కడుపుఁ జొచ్చి జీర్ణింపని య్యారీతి..." స్వా. ౩, ఆ. ౩౯; క్షీణించు, కగ్గు. "క. జీర్ణించు పెంద్రుకలు కడు, జీర్ణించును లోచనములు చెవులును ముక్కున్, జీర్ణించుఁ గాని యాశలు, జీర్ణింపవు ముదిమి నరునిఁ జెందినవేళన్." వి. పు. ౬, ఆ. ౧౭౯; 3. నరయు, తెలుపగు. "క. జీర్ణించు పెంద్రు

జుహురాణుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. అగ్ని; 3. ఋ ఆధ్వర్యుఁడు. విణ. (అ. ఆ. అ.) కుటిలుఁడు. [పృథుకము.

జుహువాసనము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2.

జుహువు. సం. వి. ఊ. స్త్రీ. యజ్ఞమం దుపయోగించు కఱ్ఱపాత్ర.

జూ

జూటము. సం. వి. అ. పుం. 1. జడయొక్క ముడి; 2. శివజటాబంధము.

జూటా. హిం. విణ. అబద్ధమైనది.

జూతి. సం. ఇ. స్త్రీ. వేగము.

జూర్ణము. సం. వి. అ. పుం. జొన్నచే.

జూర్తి. సం. వి. ఇ. స్త్రీ. జ్వరము.

జృ

జృంభ. సం. వి. ఆ. స్త్రీ. జృంభము.

జృంభకము. సం. వి. అ. పుం. అస్త్రభేదము.

జృంభకుఁడు. సం. వి. అ. పుం. 1. రుద్రగణము; 2 ఒకముని. విణ. (అ. శిశా. అ.) 1. ఆవులించువాఁడు; 2. ఒడలు బద్ధకముచే సాఁగఁదీయువాఁడు.

జృంభణ. సం. వి. ఆ. స్త్రీ. అతిశయము.

జృంభణము. సం. వి. అ. న. 1. ఆవులింత; 2. దేహము సాగదీసి విఱిచికొనుట; 3. అతిశయము; 4. వికాసము. విణ. (అ. ఆ. అ.) ఆవులింపఁజేయునది.

జృంభము. సం. వి. అ. పుం. న. 1. ఆవులింత; 2. దేహము విఱుచుట; 3. వికాసము; 4. అతిశయము.

జృంభించు. సం. అ. క్రి. విజృంభించు, చెలరేఁగు. "క. మెచ్చితిమి సీరపాణివి, కచ్చదము పదంబు దప్ప కిమ్మహి నడకెం, జెచ్చుట లేదచ్చుటమముఁ, జెచ్చెర నదియుఁపు మనిన జృంభించి తనన్." మార్క. ౬, ఆ. ౫౬; 2. ఆవులించుట; 3 ఒడలు విఱుచుకొనుట; 4. వికసించుట.

జృంభితము. సం. వి. అ న = జృంభణము. విణ. (అ. ఆ. అ.) ఆవులించునది, జృంభించునది.

జె

జెండా. దే. వి. (హిం. ఝండా.) టెక్కెము. "సీ. వదభయ వస్త్రైకిక మందటిలాల జెండాలనఁ దటరమటాలు సిగడె." కవిజ. ౨, ఆ. ౯.

జెట్టి. దే. వి. (క. జెట్టి) 1. మల్లుఁడు. "గీ. జెట్టి తండంబుతోడఁ జేపట్టి మహాంతకారి విఱిచిన యట్లు నగ్గలిక విఱుతు." భార. విరా. ౧, ఆ. ౯౧. ఆం. భా. ద్వి. ౨౦౭; 2. శూరుఁడు. "ఆ...అట్టిజెట్టి నిన్నిదినము లిట్లు దొదరి పెనఁగియుం..." భార. భీష్మ. 3, ఆ. ౧౭౭. విణ. శ్రేష్ఠుఁడు. "గీ...యోగీశ్వరులు గానజట్టిజెట్టి, పల్లవీజనసకల్పవల్లి యయ్యె." భాగ. ౧౦ స్కం ఉ. ౬౯౨. విణ. శ్రేష్ఠుఁడు. "చ...జెట్టిమల్లుల విఱుతున్." భార. విరా. ౧, ఆ. ౨౨౩.

జెట్టిగ. వై. విణ. (సం. జ్యేష్ఠిక. క. జెట్టిగ.) శ్రేష్ఠుఁడు. "ఉ. జెట్టిగవీరులై దుగము సేసిరి కైపున దీఁడి కారసిన్." కు. సం. ౧౧, ఆ. ౭౧౭.

జెట్టివాఁడు. దే. వి. మల్లుఁడు. "ఉ...జెట్టివాఁ, డుక్కునఁ దీరిసట్లు .." శుక. ౨, ఆ. ౩౫౭, స. శ. ౧౨౦.

జెట్టానజెట్టు. దే. వి. బ. జగజెట్టు. "వ...భీము సేనుండు నవలభిమన్యుండు...ఘటోత్కచుండు జెట్టానజె ట్టన్నవారు..." భార. ఉద్యో. ౪, ఆ. ౪౨౫.

జెన. దే. వి. అందమగు లోగిద్రపము. "సీ...జెన యన సంద్రద్రపం బొక్క..." ఆం. భా. ద్వి. ౯౯. "గీ, స్పష్టిత జెస కిడ్డజెనఁ ద్రావ గ్రిందనుఁడి, లేటనదినటఁ దనవెంటఁ దేలుమీల..." అము. ౪, ఆ. ౧౭౭. [ఆం. భా. ద్వి. ౫౬.

జెముడు. వై. వి. (సం. కఁహుఁడు.) చెముడుచే.

జెలతి = జెల్లి. (శ. ర.)

జెలతిపాతు = జెల్లిపాతు. (శ. ర.)

జెల్లి. దే. వి. జెల్లిపాతు, చెక్కు కల్ల గలతుచ్ఛసర్పము. "సీ. ...జుర్రోఁకటిటఁడ జెల్లి వస్తిండె ..." అము. ౩, ఆ. ౯౦. ఆం. భా. ప్ర. ౧౪౭.

జెల్లిపాతు. దే. వి. (జెల్లి+పాతు) సర్పవిశేషము. "గీ...తక్కినజెల్లిపాతులను దుఁడు, నాగులను ..." ద్వా. ౯, ఆ. ౯౭.

జెల. వై. వి. (సం. జలమ్.) సీటిఋగ్గ. (శ. ర.)

జెఁగ = జగము. "క. కలలోఁ బములఁ దేల్చను, జెలగలు గఱచుటయుఁ జావుచే టొదవు..." ద్వా. ౯, ఆ. ౭౪.

జెల్ల. దే. వి. 1. మత్స్యభేదము. "ఉ...వెస్, జెల్ల కుంట బక్క పాపరయుం సీచుకు..." ప్రబంధ. ౯౫౫. ఆం. భా. ప్ర. ౧౬౦; 2. జెల్లకాయ. (వా.) [చపేటము. (వా.)

జెల్లకాయ. దే. వి. (జెల్ల+కాయ.) లెంపకాయ,

జెల్లెము. దే. వి. ఒకవిధమైనఆట. "సీ. చిక్కనా బిల్లగోయం జెల్లెము గొడుగుకు బిల్లబిర్యము లక్కి చిక్కిదండ." హంస. 3, ఆ ౧౪౬.

జెళుకు. దే. అ. క్రి. బెదరు. "క. జెళుకుచు బూంబొమ్మనందుం జిరవిరవాశ్రిన్." హంస. ౧, ఆ. ౭౧.

జెష్ఠ. వై. వి. (సం. జ్యేష్ఠా. క. జేష్ఠె.) దరిద్ర దేవత. "క. శిష్టాచారులు లేమిని,గష్టాత్ములం జేసి వెతుకం జార్పణ్యముచే, భ్రష్టుల జేయుంము సీ వికె,జెష్టా పోపొమ్ము సీ సీకులమీాదన్." దశా. ౧౦, ఆ. ౯౨. ధర్మ. ౨, ఆ. ౧౬౯.

జే

జే. వై. వి. (సం. జయ. క. జే) జయము. "సీ. జైనులం బొడంగన్న సంతోషమునం దేలు,జే యని మ్రొక్కు లోకాయతులకు." శైవ. 2, ఆ. ౧౨౪. "క. క్షితిదేవమాళి యచలిపి స్తితుండై చేదోయి మోడ్చి జే యనుచు నమస్కృతు లలరం జేసి..." శేష. ౨, ఆ. (శ. ర.)

జేంద్ర. దే. వి. బట్టలు నేసి జీవించెడియొకానొకజాతి. "వ...జేంద్రతొగటగాంద్రజారుకు..." హం.స. 3, ఆ. ౨౯. ఆం. భా. ద్వి. ౨౦3. (బ్రా. పాఠము.)

జేంతాకము. సం. వి. అ. న. చెమటపట్టుటకై నిర్మించినయుష్ణగృహము.

జేగంట. వై. వి. (సం. జయఘంటా.) (జే+గంట.) జయాలు తెలుపుటకై ప్రయోగించుఘంట. "సీ అరయ వెన్నుండె దేవ రని బొల్పుగిమి చాటంగా నెత్తువైండి జేగంట యనంగ." య. ౨, ఆ. ౧౦౪.

జేగీయమానము. సం. విశ. (అ. ఆ అ.) మిక్కిలి కొనియాడంబడినది. "వ...జేగీయమానసారా గుణరత్నాకరుండును..." భార. ఆది. ౧, ఆ. ౨.

జేగురించు. దే. అ. క్రి. ఎఱ్ఱనగు. "గీ...లోచనాంత ములు జేగురించం గోపంబుం జెమట వర్షించ ..." వరాహా. ౧౦. ౬౪

జేగురు. దే. వి. (క. కేవు.) 1. ఎఱ్ఱనిరంగు. "చ ..ఫీ,కరకుంపలంబునన్ ద్వివిరుకంత కు వ్రేసినం బొల్చి వాంకు జేగురు గలకొండచంద మున..." భాగ. ౧౦, స్క. ఉ. ౧౩౧; 2. ఎఱ్ఱనితాయి. "గీ. గగనహరిశిలశైలశృంగమున నుండి, డొల్లినడెః బ్రొస్తు జేగురుంగల్లువోలె." శైవ. ౮. ఆ. ౧౪౨. విశ. ఎఱ్ఱనిది. (చూ. జేగుఱు.)

జేగుఱు = జేగురు. 1. (ఎఱుపురంగు.) "క. ఆగిరుల లోన మేరువు,ప్రాగుత్తరదక్షిణాపరదిశలం దెలుపున్, జేగుఱు హాళది యుం నలుపుగు,నై గుఱుతుగం దెలుపు బ్రాహ్మణాదికజాతుల్." వరాహా. ౧౦, ఆ. ౧౦౬; 2. (ఎఱ్ఱనితాయి.) "గీ...గైరికంబు, జేగు అం చన ౯ల్లు..." ఆం. భా. ద్వి. 3౨. (ఎఱ్ఱనిది.) "ద్వి. గొనబుకురుల్ కొప్పు గూడక కప్పు,కొనిన నెన్నుదురు జేగురుబొట్టు వెలయ." విష్ణుమా. 3, ఆ. (శ. ర.) ద్వా. ౪, ఆ. ౯౭.

జేగుఱించు = జేగురించు. ఎఱ్ఱనగు. "సీ. జేగుఱించిన కంటిచిగురుచాయలతీఱు..." పార. ౪, ఆ. ౯౯.

జేగుఱుంబురువు. దే. వి. (జేగుఱు+పురువు.) ఇంద్ర గోపము. (శ. ర.)

జేజె. వై. వి. (సం. జయజయ) 1. నమస్కారము. "సీ. చిన్నిఛ్రూ చేమోడ్పు జేజె వెన్నెల చెంగ నాలు...దండము పెట్ట." సాం. ని. మాన. ౨౪; 2. దేవుండు. "దండకము...జేజేలుం బ్రాంత జేజేలు..." అచ్చ. యుం. ౧౬౧.

జేజెలమానికము. వై. వి. (జేజెలు+మానికము.) చింతామణి. "క. తలంపురతనం బనన్ జే,జెల మానిక మనంగ..." ఆం. భా. ప్ర. ౪౯.

జేజే = జేజె. 1. జేయొక్కఆమ్రేడితము, జయము జయము. "శా. జేజే యుంచు భజింతు...." శైవ. ౧, ఆ. ౪; 2. నమస్కారము. "సీ. జేజే హరా జాదిరాజీవపూజా సముజ్యోతితాంఘ్రి పంకేజ నీకు." ఉ. రా. ౧, ఆ. ౨౭౧. వరాహా. ౧, ఆ. ౯౯; 3. దేవత. "సీ. వాంరుగోరు వెట్ గాలాము చేసెనే జేజే హిరణ్యాక్షశిశుకముకకు." పాండు. ౨, ఆ. ౧3౭. ఉ. రా. 3, ఆ. ౧౧౯; 4. జయజయధ్వని. "క. జేజము గొని యుప్పొంటున,నే

జనుఁనిం జేర్చి నరుచు నిశిచరపీకుల్, జేజే లిక సాహసమున..." శశాం. ౫, ఆ. ౨౫.

జేజేకట్టు. ద్వ. వి. (జేజే+కట్టు.) దేవతలకొండ మేరువు. "శా...రా జాత్రలోఁ, జింతించెక్ జగ మెల్ల దాల్పఁ గలజేజేకట్టువజ్రి బి..." చం. రా. ౪, ఆ. ౩.

జేజేగిడ్డి. ద్వ. వి. (జేజే+గిడ్డి.) కామధేనువు. "సీ... జేజేగిడ్డి చదలుతోడుక..." సాం. ని. దేవ. ౧౯.

జేజేగొంగ. ద్వ. వి. (జేజే+గొంగ.) దేవవిరోధి, రక్కసుఁడు. "క. గుజ్జువకుఁగ వయి ముకు దన యొజ్జవలఁతు బిసక చాగ మొసఁగెడుచో మూఁ డజ్జల ముజ్జగములు గొనియజ్జేజేగొంగఁ గ్రింది కనిచిలివిగదా." అచ్చ. బాల. ౧౫౯.

జేజేదొర. ద్వ. వి. (జేజే+దొర.) దేవతలరాజు, ఇంద్రుఁడు. "క. అజన్నంబుకఁ బహువును, జేజే దొర యుపహారింప..." గాధే. ౫.

జేజేనగరి. ద్వ. వి. (జేజే+నగరి.) దేవతలపురము, స్వర్గము. "సీ. చెలువోయెనా యేమి జేజేనగరి సూళగేరిబోవలిదే మిటారియైన." చం. రా. ౪, ఆ. ౧౩.

జేజేనిరాబారి. ద్వ వి. (జేజే+నిరాబారి.) దేవముని, నారదుఁడు. 'పంకకము...జేజేనిరాబారి యొందేనియుం బోవ..." అప్ప. యయా. ౧౬౧.

జేజేనెలవు. వై. వి. (జేజే+నెలవు.) స్వర్గము. "క. అలవోకయుంబలె జేజే.నెలవుపయిక్ దాడివెడలి ..." యు. ౨, ఆ. ౬౫.

జేజేపెద్ద. వై. వి. (జేజే+పెద్ద.) బ్రహ్మదేవుఁడు. "మ...భూచక్రముసిర్దిరం దిరుగ జేజే పెద్ద భీతిల్ల ..." ఉ. రా. ౩, ఆ ౧౫.

జేజేబువ్వ. వై. వి (జేజే+బువ్వ.) దేవతలభోజనము. చంద్రుఁడు. "సీ. ఏదేవునాభిపూ విపుర జేజే బువ్వ..." రా. వి. ౧, ఆ. ౨౪.

జేజేరాయఁడు. వై. వి. (జేజే+రాయఁడు.) "పఞప. జేజేరాయఁడు సిరిగేస్తుండున్." అచ్చ. యు. ౬౦౦.

జేజేలగట్టు = జేజేగట్టు. "సీ. వేలుపుగొండ జేజేల గట్టు." ఆం. సం. స్థా. ౧.

జేజేలపీట. ద్వ. వి. (జేజేలు+పీట.) స్వర్గము. "గీ. మింని ప్రస్థానభేరి వేయించి దండు,వెడలి రచు లు జేజేలపీటిమీఁద." ఉ. రా. ౨, ఆ. ౨౯.

జేజేవెట్టు. ద్వ అ. క్రి. (జేజే+వెట్టు.) జయజయ ధ్వని చేయు. "శా. గాజీవాక్షి కుమారుఁ గాంచె ...జనుల్ జేజే వెట్టఁ బ్రసూనవర్ష సుమరశ్రేణుల్ ప్రవర్షింప గన్." స్వా. ౪, ఆ. ౫.

జేడ. దే. వి. బోద, పిల్లకాలువ. "ద్వి. నిజపుగాఁ గావేనీరు గారెపునఁ, దళివార నెత్తి యాకట జేడ వెట్టి." ద్వి. పరమ. ౪, ఆ. ౬౬౫.

జేడియ = జేడె. దే. వి. బురదనేల. (శ. ర.)

జేడె. = జేడియ. దే. వి. బురదనేల. ఆం. భా. ద్వి. ౫. (జేమ. బ్రౌ.)

జేత. సం. విశ. (బు. త్రి. పు.) జయించువాఁడు.

జేన. దే. వి. పుండ్రేండ్రాంగళములకొలది. "అ... బ్రహ్మాండమనని జేనలోన నడఁగి యుండు." భాగ. ౨, స్కం. ౧౧. ఆం. ద్వి. ౧౪౦.

జేపెట్టు. ద్వ. స క్రి. (జే+పెట్టు.) స్తుతించు. "గీ. భూమి చిరకాల మేలుము స్వామి యనుచుఁ, బ్రజలు జేపెట్టు..." ఉ. రా. ౧, ఆ. ౧౪౪.

జేబ. దే. వి. మల్లబంధనిశేషము. "సీ...గొంతు పూరుసు జేబ పుపునెంపు." ఆం. భా. ద్వి. ౨౦౯.

జేబు. దే. వి. 1. అంగుదికట్టునకోక. (శ. ర.); 2. (హిం. జేబు) చొక్కాయొక్క సంచి. "సీ. సుల్తానుబహాదరి చూపించి సలఘాయి ఇచ్చవచ్చిన లచ్చ లిచ్చుజేబు." చాటు. ౧౦౩. పొ.

జేమనము. సం. వి. అ. న. భోజనము.

జేయుఁడు. సం. = జేగివ్వఁడు.

జేరుగల్లు = జేవురుగంద్లు. "చ. చొరఁబడివచ్చువారి గఱిఁదూలుచుఁ గొలకర జేరుగల్లులో, నురువడి వంచి..." రంగ. ౩, ఆ. ౬౪.

జేరుబండు. దే. వి. (శ. జేరుబాదు) చటుకు (శ. ర.)

జేవురించు = జేగురించు. (ఎఱ్ఱనగు) "సీ. జృంభించి మిసిలంగఁ జేవురించినమేనఁ బ్రస్వేదజలముఁ గంపంబుఁ బొడకు" నైష. ౭. ఆ. ౪౭.

జేవురు = జేగురు. (చూ. జేగురు.)

జేవ్రలించు = జేగురించు. ఎఱ్ఱనగు) "గీ. పంచవద నునికను జేవ్రలించె నేని." కాశీ. ౭, ఆ. ౬౦.

జేవురు = జేగురు. (రక్తిమ) "ఉ...కనుఁగ్రేవల జేవురు పుక్కిలింపఁగా." స్వా. ౫, ఆ. ౫౦.

జేవురుఁబురువు. దే. వి. (జేవురు+పురువు) ఇంద్రగోపము. "గీ. పారలునంచన జేవురుఁబురువు లడరె." అచ్చ. కిష్కిం. ౭౫.

జేవురుగండ్లు. దే. వి. (జేవురు+గండ్లు) కోటలో నుండి ఫిరంగులు కాల్చెడి కుడ్యరంధ్రములు. (శ. ర.)

జై

జైత్రము. సం. వి. అ. పుం. పాదరసము. న. ఔషధము. విణ. (అ. ఈ. అ.) జయించునది.

జైనము. సం. వి. అ. న. ఒకానొకమతము.

జైవము. సం. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము; 2. ధతూరాళి. విణ. (అ. ఈ. అ.) 1. జీవాత్మసంబంధమైనది; 2. బృహస్పతిసంబంధమైనది.

జైవాతృకము. సం. వి. అ. పుం. 1. కర్పూరము; 2. కందకము; 3 ఇనుపగద; 4. చిలుక. న. ధనము.

జైవాతృకుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. పుత్రుఁడు; 3. వైద్యుఁడు. విణ. (అ.ఆ.అ.) 1. దీర్ఘాయువు గలవాఁడు; 2. వ్యవసాయము చేయువాఁడు; 3. సన్ననివాఁడు.

జో

జోంగకము. సం. వి. అ. పుం. అగురుచెట్టు. న. అగురుచందనము.

జోంగటము. సం. వి. అ. పుం. వేవిళ్లు, గర్భిణీస్త్రీకి పుట్టునట్టికోరిక మొ.

జోంతాల. సం. వి. ఆ. స్త్రీ. జొన్నలు.

జోటి. సం. వి. ఈ. స్త్రీ. దుప్పటి. (శ. ర.)

జోణాలము. సం. వి. అ. పుం. నలుపు ఎఱుపు కలిసిన రంగు. విణ. (అ. ఆ. అ.) నీలలోహితము.

జోనలము. సం. వి. అ. పుం. జొన్న.

జోన్నాళ. సం. వి. ఆ. స్త్రీ. జొన్నలు.

జోషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. సంతోషము; 2. సేవించుట.

జోషము. సం. వి. అ. పుం. 1. సంతోషము; 2. సుఖము, కొలువు; 3. సేవ.

జ్ఞ

జ్ఞపితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. తెలియఁబడినది; 2. చంపఁబడినది; 3. తెలుపఁబడినది.

జ్ఞప్తము. సం. = జ్ఞపితము.

జ్ఞప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తెలివి; 2. చంపుట.

జ్ఞప్తిపడు. మి. అ. క్రి. (జ్ఞప్తి+పడు.) జ్ఞాపకము వచ్చు. (చూ. జ్ఞప్తిపఱుచు.)

జ్ఞప్తిపఱుచు. మి. అ. క్రి. (జ్ఞప్తిపడు. ధా. ప్రే.) జ్ఞాపకముచేయు. "పంకజాక్షుసేవ జ్ఞప్తిపఱుచు కొఱకుఁ దెలుపుతెల్ల, సాకుపిలుపు నీదుకర్ణసరణిఁ జొరదఁటే..." సత్త. ౭.

జ్ఞా

జ్ఞాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) తెలిసినవాఁడు.

జ్ఞాతము. సం. వి. అ. న. జ్ఞానము. విణ. (అ.ఆ.అ.) తెలియఁబడినది, విదితము.

జ్ఞాతవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) తెలియఁదగినది.

జ్ఞాతి. సం. వి. ఇ. పుం. 1. దాయాదుఁడు; 2 తండ్రి.

జ్ఞాతేయము. సం. వి. అ. న. 1. జ్ఞాతిధర్మము; 2. జ్ఞాతిచేయుపని.

జ్ఞానము. సం. వి. అ. పుం. జీవుఁడు. న. 1. ఒకానొక మానసికవృత్తి; 2. యోగ్యమైనయోజన; 3. దేవధ్యానము; 4. పరమాత్మ; 5. తత్త్వజ్ఞానము; 6. జ్ఞానసాధనము; 7. నిశ్చయము; 8. బుద్ధి; 9. గ్రహించుట.

జ్ఞాని. సం. వి. న్. పుం. 1. జ్యోతిష్కుఁడు; 2. కోడి. (శ. ర.) విణ. (న్. నీ. న్.) 1. తెలివిగల గలవాఁడు; 2. తత్త్వజ్ఞానయుతుఁడు.

జ్ఞానేంద్రియము. సం. వి. అ. న. విషయజ్ఞానము గ్రహించునింద్రియము. (త్వక్చక్షురాది.)

జ్ఞాపకము. సం. విణ. (అ. పికా. అ.) 1. తెలియఁజేయునది; 2. స్మృతికిఁదెచ్చునది.

జ్ఞాపనము. సం. వి. అ. న. తెలుపుట.

జ్ఞాపితము. సం. విణ. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.

జ్ఞీ

జ్ఞీప్స. సం. వి. ఆ. స్త్రీ. తెలిసికొనునట్టికోరిక.

జ్ఞు

జ్ఞుఁడు. సం. వి. అ. పుం. 1. పండితుఁడు; 2. బ్రహ్మ. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు. విణ. (అ. ఆ. అ.) తెలిసినవాఁడు.

జ్ఞే

జ్ఞేయము. సం. = జ్ఞాతవ్యము.

జ్యా

జ్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. వింటినారి; 2. తల్లి; 3. భూమి.

జ్యాఘాతవారణము. సం. వి. అ. న. అల్లెత్రాటిదెబ్బ తగులకుండుటకై వేసికొనుహస్తకవచము, గోధ.

జ్యాని. సం. వి. ఇ. స్త్రీ. 1. ముదిమి; 2. ఏఱు; 3. నాశనము.

జ్యాయాంసుఁడు. సం. విశే. (న్. యసీ. న్.) 1. మిగులవృద్ధుఁడు; 2. మిగులశ్రేష్ఠుఁడు; 3. వ్యవహర్త.

జ్యాయుఁడు = జ్యాయాంసుఁడు.

జ్యే

జ్యేష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకనక్షత్రము; 2. నాయకునియం దెక్కుడుప్రేమ గలప్రధాననాయిక; 3. అక్క; 4. పెద్దమ్మ; 5. బల్లి; 6. నడిమివ్రేలు; 7. గంగ; 8. శివశక్తి.

జ్యేష్ఠబల. సం. వి. ఆ. స్త్రీ. సహదేవిచె.

జ్యేష్ఠము. సం. వి. అ. పుం. 1. ఒకనెల; 2. హంస. న. 1. తగరము; 2. కురువేరుచె.

జ్యేష్ఠాంబువు. సం. వి. ఉ. న. బియ్యము కడిగిననీరు, కడుగు.

జ్యేష్ఠుఁడు. సం. వి. అ. పుం. 1. పెద్దసోదరుఁడు; 2. పరమాత్మ. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి మంచివాఁడు; 2. మిగుల పెద్దవాఁడు.

జ్యై

జ్యైష్ఠము. సం. వి. అ. పుం.—జ్యేష్ఠానక్షత్రముతోఁ గూడినపూర్ణిమ గలది—జ్యేష్ఠమాసము.

జ్యైష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. జ్యేష్ఠమాసమందలిపున్నమ.

జ్యైష్ఠినేయుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) జ్యేష్ఠభార్యయందుఁ బుట్టినవాఁడు. సం. భట్టి. ౫, ఆ ౭౮.

జ్యైష్ఠ్యము. సం. వి. అ. న. 1. శ్రేష్ఠత్వము; 2. వృద్ధత్వము.

జ్యో

జ్యోతి. సం. వి. స్. న. 1. సూర్యుఁడు; 2. అగ్నిదేవుఁడు; 3. ప్రకాశము; 4. నక్షత్రము; 5. ఆకాశమందున్నసూర్యుఁడు మొదలగునది; 6. మెఱుపు; 7. చైతన్యము; 8. నల్లగ్రుడ్డునడుమనుండుదర్శనశక్తి; 9. దేవలోకము; 10. జ్యోతిశ్శాస్త్రము; 11. ధనము; 12. పుత్త్రుఁడు.

జ్యోతిరింగణము. సం. = జ్యోతిరింగము.

జ్యోతిరింగము. సం. వి. అ. పుం.—జ్యోతివలె మెఱయుచుఁ బోవునది—మిణుఁగుఱుఁబురువు.

జ్యోతిర్బీజము. సం. వి. అ. న. ఖద్యోతము, మిణుఁగుఱుపురువు (విల్వమ్ము.)

జ్యోతిశ్శాస్త్రము. సం. వి. అ. న. సూర్యాదిగ్రహనక్షత్రసంచారమును దెలియఁజేయుశాస్త్రము.

జ్యోతిషము. సం. వి. అ. న. వేదాంగములలో నొకటగుజ్యోతిశ్శాస్త్రము, జోస్యము.

జ్యోతిషి. సం. వి. ఈ. స్త్రీ. తార, నక్షత్రము. విశే. (న్. ణీ. న్.) జోస్యుఁడు.

జ్యోతిష్కణము. సం. వి. అ. పుం. విస్ఫులింగము, మిణుఁగురు.

జ్యోతిష్కము. సం. వి. అ. పుం. 1. గ్రహనక్షత్రాదికము; 2. చిత్రమూలముచె; 3. మెంతిగింజ; 4. నెల్లిచె.

జ్యోతిష్టోమము. సం. వి. అ. పుం. స్వర్గకాముఁడు చేయవలసినట్టియొకానొక యజ్ఞవిశేషము.

జ్యోతిష్మతి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. ఒకానొకచిత్తవృత్తి; 3. అగ్నిదేవునిపురము; 4. ఒకానొకనది; 5. ఒకానొకయోషధి.

జ్యోత్స్న. సం. వి. ఆ. స్త్రీ. 1. వెన్నెల; 2. వెన్నెలగలరాత్రి; 3. కాంతి, వెలుఁగు.

జ్యోత్స్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. వెన్నెలరాత్రి; 2. పొట్లచె.

జ్యౌ

జ్యౌత్స్నము. సం. వి. అ. పుం. శుక్లపక్షము. విశే. (అ. ఈ. అ.) వెన్నెలసంబంధమైనది.

జ్యౌత్స్ని. సం. వి. ఈ. స్త్రీ. వెన్నెలరేయి.

జ్వ

జ్వరము. సం. వి. అ. పుం. జ్వార్తి, వేఁకి.

జ్వరాంతకము. సం. వి. అ. పుం. 1. నేలవేముచె; 2. రేలచెట్టు.

జ్వలత్. సం. శత్రం. ధ్వనించుచున్న. "గీ...జ్వలదర్కవిభాసితమూర్తి." హరి. పూ. ౯, ఆ. ౧౦౩.

జ్వలనము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. చిత్రమూలము. న. జ్వాల, మంట. విశే. (అ. ఆ. అ.)

1. మండునది; 2. ప్రకాశించునది; 3. మండించునది; 4. ప్రకాశింపఁజేయునది.

జ్వలము. సం. వి. అ. పుం. అగ్నిశిఖ. విణ. (అ.ఆ.అ.) 1. మండునది; 2. ప్రకాశించునది.

జ్వలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మండినది; 2. ప్రకాశించినది.

జ్వలించు. సం. అ. క్రి. 1. ప్రకాశించు; 2. వెలిగ్రక్కు. "ఉ...కన్నులు,ల్కకళలన్ జ్వలింప..." ఉద్భ. ౧, ఆ. ౧౦; 3. మండు. (శ.ర.)

జ్వలియించు = జ్వలించు. (ప్రకాశించు.) "మ...కిన్నరసతుల్ జ్యోతిర్లతాదీపములన్, జ్వలియింపన్ దిలకించి..." దశా. ౨, ఆ. ౧౫౩.

జ్వా

జ్వాల. సం. వి. ఆ. స్త్రీ. 1. మంట; 2. మాఁడిన యన్నము.

జ్వాలము. సం. వి. అ. పుం. అగ్నిశిఖ. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకాశించునది; 2. మండునది.

జ్వాలాజిహ్వము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. చిత్రమూలము.

జ్వాలాజిహ్వుఁడు. సం. వి. అ. పుం. 1. పార్వతీదేవిదూత; 2. అగ్ని.

జ్వాలాముఖి. సం. వి. ఈ. స్త్రీ. 1. దేవీభేదము; 2. విద్యావిశేషము.

జ్వాలి. సం. వి. న్. పుం. 1. ఈశ్వరుఁడు; 2. వహ్ని. విణ. (న్. నీ. న్.) 1. మంట కలది; 2. ప్రకాశము గలది.

జె

జెంకాయించు. దే. వి. గుఱ్ఱమును ఆడించు. (బ్రౌ.)

జెంకించు. వై. స. క్రి. బెదరించు. "క. జంకింపవుగా తపఃప్రశాంతి వెలితె గాన్." హర. ౪, ఆ. ౨౦. భార. విరా. ౨, ఆ. ౫౪.

జెంకు. వై. అ. క్రి. (సం. శంక్.) భయపడు. (చూ. జంకించు); 2. సందేహించు. వ్యవ:— వాఁడు నీ వన్నదానికి జంకఁడు; 3. దిగఁబడు, దించుకొనిపోవు; ఒఱగిపోవు. వా:— ఆగోడ జంకినది. వి. 1. సంకోచము. (శ. ర.); 2. భయము. "ఉ. కొల్లగ సెల్లపైరులను గొంకుక జంకును లేక మేయఁగా." నీలా. ౨, ఆ. ౫౪. అం. భా. ప్ర. ౧౩౩.

జెంకె. దే. వి. (క. జంకె.) బెదరించుట. "క. హుంకారములు నగల్పులు, జంకెలు ధిక్కరణములును సంస్తుతులును..." భార. భీష్మ. ౨, ఆ. ౧౩౩.

జెంకెన. దే. వి. (క. జంకణె) 1. బెదరింపు. "చ. బొమముడిపాటు జంకెనయు." నరస. ౨, ఆ. ౩౬. చం. రా ౪, ఆ. ౩౦; 2. బెదరు, భయము. "సీ. తల్లడింపు తలఁకు...జంకెన జుంకు జడుపు జాలి..." అం. భా. ప్ర. ౧౩౩; 3 కోపము గలచూపు. "చ... చురుక్కరని కోడలి జంకెనచే నదల్చుచున్." శుక. ౪, ఆ. ౧౭౦. ఉ. గా. ౬, ఆ. ౧౪౬. విణ. 1. కోపముతోఁ గూడినది. "చ...జంకెన నెఱిచూపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై." పారి. ౯, ఆ. ౧౨౪. దశా. ౭, అ. ౧౩౧; 2. మిక్కిలి చంచలము. "ఉ. జంకెనచూపులన్ మిగులసన్ననికొనును..." సురా. ౩౦.

జెంకెయొనర్చు. దే. స. క్రి. (జంకె+ఒనర్చు) భయపెట్టు. "ఉ. చప్పుడుచేయ కుండు మని జంకెయొనర్చిన..." భాగ. ౧౦ స్కం. పూ. ౩౦౨.

జెంకెసేయు = జంకెయొనర్చు. "చ. అలరులు కోయుచోట మధుపావళిమ్రోఁతకు ముగ్ధలుల్కినం, గలకలనవ్వుచుం దొలుతఁ గైకొని నవ్వపుఁదీఁగె లాగి పువ్వు లోరులు గోయ నింకఁ దలఁపుం డని యొకర్తుక జంకెసేయుచున్..." నిర్వ. ౮, ఆ. ౩౪.

జెంగ. వై. వి. (సం. జంఘా.) 1. పిక్కతోడ. (శ. ర. బ్రౌ.) "సీ. లలితచందనలేపకలితసుందర వళీసోపానముల జంగ చాపి యెక్కు." కవిరా. ౧, ఆ. ౬౭; 2. పాదము. "ఉ...జంగలు చాఁచి మొదగమనంబున కొండఁగనీ రపాయమున్." పి. శకుం. ౨, ఆ. ౧౦౭. యయ. ౨, ఆ. ౪౪; 3. దాఁటు, లంఘనము. "సీ...జలధి లంఘనునందు జంగ యొంటి కి." నరస.౫.ఆ.౨౧౩. దశా. ౮, అ. ౧౪; 4. విలుకాఁడు విల్లు సంధించునపుడుండుస్థితి. "చ. ఇల కొకసారి పోయి హరికొక్షణ నిమ్మని వేఁడుకొందునో, పంకజగర్భుఁడాతఁడు కృపారహితాత్మత నీయకుండెనా, కొండ దొఱంగి జంగ యిడి శూరుఁడు మారుఁడు

వేగ బాలచూ, తాంతపసాయకానల శిఖావళికిఁ శలభంబుఁ జేయఁడే.”” అహ. ౨. ఆ. ౭౯; 5. అశ్వప్లుతగతి. “గీ...ప్లుతగతిభేదంబు జంగ గంతు...” ఆం. భా. ద్వి. ౧౯౮.

జంగగొను. ద్వ. స. క్రి. (జంగ+గొను) దాటు, లంఘించు. “లయగ్రా...గగ, నాంగణపహీతలభుజంగవిలయుంబులఁ, జంగగొనునేర్పరి...” పారి. ౨, ఆ. ౯౩.

జంగనడ. ద్వ. వి. (జంగ+నడ) అశ్వగతివిశేషము. “ఉ. లుక్కుడువాళి జంగనడలం గనిపించుచు ...” సా. ౧, ఆ. ౭౨.

జంగనడక. ద్వ. వి. (జంగ+నడక) కాలు చాఁచి పెట్టి నడచునడక. (శ. ర.)

జంగనడపు. ద్వ. వి. (జంగ+నడపు.) జంగనడ. “సీ. జంగనడపు నాగ జంఘాలగతి యొప్పు ...” ఆం. భా. ద్వి. ౧౯౭.

జంగమయ్య. దే. వి. (జంగము+అయ్య.) 1. జంగము జాతివాఁడు. “సీ. వచ్చిన నానందవారిధిఁ దేలి జంగమయ్యపదాంబుజముల కెరఁగి.” కాళ. ౧, ఆ. ౧౬; 2. శివుఁడు. “గీ. జముఁ బగతుఁడు బూచులదొర జంగమయ్య.” ఆం. భా. ప్ర. ౩౭.

జంగము. వై. వి. (సం. జంగమః. క. జంగమ.) 1. శివభక్తుఁడు. “సీ. శివదాసనామంబు చెలఁగు జంగ మనంగ...” ఆం. భా. ద్వి. ౨౭౬. “సీ. జంగాలపాలు దేవాంగులవిత్తము...” రామలిం. ౨౩; 2. ఒకజాతి భిక్షుకుఁడు. (వా:— జంగము శంఖము పట్టుచున్నాఁడు.); 3. దేవుఁడు “ఉ...వేడికఁటిమా, జంగ మటంచు మ్రొక్కొనొకచాన నెలంతలు చూచి నవ్వఁగన్.” య. ౪, ఆ. ౧౬; 4. శివుఁడు. వేంక. దేవ. ౬.

జంగమురాలు. ద్వ. వి. స్త్రీ. (జంగము+ఆలు) జంగముజాతిస్త్రీ. “క. ఈలీలఁ గ్రొత్తజంగము రాలై తనవెంట శిష్యుఁడై యొక్కఁడు రా...” శుక. ౨, ఆ. ౩౨.

జంగమువాఁడు. ద్వ. వి. (జంగము+వాఁడు) జగము. “ఉ. జంగమువాఁడు గాఁ దలఁభుజంగమరాజకళాపుఁ డారయున్.” శివలీ. ౨, ఆ. ౭౭.

జంగాలపచ్చ. దే. వి. (క. జంగార్ పచ్చ.) ఆకుపచ్చరంగు గలఒకధాతువు. “గీ. కటుకరోహిణి పటిక జంగాలపచ్చ.” హంస. ౨, ఆ. ౨౨౭.

జంగాళము. వై. విణ. (క. జంగళ.) 1. నిడువాటు. (శ. ర.); 2. వసుబు. “గీ. జంగాళముగ వ్యాఘ్రచర్మాంబరము గట్టి...” కాశీ. ౬, ఆ. ౨౧౯; 3. కృత్రిమపుపచ్చ. (బ్రౌ.) “ద్వి. చక్కని పాపటల్ జంగాళములను.” పండితా. పర్వ. ౩౪౧ పు.

జంగాళి. వై. విణ. వదుత్తైపని. “ద్వి. శాంగారు భుజములఁ బూజించి చెని, జంగాళిము త్రెంపు ఇల్లి గేలించి.” అ. మ. క. ౩, ఆ. ౧౩౪ పు.

జంగికట్టుబడి. మి. వి. యుద్ధమునఁ జేరి పనిచేసిన వారికి విజయానంతరమున నిచ్చుభూమి. (బ్రౌ.)

జంగిలి. దే. వి. 1. సేనానాయకుఁడు. “సీ. సురఁటి వీచులఁ బట్టుదొరమెక్కురానేస్తి జంగిలి రౌతుకు మానంగడీఁడు.” ప్రబంధ. ౧౬౦; 2. (క. జంగళి. త. సంగిలి.) గోసమూహము. “వ...ముంగిటైయై జంగిలి వెలుచుగోపాలు పోలికిం బ్రతిబలంబులు గదలించియు...” ఉ. హరి. ౬, ఆ. ౭౬. పారి. ౩, ఆ. ౩౯; 3. పశుసంఘము. “ద్వి. పశులజంగిలి గాయఁ బాలేరు దన్న...” ద్వి. హరిశ్చ. ఉ. ౬౬౦ పం; 4. (క్రూరమృగముల యొక్క) గుంపు. “ప...మురువులై సింగంపుజంగిలి కిరవులై...” య. ౨, ఆ. ౪౦.

జంగు. దే. వి. (క. జంగు.) ఒకరకమైనమువ్వ. “సీ. గండపెండెరములు గంటలు...” రా. వి. ౨, ఆ. ౧౧౪. శ్రీరం. మా. ౪, ఆ. ౧౬౩. విణ. అడవియందలిది. చూ. (జంగుఁబిల్లి.)

జంగుఁబిల్లి. దే. వి. (జంగు+పిల్లి) అడవిపిల్లి. “సీ. ఎలికతూపలపిఁపు లెక్కించుకొని సారె నలరించు జంగుబిల్లులకుటుములు.” య. ౨, ఆ. ౪౯. ఆం. భా. ద్వి. ౭౪.

జంగెత. దే. వి. (జంగము+త) జంగమురాలు జంగము జాతిస్త్రీ. “ద్వి. ఉలిపిజంగెక రాక నిలునిలు మనుఁడు.” బస. ౭, ఆ. ౪౧౦. పం. “ద్వి... ఉలిపిజంగెత నీవేలఁ జనుదెంచి తిట్టు.” పండితా. దీక్షా. ౬౧ పు.

జంజెడ. దే. వి. ఇరుసుతుడిచీల. "సీ. చీల జంజడ యాణి చిలుక..." ఆం. భా. ద్వి. ౨౦౩.

జంజో. దే. వి. గుంపు. (శ. ర.)

జంజాటము. దే. వి. (క. జంజడ.) 1. దుఃఖము. "క. ఓటమితో నెల్లప్పుడు, పాటనమునఁ బనులు నేసి బాలురతో నే, కూటలకుఁ బోక యొకజం. జాటంబును లేక భక్తిసలుపుదు ననఘా." భాగ. ౧, స్కం. ౧౦౪; 2. ఆర్భాటము. "సీ. అల వాఁడు సుడిగాలి నలయించి పోలియంగఁ జదువు జంజాటముల్ సాగవయ్యె." చమ. ౨, ఆ. ౭౩.

జంజాటించు. దే. అ. క్రి. ధ్వనించు, రొదచేయు. "వ... జుమ్ముజుమ్మనుచు జంజాటించు తేఁటిదాఁటు లను..." భాగ. ౮, స్కం. ౪౪౭.

జంజోడి. దే. వి. నిడుపైనపిడి గలకత్తి. (శ.ర బ్రౌ.)

జంట. దే. వి. (క. జంటి.) 1. స్త్రీపురుషులజత. "క. సెల వెదలిరయం నెతి నదలిమఁ,జల మడిగియు నిదుర సెడియు జంట లెడసియుఁన్." స్వా. ౪, ఆ. ౩౯. ఆం. భా. ద్వి. ౧౦౧; 2. జోడు. "ఆ. జంటపన్నిదంబు నఱచితి మిట్టుగా." భార. ఆది. ౨, ఆ. ౩౪; 3. సాహాయ్యము. "క. ఒంటి మెయిఁ దాఁక నామూ,క్కంటికి వశమగునె కృష్ణ గాండీవుల నిట్లంట యుండిగి తగురథికుల, జంట గొని రణమ్ము సలుపు శత్రులు తలఁకన్." భార. కర్ణ. ౨, ఆ. ౧౫. అవ్య. ద్రు. 1. సమీపమునను, దగ్గఱను. "క... గోవుల,జంటఁ జనను క్రయ్యంబడకు నందడి యగుచోన్." భో. ౬, ఆ. ౩౨; 2. వెంబడి. "శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డిక్కాలాంతకుం డేమ ముక్కంటిం గొల్తుము కిన్నరేశుపనికై కైలాసశైలంబు నన్; జంట న్వచ్చినసారమేయములు నీసైన్యంబు లున్ మానె..." ఉ. హరి. ౨, ఆ. ౧౪౦. విశ. జోడైనది. "దండ...జంటముత్తెంబులం గూర్చుచెల్వానకంబుల్..." దశా. ౪, ఆ. ౨౩౬. ఇందు. ౧, ఆ. ౧౭; 2. ద్విగుణితము, రెట్టింపైనది. ఆం. సం. మాన. ౪౨.

జంటనలువాజ్జలమెకము. ద్వ. వి. (జంట+నలువాజ్జలు+మెకము.) ఎనిమిదిపాదములు గల మృగము, శరభము. "వ...పర్వులిడుజంటనలువాజ్జలమెకంబులం గానక..." దశా. ౫, ఆ. ౧౧౫.

జంటపిట్ట. ద్వ. వి. (జంట+పిట్ట.) చక్రవాకము. "గీ. జంటపిట్ట బటువుగువ్వ జక్కవ యనఁ గోక నామంబు లగు..." సాం. ని. తిర్య. ౭౮.

జంటమక్కాలి. ద్వ. వి. (జంట+మూఁడు+కాలు+ఇ.) షట్పదము, తుమ్మెద. "ఉ. కాలికి గేలు సాచి యుండిగంబున మొక్కుమా రాచమిన్న ... జోగికూటువనిగారపు డెందపుఁదమ్మిజంటము, క్కాలికి..." అచ్చ. యు. ౪౫.

జంటమోములవేలుపు. ద్వ. వి. (జంట+మోములు+వేలుపు.) - రెండుముఖములుగలదేవుఁడు - అగ్ని. "గీ. జమునికంటెను జేజేలసామికంటె, జంట మోముల వేలుపుకంటె..." అచ్చ. యు. ౧౨.

జంటి. దే. వి. (క. సండి.) జరీఅంచు. "సీ. జంట ముత్తెపుఁగుట్టుజాటిరైకల సంటి బిగియబ్బచన్నులు పిక్కటిల్ల." ఉ. రా. ౬, ఆ. ౧౩౧. చంద్రా. ౨, ఆ. ౩౬.

జంటించు. దే. స. క్రి. జోడించు. వేమన. ౪౯౦.

జంటీ. దే. వి. సరిగపట్టె (శ.ర.) "సీ. అవిరళకట్టడపుఁ దోరపునిగ్గుజంటీలు తనులతాద్యుతికిఁ గైదండ యొసఁగ." శుక. ౨, ఆ. ౨౦౦.

జంత. దే. వి. (క. జంతె.) 1. గయ్యాళి. "సీ. గట్టివా జంత జాఁగ గయాళి యనఁగను ధూర్త యోషాభిధ తోఁచుచుండు." ఆం. భా. ద్వి.- ద్వి. ౧౧౭; 2. వ్యభిచారిణి. "మ. విని యాజంత మనఃభయంబునను సుగ్రీవనాథుతోఁ జెప్పి..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౫౧; 3. స్త్రీ. "క. తనయాత్మను వ్రేఁ గాయెనె, తనయూఱుపు డెంత నేసె దైవ మయో..." సా. ౩, ఆ. ౧౦౧. ఉ. హరిశ్చ. ౩, ఆ. ౧౦౫; 4. దున్నునట్టిసాధనము. (చూ. జంతకట్టు.) విశ. దర్బార్గురాలు. "మ...పాపాత్మకుం డెంతదు,ష్కృతకర్మంబున కొగ్గి సిగ్గు కులముం జెంచింపకే పుంశ్చలీస్థితిచే నీబలం జంత యొంతకని చేసెన్..." శశాం ౪, ఆ. ౧౫౦.

జంతతనము. ద్వ. వి. (జంత+తనము.) దుష్టత్వము. "ఉ. జంతతనంబునం దలఁపుచాటున నుండి కరాళ

విందసం, భ్రాంతిని సన్నచేసి..." శుక. ౨, ఆ ౧౮౦; ౩౩౬.

**జంతపట్టు.** దే. అ. క్రి. (జంత+పట్టు.) కలుపు తెగ చక్కఁగా పండుటకై వైరసతుమ దున్ను. (శ. ర. బ్రౌ.)

**జంతమాటలు.** దే. వి. (జంత+మాటలు.) మాయ మాటలు. "ద్వి. జంతమాటలఁ జేయి చాఁచి వంచించి, బంతి లేదంచును బాసలు సేసె." ద్వి. శ. సా. ౩, ఆ. ౧౦౭. పా. ౧౯౦. పం.

**జంతిక.** దే. వి. భక్ష్యవిశేషము. "గీ. సారెసత్తులపంగను జంతిక లనయంత్రికలు మీఱుచుండు శేషాహి భూవ." ఆం. భా. ద్వి. ౨౫౫; 2. జంతికలు చేయుయంత్రవిశేషము. "షః. పాలఁతీ చూచితె తేఁటిఱెక్కరవగాడ్పుం బోదచేఁదాఁకు జోకలచే జాఱుమెఱుంగుఁ ఇబ్బాదులరేఁల్ మీఱె గుత్తంబులై యలరుం బెజ్జపుమ్రాని జంతికలఁ జెన్నార స్వనీదేవతా కలకంఠీమణు లొత్తు నాస్తిలగతిక్ గస్వందు గానింపుచున్." చంద్రా. ౪, ఆ. ౨౦౯.

**జంతికచుట్టు.** దే. వి. బం-జంతికవలె చుట్టినచుట్టు. 1. జిలేబీ. (బ్రౌ.); 2. వరిపిండి-శనగపిండితో కలిపిచేసినభక్ష్యవిశేషము. "గీ. అట్టు బూరెలు జంతికచుట్టు..." చెన్న. ౪, ఆ. ౩౫౮.

**జంతికపుండు.** దే. వి. (జంతిక+పుండు.) సెలలకురుపు. "సీ... జంతికపుండు నాఁ జను ననేక, రంధ్రవ్రణాభిధ..." ఆం. భా. ద్వి. ౧౩౦.

**జంత్రగాఁడు.** వై. వి. (జంత్రము+కాఁడు.) యంత్రము నడపునతఁడు. "వ. వినుము దేహధారి స్వతంత్రుఁడు గాఁడు జంత్రగానిచేతి జంత్రపుబొమ్మకైవడి నీశ్వరతంత్రపరాధీనుండై సుఖదుఃఖాంబులందు వర్తనంబు సలుపు..." భాగ. ౧౦, స్కం. ౧౭౫౯; 2. వీణాదివాద్యముల మ్రోయించువాఁడు. "సీ. ప్రౌఢయై నాఱుతంత్రుల వీణ వాయించునరి లేనిజగజెట్టి జంత్రగాఁడు... నారదుండు..." వరాహ ౯, ఆ. ౨౬.

**జంత్రబొమ్మ.** వై. వి. (జంత్రము+బొమ్మ)-కీలుబొమ్మ, మాయలాఁడి. "ద్వి. ఈపోటువాటుల నిపు డిట్టు మమ్ముఁ బోరించితివి జంత్రబొమ్మ నాయక్క." ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౯౯. పం.

**జంత్రము.** వై. వి. (సం. యంత్రమ్.) 1. యంత్రము, తేలికగా పనిచేయుటకునిమిత్తము. "ఆ. అద్భుతంబుఁ జెంది యతఁడు చేజంత్రాన, జెఱకుఁగోల లాఁడి..." హర. ౧, ఆ. ౨౨; 2. సుర. "వ... మచ్చికంటులు కీలెఱిఁగి జంత్రంబులఁ గదలించిన..." ఉ. రా. ౬, ఆ. ౧౫౮. పచు. ౬, ఆ. ౭౮; 3. కీలుబొమ్మ. "వ... కీలెడలిన జంత్రంబుల క్రియ..." కవిక. ౨, ఆ. ౯౭; 4. వీణ మొ. గానసాధనము. "సీ. రహి పుట్ట జంత్రముల రాల్ గరగించువిమలగాంధర్వంబు విద్య మాకు." స్వా. ౨, ఆ. ౪౩; 5. ఆశ్చర్యకృత్యము, అబ్బురపుఁబని. "క. మంత్రబలమొం మాయయొ యీ, తంత్రము సహజంబో నీకుఁ దనరా విను నీ జంత్రమునకు విస్మయ పరతంత్రంబైనది మనంబు తథ్యము చెపుమా." నృసిం. ౪, ఆ. ౧౨౩.

**జందియము.** దే. వి. బ్రహ్మసూత్రము. "ద్వి. జందియంబులను బుస్తకమును..." ద్వి. హరిశ్చ. ఉ. ౯౩౫ పం.

**జందెపువాటు.** దే. వి. (జందెము+వాటు) 1. జందెమువలె వైచుట. "ఉ. గందపుఁబూఁతఁ బోలు అరికం దగుగుబ్బల మీటుహారపుం, జందెపు వాటు మాటు..." శుక. ౨, ఆ. ౯౬. శుక. ౩, ఆ. ౩౨౧; 2. జందెము వేయుట. "చ... అచ్చగింపురా, సరిపెణ మేన నీటుగన జందెపు వాటుగ వైచెనో యనన్." వాల్మీ. ౨, ఆ. ౮.

**జందెము.** దే. వి. (శ. సంజం.) బ్రహ్మసూత్రము. "సీ. కలదు లే దను వాదముల కోర్చి మీను మీసమువంటి యొంటి జందెము మెఱయఁగ." పాండు. ౩, ఆ. ౧౦. "సీ. కంకాళ మనుబుద్ధిఁ గరమునఁ జందెపుఁజిలుకఁ బట్టిన నది జలదరింప." పాండు. ౫, ఆ. ౧౩౬.

**జంద్యము.** దే. వి బ్రహ్మసూత్రము. "ద్వి. నడుతల మెఱవ జంద్యంబులుం ద్రెవ్వ." నవ. ౩, ఆ. ౧౫౦ పా. రుక్మా. ౫, ఆ. ౧౮౯.

**జంద్యముపెట్టు.** దే. వి. (జంద్యము+పెట్టు) జందెము వలె ఏటవాలు నఱికినఱకు. "ద్వి. జంద్యము పెట్టుగా జాఱీనతునుక." పలనాటివీరచరిత్ర. (బ్రౌ.)

**జంపము.** దే. వి. అంకవన్నె తగిలించెడుదారము లోనగునది. "సీ...ముత్తియంపు జంపములు చొక్కంపుటంకవన్నెలు..." రసిక. ౧, ఆ ౮౫.

**జంపాడు.** దే. అ. క్రి. (జంపు+ఆడు) 1. కదలు. (శ. ర.); 2. ఊగు. (బ్రా.) జవ్వాడు. "ద్వి. చింపికుప్పసములు చెలిదోరములును, సంపుటంబులతోడ జంపాడు నొడలు." ద్వి. పరమ. ౬, ఆ. ౪౫౮ పా. ౪ పం.

**జంపారు.** దే. అ. క్రి. మిక్కిలి కృశమగు. "క. కెంపారెడునధరంబును, జంపారెడినడుము సలికి శంపారుచులన్ సొంపారు మోముఁ గన్నులుఁ జెంపారుచు నొప్పు గొప్పపిఱుఁదును గుచముల్." భాగ. ౮, స్కం. ౨౬౮.

**జంపాల.** దే. వి. ఉయ్యాల. "సీ. మొకకెంజడలలో మూఁడుత్రోవలయేఱు బాలేందురేఖ జంపాల లూఁగ." చిత్రభా. ౫, ఆ. ౧౦౪. "సీ. చన్నులు తలగడసంచులవలె వెల్లి పయ్యెదమీఁద జంపాల లూఁగ." శుక. 3, ఆ. 3౦.

**జంపాలు.** దే. వి. జోలపాట. (శ. ర.)

**జంపు.** దే. వి. (క. జంపు) 1. ఆలస్యము. "క. మీవా రెఱుఁగుట యెన్నఁడు, గావించుట యెన్నఁ డింకఁ గల్యాణంబున్, నీ వేల జంపు నడపెదు, రావే మాటాడ కిందు రాకేందుముఖీ." విజ. ౨, ఆ. ౧౮౬. ఆం. భా. తృ. ౬3; 2. అనతి, "మ... వరంబుల్ పెక్కు లిక్కంజనఁగ, భవుచేఁ గాంచి నిజాజ్ఞలోన మెలఁగన్ మమ్ము న్నియోగించి యీ, భువనక్రోడములోన దండుగయుం జంపుం జెల్ల వర్తిల్లెడున్." చం. రా. ౨, ఆ. ౨౪; 3. జాలరు. "గీ. కెంపు విడికెంపుజంపున సొంపు నింపు, జాలిమగరాలితొట్లుహర్మ్యమునఁ బెట్టి." చంద్రా. ౨, ఆ. 3. ఆం. భా. ద్వి. ౧౯3; 4. సమూహము. "సీ...జలగజంపులు జోగిజాగమ కొలములు." హార. ౨, ఆ. ౫౧. బ. కొనచెవిని ధరించెడుభూషావిశేషము. (శ. ర.) విశే. 1. ఆలస్యము చేయునది. "ఉ. ఈకలహంసమాన వసు నెక్కడి కెక్కడినుండి తెచ్చె నా,వా కడు దూర మిప్పు డని యుక్కునఁ జేర్పక జంపు మాటలన్, వ్యాకులపెట్టు టేల..." విజ. ౧, ఆ. ౧౦౨; 2. నున్ననైనది. "సీ...జంపులై జాఱు

నీకురులకు సామ్యమెం బిరుసైనచామరములు." కలు. శ. ౨౭.

**జంపె.** వై. వి. (సం. ఝంపా.) ఒకానొకతాళవిశేషము. "చ. సరివినిపించి రుక్తగతి జంపె ధ్రువాద్యటముఖ్యతాళముల్." వైజ. ౧, ఆ. ౧౨3.

**జంపెతాళము** = జంపె. "సీ. చాముండి యొసరించు జంపెతాళమునకు భృంగీశ్వరుం డాడెఁ బేరణంబు." కాశీ. ౪, ఆ. ౨౯౬.

**జంబు.** వై. వి. (సం. జంబూః. క. త. జంబు) 1. నేరేడుచెట్టు. (చూ. జంబేఱు); 2. జమ్మిచెట్టు. "గీ. జమ్మి జంబన శమి యగు..." సాం. ని. స్థా. ౨౮; 3. తృణవిశేషము. "గీ. జంబు నూవరతుంగ పెక్ జంబు పుద్ద, తుండి..." హంస. ౫, ఆ. ౪౪.

**జంబుకాణము.** దే. వి. కంబళి. "గీ. జముకాళము తివాసి జంబుకాణ మనఁగఁ గంబళాఖ్య లగు..." సాం. ని. స్థా. ౬౭.

**జంబుఖాన.** దే. వి. తివాసి. "సీ. జముఖాళ మనఁగను జంబుఖా నన బృహత్పీఠాఖ్య..." వేంక. స్థా. ౮౯.

**జంబుఖానము** = జముఖాన. "ఉ...దేవతల్ హరి, ద్రాలనమానవర్ణముల రంజిలుపట్టుపటంబు జంబుఖానా లటు నిల్పిరో యన..." ఇందు. ౨, ఆ. 3౬.

**జంబుగూడ.** ద్వ. వి. (జంబు+గూడ) జమ్మనుతృణవిశేషముతో అల్లినగూడ. "గీ...ముప్పిరుజంబుగూడలఁ బయి ధరించి..." చంద్ర. ౫ ఆ. 3౯.

**జంబేఱు.** ద్వ. వి. ప్రా. (జంబు+ఏఱు) జంబూనది. "గీ. సాటిజంబేటిజంబాల జాలమునకు." వైష. 3, ఆ. ౧౫౬. స్వా. ౫, ఆ. ౭౧.

**జక్కర.** దే. వి. 1. నది. "క...వెలుపుజక్కర నాదలను దాఁచ్చజగవేల్పునకున్." అచ్చ. పీఠి. ౨౧. "సీ. ఆపుటేనుఁగుమోముసామిముద్దులపట్టి జక్కరవిరిబోడి సవతిమున్న." రసిక. ౧, ఆ. ౨: 2. ప్రవాహము. "సీ ప్రోదికప్రపలటిబోదె చాలుపుమ్రోలఁ జొరలుభూఁదేవి జక్కరలపజ్జ." రసిక. 3, ఆ. 3.

**జక్కలించు.** దే. స. క్రి. గేలిసేయు. "సీ. వెలిదమ్మి రేకు చూపుల జిన్నినవ్వుల లేఁతవెన్నెల జక్కలించువాని." విష్ణు. నా. 3, ఆ. 3౯.

జెక్కలింపు. దే. వి. (జక్కలించు ధా.) పరిహసించుట. (బ్రా.)

జెక్కవ వై. వి. (సం. చక్రవాకః.) చక్రవాకపక్షి. "చ...కలువలవిందు జక్కవలగొంగ." శైవ. ౫, ఆ. ౨౦౧. "క. కొండలమెంచును మారెటి, పండులసోయగము జక్కవలకూడిక పూఁ, జెండులపసయుఁను." నీలా. ౨, ఆ. ౨౪.

జెక్కవకవవిప్పు. ద్వ. వి. (జక్కవ+కవ+విప్పు)- చక్రవాకమిథునమును వేఱుచేయువాఁడు— చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౫.

జెక్కవచేంటి. ద్వ. విశే. చక్రవాకములవంటి స్తనములు గలది (స్త్రీ.) వి. స్త్రీ. "గీ. కంతుపట్టదంతి చేమంతిబంతి, కలికిజక్కవచంటి యాకలువకంటి." ఘటికా. ౨. ౫౬. "సీ. చాయజక్కవచంటి సాహోఖ పావని తురికిమానిక మగుమంత యొకటి." ప్రబంధ. ౧౬౨.

జెక్కవచెలి. ద్వ. వి. (జక్కవ+చెలి.) సూర్యుఁడు. "ఆ. వెక్కిదివియఁఱన్న జక్కవచెలియున్న, రిక్కరాయఁడున్నఁ జుక్కలున్నఁ, జిన్నిలేడి చూడ్కిచేడియ నెడఁబాయ, నప్పు డంధకారమయ్యెజగము." ధర్మ. ౪౦. ౧౫.

జెక్కవలగొంగ. వి. (జక్కవలు+గొంగ.) చంద్రుఁడు. "సీ...కలువపువిందు జక్కవలగొంగ." శైవ. ౫. ౨౦౧.

జెక్కవలఱేఁడు. వి. (జక్కవలు+ఱేఁడు.) సూర్యుఁడు. "సీ. మువ్వేలుపులయిక్క మ్రొక్కులదేవరగాముల ఱేఁడు జక్కవలఱేఁడు." ఆం. సం. దేవ. ౧౬.

జెక్కవలసూడు. "గీ. బారి సమసిన నిలుపక పాఱి వాఁ,లివము మేపరి కొలపుజక్కవలసూడు, మఱువు సేరిరి..." అచ్చ. యు. ౩౧౧.

జెక్కి. దే. వి. 1. గట్టము. "ఉ...చొక్కపుఁగొక్కి జక్కివై, చెక్కుడుబల్విజీరుపడు..." నీలా. ౧, ఆ. ౭; 2. తిరుగలి. "గీ. కడపమీఁదను మఱి పన్నెకంటిమీఁద, జక్కిమీఁదను గూర్చుండ జాడగాదు." కాశీ. ౨, ఆ. ౭౪.

జెక్కించు. దే. అ. క్రి. కట్టుపడు. ఉదా: అప్పుడు చేయునన్నాఁడు, ఇప్పుడు జక్కించుచు చేసి పోయినాఁడు. (బ్రా. శ. ర.)

జెక్కిణి. దే. వి. 1. నాట్యభేదము. "గీ. జక్కిణి నటించినను మెచ్చి శంభుఁడిచ్చు, మానితవిమాన మొక్కటి వానరేంద్ర." సమీర. ౩, ఆ. ౨౧౭. "సీ. నాట్యభేదంబులనాఁదము ల్దరు జక్కిణి గుజరాతి పేరణి లనంగ." ఆం. భా. ౧. ౧౩౦; 2. (సంగీ) వర్ణవిశేషము, ఒకవిధమైనపాట. "సీ. గీతంబు దరువు జక్కిణి చిందు మొదలుగా, నొక్కొక్కవర్ణంబు నుగ్గడించి...గీ. వేణునాదంబు మొరయించె రాణ మెఱయ, మదనగోపాలమూర్తి యమ్మాధవుండు." వి. పు. ౭, ఆ. ౨౭౭. వై. వి. (సం. యక్షిణీ. ప్రా. జక్ఖిణీ.) జాతివిశేషము. (శ. ర.)

జెక్కిణిగొను. వై. అ. క్రి. (జక్కిణి+గొను.) నాట్యముచేయు. "ఉ. చొక్కపుఁబంజుకమ్మలరు చుల్ మెఱుఁ గెక్కనెక్క జాలువాఁ, నక్కల చక్కి జక్కిణిగొనం బిగిగుబ్బలు పిక్కటిల్లఁగాఁ, జుక్కలరాచడాలు తెలిమాపులు త్రొక్కని చోట్లుత్రొక్క న్యాచక్కెరబొమ్మ యమ్మహిఁవ చంద్రునిచక్కటి కేఁగె గ్రక్కునన్." సుమల. ౨. ౯౨. రూ. జెక్కిణీ. "గీ. వెక్కవగ జక్కిణీ కొక్కు ద్రొక్కిత్రొక్కి, చక్కనిమిటారి నరపతుల్ చొక్కిమాడ." దశా. ౭, ఆ. ౧, ఆ. ౨౫౭. "సీ. సెఱపుచున్నది జక్కిణీలయల్ హాయలుంగా శశిరేఖనాటకశాలలోన." కవిరా. ౩. ౫౫.

జెక్కిదాయ. దే. వి. (జక్కి+దాయ.) మహిషము. "ఆ. అంతఁబోదుపుఁగిప్ప నింతయుఁ గడఁకతో, జక్కిదాయఁపడగసామి యబ్బ, పోదమటయుఁను ..." అచ్చ. యు. ౧౯౫.

జెక్కిని. వై. వి. (సం. యక్షిణీ. ప్రా. జక్ఖిణీ. చూ. జక్కినీఁడు.) 1. కుబేరునిభార్య. (శ. ర.); 2. లోకాంతరమున దేవతాత్వము పొందినమైదువ. "సీ. మృతచిరంటికి నాఖ్య లెనఁగుఁ బేరంటాలు నాఁగను జక్కిని నా ధరిత్రి." ఆం. సం. మాన. ౪.

జెక్కినీఁడు. ద్వ. వి. (జక్కిని+ఱేఁడు.) కుబేరుఁడు. (శ. ర.)

జక్కిమోర. దే. వి (జక్కి + మోర.) దేవజాతివిశేషము అశ్వముఖుఁడు. "ఉ. పీనులకంటెతొయ్యలియొ శేల్పువెలందియొ జక్కిమోరలేఁ, జానయొ పక్కిరాచెలియొ జక్కులవంగడవు బడంతియో ..." అచ్చ. బాల. ౧౪౪.

జక్కుదంట. ద్వ. వి. (జక్కులు+దాఁట - వృత్తియందు లు-వర్ణలోపము) యక్షులలోదిట్ట, కుబేరుఁడు. "క. ఎవ్వఁడు తగవుం గలిమిం, దవ్వని యిక్కొండ జక్కుదంటకు సరుదై, చొప్పడు రొక్కము సెక్కొన, నొప్పెడుజగములకు రెంటికొకజగమిది యా." అచ్చ. భా. ౨, ఆ. ౨౬. పా.

జక్కులగమికాఁడు. ద్వ. వి. కుబేరుఁడు. యయా. 3, ఆ. ౯3.

జక్కులబోనంబులు. వై. వి. బ. (జక్కులవాండ్ర భోజనములు.) మిథ్యాభోజనములు, పాలికిక్కిలిండ్లు. (శూద్రులు పెండ్లిండ్లలో పట్టిపరేని కుండలు తలమీఁదఁ బెట్టికొని 'బోనాలు బోనాలు' అని పల్కుదురు.) "క. బోనంబు ప్రజకు జక్కుల, బోనంబులె యయ్యె బ్రొయ్యి పొగయమి వృష్టిన్." ఆము. ౪, ఆ. ౧౨౬.

జక్కులదొర. ద్వ. వి. కుబేరుఁడు. అచ్చ. బాల. ౨౧.

జక్కులఱేఁడు. ద్వ. వి. (జక్కులు+ఱేఁడు.) కుబేరుఁడు. "చ. తొలికడరాయఁ దగ్గియును దంతసిడంబుమగండు సోఁకుమూఁకలయొడయండు నీళ్లదొర గాడుపు జక్కులఱేడుఁ జిల్వసొమ్ములయొకిమీఁడు నాల్గుభుజముల్ గలవేలుపుఁ దమ్మిచూలియుఁ గ్రొ, గొలువఁగ వెండికొండపయిఁ గూర్మి వెలంగుకడింది దయ్యమా." అచ్చ. అర. ౧౨౬. ఆం. భా. ప్ర. ౫౧.

జక్కులీఁడు. ద్వ. వి. (జక్కులు+ఈఁడు.) జక్కుల జాతివాఁడు. "చ. సమదమయూరికాగణము శంబరవైరిసివంబు లాడఁగా, సమయపుజక్కులీఁడు హరిచాపపుగోణముఁ దాల్చి మబ్బుతోం, పము లను బెట్టిదంపుటురుమ ల్మొరయించుచు మ్రోలనిల్పె...ధూమమల్." చంద్ర. ౫ ఆ. 3౧.

జక్కులు. వై. వి. బ. (సం. యక్షః. ప్రా. జక్ఖో.) 1. యక్షులు, దేవతలలో నొకజాతివారు. "గీ. కులుకుఁబాయంపుముద్దులగుమ్మ గలుగు, పొగను కానికిఁ దెఱగంటిబిగురుబోండ్లుఁ, బులుఁగురా చేడియలును జక్కులవెలందు,కలును పీనులకంటి చెల్వలు నిఁకేల." నీలా. ౨ ఆ. 3౭. "వ... లేఁటిజక్కులవారియాలాపంబులకు..." శుక. 3, ఆ. ౧3౧; 2. కామేశ్వరుని గొలుచు మాంత్రికు లగునొకజాతివారు.

జక్కువ=జక్కవ. వై. వి. కోకము, చక్రవాకపక్షి. "సీ. వలిజక్కువల పెక్కువలు దక్కువగ నిక్కు చనుదోయి కొకవింతచాయ దోఁచె." పారి. ౧, ఆ. ౫౬. "క. ఎక్కువ లగుమక్కువలను, జక్కువలను బోలియట్లు సరసత సెలనాళ్లిక్కువలఁ గలసి యుండఁగ, నక్కువలయగంధి గర్భ మయ్యెద్దఁ దాల్చెన్." అని. 3, ఆ. ౯౯. (శ. ర. పా.) విక్ర. 3, ఆ. 3౯.

జక్కువలయంటు. ద్వ. వి. (జక్కువలు+అంటు.) చక్రవాకపక్షులను శేర్చునది, సూర్యుఁడు. "గీ. జక్కువలయంటు మ్రొక్కులఁ జొక్కుసామి." సాం. ని. దేవ. ౯.

జక్కొను. దే. అ. క్రి. లభించు, దొరకు. "ద్వి. మహనీయకీర్తిసన్మార్గానువర్తి, వలిమెడుమహిసాక్షి ప్రతిదివసంబు, మలహరునకుఁ ద్రిసంధ్యల సమర్పింప, నొక్కనాఁ డెట్టుకు జక్కొనకున్న, గ్రక్కునఁ దన మేనికండలు కోసి." పండితా. పురా. ౧3౫. పా.

జక్కొలుపు. దే. స. క్రి. 1 చేయు; 2. వినియోగించు; 3. సవరించు. రూ. జక్కొల్పు.

జక్కొల్పు. దే. స. క్రి. = జక్కొలుపు. 1. చేయు. "ద్వి. జంగమారాధనల్ జక్కొల్పి నిత్య,లింగార్చనములు సల్లీలఁ గావింప." పండితా. పర్వ. 3౫౯. పు 2. ఉపయోగపఱుచు. "ద్వి... ధరిణి, పాలుఁడు మును వెక్కుపాయంబులందు, జక్కొల్పఁ జాలక సంచలింపంగ." బస. ౪, ఆ. ౧౧౭. పం. 3. సవరించు. (కుక్కుటవర్ణనము.) "ద్వి. ముక్కునఁ గెలు జక్కొల్పి కడుపు, వెక్కించి మెడ సాఁచి నిక్కిమిన్నూచి." పండితా. పురా. ౧౧. పా.

జగ. వై. విశ = జగా, జోగా. (సం. జగత్. క. జగ.) పెద్దది, గొప్పది; ప్రశస్తమైనది. వి. (క.

జగ.) కాంతి. "సీ. కుందనపుఁ బసిండికుళ్లాయి జగలపైఁ జౌకట్టుబిగబిగల్ చౌకళింప." విజ. పీఠి. ౩౬.

జగమగఁడు. ద్వా. వి. గొప్పశూరుఁడు. "గీ. జగము లన్నియుం గెలిచినజగమగండు, రావణుం డొప్పు నెన లేకిశివికోడ." అచ్చ. యు. ౬౮.

జగదొంగ. ద్వా. వి. గొప్పదొంగ. "క. ఈజట లీ కృష్ణాజిన, మీజపమాలికయుఁ గాంతియొట్టు గలి గెనో, యీజగదొంగకు నోహో, శ్రీజానస్మరణ మహిమ చెప్పఁగ్ వశమే." వాల్మీ. ౩, ఆ. ౧౪౭. (గజదొంగ-వాడుక. బ్రౌ.)

జగపావురము = ద్వా. వి. ప్రశస్తమైనపావురము. "ద్వి. జగమెల్లఁజూడ నాజగపావురాయి, యెగసి మాపినకల్లియింటిపైవ్రాలె." ద్వి. శ. సా. ౨. భా. ౯౫. పా. ౫. పం.

జగడంబు. ద్వా. వి. ప్రశస్తమైనకాంతి. "సీ. పసిఁడి చాయలవానిఁ బగడంబు జగడంబు జగడంబుగల మోవిసొగసు వాని." వసు. ౩, ఆ. ౪౬.

జగబంటు. వై. వి. గొప్పభటుఁడు. "క. జగములు వొగడఁగనెగడిన, జగబంటని కొమరుఁడయ్యె జకనమఁగటా, జగదీశునోపవు..." అచ్చ. యు. ౧౨౨.

జగజంత. ద్వా. వి. 1. మాయలాఁడు; 2. మాయలాడి.

జగజంపు. ద్వా. వి. (క. జగజమ్ప) - మత్స్యములు ముస్నగు వానికుచ్చు-జాలరు. "సీ. జగజంపనంగను జల్లి నాజంపన ఝల్లరీనాముమైయుల్లసిల్ల." ఆం. భా. ద్వి. ౯౩. "తే. చంద్రికా పాండు కౌశేయ శాటియైన, యతనుజగజంపు గొడు గెవ్వఁ డవ్విధుండు, పెద్దకాలంబు...వసుధబా లించె..." కాశీ. ౪, ఆ. ౯౫. విశ. పెద్దది "సీ. పలిదంపుఁగసుమపూవన్నె చేలమెఱుంగు జగ జంపుసఁజ కెంజాయగాఁగ." దశా. ౩, ఆ. ౨౦.

జగజెట్టి. ద్వా. వి (జగ+జెట్టి.) 1. గొప్పమల్లుఁడు. "సీ. వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించినయాజగజెట్టి యితఁడె." భార. ఉద్యో. ౩, ఆ. ౧౭౫. ద్వి. పరమ. ౩, ఆ. ౨౦౪. పా. ఆంధ్రపదా. నర. ౪౦; 2 అదవిసంది. "సీ. పలఁ దట్టి చనుగట్టిపగచుట్టునరికట్టి జగజెట్టిఁ బడఁగొట్టి చనియె నొకఁడు." రా. వి. ౩, ఆ. ౬౪. విశ. శ్రేష్ఠుఁడు. "క. ఇట్టి మహిమములు గలజగజెట్టికి..." భీమ. ౧, ఆ ౭౧.

జగజోలి. ద్వా. విశ. (జగ+జోలి.) మిక్కిలి మోసఁ గాఁడు. "ద్వి. చాలుఁజాలును పట్టిజగజోలి మాట, చాలింపుమా యిట్టిజాడ లేమిటికి." రం. రా. అయో. ౯౪. పు. ౨౯. పం. వి. 1. తగులాటము. 'క. మగవారి నమ్మవచ్చునె, యగపడి తమకార్య మైనయందాఁక విరాళి గదింతు రంత నెక్కుడి, జగజోలి యటంచు నెరసి చనఁ జూతురుగా." శుక. ౩, ఆ. ౧౨౭; 2. అల్లరి. "ద్వి. ఫలము వారలో కాక పనిమాలినట్టి, చలము వారలో పట్టిజగజోలి యేల." ద్వి. పరమ. ౭, ఆ. ౬౪౫. పా.

జగడగొండి. ద్వా. విశ. (జగడము+గొండి.) కలహ శీలురాలు; కలహశీలుఁడు. (శ. ర.)

జగడమాడు. ద్వా. అ. క్రి. (జగడము+ఆడు. క. జగళాడు.) కలహించు. (శ. ర. బ్రౌ.)

జగడము. దే. వి. (క. జగళ); 1. తగవు, వాదు. "క. నటనాహాంకృతిఁ దమలోఁ, జటిపాటిజగ డంబులార్వఁశీరంభలకుం, బొటమిన..." విక్ర. ౨, ఆ. ౭౭. శుక. ౨, ఆ. ౩౩౭. "మ. జగడం బక్కధికంబుగాఁ దొడఁగుటన్ శాంతంబు గావింప రాక గుమల్ గూడి రణంబు చేసిరి పడంకన్ మూఁడులోకంబులున్." వరాహా. ౭, ఆ. ౩౧. 2. యుద్ధము, పోరు. "చ. పొలుపుగఁ గొండకట్టెలకుఁ బోయెడివాని విధంబు దోప గొడ్డలి యిడి యేమి దీన జగడంబొనరింపఁగ వచ్చితే బళా,బళ..." దశా. ౬. అ. ౧౧౯. ఆం. భా. ద్వి. ౨౨౨.

జగడాలమునిరేఁడు. ద్వా. వి. నారదమహాముని. "సీ. జగడాలముని రేనిజేగిఁ గేరి వినువాఁక చాయల నిటునటుఁ బాయఁ ద్రోచి." రామ. ౩౭౧.

జగడంపుఁగూటితపసి. ద్వా. వి. నారదుఁడు. "ఎత్తు గీతి. నోరజగములయొకిమిని పేరుసారె, గొణుగు చును వచ్చె జగడంపుఁగూటితపసి." అచ్చ. యు. ౧౫౪. [గొండి. (శ. ర.)

జగడాలమారి. ద్వా. విశ. (జగడాలు+మారి.) జగడ

జగడించు. వై. అ. క్రి. 1. జగడమాడు. "చ. దిన మొకమూర గాని మఱి లేఁడుడు శాకములందుఁ

బలుక్కు వం,డినపలుగూరఁ గాంచి జగడింపఁగఁ జొచ్చి..." బహు. ౫, ఆ. ౭. "క. తెగడిప్పుడు మూన్నెలలకుఁ, దగ వమగఁగ రండు తీర్చెదను బొందు వృథా,జగడింపకుఁడు..." జై. భా. ౮, ఆ. ౨౦౯; 2. యుద్ధముచేయుట.

జగ౹తి. దే. వి. (క. జగతి.) అరుఁగు, తిన్నె. "క...క్రొ,న్ననచప్పరంబులోపలఁ, దనరెడుకవ్వ రపుజగతిఁ దమి నున్నయెడన్." యయా. ౪, ఆ. ౬౬. ఆం. సం. స్థా. ౬౨.

జేగనొబ్బగండఁడు. మి. విశే. (క. ఒబ్బ = ఏకము.) (జేగము + ఒబ్బ + గండఁడు.) జగదేకవీరుఁడు (బిరుదనామము.) "గీ. బెండపూడన్నజగనొబ్బ గండబిరుద, సచివదేవేంద్రుఁ గృతికధీశ్వరునిఁ జేసి." భీమ. ౧, ఆ. ౨౮.

జేగము. వై. వి. (సం. జగత్.) ప్రపంచము. "సీ. జగ మద్దఁదను దొడ్డపత్తియై బెదరించుగట్టుల యొకిమోనిపట్టి జకరియె." నీలా. ౧, ఆ. ౫౨. "క. జగములు పొగడఁగ సొగడిన, జిగబంటు..." అచ్చ. యుం. ౧౨౨. ఆం. భా. ద్వి. ౭. విశే. గొప్ప, పెద్ద. (చూ. జగ.)

జేగముకన్ను. ద్వ. వి. (జగము+కన్ను.) జగచ్చక్షువు, సూర్యుఁడు. "గీ. ఇరులుగొంగ తమ్మివిరిఁ బోఁడివగకాఁడు, చదలుమానికంబుజగముకన్ను, వేఁడివేలుపిపము వేఁటాడుపోటరి, ప్రొద్దుతూర్పు మలను బొడమెనపుడు." నీలా. 3, ఆ. ౮౫. ఆం. భా. ప్ర. ౮౧.

జేగముచుట్టము. ద్వ. వి. లోకబాంధవుఁడు సూర్యుఁడు. అచ్చ. అయో. ౩౮.

జేగముతల్లి. ద్వ. వి. (జగము+తల్లి.) 1 లక్ష్మి లోకమాత. (శ. ర.); 2. పార్వతి. "గీ. సామిసామేనిఁ జేకొన్నచాన జగము,తల్లి యన గౌరి పేర్కొప్పు..." ఆం. సం. దేవ. ౯.

జేగమువిందు. ద్వ. వి. సూర్యుఁడు "గీ...జే.డ విన్విన్నమనుమఁ, డెలమిఁ గొనివచ్చు మందుల వెలుఁగు గాని,యది జగమువిందువెలుఁగు గాదె..." అచ్చ. యుం. ౪౩౧.

జేగా = జేగ. వై. విశే. పెద్దది, ప్రసిద్ధికెక్కినది. "చ. గిఱికొనుగజ్జుమామిడులక్రేవ జగాకురువింద దళీఁగచ,ప్పరముపీఁడఁ జంద్రమణిబద్ధవితర్దివసించి యున్నెడన్." ఉ. రా. ౬. ౧౨౦. వి. కాంతి. "క. పగడంబుల తెగడంబుల జగడంబులు గెలువఁ జాలు సఖమోవి జగా,నిగరాల న్నగజాలక్, నగరాల స్వెలకు నమ్ము నాలిరదమ్ముల్." శశాం. 3, ఆ. ౪౦.

జేగాజెట్టి = జేగజెట్టి. (గొప్పమల్లుఁడు.) "గీ. దట్టి కట్టాయితగ జగాజెట్టిదట్టి, మట్టిటుకొలఁగఁ జటులాట్టహాస మెసఁగ, శంభుతాండవ సంరంభ జృంభణమున సాదన యొనర్చు రఘుమహీజాని సుతుఁడు." ఇంద. ౨, ఆ. ౨౧.

జేగిలె. దే. వి. (క. జగులి.) అరుఁగు, తిన్నె. "సీ. వాఁకనీరులు తియ్యవలిపానకములయ్యె బిగువు నేలలు పైఁడిజగిలె లయ్యె." అచ్చ. అర. ౧౦౨. సాం. ని. పా. ౬౨. రూ. జవిలె.

జేగిలెము. దే.వి. జగ్గిలె (త. సగలన్) తోడియల్లుఁడు. "గీ. వద్ధకుఁడు తోడియల్లుఁడు జగిలెఁ డనఁగ." ఆం. నా. శే. ౪౭.

జేగిలెకాఁడు. దే. వి. (జగిలెఁడు+కాఁడు-స్వార్థమున.) తోడియల్లుఁడు. "గీ. కన్ను దలమానికము బండికన్ను జగిలె, కాఁడునై యొప్పి మిక్కిలి కంటివేల్పు, నలరఁ జేయువలంతి యగ్గలపుఁజల్లఁ, దనము నెఱపుచు నంతకంతకు వెలింగె." అచ్చ. అయో. ౧౯. (శ. ర.) (బండికన్ను జగిలుగాఁడు అని వావిళ్ల ముద్రితపా.)

జేగే. దే. అవ్య. నిరసించుటతెలుపును. "చ...నీ,కిను కలు సాగ విచ్చుట జగేయన నాఁతడు భీతచిత్తుఁడై." శుక. 3, ఆ. ౧౯౬.

జేగ్గిలె = జేగిలె. "క. అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొల్వఁబైడిజగ్గిలెపైఁ జే,మంతుల మాడువులో విరి,కొంతపువేల్పనఁగ రాజు కొలువున్నయెడన్." యయా. ౫, ఆ. ౪౫.

జేగ్గు. దే. వి. 1. గమనవేగాదులయం దగునసుకరణము; "చ...అందెలు మ్రోయ దీర్ఘలో,చనరుచితోడ నీరమణి జగ్గన పేఁడుచు ముద్దుబెట్టుకో జనుటయుం..." శుక. 3, ఆ. ౭౧. "వ...కంబము రాయూ నీకుఁ గలపణ్యారములు సాగింతు మనుచు జగ్గు జగ్గున పరువు లెత్తి..." ప్రబంధ. ౭౮౮. (జగ్గు జగ్గున=అతివేగముతో); 2. ప్రకాశించుటయం

దగునను కరణము; (అధిక ప్రకాశము.) "ఉ... ఒయార మొలయం గలయం జిఱునవ్వు వెన్నెలల్, జగ్గినయంగఁ గోరిక లెసంగ ననంగుని తోట్లలీలమై, సిగ్గు చెలంగ వచ్చె రమణీమణి నాథుఁడు వేడ్కఁ జూడఁగన్." ఇం.దు. ౬, ఆ. ౧౨౪. ఉ.రా. ౧, ఆ. ౧౩౮. "సీ. వెలయంఁ బ్రకాశంబు వెలుఁగు జ్యోతి యనంగ నదిమించ మైన జగ్గనంగ నొప్పు." ఆం. భా. ప్ర. ౭౨; 3. ఒయ్యారము. "మ... చిఱుపానాకత్తి చిమ్ముక్ ... వోవిపైఁ గెంపుఱిగ్గను మీసంబులు దిద్ది నాడికొని జగ్గులీ మీఱ నాపీఠుఁ డన్." కువల. ౫, ఆ ౪. విశ. 1. ఒప్పిద మైనది "ఉ. సాదన మేలు చెంపపయి జగ్గుగ వ్రేలురుమాలు మీసము,ల్మీదను జీరుకేలు జిగి మించఁగఁగప్పినసాలు..." హంస. ౧ ఆ. ౨౦౬. 2. తళతళ మనునది. "గీ. తులుకుఁ బ్రాయంపుకజనీటుకోడె కాంద్ర,గమిళఁ దనజగ్గు జిగి స చకార మొనఁగి, వలపురెట్టించు మెలఁగు నవ్వనజగంధి." హంస. ౧, ఆ. ౨౧౮.

జజాయి. దే. వి. (హిం. జజాయల్.) ఒకవిధమైనఫిరంగి. "గీ... సుర్రుక్రోవి ఫిరంగి బాణము గుంటక్రోవి, జబురుజంగి తుపాకి జజాయి నాఁగ, వెలయం నగ్ని ప్రసారణాఖ్యలు మహోళ." ఆం. భా. ద్వి. ౨౧౮. రూ. జజాయా. 'సీ. బాడబానల శిఖాపటలీలీలాఘాటకీలలీ నెడుజజాయాలగుంపు." రంగా. 3, ఆ. 3౨.

జజ్జర. దే. వి. 1. వంచన, మోసము; 2. (బ) దంభోక్తులు. "ద్వి. వలదు పసిమ్మ యాపట్టిజజ్జరల, కలుగునే కౌశికుఁ డల్పునిరీతి." ద్వి. హరిశ్చ. పూ. ౨౮౫. పం. (శ. ర. పా.) రూ. జాజర.

జజ్జరకత్తియ. దే. వి. వంచకురాలు. (శ. ర.) రూ. జజ్జరకత్తె.

జజ్జరకాఁడు. దే. విశ. మోసగాఁడు. "ద్వి. జజ్జర కాఁడ నీచనుత్రోవఁ జనుము." ద్వి. హరిశ్చ. ఉ. ౬౭౦. పం.

జజ్జు. వై. విశ. (సం. జర్జర. క. జజ్జు.) 1. శిథిలము. "సీ. జల్లిమాటలు నపశబ్దములును జజ్జుటల్లికల్ ప్రావలు నతుకుఁబలుకులును..." ప్రబంధ. పీఠి ౧౬. వై. వి. పచ్చలోనిదోషము. (బ్రౌ.) యం. దే. వి. మిక్కిలిచింపి. విశ. మిక్కిలి చిబిగినది.

జజ్జుగొను. దే. అ. క్రి. (జజ్జు+గొను.) దుర్బలమగు, బలహీనత నొందు. (శ. ర.)

జట్ట. దే వి. (త. పెట్టె) కాయముక్క. "మ... వంకాయవేఁపుడు గమ్మదన మందుకంపయును పుంటికోట్లక్ యటం బైన చిక్కుడుజట్టల్ మొన లైనశాకములు నొల్కంబప్పు వడ్డింపఁగన్." రా. వి. ౨, ఆ. ౧౦౦.

జట్టి. దే వి. 1. పెం, విజువ. "సీ. పెట్టెఁ బుట్టిన యట్టి జట్టి మీఱినపట్టుఁబుట్టముల్ మట్టుగాఁ గట్ట నేమి." సీరా. ౨, ఆ. ౭౮. ఆం. భా. ద్వి. ౨౬౬; 2 బేరము "ద్వి. వేడుక జట్టిగావించి నాపూన్కి, వీడ నాడకు మాను విత్త మింతనిన, లోఁగి యీఁకుఁ గానిలోఁ దని జట్టి, వీఁగక..."ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౮౫, ౧౪౮౭ పం. "గీ. పూవు లంగళ్లలోఁ జల్లపూఁట వీటఁ, జేడియలతోడ బేరంబు లాడునపుడు. తగులువిరిమాట తఱిలిపు ముగియనీదు, జట్టియోగమాలికకు నైనజాణలకును." కళ. ౧ ఆ. ౧౩౧; 3. అమ్మకము, అమ్ముడు. "క. ఇట్టియ్యెరుగుపురుఁ దమలో, జట్టు వడసి..." భోజరా. 3, ఆ. ౨౯౫. (శ. ర. పా. జట్టువడసి = అమ్ముడుపోయి.) 4. అమ్మకపు సరకు. "ద్వి. అపద వచ్చినయప్పుడే మున్ను, దాఁచినధన మిచ్చి తగఁ బల్మిఁగావఁ, జనుఁ బల్మి నైనను జట్టిగా నమ్మి. తనకువచ్చినబారిఁ దప్పించవలయుఁ." ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౦ పం; 5. పూర్తిసరకు యొక్క క్రయవిక్రయములు స్థిరపఱచుకొనుటకు చేసికొను ఒడంబడిక, టోకుబేరమున కొడంబడిక, క్రయనిర్ణయము. (బ్రౌ.); 6. ఒకజాతిపావురము. (శ. ర.); 7. ధనాదినిమిత్తక మైనజగడము. (వా.) విశ. సమ్మశము, సమానము. "ఉత్సా. అట్టి వేళవిశ్వకర్మ యరుగుదెంచి దీనికిక్ జట్టి పుట్ట దంచుఁ బొంచ జన్యజన్యశంఖముక్, జట్టి గాఁగ నిచ్చి యలన ధీస్సరత్సురద్విషుక్, జుట్టవ్రేల భూవరునకుఁ జూపి యేకతంబుగాన్." కళ. ౨, ఆ. ౧౧౯.

జట్టింగ. దే. వి. ఒకజాతిదొంగ, (బ్రౌ. శ. ర.)

జట్టికత్తియ. ద్వ. విశ. 1. మారుబేరకత్తె; 2. సరకులు కొనునది. (శ. ర.) రూ. జట్టికత్తె.

జట్టికాఁడు. దే. విణ. 1. కొనువాఁడు, క్రేత. "ఆ. జట్టికాండ్రఁ దమదమసరససుందరవిలాసముల చేతఁ దార జట్టికొనుచు." కవిక. ౧, ఆ ౨౧. (శ. ర.) ఆం. భా. కృ ౧౧; 2. వర్తకుఁడు. "సీ...విద్య వార్త, సేవ కారుత యర్థసిద్ధికి మూలముల్ విద్య వానికి ననవద్యతయుండు. ఆ. కర్షకునకు నేలకాల మెఱుంగుట, జట్టికాని కేది సంభవించె, నందు విలువ మొదల నగులాభమును నెడ, వ్యయము గల్గుగుటయు శివప్రదములు." భార. అను. ౫. ౭౫; 3. ఓడనడుపువాఁడు, మాలిమికాఁడు. "ద్వి. ఏ దేవా నిజకర్తృవేత్తలజట్టి, కాఁ డయ్యె భవవార్ధిఁ గడతేర్చువాఁడు." పండితా. దీక్షా. ౧౫౭ పా; 4. సభికుఁడు, జూద మాడించు వాఁడు. ఆం. భా. ద్వి. ౩౦౪.

జట్టికొను. దే. స. క్రి. 1. విలుచు, కొను. "సీ. మంకి నాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛ మై వర్తించు శిక్షింపవలయు నట్టి, గుజ్జుదోయని జట్టికొని ప్రీతి లంకించి యుండ లంకియతోడ దండుమీఁటి పాఱె నక్కోడియల్..." భార. శాం. ౪, ఆ ౪౦; 2. వశపఱుచుకొను, స్వాధీనము చేసికొను. "క. కట్టాన దేవి యై నీ, పట్టి జగం బెల్ల మెచ్చఁ బతిమానస మిట్టట్టు చననీక యున్నిట, జట్టిగొనక నేర్చు నీవు సంతస మందన్." రాజ. 3, ఆ. ౨౧౧.

జట్టిదక్కు. దే. అ. క్రి. (జట్టి+దక్కు) అమ్ముడు పోవు. "ద్వి. ఏసత్యమునకుఁగా నిచ్చెదు నీకు, దాసుఁడనై జట్టిదక్కుచున్నాఁడ." ద్వి. హరి ఉ. ౧౫౩౨ పం.

జట్టియాడు. దే. స. క్రి. బేర మాడు, బేరము చేయు. "సీ...అన్నికోలలు జట్టియాడక కొనరక ..." హర. ౧, ఆ. ౨౦.

జట్టియిచ్చు. దే. స. క్రి. (జట్టి+ఇచ్చు) విక్రయించు, అమ్ము "చ...విప్రులొనర్తురు యజ్ఞముల్ దభం,బు ననఘ జట్టియిత్తురు విమాఢతఁ బాయుందు రగ్నిహోత్రముల్." హరి.ఉ. ౯.౪౬.

జట్టియిడు = జట్టియిచ్చు. దే. స. క్రి. (జట్టి+ఇడు) విక్రయించు. "క...వైశ్యుఁ డాపద యైనన్. రాజవర మధుప్రమాంసముఁ, దా జట్టియిడంగఁ బొందు దౌర్గత్యంబున్." భార. శాం. ౫. ౪౯౪.

జెట్టు. దే. వి. 1. సమూహము, గుంపు. "సీ. ఇల్లు గట్టించి యం దెల్ల జూదపుజట్టు కర మర్థిఁ గూరిచి కడఁకఁ బెట్టి." విజ్ఞా. ప్రా. ౪౦; 2. జెత.

జెడ. వై. వి. (సం. జటా. క. జడె. త. సడై.) ఒకటితో నొకటి యంటుకొన్న బుష్యాదులజుట్టు. "సీ. జడలలోఁ దెలినీటిచదలేటిజాల్మాటి..." సిఖా. ౧, ఆ. ౧౩. "సీ... జడయనఁ జెలఁగును జటపేరు..." ఆం. భా. ద్వి. ౧౪౯. 2. వేణి, వేనలి, కొండు కలయల్లిక. "సీ. నెగ కల్కి మఱుఁగుఁ జొబ్బినజహ్నురవిజల సంణి మల్లెలతోడిజడలు మెఱయ." ఆము. ౨, ఆ. ౫౮. పారి. పీఠి. ౪. మను. 3, ఆ. ౮3; 3. (సం. సటా) సింహము మొదలగువాని మెడమీఁది జూలు, కేసరము. "సీ. పలికిన విని జడల్గలకోఁతి మిన్నమేఘట్టు విచ్చటికిప్డు ప్రొద్దుకొమరుఁ, డేటికి వచ్చు నం కాద నెంచి..." అచ్చ. యు. ౪౨౫.

జెడక. దే. వి. (సం. శాటక?) చిని గినబట్ట. (బొంత శ. ర) "మ...జడకల్ గట్టి నికృష్టయష్టికరుఁ డై చండాలవేషంబుతోన్." మార్క. ౧. ఆ. ౨౨౪. విజ్ఞా. ఆచా. ౧౧౧.

జెడకట్టు. ద్వ. అ. క్రి. జడయగు.

జెడచుచ్చు. ద్వ. వి. స్త్రీలు జడలతోఁ జేర్చి అల్లుకొనెడిభూషణవిశేషము. "సీ. కేలుదామర యందుఁ గేదారవలయంబు, జడచుచ్చుమీఁదఁ బచ్చడపుఁగండ. తే. సంతరించి..." హర. ౨, ఆ. ౯౩ చెన్న. ౨, ఆ. ౨౦౭.

జెడకొఱ్ఱ. ద్వ. వి. ధాన్యవిశేషము. "సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చాములు వెలిచామ కుట్టారికారికె కొండబరిగె." హంస. ౪, ఆ. ౧౨౭.

జెడగట్టు. ద్వ. అ. క్రి. జడగా నేర్పడు, అంటుకొని పోవు. "సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట నగరు మన్ననుమండు తపమునైకొనినచోటు." మను. ౨, ఆ. ౯. "సీ. జడలుగట్టియుం నింతసక్కనైనది వేణి దీర్చిన నెరు లెంత ద్రేణి యగునో." కు. సం. ౭, ఆ. ౭. సమీర. ౨, ఆ. ౮౮.

జెడగాఁజె. వై. వి. (త. సడైక్కంజా. జడ+గాఁజర) గంజాయిచెట్టు. (శ. ర.) "సీ...జడగాఁజ గంజా బంగి యనఁగఁ గళంజాహ్వయంబు లలరు." సాం. ని. మాన. ౩౪.

జడగొను = జడగట్టు. ద్వ. అ. క్రి.(జడ+కొను) 1. జడగా నేర్పడు, అంటలు కట్టు. "గీ. ఏచమాటలు జడగొన్న పేఁచుఁగురులు, గలుగు నెఱుకులు దగఁ బొడగనఁగ వచ్చి." యయా. ౧, ఆ. ౧౦౨; 2. పెనఁగొను, కలసికొను. "సీ ప్రోదిక ప్రపుటంటిబోదియజాల్నోళ్ల జడగొన్నసనుగున్నసంపఁగలును." అచ్చ. బాల. ౧౧౭.

జడదారి. వై. వి. (సం. జటాధారీ) 1. జడలు ధరించిన వాఁడు-ఋషి. "గీ...జడదారి నాఁగఁ దపసి, నాఁగ ఋషిసంజ్ఞ..." ఆం. భా. ద్వి. ౧౭౬, ఆం. సం. మాన. ౨ "గీ...ఉచితవేష, మెనసి నరపాలనిరపాయహితవివేక, హరి గడిజేటి యొగజడదారి యయ్యె." వసు. ౨, ఆ. ౭౮; 2. వానప్రస్థుఁడు. "సీ...వనసంవాసినామ మెసఁగు, నడవిసెలవరి నాజడదారి యనఁగను ..." ఆం. భా. ద్వి. ౧౭౬. ఆం సం మాన. ౨; 3. ఈశానుఁడు. "సీ...జడదారి గిబ్బసి పాయి రిగకంటిదొర తుదిదిక్కుటెంకి, యనఁగ నీశానాఖ్య లనువొందు..." సాం. ని. దేవ. ౧౪.

జడదారిచెవిఋగ్గు. ద్వ. వి. దేవగంగ. వేం. ఆ. ౧౮.

జడదాలుపు. వై. వి. జడల్ధరించినవాఁడు-ఋషి. "మధురగతిరగడ. వేఱుపడరు తొలివేల్పులు వేల్పులు, దూఱిరి మధురగతుల జడదాల్పులు." కళ. ౧, ఆ. ౨౨౨.

జడదాలుపువేలుపు ద్వ. వి. ధూర్జటి, శివుఁడు. "చ. పడిగొరవంకబారు లిరువంకలరాఁ జెలరేఁగి చిల్కుత, త్తడి దుమికించుకొంచు జడదాలుపువేలుపు కఁటిపుంటలోఁ,బడి వెడవిల్తుఁ డంగ మెడఁ బాసిన హొసపుటెంకియాటచే..." చం. రా. ౨, ఆ. ౭౨.

జడను. వై. వి. (సం. జడతా.) 1. అలసత, మాంద్యము. "చ...రవియాజ్ఞ మాటికిన్, మఁడి యిడఁ బిచ్చుకుంటు రథము న్నిలుపక్ బయనంబు సాగమిన్, జడను వహించె నాఁగ దివసంబులు దీర్ఘము లయ్యె నత్తఱిన్." ఆము. ౨. ఆ. ౪౯. విక్ర. ౧. ౧౬౬. హరి. ఉ. 3, ౧౮౦; 2. అలస్యము; 3. సంశయము, సందేహము. "క. ఏనోహార మొక్కుయుంపా,ఖ్యానము గలదేతదర్థ మదియుఁను వినినన్, మానివర నీవనంబున,నూనిన జడనుడుగు ననుచు నుగ్రుఁడు పలుకన్." పాండు. ౫, ఆ ౧౬౭; 4. కొఱఁత, లోపము. "చ. జడ నొక యింత లేనిజెలిచక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగా ..." మను. 3, ఆ. ౪౭. విణ. మందము. అలసము. "క. నవలాంగణ్యాకర మగు, నవలానెన్నడుము బలిసెఁడ జడఁ యయ్యెన్." చంద్ర. ౧, ఆ. ౯౬. "గీ. చలువచొట్టులఁ గ్రమ్మరుజడనుగాడ్పు, మొగులు విరియెంత దళుకొత్తు మొగముచెమట, లార్చి పొలనుకొల్లలను మెచ్చి తలిర్చె." హరి. పూ. ౭, ఆ. ౧౧౬.

జడనుపడు. వై. అ. క్రి. (జడను+పడు.) మందము "క. నడజనుపడియె నా రే, ర్వడియొక్ జను మొనలు నల్లవడియెన్..." మను. 3, ఆ. ౧౧౯.

జడప్రత్తి. ద్వ. వి. (క. జడెహత్తి. త. సడైపరుత్తి.) జటగా నేర్పడుగింజలు గలయొక జాతిప్రత్తి. (శ. ర. వా.)

జడబిల్ల. ద్వ. వి. (క. జడెబిల్లె. త. సడైవిల్లై) ఆఁడువారి శిరోభూషణవిశేషము. "సీ. బటువు ముత్యమ్ముల పాపటబొట్టు రాకిడి జడబిల్లలును గుచ్చు లదరి వెలుఁగ." వేం. ౧, ఆ. ౧3౦.

జడబ్రతుకు. వై. వి. (జడ+బ్రతుకు.) జటాధరుఁడు. "గీ. అట్టులెడలేనికడిమిఁ గయ్యం బొనర్చు, జడబ్రతుకుగూఁడుపుట్టుపుసామియిద్దఁ,గినిసి కైదువ కేల నంకించి రక్కుసుండు గాల్చుచు రెక్కలు చెండివైచె." అచ్చ. అర. ౭౫.

జడముడి. ద్వ. వి. (జడ+ముడి.) 1. గుండ్రముగా ముడిచిన యీశ్వరునిజడలముడి, కపర్దము. "చ. జడముడి జాహ్నవీకటనిశాకరహోతముఁ జూచి యొవ్వరి,కొడిమెలు గట్టి పెండ్లొడుకుక్ గడి యారము మావఁజేసి రంచుదుగ..." జై. భా. ౧, ఆ. ౯౮. ద్రో. ౫, ఆ. ౪౧౯; 2. జడల యొక్కముడి. "ద్వి. చెన్నార జడముట్లు చిఱుత కోలలును, వన్నెలకోలలు వల నొప్పఁ బట్టి." ద్వి. భాగ. ౧౦, స్క౦.

జడముడిజంగము. ద్వ. వి. (జడముడి+జంగము.) కపర్ది, శివుఁడు. (శ. ర.)

జేకలమెకము. వై. వి. కేసరి, సింహము. "సీ...జడ మెకంబదలింపు నడుముసొంపు." చెన్న. ౪, ఆ ౨౬౭. అచ్చ. బాల. ౪౭.

జేకలసికదేవర. ద్వ. వి (జడలు+సిక+దేవర) ధూర్జటి, శివుడు. "క. సిరిమగడు జకలసికదేవర యంక్ రాయంచవారువపుబోదును జెచ్చెర నడ్డగింపఁ బూనిన, దురమున రాగవుడు నిన్నుఁ దునిమెదుఁ జుమ్మీ." అచ్చ. సుం. ౫౪.

జేడి. యుం. దే.వి. (క. జడి.) 1. విడువక కురియువాన, ముసురు; "సీ. వాన యనంగను వర్షాఖ్య యగు నది విడువక పట్టిన జడి యనఁ దగు." ఆం. భా. ప్ర. ౭౫. "సీ. ఎం డుండుగురి వెంకపందిల్లు పూఁదేనెజడి యిందు శిలలందు జాలువాఱు." మను. ౪, ఆ. ౭౮. ఆము. ౪, ఆ. ౯౬; 2. వాన ధార. "సీ. నిచ్చలం బైన తేనియవానజడి సొంపు లాలికదానధారాళి గాఁగ." రాఘవ. ౨,ఆ. ౫; 3. అంతు, కోలాహలము. "గీ. తడయ కప్పుడు నలి వెంటఁ దవిలి నడువ, నమరుబృంహిత హేషిత ఘుమఘుమితభ, జాసమాస్ఫాలితంబుల జడికి నడికి, కలకుధరమండలము గలగుండు వడియె."పరు. ౨,ఆ. ౧౫౨. 4 బాధ. "మ...వృథాలాపప్రబంధోక్తులక్ జడిపెట్టంబని లేదు..." కాశీ. ౪, ఆ. ౫౦; 5. వాన. "సీ. చెవులు చిందఱవోవఁ జెలఁగుకపీంద్రుల పోరంటి మాశనివారపుజడి." కళా. ౭, ఆ ౧౯. విణ. నిరంతరము, దట్టము "మ. ఎడపెట్టైనను లేక వెక్కుడినముల్ హేరాలమై వర్షముల్, జడిగాఁ బట్టి తటాలనంగ వెలిచెన్..."పారి. ౨, ఆ. ౨౫. "మ. కడఁక న్రేచలిగట్టుపట్టిఁ దను వేడ్కం గూర్పనే తెంచివై, జడిగాఁ జుక్కలతూపు లేయ ..."పారి. ౨, ఆ ౪౪.

జేడిగాడ్పు. ద్వ. వి. (జేడి+గాడ్పు) ప్రచండ వాయువు, గట్టిగా విసరుగాలి. (బ్రౌ.)

జేడిగొను. ద్వ. అ. క్రి. (జడి+కొను.) 1. అతిశయించు, ముమ్మరించు. "చ...మీ,యెడ నని శంబుఁ బెన్పగయం నీమను రోషము సెమ్మనంబులో, జడిగొని యుండు..."నృసిం. ౨ ఆ ౧౩౫. "సీ. నగవు చెక్కుల నండఁ దగువజ్రతాటంకచామీకరద్యుతుల్ జడిగొనంగ." గంధ ౧౪౭; 2. ఎడతెగకయుండు, నిరంతరమగు. "చ. జడిగొని సమ్మదాశ్రుకణజాలము లొల్కఁగ రోమహర్షముల్, బడిబడి మేనఁ బొడుకొన భక్తినివేశతరంగితాత్ముఁడై ..."పారి. 3. ఆ ౫. దశా. ౨, ఆ ౨౦౦; 3. ఎడములేక యుండు, దట్టమగు. "ద్వి. శాఖామృగేంద్రులందు జడిగొన్నదాని, శాఖలలో డాగి చదురుఁ డై యుండె." రం. రా. సుం. ౭౪౭ పు. ౨౧ పం; 4 సంక్షోభించు, గుంపుగూడు. 'ద్వి. జడిగొని నరు లెల్ల బుడపుట్టవోవ." బస. పు. ౭, ఆ. ౯౧౦ పం.

జడిగొలుపు. ద్వ. స. క్రి. (జడిగొను ధా. ప్రే.) జడిగొనఁజేయు. "చ...నభోగళదిద్యులు పుష్పవర్షముల్, జడిగొలుపన్..."వరాహ. ౧౧, ఆ. ౧౧౩. రూ. జేడిగొల్పు.

జేడిపట్టు. ద్వ అ క్రి. (జడి+పట్టు) 1. ముసురుపట్టు. "సీ ముయ్యేడువాసరంబు లకాలవర్షంబు జడి పట్టి కురియఁ బర్జన్యుఁ బనిచి." వార. ౧, ఆ. ౧౦. "వ...కుసుమవర్షంబులు విడువక జడిపట్టి కురియ..."వీర. 3, ఆ. ౧౦౫; 2. పట్టు పట్టు. "(దూతలక్షణము) క. తడఁబడక తప్పు లాడక, జడిపట్టక పరుసుగాక సభ్యులు మెచ్చన్, గడుసుక్కక యొగ పెక్కక, నడుకక మాటాడవల యు నాగరకుండై." సకలనీతిసమ్మతము. ౩౬౯. వి. జడిపట్టుట. "గీ. అఖిలతృణలతాతరుశిచయంబుఁ జీడ, పట్టె నిట్టలంబుగ జడిపట్టుపొంటె." హరి. పూ. ౭. ఆ. ౧౬౦ రూ. జడిపట్టు.

జేడిపించు. దే. స. క్రి. భయపెట్టు. "ద్వి. జాతినీల పురంగు జడిపించుకురులు." ద్వి. హరిశ్చ. ఉ. ౩౩౯. పం.

జేడిపెట్టు. ద్వ. స. క్రి. బాధపెట్టు; కాలక్షేపము చేయు. "ద్వి. కర మర్థి నినుఁ దాన గావలె నను-చుఁ, బరితాప మొందంగఁ బరిహరించినను, ధర నాడుకోల నీకుఁ దగులదా యనుచు, విడువక జడిపెట్ట విసిగి యల్లమసుం, నొడఁబడ్డలాగున నొకమాట పలికె." ప్రభు. ౨. ౩౨. పు. ౧. ౧౮. రూ. జడిపెట్టు. "మ. అడుగ న్నిన్న వరంబు వేగమ యమాల్యాజార విచ్చేయు నాకుమురా జార్థవిభూషణుండు వర మీ నున్నాఁడు యా ప్తా

దృశు, ల్బడుగుల్ వాంఛిత మీ సమర్థతె వృథా లాభప్రబంధంబులన్, జడిపెట్టన్ బరి లేదు మిన్నక తపశ్చర్యా విరోధంబు గాన్." కాశీ. ౪. ౫౦.

జడియు. దే. అ. క్రి. 1. భయపడు, భీతిల్లు. "ద్వి. జడిసి యూరక యుండె సాధ్వి కౌసల్య. కొడుకు తెంపునకు మిక్కుట మైనవగల." రం. రా. అయో. ౧౦౧. పొ. ౧౭. పం. "ఆ. అంతినళికె వెఱచె నదరె దద్దఱె దద్దఱిల్లె జడిసెను నంగ జల్లు భయముం, జెందె ననుట కాఖ్య..." ఆం. భా. కృ. ౯౨; 2. చలించు, కదలు; వడఁకు "సీ. పవనవేగవిశీర్ణపావపాగ్రంబుల జడియు కుండ గం బట్టుసామజములు." ఉ. హరి. ౨, ఆ. ౧౯౯. "ద్వి. ముదితలయెడ నున్నముదివర్పుఁ డైన,జడియక యొట్టుండుఁ జర్చింప వహ్ని,కడ నున్న యావెన్న కరగఁ కేలుండు" ద్వి. పరమ ౨, ఆ ౬౩. పొ. (మనశ్చాంచల్యము నొందక అని భావము.) "సీ...చనుఁగవ వ్రేఁగున జడియు కౌను" కాళ. ౧, ఆ. ౪౭; 3. చెదరిపడు, రాలు. "వ...మౌక్తికంబులు జడియం బయోధరంబు లంటుచున్..." వసు. ౨, ఆ. ౧౪౦; 4. తొలఁగు, తొలఁగిపోవు. "క...కుక్కపనుపు వెనుకనున్, జడిసెఁ గబళింపనొల్లక..." భార. శాం. 3, ఆ. ౫౦౮; 5. దట్టమగు. "సీ. జవ్వాది వాసనల్ జడియంగ నుడియంగ సారంగధరుఁడని చేరఁ బోవు." సా. 3. ఆ ౨3౭; 6. స్రుక్కు. "చ. పడమటిగాలివెట్ట నొకపాటియుఁ గ్రోలమి నీరసంబులై, జడిసిన చిల్వగుంపుకొకసారియుం గ్రింగమి సొమ్మసిల్లి స్రుస్సడినకుతాని నొల్లని దణాయనికిన్..."శుక. 3, ఆ ౪౪౭. (శ.ర.పా.) 7. మ్రోఁగు, ధ్వనిచేయు. "చ. సొలసి తటిల్లతాంగి జిగిచూపు వెలుంగులచేఁ గలధ్వనుల్, గలకంఠులన్ గదిమి గాటపుసెమ్మి నటింప హంసకంబులు జడియన్...అరిగెఁ జారుఘనవ్రతిసీర చెంతకున్." వసు. 3, ఆ. ౬౭; 8. వర్షించు. "తే. విరిసె తొల్లిటిదళములు విరులుజడిసె." ఆము. ౫, ఆ. ౧3౦. స. క్రి. 1. తొలఁగించు. "గీ...నంద నులుఁ దాముఁ, గనఁగ నే లేరఁ బ్రతిహారజనులు వేత్ర, కలితులై పొరులను నెడ గలంగజడియ." భాగ. ౧౦ స్కం. ఉ. ౬౭౫. "చ...చెక్కులంటి గూడిన చూర్ణకుంతలా, వళి నగళంబుగా జడిసి వాడిన సెజ్జలమీఁది ప్రావిరుల్, తొలఁగఁ బ్రభాతవాయువులు తోఁచుఁ బురిన్ బరిచారికాళ్ళితిన్.' పాండు. ౧, ఆ. ౧౯౯. కాశీ. ౪, ఆ. ౨౯౪. ప్రబోధ ౨ ఆ.౨౯; 2. కుకున్నంతమైన 'దొలఁగు' ధాతువునకు అను ప్రయుక్తమై ప్రేరణార్థమునిచ్చును. "క. కౌరవపతియనుజన్ముల, దూరమునన్ విశిఖనిహతిఁ దొలఁగ జడియించున్." భార. విరా. ౫. ఆ.3౯౭.(శ. ర.) "వ ..ఇయ్యాలి హాసంబుతాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి యీ పుట్టినకలంకం దొలంగ జడిసి శమంబున సుఖవి గమ్ము..." భార. అను. ౪౨; 3. నివారించు, అడ్డగించు. "క. విరవున ధృష్టద్యుమ్నుని, శరనికరం బెల్లఁ బలకజడియించుఁ గిరణ, స్ఫురణాతిభీషణంబై, కరవాలము మెఱయఁ జిత్రగతులం గవిసెన్." భార. భీష్మ. ౨. ౯3; 4. త్రిప్పు, భ్రమింపఁజేయు. "స్రగ్ధర. గాండీవజ్యారవం బుక్కుట మఱి పెలుచం గ్రమ్మరం భీమబాహా,దండాశేహారి కుంభద్గన జడియుంచు రౌద్రంబుగాఁ దోఁచినన్...చాపుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టులిక్క మూర్ఛిల్ల కుండన్." భార. ఉద్యో. ౧,ఆ.3౭3; 5. కొట్టు. "వ...పరిఘంబుల మొత్తుచు ముసలంబుల వ్రేయుచు ముద్గరంబులం జడియించుచు ముష్టివలయంబుల ఘట్టించుచు..." భాగ. ౮. స్కం. 33౪.

జడివాన. దే. వి. (జడి+వాన) దట్టమైనవాన. "గీ. కారుమబ్బులం జడివాన గడఁగి కురియుం, బగిది నంపఱ కోఁతులపైని గురిసె." అచ్చ. యుద్ధ. 3౭3. "ద్వి. క్రొవ్విరిజడివాన కుంభినిఁ గురిసె." రం. రా. బాల. ౫౧ పొ. ౧౬ పం. అచ్చ. సుం. ౧౯౯.

జడుపు. దే. వి. భయము. "సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు..." ఉదిల యటన నధ్భుతి యగు..." ఆం. భా. ప్ర. ౧33. 'సీ. శ్రీవైష్ణవులం నిరీక్షించరా తిరుమణిఁ దుడిపింతు రన్నట్టిజడుపు మాని." వైజ. 3, ఆ. ౬౫.

జడ్డ. వై. వి. కీడు, కష్టము, బాధ. "ఉ...అవ సానపువేళల దండధారుచే, జడ్డలెకాని మేలు కొనసాగ దయో తలపోసి చూచినన్, బిడ్డలు లేనివానికి..." వి. పు. ౫, ఆ. ౧౦౨. వి. (క. జడ్డ.) పాల్లుతో కూడినపాల్లు. "క. గురువులు నిడుదలు జ డ్డక్కరముల బొట్టులపిఱుందకడ నూదినయక్కరములు..." కవిజ. సంజ్ఞా. ౧౩. "ఆ. ఒక్కపదములోనఁ బెక్కువిశ్రమములు, జరుగుచోట మొదట జడ్డ లున్న, నడుగు పెడలు దశక నందొక్కటియె కాని, యుండ దొకటి నదియుం నొకట నిదియుం." అప్ప. 3, ఆ. ౧౧౧. అప్ప. ౨, ఆ. 3 3౮. ఆం. భా. ద్వి. ౧౮౮.

జడ్డన. దే. క్రి. విశే. ద్రు. తటాలున, శీఘ్రముగా. "క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకమున నునిచి చన్నులతుదిఁ బా, లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా." భాగ. ౧. స్కం. ౨౬౦. "క. జడ్డనఁ గావలివా రల, యొడ్డు గడచి పురిటిసాల యొత్యున పెడలెన్." భాగ. ౧౦ పూ. ౧౪౦.

జడ్డి. దే. వి. నడుమ బరువును కట్టి ఇద్దఱు మనుష్యులు మోసికొనిపోవుట కుపయోగించు పొడుగైన కఱ్ఱ. (బ్రా.)

జడ్డిగము. వై. వి. 1. విత్తనములు చల్లుటకై మూఁడు రంధ్రములు పొడిచి పెదగొట్టిమీఁద నమర్చెడు పిడుత, బీజావాపమున కుపయోగించుయంత్రవిశేషము. "గీ...యంత్రికసామధేయంబు జడ్డిగ మన విలసిల్లుచుండును గాలకంఠ." ఆం. భా. ద్వి. ౨3౨; 2. తల, శిరస్సు. (మనము-శ. ర.) "క. అడ్డము వోయినమాత్రుల, జడ్డిగములు ద్రుంచె..." ఉ. రా. 3, ఆ. ౨3౭.

జడ్డిపెట్టె. ద్వ. వి. (జడ్డి+పెట్టె) జడ్డికి కట్టిన పెద్ద పెట్టె. (బ్రా.)

జడ్డియాఁటె. ద్వ. వి. (జడ్డి+ఈఁటె) నడుమను పిడి గలయాఁటె. (బ్రా.)

జడ్డు = జేద్దు. వై. విశే. జడము, తెలివి లేనిది. "శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభోభాగంబుపైఁ జేద్పడం, గాలం దన్నుట యెక్కడేల పసుచుల్ గల్గాడి రీజడ్డుఁబు, ల్కేటాకంబున నైనఁ జెప్పఁబడునో..." భాగ. ౧౦ స్కం. పూ. ౨౪౭; వి. 1. జడను, అలసత, మాంద్యము. "ద్వి. దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది, జడ్డు వాపినఁ గొల్వ చాలు నా కనుచు." ద్వి. పారిశ్చ. ఉ. ౧౫౦౪ పం. "గీ. జాణతనమునఁ జేతులజడ్డు విడిచి, నలువ యీకొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు." భాగ. ౮, స్కం. ౨౬౬. 2. కష్టము, బాధ. "క. దుడ్డెలం రా కటఁ మసలిరి, జడ్డున నున్నా రటంచుఁ జనుదెంచి గురుం,డు..." కుచేల. ౨, ఆ. ౯౧. "గీ. చూఁడిపాఁడివిధంబులు చూపలేని, గొడ్డుటావైన పలవనిజడ్డు గాదె." సా. పంచ. ౧, ఆ. ౫౧. హంస. ౧, ఆ. ౨౧౪; 3. తగులము, అనుబంధము. "ఉ. ఏపరమేశుపాదయుగ మెవ్వఁడు కోరి భజించి శర్వరుల్, లోపలిబుద్ధితో నుభయలోకములందుల జడ్డుః బాసి యే,తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే, సాపరమేశు మ్రొక్కెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్." భాగ. ౨. స్కం. ౬౧; 4. పారవశ్యము; 5. జోలి. "గీ. బిడ్డపాపలఁగని పెంచు జడ్డులేక." హంస. ౧, ఆ. ౧౨౬.

జడ్డుఁదనము. వై. వి. (జడ్డు+తనము-స్వార్థమున.) మాంద్యము, జడత్వము. "ఆ. సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి యిల్లాలి విడిచి బహుబలాలి విడిచి, రాజు హృదయ మిడియె రాజీవనయనుపై, ధనము విడిచి జడ్డుఁదనము విడిచి." భాగ. ౨, స్కం. ౫3.

జడ్డువడు. వై. అ. క్రి. (జడ్డు+పడు) 1. జడత నొందు, అలసత నొందు. "ద్వి. సుడిపడక యెగురక సొలయక జడ్డువడక వెన్నుతక తప్పక జారువోక." పండితా. దీక్షా. ౬౧ పు; 2. పారవశ్యము నొందు. "క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకమున నునిచి చన్నులతుదిఁ బా,లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిసి రక్షిజలముల ననఘా." భాగ. ౧, స్కం. ౨౬౦.

జత. వై. వి.(క. జతె.త. సట్టై.)1. జంట, యుగ్మము. "సీ...కొనగోటిజత లేడికొదమఁ బూని." పార. ౫. ఆ. ౫౫; 2. సామ్యము, తుల. "క. జతలేని పూఁపు గల్గుట, కలివలపైఁ బెల్లు రేఁగి యలజడి మీఱ, స్వేత పెట్టుదువె యింక సీ,బ్రతుకు బదుల్లాను నాలిపయ్యెరకుట్టా." నీలా. 3, ఆ. ౨౪;

త్రోవ. "ద్వి. పాండవంబులు డేగపదువు నమ్మీఁద. దేరి కాలంజాడఁ ద్రిమ్మరుచుండు, దానిపైత్రోవ గృధ్రము తేఁగ సేర్చు." రం. రా. కిష్కిం. (శ. ర.) "ఆ... మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సరవి, చను నడవ చొప్పు జాడ డొంక యనఁగ, బొలుచుచుండు..." ఆం. భా. ద్వి ౧; 4. అడుగులగుఱుతు. "క. ఇచ్చోట మందగొన్నవి, యిచ్చోఁ బాసితవి జాడ యిదె యనుచున్." భాగ. ౧౦. పూ. ౫౦౪. "వ... కావళ్లడపగలజాడఁ గొని..." ఆము. ౪, ఆ. ౫౩. 5. సైఁగ. (శ. ర.) విణ. యుక్తము. యోగ్యము, మాదిరి. "గీ. కడవమీఁదను మఱి సన్నెకంటిమీఁద, జక్కి మీఁదను గూర్చుండ జాడ గాదు." కాశీ. ౨, ఆ. ౭౫. "గీ... నీకు, జాడయే చేడియల చేఁచఁ జందమామ. సీలా. 3, ఆ. ౨౨; 6. చోటు, ప్రదేశము. "క. ఓక పట్టిస్తంభోదవ, యేకుల మేజాడదాన వెవ్వరి సుతవు..." భాగ. 3, స్కం. ౭౩౧; 7. దిక్కు, వైపు. "ఉ. ఈనిశితాస్త్రపాతమున నిక్కటిఁ జంపుదు నంచు వాశవ్రిత్రి, జ్ఞానియమంబునన్ వెనుక జాడగ గూడఁగ వచ్చుచుండగన్." పార. ౭, ఆ. ౫౧. 8. వార్త, వృత్తాంతము. 9. ప్రవర్తనము, నడవడి. "శా. నీజాడల్ గని యోర్చుకోఁ దగునఁటే నీలాహిపేణీ రుహా, రాజస్త్రీజన మీవగల్వినిన నౌరా యంచు నిస్సత్తురే." శుక. ౧, ఆ. ౨౨౧; 10. కష్టము. పాటు. "క. ఈజగమంత నుం నేలెను, రాజవు నీ కేల దైన్యరస మీవిరహా, వ్యాజమున నిను నలంపుచు, నీజాడలఁ బెట్టెదైవ మే మన వచ్చున్." వి. పు. ౬, ఆ. ౯౭.

జాడకాఁడు. దే. విణ. 1. త్రోవగు రెఱిఁగినవాఁడు. "సీ... మార్గజ్ఞన జ్ఞ యాఁజొప్పరి జాడకాఁడు, నా..." ఆం. భా. ద్వి. ౧౯౯; 2. గుఱుతు లెఱిఁగినవాఁడు. "సీ. పవవిజ్ఞుఁ డెసఁగుఁ జొప్పరి జాడకాఁ డన..." ఆం. భా. ద్వి. ౨౧౬.

జాడపడు. దే. అ. క్రి. (జాడలు+పడు.) విరళమగు కలుచు లేని దగు. "సీ. కలితదివ్యాంగనాకరతల చాతుర్యచామీకరశ్రేణి జాడపడఁగ." భాగ. ౬, స్కం. ౨౬౦. రూ. జాడలుపడు. "సీ. తరు మారిఁ దప్పక నొఱుంగఁ జిక్కి జొంపము లేవి జాడలువడియెఁ బొవలం." హరి. పూ. ౬, ఆ. ౫.

జాడా. దే. క్రి. విణ. (హిం. ఝాడా.) పూర్తియైనది, ముగిసినది. సమూలము.

జాడాచేయు. స్వా. స. క్రి. పూర్తిచేయు, ముగించు, నాశనము చేయు.

జాడి = జాడీ, ఒకదినుసుమట్టిపాత్రము. (శ. ర.)

జాడించు. దే. రూ. స. క్రి. ఝాళించు. (క. ఝాడిసు. త. ము. చాను.) 1. విదుల్చు, దులుపు; ఆడించు. "ద్వి... బ్రహ్మముడి విడిచి, జాడించి సీమంతసరణి తేర్పడఁగఁ, గూడ సువ్వును జాఱుకొప్పు గీలించి." ద్వి. పరమ. ౪, ఆ. ౨౯౪. ప. "సీ. రిక్కరిక్కనఁ దోఁకఁ ద్రిప్పి జాడించుచు ఖురపుటంబులఁ దల గోఁకుకొనుచు." హరిశ్చ ౨, ఆ. ౪౯; 2. కొట్టు. "సీ. బలభేదిఁ బట్టి దుర్బలునిగాఁ జాడించి పావకుఁ బెనుసుంటుపాలు సేసి." వై. 3, ఆ. ౫౨; 3. గుడ్డలు నీళ్లలో వేసి అటు నిటు పొర్లించి యెత్తు. (శ. ర.); 4. చీవాట్లు పెట్టు "ద్వి. సామాన్యరోగుల జాడించిపలుక, నీమాట లెక్కడ నిలువవు నొవలి, కన్ను దెఱచి తేని కాలు లోకంబు." ప్రభు. 3, ఆ. ౧౬. పు. ౧. పం; 5. పోఁగొట్టుకొను. "ద్వి. చావుపుట్టువులను జాడింపలేరు, చావుపుట్టువులను సమయింప కున్న, శ్రీగురుకృప యేల శివుఁ గొల్వ నేల." ప్రభు. 3. ఆ. ౭3. పు. ౧3. పం.

జాడింపు. దే. వి. (జాడించు. ధా.) జాడించుట.

జాడీ దే. వి. = జాడి. ఊరుఁగాయలు మున్నగునవి వేసియుంచుట కై యుపయోగించు నొకవిధమగు మట్టిపాత్రము. "ద్వి. చిట్టులు మట్టులుఁ జిక్కముల్ వెన్న, చట్టులుఁ దొట్టులుఁ జల్దిజాడీలు." ఆ. మ. క. ౧. ఆ. ౪౫. పు. ౨౦. పం.

జాడు. దే. వి. క్షీణసస్యము, పండక యేపుగా పెరిఁగినజొన్నకఱ్ఱ. "సీ... జాడసంగను క్షీణ సస్యంబు దగును..." ఆం. భా. ద్వి. ౨3౭.

జాణ. వై. విణ. (సం. చణః. క. జాణ.) 1. నేర్పరి, సమర్థురాలు. "గీ. జాణ జగశెట్టి దేవయచామి సెట్టి." హర. పీఠి. ౨౫. "సీ. వటగ యం చనఁగ నేర్పరి యన తప రన దంటయా జాణ నాఁ దగు సమర్థుఁడు..." ఆం. భా. తృ. 3; 2. విటుఁడు.

"గీ...విరులఁ గానుకగాఁ జల్లు,నగవుఁబుజలంబె జాణల మరులుకొల్పు." ఆశ్వ. ౨ ఆ. ౨౧; 3. రసికుఁడు, రసజ్ఞుఁడు. "గీ...మంచిపసపంచు మెసంగు, జాణలను నూడిపడుటలు నవియ కావె" సీతా. ౨, ఆ. ౩౧. (ఇటజాణ:-రుపెవినిఁగార తమ్యముతెలిసికొనినవాఁడు అని భావము.) నెఱజాణ = మిగుల నేర్పు గలవాఁడు. "గీ. మే... నెఱజాణ యెటులైన మెచ్చ వచ్చు, నను చు జెయిలోనఁ జెయి వేసి వనిత నగెను." దశా. ౭. ఆ. ౧౪౮.

జాణఁడు. వై. విశే. 1. చతురుఁడు; సమర్థుఁడు. "మ...జాణండు నీభర్త..." నైష. ౮, ఆ. ౭౧. "క. అని కనలి మాల్యవంతునిఁ, జను జాణఁడ వౌదునీతిశాస్త్రమునకు నీకును నెంత దూర మనుచున్, దనుజేంద్రుఁడు వీడుకొలిపె దర్పోద్ధతుఁడై." రామా. ౭, ఆ. ౨౩౬; 2. రసికుఁడు. "చ...మనోభవునిపట్టము గట్టి కొనంగఁ జాలుజాణని మగనిం గవుంగిట నసారతమునం గొని యాడు నెచ్చెలీ." ఉ. హరి. ౫, ఆ. ౭౫.

జాణతనము. వై. వి. 1. నేర్పు, చాతుర్యము. "గీ. నలువ రేవురు సంగడీ లెలమితోడఁ, జోఁకలాకులు నొడివోనఁ బోసికొనుచు, జాణతనమున నట్టహాసములు నోలయఁ, బెద్ద రేఁగుచుఁ గొలువఁగా వచ్చె నొకడు." ద్వి. ౧౦, ఆ ౮౩. "గీ. సకలలోకోపకారసంచారులైన, సాధుజనుల వంచించుట జాణతనమె" విక్ర. 3, ఆ. ౧౧౧; 2. ప్రౌఢిమ. "క. అని విటుల జాణతనమున నపహసించె." ఉ. రా. ౧, ఆ ౭౨. ఇ. చతురోక్తులు. "గీ దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురముపనిలోకి నేఁడు ముద్దుగ నటంచుఁ, దలఁచునంతటిలో జాణతనము లాడి, లోఁబఱచి వానిఁ దోడ్తెచ్చె లోలనయన." హంస. ౪, ఆ. ౪౮.

జాణెత. వై. విశే. (జాణ+ఎత. స్వార్థమున.) ప్రౌఢురాలు. "క ఇరుసెవి యెఱుఁగక యుండం, దరుణీ సుఖ మనుభవింపఁ దలఁచినఁ బదివేవుర కన్నులెదుటఁ బడిలిని, నరివారెల్లిదము చేయు జాణెత నమ్మిన్." ఉ. హరి. ౫, ఆ. ౧౯౬.

జాతర. వై. వి. (సం. యాత్రా.) 1. దైవతయాత్ర, దేవత తీర్థము పర్వతము సముద్రము మున్నగు వానిం గూర్చి చేసెడి ప్రయాణము. "గీ. తగును దైవతయాత్ర జాతరఁ యన భువ." ఆం. భా. ద్వి. ౨౧౯. ఉ. జాతర సేయఁగావలయుం సర్వజనంబులు సంబరాలకున్, బ్రాఁకి భక్తితోడ..." భార. మూ. ౨౪; 2 శక్తికిఁ జేసెడి యుత్సవవిశేషము. "గీ. పరఁగుఁ బల్లెను పండుగ పండు వరఁగ, నుత్సవము తద్విశేషంబు లొప్పఁ దేవ, తంతు సాకము నంపు జాతర కొలువు వన." ఆం. భా. ప్ర. ౧౪౩ "క. నేలపరుకము లాడుచు, జాతర సేసెదము భక్తి చాతురి తోడన్." భాగ. ౧౦, స్కం. పూ. ౮౨౯. "గీ. చిగురువిలుకానిజాతర సేయఁ బూని, కొలము సాముల నందఱఁ గూడఁబెట్టి." పారి. ౨, ఆ. ౪౮; 3. అల్లరి.

జాతరగాఁడు. వై. విశే. జాతరచేయువాఁడు, శక్త్యుత్సవాదులు చేయువాఁడు. "సీ. సారాయి నీళ్లకు జాతరగాండ్లకు బంగుభాయీలకు బందెలకును. గీ. లోభితనమున నేడ్చెడి ద్రాబ వాని, కడన వీడ్లకె కాక సత్కవుల కగునె." వేణు. ౪. ౮౮.

జాత్ర = జాతర. (ప్రయాణము.) "ద్వి. హరి వాక్యమునకు మా తాడంగ వెఱచి, యరుసించి గోవర్ధనాద్రికి జాత్ర, చాటించి యందఱు సదనంబులందుఁ, బాటించి వస్తుసంపద ప్రేమ మిగుల." ద్వి. సిం. భాగ. ౨, స్కం. ౩౧. పు.

జాదర. దే. వి. గందవొడి.

జాదరాడు. దే. క్రి. గందవొడి చల్లుచు క్రీడించు. "ద్వి. పోలయుంతుమ్మెదలఁ బుప్పొడి జాదరాడి, చలువపూనీట వసంతంబు చల్లి." ద్వి. పరమ. ౪, ఆ. ౩౧౬. పా.

జాది. వై. వి. (సం. జాతిః. జాజి,లత; జాతి పుష్పము. "ఉ. జాదులు మాదులంచుఁ దెలిచేవ్రలు చిల్వ లటంచుఁ గప్పురన్, వేదులు వేదులంచు..." అహ. ౨, ఆ. ౮౫.

జాదిలి. దే. వి. బుడుబుడుక్కలవాఁడు (శ. ర.)

జాదు. వై. వి. (క. జాదు = ఎఱుపు. (హిం., హైరి కాదిధాతువు. "గీ...జాజు జాదు నాఁగను

"...గాగ్ను. ఘాతనామంబు..." ఆం. భా. ద్వి. ౯౨ దే. వి. (సం. జాతిక.) పుట్టుట, కలుగుట. (చూ. జాదుకొను.)

జాదుకొను. దే. అ. క్రి. (జాదు+కొను) 1 ఉద్భవించు, కలుగు. "సీ. జడిగొన్న చెకిల్వలజగను తోడనుగూడ జకను నెన్నడలను జాదుకొన గ." విక్ర. ౧ ఆ. ౧౬౬. విక్ర. ౧. ఆ. ౧౨౨, ౧౫౭. భార. అను. ౪, ఆ. ౩౯౦; 2. పొంద్రమగు, దట్టమగు. "గీ. అర్థి యను పేరు చెవి సోకినంతమాత్ర, జాదుకొం బులకించె సజ్జ విభుండు." శైవ. ౩, ఆ. ౪౯.

జాదుర = జాజర. వై. అన్య. ఒకవిధ మగుగీతమున నుపయోగించెడి పదము. (దీనిని 'జాదుర జాదుర' యనుపల్లవితో పాడెదరు.) "ఉ. జాదుర జాదురంచు మృదుచర్చరిగీతులు వారుణీరసా, స్వాదను దాలిరేకములం జంద్రిక గాయంగ దక్షవాటికా, వేదికలమీందటన్ గనకవీణలు మీటుచుం బాడి రచ్చరల్, మోద మెలర్పంగా భువన మోహన విగ్రహు భీమనాథునిన్." భీమ. ౫, ఆ. ౧౦౨. (సర్వలక్షణసారసంగ్రహపాఠము—'జాదురజాదురంబు,' అని ముద్రి. శ. ర. పాఠములు.)

జాదులువేయు. వై. స. క్రి. మృదువస్త్రముల కఠిన కార్యమునకు నుపయోగించుట. "చ. సరవి యెఱుంగలే కకట జాదులువేసెను మంగలంబునన్." పి. శకుం. ౨, ఆ. ౬౨.

జాన. దే. వి. ఫలవృక్షవిశేషము. "సీ...జానపండులు గంగరేగుపండ్లు..." కాళ. ౩, ఆ ౬౯.

జానకి. దే. వి. కర్ణాటకపుతుపాకులచెవియందుంచెడి నిప్పు మట్టించుత్రాడు. (శ. ర.)

జానకిత్రాడు. దే. వి. (జానకి+త్రాడు) 1. జానకి. "సీ. జానకిత్రాళ్లం గృశానుకీలలం జేర్చి కేల నూందిన తుపాకీలబారు." రంగా. ౧, ఆ. ౧౫౭. "సీ. చెకుముకిముగ్గి జానకిత్రాటిమీందంగుఱుల్ గొలిలితునది యొలగొలుపమాంక." కుచేల. ౨, ఆ. ౧౨౭; 2. బాణసంచు కాల్చుట కుపయోగించు నిప్పుత్రాడు. (వా.)

జానము. దే. వి. గట్టిఘనకల్లముక్రింద వేసెడియాస్తరణము. (బ్రౌ.) జీను. "శా. వక్షల్లులుక్క... డాలిజానమును గట్టి నత్రాణకేల్లుల్లసిలన్." హరిశ్చం. ౪ ఆ. ౨౦ 'గీ. క్రొత్తమల్లెపూం దలిరు... సాం... మెసంగ మెసంగుసుత్త ... గొనితెచ్చె ... " ఉ. రా. ౭, ఆ. ౩౯౭. కుచేల. ౨, ఆ. ౧౨౧. ఆం. భా. ద్వి. ౧౯౯.

జాను. దే. వి. 1 సొగసు, సౌందర్యము, అందము. "గీ. జాను తెలుఁగున చానయును మేనమామ, కుంతుడును..." సిం. ౨, ఆ. ౧౩; 2. ఒక్క శోభ. "ద్వి...బసవనదండనాయకుని, జానొందం మత్ప్రభుస్వామిం గాంచి." పండితా. దీక్షా. ౧ పు 3. విధము. "ద్వి. మాటలం బిబ్బిల్లు మధురంబు దలంచు, పరసంబులాడెడిజాను దలంచు." పండితా. పురా. ౧౨౩ పు. విశే. 1. సొంపులము, మనోహరము; సుందరము, అందమైనది. "సీ. చొక్కము రసము చొక్కటము రాణ చొక్కటము నాణెము చొక్క. గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటంబన వెలయుం బొంకులసమాఖ్య." ఆం. భా. తృ. ౧౪. "గీ. పల్కుననుబోండి జానగుపల్కు లిడుచుం, గనికరం బెచ్చ మము నిచ్చం గాచుం గాత." అచ్చ. బాల. ౬; 2. స్పష్టము. "చ...ఈ ఖగము జానుగ నన్ను నెఱింగె..." భార. అను. ౧, ఆ. ౧౫౫. "చ. సరళము గాంగ భావములు జానుందెనుంగున నింపుపెంపుతోం, బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల..." కు. సం. ౧, ఆ. ౩౫; "ద్వి. ఉభయగద్యపద్యోక్తులం గాక, పరసమై పరంగిన జానుందెనుంగు, చర్చింపంగా సర్వసామాన్యమగుట." బస. పు. ౧. ఆ ౯౧ పం. 3. అధికము. "ఉ. మానవులార రోగములు మానుడు లేములు లేవుసంపదల్, జానగు దుఃఖము ల్బోలగు జాతి నభుంబులు...లిప్తికథకతి గొల్వండీ దరా, ధీనులుగాక మీరు వసుదేవకుమారకు ముక్తికోసమై." అప్ప ౪, ఆ. ౧౩౪.

జానుగు. దే. వి. కర్ణము, చెవి. "క. వీను లనం జెవు లనంగా, జానుగు లన నామధేయములు శ్రవణంబులకున్." ఆం. సం. మాన. ౧౯.

జానుపడు. దే. అ. క్రి. (జాను+పడు.) స్పష్టపడు, తెల్లమగు. "ఉ...న, న్నీనలినాప్తుఁ డీయనిలుఁ డీమృగలాంఛనుఁ డీసురోత్తముల్, జానుపడంగ నీక్షణము చంపరె కోపపరీతచిత్తులై." భార. ఆర. ౨, ఆ ౨౧౪. (శ. ర. పా. 'జానుసెడంగ' ముద్రితము.)

జానువాఱు. దే. అ. క్రి. (జాను+పాఱు) జానుపడు. "ఆ. కాలచక్ర మెఱుఁగఁగ లేక యొప్పను. సంధ్యజపము సేయుఁ జానువాఱ. సంధ్య జపము లేని జాడ లె ట్లుండును..." వేమన. ౨, భా. ౪౧౦.

జాపత్తిరి. వై. వి. (జాజి+పత్తిరి) జాజిపత్త్రము. (శ. ర.) రూ. జాపత్రి.

జాపత్రి. వై. వి. (జాజి+పత్రి) జాజిపత్త్రము. "సీ. జాపత్త్రి యనఁగను జాజిపత్త్ర మొప్పు..." ఆం. భా. ద్వి. ౧౬౧.

జాపిరము. దే. వి. జాగు, ఆలస్యము. "క. జాపిరము లేక యిప్పుడు, కేళ్ళులతో గొల్లసుతులఁ గృష్ణుని దొరలన్, గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపు రక్కసుఁడు నేలఁ బడియుండె నృపా." భాగ. ౧౦. స్కం. పూ. ౪౬౫.

జాప్యము దే. వి. (క. జాప్య = సోమరి) జాగు, ఆలస్యము. (శ. ర. వా.)

జాఫరా. దే. వి. కుంకుమపువ్వు. "సీ. బాణాసనప బాణతూణీరములు దాల్చి యందంపుజాఫరా గంధ మలఁది." సిం. నార శ. ౭౬.

జాబిలి. దే. వి. చంద్రుఁడు. రూ. జాబిల్లి. "చ...చందు జాబిలి చలివెల్గు చందురుఁడు వెన్నెల రాయఁడు చందమామ..." ఆం భా. ప్ర. ౭౭. చంద్రికా. ౪, ఆ ౧౧౫ ఇది సమాసాంతమున ప్రయుక్తమై శ్రేష్ఠార్థక మగును.) "గీ. వెలయ నిరుదచ్చిరాచజాబిలులలోన,మిక్కుటం బగుతేజాన మెఱసినాఁడ." అచ్చ. బాల. ౨౦౧.

జాబిలిగుబ్బలి. దే. వి. చంద్రగిరి. "సీ...రొక్కపు టొడయని, కడ, జని ద్రోణ వనగ్గటుల జాబిలి గుబ్బలియందును మౌత్తి..." అచ్చ. యు. ౪౦౩.

జాబిలితాల్పు. దే. వి. శివుఁడు. "సీ. ఇనుమునఁ గానించి యెఱిఁగి జాబిలితాల్పుఁ దగఁ గొల్చ నజ్జడదారితుటుము." యయా. ౨, ఆ. ౪౩. రూ. జాబిలితాలుపు.

జాబిలివిదిండి. దే. వి. రాహువు. "క. జాలి లేవ యియ్యాఁ లూగఁగ, నలరున్ జపయుఁ మొగంబు నవ్వక మియున్ జా, బిలివిదిండిదగాల నెల కున్, కుందుల వెదకకును గదిమిత్రో ...ండురకిన్." ...యా. ౪, ఆ. ౨౨.

జాబిలివైరి. దే. వి. రాహువు. "తరల. పలుఁదెఱం గుల బోవుచందురుఁ బట్టు నక్షిటి కన్నియై, యెలిగి పె వెఱవెంట నేఁగెఱుఁగట్టి జాబిలివైర రన్, బకె జక ల్గడు నీటఁ దేలుచుఁ బైపయిం జను నేరఁగా, నిలువటీ తల వచ్చుగొమ్ములనెమ్మిగ గమ్ము జొల్పగున్.' యమా. ౩, ఆ. ౬౯.

జాబిలిరా. దే వి. చంద్రకాంతము "ఉ. మేలిక డానిడాల్ వహోయలుం మీాఱెడు జాబిలి రాల మేడలో, కేలుపు తేఁటు నల్వయాను వెన్నుఁడు గొల్వఁగ మంచుగొండరా, చూలిగూడి వేడు కలఁ జొక్కెడులే నెలతాల్పుఁ గొల్చునన్." నీలా. ౧, ఆ. ౧.

జాబిలిరిక్క. ద్వ. వి మృగశీర్షనక్షత్రము. (శ. ర.)

జాబిల్లి దే. వి. (జాను+బిల్లిక-జాను=ఆహ్లాదకరము. బిల్లిక=బింబము-శ. ర) 1. చంద్రుఁడు. "శా. ఆజాబిల్లి వెలుంగుగల్లికల డాయన్ లేక రాకాని శా, రాజశ్రీ సగ మైన మోమునఁ బటాగ్రంబో త్తియె గ్రత్త యా,రాజీవానన యేడ్చె..." వసు ౪, ఆ. ౫౨; 2. సమాసమం దుత్తరపదమైన శ్రేష్ఠవాచక మగును. "క. జనవరసురేంద్రు కడకు,జనఁ జూపినఁ జూచి చెలుల జాబిల్లి యనున్." కుమా. ౨, ఆ. ౪; 3. బాలక్రీడా విశేషము. "సీ. దూఁటియు జాబిల్లి బూఁచి కన్నుల కచ్చి గుడుగుడుగుంచాలు కుందెనగిరి." హంస. ౩, ఆ. ౧౪౬; ౫, ఆ. ౧౫౫.

జాబిల్లిరా. దే. వి. చంద్రకాంతమణి. 'వ... ఆబొబ్బఁటి జాబిల్లిరాగోడలం బ్రతిఫలించు నిజ వదనబింబంబు లనేకశశిబింబంబులు గాఁ దలంచి..." మృ. వి. ౨, ఆ. ౧౪. రూ. జాబిలిరా.

జాబు. దే. వి. (క. జాబు) 1. కమ్మ, పత్త్రిక. 2. తావికట్టినచందనపుచెక్కపొడి. "గీ. తావికట్టిన

(జుట్టుముడి, మొ.) విడిపోవు. "సీ. చెదఱిన యలకలచిక్కు చక్కఁగఁ దీర్చి జాఱిన కనయంబు సవరించి." విక్ర. ౧, ఆ. ౧౫౪. 3. (నీరు, మొ.) స్రవించు, కాఱు, ఓడు; కాఱి పడు. "ఉ...నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం జేర్చి బుజ్జగించి నునుఁజెక్కులఁ జాలుకొనంగ జాఱుకన్నీరు కరంబులం దుడిచి..." పారి. ౧, ఆ. ౧౩౪; 5. (కాలము) కడచు, గతించు. "ఉ. రాతిరి యెల్ల జాఱినను రాగముతోడఁ గుముద్వతీరతిన్, బ్రీతి భజించి..." నృసిం. 3, ఆ. ౧౦౯; 6. వెడలు, పాఱిపోవు. "మ...మదానేకప్రచ్ఛటలోదంబులఁ బడ్డయట్టు తమ ముల్ జాఱెన్ బిలశ్రేణికిన్." వసు. ౪, ఆ. ౧౯. "సీ. మనజాలవల్లిక మఱచి వచ్చితిఁ గొంచుఁ జనుదెంతు నది యంచు జాఱె నొకతె." కళా. ౭, ఆ. ౧౪౯; "వ...వెన్ను చూపి జాఱక..." విక్ర. ౪, ఆ. ౯౯; 7. తొలఁగు. "క. వేఱొరికిఁ జని యుటు కై,దాఱుదినంబులకు వత్తు నద్దివసము లొర్న్నఱునుమీఁ నీసంగతి, జాఱుట నా కనిన యోష సంతోషమునన్." వేం. పంచ. 3, ఆ. ౬౯౯; 8. నశించు. "గీ. జడిసి విరహిణి వగఁ గూరె జారచోర, దర్పణంబులు జాఱె రవికరతాప మాఱె" మను. 3, ఆ ౬3; 9. తప్పు, చెడు. "సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ నీక పదమైత్రి యర్థసంపదలఁ బొదల." ప్రభా. ౬, ఆ. 3; 10. వదలు. "ఉ...పైఁబడినపోతరపుంగిటి నొక్క కేలున, న్నోరట బిగ్గఁ బట్టి దృఢముష్టిహతి న్వడి నొంపఁ జూచి కే, ల్జాఱుటఁ బాఱె నమ్మెకము జాగిల ముల్ వెస వెంట నంటఁగన్." శుక. ౧, ఆ. ౧౭౯. వి. = జాఱుడు. 1. గళనము. "సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జా అన గళనంబు దనరును..." ఆం. భా. ప్ర. ౧౪3; 2 తొలఁగుట; వంగుట. "గీ. నోరె నొకకొంత వడి యోర జాఱు లేక, తుములవిశ్రాంతి త్రాసునఁ దూఁచినట్లు." సుద. ౫, ఆ. ౪౭. (రెండర్థములకు నిదే యుదాహరణము) విశే. 1. బిగుతు కానిది, వదులయినది. "ద్వి. సారంగచర్మంబు జాఱుగాఁ గప్పి." ద్వి. హరిశ్చ. పూ. ౬౬. పం. 2. చిక్కనకానిది, పలుచనిది; 3. క్రిందికి వ్రాలునది, వ్రేలాడునది. "గీ. జాఱుబొజ్జ..." హర. ౭, ఆ. ౧౬.

జాఱుఁగొప్పు. దే. వి. (జాఱు+కొప్పు) చక్కఁగా దువ్వి వదులుగా ముడిచినకొప్పు. "క. నందనము వెడలి పయనపు,టందముగ జవాదిపూఁత లలఁది తొడవులుం, గుందనపుఁబంచు వగ జిలుఁగు, గుండెలిసాలువలు జాఱుఁగొప్పులు నొప్పన్." వాల్మీకి. 3, ఆ. ౭౯. రూ. జాఱుడుఁగొప్పు. "ద్వి. చలియించుచునది చొప్పు జాఱుడుగొప్పు." ద్వి. సా. 3. భా. (శ. ర.)

జాఱుఁబైఁట. దే. వి. (జాఱు+పైఁట.) జాఱెడు పైఁట. "క. కొడు మెత్తుకొఱకు గుడికిన్,నడచు న్వొలపడుచు నాభినామమునం గ్రొ,మ్ముడి సొరుగ మడిచేఱు, న్వడి జాఱుంబైఁట వింత వగఁ గనుపింపన్." శుక. 3, ఆ. ౧౭.

జాఱుచే. దే. స. క్రి. (జాఱు ధా. ప్రే.) జాఱఁజేయు, జాఱించు, స్వస్థానమునుండి కదల్చు. "సీ. బలి చూడ గబ్బిగుబ్బలమీఁదిపయ్యెద జాఱిచి గ్రక్కునఁ జక్కఁ జేర్చు." దశా. ౬, ఆ. 303.

జాఱుడు. దే. వి. (జాఱు. ధా.) "సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జా అన గళనంబు దనరును..." ఆం. భా. ప్ర. ౧౪3.

జాఱుపు. దే. వి. (జాఱు. ధా.) 1. జాఱుట, గళనము. "సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జా అన గళనంబు దనరును..." ఆం. భా. ప్ర. ౧౪3. (జాఱువు. బ్రా. పా.) 2. కొండచఱి. (శ. ర.)

జాఱుపాటు. (జాఱు+పాటు.)ద్వ. వి. 1. స్ఖలనము. 2. స్ఖాలిత్యము. "ఉ. ఎయ్యెడ మేలె చూతురు గ్రహింపరు జాణలు జాఱుపాటులన్." విజ. ౧, ఆ. ౧౦౭. (ఇది రెండర్థములకు నుదాహరణము.) విజ. ౧, ఆ. ౧౭౬.

జాఱుముడి. దే. వి. వదులుముడి. (వ్యతి. పీఁటముడి, గట్టిముడి.) (వ్యవ.) అది జాఱుముడియే గాని పీఁటముడి గాదు.

జాటువాటు. ద్వ. వి. (జాటు+పాటు.) 1. జాటుము, గళరవము. "సీ. గవ్వసెరల్ సవరించి కవపిణె లారి తంత్రుల దీటి మతి బిరడలు బిగించి, యమునాకమున రాగమురవుర సారిక గా శ్రుతుల లొనగూర్చి కరివె నివిరి.జాటువాటుగ నొక్కసారి మీటి యొకింత జాటినసారెలు చక్క నొత్తి." సమీర. ౬, ఆ. ౨౦౦; 2. నెమ్మది. "వ...అచ్చెంతకు చేరి జాటువాటుగా నోరమోములఁ దెలిసు వేఁడి." ప్రబోధ. ౭౮. 3. స్ఖాలిత్యము, ప్రమాదపతితదోషము.

జాటువాటు. దే. అ. క్రి. (జాటు+పాటు - స్వార్థము.) 1. చ్యుత మగు. "గీ. ధవళకిరణుంను చరమదిక్తటము వెంట, నల్లనల్లన దిగజాఱె వెల్ల నగుచు, సురతపరవశ భేదరీవిరళ చికుర, భారమున జాటువాటుపూబంతినోలె." కవిక. ౪, ఆ. ౧౮౩. 2. వెడలు. "గీ. వైద్యుఁ బిలిచెద నని జాటువాఱె నోర్తు." కృ. శకుం. 3, ఆ. ౫౩; 3. తొలఁగు. "సీ. నాతోడఁజిసిద లైననుఁ బిన్నఁ బెద్దగా నవరించు మీ చూపు జాటువాఱె" ఉ. హరి. ౫. ఆ. ౯౨.

జాటువోవు. దే. అ. క్రి. తొలఁగు. "ద్వి. సుడివడ కెగరక సోలయక జడ్డువడక వెన్నడక తప్పక జాటువోక." పండితా. దీక్షా. ౬౧. పు.

జాల. వై. వి. (సం. జాలమ్) 1. చేఁపలను బట్టెడి వల (శ. ర.) 2. కిటికీ. (చూ. జాలకట్టు.) విణ. జాలసదృశము. "సీ. వల యన జాలంబు వరఁగు జాల యనంగఁ దనరుచునుండుఁ దత్సదృశ సంజ్ఞ." ఆం. భా. ప్ర. ౧౯౯; 3 పద్మకము, ఏనుఁగు మొగమందలి బొట్టునమూహము. "గీ... జాల, బొగరు శౌడ యనఁ బద్మము ల్దగును..." ఆం. భా. ద్వి. ౧౯౪; 4. ఈఁటె. (చూ. జాలవాఁడు.) 5. ఒకానొకచెట్టు. "వ...రేఁగుల గోఁగుల రేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల నిరుగుల నెమ్మల జమ్మల..." వి. శకుం. ౨, ఆ. ౧౪.

జాలంచలవిడిది. ద్వ. వి. దేవగంగ. "సీ. సతతవసుల టెంకిజాలంచలవిడిది ... "గీ. ... వినువాక వెల్లి వాకనఁగ గంగ వెలయుఁ." వేం. ఆం. ౧౯.

జాలకట్టు. ద్వ. వి. (జాల. + కట్టు.) 1. వల్లెత్రాటి యందు బెజ్జము లేర్పఱచి యందు విడకిటికి. (శ. ర.) వెలుతురు ప్రసరించుటకు రాతిలోఁ జేసిన బెజ్జము. (బ్రౌ.) "ద్వి. సొరిగిఁ జేసినపాల సున్నంపుమిద్దె,జాలు రాలుగారు జాలకట్టులను." (విజలింగచిక్కయచరిత్రము. శ. ర.) 2. నిలువుగా కట్టులు నాటిన కిటికీ. (వా.)

జాలకాఁడు. = యం. దే. విణ. (జాల+కాఁడు) అలస్యము చేయువాఁడు. వై. వి. 1. చేఁపలను బట్టువాఁడు. (శ. ర.) 2. లూత, సాలెపురుగు. "సీ...జాలకాఁడు చెలఁది నస్నుపిల్లి, పాదొట్టునఁగలూత పరఁగు .." ఆం. భా. ద్వి. ౧౭.

జాలము. దే. వి. జాగు, అలస్యము. "ఎ. గీ. కలికి రాయంచబోదల కలికి యంలికి, యంలికి వల మానపవమానగళితమాన, దళితనూనసలీల నేఁ దాళఁ జాల, జాల మింది యేల లోలవిశాలనయన." శశాం. ౪, ఆ. ౧౪.

జాలరి. వై. వి. (జాల+అరి) కైవర్తుఁడు, పల్లెవాఁడు "క...అంత వేమఱ, కాటులు జాలరులు సొచ్చి క్రందుకొనంగన్." భార. శాం. 3, ఆ. ౧౯౨. "ఉ...కందపుఁగొండగాడ్పుచే, వల్లిక బిల్లికల్ దనరు నామిడిమామిడిక్రింద భూమిభృల్లఁజుల్లఁ డల్లజాలరివిధంబునఁ బొంచి హరించె డెందమున్." కృ. శకుం. ౨, ఆ. ౨౨౦; 2. జల గడుగువాఁడు. "గీ. జలగడుగువాఁడు వెలయును జాలరి యన." ఆం. భా. ద్వి. ౨౮౫.

జాలరు. వై. వి. (హిం. ఝాలర్) గొడుగు మొదలగువాని కొనచుట్టు వ్రేలెడుజల్లి లోనగునది. "ద్వి. వై నొప్పుచందువాపటము నల్గడలఁ, జానలు నవరించుజాలరుల్ మెఱయ." ద్వి. సా. 3. భా. (శ. ర.)

జాలవల్లిక. ద్వ. వి. (జాల + వల్లిక) చిత్రపుపని చేసిన తమలపాకుల తట్ట. "క. అప్పుడు తాంబూలంబులు, గప్పురమును జాలవల్లికలఁ బడఁతులచే, నిప్పించె బంధుకోటికి, నప్పద్మదళాయతాక్షుఁ డంతట సరిసెన్." పారి. ౨, ఆ. ౨౧. "సీ. జాలవల్లికలు ముత్యాలజాలీలు పెట్టింజామరలు పట్టివేళ్ల సురఁటి." రసిక. ౫, ఆ. ౧౪౮. "సీ. తాంబూలపాత్రంబు కంచనంగను గంపెయం

చనఁగను గుంపె యనఁగ, జాలవల్లిక యనఁగను ..." ఆం. భా. ద్వి. ౧౬౬.

**జాలవాఁడు.** ద్వ. విశే. ఈఁటెవాఁడు. (బ్రా.) "ద్వి. జాలవారిని దివ్వటీలను బల్ల, గోలలవారిని గుడి పూజరులను, నొడిసెలకాండ్రను నోజులవారి ..." బస. పు. ౩. అ. ౫౧౦ పం.

**జాలారి.** దే. వి. హింస్రశీ. (శ. ర.) నల్లకుప్పి.

**జాలి.** దే. వి. దుఃఖము, శోకము. "క. ఈలోకము దుఃఖబహుళ, మాలోకము భూరిసుఖనిరంతర మం దే, జాలియును లేక యుండొరు, తో లెస్సగఁ బొంది యుండుదురు జను లనఘా." భార. శాం. ౪, అ. ౧౭౧. "మ. అని నమ్రాననుఁడైన దైత్యపతిఁ బల్కాలించి నీకేల జా, లిని జెందంగ నితా జనాపజయముల్లేవా..." దశా. ౫, అ. ౭. ఆం. భా. ప్ర. ౧౩౫; 2. మనస్సంబంధి ఖేదము. "క. చేదప్పిన కార్యములకు, వేదనఁ బొందుదురె జాలివిడువు మిఁక మఱి, ఖేదము విధి దప్పింపం, గాఁదర మే నీకుఁ గామిని చెపుమా." ఉ. రా. ౪, అ. ౧౦౫; 3. వేదన, తాపము. "క. ఈలా మంచముఁ బట్టుక, చాలా జాలిం దపించె శతమఖుఁడు..." దశా. ౭, అ. ౫౯; 4. కష్టము, శ్రమ, బాధ. "ఆ. సంజయుండు దపమునఁ జాలికిఁ జాలి, వర్తిల్లుచున్నవాఁడె ధీరచిత్తుఁ, డు..." భార. ఆశ్ర. ౨, అ. ౫౫. "క. పాడు గలవాఁడు మన కోక, జాలి యిడక తానె తార సానకు వచ్చెన్, వేళయిదె లెమ్ము నృప..." ఆము. ౩, అ. ౩౭; 5. భయము, భీతి. "సీ. జాలినొందుచు నెత్తఁ జాలక వచ్చుచో మనక మండలువు లక్కడనె చిక్క." దశా. ౧, అ. ౧౭౮. ఆం. భా. ప్ర. ౧౩౩. 6. వాంఛ, కోరిక. "మత్తకోకిల. జాలి దక్కి మతాంతరాళ విశాలవేదులయందుఁ గో, నాలఁగొందిఁ దపంబు సల్పుజనంబు తాల్మలు దూలఁ ద, ద్బాలికాపుల నిస్తులస్తనపాళికామృగనాభివా, తూలికాహతిఁ బక్వకాల్మలితూలికాశకలాకృతిన్." పాండు. ౫, అ. ౨౯౬; 7. విచారము. "క. అజాలి యేల నిర్మల, బీజహావిస్తృతమేను ప్రీతి నొనర్పం, గా..." భార. ఆశ్వ. ౪, అ. ౨౬౭.

**జాలించు.** దే. స. క్రి. జాలిపడు. "మ. సముఖానన్ గాడుఁ గాని, యొరులన్ జాలింపఁడు....." మల్హభూ. ౪౯.

**జాలిఁబడు.** ద్వ. అ. క్రి. (జాలిన్+పడు) 1. దుఃఖపడు, విచారపడు. "క. మే లర్థింపను గీడును, జాలింబడి తోలఁగఁ ద్రోవఁ దరి తూష్ణీంభా, వాలంబనమ్మునఁ దశై, యాలంబుగఁ జేసి నడతు రయ్యిరు దెఱఁగున్." భార. శాం. ౪, అ. ౫౯; 2. కష్టపడు, శ్రమపడు. "క...అధర్మకర్మంబున ని, ట్లేలా యీ సౌగతులను, జాలిఁబఱచె దిట్టి వెందుఁ జను నే యనినన్." పరమ. ౫, అ. ౬౩; 3. తాపమొందు. "క. ఆలీలావతి తంత్రీ, పాలుఁడు దినదినము మందపాలై తిరుగన్, జాలిఁబడి మనసుఁ బట్టం, జాలక పరపురుషభోగ సంగతిఁ గోరెన్." శుక. ౨, అ. ౯౫౩; 4. ఇష్టపడు, కోరు. 'క. కాలము సేరినమనుజుఁడు, బాలిశచిత్తంబుతో నపథ్యములఁ గొనఁ, జాలిఁ బడుఁ గాని తనకున్, మే లగుపథ్యములు గొనఁగ మెయికొనఁ డాత్మన్." భా. రా. అర. ౨, అ. ౧౭౧. "క. జాలిఁబడి విటుల వెదకఁగ, నేలం జెనె ..." భోజ రా. ౪, అ. ౧౪౬; 5. భయపడు. "గీ. నీకటాక్షోర్మివాక్సుధానీకమునకు, జాలిఁబడి గాదె యవి యీనజాలిఁ బడియె." వసు. ౩, అ. ౧౨౭.

**జాలిఁబెట్టు.** దే. స. క్రి. (జాలిన్+పెట్టు) కష్టపెట్టు, శ్రమపెట్టు. "ఉత్సాహము. శూలపాణి మమ్ముఁ గరుణఁ జూడు త్రిపురదానవుల్, జాలిఁ బెట్టుచున్నవా రసహ్యవిక్రమోద్ధతిన్." భీమ. ౪, అ. ౧౧౨. భార. ఉద్యో. ౩, అ. ౪౫.

**జాలిఁబొందు.** దే. అ. క్రి. (జాలిన్+పొందు) భయపడు. "శా. గోలాంగూలకులంబు లాకులపడెన్ ఘోషించె శార్దూలముల్, జాలిం బొందె లులాయముల్ సుడిగొనెన్ సారంగముల్...తాలాంకావరజుండు మందరమహాధాత్రీధరం బెత్తి నన్." హర. ౬, అ. ౪౬.

**జాలిగుండె.** దే. వి. 1. కనికరముగల హృదయము; 2. అదురుగుండియ.

**జాలిగుడుచు.** దే. అ. క్రి. (జాలి+కుడుచు) దుఃఖపడు. "క. ఊళలు పెట్టంగా డా, కాలన్ వడిఁ

దన్నుటయుం భుగాలున నోరం, బాలు వెదలు శాసరమయుం, జాలిగుడిచి మంచుఁగొండచక్కిఁ బోవన్." వరాహ. ౫, ఆ. ౬౮.

**జాలిగొను.** దే అ. క్రి. (జాలి+కొను.) 1. దుఃఖపడు, జాలిగుడుచు. (చూ. జాలిఁబడు.) "గీ. సాధ యీయుంలిఁ జాచిన నామనంబు, జాలి గొని యెదు మీపదాబ్జంబు లాన, వినఁ దగుదునేని తెల్పుము విశ్వమునను, మీ కెఱుంగని కార్య మేమియును లేదు." కవిరా. 3, ఆ. ౧౬౫; 2. భయపడు. "లయగ్రాహి. ప్రేలిరి మరుత్తు లెద జాలిగొని రాక్షసులు కా లుడిగి రుద్రు లవ లీలఁ బడి రార్తిన్." భాగ. ౬, స్కం. 3౮౫.

**జాలిమాలి.** దే. వి. (జాలి+మాలి) 1. వెఱపు, భయము. "క. వాలవలద్వహ్నిశిఖా, మాలిక వీక్షించి జాలిమాలిన్ సీతా, నాళీకవదన పెన పులు, నాలుకతుదఁ దడుపుకొనఁగ నగి నగచరుఁ డున్." రామా. ౭, ఆ. 3; 2. తాపము, వేదన. "ఉ...ము,వ్వంపులకై దువుం దిగిచి వంపుచుఁ దావులయంపసోన వర్షింపుచు జాలిమాలి గొనఁ జేసె మరుం డమరీకదంబమున్." కవిరా. 3, ఆ. ౪౫.

**జాలియ.** దే. వి. 1. జాలెడేగ, శ్యేనభేదము. రూ. జాలె. "గీ. సాళువముగిద్దు లగుడు వేసడము కురుజు, బాఁజ సెలకట్టె జాలియ బైరి యణంజు, నోరణంబును నాదిగాఁ బేరుపడిన, వేఁటడేగల గిఱికొనవిడిచి కడిమి." పారిజా. ౨, ఆ. ౨౨; 2. బొంగరపుత్రాడు. (శ ర.) 3. యజ్ఞము చేయం నపుడు సోమిదమ్మ తలపై నుంచుకొనువల. "సీ. ముఖలక్ష్మీభీతిఁ దమోవీథిఁ జొచ్చె నా జాలియ విరివేణి వ్రేలుచుండ." కు. సం. ౨, ఆ. ౧౬ కాశీ. ౨, ఆ. ౫౨. 4. (సం. జాలకమ్. క. జాలిగె. త. చాళిగై;) జాలెసంచి. "ద్వి. పట్టుపుట్టంబులుఁ బసిఁడిజాలియలు." ద్వి. పరమ. ౭, ఆ. ౪౯.

**జాలియము.** దే. వి. జాలెసంచి, రూపాయిలసంచి, వరాలసంచి.

**జాలీ.** దే. వి. (సం. ఝల్లరీ) గొడుగు మొదలగువాని కొనను వ్రేలాడుకుచ్చు. "సీ. చందువాముత్యాల జాలీలు చికిలిక్రొమ్మించుటద్దము లెనమించు తగటు." రసిక. ౧, ఆ. ౬౧. సా. 3, ఆ. ౧౪౮ 'జాలి' అనియుం ప్రయోగమొకటి చూపట్టుచున్నది.) "చ...అం,చగరులపావ్పు ము త్తియపు జాలిపరాళము ... దోమతెరమంచముపై హరి నిండువేడుకన్." ల. వి. ౫, ఆ. ౧౧౭.

**జాలు.** వై. వి. 1. ఏఱు, నది. "గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టునాలు, బిట్టుగ్రాలుపసిండి క్రొంబట్టుసేలు, మెట్ట జాలు మొగిల్ పస మెట్టఁ జాలు, నట్టిడాలును గలజగజెట్టి దలఁతు." అచ్చ. బాల. 3, చెన్న. 3, ఆ. 3౮. "సరసిజవృత్తము. కప్పుఁగఁదోలుక్ గొప్పనజాలుక్ గనువినుకుల నొడికములగు సరులన్." య. ౨, ఆ. ౪౬. 2. అల్పప్రవాహము; ప్రవాహము. "సీ. జక లఁగఁ దెలినీటిచదలేటిజా ల్వాఁటి జా నొంద వెలిబూది మేన నలఁది." నీలా. ౧, ఆ. ౧3. ఆం. భా. ప్ర. ౧౫౭. కు. సం. ౧౦. ఆ. ౨౭; మను. 3, ఆ. ౧3.

**జాలుకొను.** అ. క్రి. (జాలు+కొను.) 1. ప్రవహించు; కాఱు, స్రవించు. "చ. సతతము వాని తేనియలు జాలుకొనుక్ బహునిమ్నగాకృతిన్." వరాహ. ౧౦, ఆ. ౧3౦. "వ...మృణ్మయం బైనఘటంబున జలంబులు జాలుకొను తెఱంగున దినదినంబునకు నాయువు క్షయం బై..." భాగ. ౧౧. స్కం. ౧౦౯; 2. వర్ధిల్లు. "క. జాలుకొను పెంపుతోఁ దగ, నీలాగున దగవు నడిపి యింపు దలిర్పక్, లోలోన నలరుచుఁ దన యిల్లాలిం గని కుక్కుఁ డనియె నర్మిలితోడన్." య. ౪, ఆ. ౧౨౫; 3. ప్రసరించు, వ్యాపించు. "ఉ. ఆతనియాలు డీలుపడనట్టిమనోజునివాలు వాలు కం జాతముచాలు పూలుగలసంపఁగి కొమ్మలగీలు గ్రాలుము,క్తాతతిదాలుం మేలుకొనుకల్వలతావల మేలు జాళువా, జోతుఁజాలు జాలుకొను చూపులఁ జూపఱ నేలు ప్రోలునన్." శుక. ౨, ఆ. ౬3. రాజ. చ. 3, ఆ. ౪౦. చిత్రభా. ౫, ఆ. ౧౨.

**జాలువా.** దే. వి. బంగారు, సువర్ణము. "చ. పలు మఱు జాఁడవాసరిగెపయ్యెదకొంగు విదుర్ప..." దశా. ౨, ఆ. 3౧౭. రూ. జాళువా. చంద్రా. ౧, ఆ. ౯౭.

జాలువాఱు. ద్వి. అ. క్రి. (జాలు+పాఱు) 1. ప్రవహించు; కాఱు, స్రవించు. "సీ. కరుణా రసము వొంగి తొరఁగెడుచాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ." భార. విరా. ౧, ఆ. ౧౨. "సీ. ఎం దుండుగురివెంద పండిట్ల భూఁదేవజడి, యిందు శిలలందు జాలువాఱు." మను. ౪, ఆ. ౭౦. భీమ. ౨, ఆ. ౪౨; 2. ప్రసరించు, వ్యాపించు. "సీ. మిళితరాగా భోగ మృదుగల్లపాళిపై సమ్మదోద్రేకంబు జాలువాఱ." కావ్యా. 3, ఆ. 3౯.

జాలువు. దే. వి. = జాలు. ప్రవాహము (అగస్త్యుఁడు శ్రీరాముని) "వ...తూర్ణంబుగఁ గరంబుల నెత్తి భక్తితోడం గౌఁగిలించి యమ్మహామహానుసందర్శనాహ్లాదంబున జాలువు లగుబాష్పజలంబులం దడియుచుఁ బ్రహృష్టమానసుండై..." అధ్యా. అర. ౯౪. పు. (శ. ర. పా.)

జాలె. దే. వి. 1. ఒక జాతిడేగ, శ్యేనభేదము. రూ. జాలియ, జాలెము. "గీ.మృగయుం లంకటఁ దెచ్చిరి లగుడు గిద్దు,జాలె జలకట్టె కణుజు వేసడము బైరి, కురుజు వారిణ యను డేగకోలము సాళు, వములఁ బిలుపుకు వేఁటకు వచ్చువాని." వి. శకు. ౧, ఆ. ౧౧౦. "సీ. సాళ్వము జాలె వేసడము డేగ లగుడు బైరి కణసరంబు నోర ణంబు, జలకట్టె గిద్దు వెంచడ మన శ్యేనభేదములు..." ఆ. భా. ద్వి. ౯౦. 2. వలవంటి సాజెము లుంచు సంచి. "గీ...టంక, సాల వాటులు నించి యొంట్లానిఁ గట్టఁ, గాలసర్పము గతి వ్రేలుజాలెఁ జూచి." ఆము. ౬. ఆ. ౭౧. "క. జాలెలఁ బట్టింపుము పది,వేలు నయిదువేలు రెండువేలు నరయ నొ,న్నా లరి కుంతలునకు పనుపన్." జై. భా. ౭. ఆ. ౧౪; 3. బొంగరపు త్రాడు. "చ. కనకనగంబు బొమ్మరము గా భుజగేంద్రుఁడు జాలె గా సమ,ర్చిన గిరిపుత్రి గాంచి..." విక్ర. ౧, ఆ. ౨. ప్రబంధ. ౧౦౯.

జాలెత్తు. దే. అ. క్రి. (జాలు+ఎత్తు) జాలువాఱు, ప్రవహించు. "గీ. అంతిపురమున కరుగుచో నింతి తిరిగి, యోరగాఁ జూచినపుడు శృంగార రస మ,పారముగ నుబ్బి జాలెత్తి పార దాని, చలమనోహరలోచనాంచలము వెలసె." విజ. 3, ఆ. ౧౧.

జాలెత్రాడు. దే. వి. జెట్టియొక్క యుపకరణవిశేషము. "గీ. నుదరియొడ్డాణమె దట్టిచుట్టు గాఁగ, రాలయుం గరములు జాలెత్రాడు గాఁగ, మంచి యరగండవాడి మేనిమట్టి గా గఁ, జిత్తజాభుజాభుజి! జగజెట్టిఁ బోలె." పాంచా. ౫, ఆ. ౯. (శ. ర. పా.)

జాలెము. దే. వి. వలవంటిసాజెములసంచి. జాలియము. "గీ తాను నిల్లాలుఁగొమ్మయుఁ దనయ యుంగము, మొలల దీనారముఁజాలెములు వహించి, సాతుఁ గూడి చనంగఁ దస్కరులు దాఁకి, నలుగురం బట్టి ధన మెల్ల నొలిచి కొండ్రు." కాశీ. 2, ఆ. ౨౫౦

జాల్వా = జాలువా. "మ...విదేహవల్లభునిజాల్వా పెద్దమోసాలఁ జు,గన దంతీంద్రుల డిగ్గి..." దశా. ౨, ఆ. ౨౫౯.

జాళించు. దే. స. క్రి. జళిపించు, ఆడించు;విదుల్చు, దులుపు. రూ. జాడించు. "సీ. వానువదాళ్ళ తులం వ్రాసినకంచుటరిగలు జాళించురపళి చే డాలం మించ." వైజ. ౪, ఆ. ౭౦. "వ... ఒడలం జాళించి తూలించినఁ జాలించక ముంచుకొని ముందరం బిరిందివంకను వలపలం దాపలం బోనీక పొదివిన నతికి పిడికిటం బొడిచియు..." రామా. ౭. ఆ. ౧౪౫.

జాళియ. దే. వి. మండలభ్రమణము, గుండ్రముగా తిరుగుట.

జాళియము. దే. వి. = జాళెము.

జాళీలు. దే. వి. బ. వస్త్రభేదము. "సీ. జాళీలు చెఱఁగులు సామంతవిధులును గావులు దసిలీలు ఖండదరులు." భనా. 3, ఆ. 3౭.

జాళువా. దే. వి. బంగారము; అపరంజి, శుద్ధ మగుబంగారము. "సీ. జాళువాసొమ్ములు సరిగెదువ్వలుపలు హైమమాణిక్య సింహాసనములు." ఉ. రా. ౫, ఆ. ౬౯౭. "సీ. గిలుకు మెట్టెలదాలు చలువకుచ్చెలలపై జాలువాలం గారుసరిగఁ గూర్చ." దశా. ౨, ఆ. 3౫౦. "సీ...అలితుద్ధచామీకరాఖ్యలు చనుఁగ డాని,

"మేలిమి యపరంజి జాళువా కుందనం బుదిరి నా..." ఆం. భా. ద్వి. ౧౭౭. రూ. జాలువా.

జాళువాకంటితొలిపేల్వు. దే. వి. హిరణ్యాక్షుఁడు. "గీ. జాలువాకంటి తొలిపేల్వు నేలయెల్లఁ, గొంచు వినదారిఁబెంకి కేతెంచుచున్నఁ, బూని తొల్పందిగున్న వై వానిఁ జీటి, కోఱకొన మన్ను దాల్చవే కోరి నీవు." అచ్చ. బాల. ౧౫౩.

జాళువాకంటిరేద్రిమ్మరి. దే. వి. హిరణ్యాక్షుఁడు. "దండకము...నేల యెల్లం దగం గొంచుఁ బెంజిల్వ రాచెంకికిం బాఱునా జాళువాకంటి రేద్రిమ్మరిన్ జన్నపుంబంది వై త్రుమ్మవా .." సీలా. ౧, ఆ ౪౮.

జాళువాగుబ్బలి. దే. వి. (జాలువా+గుబ్బలి) మేరువు, బంగారుకొండ. "సీ. నెత్తంపురతనాల నిగ్గులగ్గలికల జాళువాగుబ్బలిఁ బోలు దాని." ఘటికా. ౧, ఆ. ౧౧౭.

జాళువాపఱపయ్య. దే. వి. (జాళువా+పఱపు+అయ్య.) హిరణ్యకశిపుఁడు. "సీ. జాళువాపఱపయ్యఁ జంపి యూపట్టికి మేలిచ్చు సామేని మొగము నొకటి." ప్రబంధ. ౧౬౨.

జాళువాబొమ్మ. దే. వి. బంగారపుబొమ్మ. "గీ. ఎమ్మె గల దిది జాళువబొమ్మ యేమొ." ఉ. రా. ౪, ఆ. ౧౮౭. "గీ. కమ్మవిల్కానిచేతిపూఁగొమ్మ ముద్దుగుమ్మ నిద్దంపుజాళువాబొమ్మ..." సీలా. ౧, ఆ. ౩౧.

జాళె=జాళియు. "ద్వి. పోరిఁబోరి నంతశంబున నియమించి, కరి జాళె సేయింపఁ గడఁగెడువాఁడు." రం. రా. యు. ౩౮౫, పు. ౧౭. పం.

జాళువావింటివాఁడు. దే. వి. (జాళువా+విల్లు+వాఁడు) మేరుధన్వుఁడు, శివుఁడు. 'మాలిని. జగములయొకిమీఁడా జాళువావింటివాఁడా." అచ్చ. కిష్కిం. ౧౦౭.

జాళెము. దే. వి. 1 అశ్వగతివిశేషము, రేచితము. "సీ...పేరెము వేడెకు జాళెము బవిరి నారేచితంబు వెలసిల్లు." ఆం. భా. ద్వి. ౧౯౦. 2. మండలభ్రమణము, గుండ్రముగాఁ దిరుగుట. "వ...అపసవ్యగతిన్ జాళెంబున వాయంబుఁ బోనిచ్చుచు..." మను. ౪, ఆ. ౧౧౫. (జాళెములుద్రిప్పు = జాళెములుగా గిరగిరఁ ద్రిప్పు. 'సీ...గద యమర్చి, తెఱవ జాళెంబులు ద్రిప్పుచుఁ బఱతెంచి గాండీవిపేరియుంగ్మములఁ జ.పి." జై. భా. ౫, ఆ. ౭౪.)

జాళ్వా. దే. వి. జాళువాయొక్క రూపాంతరము. "మ. వలకేల్ గ్రుచ్చి కవుంగిలించి జిగి జాళ్వా పెల్వపుగ్ నద్దు చెక్కిలి ముద్దాడుచు మిక్కుటంపుఁ దమి సౌఖ్యంగాంత కన్గోడ్పువన్..." దశా. 3, ఆ. ౧౧.

జావ. నై. వి. (సం. స్రావః) గంజి; నూకలు లోనగువానిఁ జేర్చి వలుచగా కాఁచిన యాహారపదార్థము. "సీ. నిస్రావసంజ్ఞ యై నెగడు జావ యనంగ..." ఆం. భా. ద్వి. ౨౫౦. "సీ. బహుఘాతుకుఁడు పెట్టుపాయసాన్నముకంటె సద్వర్తనుఁడు పోయు జావ మేలు." రామలిం. 3.

జావంకము. దే. వి. జయాంకము. "క. వేవిన యంకకు నలువురు, జావంకంబులను బోలె సైన్యము హానో, రావములతోఁడఁ జూడఁగ, దీపన వడయుంగఁ దూర్పు తెలతెలవాఱెన్." ఉ. హరి. 3, ఆ. ౧౪.

జావడము. దే. వి. 1. అస్థైర్యము. (తాలిమి లేమి.) "ఉ. కేవలయోధసేపరులకిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్, జావడ మైనఁ జూచి యిది చందము గా దని యంటిఁ గాక." భార. ఉద్యో. 3, ఆ. ౬౧; 2. పిఱికితనము. "వ... బ్రాహ్మణజాతి జావడమున మఱి నుండఁ గొంటుడు." కళా. ౧. ఆ. ౧౫౮. 3. గట్టుపుట్టు "వ...... పిలుకువాటుగోడికల జావడంబులకుం బుట్టి... బుదర కొవమత్తుపగుంపు..." ఆము. ౪, ఆ. ౩౫. క. లావు గలయద్దె గట్టుపు, జావడముల మీఁద మాత్ర సంచుఁబు దూలన్." ఆము. ౧, ఆ. ౯౬. (శ. ర. పా.) 4. శ్యేనభేదము. "ద్వి, జాతిడేగల మంచిజావడంబులను, సాళువంబుల మంచిజలకట్టియలను." ద్వి. హరిశ్చ. పూ. ౬౨౫. పం.

జావడి. దే. వి. (జావడము+ఇ) చాకలవాఁడు. "ద్వి. పరునింటనుండి యెప్పటియంను నింటి, కరుగుదెంచినయంతి నలుగక యేల,నే పెట్టిరాముఁడనే యని యొక్క జావడి యనుమాట చారులు చెప్పు." ద్వి. భాగ. శా. స్కం. (శ. ర.)

జౌవళము=జౌవడము. దే. వి. గుఱ్ఱపుకట్టు, అశ్వవిశేషము. (శ. ర.)

జౌవళి దే. వి. = జావళీ. గీతవిశేషము. (శ. ర.)

జౌవళీ=జౌవళి. (వ్యవ.) జావళీలు పాడుచున్నారు.

జౌవాహిరి = జవాహిరి. (హిం. జవాహిర్) రత్నపుసొమ్ము. (శ. ర.)

## ఝ

ఝం. దే. వి. 1. తావివీచుట మొదలగువాని యందగు ధ్వన్యనుకరణము. "సీ. తరళాక్షి నీమేనితావి ఝుమ్మున నాదు మనసుఝుమ్మనిరేఁగి మరులుఁగొందు." లావణ్యశ; 2. తుమ్మెదలు లోనగువవి మ్రోయుంట యం దగు ధ్వన్యనుకరణము. "ద్వి. ఝాలను ఝుమ్మని ఝాలయుం చుక్షికల." ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౭౭ పం. (ఈయర్థమునందు ఆమ్రేడితమున ఝుంఝుం.) "క. మదగజ దానామోదముఁ, గదలని తమకములఁ ద్రావికడుపులనిండన్, బొదలుచుఁ దుమ్మెద గొదమల, కదుపులు ఝుంఝుమ్మటంచు గానము చేసెన్." భాగ. ౮, స్కం. ౩౦. (అను శబ్దము పరమైనప్పుడు ఝం శబ్దముయొక్క అనుస్వారమునకు మకారాదేశము) వరాహ. ౯, ఆ. ౧౪౭. "సీ. గగనకల్లోలినీకనక పద్మములపైఁ దుమ్మెద వెగసి ఝం ఝుమ్మరనఁగ." హర. ౭, ఆ ౧౩౯.

ఝంజేము. దే. వి. 1. దీపావళిపండుగనాఁటిరాత్రి బాలురు కాల్చి త్రిప్పెడు తెల్లువిడవలి లోనగువానినిడుపాటిసన్నకట్టె. ఝంఝేఱుకట్టె, పంఝే (శ. ర.); 2. కాష్ఠదీపిక. "సీ. వనచరు ల్దవదహ్ని యనుఝంజములు సోఁకఁగరము లెత్తుచుఁ గొంచెపరుపువాఱె." కువల. ౧, ఆ. ౯౭. "సీ. ఝంజము దుందురు సురుడు దివ్వెనకోల యనఁగాష్ఠదీపికాహ్వయము చెలఁగు." ఆం. భా. ద్వి. ౧౬౭.

ఝంజామము = ఝంజేము. (శ. ర.)

ఝంఝాటించు. దే. అ. క్రి. (ఝంఝాటము+ఇంచు) ఝుంఝుఱుగా నగు, చెదరు. "వ. అప్పుడనిర్వారగర్వధామంబు లగునశ్వత్థామ చూడసార్వభౌమంబు లతిరూక్షవీక్షాపరంపరలఁ ఝుటిచుటం చూచి పవరఁ జుకొని ఝంఝాటించినమెడలు నిగుడించుకొని..." కువల. ౪, ఆ. ౨౦౯. "ద్వి. ముంజు గఖ్బలతుట్టముదుక వెండ్రుకలు, ఝుంఝాటింపఁగ వికుర్చ్యము ఝుళ్లు నుకుచు." ఆ. మ. శ. ౨. ౭౦ పు. ౨౦౮౯ పం.

ఝంఝాటము. దే. విశే. (క. ఝంఝుక) బింకిగానున్నది, చెదరినది. "సీ. కఱకులై సిటినటుఖుద ఝుంఝుఱుకలును గండెనచాపకాయుఖులును." గాశీ. ౩, ఆ. ౧౩౭. "(హంసవర్ణనము) సీ. తోడరు ఝంఝాటు మేనిమర్మ్మిశారంబునఁ బుఱఁగుఁజుట్టాలబిట్టులితుఁజేకుం." వై. ౨, ఆ. ౫. "చ. బలిసినహాల్లకచ్ఛటలపైఁ దకఝంఝాటముండ్లురాయఁగాఁ, గలమము లుండుఁబండి యొఱగంబడి..." ఆము. ౧, ఆ. ౬౯. (దీనికి కొన్నిచోట్ల ఉపర్ణలోపముగలదు. "సీ. ఝుంఝావెండ్రుక లెత్తిచుట్టికలేఁదీఁగ పన్నగాధీశ్వరుపగిది మెఱయ." విక్ర. ౨, ఆ. ౧౫౩. వి. 1. ఝంఝాటుకట్టె. (శ. ర.); 2. జుట్టు. "సీ...ఝంఝాటు సికజుట్టు చుంచనంగ, శిఖ యొప్ప..." ఆం. భా. ద్వి. ౧౪౬.

ఝంఝాటుకట్టె. దే. వి. (ఝంఝాటు+కట్టె) ఝంజేము, వెలుతురుపుల్లలు లోనగువానితో జేర్పఱచిన దివ్వటీ. (శ. ర.)

ఝంఝాటుపిశాచము. మి. వి. (ఝంఝాటు+పిశాచము) కొఱవిదయ్యము. "వ...తలపుట్టెలగుంజుం జుట్టుఁ గొఱకుఝంఝాటు పిశాచంబులను..." చంద్రా. ౬, ఆ. ౯౩.

ఝుంటితేనె. దే. వి. (ఝున్ను+తేనె) మధువిశేషము ఝుంటీఁగలు కూర్చినతేనె. "సీ. అలఁతిదంతంపుఁగాములపీలిసురఁటులు శోధించి పడిచిన ఝుంటితేనె." పి. శకుం. ౧, ఆ. ౯౭. "వ...ముసురుతేనెపూఁదేనె ఝుంటితేనె పుట్టతేనె పెరతేనె కణ్ణితేనె కురుజుతేనె..." ప్రబంధ. ౧౧౨.

ఝుంటిమోవి. దే. వి. (ఝున్ను+మోవి) తేనెవంటిమోవి. "గీ. సొగసుకాఁడెదఁ గదియించి ఝుంటిమోవి, గంటియొనరించి......" నీలా. ౩, ఆ. ౯౪.

ఝుంటీఁగ. దే. వి. (ఝున్ను+ఈఁగ) తేనెటీఁగ. "క. అజగరమును ఝుంటీఁగయుం, నిజగురువులు గాఁదలంచి నిశ్చింతుఁడనై, విజనస్థలిఁ గర్మంబుల, గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్." భాగ. ౭. స్కం. ౪౩౭. "సీ. మక్షిక యీఁగ నా మను

మధుమక్షిక తేనెఁగ జుంటీఁగఁజా నెసఁగు." ఆం. భా. ద్వి. ౯౫.

జేజేలు. దే. వి. గుబురు.

జేజేలుకొను. దే. అ. క్రి. గుబురుకొను. "ఎ. గీ. అస్థి చర్మావశేషావయవములందు, జేజేలుకొన్నత నూరుహస్తోమములవు." కాశీ. ౬, ఆ. ౪౧.

జేట్ట. దే. వి. చాఁపఁబడినబొట్టనవ్రేలి చూపుడు వ్రేలి నడిమికొలత, ప్రాదేశము. రూ. జేత్త. "సీ. లాడిత యం చనఁగను లాడితిలి యం చన జుట్ట యంచనఁగను జుత్త యనఁగఁ, బ్రాదేశ నామమై పరఁగు..." ఆం. భా. ద్వి. ౧౪౦. "సీ. ఇది గాలి కనిన మహాకవరాహాదనుజేంద్రు నైనజుట్టెంటిలో నాఁగఁ జాలు." మను. ౪, ఆ. ౩౧.

జేట్టనవ్రేలు. దే. వి. (త. చుట్టువిరల్. క. సుటుమెట్టు) తర్జని, జుత్తనవ్రేలు. "గీ...జుట్టనవ్రేలు జుట్ట. వ్రేలుజుత్తనవ్రేలనఁబోలు తర్జని..." ఆం. భా. ద్వి. ౧౩౯. "సీ...తొట్టినభీతిఁ జెవుల జుట్టున వ్రేళ్లుజొనిపికొనిరో." దశా. ౨, ఆ. ౫౫. వ... మేటిమగలం దెబ్బొని పీరుసు నాతమ్ములంను గలుగ నరులకు నిన్ను జుట్టనవ్రేలకుం జూపవచ్చునే... భార. ద్రో. ౨, ఆ ౩౦౪. "ఉ...వారలెల్, జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగవచ్చునె పార్థి వోత్తమా." భాగ. ౩. స్క. ౦. ౩౧.

జేట్టవ్రేలు = జేట్టనవ్రేలు. "సీ. జుట్టనవ్రేళ్లను రెండుఁ బట్టించి నడిపింపఁ దలఁకుచు రా లేమి బలిమిఁ దిగుచు." సా. ౩, ఆ. ౨౪౯. ఉత్సావ. జుట్టవ్రేల భూవరునకుఁ జూపి యేకతంబుగాన్ ..." కళా. ౨, ఆ. ౧౦౯. "సీ. తెలియఁ బ్రజాపతితీర్థంబు చిటికెన వ్రేలిమొదలు జుట్టవ్రేలి మొదలు, పితృతీర్థ మనఁజెల్లు..." విజ్ఞా. ఆచా. ౫౧, ప్రాయం. ౯౫.

జేట్టిలి. దే. వి. చాఁపఁబడిన బొట్టనవ్రేలి చూపుడు వ్రేలినడిమి కొలఁత, ప్రాదేశము. రూ. జేత్తిలి. (శ. ర.)

జేట్టు. వై. వి. (సం. చూడా. క. జుట్టు.) 1. శిఖ, సిగ. "సీ...జుంజురు సిక జుట్టు చుం చనంగ, శిఖ యొప్పు..." ఆం. భా. ద్వి. ౧౪౬. 2. నెమిలి కోడి మొ. వానిసిగ. "క. అరెలు వలములంఁ దొడలును, దోరము బలుమెడయుం జుట్టుఁ దుండము గుబురల్, బీరంబును నుర మును విస్తారి యగు న్నారికేళజాతికి నెందున్." దశకు. ౯, ఆ. ౩౧. ఆం. భా. ద్వి. ౯౬. 3. వెండ్రుకలు.

జేట్టుబులుఁగు. ద్వ. వి. (జేట్టు+పులుఁగు.) నెమిలి, శిఖావళము. "ఉ. మా యనుగుంజెలిన్ వెతపుమా యను వొప్పుఁ దుటారిబిల్కలేమా యను గండుఁదేఁటికొదమా యను నిద్దపు ముద్దుఁ జంవమా, మా యనుఁ జుట్టుఁ బుల్గుతుటుమా యను..." అచ్చ. అర. ౯౬.

జేట్టుగు. దే. వి. జేట్టుపు. "సీ. శుక్లార్క మూలంబు జుట్టుగు వేరును నెలమి పీడెమతోన నియ్యఁ వలయుం." చికి.

జేట్టునట్టువ. ద్వ. వి. నెమిలి, మయూరము.

జేట్టునట్టువతేజిజోదు. ద్వ. వి. మయూరవాహనుఁడు, కుమారస్వామి. "సీ. జుట్టునట్టువతేజి జోదుగాంచినదంట సగరులేఁగినవాఁటి యుగితి త్రోవ." యయా. ౨, ఆ. ౪౪.

జేట్టునట్టువపిట్ట. ద్వ. వి. (జుట్టు+నట్టువ+పిట్ట) నెమిలి. "వ...ఇంచుమొగులుండెగలని బెట్టుగా నామజుట్టునట్టువపిట్టలు కతిచిలువ తెఱవ లను తలంపు పెంపున జడలకోడియ..." యయా. ౪, ఆ. ౧౩.

జేట్టుపిట్ట. ద్వ. వి. నెమిలి, శిఖావళము. "వ... ముఖచాళిఁ బూని వారలపై ధారాధారలుం జూచ నర్తిప్తున జుట్టుపిట్టలాపుసెట్టెంపుదాలుపు బలగంబు స్వస్తికంబున నొడ్డుకొని..." ప్రబంధ. ౭౦౮.

జేట్టుపిట్టతాలుపు. ద్వ. వి. కుమారస్వామి. "ఆ. బొమ్ముఁగాఁడి పాఱకమ్ములచేసిన, సొమ్ముపోయి మేటికొమ్మ మెకపు, బిడుదు లోఁగిజుట్టు పిట్ట తాలుపువాలుఁ, గోలఁ గొంచగట్టుఁ బోటె వ్రాతె." అచ్చ. యుం. ౨౦౯.

జేట్టుపు = జేట్టుగు, దుట్టుపు, దుట్టుగు. దే. వి. అజశృంగి. "సీ. సమాదేని జుట్టుపు చలిపిండి చిటి మంటి పెన్నేరు విసబొద్ది పిండిదొండ." హంస. ౪, ఆ. ౧౦. ఆం. భా. ద్వి. ౬౧.

జేడు. దే. అ. క్రి. (క. జాఱుంగు. త. సుణఙ్గు.) రూ. జాఱుఁగు. 1. అపసరిల్లు, తప్పుకొను. "సీ.

కొడికి క్రమ్మఱఁ గాలు విడిచి పక్కఁ జూడుంగు జూడఁగి రాయమఱఁ బట్టి స్రుక్కఁ జేయుం." చంద్రా. ౨. ఆ. ౯౧. "ఆ. ఓరి తపశీకాఁడ యోఁడక మిగుల శాస్త్రకెగ్గు చేసితింక నెందుఁ దూఱఁ గలవు నలువ వచ్చి కావఁబూనిన నిన్ను, జూడఁగి పోవ నీక మడఁపువాఁడ." అచ్చ. యు. ౨౨౦. 2. డాఁగు. (చూ. జూనుఁగు) 3. వంచించు; వంచించిపోవు. "సీ. కాసు పీఠంబులం వాసిగా లంకించి జూడఁగి సెల్లాళ్లలో జోఁగఁ జేసి." చంద్ర. వి. ౧, ఆ. ౫౨; 4. వెనుదీయు. "క. కాదే వినుఁ డొక్కటి యుం, కాదేవిని గలది గలిగినట్టు తెలుపునీ, పైదే శీరము జాడఁగినఁ, గానని యడంగుమనుఁ డామె గట్టిగఁ దెలుపున్." శా. ౨ ఆ. ౨౮౨. వి. 1. వంచనము. "సీ... వంచన మొనంచు. గీ. జూమఁగు క్రుక్కి కిఁకుపికుక్కి జూజుఁగు మెఱుఁగు, డవఁగ..." ఆం. భా. ద్వి. ౭౯౨; 2. అపహారణము. దొంగతనము. (చూ. జూజుఁగు)

జాడఁగింతవెట్టు. దే. అ. క్రి. వెతుకలాగు. "ఉ. అందియ గల్లు గల్లన మదంఘ్రి గేలను బట్టి తాశిపై, నిందుకళాంతంచుఁ డిడ నే నగుచు జాణిఁగింతపెట్టు..." పార్వ. ౪, ఆ. ౧౧౮.

జాడుగు. దే. అ. క్రి. = జాడఁగు. 1. భయానులచే అడఁగుల్లు. "గీ. వదన జలజంబులకు మూఁగు పరమరాశి, శుకపికశిలీముఖాలికి జాణిఁగి జాణిఁగి, గఖుఖ పష్పౌఘచయ కేళిసఖపునపుడు." చాంద్రా. ౪, ఆ. ౧౯౯; 2. దాఁగు. "చ...వాఁడునుం, జాడఁగి పొంచి తూపడగ చోటెయిఁగంబడనీక మాయలన్." రామా. ౮, ఆ. ౧౪౩. 3 వెనుదీయు. "సీ. కలమాపు రెండుపుల్ గవయంపుఁ బాడుపుల్ మూఁచి వచ్చెదవంచు జాణిఁగినోర్తు." కృ. శతం. 3, ఆ. 33.

జుత్త = జెట్ట. "క. వ్రేలెఁడు నల్లెఁడు జుత్తెఁడు, నేల లెడ ల్గాఁగ నిలిచి నిర్జరమనుజ, వ్యాళపరులఁ ..." కళ. ౫, ఆ. ౮౧. ఆం. భా. ద్వి. ౧౪౧.

జుత్తనవ్రేలు = జుట్టనవ్రేలు చూపుడువ్రేలు. "గీ... జుట్టనవ్రేలు జుట్టవ్రేలు జుత్తనవ్రేలనఁబోలుఁ దర్జని..." ఆం. భా. ద్వి. ౧౮౯.

జెత్తిలి. దే. వి. = జెట్టిలి. ప్రాదేశము, చాఁపఁబడిన బొటనవ్రేలిచూపుడు వ్రేలినడిమికొలత. (శ. ర.)

జేనుఁగు. దే. అ. క్రి. = జేమఁగు. "సీ. మాట లొప్పఁగఁ జెప్ప మఱి యదేమనువేళ కవ్వల జూనుఁగు మాయూని యగుచు." వేం. మా. 3, ఆ. ౫౫. "వ... దొర పోతుల నీక్షించి రోసి యాభీలంబుగా నాలంబుఁ గావించి కాలు కాలుం బెనఁచికొని యలిం బడి పెనఁగుబలగంపు ప్రాంత పరివారంబునుం గని జునిఁగి యనీకంబులకు స్రుక్కి తృణానీకంబులు మెక్కి వల్మీకంబు లెక్కి చెయ్యెత్తి మ్రొక్కి..." రాజ. చ. ౫, ఆ. ౩౨.

జేనుఁగుటీఁత. దే. వి. (జేనుఁగు+ఈఁత) మునిఁగి యీఁదుట; దాఁగుడీఁత. "సీ. ఇంతులలో నెల్ల నెమరెక్క డన మించుజునుఁగుటీ తలకు నీచోర ఖుమత." చంద్రా. ౪, ఆ ౨౪౭.

జేపఁపు. దే. స. క్రి. (జేనుఁగు. ధా. ప్రే.) అపసరిల్లఁజేయు, త్రోలు, చోఁపు. "చ... మూఁగిన యీఁగలఁ జేతికొమ్మఁ బో, జూనుఁపుచు దీనిఁ గొందు వెలసొమ్మని యమ్ముచు నున్న వాఁడనన్." చెన్న. ౪, ఆ. ౩౩౮.

జున్ను. దే. వి. జౌ. 1. ఆవు గేదె మొదలగునవి యీనినరెండుమూఁడు దినములలో పిలికినపాలు బెల్లము పంచదార మున్నగునవి చేర్చి యావిరిమీఁద కాఁచఁగ నగుగడ్డ, జున్ను గడ్డ. "సీ. పెక్కు లాగులఁ గదంబించు జున్నుల తోడఁ జేరి దాకొన్న క్రొంబెరుఁగుతోడ." పి. శతం. ౧, ఆ. ౧౩౫. "గీ. ఉన్నమీఁగడ పెరుఁగు పాల్వెన్న జున్ను, లన్నియుం గొల్ల సాను నవ్వఁన్నెకాఁడు." నీలా. ౧, ఆ. ౭౬; 2. జున్నుఁబాలు, ఆవు ఈనిన అయిదాఱుదినముల లోని పాలు. పీయూషము (శ. ర.) 3. తేనెపట్టు; ఈఁగలతో నిండిన తేనెతెట్టె. "సీ. ఉన్నత తరు వెక్కి జున్ను సేకఱఁ గొని తేనియ యానని వానిభంగి." భార. శాం. ౧, ఆ. ౭౪. "ద్వి. జున్ను రేఁచినరీతి సుర లెల్ల బెదరి, కన్న వారేఁ గిరి కన్ను త్రోవలకు." ద్వి. హరిశ్చ. పూ. ౪౧౪. పం. 4. తేనె. "క. తేనియ యన జున్నన సఖి, ధానంబులు మధువునకును దనరుం

కరణము. (ఆమ్రేడితమందు 'ఝుఝుఝుఝుకు') "క. ఝుఝుఝుఝుకని నెత్తురు వెలి, కుఱుకును .." ఆము. ౩, ఆ. ౨౩.

ఝొట్టి. దే. వి. (ఝుట్టు ధా.) ఒకసారి త్రాగుటలో పీల్పఁదగిన పరిమాణము. "సీ. చిన్నటనాఁడు కార్చిచ్చు నే ఝుట్టిగాఁ బీల్చిన బింకముల్ బెళుక వయ్యె" చను. ౨, ఆ ౭౩. "ద్వి. ఉఱక పువ్వులవిల్తు నోఁ ఝుట్టిఁ గొన్న, చుఱుకు చూపులకన్ను చోద్యమై మెఱయ." ద్వి. హరిశ్చ. ఉ. ౨౫౭. పం.

ఝొట్టు. దే స. క్రి. (ఝుట్టిగ మొన లగునవి) త్రాగు పీల్చు. "సీ... త్రావి, నననగ సాస్వాదిఁ సి ననుటకై పఱలుచుండుఁ, బీల్చె ఝుట్టె నన గ వెలసెఁ దద్భేదమై..." ఆం. భా. తృ. ౧౨౨. "సీ. పంచపన్నియతోడఁ బ్రసవశరాచుని నెఱ్ఱ చిచ్చుఱకంట ఝుట్టెవాఁడు." భీమ.౧ ఆ. ౧౧౦; వి. 1. (ఎక్కువ పలుచనిది ఎక్కువ గట్టిది కానిపదార్థము ను చేతితో తీసికొని) త్రాఁగుట. పీల్చుట. (శ. ర.); 2. (పలుచనిది గట్టిది కానిపదార్థమును ఒక సారితీసికొని) త్రాఁగునపుడు పీల్చునపుడు గలిగెడు ధ్వని కనుకరణము. "ద్వి. ఝుఱ్ఱురఁ బడివంబు ఝుఱ్ఱుచు గిఱ్ఱుగిఱ్ఱురఁ ద్రేన్చుచుఁ గాయ లేమెని, గటుకనఁ గఱచుచుఁ గరకర లెసగఁ, బటువుగా నములుచు..." పండితా. దీక్షా. ౪౨, పు. "ఉ...ఝుఱ్ఱురన్, గ్రుక్కెఁడు గ్రుక్కెఁ డీమధువుఁ గ్రోలుచు మోవులు నంజుకొంచు వా, రెక్కుడు గాఁగఁ దన్పిరి నిజేంద్రియపంచక దైవతంబులన్." కళా. ౬. ఆ. ౧౨౭.

ఝలమతీ. వై. వి. దేశవిశేషము. "సీ. సూరెలఁ బఱతెంచు ఝులమతీ తేజీలు ధవళాశ్వముల నుస్త్రప్రస్తరింప." రంగా. ౧, ఆ. ౧౫౪.

ఝులిమి. దే. వి. దుండగము. రూ. ఝులుము. "సీ... దుడుకు లూటి ఝులిమి దుండ. గీ. గమ్మనఁగ నుద్ధతాఖ్యతా..." సాం. ని. మాన. ౪౩. "సీ. కలిమి వాల్గంటితోఁ జెలిమి చేయని మేలు ఝులిమి వావిరిఁజూపుబలిమివాఁడ." ప్రబంధ. ౨౧౭.

ఝులుము=ఝులిమి. (హిం. జులుమ్) దుండగము. దౌర్జన్యము, బలాత్కారము. (శ. ర. బ్రా.) "ద్వి. నతి నమ్మైదను హరిశ్చంద్రుఁ డన్వాఁడ, ఝులుము లేటికి నొండుసుద్దులు మాని, తొలఁగుము..." ద్వి. హరిశ్చ. ఉ. ౬౦౧. పు.

ఝుల్మతి = ఝులమతి. "గీ. కమ్మవిలుకానిఝుల్మతీకత్తలాని." కలి వేల్పుశతకము. ౬౩.

ఝుల్మానా. హిం. వి. అపరాధము.

ఝువ్వ. దే. వి. పక్షిలోనగువానికి పెట్టెడి కూరి, ఉద్ది. (శ. ర. బ్రా.)

ఝువ్వరించు. దే. అ. క్రి. విజృంభించు. "చివ్వకు ఝువ్వరించుననుఁ జెంతలఁ గన్గొనుఁ దూదఱుం దగన్." పాంచా. ౨, ఆ. ౫౦. (శ. ర.)

ఝువ్వి. దే. వి. (క. జువ్వి) ప్లక్షము. "ప...రావుల మావుల జువ్వుల మొవ్వల రేఁగుల గోఁగుల శేలల జాలల నొద్దుల మద్దుల ఎరుగుల నిరుగుల..." పి. శకుం. ౨, ఆ. ౧౪. "గీ... ప్లక్షసంజ్ఞ, నివ్వటిలు ఝువ్వి యన..." ఆం. భా. ద్వి. ౪౪.

ఝువ్విదీవి. ద్వ. వి. (ఝువ్వి+దీవి) ప్లక్షద్వీపము. (శ.ర)

ఝువ్వు. దే వి. 1. రాలం మొదలగువానిని విసరుటయం దగు ధ్వన్యనుకరణము. "ఉ. అవ్వనజాయతేక్షణునియానతిఁజేసి మహౌషధీలతల్, ఝువ్వన నమ్మహాంబునిధిలోపల వైచి సురాసురావళుల్." వి. పు. ౧, ఆ. ౧౭౬; 2. నీరు మొదలగునవి ఇంకుటయం దగుధ్వని కనుకరణము. "ఉ. ఇద్విధిఁ బూని సైనికసమృద్ధి నహీంద్రఫణాగణంబు జో, జవ్వనఁ గ్రుంగ ఘోటకరజశ్ఛటచే నొకపాటి వాహినుల్, ఝువ్వన నింక..." పరమ. ౪, ఆ. ౧౫౭. (శ. ర. పా); 3. నలఁగఁగొట్టుటయం దగుధ్వని కనుకరణము. "క. ఎవ్వరికిని గనఁబడకయొ, యవ్వీరుల నరయుచుండె నపు డొకకపి తాఁ, గ్రొవ్వున నార్చుచు నొకగిరి, ఝువ్వనఁ గబళించి నలఁచెఁ జూర్ణము గాఁగన్." సీతావి. ౨, ఆ. ౧౪౫; 4. ఎగయుటయం దగుధ్వని కనుకరణము. "సీ. ఝువ్వన నెగసి విష్ణుపదాంతరమున రెక్కలుం వచ్చెనో యనఁ గదలఁ జాలఁ." కకు. ౨, ఆ. ౩౨.

ఝో

ఝోంక. దే. వి. తత్తఱపాటు. "వ...అదలుపులు విదల్పులు పీఁకులు తాఁకులు ఝోంకలు కూఁకలు మూఁకలు పీఁకలు..." భీమ. ౪, ఆ. ౬౦.

జోఁకించు. దే. అ. క్రి. తత్తఱపడు. "వ...పిక్ష వాటంబులఁ బ్రతిగేహంబునః బరిభ్రమించి ఎసిరి విశిమాలి కేసరి యలసి యూరటఁబొంచి సో. ని జోఁకించి తూలి దూఁకటిలి యుల్లంఘనఁ గ్రోఁడం బుద్భవించిన..." భీమ. ౨, ఆ. ౧౦౧.

జోజకత్తె = జోదకత్తె (శ. ర.)

జోజకాఁడు = జోదకాఁడు. (శ. ర.)

జోజము. వై. వి. 1 జోదము. "గీ. దొమ్మగుఱ్ఱమీడో పల్లకూటమ్మొ మయిలసంతో బెస్తలసాలో జోజంపుగట్టో, రచ్చకొట్టంబొ తనమందిరంబు నీకు, గజిబిజి యి దేమి నీవే స్తకాండ్రు నీవు." బహు. ౫, ఆ. ౨౦౬. 2. మోసము. ఉదా: కోమలవదన రేపు మా పంచుఁ గడకు జోజమే చేసితివి. (క్షేత్రయ. శ. ర.)

జోజరి = జోదరి. వై. వి. (బ్రా. జోజము+అరి)

జోజి. వై. వి. (సం. దూతీ) దూతిక. (బ్రా. శ ర.) ఎడకత్తియ.

జోజేసలు. వై. వి. బ. ఐరేనికడవలు.

జోటు. వై. విశ. (క. జోటు = శక్తి) జాణ, నేర్పరి, సమర్థుఁడు. "గీ. చదువఁ జూడంగ నింతంత చతుర గాదు, వీణ వాయింప నింతంతజాణ గాదు, జూద మాడంగ నింతంతజోటు గాదు, ప్రతిభఁ బల్కంగ నింతంత ప్రౌఢ గాదు." నిరం. ౨, ఆ. ౩౪.

జోటకాఁడు. వై. విశ. (జోటు+కాఁడు - స్వార్థమున) నేర్పరి. "సీ. పంది మాడినభంగిఁ బందుల నొప్పించు జోటకాండ్రగనట్టి వేఁటకాండ్రు." ద్వా. ౮, ఆ. ౨౨.

జోటాడు. ద్వి. స. క్రి. (జోటు+ఆడు. త. సూదాడు.) మోసముచేయు. "క. వేఁటాడ దొరలసన్నిధి, మాటాట మదించుచెందు మన్నీలఁ గరం, బూటాడఁజేయం నన్నిట, జోటాడనె యండు నతఁడు చూచెదరెకదా." రా. వి. 3, ఆ. ౫౬.

జోటు. వై. విశ. (హిం. ఝూట్) జిత్తులమారి, వంచకము. "సీ. ఆలరు జో టనఁగ జిత్తులవాఁ డనంగ వంచకుఁడు..." ఆం. భా. తృ. 3. "సీ. సుఁకరి జూదరి జోటు వనాచారి ముని పా చ్చఁ జలపాది మడియనిడుపుఁ. గీ. జేర పల కదు వఱపొంగు సేయఁ దగదు." నీతి. ౯. ప్రబంధ. ౬౪౨

జోటుఁదొలకాఁడు. వై. వి. (జోటు+కాఁడు) వంచక. "గీ. వారసుల మాటలను తెప్పించి సక్కి రోట, మైన దయ నీర యే మైన నడిపిజ్జ, జోటుఁ దనమున సభ లెక్కు చొరఁగరాండ్రు." ఆము. ౪, ఆ. ౬౧. విప్ర. ౪, ఆ. ౬౦.

జోటుకత్తియ. వై. విశ. (జోటు+కత్తియ - స్వార్థమున) వంచకురాలు. "ద్వి. గొంగోనఁ జాల కిజోటుకత్తియలు, పాపనిపై నట్టిపాపంబు గట్టె." ద్వి. వి. సా. ౨, ఆ. ౩౧ పు. ౧౯ పం.

జోదకత్తె. వై. విశ. (జోదము+కత్తె) జోజకత్తె. 1. జూద మాడునది (శ. ర.); 2. మోసకత్తె. 'గీ. కల్లవగ జాదకత్తెల. గంటి. గాని, యింత మాయలజగజాత నెందుఁ గాన." శుక. ౨, ఆ. ౫౨౩.

జోదకాఁడు. వై. విశ. (జోదము + కాఁడు.) జోజకాఁడు, ద్యూతకారుఁడు. "సీ. ద్యూతకారాభిధ దోఁచుచుండును జోదకాఁడు జోదరి పంద కాఁ డనంగ." ఆం. భా. ద్వి. ౩౦౪.

జోదము. వై. వి. (సం. ద్యూతమ్) జోజము. 1. ద్యూతము. "క. జోదపుసిరి యోనపడం, గా దని విదురుండు సెప్పఁగా..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౧౬. "క. కాదంబరిఁ ద్రావింగొను, జోదం బాడింతు..." శైష. ౭, ఆ. ౧౭౦. ఆం. భా. ద్వి. ౩౦౪; 2. మోసము; 3. జూదపుగడి. "గీ. నన్ను జూదపు నేతమంచంబుమీఁద, దుడ్డుగంబడిఁ బఱిచి నిద్దురకుఁ దూలి, మగనిఁ గూర్కుచు నను చు నమ్మాయలాఁడి." వేం. పంచ. ౪, ఆ. ౪౫౬.

జోదరి. వై. విశ. (జోదము+అరి) జోజరి. 1. జూదమాడువాఁడు "మ. అరయం ద ప్పౌక యింక నావలన లే దాధర్మపుత్త్రుండు జూదరి వెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి..." భార. ఉద్యో. 3, ఆ. ౩౫౩. 2. మోసకాఁడు, వంచకుఁడు; మోసకత్తె. "క. కుటిలుఁ డపకారి జూదరి, లోటలోటకాఁ డాగ డీఁడు లోభి ఖలుఁడు దుర్విటుఁడు బలురోగి తక్కరి, మెటిగిడి బాఁపనగరాను ముట్టకు మబలా." ప్రబంధ. ౬౪౪.

ఝోదరిక్షత్రియ. వై. విశే. (ఝోదరీ+క్షత్రియ) ఝోద మాడుఆడుది. "ఉ. ...విరాళి గాక యేరుపెల గొట్టు గాక బలురాయడిక్షత్రియ గాక యొప డున్, సొం పౌక యింత లేనియెడ ఝోదర క్షత్రియ గాక యెంతయున్." ధశా. ౨. ఆ. ౬౩. రూ. ఝోదరిక్షత్త్రి.

ఝోదు. దే. వి. కల్లు. (బ్రౌ.) "గీ. చూడఁ ఝోపట్టు సిరు లెల్ల ఝోదు లగుచు, గొలఁది వట్టినఁ దొంటి బాగులకు రావు." నీతి. ౭౧. సాం. ని. మాన. ౪౯.

ఝోలు. దే. వి. (క. ఝోలు.) 1. సింహము మొదలగువాని మెడమీఁది వెండ్రుకలు; 2. వస్త్రము చివర నేయకుండ విడిచెడు నూలిపోఁగుల సముదాయము. "ఉ. గాటపుఝోలు మేల్వలువ గప్పెను బాలికదాన నేమగుం, జేటగఁ గాంచెఁ గాంచిమణిదీపములన్ రమణుండు సర్వమున్." మృ. వి. ౩, ఆ. ౧౩. 3. ఏనుఁగుమీఁద పఱచెడికంబళి; కథనము. "సీ. ...కథనము ఝోల్ లే వనఁ గొఱలుచుండు." ఆం. భా. ద్వి. ౧౯౫. "సీ. పరితః ప్రకీర్ణమై పఱచిన ట్లున్నశైవాలజాలము నీలి ఝోలు గాఁగ." రామా. ౭, ఆ. ౩౧; 4. గుఱ్ఱముకు కప్పెడువస్త్రకవచము. "గీ. పసిఁడిగొలుసులు జరతారుపట్టెడలును, మేలి పొంబట్టు ఝోలును మెడల గొప్ప, వెండిమువ్వలు పాదలంగ గండుమీఱి, సాగె వేగఁ దటారంపుఝాగిలములు." రసిక. ౧, ఆ. ౧౦౬.

ఝోవరము. వై. వి. సంతాపము. (శ. ర.)

## ఝొ

ఝొంపము. దే. వి. (క. ఝొంప.) 1. ఆకులు తీఁగెలు మొదలగువానిగుంపు, గుబురు; సమూహము; పొద. "సీ. ...ఒనరు లతాప్రతానినియం ఝొంపు, మనఁగ..." ఆం. భా. ద్వి. ౩౬. "సీ. లోని ఝొంపము పసలును బెనుఁజీకటి నొదవించి పొదలంగ నొప్పువాని." భార. విరా. ౧, ఆ. ౧౬౨ "ఉ. ఝు ఝుఝుపల్లవెండ్రుకల ఝొంపములుం గల మస్తకంబులున్." పి. శకుం. ౧, ఆ. ౯౭. "సీ. లలితవిద్రుమలతాలావణ్యమగుజటాజూటంబుఁ జిగురాకుఝొంప మై." ఉ. హరి. ౨, ఆ. ౧౭౫; 2. రెమ్మ. "చ. ...తాఁదలపోసి హరించెనాకులుం, గొఁకలుఁ ఝొంపముల్ నిడుదకొమ్మలు రే యగుడుంగ్రమం బనన్." భార. శాం. ౩, ఆ. ౩౯౪; 3. గుత్తి. గుచ్ఛము. "సీ. పసిఁడిపక్కెర జక బాజు మెత్తా ముత్తె పుఝొంపములు చొక్కాపు కెంపు, టంకసన్నలు గిలుక్కటుపెకుల్... గీ. ...కదిగి, రాణఁ దనరారు మేటిహామ్రాణి నెక్కి, పాళి దైవార నపుడు వాహ్యాళి వెడలె." రసిక. ౧, ఆ. ౧౫; 4. సాంద్రత. 'క. పెనుఁబొకుపు బఱపుఝొంపము గలయది...'' భార. విరా. ౧, ఆ. ౧౬౫; 5. నిరంతరధార. "క. ముంపు గొని విరులవానలు, ఝొంపంబులు గురియ..." భాగ ౧౦ స్కం. ౫౧౦. విశే. సాంద్రము, దట్టము. "శా. ప్రాతర్వేళల మంచుచిక్కగుమి ఝొంపం బైన లేఁబచ్చికల్, శ్వేతశ్రీఁ దులకించు టెంతయుం దహించెన్..." ఉ. రా. ౫, ఆ. ౨౧౬.

ఝొంపిలు. దే. స. క్రి. పొడిచేయు, ముద్ద చేయు.

ఝొంపు. దే. వి. కొండయందలియూటనీరు. (బ్రౌ. శ. ర.)

ఝొగ్గు. దే. వి. భిక్షము. (బ్రౌ. శ. ర.) రూ. జోగు.

ఝొటఝొట. దే. వి. వడియుట, కురియుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము. "క. చెమటగుఱ్ఱల గ్రుచ్చినసంపుసు పొంటలఁ దగిలి నెయ్యి ఝొట ఝొట వడియున్." మను. ౪, ఆ. ౧౯. "ద్వి. ఝొటఝొటఁ జెమటలు సోనలై కురియ." ద్వి. నల. ౨, ఆ. ౬౩౫. "చ. ఝొటఝొట ధారగా వడియుచున్ గడలెత్తు సుధారసంబు." పాండు. ౪, ఆ. ౪౧. రూ. చొటచొట.

ఝొత్తిలు. దే. అ. క్రి. 1. (రక్తము కోపము మున్నగువానిచే) ఎఱ్ఱబడు, ఎఱ్ఱనగు. "ఉ. ఝొత్తిలునేత్రకోణములఁ జూచుచు నోరిదురాత్మ కత్తి నీ, కుత్తుకఁ గోసి బుద్బుదవిఘూర్ణితఫేనిలమైన నెత్తుటన్, బుత్తి యొనర్తు దుర్గకు..." ప్రబోధ. ౩. ఆ. ౩౯. "చ. ...పెంజెమటనీళ్లను మేనుల జాఱనెండచేఁ, గటములు రక్తకాంతి నధికంబుగ ఝొత్తిల దప్పి నోష్ఠసంపుటములు వాడఁగా వగరు పుట్టఁగ వచ్చిరి వెచ్చనూర్చుచున్.' ద్వా. ౧౧, ఆ. ౧౦; 2. రంజిల్లు, రాగిల్లు, (ఎఱుపు మున్నగు రంగులచే) నానావర్ణము కలదియగు. "గీ. చిత్తమాశ్చర్యరసమున ఝొత్తిలంగఁ, జేయుం నీ ప్రశ్నము..." పాండు. ౧, ఆ. ౧౫౬. రూ. ఝొత్తిల్లు.

జొత్తిల్లు. దే. అ. క్రి. = జొత్తిలు 1. ఎఱ్ఱబాఱు. "సీ. నెత్తుట జొత్తిల్లి నెఱసిన యాలుక నుగ్రం బై వదనంబు కాంతి పరంగ." భార. ద్రో. ౨, ఆ. ౧౧౪ "సీ. లత్తుకరసమున జొత్తిల్లు బదతలముల నర చేతుల హాపించి యూని." కు. సం. ౪. అ ౧౧౫. 2. రంజిల్లు. "సీ. బికతంతుపటము లింపెసలారఁ జందనద్రవమున జొత్తిల్లు దడుపువారు." దశకు. 3 అ౧౨౪; 3. అర్ద్రమగు. "గీ. తనయాలం లంపటుఁ బోలి యుంట వినినయుడిము; మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు, వొగులుచును వచ్చె నమితల పోఁడఁ జేసి, యల్ల మగ్గ్రటికమున జొత్తిల్లు చుండ." భార. స్త్రీ. ౧. అ ౧౧౭. "సీ. క్రొత్త నెత్తుట నేల జొత్తిల్లమి గజాచిచర్మిత గాదుగా జలదవేణి." చం. రా. ౫,౬౮; 4. ఉద్గమించు, పైకుబుకు. "వ...పీఁపులు మూఁపురంబులు నడఁచియుం నెత్తురులు జొత్తిల్లం జేసియుం..." సీలా. 3, ఆ. ౭౪.

జొత్తు. దే. వి. 1. ఎఱుపు, రక్తిమ. "ఉ. కొమ్మకన్నుఁగవకుఁ గోరగింపఁగఁ జూచి, కలుచు జొత్తు గ్రక్కు దానసంబు, గవిసితమాల గహానాంధ కారవి, తానమునకు నుదయభానుఁడయ్యె." మను. 3, ఆ. ౯౬; 2. కర్ణభూషావిశేషము, చెవ్వాకు. "పీ. పవడంపుజొత్తులఁ జెవులు రూపడఁ గంగఁ బావటఁ దలకట్టుభంగి గిప్పు." భార. విరా. ౧, ఆ. ౨౨౨; 3. కృత్రిమరక్తము; రుధిరము. "సీ...కృత్రిమరక్తంబు గేరు జొత్తు, నాన్..."ఆం. భా. ద్వి. ౧౩౨. "సీ. చూడ సరస్వతి జొత్తువైఖరి నుండు గుప్తగామిని యది కొఱమొ మనకు." దశా. ౧౦, ఆ. ౮౮.

జొత్తుకొను. దే. అ. క్రి. (జొత్తు+కొను) దట్టమగు, సాంద్రమగు. "చ...ముష్టిఁ బొడువక్ వెసఁ దాఁకి శిరంబు వ్రయ్యలై, ఘనరుధిరంబు జొత్తుకొని కాఱ వికారము గాఁగ ఁ గూలుచున్." పద్మ. ౯, ఆ. ౧౮౭.

జొత్తుపాప. దే. వి. (జొత్తు+పాప) మేన నెత్తురు లేఱుచున్న లేఁతబిడ్డ. నెత్తురుగుడ్డు. "వ... తత్తటంబున నెత్తురుం దడిసి జొత్తుపాపలవిధంబున నొత్తోల వలకియమ్ములలెత్తు లైనరాహుత్తులును..." జై. భా. ౨, ఆ. ౭౫.

జొత్తువెట్టు. దే. స. క్రి. (జొత్తు+పెట్టు) ఖండించు, నఱకు. "ఉ. అంబుధిఁ గట్టి లంకఁ గడుసాగ్రహ మొప్పఁగఁ జుట్టుముట్టి దివ్యాంబకసహ్నిచేత ననురావళి నెల్లను మడఁ బెట్టి ఘోరరంబుగఁ గుంభకర్ణునిశిరంబు సురంబున జొత్తువెట్టి వైరంబుఁ గిట్టి సర్వసురాళి నుతింపఁగ మీర లుండఁగన్." మై. ౧, ఆ. ౮౬.

జొన్న. యం. దే. వి. వృక్షవిశేషము. (శ. ర.) వై. వి. 1. (సం. జూర్ణ.) సస్యవిశేషము, ధాన్యనామము. "సీ...పోలుచు జూర్ణంబు జొన్నరా..."ఆం. భా. గ్వి. ౬౩౪. 2 (బ) ధాన్యవిశేషము. "క...ఎంతతఱిఁగిన మిరియాల్, లం జొన్నలసరిపోవే..."ఉ. హరి. ౧, ఆ. ౭౫. "క్. జొన్నగుళభ్దములున్ బహూంతను దశతమ ఫలము. లగును." ఆం. భా. క్వ. ౪౧.

జొబ్బటిలు = జొబ్బిలు. "మ. నిబిడక్రోధరసంబు జొబ్బటిల ధన్విత్రాణ కుప్పీనుఖుల్..."రంగా. 3, ఆ. ౧౦౫.

జొబ్బిలు. దే. అ. క్రి. రూ. జొబ్బిల్లు. 1. రాలు; స్రవించు, కాఱు; ఉబుకు, ఉద్గమించు. "గీ. గోవ జవ్వాదిఁ గస్తూరిఁ గొఱతపఱచు, వెన్నవడి దెంబు జొబ్బిల విద్రిచి విద్రిచి." సైష. ౬, ఆ. ౧౨౦. "చ. కుటిలత రాహు వెగ్గి తనకోఱలఁ బాచుగ నొక్క మిక్కిలిక్, జొటచొటగా సుధారసము జొబ్బిలుచున్నశశాంకురేఖ..."బిల్హ. 3,ఆ.౫౧. 2. తడియు. "సీ. జడలయల్లిక యూడ్చి సంతంగనూనియఁ దిన్నగా కట్ల జొబ్బిలఁగ నంటి." పార. ౨, ఆ. ౧౯౯; 3. నిండారు, అధికమగు. "చ. ఉదితమనోజ్ఞరాగదహానోష్ణభరంబున నాలతాంగికిన్, హృదయమునందు జొబ్బిల వహించిన చందనకర్దమంబు బుద్బుదముల సీనె..." సైష. ౨, ఆ. ౧౧౪. ౧జ. వి. 3, ఆ. ౪౧. 4. అను కగు. "సీ. పునుఁగుజవ్వాది కప్పురము గుబాళించుకలపంబు మేన జొబ్బిల నలంది." సా. 3, ఆ. ౧౩౮. "గీ. అలరు నను కయ్యి ననుట జొబ్బిలె ననంగ." ఆం. భా. తృ. ౯౪.

జొబ్బిల్లు. దే. అ. క్రి. = జొబ్బిలు. 1. స్రవించు, రాలు. "వ...గబ్బిగుబ్బలం జొబ్బిల్లుకుంకుమరసం

బునఁ బంకిలంబు లగుహారముక్తాతారకంబుల..." మను. ౫, ఆ. ౬౧. "క. మబ్బులఁ గ్రమ్మెడు క్రొమ్ముడి, జొబ్బిల్లెడు తేనె సోవి సోబ గౌ మొగముఁ గా,...నిగ్గుచెలంగున్." హంస. ౪. ఆ. ౧౯౪; 2. తడియు. "సీ. పన్నీట జొబ్బిల్లు పచ్చకప్పురపుఁదిసెమోఁదఁ బుప్పొడిరవ పొదు గొల్పి." యశా. ౫, ఆ. ౯౭; 3. నిండారు. "గీ. మలయజము మేనజొబ్బిల్ల నలఁది యంత, శ్రమము వాయంగఁదాళవృంతమున విసరి." భాగ. ౧౦. స్కం. ఉ. ౯౮౩; 4. అతుకగు.

జోఱజోఱ=చోఱచోఱ. మిడుఁగుఱులు రాలుట యందలిధ్వని కనుకరణము. "క. ఉఱిమెఱు కాదంబినిలోఁ, గఱకుఁబిడుగుగములు వెడలుగతిఁ గైదువు లన్, మెఱుఁగుటతో నుదయించిరి, జోఱజోఱ మిణుఁగుఱులు రాలు చూపులు శక్తుల్." వరాహ. ౧౧, ఆ. ౧౭౩.

జొట్టీఁగ. దే. వి. పశుమక్షిక. (బ్రా. శ. ర.) రూ. జోటీఁగ.

జొట్టు. దే. వి. = జోఱు.

జొల్ల. దే. వి. చిన్నరేఖ. (బ్రా. శ. ర.)

జొల్లు. దే. వి. (క. జొల్లు) చొంగ, లాల. రూ. చొల్లు. "గీ. కలవరించుచు నోడ లెఱుఁగక సెలవుల, జొల్లుగాఱంగ బ్రాహ్మణి సుప్తిఁ బొందె." హరిశ్చ. ౫, ఆ. ౫౫.

జోహారు=జోహారు. దే. వి. నతివిశేషము. నమస్కారము. "సీ నతి షడ్విశేషము ల్చెవిప్ప వెన్నెల చిన్నిపువ్వు, జోహారును జొహారు..."ఆం. భా. ద్వి. ౧౭౫ "గీ. నతికిఁ బేళ్లొప్పు జోతదండము జోహారు." ఆం. సం. మాన. ౩౧.

జోహారువు=జోహారు. (శ. ర.)

జో

జో. దే. అవ్య. (క. హిం. సో=నిద్రింపుము.) పిల్లలను నిద్రపుచ్చునపుడు వాడెడుపదము; ఉదా: జో అచ్యుతానంద జోజో ముకుంద.

జోక. దే. వి. (క. జోకె) 1. సౌందర్యము, అందము, ఒప్పు. "ఆ. సోయగంబు సొబగు జోక మురువు...చక్కఁదన మనంగ సౌందర్య మొప్పును." ఆం. భా. తృ. ౪౧; 2. కాంతి. "శా. జోకల్ పీడ్కొని దుక్కఁ జేఁగెను జుమీ శుభ్రాంశుబింబప్రభో,త్సేకంబుల్ దఱిఁగెన్ జుమీ కడకు వచ్చెం జుమ్మి యామేయి..." చమ. ౩, ఆ. ౩౯; 3. జత, కవ. "ఉ. ...చిగురుఁ బోఁడికి నుంగవ జోక యెప్పుడున్, మానని చక్రవాకములు దూనినిచన్నులు చూడుమా సఖీ." అని. ౫, ఆ. ౭౯; 4. విధము, రీతి. "సీ. విరివియై మేఘముల్ పెంగిసచ్చినజోక ఘనపణాకలశశాంగములు హత్తి." విజ. ౩, ఆ. ౧౫౭; 5. విజృంభణము; ఉత్సాహము. "సీ. గములుగాఁ బెఱలు కీరములార మీఁజోక హరిమధ్య చేరి మాటాడు దాఁక." శకుం. ౪, ఆ. ౯౭. "శా...జోకం జిత్రసేనాదిగం,ధర్వ ల్యాంజకి: దోషుసూవిరి పురద్వారప్రదేశంబునన్." పారి. ౪. ఆ. ౭౭; 6. మొత్తము, సమూహము. గుంపు. "ఉ. శూర సంఘంబు పక్కె మొకజోకయి వచ్చి సోదిచ్చె నేని నే, నీరణక్షోణి నోమణి గ్రహింపక పోను..." విజ. ౩, ఆ. ౧౫౪; 7. స్వరూపము, ఆకృతి "గీ. అన్నపాలుని యనుమసామకతఁ జూచి, వానిసు మహితకార్ముకత్వంబుఁ జూచి, మనుజు లవ్విభుజోకకుమారుఁ బోలు, రతనిసౌందర్య మును కౌర్ణమట్టి దగుట." కవిరా. ౧, ఆ. ౭౯. 8. నాట్యవిశేషము. "ద్వి. కోలాటమును బాష్ప, గొండ్లి పేరణియుఁ, గేళిక జోకయుఁ లీలనటింప." బస పు. ౧. ఆ. ౫౫. పు. ౫౫౯. పం. "ద్వి. అంతంతఁ గోలాట లంతంత జోక లంతంతఁ గేళిక లభినయింపంగ." పండితా. మహిమ. ౫౯౫. పు.

విశే. 1. సదృశము, ఈఁడు, సమానము. "సీ. అతిథిసంతర్పణవ్రతవిధానంబుల నన్నపూర్ణకు జోక యక్కమాంబ." వైజ. ౧, ఆ. ౫౭. 2. యుక్తము. "క. అకుయ్యారమును వేఁటకు, జోకై..." భల్లా. ౫, ఆ. (శ. ర.) 3. అధీనము. "క. జోకై యుండుఁ బదార్థము, చేకుఱునందాఁక ధనికుఁ జేరి మహాత్మా." (శ. ర.) 4. జతయైనది, సహాయము; కూడియుండునది. "సీ. రాయంచయాంచుఁజీరకు జోక యగుఁగాక పచ్చియేనికతోలు పచ్చడంబు." హర. ౪. ఆ. ౫౭. "సీ. తరుణవిద్రుమలతాతరులతో జోకైన పాకభిన్నిలశలాక యనఁగ." బహు. ౫, ఆ. ౧౯. 5. వ్యాపించినది, నిండినది. "క. ఆకాశం

బున వాయువు, ప్రాఁకున దావాగ్ని యటుల మానసమందుఁ, ఏకాకారుఁడు జగమున, జోకై తను దాని వెల్గుఁజూస్తుర వేమా." వేమన. ౩, భా. ౧౪౬. 6. జాగరూకము, మెలఁకువ గలది. "క. మాకంటె వాఁడు మఁనుపుగ, నే కార్యము సేయ గలఁడొ యెఱుఁగము మీరల్, జోకగఁ దత్పురి మెలఁగుచు, నా కేదో కనికి వేగు నడపఁగవలయున్." ప్రభా. ౧, ఆ. ౧౧౪.

జోకసేయు. ద్వి. స. క్రి. 1. పోల్చు. "గీ. అందు మున్నిటి జోకసేయంగఁ జాలు, చెఱుపు ద్రవ్వించె..." యయా. ౧, ఆ. ౩౦; 2 సంపాదించు. "సీ వేవిధంబున మావిత్తము జోక సేసెదవు." హరిశ్చ. ౩, ఆ. ౩౦; 3. సిద్ధపఱుచు. "సీ. శ్వేతకేతుఁడు జోకసేసి తెచ్చిన పదార్థమ్ము యాచకుల కొఱవడిగ నిచ్చె." ఉ రా. ౨, ఆ. ౧౭౯.

జోకపడు. ద్వి. అ. క్రి. జతపడు (శ. ర.)

జోకపఱచు. ద్వి. క్రి. (జోకపడు ధా. ప్రే) జోకపడఁజేయుట. 1. జతపఱచు, సమానము చేయు. "వ...మిక్కిలిం గడంకొలుపుచున్న యగవిరిచినను మొగలిపూవులతోడ వీరభటులు జోకలు జోకపఱచు..." కళా. ౬, ఆ. ౨౨౪. 2. కలిగించు. "గీ. అకుపాభాగుఁ డచ్యుతుఁ డాదరమున మీకు నఘాఘ్నవిఘ్నాలి జోపఱచె" భాగ. ౬. స్కం. ౧౯౭; 3. కావించు "ఆ. ఈవిమానమునను యావిగ్రహముతోన, జోకపఱతు రాకపోకలనిన." కకు. ౧, ఆ. ౨౧౫.

జోకలుగట్టు. ద్వి. అ. క్రి. (జోకలు+కట్టు) మొత్తములగు, గుంపులగు. "ఉ. శ్రోణిరుహాగ్ర భాగముల జోకలుగట్టి పసిశిఖావళి, శ్రేణులు తాండవంబు లొనరింపగ..." శివరా. ౪ ఆ. ౫.

జోచు. దే. స. క్రి. చిట్టు. వి. చిట్టు. (శ. ర.)

జోకొట్టు. దే. స. క్రి. (జో+కొట్టు) 1 (బిడ్డలు నిద్రపోవుటకుగాను) జోజో అని వీపున చేత మెల్లఁగా తట్టు. "క. లోకములు నిదురవోవగ, జోకొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్, జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్." భాగ. ౧౦. స్కం. పూ. ౧౯౩. "ద్వి. సుదతులు జోకొట్టి జోలలు పాడ." ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౧౫. పం; 2. జయించు. "వ...గరుడులం దోలి ఖచరుల జోకొట్టి..." కాశీ. ౭, ఆ. ౯౫; 3. వంచించు; మాయచేయుట. "సీ. అడియాస జోకొట్టుపడకంపుటల్లుండ్రఁ దఱిమి ప్రోవాడు నత్తలియదల్పు." కవిక. ౪, ఆ. ౭౭. "క. లోకములు నిదురవోవఁగ, జోకొట్టుచు నిదురవోని సుభగుఁడు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౯౩. వి. నిద్రపుచ్చువాఁడు, నిదురింపఁజేయువాఁడు. "సీ. కుముదినీవల్లికా సమితికి జోకొట్టు తలఁగుజక్కవలసంధానకర్త." చమ. ౩, ఆ. ౪౦. "ఉ. పట్టినుఱుగుఁ బెట్టి నుదుటం బలి తేదది యొల్లఁ జేరి జోకొట్టుట కాక నిద్దెలుపఁ జూడు మీ మాటల నీవు గంటి నన్నుట్టికి భాంగుఁ డీరమణి చూసల కాస్పద మిప్పు డాతని, నట్టిగ నగ్నసూవికథనంబునఁ జెప్పి యనుగ్రహింపవే." ప్రభా. ౩, ఆ. ౭౨. (జేరి జోకొట్టు=నిశ్శబ్దముగా నిద్రింప జేరిరి చేతితో చఱచు.)

జోగడ. దే. వి. (క. జోగళ) జోలపాట. రూ. జోపడ. "చ. తిరుమణి వెట్టు నాదలలఁ దెల్లని చీరలు గప్పఁ జిన్నిపూ,ధరణము లెల్లఁ బెట్టుఁ దగుభంగుల దగ్గఱి చన్నలిచ్చు వేఁధరముగ నూఁచి జోగడలఁ బాడు మందంబున నందగోప సుందరి యిచ్చె నిత్యకృత్యముగఁ దాఁ బెనిచెన్ దగ రామకృష్ణులన్." పద్మ. ౯, ఆ. ౧౧౩.

జోగపట్టెము. వై. వి. (జోగము+పట్టెము) యోగపట్టము. "గీ. జోగపట్టియు కకపాల జోలె సంచి, కలికి కాటున గిర్బొట్టు పలుఁగు పేరు, జంటిగాఁ దాల్చి నెరమిండజంగ మనుచు." హర. ౫, ఆ. ౪౦.

జోగము. వై. వి. (సం. యోగః) 1. యోగము, చిత్తైకాగ్ర్యము. "సీ. చదలు కాపువుఁదిండి చలువ పాన్పునఁ బడి జోగంపు నిదురలఁ బొక్కఁ జేఁడ." అచ్చ. బాల. ౧౬౦; 2. స్త్రీపురుష సంయోగము. (చూ. జోగరగండ.)

జోగరగండ. వై. వి. (జోగము + గండఁడు) యోగములకు శూరుఁడు, స్త్రీపురుషులను గలుపుట యందు దిట్ట; యోగభేదకుఁడు, చిత్తైకాగ్ర్యమును

చెలిచువాఁడు. "గీ. నవకములు లేరుతొలిజవ్వనంబు మాటు, కమలనాళంబు జోగరగండబిరుదు, వెలయ నెవ్వాఁడు విలసిల్లు విశ్వవినుతశౌర్యుఁ డగుకట్టిమదనుని నర్తులింతు." గంధ. ౬.

జోగి. వై. వి. (సం. యోగీ.) 1. యోగి. "క. ఓగురునాయక యీసొ, మ్మేగలి నినుఁ జేరెఁ జెప్పవేలె మ్మనిసన్, జోగులము మేము మాకట, రాఁ గూడదు గాన రాజు ర మ్మనుఁ డిటకున్." ద్వా. ౧౨, ఆ. ౫౨. కళా. 3, ఆ. ౨3 2. (జోగు+ఇ) భిక్షుకుఁడు. (శ. ర.)

జోగిణి. వై. వి. (సం. యోగినీ.) ఒకానొక స్త్రీదేవత. (శ. ర.) "సీ. జోగిణిఁ గొసరి జైసుకవెట్టి పలకపై సారెలు వోయించి సరము చూచి" ఉ. హరి. 3, ఆ. ౧౨౦. (శ. ర. పా.); 2. సన్న్యాసిని. "ద్వి. జోగిణులును దారు జోగివేషముల, జోగులు గొలువంగ జోగు లేతేర." పండితా. పర్వ. 3౪౪. పు.

జోగిణీపంతు. ద్వ. వి. నాట్యవిశేషము. 'సీ. చూపుచున్నది జోగిణీపంతు రంతు గా రంభ నాట్యగృహాంతరంబునందు." కవిరా. 3, ఆ. ౭౭.

జోగినసాము. వై. వి ఒకవిధ మైనసాము, పండ్రెండు పరువడులలో నొకటి. ప్రబంధ. ౮౭.

జోగు. వై. వి. 1. బిచ్చము; భిక్షాభేదము. "గీ. భిక్ష లిరిపెము బికిరము బిచ్చ మాయ, వార మనజోగు నాఁగను వఱలు నభిప." ఆం. భా. ద్వి. ౧౭౫. "సీ. చూడనీఁ డొకవేళ జోగునకై వచ్చి మేలు దెల్పెడు జోగురాలి నైన." కువల. ౪, ఆ. ౧౭3. "సీ. ఓడ భిక్షాభేద మొప్పను జోగు నా..." ఆం. భా. తృ. ౫౦; 2. పడవ. "సీ. ఓడ భిక్షాభేద మొప్పను జోగు నా..." ఆం. భా. తృ. ౫౦. "మ. నుసగ ప్రంపుటనంటి విప్పుఁబొర యన్ జోగెక్కి..." పను. 3, ఆ. ౧౪౨. "సీ. ఒకచోఁ బునర్వసు పూఁగె వృక్షము కొమ్మ సుడివడ్డదుత్యాఁ జోగువోలె." కాశీ. ౧, ఆ. ౧3౭; అ. క్రి. తూఁగు (బ్రౌ. వా.) వి. జోగుట.

జోగురాలు. వై. వి. (జోగు+ఆలు) యోగిని. "ఆ. క్షపణకుండు చూచి సౌగత యీజోగు, రాలిఁ గూడి తంటరాడ మన్న." ప్రబోధ. 3, ఆ. ౪౯. "క. మనకథ యవితథముగ విను, మని యంత స్నాయజోగురా లి ట్లనియెన్." శుక. ౨, ఆ. ౪౪.

జోగులయిలువేల్పు. ద్వ. వి. (జోగుల+ఇలు+వేల్పు) భైరవుఁడు. "చ...కాచు దంతిముఖవాహనమత్తతరాజిఁ గాచుజో, గులయిలువేల్పు వాఁడిమదిఁ గోరక బోనము..." కాశీ. ౪, ఆ. ౧౫౪.

జోజో. దే. అవ్య. (జో అనుదానియామ్రేడితరూపము) పిల్లలను నిద్రపుచ్చునపుడు వాడెడుపదము. "క. జోజో కమలదళేక్షణ, జోజో మృగరాజమధ్య జోజో కృష్ణా, జోజో పల్లవకరపద, జోజో పూర్ణేందువదన జోజో యనుచున్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౯౦. "ద్వి... ఊవిద లవ్వేళ, జోజో కుమార జోజో చిన్నియన్న, జోజో నను గన్న చొక్కపుఁ దండ్రి, యనుచుఁ బాటలు పాడిరి..." వృ. వి. 3, ఆ. ౬౧.

జోటి. వై. వి. (సం. యోషిత్.) 1. ఆఁడుది, "ఉ. చూడక చూచు మాడ్కి నలజోటి దిశల్ పరికింప నొక్కచోన్." మను. 3, ఆ. ౭౬; 2. భార్య. "క...సుంకుని జోటి యది తదీయసుతుఁడు కూరుం డెపుడున్." భా. రా. బాల. ౨3౫. భీమ. 3, ఆ. ౬౨. 3. కుటుంబము, సంసారము. (బ్రౌ.)

జోటిక. వై. వి. (జోటి+క-స్వార్థమున) స్త్రీ; భార్య. "గీ. మదఁటి జోటిక ముద్దుగుమ్మ యన స్త్రీస, మాఖ్య..." ఆం. భా. ద్వి. ఆ. ౧౦౪. "సీ. ఊడిగంబుల కెల్ల నొదవి నల్లదలఁ బాయకయుండుకపసి జోటికల మఱచి." సున. ౧. ఆ. ౧౨౯.

జోటికత్తియ. ద్వ. వి. (జోటి+కత్తియ - స్వార్థమున.) చెలికత్తె. రూ. జోటికత్తె.

జోటిపని. ద్వ. వి. (జోడు+పని) మిథునకర్మము, "క. నీ టొదవఁగ నయ్యెడయని, చోటికిఁ బలితెంచివలపు సొంపెసలారన్, జోటిపనుల్ గోరిన న, జ్జోటిం గని పొఁసుదిండిమూ డి ట్లనియెన్." అచ్చ. అర. ౯.

జోడఁగి. దే. వి. సన్నముగానుండి మిక్కిలి వేగముగా పరుగెత్తెడి వేఁటకుక్క. "క. దాడి మెయి దీని వెంబడిఁ, గూడన్ బెలజాగిలములకుం దరమే

యీ, జోడంగివేఁపిముందర, వేడియుం గీడియుఁ జనంగ తే దఘ వైనన్." కవిరా. ౨, ఆ ౯౧.

**జోడగించు.** దే. స. క్రి. జోడనడతో నడపించు. "గీ. ఎనయఁ గడు జోడగించి త్రోలినహయంబు," సా. ౧, ఆ. ౪౩. (శ. ర. పా.)

**జోడన.** దే. వి. 1. ధౌరితకము, అశ్వగతిభేదము. "సీ. జోడనల కొకింత జోడు గానేరక వేఱ్వురాయని తేజి వెల్లనయ్యె." ఉ. రా. ౧, ఆ. ౭౪. ఆం. భా. ద్వి. ౮౯౪; 2. (నాసికయొక్క) రంధ్రములు. "సీ. మునునలదమిఁ బట్టి ముంగాళ్ల ముక్కు జోడనలఁ బీలిచి పనర్కొనిన విడిచి." ఆము. ౫, ఆ. ౧౧౭.

**జోడమ్ము.** వై. వి. (జోడు+అమ్ము. శ. ర.) చేయమ్ము, చేతితో ప్రయోగించెడిబాణము, విల్లక్కఱలేని బాణము. "సీ. దివెవారిగొమ్ము దోల్తిత్తియుం జోడమ్ము మెడమీఁది మొగలాకుగోడుగుఁదనర." ఆము. ౬, ఆ. ౬. "సీ. చాపానపేక్షియౌశర మొప్పదుండుఁ జేయ మ్మంచనంగ జోడ మ్మనంగ." ఆం. భా. ద్వి. ౨౧౩.

**జోడా.** దే. వి. (హిం. జోరా.) జత, యుగళము. (వా.) మురుగులజోడా.

**జోడాలు.** వై. వి. బ. నమస్కారభేదము. "సీ. జోహారును జోహారు జోడాలు చెంగనాల్గిడి గిల్లు గొబ్బిళ్లు టెంగణాలు...తనరు." ఆం. భా. ద్వి. ౧౭౫.

**జోడించు.** దే. స. క్రి. జతచేయు. 1. ఒకదానితో నొకటి-చేర్చు. "శా...దత్తుం డెవ్వాఁడిల రామ భారతకథల్ జోడింప భాషాకృతిన్." రాఘవ. పీఠి. ౧, ఆ. ౧౦; 2. కూర్చు, చేయు, రచించు. "క. ఒకమాటఁ బలుకలేరఁట, చకితమనస్కులును గాక చక్కఁగ కథలన్, సకలార్థసాధనములగు సుకృతులు కుకవులకుఁ దరమె జోడింపంగన్." కుచేల. ౧, ఆ. ౪. "సీ. వగటుపావలు మెట్టి బట్టుకై వారముల్ జోడింప మరిగెలనీడ కేఁగు." కువల. ౫, ఆ. ౯. 3. కల్పనచేయు, కల్పించు. "ద్వి. మంత్రికుమార నీమాటలు చాలుఁ, దంత్రవాదివిగానఁ దప్పజోడించి, కలవి లేనివి కొన్ని కపటముల్ పన్ని, కలఁతఁ బుట్టింప నిక్కముగఁ బల్కితివి." ద్వి. శ. సా. ౧, ఆ. ౨౦. పు. ౭. పం. 4. వెంబడించు. "సీ. జోడించినసివంగి కేడించుకొనునిట్టి వెనుకగాఁ గుట్టార్పు విడిచి త్రెళ్లె." కకు. ౪, ఆ. ౯౪.

**జోడింపు.** వై. వి. (జోడించు భా.) ముప్పదిరెండు విన్నాణములలో నొకటి, మల్లబంధవిశేషము. "సీ. కాసె నిల్కడ గళకత్తెర జోడింపు... గీ...మెడపట్టు నాఁగఁ జె న్నలరు దుండు,ముప్పదియుం రెండువిన్నాణములకుఁ జెల్లు." ఆం. భా. ద్వి. ౨౦౯.

**జోడిల్లు.** వై. వి. బ. నమస్కారము. "వ. సూర్యమండలమందలి పద్మాక్షునకు జోడిల్లు...వెంగనాలు." ప్రబంధ. ౪౪౦.

**జోడు.** దే. వి. హి. (క. జోడు.) 1. జత, యుగము. "గీ. వార లిరువురు బాల్యభావమునఁ జేసి, శయనపానాన్న భోజనసమయములను, శాస్త్రపఠనాది విద్యాప్రసంగములను, జోడు వాయక యుండుదురు వేడుకలర." బ్రహ్మో. ౫, ఆ. ౧౭౨ పు. "సీ. కవ్వపుత్రుక వాఁడు గాలిమేఁతరియుండ జోటివాఁ దరమెయిఁ జోటివాఁడు." అచ్చ. బాల. ౧౩; 2. మిథునము, ద్వంద్వము. "ఆ...మిథునమున కాఖ్య లగు జోడు, దోయి కవ యనంగ ధూతకలఁవ." ఆం. సం. మాన. ౪౨; 3. సహచారి, మిత్రము. "సీ. పావన బ్రహ్మకపాలమాలికఁ జోడౌదువొక్కొకనాఁడు హరు నగుచు." దశా. ౨, ఆ. ౧౭౯; 4. కవచము; "గీ...అమ్మారుక పుత్రు జోడుఁ, దనువుఁ జించిరి వివిధాస్త్రతతులవలసి." భార. భీష్మ. 3, ఆ. ౨౨౧. "మ. గద దట్టించి నిశుంభుమస్తకము నశ్కాలుండు వ్రేయన్ మెయిన్,నపరం బైన నొకింత శక్తి రిగియున్ కాతాసిచే వాఁడు జోడు దగన్ వ్రేసిన మేను ప్రస్సి..." ఉ. హరి. ౧ ఆ. 5. అశ్వకవచము. "ద్వి. మెఱుగులువాసినమించు మొలకలౌ జోడు, దిగిచినసూనాస్త్ర తేజులోయ నఁగ." అ. పు. క. ౧, ఆ. ౭౫. పా. ౧౭ పం. ౩౫; 6. విధము. "వ...పిచ్చుకలు కొట్లాడి పట్టు పట్టెసిజోడున నొండొరువుల తనువులు జర్జరితంబులై ఓరిఁగి..." ప్రబంధ. ౭౪౪. విణ. సమానమైనది. "క. ఓడవు సురాసురాదుల,

కోడవు భవజలధిఁ గడప నోం డెవ్వఁడు నీ, జోడు జగంబులమాకుఁ; జోడుభవక్కురణ మనుజఁజూడు మహాత్మా." రామా. 3,ఆ. ౨౦3
ఆం. సం. స్థా. 3౪. దశా. ౧, ఆ. ౪౯.

జోడుకోడియ. ద్వ. వి. ఐ. సహచరము, మిత్త్రము "గీ... జాళవాఁగట్టుతోడి, జోడుకోడియ లవ్వీటి పేడగములు." రామా. ౧, ఆ. ౧౨౩.

జోడుకోడె=జోడుకోడియ. విణ. సమానుఁడు. "మ. జలజాతాప్తునిజోడుకోడె యగుటన్ జంద్రుండు దాఁ బుట్టు నిచ్చలపుంగెంపున బ్రహ్మభూయము..." చంద్రా. ౫, ఆ. ౫౭. "చ. వల పులవింటివానిదళవాయి వసంతునిజోడుకోడె..." రామా. ౧, ఆ. ౫౧; వి. మిత్త్రము. "గీ. సుర ధరిత్రీధరమునకు జోడుకోడె, వనధినభమైన మైనాకమునకుఁ దండ్రి." వరాహ. ౧౦. ఆ, ౪౯.

జోడుగట్టు. దే. అ. క్రి. (జోడు+కట్టు) జోడు గూడు. "మ.... జోడుగట్టుతతి రివ్వన్ మీఱి జోడించుచున్. నిరం. 3, ఆ. ౨౦.

జోడుగూడు. దే. అ. క్రి. (జోడు+కూడు) కవ గూడు, కలయు, మిళితమగు. "ఉ... జక్కవ లొక్కట జోడుగూడ వే,వే యఱిరియాడఁ దోడరహి పీడ విరిర్మలసాంద్ర చంద్రికల్." చంద్రా. ౫, ఆ. ౧౧3. కేయూర. 3, ఆ. ౭.

జోడుగూర్చు. దే. స. క్రి. (జోడు+కూర్చు—జోడుగూడు ధా. ప్రే.) సరిచేయు, పోల్చు, "సీ. తాళముల్ జూడఁ గీర్తనపాత్రము లటంచుఁ గొట్టుమారుల జోడుగూర్పఁ దగునె... గబ్బిచన్గుబ్బగవకు." చంద్రా. ౪, ఆ. ౧౨౭.

జోడుదటిచు. దే. స. క్రి. జోడుగూడు, కలియు. "గీ. తనరుమాతంగకుంభకుస్తనుల జోడుదటియఁ జాల దురాగతత్వమునఁజేసి." హ. స. ౨, ఆ. ౬౧.

జోడుపులుఁగు. దే. వి. (జోడు+పులుఁగు) చక్రవాకము. వేంక. విర్య. ౧౦౨.

జోడురాలు. దే. వి. బ. (జోడు+రాలు) క్రీడా విశేషము, ఒకవిధమైనయాట. "సీ. దాయాలు సొగటాలు దాట్రాయ చదరంగమును జోడు రాలును మూఁటపొడుపు." హంస. 3, ఆ.౧౪౬.

జోడువేల్పురిక్క. ద్వ. వి. విశాఖా నక్షత్రము(శ.ర.)

జోణఁగి=జోడఁగి. (త. కోణంగి) "సీ... తునకము వేపి తక్కునఁగఁ దనరుఁ, దద్భేద సామము తగు జోణఁగి యనంగ పనకునకంబులే చనఁగ నొప్పు." ఆం. భా. ద్వి. ౨౮౦.

జోత. దే. వి. నమస్కారము. "క. గాలిని సుఁ గెలిమితో ర్యాచూలిం బొడగాంచి మిగుల జోత లొసఁగి తొ,ల్వేలుపుప్రేలిమి నెఱిచిన, జోలి యెఱింగించి మదిని జొక్కించెసెన్." అచ్చ. యు. ౪౫౮. "ఉ... గట్టురాచూలి యనుంగుసామికిని జోతలు జోత లటంచుఁ బల్కుచున్." సా. ౧, ఆ. ౪౪.

జోతము=జోత. (శ. ర.)

జోతాము. దే. వి. జోతముయొక్క రూపాంతరము. (శ. ర.)

జోతి. వై. వి. (సం. జ్యోతిః.) 1. ప్రకాశము, వెలుఁగు. "సీ. వెలయుఁ బ్రకాశంబు వెలుఁగు జోతి యనంగ..." ఆం. భా. ప్ర. ౧౨. "సీ. రాలిరియొకమీఁదు జోతి యుండెడువాఁడు..." శకాం. ౧, ఆ. 3౯; 2. దీపము. 'సీ. విడికెంపు గుంపుఁ జెక్కడపుఁ జొక్కపు కోటగొమ్మలు జోతులయొప్పుఁ దాల్ప." కుచల. ౧, ఆ ౭౦. "సీ. నేతుఁజోతుల నెఱిదీపమాలికల్ తారకాగ్రహ ములదారి మీఱ." అహ. ౧, ఆ. 3౦; 3. వన్నె, రంగు. "ఆ. వన్నె డాలు రంగు పన్నియ జిగి జోతి, చాయయనఁగఁ బరఁగు జగతిఁగాంతి." ఆం. సం. స్థా. ౧౭; 4. పిండితోఁగాని మట్టితోఁ గాని చేసినదీపపాత్రము.

జోడెల్లు. వై. వి. బ. నమస్కారములు. 'గీ. అల్లో నేరెల్లు జోడెల్లు..." ఆం. భా. ద్వి. ౧౭౫.

జోదు. వై. వి. (సం. యోధః) యోధుఁడు, యుద్ధము చేయువాఁడు. "సీ. జోదులతనువులు ఛేదించి మోరలు గళ్యాతోడఁ జెక్కులుఁగఁ జేసి." భార. కర్ణ. ౧, ఆ. ౧౪౦. ఆం. భా. ద్వి. ౧౮౪.

జోనంగి. దే. వి. ఒకజాతికుక్క. రూ. జోణంగి. (శ. ర.)

జోనఁగి = జోడఁగి. (బ్రౌ. శ. ర.)

జోనడ=జోడన. (బ్రౌ. ఇందు వర్ణవ్యత్యయము అని శ. ర.)

**జోపాప.** ద్వ. వి. (జో+పాప.) జోకొట్టుటకుఁ దగిన శిశువు. "సీ. కేలికి హరి వైవఁ గేలిఁ దాలిచిన సాపఁగి బంతిగొనఁ జోపాప లగుచు." ఉ హరి. ౧, ఆ. ౧౫౧.

**జోబిళ్లు.** దే. వి. బ. నమస్కారము. "రగడ. ఘనతర నహోబలగరుడాద్రి హిరణ్యాసురవధునకు నతి జోబిళ్లని." హంస. ౪, ఆ. ౨౧౩. (క. ర.)

**జోము.** దే. వి. (క. జోము.) సుఖము. "ఆ. తాము నిలుచుచోట దైవము లేదని, పామరజనము తిరుకతులు దిరిగి, జోము చేడి చేటిసా మైల్లఁ బోఁకేసి చెడి గృహంబు తాను జేరు వేమ." వేమన. 3, ఆ. ౨౭౦.

**జోరావరి.** దే. వి. (క. జోరావరి. హిం జోరావర్) బలాత్కారము. (క. ర. బ్రా.)

**జోరు.** దే. వి. **1.** వాన ముఖ్యముగనవి కురియుటయం దగుధ్వన్యనుకరణము. "ఉ. జోరున దుందుభుల్ మొరసెఁ బువ్వుమయం బగువర్ష మంతటన్. జోరున వెల్లిగాఁ గురిసె..." చమ. 3, ఆ. ౭౮; **2.** తొందర, దుడుకుతనము. (వా.) నీకింత జోరుపనికిరాదు. **3.** బలము, బలాత్కారము.

**జోటీగ.** దే. వి. (జోటు+ఈఁగ) పశుమక్షిక, ఒకానొక ఈఁగ. "సీ...జోటీగ నాఁగను మీఱును పశుమక్షిక..." ఆం. భా. ద్వి. ౯౫. "సీ. మకరందపానంబు మధుకరాళికిఁ గాక జోటీఁగ చవి గని జుట్టఁ గలదె." వేణు. ౫౧, రూ. జొట్టీఁగ.

**జోఱు.** దే. వి. ఈఁగలు తుమ్మెదలు మొదలగునవి ఎగురునపుడు కలిగెడుధ్వని కనుకరణము. (వా.)

**జోఱుటీఁగ.** దే. వి. జోటీఁగ. "ఉ...బలురోమము లంటిన జోఱుటీగలున్, గూడినబంధముం గలిగి కూర్కుచు నుండ డోకబక్క గుజ్జునన్". హంస ౫, ఆ ౩౦.

**జోల.** దే. వి. బిడ్డలను నిద్దుర పుచ్చునపుడు పాడెడు పాట. "గీ. పాట యనఁగను గానాఖ్య పరఁగు చుండు, లాలి యనంగ నాలప్తి యలరుచుండుఁ, దద్విశేషాభిధానముల్ దనరు నేల జోల సువ్వాల యనఁగను సోమభూప." ఆం. భా. ప్ర. ౧౨౩. "సీ. వేదాంత వేద్యుఁ డీబిశ్వంభరాధీశు శుద్ధాంత కాంతల జోలఁ జొక్కె." రామా. 3, ఆ. ౧౩౮.

**జోలి.** దే. వి. **1.** విషయము, సంగతి, సంబంధము. "శా. ఆయెర్క్ బోయెను నాఁటిపోలి యింక నేలా యీవలన్ వింటివే, యోయయ్యా..." ఉ. రా. ౨, ఆ. ౨౭౬. "ఆ. నే యేలం గొనెదు జోలియు దేటికి." అచ్చ. యు. ౩౯౭. "గీ కూలి గొనని ఱ్ఱ కాఁబోలుఁ గొదమచిలుక, తపసి బుధులకుమికి వేదంబు నుడువు, నుసరముగఁ బాలికాంఱ్ఱు లేజోలి లేక, జపతపంబులు సాగింప జనఁదె?" శుక. ౨, ఆ. ౬౩; **2.** వృత్తాంతము. "క. గాగినిఁ గెలిమితో రా, చూలిం బోదగాంచి మిగుల జోక లొనగి తో, త్వేలుపు కేలిమి సెచిన, జోలి యెఱింగించి మదిని బొక్కించెసెన్." అచ్చ. యు. ౪౫౫. **3** కార్యము, పరి. సాం. ని. మాన. ౨౮. **4.** గాథ. "సీ...గాథ యనఁ జోలి నా..." ఆం. భా. ప్ర. ౧౧౭. "మ. విను మింకం దెనుజోలి రిత్త చపువుల్ వేయేల..." మల్హ. శృం. ౩౯.

**జోలియ.** దే. వి. జోలె. (ఉయ్యాల). "క. వారు పీర్యము దాల్పఁగఁ గడు, ధీరమై పడి నడుము డిగ్గఁబడి కదప ఖ్వంబరమందున నిల్చి పొల్చెను, సురవాహిని బాలుఁ డున్నజోలియ వోలెన్." కు. సం. ౧౦, ఆ. ౧౩.

**జోలె**, **జోలియ.** దే. వి. **1.** భిక్షుకునకై చొకపుగుడ్డ నాలుగంచులు చేర్చి ముడివేసి చేతిని వ్రేల వేసికొను సంచి. "గీ. జోగ పట్టియు కకపాల జోలెసంచి, కటికి కాటుక గిర్కొట్టు పలుఁగు పేరు, జాటిగాఁ దాల్చి కఱమిందజంగ మగుచు." హర. ౫. ఆ ౪౧; **2.** ఉయ్యాల. "సీ. ఉయ్యాల యొయ్యాల యూయెల తొట్టి జోలె యనంగ డోలికాహ్వయము లెసఁగు." సాం. ని. స్థా. ౬౪.

**జోలెకాఁడు.** దే. విశ. (జోలె+కాఁడు) భిక్షుకుఁడు, బిచ్చగాఁడు. "గీ. ఏల నఁడు జూడ వీపనం దేల యిట్టి జోలెకాఁడై నలిరిపప్ర జోగి యేల, యఖిల లోకంబులకుఁ బతి యైన నన్నుఁ, గదిసి వర్తింపఁ జెల్లదే కమలనయన." సీతావి. ౪, ఆ. ౧౩౭.

**జోవ.** దే. వి. జోల. "ఉ. వేవిన నిద్ర మేలుకని వేఁబొకబానను దీర్పుతోడఁ బై, మీవడఁ బుచ్చి కవ్వ మిడి మిట్టచనుంగవ రాయిడింప మేఁదీవ నటింప కొన్నడుము దీలుపడం గటి గుల్క

గాచముల్, జోవలు పాడఁ జల్లఁ దరుచుక్ వడి ధర్షిణి రజ్జుపాణియై." వేం. పంచ. ౧, ఆ ౫౯౦.

జోసి. (సం. జ్యౌతిషికః) వై. వి. జ్యౌతిషికుఁడు, జోస్య మెఱింగినవాఁడు. (శ. ర. బ్రా)

జోస్యము. వై. వి. (సం. జ్యౌతిషమ్) జ్యోతిశ్శాస్త్రము. (శ. ర.)

జోస్యుఁడు. వై. వి. (సం. జ్యౌతిషికః) జ్యౌతిషికుఁడు. జోస్యము నెఱింగినవాఁడు. "గీ. పలయుఁ బ్రాహ్మ్యఘోదబ్జుతత్త్వముల నొకటి, తారకంబులుఁ దిథులును వారములును, జోస్యు లెఱిఁగించినవి మేలు సుప్రతీక, లోలమంగళిపనికిని దైల మునకు." భార. అను. ౪, ఆ. ౧౨౧.

జోహారు. దే. వి. (నమస్కారము.) "వ... కాలభైరవునకు జోహారును... దండపాణికి దండప్రణామంబును... చేసి." భీమ. ౨, ఆ. ౫౦. "సీ. జోహారు మకరజదోర్మహోగ్రగాణ్డీవహా ప్రాహార్ఘ్య దావానోత్సాహా నీకు." ఉ. రా ౧, ఆ. ౩౨౨

జోహారువు = జోహారు. "గీ. అతఁడు సుగలకు జోహారు వనుచు మ్రొక్క." సైవ. ౭, ఆ. ౫౫.

జౌ

జౌకు. దే. అ. క్రి. మిక్కిలి మెత్తగిల్లు లొంగు. బ్రా. ఉదా. కట్టుకట్టిగడ్డ జౌకినది. వి. (బురద. పంకము) "సీ. చలిమావిరసముల జౌకు లెత్తినచోటఁ గలువపుప్పొడి నించి బలసి బలసి." చంద్ర. ౩, ఆ. ౧౧౦. (జవుకుయొక్క రూపాంతరము.)

జౌజవ్వ. దే. వి. జవ్వనకామ్రేడితరూపము. 1. పాఱుటయం దగుధ్వని కనుకరణము. "మ. శర సంధానములోనె కొన్నియడుగుల్ జౌ జవ్వనం బాఱి..." వసు. ౪. ఆ. ౧౧౧; 2. వంగుటయం దగుననుకరణము. "ఉ. ఇవ్విధిఁ బూని సైనికసమృద్ధి నహీంద్రఫణాగణంబు జౌజవ్వనఁ గ్రుంగ..." పరమ. ౪, ఆ. ౧౫౬.

జౌరు. దే. స. క్రి. 1. కొట్టు. "సీ. వాల్గంటి కీల్గంటు వైచి వచ్చినచెల్వ జడ యల్లుకొను నాఁటిపౌరు జౌరు." విజ. ౩, ఆ. ౧౩. 2. చేతులతో ప్రోగుచేసి యెత్తు. (జేవురుయొక్క రూపాంతరము.)

జౌళి. దే. వి. ఒకానొకరాగము. "గీ... నాట, జౌళి దేశాక్షి తోడి వరాళి శ్రీవరాళి హెజ్జజ్జ కేదార గౌళ పాడి." ప్రబంధ. ౯౬. (జేవ్రళియొక్క రూపాంతరము.)

ఝ

ఝ. సం. ఒకానొక యక్షరము

ఝంకరించు. సం. అ. క్రి. ఝంకారము చేయు, రొదచేయు. చను. ౪, ఆ. ౨౦.

ఝంకరింపు. మి. వి = ఝంకారము. (ఝంకరించు "ఉ. కెంపుమొగంపుఁబచ్చ తురికీ నుఱికి పుచు ఝంకరింపు చే, నిం పొదవించు..." కవిరా. ౩, ఆ. ౪౫.

ఝంకారము. సం. వి. అ. పుం. తుమ్మెదలు మొదఁగు వానిరొద.

ఝంకించు. మి. అ. క్రి. ఝంకరించు. "వ... అని ఝంకించిపలుకుటయు..." కాశీ. ౪. ఆ. ౭౭.

ఝంకృతి. సం. వి. ఇ. స్త్రీ. ఝంకారము

ఝంఝ. సం. వి. ఆ. స్త్రీ. వానతోఁ గూడి ఝమ్మని వీచు జోరుగాలి; 2. కురియుచున్న వానయొక్క గాని వీచుచున్న గాలియొక్క గానిధ్వని.

ఝంఝావాతము. సం. వి. అ. పుం. వానతోఁగూడిన పెద్దగాలి, తుపాను.

ఝంప. సం. వి. ఆ. స్త్రీ. 1. దాఁటు, గంతు, దూఁకు; 2 జంపెతాళము. 3. మల్లవిద్యావిశేషము. 4. అశ్వగతిభేదము. "గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేఁ డనుచు నెమకు, ఝగిడిఁ దగునడ్డవేడెము ల్పఱపి మఱియు, భంజళి మరళి ఝళిపి ఝంపయు నుధాల, మనగతులెనఁగఁ జూపుచు వాళి మీఱ." ప్రబంధ. ౧౯౫.

ఝంపము. సం. వి. అ. పుం. దూఁకు, గంతు, దాఁటు.

ఝంపాకము. సం. వి. అ. పుం-దుముకునది, కోఁతి.

ఝంపారువు. సం. వి. ఉ. పుం = ఝంపాకము.

ఝంపు. వై. వి. మల్లబంధవిశేషము. "వ. ఏకసర పైసర భృంగిపటలము ఝంపు టెక్కు కరలాఘవంబు లాదియగాషోడశోపవీతంబుల రీతులు నేర్చి..." హంస. ౧, ఆ. ౨౦౬.

ఝకటము. సం. వి. అ. పుం. జగడము.

ఝగితి. సం. అవ్య = ఝటితి. [సిరిక.

ఝట. సం. వి. ఆ. స్త్రీ. 1. వేగము, త్వర; 2. నేయు

ఝటితి. సం. అవ్య. శీఘ్రముగా. "మ. ఝటితి స్ఫూర్జత్పలాశపత్త్రపుటికా శాటీ ప్రదేశంబులన్." కాశీ. ౭, ఆ. ౧౩౨. "చ. ఛటికెన వ్రేలియుంగరము. చేడియ కొడ్డెనమాయె భూవరా, కటకట దోసమం డినపకట్లకుఁ దాళనఁటే తళోదరీ, కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్, ఝటితిని గాంతు నే నని నిజాంగనతో దను దెల్పు వేగమే." కవిజనోజ్జీవని. ౮౯.

ఝణఝణ. సం. వి. అ. పు. ఆ. స్త్రీ. కంకణాదుల ధ్వని ననుకరణము. "సీ. ఝణఝణా మణికంకణములు మ్రోయంగ గణగణ మొలనూలిగంట లులియ." ప్రబంధ. ౧౮. "గీ. కమ్ర కరపంకరుహారత్నకటక ఝణఝణధ్వని స్ఫూర్తి తాళమానములు గొలుప." మను ౨, ఆ. ౨౭.

ఝణఝణత్కారము. సం. వి. అ. పు. కంకణాదులధ్వన్యనుకరణము. "వ...కంకణఝుణఝుణత్కారంబు తోరంబుగా..." భీమ. ౨,ఆ. ౧౦౯.

ఝణత్కారము. సం. వి. అ. పు. కంకణాదిధ్వని.

ఝర. సం. వి. ఆ. స్త్రీ. 1. సెలయేఱు; 2. ఒకజాతి తోఁటకూర.

ఝరము. సం. వి. అ. పు. సెలయేఱు.

ఝరి. సం. వి. ఈ. స్త్రీ. సెలయేఱు.

ఝర్ఝర. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య, భోగముది.

ఝర్ఝరకము. సం. వి. అ. పు. కలియుగము. కంజుముడి యను వాద్యవిశేషము.

ఝర్ఝరము. సం. వి. అ. పు. 1. డమరువు, డక్క 2. పటహము, తప్పెట; 3. కలియుగము; 4. నదవిశేషము; 5. బెత్తము; 6. వంట కుపయోగించునొకానొక లోహపాత్రము; 7. మణిదోష విశేషము. జర్జరము. (శ. ర.)

ఝర్ఝరి. సం. విణ. (న్. ణీ. న్.) ఝర్ఝరము కలవాఁడు. సం. వి. న్. పు. శివుఁడు. ఈ. స్త్రీ. ఝర్ఝరము, కైమఁడి.

ఝర్ఝరికుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ఝర్ఝరము వాయించువాఁడు.

ఝర్ఝరీకము. సం. వి. అ. పు. 1. దేహము; 2. దేశము; 3. బొమ్మ.

ఝల. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. సూర్యకాంతి.

ఝల్ఝల. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుచెవులు కొట్టుకొనుట. రూ. ఝజ్ఝల.

ఝలరి. సం = ఝల్లరి

ఝలి. సం. వి. ఇ. స్త్రీ. పోక. ఈ. స్త్రీ. జలగ, జలూక.

ఝల్లకంఠము. సం. వి అ. పుం-ఝల్లవాద్యధ్వనివంటి ధ్వని కలది. పావురము.

ఝల్లకము. సం. వి. అ. న. కంచుతో చేయఁబడిన కరతాళము.

ఝల్లకి. సం. వి. ఆ. స్త్రీ = ఝల్లకము. (వాచ.)

ఝల్లము. సం. వి. అ. పుం. ఒకవిధ మగుమద్దెల.

ఝల్లరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఝర్ఝరము; 2. ఉడుక, (పెద్దడోలువంటివాద్యవిశేషము. అని కొందఱు.); 3. కేశము, కేశసముదాయము; వెండ్రుకల మురికి పోఁగొట్టుకరిమళద్రవ్యముల మద్ద 4. తడి; 5. నీటిసుడి; 6. శుద్ధి; 7. గొడుగు మున్నగువానికి చుట్టును కట్టెడు జాలరు; 8. ఆఁడుందుమ్మెద. "సీ. వల్లరీవలమాన ఝల్లరీఝుంకార వల్లకీకలనాదపేల్లితంబు." భా. రా. యు. ౫౭౭.

ఝల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధ మగుమద్దెల.

ఝల్లిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నలుఁగుపిండితో నలిచిన రొమ్ముదలిముఱికి; 2. కాంతి; 3. రంగు గాని సువాసనద్రవ్యములు గాని పట్టించుటకు ఉపయోగించు పేలిక.

ఝల్లు. వై. వి. జల్లుయొక్క రూపాంతరము. 1. భయాదులచే ప్రాణము గుండెలు మొ. చెదరుట యందనుకరణము. "క. వారుఁ గని ప్రాణములు ఝల్లని. విరిసిన మెయిముఱిచి వచ్చువిల్తుఁడు... కదలక నిల్చెన్." కు. సం. ౫, ఆ. 3. "క. ప్రాణము ఝల్లన నమ కల్యాణనిధిం బ్రియుండు జూడ నతఁడు గుఱి యగున్, బాణకరనికరతర, బాణంబులకున్ గటాక్ష బాణంబులకున్." ఉ. హరి. ౫, ఆ. ౨౮౫; 2. రక్తము మొ. పైకి ఉబుకుట కనుకరణము; 3. వానచినుకులు మొ. పడుటకనుకరణము. "గీ. ఝల్లుఝల్లునఁ జినుజల్లు చల్లుచుండ, భోరుభోరున వర్షంబు ధార లురిసె." శుక. ౧, ఆ. ౨౭౬. "సీ... త్రిదండిసమితి గుండెలు ఝల్లుఝల్లుమనఁగ." ప్రబంధ. ౧౯.

ఝల్లోలము. సం. వి. అ. పుం. తక్కళ్లాడకము, నూలు వడుకునపుడు కదురుక్రింద నుంచుకొనెడు చిప్ప.

ఝష. సం. వి. ఆ. స్త్రీ. నాగబల, బీఱ. ♆

ఝషకేతుఁడు. సం. వి. ఉ. పుం-ఝషము పతకగా కలవాఁడు-మన్మథుఁడు.

ఝషభషము. సం. విణ. కఠినమై నిందాపూర్వక మైనది. "క...ఆతని, చక్కఁదనంబునకుఁ గాఁడె సరసపుఁ బద్యం బొక్కటి రచియించిరిఁ గవు,ల క్కట ఝషభషపుఁగవితలల్లఁగా గిచుకన్." సావి. ౨, ఆ. ౮౮.

ఝషము. సం. వి. అ. పుం. 1. చేఁప; 2. మొసలి 3. మీనరాశి; 4. తాపము, వేఁడిమి. న. అడవి.

ఝషోదరి. సం. వి. ఈ. స్త్రీ. ఝషము యొక్క ఉదరము జన్మస్థానముగా కలది-మత్స్యగంధి, సత్యవతి. (వ్యాసునితల్లి.)

ఝళంఝళ. సం. వి. ఆ. స్త్రీ. 1. కటకధ్వని కనుకరణము, అందెలు, మొ. వానిధ్వని కనుకరణము. "సీ. బిరుదందెల ఝళం ఝళరవమ్ములఁ ద్రిదండి నమితి గుండెలు ఝల్లుఝల్లు మనఁగ." ప్రబంధ ౧౯; 2. ఏఱు ప్రవహించునపు డగుధ్వనికనుకరణము. 'చ...ఉచ్ఛలజ్జల ఝళంఝళ నిర్ఝర ఝర్ఝరీభవ, న్నగవిగళచ్ఛిలా గణఘణంఘణ ఘోషణభీషణంబుగన్." కళా. ౪, ఆ. ౮౭.

ఝళజ్ఝళము. సం. వి. అ. పుం. నీటిబొట్టులు క్రిందఁ బడునపుడు గలుగుధ్వని.

ఝళఝళ. దే. వి. ఆ. స్త్రీ. వర్షధారలుపడుట యందలిధ్వని కనుకరణము. "గీ. రమ్యమేఖల ఘళఘళల్ రత్నహేమ, కలితనూపుర ఝళఝళల్ చలదవలంవ, ఫెళఫెళన్ గిల్కుమట్టెలగిలగిలల్ ర,హించ రాయంచకడ నిల్చెఁ జంచలాక్షి." హంస. 3. ఆ. ౫౪.

ఝళిపి. సం. వి. ఈ. స్త్రీ. అశ్వగతిభేదము. "గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేఁ డనుచు నెమకు పగిదిఁ దగుసడ్డవేడెము ల్బరపి మఱియుం, ధేంజళి మురళి ఝళిపి ఝంపయుం సుధా, మనుగతు లెసఁగఁ జూపుచు వాళి మీఱ." ప్రబంధ. ౧౮౫.

ఝళిపించు. దే. క్రి. ప్రే. జళిపించుయొక్క రూపాంతరము.

ఝసక్కు. దే. వి. చింత మొదలగు వానియం దగు ననుకరణము. "ఉ. ఇమ్మవిరాక్షి మ్రొక్కెడియొ నింటికిఁ బోవలెనంచు నట్ల కా, ని మ్మని యానతీ వలయుఁ. నీశ్వర యం చని బోఁటు లాడఁ జి,త్తమ్ము ఝసక్కు రంచన వితావని చేయుండు రంచు మెల్లనే, సమ్మతి యైనయట్టు లనఁ జానలు పార్వతితోడ నేఁగఁగన్." పార్వ. ౪, ఆ. ౧౮౮.

ఝా

ఝాంకృతము. సం. వి. అ. న. 1. కాలి కడియము. 2. నెబయేఱు మొదలగువానిధ్వని. పుం. తూర భేదము.

ఝాటము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. పొదరిల్లు. 3. కాఱడవి.

ఝాటలము. సం. వి. అ. పుం. మొక్కపుఁజెట్టు. ♆

ఝాటలి. సం. వి. ఈ. స్త్రీ. పొదరిల్లు.

ఝాటు. దే. వి. మల్లవిద్యాసంబంధ మగుపదునాల్గు విసరులలో నొకటి. "వ...ఝాటు కథాను... మొదలగు విసరులును..." మల్లుపు. 3, ఆ. ౯౯. "వ...అప్వీరుండు...ఝాటు నివి మొదలైన పదునాలుగు విసరుల మర్మంబులం జూచి..." హంస. ౧, ఆ. ౨౦౬.

ఝాటుధాణి. దే. వి. మల్లవిద్యాసంబంధ మగు పదునాలుగు విసరులలో నొకటి. "వ...అప్వీరుండు...ఝాటుధాణి ఝాటు నివి మొదలయిన పదునాలుగు విసరులం జూచి..." హంస. ౧, ఆ. ౨౦౬.

ఝాబుకము. సం. వి. అ. పుం. సన్నపు ఆకులచెక్క. రూ. ఝావుకము.

ఝామకము. సం. వి. అ. న. చక్కఁగా కాలిన యిటిక.

ఝామరము. సం. వి. అ. పుం. కదురుసాన, సూదులు మొదలగువానిని పదనుపెట్టుట కుపయోగించు చిన్నసాన.

ఝార్ఝరుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) ఝర్ఝరము వాయించువాఁడు.

ఝాలి. సం. వి. ఇ. పుం. ఒకరకముమామిడికాయ యూరుఁగాయ.

ఝి

ఝింకృతి. సం. వి. ఇ. స్త్రీ. ఝుమ్మనుధ్వని, తాళములు వాయించునపుడు కలుగుధ్వని. "గీ. భూతగణములు గరతాళములు ఘటింపఁ, జిత్రగతి నొర్తుచక చక ఝింకృతులకు...తాండవంబాడుటః భైరవుండుఁబోలె." హై. భా. ౫, ఆ. ౧౯౭.

ఝింటి. సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లగోరంటపూ; 2. నీలుగోరంటపూ; 3. పచ్చపువ్వులముగోరంటపూ. (అమరము.)

ఝిల్లి. సం. వి. ఇ. పుం. వాద్యభేదము. స్త్రీ. 1. ఈలపురుగు; 2. వాద్యవిశేషము. ఈ. స్త్రీ. 1. ఈలపురుగు; 2. ఈలపురుగుకూఁత; 3. వత్తి; 4. ఎండజిగి; 5. కరతాళభేదము; 6. రంగుగాని వాసనద్రవ్యముగాని పూయుంగుడ్డ; తుడిచెడిగుడ్డ. (శ. ర.); 7. మాఁడినయన్నము.

ఝిల్లిక. వి. సం. ఆ. స్త్రీ. 1. ఈలపురుగు; 2. ఎండజిగి; 3. నలుఁగిడఁగా ఒడలినుండివచ్చు ముఱికి.

ఝిల్లికము. సం. వి. అ. పుం. ఈలపురుగు.

ఝీ

ఝీరిక. స౽ = ఝీరుక.

ఝీరుక. సం. వి. ఆ. స్త్రీ. ఝిల్లి, ఈలపురుగు.

ఝు

ఝుమ్ము. దే. వి. ఈఁగలు మొదలగునవి మూఁగుట యందగుధ్వని కనుకరణము. "చ...ఝుమ్మని మూఁగునీ గలఁన్." ఉ. హరి. ౨, ఆ. ౧౨౯.

ఝూ

ఝూటి. సం. ఇ. స్త్రీ. 1. ఒకజాతిపోఁకపూ; 2. దుష్టదైవశక్తి, అపశకునము.

ఝో

ఝోంబకుఁడు. సం. విశే. (అ. ఆ అ.) పాడునపుడు ముఖము వికృతముగా త్రిప్పువాఁడు.

ఝోడము. సం. వి. అ. పుం. ఒకజాతిపోఁకపూ.

ఝౌ

ఝౌలికము. సం. వి. అ. పుం. చిన్నసంచి.

ఞ

ఞ. చవర్గ పంచమాక్షరము, అనునాసికము.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951

# వావిళ్ల నిఘంటువు

## అభిప్రాయములు

### డాక్టరు: శ్రీ ఏ. యల్. నారాయణగారు, ఎం. ఏ, డి. యస్. సీ.,

మహారాజావారికాలేజీ ప్రిన్సిపాలు, విజయనగరము.

ఈయుద్గ్రంథము నచ్చటచ్చట స్థాలీపులాకన్యాయముగ జూచితిని. నిఘంటువులలో నిది యుత్తమస్థానము నొందగలదని నావిశ్వాసము. తెనుగుబాసకు నిఘంటువులు లేకపోలేదు కాని సర్వవిషయ సంగ్రాహకములును, సమగ్రములు నైన నిఘంటువులుమాత్రము లేవనియే చెప్పవచ్చును. సర్వతోముఖము లయియున్నను కొన్ని యసంపూర్ణములును అందుబాటులో లేనివియు నగుటచే నాంధ్రభాషకుగల యీలోటు తీరలేదనియే చెప్పవచ్చును. ఆంధ్రభాష స్వీయమొనర్చికొనిన అన్యభాషాపదజాలమును, ఆధునికములును, శిష్టవ్యవహారసమ్మతములు నైన దేశ్యపదములను వివరించురీతి నూత్నమనక తీరదు. భాషాశాస్త్రరంగమున కృషిచేయువారి కనువగురీతిని అచ్చటచ్చట నాంధ్రపదముల తోడ అర్థమునందు, రూపమునందు సాదృశ్యముగల తమిళ కన్నడాది భాషలందు వ్యవహృతములగు పదముల నెత్తి జూపుటయు నవీనము. ఉదాహరణమునకు (ఆం) అంబారము (క) అంబారవు (త) అంబారమ్ మొదలగునవి సంస్కృతశబ్ద సంబంధము గలిగి, సంస్కృతపదము లయ్యును తెనుగు నుడికారమను భ్రాంతిని గొల్పు కొన్నిశబ్దముల ప్రకృతి ప్రత్యయ విభాగపూర్వక వివరణము ఆంధ్రవిద్యార్థుల కత్యంతోపయోగకరము. అర్థనిర్ధారకములగు ప్రాచీన మహాకవిప్రయోగముల వివరించునెడ నచ్చటచ్చట జూపుట భాషాసేవ యొనర్చువారి కెక్కుడుగ నుపకరించును. ఈనిఘంటువు రెండుసంపుటములలో వెలువడనుండియు నెక్కువ వైశిష్ట్యము కలదగుట నాంధ్రలోకమున కాదరణీయము. తదితర నిఘంటువులవలె ప్రతిగ్రంథాలయమునం దుంచవలసినట్టిది మాత్రమే కాక మూల్యమునం దల్పమై విషయసంపదయం దమూల్యమగు నీనిఘంటువు ప్రతియాంధ్రునియింట నుండవలసినదే. ఆంధ్రలోకము వావిళ్లనిఘంటువు నాదరించి నిట్టియుద్గ్రంథముల బహుళావిర్భావమునకు ప్రోత్సాహ మొసంగగలదని యాశించుచున్నాను. (1)

### శ్రీశతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు, చిరివాడ, కృష్ణాజిల్లా.

వావిళ్లనిఘంటువును నే నచట నచట జూచితిని. ఇది మొదటి భాగము. ఇందు అ మొదలుగా ఔ వఱకుగల పదములు ఉన్నవి. గోగడనున్న నిఘంటువుల నిదిజీర్ణము చేసికొనుటతో పాటు క్రొత్త వెలుగుల విరజిమ్ముచున్నది. ఇందు చాలగుణములు కనుపట్టుచున్నవి. ఇందుదేశ్యములని భ్రమపడుట కవకాశము కల కొన్ని దొంగపదములు వైకృతములని తెలుపు వ్యుత్పత్తి కలదు. అఱవము కన్నడము మొదలగు భాషలలోని పదముల సోదరత్వము ఇందు నిరూపితము. ఇది తెలుగున కత్యావశ్యకము. మఱియు నిందు శిష్టవ్యవహారములోగల దేశ్యములకు అర్థములు కలవు. ఇక మాండలికములకే కొఱత. అది దీర్ఘకాలమునకుగాని ఇప్పుడప్పుడే తెమలునది కాదు. అది యటుండె. ఈ నిఘంటువు శ్రీవావిళ్ల వారి పతాక. నేడు సమగ్రములగు నిఘంటువులుకొనుటకు దొరకుటలేదు. ఇట్టితఱి వావిళ్ల నిఘంటువు సమగ్రమై సకాలములో అందఱచేతులనలంకరింపగలదని ఆసించుచున్నాను. (2)

### DR. CH. NAKAYANA RAO GARU, M. A., Ph. D.

HEAD OF THE TELUGU DEPARTMENT

***Ceded Districts' College, Anantapur.***

"I have gone through very carefully nearly one hundred pages of "Vavilla Lexicon," and I find this lexicon will prove useful not only to students of Telugu literature but also be of great help to scholars. The innumerable quotations given mostly from the classics is very useful. I wish the Lexicon will be completed and published early for a similar book of

reference is not available now. I congratul te Bhasho'haraka Sri Vavilla Venkateswara Sastrulu for hav ng secured the services of Sri Sripada Lakshmipati Sastry, Sri Bulusu Venkateswarlu B. A., and Vidwan Sri Vedam Lakshmi Narayana Sastri, B. O. L. for preparing material for this Lexicon (3)

## శ్రీపుల్లగుమ్మి వేంకటాచార్యులుగారు, గద్వాలసంస్థానము

పూర్వకాలమునందు నిఘంటువుఛందోబద్ధముగా పర్యాయపదములను మాత్రము తెలియచేయుచుండెను. అట్టినిఘంటువువల్ల అర్థమునుదెలిసికొనుట కష్టముగానుండెను. ఇతఃపరముపాశ్చాత్యనిఘంటుగ్రంథములజూచి మనహిందూజనులు అకారాదిక్రమముగ పదములను వాటికి అర్థమును-దేశ్యతద్భవాది జ్ఞానమునకై కొన్నిచిహ్నములను నేర్పాటుచేసి కొన్నినిఘంటువులను రచియించుకొనిరి. దానికన్నను సౌకర్యముకలుగజేయబూనికూడ పదములకు గ్రంథప్రయోగములను జూపుచు శబ్దరత్నాదికరాది నిఘంటువులను రచియించిరి. ఇప్పుడు శ్రీ శ్రీపాద లక్ష్మిపతిశాస్త్రులవారు వాటికన్నను మిక్కిలి జ్ఞానసౌకర్యముకలుగజేయబూని వావిళ్లనిఘంటవును చేయబూనినారు. ఈప్రయత్నము సముద్రమును ఈదు చందమున నున్నది. ఇది కొనసాగినయెడల శ్లాఘతమమై బహుజనులకు గురువువలె నుపయోగకరమై యుండు నని నమ్మినారము.

వీరు గద్వాలసమస్థానం ఆస్థానపండితులు. రెండవది నాకు విద్యాగురువులు. నేను వీరిఅభిప్రాయముతో నేకీభవించియున్నాను. కవిసింహ శ్రీ పోకూరి కాశీపతిగారి అభిప్రాయముకూడయిందుతోడ పంపివున్నాను. నేను వీరి అభిప్రాయములతో నేకీభవించినాను. (4)

## శ్రీకవిసింహ పోకూరి కాశీపతిగారు, గద్వాలసంస్థానకవి

గుంటూరుజిల్లా, బోదిలవీడు.

ఇయ్యది చెన్నపట్టణవాస్తవ్యులైన బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారికుమారులును త్రిలిఙ్గపత్త్రికాధిపతులును సంస్కృతాంధ్రభాషాసేవకులును సుప్రసిద్ధులును అగు వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారియాజ్ఞానుసారంబుగ శ్రీపాద లక్ష్మిపతిశాస్త్రివారిచే రచియింపబడుచున్నది. ఇదివరకు రచియింపబడియున్నశబ్దరత్నాకరము, శబ్దార్థకల్పతరువు, శబ్దాచంద్రిక, ఆంధ్రపదపారిజాతము మొదలైన నిఘంటువులు కొన్నిశబ్దార్థములు దెలుపునవియును కొన్నిలింగభేదములు దెల్పునవియును కొన్ని అంతములు దెల్పునవియును, కొన్నిభాషాభాగప్రయోగములు దెలుపునవియును, కొన్ని తత్సమతద్భవదేశ్యగ్రామ్య పదభేదములను దెలుపునవియునై యున్నది. శ్రీ పీఠికాపురసంస్థానాధీశ్వరులైన శ్రీమహారాజ సూర్యరాయబహద్దవారు తమపేర సూర్యరాయనిఘంటువును రచియింపించుచు, పైవిషయములన్నియు దెలుసుకొనునంతటిసౌకర్యములను గూర్పింపుచున్నారు. ఇంకను శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు యివి యన్నియునుగూర్పించుటయేగాక శబ్దోత్పత్తులును తెలియగలవిధానమును చేర్పింపుచున్నారు. ఇది వెలువడినచో కవులకు కల్పవృక్ష మనకతప్పదు. ఇట్టి యమోఘమైనశబ్దసాగరమును తరియించుటకు జాకక ప్రయత్నించినగ్రంథకర్తసాహసమును కొనియాడ నలవిగాని దైయున్నది. ఇట్టినిఘంటువును వ్యయప్రయాసములకోర్చి ముద్రణమునొనర్చి పాఠకలోకమున కందజేయసమకట్టిన శ్రీవేంకటేశ్వర శాస్త్రులవారికెల్ల ధీమణులును కృతజ్ఞులే యగుదురని నానమ్మకము. పత్రికలలో ప్రయోగించు నన్యదేశ్యములుజేర్చుట గ్రంథబాహుళ్యమగుననియును కవులట్టిపదప్రయోగమునొనర్చి యాంధ్రి భాషామతల్లికి కళంకమునుగూర్చెదరనియును సాధువులనబడు ననింద్యగ్రామ్యములుదప్ప కేవలగ్రామ్య పదములును నిష్ప్రయోజకములేయగుననియును నానాదేశజనభాషాసమ్మిళనమైయున్న ప్రస్తుతప్రపంచమున నట్టియన్యదేశ్యపదముల్నియును క్రోడీకరించుట గ్రంథకర్తకు సాధ్యముకానేరదనియును నాయల్పబుద్ధికితోచినసలహానిచ్చుచున్నానుగావున మఱికొందరిప్రాజ్ఞులసదభిప్రాయమును గ్రహించి శీఘ్రకాల

ములో నీనిఘంటువును పాఠకలోకమునకు నందఁజేయుటకు యత్నించిన కృతిభర్తకృతికర్తల కాయు రారోగ్యవిభవములనిచ్చి రక్షించుటకు శ్రీజగదీశ్వరుని ప్రార్థింపుచు నిఘంటుదీపకులకు నాకృతజ్ఞతా పూర్వకవందనము లర్పింపుచున్నాఁడను. (5)

## శిరోమణి శ్రీశృంగారము అయ్యమాచార్యులుగారు

మైలవరము, బెజవాడ, కృష్ణాజిల్లా.

తమరుపంపిన వావిళ్లనిఘంటువు అందినది. నేను గ్రామాంతరము సెలవుమీద వెళ్లుటచే త్వరగా తమకు జవాబువ్రాయుటకు ఆలస్యమయినది. ఇప్పుడు చేయుఏర్పాటు బాగుగానే ఉన్నది. కాని యిదివరలో శబ్దరత్నాకరము వగయిరాలలో కొన్నిపదములు వాడుకలో నున్నవిలేవు. అట్టివి కొన్ని ఆంధ్రపత్రికలలోనివి నిఘంటువులో తయారుచేసియుంటిని. కాబట్టిన పంపగలను. తమరు కోరివ్రాసినచో మఱికొన్ని సంగీతాదిశాస్త్రములలోని ప్రసిద్ధపదములుగూడ ఇదివఱకున్ను నిఘంటువులలోలేవు. అవి కూడ సాధ్యమయినంతవఱకు వేయించిన మన నిఘంటువు నూతనపరిపూర్ణస్వరూపమును బొందగలదని నాఅభిప్రాయము. అట్టివి తయారుచేయుటకు నా కవకాశమిచ్చిన నేను జేయగలను. తమకు మాపై అట్టి ఆదరణ ఉన్నయెడల ఆర్డరు ఇచ్చి తగినయేర్పాటుచేసిన (విభాగము) అక్షరభాగములు తయారగునో ఆక్రమమును తయారుచేసి పంపుచుండగలను. (6)

## శ్రీ సత్యవోలు రాధామాధవరావుగారు

సంగీతసాహిత్యవిద్వాన్, పిఠాపురము

ప్రస్తుతము తమ వావిళ్లనిఘంటువు, 1 వ భాగము ప్రకటనమైనట్లున్నది. దానినిర్మాణపద్ధతి సర్వ ప్రబంధాది పద్యప్రయోగతత్త్సమయానుకూల శబ్దార్థవిశేషాదులగూర్చి సవిమర్శగా సమీకరించి ప్రచురించిన తమ మహత్తరదేశభాషాభిమానము ఆంధ్రులెల్లరుకొనియాడఁదగినది.

చ. వలనుగ సంస్కృతాంధ్రములభాషలలోని సమస్తశబ్దముల్
గలయ తదర్థభావములుగన్పడ మేలు నిఘంటు, సత్కృతిన్
వెలయ రచింపజేసి యిట విశ్వమునం బ్రకటింపజేసి మేల్
కలిమి యశంబు ధన్యతయుఁగాంచితి వావిళ వేంకటేశ్వరా. —"అని విన్నవించుచున్నాను".

సంగీతసాహిత్యసంబంధముగా రచించిన వసుచరిత్రములోనిపద్యములందలి కొన్నిశబ్దములు 1. సంగీతరోగములు 2. కథకుసరిపడు రెండవఅర్థముగలవి చాలాగలవు. అట్టివిశేషములను మననిఘంటువున జేర్చుట చాలాముఖ్యము = సంగీతకళారహస్యనిధి.

అందలి విశేషములను యీ ప్రక్కపైపున నుదాహరించుచున్నాను బాగుగా గ్రహించి దీనివిశేష మును ముందురాబోవు దానిలో చేర్చుదురుగాక. ఆయారాగములు పద్యములలోనే చెప్పియుండెను. వీణలోకూడవాయించుదును.

ప్రస్తుతము ముద్రితమై ప్రకటింపబడిన నిఘంటువు చూడగోరుచున్నాను. కావున దయయుంచి యొకటి బంపించగోరుచున్నాను 150 రాగము పేరులు తీసియున్నాను. (7)

## శ్రీలోకా లక్ష్మీనృసింహశాస్త్రిగారు, శ్రీసరస్వతీనికేతనము,

నందికొట్కూరు, కర్నూలుజిల్లా.

తామధికవ్యయ ప్రయాసములు సహించి బహుకాల ప్రయత్నముగా తయారొనర్చిన శ్రీవావిళ్ల నిఘంటువును నేనకస్మాత్తుగా దూరవాసియైన మామిత్రునిచెంత స్థాలీపులాకముగ నొకనాడీక్షించుభాగ్య మొదవినందుల కెంతయు సంతసంబయ్యెను. మీరొనర్చినకృషి చాలపెద్దది. మీభాషాసేవ నిష్పారమైనది. ఇటీవల బయలుదేరిన నిఘంటువుల తలకట్టుగా దోచుచున్నది. చాల

అపూర్వపదముల సేకరించి చేర్చినారు. కొన్నిట జన్యజనకభావములు జనరంజనముగా హృదయాహ్లాదకరములుగా వెలయుచున్నవి. మీతండ్రిగారినాటనుండి గ్రంథగ్రథనప్రయత్నములలవడిన కృతహస్తులు. కృతార్థులగుట జన్యజనకభావము చక్కగా సమన్వయంబయ్యె. మీనిఘంటువను కుసుమ మిప్పుడిప్పుడు వికసించి బయలువెడలినది. బహుహస్తస్పర్శన మంద లేదు. దిగంతప్రచార మచిరకాలమునం దొందవి పండితపామర లోకానేక స్తుతిపాత్రమగునని విశ్వసించువాడ. ఈ మహనీయమగు నిఘంటువునకును దీర్ఘాయురభివృద్ధుల సర్వేశ్వరుడొసగుగాత. (8)

## శ్రీ కే. వి. కామకోటిశాస్త్రిగారు, పచ్చయప్ప హైస్కూలు, కంచి

పై నిఘంటువువిషయమై శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు (19-2-34) ప్రశ్నపత్రికయందభిప్రాయములు ప్రచురింపఁగోరియుండిరి. నిఘంటువు బడులలోని బాలురకును నుపాధ్యాయులకును నుపయుక్తమగు విషయములు గలిగియుండవలయును. బడులయందు చరిత్ర, సైన్సు మున్నగు విషయములు దేశభాషలలోను నేర్పఁబడుచున్నవి. తెనుగునందు కొన్ని వస్తువులకు పేర్లు సృష్టింపఁబడవలసియున్నవి. సృష్టింపఁబడినవి కొన్ని నిఘంటువులందు లేకుండుటచే నప్రసిద్ధములుగా నున్నవి. పలువురు పలువిధములఁ జెప్పుచున్నారు. నిఘంటు నిర్మాణము సేయువారు ప్రకృతవస్తువులకు యుక్తమగు పేర్లు కల్పించి వానికి ప్రత్యేకచిహ్నములుంచి నిఘంటువునఁ జేర్చినయెడల నాంధ్రదేశమునంతట నుపయోగింతురనుట నిస్సంశయము. దిక్ప్రదర్శనముగా, గొన్నిలోపములను దీర్పఁదగినవానిని జూపెదను.

1. లోహముల విషయమున:— నిక్కల్. (Nickol) రేడియమ్. (Radium) అల్యూమినియము (Aluminium) మున్నగు పదములకును, విద్యుచ్ఛక్తి విషయమున, బ్యాటరీబల్బు, పాజిటివ్, నెగెటివ్ మున్నగు పదములకును. యంత్రముల విషయమున వాల్వ్ (Valve) సిలిండరు (Cylinder) లీవరు మున్నగు పదములకును, పెడల్, టైరు మున్నగు పదములకును, శారీరకమున అయోర్టా, ఆరికిల్ మున్నగు పదములకును నర్థేయాంధ్రత్వముఁ గల్పించుట కాని, యుచితపదములను సృష్టించుట కాని నిఘంటు నిర్మాతలచేఁ జేయఁబడవలసిన కార్యము. గృహవస్తువులకు వాచకములు తెనుగునందుండవలసిన యగత్యము లేదని యెవ్వరును చెప్పఁబోరు. ఇంకను ప్రసిద్ధముగఁ దెనుగున పేర్లులేనివస్తువులు పైనఁజూపినవానివంటివి నూర్లకొలదిగా నున్నవి.

2. ఒక్కొక్కపదము వ్రాయుచోటను దానిపర్యాయపదముల నన్నిటిని వ్రాయుటకు బూనిన గ్రంథము చాలగొప్పదగును. అది యసాధ్యము. వ్యర్థము. [illegible] ఆంధ్రభాషార్ణవము మున్నగు గ్రంథములలో నకారాద్యనుక్రమణికలు లేకుండుట లోనగు లోపములును శబ్దరత్నాకరము లోనగు నిఘంటువులలోఁ బర్యాయపదములన్నియు లేకుండు లోపములు నున్నవి. ప్రస్తుతనిఘంటువునం దీలోపములు నివర్తించుటకీక్రిందిమార్గంబు సూచింపఁబడుచున్నది. ఉ. కేసరి యనియర్థవివరణాదులు వ్రాసినపిదప దీనిపర్యాయపదములు సింహము, పంచాస్యము, హరి లోనగువాని నన్నిటిని వ్రాయుట. అకారాద్యనుక్రమణిక ననుసరించి సింహమనుపదమును నర్థసహితముగ వ్రాసి దానిప్రక్కన నేపుటలో కేసరిపదమున్నదో దానిసంఖ్యమాత్ర మిచ్చుట. ఇట్లు వ్రాసినచో గ్రంథము నాతివిస్తరముగను మిక్కిలి యుపయుక్తముగను నుండుటయేగాక నూతనవిషయభరితమై జనాదరణము నొందు ననుట నిర్వివాదాంశము.

3. పంక్చుయేషన్ (Punctuation) విషయమున, కామా, కోలన్, మున్నగు వానికిని దుల్యపదములఁ గల్పించి నిఘంటువునఁ జేర్చుట ముఖ్యకార్యము. ఇట్టి సూచనలు నిఘంటుకర్తల యామోదమును బడసినచో నిట్టివి మఱియును గొన్ని చేయఁదగునని యుంతటితో విరమించెదను. (9)

## శ్రీ ఏనుఁగు తమ్మిరాజుగారు, తాపేశ్వరము, తూ. గోదావరిజిల్లా.

వావిళ్ల నిఘంటువుపుటలు నేఁడే చూచితిని. ఈ ప్రయత్నము సర్వజనశ్లాఘాపాత్రమైనది. నేటికి మరల తమకారణమున నాంధ్రభాషాయోష కొకనూతనామూల్యాభరణము లభించినది. ఇక్కృతంబున తమరాంధ్రులందరికి వందనీయులు. పూర్వము మనభాషలో పద్యనిఘంటువులే గాని గద్యనిఘంటువు లంతగా లేవని చెప్పవచ్చును. ఇటీవల్ల కొంతమంది పండిత ప్రకాండులు గద్యనిఘంటువులు వ్రాయ సమకట్టి మనభాషకమూల్యమైన సేవచేయుచున్నారు. ఇట్టి నిఘంటువులలో మన మెరిగినంతవరకు ముఖ్యముగా విశేషవ్యాప్తిగలది శబ్దరత్నాకర మొకటి గాన్పించుచున్నది. కాని యిదిగూడ సమగ్రమైనది కాకపోవుటచే భాషాలోపము తీరినదని సంతసించుటకు వీలుగాకున్నది. కాబట్టె యిట్టిలోపముతీర్చుటకయి బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారిచే "వావిళ్లనిఘంటువు" వ్రాయింపించి తమరాంధ్రుల కమందానందము కల్పించుచున్నారు. ఇంతటి మహాత్కార్యము తమవంటి యుదారాతిశయములుగల ధీమంతులకేగాని తక్కినవారికి సాధ్యముగాదు. ఈ నిఘంటు నిర్మాణములో లక్ష్మీపతిశాస్త్రిగారి పాండిత్యప్రకర్షయు, విజ్ఞానసంపదయు కొనియాడదగినవి. ఇతర నిఘంటువులవలెగాక యీనిఘంటు వొకక్రొత్తమార్గము చూపుచు నిందు వ్యావహారికాంధ్రమునకు తావొసంగబడి గ్రాంథికాంధ్రమునకువలె లక్ష్యలక్షణసమేతములైన అర్థవివరణాదులు వ్రాసినారు. కాలానుసారముగా భాషాప్రవాహమునకు కలిగెడుమార్పులనుబట్టి యిటువంటినిఘంటురాజము ప్రస్తుతము వెలువడవలసినయవసర మెంతేనియుగలదు. అసలు నిఘంటువులు వ్రాయుట కష్టము; అందులో గ్రాంథికవ్యావహారికమిశ్రమముగా రచియించుట కష్టతర మనుటలో సందియములేదు. అటుపైని అన్యదేశ్యశబ్దములనుగూడ సంగ్రహించి నిఘంటునిర్మాణము గావించుట యెంతటికష్టసాధ్యమో చదువరు లూహింపకపోరు. ఇదివరకున్న శబ్దరత్నాకరములో నీపక్కి లేదు. తత్సమ తత్సమేతరశబ్దములైన శబ్దరత్నాకరముకంటె నెక్కువగానుండునని వ్రాయుటచే నీనిఘంటురాజము శబ్దరత్నాకరముకంటె మిన్నయని చెప్పనొప్పును. వావిళ్లనిఘంటువుయొక్క మాదిరిపుటలుచూచి నాకుతోచిన అభిప్రాయము వెలువరించితిని. తప్పులున్న విజ్ఞులు మన్నింతురుగాక. ఇట్టి యుత్తమనిఘంటువు నాంధ్రలోకంబున వెలయింపజేసిన బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికిని బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారికిని బరమేశ్వరు డాయురారోగ్యాదుల నొసంగి రక్షించుగాతమని ప్రార్థించుచున్నాను. (10)

## విద్వాన్ పాలపర్తి సూర్యనారాయణగారు

ఆంధ్రోపాధ్యాయులు, శ్రీమంతురాజావారి హైస్కూలు, చల్లపల్లి

ఆర్యా ! తాము దయతో పంపిన వావిళ్లనిఘంటుయొక్క మాదిరిప్రతిని పీఠికను జూచితిని. తమ ప్రయత్నమునకు మిగుల సంతసించితిని. దానిని రచించుచున్న బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగా రెంతయుఁ బ్రశంసార్హులు.

శబ్దరత్నాకరమునకంటె మీరు పంపినభాగములోనిమాటలయం దెక్కువవివరముగ వ్రాయఁబడియున్నది. అంతేకాక ప్రతిపదమునకు నిదేవిధముగ విపులముగ వ్రాయుదు రని విశ్వసించుచున్నాము. జనోపయోగకరముగనుండుటకు లక్ష్యము లిచ్చుటయే ప్రధానముగా దీసికొనక సంస్కృతశబ్దములకు వైకృతములు, వైకృతులకు ప్రకృతిపదములు వ్యుత్పత్త్యర్థములు రూపాంతములు ప్రతిపదమునకుండిన యెడల మిగుల లాభకరమని నాయూహ.

తామా ప్రకారము ప్రకృతివికృతులు వ్యుత్పత్త్యర్థములు రూపాంతరములు వచ్చునట్లు ప్రకటింతురని నాయాశయము. కేవలము లక్ష్యములకొఱకే కాలమును వినియోగించుటకంటె నీప్రయత్న మతిఫలవంతము. వివాదాంశములకే లక్ష్యము లవసరమగుచుండును. పెద్దలకు విశేషము వ్రాయశక్తిలేనివాఁడను. గనుక యింతతో విరమించుచున్నాను. (11)

### శతావధాని శ్రీమలకపల్లి పెద శేషగిరి రాయకవిగారు,

మ. స. నా. మిడిల్ స్కూలు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, జగన్నాయకపురము, కాకినాడ.

నేను బ్రహ్మశ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారిచే రచియింపఁబడి వావిళ్లవారిముద్రాక్షరశాలలో ముద్రింపఁబడుచున్న వావిళ్లనిఘంటుస్వరూపములోని కొంత విమర్శనమనస్కై రాఁగాఁ జూచియుంటిని.

ప్రకృతమనను న్న ఆంధ్రనిఘంటువులన్నిటికంటె నిది ప్రశస్తమైనదక్కని వ్రాయఁబడినట్లు నా మనస్సునకు స్ఫుటముగా గోచరించుచున్నది. ఆంధ్రభాషాసారస్వతమున శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచేఁ బ్రచురింపఁబడినన్ని గ్రంథరాజములు మఱియెచ్చటను గానరావు.

మహామహులగు జమీాందారులు మున్నగువారిప్రోద్బలముచే నిక్కాలమున రచియింపఁబడిన నిఘంట్వాదిగ్రంథము లాయాపండితులకుఁ దగినపోషణాదికము లొసఁగబడక రచియింపఁబడినవగుటచేఁ గాఁబోలు నవి యసంతృప్తికరములుగను నపర్యాప్తములుగను గానంబడుచున్నవని నేను రూఢిగా వక్కాణింపగలను.

శ్రీసూర్యారాయాంధ్రనిఘంట్వాదుల వెన్నుదన్ని వెలువడుచున్న యీవావిళ్లనిఘంటుస్వరూప మన్నివిధముల సర్వోత్కృష్టమై ఆంధ్రభాషాభివృద్ధినొందింపఁగలదని నాసంతోషమును మహోత్సాహముతో వెలిబుచ్చుచున్నాఁడను

ఈగ్రంథమును రచియించుటకు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు పడిన ప్రయాసమునకును, దేశోపకారపారీణతకును నేననేకకృతజ్ఞతాభివందనములర్పించుచున్నాఁడను. (12)

### చిత్రకవి శ్రీదేవినేని సూరయ్యగారు

ప్రధానాంధ్రోపాధ్యాయులు, శ్రీమంతురాజాగారి హైస్కూల్, చల్లపల్లి

"వావిళ్ల నిఘంటుస్వరూపము" నందలి కొంతభాగములను జూచి, తమయాంధ్రభాషాభిమానమునకును, తమసత్ప్రయత్నమునకును, గడుంగడు సంతసించితి. ఆంధ్రభాష కిపుడున్నగల "శబ్దరత్నాకరము" మున్నగాఁగల నిఘంటువులకన్న నన్నివిధముల మీానిఘంటువు మిన్నయని వ్రాయుటకు సాహసించుచున్నాను. గ్రంథమంతయు నిట్లే విశేషార్థసంపత్తితోఁ జరగుచుండునని తలంచెద.

ఈకార్యము సామాన్యముగా నెఱవేరునది కాదు. కాని, సంస్కృతాంధ్రభాషలయం దసమాన పాండిత్యము ననుభవముగలిగి ప్రఖ్యాతివహించియున్న శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు తాము పూనుకొనినప్పుడు నిరంతరాయముగా నిది నెఱవేరుననుటకు సందియముండదు.

కేవలభాషాభిమానులై, స్వలాభముం దలంపక యుభయభాషలలోఁ బెక్కుగ్రంథములు ప్రకటించి యింతకుమున్నే దిగంత విశ్రాంతయశోవిభ్రాజితులరగు తమవంటివారు ప్రకటనకర్తలైనప్పు డింక లోపమేమిగల్గును? నిర్విఘ్నముగా చిరకాలములోనే మీానిఘంటుకల్పకము బయల్వెడలి యాశ్రిత విద్యాభిమానుల మనోవాంఛితము నీడేర్పగలదు. దయామయుఁడగు పరాత్పరుండు మీాకును, గ్రంథకర్తగారికిని నిరంతరదీర్ఘాయురారోగ్యభాగ్యమొసఁగి యింక నిట్టిలోకోపయోగగ్రంథ ప్రకటనభాగ్యశాలురఁ జేయుగాతమని తలంచుచున్నాఁడను. (13)

### ఉభయభాషాప్రవీణ శ్రీఉత్పల వేంకటరంగాచార్యులుగారు, చిత్తూరు.

"వావిళ్ల నిఘంటువు"ను స్థాలీపులాకన్యాయముగ నచ్చటచ్చట బరికించితిని. కోశముల గంఠస్థము చేయుపద్ధతియు, నర్థజ్ఞానమును శూన్యమగు నీకాలమున ఆంగ్లేయపద్ధతి ననుసరించి అకారాది నిఘంటువులు బయలుదేరినవి. అందును బేరుపొందినది 'శబ్దరత్నాకరము'. అది సంపూర్ణముకాామి, నాలోపమును దీర్ప నెంచిన తమయాశయము మిగుల నుగ్గడింపదగినది. ఇప్పటికి వెలువడియున్న నిఘంటువులకంటె నిందు గొంత విశిష్టత గన్పట్టెడిని.

పదముల నిష్పత్తి (వ్యుత్పత్తి) లను దెలుపుట, ప్రకృతి వికృతుల సూచించుట, సంస్కృత పదముల ప్రయోగౌచిత్యము. అనునంశము లీక్రిందిపదముల నాలోకించిన దెలియుచున్నవి. అంతరీపము, అంతేవాసి, అగజ, అంధిక, ఇంత, ఇంతి, అంత, అంచల్ మున్నగునవి. ఇట్లే తక్కినభాగమంతయు బూర్తిగావింతురుగాక. వ్యయప్రయాసములకు భీతిల్లక భాషాసేవచేసి లోకోపకారము నొనర్చుచున్న వావిళ్లవారికృషి, యీనిఘంటు కల్పకముచే ఆ కల్పాంతము ఖ్యాతి వహించుగాక. జగన్నాయకుడగు నాశ్రీయఃపతి ఆయురారోగ్యముల నొసంగి తమకు నిత్యానంద మొసగూర్చుత మని ప్రార్థించుచున్నాడను. (14)

## శ్రీవీణా సుదర్శనాచార్యులుగారు, కల్యాణి (బొంబాయి)

తాము అభిప్రాయనిమిత్తమై కల్యాణి ఆంధ్రజనసంఘగ్రంథాలయములకునంపిన 'వావిళ్ల నిఘంటు స్వరూపము'ను అత్యంతానందముతో కనుగొంటిని. గత్యంతరములేక 'ఆంధ్రశబ్దరత్నాకరము' నే శరణ్యముగ నెంచి పూర్తివివరములు దెలియక సందేహాడోలాయమాన హృదయులై వర్తించు ఆంధ్రభాషాజిజ్ఞాసువులకు ఈమీనిఘంటువు అమృతోపమానమై విరాజిల్లుననుట సత్యదూరముగాదు. తత్సమతద్భవేతరపదముల వ్యుత్పత్త్యర్థముతో సోదాహరణముగ విమర్శించి పేర్కొనుటలో ఆంధ్రవిద్యార్థితతికి భాషాగ్రహణము కరతలామలకమై పొడగట్టును. దేశీయఆంగ్లపదములను సహా చేర్చుట నవీనపక్షమును సూచింపుచున్నది. ఈమీనిఘంటువు సర్వజనాదరణీయమై వెలుగొందును. ఆంధ్రభాషోద్ధారకబద్ధకంకణులగు మీరీఘనకార్యమునకు బూనుకొనుట వింత కాకపోయినను ఆంధ్రభాషాలోకమునకు అమూల్యోపకారమొనర్చితిరని చెప్పకతప్పదు. శ్రీఆంధ్రభాషాయోషామణి మీకాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించి పెంపొంద జేయుగాక యని ప్రార్థించుచున్నాను. అత్యంతశీఘ్రమున ఆంధ్రులహస్తమును తమనిఘంటురత్నముతో అలంకరింపజేయప్రార్థితులు. (15)

## శ్రీచివుకుల అప్పయ్యశాస్త్రిగారు, దివ్యవాణిసంపాదకులు, సికిందరాబాదు.

తమరు కృపతోఁబంపిన "వావిళ్ల నిఘంటుస్వరూపము" వందనపూర్వకముగా నందికొంటిని. ఆనందించితిని. లబ్ధప్రతిష్ఠులయిన తమ రీమహాకార్యమునకుఁ బూనుకొనుట సర్వవిధములను గొనియాడఁదగియున్నది. వ్యాకరణాంశములుగూడ నిందుఁజేర్చుటచేఁ గొంత గ్రంథబాహుళ్యమైనను మిక్కిలి యుపయోగకరములు గాఁగలవని నాతలంపు. ప్రస్తుత మిందున్నమాదిరిపదములవలెనే నిఘంటువంతయుం సక్రమముగా నుండునని యెంచుచున్నాను. బహుచిత్రవిచిత్రరూపములును బొందెడివియు, నానాదేశీయములునగు వ్యావహారికభాషాపదముల నెంతవఱకు సమకూర్చి యర్థవివరణాదులం గావించి చదువరుల కుపయోగింపఁజాలుదురో ముందుఁ దెలియఁగలదు. "జగమెఱిఁగినబ్రాహ్మణునకు జందెం బేలా" యన్నట్లు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువ్యాదిగ్రంథరచనమునందు మిక్కిలి పరిశ్రమచేసియున్న బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారినిగూర్చి ప్రత్యేకముగాఁ బ్రశంసింపవలసినయవసరముండదు. ఉదాహరణభాగములం దెట్లున్నను అర్థవివరణములు తెలియఁబఱచుచోటఁ గొంచెము పెద్దక్కరములున్నచో బాగుండునని తోఁచెడి. భాషోద్ధారకులును, ధర్మాభిమానులునగు మిమ్ములం గ్రియమాణకార్యమునందుఁ గృతార్థులనుజేయుగాకయని భగవంతునిం బ్రార్థించుచున్నవాఁడను. (16)

## శ్రీగుండు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఆంధ్రోపాధ్యాయులు,

హిందూమాధ్యమికపాఠశాల, పూళ్ల, ఏలూరు, ప. గోదావరిజిల్లా.

తమచే నంపఁబడినదియు యుష్మత్ప్రణీతంబై ప్రకృతము ముద్రింపంబడు నిఘంటువునందలి కొంతభాగమునందుకొని యందుండు పదసమూహము నప్పదములకుఁ దాము వ్రాసినయర్థబోధకతాసామర్థ్యంబు నీక్షించి నాయుల్లం బమందానందతుందిలంబయ్యె. అమూలాగ్ర మీచంద

మున సంపూర్ణాహ్లాదకరులుగ నొనర్పఁగలరని భావించుచుంటిని. కల్పలతాప్రసూనగుచ్ఛంబుపగిది సత్ప్రేక్షకులగుజనుల కభిమతనానార్థప్రదాయకంబై చెన్నొంద వెనుదీయదు. ప్రణేత్ర ధ్యేతృజనోపయోగకరంబగుటకు సందియం బావంతయేనికలుగదు. మీయాంధ్రభాషాభిమానమునకును సత్ప్రయత్నమునకు సర్వనియంత్రమైన శ్రీయఃపతితోడ్పడుగాక. ఇట్లని నిర్హేతుకజాయమానకరుణాళుండగు సర్వేశ్వరుని బహుభంగులం బ్రార్థించుచున్నాఁడ. (17)

## శ్రీసాహిత్యవిద్యాప్రవీణ జమ్ములమడక మాధవరామశర్మగారు

సాహిత్యాలంకారాధ్యాపకులు, భాషావాఙ్మయచరిత్రోపన్యాసకులు, సంస్కృతకళాశాల, తెనాలి

వావిళ్లనిఘంటువు నభినందించుచు శిరఃకంపమొనరించువారలలో నే మొదటివాఁడను కాఁగోరుదును. ఆరితేరిన రచనలలో సామర్థ్యమత్యధికముగఁగల బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు దీనికి రచయితలగుట "హేమ్నః పరమామోదః" రచనావిధానమున శ్రీపాదులవచనరీతి హృదయంగమము. పదములయర్థనిర్ణయమున వివేచనాశక్తి ప్రశస్యము. బహుగ్రంథపరిశీలనాపటుత్వమే లక్ష్మీపతులకుఁగాని సిద్ధముగాదు. శబ్దములవ్యుత్పత్తుల నిర్వచించునపుడు శ్రీయుతుల శాస్త్రపరిశ్రమము బహుఫలమయినది. నిస్సందిగ్ధముగ నిశ్చయార్థముల వివరించు లక్ష్మీపతిశాస్త్రిగారివిజ్ఞానము లోకమున కమూల్యభిక్ష నొసఁగును. పాఠకలోక ముత్తంభితహృదయములతో వావిళ్లనిఘంటువునకు స్వాగతమిచ్చి ధన్యముగాఁగలదు. శ్రీపాదుల యనన్యకౌశలమునకు మాధన్యవాదములు. (18)

## విద్వాన్ దైత్యశివరామశాస్త్రిగారు

B. M. స్కూల్, ఈడుపుగల్లు

తాము దయతో పంపిన వావిళ్ల నిఘంటుస్వరూపము వందనపూర్వకముగ నందుకొంటిని. ఇందులో సామాన్యముగ ప్రాచీనోదాహరణములే సేకరింపఁబడియున్నవి. వ్యావహారికపదములకు సైతము ఉపయోగించువిధము తెలియుటకు వాడుకలోనివాక్యములుగూడ చేర్పఁబడినవి. కొన్నిపదములకు సాధుత్వప్రక్రియ అతిసమంజసముగ చూపఁబడినది. మఱియు ముఖ్యముగఁ గావలసినసామగ్రి బాగుగానే సేకరింపఁబడినది. ఇయ్యది ఆంధ్రలోకమునకు గొప్పయుపకారము. మీరెప్పుడిటువంటి సదుపయోగకరములైనపొత్తములను ప్రకటించి సారస్వతోద్బోధము కలిగించి విద్యాభిమానులచే కొనియాడఁబడుచు శాశ్వతకీర్తినిగడించి వర్ధిల్లుదురుగాక అని సర్వేశ్వరుని కోరుచున్నాను. (19)

## శ్రీనడింపల్లి జగన్నాథరావుపంతులుగారు, నరసారావుపేట

సాదరంబుగ మీయంపినమచ్చుపదములపత్రములనందికొని శ్రద్ధమెయిఁజదివితి. ఆంధ్రవాఙ్మయలోకమునకు మీ వావిళ్ల నిఘంటువు రతనాలప్రోది యనక తప్పదు. అచ్చటచ్చట సంఘటించిన వ్యాకరణాంశముల నట్టునిచి తత్తదుచితానుకూలంబగు ప్రయోగకౌశలంబునుమాత్రమే చూపెట్టిన జిజ్ఞాసువులకు ముదావహంబయి తనరారఁగలదని భావించెద. శ్రీలక్ష్మీపతిశాస్త్రులవారు పండితులును - రచనాధిషణులు - నగుట నిఘంటునిర్మాణంబునకు బంగారమునకుఁ దావియబ్బినచందం బయ్యెననుటకు సందియంబులేదు. అట్టిధీమంతునకు భాషోద్ధారకులనఁదగు తాము నన్నియభట్టమహోపాధ్యాయునకు నారాయణభట్టు తోడయినటులఁ దోడగుట మఱింతవన్నెఁబెట్టుచున్నయది. సర్వవిధముల నిది భాషకు మేలిపసిండికొంగని భావించుచున్నాఁడ. శీఘ్రగతిని నిఘంటుప్రాకట్యమునకుఁ బ్రతీక్షింతును. (20)

## శ్రీ వీరుభొట్ల భాస్కరరావుగారు, జగన్నాథపురము, కాకినాడ.

ఈమధ్య ప్రకటితమైన "వావిళ్ల నిఘంటువు" ప్రథమసంపుటమును గాంచి బ్రహ్మానందభరితుఁడ నైతిని. ఆంధ్రభాషలో నేటివఱకు రచింపఁబడిన 'శబ్దరత్నాకరము' మున్నగు నిఘంటువు లున్నను ఆ యా నిఘంటువులు రచింపఁబడునాటికి వ్యాపకములో నున్న పదములనే యెత్తి అర్థములు వ్రాయఁబడినవై యున్నవి. కాని కాలక్రమమున అనేకమార్పులు చెందియున్న చెందనై యున్న సంస్కృతాంధ్రభాషా పదములను పూర్వాపరసందర్భముతో వ్యావహారికభాషలో పరిపాటిగా వాడబడు కొన్ని సూక్ష్మపదములకు సరిపడి సరియగు అర్థము నెల్పు గొప్పనిఘంటువొకటి వర్తమానకాలమున బయలుదేరి భాషాభివృద్ధికై ప్రచారమునల్పు టెంతయు ముఖ్యావసరమై యున్నదనుటలో నాశ్చర్యముండఁజాలదు. అచిరకాలమున "వావిళ్ల నిఘంటువు" వెలువడి ఆంధ్రుల ఆదరాభిమానప్రోత్సాహములకుఁ బాత్రముకాఁగలదని నమ్ముచున్నాఁడను. నిఘంటు నిర్మాణకర్తలగు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు విశేషపరిశ్రమతో నై భారత భాగవత రామాయణగ్రంథములనుండియు ప్రాచీనకవుల ప్రబంధరాజములనుండియు పురాణాదుల నుండియు సంగ్రహించిన పద్యపాదసహితమగు అనేకపదములకు వివరముగా విపులమగువిశేషార్థముల నుదాహరణపూర్వకముగ నెత్తిచూపుచు పండిత పామరజనరంజకమగు సులభశైలిలో నిఘంటువును రచింపుచున్నందులకు శ్రీ శాస్త్రిగారి కృషి త్వరలోఫలోన్ముఖమునకు రాఁగలదని విశ్వసింపుచున్నాఁడను. ప్రకృతమున "వావిళ్ల నిఘంటువులో చక్కనియర్థములు వ్రాసియున్నారు. ముద్రింపు ప్రకటితముకానై యున్న నిఘంటువింకను నవీనవిశేషములతో బయల్వెడలి భాషాభిమానుల నేత్రోత్సవము గావింపఁగలదని నమ్ముచున్నాఁడను. ఆంధ్రులెల్లరు వావిళ్ల నిఘంటువునకుఁ దగినప్రోత్సాహ మొసఁగి శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని ఆశీర్వదించి భాషాభిమానులందఱు తమవిధ్యుక్తకర్తవ్యాంశమేమో యోచించుకొన గోరుచున్నాఁడ. (21)

## శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, యం. ఏ., బి. యల్., విజయవాడ.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి నూతననిఘంటువురచన చాల సంతోషకరము. వావిళ్లవారి సాహితీసేవను గుఱించి నేడాంధ్రులకు చెప్పనక్కరలేదు. భాషాసేవ ప్రజాసేవలను ఆశయములుగాఁగొని శ్రమజాత్రములను నడపువారిసంఖ్య మిగులతక్కువైనది. పోటీవ్యాపారమునకు డీకొనుచు గ్రుడ్డిగవ్వకు కొఱగాని పుస్తకములను బండ్లకొలఁది ప్రైళ్లలోని కెగుమతి చేయుమహాశయులు ఆంధ్రభూమియందు విజృంభించుచున్నారు. వావిళ్లవారీతెగలోనివారు కారు. వీరు దేశసేవకుపూనుకొనిన ఉదారులగు ప్రకటనకర్తలని వీరు ప్రచురించుగ్రంథములును చేవగల వ్రాఁతగాండ్రకు వీరొసఁగుప్రోత్సాహమును నొక్కి చెప్పుచున్నది. వావిళ్లవారు ఆంధ్రావనికీవఱలోఁ జేసిన భాషాసేవను తక్కెడలోనుంచి నూతననిఘంటు ప్రకటనముగ వారు కావింపనున్న సేవను వేఱొక తక్కెడయందుంచితిమేని రెండవతక్కెడయే యెక్కువ బరువై యుండునని నా యభిప్రాయము.

వాఙ్మయవసంతసమయమున వావిళ్ల నిఘంటువు పట్టుచున్నది. దృఢసంకల్పమున నది పెరుగుచున్నది. తక్కుంగల నిఘంటువులట్టివైన దీనివలన ప్రయోజనమే ఉండదని సుహృద్వరులు శ్రీ వేంకటేశ్వరులు గుర్తించియుందురు. వావిళ్లనిఘంటువు వట్టిమాటలపుట్టిగాని శబ్దములగుట్టగాని యైయుండదని నాతలంపు. శబ్దరత్నాకరములోని కొన్ని యర్థములమాటయు, వివరణములమాటయు నటుండగా, కొన్నిచోట్ల ఉదాహృతగ్రంథనామాశ్వాససంఖ్యాదులే సరిగాలేవు. పద్యసంఖ్య చూపఁబడకపోవుటచేత నుదాహృతభాగము మూలగ్రంథమున గనిపట్టుటకష్టము.........ఇట్టి యసంగతవిషయములు గొన్నియుండుటచేఁ దగినంత సహాయము పొందుటకు బుద్ధిపరిశ్రమ కాలవినియోగము లెక్కువగాఁ గావలసియుండును." అని వావిళ్ల నిఘంటుకర్త వ్రాసియుండెను. శబ్దరత్నాకరము మొత్తముమీఁద రమారమి ముప్పదినాలుగువేల పదము లున్నవి. ప్రకృతము రచించుచున్న నిఘంటువున మొత్తము నలువదియైదువేలుపదము లుండవచ్చును. అనియు వారు వ్రాయుచున్నారు. శ్రీ గిడుగు వేంకటరామమూర్తిగారు శబ్దరత్నాకరమున సుమారు

*

రెండువేలతప్పులున్న వనుచున్నారు. దానియందలి లోపములు దీనియందు మాపగునేని ఈనిఘంటువు యొక్కయని చెల్లి పోవునని నేను తలంతును. వావిళ్లనిఘంటు స్వరూపమునకు అపూర్వస్వరూపము నిచ్చునది తప్పులన్నదబాటు గాదు. "వ్యవహారమునఁగలపదము లనేకములు చేర్చుటయే గాక వానినుపయోగించురీతి తెలియుటకై వాడుకలోనివాక్యములుగూడఁ జేర్పఁబడును. వ్యాకరణవిరుద్ధములని యెంచబడు కొన్ని పదములకు సాధ్యమగుచోట సాధుత్వప్రక్రియఁ జూపఁబడును. ఆంధ్రదేశమున ననేకసంచయమొందిన హిందూస్థానపదములును ఆంధ్రభాషాపదములుగ నిందు గ్రహింపఁబడును. ప్రస్తుతవ్యవహారము ననుసరించి తెనుఁగు పత్రికల ప్రధానవ్యాసములలో వాడబడుచున్న నూతనభాషాపదములు అర్థవివరణాదులతో నిందుఁజేర్పఁబడును." ఈవాక్యములు నిఘంటుస్వరూపమును సమగ్రముగా సూచించునని నా యభిప్రాయము. వావిళ్లవారిభాషాసేవ ఆంధ్రభాష మనియున్నంతకాలము ఆంధ్రజాతి జీవించియున్నంతకాలము నిలుచును. నిఘంటుప్రకటనముతోడనే వావిళ్లవ్యాకరణమొకటి వెలువడవలెనని నాయభిమతము. వావిళ్ల నిఘంటువు పాంచజన్యమును పూరించినంతనే వావిళ్ల వ్యాకరణము దేవదత్తమును పూరింపఁగలదు. విషాదయోగమును ద్రుంచి శంఖారావప్రకరణము గోచరించినంతనే కురుక్షేత్ర విజయసంస్మారమునకు నాఁడే నేఁడు కురుక్షేత్రమైయున్న ఆంధ్రవాఙ్మయము అచిరముగా ధర్మక్షేత్రము కాఁగాలుపోవునని నాఆశ. నూతనయుగభారతమును ఆంధ్రులకీయజాలు ప్రకటనకర్తల ప్రతిభ దిగంతములను జేరఁబోవునా! (22)

శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు, విజయనగరము.

శ్రీ విజయనగర సంస్కృతకళాశాలాంధ్రోపాధ్యాయులు.

మహాశయా! దయాపురస్సరముగాఁ బంపిన శ్రీ వావిళ్లనిఘంటువును ముఖమును బరికించితిని. ఉత్పత్తిమొదలుగా నర్థసంపాదనము వ్యవహారయోగ్యతయుఁ బ్రసిద్ధప్రచారము స్థిరస్థితిప్రాప్తియు భాషామతల్లికిఁ గలుగుటకు నిఘంటువే మూలము గావచ్చునని నానిశ్చయము. సుసంపన్నాభివృద్ధిగాంచుచున్న మన యీ ఆంధ్రవాఙ్మయముల జాడఁగనిపట్టు తత్స్వరూప నిరూపణపురస్సరముగా నర్థనిర్ణయము చేయించుపని పూనుట ఘనకార్య మనక తప్పదు తండ్రితాతల తరమునుండియు నాంధ్రభాష నుద్ధరింప బూనియున్న తామిప్పటికిఁదలపడుట యొకవింత కాదు.

ఆంధ్రభాషకు నిఘంటువు బహుజనపల్లి సీతారామాచార్యులవారును మున్నగువారు వ్రాసియున్నవారు. వానిలోఁ దత్సమాదిపదమూలమును గొంత విపులముగాఁ దెలుపునది శబ్దరత్నాకరము. తరువాత నట్టిపనిచేయు వారికదియ మార్గదర్శక మనక తప్పదు. కాని యందు కొన్నిపదములకు వాఙ్మయమున మహాకవు లొకయర్థవిశేషమున వాడియుండ నాయర్థము వ్రాయఁబడక సంస్కృతనిఘంటువు ననుసరించి వ్రాయఁబడుచువచ్చెను. "సహాయము" అనుపదము 'సాహాయ్యము' అనునర్థమున ప్రయోగింపఁబడియుండ నట్టియర్థ మానిఘంటువున వ్రాయఁబడలేదు. మఱియును నాచార్యులవారు పదములకు వ్యుత్పత్తులను జూపుటందును, నాంధ్రభాషాపదముల కితరభాషాపదములతో సాదృశ్యసంబంధవిధ మెలఁగించుటందును, పని చేసినట్లు కానరాదు.

శ్రీ వావిళ్లనిఘంటువులోని మార్గదర్శకము గానంపిన పదములు చూడ నట్టికొఱతలు పాసి నవియుగా గానవచ్చెడిని. గ్రంథకర్తగారు వ్రాయబూనినపదములయు వానిస్వరూపనిర్ణయము పద్ధతియుఁ గొంతవఱకు క్రొత్తదికాకపోదు. ఇందు వ్యవహారస్థపదములఁ జేర్చుటయుఁ బూర్వుల లక్ష్యలక్షణముల కంతగా విరుద్ధము గాదు. మఱియు శబ్దరత్నాకరముకన్న నిదియొక వేయి పదములచే మిన్నయగుటను గన్నడభాషా సంబంధమును గన్నార జూపునదగుటను, మిగుల మన్ననగాంచు ననియే నావిన్నపము.

ఇట్లు పలువిధముల భాషాభివృద్ధికిఁ దోడ్పడు తమ్ము సర్వమహావిష్ణువును సమాన ఆయురారోగ్యాభివృద్ధుల నందించుగాక యని వేడుచు నింతతో విరమించుచున్నాఁడను.

శా. ఎన్నో దేశము లున్న వందుగల వెన్నెన్నో మహావ్యక్తులో
యన్నా! వేంకటశాస్త్రి వర్య! ఇటు లీ యాంధ్ర ప్రపంచంబునకా

వన్నెంగాంచఁ గలట్టి మార్గములు నీవా కాక వేఱొక్కరా!
కన్నారంగనిపట్టి నారు కన మీకల్యాణసౌఖ్యోన్నతుల్. (23)

## ఉభయభాషాప్రవీణ అయ్యగలసోమయాజుల కాశీపతిచయనులుగారు

తెలుగుపండితులు, ఎ. బి. యమ్. స్కూల్, కిర్లంపూడి

తాము శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారిచే రచింపించుచున్న "వావిళ్లనిఘంటువు" తాలూకు పుటలుకొన్నిమాత్రము చూచితిని. ఇయ్యది శబ్దరత్నాకరాదినిఘంటువులకన్న మిన్న యని చెప్పుట కవకాశ మున్నట్లు గస్పట్టుచున్నది. ఆంధ్రపదార్కకాంతములు వావిళ్లనిఘంటుసూర్యోదయము వలనఁ బ్రజ్వలించి ఆంధ్రలోకమున కమితతేజంబును సమకూర్చి అజ్ఞానాంధకారమును తొలగింపగల వని నమ్ముచున్నాడను. (24)

## అభినవతిక్కన శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నెల్లూరు.

తమరు అపరపూర్వకముగఁ బనిచిన 'వావిళ్ల నిఘంటువు' అమందకౌతుకముగాఁ గైకొని, అశిథిలమైనయవధానముతోఁ బరికించితిని. 'శబ్దరత్నాకర' మిప్పు డుపలబ్ధము కాకపోవుటయు, అయ్యదేనియు నందు మార్పులు చేర్పులు పెక్కు చేయందగియుండుటయు, సూర్యారాయనిఘంటువు అంతకంటె సమృద్ధమయ్యు విస్తృతిచే బహుసంపుటములం గాని లభింపకపోవుటయు గుఱితించి, విద్యార్థుల కుపాదేయముగా నీనిఘంటువు తాము వెలయించుట తమకార్యాచితిని సూచించుచున్నది. ఒక నృపవతంసుని ప్రాపున ఒక 'కళాప్రపూర్ణుని' పర్యవేక్షణమునఁ బెక్కురుపండితులచేఁ జిరకాలము నుండియు రచింపఁబడుచుండిన సూర్యారాయనిఘంటువు ఇప్పటికిని బూర్తికాకుండుట ఆంధ్రుల దురదృష్టము. తాము అట్లుగాక దీర్ఘంబుగాని 'సూక్ష్మములో మోక్ష' మన్నట్లు, ఈనిఘంటు నిర్మాణోద్యమమునకుఁ బూని, పనికిఁ దొడంగిన శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులవారు నడుమనే స్వర్గస్థులైనను, సదృశుఁ డగుపండితుని, పైపెచ్చు ఆంగ్లభాషా పట్టభద్రుని ఆపనికి నియమించి యింతలో నింత సంపుటము వెలయించుట తమ కార్యకౌశలమునకు నిదర్శనము. 'యోగః కర్మసు కౌశలమ్' అనుట కలదుకదా! ఇఁక నొక్కసాపుటిలోనే తక్కినభాగమంతయు సంపూర్ణము కావచ్చునన్నది సరియైన 'అంచన' కాదేమో యని నేను భయంపడుచున్నాను. అట్లు కావలయునేని, మీరు నిర్మాణనియమములు కొన్ని మార్చుకో వలసియుండును.

1. ఇష్టాపూర్తాది సమాసములు తొలఁగింపవలయును.
2. అంగీకారము, అంగీకృతి, అంగీకరణము:—వ్యాకరణ సాధ్యము లగు నిట్టిరూపములలో నొక్కదాని గ్రహించి తక్కినవానిని వానిక్రిందనే రూపాంతరములుగాఁ జేర్కొనవలసియుండును.
3. అగు = అవు = ఔ:—ఇట్టిచోట్లఁ గొంత కక్కుఱితి పడవలసియుండును.
4. అలుమగలమాట = ఆల్మగలమాట - ఇట్టిచోట్లఁ దొలి రూపము మాత్ర మిచ్చి సంధిరూపము ముజ్జగింపవలసియుండును.
5. డ = ణ:—పోఁడిమి = పోణిమి; అడఁచు = అణఁచు; ఇత్యాదులలోఁ దొలిరూపమునే వ్రాసి అటనే రూపాంతరము సూచింపవలసియుండును.

ఇదియు, ఇట్టివియుఁ బెక్కులు నిర్మాతలెఱుంగని విషయములు కావు. కాని యేవంరూప సంక్షేపమున, విపరిషు విద్యార్థులు కొంత త్రొక్కటపడుదు రేమో! ఇవి నాకంటె మిన్నగాఁ జిరకాలానుభూతిగల తామే యాలోచింపవలసియుండును.

'వావిళ్ల' పేరు ఈవఱకే దిగంతములకుఁ బ్రాకియున్నది. నేఁడు ఆపేరువిననియక్షరాస్యుఁడు ఆంధ్రలోకమున లేఁ డన్న నతిశయోక్తి కానేరదు. ఈనిఘంటువుతో మీయశస్సు మిన్నంటఁగలదు. 'పుత్త్రాదిచ్ఛేత్పరాజయ' మ్మన్నట్లు మీయట్టి సుపుత్త్రునిగన్న శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు

స్వర్గమునుండి మీ యీయుద్యమమునకు నెంత సంతోషించుచున్నారో కదా! భగవంతుడు ఈపనిని సాగించుటకు మీకు క్షిప్రమారోగ్యము ప్రసాదించుగావుత మని ప్రార్థించుచున్నాను. (25)

శ్రీ జి. జాషువగారు, తెలుగుపండితులు, వినుకొండ.

గీ. అందుకొన్నాను తా మంపినట్టి నూత్న, ఘక్క యగునిఘంటువులోని భాగములను
ఆంధ్రవాఙ్మయాభ్యుదయచి హ్నములు దలచి, మేను మఱచితి నొక్కనిమేష మనఘ!

ఉ. ఏపద మేకవీశ్వరుని హృద్యవచఃకలశాంబురాశి, నే
రూపము నందెనో, యది యెఱుగుట దుస్తర మాంధ్రవాఙ్మయం
దోషికతో మథించి, వివిధోక్తులపుట్టువు లాకళించి ల
క్ష్మీపతిశాస్త్రి దక్షుడయి సృష్టి యొనర్చె నిఘంటు భారతిక్.

ఉ. ముదిరినతాటియాకు వనభూములలోన గృశించి తెల్గు శా
రదకు వ్యయప్రయాసములరాపిడి కోరిచివన్నెచిన్నెలక్
గుదిరిచి క్యాలికోజిలుగు కోక లమర్చిన రామశాస్త్రి, సం
పదగలవాడు శ్రీపదము వారితనూభవ నాదరింపడే?

సీ. శబ్దరత్నాకర శబ్దార్థచంద్రికాదినిఘంటువులచేత దెలియబడని
పదములసాధుత్వప్రక్రియల్ వ్యుత్పత్తు లర్థభేదములు రూపాంతరములు
బొందించి నూతనంపుంబడి నిర్మించినావు నిఘంటు కన్యామతల్లి
నర్పించినావు భాషాభిమానులకు వావిళ్ల రామస్వామిప్రియసుతులకు.

గీ. తగినబిడ్డను గని యీయదగినవారి, కిచ్చియున్నావు ధన్యుండవిద్దయశుడ
వాంధ్రనైఘంటికుండవు నభిధ దాల్చి, శ్రీపదము నేలుకొమ్ము లక్ష్మీపతీంద్ర!

చ. చదివితి పాణినీయమును సద్గురుసంగతిసాహితీగతుల్
మదికి నిరూఢమానటుల మాన్యులు మెచ్చగ నేర్చి తెల్గునం
దుదితమనోరథుండనయి యున్నతసత్యవికావ్యరాజముల్
పదపదసద్విమర్శమున ప్రౌఢిమవ్యాఖ్యలు నే రచించితిన్.

ఉ. ద్రావిడసంస్కృతాంధ్రముల ప్రాకృతభాషలసంప్రదాయ స
ద్భావము వ్యక్తమానటుల ధన్యత గోశము గూర్చినాడ నా
భావనశక్తి పెల్లముగ ప్రౌఢమరుత్తచరిత్రనాటకం
బావల దాస్యమోచనము నాదిగనాంధ్రమునందు గూర్చితిన్.

గీ. సూర్యరాయాంధ్రకోశంబు నార్యులెన్న, ముఖ్యపండితపదవిని మోదమొంది
పుష్కరాధికకాలంబుపూర్ణశక్తి, గూర్చుచుండగ విఘ్నంబుగూడె నొకడు.

గీ. దాని నేనంతతలచుచుగ దగదుగాదె, యెవని కేదెంత ప్రాప్తమో యెవడెఱుగు
నేది నాచేత జేయింప నీశు డెంచెనో యెఱుగగ శక్యంబె యూహలేల?

గీ. స్వీయ మేధావిశేషంబు వివిధభాష, లరసి యున్నట్టిశక్తిని గరము గూర్చి
యాంధ్రవిద్యార్థిబృందంబులంద నలవి, యగునిఘంటువు రచియింప నగునుగాదె.

గీ. అనుచు నాలోచనముబుట్టినట్టివేళ, నాంధ్రసద్గ్రంథముద్రణనాథ్యుడయిన
వేంకటేశ్వరశాస్త్రి వావిళ్లవంశ్యు, మిత్ర మానటు గావించె మిత్ర మొకడు.

గీ. తెలుగువిద్యార్థులకుదెల్ల దెలివి నిచ్చు, తెలుగు గోశంబు గూర్చుట దిరముగాగ
పేరుపొందిన వావిళ్లవారి పేర, వేంకటేశ్వరశాస్త్రి వావిళ్లవంశ్య.

గీ. విప్రవరుడవు శాస్త్రముల్ వేదచయము, నాంధ్రసద్గ్రంథములనెల్ల నలవరించి
ప్రకటనంబును జేసినభవ్యకీర్తి, వేంకటేశ్వరశాస్త్రి వావిళ్లవంశ్య. (26)